## పుష్పచయము

**శ్రీమతి శ్యామకుమారి నెహ్రూగారు "New Outlook" నందిటుల వ్రాయుచున్నారు.**

ప్రకృతము భారతీయబాలికలకు విద్య నవీనాచారములు సంఘాభివృద్ధికంటె నవీనయువకుల నాకర్షించుట కెక్కుడుగ నుపయోగపడుచున్నవి. ముఖ్యముగా బాలికల కీ నాటివిద్య వివాహవిషయములలో విలువ యెక్కువచేయుటకే నేర్పబడుచున్నదని తలంపనగును. యువకు లీ విద్యావతులైన యువతుల గోరుచున్నారు. జీవితపథము మారినది. వేరువిధములైన యువతులు గావలసియున్నారు. కావునయువతులకు విద్య అత్యంతావశ్యకము. ఆవిద్య ఆమెకు మంచి సంబంధము దీసికొని రాజాలదేని నిష్ఫలము. ఇప్పటి ఆశయము లిట్టివి. ఇట్టి దృక్పథము సంపూర్ణముగా మారవలయును. బాలిక బాలునితో సమానముగనే చూడబడవలయును; కాని ఎంతమాత్రము తక్కువగా నెంచరాదు. విద్య విద్యకొరకే నేర్పవలయును.

* * * *

ఇరువదిరెండు సంవత్సరములక్రింద ఉత్తరఫ్రాన్సుదేశమున నొక యింగ్లీషుయువకునికిని యొకఫ్రెంచి యువతికిని వివాహముజరిగెను. వివాహపువిందునకు పోవునపుడు వధూవరులిద్దరు తగవులాడుకొనిరి. వరుడు కోపముచేసికొని యింటి చోటువీడి చనెను. ఆ దినమునుండి వారిరువు రెపుడును గలసికొనలేదు. వధువుమాత్రము వివాహమాడిన భర్తయెడ ప్రేమగల్గి తన్ను వివాహమాడ యర్థించిన పెక్కుయువకులను త్రోసిపుచ్చి మొదటిభర్తనుండి విడాకులుపుచ్చుకొనుటకు నిరాకరించెను. ఈసమాచారము యిటీవల ఆమె భర్తకు స్నేహితునిమూలమున దెలియవచ్చెను. ఆతడుగూడ భార్యపైన ప్రేమచేతనే తదుపరి వేరొకయామెను వివాహ మాడియుండలేదు. వెంటనే వారు ఒకరిసమాచారముయింకొకరు తెలిసికొన్నారు. తానుజేసినదానికై భర్త పశ్చాత్తప్తుడై భార్యను చేరదీసి సంతోషముగానున్నాడట. కామేచ్ఛమే ప్రధానముగాగొని పవిత్రమైన ప్రేమను క్షణక్షణము పరువులెత్తించు పాశ్చాత్యప్రపంచమున గూడ నిట్టిపవిత్రహృదయులుండుటాశ్చర్యముగదా!

* * * *

భారత నారీమణి వస్త్రధారణం పాశ్చాత్య వనితల్ని ఆకర్షించివేసింది. వారందరూ దానిలోని రామణీయకతను కీర్తిస్తూ వున్నారు. దానిని అనుకరించడానికి అమితోత్సాహాన్ని వెలువరిస్తున్నారు.

నేడు పారిస్‌లో ఇలాగా చీరలు ధరించడానికి విశేషంగా ప్రయత్నాలు జరుగుతూవున్నాయి. నిజంగా విచారిస్తే ఈ చీరకు పెద్దగాథవుంది. ప్రస్తుతం ఇది ప్రపంచనారీమణుల్ని కదలించి వేస్తోంది. వివిధదేశాల్లోని మహిళామణులు దీన్ని అనుసరించడానికి ఉవ్విళ్లూరుతూ వున్నారు.

ఈ చీరలో ఒక అపూర్వశోభవుంది. ఇది సుదీర్ఘంగావుండే నేతగుడ్డగాగానీ, లేక సిల్కుగాగాని వుంటుంది. దీనికి చుట్టూ సొగసైన అంచువుంటుంది. దీనికి తగిన మడతలూ, జరీలూ అన్నీ ఆరితేరిన పనివారిల చేత కూర్చబడుతూ వుంటాయి. వీనిలో స్త్రీ కళలన్నీ ఉట్టిపడుతూ వుంటాయి. అనేక శతాబ్దాలనుండీ ఇలాంటి సుందరమైన ప్రత్యేకవస్త్రాలు పేరుబడసిన పనివారలచేత తయారుచేయబడుతూ, దేశీయుల మన్ననలకు పాత్రమవుతూ వచ్చినాయి. వీనిమీద హైందవాంగనలు ప్రత్యేకాభిమానాన్ని ప్రకటిస్తూ వచ్చారు. అందరూ వీటిని అమితంగా ప్రేమించారు. రాను రాను వీటిని తాము పూజిస్తూవుండే దేవుళ్లతో సమానంగా పరిగణించారు.

హిందూదేశంలో ధరింపబడుతూవున్న చీరకు ప్రాముఖ్యం చాలావున్నది. దానికి అమర్చబడివుండే రంగులూ, పద్ధతులూ మొదలైనవి దానినిధరించిన వారి సాంఘికస్థితిని తెలియజేస్తూవుంటాయి. భిన్నదశలో వుండే స్త్రీలకు భిన్నవర్ణముల రంగుల చీరలు ఉపయోగిస్తూ ఉంటారు.

ఇప్పుడిప్పుడు చీరలోని అపూర్వ శోభనూ, కట్టులోని ప్రత్యేకతనూ అన్నిదేశాలవారూ మెచ్చుకుంటున్నారు. ఈ విధానాన్ని అవలంబించడానికి పాశ్చాత్యస్త్రీలుకూడా యత్నిస్తూవున్నారు. 'ప్రజామిత్ర'

# గ్రంథపరిచయము

**శ్రీదత్తాత్రేయ పూజావిధి :** వెన్నెలకంటి హనుమాయమ్మ గారిచే సంస్కృతమున రచింపబడినది. ఈ గ్రంథమున నీమె శ్రీదత్తాత్రేయ పూజావిధానమున ధ్యానాచమనములు మొదలు పూజాంగమున శ్రీపాద తీర్థగ్రహణము వరకు అన్ని పూజాంగములను యథోచితములగు శ్లోకరూపమున జెప్పినది. శ్రీదత్తాత్రేయ మూర్తి చరిత్రమును దెలుపగల ముఖ్యాంశములయు అష్టోత్తరనామావళియును కూర్చినది. ఈ గ్రంథమున నీయమ పేరును కనుపడదు. అయినను ఆమె రచించినదనుటకు సందియము లేదు. ఈ వరప్రసాదిని చిన్నతనముననే సంస్కృతిబంధముక్తురాలయి పరమవైరాగ్యమునను దైవభక్తి తత్వరీతియందును నెల్లూరిలో తనపుట్టినింట జీవయాత్ర గడుపుచున్నది.

ప్రస్తుత గ్రంథముననుండి ఈమె కవితను జూపు శ్లోకములు కొన్ని ఈ క్రిందచూపబడుచున్నవి:—

> పాతివ్రత్య తపఃప్రభావ విలసద్దివ్యైశ్చ తైస్సాసతీ
> జ్ఞాత్వాకించ నిధాయ తానపశిశూ నాందోళికా
> యాం ముదా ।
> హేబ్రహ్మన్ భగవన్ హరే సురగణాధీశాన
> హే శఙ్కర
> ధూపం స్వీకురు దత్తచేతి ముదితాస్తైసా ఽ త్రిజా
> యాజగౌ ॥

> కదా సహ్యక్షోణీధరశిఖర కాంతారనిలయే
> మునీనాం మధ్యస్థం స్మితసితరుచి ప్రోజ్వలముఖం ।
> గురుం పశ్యన్ దత్తం "గురువరదయాళో ఽ త్రి
> తనయ
> ప్రసీదేతి క్రోశన్ నిమిషమివనేష్యామి దివసాన్ ॥

> వదతు వదతు వాణీ దత్త దత్తేతి మంత్రం
> నమతు నమతు మౌళిస్తస్య పాదారవిందం ।
> హృదయకమల మధ్యే చిన్మయం దత్తధామ
> స్ఫురతు భయహరం మే సర్వదం సర్వకాలం ॥

శ్రీదత్తాత్రేయానుష్ఠానమును దేశమున వ్యాపింపజేయుటకీ పూజావిధానగ్రంథ మత్యంతోపకారకమని శ్రీ స్వాములవారు దీని విశేషముగ శ్లాఘించియున్నారు. ఈ గ్రంథము వేలకొలదిగ కాశీప్రాంతములను మహారాష్ట్రదేశమునను వ్యాపించియున్నది. వెల 0-4-0 కాశిలో బిందుమాధవఘట్టమున పంచగంగేశ్వరమఠమున శ్రీ॥ మగి వెంకటాచల శర్మగారియొద్ద దొరకగలవు.

**స్మృతికాలపు స్త్రీలు** గ్రంథము 212 పేజీలు. క్రయం రు 0-10-0. గ్రంథకర్త జటావల్లభుల పురుషోత్తముగారు ఎం. ఏ. వీరు పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరు "ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము"నకు అధ్యక్షులు. వీరు దొరకినంతవరకు స్మృతులన్నియు బరిశోధించి, హిందూమతమునకున్నూ — అందులో ముఖ్యముగా స్త్రీలయొక్క పూర్వధర్మములు, అనగా వివాహవయస్సు — వివాహవిధానము — రజస్వలాంతర వివాహము — పునర్వివాహము — కర్మకాండ — స్త్రీధనము — గౌరవము — స్వాతంత్ర్యము — వృత్తి — విద్య — మున్నగు విషయములు స్వతంత్రబుద్ధితో నిష్పక్షపాతముగా స్మృతులను — వాని అర్థములను వ్రాసినారు. భేదాభిప్రాయములు కలిగియున్నను, అందరు నీపుస్తకమును చదివితీరవలెను. అందరికి అందుబాటులో నుండుటకై

గ్రంథముయొక్క క్రయము తగ్గించినట్లున్నది. ఈ గ్రంథమునకు రెండవఅనుబంధము త్వరలో వెలువడ వలెనని గోరుచున్నాము. ప్రతులు గ్రంథకర్తకు వ్రాసిన బడయగలరు.

**బాలసరస్వతి ఆంగ్లో తెలుగు ప్రైమర్**

గ్రంథకర్త శ్రీ ఎ. ఈశ్వరయ్య సెట్టిగారు. 62 పుటలు. బాల బాలికలు, పాఠశాలలందును, స్వయముగను ఆంగ్లభాషను నేర్చుకొనుటకు చాల ఉపయోపడు నట్లు వ్రాయబడినది. ప్రతిపదము తెలుగున యింగ్లీషు వ్రాయబడినది. దాని యర్థము సులభముగ గోచరించు రీతి చిత్రములు విరివిగాగలవు. సంభాషణగూడ త్వరగా నేర్చుకొనుటకు మార్గములు సూచింపబడినవి. అంత్యమున శబ్దసంగ్రహమున, ఇంగ్లీషుపదములు వాని నుచ్చరించురీతి, అర్థము 14 పుటలులో చేర్చబడినది. దీనిని పాఠశాలలం దుపయోగించిన బాగుండునని మా తలంపు. ప్రతులు బాలసరస్వతి బుక్ డిపో, కర్నూలు వారివద్ద దొరుకును. వెల 4 అణాలు.

**నవ్యభారతోదయము**

ఇది రాజమహేంద్రవరమున గల ప్రాక్ ప్రతీచీ గ్రంథమాలయందు మూడవపుస్తకముగా వెలువడినది. గ్రంథకర్త, ప్రకాశకులు గూడ కామరాజు హనుమంతరావుగారు. 230 పుటలు. వెల రేపరు బైండింగు రు 1-0-0 అట్ట బైండింగు రు 1-4-0 "ఆదికాలమునుండియు నేటివరకుగల హైందవధర్మజీవనముతో సంబంధించిన మహద్విషయము" లేగాక యీపుస్తకమునందంతట హైందవుల ఆశయములు, ఆధ్యాత్మికవిజ్ఞానార్జనాభిలాష, భౌతిక పదార్థ తత్వపరిశీలన, దానివలన మానవోపయోగకర ములను వాని నిర్మాణములందు కోరికలేకుండుటయు భౌతికవిజ్ఞానప్రధానులగు పాశ్చాత్యులు గూడ నీ యాధ్యాత్మికవిజ్ఞానము ఉత్కృష్టమని ప్రశంసించుటయు, గ్రంథకర్త బహుచక్కగా పొందుపరచినారు. ప్రాచీన హైందవుల ఉత్తమధర్మములనే నవీనకాలమునరామ మోహన, దయానంద, రామకృష్ణ, విన్సెంటు ప్రభృతులు పునరుద్ధరించిరనియు, నీకాలపు పురుషపుంగవు లగు గాంధీమహాత్ముడు, అరవిందుడు, రాధాకృష్ణుడు అఖిలప్రపంచమునకు హైందవధర్మ ప్రబోధముల నుత్తమాదర్శముల మూలమున జూపుచున్నారనియు మతములు వేరైనను లక్ష్యమొక్కటేననియు, వ్రాయ బడినది. "రవీంద్రుని భావనాశక్తియందును, రాధాకృష్ణుని తత్వజ్ఞానములోను అరవిందుని యోగసాధన లోను గాంధీమహాత్ముని యాదర్శజీవనములోను నవ్య భారతభూమి నవీనకాంతులు ప్రస్ఫుటమగుచున్న" టుల గ్రంథకర్తగావించిన పరిశోధన ప్రతివారును, జదువదగియున్నది. ఇట్టి యుత్తమగ్రంథముల నింకను ఆంధ్రలోకమునకు గ్రంథకర్తగారు ప్రసాదింతురు గాక.

**అబిసీనియా యుద్ధము**

ఇది అనకాపల్లి ప్రజాసేవ గ్రంథ మాలనుండి రెండవదిగా వెలువడి నది. 20 పుటలు. పులపాక సీతా పతిరావుగారు దీనిని రచించిరి. వెల 1 అణామాత్రమె. ఇందు పందొమ్మిదవ శతాబ్ది మధ్యనుండి నేటివరకు అబిసీయా చుట్టుప్రదేశముల నాక్రమించుకొనియున్న ఇటలీ, ఫ్రాంసు, ఇంగ్లీషు వారికిని అబిసీనియాకును జరిగినయుద్ధములు, సమాధాన ములు, వారిలో వారికి పరస్పరముగల సంబంధములు, ప్రకృతపు యుద్ధమునకు కారణములు గలవు.

**దస్తావేజుల మతలబు**

74 పుటలు. వెల 12 అణాలు. ఆంధ్రలోకమునకు చిరపరిచితు లును, "సాహిత్యలతా గ్రంథ మాల" సంపాదకులును అగు శ్రీకర్లపాలెం కృష్ణారావుగారు దీనిని రచించిరి. ఇదివరకే దీనినిగూర్చి విమర్శన గృహలక్ష్మియందు వెలువడినది. ఇందు సకలవిధములైన దస్తావేజుల సమాచారములు అందరకూ తెలియునట్లు వివరముగా

వ్రాయబడినవి. ఈ పుస్తకము మూడవముద్రణమైనం దున మునుపటికంటె ఎక్కువసంగతు లిందువ్రాయ బడియున్నవి.

**జ్ఞానదీపిక.** 110 పుటలు. గ్రంథకర్త శ్రీ ఆకురాతి కృష్ణమూర్తిగారు పిఠాపురము. ఇత్యాది పండిత సీతానాధ తత్వభూషణ మహాశయునిచే వంగభాషయందు 'సాధనబింధు' అను నామమున వ్రాయబడి గ్రంథకర్త గారిచే 'ధర్మసాధని' యందు ప్రకటింపబడినది. తండోపతండములుగా బయలుదేరు గ్రంథములు పత్రికలు బాలిబాలకల మనస్సును గలతపెట్టుచున్నవనియు వారి ధర్మబుద్ధికి, సదాచారమునకు, భావనాశీలతకీ "గ్రంథముపకరించుననియు, ప్రకాశకుల యాశయము. సాధన, ధ్యానము, ప్రేమబీజము మున్నగు అధ్యాయములందు వ్రాయబడిన సంగతులు పై యాశయమును సఫలముజేయునని తలంచెదము. ఆంధ్రయువతీ యువకులు ధర్మక్షేత్రమం దడుగిడుట కిదిచాల ఉపకరించును. వెల 10 అణాలు. ప్రతులు ఆకురాతి చలమయ్య శాంతికుటీరమువారికి వ్రాసిన దొరుకును.

**రాజర్షి రాజారామ్ మోహనరాయ్.** 72 పుటలు. వెల 0–6–0 గ్రంథకర్త ఆకురాతిచలమయ్యగారు. రాజా రామ్ మోహనరాయి గారినెరుంగనివారు భారతదేశమం దెంతమందియో యుండరు. వీరిచరిత్ర సంగ్రహముగ నిందు వ్రాయబడినది. రాయిగారి శైశవము విద్య, శాస్త్రచర్చ, ఉద్యోగము, ధర్మ ప్రచారము ధర్మాందోళనము స్త్రీలకు జేసిన సేవ సులభగ్రాహ్యముగ వ్రాయబడినది. తాముజేయు కార్యము జనసామాన్యమునకు నచ్చకున్నను, సనాతనులు పెక్కు కష్టములుబెట్టినను గమనింపక తన కార్యములను కొనసాగించి సంస్కారములకు విద్యావ్యాప్తికి బీదప్రజలహక్కులకు విశేషముగ కృషిజేసిన యీమహనీయుని చరిత్ర నందరు జదువదగి యున్నది.

**శ్రద్ధాంజలి.** ఇదికూడ ఆకురాతి చలమయ్య గారిచే ప్రకటింపబడినది. 26 పుటలు. వెలతెలియదు. ఇది 'భక్తవరేణ్యుడగు పిల్లారిశెట్టి సీతారామయ్యగారి సంగ్రహ జీవిత చరిత్ర. పరిపూర్ణమగు భక్తి, మానవసేవయం దిచ్చ సన్మార్గ జీవనముగల్గి మార్గదర్శకుడైన వీరిచరిత్ర చదువుట కాహ్లాదముగ నున్నది.




**శ్రీ పంచమ జార్జిసార్వభౌముల నిర్యాణము**

జనవరి యిరువదవతేది సోమవారము రాత్రి 11-55 గంటలకు శ్రీ పంచమ జార్జి సార్వభౌములు పరమపదించిరని వ్రాయుట కెంతయు చింతించుచున్నారము. 1928-29 సంవత్సరములందు గల్గిన యనారోగ్యమున కంటె యిప్పటిజబ్బు నిరపాయముగా గన్పించి నను కొలదికాలములోపలనే సార్వభౌముల మృత్యువున కెఱజేసి ఎల్లరికిని తీరని విచారము గల్గించినది. శ్రీ మేరిరాణిగారును వేల్సు యువరాజుగారును యార్కు రాకుమారుడును కెంటు రాకుమారి దంపతులును రాచకుమారితెయు చెంతనుండ ఎట్టి యాయాసముగాని,ఎట్టి బాధగాని లేక సార్వభౌము లీ భౌతిక శరీరమును తన డెబ్బదియొకటవపట చాలించిరి.

ప్రపంచమందు భూప్రదేశమున నైదింట భాగమునకు సార్వభౌముడై వివిధజాతులు మతములు, భాషలు తన సామ్రాజ్యమం దిమిడియుండ నందరిని నన్నివిధముల తృప్తి పరుప తన శక్తికొలది ప్రవర్తించిన యా సార్వభౌముని వియోగమునకెవ్వరుకంట తడిబెట్టకుందురు? కన్నబిడ్డలపోలె చూచుచుండిన వారి ప్రజల నుధ్యవారెపుడును కీర్తి శరీరముతో జీవించియేయుందురు.

సర్వవిధముల సార్వభౌములకు తగిన ధర్మపత్నియైయుండిన శ్రీరాణిగారికి రాజ కుటుంబమునకును గల్గిన నష్టమునకు చింతిల్లుచు భక్తిపూర్వకమగు సానుభూతి నందజేయుచున్నాము. తండ్రి కన్నివిధములదగిన తనయుడై యిదివరకే ప్రజాదరణము చూరగొనియున్న వేల్సు యువరాజుగారిపుడు ఏనిమిద ఎడ్వర్డుగా సార్వభౌములైనారు. వారు తండ్రివలె ప్రజాదరణకు పాత్రులగుదరనుటలో సందియములేదు. పరమేశ్వరుడు వారి కెల్లప్పుడు తోడునీడయై యుండుగాక ; సార్వభౌముల యాత్మకు శాంతిగలుగు గాక యని ప్రార్థించుచున్నాము.

**ప్రసూతివైద్య సమావేశము**

"భారతనారీమణులను రోగములనుండి ప్రసూతిబాధలనుండి దప్పించి ఆరోగ్య భాగ్యాభిరామమగు సంతానమును బడయ జేయుట కెంతేని ప్రయత్నింపవలసియున్న" దని ప్రసూతివైద్య సమావేశ సందర్భమున గవర్నరుగారు వచించినదెంతయు నిక్కవము. ప్రస్తుతముగల ప్రసూతివైద్యవిద్యయు తత్సంబంధమగు వైద్యశాలల నిర్మాణముగూడ ప్రసూతిరోగములను, వానిమూలమున మరణించుచుండువారి సంఖ్యను తగ్గింపలేకున్నవి. ప్రసూతివైద్యసమస్య భారతదేశ

మందు ప్రబల సమస్యయైయుండుట సత్యేతరముగాదు. దీని పరిష్కారమునకై కూడిన పై సమావేశము ప్రసూతి వైద్యవిద్యయందు పరిశోధన అవశ్యమని తీర్మానించినది. ఈ విద్యయందిట్టి శ్రద్ధగైకొనుటకు చెన్నపురి యగ్రగణ్యమయ్యె పై సమావేశమునకధ్యక్షురాలగు(డాక్టర్)మిస్. స్కడ్డర్ గారు వచించిన విధమున ప్రసూతివైద్యము ఏవో నాల్గుపెద్ద పట్టణములందలియొకటి రెండు వైద్యశాలలందేగాక మారుమూలలనున్న గ్రామములకుగూడ ప్రాకవలయును. పరిశోధనలెన్నియైనిసాగవచ్చును; నూతన విశేషములెన్నియైన గనుగొనవచ్చును; వైద్యశిఖామణులీ విద్యయందు పెద్దపెద్ద పట్టముల్ను పొందవచ్చును; కాని యెప్పుడీవైద్యము ప్రజల కందుబాటులో నుండునో, బీదసాదలకుగూడ నుపకరించునో యపుడే దీనివలన నిజమగు ప్రయోజనముండగలదు. ప్రతిగ్రామమందును యీవిద్య యింతయోయెంతయో దెలిసియుండు మంత్రసానులు వైద్యులుగూడ నీ విషయములందు శ్రద్ధవహింపవలయుననియు నీవైద్య విద్యనభ్యసించినవారందరును గ్రామవాసులయెడ సహకారము జూపవలయుననియు వీరికి స్థానికప్రభుత్వమువారును స్థానిక సంఘములును సాయపడవలయుననియు నధ్యక్షులు సూచించిన విషయములు గమనింపదగినవి. ప్రసూతివైద్యము విరివిగా నభ్యసింపజేసి తగువైద్యులను మంత్రసానులను తయారుగావించి పెద్దపెద్ద పట్టణములనుండు వారికిని ధనవంతులకు మాత్రమే గాక ధనవిద్యావిహీనులగు గ్రామవాసులకుగూడ నీవైద్య సాహాయ్యము గలుగునట్లు ప్రభుత్వమువారు శ్రద్ధవహించి ప్రజాసముదాయమునకు మేలొనర్తురని గోరుచున్నాము.

ఆంధ్రదేశకళావంతుల సంఘసంస్కరణ మహాజనసభ:

"ఆదిలో నీకళావంతుల సంఘము సంగీతనాట్యాది లలితకళలకు నెలవై మతవ్యాప్తికిగూడ దోహదము గల్గించుచు, రాజులచేతను దేవాలయాధికారులచేతను ధనమాన్యముల మూలమున పారితోషకములు బడయుచు, సద్వర్తనమే మూలముగా నుండెడిది. కాలక్రమమున ధనాపేక్షచే విషయలోలురకులోనై ఈసంఘము పతితమయ్యె" నని యీసభ కధ్యక్షతవహించిన శ్రీమతి యామినీపూర్ణతిలకమ్మగారి వచనములు నిజములై యుండవచ్చును. ఏ కారణముచేనైన గానిండు. ఇప్పుడైన భారతీయులు మేల్కాని దానిని సరిదిద్దుటకు పూర్తిగ బూనుకొనకుండుట చాల శోచనీయము. ప్రభుత్వమువారి చట్టములుండిన నేమి! ప్రజాదరణము, దేశనాయకుల సహకారము, సంఘమువారి సానుభూతిలేకున్న సంపూర్ణమగు సంస్కారము జరిగి యీమచ్చ మాసిపోదు. పై సంస్కారసమావేశమునందు వివాహవిషయమునను, వృత్తిని నిరాకరించు విషయమునను గావింపబడిన తీర్మానములు గమనింపదగినవి. 'భోగము'వారను యుద్దేశ్యము పూర్తిగమాని మానినుల సూచితరీతి

సన్మానింపబూనుకొని యిపుడైన మనదేశ మునకు సంఘమునకు కళంకముగనుండు నీ వృత్తిని తుదముట్ట నిర్మూలింప ప్రతిసోదరీ సోదరుడును ప్రయత్నించుగాక.

శ్రీ శారదానికేతనము:

శ్రీ ఉన్నవలక్ష్మీనారాయణ దంపతులచే స్థాపింపబడి గుంటూరునందు నడుపబడుచున్న శ్రీ శారదానికేతనము నెఱుంగని యాంధ్రు లుండరన్న యాశ్చర్యముగాదు. త్యాగమూర్తులై దేశసేవాపరాయణులై సంస్కరణాభిలాషులై యీ దంపతు లాంధ్రదేశమునకు జేయుచున్న సేవ యమోఘము. వీరు తమ సంస్థయందలి బాలికల పుత్రికాప్రేమతో సంస్కృతాంధ్ర హిందీసాహిత్యముల చవి జూపించుటయగాక, భావిభారతగృహలక్ష్ములకు గావలసిన, గృహపరిశ్రమ, లలితకళలు, సంగీతము, మొదలగువానినెల్ల నేర్పుచున్నారు. నిరాడంబరత్వము, విశ్వమానవసౌభాతృత్వము, సర్వమతసహనము, ముఖ్యముగ నిమ్నజాతులయెడ తగునాదరణ, చాలయక్కరతో నేర్పబడుచున్నవి. సారస్వతాభివృద్ధికిచట సర్వవిధముల ప్రయత్నించుటయందే ప్రాముఖ్యము వహించుటయగాక బాలికలకు గావలసిన ఆరోగ్యవిషయములందును, తత్సంబంధమగు ఆటపాటలందును, లలితకళాభివృద్ధికి మార్గములగు నాటకాదివిశేషములందును, గూడ యెక్కువశ్రద్ధ వహించుచున్నారని జెప్పకతప్పదు. ఏకాదశవార్షికోత్సవసందర్భమున మనోహరముగ ప్రదర్శింపబడిన నాటకాదివిషయము లిందులకు నిదర్శనములు.

కులాభిమానము తమకడ్డురానివ్వక పెక్కుమంది, దీనికి సాయమొనరించుచున్నారు. కొందరు ధనముమూలమున మరికొందరు ధాన్యాదివస్తురూపమున సాయమొనరించినారు. వారెల్లరకు మా ధన్యవాదములు. సంస్థ చాల యభివృద్ధిబొందినదనుటకు సందియములేదు. అభివృద్ధితోపాటు వ్యయము గూడ హెచ్చైనది. కావున ఉదారాభిమానులందరు యథోచితముగ సాయమొనరించి ఈసంస్థ నింకను అభివృద్ధికిదెత్తురనియు, తమ బాలికల నచటికిబంపి మేలుబొందెదరనియు గోరుచున్నాము.

సంతాననిరోధము — శ్రీమతి మార్గరేట్ సాంగరుగారు:

సంతాననిరోధనమస్య ప్రపంచమంతయు నల్లుకొన్నది. మహాపురుషులుగూడ నీ యుద్యమమును ప్రశంసించుచున్నారు. ఈ యుద్యమసంస్థాపనరాలగు శ్రీమతి మార్గరేట్ సాంగరుగారిపుడు భారతదేశమందు ప్రచారము గావించుచున్నారు. ఈ సమస్యయింతటి ప్రసిద్ధికెక్కుటకు ప్రబలకారణములున్నవి. దీనిపై సాంగరుగారిమాటల గమనింపదగును. "దేశాభివృద్ధి గావలయునన్న, జాతి అత్యున్నతదశ పొందవలయునన్న, ప్రజలు బలహీనమగు జనాభాను తగ్గింపవలయునని సాధించుటకే సంతాననిరోధ ఉద్యమము స్థాపింపబడినది. ఎంత దరిద్రదశయందుండు

కుటుంబమునకైనను శాస్త్రోక్తమగు నీవిధానముల చేకూర్చి వారిని తమకుటుంబముల వృద్ధిబొందించుకొనకుండుట కవకాశములను గల్గించుటకే యీ సంఘము పాటుబడుచున్నది. మనుజుని ఆయుఃపరిమాణాభివృద్ధి కిదియే మంచిమార్గమని నా తలంపు. జన్మించు ప్రతిశిశువుగూడు దేశాభివృద్ధిని జాతీయగౌరవమును పెంపొందింప సాయపడవలయును. నే నిందుకే యీయుద్యమమును ప్రారంభించితిని."

ఇంతియునాక, వ్యభిచారనిర్మూలనమునకు, రోగులును, బలహీనులునగు శిశుజన్మనిరోధమునకు, వంశపారంపర్యముగ వచ్చు రోగముల నాటంకపరచుటకు, ప్రబలముగనున్న ప్రసూతిమరణములు,శిశుమరణములు తగ్గించుటకు, హెచ్చుచుండు జనాభా తగ్గించుటకొరకు,విశేషముగతోడ్పడునదిసంతాననిరోధమేయనియు, గూడ యీయుద్యమము నొక్కిచెప్పుచున్నది. కాని, యిది వ్యభిచారము నభివృద్ధిపరచుననియు, అగ్రజాతు లిందుదయించు ప్రతిభావంతుల నాటంకపెట్టి సంఘమున కపకారము గల్గించుననియు, ప్రకృతి విరుద్ధమనియు, మతసాంప్రదాయములకు వ్యతిరేకమనియు కొంతమంది వాదింతురు. ఏదియెట్లున్నను యీ యుద్యమోద్దేశ్యములు గమనింపదగినవే. పద్ధతులు మాత్రము సర్వజనాంగీకారములుగ లేవు. భారతదేశవాసులవంటి ధనవిద్యావిహీనజనసముదాయమున కుపకరింపవు. కావున ఆపద్ధతుల నవలంభించుటకంటె మహాత్ముడు వచించినట్లు, ఆర్యులపద్ధతియగు బ్రహ్మచర్యపరిపాలనము,వయోవివాహములు మొదలగు విధానముల, ననుసరింపవలెను. నిర్బంధవిద్యావిధానము స్వదేశపరిశ్రమలు, మొదలగు వానిచే ప్రజాసముదాయము గనుక్క జీవితమునందు మార్పుగల్గించిన దోసదిగూడ యెక్కువగ నుపకరించును.

సవరణ:

డిశంబరు సంచిక — తప్పు. సింగళీసూచన

పేజి ౬33, 25-వ పంక్తి — ఒప్పు. చేమకూర వేంకటకవి

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# ఇంటికి మించిన ఆదరణ!

# ఆవికిమించిన భోజనము!!.

ఆంధ్రులరుచులను కనుగొని మృష్టాన్నమిడు ఆంధ్ర బ్రాహ్మణ హోటలు బెంగుళూరులో నిదియొక్కటియే. ఈ హోటలును రు. 50000 ల (యాభై వేలరూప్యముల) మూలధనముతో యస్. జి. శాస్త్రిగారిచే స్థాపింపబడినది. నవీన నాగరికత యేర్పాటులతో ఈ భవనము అలంకరించబడియున్నది. ఆంధ్ర సోదరసోదరీమణులకు కావలసిన పచ్చళ్లు (గోంగూర చింతకాయ పచ్చళ్లు వగైరా) ముద్దపప్పు, వెన్నకాచిన నెయ్యి, ఆవకాయ, వేపుడుకూరలు మొదలగు భోజనపదార్థములతో భోజనము పెట్టబడును. రెండుపూటలు భోజనము, రెండువేళల కాఫీ ఫలహారములు గదితోకూడ దినమునకు 2 రూపాయిలు మొదలు రు. 5 వరకు రేట్లుగలవు.

మరియు యిక్కడ ప్రతిపదార్థము వెన్నకాచిన నేయితోనే తయారు కాగలదు. వివిధములైన మిఠాయి దినుసులను చక్కనిప్యాకింగుతో రైలుపార్సిలు ద్వారాగా బైటవూర్లకు పంపబడును. వివాహాదిశుభకార్యములకు జాస్తికావలసిన ధరలు తగ్గించి యివ్వబడును.

వివరములకు వ్రాయుడు

## శాస్త్రి హోటల్ అండ్ రెస్టారెంట్

**89 చిక్ పేట :: బెంగుళూరు సిటీ**

# గృహలక్ష్మి

### చందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్థసంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి యమూలకము.

### ప్రకటన రేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ఉంచవలసిన రేట్లు ఇవి: ఒకసారికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్థసంవత్సరము అంతకుపైబడినకాలమునకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువవైనప్రకటనలు చేక[illegible]లము. ప్రత్యేకస్థలములరేట్లకొఱకు వ్రాయునది.

### ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

[illegible] స్త్రీజనములకు సంబంధించియుండు [illegible]గహాముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. [illegible]యునకు ఒకవైపుననే సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలబిళ్లలు [illegible]పను చేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తర[illegible]ండుటలెస్స. విమర్శనార్థము పంపబడు [illegible] ప్రచురణార్థము పంపబడువ్యాసము [illegible]వఱకు వ్రాయుచుండినరీతిని

ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జవాబుఈయబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

### చిరునామామార్పు

చిరునామాయందుమార్పు ఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగనుండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతిసంచిక వీ. పీ. గా పంపగలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి. పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రముపంపకూడదు.

# 45 వ సంవత్సరము

# జన్మదినపు బేరములు



## తగ్గింపు ధరలు

**4-3-1935 తేది**

## ప్రారంభము.

కొనుక్కొనేవారికి

అతిలాభకరమైన

సమయము.

క్రొత్త ఫ్యాషను చీరలు

క్రొత్తరకముల వస్తువులు

# బెలారామ్స్

బెలారామ్స్ కెయూఃచెడ్

ఫ్యాషన్ సిల్క్ పాలెస్

**45**

రట్టాన్ బజారు,

మదరాసు.

# వి ష య సూ చి క



త్రివర్ణచిత్రము

సత్ కాలక్షేపము

# ఛాయాచిత్రములు

## వివరములు

### శ్రీమతి ఎజ్‌లిన్ ఒబెయసక్కర్ కన్య

సింహళద్వీపమునకు స్పీకరుగానుండిన శ్రీ ఒబెయసెక్కెరిగారి కుమార్తె. సుప్రీము కోర్టులో క్రొత్తగా అడ్వొకేటుగా చేరినది. ఈమెయే సింహళములో ప్రథమస్త్రీ అడ్వొకేటు.

### శ్రీమతి ముసగాల విజయలక్ష్మమ్మగారు

నరసాపురం పోటీపరీక్షలో శ్రీయనమండ్ర కామేశ్వరమ్మ స్వర్ణపతకము నందినారు.

### శ్రీమతి పి. సౌభాగ్యమ్మగారు

పై పరీక్షలోనే శ్రీ తివాదిదేవకీబాయి స్వర్ణపతకము నందినారు.

### శ్రీమతి వల్లూరి జానకమ్మగారు

పై పరీక్షలో మొదటియామెగ కృతార్థురాలై గృహలక్ష్మి స్వర్ణపతకమందినారు.

### శ్రీమతి లలిత

చక్కగా నృత్యముచేయగల సతీమణి. ప్రస్తుతము అజంతాగుహలలోని చిత్రములను చూచి కొన్నిభంగిక లభ్యసించుచున్నది.

### శ్రీమతి శ్రీరాం భాగీరథీగారు

కాంగ్రెసు తరఫున చెంగల్పట్టుజిల్లా బోర్డుసభ్యురాలుగా ఎన్నుకొనబడినారు.

### శ్రీమతి సిపాహిమాలనిగారు

సుప్రసిద్ధ కాంగ్రెస్సుసేవకియగు సింధురాష్ట్రనివాసి. కరాచికార్పొరేషన్కు సభ్యురాలుగా నెన్నుకొనబడినారు.

### శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

నరసాపురం పోటీపరీక్షలో రెండవయామెగా కృతార్థురాలై శ్రీ యడ్లమిల్లి శకుంతల స్వర్ణపతకము నందినారు. రాజమహేంద్రవరవాస్తవ్యురాలు. గృహలక్ష్మిపాఠకుల కీమె గద్యపద్యరచనలు పరిచితములగుచునే యున్నవి.

# మాధవి




ఇది పుష్పసారములతో నిండియుండు ఒక నాజూకైన మంచువంటి పరిమళపదార్థము. ఈ మంచును కొద్దిగ వ్రేలితో తీసుకొని ముఖమునకు లేపనమును చేసికొనిన వెంటనే అది చర్మములో మాయమై ముఖమునకు కళ, కాంతి నిచ్చును. ముఖము స్ఫటికమువలె నిర్మలమగును. ముఖమున లేచు పొబ్బి, మచ్చలు, మొటిమలు మొదలగువానిని మాన్పును. మరియు దీనిని ముఖమునకు పట్టించుకొనిన వెంటనే ముఖము చల్లగ నూడి మంచు రాచుకొనినట్లేయుండును.

వెల బుడ్డి 1-కి 8 అణాలు.

కస్తూరికుటీరం, ఎగ్మూరు, మద్రాసు.




శ్రీ విస్తారము నాంధ్రలోక వనితాసేవ్యంబు భవ్యంబు బ్రా
హ్మీ విక్రాంత మనంతమైన గృహలక్ష్మీ శక్తి యాశాంతమై
మీ విద్యాబల వృద్ధిసేయుచు సదా మీ కాయురారోగ్యను
శ్రీ విఖ్యాతు లొసంగుగాతయని యాశీర్వాదముల్ జేసెదన్.

ప॥ కృ॥ మూర్తి.

# కృతజ్ఞత

సోదరసోదరీమణులారా !

కృతజ్ఞతాపూర్వకములగు మా యీ మాటలు చర్వితచర్వణములు కావు. ఇది మాకుఁ గర్తవ్యమును మీ కుత్సాహకరము నైనవిషయము. సర్వవిధములమందమైయున్న ప్రస్తుతస్థితిలో మన 'గృహలక్ష్మి' మఱియొక నూతనసంవత్సరమును జూడఁగల్గుచున్నది యనుట యొకవిశేషము. ఆరునొకటి గడచినవి: ఇది యెనిమిదవయేఁడు వచ్చినది. ఇంతవరకుఁ దాము సర్వవిధముల నెట్టిప్రేమాదరణములతో స్వాగతమిచ్చియున్నారో అట్టి ప్రేమాదరణములతోనే యికముందుగూడ నీ గృహలక్ష్మికి స్వాగతసౌభాగ్యము నొసంగుదురని నమ్ముచున్నాము.

మానినీమణులు లోకకళ్యాణమునకై యిటీవలఁ జూపిన యపూర్వత్యాగము నమిత వ్యయప్రయాసములు సాధ్యమైనంతవరకు గమనించి యీ మనగృహలక్ష్మి యెంతో విజ్ఞానము సంపాదించినది; యింకను సంపాదింప నువ్విళ్లూరుచున్నది. ఇంతేకాదు: భారతవర్ష

మునఁగల వివిధ నాగరకజాతులలోఁగల తారతమ్యమును బరిశీలించునపుడు మనయాంధ్రులుమిక్కిలి వెనుకఁబడియే యింకను బ్రాకులాడుచుండుట కొకవిధమగు వగపుగూడ వెలిబుచ్చుచున్నది! తన్నాదరింపఁగలవారు, నాదరింపవలసియున్నవారు వేనవేలున్నను అట్టివారేలకో యింకను ముందుకు రాకున్నారు!! అటువంటి యబలలకెల్ల మన యీ చిట్టిగృహలక్ష్మిని జూపించు బాధ్యత మీయందు లేదా!!

ఇఁక 'నీ యారునొక్కసంవత్సరముల నుండియు మీ గృహలక్ష్మి యేమిచేయఁ గలిగినది?' యని ధీరమతులగు కొందరడుగవచ్చును. అక్కటా! యెన్నినక్షత్రములైనను అమావాస్యను పూర్ణిమగా మార్పఁగలవా?! లేవు. తథాపి వాటికాన్తి సర్వదా ప్రయోజనకారియే యగుచున్నది. అట్టులే యీగృహలక్ష్మి దీనినిబోలు మరికొన్నియు నజ్ఞానాంధకారమునఁ బడియున్న పథికులకు మార్గదర్శకములే యగుచున్నవి కాని యూరక నుండలేదు. ఐతే యెంతవరకనిన నింతవరకని చెప్పుటమాత్రము దుస్సాధ్యము.

వ్యాసరచనలయందెందరెందరో క్రొత్త క్రొత్తవారు దర్శింపబడుచున్నారు. కేవల మృగ్యమైయుండిన వనితాకవిత్వ మిప్పుడు ప్రాయికమైనది. వంటయిండ్లముంగిటి సావడులలో బడియుండిన మహాలక్ష్మి సరస్వతీ పార్వతీ స్వరూపములు, నేడు బహిరంగ సభావేదికలపై దర్శనములిచ్చి లోకమును దరింపజేయ వచ్చినవి. కాఁ క్రమమున నాత్మబలమునుబొంది గృహలక్ష్మి యింకను నెంతైనఁ జేయఁగలదు. దయ యుంచెదరుగాక!!

సమస్తసన్మంగళానిభవన్తు!!

# వీరచంద్రావతి

యశవంత సింహుని సేనలు అలంగీరు పాదుషా సైనికులు హోరాహోరి బోరుచుండిరి. మొగలులధాటికి రాజపుత్రులాగజాలక వెనుదిరిగిరి. యశవంతసింహునిరాణియగు చంద్రావతి కోటబురుజుపైనుండి చూచుచు తన భర్తసైన్యముల యోటమికి సహింపక తానును సంగరమున కటికి శత్రుసేనలం బరిమార్ప గృతనిశ్చయయై పట్టణాభిముఖులై బరతెంచు రాజపుత్రసైనికుల సమరమునకరుగ బ్రోత్సహించుచున్నయది.

ఉ॥ భండనభూమి శత్రువులబట్టి వధింపగలేక యొక్కడో
క్కండుగ వెన్నుజూపియిటు కయ్యమునుండి తొలంగి ప్రాణముల్
మెండగు తీపిగాదలప మీమదులన్ మహనీయభారతా
ఖండుల పౌరుషోన్నతము గ్రాలదె భీరులె వెన్నుజూపగన్.

ఉ॥ చచ్చుటె నిక్కమెన్నటికి జావకమంచమునందు మ్రగ్గిపె
ల్లెచ్చినవ్యాధిచే కడుకృశించిరనన్ ఫలమేమి? శత్రులన్
జిచ్చరసిద్ధులట్లుగ నశింపగజేయుడు: జేయలేనినా
డచ్చుగ వీరస్వర్గము యథావిధి నేలగబొందుడెంచికన్.

ఉ॥ పందలవోలె నొక్కనికి బానిసలై భుజశౌర్యమేది రా
జ్యేందిరనిట్టు క్రూరమదినేల నరాతులకిచ్చి దీనులై
యుందురె భారతీయులన నొప్పునె మిమ్ముల మాతృభూమికిన్
జెందినపాటు గన్గొనుడిసీ పరివారలు నవ్వరే మిమున్.

ఉ॥ ఆజికిదప్పి శత్రువుల కౌదలలొగ్గితిరేని మేమికన్
గాజులనూడ్చి కత్తులను కత్తళముల్గొని వైరిసేనలన్
తేజమడంచి యీభరతదేశము కున్నతిగూర్చి హైందవ
స్త్రీజనశౌర్యముల్దెలసి ఛేతులు మోడ్చగజేతు మీతరిన్.

క॥ చచ్చిన స్వర్గము జయముం
దెచ్చిన రాజ్యంబొ యెదియు దేల్పక కోటం
జొచ్చిన మిమ్మందర నిట
వ్రచ్చెద తరలుండు జయము వడయుడు వేగన్.

చిల్కపాటి సీతాంబ.

# చుట్టుతిరిగిరావె నాచిట్టితల్లీ

ప॥ కృ॥ మూర్తి

బండివాడొక యూరిముందటికి వచ్చునటికి చీకటిపడినది. ఇది సందని వాడు టోల్‌గేటు తప్పించి బండిని తోలుకొని యూరిచుట్టు దిరుగ నారంభించెను గాని వాని కెక్కడ గూడ సందుదొరకలేదు. వాడు నట్లే యూరికి ప్రదక్షిణము చేయుచుండ తెల్లవారినది. వాడు రేయంతయు తిరిగితిరిగి తెల్లవారు నటికి మరల నా టోలుగేటుదగ్గరకే వచ్చెను. దీనినే ఘట్టకుటీ ప్రభాతన్యాయమని న్యాయవిదు లన్నారు.

నం
గలవ ఈ న్యాయమే మన స్త్రీవిద్యా విషయ
ప్రవ ను వర్తింపజొచ్చినది.

సమర్థతతో గృహలక్ష్మీత్వము నిర్వ ..ంపగల శక్తిని గలిగింపజాలు విద్యావిధానము కావలయును గాని యీ ప్రకృత విధానము లన్నియు పనికిరావని పూర్వపద్ధతికే వచ్చుచున్నారు. ఔను! మన పూర్వులు తెలివితక్కువవారు కారు. ఎంతమాత్రమూ కారు. సంసారభారమంతయూ గృహిణుల తలలకే యెత్తినారు. అబలలగు నాయిల్లాండ్రా యత్యంతభారమును పరమానందముతో నిర్వహింపగల శక్తి వారికి గలుగుటకై యాత్మబలముండుట అత్యవసరము కాబట్టి పురాణపఠన శ్రవణములను ముఖ్యములుగ జేసినారు. ఇతిహాసపురాణ సంభూతికిని మూలాధారము స్త్రీయే కదా! సీతలేకుంటే రామాయణమే లేదు. అట్లే ద్రౌపదిలేకున్న భారతము సున్న. ప్రకృతిలోనున్న మహాశక్తుల కన్నిటికిని స్త్రీ స్వరూపములే యిచ్చినారు. శకుంతల: అమాయికమైన అకలంకప్రేమ స్వరూపమే. సత్యభామ:—మెత్తని కత్తి!! పార్వతి:—కుమారులను గాంచగలదు; పెంచగలదు; త్రుంచగలదు; సమయముపడిన తానుగూడ దగ్ధము కాగలదు! ఇట్లే సర్వత్ర ఇట్టి మహద్విషయ జ్ఞానము నుగ్గుపాలతో గూడ నాడుపిల్లలకు బట్టుచుండుట ఆర్య కుటుంబములయందు దాచారమై యుండెను కదా! దానికి కదలిక వచ్చినది. ఇది యే నాడు భ్రష్టమైనదో ఆనాడే ఆర్యావర్త మొక యధోగతి బట్టినది.

అది వివరించుట గతజల సేతుబంధనము. సర్వవిధముల విచార్యమైనది ప్రకృతము. ఇప్పటికైన మన పెద్దలు ఇది తప్పని తెలిసికొన జూచుట గొప్పమేలునకే!

"నీవు ప్రకృతివి! సర్వసంసార మూలహేతువవు నీవే సుమా! నేను కారణమాత్రుడ"నని ప్రతిపురుషుడును స్త్రీ వ్యక్తికి బోధించి యామెయందు చెడియడగి మడగి యున్న యాత్మ బలశక్తుల నుద్రేకింపజేయుటయే నిజమైన విద్యాపద్ధతి. అంతేకాని



శ్రీమతి ఎవ్లిన్ ఒబేయ్‌సేకర్ కన్య

ఏమో పది పుస్తకములు చదివించివేయుట యెంతమాత్రము గాదు.

తానెంతో తనశక్తియెంతో తెలిసికొని యాపుది యగాధమైన సంసారసాగరము నీద గలదా—తరించగలదా? అట్లు తనకు తానే తరించలేనిది తన మగవానికి సహకరించఁజేయుట యెట్లు? పలుకం గూడని భంగపాటులకు నిలచినది కావుననే ద్రౌపది పంగలను మగవారనిపించి గౌరవభావమును బుగ్గిలో గలిపించినది. అట్టి వనితలు అట్టి ఏకమాతలు నేడు కావలెను. స్త్రీ విద్యా విధానమున కిదియే పరమలక్ష్యమై యుండవలయునుగాని యక్షరములు కట్టుకొని బ్రతుకుమనుట కాదు. ఆపను గాను వాని చెప్పుటకు నేర్పనక్కఱలేదు. అట్టివన్నియు నింటనే రాగలవు. ఇక మనకు గావలసిన యాత్మవిద్య పాఠశాలలలో నెంత మాత్రమూ చెప్పుటకు వీలులేదు. కాబట్టియే "చుట్టు...తల్లీ" యన్నట్లు మన పురాణ పంథయే శరణ్యము. అది ప్రస్తుత కాలము ననుసరించి కొన్ని నియమములకు లోబడి యుండవలెను. ఇక నితరపరిశ్రమల మాటయా?—అది మనము కనులార చూచిన కొన్ని సంగతుల స్మరించుకున్న చాలును—చెప్ప నక్కఱలేదు. ఐనను స్థాలీపులాకన్యాయమున రెండు మూడు దృష్టాంతరములను చెప్పుకో వచ్చును. ఖరగ్‌పూరులోనున్న పంజాబీ స్త్రీలు—ఆవులను, గేదెలను పెంచి చక్కని పాలు, పెరుగు, వెన్న, నేయి, మజ్జిగల వ్యాపారము జేయుచున్నారు. ఏ రచట లేకుండిన గతిలేదని చెప్పుట అతిశయముకాదు. మఱియును ఈతాకులతో విసనకఱ్ఱలు, చాపలు సంచులు మొదలైనవి చేసి యమ్ముచున్నారు. ఇవి బహు నాజూకుగా నుండును. దేవదారు చెక్కలతో చిన్నచిన్న చేతిపెట్టెలను అత్తరు పెట్టెలనుజేసి రంగులువేసి విక్రయింతురు. ఇట్టి గృహపరిశ్రమ లింక నెన్నో యున్నవి. ఇవన్నియు వారిండ్లయొద్దనే అన్యోన్యాశ్రయమువల్ల నేర్చుకొన్నవే కాని స్కూళ్లలో కాదు.

కాశీ యాప్రాంతములలో స్త్రీలే మూడు వంతుల నేతపని చేయుచున్నారు. సరిగె సంకీపనులయందు వీరసమానులు. మిడ్నపూరులో స్త్రీలే మట్టిబొమ్మలు పాత్రలు మొదలగు గృహోపకరణములు చేసి విక్రయించుచున్నారు. ఓఢ్రదేశమున ఖర్చగుచున్న బియ్యమంతయు స్త్రీలు దంచి బాగుచేసినదే.

చెప్పవచ్చేదేమనగా దేశము సాధ్యమైనంత శీఘ్రముగా ముందుకు రావలెనంటే ప్రతి మగవాడును తన భార్యను సంతానమును గూర్చి శ్రద్ధవహింపవలెను. తాను నేర్చుకొనినయెడ నింటిదాని కొక చేతిపని నేర్పుట లెస్స. ఇది గొప్పవృత్తి యిది కొంచపువృత్తి యను భేద మేమాత్రము లేదు. శరీరమందున్న రోమరాజి మొదలు కొనియున్న యన్నియు శరీరముయొక్క క్షేమమున కుపచరించుచున్నట్లే ప్రపంచము నందున్న యన్నివృత్తులును ప్రజాసంఘము యొక్క క్షేమమునకే వెలయుచున్నవి. ఇవి యన్నియును సమాన పవిత్రత గలిగియు

న్నవియే. మరి యివన్నియు ప్రజలతోడ బుట్టినవే. వీనికి యజ్ఞములనెడి యుత్కృష్ట నామము పెట్టబడినది. "సహయజ్ఞాః ప్రజాః" ఇత్యాది గీతవాక్యముల జూతురుగాక. స్వతః పవిత్రములగు నీ వృత్తుల రహస్యము నెఱిగిన వారే విజ్ఞానులు. ఇక జ్ఞానమనునది ప్రత్యేక మొక్కయాత్మను గూర్చి తెలిసికొనుటయే. ఇది నిరంతర గ్రంథపఠన శ్రవణముల వల్లనే కలుగవలెను. ఇట్టి జ్ఞానము పురుషులకుకంటె స్త్రీలకు వేగముగా బట్టుబడుట సహజమని పెద్దల యుద్దేశము. కాబట్టియే వారీ పురాణ శ్రవణము ముఖ్యముగా నాఁడువారిచే జేయించుచుండెడివారు. ఈ జ్ఞానము నార్జించుకొన్నారు కాబట్టియే యప్పటి నారీరత్నములు తమ బిడ్డలను సన్మార్గములయందు నడిపించి దేశమున కెంతో వన్నెయు వాసియు దెచ్చినారు; సర్వకాల సర్వావస్థలయందును తమ భర్తల ననుసరించి వారి కిహపరసుఖముల కూర్చినారు.

నేఁడుగూడ సట్టియిల్లాండ్రే కావలెనని కోరుచు మనము పలుమారు సీతా సావిత్రీ యని యట్టివారి పేళ్లను వల్లించుచున్నామే కాని యట్టివారిని తయారుచేయుట యెట్లో యనిమాత్రము యోచింపలేదు. మనము చదివిన యీచదువు వట్టియోచనల బుట్టించుట కవకాశ మొదవించునదికాదు; కాబట్టి యిప్పుడు ముందుగా పురుషవిద్యావిధానము మార్పునొందవలెను; దానితోడనే స్త్రీవిద్యావిధానము దానంతటదేమారును. అప్పుడు గృహలక్ష్మి ప్రతిభావిశిష్టయై తనబిడ్డల నుత్తమపురుషులనుగా జేయుటకే తనకాలమంతయు వినియోగించును. అప్పుడామెకు తీరుబాటేయుండదు. సంసారచక్రమును నిరపాయముగా ద్రిప్పుటకుకంటె మంచియుద్యోగమేదని యామెయే చెప్పగలదు. కాబట్టి విద్యావిధానమును మార్పుచేయుట పురుషుల విషయముననే ముందుకానవలెను. ఏలయన ఇతడుచెడి యామెను చెడగొట్టుచున్నాఁడు. కాని ఆపెచెడి యాతని చెడగొట్టలేదు. అందువలన ముందుగ నంతడు బాగుపడెనేని యామెయు నావెంటనే బాగుపడగలదనుట నిస్సంశయము.

పై హేతువునుబట్టి పురుషునకు మతవిద్య మొదటిది. వృత్తివిద్య తరువాతిది. ఈ రెండింటివలన నతడు జ్ఞానవిజ్ఞానముల సంపాదించి యనంతరమున వివాహితుడై భార్యను సహధర్మచారిణిగ జేసుకొని యజమానుడై, లోక సంగ్రహమునకు దోడ్పడగలడు.

# నీ ప్రణయ రూపము

పోలుకొండ భద్రయ్యగారు

నీప్రణయరూపమే
నీప్రౌఢగానమే
సంజకెంజాయలో,
సాంద్రతారుణిమములో,
నీలాభ్రరుచులలో,
నిర్మలాంబువులలో,
నీప్రణయరూపమే
నీప్రౌఢగానము

౨

గౌతమీలహరిలో,
గాలిచిరుతరగలో,
సికతాతలములలో,
స్నిగ్ధకుంజములలో,
నీప్రణయరూపమే
నీప్రౌఢగానమే

౩

ప్రసవసౌరభములో,
ప్రచలితాంబుదములో,
ఫుల్లకుసుమములలో,
పూర్ణేందురేఖలో,
నీప్రణయరూపమే
నీప్రౌఢగానమే

౪

జలధరార్భటులలో,
చలితశంపాలలో,
చకితశార్వరులలో,
చటువిహంగములలో,
నీప్రణయగానమే
నీప్రౌఢగానమే

౫

పఠనకావ్యములలో,
ప్రణయగీతములలో,
రచితచిత్రములలో,
రజతతారాలిలో,
నీప్రణయరూపమే
నీప్రౌఢగానమే

౬

భయదకాననములో,
భ్రమరఝంకృతులలో,
శుకపికారవములో,
శూన్యలోకంబులో,
నీప్రణయరూపమే
నీప్రౌఢగానమే

౭

కన్నీటియేటిలో,
కనలుహృదయాగ్నిలో,
నిట్టూర్పుఝరులలో,
నిత్యవీక్షణములో,
నీప్రణయరూపమే
నీప్రౌఢగానమే

# 'వ్యాసఘట్టం'

## కాకిముక్కుకు దొండపండు

కృష్ణశాస్త్రి లక్ష్మీపురం అగ్రహారంలోని పెద్దగృహస్థు. అతనికి సాలుకు అయిదువేలు రూపాయీలు భూములవల్ల రాబడి. సిరితో పాటు సంపదకుకూడా అతనికి లోపంలేదు. నలుగురు కుమాళ్ళ వెనుక కడసారంకూతురు. రత్నంకుయిప్పుడు పద్ధాలుగోయేడు వెళ్లి పదిహేనోయేడు. సిష్టాచారంచేత రత్నంకు యెనిమిదోయేటనే పెళ్ళిచేశారు. అత్తవారు శ్రీరాంపురం వెంకటచయనులుగారి కోడలు. వారికి సాలుకు పదివేలు వస్తాయి భూముల వల్ల; నరసింహం ఒక్కడేకుమారుడు. చయనులుగారు నరసింహాన్ను అయిదువేలకు వరవిక్రయంచేశారు. శాస్త్రిగారు అయిదువేలు యిచ్చి రత్నంను నరసింహంకు వివాహం చేశారు. నరసింహంకు యిరవయియేళ్లు వెళ్లేయి; చదువు మూడోక్లాసులోనే పూర్తి అయిపోయింది. రత్నం నాలుగోక్లాసు ప్యాసయింది. యిప్పుడు తండ్రిగారివద్ద సంస్కృతం చదువుకుంటూంది. రఘువంశం పూర్తికావచ్చింది. శాస్త్రిగారి కుమాళ్లు నలుగురూ వంశీకులే. వీరి నెవ్వరినీ శాస్త్రిగారు [illegible]లేదు. మనకున్నది చాలదాఅని [illegible] ఉద్దేశం. యిందుగురించి శాంతమ్మ పట్టుపట్టలేదు. అందువల్ల శాస్త్రిగారు ధన్యులయ్యారు. రత్నం పెద్దదయి యీడాదయింది. [illegible] మంచిదికాదని వకయేడు నిలిచి పెట్టేరు. మొన్న ఆశ్వీజంలో శాంతివారెలు శాస్త్రిగారి యింటివద్దనే జరిగాయి. ఈ సంక్రాంతిపండుక్కి నరసింహంను శాస్త్రిగారు తీసుకువచ్చారు. భోగినాడు రాత్రిభోజనాలయాయి. అంతా సావిట్లో కూర్చున్నారు. రత్నం రఘువంశం శ్లోకాలు చదువుతూంది శాస్త్రిగారు బోధచేస్తున్నారు. కుమాళ్ళ సందేహాలని శాస్త్రిగారు తీరుస్తున్నారు. విద్యాగోష్ఠి జరుగుతూంది. నరసింహంకు యీ గోష్ఠిఏమీ నచ్చలేదు. కునుకుపాట్లతో కొంతసేపు వూగి వెళ్లిపోయి పడుకున్నాడు. అల్లుడు గదిలోకి వెళ్లిపోయిన కొంతసేపటికి "కాకిముక్కుకి దొండపండు" అంది శాంతమ్మ. దాని దగ్గరలోవున్న అల్లుడు వినకపోలేదు. తెల్లవారుజామున యెవరికీ చెప్పకుండా యింటికి పారిపోయాడు. కారణం అంతా గ్రహించుకున్నారు. శాంతమ్మ చాలా నొచ్చుకుంది. "చెయ్యికాలిన తరువాత ఆకులుపట్టుకున్నట్లు". నోరు జారిపోయింది. అత్తగారు ఆడినమాట తల్లితో చెప్పేడు నరసింహం. వియ్యాలవారికి అమితాగ్రహం వచ్చింది. రత్నాన్ని అత్తవారు తీసుకు వెళ్ళలేదు. కులపాంగీ యోలాగా అని శాస్త్రిగారు రత్నాన్ని పంపలేదు. "కాకిముక్కు దొండపండునిచ్చి చిలకముక్కుకి కట్టుకొం"డని అనుగ్రహించారు అత్తవారు. ఇది కథోకల్పనో అని వితర్కించకండా యీ ఆపదనుంచి రత్నం యేలాగు విముక్తి కాగలదో ఆ వుపాయం నాసోదరీమణులు వూహించి తమతమ వూహలను 'గృహలక్ష్మి'కి తెలుప ప్రార్థితులు

భాస్కరభట్ల వెంకటరమణమ్మ

# ఆత్మకథ

బి. తిరుపతయ్యగుప్త
యం. రామసుబ్బయ్యశ్రేష్ఠి.

(ఒకానొక స్త్రీ కరుణా కథ.)

(హిం. దీస్వరాజ్య 8-1-35 నుండి అనువాదము)

[* యీకథ కల్పితముకాదు. నిక్కముగా జరిగి నదియే. ముక్కుపచ్చలారని పసిపాపలను, ధనాశాపరులగు తలిదండ్రులొనర్చు అపరాధములను, యుక్తవయస్సునందలి కామాంధకారముచే మంచి చెడ్డల గయక బాలవిధవలుపడుపాట్లును హిందూధర్మ సంరక్షణీ సభవారొనర్చు అపారసంఘసేవయు నీ జీవిత చరిత్రవల్ల వెల్లడియగుచున్నవి. యిందువల్ల ధనాశాపరులగు తలిదండ్రులును, యవ్వన మధాంధులగు బాలవిధవలును, వుండినంతవరకు గౌరిగ తనుపరిశీలనముగా చూచు కొండెగాండ్రును బుద్ధి తెచ్చుకొనుటయేగాక వేనవేలుగా యితరమతములందు కలయుచున్న నిస్సహాయులను సోదరీమణులను నాదరింప సముకట్టు హిందూధర్మ సంరక్షక సంఘవిధానముల ననుసరింప ప్రార్థించుచున్నాము.]

మునుముందు నేను నాతండ్రినే దోషిగా తలచుచున్నాను. నే నెపుడు జన్మమొందితినో అప్పటి నుండి నాతండ్రి తన జీవితమును సుఖముగా సాగించుచుండెను. నేను వారిపుత్రికను. అయితే వారు నన్నొక బంగారుకునకగా భావించుచుండిరి. నాలాలన పాలన బహు శ్రద్ధగా చూచుచుండిరి. తనదారిద్ర దశయందుకూడా నన్నుగురించి చాల కర్చుపెట్టెడి వారు: అయితే తండ్రిగారి లాలన పాలన యంతయు సంతానాపేక్షవలన కాదు. కొంతకాలమునకు నాకీ విషయము తెలిసినది. పైకము తీసుకొని వారు నన్నెవరికో విక్రయింప సిద్ధపడుచుండిరి. నా తల్లి ఏమి చేయగలదు. హిందూ సమాజమున కుటుంబవ్యవహారములలో స్త్రీకి పురుషునియెదుట ఏలాటి అధికారము లేదు. మరియు తల్లికూడా ద్రవ్యాపేక్షలో మునిగియుండెను. హా! యెప్పుడు నేను ఐదవయేటనుంటినో అప్పుడే నా తండ్రి నా వివాహతంతు ముగించెను. రెండవమాసముననే నేను విధవనైతిని. ఎపుడు 16-17 సంవత్సరముల వయస్సుదాని నైతినో అపుడు నేను విధవనైతినిగదా యని తెలుసుకొంటిని. విధవశబ్దమునందలి యర్థము గ్రహింపగల శక్తి అపుడు నాకు కలిగినది.

గులాబ్ అను నొక యువకుడు నన్ను న్యాయమార్గమునుండి తప్పించెను. నిష్కలంక జీవితమును కలంక మొనర్చుటయే గాక అతను నన్ను [illegible] నుండి వెలికి డ్చెను. నావద్ద రూ. 6000 వేలు [illegible] నగలుండెను. నేను కర్నాబటి [illegible] గ్వాలియర్ ప్రాంతమందలి బోటి [illegible] మునకు తేబడితిని. ఐదుమాసము లచ్చటనే గడిపితిమి. తరువాత మేము కరగొనా వెడలిపోతిమి. అచ్చట నొక అద్దెయింటిలో రెండున్నర సంవత్సరము లుంటిమి. యీ రెండునర సంవత్సరములు గులాబ్

యేమియు సంపాదింపలేదు. నా సొత్తులనమ్మి తినుచుంటిమి. అన్నియు అమ్మినతరువాత గులాబ్ నన్ను యిందూరుకు తీసుకవచ్చెను. యిచ్చట మా పొట్ట నింపుకొనుటయే కష్టమని తోచగా గులాబ్ నన్ను నజమహమ్మద్ అనునొక ముసల్మానుకు రు. 1500లకు విక్రయింప తలంచెను. యీమాట యిరుగుపొరుగు వారినుండి వినబడితిని. నేను గులాబ్‌తో యీవిధముగా విన్నవించుకొంటిని. "నీవు నన్ను ధర్మ విరుద్ధునికి అమ్మకుము. నేను స్వేచ్ఛముగా వెళ్లిపోవుచున్నాను. మరియు యెక్కడైనను ఏదో వొకవిధముగా నాజీవితమును గడుపుకొందును." గులాబ్‌కు రు. 1500ల ఆశయుండెను. అందువల్ల నన్నితడు విడువకుండెను. మాయిద్దరియందు తగవు పెరిగెను. ఆ తగవునందు అతడు నాపై [illegible]మాపాదించి నన్ను బందినిగా జేసెను.

నేను రెండుమాసములు కర్నూలు జైలునందు గడపితిని. అక్కడినుండి విడుదలకాగానే దిక్కులేని పక్షివలె తిరుగుచుంటిని. కడకు ఆ గులాబ్ చెంతనే వచ్చవలసివచ్చెను. తిరిగి మేము మందలేశ్వరము పో నాలోచించితిమి. అక్కడ కచ్చులకు ఏమి లేనందుటచే నా కాలియందలి వెండికడియము లమ్మి మందలేశ్వరమునుండి కొద్దిదినములకు యిందూరు చేరితిమి. మేము బొలియా సంస్థానమువారి సత్రమందు విడిది ఏర్పరచుకొంటిమి. అక్కడ గులాబ్‌కు రెండుమూడు మాసములు హల్‌వాటు అను వారివద్ద నౌకరు కుదిరెను. తదుపరి వాని కాలియందు నారి కురుపు లేచెను. తిరుగుటకు శక్తి చాలకుండెను. నేను బండారీ మిల్లు ముందున్న జానకీ సేటుగారి బంగ్లాకు ప్రతిదినము పనికి పోవుచుంటిని. ఆరుమాసములవరకు పనిచేస్తూ గులాబ్‌ను యం. టి. ఆస్పటల్‌లో చికిత్స చేయించుచుంటిని. నేను రాత్రిపగలు చేయు పరిచర్యవల్ల గులాబ్‌కు నెమ్మదించెను. కొద్ది దినములలో నేను జాయిలాపడితిని. నాకాలియందు వ్రణమయ్యెను. నేను హాస్పటల్‌యందు చేర్పబడితిని. ఆపరేషన్ కూడా చేయబడితిని. ఒక్కనెలవరకచ్చటనే యుంటిని. యీ వొక్కనెలలో గులాబ్ కడకు మందునకైన విచారించినవాడు కాడు. ఒక్క దినము వచ్చియుండెను. కుశలమడిగెను. వెంటనే ఐదునిమిషములకే వెడలిపోయెను. నేను నిమీలిత నేత్రములతో నట్లే చూచుచుంటిని. కన్నీరెటుల వుప్పొంగునో యిపుడు తెలుసుకొనగలిగితిని. కంటికి మంటికి నేకధారగా నేడ్చితిని.

నేను హాస్పత్రి భోజనమే పుచ్చుకొనుచుంటిని. అప్పుడప్పుడు బమ్మా అనువాడు అన్నమిడుతూ నా కుశలప్రశ్నలడుగుచుండెను. నేను బాగుపడగానే బమ్మ మహమ్మదీయుడని తెలుసుకుంటిని. అంతవరకు మహమ్మదీయుని చేతి అన్నము దినుచుంటిని. ఆరోగ్యవంతురాలనైన పిమ్మట ప్రతినియమాను సారముగా ప్రాయశ్చిత్తము జేయించుకొంటిని. తిరిగి చత్రమున ప్రవేశించితిని.

గులాబ్ కూడా స్వస్థతనొందియుండుట గాంచితిని. అతనికి భోజనమునకుకూడా జరుగుటకు కష్టముగానుండెను. గులాబ్ నన్ను తిరిగి పనియందు ప్రవేశపెట్టుటకు తొందరించెను. నేను నా అశక్తతను కనుబరుచుతూ నిష్కపటముగా మొరపెట్టితిని. "గులాబ్ నేనీ దరియుండుటల నౌకరికి పోవుదును." అని. నా దీనాలాపములు గులాబ్‌నం దేమియు పనిచేయజాలకపోయెను. మరియు నాతో కలహమునకు మొదలుపెట్టెను. మే మానాడంతయు కొట్లాడుచుంటిమి. గులాబ్ రాత్రియందు నిదానంతయు నడుపుట నారంభించెను. నేను మేలుకొనియే యుంటిని. గాని నిద్రించునట్లు నటించుచుంటిని. ఆత్మరక్షణార్థమై మనోబలము చేతనే నా రాత్రియంతయు గులాబ్‌నకు దొరకక పరుగెత్తితిని. తెల్లవారగనే రిపోర్టుచేయుటకు కొత్వాలుపద్ది కెళ్లితిని. అచ్చట చాల జనము ప్రోగైరి. ఆ జనమందు బమ్మకూడా నుండెను.

నేను రిపోర్టు వ్రాయించి పోవుచుండగా బచ్చు నా వద్దికివొచ్చి "యిక నీకు హిందూసమాజమం దాదరణలేక పోయెను కదా? యిక నీవెందుకు యిస్లామందు చేరకూడదు?" అనెను. మరియు "నేను నిన్నొక పల్లెత్తుమాటకూడా యనను" అనెను. నేను ప్రతిమవలె బచ్చువెంట నడచితిని. వాడు లతీఫ్ యను మహమ్మదీయుని యింటికి నన్ను తీసుకపోయెను. ఆ యింటియందు మరియం అను మహమ్మదీయ యువతి యుండెను. "నిన్నిక హిందూమతము నందు చేర్చుకోరుకదా? యిక నెందులకు యిస్లాం మతమునందు చేరకూడదు." అని యామె నన్నడిగెను.

ఇటు లనుచు నామె నాముందు కొన్ని తినుబండారము లుంచెను. నేను తినుట కంగీకరింపలేదు. అదేయింటిలో నేను స్వయముగా వొండుకొని తినుచుంటిని. లతీఫ్ నావంటపనికై వొక శిక్కు బాలుని నియమించెను. నేనొక పదిదినము లచ్చటనే యుంటిని. ఒకదినము నేను దైవప్రార్థన వింటిని. "దానము చేయుండి. దక్షిణలివ్వండి గ్రహణసెనము" అను శబ్దముల వినుచుంటిని. కొందరు స్త్రీలు స్నానముకై ఏగుచుండిరి. నా హృదయము దొక యూహ పొడచూపెను. నాకేసరములు నిక్కబొడుచుకొనెను. నా నరకజీవనముపైన కన్నీరు ప్రవహింపజేసితిని. "హా! దైవమా ఆ యధర్మపరుడు నన్ను నా తల్లినుండి వేరుచేయకుండినచో యీ జీవనముకన్న యావైధవ్యమే బాగుండును కదా? నివాసయోగ్యమగు పట్టణముకన్న నిర్మానుష్యమగు అరణ్యమే మేలు కదా?" యని తలపోసితిని.

మూడుదినములకు చూచితిని కదా హిందూధర్మ సంరక్షిణీ సంఘసభ్యులలో కొందరాగృహము ప్రవేశించి నన్ను విడపించుకొని పోయిరి. నాదరఖాస్తు మంజూరు కాబడి తోడ్పువారు నన్ను విడుదల జేసిరి. యింతవరకును నేనా హిందూధర్మ సంరక్షిణీ సభయందే యున్నాను.

గడచిన సోమవారము తే 31-12-34 దీన శ్రీయుత, హెచ్. సి. బటిరూ, నిమచ్ గ్రామనివాసికిని నాకును పరిణయమయ్యెను.

శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః
పరధర్మో భయావహః ॥

# స్త్రీ విద్య

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, ఎం.ఏ; బి.ఎల్.

భారతస్త్రీల పూజామందిరమున నుండవలయు దేవి సౌందర్యసంశ్లిష్టమైన భారతసభ్యతకాని, వికృతరూపుఁగల నేఁటిపాశ్చాత్యనాగరికతకాని పూతభారత స్త్రీహృదయమున సంస్కరణమనుపేరిట కూడని తలఁపులు కొన్ని చేరి పడమరందు పల్వురు భాగినులు పడినపల్లమందు విచక్షణయెఱుఁగని సోదరీమణులను కూల్చుటకు సిద్ధపడుచున్నవి. అవసరమగుచోట్ల, సంస్కరణము తప్పకకావలెను. కాని కత్తి తగులవలసినది కంతమీఁద—మఱి కురుపుమీఁద. ముక్కుకోయు సంస్కరణము, వికృతపుబ్రదుకిచ్చు పిశాచము.

అవిద్యకు అహంకారము చెలికత్తె. ఈ రెంటనుకలిసి దేశచరిత్రలందు నెత్తురును గ్రుమ్మరించుట విజ్ఞానులెఱుఁగుదురు. వీనిని పోఁద్రోలుట మాటలలోనిపనికాదు. ఎదుటి సద్భావమును ధ్యానములో నిలిపియైనను, నిజమును కన్గొనుట కివి యిచ్చగింపవు. న్యాయవాదియైన నిరంకుశత్వమును వాడిగల వాదనముతో తునియలుచేయవచ్చునుగాని నిరంకుశత్వమే న్యాయమూర్తియై, ఉన్నతాసనముపై నాసీనమగునేని, దానినెదుర్కొనుట జయమునకు చెఱుపుఁదెచ్చును. వినీతమైన వేఁడికోలునకు చెవియొగ్గనిచో, వికృతభావములు అడఁలుపుట్టించును.

ఇట్టియుపద్రవము లింకను స్త్రీవిద్యాప్రాంగణమున పొడసూపకుండుట ముదావహము. భారతరమణుల ప్రకృతి, ప్రత్యేకమైనది. దుడుకుఁదనముపై నిది యెఱుక నొల్లదు.

అధునాతనభారత సంస్కరణోద్యమమునకు పుట్టినిల్లైనది వంగరాష్ట్రము. సారస్వతమందును, దైనికజీవనమందును సంస్కరణము నారాధించి, తన యారాధనముకతన చాల యిబ్బందులకు కొమ్మొడ్డినది సుప్రసిద్ధ ఠాకూరు కుటుంబము. రవి ఠాకూరుభావములు రవిప్రభలట్లు నేఁడైదుఖండములందును వెలుఁగొందుచున్నవి. ఈకవీంద్రునిపైఁగల వాత్సల్యము నిటీవల మదరాసుమహిళామణులు వ్యక్తీకరించిరి. సహజభారత సభ్యతాకల్లోలిని రవికవి పలుమాఱు కీర్తించినాఁడు. పశ్చిమభూములందు పైశాచికనృత్యమొనరించు వికృతపద్ధతుల నీతఁడు గర్హించినాఁడు. స్వీయదేశమునఁ బాదుఁగట్టిన దురభ్యాసములపై తీక్ష్ణదృక్కులు సారించినాఁడు. స్త్రీవిద్య తగదనువారి దుర్నయమును రవీంద్రుఁడు తునియలు చేసినాఁడు. స్త్రీపురోభివృద్ధిని గుఱించి ఈ విజ్ఞానభాస్కరుఁ డేమనినాఁడో సోదరీమణులెల్లఱు ఎఱుఁగుదురో ఎఱుఁగరో! పురుషప్రకృతికి స్త్రీప్రకృతి వేఱని రవి యనినాఁడు. స్త్రీకర్త

వ్యము ప్రత్యేకమైనదని ఆతనితలంపు. స్త్రీ స్త్రీయయ్యే యుండి, ఆ పురుషుని జూచి, 'కోతి యనుకరణమునకు' దిగరాదని ఆతఁడు పలికినాఁడు. గృహలక్ష్మియై అనురాగమరీచి గుచ్ఛశిఖల నద్దెసల నామె సాగింపవలెనని పృథుకవి యనినాఁడు. రవికవి పల్కులపై శుభాక్షతలు చల్లిన పాశ్చాత్త్యు లనేకులున్నారు. వీరిలో సర్ ఫ్రాన్సిస్ యంగ్ హజ్‌బెండ్ ఒక్కఁడు. సోదరసోదరీమణు లాతని వాక్కులను పఠింతురుగాక.

**"Tagore looks upon woman as different from man and does not therefore press her equality. Her sphere is another. And he would have her remain woman and not ape man. But he attacks the injustice which would regard her as unfitted for education. He only thinks that her true field is the home, where she can be the centre of love and inspiraion. And he himself, in that wonderul home-circle of the great Tagore family, was greatly encouraged and inspired by the elder brother's wife" (Vide: "Dawn in India" By Sir Francis Younghusband).**

భారతవిజ్ఞానమును కొంత చవిఁజూచిన ఈ మనీషి యభిప్రాయమెట్టిదో సోదరసోదరీమణు లచిరములో నెఱుంగఁగలరు.

## సింగారములు

తిలకమేటికిలేదు తిలకినీతిలకమా, పువ్వులు ముడువవా పువ్వుబోఁడి
కస్తూరి యలఁదవా కస్తూరికాగంధి, తొడవులు తొడువవా తొడవు తొడవ
కలహంస పెంపుదే కలహంసగామిని కరము జదివింతె కీరవాణి
లతలబోషింతువా లతికాలలితదేహా, సరసినోలాడుదే సరసిజాక్షి

మృగికి మేతలిడుదె మృగశాబలోచన,
గురుల నాదరింతె గురువివేక,
బంధుజనుల బ్రోతె బంధు చింతామణీ,
యనుచు సతులనడుగు నచ్యుతుండు ॥

భాగవతం.

# అయ్యో పాపం!!!

'మంచినీళ్లయినా యివ్వని మాయసంఘం'

"శుని చైవ శ్వపాకేచ పండితాః సమదర్శినః"

ఆర్యా! నమస్కారములు. ఈ కథ స్వానుభవముతో వ్రాసిన 'అస్పృశ్యతా పాపము'నకు సంబంధించినది. నేటివరకు అమలులోనున్న ఆచారములచే మాకు అక్కడక్కడా కలుగుచున్న అవమానాగ్ని హృదయము దహించి వేయగా ఇది వ్రాసితిని. నేనొక హరిజనయువతిని.

అవి మండిరోహిణిగాడ్పులు. పగలు పదిగంటలు దాటితే రైళ్ళలో ప్రయాణంచేస్తూన్న ఫస్టు సెకండు క్లాసు ప్రయాణీకులు కూడా హడలిపోయే రోజులవి. ఆకాశాన్నుంచి చండభానుడు నిప్పులు గ్రుమ్మరిస్తున్నాడు. ఆ మండుటెండలకి వృక్షాగ్రాల నివసిస్తూన్న ఎన్నో పక్షిజాలాలూ పశులూ విగతజీవులై నేలబడి పోతున్నాయి.

కలిగినవాళ్లు పట్టివేళ్ళ తెడకల్లో ఐస్ క్రీమ్ పానం చేస్తూ చలువపన్నీరూ మంచిగంధమూ, పూసుకుంటూ హాయిగా మేడల్లోనుంచి బయటకు తొంగి చూట్టానికైనా అవసరంలేని మంచిరోజులవి. ఇక గుప్పెడి పొట్టకూటికి ఎండనక, వాననక నానా బాధలూ పడుతూండే పేదవాళ్ళసంగతో?—

2

ఇలాంటి భయంకరపు రోజుల్లో బయలుదేరారు. అన్నపూర్ణా భాస్కరులు-హరిజనయువతీయువకులు-దంపతులు, చాలాదూరాన్నున్న వూళ్ళో అన్నపూర్ణ పుట్టింటిపెద్ద తల్లి విషజ్వరంతో ప్రమాదంలో వున్నట్టూ-ఏకపుత్రికైన అన్నపూర్ణను చూట్టానికి ఆ స్తమానాలు ఆలాపిస్తూన్నట్టూ వుత్తరం రాంగానే తొందరగా బయలుదేరారు.

చివరకూ చింతావల్ల తెల్లవారి 6 గంటలకి కాస్త కాస్త చల్దిగంజి త్రాగారో లేదో పాపం! తొందరగా ప్రయాణం సాగించారు. వెళ్ళవలసింది బహుదూరం. బారెడు ప్రొద్దెక్కిందో లేదో, అప్పుడే వేడి గాడ్పులు సిరిసిరి తోలుతున్నాయి. రైలుమీదో మోటారుమీదో వెళ్ళద్దాంగాని, ఏపూటపాటు ఆపూట సాపాటుకే చాలక బాధపడుతూన్న యీ హరిజనదంపతులకి ఆసుఖమెల్లాకల్గుతుంది. వాళ్ళకే భాగ్యమూ లేదు. ఉన్నదల్లా ఒకళ్ళనొకళ్ళు ఎప్పుడూ విడిచివుండలేని అన్యోన్య ప్రేమభాగ్యమూ ఏదో ఒకమాదిరి ప్రపంచజ్ఞానం తెలిసికోదగ్గ అయిదో క్లాసువరకూ చదువుకున్న విద్యాభాగ్యమూ తప్ప.

3

అప్పుడే యించుమించు పది పదిహేను మైళ్ళవరకూ నడిచొచ్చారు. మార్గమధ్యంలో అక్కడక్కడా వడదెబ్బకు అలసిసొలసి పడుతూన్న ఒకళ్ళిద్దరు అభాగ్యపు పాంథుల్ని చూచి జాలిపడుతూ అన్నపూర్ణాభాస్కరులుకూడా అలసిపోయారు. చెమట యిద్దరిగుడ్డల్నీ తడిపేసింది!! క్రిందకాళ్లూ పైననెత్తీ మండిపోతున్నాయి.

మొగాలు కందగడ్డలై పోయాయి. నాలుకల మీద తడిలేదు. గొంతెండుకపోయింది. నీడా— నీళ్లూ వీటికోసం తహతహ లాడిపోతున్నారు. గ్రుక్కెడు మంచినీళ్ళున్న గుంటకోసం అటూ-యిటూ వెతుక్కుంటూ నడుస్తున్నారు.

## ౪

బాటప్రక్కనే పెట్టించాడు చల్లని చలివేంద్రం దగ్గరవున్న వూళ్లో కరణాలందరూ కలసి పుణ్యం వస్తుందని. నిమ్మరసం కలిపిన పల్చని మజ్జిగతో నింపి వున్న బానలు వరుసలు దీర్చి పందిట్లో పెట్టివుంచారు. దగ్గరగా వున్న బల్లమీద తళతళలాడుతూ పది పన్నెండు గ్లాసులున్నాయి. పుల్లనిమజ్జిగకంపు దూరాన్నుంచి వస్తూన్న తృషాతురుల్ని ఆహ్వానిస్తోంది. ఎదురుగ వున్న యింకో పందిట్లో తాటాకుల చాపలు పరిచివున్నాయి పథికులు కూర్చుని మార్గాయాసం పోగొట్టుకుంటానికని. వచ్చినవాళ్ళు తృప్తిదీరా దాహం త్రాగగానే ఒక్కొక్క పిసనకర్ర చేతికిచ్చి కూర్చొనుంటున్నాడు—చలివేంద్ర నిర్వాహకుడు, కుంకుమబొట్టూ—యజ్ఞోపవీతమూ—విభూతి పెండికట్లూ—అతడు బ్రాహ్మడే.

దూరాన్నుంచి ఇదంతా చూచారు. అన్నపూర్ణ ప్రాణం లేచివచ్చినట్లయింది వాళ్ళకు. పరమసంతోషంతో దగ్గరగా వచ్చారు. నోటమాటలు స్ఫుటంగా "ఎవరుమీరు?" అన్నాడు బ్రాహ్మడు. ఈమాట వినగానే నడుము విరిగినట్లయింది భాస్కరుడికి. "మాల్లాళ్ళమండీ" అంది హీనస్వరంతో అన్నపూర్ణ. "చాలుచాల్లే ప్రక్కకు తప్పుకుని మరీ మాట్లాడండి!! దారికి అడ్డంగా నిలబడి గొప్పగొప్పవాళ్ళు వచ్చిపోతున్నారు ఇక్కడ మాలముండాకొడుకులు దాహమిమ్మారు. మాకు మైలగాదూ మీకు నీళ్ళిస్తే!! పదండి తాకపోకండి" అన్నాడు భీకరంగా బ్రాహ్మడు.

"గంటగి టక్కీ, 'కాఫీ టీ లూ— 'సోడా లైంజూస్' లూ, త్రాగుతూ, కారుల్లో కాలు క్రింద పెట్టిందే తడవుగా, గొడుగునీడల్ని నడచేవాళ్ళందరికీ, పిలిచి బలవంతంగా—దాహమిచ్చేకంటే, మాబోటి నోరెండి ప్రాణాలు పోతూన్నవాళ్ళకిస్తేనే మీకు యెక్కువ పుణ్యం గాదా బాబూ—గుక్కెడు—" అంది అన్నపూర్ణ కంపితకంఠంతో—

"నోరుముయ్యి. ఇక్కడ మాట్లాట్టానికి వీల్లేదు. మీవంటి చండాలపాళ్లకోసం పెట్టిందిగాదిది!! అల్లావూళ్లోకపోండి—పొమ్మంటే పోరేం—బుద్ధిలేదూ మీకూ"

అని కసరుతూ గద్దించాడు బ్రాహ్మడు, నిలబడ్డానికేనా వీల్లేకుండా—

మొగాన్ని అర్ధణాకాసంత కుంకుమబొట్టూ— ఎర్రటి పట్టుచీరా— చేతినిండా గాజులూ— మెళ్ళో పట్టెడు మంగళసూత్రమూ— ఎత్తుపీటమీద కూర్చుని వుంది—బ్రాహ్మణముత్తైదువ—చల్లని మంచినీళ్ళ గంగాళం ముందుపెట్టుకుని, అగ్రహారపు పెద్దవీధి మొదట లోగిట్లో. ప్రతియేటా వేసంకాలం నాలుగునెల్లూ, ఆయిల్లాలు తనలోగిటిముందువరలో అడిగినవాళ్లకు లేదనకుండా శుద్ధిదాహమిస్తూవుండటం రివాజట

ఊళ్ళోకేనా వెళ్లి తనివిదీరా దాహము త్రాగుదామనుకుంటూ—పెదిమలు చప్పరించుకుంటూవచ్చి చేరుకున్నారు యీ మొదటయింటికి—అన్నపూర్ణాభాస్కరులు. వీథిముఖంలో నిలబడి "గుండె ఆరుకుపోయింది గుక్కెడు మంచితీర్థము యిప్పించమ్మా!" అని కేకేశాడు భాస్కరుడు.

చెంబుతో నీళ్ళూ— గ్లాసూపట్టుకుని తొందరగా ఈవలకువచ్చింది. "ఎవరుమీరు నాయనా—అగ్గిగొట్టి అలసిపోయినట్టున్నారూ" అంటూ ఎంతో ఆదరంగా దగ్గిరికొచ్చిందా యిల్లాలు—

మంచినీళ్ళు దొరికాయిగదా అనే ఆనందంతో— "మాలాళ్లము తల్లీ—యిల్లాపొయ్యండండి" అంది ఆప్యాయంగా—అన్నపూర్ణ.

ఆమాట వినగానే చటాలున వెనక్కితగ్గి "ఎమ్మరా! ఇంత మోసం చేశారూ!!—మాలచచ్చినాళ్లమని ముందే యేడవొద్దూ? — ఇది అగ్రహారమనుకున్నారా— మరోటా? ఎంతపిస్తూరక మొచ్చిందర్రా!!—పాడు కాలం! పోపోండి! ఇక్కడెక్కడా నీళ్లుదొరకవు—ప్రక్కవూరికిపోండి!!—" అని గుక్కతిప్పకుండా అనేసి, చటాలున తలుపుమూసి లోనికిపోయింది. నిలువునా చచ్చిపోయి ముందుకు బయలుదేరారు—భాస్కరదంపతులు.

## ౫

"ఈవేళ పెట్టనిరోజు గాబోలు, పురిసెడి మంచినీళ్లే కరువయ్యాయి" అంది మెల్లగా అన్నపూర్ణ. "అ

మాటలేమీ నేనొప్పుకోను:—పెట్టనిరోజులనీ-పూర్వ కర్మఫలితాలనీ, యీరోంగవేదాంతాలన్నీ మనకోసమే కల్పించా రీభాగ్యవంతులంతా-మనరక్తమాంసాలన్నీ బాగా పిండుకుని, మనకు మంచినీళ్ళైనా దొరక్కుండా చేస్తూన్నందుకు, మనము నోరుమూసుకుని వూరుకోడానికి!! యిల్లాంటి పిచ్చిమాటలు నమ్మబోకు అన్నపూర్ణా" అన్నాడు భాస్కరుడు.

ఇల్లాగే యేమేమో గొణుక్కుంటూ, మొగాలు వ్రేలవేసుకుని ఓపికలేక-వకళ్ళ చేయి వకళ్ళుపట్టుకుని నడుస్తున్నారు. వేడిగాడ్పులకు ప్రతియింటితలుపులూ మూసివున్నాయి. ఎవ్వరినేనా గుక్కెడు మంచినీళ్లు అడుగుదామని మెల్లగా నడుస్తున్నారు.

మేడపై అంతస్తుమీదున్న విలాసిని, వీధంట వెళుతూన్న మాలదంపతుల్ని కిటికీగుండా చూచింది.

"ఎవ్వరో చాలానీరసంగా గాడ్పులలోబడి నడుస్తున్నారు—పార్వతీపరమేశ్వరుల్లాంటి దంపతుల్లాగున్నారు. ఈరోజు అతిథి పూజా భాగ్యమన్నా మనకు దక్కుతుంది-అల్లావెళ్ళివారిసంగతి కనుక్కొని యిటు తీసుకరారా" అని చెప్పిపంపిం దావిలాసిని-ఎంతో జాలితో నౌకరిని.

నౌకరువచ్చి సంగతి తా తెలిసికొన్నాడు. 'మైల మైల' అని అరుచుకుంటూ పరుగెత్తి యజమానికి మనవిచేశాడు. ఆవిడ మండిపడి "నేనుపుట్టి బుద్ధెరిగినాక అగ్రహారపువీధుల్లో మాలవాదిగాళ్ళు నడుపడమే నేనెరగను-పైగా మంచినీళ్లే కావాలన్నారూ, వాళ్ళు? విపరీతంగావుందే?—ఒరే! ఛప్పున వెళ్ళి ఆ దేబెలను వూరిబయటకంటా తోలేసిరా" అని ఆజ్ఞాపించింది.

యమభటులావచ్చి ఏమండర్రో-ఇదిబ్యామ్మల పుట్టని తెలీదూ-పోపాండర్రావలకీ- దామానికీలేదు గీమానికీలేదు" అంటూ దుడ్డుకర్ర యిద్దరి మెడమీదా వేసి వూరిబయటకంటా నెట్టేశాడు-చాకలినౌకరు దయాదాక్షిణ్యాలు విడిచేసి!!—

## ౬

వడవుట గాడ్పుకి కొనవూపిరితోవున్న అన్నపూర్ణ, ఈనౌకరి గెంటులకి మరీఅలసిపోయింది. వూరిబయట వదివన్నెండుగబాలదాకానడిచి, స్మృతి దప్పి పడిపోయింది. 'బావురు'మని యేడ్చాడు భాస్కరుడు, పాపం! యేంజేస్తాడు. మెల్లగా దగ్గరగావున్న చెట్టుదగ్గరకు చేర్చాడు అన్నపూర్ణను.

"పూర్వమేదో మహాపట్టాం పాపభారాన్ని దగ్ధమై 'కొల్లేరై' పోయిందట-అల్లాగవకూడదూ? ఈ అగ్రహారంకూడానూ- దేవుడనేవాడొకడుండి చూస్తూవుంటే-భగవంతుడూ భాగ్యవంతులూ ఒకటేనేమో! లేకపోతే యిల్లావూరుకుంటాడూ-ఈకటికి వాళ్ల హృదయాల్లో గుక్కెడు మంచినీళ్ళిచ్చే దయాలేశమైనా కలిగించకుండా- ఏవో యిల్లాంటి వూహలతోటే కొట్టుమిట్టాడుతూ నాలు కారుకపోయి ఏకాగంతో భాస్కరుడున్నాడు. ఈ రెండుప్రాణాలూ, యీ పాడుఅగ్రహారపు ఆచారాలకు బలిగాబోలు!!!

## ౭

"ఉస్స-అల్లాహోఅక్బర్" అనుకుంటూ, చేత్తో మరచెంబుపట్టుకుని వస్తున్నాడు ఆయాసంగా.—సాహేబు తోటపనిమీద; దూరాన్నుంచే చూచేడీ దృశ్యం; గబగబా చెట్టుదగ్గరకువచ్చాడు. "ఏమీ భాయీ-బీబీపడీవుందీ- సూర్యుడికీ దబ్బా- భలే-తగిలిందాభాయ్" అంటూ ఛప్పున మరచెంబుమూత విప్పి గ్లాసెడునీళ్ళు అన్నపూర్ణ మొగాన్నిగొట్టి, కొంచెంనీళ్ళు నోట్లోపోశాడు. నీళ్ళు పపరించి గుటక వేసి కొంచెం కళ్ళుతెరిచింది. గ్లాసెడునీళ్ళు నోటికందించాడు. 'గటగటా' త్రాగి తప్పుకొంది. మిగిలిన నీళ్ళన్నీ భాస్కరుడికిచ్చాడు. ఇద్దరూ కొంచెం తేరుకున్నారు.

"భలేదిగ్గిరా- వూరూవుండిందీ- పానీకీ ఇంతా కుట్టం ఎందుకీ భాయ్"అన్నాడు సాహేబు ప్రాణదాత.

"మేము మాలాళ్ళం, అసంతా మంచినీళ్ళయినా యివ్వని మాయసంఘం, బాబూ!" అన్నారు ఏకకంఠంగా గద్గదకతో—అన్నపూర్ణాభాస్కరులు చేతులు జోడించి—

కొట్టుముక్కల మంగాయమ్మ.

# పండిత పుత్రుడు

వల్లాది వేంకటకృష్ణశర్మగారు

అతడు కటిక వైష్ణవుడు—ఇతడు వీర శైవుడు. అతడు మూర్ధాభిషిక్తుడు—ఇతడు పండిత మూర్ధన్యుడు. అతనికి వేలకొద్దీ నౌకర్లున్నారు. ఇతనికి వేలకొద్దీ శిష్యులున్నారు. అతడు ప్రచండుడైన సార్వభౌముని మెప్పించి బిరుదనిశానీలను సంపాదించాడు. ఇతడు అమాయకులైన సమస్త మానవుల హృదయాలనూ కదిలించి బిరుదు నిశానీలను సంపాదించాడు.

అతడు రాజు—ఇతడు కవిరాజు. అతడు సర్వతంత్ర స్వతంత్రుడు—ఇతడూ సర్వ తంత్రస్వతంత్రుడు—అతడు లక్ష్మీ వర ప్రసాది—ఇతడు సరస్వతీ వరప్రసాది. సహజ వైరం సాగుతూంది.

అతడు సమయం దొరుకుతే, చాలునని కత్తి గురిపెడుతున్నాడు. ఇతడు సమయం దొరుకుతే చాలు కలం గురిపెడుతున్నాడు. ఉన్నవూరు రాజుదైతే, సమస్త భూప్రదేశ కవిరాజుదయింది.

ఈ పోరాటమునకు ఫలముగా శతాబ్ద గమన వేగమున నలిగిపోయిన శైవమతం విజృంభించడానికి ప్రారంభించింది. ఒకన్యక్తి మీదుగా మహాగ్రంథములు శతాధికముగా లోకమునకు సమర్పింపబడ్డాయి. ఈ పోరాట మునకు ఫలముగా మతము లోకూడా, తామస వృత్తి నవలంబించే రాజుల పట్టుదల, లోకులకు వ్యక్తమయింది: గ్రామమున మూడు వంతులు ఇండ్లగోడలపైనీ తలుపులపైనీ బలవంతాన పట్టెనామములు బయలుదేరేయి.

రాజు ధనము విరజిమ్ముతున్నాడు. కవిరాజు కావ్యామృతమును విరజిమ్ముతున్నాడు. లోకులకు, రాజంటె భయమూ, కవిరాజంటే భక్తి. అతనికీ ఇతనికీ పోరాటం సాగుతూనే వుంది.

నిరంకుశుడైన రాజును మతములో కలిపి అరపాదముక్రింద నిలిపిన కవి సార్వభౌమునకు, తనయింటనే శత్రుబీజం మొలక లెత్తడం ప్రారంభించింది. మహా శక్తిసంపన్నుడూ విజయశాలీ అయిన పండితరాజు దుర్బలుడూ—నిరక్షరకుక్షీ అయిన యింటి శత్రువును జయించలేకుండా వున్నాడు.

◆ ◆ ◆

ఒడలు ముదురని రోజులలో రెండు కావ్యాలు చదివేడు. ఘోటుచాలక ఎంకి పాటలు ప్రారంభించాడు. తండ్రి సూత్ర భాష్యం వ్రాస్తే తాను ప్రణయరోదనం వ్రాశాడు. తండ్రి శైవసిద్ధాంత చర్చచేస్తే ఇతడు ప్రణయచర్చ చేశాడు. తండ్రి భారవిభవ భూతులను పేర్కొంటే తాను కృష్ణశాస్త్రి ముద్దుకృష్ణులను పేర్కొంటాడు. జనకుడు

గీతాపఠనము చేస్తే తనయుడు రాయప్రోలు వారి జడకుచ్చులో పారాయణము ప్రారంభించేడు.

తండ్రి దృష్టిలో కొడుకు విద్యావిహీనుడూ—భ్రష్టుడూ! కొడుకు దృష్టిలో తండ్రి కూడా అంతే......

కొసకు తండ్రినిజయించిన కొడుకయినాడు. తన అవినయవర్తనమునకు గురిచేశాడు. తండ్రియగు పండితరాజు కొడుకు డాకకు నిలువలేక చిక్కి-చివికి, శల్యావశిష్టుడై ఒక నాడు కళ్లుమూసుకున్నాడు. ఈవార్త విని రాజు విజయధ్వని చేశాడు. ఈ వార్తవిని పుత్రుడు ప్రణయనృత్యం చేశాడు. ఆంధ్ర సరస్వతి కన్నీరుమున్నీరుగా ఏడిచింది.

భావకవి వలపులపాటతో కవిరాజు యొక్క భౌతికశరీరాని కగ్నితగిలించి, తండ్రి యొక్క కీర్తిశరీరంవంక నిప్పు కలు రేగే తీవ్రదృష్టి సారించాడు.

* * *

రాజుపంపిన నోట్లకట్టలు లెక్క-చూచుకొని, ఇంటిముందు నించున్న రాజభటుల తలలకు పుస్తకములకట్ట లెత్తించి రాజసభామందిరము ప్రవేశించాడు. రాజు సామ్రాజ్య పట్టాభిషేకమునకు సంసిద్ధుడైనట్టు నిరంకుశదృష్టి ప్రసరిస్తూ పండిత పుత్రుణ్ణి ఆహ్వానించాడు. రాజు ముక్తకంఠముతో భావకవిని "నీతండ్రి మాకు పరమ మిత్రుడు—అయినా అతడు నా మతమునకు విరుద్ధముగా ప్రవర్తించడం నీకూ తెలుసును. నీతండ్రి వ్రాసిన యీపుస్తకాలెందుకు కొన్నానో నీకు తెలుసునా? చూడు" అని సేవకులకు పుస్తకములన్నీ ఒకచో పేర్చమని ఆజ్ఞాపించాడు. తనకు కావలసిన గ్రంథాలన్నీ పరీక్షించి ప్రక్కనించున్న సేవకుని చేత వాటికి నిప్పుపెట్టించాడు. సురసుర కాగితాలు ముట్టుకొని మండుతున్నాయి. మంటలు పుస్తకాలన్నింటినీ ఆవరించాయి.

అక్షరాలు చూస్తూండగా మాడిమాయమవుతున్నాయి. భావకవి రెప్పవెయ్యకుండా చూస్తున్నాడు. రాజు ఆనందవివశుడై తన్ను తానుమరచి జ్వాలలచుట్టూ పిశాచతాండవం చేస్తూన్నాడు. భావకవి ఇంటివెన్నునంటుతూన్న మంటలలో చూపు స్తంభింపజేశాడు. ఆజ్వాలలలో పండితరాజు కనిపించినట్టయింది. ఎవరో ఆమంటలోంచి తన్ను శపిస్తూన్నట్టు వినిపించినది. మరిచూడలేక కళ్లుమూసుకున్నాడు. కన్నువిప్పి చూచేసరికి చిరుగాలికి రేగుతూన్న మసిగుండ అతనికి కనిపించింది.

* * *

# అపూర్వవాత్సల్యము

కో. వెంకటేశ్వరరావుగారు

అది గోధూళికాసమయము. తన జీవయాత్రను ముగించి యపరదిగ్వధూతిలక యంకతలమున విశ్రమింపజనుచున్నాడాయన నాదిత్యుఁ డపరాంబుధిఁ గ్రుంకుచుండెను. నిజకులాలయంబుల డాయు శకుంత సంతాననిస్వనంబులు కోదసీకుహరంబున మారు మ్రోగుచుండెను. తమి మెల్లమెల్లన తలచూపుచుండెను.

కేలంబూనిన దీపకళిక వాయు విక్షేపంబునకు నారి పోకుండుటకై కరంబును నర్ధమండలాకృతిగ నునిచి నళిని గృహాంతరమందలి తులసీకోటకు నూటిగ నడచుచుండెను. సాయంసమయంబున తులసీపూజ చేయుటా యింటి గృహిణీమణులకు నాచారంబై యుండెడిని. నళిని మాతామహియు, పిదప నళిని జననియు తులసీపూజఁ జేయుచుండిరి. ఇప్పుడది నళినిపైఁబడ నామెయు దానిని వదలకఁ జేయుచుండెను.

దీపకళికను తులసికోటపైనునిచి చేతులు మొగిడ్చి శిరంబువాల్చి నిమీలితలోచనయై తదేకధ్యాన పరవశురాలై యట నిలుచుండెను. అదేలకో యన్ని రోజులకన్న నాదినంబున నామె దీర్ఘకాల మట్లుండుటయే గాక ద్విగుణీకృతభక్తిహత్తచిత్తంబుతో దేవిని నుతించుచుండెను. అట్టియెడ 'నళినీ' యనుపిలుపు వినబడెను. నళిని ఒక్కదాటున కవాటముఁజేరుకొనెను.

ఆజానుబాహుండును సుందరాకారుండునైన పురుషుడు ఇంటఁ బ్రవేశించి ఇంటి నలఁటట కలయ జూచుచు నొక సోఫాపైఁ జతికిలబడెను. ఇరువుఁ దరుమ దీపం బెక్కడను కానరాదాయె. మిత్రాగమముచే ప్రఫుల్లయగు బిసరుహాంగనవోలె సోదరుని జూచుట తడవుగా మానసంబున నుద్వేగమగు విషయంబుల నడుగఁబూని మరల యడుగుట నుడిగి యతని వదనాంబుజమును వీక్షించుచు నిల్చుండె. భాస్కరుడు సైతము మౌనముద్రితుండై కూర్చుండెను. అతడా విషయంబును నిజసోదరి కెట్లు నివేదింతునా యని యోచించుచుండెను ఇట్లెంతో సేపుండజాలక నళిని యాగ్రజుఁగాంచి సోదరా యని యూరకుండెను. ధ్వాంతసమితి యావరించిన యాగృహంబున నిశ్శబ్దమెల్లయెడల నిండియుండెను. నళినీసంబోధితుడై యాతడు స్వప్నమునుండి తెప్పరిల్లినమాడ్కి సోదరిఁగాంచి 'నళినీ' ఏమమ్మా. యని యూరకుండెను. 'సోదరా! కేసుముగిసెనా?' యన, కంఠంబు సర్దుకొనుచు 'సోదరీ ఇంకను ముగియలేదు. పోలీసువారు ఇంకను అన్వేషించుచునేయున్నారు. వారికిఁదగిన యాధారములు దొరికమి కేసు విచారణకు రాదాయెను. ఆతడు నేరస్తుండని భావింపబడినను వారి సందేహము స్థిరపడుపజాలిన యంశమేదియు లభింపదాయె. ప్రస్తుతమున ఆతని విడుదలచేయుటో శిక్షించుటో నావాఙ్మూలముపై నాధారపడియున్న' దని బదులిడెను.

'ఏమీ! నీ వెఱిగిన విషయంబులఁ గోర్టున నివేదించిన ఏమగు'నని నళిని భీతికంపిత గాత్రముతో ప్రశ్నించెను.

'దాని ఫలితము నీ వెఱుంగజాలినదే' యని యాతఁ డూరకుండెను.

నళిని యా విషయంబును నెఱుంగునుగాని నిజ సోదరుని పల్కులు వీనులంబడ నిర్జీవప్రతిమవోలె

నిలువబడియుండెను. ఆమెకు తల బరువెక్కినట్లుండెను. నయనంబులు గిర్రున తిరిగి పోవుచుండెను. ఏదియో భయంకర ఘాతములోఁ బడిపోవుచున్నట్లు తోఁచెను. కొంత తెప్పరిల్లి తనయసహాయ స్థితిని గుర్తించెను. తటాలున నేదో యొక యభిప్రాయము తన మనంబునకురాగా సగ్గుజాఁగాంచి 'సోదరా! ఆతనిపైఁ దేఁబడిన నేరము లసత్యమని వక్కాణించిన కేసెట్లు పరిణమించునో'యని యాతురతతోఁ బ్రశ్నించెను.

నీలనీరదాచ్ఛాదితాంబరంబునఁ బొడమూపు విద్యుల్లతవోలె భాస్కరునివదనంబున దరహాసము తోఁచి యంతలో నంతర్హితంబయ్యె. 'అట్లయిన నాతడు విడుదలఁజెందు'నని నుడివెను.

రుడకు నిజమనోనాధుని విముక్తికి మార్గమొకటి యున్నదని మదిఁదోఁప దీనాననయై నళిని సోదరుని చరణంబులపై వ్రాలి 'సోదరా! ఆతని నిస్సహాయత్వమును పరికించుము. నిన్నుదిక్కని నాప్తులన్యులతని కేసును లేరనుటఁ గుర్తించుము. ఆతని శిక్షాముక్తులు నీనుడువులపై నాధారపడియుండుటను యోచింపుము. ఆతని దుస్థితిని తిలకింపుము. ఎట్లైన నాతని గాపాడు'మని వేడుకొనియె.

ఆహితుండికుని నాగస్వరంబును గమనించునురగంబుపోల్కి భాస్కరుడు నిజసోదరి పల్కులను విని అమాత్వము జెందెనోయన గానఁబడుచుండెను. క్రమేణ యతని లోచనంబు లశ్రుపూరితంబులగుటం గమనించి యెంతో ప్రయత్నముపై నాపుకొనుచు 'సోదరీభీతిజెందకుము. ధైర్యావలంబినివై యుండుము. ఆతని విడుదలకుఁ దగు ప్రయత్నములఁజేసి తుదకు ననువుఁ బాయవలసివచ్చినను వెనుకంజవేయు'నని సోదరిని యూరడించెను. సోదరీసోదరుల యక్షు లశ్రుపూరితంబులయ్యె

౨

నళిని మాతాపితృ విహీన. నళిని సప్తవర్ష ప్రాయురాలైయుండుతరి ఆమెజనని దివంగతురాలయ్యె. చతుర్దశవర్షప్రాయుడైన భాస్కరుని నళినిని వారి మేనత్త చేరదీసి పోషించుచుండెను. నళిని షోడశవర్ష ప్రాయురాలగుడు ఆమెను కమలకాంతున కిచ్చి వివాహము జేసెను. భాస్కరుడు సైతము కుల శీలవయోగుణ రూపంబుల నొప్పారు కన్యకామణిని వివాహంబాడజూడ పర్షించుచుండ నామె యకాల మృత్యుకరాళవదనంబునంబడె.

కమలకాంతుడొక యనాధయువకుడు. ప్రాణ సమంబైన సోదరి నొక ఘడియయైన విడిచియుండ నోర్వని భాస్కరుడొక యనాధయువకునకు తననిజ సోదరి నొసగిన భార్యాభర్తలు తన చెంతనే యుందురనే భావముతో నళినిని కమలకాంతున కిచ్చి తన చెంతనే యుంచుకొనెను. భావముఁదినున్నత విద్యావలంబకునిగా జేయవలయునని స్కూలుఫైనలు ప్యాసుఅయినదే కమలకాంతుని కళాశాలలో ప్రవేశ పెట్టెను. 'అన్యధాచింతితం కార్యం దైవమన్యత్ర చింతయే'త్తన్నట్లు ఆతడు చక్కగా జదువుకొనక దుర్మార్గులతోఁ గలిసి కాలమును వ్యర్థపుచ్చుచుండెను.

భాస్కరుడు దానిని గమనించి ఎన్నియోవిధంబుల ప్రాణంపుచెలికానివోలె అడసెరిగి చదును చేయుమన్నట్లు ఎప్పటికప్పుడే యాతనిని మందలించుచుండెను. కొన్నాళ్ళకు కమలకాంతుడు తనమిత్రులతోఁజేరి దేశోద్ధారణకై పాటుబడసాగెను. కాని భాస్కరుడు వారలపేరున దేశద్రోహకార్యంబుల జేయుచుండుటను పసిపట్టెను. భావముఁదినిజేరి ఎన్నియోవిధంబుల బుద్ధిచెప్పెను. 'పోగాలము దాపించినవారు దీపనిర్వాణగంధమును యరుంధతిని మిత్రవాక్యమును మూర్కొనరు, కనరు వినర'న్నట్లు బావ సద్బోధనంబు లాతనిచెంత వ్యర్థమయ్యెను. నళిని కుసుమకోమలగాత్రి. పసిబాల. కృత్రిమకార్యముల నెరుంగజాలని కురంగాక్షి. పతిచరణంబులే సతికి గతియని తలపోయు రాజీవలోచన! నిజభర్తకు కడు

భయభక్తులతో సేవలుజేయుచు నాతనిని ప్రాణంబుల కన్న నెక్కుడుగ ప్రేమించుచుండెను.

వీరిద్దరిగుణంబులభేదము వితర్కించ భాస్కరుని డెందము చింతాకులమైపోవుచుండెను. నిజభగిని నయనంబు లశ్రుకణంబులు తొరఁగుటగాంచజాలక తనబావమఱఁదిని మందలింప వెనుకంజవేయుచుండెను గాని మనంబునమాత్రము అతడు కమలకాంతునియందు గొప్ప నేరముఁ జేయుచున్నాడని యెఱుంగును. తాను విషమస్థితిలోనుండి ఏమియు చేయజాలడయ్యె. తదనుగుణంబుగా నగరంబున నొకభయంకర నేరమొకటి జరిగెను. అతడే ఘోరకృత్యమును జేసెనని భాస్కరుడు చక్కగానెఱుంగు దానిని వెలిబుచ్చినచో కమలకాంతుడు శిక్షింపబడును.

అట్టిగతికి తనప్రాణేశుడు పాలుబడెనని వినిన నళినికని మిన్నువిరిగి నెత్తినబడునని భాస్కరుడు మన్నుదిన్నపామువలెపడి యూరకుండెను. తాను ఎన్నిఇడుములనైనను గుడుచునుగాని ఏకారణముచేతను తనసోదరి దుఃఖించుట గాంచజాలడు.

అట్టియెడ ఒక పాశ్చాత్యవనిత ఘామశకటంబున నరుగుచుండ కొందరు దుర్మార్గులామెతో మొదటి తరగతిబండిలో ప్రయాణముచేయుచు నామెపై నత్యాచారముసల్పి యామె భూషణంబుల నపహరించినవార్త దేశమంతయు మారుమ్రోగుచుండెను. అంతకుపూర్వము జిల్లామేజస్ట్రీటు గృహావరణంబున ఫిరంగిప్రేలినది యెవఁడరింగినదే. ఆ నగరపోలీసువారాదుండగీడుఁ బట్టుకొన విశ్వప్రయత్నములు సల్పుచుండిరి. ఇంతలో నొకడే వీటిని సల్పియుండడు ఏదో దేశద్రోహ సంఘమేర్పడి యిట్టి దుష్కృత్యములు సల్పుచున్నారని యందరు తలంచుచుండిరి. సందియముపై కొందరు విద్యార్థులు బంధింపబడిరి. వారిలో కమలకాంతుడొకడు. అందరిని విడిచిపెట్టిరిగాని యాతనినిమాత్రము విడువరైరి. పోలీసు అధికారుల ప్రశ్నలకు తగుసమాధానమీయనందున అతనిపై నేరము మరింత దృఢపడెను.

అప్పటినుండి కమలకాంతుడనిన భాస్కరునకు కడునసహ్యత. ఆ ఘోరకృత్యము జరిగిన మరుదిన ముదయమున యాతడింటికివచ్చెను. అకస్మాత్తుగా కమలకాంతుని వ్రేలవజ్రపుటంగుళీయకముండుటను భాస్కరుడుగాంచి విషణ్ణుడాయెను. నారీమణుల ప్రాణమానంబుల గాచుట సకలజనసమ్మతమైయుండ ఒక వనితామణి ప్రాణమానంబుల నపహరింపబూనిన మానవుని మన్నించుటకు మన భాస్కరుని మనంబీయకొనునా? కాని ఏకగర్భజనితయైన నళినిముఖంబునందు విషాదచ్ఛాయ లలముకొనుటఁజూచి సహింపజాలమిచే భాస్కరుడు తన బావమఱఁదిని మందలింపక యూరకుండెను.

అతని కన్నటికిని స్వసుఖమునం దభిరుచియుండదు. అనయము సోదరీసౌఖ్యమునకే పాటుబడుచుండును. ఆమె సంతోషమే తన సంతోషముగా భావించును. ఆమె సౌఖ్యాంబుధి నోలలాడుటయే తన జీవితసారమని మది వితర్కించుచుండును. అతని నెవరైనను 'వివాహమాడవైతివేమి?' యనిన 'నాపరిణయమునకు ఏయావశ్యకత కనఁబడదు. నేను అనయము నుత్సాహపూరిత చిత్తుండను. నేను గన్నసుతుడైననేమి నాసోదరికి యుద్భవించిన నందనుడైననేమి? నా భగినిపుత్రుల ముద్దుమురిపెములఁ గాంచుచు నా దినంబుల గడుపుదు' నని చిరునగవు కెంపెదవుల దళుకొత్త భాస్కరుడు బదులిడుచుండును.

విపణివీథుల నొకయువకుడు విలువగల యొక యుంగరము నమ్మజూపుచుండగా పురరక్షకభటులు అనుమానముపై వీనిని ఠాణాకు గొంపోయిరి. అచ్చట విషమప్రశ్నలను వేయగా తగు సమాధానమీయ నశక్తుడైనందున వానిపై యనుమానము మరింత దృఢపడెను గాని, తాను తప్పించుకొనుటకు యుంగరము తనకు తనబావయిచ్చి యమ్మమనెనని వాక్రుచ్చియుండెను. మరునాడతడు తనవాఙ్మూలమిచ్చిన తొలి యువకుడు నిర్దోషియని నిర్ధారణమగును. భాస్కరుని

నోటిమాట యొక్కటిచే కమలకాంతుడు విడుదల గాంచుననుట నిక్కమే!! అయినను భాస్కరునికి దీర్ఘకాల కారాగృహవాసము నాహ్వానించుట యగునుగదా. అంతకన్న మిన్నయైన యాత్మగౌరవము ప్రజావిశ్వాసముల గోల్పోయి చోరుడని జారుడని హంతకుడని పేరుమోసిపోవలసి వచ్చునేదాయని యాతడు వాపోవుచుండును.

ఇవన్నియు తన సోదరీప్రేమను సరితూగగలవా. ఆ భగినీసంతసమునకై యావజ్జీవకారాగారవాసంబును మృత్యుప్రాయమైన జీవితంబు గడుపుటకైన నిచ్చకొనును. నళినికై యాతడెంతకుం దెగువ జేయును. కమలకాంతునకు కారాగృహవాసంబు సంప్రాప్తమయ్యెనని ఏవిధమున తనసోదరికి నుడువ గలడు? సోదరి తన్నుజూచి, 'సోదరా! నీవుండియు నీబావమఱంది కారాగారవాసంబున కనిపితివా?' యనిన నాతడు బదులే మీయగలడు. అంగుళీయకము లభించుటచే నెవరో యొకరు శిక్షబొంద వలయును గాన భాస్కరుడే శిక్ష బొందుటకు నిశ్చయించుకొనెను.

తాను గృహంబు వీడి చనిన తనసహోదరి యేమిచేయునో? నళిని యెంతపరితపించునో!! అన్నపానీయముల వర్జించి కృశించునో!! యని ఒక్కమారు తన మనంబున తలంచెను. కాని యది యాతనికి కమలకాంతుని కారాగృహవాసముకన్న యెక్కుడుగా కనబడదాయెను. భాస్కరుడు తన శిరంబును తన యిరుకరంబుల నునిచికొని చింతాకులచిత్తుండై దీర్ఘాలోచనమున మునింగిపోయెను.

3

నేడు విచారణదినం బాసన్నమాయెను. అదినమున న్యాయశాలకు జనుటకుపూర్వము భాస్కరుడు తన మురిపెంపుభగినిం జేరబిల్చి ప్రేమమెయిం గౌగిలించి శిరంబును మూర్కొనియెను. నళిని చింతాకులచిత్తయైనందున యాతని యక్షిద్వయంబునుండి యశ్రుకణంబు లపారిగా మస్తకంబుపై బడుచుండినవి. ఆమె దానిం గుర్తించలేకపోయెను. ఉత్తమాంగము నొకించుక పైకెత్తి 'సోదరా! అతడు విముక్తి గాంచెడా?' యని యడిగెను.

భాస్కరుడంత స్వాధీనమనస్కుండై నళినీముఖంబుపై బడుచుండిన యామె వినీలకుటిలకుంతలంబుల జక్కదిద్దుచు 'సోదరీ! ఏల యాతడు విముక్తినొందడు? అనతికాలంబులోనే యాతడు నిర్దోషియని నిరూపింపబడి మనగృహంబున కేతెంచును. నీవు చింత దక్కియుండుము. అతడు ఇంకను తన స్థితిగతుల నెఱుగజాలనిచో నాతనిని మందలించుచు నొకింత జాగ్రత్తగానుండుము. అతనిని ఇకపై కళాశాలకు ననుపరాదు. గృహస్థ ధర్మావలంబకుడై తత్కృత్యంబులను తీర్చునట్లు అతనిని దిద్దవలసిన భారము నీపై నున్నద'ని యని పల్కి మిన్నకుండెను.

భయసంభ్రమములు ముప్పిరిగొన తనసోదరుని గాంచి 'యన్నా! నీవే యాతనికవ్విధంబును నేర్పం జాలుదువు. అంతియగాక నాపల్కులను పాటించెదరా? నీవే చెప్పవలయును' అన,

'సోదరీ యాలాగే కానిమ్ము. ఇకపై నాతడు తన దుండగీడుతనంబును మాని సన్మార్గప్రవర్తకుండగును. అతడు నీపల్కులను తప్పక యాలకించును!! నేనును నాతని మందలించుచుందును. నీవును నాతనికి బుద్ధి జెప్పుచుండు'మని బదులిడెను.

భాస్కరుడు పరోపకారపరాయణుడని బీదలపాలిటి కల్పతరువనియు సుగుణఖనియనియు నగరమందంతటను ప్రఖ్యాతి గాంచియుండెను. తానే దేశద్రోహకార్యసభ్యుడననియు, నిదివరకనేక దుండగములు జేయుచుంటిననియు, రైలుబండియందు నాపాడు ఆంగ్లేయవనితను హింసించి యామె యాభరణంబు లపహరించెననియు మరియు నా యాభరణంబులలో నొక్కటియైన యావజ్రపుటుంగరమును తానమ్మజాలక కమలకాంతుని నమ్మబంపెననియు,

కమలకాంతుడు నిర్దోషియనియు భయకంపిత చిత్తుడగుటం జేసి యవ్విధంబున వాఙ్మూలము నిచ్చియుండెననియు నిందుకోర్టు నుడివిన నేమానవుడు సంభ్రమాశ్చర్యముల ముప్పిరిగొని రెప్పవేయక యాతని దిలకించకుండును!! ప్రతిపురుషుడును 'అయ్యో! ఇట్టి సుగుణవంతు డిట్లు చేసియుండె'నని కలగకమానడు గదా!

దోషినిగుర్తింప నాయాంగ్లేయవనిత కోర్టులో హాజరైయుండెను. భాస్కరుడే తాను దోషియని నుడువగా నాంగ్లేయవనితయు ఆతడే తన్ను హింసించెననియు నుడివెను. హైందవులను గుర్తింప నశక్తురాలు గనుక భాస్కరుడే రివాల్వరుతో తన్ను గాల్చజూచెనని యామె దిట్టముగా నుడివెను. అంతట కమలకాంతుని విడిచి భాస్కరుని ఆతని స్థానమున నిల్వ నాజ్ఞాపింపబడెను.

కమలకాంతుడు నిర్దోషియని నిరూపింపబడి విడుదలచేయబడినను తనస్థానమునుండి యొకయడుగైనను కదలింపజాలక భ్రమనుపట్టినమాడ్కి నిలువబడియుండెను. భాస్కరుని పల్కు లొక్కొక్కటియును ములుకులవలె నాతని హృదయపీఠమును గ్రుచ్చుచుండెను. ఆత డపుడపుడు భాస్కరుని మాటలను ఖండింపబలుక జూచెను గాని ఏలకో యాతని నోటివెంట నొక్క పలుకైన వెలువడదాయెను. భాస్కరుడు దోషియని నిరూపింపబడి పదునాల్గేండ్లు ద్వీపాంతరవాసశిక్ష విధింపబడెను. కమలకాంతుడు భాస్కరుని వదనాంబుజంబును గాంచెను. అపుడున్ను ఆతని వదనంబున గంభీర ధైర్యస్థైర్యములు తాండవమాడుచుండెను. కమలకాంతు డట్లెంతోసేపు భాస్కరుని గాంచజాలకపోయెను. అవమానపూరిత చిత్తంబు దుఃఖమున వ్రీలిపోవుచుండెను. ఇరుకరంబుల తనవక్షంబును నదిమిపట్టుకొనెను.

భాస్కరుని కారాగృహమునకుం గొనిపోవుతరి యాతని హస్తశృంఖలాశబ్దంబునకు చైతన్యంబుకెంది సుగుణసంపన్నుండగు సోదరీవాత్సల్యపూరిత చిత్తుండగు నిర్దోషియగు పురుషుండు దోషియని నిర్దేశింపబడి తాను నిర్దోషియని విడుదలపొందుట కమలకాంతునకు విస్పష్టముగ గోచరించుచుండెను.

కమలకాంతునితో మాట్లాడుటకు ననుజ్ఞవడసి భాస్కరుడు ఆతని చెంతనిల్చెను. కమలకాంతుడాపాదమస్తకము వణకిపోవుచుండెను. ఆతనిని గాంచి 'నీవు ఇంటికిపొమ్ము. నీవిపు డెంతగౌరవముతో విడుదలగాంచితివో యిట్లే నీజీవితకాలంబును గౌరవముతో గడుపవలయును. సర్వేశ్వరుడు నీకనుగ్రహించుగాక. నాసర్వస్వమ్మును నీకును నళినికిన్ని ఇచ్చివేయుచున్నాను. నేను మరల ఏతెంతునని స్వప్నమునకైతము నిరీక్షింపవలదు నళినితో — నళినీ నామంబు నధరంబులలో వెలువడ నాతనికంఠంబు రుద్ధమగుచుండెను. నయనంబుల నశ్రుకణంబులు కాలువలుగట్టి పారుచుండెను. ఆదుఃఖాతిరేకంబున పెదవులు తొట్రిలుచుండెను. ఎట్లో సద్దుకొని ప్రయత్నపూర్వకముగ నాతని గాంచి 'నేను ఈదేశంబును వీడుతరి నామె జీవయాత్ర సుఖప్రదముగను సంతోషదాయకముగను గడుపునుగాకయని దీవించితి'నని యామెతో నుడువుము. ఆమాతనసీమయందు ఎదిగిన మోమొక్కటియు గాన్పించదని [illegible] నాముద్దుచెలియలి సుందరవదనంబె నాకిక యాత్రకు నూతకొమ్ముగా నుండునని వచియింపుము. నేను నాజీవితంబును విలువగలదానిగ నెంచబోను. ఏ యబలసుఖంబునకై ఎవ్వరికొరకై నాజీవితంబును గడుపుచుంటినో యాప్రాణంపుముద్దుచెల్లెలు నాప్రియసోదరి యధరంబులపై దుఃఖరేఖ గోచరింపకుండుటకై యీయంతులేని నాయాత్ర నుంకించితినని ఆమెతో నుడువు'మంచు భాస్కరుడు నుడువ కాంతుడు సోదరా యటంచు యాతనిపాదములపై వ్రాలెను. కాంతుని గాంచి 'మిత్రమా! శిశువువలె ప్రయత్నించకుము. లేచి యింటివారింబట్టుము. కంటికి

మింటికి నేకధారగా నేడ్చుచు నళిని నీకై నిరీక్షించుచుండును. ఆమెను శాంతవచనంబుల నోదార్చుచు. వర్షాంతమునకో మరుసంవత్సరమునకో వత్తునని నుడువు' మనిపల్కి యాతనిపై కడసారి చూడ్కుల నిగిడించి పోలీసువారివెంట నేగెను. తడబడు నడుగులతో కాంతుడు యింటిదారింబడెను.

## ౪

వర్షాగమమునకై వేచియుండు చాతకంబుకైవడి, ఆహారాన్వేషణంబునకై చనియుండుమాతకై వేచియుండు శకుంతసంతానంబుమాడ్కి నళిని తన ప్రియునికై నిరీక్షించుచుండెను. అల్లంతదవ్వున నిజవిభుడు జనుదెంచుటంగాంచి సంజవేళ మగుడి యేతెంచు మొదవుజూచిన వత్సంబుచందంబోలె నిజధవుని నొక్కచెంగున కలసుకొనెను. చంద్రోదయంబునుగాంచిన జలజంబుమాడ్కి వన్నెదక్కియుండిన యావదనంబున నశ్రుకణంబులు దొరలి మచ్చలుబడి యాకపోలతలంబును జూచిన నామందయాన యావిసంబంతయు వాపోయినట్లు పొడంజూపుచు—

'ధర్మస్వరూపులైన యాన్యాయపతి మీకు స్వేచ్ఛను దయచేసెంగదా? మిమ్ము మరల ఖైదీ చేయరుగదా?' యని మించిన సంతోషంబుతో నళిని ప్రశ్నించెను. తెమ్మెరోలు చిరునగవు కెంపెదవులం దొలుకాడ 'ప్రేయసీ వారు నన్ను బంధించియేయుందురు. నిజమునకు నీకాంతుడు దోషియేయగు. అఘోరమునకు ద్వీపాంతర వాసశిక్షనుబొంది యుండు'నను పల్కులు చెవులంబడ నళిని యప్రయత్నముగ యాపాదమస్తకంబు వణకిపోవుచుండెను. అతనింగాంచి 'వల్లభా! మీరిక నిట్టికఠినంబులైన నుడువులం బల్కబోకుడు. మీరిప్పుడు స్వేచ్ఛావిహారంబునుబొంది వచ్చితిరిగదా. దుర్జనసాంగత్యము బోనాడి సన్మిత్రులంబడసి ధర్మమార్గాచరణులగుడు.' అటంచు దీనవదనాబ్జయై యాతని చరణంబుల కెరగెను.

కాంతుని డెందము దగ్ధమైపోవుచుండెను. మాటలాడనోడి రాతిప్రతిమవోలె నిల్వబడియుండెను. 'ఆహా నా స్వేచ్ఛకై. ఎట్టిమానవోత్తముని గోల్పోయితి!! తన ప్రాణంబుల మిన్నయని చింతించు నళిని నెట్లోదార్పజాలుదు. సోదరుడే సర్వస్వమ్మనియెంచు చింతించు నామె నెట్లు ఊరడింతు'నని యాతండు మదిం వలపోయుచుండె. నాతనికి కంబు దిరుగుచుండునట్లు గోచరించె. ఆతని నయనంబులకు ఇలాతలంబు ధ్వాంతపూరితంబైనట్లు జూపట్టుచుండె కాంతుడు నిలువజాలక పోయెను. శరీరం బస్వస్థతగా నున్నదని నుడువుచు తనగదికింజని పరుండెను.

పోలీసువారి యాధీనంబున నుండుటచే నాతని దేహంబు బాగుండలేదు కాబోలని నళిని మనంబున చింతించుచుండె శీఘ్రముగ రుచికరభోజనంబు తయారుచేయుచుండెను. ఆమె మనంబు నిజ మనోహరునియందు లగ్నమైయుండినందున నిజసోదరుని గూర్చి తలపోయదాయెను. వంటపూర్తియైనదే నిజ సోదరుడు వచ్చునని యెదురుజూచుచుండెను. అప్పుడప్పుడు వ్యాయామమందిరంబునకు జనుచుండు నందున గృహంబున కాలస్యంబుగ వచ్చుచుండెను. ఆ దినంబు సైతము మల్లె వేచియుండి యెంతకు మగుడి రానందున నళిని కాంతునికేరి 'నాథా! మాయన్న రాన్రపొద్దగు. మీరు వేచియుండుటెందులకు? మీరు భుజించి విశ్రమింపు'డని వేడుకొనెను.

కాంతుడు పాన్పుడిగ్గడు; బదులు పలుకడు నళిని మరలమరల ఆతనిని భోజనంబునకై లేపెను. ఎంతకు కాంతుడు లేవడాయెను. అంతట నళిని యతని చరణంబులలో కదల్చిలేప మరింత చెంతకు డాయగ యాతడు ముఖంబునకు దిండుమాటుగ జేసుకొని వెక్కివెక్కి ఏడ్చుచుండుటను తిలకించెను. ఆతనినట్లే కౌగిలించుకొని, 'నాథా! మీరిట్లు శోకాక్రాంతులై యుండుటకు గతంబేమి?' యన నతడు మరింత యెక్కువగ వాపోవదొడంగె. ఆమెను

అక్కునఁజేర్చి హోరున నేడ్చుచు నళినీ! ప్రియా! నీకింకెక్కడి సోదరుడు! ఎక్కడికి జనిన మగుడి రాజాలఁడో ఆసీమ నీసోదరుని నెలవాయెను. దెయ్యమెత్తినవేరితి నిశ్చేష్టురాలై నిలబడి కొంత తడవు కడువ సేదదేరి ఆతనికౌగిలిపీడి ఏమీ! మీరేమంటిరి!! మీరు నుడివినదేవో విమర్శగ పల్కరా——— నాసోదరుడు—— —

'అవును నళినీ నీసోదరుడు మగుడివచ్చునంచు స్వప్నమునందైన తలంపబోకుము. నీకొరకు నీసోదరుడు నాసేరంబు పైనవేసుకొని పదునాల్గుసంవత్సరములు ద్వీపాంతరవాస శిక్షను ముదముతో గైకొనెను. నళినీ! యీదౌర్భాగ్యునికై నీసోదరరత్నంబును కోల్పోయితివి. అట్టి ఘోరపాపిని పూర్తుడవు నీవు నాచెంతకు రావలదు. నన్నుఁ దాకవల'దని హోయమని ఏడ్వసాగెను.

ఆపల్కులు వాడియమ్ములవోలె చెవులనాట, 'హా సోదరా! కంటికి రెప్పవోలె నా బాల్యమునుండి ఎండకన్ను నీడకన్ను నెఱుంగనీయక కాపాడితే! హా అగ్రజా నన్ను వీడిపోతివే' యనుచు నామూలచ్ఛేదిత భూరుహంబుకైవడి స్పృహదప్పి నేలంగూలె.

సావిత్రి——ఎవ్వరికి వాఙ్మనఃక్రియలనేరికి హింసయొనర్పఁబూన రె
య్యెడలను దీనులం గరుణయేర్పడ బ్రోవసదాచారులిమ్మహిన్
గడుమనఁదగినీ కెదిరికాంక్షితములొ త్తుదమొక్కఁడీర్తు రె
క్కుడుమదిఁగూర్తు రార్తులకున్ విపులస్థితియు నార్యధర్మముల్.

శమనుడు.——కొనుమిదె నీమనఃప్రియముఁ గోమలి, నీదు చతుశ్శతాబ్దముల్
మను నిటమీఁదఁ బుత్రులఁ గ్రమంబున నూర్వురఁ గాంచుఁ గీర్తిస
ద్ధనుఁడగు సంతతాధ్వర విధానములం బరితుష్టిసేయు న
య్యనిమిషకోటికెల్లను; నిజాన్వయ మౌళి విభూషణుండగున్.

'భారతము'

# దిద్దుబాటు

శ్రీ విశ్వనాథకవిరాజుగారు

[రామనాథశాస్త్రి న్యూసుపేపరు చదువుకుంటూ యీజీచెయిరులో కూర్చున్నాడు. వయసు 58. దృఢ శరీరుడు. 8 సం|| చిన్నగా కనబడుతాడు. అతని కొమార్తె సరోజిని. 'షా' గారి 'సీజర్ అండ్ క్లియోపాత్రా' చదువుతూ సోఫాలో సగంగా పండుకొన్నది. వయసు 17. శరీరమునకంతకూ ముఖమే డాబుగా వుంటుంది. అందులో ప్రకృతి సిద్ధమైనసౌందర్యంకంటె ప్రతిభా సిద్ధమైనసౌందర్యం హెచ్చు. గడియారం 8 గ్రుక్కలలో చెప్పింది-8 అయిందని; పాపం! ఉదయవేళ అనిమాత్రం చెప్పలేకపోయింది]

శాస్త్రి—సుబ్బయ్యగారూ!

(సుబ్బయ్య 100 ఏండ్లక్రిందటి శ్రోత్రియ బ్రాహ్మణునిలాగుంటాడు. వయసు 52. సంతోషశాలి. వచ్చి ప్రక్కగా నిల్చుంటాడు.)

చూడండీ-మీతో ఇదివరకు చెప్పినాను. శేషగిరి అని మీ బరంపురంప్రాంతం మనిషే. నని—ఆయనవస్తున్నా రీమెయిలులో.

సుబ్బయ్య—చిత్తం.

శాస్త్రి—చేయగలిగితే ఈరోజున మీరు ఫస్తుగా తెనుగువంట—అందులో తూరుపు వంట చేయించండి.

సుబ్బయ్య—నే సలవాటుపడ్డదే అది. ఈ అరవవంట నాకు మధ్యవచ్చిన వైష్ణవ మండి.

శాస్త్రి—మరోమాట. ఒక్క అరగంట లోనే వారువస్తున్నారు. రావడమే పండ్లూ బిస్కత్తులూ కాఫీమాత్రం తెప్పించండి.

సరోజిని—నాన్నగారూ! నేను తెచ్చి పెడతా.

శాస్త్రి—మంచిదమ్మా... మీరువెళ్లండి. (సుబ్బయ్య వెళ్తాడు.)

అమ్మా! గ్రామఫోను రికార్డులు ఏమి వేయదలంచుకొన్నావో వేరుగా ఏర్చిపెట్టినావా?

సరోజిని—ఎందుకండీ!

శాస్త్రి—రికార్డులనుబట్టి అవి కొన్న వారి మనస్తత్వమూ అభిరుచులూ చెప్పవచ్చును. అవి వెకిలిగావుంటే—

సరోజిని—మన దగ్గరవున్నవి మన అభిరుచినిబట్టి కొన్నవే. ఆయన కేఅభిప్రాయం కలుగనీయండీ— ఉన్నలోపాలను మనము మానుకోనక్కర లేనిగుణాలను ఆరోపించుకో వద్దు.

.................. ......

శాస్త్రి—స్టేషనుకు మనకారు వెళ్తుంది; మనంకూడా వెళ్లవలసివుంటుందా?

సరోజిని—ఎందుకు? ఇదివరకు వారు రెండుసార్లు మనయింటికి వచ్చినారు. అప్పుడు కూడ మన కారే వెళ్లిందికాని మనంవెళ్లలేదు.

శాస్త్రి—అప్పుడు విశేషమున్నదికదూ!

సరోజిని—ఈమాత్రానికే దానినొక పెద్ద విశేషం చేయవలసిన అగత్యంలేదులెండి.

శాస్త్రి—అయితే నీమనసులో మాట యేమిటి?

సరోజని—పైకి చెప్తావున్నమాటే—2 సంవత్సరాలనుంచీ నా కాయనను తెలుసును. ఇటీవల స్నేహమేర్పడ్డది కూడా. చాలా మర్యాదాగలమనిషి. మా కాలేజీవిద్యార్థు లందరికీ ఆయనఅంటే చాలాగౌరవం. టెన్నిస్ సింగిల్సులో ఆయనకు ప్రెసిడెన్సీ కప్పు వచ్చింది. అంతకంటే ఆయనలో నేను మెచ్చుకొనేప్రజ్ఞ ఆయన ఇంగ్లీషు ఒరెటరీ (తన్ను మరపించే మార్దవంతో) మీరు విన లేదుగాని నాన్నగారూ ఆయన ఇంగ్లీషు మాట్లాడుతూవుంటే సంగీతం పాడుతూన్నట్లుంటుంటుండి. ఆ భావగాంభీర్యం ఆ భాషా సౌలభ్యం- నిజంగా రాధాకృష్ణన్‌గారిని విన్నాను- ఆయనను విన్నాను.

శాస్త్రి—అది మంచిలక్షణమే దానివల్ల మనిషి సులభంగా వృద్ధికొస్తాడు. ఈరోజుల్లో పిల్లకాయలకు దానిమీద శ్రద్ధేలేదు. అందులో ఆంధ్రులకు మరీన్నీ!! మొన్న డిశంబరులో స్టూడెంట్సు కాన్ఫరెన్సుకు ప్రెసిడెంటుగా వెళ్లి చూచినాను—ఒక్కడు ఒక్క విద్యార్థి మంచియింగ్లీషు మాట్లాడుటనూ!

సరోజని—'ఇంగ్లీషు పరభాష—దానికై యింతపరిశ్రమ యెందుకు' అని నేటివిద్యార్థి అభిప్రాయము.

శాస్త్రి—ఇంగ్లీషు మనజీవనమునకు గూడా ఆధారమై యున్నంతవరకూ మనందాన్ని తిరస్కరించరాదు. శక్తికిమించి ఉపాసించనేవలె.

సరోజని—నిజమే. ఆస్వాతంత్ర్యముంటే ఆభాషాభ్యాసమే వదలుకోవలె.

శాస్త్రి—రాజకీయంలో అతనికేమైనా వుత్సాహముందా?

సరోజని—ఉన్నట్లు కానరాదు. ఆయన తరుచు ఖద్దరుకూడా కట్టరు. ఆయన ఫీల్డు సోషల్‌రిఫారమ్ గ్రామపునర్నిర్మాణమంటే చాలయిష్టం. అన్నట్లు మొన్న భగవద్గీతా లెక్చర్సుకూడా రెండిచ్చినారు.

శాస్త్రి—ఇదేనమ్మా ఈకుర్రవాళ్లతో వున్నచిక్కు. రవంత తెలివితేటలుంటే సమస్తమూ తెలుసుననుకొంటారు. వీరికున్న అనుభవమేమిటి చెప్పా గీతలు వీరికర్థం కావడానికి.

సరోజని—మీవయసువస్తేకాని గీతలర్థం కావన్నవాదం మీది!

శాస్త్రి—నా వయస్సక్కరలేదు. 50 ఏనా వస్తేకాని గీత బోధపడదు.

సరోజని—మరి శంకరాచార్యులవారు 16 ఏళ్లలోపుననే గీతాభాష్యం వ్రాశారట కదూ?

శాస్త్రి—సరిపోయింది!! ఆయన 8-వ యేట సన్యసించినారు. ఇంకొకరిని సన్యసించమనూ. 'శంకరశ్శంకరస్సాక్షాత్' అని అవతారపురుషులు!! వారికీ మనకీ సాటా!! అదుగో మెయిల్‌కూత...వచ్చేవుంటాడు. మనం వెళ్ళవలసింది.

సరోజిని—మీకెందుకండీ యింకా ఆ సందేహం?

శాస్త్రి—నువ్వు చిన్నపిల్లవమ్మా—నీకు తెలియదు. సరే అయిపోయింది. ఈమాట చెప్పు—అతడు వచ్చినతర్వాత ఆవిషయం మనమే మొదట యెత్తుదామా?

సరోజిని—ఆయన మొదట జాబువ్రాసినారు. దానికి జవాబుగా 'ముఖాముఖిని మాటాడుదాము రావలసిం'దని మీరు జవాబువ్రాసినారు. వస్తున్నారు. కనుక మీరే మొదట ఆవిషయ మెత్తవలసి వుంటుం దనుకొంటాను.

శాస్త్రి— నిజమే... ఇత డీవిషయం నీతో ఇదివర కేమనిచెప్పెను?

సరోజిని—చెప్పినానుకదూ...ఒకపర్యాయం. ఇన్స్పెక్ట్రెస్ ఆఫ్ స్కూల్సు రాధాసుందరమ్మగారిని టీకి పిల్చినాను. ఆసాయంకాలం వీరిద్దరూ 'కో ఎడ్యుకేషన్'గురించి వాదించినారు. కలిసే మనసుకు వచ్చినారు. అప్పుడామె అన్నది 'మీరిద్దరూ పెండ్లిచేసుకొందుకు వీలులేదా' అని. నాకంతటి యోగ్యతా భాగ్యమూ ఉన్నదా!' అన్నా రాయన. 'వున్నగా రున్నారుగదా' అన్నాను నేను. ఆసంభాషణ అంతటితో ముగిసింది. వారు మీకు జాబువ్రాసినారు.

శాస్త్రి—బాగుంది. సంపాదిగలమనిషే. అతని ఆస్తినిగురించీ ఖర్చువెచ్చాలనుగురించీ అడుగుదామా?

సరోజిని:—వద్దండీ—మనిషికి ఆస్తేమిటి? తెలివితేటలే ఆస్తి. యోగ్యతే ఆస్తి.

శాస్త్రి:—పోనీ కుటుంబమునుగురించి?

సరోజిని:—అడగవచ్చును. దానికేమి?

శాస్త్రి:—నువ్వు మరొకసారి ఆలోచించినావూ నీకింతకంటె మంచిసంబంధము రావచ్చునేమో? నాగౌరవం, మనఆస్తి, నీవిద్యావివేకములు వీటినిబట్టి—

సరోజి: —పోనిస్తురూ, రెండుపక్షములూ సరిగాచూచి యేర్పాటుచేసుకొందుకు వీలుండదు. వీరసహ్యింపదగిన అవగుణములు వారిలోనూ వారసహ్యింపదగిన అవగుణములు వీరిలోనూ లేకుండేచాలు. హృదయాభిముఖ్యం ముఖ్యమన్నిటికంటే. ఇంతకూ మీఅనుభవం చాలాగొప్పది. ఒక్కసారి మనిషినిచూస్తే అతనితత్వం మీకు బోధపడుతుంది సంపూర్ణంగా.

(ఇంటిగుమ్మందగ్గర కారుకూత—
ఇద్దరూ దిగున లేచివెళ్తారు:
శేషగిరితో కలిసివస్తారు.
సరోజని కుషన్ పైరుమీదను,
వీరు సోఫామీదనూ కూర్చుంటారు)

శా:—9-10; ట్రైను రైటుటైముకే వచ్చింది.

శేషగిరి:—చిత్తం.

శా:—ఈసెలవలలో ఏమైనా లెక్చరింగ్ ప్రోగ్రాము పెట్టుకున్నారా?

శేష:—లేదండి, మానంటివారం లోకానికి ఏమిచెప్పగలం గనుక.

శా:—ఈమధ్య గీతా లెక్చెరిచ్చేరట కదూ?

సరో:—రెండూ!! మెసెజ్ ఆఫ్ది గీతా అనివకటి. గీతా అండ్ ది బైబిల్ అని నకటీ.

శేష:—ఏదో బాల్య చాపల్యమండి; తమవంటివారెదగ్గర నేను గీతాప్రశంస చేయుడమేమిటి?

(సరోజిని ఫలహారాలమరుస్తూవుంటుంది)

శా:—గీత అగాధమైనదండి. నాకు మాత్ర మేమి తెలుసును? ఏదోనేను రిటైరైన యీ 4 ఏండ్లలోనూ కొంతచూచినాను. మీ రేయేగ్రంథాలు చూచినారు?

శేష:—నాకు తిలకూగాంధీ ఏనిబిసెంట్ ఆధారమండి,

శా:—చాలదు. ఒక్క వారంరోజులు మనం కలిసి కూర్చుందాము. తర్వాత మీకు తెలుస్తుంది గీత యెంత అద్భుతమైందో. గీతను అస లుపనిషత్తులన్నారు పెద్దలు...

శేష:—చిత్తం.

శా:—కూర్చుందాము. నువ్వూ రా అమ్మా.

(సరోజిని గ్రామఫోను రికార్డువేస్తుంది. ముగ్గురూ తీసుకొంటూవుంటారు)

శా:—ఈగ్రామఫోనువచ్చి ప్రజల అభిరుచిని చెడగొట్టివేస్తూవున్నాదండి.

శేష:—నిజమే. నాకు సంగీతంరాదు మంచి ప్లేట్లు మెచ్చుకోందుకు. పాడుపాటలు నేను వినలేను. కనుక నాకు గ్రామఫోనంటే మోజు లేదండి.

శా:—ఇందులోకూడా కొన్ని మంచివి లేకపోలేదు. ఏదమ్మా వేస్తావా మొన్న నే తెచ్చాను భగవద్గీతాశ్లోకాలూ మంత్రపుష్పమున్నూ.

సరో:—తర్వాత తీస్తాను; వెదకవలె. అవి చాలా బాగున్నవండీ.

శా:—నాకో అభిప్రాయం కలిగింది. చూశారూ దేశంలో వేదవిద్య మూడు వంతులుపోయింది. మనతరం గడచిపోతే సంపూర్ణంగా పోయిందన్న మాట. అది స్వర ప్రధాన మవడంచేత ప్రజలుచూసికూడా చదవలేకపోతారు. కనుక ఉన్నంతవరకూ వేదపండితులను ఇప్పుడే ఏరి అంతా రికార్డు చేసేస్తే శాశ్వతంగా నిల్చిపోతుంది. లోకంలో అన్ని దేశాలవారూ పుచ్చుకుంటారు గనుక చెలామణీ బాగా అవుతుంది.

శేష.—చాలా బాగున్నదండీ. భారతీయులందరిలోనూ ఆంధ్రుల ఉచ్చారణ చాలా బాగుంటుందంటారు. ఇది ఆంధ్రులవల్లనే కాతగ్గదికూడా.

సరో:—ఔను. ఆంధ్రుల అభిరుచులిప్పుడు సంగీతాలలోనూ కవిత్వంలోనూ సాంఘిక సంస్కారములలోనూ చాలా గొప్పగా వున్నవి. ఆంధ్రుల పద్యపఠనమింత జాతీయంగావుంది ఇంక వేదగానమే మిగిలిపోయింది.

సినీమాకళ మనఆంధ్రులచేతిలో ఎంతమనోహరంగా తేలిందో చూశారుకారు? ఇంక వేదగానంకూడా మన ఆంధ్రాస్ ఆఫ్ది గ్రామఫోను ఫేములకు విడిచిపెడితే అసావేరీ బౌరువా మాల్కౌంజు రాగాలతో బయలు వెడలుతుంది.

శేష:—సరోజినీ! ఇది కేవలం సిద్దాక్షిణ్యం. ఉండండి మహాతీక్ష్ణంగా మాటాడతారు?

శా:—నాకు ఆలాగే కనబడుతుందండి.

శేష:—చిత్తం ఆలాగే.

శా:—ఆపమ్మా గ్రామఫోను. అయితే సెలవల్లో ఇంటికి వెళ్తారా?

శేషగిరి:—ఎవరున్నారింటిదగ్గిర. నుసం రాలేదని విచారించేవాళ్ళు?

శా:—మీకుటుంబ మెవరెవ రున్నారో చెప్పండి. కుతూహలంచేత అడుగుతున్నాను.

(సరోజిని లోపలకువెళ్లి వెంటనేవస్తుంది)

శేష:—నేను 4 ఏళ్లవాణ్ని అయినపుడు మాతల్లిపోయింది. మాతండ్రిగారు మంచి పేరుకెక్కిన ప్లీడరుగా వుండేవారు బరంపురంలో. ఆయన ఇరవై పాతిక వేలుఆర్జించి వుంటారని వాడుక. ఆయనా మరి నాల్గేళ్ళు వుండి ఆఆస్తినీనన్నూ మాపినతండ్రిగారి కప్పగించి విరక్తిచెంది కాశీహరిద్వారం వెళ్ళిపోయినాడు. ఆయనను హరిద్వారంలో చూసినామని కొందరూ బదరీనారాయణంలో చూసినామని కొందరూ చెబుతూవచ్చినారు. ఈపరీక్షాతరంగాలుగడచి గట్టెక్కితే వెళ్లి ఆయనదర్శనం చేసుకోవలెననివుంది. ఇంక మాపినతండ్రిగారు సుబ్రహ్మణ్యశాస్త్రిగారని మంచి శాస్త్రపండితులు. ఆయన నన్ను విజయనగరంలోనూ రాజమండ్రీలోనూ మద్రాసులోనూపెట్టి చదువు చెప్పిస్తున్నారు. నేను సెలవులలో యింటికివెళ్తే నాతో యెవరేమాటలుచెప్పి విడదీస్తారో అని ఆయనకు భయం. ఆయనే సెలవలముందు ఓసారి వచ్చి నన్నుచూచి వెళుతూవుంటారు. నాకు ఆయననుచూస్తే మాతండ్రిగారిని చూసినట్లేవుంటుంది. పిల్లలవాడు. మాతండ్రిగారి ఆస్తిమీదనే ఆయనజీవిస్తూవున్నా ఆయన దగ్గరనుంచి చదువుకోసరమైనా ఈమాత్రం డబ్బు పుచ్చుకోవడం నాకు కష్టంగానేవుంది. ఈ బి. యల్ అయిందనిపించేసుకుంటే ఏదో బల్లకట్టుకొని స్వతంత్రంగా జీవించవలెనని వుందిగాని నాతండ్రిఆస్తిగూర్చి నాపినతండ్రిని అడగవలెనని లేదు.

సరో:—చాలా బాగున్నది.

శా:—బేషైగావుంది. ఇది గొప్పఔదార్యం. ఇటువంటిబుద్ధి సాధారణంగా అందరికీ పుట్టదు.

సరో:—ఈమాత్రం ఆత్మార్పణఅయినా లేకుంటే సహజంగా సంఘసంస్కరణ బుద్ధి పుట్టదు.

శా:—ముందేమో అనుకొన్నానుగాని గీతార్థం మీకు బాగా అవగాహన అయిందని నాకు తోస్తూవున్నదిప్పుడు. శాస్త్రి మనుభవంలోకి రావలె.

శేష:—నమస్కారం. మరిదీన్ని విశేషంగా ప్రశంసించవద్దని ప్రార్థన. నామనస్సు

న్యాయంగా ధర్మంగావు. డేటట్లు తమరాశీర్వ దించవలె. అంతే.

(సుబ్బయ్య తలవంచుకొనివచ్చి కప్పు లూప్లేట్లూ తీసుకొనివెళ్ళాడు)

ఇదేమిటిది? ఎవరీయన?

(భూతావిష్టుడు లాగా తాడు)

శా:—సుబ్బయ్యగారని మావంటబ్రాహ్మ డు మీానైవుమనిషే.

సరో:—ఏం? ఏమిటి విశేషమండీ?

శా:—అలాగై పోతున్నారేమిటి? సమ దాయించుకోండి. సుబ్బయ్యగారూ!

(సుబ్బయ్యవచ్చి నవ్వుమొగంతో దూ రంగా నిల్చుంటాడు.)

శేష:—నువ్విక్కడి కెందుకువచ్చినావు?

సుబ్బయ్య:—నువ్విక్కడికి వస్తావనీ .. నిన్ను చూదామనీ......

శేష:—నీకువచ్చిన యేళ్లెవరికవచ్చినా యి? నీకిదేమైనా బాగుందా?

సు:—సెలవలకైనా నువ్వింటికి రాకుంటే నేను చేసేదేముంది అబ్బాయి?

శా:—ఎవరనుకొన్నారు సుబ్బయ్యగారూ— ఆయనని అబ్బాయని పిలుస్తారేమిటి?

సు:—మాఅబ్బాయండీ వీడు.

శా:—ఆఁ ఆఁ !! అంటే మీాఅన్నగారి కుమారులా?

సరో:—అంటే ? ఈయన మీా పినతండ్రి గారా?

శేష:—ఆః మాపినతండ్రిగారే!

సు:—తల్లిపోతే తండ్రి, పినతండ్రితో సమ మంటారు. ఆవిధంగా ఆలోచిస్తే పినతండ్రినీ కావచ్చును పిశాచాన్ని కావచ్చునుగాని తపస్సుచేసి తిరుపతి వేంకటేశ్వరుడుకు మ్రొ క్కుకొని మరీ వీడిని కనుక్కొన్నాను. వీడు నాయేకపుత్రుడు; వరప్రసాది.

శేష:—చెప్పుచెప్పు. నీయిష్టంవచ్చినంతా చెప్పు. ఇంతకుమించి చేటేమిటి?

(వాణీముఖంమీాదనుంచి కప్పుకొని అల్లన సాగి వండుకొంటూడు.)

(శాస్త్రి వేరేకుర్చీమీాద కూర్చుంటాడు)

శా:—సుబ్బయ్యగారూ! ఆకుర్చీమీాద కూర్చోండి.

సు:—పర్వాలేదు ఈలాగున నిలబడ తాను సెలవియ్యండి.

సరో:—కాదు, ఈలాగుకూర్చుండండీ.

(కుర్చీదగ్గరకుతీస్తుంది: కూర్చుంటాడు)

(తనకుర్చీ తండ్రికుర్చీదగ్గరకు తీసుకొం టుంది.)

శాస్త్రి:—తమరు బరంపురంలో ప్లీడరీ చేసినారా ?

సుబ్బయ్య:—ప్లీడరీలేదు మట్టిగడ్డాలేదు. నేను పురోహితవృత్తి చేస్తున్నాను. నా పేరు సుబ్బావధాని.

శాస్త్రి:—మీాకు తమ్ముడుగారున్నారా?

సుబ్బయ్య:—నాకు వీడుతప్ప ఇరస్తా పరస్తా ఎవ్వరూ లేరు.

శాస్త్రి:—ఈ యునకు మీారే చదువు చెప్పిస్తున్నారా ?

సుబ్బయ్య:—నేనే. నాకింతకంటె యింకే ముందిగనుక, వెళ్లి చదువుకుంటానంటే యింగ్లాండుకూడా పంపిస్తా నన్నాను,

శాస్త్రి:— అయితే, ఎక్కడి బరంపురం! ఎక్కడి మధుర! మీరింతదూరం రావడ మేమిటి? ఇక్కడికే రావడమేమిటి? ఈరహస్య మేమిటో చెప్పండి.

సుబ్బయ్య:—రహస్యం అనృతాని కింకొకరూపమని నా అభిప్రాయం. అనృతం నేను సహించను. అసలు రహస్యం బహిరంగపరచడానికే నేను వచ్చినాను. నాల్గు మాసాలక్రిందట వీడు నాకు జాబువ్రాసినాడు. సంగతులివి.

"సామవేదం రామనాధశాస్త్రిగారని రిటైర్డు ప్రెసిడెన్సీ మేజస్ట్రేటుగారు ప్రస్తుతం మధురలో వున్నారు. ఆయన కుమార్తె సరోజిని అనేపిల్ల మా కాలేజిలో చదువుకొంటూ వున్నది. వయసు 17 సం॥ ఆమెను పెండ్లాడవలెనని నాకు వున్నది. నీవు వైదిక వృత్తిలో నున్నావు. నేను నీ కుమారుడనన్న సంగతి తెలిస్తే నాకీ సంబాధము తప్పిపోవచ్చును. అంతపనే జరిగితే నేను ఆజన్మ బ్రహ్మచారిగా ఉండవలసినవాడను గాని పెండ్లాడవలసిన వాడనుగాను. నేనొక యింటి వాడనై వుండవలెననే అభిప్రాయమే నీకుంటే నువ్విందులో జోక్యం కలిగించుకోవద్దు. నీ కిష్టముంటే నాకొక వెయ్యిరూపాయిలు పంపు. లేకుంటే యిబ్బందిలేదు" అని. వాడు ప్రాజ్ఞుడని నాకు తెలుసును. వెంటనే వేయి రూపాయిలూ పంపినాను—కాశీ వెళ్లుచున్నానని జాబువ్రాసి నేనీలాగు వచ్చినాను ఇది అనృతమనుకోకండి—నేను కాశీతప్పక వెళ్లుతున్నాను.

శాస్త్రి:—ఇక్కడికి రావడంలో తమ అభిప్రాయమేమిటి ?

సుబ్బయ్య:—మనవిచేస్తాను. ముందక్కడ ఎసరువేసి వచ్చాను. చూసివస్తాను.

శాస్త్రి:—మీరు వెళ్లవద్దు—మీరు వంటచేయవద్దు.

సుబ్బయ్య:—లేకుంటే అంతా చెడుతుంది. ఏమీ తప్పులేదు. (వెళ్తాడు)

(శేషగిరి ముసుగులో ముక్కిముక్కి వెక్కుతూ వుంటాడు.)

శాస్త్రి:—చా! అదేమిటది ? లెండి! శేషగిరిరావుగారూ, కూర్చోండి.

(కుర్చీబెట్టి తాను ప్రక్కను కూర్చుంటాడు.)

శేషగిరి:—నేను పుట్టి ఆడిన అబద్ధమిదిఒక్కటి—ఎందుకాడినానో ఆభగవంతుడికి తెలుసును—తెలిసికూడా నన్నీలాగు శిక్షించినాడు. నేను ధ్వంసమయిపోయినాను. అయితే యిది పితృద్రోహానికి శిక్షఅయి వుంటుంది.

శాస్త్రి:—మీరు బాగా సమదాయించుకోవలె. ఇప్పుడు వచ్చిన ప్రమాదంలేదు. మీ తండ్రిగారు చాలా దూరదర్శిగా కనబడుతున్నారు. మిమ్ము క్షమిస్తారు.

శేషగిరి:—కడుపుతీపిచేత ఆయన క్షమిస్తారనుకోండి లోకం క్షమించగలదా ?

శాస్త్రి:—ఏదో 'ప్రమాదో ధీమతా మపి' దానికేమిలెండి, చూడండీ శేషగిరి రావుగారూ! ఏ సంబంధమైనా తెగతెంపులు చేసుకో వీలున్నదిగాని జన్య జనక సంబంధంమాత్రం తెగనిది. బురదలోనుంచే పద్మం పుడుతుంది; పంకజమన్న పేరుతోనే వ్యవహరింపబడుతుంది. అయినా దాని గౌరవానికిమాత్రం లోపంలేదు. చూడండీ మా తండ్రిగారు విశాఖపట్నం మెయిన్‌రోడ్డు మీద 38 సంవత్సరములు పొడుముకొట్టు పెట్టుకొని జీవించినారు. ఆరాబడితోనే నాకు బి. యే. చెప్పించినారు. మాటవచ్చేటప్పుడు నేనా విషయం దాచను. మీరింకా పసివారు. మీకీవిషయములు తెలియవు. అందులో మీ తండ్రిగారేమిటండీ వేదపురుషునంటివారు. అయనగర్భమున పుట్టడం మీ అదృష్టం.

శేషగిరి:—నాన్నగారూ!

(సుబ్బయ్యవచ్చి దూరంగా నిల్చుంటాడు)

నాన్నగారూ! గొప్పఅపరాధం చేసినాను.

సుబ్బయ్య:—నువ్వు చేయబోయినా నేను చెయ్యనివ్వనోయ్...ఔను, ఏడుస్తావెందుకూ? ముట్టుకోకు కూర్చో.

శాస్త్రి:—ఏమిటి శేషగిరీ! నీకు కుర్రతనం వదలలేదుసుమా! ఊరుకో.

సరోజిని:—అవును!! ఎందుకండి అంత పరితాపపడతారు? మనంమనుష్యులం ఏదో తప్పుచేయకుండా వుండలేము. పెద్దలు దిద్దుకుంటారు ఊరుకోండి.

సుబ్బయ్య:—అమ్మా! నీముఖంచూడలేక వాడింత ఆరాటపడుతున్నాడు.

సరోజిని:—ఇది బాగుంది! నేనెవర నిందులో మధ్య?

శాస్త్రి:—అయితే మీరెందుకు శ్రమపడి యింతదూరం మిక్కడికి వచ్చినారు?

సుబ్బయ్య:—తగినంత కారణముంది. వాడు అజ్ఞానంకొద్దీ యెంతకాదని త్రోసినేసినా వాడి జీవితం సుఖప్రపూర్ణంగా వుండేటట్లు సాధ్యమైనంతవరకూ యేర్పాటుచేయవలసిన బాధ్యత నాకున్నది. ఆ జాబునుబట్టి వీడు తనకుటుంబవృత్తాంతంలో కొంత అబద్ధం చెప్తాడని నాకు పొడకట్టింది. అది నేను కాకుంటే మరి పదియేండ్లనాడయినా ఆమెకు తెలియవచ్చును. అప్పుడు ఇద్దరికీ అరమరలు కలుగవచ్చును. ఇంకా ఇది యిట్లా నిర్లక్ష్యం చేస్తే యితని జీవితసౌధమునకు ఒక అనృతం పునాది అవుతుంది. ఆతలాగే నేను సహించలేక పోయినాను.

సరోజిని:—మీ సత్యసంధతవల్ల యీ సంబంధం తెగిపోతే?!

సుబ్బయ్య:—అంత్యనిష్ఠురంకన్న ఆది నిష్ఠురం మేలుకాదమ్మా వెర్రితల్లీ!

శాస్త్రి:—బాగుంది. అమ్మా! ఏమంటావు?

సరోజిని:—ఇదివరకేమన్నాను నాన్నగారూ! మీయిష్టమే నాయిష్టం.

శాస్త్రి:—మనకు శాఖాభేదముండే— మీరంగీకరిస్తారా?

సుబ్బయ్య:—శాఖాంతరమన్న సందేహం నాకులేదు. ఇంకే ఆక్షేపణ నాకులేదు. అబ్బాయి! నీకు మరోసంగతికూడా చెప్తున్నాను. ఇతరదేశపు పిల్లలు—ఎదిగినపిల్లలు, చదువుకొంటూవున్న పిల్లలు అంటే వారి ప్రవృత్తులు ఎంట్లావుంటవో అని నాకొక విధమైన జడుపువుండేది. నూరేండ్లు బ్రతుకవలసిన బ్రదుకు—ఈమే నీ జీవితాని కాధారము. ఈమెసంగతి కనిపెట్టవలెననే వుద్దేశం కూడా వుండెను నా కిక్కడికి రావడంలో. బిడ్డ పులుగడిగినముత్యం!! అదీ చెప్పివేశాను.

శాస్త్రి:—అమ్మమ్మ—వైదికం వైదికం అని యెల్లిదంచేస్తాం. ఈ అమాయికపు వైదికంలో యెంత సౌక్యమూ యెంత దూరాలోచనా యెంత చొరవా వున్నవి! సరోజినీ! ఇంతగడుసైన మామగారి దగ్గరా అంత తెలివైన భర్తదగ్గరా నువ్వేలాగు మసలుకోగలవమ్మా!

సరోజిని:—మీరు నాతో లేరటండీ, నాకేంభయం?

సుబ్బయ్య:—చాలావేళఅయింది. ఇంక భోజనాలకు లేవవచ్చును.

శాస్త్రి:—ఇదేమి దుర్న్యాయమండీ—మీరు మాకు వండిపెట్టడ మేమిటి?

సరోజిని:—నేను స్నానంచేసి వచ్చి మీ ముగ్గురనూ కూర్చుండబెట్టి వడ్డిస్తా.

సుబ్బయ్య:—నీ చేతి అన్నంకోసమే 19 ఏళ్లా యెదురుచూస్తున్నానమ్మా నేను.

శేషగిరి:—నన్ను క్షమించండి నాన్నగారూ! మీ హృదయం తెలుసుకోలేకపోయినాను.

సరోజిని:—మామగారూ! క్షమించకండి పరహృదయం తెలుసుకోలేని వారిని!!

వెన్నెలరాత్రిరాక — దామెర రాజగోపాలరావుగారు

(నవ్యసాహిత్యపరిషత్తు)

ప్రియ తమతమ స్విన్నవయస్విని తదీయ
కోమల కబరీనిబిరీ సకుంతలముల,
తరళతరళ తారాలతాంతాలు తురిమి;
సొంపులొలుకు కలికివలిపెంపు మేన,
వెలది వెన్నలవన్నల వలువదాల్చి;

ఇరులకురులు చక్కగ సవరించుకొనుచు,
ప్రసవ వాసనావిసరముల్ ముసురుకొనగ,
అల్లనల్లన అవనికి నరుగుదెంచె,
మోహానవిలాసలావణ్యమూర్తి వోలె!

"మణిమాల"

# సర్పము యొక్క నాలుక

శ్రీమతి కామరాజు మైత్రేయిగారు

(అనువాదము)

మన హిందూదేశపు కథలలో సర్పము నాలుక రెండుగ చీలివుండుటను, కథ యొక్కటి చెప్పెదరు. ఆకథ మనలో సందఱకు తెలిసియే యుండవచ్చును.

కాని స్వభావసిద్ధముగ సర్పమునకు రెండు నాలుకలు ఎట్లు కలిగినవి - వాటివలన, ఆ ప్రాణికి వుపయోగ మేమి? యని మనలో పెక్కుఱకు తెలియదు.

గెస్క్ను మహాశయులు వ్రాసిన ప్రాణి కెరటాలు. **(living waves)** అను వ్యాసమున సర్పముయొక్క నాలుకను గుఱించి యిట్లు వ్రాసినారు.

"ఇప్పుడు. సర్పశాస్త్రవేత్తలను నాకు తోచిన ఒక ముఖ్యమగు విషయమును గుఱించి యడుగవలెనని వున్నది. అదేదన సర్పము తన నాలుకతో మాటలాడ లేనప్పుడు, రుచి చూచినప్పుడు బుసకొట్టనప్పుడు, సర్పమునకు, ఆనాలుకతో ప్రయోజనమేమి? కాని యీ ప్రాణిని బాగుగ నెఱుగనివారు, చీలికలను పోలు రెండు సన్నని దారములు వంటివి దాని నోటిలోనుంచి బయటకు లోపలకు మెరపు తీగలవలె, వచ్చుచు పోవుచుండు దృశ్యముచేతనే, యీజంతువు మనలను యాకర్షించునట్లు తెలుసుకొనుచున్నారు. కాని దాని వలన, దానికి ప్రయోజనమేమి? సర్పముతప్ప తక్కిన జంతువులన్నియు, తమ నాలుకలచేత, ఏదోపనిని చేయుచున్నవి.

"ఊసరవిల్లి తననాలుకతో పురుగులను పట్టుచున్నది. పిల్లి పాలను త్రాగుచున్నది. ఫోలాసుఅను ప్రాణి రాతిలో బొరియలు చేయుచున్నది. మశకము మన్నులో బొరియలు చేయుచున్నది. పాపము, ఆసర్పము తన నాలుకతో ఏయుపాయమును గాని చేయనప్పుడు, అది యట్లు చీలివుండుట ఎందులకు?" అని వ్రాసినారు.

గెస్క్ను మహాశయులు, సర్పశాస్త్రవేత్తలకు యీ ప్రశ్న వేసినను వారెవరును, ప్రత్యుత్తరము చెప్పలేరనియే నా యభిప్రాయము.

కఱచుట, బుసకొట్టుట, నాకుటయును యీ చేష్టలేవియును పాము తన నాలుకతో చేయలేదని, మనము నిర్ధారించిన, ఆనాలుక, నిరుపయోగమని తేలుచున్నది. కాని పాము తన నాలుకతో కఱచుచున్నదను విషయము లోకవిదితమే కనుక, పైచెప్పినది నమ్ముటకు వీలులేని నిర్ధారణయగుట లేదా? ఇప్పుడు సర్పము తన నాలుకను, బయటికి లోపలికి త్వరత్వరగా ఏల కదలించుచున్నదో తెలుసుకొనవలసి యున్నది.

ఒక జాతియొక్క దీర్ఘమైన జీవితములో కొన్ని యవయవములు, వాటి వుపయోగము లేకపోయినను నామమాత్రముగ యుండియుండుట సహజము. కాని పై చెప్పిన ప్రాణుల విషయములందు యీమార్పు కలిగినట్లు, పాము నాలుక విషయమున కలిగినదనుటకు వీలులేదు. ఏలనన, ఆనాలుక కనుబరుచు చురుకుదనము, వుద్రేకము, వీటిని కనిపెట్టి చూచిన, ఆ అవయవము తన పూర్వపు వుపయోగమును క్రొత్తవిధముగ, మార్చుకొనినట్లు మనము వుద్దేశించుటకు, తోడ్పడుచున్నది.

ఊసరవిల్లి తన నాలుకతో పురుగులను, పట్టునటు వలన, పాము యిటువంటిపని చేయలేదని తెలియు

మఱీ యిద్దఱు సర్పశాస్త్రజ్ఞులు తమ యభిప్రాయముల వేర్వేఱువిధముగ విశదీకరించినారు.

“సర్పము తన యాహారప్రాణిని యాకర్షించుట యందు ఒక ఎరవలె వుపయోగించుచున్న”దని వ్రాసినారు. జంతుప్రదర్శనాలయమునందు జరిగిన యొక సందర్భమువలన నీయభిప్రాయము వారికి స్ఫురించినది. ఒకపామువద్ద యొక చిన్నపిట్ట వుంచబడెనట. ఆపిట్టను చూడగనే యాప్రాణికొఱకు బోసంపేయు తింగినదట పాము. తన నాలుకజాపగనే యాపక్షి నాలుకను చూచి నానపామునితలచి పామునుపొడిచినదట. ఇటువంటి సందర్భము ప్రకృతియందు జరుగుట యరుదు.

నాలుక త్వరగ కదలించునప్పుడు నానపాముపలెను యింకను త్వరగ కదలించునపుడు చిమటపురుగుపలెను కనుపించవచ్చును. అయినను పాము తన్ను పరివేష్టించి యుండు వస్తువులయందు లీనమై జనమువలె కనుపించినను ఇతర చిన్నప్రాణులచేత జనమనుపించుకొనునని తలచుటకు వీలులేదు.

ఈక్రింది విషయములవలన గొప్ప మహాశయులు తలచినట్లు సర్పశాస్త్రవేత్తలు సర్పశాస్త్రవిషయమున యూరకపంపలేదు. వారు సర్పముయొక్క నాలుకను పెక్కు వుపయోగముల కనుగొనియో గమనించియో యున్నారు. ఒకటీత్తిరాన్నాత నొక్కుటిగ యీనాలుక పురుగులను పట్టు అవయవమనియు, ఎరవలె వుపయోగింపబడుననియు స్పర్శశక్తిలేని అవయవమనియు మనకు తెలియని యొకవిధమగు జ్ఞానేంద్రియమై యుండవచ్చుననియు చెప్పబడియున్నది. ఆలోచించిచూచిన ఆఅవయవము యిదేదియును కాదు. క్రొత్తక్రొత్త యూహలకింకను ఎడమున్నది.

సోమరియైన ప్రతివిషసర్పమును పెద్దపెద్ద జంతువులు తన్ను త్రొక్కివేయకుండుటకు తన వునికిని తెలియజేయుచు వాటిని హెచ్చరించుటకై పెక్కు మార్గములుకలవు. సాధారణముగ చురుకుదనములేని ప్రాకుడుజంతువు లన్నిటియందును నాలుక హెచ్చరికను తెలియజేయునని తలచుటకు వీలగుచున్నది. నాలుక చిన్నదైనను దానిని కదలించుటచేత యితర ప్రాణులకు హెచ్చరికయు, తనకు లాభకారియు అగుచున్నది. సాధారణముగ సర్పములన్నియు సోమరివి. అందుచేతనే మన లో “మన్నుతిన్నపా”మను లోకోక్తి కలిగినది. ఎంతో యవసరము కలిగినగాని అవి కదలుట కిష్టపడవు.

మనము బాగుగ నాలోచించిన హెచ్చరికను తెలుపుటయను వుపయోగముకన్నను పురాతనమైన మరి యొక వుపయోగము వున్నట్లు వూహించవచ్చును. ఏలనన, మనము పామునేకాక యీనాలుక చిన్న భాగమైన సర్పశరీరమును, దానియొక్క యసాధారణప్పాయు ప్రకృతియందు దానికుండు విపరీతస్థితి యని దానియాహార ప్రాణులయందు తన వునికిని తెలియజేయుచు వాటికి గలిగించెడు యభిప్రాయము వీటిని మనము గమనించవలెను.

ఒకపాము కప్పను తరుమునప్పుడు పెక్కుసందర్భములందు యీతరుముట నిరుపయోగమే కావచ్చును కాని, యీకప్పలోవున్న దోషమువలన యట్లు జరుగుటలేదు. ఇట్లు తరుమబడు కప్ప పామును చూడనైన చూడనక్కరలేదు. ఆభావము కప్పకు కలిగినజాలును. భయముచేత కదలలేక పడిపోవును. ఈవిషయము మనము కప్పవద్ద కఱ్ఱను పామువలె గదలించి తెలసుకొనవచ్చును.

ఇంతవఱకు పాము కప్పను ఎట్లుపట్టునో చూచితిమి. కప్పలు సాధారణముగ తడిస్థలములందుండును. కనుక యవి పక్షులను మొదలగు జంతువులను ఎట్లుపట్టునో చూడవలసియున్నది.

ఈప్రాణులు చురుకైనవి కనుక పాము సాధారణముగ వీటికి కనబడకుండ నుండలేదు. పెక్కు సందర్భములందు పాము తన ఎరకు కనబడి దగ్గఱకుచేరును. ఇటువంటిజిత్తు పామునందే కాక ఎదో విధముగ నితరజంతువులయందును చూడదగును. ఈజిత్తు సాధా

రణముగ సాలీడుయందు కానవగును. సాలీడు తన యాకారమును దాచుటకు వీలులేని గోడ మొదలగు నునుపైన ప్రదేశములందు యున్నయెడల తన ఆహార ప్రాణి ఈగయే యనుకొందము. పట్టువలసి ముందు ధైర్యముగ ఈగవద్దకు పరుగిడును. ఆఈగ సాలీడు రాకను గమనించి తప్పించుకొన జూచెనా సాలీడు కదలక నిలచిపోవును. ఇట్లుండుట ఈగయందు యాశ్చర్యమును పుట్టించుటచేత అది ఎగురక నిలచి చూచుచుండును. సాలీడు కదలుటలేదని ఈగకు తెలియగనే ధైర్యముగ నటునిటు ఎగురుచుండును. ఈగ చూడనప్పుడు సాలీడు కొంచెము ముందునకు జరుగును. ఈగ మరల చూచిన యథాప్రకారముగనే కనుపించును. ఈవిధముగ సాలీడు దగ్గఱదగ్గఱకు వచ్చును. ఈగమాత్రము ఈవిషయమును కనుగొనలేక యక్కడనే యిటునటు ఎగురుచుండును. సాలీడు మెల్లగ సమయముచూచి ఈగను పట్టుకొనును. ఈవిధముగనే పిల్లియు పక్షులను పట్టుచున్నది.

సాలీడువలెను పిల్లివలెను పాము ఒక్కవుదుటున ముందునకు దూకలేదు. ఆహారప్రాణి పట్టుకొనుటకు వీలగు ఎడమువఱకు జరగియేరావలెను. కనుక పాము కదలనట్లు కనుబడుచు మెల్లగ జరుగుటయును శక్తిచేత పట్టుచున్నది. ఇట్లు వచ్చునప్పుడు నాలుకనుచాచి త్వరత్వరగా కదలించుట పాము తనుచంపబోవు ప్రాణి మోసగించుటయందు తోడ్పడుచున్నది.

నేలమీద, చలనము కలిగిన పాముకాని లేని పాముకాని యితరప్రాణుల యాకర్షించు దృశ్యమై నట్లు తోచుటలేదు. నక్క, గ్రద్ద మొదలగుప్రాణుల విరోధమును తెలిసి యితర చిన్నచిన్నప్రాణుల భయ పడునట్లు పాము విషయమున భయపడునట్లులేదు. ఏలనన పెక్కుమారులు చిన్నచిన్నపక్షులు పామునకు కొన్ని యడుగులదూరముననే ఆహారమును వెదుకు నట్లు మనము గమనింపవచ్చును. పక్షులు యప్పు డప్పుడు తమ తలలను పైకెత్తి పామువంకచూచి, మరల తమ పనులందు లీనమైయుండుటను చూచిన పక్షులు పాముయొక్క యునికిని తెలిసికొనియే యుండుననుకొనుటకు వీలగుచున్నది. దీనివలన చిన్న పక్షులు పామునుచూచి భయపడక వాటినిగూర్చి యణుమాత్ర ముపాయమైనను శంకించక దగ్గరకు వచ్చునట్లు తెలియుచున్నది. పాముయొక్క ప్రత్యేక మైన యాకారము మృగముదేహమువలెకాక, వృక్ష వర్గములపోలిక గలుగుటయు ముఖ్యమైనది. మరియు విపరీతమైన వానిగమనము లీటన్నిటిచేత బహుశా యీపక్షులు, జంతువులు, యాశ్చర్యముతో చూచు చుండవచ్చును.

ఇట్లు పొంచి యాకలిగొన్న పామువద్ద తేబడిన పక్షికాని లేక జంతువుకాని ప్రాణాపాయమునకు లోనైవున్నది. ఈప్రాణులు పైజెప్పిన వుపాయముల చేత పట్టుబడుచున్నవి. మొదటిది, కప్పవలె భయ పడి కదలలేకపోవుట లేక ఈగవలె మోసపోవుట ఈరెండు వుపాయములచేతను ప్రాణముల గోల్పోవు చున్నది. పాముయొక్క నాలుకకు యీరెండువిధము లందును ముఖ్యపాత్రకలదు.

సర్పము తన యాహారప్రాణిని పట్టుటకు చలనము లేనట్లు మెల్లగజరుగును. అయినను పెక్కుసందర్భము లందు ఆకదలికను కనుగొనవచ్చును. కాని యా నాలుకవలన యట్లు జరుగుటలేదు. నాలుకను త్వర త్వరగ కదలించుటచేతను, లోపలకు బయటకి జాచుట చేతను, ఎదుటనుండు ప్రాణిదృష్టిని యాకర్షించు చున్నది. ఇట్లు ఆప్రాణి ఎదుటనుండు దృశ్యముచేత యాకర్షింపబడి పాముయొక్క గమనమును గమనించ లేదు. పైకి ఎత్తబడిన పాముమెడ తలయుమాత్రమే కనుపించును. కాని యివిమాత్రము కదలవు. ఇట్లు పాము మెల్లగజరిగి యీప్రాణిని పట్టునట్లు తెలియు చున్నది. ఆప్రాణియన్ననో పామును తప్పించుకొను టకు ఎగిరిపోవుటకో పరుగెత్తిపోవుటకో సిద్ధమై యుండినను ఆనాలుక వికారచేష్టలవలన మంత్ర

ముగ్ధులైనట్లు నిలిచిపోవును. ఇట్టి వుపాయముచేత పాము మెల్లమెల్లగ జరిగి ప్రాణిని పట్టుచున్నది.

సర్పమును గురించిన చరిత్ర పుస్తకములవలనను, జంతుశాలలయందు వుంచబడు పాములవలన కాని తెలుసుకొనినవారు పైజెప్పిన విషయములన్నియు నిర్ధారణలేని విషయములని చెప్పవచ్చును. గాని పాములను స్వభావసిద్ధముగను ప్రకృతిసిద్ధముగను గమనించి వాటివిపరీతస్థితిచే నాకర్షింపబడినవారు పైవిషయములందు విపరీతము లేవియు లేవని చెప్పుదురు. సర్పములనుగూర్చి స్వభావసిద్ధముగ తెలుసుకొన వలయునను యాశకలవారలు, దానిని చంపికాని చెరపట్టికొని కాక, ప్రకృతిసిద్ధముగ, దాని జీవితమును పరిశీలించవలయును. సర్పము తనతో కూడ మంటియందుండు ప్రాణులకేవిధమగు యభిప్రాయమును కలిగించునో యటువంటి యభిప్రాయమే మనయందును కలిగించవలెను.

ఈవ్యాసములో సర్పమునాలుకయే సర్పమునకు సర్వస్వమనికాని, యితరప్రాణులను మైమరపించుట యందు ముఖ్యపాత్రయనికాని చెప్పుటలేదు. కాని నాలుక దానిశరీరమునందు అవసరమైన యొక అవయవమనియు, ఆప్రాణియొక్క విపరీతమైన స్థితివలన నాలుకచేత యితరప్రాణులను దిగ్భ్రమ చెందించు ననియు మాత్రమే తెలియుచున్నది.

పొడుగుపాటి అవయవములేని శరీరము మెల్లగను వింతగను జరుగుచు కాంతికలిగియు లేకయు యుండు చుక్కలు మచ్చలు కలిగి శరమునుపోలి కదలికలేని తల గుండ్రముగను ప్రకాశవంతముగను వెలుగు కను రెప్పలు లేనికండ్లు, పొడుగునను, ఎఱుపుగనో, నలుపు గనో వుండి చీలికలనుపోలు నాలుక, పెద్దపెదవులు లేని నోటిముందఱ వెలిగ కదలుచుండుట ఇదియే పాము.

దీనియాకారమునుంచి గాని యది యితరప్రాణాల యందు కలిగించెడు యభిప్రాయమును గురించిగాని ఒకచిన్న విషయమునుగాని త్రోసివేయుటకువీలు లేదు.

## శ్రీమతి కమలా నెహ్రూ గారు

సీ॥ శీలంబునందున సీతామహాదేవి
సాటినీకగుగాదె సత్యచరిత
పతిసేనయందున బడతిసావిత్రియే
సాటినీకగుగాదె సత్యచరిత
బీదపోషణమున ప్రియుడగునీభర్త
సాటినీకగుగాదె సత్యచరిత
దేశసేవనుజేయ దీరుడౌనలగాంధి
సాటినీకగుగాదె సత్యచరిత

తే॥ గీ॥ భారతావని నీసేవ బడయుకొరకు నిన్నుసృష్టించెనాబ్రహ్మ నిక్కముగను
ధరనుచిరకాలజీవివై తనరుమమ్మ కమలనాభునికృపగల్గి గమలనెహరు॥

గొర్లపాటి లక్ష్మీగంగమ్మ.

# సతీమణి

బులుసు శీతారామమూర్తిగారు

రామారావుగారు బందరులో ఒక గొప్ప న్యాయవాది. చిన్నతనమునుండియు పవిత్రాంతఃకరణమును, విద్యాధిక్యతయు, నందులకుఁదగు వినయము, దీనరక్షాపరతంత్రత, ఉన్నత సంస్కరణాభిలాషయు, భూషణములై నెగడొంద న్యాయవాదివృత్తిచే విశేషము ధనమార్జించి కీర్తిగడించెను. ఆయనకు లేకలేక చిరకాలమున కనేకనోముల ఫలముగా కృష్ణుడను నొకపుత్రుఁడును, శారదయను నొకపుత్రికయుఁగల్గి రూప విద్యాశీలముల వృద్ధినొందుచుండిరి. క్రమముగ నామెకు పదునైదువర్షముల వయస్సు వచ్చినది. రామారావుగారు యింటఁ దల్లి పోరుపడలేక రాజమండ్రిలో బి. యే. చదువుచున్న విశ్వేశ్వరరావునకిచ్చి వివాహ మతి వైభవమున నొనరించెను.

* * *

ఆహా దైవమహిమ! తానొకటిఁదలఁచిన దైవమొండుఁ దలఁచును. సంపూర్ణ విద్యావతియు జవ్వనియునై యుండి ప్రాణేశుఁడగు విశ్వేశ్వరునితో సకలసుఖముల ననుభవించుచుపవిత్రాశయపూరితమగు గృహిణీధర్మము ననుష్ఠింపఁదలచినశారదాదేవి యిట్టిదుర్వార్త వినవలసివచ్చునని కలనైన నెవరుసుఁ దలఁప లేదుకదా! "పోస్టుజవా"నిచ్చిన వుత్తరము జూచికొని కొంతసేపు నిశ్చేష్టులై యుండి యాలేఖను కోటుజేబులోనుంచి రామారావుగారెచటకో వెడలిరి. యీవిషయముఁ గని పెట్టుచున్నశారద యాలేఖఁగైకొని యిట్లు చదువుకొనెను.

శ్రీ శ్రీ శ్రీ రామారావు బావగారికి-

మీయల్లుఁడు చిరంజీవి విశ్వేశ్వరుఁడు రెండువత్సరములనుండి దుర్వ్యసనలోలుఁడై తనవంతుయావదాస్తిని వెచ్చించియున్నాడు. ఇపుడు నాయాస్తిఁగూడ నపహరించి వేశ్యల కీదలఁచి నన్ననేకవిధములనడిగి విఫలుడై నిన్నరాత్రి 12 గంటలకు నన్ను కత్తితో బొడిచి పలాయనమాయెను. నాకు కాలము సమీపించినది. యిఁక బ్రతుకజాల. సతీమణి యగు శారదకిట్టి యిక్కట్టు కలుగుటకు కారణము నేనేగదాయను చింతతో ప్రాణముల వీడకున్నాను. శారదకు శుభమగుగాక

ఇట్లు శుంతవ్యుఁడు

నారాయణరావు.

యిన్నీసుపేట, రాజమండ్రి.

15—5—1795

ఆలేఖాపఠనానంతర మామెకు గలిగిన విచారభారము వర్ణింప నాదిశేషునకైనఁ దరముగాదన నాశ్చర్యమేమి? లేఖను యథాస్థానముననుంచి తనపఠనమందిరమున కేగెను.

* * *

రామారావుగారు 'శారదా! యేల మమ్మింత దుఃఖసాగరమున ముంచెదవు, విశ్వేశ్వరుఁడదృశ్యుఁడై యిప్పటికి ఆరువత్సరములపూర్వము. నేటికి నతనిజాడ తెలియదు గదా! మూఁడువత్సరములపూర్వము విజయనగరమున క్షయవ్యాధిచే బాధపడుచుండెననియు కొద్దిదినములఁ జావనున్నాఁడనియుఁ దెలిసి విజయనగరప్రాంతముల గాలించి విఫలుఁడనైన విషయము విదితమేకదా!

నీతోడి సంస్కర్త్రు వనితలందరు నీశీలముఁ గొనియాడుచు నీకువ్రాసినలేఖ ద్రోసి నీవిషయమై కృశించి మంచమువట్టిన తల్లి మాట సరకుగొనక నీకై పలువిధముల పరితపించుచున్న నాప్రార్థన దిరస్కరించి యూరక ఉపవాసముల నేల శుష్కించెదు. ఆపితృహంతకుడు జారుడు మూర్ఖుడు!! వాని నామము రాత్రింబవళ్లేమరకస్మరించిన నేమి ఫలము యిదితప్పిన నాయానకలదుసుమా!! నామాటవిని నానిశ్చయించిన వరుఁ గూడి మా కమందానందము కల్గింపుము' అని దీనముగా బలికెను. "తండ్రీ యీవిషయములో మీవాక్యములఁ ద్రోచివుచ్చినందులకు మన్నింపవలయును. తండ్రీ, నిర్మలహృదయమును పవిత్రప్రేమతో విష్ణుస్వరూపునిగా భావించి యాతనికర్పించియుంటి నే, అట్టి హృదయమును నేనెట్లు మరల్చుదును. నా తరముగాదు. జయంతకంతులుగాని మన్మథుడుగాని ప్రత్యక్షముగావచ్చి యాచించినను నామానసము చలన మొందునది కాదు. మూర్ఖుడైనను కురూపియైనను వ్యాధితుఁడైనను నా భర్తను విష్ణునిగా భావించుటపాడి. నాపతి ననేకవిధముల నెందుకు నిందించెదవు. పూర్వజన్మమున నేమిథునమునో నే నెడఁబాపియుండ నాపాపమునకు పాత్రులెవ్వరు? మనోవాక్కాయకర్మముల ధారవోసి దైవవశమున భర్త విపరీతుఁడైన వికృతింబొందు నదియా ప్రేమఁ!! తండ్రీ, వేయేల? నానియమానుసారముగ నారువత్సరముల కొక మాసము గడువు మిగిలియున్నది. యీలోగా నాభర్తజాడ దెలియనిచో హిమవత్పర్వతమునకుబోయి తపస్సుచేసి పరజన్మనైనను నాపతిని సచ్ఛీలునిజేసి ననుగూర్చుమని దైవముఁ బ్రార్థించెద. ఇదియే నిశ్చయముఁ నిశ్చయము!!" అని శారదయనెను. ఇంతలో 'పోస్టుజవాను' జాబునిచ్చి వెడలిపోవును. రామారావుచూచి జాబు నిట్లు చదువును:—

తరుణీమణీ శారదా!

పశ్చాత్తప్తుఁడనై ధనాశాపిశాచావేశితుడనై తండ్రినిఁగలసి నీయెడ మహాపరాధమొనర్చితిని. క్షయవ్యాధిపీడితుడనై యున్నాను. కొద్దికాలములో మరణింపనున్నాడను. అంత్యమున నొకసారి దర్శనమిచ్చి రక్షింపుము. క్షమింపుము. ఆర్యాపురం ఏటిబడ్డున పాకలో నున్నాను.

ఇట్లు క్షంతవ్యుడు,
విశ్వేశ్వరుఁడు,

రాజమండ్రి
14—5—1800

శారదకు ఆనందాశ్రులు ముత్తియముల పగిది జలజలరాలెను.

మర్నాడు 10 గంటలకు శారదారామారావుగార్లు ఆర్యాపురం పాకసమీపించిరి. దూరమునకు దుర్వాసన విరజిమ్ముచు ఈగల దోలుట కసమర్థుడై పశ్చాత్తాపముతో అసంపూర్ణముగ రామనామముచ్చరించెను. ఆశారద విశాలహృదయ మెట్టిదోకాని ఆవిశ్వేశ్వరుడు నవయౌవన సుందరాకారుడై యామెకు కన్పట్టెను. ఆమెంజూచి యాతని క్షమింపుమని దీనముగఁబల్కెను. వెంటనే యామె హృదయాంతరాళము తరంగితమగుచున్న పవిత్రప్రేమ యుప్పొంగ ప్రాణేశ్వరాయుని కౌగలించుకొనెను.

ప్రేమయున నదియేకదా? ధనయౌవనాదులు కల్గినపుడు పైపై వన్నెల్పచరించి లేనినాడు వానినివదలి మఱియొకని నన్వేషించు కులటల చిత్తములలో మీకెంత మాత్రమయిన తావున్నదా? 'శారదా నీవు ధన్యవు' ఇట్టినారీమణులు భారతదేశమున నింకెందరో కలరు!!

వినుము మనోవాక్కాయము
లన మూఁడు దెఱంగు; లందు నతఃకరణం
బనఘ, ప్రధానము గావున
మనమునఁ గైకొన్న భర్త మానందగునే.

భారతము                                                    సావిత్రి

# కామేశ్వరి

చోడవరపు రామశేషయ్యగారు

[మేము, మాగృహలక్ష్మి పాఠకులకు కథలు కబుర్లు చెప్పి శ్రమ కలిగించవలయునని గాని, లేక విద్యార్థుల మగు మాయమూల్య సమయమును వ్యయపఱచు కొనవలయుననిగాని యించుకంతైనను యభిప్రాయము లేదు. కాని, కరుణాపూరితమును, హృదయ విదారకమగు నొక దృశ్యమును మేము స్వయముగ గాంచియుండుట వలన నది తమ సాన్నిధ్యమున యుంచవలయునను యుత్కంఠయే మమ్ముల నీ కార్యమునకుపురికొల్పినది.]

నేను చాల శ్రద్ధగా చదువవలయునని రాత్రి మూడుఘంటలకే యలారము పెట్టియుంటిని. ఉక్త సమయమున ఘడియారము తనపని తాను చేయ మొదలు పెట్టెను. దాని క్రూరకృత్యముచే మాగది వారిలందరి నిద్రయు, భంగమయ్యెను. కాని, శీతల వాయు తీక్ష్ణకరజాలములచే యొకరికి లేచుట కిచ్ఛ కలిగియుండలేదు. నేనుమాత్రము నాడు దురదృష్టము నకు వగచుచు లేచి కూర్చుండి చదువ మొదలిడితిని. నిష్పక్షపాతియగు చలిదేవున కొకరు తెక్కువయు, ఒకరు తక్కువయు లేదను విషయము స్వానుభవము వలన నాకు తెలిసెను. నేను కూడ బాగుగా ముసుగు పెట్టుకొని పరుండి పఠింప నారంభించితిని. నేను నా తలంపులో బాగుగా చదువుచునేయుంటిని. చదివిన విషయముపై విస్తృతమైన విమర్శన గావించుచునే యుంటిని. కాని నామిత్రుని వ్యాకులస్వనమువిని యులిక్కిపడి లేచునంతవరకు నిద్రించుచున్నాననే జ్ఞానము లేకపోయెను.

కన్నడ ప్రాంతవాసియగు నొకమిత్రుడు వ్యగ్ర హృదయుడై కంపించుచు నాయెదుట నిలబడి యుండెను. వారిచెంత దండధారియగు నొక స్వామి వారు కాన్పించిరి. వారిద్దరి నాసమయమున నాదశ లోచూచి చకితుడనైతిని. వారిని గౌరవించవలయునను విషయమే మఱచిపోతిని. కింకర్తవ్యవిమూఢుడనై వారిపై పు తదేకదృష్టిగ చూడ నారంభించితిని. ఇంతలో నామిత్రుడు ఒక యభాగినియగు నాంధ్ర స్త్రీని రక్షించుటకు సిద్ధముగమ్మని హెచ్చరించెను. చేతనాశూన్యుడనగు నాకు వారి కరుణాపూరితమగు శబ్దము వినబడుటతోడనే శరీరమున రక్తనాళములం దుష్టరక్తము త్వరితగతిని ప్రవహింప నారంభించెను. కాని శాంతచిత్తుడనై విషయమేమిటని యడిగితిని.

అంతట స్వామివారు తాను గతరాత్రి తెలిసి కొనిన విషయము నిట్లు చెప్పనారంభించెను. "నా మిత్రుడగు యొక మలబారుప్రాంతము వారిచ్చట యొక పండాయొద్ద పనిచేయుచున్నాడు. ఆయన గతరాత్రి తన యజమానుని యింటియందు దకస్మాత్తుగ మరణించిన యొక యాంధ్రుని గాంచెను. శవము యొక్క విషణ్ణవదనమునుబట్టి విషప్రయోగము గావింపబడియుండునని నిశ్చయించి దానివలన విషయ మంతయు తెలిసికొనెను. మరణించినయువకుని పత్ని కూడ వచ్చియున్నదనియు, వారు ధనవంతులనియు ఆమెయొద్ద విలువగల నగలు గలవనియు, ఆమె సుందరియనియుగూడ చెప్పెను. శవదహనము రాత్రి పన్రెండుఘంటలకు జరిగిపోయినట్లు తెలిసెను."

ఈ విచారపూరితమును, అమానుషకృత్యమును వినిన నాగదియందలి మిత్రులందరొక్కపర్యాయముగ యుగ్రులై పోయిరి. ఆపండా నిప్పుడే తుదముట్టించెదమని వెలువడ నుద్యుక్తులైరి. కాని వారినందఱిని శాంతిపఱచి యొక కన్నడిమిత్రుని ఒకమలబారు

మిత్రుని వెంటతీసికొని స్వామివారివెంట పయనమైతిమి. ఈదుఃఖవార్త నామనస్సును పరిపరివిధముల పీడింప నారంభించెను. ప్రతివానిపాదములా యభాగిని రక్షణార్థమై పరువిడుచుండెను. అందరి హృదయములు దడదడకొట్టుకొనుచుండెను; అందరి నాసికాపుటములనుండి వేడినిట్టూర్పులు వెలువడుచుండెను. మేము సాధారణముగా నడచుచుంటిమనియే భావించుచుంటిమి గాని మార్గస్థులు మాయీ యాతురతతో పరుగెత్తుచుండుటగాంచి నివ్వెరపోవుచుండిరి.

## ౨

మాపాఠకులకు కాశీనగరపు గొందులపరిచయము గావించిన పిదపనే మేము మానిర్దిష్టస్థానమున ప్రవేశించెదము. ప్రాచీనకాలమునుండియు పిలువబడుచున్న కాశీపట్టణమున తమకు అన్నియు సందులే గాని యొకవిశాలమగు మార్గమైనదొరకదు. ప్రతి సందును, సామాన్యముగు యిద్దరిమనుజులకు మాత్ర మాతిథ్యమిచ్చునంత విశాలము కలిగియుండును. దుర్గంధపూరితమగు—కాదు—సకలపాప పరివేష్టితములగు నాసందులలో భయంకరపాపభయముచే గాబోలును లోకరక్షకుడగు నాదిత్యుడుకూడ తన ప్రచండకిరణజాలముల నొకానొకటైనను ప్రసరింపనిచ్చుటలేదు. కాని మనకొకపర్యాయము యీపవిత్రమార్గముగుండ ప్రయాణము చేయకతప్పదు. జాగ్రత్త; సావధానులరై ముందున కడుగిడుడు. క్రిందచూచిన చిన్నప్పుడు త్రాగిన దొండాకుపసరుకూడ బయట యుడగవలసినదే!! పైకిచూచినచో పరమపావనియగు వైతరణీనది స్నానము తప్పదు. ఈసందులయుత్పత్తికి చాల కారణములు తెలుపబడుచుండును.

ఇప్పుడిట్టి సందుగుండ మేము పోవలసియున్నది. ఒకపర్యాయము కడుపార వాయుసేవనముచేసి జేబురుమాళ్ళతో ముక్కులు గట్టిగమూసుకొని, భగవంతునిపై భారమువైచి ముందునకు సాగితిమి. మేము చేరవలసినగృహము—కాదు కాదు—భూతగృహమొక సందుచివరయుండెను. ఇచ్చట భూతగృహనిర్మాణమునకు కారణము మహమ్మదీయుల యాక్రమణమనియే చెప్పుదురు. ముసల్మానులు ముట్టడించినపుడు యీగృహములందు హిందువులు తమ యాత్మరక్షణ చేసికొనుచుండెడివారట. ఇవి ముఖ్యముగ స్త్రీలకై యేర్పాటు గావింపబడినవట.

ఉద్రేకపూరితులమై యింతవరకు వచ్చితిమేగాని ముందు చేయవలసిన కార్యమేమియో యొక్కరును నాలోచించియుండలేదు. స్వామివారాస్థానమునకు చిరపరిచితులగుటచే మేము చేరవలసియున్న గృహమునుగుర్తించి దానికి కొలదిదూరముగనే మమ్మలనందరిని నిలబడుట కాజ్ఞయొసంగిరి; మరియు ముందు చేయవలసిన విషయమేమని ప్రశ్నించిరి. అప్పుడు మా తెలివితక్కువకు మిగుల పశ్చాత్తాపపడి వారనే సలహా యీయవలసినదిగ కోరితిమి. తుదకు మేమందఱము శీఘ్రముగ నాలోచించి యొక పథకమును పన్నితిమి.

నేను నామిత్రులనందరిని నిలిపిచి నలువైపుల పరికించుచు ముందునకు సాగితిని. మెల్లగిగ సందా యింటిముందునకు చేరితిని. తలుపులు మూయబడి యుండుటజూచి సంతసించితిని. మరల నలువైపుల చూచి తలుపుయొద్దకుచేరి రంధ్రములగుండ లోపలల చూచితిని. అంతయు నంధకారమయము. చెవియొగ్గి వింటిని; ఎచ్చటనుండియో స్త్రీరోదనధ్వని వినవచ్చుచుండెను. ఆధ్వని నాకర్ణకుహరముల ప్రతిధ్వనించుటతోడనే శరీరమంతటను ఉష్ణరక్తము వెల్లివిరిసి ప్రవహింప నారంభించెను. ఇకనేమియు నాలోచింప నవసరము లేకపోయెను. తలుపులు గట్టిగ గ్రుద్దుచు కేకలువేయ నారంభించితిని.

ఎట్టకేలకు తలుపులు తెఱువబడినవి. కాని యప్పుడుకూడ నిరాశయే నాలుగువైపుల నృత్యమాడుచుండెను. కొంతసేపటికి యొకదాసి తలుపు

ప్రక్కనుండి యెదుట ప్రత్యక్షమయ్యెను మేమిద్దఱము ఒకరినొకరు బాగుగ ఆపాదమస్తకము పరీక్షించుకొంటిమి. ఆమె భావములన్నియు తెలిసికొంటిమి. నాభావములన్నియు మఱుగుపఱచి పండా వారెక్కడయని యడిగితిని. ఆమె నాప్రశ్నకుత్తరమీయకుండగనే నాపుట్టుపూర్వోత్తరముల నడుగ మొదలిడెను. నేనామె యడిగిన ప్రతిప్రశ్నకు లేశమైన ననుమానము లేకుండగ ప్రత్యుత్తరమిచ్చితిని. అప్పుడామె పండాగారిని పంపుదునని లోనికిబోయెను.

ఆమె లోపలికి వెళ్ళుటతోడనే నేను రోదనధ్వని యేదిక్కునుండి వచ్చుచున్నదాయని చూడ నారంభించితిని. కాని మనుష్యునియడుగుల చప్పుడు వినబడుటచే యేమియు నెఱుగనివానివలె నాస్థానమున నేను నిలబడితిని. ఇంటిలో పండాయచ్చటకు వచ్చిచేరెను. వానిని గాంచుటతోడనే ఫిలిమ్సులోని రాక్షసాకృతి జ్ఞప్తికివచ్చెను. వచ్చుటతోడనే యెవరు నీవని తీవ్రముగ ప్రశ్నించెను.

నేను:—అయ్యా! మాది ఆంధ్రప్రాంతము. ఇచ్చట యూనివర్సిటీలో చదువుకొనుచున్నాను (యూనివర్సిటీ పేరుచెప్పితే పండాలందఱకు చాలభయము) మాబంధువులగు రాజేశ్వరరావుగారిచ్చటకు యాత్రకై వచ్చియున్నారని తెలిసినది. వారికై రెండుదినములనుండి వెదకుచున్నాను. నేడు వారిచ్చట యున్నారని తెలిసి వచ్చితిని.

పండా:—అయ్యో! అట్లాగా! ఆయనగారు మీబంధువేనా? పాపము; విషజ్వరమువచ్చి నిన్ననే చనిపోయినారు.

నేను:—అయ్యో! అయ్యో! చనిపోయినారా? ఎంతఅదృష్టవంతులు? ఇట్టి పుణ్యక్షేత్రములోను అందులో తమవంటి సుహృదయులగు వారియాశ్రయమునను మరణించుటెంత గొప్పయదృష్టము? వారెంత మహాపుణ్యము చేయబట్టియోగదా యిట్టిమరణము సంభవించినది.

పండా:—కాశీలో యెంతపాపముచేసినను, చనిపోవుసమయమున స్వర్గప్రాప్తియేగాని నరకము పేరు వినవలసిన యవసరము లేనేలేదు.

నేను:—(అది విననట్లుగా) రాజేశ్వరరావుగారి భార్యామాపినతల్లిగారి కుమార్తె. పాపమామెకు చిన్నతనమునందే యింతకష్టమనుభవింపవలసి వచ్చినదిగదా? దయచేసి ఆమె యెచ్చటయున్నదో చూపింపుడు. ఆమెకు నావిచారమును ప్రకటించి కొంచెమోదార్చెదను.

పండా:—(ఉలిక్కిపడి వికృతస్వరముతో) అబ్బే! ఆమె యిచ్చటలేదు. నిన్ననే వారిదేశము వెళ్ళిపోయినది.

ఇది వినుటతోడనే పిడుగు పడినట్లైనది. వేరొక మార్గమేమియు స్ఫురించుటలేదు. మనసైపులమాదిరిగా స్వతంత్రించి యేమగవాడు లోపలకు వెళ్ళజాలడు. ఇచ్చట ఘోషాపద్ధతి చాల కఠినముగాయుండును. కాని యింతలో మొదట నాకు వినిపించిన యాక్రందనమే యీపర్యాయము ద్విగుణీకృతముగ వినిపించెను. నేనదివిని, ఆయేడ్పువారెవరని యడిగితిని.

పండా:—ఆమె మాయింటావిడ. ఇప్పుడే మాయిద్దఱికి పోట్లాటజరిగినది. నేనామెను కొట్టితిని. అందులకై యేడ్చుచున్నది.

నేను:—కొంచెమునే పూరకుండి కాదు: తాము, నన్ను పరిహాసము చేయుచున్నారు. ఆస్వరము మా సోదరదే! నేనిదివఱకు చాలపర్యాయములు వినియుంటిని.

నాయీమాట వినుటతోడనే పండా ముఖాకృతి వికృతినొందెను. ముఖమున యిదివఱకుగల కొంచెము కళయుగూడ యంతర్ధానమయ్యెను. వానికేమియు చెప్పుటకు తోచలేదు. చివరకు కోపముతో 'నీవు పొరపాటుపడుచున్నా' వనిచెప్పి లోనికిబోవనుద్యుక్తుడయ్యెను. ఇది గాంచి క్రోధభయశోకావమానము

లచే నాకంఠ మవరుద్ధమయ్యెను. శరీరమంతయు కంపింప నారంభించెను. ఇంతలో కృపామయుడగు సర్వేశ్వరునికృపచే నామిత్రులు వచ్చిచేరిరి. వారు నన్నెరుగనట్లుగనే నటించుచు, పండాతో యితర సంభాషణ మారంభించిరి. ఇట జరుగుచున్న సంభాషణము వినికాబోలు లోపలనుండి 'రక్షింపుడు; రక్షింపుడు;' అను భయార్తనాదము వినవచ్చెను. అదివినుటతోడనే నాయొడలావేశముచే యుప్పొంగిపోయెను. వెనుకముందు చూడక యొక్కసారిగ యచ్చటకుం బరువిడితిని. అచ్చట దృశ్యము గాంచి చకితుడనైతిని. సీతాశోకవాసము తలంపునకువచ్చెను. అది వినుటయే గాని ఇది ప్రత్యక్షముగ గాంచితిని. ఆమెకంటికి మంటికి నేకధారగా నేడ్చుచుండెను. ఆదుఃఖసాగర ప్రవాహమున నచ్చటయున్న శిలాప్రతిమలు (లింగములు) గూడ కొట్టుకొనిపోవునా యనునట్టులనోచెను. దుఃఖావేశముచే నాకు బాహ్యజ్ఞానము లేకపోయెను. కాని నాకు తెలియకుండగనే సోదరీ! భయపడకుము, నీసోదరు డిచ్చటనే యున్నాడనుమాటలు నానోటి నుండి వెలువడెను. ఈమాట లచ్చటయున్న స్త్రీలకు తెలియలేదు. వారు నావంక తమ నిశితకటాక్షములం బఱుప నారంభించిరి. ఆ దుఃఖిత యొకమాఱు నావైపుచూచి మరల యినుమడించిన స్వరముతో యేడువ నారంభించెను. నేనిట్టివిపత్తులలో చిక్కుకొనుట కిదియే ప్రథమపర్యాయము. సందర్భానుసారముగ యోదార్చుట నాకించుకంతైనను తెలియదు. ఆమె యాక్రందనము నన్ను మరింత యస్థిరునిగ గావించి వైచెను.

భయంకరమును, కరుణాపూరితమును, హృదయభేదకమునగు నామె శోకార్ణవమును విని నామిత్రులు కూడ పరువిడివచ్చిరి. వారివెంట పండాకూడ వచ్చినాడనిచెప్ప నవుసరముండదు. వీరందఱు వచ్చుటతోడనే దాసీతప్ప యటనున్న మిగిలిన స్త్రీలందఱు లోనికిపోయిరి. నామిత్రులుకూడ ఈకరుణాదృశ్యముగాంచి నిశ్చేష్టులైరి. వారందఱు భిన్నభాషల వారగుటచే నామె నోదార్పజాలకపోయిరి. కాని నాకన్నడిమిత్రుడు తెలుగునందు తనకుగల స్వల్ప జ్ఞానముతో నామె యోదార్ప నెంచెను. ఆయన యోదార్పుమాటలను వినుటచే నాదుఃఖసమయమున నాకు నవ్వు వచ్చుటయేగాక, యేడ్చుచున్న ఆమె గూడ కొంతవరకు తనదుఃఖమును మఱచిపోయెను. ఈయవకాశమును పొంది నేనామెవిషయము తెలిసికొన ప్రయత్నించితిని. నామాటలను విని మరల యామె తన దుఃఖసముద్రములో మునింగిపోయెను.

పండామహాశయుడు మా యీప్రవర్తనమునకు మనస్సులో చాల కోపించుకొనుచుండెను. కాని మాతో యేమియు చెప్పజాలకుండెను. మమ్ముల నొక పర్యాయము తీవ్రముగజూచి బయటకువెళ్ళెను. ఆ చూపునందుక్రోధము, యీర్ష్య, ప్రతీకారము మిళితమైయుండెను. ఆయన వెళ్లినపుడు తలుపుబయట బంధించినశబ్దము మాయందఱకు వినబడెను. ఇప్పుడు మే మాగదిలో బంధితులమైపోతిమి. బయటకుచేరు మార్గమేమియు కానిపించుటలేదు. దాసీ తనశక్తి కొలది, యేడ్చుచున్న యామెనోదార్ప ప్రయత్నించుచుండెను. మేమందఱము వెంటనే యామె హృదయమును గనిపెట్టితిమి. నా కించుక ధైర్యముకలిగినది. వెంటనే జేబునుండి పదిరూపాయలనోటునుదీసి యామె చేతియందిడి తల్లీ! నీవు మమ్ములనందఱ నీయాపద నుండి రక్షింపుమని కోరితిని. ఆమె మొదట చాల సందేహించెను. మాయందఱి ప్రార్థనవినుటచే నామె హృదయ మించుక ద్రవీభూతమయ్యెను. కొంచెము దనుక యాలోచించి నలువైపులజూచి యానోటును గుప్తపఱచెను. నేను కామేశ్వరికి ధైర్యముచెప్పి రానున్న యాపదనుండి తప్పించుకొనుటకుగాను మా వెంటరావలయునని ప్రార్థించితిని. సుగుణవతియగు నామె వెంటనే యంగీకరించెను. ఆ దాది మమ్ముల నందఱి నొక గుప్తమార్గముగుండ బయటకుచేర్చెను. నా మలబారుమిత్రుడు సాధ్యమైనంతవరకు కామే

శ్వరి సామాను, పెట్టెనుతీసికొని వెనుకనుంచి మమ్ముల కలిసికొనెను. కామేశ్వరి సగలింతవరకు చెక్కుచెదరకయుండెను. మే మెచ్చినమార్గము, గంగానదియొడ్డునగల కేదారుఘట్టమునకు చేరెను. మాకందఱకు పూర్తిగ ధైర్యమువచ్చెను. కాని పండా వెంటాడునేమోయను భయముచే యచ్చటనుండి వెంటనే పయనమై, హనుమాను ఘట్టమునందుగల స్వామివారి యాశ్రమమున ప్రవేశించితిమి.

౪

రాజేశ్వరరావు తణుకు తాలూకా మాచవరగ్రామ కాపురస్థుడగు ధనవంతుడు. ఆయనకు ముప్పది యెకరముల సుక్షేత్రమగు మాగాణిభూమియు, కొబ్బరి, పనస, అరటి తోటలును గలవు. వానిపై సాలీనా మూడు వేల రూపాయలు ఆదాయమువచ్చును. ఆయన తల్లి తండ్రుల కేకమాత్ర పుత్రుడు. చిన్నతనము నుండియు మిగుల గారాబముగ పెంచబడెను. పాపము రాజేశ్వరరావు చిన్నతనమునందే, మాతాపితలను గోలుపోయెను. రాజేశ్వరరావు, సుందరుడును, ఉత్సాహవంతుడును, బుద్ధిమంతుడును, తెలివిగలవాడును యగు యువకుడు. కాని యేకారణముచేతనో తగినంత విద్యాభ్యాసము లేదు. అందువలన ప్రపంచ జ్ఞానశూన్యుడని వేరుగ చెప్పనవసరముండదు. మనరాజేశ్వరరావు పిచ్చిపిడిగ ఖర్చుచేయుచు జీవిత సుఖలాభమును పొందుచుండెడివాడు. కాని పతిసేవాపరాయణి యగు కామేశ్వరి కాపురమునకు వచ్చిన తరువాత ఖర్చు యించుకంత తగ్గెను.

కామేశ్వరి సుందరియు, సుశీలయు, సుగుణవతియు, పతిభక్తిపరాయణియునై యున్నది. ఆమె యెప్పుడునూ, పతిసేవ చేయుటయందించుకంతయును లోపము కలుగనిచ్చెడిది కాదు. ఇట్టి సుగుణ ఖనియగు పత్నిని గాంచి రాజేశ్వరరావు అత్యంత ముదమందుచుండెడివాడు; మరియు తాను ధన్యుడనని తలంచుచుండెడివాడు.

రాజేశ్వరరావును సదా తన జన్మదాతలగు తల్లి దండ్రుల ఋణమెట్లు తీర్చగలనాయను చింతయే బాధించుచుండెడిది. పెద్దల యుపదేశముల వలన కాశీ, గయా, ప్రయాగాది పుణ్యక్షేత్రములలో పితృతర్పణ మర్పించిన తన పూర్వజుల యాత్మకు శాంతి కలుగుననియు, వారికి స్వర్గప్రాప్తి కలుగుననియు తెలిసికొనెను. అదివిని యప్పటినుండియు యాత్రకు బయలు దేరవలయునను యుత్కంఠ వానిని బాధించుచుండెను. తుదకొక శుభముహూర్తమున, పతివ్రతయగు పత్నిని వెంట దీసుకొని, పరమపావనియగు వారణాసికి ప్రయాణమయ్యెను. ధనికుడగు రాజేశ్వరరావు యాత్రకు బయలుదేరెనన్న యింకేమి తక్కువ యుండును. కావలసినంత సామాను, ధనము తీసుకొని బయలుదేరెను. యుక్తసమయమున కాశీస్టేషన్ వచ్చిచేరెను.

స్టేషన్లో దిగుటయేతడవుగనే పండాలందరు రాజేశ్వరరావును ముట్టడించిరి. ప్రతిపండాయును వివిధములగు సదుపాయములను చేయుదుమని తమతమ మామూలు పాటలను ప్రారంభించిరి. పాపము రాజేశ్వరరావుకు వారిగోల యేమియు తెలియలేదు. తమాషా చూస్తూ యట్లే నిలబడిపోయెను. పండాలకు ప్రయాణీకుల స్థితిగతులను కనిపెట్టుటలో యెక్కువశ్రమ యుండదు. వారు వెంటనే మనరావుగారి దశను తెలిసికొనిరి. వారిలో మన పండాగారికి రెండు తెనుగు మాటలు వచ్చును. "మా వెంటరండి, మీకు బాగా చేస్తాను." ఈ బాగాచేస్తాననే దాని కర్థమేమిటో రాజేశ్వరునకేమి తెలియును. అంధకారములో దీపపు వెలుతురు కాన్పించినట్లు, హిందీభాషా ప్రపంచములో తెలుగు మాట్లాడువాడు దొరకేటప్పటికి చాలసంతోసము కలిగెను. వెంటనే మారుమాట చెప్పకుండ "టాంగా"లో యెక్కి పండాగారి గృహమునకు చేరెను.

మొదటిదినమున గంగాస్నానము, విశ్వేశ్వరుని దర్శనము పూర్తియయ్యెను. రెండవదినమున పితృతర్ప

ణము మొదలైనవి జరుగవలసియున్నది. కాని పాప మా సాయంకాలమే రాజేశ్వరరావునకు తీవ్రమగు జ్వరము వచ్చెను. పండా మొట్టమొదటనే తన చాతుర్యముచేతను, ఉపచారములచేతను, రాజేశ్వరరావు కృపకు పాత్రుడయ్యెను. ఇప్పుడు రాజేశ్వరరావు పండాగారి చేతిలో కీలుబొమ్మ. జ్వరము వచ్చుటతోడనే పండా తన దూరదృష్టియంతయు ప్రకటించుచు మందుతీసికొనివచ్చి యిచ్చి, దీనితో రేపటికి పూర్తిగ పోవునని చెప్పెను. ఏమిటి? అని యడుగువారెవరూ లేరుగదా? ఇతరసహాయము లేకపోవుటచేతను, పండా యందుగల విశ్వాసముచేతను అతనిచ్చిన మందు త్రాగెను.

జ్వరము తగ్గుటకు మారుగ హెచ్చిపోవుచుండెను. అదిగాంచి కామేశ్వరికి, యాతురత యెక్కువయ్యెను. కాని, అబలయగు నామె యేమిచేయగలదు? భగవంతునిపై భారమువైచి రోగియగు పతికి సేవచేయుచుండెను. మఱుచటి యుదయమునకు రాజేశ్వరరావు ముఖము వివర్ణమై పోయెను. అదిగాంచి కామేశ్వరి కనుమానము కలిగెను. ఆమె సంజ్ఞాపూర్వకముగ డాక్టరునిం బిలువుమని వినయపూర్వకముగ పండాను ప్రార్థించెను. దురాత్ముడగు నా పండా కీమె దీనాలాపములు, యేమి రుచించును? తీసికొనివచ్చెదనని చెప్పి వెడలెను కాని సాయంకాల మైదుఘంటలవరకు తిరిగి రాలేదు. కామేశ్వరి దుఃఖమునకు మేరలేకుండెను. ఇంటిలోని స్త్రీలెవరును నామె నోదార్చుటకు వచ్చియుండలేదు. పాపము దాసీమాత్రము మూగభాషతో కామేశ్వరి కంతచరిత్రయు తెలియజెప్పెను. కామేశ్వరది వినుటతోడనే మూర్ఛితయయ్యెను. మూర్ఛనుండి లేచి చూచుసరికి పతి స్వర్గస్థుడై యుండెను.

విదేశములలో దురాత్ముడగు పాషండుడును, ధనపిశాచియునగు పండావలన పతి మరణము సంభవించినప్పు డబలయగు కామేశ్వరి యేమి చేయగలదు? ఆమె హృదయము దుఃఖావేగముచే భిన్నభిన్నములయ్యెను. ఆమె స్పృహ లేకుండగ పతి శవముపై పడిపోయెను.

మరుచటిదినము స్పృహవచ్చునప్పటికి, కామేశ్వరి, తానొక చీకటిగదిలో యుంటినని తెలిసికొనెను. నలువైపుల గాంచెను. ద్వారములన్నియు మూయబడి యుండెను. తన కీదశ యెట్లు కలిగినదాయని యాలోచింప మొదలిడెను. క్రమక్రమముగ గతదినమందలి భయంకర దృశ్యమంతయు తలంపునకు వచ్చెను. స్మరణకు వచ్చుటతోడనే యేడువ నారంభించెను. ఈ యేడుపు విని యింటిలోని స్త్రీలచ్చటికి వచ్చి చేరిరి కాని యెవరును కామేశ్వరి కొకించుకైనను ధైర్యము చెప్పువారు లేకపోయిరి. ఈ రోదనధ్వనియే మొదట నాకు వినిపించినది.

✂

మేమిచ్చిన తంతివార్తవలన, కామేశ్వరి సోదరుడు మూడవదినమున కాశీవచ్చి చేరెను. నా మిత్రులు స్టేషనుకువెళ్లి వారిని తీసుకొనివచ్చిరి. ఈ మూడుదినములలోను కామేశ్వరి పవిత్ర చరిత్ర నంతయు గాంచి యానందాంబుధి నోలలాడితిమి. ఆమె పతిభక్తి కచ్చెరువొందితిమి.

స్వామిజీవారీ మూడుదినములలో, కేసుచేయుటకేదైన మార్గము దొరకునేమో యని రహస్యముగ ప్రయత్నించిరి. ఆయన ప్రయత్నము పండాలకు తెలిసిన, గంగార్పితము కావలసినదే. పండాలతో జగడమాడి కాశీలో యెవరు నివసించగలరు? అందుచే చాల జాగ్రత్తగ ప్రయత్నము చేయవలసి వచ్చెను స్వామివారికి. మేముకూడ స్వామివారి మలబారు మిత్రుని చాల నిర్బంధించితిమి ధనాశ జూపించితిమి. కాని నిరర్థకమయ్యెను. ఎంతచెప్పినను, ఆయన వినలేదు. ప్రాణములందాస యెవరికి యుండదు! అంతే ఆత్మత్యాగులు లేరని నా యభిప్రాయము కాదు. తుదకు మాకేమియు వేరొక మార్గము గాన్పించనందున, కామేశ్వరిని ఆమె సోదరునితో వారి గ్రామమునకు పంపివైచితిమి.

# శారదలేఖలు

సౌభాగ్యవతి కల్పలతకు—నెచ్చెలీ !

అది అభివృద్ధియో, క్షీణతయో ఉత్థానమో, పతనమో, ముందడుగో, వెనకడుగో, లాభమే కలుగుచున్నదో, నష్టమే సంభవించుచున్నదో, ఇది మంచికే వచ్చినదో, చెడుటకే వచ్చినదో, ఇటీవల మనదేశమున కుప్పలు తిప్పలుగా నుప్పతిల్లుచు నఖండవ్యాప్తి గాంచుచున్న హాస్యపత్రికల వలన నేమి ప్రయోజనము కలుగనున్నదో వీని యుద్దేశమేమియో యెంత యూహించినను బోధపడుట లేదు. కాని వీనిలోని కథానకములను, గేయములను, చిత్రములను, తిలకించిన మాత్రము విపరీతమైన భయము, విచారము, కంపరము, మాత్రము కలుగుచున్నది.

హాస్యరసమును పోషింపనెంచుచో లోకములో అనేకవిషయములుగలవు. ఏదిసౌమ్యముగా ప్రజలకుచెప్పనగునో దానిని రచయిత నిపుణుడగువో హాస్యరసముతో మేళవించియు చెప్పవచ్చును. సౌమ్యముగా వెల్లడించినదానికంటె యిదియే ప్రజల నెక్కువ యాకర్షించును. కాని యదియేమి కర్మమో నేటివినోద విమర్శకులకు హాస్యరసమును పోషించుటకు స్త్రీ దప్ప వేఱువస్తువు కానవచ్చుటలేదు. ఏ వినోద పత్రికనైన విప్పి చూడుము కథపేరునందును కథకులపేరునందును మార్పుండునేగాని కథా వస్తువునందు మాత్రము మార్పుండదు. ఏదియో నెపముగ స్త్రీని వర్ణించుటయే వారిలక్ష్యము. ఎంత సారముగల వస్తువునైనను, సమయోచితముగను, మితముగను నుపయోగించిన దానివాసెను కనుపించునుగాని విపరీతముగ వినియోగించిన వెగటుగనుండదా ? నేటి వినోద కథానకము లట్టి వెగటునకే కారణమగుచున్నవి. కల్పలతా, నీ యభిప్రాయమెట్లున్నదో గాని రాను రాను నాకీ కథలుగల పత్రికలను చూడకనే ఆనలపారవేయవలయునని బుద్ధి పొడముచున్నది. స్త్రీయనిన వీరొక జడపదార్థ మనుకొనుచున్నారో, విచిత్రయంత్ర మనుకొనుచున్నారో, ఆటవస్తు వనుకొనుచున్నారో, యథేచ్ఛముగా వర్ణించుటకు, వెక్కిరించుటకు, పొగడుటకు, తెగడుటకు సర్వాధికారములుగల స్వాస్థ్యమనుకొనుచున్నారో, నాకు తెలియుటలేదు. స్త్రీలుగూడ నొక మానవమాత్రులనియు, వారికిని బుద్ధి, జ్ఞానము, మంచిచెడ్డలయందు విచక్షణ మున్నగు లక్షణము లుండుననియు, నెవరైన నొవ్వనాడిన కోపతాపములు

పొందుదురనియు, వీరూహించుచున్నారో లేదో? తాము వ్రాసెడి వికృతపు కథల నారసి స్త్రీ లెల్లరెంత యసహ్యపడుచున్నారో వీరు తెలిసికొనుటలేదు. స్త్రీలు గదా వారిపై మనకు సర్వాధికారముగదా! వారిపై మనకలము నల్లేరుపై బండిగదా! వారిని వర్ణించుటకు మనము బిడియ పడవలసిన పనిలేదుగదా అని మొండిధైర్యమే గాని యిట్టిరచనలు వ్రాయుటవలన తమ గౌరవము నెంతగోల్పోవుచున్నారో వారికి తెలియనట్లున్నది. ఈ మధ్య నేనొకపత్రికను చూచితిని. అందులోనొక కథయున్నది.

రచన చాలమనోహరముగా నున్నది కాని కథలోని విషయము గమనింప మనసు నీరైనది. పాతికేండ్ల విధవట, పదునైదేండ్ల బాలుడట, ఆ విధవ యీ పసివానిని వరించినదట, పట్టుచొక్కాలు, పట్టు లాగులు, కుట్టిస్తాననీ, పట్టణవాసపు చదువు చెప్పిస్తాననీ, పిలుచుకొనిపోయినదట, పట్టణములో కాపురమట, బాలుడు పెద్దవాడైనాడట కాలేజీ చదువు చదువుచున్నాడట, భార్యాభర్తల పగిది మెలగుచున్నారట, ఆమె బిడ్డను గని చచ్చిపోవుచుండ ఆమె నీకేమగునని పాదరీవచ్చి అడుగగా చెప్పలేకపోయినాడట. ఏమికథయిది! ఇట్టి కథలు వ్రాయుట వలన వ్రాయువారికి గాని చదువువారికి గాని యేమైన ప్రయోజనముండునా? కల్పలతా! రచయిత లెంతచక్కని కల్పనను సరసమైన రచనను చేయగల వారేనను కథలో నిట్టి విషయము చేర్చబడుటచే వారి దివ్య లేఖని యపవిత్రమగుచున్నది.

ఈ మధ్య మా స్త్రీసమాజములో కొందఱు బాలిక లొకహాస్య పత్రికను "నేను తీసికొని వెళ్లెద, నేను తీసికొని వెళ్లెద"నని వాదులాడుకొనుచుండిరి, వారి వాదమును విని మనమిత్రురాలు సావిత్రమ్మ "ఏమిటీ హాస్యపత్రికకోసమా? మీరింత వాదులాడుకోటం? మీరెవ్వరూ చదువవద్దు ఆ పత్రిక నిక్కడ పడేసివెళ్లండి. మీరు చదువతగిన పత్రికలు కావవి" అని గట్టిగా మందలించి వాళ్లచేతులోని పత్రిక లాక్కొనెను, "ఏమి సావిత్రమ్మా! పిల్లలను హాస్యపత్రికలు చదువవద్దని గట్టిగా మందలిస్తున్నావు. హాస్యాలంటే నీకు గిట్టదా?" అని నేను సావిత్రమ్మతో నవ్వుతూ అంటిని. 'ఎబ్బే, హాస్యపత్రికలని పేరేగాని వీటిలో ఏమిహాస్యమున్నదమ్మా! అన్నీ వట్టి పాడుపచ్చి శృంగారపు వలపు కథలు, ఇవి చదివితే పిల్లలు పాడైపోరూ? పసివాళ్లు వాళ్లకేమి తెలుసు? మనమే వాళ్ల నిట్టివి చదువకుండా కనిపెట్టాలె" నన్నది. నిజమే హద్దు పద్దులేని యువతీ యువకుల ప్రణయగాథలే గదా యెందుచూచినను. కవుల కిదియే వస్తువై పోయినది. కథకుల కిదియే వస్తువై పోయినది. గాయకుల కిదియ్యే వస్తువై పోయినది. చిత్రకారుల కిదియే వస్తువై పోయినది. కోమల హృదయులగు బాల బాలిక లిట్టివి తిలకించి నచో సావిత్రమ్మ చెప్పినట్లు ప్రమాదమనుటలో సందియమేమున్నది? వయసే పాపిష్టిదే: మనసే చపలమైనదే; ఇంద్రియములే

స్వాభావికముగా సాధుత్వమెఱుగని స్వారి గుఱ్ఱములవంటివే; పతనహేతువులగు యిన్ని వికార గుణములు మనుజప్రకృతికి సహజముగనే యమరియుండ నగ్గికి వాయువును తోడు చేసినట్లు వానినింకను రెచ్చగొట్టుటకు దోహదములగు రచనలను రచించి లోకముపై విడుచుట యెంతపొరబాటు కల్పలతా! ఏమిచెప్పవచ్చును ? ఈ రచనలు చేయువారు అవ్యక్తులు గారు. అల్ప విద్యావంతులు గారు అల్లరి చిల్లరవారుగారు. ఇంచుమించుగా యింగ్లీషు విద్య బాగుగా నభ్యసించి బి. ఏ. ఏం. ఏ. మున్నగు పట్టములను బడసిన విద్యాధికులు; పెండ్లాము పిల్లలు గలవారు, నలువురిలో తిరుగనేర్చినవారు, ఇట్టివీరు ఔచిత్యమునువీడి యప్రశస్తములగు ప్రణయగాథల నల్లి అదియే పనిగ పత్రికల కంపుచున్నచో వీరికెవరు కాదని చెప్పగలరు? తెలియక చేసెడివారి కిది తగవుగాదని చెప్పవచ్చునుగాని బుద్ధిపూర్వకముగ జేయువారి నెవరు మందలింపగలరు.

"ఆహార నిద్రాభయమైథునాని సామాన్యమేతత్ పశుభిర్నరాణాం" అనుసూక్తిప్రకారము పశుపక్ష్యాదులన్నియు ఏకథయు చదువకయే, ఏ గీతము నాలింపకయే, ఏ చిత్రమును దిలకింపకయే దాంపత్యధర్మము లెఱిగి ప్రవర్తింపుచుండ ప్రతిజీవియందు సహజముగా నేర్పడియున్న విషయేచ్ఛల కింత ప్రాముఖ్యమేల ? వీని నిరోధించుటకు యత్నము గావలయును గాని అవలంబించుట కాందోళన పడ నక్కఱలేదు ?

భగవంతుడు మనుజుని సృష్టియందలి జీవరాశియందంతటిలో మిన్నగాజేసి యుక్తాయుక్తవివేచనాసాధనమగు బుద్ధిని ప్రసాదించియుండ నట్టిబుద్ధి వైశద్యము నిట్టి వెఱ్ఱి వ్యాపారములకు వినియోగించుట యెంత తప్పు !!

ఒక్కకథను వ్రాయుటగాని, యొక్క చిత్రమును రచించుటగాని యొక్కగేయము నల్లుటగాని యెల్లర కలవడునదిగాదు. అసంఖ్యాక మానవసమూహములో నే కొలది మందికో మాత్రమే భగవానుడు ప్రత్యేకముగా నిట్టి యదృష్టమును లభింపజేయును. ఇట్టి యనన్యదుర్లభమగు సుకృత మే పూర్వపుణ్యవిశేషముననో తమకబ్బినప్పుడు దానిని మానవకల్యాణమునకు సార్థకము చేయవలయునుగాని నిస్సారములై యింద్రియప్రకోపన హేతువులై యవినీతికారకములై యువతీయువతుల మనోవృత్తులను, బాలబాలికల లేతహృదయములను పాడుజేసి జాతివినాశమునకు హేతుభూతములగు రచనలయందు వినియోగించనగునా ? సంవత్సరమున కొక్కరూకయే చందాయనియు, విడిపత్రిక అణాకే యమ్మబడుననియు, ఆరుకానులకే యీయబడుననియు, రెండణాలకే లభించుచున్నదనియు నీపత్రికలను చూచి ప్రతివారు మురియుచున్నారేగాని, ఈపత్రికలను గొనెడివారు ఒక్కొక్క పత్రికమూలమున తమలోని కెంతవిషము నెక్కించుకొనుచున్నారో, తమ యింటిలోనివారి కెంత యెక్కింపజేయుచున్నారో గమనించుటలేదు.

స్త్రీలయెడ పురుషులకుగల లఘుభావముచే నిట్టికథలను వ్రాయుచున్నారని మన సోదరీమణులు కొందఱు విషాదముతో ననుట నేను వింటిని. కాని యెవరైనను నొకానొకరిని నిర్హేతుకముగా నధిక్షేపించుచున్నచో నది నిందించుచున్నవారి పరుషస్వభావమే యనుకొనెదరుగాని నిందింపబడినవారి యల్పత్వ యనుకొనరు. అనుచితములగు నిట్టిగాథలు విరచించువారికే యగౌరవముగాని స్త్రీలకెంతమాత్రము గాదు. అయినను స్త్రీలను సర్వదా నీరీతి నేదోవిధమున స్మరించి తాపమొందు నీహృదయ దౌర్బల్యమనోవికారము, పురుషులలో యుగయుగములనుండి పాదుకొని యున్నదేగాని క్రొత్తసమాచారముగాదు. పరాయిస్త్రీగాదు కన్నకూతుని జూచియే బ్రహ్మంతవాడు బేజారైనసంగతి పురాణప్రసిద్ధముగదా. నాకాధిపతియగు దేవేంద్రు నంతటివాడు మహర్షులపంచను కుక్కుటంబై కొక్కొరుకోయనుట యెఱిగిన విషయమేగదా. రావణునంతటి వీరాధివీరుడు, జగజ్జేత, స్త్రీనిమిత్తమే సర్వనాశమైపోయినాడుగదా. లోకేశ్వరుల పదవులు, మహర్షులతపములు, రాజులరాజ్యములు, ఒకటేమి తమ యమూల్యప్రాణములను గూడ స్త్రీలకొఱకు పోగొట్టుకొనినవారిని గాంచుచునే యున్నాము నేటికిని.

కనుక యెక్కడనో, ఎవతనో హఠాత్తుగా చూచినంతమాత్రముననే, పగలు పనిసాగలేదనియు, రాత్రులు నిద్రపట్టలేదనియు, ఏదియు చదువుకొనుటకు మనస్కరింపలేదనియు, ఎవరితోను మాట్లాడుటకే బుద్ధిపుట్టలేదనియు, వెఱ్ఱియెత్తిన చందమున నైపోతిననియు, ఆఫీసులో పని పాడుచేసికొంటిననియు, కాలేజీపరీక్ష తప్పిపోయితిననియు, నీవిధముగా కథలు వ్రాసికొనుట వారికి మాత్ర మేమంతగౌరవప్రదము! కల్పలతా! మనస్త్రీలపై యనుచితములగు గాథ లనేకములు విరచింపబడుట నిశ్చయముగా మనకత్యంత విచారకరమగుట తథ్యమేగాని వారి యగౌరవముకంటె మనవిచారము గొప్పదికాదని నాయభిప్రాయము.

భావపురి — ఇట్లు,

1-3-35 — శారద.

ద్విధాకృత్వాత్మనో దేహమర్ధేన పురుషోఽభవత్ ।
అర్ధేననారీతస్యాం సవిరాజ మసృజత్ప్రభుః ॥

'మనుః'



శ్రీ ఉదయశంకర్,
ంగ్ల భారతీయ వేషములలోనున్న ఆయన చెలిమికత్తె శ్రీమతి సింకీ

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిచే రచియింపబడిన పుస్తకములు

-:0:-

1. వసుమతి:—సాంఘికసాంసారికానర్థములను వివరించు నీతిబోధకమగు చక్కని సాంఘిక నవల. పాఠశాల పఠనీయగ్రంథముగా అప్రూవు చేయబడినది. ... వెల 0 12 0

2. బాలనీతి కథావళి:—నీతిబోధకములగు ఇరువది కథల సంపుటి. దొరతనమువారిచే పఠనీయ గ్రంథముగా అప్రూవ్ చేయబడినది. ... ... ... వెల 0 10 0

3. విశ్వామిత్ర మహర్షి:—ఈ మహర్షియొక్క అద్భుతచరిత్ర మిందు ప్రౌఢభాషలో వర్ణింపబడినది. ... ... ... ... వెల 0 8

4. ద్రౌపదీవస్త్రసంరక్షణము:—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

5. సత్యాద్రౌపదీ సంవాదము:—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

6. జ్యోతి:—ఆరోగ్యనాటకము. హెల్తు డిపార్టుమెంటువారిచే ఆమోదింపబడినది. వెల 0 4 0

7. పెన్నను పుచ్చుకున్ననాటి రాత్రి:—అనేకమంది విద్యార్థినులచే ప్రశంసింపబడిన చక్కని కథ. గృహలక్ష్మినుండి పునర్ముద్రింపబడినది. ... ... వెల 0 1 0

8. శారదలేఖలు:— ... ... ... వెల 1 0 0

ఈ పుస్తకములన్నియు నొకేమారు తెప్పించుకొనువారికి 3 రూపాయలకే యివ్వబడును. పోస్టు కర్చులు ప్రత్యేకము.

ఈ గ్రంథములు వలయువారు :

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు,

బాపట్ల, గుంటూరు జిల్లా. అని వ్రాయవలయును.

# గర్భవతుల గమనీయములు

నాగుమంత్రి నరసింహమూర్తిగారు

స్త్రీ, గర్భవతియైయుండు కాలమందామెయొక్క మనోసంకల్పానుసారమును సంతానప్రాప్తి కలుగును. మానసంబను క్షీరంబు మనోసంకల్పంబను వివిధాకృతులుగల యేపాత్రయందు పోయంబడిన యాపాత్రాకృతిని దాల్చునట్లు గర్భవతుల మనోవికారంబు ననుసరించి బిడ్డలుద్భవింతురు. దీనికి పరమ భాగవతోత్తముండైన ప్రహ్లాదుండే ప్రబలసాక్షి. ఈతడసురబీజ జనితుండైనను మాతాగర్భమందుండు కాలంబున యీతని తల్లి శ్రీనారద మహర్షియొక్క శుశ్రూషచేసి పరమాత్మను ధ్యానించుటచే ప్రహ్లాదుండు మహాభక్తుండై జన్మించెను.

గర్భకాలంబున స్త్రీలు భగవధ్యాన నిష్ఠతో నున్నచో, నదేరీతిని పుత్రులుకూడ జ్ఞానులై జన్మింతురు. గర్భధారిణులను భయపెట్టరాదు. వీరు భయంకర దృశ్యములు చూడరాదు; భయోద్భూత మగు మాటలు వినరాదు; జగడములలోనికి జనరాదు; చింతను చేరనీక సర్వదా నుత్సాహముగ నుండవలెను. మంచి మంచి సత్కథలను, భూవలయమందలి నాయక నాయకీ శ్రేష్టులజీవిత చారిత్రములను, వినవలెను లేక చదువుచుండవలెను; స్వేచ్ఛగ సంచరించుచు సాధారణ సంసారిక నిత్యకృత్యములను నిర్వహించుచుండవలెనే గాని సోమరితనమునకు చోటీయరాదు.

శ్రీవివేకానందస్వామివారు తనకుగలిన సద్జ్ఞానములును వారితల్లివలన సిద్ధించినవని చెప్పియున్నారు. వీరి తల్లి పుత్రసంతానములేక కాశీ క్షేత్రమందు బహుకాలము మహాశివుని ధ్యానించి వచ్చినపిమ్మట శ్రీస్వామివారు జన్మించిరి.

మనదొరగారి దేశమగు నింగ్లాండునందొక దరిద్ర బాలుడుండెను. వాడు చిఱుప్రాయమునుండియు తోడిబాలురను కొట్టుట, కొరుకుట, ప్రాణులను జంపుటమున్నగు క్రూర కృత్యములను జేయుచుండెను. కొంచెమెదిగిన పిమ్మట సర్వదాకత్తిని తనయొద్ద నుంచుకొనుచు చేజిక్కిన మేకలు గోవులు మొదలగు జంతువులను వధించుచుండెను. మరికొంతకాలమునకు మానవులనుకూడ, ఏకాంతస్థలములలో నరకుటకు వెనుదీయువాడుకాడు. అకారణముగ నిట్టి యకృత్యములను జేయుచుండుటచే న్యాయస్థానమున మరణ దండన విధింపక గొప్పగొప్ప సైన్సుశాస్త్రవేత్తలను దీని కారణమరయుటకు నియోగించిరి. ఈశాస్త్రజ్ఞులకు తలకొకవిధమగు తలంపులు కలుగుటచే సరియగు నమ్మకము కుదురలేదు. తరువాత నొక ధీవిశాలి యీ దురాత్ముని తల్లిని విచారించెను. "నీ కుమారుడిట్లుండుటకు కారణము నీకేమైనను తెలియునా? నీవు గర్భకాలమందేయేపనుల జేసితివి?" అని యడిగెను. అందుకాయమ తాను మిక్కిలి దరిద్రురాలనియు, గోహత్యజేయు స్థలము శుద్ధిచేయుచు వచ్చినకూలిచే జీవయాత్ర గడపుదాననియు, గోవులను మేకలను జంపునపుడు కాలుచరణముల బట్టుకొనుటయు, చర్మము తీయుటయందు దోహదపడుటయు, యీపనులన్నియు మిక్కిలి యుత్సాహముగ నుండెననియు రాత్రియంతయు రేపెన్నిజంతువులను జంపుటయో ఆదృశ్య మెట్లుండునో యని సర్వదా విచారించుచు నుండుటయే తనపనిగా నుండెననియు విన్నవించెను. అప్పుడా మహా శాస్త్రజ్ఞుడు శిశువు గర్భమందుండుకాలమున

స్త్రీయొక్క సంకల్పము ననుసరించి పుత్రుని వృత్తి యుండునని తీర్మానించెను. ఈవిధి మనుజులకువలెనే జంతువులకును వర్తించును. గోవులు, గుఱ్ఱములు మున్నగు జంతువుల ఋతుకాలమందు గొప్పలక్షణవంతములగు మగజంతువులనుగాని వాటి యాకారములనుగాని యాడుజంతువులయెదుట నుంచెదరు. ఋతుకాలమం దాడుజంతువుయొక్క భావ మెట్లుండునో దేనిని చూచుచు తలంచుచున్నదో యట్లుండు శిశువును గనును.

స్త్రీలకు జ్ఞాన మత్యావశ్యకము. వారు గర్భకాలమందు దురాచారులైయుండినచో వారి కుద్భవించువారు క్రూర స్వభావులై మెలగుదురు. వారు సదాచారులై దైవభక్తిపరులై యుండినచో సత్సంతానముఁగల్గి తల్లిదండ్రులకు వన్నెదెత్తురు. బిడ్డలు ప్రాయము వచ్చువరకును తల్లివద్ద మెలగుచుండుటచే తల్లియొక్క గుణములే బిడ్డలకలవడును. తండ్రియొద్ద ప్రాయమువచ్చిన పిమ్మట నేర్చుకొనుటకు సాధ్యమగును. మరియు పురుషుల సౌఖ్యమంతయు స్త్రీల వశమునందుండునే గాని పురుషునిచే నేమియు సాధ్యముగాదు. స్త్రీయుత్తమురాలై వివేకవంతురాలైనచో పురుషునియొక్క జన్మసాఫల్యము సులభము. లేనిచో పురుషునకు దానికన్న ఘోరనరకము మరియొకటిలేదు. లేబ్రాయమునుండియు బిడ్డలకు మంచి నడతలను గరపుచున్నచో అవి యెన్నటికిని నశింపవు. అల్లిబిల్లిగ నల్లుకొన్న పనుక యొక లతాగుల్మమును తన యాశ్రమమునుండి వేరుచేయుట యెట్లు దుర్ఘటమో యట్లే చిన్ననాటి స్వభావములు మార్చుట గష్టతరము.

(మూలము:—శ్రీమలయాళ స్వాములవారి శ్రీశుష్క వేదాంత తమోభాస్కరము.)

అవసరజ్ఞుండయి వ్యాసుఁడేతెంచె నంత నత్తపసి
కవిలగడ్డంబును గవిలజడలును గవిలకన్నులును
దవినయున్నువ నల్లనైన దీర్ఘంపు దనువునుజూచి
యువిదకన్నుంగవ మొగిచి తెలవకయుండె భయమున.

భారతము.

# కళలు

**"Sweet smiling star of the silent screen and a pretty polished lady is Devakirani."**

**దేవకిరాణి**

సుప్రసిద్ధ సినీమానటియగు దేవకిరాణి వంగదేశీయుడైన కీర్తిశేషులైన కల్నల్ చౌదరి. ఐ. యం. యస్, గారి ఏకైక పుత్రిక. ఈమె చిన్నతనమునందు పినతండ్రియగు డాక్టరు రవీంద్రునిచెంత విద్య నభ్యసించెను. విద్య నభ్యసించుటయే గాక కవిసార్వభౌముడగు డాక్టరు టాగోరు రచించిన అనేక నాటకములయందు నాయికాపాత్రలను ధరించి, కలకత్తా కనతిదూరమున బోల్‌పూర్ వద్దనున్న విశ్వభారతి (Santiniketan university) యందు ప్రదర్శించుచుండెను. విశ్వభారతియందు శిక్షణ పూర్తియైనతోడనే, ఈమె ఉన్నత విద్యనభ్యసించుటకు యింగ్లాండు, జెట్ లెందమ్‌నకుబోయెను. తదుపరి తనతండ్రితో బాటు యూరప్ ఖండమంతయు దిరిగి వివిధకళలు (Singing, Dancing and painting) నభ్య సించెను. ఈమెకు బెంగాలీ, హిందూస్థానీభాషలే గాక పాశ్చాత్య దేశభాషలయందు గూడ మంచి పరిచయము గలదు. తాను యూరప్‌నందు పర్యటనము జేయునపుడు, జూరిచ్, బేసోల్, లసైన్, స్టాక్ హోల్ంమ, ఒస్కానందు గాన నాట్యకళానైపుణ్యమును జూపియుండెను.

ఈమె ప్రపంచఖ్యాతిగన్న సినీమానటుడగు హిమాం సురాయిని బరిణయమాడెను. ఈతడు బొంబాయినగర మందు యొక టాకీకంపెనీ (Himansurai Indo-international Talkies Ltd) స్థాపించి తనతో కలసి యాడుటకు తగిన శక్తిసామర్థ్యములుగల చక్కనిచుక్కయగు సినీమానటి కొరకై నన్వేషించుచు, దేవకీరాణిపై యీతని దృష్టిపడెను. ఈమెతో కలసి రాజపుటానాబోయి వారి కథ 'కర్మ' కు

యవసరమగు భాగములను బూర్తిచేసికొని, 1931 సం॥ అక్టోబరుమాసమునందు బెర్లిన్ (Berlin) బోయి యొక యేడాది యుఫా స్టుడియో (Ufa studio) నందు క్రమమగు సినీమాశిక్షణమొందిరి. ఈమె యభినయించిన కథలన్నిటి కంటె 'కర్మ' లేక 'నాగాన్‌కిరంగి' యనునది ఉత్కృష్టమైనది. ఇది ప్రప్రథమమున లండనునగరమునందు వెలువడి నపుడు యిర్విన్‌దంపతులు, సేమ్యూయల్‌హోరు దంపతులు జూచి చాలా అభినందించిరి. ఆమెను జూడవాలెనను కోరికతో ప్రేక్షకులకు యుపన్యసించునట్లు ఏర్పాటుజేసిరి. ఉపన్యసించు చుండగా అనేక ఛాయాపటములను దీసిరి.

బొంబాయినగరమందు 'యిండియన్ హాలీవుడ్' (Indian Hollywood) ను స్థాపించుటకు ఈమె భర్తచేయు ప్రయత్నములకు చాలా సాహాయకారియైయున్నది. హిందూదేశమందు సినీమారంగమున కురికిన స్త్రీలలో ప్రస్తుతం యీామెయే విద్యావంతురాలు. విద్యావంతులగు స్త్రీ, పురుషులు జేరిననేగాని, సినీమాపరిశ్రమ దేశమునందు బాగు పడదని యీామె యుద్దేశం.

లక్ష్మీనారాయణ పాణిగ్రాహి.

సంగీత

ఆంధ్రదేశంలో సంగీతాని కిప్పుడిప్పుడు మంచిదశ పట్టినట్టే వుంది చూడగా; యెందుకంటారా అది మహిళామణుల ప్రాపు బడసినది. రాజమండ్రీలో రెండేళ్లనుంచి ఆంధ్ర మహిళాగానసభ యనేపేర నేదోయొక సందడి జరుగు చున్నది. ఆరంభదశలలో నిట్టి సమాజము లింతవరకూ జేయగల్గుట చెప్పుకో తగ్గమాటయే. ఐతే మరోసంగతి. యీాలాగు వరసకచీరీలుపెట్టి యేదో కొంతడబ్బు కూడ బెట్టి దానిని వెంటవెంటనే ఖర్చుపెట్టుట మాత్రముతో దేశమందు విద్యాభివృద్ధి కాజాలదు. కాబట్టి దేశస్థలైన బాలికల కొకరిద్దరికి స్కాలర్‌షిప్పు లిచ్చి చెన్నపట్నంలో

నున్న పరిషత్పాఠశాలయందో మరెక్కడో పాట చెప్పిం
చుట మంచిదని తోచుచున్నది. ఆలాటప్పుడు దేశస్థులంతా–
ఇదేంతో పెద్దమాటకూడా కాదు—ఒకవ్యక్తికి రెండేళ్లకు
సుమారైదువందలుంటే చాలు. ఇటువంటి వాళ్లైదారుగురు
ముందుగా తయారైతే వీళ్లద్వారా కాలక్రమాన్ని దేశంలో
చక్కని కర్ణాటసంగీతం వ్యాప్తం కాగలదని మాయా
శయము. దీనికి మాసోదరీమణు లేమంటారో చూడాలి.

## నాదస్వరూపము

నాద తను మనిశం శంకరం
నమామి మే మనసా శిరసా
మోదకరం నిగమోత్తమ సామ–
వేదసారం వారం వారం॥

సద్యోజాతాది పంచవక్త్రం
సరిగమ పదనీతి సప్తస్వర
విద్యాలోలం—విదళిత కాలం
విమల హృదయ త్యాగరాజ లోలం॥

## నాదోత్కర్ష

సీతావర, సంగీతజ్ఞానము–ధాత వ్రాయవలెరా॥
గీతాద్యఖిలో పనిషత్సార–భూత జీవన్ముక్తుడౌటకు॥
ఆకాశ, శరీర పరబ్రహ్మమని–ఆత్మారాములు లోనజూచెను॥
లోకాదుల చిన్మణిమయసుస్వర–లోలుడౌత్యాగ రాజసన్నుత॥

(పైవాని యర్థవిచారము చేయుదురుగాక)

(తానవర్ణం) కదనకుతూహలం—ఆదితాళం. (పా॥కృ॥మూర్తి

గాపాపమదని గాపాసాసని × దపమగపమగరి × సరిరిమ మదదని।

శ్రీ గృ హ ల క్ష్మి + మ ము + చె ర।

గా గపాపసా సనిదప మగపమ + గరి, మద + ని-గప సనిదపమ॥

రా గ దె వె గ + మే న + గు చు ॥

ద దప-పమగరి మగగరిరిస సనిద + ప-సరిసరిమగరి + రీమదని గపా ॥

భో గ భ గ్య + ము లో + సం గనే ॥

స నిదపా రి సనిదపా మగరిసని + దపా మదనిగప + సనీదప మగరి ॥

భ గ ధే యు + డా శ్రీ కె + సతీకుమ—రి ॥

ససరి సరిమాగరి దపపమమగరి + సరినీద దపస + ,సరి సరి మగరి॥

అగణితగుణంబుల వెలయుచుముగుద × లగురించి తగవె + ంచిసుగతి దలచి॥

మమదదని గగపపస రిరిమమద గ + పస రి మాగరిస + రిసీదప పామ ॥

తగినదియు తగనిదియు నొగి దెలుపుమ + వురుచులూరగవె + తదీరగ బాగు॥

పా,.దమపా దమపమగరి సరి + మా, మగపామ + దనీ-గపసనిద ॥ పా॥

ఆంధ్ర వ ని లో + ఆ నం ద + ము జెందగడిరిగి॥ ఆ॥

1. పా,మా,గా,రీ మాదాని + గా, పా, సా + ,రీసానీద ॥పా॥

ఎం దెందున్ నీ వున్నావో + ఆం దం దే + పొందుంగీర్తి ॥ ఆ॥

2. దాని మదని రిమమ దదని గపసని + దపా మగరిస ని + దపా సారిమప ॥పా॥

నీదుకథలు నిరుపమ రసభరితము + లు నీజిలిబిలి ప + లుకుల్ నీకుతగు॥నాం॥

3. గప సనిదప మదనిగప సనిదపమ + గరి మగరి గరిస + నిదప సరిమగరి ।

వరసతులిల తులసిదళము లటువలె + గదశిరములపయి + నునిచికొనియెదరు ।

మదని రిమదని సరిమదని గపసని + దపగప స రిమ గ + గ రి రి స సనినిద ।

పరమశుభమతి పరమ శివసతిగతి + పరజన పరిహార + ణనిరతి వరలెద ॥వాం॥

4. సా,, ,, రినీదా మదని గగ + పా,, ,, మగ + రి సరి మదని గప ।

ఓ విశాలాక్షి నినుగన + మో హాయ + లమి-రనిల గల ।

సనీస రినీ మదనీ గపసనీ + దపా మగరి సరి + మదని రిమదనీ ।

సరోజముఖుల్ పరమాదరముతో + పరార్థపరవని + వలచి పిలువరో ।

గగపసా నిదపరీ మ గ గ రి స రి + మగ రి సనీదప + మదనీధ గపా ।

సరసిజా సనునిరాణివలె సకల + కళలరహస్యము + ల నవీనముగా ।

సనిదపా పమగరీ సని దపా స + రిమదా రిమదనీ + రి సనిగపమగరి ॥పా॥

వరరుచుల్ గురియగా బలుకుదో భ + వహరీ శివకరీ + కవిజనవినుత ॥ఆం॥

# గృహలక్ష్మి

సీ॥ ఘనతగాంచినయట్టి కవికుమారితపికా
నీకమ్మునకు మావిమూకవమ్మ!
నవరసాలంకార కవితామహాకావ్య
కలహంసలకుఁదటాకమ్మువమ్మ!
గృహగృహమునకేగి గృహిణులందరకును
జ్ఞానంబొసంగు సుజ్ఞానివమ్మ!
కులవధూటియురమ్య గుణాధుర్యయగుఁటకు
సీదుసాంగత్యమే పాదుసుమ్మ!
తే॥గీ॥ సాటిపత్రికలందున మేటివైతి
ఖ్యాతిగాంచితి తల్లిరో కలియుగాన
నిత్యసౌభాగ్య సుశ్రీల నెగడుచుండి
వరలుమమ్మరో గృహలక్ష్మి ధరణిపైని.

ఉ॥ ఈఁడొక యింత లేదుసుమ! యెన్నడునేర్చితి విన్నివిద్దెలే
డేడుల ముద్దుతల్లివహా! ఇంకొకయేడిపుడాయనమ్మ! నూ
ఱేడుల తల్లివై నవరఁ కిట్టులె బల్లెలఁబట్టణాలమా
టాడఁగరాని కీర్తిఁగొని హాయినిగొల్పుమ గేహలక్ష్మిరో!

మ॥ సకలాచేతనచేతనాకలితవిశ్వంబున్ ముఖంబాదు నం
దకుమారుం డొకమారె చూపెనటు నిత్యంబున్ ప్రదర్శింతు వీ
వకలంకాధునికాఖిలాంధ్రవనితాలోకాన సుజ్ఞానమున్
సుకవిత్వ ప్రతిభాకృతప్రతతితో శ్రీదేవివీవేసుమా!

బులుసు వేంకటేశ్వరులు

## అపరోక్షానుభూతి

(గత సంచిక తరువాయి)

నిష్కలయునేకమై యాత్మ నెగడునెపుడు
నింద్రియాదులదేహ మావృతముసుమ్ము
ఇట్టి దేహాత్మలకు నైక్యమెంతురకట
దీనిమించిన యజ్ఞానమౌనె ధాత్రి. (17)

ఆత్మచూడ నియామక మవ్యయంబు
నగు నియామ్యకమగు దేహమహహా? రెంటి
నైక్యబుద్ధిని గనుగొందురకట! జనులు
దీనిమించిన యజ్ఞానమౌనె ధాత్రి. (18)

ఆత్మవిజ్ఞానమయము పుణ్యంబునగును,
కాయమ నమాంసమయమును దేహమగును,
వీనికైక్యంబు గల్పింత్రు వెఱ్ఱులహాహా !
దీనిమించిన యజ్ఞానమౌనె ధాత్రి. (19)

ఆత్మచూడ ప్రకాశక మమల మజము
తామసయుతంబు దేహంబు భూమిరెంటి
నైక్యబుద్ధిని గనుగొందురహాహా ! జనులు
దీనిమించిన యజ్ఞానమౌనె ధాత్రి. (20)

ఆత్మనిత్యంబు సద్రూపమచ్యుతం బ
నిత్యమగు కాయమెంతయు నింద్యమఱయ
వీని కైక్యంబు గల్పింత్రు వెఱ్ఱులహాహా !
దీని మించిన యజ్ఞానమౌనె ధాత్రి. (21)

సకలవస్తుప్రకాశక శక్తియుతము
సార్వకాలిక మాత్మతేజంబయద్ది
భాస్కరాదుల కాంతులవంటి దనఁగఁ
దగదు రాత్ర్యాదులందవి యగు పడవుగ. (22)

ఘటమునొక్కఁడు నెదురుగాఁ గాంచియవలఁ
నాదియిదియను మూఢజనంబుపోల్కిఁ
దేహమునుగాంచి తానని యూహసేయుఁ
నహహా !! దీనిని మూర్ఖత్వమనఁగఁదగదె. (23)

సచ్చిదానందరూపుఁ డసముఁడశాంతి
యుతుఁడనే బ్రహ్మమంచును మతిఁదలంచి
అస్థిరంబైన మేనునేనగుటకల్ల
యనితలంచుటె యెఱుకంద్రు మునులుజగతి. (24)

నిర్గతాకారు నిరవద్యు నిర్వికారుఁ
నవ్యయాత్మునిఁగాఁ దన్ను నరసికొనుచుఁ
నస్థిరంబైన మేనుతా నగుటకల్ల
యనితలంచుటె యెఱుకంద్రు మునులుజగతి. (25)

నిర్వికల్పుఁడ నిత్యుఁడ నిర్వికారుఁ
డను సకలసాక్షిఁ బరమాత్ముఁడ నగుదుఁగనఁ
నస్థిరంబగు తనువునేనగుటకల్లఁ
యనితలంచుచు నెఱుకండ్రు మునులుజగతి. (26)

నిష్క్రియము నిత్యముక్తంబు నిర్గుణంబుఁ
నచ్యుతంబును నిత్యంబు నగుదుఁగానిఁ
యస్థిరంబైన తనువునేనగుటకల్లఁ
యనితలంచుచు నెఱుకండ్రు మునులుజగతి. (27)

నిర్మలంబు ననంతంబు నిశ్చలంబుఁ
నజర మమరంబు శుద్ధంబునగుదుఁగానిఁ
యస్థిరంబైనమేనునే నగుటకల్ల
యనివచించుచు నెఱుకండ్రు మునులుజగతి. (28)

స్వీయదేహంబుననెయుండి శోభనెసఁగుఁ
సమ్మతుండయి పురుషాఖ్య సంతరించుఁ
దేహభిన్నంబయగు నాత్మఁ దెలియకీవుఁ
శూన్యమని మూర్ఖ! చెప్పఁగఁ జూతువేల. (29)

తనువుకంటెను భిన్నమై తనరుపురుషు
స్వాత్మనిసదాకారుని సహజరీతిఁ
శ్రుతినియుక్తిని గనుగొండ్రు సూవెబుధులుఁ
గాన నెట్లగు నినుబోటి కలుషమతికి. (30)

నేననెడి శబ్దవిఖ్యాతి బూనియుండుఁ
పరముఁడొక్కండెయై తాను వరలుచుండెఁ
స్థూలమే తానెనేకత్వ మూలమయ్యెఁ
దేహమగుటెట్లు పురుషుండు తెలియుమయ్య. (31)

నేను దష్టృత్వసిద్ధిచే నెసగువాఁడఁ
దేహమోదృశ్యతాసిద్ధి దీపితంబు
నాది నేనను నిర్దేశవాదమెటేఁగి
దేహమగుటెట్లు పురుషుండు తెలియుమయ్య. (32)

జాలారి తులశమ్మ

## పూర్ణ చంద్రుడు

సీ॥ పాల్కడలికిముద్దు పట్టివై శ్రీదేవి
యనుఁగు సోదరుడవై యలరువాడ
అఖిలలోకాధీశు డౌ నీలకంఠుని
జడలలో నివసించు చలువ రేడ
కలువలగారాబు చెలుకాడవై భువి
పదునారుకళలచే ప్రబలువాడ
జనులెల్లనుతియింప చల్లనిచూపుతో
పండువెన్నెలసిచ్చు చుండువాడ
గీ॥ ఘనుడవనిచాల వినుతుల గన్నవాడ
కటకటా! నీవె యెన్నెన్నొ కష్టములను
విఘ్నములనొందుచుంటివే విధికృతమున
యింకమముబోట్లు చింతింప నేమిఫలము ?
గీ॥ సకల కల్యాణగుణధామ చందమామ
జగతి కానందకరుడవౌ చందమామ
నిన్ను గాంచినయంతనే నేత్రములకు
పండువై దోప సంతోషబాష్పములను
నధికతరమైన యానంద మలరుచుండు
సౌమ్యగుణమూర్తి సద్భాగ్యశాలివనుచు
దలతుమేగాని నీకున్న కలతలేమొ
దెలియమాబోటివారల కలవియగునె
సౌమ్యగుణధామ పున్నమ చందమామ॥

చీమకుర్తి సత్యవతి

## సీతాదేవిసందేశము

గీ. ఘోరరాక్షసమూకలోఁ గ్రుంగిపోయి
నెట్టుచుంటిని కాలంబు నెట్టులెటులొ
పతిసమాగమమునుగోరి పవనతనయ !
చెప్పశక్యంబుగాదునా ముప్పులకట !

ఉ. సుఖముగనున్నవారె యలశూరులుధీరులు రామలక్ష్మణుల్
సఖులును బంధుమిత్రులును సాధుగుణాఢ్యులు జన్నవారలుఁ
సుఖమగునొక్కొయత్తలకు శోభనగాత్రలు నాదుసోదరుల్
సుఖమె వచింపు మందఱనుజూచెడుభాగ్యము నాకుగల్గునా ?

క. హెచ్చుగ నీ నామమెపుడు
పొచ్చెము లేనిహృదయమునఁ బొల్పెసఁగంగా
నచ్చపు భక్తినిఁగొల్చుచు
నిచ్చట నుంటిననుచు వచియింపుమ పతికిన్.

లక్ష్మీసరస్వతులు

### —దధిభక్ష్యము—

మీగడతోడ అయిదుపళ్ల గట్టిపెరుగును తెల్ల గుడ్డలో మూటగట్టి మీదుగ వ్రేలాడగట్టవలయును. నీరంత యిపసినతరువాత అందు కాలుపడి గోధుమరవలను, మూడుపలముల వెన్ననుగాని లేక నేతిని గాని చేర్చి, పిసికి చిన్న చిన్న బిళ్లలుగా తట్టి ఏడుసేర్ల తెల్లచక్కెరను మురికిలేక పాకముచేసి పెట్టుకొని, ఈబిళ్ళలను నేతిలో వేల్చినతోడనే ఆపాకములో వేయవలయును. బిళ్ళలను నాలుగైదుదినములవరకు కట్లేయుంచి చల్లారినమీదట భక్షించవలయును.

—పి. కమలావతి.

### —విషాస్తాహల్వా—

అయిదుపళ్ళ గోధుమరవలను చిలుముపట్టని పాత్రలోవేసి రాత్రికి నీళ్ళుపోసియుంచి, ఉదయమున ఆరవలను రోట్లోవేసి రుబ్బి, ఆముద్దను బట్టలోవేసి పిడిచికొని మరలను ఆపిప్పిగానుండు ముద్దలో తెల్ల చక్కెర కొంచెమువేసి రుబ్బి దానిని పిడిచికొని, ఇట్లు పిడిచిన పాలను మంచిపాత్రయందుపోసి, నోటికి బట్టకట్టి యొకచోట వారముదినములుంచి, యుంచవలయును. ఎనిమిదవనాడు ఒకపడి తెల్లచక్కెరను పాకముపట్టి, అందుముందు పిడిచియుంచిన పాలను ఒకపడిపోసి, పదితులములనెయ్యిని, ఒకపలము పన్నీరును, ఒకవరాయెత్తు ఏలకులు జూర్ణముచేసి, చేర్చి హల్వా పక్వముగా చేసికొనవలయును.

—పి. కమలావతి.

### —చంచంబర్ఫీ—

ఒకసేరు గోధుమనూకయును వీశయేబలము పంచదారయును తీసుకొనవలెను. గోదుమనూక కళాయిలోవేసి పొయ్యిమీదపెట్టి కాస్తసేపు వేపవలెను. వేపుచుండగనే 15 తులములనెయ్యి అందులో పోసి కలిపివేసి దించివేయవలెను. తెచ్చిన పంచదారలో అర్థసేరు నీళ్ళువేసి బాగా ముదర పాకము పట్టవలెను వేపిన గోధుమనూక అందులో పోయవలెను. ఏలకపొడి, బాదమపప్పు అందులో వేయవలెను. వేసినతరువాత నలమపాటి యాలకట్టతీను కొని పొయ్యిమీద నుంటూయుండగా చిక్కగా వచ్చేవరకు కలుపుచుండవలెను. చిక్కగా వచ్చిన వెంటనే దించి పళ్లెములో పంపివేయవలెను. బాగా చల్లారిన తరువాత నది చిన్నచిన్న ముక్కలుగా కోసి తినినా యెంతో రుచిగానుండును.

—చంద్రాబాయి.

# తాజా మిఠాయ్ !!!

పిల్లల్లారా !!! మీకే

## స్వరాజ్యం

ఉప్పోయమ్మ ఉప్పు—
ఏండుప్పు ?
నిమ్మొప్పు—
ఏంనిమ్మ ?
ఎండునిమ్మ—
ఏంఎండు ?
చెట్టెండు—
ఏంచెట్టు ?
తాటిచెట్టు—
ఏంతాటి ?
ముంజతాటి—

ఏంముంజ ?
కల్లుముంజ—
ఏంకల్లు ?
పాడుకల్లు—
ఏంపాడు ?
కట్టపాడు —
ఏంకట్ట ?
లాటీకట్ట—
ఏంలాటీ ?
దెబ్బలాటీ—

ఏందెబ్బ ?
ఓర్పుదెబ్బ—
ఏంఓర్పు ?
మనిషిఓర్పు—
ఏంమనిషి ?
చెడుమనిషి—
ఏంచెడు ?
రాజ్యంచెడు—
ఏంరాజ్యం ?
స్వరాజ్యం—

అక్క—పెద్ది కమలమ్మ.

## సమస్యలు

చెప్పుకోవే చిట్టితల్లీ చెప్పుకోరా చిట్టితండ్రీ
యెప్పుడూ లడ్డూలునీకూ గుప్పెడేసి దొరుకుతాయ్ !!

రంగడూలింగడూ వొకటేగాని
పొంగరాలదగ్గిరే పోట్లాడతారట
యెందుకో పోల్చుకోండీ !!
మీచెల్లాయికోసంకూ నీకంటే

పెద్దవాడైతే మహారాజశ్రీ అని
రాస్తారా లేక శ్రీరస్తు చిరంజీవి అని
రాస్తారా చెప్పండీ !!

'హరిదాసు'

1. భూగోళశాస్త్రజ్ఞులు ప్రపంచకము నారూపమందురు.
2. వేదాంతశాస్త్రజ్ఞులు ప్రపంచము 'నేనే' యందురు.
3. గణితశాస్త్రజ్ఞులు నన్ను గణింపకుండినను నాసహాయము వారికి ముఖ్యావసరము.
4. నేనెట్టి ఆవరణముల లేనప్పటికి, నాయందుమాత్ర మావరణమిమిడియున్నది.
5. నాయాద్యంతము లగోచరములు. పాఠకా—నిన్ను నీవు తెలిసికొనువరకు నావలె తిరుగకమానవు.
నే నెవరో నీకు దెలిసినచో దయతో దెల్పుము—పరాత్పరుని రూపమం దైక్యమొందెదవు.

ఆర్. ఆర్. పాత్రో.

## చిత్రప్రశ్న

యడవల్లి జానకీభాయిగారు

సీ॥ నాలుగుగాళ్లుండి ♦ నడువంగనేరదు
నోరుదోకయులేవు ♦ నుదురులేదు
చేతులురెండుండి ♦ సేవజేయగలేదు
వీపొకటున్నది ♦ వెనుకనమరి
వీఠమున్నదిగాని ♦ పిరుదులులేవెందు
బంధుమిత్రులుచేరు ♦ పాపమవని
పెద్దచిన్నలనక ♦ నొద్దికదరిజేర్చు
సిద్ధునికై వడి ♦ జింతబడక
ఆ.వె. రాజసభలయందు ♦ రాజిల్లునెప్పుడు
గపటమెఱుగదెందు ♦ గాంచిచూడ
నొరులుగారుదాని ♦ కొరులకుదానౌను
కాంచిచెప్పరమ్మ ♦ కాంతలార.

## కథచెప్పనా? ఐతే జాగ్రత్తగావినండి

చార్ దార్వేష్కీ బాగ్‌బహార్ అంటారే అందులోదిది. అనగనగా వోరాజు. అతనిపేరు హాతింతాయ్. అతడు చాలా మంచివాడు; కాబట్టి జగంవంతా 'హాతింతాయ్‌కోజేయ్' అంటూవుండేవారు. ఆపక్కనే అతనిలాటివాడే మరోరాజుండేవాడు. అతనిపేరు నౌఫుల్. ఇతగాడి చెవులకు ఆ 'హాతింతాయ్‌కీజేయ్' అనేమాటలు శూలాల్లాగుండేవి! యెందుకో తెలుసునా? వీడికి అసూయ-అంటే వొగర్ని మంచియంటే వినలేకపోవడంఅనే పాడుగుణం వుండేది. అందుచేత వీడు హాతింతాయిమీద లఢాయికి వెళ్లాడు. పాపం హాతింతాయ్ వొకఅడవిలోకి పారిపోయి దాగున్నాడు!! యెందుకో తెలుసునా? పాపం భయంచేత కాదూ!! యుద్ధాల్ చేస్తె యెంతో మంది చచ్చిపోతున్నారు! వాళ్ళ పెళ్లాలకీ పిల్లలకీ యెంతో బాధగదా!! అందుచేత. ఐతే నౌఫుల్ మాత్రం పొగరుబోతు!! కాబట్టి అనుకోలేదు: హాతిం తనకు భయపడి పారిపోయాడనుకొన్నాడు! అనుకుని 'హాతింతాయిని పట్టుకుతెస్తె- ఐదువేల మొహిరీలిస్తాన్' అని చాటించాడు.

వోనాడూ అడివిలో వొగతాతా అవ్వా మాట్లాడుకుంటున్నారు. యేమనీ?

తాత—ఆడుగాని దొరికితే ఐదేలు మొహరీలు!! వోయబ్బ ఐదేలు!!

అవ్వ—నీగోసకూలా!! నీయాసమాసిపోనూ? ఆడు దొరుకుతాడంటో—ఆడేం సామాన్యుడా—ఆతింతాయే—ఆ-దర్లాటోడా—యెందుకీ యాస?

అక్కడేవున్నాడు హాతింతాయి-చెట్లల్లో దాగుని-యీమాటలు విన్నాడు- సంగతి సందర్భాలు తెలుసుకున్నాడు- నహూమన్నాకు నౌఫల్ దగ్గిరికి- వాళ్లెం బతిమాలినా విన్నాడా? లేదు. యెందుచేత? వాళ్లు దరిద్రులు, ముసలాళ్ళు, కష్టపడలేరు. అలాంటివాళ్లకి తనమూలకంగా ఐదువేల కరుకులు దొరుకుతాయంటే తన కెంతమంచిదీ-అందుచేత. చూశారా యెంత గొప్పవాడో? మనమంతా డబ్బున్నవాళ్లని గొప్పవాళ్లనేస్తాం కాదూ? అదితప్పు—శుద్ధతప్పు. యెవడైతే తనప్రాణమైనా ధారపోసి కష్టాల్లో వున్నవాళ్లని గట్టెక్కిస్తాడో వాడు గొప్పవాడు- తెలిసిందా.

తరవాత నౌఫుల్ దర్బార్లోకి వెళ్లారు హాతింతాయీ అవ్వా తాతా- ముగ్గురూనూ. నౌఫుల్ చూశాడు హాతింతాయిని. వాడి గుండెల్లో హడల్ పుట్టింది. వెంటనే యిచ్చేశాడు హాతింతాయిరాజ్యం హాతింతాయికి- కుమ్మరించేశా డప్పుడే ఐదువేల మొహిరీలూ. సాష్టాంగపడ్డాడు. తనరాజ్యానికి దొడ్డోదొడు వొక్కటేదొడు-తిరిగిచూస్తె తిరుమణితోడు.

మంచితనం యెంత పనిచేస్తుందో చూశారూ-హాతింతాయ్‌వాడితో యుద్ధంవే చేసివుంటే?

# విన్నారా?

జేమ్స్ ది సెకెండ్ గార్ని అడిగారట—"మహారాజా, మీయాలోచనలు గొప్పవేకాని మీపను లెందు కలాగుంటాయి?" అని అడిగితే ఆతం డన్నాడూ "అయ్యా నా ఆలోచనలేమో నావే—కాని నాకార్యాలుమాత్రం నావి కావు. నా మంత్రులవి!!" అని.

అమెరికాల యస్సా!! పేరు మేరివిన్ సెంట్. ఈమె కిప్పుడు 99, ఈమె కూతురికి 74, ఈమె కూతురికి 59, ఈమె కూతురికి 40, ఈమె కూతురికి 19. ఈమె కిప్పుడో బిడ్డ. అంతా బ్రతికేయున్నారు: బాగున్నారు కూడా. జన్మనేలో 63 యేళ్ల మిలిటరీ యుద్యోగికి గృహస్థధర్మానుసారంగా అగ్రతాంబూలం ఇప్పించారు: యేంచేయంటారా?—యీవిని కొనిపరి కిరవైతొమ్మండుగురుపిల్లలు; యిటీవలనే యింకొకడు పుట్టాడు; యింటినిండా హాయిగా వున్నారుట!! యిదీ యిందులో వున్న విశేషం: కాగామరి!! ఇట్టిగి కావాలంటే నాకూ వొద్దంటే తప్పవన్నారు పూర్వులు. ఇది శుద్ధ తెలివితక్కువంటున్నా రప్పటివాళ్లు. యేది నిజం?

మనదేశంలో తుమ్ము అపశకునంగా భావించి తుమ్మినవాళ్లను తెగతిడతాం గదా! ఇది చూడండి:- డాక్టర్ ఆర్థిపుమాలెనిన్ అనునామె (హెక్ఫర్డ్) "తుమ్మువొస్తే తిడతారేమో పైవాళ్లని భయపడవొద్దు. దాని నాపుకోవొద్దు. మనసు రాగల యేదో కీడు యీశ్వరకృపవల్ల తప్పిపోయింది సుమా అని తెలియజేయడానికే తుమ్మువొస్తుంది. కాబట్టి ఆర్ స్టోటల్ గారు సెలవిచ్చినట్లు తుమ్మువొస్తే దేవుడికి దండంపెట్టండి" అని ఆరోగ్యపాఠశాలలో విద్యార్థులకు బోధపరచినది. మనలోనైనా అన్నివేళలా తిట్టం. కొన్నివేళల్లో తుమ్ము మంచిదనీ కొన్నివేళల్లో తుమ్ము చెడ్డదనీ అనుకుంటున్నాం. లెనిన్ గారుమాత్రం అన్నివేళలా మంచిదే అంటారు. కాను తుమ్మును అణిచిపెట్టకూడదు. శకునాల మాటలాగుండగా తుమ్మును అణిచిపెట్టడంవల్ల మెదడుకెంతో ప్రమాదం వొకప్పుడు మృత్యువుకూడ తటస్థింపవచ్చును. కాబట్టి తుమ్ము నడిచిపెట్టరాదు.

సముద్రపు నాచుతింటేనట 200 యేండ్లు బ్రతుక వచ్చునట! వొకఅమెరికా డాక్టరుగారు, ఇ. హెచ్. జెకోబునారు చెప్తున్నారు. యోగశాస్త్ర రహస్యం తెలుసుకుందామని ఆయన యిపుడు మనదేశానికివచ్చి యున్నారు. ప్రాచీనయుగములలో నాగరీకులను సముద్రతీర ప్రాంతనాసులునూ తినేవస్తువులలో సముద్రపు నాచుకూడా వొకపదార్థమనీ దీనియందు మనుష్యజీవితమునకు కావలసినట్టి లవణాములన్నీ వున్నాయని యీయనసిద్ధాంతం. డెబ్బదియేండ్లు వయసుగల యీనక్షత్రపకుడు యీయపూర్వపదార్థాన్ని పదిహేను సంవత్సరాలనుండీ తానే నడుచుచున్నాడు. కాబట్టి యిందనుమాన ముంచరాదు.

ఇటలీదేశంలో వొక అమ్మాయివుంది. ఆమె చీకట్లో మెరుగులు పెరుగులుగు మెరుస్తూ వుంటుంది. ఇది సామాన్యపు మాటకాదు గదా! వైద్యప్రపంచ మంతా తార్మాణించింది. ఆఖరికి జెనీవాలో డాక్టర్ ప్రోటీగారు కనుక్కున్నారిందులో రహస్యం. ఆ అమ్మాయివొంటిలో "ఫాస్ఫరెసెంట్" అనగా భాస్వరసంబంధమైన పదార్థములేవో వుండడంవల్ల ఆ మెరుపులు పుట్టుచున్నాయని. దాన్ని ఋజువు చేయడానికిగాను అల్పపదార్థమే తయారుచేసి ఆ వైద్యవరుడు కుక్కల మెదడులోనికిన్ జంక్షనిచ్చి చూపిస్తున్నాడు!

## "నాస్తివస్తు రనౌషధం"

రానురాను జపానుదేశంలో పాములను తినడం పరిపాటి అయిపోతూవుంది. కేవలం పాములమ్మే యంగళ్లు 200 లకు పైగా నున్నాయట! పాము



మోహినీరాజ దేవాలయము



శ్రీ మల్లికేశ్వరాలయము

మాంసము మిక్కిలి బలం కలుగజేస్తుందనీ చాలాకాలం బ్రతికిస్తుందనీ ముసలితనాన్ని చేరనీయదనీ తెలుసుకున్నారు. ఇంతేకాదు. కొన్నికొన్ని జాతుల సర్పములనుండి ద్రావకాలు తీస్తున్నారు; కొన్ని జాతుల వాటిని బాగా యెండబెట్టి చూర్ణంచేసి ధాతుపుష్టికీ ఆయుర్వృద్ధికీ మందుగా వాడుచున్నారు; కొన్నిజాతుల పాములనుండి సారాయిని కూడా తీస్తున్నారు. ఈ సారాయి యెంత పాతబడితే అంత రుచిగానుండునట!

## ఇటీవల గాంధీగారు ఢిల్లీలో విడిసియున్న రోజుల్లో జరిగిన ముచ్చట యిది:—

అందరివంటి సామాన్యుడే వొకడు మహాత్ముని దర్శనము కొరకు తెల్లవారకట్టలో పడియుండి తుదకాతని దర్శనమైన తర్వాత పదిహేనంతుల పదిరూపాయిల నోట్లు ఆరింటినిచ్చి చెప్పె "మహారాజ్, యిది పాత్రులైన వాళ్లకివ్వండి. పాత్రాపాత్రు లెవరో నాకంటే మీకు బాగా తెలుసు" అన్నాడు.

గాంధి:—అన్నా బాబా, యిన్నాళ్లాయి కూడబెట్టి నాకేం పూర్తిగా సెప్పుమాను?

కాపు:—బాపూజీ—అనగ మరిపడగినను—జీవితారంభం నుండీ కూడబెట్టుకున్న దంతే! పనిలోనుంచి వొక పందరూపాయి లేమో భూకంప సహాయనిధి కిచ్చుకున్నాను. అన్నాము కోవంద: ఐదు వంద లలహాబాదు రైతులకు—యిక వున్నదదే!

గాంధి:—సుహాబాష్! భయ్యా సహబాష్—ఐతే వొగటి చెప్పూ—నీవేంచేస్తూవుండే వాడవూ?

కాపు:—మహారాజ్! ఘనివిచేస్తానూ వొక చిన్న స్కూల్ మాస్టరుగా వుంటిని చాలాకాలం—రిటైరైపోయే టప్పుడు రూ. 52 జీతంలోవుంటిని. ఆఖరికి రూ. 2700 లు గ్రాట్యుయిటీ యిప్పించారు. పింఛన్ లేదుగదా!

గాంధి:—యెన్నాళ్లైంది రిటైరై?
కాపు:—ఐదేళ్లయింది మహాత్మాజీ.

గాంధి:—ఐతే యిన్నాళ్లూ యేంతిని బ్రతికావు బాబా?

కాపు:—దానిమాటకేంవి లెండి!!

గాంధి:—అలాగుకాదు—బ్రతకడానికేదో తినాలి కాదూ?

కాపు:—పదిరూపాయిలు చాలదా అని మునుపూ అంటే నా మేనల్లుళ్లూ వాళ్లూ వుండేవాళ్లు—వాళ్లకు చదువూ సంధ్యా చెప్పిస్తూ వుండేవాణ్ణి—యిప్పుడెవరూలేరు వాళ్లంతా పెద్దవాళ్లై బ్రతుకుతున్నారు. నేనో చిన్న సంస్కృత పాఠశాల పెట్టుకున్నాను. వుచితంగానే విద్య చెప్తాను. యిగనేంవుంది.

గాంధి:—ధన్యోధన్యహో, భాయీ!! ప్రతీవాడూ కూడా యీలాగుంటే యెంత సంతోషపడుదుము గదా!! యింత స్వల్పజీతంలో యింతకష్టపడి యీ పెద్దపెట్టున ధర్మంచేస్తున్నావు మహానుభావా!!!

కాపు:—కాను మహరాజ్—నిజంవే! నే నెప్పుడూ కూడా నా కడుపుకు తిన్నది కొంచంవే!! యేం మిగిలినా అడిగినవాళ్లకిచ్చాడింవే.

గాంధి:—దానికేంగాని భాయీ సాహెబ్, యింత మంచిఖద్దరు నీ కెక్కడిదీ?

కాపు:—మాయింట్లో తయ్యార్ చేసుకున్న దేనండీ.
గాంధి:—నాకసూయకు బోతులసంగా వుందిసుమా!!!

కాపు:—మహాత్మా, సెలవిప్పించు. యింకా కొంచం డబ్బుంది యింటిదగ్గిర—యెవరికివ్వడానికీ తోచక కొట్టుకుంటూ వుండడం వెందుకూ? నీకు సమర్పిస్తే పాత్రా పాత్ర లెరిగి నీవే యిస్తావుగదా. సెలవిప్పించు—మళ్లీ దర్శనం చేస్తా నింతలోనే.

అని యాతని పాదములంటి మ్రొక్కి 'ఆనంద గహరోబాబా' యని యాశీస్సునొంది వెడలిపోయెను.

(సన్‌డే టైమ్స్)

# మనోరమ

## రాజకుమారి

### ౧

గీ. సంజకెంజాయ ననురక్తి జాయఁగూడి
పూవుఁ బుణుకుచు వాహ్యాళిగ బోవునపుడు
కలహమాడితి మక్కటా క్షణమునందె
ముద్దు గొంటిమి కన్నీరు మునుగువడగ.

గీ. మనము నెయ్యంపు గినుకకు బాలువడగ
ప్రియతమంబైన హృదయాల వేసివుట్టి
ప్రణయ మువ్పొంగజేసెను పథముగాన
ప్రణయ కలహాస నెంతటి మహిమగలదో!

గీ. ముద్దు గొనుచును కన్నీరు మునుగుగొంచు
చేరుకొంటిమి పూర్వమా సీమయందె
ఘోరతరమైన వర్షంపు ధారయందు
పిడుగుపాటున మాహాఁదు పడినచోటు.

గీ. వర్షధారను బలిసైన వసుధయందు
హృదయదాహంబు జన్మించె నిచ్చటనుచు
ఊర్పులెగయంగ విహ్వల మూదికొనుచు
ముద్దు గొంటిమి కన్నీరు మునుగు వడగ.

మఱునాటి ప్రాతఃకాలమున నాకన్యా విద్యాలయమున సంరక్షణాధికారిణియగు నామెయొకతె మాయొద్దకువచ్చి యచ్చట విద్యాభ్యసనమున యువతులకుఁ బ్రత్యేకముగ నేర్పాటుచేయఁబడిన పట్టు చీరలను దెచ్చి మా కొసంగెను. అవి చిత్రమగు జరీయంచులతో మృదులముగ నుండి ధగమెఱసిపోవుచుండెను. మేము వానిని మేనదాల్చి పట్టుగూటినుండి ఈవలకు వ[illegible] సీతాకోక చిలుకలవలె నొండొరులకు నే[illegible] త్సవ మొనర్చుకొనుచుండగ నా [illegible] వచ్చిన యామె ఇందిరాదేవి మా రా

ప్రతీక్షించుచున్నదని మా కెఱింగించెను.

అంతట మేము లోనఁ బ్రవేశించితిమి. నేనే ముందుఁ ద్రోవదీయుచు చెలికాండ్రతో నడచిపోయితిని. ఆహా! ఆ విద్యాలయ మెంత చిత్రముగ నెంత రమణీయముగఁ బ్రకాశించిపోవుచున్నది! చిత్రచిత్ర శిల్ప చిత్రములతో సృష్టియంతయు స్త్రీ మయమే గాని పురుషరూపముల కెచ్చటను స్థానము లేదను భ్రాంతి కవకాశమిచ్చుచు మామార్గ మంతయు సుందరీ మయమయి చక్షురుత్సవ కరముగ నుండెను.

ఆ రాజకుమారి యా వాసగృహ మింకను శృంగార పరంపరలచేత హృదయాకర్షముగ నుండెను. ద్వారదేశమున హంసారూఢయగు సరస్వతీదేవిచిత్రమున్నది. మఱియు నాదిశక్తియగు శాంభవి యవతార రూపములు గూడ నచ్చట తెల్లని స్ఫటికపు రాలతో జేయఁబడి మాకు వెఱఁగుఁ బుట్టించెను. ఒకచోట మహిషాసురమర్దనియగు దేవి ఉగ్రరూపిణియై మహాదేవుని గాలఁ ద్రొక్కుచు భయంకరముగ వక్త్ర గహ్వరమును దెఱచి తాండవించుచుండెను. అది స్త్రీలనిసర్గశక్తికిఁ జిహ్నము కాఁబోలు! శాంభవి, సరస్వతి, లక్ష్మి—వీరి యవతార రూపముల నడుమ శృంగారమగు నొక స్త్రీ రూపము నుండి మూర్తీభవించిన జ్ఞానవృష్టి వలె నీటిదుంపురు లీవలకు వర్షపాతమువలె పైకెగసి క్రిందకుఁ బడిపోవుచుండెను. అచ్చటి నేల సహితము తెల్లని పాలరాలతో నిగనిగ లాడుచుండెను. అచ్చట మేము ప్రవేశించి నంతనే ద్వారదేశమున నేవో సంగీతయంత్రములు మమ్మాహ్వానించుటకో యన గర్ణపేయమగు గీతముల నాలాపింపఁ దొడంగెను. ప్రభాతాయాత వాతాహతాలోలతంత్రులు నవ్యక్త మధురముగ బలుకుచున్న విపంచి యొకటియు, సగము పఠింపఁబడి కదలిపోవుచున్న పత్రములతో నొక పీఠమునం దున్న పుస్తకమొకటియు నాభవనము సంగీత సాహిత్య విద్యాలయమని మాకుఁ జెప్పక చెప్పుచున్నవో యనునట్లచ్చట గానవచ్చెను. వీనిని మేమంతగఁ బరీక్షింపక తొందరగ మేడ మెట్లనెక్కి యచ్చట విశాలమగు ప్రాంగణమున మా రాకను బ్రతీక్షించుచున్న నా మనోహారిణిని సందర్శించితిమి. ఆహా! ఆ ప్రథమ సమావేశ మిప్పటికిని నాకన్నులకుఁ గట్టినట్లున్నది. రెండు సింగపుబిల్ల లిరువంకలను గుక్కలవలె గూర్చుండియుండగా నడుమ నొక సింహాసనమున గొప్ప గొప్ప పుస్తకముల దొంతరల కెదుటఁ గొన్నికాగితముల నవలోకించుచు నామె సుఖాసీనయై యుండెను. ఇన్నాళ్లకుఁ గదా నా కన్నులు కృతార్థములైనవి! ఆమె ప్రత్యక్షమైన లావణ్య సీమ!—స్త్రీ రూపమునుదాల్చిన రామణీయకత!—సాక్షాత్కరించిన శృంగార రసము!—మూర్తీభవించిన మాధుర్యగరిమ! ప్రపంచమున సౌందర్యమంతయు కరచరణాదులతో స్త్రీరూపమును ధరించి నాయెదుట ప్రత్యక్షమయ్యెనని నేను భావించితిని. ఆమె దుచ్ఛమగు నీ భూగోళమున గాన్పింపవలసినది కాదు. ఇంతకంటె సూర్యప్రభాభాస

మానమగు నేదివ్యగోళమునన్నో ప్రభవించి యుండదగినది. భ్రాంతి నొదవించు గంధర్వ భామవలె, వింతబుట్టించు నప్సరఃకాంతవలె ఆమె నా కగుపించెనుగాని మనుజకాంతవలె నాకెంతమాత్రముఁ దోఁచినదేకాదు. నిశ్చయముగ నామె దివ్యాంగన! ఆమె కన్నుల యందంతలావణ్యమున్నది. ఆమె మూర్తి వైభవమునందంతయాకర్షణశక్తియున్నది. ఆమె సర్వాంగములయం దంతయలౌకిక రామణీయకత యున్నది. మహా మనోహర మగునట్టి స్వరూపమునుగాని, కమనీయతర మైన యట్టి రూపరేఖావిలాసమునుగాని, విద్యుల్లతవలె మెఱసిపోవునట్టి యుజ్వలాంగమును గాని నా జన్మమధ్యమున మఱియెచ్చటను జూచియుండను.

ఆమె మారాకనుజూచి తక్షణమే సింహాసనమునుండిలేచి నిలువఁబడెను. పాశ్చాత్య దేశీయలగు లక్షణవతులవలె నామె మిగుల నున్నతమగు నాకారవైభవమున ధగధగలాడుచుఁ దమజాతికంతకును నాయకురాలనుటకు నెంతయు నొప్పియుండెనని నాకుఁ దోఁచెను. ఆమె మమ్మువలోకించుచు నిట్లు పలికెను —"మీకు మనఃపూర్వకమగు స్వాగతము. ఈ విద్యాలయమునకే గాక తప్పక మీకును మీ దేశమునకును గీర్తి నుపార్జించు నూహతోమీరిచ్చటకువచ్చితిరి. క్రొత్తగ వచ్చువారి కిట్టి ఫల మజస్ర సహస్ర రూపముల సిద్ధించుచునే యున్నది. ఈ వర్తమానయుగము స్వర్ణాక్షరములతోఁ జరిత్రమున కెక్కునప్పుడు మా నామముతో మీ నామములుగూడ శాశ్వతముగ నుండిపోవును.—అయిన మీదేశమున యువతులందఱును ఇంత పొడుగా యేమి?"

"రాజాంతఃపురమున నుండు మేము మిగుల పొడుగే." అని కృష్ణవర్మ బదులు చెప్పెను.

"అట్లయిన మీరా రాజకుమారు నెఱుంగుదురా?" అని యామె తిరుగఁ బ్రశ్నించెను.

"ఎఱుగకేమి? భావిపురాతనాద్యతన పార్థివకుమారులలో నట్టివాఁ డొక్కఁడుఁడును ఉండఁడు. ప్రపంచమున దివ్యలోకానీతమగు పారిజాతపుష్పమొక్కటే యున్నట్లు మిమ్ములను భావించుచు తమ యున్నతాశయమునే యుపాస్తి యొనర్చుచుండును." అని యాత దుత్సాహమున బదులుచెప్పెను.

"మా విద్యాలయమున మాసమక్షమునందే ఇట్టి వాక్యముల విందుమని మేము స్వప్నమునందయినఁ దలంపలేదు. ఇది శుష్కమును, నిస్సారమును నగు వాక్యముల చెత్త. ఇవి కేవల పురుషులే జెప్పుకొనునట్టివి. ముచ్చె బంగారమువలె, మాయ నాణెములవలె నివి ధగధగ మెఱసిపోవుచు నగుపించినంత మాత్రమున వాని విలువ యెవ రెఱుంగనిది? ఇట్టి మెచ్చుకోలున నికరమగు నాణెముల ప్రమోతలేదు. గాజురాల చప్పుడువలె, ఇత్తడిడబ్బులసవ్వడివలె కర్ణమున నిది దుస్సహముగ నున్నది.—పుస్తకముల మొగమెఱుగని గౌతమీ ప్రాంతపు టడవిదేశమునుండి మీ రిచ్చటకుఁ

బలాయితులయి వచ్చి మీయందలి జ్ఞాన తృష్ణను, ఔన్నత్యవాంఛను వెల్లడించితిరి. అయినను మీ రామమాటను బట్టి మీరింకను శైశవావస్థయందే యుండిపోయిరనుట స్పష్టమగుచున్నది.—నిశ్చయముగ నారాజకుమారునిగూర్చి మేము స్వప్నమున నయిన దలపెట్టుటలేదు. ఈ మహాకార్యమును మొదట నుద్యమించినప్పు డీక నెవ్వనిని పెండ్లియాడకుండ మాలో మేము శపథముఁ జేసికొంటిమి. మీరుగూడ జెలువల నిసర్గలీలలని ప్రసిద్ధికెక్కియున్న హావభావ విలాసములను దూరముగా దొలగించుకొనవలెను. అవి మగవాండ్రచేతులలో గీలుబొమ్మలనుజేసి కేవలము వాండ్రసౌఖ్యమునిమిత్తమై మనలను వంటయింటి పడుకటింటి బానిసలఁ జేయుటకే తోడ్పడును. పురుషులకు భోగ్యవస్తువులుగ, కేవల మాటవస్తువులుగ నుండుట యుక్తమో, లేక వారలప్రభుత్వమంగీకరింపక వారలతో సమానముగ 'మీరెంతటివారలో మేము నంతటివారమే. సమస్తకార్యభారవహన క్రియాచాకచక్యమునందు, సర్వమార్గ దర్శక వ్యవహార నిర్వాహక ప్రతిభా సంపన్నత్వమునందు మేము మీ కెంతమాత్రమును దీసిపోవువారము గాము' అని సింహఘోషమున లోకమునకు బ్రకటింపగల్గుట యుక్తమో మీరే భావించుకొనుఁడు. అట్టి స్త్రీ జన్మమే—అట్టిజీవనమే ధన్యమని నే నూహించుచున్నాను. మీకట్టి యుత్సాహమును, పట్టుదలయు నున్నయెడల తప్పక మీరట్టివారు కాఁగలరు.”

అని జలదస్వనగంభీరముగ నారాజకుమారిపలుకు మాటలకు స్త్రీ వేషముల ధరించియుఁ బురుషులమను నాత్మజ్ఞానమును మార్చుకొననేరని మేము తిన్నవడి విని తుదకుఁ దలలువంచి నేలకుఁ జూచు నారంభించితిమి. అప్పు డావిద్యాలయాధికారిణి యొకతె లేచి కొన్ని శాసనములఁ జదివి మాకు వినుపించెను. అవి యెట్టివనిన—మూడేండ్లవఱకు నింటితో నుత్తర ప్రత్యుత్తరములను జరుపుకొనరాదు. మూడేండ్లవఱకు స్వాతంత్ర్య సీమలను విడిచి యడుగావల వేయరాదు. మూడేండ్లవఱకు మగవాండ్రతో మాట్లాడరాదు.—ఇట్టి వింకను జాలయున్నవి. వాని కన్నిటికి మే మంగీకారమును దెలుపుకొని తొందరగ బత్రములపై సంతకములఁ జేసితిమి.

అప్పుడు రాజకుమారి మమ్మవలోకించుచు నీవిధముగ జెప్పెను.

“ఉత్తిష్ఠత ! జాగ్రత ! ప్రాప్యవరాన్నిబోధత !* మన విద్యాలయౌన్నత్యమును, దానిని మించియున్న మనశాసనౌన్నత్యమును గన్నులఁ దెఱచి ప్రప్రథమమున సర్థముఁజేసికొనుఁడు. ఈ చట్టములు—ఇవి పురుషులు మనకై శ్రమపడి జేసియున్నవికావు. స్మృతులను జావగొట్టి స్త్రీజాతి తన సహజ స్వాతంత్ర్యమును బ్రకటించుకొనుచు నీ శాసనములు నమశాచించుకొనుచున్నది. ఇవియే

* లెండు ! మేలుకొనుడు ! పొందబడిన ఈ వరముల దెలసికొనుడు.

స్త్రీల కనుష్ఠేయములు. ఇవియే ఉపాసితవ్యములు. కౌమారావస్థయందుఁ దండ్రి, జవ్వనమున భర్త, చరమకాలమున కుమారుఁడును స్త్రీని బరిపాలింపవలెనే గాని స్త్రీకి స్వాతంత్ర్యార్హత లేదని పురుషులు మనల నింతవఱకు శాసించుచు వచ్చిరి. శ్రుతి శాస్త్ర స్మృతులీ సిద్ధాంతములనే శతసహస్రముఖముల మనుజజాతికిఁ దలవంపు గలుగునట్లు ఘోషించుచున్నవి. ఒక్క భారతవర్షమునందే ఈ యాగడమా? ప్రపంచమునం దన్ని దేశముల యందును అన్ని జాతుల యందును ఇట్టి శాసనములు బొమ్మజెముడువలె వ్యాపించిపోయియున్నవి. పూర్వపశ్చిమ మధ్యస్థమగు సమస్తదేశములయందును స్త్రీల నణచి యుంచుటయే పౌరుష లక్షణముగ భావింపఁబడుచున్నది. మానవతులకు మగవానితోడిదే లోకమను నాచారసిద్ధాంతములు నాగరికదేశములందును, అనాగరిక దేశములందును ఒక్కమచ్చుననే విజృంభించి యున్నవి. అట్టి యాచార వ్యవహారములను మూలమట్టముగ మనుజజాతినుండి పోవునట్లు చేయుటయే ప్రపంచమునకు శ్రేయస్కరము. అట్టి జగత్కల్యాణమునకుఁ ద్రోవఁ దీయుటకే మేమీవిశ్వవిద్యాలయ మిచ్చట స్థాపించితిమి.

"ఇక మా విద్యాలయమున కలంకారములుగ మేమిచ్చటఁ బ్రతిష్ఠించిన ఈ స్త్రీలోకనాయకమణుల నవలోకింపుడు! వీరు తుచ్ఛశృంగారముల నిగనిగమెఱసి పోవుచు దన్మహత్త్వమున పురుషులచే నఖిలషింపఁబడు చిత్రవర్ణపుఁ జిలుకలుగారు. స్త్రీజాతి కలంకారభూతలైన మహిళామతల్లులు. అదిగో! ఆంధ్రజాతికంతకును వన్నె దెచ్చిన కాంతాశిరోమణి రుద్రమదేవి! ఈమె పశ్చిమదేశస్థులుగూడ మెచ్చుకొనునట్లు నాంధ్రదేశమున కేలికయై ముష్కరమగు మహారాష్ట్రజాతికిఁగూడ నాంధ్రుల కత్తులపదను జవిఁ జూపించిన రాజనీతికోవిద!—ఈమె ఢిల్లీ సింహాసనమున నధిష్ఠాతయై భరతఖండమునకుఁ బేరుదెచ్చినఁ దురుష్కయువిద సుల్తానారజియా—ఇదిగో! ఈమె స్వదేశము నాంగ్లేయ భూతములనుండి కాపాడి స్వదేశసంరక్షణమున నప్రతిమానయై పెక్కు రణరంగముల శత్రువులను హతాశులుగ నొనర్చిన ఫ్రెంచినారీమణి జోన్ ఆఫ్ ఆర్క్! ఈమె మానవజాతి కంతకును గౌరవము దెచ్చిన వీరకాంత. పురుషులీమెను కడకు రాక్షసులై పట్టుకొని ఈమె నొక దయ్యముగజేసి బ్రతికియుండగనే కాల్చి పాపమును గట్టుకొనిరి; కాని బ్రతికియుండగ నీమె ఇంగ్లీషువారిని గడగడలాడించి పెక్కుయుద్ధములఁ బరాజితుల నొనర్చినది.—మఱియు నీమె 'నాయకురా'లను నాంధ్రచరిత్రమునఁ బ్రఖ్యాతిఁగన్న ప్రధానశిరోమణి. పల్నాటి వీరచరిత్రమున నొక నాటకమాడిన సూత్రధారిణి!—మీరు వీరలఁగూర్చి విపులముగఁ బఠించి హృదయములకుఁ జేవయు, నుత్సాహమును కల్పించుకొనుచుండుఁడు. సదాచారములనిగాని, సత్సాంప్రదాయములనిగాని స్త్రీల కసహ్యాభాజనమైన ప్రాత

పద్ధతుల నవలంబింప నూహింపకుఁడు. పూర్వాచారములను మనమెంత వదలించు కొనిన మనజాతి కంత శ్రేయము. ఎల్లప్పుడు ను స్త్రీజాతియున్నతియే మీ మీ మనోభీష్ట ములుగ భావించుచు స్త్రీలకిట్టి యౌన్నత్య మిచ్చిన వీరకాంతామతల్లుల చరిత్రములనే సదా పఠింపుచు వాని యుత్తమాదర్శముల నవలంబించుచు మీజీవితముల గృతార్థము లుగఁ జేసికొనుఁడు. మీరట్టి యాదర్శముల వలన మీజీవితములఁగూడ పరుల కాదర్శ యోగ్యములుగఁ జేసికొనఁగలరు. కావున దుచ్ఛమగు శృంగారభావములను మీహృద యాంతరాళములనుండి దూరముగాఁ ద్రోలి వైచి మాయున్నతాశయముల దృష్టిపథ మునం దుంచుకొని స్త్రీ స్వాతంత్ర్య భాగ్యో దయమునకు దోడ్పడవలసినదని మిమ్ము నే నుద్బోధించుచున్నాను.

"జ్ఞానమనునది కేవల పురుషహస్త గతమై యుండకుండ స్త్రీజాతికంతకు నందు బాటున నుండునట్లు మేమీ విశ్వవిద్యాలయ మును ప్రతిష్ఠించితిమి. ఇచ్చట మీరు మనుజజీవితమునకుఁ బరమ ప్రయోజనమైన జ్ఞానామృతమును దనివితీర నాస్వాదించి తర తరముల కర్మఫలములవలె నుండి స్త్రీల కవశ్య భోక్తవ్యమైయుండిన బానిసత్వ మును, దుచ్ఛశృంగారములను, శుష్కకథా లాలసత్వమును, ద్వేషమాత్సర్యాది దుర్గుణ పరంపరలను నశింపఁజేసికొని తేజస్వంతము లగు పవిత్రమార్గములఁ దెలిసికొనుడు. ఉత్తమముగ—సర్వోత్తమముగఁ బ్రతుకనేరక పోవుటకంటె జచ్చుట మేలు. ముఖ్యముగ మీయందున్న పసిమియుఁ జేవయుఁ జెడకుండఁ జూచికొనుఁడు. ఇఁక నేనితరకార్యములఁ జూచికోవలయును. కావున మీరావలకుఁ బోవచ్చును. నేడు శకుంతలాదేవి మహోప న్యాసమున్నది. ఆమె యొకవారమునుండి మావిద్యాలయమునఁ జేరవచ్చిన క్రొత్త బాలికలకు కర్తవ్యోపదేశ మొనర్చుచు సంభాషించును. అనుదినము కాంతలు నానా ముఖముల నిచ్చటకువచ్చి మావిద్యాలయ మునందలి శిష్యులసంఖ్యను వృద్ధిచేయుచు న్నారు." అని చెప్పి మమ్ముల నావలకుఁ బంపివైచెను.

మేమచ్చటినుండి కదలి శకుంతలాదేవి యుపన్యాసభవనమునకుఁ బోతిమి. అచ్చట శరదోదయకాలమున సూర్యరశ్మియందుఁ గుమిగూడియుండు కపోతసంఘమువలె ఉప న్యాసాకర్ణనోత్సుకలగు బాలికలు గుమిగూడి నిశ్శబ్దముగ గూర్చుండియుండిరి. అచ్చట నున్నతమగు నొకపీఠమున శకుంతలాదేవి యాసీనయై తన యుపన్యాస ముపక్రమింప సన్నద్ధయైయున్నట్లు మాకు గానవచ్చెను. ఆమె మిగుల నాకర్షణీయమగు మూర్తి వైభవమును బ్రదర్శింపుచుండెను. వింశతి శరద్వయస్కవలె ఆమె నాకగుపించెను. ఆమె కెడమవైపున నందమగు నొకతొట్టియందు రెండేండ్ల ప్రాయముగల ఆమె బిడ్డయగు నహల్య పరుండి నిద్రఁబోవుచుండెను. మేము శకుంతలాదేవికి కొంచెము చేరువగబోయి కూర్చుంటిమి. ఆమె మావంకఁజూచెను.

అశ్వత్థామ చచ్చెనని చెప్పునప్పుడు 'కుంజర'
మని ద్రోణుని చెవులకుఁ వినపించకుండ
దొట్రుపాటున పలుకు నజాతశత్రునివలె పార్థ
సారథి మాయిరువురకుమాత్రమే తెలియు
నట్లు 'నాయక్క' యని మెల్లగఁబలికెను.

"ఆహా! ఎంత శృంగారవతి! ఎంతలావ
ణ్యసీమ!" అని కృష్ణవర్మ తనయానంద
మును వెల్లడించెను.

"చాలు. ఇఁక నూఱకుండుము." అని
నేనంటిని. అప్పుడామె తనయుపన్యాస మారం
భించెను

"దృశ్యమానమగు నీబ్రహ్మాండ మొక
ప్పుడు కేవల ద్రవీభూతమైయుండిన కాంతి
పుంజము. ఆకాంతిపుంజమునుండి మన
కన్నుల కగపడుచున్న ఈఖగోళములన్నియు
నుదయించినవి. కేవల జ్యోతిర్బ్రహ్మము
నుండియే ఈనక్షత్రరాసులన్నియు నేర్పడినవి.
అట్టి నక్షత్రరాసులలో స్వయంజ్యోతులగు
సూర్యగోళము లెన్నియైననున్నవి. ఇది
మనుష్యమాత్రు లెవ్వరును భావమునఁ బట్ట
లేని బ్రహ్మాండభాండముల యుదంతము.
అంతగాఁ దెలిసియుండని తదితరసూర్య
గ్రహములగొడవ మనకెందులకు? నవగ్రహ
ములతోఁగూడి కందుకమువలె నేమహాగోళ
మునకు ప్రతినిత్యమును మనభూమి ప్రదక్షిణ
మాచరించుచున్నదో—ప్రత్యహమును మన
ల నేమహామూర్తి చూచుచుండుటచేతనే
మనకుఁ గన్నులున్న ప్రయోజనమున కవ
కాశ మేర్పడుచున్నదో—ఏ పవిత్రజ్యోతి
కిరణప్రసారమునందలి మార్పులచేతనే మన
కింత గ్రీష్మము, ఇంతవర్షము, ఇంత హేమం
తమునుగలిగి ఋతుభేదముల కవకాశ
మేర్పడుచున్నదో—అట్టి సూర్యభగవా
నుని మనమెల్లప్పుడును గన్నులుపెట్టుకొని
చూచుచున్నను తన్మహత్వమునుగాని, తన్ని
ర్మాణతత్వమునుగాని ఏలవలేశమును తెలిసి
కొనజాలమే! సర్వభూతాంతర్యామియైన పర
మేశ్వరునిమూలతత్వమువలెనే సూర్యభగ
వానునితత్వముగూడ 'యతో వాచో ని
వర్తంతే అప్రాప్య మనసాసహ' * అను
నుపనిషద్వాక్యమునకుఁ దార్కాణమైనది.
అట్లని మనకుఁ దెలిసియున్న మాటలనైనఁ
జెప్పుకొనకుండ నుండఁజాలముకద! కొన్ని
లక్షల సంవత్సరములకుఁ బూర్వము కేవల
మీసూర్యగోళమునుండియే గ్రహములును,
మనభూమియు వేఱుపడి ఈవలకువచ్చి ఇప్పు
డున్న స్థానములనుండి సూర్యమండలమునకు
జుట్టును . పరిభ్రమణ మొనర్చుచున్నవని
జ్యోతిర్విదులయూహ. తరువాత కొన్ని
మహాయుగములైన తరువాత భూమియందు
బ్రాణికోటులకు జీవించుట కాధార హేతువు
లేర్పడినవి. మొదట తామసరాక్షసబలయుక్త
ములైన జంతువులీభూమిపై నుదయించి
నవి. తరువాత మనుష్యుడే భూమిపై నవత
రించి సృష్టియంతయుఁ దనవశమున నుండు
నట్లుఁ బ్రయత్నించుచు వచ్చినాఁడు. తదితర
ప్రాణుల కంతగలేని బుద్ధిసంపద మనుజున

* దేనినిగూర్చి మాట మనసుతోగూడ పొందఁబడక తిరిగి పోవునో.

కుండుటచేత నతఁడు బలహీనాంగులైన ప్రాణులను, బలాధికులైన ప్రాణులనుగూడ నొక్కుమ్మడిఁ దనస్వాధీనములో నుంచునట్లు చేసికొనుచు వచ్చినాఁడు. అయిన నీమనుజుఁ డాదిమదశయం దెట్లుండినవాఁడు? వట్టి మృగప్రాయుఁడై తానును గేవలమొక రాక్షసునివలెనే బ్రదుకుచుండిన వాఁడు. ఇప్పుడు సహితము నరమాంసభక్షకులై మృగచర్మముల గప్పికొని మొగములను, దేహమును వికృతముగ బొడిపించుకొనుచుఁ గొన్ని సముద్రముల కావల కొన్ని కొన్ని దీవులలో నేటికిని గానవచ్చు ఆదిమనివాసుల వలెనే తానును ఒకజంతువై బ్రతికియుండిన వాఁడు. తానొకపశువై తనతోడియాఁడుదాని నొకపశువుగఁ జూచుచుండినవాఁడు. అట్టివారిప్పటి నాగరిక సంఘములలోఁ గూడఁ దుచ్ఛాతితుచ్ఛమయిన తత్త్వముల వెల్లడించుచుఁ గానవచ్చుచునే యున్నారు.

“తదనంతరమున నిప్పటివఱకు మానవ చరిత్రమున నేమయినది?—తెలిసినంతవఱకు భారతీయుల—గ్రీకుల—రోమనుల—ఈజిప్షియనుల—మఱియుఁ దదితరయూరపియనుజాతుల చరిత్రముల నన్వేషించి చూచినయెడల మన కేమి గానవచ్చును? పురుషునిదౌర్జన్యము—పురుషుని దుర్నయము—పురుషుని దుర్మార్గము. ఇంటింటను పురుషులు లోకకంటకులగు రాక్షసులనుమించి మనకంట దడిపెట్టుచువచ్చిరి. మనల విద్యాబాహ్యలనుగాఁ జేసి తామే విజ్ఞానవీచికల విహరించుచువచ్చిరి. కేవలాత్మీయసుఖ పరాయణులయి మనలఁ బీడించుచు వచ్చిరి. కేవలము తాము తమ విద్య, తమసుఖమేగాని స్త్రీలకెందులకును యోగ్యతలేదని స్పష్టముగా జెప్పుటయేగాక శాసనాదులను సహితము కల్పించి మనల నింతవఱకు బాధించుచువచ్చిరి.

“ఇట్టివారి యాగడము దేశమునుబట్టి, కాలమునుబట్టి, జాతినిబట్టి వివిధరీతుల విజృంభించుచు వచ్చినది. కావున నాయా దేశముల వారిచరిత్రములఁ గొంతవఱకు స్థూలరూపముగనైన మనము విమర్శించు కొన్నయెడల స్త్రీసంఘమున కింతవఱకును గలిగిన పతనమును, అప్పుడప్పుడు గల్గుచు వచ్చిన యున్నతియు మనము గ్రహింప గలము. కోమలులను ముష్కరులగు దురాత్ము లెంతయడచి వేయుచువచ్చినను అప్పుడప్పుడు చెప్పను జేయను జేతనయినఆడువాండ్రు విద్యుల్లతలవలె మానవచరిత్రమున గానవచ్చుచునే యున్నారు.

“పురుషదుర్నయ ప్రతిబింబితమైన మానవచరిత్రము నొకసారి పరీక్షించిచూడుఁడు! వేదకాలమున ఋషిసత్తములతో సరిసమానముగ బ్రహ్మవాదినులయి పేరెన్నికగన్న గార్గి, మైత్రేయి, వేదవతి మున్నగు మహిళామణులీ దేశమున మొదట నుదయింపకపోలేదు. తరువాతఁ బురాణయుగమున భారతవర్షపుఁ గాంతలు మిగుల నధఃపతితలయి పోయిరి. స్త్రీలు మూఢాచారములకుఁ గట్టువడి పాతివ్రత్య మొక పరమధర్మముగ భావించుచువచ్చిరి. మగవానితోడిదే లోక

మనియు, మగఁడు జచ్చినయెడల ప్రాణ త్యాగ మొనర్చుటయే ఉత్తమమనియు వారు భావించిరి. పాతివ్రత్యమను నసిధారావ్రత మును వారవలంబించి తమజీవితముల దుఃఖ భాజనములుగఁ జేసికొనిరి. అట్టి పతివ్రత లేమైన సుఖమనుభవించిరా ? సీత, ద్రౌపది, దమయంతి మున్నగు మహాపతివ్రత లెట్టి యెట్టికష్టముల ననుభవించిరో పురుష విరచి తములైన పురాణములే చెప్పుచున్నవి. అట్టి కష్టముల నెన్నిటినైన సహించుకొనుచు అవి యన్నియు తమ పూర్వకర్మముల ఫలముగఁ దలపోయుచు పురుషులను బల్లెత్తుమాట యైన బలుకకుండుటయే పుణ్యసాధ్వీలక్షణ మని వారు భావించుచువచ్చిరి. తన్ను నిష్కారణముగ నడవులలోవిడువ నాజ్ఞా పించిన రామునినిర్దయత్వమునైన దలంపక సీత 'ఎడపక పూర్వజన్మముల నేమిధునం బులఁ బాయఁజేసి వారడలఁగ నవ్వుచుండి తినో' అని వాపోవుచు "శ్రీరాము మో మీకాయంబునఁ జూచుభాగ్య మికలేదే మో సుమిత్రాత్మజా !" అని దుఃఖించుచు వచ్చినదిగాని పురుషుని దుర్ణయమున తనకట్టి యాపద కల్గినదని దూషింపలేదు. ఇఁక ద్రౌపదియొక్క కర్మమింతకంటెను కాలి పోయినది!! ఆమె పాండవులకందఱకునుసాధా రణధనంబఁట ! అయిన నామె కొంత స్వాత్ర ముకలది. తనకర్మమునుగూర్చి దుఃఖించును గాని వారుండగ తానట్టి దుర్గతికేల బాలు పడవలెనని సాహసమున తనభర్తలనుగూర్చి పలుకుచున్నది.

ఉ. అక్కట మోసపోయి యడి
యాసల జావకయున్న దాన ము
న్నొక్కెడ నేదురంత దురి
తోత్కట బాధలఁబెట్టియున్న నా
కెక్కడి దుఃఖశాంతి కడు
నేదుట యెమ్మెయిఁ గల్గనేర్చుమీ
ముక్కున నూర్పుగల్గ నొక
మూర్ఖునిచే బడితిన్ సభాస్థలిన్.

అని కీచకునిచేత నయిన పరిభవమును దలంచుకొనుచు బరిదేవనముఁ జేయుచున్నది. అందులకు భీమసేనుడు 'పూర్వమున సహి తము పతివ్రతలిట్టి యిడుమలఁబడిరి. నీవు మాత్రమెందులకు సహింపవని యను చున్నాడు.

సీ. చ్యవనుని వాంఛకు ♦ శర్యాతినందన
యిడుమల గుడువదె ♦ యడవిలోన
రాఘవుతోడ న ♦ రణ్యవాసముచేసి
సంతాపమందదె ♦ జనకతనయ
కుంభసంభవునికై ♦ ఘోరదుర్గముల లో
పాముద్ర యలజడి ♦ పాలుగాదె
నలుని పిఱుంద గా ♦ నలకేగి దమయంతి
మనుజులువడని యు ♦ మ్మలిక వడదె

గీ. వారు సైరణసేసి దు ♦ ర్వారమైన
నిరతిశయ దుఃఖభారంబు ♦ నిస్తరించి
సౌఖ్యమొందరె నీవునా ♦ చందమునన
యాపదలకోర్చి సంపద ♦ లనుభవింపు.

అని భీమసేనుఁ డామె తనపై కలుషింప కుండ నామెను ధీరస్వాంతనుచేయఁ బ్రయ త్నించినాఁడు. పురుషులెప్పు డిదియేధోరణి.

స్త్రీలెట్టి యాపదలఁబడినను చచ్చినట్లు సహించుకొనవలెను. అట్లొనర్చుకొనుటయే పతివ్రతాలక్షణము.

"ఆహా! ఎందఱు కాంతామణులీ పాతివ్రత్యసిద్ధాంతములకు బలియైపోయిరి! పురుషులంతతోనైన దృష్టివహించిరా! వారి యైహిక జీవనములేకాక తదనంతరజీవితములును, ప్రాణములును సహితము తమసొత్తని వారు భావించిరి. తామీలోకముఁ జచ్చినను తమస్త్రీలు చితులనెక్కి ప్రాణత్యాగ మొనర్పవలయునని వారుశాసించిరి. ఈ యార్యావర్తదేశమున నాయువుమూడి చచ్చిన పురుషులతోఁ దగులఁబెట్టఁబడిన సతీమణు లెన్నికోట్లయిన నుందురని నేనూహించుచున్నాను. ఇదంతయు మూర్ఖాచారముల వలన వచ్చిన పురుషుల దుండగమనుట కేమయిన సందేహమున్నదా? స్త్రీ తనమనమును, ధనమును, ప్రాణమును కిమ్మనకుండ బురుషుని కర్పింపవలయుననియు, లేనియెడల ధర్మసంక్షణమును, వర్ణసంకరమును, మహాప్రళయమును వచ్చితీరునని పురుషులు చావగొట్టి శాస్త్రములశాసించిరి. అంతటితో నూఱకుండిరా?— పురుషులు మనకెట్టి స్వతంత్ర్యాధికారమును లేకుండచేసిరి. ప్రకృతిసిద్ధమైన బుద్ధినైన మనముపయోగించి మన నైచ్యస్థితిని తెలిసికొని మేలుకొందుమని భావించి వారు 'స్త్రీబుద్ధిః ప్రళయాంతక' యనియు శాస్త్రములఁజేసి స్త్రీజాతి మఱియెన్నడును మఱచిపోకుండ నొకవాతను గూడ వేసిరి.

"ఆర్యావర్తదేశమునఁ గేవల పురుషరచితమై స్త్రీజాతినిట్టియధోగతికిఁదెచ్చిన ఈ శ్రుతిశాస్త్రస్మృతికంటకవితానము లిప్పుడెవరికిఁ గావలెను? నిష్ప్రయోజనమగు వీని నొక్కమూఁటు గట్టకట్టి మనకుఁ జేరువనున్న బంగాళాఖాతమున బాఱవేసిన తరతరములనుండి వచ్చుచున్న భరతమాత దుఃఖమైన కొంత యుపశాంతి పొందవచ్చునని నేననుకొనుచున్నాను. పరదేశముల గూడ పురుషులీవిధమున స్త్రీలపై నత్యాచారములఁ జేయుచునేయున్నారు. అయిన మనదేశమునకంటె పాశ్చాత్యదేశముల స్త్రీలకొకింత గౌరవమును, స్వాతంత్ర్యమును కలవని నేనూహించుచున్నాను. పాశ్చాత్య స్త్రీలకు వివాహవిచ్ఛేదనాధికారమున్నది. పునర్వివాహాధికారమున్నది. ఆజన్మాంత కన్యాత్వాధికారమున్నది. భారతమహిళల కిట్టియవకాశము లెవ్వియు లేవు. లేకపోవుటయేకాదు. వానినిగూర్చి ప్రసంగించుటయు మహాపాపమని 'పతివ్రతల' యూహ.

"భారతవర్షమున నన్ని జాతియువిదలకంటెను కేరళదేశసంజనితలగుకాంతలు భాగ్యశాలినులని నేను భావించుచున్నాను. 'ఆనుమళయాళ'మని పూర్వాచారపరాయణులవహేళనమొనర్చు పశ్చిమతీరమే నాగరికాగ్రగణ్యమని నిస్సంశయముగఁ జెప్పఁగలను. అచ్చట స్త్రీలకున్న స్వేచ్ఛ భారతవర్షమున మఱి ఏదేశమునఁగూడ నుండదు. అచ్చట స్త్రీలనుబట్టియే వారసత్వాధికార

ము లేర్పడుచున్నవి. ఇదియే భారతము నందును, జైమినిభారతమునందును స్త్రీ మండలమని వర్ణింపబడినరాజ్యమని నేనను కొనుచున్నాను. ఆరాజ్యమేలు 'ప్రమీల' యను నామె కావ్యగ్రంథముల రాజరాజేశ్వరి యనియు, కేరళదేశాధీశ్వరియనియు సంబోధనము లున్నవి. ఆమె వీరవ్యాపార ముల ప్రకాశితయయి ఆహవవిద్యా విశారదలయిన పదిలక్షల కన్యకలతో యుద్ధ రంగమున కుఱికి అప్రతిహత వీరుఁడైన అర్జునుని సహితము గడగడ లాడించిన వీరనారి. ఆహా! ఆమెవలె యుద్ధమొనర్పగల యోషు దిప్పుడుగాని యిఁక ముందుగాని భూమిపై నవతరించుట కవకాశమున్నదా? పాశ్చాత్య దేశములలో పూర్వకాలమున 'అమెజాన్' జాతి యోషువాం డ్రట్టివారు.

"ఈ స్వేచ్ఛా సీమలలో మేముకూడ 'ఆడుమండలము' వారి వైఖరిని —'అమెజాన్' జాతిస్త్రీల వైఖరిని 'కన్యారాజ్య' మేర్పఱచుకొంటిమి. ఇన్నాళ్లకిట్టి విద్యాలయ మిచ్చట స్థాపించిన రాజకుమారీమణికి మనమందఱమును కృతజ్ఞలమై యుండ వలయు.

"పురుషుఁ డిఁక మనలఁ ద్రొక్కి యడచి యుంచుట కవకాశములేదు. మన భావి భాగ్యోదయమున కిది యుషఃకాలము. తగినంతకృషి సల్పినయెడల మనమిచ్చట సత్ఫలములఁ బొందగలము ఆచారశృంఖలాని బద్ధమై బానిసత్వమునయున్న స్త్రీజాతిని మన రాజకుమారి స్వేచ్ఛాపరతంత్రమగునట్లు చేసి మనకిట్టి యవకాశములఁ గల్పించినది. ఆమె ఈ మహత్కార్యమునకు బునాదులను వేసినది. మనమందఱమును గలసి మనభాగ్య సౌధముల నిచ్చట నిర్మింపవలసి యున్నది. పురుషు లేయేవిద్యల నేర్చుకొందురో మీరాయా విద్యలన్నియు నేర్చుకొనవచ్చును. సందేహింపకుండ మీరన్నికళల నిచ్చట కృషి సల్పవచ్చును.

"స్త్రీ లేమి? నేర్చుకొనుటయేమి?— యని కొందఱవహాస్యము చేయవచ్చును. స్త్రీల శిరములుకాని వారి లలాటములుకాని పురుషుల శిరస్సులవలె పెద్దవియు విశాలములును కావని కొందఱాక్షేపింపవచ్చును. అయిన గొందఱు పురుషులకు స్త్రీలకంటెఁ చిన్ననగు తలలులేవా? శిరఃప్రమాణమును బట్టియా బుద్ధి విశేషమును నిర్ణయింప వలసినది? దేనియందైన పరిశ్రమమునందు గదా సునిశితత్వమును, తీక్ష్ణతయు నేర్పడును! పురుషుఁడు తనకుఁ బ్రకృతివలన నేర్పడిన పైశాచికబలమున ముందు కార్య రంగమున కుఱికి జ్ఞానోపార్జన మొనర్చుకొను చున్నాఁడు. వానికంటె కొన్ని మహాయుగములు మనము వెనుకఁబడిపోతిమి. అయిన నేమాయె! స్త్రీలబుద్ధి ముందే వికాసమునకు వచ్చుట జగద్విదితము. కావున నిరుత్సాహమున కవకాశము లేనేలేదు. ఇఁక పురుషుల ప్రతిభయు, స్త్రీల ప్రతిభయుఁదర్కించి చూచినయెడల మనలయందు విశ్రుత

నామము లెంత యల్పసంఖ్యాకులయినను పురుషులకుఁ దీసిపోవునవి కావు. ఎలిజబెత్, రుద్రమదేవి, జోన్ ఆప్ ఆర్క్ మున్నగు వీరకాంత లేమగవారికిని దీసిపోయినవారు కారు. అట్టి వారితో సరిసమానముగ మన మెంచుకొన వలసిన దీఇందిరాదేవి. తన యంతఃపురమునందలి బంధువర్గము నంతయు వదలి స్త్రీ జాతి నుద్ధరింప బద్ధ కంకణయై యున్నది. స్త్రీల కవకాశములులేని జగ త్తంతయు పట్టి యెడారి. ఈ స్వేచ్ఛాసీమ యెడారులందలి ఫలవంతములగు ప్రదేశముల వంటిది. మన మిచ్చట పెరుగుట కవకాశ మున్నది. పురాతనాచారపు దుపాను లిచ్చట మనల బీడింపవు."



గుఱ్ఱపు స్వారి.

గుంటూరు శారదానికేతనవార్షికోత్సవములో జూపఁబడిన బాలికల వ్యాయమక్రీడలలో నొకటి. వ్యాయామప్రదర్శనము శ్రీమతి తుర్లపాటి రాజేశ్వరమ్మగారి అధ్యక్షతను జరిగినది.

# గ్రంథ పరిచయము

**ఆంధ్రసహకార పత్రిక.** మదరాసు రాష్ట్రీయసహకార యూనియను, నెల్లూరు జిల్లా కోఆపరేటివుబ్యాంకింగుయూనియను వార్లచే ప్రకటితమగు మాసపత్రిక. ప్రథమ సంపుటము ప్రథమసంచిక జనవరి 15 వ తేదిని శ్రీయుత వెన్నెలకంటి అప్పారావుగారి సంపాదకత్వమున వెలువడినది. ఇంతవరకు పైరెండుసంస్థలును వేర్వేరుగా రెండుపత్రికలు ప్రకటించుచు తన్మూలమున ఆంధ్రదేశములోని సహకారోద్యమమునకు చేసిన సేవలు ఆంధ్రసహకారులకు విశదమైయేయున్నవి. ఈరెండిటి సమ్మేళనమువలన పుష్టికెక్కి-మాసమాసము 100 రేసిపుటలలో అఖిలభారతదేశమునను సహకారోద్యమము పొందుచున్న పరిణామములను విమర్శించు సుప్రసిద్ధులవ్యాసములతో ప్రకటింపబడుచున్న యీపత్రిక ఆరెంటికంటె నూరుమడుంగు లెక్కువ ఆదరణము పొందవలెనని కోరుచున్నాము. ఆంధ్రదేశములో సహకారోద్యమమును బోధించుసమర్థులైన దేశికులు ప్రస్తుత మిద్దితప్ప వేరెవరును లేరు కనుక సహకారసంస్థలెల్లయు దీనికి చందాదారులుకాక తప్పదని హెచ్చరించుచున్నాము.

---

**పారిభాషికనిఘంటువు.** వ్యవహారకోశము 270 పుటలు, శాస్త్రపరిభాష 240 పుటలు, ఇంగ్లీషుకు తెలుగు, తెలుగుకు తెలుగుఅర్థములను తెలుపు నిఘంటువు. గ్రంథకర్త దిగవల్లి వేంకటశివరావుగారు, బి.ఎ. బి.ఎల్, బెజవాడ. వెల రు2-8-0లు. కోటులు, రాజకీయములు, శాస్త్రీయవిషయములకు సంబంధించిన అనేకపదములకు అర్థములు వ్రాయబడినవి. వ్యవహారస్థులకు దేశసేవకులకు, విద్యార్థులకు, వ్యాసరచయితలకు దీనివలన కలుగు ప్రయోజనములనంతములు. ఆంధ్రభాషకిది అమూల్యభూషణము. విద్యాధికు లనేకుల ప్రస్తుతు లందినది. పాఠ్యగ్రంథనిర్ణయసభవారిచే గ్రంథాలయోపయోగమునిమిత్త మంగీకరింపబడినది.

**వేంకటేశ్వర.** వారమున కొకతూరి వెలువడు ఆంగ్లమాసపత్రిక. జనవరినెలను డియు తిరుపతినుండి వెలువడుచున్నది. శ్రీనారాయణదాసోజీవారు ప్రకాశకులు సంవత్సరచందా రు 3-0-0లు. విడిపత్రిక 9 పైసలు తిరుమల తిరుపతి దేవస్థానముల పరిపాలనములోని లోపాలోపములను విమర్శించుటయేగాక, హిందూదేవాలయములు, పూజావిధానములు, పురాణములయొక్క అంతరార్థములను విశదీకరించు అనేక గంభీర మనోహరవ్యాసములను గూడ ప్రకటించుచు దేశములోనుంచి మాయమగుచున్న సనాతనాస్తిక్య భావములను పునః ప్రతిష్ఠించుటకు గడంగుచున్నది.

---

**రామతీర్థస్వామి. జీవితము** డెమ్మీసైజు 150 పుటలు. వెల రు 0-8-0 లు గ్రంథకర్త శ్రీయుత బులుసు వేంకటేశ్వరులుగారు యమ్.ఎ, పి.ఆర్. కాలేజి, కాకినాడ. యోగి, వక్త, కవి, సన్యాసి, తపస్వి, దేశభక్తుడు-దేశికుడై భారతవిజ్ఞానము, మహిమలయొక్క కీర్తిని ప్రపంచమున దశదిశలను వెలయించిన స్వామివారి జీవన మెవ్వరి కుత్తేజము కలిగించదు? అందునను శ్రీ వేంకటేశ్వరులుగారివంటి విద్వాంసులు రచయితలు చెప్పఁగడంగినప్పుడు బంగారమునకు వెలిగార మద్దినట్లుండకమానదు. అనర్గళ మధురమైనధార, అత్యుపయుక్తములగు విమర్శనలు, అతిసుందరమైన సూక్తి, వీనిమధ్యవికసితపుష్పములవలె వాసించు స్వామివారి సందేశముల, రచనల, ఉపన్యాసముల, ఉపదేశముల భాగములు. పాఠ్యగ్రంథము కాదగ్గది.

---

**గ్రంథస్వీకారము.** ఆరోగ్యవైద్యము, సర్వేశ్వర శతకము, గోల్కొండ కవులసంచిక, అమ్మ, వివేకానంద, స్వప్నకథ.



# సంపాదకీయములు

## భారతశాసనసభ విజయములు

నూతన భారతశాసనసభలో దేశీయ ప్రతినిధులకు విజయము తరువాత విజయము చేకూరుచుండుట మిగుల ప్రశంసనీయము. దీనికికారణము ప్రజాప్రతినిధులలో అధిక సంఖ్యాకులు కాంగ్రెసు జాతీయపక్షములవారగుట యొకటి—అధిక మహమ్మదీయ సంఖ్యగల ఇండిపెండెంటు పక్షమునకు జిన్నాగారు నాయకులుగా నుండుట రెండవకారణము. మహమ్మదీయులకును హిందువులు లేక కాంగ్రెస్సువారికిని సాంఘికపరిష్కారము విషయమునతప్ప రాజకీయములలో నెట్టిభేదమును లేకున్నను ఈయొక్క ప్రభేదమే కాంగ్రెస్సుకు సంపూర్ణవిజయములు కలుగకుండుటకును, స్వతంత్రపక్షమను వేరే పక్షమొకటి కాంగ్రెసుకును ప్రభుత్వమునకును మధ్యన నడ్డగోడవలె నిలచుటకును పెద్ద కారణమై యున్నదని కాంగ్రెసువారు నేడు గ్రహింపఁ గలిగిరి. ఈపక్షమే యొకటిలేకున్నచో ఇండియాబిల్లు పూర్తిగా త్రోసివేయఁబడి కాంగ్రెస్సువారు ప్రజలకు చేసినవాగ్దానము పూర్తిగా చెల్లియుండెడిది. ఈపక్షమొకటి ఉండడమువల్లనే కాంగ్రెసువారి సంస్కరణనిరాకరణ తీర్మానములు నెగ్గకుండుటయు, జిన్నాగారి మూడుసవరణలు విడివిడిగా నెగ్గుటయు, సాంఘికపరిష్కారమామోదింపఁ బడుటయు తటస్థించినది. ఇది ప్రభుత్వమునకు కొంత పరాజయమైనను కాంగ్రెస్సుకు గాని దేశమునకుగాని సంపూర్ణవిజయమని చెప్పుటకువీలులేదు. ఈమాత్రము విజయమైనను కలుగుట ప్రశంసనీయమే యైనను హిందూ మహమ్మదీయ సంపూర్ణ సఖ్యము లేకపోవుటవలని నష్టమును కాంగ్రెసువారుగ్రహించి తదనుకూల ప్రయత్నములకు కాంగ్రెసు జిన్నాపార్టీలవారు ప్రయత్నించ బూనుకొనుచున్నందులకు వారిని నెంతయు అభినందించి వారిపూనికి ఫలసిద్ధిని బడయవలెనని కోరుచున్నాము.

నిజమైన స్వరాజ్యమునకు లక్షణములు మూడు. వ్యక్తిస్వాతంత్ర్యము, సంఘస్వాతంత్ర్యము, దేశస్వాతంత్ర్యము. కాంగ్రెసువారు అసెంబ్లీలో ప్రవేశించిన ఈరెండుమాసములలోనే ఈ మూడు విషయములనుగూర్చి ప్రశంసనీయమైన వాగ్యుద్ధమునొనరించి తమ పట్టును చాలావరకు నెగ్గించుకొనిరి. శరచ్చంద్రబోసుగారిని నేరము నిరూపణము చేయనిదే నిర్బంధమునసుంచి, విచారణసలుపక, ఆసెంబ్లీకి వచ్చుటకు అనుజ్ఞ నీయనం

దుకు గర్హించుచు తేబడిన తీర్మానమును కాంగ్రెసు ఇండిపెండెంటు పక్షములు రెండును కలిసి ప్యాసుచేసినవి. ఇట్లే శాంతియుత సత్రకమాందోళనము చేయుచున్న రెడ్డు షర్టులు లేక దేవసేవక సంఘముపై నిషేధ మును తొలగించకున్నందుకు గర్హించుచు తేబడిన తీర్మానమును నెగ్గినది. ఇది సంఘ స్వాతంత్ర్యమునకు చెందినవిషయము. మూ డవది దేశస్వాతంత్ర్యమునకు సంబంధించిన విషయము. హిందూదేశ శాసనసభలనుగాని వర్తకసంఘములనుగాని ఆలోచించకుండ భారత బ్రిటిషుప్రభుత్వ సభ్యులు ఒనరించిన ఇండోబ్రిటిషు వర్తకపు టొడంబడికను నిర సించుచు మరియొకతీర్మానము తేబడినది. ఈతీర్మానముకూడ నెగ్గినది. బ్రిటిషుప్రభు త్వమువారికి ప్రజాప్రాతినిధ్యము మీాదను, శాసనసభలమీాదను, భారతదేశముమీాదను ఏమాత్రము గౌరవమున్నను, శరచ్చంద్ర బోసుకు స్వాతంత్ర్యమిచ్చుట, 'ఖుదాఖిద్మ తుగారుల'పై నిషేధమును తొలగించుట, ఇండోబ్రిటిషు ఒడంబడికను రద్దుచేయుట జరిగించవలసియున్నది. కాని దేశీయవాంఛ లకు ప్రతికూలముగ పార్లమెంటువారు ఇండియాబిల్లును ప్యాసుచేయుట కేనిశ్చ యించుకొని తొందర పడుచుండుటనుబట్టి వారికట్టిగౌరవమేమియును లేదనియు, 'భారతదేశపుకుక్క లెన్నివిధములుగ మొఱ గుచున్నను బ్రిటిషువారి ఒంటెలదళము నిర్గ మించుచునే యుండు'ననియు స్పష్టమగు చున్నది. సర్వవిధములను హిందూ మహ మ్మదీయ సఖ్యత కుదిరి ప్రత్యేకనియోజక వర్గములుతొలగి సంయుక్త నియోజకవర్గము లేర్పడువరకైనను ఈమొఱగులవలన నెట్టి ప్రయోజనము నుండదని కాంగ్రెసు ఇండి పెండెంటుపక్షములు గ్రహించవలసిన సమయ మాసన్నమైనది.

కాంగ్రెసువారి తీర్మానములు.

ఇక ప్రధానతీర్మానమునకుపట్టినగతి నాలోచించినచో ఈవిషయము మఱియును స్పష్టము కాగలదు. క్రొత్త ఇండియాబిల్లును తన్మూలకముగ వచ్చెడి శాసనమును హిందూదేశమును, కాంగ్రెస్సును, మితవా దులునుగూడ నిరాకరించుచున్నారనుటను వారివారిసభల తీర్మానములు, నాయకుల యుచ్చారణములు, కాంగ్రెస్సువిజయములు సుస్పష్టము చేయుచున్నవి. కాని ఈతీర్మా నము భారతశాసనసభలో నోడిపోయినది. 61 వోటు లనుకూలముగను 72 వోటులు ప్రతికూలముగను వచ్చినవి. బాగుగా నాలో చించినచో హిందూమహమ్మదీయ సఖ్యత లేకపోవుటయే దీనికి కారణమని తెలియఁ గలదు. ఈసఖ్యము లేకపోవుటకు సాంఘిక పరిష్కారమును మహమ్మదీయు లామోదిం చుటయు కాంగ్రెస్సువారు నిరాకరింపకయు అంగీకరింపకయు నుండుటయు తన్మూలమున వారికిగల పరస్పరానుమానములును అని తేటతెల్లము. కాంగ్రెసువారుతెచ్చిన ఈ తీర్మానము ఓడిపోవుటలో ఇట్టిసందర్భమున ఆశ్చర్యము లేదు.

కాంగ్రెస్సు భారతదేశప్రతినిధిసంస్థ యనియు దానిఅభిప్రాయమే అఖిలభారత దేశీయాభిప్రాయమనియు కాంగ్రెస్సువారు చెప్పుకొనుచున్నారు. ఇది చాలావరకు సత్యమనుటకుకూడ, ఆటంకములేదు. కాని సాంఘిక పరిష్కారము విషయమై దేశము తటస్థముగ నున్నదనువిషయమున కాంగ్రెసు అభిప్రాయము సరికాదని అంతకుముందరి చర్యలేకాక అసెంబ్లీతీర్మానమును విశదీకరించుచున్నది. తటస్థభావము కాంగ్రెసు వ్యక్తులు, వారిచేపాలింపఁబడుసంస్థల యొక్క భావముకాని అసంఖ్యాకులగు హిందూ మహమ్మదీయుల భావముకాదు. హిందువులు, సిక్కులు దానిని నిరసించుచున్నారు. మహమ్మదీయులు ఐరోపీయులు ప్రభుత్వసభ్యులు దానిని అంగీకరించుచున్నారు. ఇట్టిసందర్భములో కాంగ్రెసువారి తటస్థ తీర్మానము ఓడిపోవుటలో ఆశ్చర్యములేదు. దానికి ప్రతికూలముగ 84 వోటులును, అనుకూలముగ 44 వోటులు మాత్రమును వచ్చినవి.

జిన్నాగారి సవరణలు.

కాంగ్రెసు తీర్మానమునకు కలిగిన యీ పరాజయములకు తరువాత జిన్నాగారి సవరణలంగీకరింపఁబడుటలో ఆశ్చర్యములేదు. జిన్నాగారి రాజకీయసవరణలు నెగ్గుట దేశమునకు భారతశాసనసభకుగూడ ప్రతిష్ఠకరము. జిన్నాగారు సవరణమును మూడు భాగములుగ చేసిరి. ఒకటి ఫెడరేషనును తృణీకరించుట, రెండు రాష్ట్రీయపరిపాలనము అసంతృప్తికరమనుట, మూడు సాంఘికపరిష్కారము అంగీకృతమనుట. మొదటి రెండు సవరణలను ఒకభాగముగాను, మూడవసవరణమును వేరొకభాగముగాను తేకున్నచో ఆతీర్మానమునకు వేరేగతి పట్టియుండును. మూడవసవరణమునకు కాంగ్రెసువారును జాతీయవాదులును ప్రతికూలురగుటచేత ఆసవరణ కారణముగా అసలు తీర్మానమునే యిరువురును ప్రతిరోధించియుందురు గనుక ఓడిపోయి, ప్రభుత్వమునకు సంపూర్ణవిజయము చేకూరియుండెడిది. అవి రెండుభాగములగుటకతనను రాజకీయ భాగమునకు విరోధులెవ్వరును లేకపోవుటచేతను ఆభాగమునెగ్గినది. ఇంతవరకే దేశప్రతిష్ఠ నిలచినది. రెండవభాగము నెగ్గుట దేశమునకు కాంగ్రెస్సుకు భారతజాతీయతకు గూడ అప్రతిష్ఠయేకాక ప్రభుత్వమునకు సంపూర్ణవిజయము. పైన భేదములు వారి భాగ్యమను సిద్ధాంతమున కిది ప్రబలనిదర్శనము. ఫెడరేషనును, రాష్ట్రీయపరిపాలనావిధానమును నిరసించు తీర్మానమునకు 74 వోట్లనుకూలముగను 58 వోట్లు ప్రతికూలముగను వచ్చినవి. సాంఘిక పరిష్కారము నంగీకరించు భాగమునకు 68 వోట్లు అనుకూలముగను 15 వోట్లు ప్రతికూలముగను వచ్చెను. 53 గ్గురు కాంగ్రెసుప్రతినిధులు తటస్థముగ ఊరుకొనిరి.

కాంగ్రెసు వైఖరి.

కాంగ్రెస్సువారి తటస్థమున కర్థము అంగీకారము కానప్పుడును, వారి తాటస్థ్యఫలి

తము అంగీకారమగునప్పుడును తాటస్థ్య మక్షమాపణనీయమనుట కాటంకములేదు. తాటస్థ్యతీర్మానము వచ్చినప్పుడు అనుకూలముగా నుండవచ్చును కాని అంగీకారమునకు గాని నిరాకరణమునకు గాని తీర్మానము వచ్చినప్పుడు తటస్థముగనుండి అంగీకరింపఁబడుటకుగాని నిరాకరణమునకుగాని కారకులగుట వారు దేశీయులకిచ్చినవాగ్దానములకు విరోధముకాకుండుటెట్లో వారూహించుకొనకుండుట విచారహేతువు. నిరాకరణతీర్మానమునకు వారు తటస్థముగ గాని ప్రతికూలురుగగాని యుందురనియు నెగ్గదనియు తలచి జాతీయపక్షమువారట్టి తీర్మానమును తేక వారిదూరదృష్టిని చూపించుకొనిరి. అంగీకారమునకు కూడ వారు తటస్థముగనుండి అది నెగ్గగలదను ధైర్యముతోను ప్రభుత్వమువారి ఆసరాతోను జిన్నాగారీతీర్మానమును తెచ్చిరి. కాంగ్రెసువారి తటస్థభావము అంగీకారమునకు విరోధముకాదా? అంగీకార తీర్మానము వచ్చినప్పుడు దానికి వారు విరోధులై యుండియు ప్రతికూలముగ వోటుచేయక తటస్థులై యుండుట రాజకీయ జ్ఞానమును గాని ధర్మమునుగాని సూచించదు. అంగీకరింపవలెననిగాని నిరాకరింపవలెననిగాని యెవరైన తీర్మానమును తెచ్చినప్పుడు దానికి ప్రతికూలముగ వోటునిచ్చెదమని కాంగ్రెసు నాయకులును కాంగ్రెస్సు మహమ్మదీయ నాయకులును, ఫిబ్రవరి ఆరవ తేదిని వల్లభాయి పటేలుగారును తమతో చెప్పిరని పండిత మాలవ్యాగారు కాశీలో 13 వ తేదిని జరిగిన బహిరంగ సభలో చాటియున్నారు. అట్టి తీర్మానమును గూర్చి తమకేవీ భావము లేలేనట్లును, తాము శాసనసభలో లేనేలేనట్లుగను భావించుకొని కాంగ్రెసువారు మినుకు మినుకు చూచుచు నూరకుండి, భారతశాసనసభ ఇట్టి అజాతీయమగు పరిష్కారము నంగీకరించుచున్నదనుభావము ప్రపంచమున వ్యాప్తమగుటకు కారకులైనందుకు దేశీయులకు కాకున్న తమకు తామైనను కాంగ్రెసుసభ్యులు జవాబు చెప్పుకొనవలసినవారగుచున్నారు.

## సమ్యక్కర్తవ్యము.

వారి యుద్దేశ్యము త్వరలోనే వేరే పరిష్కారమును తమలో తాము కుదుర్చుకొని దానిని ప్రతిపాదించుచు దీనిని త్రోసివేయుదమనియై యుండవచ్చును. అట్లయినచో అందుకు వెంటనే గడంగవలెను. ఇది యిక ముందు కాంగ్రెసువారి ప్రప్రథమ సమస్యయై యుండవలెనని సత్యమూర్తిగారు తెలిపిన అభిప్రాయముతో కాంగ్రెస్సువారును కాంగ్రెసు మహమ్మదీయులును జిన్నాగారును గూడ ఏకీభవించు చున్నారనియే నమ్మవలెను. త్వరలో హిందూ మహమ్మదీయ సమాఖ్య కుదిరి, కాంగ్రెసు ఇండిపెండెంటు పక్షము లేకమై, శాసనసభలద్వారా ప్రబలమగు సక్రమాందోళనము సలిపి, ప్రస్తుతము కాబోవుచున్న శాసనము సంపూర్ణముగా మారి నిజమైన భారతదేశీయప్రభుత్వము

హిందూదేశములో నెలకొల్పఁబడునుగాక యని కోరుచున్నాము. బ్రిటిషువారి మొండి తనము మనలో మనకు సఖ్యము కుదిరేవరకే తప్ప అటుతరువాత అర్థనిమేషమైన నుండ దనియు, మనలో మనకు సఖ్యము కుదిరిన వెంటనే బ్రిటిషువారితో కూడ సఖ్యము సులభసాధ్యమగు ననియు, పిమ్మట భారత దేశము కెనడా, దక్షిణాఫ్రికా, న్యూజీలండు మొదలగు వలసరాజ్యములవలె సంపూర్ణమైన డొమినియను స్టేటసు ననుభవించుచు బ్రిటిషు సామ్రాజ్యములో సంతుష్ట సభ్యత్వముతో కిరీట మకుటమై యుండగలదనియు భారతీయులును బ్రిటిషువారును కూడ ఎంత వేగ మంగీకరించిన అంతమంచిది. కాంగ్రెసు వారును, జిన్నాగారును ఇట్టి శుభసన్నివేశము సన్నిహిత మొనర్తురుగాక!

సంపూర్ణ స్వాతంత్ర్యమా, డొమినియను స్టేటసా అనే ఊకదంపు కాలక్షేపమున కిక అవకాశములేదు. వెస్టు మినిస్టరు స్టాచ్యూటు ప్రకారము రెండిటికి భేదములేదు గనుకనే డొమినియనుస్టేటసు నిచ్చుట కిష్టపడక ఆపద మును బిల్లుయొక్క ఉపోద్ఘాతములో చేర్చ లేదనియు, చేర్చకపోయినను భారతీయులు అపార్థముచేసుకొన నక్కరలేదనియు కార్మిక వర్గమువారు తగాయిదా పెట్టరాదనియు సర్ శామ్యూయలుహోరుగారే అభయ మిచ్చుచున్నప్పుడు, ఆ రెండిటికి నేమో భేదమున్నట్లు మితవాదులును కాంగ్రెస్సు వారును ఒకరినొకరు నిరసించుకొనుచు ఉపన్యాసము లిచ్చుకొనుచుండుట అర్థము లేనిపని. ఎవరేమనుకొన్నను మనకు కావల సినది మనలో మన సఖ్యము, మనయిల్లు మనము చక్కపెట్టుకొనుటకు శక్తి. ఇవి మనలో యెంతవరకు రాణించిన మన 'స్వరాజ్యము'నకును బ్రిటిషు సామ్రాజ్యమున కును, నిఖిల ప్రపంచమునకును అంత శాంతియు సౌభాగ్యమును లభించును.

సార్వభౌముని జూబిలీ.

రానున్నది బ్రిటిషుసార్వభౌముడగు పంచమజార్జి పరిపాలనముయొక్క రజతోత్సవము. బ్రిటిషుపార్లమెంటుతోగాని, ప్రభుత్వముతోగాని, వర్తక సంఘములతో గాని, అధికార వర్గములతోగాని, మన జాతీయాశయములకు సౌభాగ్యమునకు ప్రతికూలముగ మాటలాడుచున్న మరి యే వర్గముతోగాని, మనకుగల భేదాభిప్రాయ ములను యీ యుత్సవానందమునకు అడ్డుగా మనము తీసుకొనరాదు. ఇవి అన్నియు గృహచ్ఛిద్రములు. వీనికి కారణము చాలవరకు మనభారతీయవర్గములలోనే యున్నది. మనలోమన కైకమత్య బలమున్నచో నిర్మాణశక్తియున్నచో ప్రతిఘటన సామర్థ్య మున్నచో పైవారెల్లరును తదనుకూల ములైన రాయభారములనే యితర సామ్రాజ్యస్థదేశములతోవలె మనతోకూడ సలిపియుందురు. మనము దీనికి శుభప్రారంభము లొనరించుచున్న మహూర్తములో ఈ ఆనందవాహినిలో మునిగి తేలుటతప్ప మూలుగులును ముక్కిళ్లును పెట్టుకొనుట

సల్లక్షణముకాదు. ప్రభుత్వోద్యోగస్థులు, సామంతరాజులు, జమీందారులు, వర్తకులు, శ్రీమంతులు, దేశీయనాయకు లెల్లరును ఇందుకు భూరివిరాళములిచ్చి ఉత్సవముల యథోచిత శోభతో జరిపి దేశాభివృద్ధికర మగు రెడ్డుక్రాసు సొసయిటీ, లేడీ డప్రిను ఫండు మొదలగువానికి సహాయముచేసి సార్వభౌముని కానందమునుగూర్చి ఆతని ఆశీర్వాదముల నందుదురుగాక !

ప్రసవరోగనివారణ ప్రయత్నములు.

ప్రసవరోగములు, ప్రసవకారణమున మరణములు మొదలగువాని కనేకస్త్రీలు మనదేశముననే గాక, అత్యధికముగా ఆస్పత్రులు మందులు వైద్యులు హెచ్చు పెఱిగి పోయిన పాశ్చాత్యదేశములలోఁగూడ గుఱి యగుచున్నారు. స్త్రీపురుషులు వారివారి శరీరధర్మముల గుర్తెఱిగి యుక్తాహార విహార లోలురై మాత్రము వర్తించినయెడల ఈకష్టములు తగ్గఁగలవు, కాని నవీననాగరకత విజృంభించుచున్నప్పటినుండియు పురుషులకంటె స్త్రీల కెక్కువగానే కాయమునకు కష్టము, దేశములో సంచారములు, చదువులు, వివిధములైన భోగములు, ఆహారములు, విహారములు, అలజడులు యెక్కువగుచున్న కారణమున అది సాధ్యముకాకున్నది. వైద్య శాస్త్ర మభివృద్ధియైనప్పటినుంచి యితర రోగములవలని మరణములు తగ్గుచున్నవి, పాశ్చాత్యదేశములలో సంతాననిరోధ పద్ధతులు ప్రబలుచున్నప్పటినుంచి పుట్టువులు కూడా తగ్గుచున్నవి, కాని ప్రసవమరణములు తగ్గక హెచ్చుచున్నవని ఇ. సిల్వియా పాంఖరస్టు అనునామె వ్రాయుచున్నది. గత యిరువదిసంవత్సరములలో అత్యంత నాగరికమని పేరుపొందిన ఇంగ్లాండులోనే నూటికి 5 నుండి 42 వరకు ఇట్టి మరణముల సంఖ్య హెచ్చినట్లు ఆమె తెలుపుచున్నది. గర్భిణీస్త్రీలను పరీక్షించుచు మందులిచ్చుటకు ఆస్పత్రులు, ఇతరయేర్పాటులు హెచ్చుచున్నవి కాని వానివలన విశేషలాభము లేకున్నది.

ఇట్టి వైద్యసహాయము గర్భిణులైయున్న సమయముననే కాక ప్రసవించుచున్నప్పుడును, పురిటిలోను, బాలెంతరాలుగా ఉన్నంతకాలముననుకూడ చేయుచుండుటకు ఏర్పాటులు జరుగుచున్నవి. ఇట్టి సమయములన్నిటియందును స్త్రీల నాస్పత్రులలోనే యుంచి కాపాడుచున్న స్వీడెను హాలండు దేశములలో ఇట్టి మరణములసంఖ్య చాలా తక్కువగనున్నది. కాని సాధారణ దేశములలో పేదస్త్రీలు ఇట్టివానివలన సహాయము పొందలేకున్నారు. ఇట్టి ఆస్పత్రులను స్త్రీలందరికొరకు దేశమంతటను పెట్టుటకు ప్రభుత్వమునకు అమితమగు వ్యయమగుచున్నది. అట్లు పెట్టినతావులలోకూడ పేదవారు తమ యింటిపట్టులనుండి యెడపిల్లలను భర్తలను సంసారములను ఒద్దుకొనవలసి యుండుటచేత ఆస్పత్రులలో స్థిరనివాస మేర్పరచుకొన లేకున్నారు. ఇట్టివారిపిల్లలను ఇంటివద్ద సంరక్షణచేయుటకు మంచిదాదులు కావలసి

యున్నారు. అట్టిసహాయమునకుఁగూడ ఇంగ్లాండు గణంగుచున్నది. 1933 లో ఇట్టి దాదులసంస్థలు ప్రభుత్వము స్థాపించినవి 18 న్ని, ఉదార ప్రజాసంస్థలు స్థాపించినవి 82 న్ను మాత్రమే యుండెను. ఇవి చాల వనుటకు సందేహములేదు. మునిసిపాలిటీ వారు ఇట్టి పిల్లలకొరకును, వారి తండ్రుల కొరకును హోటేళ్లు పెట్టుచు, బీదలకు తక్కువ రొక్కమునకు శ్రీమంతులకెక్కువ రొక్కములకు సంరక్షణలు సాగించుచున్నారు.

కాని యీప్రయత్నము లెవ్వియును చాలకున్నవి. ఇందుకు చాలా ఖర్చుకాక తప్పదు. ఆస్ట్రేలియా ప్రభుత్వమువారు 1922 నుండియే పుట్టువుకు 5 పౌనులచొప్పున ప్రభుత్వపు ఖజానాలోనుంచి సొమ్ము శాంక్షను చేసి దానితో ఇట్టిప్రయత్నములు సాగించుచున్నారు. ఇప్పుడు కొంచెమెక్కువగానే శాంక్షను చేయుచున్నారు. ఇంగ్లాండులో పుట్టువు 1 కి 10 పౌనుల చొప్పుననైనను శాంక్షను చేసినచో కొంత సంతృప్తికరమైన పని జరుగగలదని పాంఖరస్టు సతి వ్రాయుచున్నది.

ఎంతధనము శాంక్షనుచేసినను సుశిక్షితులగు వైద్యులు దాదులులేనిదే యీపని సాగదు. వైద్యులలో చాలామంది యితర రోగనివారణములందు విశిష్టప్రజ్ఞ గణించుటకే తాపత్రయము పడుచున్నారు కాని దీనినిగూర్చి శ్రద్ధబూనకున్నారు. బహుశా దీనివల్ల తగిన ద్రవ్యరూపమైన ప్రతిమానము రాకుండుటయే కారణమై యుండవచ్చును. కాని మాతృసంఘసంరక్షణము దేశభావి పౌరపోషణము డబ్బుకూలియను కొలత బద్దతో కాక విశాలదేశశ్రేయప్రమాణముతో పరీక్షించి సాగించవలసిన పనులై యున్నవి.

పురుషులకంటె స్త్రీలు వోటర్లు పార్లమెంటుసభ్యులు అయి దీనినిగూర్చి యెక్కువ శ్రద్ధ చూపవచ్చుననుటకు ఆటంకములేదు. ఇంగ్లాండులో స్త్రీలు వోటుహక్కుకోసము అల్లరలు ఆందోళనలు ప్రారంభించి సాధించుచున్నప్పుడు స్త్రీలు ముందుకువచ్చి యిట్టి సంస్థలకొరకెక్కువ యాందోళనము చేయగలరని ఆశింపఁబడెను. కాని ఆహక్కులు రాగానే ఆఆవేశమును ఆగిపోయి ఆగౌరవములతో తృప్తినొంది తదనంతరావశ్యకములైన యిట్టి ఆందోళనములకు వారు గడంగనందు కామె విచారించుచున్నది. మన దేశములో స్త్రీలట్టి అల్లరలను ప్రారంభించకుండనే బ్రిటిషువారు స్త్రీవోటర్లసంఖ్యను హెచ్చించినారు. వచ్చే శాసన సభలలోకి అనేకమహిళామణులు సభ్యులుగావచ్చి యిట్టి ఆందోళనములుసాగించి పభుత్వమువారిచేత విస్తారమగుద్రవ్య మిట్టిసంస్థలకొరకు శాంక్షను చేయించవలసినబాధ్యత పడుచున్నది. దేశమాత వారికిట్టి ఉదారకరుణా సంకల్పములు ధైర్యస్థైర్యములు ప్రసాదించునుగాక యని ఆశించుచున్నాము.

EDITED, PRINTED AND PUBLISHED BY



# బాలపాపలే దంపతుల ప్రేమబంధము

స్త్రీకి మాతృస్థానము గౌరవప్రదము. ఆమెకు గృహయాజమాన్యము లభించును. ఆత్మానందము కలిగించును. భర్తకు తనయెడల భక్తి ప్రేమ భావములు దినదిన మభివృద్ధినొందును. దీని కంతటికిని కారణము?

మా తృ త్వ మే !

మాతృత్వమునకై ప్రతి స్త్రీయును ఆసగొనును. ముద్దుబిడ్డను కర కమలములం దిడుకొని ఆడించు తలంపు స్త్రీకి యెక్కుడు.

స్త్రీకి లభించవలసిన యీ మహోన్నత స్థానమునకు ఆటంకములను కల్పించు గర్భాశయ రోగములను దూరముచేయవలయును. ఇందులకు లోధ్ర సేవనమే రాజమార్గము.

## లో ధ్ర

వనితల ఋతుదోషాది రోగములకు వజ్రాయుధము.

లో ధ్ర యె ల్లె డ ల దొ ర కు ను.

కేసరికుటీరం, ఎగ్మూరు, మదరాసు.

# పనితనముగల వెండిసామగ్రులనిలయము









## ఉమ్మిడి రామయ్యశెట్టి గురుస్వామిశెట్టి & కంపెని,

నగలవ్యాపారులు

25. చైనాబజారురోడ్డు, మదరాసు. 62. గోవిందప్పనాయక్ వీధి




# పారిస్

# ముత్యాలహారాలు

అసలు మంచిముత్యాలలాగున చాలాకాలం
చెడిపోకుండా వుండేదిన్నీ, కాంతి, తళతళ,
అందం, గట్టితనం మొదలైన వానిని
పొందియున్నట్టిదిన్నీ, నెం. 1, 2, 3
సైజులలో నూలుతో అమర్చిన
హారము 1-కి

## రూ. *1-0-0*

వెండి తీగెతో సమర్చిన హారము 1-కి

## రూ. *2-8-0*

ముత్యాలు, చిన్నవి, పెద్దవి, అన్నిసైజుల
లోను దొరకును,

ప్యాకింగ్, తపాలాచార్జీలు ప్రత్యేకం

## పి. గోపాలస్వామి నాయుడు

## అండ్ సన్సు

**కర్మాగారము :**

**పరంగిమలై పోస్టు,**

**మదరాసు.**

**బ్రాంచి ఆఫీసు :**

**234, గోవిందప్ప నాయక్ వీధి,**

**మదరాసు.**

# పఠానుల బలపరాక్రమము



### కాశ్మీరపుఠాళ మీసు కావలయును

మానవులందరును బలిష్ఠముగను దార్ఢ్యముగను జన్మింపరు. కాని శరీరమునుపట్టి పీడించే నిస్సత్తువను నిర్మూలించి నిగనిగలాడు దేహముతో నిండు ఉత్సాహముతో అవయవముల పుష్టితో హాయిగానుండు టవసరము. అది మానవుని జన్మహక్కు. అందులకై ప్రతి ప్రాణియు ప్రయత్నింపవలయును.

దేహమందు రక్తము—నిష్కళంకమగు ఉష్ణరక్తము ప్రవహించుచో దేహమునకు ఆరోగ్యము, ప్రాణికి ఆనందము, జీవితముయెడల ఉత్సాహము ఉండగలదు. జీవాధారమగు ఉష్ణరక్తమును వృద్ధిచేయుటకు సాధనము అమృతకంటె వేరులేదని చెప్పకతప్పదు. శుష్కించిపోయిన మానవుని మన్మధునిగ చేయును. పిరికివానిని పరాక్రమునిగ మార్చును. మందబుద్ధిని బుద్ధిమంతుని చేయును.

## అమృత

### రక్తశుద్ధి ద్రావకము

రక్తహీనత, మలబద్ధము, అజీర్ణము, కీళ్ళనొప్పులు, సోమరితనము, మేహవ్రణములు, సుఖసంకటములు, నిస్సత్తువ, కడుపులో మంట మొదలగు వ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని, ముఖమునకు తేజస్సును ఇచ్చును. ఈ మేలైన యౌషధమువలన ఎందరో ఆరోగ్యవంతులైనారు.




**12 ఔ. రు 3.  6 ఔ. రు 1—10 లు.**

అమృత యెల్లడల దొరకును.

## కేసరి కుటీరం, ఎగ్మూరు, మదరాసు.

# (5) ఉత్తరరాఘవము (5)

కుశలవ

Saraswathi Stores

MADRAS.

ODEON

K. R. SARMA

5 రికార్డులు

5 రికార్డులు

సీతా వనవాసము మొదలుకొని, కుశలవులజననము, సీతారాముల సంయోగము వరకుగల కథాభాగము. హృదయతంతువులను కరగించు మనోహర దృశ్యములు. మీ సమీపమందలి యేగ్రామఫోను వ్యాపారివద్దనైనను నేడేవినుడు.




సరస్వతి స్టోర్సు

మద్రాసు.



ఇదిగో

హిందూదేశపు

స్వకీయ

సుప్రశస్త

శుద్ధతమ

అతి చౌక

మిక్కిలి హాయిగూర్చే

పానీయము




కోట్లకొలది జనులు సేవించుచున్నారు—మీరో




సంపాదకుఁడు

## డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౮.]　　ఏప్రిల్ 1935　　[సంచిక ౧

*Printed at Lodhra Press, Egmore, Madras.*

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్ధ సంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువరైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలములరేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసినచో జవాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలుఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తుఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు.

# బలము కాడ్డులివరాయిలులో వుంది

# స్కాట్సు ఎమల్షనులో

# అంతకు 3 రెట్లెక్కువ వుంది

దేహానికి బలము రావలెనంటే, అందులోనూ జబ్బుపడి లేచినతరు
క బలవృద్ధి శీఘ్రముగా కావాలంటే కాడ్డులివరాయిలుకంటె మంచి
దు లేదని డాక్టర్లు చెపుతారు. దానినిండా ఎ. డి. వైటమినులుండి
నికి పెంపు పుష్టికూడా యిస్తవి.

కాని శుద్ధ కాడ్డులివరాయిలును త్రాగి అరిగించుకోవటం చాలా
కష్టం. స్కాటుచేసిన యీ ఎమల్షనువల్ల అది చాలా సరకుమారి
దరికీ సులభముగా జీర్ణమవుతున్నది. దీనివల్ల దానిగుణములా చెడవు.
శక్తి యామోమ్చున. పైగా లైము, సోడాకూడా చేర్చుటవల్లన దాని
టె మూడురెట్లెక్కువ గుణముకూడా కలుగుతుంది.

## బలిష్ఠము రోగనివారిణి.

దౌర్బల్యంపోయి బలంగా ఆరోగ్యంగా ఉన్నప్పుడైనాసరే, జన్మం
ఏజబ్బూలేకుండా బాగుండాలంటే యీఎమల్షనే తగినది. రక్తము
అవుతుంది. నరములు బలపడుతవి. ఎంతకష్టపడినా, ఎటువంటి శీతా
ములైనా శరీరానికొక్కరవ్వ ఆయాసం కలగనీయదు. డాక్టర్లు
యేళ్లాయను దీనిని సిఫార్సు చేస్తున్నారు.

## స్కాట్సు ఎమలను

సాదా కాడ్లివరు ఆయిలుకంటె 3 రెట్లధికగుణమిచ్చును. ఎముకలనుమాంసమును కండలను తీర్చి పెంచును. నరములకుపుష్టినిచ్చును. రక్తవృద్ధిని కలుగజేయును. రోగములు రాకుండా కాచుకుంటకు తగిన శక్తినిచ్చును.



# SCOTT'S Emulsion

మందీవ రకులు:

ఇంపీరియలు కెమికలు ఇండస్ట్రీస్ (ఇండియా) లిమిటెడు, కలకత్తా, బొంబాయి, మదరాసు, లాహోరు, రంగూన్, కొలంబో, కాన్పూరు, పాట్నా, అహమ్మదాబాదు, కొచ్చిన్, కాలికట్టు,

# విషయసూచిక

# ఛాయా చిత్రములు

## వివరములు

### ఆంధ్రమహిళా గానసభ—రాజమండ్రి

కడచిన డిసెంబరు 18, 19, 20 తేదీలలో రాజమహేంద్రవరమున నాళమువారి సత్రమునందు శ్రీమతి సీతాదేవి చెట్టూరుగారు (కలెక్టరుగారి సతీమణి) యాధిపత్యమున జరిగిన, ఆంధ్రమహిళాగానసభాద్వితీయ సమావేశ సందర్భమున జంత్రగాత్రములయందుఁ బాల్గొనిన యువతీమణులలోఁ గొందరుజేరి తీయించుకొనిన ఛాయాపటము. ఈ సంఘమున కధ్యక్షురాండ్రు శ్రీమతి బా. వెంకటచలమమ్మగారు, నాళము సుశీలమ్మగారు. కార్యదర్శినులు కో. లీలావతి ఊ. లక్ష్మీకాంతమ్మగార్లు.

### చి॥ సౌ॥ అండలూరి సుబ్బలక్ష్మి

కీ॥ శే॥ చాగంటి బాపిరాజు, బి.ఏ.బి ఎల్; గారి కుమార్తె. ఈమెకు చదువునందభిరుచిగలదు. "భిక్షుకస్త్రీ"యను చిన్నికథను ఆమె వ్రాసినది. ఆరచన ఉన్నతంగానేఉంది. ఆరచనలోకళకూడా సలక్షణముగా నడచినది. పంద్రెండేండ్ల బాలిక ఈమాత్రము రచింపగలుగుట ప్రశంసనీయమే.

### శ్రీమతి డాకిన్ కిన్ గ్యి

బర్మాస్త్రీలలో మొదటి బారిస్టరు, ఎగ్జిక్యూటివ్ కౌన్సిలు సభ్యురాలు.

### కుమారీ హవా బాయ్ బి. యే.

మహమ్మదీయులలో మొదటి పట్టభద్రురాలు.

### కుమారి కుముదం

అనంతపురం ఉన్నత బాలికాపాఠశాల విద్యార్థిని. పద్యపాఠములందు మొదటి బహుమానమందినది.

### కుమారీ సత్యవతీదేవి

సహకారసంఘముల పరీక్షకురాలు. స్త్రీ సహకారిసంఘము లభివృద్ధి గాంచు విధానమును గూర్చి యీమె వ్రాసిన వ్యాసమునకై స్వర్ణపదక మొసగబడెను.



కీ॥ శే॥ శ్రీమతి నరహరిసెట్టి నాగమణిగారు

తేది 23-3-35 ని ఏలూరుతాలూకా, కైకరంగ్రామమందు చనిపోయిరి. ఏలూరు కాపురస్తులు శ్రీయుత శేషగిరిరావునాయుడుగారి భార్య. వీరి వివాహము క్రిందటి జూను 1934 సం॥ జరిగియుండెను. ది 16-3-35 మగశిశువును ప్రసవించెను. ఆజబ్బుచేతనే మరణించెను.

## నూతనముగ వెలువడిన–సన్ రికార్డులు

—:o:—

# శ్రీ రామ పాదుక

4 రికార్డులలో చక్కగ సమకూర్పబడినది

వెల రు 11/– లు మాత్రం



దైతా గోపాలం



ఆర్. సుభద్రమ్మ

| N. V. 6 | | |
|---|---|---|
| రండు రండిక —పద్యం | రంగ, రంగ, రంగ —పాట | 1 భాగం |
| రామనామము —పద్యం | రంగ, రంగ, రంగ —పాట | 2 భాగం |

**N. V. 5**

ప్రియసఖియ పాట—భీమ్‌ప్లాస్

జరుగదునా —హిందోళ

రికార్డు 1–కి రు 2–12–0 మాత్రము

## సన్ రికార్డు అండుకో లిమిటెడ్,

## కాకినాడ.

## చిత్రకారిణి శ్రీమతి ఆర్. కమలాబాయిగారు

ఈమె, రిటైర్డు పి. డబ్ల్యు. డి. ఆఫీసరు శ్రీయుత ఆర్. అబ్బాయినాయుడుగారి పుత్రిక. సంగీతమునందును చిత్రలేఖనమునందును చిన్నతనమునుండియు మిగుల అభిరుచిగల వ్యక్తియగుటచే తండ్రిగారు ఈమెఅభిరుచులకును కళాభివృద్ధికిని తగిన దోహదమిచ్చుటలో కనుంగడు శ్రద్ధవహించిరి. ఈమె శాంతినికేతనములో వంగదేశ సంగీతము, చిత్రరచనము మొదలగు కళలను చాలకాల మభ్యసించి, శిక్షణముపొంది యోగ్యతా పత్రములను బడసినారు మదరాసు ప్రదర్శనములో ప్రదర్శింపఁబడిన "రాధా నిరీక్షణ"యను సవర్ణచిత్రమునకు స్వర్ణపతక మొసంగఁబడినది. మదరాసు యూనివర్సిటీలో ఫిడేలు వాద్యమునందు మొదట తరగతి డిప్లొమానుబడసిరి.

గృ॥ ల॥




## 'శుద్ధటర్కీ'—స్త్రీలగౌరవము

టర్కీలో కాలీఫా సింహాసనభ్రష్టుడై కమాలుపాషా అధికారమునకు వచ్చినప్పటి నుండియు ఆ దేశముపొందుచున్న శీఘ్రతరాభివృద్ధి యెల్లరకు దెలిసియేయున్నది. కాలీఫా అధికారమునందున్నన్నాళ్లు టర్కీ చాలాదుర్బలమై 'అయిరోపాఖండపు రోగి' అనేపేరుతో ఈసడించబడుచుండెను. కమాలుపాషా అధికారమునకు వచ్చినప్పటినుండి టర్కీ కట్టిఅపకీర్తి పోయినది. అంతకుముందు రష్యా, జర్మనీ, ఫ్రాన్సు మొదలైన దేశములెవరికికావలసినభూమిని వారు దానిలోనుంచి కత్తిరించుకొని తీసుకొనేవారు. కమాలుపాషా ఈ ఆటకట్టించినాడు. పాశ్చాత్యదేశములంతకుముందా దేశములో అంతఃకలహములు రేచగలుగుచుండెడివి. కమాలుపాషాయొక్క కఠోరసవ్యపరిపాలనము టర్కీయొక్క ఐక్యతను స్థిరపరచినది.

ప్రాచ్యదేశములెవ్వి యిప్పుడు బలవంతములై కీర్తివంతములై, స్వతంత్రములై యుండవలెనన్నను కొన్ని పాశ్చాత్యసూత్రముల నవలంబించకతీరదు. జపాను ఇట్టి సూత్రముల నవలంబించియే పాశ్చాత్యదేశములను మించిన నాగరకతతో రాజిల్లుచున్నది. కమాలుపాషాయు అట్టిసూత్రములనే అవలంబించినాడు. నిర్బంధోచిత ప్రారంభవిద్య, నిర్బంధసైనికశిక్షణము, ప్రజాపరిపాలనావిధానము, స్త్రీపురుషుల సమానత్వము, దేశీయులలో హెచ్చుతగ్గు భావనిర్మూలనము, మూర్ఖమతాచారదాస్య నిరసనము, వ్యవసాయపరిశ్రామికవిప్లవము

మొదలగునవి అట్టి సూత్రములలోకొన్ని. ఇట్టి సూత్రములతో కమాలుపాషా ప్రజల హృదయములను జూఱగొని నిర్దుష్టమైన పరిపాలనమును నెలకొల్పినాడు. పైవిషయములన్నిటిలోను నేడు టర్కీ పాశ్చాత్యదేశములను బురుడించుచున్నది.

ఈ పాశ్చాత్యానుకరణ మింకను అగకసాగుచునేయున్నది. నిరిటిసంవత్సరము 23 సంవత్సరముల వయస్సుకుమించిన స్త్రీలకెల్లరకు వోటుహక్కును 30 సంవత్సరముల వయస్సుమించిన స్త్రీలకు పార్లమెంటుప్రతినిధికాగల హక్కును ఒసగఁబడినవి. ఈ సంవత్సరము 20మందిస్త్రీలైనను పార్లమెంటు సభ్యురాండ్రుకాగలరు. టర్కీలో పొలిటికలు పార్టీలు లేక అంతా గవర్నమెంటుపార్టీ యొక్కటేగనుక కమాలుపాషా యెంచుకొనెని యీ యిరువదిమంది స్త్రీలును తప్పక సభ్యురాండ్రుకాగలరు.

ఇంతవేగము ఇట్టి వోటుహక్కు ప్రాతినిధ్యహక్కు స్త్రీలకొసంగబడునని టర్కీలో యెవ్వరును అనుకొనలేదు. ఇంతవరకు టర్కీ స్త్రీలకు పురపాలకసభలకు వోటుహక్కు మాత్రమే ఉండెడిది. శాసనసభలకు కూడ వోటుహక్కునిమ్మని వారు చేయుచుండెడి ఆందోళనలెల్లయు నిష్ఫలములయ్యెను. ఈ సంవత్సరము టర్కీలో ఇస్తాంబుల్ నగరములో అంతర్జాతీయమహిళాసభ జరుగనున్నది. అచ్చటికి సమస్తప్రజాపరిపాలకదేశములనుండి వోటుహక్కులుగలస్త్రీలు విచ్చేయుదురు. వారిమధ్యను టర్కీ స్త్రీలకు టర్కీప్రభుత్వమునకు తలవంపులు కలుగకుండుటకై ఈమార్పు యింతత్వరగ చేయబడియుండవచ్చును. కారణ మెద్దియైనను ఇట్టి చిరతరవాంఛను శీఘ్రముగను ఆందోళనావశ్యకతలేకుండను చేసినందుకు కమాలుపాషాను అభినందించుచు టర్కీలో పలుమూలలనుండి స్త్రీనాయకులు వ్రాసెడి లేఖలు కుప్పతిప్పలుగ వచ్చుచున్నవి.

కమాలుపాషాచేసినమరియొకమార్పుయొక్క లక్షణమును భారతీయాంగనలు గమనించదగినది. కమాలుపాషాకు ప్రాచ్యసంగీతమన్నకిట్టదు. అది రొడ్డకొట్టుతోవలో పడి, శోకభరితమై, గాయకులను శ్రోతలను సోమరితనము పాలుచేయునని యు చుఱుకుతనమును పుట్టనీయదనియు అతని అభిప్రాయము. నవంబరు 1 వ తేదిని అంగోరా పార్లమెంటులో ప్రారంభోపన్యాసము నొసంగుచు అతడు "మనసంగీతము మనకు గౌరవదాయకమైనదికాదు. నూతనటర్కీ కనుగుణమైన నూతనసంగీతము మనకావశ్యకమైయున్న"దని శలవిచ్చినాడు. కాఫీహోటళ్ళలో, హోటళ్ళలో, పార్కులు మొదలగు బహిరంగస్థలములలో ప్రాచ్యసంగీతము (Oriental music) వినబడరాదని కట్టడి చేసినాడు. రాజధానీనగరమునందలి ప్రధాన రేడియోలోకూడా ఈ సంగీతము నెవ్వరును పాడరాదు. విద్యాశాఖమంత్రి గాయకులందరిచేతను పాశ్చాత్యఫక్కీని గీతములు వ్రాయించి యెల్లరకును నేర్పించుచున్నాడు.

ఇప్పుడు టర్కీ అంతయు అయిరోపీయ సంగీతమయమగుచున్నది. వెనీసు మొదలగు పట్టణములనుండి గాయకులనురప్పించిపాటలు వ్రాయించుచున్నారు. ఈసంవత్సర హేమంత ఋతువులో అంగోరానగరమున జరుగు గాన సభలలో పాశ్చాత్యసంగీతముతప్ప మరియొక సంగీతము వినబడకుండా ఏర్పాటులు జరుగుచున్నవి. పూర్వాచారపరాయణులు వయోవృద్ధులు సంగీతవిద్వాంసులు ఇట్టిమార్పున కియ్యకొనక లోలోన గొణుగుకొనుచునే యున్నారు. కాని పడుచురక్తము కలవారందరికీ పాశ్చాత్యదేశములలో పాడెడి ఒపేరా సంగీతము, జాజి(Zazz) సంగీతమే మనోహరముగనుండుటచే వారు కమాలుపాషాకు మంచిమద్దతుచేసి బలపఱచుచున్నారు.

ఇట్టిమార్పులు ఒక్కసంగీతముతో ఆగలేదు. భాషావిషయమునఁగూడ ప్రవేశించినవి. ఆరుసంవత్సరములక్రిందటనే అరేబిక్కు లిపిని అతను మానిపించి దానిస్థానే లాటిను లిపినిపెట్టి ఒక్కయేఁడాదిలో బలిపంతముగ అందరు నేర్చుకొనునట్లు చేసినాడు. ఇప్పుడు లాటిను లిపితప్ప వేరు లిపియే అక్కడలేదు. కాని ఆ భాషలోను వారి నిఘంటువులలోను వేనవేలు ప్రాచ్యభాషాపదములు అనగా పర్షియనుపదములు. అరేబిక్కుపదములు ఉండెడివి. టర్కీభాష ప్రాచ్యభాషాకుటుంబమునకుచెందినదని యెల్లరు నెఱిగినదే. గతసంవత్సరములో అట్టి పదములనెల్ల నిఘంటువుల నుండి గ్రంథములనుండి తొలగించి "శుద్ధ టర్కీ" భాషాపదములని తానుభావించిన వానినిమాత్రమేమిగిల్చినాడు. తానుమాట్లాడెడి, ఉపన్యసించెడి, వ్రాసెడిపదములెల్లయు 'శుద్ధటర్కీ' పదములైయుండి ఇతరుల కనుకరింపదగియుండుశైలిని నభ్యాసముచేసుకొన్నాడు. కొన్ని 'శుద్ధటర్కీ' పదములను చేర్చి, ప్రాచ్యభాషాపదములను తొలగించి నూతననిఘంటువును అనతికాలములో అతను తయారుచేయుచున్నాడు. సుప్రసిద్ధవార్తాపత్రికలలో ఈ 'శుద్ధటర్కీభాష' తప్ప వేరొకటి యుండరాదు. ఈ మార్పుకూడా ముసలివాళ్ళ కిష్టములేదు. కానివారిని లక్ష్యము చేసేస్థితిలో టర్కీప్రభుత్వవర్గముకాని యువకవర్గముకాని లేవు.

ఇన్నింటికన్న చిత్రమైనది మతవిషయమైన సంస్కారము. టర్కీలో మహమ్మదీయులు, కాతలిక్కులు ఆర్మీనియనులు ప్రొటస్టంటులు మొదలగు క్రైస్తవులు యూదులు, కూడఁగలరు. గ్రీసుదేశపు పూర్వాచారపు కేతలిక్కులపవిత్రయాత్రాస్థానమును గురుపీఠమును ఇస్తాంబులునగరమున నున్నది. ఈ వివిధమతముల ఆచార్యులెవ్వరును వారి వారి మతదుస్తులనుధరించి బహిరంగస్థలములకు రాకూడదు నడవకూడదుఅని మరియొక శాసన మక్కడ ప్యాసయినది. ఆరునెలలు పోయినతరువాత ఈ శాసన మమలులోనికి వచ్చును. క్రైస్తవమతాచార్యులు ఈ చట్టము రద్దుచేయుమని విన్నపములు పంపుచున్నారు. గ్రీసుప్రభుత్వమునకును టర్కీప్రభుత్వమునకును ఈ విషయమున విభేదములు పొడమి గల్లాటాలు కలుగునేమో

అనికూడా అనుకొనుచున్నారు. రోము నగ
రమునందలిపోపుగారు తన శిష్యులగు
పూర్వాచార కేతలిక్కుల కిందువలన యెట్టి
నష్టము వాటిల్లునోఅని ఆత్రుతతోనున్నారు.
ఇటలీ ఈ విషయమున చేయిచేసుకొనునేమో
చెప్పజాలము. కాని కమాలుపాషామాత్రము
ఇట్టి తాటాకు చప్పుళ్ళకు బెదరలేదు. ఈ
ఆరునెలలగడవులోను వివిధమతస్థులు మతా
చార్యులు బహిరంగస్థలములకు వచ్చిన
ప్పుడు వారి సహజవేషముల విసర్జించుకొని
'శుద్ధటర్కీ'వేషముతోనుండకపోయినయెడల
వారిదేవాలయములకు పూజామందిరములకు
చర్చిలకు తాళములువేయించుటకే నిశ్చయిం
చుకున్నట్లు ఈ మొదలైనవిషయములు సండే
క్రానికలుపత్రికావిలేఖరి వ్రాయుచున్నారు.
ఇట్టిమార్పు పాశ్చాత్యదేశములలోఁ గూడ
ఇంతవరకు ఒక్కసోవియట్టు రష్యాలోతప్ప
జరుపఁబడలేదు. కమాలుపాషా ఇట్టిపరిపూర్ణ
సాంఘిక విప్లవములయందు పాశ్చాత్యులను
మించిన పాశ్చాత్యుఁడగుచుండుట ఆ దేశపు
నూతనవిజ్ఞానమున కెంతయు ననుగుణముగ
నున్నది. తక్కిన ప్రాచ్యదేశము లిట్టివిషయ
ములలో నెంతవరకు టర్కీని అనుసరించ
గలవో విచారణీయము.

కమాలుపాషా అవలంబించుచున్న 'శుద్ధ
టర్కీ' విధాన మిట్టిదై యున్నది. బహు
భార్యాత్వము, ఘోషా, నిరక్షరాస్యత,
ఉద్యోగానర్హత, ప్రజాహితజీవననిరాకర
ణము, రాజకీయహక్కులులేమి మొదలగు
శృంఖలములనుండి టర్కీమహమ్మదీయ
స్త్రీలకు విముక్తినిచ్చి వారికి పురుషులతో
పాటు సమానహోదానిచ్చినందుకు కమాలు
పాషా నభినందించవలసియున్నది. తక్కిన
టర్కీసంగీతము, భాష, మతస్వాతంత్ర్యముల
వల్ల నూతనటర్కీ కెట్టినష్టములు వాటిల్లు
చున్నవో, ఇట్టిచట్టముల ప్యాసుచేయవలసి
నంత ఆవశ్యకత యేమికలిగెనో మనము
దూరమునుండి ఊహించలేము. కమాలు
పాషా నిష్కలంకజాతీయవాది దేశాభిమాని
వివేకశాలియనిగూడ ఎల్లరును అంగీకరించక
తప్పదు. అత నవలంబించిన వైజ్ఞానిక ఆర్థిక
విధానములే ఆ సంగతిని ఋజువుపరచు
చున్నవి. మనభారతదేశముకూడ శీఘ్రత
రాభివృద్ధిని బడయవలెనన్న ఇట్టిమార్పులు
కొన్నిచేయకతప్పదు, చేసుకొనుచున్నాము.
కాని భారతీయకళలు, భాషలు విజ్ఞానము
నకు విగటమగుమార్పులకు మన దేశములోని
స్త్రీపురుషు లెవ్వరుగాని పూర్వ అధునాత
నాచారపరాయణు లెవ్వరుగాని అంగీకరించ
రని నమ్మవచ్చును. భారతసంప్రదాయము
లకు ప్రాచీనసుప్రసిద్ధచరిత్రమున్నది. నవీనా
చారములనేకములోని లోటుపాటులను దిద్ది
సమన్వయముచేసుకొని జీర్ణించుకొనగలశక్తి
వాటికిఉన్నది. మనదేశపు సంస్కారనాయకు
లీసంగతిగుర్తించి జాగ్రతగా ఆర్థికసాంఘిక
వైజ్ఞానికమార్పులను తేగోరుచో అప్రతికూ
లముగ అవి అంగీకరింపబడి చట్టనిర్బంధము
లేకనే ఆచరించఁబడునని నమ్మవచ్చును.
అవసరమైనఅనుకూలమైనచోట్టులచట్టములను
చేయుటకూడ తప్పదని విశదమగుచున్నది.

# ఆశాభంగము

గాలి బాలసుందరరావుగారు.

అనురాగం, అజ్ఞానం, అమాయికత్వం మూడూకలిపి ముద్దచేసి సృష్టించాడు బ్రహ్మదేవుడు సావిత్రిని. నిరంతర సాంఘిక విప్లవభావ సంచలితుడైన ప్రభాకరరావుకు భార్యనిచేశాడు, భాగ్యవశాన్నో, దౌర్భాగ్యవశాన్నో !

సావిత్రితండ్రి సక్రమాక్రమ సంపాదనలతో పది డబ్బులు కూడ పెట్టుకున్న ప్రభుత్వోద్యోగి. స్త్రీ ప్రపంచకం పరిహద్దులు, ఉన్నయింటి ప్రహరీ గోడలే ననీ, ఆడవాళ్లకు అక్షరాల్తోగూడా నిమిత్తంలేదనీ తనకు దృఢమైన విశ్వాసంఉన్నా నాగరికత మీరి పోతున్న యీరోజుల్లో ప్రతిపెళ్లికొడుకూ అడిగే ప్రశ్నల్లో "మీఅమ్మాయి యేంచదువుతోంది" అనేది ప్రధానం అయిందిఅవటంచేత విధిలేక కూతుర్ని బళ్ళోకిపంపక తప్పిందికాదు. జన్మతః మందబుద్ధి, చదివేవా అని అడిగేవాళ్లు లేకపోవటం, సంవత్సరానికి మూడుమాట్లు బదిలీ అయ్యేవాళ్లనాన్న ఉద్యోగం, అన్నీకలిసి ఆ అమ్మాయిని . అయిదో క్లాసు దాటనీయలేదు. సావిత్రికి పదకొండోయేడు రావటంతోటే ప్రసాదరావుగారు అపంచకాన్ని గావించి ప్రభాకరరావు సంబంధంమాట తెలుసుకుని, తల్లిదండ్రులులేని అతనికి సంరక్షకుడై, పెంచిపెద్దచేసి చదువు చెప్పించుతున్న అతనిపినతల్లి భర్తతోమాట్లాడి సరేననిపించుకుని పట్నంలో చదువుచున్న అతనికి ఉత్తరం రాయించాడు.

సాయంత్రం బీచికి షికారువెళ్లి హాస్టలుకువచ్చి గదితలుపు తెరిచేటప్పటికి పినతండ్రిదగ్గరనుంచి వచ్చిన ఉత్తరం కనపడింది. అందులో సారాంశం, ఆరాత్రి మెయిల్లోనే బయల్దేరి రావలసిందని. ఏం మునిగిందో నని తొందరగా భోజనాదికములచేసుకుని అతను మెయిలెక్కాడు. మర్నాడు ప్రొద్దున్నకు బెజవాడ వెళ్లేడు.

ఇంట్లో వాళ్లపినతండ్రి సంబంధంసంగతి అంతా చెప్పి "అంతా నిశ్చయం అయింది; నువ్వు పిల్లని చూట్టమే తరవాయి" అన్నాడు. "అంతా నిశ్చయం అయ్యాక నేను చూడకపోతే మట్టుకేం" అన్నాడు ప్రభాకరరావు. తెలుగుకుటుంబాల్లో అటువంటి పరిస్థితుల్లో సంభవించేవాదనలు చివాట్లు బెదిరింపులు అన్నీ అయినవి. ఆదర్శంకోసం అభ్యుదయం త్యాగం చేయలేని అనేకమందిలాగ అతనూ లొంగిపోయి నాడు. అమాయికఅయినసావిత్రి అనేనోసెపడవ తీవ్రభావతరంగ సంక్షోభితమైన అతని జీవితసముద్రం లోకి కొట్టుకువచ్చింది.

ప్రభాకరరావు అవతరించిన రసజ్ఞత; స్వరూపం ధరించిన సాంఘికవిప్లవం. విద్యాపూర్తి అయింతరవాత తనంతటైై, విద్యావతి, ప్రతిభావతి, సౌందర్యవతి, అయిన యువతిని జీవిత భాగస్వామినిగా చేసుకుని తన అభిప్రాయములన్నీ అమల్లో పెట్టదలుచుకున్న అతని ఆశాసౌధము చీట్లపేక మేడలాగ కూలి పోయింది. అతని అభిప్రాయాల్లో ఎంత విప్లవస్వభావం వుందో అంత ద్రఢిమ అతని హృదయానికిలేదు. ఆ స్థైర్యరాహిత్యమే అతన్ని క్రుంగదీసింది.

అతను వైద్యకళాశాలలో చేరటానికి పట్నం వెళ్లే నాడే రైల్లో సుభాగ్యవకీ అతనికీ పరిచయం అయింది. వాంఛ్మయంలో అభిరుచివున్న యువతీయువకుల స్నేహం అభివృద్ధి చెందినట్లుగా మరేదీ అభివృద్ధి చెందలేదు. సుభాగ్యవకూడా వైద్యవిద్యార్థిని. అప్ర

యత్నంగా ఆరంభించిన వారిపరిచయం నిత్యపరిచయంవల్లా స్వభావైక్యంవల్లా త్వరలోనే స్నేహమై చివరకు పరస్పరమైన అనురాగంగా మారిపోయింది. కాని ఆ అనురాగములు కేవలం మానసికములు. బాహిరంగా వాటి సంబంధం స్వచ్ఛమైన సౌహృద్యం.

ఏకోద్రేక ప్రకంపితములై వారిహృదయ వీణాల భావతంతువులు దివ్యగానంచేస్తూ తన్మయత్వంచెందుతూవుంటే తప్పుతాళంవేసి భగవంతుడు గానభంగం చేశాడు. నవ్యనాగరికతా సంజనితమైన స్వేచ్ఛావాతావరణంలో సాధారణదృష్టికి అతీతమైనస్థితికి యెగసి స్నేహవిమానమ్మీద వారిఆత్మలు ప్రేమ విహారం చేస్తూవుంటే ఆవిమానం రెక్కవిరిగింది.

వారు తమ ప్రేమలను పరస్పరం యెరిగించుకోనైనాలేదు. దర్పంలో వారిరువురూ సమానులే. ప్రభాకరరావు బయటబడితే కాస్సేపు ఆడించి సరేనందామని సుధార్ణవవూహ. ఆవిడ హృదయకవాటంవిప్పి ఆహ్వానించితే లోపలికి వెళదామని అతని అభిలాష. ఈవిధంగా వారి విజ్ఞానపరిశోభితములైన హృదయములు ఒకదానికి ఒకటిలొంగక దివ్యనృత్యం చేస్తూవుంటే ఒకరికి కాలు బెణికింది.

చేసినతప్పు నిస్సంకోచంగా ఒప్పుకోలేని హృదయ దౌర్బల్యమో, సిగ్గో, భయమో ఆవిడహృదయాన్ని వికలం చేయటానికి అయిష్టమో, మరేదో అతన్ని ఆవేశించి తన వివాహంవిషయమై సుధార్ణవకు తెలియ చేయనీయలేదు. ఆవిడదృష్టిలో అతనింకా అవివాహితుడే! అతనిహృదయం యింకా అనన్యదత్తమే! తనప్రేమని సార్థకం చేసుకుంటానికి కావలసినంత వ్యవధివుంది.

తన దౌర్బల్యంచేతనే తన జీవితంలోకి తీసుకురాబడిన అమాయికవ్యక్తికి తనప్రేమని యీయలేకపోయినా గౌరవాన్నయినాయిచ్చి భర్తగా తనవిధిని కొంతవరకు నిర్వర్తించుదా మనుకున్నాడు ప్రభాకరరావు. అనేకమార్లు ఆవిడని హైస్కూలుకు పంపించమని మామగారికి వుత్తరంరాశాడు. "ఆడదానికి చదువు అవసరంలే"దని ఒకమారూ, 'ప్రైవేటు మేష్టర్ని పెట్టే'నని ఒకమారూ, హార్మోనియం కొన్నామని ఒకమారూ, 'అంతగా చదువురావాలనివుంటే నువ్వే తీసుకవెళ్లవచ్చు'నని ఒకమారూ జవాబులు వచ్చినయి. ఆవుత్తరాలన్నీ చూస్తువుంటే ఆగ్రహం యేడుపూ రెండూ వచ్చేవి అతనికి.

రోజులుగడిచినయి. సావిత్రిశారీరికంగా పరిపక్వం అయింది. తనదగ్గిరేవుంచుకుని తన హృదయావస్థను అవగాహనం జేసుకుండేపాటి విజ్ఞానం కలిగించితే తరవాత చూడవచ్చునని చెన్నపట్టణం తీసుకువెళ్లేడు ప్రభాకరరావు. వారిద్దరూ మాంబళంలో ఒక చిన్న గది అద్దెకుతీసుకుని 'కాపురం' వున్నారు. చాలా రోజులు బంజరుగావున్న యీచవిటి పర్రలో యెరువు తోలి మెరకపల్లములు సరిచేసి దున్ని విజ్ఞానబీజములు వేసిచూడాలి. ఫలించితే ఫలించుతుంది. కాకపోతే పొలంసంగతి యెరక్కుండానే శాశ్వతకవులురాసి యిచ్చిన రైతులాగా అవుతుంది అతనిపని.

అతను నాలుగోసంవత్సరంలోకివచ్చేడు. సుధార్ణవా అతనితోనే అంగలువేసింది. ఇంకా ఆవిడ దృష్టిలో ప్రభాకరరావు అవివాహితుడే. తన మనోరథం సఫలీకృతం చేసుకుంటానికి యింకా చాలా కాలంవుంది. ఆవిడ ప్రణయలత రోజూ ఒకకొన తిరిగిస్తోంది. దాన్ని నిర్మూలించటానికి ప్రపంచకంలో ఉన్న గొడ్డళ్లన్నీ పనిచేసినాచాలవు.

సుధార్ణవవిషయంలో తను మహాద్రోహం చేస్తున్నానన అది అత్యంతవ్యమూ అధమమూ అయిన పాతకమనీ, ప్రభాకరరావు తనలో తనే బాధపడేవాడు. చాలామాట్లు చెప్పేద్దామనుకుండేవాడు. కాని చెప్పటానికి ఏం అవకాశం ఉంది? చెప్పేవాడు మొదటే "నాపెళ్లి" అని చెప్పాలి: కాకపోతే మళ్లీ ఆప్రస్తావన వచ్చినప్పుడు చెప్పాలి. ఇప్పుడు అసందర్భంగా "నాపెళ్లి అయిపోయిందండోయి"

అని యెల్లాగా చెప్పటం? చెప్పితే ఆవిడ సంతోష విచ్ఛిత్తితప్ప ప్రయోజనం యేమివుండదు. ఆశావాయు తరంగాల్లో అల్లల్లాడుతూ, అనురాగ మేఘాల్లోకి యెగసి ఆనందంకలిగించే ఆవిడప్రేమఅనే గాలిపటం దారాన్ని కత్తిరించటం అతనికి యిష్టంలేదు. కాలక్రమాన్నే యీరహస్యప్రణయాగ్నిపర్వతం బ్రద్దలవుతుంది.

ii

సావిత్రిని కార్పొరేషన్ స్కూల్లో చేర్పిద్దామనుకున్నాడు మొదట. కాని ఆవిడ చచ్చినా బళ్ళోకి వెళ్లనన్నది. పోనీ యింట్లోనే విద్యలోకొంత అభిరుచి కలిగించితే కొంతలాభించుతుం దనుకున్నాడు.

ఆవిడ విద్యకోసం అతను అవలంబించినన్ని విద్యావిధానాలు ఏ ట్రెయినింగు కాలేజీప్రొఫెసరు అవలంబించి వుండడు.

ఆదర్శప్రాయమైనభార్యకు ఉండవలసిన లక్షణాలనుగురించి అతనికి చాలావింత అభిప్రాయాలున్నవి.

భౌతిక సౌందర్యంతో అతనికి అట్టేపట్టింపులేదు. కురూపి కాకుండావుంటేచాలు. స్త్రీకి సౌందర్యం అంటే విజ్ఞానసౌందర్యమే నని అతనివుద్దేశం.

తనకు భార్యగావుండి తనగౌరవమును పొందాలంటే తెలుగులో తన కవిత్వాన్ని అర్థంచేసుకుని ఆనందించే విమర్శపాండిత్యం వుండాలి. ద్వంద్వార్థాల్తో వ్యంగ్యార్థములతో తనతో యింగ్లీషు మాట్లాడగలిగివుండాలి. మర్యాదకులోబడి మాటకుమాటా వేటుకువేటూ వెయ్యాలి.

జీవప్రకృతి రసాయనశాస్త్రాల్లో అత్యంతాధునిక సిద్ధాంతాల్నికూడా అర్థంచేసుకుని వాటిని నిత్యజీవిత విధానానికి అనువర్తించి జాతీయజీవితంలో పెద్ద విప్లవం తీసుకురావాలి. ఆచారపిశాచాన్ని రూపుమాపి యింట్లో చిన్నస్వర్గమును సృష్టించాలి. శాస్త్రదృష్టితో నవీన సమస్యలనుగ్రహించి తనతోచర్చించి మార్గాలు సూచించాలి.

ఊహాతీతములైన భావవీధుల్లో తనతోపాటు పోటీపడి విహరించాలి. రమ్యమైన ఒకచిత్రాన్నో, దృశ్యాన్నో, గీతాన్నో చూపించితే ఆసౌందర్యాన్ని తనతోపాటు అనుభవించేశక్తి గలిగివుండాలి.

ఈక్షణం పార్శీలాగా, యింకొక్షణం బెంగాలీలాగా, మరోక్షణం పంజాబీలాగా వేషం మారుస్తూ నూతనాలంకరణవిధానాల్లో రిసెర్చిచేస్తూ రసదేవత అనిపించాలి. తనుతెచ్చే పత్రికలన్నీ చదవాలి.

భాగస్వామిని అయి (Partner) తనతో టెన్నిసు ఆడాలి. నైపుణంతో carrams ఆడాలి. చదరంగమాడి ఆటకట్టించాలి. విద్యాధికులూ నాగరికులూ అయిన తనస్నేహితుల్ని స్నేహితురాండ్రనీ పరిచితుల్ని చేస్తే వెర్రిఅనుమానాలుపడకుండా వాళ్లతోకలిసి ప్రవర్తించటం నేర్చుకోవాలి.

పాత్యఅన్న విషయములో అతని అభిప్రాయములు యివి. ప్రేమకు ప్రతిఫలమైన పతిభక్తిఅంటే అతనికి గౌరవమే. లోకంకోసం పతిభక్తిఅంటే అసహ్యం. విజ్ఞానంలేని సౌందర్యానికి నాగరికతలేని పతిభక్తికీ అతనిదృష్టిలో విలువలేదు. ఈరెండూ మూర్తీభవించిన సావిత్రి అతనిహృదయాన్ని ఆకర్షించదు.

అక్షరమాత్ర పరిజ్ఞానంగల సావిత్రి యీస్థితికి రావాలి. పాతాళంలోనించి గౌరిశంకర శిఖరమీదికి రెక్కలులేకుండా యెగరాలి. గజంలోతు చౌటిపర్రలో కేదారఖండం సృష్టించాలి. పట్టుకుంటే పిండి రాలిపోయేశిలలతో తాజ్ మహాలు తయారుచెయ్యాలి.

కేవల స్వశక్తిమాత్ర సహాయ్యుడై మహాసామ్రాజ్యాన్ని కూలద్రోయ దలచుకున్న విప్లవకారుడి విజయానికి యెంతఅవకాశంవుందో అతని విజయానికీ అంతే అవకాశంవుంది.

అయినా ప్రభాకరరావు ఉత్సాహం విడువలేదు. ఎప్పటికైనా తనకు సుఖప్రణయానుభూతి అంటూ వుంటే అది సావిత్రి వివేకమ్మీద ఆధారపడివుంది.

సావిత్రికి మనుచరిత్రంపాఠం మొదలుపెట్టేడు. నడక చాలా మందంగావుంది. "ఉల్లమునందు నక్కటిక మూనుట" దగ్గరకువచ్చేటప్పటికి మూడువారాలుపట్టింది. ఆపద్యసారస్యము సావిత్రి మాటల్లోవున్న మృదువైన యెత్తిపొడుపు పెద్దన ప్రతిభ ఉగ్గడించుచూ రెండుగంటలు విమర్శకోపన్యాసం చేశాడు. వింత, భయం, ఖంగారూ వెళ్లగక్కే వేడికళ్లల్లో దృష్టినిలబెట్టి వినివిని సావిత్రి "మీచదువుకున్నవాళ్లదంతా తంతూ తమషానూ! యీకాస్తముక్కలో యింత వుందండీ!" అన్నది. ఆదెబ్బతో అతని ఉద్రేకం పంపు వూడదీసిన 'స్టౌవ్'లాగ ఆగిపోయింది. ఆనర్సుక్లాసు లెక్చరుహాలుకు యోగ్యమైన ఆ అమూల్యోపన్యాసం వ్యర్థం అయినందుకు ఒక్కవేడినిట్టూర్పువిడిచాడు. ఆవుపన్యాసం సుధార్ణవముందు చేస్తే యెల్లా ఉండేది? రెక్కలు గట్టుకుని అతనితోపాటుగా అంతరిక్షంలోకి యెగసేది. అంత ప్రతిభావంతుడైన స్నేహితుని సంపాదించినందుకు గర్వపడేది. సంస్తుతివాక్య కుసుమహారాల్తో నింపివేసేది. శ్లాఘానురాగ పవిత్రములైన దృగ్వీచికల్లో స్నానంచేయించేది. ఇక్కడ ఆవుపన్యాసం బూడిదలో పోసిన పన్నీరయింది.

ప్రతిరోజూ యిల్లాంటిదే యేదోజరిగేది. ఆవిడ బెదిరేది. గుండెలుజారి అతను నిట్టూర్పులు విడిచేవాడు. మరి రెండుపద్యాల్తో మనుచరిత్రపాఠం ఆగిపోయింది.

కుంపటి ముందరబెట్టుకుని అవస్థపడుతూవుంటే స్టౌవ్ వెలిగించటం నేర్చుకోమని చాలా బాధపెట్టేడు. "దానికిటుకులు నాకుతెలియ"దని చాలారోజులు తలాయించింది. ఒకనాడు అతనే చాలా తీవ్రంగా చెప్పగా సాహసించి ఉద్యమించింది. ఎన్నడూ చూడని ఆపరేషను చేయబోయేముందు దుర్బల హృదయుడైన సర్జనులాగ కంపించింది. చివరకు స్పిరిట్ పోసి వెలిగించి పంపు బిగించకుండా గాలి కొట్టింది. స్పిరిట్ ఆరిపోయింది. స్టౌవ్ వెలగలేదు. "ఇదేమిటో తెలియటంలేదండీ," అని కేక బెట్టింది. చదువుతూవున్న సర్జరీ వదిలిపెట్టి వచ్చిచూసి పంపు బిగించాలని జెప్పి వెళ్లేడు. మళ్లీ స్పిరిట్ పోసి సరిగా కాలకుండా గబగబా గాలి కొట్టింది. భగ్గుమని మంటలేచింది. ఏంచెయ్యాలో తెలియక "బాబోయ్!" అని బయటకువచ్చింది. అతను వెళ్లి ఆర్పేడు. మర్నాడు పీడనశక్తిమీద, వాతావరణంమీద, స్టౌవర్కింగుమీద స్కూలుమేష్టరు చెప్పినట్లుగా చెప్పేడు. **Principle should precede application** అనుకొని అంతావిని నాకీ స్టౌ వద్దూ చట్టుబండలూ వద్దు కష్టపడేదాన్ని నేనయితే నాకేం అన్నది. స్టౌ మూలపడింది అంతటితో.

హోటలునుంచి అన్నంతెచ్చే అయ్యరు మానివేశాడు. ప్రభాకరరావు ఆపనికి ఒక మొదలియారు కుర్రాణ్ణి పెట్టేడు. సావిత్రి "పెడితే బ్రాహ్మణ్ణి పెట్టండి లేకపోతే కావలసినవి పట్రండి నేనే వంటచేస్తా"నన్నది. ఏసంఘసంస్కర్త యివ్వని మహోపన్యాసం యిచ్చాడు. ఆవిడలోపరివర్తనం కలగలేదు. నెలకు మూడురూపాయిలుయిచ్చి ఒక అయ్యర్ని కుదిర్చాడు.

ఆవిడకొ అందమయిన కళ్లజోడు కొనుక్కొచ్చేడు. "ఎందుకిది దండగ? నాకళ్లకేమి జబ్బులేదు. ఏజబ్బులేకుండా మీరు పెట్టుకున్నారు అనిచాల్లెండి" అని యెత్తిపొడిచింది.

కాళ్లకి చెంకీ చెక్కిన స్లిప్పర్సు కొనుక్కువచ్చేడు. ఎందుకన్నది. "ఇంట్లో తొడుక్కుంటానికి" అన్నాడు. "ఇంట్లో చెప్పలెందుకు? నేనేం దొరసాన్నేమిటి? డబ్బు తగలెయ్యటానికి కిదేముళ్లు" అని చివాట్లెట్టింది.

కాళ్ల కడియాలు తీసెయ్యమన్నాడు. కుంకంబొట్టు కొంచెంచిన్నదిగా పెట్టుకోమన్నాడు. బాడీస్ తొడుక్కోమన్నాడు. పక్కపాపిడేనా తీసుకో

మన్నాడు. దారిపోయే యిద్దరు ముగ్గురిని ఉపమానంగా చూపించాడు.

చివరకి "ఏమిటండీ! యీ పోరు నాకు. ఈ వేషాలు కూడు పాలదుటండీ! ఈ భోగంవేషాలు నేను వేయలేను. నన్ను చంపినా సరే!" నన్నది.

ప్రతివిషయంలోను ప్రభాకరరావుకు అసంతృప్తి కలిగింది. జీవితంలోంచి సౌందర్యం తీసివేయబడ్డట్లయింది. కిసలయితోద్యానంలాగ శోభిల్లవలసిన అతని తరుణహృదయం నైరాశ్యంతో థార్ యెడారి అయిపోయింది.

అంతభావోద్రేకం గల తనకు యిటువంటిభార్యను చేసి తన్ని యింత కుంగదీయటానికి భగవంతుడికి తానేమి అపకారం చేశానా అనుకునేవాడు.

నిజం విచారించితే సావిత్రి తప్పేముట్టుకు యేమివుంది? ఆవిడ శైశవంనుంచీ పొందిన తర్ఫీతు పెరిగిన పరిసరములు ఆమెను అట్లా తయారుచేసినవి: జీవిత విధానంలో ఆవిడకీ తనకీ అభిప్రాయభేదం వుంది. అంతే! ఆవిడని నిర్బంధించి తన అభిప్రాయములను ఆవిడకూడ Force చెయటానికి తనకుమట్టుకు యేమి హక్కువుంది? అతను స్త్రీ జాత్యారాధకుల్లో అగ్రగణ్యుడు. ఎంత విసిగించినా సావిత్రిని ఒక్కమాట అయినా అనేవాడు కాడు. ఆవిడ యేదైనా అడిగితే వెంటనే తెచ్చియిచ్చేవాడు. అసలు ఆవిడ కోరికలేమున్నాయి? శనివారంనాడు ఆంజనేయస్వామికి కొబ్బరికాయ తెమ్మనడంతప్ప! ఆవిడ అడిగిందేలేదు. అన్ని అతనే ఊహించి తెచ్చేవాడు.

తనకు కావలసిన భార్యను ఆవిడలో చూడలేను అని తెలిపోయింది. అతనికి ఆవిడని నిర్బంధించటానికి అతనికి చేతకాదు. అతను ఆత్మవున్న భర్త. అమాయిక అయిన కన్య కళ్లనీరు అతన్ని ఉడికించివేస్తుంది.

గృహంలో సౌఖ్యం. శాంతివుండాలంటే భార్యాభర్తలు సమానప్రేమలూ సమాన జీవితాదర్శాలు కావాలి. దంపతులప్రేమ వారి మనస్సుల కలయిక మీద ఆధారపడుతుంది. అభిరుచులు వేరయితే అనురాగానికి చోటువుండదు.

అతడు పాశ్చాత్య నాగరకతా వ్యామోహితుడు. తను రోజుల్లా కాలేజీలోపడి యింటికి రాంగానే Hullow! అని ఆహ్వానించేవారూ అందంగా అలంకరించుకున్నప్పుడు అతని taste ని మెచ్చుకుండేవారు సినీమాలకీ పిక్నిక్ వెళ్లినప్పుడు అందమయిన వేషంతో ఆకర్షణీయమైన భంగితో ప్రక్కనవుండి కబుర్లు చెబుతూ చూశేవాళ్లందరూ యీర్ష్యపడేటట్లు చేశే వాళ్లూ కావాలతనికి. ఆవిధంగా అనేకచోట్ల తన కంటబడే యువతీ యువకుల్ని చూస్తే హృదయం నీరయ్యేది అతనికి. కాలం గడిచింది.

iii

ఒకనాడు ప్రభాకరరావు గదిలో కూచుని కాలేజి గ్రూపుఫోటోలో ఠీవిగా కూర్చునివున్న సుధామయ వంక చూస్తున్నాడు. మెదడు అమితాసక్తి పరిసరములను మరిచింది.

ఎందుకో అక్కడికి సావిత్రి వచ్చింది. మెల్లిగా అతని వెనకాలనుంచుని "ఎవరండీ ఆ అమ్మాయి?" అంది.

కొరడాదెబ్బ తగిలినట్లయింది ప్రభాకరరావుకు—కాని తెప్పిరిల్లి "ఏ అమ్మాయి?" అన్నాడు.

"మీరుచూస్తున్న అమ్మాయి"

"అమ్మాయిలు అను, యిక్కడ చాలామంది ఉన్నారు."

అందర్నీ మీరు చూట్టంలేదు. అమ్మాయినే మీరు చూస్తున్నారు. ఎవరండీ ఆ అమ్మాయి?"

"ఎవరో చదువుకునే అమ్మాయి."

"ఎవరో చదువుకునే అమ్మాయి! అయితే అమ్మాయివంక యెందుకు చూడటం?"

ఆ సమయంలో బెట్టువిడిచి బేలయయి ఉద్రేకంతో ఆకంపించి పోయింది.

ఆవిడ నోటినుంచి వచ్చే ప్రతిఅక్షరం అతనిశరీరం లోని ప్రతిపరమాణువునూ ఉడికించివేసింది! క్షణకాలం అతని ఆత్మ స్వర్గసౌఖ్యం ప్రాప్తిఅయిన విష్ణుభక్తుడిలాగ ఊహాతీతమైన ఆనందమును అనుభవించింది. కాని మరుక్షణమే సావిత్రిరూపం అతనికి కనులముందు కన బడింది.

చవిటిపర్రకోసం స్వర్గసామ్రాజ్యాధిపత్యం వొదు లుకోవాలి ప్రభాకరుడు!! ఆసమయంలో ఆ మెదడు లేడి, ఆనెత్తురుడుకు, ఆహృదయంలోవేదన ప్రపంచకంలో ఉన్నవాంఙ్మయాలన్నీ కలిసినా అభి వర్ణించలేవు.

ఇప్పుడు ఆనిష్కల్మష ప్రణయమూర్తికి యేమని జవాబుచెప్పాలి? ఆ ప్రేమని తిరస్కరించుతాడా? ఏ కారణంచేత? స్వీకరించుతాడా? ఏ మార్గంతో? ఎంతప్రయత్నించినా అతని నాలుక కదలలేదు.

తన మహాపరాధం సుధార్ణవకు తెలిపి ఆవిడ క్షమాభిక్ష కోరదామనుకున్నాడు. అనిర్వాచనీయమైన యేదో దౌర్బల్యం అతన్ని శక్తివిహీనుణ్ణి చేసింది. ఆ దివ్యమూర్తిముందు అతను దోషాంగీకారం చేయ లేకపోయినాడు. ఆత్మకు వ్యతిరేకమైన పరిపాలనా విధానమును పరిస్థితుల నిర్బంధంచేత అవలంబించి జాతి హింసచేసే విదేశాంగ మంత్రిలాగు అతను వేదన అనుభవించాడు.

కొంతసేపటికి అతనివాక్కు అతని స్వాధీనతకు వచ్చింది.

"సుధా! యీదీనుణ్ణి నీవంటి యువతి తన అమూల్యప్రేమతో పవిత్రీకరించటం చాలా అసాధా రణమయిన విషయం. ఏ అభ్యంతరమూ చెప్పక 'ధన్యోస్మి' అనుకుని తలఊపవలసిన పరిస్థితులు నావి. కాని..." అపూర్వమైన హృదయవేదన యేదో అతనికంఠము రుద్ధము చేసింది. మళ్లీ విశ్వప్రయత్నం మ్మీదమాట స్వాధీనమునకు తెచ్చుకున్నాడు. "కాని నేను వెంటనే యీప్రేమరాశిని స్వీకరించలేను. అందుకు నాశక్తికి మించిన అభ్యంతరములు ఉన్నవి. నా అంగీకారము యిచ్చేముందు కొన్ని విషయముల స్థలను పూర్తిచేయాలి. అందుకు కొన్నిరోజులైనా అవసరం." అన్నాడు.

తన ప్రభాకరరావునోటివెంట అటువంటి జవాబు వస్తుందని ఎప్పుడూ సుధార్ణవ అనుకోలేదు క్షణ కాలం ఆవిడ ధైర్యం ఆవిడను విడిచింది. తనకళ్ల మీద చెవులమీద ఆవిడకు విశ్వాసంపోయింది. అతను యుక్తవయస్కుడు. స్వతంత్రుడు. అతనికి అంగీకారం వెలిబుచ్చటానికి యేమిటి అభ్యంతరం?

"నీకేమిటి సందేహం? నిన్ను యెదుర్కొనే ఆ సమస్యలు యేమిటి?" అన్నప్రశ్నలు ఆవిడ నాలుక దాకా వచ్చినవి, కాని ఆవిడ వివేకం ఆవిడను వారిం చింది. అవిచ్ఛిన్నంగా ప్రవహించవలసిన ఆవిడ ప్రేమవాహినికి యిప్పుడు అడ్డుతగిలింది. ప్రభాకర ప్రణయాలబ్ధి సందేహాస్పదం అవటంతోటే ప్రపంచకం అంతా ఖాళీగా తోచింది చివరకు.

"పోనీ! యింకా కొంతకాలందాకా ఆశ ధరించ వచ్చునుగా,"

"నిస్సంశయంగా" అన్నాడు ప్రభాకరరావు.

ఆ తరవాత యేమీ సంభాషణ జరగలేదు. సంజ చీకటివారిని గృహోన్ముఖులను చేసింది. హాస్టలుగేటు దగ్గిరమాత్రం 'గుడ్ నైట్' అన్నాడు ప్రభాకరరావు. 'గుడ్ నైట్' అన్నది సుధార్ణవ, కాని ఆ కంఠంలో పూర్వంవుండే ఆత్రావ్యత లేదు. ఉత్సాహంలేదు. ఆవిడ కంఠదైన్యం కలిగించానసే తలపు ప్రభాకరరావును రంపపుకోత కోసింది. ఆకాశమున మొలక నవ్వులు నవ్వే చంద్రుణ్ణి పెద్దకారుమబ్బు క్రమ్మివేసింది. ప్రభాకరరావు యింటికివెళ్లేడు. సావిత్రి యింట్లో

ప్రభాకరరావు మాట్లాడలేకపోయినాడు. అతని శరీరమును యింద్రియములను సావిత్రి వివాహవేళలో కొనుక్కుంది. వాటిని అన్యవిషయంలో వినియోగించటానికి అతనికి యేమి హక్కువుంది?

"పోనీండి చెప్పకపోతే!" అని వెళ్లిపోయింది సావిత్రి, భర్త యెంతకూ జవాబుచెప్పక పోవటం చూసి.

"ఎవరండీ ఆ అమ్మాయి?" ఆ ప్రశ్నే అతని చెవుల్లో ప్రతిధ్వనించింది. ఏమిటి దానికి జవాబు?

ఆ సాయంత్రం ప్రభాకరరావు యెందుకో మనీపర్సుబల్లమీద వదలి వెళ్లేడు. పరధ్యానంగా సావిత్రి అందులో యేముందోనని ప్రతి అర వెదికిచూచింది. కొంతడబ్బుతో పాటు ఒక అరలో యేదో బంగారంలాగా మెరిసింది. బంగారానికీ పల్లెటూరిపిల్లకీ అవిభేద్యమైన సంబంధం వుంది. అది కాసేమోనని బయటికిదీసి చూసింది సావిత్రి.

అది ఒకలాకెట్టు అందులో సుభార్ణవ బొమ్మ వుంది. ఆ బొమ్మకీ యిందాక తన భర్త చూస్తూవున్న బొమ్మకూవున్న పోలిక చూస్తే సావిత్రికి భంగాయి పుట్టింది. "ఇదంతా యేమిటో గోలగావుంది. రానీ అడుగుతాను" అనుకుంది.

ఆ సాయంత్రం ప్రభాకరరావు డాబామీద వెన్నెట్లో పడుకున్నాడు ఏదో ఆలోచించుతూ. వెనకాలనుంచివచ్చి సావిత్రి "యిదియేమిటండీ" అన్నది. దొంగ మేజస్ట్రీటుముందులాగా ఒణికిపోయినాడు ప్రభాకరరావు సావిత్రిముందు, కాని "ఏమిలేదు. అది నీకెల్లా దొరికింది?" అన్నాడు ఎల్లాగో మొగవాడు గనక.

"ఇంతకీ యెవరో చెప్పమంటే చెప్పరు. ఎవరండీ ఆ అమ్మాయి?"

ఆ కంఠంలోవున్న అమాయకత్వం, దొంగసాక్ష్యం యిచ్చే సాక్షిని వకీలు సింహగర్జనంలాగా అతన్ని కంపింప జేసింది. కాని మళ్లీ తెప్పిరిల్లి "ఒకస్నేహితురాలు" అన్నాడు.

"స్నేహితుల బొమ్మలు యిల్లా దాచుకుంటారా?" అజ్ఞాన జీవితమైనా ఆనిష్కల్మషత యెంత పవిత్రమయింది.

"ఔను."

రెండు నిముషాలు అల్లాగే చూసింది సావిత్రి. ఆ చూపు నాయనమ్మలు చెప్పే వెర్రికథలు విశ్వసిస్తూ బాలకులుచూసే చూపులాగా వుంది.

"మరి మీబొమ్మ ఆ అమ్మాయిదగ్గిరా వుంటుందా?"

"ఆ ఉంటుంది" అతనికి నవ్వూయేడుపూ రెండూ వచ్చినయి.

"ఆ అమ్మాయిని మన యింటికి ఒకమారూ తీసుకురాలేదేం?"

అతను మాట్లాడలేదు. తన ప్రశ్న సంగతి మరచిపోయింది సావిత్రి.

"మరి మీబొమ్మ యిల్లా దగిర వుంచుకుంటే వాళ్ల అమ్మా నాన్నా కోప్పడరండీ?"

"వాళ్ల అమ్మా నాన్న లేరు." అన్నాడు తేలిగ్గా.

"ఒకవేళ ఉంటే?"

"ఉన్నా కోప్పడరు". ఎన్ని అబద్ధాలు!

"కోప్పడరూ? ఏమి వింతండీ!"

ఆ వేళకి ఆ సంభాషణ అంతటితో అంతానికి వచ్చింది. ఆ మర్నాడు ప్రభాకరరావు బావమరిది వచ్చి సావిత్రిని తీసుకువెళ్లేడు. ఆ పిల్ల తమ్ముడి అన్నప్రాశనకు. పరీక్షలని వంకపెట్టి ప్రభాకరరావు తప్పించుకున్నాడు.

iv

ఏకాంతంగా వుండటంచేత ఫైనల్ యియరు పరీక్షకు విపరీతంగా చదివేడు ప్రభాకరరావు, అతనికి మెడిసిన్‌లోనూ సర్జరీలోనూ డిస్టింక్షను వచ్చింది. సుభార్ణవ మిడ్వైఫరీలో డిస్టింక్షను తెచ్చుకుంది.

ఇప్పుడు సుధార్ణవ డాక్టర్ సుధార్ణవ! ప్రభాకర రావు డాక్టర్ ప్రభాకరరావు!

ఫలితములు తెలిసిననాటి సాయంత్రం సుధార్ణవ హాస్టలుకు వెళ్లేడు ప్రభాకరరావు. ఆ యేడు ఆడవాళ్లల్లో అన్ని సంవత్సరాలవాళ్లూ విరివిగా పరీక్ష అయినారు. హాస్టలంతా కోలాహలంగావుంది. ఎక్కడో తప్ప వాచినకళ్లు కనబడటంలేదు.

అభ్యంగనపరిశుభ్రమైన దీర్ఘవేణిని కొంతవరకూ జడవేసి వదిలి, మల్లెపూవువంటి మస్లిను చీరకట్టుకుని మామిడిచెట్టుక్రింద కుర్చీమీద కూర్చునివుంది సుధార్ణవ. చిరుగాలికి ముంగురులు నాట్యంచేస్తూ వున్నవి. ఆవిడ కళ్లల్లో ఆలోచనా విజయోత్సాహం అసాధారణ విజయం కలిగినప్పుడు ఆడవాళ్ల కళ్లల్లో కనబడేదర్పం అన్నీ తాండవిస్తున్నవి.

దూరాన చెట్టుక్రింద యిద్దరు యువతీ యువకులు 'కేరమ్సు' ఆడుకుంటున్నారు, తనకు అభినందనములు చెప్పవచ్చిన సంపన్న స్నేహితుని కారుమీద కాలు వేసి విజయోపేత అయిన యువతీమణి ఒకర్తె ధన్యవాదములు చెబుతోంది. 'రికెట్సు' పట్టుకుని! ఛాన్సు కోసం నిరీక్షించుతూ, ఆడేవాళ్లు బాగా ఆడినప్పుడు హర్షము వెలిబుచ్చుతూ టెన్నీసు కోర్టుదగ్గర చాలామంది నిరీక్షించుతున్నారు. ఎక్కడ చూసినా "Congratulations" "Thanks" అన్నమాటలు వినబడుతున్నవి. ఆరోజు లక్షమంది మిస్ మేయోల నోరు మూయించేటట్లుగా వుంది ఆ హాస్టలు.

సుధార్ణవ ప్రభాకరరావు పరస్పరము అభినందనములు ధన్యవాదములు అందచేసుకున్నారు. అందరూ చుట్టిముట్టి అభినందనములు చెప్పేరు. అందరికీ ధన్యవాదములు అందచేసేటప్పటికి అరగంటసేపు పట్టింది.

"తలంతా యేదో దిమ్ముగాఉంది ఎక్కడకన్నా షికారు పోదాము" అన్నది సుధార్ణవ. ఆవిడ చేసిన సూచనలకు వ్యతిరేకం అతను యింతవరకూ చెప్పలేదు. ఇద్దరూ "స్పర్టాంకు మెడోస్" వేపువెళ్లేరు మధ్య మధ్య మాట్లాడుకుంటూ.

మంద మనోజ్ఞమైన సాయంవాయువు వీస్తోంది. రేడియోలోనించి శ్రావ్యమైన సంగీతం వినబడుతోంది. ఆనందానికి విరుద్ధమైన దేదీ అక్కడలేదు.

కాని సుధార్ణవహృదయంలో చిన్నతుపాను రేగుతోంది. ఆవిడ తండ్రి ఆవిడకు చాలా ఆస్తి అప్పగించి పోయినాడు. అది ట్రస్టీలచేతుల్లోనుంచి కొద్దిరోజుల క్రిందే ఆవిడ చేతుల్లోకి వచ్చింది. ఇప్పుడు విద్యాపూర్తి అయి వైద్యవిద్యలో పట్టభద్ర అయింది ఎంతకూ ప్రభాకరరావు హృదయం విప్పారేటట్లు లేదు. ఆవిడప్రేమ యిక దాచటానికి వీలుగా నుండక పొంగి పొర్లిపోతోంది. సంతోషప్రదమైన యీదివ్య సమయంలోనే ఆ ప్రేమను యెందుకు సఫలీకృతం చేసుకోగూడదు?

కాని యువతులు సహజంగా దర్పస్వరూపలు. తమ ఉద్రేకాలు తమర్ని యెంత బాధించుతున్నా అణచుకుని తాముప్రేమించిన యువకులు తమ పాదాక్రాంతులు అయ్యేవరకు నిరీక్షించుతారు. అంతేకాని బెట్టువీడి చేలలుకారు. కాని ఒక్కొక్కప్పుడు యీదర్పాన్ని అణచుకొని తమంతట తామే బయటపడేదైన్యం కలుగుతుంది యువతికి. ఆ అవస్థకుముందు "లొంగిపోవటమేనా?" అన్న శంక, దాంతో ఒకతుపాను రేగుతుంది. సుధార్ణవ యిప్పుడీస్థితిలో ఉంది.

చివరకు నిర్ణయానికి వచ్చింది. తనహృదయానికీ, శరీరానికీ సంపత్తుకూ అన్నిటికీ అతన్ని అధినాధుణ్ణి చేయదలచుకుంది. ఇంకా యెందుకు బెట్టుసరి? మెల్లిగా తన ప్రేమసంగతీ ఇన్నాళ్లుగా తాననుభవించిన వేదన సంగతీ అంతా చెప్పింది. చివరకు తన్ని పత్నిగా స్వీకరించమని చెప్పింది. అధిగంభీర అయిన సుధార్ణవ

లేకపోవటం మహాదృష్టం అనుకున్నాడు. మూల అయ్యరు తెచ్చిపెట్టిన టిఫిన్ కారియరు చీమలుపట్టి పోతోంది. ఆ వివశత్వంలో ఆకలి యేం తెలుస్తుంది? అతను ఆలోచన మొదలుపెట్టేడు. ఇప్పుడు అతనికి విశాలప్రపంచంలో యిద్దరు వ్యక్తులుమాత్రమే కనబడుతున్నారు వారిమీదే అతని ఆలోచనలు కేంద్రీకరించి ఉన్నవి. వారిద్దరూ సావిత్రీసుభార్గవలు ఇద్దరూ తనదౌర్బల్యంచేతే తన జీవితంలోకి ప్రవేశించారు. ఒకరియందు తను భర్తృవిధిని నిర్వర్తించాలి. ఇంకొకరియందు ప్రణయవిధిని నిర్వర్తించాలి.

రాజ్యంకోసం ఆత్మీయులను వధించుటనో, ఆత్మీయులకోసం రాజ్యాన్ని విసర్జించటమో తెలియక కర్తవ్య మూఢుడైన అర్జునునిలాగు, దోషియైన తల్లిని చంపి తండ్రియెడల విధినిర్వర్తించటమో తల్లిమీద ప్రేమతో తండ్రికి అపరాధం చేయుటకో తేల్చుకోలేక మనోవేదన చెందిన హ్యామ్లెట్ లాగ అతను అవస్థపడ్డాడు.

ప్రతియుగంలో ప్రతిదేశంలో విధికీ ప్రేమకీ యుద్ధం జరుగుతూనేవుంది. ఆవిషమపరిస్థితుల్లో సరియైన కర్తవ్య నిర్ణయం చేసుకొన్న బుద్ధిమంతులు చాలా అరుదు. సావిత్రీ, సుభార్గవా: విధీ, ప్రేమా - రెండూ రెండే. వివేకమనే త్రాసులోపెట్టి యిద్దర్నీ యెంతసేపు తూచినా త్రాసు అటూయిటూ మొగ్గటం లేదు. ఒకరు ఉండగా మరొకరు లభించరు. ఇద్దరూ అసలు లభించరు.

శీలం విషయంలో సావిత్రి తులశిమొగ్గవంటిది. తన అభిప్రాయములతో యేకీభవించని మాత్రాన ఆవిడను విసర్జించటానికి అతని ఆత్మ అంగీకరించదు. కావలిస్తే సుభార్గవనే తిరస్కరించవచ్చు; కాని ప్రపంచకములు మునిగినా అతనినాలుక ఆమాట ఉచ్చరించలేదు.

ఉంటే యిద్దరూఉండాలి. లేకపోతే యిద్దరూ ఉండగూడదు. తనంటే దేవతుల్యుడుగా పరిగణించుతున్న సుభార్గవదృష్టిలో దోషిగా పరిగణింపబడి, ఆవిడ ఆశాభంగంతో కృశించుతూనో,అన్యగృహీతయై సుఖించుతోనో ఉంటే తను చూస్తూ జీవించలేడు. అది అసంభవము.

ఈ సిద్ధాంత పూర్వపక్షములతో మెదడు వేడి యెక్కి పోయింది. హృద్వేగం యినుమడించింది. రక్తనాళాలు చిన్నవి పెద్దకాచొచ్చినవి.

ఈ గోల అంతా తనే ప్రపంచకాన్ని విడిస్తేనే తప్ప తీరేటట్లు లేదు. అవివేకసంజనితమైన మానసికోన్మాదంలో ఆతని ఆత్మ ఆత్మహత్యను నిర్ణయం చేసింది.

* * *

మర్నాడు పదిగంటలకు అతని అకాల దుర్మరణం ప్రపంచకానికి తెలిసింది. అతనిశవం వైద్యాలయానికి వచ్చింది. విచారణమీద తేలిన నిర్ణయం విద్యుద్ఘాతంతో మరణం అని.

అతని విజ్ఞానం ఉన్నతవిద్యా అన్నీ అనవసరంగా ఆత్మహత్య చేసుకొంటానికి వచ్చినవి.

కర్తవ్యతామూఢుడైన అర్జునుడికి శ్రీకృష్ణుడు కర్తవ్యోపదేశం చేసి ఉద్ధరించేడు. కర్తవ్యోపదేశం చేసేవాడు లేక హ్యామ్లెట్టు నశించాడు. ప్రభాకరరావు సున్నితస్వభావం తీవ్రసమస్యలను యెదుర్కోలేదు. బిగించిఉన్న వీణతీగె మోటుగా మీటినప్పుడు తెగినట్టు అతని జీవితం తెగిపోయింది. ఆవిషమ సమస్యలో అతనిబుద్ధికి మరొక్కబుద్ధి తోడైఉంటే ఆ మహావిప్లవం సంభవించేదికాదు.

ఒకవేళ సుభార్గవ అతన్ని క్షమించేదేమో! తన భర్త ఆనందంకోసం, సరీగాబోధించితే, తనహక్కును సావిత్రిత్యాగం చేసేదేమో! అతను ధైర్యంతో ముందంజ వేయలేదు. హృదయదౌర్బల్యసంజనితమైన మానసికాందోళనలో ఉక్కిరిబిక్కిరి అయి ఊపిరిఆడక అతను నశించి పోయినాడు.

అతని మరణానికి కారకులెవరు? అతని భావాభిరుచులను నిర్లక్ష్యంచేసి నిర్బంధించి అతని జీవితాన్ని పాడుచేసిన సంరక్షకులు, ఇతరుల ఆదర్శములను లెక్కచేయకుండా తమ మూఢవిశ్వాసములనే వారినీ అవలంబించమనే ఛాందసులు. అతన్ని నిర్బంధించి అతని పినతండ్రి వివాహం చేయకపోయినా, అతని ముద్దు చెల్లించి మామగారు శైశవంలోనే సావిత్రికి విద్యాభిరుచి కలిగించి విజ్ఞానసంపన్నను చేసినా, సావిత్రి తన మూఢాచారములను విసర్జించి తనభర్తకు సంతోషప్రదమైన జీవితవిధానమును అవలంబించినా అతని ఆత్మహత్య సంభవించిఉండేదికాదు. కాని దైవవిధి అనుల్లంఘనీయం.

ఆ దుర్వార్త విన్నప్పుడు సుధాన్వ హృద్వేదనను ఏకలం అభివర్ణించుతుంది? ఆడ జీవితాంతం బ్రహ్మచారిణిగానే ఉండిపోయింది.

ఏకారణం లేకుండా యెందుకు తనకు చిచ్చుపెట్టి భర్త నశించినాడో సావిత్రికి జన్మంతా ఆలోచించినా తోచలేదు. మూఢాచార సేవకుడైన తండ్రి సంఘభయంతో సావిత్రి జన్మాంతవైధవ్యం అనుభవించింది.

ప్రణయరంగంలో ఆశాభంగాల్తో ఆత్మహత్యలు నేడు దైనిక సంఘటనములైనయి. హృద్విదారకములైన యీ విషాదసంఘటనములనుంచి హిందూ సంఘానికి యెప్పుడో ముక్తి?

## "శిశిరము"

("షెల్లీ" గీతములనుండి)

కోడెకానిఁగోల్పడిన శకుంతమొండు
మోడు శాఖకఁ రెక్కలముడిచి, యొదిగి,
వెతనినాదించు ప్రేమైక విరహగీతి
కూసెఁ హృదయమే కలగఁ 'కూ! కూ!'
యటంచు.

ఊర్పుపై యూర్పు విడకఁ బిట్టూర్చి ప్రాకెఁ
యిగముక్రమ్మిన మాదసమీరవీచి;
వృక్షపాదమ్మునాని స్రవించెమెల్ల
గా నొకండు లహరి మంచుగడ్డ కట్టి!

కాననాంతరసీమలో కానరాదు
చెప్పుకొన నొక్క పత్రంపు చిహ్నమైన!
చిత్ర మదియేమొగాని? సజీవసుమన
సమ్మె స్వప్నించ బోదిలాక్షలిని నేను!

స్తబ్ధతా నిబిడీకృతశాంతిపొదలు
నాకసమున మెల్లదెసలయందుకూడ!
అతిప్రగాఢ ప్రశాంతినిశాంతసమయ
మును విదల్చుఁ "మరల" చక్రపునినదమ్మె!

'కొమఱ్ఱాజు'

# దానములు

ఇయ్యవలయుననను నిశ్చయముచే దన కుపకారికాని వానికైనను దేశకాల పాత్రము లాలోచించి చేయుదానము సాత్వికమనియుఁ, బ్రత్యుపకారమునకుఁగాని ఫలము నుద్దేశించి కాని మనసునఁ గష్టపడుచుఁ జేయుదానము రాజసమనియు దేశకాలపాత్రల వివేచనలేక గౌరవసత్కారశూన్యముగఁ జేయునది తామసదానమనియు గీత అ. 17 శ్లో. 20, 21, 22 ములలోఁ జెప్పఁబడి యున్నదికదా! ఈముత్తెరంగుల యీవిలో మొదటిది మృగ్యము; రెండవది సకృత్తు; మూడవది సర్వసాధారణమును.

సాత్త్వికుడు ఫలము నేమాత్రము గోరకున్నను ఆయా దేశకాల పాత్రలనుబట్టి ఫలము కలిగియే తీరునని ఋజువుసేయుటకే క్రింది కథ వ్రాయఁబడుచున్నది. ఇది జరిగినదే. ఆంధ్ర దేశములోఁ నక్కడక్కడ పెద్ద లీనాటికిని జెప్పుకొనుచున్నదే !!

అజ్జాడ అన్నయ్యగారని యొక బ్రాహ్మణుడు. అతని బిడ్డలను గురించి మానాయనమ్మ నాతో నేమియుఁ జెప్పియుండ లేదనియే నాకు బాగా జ్ఞాపకము; కాని యాతఁడు మాత్ర మన్నప్రదాత—కాదు —నిరతాన్నప్రదాత !!

ఒకనాటిరాత్రి యాదంపతులు భుజించి పడుకొనియుండిరి. అది వర్షకాలము. ఆనాడు నారాత్రివర్షము గురియుచునే యుండెనట కాని ధారాపాతముగా మాత్రముకాదు. అట్టి సమయమున నెక్కడనుండియో "అన్నయ్య బాబో—రెండ్రోజుళ్ళనుండీ అన్నంలేదు—యిక్కడంటుకున్నాను రక్షించుబాబో" యని యొక యార్తనాద మాయజమానుని చెవిఁ బడినది. చప్పునలేచి మరల మరల విన్నాడాతఁడదే యేడుపు!! అది యెచటినుండి? ఒకమాలవాడు కుష్ఠరోగి!! కాళ్ళేతులు లేనివాడు కన్నులుగూడఁ దిన్నగాఁ గనఁబడవు—ఆలాటివాఁడు—ఏరుదాటి వచ్చుచుండగా నకస్మాత్తుగఁ బ్రవాహమువచ్చి యొక యిసుకదిబ్బమీద నంటుకున్నాడు. అట్టి వాని దాయేడుపు!! అన్నయ్యను వాడును వాని నన్నయ్యగారు నొకరినొక రెరుగుదురు. "ఔనదివాడే— నిన్న మొన్న రాలే దన్నాని" యనుకున్నాడన్నయ్య. వెంటనే భార్యనులేపి యింత చద్దియన్నమును ఆవకాయముక్కలును గిన్నెలోపెట్టి గుడ్డను మూటగట్టుకుని యామూట నెత్తినిఁగట్టుకొని పట్టుకుపోగాకు రొంటఁబెట్టుకొని గడ్డిబెంటు నిప్పంటించి చేతఁ బట్టుకొని బయటఁ బడ్డాఁడు !! భార్య "కూడావస్తా"నన్నది; కాని 'వొ'ద్దన్నాఁడు. ఎంతదూరము కనక ! ఇదిగోయేరు ! మహా యెక్కువైతే పీకబంటిలోతూ! అంతకెక్కువ యెప్పుడూ రాదేరు—"అరగంటలో రానటే" అని బిరబిర నడచిపోయినాడు. అటుతేరు

వాత నామాఁటే మరిచిపోయాఁడు. లోకమున
కిట్టిదంతయుఁ గానలయునా!

కొంతకాలమునకుమాత్ర మాయింటనొక
హత్యజరిగినదట: అమ్మగా రావకాయకుం
డలు తిరగవేయుచుండగా నామె మెడలో
నుండిన రవలజిగినీనాను శీలజారి ఆయూరుఁ
గాయకుండలోఁబడినది. అది యామె గమ
నింపలేదు. తరువాతఁ గూడ నావిషయమై
యా దంపతు లంతగాఁ బాటింపనులేదు.
'ప్రాప్తంలేదు— పోయిం'దనుకున్నారు. కాని
వారిదయ సంపాదింపగోరిన మహాత్ములు
మాత్ర మూరకుండలేక వంటవానిపై నను
మానపడి వానినొంటిగ నేటియొడ్డునకుఁ
బిలచికొనిపోయి తన్నిరి. అప్పుడే దెబ్బ
యెక్కడఁదగిలినదో కాని వాడు 'హరీ'
యన్నాడు పాపం!

అదికూడ లోకమున కేమియవసరము?
ఏట్లోపడి కొట్టుకుపోయుంటాడేమో—లేకుంటే
యేవైపో తా'డనుకున్నారు నలుగురునూ.
'ఏయుంటుం' దనుకున్నా రందరివలెనే అన్న
య్యగారును. కాని యప్పటినుండి యదేమి
చిత్రమో—ఆ యాలిమగల కన్నము పురుగుల
వలెఁ గనఁబడ నారంభించినది. ఎందుమా
కులును మంత్రతంత్రాదులు నెందుకును
బనికిరాకపోయినవి!! 'అవశ్యమనుభోక్తవ్య'
మనుకున్నారా యిద్దరును.

అనంతరమొక సిద్ధుఁ డాయింట నతిథియై
యీసమాచారము విని జాలిపడి యోజింప
మొదలిడెను. ఒకమండలము అనగా 40 నాళ్లు
సమాధిలోనుండి యవ్వల నాత డన్నయ్య
గారితో నిట్లనెను:—అయ్యా యిది బ్రహ్మ
హత్యా పాతకఫలము!! ఇది తొలగించు
కొంట కొక్కటేగతి:—ఆ నాఁ డా రాత్రి
మాలవాని కన్నముబెట్టిన సుకృతమును
ధారపోయుట.

అది వినఁగానే అన్నయ్యగారు 'అయ్యా,
నాకు ఫలాఫలజ్ఞానంలేదు. ఉన్నాదంటు
న్నారు మీరు. సందేహాస్పదమైన యిటు
వంటిదానిని ధారపోయడపు సంకల్పం నేను
చేయలేను. ఆ పాపఫలంకూడా అంతే? నేను
కావాలనలేదు; వొచ్చిందైతే!! దాన్నిపొమ్మ
నడానికి నాకధికారంలేదు' అన్నాడు!!

ఆ మాటలు పూర్తియైనవో లేదో అచ
టనే యెదుటనున్న రావిమాను అకస్మాత్తుగ
ఫెళఫెళమని విరిగిపడ్డది. ఆనాటినుండి యా
దంపతు లందరితోఁ గలసి తిరిగి యన్నము
దినుట కారంభించిరి.

విన్నారా?! సా॥ కృ॥ మూర్తి.

# కమల

శ్రీమతి పెరిచెండ [illegible] లక్ష్మిగారు

"ఏమి కమలం! ఈరోజు మాధవరావు తన గృహమునకు మనలను 'టీ'కి రమ్మన్నందున వెళ్లదలచితిమి గదా! ఇంకా నీవు తయారుకానటులగుపడుచున్నావే. వారింటి కెప్పుడు వెళ్లుట? అక్కడనుండి సినీమా కెప్పుడు వెళ్లుట? చదువుకొనుచున్న దానవగు నీవే ఇట్లుండిన ఇంక నితరులసంగతులడుగ నెందులకు?" అని నాగేశ్వరరావు తన సహాధ్యాయినిని తొందర పెట్టుచుండెను. ఆమెయు కాలానుసరణంబుగ నలంకరించుకొని, చరచర వీధిలోనికి తన మిత్రునితో వచ్చి, అక్కడనున్న పనిమనిషితో "ఓసీ వెంకీ! నే నీరోజున బహుశా ఆలస్యముగా యింటికివచ్చెదనని అమ్మగారితో చెప్పివేయుము" అని పల్కి అతనితో వెడలిపోయెను. ఆమె తల్లియు పనిమనిషివల్ల తానువినిన సంగతికి విసుగుకొనుచు "అయ్యో! ఇదియేమి కాలమహిమ, అంతకంతకు ఈ విద్య జ్ఞానార్జనమునకు గాక, విషార్జనమునకే సహాయకారియగుచున్నది. ఎవరి ననుకొన్న నేమి లాభము. కుటుంబమును సార్థమైనరీతిని, సరియైన పద్ధతులపైన, నడుపవలసిన గృహయజమానియే ఇట్టి అసందర్భపు వాతావరణములోబడి కొట్టుకొని పోవుచున్నారు." అని సణుగుకొనుచుండగా వీధియందు కారుచప్పుడాయెను. కుటుంబరావుగారు, చేతిలో మందులపెట్టెను పట్టుకొని కంపౌండరు వెంట వచ్చుచుండ లోనికి వచ్చి ఈజీఛైరులో నైన కూర్చొన వీలులేనందున స్టూలుమీద కూర్చొని, తన దుస్తులను మార్చుకొనుచూ, కంపౌండరునకు ఏవియో కొన్ని కాగితములనిచ్చి పంపివేసెను. భార్య రుక్మిణమ్మ చేతి కందిచ్చిన జలముతో ముఖ, పాద, ప్రక్షాళనముల గావించుకొని భుజింప లోనికేగి నలువైపుల కలయజూచి "మన కమల భుజించినదా?" అని ప్రశ్నించెను. "5 గంటలు కొట్టకమునుపే స్నేహితులెవరితోనో కలసి బయటకువెళ్లినదట. ఇంటికివచ్చుసరికి ఆలస్యమగునట." అని జవాబిచ్చెను. "ఆఁ హా! అయిన సరి, నీవుకూడ భోజనముచేయుము. అనవసర ఆలస్యమెందులకు?" అని భుజించుచూ "ట" అని అంటివే, అమ్మాయి వెళ్లినసంగతి నీకు నేరుగా తెలియదా" అని అడిగెను.

రుక్మి:—తెల్పుటకు తగినటుల మీరు ఉంచిననే గదా యుండుట. ఎవరిచ్ఛవారిది. ఎవరిమనస్సు వారిది అనే సిద్ధాంతంలో చెందిన మిమ్ములను, మీ కుమార్తెను అడుగువారెవరు? ఎనిమిది గంటలు కావచ్చినది. ఈడువచ్చిన కన్య, నవయౌవనుడగు వేరొకయువకునితో నిశ్శంకగా షికారులా!! అడిగినవారిని అనాగరికులు, నమ్మకము, విశ్వాసము లేనివారలు అని [illegible] నిందించుటకు ప్రారంభింతురు. దీనికంతటికి, మీ అవిచారపూర్వకమైన ప్రవర్తనయే కారణము" అని కోపయుక్తమైన స్వరముతో బల్కెను.

కుటుంబ:—నీ విట్టి అనవసర అనుమానములను పెట్టుకొని సహజమగు వ్యక్తి స్వాతంత్ర్యమును అరికట్ట జూచుచున్నావు. రేపు నేనూ, కొంచము ఆలస్యముగా వచ్చిన, ఇట్టి అనుమానములనే పెట్టుకొనెదవు కాబోలును? సరి, సరి.

రుక్మిణి:—నాగరిక చిహ్నమని తలపబడు ఇట్టి స్వేచ్ఛా వ్యామోహములో మునిగిన మీకు నే దెల్పు వాక్యములు ఇప్పట్లో చెవికెక్కజాలవు. మానవజీవితమునందు క్షేత్రజ్ఞుని స్వభావమైన స్వాతంత్ర్యమను పవిత్రపదమును, చాపల్యసూచకమై అహంకార మమ:

కారములచేతను, కామక్రోధ ఇచ్ఛాది ప్రకృతిగుణములచేతను ఆవరింపబడినట్టి క్షేత్రముయొక్క స్వాభావమగు ఇచ్ఛకు సంబంధించిన స్వేచ్ఛకు ముడిపెట్టి నిజమైన స్వాతంత్ర్యమును అనుభవించుచున్నామను వెఱ్ఱిలోబడి ముందువెనక లరయక చాలమంది కొట్టుకొని పోవుచున్నారు.

కుటుంబ:—రుక్మిణీ! ఏమంత వెఱ్ఱిదానవు. మిన్నొచ్చి విరాదపడినంత విచారమును పొందుచున్నావే!! వారు తమసరదాలను ఇప్పుడు తీర్చుకొనకున్న మరెప్పుడు తీర్చుకొనెదరు?

రుక్మిణి:—మీ జవాబు మరీ బాగున్నది. వక్రమార్గములకు ఎట్టివారినైన నీడ్చుకొనిపోవు నవకాశమిచ్చు యౌవనకాలమున మనమట్టి పరిస్థితులకు దోహదమిచ్చుట సమంజసమా! జీవికి యౌవనకాలము త్రాసుముల్లువంటిది. మంచి, చెడుగులను రెండువైపుల తక్కెళ్లకు ఎటువాటము హెచ్చుగానుండిన ఆ ముల్లు అటులొరగక తప్పదు. అందులో పురుషుని దేహ, మనో నైసర్గికములకన్న స్త్రీల నైసర్గికములు స్వభావముగ భిన్నములు.

ఇట్లు వీరు మాటాడుకొనుచుండగా 25 సంవత్సరముల నవయువకుడు, సర్వాంగసుందరుడు, అచ్చటికి ప్రత్యక్షమై "ఏమి మామా! అత్తా! క్షేమమా?" అని పల్కరించెను. ఆ దంపతులును ఆశ్చర్యానందములతో "ఏమి నాయనా ఆనందం! ఎప్పుడమెరికానుంచి వచ్చితివి? మాకొక జాబైన వ్రాయగూడదా? నాన్న, అమ్మ, తమ్ములు, చెల్లెండ్రు, అందరు క్షేమమా?" అని తొందరతొందరగా ప్రశ్న పరంపరలను గురిపించి పూర్తిగా జవాబులనైన గాంక్షించక, స్నానమునకు లెమ్మని తొందరించి భోజనమునకు వలయు ఏర్పాట్లను జేయుచుండిరి. ఆనందరావు స్నానమును ముగించి మేనమామ ప్రక్కనే వేయబడిన పీటపై గూర్చుండి "అత్తా! కమల అప్పుడే నిద్రబోవుచున్నదా ఏమి? ఆకస్మిక సమావేశమునం దుత్పన్నమగు సహజానంద మనుభవింపవలెనను కాంక్షతో మీకు జాబునైన వ్రాయక నేరుగావచ్చితిని" ఆ పలుకులు విని రుక్మిణమ్మయు ఏమియు జవాబును చెప్పజాలక "ఈ రోజు సినీమాకు ఎవ్వరో కొందరు తోడి బాలికలు వెళ్లుచుండ తానుగూడ వెళ్లినది. ఇంకొక గడియకు రాగలదు.

కుటుంబ:—నీవు సౌఖ్యముగా వచ్చినందుకు చాల సంతోషము. ఇక నీవు చేయదలచిన కార్యక్రమ మేమి?

ఆనంద:—మానాన్నగారు నన్ను ఏ ఉద్దేశముతో పంపిరో దానికొరకే పాటుపడి దేశీయవస్తు నిర్మాణమునకు సహాయమును చేయవలెనని యున్నది. నాన్నగారిప్పుడే ఏర్పాట్లన్నియు చేసి లక్షరూపాయల పెట్టుబడితో పని నుపక్రమించారు.

కుటుంబ:—(సంతోషముతో) నాయనా! చిరంజీవివై వర్ధిల్లి నీ ఆదర్శమును అచిరకాలముననే పొందువాడ వౌదువుగాక. మరొక్క సంగతి. ఆదేశములో స్త్రీల విషయమై నీ యభిప్రాయమేమి? గుఱ్ఱుపెట్టినందులకు ముద్దుపెట్టుకొనినందులకు ఇంకనిటువంటి ఇతర సందర్భములలోనే, దాంపత్య విచ్ఛేదములు జరుగుచూ వింతవింతలైన పద్ధతులు అమలులోనికి వచ్చుచున్నట్లు ఇక్కడ పత్రికలమూలమున తెలుసుకొనుచున్నాము. ఇటువంటివి నిజముగా జరుగుచున్నవా? లోకమునకు ఇదిగో పులియన్న అదిగో తోక అను అనుస్వభావముగదా?

ఆనంద:—మనదేశస్థులగూర్చి ఎవ్వరైన అన్నప్పుడు అట్టిది కష్టమగునుగాని' ఆ దేశస్థుల విషయమై లేనివి వ్రాసిన వారెంతమాత్రము ఊరుకొనరు సుమా! ఆ దేశమున కుటుంబసౌఖ్యము కుటుంబగౌరవము పరిశీలనగా చూచిననే తప్ప గాంచలేము. మనదేశమున ఏనాదులు మొదలగు నీచజాతులనబడు వారియందు గాన్పించు కుటుంబ పరిస్థితులు అక్కడ

సర్వసామాన్యముగా నుండును. ఈ సంగతులు మీకు పత్రికల మూలమున బోధపడుచునే యుండి యుండ వచ్చును. ఆ విషయములు మనమంతగా మాట్లాడ తగ్గవి గావు.

రుక్మిణి:—మీ మామగారుకూడ మనసంఘమంతయు అమాదిరిగా నుండవలెననియే కదా కాంక్షించుచున్నారు. మాతండ్రిగారు కూడ మమ్ములను స్కూలు ఫైనలు వరకు చదివించిరి కాని మా యుద్దేశములను, మాయాదర్శముల ప్రక్కదోవలకు పోకుండునట్లు బహు జాగ్రత్త తీసికొనినారు. రేపటినుండి నేనుగూడ మా ఫ్రెండ్లుఎంగేజిమెంట్సులో ఉండెదను. అని నవ్వుచూ బల్కెను.

కుటుంబ:—(నవ్వుచూ) తానే పెట్టిన మూడే సోలలైనట్లు నీవేనా ఏమి గుత్త. ఎవరో ఒకరు ఈ మాత్రము సదుపాయమునకు దొరకకరనుకొన్నావు కాబోలును.

రుక్మిణి:—సరి, సరి, ఇందులోనే తెలియుచున్నది. అప్పుడే 'నీతోనేనా' అని అన్నంతవరకు ముదిరించారు. అమ్మాయి కాబోలు తలుపు తట్టుచున్నది.

౨

"నేను గంపెడాశతో అప్పటి మనఉభయుల మధ్య జరిగిన వాగ్దత్తములను దలచి ఈ మన సమావేశము మన ఇరువురకు సమానానందదాయకమగు నను ఆతుర్దాతో విదేశమునుండి వచ్చినవెంటనే మా అమ్మ నాల్గుదినములు విశ్రమించి మరీ వెళ్లుమని బలవంత పరచినను వినక పర్విత్తుకొని వచ్చితిని. నే వచ్చి నేటికి 3 దినములైనది. ఒక్కగంటసేపైనను నాతో మనసిచ్చి మాటలాడుటకు నీ కవకాశము లేకున్నది. ఏమి కమలా! నాతో మాటాడుటకు నీ కయిష్టముగా నున్నదా ఏమి? లేక స్త్రీల సహజాలంకారమగు లజ్జాభూషణమును ధరించితివా?

కమల:—ఇప్పు డవన్నియు ప్రబంధభూషణములుగ మాత్రమే యుండుటకు తగియున్నవని నీవెరుగవు కాబోలును! ఇప్పుడు నే జేయవలసిన దేదో స్పష్టముగ దెలుపుము.

ఆనంద:—(మనస్సు చివుక్కుమన) కమలా! నీకు నేను మన చిన్ననాటినుండి మనతోనే మన మనస్సులలో పెరుగుచున్న ఈపరస్పర ప్రేమాంకురముల గూర్చి జ్ఞప్తికిదేవలసి వచ్చెనా? నేను విదేశములందున్నప్పుడు నీ అప్పటిప్రేమవాక్కులనే తలచి తృప్తిజెందుచు ప్రపంచయాత్ర ఇకముందు నీ సహవాసానందమున సుఖముగ జరుపుకొన ఆశించితిని. అట్టి నన్ను ఈవిధముగ ప్రశ్నించి నొప్పించుట నీకు న్యాయమా?

కమల:—ఆనందం! ఎందుల కీ కంఠశోష. ఇప్పట్లో వివాహమాడి నా స్వేచ్ఛను గోల్పోవనా కిష్టములేదు. బి. ఏ. ఇంకా పూర్తిగాలేదు. వెనుక నుండి మాటాడుకొనవచ్చును. నామిత్రులు నాకొఱకు వేచియుందురు. కాలాతిక్రమణ మగుచున్నది. పోవలెను.

ఆనంద:—నేనుకూడ నీకొకప్పుడు ప్రాణాధికుడనని నీ వన్నకాలము గలదని నీవు మరువకుము. నీ కాలమును వృథాచేయుచుంటినని నీ వెంచినప్పటికీ, నా నిశ్చితాభిప్రాయమును రెండుమాటలలో దెల్పి ఈ రాత్రియే బయలుదేరి వెడలిపోవుచున్నాను. అప్పటికి నీవు బహుశా ఇంటికి రావని తలచెదను. కమలా ఏనాడైతే మన ఇరువురిహృదయములు శాశ్వతపవిత్ర ప్రేమసూత్రముచే బంధింపబడి పంచభూతముల సాక్షిగా మనోవాక్కాయ కర్మములచేతను మనము ప్రమాణమొనరించుకొంటిమో, ఆనాటినుండియే ఈ నా హృదయము నీ కర్పణచేసితిని. నేటికి అది కించిత్తైన చలించలేదు. నా జీవితాంతమువరకు ఇటులనే యుండెదను. ఆనాడు నీ పల్కిన పల్కులు సువర్ణాక్షరము

లతో నా హృదయమున లిఖించుకొంటిని. నీహృదయమును గూడ నావిధమునసే నాకు దత్తముచేసిన కథనము నీకు జ్ఞప్తియం దుంచకపోదు. దానివిలువను, దాని పవిత్రతను మరువకుము ఇదే సెలవు" అని పల్కి ఆనందరావు ఇక తిరిగైన చూడక మేనమామ ఇంటికి వచ్చువరకు ఆగుమని మేనత్త ఎంత బ్రతిమలాడినను వినక, ఆమెవద్ద సెలవుపుచ్చుకొని విశాఖపట్టణమునకు ప్రయాణమయ్యెను. రుక్మిణమ్మ ఈసంగతులను ఊహించలేనంతటి మందమతిగాదు. బహు తెలివైనయువతి! పెనిమిటి గృహమునకు వచ్చినపిమ్మట చూచాయగా ఈ సమాచారమును దెల్పి అల్లునిముఖవైఖరిని గూర్చి కొంత దెల్పెను. కుటుంబరావును కొంతవరకు నిదానముగా యోచించి తనకుమార్తెయొక్క దురుసుతనమును, అల్లుని నిష్కళంక ప్రేమానురాగమును గూర్చి యోచించి స్తబ్ధుడై కొంతవడి యట్టె మిన్నకుండెను.

సుందరమ్మ 40 సంవత్సరముల ముత్తైదువ. తగిన కుటుంబమున బుట్టి తగిన ఇంటకోడలై సిరిసంపదలతో తులతూగుచు విద్యావినయ వివేకాదులకు పట్టుగొమ్మయై, అందరచే పూతచరిత్రయని పూజింపబడునంత గౌరవస్థానమును బడసెను. ఒకరోజు ఉదయము మెయిలులో సోదరుడగు కుటుంబరావు గృహమునకు నెల్లూరుచేరెను. ఆమెనుగాంచిన వెంటనే ఏదియో యొక అపరాధమును గావించిన అపరాధులవలె కుటుంబరావు దంపతులుగతుక్కుమని, తిరిగి సమాళించుకొని ఆమెను తగువిధమున పూజించి కుశలప్రశ్నలను గావించుచు, "సుందరం! మన ఆనందం ఇచ్చటికి రెండుసంవత్సరములక్రిందట వచ్చినప్పుడు 3 దినములుండి నాతో చెప్పనైన చెప్పక వెడలిపోయినాడు. నాటిమొదలు నేటివరకు వాని దస్తూరితో ఒకజాబైన నాకు వ్రాయలేదు.

సుందరమ్మ:—వానిసంగతిని గూర్చి యోచించుటకే ఇచ్చటికి వచ్చినాను. ఇచ్చటినుండి అచ్చటికి వచ్చినలగాయతు ఒకవిధమైన వింత మార్పు వానియందు స్పష్టముగ గాన్పించుచున్నది. వివాహము చేసుకొమ్మనిన వలదను మూర్ఖపు పట్టేగాని మరివేరే మాటయే లేదు. కాని వాని ప్రవర్తనగాంచిన, అట్టి సుపుత్రరత్నము నా గర్భవాసమున గల్గినందుకు నేను మిగుల గర్వించుచున్నాను. ఒక్కొక్కప్పుడు సమస్త లోకమును ఉద్ధరించుటకు తగు ఉదారహృదయముగల సామర్థ్యవంతుడితడేనా అని అనుకొనుచుందును. మేమందరము సకలవిధ సౌఖ్యము లనుభవించుచుండ, తాను ఒంటిగ నిట్టి సంతోషములయందు పాల్గొను అవకాశములు కల్పించుకొనకుండ, శరీరధారణ మాత్రమున కాహారమును సేవించుచు, కాలము బుచ్చుటగని నే సహించలేకున్నాను. నీ కుమార్తెయగు కమలాన్ని మన ఆనందం ప్రేమించినట్లును, ఇరువురు ప్రేమబద్ధులైనట్లును మనము చాలదినముల క్రిందటనే అనుకొంటిమిగదా. ఇంకెందులకు యోచించుచున్నావు?

కుటుంబ:—నేనేమియు చెప్పజాలను. దానిమనస్సునుగూర్చి తెల్పుటకు నా కెట్టి స్వాతంత్ర్యమును లేదు. దానిని పిలచి నీవే అడుగుము. అని కుమార్తెకొరకు కబురుచేసెను. కమలయు మేనత్తను చూడగానే "ఓహో అత్తయ్యా ఇప్పుడేనా రావడం. బావా వాళ్లు అందరూ క్షేమమా? ప్ర్యాక్టీ పనులు చాల చురుకుగా జరుగుచున్నట్లు వినుచున్నాను. చాల సంతోషము.

సుందరమ్మ:—కోడలా! నీవు నిజముగ నాకు కోడలవు కాగలభాగ్యము ఎప్పుడు కలుగజేసెదవు? మీ బావను గృహస్థునుజేసి మీ ఇరువురు సమస్త సౌఖ్యము లనుభవించుచు, మీద్వారా భగవంతుడు కొంత మేలును ప్రపంచమునకు కలుగజేయు నేకాంక్షించుచున్నాను. ఇద్దరు విద్యావంతులు. ఇద్దరు దేశకాల పరిస్థితుల నెరిగి మానవ ధర్మమునకు సోపాన ప్రాయములగు నూతన నూతన పద్ధతులను నెలకొల్పు

టకు సమర్థులు, విశ్వజనీన ధర్మమును ప్రస్తుత అవసర ధర్మానుష్ఠానములద్వారా పొందనవకాశమును జూపింపనేర్పరులు; అట్టి మీ రిరువురు దంపతులగుటకు నే కాంక్షించుచున్నాను.

కుటుంబ:—అమ్మాయీ! మీరుభయులు ఒకరి నొకరు ప్రేమించుకొనినది వాస్తవమే గదా? వివాహము చేసుకొనుటకు నీ కేల నింతఅనుమానము.

కమల:- మనసంఘమునందున్న పెద్దలోపమిద్దియే. వివాహములు కానంతమాత్రమున ఏదో గొప్ప లోపము జరిగినట్లు విచారించెదరు. నా కా పద్ధతి సరిపడదు.

సుందరమ్మ:—అయిన నీ వవివాహితగా నుండదలచితివను మాట! అమ్మా! ప్రాపంచిక వాసనల ననుభవించుచు ప్రాపంచిక రుచులలో కలిసి మెలసి తిరుగుచున్నంత కాలము నిష్కళంక బ్రహ్మచర్యమవలంబించుట దుస్సాధ్యమని పెద్దల అనుభవ ప్రమాణముల వలనను, నాగరిక దేశములయందు గాన్పించు లెక్కకు మిక్కిలియగు ఆర్ఫనేజీల మూలమునను మనకు స్పష్టము. నీ రక్తనాళములయందు, భారతీయాంగనల ప్రత్యేక గౌరవస్థానమునకు మూలకందమగు పరమపాతివ్రత్య రక్తము ప్రవహించుచున్నది. అట్టి గౌరవమును కాపాడుట విద్యావతివగు నీకు విధియని వేరే చెప్పననవసరము.

కమల:—ఏమీ! పురుషునకు సేవజేయుచూ దాస్యభావమును పూనుమనియా నీ కాంక్ష. అది నా మతము గాదు.

సుందరమ్మ:—చిన్నపిల్లవగు నీకు పాతివ్రత్య ధర్మము దాస్యచిహ్నమన్నట్లు స్ఫురించుచుండుట విచారము. పాతివ్రత్యము మోక్షద్వార స్వరూపమగు త్యాగస్వరూపము. సృష్టినియమముల ననుసరించి భరించు వస్తువు యెడల భరింపబడువస్తువు ప్రేమ విశ్వాసత్యాగములను చూపించుట ఆత్మోద్ధారక హేతువుగాదా? ఇట్టి పవిత్రగుణ విరాజితు లిందు అంతస్తు పొందుగౌరవము, పొందు పూజ్యత మహా యోగీశ్వరులు గూడ పొంద నవకాశము లేదని మన పెద్దల వచనము. అట్టిదానిని చులకనగ తూలనాడ జనదు.

కమల:—స్వార్థపరులగు కొందరు పురుషమ్మన్యులచే కల్పింపబడిన దీని నిట్లు ఇంతగా వర్ణించుట నాకు అసందర్భముగ దోచుచున్నది.

సుందరమ్మ:—ఓసి వెఱ్ఱిదానా! నీవేమియు మన భారతీయుల సంఘాచారములగూర్చి లోతుగా కించిత్తైన పరిశీలించినట్లు గాన్పించదు. నిజమే తెలియుటకవకాశమెక్కడ? సమస్తవిధముల తన సంతానము యొక్క అభివృద్ధులను పాటించ బాధ్యతగల తండ్రి తన విధిని మీరి తనసౌఖ్యమును చూచుకొనుటలోనే లీనమైనయెడల ఆ సంతానముయొక్క స్థితి ఎట్లుండునో అట్టిస్థితిలో ప్రస్తుతమున్న మన సంఘము ఈ విధముగా గాక మరేవిధముగా యుండగలదు. ఉపనిషద్యుగము మొదలు పురాణ యుగమువరకు, చివరకు కొన్నివందల సంవత్సరముల క్రితమువరకు కూడ స్త్రీలను చూడుము! మనవారు మనస్త్రీలను బానిసలగా నుంచదలచిరో, లేక మాతృదేవతలగాను, అర్ధాంగలక్ష్ములుగను ఎంచి పూజించి, గౌరవించిరో తెలియగలదు. సృష్టియందే స్వభావసిద్ధముగా యున్న స్త్రీ పురుష స్వభావభేదముల ననుసరించి ఆయా విధాయకములకు స్త్రీ పురుషుల నిర్వాహను బాధ్యులనుగా జేసినట్టు ప్రపంచమంతయు సాక్ష్యమిచ్చుచున్నది.

నిజముగ స్త్రీజాతినంతయు బానిస స్థితియందు నుంచుటే హైందవులు ఆదర్శముగ నెంచినయెడల వేదములయందు స్త్రీలచే వ్రాయబడిన ఋక్కులుండుట సంభవమా? దానధర్మములను చేయుటకు పత్నీరహితుని కధికారములేదను శాస్త్రములు స్త్రీల నగౌరవపరచు సూచనలా?

కమల:—నీగొప్పలు చాలుగాని ఆస్తిపాస్తులలో స్త్రీల కొక్కింతయైన భాగములు కల్పించిరా? అది వారి స్వార్థమునకు ప్రబలనిదర్శనముగాదా?

సుందరమ్మ:—ప్రత్యేక ధనావశ్యకములేని కాలములో పాడిపంటలచేతను ధనధాన్య సమృద్ధిచేతను గృహములే సత్రవులుగనుండి స్త్రీలే గృహయజమానురాండ్రుగ నున్న కాలములో స్త్రీకి ప్రత్యేకముగ ఆస్త్యవసరము గాన్పించకపోవుటవల్ల ఈలోపము కల్గియుండవచ్చును. కాలానుసరణముగ తదావశ్యకత ఏర్పడినకాలమున మనమాస్థితిని తప్పక పొందవలెను. పొందవచ్చును. కమలా! నీవు బాగా యోచించుము. నామాటను గౌరవింపుము.

కమల:—ఏమిటత్తా! నీధోరణి నాకేమియు తలకెక్కలేదు. వెళ్లి భోజనముజేయుము. నేక్లబ్బుకివెళ్లి వచ్చెదను. అని లోనికి వెళ్లిపోయెను. తల్లి, దండ్రి, మేనత్త ముప్పురు ఒకరిమొగ మొకరుచూచుకొనక మొగములను త్రేలవైచుకొనిరి.

## 3

ఒకరోజు మధ్యాహ్నము కుటుంబరావుగారు, ఆయనభార్య రుక్మిణమ్మయు మేడమీద వసారాలో నిల్చుని అప్పుడే యూరేగి వెడలిపోయిన పీర్లపండుగలనుగూర్చి మాటాడుకొనుచుండిరి. ఇంతలో బారిష్టరు కబురుద్దీనుగారి భార్యయు తనకుమార్తెయు అగు కమలమ్మ విసవిస మేడపైకి వచ్చుచుండుటగాంచి తల్లిదండ్రులు చకితులై ఏమమ్మా! ఒంటరిగ బిడ్డలనైన వెంటపెట్టుకొనక ఇంతదూరము వచ్చితివి? నీవంట్లోగాని, నీభర్తపిల్లల వళ్లల్లోగాని ఏమియు తొందరలు లేవుగదా? అని ప్రశ్నించిరి.

కమలమ్మ:—ఎవ్వరికీ ఏరోగమూలేదు. అతని చర్య అంతకంతకూ నాకు నచ్చుటలేదు. నేచేయు పనులన్నిటిలోను పానకములో పుల్లవలె ఏదోవిధముగా అడ్డుతగులుచు పరీక్షించుచుండును. అది నా స్వేచ్ఛకు నాఆత్మసాక్షికి భంగము. అందువల్లనే వచ్చివేసితిని.

రుక్మిణమ్మ:—అయ్యో! అన్నిట్లో నీకింత దురహంకారమెందులకే. భార్యాభర్తలైనపుడు ఒకరి కింకొకరికి తెలియగూడని రహస్యములేమియుండునే!? ఎందుకువచ్చిన వివాహములు యిపి? పిల్లలను ఏమిచేసితిరి? నీదురహంకారము నీయందున్నమాత్రపు ప్రేమనుగూడ నశింపజేసెనటే. మొట్టమొదటనుంచి వలదు వలదన్నను పుట్టుపూర్వోత్తరములు, వంశమర్యాదలు ఎరుగనివారితో వివాహసంబంధము పెట్టుకొనుట తప్పు. మంచివారైనంతమాత్రమున గౌరవార్హులేగాని ఇట్టిపద్ధతికూడదని చెప్పితినిగదా? వివాహమన్నప్పుడు కేవలము బొమ్మలాటలా? ఇప్పటిపద్ధతిప్రకారము ఈడువచ్చిన నీవు వరించి చేసుకొంటివి. ఇప్పుడు తిరిగి ఈఉప్పెనేమిటి? అనిపల్కి కంగారు పడుచుండెను.

కుటుంబ:—అమ్మా! ఇప్పుడు నీయుద్దేశమేమి?

కమల:—"ఉద్దేశమునకేమున్నది వివాహవిచ్ఛేదనమొనర్చుకొనదలచివచ్చితిని" ఆపల్కులువిన్న తల్లిదండ్రులనడుము నటుక్కుమన్నది. కళ్ల నీళ్లు క్రమ్మినవి. తమ ఏకమాత్ర ముద్దుబిడ్డ ఇవ్విధముగ తన జీవితమును ఇంకొకరిజీవితమును బిడ్డలజీవితములను అధోగతికి ముంచుకొనుచు ముంచుచున్నదని తెలియుచున్నప్పుడు వారివలన కీర్త్యపకీర్తులు అనుభవించు తల్లిదండ్రుల ఆరాటము వేరె తెలుపవలెనా? కుటుంబరావు అచ్చట నిల్వలేక క్రిందకు వెడలిపోయెను. అన్నిటిని భరించుటకు తల్లి భూదేవతంబోలిన మాతృదేవతగాన విచారముతో మందలించుచూ "కమలా! నీవు ముందువెనుక లారయక నీ అంతస్తును, నీవిధాయకమును, నీగౌరవమును, నీవంశగౌరవమును కించిత్తైన దలపక ఇచ్చవచ్చినరీతిని పశుచర్యననుకరింప ప్రయత్నించుచున్నావు. నీవివాహము చిన్నప్పుడు జరిగిన ఒకవేళ సరియైనవరునికి తల్లిదండ్రులమగు మేము ఈయజాలమైతిమను నిందకు గురియైన గాగలము.

యుక్తవయస్సువచ్చి మంచిచెడుగుల తారతమ్య మెరుగ నేర్పుగలిగి ఒకరికొకరు ఆధీనులైనట్లు ప్రమాణ వాక్యములద్వారా మనోవాక్కాయ కర్మలా పరస్పర విశ్వాసినులుగా మెలంగి నియమించుకొన్నప్పుడు ఇట్టి విచ్ఛేదములకు ప్రయత్నించుట అతిఘోరము. ఇక ప్రపంచమున సత్యమునకు వాగ్దత్తమునకు విశ్వాసమునకు స్థానములేనట్లు ఈచర్యలవలన స్పష్టమగుచున్నది. మాఇచ్ఛకు నీవు వ్యతిరిక్తవుగా మెలగుచుంటివని నీవు మాకుమాత్రవుగావని ఎప్పుడైన తలచుటకు ప్రయత్నింతుమా? నీబాగుకొరకే ఎల్లప్పుడు ప్రయత్నించుచూ నిన్నే విధముగనైన సక్రమమార్గమున త్రిప్ప ప్రయత్నింతుము. ఆవిధమునసే నీవును నీకోపమునుమాని నీభర్తను నీభర్తగాదని తెల్పసాహసించక ఆయన యోగక్షేమమునే మనమున కోరుచుండుట నీవిధాయకము. కీర్తికరము" ఇట్లు తల్లిపల్కుచుండగా కుటుంబరావు తిరిగి కుమార్తెవద్దకువచ్చి బుజ్జగింపు మాటలతో "తల్లీ! మీఅమ్మ చెప్పినట్లునడచి కీర్తి గాంచుము. లోపాలోపములు మానవులకు సహజములు. అందులో నీవుచెప్పినలోపము బొత్తిగ నగుబాటుహేతువు, గీతలలో "స్త్రీషుదుష్టాసువార్ష్ణేయ జాయతే వర్ణసంకరః" అని చెప్పబడినట్లు సంఘమునకు పునాదులగు స్త్రీలప్రవర్తన కళంకితమైనయెడల వర్ణము అనగా ప్రత్యేకజాతులుగాక మానవజాతి యంతయును సంకరమగును. సంఘపవిత్రతకు స్త్రీపురుషులు యిర్వురు సమానబాధ్యులైనప్పటికి పురుషుడు సృష్టికి కేవలము బీజస్వరూపుడేగాని దానిని ధారణ చేసి పవిత్రస్థితియందుంచి పెంచి దృఢమైన పునాదుల మీద పోషించి మానవప్రపంచమున కప్పచెప్పవలసిన బాధ్యతంతయు స్త్రీదై యున్నది. నీవును నీపవిత్రతను మాత్రము ఏమియు నల్లించుకొనక కాపాడుకొనుచుండిన నీకును సంఘమునకును కీర్తికరము. మామాటలను మన్నింపుము. ఒడలున రక్తబిగి తగ్గినవెనుక నీవు మిగుల పశ్చాత్తాపపడవలసియుందువు. సద్గుణరాశియు నీప్రేమకాంక్షియు అగు నీబావను నిరాకరించి అతనిని నేటివరకును ప్రపంచసౌఖ్య విరహితునిగ విరాగినిగా జేసితివి. చేసికొనిన ఇతనినైన సరిగచూచి సుఖింపుము. అనవసరకోపము నుజ్జగింపుము. కోపము మంచిచెడుగుల గాంచనీయదు. నామాటవిని మమ్ములను అప్రతిష్ఠపాలుగానీక నీవు ప్రతిష్ఠను గాంచుము.

కమల:—ఎక్కడున్నను నాకు వ్యతిరేకపరిస్థితులే కలుగుచున్నవి. కానిండుమాతము. రెండురోజులైన అన్నము పెట్టెదరా? లేక హోటలునకు వెళ్లమనెదరా? అని తీక్ష్ణముగాబల్కి తనవెంట తెచ్చుకొన్నపెట్టెను సవరించుకొనుచుండెను.

## ౮

"నాయనా! నీవెన్నిదినములీవిధమున కాలక్షేపము చేయుదువు? ఆకమల ఏలాగు వివాహయోగ్య కాదుగదా. నీవెందులకు వివాహము చేసుకొనకూడదు. ఇప్పటికి అనేకమంది తమ కన్యలనిత్తుమని కబురులంపుచున్నారు. ఏమి మాట్లాడవు?" అని సుందరమ్మ కుమారుడగు ఆనందరావుతో బల్కెను. అతడును చిరునగవు మొగమున కొంత వన్నెయొసగ "తల్లీ! సకలజ్ఞవగు నీకు నేను చెప్పవలసిన దేదియు లేదు. మనస్సు ఎప్పుడైతే ఒకరియందు లగ్నమాయెనో అప్పుడే వివాహమైనట్లుగదా! ఆవివాహము ఆజన్మాంతము ఇరువురను బంధించునుగదా. విధికృతముగ ఎవ్వరైన మరణించిన అప్పుడు వారిష్టమువచ్చినయెడల వేరొకరిని కాదని నింకొకరిని, నింకొకరిని కాదని వేరొకరిని ప్రేమించుట నింద్యమును ఆత్మపతన హేతువగు చాంచల్యమునకు దోహదముకాదా? ఒకరివలన తప్పున్న రెండవవారు ఆతప్పు దిద్దుబాటునకు వచ్చువరకు ఎదురుచూచుచు అనుభవించవలసినదేగాని కాలము వెట్టిగా ప్రజలందరు పురిలేనిదారముకన్న సులభముగా ఈదాంపత్యసూత్రమును త్రెంచిన ఆధర్మమునకు భంగముకాదా? భగవత్సేవకు ప్రత్యామ్నాయమగు మానవసేవనుచేసి ధన్యుడనగుటకును నేనిట్లున్నాననిదైన తెలుసుకొని కొంతకాలమునకైన కమల తనజీవితమును పశ్చాత్తాపాగ్నిలో బడవైచుకొని పవిత్రవంత మొనర్చుకొనుటకును అవకాశము లేగ్పడుచున్నవి. కాన నీవింక విచారించకుము." అని పల్క

కుమారునివాక్యములకు బదులాడనేరక, "నాయనా! అటులనే కానిమ్ము. నిన్నీశ్వరు డాశీర్వదించును గాక" అని దెల్పుచుండగా, ఒక జమాను పర్వెత్తుకొనివచ్చి "బాబుగారూ! చిన్నబాబుగారు సైకిలు మీదనుండి క్రిందబడి పెద్దగాయము తగులగా నాన్నగారు పెద్దాసుపత్రికి తీసికొని వెళ్లినారు. మీకీసంగతి దెల్పి అమ్మగారితోసహా మిమ్ములను రమ్మని చెప్పమన్నారు. కారు వీధిలోనున్నది." అని పల్కగానే తల్లి కుమారులిర్వురు ఏమియుతోచక కంగారుతో ఆసుపత్రికివెళ్లిచూచి అక్కడిస్థితి మరేమియూ ప్రమాదావస్థలోలేదని తెలిసి శాంతించిరి. అక్కడికి వచ్చిన డాక్టరుగారితో మన ఆనందరావుకు ఎక్కువ స్నేహముగాన ఆతనితో ఏమేమియో మాటాడుచు ఆస్పత్రియంతయు చుట్టుచుండెను. ఆనందరావుకింస్లైకు ఏమిదృశ్యము గాన్పించినదోగాని అకస్మాత్తుగ నిల్వబడి "డాక్టర్! ఆమెఎవరు? ఏమిజబ్బు?" అని ప్రశ్నించెను.

డాక్టర్:—ఆమె తనపేరుగాని తనఊరుగాని తెల్పజాలననియు ఒక దిక్కులేని వనితననియు మాత్రము దెల్పినది. ఆమె తనచరిత్రను ఎంతమాత్రము బయటకుదెల్ప నిచ్ఛగించనట్లు తోచుచున్నది. ఆమెకు గుండెజబ్బు, గర్భాశయసంబంధమైన ప్రబలరోగములు కొన్నిగలవు. బహుశా అది కుదిరేజబ్బుగాదు. మనిషినిచూచిన గొప్పకుటుంబములోపుట్టి పతితయైనట్లు తోచుచున్నది." ఆనందరావు ఆమాటలనువిని యొక దీర్ఘనిశ్వాసమునువిడిచి "ఆమెను నేనెరుగుదును. కొంతసేపు మాటాడివచ్చెదను. నీవువెడలుము" అనిపల్కి మెల్లగ వణుకుచున్నపదములతో మంచము సమీపమున నిల్వబడి మెల్లగా కమలా! అని పల్కరించెను. ఆమెయు త్రుళ్లిపడి దుఃఖమును పట్టజాలక శరీరస్మరణలేక ఉన్నతావును గమనించక లేచి ఆతని పాదములపైబడి బావా! అపరాధిని పాపిని క్షమించుము. నీవే నాపాలిట పతితపావనుడవు. అని పల్కి వెక్కివెక్కి ఏడువసాగెను. ఆతడెంత ధీరుడైనను ఆక్షణమున తనకంటినుండికూడ రెండు కన్నీటికణములను రాల్చకుండ నుండజాలకపోయెను. వెంటనే ఆమెను లేవనెత్తి మంచముపై పరుండజేసి "కమలా! విచారించకుము; జీవులు కర్మానుగతులు. జ్ఞానఖడ్గముచే తన్నెదుర్కొనిన సంకటపథములను సుకరముగ జేసుకొనుట ఉత్తమ పురుషలక్షణము. నీవెప్పుడైతే పశ్చాత్తాపాగ్నిలోబడి సంస్కరింపబడితివో అప్పుడే నీజన్మము అగ్నితప్తమైన సువర్ణమువలె కళంకరహితమైనది. నీస్థితి ఇంత హైన్యతకు రాగతమేమి? మాకు చాలదినములనుండి నీసంగతులేమియు తెలియుట లేదు. నీరెండవవివాహము వరకుమాత్రమే నాకు తెలిసినది. ఆడాక్టరు జోసెఫు ఎక్కడున్నాడు? నీబిడ్డ లెక్కడ?

కమల:—నేనా కథనములను తలచిన నాగుండెలు వ్రక్కలగుచున్నవి. ఆతడు అకస్మాత్తుగ నాకు తెలియకుండ వేరొక యువతినితీసికొని ఏదోచదువని నెపముబెట్టి ఇంగ్లండు వెళ్లిపోయినాడు. నావద్దనున్న ధనమంతయు వ్యయముకాగా దయామయులగు నాతల్లిదండ్రుల మనముల నొప్పించి పాపార్జనను చేయజాలక కష్టపడుచు క్రిస్టియన్సు ధర్మమా అని బిడ్డలను ఆర్ఫనేజిలో అప్పజెప్పి నాశరీరమున రుగ్మతబలముకాగా ఇచ్చటికి వచ్చిచేరితిని. ఇక నేను భూమిమీద బ్రతుకజాలను. నారోగముకూడ నాకనుగుణ్యముగానేయున్నది. అంత్యకాలమున నీదివ్యదర్శనముచేసి నిన్ను క్షమింపవేడుకొని నిశ్చింతగ ప్రాణము వదల నవకాశము కల్పించునాశతో ఈఊరికి వచ్చితిని. భగవంతుడు అన్నివిధముల నన్ను దయతోనను నిమేషము చూచుచున్నాడనుటకు ఈనీదర్శనమే నిదర్శనము. నాసహవాసదోషములు నానవనాగరికతా దర్పములకు దోహదమొసగ మీఉద్బోధనలు మీనీతివాక్యములు బూడిదలోబోసిన పన్నీటివలె నిరర్థకమై నాజీవితము అధోగతికివచ్చినది. కడసారి నీద్వారా భగవంతుడు తన దివ్యదర్శనమును నాకు గాన్పింపజేసి నాజన్మమును ధన్యముజేసినాడు. ఆనందం! నీవు నాపాలిట ఆనందధాముడవై, ఆనందజ్యోతివై బ్రహ్మానంద సంధానుడవగుచున్నావు. నీవు క్షమించితి ననకున్న ఈప్రాణిబోదు. నీజీవితమును సుఖవిదూరము చేసిన పరమపాతకిని. అయినను నీవు ధన్యుడవు. నా అంత్యకాలమున నిన్నుగాంచిన నేను ధన్యను, నీయట్టి ఉన్నతాత్ముని గాంచిన నీజననీజనకులు ధన్యులు. నీదేశము ధన్యము" అని బల్కుచుండగానే ఈ ఆవేశముచేత అకస్మాత్తుగ గడియారమాగినట్లు ఊపిరాగిపోయెను. ఆనందరావు నిశ్చేష్టుడై ప్రాన్పడి కొంతవడి నట్టె నిల్వబడిపోయెను.

# భిక్షుక స్త్రీ

శ్రీమతి అండలూరి సుబ్బలక్ష్మిగారు

“ఆడవాళ్లకు కూడా ఒక పత్రిక పెట్టారు, చిన్నా పెద్దా యావన్మందీ కూడా దాంట్లో వ్రాస్తున్నారు. ఏడోక్లాసు చదువుతూ స్కూలులో చాలా ప్రయిజులు పుచ్చుకొంటూ, అనర్గళంగా భాగవతము, రామాయణము చదవగల నీవు ఏదైనా ఒక కథ వ్రాసేందుకు ప్రయత్నించకూడదా చెల్లీ” అన్నాడు మా అన్నయ్య. యుక్తవయస్సు వచ్చేవరకే స్కూలుకి పంపి, చదువు చెప్పించడమే, మహోపకారంలా తలచే తల్లి తండ్రులచాటున పెరిగే హిందూబాలిక, ఏం కథలు వ్రాయగలుగుతుంది? చిన్నపిల్లని లోకానుభవం లేసిదాన్ని, నేనేమి కథ వ్రాయగలనని హృదయంతరిచి చూచుకున్నాను. నా జీవితంలో అనుభవానికి వచ్చిన ఘట్టం స్ఫురించింది. అదే చెబుతాను వినండి.

మాయింట్లో ఉన్నవాళ్లం, నేను, మా అన్నయ్య, మా అమ్మ, మా వదిన అంతే. మాకుకొంచెం భూవసతి ఉంది. ఒక స్వంత యిల్లు, కొద్దిగా రొక్కం, దానా దీనా కాస్త సుఖంగానే కాలక్షేపం చేస్తున్నాము. మా అన్న బి. ఎ. ప్యాసై కూడా ఉద్యోగం చెయ్యడు. యింతకూ చేస్తానంటేమాత్రం యీరోజులలో దొరికే దెక్కడ. అతనికి ఆంగ్లభాషఅంటే అభిమానం మెండు. ఆంగ్లంలో కవిని కూడా అవుదామని అతని ఆశయం. నిత్యం గదిలో తలుపులుమూసుకొని కూర్చొని, ఆంగ్లకవులువ్రాసిన గీతాలు బిగ్గరగా దొరల ఫక్కీని చదువుతూ ఉంటాడు. బజారునుంచి ఏదైనా వస్తువు తెచ్చిపెట్టాలన్నా, యింట్లో కాస్త అస్వస్తతగా ఉంది డాక్టరునేనా పిలువమన్నా, మనం ఎంత కేకలువేసి పిలిచినా, గిడామన్నా పలుకడు; బుఱ్ఱ బద్దల కొట్టుకొని చచ్చినా తలుపు తీయడు. ఇహ మా వదిన, యీవిడ ఉత్తిరోగాలకుప్ప—సంవత్సరం పొడుగునా మూలుగుతూనేఉంటుంది. అంచేత మా అమ్మకు ఆడతోడు చిన్నమొగతోడు కూడా నేనే.

పగలల్లా నేను బడిలోగడిపి సాయంకాలం యింటికిరావటం. చీకటిపడగానే మేమంతాభోజనాలుచేసి, అన్నయ్య మినహా, గదిలోకిపోయి పక్కల్లాపడుకుంటాం. మా దొరగారు, రాత్రి పదిగంటలు వరకు ఏవేవో ఆంగ్లపద్యాలు చదివి అలసిపోయి ఇంట్లోకివచ్చి వదిన్ని లేపి, పీటేసుకొ కూచోమని, కాస్త నువ్వుకులాసాగా బాతాఖాని చేస్తూఉంటే, నేనువడ్డించుకొని తినేస్తానని, అన్నం తనే పెట్టుకొని తినేసేవాడు; మొదటే చెప్పాగా ఆతనివన్నీ దొరల పద్ధతు

లని. రాత్రియిల్లాగడిచేది, నాకు తెలివి ఉన్నంతమట్టుకు.

ఆ వేళరాత్రి మేము భోజనాలుచేసి గది లోనికిపోయి పండుకునేవేళఅయింది. అవి చలిరోజులు, పండుగు ముందుకూడాను. వీధిలో ఒక కేకవినబడ్డాది, అన్నంకోసం పరితపించే ఒక జీవిది, సంగీతంలా. ఆ కేక లోనిఅసహాయత, దీనత్వం, వేదన నా లేతగుండెల్లో జాలిని కదిపాయి. ఆమెను పిల్చి ఆనాడు మాయింట్లో మిగిలిన అన్నం పెట్టాను. పాపం ఆ విడ ఎంతోసంతోష ముతో 'అమ్మా! తల్లీ! నీకు చాలామంది పిల్లలు పుడతారు' అంటూ ఒకవిధమైన యాసతో, దీవించి వెళ్లిపోయింది.

మర్నాడు రాత్రికూడా ఆవిడ వస్తుందని నాకు తెలుసు. అంచేతనే ఎసట్లో బియ్యం పోసేటప్పుడే, ఎక్కువ పోశాను. అనుకొన్నట్లు రాత్రితొమ్మిదిగంటలవేళఅయేసరికల్లా 'పుణ్యతల్లీ! అన్నంపెట్టవమ్మా!' అంటూ హాజరైంది ఆవిడ. అల్లా జాలిగా కేకవేస్తే నాప్రాణం కొట్లాడేది. ఆ కేకలోని జాలి, వీధిలో ఉన్నవారిఅందరిహృదయాలకు అందదుకామోసు, లేకపోతే మరెవ్వరూ పిల్చి అన్నం ఎందుకు పెట్టరు?

ఇల్లా ప్రతిరోజూరాత్రి ఆవిడ వస్తూ ఉంటే అన్నం పెట్టడము నా కొక అలవాటై పోయింది. ఆవిడయెడల నాకొక సోదరీభావం కూడా ఏర్పడ్డాది. మాఅమ్మమాత్రం 'రోజూ మధూకరం పెట్టే వాళ్లని ఎక్కడా చూడమే, ఎప్పుడో అన్నం మిగిలిపోతే యింత పడేస్తారు గాని' అనేది. నేనుమాత్రం ఎవరి కడుపులోనూ అన్నం ఉట్టికట్టుకు ఉండి పోదు; యింతకు నాలికదాటితే నరకమేను, బీదల కింత పడేస్తే యిహంపరం కూడాను అంటూ ప్రతిరోజున ఆవిడకు తప్పకుండా అన్నం పెట్టేదాన్ని.

ఈ రీతిగా కొద్దిరోజులు గడిచాయి. ఆరాత్రి చలి చాలా జాస్తీగాఉంది. భోజనాలైయాక, ఆ భిక్షుకస్త్రీకోసం, సిబ్బిలో అన్నంపెట్టుకొని, వీధి తలుపుతెరచి సావిట్లో కూచున్నాను. నిత్యంవచ్చేవేళ తప్పిపోయింది, ఆవిడ రాలేదు. పదిగంటలు కూడా కొట్టారు. ఇంకా రాదేమి? చలిలో ఎంత సేపని కూచుంటా? నిద్రకూడా వస్తున్నాది. ప్రాణం విసిగి తలుపు వేసుకొని గదిలోకి పోయి పండుకున్నాను. ఉదయాన్నే మా అమ్మచేత చీవాట్లు 'ఆ ముండ రానులేదు చెయ్యాలేదు సిబ్బెడు అన్నం దిబ్బచేరింది' అని. పాపం! ఆవిడ ఎంచేతరాలేకపోయిందో? వంట్లో బాగులేదేమో? అని అనేక విధాల నామనస్సు కళవళ పడ్డాది.

ఇంతట్లో పండుగుదినాలు దగ్గరకు వచ్చాయి. ఊళ్లో ఎక్కడచూచినా యిళ్లకు సున్నాలు వేసుకొనేవారు, తలుపులకు తారురాసుకొనేవారు, గుమ్మాలకు పసుపు రాసి బొట్టుపెట్టుకొనే వారును, కొత్తబట్టలు కుట్టించుకొనేవారు. ఒకవిధమైన నూతనోత్సాహముతో పండుగదినాలు వచ్చాశాయి.

ఎక్కడచూచినా పేకాట హడావిడి రేగింది. మాయింట్లో కూడా మా అన్నయ్య, మేడ మీద అద్దెకుడున్న బడికుఱ్ఱవాళ్లు పగలల్లా ఆడడమే కాకుండా రాత్రిభోజనానంతరము మావీధి అరుగుమీది తీణివేసి పదకొండు గంటలరాత్రిఅయ్యేవరకు అదే పేకాట. పండుగదినాల్లో పేకాడడము దేశంపొడు గున ఒకరివాజుఅయిపోయింది. పండుగు దినాలంటే ఒక దానంధర్మం చేసుకొనేందుకు పర్వదినాలుకాని, బేస్తు మీద బేస్తు పెట్టి, నిద్రాహారాలు మాని, యిల్లు వళ్లు గుల్ల చేసుకొనేందుకుగాదు. ఆమొగాళ్లకర్మం మొగాళ్లదికాని ఆడవాళ్లకీ అదేపాడుబుద్ధి. నాస్నేహితురాళ్లు, ఎందరో ఆడపిల్లలు ఆ పండుగ రోజున మాయింటికివచ్చి పేక ఒకటి తెచ్చి, బిస్కత్తులుకాచి, పిప్పరమెంట్లుకాచి, పేకాడుకుందాము రమ్మనమని పీక్కు తిన్నారు. నేను మాత్రం తలంటి నీళ్లుపోసు కొని, మా అమ్మయిచ్చిన కొత్తబట్టలు కట్టుకొని, ఏదేనా కొనుక్కోమని మాఅమ్మ యిచ్చిన రెండు అణాలు జేబులోపెట్టుకొని, బుట్టలో బియ్యంపోసుకొని, గుమ్మం దగ్గర కూర్చొని, వచ్చిన ముష్టివానికల్లా పిడికెడేసి బియ్యం పెడుతూ ఉదయంఅంతా గడిపాను. మధ్యాహ్నము, పిండివంటలతో భోజనము చేసి, వీధిసావిట్లో ఖజ్జూరపుచాపవేసుకొని కూర్చుని, పోతన్నగారిభాగవతంతీసుకొని గజేంద్రమోక్షంచదువుతూ గడిపాను. లా 'వొక్కింతయులేదు' అన్న పద్యంచదివి నప్పుడు ఆ భిక్షుకస్త్రీ నాహృదయంలో తోచింది. ఏమయినదో! కేక నావినపడలేదు వీధిలో, ఈ పండుగ మూడురోజుల నుంచీ కూడాను. ఈరోజుల్లో ఆవిడగానివచ్చిఉంటే అన్నంతోపాటు పిండివంటలుకూడా పెట్టి ఉందునే?

పండుగ మూడురోజులు కులాసాగా గడి చాయి. అవేళ కనుంపండుగ. రాత్రిభోజనా లైయాక గదిలోకిపోయి మేమంతా పండు కున్నాము. నాకుమాత్రం నిద్దురరాలేదు. ఎంతప్రయత్నించినా కన్నేనాబరువెక్కలేదు. పదకొండుగంటలుకొట్టారు. అంతవరకు వీధిఅరుగుమీద పెనుప్రళయముగా జరిగిన పేకాటఆపివేసి ఎవ్వరిమానాన్నవారు వెళ్ళి పోయారు నిద్రపోయేందుకు. నాకు యింకా నిద్రరాలేదు. ఆ మర్నాడు మా బడికి దొర సానమ్మవచ్చి తణికీచేస్తుంది. అంచేత నేను పాఠాలన్నీ మనస్సులోనే, నెమరువేసుకుం టున్నా, నిద్రరాలేదు కాబట్టి. కొంతసేపటికి మా వీధిఅరుగుమీద మూలుగు వినబడ్డాది. క్రమేణ అది ఏడ్పుగామారింది. ఆ కంఠం చిరపరిచితమైనదే. భిక్షుకస్త్రీది. ఆమె కంఠమే అంత మధురముగాఉంటుంది. నేను పోల్చుకొని తగ్గిఉన్న దీపంహెచ్చుచేసి, వీధిలోనికి తలుపుతీసుకు వెళ్లడానికి భయపడి, గదిలోకిఉన్న కిటికీతలుపు రచి, 'ఏమమ్మి యిన్నాళ్ళు ఎక్కడ? ఎందు కల్లాపడుస్తా వని' ప్రశ్నించా. ఆ భిక్షుకస్త్రీ నిండావేసు కొన్న ముసుగు తొలగించి, వెక్కివెక్కి ఏడ్వటం ప్రారంభించింది. ఎంత చక్కని. ముఖం! చక్కనివాళ్ళకుకూడా దరిద్ర ముం

టుంజా అనుకున్నా నేను. ఏమిటికథ అన్నాను. తనకథ యీ విధంగా చెప్పింది.

'తల్లీ! నేను ఒక మహమ్మదీయస్త్రీని. చిన్నప్పుడే తల్లితండ్రులు గతించారు. నాకు యుక్తవయస్సువచ్చేవరకు నా పినతండ్రి పెంచి, ఒక అభాజనుడుకి నన్నుయిచ్చి పెండ్లి చేశాడు. నా భర్త కుట్టుపని చేశేవాడు. వచ్చిన డబ్బంతా ఆతని త్రాగుడుక్రింద వినియోగమయిపోయేది. దరిద్రంలో మేము కుళ్లిపోయేవారము. ఇంతట నాకు యిద్దరు పిల్లలుకలిగారు. నన్నూ పిల్లన్ని ఆతను పోషించలేక, మమ్ములను విసర్జించేసి, రంగం వెళ్లిపోయాడు. నాడుమొదలు నేను బిడ్డలు పగలల్లా ఉపవాసము చేస్తాము. రాత్రి నేను మాత్రము పైకివచ్చి ఏ ధర్మాకరముచేసుకొని, ఏతల్లిహృదయమేనా కరిగితే నేను యింతతిని పిల్లలకు పెడతాను. లేకపోతే మేము తల్లి ముగ్గురము నిరాహారమే. కన్నతల్లీ! నీవు ఆమధ్య ప్రతిరోజూపెట్టడముచేత, మేము సమృద్ధిగా తిని సంతోషింపగలిగాము. కాని ఒకరోజున చేతిపిల్లకిజబ్బుచేయబట్టి రాలేకపోయాను తల్లీ! ఇంతపండుగి వచ్చింది, యీమూడురోజులు అరుగుమీద మొగవారంతా పేకాటఆడుతున్నారు. నేను వేచివేచి వెళ్లిపోతున్నాను తల్లీ! తిండి లేక మలమలమాడి జీవాలేనా విసర్జిస్తాము గాని, మొగవారియెదుట పడమమ్మా! ఈ పండుగ మూడురోజులు మేము ఉపవాసాలే చేస్తున్నాము చల్లనితల్లీ! ఈరోజున నా కడుపులోబాధ చెప్పుకొనేందుకని వీధిలో చీకటిలో పేకాట అయిపోయేవరకు ఉండి, యిప్పుడు మీ అరుగుమీదికివచ్చి, నిశ్శబ్దంగా ఉండటంచేత, నీవు నిద్రించిఉంటావని తలచి, దుఃఖంపట్టలేక ఒకమారు యిక్కడ ఏడ్చి వెళ్లిపోదామని అనుకున్నాను. ఇంతట నీవు చల్లగా పిల్చావుతల్లీ!' అంది.

నాకు శరీరములో ఒకవిధమైనకంపం కలిగింది కథవిన్నాక. చిన్నపిల్లని, అస్వతంత్రురాలిని, అర్ధరాత్రివేళ ఇప్పుడు నే నీమెకు ఏమి సహాయముచేయగలనని అనుకున్నాను. నా హృదయంలో మెరుపులా ఒకటిమెరిసింది. మాఅమ్మ నాకు పండుగులో కొనుక్కోనితినమని యిచ్చిన రెండణాలు నా జేబులోనేఉన్నాయి. అవితీసి ఆ విధ చేతిలోపెట్టి 'అమ్మా! యిది పెట్టిఏమేనా కొని నీవు నీపిల్లలు యీరాత్రితినండి. ప్రతిరోజునా వస్తూఉండు, నేను నీకు తప్పక అన్నంపెడతాను. ఇకమీద యిక్కడ పేకాటకూడా ఎవ్వరూ ఆడరు'అని చెప్పాను. ఆ కిటికీలోంచి ఆమనిషిచేతులతో నాబుగ్గలు ముద్దుపెట్టుకొని, 'యింత చిన్నపిల్లవైనా, ఎంత ధర్మబుద్ధి, చల్లనితల్లీ! నీది' అంటూ ఆనందముగా వెళ్లిపోయింది.

దేశంపొడుగునా యిల్లాంటిభిక్షుకస్త్రీలు ఎంతమందిఉన్నారో! మూడురోజులపేకాట, ఒకమనిషి మూడుప్రాణాలుతీసింది. యిల్లాంటి ఎండకన్నెరుగనిఆడవాళ్ళని వీధిపడకుండా కాపాడుకోలేనిదేశం ఏందేశం ?



లేడీ ఎరిస్కిను (మదరాసు గవర్నరుగారి సతీమణి) మదరాసు
అఖిలభారత మహిళా సభను దర్శించుట

# అరవిందము

వి. వి. రెడ్డిగారు

కమల నిష్కళంకహృదయ అతి సూక్ష్మగ్రాహిణి ఆనందాలంకారములకు నిధి. ఎల్లప్పుడును చిరునగవు లామె మోమున చిందులు త్రొక్కుచుండును. కోప మనునదెట్టిదో నామె యెఱుగదు. సుకుమారి స్థిర చిత్త.

తండ్రిపేరు కోటీశ్వరుడు. అగర్భ శ్రీమంతుడు. ఎల్లప్పుడును ధనధాన్యములతో తులతూగుచుండును. కులమునకు కమ్మ. వీరి గ్రామము కపిలేశ్వరం. కోటీశ్వరుడుగారికి పెద్దదొర. గ్రామమునందలి కమ్మ దొరలెల్లరు తాను చెప్పిన చొప్పున నడచుకొనవలయును.

తనయొక్క పుత్రికయగు కమలను విద్యాబుద్ధుల యందుత్తమురాలిని జేయవలయునని యాతని కెల్లప్పుడును గొప్ప కోరిక. ఒక్కగా నొక్క కూతురు. అతి గారాబముతో పెంచుచుండెను. కోటీశ్వరుడు విద్యా విహీనుడైనను ప్రాపంచక వ్యవహారముల యందతి నిపుణుడు. ఆధునిక విషయాలయం దభిరుచి మెండు. ఇంట నొక పండితోత్తమునిచే కూతునకు విద్యాబుద్ధులు నేర్పించుచుండెను.

పదునొకొండవయేట గుంటూరునందలి జాతీయ పాఠశాలయగు శారదానికేతనమున కామెను పంపించెను. కమల సూక్ష్మగ్రాహిణియని ముందే చెప్పియుంటిమి. పాఠశాలకుపోయిన కొలదిదినములకే తన నైపుణ్యమును వెలిబుచ్చుచు తోడిబాలికలను మించి, విద్యయందును నడవడికయందును ఉపాధ్యాయుల మన్ననలకు పాత్రురాలయ్యెను. సంగీతమామె సొత్తు. కంఠము కోకిలను ధిక్కరించును.

సంవత్సర మాఖరువాయెను. వేసవికాలపు సెలవులు. కమల తండ్రిగారిచే పంపబడిన బంధువునితో కలసి స్వగృహము చేరెను.

కమల కిప్పుడు పండ్రెండువత్సరములు ప్రాయం. రజస్వలానంతరము ఇంటియొద్దనే, వచ్చిపోవు చుట్టాలతో ముచ్చటగా కాలము బుచ్చుచుండెను.

మఱియు వేసంగులప్పుడు శ్రీరామనవమి ఉత్సవములు చెలరేగుచుండెను. వీధులన్నియు పందిళ్లతోను తోరణములతోను అలంకరింపబడియెను. వీధివీధుల నాటకములు, హరికథలు విరివిగా జరుగుచుండెను. అంగనలు వీధివీధుల దిరిగి యానందించుచుండిరి. ఒక నాటిరాత్రి కమల తోడిచేడియలతోగూడి నడివీధి లోని శ్రీరామాలయముదగ్గర నారాయణదాసుగారు చెప్పుచున్న హరికథను వినుటకై బోవుచుండెను. త్రోవలో నెవరో నలువురుయువకులు వారికెదురుగా వచ్చుచుండిరి. వారిలో నొకడు "ఆమె మాదొర వారి కమల"యని మెల్లగాబల్కెను. ఆపల్కులు కమలయొక్క కర్ణపుటములలో ప్రతిధ్వనించెను. ఆశ్చర్యమున కనులు మిరుమిట్లుగొల్పెను. తదేక దృష్టితో నాయువకుని వీక్షించెను. హృదయము చలించెను. మోమునందొకవింత తేజస్సు విజృంభించెను. ప్రణయకోర్కె మొలకెత్తెను. దేహము మాత్రము తోడివారితో బోవుచుండెను గాని, మనస్సంతయు నాయువకునియందే లగ్నమై పోయెను. కర్ణరసాయనమగు దాసుగారి హరికథ యందు ప్రీతిలేదు. చెలులకు సాకుచెప్పి గృహాభిముఖురాలయ్యెను. తన గదిలోనికిబోయి తలుపులు బిగియించి పాన్పుపైబరుండి ఆయువకుని ముఖారవిందముననే మనస్సున జిత్రించి పొంగి పొరలు ప్రణయాంబుధిలో తేలిపోవుచూ, పూవిలుతుని వాడితూపులకు తాళజాలక క్రుంగి కృశించి ప్రక్కపైనే ఉన్మత్తయై నిదురబోయెను.

వెంకడు దొరవారి పెదపాలేరు. ఏటేట దొర వారికొక కిర్రుచెప్పులజోడు బహుమతిచేయుట వెంకనికి మామూలు. ఈయేడాది కుమార్డు కాంతయ్య 'ఇంటరుమీడియట్' పరీక్షయందు త్తీర్ణుడగుటంజేసి అమితానందముతో వానిని దొరవారికి చూపించు నిమిత్తము వెంటనిడుకొని, తానే స్వయముగా తయారుచేసిన కిర్రుచెప్పులజోడును చేతబట్టుకొని దొరవారి దర్శనార్థమైబోయెను.

♦ ♦ ♦

దొరవారు కాఫీవగయరాలు పాటింపరు. పాలు పెరుగులాయన కమిత ప్రీతి. తొమ్మిదిగంటల ప్రొద్దెక్కెను. అప్పుడే పెరుగన్నం పూర్తిగా భుజించి గబ్బున త్రేచ్చుచు, లోగిటి ముందటివసారాలో పడకకుర్చీమీద పరుండెను. వెంకయ్య అతి వినయముతో దొరవార్కి నమస్కరించెను. కాంతయ్యయు నట్లే గావించెను. దొరవారు సంతోష పూర్వకముగా వందనములనందుకొని, "ఏరా వెంకడూ! మీవాడేమి చేస్తున్నాడు"అని ప్రశ్నించెను. "సిత్తం మావోడు ఎప్ యే పాసయినాడట బాబూ! దొరోరికి సూపిద్దామని తీసుకొచ్చా"అని వెంకయ్య బదులు చెప్పెను.

♦ ♦ ♦

కమల తనగది కిటికీలోనుండి చూచినది. సమస్తమువిన్నది. మనోరంజకుని గుర్తించినది. హృదయమునందు ప్రణయజ్వాలలు రగుల్కొన్నవి. తత్తరపాటుతో నిటునటుచూచినది. ఏమియు తోచలేదు. ఎట్టకేలకించుకశాంతి నొంది రివ్వున వెలుపలికివచ్చి "నాన్నగారు! నాకుకూడ చెప్పులు తెప్పించరూ!" అనియెను. చూడ్కులు మాత్రం చీడీలక్రింద నిలుచుని యున్న యువకుని మీదికే సాగిపోయెను. ఆ చూపులలో అలంకార ముట్టిపడుచుండెను. అందుండి విద్యుచ్ఛక్తి ప్రవహించుచున్నది. కాంతయ్య ఆ ప్రవాహములో పడెను. మైమరచెను. అప్రయత్నముగా చలించిపోయెను. ఒళ్ళు పులకరించినది. ఒండొరుల చూడ్కులు తీవ్రముగా ప్రసరించినవి. ఇరువురును నిర్మల ప్రేమలో లీనమైపోయిరి.

♦ ♦ ♦

జూలైనెల ప్రారంభమాయెను. కాంతయ్య కాలేజీకి వెళ్ళవలసి వచ్చెను. పిఠాపురపు మహారాజా వారి కళాశాలలో బి.యె. చదువుటకు పోవుచుండెను. మహారాజావారు సంవత్సరమునకు రెండువందలు సహాయము చేయుచుండిరి. పద్దెనిమిది యేండ్ల ప్రాయముడు. నూనూగుమీసములు; నున్నని చెక్కిళ్లు; పొడవునకు తగినలావు, లావునకు తగిన వక్షస్థలము. రూపమునుబట్టి కులమును నిర్ణయింప వలసిన అతనిని మొదటి తరగతిలో చేర్చక తప్పదు. వేయేల మోహనాకారుడు. కళాశాలలో చేరవలసిన గడువు దాటిపోయెను. ఏలకో వ్యాకుల మనస్కుడైయుండెను. ఊరు విడచిపోవుటకు బుద్ధి పుట్టడములేదు. లోలోన ఆయాసపడుచుండెను. కాని ప్రాణమిత్రులకైనను తన గుట్టునివ్వలేదు.

♦ ♦ ♦

అర్ధరాత్రివేళ; కమల తత్తరపాటుతో లేచెను. ప్రాణకాంతుని కౌగిళ్లలోలేదు. అగాధంగమాయెను. తన్నాడించుటకు మంచముక్రిందనో, బల్లక్రిందనో దాగొనెనని వెదకజొచ్చెను. ఎందును గాన్పించలేదు. కండ్లు నులుమికొనెను. తేరిపారచూచెను. 'కల' యని స్థిరపరచుకొనెను. నేత్రము లెఱ్ఱబారెను. వేడి నిట్టూర్పులు విడచుచుండెను. అనుకోనిరీతిగా మరల ప్రక్కపైబడి నిదురబోయెను.

తెలతెలవారజొచ్చెను. కొక్కొరోమన్న కోడికూతవిని కమల త్రుళ్ళిపడిలేచి కూర్చుండెను. పాపమాకోమలి కింకేమితోచును! ప్రాణకాంతునే పూజించుచుండెను.

"నాకాంతు డెంత చక్కనివాడే! ఆయాకారమునందేమియు కళంకములేదు. అందచందముల నేరికిని

తీసిపోడు. అట్లయిన నాయంటరాని తనమెందున్నది. సర్వమానవులవలెనే యున్నాడే! అస్పృశ్యుడెట్లు లాయెను. ఇది పట్టి కల్ల. కేవలము మానవకల్పితము. పేదవాడైనంత మాత్రమున నాప్రియుడంటరానివా డెట్లగును," అని తనలోతాను వితర్కించుకొను చుండెను. తుట్టతుదకెట్టులైనను తనప్రియుని కొక లేఖ వ్రాయ నిశ్చయించి ప్రక్కనున్న కలము కాగితముతీసి యిటుల వ్రాయ మొదలిడెను.

హృదయకాంతా!

రేయెల్ల మీ కౌగిళ్లలో మునిగిపోతిని. కాయజుడు నిర్దయుడై నన్నుదహించి వైచెను. మనస్సు మనసున లేదు. ఈ దిగువ పద్యములో నంతయు ముద్రించుచున్నాను.

"స్వప్నమందున నినుజూచి సంతసిల్లి
ప్రణయగీతాల గొంతెత్తిపాడుకొంటి
గాని, యిరువుర మేనాటికేని, పేర్మి
గూడుకొనకుందుమా యంచు గుందుమంటి."

మీదర్శన భాగ్యమునకై, స్వాతిచినుకులకు ముత్యపుచిప్పలునోళ్లు తెఱచుకొనియుండు విధమున, వేచియున్నాను.

ఇట్లు, మీ చరణదాసి,
కమల.

..............................

పరీక్షలు ముగిసినవి. మరుసటిదినము కాంతయ్య స్వగృహమునకు పోవలయును. పదిగంటలకు మామూలుగా కాలేజికివెళ్లెను. పోస్టుబంట్రోతొక యుత్తరమును తీసుకొనివచ్చెను. కాంతయ్య తీసుకొని, విలాసముచూచి, వ్రాత యెవరిదాయని యూహించి, కవరు చించిచూడగా, "హృదయకాంతా," యను అక్షరములు గాన్పించెను. తటాలున లేఖ అడుగుభాగమును చూచెను. ముత్యములవలె ముద్రింపబడిన 'కమల' యను యక్షరములజూచెను. కాంతయ్య కంపించిపోయెను. నిలువున నీరైపోయెను. అతని ఆశ్చర్యమునకు మేరయేలేదు. ఎట్టకేలకు తెప్పిరిల్లి, శాంతముగా నొకచో గూర్చుండి యుత్తరమును పూర్తిగా చదివెను. దీర్ఘాలోచనా నిమగ్నుడాయెను. ఏమియుతోచలేదు. రివ్వునలేచి బయటపోయెను.

..............................

దినములు గడచిపోవుచుండెను. కమలహృదయాంతరంగమందు మొలకెత్తిన ప్రణయ 'లత' దినదినప్రవర్ధమానమై గంభీరముగా బరిణమించుచుండెను. కాంతయ్య కులభ్రష్టుడు, అంటరానివాడనువిషయము లాయఖండ ప్రజ్వలితమైన ప్రేమాంబుధిలో కలిగిపోయినవి. కమలకవి గోచరించుటలేదు. అహోరాత్రములామె యాత్మహృదయుని ధ్యానములో మునిగిపోయినది. ఆకలిదప్పిక లెరుంగదు. వేసారిపోయినది; కృశించిపోయినది. మనోవేదనతో తపించిపోవుచున్నది.

..................

"అతిరహస్యం బట్టబయలు" అను. లోకోక్తి అక్షరాల సంఘటించుచుండెను. లోకులు కాకులు; ఏ నోటవిన్నను, 'కమల' కాంతయ్య. అను మాటలే వినవచ్చుచుండెను. ఊరంతయు దావానలమువలె నంటుకొనియెను. కమ్మదొరలందరు గూడిరి. 'మాల మాదిగ వెధవలకు కళ్లుపొరలు కమ్మిపోతున్నాయి' అని కొందరనిరి.

'ఇంకా చూస్తారేం,' అనిరి కొందరు. తలొక కత్తి చేతబట్టిరి. కమల మేనమరిదియగు వెంకటేశుడు నాయకుడు. సింహనాదములుచేసిరి. భేరీరవములు మ్రోయించిరి. అమాంతముగా మాలపల్లెపైబడిరి.

పల్లెఅంతయు గొల్లుమని ఘోషించిపోయినది. మాలమాదిగలు తయారైరి. బాణాకర్రలు చేతబట్టిరి.

గిరగిర త్రిప్పివేసిరి. ఊరివారలు యుద్ధభూమిపైపోయెను. చట్, పట్ మని కత్తులు మ్రోగిపోయెను. కాంతయ్య కత్తిత్రిప్పుచు వ్రేటునకొకని పడవేయు చుండెను. పద్మవ్యూహములోపడెను. 'అభిమన్యుడా' యనిపించెను. అతిఘోరముగా పోరాడుచుండెను.

సూర్యభగవాను డపరాద్రిని గ్రుంకిపోయెను. గాఢాంధకారము లలముకొనియెను. యుద్ధభూమి స్మశానముగా మారిపోయెను. కాంతయ్య రణరంగములో గూలిపోయెను.

కాంతయ్య మృత్యువార్త తంతి వేగమునపోయెను. కమలయొక్క కోమలమగు హృదయమును బ్రద్దలు చేసెను. తంతిమీటిన వీణవలె నామె శరీరము కంపించిపోయెను. సుడిగాలివడిన యోడవలె వడకి పోయెను. ప్రాణకాంతుని పరమునందైనను కలుసు కొందు ననుకొనియెను. తటాలున దొడ్డిలోనున్న బావిలోదుమికెను. అదృశ్యయైపోయెను. మరుసటి దినము ఊరంతయువచ్చిరి. బావిలో తొంగిచూచిరి. అదృశ్యమైన 'కమల' ఆశ్చర్యముగా 'అరవిందమై' నిండువికాసముతో నిర్మలోదకముల దేలుచుం డెను.

## అప్పంపుఁ బ్రేమ

ఏరాచకన్నెయు నెలమిఁ బెండ్లాడని పుట్టుగ్రుడ్డినిఁ గోరి చెట్టవట్టి
పతికిలేని సుకంబు సతికేని దగదని కనులకడ్డంబుగా గంతగట్టి
పుత్రులు నూర్వురు పుట్టిన నొకనిని గనుఁగొనక మనసును గట్టిపెట్టి
సమరోన్ముఖుండయి కొమరుండు చనుచున్న పాపి గెల్పుతమని వరము పెట్టి

భర్త వెంబడి నడవికి బయలుదేరి
కష్టములకోర్చి గాంధారి కడకమీరి
ఇంతకంటెను భక్తిలో నెక్కువేరి ?
సకల కళ్యాణ గుణధన్య సర్వమాన్య.

'సోమనాధకవి'

# దూరపు కొండలు నునుపు

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

మనవిద్య మనప్రాచీనౌన్నత్యములు మన మతమును మరపింపజేయుచున్నదే పరవిద్యా ప్రతిభ. జాతీయత నాదరించనిహిందు వెట్టి వాఁడనగ, కన్నతల్లినిరోసి, సవతితల్లి నపేక్షించునట్టిది. ఎందుచేత ననఁగ హిందూదేశమం దుద్భవించిన మహనీయుల మననమైనను లేక యుపేక్షచేయుటవలన మనహిందూ దేశముతక్క తక్కినయూరప్ అమెరికా ఆస్ట్రియా మొదలగు ఖండములను తిలకించుడు ప్రతిదేశముకూడ తమదేశమందుద్భవించిన వీరులనైతేనేమి కవులనైతేనేమి సంఘసంస్కర్తలనైతెనేమి గొప్పఁజేసి వారి నొక నక్షత్రముగా నలంకరింపఁజేసికొందురు. జ్ఞాపకార్థము వారి ప్రతిమల స్థాపించియు నవయువకుల హృదయోద్దీపిత మొనరించ వారి చరిత్రల ప్రకటించియు ఫోటోలు తీయించి గృహముల నలంకరింపఁ జేసికొనియు వేవిధముల వారి నామము ప్రపంచమంత ప్రాకఁజేయుశక్తి భక్తి వారికీ మనకంటె చాలగలదు. ఆ అద్భుతశక్తిచేతనే జర్మను ప్రధానమంత్రి హిట్లరుమహాశయుఁడు కీర్తిశేషుఁడైన రష్యనుప్రజానాయకుఁడగు లెనిన్, అమెరికన్ ప్రసిడెంటు రూజువెల్టు, ఇటలీడిక్టేరగు మస్సోలిని ఆస్ట్రియాడిక్టేటరగు డాక్టర్ డాల్ఫస్ టర్కీకెమల్ పాషా వగైరాలందరూ కూడ వారివారి దేశోన్నతకార్యములనుబట్టి వారివారి దేశములందేగాఁక ఖండేతరులమగు మనహిందువుల నోళ్లలోకూడ నానుచుండుట తటస్థించుచున్నది. గ్రహించితిరా? మంచి యెచ్చటనున్నను ఆదర్శప్రాయమగుటచే ఆదరించుట విధేకాని మనవారల మంచిని మరుగుపరచి మరచిపోవుటకాదు.

ఇంటగెలిచి రచ్చగెలవాలనురీతి మన దేశీయులలో డిక్టేటర్లు, వీరులు, కవులు, గాయకులు, సంఘసంస్కర్తలు యెందరో గలరు: కలుగుచున్నారు. ఈమధ్య జరిగిన శ్రీమహారాష్ట్ర స్థాపకవీరుఁడగు ఛత్రపతి శివాజీ జయంతి జరిపిన సందర్భమున జరిగిన సభా ప్రసిడెంటగు డాక్టర్ జి.సీ. అరండేలు యీనంగతే మనదేశీయులకు ప్రబోధించిరని వార్తాపత్రికలు వ్రాయుచున్నవి. ఇకనైన మనమృతజీవుల నార్యప్రతిభ నిలబెట్టుఁడు.

ఏదీ, ఆసేతుహిమాచల పర్యంతమేలిన చంద్రగుప్తనామ మేమూలనోకాని దానికిజీవదానమేది? మనహిందూరాజ్య శిఖామణి మమునకుబదులు ఆకాలమునాటివాడై న దేశమునందలి భాగములజయించిన గ్రీసు దేశచక్రవర్తి అలగ్జాండరుపేరు మ్రోగుచున్నది. గమనించితిరా విక్రమార్క భోజరాజుల అలికిడేలేదు. అశోకచక్రవర్తి పేరే యిప్పటివాళ్ళకు తెలియదు. ఆంధ్రభోజ

బిరుదాంకితుఁడై, అష్టదిగ్గజకవికల్పవృక్ష మగు విజయనగర సామ్రాట్టు శ్రీకృష్ణదేవరాయల చిత్తరువే లేకుండుట కడు శోచనీయము. అప్పటిరాజు లెట్టివీరులో, వారి మంత్రులును నంతటి యుక్తిపరులు, చంద్రగుప్తు నంతటి సార్వభౌమునకు చాణక్యునివంటి మంత్రికదా? చాణక్య నీతి యని పేరు. శ్రీకృష్ణదేవరాయల కట్టి తిమ్మరుసుమంత్రి తగియుండెను కదా! విక్రమార్కునివంటి వీరవరునకుభట్టివంటి తగిన మంత్రి. ప్రతాపరుద్రునిఁ దెచ్చుటలో కడు యుక్తులంబరపిన మంత్రియుగంధరుని ప్రతిభ కొనియాడ వశమా? ప్రతాపరుద్రుఁడు, పూర్ణచంద్రుడు, బొబ్బిలివీరులలో పులి యను ఖ్యాతివడసిన తాండ్రపాపయ, ధర్మారాయ రంగారాయ వెంగళ్రాయాదివీరులు, రసపుత్రసింహములగు రాణా ప్రతాప, రాజసింహ, ఉదయసింహాదులు, వేయేల మనదేశమున నుద్భవించని మహనీయు లే దేశమున లేరనిన యతిశయోక్తికాదు. భరతమాత, రత్నగర్భ, కనకగర్భ, రజితగర్భ, వీరగర్భ, కవిగర్భ, సతీగర్భ యని జ్ఞప్తియుందుంచుకొని, తల్లి నభిమానించిన ప్రతిహిందువునుకూడ, మనప్రాచీనాధునిక, వీర, కవి పుంగవుల, దివ్యచరిత్ర పఠించుచు, వారల నాదర్శముగాగొని, వారి చిత్తరువుల గృహాలంకారములుగాఁజేసికొని, ఆత్మౌన్నత్యము నిలబెట్టుదురుగాక. ఝాన్సీ లక్ష్మిబాయి, రుద్రమదేవి, సంయుక్త మొదలగు హిందూ వీరస్త్రీలు, సీతానసూయారుంధత్యాది, పతివ్రతామణులుకూడ మనలోగలరు. గ్రహింపుఁడు.

మన ఘనవక్త, లోకమాన్యబాలగంగాధరతిలకు, శివాజీవీరుని, బోలతగిన ప్రబోధకుఁడు, ముప్పదిమూడుకోట్ల దేవతల కింద్రుఁ డెట్టి యధిపతియో, హిందూనాయకుఁడగు, మహాత్మాగాంధియట్టివాఁడు. కొందరికాలమున ఫొటోలుతీయునేర్పు లేనందున, చెక్కడములే గలవు. అవైన, కాలక్రమమున సిధిలావస్థఁబడి, రూపేలేనందున, మనకా మహనీయు లెట్టివారో కన్పడ నాధరువు లేదు. అయినా, చారిత్రకవర్ణనలబట్టి, రూపమూహించి, రామ, కృష్ణాద్యవతారంబులును, శివాజి, మొదలగు వీరులయొక్కయు, చిత్తరువు లెట్లు వ్రాయుచుండిరో యట్లే, తదితర, మహనీయులగు, శ్రీకృష్ణదేవరాయ, ప్రతాపరుద్ర, రసపుత్రవిక్రముల, బొబ్బిలి వీరుల, కాళిదాసాది, మహాకవులయొక్కయు, భోజ, విక్రమార్క చంద్రగుప్తాది సార్వభౌముల యొక్కయు, ఊహాకల్పక చిత్రముల లిఖింప, చిత్రలేఖకులఁ బ్రోత్సహించి, యాచిత్తరువులం దభిమానముంచికొనియు, కవు లట్టివారి చరిత్రలు మరపొందకుండ వ్రాసియు, నవీనవిద్యార్థు లట్టి దేశచరిత్రల పఠించియు, దేశోద్ధారకు లట్టివారి యాదర్శప్రాయు లగునట్లు, సంఘమునకు తోడ్పడియు, నాట్యకళాపోషకు లట్టి జాతీయ చారిత్రక నాటకములనే యాడి, మరచిన నాయకుల మరల జ్ఞప్తికిందేవ ప్రార్థించుచుంటిని.

ప్రస్తుతము కొంతనయము; ఏ మహానుభావుల వాగ్రూపప్రవాహమహిమోకాని, రాజరాజ నరేంద్రవర్ధంతని, శివాజీజయంతని, త్యాగరాజ గానసభలని, కాళిదాస నాటకమని, శంకరాచార్య మతమని, ఆంధ్రవాణీ సామ్రాజ్యాది నాటకనటనరూపముల కృష్ణదేవరాయుని యశమును, అజంతా, అమరావతీ, మొదలగు గృహా, స్థూపశిల్ప చాతుర్యముల, ప్రకటించియు, దేశప్రతిభను పూజించుచున్నారు. ఇంతతోను పేక్షసేయక, మరియు, మన పుణ్యపురుషులను ప్రతివ్యక్తి మనోఫలకమున హత్తింపఁజేయవలయును.

షేక్స్పియర్ డ్రామారా! అని యుత్సాహంగా పఠించి, రూపకమీమాంసప్రతివిద్యార్థియు వెడలును కాని, నన్నయ, పోతన, శ్రీనాధ, పెద్దన, కాళిదాసాది, కవుల గ్రంథము లుత్సయింపఁ డెందువలన? వారి కిచ్చేచదు వట్టిది. వారి దేశీయులఁప్రకట నట్టిది. ఇది గ్రహించి విద్యార్థి, విమర్శనపూర్వకముగా, జాతీయత నిలబెట్టవలెను. మన ప్రాచీనవీరులను మరచితే, మనకొచ్చేది సలామే. మనపూర్వుల కవిత్వధోరణి నణగ ద్రొక్కితే, మనకబ్బేది హూణభాషాపద మిళితమైన గ్రామ్యకు కవిత్వమే. మనఆర్యుల రూపదృశ్యము లంతరించినయెడల, మన కాత్మరూప సందర్శనమే దుర్లభము.

వేదాంతమునకు నిధియగు మనవేదాంతుల నిర్లక్ష్యపరచి, గ్రీసుదేశ వేదాంతియగు శోక్రటీసును స్మరించుచున్నాము. ఎంతాశ్చర్యకరము. ఇదే పొరుగింటి పుల్లకూరరుచియు, దూరపుకొండలు నునుపనుటకు నిదర్శనములు. ఏ పుట్టలో నే పామున్నదోయని, ఇంటిపుట్టలుమాని, బయటపుట్టలు గాలింప భావ్యమా! ఫలమేమి? మరచిన విద్య మననమొనరింపుడు. నమస్కారము. 'మావి పండెంత మధురమై మంచిదైన జీడియుండక పోవునే చివరకొంత' యని కవిసూక్తిగా. తప్పు లెన్నవలదని మనవి.

ఉ॥ రిక్కల నీసడించెడు మరీచుల దిక్కులఁ గ్రక్కు వజ్రముల్
లెక్కకుమీరి సంద్రములలేవె మనుష్యుల దృక్పథంబులన్
దక్కి; యెవండుసూచె వసుధాస్థలి నున్న మహానుభావులన్
జక్కఁగ లెక్కసేయుటలు శక్యమె వారలు నెందరెందరో.

'దాసుఁడు'

# ఇంటనొకటి రచ్చనొకటి

శ్రీమతి పి. హేమలతా దేవి.గారు

రఘునాధరావు B. A. ప్యాసయినాడు. బ్రాహ్మణుడు తెలివిగలవాడు. యింకా యేమీ వుద్యోగము లేదు. Town halls లోగాని స్త్రీసమాజములలోగాని అతడు లేనిదే యే ఉపన్యాసము జరుగదు. యీ దినమున స్త్రీసమాజములో రఘునాధరావీవిధముగా ఉపన్యసించెను:

సోదరీమణులారా,

మనదేశములో స్త్రీల బాధలు చూస్తే రాయైనా కరిగిపోతుంది. స్త్రీకి తనకోరికమునకు తనయిష్టమువచ్చిన దుస్తులు తనయిష్టప్రకారం ధరించుకొనుటకైనా స్వాతంత్ర్యములేదు. యీ వేళ శ్రావణ మంగళవారము. స్త్రీలు ఖయిదు విడుదలైనారు. "అమ్మకళ్లా యీ వేళ వీధిలోనికి వస్తూన్నాము: యీ వేళయిన యిష్టము వచ్చినట్లు మంచిదుస్తులు ధరించెదమంటే, ఆదుస్తులు యేలా ధరించవలెనో అత్తగారినో ఆడబిడ్డనో అడిగి వారియిష్టము వచ్చినట్లుగాని ధరించవీలులేదు" అని అనేకమంది యువతులు లోలోన విచారించుచుందురు. అత్తగార్ల Fashion వేరు. కోడళ్ళ Fashion వేరు. కోడలు అత్తగారి అనుమతిప్రకారం దుస్తులు ధరించకపోతే వీధిలోని తనతోడి అమ్మలక్కలందరను పోగుచేసి తిట్టించేస్తుంది. భర్తలు భార్యలనుపెండ్లాడి, తల్లులకు అక్కచెల్లెండ్లకి వారియిష్టానుసారము చాకిరీ చేయించుకొమని వప్పచెప్పడం యింతఅన్యాయము! తరువాత, పురుషు డెంతమందినైన వివాహమాడవచ్చునుగదా: అందు తప్పలేదు. కనుక భార్యకు జబ్బుచేసినను, తనకిష్టములేకపోయినను, పురుషుడామెను వదలివేసి మరల పెండ్లిచేసుకొనుచున్నాడు. అప్పుడామెగతియేమిటి? పట్టెడన్నమునకుకూడకరువుగాదా? భార్యవదలినా భార్యదేతప్పు. భర్తవదిలినా భార్యదే తప్పు. ప్రజలలో నీచకము. ఆపది ప్రపంచములో బ్రతుకుటయెట్లా. స్త్రీజీవితమునకు సుఖమన్నదున్నదా? స్త్రీ రజస్వలయేవరకు ప్రపంచకము నొకమోస్తరుగా చూడవచ్చును. తరువాత నేనిస్తూరాలుగా ఖయిదు చేసేస్తున్నారు. పూర్వ సువాసినులకుతప్ప, మిగిలిన వారికందరికి ఆజన్మాంతరం అఖయిదులాగా వుండవలసినదే: 'చెప్పు' అందుకి సమానముగాదా? మగవాడు తనవినోదముకొరకు షికారుపోవుటకాని, ఆటలాడుకొనుటగాని చేయవచ్చును. అదే స్త్రీచేసిన మహాపాతకము. ఇంట్లోకావలసిన నీళ్ళుమోయుటకు మైలుదూరమునన్న చెరువుకైనాపోయి నీరుతేవచ్చును. కాని సాయంకాలము చల్లగాలికైనను వీధిలోకి రాకూడదు. స్త్రీ వీధిలోనికి ఒకప్పుడు వెళ్ళవచ్చును, మరొకప్పుడు వెళ్ళకూడదు. స్త్రీకి తన స్వంత ఆస్తి అనునది లేదు. చదువు మొదలేలేదుగదా. భర్త, అత్తగారు ఎన్నిబాధలు పెట్టినా పడి వుండవలసినదే. చేయునదేమి లేదుగదా. పయిగా ఎంతబాధపడితే అంతమహాపతివ్రతంటారు!! పురుషుడు అత్తవారింట సర్వవిధములయిన గౌరవములుపొందును ఏమంత్రమును గౌరవలోపమయిన భార్యనిబాదును. చేతసయిన పనింకేమున్నది? భార్యను పుట్టినింటికిపంపడు. ఇక స్త్రీకి అత్తవారింటి గౌరవములేదు సరిగదా, నడుము విరగకుండా రోజులు వెళ్ళపుచ్చితేగొప్ప. పలిదం ప్రాణ సర్వమువిడచి నీవే దైవమని వచ్చినభార్యకిదా మనముచేయు గౌరవము" ఈవిధముగా 3 ఘంటలు గుక్కతిరగకుండా లెక్చరిచ్చాడు.

౨

రఘునాధరావు easy chair లో పరుండి పేపరు

చదువుకుంటున్నాడు. భార్య సుగుణమణివచ్చి 'వంట యినది. స్నానము చెయ్యవచ్చు'నని చెప్పి వడ్డించుటకు వంటయింట్లోకెళ్ళింది. రఘునాథరావు భోజనానంతరము తాంబూలము వేయుచు నిద్రవచ్చుటకుగాను న్యూస్ పేపరు తిరగేస్తున్నాడు. సుగుణమణి నగుమోముతో నిలుచున్నది.

సుగుణమణి:—మీ రేమిటో చదువుచున్నారది నేనుకూడ తెలుసుకొనకూడదా?

రఘు:—ఏదో ఒకటి. నీకెందుకు? ఆడవాళ్ళకి ప్రపంచకపు సంగతులెందుకు. పాడయిపోతారు. పోయి పనిచేసుకో, పనిలేదా?

సు:—పనా? నిన్ననే కాదా అరబస్తా కందులు కొన్నారు. అవిచాలు. మేము ప్రపంచకము చూడనే కూడదుగదా, అందలిసంగతులేనా విందామని వచ్చాను.

ర:—స్త్రీకిల్లే ప్రపంచకము ఇతరమనవసరము.

సు:—దానికేమిగాని. ఈవూళ్ళో హార్బరువుందట. చూపెట్టరా?

ర:—సాధ్వ కిలాటివి తగవు. స్త్రీకి గృహాసంరక్షణ, గోసంరక్షణ, దాసీదాని అవసరములేకుండా గడుపుకొనుట, భోజనమయినతరువాత కందులో, పెసలో, బాగుచేసుకొనుట, మొదలయిన పనులతో కాలము గడపవలెను. యీవూళ్ళో హార్బరుకట్టితే మనకెందుకు: మరొకటికట్టితే మనకెందుకు?

సు:—మీమాటల కేమిలెండి. నేను అనకాపల్లిలోపుట్టి యీవిశాఖపట్నం కాపురంవచ్చేను. వచ్చి 6 యేండ్లయినా యీవూ రెలావుంటుందో యెరగను. చిన్ననాడెప్పుడు కాలుకొద్దిపయగత్తి ఆడుకొన్నానో. కాపురమున కొచ్చినదిమొదలు యిప్పటివరకు సరదా అంటే యేమిటో యెరుగను. దైవమిచ్చిన కండ్లు, కాళ్ళు మీవల్ల నిరుపయోగమయిపోయినవి. మొన్న మీకు 4 రోజులు జ్వరంవచ్చి యింట్లోవుంటే, వీధిలో కెళ్ళిందాకా తోచదనేవారే, నాకుమాత్ర మలావుండదా? నే నీప్రపంచకములో జన్మించు టెందుకు?

ర:—రాజ్యమేలేటందుకు.

సు:—ఏరాజ్యము?

ర:—గృహరాజ్యము.

సు:—యీరాజ్యములో రాణికి ఖైదే కాబోలు.

ర:—బియ్యములో బెడ్డలేరుట, పెసలు మినుములు బాగుచేయుట అంట్లు బాగాపదలేటట్టు తోముట, యీలాటి రాజకీయవ్యాపారము లనేకము లున్నవి. అవన్ని ఏరోజువారోజకి సరిపోతాయి. సంకెళ్ళువెయ్యకపోతే యివన్ని సరిగ్గాజరగవు.

సు:—అత్తగారు, మీ రుత్తవెధవముండలండీ, అన్నట్లు బాగానేచెప్పారు. మేము పుట్టుట అంట్లు తోముటకు, యిల్లలుకుటకు, పిల్లలను కనుటకేనా? మీ మాటలుచూస్తే బానిసలమని అర్థమిస్తుంది.

ర:—బానిసకూడా కాదు. మాయింట్లో వంటకు గిన్నెలు చెంబులు ఏలాకొనుక్కున్నామో, అవిధముగానే యింట్లోపనిచేయు **Machines** క్రింద దేవుడు మిమ్మల్ని పుట్టించినాడు.

సు:—అయితే యింక భార్యాభర్తలకు ప్రేమ అక్కరలేదా? వాళ్లయిందిరను మొగుణ్నిచూడండి. ఎంత అన్యోన్యంగావుంటారో.

ర:—వాడా! వుత్తవెధవ. కాకపోతే ఆడదానికా షికార్లేమిటి! అది ఆడిందల్లాఆట పాడిందల్లా పాట. ఇద్దరు కుర్చీలలోకూచుని గుసగుసలు. భోగందానిలాగ షోకులు, ఆనగలు, పిల్లనెత్తుకొనుటకు పిల్ల వంటావిడ! పనిమనిషి! క్రిందఅడుగువేస్తే అరిగిపోతుం దంటాడు. మొగవెధవకి బుద్ధివుంటే ఆలాబరితెగించిపోతుందా? సరిగా పనిచెయ్యకపోతే తన్నడమే నాకు ప్రేమ. మాతాత ఏమిచేసేవా డనుకున్నావు? మ అమ్మమ్మని: కొడితే నడ్డివిరిగేది. పక్షంరోజులుదాకా వేసినమున్నప్పట్టు వేసినట్టేవుండేది.

సు:—మీరేమగవారు. యేమిచేసినా అడిగే వారులేరు. మీనాన్నగారు కొంచెం నయమనుకుంటాను.

ర:—నీవు నోరుమూసుకుని అయినవాళ్ళతోను కానివాళ్ళతోను స్నేహాలు చెయ్యక యింట్లోపడివుండు, లేదా పాదరక్షాప్రయోగంతప్పదు.

సు:—ఇన్నాళ్ళమట్టి కాపురం చేస్తున్నా మీకింత కఠినహృదయులని కనిపెట్టలేకపోయితిని. ఈ సంగతి మీతో చెప్పుదామని ఎన్నాళ్ళమట్టో మనస్సులోవుంది కాని భయపడి వూరుకున్నాను. బ్రతికేది కొద్దికాలము. మీమాటలవల్ల ఈజీవితమునకింక ప్రపంచకములో కన్నులారచూచేవి ఆనందించేవి లేవు. 6 సంవత్సరములనుంచి చూస్తున్నాను. ఈమూడు గదులు ఎలక్కన్నములు అనుభవించేదేమంటే మీచేత చెప్పుదెబ్బలు. పరలోకం ప్రయాణం త్వరలో చేస్తే యీబానిసత్వంవదలి మనవాళ్ళు చెప్పేటట్లు జీవుడే నా సుఖ మనుభవిస్తుందేమో?

ర:—చస్తేచావు. నోటికి సిరిలేకపోతేసరి. కూచోబెట్టి మేపుతుంటే బానిసత్వమయిందా? చదువుకున్న పిల్ల కాపురంచేస్తుందా. మాఅమ్మనివద్దంటే కట్నం కోసం నాకు నిన్ను కట్టిపెట్టింది.

సు:—ఈరోజున స్త్రీసమాజములో స్త్రీలపక్షమున, స్త్రీస్వాతంత్ర్యము, ఘోషానుగురించి లెక్చరిచ్చారట గాదా? అక్కడ ఆలాగుచెప్పడం, యింటి దగ్గర యీలాగు చేయడమూనా?

ర:—ఈవిషయం నీకేలాగున తెలిసింది?

సు:—ఇందిర చెప్పింది

ర:—అయ్యో నీమొహంమండ! దరిద్రపుముండా! ఏదో వాళ్ళుచెప్పమంటే అలా చెప్పానుకాని అది అంతా నీకోసం అనుకొన్నావా? కాని స్నేహములు చేసి చెడుతూన్నావా ముండా?

అంటూ నాలుగుగుద్దులుగుద్ది యింకా కోపంతీరక అప్పడాలకఱ్ఱ విసరివేసిరి. అది సుగుణకాలుకు తగిలి రక్తం చిమ్ముతోంది. చావు, ముండా! అంటూ రఘునాధరావు తలుపుజేరవేసి వీధిలోనికి వెళ్ళిపోయెను.

3

కొంతసేపటికి విమలవచ్చి తలుపుతట్టింది. సుగుణ తలుపుతీసి ఆమెను మర్యాదచేసి కుర్చీమీద కూర్చోమంది.

విమల:—ఏమే? కాలు కట్టుకట్టావు?

సు:—ఏమీలేదు దెబ్బతగిలింది—విశేషము లేమన్నా ఉన్నాయా?

వి:—శీలవతి, సుగుణాలవాల, ఆయిందిరనుగురించి ఎట్లు ప్రజలు చెప్పుకుంటూన్నారో! అట్లుడికినట్లు;

సు:—ఏమని?

వి:—దానికి జబ్బుచేసిందిగా! శరీరారోగ్యమునకు సముద్రతీరమునకు వాక్ కు వెళ్ళమని డాక్టరు చెప్పినాడట. పాపమది, ప్రజలు బతకనివ్వరు, నేను వెళ్ళను, అందిట. కాని భర్త పట్టుబట్టి పంపినాడట. అది ఇప్పటికినగలు పెట్టుకుంటుంది. ఇంకా "ఒప్పులకుప్ప" "దాగుడుమూతలు" యిలాంటి ఆటలంటే దానికి సరదా! ఇదేతప్పట!

సు:—గొప్పతప్పే! దీనితో నేపోయిందా? దాని పాతివ్రత్యము. పూర్వము శకుంతల, దమయంతి, మున్నగువారు చెలికత్తెలతో ఆడుకున్నట్లు మనగ్రంథములలో లేదూ? ఇప్పుడు ఈచెప్పుకొనేవారంతా వారిని సతీవ్రతల లిస్టులోనుంచి త్రోసివేశారా?

వి:—ఆచరణలోనున్న పాతివ్రత్యానికి గ్రంథస్థమైనదానికి సహస్రం తేడాఉంది. ప్రస్తుతము మన అమ్మలక్కలు కొందరు అన్నీ వేషభాషలలోనే ఉంటాయి, అంటారు.

సు:—మంచి హృదయంలో ఉంటుందికాని బట్టలోను బొట్టులోను ఉంటుందా? భారత నారీమణుల బాధలు ఎప్పుడు తీరునో?

(విమల నిష్క్రమించెను.)

## ౪

మఱునాడు రఘునాధరావు షైరువెళ్లి తిరిగివచ్చి తలుపు తట్టుసరికి ప్రత్యుత్తరములేదు. త్రోయగా తలుపు వేసియుండకపోవుటచే తెఱచుకుంది. సుగుణమణి ఎలెక్ట్రిక్ పంకాక్రిందపడిఉంది. నిన్న కొట్టినందుకు కోపగించి పడుకుందేమో అనుకొన్నాడు. సమీపించి తట్టుసరికి—ఇంకనేముంది? కాళ్లుచేతులు చల్లబడి సుగుణమణి జీవరహితకాయము కొయ్యబారి ఉంది.

"అన్నంతపనీ చేశావే!" అంటూ కూలబడ్డాడు. ప్రక్కనున్న చిన్నఉత్తరమునుచూచి తత్తరపాటుతో చదివినాడు అందిట్లుండెను.

ప్రాణనాధా!

మీరు నాకొఱకు విచారించవలదు. బానిసత్వపు విముక్తికి ఎందరు ధీరులు ప్రాణములు కోల్పోలేదు!! నేను స్త్రీసంఘపు బానిసత్వవిముక్తికి నాప్రాణములర్పించితిని. నామీద మీకు ప్రేమయున్నచో నా తుదికోరిక తీర్చకోరెను. తమరు ఒకపక్షముదినములు గదిలో తలుపువేసికొని కూర్చుని ఎట్లుండునో మీ సోదరులకు చెప్పుడు. స్త్రీలకు సహితమిట్టిఖైదుల మాన్పింపుడు.

ఇక సెలవు,
సుగుణామణి.

రఘునాధరావు భార్యకోరిక తీర్చాడు. పక్షము దినములు అయినతర్వాత బయటకువెడితే ప్రపంచమంతా కొత్తఅయింది. సంఘసంస్కరణకై ప్రాణములర్పించిన సుగుణమీద ప్రేమ కిందమారిపోయింది. ఉపన్యాసములు జోరయ్యాయి. సంఘసంస్కర్త అయ్యాడు రఘునాధరావు.

సుగుణశవము ఏవిధమైన ఘోషాలేకుండా సముద్రతీరమున దహనము చేయబడెను. ఆడది గడప దాటరాదనుశాస్త్ర మిక్కడ రద్దుచేయబడెను. సుగుణ కోరకయు, బ్రతికియున్నప్పుడు పొందని బీచిషైరు నేటికి చేకూరెను.

హాయిగా మలయమారుతములు వీచుచున్నవి. సముద్రుడామెకు అంత్యగీతములు పాడుచున్నాడు. సుగుణమాత్రము నేటికిని మృతజీవురాలే.

సంతుష్టో భార్యయా భర్తా
భర్త్రా భార్యా తథైవచ,
యస్మిన్నేవ కులేనిత్య
కళ్యాణం తత్రవై ధ్రువమ్.

మనువు.

# స్త్రీదే దయాంతఃకరణము

బులుసు వేంకటేశ్వర్లుగారు

కోటిసూర్యప్రకాశమానమైన భవనము, భవనాంతర్భాగమున మాలతీ లతాదులతోను, విరబూసిన జాజి, చేమంతి, గులాబి అంట్లతోనిండిన పూదోఁట, ఇంటిలో విద్యుద్దీపములు, విశాలాంతఃపురములు. నిలువుటద్దములు, బెక్కాములు, ఊగుటుయ్యెలలు, అవి యివి యననేల? ఎటఁజూచినను లక్ష్మీదేవి తాండవమాడుచున్నదో యనునట్లుండెను. ఇంత యింటిలోను అల్పజనసంఖ్య గృహయజమాని యౌన్నత్య పదవియందున్నాఁడు. నాఁడు బాలుని జన్మదినోత్సవము. అతి మనోహరముగ నా గృహమలంకరింపఁ బడెను. అనేకులు శ్రవణాసహ్యకరముగ ఘీంకారసినాదమొనరించు ధూమశకటములలోను, ద్విచక్రధూమశకటములలోను గృహాంగణమున దిగి లోనికేగుచుండిరి. వీరందరు ఉద్యోగులు. గొప్పవారు. నవరత్న ఖచిత సింహాసనములో యన నొప్పు కుర్చీలలో నాసీనులగుచుండిరి. బల్లపై, ఫలహారము లతిజాగ్రతగ వడ్డించుచుండిరి. పాప మందు కొందరు తినఁజాలకుండిరి. తినిన వారికి పడదట. అంతవఱకే వారిపూర్వజన్మ సుకృతము. సరస సల్లాపములతో నెంగిలి జేయుచుండిరి. గ్రామఫోనులు కుక్కలవలె నఱచుచుండెను. మితిలేని యానందమా మానవులం దావహించినది.

అంతవీధిలో నొక వనితా విలాపము. "ఆహా! చలిబాధకుఁదాళఁజాల. గొప్ప ప్రభువులు ఒక వస్త్రమును దయచేయుఁడు. తండ్రులారా!" అని యొకజవ్వని—దారిద్ర దేవత ముఖమున దాండవ మాడుచుండ, కట్టఁ బట్టలేక గోనెగుడ్డలఁ జుట్టుకొని మరి యొక గుడ్డలో దన పసికూననిడుకొని బహిష్కరణాంగియై యెదుటఁబడి విలపింప సాగినది. ఆయార్తనాదము వినువారెవరు? ఆ భవనాధికారియా? ఉద్యోగ మదాంధులై యున్న యా భోక్తలా? సృజించిన బ్రహ్మకైనను జాలి లేదే? అట్టిస్థితియందున్న యామెను గన నేఁకి గుండె గుభిల్లుమనదు? ఏరి మన మనంతదయాం సముద్రమున మునుగదు? కాలమా శీతకాలము. దినమా శీతల మధికముగల దినము. మూఁడుకోళ్లఁ దొడిగి మూలకూర్చొన్న ఇఁక నామె గతి యేమి?

సూర్యభగవానుఁడు, "ఓ తల్లీ! నీవు వస్త్రవిహీనవైనను దినమంతయు వేఁడినిచ్చి కాచితిని. ఇఁక నేనేమి చేయుదు?" నని బాష్పములు రాల్చుచున్నాఁడో యన పశ్చిమ సముద్రమున గ్రుంకుచు మేఘావృతుఁడై యున్నాఁడు.

"హా! తండ్రులారా? మీ ప్రియపుత్రిని. దయ లేదా? శరీరము గజగజ వణుకుచున్నది.

నోట—మాట—వచ్చుట—లేదు." అని హత మారినట్లు నేలగూలినది. నౌకరులు—నౌకరులా—వారు !! యమకింకరులు. మానాభిమానహీనులైన ప్రభువుల నౌకరులువారు "ఛీ! పొమ్ము. అయ్యగారు మమ్ము కోపపడి ఏదైనచేతురు. పోకున్న గెంటివేయుదు" మని నిష్ఠురోక్తు లాడసాగిరి. అపు డామె గతి యేమి?

ఓ మాలదైవమా? నీ వట్టివారి నేల పుట్టింపవలయును? పుట్టించినవాడవు కట్ట పుట్టములేకుండ నేలఁజేయవలయు? భారతమాతృగర్భమునుండిపుట్టిన యొకఅబలపైనా నీ దారిద్ర్యదేవతాస్త్రప్రయోగము? ఎంత మంది రమణీమణు లిట్టి యిక్కట్టు లనుభవించుచున్నారో గదా?

ఎటులో ధైర్యముఁ దెచ్చికొన్నది. "ఓ దయాంతఃకరణముగల తల్లీ! నీకైన దయ లేదా," అని దొడ్డివాకింబడినది. అపు డా గృహిణి యేమనఁగలదు? "ఆవల కనబడుము. ఇపుడు కంగారుగా నున్న"దని స్త్రీహృదయము మతి దయాకరమగుటచే లోనికిఁ జనియెను. ఇంతలో వీధింబోవుచున్న యొకమాలపిల్ల, దయాంతరంగముగల జవ్వని, యామెం గేక వైచినది. ఆమెపండగకై నూతనవస్త్రము గొని గృహమున కేఁగుచున్నది. తక్షణ మా చీరఁదీసి యామెకుగప్పి, "తల్లీ! దీనసంతృప్తిఁ జెందుము. ప్రస్తుత మీశైత్య బాధానివారణమునకై నాకిదిచాలు. నీవు కష్టపడుచుండ నాకు పండగేల? ఇది నీ ముద్దుబిడ్డకుం దొడుగుము." అని యొకచక్కని చొక్కా దీసి బాలునకిచ్చి చనెను.

అపు డామె బట్టఁగట్టుకొని శైత్యబాధ పోగొట్టుకొని పసిపిల్లని కా చొక్కాదొడిగి భగవంతుని ప్రార్థించుచు వీధిఁబడియేగెను.

ఆహా! భారతదేశ సముద్ధరణభరముం దాల్చినస్త్రీలును, ఇట్టి త్యాగశీలురును, ఈ యిల నెంతమందిగలరో గదా? భారతమాత ధన్యాత్మ. అగ్రవంశజయైననేమి? అంత్యకులజయైననేమి? ఆగర్భశ్రీమంతురాలైన నేమి? పుట్టుదరిద్రురాలైననేమి? స్వార్థత్యాగులు, సర్వమానవసౌభ్రాత్రముం గోరువారేకదా కావలయును. వారికేగదా యీతఁడు సర్వశుభముల నొసగూర్చును. అట్టి నారీమణులేగదాభారతిమాత శృంఖలములను విడిపించువారు. అట్టి త్యాగశీలురు, సర్వసమర్థులు, భారతిమాతను నిత్యసౌభాగ్యసుశ్రీల నెగడునట్లు చేయువారలు, ఆత్మసామ్రాజ్యవైభవవ్యాప్తి నొందజేయు నారీమణులు వర్థిల్లుదురుగాక!!

# శారదకు ప్రత్యుత్తరము

శ్రీమతి దివాకర్ల శారదామణిగారు

[జనవరిమాసపు గృహలక్ష్మి సంచికలో ప్రకటింపబడిన శారదలేఖలో శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు ఇతర రాష్ట్రములయందువలె ఆంధ్రరాష్ట్రమునందుకూడ హిందీ వ్యాపించవలసిన ఆవశ్యకతను సమర్థించుచు హిందీప్రచారమునకు స్త్రీపురుషులు దోహదము చేయవలయునేగాని ప్రతికూల విమర్శనలతో నిరుత్సాహపరచరాదని హెచ్చరించినారు. హిందీప్రచారమువలన ఆంధ్రభాష కెట్టిముప్పైనను కలుగుననుట కేవలభ్రమ కాక సత్యముకాదనికూడ తెలిపినారు. ప్రస్తుతము కాంగ్రెసువాదులును, హిందీ ప్రచారకులును గూడ ఇట్టి యభిప్రాయముతోనే హిందీప్రచారమును సాగించుచున్నారు. అయినను హిందీ ప్రచారమువలన ఆంధ్రభాషకు ప్రత్యక్షముగ నష్టము కలుగుచున్నదనియు, అది మఱి వృద్ధియగుననియు, రాష్ట్రభాషా ప్రచారమిప్పు డవసరములేదనియు, తెలుగువారికీ పిచ్చి బాగా తలకెక్కి తమభాషకు ముప్పు తెచ్చుకొనుచున్నారనియు ప్రస్తుత హిందీభాషా ప్రచార ప్రతికూలవాదులు ఘాటుగానే ఉపన్యాసములు విమర్శలు సాగించుచున్నారు. ఉభయ వాదముల సారమును గృహలక్ష్మి పాఠకులకు విశదమై యుండవలెనను తలంపుతో శ్రీమతి శారదామణిగారు వ్రాసిన యీవ్యాసము నిందు బ్రకటించుచున్నాము. శారదామణిగారు తమయుత్కర్ష ఋషీతుల్యమగు నాంధ్రశయ్యలో, మాతృభాషాభిమానావేశముతో సమగ్ర చారిత్రాత్మక చర్చతో పాఠకకోటి హృదయమునకు తమవాదమును నచ్చచెప్పుచు వ్రాసిన యీ దీర్ఘవ్యాసమునకు ఆమెకు కృతజ్ఞతను దెలుపుచున్నాము. —గృ॥ సం॥

ఉత్తమాశయ ప్రచారిణియగు శారదకు దివాకర్ల శారదామణి నమస్కారములు.

అమ్మా !

భావాకాశమున సంస్తవమగుకీతులవిహరించుచున్న నీతోడిచెలిమి కాంక్షించుచు ఈ పత్రికా ముఖమున నే నీలేఖను వ్రాసికొనుచున్నాను. విద్యావివేక సంపన్నలగు భారతీయమహిళామణులలో--అందును ముఖ్యముగ నాంధ్రవిదుషీమణులలో నీ వత్యుచ్చమగుశ్రేణినుండి జ్యోతిర్మయమగు భావపుంజములప్రసరింపజేయుచు నన్నుబోలుయువతుల నీదెస కాకర్షించుకొనుచున్నావు. అయస్కాంతమున నాకర్షింపబడినట్లు సదా నీవువ్రాయులేఖాంశములవలన మా హృదయము లెల్లప్పుడును నీవంకకే భ్రాంతమగుచున్నవి. కల్పలతావలంబితములగు నీభావసౌధములు అఖిలకాంతాలోకశిరఃకంపనకారణ ధోరణీవిరాజమానములయి, ఆర్యమహిళా వ్యవహార నిర్వాహప్రతిభాసంపన్నములయి, ఉన్నతాదర్శబోధకములయి చదువనేర్చినవారి కనుదినసంతోషములుగ జిహ్వాగ్రముల విహరించుచున్నవి. ఆంధ్ర

భాష పుణ్యమున, ఆంధ్రవిదుషీమణులమహాభాగ్యమున నీవు నీలేఖా ముఖమున మాకు కర్తవ్యోపదేశమొనర్చుచు సర్వకార్యకలాపములయందును మార్గదర్శిని వగుట నాకు మోదావహముగ నున్నది.

అయిన నో శారద !—ఈ క్రొత్తసంవత్సరారంభమున (అనగ జనవరి 1 వ తేదీని) నీవు గృహలక్ష్మీ ముఖమున బ్రచురించిన నీ లేఖ విస్మయమును, విషాదమును, విపులమగు నానందమును ఒక్కపెట్టున నా హృదయమం దుదయించునట్లు చేసినది. నీ హిందీ భాషాభినివేశమునకు—నీ హిందీభాషాభినివేశమునకు మించియున్న నీ సర్వభారతీయజాతీయతాభినివేశమునకు విస్మయపడితిని. హిందీసంపర్కమున నాంధ్రభాష కొక్కయాపద యుండదను నీ హేతు కల్పనమునకు విషాదమగ్న మానస నయితిని. అన్నిటి కంటె నీహేతుగుచ్ఛమున దారమువలె నంతటను బెనగొనియున్న నీ మాతృభాషాభిమానమునకు నానందమును నాకు జనించెను. ఇట్లు నీ లేఖవలనఁ ద్రివిధంబులగు ననుభవములకు బాలుపడితిని.

తెనుఁగు వారికి హిందీభాషపై ద్వేషభావము కలుగుట కెట్టి హేతువును లేదని నీ వూహించుచున్నావు. ముఖ్యముగ నాంధ్రులకు హిందీ—హిందుస్థానీ భాషలయెడ విద్వేషకారణము లున్నవని నేనూహించుచున్నాను. మనదేశమును బట్టి, కాలమునుబట్టి, చరిత్రమునుబట్టి నే నీ హేతువులఁ జెప్పుచుంటినిగాని హిందీభాషపై నిర్హేతుకముగ శత్రుత్వమును వహించి నే నిట్లు చెప్పుచుండుటలేదు. "హిందీ మారాష్ట్రభాష—మాజాతీయభాష. నేను ప్రాథమిక పరీక్షకు చదువుచున్నాను" అని గరువతనమునఁ జెప్పుకొనుట విద్యార్థినులలో నే డొక "ఫ్యాషను"గా బరిణమించినది. సారస్వత రంగ ప్రవేశమున హిందీకి మన మెట్టి యవకాశములఁ గల్పించుకొన్నను వ్యావహారిక భాషగగాని, రాజభాషగగాని హిందీకి మనమొక యగ్రస్థానమిచ్చినయెడలఁ దప్పక నది తెలుఁగు భాషనధోగతిపాలుచేసితీరునని నేను నిశ్చయముగఁ జెప్పగలను. ఆంధ్రదేశమునందొక మూడవ భాగమును తనయందుఁ జేర్చుకొనియున్న నిజామురాజ్యమునందలి తెలుఁగువారివ్యావహారికభాషకిట్టి దుర్గతి అజస్ర సహస్ర విధముల బ్రత్యక్షముగ ననుభవమునకు వచ్చుచునేయున్నది. హిందీభాషాభిమానులగు నాంధ్రనాయకుల కీసంగతి తెలిసియున్నదో లేదో: తెలిసియు తూష్ణీంభావమున నూఱకొనుచునే యున్నారో నాకు తెలియకుండ నున్నది. నైజామురాష్ట్రమున హిందుస్థానీ సంపర్కమున దెలుగున వ్యావహారికభాషయందుఁ బీఠము పెట్టుకొనియున్న ఈ క్రిందిపదములు చెన్నరాజధానియందలి ఏ తెనుఁగువారి కర్థమగునో నీవు చెప్పగలవా ?

| నైజామురాష్ట్రపు తెనుగు. (వ్యావహారికము) | మన వ్యావహారికమున నర్థము. |
|---|---|
| గవాయి | సాక్ష్యం |
| వతను | రాబడి |
| దవాఖానా | ఆస్పత్రి |
| తనఖా | జీతం |
| క్యాదకి | మొంగలిరేకు |
| గత్తర | కలరా |
| దేహాతిపని | స్వదేశప్పని |
| ఆలుగడ్డ | బంగాళదుంప |
| మంది బీడుగా ఉన్నారు | జనసమ్మర్దం ఎక్కువగా [వుంది |
| మిత్తి | వడ్డీ |
| యాది | జ్ఞాపకం |
| సుర్మాకలం | పెన్సలు |
| కైకిలి | కూలి |
| ధాతి | సిరాబుడ్డి |
| రోఖాయించుట | అడ్డంరాకు |
| దేకీచ | డేగిసా |
| ముల్కి | దేశం |

ఇట్టి శబ్దములు కేవల హిందుస్థానీసంపర్కమున తెలుఁగువాణియందుఁ బ్రవేశించినవి. అచ్చటి శుద్ధ దేశ్యపదములైన—తెలుగు గడ్డయందు బుట్టిన పదములుగా నుంచక మనరాష్ట్రమునందలి ముసల్మాను సోదరులు మాట్లాడు తెలుగుభాషవలె నుండును

| నైజాము రాష్ట్రమున తెలుఁగువారి భాష | మనరాష్ట్రమందలి వ్యావహారికము |
|---|---|
| కూసంటావ్ | కూచుంటావు |
| బేకందు | కొట్టాడు |
| నీకాల్మొక్త | నీపాదాలుపడతాను |
| యాడికి | యెక్కడికి |
| అడ్గిండు | అడిగాడు |
| కూలబడు | కూచో |
| ఎళ్లిండు | వెళ్లాడు |
| పిల్సిండ్రు | పిల్చారు |
| ఆడివాండ్లు | ఆడవాళ్లు |
| ఇగేంగదంటే | ఇంకేమిటంటే |
| నాసిరి | తక్కువది |
| అయ్యాష్లు | వైష్ణవులు |
| కండ్లొచ్చినై | కళ్లుగలిగినవి |
| కడి అయినరు | వెళ్లిపోయారు |
| కుట్లకెల్ల తిన్నాడు | గొంతుకదాకా తిన్నాడు |
| గట్కిపిండి | నలుగుపిండి |
| గది | అది |
| గిజగిజ ఉరకడం | గబగబ పరుగెత్తడం |
| జల్లట్ల బోయింది | గవంతలో తప్పిపోయింది |
| దస్తీగుడ్డ | చేతిరుమాలు |
| జింగిపోయింది | ఆగిపోయింది |
| తుక్కు బడాయించింది | పొగరెక్కింది |
| చుక్క | పావలా |
| డప్పాలు | దెబ్బలు |
| కళాబంది మేళం | భోగంమేళం |
| తుంటకుతుంట ఉన్నడు | లావుగా ఉన్నాడు |
| తుట్టిపోయినాడు | దండుగపోయాడు |
| తొడచిమ్ముట | తొడపాశంపెట్టడం |
| తోడుకొక్క పోవుట | పిలుచుకుపోవడం |
| నక్క | దొంగాడేశే కన్నం |
| పన్నావా? | పడుకొన్నావా? |
| పడగొట్టిరా | పంపించిరా |
| పిన్నాడు | పిల్లాడు |
| పిస్సవాడు | పిచ్చివాడు |
| బేగిరా | చప్పునరా |
| యాష్ట వచ్చింది | విసుగేసింది |
| ఉలాసిగా కొట్టురా! | ఈడ్చికొట్టురా! |
| వొంటించుట | కపట్పం |
| వొడిసి పోయినవి | అయిపోయినవి |
| పెద్దమనిషి | ముసలాడు |
| ఎందుల్లో | ఏమిగోయి |
| లొల్లి | అల్లరి |
| అయింది గని | అయిందికాని |

పై పట్టికను ఇరువదేండ్ల క్రిందట నాంధ్రభాషా సంరక్షకసమాజమువారిచే ప్రచురింపఁబడి పాను గంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారిచే రచియింపఁబడియుండునని నే నూహించుచున్న 'వివర్శా దర్శ,వివర్శా దర్శము' అను గ్రంథములనుండి సంగ్రహించి వ్రాసితిని కాని నేనేపోయూహించి ఉన్న వియు లేనివియుఁ గల్పించి తయారుచేయలేదు. ఇంకను విస్తారముగ నీ క్లిష్టపదముల నెఱుంగఁ గోరిక యున్నయెడల నా గ్రంథమునందే చూచికొనవచ్చును.

నూటడెబ్బదియేండ్లనుండి బ్రిటిష్‌వారి స్వాధీనమునకువచ్చి ఉత్తరసర్కారులలోనుండు మనము బ్రతికిపోతిమి కాని దురదృష్టవశమున నైజామురాష్ట్రమునందే మనముండిపోయినయెడల మన వ్యావహారికపుఁ దెలుగుగూడ నైవిధమున "ఖరాబై" యుండవలసినదే.

"నిజాము రాజ్యమున దురుష్కప్రభుత్వమున్నది. ఆతురకలభాషయు ఇప్పుడు నేను చెప్పుచున్న హిం



తల్లిపాల మహిమ

దీయు నొకభాష యెట్లగును ?"—అని నీవు చాటుకొనిపోవ నూహింపవచ్చును. నీవట్లుసందేహించిన యెడల నేనంతగా వాదమొనర్పవలసినయావశ్యకతయే లేదు. దక్షిణభారత హిందీప్రచారనిర్వాహకులలోఁ బ్రముఖులగు పండితహృషీకేశశర్మగారీవిషయమునుగూర్చి పూర్వపక్షములఁ దర్కించుచు నీవలెకే సిద్ధాంతీకరించి వ్రాసిరి. ఆయన ఆంధ్రులయి యుండియు తమపిల్లల కుగ్రుపాలతోఁగూడ హిందీ భాషనునేర్పి తమ సర్వజీవిత వ్యాపారములను హిందీ యందే నిర్వర్తించుకొను నత్యపూర్వ రాష్ట్రాభిమానులు. వారేమనుచున్నారు!

"ఆప్ ముసల్మానోఁ సే బోలీజానీవాలీభాషా కో "తుర్కీభాష" కహతేహైఁ; యహ్ అచ్ఛా నహీఁ. హిన్దుస్థాన్ కీ ఆమ్‌జవాన్ హిన్దుస్థానీహై. జిస్ భాషాకో హిన్దూలోగ్ "హిన్దీ కహతేహైఁ ఉసీకో హమారే ముసల్మాన్ భాయీ "హిన్దుస్థానీ" కహతేహైఁ. ఇత్నా ఫరక్ హై కి హిన్దీమేఁ సంస్కృత్ కేశబ్ద్ అధిక్ హైఁ—ఔర్ హిన్దుస్థానీమేఁ అరబీ, ఫార్సీకే అల్ఫాజ్ జ్యాదహ్ హైఁ. ఉర్దూ, హిన్దీ ఔర్ హిన్దుస్థానీకో ఆప్ ఏక్ హీ సమ్ఝే యే." అనగా మహమ్మదీయ సోదరులు మాట్లాడుభాషను "తురక"భాషయని మన మేవగించుకొనరాదనియు, మన మేభాషను 'హిందీ'యని చెప్పుచున్నామో దానినే ముసల్మాను సోదరులు 'హిందుస్థానీ' యనుచున్నా రనియు, హిందీ, హిందుస్థానీ, ఉర్దూభాష లొక్క భాషా వికారములేయనియు, అవి యేమన 'ఆమ్ జవాన్' అనగా రాష్ట్రభాష కాదగినదనియు వారు వేదవాక్యములవంటి వాక్యముల సెలవిచ్చిరి.

1918-వ సంవత్సరమున నిందూరు నగరమున జరుపఁబడిన హింసీసాహిత్య సమ్మేళనమునకు మహాత్ముని సభాధిపతిగా నెన్నుకొనుట తటస్థించెను. అప్పటినుండియు మహాత్ముని ఆదేశానుసారమున మదరాసు రాజధానియందు హిందీప్రచార మారంభింపఁబడినది. అప్పటినుండియు దక్షిణభారతమున వ్యాపించియున్న హిందీప్రచారాందోళనమంతయు మహాత్మునియుద్యోగఫలముగనున్నదని దక్షిణ భారత హిందీ ప్రచారసభవారు చెప్పుకొనుచునేయున్నారు. మహాత్మునియందున్న కార్యాసూరత్వమును, ప్రజాకర్షణ శక్తియు ఆంధ్రమహాజనులను హిందీప్రచార పరాయణులనుగా నొనర్చుచున్నది.

అయినను హిందీభాషా వ్యాప్తివలన నాంధ్రభాష కగు సాధక బాధకములను మనము మొదట యోజింప వలయునని నేను భావించుచున్నాను. ఈప్రచారమున బద్ధకంకణులయినప్పు డాంధ్రప్రముఖులు—ఉత్తర సర్కారులందుఁగాని, రాయలసీమయందుగాని కొన్ని శతాబ్దములనుండి నిజామురాష్ట్రమున నాంధ్ర భాష యెట్లు ధ్వంసమైనదో కొంచెమైన నూహించి యుండిన వారుకారు. వారెట్టిభాషాపరిశోధనమును జేయకయే మహాత్మునియాదేశముల శిరసావహించి హిందీభాషాప్రచారమే స్వరాజ్యసాధనమంత్రముగ భావించి నేటికిని అట్టి కార్యోత్సాహమునే జూపించుచున్నారు. హిందుస్థానీభాషాభాషకులగుజాతుల వలన నిదివఱకే ఆంధ్రభాషకును ఆంధ్రజాతికిని తీరని నష్టము వాటిల్లినది. అట్టిజాతులు దక్షిణాపథమునకు రాకుండ హిందూధర్మమునుగాపాడినవా రాంధ్రులు. ఆంధ్రు లేకశిలానగరమున, హంపీవిజయనగరమున నట్టివారితోఁ గొన్ని వందలయేండ్లు హోరాహోరిగా బోరి దక్షిణాపథమునందలి దేవాలయములకును, హైందవ ధర్మములకును రక్షణమొనర్చుటచేతనే మన మిందఱ మింకను హైందవులుగనుండుట సంభవించినది. సముద్ర తరంగములవలె దక్షిణమునకుఁ గొట్టికొనివచ్చిన మ్లేచ్ఛజాతులను ఆంధ్రులు జెలియలి కట్టవలె నిలిచి తమిళ, కన్నడ, మళయాళదేశములఁ గాపాడిరి. ఇతరజాతుల నణఁచియుంచుటకే వారట్లు చేసినవారుకారు. కృష్ణరాయాదులకు 'యవనక్షోణీధవస్థాప కృపాకటాక్షా'ది బిరుదములుకూడ నున్నట్లు

మనకు మనుచరిత్రాదిగ్రంథములఁబట్టి తెలియుచునే యున్నది. అనఁగ వారు ధర్మమునకుఁ గట్టుబడి తమ సహాయ మపేక్షించిన మహమ్మదీయ రాజులకుఁగూడ నాపత్కాలముల తోడ్పడుచుండిరన్నమాట. కృష్ణదేవరాయ లట్లుచేసినను చేయకున్నను అతని యల్లుఁడగు రామరాజు 'విశ్వామిత్రులగు' దురుష్క సుల్తానులకుఁ 'గల్యాణము'ను గూర్చినవాడు. వారతనిపై దుదకెట్టి విశ్వాసమును జూపించిరో చరిత్రమే వేనోళ్ల ఘోషించుచున్నది. బొమ్మలవలె రామరాజు తమ్మాడించుచున్నాఁడని భావించి తురుష్క ప్రభువులందఱును తమమతమే ముఖ్యముగ భావించి 1565—వ సంవత్సరమునఁ దల్లికోటయుద్ధమున తొంబదియేండ్లప్రాయమువాఁడగు నా వృద్ధ రాజేంద్రుని సంహరించి పగదీర్చుకొనిరి. భావి పురాతనాద్యతన నగరమహాలక్ష్ములలో నేవియు నుపమింపసమానముగానివిజయనగరము నొక్క దెబ్బలో గోలుపోయి ఆంధ్రులప్పటినుండి నేటివఱకు విగతరాజ్యులయి, నిర్భాగ్యులయి పారతంత్ర్యమునఁ బ్రాకులాడుట సంభవించినది. తమిళ, కర్నాట, మళయాళముల మనవారిఁ గాపాడిరికాని తమదేశమును, తమ్మును కాపాడుకొనఁ జాలకపోయిరి.

కొన్ని వందల సంవత్సరములు హైందవధర్మమును గాపాడియు ఆంధ్రులకిట్టిదుర్గతి ప్రాప్తమైనది. ఒక్క రాజ్యభ్రష్టత్వముతో మనకష్టములు తొలఁగిపోయినవా? ఆంధ్రదేశమంతయుఁ దుత్తునుకలుగఁ జేయబడి బిజాపురపు నవాబులక్రింద గోల్కొండనవాబుల క్రింద, మహారాష్ట్రులక్రింద, నైజామురాజులక్రింద, ఫ్రెంచివారిక్రింద, హైదరాలీక్రింద, టిప్పుసుల్తాను క్రింద, బ్రిటిష్ ప్రభువులక్రింద నలిగినలిగి చచ్చియుఁ జావకుండ పడియుంటిమికద! ఇప్పు డీపరిపాలనమున—ఈవింశత్శతాబ్దమున ఇందఱు రాజనీతిపారంగతులు మనకుండి—ఇందఱు మంత్రిశిఖామణులు మనకుండి—ఇందఱు కాంగ్రెసునాయకులు మనకుండి—ఇందఱు బ్రాహ్మణాబ్రాహ్మణ నాయకమణులు మనకుండి—ఇందఱు దేశోద్ధారకులు మనకుండి—ఇందఱు దేశభక్తులు మనకుండి—ఇందఱు దేశబాంధవులు మనకుండి—ఇందఱింద టాంధ్రరత్నములు మనలో నుద్భవించి—ఇన్ని రాజకీయాదర్శముల మన మెఱిఁగియుండి—ఇన్ని రాజనీతిపథముల మన మారితేరి—ఇన్ని జాతీయ రాజకీయసూత్రముల బఠించుచు—ఇన్ని నవనవాదర్శముల మనము బ్రోదలమయి—ఇన్ని శాసన ధిక్కారకార్యముల మన మనుభవమునకుఁ దెచ్చుకొనుచు సంయుక్తప్రాంతములందలి 'సిరోంచ' మొదలు సెకంద్రాబాదునుండి చెంగల్పట్టు వఱకు బళ్లారినుండి బ్రహ్మపురము వఱకు తెనుగు మాట్లాడు మేమందఱ మొక్కజాతివారము—మా కౌన్నత్యముకాని, బతనముకాని ఒక్కగట్టుగ నొక్కయొత్తునఁ గావలసినది కాని మమ్మిట్లు శాశ్వతముగ రాజకీయశృంఖలములఁ గట్టిపెట్టి, వేలువేలుకోట్లలో నుంచుట కొప్పుకొనమని సాహసించి యాందోళన మాచరించిన వారొక్కరైనఁ గాన్పింపరుకద! మనవారేమి తెలివితక్కువవారా? ప్రజ్ఞాహీనులా? ప్రతిభాశూన్యులా? కార్యశూరులు గారా? సాక్షి గ్రంథకారులు చెప్పినట్లు వెల్లులిపాయను వేయిజీలికలు గాఁ జింపఁగల నేర్పరులున్నారే! గాంధీమహాత్ముని యుద్యమముల బలువవలన ప్రతిపట్టణమునఁ బదుగురు 'శశిరోలు,' ప్రతిగ్రామమున నొకొక్క 'డిమాస్థనీసు,' ఇంటింట నొక 'గాంధీ' బయలుపడి మనచే పదిపదునైదేండ్లనుండి ఆకాశసౌధములఁ గట్టించుచున్నారు కదా! ఇందఱిందఱు వాక్శూరులు, కార్యశూరులు బయలుదేరుచున్న మన కర్మభూమియందు మన యాంధ్రనాయకుల కిట్టియాందోళనములపస దెలియదని మన మనుకొనఁగలమా? ఈయిరువదియవ శతాబ్దమునందే వంగదేశవిభాగమునకైన యాందోళన మెంత జయప్రదముగఁ బరిణమించినదో మన నాయకు లందఱును బ్రత్యక్షముగ గమనించియే యుండిరికద!

మహాత్ముఁడుకాని, తదితర నాయకులుకాని అట్టి యాందోళనమున కీయకొనరనికాని, ఆక్షేపింతురని కాని ఆంధ్రమహాజను లూహించుచున్నారా? స్వదేశ సంస్థాన వ్యవహారములతో మనమింకనుజోక్యము కలుగఁ జేసికొనరాదనియు, స్వదేశరాజ్యములలో స్వరాజ్యమీవలకే చేకూరియున్నదనియు, కావున మనకు స్వరాజ్యసిద్ధికాని స్వతంత్రసిద్ధికాని అగునంత వఱకు నైజామురాష్ట్రమునందలి యాంధ్రులెంత యధమాధమస్థితికి వచ్చినను వచ్చినట్లూరకొనవలె ననియు - అట్లుచేయుటయే మహాత్ముని యాదేశమనియు నీవందువా?

ఈవర్తమానయుగమున నైజామురాష్ట్రమునందలి యాంధ్రులెంత దుర్గతికివచ్చిరో నీవేమాత్రమైన గ్రహించితివా? సంఖ్యాబాహుళ్యమునుబట్టి తెనుఁగు వారక్కడ ప్రథమగణ్యులు. అయిన తెనుగువా రభివృద్ధినొందుట కా 'స్వరాజ్యదేశమున' నెట్టి యవకాశములున్నవి?—ప్రజలలో నెక్కువగ నున్నవా రాంధ్రులు. రాజధానీనగరమునసహితము తెనుఁగు వారిసంఖ్య హెచ్చు. అట్లుండునపుడు ఆధునిక డిమోక్రేటిక్ ప్రిన్సిపుల్ నును (ప్రజాబాహుళ్య సమ్మత సిద్ధాంతములఁ)బట్టి మహాత్మునిదృష్టియందు స్వరాజ్యమును పొందియున్న ఈరాజ్యమున తెనుఁగే రాజభాషగా—ముఖ్యవ్యావహారికభాషగా నుండవలసినదికాదా? అట్లున్నదా? 35 కోట్ల జనసంఖ్యగల భారతవర్షమున 12 కోట్ల 12 లక్షల జనులు హిందుస్థానీభాషల మాట్లాడఁగలరనియేకదా వానితో నంతగ సంబంధములేని దాక్షిణాత్యభాషలపై 'హిందీ'ని రుద్ద నూహించుచున్నారు.

ఇంతేకాను వింధ్యపర్వతములకీవల మనదక్షిణదేశములందు సంఖ్యాబాహుళ్యమును బట్టిచూచినచో ఆంధ్రభాషయే ప్రథమగణ్యమైయున్నది. అరవము, కన్నడము, మళయాళము మున్నగు ద్రావిడభాషలే కాక, మరాఠి, గుజరాతి మున్నగుభాషలుకూడ జనసంఖ్యయందు తెనుఁగునకు వెనుకఁబడియే యున్నవి. ఇప్పుడు మన జాతీయ వాదులు చెప్పునదొకటియుఁ జేయునదొకటియుఁ జేయువారు గానియెడల దక్షిణాపథమున నత్యధిక సంఖ్యాకులకుమాతృభాషయైన ఆంధ్రభాషను రాజకీయభాషగ, ముఖ్యవ్యావహారిక భాషగా (Lingua Franca) నంగీకరింపవలెను కాదా?

ఈదక్షిణభారతీయ భాషలన్నిటికి పరస్పర సామ్యముండుటచేత ద్రవిడసంభవులకు తమ భాషాకుటుంబమునఁజేరిన ఆంధ్రభాష నభ్యసించుట హిందీ నభ్యసించుటవలె కష్టసాధ్యముకాదు. హిందీయందువలె నిరర్థకములగు 'నే' ప్రత్యయములుగాని, లింగభేదములుగాని 'కి' ప్రయోగములుగాని, ఇంకను చిత్రచిత్రములగు వాక్యవైఖరులుగాని మనభాషయందు లేవు. మఱియు పలుకుతీరునందు, వాక్యపు బందు కట్టులయందు దక్షిణభారతీయభాష లొక్కతీరున నున్నవికాని విపరీతముగ లేవు.

ఆంధ్రనాయకులకిట్టియాందోళనము ప్రథమ కర్తవ్యమైయుండగ నట్లుచేయరుసరికదా హిందుస్థానీయులగు నాయకులు మంచిచెడ్డలను తెలిసికొనక దక్షిణభారతీయులందఱును హిందీ నేర్చుకొనవలయునని గాంధీమహాత్ముని పురస్కరించి తీర్మానించుకొనగ మనవా రాయాదేశమును శిరసావహించి దక్షిణదేశమంతయు నైజాము రాజ్యమువలెనే హిందుస్థానీమయముగాఁజేయ ప్రారంభించుచున్నారు. మన నాయకులెంత స్వరాజ్యాందోళనముల దిట్టలయినను ఇట్టిదా రాజనీతి? 'వారాంగనేవ నృపనీతి రనేకరూపా' [వార రమణికైవడి బహురీతి రాజనీతి) అను భర్తృహరి వాక్యమునందలి పరమతత్త్వమును మన భాషాసంరక్షణమునకైన మననాయకులేల అవలంబింపఁజాలరు? మనకిప్పుడు సర్వభారతజాతీయ తత్త్వ ముండవలయునుగాని కేవలాంధ్రజాతీయతాందోళనములు పరిహాసభాజనమగునని ఆంధ్రమహాజను లూహించుచున్నారా? అట్లూహించుచున్నయెడల

వారికి సరియైనజాతీయతత్త్వముగాని, ఆంధ్రదేశ చరిత్రముయొక్క ప్రధానతత్త్వముగాని గ్రహించుట లేదని నిశ్చయముగఁ జెప్పవచ్చును,

ఇప్పుడు కాంగ్రెసు నాయకులనుబట్టి చిలుక పలుకలవలె మనవారు చెప్పుకొనుచున్న సర్వభారతీయ జాతీయైకమత్యమనునది(**All Indian National Unity**) చరిత్రమున నెప్పుడును కొనసాగియుండలేదు. పూర్వమున కాశ్మీరమునుండి కన్యాకుమారివఱకు భరతఖండము నేకచ్ఛత్రముగఁ బరిపాలింపఁ గొందఱు చక్రవర్తు లూహించిరికాని కడకు విఫలమనోరథులైరి. అశోకవర్ధనుఁడు, హర్షవర్ధనుఁడు, అల్లాయుద్దీను, అక్బరు, ఔరంగజేబు ఆర్యావర్తముతోఁగూడ దక్షిణాపథమును జయింపఁ బ్రయత్నములు జేసి కొంతదేశ మాక్రమించుకొనిరికాని వారందఱునుకలసి ఆయాప్రాంతముల నొక నూరుసంవత్సరములనైన తమ స్వాధీనమున నుంచుకొనఁజాలక పోయిరి. వేలకొలఁదియేండ్ల దేశచరిత్రముగల మన భరతఖండచరిత్రమున ఒక నూరేండ్ల చరిత్రమునుజూచి మనము తృప్తిఁ బొందినయెడల నది సముద్రజలముల క్షారము నొక మధుబిందువువలన నుపశమింపఁజేయ నూహించుట వంటిది.

మనకింత యసహ్యముగనున్న బ్రిటిష్‌పరిపాలనమునందే ఆసేతుశీతాచలమును ఒక్కరాజ్యవిధానము క్రింద వచ్చుట సంభవించినది. బ్రిటిష్‌వారి పరిపాలనమున మననాయకులు చిత్రించువిధముగ ఎడారులలో మాడిపోవునట్లు మనమెంత కాలిపోవుచున్నను ఈ యెడారులలోనే నడుమ నిజామురాజ్యము, మైసూరు కాశ్మీరము మున్నగు స్వదేశరాజ్యములు మనకుఁ జక్షురుత్సవకరముగ, సంతోషదాయకములుగ ఎడారులలోని ఫలవంతములగు ప్రదేశముల (**Oases**) వలె ఈశ్వరకటాక్షమున నేటికిని శాశ్వతరూపముల నిలిచియున్నవి. మన స్వదేశరాజ్య ప్రభుత్వములనుగూడ బ్రిటిష్‌రాజ్యవిధానముతో కేంద్రీకరింపఁబడునట్లు ఈమధ్య పార్లమెంటున నొక ఫెడరల్ విధానమును తయారు చేయుచున్నారు. కాని అది కాంగ్రెసువారి రాజనీతికి సరిపడకపోవుటచేత దానిని మననాయకు లక్కఱలేదని వేనోళ్ల నుపన్యసించుచున్నారు. స్వదేశరాజ్యముల మనతోఁ జేర్చుకొని భరతఖండమునంతయు నేల నొక 'సహారా' క్రింద జేసికొనవలెనని మన రాజనీతి విశారదుల యూహకాఁబోలు! బ్రిటిష్ గవర్నమెంటును ప్రతిఘటించుటకై కాంగ్రెసు నాయకులు పన్నుచున్న మహావ్యూహముల ప్రతిభను మెచ్చుకొనుటలో నేనెవ్వరికిని దీసిపోవువాఁడను కాను. కాని కాంగ్రెసు వారొకవంక ఉత్తరమును దక్షిణమును ఒక్క వ్యావహారికభాషవలన గలిసియుండవలెనను చున్నారు. మఱియొకవంక—అన్నిటికంటెను ముఖ్యమైన బ్రిటిష్‌రాజ్యమును, స్వదేశరాజ్యములును ఫెడరల్ విధానమునకు రావలెనను సర్కారువారి ప్రయత్నములఁ బ్రతిఘటించుచున్నారు. ఇది యాత్మబంధువుల నింటినుండి దరిమివైచి పరదేశస్థుల విందున కాహ్వానించుట వంటిదికాదా? ఇంకను స్పష్టముగ జెప్పుకొనవలెనన్నచో మనకన్నలు తమ్ములునగు నిజామురాష్ట్రమునందలి తెలుఁగువారలైనను మనము జోక్యము కలిగించుకొనక మనము కేవలపరాయివారగు హిందుస్థానీయుల మొదట నెత్తి నెక్కించుకొనవలెనని చెప్పుటకాదా?

ఔత్తరాహులతోడిసంబంధబాంధవ్యముల కంటె స్వజాతీయులగు నిజామురాష్ట్రమువారితోడి సంబంధము మన దేశీయాభ్యుదయమున కెక్కువదని నేనూహించుచున్నాను.

తన బాంధవులను శత్రువులబారి విడిచి తాను పరులకభయహస్తమిచ్చి యుద్ధరంగమున కుఱికిన శూరాగ్రేసరునివలె ఓరుగల్లును, గోల్కొండయు దురుష్కులాక్రమించుకొన్నను లక్ష్యముచేయక తెనుఁగువాఁడు తన ద్రవిడసోదరుల రక్షించుటకై విజయనగరమున కోటగట్టి రెండుమూడువందల సంవత్సరములు యుద్ధమొనర్చి తుద కధఃపతితుఁడైపోయి

నాఁడు. ఇప్పుడు మన తమిళ, కన్నడ, మళయాళ సోదరుల కా విస్వాసమేమైన నున్నదాయని నేనడుగుచున్నాను. ఉన్నయెడల తమ ద్రవిడభాషా కుటుంబమునకుఁ జెంది అన్ని దక్షిణభారతీయ భాషలలోను సంఖ్యాబాహుళ్యమున ప్రథమగణ్యమైన ఆంధ్రభాషను వ్యావహారికభాషగ—కాలక్రమమున రాజభాషగ జేసికొనుట కుత్సహించుట యుక్తధర్మమగును కాదా ?

ఇంత భరతఖండమున ఉత్తరమున హిందీయు దక్షిణమున నాంధ్రమును వ్యావహారికభాషలుగ జేసికొనుట ఆర్థికముగ—చారిత్రకముగ రాజకీయముగ సమంజసమని నేనూహించుచున్నాను. పేరునకు భారతవర్షమొక దేశముగఁ జెప్పబడుచున్నను పాశ్చాత్యదేశములలో వలె ఇంతదేశమున నొక్కజాతీయతత్త్వమెన్నడును కలిగియుండలేదు. మన కాంగ్రెసువారెన్నెన్ని యుపన్యాసములనిచ్చినను అట్టి జాతీయతత్త్వమసంభవము. చరిత్రమున నెప్పుడును అట్లు జరిగియుండలేదు. ఇది పెక్కుదేశములుచేరిన యొక ఖండమని 'భరతఖండ'మను నామమే చెప్పుచున్నది. పరికించిచూచినచో ఈ మహాఖండము రష్యాదేశవిలుప్తమగు యూరపుఖండమంతయున్నది. అందు నానాజాతిప్రాంగతులగు యూరోపుఖండ జాతులలోనైన ఒక్కజాతీయభాషకాని వ్యావహారికభాష గాని 'ఆమ్ జవాన్'గఁ బరిగణింపఁ బడుచున్నదా? 'ఫ్రెంచి' పరస్పర రాజకార్యోపయోగమగు భాషగ (diplomatic language) 'జర్మను' వర్తకవ్యవహారోపయోగమగుభాషగ ఇంగ్లీషు బహుళవ్యవహారోపయోగమగుభాషగ— నారోపియనులలో ద్రిభంగులగు భాషలు వ్యవహారమున నున్నవి కాదా? అట్లున్నను వారి స్వతంత్రతత్త్వముల కవి యెంతమాత్రమును ప్రతిబంధకములుగ లేవు. మనముగూడ నార్యావర్తమున హిందీయు, దక్షిణాపథమున నాంధ్రమును ఎందులకు వ్యవహారోపయోగములుగ నంగీకరింపరాదు?

భరతఖండమున రాజకీయముగనైన నిట్లుఁ రెండు పక్షముల నుంచుకొనుటవలన భారతీయుల కట్టి యాపత్తును గలుగదు. కాంగ్రెసు పరిపాలనమున నేకముఖమునకు వచ్చిన ఆసేతుశీతాచలమును మరల రెండుగ ఖండించివేయుదువా? అట్లుచేయుట అవివేకము కాదా?—అని నీవఖిలభారతీయ జాతీయతాభినివేశమున నన్ను బృచ్ఛింతువు. మన దక్షిణదేశముల తెలుఁగొక ముఖ్యవ్యావహారికభాషగ నున్నంతమాత్రమున మనకుఁ గాంగ్రెసు పరిపాలనము కాని, బ్రిటిష్ పరిపాలనము కాని అంతరించిపోవుట ఎన్నటికిని సంభవింపదు.

1920-వ సంవత్సరమున తానుచెప్పినట్లు చేసినయెడల నొక్కసంవత్సరమున మనకు స్వరాజ్యము లభించితీరుననియు నిఁక బ్రిటిష్వారితో బాధపడవలసిన దుర్గతి యుండదనియు జగత్తంతయు మారుమ్రోగునట్లు సింహఘోషమున మహాత్ముఁడొక నిర్మాణకార్యక్రమమును, ఒక యుద్ధ నిర్వాహక తంత్రమును ప్రకటించినాఁడు. అప్పుడా సేతుశీతాచలమును కార్యశూరులుదయించి మహాత్మనివాగ్దానము పునఃపునరుచ్చరితమగునట్లు శతసహస్రముఖముల ప్రతిధ్వనులఁజేసిరి. తరువాత నెన్నియేండ్లు గడచినవి? ఎన్ని సత్యాగ్రహసంరంభములు, ఎన్ని శాసనోల్లంఘన మహావ్యూహములు నాచరణమునకువచ్చి తుదకు బ్రిటిష్వారాజనీతి కాహుతియై పోయినవి! కాంగ్రెసువారి యుద్యమమహత్త్వములఁ దెలిసికొనలేక నేనిట్లు చెప్పుచుండుటలేదు. దాస్యశృంఖలా నిబద్ధమైయున్న ఆర్యజాతికెప్పటికైన స్వరాజ్యప్రాప్తియైనయెడల నది కాంగ్రెసువారి పద్ధతులవలననే కావలయునని నాకు విశ్వాసమున్నది. నాకొక్కతెకే కాదు. ఈపదునైదేండ్లనుండియు భారతీయ ప్రజల కట్టి విశ్వాసముదయించినది. ఎందువలన? గాంధీమహాత్మునినాయకత్వమహత్త్వమువలన. నిశ్చయముగ నరులలో గాంధికంటె నున్నతుఁడులేదు. అతఁడెట్టి

మహాపురుషుఁడైనను అతఁడిప్పుడు విరమించినట్టి వైఖరినిగాక మఱికొన్ని సంవత్సరములు నాయకుఁడై మనల నడపించినను నేటికాంగ్రెసువారి లక్ష్యమైన సంపూర్ణస్వాతంత్ర్యము **(complete independence)** మనకు చేకూరగలదా? అందనిమ్రానిపండ్లకుఁ జేతులు జాచువిధమున మననాయకులు సంపూర్ణస్వాతంత్ర్యమను లక్ష్యమొకటి యెదుటనుంచుకొని బ్రిటిష్‌వారెప్పటికైన మనకుఁ బీడ విరుగడయయిపోయినట్లు పోయితీరుదురని భావించుచు నడియాసల నిడుమలఁ బడిపోవుచున్నారు. మనకెంతటి స్వరాజ్యప్రాప్తి గ్గైనను బ్రిటిష్‌వారి యాధిపత్యము **(British supremacy)** ఇంతట నంతట మనకు వదలిపోవునది కాదు. బ్రిటిష్‌రాజ్యములోనున్న మనము గాంధీగారి నాయకత్వమున బ్రిటిష్‌వారిని వదల్చుకొన్నను స్వదేశసంస్థానాధీశు లెప్పటికిని బ్రిటిష్‌వారిదేశమును వదలకుండ వారికి బాసటలై యుండఁగలరు. అనగ నాంగ్లేయులు కాంగ్రెసువారి బాధపడలేక దేశమునువదలి పోవనూహించినను వెల్లస్లీ ప్రభువు స్వదేశసంస్థానాధీశులతో చేసికొనియున్న 'సబ్‌సిడియరీ' సంధిషరతులకు బ్రిటిష్‌వారెప్పటికి కట్టుపడియుండునట్లుగ మన స్వదేశప్రభువు లాందోళనములఁ జేసి బ్రిటిష్ భారతప్రజలను హతాశులుగ నొనర్చుచుందురు. కావున కాంగ్రెసువారు మనకు సంపూర్ణ స్వాతంత్ర్యప్రాప్తి గలుగఁగలదని వట్టియాకాశసౌధముల నిర్మింపఁజేయుచున్నారని నిశ్చయముగఁ జెప్పఁగలను. అట్టి యాకాశసౌధముల నిర్మింపఁజేయుచునే యిప్పుడున్న రాజభాషయగు నింగ్లీషును పఠింపనిఁక యవసరముండదనియు, దానిస్థానమున 'హింది—హిందుస్థానీ' భాషల నెలకొల్పుకొనుటకు మనము సంసిద్ధులమై యుండవలెననియు కాంగ్రెసు నాయకులనుచున్నారు. మనకట్టి పరిస్థితులలో హిందీ రాజభాషగ చేసికొనుట కట్టి యవకాశమునులేదని నేను చెప్పఁగలను. ఒకవేళ బ్రిటిష్‌వారి యాధిపత్యమున 'డొమీనియన్ స్టేటస్' వంటి స్వరాజ్యమొకవేళ మనకు సిద్ధించినను ప్రజాబాహుళ్యమునుబట్టి ఉత్తరమున హిందీయు, దక్షిణభారతమున నాంధ్రమును రాజభాషలుగఁ జేసికొనుట యుక్తమని నేనూహించుచున్నాను. ఇది యెంత కలికాలమైనను బ్రిటిష్‌వారి పరిపాలనమున మన మేమంత దుర్గతికిఁ బాలుపడితిమో నాకుఁ దెలియకుండనున్నది. ఈకలికాలమునఁ జెప్పరాని సహింపరాని యిడుమల పడిపోవుదుమనికదా మనపూర్వులు శాస్త్రేతిహాస పురాణముల వ్రాసికొనిరి.

సీ. ఒకకాలమునఁ బండునోషధిచయము వే
ఱొకకాలమునఁ బండకుండునండ్రు
క్రోధంబు లోభంబు క్రూరత బొంకును
దీపింప నరులు వర్తింతురండ్రు
వ్యవహారములు మహావ్యాజయుక్తములండ్రు
సఖ్యంబు వంచనాసహితమండ్రు
మగలతో నిల్లాండ్రు మచ్చరించెదరండ్రు
సుతులు దండ్రులఁ దెగజూతురండ్రు

గీ. గురుల శిష్యులుదూషించి కూడరండ్రు
శాస్త్రమార్గము లెవ్వియు జాగవండ్రు
న్యాయపద్ధతి ఋషులైన నడపరండ్రు
కాలగతి వింతయైవచ్చెఁ గంటె నేఁడు.

ఇట్టి దుర్నయములు దప్పక నేడు మనుజులలో నున్నవి. ఇవి భరతఖండమునకుమాత్రమే పట్టియున్న కర్మముగాక సర్వమానవప్రపంచమున నొక్కవిధమున నావరించియున్నది.

క. క్రమమున రాష్ట్రములును నగ
రములును నాశంబునొందు రక్షాచ్యుతులై
భ్రమియింతురు జను లతిదు
ర్గమగిరిసరిదంతికములఁ గడు నాతురులై.

బ్రిటిష్‌వారీ దేశమునకువచ్చునప్పటికి జనులిట్టి దుస్థితియందేయుండిరి. నూటయెనుబదేండ్ల క్రిందట నుత్తరసర్కారులను బ్రిటిష్‌వారు పరిపాలింప నారంభించినదిమొదలింతవఱకు మనమిట్టి దుస్థితినెఱుం

గము. అంతకుపూర్వము మరాఠీవారికి, హైదరాలీకి, టిప్పుసుల్తానునకు, పిండారీలకు, థగ్గులకు వెఱచి మన వారాత్మరక్షణమునకై యడవులకుఁ గొండలకు పాఱి పోవుచుండుట విజ్ఞులగు ముసలివారిప్పటికిని చెప్పుచునేయుందురు.

మ. ధరణీరక్షణ మాచరింపక నృపుల్
దర్పంబునన్ బశ్యతో
హరులై సాధులదోఁచి చేకుఱుతదీయ
స్త్రీధన క్షేత్రముల్
హరియింపంగలవారు దారుణతరం
బై పెల్లు చెల్లం పర
స్పరయుద్ధంబు ధరాతలేంద్రులకు వి
శ్వప్రాణి నాశంబుగన్.

బ్రిటిష్‌వారిరాకకు బూర్వమొక వేయియేండ్లిట్టి 'పశ్యతోహరు'లగు మహమ్మద్ ఘజనీ, మహమ్మద్ ఘోరీ, మల్లిక్ కాఫూర్, తైమూర్‌లంగ్, నాదిర్‌షా, మహమ్మద్‌షాదురానీ మున్నగువారు భరతఖండమున యుద్ధములు చేసిచేసి ప్రజల ఖండించిఖండించి ప్రజల నెన్నికడగండ్లపాలు చేయవచ్చునో అన్నిటిని చేసిచూపిరి. కాని 180 సంవత్సరములలో ఆంధ్రజాతికెప్పుడైన నట్టిముప్పు కలిగినదా ?

తరువోజ.

ఉక్కున శూద్రులత్యుగ్రులై కవసి
♦ యొండొండ పెక్కండ్ర నుఱకచంపుటయు.
దిక్కెవ్వరునులేక దీనులై వసుమ
♦ తీసురల్ నాలుగుదెసలఁ బాఱెదరు
మ్రుక్కిడి చోరులు ముట్టినిశ్శేష
♦ ముగధనావలిఁ గొనిమొగి వధింపంగ
గ్రుక్కి కాకులయట్లు శూన్యులై చెదరి
♦ సొంపరియడవులు సొత్తురుజనులు.

ఆంగ్లేయు లీదేశమునకు వచ్చునప్పుడు జనులిట్టి దుర్దశయందే యుండిరి. నేడు బ్రిటిష్ పరిపాలనమున నట్లుంటిమని నీవనగలవా ?

పరీక్షిన్నరేంద్రునివలె ధర్మదేవత కుంటువడకుండ నీకర్మభూమియందు బ్రిటిష్‌వారు మనలఁ బరిపాలించుచున్నారని నేననుచుండుటలేదు. ఇది కలియుగమగుటచే నెట్టివారికైన నట్లుచేయుట సంభవమని పూర్వులిదివఱకే శిలాక్షరముల వ్రాసిరి.

ప్రస్తుత పరిస్థితులఁబట్టి 'సంపూర్ణస్వాతంత్ర్యమ'ను లక్ష్యమెప్పటికిని కొనసాగఁజాలదని చెప్పుటకై నేనింతదూరము వ్రాయవలసివచ్చినది. కాంగ్రెసు నాయకులిట్లు పలుకుచున్నను నేడు ఎసెంబ్లీలలోఁ బ్రవేశించిన 'పార్లమెంటేరియను'ల కట్టి స్వాతంత్ర్యము చేకూర్పఁగలదను విశ్వాస మిసుమంతయు లేదు. ఉన్న యెడల వారితత్త్వమునకు బ్రతికూలముగ పార్లమెంటేరియనులగుట జరిగియే యుండదు.

భారతవర్షమునకు స్వాతంత్ర్యయోగములేని సందర్భమున హిందీరాజభాష యగుటకెట్టి యవకాశమును లేదు. అట్టి పరిస్థితులలో రాజభాషకై ఇంగ్లీషు, ఆధ్యాత్మిక వికాసమునకై సంస్కృతము, మాతృభాషగావున తెనుగు—ఇన్నిభాషలను మనవా రభ్యసింపవలసియుండగా నింకను 'రాష్ట్రభాష' యనిపేరుపెట్టి 'హిందీ'ని మనపై నాయకులెందులకు పులుమ నూహింపవలయును ?

నేనేమో ఆంగ్లభాషావ్యామోహమున నింగ్లీషే శాశ్వతముగ రాజభాషగావలెనను నభినివేశముతో నిట్లనుచుంటిననియూ, అట్లనుట జాతీయవిద్రోహమనియు నీవు భావింతువు. నాకొక్కనికే గాదు. ఆంగ్లభాషాకోవిదులగు నాయకులకందఱకు నాంగ్లభాషా మహత్త్వము తెలిసియేయున్నది. ప్రపంచమునన్నిభాషాభాషితులలోను, అన్ని నాగరికదేశములలోను ఆంగ్లభాష బహుళవ్యవహారముల వ్యాపించియుండుట మననాయకులందఱకుఁ దెలిసియేయున్నది. ప్రాగ్దేశములన్నిటిలోను నాగరికతయందు బ్రథమస్థానమున నిలిచియున్న జపానుదేశమునకూడ ఆంగ్లభాష మాతృభాషను మించియున్న యభిమాన.

ముతోఁ బఱింపబడు చున్నదని మన నాయకులకుఁ గూడ తెలిసియేయున్నది. అయిననేమి?—మన జాతీయ నాయకులలో భాషావిషయమున తమ విశ్వాసమును ధైర్యమున బ్రకటింపఁగల సాహసము—— (Courage to reveal one's own conviction) కొఱవడియున్నదని పలుకవలసియున్నది. అందఱిట్టి యాత్మవంచనమునకుఁ బాలుపడుచుంటిరని నేనను చుండుటలేదు. భారతీయ మహిళాశిరోమణులలో నప్రతిమానమగు ప్రతిభావిశేషముఁబ్రదర్శింపు చున్న శ్రీమతి సరోజినీదేవిగారు లాహోరున నేటి దినమే ఆంగ్లభాషా మహత్వమునుగూర్చి యుపన్యసించినట్లు నేటి అసోసియేటెడ్ ప్రెస్ వార్తలవలన దెలియుచున్నది. సరోజినీదేవిగారు నేటి కాంగ్రెసు వారి యుద్ధసంరంభములలో నగ్రస్థానమున నిలిచి యుండు నతిరథ మహారథశ్రేష్ఠులలో 'నాయకమణి' యని ప్రసిద్ధినందియున్న కాంతాశిరోమణి. ఆమె జాతినిబట్టి వంగనారీమణియయ్యు నాంధ్రులయింటఁ బ్రవేశించినఁ దగుటచేత ఆంధ్రమహిళాసంఘమునకుఁ జేరినదనియే మనము గర్వింపవచ్చును. ఆమె ఆంధ్ర భాషాభిమానముచేతను, హిందుస్థానీపై ద్వేషముచేతను ఆంగ్లభాషయే మనకు రాజభాష గావలయు నని చెప్పుచున్నదని నేను తలంపఁజాలను. ఆమె తెలుఁగు నాయుఁడుగారి సతీమణి యయ్యును ఆంధ్ర భాషాజ్ఞానముకాని, తద్విషయికమగు నభిమానము కాని లేదనియే నాయూహ. ఆమె సికంద్రాబాదున నుండి హిందుస్థానీయందేపుట్టి పెఱిగియున్న విదుషీమణి. ఆమె యేమనుచున్నది?.—

మనజాతీయ విద్యాలయము లన్నిటిలోను ఆంగ్ల భాషయే బోధనోపయోగమగు భాషగనుండి పోవలె ననుచున్నది. భారతీయుల కాంగ్లమెంతటి మేలైనఁ జేసెననుచున్నది. "మెకాలే" మన కాంగ్లభాష నేర్పఁబడునట్లుచేసి మనకు మహోపకారమును చేసి యున్నాఁడనుచున్నది. ఆంగ్లభాషవలననే నిజమగు స్వతంత్రాదర్శములు మన దృష్టిపథమున నంకురించిన వనుచున్నది. భారతవర్షమున నేడింతతీవ్రరూపమున నిల్చియున్న మత, సాంఘిక విద్వేషముల నశింప జేయుట కొకసామాన్యభాషయే గొప్ప సాధనమనుట నిశ్చయమే కాని ముఖ్యముగ బ్రస్తుతసమయమున పెషావరునుండి కన్యాకుమారివఱకు మన మేకకంఠమున నెట్టి యాందోళనములఁ జేయఁగలుగుచున్నను అందులకు మూలకారణము ఆంగ్లభాషా సంబంధమే యని వక్కాణించుచున్నది. ఆమె తనకు సంకుచిత జాతీయ భావములతోను, సంకుచితమగు దేశభక్త్యావేశములతోను నిమిత్తము లేదనుచున్నది. ఆంగ్ల భాషయనిన మనకొకవిధమగు నభిమానముపయించి నను అందులకు సర్కారువారిని నిందింపఁ బనిలేదనుచున్నది ప్రస్తుత విద్యావిధానము సక్రమముగ లేక పోవుట వాస్తవమేయనియు, దానిని మనము సవరించుకొన వలయుననియుఁ జెప్పుచున్నది. ఇట్లనినంత మాత్రమున శ్రీమతి సరోజినీ దేవిగారు మాతృదేశ హితమునకుఁ బ్రతికూల ప్రచారిణియై పోవుచున్నదని తదితరనాయకులు చెప్పఁగలరా?

ఆంగ్లభాష రాజభాషగ నుండుటవలన మనకెట్టి యెట్టి ప్రయోజనము లున్నవో ఆంగ్లభాషావిదులగు నాయకులందఱకును తెలిసియేయున్నది. అయినను జాతీయతాభినివేశ మావహించియున్న ప్రస్తుతకాలమున వారు తమ యంతరంగస్థమగు సత్యముల నోటఁ బలుకుటకు సంకోచించుచున్నారు. నిశ్చయముగ దక్షిణభారతమున హిందీభాష కెట్టి స్థానమును లేదు. దక్షిణమున నాంధ్రభాషయే వ్యావహారిక భాషగ నుండఁదగినది. ప్రజాబాహుళ్యమున కాంధ్రమే మాతృభాష గావున ఆంధ్రభాషయే రాష్ట్రభాష కావలెననుట న్యాయమును, ధర్మమును, సత్యయుక్తమునగునని మన నాయకు లంగీకరింపవలెను. ముఖ్యముగ నాంధ్రనాయకులట్టి యాందోళనమునుజేసి తమ కార్యశూరత్వమును, రాజనీతివిజ్ఞానమును లోకమునకు వెల్లడింపవలయు. ఉపేక్షవహించి తమ్ముగాన ట్లూఱకున్నయెడల నది యాత్మవంచన మనిపించు

కొనును. హిందుస్థానీయందుఁ బుట్టి పెరిగియున్న సరోజినీదేవిగారే ఇట్లనుచుండగా నాంధ్రు లా హిందీ తలకుఁ బులుముకొని స్వచ్ఛమగు తమవాణి నెందులకుఁ జెఱుపుకొనవలయునో తెలియకుండ నున్నది.

ఉ. సారపు ధర్మమున్ విమల
సత్యము బాపము చేతఁ బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడ
బాటిపదైనయవస్థ దక్కు లె
వ్వార లుపేక్షచేసి రది
వారలచేటగుఁ గాని ధర్మ వి
స్తారకమయ్యు సత్యశుభ
దాయకమయ్యును దైవముండెడున్.

"ఉగ్గుపాలతోఁ బుట్టిన మాతృభాషేమి? హిందీ వ్యాప్తివలన నశించుటేమి? వేడినీళ్లతో నిండ్లుగాలు నన్నటులున్నది."—అని నీవు కల్పలతకు వ్రాసితివి. ఎంతయుగ్గుపాలతోఁ దెలుగునఁ బుట్టియున్నను నిజాం రాష్ట్రమందలి యాంధ్రులభాష అట్లు పాడైనదా లేదా? వేడినీళ్లుగావు. హిందుస్థానీయునున దారాజ్యమున అగ్నిపర్వతమునుండి నిరంతరము బయలువెడలి వచ్చు ద్రవీభూతమగు నయఃపాషాణముల [లావా) వలె నాంధ్రభాషను దగ్ధపటలముగఁ జేయుచునే యున్నది. వందలకొలది యేండ్లనుండి ఆంధ్రభాష ఇట్లు కాలిపోవుచున్నను బూర్తిగ నశింపకుండుటయే వింత. అచ్చటి పరిపాలకులు తురుష్కులు. వారిసంఖ్య యత్యల్పము. అయిననేమి? వారు కోట్లకొలది ధనమును ఖర్చుచేసి 'ఓస్మానియా' యూనివర్సిటీల స్థాపించి ఉర్దూ—హిందుస్థానీ భాషలఁ బ్రోత్సహింతురు. కాని ప్రజలభాషయగు తెనుఁగుపై వారు సవతితల్లిప్రేమనే ఇంతవఱకుఁ జూపించుచున్నారు. ఆర్యావర్తమున 12 కోట్ల 12 లక్షల ప్రజలు మాట్లాడుచున్న హిందుస్థానీయ భాషలపై వ్యతిరేక ప్రచారమును నీవు పిచ్చుకపై బ్రహ్మాస్త్ర మనుచున్నావు. రాకాసిబలముగల ఈభాషపై మన నాయకులిప్పుడు బ్రహ్మాస్త్రములఁ బ్రయోగింపవలయునో లేక త్రిపురసంహారకాలమున నీశ్వరుఁడు ప్రయోగించినట్లు 'మాధవాస్త్రము' నే బ్రయోగించి దక్షిణాపథమును దొంగిచూడకుండ రూపఱునట్లు చేయవలయునో నీవే యోజించుకొనుము.

దక్షిణ భారతదేశమున నాంధ్రభాషకుఁగల యోగ్యతనుగూర్చి యింకను విపులముగఁ జెప్పదలంచియు విస్తరభీతిచేత మిగుల సంక్షేపముగనే జెప్పియుంటిని. నీవు కోరినయెడల నెప్పటికైన నట్లుచేయుదును.

సుహృద్భావముతో నేనీలేఖను వ్రాసితినికాని మన నాయకుల నెంతమాత్రమును నిందింపవలయునని నేనీలేఖ వ్రాసియుండలేదు. కేవల విమర్శనైక దృష్టితోఁ నేనీలేఖను వ్రాసితినని నీవు భావింతువుగాక. శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు తమ యర్థశాస్త్రమునఁ జెప్పుకొనినట్లు—

క. పలికితినె చేదుమాటల?
పలికితినే హితవుకాని ♦ పలుకుల నొకచో
పలికితినిపో గృపనుఁ
దెలియుమియని మనుపరయ్య ♦ ధీరప్రవరుల్.

అని మనదేశీయ నాయకులను బ్రార్థించుచు నింతటితో విరమించుచున్నాను.

# స్వర్గీయ గోనెల రుక్మిణమ్మగారు

అష్టావధాని వడ్డాది సీతారామాంజనేయులుగారు

శ్లో. కార్యేషుదాసీ, కరణేషుమంత్రీ
స్నేహేషుమాతా, శయనేషురంభా
రూపేచలక్ష్మీ, క్షమయాధరిత్రీ
షట్కర్మయుక్తా కులధర్మపత్నీ.

పెద్దలీరీతిగా గృహలక్ష్మీధర్మనిర్ణయము చేసియున్నారు. భారతదేశ మనేక దురవస్థలకుఁబాల్పడి యెంతో ప్రాల్మాలియున్నను నేఁటికినిఁ గొందఱు ధన్యాత్మలు సహధర్మచారిణి, యర్థాంగియను జీవితప్రాశస్త్యమును వహించి యనన్యసాధ్యమహాత్మ్యమునఁ దాము ప్రకాశించుటయేగాక తమపరిసరప్రాంతములను గూడఁ బవిత్రీకరించుచున్నారు. ఇట్టి మహాశక్తి సహజకోమలహృదయముల నుండి వెలువడుటకు వంశోన్నతి, యభ్యాసపటిమ, విచక్షణాదక్షత, శ్రద్ధ, కార్యదీక్ష, జిజ్ఞాస మొదలగు సుగుణపుంజము సహాయకారులు, ప్రాచీనాంధ్ర గృహిణీధర్మమును జీవితమునఁ బ్రత్యంశమునందును బ్రస్ఫుటీకరించిన పవిత్రవ్యక్తి యెవ్వారికి మాననీయము గాదు?

మా మిత్రులగు శ్రీయుత గోనెల నరసింగరావుగారు సహధర్మచారిణిఁ గోల్పోవుట కడుంగడు విచారకరము! ఈమె 1918 సంవత్సరములో విశాఖపట్టణమున జన్మించి తే 6-2-1935 దీని నుదయము 8 గంటలకు గుంటూరు 'ఘోషాఆస్పత్రి'లో స్వర్గస్థురాలయ్యెను. ఈమెతండ్రిగారు పోలీసు శాఖలో నున్నతోద్యోగులగు శ్రీయుత గాదంశెట్టి పాపారావునాయఁడుగారు. ప్రస్తుతమున మా ఖాశింగఁకోట గ్రామవాస్తవ్యులయిన శ్రీయుత గోనెల వేణుగోపాలరావునాయఁడుగారి గాదిలికోడలు.

ఈమెకుఁ బ్రాచీనస్త్రీధర్మములయందు మిక్కిలిమక్కువ. ఈమెకు దైవభక్తియన్న పని 'వెన్నతోఁబెట్టినది.' ఆధునికమహిళామండలి యీమె ధర్మాచరణనిష్ఠాగరిష్ఠత నుండి యెన్నేని గుణపాఠములను గ్రహింపనుత్కృష్టతకలది. పదునేండ్ల బాలప్రాయమున నిట్టి సుగుణపుంజము నలవరచుకొని, యీబాలగోపాలమునకు నానందమోదములను గల్గించుప్రౌఢిమ యీమెకెట్లలవడినదో! ఈమెను దలఁచుకొన్నప్పుడు సకలమనోనయనానందకరమగు లేఁదీవ మనస్స్మృతిపథమున గోచరింపకతప్పదు. చిత్రవిచిత్ర

ములగు చేతిపనులన్న నీమె కభిలాషమెండు. తదభినివేశమున నీమె చిత్రించినపటము లెన్నియో నా మిత్రునిగృహ మలంకరించి చూపరుల కనుక్షణము జాలిపుట్టించు చున్నవి.

పేదసాదులయెడల నీమెకుఁగలయాదరణ, మామె నిర్యాణమునకు రోదించియేడ్చిన బీదల మూఁగకన్నీరే నా కలముకన్న నధిక ముగఁ జెప్పఁగలదు. ఆమెకై నిట్టూర్చిన యాప్తుల హృదయసంఘర్షణ మొక నిదాఘ మైపోయినది.

'రహివుట్ట జంత్రగాత్రముల రాల్గరఁగించు' సంగీతకళయం దీమె మంచి యభ్యాసముచేసియున్నది. ఈమెకుఁగల పతిభక్తి మిక్కిలి కొనియాడఁదగినది. ఈమె విద్యావతియయ్యును ప్రస్తుతకాలపుఁ చపలాక్షుల వలెఁ గాక పూర్వసాధ్వీమణుల పాతివ్రత్య ధర్మమును శ్రద్ధతోఁ బాటించినది. ఈమె తనప్రతిబింబముగా నేడుమాసములపుత్రికను విడిచిపెట్టి మృతినొందెను. పూర్వాచారములయందు మిక్కిలి ప్రియముకలదైనను, ఛాందసత్వములేక గ్రంథపఠనయందాసక్తిగల్గి గృహలక్ష్మి మొదలగు పత్రికలకుఁ జాదాదారుగానుండెడిది.

ఈమె కాత్మశాంతియును, ఈమెభర్తకు మనశ్శాంతియును, ఈయుభయకుటుంబములకు దుఃఖోపశమనమును బ్రసాదించి, పూర్వబాంధవ్యమెడపై పోవకుండునట్లు పరమేశ్వరుఁడు వీరి ననుగ్రహించుఁగాక!

## స్త్రీ ధర్మము

చ. పతిఁ గడవంగ దైవతము • భామల కెందును లేదు ప్రీతుఁడై
పతి గరుణించెనేనిఁ గుల • భామిని భాసురభూషణాంబరా
న్వితధనధాన్యగౌరవము • విశ్రుతసంతతియున్ యశంబు స
ద్గతియును గల్గు నొండుమెయిఁ • గల్గునె యిన్ని తెఱంగు లారయన్.

ఆ. కరము దుఃఖపడినఁ • గానియొక్కింతసౌ, ఖ్యంబు ధర్మగతియుఁ • గలుగ దెందు
జూడు మబల భర్తృ • శుశ్రూషఫలము సం, తతసుఖంబు గలదు • ధర్మవాదవు.

భారతము.

# స్మృతికణములు

గోనెల నరసింగరావుగారు, బి. ఏ.

౧

ప్రణయరుధిరమ్ము గడ్డకట్టినతలమ్ము
చెలిమినెత్తావి నిప్పులు చెఱుగుతావు
వగపుఁగన్నీటిసెల, కట్టు తెగినచోటు
సొంపుపెంపులతుది పయనంపుమేర.

౨

ఇచటనే నాదుసగము మే నింగలమునఁ
గట్టియై కాలిధూళిలో గలిసిపోయె.
తత్ప్రలోచనగళ దశ్రుధారదోఁగి
బురదయైలేఁత పచ్చిక మొలకలెత్తె.

౩

నిన్నుఁ దనపొట్టనిడుకొన్న నిష్ఠురంపు
టామయముతోడఁ బోరాడినాముగాని
వీఁగిపోయితి; మొడలేని ప్రేమమైన
నాకు నిన్నయో దక్కింపలేకపోయె.

౪

ప్రేమసుమము సోయగము గుప్పించినవ్వు
వలపుఁదీయం దనమ్ములు బఱపెఁగాని
నేఁడు ప్రవిమలాశావృంత మూడిపోయెఁ
బాయదీవియోగార్తి యెప్పటికినింక.

౫

నీరవమ్మయ్యె నవమురళీరవమ్ము
లలితకళలెల్ల మృదుచంద్రికలనెడఁగె
సొగసిరాఁజిల్కు చుక్కలసురిగిపోయె
మాయచీఁకటి రవళించి మనసుకొంచె.

౬

దీవెనలు రిత్తమాటలై తీపుసెడెనొ!
మనసుకముఁజూచి కనుగుట్టుకొనుచునిరత
మున్నురనియేడ్చు చుట్టాలయుసురుదగిలి
కరఁగికరఁగి నీఱయినావొ! కలఁగినీవు!!

౭

మొనసిమరణంపు మబ్బుకూర్చినవితాకు
చెదరిపోకున్నె? ప్రణయ వీచికలువీవ
ఈతచుత్రాణములతోడ నేమిమనకు
నీవునాలోన లీనమైనావు కావె.

౮

నీకు నెదపూవు టీరమ్ము నిలిపినాను
విందు నచట నీ నూపురస్పందగీతి
ననుఁగు జిలిబిలిపలుకుల నాలకించి
నాదు కన్నీటిసోన కాన్కలనుగొనుము.

# తా జా మి ఠా య్ !!!

పిల్లల్లారా !!! మీకే !

## కన్నెనోములు

"ఇంద్రకంటి"

తూర్పుబంగిరు కొలనులోనూ
తొందరగ జలకమ్ములాడీ
వచ్చెనదివో మన ఉషోబాల
లేచిరావే చిట్టితల్లీ !

చిట్టిబొట్టూ పెట్టడానికి
నిత్యశృంగారమ్మునకునూ
వెళ్లవా ? మరి ఉషోబాలతో
వేగిరమ్మే కదలిరమ్మా !

లోతులేని లేతమనసుల
పూతబూసిన కన్నెప్రేమల
వింత తియ్యదనాలు మరిగీ
బిడియమేలనె ? వెర్రితల్లీ !

మగనిభాగ్యం కోసమేయే
తగనినోములు నోచమన్నా
నగవుతో తల ఊపి ముందుకు
నడచివత్తువె ! తెనుగుబిడ్డా !

## 'కాన్ ఖుషీ—దిల్ ఖుషీ'

వోనవాబుగారి దర్బారులో వోసంగీత పాటకుడు నారదునిలాంటివాడు——పాడుతున్నాడు. మహా రక్తిగావుంది పాట. మధ్యమధ్య నవాబు 'అచ్చా' 'శేష్' 'షహబాష్' అని మెచ్చుకున్నాడు. మెచ్చుతూవున్నప్పుడల్లా 'శాలుజోడా'లు 'సింహతలాటాలు' 'ముత్యాలపేర్లు' 'ఆఖరకగ్రహారం'కూడా 'బహుమతీ' అంటున్నాడు. అతడట్లంటూవున్నకొద్దీ మన 'గవయ్యా' గొంతు బద్దలయ్యేటట్లు పాడుతున్నాడు. ఇక వానిమనసులో సంతోషంమాట నేను చెప్పవాలా ?! వొక్క పాటకచ్చేరీతోకూడా ప్రొప్రైటరయిపోయినాడన్నమాటేకదా మరి !! సరే అవాలా గుండనీ-పాట--మంగళారతి—పాడేశాడు పాటకుడు. తరవాత చేతిరుమాలుతో చెమట తుడుచుకుంటూ "సర్కారువారి సెలవైతే రేపు సెలవుతీసుకుంటా" నన్నాడు. అనగానే 'సర్కారువారు' మంత్రిగారిని చూచి యీతడికి 'ఖర్చులతోకలిపి నూటపదార్లు' కట్నం విప్పమన్నాడు. పాటకుడు వెలవెలబోయి యేదో 'హుజూర్ వారు చాలా వాగ్దానాలు......' అంటూ పెదవులు చప్పరించాడు. అదివిని 'నవాబు' గారు నవ్వుతూ గడ్డంస్పృశించి "అవా"......అరే దివానా !!! ఆ ముహూర్తంలో నీవు నాకు 'కాన్ ఖుషీ' (శ్రవణానందం) చేశావు. నేనుకూడా 'తారీఫ్' చెప్పి నీకు 'దిల్ ఖుషీ' (చిత్తానందం) కలిగించానుబే' అన్నాడు. 'గవయ్యా' గాభరాపడ్డాడు. దివాన్ జీ దిక్కులుచూశాడు. నవాబ్ సాహెబ్ లోపటికెళ్లిపోయాడు.

దానుతు.

## "ఇద్దరు దయగల బిడ్డలు"

రాధ, రాము అన్నచెల్లెళ్లు రాముకు ఎనిమిదేండ్లు, రాధకు ఆరేండ్లు. వారిద్దరు ఎప్పుడు జట్టుగ బడికి పోతుండేవారు. తల్లిదండ్రిచెప్పినట్లు వింటూ వారికెంతో సహాయముగా నుండేవారు. తోటకు నీరుపారించుట, గడ్డిపీకివేయుట బజారుకుపోయి కావలసిన సామాను తెచ్చుట యిటువంటి చిన్న చిన్న పనులన్నియు చేయుచుండిరి.

ఒకనాడు వారుండేవూరికి మంచి సర్కస్ వస్తుందని విని, రాధ, రాము చాలా సంబర పడుచుండిరి. ఇద్దరు తల్లిదగ్గరకుపోయి "అమ్మా ఈవూరికి పెద్ద సర్కస్ వస్తుందట, అప్పుడు మమ్మల్ను పంపించవూ" అని అడిగారు. "నాబిడ్డలారా అట్లనే పంపిస్తాను అయితే మీ టిక్కట్ డబ్బు మీరే సంపాదించుకోవలెను. మీరు నాకేపని చేస్తే ఆ పనికి ఒకకాని చొప్పున యిస్తాను యిద్దరికి. తోటపనైనా సరే యింటిపనైనా సరే. ఇంకా సర్కస్ రావటానికి రెండువారాలుంది కదా. ఈ లోపల మీదుడ్డు సంపాదించుకొనండి." అని చెప్పింది. అల్లాగే వారిద్దరు తల్లి, తండ్రి చెప్పిన పనులుచేసి టిక్కట్టుకు సరిపోయేంత డబ్బు చేర్చారు. అర్ధరూపాయ ఒకొక్క టిక్కట్. ఇంకొకదినమేవుంది సర్కస్ ప్రారంభించుటకు. ఊర్లోకి, ఏనుగులు, పులులు, ఎలుగుబంట్లు, కోతులు, బోనులలో లాక్కొరావటంచూచి, పిల్లలందరు, ఒకటే గంతులు, అరుపులు మొదలు పెట్టారు.

రాధను, రామును, వారితల్లి యిదివరకు వారితోటపని చేసిన ముసలివాడు వీరన్నకు కొన్ని గుడ్డలు తీసుకొనిపోయి యిమ్మని పంపించినది. వీరన్న చాలామంచి విశ్వాసము గల మనిషి; వీరింట్లో చాలాకాలము పనిచేసి యిప్పుడు ముసలివాడయినందుకు పనిచేయలేక మానుకున్నాడు. వానికి ఆయింటి యజమానురాలు అప్పుడప్పుడు పాతబట్టలు, అవి ఏదైనా యిచ్చి పంపించుట వాడుక. అనాడు వారవి తీసుకొని వీరన్నయింటికి పోయిరి. వానిగుడిసెలో ఒకమూల చాప వేసుకొని వీరన్న విచారపడుచు కూర్చునియుండెను. ఈ పిల్లలు గుడ్డలు వానికిచ్చి "ఏమి వీరన్నా అలాకూర్చున్నావు నీకేమి కష్టి?"మని అడిగారు. "నాకు కళ్లు బాగా కనబడవు బాబూ, మహానుభావుడు ఒకాయన కంటద్దాల జోడిచ్చారు. అవి వేసుకుంటే సుమారుగా కనపడేది. అదికూడా విరిగిపోయినది. బయట ఎక్కడికి పోలేక కూర్చున్నాను. ఏదో నాకు వచ్చినమటుక్కు పుస్తకం ఏదైనా చదువుకుందామన్నా సరిగా కనబడదు. బాబూ అమ్మగారి దయవలన ఈగుడ్డలు కట్టుకుంటున్నాను; లేకుంటే ఈ చలిబాధకు తట్టుకోలేకపోదును." అన్నాడు "ఆ కంటద్దాలు ఎందుకు బాగు చేయించుకోకూడదు?"అని అడిగారు పిల్లలు.

నాకు నాకొడుకు పంపించేదుడ్డు నాతిండికి సరిపోతుంది. అది బాగుచేయించను డబ్బు లేదు. మెల్లిగా కూడబెట్టుకొని బాగుచేయించుకోవాలి బాబూ" అన్నాడు

రాధ, రాము ఒకరిమొఖ మొకరు చూచుకున్నారు. బయటికి వెళ్లారు. "రాధా, మనం టిక్కటుకు చేర్చిన డబ్బు వీనికిస్తే కంటద్దాలు బాగుచేయించుకుంటాడు పాపం. వానిని చూస్తే జాలివేస్తోంది. ఎక్కడికిపోలేడు.మనం యింకెప్పుడయినా సర్కస్ చూడవచ్చును. ఏమంటావు?" అన్నాడు రాము. "సరే అన్నయ్యా పాపం వానికిస్తాములేమనకొద్దు" అనింది రాధ జాలివేస్తున్న కండ్లతో.

రాము మళ్లీ గుడిసెలోకిపోయి వీరన్న ప్రక్కనవున్న విరిగిన కంటద్దాలు తీసుకొని మెల్లగా వచ్చాడు. ఇద్దరు కలసి అద్దాలు వేసే చోటికి వెళ్లారు. అంగడివానిని ఈ అద్దాలు బాగుచేయటానికెంతవుతుందని అడిగారు. ఒకరూపాయి అవుతుందని చెప్పాడు. పిల్లలు సంతోషపడి తమదగ్గర వుండేది రూపాయే నని తెలిసి, అది బాగు చేసి యిమ్మన్నారు. కొంతసేపటికల్లా దానిని బాగుచేసి యిచ్చాడు. అదితీసుకునిపోయి వీరన్నకిచ్చి "ఇదో వీరన్నా నీఅద్దాలు. మేము దానిని బాగుచేయించాము. ఇకమీద నీవు ఎక్కడికైనా తిరుగవచ్చును. చదువుకో వచ్చును" అని చెప్పారు.

అదిచూచి వీరన్న చాలాసంతోషపడి "మీరు చాలా మంచిబిడ్డలు. మీకేమి చేయగలను ప్రత్యుపకార"మని కొంచెం ఆలోచించి "ఇదుగోచూడండీ ఈవూరికి సర్కస్ వచ్చిందే దానికి మీకు పోవుటకిష్టమైన, నేనొక్కజాబు వ్రాసియిస్తాను. అది తీసుకొని ఆ సర్కస్‌లోనే నాకొడుకు చేరి వున్నాడు. వాడే ప్రధాన హాస్యగాడు. వానికి ఈజాబు యిస్తే మీకు 'ఫ్రీసీట్సు' దొరుకుతాయి"అని ఒకజాబువ్రాసి యిచ్చాడు. ఆ పిల్లలు అపరిమితానందముతో దానిని తీసుకొని యింటికివెళ్లారు.

ఈసంగతంతా తల్లితో చెప్పారు. తల్లి తనబిడ్డలుచేసిన పని విని, మురిసిపోయింది.

మర్నాడు సాయంకాలం అయిదుగంటలకు, రాము రాధ, సర్కస్ చూడను బయల్దేరి పోయారు. సర్కస్ గేటుదగ్గర ఒకమనిషి టిక్కట్టు అడిగాడు. ఈ పిల్లలు జాబు చూపించి, (హెడ్‌క్లవున్) ఎక్కడున్నాడు? అతనికి మేము జాబుతెచ్చాము అన్నారు. అతను అక్కడున్న ఒకగుడారము చూపించి అందులో వున్నాడు పొమ్మని చెప్పాడు. వారక్కడికిపోయి జాబు అతనికిచ్చారు. ఆ క్లవున్ జాబుచూచి తన ప్రియమైన తండ్రి వ్రాసినట్లు తెలిసి చాలా సంతోషించాడు.

ఇద్దరు దయగల బిడ్డలకు 'ఫ్రీసీట్సు' యిప్పించమని వ్రాసియుండెను. ఆ 'క్లవున్' సంతోషముతో వారిద్దరిని తీసుకొనిపోయి ముందరబల్లమీద కూర్చుండపెట్టెను. ప్రారంభించుటకు గంటకొట్టగానే హాస్యగాడు లోపలికి పోయి.యింకా చాలామంది హాస్యగాళ్లతో వచ్చి హాస్యం చేసాడు.

అందరు కడుపుబ్బేటట్లునవ్వారు, సర్కస్ అంతా చూచి హాస్యగానిదగ్గరకు పోయారు సెలవు తీసుకోటానికి. "ఏమి పిల్లలారా ఎట్లా వుంది సర్కస్?"అని అడిగాడు. "చాలా సంతోషించాము. ఎంతో బాగుంది. నిన్నెప్పుడు మేము మఱువము" అన్నారు. అతను వారిద్దరిని ముద్దుపెట్టుకొని యింటికి నెమ్మదిగా పొమ్మని చెప్పాడు. ఇంటికివెళ్లారు. బహు సరదాగా తల్లి దండ్రితో అంతా చెప్పారు. "బిడ్డలారా చూచితిరా దయగలిగినవారికి దేవుడే దారిచూపుతాడు. అది మఱువకుడీ" అని తల్లిచెప్పింది.

నెమిలి చంద్రమతి.

# కళలు

## ప్రేమప్రణాళిక.

**Must a woman be beautiful to be loved?**

**లక్ష్మీనారాయణ పాణిగ్రాహి.**

ఫ్రాంసుదేశమునకు ముఖ్యపట్టణమును, పాశ్చాత్య నాగరికతకు ఉనికిపట్టునగు పేరిస్‌నగరమందు (Paris is known for fashions) వెలువడు "రెవ్యూడిలా-ఫేమ్" (Revue de la famme) యను సంచిక, స్త్రీల నిత్యజీవనమునకు, ప్రేమింపబడుటకు సౌందర్యమే ముఖ్యకారణమాయని ప్రకటించుచు, పార్లమెంటుసభ్యుల గవర్నమెంటు కార్య నిర్వాహకవర్గ సంఘసభ్యుల, విశ్వకళా పరిషత్ వారియొక్కయు సుప్రసిద్ధ న్యాయవాదుల, గ్రంథకర్తల, కళాపోషకుల, శిల్పి పనివాండ్రయొక్కయు, వివిధవిదుషీమణుల కుట్టుపనివాండ్ర తదితరులయొక్క అభిప్రాయములను గైకొని యీక్రింద పొందుపఱచిన ప్రేమసూత్రమును (A love formula) తేల్చియున్నది. ఈప్రణయప్రణాళికయందు సౌందర్యమునకెక్కువ తావులేదు. పదిన్నారువత్సరముల వయసుగల (Sweet sixteen summers) వనితయందునే యిది అగ్రస్థానము వహించుచున్నది. వయస్సు ఎక్కువైనకొలదిని గుణములు మార్పుజెందుచుండుట గమనీయాంశమై యున్నది. "గృహలక్ష్మి" పాఠకులు దీనిని గ్రహింతురుగాక. పురుషుల విషయమందుకూడ నిట్టి లెక్కొకటి తయారుజేయబడుచున్నది. ఇది నూటికి యిన్ని భాగములు (Percentage) యని చెప్పబడియున్నది.

| | సం॥ వయస్సు | 16 | 20 | 25 | 30 | 40 | 50 |
|---|---|---|---|---|---|---|---|
| Beauty | (సౌందర్యము) | 80% | 70 | 60 | 50 | 30 | 10 |
| Physical Coquetry | (మాయవలపు చేష్టలు) | — | 10 | 10 | 10 | 10 | 10 |
| Mental Coquetry | (మాటవలపు మాటలు) | 20 | 20 | 15 | 15 | 10 | 10 |
| Intelligence | (తెలివితేటలు) | — | — | 15 | 15 | 25 | 40 |
| Generosity | (ఔదార్యము) | — | — | — | 10 | 25 | 40 |

## హార్మోనియం

ఆంధ్రదేశంలోనే కాదరవదేశంలోకూడా యీపెట్టె చాలా యిళ్లలో వినబడుతుంది. ఇది పిల్లలపాటకు చేసే సహాయం 'సవతితల్లి ప్రేమ'. ఎంతనికృష్ణంవైన్దైనా ఆడపిల్లకుతుక మృదువుగానే వుంటుంది. దానియందు జీవకళ హెచ్చు. పాడేటప్పుడు బిడ్డ ఆపెట్టెకంటే పెద్దగా పాడాలని ప్రయత్నిస్తుంది. ఆప్రయత్నం స్వభావసిద్ధం. లేకుంటే పాడినదేదో వినబడదుగదా మరి. అందుచేత శక్తికిమించిపోయిన 'కేకలు' పెడుతుంది. ఈలా కేకవేయగా వేయగా ఆగొంతుకలో వున్న మార్దవం కాస్తాచచ్చి గొంతుకమోటు బారిపోతుంది. ఇదిలావుండగా పిల్ల జన్మతః గట్టిపిండంవైతే సరేసరి. లేకుంటే మాత్రం వూపిరితిత్తులకుదెబ్బ!! పిల్లారిని చేయబోతే కోతైనదన్నట్లు సంగీతం నేర్చుకోబోయి గుండెజబ్బు తెచ్చుకున్న వాళ్ల నెందర్నో చూశాను. కాబట్టి యీ హార్మోనియం శ్రుతి కో సలాంపెట్టి తంబురశ్రుతి కలవాటు చేయించడంవే కర్తవ్యం.

తంబుర యెంత తక్కువదియైనా దానినాదం మాత్రం జీవనాదంవే. వొకజీవనాదం వేఱొక జీవనాదంతో మిలాయించినప్పుడు మాత్రంవే శ్రవణసుఖం; మరోలాగైతే చెవిలో జోరీగలమోత తప్ప సుఖం కలగదు సరేకదా మీాదు మిక్కిలి చిత్తసంక్షోభంకూడా కలుగుతుంది. ఇట్టి చిత్తసంక్షోభంవల్ల ఆకలిచచ్చి యారోగ్యంకూడా చెడుతుంది. నాకే కారణంచేతనైనా చిత్తవైకల్యం కలిగితే తంబూరా శ్రుతిచేసి మీాటుకుంటూ కూచుంటాను! పాడను. ఆతంబూరా నాదంలో ఆమహిమ వుందోలేదో పరీక్షచేసి మరీ చెప్పండి గాని వూరికే చెప్పవద్దు. నాదసుఖం మరిగినవాళ్లీమాట కాదనరు. తంబురకంటే వీణ మరీనీ!! హృదయంలోనున్న కంటికి కనబడని సూక్ష్మనాడీకూటమును కదిలించగలశక్తి

యీవీణానాదంలో తప్ప మరోదాన్లో లేదు. 'ఆనందరసోత్ప
త్తికి వీణానాదశ్రవణంవేఁ మొదటిసాధనం.' పెద్దలన్నారు.
మీరు నమ్మండనికాదు. మీరు చేసిచూడండి.

కవిత

భ్రమరఖేదము

గీ॥ హా! మహాబలుఁడెంత యన్యాయకృత్య
మునకుఁబాల్పడె నక్కటా కనలిద్రోహి

♦ ♦ ♦

ఆగమనిశాజనిత వియోగానలంబు
భారమధికంబునగుట మత్ప్రసవకాంత,
సుందరాస్యంబు ముద్దాడుచుండుసంత
దర్పమంతయు వెన్నంట దాంభికముగఁ
బ్రబల ఝుంఝూనిలాకృతిన్ వచ్చిద్రోహి
నన్నుద్రోచియు, మరల మత్సన్నుతాంగి
యబల లతిసుకుమార లం చనక వాఁడు
పట్టిలాగెను జవమునన్ పాపియగుచు.

హా! ప్రియా నీవు యెదనెంత యడలినావా!
నీచుఁడగు పవనుండు నిన్నీడ్చునపుడు
కర్మబద్ధుఁడనై గతిఁ గానరాక
రెక్కలన్ గోలుపోయి యీఫక్కిధరణిఁ
బడియు నినుగాంచుభాగ్యమ్ము బడయఁగోరి
యెగిరితినిగాని నాదేవి! యెగురలేక
యిట్లువ్యర్థుఁడనై యుంటి నింకముందు
వలపుఁజిలికెడు కులుకుఁలంగులుకు నీదు
సుందరాస్యావలోకన మొందకున్న
నిలచునే జీవముల్మనఁ దలిరుఁబోఁడి!

# ప్రణయవృష్టి

౧

ఈవానలో నిలువగలనా
ఏమైన ఈధారలో దడియగలనా
ప్రణయగర్జన కోర్వగలనా
పైపైనివచ్చు తళుక్కుల జూడగలనా ?

౨

నిర్జితం బొనరింపగలనా
నియమాది నీతులన్నియు నిల్పగలనా
పిడుగుదెబ్బల కోర్వగలనా
జీవంబు అడిగినా: తడిసి మనగలనా ?

౩

దారితెలియక దాటగలనా
చూపులో ధారలంబడి తేలగలనా
గనులలోనే గలియగలనా
ప్రేమసం పదలలోనే నడపగలనా ?

౪

హృదయంబులో నుండగలనా
ప్రణయాభి సదనంబులో నాడగలనా
ఆనందముం బొందగలనా
ప్రేమసం ధానంబులో దాళగలనా ?

౫

సంచితార్థము మానగలనా
శృతి మేళగించి గానము సేయగలనా
గానమ్ములో గఱుగగలనా
మూర్తుల ధ్యానించి ముక్తి గనగలనా ?

౬

ప్రణయవాహిని బోవగలనా
సుడులలో తెప్పమెల్లగ నడ్పగలనా
గట్టిగాకూర్చుండగలనా
నాకులో గలవియోగము నెట్టగలనా ?

బూరాడ గున్నేశ్వరరావు.

# లోకంపోకడ

## 84 గురు రాణుల కేకముహూర్తవిరహవేదన

తూర్పు అరేబియాలో అల్కాట్టర్ అనే రాజ్యమున్నది. ఆ దేశపు రాజును షేకు అంటారు. ప్రస్తుతపు షేకుపేరు అబ్దుల్లా బెజ్ జాసిమ్. ఆదేశపు సముద్రతీరమున మంచి ముత్యములు దొరకును. వేలకొలది నీగ్రో బానిసలు సముద్రతీరమున పాటుపడి ముత్యములను సేకరించి అతని భవనములలో చేరుస్తారు. ఆ అమూల్యములైన ముత్యములను ప్రపంచములో దశదిశలనున్న దేశాధీశులతనయలు రాణులు ప్రియురాండ్రు, శ్రీమంతసీమంతినీమణులు, బాలబాలికలు కొనుక్కొని కంఠాభరణములలోను శిరోభూషణములలోను పొదుపుకొని ధరించి తళతళ మెఱుస్తూ వుంటారు. కిరీటమాంధాతలు సార్వభౌములు రాజులు మొదలైన వారెందరో వానిని తమ మకుటములయందు ధరిస్తారు. ఇట్టి ఆ పరిపాలకుని సంపదలకు భోగములకు ఇంత అంతయని హద్దు చెప్పలేము. అట్టి రాజులనుగూర్చి మనము కథల పుస్తకాలలో చదివివుంటామేమో కాని ప్రత్యక్షముగా చూచివుండము. అతను మనజార్జిసార్వభౌమునికి బ్రిటిషు సామ్రాజ్యమునకు ప్రియతమమైనమిత్రుడు. అతను కొంచెముకాలములోజరుగనున్న మన సార్వభౌమునిరజతోత్సవ సందర్భమున లండనుకు వెళ్లి అతనిని దర్శింపనున్నాడు. అప్పుడెటువంటి కానుకలర్పింపఁగలడో యెవ్వరూహింపఁగలరు!

అయితే అతను లండను వెళ్లుతున్నాడంటే రాజనగరు అంతా చింతాక్రాంతము కాకమానదు. ఒకరాయిద్దరా ఎనభైనలుగురు పట్టమహిషులు విరహవేదనాపీడితులు కానున్నారు. ఆదేశములో బైరము అను ఒక మహమ్మదీయపండుగ ఏటా జరుగుతుంది. ప్రతీపండుగకు ప్రతీతాబేదారు అతనికొక దివ్యసుందరమైనకన్యను కానుకగా అర్పించవాలి. వీరందరూ రాజాంతఃపురము దాటి పైనియేమున్నదో యెన్నడును చూచి యెఱుగరు. తమ ప్రియతముని మొగము తప్ప వేఱొకపురుషుని మొగము వారి కన్నుల కెన్నడును కనిపించదు. భీషణ కఠోరదృష్టులగు కొజ్జాలుమాత్రము ఆయుధపాణులై వారికి కావలా యిచ్చుచుందురు. ఈ కావలాలో వారహోరాత్రములు కాలక్షేపము చేయుచుందురు. రాజుగారు నగరమువిడచి పైకివెళ్లుటయే అరుదు. చక్రవర్తిజూబిలీధర్మమంటూ అతనికి ఈ సుందరీ చక్రముయొక్క రాసక్రీడలనుండి యెడబాటు కలుగనున్నది. అతనెక్కడకు పోయి

నను అతనిదృష్టి వీరి సంరక్షణము మీదనే యుండును. అతనూర లేనప్పుడు కొజ్జాల కాపలాభారము మరీ కఠోరమవుతుంది. కొజ్జాలందరికి ఇప్పటినుంచే మరీకఠినమైన ఆజ్ఞలను నిచ్చుచున్నాడని 'వీపిలు' పత్రిక వ్రాయుచున్నది.

తాంబేలు బహుమానము

సార్వభౌమునికి జూబిలీసందర్భమున ఇట్టి అమూల్యాభరణములేకాక ఒక తాంబేలు కూడా మరియొకరాణీగారిచేత బహూకరింపబడనున్నది. ఈమె టోంగాదేశ పరిపాలకి. ఈ తాంబేలు వయస్సు ఇప్పటికి మూడువందలసంవత్సరాలకు పైగా వుంటుంది. ఇది చాలా చారిత్రకప్రసిద్ధమైనతాంబేలుకూడాను. ఇది మొట్టమొదటిలో కేప్టను కుక్కుగారిది. 1774 లో కుక్కుగారు సముద్రయాత్ర చేస్తూ చేస్తూ పడవలో ఆహారపదార్థములు నిండుకోవడంవల్ల పసిఫిక్కు మహాసముద్రతీరమున నున్న టోంగా దీవులలో చేరుకున్నారు. అక్కడి ప్రజలు అతని కత్యభిమానపూర్వకమైన స్నేహస్వాగతమిచ్చినారు ఈ కారణముచేత ఆ దీవుల కతను స్నేహద్వీపములు లేక ఫ్రెండ్లీఅయిల్సుఅని నామకరణ మొనర్చినాడు. వారియెడల తనకుగల స్నేహమునకు సూచకముగా అతను వారి దేశాధీశుడైన ట్యూబనుగారికి ఈ తాంబేలును కానుకగా యిచ్చినాడు. అప్పటికే దాని వయస్సు 160 యేళ్లు. అప్పటినుంచి ఈ తాంబేలు ఆ వంశస్థులచే సాకబడుచున్నది. ఆదీవుల నిప్పుడు స్లోటూరాణి పాలించుచున్నది. ఈమె అతనివంశీయురాలే.

రాణీగారప్పుడే తాంబేలుతో సహా స్టీమరెక్కి ఇంగ్లాండుపయనమైనట్లు సండేఎక్సుప్రెసు పత్రిక వ్రాయుచున్నది.

సినీమాలకు వెళ్లు కొందరు మహనీయులు

సినీమాలకు వెళ్లే పురుషులలో తెరమీద వుండే బొమ్మలనుకంటె తెరయివతలవుండే నిజమైన స్త్రీ విగ్రహములను చూచి ఆనందించ గోరేవారే యెక్కువగా వుండడం అన్ని నాగరికదేశాలలోను మామూలుగానే వున్నట్లుంది. మనదేశంలో సాధారణంగా ఎవరో విద్యార్థులు, రౌడీలు, కొంటెపిల్లకాయలు మాత్రమే అల్లాటిపనులు చేస్తారు గాని జ్ఞానమువచ్చినటువంటిన్నీ, వయస్సు మీరినటువంటిన్నీ, పిల్లలతండ్రులైనటువంటిన్నీ పెద్దవాళ్లల్లాంటిపనులుచేయరు. కొంటెవాళ్లైనా యేవో నాలుగుమాటలతో విరమిస్తారు కాని అంతకంటె యెక్కువపెంకితనానికి దిగరు.

కాని లండనుపట్టణము వెస్టుఎండుకినీమాలకు వెళ్లే గొప్పవారిలో యాభై అరవైయేసియేళ్ల వాళ్లలోనే యిట్టిపనులయందు దారితేరినవాళ్లుంటున్నారు. వారు సినీమాహాలులోనే కాక హాలువిడచి పైకి వచ్చుచున్న ప్పుడురోడ్డుమీదకూడ సుందరులను వెన్నాడి అల్లరిచేస్తూ వుంటారు. పాప మా స్త్రీలు కేకలువేస్తే యేమి అల్లరి జరుగుతుందో అని మెల్లిగా సర్దుకొని నోరుమూసుకొనివచ్చేస్తారు. ఇందువల్ల వీరిధైర్యం మరీయెక్కువ అయి మరీ ఆగడంచేయుటయు కలదు. ఈ అల్లర లెక్కువైతే ఆడవాళ్లు సినీమాలకు

రావడం మానేస్తే తమ రాబడు లెక్కడ తగ్గిపోతాయోఅని కంపెనీలమేనేజర్లంతా బెంగ పెట్టుకున్నారు.

ఇటువంటి అల్లరలు అమెరికాలో మరీ విపరీతంగా వుంటాయిట. ఈ సంగతులు ప్రభుత్వమువారినోటీసుదాకా వెళ్లినవి. ఇట్టి వారిని వెంటనే శిక్షించుటకు అక్కడ చట్టము ప్యాసుచేయఁబడినది. కనుక యీ గోల కొంతతగ్గినది. కాని ఇంగ్లాండులో ఇట్టి వారిని శిక్షించుటకు చట్టములేదు. పడుచు పిల్లలని తాకి యీడ్చుకొనిపోతున్న వాళ్లని మాత్రమే శిక్షించుటకు చట్టమున్నది. జ్ఞానము వచ్చినవాళ్లతో సారసలాడి-పైపై అల్లరిచేసేవాళ్లని యేమిచేయుటకును వీలు లేదు. సినీమా హాలులోనే యెవడైనా యిట్టి అల్లరి ప్రారంభిస్తే మేనేజర్లు వచ్చి వారిని తరిమేసి యింకెప్పుడు తమ సినీమాలలోకి వారిని రాకుండా యేర్పాటుచేసుకోవచ్చును. కాని పైని జరిగేఅల్లరికి వీరేమీచేయ లేరు. ప్రస్తుతం మేనేజర్లంతాకలిసి ఒక సభచేసి ఆలోచిస్తున్నారు. అమెరికాలో లాగే అక్కడకూడా ఒకచట్టమును ప్యాసు చేసి యిటువంటివారి నెప్పటికప్పుడు శిక్షించే టట్లు చేయవలసినదని వారు పార్లమెంటును కోరుతారు.

ఇటువంటి నేరాలన్నీ పురుషుల నెత్తిపై నే పెట్టి రుద్దడానికి వీలులేదు. స్త్రీలలోకూడా వీరినిమించిన మహనీయలుంటున్నారు. లండనులో ఒక సినీమా థియేటరుకు ఒక పెద్ద మనిషి వెళ్లెను. సేవకుని దుస్తులలో ఒకడు వచ్చి మర్యాదగా అతనిని గేటుదగ్గరే కలుసుకొని అనుకూలమైన స్థానమును చూపించినాడు. హాలుకు ఒకమూలను, ఒక్కసుందరి తప్ప యితరు లెవ్వరును సమీపములోనేరు. ఆమె అతనితో ఏవో సంగతులు సవ్వాతాలు ప్రస్తావన ప్రారంభించింది. అందులో మరే మీావిపరీతములేకపోవుటచేత ఇద్దరూ కులాసాగా మాట్లాడుకొనిరి. ఆట తరువాత పైకివచ్చేసేసమయంలో ఆమె అతనిని నిందిస్తూ కేకలువేయడం ప్రారంభించింది. తనను చూచి తుచ్ఛపుమాటలాడి బలాత్కరించుచున్నాడని మొట్టమొదట అతనిని కలిసి అక్కడ కూర్చోపెట్టిన సేవకునిపిలచి ఫిర్యాదు చేసింది. వాడుకూడా కొంత బెదిరించి అతని పేరు విలాసము తీసుకొని పోలీసుకు ఫిర్యాదు చేస్తానన్నాడు. ఈ సమయంలో మరియొక అమాయకుడైతే వారిద్దరికీ కోరుకున్నది ముట్టచెప్పి మర్యాదగా తప్పుకొనివచ్చేసి యుండును. కాని అతనుపెద్దమనిషి, కోర్టులోనైనా తన మర్యాదా ధృవపరచుకొన గల ప్రసిద్ధుడు కావడముచేత వీరిని లక్ష్యము చేయకుండా వచ్చేశాడు. ఇక తనపప్పు మరి ఉడకదని నిశ్చయించుకొని ఆమె మెల్లిగా జారిపోయింది. అమాయకు లెందరిదగ్గరో యిటువంటి మాయకత్తె లెందరో యీ విధంగా సినీమాపన్ను వసూలుచేసుకుంటున్నట్లు 'జానుబులు' అనే పత్రిక వ్రాయుచున్నది. మనచెన్నపట్నం సినీమాలు ఇంకా ఇంతవరకు ముదరనందుకు మనము సంతోషించవలసినదే!

# గ్రంథపరిచయము

**మాధురి** తెనాలినుండి శ్రీయుత మానూరి రమణారావుగారి సంపాదకత్వమున వెలువడు మాసపత్రిక సంవత్సరమునకు చందా రూ. 0-11-0 లు మనోహరసాంఘిక కథలు, ఖండ కావ్యములు ప్రకటింపఁబడుచుండును.

---

**గోల్కొండ కవుల సంచిక** సంపాదకుడు శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డిగారు బి.ఏ., బి.యల్., గోల్కొండ పత్రికాప్రకాశకులు, హైదరాబాదు దక్కన్, ఇందు పీఠికలో ఆత్మకూరు సంస్థానము చరిత్రయు, నైజామ్‌లో ఆంధ్రోద్యమ చరిత్రయు ప్రకాశకులు క్లుప్తముగ తెలియచేసియున్నవారు. ఇక కవితా భాగము 320 పుటలు 352 కవులు వ్రాసిన 354 పద్యకావ్యము లిందు 'నవరసభావాలంకృత కవితా' మాధుర్యమును చిందుచున్నవి. చిత్రకవిత్వములా, కథలా, ప్రబోధములా, మహాపురుష ప్రశంసలా, శృంగారపు పట్టులా ఏభాగమున కాభాగము క్రొంగ్రొత్త చవులూరుచుండును. మహాప్రయత్నము మీద నిట్టి రచనల సేకరించి, ప్రకటించి హైదరాబాదు రాష్ట్రమున నెటువంటి విద్వన్మణులు కవిరత్నములు గలరో అఖిలాంధ్రలోకమునకు చాటిన ప్రకాశకు లెంతయు ప్రశంసార్హులు. అందందు చేర్పఁబడిన కొందరు కవీంద్రుల చిత్రములు సంచిక సౌందర్యము నినుమడింపఁ జేయుచున్నవి. వెల రు. 2-0-0 లు.

---

**వివేకానంద** క్రౌను సైజు 55 పుటలు గ్రంథకర్త శ్రీయుత కర్లపాలెం కృష్ణారావుగారు, చీరాల "సాహిత్యలత" యందలి ప్రథమకుసుమము. వెల రు. 0-12-0 లు, చందాదారులకు రు. 0 8 0 లు. సుప్రసిద్ధయోగియగు వివేకానంద స్వామివారి జీవితము 9 రంగములలో చిన్న నాటికగ వ్రాయఁబడినది. స్వామివారి జీవిత రహస్యమును ఆత్మ సాక్షాత్కారమును నిందు సుందరముగ చిత్రింపఁబడినవి.

---

**స్వప్నకథ** క్రౌను సైజు 50 పుటలు గ్రంథకర్త శ్రీయుత జి. బూషువా కవిగారు, వినుకొండ గుంటూరుజిల్లా. వెల రు. 0-12-0 లు. త్యాగియు, సుప్రసిద్ధదేశికుడును నగు శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారి సుతయు, ఉత్తమజీవనుడగు శ్రీ సింగరాజు పుల్లపరాజారావుగారి ప్రథమ కళత్రమును, అల్పజీవియయ్యు కీర్తిశేషురాలైన శ్రీమతి సింగరాజు లక్ష్మీకళావతిదేవిగారి కంకితము—ప్రథమాశ్వాస మొక 'స్వప్నకథ.' ద్వితీయాశ్వాసము 'అనాథ.' రెండును దరిద్రవనితల యితివృత్తములు. దరిద్రజీవనము నందంతర్భూతములైయున్న సౌందర్యములో తనలేఖిని ముంచి కరుణారసచ్ఛాయలను కవీంద్రుడు చిత్రించినాడు. మొదటికథలోని అవ్వ స్వప్నతుల్యమైన మాయా ప్రపంచమున ధన్యజీవనమును నెఱపి మరణించి యదార్థ రచితమైన స్వప్నప్రపంచమున చంద్రమండల నివాసియై అనన్యసాధ్యదృష్టి గల కవిపుంగవులకు మాత్రము దర్శన మిచ్చుచున్నది. రెండవకథలో ఆర్తయగు అస్పృశ్య మహిళకు అగ్రకుల భూషణమగు అంగన ఆదరమిచ్చుటతో భూదేవి కడుపుచల్లబడి సస్యశ్యామలయై పులకరించుచున్న విధము గోచరించుచున్నది. కవిగారి కవితాసౌందర్యము నవీనాంధ్ర సాహిత్యమునకు క్రొత్త క్రొత్త రుచులను నడకలను

గఱపుచు మెఱపించుచున్న విధము వారి ఫిరదౌసి మొదలగు కావ్యములను పఠించినవారికి విదితము. విద్యా సంస్థలును విద్వత్ప్రభువులును గూడ వారి రచనలకు యథోచిత గౌరవము నిచ్చి వారి ప్రోత్సహింతురు గాక!

---

**సర్వేశ్వర శతకము**

డెమ్మీ సైజు 15 పుటలు, ఉచితము—గ్రంథకర్త భారతగర్భ రామాయణమును వ్రాసిన కవితాకోవిద శ్రీయుత రావిపాటి లక్ష్మీనారాయణగారు, నరసారావుపేట, గుంటూరుజిల్లా. వైరాగ్యము, వృక్షములు, పురుగులు, జ్ఞానము కాలము మొదలగు వానినిగూర్చి కలిగిన అనేక మహాభావములు శ్రీ సర్వేశ్వరునికి 100 పద్యములలో శార్దూలమత్తేభవిక్రీడితములలో నివేదింపఁబడినవి. ప్రకృతి కీర్తనముద్వారా భగవత్కీర్తనము సలుపు ఒకక్రొత్త భక్తి ఇందు త్రొక్కఁబడినది.

---

**ప్రకృతి ఆరోగ్య వైద్యము**

క్రౌను సైజు 192 పుటలు. గ్రంథకర్త శ్రీయుత విదౌండా సాహేబుగారు, కలికిరిపోస్టు. చిత్తూరుజిల్లా వెల రు. 0-10-0

మానవులకు సంబంధించు అనేకరకముల రోగములు, వాని లక్షణములు, వానివలన గలుగు బాధలు, వానికి చికిత్సలు ఇందు తెలుపఁబడినవి. మిగుల అనుభవముతోగూడిన యోగ్యగ్రంథమువలె నుండును. మందులు రోగనివారకములే కావనియు పథ్యము, వ్యాయామము, అల్పాహారము, లంఘనము మొదలగు సాధనములవలన కుదరని రోగములు లేవనియు పాఠకులకు తెలియఁగలదు. ఎట్టిరోగి కెట్టి యవస్థలో ఎట్టి సాధన మవసరమో తెలుపఁబడినది. ప్రతిసంసారి యింటను ఒకగ్రంథ ముండఁదగినది.

---

**భగవద్గీతా సంగ్రహము**

రాయలు సైజు 170 పుటలు. వెల రు. 0-3-0 గ్రంథకర్త్రి శ్రీమతి మంచిరాజు సీతమాంబగారు, అప్పికట్ల, గుంటూరుజిల్లా. భగవద్గీత 18 అధ్యాయాలు సీసమాలికలుగా తెలిగించినారు. స్త్రీజనంబులు పాటవలె పాడుకుని గీతాజ్ఞానమునుబడసి మోక్షసిద్ధిని బడయవచ్చును. కవిత్వము మసపాకము. సులభమై విడువనొల్లకుండును.

---

**హరిజనుడు**

క్రౌను సైజు 28 పుటలు వెల రు. 0–1–0 తపాలబిళ్లలు 0-1-9 పంపిన ఒకపుస్తకము పోస్టులో పంపబడును. గ్రంథకర్త తాళూరి జియ్యరుదాసుగారు, శ్రీరామాశ్రమము, తాళ్లపాలెం, పొన్నూరుపోస్టు, గుంటూరుజిల్లా, హరిజన ప్రబోధకరమగు 80 గీతపద్యములు గలవు. శైలి సులభము. కవిత్వముత్సాహమును పుట్టించును.

---

**జర్మను విద్యావిధానము**

రాయలు సైజు 204 పుటలు వెల రు. 1-0-0 గ్రంథకర్త శ్రీయుత చిలుకూరి నారాయణరావుగారు. ఎమ్. ఎ. యల్. టి., పి. హెచ్. డి. అనంతపురం ప్రభుత్వ కళాశాలలో అధ్యాపకులు. ప్రారంభవిద్య మొదలు ఉత్తమవిద్యవరకు, వ్యవసాయవిద్య మొదలు వేదాంతవిద్య వరకు స్కౌటు విద్య మొదలు సైనికవిద్యవరకు, పామరవిద్య మొదలు పరిశోధక విద్యవరకు ప్రశస్తతమమని ప్రసిద్ధి బడసిన జర్మను విద్యావిధానమును విపులముగ వ్రాసి ఆంధ్రులకందరికి గ్రంథకర్తగారు తేట తెలుగు వ్యావహారిక శైలిలో విశదీకరించారు. ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుడు మొదలు వైసుఛాన్సలరు వరకు నెల్లరు నెఱుంగవలసిన విషయము లెన్నియైనఁగలవు. ప్రతిపాఠశాలలోను ఉండవలసిన పుస్త

కము. ప్రతులు వలయువారు వర్మ అందు సన్ను పెద్దాపురమునకు వ్రాయవలెను.

---

**ఇంగ్లీషు నర్సరీ రైమ్సు**

ఆంగ్లమున 1, 2, 3 తరగతుల కుపచరించుచున్న చిన్న చిన్న ఆంగ్లపద్యములను మూడు రీడర్లుగా శ్రీయుత చిలుకూరి నారాయణరావుగారు వ్రాసినారు. విద్యాసాధన గ్రంథమండలి వారు ప్రకటించినారు. ఇంతవరకాంధ్రు లిట్టి గ్రంథములను ప్రకటించలేదు. తరచు ఆంగ్లకంపెనీలే యిట్టివ్యాపారము చేయుచున్నవి. ఇందుకు గడంగిన శ్రీవత్సవాయి రాయ జగపతివర్మగారిని ఆంధ్రవిద్యాసంస్థలవారెల్ల రాదరింతురుగాక.

---

**ఇంగ్లీషు పొయెటికల్ సెలెక్షనులు**

ఇవియు పైవర్మగారిచేత 4,5,6,7 తరగతులకు నుపయుక్తమగునట్లు శ్రీయుత నారాయణరావుగారిచే వ్రాయించి ప్రకటించఁబడినవే. వలయువారు వర్మ అందు సన్ను పెద్దాపురమునకు వ్రాయవలెను.

---

**హిందూ సుందరి**

ముప్పదిసంవత్సరములాయను శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారిచే కాకినాడనుండి ప్రకటింపఁబడు మహిళా సేవ చేయుపత్రిక. మొన్న సంక్రాంతినుండియు క్రొత్త ముస్తాబుతోను క్రొత్తభావములతోను, శృంగారముతోను సంచారమునకు గడంగినది. కథలు, గీతములు, వ్యాసములు మనోహర నిర్దుష్టమైన శైలిలోను డెందంబుల జూరగొను రసముతోను రచింపఁబడి స్త్రీ జనాభిమానులగు యువతీయువకు లెల్లరివల్లను హిందూ సుందరికి కానుకలుగ నర్పింపఁబడుచున్నవి. వీనియన్నిటితో హిందూసుందరి తొంటికంటె వేయిరెట్లు గాంభీర్యముతోను ప్రౌఢతతోను రాణించుచు తక్కుంగల పత్రికారత్నములనెల్ల బుఱుడించుచున్నది. చందాదారులు మొదలగువారు ఇప్పటికంటె ఎక్కువ ఆహ్లాదముతో దీనిని పఠించి ఎక్కువ ఆదరము నొసగగలరనియే విశ్వసించుచున్నాము. స్త్రీలకు విద్యార్థినులకు అత్యావసరము. చందా సం|| 1-కి రు 2-0-0 లు మాత్రము.

---

**ఆంధ్రవాచస్పత్యము (నాల్గవభాగము)**

ఈభాగములో అ, ఇ, ఈ అక్షరములు పూర్తియై ఉకారము నడచుచున్నది. శ్రీ శ్యామశాస్త్రిగారు మొదటి మూడు భాగముల పద్ధతినే దీనినిగూడ జరిపించుచున్నారు. ఇందు ఇషారు, ఇలాకా, ఇనాము ఇజారా, ఇరసాలు మొదలగు హిందూస్థానీ వ్యవహార పదములే గాక ఇంజింక్షను, ఇంజెక్షను, ఇంటరెస్టు ఇన్ఫ్లుయెంజా, ఇనస్పెక్టరు మొదలగు వ్యావహారికాంగ్ల పదములకుగూడ అర్థములు తెలుపఁబడినవి. ఇందు లగ్నమను జ్యోతిశ్శాస్త్రపదమును తీసుకున్నప్పుడు దానినికట్టుట యెట్లో, ఒకొక్క గ్రహమున కెన్నికళలో కూడ తెలుపఁబడినవి. ఇట్లే ఉదజనియను (హైడ్రజను) రసాయనశాస్త్రీయపదము తీసుకున్నప్పుడు దాని లక్షణములు తయారుచేయువిధము మొదలగు వివరము లెల్ల తెలుపఁబడినవి. ఇక చారిత్రికపదములు పురాణములు, శాసనములు మొదలగు వానిని తీసుకున్నప్పుడు వానినిగూర్చి సంగ్రహముగ వ్రాసిపెట్టుటయే కాక మిగిలిన వివరములు తెలుసుకొనుట కేయేగ్రంథములు పఠించవలెనో సూచింపఁబడినది. ఇందులూరి అన్నయదేవు, ఇంద్ర భట్టారకుడు, ఇంద్రద్యుమ్నుడు, ఇంద్రవర్మ అతని 8 శాసనములు, ఇచింగు అను చీనాదేశీయుడు ఇమ్మడి బ్రహ్మహస్తుడు, ఇయోసిను అను పూర్వకాలభాగము, ఈశ్వరపోతరాజు, ఉత్కళదేశము దానిహద్దులు, ఉదయాదిత్యుడు మొదలగు

పదములు ఇందుకు ఉదాహరణములు. ఇట్టిపదముల అర్థములను వివరించువిధములో శ్రీ శాస్త్రిగారు అతి నవీనపరిశోధకుల కృషి ఫలితములనెల్ల గుర్తించి నిర్దుష్టమైన అధికారముతో వ్రాయుచుండుటయు ప్రశంసింపతగ్గది. ఆంధ్రవిశ్వవిద్యాలయు ఎక్స్లైను ఛాన్సలరు సి. ఆర్. రెడ్డిగారును అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారును ఈభాగమును మిగుల ప్రశంసించినారు. ఈగ్రంథము 80000 పదముల కర్థములు తెలుపును. 2500 డెమ్మీసైజు ప్లేజుపుటలు నెలనెలకు నూరేసిపుటలు గల ఒకభాగము వెలువడును. భాగము వెల రు 1-0-0 లు. రు 15 లు ఒక్కసారి చెల్లించినచో 25 భాగములును నెలలవారీగా పంపబడును. రు 5,6,7 రూప్యములనుగా మూడుదపాలను చెల్లించినను 25 భాగములును అంపఁబడును. ప్రతులు వలయువారు లేక చందాదారులు కాగోరువారు తూర్పుగోదావరిజిల్లా, కాకినాడతా॥ కరపగ్రామము, శ్రీ ఆంధ్రవాచస్పత్య కార్యాలయాధిపతి నిఘంటుకర్త, ఆంధ్రవాఙ్మయ మహోదధి శ్రీ కొట్రశ్యామల కామశాస్త్రిగారికి వ్రాయవలెను.

---

**గౌతమి** రాజమహేంద్రవరము నుండి శ్రీయుత పి. ఆర్. శేషగిరిరావుగారి సంపాదకత్వమున వెలువడు సచిత్ర మాసపత్రిక సం॥ చందా రు 1-0-0 వినోదినీ చిత్రగుప్తలవలె వివిధహాస్యకథలు, గీతములు, వ్యాసములతో రాజిల్లుచున్నది.

---

**రామనామం** శ్రీయుత ముద్దా విశ్వనాథంగారు వ్యాసకుటీరం, మెలుపాక, యలమంచిలిపోస్టు, విశాఖపట్నంజిల్లా, ఒక అణాముద్ర పంపి తేచాలు పుస్తకం వొస్తుంది. పేరులోనేవుంది పుస్తకంలోవుండే గొప్పదనం; కాబట్టి అధికం వ్రాయలేదు.

---

**శతకభారతం** శ్రీయుత పిసిపాటి సోమయ్యగారు, నూజవీడు. 38 పుటలు. తాత్పర్యసహితములైన 112 కందపద్యాలు. శ్రీమద్భారత కథాసూత్రానికి కూర్పబడియున్నది. అన్నియునూ చివరకు కృష్ణాయను ముద్రతో నొప్పుచున్నవి. వె॥ 0-5-0

---

**సౌందరనందము** ఫిదసుసైజు కాగితము రాయలుసైజు సుమారు 90 పుటలు. గ్రంథకర్తలు శ్రీయుతులు పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వరరావుగార్లు కృతిపతి శ్రీయుత చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు. "నద్యత నాంధ్రకవిప్రపంచనిర్మాతకు భక్తిమై నుడుగఱల్ ఘటియించెడి" పూనికయే కవివరుల ఈకృతిప్రదానమునకు కారణము. బుద్ధదేవుడు కామలీలాపరతంత్రులగు తన యనుంగుసోదరుడగు నందుని, అతనిభార్య సుందరిని భిక్షుసంఘములోనికి లాగి దీనసేవాపరాయణుల నొనర్చుట యితివృత్తము. పునరాగమము, భిక్షాగమనము, పరివ్రాజము, నిరీక్షణము, అనుతాపము, ఉపదేశము, ధర్మసంవాదము, అనుజ్ఞ సహధర్మచర్యము అను తొమ్మిది సర్గనామములును కథను పాఠకులకు సూక్ష్మముగ నందిచ్చుచున్నవి.

బుద్ధుడు భవతారణోపాయమును గనుగొని కపిల వాస్తూ నగరమునకు మరల విచ్చేయును. నగరవాసులు స్వాగతమిత్తురు. అతను భిక్షమునకై నందు నింటికివచ్చును. ప్రియాతంత్రుడగు నందుడు భార్యనించుక ఆపి బుద్ధునకు సన్మానముచేయనేగును. బుద్ధుడు మెల్లగా అతనిని తన ఆశ్రమమునకు గొంపోయి పరివ్రాజకవ్రతమునిమ్మని శిష్యుల కాజ్ఞాపించును. నందుడు సతీవిలాస హృతచిత్తుడు ఆందోళన పడుచుండును. సుందరి అతనిరాకకై నిరీక్షించుచు కొందలపడుచుండును. చెలికత్తెలామెకు సేదదీర్తురు. ప్రియునివృత్తాం

తము చూచాయగా నెరిగింతురు. సుందరి అతని కాఠిన్యతకును బుద్ధుని కఠోరతకును వెఱచును. బుద్ధుడు సన్యాసము స్వీకరింపుమనినందున కుపదేశముచేయును. ప్రేమవ్రతము సన్యాసముకంటె నుత్తమమని నందుడు బుద్ధునితో సంవాదముచేయును. బుద్ధుడు తనపట్టు విడువడు. నందుడాతనిని తిరస్కరింపలేడు. సుందరికి గూడ క్షైత్రిక్కీవ్రత మిప్పించుమని నందుడు వేడుకొనును. బుద్ధుడనుజ్ఞనిచ్చును. నందుడు దీనజనసేవాపరాయణవ్రతమున లగ్నుడగును. సుందరియు తన సంపదలు, భవనము, ప్రశస్తసుస్థానము దీనజనాయత్తముచేసి తొంటి విలాసవేషములుమాని సన్యాసవ్రతమున కాలముగడుపుచుండును. ఒకకూతును ఒకకొమారుని భూలోకమునవిడిచి సూక్ష్మలోకమ్ముఖియగుచున్న ఒక యువ్వాయింటిలో తత్సోదరిగా వారసమావేశము. ఇట్టి అకస్మాత్సమావేశమున తొంటి ప్రణయవాసనలు వారికి జ్ఞాపకమువచ్చి సంచలింతురు. కాని వెంటనే అట్టి భావములనుజయించి తమ దీక్షామహత్వమును గుర్తించి నాటినుండి నిజమైన సహధర్మచర్యమున వర్తింతురు. బుద్ధదేవుడు ప్రత్యక్షమై ఆశిశువులను నందసుందరీ నామములిడి వారికి కౌస్కగానొసగి బౌద్ధభిక్షుక వ్రతమునందు నిరంతరాయముగ వర్తించునట్లు ఆశీర్వాద మొసంగును.

ఇట్లు శాంత, శృంగార, కరుణారసంబుల కిరవగు బౌద్ధేతిహాసమును ఇతివృత్తముగాగ్రైకొని కవిముఖ్యము మనోహరశయ్యా భూషితంబైన కావ్యమును వ్రాసి నూతనాంధ్రసాహిత్యమును పూతమును పూతను బట్టించినారు. పదములపొందిక, భావములరామణీయకత, ఆశయముల వినిర్మలత, రసముల సమగ్రత పద్యపద్యమునందును ద్యోతకమగుచు కావ్యము విద్వల్లోలను బురుడించుచున్నది. నవీన కవికుమారు లిట్టి కావ్యములను నరవడిగ పెట్టుకొని వర్తించినచో ప్రస్తుత భావకవిత్వములయందు దోచు అనేకదోషముల 'పుబుమడులు' అదృశ్యములగును. భావగాంభీర్యము శయ్యాసౌలభ్యము, నిర్దుష్టకవిసిద్ధప్రయోగములు, ఆధునిక సాధుప్రయోగములు. ప్రాచీనసంస్కృత పదములు, అచ్చతెనుగునుడికారములు అల్లిబిల్లిగా నల్లుకొని ఆంధ్రభారతియొక్క అచ్చపుస్వరూపమును ప్రకటించుచున్నవి.

---

**ఆంధ్రజాతి**

ప్రతి బుధవారమును మచిలీ పట్టణమునుండి వెలువడు వారపత్రిక సంపాదకుడు శ్రీయుత సి. హెచ్. చలపతిరావుగారు. జిల్లా రాజకీయములను ఆంధ్ర రాష్ట్ర సమస్యలను చర్చించును. ఉత్తమవ్యాస రాజములతో శోభిల్లుచు ప్రఖ్యాత ఆంధ్ర వారపత్రికలను బురుడించుచు స్థిరముగా ఆంధ్రపత్రికాలోకమున నెలకొని సేవసేయగల సూచనల గ్రమ్ముచున్నది. సం 1 కి చందా రు. 3-0-0 లు.

---

**శ్రీ సత్య నారాయణ వ్రత కల్పము**

సంస్కృతశ్లోకములను శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి గారి ఆంధ్రానువాదము. ముక్కకు తణుముకోకుండ, పొల్లు ముక్క లేకుండ, భావపుష్టి చెడకుండ, రసము చిప్పిలుచుండు సులభసుందర కవిత్వమున మిన్నయని మున్నే పన్నెకెక్కిన కవయిత్రిని గూర్చి కాని, ఆంధ్రగృహస్థు లెల్లరును నెఱిగిన కథనుగూర్చి కాని విశేషించి వ్రాయనవసరములేదు. సత్యనారాయణ వ్రతాచరణ మత్తచిత్తులగు ఆంధ్రు లెల్లరి యిండ్లనుండదగు గ్రంథము. క్రౌనుసైజు 24 పుటలు వెల రు. 0-4-0 లు. వలయువారు కర్నూలు జిల్లా మురవకొండపోష్టు కొల్లాపురమునందలి స్నేహలతా కవితా సంఘమునకు వ్రాయవలెను.

---

**సరస్వతీ రామాయణము**

క్రౌనుసైజు 262 పుటలు వెల రు. 1-0-0 స్నేహలతా కవితాసంఘపు 40 వ పుష్పము. గ్రంథకర్త్రి శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు. రామచరితమను సుర్యో

లలో పెట్టి పాఠకుల డెందముల నూచి ఉత్సాహ వీచికల రేచుచుండు మధుతుల్యమైన కవిత్వశయ్యా వశంవదమైన కొంచెముమంది ఆంధ్ర కవయిత్రులలో సరస్వతీదేవిగా రాకరు. ఆంధ్రదేశమున పేరుమోసిన పండిత, కవివర్యు లెల్లరును ఈ రామాయణ సంగ్రహమును నుతియించినారు. మొల్లతరువాత ఇట్టి సత్కృతికి గడంగి నెరవేర్చి ఆంధ్రసాహిత్యమున శాశ్వత స్థానమును సంపాదించుకొనిన కవయిత్రికి మా అభినందన శతంబులు.

---

**దివ్యజ్ఞాన దీపిక**

ఇప్పటి కిరువదిరెండు సంవత్సరములనుండి నెలనెలకు ప్రకటింపఁబడుచు దివ్యజ్ఞాన సమాజమువారి ఆశయములకు ఆంధ్రదేశములో మంచి వ్యాప్తి నొసంగుచున్నది. సంపాదకులు శ్రీయుతులు వేమూరి శ్రీనివాసరావు పోపూరి కామేశ్వరరావుగార్లు. కార్యస్థానములు మదరాసు, ఏలూరు దివ్యజ్ఞాన సమాజములు. చందా సం|| 1 కి రు. 1-0-0 లు.

---

**కాకినాడ హోమోపతి పత్రిక**

సంపాదకుడు శ్రీయుత వై. గణపతిరావుగారు. చందా రు. 1-4-0 ఈ మాసపత్రిక యొక్క రెండో సంచిక మా కార్యాలయము చేరినది. వ్యాసము లాంగ్లమునను ఆంధ్రమునను గూడ గలవు. హోమోపతి శాస్త్రముప్రకారము రోగమననేమియో దాని చికిత్స యెట్టిదియో తెలుపువ్యాసములేకాక, రోగులు, వారిరోగముల నివారించిన కేసుల యుదాహరణములుకూడ యిందు ప్రకటింపఁ బడుచున్నవి. వీరు కాకినాడలో ఒక హోమోపతి కాలేజీనికూడ నడుపుచున్నారు. హోమోపతి వైద్య ప్రచారమునకీ పత్రిక అమూల్యమైన సేవచేయుగలదు.

**లక్ష్మీ సరస్వతీ సవాదము**

రచయిత్రులు శ్రీ|| సౌ|| లక్ష్మీ సరస్వతులు, కొల్లాపురం స్నేహలతా కవితాసంఘపు 36 వ పుష్పము. లక్ష్మీమపాత్రను శ్రీమతి లక్ష్మీమదేవిగారు సరస్వతీపాత్రను శ్రీమతి సరస్వతీదేవి గారును పూని యెవరిమహిమను వారు చక్కగా చాటుకొనినారు. మహావిష్ణువు తీర్పు నంగీకరించి స్నేహమున మెలగ నిశ్చయించుకొనిరి. కాని లోకములో సరస్వతీదేవికి లక్ష్మీమదేవిపై నున్న ఆదరాభిమానములలో వేయవ వంతైనను సరస్వతిపై లక్ష్మీమదేవికి లేకుండుట ఆమెచంచలత్వమునకును మస్సరమునకును శాశ్వత నిదర్శనము. అయినను సరస్వతి ప్రతిభ అందువలన మరింత హెచ్చుచున్నదే కాని తీటువడకుండుటయు ప్రశంసనీయము. కవిత్వము సుకుమారము. వెల రు. 0 2 0 లు.

---

**అలంకార మంజరి**

క్రౌనుసైజు 300 పుటలు. గ్రంథకర్త శ్రీ. వెం. రాఘవఅయ్యంగారు ఎమ్. ఏ. బెజవాడ. ఇంతవరకు ఆంధ్ర భాషలో అలంకార విషయములను గూర్చి భట్టుమూర్తి అడిదము సూరకవి మొదలగు వారు వ్రాసిన పద్యకావ్యములే కాని గద్య గ్రంథ మొకటియును లేదు. గద్యగ్రంథములు విరివిగా చెలామణియగుచున్న యీ రోజులలో ఇందునుగూర్చి సామాన్య జనబోధకంబగు గద్య గ్రంథ మత్యావశ్యకము—ఇది గుర్తెరిగి గ్రంథకర్తగారు మమ్మటాచార్యుని కావ్యప్రకాశిక ననుసరించి యీగ్రంథమును తయారుచేసి ఆంధ్రభాష కుత్కృష్ట సేవనొనరించినారు. గ్రంథప్రశస్తిని గూర్చి శ్రీయుతులు వఝ్ఝలచిన సీతారామ శాస్త్రి చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి మల్లాది సూర్యనారాయణశాస్త్రిగార్లు మొదలగు వా మిగుల ప్రశంసించుచు అభిప్రాయములు వ్రాసినారు.

**మరణ భ్రమ** క్రౌనుసైజు 192 పుటలు. వెల రు. 1-0-0 గ్రంథకర్త శ్రీయుత మరువాడ నారాయణమూర్తి గారు. పశ్చిమగోదావరిజిల్లా కాకరపఱ్ఱునందలి సరస్వతీ గ్రంథమాలవారి 37 వ పుష్పము. అద్భుతమైన రహస్యపరిశోధనలు, మోసములు, భ్రమలు, హత్యలు, చౌర్యములు, రహస్యమందిరములు, మొదలగునవి యెటువంటి పత్తేదారులకు గూడ దిగ్భ్రమలు కలిగించును.

---

**వినోద శిల్పము** డబులు క్రౌను 144 పుటలు. గ్లేజు కాగితములు. సంపాదకురాలు శ్రీమతి కొ. స్వర్ణవల్లి గారు, త్యాగరాజనగరము. ప్రకాశకులు ఆంధ్ర గ్రంథమాల, 7 తంబుచెట్టివీధి, మదరాసు. వెల రు. 1-4-0 లు నాలుగైదేండ్లాయను 'భారతి' పత్రికలో ప్రకటింపఁబడుచున్న శ్రీమాన్ కొ. నరసింహాచార్యులుగారి వ్యాసముల సంపుటము. ఇందు శాశ్వత పంచాంగము, బీరువా, రాట్నము, ఆకుచిలుక, విసనికర్ర, గడియారపు గొలుసు, మొదలగువానిని తాటాకులు, కొబ్బరియాకులు, అట్టలు కాగితములు మొదలగువానితో తయారుచేయువిధములు సచిత్రకముగా చూపఁబడినవి. ఉపాధ్యాయులకు గృహస్థులకు మిగుల నుపకరించును. చిన్నప్పుడు పిల్లలకు వీనిలో సరదా పుట్టించినచో పెద్దయైన తరువాత వారి నిర్మాణశక్తి వర్ధిల్లి దేశమునకును తమకును గూడ యెన్నియోవిధముల పనికివత్తురు.

---

**అమ్మ** మాక్సిమ్ గోర్కీ అను రష్యను నవలాకారుడు వ్రాసిన గ్రంథమునకు శ్రీయుత క్రొవ్విడి లింగరాజుగారి ఆంధ్రీకరణము. వెల రు. 1-8-0 క్రౌనుసైజు సుమారు 700 పుటలు, కృష్ణాజిల్లా ఎలమఱ్ఱునందు ఆదర్శగ్రంథమండలి వారిచే ప్రకటితము. రష్యాలో పూర్వపు కార్మికుల దుస్థితి, వారి తిరుగుబాటు, ఆందోళన మొదలగు విషయములు చక్కగా వర్ణింపఁబడినవి. శైలి వ్యావహారికము, అనుకరణముగాక అచ్చఆంధ్రము, జాతీయము, పామరజన సులభము, ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లిని జ్ఞప్తికి దెచ్చుచుండును.

---

# స్వదేశీపానము (తేనీరు)

బోధిధర్మ అనే పేరుగల ఒక హిందూసన్యాసి మోక్షాసక్తితో యేడేళ్లు తపస్సుచేసి యెనిమిదవ యేట నిద్రరాకుండాను చురుకుతనమువృద్ధియగునట్లును చేయు ఈపత్రమును కనిపెట్టినాడు. చీనాలోకి క్రీ.శ. 543 లో ఈతనే దీనిని తీసుకొనివెళ్లెను. చీనా జపానులలో తేనీరుత్రాగుట మప్పటినుండియు ఒకవిధమైన బౌద్ధమతకర్మ అయినది.

చీనాకవీశ్వరు డేమని పాడుతున్నాడంటే,

"ఉత్సాహమును రేపు ఉదుగ్రమేఖంబు
తమముపోఁ జేయుశాంతము పాదుకొల్పు
దయనుహెచ్చించు శ్రద్ధను పెద్దసేయు
అలసటం బోదోలు ఆత్మ మేల్కొల్పు-"నని.

డచ్చివారు మొదట పడమటిదేశస్థులకు దీనిని 17-వశతాబ్దములో రుచిచూపించినారు. 18-వ శతాబ్దమునాటికే జాన్సను, ఎడిసను, స్విఫ్టు మొదలైన కవీశ్వరులందరూ దీనిని సేవించడంలో పండితులైనారు. ఆంగ్లేయులు అస్సాము కొండలలో దీనిని చూచి పెద్దతోటలలో దీనిని పెంచి అన్ని దేశాలకు యెగుమతిచేసి చీనాటీకంటె ఇండియాటీ దినదినాలంగా ఎక్కువ ఖ్యాతివచ్చేటట్లు చేశారు.

ప్రపంచకంలో అన్ని దేశాలలోను పేదసాదలందరూ ఆహారసమయములలోను ఉత్సవసమయాలలోకూడా సంవత్సరంలో అన్ని ఋతువులలోనూ గంటగంటకూ తెగతాగుతారు. ఎండాకాలంలో చలవచేస్తుంది. చలికాలంలో వేడిచేస్తుంది. పగలు చురుకుతనమిస్తుంది. రాత్రి మేల్కొల్పుతుంది. ఇట్లాంటి సుగుణాల కుప్పను, అందులోను హిందూదేశంలో పుట్టినటువంటి యీస్వదేశీబిడ్డను, భారతీయులెందుకు ఆదరించరు ?

కైపెక్కనీయకుండా సంతోషమును పుట్టించే పానకం యెక్కడేనా దొరుకుతుందా అని ప్రపంచం తపస్సుచేయగా చేయగా ఇది దొరికింది. హిందూదేశపు టీ అంటే ప్రపంచమంతా వలచిపడిపోతున్నది. హిందూదేశస్థులకు తమయొక్క ఘనతలను తెలుసుకొనడంలో చాలా వెనుకపడడం అలవాటు. ప్రపంచమంతాగుర్తించి కీర్తించుచున్నప్పుడైనా మీరు దానిని గుర్తించి గర్వించకపోతే యెట్లా ?

"దుఃఖమయమైన యీప్రపంచంలో సుఖస్వరూపమైన ఈ తేనీరనే పానకమును దేవుడు సృజించకపోతే మానవులగతి యేమికాను ? ప్రపంచంలో టీ లేనప్పుడు కాక సర్వవ్యాప్తమయిన యీయుగములో నేను పుట్టినందుకు ధన్యుడ"నని సిడ్నీస్మిత్తు అనే కవి తేనీరుత్రాగి ఆనందతాండవం చేసేవాడు.

అందులోనూ ఇది భారతీయులకు జాతీయపానమాయె. మంచినీళ్లమాట తీసేస్తే దక్కిన పానీయము లన్నిటికంటే కాలుదూక.

తేనీరంటే సామాన్యమా, అన్ని కార్యాలకీ గణాధిపతి లాంటిది. కాస్త తాగి వ్రాయమొదలుపెడితే అదే వ్రాత, ఆటకుపోతే అదే ఆట, మాట్లాడబోతే అదే సంభాషణము, కవిత్వమునకు పూనుకుంటే ఒకటేధార, ఉపన్యాస వేదిక నెక్కితే ఒకటే లెక్చరు.

కనుక భారతీయ నాయకులెల్లరు ఇట్టి సర్వోత్కృష్టమైన స్వదేశీపానకమునకు సంపూర్ణస్వాగతమిచ్చి ధన్యులయ్యెదరుగాక.

## డి. జె. కెయిమెరు అండు కొ, (లిమిటెడ్)

టెలిఫోను నెం. 5775
కలకత్తా.

4 లైయన్సు రేంజి
తపాలాపెట్టె నెం 440 కలకత్తా.

టెలిగ్రాములు
అడ్రెస్ మైయెకు
కలకత్తా.



# సంపాదకీయములు

మదరాసు నారీరక్షణమందిరము:—

హిందూసంఘములో పాశ్చాత్యదేశముల లోవలె ప్రౌఢవివాహములు, విధవావివాహములు, వివాహవిచ్ఛేదములు, పునర్వివాహములు మొదలుగాగల నైతికజీవితమునకు సాధకములైన ఆచారములు లేకుండుటయే కాక, స్త్రీ యేమాత్రము ఏకపతివ్రతము నుండి జాఱినను కుక్క ముట్టుకున్న కుండవలె వెంటనే వీధిపెట్టఁబడి గెంటఁబడి నిరాధారగాఁ జేయబడుచున్నది. ఎవరో ఒకపురుష మహాశయుడు లేనిదే స్త్రీ నీతివర్తనము నుండి జాఱుట సాధ్యముకాకున్నను పురుషుని పట్టుకొనుటలోను, నేరస్థుడని స్థిరపరచుటలోను, నేరస్థుడైనను శిక్షించుటలోను కష్టములున్నవి కనుక అతను యథేచ్ఛగ విహరించుచుండుటయు, అతని కామోద్రేకమున కెఱయగు అనాథలు నానాయిడుమ పోతలు అవమానములు, రోగములు అనాదరణములుపడి పిచ్చెత్తి మరణించుచుండుటయుగూడ సాధారణమగుచున్నది. ఒకానొక వేళావిశేషముననో ప్రమాదముననో తప్పొనర్చినవారిని వారి పశ్చాత్తాపబాధకుతోడు చుట్టుప్రక్కలనున్న వారందఱును యెత్తిపొడుపుమాటలవల్ల మఱింతహింస పెట్టకున్నచో హిందూసంఘమువంటి పవిత్ర వాతావరణములో వారిజీవనము వెంటనే శుద్ధమై ఆదర్శప్రాయముగా నుండుననుట కాటంకములేదు. కాని ఇట్టి పతితజన సేవాపరాయణత్వము, క్షమామహత్వము క్రైస్తవ సోదరసోదరీమణుల పూర్ణగుత్త కాని మరి యేమతస్థులలోను అంత బాహుళ్యముగా గానరాదు. క్షమామహత్వమును చాటుటకు క్రైస్తవులు పాపమునుకూడ ప్రేమించుచున్నారని రస్కిను మహాశయుడు చెప్పినమాట అబద్ధము కాదు. ఒక్క క్రైస్తవమతముతప్ప తక్కినవన్నియు పాపమును క్షమించుటకుకంటె శిక్షించుటకే కత్తిగట్టుచుండును. అందుచేత మహమ్మదీయాది మతములలో శుద్ధీకరణమైన ఉన్నది కాని హిందూమతములో దానికి బహిష్కరణము తప్ప వేఱుమార్గములేదు. కాదూ పోదూ అన్న కళ్లుమూసుకున్నట్లు నటింతురు కాని తెరచుకున్నట్లు కనిపించిరో తిట్టి దిగబెట్టక మానరు.

ఈకారణములచేతి హిందూసంఘము శుద్ధ పవిత్రమైన దేవతాసంఘమని చెప్ప వీలులేకున్నను కర్మముచాలక ప్రమాదమొనర్చిన స్త్రీలనుమాత్రము ఇది గండ్రగొడ్డలియై పీడించుకొని తింటున్నది. పరమేశ్వరుడు పతితపావనుడైనచో అతనిని ధ్యానించుకొని వా

రేగంగ యొద్దనో దేవాలయపుగడపలదగ్గరనో బిచ్చమెత్తుకొనుచు ధ్యానించుచు తరించవలసినదేకాని, సంఘమునకు మాత్ర మట్టి గుణము లవలేశమునులేదు. తెలియకుండా నటించి కడుపులోపెట్టుకొని వారివల్ల తన దేహామంతయు మైలపడుటకైన సిద్ధపడును కాని తెలిసి జాలిపడి వేరేపెట్టియైన పోషించి, బోధించి తరింపజేయు ప్రయత్నము నది యెన్నడును చేయదు. ఈసంఘములో యెవరి తరణోపాయమునకు వారే తంటాలుపడుచు వారికాళ్లా వీరికాళ్ళాపడి మంత్రోపదేశములు పొందవలసినదేకాని ఏకాచార్యుడుకాని పురోహితుడుకాని బ్రాహ్మణుడుకాని బైరాగికాని దీనులనుతిట్టి ధైర్యమిచ్చి మంచిమార్గమునుచూపించి రెండమగులు చెయిసాయమిచ్చువారుండరు.

ఈకారణముచేత ప్రమాదవశమున నెప్పుడైన కాలుజారి బహిరంగమైన ప్రతీబాలిక, పడతి, ప్రౌఢకూడ వెంటనే యేచెర్లోనోపడి చావవలెను; లేదా నీతిహీనమైన జీవనములో పడి కుళ్లవలెను తప్ప తిరిగి గౌరవవంతమైన జీవనమునకు మరి రాలేదు. చచ్చినంతమంది చచ్చుచున్నను దుర్గతికి పట్టుచున్నపడతులకుగూడ అంతుపొంతులేకున్నది. ఇట్టివారిని రక్షించుట తమ కర్తవ్యముకాదని పీఠాధిపతులు, సంఘాధినాధులు పెడమొగము పెట్టుకున్న పెట్టుకుందురుగాక, మహిళాఉద్యమ మహానాయకులు ఈపనిని నిర్లక్ష్యము చేయ వీలులేదు. ఇట్టివారి రక్షణముకొరకు బెజవాడలో శ్రీమతి తుర్లపాటి రాజేశ్వరమ్మగారు ఒకవసతి గృహమునునిర్మించి పోషించుచున్న సంగతి పాఠకులకు విదితమే. మదరాసులోగూడ గతసంవత్సరం మార్చినెలలో స్టాన్లీ సతీమణి ఒక రక్షణగృహమును తెరచినారు. ఇందు గతసంవత్సరము నిర్వహింపబడిన పనినిగూర్చి నివేదిక నూతనముగ వెలువడినది. నానాజాతులకు ప్రాంతములకు వయస్సులకుచెందిన విధవలు సధవలు సుమారిరువదిమందియైనను వీరిచే ఆదరించబడి పోషించబడి సద్వ్యాజీవన మార్గమున నిలబెట్టబడినారు. వీరిలో కొందరిని పిచ్చిఆస్పత్రిలో పెట్టవలసివచ్చెను. కొందరిని కొంచెము దిద్దుబాటుచేసి యేదోఒకవృత్తిలోపెట్టుట సాధ్యమైనది. కొందరికి జీవనాధారమగు వృత్తులు నేర్పబడుచున్నవి. వివాహావయస్కులకు ననుకూలురగువరులుదొరకినచో పెండ్లిండ్లును చేయబడుచున్నవి. కొందరిబాధ తప్పించుకొంటకు వారిచుట్టములే రహస్యముగను మర్యాదగను తీసుకొనివచ్చి యిక్కడికి దిగబెట్టుచున్నారు; ఇంచుమించు అందరికి వైద్యసహాయము కావలసివచ్చుచున్నది. ఉపచారముచేయుటకు దాదులు, వృత్తులనేర్పుటకుపాధ్యాయినులు, కాచుటకు ద్వారపాలినులు కాలక్షేపమునకు చెలికత్తెలు కావలసియున్నారు. మంత్రసానులు, సంగీతబోధకురాండ్రు, వంటకత్తెలు, సేవకురాండ్రు మొదలగువారినిగా వీరిని తరిఫీదు చేయుచున్నారు. కనుక కావలసినవారెల్లరును వీరికివ్రాసి అనుకూలమైననౌకర్లను తెచ్చుకొనవచ్చును. ఇది అంతయు మహిళా అఖిలభారత మండలము

వారి తరఫున శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డిగారి పరిశీలనముక్రింద జరుగుచున్నది. మదరాసు రాజధానియందలి మహనీయులెల్ల రును దీనియందు తగినశ్రద్ధబూని సహాయ మొనగూర్తురు గాక!

సాహిత్య తత్త్వవిమర్శనము:—

శ్రీయుత జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి, ఎమ్. ఎ., బి. యల్ గారు ఆంధ్ర పాఠకలోకమునకు బాగా పరిచితుడైన విశే షరీ విమర్శకుడు గ్రంథకర్తయునై యు న్నారు. ఆంధ్ర సంస్కృత భాషలయం దుత్కృష్ట పరీక్షలనిచ్చిన ఉద్దండ పండితవర్గ ములోనివాడు కాకున్నను సంస్కృతాంధ్రో త్తమ పండితైకవేద్యమైన గంభీరశయ్యా విభాసితుడు. పద్యములును పాటలును వ్రాసిన కవివర్యుడు కాకున్నను అతని గద్య మునందలి పదములే ఆయాయిూపట్లను రెక్కలుకట్టుకొని యెగురుచు కవీంద్రుల భావములనుమించిన సుందరకాంతులను మిల మిల కురియుచుండును. జైళ్ళనుంచియింటికి యింటినుండి జైళ్లకు ఊరేగుచుండు కాం గ్రెసుసేవకుడు కాకుండినను భారతదేశపు స్వాతంత్ర్యోద్యమముయొక్కయు దానిని నడపుచుండిన అఖిలభారతస్థానిక నాయక సేవకవర్గమందలియొక్కయు ఘనతను బాగుగానెఱింగి ఉల్లమున సంతతము స్వాతం త్ర్యోపాసనము చేయుచుండు దేశాభిమాని. క్షణక్షణ చంచలాయమాన అధునాతన నాగరకతామహాశయపరనాభ్యాసపరా యణులగు యువకకోటికిఁ జెందినవాడయ్యు, సృష్టి అనాదినుండి అనంతమువరకు ఒకానొక సనాతనసౌందర్యముతో భాసిల్లుచుండుట నెఱింగి విధేయతను విడువనొల్లని ఉత్తమ శిష్యుడు. ఆధునిక పాశ్చాత్య భారతీయ భాషలలో అగ్రగణ్యములైన గ్రంథములను సరాసరి ఆభాషలలోగాని తర్జుమాలలోగాని పఠించి పరిణామమునుగ్రహించిన సాహిత్యో పాసకుడగుటచేత అతనిసాహిత్య విమర్శన ములును అభిప్రాయములును వ్యాఖ్యానము లును విద్వాంసులకు విద్యార్థులకుఁగూడ శిరసావహనీయములు.

క్రొత్తగా వారు ప్రకటించిన సాహిత్య తత్త్వవిమర్శనముఅను గ్రంథము డెమ్మీసైజు గ్లేజుకాగితములలో 206 పుటలుగలిగి సాహి త్యాది, సారస్వతము ముక్తిసాధనము, శైలి, భావనావేశము, మాతృభాష, నేటి వాఙ్మయోద్యమము, లలితకళలు నవ్యసాకెర టాలు, నాట్యకళ, సంస్కరణము మొదలగు 13 వ్యాసములతో రాజిల్లుచున్నది. పఠిం చినకొద్ది బుద్ధికొకతీక్ష్ణతయు, భావముల కొకమెఱుగును, విజ్ఞానమున కొకపొరయు వృద్ధియగుచుండునని చెప్పనక్కరలేదు. పుస్త కమును ముగించులోపల ప్రాచ్యపాశ్చాత్య కవీశ్వరు లనేకులతోను వారి రచనావిధాన సౌందర్యములతోను మనకు మంచిపరిచితి గలుగును. గ్రంథమామూలాగ్రము సావ ధానముగ నిండ్లలోపఠించి విద్యాలయము లలో నున్నతతరగతుల విద్యార్థులకు విద్వాం సులు విశదీకరించవలసిన విషయములతో తుందిలమైయున్నది. ఇదివరకున్న ఆంధ్ర

సాహిత్యవిమర్శ గ్రంథములు తరచుగా కవుల కాలములు, శయ్యలు, పరస్పరపుపోలికలు మొదలగు విషయములను తెలుపు చారిత్రక గ్రంథములుగామాత్రమే ఉన్నవిగాని సాహిత్యతత్వమునుగూర్చి యింతవిభజనగా ఇన్ని వ్యాస్యములుగల దేదియునులేదు. సర్. యస్. రాధాకృష్ణనుగారు దీని ప్రశంసించుచు వ్రాసిన ఉపోద్ఘాతమున కిదియెంతయు తగియున్నది. మదరాసు రాజధానియందలి విశ్వవిద్యాలయముల సిండికేటులందలి తెలుగు భాషాభివృద్ధికి సంబంధించిన సభ్యులెల్లరును దీనినిపఠించి, వారివారి విశ్వవిద్యాలయములలో ఉన్నతతరగతివిద్యార్థులకు పాఠ్యగ్రంథముగా నియమించి ఆంధ్రభాషాభివృద్ధికిని సరసవిమర్శనమునకు తోడ్పడుదురుగాక. వెల రు 1-4-0 లు. గ్రంథకర్త చిరునామా 2 మాధవభాగ్. లజ్ చర్చికోడ్డు, మైలాపూరు మదరాసు.

కీ॥ శే॥ కళ్లేపల్లి వేంకటరమణమాంబగారు:—

ఆంధ్రమహిళాఉద్యమమును తెనుగుదేశమున నాటిపెంచిన ప్రప్రథమవిదుషీమణులలో శ్రీమతి వేంకటరమణమాంబగారొకరు. ఈమె విద్వత్కుటుంబమున బరంపురములో 1864 లో శ్రీయుత కురవిరామశాస్త్రిగారి తనయగా జనించిరి. బలగన్నాడు కరణకమ్మ వైదికులు. సనాతనసంప్రదాయముప్రకారము 8 వ యేట బ్ర॥శ్రీ॥ కళ్లేపల్లి శివరామయ్యగారికిచ్చి తల్లిదండ్రులు వివాహమొనరించిరి. పుట్టింటను అత్తింటనుగూడ విజ్ఞానపరిసరములలో మెలగి పాండిత్యకవిత్వసంగీతములయందనుపమానమైన ప్రజ్ఞగణించెను. విశేషించి దైవభక్తిపరాయణురాలన్నసంగతి ఆమె వ్రాసిన వరలక్ష్మీశతకము పూజపాటలు మొదలగుగ్రంథములను పఠించినవారికి తెలియగలదు. శశిలేఖ, దేశోపకారి, హిందూసుందరి, కృష్ణాపత్రిక, సావిత్రి మొదలగు పత్రికల కామె వ్యాసములమూల్యాలంకారములై యుండెడివి. స్త్రీల 'మార్గాచారములను' సంస్కరించుటకై ఆమె అనేకవ్యాసములు వ్రాసెను. కల్పలతాపత్రికాధిపతులును, 'దుర్గేశనందని' యను నవల వ్రాసినందుకు ఆంధ్రప్రచారిణీ గ్రంథమండలివారును, పోటీపరీక్షయందు తీర్ణురాలైనందుకు నరసాపురం స్త్రీవిద్యాభివర్ధనీసమాజమువారును విజ్ఞానచంద్రికాగ్రంథమండలివారును బహుమానములనొసగి ఆమెను గౌరవించిరి. విశాఖపట్టణములో స్త్రీల యున్నతపాఠశాల బాలికలకొరకేర్పడిన హాస్టలుకు నిర్ణయాధికారిణిగా పనిచేసిరి. కాకినాడలోని హిందూసుందరిపత్రికకును బరంపురమునందలి ఆంధ్రలక్ష్మియను మాసపత్రికకును కొంతకాలము సంపాదకురాలుగనుండెను. డెబ్బదిసంవత్సరములుదాటిన పండువయస్సున 21-1-35 తేదిని ఇరువురుసుతులను ఏవురుకూతురులను ఆప్తబంధుమిత్రవర్గములను దుఃఖసముద్రమునముంచి బ్రహ్మైక్యసిద్ధిగాంచెను. వీరి యాత్మశాంతికి ప్రార్థింపుచు బంధువర్గమునకెల్ల మాసానుభూతిని దెలుపుచున్నాము.

స్వదేశీఫిల్ములు—వేలుపిక్చర్సు:—

భారతదేశములోకూడ టాకీఫిల్ములు

తయారుచేయుట ఒకపరిశ్రమమై పరిణమించుచున్నది. బట్టలమిల్లులు, బియ్యముమిల్లులు మొదలగునవి పెక్కులేచి ఒకటితో నొకటి పోటీచేసుకొని అనేకనష్టములపాలై భారతదేశపు మూలధనము నశించుచున్నట్లే ఈ పరిశ్రమకూడ అనతికాలములో దెబ్బతినగలదని ఫిల్మిండియా యను పత్రిక ఒకవిషాద సూచకమైన వార్తను ప్రకటించుచున్నది. భారతదేశమువంటి విశాలదేశమున కిప్పుడున్న మిల్లులు ఫిల్ముకంపెనీలు ఒకలెక్కలోనివి కావన్నమాట నిజమేయైనను, మనదేశపు పరిశ్రమలు తమలో తాము సర్దుకొనుటయేగాక ఉప్పెనవలెవచ్చి మీదపడుచుండు విదేశిపరిశ్రమలపోటీకి తాళలేక కృశించి దేశమున వానికి పట్టముగట్టవలసిన దౌర్భాగ్యస్థితి సంభవించుచున్నది. ఈపోటీలకు మనము తాళుకొనవలెనన్న మనకు 'స్వదేశీ' యభిమానముతప్ప వేరుశరణ్యములేదు. ఈయభిమానముకూడ కేవలము 'విదేశీ' యెడల ద్వేషముమీద నాధారముపడి స్వదేశీపరిశ్రమలను బాగుచేసుకొనకుండనే దేశీయులభిమానము చూపవలెననెడి దురభిమానము పట్టి సాగించినయెడల అతికాలము సాగనేరదు.

స్వదేశీఫిల్ములను బాగుచేసుకొనుటయు వానిమీద నెక్కువ అభిమానము చూపుటయు విదేశీఫిల్ములమీద వ్యామోహము వదల్చుకొనుటయు తక్కిన పరిశ్రమలయందు వలె అంతకష్టసాధ్యము కాదు. తక్కిన మిల్లు పరిశ్రమలన్నియు ఏదేశములో నైనను ఇంచుమించు ఒకేమోస్తరుగా నుండునుకాని ఫిల్ములు మానవప్రకృతినై పుణ్యములను ప్రతిబింబించునవై యుండుటచేత ఒకొక్కదేశమునలో ఈ పరిశ్రమయందొకొక్క విశిష్టత యేర్పడి, అనన్యానుకరణసాధ్యమై ఒకొక్కదేశమున కొకొక్కటి అభిమానపాత్రమై యుండును. విదేశీఫిల్ములు విదేశీ భాషలలో నుండుటచేత మనదేశీయుల కర్థముకావు. విదేశీ సంప్రదాయములు సాంఘికాచారములు మనకు నచ్చక కొన్ని ఆదరణ పాత్రములుకావు. కొన్ని అవినీతికరములై బహిష్కరణ నీయములు. మనదేశపు నైతికవైజ్ఞానిక సంప్రదాయములు పోషించబడినవై, మనదేశస్థులకు విజ్ఞానము కలుగవలెనన్న మనదేశపుకథలు భాషలు నటకులు పాటలు మనకు ఉండక తీరదు. ఈ పరిశ్రమ మనదేశములో తక్కిన దేశములలో కంటె ఆలస్యముగ ప్రారంభింపబడినను నానాటి కత్యంతప్రీతిపాత్ర మగుచున్నది. విదేశీపటములను మూడునాలుగు దినములకంటె యెక్కువకాలము ప్రజలు చూడకున్నను; లవకుశ, పాదుకాపట్టాభిషేకము మొదలగు పటములు వారములకొలది చూపబడుచున్నను ప్రజ లానందించుచునే యున్నారు. ఈ పరిశ్రమను మనధనవంతులు సాగించ బూనుకొన్నచో తక్కిన పరిశ్రమలలో కంటె పోటీ తక్కువ కాగలదనుట కాటంకము లేదు.

ఇంతవరకు మన తెలుగు ఫిల్ములు ఉత్తర హిందూదేశపు కంపెనీలచేతనే తయారు

కాబడుచుండెను. బొంబాయి కలకత్తా అహమ్మదాబాదు మిల్లులవలె బొంబాయి కలకత్తా ఫిల్ముకంపెనీలే తెలుగుఫిల్ములుగూడ తయారుచేయుచుండుటచేత దక్షిణహిందూస్థానీయుల ద్రవ్యమెల్లయు ఉత్తర హిందూదేశీయ ధనవంతుల బొక్కసములలోనికే దాటిచేసుకొనుచున్నది. మన ఆంధ్రుల ద్రవ్యము ఆంధ్రదేశములలోనే యెక్కువగా నిలువవలెనన్న ఆంధ్రులు పెట్టుబడి పెట్టిన ఫిల్ముకంపెనీలు లేవవలెను. ఆంధ్రులొక్కరే కాకున్నను ఆంధ్రులును అరవవారును కలసి పెట్టిన వేలు పిక్చరు కంపెనీవారు ఇదివరలో సీతాకళ్యాణము ఫిల్మును తయారుచేసిరి. అది చాలవరకు ఆంధ్రులయొక్కయు ఆంధ్ర పత్రికలయొక్కయు సద్విమర్శనకు పాత్రమైనది. ఆ కంపెనీవారే కృష్ణలీలలను మరియొక ఫిల్ము నిప్పుడు తయారుచేయుచున్నారు. ఈ కంపెనీ వంతువారులు, డైరక్టరులు, కండక్టరులు అందరును ద్రావిడులును ఆంధ్రులే అయియున్నారు. శ్రీయుత పినపాలెం వెంకటదాసుగారు మొదలగువారు చాలకాలమునుండి సినిమాప్రదర్శనముల యందు అనుభవము సంపాదించుచు ఆంధ్రుల ప్రకృతిని గుర్తించుచు వుండియున్నవారు. శ్రీయుతులు పారుపల్లి సుబ్బారావు, వేమూరి గగ్గయ్య, రాజేశ్వరరావు గార్లును శ్రీమతులు శ్రీరంజని మొదలగువారును దీనిలో పాత్రధారులై ఆంధ్రుల నానందాంబుధిలో నోలలాడచేయగలరు. ఇట్టి క్రొత్త క్రొత్తప్రదర్శనములను తయారుచేసి ఆంధ్ర లోకమునకు పంచుచు, ఆంధ్ర ద్రావిడ సంపదల నాంధ్రద్రావిడానుభవములకు తెచ్చుచున్న వేలుపిక్చర్సువారు సకల దక్షిణ హిందూస్థానీయుల ప్రశంసలకును పాత్రులగుటకు సందేహములేదు.

## స్త్రీల పద్యపోటీపరీక్ష

ఏలూరు మోతేపల్లివారి వీధియందు నెలకొను 'స్త్రీవిద్యా విషయిక చదలవాడ శ్రీ వేంకటానందమూర్తి స్మారకపద్య రచనా పరీక్షాపీఠము'వారు గత మూడుసంవత్సరములలోవలె యీసంవత్సరముగూడ పోటీ పరీక్ష జరిపింతురు 11-11-1935 న తేది లోగా 'భాగవత భారత కృష్ణులకుగల భేదము'ను గూర్చి 25 పద్యములను రచించి స్త్రీలు పంపవచ్చును. ఒక స్వర్ణపతకము, రజతపతకము, మొల్లరామాయణము అను మూడు బహుమానములను, నూటికి నూరు మార్కులు తెచ్చుకొనువారికి 'కవిరాజ్ఞి' బిరుదమును నొసగుదురు 12-12-1935 వ తేదిని జరుగు వార్షికోత్సవ దినమునాడు బహుమానములు పోష్టుద్వారా ఉత్తీర్ణురాండ్రైన నలువురు స్త్రీలకును పంపుదురు. ఇతర వివరములు వలయువారు చదలవాడ ధర్మరాజు (ఆంధ్రజ్యోతిర్విద్యాలయము ఏలూరు) గారికి వ్రాసి తెలుసుకొనవచ్చును. ఈ రీతిగా ఆంధ్రమహిళా మణులలో కవిత్వ రచనాసక్తిని పోషించుచున్న శ్రీయుత ధర్మరాజుగారి సత్ప్రవృత్తి సుత్సా మాంధ్రులకెల్లరకు మిగుల హర్షదాయకము.

EDITED. PRINTED AND PUBLISHED BY

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావు. నూజవీడు: వైద్యుల నారాయణ

తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.

మచిలీపట్టణము: ఎస్. బి. లింగమ్, చీఫ్ ఏజంటు.

హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు.

నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.

తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కంపెని.

జెమ్‌షెడ్‌పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్‌పైప్ కంపెనీ, లిమిటెడ్.

బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.

గుంటూరు: వెల్‌కం అండు కంపెని. మైసూరు: స్టూడెన్ట్సు హాలు.

సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు

పిఠాపురం: ఎం. సూరరాజు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.

రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.

మదరాసు: వై. నారాయణగారు, 364 ఎస్‌ప్లనేడు.

బెంగుళూరు కంటోన్‌మెంటు: ఆనందా బుక్ డిపో. ఏలూరు: బి. విశ్వనాధంగారు.

తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.

బెజవాడ: ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్‌పేట.

ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.

రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్ వీధి.

చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.

విజయనగరం: ఆయపిళ్ల .సూర్యనారాయణరావు

నరసాపురం: వై. సత్యనారాయణగారు.

ఖరగ్‌పూర్: పి. వి. రమణయ్య, స్టోర్స్‌క్లర్క్., బి. ఎన్. ఆర్ వై. వర్క్ షాప్స్

కొవ్వూరు: కె. సి. చెన్న కేశవయ్యర్. గూడూరు: సి. సి. సుబ్బయ్య, మర్చంటు.

కాకినాడ: నున్నా బాలకృష్ణరావు, న్యూస్‌బాయ్ అండు కో.

అనకాపల్లి: సివాజీ న్యూస్ ఏజన్సీ.

నెల్లూరు: సి. సుబ్బరావు అండు సన్సు.

భీమవరం: వంగల అచ్చుత రామయ్య, మేనేజరు, నెహ్రూ ఖద్దర్ స్టోర్సు.

గుడివాడ: శ్రీ శివరామ అండు కో.

తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.

అమలాపురము: పి. అన్నాజిశర్మ. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)

హిగిన్‌బాతమ్ స్టాలువద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిచే రచియించిన పుస్తకములు



1. **వసుమతి:**—సాంఘిక సాంసారికానర్థములను వివరించు నీతిబోధకమగు చక్కని సాంఘిక నవల. పాఠశాల పఠనీయగ్రంథముగా అప్రూవు చేయబడును. ... వెల 0 12 0

2. **బాలనీతి కథావళి:**—నీతిబోధకములగు ఇరువది కథల సంపుటి. దొరతనమువారిచే పఠనీయ గ్రంథముగా అప్రూవ్ చేయబడినది. ... ... వెల 0 10 0

3. **విశ్వామిత్ర మహర్షి:**—ఈ మహర్షియొక్క అద్భుతచరిత్ర మిందు ప్రౌఢభాషలో వర్ణింపబడినది. ... ... ... ... వెల 0 8 0

4. **ద్రౌపదీ వస్త్రసంరక్షణము:**—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

5. **సత్యాద్రౌపదీ సంవాదము:**—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

6. **జ్యోతి:**—ఆరోగ్యనాటకము, హెల్తు డిపార్టుమెంటువారిచే ఆమోదింపబడినది.

7. **పెన్షను పుచ్చుకున్ననాటి రాత్రి:**—అనేకమంది విద్యాధికులచే ప్రశంసింపబడిన చక్కని కథ. గృహలక్ష్మినుండి పునర్ముద్రింపబడినది. ... ... వెల 0 1 0

8. **శారదలేఖలు:**—

ఈ పుస్తకములన్నియు నొకేమారు తెప్పించుకొనువారికి 3 రూపాయలకే యివ్వబడును. పోస్టు కర్చులు ప్రత్యేకము.

ఈగ్రంథములు వలయువారు:

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు,

బాపట్ల, గుంటూరు జిల్లా. అని వ్రాయవలయును.

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారి

# జీవామృతము

1898 సం॥ నుండి భారతవర్షమునం దంతటను ప్రసిద్ధిలో నున్న

## ఆరోగ్యప్రదాయిని




దీనిని వాడుటవల్ల
బలహీనదేహములకు బలమును,
దుర్బలవీర్యులకు పటుత్వమును,
నిద్రాహీనులకు సుఖనిద్రయు,
నరములప్రోగుకు కండపుష్టియు,
మందకొడిగ నుండువారికి ఉల్లాసమును,
జీర్ణశక్తి లేనివారికి జఠరదీప్తియు,
రక్తహీనులకు క్రొత్త ఎఱ్ఱటిరక్తమును,
జ్ఞాపకహీనులకు జ్ఞాపకశక్తియు,
పాలిపోయినవారికి తేజస్సును,

మొదలగు అసంఖ్యాకములైన సుగుణములెన్నియో కలుగును. స్త్రీపురుషులెల్లరు వయోభేదము లేక ఎల్లకాలముల సేవింపదగిన దివ్యమైన టానిక్కు.

రెండు సైజులలో ఎల్లప్రదేశములందును దొరకును.

# బాలభాస్కర

(రిజిస్టర్డు)

ఇది బిడ్డలకు తరుచుగా కలుగుచుండు

## లివర్ అండ్ స్ప్లీన్ వ్యాధులకు

అమోఘముగా పనిచేయును.

సమక్షమునగాని ఉత్తరముల ద్వారాగాని

వివరములు తెలిసికొనుడు.

# ఆయుర్వేదాశ్రమం

**151 గోవిందప్పనాయక్ వీధి, పోస్టుబాక్సు నెం. 287, మదరాసు.**

కొండకోలకు. వికసితోత్పలశ్రీ క. కవి మ-రా-రా-శ్రీ కవికొండల వెంకటరావుగారి విరచనములు అచ్చుపడినవి.

కనీసపు తగ్గింపువెలలకు 1935 సంక్రాంతినుండి సంవత్సరాదివఱకు మాత్రమే.

* స్త్రీలకు శ్రీరామనవమి వఱకును *

# అభినవాంధ్ర కార్యస్థాన సుప్రకాశితములు

| పుస్తకము ప్రతి 1-కి | అసలు వెల | | | తగ్గింపువెల | | |
|---|---|---|---|---|---|---|
| 1. మాతృదేశ సంకీర్తనము | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 2 కలరుతము | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 3 జనపదములు | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 4. కుమారీకంఠము | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 5. చదువులదుత్త | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 6. ప్రకృతిచందనము | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 7. కోనేరు | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 8. చిట్టికైత | 0 | 6 | 0 | 0 | 1 | 0 |
| 9. ఆత్మవ్యక్తి | 0 | 8 | 0 | 0 | 6 | 0 |
| 10. పొట్టికథ | 0 | 8 | 0 | 0 | 6 | 0 |
| 11. అగడపులు | 0 | 8 | 0 | 0 | 6 | 0 |
| 12. విప్రసందేశము | 1 | 0 | 0 | 0 | 10 | 0 |
| 13. జంటలు | 1 | 0 | 0 | 0 | 10 | 0 |
| 14. త్రయి | 0 | 14 | 0 | 0 | 10 | 0 |
| | [illegible]—6—0 | | | 3—8—0 | | |

## విశేషగమనిక

రూపాయకు తక్కువ అయిన ఆర్డర్లు అంగీకరింపబడవు. సొమ్ము ముందుగ మనియార్డరు చేసినయెడల కొనుక్కొనువారికి తపాలఖర్చులు తగులవు. మొత్తము సెట్టునంతను నొకసారి తీసికొనువారికి సెట్టంతయు మూడురూపాయలు మాత్రమే. మొదటి నాలుగుపుస్తకములలో నే వానిలోనైనను వందపుస్తకము లొకసరి తీసికొనువారికి ఆ వందపుస్తకముల ఖరీదు అయిదు రూపాయలు మాత్రమే. త్వరపడుడు. కొన్నికొన్ని కొలది ప్రతులుమాత్రమే కలవు.

వలసినచో

కవికొండల వెంకటరావుగారు, బి. ఎ. బి. ఎల్.,

ఇన్నీసుపేట, రాజమండ్రి. అని వ్రాయునది.




సంపాదకుండు

**డాక్టరు. కే. యన్. కేసరి**

సంపుటము ౮.] మే 1935 [సంచిక ౩

*Printed at Lodhra Press, Egmore, Madras.*

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్ధసంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతి లేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటన రేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ఉంచబడిన రేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువవైన ప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలముల రేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసు చేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈపఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులు వ్రాయజాలము. రిప్లయికార్డు వ్రాసిననే జవాబు ఈయబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదని వ్రాయుచో తిరుగ కాపీలు పంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథాకీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగనుండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు.

# నవనాగరికమైన వన్నె చిన్నెల బట్టలు

## కావలెనంటే

**ఫ్యాషను సిల్కుప్యాలెసు ప్రఖ్యాతివహించియున్నది.**



14యేండ్లారూను
క్షిణ హిందూ
దేశమంతట
దీనిపేరు
మోగుచున్నది.

నాణ్యమైన
సరసమైన
చాలాకాల
మనుడ
ఇది మా
వ్యాపారసూత్రవ

### చీరలు

రకరకాల ప్రకాశవంతమగు రంగులు. క్రొత్త క్రొత్త ఫేషనుల అంచులు. ఏమి కట్టి శుభ కార్యములకు వేడుకలకు ఎటువంటివి కావలసిన వటువంటివి దొరకును. తమరు స్వయముగా వచ్చి చూడవచ్చును లేదా జాబుద్వారా ఆర్డరు పంపవచ్చును.

45 — **చెల్లారామ్స్**

టౌన్ బజారు, మదరాసు.

.బ్రాడ్ కాస్టు రికార్డులు

# Broadcast



సంగీత కచ్చే

12 ఇంచి

బ్లూ లేబిల్

రికార్డు

ధర రూ. 4

B. T. 204

నగుమోమ

భాగములు

1 & 2

ఆభేరి





ఇంచి

బ్లూ

లేబిల్

కార్డు

2-12

2068

రఘుకుల

భాగములు

1 & 2

ఉసేని

(తెనుగు కృతి)



మిస్. ఎం. ఎస్. సుబ్బులక్ష్మి, మదరాసు.

మ్యూజికల్స్ ప్రాడక్ట్సు లిమిటెడ్,

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావు. నూజవీడు: వైద్యుల నారాయణ
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ ప్రొప్రయిటర్స్ ఆఫ్ న్యూస్.
మచిలీపట్టణము: ఎస్. బి. లింగమ్, చీఫ్ ఏజంటు.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు.
నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశీరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కంపెని.
జెమ్‌షెడ్‌పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్ పైప్ కంపెనీ,
బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్. [లిమిటెడ్
గుంటూరు: వెల్‌కం అండు కంపెని. మైసూరు: స్టూడెన్ట్సు హాలు.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు
పిఠాపురం: ఎం. నూకరాజు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
మదరాసు: వై. నారాయణగారు, 364 ఎస్ప్లనేడు.
బొంగుళూరు కంటోన్మెంటు: ఆనందా బుక్ డిపో. ఏలూరు: బి. విశ్వనాధంగారు.
తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్‌పేట.
ఒంగోలు: తాతా జాలయ్య శెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్ వీధి.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.
విజయనగరం: ఆయపిళ్ల .సూర్యనారాయణరావు
నరసాపురం: వై. సత్యనారాయణగారు.
ఖరగ్‌పూర్: పి. వి. రమణయ్య, స్టోర్సుక్లర్కు, బి. ఎన్. ఆర్ వై. వర్కు షాప్సు
కొవ్వూరు: కె. సి. చెన్నకేశవయ్యర్. గూడూరు: సి. సి. సుబ్బయ్య, మర్చంటు.
కాకినాడ: నున్నా బాలకృష్ణరావు, న్యూస్ బాయ్ అండు కో.
అనకాపల్లి: సివాజీ న్యూస్ ఏజన్సీ.
నెల్లూరు: సి. సుబ్బరావు అండు సన్సు.
భీమవరం: వంగల అచ్యుత రామయ్య, మేనేజరు, నెహ్రూ ఖద్దర్ స్టోర్సు.
గుడివాడ: శ్రీ శివరామ అండు కో.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.
అమలాపురము: పి. అన్నాజిశర్మ. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)

హిగిన్‌బాతమ్ స్టాలులవద్ద దొరకును.

# మాధవి



ఇది పుష్పసారములతో నిండియుండు ఒక నాజూకైన మంచువంటి పరిమళపదార్థము. ఈ మంచును కొద్దిగ వ్రేలితో తీసుకొని ముఖమునకు లేపనమును చేసికొనిన వెంటనే అది చర్మములో మాయమై ముఖమునకు కళ, కాంతి నిచ్చును. ముఖము స్ఫటికమువలె నిర్మలమగును. ముఖమున లేచు పోబి, మచ్చలు, మొటిమలు మొదలగువానిని మాన్పును. మరియు దీనిని ముఖమునకు పట్టించుకొనిన వెంటనే ముఖము చల్లగ నుండి మంచు రాచుకొనినట్లేయుండును.

వెల బుడ్డి 1-కి 8 అణాలు.

కేసరికుటీరం, ఎగ్మూరు, మద్రాసు.

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు రచియించిన పుస్తకములు



1. వసుమతి:—సాంఘిక సాంసారికానర్థములను వివరించు నీతిబోధకమగు చక్కని సాంఘిక నవల. పాఠశాల పఠనీయగ్రంథముగా అప్రూవు చేయబడును. ... వెల 0 12 0

2. బాలనీతి కథావళి:—నీతిబోధకములగు ఇరువది కథల సంపుటి. దొరతనమువారిచే పఠనీయ గ్రంథముగా అప్రూవ్ చేయబడినది. ... ... వెల 0 10 0

3. విశ్వామిత్ర మహర్షి:—ఈ మహర్షియొక్క అద్భుతచరిత్ర మిందు ప్రౌఢభాషలో వర్ణింపబడినది. ... ... ... ... వెల 0 8 0

4. ద్రౌపదీ వస్త్రసంరక్షణము:—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

5. సత్యాద్రౌపదీ సంవాదము:—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

6. జ్యోతి:—ఆరోగ్యనాటకము, హెల్తు డిపార్టుమెంటువారిచే ఆమోదింపబడినది.

7. పెన్నను పుచ్చుకున్ననాటి రాత్రి:—అనేకమంది విద్యాధికులచే ప్రశంసింపబడిన చక్కని కథ. గృహలక్ష్మినుండి పునర్ముద్రింపబడినది. ... ... వెల 0 1 0

8. శారదలేఖలు:— వెల 1 0 0

ఈ పుస్తకములన్నియు నొకేమారు తెప్పించుకొనువారికి 3 రూపాయలకే యివ్వబడును. పోస్టు కర్చులు ప్రత్యేకము.

ఈ గ్రంథములు పలయువారు:

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు,

బాపట్ల, గుంటూరు జిల్లా. అని వ్రాయవలయును.

# GRAND SILVER JUBILEE OFFER
# WIN Rs. 20,000
### Closing Date 18th May 1935.
## FIRST PRIZE RUPEES TWELVE THOUSAND
(FOR AN ALL CORRECT ENTRY)

**:COND PRIZE RS. 3,000** (FOR ONE MISTAKE) **THIRD PRIZE RS. 1,500** (FOR TWO MISTAKES)

### SPECIAL PRIZES.

**rand New Baby Austin Car (Cost Rs. 2,800)**—(For the first all-correct entry)
(On Show at Stanes Motors (S. India) Ltd., Coimbatore)

**uxurious Royal Portable Typewriter (Rs. 230)**—(For the next all-correct entry)

**lagnificent Husqvarna Hand Sewing Machine (Rs. 120)**—(For the next correct entry from a lady)
(Both on show at MESSRS. ADDISON & CO., MADRAS.)

For the Competitor who submits the maximum number of entries.

**Brand New H. M. V. Gramophone with Records *or* One H. M. V. 8 Valve Superheterodyne All ware Radio Receiver (Each Rs. 350) on Show at Gramophone Co., Ltd., Bombay and Bangalore.**

### Rupee ONE per entry.

| Letters | Clue | Value |
|---|---|---|
| | A sweet flower | (57) |
| | Miss | (51) |
| R | Portion | (55) |
| E | Passage of water | (46) |
| E | Superlative | (46) |
| E | Allowance | (44) |
| | Soothes in trouble | (28) |
| | Trial of speed | (27) |
| | Female | (32) |
| L | Clothed | (20) |
| E | Current | (38) |
| M T | A Measurement | (61) |

R : 18
O : 15
S : 19
E : 5

Total 57

**Ref :- Chamber's XX Century Dictionary.**

### WHAT TO DO.

You have to fill in the Blank Squares and find the words as per the clue given against each. The numerical value of the letters of the alphabet are given below and you can check the correctness of the solution by adding the numerical value of each letter of the word and comparing the sum with the number given against each. No. 9 has only three letters and No. 12 five.

Eg. Take No. 1. A sweet flower (57) The answer is R O S E and the accuracy is checked as below.

| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |
| 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 |

**LES AND CONDITIONS.** An entrance fee of **Rupee One** is payable for each entry per M. O. only. Plain paper entries cepted. M. O. receipt must accompany the solution. Competitors shall write their name and address and the number of tries submitted on the back of the envelopes and on the M. O. coupons in Block capital letters.

In case of tie or ties the money will be equally divided. No correspondence can be entered into or interview anted. Decision of the secretary in all matters relating to this competition is final and legally binding. Anybody no mplying with the rules will be disqualified.

Paid or honorary employees of the club or members of their families are not permitted to compete.

Enclose an addressed envelope and an anna loose postage stamp for posting the detailed winners' list.

Copies of key solution kept in sealed cover with Manager, "Times of Ceylon" "Malayala Manorama" and som her principal Newspapers in S. India.

Address all entries to the "**Competition Secretary**" and M. O's. to the "**Treasurer**".

## INDO EUROPEAN CLUB,

**.UB LINKS, KOTTAYAM, S. INDIA. PUBLISHING RESULT IN HINDU of 25th MAY 193:**

**V B.—A copy of Chambers XX Century Dictionary will be forwarded on receipt of Rs. 5-14-0 per M. O. by "ASSOCIATE**

# విషయసూచిక



త్రివర్ణచిత్రము :

'ఉష

# ఛాయాచిత్రములు

## చిత్రపటముల వివరములు

త్రివర్ణచిత్ర చిత్రకారిణి శ్రీమతి ఆర్. కమలాబాయ్‌గారు

### కోలాటము.

బొంబాయినగరమున మాతుంగావద్ద దక్షిణఇండియా ఎడ్యుకేషను సంఘమువారు నూతనబాలికాపాఠశాలను కట్టించుటకు శంకుస్థాపనచేయు నవసరమున అచ్చటి బాలికలు ఈ కోలాటనాట్యములు సల్పిరి.

### శ్రీమతులు అహమ్మదాలీ, బేగము కమాలుద్దీనుగార్లు.

టర్కీలో ఇస్టాన్బులు నగరమున జరుగుచున్న ఇంటర్నేషనలు వుమన్సు మహా సభకు భారతదేశమునుండి వెళ్లిన ప్రతినిధులు.

### శ్రీమతి గున్నమ్మడిదల దుర్గాబాయమ్మ, పొణకా కనకమ్మ, వేదాంతం కమలాబాయిగార్లు

మదరాసు శాసనసభ యెన్నికలలో శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతిగారి తరపున మదరాసులో ప్రచారము చేసినారు.

### శ్రీమతి రుక్మిణి లక్ష్మీపతిగారు

మదరాసు శాసనసభ ఉపయెన్నికలలో విజయ మందినారు.

### మిస్ జోహ్రా.

కళా కినీటోనువారి 'హిందాల్కి మదనమంజరి'లో నటించిన యువతి.

### శ్రీమతి హెలీదా ఎడిబ్‌గారికి స్వాగతము.

ఈమె టర్కీనుండి వచ్చి అచ్చటి మహిళా జనోద్యమమునుగూర్చి భారతనారీ మణులకు ప్రబోధకోపన్యాసము లొసంగినారు.

### శ్రీమతి సుబ్బలక్ష్మి, మధుర.

ఈమెవయసు దాదాపుగా 16 వర్షములుండును. గ్రామొఫోనులో నీమె యెన్నో పాడియున్నది. ముఖాముఖి నీమెపాట వినుట యొక యదృష్టమే! ఇది యతిశయోక్తికాదు.




## పాతివ్రత్యసూత్రము — ధర్మశాస్త్రములబలము

భారతదేశసంప్రదాయము ప్రకారము చూచినచో వివాహము చతుర్విధపురుషార్థదాయకము. గార్హస్థ్యధర్మనిర్వహణ సాధనమై, లోకసంగ్రహ ప్రయోజనమై, ఇష్టకామ్యార్థసిద్ధిదమై, మోక్షకారకమైన గృహస్థాశ్రమము తక్కిన యాశ్రమవాసుల కెల్లను కూతపట్టై శ్రేష్ఠతమమయినదిగా సమస్తధర్మశాస్త్రములయందును ప్రశంసింపంబడినది. కావుననే వివాహమునకు వైదికసంప్రదాయములో మోక్షకారకములైన షోడశకర్మలలో నొక యుత్తమస్థాన మొసంగంబడినది.

ఆధ్యాత్మికపరిభాష చాలనర కథము కాని మనకు భౌతికదృష్ట్యా పరిశీలించినను వివాహము కాయికమై మోహమును తీర్చును. మానసికమై స్త్రీపురుష స్నేహమును స్నిగ్ధమొనర్చును; సాంఘికమై సంసారములను పెంచి దేశాభివృద్ధిని చేయును. మోక్షసిద్ధిలో భౌతికశాస్త్రములకు విశ్వాసము లేదు గనుక ప్రస్తుత వివాహసంస్కరణ సమస్యలలో దానికి గమనించవలసినంత స్థానమే లేదు. భారతదేశములో మాత్రమింకను ఆప్రాతవిశ్వాసమునంబట్టి వ్రేలాడువారు గలరు.

భారతీయ ధర్మశాస్త్రములలో చెప్పబడిన యిట్టి మోక్షకారకత్వము పతిదైవతత్వము యితరమతముల సూత్రములలో లేకున్నను, ఏమతముగాని వివాహమును ఒక కాయిక సాంఘికకర్మగా నంగీకరించుటతో మాత్రము తృప్తినొందక దానికొక శాశ్వతత్వమును పవిత్రత్వమును ఆరోపించియే యున్నది. ధర్మశాస్త్రములలోను మతగ్రంథ

ములలోను వివరింపఁబడిన శాశ్వత పవిత్ర మోక్షభావములలో విశ్వాసముతో చేసుకొనబడిన వివాహములకు వైదిక లేక మత సంబంధ వివాహములనియు (religious marriages) తక్కిన కాయికమానసిక సాంఘిక ప్రయోజనములయందు మాత్రము విశ్వాసముతో చేసుకొనఁబడిన వివాహములకు సాంఘిక వివాహములు (civil marriages) లేక ఒడంబడిక వివాహములు (contract marriages) అనియు వ్యవహారములో వాడుక. ఇట్టివివాహము లెప్పుడు పట్టిన నప్పుడు, ఎవరిష్టమైనచో వారితో చేసుకొని, యిష్టముచెడగానే త్రెంచుకొని యిష్టమైన యితరులతో చేసుకొనవచ్చును. స్వయంవరము వివాహవిచ్ఛేదము అను సంపూర్ణవ్యక్తి స్వాతంత్ర్యపు హక్కులపై నిట్టి వివాహము లాధారపడుచున్నవి. వీని ఫలితముగా అమెరికా మొదలగు పాశ్చాత్యదేశములలో వివాహవైఖరులెల్లయు చాలా అరాచకములపాలై, గార్హస్థ్యబంధములు పటాపంచలై, నైతికపు కట్టుబాట్లు త్రెగిపోవుచున్నవనియు, రాజకీయముగ సాంఘికముగ స్త్రీపురుషుల కెట్టి సౌకర్యాభివృద్ధులు చేకూరినను నీతివిశ్వాసములు విచ్ఛిన్నములైన సంఘములు వృద్ధికి రాజాలవనియు, సాంఘికజీవనము పరిశుద్ధమై మనోహరము కావలెనన్న వివాహవిషయములో మతసిద్ధాంతములకు గౌరవము కలుగవలెననియు, అవసరమైనచో యిందువిషయమై చట్టములనుగూడ చేయవలెననియు రివరెండు గిల్లిసుగారు 'క్యాతలిక్కువరల్డు' అను పత్రికలో వ్రాయుచున్నారు. ఆర్థిక రాజకీయసైనికవిషయములనుగూర్చి తీసుకొనుచున్నశ్రద్ధలో నూరవపాలైనను ఇట్టి ప్రధానసమస్యవిషయమై రాజకీయవేత్తలు తీసుకొననందుకు ఆయన వగచుచున్నారు.

"అతి తరచుగా వివాహములు విచ్ఛేదములు చేసుకొనుచున్న వీరు తమ చర్యలను సమర్థించుటకు అనంతమైన కామవాంఛను తప్ప వేరొకదానిని దేనినిగాని కారణముగ చూపలేకున్నారు. బైబిలునుమాత్రమే వారు తృణీకరించి హేళనచేయుటతో తృప్తినొందక మానమర్యాదలనుగూడ తృణీకరించుచున్నారు. బైబిలులో వివాహమునుగూర్చి యేమిగలదో వారు పఠించి తెలుసుకొననైననోల్లరు. 'భార్య నెవడు విడచిపెట్టి వేరొకతె కరగ్రహణ మొనర్చుచున్నాడో అతడును, భర్తచే విడచిపెట్టబడి వేరొకని నెవ్వతె కరగ్రహణమొనర్చునో ఆమెయు వ్యభిచారదోషమునకు పాల్పడుచున్నా'రని బైబిలు చెప్పుచున్నది. బైబిలును మరచిపోయిన యీతరము వారి కిట్టి సిద్ధాంతములు విపరీతముగ వినబడుటలో ఆశ్చర్యములేదు. బైబిలును నమ్మినను నమ్మకపోయినను క్రైస్తవ యూదీయ, అక్రైస్తవ సిద్ధాంతముల కన్నిటికినిగూడ విరుద్ధమైన యిట్టిచర్యలకు వారుత్తరవాదులుకాక తప్పదు. ధర్మశాస్త్రములు మాకు తెలియవు; వానిని మేము నమ్మమన్నంత మాత్రమున వానిలో విధింపఁబడిన బాధలు మనకు తప్పిపోవు" అని అతడు ఆవ్యాసమునందే వాపోయినాడు.

నవనాగరకులు అతని విశ్వాసముతో సంపూర్ణముగ ఏకీభవించినను ఏకీభవించకున్నను వివాహమొక ధర్మశాస్త్రకర్మగా పరిగణింపఁబడవలెనను విశ్వాసముగలవారన్ని దేశములలోను జాతులలోను పెక్కురు గలరు. కాని యీవివాహకర్మయందు భారతీయులకు భారతీయస్త్రీలకుగల యంత విశ్వాస మింకేజాతికిని లేదనియే చెప్పవచ్చును. భారతస్త్రీల కింకను పతియన్న దైవము. దైవముయొక్క గుణములను లోపములను భక్తుడు సంశయింపఁగూడనట్లు భర్తలోపములను గూర్చి భారతాంగన యిప్పటికిని చర్చింపనొల్లకుండనున్నది. భర్తయొక్క లోపములు పాపములుగూడ తన పాతివ్రత్యమహిమవల్లన మటుమాయము కాగలవనియు, అందుకే ఆపె యువతారమనియు నేటికిని ఆమె విశ్వసించుచున్నది. భర్తృమరణానంతరముగూడ వేరొకపురుషుని వివాహమాడుట అయోగ్యముగ పరిగణించుట కలవాటుపడిన ఆమెను సజీవభర్తతోడిదే పతివ్రతయొక్క జీవితమనియు, అతనితరువాత ఆమె జీవించుటకైన నయోగ్యఅనియు ఒకప్రాచీన విశ్వాసమింకను పీడించుచునేయున్నది. సహగమనమును నిషేధించు ప్రభుత్వశాసనమే లేకున్నచో ఎంతమంది పతితోకూడ చితిలో దూరకుండ నొల్లనివారు భారతజాతియందు గలరో చెప్పఁజాలము. సహగమనమును నిషిద్ధముచేసి వేనవేలస్త్రీల జీవితములను మానవకోటికి దక్కించిన ప్రభుత్వమువారీవిషయమున కృతజ్ఞతాపాత్రులని ప్రగాంతీకరణములు గల వారెల్లరును విశ్వసింపక మానరు. విధవావివాహములు ప్రభుత్వశాసనసమ్మతములైనను వైదికపాతివ్రత్యవాసనలు నంటికి బట్టిపోవుచు భారతాంగనలలో పెక్కురు దానివల్ల నెట్టిప్రయోజనమును బడయనొల్లకున్నారు. వైదికసంప్రదాయము లర్థము చేసుకోనేరని మిస్ మేయోవంటి పాశ్చాత్యవిలేఖరులెందరో యిదియంతయు మతదౌర్జన్యమనియు, మతపిచ్చియే లేకున్నచో వీరందరును పునర్వివాహములుచేసుకొని కులుకగలవారే యనియు, పాశ్చాత్య విద్యావిమర్శనలనీదేశములో వ్యాపింపఁజేసి వారినందరిని భోగసౌధాంతముల మీదికెక్కించి పుణ్యము కట్టుకొనవలెననియు ఎడతెగనిప్రచారములు చేయుచునేయున్నారు. అయినను పుణ్యమూర్తులగుభారతీయాంగనల కీసిద్ధాంతమిప్పటికిని నప్పటికిని నచ్చక నోములు వ్రతములు యాత్రలు తీర్థములు దానములు ధర్మములు పూజలు ఉపవాసములు మొదలగువానిలోనే నవయ నిచ్చగించుచుండుట వారి జ్ఞానవిశేషమో అజ్ఞానమహిమయో నిర్ణయించవలసిన భారమును విజ్ఞులకు పండితులకే విడచిపెట్టగోరుచున్నాము.

అన్నింటిలో ఆశ్చర్యకరమైన విషయము భారతదేశములో విగతభర్తృకలైన స్త్రీలింకను వ్రతోపవాసముల నవయుటతో మాత్రము సంతృప్తినొందక సహగమనము చేయ తాపత్రయము పడుచుండుటయై

యున్నది. ఇట్టివారు పెక్కుమంది లేక పోవచ్చునుగాని కొద్దిమందికల్గినను అది భారతీయాంగనల కాచట్టనిషిద్ధకర్మయందు గల విశ్వాసపరిమితికి నిదర్శనమనియే చెప్పవలెను. వారికా కర్మయం దట్టివిశ్వాసము కలదు గనుక వారు మరణించుటకు ప్రభుత్వశాసన మనుమతి యియ్యవలెననికాని నిషేధించరాదనికాని వాదించు ఛాందసు లిప్పుడెచ్చటను లేరు. మహాత్మాగాంధిని యీప్రశ్నయే యొకరు వేసినప్పుడు "సహగమనముచేయు కోరికయు విశ్వాసమును స్త్రీకి వుంటేవుండునుగాక కాని చట్టమందు కంగీకరింపరాదు, ఆపవలె"ననియే అతడు నిష్కర్షగ వాక్రుచ్చినాడు. ఈ ధర్మశాసనమొక టుండుటవలననే యేటేట ననేక ఆత్మహత్యలును స్త్రీహత్యలును ఈదేశమున నాగిపోవుచున్నవనికూడ అందరును గ్రహింపవచ్చును. ఈశాసనబలము వలననే ఇట్టి ఆవేదములు ఆవేశములు అప్పటిలో ఆగి, క్రమముగ చల్లారి విధవాజీవనమునకు కొందరును పునర్వివాహములకు కొందరును అలవాటు పడుచున్నందుకు గూడ మనము సంతోషించవలసినదే.

కాని యింకను అనేకమంది కిట్టిజీవనము కేవలము శాసననిర్బంధమువల్లను నిస్సహాయత వల్లనే కాని మనఃపూర్వకముగ నంగీకారము కాదేమోయని సంశయింపవలసి వచ్చుచున్నది. భర్తృమరణానంతర మాత్మహత్యలు చేసుకొనుచున్న వారియొక్కయు మంచముపట్టి కృశించి మరణించుచున్న వారియొక్కయు చరిత్ర లప్పుడప్పుడు వార్తాపత్రికలలో ప్రకటింపఁబడుచునే యున్నవి. మార్చినెల 25-వ తేదిని సాత్నానగరములో భగవత్ప్రసాదను బ్రాహ్మణుడు వెంకట హైస్కూలు పండితుడు మరణించెను. అతనిచితిలోబడి ఆమెభార్య మరణించుటకు ప్రయత్నించెననియు, బంధువులును పోలీసువారును ఆమెను అట్టిప్రయత్నము నుండి లాగి తన భర్తృకుటీరమునకు చేర్చిరనియు, ఆమె నాటినుండి నిరశనవ్రతమూని నీటిచుక్కయైనను త్రాగక మరణనిశ్చయముతో కృశించుచున్నదనియు, ఎవరెన్ని విధములబోధించినను ప్రయోజనము లేకున్నదనియు, వందలకొలదిజను లామె కుటీరమునకువచ్చి ఫలములు పూవులు దక్షిణలు యిచ్చి మ్రొక్కులు చెల్లించుచున్నారనియు జబ్బల్పూరునుండి ఫ్రీప్రెస్సు విలేఖరి పత్రికలకు వ్రాయుచున్నాడు. నవనాగరకత, నూతనస్వాతంత్ర్యతాసిద్ధాంతములు నాలుగుగుఱ్ఱాల రథములమీద పరుగులెత్తుచున్న యీ శాస్త్రీయ యుగములోగూడ భారతదేశములో నిట్టి విశ్వాసము లచంచలముగ వేనవేలు స్త్రీపురుషుల చిత్తములను వశీకరణ మొనర్చుకొని యేలుచుండుట భారతీయులకు ధర్మశాస్త్రములయందును మోక్షలబ్ధియందును గల ఆసక్తిని వేనోళ్ల చాటుచున్నది.

భర్తలుబ్రతికున్నన్నాళ్లు వారిలోపము లెక్కడనగుపించునో యని గాంధారివలె కండ్లకు గంతలుకట్టుకొని చూడనొల్లక,

ఇతరులు చెప్పిన విననొల్లక భక్తితో పరిచర్యలు సలుపుచు, మరణించినతరువాత సాధ్యమైనచో సహగమన మొనర్చుచు లేనిచో వ్రతోపవాసములతో నవయుచు అతనికి పుణ్యలోకసిద్ధికై తపస్సు చేయుచుండు నారీరత్నములు భారత నాగరికతకు పెట్టనిభూషణములు. అట్టి సుందరీరత్నముల గనుచున్న భరతమాతయు, వారిని పాణిగ్రహణము చేసుకొనగలుగుచున్న భర్తలును ధన్యులు. వారి ఋణములను వీరెవ్వరును యెన్నిజన్మములకును తీర్చుకొనలేరు. అట్టి పతివ్రతాశిరోమణులకు తగిన పూజా గౌరవములు పురుషు లీయజాలకున్నచో వారి జన్మనిరర్థకమనియే చెప్పవలెను. భారతదేశపు పురుషులలో విద్వాంసులు, వ్యవహర్తలు, శ్రీమంతులు, ధీమంతులు, పరాక్రమవంతులు పెక్కుఱుగలరు. వీరందరును ప్రతిదినమును ఇట్టి పతివ్రతాశిరోమణులకు భర్తలు కాగల అర్హతలు తమ వద్దనున్నవేమో ప్రతిదినమును ఆత్మపరీక్ష యొనర్చుకొనవలెను. అట్లొనర్చుకొనుచున్నచో మన దేశమున నారీమణుల ప్రస్తుత జీవనములు ఇంత దుఃఖభాజనములుకావు. అర్ధాసనముమీదఁ గూర్చోపెట్టుకోవలసిన నారీరత్నముల నెందరో ఈసడించి వేశ్యారతులును పరదారానుగతులును నగుచున్నారు. పాదములపైబడి మ్రొక్కవచ్చుచున్న శిరఃఫలకముల నెడమకాలఁ దన్నుచున్నారు. ఆలోచనలలోనికి తీసుకొని ఆదరించవలసిన సచివరత్నములను అజ్ఞానమున ముంచి అవమానము చేయుచున్నారు. ఇట్టిగతులు పాతివ్రత్యమునకై పేరుమోసిన భారత నారీమణులకు పట్టరానివని యెల్లరెఱింగినదియే. ఇట్టినారీరత్నముల కర్హమైన పతులుగ సుతులుగ సోదరులుగ అతిథులుగ హితులుగ మైత్రీలుగ, సేవకులుగ, యజమానులుగ జీవింపఁగల అర్హతను తమకు ప్రసాదించుగాక యని భారతపుత్రు లెల్లరును కాత్యాయనీదేవిని అనునిత్యము ప్రార్థింతురు గాక !

# తెలుఁగు యుగాది

చిత్త మలరించు చివురుల చీరగట్టి
తావులను జిమ్ము మల్లియల్ తలనుముడిచి
పిల్లతెమ్మెరపట్టిని వెంటనిడుక
రమ్య కలకంఠకూజిత రవళి మెరయ
క్రమగతివచ్చె తెలుఁగు యుగాదిలక్ష్మి

*　　　*　　　*

కాలచక్రంబునందున గ్రాలుచుండు
నాకులే సుమి యరువది యబ్దములును
చక్రభ్రమణాన నెన్నియో సారులిట్లు
భావ యువ ధాత వర్షాళి వచ్చివచ్చి
యాంధ్ర జగతినిపాలించి యరిగియుండె
క్రొత్తగాదిద్ది వానికి క్రొత్తగాదు.

*　　　*　　　*

ప్రాఁతవారైన పరదేశ వాసముండి
బహుదినాలకు నేతెంచు బంధులయెడ
ప్రీతినెఱపుట మనుజుల రీతిగాన
రమణ భవదీయమందిర రాజినెల్ల
వెల్ల సున్నంపుబూతల వెలయజేసి
రంగవల్లులదీరిచి రాణమీరు
పసపు గుంకంబులిడి దోరబంధములను
చూతదళతోరణంబుల సొగసుపఱచి
మావిపిండెల పచ్చళ్లు మంచిమంచి
వంటకంబులు భక్ష్యముల్ పాయసంబు
వేపపూ ప్రసాదంబుతో విందుబెట్టి
గారవింపుడి తెలుగు యుగాది నెలమి
లలిత మతులార యోగ్యహ లక్ష్ములార

కనుపర్తి వరలక్ష్మమ్మ

# స్వాగతము

సగు మొగమ్ములతోడ మా నన
ముగుదలెల్లను విరిసినవ్వగ
మొగిలుకన్నెక విజయహారతి మొనసి ఎత్తినది.

పంచమస్వర మెత్తికిన్నెర
పాటపాడెడి పరభృతమ్ములు
పారవశ్యముతో వసంతుని...పజ్జఁజేరినవి.

యువజనమ్ముల హృదయకాంక్షలు
యువజనమ్ముల ప్రమదజీవిక (కు)
అంక్షు వేయగ నవయువాబ్దం బవతరించినది.

తరలితిరిగెడు సమయచక్రము
దొరలియరిగెడు యబ్దవలయము
నరయమానవ జీవితమ్మె...సరికి సరియగునో.

ఓవసంతపికమ్మ స్వాగత
మోవసంతసమీర స్వాగత
మోవసంత సుమమ్మ స్వాగత...మోయువాబ్దంబ !

కొమరవోలు నిర్మలాదేవి

# స్త్రీ స్వాతంత్ర్య మెట్టిది?!

శ్రీమతి గొల్లపూడి కృష్ణవేణమ్మగారు

ఇతర దేశాలలోవలె మనదేశములోను పురుషులతోపాటు స్త్రీలకును అన్ని స్వాతంత్ర్యములును ఉండవలెను అనేవారు ఈకాలమున పెక్కుమంది ఉన్నారు. అయితే ఆ స్వాతంత్ర్యమనేది ఎట్టిదో వినేవారికివలెనే అనేవారికిగూడ అంతగా తెలియదేమో అని తలుస్తాను. ఇతర దేశాలలో అనేకముగా పురుషులతోపాటు స్త్రీలున్ను కడుపు కక్కుర్తికి గంటాలు పడువారు కలరని తెలుస్తున్నది. ఏబీదకుటుంబములలోనో, ఏతక్కువ జాతిలోనో తప్ప మనదేశంలో స్త్రీలకు అట్టి బాధ ఎప్పుడునులేదు. ఎన్ని అగచాట్లు పడియైన డబ్బు సంపాదించి యింటికి తీసికోరావలసినవారు పురుషులు. ఆద్రవ్యమును ఆహారపదార్థముగ తయారుచేయవలసినవారు స్త్రీలు. మొదటినుండి మనదేశములో ఇదే పద్ధతి అనుకుంటాను. ఇప్పటికి ఎన్నో రాజ్యాలు తలక్రిందైనట్లు వినుచున్నాము. కాని ఈపద్ధతి మాత్రము ఇంకను తలక్రిందు కాలేదు.

మనముకోరే స్వాతంత్ర్యాలలో ఇది యొకటిఅయితే (అనగా పురుషులు వంట యింట్లో స్త్రీలు ఆఫీసులలో) స్వర్గములో ఉండి, నరకమును కోరుచున్నామన్న మాట. గృహలక్ష్మి, బజారులక్ష్మి, ఆఫీసులక్ష్మి అయినచో ఇంక చెప్పవలసినదే లేదు. ఘోరము విచారించిన పురుషుడు ఇంటివెలుపలను లోపలగూడ అస్వతంత్రుడే. మన ప్రాచీనులు చేసిన యేర్పాటది. ఈసంగతి పెండ్లికాలములో చదువుమంత్రాల యర్థము తెలిసికొన్నచో ఏర్పడును. 'ధనవిషయములోగాని ధర్మవిషయములోగాని, కామవిషయములోగాని నామాటను ఎప్పుడును జవదాటగూడదు'అని మొదటనే గట్టి యేర్పాటుచేసికొని పురుషుని స్త్రీ వివాహమాడుచున్నది. చెమటడీసి సంపాదించిన ద్రవ్యములో తాను ఒకదమ్మిడీగూడ స్వతంత్రించి కర్చుపెట్టుటకు అధికారములేనివాడు పురుషుడని యేర్పడుచున్నది. అంతట అట్లు జరుగుచున్నదా అంటే అదివేరు. ఆసంగతి ప్రత్యేకముగా విచారిస్తాము.

ఇంక విద్యావిషయములో చూస్తాము: స్త్రీలు చదువుకోకూడదు అనేమాట మన అమ్మమ్మకాలమునాటిదో, అంతకు ముందటిదో!! మాకు బుద్ధితెలిసినదిమొదలు అట్టిది వినరాదు. ప్రాచీనకాలములో ఎందరో స్త్రీలు, విద్యావతులున్నట్లును, వారు గ్రంథరచయితలేగాక పెద్దపెద్ద సభలలో శాస్త్రవాదములుచేసినట్లును తెలుస్తున్నది. ప్రకృతము, స్త్రీవిద్యకై వాగ్వ్యాయము చేసేవారు పెక్కురు. కాని స్త్రీజాతికి వన్నె తెచ్చునది యెట్టివిద్య అట్టి విద్యాశాలలు ఈవిశాల భారతదేశంలో ఎన్నియున్నవి అని విచారించేవారులేరు. ఇప్పటివిద్య పురుషులకే అనర్థము నిష్ప్రయోజనము కానిసచదువు అని దూషించుచు బాలురతోపాటు బాలిక

లనుగూడ ఆ విద్యాశాలలకే అందఱును పంపుచున్నారు. ఈ విద్యవలన స్త్రీలకు ఎట్టి ప్రయోజనమని అడిగితే గ్రుడ్డికన్నుకన్న మెల్లకన్ను మేలుగదా అని సమాధానము; కాని మెల్లకన్ను ఎప్పుడో యొకప్పుడు అపాయకరమని గూడ తలంచవలెను.

చక్కగ విచారించినచో, లోకానికిభయపడో, మొగమోటమునకో, మఱెందులకో గాని ప్రకృతము చాలమంది పురుషులు స్త్రీజాతియెడ చూపు గౌరవము తక్కువైనది కాదు. తమకంత యిష్టములేకపోయినను భార్యలనిమిత్తము సినిమాలకు, నాటకాలకు స్త్రీలను వెంటబెట్టుకొని వెళ్లే పురుషులు పెక్కురు. బాలురకువలె బాలికలకును ద్రవ్యము వెచ్చించి చదువు చెప్పించువారు చాలమంది. ఇట్టిస్థితిలో స్త్రీలు తమబాధ్యతను ఎంతవరకు గుర్తించినారో ఆలోచింపుడు. కొన్నివత్సరాలక్రిందట జాతీయత వంటయిండ్లలో నవయుచున్నదని చెప్పుకొనేవారు. అచటిపొగకు తాళలేక కాబోలు చెప్పకుండ పరుగెత్తిపోయినదని యిప్పుడనుకొనుచున్నారు.

నూటికి, కాదు పదివేలమందికి ఏయొక్కరో ఉన్నతవిద్య నభ్యసించి పురుషులకంటె పైచెయ్యి అనిపించుకొని సంఘమునకు దేశానికి పాటుపడు సోదరీమణులమాట యటుండనిండు. తొమ్మిదివేలతొమ్మన్నూటతొంభైతొమ్మిదిమంది మాటనుగూర్చి నేను చెప్పేది. మన వేషమందు, మన యాచారమందు, మన భాషయందు మనకే గౌరవము లేనపుడు ఇకమనకు స్వాతంత్ర్యమేమిటో తెలియదు. అర్జునుడు బంధువులను చంపుటచే గలుగు కులక్షయమును తలచి 'స్వామీ! కులక్షయమగునేని సనాతన ధర్మములు నశించును. దానిచే అధర్మము వ్యాపించును. అధర్మము ప్రబలెనేని కుల స్త్రీలు చెడుదురు. స్త్రీలు చెడినచో జాతినశించును' అని శ్రీకృష్ణునియొద్ద మొఱపెట్టుకొన్నాడు. కాబట్టి ఏకాలమందుగాని, ఏదేశమందుగాని జాతీయత స్త్రీలపైననే ఆధారపడియున్నది. పురుషులపైననే ఆధారపడియుండినచో ఇదివరకెప్పుడో మనజాతీయత ఊరుపేరులేకుండ పోయి యుండును.

ఇంకొకమాట:—మృగజాతినుండి వేరుపడవలెనన్న మానవజాతి కొన్ని నియమాలకు కట్టుపడవలయును. అయితే సామాన్యనిబంధనలు అందఱకు సమానమే. విశేషనియమాలు మాత్రము అట్లుగాదు: పురుషులకు వేఱు. స్త్రీలకు వేఱు, బాలురకు వేఱు, వృద్ధులకు వేఱు, ఆయానిబంధనలకు తలయొగ్గినపుడే వారివారి మేలుగలుగును. అదుపాజ్ఞలులేక మమ్ములను అనేవారు లేరుగదా అని నిరంకుశముగ ప్రవర్తించి తాము అన్నమో రామచంద్రాఅనుచు తమతోపాటు తమ యాలుబిడ్డలను అలోలక్ష్మణాఅని అల్లాడపెట్టువారిని ఎందఱినో చూచుచున్నాము. కావున స్వాతంత్ర్యమనేదానికి కొన్ని నియమములకు లోబడిన స్వాతంత్ర్యమనియే యర్థము. ఇట్టి స్త్రీస్వాతంత్ర్యమునుగూర్చి సోదరసోదరీమణులు చక్కగ ఆలోచించి పుణ్యము గట్టుకొందురుగాక.

# స్త్రీ సంస్కృతవిద్యాలయములు–కొన్ని సూచనలు

ఉ. భా. ప్ర. దువ్వూరి సూర్యనారాయణమూర్తిగారు

ఆంధ్రమాత రత్నగర్భమున నుద్భవమందిన స్త్రీ విద్యాలయములు నేటికి లెక్కకు తక్కువగానే యున్నవి. ఉన్నవానిలో కొన్ని సర్వసౌభాగ్యములతో తులతూగుచు నక్షత్రమార్గమునంటుచున్నవి. మరి కొన్ని తగుమాత్ర వసతులు గలిగి తమమట్టుకు తమకు సరిపడునట్లున్నవి. మరికొన్ని నానాకడగండ్లపడుచు తిండియున్న విద్యలేక విద్యగలిగిన తిండిలేక ఈ రెండున్న వసతిలేక అన్నియున్నపుడు పోషకవర్గము కుదరక అనేకవిధములైన కష్టనష్టముల కాకరములగుచున్నవి. ఇవిట్లు కొంత విచ్ఛిత్తి దశలోనికి వచ్చుటకు కొన్ని కారణములు గలవు. వానిని నాయనుభవమునుబట్టియు, లోకపరిచయమును బట్టియు వ్రాయుచున్నాను.

## విద్య

ముందుగా నేటి ఎలిమెంటరీ, అడ్వాన్సు, స్త్రీ పాఠశాలలలో నేర్పబడుచున్న విద్యను పరిశీలింతము. ఈ చదువు గవర్నమెంటువారు నియమించిన కరులం ప్రకారము నేర్పబడుచున్నది. కాని ఈపద్ధతి స్త్రీల కెంతజ్ఞానబోధ నిచ్చుచున్నదో ఊహ్యము. ప్రథమమున ఎలిమెంటరీ కక్ష్య నాల్గువిధములుగా విభాగింపబడినది. అందు రెండవతరగతికి రఘువంశము, విక్రమార్క చరితము పఠనీయ గ్రంథములు. అసలు పంచకావ్యవిభాగమే కొంతవ్యత్యాసముగా నున్నది. బాలికలకుగాని యువతులకుగాని ప్రతికావ్యమందును, అధమాధమము నాలుగైదు సర్గలైనను చెప్పితీరవలెను. ఈసర్గలలోని కథ పూర్వరాజులకు సంబంధించినదే యైనను నడుమనడుమ ఆతరగతి స్త్రీలకు, బాలికలకు గ్రహణయోగ్యములుగాని విషయముల నేకములున్నవి. అవి అనుభవైకవేద్యములుగా నున్నవి. ఈ అగ్రాహ్యవిషయము, శృంగారసంబంధముగాను, ఆరోపణాది మూలకమైన అలంకారసంబంధముగాను, వృత్త సంబంధముగానుకూడ నున్నది.

ఇక రెండవతరగతికి కుమారసంభవము మేఘదూత దశకుమారచరితమును పఠనీయములు. ఇందును పైని చెప్పిన బోధలన్నియు గలిగియేయున్నవి. ఈగ్రంథములన్నియుగూడ పిల్లల లేతహృదయములకు తగినట్లు లేవు. కుమారసంభవమునద్వితీయసర్గలో సగమువరకు గొడ్డువేదాంతమేగదా? పోనీ గ్రహింప వీలుగానివి తీసివేయుదమన్న పరీక్షాధికారులు తమ నిర్ణీతమైన కోర్సులో తూ చా లు తప్పకుండ అడిగెదరు. అప్పుడు అగ్రాహ్యమని విడిచినచో నేమిబాధకలుగునో? మరి మేఘదూత కావ్యము పూర్తిగా బాలికలకుగాని యువతులకుగాని చెప్ప వీలులేదు. దీనిలో ముప్పాతికమూడు వంతులు శృంగారమేగాని స్త్రీలు నైతికముగా దీనినుండి గ్రహింపవలసిన విషయమేమియు లేదు. స్త్రీలలో స్త్రీలే చెప్పుకొనుటకు గూడ ఏహ్యముగా నుండును.

ఇక మూడు నాల్గవ తరగతులకు భారతి మాఘము కాదంబరీ మొదలగునవి కలవు. ఈ గ్రంథములలో మేఘదూతాదులందువలె శృంగారాతివర్ణనలు లేకున్నను ముఖ్యముగా ప్రపంచజ్ఞానము బాగుగా సంపాదించినవారు గ్రహింపవలసిన రాజ్యతంత్రము ఎక్కువగా నున్నది. ఆ కావ్యము చదువుటకు అర్హత సంపాదించినవారుకూడ దీనిని గ్రహించుటకు కష్టము. ఇవ

న్నియు తప్పక చెప్పవలసినదిగా అధికారులయు పాఠశాలాధి పతులయు నిర్ణయము. ఇక తప్పని సరియెప్పుడైనదో ఆకోర్సు పండితులు పాటగా పాడివేయుట విద్యార్థినులు గ్రహింపలేకపోవుట తటస్థించుచున్నది. కాని ఈ పంచకావ్యపఠనము మార్చి ఏ రామాయణమునుండియో భారతమునుండియో కొన్ని ఘట్టములు తీసి పాఠ్యవిద్యగా నిర్ణయించిన జ్ఞానమునకా జ్ఞానము, సాహిత్యము, రాజులచరిత్రలు, మొదలగునవి తెలియుట గలుగును. ముఖ్యముగా స్త్రీలు నైతికముగా గ్రహించుటకు ఆదర్శ పతివ్రత లనేకుల చరిత్రము తెలియనగును. క్రమేణ జ్ఞానాభివృద్ధికికూడ లోపముండదు. ఈ పాఠ్యమునకు సాయము గృహపరిశ్రమలను నేర్పుటకును, తమకెట్టి కృషికావలెనో వానిని బోధించుటకు తగినగ్రంథము లేమైన నున్న వానిని పఠింపచేసినచో ఈ స్త్రీవిద్య తప్పక పెంపొంది జయముగానుండును. లేకున్న పంచకావ్య పఠనమువలన మనబాలికలకు కచకుచ జఘనవర్ణనల బోధించి వారి లేతహృదయములకు లేనిపోని పాశవము నంటజేయుటతప్ప ప్రయోజన మంతగానుండదు. మరియు నుభయభాషాప్రవీణ మొదలగు నున్నతవిద్యలు చదివెడివారి కెట్టిగ్రంథములున్నను డిగ్రీప్రధానమైనవి గనుక నప్పుడవి తప్పనివే.

మొన్న నూజివీడు మార్చినెలలో జరిగిన స్త్రీ విద్యావిషయిక సభలో శ్రీ స్నేహా యువజన సమితి వారి యాజమాన్యమున శ్రీ హంటర్ దొరసానివారి యధ్యక్షత క్రింద బైండర్ మొదలగువా రుపన్యసించిరి. వీరు స్త్రీల కుపదేశింపవలసిన విద్యలలోని ప్రాశస్త్యమును చక్కగా నిర్ణయించిరి.

మరియు విద్యాలయమునందు పండితులకును అధికారిణులకు నే యేవిషయముల నెంతసంబంధముండవలెనో నంతియేగాని అనవసరముగా టీచర్లను ఇతర కార్యవ్యగ్రులనుగా జేయరాదు. విద్యనేర్పుటలో పండితుల కేమాత్రమును వెనుదీయరాదు. అధికారిణులు ప్రతిదినమును పాఠములు జరుగుచున్నవా లేదా అని గమనించుచుండవలెను. కోర్సు సరిగా చెప్పని పండితులను తా మెంతవారైనను యధికారము చేయవచ్చును. అంతియేగాని పాఠముల నియమింపరాదు. గురువు వారివారి యోగ్యతలను బట్టియు, జ్ఞానమును బట్టియు ఏకక్ష్యకనుగుణముగానున్న నక్లైచేయవలయును. కాని యీనడుమ తమకక్ష్యలు తగ్గినవనిగాని, ఆయాకక్ష్యలకు సంఖ్యతగునంత లేదనిగాని చిన్నతరగతులవారికి పై కావ్యములను జెప్పించుడని నడుమనున్న కోర్సు త్రోసివేసి పైకిలాగరాదు. ఇందువలన బాలికలు పునాదిదిట్టము లేక పై కావ్యమర్మముగాక ఉభయభ్రష్టులగుదురు. అట్టివిద్య కృత్రిమవిద్యయగును గాని ఆదర్శవిద్య కానేరదు. ఇది తమ గ్రాంటు డబ్బులకొరకు చేసెడి తంతుగాని నిష్కళంకమైన సంఘసేవగాదు. మరియు మేఘదూతకావ్యమును వరకు బాలికలకు వ్యాఖ్యానమనవసరము కాని ఇది పండితులు చెప్పలేక బధకించుచున్నారను నమ్మకముతో వ్యాఖ్యానముగూడ నియంతలు నియమించుచున్నారు. కాని దానివలన బాలికలకు రివ్వంత ప్రయోజనమైన లేదు. వ్యాఖ్యానమును నవగతముచేసికొనుటకు ముఖ్యముగా నిఘంటువు, అలంకారజ్ఞానము, కొద్ది వ్యాకరణముగూడ నున్నగాని వీలుగాదు. అలంకారమననేమో? శ్లేషధ్వనులననేమో? యెరుంగని పిల్లలకు వ్యాఖ్యచెప్పి వారినిగడబిడలో ముంచుటకన్న శ్లోకము, అర్థము, వారియొద్ద కంఠరవేణ నప్పగించుకొని భావముచెప్పుటలో బాగుగా తరిఫీదు చేయుట చాలమంచిది అన్వయముకూడ అనవసరమే. ఇట్టిపాఠములలో, అల్పజ్ఞానముకల మేనేజరు లేమాత్రమును పిచ్చిపిచ్చి నియమములు పెట్టి వారిని బాధించరాదు.

మరికొన్ని పాఠశాలలలో పండితులనే వెంటబెట్టుకొని యాచనకు తిరుగుచున్నారు. అట్టివారు నెలనెలకిచ్చు వేతనములు స్త్రీవిద్యకుగాక తమతో తిరిగినందుల

కగుచున్నది. ఇట్టి ప్రయాణములలో బాలికలు నిర్వ్యాపారలై చదువు సంధ్యలువాని పాతవి మరచి క్రొత్త పాఠములు లేకుండ నుందురు. ఉపాధ్యాయులు లేనందున గ్రామస్థులు జడిమానుటగూడ తటస్థించును. ఇట్లు జరుగుచుండుటచే బాలికల యుత్సాహము క్షీణించి తన్మూలమున విద్యకూడ తగ్గిపోవుచున్నది. కనుక ఎన్నియున్నను విద్యజరుగుపాటునకు లోటురానీయరాదు.

## పండితులు

ఇట్టి ఎలిమెంటరీ అడ్వాన్సు పాఠశాలలలో నేటి పరీక్షలను ప్యాసయినవారినే గాని యితరు లెంత పండితులైనను వారిని గ్రహించుటలేదు. అధికార్ల దృష్టికి డిగ్రీసంపాదించిన వారికంటె హై పండితులు లేచ్చు. ఇదియొకవిధముగా మంచిదే. సాధ్యమైనంత వరకు స్త్రీవిద్యాలయములలో స్త్రీలనే వేయుట, లేనిచో కొంతవయసు మళ్లినవారిని వేయుట మంచిది. అట్లని వయసు మరలుటయే ప్రధానముగాదు. గుణములుగూడ నుండవలెను. ఇట్టి పరిశీలన ముఖ్యము. ఈ పరిశీలన లేనినాడు వారివలన నానాబాధలు పడుట తుదకు అన్నయింటి వాసములు లెక్కపెట్టి నట్లు వారు వర్తింపువారిని తొలగించుట అందువలన ఇష్టులందరునూనుట మొదలగు ఛిద్రములచే నెన్నియో స్త్రీ కళాశాలలు నశించినవి. నశించుచున్నవి. ఇట్టి మతభేదము లేకుండ స్త్రీ మెంబర్లు సంఘమంతయు ఒకే మాటమీద నడువవలెను. ఇట్లు మెంబర్లలోని మతభేదమువలన మన స్త్రీవిద్య సగము పాడగుచున్న దనవచ్చును. కాన పండితులవిషయమై పరిశీలనలేక వర్తించినచో కొంపలు మునుగును. కొన్నిచోటుల నెంతపండితులైనను ఎన్ని డిగ్రీల సంపాదించినను, ధూమపానము, నస్యసేవనము, మొదలగు దుర్గుణము లున్నవారిని మన హిందూ స్త్రీమతల్లికలు నిరసించుట కెంతయు సంతసము. విద్యనేర్పెడివారు సమపక్షపాతముగా నుండవలెనేగాని భేదబుద్ధితో వర్తింపరాదు.

నేడు పండితులు హెచ్చుపెరిగియుండుటచే వేతనములు చాల స్వల్పముగా ముట్టుచున్నవి. కాని వారివారి శక్త్యనుసారము వేతనములిచ్చుటలో నాటంకముండదు అట్లని గోచీకి ఎక్కువ గోణమునకు తక్కువన్నటులు చేసినచో వారాధనముతో గిడుపలేకయే లౌకిక వృత్తిలోనికి దిగి ధనమార్జింప మొదలు పెట్టెదరు.

మరికొన్నిచోట్ల కొన్ని ప్రయివేట్లు చెప్పకొనుచు కాలము గడపుచుండి అట్లు చెప్పుకొన రాదనియు ఆలాగుచేసిన దానివలన వచ్చెడి ధనము మాసంస్థకే యీయవలెనని నిర్ణయించుచున్నారు. అధికముగా తిరుగుచున్న, పాఠశాలలోనికిరాత్రు చెప్పలేకపోవు ననియే వీరి యాశయము. అట్లుగాక మేలొటు పండితులే స్వయముకొని తగుమాత్రముగా వారి ధనాహరణమునకు అడ్డురాకుండుట మంచిది.

## సంగీతము

మఱియు ప్రతి స్త్రీ విద్యాలయమునందును ఈ సంగీతము ముఖ్యముగా నేర్పబడుచున్నది. కాని నేర్పెడుపద్ధతిలో దీనిని సంగీతవిద్వాంసులు నేర్పుట లేదు. సంగీతమునకు ప్రాణము తాళము. తాళములేని పాటయు మతిలేని మాటయు నొకటిగదా? అట్లని పండితు లెరిగియు తాళముచెప్పుట మానెదరు. దీని వలన వారివారి శ్రమతగ్గును. పదిసార్లు పాడినపాటకు ముప్పదిసార్లు తాళము చెప్పినగాని నడువదు. ఈవిషయము ప్రతి పట్టణమందును లోటుగానే యున్నది. విజయనగరము, కాకినాడ, రాజమండ్రి, మొదలగు పట్టణములలోని సంగీతపాఠముల విన్న నవి ఆశ్చర్యకరముగా నుండును. కాని వారలనడుగగా తాళముతో పాఠము చెప్పుట కష్టము పదిరూపాయి లీవలెననియు, ఇప్పుడు తాళమెవరు చూసి సంతోషింతురనియు వారు సమాధాన మిచ్చిరి. వారివారి తల్లులుగూడ ఆరోగ్యనియమమువిూద చెయ్యివేసి నాలుగు

పాటలు, నాలుగు సాంగులు, రెండు టుంగిరీలు, వాయించిన చాలును. అదే సంగీతమను దృష్టిలో నున్నారు. అందువలన శాస్త్రయుక్తముగా నేర్పెడి పాట వారి కక్కరగలేదు. అంతధనవ్యయము చేయ లేరు. వారిమాట నట్లుంచి మనపాఠశాలలలోగూడ నేర్పబడుచున్న దింతియేగాని అధికములేదు. కాని ముందుగా అలంకారములనుండి తాళము వేయించి బాలికలకు గరపెడి ప్రతిగీతమును తాళముతో నోటిని పాడునట్లు చేయవలెను. ఇది సాధ్యముగాదని చాల మంది ఎంచెదరు. కొంత శ్రమచే అట్లున్న చెప్పలేము గాని తప్పక స్త్రీలకలవరచవలసిన మార్గమది. లేకున్న ఆగాలిపాటలే తమ పిల్లలకు నేర్పుచు కీర్తను పాడు చేయుచున్నారు. నేడు వీణ, ఫిడేలు, ఆర్మోనియం మీద కృతులు, వర్ణములు, సాంగులు కనులువూను కొని పాడుచుండుటలన నేకుల చూచుచున్నాము. వీరికిని తాళమునకును సగమువిరిక. ఇట్టి పరంపరా పాఠములవలన తెలియనివారు సంతోషించుట, ఆ తప్పులే పిల్లలకు నేర్పుట జరుగుచున్నది. కనుక తాళ క్రమము లేనిదే సంగీతము గరపరాదు. ఈ విషయములో స్త్రీలు దీక్షవూనినచో స్త్రీజాతి కలంకార మైన యీకళ చిరస్థాయి కాగలదు. ప్రయివేట్లు చెప్పించెడి తల్లులుగూడ తమపిల్లలకీ పద్ధతినే నేర్పింప వలెను.

మరికొన్ని విద్యాలయములందున్న పండితులే ఆ పాఠశాలలకు సంబంధించని యితర విషయములను గూడ నవరించ నియమించుట ఆచారమున్నది. మనము చేయు ప్రతీలేశమును స్త్రీవిద్యకేయని యభిమాన మున్నచో నొక్కగడియ టీచర్లు నితరవ్యాపారము లలోనికి దిగనీయరాదు. ఇట్టి కాలక్షేపముచే రోజు లకు రోజులు గడచిపోవుట, ఆయాపాఠము లడుగం టుట మొదలగు నష్టములు జరుగును.

మరికొన్ని పాఠశాలలలో పండితవేతనములు సరిగా నెలనెలకు ముట్టచెప్పలేకుండిరి. ఇట్టి విద్యాలయము లకు మూలధనమేమియు లేకయు నిరంతవిధముగా వచ్చునధనము చాలకయు పై పని జరుగుచున్నది. పొరుగూరినుండి సంసారముతో వచ్చిన ఆ అపరిచితు నకు ఆగ్రామమున నొక కవళము పుట్టదు. ఆ జీతపు ధనమే గతి. అట్టియెడ తమ కెంతరొక్కటముగా నున్ననో గాని పండితులజీతము లెగబట్టరాదు. ఇట్లే నాలుగైదు నెలలు ఎగబట్టుట, ఆ వెనుక జీతమిచ్చిన నిచ్చుట, రెండువూడు పర్యాయములడిగిన కోపించుట, అంతనాపండితునితీసివేయుట, మొదలగు చిక్కులు రాకుండచేయ విదుషీమణులగు అధికారిణులు గ్రహింతురుగాక.

మరియొక గట్టిచిక్కు ఈవిద్యాలయములకు గలదు. ఇతర బోర్డు మునిసిపల్ ఎలిమెంటరీ స్కూళ్లయందు వలె గాక ఈ సంస్కృత విద్యాలయములలోని కక్ష్యావిభాగము బాగుండదనియు, ఆ స్కూళ్లలో నైదవతరగతి ప్యాసైన సర్టిఫికెట్లు లిత్తురనియు, నీ సంస్కృతము స్కూళ్లలో జదివిన బాలికలు మరియొక బోర్డుస్కూలులో జేరుదమన్న నీ కక్ష్యలను సరిపడ రనియు, తలచి చాలమంది మనపాఠశాలలకు రామాను చున్నారు. ఎలిమెంటరీ పాఠశాలలున్నచోట ఈ బాధ అనివార్యముగా నున్నది. సంస్కృతపాఠశాల అగుటచేత సాలుసరికి వచ్చెడి సూపర్ వైజరు సూప రిండెంటు వగైరాలు సంస్కృతమునే పరీక్షింతురు గాని కోర్సులోనున్నను లెక్కలు, సంగీతము, పాకకళ, మొదలగువానిని పరీక్షింపరు. తెనుగును వినవే వినరు. అందువలన ఆసబ్జెక్టులు పండితులచే "ఉన్నా మంటే ఉన్నా" మన్నట్లు చెప్పుచున్నారు. అందు వలన ఆకోర్సునం దశ్రద్ధచూపక బాగుగా జెప్పుచు న్నచో స్కూలులోని బాలికలసంఖ్య తప్పక పెరుగ గలదు. పిల్లలతల్లిదండ్రులకును బోర్డుస్కూళ్లకన్న నీపాఠశాలలే మంచివను నూహగలుగును. దానికొరకు, తెనుగు, లెక్కలు, గృహపరిశ్రమలు, మొదలగునవి నేర్పుట కొకసమర్థులైన పండితునితేసికొనుట ఆయా పాఠశాలల కుచితమగు పని.

ఇంకొక విషయము. నేటి మన స్త్రీల సంస్కృత విద్య పంచకావ్యపఠనములోనో ఈ లోపుననో వెన్ను వేయుచున్నది. ఇందుకు కారణము భర్తలుగాని, తల్లిదండ్రులుగాని అగుచున్నారు. ఇది దురతిక్రమమైనను వారివారి యుత్సాహముల భంగపరుపక తగిన ప్రోత్సాహముచేయవలెను. మునుపు ఉభయభాషా ప్రవీణకక్ష్యలో, బి. గ్రూపు, ఏ. గ్రూపు కూడా నుండుటచే ఆంధ్రప్రధానమైన బి. గ్రూపు ఎంట్రన్సు పరీక్షను స్త్రీలు కష్టించి చదువుకొనెడివారు. నేడు మన ఆంధ్రయూనివర్సిటీవారు, ఏ. గ్రూపుకన్న బీ. గ్రూపు చాల సులభమగుటచే అందరు నిద్దానికే చదువుచున్నారని ఆ గ్రూపు పరీక్షను లాగివేసి స్త్రీలకు ఎంతయో అపకారమొనర్చిరనవచ్చును. ఇప్పుడు స్త్రీలు నేర్వవలెనన్న ఏగ్రూపు ఎంట్రన్సు చదివినగాని పైకక్ష్యకు పోవవీలుండదు. పంచకావ్యములు కాకుండగనే స్త్రీలచదువు అనేక వాతావరణములచే నంతరించుచుండ, ప్రతాపరుద్రీయము, వేణీసంహారము, శాకుంతల, నైషధము, కాదంబరీ, మొదలగు సద్గ్రంథముల జదువుటకును, వాని నవగతముచేసి కొనుటకును, వీరికి కాల మెక్కడనుండివచ్చును. ఈ గ్రంథము చదువుట కర్హత సంపాదించుటకుముందు, కావ్యములు, చంపులు, కొన్నిచదివినగాని వీలేలేదు. భాషయంతయు సంస్కృతములోనే వ్రాయుచు సంస్కృతలిపితోనే ఉపన్యాసాదికము వ్రాయుట కెంత జ్ఞానమావశ్యకమో సర్వవిదితమే. ఇందుమూలమున సులువుగా చదివి పరీక్షలో నుత్తీర్ణతనందెడి మన స్త్రీల యానందము మోడువడి ఆ గ్రంథముల చదువలేమనెడి భయము కలిగినది. ఇప్పుడైనను మన స్త్రీలలో పెద్దలందరును మీటింగులుచేసియో, ఎట్లైన పట్టుపట్టి బీ. గ్రూపు పరీక్షల తీసివేయకాదని గట్టిప్రయత్నము చేసినగాని స్త్రీవిద్యకు చీడపట్టును. ఈ విషయము ఈవత్సరమునుండియు ఎంట్రన్సుపరీక్షలకు మన అడ్వాన్సు పాఠశాలలనుండిగాని కాలేజీలనుండిగాని ఎందరు స్త్రీలు ఏ. గ్రూపునకు కట్టిరో, బీ. గ్రూపు ఉన్నపు డెందరు పరీక్షార్థినులుగ నుండెడివారో గమనించిన తేలును. ఈ ప్రకారము ముమ్ముందు, ఏ. గ్రూపున కెవ్వరును తయారుకాలేదనిగూడ చెప్పవచ్చును. ఈవిషయమై శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు మొదలగువారు వేసినబీజముల పునరుద్ధరించుచో, బీ. గ్రూపుకూడ నిలువగలదు. ఈవిషయమై సంస్కృతాంధ్రాభిమానముగల స్త్రీలు ముందంజ వేయవలెను.

ఈవిషయములను ఆంధ్రలోకమునసున్న సంస్కృత పాఠశాలలు, స్త్రీలుగ్రహించి తప్పక వీనిని ఆచరణలో నుంచిన నేడు స్త్రీవిద్యకు కలిగెడి ఛిద్రములు తప్పక నశించునని నాయూహ. తమలోని లోటుపాటులను సద్దుకొని తాముచేయుకృషి స్వచ్ఛందముగా, నిష్కలంకముగా, స్త్రీలకర్పణచేసెడి పతల్లికలను పరాశక్తి రక్షించి వారివారి యుద్యమములకు సహాయముచేయుగాక యని ముగించుచున్నాను.

'సుగుణా'

'.........'

'సుగుణా సుగుణా.'

'ఓసుగుణా ఎచ్చటినుంటివి సుగుణా.'

'ఆ ఇచ్చటనండి ఈదొడ్డివసారాలో'

'ఏమి చేయుచుంటివి ?

'పెరుగు చిలుకుచుంటిని. ఏమాఖంగారు'

'ఎన్నిసాకులుపిల్చిన పలుకవేమి ?'

'నాకు వినిపించనిదే—ఈపెరుగు చిలుకు ధ్వనిమీద.'

'పరేకాని మాతల్లిగారి దగ్గరనుండి కమ్మ వచ్చినది.'

'ఆహా నిజమా ?'

'నిజముగాక కల్లా?'

'ఖులాసాయేనా! యిప్పుడు ఎచ్చట నున్నట్టు?'

'ఇప్పుడా! రామేశ్వరయాత్రకానిచ్చుకొని మరల తిరుగుదలలో, కాళహస్తి పెదతిరుపతి మొదలైన యాత్రలు చూచుకొని ప్రస్తుతము మద్రాసులో నుండిరట. దగ్గరనున్న డబ్బు ఖర్చుఅయిపోయినదట. అరువదియో డెబ్బదియో పంపిన శ్రీశైలయాత్ర మొదలైనవికూడా చూచుకొని తిరిగి వత్తురట. శరీరములో మాత్రము స్వస్థతగనే యున్నదట.'

'మరి డబ్బుపంపరా ?'

'వెంకయ్యగారివద్ద తీసుకొని తిరుగు టపాలో మనియార్డరుచేయుమని "పోస్టుప్యూన్" వెంకటస్వామి చేతికి వందరూపాయీలు యిచ్చితిని.'

'వెంకటస్వామినమ్మకమైనవాడా యేమి?'

'నమ్మతగినవాడు కనుకనే వందరూపాయీలు యిచ్చితిని.'

'మీతల్లిగారు డెబ్బదిరూపాయీలు యడిగిన మీరు వందరూపాయీలు పంపినారా?'

'యెందులకైన అవసరము వచ్చునని తరువాత డబ్బులేకపోయిన ఆపర్వతములలో యెవరు యిచ్చెదరు. అప్పుడు మాతల్లిగారు బాధలపాలగుదురు. ఆమె బాధపడుట నాకు శ్రేయస్కరము గాదు. ఆమెకొరకై నా ప్రాణము విడువవలసిన్నను పరమ సంతోషముతో విడచెదను. గాని ఆమెను బాధల పాల్చేయ నామనసొప్పదు.'

'ఆహాహా ఏమి మాతృభక్తిండి. అంత ప్రేమ పర్వతమధ్యనుండి క్రిందికి వడిగా ప్రవహించు నిర్ఝరిణివలె ప్రవహించు చుండగా పుణ్యాత్ములరాలైన ఆమాతృదేవతకేమి కొరత.'

'నీకు మాతృదేవతయనిన హాస్యముగా నున్నది. వేదములుకూడా "మాతృదేవో

భవ పితృదేవోభవ" యని ఘోషించుచున్నవి. అందులో రెంటిలోనుకూడా మాతృదేవతకే ఎక్కువ అధిక్యతయున్నది. ఎందులకనిన నవమాసములుమోసి అష్టకష్టములుపడి నానాబాధలకు లోనయి కని, పెంచునది తల్లిగాని తండ్రిగాదు గదా! అటులని తండ్రిలో ఆధిక్యత తక్కువయని కాదు నాభావం. ఎక్కువ శ్రమకు లోనగునది తల్లి. అట్టి తల్లిని బాధలుపెట్టి తినునది పవిత్రమైన యన్నముగాదు. దుష్టులైనటువంటి రాక్షసులు భుజించు రుధిరాన్నము. ఏ రుధిరాన్నమైనను అసలు దొరకెనుగదా! పరమ పవిత్రులైనటువంటివి, పూజార్హులైనటువంటివి, వానివృద్ధికి కారణభూతులైనటువంటి మాతృదేవత బాధలననుభవించుచుండ ఆదుర్మార్గునికి అన్నము దొరకునా? అటువంటి దురాత్ముని కొరతవేసినను పాపముండునా? అటువంటి దౌష్ట్యుని నిలువున రెండుముక్కలుగా తరిగి ఉప్పుకారమంటించినను వాని పాపమునకు ప్రతిఫలమవునా? అటువంటి దుష్టబుద్ధిని చిత్రవధ—'

'ఆ—చాల్లెద్దురూ! కబుర్లుచెప్పారు. ఇటువంటి ఉపన్యాసములు ఇచ్చుటకేమి? కబుర్లు ఖరీదుసకు కొనవలెనా? అవిలోతైనబావిలో ఉదకము పుట్టుచున్నట్లు ఊరుచునేఉండును. అవసరమైన వాక్యములు అతిగాఢముగా బాణములు ప్రయోగించురీతి ప్రయోగించవచ్చును. కాని వాచాచెప్పుటయే కాని క్రియయున్నా. ఇటువంటి డంబములకేమి?'

'చాలులే ఊరుకొనుము. నోటితో చెప్పుటయో చేతితో చేయుటయో నీకేమి తెలియును. నీవలన "ఒపీనియన్" పొందిన గాని నాకు వేరొకగతిలేదా ఏమి? చాలులే! ఇదిగో గృహలక్ష్మివచ్చినది. తీసుకొనుము.'

అనుచు నవ్వుచు ఆయన వెడలిపోయినారు. నేను ఆమాసపత్రికను చూచుసరికి నాయొక్క సంతోషము "పెన్నిధిగన్న పేద చందంబునన్" బోలినది. దానిని గదిలోనికి తీసుకొనిపోయి పుస్తకములలో జాగ్రత్తపెట్టి తిరిగి వచ్చుచున్నంతలో ఆయన మరల తిరిగి వచ్చి "సుగుణా నేను నవ్యవాణికై వ్రాసిన వ్యాసము ప్రకటింపబడలేదు సుమా" అనినారు.

'ఏమండీ మీరువ్రాసిన వ్యాసముపేరేమి? మీరూపము, మీ వచో జృంభణ, మీకవితా ధోరణి, మీ తెలివితేట పుంజముల నిగనిగ కాంతులు ఆపత్రికాధిపతులకు తెలియవు గాబోలు.'

'నారూపమనినావు. నాసౌందర్యములో ఏమిలోటు—'

'ఏమియును లోటులేదు. అగ్రాఫ్ యొక్క తేటతనము, అమావాస్యనాటి చీకటిని నిరసించు ఆశగీరకాంతి, సినిమాలోని మార్చుని వదనమును మించిన ఆమోముడాలకము, భావకవిగారు అనిపించుకొనవలెనని కాబోలు కట్టిన ఆకట్టు, పరకాంతాప్రియుడైనటువంటి కీచకుని వధించిన భీమునివలె నసువవలెనని నడచు ఆనడక, నేటివ్రిన్సువలె—'

'ఏమిటాకవిత్వము? నీ కవిత్వధోరణికి తక్షణము ఆనకట్టు కట్టకపోయిన చుట్టుపట్ల

నున్న గ్రామములను ముంచునేమోయని 'భయము కలుగుచున్నది.'

నాకవిత్వధోరణికి ఆనకట్టను వేయుటకు తగినకూలీలు అకస్మాత్తుగా సప్లయికావలె నన్నారు. కాని మీకవిత్వములోనున్న సారస్యమేమో కొద్ది తెలియజేయుడు. మీరు వ్రాసిన వ్యాసముపేరు లొట్టాబట్టీయమా? కత్తిరాయీ సంవాదమా? తిరుమలతాతీయమా? మీభావ కవిత్వమంతపాడుది మరియొకటిలేదని చాలమంది ఇంకొక నోరును బదులు తెచ్చుకొని కూడ దూషించుచున్నారు. ఒకమహాశీయుడు "భావగీతమనీ జన్మపాడుగాను" అనిబహుసరసముగాదీవించినాడు. భావకవులలోనున్న గొప్పదుర్బుద్ధియేమనగా విధాతకు నెనవచ్చు పూర్వకవుల గ్రంథములను వీరి అమేయమైన తెలివికి విమర్శించబోతారు. మనుచరిత్రకారకుడై నటువంటి అలసానిపెద్దనగారి బుఱ్ఱమట్టి బుఱ్ఱని, పెద్దనగారు అనేకంటె పెద్దన్నగారంటే చాలా మృదువుగా వుంటుంది శబ్దం అంటారు.'

'అనుమానంలేకుండా భారతభాగవత రామాయణాలను పారాయణచేసేవారిని చూస్తే అడ్డదిడ్డపు ప్రశ్నలు నాలుగువిసిరి అడుసులో అడుగువేయిస్తారు. వీరువేశే ప్రశ్నలు ఎల్లావుంటాయంటారా! మహావినయముగా ఉపక్రమిస్తారు. అయ్యా! శాస్త్రిగారూ! శ్రీమహావిష్ణువు బలిచక్రవర్తి దగ్గరకుపోయి మూడడుగులుదానం ఈయమనినాడటే ఎందులకంటారు? అనిప్రశ్న.

ఇంద్రునిపదవి బలిచక్రవర్తి అధీనమైపోవునని ఇంద్రునికి గుండెదడబుట్టి నలువగారివద్ద నసుగుతూనసుగుతూ మనవిచేసుకొని బాహాటంగా పాదాలమీదబడి బ్రతిమాలుతే ఇంద్రునియొక్క పదవి రక్షించే ఉపాయము నాలుగుబుఱ్ఱలున్నా ఆయనకు తోచక తండ్రిగారైనటువంటి విష్ణుమూర్తిగారికి తెలియజేస్తే కామరూపధరుడైనటువంటి, అనగా చేప, కూర్మము, వరాహము, సింహము మొదలైన రూపాలుయెత్తేటువంటి ఆయన వామనావతారుడై బలిచక్రవర్తిని మూడడుగులు భూమినడిగి, ఒకఅడుగు భూమి, రెండవ అడుగు ఆకాశము మూడవఅడుగు బలిచక్రవర్తి నెత్తిపైన పెట్టి పాతాళమునకు త్రొక్కివేశాడు. ఇదీకథ. అని చలాక్ అయినటువంటి శాస్త్రిగారి జవాబు.

శాస్త్రిగారూ! బాగానేవుందండి. మొదటి అడుగు భూమి అన్నారూ భూమంతావామనుని అధీనమైనట్టేగా రెండవఅడుగు ఆకాశం. మూడవఅడుగు బలిచక్రవర్తియొక్క శిరస్సుమీదనా? "పాత్రాధారంఘృతంవా ఘృతాధారం పాత్రంవా" అని భూమ్యాధారం బలిచక్రవర్తికా బలిచక్రవర్తి ఆధారం భూమికా? భూమంతా మొదటిపాదములో అయిపోగా బలిచక్రవర్తి శిరస్సుమీద మూడవపాదానికి స్థలమెక్కడుంది. పోనీ ఉందనుకోండి. భూమ్యాధారం బలిచక్రవర్తికి పోయినప్పుడు ఆయనశిరస్సు మీదున్నటువంటి స్థలము ఎందులకు పనికివచ్చును.

శాస్త్రిగారు బాగా ఆలోచించారు. ఆయనకు ఆప్రశ్నతోటి మతిపోయినట్లైంది. అట్టే ఆలోచించి. "అబ్బాయీ మహానుభావుడు ఆపోతనగారు సమర్థించాలి కాని మనబోటివాళ్లచేతగాదు. పోతనగారి బావమర్ది శ్రీనాథుడుగారు గజేంద్రమోక్షములో వ్రాయబడిన "సిరికింజెప్పడు శంఖచక్రయుగముంజేదోయి సంధింపడు" అన్నపద్యాన్ని ఆక్షేపణచేసినప్పుడు పోతరాజుగారు ఏమని సమర్థించారు?—బావను నోటితోటిచెబితే అనుభవసిద్ధంగా ఉండదని "ప్రాక్టికల్"గా చూపించారు. ఇప్పుడు మీరుకూడా పోతరాజుగార్కి ఉత్తరము వ్రాసో మనిషినిపంపో కనుక్కుంటే తెలిసిపోతుంది. మీరు భావకవులని నాకూ తెలుసు. మీరు ఎక్కడవ ఇంగ్లీషునాడతారు. ఉత్తరము మాత్రము ఇంగ్లీషున వ్రాయక తెలుగున వ్రాయండి. ఆ పోతరాజుగారు ఏ విశ్వవిద్యాలయములోనూ చదువుకున్నట్టు కనుపించదు. చదువుకోన్నవాళ్లు ఆయనవుండేచోటవున్నా వాళ్లచేత చదివిస్తే ఉత్తరముబట్టి బయలవుతుంది అని గడుసుతనంగా జబాబిచ్చాడు. అంతేటండీ శాస్త్రిగారూ! మీరేకో సమర్థించి చెప్తారనుకొన్నాను. ఇంతేనా అంటూ బుటాయిగ్రాఫ్ వెనక్కి విసిరి మీసాలు లేకపోయినా మీసాలుదువ్వుతూ వెళ్లిపోయాడు భావకవి. ఇటులనేవున్నాయి మీ భావకవులు వేసేప్రశ్నలు. వీరి తెలివికి పోతన్నగారిబుద్ధి పెడతోక్కుతొక్కిందని, తిక్కన సోమయాజిగారి తెలివి తేగలతెలివని, భట్టుకవిగారి కవిత్త్వము బావురుమన్నట్టుందని ఎంచడమేగా పని. "కుహూవీనీవనేమంటే సుహూపాలని యోచడమేనాపని" అన్నట్టుంటుంది మీభావకవుల భావం. ఇంకొక మహానుభావుడన్నాడు. భావకవులు బొచ్చుపెంచుటలో షోకుమజాచేస్తారు గాని ఇతర తెలివి తేటలు పూజ్యానుస్వారం అని. భావకవులు భోజనానికి సంపాదించలేకపోయినా భావాలకు లోటులేదు. ఆకవులకు పూర్తి ఇంగ్లీషూ రాదు. తెలుగు సమాప్తి గాదు. సంస్కృతము సంపూర్ణమవదు. హిందీకూడా సశేషమే. ప్రతీవాడుకూడా అన్నిభాషల్లోను వేలెట్టి "టాగూర్ మహాకవి"లాగు అయిపోవాలని ఊహ. కాని వాళ్ల జాతకములో గురుడు వక్రిస్తే చనువెక్కడ నుంచి వస్తుంది. ఉభయభాషా ప్రవీణ, అని బిరుదు సంపాదిదామనుకుంటారు. అప్రూహా తారుమారై ఉభయభాషాభ్రష్ట అనే బిరుదు వర్తిస్తుంది. ఒకభావకవిగారు ఒకరోజున ఊరంతాసి కారుకొట్టివచ్చి గృహమునందు పాయిమీదికి లేక పాయిలోకి లేక మతిపోయినట్టయి తన భాషాపాండిత్యమంతా ఉపయోగించి ఈ క్రింది శ్లోకమును రచించినారట.

శ్లో॥ తండులాలు గృహమందు నాస్తి
　　తిండికైతే పగిపుంది నాస్తి
　　పాయిలోకి మైసు లుకింతి
　　దొంగవెధవలు హసంతి.

అనినారట. ఆఖరు పాదమునకు ఆయన వ్రూహా ఇంట్లో ఉన్నవాళ్లంతా నవ్విస్తారు

అని. ఆయింటోవాళ్లల్లో తనుకూడా జమేనా కాదా? ఇక మామూలుగా మాట్లాడే భాష చూద్దాం. "ఐసాయెస్నేక్ పాము ఇన్ ది సంతబజార్ బట్ అయితే కొడుదునుగాని ఐ, హావ్, నో, స్టిక్, కఱ్ఱ, ఇన్, మై, చేతి, హాండ్," అని మొదట బాగానే ఇంగ్లీషు మాట్లాడతాడు. మధ్యలో ఆకస్మాత్తుగా (do) డు అని వుపయోగించాలో "డిడ్" అనాలో "ఈజ్" అనో "వాజ్" అనో తెలియక పప్పులో అడుగేసి నవ్వులపాలై పరిహాసమునకు పాత్రుడవుతుంటాడు. ఇంకొక భావకవిగారు ఏక్, మేన్, వన్, బాల్చా, నిండా, తైలం, పూరయిత్వా, హెడ్‌పై, నిధాయ, బజార్, మేం, తిరుగుచు, ఫిల్లా చిల్లాకర్, కహానేలగా, జోర్, అమ్మేట. కర్తాహై." అని ఆయనయొక్క త్రిభాషా పాండిత్యము వెలుగజేయుచూ వుంటాడు. కనుపించిన స్త్రీ నల్లా శృంగార రసములో శ్రీనాధుడ్ని దాసోహం అనిపించాలని తనివి తీరా వర్ణించేస్తాడు. ఆవర్ణన ఆస్త్రీకి వినిపించి నట్టైతే ఆపె వాళ్లవాళ్లతోటి చెబితే పాదరక్షా ప్రయోగం అవుతుందేమోనని భయం. హృదయంలోవుండి లోలోపలే వర్ణించుకొనీ ఆమె వెనుదిరిగి చూంచినప్పుడు కన్నుగీటి ఒక విధమైన సంజ్ఞ చేస్తాడు. చిన్నతనంలో వీళ్ల తల్లులు కళ్లు చికిలించకుండా ఘూటైనకాటుక పెట్టినట్టు తోచదు. పెట్టినట్లైతే అంతఅకస్మాత్తుగా ఆకన్నుగీటుదొమ్మ వీళ్లని బాధించదు. ఇటీవల చాలామంది నేత్రవైద్యులు ఈకన్ను గీటుదొమ్మఅనేది జలజల వాతంచేతవస్తుందా, కంపమేహముచేత సంభవిస్తుందా, ఎగురుడు పైత్యంచేత ప్రవేశిస్తుందా అని ఆయుర్వేద గ్రంథాలన్నీ గుమాస్తాలనుపెట్టి వెతికిస్తు న్నారట. కొంతకాలంలో సాధించి తెలుసు కుంటారనికూడా, రూమర్, ప్రబలింది. ఆ నేత్రవైద్యులు పట్టుకొని సాధిస్తారని నాకూ ఉంది నమ్మకం. ఎంచేతంటే "కస్టేఫలీ" అన్నారు గదండి."

"ఏమిటీ సుగుణా ఈ లెక్చర్. చాలా ఆయాసపడినట్లున్నావు. కాశిని మంచితీర్థం తీసుకో. మా భావకవులంటే నీకంతఓర్వలేని తనమెందులకు?—

"ఆ. ఆ. ఆగండి మీభావ కవులవిషయాలను గురించి అప్పుడే నేను మంగళవాక్యము చెప్పనిదే. ఇంకా వున్నవి విషయాలు. మీ భావకవులు విమర్శించిన విషయాలు యింకా కొన్ని చెప్తాను ఒకభావకవిగారు అన్నారు—పూర్వకవులకు చిన్న మెత్తైనా తెలివిలేదుట. నోటికివచ్చినట్టు వీళ్లు కవిత్వము చెబుతే గంగిరెద్దుల్లాగ ఆ అంకితము పుచ్చుకొన్న మహారాజులు బుఱ్ఱూపి ఆనందించారట. ఇంక ప్రజలు "యధారాజా తధాప్రజా"ట, వాళ్లు వ్రాసినంత అప్రౌఢకపు కవిత్వము మరొకటి లేదుట. వాళ్లు వ్రాసిన పద్యం వీళ్లకి తెలియకపోతే అది అప్రాచికపు కవిత్వమే కాబోలు. అటులనుటకు కారణం పూర్వపు కవులు స్త్రీని వర్ణించుచూ ఎక్కడో వస్త్రాలలో అడగి

మణిగి వున్నటువంటి తొడలను అరటికంబములతోటి పోల్చారుగదా. వీళ్లకవియెల్లా కనుపించాయి. అటువంటిది అప్రాచికపు కవిత్వముగాదా! అని ప్రశ్నించారు భావకవిగారు. రెండవప్రశ్న ఏమిటంటే, రహస్యావయువాలనికూడా బాహాటంగా వర్ణించేవారే! ఆవర్ణనలు నీచంఅయినటువంటి బూతులలో చేరవా? అటువంటి బూతులు మహనీయులైనటువంటివారి నోటినుండి బయలువెడలవచ్చునా, అదిబూతుకవిత్వముగాదా?

నేను దానికి జబాబుచెబుతున్నాను చూడండి. మొదటిప్రశ్న, వస్త్రములలో అడగి మణగివున్నటువంటి తొడలు వీరికెల్లా గోచరించాయి అని, రవికానిచోటును కవి గనుగొనునను మాటమరచిరి కాబోలాభావకవిగారు.

రెండవది. రహస్యావయువాలని కూడా వర్ణించవచ్చునా? అదితప్పుకాదా? కవిచౌడప్పగారు పదినీతులు పదిబూతులు చెప్తేనేగాని గ్రంథం సారస్యంగా వుండదని నారు. అప్రూహే పూర్వకవులకుకూడా అయివుండవచ్చునని నావ్రూహ. ఇటువంటివి భావకవులకు తెలిసియో తెలియకో చొప్పదంటకవిత్వాలని శోధనచేయబోతారు పెద్దగ్రంథాలను గొప్పకవులను.

ఆనాడు రామమ్మగారూ మేమూ కలసి సినీమాకు వెడలినాము చూచారూ ఆరోజున వెళ్లుచుండగా దారిలో ఏదో కూనురాగము వినిపించింది. ఏమిటా అని చూద్దునుగదా సన్నంగా సమీపములోనే వినిపిస్తోంది. అప్పటికి అంధకారం అటునుంచి ఇటునుంచి వ్యాపిస్తోంది. ఎదరనున్నటువంటి మనిషిని గుర్తించకుండా చేయుటానికి ప్రయత్నిస్తోంది. ఆ రాగ మాలాపనచేయువాడు తమాషాగా నడచుచూ క్రమక్రమముగా మమ్ములను సమీపిస్తున్నాడు. ఆ క్రాఫ్ మూరెడెత్తున ఎదిగివున్నది. ట్విల్లుషర్టు, మల్లెపూవులాంటి పంచె, పైమీాదచిన్న టవల్, ధరించియున్నాడు. ఎడమచేతిలో చేతికఱ్ఱ ఊగుచున్నది. కుడిచేతిలో సిగరెట్ వెలుగుచున్నది. మధ్యమధ్య సిగరెట్ పీల్చుచూ కూనురాగము తీయుచూ మమ్ములను సమీపించినాడు. ఆపాటయేమా అని పరిశీలించి విందునుకదా "చెప్పుకుంటే చెడ్డ సిగ్గోలప్పమ్మ" అని వినిపించింది. ఈవాక్యము వినుసరికి నాకు నవ్వు హృదయము బ్రద్దలుచేసుక వచ్చినది. బలవంతముగా ఆ నవ్వును ఆపుకొని కళ్లు బాగుగా విప్పి పరీక్షగా చూచితిని. చదువురాని మూఢుడాయనిన వాలకం ఆ మాదిరి లేదే. మాతిని అష్టదిక్కులకూ త్రిప్పునూ ఆలాపన సాగిస్తూనే యున్నాడు. ఆ ఆలాపన హద్దులేని ప్రవాహం. కాని ప్రవాహఘోషవలెనే మధ్యమధ్య ఒకవిధమైన గురగురధ్వని కూడాను. అక్కడక్కడ కీచుగా పోతోంది.

మాబండివెనుక వచ్చుచునే యున్నాడు. క్రమక్రమముగా మా శకటము సినీమాహాలు సమీపించింది. అంతలో ఎవరో మా

వెనుకవచ్చు వ్యక్తిని "ఏమండోయి భావకవిగారూ!" అని పలుకరించినారు. భావకవి అనగానే నానోటనుండి "భావకవులు బొచ్చు పెంచుటలోను భావకవిత్వము చెప్పుటలోనూ గాక సంగీతములోకూడా షోకు చూపిస్తారే." అని అప్రయత్నముగా వచ్చివేసినది. ఆ వాక్యము ఆ భావకవిగారికి వినిపించియుండదు. ఆభావకవిగారు సిగిరెట్ కాల్చుటలో చూపినషోకు వర్ణించుటకు భాషలో అక్షరములు కానరావు.

తలిశెట్టి రామారావుగారు ఒక భారతి మాసపత్రికలో "బ్రహ్మగారికి కొన్నిసూచనలు" అనుపేరుతో నాలుగు చిత్రములను చిత్రించియున్నారు.

ఎద్దుబొమ్మవేసి బ్రాందీ ఎద్దు ఈయునట్లు పక్షిబొమ్మవేసి పక్షియే విమానమురీతి ఉపయోగించవలెననియు టీకప్పుతుప్ప అని తుప్పను చిత్రించి టీకప్పుతుప్ప మొక్కను సృజించిన బాగుండునన్నట్లు, సిగరెట్ల చెట్టు గీసి సిగరెట్లచెట్టును పుట్టించిన బాగుండుననియు కొన్నిసూచనలు తెల్పియున్నారు. ఈ నాలుగువిషయములు బ్రహ్మగారు కరుణించి సృజించినట్లైతే మనవొట్ట నేతిలోపడినట్టే అని ఒకభావకవిగారు ఒకానొక సమయములో తమయొక్క మనోభిప్రాయమును వెల్లడిచేసి యున్నారు. అట్టుచేసిన మంచిదే అని నా వూహాకూడ. సరియైన విషయము గురించి వ్రాసినట్టయితే భావకవిత్వమైనా బాగానే వుంటుంది. కాని మనభావకవులకు ఫోర్సు ఎక్కువై గైరమ్మపాటల మీదను, గొంగోరపాటలమీదను, అప్పన్న కొండ పాటలమీదను ఎక్కువమోజు కనుపరచుచున్నారు. ఈమార్గమున గ్రామఫోను కంపెనీవారుకూడా ప్రయాణముచేసినారు. ఎందువల్లననగా గ్రామఫోను వచ్చిన క్రొత్తలో పెద్దవాళ్లు అనగా భక్తియందు అభిమానమున్నటువంటి ముసలివాళ్లు, గానమునందభిమానమున్నటువంటి కళాభిమానులు, ఏమనుకున్నారంటే గొప్పగొప్ప పాటకులయొక్క భక్తిరసమైనటువంటి కీర్తనలు, గీతములు, శాశ్వతముగా వుండిపోవుమార్గమున్ను శ్రవణానందముగా విను ప్రాప్తిన్ని దొరకినదని సంతోషించినారు. కాని గ్రామఫోను కంపెనీదార్లయొక్క బుద్ధులు పెడతొక్కతొక్కి భక్తిరసప్రధానమైనటువంటి కీర్తనలు విడచిపెట్టి గొంగోర పాటలమీదను కోడిపందెపు పాటలమీదను మోజు ఎక్కువ చూపించుచున్నారు. గ్రామఫోనులు దేశమునకు ఉపకారము చేస్తవి అని యనుకొనగా అపకారమే చేయుచున్నవి. ఆ రీతిగానే భావకవులయొక్క మనస్సుకూడా తప్పుదు కవిత్వములోనికి పోవుచున్నది. మహనీయులు మంగిపూడి వేంకటశర్మగారు కవులను సంబోధించి "లోకోపకృతికి జెందని యాకవనము వనమె యనెదు నానుడిగనుడీ" అని వాకొనినారు. నాయొక్క వూహాకూడా అంతే."

"చాలు నీమాటలసందడిని నాపనులన్నియు మరచితిని."

ఇదిగో అయినది. నేను పెరుగు చిలుకుచు దానిమాటయే మరచితిని. నేను చిన్నసంగతిని చెప్పెదను వినుము. పెరుగు చిలికినగాని వెన్నవచ్చునా? సువర్ణమును పుటము వేసి సుత్తెతో మర్దించినగాని మేలిమి బంగారమవునా? అటులనే పురాణములను, ప్రబంధములను తెరచి తెరచి లోలోననే శోధించి తెలుసుకొనవలెను గాని చిన్నసంగతిని బట్టి పెద్ద గ్రంథములను పరీక్షించుట కుక్క తోక బట్టుకొని గోదావరీదుటయే.

"అయినదా? మా భావకవుల విషయములను గురించి మంగళహారతి ఇచ్చితివా?"

"ప్రస్తుతమును మంగళహారతి ఇచ్చుచున్నారు. ఈ వ్యాసమును చూచి భావకవులు క్రోధము వాల్చక నన్ను మన్నించితిరేని వారియొక్క లోటులను ఇంకొకమారు మనవిచేసుకొందును."

"మంచిది. అటులయిన వారు నిన్ను మన్నించరు. పనివున్నది. అటులపోయి వచ్చెదను. వచ్చునంతలో భోజన ప్రయత్నమును చూడుము."

ధన్యులెవరు?

నిర్మలభావ బంధము
కర్మల విడనాడఁబోక కష్టసంప్రీతిన్
గర్వగ్రహులను నాశింపక
ధర్మమెఱింగి మెలఁగువారె ధన్యులు ధరణిన్.

శ్రీ లక్ష్మి సరస్వతులు.

# కీ॥ శే॥ బ్రహ్మాండం వరదమ్మగారు

(శ్రీమతి అప్పాజి కుప్పమ్మగారు)

యీమె 1883 సంవత్సరం మార్చినెల 27వ తేది చిత్తూరుజిల్లా నారాయణవరంలో జన్మించెను, యీమె తండ్రిగారు విఠల్ దేవుని సుందరయ్యగారు. వీరు చిత్తూరుజిల్లాలో చేరిన పుత్తూరునందు రెవిన్యూ ఇన్‌స్పెక్టరుగా నుండిరి. తల్లిపేరు వెంకమ్మగారు. జననీజనకుల ప్రథమసంతానము గతించుటవలన రెండవసంతానమగు నీవరదమ్మగారిని మిగుల గారాబుగా పెంచిరి. పిమ్మట నీమెకిరువురు సోదరులు గల్గిరి. అందగ్రజులు ప్రస్తుతము మదరాసునందు సుప్రసిద్ధ న్యాయవాదులగు శ్రీయుత విఠల్ దేవుని రాధాకృష్ణయ్యగారు. కనిష్ఠుడు యిటీవల 10 సంవత్సరముల క్రిందట కాలధర్మము నొందెను. బాల్యమందే యీమెకు తనయనుంగు సోదరులయందు అమిత వాత్సల్యతయు వారికీమెయందు పరమపూజ్యతయు గల్గియుండెను. తన చిన్నితమ్ములకు చిన్నికథల చెప్పుచు బుజ్జగింపుచు తన తోడిబాలికలయందు సమమైత్రి నెరపుచుండెను. అప్పటికే యీమెసుగుణసంపత్తి బీజాకృతివదలి యంకురదశ నొందుచుండెను. ఇట్టి బాల్యావస్థయందే అనగా 10 సంవత్సరముల వయసున సదరు సుందరయ్యగారి రక్త సంబంధులు శ్రీమంతులునగు బ్రహ్మాండం కృష్ణయ్యగారికి నొసగి వివాహముజరిపి మాతాపితల ముద్దుముచ్చటలు దీర్చుకొని ధన్యులైతిమి గదాయని సంతససాగరమున నోలలాడిరి. యిట్టితరుణమున అహో విధాత ఎంత కఠినుడు!! స్త్రీల సహజసౌఖ్యములగు గృహిణీస్థానము. మాతృస్థానములను పొందుహక్కుల నావలనెట్టి దుర్భర దుస్సహమగు వైధవ్యము పాలుగావించెను. అప్పటికీమెకు 13 సంవత్సరముల వయస్సు. తదనంతరం యీమె తండ్రిగారు తమ ముద్దులపట్టికి గలిగిన కష్టదశకు వగచి యచిరకాలములో నే గతించిరి. యిట్లీమెకు కష్టపరంపర నెట్టుకునిరాగా కొంతకాలము శోకించినది. యీచంచలప్రపంచమున శోకదేవతకు మాత్రము పూర్ణాయుర్దాయమున్నదా? దానికిన్ని



కీ॥ శే॥ బ్రహ్మాండం వరదమ్మగారు

అంత్యదశయందున్నది. అంతట తన జ్యేష్ఠసోదరు నింటనుండి మనసా కర్మణా వాచా విశ్వసేవసేయ దొడంగినది. రత్నము సానబెట్టినప్పుడే కాంతి ప్రబలమగునట్లును సువర్ణము కంసాలి కాచిగొట్టగా దాని సహజశోభ ప్రకటమగునట్లును పెనురాతిని శిల్పిసుత్తి పోటుచే చెక్కినప్పుడే దేవతా విగ్రహము లగునట్లును కష్టములు గల్గినప్పుడే మనుజుల సాహస ఔదార్య విరక్తి భక్తులు మొదలగు సుగుణకలిమి బయల్పడును. కష్టమన్న నేమో యెరుగక భర్తృప్రేమ డోలికల నూగుచుండవలయు యౌవనారంభమున విరాగిణియై స్వార్థసుఖములను త్యజించి 'పరోపకారార్థమిదంశరీరం' అన్న శ్రుతిని పాలించెను. చిన్నతనమున విద్యావతికాకున్నను విశ్రాంతదశ ప్రాప్తమైన పిమ్మట జ్ఞానోదయము బడయుటకై యొకవృద్ధవనితను గురువుగా స్వీకరించి తద్ద్వారా మాతృభాషయగు నాంధ్రము చక్కగ నేర్చుకొనెను. వెనుక అనేక వేదాంతగ్రంథములు నుపనిషత్తులు జదివి తనశోకాగ్నిని నిశ్శేషముగ నార్పివైచి తన తనువును ధనమును పరోపకార నిమిత్తము భగవదర్పణము సేయ నిశ్చయించెను. సహజ సౌందర్యమలంకారాదులచే శోభించునట్లు జన్మనాగల్గిన యీమె సుగుణ పరిమళము జ్ఞానోదయముచే రవిగన్న తామరలవలె వికసించెను. హిందూ యాచారపద్ధతి ననుసరించి అలంకారములన్నిటికి దూరమైనను తన తోడిబాలికల నలంకృతలజేసి తృప్తిపరచి తాను సంతసింపుచుండెను. భారతభాగవత రామాయణాది గొప్ప గ్రంథముల పద్యశైలిని ధారాళముగజదివి అర్థము. అంతరార్థము సహా గ్రహించుటలో నీమె యసమాన ప్రజ్ఞగలది. ఈమెకు చిత్తూరుజిల్లాలో సుమారు 15000 విలువగల భూవసతియు 2-3 గృహములు గలవు. అందు సంవత్సరరాబడి 4-5 వందలరూప్యము లుండును. తన వచ్చుబడి సొమ్మువంటకొకకాను మిగిలింపక ధర్మకైంకర్యములకై వినియోగించెడిది. ఈమెను దేహియన్నవారు నాస్తిపదము విని ఎరుగరు. ఫలరహితమగు కర్మయోగమందేగాక శివకేశవులయందు నిష్కామభక్తియోగమున్నగద్దు. తిరుత్తణిసమీపం కొమారకుప్పమను గ్రామమందు శ్రీ భక్తాంజనేయ స్వామివారికి సుమారు 800 వెలగల రజతకవచమునుజేయించి సమర్పించినది, ఈమె జేసిన సత్కార్యము లనేకములైనను పత్రికాముఖంబున వెల్లడిజేయుట పలువురతో రద్దుజేసుకొనుట మొదలగు వాటికీమె ఇష్టపడదు. కర్మసాక్షియగు నామె యంతరాత్మ కొక్కనికే ఎరుకపడుచుండును. తాను జేసినధనసహాయము ఎప్పుడు ఎవరికి ఎందునిమిత్తము జేసితిమి యన్నవిషయము జ్ఞాపకము సహావదలి బాహ్యాడంబరముల పొంతపోక తన నిత్యకృత్యములలో ధర్మకృత్య మొక్కటిగ భావించిన ధన్యురాలు. సోదరకుటుంబమున గృహనిర్వాహక యాజమాన్యమును సోదరులిరువురి సంతాన శిశురక్షణయు నీమెపై యాధారపడియుండెను. సోదరులపిల్లలు తల్లిపోషణ మేమాత్రమెరుగక దమ మేనత్తగారిచే చక్కగా పోషింపబడి తమయత్తగారనిన మిగుల ప్రీతిగలిగి అమెను దమ పెన్నిధివలె భావింతురు. వీరేగాక సోదరదౌహిత్రులుగూడ నీమెచే పోషింపబడిరి. వారు వీరనేల దూరపుబంధువుల బిల్లలైనను పరిచారకుల బిల్లలైనను సరియె యీమె పెట్టుపోతలలో సమాన దృష్టినెరపుచుండును. అన్నము పెట్టుటయందు శ్రీకాశీ అన్నపూర్ణను రోగులనుపచరించుటయందు ఫ్లారెన్సు నైటింగేలును స్మృతికి దెచ్చుచుండును. బిల్లలందరికి నీమెయందు అమితానురాగమును యీమెకు వారియందు అపారమగుప్రేమయు గల్గుచుండెను. దీనికంతకు కారణము అయస్కాంతము ఇనుము నాకర్షించునట్లుల నీమెయొక్క నిష్పక్షపాతము అబాల గోపాలము నాకర్షించినవి. తన సోదరపత్నిని ఔరస పుత్రికకన్న వేయిమడుంగుల నెక్కువగ ప్రేమించెను. వీరివదినె మరదళ్లమైత్రి లోకవిదితము. గీతయందు శ్రీకృష్ణభగవానులు ఎంచినచెట్టున నీరు బోయుట రోగికి పరిచర్యసేయుట భగవత్పూజలని

అర్జునున కుపదేశించెను. ఈయంశము నీమె చక్కగా నెరవేర్చి శ్రీభగవానుల అనుగ్రహమునకు పాత్రత జెందెను తన సోదరభార్య జబ్బుపడినప్పుడు వలయునంత బంధువర్గము పరిచారకు లనేకులున్నను రాత్రింబగళ్ళు నిద్రాహారము లెరుంగక పాటుపడినది యీమెకుగల దయాళుత్వము దాతృత్వము శత్రువును సహితము పుత్రునిగ ప్రేమించు గొప్పతనమయు కుట్టు పనియందుగల నిపుణతయు గృహనిర్వాహక శిశు పోషణములగల నేర్పరితనము మిగుల శ్లాఘపాత్రములు. ఔరా ప్రపంచమందు మనుజులు కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞాన, యోగముల నాల్గింటిలో నొక్కొక్క దారి నడచుటకు చేతగాక కాలుజారి పడుచుండగా నీమె రెండుమార్గముల నధిష్ఠించినది. అందొకటి నిష్కామకర్మయోగము. వేరొకటి ఫలరహిత భక్తి యోగము. ఇట్టి పరమసాధ్వి సోదర సతీమణి శ్రీమతి వి. లక్ష్మమ్మగారు (యీమె గృహలక్ష్మి పాఠకులకు చిరపరిచితురాలు) 1933 సంవత్సరము డిసంబరునెల 28వ తేది మరణించినది. అట్టి బెంగచే శోకాకులచిత్తయై క్రమేణ దేహారోగ్యము చెడి వ్యాధి గ్రస్తురాలై 1934 సంవత్సరం నవంబరునెల 20 తేది మంగళవారం వుదయం 7 ఘంటలకు భౌతిక దేహంబు చాలించి పరమపదమందెను. ఇట్టి విశ్వజనని ఇక కొంతకాలము జీవించియున్నచో నిక నెన్నియో ధర్మకార్యముల జేసియుండును. యీలాటి పరోప కార పారీణులు గతించుట యాచకవర్గముయొక్క దురదృష్టమని చెప్పవలెను. యిప్పటికిన్ని యీమె పేరు విన్నను ఫోటోచూచినను బిల్లలు అల్లదె అత్తమ్మ వచ్చినదని గంతులువైచి సంతసింతురు. బంధువులు పరిచారకులు చిరపరిచితులు కంట నీరు బెట్టుదురు, వీధినూడ్చు పాకీవాండ్రుసహా నీమెపేరు విన్న అభివందన మాచరింతురు. యీదయామయు రాలి ఆత్మకు సర్వేశ్వరుడు శాంతిని గూర్చుగాక యని ప్రార్థింపుచు దుఃఖాతిరేకముతో విరమించు చున్నాను. ఈమె జీవించియుండగనే యీమె జీవితచరిత్ర వ్రాయవలెంచితిని గాని దైవకృతము వేరు గా నుండెను. ఈపవిత్రాత్మ దైవసన్నిధిని చిర స్థాయియై వెలుగుగాక !

# జోస్యము

పై. రా. శాస్త్రిగారు

వేంకటాద్రినాయుడు తనప్రభువు సైన్యమునందు సామాన్యసైనికుడుగా జేరి క్రమముగా రాజునాంతరంగిక భృత్యులలో నొకడయ్యెను. చివరకు సైన్యాధిపత్య మీతనినిలపై బడెను. నాయుడు రాజనీతి యందు విభీషణునికి సోదరుడు. మీరాజ్ఞా ఘనుడు కుంభకర్ణుడు. ఈతనితృష్ణకు మేరలేదు. పాషాణహృదయుడు. శత్రుకోటికి సాయమిచ్చి నిజస్వామిని రాజ్యచ్యుతుని గావించినవరుడీతడు. తుదకు తానే రాజయ్యెను. తన్నెదుర్కొన్నవారిని కఠినముగా దండించెను. పక్కైవచ్చి సేవకయ్యెను. నాయునికి సింహాసనపదవులు సమకూరినవి. ఏకపుత్రికయగుని పుత్రి కలిగె నీయుకామే నాయుని యందాగి నూరేళ్లు నిలుచు కొరకయెను. నాయుని కొన్నిటియో విచారము. తనవెనుక నీ రాజ్యము పాలించువా రెవ్వరు?

మోహిని జగదేకమోహిని. సుగుణరాసి. నాయునికాప్పుడు నిట్టి నారీమణి మొలకలుభవించెనా యను సందియము ఆశ్చర్యములోనే తీరదయ్యె. మోహినింగని చకితుడుగాని మానవుడుండడు. ఆమె పొందుగోరిన ఖిల్లాదారులు, జిల్లాదారులు వేలువేలుగలరు. కాని నాయుని చూపు వేరు. తనకన్న మిన్నయగు రారాజును తన తనయ పెండ్లాడవలెనని నాయునితలంపు. తండ్రియూహ మోహిని లెస్సగా గ్రహించినది. తండ్రియందు ప్రేమకన్న భయము మెండు. తండ్రికెదురాడుశక్తి తనయకు సున్న. నాయుని ఆంతరంగిక సైన్యాధిపతి యగు సింహాద్రి నాయునియందు మోహిని మనస్సు లగ్నమైనది. సింహాద్రి కీసంగతి తెలియకపోలేదు.

తన దినచర్యనంతయు ఆస్థాపండితుండును ఆగతానాగతవేదియు, ఉపాసనాతత్పరుండును పరమలౌకికుండునగు శంకరభట్టు సలహాపైననే జరుపుచుండు పరిపాటి నాయునికి గలదు. భట్టు జోస్యమునందు నాయునికి గల నమ్మకము అపారము. ఇంతవరకు భట్టు జోస్యమునందొకటియు పొల్లుపోలేదు. మోహినిఆశలకు శంకరభట్టు పట్టుగొమ్మ యయ్యెను. తన దాసిమూలమున భట్టునకంతయు మోహిని నివేదింప భట్టు అభయహస్తమొసంగె.

నాయుని రాజ్యమునందు శాంతి, కోటలో శాంతి, మనమునందు మాత్ర మది కొరవడెను. మోహినికి కన్యచెరవదిలి యుండలేదు. తనయమనస్సే యదృష్టవంతునియందు లగ్నమయ్యెనో ప్రశ్నింప

నాయునిపద్ధతికి వ్యతిరేకము. వరునికొరకు నాయుడు దేశదేశములుగాలించి వెదకించెను గాని తనమనసునకు నచ్చినవాడొకడును తగిలియుండలేదు. చివరకు భట్టు సలహా శరణ్యమయ్యెను. నాయుడు భట్టుని రావించి సంగతులన్నియు విన్నవింప వారముదినములు గడువిమ్మని ప్రార్థించెను. నిర్ణీతదిన ముదయముననే భట్టు కోటలో ప్రత్యక్షమయ్యెను. నాయుడు ప్రశ్నింప 'ప్రభూ నిన్నరాత్రి అంబనారాధింప ప్రసన్న మైన'దనెను. ఏమి శెలవిచ్చినదని యాతురతో ననియెను రాజు. 'నీప్రభువు మిగుల చింతాక్రాంతుడై యున్నాడు. మోహిని మిగుల అదృష్టవంతురాలు ఆమె సింహాద్రి నాయుని పరిణయమైనవెంటనే ఆమె కొక యమూల్యమణి దొరకును. ఆమణిని శిరమునధరించి సామ్రాజ్యమేలును. నాయుని వంశ మక్షయమగుననుచు నంతర్ధానమైన' దనెను. భట్టు భట్టుప్రస్తావన పూర్తికాక మునుపే నాయునిముఖము రక్తపూరిత మయ్యె. నోటమాటరాదయ్యె. మితిలేని కోపమువచ్చెను. ఇదియంతయు సింహాద్రి మేలుకొరకు భట్టు పన్నినపన్నుగడయని లో ననుమానించెను. 'ఛీ! మోహినీచపు కృత్యము. నాసరదారులలో నొకడగు నాతనికా!! నేనమ్మజాల! అంబనోటినుండి యిట్టిమాటలు రావలవు' అని గర్జించెను. తనకేమి కీడుమూడునోయనిభట్టు. ఏదియో మిషపై వీధిలోనికిబోయెను. రాజు ఆలోచనా నిమగ్నుడయ్యెను. ఇంతవరకు భట్టు అనృతమాడుటకు కారణమేదియు గన్పటదు. 'నాతనయకు రారాజు పొందుగూర్చవలెనని తలపోయుచుంటిగదా! అంబ ఏమనెను. సామ్రాజ్యమేలుననెను. నాతనయ రారాజును జేపట్టక సామ్రాజ్యమెట్లేలు' ననుచు రాజుతనలో తలపోయుచుండెను. చివరకు భట్టువాక్యములందు గురికుదిరెను. వెంటనే నాయుడు అంతఃపురమునకుం బోయి మోహినిని బిలచి తనమనోనిశ్చయ మామెకుదెల్పెను. ఆమె ముఖమునందాశ్చర్యము పొడమెను. ఆమె మాటాడక పోవుటచే తన యాధికారమునకు లొంగిపోయెనని రాజుసంతోషించెను. నోగక్షీరము లభిలషించెను. వైద్యులుపాలు పుష్టిమా యించిరి. ఇంక చింతయేల! కొలదిదినములలో మోహినీస్వయంవర మయ్యెను.

వారములు నెలలు గడచెను. పరిణయమై సంవత్సరమగుచున్నది. మోహిని కెట్టి మణియు లభించియుండలేదు. రాజేమగుట కల్ల! అంబవాక్కులలో నొకటియు ఫలింపలేదు. నాయునిమనసమున పరితాపము మెండయ్యె, భట్టునిరావించి నాయుడు పరుష వాక్యములాడెను. 'స్వామీ నాజ్యోస్య మిది వరలో సూటితప్పలేదే! జగదంబ నన్ను వంచనచేయునా! రేపటివరకు గడువిండ' నుచు భట్టు తిరోహితుడయ్యెను. మరునాడు భట్టు నాయునియెదుట ప్రత్యక్షమై రాజా అంబవాక్కునకు వ్యాఘాతము గల్గునే! ఆమెవచించినదెల్ల జరిగిపోయినది. నీకొమరితకు మణి దొరికినది. తన్మణిని

శిరమున ధరించినది. సామ్రాజ్యము నేలుచున్నది. నీవంశ మాచంద్రార్కముగ నుండు పరిస్థితు లేర్పడిన'వనెను, 'నీవబద్ధ మాడుచున్నా'వని రాజనెను. 'రాజా శాంతింపుము! శాంతింపుము!! భారతనారీమణి కనుకూలుఁడగు భర్తదక్క వేరొక యమూల్యమణి గలదె! తన్మణి నాదలధరించి నీయనుంగుతనయ ప్రేమసామ్రాజ్యము నేలుచున్నద'ని భట్టువాక్యము పూర్తి సేయకమున్నె అంతఃపుర పరిసరములనుండి నృత్యవాద్య విశేషములు వినవయ్యె. 'రాజా నీవంశ మక్షయమయ్యె! నీముద్దులమనుమని కండ్లార జూచిరమ్మ'నుచు భట్టు మెల్లగా జారెను.

# మందుఁడు

శా. ఎన్నో బాధలు బొందుచుండుమని న న్నీభూమి వర్జించి నా
పున్నెంపుంసతి అగ్బరేగ దివికిన్ బూర్ణేందు బింబంబు నా
ర్ధన్నిద్రింపఁగఁబోయిన; ట్లీఁక మహాంధీభూత మాలిన్యసం
భన్నాస్మ న్నిసిషిద్ధజీవన మభాసంబెన్నినా ళ్లుండినన్.

ఉ. ఎందఱో పోవుచుండి రిదియేమిటి యేమిటి పుట్టియీగతిన్
మ్రందుమనున్నదో తెలియరాదుగదా దివి యేమి యేప్పచే
మందుఁడనైన నాపసికిమాలిన బుద్ధికిఁ దోఁచకున్న దీ
చందమెఱుంగువారు నిజజన్మతరింప నచింపఁ జెల్లదే.

(దృశ్యము)

ఉ. ఏమిటిచిమ్మచీఁక టదియేమిటివెల్గు వియద్ధునీజల
శ్యామలమైన మబ్బు తెరచాటున మింటి బయళ్లమధ్య సౌ
దామినులన్ బ్రదీప్తమగు ధామములన్ విహరించు నాజన
స్తోమములేమిటో అవియె సుమ్ము యదార్థ జగమ్ము జీవికిన్.

ఉమర్ అలీషా.

# సుభద్ర

అయ్యలసోమయాజుల సుబ్బారావుగారు

సుభద్ర యిప్పటి నవనాగరిక స్త్రీలలాగ టక్కులు, టిక్కులు, నిక్కులు లేకుండా పూర్వకాలపు స్త్రీల మల్లే యెల్లప్పుడు పురాణగాధలతో కాలక్షేపం చేస్తూండే సాధ్వీమణి; నిరంతర పతిసేవా పరాయణ; అత్త మామలకు ఎదురాడక వారు చెప్పేపనులు శిరసావహించి చేయు క్షమారూపిణి; అన్నాతురులగు బీదవాండ్రకు సాక్షా దన్నపూర్ణాదేవి; సుశీల. అంత అందంగా వుండకపోయినప్పటికీ చామనచాయని దేహం, ఆ ఆకర్ణాంత విశాలనేత్రాలూ, ఎల్లప్పుడూ నవ్వులొలికే ఆ ముఖకళ చూస్తే సౌందర్యవతియనే చెప్పొచ్చు. అట్టి సుభద్ర గుణాలకి వ్యతిరేకించాయి అత్తగారు వెంకటనరసమ్మ గుణాలు. రోజు కొకమాటైనా కోడలిమీద వెయ్యిచేసుకుంటేనే గాని చేతి దురద వదలని కోపస్వభావురాలు; ఆవిణ్ణిచూస్తే యింట్లో అందరూ గడగడలాడవలసిందే; పెనిమిటి సబ్ కలక్టరు గదా! అందులో అన్నదమ్ము లెవరూ లేకపోడంవల్ల పుట్టింటా రాస్తంతా ఆవిడికే కలిసింది. ఇంకేం కొదవ? సర్వవిధాలా అధికారం చెల్లాయిస్తూ వుంటుంది. ఆఫీసులో కలెక్టరైనా యింటిదగ్గర సర్వెంటులాగ వుండవలసినదే; లేకపోతే భర్తయేది వాణ్ణి పుట్టించిన బ్రహ్మయేది వీపు పెట్టవలసిందే.

జగన్నాథం సర్వసద్గుణ సంపూర్ణుడు. తల్లిదండ్రులయందు భక్తి యెక్కువగలవాడు. భార్య అన్నప్రేమే గాని తల్లిమాట జవదాటలేడు. అదీకాక శలవుల్లో తప్ప యింట్లోవుండేదికూడ లేదుగా. అందుచేత భార్యయొక్క కష్టాలేవీ తెలిసేవికావు. ఇల్లా వుండగా ఇక్కడ సుభద్రకు రోజు రోజూ బాధ లెక్కువై పోయాయి. "అసలే కోతి అందులో నిప్పు తొక్కి కల్లుత్రాగిన" దన్నట్లు ఆ వూళ్లో ఓవర్‌సీరుగానున్న సుబ్రహ్మణ్యంగారి భార్యవచ్చి "వెంకట నరసమ్మొదినా! మీవాడికి పెళ్లయిపోయిందిగాని, లేకపోతే మీరంతడిగినా అంతకట్నమిచ్చి మీలాంఛనాలన్నీ జరిపి మాపిల్లనిచ్చేద్దును గదా! ఏంచేస్తాం, చెయ్యికాలిన తరవాత ఆకులు పట్టుకోడంగాని. శుభ్రంగా ఏదో చదువుతోందిగదా! పిల్ల రత్నంలా వుంటుంది. ఆర్మొనీ బాగా వాయిస్తుంది, కలిసొచ్చిన సంబంధం చేసుకొంటే బావుండును, ఇంకేమంటే లాభమేవుంది?" అని యీ నిప్పులో కొంత నెయ్యి పోసేది. అందుమీద యీ అగ్గి రవులుతూండేది, ఎన్ని కష్టాలొచ్చి సుభద్రమాత్రం భక్తిగా అత్తమామలకునా సేవచేస్తూ భర్తరాకకై ఎదురుచూస్తూండేది.

## ౨

పరీక్షలాఖరైనాయి. జగన్నాథం శలవులకు యింటికి వచ్చేశాడు. బ్రహ్మరథం పట్టింది సుభద్ర. వెంకట నరసమ్మ వోర్వలేకపోయింది. "నవమన్మథుని లాంటి తనకుమారునిదగ్గర సుభద్రకు నిలబడడానికే నా అర్హతవుందీ?" అనుకొంది. ఇంటిలో దీపంలా వెలుగుతూంటే వాడిదగ్గర కోతివిదయ్యానికి మల్లే యిదెందుకుండాలి? నే బ్రతికుండగా చూడలేను. ఏదో అప్పుడు నామెడవిరిచేరు గాని, ఇప్పుడుకూడా నాకొడుకు కష్టపడుతూంటే చేతకానిదానిలాగ ఊరుకోవలసినదేనా? ఈ దెయ్యం గతేకైతే నాకేం నిక్షేపంలాంటి కాళ్లకీ కడుపుకీ అచ్చొచ్చిన సంబంధం. ఆ వోవర్‌సీరుగారి కుమార్తెను పెళ్లిచేసేస్తాను." అనుకుంది. ఆ రోజు అయిదారుమాట్లేనా కొట్టి వుంటుంది సుభద్రను. "దీన్ని తగిలేయడ మేలాగా?" అనే ఆలోచన పగలల్లా, రాసికి తననింట్లో నాఖరీ

అప్పలస్వామిని పిలిచి సంగతంతా చెప్పి ఎలాగైనా రాత్రి రెండుగంటలవేళ సుభద్ర గదిదగ్గర నిలబడమంది. వాడు మొదటొప్పుకోలేదు గాని అమ్మగారు చెయ్యితడిచేసేసరికి ఒప్పుకున్నాడు. ఆహా! అర్థ మహిమ! యొక్క క్షణములో మాతాపుత్రులకు కూడ పరస్పర విరోధభావాలు కలగజేస్తుందిగదా! ఇంక యొకతుచ్ఛుని దుష్పథం త్రొక్కించుటలో లెక్కా?

సుభద్ర రాత్రి పదిగంటలవఱకు గృహకృత్యాలు చేసుకొని చెంబుతో మంచినీళ్లు పుచ్చుకొని పడకగదిలోకి వెళ్లింది. కసరికొట్టేసింది వెంకటనరసమ్మ. "మేం వేదో మాట్లాడుకుంటూంటే నువ్వెందుకే యిక్కడికి? వెళ్లు. తరవాత వస్తువుగాని లే!" పొమ్మంది. ఏంచేస్తుంది వసారాలోనే కొంతసేపు కూర్చొని నిద్రకాగలేక అక్కడే పైటకొంగు పఱచుకొని పడుకుంది. ఆ వెక్కడ కబుర్లో గాని రాత్రి రెండుగంటలవఱకు కొడుకును వేపుకతింది. చాలా కాలానికి కలుసుకొని కష్టసుఖాలు మాట్లాడుకుందామని ఎంత ఉబలాటపడతారో నవీన దంపతులు? జగన్నాథానికి అసలు సంగతి తెలుస్తేగా! తనమీది ప్రేమచేతనే తల్లి యింతరాత్రి కష్టసుఖాలు మాట్లాడిందనుకొన్నాడు. ఈ వొక్కరోజు తల్లిమాట వింటే రేపటినుంచి కులాసాగా వుండొచ్చు ననుకున్నాడు. ఇంతలో వసారాలో చప్పుడైంది. మాతాపుత్రులిద్దరూ చూడ్డానికి వెళ్లారు. మంచందగ్గఱ నిలబడియున్న నౌఖరు అప్పలస్వామిని, లేస్తూన్న సుభద్రను చూచారు. తెల్లబోయింది సుభద్ర. నౌఖరువాడు తన మంచందగ్గఱ కెలావచ్చేడో తెలీదు. ఏదో చప్పుడైతే తనుకూడా లేచింది. ఇంతకూ కారకురాలు వెంకటనరసమ్మ వూరుకుంటుందీ!

"ఆసి! నీమొగం తగలెయ్యా! ఎంతపని చేస్తున్నావే! వెధవా! నువ్వెవడవురా? అప్పలస్వామీ! నువ్వే? నీకేం పోయేగాలం వచ్చిందిరా! తినుండలేక తిన్నింటివాసాలే లెక్కపెట్టడం? ఇంతకీ నిన్ననేదేంవుంది. మావస్తువుమంచిదికాకపోయాక ఇంకా కదలవేం?" అంటూ నిజంగా కొట్టేదానికి మళ్లీ వో దెబ్బ వేయబోయేసరికి పారిపోయా డప్పలస్వామి. ఇంక సుభద్రపై నానాహంగామా చేస్తూ, చితకతంతూ తెల్లవార్చేసింది కేకలతో వెంకటనరసమ్మ. జగన్నాథం భార్యయొక్క గుణం తనకు తెలియును గాని యేంచేస్తాడు? ప్రత్యక్షంగా కనబడుతూంటే. తల్లియాజ్ఞకు బద్ధుడై వాల్చొచ్చింది. తిరిగి వివాహమయిపోయింది నెలరోజులలో. ఓవర్ సీరుగారితో వియ్యమందినందుకు ఉప్పొంగిపోయింది వెంకటనరసమ్మ. పాపం సుభద్రకు ముందు నుయ్యి, వెనక గొయ్యిపాటొచ్చింది. ఏంచేస్తుంది; పుట్టింటియాశ లేదు, తల్లిదండ్రులు సుభద్ర పెళ్లయిన సంవత్సరంలోనే చనిపోయారు. ఓ మేనమామమాత్రం ఉన్నాడు గాని ఎక్కడున్నాడో తెలీదు. ఇంక అత్తింటిస్థితి యిలావుంది. ఇంక దాసీదానిలాగ యింట్లోపని చేస్తూ వుంది. అప్పటప్పుడు చచ్చిపోదామని నూతిదగ్గఱకు వెళ్లేది. ఆ సమయానికల్లా యెవరో వకరు వచ్చేవారు. అవమాన దుఃఖంలో వుండినప్పటికి నాథుని సేవ మానేదికాదు. ఎప్పటికైనా రహస్యం దాగుతుందా? వెంకటనరసమ్మ వొప్పుకున్నప్పటికీ వూళ్లోవారు తన్ని తగిలేశారు అప్పలస్వామిని; భార్యాపిల్లలను పోషించలేక అల్లాడిపోతున్నాడు. ఇంకెవ్వరూ గూడ నౌఖరీ యివ్వడం మానేశారు. పైవూరు పోదామన్నా డబ్బులేదు. ఉన్నడబ్బల్లా అదివఱకే ఖర్చుపెట్టేశాడు. ఇంకేం చేస్తాడు? జోలితగిలించుకొని తిరగడం ప్రారంభించాడు. ఓరోజు సుబ్రహ్మణ్యంగారింటికే ముష్టికి వచ్చాడు. అడగలేక అడగలేక "అమ్మా! ముష్టి." అన్నాడు ఫో! ఫో పోకిరీ వెధవా! పోతావా? గెంటించనా!" అన్నారు సుబ్రహ్మణ్యంగారు.

అప్ప:—బాబూ! నిన్నటినుండీ తిండిలేక మలమల మాడిపోతున్నారు పిల్లలు. రక్షించండి! బాబయ్యా!

సుబ్ర:—ఏం? వెధవపన్లు చేయకపోతేనేం? ఈ యేడ్పు లేడవకపోతేనేం? వెళ్లు! వెళ్లు!

అప్ప:—బాబయ్యా! క్షమించండి! నేరక గడ్డి తిన్నాను. పాతికరూపాయ లిస్తానంటే ఈ వెధవపని చేశాను.

సుబ్ర:—ఎవర్రా! నీకు పాతిక రూపాయలిచ్చి ఈపని చేయించినవారు?

అప్ప:—వెంకట నరసమ్మగారండి!

సుబ్ర:—ఛీ! దుర్మార్గపు వెధవా! ఆ యిల్లాల్ని గూడ యిందులో తోస్తున్నావా? తన్నులు తింటావు. జాగ్రత్త!

అప్ప:—పిల్లలతోడు బాబయ్యా! నేను చెప్పేదంతా నిజంవండి! నమ్మితే నమ్మండి! లేకపోతే మానీయండి!

సుబ్ర:—నిజంవా? ఆ నిజంవేమిటో చెప్పూ!

అప్ప:—ఆవేళ సాయంత్రం నన్ను పెద్దమ్మగారు పిలిచి రాత్రి రెండుగంటలకల్లా సుభద్రమ్మగారి గదిదగ్గర తచ్చాడమన్నారు. "ఎందుకండి! నేనాపని చెయ్యను" అన్నాను. అప్పుడు పిల్పు; పాపిష్టిపిల్పు; నాకిచ్చి నాచేత వొప్పించుకున్నారండి! పాతిక రూపాయల కాశపడ్డానండి! నే చేసినపని తప్పే బాబు! మీ పాదాలమీద పడ్తాను బుద్ధొచ్చింది. ఇంక నేనా నమ్మకంవుంటే ఇంతతిండి పెట్టించండి ఆకలి దహించుకుపోతోంది.

సుబ్ర:—అప్పా! ఎంత నెరజాణవే! వెంకట నరసమ్మా! నిజంగా అలా చేసిందిరా?

అప్ప:—నిజంవండి! బాబయ్యా! సుభద్రమ్మ గారేంవీ యెరగరండి! నేనొచ్చినట్లు తెలపడానికి దగ్గినదగ్గే ఆవిణ్ణి లేపిందికాని, ఆవిడ నిజంగా గౌరీదేవేనండి!

సుబ్ర:—పో! యీరూపాయిపుచ్చుకొని బియ్యం కొనుక్కో! పశ్చాత్తాపం వచ్చింది గనుక బాగు పడతావులే!

అప్ప:—శలవు దయచేయించండి; బాబూ!

సుబ్ర:—వెళ్లు!

## 3

సుబ్ర:—జానకీ! జానకీ! నే చెప్పినమాటలు జ్ఞాపక మున్నాయా?

జానకి:—ఆ! జ్ఞాపకమున్నాయి నాన్నగారూ! కానీండి నేవెళ్లేక సవరిస్తాగామా!" అని వెళ్లి పోయింది జానకి. సుబ్రహ్మణ్యంగారు అప్పలస్వామి చెప్పిన మాటలన్నీ నమ్మి "వెంకటనరసమ్మకు ప్రాయశ్చిత్తంచేయడం కెలాగా?" అని ఆలోచించి తన కుమార్తె జానకిని పిలిచి నేర్పవలసినవన్నీ నేర్పుతూ వుండేవాడు. కాలేజీలో చదువుతూ ప్రపంచవార్తలు నాలుగూ వింటూవుండడం వల్లను, అసలే బుద్ధిమంతురాలౌటవల్లను జానకి తండ్రిచెప్పిన మాటలువిని అవగాహనచేసుకుంటూ వుండేది. అత్తవారింటికి వెళ్లిన తరువాత చేయవలసిన పనులన్నీ రోజూ పాఠం వప్పగించేది. సుభద్ర కష్టాలు ఎప్పుడు పోగొడ్తానా అనే ఆలోచించేది. ఏం? సుభద్ర కష్టాలుపడితే తనకేం? దయా ప్రపూర్ణయగు జానకి అన్యాయంగా తనబోటి యొక స్త్రీవ్యక్తి కష్టపడుతూంటే వూరుకో గలదా? సమస్త విద్యల్లోను శక్తియుక్తురాలగు జానకి తనచే కావలసినపనికి వెనుతీస్తుందా? శ్రావణమాసంవనీ, అట్లతద్దనీ ప్రతీపండుక్కీ జానకిని తీసుకెళ్లేవారు. అక్కడకి వెళ్లినప్పుడల్లా సుభద్రపాట్లుచూచి జాలి పొందేది. దుఃఖించేది కూడాను.

కొన్నాళ్లకు జానకి వ్యక్తురాలయింది. వెంకటనరసమ్మ మిన్నందుకుంది. అందమైనపిల్ల, చదువుకొన్న పిల్ల, దైవకటాక్షంవల్ల కొడుక్కిగాని యే పెద్ద వుద్యోగంవేనా అవుతే కొడుకు, కోడలు ఇంగ్లీషు మాట్లాడుకుంటూంటే సరదాగా వింటూ కాలక్షేపం చేయొచ్చు, వంటకేదో సుభద్రవుందికదూ? ఇంకనేం కులుకుతూ కూర్చుందాంవనుకుంది. పైన దైవంలేదూ?

మలేరియా జ్వరంవచ్చి సబ్ కలెక్టరుగారు స్వర్గం వేంచేశారు. ఊరంతా "కోడలు సంవత్సాడిన నక్షత్రం మంచిదికాదమ్మా!" అంటూ నాలుగక్షింతలు జానకి నెత్తిమీద పోశారు. కావలని కోరితెచ్చుకున్న పిల్ల గదా వెంకటనరసమ్మ ఊరుకోంటుందా! కొత్తవెధవ ముండయినప్పటికీ వూరందరికీ సమాధానం చెప్పేది సుభద్ర చెడునడతవల్లనే నిక్షేపంలాంటి నిధి పోయిందంటూ. అదేవంటే నమ్మేవాళ్లెవరు? అదివరకే తెలిసిపోయాయి వెంకటనరసమ్మ గుణాలు.

కార్యంచేసుకొని మీపిల్లను మీరు తీసుకెళ్లమని తొందరచేస్తున్నారు సుబ్రహ్మణ్యంగారు. దినవారాలయింతరవాత ఆ అవశిష్టం కాస్తాతీర్చుకొని జానకిని తీసుకొచ్చింది వెంకటనరసమ్మ. జానకి అత్తారింటికి వెళ్లిన కొద్దిరోజుల్లోనే తండ్రిగారి వుద్యోగమే జగన్నాథానికిచ్చారు. ఏ నోటితో జానకిని తిట్టారో ఆ నోటితోనే భూషించారు లోకం. వెళ్లిన రెండు మూడు నెలలు అలవాటయ్యేవరకూ అత్తగారిపట్ల అణకువగానే వుంది జానకి అక్కడనుండి కొంచెం వెటకారపుమాటలు, వెక్కిరింతలు ప్రారంభించింది. కోరిచేసుకున్న పిల్లవెూ, ఏమీ అనలేకపోయింది వెంకటనరసమ్మ. ఒకెప్పు డెప్పుడేనా కూకలేస్తే టిల్రగాం వెళ్లిపోయేది సుబ్రహ్మణ్యంగారి దగ్గిరికి. ఆయన అల్లుడు లేకుండా చూచివచ్చి "ఇంకెప్పుడేనా కూకలేశావంటే గుండట్టుకు యీడ్పించేస్తానంటూ అడావిడిచేసి పోయేవాడు. కొడుకొచ్చేసరికల్లా యీ సంగతి చెపదామని ఎదురుగా వెళ్లబోయేసరికి జానకి కనిపెట్టి తనే ముందుగా వెళ్లి కావలించుకొని తీసుకుపొయ్యేది గదిలోకి. అక్కడికికూడా రానీలులేకుండా గడియవేసి మరీ వెళ్లిపొయ్యేది. పగల్లా ఆఫీసులోను ఇంటిదగ్గరున్నప్పుడు జానకిదగ్గరా తప్ప యింకెక్కడికీ వెళ్లడానికి వీల్లేకపోయింది జగన్నాథానికి. ఒకప్పుడెప్పుడేనా సరదాపుట్టే బేట్మెంటాడుకోటానికి క్లబ్బుకు వెళ్లేవాడు. ఇల్లా రెండు నెలలు కొడుకుతో మాట్లాడ్డానికి వీల్లేకుండా చేసింది వెంకటనరసమ్మను జానకి. ఈ అవమానం భరించలేక వెంకటనరసమ్మ యిరుగు పొరుగువారితో చెప్పుకొని విచారిస్తూండేది. "ఏంవమ్మా! బుద్ధిమంతురాలైన సుభద్రమీద లేనిపోనినేరాలుకల్పించి కోరి కొడుక్కి రెండో వివాహంచేసి యిప్పుడీ కోడలిమీదకూడా నేరాలేనా? నీ కొచ్చిన యేళ్లు యెవరికొచ్చాయి? చాలు! చాలు! ఊరుకో నవ్విపోయేరు" అని వారు చీవాట్లు తగిలిస్తే నోరుమూసుకుని యింటికి వచ్చేసేది. ఇంతకీ వొక్కదానికిమాత్రం సంతోషించింది. సుభద్ర నేలుకోలేదనే. ఆ సంతోషంకూడా కలకాలం నిలపలేదు. "మా సుభద్రక్కయ్య నేలుకుంటేనే గాని నేనుకూడా మీకు లేనిదాననే." అంది జానకి. సుభద్రగుణాలు తనకు చూచాయగా తెలిశాయి కాబట్టి సుభద్రనుకూడా ప్రేమతో చూస్తున్నాడు జగన్నాథం. ఇంక మూలుగులు, మూతివిరుపులు ప్రారంభించింది వెంకటనరసమ్మ. రోజుకు వోమారేనా కాశీ చూచుకొని సుభద్రను తిడుతూనేవుంది.

ఓరోజున వంటకాలస్యంగా మడికట్టుకుందని పెరటపడి తెగతిడుతోంది. జానకి వింది. "ఏంవమ్మో! మీరుగాని యిలాతిక్కేరంటే వేరేవుండొచ్చు, తిని కూర్చోలేక యేంవిటీ కేకలు? రేపటినుండి మీరే మడికట్టుకోండి! మేం చేసేదిలేదు. వుంటేవుండండి! పోతే పోండి." అంది జానకి. ఆమాటకి నిలుచున్నపాటున కూలబడిపోయింది వెంకటనరసమ్మ. గట్టిగా మాట్లాడ్తే యముడులాగవచ్చి పడిపోతాడు సుబ్రహ్మణ్యంగారు. తనకోరికపైని ఈసకకలిసిన పుట్టింటి ఆస్తి కోడలిపేర రాస్తేనేగాని పిల్లనివ్వనంటే సంతోషంగా రాసి జానకిని కూర్చింది కొడుక్కి. వూరంతా ముద్దుకోడలంటూండేవారు జానకిని. ఇప్పుడుగాని జానకిమీద నేరాలు పైవాళ్లతోచెప్తే సేసిన్నాళ్లు జల్లుతారని భయంకలిగింది. కుమారునితో మాట్లాడ్డానికూడా నోచుకోలేదు. కుళ్లికుళ్లి విచారించింది. ఇంతజరిగినా సుభద్రంటే సవితల్లిప్రేమగానే వుండేది.

## ౮

సంవత్సరాది పండుక్కి జానకి పురమాయింపువల్ల బొబ్బట్లొండింది వెంకటనరసమ్మ. జగన్నాథం భోంచేసి వెళ్ళిపోయాడు. సుభద్రకు జానకికికూడా వడ్డించి తనుపెట్టుకు తింటూంది వాళ్ళని పిలవకుండానే. జానకీ సుభద్రా మంతనాలాడుకుంటూ భోజనానికి వచ్చారు; వడ్డించిన విస్తళ్ళు చూచి తెల్లబోయింది జానకి. సుభద్రకు వడ్డించిన విస్తరిలో ఏంవుంది? కూర, అన్నం! జానకికి బొబ్బట్లుపెట్టి తనకు పెట్టుకొని సుభద్రపై కోపంచేత పెట్టడం మానేసింది. అదికనిపెట్టి జానకి చట్టున తనవిస్తరిలోని పిండివంటలు సుభద్ర విస్తరిలో పెట్టేసి గబగబా వెంకటనరసమ్మ పెట్టుకున్నవన్నీ తనవిస్తరిలో పెట్టేసుకుంది.

"అయ్యో! అయ్యో! అదేం? జానకీ! మైల పర్చేశావ్?" అంది వెంకటనరసమ్మ.

జానకి:—మాట్లాడకమ్మా! నీచప్పనిచేసి పైగా మాట్లాడుతారు. ఇంటికి పెద్దకోడలే! పరమ పతివ్రతే! అట్టివానిమీద లేనిపోని నిందలుమోపి దాసీదానికన్న హీనంగాచూచి తిరిగి కొడుక్కి పెళ్ళిచేశారూ!! దైవంలాచూసేదే! అందంగాలేదనా? స్త్రీకి రూపం, గుణంగాని యీ దేహచర్మంవా? లోకులంతా కూడ మిమ్మ దేపనిగా చెప్పుకుంటున్నారే! మీ గొప్ప నాదగ్గఱోంపనికిరాదు; మామీద మీరు ప్రేమ గావుంటే మిమ్మల్నిభక్తిశ్రద్ధతో పూజించుకొంటామే! ఇంక మీ కిష్టంలేకపోతే వేంచేయండి! తలుపుతీస్తాను." అన్ని మాటలు వింది వెంకటనరసమ్మ. కళ్ళవెంట నీళ్ళు గిఱ్ఱున తిరిగాయి. చట్టున జానకిచేతులు పట్టుకొని ఏడవడం ప్రారంభించింది. "పశ్చాత్తాపంవొచ్చింది, యింకేం వనకూడ"దనుకొంది జానకి. కొంచసేపటికి గద్గదస్వరంతో 'క్షమించు' అంది వెంకటనరసమ్మ. అప్పుడు సుభద్రవచ్చి "అత్తా! మిమ్మల్ని క్షమించడానికి మేంవర్తులమా? మీ ఆశీర్వచనఫలితంవల్లే యిల్లా వున్నాము. ఊరుకోండి." అని వెంకటనరసమ్మను వసారాలోకి తీసుకుపోయి ఉపచారాలు చెయ్యడం ప్రారంభించింది. జానకికూడ సంతోషించి నూతికి పోయి స్నానంచేసి త్వరగా వంటచేసి వెంకటనరసమ్మను భోజనానికి పిలిచింది "రాత్రి ఫలహారం చేస్తాలే! ఇంక తినకూడదు." అంది వెంకటనరసమ్మ. "ఇప్పుడుగాని మీరు భోంచేయకపోతే ఇంకా కోపం వుందనుకుంటాం." అంది సుభద్ర. తప్పని సరిగా మడి కట్టుకుని రెండు మెతుకులు కొరికింది వెంకటనరసమ్మ.

సాయంత్రం వయ్యోసరికల్లా ఇష్టాగోష్ఠిగామాట్లాడుకుంటూన్న అత్తాకోడళ్ళనుచూచి ఆశ్చర్యపోయ్యాడు జగన్నాథం. ఆనందంతో "అమ్మా! నాకు ప్రమోషనుకి ఆర్డరొచ్చింది." అన్నాడు. "మీరుచెప్పిన వార్తకంటె శుభవార్త చెపితే యేంవిస్తారు!" అంది జానకి.

జగ:—ఏంవిటది?

జానకి:—ఈరోజునుండి మీజట్టు మానేశాం.

జగ:—ఎంచేతో?

జాన:—అత్త మామీద ప్రేమజూపుటచేత.

జగ:—అయితే! అత్తగారిని పూర్తిగా వలలో వేసుకొన్నావన్నమాటే?

జానకి:—'ఆల్ రైటు'గాను.

జగ:—పెంకా!

వెంక:—కుంకా!

జగ:—అదేంవమ్మా! నువ్వలాగంటావు?

వెంక:—నాయనా! చిన్నదయినప్పటికీ జానకికి ఉన్నబుద్ధి మనకుందీ! సాక్షాత్ జానకీదేవే. అశాశ్వతమైన తనువుచూచి అందంవనీ దూషించాను. మణిని రాయికింద భావించి మహాపాప మెడికట్టుకున్నాను. ఇంక నాచేష్టలన్నీ మఱిచిపోయి కొత్త వెంకటనరసమ్మననుకోండి!

సుభద్ర:—గతజలసేతుబంధం వెందుకత్తా! భోజనానికి లేవండి!

వెంక:—నాయనా! లే! మడికట్టుకో!

కొంతకాలం వయింది యిద్దరినుంవల్లి చెరో ప్రక్క కూర్చోపెట్టుకొని ఆనందిస్తోంది వెంకటనరసమ్మ భాగవతంవింటూ—జానకి ఒక్కొక్క పద్యమే చదువుతూ అర్థంచెపుతోంది. అదెల్లప్పుడూ నిత్య చర్యగా! ఆగృహలక్ష్మి అల్లాగే ఉంటుందని నమ్మకం ఐకమత్యం ఉంటే ఉండదూ?

# మరులుమందులు

చదువుల రామచంద్రయ్యగారు

పురుషులు నానాటికి ప్రభువులై స్త్రీ స్వాతంత్ర్యము నణగద్రొక్కి వారిని పలు బాధలు బెట్టుచున్నారను గోల క్రమక్రమ మగుచున్నయది. ఈ సమస్యా పరిష్కార మునకు పెక్కు త్రోవలు మా సోదరీమణుల కిదివఱకే తెలిసియుండునేమో గాని మేము కూడ ప్రకృతము యీ క్రింది మరులుమందు లమోఘముగ బనిజేయుటచే తెలియజేయు చున్నారము. ఈ మందులుగూడ రెండు తెరంగులు. ఒకటి వస్తురూపమున పురుషుని నారగింపజేసి యతని శరీర మానసికా రోగ్యముల జెరచి కులకళంకము లాదిగా పాపఫలము నొందుట. రెండవది విజ్ఞాన రూపమున నాతని మనస్సును తమపరి యూతని సర్వకార్యములను సులభముగ సునాయాసముగ నెరవేర్చి స్త్రీ పురుషు లిరు వురు ఇచ్ఛాపూర్తిని బడసి సుఖించుట. మందు లొక్కొక్కటిగ క్రింద పొందు పరచుచున్నారము.

మొదటిది:—బైట దిరుగుచు సంపాద్య మునకై పలుబాధలు బడుచున్న పురుషుడు కొన్ని కారణములచే నింటికి వచ్చినపుడు యింటనున్నవారిపై కోపము వహించుట గలదు. దాని నపుడే తొలగింపకున్నచో సాధారణముగ స్థిరముగ నాటుకొని తుదకు ఇంటనున్నవారియెడ జుగుప్సకుగూడ కారణ మగుచుండుట విదితమే. ఈ రోగమున కాదియందే యీ మందు ప్రయోగింపవల యును. కోపము వచ్చినట్లు తెలియగనే శాంతము వహించి, వారు చెప్పినవెల్ల గ్రహించి, మెల్లగ యొద్దజేరి, "పాపము పంతులుగారికి బయట ఏమిటో నొప్పి గల్గి నది. అధికా ర్లేమన్నారో? నీ రివ్వనా? ఫలహార మేమైన చేస్తారా!" అని ప్రారం భించిన కోప మింకను అచట గూర్చొని ఉండునా? ఆతడు మానవుడు గాడా? కోపము తీరిన ఇష్టము వచ్చినట్లు నడిపింప గూడదా? అదియును గాక ఒకమారిట్లు జేసిన మరొకమారు కోపము రాకుండుటయే గల్గును. పైమందు వేయక, "ఇంటికొచ్చే వేళకు చిటపట లాడుచూ "వస్తా రేమి టండీ" యని మాటకు మాట 'బాకీ' చేయించిన తత్ఫలితము అందరికిని తెలిసిన విషయమే.

రెండవది:—మనుజుల కత్యంత ఇష్టమైన వస్తువులలో భోజన మొకటి. పురుషుని లోబరుచుకొనుటకు ఇయ్యదిగూడ చాల బనిజేయును. పురుషుల కే వస్తువు మిగుల యిష్టమైనదో గమనించి వారి కది పలు మారు సమకూర్చుచున్న దీనితో సమాన ముగా బనిచేయు ఔషధము వేరొకటిలేదు. క్రమక్రమముగా పురుషుడు సంపూర్ణముగ

లోంగిపోవుట తటస్థించును. ఐనను కొంచము శ్రద్ధ దీసికొనుట మంచిది. ఎదురాడిన తమకత్యంతప్రియతమమగు వస్తువు లభింపదు గదా యను భయము వారి నావేసించును.

మూడవది:—మనిషి కేదైన కష్టము గలిగినపుడు దానియందు పాల్గొని దానిని సాధ్యమైనంతవరకు అతనికి దోపకుండునట్లు జేయుట. ఇతరులకు కష్టములు గల్గినపుడు గాని బాధలేక ఆయాసము గల్గినపుడు గాని మన మెంతో పరితపించి వారికి తోడ్పడుటకు లేక ఉపచరించుటకు ప్రయత్నింతుము గదా? జీవితమునందు భాగస్వామియగు పురుషునకు తోడ్పడుటకు ఉపచరించుటకు గమనించినచో ఎట్టి ఫలితముల నొసగునో యెరుగని విషయముగాదు. ఈ విషయములలో అతని మనస్సెంత సంతోషపెట్టిన తన ప్రియసతికట్టి సమయములెంతగా ఎంతగా నుపచరింపదు? ఎక్కడనోయున్న రాతి విగ్రహమును దెచ్చి యెక్కచోనుంచి సకలోపచారములుచేసి సకలము అర్పించి షడ్రసోపేతముగ భోజనమిడి, నిర్జీవయగు నయ్యది యనుగ్రహించునని తలంతురుగాని సజీవుడై దయాదాక్షిణ్యాది సకలగుణముల కిరవగు మీ భర్తల కెపుడైన యట్టి యుపచారములు జేయుచున్నచో మానవుడైన వాడెపడు మరువగలడు? అంటే చేసినవన్నియు గ్రహించి పెట్టినవన్నియు గుటకాయస్వాహా చేయునని మనుష్యులకట్టి సేవలు చేయ నిరాకరింతురు. సేవ లనుభవింపని విగ్రహములచే మీరనుగ్రహింపబడుచో జీవములతోనున్న విగ్రహములు మిమ్మనుగ్రహింప వస సమ్మసగునా? దీని కేమందుసాటి?

నాల్గవది:—ధనమసలే లేదు. ఉన్న జీతాలు ఊడబెటికి తిండికి గుడ్డకు కూడ చాలక యిచ్చుజీతాలు గల కాలములో భర్తలను లేక తండ్రులను, సొమ్ములని మరి తరములని బాధించువారి నెంతమాత్రము ప్రేమింతురో మీ కెరుగనిది కాదు. అట్లు గాకుండా విద్యాదిగుణములే అలంకారములని యున్నట్లయితే, డబ్బు మీరు భద్రముగా దాచెదరని వారికి తెలిసిన, వారికి వచ్చు పైకము మీవద్దగాక యింకెచటనుండును. వారికా నమ్మకము గలిగింపవలయును గాని ఖజానా చేతిలోనున్న రాజ్యమేలు వారెవరు? తరువాత మీకత్తి కడ్డమెచట?

ఇక ఐదవది భర్త చెడుత్రోవను సంచరించుచున్నచో "ఆయనకు చెప్పేదెట్లా" అని 'మనకెందుకులే ఆగొడవ' అని "ఇది అంతయు నాదురదృష్ట" మని ఊరకుండక సమయము సందర్భము తెలిసికొని మంచిమాటలచే నయమున ప్రియమున, (మీ రీ మందులన్నియు నేర్చి యంటే భయమున గూడ) వారు చేయుచున్న దుర్మార్గమును గురించి బుద్ధిజెప్పి సన్మార్గమునకు తీసికొని రావలయును. వారియెడ విసుగుకొనకుండ క్రమక్రమముగ యీ మందు ప్రయోగించుచో రోగము బాగుపడుటయే గాక యింకొక మారు ఆరోగ మాతని కంటదు.

ఆరవది:—వినయవిధేయతలు, వివేకము, దయ, ఓర్పు, సత్యము, శౌచము మొద

లగు వస్తువులు సమానముగ చేర్చి నున్నగ మర్దించి మాత్రలుచేసి సమయానుకూలమగు అనుపానముతో నొక్కొక్కటి పురుషులచే సేవింపజేయుచో తప్పక వశ్యు లగుదురు. ముద్దుస్వరూపాలను జూచిన ఎవరికైనను మొత్తబుద్ధియే! వివేకశాలినియై ప్రజ్ఞాశాలినియగు భార్యను జూచిన పురుషునికెపుడును భయమే! ఆమెను కష్టపెట్టుటకు సాహసింపజాలడు సరికదా, ఆమె ఆనతి మీరుటకైన తలంపజాలడు.

ఇట్టివే ప్రపంచమున మరులు మందులు. వేరొండు మందులు ఎందును గానరావు. ఇవి ఎవరియంతకు వారే సమయానుకూలముగ తయారుజేసి వాడవచ్చును. గుణమున కెంతమాత్రము లోపముండదు. ప్రకృత స్త్రీస్వాతంత్ర్య సమరములో వనితాలోకము సంపూర్ణము గెలుపొందిన, నిరంకుశ ప్రభుత్వము జరుపుచుండిన పురుషులెపుడును ఒత్తిడిజేయుటకు కాచుకొనియేయుందురు. కాన నది, మా సోదరీమణుల సంపూర్ణవిజయము కాజాలదు. కాని పైజెప్పినవాని రోగలక్షణము ననుసరించి ప్రయోగించుచుండిన పురుషులపై సంపూర్ణ విజయము బడయుటయేగాక, వారిచే కావలసిన కార్యములను సులభముగ జేయించుకొనవచ్చును. కాన మా సోదరీమణులకు మేము చేయు విన్నప మిది. ప్రపంచమున నుత్తమోత్తమమగు మరులుమందు లివియే. వాటిని ప్రయోగించి జయశీలరగుదురు గాక!

### అరణ్యరోదనము

చాలీ చాలని మేతవేసి మరి నా సన్తానమున్ రోసి నా।
పాలన్నీ తెగఁదీసి యమ్ముకొని సంపన్నుండవైనావు: నా
తోలున్నా; దదికూడ నేఘనుఁడా చేతుల్ చల్లఁగావిల్చు నీ
కేలా సంతత సాధుజంతువులపై నీ క్రౌర్య మోగొల్లఁడా

'చాటూక్తి'

# స్త్రీ విద్య

జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారు, ఎం. ఏ; బి. ఎల్.

## ప్రాచీనుల ఆశయము.

సంపూర్ణజీవనమును నడపు భావశక్తులెట్టివో యోజించియే మన ప్రాచీనులు విద్యావిధానములకు నిర్ణీతప్రణాళికలను, పంథలను ఏర్పఱచిరి. సంపూర్ణ జీవనమున సమానభాగధేయులు స్త్రీపురుషులని గుర్తించి వీరివీరి యాంతరంగిక వ్యక్తిగతశక్తుల ననుసరించి వీరి క్రియాకలాపమును నిర్దిష్టముచేసిరి. వీరు వ్యక్తీకరించిన సిద్ధాంతములును, నియమములును మనుష్యమానస గ్రథనము ననుసరించి జనించినవి కాని అర్థశూన్యప్రలాపమునుండి యుబికినవి కావు.

ఆంతరంగిక దృష్టియందు సర్వతోముఖమైన మానవసమస్యలను వారు విలోకించిరి కావున నాఁటి వ్యక్తిగతజీవనమును, సంఘజీవనమును, జగచ్చక్షువు నెదుట గాంతిలు సూనవితానమట్లు వెలసినవి.

మహితాశయ బంధురజీవనమును, కళోపాసనమును నీదృష్టియందే వెలుంగును. ఈదృష్టి దివ్యచక్షువు లోనిది. దివ్యచక్షువులు కలవారే దివ్యమయూఖ సందీప్తజీవనములు కడుపఁగలరు; ఆదర్శకళోపాసకు లగుదురు; వీరిజీవనములు దేవతలకుకూడ మేలుబంతు లగును; వీరిరచనలు భావప్రభాకలిత తరణికిరణములకు బరవళ్ళగును.

పాశ్చాత్యవిద్యావిధానమున నాంతరంగికదృష్టి కలదనుట కల్ల. ఆకస మంధకారబంధురమైనయెడల, అవని ఆలోకప్రదీప్తమగునా? విద్యావిధానమున వెలుగు లేనితఱి దానిపైకన్నిడు నాగరకత ఖద్యోతమండల మట్లు చూపట్టునా? ఆత్మప్రదీపమున దివ్యతైలము వోయు అదృశ్య ఆధ్యాత్మికశక్తి యొట్టిదియో ప్రతీచీ ఖండవాసులెఱుఁగరు. ఈజ్యోతి కొఱవడిన విద్యయును, జీవనవిధానమును పైపై మెఱుంగులు కలిగిన వైననేమి, బాహ్యపుష్టిని ప్రదర్శించున వైననేమి, ఆత్మశక్తిలేనివై కంకాళ సన్నిభములగును. నేఁటి పాశ్చాత్యుల ఉద్గ్రంథపత్రములును, జీవనవిధానాంశములును కళాసౌందర్య రహితములై యున్నవి. కారణము? వా రాత్మబృందావన ద్వారమును బంధించి వేసి, మేఘశ్శిఖరమునఁ గుప్పిగంతు లేయుచుండుటే! ఆత్మజ్యోతి సముద్భవ ఆలోకసూత్రములు పంక్తి వితానమైనపుడే మనుష్యరచనలు సచ్చిదానంత సమన్వితములై అనంతకాలము వెలయును. ఈజ్యోతి మరీచులే ఉత్తమజీవనమునకు చలనప్రాణములిచ్చు భావశక్తులగును.

విద్యావిధాన జీవనవిధానముల కలయికయే కదా నాగరకత! నేఁటి పాశ్చాత్యసభ్యతను పరికింపుఁడు. అందు భావవిభూతి హుళక్కి; సౌందర్యద్యుతి సున్న. ఆకసమునంటు మేడలను, మిద్దెలను అది నిర్మించినది. ఫిరంగులను తయారొనరించినది; విషవాయువులను ప్రోగొనరించినది. అపూర్వ ఆగ్నేయాస్త్రములను సిద్ధమొనరించినది. ప్రపంచముచుట్టు తన బాహువులు పెనవేసియుంచినది. రాశిరాసులుగ, ధనమును ప్రోగొనరించినది; ఈరాసులను గొలబోయునది స్వార్థము. ఈరాసులనుండియే ఇపుడు గుండుదెబ్బలు వెడలుచున్నవి! వీనిని గుండెలం దిముడ్చుకొనిన సౌధములు పెటిల్లుమనుచున్నవి! బాహ్యాంతరంగిక వాతావరణము విషవాయువులతో, కారుపొగలతో నిండియున్నది. నేఁటి పాశ్చాత్యనాగరకత తన్ను చూచి తానులికిపడుటలేదా?

ప్రాణములు లేనివానిని కట్టెయందుము. అందలి దీప మారిపోయినది కావున దానికి చీమలుపట్టును. ఎంత యందమైన శవమైననేమి, అచిరములో చితి నెక్కకున్న దుర్గంధమును గ్రక్కదా? ఆత్మజ్యోతి లేని విద్యావిధానము సహజకవచకుండలముల నెఱుఁగ నిదై, అబద్ధపు భుజకీర్తులు తగిలించుకొని గచ్చుపై చూపట్టిననేమి? ఆయువులేనిదై అది దుర్గంధమును వెలారింపదా?

అధునాతన మనుష్య జీవనవిధానమున మేలుబంతి యగుచున్నది పాశ్చాత్య నాగరికతయే. అర్వాచీన విద్యావిధానమున నొరవడి 'యగుచున్నది పాశ్చాత్య పద్ధతియే. శక్తి యెందున్నదో అధికారమును అందే యున్నది. రాజకీయమైన స్వరాజ్యముమాట దేవుఁ డెఱుఁగును; మనమిపు డాంతరంగికమైన స్వరాజ్యమును కోలుపడుచుంటిమి. పృథ్వీజాతులన్నియు, దానిని గోల్పోయినను, సహస్రాబ్దులనుండి దాని నారాధించుటందు ప్రత్యేకశక్తిఁ గలవారమని గణుతి నందిన మనమే దాని నిపుడు పోగొట్టుకొనుచుంట అరిష్ట కరము. ఆచార్యులవారే కల్లుముంతను చేఁబట్టిన యెడల, నిఁక నంతేవాసుల పునరుద్ధరణ మెందుండి యుబుకును? మనయాత్మ దినమణిపై పొగమంచును చేరనిచ్చి, మన వ్యక్తిత్వమును, మన స్వాతంత్ర్యభావమును మన మహత్త్వమును మడియించి మెడవాంచి వక్రనాగరకత పలుకుదానికి 'భళాభళి' యనుచుంటిమి. ఈపలుకు ఆత్మకుంజమునుండి వెడలుతీయని రాగంపు తీవ గాక, భుగుల్భుగుల్మను స్వార్థమునుండి ఇంజనుగూతవలె వెలువడు వికృతశబ్దమని మనమింకను గ్రహింపఁ జాలకున్నాము.

## చదువు

తండ్రి :—

చదువనివాఁ డజ్ఞుండగుఁ
జదివిన సదసద్వివేక చతురత కలుగున్ ।
జదువఁగవలయును జనులకుఁ
జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ ॥

కొడుకు :—

చదివించిరి ననుగురువులు
చదివితి ధర్మార్థముఖర శాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్ల చదివితిఁ దండ్రీ ॥

భాగవతం.

# రుద్రమదేవి సందేశము

### శేషాద్రిరమణ కవులు

"విక్రమస్థిరులార దోర్వీర్యలబ్ధ
విజయయుతులార! ఓ యాంధ్రవీరులార
అకట చూచెదరేమి మీ యాంధ్రనగరు
ముట్టడించె మహాదేవ భూవిభుండు"॥ 1

"ఆఁడుది యేమిసేయఁగలదంచుఁ దలంచి పరాక్రమించి నా
తోడదురంబు సల్పుటకు దుర్విధి తన్ బురికొల్ప వచ్చియు
న్నాఁడల సేవణుండు కదనంబున నాతని నోహటించి వె
న్నాఁడుదు నేను మీ కనిమొనన్ విజయంబొనగూర్చి తీరెదన్"॥ 2

"వాఁడి మెఱుంగు ఖడ్గములఁ బట్టిన యో జగజెట్టులార; పో
రాడఁగ రారిదేటికి మురంబొనరింపుఁడు దేశసేవకై
వీఁడుఁడు ప్రాణవాయువులు వీడుదులై మహాదేవరాయ క్రో
వ్వాఁడిశరంబు తప్పికొని వచ్చిన మృత్యువు తప్పిపోవునే"॥ 3

"బీరపుఁ బెంపుతోడి మగబిడ్డలు మీరలు పోరుసల్పకే
పాఱిన యాదవుల్ మనలఁ బ్రాణముతోడుత నిల్వనిత్తురే
వైరులనెల్ల దేవగిరి వైపునకుం దమి సాగదోలఁగా
రారిదియేల యీవిజయరాజ్యము మార్తుర కప్పగింతురే"॥ 4

"శారదరాత్రులన్ మొగిలిచర్లకు నుత్సవదర్శనార్థమై
జేరవ వేళఁ జూచి దయచేసెనుగా మహాదేవరాయ లీ
ద్వారమునుండి యోరుగలుదాపున కీ మహితాంధ్రరాజ్యల
క్ష్మీరమణుండు తానగుట చేకురదంచును హెచ్చరించుఁడీ"॥ 5

"కాకతిసింహంబు కదనాటవులఁ జొచ్చి
ప్రతిపక్షగజములఁ బట్టునాఁడు
నేలనాల్గంచులు ప్రోలభూనాథుండు
కీర్తిచంద్రికల వెల్గించునాఁడు

రుద్రదేవుని ఖడ్గరోచి దిగ్భ్రమగూర్ప
మహారాష్ట్రసైన్యంబు భ్రమందునాఁడు
గణపతిదేవు విక్రమవహ్నిచే దేవ
గిరిగుహల్ నిప్పుకల్ గురియునాఁడు

మెఱసిన మహత్తరాంధ్ర సమీకపటిమఁ
దరతరంబుల మాతృసంతతి వచింప
నెఱుఁగఁడేమొ మహాదేవధరణివిభుఁడు
వచ్చెఁ బూర్వస్మృతింగూర్పవలయు నింక" ॥ 6

"నలుబదియేండ్లు నిండినవి నా భుజపీఠిని రాజ్యలక్ష్మి ని
శ్చలముగ నిల్చి, యిప్పటికి శౌర్యముగ్గిన పోరుబంటుగాఁ
దెలిసి పరాక్రమించె మహాదేవనృపాలుఁడు పట్టితెంచు, క్రొ
న్నెలపువ్వుదాల్పురాణికడ నిల్పుడి యాదలయుత్తరించెదన్. 7

"మగటిమియున్న వానిని మమ్ము నెదుర్పఁగవచ్చు, లేని వో
మగువవితాన దేవగిరి మధ్యమునందొగి జీవయాత్ర నే
రుగ ముగియింపవచ్చుఁ బెనత్రోవల రాజ్యము ముట్టడించు నీ
తెగువ విచిత్రమొందు మహాదేవనృపాలకుఁ డభ్యసించెనో" 8

"రాచేమున్మనకంచు రుద్రమమహారాజ్ఞీవతంసంబు తాఁ
జేరెఁ ద్వారము నాంధ్రసైనికులు నిస్సమప్రతాపంబు తోఁ
గ్రూరాత్ముల్ మహాదేవభూవిభుని శ్రీరుద్రాంబ ముందుంచగా
నోరుంగంటి పురంధ్రు లిచ్చిరపు డత్యుల్లాసలై హారతుల్" ॥ 9

# రజియాబీగమ్

గోనెల నరసింగరావుగారు, బి. ఏ.

రజియాబీగమ్ బానిసరాజులలో (Slave-Kings) సత్యోత్తముఁడును నగ్రగణ్యుఁడును నసమానకీర్తికాముఁడునునగు ఇల్టమిష్ రాజన్యుని తొలిముద్దు. శైశవావస్థయందే యపారశేముషీవిభవ ముపార్జించి, రాజ్యపాలనాసంవిధానానుగుణ్యములగు వివిధోపాయములెఱింగి పురుషవేషమున రణరంగములలో తెగువతోఁజొచ్చి వీరభటనికాయము లబ్బురమొందునట్లు వీరవిహారము సల్పుచు నెనలేని సత్కీర్తి నచిరకాలములో సముపార్జించెను.

కాలక్రమమున ఇల్టమిష్‌పాదుషా మృతజీవుఁడాయెను. సచివులు, సరదారులు, తురుష్కయోధాగ్రేసరులు — సుల్తాను పుత్రుల నటు పెట్టి — వీరనారీమణియగు రజియాభామినిని మహారాణిగ నభిషేకించి సలాముల నొనరించిరి. రజియాబీగమ్ ప్రజారంజకముగఁ బరిపాలింపఁదొడఁగెను. ధర్మసంస్థాపన మొనరించెను. ఇఁక రాజనీతిజ్ఞతకు బెట్టినది పేరుకదా! ఆమె మణిమయమకుటమస్తకము నించుక జైకెత్తినదా మహీమండలము గడగడ వడఁకఁజొచ్చెను; ఆమె సుందరవదనారవింద మించుక జేవురించినదా శత్రురాజుల వదనమండలములు వెలవెలఁబోఁజొచ్చెను; అంతటిపటిమ, అంతటిగరిమ, ఆమెలో మూర్తీభవించియున్నవి. ఆమె తేజోరాశి; ధైర్యస్థైర్యములకిక్క; మూర్తీభవించినశక్తిస్వరూపిణి.

కాని ఆయమ యాఁడుది. మానవసామాన్యమైన మాత్సర్యము పురుషులగు సామంతులలో ప్రాకుకొని పోయినది. అయ్యదినైసర్గికము. మచ్చలేని యచ్చపుయశస్సునబలులబా లొనరింప నిచ్చగింపక, అల్టూనియా (Altunia) యను సరదారొకఁడామెపై కత్తినెత్తి యనుకంపాశూన్యుఁడై యామెను చెఱపట్టెను. విజయలక్ష్మిని వరించిన అల్టూనియాకు చెఱసాలనుండి రజియా, స్త్రీపురుష వివక్షతబాహ్యమునకే గాని వేఱుకాదని "కాయములు వేఱుపడుటనే మాయ యొదవునంతన్ జ్యోతి నది యెన్నడంట గలదెకో"యని సందేశ మంపెను. రసికాగ్రేసరుఁడగు టర్కీఖానుఁడా సందేశమున కానందపరవశుఁడాయెను. వాని యజ్ఞానాంధకారమునకీ విజ్ఞానపూరితమగు సందేశమే చంద్రిక. జ్ఞానదోహద మొనరించిన సుజ్ఞాననిధియగు రజియా మహారాజ్ఞి ననునయించి యామె యనుజ్ఞఁగొని యుద్వాహ

మూసెను. అనంతర మా ప్రేమజీవులు గోల్పోయిన తమ యాజన్మహక్కగు ఢిల్లీ రాజ్యరమకొఱకు ఘోరాహవముఁ బోరి, గోరీలైరి.

రణరంగమున శత్రుగాజి దున్మాడుచో
 సంయుక్త కౌకవన్నె సంతరించి,
రాజ్యపాలన కళాప్రాప్తి సంధించుచో
 రుద్రాంబ కాయాసి భద్రపఱచి,
మహితపాతివ్రత్య మాధుర్యమెంచుచో
 పద్మినీ సౌభాగ్య పటిమనేలి,
పరమపావనభక్తి గరిమంబు నెఱపుచో
 నల్లమీరాబాయి యనఁగ నెగడి,

నిస్తుల పవిత్రచరితఁ బ్రశస్తికెక్క
కులముకన్న గుణంబె యెక్కువయటన్న
ప్రవచనంబున కీవు తార్కాణవైతి
వహహ రజియాంబ గృహలక్ష్మి వౌదువమ్మ.

సీ॥ బొమ్మపెండ్లిండ్లకుఁ బోనొల్ల ననుబాల, రణరంగమున కెట్లు రాఁ దలంచె?
మగవారిఁ గనినఁ దామఱుఁగుఁ జేరెడునింతి, పగవారి గెల్వ నేపగిదిఁ జూచెఁ
బసిఁడియుయ్యెల లెక్క భయమందు చెలువ, ఖగపతిస్కంధ మేకడిఁది నెక్కె
సఖులకోలాహల స్వనము సోఁకనికన్య, పటహభాంకృతుల కెట్లుఁగి నోర్చె

సీ. వీణఁ జక్కఁగఁ బట్ట నెఱనేరఁగనికొమ్మ, బాణాసనం బెట్లు పట్ట నేర్చె
ప్రాఁకునఁ దీఁగె గూర్పంగ నేరనిలేమ, గుణము నేక్రియ ధనుఃకోటిఁగూర్చె
సరవి ముత్యము గ్రువ్వఁ జాలనియాబాల యే, నిపుణత సంధించె నిశితశరముఁ
జిలుకకుఁ బద్యంబు సెప్ప నేరనితన్వి, యస్త్రమంత్రము లెట్లు నభ్యసించెఁ

# గృహోద్యాన శీర్షిక

(గతసంచిక తరువాయి)

గుమ్మలూరు సత్యనారాయణగారు, బి. ఎస్‌సి. ఏజి.

## గులాబి

దూరస్థలమునుండి కొన్ని యంటుమొక్కలను తెప్పించినపుడు, మనలనవి జేరినపిదప నొకరోజు వానికి విశ్రాంతినిచ్చుటమంచిది. కాని యాలోపున నవి యెండిపోకుండ మనము జూచుచుండవలయును. అందుకుగాను మొక్కలవేళ్లను, వీలయిన కొంత మొక్కభాగమునుగూడ, నాచులో తడపియుంచుము. ఆయంట్లను పాతునపుడు యెక్కువలోతుగా పాతరాదు. 1 మొక్కకు ఒకఅడుగులోతు, ఒకఅడుగు వెడల్పుగల గోతులుచాలును. పెద్దపొదలవలె పెరుగు జాతులను వేయుచున్నప్పుడు, 2-3 గజముల దూరమున త్రవ్వబడిన ఒకగజము చదరపుగోతులలో బాగుగా యెరువులను, మిశ్రములను వేసి, యొక్కొక్క గోతిలో 2, 3 మొక్కలను నాటవలెను. ఇంకను పాతుటకుముందు ముదరియాకులను, కొమ్మలను త్రెంచి వేయుటవలన త్వరలో మొక్కలు నాటుకొనగలవు.

## నీరుపోయుట.

గులాబి మొక్కలను నేలను వేసినప్పుడు వానిచుట్టు చిన్నకడియములు కట్టుట మంచిది. సాధారణముగా పూలతోటలోగల నాయా గులాబిపొదలన్నిటికిని యిట్లు కడియములుకట్టి, యాకడియములను కలుపును నొక చిన్నకాలువ తీసిన, తోటలోని నూతినుండి మనము తోడుచున్ననీరు, చక్కగా, తిన్నగా కడియములనింపుచు మొక్కతర్వాత మొక్కకు పోవును. ఇట్లుగాక పాదునకంతకును నీరుపెట్టిన, నేల బురదగానుండి, ప్రతిరోజును పూవులేరుటకును, దగ్గరగా మొక్కలను చూచుటకును, వీలుండదు. ఇదిగాక, పూలతోటలలో నెప్పుడును మనము బాగుగా నాలుగు ప్రక్కల తిరుగుటకు స్థలముండవలయును. పొదలగా పెరుగుజాతులకు మాత్రము భూమికి చేరువగా నున్న చిన్నకొమ్మలను, రెమ్మలను త్రెంచివేసి శుభ్రముగా నుంచకుండిన, మొక్కల కడియములలో గొప్పుత్రవ్వుటకుగాని, యెరువు వేయుటకుగాని వీలుండకపోవుటయేగాక, పాములు మొదలగునవియున్నను మనకగపడవు.

ప్రతిరోజును సాయంత్రము ఎండచల్లబడిన పిదప నీరుపోయవలెను. ఎండ యెక్కువగా నున్నప్పుడు మనకువలె మొక్కలకుగూడ దాహము వేయును గదా యని మధ్యాహ్నము వాటికి నీరుపోయరాదు. ఆ యెండ తీక్ష్ణతయొక్క తరతమములబట్టి నీరును సాయంకాలమే పోయవలెను.

వర్షకాలములో దక్క మిగిలినరోజులలో నీరుపోయ నవసరముండును. గోలెములలోని మొక్కలకు తోటజారీతో నీరుపోయునపుడు పూవులు, మొగ్గలు, తడియకూడదు. అటులయిన, పూవులు త్వరలో వాడి, రెక్కలుపోవుటయేగాక కొన్ని బూజు తెగుళ్లకు కూడ పాల్పడును. కనుక యెప్పుడును మొక్క మొదటనే నీరు జాగ్రత్తగా పోయుచుండ

వలెను. ఇంకొక విషయము కలదు, మొక్కచోటు పెట్టు టకు వీలులేని పక్షమునందు ఉన్నపుడు నాటుకొనిన పిదప, నాటిలో నీరునిలిచిపోవును. కనుక వెంటనే యా నిలచిన నీరు, గోతులను వంచి, పారపోయ వలెను.

### ఎరువు వేయుట.

ఎక్కువయెరువైనను, పోయిన, ద్రవరూపముగా వేయుటయు కద్దు. ఎరువులను మొట్టమొదట మొక్కలను నాటుటకు ముందు వేయవచ్చును. కాని మొక్క తొడుగు కాలములో త్వరగా ననుభవమునకువచ్చు యెరువులను వేయవలసియున్నది.

మొక్కలను నాటుటకు ముందు మొక్క కొక్క పౌను చొప్పున యెముకల పొడియు, యేదైన పచ్చియాకుల రొట్టయు వేయుట మంచిది. మొక్కకు మున్ముందు పెట్టు నీరువలన బాగుగా కుళ్లుచు మొక్కకు సత్తువ నిచ్చును. మాంసాహారులయినపుడు యూరికనే పోవుచేపపాలునులు, చేపలను కడుగు చున్నపు డుపయోగించిన నీరు మొదలగువాటిని గూడ కొదుగుచున్న మొక్కలకు వేయవచ్చును. సాధారణముల యిండ్లలో మంచియెరువును తయారుజేసుకొను టకు పెరట నొక యడుగులోతున గొయ్యితీసి, యందులో పొయ్యిబూడిద, ఎంగిలియాకులు, కాయగూరల పనికిరానిభాగములు, పశుశాల యున్నప్పుడు యందలి పేడ, ఉచ్చ మొదలగునవి, పిల్లలుండిన వారి మలము, తదితర యింటి చెత్తనంత వేసి కప్పిన మంచి బాగుగా చిమికి, నల్లగా నుండిన పరిశుభ్రమైన గొప్ప యెరువగును. దీనిని చాలలాభకరముగా పెరటిలోని పూల మొక్కలకు, కాయగూరలకు నుపయోగించుకొన వచ్చును.

ఇవిగాక గుఱ్ఱము, గాడిద, మేక, గొఱ్ఱె మొద లగువాని గత్తములు గులాబికి బాగుగా పనిచేయును. పిండి యెరువులను గూడ నీటిలో కలిపి వేయనగును— ఆముదపు పిండి, తెలకపిండి, చిక్కగా నీళ్లలోకలిపి రెండుమూడు రోజులు కుళ్లనిచ్చి వీనిని నేరుగ మొక్కల కుదుళ్లలో పోయవచ్చును. ... పోగా నడుమను మిగులు పిప్పిని యితరములతో పాటు వేయుగలము.

ఏ యెరువును యెట్లు వేయదలచుకొన్నను నొ... మాత్రము ముఖ్యముగా గమనింపవలయును—

1. ఎక్కువ ఘాటుగానున్న యెరువులను మొక్క కాండములను, నాసిలకును తగులనీయరాదు.

2. ఘాటుగా నుండు కంపెనీయెరువులను వేసిన వెంటనే నీరుపెట్టవలయును.

3. సాధ్యమైనంతవరకు మొక్కకు చులకనగా నందుబడిలో నున్నటుల వేయుచుండవలయును.

### ఉత్తరకృషిలో కొన్ని ముఖ్యగమనింపులు

గులాబిపువ్వులు సాధారణముగా జూను నుంచి సెంప్టెంబరు వరకును, డిశంబరునుంచి మార్చి వరకును పూయును. పాతిన 6 నెలలలో నవి పూతకారంభించును. అంతకుముందు మొగ్గలను తొడగినను, దానిని మననుంచరాదు. ఉంచి, పూపించిన, లేతవయసులో సంతానవంతురాలి శరీర స్థితి యెంతదార్ఢ్యముగా నుండునో యటులనే యిదికూడ నుండును. ఒక మొక్క సరిగా 5–6 సం|| పూయును. తరువాత దానిని పీకి పారవేయవచ్చును.

ఒక పూతకాలమైనపిదప రెండవపూతకు సాధారణముగా కావలసినంతశక్తి యుండదు. గులాబి భూమిలోనుండి యెక్కువసారమును దీసుకొనును. ఈ కారణములవలన నేలకును, మొక్కకును బాగుగా సత్తువచేయవలయును. ప్రకృతిలో రెండవపూతకు శక్తినుంచుకొనుటకే, మొదటిపూత పిదప దాదాపు రెండునెల లెదగక, నాకులరాల్చి, మరల చిగిర్చి, దాచియుంచిన శక్తితో నాహారము నెక్కువగా భూమిలోనుండి దీసుకొని, బాగుగా నెదిగి, పూయును.

ఈ విశ్రాంతికాలములోనే మొక్కలను మనము ప్రవర్ధనకొరకుపయోగించుకొనవలెను.

ఏప్రెలునెల తుదివారమునుండి నీరుపోయుట మాని వేయుము. ఒకనెలలో నవి యాకునంతను పూర్తిగా రాల్చి, యెదుగకుండునుగదా. అప్పుడు బాగుగా ముదిరి యెండుచున్న కొమ్మలను కత్తిరించవలెను. ముక్తసరిగా 3–4 కొమ్మలున్న చాలును. ఈ కృషికే యాంగ్లమున ప్రూనింగ్ (Pruning) అందురు. నీరు నాపిన వెంటనే గులాబిమళ్లను బాగుగా లోతునత్రవ్వి యుంచవలెను. కొమ్మ కత్తిరింపయిన పిదప, బాగుగా కుళ్లినగెత్తము వేసి, మొదట మితముగాను, పిదప మామూలుగాను నీరుపోయవలెను. ఒకవారమురోజులలో మొక్కలు చిగురెత్తి, నెలలో మొగ్గలనుదొడగును. పిమ్మట జూన్—జూలై నుండి సెప్టెంబరువరకు పూయుచునేయుండును. మరల అక్టోబరులో నిట్లు చేసిన, డిశంబరునుంచి మార్చివరకు రెండవపూత వచ్చును.

ఇటులనే గోలెములలోని మొక్కలకు కూడ జేయనగును; గాని మే నెలలో మాత్రము నీరుపోయుట నాపి వేయవలెను. ఆకురాల్పు పూర్తియైన పిదప బాగుగా గెత్తమువేసి నింపిన వేరొక గోలెములోనికి మార్చవలెను. ఒకవారము దినములలో మొగ్గదొడగును.

## గులాబికి కీటకములు—చీడలు

ఎక్కువగా గులాబిపూదోటలను వేయునపుడు గులాబికి పట్టుచీడలు, పురుగులను దెలుసుకొని, తగు నివారణోపాయములను గుర్తెరుగుట విధి. అదిగాక పెరటిలో కొన్ని మొక్కలను వేసుకొనినపుడు, యా కొన్నియును కీటకేతరబాధల పాల్బడకుండ చూచుకొనుట సంసారి యవసరము. కనుక ముఖ్యమగు వాటినే కొంచెము చూతము.

1. 'మిల్డ్యూ' అను చీడ. (దీనిని 'బూడిద తెగులు' అనవచ్చును) దీనివలన యాకులు, ముడుతలు పడి మణచుకుపోవును; బూడిదవంటి రంగుపూత యాకులపై నగబడును. ఈ చీడ యతిత్వరగా మొక్కంతటను వ్యాపించును. తుదకు నాహారము లేనందువలన మొక్క చచ్చును. కాకపోయినను మొగ్గలు, పువ్వులు చెడిపోవును.

నివారణ—'బోర్డోమిక్స్చరు' (Bordeaux mixture)ను పిచికారుతో చిమ్ముము. ఆ ద్రావకము నిట్లు తయారుచేసుకొని యుంచి, యుపయోగించుకొనవచ్చును.

5 పౌనుల మైలతుత్తమును, 5 గాలన్ల నీటిలో (ఒక కిరసనూనె డబ్బా 4 గాలన్లు) కలిపియుంచును. మరియొక 5 గాలన్ల నీటిలో 5 పౌన్ల సున్నమును కలిపి వడబోయుము. అవసరము వచ్చినప్పుడు ఇందులోని యందులోని సమానముగా దీసి కలిపి మొక్కలకు చిమ్ముము. నీటిని ఎల్యూమినము గిన్నెలలో కలుపకూడదు. వాటి నీద్రావకపు మిశ్రము దినివేయును. కనుక రాగిపాత్రలలోనైనను, కర్రతొట్టెలలో నైనను కలుపవచ్చును. కాని పెద్దగులాబీ తోటలున్నపుడిది ఎక్కువ లాభముగా నుండును. అవసరమువచ్చిన యింకను వివరములు జూచునది.

2. మట్టిరంగుచుక్క లొకప్పు డాకులమీద నగబడును. అప్పు డట్టియాకులనన్నిటిని తీసి దూరముగా పారవేయుటకంటె కాల్చివేయుట మంచిది.

3. ఆకులను దినివేయుపురుగులు. గులాబికి తైర పురుగులు (Rose chaffers) సాధారణముగా వేపముల దగ్గరకు బహువేగమునవచ్చి, గోడకు తగిలి, నేలబడి, మణచుకుపోయి, చచ్చినట్లు కొంతకాలము వెల్లకిలబడి, మరలలేచి, రొదచేయు పురుగులివి. వీనిలో కొన్నిటికి రెక్కలు గోధుమవర్ణముగాను, కొన్నిటికి నెర్రగానుండి తెల్లని చుక్కలుండును. ఇవి పెద్ద కందిగింజలంత యుండును.

### 4 మొక్కలయాహారద్రావకములను త్రాగివేయునవి.

తెల్లని పేనుపురుగులు— (Scale Insects) సాధారణముగా వేపచెట్లపైగాని, చిక్కుడుపాదులపైగాని, తెల్లని బూజు కట్టుకొని, వాటినినొక్కిన లోనుండి యేదో ద్రవమువచ్చును, చిన్న చిన్న పట్లు కనబడును. వాటిదగ్గర నల్లచీమలు తిరుగుచు, యాద్రవమును తినుచుండుటకూడ చూచుదుము. ఆ తెల్లనిపట్టులే ఆడ పేనుపురుగులు. అవి అట్టే కదలలేవు. వాటికి రెక్కలుండవు. రెక్కలున్న మగపురుగులు సాధారణముగా దొరకవు. ఈ యాడపురుగులు, మొక్కలోనుండి యాహారమును ద్రాగుచు, యెదిగి, గ్రుడ్లుపెట్టును. తిరిగి యీసంతాన మా లేతకొమ్మలను పట్టించును. తుదకు మన మొక్క చచ్చును.

మీదచెప్పిన కత్తెరపురుగులు, యాకులను, పూరేకలను కత్తిరించి తినివేయును. పేనుపురుగులు, లోని యాహారమును ద్రాగివేయును. ఇట్టి రెండువిధములలో హానిచేయుపురుగు లింకనేకములున్నవి.

వానికి నివారిణ మొక్కదగ్గరకు రాకుండచేయుటకును, (Repellant) వానియూపిరి తిత్తులద్వారములనుమూసి చంపుటకును (Contact) కొన్ని విషములగు మందులను (Poisons) జల్లవలసియున్నది. అందుకు గానుపొగాకుకాడలకషాయము (Tobacco-decoction) గాని; కిరసనూనె, సబ్బునీరు కలిపి మరగించిన చిక్కని రసమును (Kerosene Emulsion) గాని మొక్కలపై జల్లవచ్చును. మాత్రము వాటిని 10 రెట్లు నీటితో పలుచనజేసి ఎప్పటికప్పు డుపయోగించవలెను. ఆ చిక్కని కషాయములను మాత్రము చాలకాల ముంచవచ్చును.

### తుది మాటలు

ఇంతటితో గులాబి ముచ్చటలు ముగియుచున్నవి. ఇందు వ్రాయుట కెంతైనగలదు. ప్రచురించుట కెన్నో త్రివర్ణచిత్రములుగలవు. తెలుపుట కెంతయో శాస్త్ర పరిచయముగలదు. కాని యెవరికొరకు వ్యాసముల వ్రాయుచున్నామో బాగుగా జ్ఞప్తిలోనుంచుకొని, తగు విషయములు పొందుపరచబడినవి - యని యూహ. ఎంతవరకు నది సమకూర్పబడినదో పాఠకులే విమర్శకులు.

ఈ గృహోద్యానశీర్షికలకు విలాసపాఠకులుకన్న కర్షకపాఠకు లత్యవసరము. ఏదైన యొక కృషివిధానము దెలిసినపిదప, దాని నానుకొని, యాకృషినిచేసి జూసి, ఫలమో, నిష్ఫలమో గ్రహించువరకును దేని విలువయును దెలియదు. ఈ యంశముకూడ జ్ఞప్తినుంచుకొని, యీమొక్కవస్థలములో తోటలవలె పెంచుటకును, గోలెములలో విలాసార్థము పెరటిలో మనయక్కచెల్లెండ్రు పెంచుటకును, ఇదివరకే కొంత ప్రవేశము గలవారికి మరికొంత విషయము (శాస్త్రరీతిని, కర్షకరీతినిగూడ) నిచ్చుటకును, తగు నవకాశములు సాధ్యమైనంతవరకు నిందు పొందుపరచబడినవి.

ఈ యంశములు, క్రమములనే, యనుసరించుచు మున్ముందు రాబోవు శీర్షికలుకూడ యుండునని తలంపు; ప్రయత్నము. ఇవిగాక యితరములగు కొన్ని యంశములను దెలుసుకొనుటకు గృహలక్ష్మిపాఠకులకు కుతూహలముండిన, వారీవ్యాసకర్తకు సాధ్యమైనంత త్వరలో దెలియజేయ ప్రార్థితులు. రానున్న శీర్షికలో 'చేమంతి' ముచ్చటింతము.

## BIBLIOGRAPHY

1. Hand book of Horticultural Development —Patwardhan & Deshmukh.
2. Manual of Botany for India—Firminger.
3. Garden development—Henston.
4. Experiment Station Reports 1923— —U. S. A. Agri, Dept.
5. Roses in India—P. S. Parthasarathy Iyengar, B.A., B.L., Hindu Annual 1928.
6. ఉద్యానకృషిపాఠములు— గోటేటి జోగిరాజు.

# ఆంధ్ర కవయిత్రి శ్రీమతి చిల్కపాటి సీతమాంబగారి గ్రంథ ప్రశంస

'ఒక విలేఖరి'

గృహమునకు పునాదు లెట్టివో, శైలి యట్టిది. క్రొత్త యొకవింత, పాత యొక రోత యనునట్లును, "క్రొత్తనీరు వచ్చి ప్రాతనీటిని కొట్టుకొనిపోయినట్లును, యాంగ్ల భాషయందలి యాసక్తిగల జనసమూహము, వ్యాకరణయుక్తమగు గ్రంథపఠనమున కశక్తు లగుటయేగాక, గ్రంధసముదాయముగూడ వాడుకభాషలోనే వెలువడుచున్న దినములలో యీ కవితయొక్క శైలి యెంతయు నాదరణీయమగును. ప్రస్తుత కాలమం దేపాత్తము చూచినను, చదివినను, విరివిగ "ఏలాగు వచ్చితిరి, ఆలా చేసాను" మొదలగు గ్రామ్యవాక్యములతో నిండియున్నది. అయిన, యీ దోషము, పాఠకునిదా? కవిదా?

దోష మిరువురియందును గలదు. కాని ఎక్కువ కవియందును, తక్కువ పాఠకుని యందును గలదు. బాలుడు చిన్నబిడ్డగా యున్నప్పుడు, తల్లి బాలుని యారోగ్యము కాపాడుటకొఱకు, యాముదమును పాలు త్రాగించునట్లు, ఉగ్గుగిన్నెతో గిన్నెడు బోయ, బాలు డజ్ఞానదశయం దుండుటవలన మ్రింగునుగాని, కొంచము జ్ఞానము వచ్చిన పిమ్మట మధురపదార్థముల కలవాటుపడి, యాముదము త్రాగింపవలెనన్న యెంతయు కష్టము. అట్లు బాలుడు త్రాగడని తన బిడ్డల శ్రేయస్సు నభిలషించు యే జనని యూరకుండును? ఏ యల్లపురసము తేనెతోనో, లేక యే కాఫీతోనో గలిపియిచ్చును. బాలుని యారోగ్యము చెడకుండ చూచు చూనేయుండును: అట్లే కవిగూడ పాఠకు డేదేని కారణములచే వ్యాకరణయుక్తమగు భాషను చదువలేనిచో, కవి, తనయొక్క బుద్ధిచాతుర్యము నుపయోగించి, ఎటువంటి విషయములను వ్యాకరణయుక్తముగ వ్రాసిన పాఠకుల కిష్టమోయని గ్రహించి వ్రాయవలెను గాని, మామూలు వాడుక భాష నభివృద్ధికి దెచ్చి కవితామతల్లిని నిరాదరణచేయుట యెంతయు హాస్యాస్పదము.

ప్రతిమానవుడు తాను చేయు పనులను, ముఖ్యముగా విద్యావిషయములను ప్రజల యొక్క యభివృద్ధికై వినియోగింపవలయును. కావ్యములను వ్రాయుట సప్త సంతానములలో నొకటియని చెప్పుదురు. మరియును, విద్యాదానము అన్ని దానములవలె యిచ్చిన కొద్ది తరుగక యభివృద్ధి చెందుచుండును. కనుక, కవి యెప్పుడును తనయొక్క కవిత్వమును యభివృద్ధి నొంది,

శాశ్వతమైయుండుటకు దేశ కాల పాత్రల నెల్లప్పుడు పరిశీలించుచుండవలెను.

గ్రంథరాజములకు శైలియే ప్రాముఖ్య మైనప్పటికిని కథగూడ ప్రజానురంజకమై ప్రజలయొక్క ప్రస్తుత యభిప్రాయములకు పరిస్థితులకు ననుకూలమగున ట్లుండవలెనే గాని, యడవిలో గాచిన వెన్నెలవలె నిరర్థకము గాకూడదు. శైలియును, శశాంక కిరణములు సర్వజనానురంజకములైనను, పాశ్చాత్య నాగరికతారణ్యమున నిరర్థకమే గదా?

ఈ కవయిత్రి వ్రాసిన గ్రంథముల యొక్క సారాంశ మేమనగా, శైలియంతయు మృదుమధురము, సర్వసాధారణ విద్యాపారీణులకుగూడ గ్రాహ్యమగునట్లున్నది. అయిన యీకవి గ్రంథములు, జన బాహుళ్యమును రంజింపజేసి, శాశ్వతాభివృద్ధి నొందునా? లేదా?

ప్రస్తుత మానవ మానసికములకు గావలసినవి హాస్యములు, కథలు, విషాదాంతము లేక ప్రణయగాథలు వీటితో మిళితమైనవి పురాణగాథలైనను సరే, పుక్కిటికథ లయినను సరే, పెన్నిధిగన్న పేదచందంబున నుండును.

సావిత్రి, నలచరిత్ర, లవకుశ, హరిశ్చంద్ర, సారంగధర, కృష్ణలీల మొదలగున వన్నియు పురాణగాథలే యయినను, నాటికిని, నేటికిని వీటి ప్రాముఖ్యత యొక్కతీరు ననేయున్నది. వీటియన్నిటియందును, పై నుదహరించిన హాస్యరసము మొదలగున వన్నియునో, లేక కొన్నియో గలసియె యున్నది. ఇక పుక్కిటికథ లన్న చింతామణి, వరవిక్రయము, కన్యాశుల్కము మొదలగునవికూడ ప్రజలరంజన చెందుచూనేయున్నవి. ప్రజలు చింతామణి నాటకములోని, సుబ్బిసెట్టియొక్క పాత్రయం దెక్కువ యానందమును బొందుచున్నను, రాధయొక్క పాతివ్రత్యము చింతామణి యొక్క నీతినిగూడ గ్రహించుచునే యున్నారు.

ఈ కవయిత్రి వ్రాసినవి దిలీప మొదలగు నాటకములు మృదుమధురశైలితో, ఎక్కువ గ్రంథవిస్తరములేక క్లుప్తముగను, చిన్న చిన్న అంకములతోడనున్నవి. వీటియందు యింకను కొంచము ఎక్కువ హాస్యరసమున్న పాత్రలు, మొదలగువాటిలో వాటిని పెట్టి పిల్లలచే నాడించుట కెంతయు నుపయోగకరముగనుండును.

కాదాచిత్క పద్యరత్నము లెంతయు వెలలేని రత్నములై యొప్పుచున్నవి. ఇందలి పద్యము లోకేవిషయమును గురించి గాక, ప్రార్థనలు, ప్రణయగాథలు సర్వజనానందకరమగు శ్రీ కృష్ణుని బాల్యక్రీడలతోడను నిండి మృధుమధురశైలిని యొప్పుచున్నది.

గ్రంథకర్త్రికి నా వినయపూర్వక విజ్ఞప్తి యేమనగా, బంగారమునకు మెరుగుపెట్టినట్లు శైలికి తగినట్లు విషయమునుగూడ ప్రస్తుత ప్రజల మానసికమునకు తగినట్లు వ్రాయుచుండినచో సర్వజనామోదమై క్రుంగిపోవుచున్న యాంధ్రభాష నుద్ధరించుటయె గాక, శాశ్వతకీర్తి నాంది పుస్తకములు చిరకాల జీవితములై యుండును.




## రాజకుమారి

(మార్చి సంచిక తరువాయి)

అట్లుత్సాహముసఁ దమయుద్యమమహత్వమును వెల్లడించి పురుషద్వేషిణియగు శకుంతల తన యుపన్యాస మీక్రింది విధముగ ముగించెను.

"మన భావిభాగ్యోదయమున కిది యుషఃకాలమని నేను చెప్పియే యుంటిని. విధాత సృష్టియందు మగవాఁడెంతటిమానిసి కాఁగలుగుచున్నాఁడో ఆడుదిగూడ నట్టిదయి సర్వవ్యవహారముల స్వేచ్ఛోపార్జన మొనర్చి జగద్భద్రానుసంధాయినియయి యుండఁగలదని నేను నిరాఘాటముగఁ జెప్పఁగలను. కార్య ఖడ్గముల నేర్పరులయి రాజనీతియందును, యుద్ధనీతియందును, ప్రకృతిశాస్త్ర విజ్ఞానమునందును, తత్త్వశాస్త్ర సంపత్తియందును, సంగీతసాహిత్య విద్యలయందును, చిత్రకళలయందును, విమర్శనాశక్తియందును, కవిత్వతత్త్వ విచారమునందును, జగమును తేజస్వంతముగఁజేయు కవితాసృష్టియందును స్త్రీలు పురుషులతో సమానముగ నౌన్నత్యమునుపొంది ఖ్యాతిఁగాంచగలరు. అఘటనఘటనా సమర్థమును, జగదుత్పాదనహేతువును, సర్వచరాచరావళీ రక్షకమును, సర్వముతానైనదియు, మనలోనున్నదియునగు నుత్తమ తేజము—ఆమహాశక్తి—మనల కృతకృత్యల నొనర్చుఁగాక."

ఆమె తనయుపన్యాసమును ముగించి మమ్ములను తనయొద్దకురమ్మని కనుసన్న యొనర్చెను. మిగిలినవా రావలకు బోయిరి. ఆమె మనఃపూర్వకముగా మాకు స్వాగతమీయనుద్యమించుచు—రయముగ బోవుచున్న పడవ యాకస్మికముగ మెఱకను బట్టుటచేత నొక్కమారుగ నదరిపడునట్లు అంతలోనే కలవరపాటున మమ్ము చూచుచు మిగుల గంపించిపోవు కంఠనాదమున 'నాతమ్ముఁడా!' అని పలికెను.

"అవును ఏమందువక్కా!" అని పార్థసారథి శాంతస్వనమున ననెను.

"ఆహా! మీరిక్కడ నీ వేషములతో నేమి చేయుచున్నారు?—ఇందఱు—ఎవరు వీరు?—మందలోఁజొరఁబడిన తోడేటి వైఖరిని వచ్చితిరి. ఒకటిగాదు రెండుగావు! ఒకమందయే వచ్చినట్లున్నది. మేకతోలుఁ గప్పికొనినట్లు మీకీ వేషములేమి?—తేనెపూసిన కత్తులు పయోముఖ విషకుంభములు—గోముఖ

వ్యాఘ్రములు. మీరేమిచేయ వచ్చితిరి? భగవంతుఁడనుగ్రహించుఁగాక! ఎంతమహాద్రోహము! ఎంతకుట్ర! సర్వనాశనమగు కుట్ర! తుచ్ఛాతితుచ్ఛమగు కుట్ర!"

అని మిగుల నుద్వేగమున, నాగ్రహమున ఆమె పలుకఁజొచ్చెను.

"ఇందెట్టిద్రోహమును లేదు. కుట్రయును లేదు"అని పార్థసారథి మెల్లగ ననెను.

"ఎంత భ్రష్టుఁడవై పోతివి!—నీవు వట్టి నిర్భాగ్యుఁడవుగాని మాద్వారమున కావల పెద్ద యక్షరములతోఁ జెక్కఁబడిన వ్రాతనైనఁ జూచికొనకుండ నీ వేల లోనఁబ్రవేశించితివి?—'పురుషులులోనికి రారాదు. వచ్చిన మరణశిక్ష!' అనికదా అచ్చట వ్రాసియున్నది?"

"ఆవ్రాతను చూచియుంటినే యనుము. 'ఆడెసీ'యను గ్రీకుపురాణమునఁ జెప్పఁబడినట్లు 'సైరెను'లనఁబడు సుందరాంగులవలె నీ మహిళా విద్యాలయమును బరిపాలించు కుసుమకోమలులుఁగూడ పురుషుల తెల్లసియస్థికలఁ దిలకించుచు మహామోహనకరమగు గాన మొనర్పఁగల కర్కశత్వమలవరించుకొందురని ఎవ్వఁడూహించును?"

"నీవట్లూహించక పొరఁబడితివని తప్పక భావించి తీరుదువు. అయినను మరణోన్ముఖుఁడవై యున్న నీకిట్టి పరిహాస మెందులకు? చావఁబోవునాఁడు యముని వెక్కిరించినట్లు—నిన్ను బట్టి యొప్పగింపవలసిన నావద్దనే నీవపహాస్యము చేయుదువా? పదునుకత్తులతో నాడుకొనినట్లు—పాము కోఱలతోఁ జెలగాటమాడినట్లు నీ విట్లుపలపించుచున్నావు. నా శపథమునుబట్టి మిమ్మిప్పుడొప్పగించి తీరవలెను. వంపఁజాలని గొడ్డలియంచువలె—అయఃపాషాణ నిష్ఠుర మనస్కయైన మాయేలిక — మారాజకుమారి! — ఆమె మృదుత్వమేల వహించును?"

"అక్కా! శకుంతల!—అట్లే కానిమ్ము. నాప్రాణములఁ దీసికొనుము. మీశాసనోల్లంఘనాపరాధమునకుఁ బాలువడిన నన్నుఁజంపి నాయస్థికల మీబహిర్ద్వారమునకుఁ జేరువబెట్టించి వానిపై

స్త్రీలకొఱకును స్త్రీజాతి ♦ మేలుకొఱకు
సోదరునిజాంపె నొకయక్క ♦ చూడుడనుచు
పురుషజాతికి హడలది ♦ పొడమునట్లు
ఱాలపైఁజెక్కి కొమ్ముచే ♦ వ్రాలుజేసి."

అప్పుడు కృష్ణవర్మ—

"శకుంతలాదేవియన నెట్టిదో కనియు వినియు స్వయముగఁ దెలిసికొంటిని. ఇంతవఱకు మాత్రమే కృతార్థుఁడనై యున్నను జచ్చుటకు సిద్ధముగనేయున్నాను. కావున నన్నును చావనిమ్ము."అని పలికెను.

అప్పుడు నేనుకూడ నిట్లంటిని:—అమ్మా శకుంతల! మాయవేషమునున్నను నాకు సత్యమునందభిమానమున్నది. దైవసాక్షిగ నిజమాడెదను. కావున నీవిఁకఁ దెలిసికొనవచ్చును. నీవేదేశమునఁ బుట్టియుంటివో నేనాయుత్తరదేశీయుఁడను. ఈరాజకుమారిని బరిణయమాడ నిశ్చయింపఁబడిన రాజకుమా

రుఁడను. చాల సంవత్సరములయి ప్రధానమైనది. ఆమె ఇచ్చుట నీవిధముననుండుట చేత నుపాయాంతరమును గానక నేనీవేషమున రావలసినవాఁడ నయితిని."

"అయ్యా, రాజకుమార! 'స్వదేశ'మని నాకొకదేశములేదు. ఉన్న నిది యే—ఈ విద్యాలయమే నామాతృదేశము. నాప్రాక్తన చరిత్ర మంతయు వ్రేళ్ళతోఁ బెకళించుకొని యిచ్చటకు వచ్చితిని. ఇఁక నాయందున్న దంతయు అంటుమామిడివలె మాతృస్థానమును ద్రెంపుకొని తేజస్వంతమై స్వచ్ఛందముగనుండు భాగము. నీవు ప్రధానమను చున్నావు. కన్యాక్రాంతమగు నీయావరణమున పెండ్లిమాటలనునవి చెవులలోనైనఁ జెప్పుకొనరాదు. మాసమాజోన్నతికి అమ్ముడునడి పరాధీననై యున్న నేనెట్లు మీకుఁ బ్రాణదానమును చేయఁగలను? పిడుగువడనున్నది. ఈశాంతి వాతావరణ మిది మిధ్య. ఆకస్మికముగ సర్వనాశనమైపోవును. మీరు సంసిద్ధులరై యుండవచ్చును."

"అయినను యోజింపుము. మీబహిర్ద్వారముననున్న ఆవ్రాత యెట్టిదయినను దానియందుఁ బ్రాణములతీత నాకగుపించుట యేలేదు. ఫలములపై వ్రాలకుండ పక్షులను బెదరించుట కేర్పడిన రేకుడబ్బాల మ్రోత యందు జీవహత్యా పటిష్టతాదారుణమగు పిడుగుపాటున్నదని చెప్పవచ్చునా? ఒక వేళ పురుషులను జంపు నిశ్చయమొకటి మీ బహిర్ద్వారశాసనమున నున్నదే యందము. అట్లున్నరీతినే జేయువారగునెడల నేమగును? యుద్ధములై పోకుండ ఇవ్వల నవ్వలఁజూచుచు జనులు మిన్నకుందురా? అట్టియుద్ధవాతావరణమున మీకార్యక్రమముల కంతరాయము కలుగకుండ నుండునా? కడకు జయమెవ్వరి పాలఁబడినను యుద్ధఘోషములలో మహా మనోహరమగు మీ సిద్ధాంతములన్నియు నేలఁ గలిసిపోవుననుట ధ్రువము. అట్లు కూకటివ్రేళ్ళతోఁ బెకలమయి, నిర్మూలమయి మీ విద్యాలయ మిప్పుడు పాడుపడి యున్న హంపీ విజయనగర భూములవలెనే నామమాత్రావశేషమయి యుండిపోవును. మీరిప్పుడాత్మ బంధువులనుండి వేఱడి, ఇన్ని కఠిననియమము లుంచుకొని, ఇన్ని యసిధారా వ్రతములకు బాలుపడి తుద కేమి సాధించిన వారగుదురు? వ్రతము చెడినను ఫలమైన దక్కినట్లగునా? శ్రీనాథుఁడు కాశీఖండమునఁ జెప్పినట్లు.

క. ఎవ్వనితో నెచ్చోటని
జివ్వకుఁ జేసాచవలదు. జేసాచినచో
నివ్వల నవ్వల నెవ్వరు
నవ్వకయుండంగ పగఱనడగించదగున్.

"మాకార్యఖడ్గముల భారమును వహించుచున్న రాజకుమారి అందునుగూర్చి నిర్ధారించుకొను గాక! నసుమ నాకేల? ప్రస్తుతము నా ధర్మమును నిర్వర్తించుకొనుటయే నాకుఁ గావలసినది. నే బోయెద. సెలవిండు. ఎంత యసందర్భపుఁ బుట్టిములక వచ్చినది! అయినను నా ప్రతిజ్ఞఁ జెల్లించుకొందును. అందువలన నేమగునో తలంచుకొన్న నా కొడలఁ గంపమెత్తు

చున్నది. అయినను ధైర్యము వహింతును. నేఁబోయి మిమ్ములను పట్టింపకుండ నాత్మ ద్రోహ మొనర్చుకొనఁజాలను."

"సమస్త శాస్త్రోపాధ్యాయిని వై యుపన్యసింప నేర్పరురాలవగు నీవు 'సహ సావిదధీత నక్రియామ్'

అను భారతవచనము నెఱుంగకుండనుండవు కద! తొందరపడి నీ వెంత విపరీతముగఁ జేయ నుద్యమించుచుంటివో కొంచె మూహింపవలదా? చేతులఁ గాల్చుకొన్న తరువాత నాకులు పట్టుకొన్నట్లు పోయిన నీటిని బంధింప నూహించినట్లు తొందరపడి చేసికొన్న కార్యములకుఁ దరువాత నాలుకఁ గఱచికొనవలసివచ్చునేమో యని రవంత యూహించవలదా? ఇప్పు డింత విపరీతముగ బల్కుచున్న నీవు నే నిన్నాళ్లవఱకు నెఱింగి యుండిన ఆ శకుంతలవేనా? పార్థసారధి మహారాజు మీ వంశమునఁ బేరెన్నికఁ గన్నవాఁడు. అతని చిత్రపట మింకను మా రాజప్రసాదమున కలంకారభూతముగ నున్నది. ఉద్దామవర్తనభీభత్సమగు యుద్ధ రంగమున పరాక్రమోర్జితయశులగుమహా వీరులు పీనుఁగుబెంట లగుచుండగ నాహా కారమేదురరోదోంతర ఘోరంబుగ సైన్య ములు దీనదశకు వచ్చి పాఱిపోవునప్పుడు నోరికండ నాఁచికొనుచు హుంకరించు బెబ్బులివలె అద్యేకవీరుఁడగు పార్థసారథి నెత్తుటఁ జొత్తిల్లి నేలకొఱగిపోవుచున్న మా తాతను గాపాడి విఱిగిపోవు సైన్యములఁ బురికొల్పుచు అపజయోన్ముఖమైయున్న మావారికిఁ గెల్పుకొలిచ్చెనని యుగ్గడింతురు కద! అట్టి యతిలోకవీరుఁడు, అట్టి రాజ భక్త్యుత్సాహపూరితుఁడు, అట్టి దేశసేవా పరాయణుఁడు, అట్టి ధీరోదాత్తగుణభూష ణుఁడు మీ కైదవతరమువాఁడగు తాతయే కద! మీ రాజప్రసాదముననున్న ఆ యుత్త మోత్తముని చిత్రమును జూపించుకొనుచు పార్థసారధి రక్తనాళములలో నుజ్వలమై యుండిన రాజభక్తి నేటికిని పుత్ర పౌత్ర పారంపర్యముగ జీవించియున్నదని సంత సించుచుందుము. అట్టి వంశమునఁ బొడమి నీ విప్పుడు నన్ను బట్టి యొప్పగింతువా?"

అప్పు డామె సోదరుడు, "అవును. నీ విది యోచింపవలదా? వయసునఁ జిన్న వాఁడనగు నన్ను నీ వెంతకూరిమితోఁ జూచియుంటివి! బాల్యకాలమున నీవు నాతో నీడవలె నెల్లయెడలను సంచరించి యుంటివే! పుష్పోపవనముల కిరువురమును గలసిపోయియుంటిమే! బంతియాడునపుడు, గాలిపటముల నెగరవేయునపుడు, తూనీగల వెనుకఁ బఱుగెత్తునపుడు, కుందేటిపిల్లలఁ బట్టుకొనునప్పుడు నా ప్రాణమునకుఁ బ్రాణ ముగ తిరిగియుంటివే! అలసి సొలసి గుండెలు తటతట నాడునప్పుడు నీవు నన్ను సమా శ్వాశించుదానవు కద! ఒడ లెఱుంగకుండ జ్వరపీడితుఁడనై యున్నపుడు నాకుఁ గ్రీదల లమర్చి ఔషధములఁ ద్రాగించి కథలఁ జెప్పుచుఁ బుస్తకములఁ చదువుచు సౌఖ్యా వహమగు కలలఁ గనునట్లుచేసి రోగసమయ

ములఁగూడ సంతోషవంతములుగఁ జేసి యుంటివి. ఆ శైశవమున నొకకవి చెప్పినట్లు

క. ఒకదిక్కే కాని చనఁబో
మొకచోటన కాని నిలిచియుండము
నొకటియె కాని తలంపము [మనలో
ఒకటే మన కాటపాటయూహింపంగన్.

తమ్ము గుఱ్ఱఁడే జీవితసర్వస్వ మనునట్లు వర్తించియున్న ఆ శకుంతలవేనా? అప్పుడట్టి శకుంతలవే! కాని యిప్పుడు?" అని నేను చెప్పు నంశమున కూతగ తానుగూడ ననెను.

అప్పుడు కృష్ణవర్మ యూరకుండక "మహీతలమండలి యుగ్మలు లెవ్వరియందును చూపఁజాలని యుత్తమతత్త్వము నీయందు గనుచుండువాఁడను. ఇతర కాంతా సాధారణమైన బుద్ధి నీయందు నా కెన్నడును బుట్టియుండని నన్ను నీ విప్పు డాడుదానికంటెను బేలవానిగఁ జేయఁగలిగితివి. పురుషులకు సహితము స్త్రీత్వ మలవరింపఁ జేయు మహాశక్తిగల నిన్నుఁజూచి భాషించి కృతార్థుఁడనైతిని" అని యొక వెఱ్ఱినోర ణిని ప్రసంగింపఁజొచ్చెను.

మఱల నే నందుకొని చెప్పదొడంగితిని. "నీ వీ రాజ్యమునకు వచ్చినపుడు—మీ యక్క పరిణయోత్సవ సందర్భమున మా తండ్రి రాజప్రాసాదమున సంపద్భరితమైన సందడులనడుమ మీరు దక్షిణముగఁ బోవుచున్నను పూర్వసంబంధముల బలిమి వలన మాకుఁ జేరువగనే యుందురనియు, నా దేశమున నెవ్వరైన మనవారు కష్టముల పాలఁ బడినయెడల మీరు సంరక్షింతురనియుఁ జెప్పియుండిరి. అది నీ కిప్పుడు జ్ఞాపకమున్నదా? మా తండ్రిగారు సూచించిన రీతి విపన్నులమై, భగవత్ప్రసాదజీవనులమైయుండ నభిలషించుచున్న మమ్ము నీవు త్రోసివేయుదువా?"

పార్థసారథి తిరుగ నిట్లు పలుకఁజొచ్చెను. "సౌఖ్యావహమగు బాల్యమున నొకనాఁడు బాణము తగిలి కొట్టుకొనుచు నీవు పెంచు పావుర మొకటివచ్చి నీయొద్ద పడిపోయెను. అప్పుడు దానినిజూచి కరుణావేశమున నీవు దుఃఖింపఁ దొడంగితివి. ఆ పావురము నీ యొడిలో తలఁ జేర్చుకొని విలక్షణముగ నాక్రోశించుచుండగా నీ బట్టలన్నియు రక్తమయమై పోయెను. అది కపోతరక్తము. ఇప్పటివలె నది భ్రాతృరక్తము కాదు. అయినను నీవు దుఃఖించితివి. అట్టి పరమకృపావేశపరవశవై యుండిన నీ వింత కర్కశత్వమును వహింపఁగలవా? నీ వొప్పుకొన్నను ఒప్పుకొనకపోయినను అప్పటి శకుంతలవే నీవు. ఆ తొట్టెయందలి శిశురత్నము నాకుఁ దప్పక మేనకోడలే యగును."

"ఆహా! ఆ చిట్టిపిల్ల యెంత యందముగ నున్నది! ఎంత ముద్దు గులుకుచున్నది!" అని కృష్ణవర్మ పలికెను.

అప్పుడు శకుంతల, ,, చాలికఁ జాలింపుడు. నాకు వెగటుగనున్నది. సహజాను

రాగ బాంధవ్యముల నేనేల త్రెంపుకొన రాదు? ఎవ్వనిపేర నిది భరతవర్షమని ప్రఖ్యాతివడసి యున్నదో అట్టి భరతుని భార్యలు తమ కన్నబిడ్డల వధించినట్లు నే నేలఁ జేయరాదు? * జుగుప్సాకరుఁడగు నొక జంగమ మహేశ్వరునకై తలిదండ్రులు స్వయముగ తఱిగి, వండి, వడ్డించి కుడువఁ బోయిన పరమశైవాచారపరాయణుఁడగు చిఱుతొండనంబివలెనే నేనుమాత్ర మెందు లకుఁ జేయరాదు? వీరశైవాచారపరులగు మీ రతని నతిలోకభక్తునిగఁ దలంచుట లేదా? అతఁడు తుచ్ఛమగు మూఢభక్తికిఁ బలియయి తన కుమారుని బలి యొసంగెను. ఇక నేను సంస్తవనీయమగు మా యుద్యమమునకు—మా సద్యత్న ఫలావాప్తికి—అవసరమైనయెడల నా బిడ్డయగు నహల్యను సహితము బలిదానముఁజేయ సంశయింపను. అట్టి సందర్భమున మానవజాతియందలి ఒక యర్ధభాగముయొక్క యున్నతి సంశయాస్పదముగ నున్నపుడు ఒక సోదరుని, ఒక రాజకుమారుని జంపుట కేల సంశయింపవలెను? అయినను నేనంత నిర్దాక్షిణ్యము వహింపను. మీ రిన్నివిధములఁ జెప్పియుంటిరి కనుక కొంచెము దయదలచి వదలి వేయుదును. అట్లు చేయుటయే మాకును, మీకును, మా యుద్యమమునకునుకూడ భద్రమని భావించుచున్నాను. ఆహా! ఆత్మధర్మ మనురాగముతో నొఱసికొనుటకంటె కష్ట మిఁకొకటి లేదు కద! ఇంతమాత్రమున నా యంతరాత్మ నన్ను బాధింపకుండనుండునని భావించుచున్నాను. నా షరతుల వినుఁడు. ముఖ్యముగ నేఁడు కాని రేపు కాని మీరు వేగముగ వచ్చిన మార్గముననే దిరిగి పోవుటకు వాగ్దానము చేయవలెను. లేనియెడల మీరు చంపఁబడిపోవుదురు. పశుప్రాయులగుటవలన మా విద్యావిధానములకుఁ గట్టుపడియుండలేక పాఱిపోయిరనియు, ఉన్నయెడల మమ్మందఱను బరిహాసపాత్రలనుగాఁ జేసియుందురనియు నిచ్చటివా రనుకొందురు. ఇట్లు చేయువారమని మీరు నాకు వాగ్దానము చేయవలెను" అని పలికెను.

గత్యంతరములేక మే మట్లొనర్చితిమి. అప్పు డామె క్రొత్తగఁ బట్టుపడి బోనులోని కెక్కింపఁబడిన ఘాతుకమృగమువలె ముందునకును వెనుకకును గొంత సందిగ్ధసూచకముగఁ బచారుచేసి అంతలోనే మందహాససుందరవదనారవిందయై పార్థసారధి కెదురుగ నిలిచి ఇట్లు పలుకఁజొచ్చెను.

* క. భరతుని భార్యలు మువ్వురు,
వరుసం బుత్రకులఁ గాంచి ♦ వల్లభుతోడన్
సరిగారని తోడ్తోడను
శిరములు దునుమాడి రాత్మ ♦ శిశువుల నధిపా.
—భాగవతము

"తమ్ముడా! నిన్ను జూచుటతోడనే తెలిసికొంటిని. చాల నెదిగియున్నను నీ వెంతమాత్రమును మార్పు చెందనేలేదు. ఆహా! నిన్ను నేను మృత్యువున కొప్పగించుటయా? నాయందలి 'స్వధర్మ' మట్లని పించినది కాని అట్లు పలికినది 'నేను' కాదు. పైకి నే నత్యవసరమగు కఠినత్వమును వహింపవలసివచ్చినది. అందులకు నీవు మన్నింతువు గాక! అమ్మ బాగుగనున్నదా?"

అని ఈ వైఖరిని వా రొండొరుల నడిగి కొనుచుఁ దెలిసికొనుచు సహజానురాగమున సంభాషింప నారంభించిరి. వారు ప్రపంచమును మఱచి సోదర సోదరీజన యోగ్యమైన సల్లాపసౌఖ్యమున నానందించుచుండగ నేనును కృష్ణవర్మయు వారిని దిలకించుచు నిలువబడితిమి. అంతలో రమణీయ కంఠ మొకటి 'భానుమతీదేవి తమ కొక సందేశ మంపినది' అని వినవచ్చి మమ్ముఁ జకితులఁ గావించెను.

మా వెనుకవైపున భానుమతీదేవి కొమార్తెయగు మాలతి నిలువఁబడి మ మ్మువలక్షించుచున్నదని తెలిసికొంటిమి. ఆమె యెంతకాల మచ్చటనుండి మాయాలాపముల వినుచుండెనో మే మెఱుఁగము. ఆమె యచ్చటనున్న తలుపు నూతగబట్టికొని మా వంక జూచుచుండెను. ఆమె కనులలో నాశ్చర్యమును, భ్రాంతియు, తొట్రుపాటును స్పష్టముగ ద్యోతకమగుచుండెను.

"ఓహో! మాలతి! నీవేనా? మే మాడుకొను మాటలను వింటివా యేమి?" అని శకుంతలాదేవి యామెను ప్రశ్నించెను.

"అమ్మా! నే నేమి చేయుదును? బుద్ధిపూర్వకముగఁ బొంచుండి నేను మీ మాటలు విన్నదానను కాను. నేను వచ్చుచుండగ మీ రీవిధముగఁ జెప్పుకొనుచుండిరి. నే నిక్కడనే నిలువఁబడిపోతిని. అయిన మా యమ్మకంటెను ప్రియతరురాలవగు నీవు నావలన భయమందు టెందులకు? ఇట్లు ధీరోదాత్తులై వచ్చియున్న ఈ ముగ్గురు పురుషులను మరణదండనమునకుఁ బట్టి యొప్పగించు నిష్ఠురహృదయము నాయందున్నదని నీవు తలంపవలదు."

శకుంతల యిట్లనెను. "మాలతీ! నీ మాటయందు నాకు విశ్వాసమున్నది. యమళార్జున వృక్షములవలె సహకారమున, సాహచర్యమున, పరమసఖ్యమున మెలఁగుచుండువారము. అయినను మీయమ్మ మత్సరస్వభావమును దలఁచుకొన్న నాకేమో భయముగనున్నది. సవతియగు దేవయానికి తన ప్రాణప్రియుని గూర్చిన రహస్య మెఱిగించుకొని చేటు దెచ్చుకొనిన శర్మిష్ఠవలె పరమరహస్యముగా నుంపవలసిన ఈ సమాచారమును బాల్యచాపల్యమున నీ వితరుల కేమాత్రమైన తెలియజేసిన యెడల ఈ మహిళావిద్యాలయము నశించుననియు, నేను నా గౌరవమును గోల్పోదుననియు, వీరు తమ ప్రాణములఁ బోగొట్టుకొందురనియు నీవు గమనింపవలెను."

"అమ్మా, నీ వింత భయపడ నక్కఱ లేదు. వీరి యుదంతమును నీ వెంతకాలము రహస్యముగ నుంప నూహింతువో అంత కాలమును రహస్యముగనే యుంచుదానను. మేను మఱచి కూరుకుచున్నప్పుడైనను పురూరవుని గాంచి తిట్టుట కారంభించిన యూర్వశివలె * నెవ్వ రెంతపరుషముగ భాషించినను సహింతును గాని ఈ రహస్య మెవ్వరికిని వెల్లడింపను."

"నీ వట్లే చేయవలయు. చేసిననే మనము ప్రపంచమును విజ్ఞానదీప్తిమంతముగఁ జేసి జగత్కల్యాణమునకుఁ ద్రోవఁ దీయఁగలము. అట్లయిన నెప్పటికైన బురూరవుఁడే యూర్వశి నన్వేషించుకొనుచు వచ్చుట జరుగవచ్చును" అని పురుషులను పురూరవునిగను, యువిదల నూర్వశిగను చెప్పుచుండగ కృష్ణవర్మ యందుకొని అంత సందర్భముగ లేకపోయినను ఇట్లు పలుకఁజొచ్చెను.

"అమ్మా, వేదములఁ ద్రిభంగుల విభాగించి అతఁడు విజ్ఞానోన్నతి వడసియుండిన చక్రవర్తి. ఆమె నిరుపమాన శోభాంగియు, స్వేచ్ఛావతియునగు యువతి. అతఁడు నిగ్రహానుగ్రహ సమర్థుడగు సార్వభౌముఁడు. ఆమె శాపానుగ్రహ శక్తియుక్తురాలగు సుత్తమాంగన. ఎంత యాత్మజ్ఞానము లేకున్న దానచ్చరయయ్యు నిట్లు పలుకఁగలదా?

మ. తలపుల్ చిచ్చులు మాటలు జ్వలసుధా
ధారల్ విభుండైన పు
వ్విలుతున్ మెచ్చర యన్యులన్ వలతురే
విశ్వాసమున్ లేదు క్రూ
రలు తోడుం బతినైనఁ జంపుదు రధ
ర్మల్ నిర్దయల్ చంచలల్
వెలయాండ్రెక్కడ వారి వేడబములా
కల్పాంత నూత్రంబులే.

దీనిని వ్రాసినవారు పురుషులగుటచే నిట్లు చెప్పించిరని నీ వందువు కాఁబోలు. కాని ఈ మాటలలో స్పష్టమగుచున్న యూర్వశి యాత్మజ్ఞానమునకు మనము హర్షింపవలెను. మత్తారాతి విదారణుఁ డనియు, బుధసన్మాన్యుఁడనియు, సద్గుణాకరుఁడనియుఁ జెప్పఁబడియున్న పురూరవశ్చక్రవర్తి మహాలక్షణవతియు, నుజ్వలాంగియు, స్వేచ్ఛావతియునగు నూర్వశిని తన రాజ్యమున కాహ్వానించుకొని ఆమెకును తనకునుగూడ శాశ్వతమగు శోభ కలుగున ట్లొనరించెను. అదేవిధముగ నీవు మా నమును కేగుదెంచెదునెడల సంపన్నగుణాభిరామవగు నీకును మే మట్టి స్వాగతమే యొసంగఁగలము. కృతాపరాధులమయ్యు దైవనియోగమున నీవలనఁ బ్రాణదానమును

* క. వినియుఁ వినవు రణభీరువు మనుజాధము నిదురపోతు ♦ మందునిసకటా!
నినుఁ జక్రవర్తిఁ జేసిన వనజాసనుకంటె వెర్రి ♦ వాఁడును గలఁడే.

అని యూర్వశి పురూరవుని నొవ్వఁబలుకుటయే గాక 'మగవంద' యనియు 'శవ' మనియు 'మనుజపశు' వనియుఁగూడ దూషించినది. 'శవ' మనఁగ వ్యావహారిక భాషయందు క్రోధావేశమున జనుల కందివచ్చు 'పీనుగ' యను నిరాఘాటమైన వాక్సాధనమే కద!

పొందఁ గల్గితిమి. క్షుధాతురుఁడై విశ్వామిత్రునంతవాఁడు కుక్కమాంసమునుగూడ తస్కరించెనఁట. ఒక్కదినపుఁ బొట్టకూటికి వ్యాసునంతవాఁడు దీనుఁడయి తిట్టుబోఁ తని పించుకొనెను. సప్తర్షులును గాలుచున్న మనుజకళేబరమునే తినుటకు సంసిద్ధులయిరి. * ఒక్కనాటి పొట్టకుఁ గఱవయి సర్వ సాధారణమగు క్షున్నివారణమునకే మహా మతులగు ఋషిసత్తము లట్లు చేసియుండిరే! ఏల?—ప్రాణములందలి తీపిచేత అట్టి సందర్భమున మాకుఁ బ్రాణముల నిలువఁబెట్టిన నిన్నెంత గొనియాడినను కొనియాడదగినదే కాదా?—" అని యొక వెట్టిధోరణిని తాను బలుకుచున్నదేమో తనకే తెలియకుండ నున్నదాయను భ్రాంతి బుట్టుట కవకాశమిచ్చుచు మాట్లాడెను.

"నన్నుకాదు. ఇంత చక్కని కల్పనముఁ జేసిన నిన్నే మెచ్చుకొనవలెను.—ఇఁక మీరావలకుఁ బొండు. దీర్ఘముగ సంభాషించుకొనుచు నుండిపోతిమి. ఉత్తరదేశీయుల వైఖరిని మీరు మేలిముసుగుల ముఖములఁ జక్కగ గప్పికొని సంచరించునది. ఉత్తరభారత దేశమునుండి మావిద్యాలయమునకు వచ్చువారంద ఱట్లేయుందురు. ఇప్పుడు కొందఱాంధ్రస్త్రీలును దాని నొక నవీనశృంగారమని భావించి యవలంబించుచున్నారు. మీరావిధమున సేయునది. ఎవ్వరితో నండగ కలసిమెలసి తిరగకుండ సప్రమత్తులరై యున్నయెడల దైవము మన కనుకూలముగ నుండవచ్చును."

వెడలిపోవ నుద్యమించుచు నేను 'తథా' స్తంటిని. అప్పుడు కృష్ణశర్మ తొట్టియలోఁ బొత్తులలోనున్న అహల్యాకుమారి నత్యాదరంబున నందుకొని శకుంతల యానందించుచుఁ జూచుచుండగా బాలికనెత్తికొని బుగ్గలపై నూది ముద్దుపెట్టి యది కిచకిచలాడుచుండగఁ దనమోమును చేతితో నిచ్చట నచ్చట భ్రామించుకొని ఉపలాలనార్హములైన జిలిబిలిమాటలఁ జెప్పుచు దానిని బాగుగనవ్వించి తల్లికిచ్చివేసెను. ఈవిధముగ నాటిసమావేశము పరిసమాప్తమునకు వచ్చెను.

ఆదినమం దొక యర్థభాగమా మహిళా మహా విద్యాలయమందలి మహోపన్యాస భవనములను, ఆడుగురువుల యాలాపచమత్కారములను, బాలికామణుల విద్యోపార్జనాసక్తియుదిలకించుచు అర్థచంద్రాకారముగ నమర్పఁబడిన యున్నతపీఠముల నలంకరించి యున్న బాలికలకెదుట కూర్చుండి మనోహరమగు వాచాలత్వమున విజ్ఞానకిరణ

* క. మూరాఁకలి పెల్లున శా
హారంబుగ శవముకినుట కడరితి రి చే
లారండిచ్చెద మీశా
హారంబులు వలపినట్టి వని తా మతితయున్.

—భారతము.

ముల బ్రసరింపఁజేయు గురుమహాశయులఁ జూచుచు నాకర్ణించుచుఁ బ్రొద్దుగడపితిమి. ఆడుహస్తములక్రింద వలయాకృతికి వచ్చు వృత్తములఁజూచి వానియందు పరిధి యనియు, సమరేఖయనియు, కేంద్రమనియుఁ, గోణములనియు పరిభాషాశబ్దభూయిష్ఠమైయున్న రేఖాగణితము నేర్చుకొని సంతసించితిమి. శ్రుతి, శాస్త్ర, పురాణములు మొదలైయున్న యుపన్యాసముల వింటిమి. గీర్వాణకావ్యముల విని వాని మహత్త్వములఁ దెలిసికొంటిమి. ఉదాత్తరసాన్వితమైన మాతృభాషాకావ్యములవిని యానందించితిమి. ప్రాచీన కవిశిఖామణుల చాటువుల — సమస్యల — చమత్కారములఁ గ్రొత్తక్రొత్త వైఖరులవిని యాశ్చర్యమందితిమి. ఆచంద్రార్కముగ భూమిపై కాంతిపుంజముల వెదఁజల్లు వాఙ్మయరత్నముల క్రొంగ్రొత్త రుచులఁజూచి విస్మయమందితిమి తరువాత నింక నుడియది యనియేమి ?— మానవజాతి సమగ్రేతిహాసముల, రాజనీతిధర్మముల, మనస్తత్త్వవైఖరుల, నీతుల, భౌతికసిద్ధాంతముల, నక్షత్ర తత్త్వముల, క్రిమికీటక విహంగమాది జంతుపరిణామముల, సమస్తజంగమ స్థావరసృష్టివిశేషముల, రసాయనిక వైద్యుతిక శాస్త్రరహస్యముల—నేర్పఁదగిన నేర్వవలసిన యెల్ల విషయముల నామహిళామహా విద్యాలయమునఁ గఱపఁబడుచున్నవని తెలిసికొంటిమి. పక్షముల దెంచుకొని చేనులలోఁబడి అందిన వెల్ల లోనికి గ్రుక్కుకొను గుబ్బములవలె మేము మువ్వుర మిట్లాడువారి విద్యాలయమునఁజొరఁబడి మా కందివచ్చిన విజ్ఞానమంతయు లోని కెక్కించుకొని పొంగిపోతిమి.

అప్పుడు నేను చెలికాండ్రతో—

"విపుల శాస్త్రేతిహాసాది విద్యలైన
చెప్ప నేర్తురు పూరుషుల్ చెప్పినట్ల
చదువ నేర్తురు పూరుషుల్ చదివినట్ల
చేయ నేర్తురు పూరుషుల్ చేసినట్ల
ప్రతిభఁ జూపింప నేర్తు రప్రతిమలగుచు
కార్యఖడ్గంబులందెల్ల కాంతలందు
చెప్పి చేయింపఁగలగొప్ప జీవశక్తి
చేరియుండుట విశదమీ క్షితిని మనకు.
అందులకు కృష్ణవర్మ యంగీకరింపక

"ఆహా! వేదవేదాంగపురాణములఁ జావగొట్టి వీ రుపన్యసించుచున్నారు. అయినను వేదములయం దిదియున్నది— అదియున్నది అని వీరు చెప్పుట కేమి హక్కున్నది? అసుదానికి వైదికవిజ్ఞానాధికారమెచ్చటనైనఁ బొలుత నుండినకదా వానిపై వీరు వ్యాఖ్యానములఁ జేయవచ్చును. ఇట్లేవైన నిషేధశాసనములఁ దలపెట్టిన యెడల నవన్నియుఁ బురుషులు తమపై నుడుకుబోతుతనమునఁ గల్పించిన వందురు కాఁబోలు! కావున వారి కట్టి యధికారమున్న దేయని యొప్పుకొందము. అయిన వీరు నేర్చుకొనుచున్న వేమి శాస్త్రములు? కేవల పురుషసృష్టములై ప్రాతపడియున్న విద్యలే కావా? ఇవేమి క్రొత్తక్రొత్తచదువులా? నవీనమార్గములా?—ఒకవేళ నయినను ఆడు దెప్పుడైన నేమైన క్రొత్త

దానిని * కనిపెట్ట కలిగినదా?" అని మమ్ముఁ బ్రశ్నించెను.

"ఇది మిగుల దయాదిహీనమైనమాట, శకుంతల యుపన్యాస మంతనే పాలించి యుంటివే! కడకు నీ విదియేనా నేర్చుకొంటివి?—నాకు రోతగనున్నది. ఇది శుష్కమగు చెత్త. ఇఁక జాలింపుము." అని పార్థసారథి యతనికిఁ బ్రత్యుత్తరమిచ్చెను.

"చెత్తయా?—చెత్తయైనను నిందు గొంత చేవయున్నది. ఇఁక నామె యుపన్యాసమున నేనేమియు నేర్చుకొనలేదని యా నీవనునది? నేర్చుకొనకేమి? ఒక్క క్షణములో నామె నాకు సర్వజ్ఞత్వమును కలుగఁ జేసినది. వివిధ విద్యాధిష్ఠానదేవత లన్నియు నాకపాలమున తలకొక విద్యయు లోన బోసియున్నను నాకింతవిజ్ఞానము కలిగి యుండదు. ఒక వేయి కాంతాహ్లాదయము లిచ్చట బీడువడిపోయియున్నవి. వీరందఱు బిడ్డలఁగని మాతృదేవతలయి వేయిగృహముల రాణులయి పురుషుల కుత్సాహమిచ్చి యుండవలసినది. కాని గ్రహచారవశమున వంధ్యాత్వమున శోభిల్లుచున్నారు. వీరిది స్త్రీ జన్మమేనా? వీరియందు శృంగారరసమున కవకాశము లేదా? విషయసాయకుని యాగడములకు వజ్రకఠినమైయున్న వీరిహృదయములఁజూడ నాకుగుండె నీరగుచున్నది. అనన్య సామాన్యములైన వీరి లావణ్యవిలాసములు శూన్యగేహాంగణ దీపికలువోలె నున్నవి. ఇట్లెన్నాళ్లు కఠినవ్రతమును వహించి తాముపట్టినపట్టు వీడకుండ నుండిపోఁగలరు?

"ఒక్కొక్కవేళ పద్మముఖు
లొల్లమి సేయుదు రొక్కవేళ పె
న్మక్కువ నాదరింతురు క్ష
ణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్"

అను కవిగారి వాక్యములఁ దలఁచుకొని కదా నావంటివా డూఱట నందవలెను? పురుషాకర్షణశక్తి స్త్రీలయం దుండుట చేతనే 'పద్మినికి నాగరికము స్వాభావిక' మని కవులు వర్ణించిరి. శకుంతల భ్రూలతాక్షేపము, కుంచితాక్షమగు కటాక్షము, స్నిగ్ధమగు పలుకు లజ్జితాంతశ్చమగు హాసము—ఇవి స్వాభావికమగు నామె భూషణములు, నాయుధములు నయి నన్నామెకు వశంవదునిగ నొనర్చినవి. కేవల 'పురుషద్వేషిణి' యని కమలాకరవర్మ చే దెలిసికొనినప్పుడు నేను నాయుద్యమమున హతాశుఁడ నగుదునేమో యని భావించితిని. ఇప్పుడామె నిచ్చట బ్రత్యక్షముగఁ జూచి సంభాషించి నాయభీష్టమునఁ గృతా

* **They hunt old trails—**
**But when did woman ever yet invent?——**
అని మూలగ్రంథమగు నాంగ్లకావ్యమున నున్నది. టెన్నిసన్ కాలమునకు స్త్రీ లెవ్వరును గ్రొత్తగ 'ఇన్వెంట్' చేసి యుండలేదు కాని ఈనడుమనే మరణించియున్న 'మేడమ్‌క్యూరీ' యనునామె 'రేడియమ్' అను గొప్పపదార్థమును గనిపెట్టి 'సైంటిఫిక్' పరిశ్రమముల మానవజాతికి బాధానివారణమగు నుద్యమముల తన జీవితమును తుద ముట్టించుకొనెను.

ర్హుఁడఁ గాగలనని భావించుచున్నాను. పూర్వకాలమున శకుంతల దుష్యంతునిచే

కరం బనురాగ మొప్పగా
భామిని నాకు భార్యవయి
భాసురలీల నశేషరాజ్యల
క్ష్మీ మహనీయ సౌఖ్యముల
మేలుగ నందు మనిందితేందు పా
దాముల తుంగహర్మ్యముల
హారి హిరణ్మయ కుట్టిమంబులన్.

అని యనిపించుకొనెను. ఆదుష్యంతుఁడు సమస్తాశాంతమాతంగ మర్యాదా లంకృతమైన భూవలయ మాత్మాయత్తముగఁ జేసికొన్నవాఁడు. సమస్త దుర్గదుర్గమ మహారణ్య దేశాళితో నాదిక్షత్ర చరిత్రమునఁ బరిపాలించినట్టివాఁడు. ఈశకుంతలనువరించు నాకట్టి భాగ్యభోగములులేవు. కాని నా శకుంతలకున్నవి. నాయక్కఱతీర్చు దుర్గాధిపత్యమును సంపదయు ఆమెకున్నవి. కాన నేనేల హతాశుఁడనగుట కీయకొందును? తొలుదొల్త దుష్యంతుఁ డాత్మగతంబున భావించినట్లే-

ఎంతయు నిస్పృహా వృత్తినున్న నా
హృదయము రాజపుత్రినని
యిక్కమలాక్షి నిజాభిజాత్య సం
పద నెఱిగించినన్ మదన
బాణపరంపర కిప్పుడుండ నా
స్పదమయి సంచలించె నళి
పాతవికంపిత పంకజాకృతిన్.

అని చాలవఱకూహించుకొనవలసిన వాఁడ నగుచున్నాను. ఈప్రాతకథల నిన్నిద్రవ్వు టెందులకని మీరనుకొనుచున్నారు. ఎట్టి విద్యాధురీణులకైనను, ఎట్టి ప్రజ్ఞాన్వితులకైనను కర్తవ్యమేమి?—నన్నయభట్టెంత చక్కఁగఁ జెప్పినాఁడో చూడుఁడు!

క. ఎఱుక గలవారి చరితలు
గఱచుచు సజ్జనులగోష్ఠి గదలక ధర్మం
బెఱుగుచు నెఱిగినదానిని
మఱువ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్.

మనకుఁ దెలిసియున్న చదువుకొన్న సందర్భములను మన మాచరణమునకుఁ దెచ్చుకొననియెడల మన బుద్ధి విశేషములును, చదువులునుగూడ నెందులకు గాల్పనా? కాని ఈమహిళామణుల విద్యోపార్జనోత్కంఠమే నాకుఁ జోద్యముగనున్నది. ఆయుపన్యాస భవనములలో నేను మనసు పట్టుకొనలేక నొకప్పుడు పకపక నవ్వవలెనని యూహించియు నాయుపహాసమును నాలోనే గష్టమున నణచియుంచుకొంటి ననఁగ నమ్ముదురా? దాహాతురమైయున్న మొక్కవలె విజ్ఞానాతురలై వీరు నాకు వింతనుబుట్టించిరి. అంభోరాశి నొక్క గ్రుక్కలోఁ బీల్చివేసిన యగస్త్యునివలె వీరు సమస్త విద్యాంభోధియుఁ బీల్చివేయ నూహించుచున్నారు.

భామాజనులాచరించు పని మఱలింపఁగ
దామరవిరిలోఁ బొడమిన
యామేటికినైన నలవియగునె తలంపన్.

మన యనుభవమునకు వచ్చు నిట్టి

సందర్భములఁగూడఁ గనిపెట్టఁ గల్గుట చేతనే 'రవిగాననిచోట కవిగాంచుచున్నాఁ'డని మనము చెప్పుకొనుట!! కేవల మదపుఁబిచ్చివలన నే నిట్లపలాపించుచుండుటలేదు. 'రే! కన్దర్ప కరం కదర్థయసి కింకోదండ టంకారితైః' అని చెప్పుకొనునంత వైరాగ్య మింకను నాయం దుత్పన్నము కాలేదు. ఇనుపకచ్చడములఁ గట్టికొను మునిముచ్చులందఱును కామినీ కటాక్షములకు వశమగుచునే వచ్చిరి.

వనదళవాతముల్ మెసవు
♦ వారు పరాశరకౌశికాదులా
ఘనులును సుందరీజనుల
♦ గన్గొని మోహితచిత్తులైరి

అని మనవారు చాపగొట్టి వ్రాసియుండగా ఘృతపాయసాన్నముల భక్షించు నావంటి వానికి మనోజయ మెట్లువచ్చును? అకాముఁడగు ప్రవరునియందు లబ్ధానురాగయై వరూధిని ప్రలాపించున ట్లున్నది నాయవస్థ. సైవామృతలతా రక్తా విరక్తా విషవల్లరీ*' ఇందేమైన శూన్యతత్త్వ మున్నదా? సంపన్నగుణాభిరామయగు శకుంతలయే నాకుఁ గావలయు—"

అని సందర్భశుద్ధిలేకుండ వదఱుటలో నప్రతిమానుఁడగు కృష్ణవర్మ కామోన్మాదమునందే తనకు దెలిసియున్న ప్రాత కథల నేకరువుపెట్టుచు నుపన్యసింప నారంభించెను. అంతలో భోజనాహ్వాన సూచకముగ ఘంటానాద మొకటి వినవచ్చుటయు మేము భోజనాలయమునకు నెడలిపోతిమి. అచ్చట పంక్తులుదీరి వివిధవర్ణముల పుష్పములవలె నయనోత్సవ మొనర్చుచున్న బాలికామణుల చెంతకుఁబోయి కూర్చుంటిమి. అంతలో నుపాధ్యాయినీ సంఘముతో రాజకుమారియు వచ్చి నడుమ నుపవిష్టురాలయ్యెను. స్త్రీజాతియం దొక్కసారిగ మహావిప్లవమును దీసికొని వచ్చిన నా మనోహారిణిపై కన్నుంచినే నేను భుజింప నారంభించితిని. ఆడువాండ్ర వైఖరులలో నామె యెట్టి పరివర్తనములఁ దెచ్చిపెట్టినది! ఇంకను ఎన్ని మహత్కార్యములఁ జేయ సంకల్పించియున్నది! విస్మయావహమగు నామె నిశ్చయబుద్ధికి స్త్రీ జాత్యాభిమాను లెవ్వరు జోహారు నెట్టరు? గంభీర భావమున గూర్చుండి బాలికలందఱు తదేకదృష్టులతో తన్నవలోకించుచుండగ నామె యెంత తేజోవంతముగ మెఱసిపోవుచున్నది! ఉపాధ్యాయినులందఱు సందేహాస్పదమగు నొక శాస్త్రసిద్ధాంతమును బట్టి చర్చింప నారంభించిరి. కళలగూర్చి ప్రకృతి శాస్త్రసందర్భములఁగూర్చి కొందఱవో పూర్వపక్షసిద్ధాంతము లొనర్చుచు సందడిచేసిరి. నడుమ నడుమ భానుమతీదేవి తీక్ష్ణమగు నపాంగవీక్షణముల మాపై బ్రసరింపుచువచ్చెను.

భోజనములైన తరువాత మేమచ్చటి యుద్యానవనములలోనికి బోయి తిరుగ

* అమృతలత లతాంగి ♦ యనురాగవతియైన కౌశ మెలగొనెని ♦ గరళవల్లి.

నారంభించితిమి. అచ్చట నొక బాలిక తనలో తానేదో వర్ణించుకొనుచు మందగమనమున నడయాడుచుండెను. ఒక బాలిక చదువుదానివలె పుస్తకమొకటి చేతఁబట్టి రెండవచేత నొక మయూరమును బుజ్జగించుచుండెను. కొందఱొకచోట గుమిగూడి మనోహరముగఁ బాడుచుండిరి. కొందఱు దట్టముగఁ బెరిగియున్న పండ్లచెట్ల గుంపులలో జొరఁబడి యిష్టకథాకలాపముల నానందించుచుండిరి. కొందఱు జలయంత్రముల మీఁదుగ గందుకముల నెగురవైచి నవ్వుకొనుచు జిత్రచిత్రమగు ఖేలనములఁ గాలముఁగడపుచుండిరి. కొందఱచ్చట సుఖాసీనలయి తమ జీవితముల వసంతకాలమంతయుఁ గడచిపోవుచున్నదనియు, తమకుఁ జదువెందులకనియు, 'అనాశ్వాసితదుఃఖితే మనసి సర్వమసహ్యా' మనియు జెప్పుకొనుచుండఁ జెవులఁబడి వారియాలాపముల కడముట్ట నాకర్ణించితిమి.

వారికిఁ బరిణయమొకఁ వేడుకయున్నది. వారికి గృహములఁ బరిపాలించుకొన శక్తియున్నది.—అట్టివారికి సమస్తవిద్యాపరాయణతవలనఁ బ్రయోజనమేమున్నది? మఱియు విద్యాధురీణురాండ్రగు యువతులనుజూడఁ బురుషుల కొకవిధమైన ద్వేషము.—ఏల? చదువుకొన్నయాఁడుదైనయెడల తమపైఁ బ్రభుత్వమును జేయునని—

ఈవిధముగ సంభాషించుకొనుచుండగ మేము మా చెవుల నమ్మజాలకపోతిమి. అంతలో మాలతివచ్చి యేదో పరిహాస వచనములాడి మాకానందమును కలిగింప నారంభించెను.

అంతలోఁ జీకటిపడుటయు మమ్ము లోనికిరండని యాహ్వానించు ఘంటానాదమును విని విద్యాలయమునఁ బ్రవేశించితిమి. అచ్చట నొకచోట జేరియున్న ఆఱువందల కన్యామణుల గలసికొని వారితో దైవప్రార్థనలఁ జేయ నారంభించితిమి. జగద్హితమునకై ఇందిరాదేవి జేయు సత్ప్రయత్నములకు సంపూర్ణ ఫలావాప్తి కలుగునట్లు పరాత్పరు నైక్యకంఠముగఁ బ్రార్థించుచు స్త్రీలు మనోజ్ఞముగఁ బాడుకొనిరి.

ఇది మనోరమయను వచనకావ్యమునఁ
బ్రియంవద యను నామెచేఁ జెప్పఁబడిన
రాజకుమారియను కథయందు
ద్వితీయభాగము.

# క్రొత్తప్రాతలు

## అప్పుడు—ఇప్పుడు

టర్కీదేశములో ప్రధాననగరమైన ఇస్తాంబులులో అఖిలప్రపంచమహిళాసభ జరుగబోతున్నది. మన భారతదేశమునుండికూడా మిసెస్ హమీదాలీ, బీగమ్ కమాలుద్దీనుగార్లు స్త్రీప్రతినిధులుగ బయలుదేరి వెళ్లినారు. ఆదేశములో స్త్రీలు పొందిన నవీననాగరకతాభివృద్ధి ప్రతిపత్రికకు ఒకప్రధానవిషయమైవుంది. మహమ్మదీయమత మాదేశములో ప్రవేశించకముందు స్త్రీలు పురుషులవలె షరాయిలు చడావులు తొడుక్కొని బహిరంగజీవనం చేస్తూవుండేవారు. ఇట్టివారి శాంతిప్రతిమ లింకా అక్కడక్కడ ఆదేశములో అగుపించుతవి. పల్లెటూళ్లలో కర్షకవనితలు మొదలగువారుకూడా యిట్టివానినే యిప్పటికీ తొడుక్కొని తిరుగుతారు.

మహమ్మదీయమతంతోకూడా ఘోషావచ్చింది. రెండుమూడువందల సంవత్సరములనుండి స్త్రీలు (ముఖ్యముగా నగరములలో) బురకాలుమాత్రమే తొడుగుతున్నారు. తలమీదినిటోపీలనుండి ముఖముమీదికి తెరలు వ్రేలాడును. కళ్లదగ్గిర కన్నాలలోనుండి వారు లోకులను చూడగలిగినా లోకులకు వారెంతమాత్రం కనిపించరు. పగలంతా అంతఃపురాలలోనే తిరగడం - కిటికీలకు అడ్డంగాను నిలువుగాను కఱ్ఱబద్దల కటకటా లల్లిబిల్లిగావుండడంవల్ల లోకాన్ని వారు తొంగి చూడగలిగినా లోకానికి వారగుపించరు. పైగా యీ కిటికీలకుకూడా ఘోషాయే. వాటిమీద తెరలు తగిలించేవారు. ఎప్పుడైనా పనివుంటే అర్ధరాత్రివేళ పట్టణములు నిద్రించుతున్నతరి రోడ్డుమీద నమాజుకొరకై మసీదులకు స్త్రీలు ప్రయాణం. అతిదగ్గర బంధుత్వంగల మగవారినైతే అలాగా యిలాగా చూస్తారు. తక్కినవాళ్లొస్తే కనిపించవల్లకాదు. అయినా వారి నజ్ఞానులనరాదు. ఆ గూఢ్యాలలోనే వారు పార్సీ, అరేబిక్కు, ఫ్రెంచి, జర్మనీ భాషలు నేర్చేవారు. షైరను, కాంటు, టాంటీ, సాదీ మొదలగువారల గ్రంథముల నామూలాగ్రముగా చదివేవారు. మరోవిధమైన ఉద్యోగాలు, లెక్చర్లు, బజారుపనులు, ప్రయాణాలు, ప్రజాసేవలు లేకపోవడంవల్ల కాలమునంతటిని శుద్ధవిజ్ఞానవిషయములలోనే వినియోగించుటకు వారికెక్కువ అవకాశము లుండెడివి. తక్కిన అయిరోపావనితలవలె వీధులలో వస్తాదుగిరీ, పురుషులతో విహారభాగ్యం మొదలైన విజ్ఞానములకు నోచుకోకపోయినా భాగ్యవంతులైనవారు ఈ విధంగా తమ కాలమును సద్వినియోగమే చేసుకొనేవారు. కాని జనసామాన్యానికి మాత్రం చదువూ వ్రాతా లెక్కా బహిఃప్రపంచం అంటే పెద్దగోడలాగుండేది.

ఏళ్లైయేళ్లాయ యీసంగతులన్నీ తారుమారై, టర్కీ మళ్లీ మూడువందల యేండ్ల క్రిందటి అయిరోపాదేశమై, నవీనపద్ధతులనుగూడా కట్టుకొనుచుండుటచే అయిరోపావనితలకు టర్కీవనితలకు నేడు భేదము కనిపెట్టడం చాలా కష్టమగుచున్నది. ఈ నూతనత్వ మనేకవిధముల గోచరమవుతున్నది. మొట్టమొదటిలో నవముసుగులూ తొలగాయి. వీటిని తొలగించవాలని చట్టము ప్యాసుకాలేదు. కాని కెమాలుపాషాగారి కిలాంటి పద్ధతులంటే కోపమని

అందరికీ తెలిసింది. దానితో అందరూ ఈ ముసుగులు తీసేశారు. పల్లె ప్రాంతాలుకూడా చాలా నాగరిక మైనవి. అనగా గ్రామకాఫీక్లబ్బు, గ్రామ రేడియో, గ్రామటాకీ మొదలైనవి లేచాయి కాని పల్లెపడు చులుమాత్ర మింకా సాయంకాలముల యందు మాత్రమే సన్ననిముసుగులు వేసుకుని మునపటిలాగనే యిళ్లు కదలుతే కదలుతారు. కాని నగరవాసినులు శ్రీమంతసీమంతినులు బారులు బారులుగా జనానాలను విడచిపెట్టి స్కూళ్లకు, కాలేజీలకి, ఉద్యోగాలకి, కూలిపనులకి, కాఫీహోటళ్లలో వడ్డించడానికీ, ఫ్యాక్టరీలలో మూటలు మోయడానికీ వచ్చేస్తున్నారు. నాగరికమంటే మజాయా? మగవాళ్లకు పనులుపోయి ఆడవాళ్లకు తిండిచాలక స్వతంత్రులై కూలికి నాలికి వీధులలో దిగబడకపోతే అది ఏజాతినైనా ఉత్త పుణ్యానికి తనంతట తాను వలచిపడుతుందా? మొత్తముపైని మన తురుష్క వనితలు తెల్లవనితలతో సమానస్థాయీ సంపాదించినందుకు వారిని మన మభి నందింపవలసివున్నది. ఈ వుపదేశమే మనకందరికీచేసి హాలిడే ఎడిబుగారు ఈమధ్యనే టర్కీ వెళ్లిపోయి నారు.

బహుభార్యాత్వపిశాచాన్ని మెడపట్టి గెంటినారు. వివాహవిచ్ఛేదము సులభసాధ్యమయేటట్టు స్విజరు లేండులోవలె ఒకో క్రొత్తచట్టము మక్కీకి మక్కీ ప్యాసుచేసినారు. అయినా కొన్నిరాష్ట్రాలింకా యీపద్ధతుల నన్నిటినీ ఒక్కమారు వరించుటకు చాలా మొగమాటము పడుతున్నవి. ఇస్తాన్బులు నగరమే చాలా వెనుకపడుతోందిట. ఈ కొన్ని రెన్నెళ్లలోకూడా ఆసిగ్గు తొలగిపోగలదు.

ఇప్పుడు ఫ్యాక్టరీలు కచ్చేరీలు స్త్రీలమయం. పగలల్లా వాటిలో కష్టపడి సాయంకాలమయేటప్ప టికి బోస్ఫరసు సముద్రపుటొడ్డుకు పురవీధులగుండా వనితామతల్లులు సౌందర్యవాహినులలాగ ఒకరినొకరు త్రోసుకుంటూ నవ్వుకుంటూ వస్తారు. నూరేళ్లక్రిం దట ముసుగు తీసుకున్న ఆడది వీధిలో కనిపిస్తే శిక్ష ఉత్తరించేవారట. నేడు ముసుగు నెవ్వతెకాని వేసు కోరాదు. నల్లని కనుబొమ్మలు, తెల్లని ముఖబింబ ములు, సూదులలాగు చూపర్లగుండెల్లో గ్రుచ్చుకొనే చూపులు—ఇవి ప్రతీవీధికీ ఒకశోభని కలిగిస్తూ ఉం టవి. వీరంతా ఉదయంపూట అప్పుడప్పుడు వచ్చి చెంగున పడవల్లోకి దుమికి, చప్పున తెడ్లువేసి పడవలు నడుపుకుంటూ చాలాదూరం పోయివస్తారు. ఈపడవ షికార్లు స్త్రీ పురుషులు కలసియే చేస్తారు. పూర్వం ట్రాముబండ్లలో స్త్రీ లొకచివర పురుషు లొకచివర కూర్చొనేవారు. వీరిద్దరికి మధ్యన ఒక యెఱ్ఱనిపరదా వుండేది. పురుషుల చివర యెంత క్రిక్కిరిసివున్నా స్త్రీల చివర యెంత ఖాళీగావున్నా యెవ్వరూ ఆ తెరను తాకరాదు. ఇప్పుడు తెరలులేవు. ఎవ రెక్కడపడితే అక్కడ కూర్చోవచ్చును.

వీటికన్నిటికీ యేమి? ముఖ్యమైనది, స్త్రీలకు వోటుహక్కు వచ్చేసింది. లాయర్లు, డాక్టర్లు, జడ్జీలు, నటీమణులు, పోలీసులు మొదలైన పెద్ద పెద్ద వుద్యో గాలన్నీ వారు చేసేస్తున్నారు. కచేరీలలోనేమి, కాఫీహోటేళ్లలోనేమి, బజారులలోనేమి, యిళ్లలోనేమి, సినీమాలలోనేమి డాన్సింగుహాలు లలోనేమి స్త్రీపురుష లరమర అభ్యంతరాలు లేకుండా రాసుకుంటూ మాట్లాడుకుంటూ నవ్వు కుంటూ ఆనందిస్తూ హాయిగావుంటారు. నారీజన విమోచనమంటే యింతకంటె వేరేమి కావలెను? అయితే ఒక్కదానికి విచారించవలసియున్నది. ఇట్టి శోభ పట్టణములలోనే కాని పల్లెల కింకా వ్యాపించ లేదు. పల్లెటూళ్లకు వెళ్లితే గాడిదనెక్కి స్వారిచేసే పాతకాలపు మగవాళ్లు, కాలినడకను పురుషుల వెనక పోయే ప్రాచీనపద్ధతి పడతులు ఇంకా కనిపిస్తూనే వుంటారు. హిందూదేశంలోలాగే గ్రామపునర్నిర్మా ణోద్యమ మొకటి లేవదీయకుంటే యిట్టి అనాగతము లెవ్వియు మటుమాయములు కావు!

## స్వాతంత్ర్యంలేకుంటే పొద్దుపోదు.

మనదేశంలో మంచిపనిమంత్రులురాండ్రని పేరుపడ్డ యిల్లాళ్లు కూడా కార్తీకమాసంలో కడవెత్తుకుంటకు కాలముండదు, మార్గశిర మాసంలో మాట్లాడుకుంటకు వేళఉండదు, పుష్యమాసంలో పూసగ్రుచ్చుకుంటకు పొద్దువుండదు అని ఊరికే బెంగపెట్టుకుంటూ గృహకృత్యములలో పడి కొట్టుగొంటూవుంటే పాశ్చాత్య దేశాలలో పొద్దెల్లాగ పోతుందిరా దేముడా అని పుణ్యస్త్రీలుఅందరు గుండెలు బాదుకుంటున్నారు. పనికలిపించుకొని యింటిలో ఏదో ఒకటి చేదామంటే వుండదనికాదు. దేహానికి గేహానికీ యెంతచేసినా యింకా వుండనే వుంటుంది. అయితేమాత్రం? ఇంట్లో నాలుగు గోడల మధ్యా కుర్చొని పనిచేస్తూవుండు, నువ్వెందుకే పుట్టావంటే యీకాలంలో ఏ అమ్మాయి వింటుంది? పడుచుకుట్టవాళ్లని సాయంత్రం పద్దదగ్గరనుంచీ యిల్లుకదలవద్దని ఆజ్ఞపెడితే వాళ్లకెంత బాధగా వుంటుందో పుణ్యస్త్రీలను నీ'పిల్లలబాధేదో నీవుపడు, దేశంబాధ నీకెందు'కంటే అల్లాగే ఉంటుందని 'దిపోష్టు' అనే యింగ్లీషు పత్రిక వ్యాఖ్యానం చేస్తున్నది.

పైగా యంత్రాలువచ్చినప్పటినుంచీ యిల్లాళ్లకి కాయకష్టదాస్యంనుంచి ముక్తివచ్చేసింది. దంచిన బియ్యం, విసిరినపిండి, కాలినరొట్టె, వెలిగినవిద్యుద్దీపం, కాఫీకాచి గంటలుకొట్టి లేపేస్తవ్వు వచ్చేసినతరువాత ఆడదానికి పొగర్లు రానుకోవడం, క్రీములు రుద్దుకోవడం, దుస్తులు సద్దుకోవడం, బజార్లుచేసుకోవడం, సినీమాలకు వెళ్లుకోవడం తప్ప మరేమీ పనిలేదు. పిల్లలసంరక్షణ అనేది మహావుంటే రోజుకో గంటపని అవుతేఅవుతుంది కాకుంటే కాదు. కొంతకాలం దాది చూచుకుంటుంది. కొంతకాలం కిండరుగార్టనుస్కూలువాళ్లు, తరువాత పెద్దస్కూళ్లు, హాస్టళ్లు. ఈయేటా ఆయేటా కానుపులన్న బాధలేదు. ఎప్పుడిష్టము లేకుంటే అప్పుడే ఆపీనుకోవచ్చును.

ఇన్ని పరికరాలుఉండకపోతే స్త్రీపురుషుల సమానత్వస్వాతంత్రత్వసిద్ధాంతాలు పుస్తకాలలోను ఉపన్యాసవేదికలమీదను వక్త, నోళ్లలోను పడివుండవలసినదేకాని అమలుజరగడానికి సాధ్యమవుతుందా? డబ్బు లేకుంటే సమానత్వంకాని స్వతంత్రత్వంకాని వస్తుందన్నమాట కల్ల. భేదాభిప్రాయంవస్తే విడవడే శక్తి లేకుంటే స్వతంత్రతయెక్కడ? డబ్బు, వేరేవృత్తి, వేరే ఆర్జనవుంటేనేగదా వేరుపడడానికి తగినంత ధైర్యసాహసము లెవరికైనావస్తవి? డబ్బురావాలంటే మగవాడెన్నివిధములైన కూలిపనులు వుద్యోగాలు చేస్తున్నాడో వానినిమాత్రమే కాకుండ తాము మాత్రమే స్వపులుగా చేయగల మరికొన్నివుద్యోగాలు కూడా స్త్రీలు చెయ్యగలిగివుండవాలి. ఫ్యాక్టరీలో కూలిపనికి, కచ్చేరిలో గుమస్తాపనికి, స్కూలులో మేష్టరుపనికి సిద్ధంకాకుంటే యింట్లో పురుషుడినుంచి, గృహకృత్యములనుంచి స్వాతంత్ర్యము యెట్లు రాగలదు? దైవం ధర్మమంటూ ఈపనులేమీ వారు పక్కాగా చేయలేరని చెప్పటకు వీలులేకుండా అన్నీ పురుషులతో తుల్యంగాను వారికంటె చక్కాగాను కూడా వీరు నిర్వహించుచున్నారు.

అయితే పురుషు లెాకందుకు ఏడుస్తున్నారు. మంది యెక్కువైతే మజ్జిగ పల్చన కాదూ? మన దేశంలో అందరూ చదివేసుకొని ఉద్యోగాలు చేస్తామంటే తక్కువజీతాలు నిరుద్యోగాలు వచ్చేశాయి కావూ? అల్లాగ్గానే ఈ ఆడమళయాళమంతా కూలి పనులలోకి వుద్యోగాలలోకి దూరగానే కూలిజీతముల కోతలు నిరుద్యోగములు తటస్థించినవి. మునుపొక్క పురుషుడి ఆర్జనతో యిల్లు వెళ్లేది. ఇప్పుడు స్త్రీ పురుషులు సమానంగా కష్టపడితే కాని యిల్లువెళ్లదు. ఈవిధంగా సమానత్వం సిద్ధించి తీరింది. పూర్వం ఒక్క పురుషుడికే తన సంపాదన తాను తగలపెట్టుకొని తాగేందుకు వీలుండేది. వాడి స్వాతంత్ర్యమిప్పుడు సగముతగ్గి స్త్రీకి సంక్రమించినది. ఆమె కూడా తన ఆర్జనను తన యిచ్ఛవచ్చిన క్రీములకు

స్వతంత్రంగా ఖర్చుపెట్టుకోవచ్చును. వీరిద్దరి సమానత్వ స్వతంత్రత్వములవల్లనూ బాగుపడుచున్నవారు వీరి కుద్యోగములిచ్చే మిల్లుల యజమాని వర్గమువారు కనుక వారింకా యీ ధర్మాలుస్కూళ్లలో బోధ చేయించుతునేవుంటారు.

మీనుంచి మాకు కూలికోతలు వచ్చాయని పురుషులు స్త్రీలను నిందిస్తూవుంటే, 'అసలు మిల్లులు యజమానులు మండీవర్తకులు వచ్చి మీ వుద్యోగాలే పూడదీస్తే వూరుకున్నారు కాని మా సమానత్వ స్వాతంత్రత్వములకోసం మీకు మిగిలిన వుద్యోగాలలో సగంకూలికి మే మాసిస్తేనేనా మీకు బాధవచ్చింది' దని వీరు చెప్పెపోడుస్తున్నారు. కొన్ని సందర్భాలలో స్త్రీలు పురుషులతో సమానులేకాక అధికులు, వారినుండి స్వతంత్రులే కాక వారికి పోషకులు యజమానులుకూడా కావలసివచ్చుచున్నవి. అనేక పురుషులకు నిరుద్యోగము. నేతమిల్లులలో కూలులు తక్కువ కనుక ఆ వుద్యోగములు స్త్రీలకే యిస్తారు. స్త్రీలు ఆ కూలులు తెచ్చుకొని పురుషులకు ధర్మపిండంపెట్టి పోషించక తప్పకుండావున్నది. ఈవిధంగా క్యాపిటలిష్టు ధర్మమంటూ నిరుద్యోగములు హెచ్చిన కొద్దీ స్త్రీల స్వాతంత్ర్యము మరీ వృద్ధిఅవక తప్పకుండావుంది. మగవాడు యెక్కడేనా ఉద్యోగానికి దరఖాస్తు పెట్టినా, నీ భార్యకిచ్చినాము గనుక నీకు హుళక్కి అని జబాబు వస్తుంది.

ఇంగ్లాండు మొదలైన దేశాలలో పెనిమిటికి నిరుద్యోగం భార్యకు తక్కువ కూలి. ఇది భాగోతం. భార్యకు తక్కువకూలి యేమయ్యా అంటే ఆడవాళ్లు తక్కువ బాగా పనిచేస్తారు, పిల్లలను కనుక్కోవాలి, సంరక్షణ చేసుకోవాలి, అటువంటి సమయములలో మాకు పూర్తిపని వాళ్లదగ్గరనుంచి రాదని యజమానుల జబాబు. ఈ దేశాలకంటె రష్యా కొంతనయం. రష్యాలో ఆడదానికి తక్కువకూలి మగవాడి కెక్కువ యెక్కడాలేదు. అక్కడ యాజమాని ఘటాలులేవు కనుక, ఆడది యెంతపని అటుచెయ్యనీ, మగవాడితో సమానంగా కూలి యియ్యడమే. ఆమె కూలిపని తక్కువచేస్తేమాత్రం, పిల్లలను కనలేదూ? రేపటికి కావలసిన కూలివారు వారే కాదూ? అందుచేత ప్రసవంముందు ప్రసవంతరువాత, ఇతర సమయముల యందు, ఊరికేకూడా స్త్రీలకు కూలులిచ్చి స్త్రీపురుష సమానత్వమును సోవియట్టు ప్రభుత్వమువారు మంచి పునాదులమీద నిలబెట్టినారు. స్వాతంత్ర్యం సమానత్వం అంటే సామాన్యమా? ఇన్ని యంత్రాలు, నిరుద్యోగాలు, కూలికోతలు, కూలిపనులు వస్తే గదా స్త్రీలకీ రెండు హక్కులు స్థిరపడినవి. మన దేశ దేశములో ఇట్టి సంపూర్ణస్వాతంత్ర సమానత్వములు పూర్ణస్వరాజ్యములు వచ్చేటప్పటికి యెన్ని యుగాలు వెళ్లిపోవాలో చెప్పలేము.

## భారతీయు లేమంటారు

ఈవిధంగా యంత్రాలద్వారా అర్థాభివృద్ధి,ఉద్యోగాలద్వారా స్త్రీ స్వాతంత్ర్యాభివృద్ధి పాశ్చాత్య దేశాలలో చటాపటాలు వేసుకొని తిరుగుతున్నవి. ఇవి వాటంతట అవి పుట్టుకొని వచ్చినవికావు. రాజకీయ తత్వవేత్తలు, సంఘసంస్కరణాభిమానులు కూడబలుకుకొని పంచవర్ష దశవర్ష ప్రణాళికలేర్పాటుచేసి, చట్టములుప్యాసుచేసి, నడిపిస్తున్నారు. ఈపద్ధతులనే కొన్ని దేశములలో కమ్యూనిజముఅని, కొన్ని దేశాలలో ఫ్యాసిజమ్మని, కొన్ని దేశాలలో సోషలజిమ్మని అంటారు. మనదేశములో ఆంగ్లేయవిద్యావాసనలు వంటికిపట్టిన యువకు లిట్టిభావములను సగము జీర్ణము చేసుకొని సగముచేసుకోక మక్కీకిమక్కీగా ఆఆచార విధానములను దిగుమతిచేయుగోరుచున్నారు. కొందఱు సనాతనఛాందసులు ఇట్టిపనులుజరిగితే కొంప మునిగిపోతుందని మూలుగుతున్నారు.

ఈసమయంలో బాబూ భగవాన్దాసుగారు (కాంగ్రెసుతరపు అసెంబ్లీసభ్యుడు) చేస్తూవున్నవుపదేశం కొందరికి నచ్చుతుందేమో— అతనంటాడుగదా

'ఇవన్నీ పేరుల భేదమే కాని, ఈసూత్రాలు ప్రణాళికలు మనుధర్మంశాస్త్రంలోనే వున్నాయి. వ్యక్తిస్వాతంత్ర్యం, సాంఘికకట్టుబాటు, అర్థోత్పత్తి, దేశరక్షణ, వ్యాపారసౌకర్యము, విద్యాప్రదానము మొదలగు సూత్రములకన్నిటికీ మనువు రాజబాట నేర్పాటు చేసినాడు. ఇందులో కార్లుమార్క్సుకు గాని లెనినుకు గాని క్రొత్తసూత్రములు కనిపెట్టినకీర్తి యేమీలేదు. మనుధర్మశాస్త్రమంతా వర్ణాశ్రమ ధర్మసంరక్షణలోనే వున్నది. దీనిని సంరక్షించవాలంటే దానిమీద తిరగబడడానికి వీలులేదు. ప్రతీవ్యక్తి తనకు నిర్ణయింపబడిన స్థానము, కర్తవ్యము గుర్తెరిగి ఆగిరిలో ప్రవర్తిస్తూ యితరుల గిరిమీదికి దాటివెళ్లకూడదు.'

విధినిషేధములతో కూడిన యిట్టి కఠోరమార్గము నీయుగములో ఏవిద్యార్థికుడు లక్ష్యపెట్టి తనవ్యక్తి స్వాతంత్ర్యసిద్ధాంతములను చంపుకుంటాడు? తెల్లవాళ్లు దీనిని 'సాంఘికనిరంకుశత్వము, పూర్వాచారదాస్యము' అని తిట్టిపోయరా? భగవాన్దాసువంటివారి [illegible] కాలములో ఎవ్వరూవినరు. మనమతాచార్యు[illegible] దీక్షములు మడసిపోయినవి. పాశ్చాత్య అర్థశాస్త్రగురువుల సిద్ధాంతాలకు మనము శిష్యరికము చేయకతీరదు. వారికి త్రోవతెలియక చీకట్లో తడుముకొని తన్నుకుంటున్నారని దానుగా రాక్షేపిస్తున్నారు. మనమూ అట్లాగే ఆ వ్యక్తిస్వాతంత్ర్యముతో ఆచీకట్లోనే తడుముకుంటూ వారికిదొరికే ఆపెన్నిధినే దోచుకుందాముకాని ఒకరు చెప్పినట్లు ఇంకొకరు వినడము అందులోనూ మనధర్మశాస్త్రకారులు చెప్పినట్లు మనము వినడముకంటె ఆత్మగౌరవహీన మింకొకటిలేదని 'ఆత్మగౌరవసంఘము' మొదలగువారి సిద్ధాంతము. ఏటి కెదురీదడపు వెఱ్ఱితలపుకంటె ఏటిలోకొట్టుకొనిపోయే వివేకమే ఉత్తమమైనది. కాదన్నవాళ్లు ప్రైవీకౌన్సిలుకో జాతిసమితికో అపీలుచేసుకొని శుద్ధమైనన్యాయమును నిర్ణయమును పొందవచ్చును.

# బాలవిజ్ఞానశాఖ

## కథలు

### (1) చెవులపిల్లి పెదవి చీలిన దెందుచేత?

మనము నివసించెడు ఆసియాఖండమునకు తూర్పున జపానుదీవులున్నవి. ఆ దీవులు సముద్రములో దగ్గర దగ్గరగా చెదరిఉన్నవి. ఒకదీవినుండి మరియొకదీవికి వెళ్లవలెనన్న మనుష్యులు పడవలమీాద వెళ్లవలెను. పెద్ద పెద్ద చేపలు మొసళ్లు మొదలగునవి యీాదుకొని పోగలవు. చెవులపిల్లులు మొదలైన జంతువులు సముద్రము నీది దాటలేక ఏ దీవిలోనివి ఆదీవిలోనే ఉండిపోవును.

ఒకనాడొక చెవులపిల్లి ఒకదీవిలో సముద్రపు ఒడ్డుకువచ్చి ఆడుకొనుచుండెను. ఎదురుగా మరియొకదీవి కనుపడుచుండెను. అక్కడి కెట్లైనను పోయి చేరవలెనని దానికి కోరికపుట్టెను. కాని ఈదలేదు. పడవలవారెవ్వరును దానినెక్కించుకొని తీసుకొనిపోరు గదా! మరియేమి చేయగలదు?

ఇట్లాలోచించుకొనుచుండగా ఒక మొసలి ఆదీవిఒడ్డుకు వచ్చెను. దానిమీాద నెక్కికూర్చున్నచో దానితోకూడా అవతలఒడ్డుకు పోయి దిగిపోవచ్చును. కాని మొసలి అందుకు ఒప్పుకొనునా? పైగా అది మెల్లిగా దానిని నోటిదగ్గరకు తీసుకొని నమలి మ్రింగివేయునేమో? కనుక దానినడుగుటకు కుందేలు కిష్టములేదు.

మొసలిమీాది కెక్కితే కాని అవతలకు పోవీలులేదు. కనుక కుందేలొకయుక్తి పన్నెను. కుందేలు మొసలితో ఇట్లు ప్రస్తావించెను.

కుం:—మొసలీ, మొసలీ! నీవు ఆదీవినుండేకాదా యిచ్చటకు వచ్చితివి?

మొ:—అవును.

కుం:—ఆదీవిలో కుందేళ్లు ఎక్కువగా ఉన్నవా లేక మొసళ్లా?

మొ:—ఆయొడ్డున మొసళ్లే యెక్కువగా వున్నవి.

కుం:—కాదు. చెవులపిల్లు లెక్కువగా ఉన్నవి. నాకిక్కడనుండే కనిపించుచున్నవి.

మొ:—పందెము కట్టెదవా?

కుం:—ఆహా కట్టెదను.

మొ:—ఏమిపందెము?

కుం:—మొసళ్లెక్కువగా ఉన్నచో నీవు నన్ను మింగివేయవచ్చును.

మొ:—సరే.

అక్కడ మొసళ్లే యెక్కువగానున్నవని మొసలికి బాగా తెలియును. ఈ చెవులపిల్లి తన నోట్లో పడునుగదా యను సంతోషముతో అది ఊటలు కార్చెను.

మొ:—అయితే రెండింటిని లెక్కపెట్టుదామా?

కుం:—తప్పక లెక్కపెట్టుదాము. మీ మొసళ్లందరినీ యిక్కడకు తీసుకొనిరమ్ము, నేను లెక్కపెట్టెదను.

మొసలి అట్లే చేసెదనని చెప్పి పోయి వానిని పిలుచుకొని వచ్చెను. అవియన్నియు ఈ దీవినుండి ఆదీవిదాక ఒకటికొకటి దగ్గరగా తేలుతూనిలచినవి. మొదటి మొసలి యిక లెక్కపెట్టుమనెను.

కుందేలు తనకు దృష్టి బాగా ఆనదనియు ఒకొక్క మొసలిమీదికి దుమికి మరీ లెక్కపెట్టుదుననియు చెప్పెను. మొసళ్లన్నియు అందు కంగీకరించినవి. వానిలో ఒకరు పందెము గెలిచినచో అందరును గెలిచినట్లే గదా అవి భావించును.

కుందేలు మొదటిమొసలి వీపుమీదికి 'ఒకటి' అని చెప్పి దుభీమని దుమికెను. రెండు అని రెండవదానిమీదికి దుమికెను. ఇట్లొకదానిమీదనుండి యింకొకదానిమీదకు అంకెలు వరుసతప్పిపోకుండ చెప్పుచు నూరు నూటయేభై రెండువందల మొసళ్ల మీదికి దుమికి ఆఖరుకు అవతలదీవిమీదికి గెంతివేసెను.

ఆఖరు మొసలి కుందేలునుచూచి మీ కుందేళ్లనన్నిటి నిక్కడకుపిలువుము, మేము లెక్కింతుమనెను. ఈ కుందేలు తక్కినకుందేళ్లను ఒడ్డుకుపిల్చుకొని వచ్చుననియు, మొసళ్లన్నియు తలయొక కుందేలును విందుగుడువ వచ్చుననియు సంతోషించి అన్నియు ఈదీవి వైపు మొగములు త్రిప్పెను.

వీని తెలివితక్కువ తనమును తన ప్రజ్ఞను తలచుకొని కుందేలు పకపక నవ్వుటకు ప్రారంభించెను. "నేను పిలుచుకొనిరాను. నా కిక్కడకు రావలెనని బుద్ధిపుట్టి నే నీయుక్తి పన్నితిని. పొండు, తెలివితక్కువ మొసళ్లారా, పొండు" అని చెప్పుచు అది మరీ నవ్వుటకు ప్రారంభించెను. వారికి కలిగిన పరాభవమునకు తనకుకలిగిన విజయమునకు ఆనందపరవశయై గుక్కవిడవకుండ అదే నవ్వుటకు తగులుకొనెను.

పాపము! మొసళ్లన్నియు చిన్నమొగములు చేసుకొని, కన్నీళ్లునించుకొని విచారించినవి. కుందేలుమాత్రం యింకా నవ్వుచునే ఉండెను. మొసళ్లు పారిపోయెను. కుందేలు కడుపు చెక్కలుచేసుకొనుచు నోరు దాకవలె విరివిగా తెరచుకొనుచు ఇంకా నవ్వుచుండెను. నవ్వగా నవ్వగా దానిపెదవులు విరిగిపోయి రక్తములు కారెను. ఆ చీలిక మరి అదుకుకొనలేదు. అందుచేతనే చెవులపిల్లుల నోళ్లన్నియు నేటికిని అంద వికారముగా అట్లు చీలివుండునని జపాను దేశపుబాలు రిప్పటికిని కథచెప్పుకొనుచుందురు. ఆదేశపుబాలురు నేటికిని క్రొత్తవారిని

చూచి మోసగించుటకు కాని హేళన చేయుటకు గాని ఒల్లరు. కొంటెపనులు చేసి కొంటెనవ్వులునవ్వే బాలురుబాలికలపనికూడ అంతే! కనుక జాగ్రత!

ఆ. వె. చెవులపిల్లి పెదవించీలిన దెందుచే?
మొసలి సోదరులను మోసపుచ్చి
వీపుమీద దుమికి వేఱుదీవికిచేరి
గొప్పపడుచు నవ్వుకొన్నకతన॥

స॥ నా॥

---

## (2) బ్రహ్మఘటన

### శ్రీమతి సమయమంత్రి వందేమాతరంగారు

చాలాకాలానికి రాజు కొకకూతురు పుట్టింది. యుక్తవయస్సు రాగానే పుత్రికవివాహం యేమాలోచించారని అడిగింది రాణి రాజును. తన సోదరితనయున కీయతలచినట్లు తెలియజేశాడు రాజు. ఆలా వీలు పడదనియూ, తన తమ్మునకీయ నిశ్చయించాననియూ రాణి యన్నది. యిద్దరూ తగవుతీర్చుకొనేనిమిత్తం అమ్మాయిని పిల్చి అడిగారు యెవరిని చేసుకొంటావని. నన్నడిగారు గనుక చెపుతున్నా. నేను చాలాకాలాన్నుంచి మంత్రి కుమారుని ప్రేమించాను కనుక అతనికి నన్నిచ్చి పెండ్లిచేయండంది ఆమె. ఆలా కాదు, నాచే నిశ్చయింపబడ్డవారే నిన్ను చేపట్టి తీరాలని రాజు తనదారిని వెళ్లాడు. నా తమ్మునకేదోవిధంగా యీ అమ్మాయిని చేసితీరుతానని రాణి పంతం. మాతాపితల భిన్నాభిప్రాయాలు గమనించి అమ్మాయి తలపంకించింది. ఒకపెట్టెలో కుమార్తెను కూర్చోమని కోరింది తల్లి. గంటకాలం జరిగినతర్వాత నీ కోరికప్రకారం నడుచుకుంటానని వేడింది తల్లిని. సరేనన్న దామె. "ప్రియా! మా అమ్మగారి అన్యాయప్రవర్తనచే తండ్రిగారు వంచింపబడుచున్నారు. నాచే అమ్మ వంచింపబడవలె. సేవకులచే మోయబడు పెట్టెలో నే నుందును. తగుసిబ్బందిచే మార్గమడ్డగించి గాంధర్వమున నన్ను చేపట్టి సుఖింపుము" అని వ్రాసి నమ్మకమైన దాసిచే బంపివైచి తాను తల్లిచెంత కేగెను. చెప్పినమాట వినుచున్నందులకు సంతసించుచూ, పుత్రికావియోగము కలుగుచున్నందులకు దుఃఖించుచూ తన పట్టుదల నెగ్గుచున్నందులకు గర్వించుచూ అమ్మాయిని పెట్టెలో పెట్టి తాళంవేసి సేవకులవశం చేసింది. జాగ్రత్తగా గొనిపోయి మా పుట్టినిలు చేర్చిరండి గొప్పబహుమాన మిస్తానన్న దామె. ఆమెమాట శిరసావహించారు వాళ్లు. ఆలా వాళ్లచే మోయబడే పెట్టెను పెద్దపెద్ద పక్షులు రెండు వచ్చి దానిని తన్నుకుపోయినవి. కొంతదూరం యెగిరి బరువెక్కువగుటచే పారవైచి వాటిదారి నవి వెళ్లినై. ఆపెట్టె పడిన స్థలం చేరువగా వ్యాధిగ్రస్తుడొకడుంటూ యున్నాడు చాలాకాలంనుంచి. నెమ్మదిగా ఆ పెట్టెను సమీపించి మూతతెరచాడు. నాథా! వారి నుండి యీపెట్టెను సంపాదించేనిమిత్తం యెంత శ్రమ జెందితిరో కదా? నేటితో మన కష్టాలు తీరినవంటూ ఆమె బైటికొచ్చింది. ఆ వికృతాకారుడగు నూతన పురుషునిగాంచి త్రుళ్లిపడింది పాపం. యినుపకచ్చడాల్ బిగియించు మునిముచ్చులనైన మోహింపజేయు ఆ సౌందర్యనిధిని చూచి ఆశ్చర్యపడ్డాడతను. బాలా! భయమువిడిచి నీ వృత్తాంతము విశదపరుపుము అన్నాడు. జరిగినసంగతి యావత్తు తెలియజేసింది. సరే మరల పదునేను దినముల కవి యీ మార్గంగా వెళ్తవి. అప్పుడు నీదేశము చేరవచ్చు అన్నాడు. సంగతి తెలియక విపులంగా చెప్పమని కోరింది. మాసమునకు రెండుమారులు అపక్షు లీ

మార్గంగా వెళ్ళవి. ఆలావెళ్తూ కొన్ని ఫలముల నా ముందు పారవైచుచుండు కారణం నాకే తెలియదు. నేడీ మందసాన్ని వైచి వెళ్లినవన్నాడు. ఆఫలాదులే తిని జీవించుచున్నా నన్నాడు. నన్ను మీ చరణ దాసిగా అంగీకరించి ధన్యంజేయాలని కాళ్లమీద పడింది. సిరిరావ లదనువా రుందురా? త్వరలో యిహలోకాన్ని విడువవలసిన స్థితికి వచ్చిన నన్ను పరిణయమాడి నీవేమి సుఖింతువు వలదన్నాడు. బ్రహ్మనిర్ణయ మిట్లుండబట్టే యీవిధముగా నేను మిమ్ము చేరగలిగితిని. మిమ్మ చూడకమున్నే 'నాథా' యని సంబోధించితి. అదేల కాకుండనుండునని పాదాలుపట్టుకుంది.

గాంధర్వంగా వివాహం చేసుకున్నారు. వ్యాధిగ్రస్తుడన్న యేవగింపులేక సకల వుపచారములుచేస్తూ భర్తనే దేవునిగా భావిస్తూయున్న దామె. ఆమె సుగుణమునకు మెచ్చి కావలయును కొంతకాలానికామె భర్త వ్యాధి దానంతటదే కుదురునట్లు చేసాడీశ్వరుడు. భగవంతుని స్తుతిచేయుచూ భార్యాభర్తలిరువురు నడకసాగించారు. తిన్నగా తండ్రి రాజ్యం చేర్చింది భర్తను. ఆమె తండ్రి కాలధర్మమొందుటచే రాజ్యం ఆరాజకమైపోయింది. తన వృత్తాంతం తెలియజేసి ఆ రాజ్యాన్ని తన భర్తకు అర్పింపించింది. రాజ్యాభిషిక్తుడై ఆరోగ్యవంతుడై భార్యవలన సకల సౌఖ్యముల నోలలాడుచుండెను. పాతివ్రత్యమే ప్రధాన ఆధారముగా భావించినవారి కేమి కొదువ. బ్రహ్మఘటన మెంతయూ శుభదాయకమే.

## ఇష్టసిద్ధి

గీ. దేవుఁడిచ్చిన దానికిఁ దృప్తియున్నఁ
గృత్రిమముబూని ధనమునార్జింపకున్న
సిగ్గుమాలిన కార్యముల్ సేయకున్నఁ
బురుషుఁడెవ్వేళలందును బూజ్యతముఁడు.

గీ. హింసనేయంగ నాత్మలో నెంచకున్నఁ
బరుల భాగ్యంబుజూచి యోర్వకయున్న
గపటవృత్తుల జీవింపఁగడగియున్న
బ్రతికియుండియు నేమిలాభంబుగలదు?

గీ. శౌచమున్న సదాచార సరణియున్నఁ
గలుషమను మాట నాత్మలోఁ గలుగకున్న
స్తుత్యమైనట్టి త్రికరణశుద్ధియున్న
దేవతాశక్తి మనయందుఁదే జరిల్లు;

గీ. సంఘసంస్థల కెల్లమేల్సలుపుచున్న
మాతృభాషాభివృద్ధికై మమతయున్న
మంచిపనులకుఁదనువు నర్పించుచున్న
నింకస్వారాజ్య మరచేతనుండకున్నె?

రామసుబ్బారాయుఁడు
వేంకటనారాయణ

# గ్రంథపరిచయము

**రెడ్డి**

విశాఖపట్టణందరి అల్లిపురములో ప్రతి శనివారం ప్రకటింపబడు పత్రిక. సంపాదకుడు ఎమ్. ఎ. రెడ్డిగారు బి. ఎ. మార్చి 16వ తేది 2వ సంపుటము 7-వ సంచిక మా కార్యాలయము చేరినది. ఆంధ్రరాష్ట్రము, ఉత్తర సరిహద్దు, రాయలసీమక్షామము, జిల్లాబోర్డులు మొదలగు సమస్యలను చక్కగా చర్చించు వ్యాసములు సంపాదకీయములతోను, చిన్న కథ పద్యములతోను రాణించుచున్నవి. ఆంధ్రదేశములోని రెడ్డి జనుల కిది అమూల్యమైన సేవచేయుచున్నది. సాధారణచందా సం|| 1కి రు. 3-0-0లు. శ్రీమంతులగు రెడ్లు విశేషచందాలనిచ్చి దీనిని పోషించవలసిన బాధ్యులైయున్నారు.

**ప్రజాబంధు**

సంపాదకులు యస్. జి. ఆచార్య గారు. ప్రతిగురువారం, సోమవారం వెలువడును. విడిప్రతి 3 పైసలు. సం|| చందా రు. 3-0-0 లు. కార్యస్థానము ప్రజాబంధు ప్రెస్సు, 103, ఆర్మీనియను వీధి, జార్జిటౌను, మదరాసు. తెలుగులో కానీపేపరు లేనికొరత చాలా కాలమునకు తీరినది. 8 పుటలు. చక్కని విషయములు. ఆంధ్ర, అఖిలభారత, ఆర్థిక, సాంఘిక, రాజకీయములను పూసగ్రుచ్చినట్లు ప్రకటించుచున్నది. పల్లెలు, పేదలు, పామరులపాలిటి పారిజాతము.

**తెలుగువీణ**

క్రౌనుసైజు 44 ఫేదరువైటు పుటలు. 16 గీతములు. శ్రీరంగం శ్రీనివాసరావుగారి 'శ్రుతి' అనగా పీఠికోపరిచయవాక్యముకలదు. హనుమచ్ఛాస్త్రిగారి కవిత్వము. పుస్తకాలు కావాలంటే కనకదండి గోపాలక్రిష్ణ శాస్త్రి, అశోకవనం, నిడదవోలు, పడమటి గోదావరి' అని వ్రాయవలెను. మూడేసి చరణాలలోనైనా సరే, ఆలోచించకుండా నోటిలోంచి వచ్చే వాక్యంముక్కలలోను ముక్కల అతుకులలోను అయినా సరే, శుద్ధవాడుకభాషలోనైనా సరే, కవిత్వంవుంటే వుండవచ్చునని ఇందులోని ప్రతీగీతము మనోహరముగా చాటుచున్నది. కవిత్వతత్వవిమర్శకులు గ్రహించవలసిన విషయములిం దనేకములు కానగును.

**మల్లెపూలు**

సాహిత్యలత ద్వితీయ కుసుమములు. గ్రంథకర్త శ్రీయుత కగ్గపాలెం కృష్ణరావుగారు. ఇదివరకనేకపత్రికాతీగలమీద పూయించినపూవులలో ఏర్పులనుగూర్చి యిట్లు ఆంధ్రపాఠకలోకమునకు కవిగారు కానుకగా అర్పించినారు. కవిత్వమనోహరత్వమును గూర్చి కవికోకిల దువ్వూరి రామరెడ్డిగారు వ్రాసిన ప్రశంసావాక్యముల కిద్ది బహువిధముల తగియున్నది. కవికుమారుడు తన్నాకర్షించిన విషయము లన్నిటిపైని తన మనస్సును బరపి గీతముల పాడిపాడి మంజుమంజులంబుగా ఘోషించినాడు. గ్రంథమునుపట్టి ఆలకించుటయే పాఠకుని సొమ్ము. వెల రు. 0-12-0లు. చందాదారులకు రు. 0-8-0లు. వలయువారు చీరాల గ్రంథకర్తగారికి వ్రాసుకొనవలెను.

**కామ విలాసము**

స్నేహలతా కవితాసంఘము (కొల్లాపురము, మురవకొండపోష్టు. కర్నూలుజిల్లా) వారి 44వ కుసుమము. క్రౌనుసైజు 75 పుటలు. వెల రు. 0-8-0లు. గ్రంథకర్త హైదరాబాదు నైజాము

కాలేజీలో ప్రొఫెసరుగానున్న విద్వాన్ సరిపల్లె విశ్వనాథశాస్త్రి యమ్. ఏ. గారు. ఇట్టి గ్రంథము యొక్క ప్రకటనకు కారకులైన కవిగారికి ప్రకాశకులకుగూడా ఆంధ్రసాహిత్య హితైషులెల్లరు పెక్కు వందనము లర్పించవలసియున్నది. ఆంగ్లకవి మిల్టను యొక్క కోమసు అను సుప్రసిద్ధరూపకమునకు ఆంధ్రానువాదము. ఆద్యంతము వివిధరకముల గేయములు సందర్భోచితముగ వెలుగుచున్నవి. ప్రాచీన ఆంగ్ల గ్రీకు నాటకముల రచనాతత్వముల నెరుగగోరువారికిది అపూర్వసహాయ మొనరించును. గుంటూరు వాస్తవ్యులగు అచ్యుతుని వెంకటాచలపతిరావు గారు ఇందలి కవిత్వము, రచనాపాండిత్యము, గాంభీర్యము, శైలి మొదలగు విషయములను చర్చించుచు విశాలమగు పీఠికను వ్రాసినారు. శ్రీయుతులు రాధాకృష్ణను తనికెళ్ల వీరభద్రుడుగార్లు దీనికి యథోచిత సంస్తుతి వాక్యములు వ్రాసినారు. రసికులకు రసము, విద్యార్థులకు విద్య, పండితులకు నిర్దుష్టమగు శబ్దశుద్ధి, కళాభిరతుల కపూర్వకళావిలాసములు ఆనందోపాసకులకు మనోహరభావమకరందము కవులకు కవితను విరజిమ్ము యీ గ్రంథము నాంధ్రసరస్వతి అత్యాదరముతో ఆలింగన మొనర్చుకొనుచున్నదనుటలో అతిశయోక్తి లేదు.

**రంగభూమి** 'కళోపాసన గావించు సచిత్రాంధ్ర మాసపత్రిక.' సంవత్సర చందా రు. 1-8-0లు. విడిప్రతి రు. 0-2-0లు. కార్యస్థానము: రాయపేట, మద్రాసు. సంపాదకుడు శ్రీయుత యస్. యస్. సోమయాజిగారు. శ్రీయుతులు బుఱ్ఱా శేషగిరిరావు, ఏ. వి. సీతారామయ్య, విశ్వనాథ కవిరాజు, నెల్లూరు నగరాజారావుగార్లు మొదలైనవారు వ్రాసిన వ్యాసములతో రాజిల్లుచున్నది. నాట్యరంగ సముద్ధరణము పత్రికయొక్క ముఖ్యాశయమైనట్లు తోచును. చాలావ్యాసము లీ యుద్దేశ్యముతోనే ప్రకటించబడినవి. బ్రహ్మశ్రీ గుమ్మిడిదల వెంకటసుబ్బారావుగారి 'బహుపరాకు' (Warning)ను జ్ఞాపకముంచుకొని దీనిని నడిపించినచో ఆంధ్రజాతికి కొంతసేవ చేయగలదు. లేనియెడల యిప్పటి కొన్ని సచిత్ర ఫిల్ముమేగజైనులు, నాటకరంగములువలె కొందరు నటనటీమణులకు కొంత కృత్రిమ కీర్తి సంపాదించుటకు మాత్రము సహాయకరమగుచు దినదినాభివృద్ధిని పొందగలుగుటకు సందేహముండదు. పత్రిక చిరంజీవియై ఉత్తమసేవ చేయవలయునని ఆశీర్వదించుచున్నాము.

**ఆంధ్రవాచస్పత్యము (అయిదవ సంపుటము)** 1935 మార్చి నెలలో యీభాగము ప్రకటింపబడినది. ఇందు 401 మొదలు 500వరకు 100 పుటలు గలవు. ఊకారము మొదలు ఎకారమువరకుగల పెక్కు ప్రాచీన నవీన దేశీయాన్యదేశీయపదములకు అర్థములు వ్యుత్పత్తులు ప్రయోగములు మొదలగునవి తెలుపబడినవి. ఇంక ననేకపదములకు కేవల మర్థజ్ఞానమును తెల్పుటతో వాచస్పతిగారు తృప్తి నొందక శాస్త్రజ్ఞానము బోధించుటకు రెండుమూడేసి నాలేసి పుటల విస్తీర్ణముగల వ్యాసములను రచించుట వలన నిఘంటువుయొక్క విశేషప్రయోజనములను సులభముగ నెఱుగనగును. ఉపవిద్యలు, ఉపసర్గము, ఊపిరితిత్తులు, ఋతుదినములు మొదలగు పదము లిందు కుదాహరణములు. ఎంపిరికలు, ఎంబార్గో, ఎంబ్రియోలజీ, ఎకనమిక్సు, ఏకాయకీ, ఎక్స్చేకరు, ఎక్స్చేంజి మొదలగు ఆంగ్లాది వాడుకపదములకుకూడ అర్థములను తెలుపుట మరియొక విశేషముగ నెంచనగును. ఇట్టి సంపూర్ణోపయోగకరమైన గ్రంథమును నిర్వహించుచున్నందుకు గ్రంథకర్తగా రెంతయు ప్రశంసనీయులు. మొత్తము గ్రంథము 2500 పుటలు. 25 ప్రతులు. నెలకు 100 పుటల చొప్పున తప్పక కొనువారికి 20 నెలల తరువాత తక్కిన 5 ప్రతులును ఉచితముగ నొసగబడును. ఒకేసారి 15 రూపాయ లిచ్చువారికి 25 ప్రతులు నెల కొకటిచొప్పున పంప

బడును. రాజపోషకులు రు. 25లును మహారాజ పోషకులు రు. 50లును యీయవచ్చును. ఎవరికి తోచిన రీతిని వారు ద్రవ్యసహాయ మొనర్చుకొనియో ప్రతులు కొనుక్కొనియో సత్వరసంపూర్ణ గ్రంథ ప్రకటనమునకు తోడ్పడుటకు హెచ్చరించుచున్నాము. గ్రంథకర్త ఆంధ్రవిద్యావాచస్పతి, కొత్త వ్యాసులకామశాస్త్రిగారు, కడప, కాకినాడ తాలూకా, తూర్పుగోదావరిజిల్లా.

**కావేరి కాన్పులు**

'Children of the Kaveri' అను చిన్ని కథల సంపుటము. ఆంగ్ల భాషలో రచితము. గ్రంథకర్త శంకరరామ్‌గారు. ప్రకాశకులు ఎ. యస్. పూర్ణయ్య అండు కో, 56, బంగారు నాయకు వీధి, మౌంటురోడ్డు, మద్రాసు. వెల రు. 0-12-0లు. మదరాసు టెక్స్టుబుక్కు కమిటీ వారిచే విద్యార్థుల పఠనీయ గ్రంథముగా అంగీకరించబడినది. గ్రంథకర్త ఆంధ్రుడు. పెక్కులు ఆయినో ప్రీయ భారతీయ కవిపండితుల ప్రశంసలనందినవాడు. పిల్లల కుతూహలము, నీతి, సుగుణసంపద, కల్పనాశక్తి పుట్టించుటయే గాక, జాతీయమై, సులభమై, సంక్షిప్తమైన ఆంగ్లేయభాష అతిరమ్యముగ అలవడుటకీ గ్రంథము తోడ్పడును. ఇందు మొత్తము 100 పుటలలో 9 కథలున్నవి. ఇట్టి గ్రంథము నాలుగైదు నిర్మించినచో పిడేనియమై కలిగిన నైన ఆంధ్రులకును సంతోషమునకు చక్కగను అలవడుతుంది. పెక్కులు పాఠశాలాధికారులు దీనియెడల సత్యంతాభిమానము చూపి వారి సమ్మేచనాశక్తిని ధృవపరచుకొన్నారు.

**ప్రాణులన్నియు నొక్కటే**

"Creatures all" అను మరియొక ఆంగ్లకథాసంపుటి. గ్రంథకర్తయును ప్రకాశకులును పైవారే. 112 పుటలలో 6 కథలున్నవి. కథలన్నియు ఆంధ్రప్రాంతములకు ఆంధ్రజానపదులకు సంబంధించినవి. తూర్పుగోదావరిజిల్లా ఉత్తమ గ్రంథముకంటె పెద్దతరగతులకు కూడనో గించబడెను. మానవజీవితములో నెట్టి గుణములు ఉత్తమ మధ్యమములునుండునో అట్లే జంతుజీవనములలో కూడ నుండుననుతత్త్వమును ప్రతీకకథ యు బోధించి విశ్వమానవసౌభ్రాతృత్వమునే కాక విశ్వప్రాణ సమానత్వమునుగూడ సూచించుచు ప్రేమతత్త్వమును పవిత్రమొనర్చును. విద్యార్థులే కాదు. విద్వాంసులును కథను ప్రారంభించినచో తుదిచూడకుండ విడువనేరరు. ప్రతిమాటయు వాక్యమును పేరాయు సన్నివేశమును పాఠకుల కుతూహలమును రేపుచు సమాలమును కంఠతాపెట్టుటకు ప్రోద్బలము చేయుచుండును. కేవలాభ్యాసాలభ్యమైన ఇట్టి గ్రంథ రచన కవిగారికి పెట్టనిసొమ్ము. దీనిని వీరు సార్థక మొనర్చుకొని యితోధికములగు పెద్ద గ్రంథములను వ్రాసి ఆంధ్రప్రతిభ నిలబెట్టవలెనని కోరుచున్నాము. వెల రు. 0-12-0లు.

**ధంకా**

వినోదిని సంపాదకులై ఆంధ్రదేశమునందెల్ల వినుతికెక్కిన ఓ. టి. నరసింహాచార్యులుగారు సంపాదకులు. పత్రిక కేవలము కథలు కల్పనలేకాక అనేక సమకాలిక రాజకీయాదివిషయ చర్చలతోకూడ నిండియున్నది. కేవలము చెలామణికొరకు పచ్చిశృంగారపు కథలను ప్రకటించి తమ్ములమునమాత్రమే సంఘ సంస్కారమును చేయగలమను పిచ్చివిశ్వాసమునకు స్వస్తి చెప్పినచో పత్రిక గౌరవమును ఆంధ్రరాష్ట్ర గౌరవమును నినుమడించగలదను నమ్మకముతోనే తొలినుండియు పనిచేయవలెనని మా అభిమానపూర్వమగు హెచ్చరిక! ఇట్లు చేసియు వినోదినికంటె వేయి రెట్లెక్కువ వినోదమును కూర్చగలనని 'ధంకా' ధంకామీద దెబ్బవేసి చాటవలెను. వెల విడిప్రతి రు. 0-2-0లు. చక్కని త్రివర్ణచిత్రములు, సాదాచిత్రములును గలవు. కార్యాలయము 176, మింటుస్ట్రీటు మద్రాసు.

**రహస్య లేఖ**

పద్మనాయక గ్రంథమాల తృతీయ కుసుమము. గ్రంధకర్త చెలికాని సత్యనారాయణగారు. కార్యాలయము పెంటపాడుపలస, రాజాంపోస్టు, విశాఖపట్టణంజిల్లా. క్రౌను సైజు 67 పుటలు. వెల రు. 0-8-0లు. చక్కని రహస్య పరిశోధకనవల. నేరస్థు లెవ్వరును లేకున్నను అనుమానములు పెక్కుకలిగి సవ్యముగా కథ పరిణమించినది.




రైతు ఋణ సమస్య:—

జాతీయ ఋణమునకును రైతుఋణము నకును దగ్గర సంబంధమున్నది. జాతీయ ఋణము తీరవలసినది జాతియొక్క ఆదాయ ముతోనే. జాతికి నిజమైన ఆదాయమును తెచ్చువాడుజాతీయపంటలను పండించు రైతే గనుక అతనే తీర్చుచున్నాడనుకొనవలెను. తక్కిన ఉద్యోగస్థులు వర్తకులు యంత్రాధి కారులు మొదలగువారలు వారి ఆదాయము నిటునుంచిఅటు అటునుంచియిటు మార్చి కమీషనులు లాభములు వడ్డీలు, జీతముల మూలముగా యెంతో కొంత చేకూర్చు కొని బాగుపడువారేగాని నిజమైన సంపాదకు లెవ్వరునుకారు. హిందూదేశమువంటి వ్యవ సాయక దేశంలో రైతొక్కడే ఆర్జనాపరుడు రైతు ఒక్కడే జాతీయఋణము తీర్చేవాడు అగుచున్నాడు. జాతీయఋణము రైతు ఆదాయమును హెచ్చించు ఉద్దేశముతో చేయఁబడవలెను, జాతీయఋణము అతను మూలమట్టముగా నాశనముకాని సూత్రము లపై తీర్చబడవలెను.

కాని హిందూదేశపు జాతీయఋణము రైతు ఆదాయమును హెచ్చించు ఉద్దేశ ముతో చేయఁబడినది కాదు; అతని సౌకర్య ములను పాటించుచు తీర్చబడుచుండుట లేదు. హిందూదేశపు జాతీయ ఋణమునకు మూల కందము రైలువేలు స్థాపించుటకు చేయఁబడి నది. అదే అసలు వడ్డీలతో నానాటికిపాపము వలె పెరుగుచున్నది. అది అతని ఆదాయము తోనే తీరవలసియున్నది. ఇట్టి జాతీయ ఋణమువలన అతని కేమిలాభము కలుగు చున్నదో చూచితిమేని అదిమృగ్యము. పైగా అతనికి అందువలన నష్టమే కలుగుచున్నది. ఈదేశపు రైలువేకంపెనీలకు పెట్టు దారులు భాగస్వాములు విదేశీయులు. లాభ ములు వారికిమాత్రమే చెందునట్లు అవివ్యవ హరింపఁబడుచున్నవి. నష్టమువచ్చినచో ప్రభుత్వాదాయమునుండి అది భర్తీచేయఁ బడును. విదేశీవస్తువులను చౌకగా దించి అతని సొమ్మునుహరించుటకును,అతనిపంటను చౌకగా పరదేశములకు గొంపోవుటకునే అవి ఉపయోగించఁబడుచున్నవి. అతనికి లాభము కలుగునట్లు రైలువేరేటులుతగ్గించి అతని సరుకురవాణా చేయుటకు కంపెనీలు అంగీక రించవు. అయినను ఈకంపెనీలకు మన ప్రభుత్వముకూడ కొంతసొమ్ము జాతీయ ఋణము చేసి పెట్టుబడిపెట్టినది. దాని అసలు వడ్డీలను రైతే తీర్చవలెను. వ్యవహారములు

మాత్రము కంపెనీల బోర్డులవారి చేతిలో నుండును. ప్రభుత్వమునకుకూడ ఆబోర్డులలో స్థానమున్నను రైతుపక్షమున అది ధీమాగా నిలచి సౌకర్యములను గూర్చుటకు సాహసించదు. అట్లు చేయఁగడంగినచో విదేశీవర్తకుల ముఖ్యముగ ఆంగ్లవర్తకుల ఆగ్రహమునకు గుఱికాక మానదు. దేశీయాదాయములో విశేషభాగము దీనివడ్డీ అసళ్లక్రింద తీరుచున్న సందర్భములో దేశీయరైతుయొక్క సౌకర్యములను గమనించకుండుట అన్యాయము. ఇట్లువ్యవహరించుచున్నంతకాలము రైతుకు సౌకర్యములు లేకుండుట సరేకదా, ఆవిధముగా వచ్చెడి జాతీయాదాయములేక, జాతీయఋణము వృద్ధియగుటకూడ తటస్థించుచున్నది. ఇండోచీనా సయాము బియ్యములమీద పెద్దదిగుమతి శేటులను, విదేశీ సరుకులమీద పెద్దదిగుమతి శేటులనువేసిన గాని జాతియ పంటకు పెద్ద ఖరీదులును, జాతీయపరిశ్రమలకు పెద్ద పోషణమును చిక్కవు. అట్లు చిక్కినకాని రైతు బాగుపడుటకాని, జాతీయఋణము తీరుటకాని తటస్థించదు. జాతీయఋణము లన్నిదేశములకు నున్నవి కాని అవి ఆదేశాదాయములను పంటలను పరిశ్రమలను పోషించుట కాధారమైనవి (productive debts). కాని మన జాతీయఋణము మనచేటుకుగా చేయబడినదయినది. ఇది కేవలము లాభములేని ఋణము (unproductive debt) మాత్రమే కాక నష్టకరమైన ఋణము (destructive debt) అయి కూడ వున్నది. దేశమునకు వెన్నెముకయైన రైతు శ్రేయస్సుపై ప్రభుత్వమువారు శ్రద్ధపూని రైలువేవ్యవహారములు క్రమముగా దిద్దకున్నన్నాళ్లు పైపై రెమిషనులు సహకారసంఘములలోఋణములిచ్చుటలు మొదలైనవానివల్ల నెట్టిప్రయోజనమును నుండదు. ఇప్పటికే కఱవులు, వరదలు, వర్షలేములు, ధరలతగ్గుదలలు, పరిశ్రమలపతనములు, నిరుద్యోగములవలన దేశములో హాహారావములు మిన్నుముట్టుచున్నవి. ఈసమస్యాపరిష్కారమునకై ప్రభుత్వమువారు, శాసనసభ్యులు కాంగ్రెసు నాయకులు తగిన చర్యలు తీసుకొననిచో పరిస్థితులు మరింత విషమించకమానవు.

ఈ జాతీయఋణముకూడ, రైతుచేసుకున్నది, రైతుకొఱకైనది కాకున్నను, రైతు సంపాదనవలనతీరవలసినది గనుక రైతుఋణమే. అయినను, ఇదికాక రైతుఋణము లేక వ్యవసాయదారుల స్వంతఋణము, 900 కోట్ల రూపాయిలకుపైగా వున్నది. మొదటి ఋణము రైతుచెల్లించినశిస్తులలోనుంచిప్రభుత్వము తీర్చును. రెండవఋణము ప్రభుత్వ శిస్తు, భూఖామందు పాలు పోగా మిగిలిన ఆదాయములోనుంచి రైతు తాను స్వయముగా దేశీయసాహుకారుకో సహకారసంఘములకో టక్కావీలోను వారికో తీర్చవలసినది. మొదటి ఋణమునుగూర్చి ప్రభుత్వము తన మార్గమేదో తాను చూచుకొనును కాని రెండవఋణము రైతుయొక్క స్వంత బాధ్యత అయివున్నది. అది తీరలేకపోయినచో అతని యిళ్లువాకిళ్లు యెడ్లు, నాగళ్లు



శ్రీమతి హాలీదా ఎడిబ్ గారికి స్వాగతము

వంటింట్లో నూకలు భార్యమెడలో పుస్తెలు అమ్మించి సాహుకారులు కరణములు వసూలు చేసుకొందురు. జాతికంతటికి జీవనాధారమగు ఇట్టి రైతువానిగతి యిట్లు ఋణగ్రస్తమైనచో దేశమెట్లు మెత్తిల్ల గలదు? రైతు మూడురోజులు పండుకొన్నచో వుద్యోగస్థులు, వర్తకులు, లాయర్లు సేనలు, పోలీసులు, చాకళ్ళు, మంగళ్లు అందరును మలమల మాడిపోవలసినదే. అట్టి రైతు ఇంతనష్టముతో వ్యవసాయమును గత్యంతరములేక సాగించుచు కృశించుచుండుట యెంత శోచనీయమైన దృశ్యము!

ఈసమస్యను చర్చించుచు పరిష్కార సూత్రములను సూచించుచు కలకత్తా కార్పొరేషను మేయరగు శ్రీయుత నళినరంజన సర్కారుగారు ఒక గ్రంథమును వ్రాసినారు. వారి అనుమతితో శ్రీయుత శనివారపు సుబ్బారావుగారు దానిని తేట తెలుగులోనికి తర్జుమాచేసి ఆంధ్రుల కర్పించినారు. అందు సూచించబడిన మార్గములు గొంతెమ్మ కోరికలవలె కాక ఆచరణసాధ్యములై యున్నవి. స్వరాజ్య మనుభవించుచున్న ఆస్ట్రేలియా మానిటోబా మొదలగు ప్రాంతములలో అమలులోనున్నవి. రైతుకు తలకు మించిన అప్పులున్నచో రద్దుచేయుట, తీర్చుటకు కష్టమైనవానిని భూమితనఖా బ్యాంకుల పరముచేసి సాహుకారు సంబంధమును తెగత్రెంచుట, తీర్చుటకు సులభమైన అప్పులను గూర్చి సాహుకారులు కోర్టుద్వారా తొందర చేయలేనట్లు చట్టములు చేయుట ఇందలి మూలసూత్రములు. మన భారతదేశములో సంయుక్తరాష్ట్రము పంజాబు మొదలైన రాష్ట్రములలో రాష్ట్రీయప్రభుత్వము లిట్టిచర్య తీసుకొనుచున్నవి. మదరాసు రాష్ట్రీయభూమి తనఖాబ్యాంకు ఈ విషయమున మంచికృషి చేయుచున్నది. అందరును సహకారధర్మ సూత్రము లవలంబించి చేతులను కలుపుకొని రైతుజనమును రక్షించి తమ్ము తామురక్షించుకొందురు గాక. క్రౌనుపైజు సుమారు 90 పుటలపరిమాణముగల యీ గ్రంథమును సకాలమున వెలువరించి రూ 0 4 0 లకు పంచుచు శ్రీ సుబ్బారావుగారొనరించుచున్న రైతుసేవకు మే మెంతయు వారి నభినందించుచున్నాము. ప్రతిరైతు బిడ్డ, ప్రతిదేశసేవకుడు, ప్రతి అర్థశాస్త్ర విద్యార్థికూడ పఠించి మననము చేసుకొనతగినది. ప్రతులు వలయువారు పశ్చిమగోదావరి జిల్లా కొవ్వూరులో నున్న శ్రీ సుబ్బారావుగారి పేర వ్రాసి బడయవచ్చును.

**జీవితభీమా:—**

బాగుగానాలోచించినచో భీమావ్యవహారము వ్యాపారలక్ష్మికి తల్లి. వ్యాపారములకు పెట్టుబడి అవసరము. భీమాకంపెనీలు ప్రజల జీవితములను భీమా చేసి వారివద్దనుంచి ధనమాకర్షించి పెట్టుబడిదారులకు బదులిచ్చును. వ్యవహారస్థులకు నష్టమురాకుండా హామీ అవసరము. లేకున్న వారు వ్యవహారములోకి దిగరు. ఈ భీమాకంపెనీలు వ్యవహారముచేసి నష్టమువచ్చినవారికి భర్తీ

ఘటయే న్యాయముకాని తిట్టుట, రహస్యముగ తన్నుట మొదలైన పనులు చేయుటకు పూనుకొన్నచో ప్రజాస్వామిక సూత్రములకు విరోధమేకాక అట్లొనర్చిన పక్షమునకుకూడ అపకీర్తికరము. ఇట్టిపని రాజధానీ నగరముననే జరుగుట మిగుల శోచనీయము. మదరాసు రాష్ట్రమున మున్మున్ముందు నిట్టి యకృత్యములు జరగకుండునట్లు వివిధపక్షముల నాయకులును ప్రభుత్వోద్యోగులును తగిన శ్రద్ధ తీసుకొందురుగాక యని హెచ్చరించుచున్నాము.

రెంపసమేడు—

ఆచార్య రంగాగారు ఏప్రిల్ 17-వ తేదిని తిరిగీ తమ రైతాంగవిద్యాలయమును నిరుటి వలె ప్రారంభించినారు. ఆంధ్రదేశములో వివిధభాగములనుండి చాలామంది విద్యార్థులగు పల్లెలయువకులు విద్యాభ్యాసమునకై వచ్చేసినారు. పేరు మోసిన ఆంధ్ర పండితులెల్లరును తమతమ అభిమానవిషయములను విద్యార్థుల కుపన్యసించుచున్నారు. నూతన వ్యవసాయపద్ధతులు కుటీరపరిశ్రమలు, గ్రామాభివృద్ధికరములగు ఆర్థిక సూత్రములు, నూతన పాశ్చాత్య ప్రాచ్యదేశ విజృంభణములు సంఘర్షణలు శాంతిమార్గములు, భారతదేశరాజకీయములు, ఉత్తమ రాజకీయ పక్షవిధానములు, ఆంధ్రసాహిత్య సౌందర్యములు, నిమ్నజనాభివృద్ధిమార్గములు మొదలగునవి యెల్లయు చెవులలో నిల్లుకట్టుకొని కాపురముండులాగున నిరుడు వక్తలుపన్యసించినారు, కవులు వర్ణించినారు, గాయకులు పాడినారు, విద్యార్థులవగాహనము చేసుకొని తమతమ పల్లెలకు బోయి రచ్చరాళ్లదగ్గర ముచ్చటలు చెప్పినారు, ప్రజలు విని ఉల్లాసమందినారు. ఈయేటను గూడ సుమారు రెండునెలలపాటు ఈసందడి యంతయు జరుగును. ఇదియొక శాశ్వత సంస్థయై యేటేట సాగుచుండును. ఇంతియ కాక ఆంధ్రరాష్ట్రము పలుభాగములలో ఇట్టి వేసంగి పాఠశాలలు సాగవలెను, సాగగలవు. వాటికన్నిటికి మార్గదర్శకము కాగల కీర్తి రంగాగారి సంస్థకు చెందును. సత్వర విజ్ఞాన ప్రచారమునకు ఎలిమెంటరీ పాఠశాలలు హైస్కూళ్లు కళాశాలలకంటె యిట్టి సంస్థ లెక్కువ ప్రయోజనకరములను సత్యము డెన్మార్కు దేశపు చరిత్రను పఠించినవారికి తెలియగలదు. వీటికి ఖర్చు తక్కువ, ఉత్సాహమెక్కువ, ఆయాసములేదు, పరీక్షలు గెలువుదుమను బెంగలేదు, ఉద్యోగము దొరకదను ఆదుర్దాలేదు, దాస్యవృత్తికి పోవుదమను ముద్రాశను పురిగొల్పదు, స్వతంత్రజీవనాభ్యాస పరాయణులకు సముత్సాహదాయకము. కాని యెంత పేదపల్లెకైనను బూరెలు తప్పనట్లు ఇట్టి విద్యాలయములను నడుపుటకుం గూడ కొంతద్రవ్యమవసరము. కొందరు విద్యార్థులు వారిభోజన భాజనములకగు ఖర్చులను వారే భరించినను, భరించలేని మరికొందరకు సంస్థవారే సహాయము చేయవలెను. దూరభారమునుండి వచ్చు ఉపన్యాసకులు మొదలగు వారికి రాకపోకలు, భోజనవసతులు మొదలగు నదు

పాయములు చేయుటకుఁ గూడ కొంతద్రవ్య మవసరము. దీనిని దేశీయ శ్రీమంతులును, అందును ముఖ్యముగా గుంటూరు జిల్లాలోని పెద్దింటివారును భరించక తప్పదు. రంగాగారి విద్యాధిక్యతను గూర్చి కాని, వక్తృత్వ మును గూర్చికాని, బోధనశక్తిని గూర్చి కాని, విద్వాంసుల నాకర్షించి ఉపన్యసింప చేయఁగల పలుకు బడిని గూర్చికాని యెరు గనివా రాజిల్లాలో లేరు. అతని ఆసక్తిని గుర్తించి జిల్లావాసు లెల్లరును ఈ సంస్థకు భూరి విరాళములిచ్చి మండలకీర్తి నిను మడింపఁ జేయుదురుగాక !

**వార్షికోత్సవములు:—**

కాకినాడలో శ్రీమతి బాలాంత్రపు శేషమ్మ వారిచే నిర్వహింపబడుచున్న మహిళా సంస్థల వార్షికోత్సవములు తే 12-4-35 దిని మిసెస్ ప్రీస్ట్లీ (జిల్లా కలెక్టరుగారి భార్య) గారి అధ్వర్యమున జరిగినవి. శ్రీవిద్యార్థినీ సమాజము, శ్రీరాజ్యలక్ష్మి పుస్తక భాండా గారము సుమారు 24 సంవత్సరములనుండి యు నడచుచున్నవి. హిందూసుందరి 30 యేండ్లనుండియు మహిళావిద్యాలయము 12 సంవత్సరముల నుండియు నడచుచున్నవి. కోలాటకము, ప్రహసనము, భవభూతిప్రద ర్శనము, బహుమాన ప్రదానము స్త్రీవిద్యా విషయికచర్చ మొదలగు నుత్సవములతో వర్ధంతులు మనోహరముగ జరిగినవి. ఈ సంస్థలు చిరపరిచితములగుటచే యివ్వి చేయుచున్న అమోఘసేవను గూర్చి గృహ లక్ష్మి నూతనముగ పాఠకులకు పరిచితిచేయ వలసిన ఆవశ్యకతయేలేదు. ఇవ్వియెల్లయు ఇతోధికాభివృద్ధిని బడయవలెనని యాశీర్వ దించుచున్నాము.

**నరసాపురం పోటీపరీక్షలు:—**

ప్రతిసంవత్సరమువలె ఈయేటను డిశెం బరు 7, 8 తేదీలను యీపరీక్షలు జరుగును. అన్నివూళ్లలోని స్త్రీలును పరీక్షా పత్రము లకు జవాబులు యెవరింట్లయొద్ద వారే వ్రాయవచ్చును. జాతి వయస్సు మొదలగు నిర్ణయము లెవ్వియులేవు. పద్యము, గద్యము, వ్యాసరచన, లెక్కలు, ఆరోగ్యశాస్త్రము లలో పరీక్షలు జరుగును. 100 మార్కు లలో 60 మార్కులు వచ్చినవారు మొదటి తరగతిలో గడతేరినట్లు. నలుగురికి బహు మానము లొసగబడును. మొదటివానికి డాక్టరు కేసరిగారి స్వర్ణపతక మొసఁగబడును. పఠనీయగ్రంథములు వగైరా యితర వివర ములు వలయువారు యన్. టి. పి. యూని యను కార్యదర్శి అద్దంకి బిందుమాధవరావు గారికి వ్రాయవలెను.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS EGMORE, MADRAS.

కొండకొలకు, వికసితోత్పలశ్రీక. కవి మ-రా-రా-శ్రీ కవికొండల వెంకటరావుగారి

విరచనములు అచ్చుపడినవి.

తగ్గింపు వెలలు

# అభినవాంధ్ర కార్యస్థాన సుప్రకాశితములు

| పుస్తకము ప్రతి 1-కి | ఆసలు వెల | | | తగ్గింపువెల | | |
|---|---|---|---|---|---|---|
| 1. మాతృదేశ సంకీర్తనము | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 2. కలరుతము | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 3. జనపదములు | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 4. కుమారకంఠము | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 5. చదువులదుత్త | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 6. ప్రకృతిచందనము | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 7. కోనేరు | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 8. చిట్టికెత | 0 | 6 | 0 | 0 | 1 | 0 |
| 9. ఆత్మవ్యక్తి | 0 | 8 | 0 | 0 | 6 | 0 |
| 10. పొట్టి కథ | 0 | 8 | 0 | 0 | 6 | 0 |
| 11. ఆగడవలు | 0 | 8 | 0 | 0 | 6 | 0 |
| 12. విప్రసందేశము | 1 | 0 | 0 | 0 | 10 | 0 |
| 13. జంటలు | 1 | 0 | 0 | 0 | 10 | 0 |
| 14. త్రయి | 0 | 14 | 0 | 0 | 10 | 0 |
| | 6 | 8 | 0 | 3 | 8 | 0 |

## విశేషగమనిక

రూపాయకు తక్కువ అయిన ఆర్డర్లు అంగీకరింపబడవు. సొమ్ము ముందుగ మనియార్డరు చేసినయెడల కొనుక్కొనువారికి తపాలఖర్చులు తగులవు. మొత్తము సెట్టునంతను నొకేవరి తీసికొనువారికి సెట్టంతయు మూడురూపాయలు మాత్రమే. మొదటి నాలుగుపుస్తకములలో నే వానిలోనైనను వందపుస్తకము లొకేవరి తీసుకొనువారికి ఆ వందపుస్తకముల ఖరీదు అయిదు రూపాయలు మాత్రమే. త్వరపడుడు. కొన్నికొన్ని కొలది ప్రతులుమాత్రమే కలవు.

వలసినచో

కవికొండల వెంకటరావుగారు, బి. ఎ. బి. ఎల్.,

ఇన్నీసుపేట, రాజమండ్రి, అని వ్రాయనగును.

# ఒక అపూర్వ పర్వదినం

**OFFICIAL SILVER MEDAL**





**BY THE ROYAL MINT**

**(Size 1¼" Diameter)**

అత్యంత సుప్రసిద్ధమైన

## ఐదవజార్జి చక్రవర్తిగారి

# రజితోత్సవము

25-వ పరిపాలనావత్సర

సమాప్త మహోత్సవమును జరుపుటకై

## అందమైన పతకములు

లండనులోని రాజనాణెపు ముద్రాలయమునుండి

తయారై వచ్చుచున్నవి.

## వెల 2 రూపాయలు

పైకమును ముందుగ పంపినచో ప్యాకింగ్ పోస్టేజీలు ఉచితము

కొలది పతకములు మాత్రమే వచ్చుటచేత వెంటనే త్వరపడుము

## పి. గోపాలస్వామి నాయుడు అండ్ సన్సు

కర్మాగారము :
పరంగిమలై పోస్టు,
మదరాసు.

బ్రాంచి ఆఫీసు :
234, గోవిందప్ప నాయకన్ వీధి,
మదరాసు.

# "నీకు సంజీవియా? నాకు అమృతము!



## భార్యాభర్తల ఆరోగ్యమే గృహ సౌభాగ్యము.

పురుషునకు బలము, పట్టుదల, దృఢకాయము, ఆనందమార్గమునకు ఆరోగ్యము కావలెను.

ఇందులకు పురుషునకు నరబలము, కండపుష్టి, ఉష్ణశక్తిము అవసరము.

ఫలసిద్ధికి మార్గము? అమృతప్రాయమగు "అమృత" సేవనమే!

భర్తలకు

## అమృత

స్త్రీకి సంతానము, సౌందర్యము, సౌఖ్యప్రదాయినియగు ఆరోగ్యము కావలెను.

ఇందులకు సుగ్రంథులు లేనిగర్భకోశము, చక్కని కాంతినిచ్చు శుద్ధరక్తము, బలము అవసరము.

ఇందులకు దారి? స్త్రీలపాలిట సంజీవియగు "లోధ్ర" సేవనమే!

భార్యలకు

## లోధ్ర

### ఇవి అన్ని షాపులయందును దొరకును.

కేసరికుటీరం, ఎగ్మూరు, మదరాసు.

కేసరిగారి

## విషవిధ్వంసిని

వేసవికాలమున తేళ్లబాధ హెచ్చు. తేలు కాటువలనిబాధ దుర్భరమైనది. మా విషవిధ్వంసిని ఒకబుడ్డి దగ్గరయుంచుకొనుట అట్టిబాధకు తక్షణ నివారణోపాయమును దగ్గరయుంచుకొనుటయే. ఒక్క తేలుకాటు విషమునేగాక ఇంకను ఇతరవిషపుపురుగుల కాటులనుకూడ ఇది ధ్వంసము చేయగలదు. ప్రతిఒక్కరిదగ్గరను ఉండతగినది.

బుడ్డి ఒక్కంటికి ఎనిమిదిఅణాలు.

కేసరిగారి

## జయద్రావకము, విజయవటి

ఉష్ణవిరేచనములు, ఉడుకుభేదులు, కలరా, మొదలగు రోగములందు ఈమందుల ఉపయోగము ఆశ్చర్యకరముగా పనిచేయును. రోగమును నిరోధించుటయందును, వచ్చినరోగమును మాన్పుటయందును నమ్మకమైనమందు. రోగముయొక్క ప్రథమదశలో మేముచెప్పు ఈ మందు సేవించువిధముప్రకారము కొన్ని మోతాదులు తీసికొనుటతోడనే సంతృప్తికరముగ గుణమీయగలదు.

ద్రావకము, మాత్రలు కలిసి

వెల ఒకరూపాయి.

కేసరికుటీరం, ఆయుర్వేదఔషధశాల, ఎగ్మూరు, మదరాసు.

---

కేసరిగారి

## వసంతమాలతి తైలము

వేసవికాలమున సహజముగ అత్యుష్ణమునుండి శరీరమును కాపాడి సమశీతోష్ణమును నిలుపుటకు ఈ స్నానతైలము పెట్టవలసినదే. ఒకేచోట నిలుకడగకూర్చుని పనిచేయువారికి, విశేషముగ మనోపరిశ్రమ చేయువారికి ఈ తైలము మంచి ఉపయోగకారి. నిలుకడైన సువాసనగలదు. శిరోజములను నలుపెక్కచేయును, అకాలపు నెరుపును కలుగనీయదు, బట్టతలను తొలగించును, మేధకు చలువచేయును.

6 ఔన్సుల బుడ్డి ఒకరూపాయి.

కేసరిగారి

## మాదీఫల రసాయనము

మాదీఫలములతో తయారైన శ్రేష్ఠమైనరసాయనము. అరుచిని, వాంతిని మాన్పి ఆకలిని కలిగించుటలో అమోఘమైనమందు. దీనికావిషయమున సాటిలేదు. గర్భిణీస్త్రీలకు మిక్కిలి హితకరమును, ఉపయోగకరమును అయినది.

3 ఔన్సులబుడ్డి ఒక్కంటికి పండ్రెండుఅణాలు.

కేసరికుటీరం, ఆయుర్వేదఔషధశాల, ఎగ్మూరు, మద్రాసు.




సంపాదకుఁడు

# డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౮.] జూన్ 1935 [సంచిక ౩

*Printed at Lodhra Press, Egmore, Madras.*

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్ధ సంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందియవలసినవస్తువులను గూర్చి ప్రకటించుట కీపత్రిక యెంతయు అనువైనది. ఉంచబడిన రేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలములరేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకు వ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పంపకుండుటకొన్న. సమర్పణార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈసంగతి వ్రాయుమండినరీతిని

ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జవాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరని వారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదికి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగనుండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతిసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనమనవి

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రముపంపకూడదు.

కేసరిగారి

## విషవిధ్వంసిని

వేసవికాలమున తేళ్లబాధ హెచ్చు. తేలు కాటువలనిబాధ దుర్భరమైనది. మా విష విధ్వంసిని ఒకబుడ్డి దగ్గరయుంచుకొనుట అట్టిబాధకు తక్షణ నివారణోపాయము దగ్గరయుంచుకొనుటయే. ఒక్క తేలుకాటు విషమునేగాక ఇంకను ఇతరవిషపుపురుగుల కాటులనుకూడ ఇది ధ్వంసము చేయగలదు. ప్రతిఒక్కరిదగ్గరను ఉంచతగినది.

బుడ్డి ఒక్కంటికి ఎనిమిదిఅణాలు.

కేసరిగారి

## జయద్రావకము, విజయవటి

ఉష్ణవిరేచనములు, ఉడుకుభేదులు, కలరా, మొదలగు రోగములందు ఈమందుల ఉపయోగము ఆశ్చర్యకరముగా పనిచేయును. రోగమును నిరోధించుటయందును, వచ్చినరోగమును మాన్పుటయందును నమ్మకమైనమందు. రోగముయొక్క ప్రథమదశలో మేముచెప్పు ఈమందు సేవించువిధముప్రకారము కొద్ది మోతాదులు తీసికొనుటతోడనే సంతృప్తికరమగు గుణమీయగలదు.

ద్రావకము, మాత్రలు కలిసి

వెల ఒకరూపాయి.

కేసరికుటీరం, ఆయుర్వేదఔషధశాల, ఎగ్మూరు, మదరాసు

---

కేసరిగారి

## వసంతమాలతి తైలము

వేసవికాలమున సహజమగు అత్యుష్ణమునుండి శరీరమును కాపాడి సమశీతోష్ణమును నిలుపుటకు ఈ స్నానతైలము పెట్టినదిపేరు. ఒకేచోట నిలుకడగకూర్చుని పనిచేయువారికి, దీర్ఘముగ మనోపరిశ్రమ చేయువారికి ఈ తైలము మంచి ఉపయోగకారి. నిలుకడగానైన సువాసనగలదు. శిరోజములను నలుపెక్కచేయును, అకాలపు నెరుపును కలుగనీయదు, బట్టతలను తొలగించును, మేధకు చలువచేయును.

6 ఔన్సుల బుడ్డి ఒకరూపాయి.

కేసరిగారి

## మాదీఫల రసాయనము

మాదీఫలములతో తయారైన శ్రేష్ఠమైనరసాయనము. అరుచిని, వాంతిని మాన్పి ఆకలిని కలిగించుటలో అమోఘమైనమందు. దీని కావిషయమున సాటిలేదు. గర్భిణీస్త్రీలకు మిక్కిలి హితకరమును, ఉపయోగకరమును అయినది.

3 ఔన్సులబుడ్డి ఒక్కంటికి

పండ్రెండుఅణాలు.

కేసరికుటీరం, ఆయుర్వేదఔషధశాల, ఎగ్మూరు, మద్రాసు.

కొండకొలను, వికసితోత్పలశీర్షిక. కవి మ-రా-రా-శ్రీ కవికొండల వెంకటరావుగారి

విరచనములు అచ్చుపడినవి.

తగ్గింపు వెలలు

# అభినవాంధ్ర కార్యస్థాన సుప్రకాశితములు

| పుస్తకము ప్రతి 1-కి | ఆసలు వెల | | | తగ్గింపువెల | | |
|---|---|---|---|---|---|---|
| 1. మాతృదేశ సంకీర్తనము | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 2. కలరుతము | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 3. జనపదములు | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 4. కుమారకంఠము | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 5 చనువులసుత్తి | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 6 ప్రకృతినందనము | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 7. కోనేరు | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 8. చిట్టికైత | 0 | 6 | 0 | 0 | 1 | 0 |
| 9 ఆత్మవ్యక్తి | 0 | 8 | 0 | 0 | 6 | 0 |
| 10 పొట్టికథ | 0 | 8 | 0 | 0 | 6 | 0 |
| 11 ఆగిపవలు | 0 | 8 | 0 | 0 | 6 | 0 |
| 12. విప్రసందేశము | 1 | 0 | 0 | 0 | 10 | 0 |
| 13. జంటలు | 1 | 0 | 0 | 0 | 10 | 0 |
| 14 త్రయి | 0 | 14 | 0 | 0 | 10 | 0 |
| | 6 | 8 | 0 | 3 | 8 | 0 |

వి శే ష గ మ సి క

రూపాయకు తక్కువ అయిన ఆర్డరు అంగీకరింపబడవు పోస్టేజి ముందుగ మనియార్డరు చేసినయెడల కొనుక్కొనువారికి తపాలఖర్చులు తగులవు. మొత్తము సెట్టునంతను నొకేవరి తీసికొనువారికి సెట్టంతయు రెండున్నరూపాయలు మాత్రమే. మొదటి నాలుగుపుస్తకములలో నే వానిలోనైనను వందపుస్తకములు లొకేవరి తీసుకొనువారికి ఆ వందపుస్తకముల ఖరీదు ఐదు రూపాయలు మాత్రమే. త్వరపడుడు. కొన్నికొన్ని కొలది ప్రతులుమాత్రమే కలవు.

వ ల సి న చో

కవికొండల వెంకటరావుగారు, బి. ఎ. బి. ఎల్.,

ఇన్నీసుపేట, రాజమండ్రి, అని వ్రాయనగును.

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావు. నూజవీడు: వైద్యుల నారాయణ

తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.

హైదరాబాదు: ఎస్. లక్ష్మిబాయిగారు, సుల్తాన్ బజారు.

నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.

తాడేపల్లిగూడెం: కాశీరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కంపెని.

జెమ్‌షెడ్‌పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్‌పైప్ కంపెనీ, [లిమిటెడ్.

బరంపురం: ఎస్. కె. మూర్తి అండ్ సన్స్.

గుంటూరు: వెల్‌కం అండు కంపెని. మైసూరు: స్టూడెన్ట్సు హాలు.

సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.

పిఠాపురం: ఎం. సూకరాజు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.

రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.

మదరాసు: వై. నారాయణగారు, 364 ఎస్ప్లనేడు.

బెంగుళూరు కంటోన్మెంటు: ఆనందా బుక్‌డిపో. ఏలూరు: డి. శ్రీహరిరావు.

తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.

బెజవాడ: ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్‌పేట.

ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.

రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్ వీధి.

చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.

విజయనగరం: ఆయపిళ్ల .సూర్యనారాయణరావు

నరసాపురం: వై. సత్యనారాయణగారు.

ఖరగ్‌పూర్: పి. వి. రమణయ్య, స్టోర్స్‌క్లర్క్, బి. ఎన్. ఆర్ వై. వర్క్ షాప్స్

కొవ్వూరు: కె. సి. చెన్నకేశవయ్యర్. గూడూరు: సి. సి. సుబ్బయ్య, మర్చంటు.

కాకినాడ: నున్నా బాలకృష్ణరావు, న్యూస్ బాయ్ అండు కో.

అనకాపల్లి: సివాజీ న్యూస్ ఏజన్సీ.

నెల్లూరు: సి. సుబ్బరావు అండు సన్సు.

భీమవరం: వంగల అచ్చుత రామయ్య, మేనేజరు, నెహ్రూ ఖద్దర్ స్టోర్సు.

గుడివాడ: శ్రీ శివరామ అండు కో.

తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.

అమలాపురము: పి. అన్నాజిశర్మ. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)

హిగిన్‌బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

# మాధవి




ఇది పుష్పసారములతో నిండియుండు ఒక నాజూకైన మంచువంటి [illegible]ము. ఈ మంచును కొద్దిగ వ్రేలితో తీసుకొని ముఖమునకు లేపనము చేసికొనిన వెంటనే అది చర్మములో మాయమై ముఖమునకు కళ, కాంతి నిచ్చును. ముఖము స్ఫటికమువలె నిర్మల మగును. ముఖముపై లేచు పొక్కి, మచ్చలు, మొటిమలు మొదలగువానిని మాన్పును. మరియు దీనిని ముఖమునకు పట్టించుకొనిన వెంటనే ముఖము చల్లగ నుండి మంచు రాచుకొనినట్లేయుండును.

వెల బుడ్డి 1-కి 8 అణాలు.

కేసరికుటీరం, ఎగ్మూరు, మద్రాసు.

# విషయసూచిక



త్రివర్ణచిత్రము:

పుష్పాంజలి




# స్త్రీలు – సహకారోద్యమము

ఆంధ్రదేశములో మహిళాఉద్యమము ముఖ్యముగ గ్రంథాలయములను స్థాపించి, సభ్యురాండ్రను చేర్పించి అప్పుడప్పుడు ఉపన్యాసములు వినిపించి వార్షికోత్సవములు జరిపించడముతో సరిపోయి తక్కిన విషయముల వైపునకు దృష్టి త్రిప్పలేకున్నది. కొన్ని పెద్ద పట్టణములలో ఏ జిల్లా కలెక్టరు గారు లేక జడ్జిగారి భార్యయొక్క అధ్యక్షత క్రిందనో కొందరు విదుషీమణులు సమావేశమై క్లబ్బులుస్థాపించి టెన్నిస్సు బ్యాడ్మింటను మొదలగు ఆటలమూలముగ దేహపరిశ్రమములను జరుపుకొని ఆనందించుచున్నారు. పెక్కువూళ్ళలో ఆయాయిసందర్భములలో స్వదేశీప్రదర్శనముల తాము జరిపిగాని, జరుగుచున్న వానిలో పాల్గొనిగాని స్వదేశీపరిశ్రమలకు ప్రోత్సాహ మొసగుచున్నారు. రాజమహేంద్రవరం కాకినాడలలో మహిళాసంస్కృత విద్యాలయములు స్థాపించి విద్వాన్ మొదలగు తరగతుల పరీక్షలకు యువతులను తయారుచేసి ఉత్తీర్ణలను జేయుచున్నారు.

ఇవియన్నియు ప్రశంసనీయములే కాని మరికొన్ని ముఖ్యములగు ఉద్యమములపైకి వారిదృష్టి ప్రసరించకుండుట విచారకరము. అట్టివానిలో సహకారోద్యమమొకటి. పాశ్చాత్యదేశములలో ఈఉద్యమము కొంత వృద్ధిపొందినది. ఇంగ్లాండుదేశంలో ఇది జాతీయ, అంతర్జాతీయసంస్థ కాదగినంత పెద్దదిగాకూడా వృద్ధియైనది. ఇంగ్లాండులో 'వుమన్సు కో ఆపరేటివుగిల్డు 1,300 శాఖలతోను, 65, 000 సభ్యురాండ్రతోను

రాణించుచున్నది. ఇది కొంతవర కంతర్జాతీయసంస్థగా పనిచేయుచు ఆస్ట్రియా, బెల్జియమ్, ఫ్రాన్సు, రష్యా, అమెరికా, దక్షిణాఫ్రికా, జపాను మొదలగు ప్రాచ్యపాశ్చాత్య దేశములలో జాతీయశాఖలను కలిగియున్నది. మన భారతదేశములో పంజాబులో ఈఉద్యమము ప్రశంసనీయమగు అభివృద్ధి పొందినది. అందు 130 సంఘములును 2000 సభ్యురాండ్రును 1929 సరికే ఉండిరి. ఇప్పటికింకను ఎక్కువగా ఉండవచ్చును. బెంగాలు సంయుక్తరాష్ట్రములలో ఆరేసి సంఘములును, బొంబాయిలో మూడును మాత్రమేవున్నవి. మన రాష్ట్రములో విదుషీ నాయకురాండ్రదృష్టి ఈదెస యిప్పటికైనను తిరిగినచో కొంత ప్రయోజనముండును.

స్త్రీలకు వేరే సహకారసంఘము లెందుకని కొందరికి సందేహము కలుగవచ్చును. పురుషులసంఘములలోనే కలిసి పనిచేయుట వలన కొంతవరకు స్త్రీపురుషవిభేదము తగ్గి సరిసమానత్వ మేర్పడునన్నమాట నిజమేయైనను అందువలన కొన్ని అనర్థములుకూడ వున్నవి. పురుషులతో కలిసిపోతప్ప స్వాతంత్ర్యముగ తమ వ్యవహారములను తాము నిర్వహించుకొనునేర్పు వారికెన్నడును నలవడదు. మరియు మన భారతదేశమువంటి దేశములో పురుషులుండి పాల్గొను సంఘములలో స్త్రీలు అధిక సంఖ్యాకలుగవచ్చి జోలు కొనుట కింకను అలవాటుపడలేదు. మానవ సమస్యలలో కొన్ని కేవలము స్త్రీలవేయై వారే వ్యవహరించుకొనవలసినవనియు, పురుషులకు సాధ్యములుకావనియు, వానిని నిర్వహించుకొనగల స్వయంశక్తి స్త్రీలకు కుదరవలెననియు పెక్కు రెరింగినవిషయము. ఈకారణములవల్లనే స్త్రీసహకారోద్యమము పురుషోద్యమమునుండి వేరుగాను, అసలు సహకారోద్యమముతో అనగిపెనగి అంతర్భూతముగాను వున్నది.

స్త్రీలు ముఖ్యముగ స్థాపించవలసినవి మితవ్యయ (thrift) సంఘములు స్త్రీలలో మున్ముందు ఈసల్లక్షణమును ప్రోత్సహించవలెను. వీరికొకసారి యిట్టిసంఘములలో ఆవేశముతో పనిచేయునేర్పు కుదిరినచో పురుషుల దుర్వ్యయములు, స్త్రీలదూబరా వ్యయములు, వివాహములు చావులు మొదలగు సందర్భములలో ఆడంబరవ్యయములు ఒక్కపెట్టున కట్టును. స్త్రీప్రకృతి ప్రపంచమున నంతటను ఇంచుమించు ఒక్కరీతిదేయైనను, భారతీయవనితయొక్క నిరాడంబరమును మితవ్యయమును, కార్యనిర్వహణదక్షతయు చరిత్రప్రసిద్ధములు.— "హిందూస్త్రీలు చేయలేనివృత్తులు, నెరవేర్చలేని రాచకార్యములు లోకమున లేవు. నాగరికసంఘములో మర్యాదస్థులు పాల్గొని వ్యవహరించు కార్యములలోనెల్ల భారతీయాంగనలు చాలాముందర వుంటున్నారు" అని అబి దూబీ అను ఫ్రెంచి మిషనరీ సుమారు 200 సంవత్సరముల క్రిందటనే వ్రాసినాడు. అప్పటికంటె వారిప్పుడెంతో ముందుకు వచ్చినారని శ్రీమతులు ముత్తులక్ష్మి, రుక్మిణమ్మ, కమలాదేవి, సరోజినీ

దేవిగార్లు మొదలగు మహాయిల్లాంధ్ర ధీరణులవల్ల మనకు తెలియుచున్నది.

మితవ్యయ సంఘములతరువాత అంగడి సంఘములు, పరపతిసంఘములు, విద్యా వైద్యపరిశ్రమ శిక్షణాదులకు సంబంధించిన సంఘములతోను, ఉద్యమములతోను, అఖిల ప్రపంచసంఘములతోను పరిచయము కలుగును. ఆంధ్రదేశమునగల సహకారోద్యమ పురుషనాయకులును అధ్యక్షులును ఇప్పటినుండే స్త్రీనాయకురాండ్రసి విషయమై ప్రబోధించి ప్రోత్సాహించి రానున్న మదరాసు రాష్ట్రీయ సహకారమహాసభలో యీవిషయమును సాంగముగ చర్చించి ఈ భావములకు రూపురేఖలు కల్పించి ఆచరణలోనికి తెత్తురుగాక యని నమ్ముచున్నాము.

## మేలుకొనుము

సీ. కలదు లే దనువాదముల నుండిన 'జపాను' యే స్థితి యందున్న దీ దినంబు?
అన్న మోహానుచంద్రా యన్న 'రష్య' యే ప్రభలీనుచున్నది ప్రతిదినంబు?
అంతఃకలహముల కాకరంబగు 'చైన' యభివృద్ధి నే రెంత యధిగమించె?
ముసుగు వీడక నెప్డు మూల నుండిన 'టర్కీ' ప్రాబల్య మెంతటి పటిమగాంచె?

గీ. వీరి సౌభాగ్యమున కెల్ల కారణమ్ము, నీదు సోదరి చేతలే నిశ్చయమ్ము.
సంఘప్రాబల్యమున కీవు సాక్షిసుమ్ము, మేలుకొనుమమ్మ సోదరీ మేలుకొమ్ము. 1

సీ. సామ్యసిద్ధాంతముల్ సామ్రాజ్యమే మార్చ సాయంబు జేసిన చతురమానసులు;
సర్వాధికారంబు నిర్వహించి 'నియంత'పదవి జేకొన సాయపడిన సతులు;
అమెరికా సభ్యతకు నంతటివారికి సూచనల్గావించు సుగుణమతులు;
సంఘ దురాచార సంఘంబు మాన్పింప నేతకు బాసటౌ నిపుణమతులు;

గీ. వివిధ దేశము లందిప్డు వెలసినారు, నీదు సామర్థ్యమం దెట్టి నేర్పుగలదొ?
సమయమింకను రాలేదె చాలుచాలు, మేలుకొనుమమ్మ సోదరీ మేలుకొనుము. 2

సీ. సర్వార్థదాయి స్త్రీస్వాతంత్ర్య మదిమీరు సాధింప మార్గంబు సన్నవలయు;
సంఘాభివృద్ధిని సాగిపోనివ్వని ఆచారముల నెల్ల నష్టవలయు;
దేశదారిద్ర్యంబు దీర్పంగ నింటింట గృహపరిశ్రమల వే గూర్పవలయు;
విద్యావిహీనత వేవేగ మాన్పించి విజ్ఞానభాగ్యంబు పెంపవలయు;

గీ. జేయవలసినకార్యముల్ వేయిగలవు, కాలమే జేయుననియున్న కాదుకాదు,
ఎంతకాలంబు నీరీతి యేగగలవు? మేలుకొనుమమ్మ సోదరీ మేలుకొనుము. 3

చదువుల రామచంద్రయ్య

# ఆంధ్రసారస్వతము—జాతీయాభ్యుదయము

శ్రీమతి చామర్తి భ్రమరాంబగారు

భారతదేశమున నుదయించిన జాతీయప్రబోధము ఆంధ్రదేశమున మెల్ల మెల్లగా నావరించినది. ఆంధ్ర జాతీయప్రబోధము ఆంధ్రోద్యమమున మూర్తీభవించినది. ఆంధ్రోద్యమము ప్రారంభమై పలుసంవత్సరములయ్యెను ఫలోన్ముఖము కాలేదు. ఆంధ్రప్రజాశక్తి యెచ్చటదాగియున్నదో తెలియదు. శాతవాహనుని ఆంధ్రసామ్రాజ్యమును, ప్రతాపరుద్రుని ఓరుగంటి సామ్రాజ్యమును, కృష్ణదేవరాయని విద్యానగర సామ్రాజ్యమును ఆంధ్రుల కార్యశూరతను చాటుచున్నవి. ఒకప్పుడంధకారబంధురమైన ప్రతీచీప్రపంచము నేడు వికాసమువహించి విజృంభింప, మహత్తర సామ్రాజ్యముల నెదురులేక పరిపాలించిన ఆంధ్రజాతి ప్రస్తుతమీ దీనస్థితియందుంట తక్కిన భారతీయులకు మిక్కిలి విచిత్రముగా నున్నది. పరదేశీయులకు పరిహాసాస్పదమైయున్నది. మనకెంతయు విషాదము కలిగించుచున్నది.

కాలమునుబట్టి పరిస్థితులును మారుచుండును. పూర్వకాలములోని సామ్రాజ్యనిర్మాతలు పరాక్రమవంతులైన స్వతంత్రరాజపురుషులు. అప్పుడు జాతులేకమై రాజ్యములు స్థాపింపలేదు. జాతీయసామ్రాజ్యములు లేవు. చంద్రగుప్తుడు మగధసామ్రాజ్యమును నిర్మించెను; శ్రీముఖుడు ఆంధ్రసామ్రాజ్యమును ప్రతిష్ఠించెను. కాని మాగధులు మగధసామ్రాజ్యమును, ఆంధ్రులు ఆంధ్రసామ్రాజ్యమును స్థాపించలేదు. కావుననే మనపూర్వులకు రాజభక్తియుండెను గాని రాజ్యభక్తిగాని, దేశభక్తిగాని లేకుండెను. అప్పటి రాజ్యములు రాజులపేరనే కీర్తికెక్కి వారితోనే శిథిలములయ్యెను. అశోకుని మరణానంతరము మగధసామ్రాజ్యమును రామరాజు గతించినపిమ్మట విజయనగరసామ్రాజ్యమును నశించినవి. జాతులయందు జాతీయభావముండియుండిన సామ్రాజ్యములు ఖిలముగాకుండ సుస్థిరములై యుండెడివి.

శత్రుభయమువలనను మరి యితరకారణముల వలనను ఈఐక్యము సమకూడినప్పటికిని, జాతీయసారస్వతము జాతీయాదర్శములను బోధించుటకును, జాతీయతను పెంపొందజేసి జాతిలోనివారి వీరరసపూరితులనుగా జేయుటకును ముఖ్యసాధనమై యున్నది. అత్యాశ్చర్యకరమైన జర్మనులవిజృంభణము జాతీయసారస్వతమువల్లనే సాధింపబడినది. ఫిష్టి, ట్రిష్కి, బరన్హార్డి అను మహనీయులు జర్మనుదేశీయులను ఆవేశపరులనుగా జేసిరి. జర్మనుల హృదయములందు "జర్మనీదేశము దేవభూమి. జర్మనులు దేవతలు. జర్మనులు లోకోద్ధరణమునకై యవతరించిరి. జర్మనుల బల మపారము. జర్మనులశక్తి అభేద్యము. కైజరు అవతారపురుషుడగు నాయకుడు" అనువిషయములు గాఢముగా నాటుకొనెను. వారిప్రతాపము ద్విగుణీకృతమయ్యెను. ఫ్రాన్సుదేశవిప్లవము 'రూసో' అను రాజకీయవేత్తయొక్క వ్రాతవల్ల జరిగినది. చిరకాలమునుండి అజ్ఞానమునమునిగి సరియైన జాతీయైక్యత లేక యల్లాడిన ఇంగ్లండుదేశమున 'షేక్స్పియరు' నాటకములు చక్కని ప్రబోధము గలిగించినవి. ఆ మహాకవి ఇంగ్లండుదేశ చరిత్రలోని ముఖ్యభాగములను నాటకరూపమున రచించి జాతీయభావముల నాటెను. ఆంగ్లదేశీయుల శౌర్యమునుగ్గడించెను. శత్రువుల పరాక్రమము ప్రశంసనీయమైనను, స్వదేశీయుల పక్షమువహించి వారిని గొప్పగా జేసెను. ఆమహాకవి

ఉదయముతో ఆంగ్లదేశాభ్యుదయమును నారంభమయ్యెను. ఆకాలమున ఇంగ్లండుదేశమునకు సామంతులులేరు. ఐర్లండు, స్కాట్లండుసైతము యించుమించు స్వతంత్రరాజ్యములు. సైన్యబాహుళ్యమున గాని, ధనమునగాని ఇంగ్లండునకు మించినదేశములు యూరోపులో పెక్కులుండెను. అయినను 'షేక్స్పియరు' తన మాతృభూమి నెంతయు నతిశయోక్తులతో స్తుతించి నిక్కంపు దేశభక్తుడయ్యెను. ఇంగ్లండుదేశము సామ్రాజ్యరాజుల కాస్థానపీఠమట! సహజపరాక్రమ సంపన్నులగు వీరయోధుల కాలవాలమట! శ్లాఘ్య భాగములచే నావరింపబడి లోహమయమైన ఆదేశము భూలోకస్వర్గమట! రజతసముద్రమునందు గూర్చబడిన వజ్రమట! ప్రకృతిదేవతచే నిర్మింపబడి పరుల కలవిగాని పెట్టనికోటయట! ఆహా! ఏమి షేక్స్పియరు మాతృదేశాభిమానము! కావుననే అల్పసంఖ్యాకులైనను, ఆంగ్లేయులు రవియస్తమింపని సామ్రాజ్యమును బడయగలిగిరి.

ఇటీవల ఆంగ్లకవులుసైతము తమ కవితాసామర్థ్యమును శృంగారవర్ణనలయందే వ్యర్థపుచ్చక జనులకు రాజకీయబోధ గావించిరి. షెల్లీమహాకవి పవిత్ర స్వాతంత్ర్యగీతముల బాడెను. ఆమహనీయుడు ప్రపంచమునంతయు సంస్కరింపవలయునని ఆవేశపడుచుండునట. 'బైరను' అను మరియొకకవి నిరంకుశ ప్రభుత్వమువలన గలుగు అన్యాయమును చర్చించుచు యూరపులోని రాజకీయాందోళనములందు విశేషముగా బ్రవేశించి తుట్టతుదకు పరదేశమగు గ్రీసునకు స్వాతంత్ర్య మిప్పించుటకై తనప్రాణములను సహితముధారవోసెను. 'స్కాట్' అను సుప్రసిద్ధ నవలాకారుడు కఠినకంటక శిలామయమైన తన జన్మభూమిని కల్పవృక్షమువలె పొగడుకొనెను. 'థామస్ మోర్' అనునతడు తన మాతృదేశమగు ఐర్లండు రాజకీయ విముక్తికై పాటుబడి యర్థప్రాణములను గోలుపోయి దేశబాంధవుల కీర్తిపరంపరలను తన మధురగీతములందు గానముచేసి దుర్ఘటమగు నాజాతీయోద్యమమునకు దేశవాసులనెంతయు పురికొలిపియున్నాడు. ప్రతిజాతియందును నావేశకరమగునటువంటి సాహిత్యముండుటచేతనే ప్రతీచీ ప్రపంచము జాతీయాభ్యుదయ పరంపరలచే విరాజిల్లుచున్నది.

పూర్వఖండమున నూతనశక్తి మిక్కిలి ఆలస్యముగా సంకురించినది. జపానుదేశమునందు సూర్యోదయమైనది. భారతదేశమున నావరించిన సంధ్యారాగ మార్యావర్తవాసులకే దృగ్గోచరమైనది. దక్షిణాపథ మప్పటి కింకను నంధకారముననే యున్నది. ఆర్యావర్తమునందు వంగదేశము జాతీయోద్యమములకు ముందు దారితీసెను. వంగదేశ విభజనము వంగీయుల జాతీయజీవితములకు భంగకరముగా నుండెను. బలవంతముగా విడదీయబడిన ఆ ప్రజలు ద్విగుణీకృతమగు ధైర్యసాహసములతో నెదిరించిరి. వారా సమయమున గనబరచిన కార్యసామర్థ్య మెంతయు ప్రశంసాపాత్రము; వారి యుద్యమమున కనేక విఘ్నములు కలిగినవి. నాయకులనేకులు నిర్బంధితులైరి. కొందరుత్తమపురుషులు బలవన్మరణమునందిరి. మఱి కొందఱు పాలకుల రాజ్యతంత్రమును విమర్శించుచు ఖండించుటచే మాతృభూమినుండి వెడలగొట్టబడిరి. ఎన్నియాపదలుసంభవించినను లెక్కపెట్టక ప్రజాశక్తిని నమ్ముకొని ధైర్యోత్సాహములతో బ్రవర్తించిరి. ఎట్టకేలకు వారి ఆశయములు సఫలీకృతములయ్యెను. పవిత్రమగువారి జాతీయజీవితమున కింక నే యభ్యంతరములేదు. అత్యద్భుతమగు నిట్టి యమూల్యశక్తి వంగదేశీయుల కెక్కడనుండి గలిగినది? వారు దేవపురుషులుగారు. వారును మనవలెనే మానవమాత్రులు. అయినను వారియందు ప్రబలమగు ప్రజాశక్తి గలదు, ప్రతివంగదేశస్థునకును మనోబలము కలదు. ప్రతివానికి నాత్మగౌరవముకలదు. ఎవరి సామర్థ్యము వారి హృదయమునకు దెలియును. వంగజాతి అంతటి యున్నతస్థితికివచ్చుటకు వారిజాతీయ

భాషా మూలమైన ఉత్తమ సారస్వతమే మూలకారణము. భారతదేశములోని వాఙ్మయములలో వంగ వాఙ్మయము ప్రథమస్థాన మలంకరించుచున్నది. ఇందుకు బంకించంద్రుని నవలలే యుదాహరణములు. ఇంక రవీంద్రుని కవితారామణీయకము నుగ్గడింపబనిలేదు. బంకించంద్ర విరచితమగు నానందమఠమను నవల నెరుగనివారులేరు. అందలి వీరయోధుల పరాక్రమమును, పవిత్రమగు జాతీయాభిమానమును మనయాంధ్రగ్రంథములయం దెచ్చటను గానము.

సకలదేశ వాఙ్మయములును మహాపురుషులను గూర్చి గానముచేయుచు జాతీయాభ్యుదయమునకై పాటుబడుచుండ నాంధ్రవాఙ్మయ మేమి చేయుచున్నది? అతిదీర్ఘములును, అనేకములునునగు సంస్కృత సమాసములతోడను, అతి విచిత్రములును, అనుపయోగములును నగు బంధచిత్ర కవిత్వరచనలతోడను నలంకరింపబడి లోకభయంకరమై కొన్నాళ్లు ప్రసిద్ధికెక్కినది. ప్రస్తుతముమాత్ర మాభయము లేకపోయినప్పటికి నింకను పురాతనమార్గములనే అనుసరించుచున్నది. అష్టాదశ వర్ణనములయందే మునిగియున్నది. శ్లేషలయందలి ఆశలవదలకున్నది. క్లిష్టాన్వములయందలి భ్రాంతివడకున్నది. ఎంతకాల మీనిర్బంధములు మనల వేధించుచుండునో తెలియకున్నది. ఏ భారతమునందలి యుపాఖ్యానమో, ఏభాగవతమునందలి కథయో గైకొని నాటకము వ్రాయువారేగాని సుప్రసిద్ధ చారిత్రకపురుషుల మహత్కార్యములను వర్ణించువారు లేకైరి. హరిశ్చంద్రుని కథను హరిశ్చంద్రీయమని యొకరు, సత్య హరిశ్చంద్రనాటకమని యొకరు, సంగీతసత్య హరిశ్చంద్రీయమని మరి యొకరు యిష్టమువచ్చినట్లు నాటక రూపమున రచించువారేగాని ఆంధ్రభాషయందు నూతనఫక్కీని కావ్యనాటకాదుల రచించ గలిగిన కవులు తెలుగుసీమయందు పుట్టరైరి. కవులు ఒకరు వ్రాసినదానినే రూపభేదముతో మరల మరల రచించుటకన్న, తమసామర్థ్యము నావిధముగా వ్యర్థపరచుటకన్న దేశోపయోగకరమైన వ్రాతలచే ఆంధ్రజాతియందు నూతనమైన ఉద్బోధము కలిగించగూడదా? వారు శ్రీముఖుడు మొదలగు సామ్రాజ్యనిర్మాతలయు, విద్యారణ్యుడాదిగాగల మంత్రిపుంగవులయు పవిత్ర చరిత్రములు తమకావ్యములయం దెందుకు పొందుపరుపగూడదు? నాటకములు వ్రాయుటకు మహాపురుషులగు దేశోద్ధారకుల పవిత్రచారిత్రములు లేవా? పురాణగాథలనే వ్రాయవలయునను సిద్ధాంతమేమి? పూర్వమందలి ఆంధ్రస్త్రీల శౌర్యమును జాటు ఖ్యాతికెక్కిన కథ నాటకరచనమునకు పనికిరాదు కాబోలు! చరిత్రప్రసిద్ధములును దేశాభివృద్ధికరములును నగు నిట్టి కథాసందర్భములు ఆంధ్రకవులకు రుచించనట్లు తోచుచున్నది. ఇట్టివి నాటకములుగను నవలలుగను రచింపబడినచో ప్రేక్షకులును, పాఠకులు నెంతటి దేశభక్తిప్రపూరిత హృదయములతో విలసిల్లుదురో గదా! ఇప్పటికైనను ఆంధ్రకవులు తమ ప్రాతపద్ధతుల వీడి జాతీయోద్ధరణమున కనుకూలించు కావ్యనాటకాదుల రచించి తాము ధన్యులై, తమతోడి దేశీయసోదరుల ధన్యులజేయుదురని నమ్ముచున్నాను. వారి కట్టి బుద్ధి ననుగ్రహించుటకై భగవానుని ప్రార్థించుచున్నాను.

# మాతృవందనము

శేషాద్రి రమణకవులు

నిండవచ్చెను సుతునకు రెండుమూఁడు
వత్సరంబులు నేలపైఁ బ్రాకలేఁడు
మాటలారావు చిఱునవ్వుతేటవెల్గు
ముద్దుమొగమునఁ గనిపింపఁబోదొకింత
అకటచైతన్య రహితమాంసస్థిఖండ
మేల దయచేసె దేవుఁ డూహింపఁజాల
కల్లయగునేమొ శాస్త్రజ్ఞగణితఫలము
బాలకునితోడి యైహికబాంధవంబు
గడచిపోనుండెనొకో స్వల్పకాలమునకు
నాదుకనుదోయి వెన్నెల నాఫలంబు
నా కుమారకరత్నంబు నన్నువిడివ
నైహికంబులజెలిమి రవ్వంతవలదు.
సృష్టికెంతయొబరువు నాజీవితంబు
సుతుఁడుజీవించెనా నాదుబ్రతుకునిజము
నాదుగర్భస్థ మాంసపిండంబు జనెను
పుణ్యలోకంబు నే నేఁ బొందఁదగదు.
వదలుఁడీ నాపయినిఁ బ్రేమ వల దటంచు
నాదు జనకునిదరిని విన్నపమొనర్చి
నన్ను కౌఁగిటఁబొదివి యానందబాష్ప
పుణ్యవాహినిలోపల ముంచితేల్చి
నాదుకౌఁగిటిలోని చిన్నారి నెట్లు
మృత్యువు గ్రహింపఁగలదో దర్శింతునంచు
సుతచిరంజీవక వ్రతసూత్రికతన
నన్ను బ్రతికించుకొంటివో కన్నతల్లి
అట్టి పుత్రహితాచారవైన నిన్ను
వదలి జీవితయాత్రకై వచ్చిపడితి
పాపవశమున మిన్నులుబడ్డచోట
తల్లియెటుసైచెదో వియోగతాపమీవు !!
కలరు నీకైదుగురుసుతుల్ కర్మవశత
పెద్దకుమరుండు కడసారి ముద్దుకొడుకు
స్వర్గగతులైరి నీప్రేమసారసదిని
బ్రతికియుండిన మువ్వురిపైని బఱపి.
యస్థిమాత్రావశిష్టవై యైహికముల
శూన్యదృష్టినిఁ దిలకించుచును బ్రసన్న
భావమును బుత్రకునియందుఁ బాదుకొల్పి
పరమపదవికి లేచు నీ ప్రణయమూర్తి
అమ్మ ! నాజీవతరువున కమృతవృష్టి.
జనని నా చిత్తలతకు వసంతఋతువు.
మాత నాజీవికను శరన్మధురరాత్రి
ఇరుగుపొరుగిండ్ల బాలకుల్ సిరులుమీరు
హారములు కంఠమునదాల్చి నరుగుదేర
జూచి మాటలునేర్వని సుతుఁడనగుట
హృదయగతభావమును వచియింపలేక
సొమ్ములకునేడ్చియేడిచి సొమ్మసిలితి,
ఎంతయొబుజ్జగించితి వెన్నొదిశలఁ
ద్రిప్పితివి, నాదు భావంబుదెలియలేక,
అక్కునందన్నితిని మొగమాదుగోట
రక్తధారలుక్రమ్మగా రక్కినాఁడ
జనని నీదుపవిత్ర వక్షస్థలమున
నపుడునాచేసిన దోసంగె యనుదినంబు

రుధిరగతమయి యిపుడు హృద్రోగమయ్యె
తల్లి యీపాపకర్మంబు తనువునందుఁ
బొడమె నీకిచ్చె నీరెండుభూషణములు.
చెప్పవిప్పటికేని నాచిన్నితనపు
దుడుకుఁదనమెవ్వ రెంత గానఁగుచున్న
ఈ యనన్య కృపావృత్తి కేనుపేరు
ప్రేమయననలెనో దయావృత్తియంచు
బొసఁగ నననౌనో, వాత్సల్యరసమటంచు
వాకొనఁగనౌనో; యర్థసంబంధమరయఁ
బదముకనిపింపకున్నది వాఙ్మయమున
సంజకడ నారుబైట నో జనని నీవు
బురదలో నాడుకొనెడు సుపుత్రునన్ను
నెత్తుకొని మేనుచెఱుఁగుతో నొత్తి మొగము
కడిగి తిలకంబు మొగమునఁగన్నుదోయి
యంజనముదీర్చి అమ్మాయి, యాఁడుపిల్ల,
జానకియటంచు ముద్దాడి స్తన్యమొసఁగఁ
బసుపుక్రొత్తఁగఁబూసిన పట్టుత్రాటి
మేలిమంగళసూత్రంబు కేలఁబట్టి
నాగళంబున నిడుమని నాఁడునేను
కొట్టితిని నిన్ను నేడ్చితిఁ గొఱికినాఁడ
గంట్లుపడ గిచ్చితిని మఱి కాలదన్ని
యేడ్చితిని పొట్టయుబ్బ నాయెదవడంకె
ఎటుల మంగళసూత్రము నీయఁగలవు
ఎటుల నను బుజ్జగించెద వేదితెరువు.
ఇంటసిరులున్న సుతునేశ్వనిత్తునొక్క-
ఏటికి దరిద్రులకుఁ బుట్టెనీసుతుండు
అడుగరానిదియడిగినా డందుకొఱకె
యేడ్చుచున్నాఁడు మానఁడే యింకనైనఁ
గంఠమున నల్లపూసేని కల్గియున్నఁ
దప్పుగద నేటియేడ్పు నాతనయునకని
చింతతోఁగుంద నాఁటినీవింతసొబఁగు
తలఁచి పరితాపమొందుదు; తల్లినేను
పొడమనే నీకునివ్వ తప్పునుగదమ్మ.

# పుత్రపుత్రికా భేదము

శ్రీమతి ఆపంట సత్యవతమ్మగారు.

జగన్నాథంగారికి ముగ్గురు కుమారులును ముగ్గురు కుమార్తెలును కలరు. మనదేశమున కుమారునిమీద నున్నంత యభిమానము కుమార్తెలమీ దుండదేమి ప్రారబ్ధమో? పిల్లేమో పరాయియింటికి పోయేదే కదాయనియు పిల్లవాడేమో వంశాంకురమై, గణించి వెలుగబెట్టి తమ్ము సుఖింపజేయుననియు తాను కాకుండా పైగా చాకిరీచేయించి తలిదండ్రులను సౌఖ్యపరుచుట కొక భార్యామణినికూడా తెస్తాడని వారియాశయము. ఇంకొకటి: కూతు రింటది తగలించుకొని పైయింటికి బోవుటేగాక మూర్ఖపుటల్లుడు గనుక దాపురించెనా యిక చెప్పేదేముంది. అడుగడుగు పండాలు, అలకలాంఛనములు, అమ్మాయి వచ్చుటే కఱువు. ఇట్టి సంప్రాప్తసూచనలతో జాతీయత నాటి పోయింది మన హృదయాల్లోకాని, అది తప్పు. హృదయమృదుత్వ మబలలసొమ్ము. బండరాయి మనసు అబ్బాయిసొమ్ము. అబ్బాయి అధముడైతే అవిధేయుడై ఆచరించవలసిన విధాయకములు మీరును. అది ప్రపంచకంలో ముఖ్యంగా నీ కలియుగంలో సాధారణంగా స్వానుభవ మింటింటయున్నను, అబ్బాయన్న యాధిక్యత గౌరవస్థాన మిచ్చుట యణచుకొనరు. ఆడబిడ్డకొక్క వివాహపు ఖర్చేకాని యబ్బాయి కడుగడుక్కు. విద్యావిషయక ఖర్చులే యధికము!! అది మనకు తెలియదేమి?

అట్టి ప్రకృతిలోనివారే యగుట మనజగన్నాథ సుభద్రమ్మలుకూడా మగబిడ్డల విద్యాకృషియం దమితాభిమానముజూపుచు ముగ్గురిని బి. ఏ. లు ప్యాసుచేయించిరి. అంతతో సెనగలుదిని చెయి కడుక్కున్నట్లయింది. చరస్థిరాస్తులకు చలనము కలిగింది. సొమ్ము గలగలలో యున్నప్పుడే పెద్దపిల్ల శేషకును, చిన్నమ్మాయి సత్యకును, తగిన స్థితిశ్వర్యవంతులను గుణవంతులనుచూచి పెండ్లిచేసేసిరి. కాని సమస్తానికి లోటుకలిగే సమయానికి సూర్యం వివాహవయస్కుడైయున్నది. ముగ్గురాడుబిడ్డలును, గుణవతులు సౌందర్యవతులు.

సూర్యానికి పెండ్లి యెట్లనాయనియు, కట్నమిచ్చిననేకాని, నాల్గువేళ్లు లోనికిబోవు సంబంధము రాదనియు కట్నమిచ్చుటకు దారియెట్లని దంపతు లాలోచనా సముద్రమునమునిగి పాలుబోకుండిరి. మగబిడ్డల విషయమై కించిత్తైనను కించవడకుండ తల్లి తనదేహమందలి సమస్తాభరణములును, వమ్ముచేసికొనెను. తరువాత వాళ్లకు రెక్కలువచ్చి ఉద్యోగపదవికి యెగిరినప్పుడు తన్ను నెత్తినపెట్టుకొని, గౌరవించి సుఖింపజేయుదురన్న యమితధైర్యముతో యామె స్వసుఖవిహీనురాలై, మగవాని మంచియాలోచనలు కూడ తనయమాయికత్వముతో మాపుచేసి, పోరి పోరి పుత్రులను ఆధరువుగల్పించు దారికి దెచ్చునుకాని, పుత్రులు శత్రులన్నమాట రిత్తయగునా? కాదు!! ముమ్మాటికి కాదు!!!

"మనసూర్యం పెళ్ళివిషయంలో నింతయాలోచన విచారము లెందుకండీ. మన పెద్దబ్బాయి రామానికి లెక్చరరుపని యైనదికదా? రెండువందల జీతము. రెండోవాడు గోవిందానికి సబురిజాస్ట్రారు పదవిదొరికింది. ఇద్దరూ యీనెలలోనే ప్రవేశించారు. మూడోవాడు నారాయణునకు పోస్టుమాస్టరుకు ధరకాస్తు చేసినారు. అదిగాకపోతే రైల్వేలో ప్రవేశించే సిఫార్సుదొరికిందికదా? ఇక మనకేమిలోటు. మనకష్టాలు

గట్టెక్కినవి. చిన్న చెల్లెలిని కంటిని పెట్టుకొనిముగ్గురూ కలసి మంచిసంబంధము తెచ్చి పెళ్లి చేసేస్తారన్నలు; ఇక విచారించక ఆలోచనలతో తలవేడి పెంచుకొనక, అబ్బాయిలనుకబురంపి వాళ్లతో మాట్లాడండి." అంది సుభద్ర.

"అయ్యో! ఎంతయమాయిక సాధ్వి యీమె "అడ్డాలు నాడే బిడ్డలు కాని గడ్డాలొచ్చాక బిడ్డలా!" యన్న రహస్య మెరుగదీమె? యద్భావంతద్భవతి యనునట్లు నిష్కల్మష స్వభావశీలయగుటచే తన గుణమువంటిదే యందరిదీ యనితలచునే కాని, స్వభావ భేదము యుండునకైన నెరుగదుగదా! వస్తువుమీ! అంతి చేయికి ముసుకొనుట తుదకు ముప్పని యెంతబోధించి నను పెడచెవినిపెట్టి గొప్పవిద్యలు బిడ్డల కిబ్బవలె నని వంటినగలు వమ్ము చేసికొనెను. ఒక్కపట్టుచీర, కొనుక్కొమ్మంటే ఆసొమ్ముతో పిల్లలకు దర్జాగా సూట్లుబూట్లుకుట్టించి వాళ్లకాలంలో నిత్యం పట్టు చీరలే కట్టుకుంటానని మనస్సమాధానంచేసికొని సకలము వాళ్లకు ధారవోసిందికదా? ఇప్పుడు చూడాలి— వాళ్ల ప్రేమప్రవర్తనలు. నేనెక్కడ, కోపము పడెదనోయని మెల్లన తల్లిచెంత కరిగి తీయని దీనాలాపముల నామెను మెప్పించి సొమ్ములాగి పుత్రుల మాతృభక్తిని యొకనాడు మధ్యాహ్నము కాఫీలసమయంలో పుత్రులతో సూర్యం వివాహ విషయక ప్రసంగమెత్తెను జగన్నాథంగారు."

"ఈవాళే యుద్యోగమైనదో లేదో మీకళ్లు కుట్టుకున్నాయి కాబోలు. నాల్గువేలు ఖర్చుచేసి, సూర్యంకు పెళ్లిచేసి జీతంలో యాయప్పటీరుస్తూ, పకీరునై పెళ్లానికి నగలు చీరలు కొనకుండా పేద ముత్తైదులాగ యుంచమన్నావా?" అన్నాడు పెద్ద బ్బాయి రామం."

ఈమాట సమ్మెటపోటులా తగిలింది సుభద్ర హృదయానికి. ఒడలెల్ల చెమ్మగిల్లెను. "అయింతా" అన్నట్లుగా తలయూపి భార్యకేసిచూచాడు జగన్నాథంగారు.

ఇక రెండవవాడు యెట్లు భాషించునోయని కని పెట్టుకున్నారు. కాఫీకప్పు క్రిందనుంచి మొదలు పెట్టాడు గోవిందం:— రెండువందలు తెచ్చుకున్న అన్నయ్యే యియ్యలేకపోతే నూటిలోయున్న నేనేమి సహాయం చేయగలను? సబురిజిష్ట్రారు హోదాకు సరిపడు బట్టలుకుట్టించుకోవాలి. మాకోడలుకు రవ్వల దుద్దులు ముక్కుపుడకలు కావాలంటూంది. అవి చేయించాలి. చెల్లెలుపెళ్లికి నేనేమి సహాయంచేయలే నన్నాడు.

దీనితో తలిదండ్రులతలలు తిరుగుచుండెను. జగన్నాథంగారికండ్లు యెఱ్ఱబడెను. కోపముతలకెక్కెను కాని మాటరాదాయెను. ఇక సుభద్రసంగతి చెప్ప నక్కరేలేదు. నిలువెల్ల నీరై కుప్పకూలిందామె. ఫస్టు సెకండ్లు పలుకుమాట లనినప్పుడిక మూడోవాడు ముద్దుగా మాటాడునాయనియు యాపై నింకా వాని కుద్యోగమేకాలేదని వారాతని పలుకరించనేలేదు.

తల్లి, తనయులపై నాశలుంచిన తల్లి, సమస్తమును తమకై ధారవోసి యుపాధికల్పించినతల్లి మానసమిట్లే పుల్లవిరిచినట్లు విరిచేశారు తనయులు. ఆమెభావములు తారుమారైయాయి. అందుకనే మగనిరాజ్యం తన రాజ్యం యనుభవించి సుఖించాలనియు, పుత్రుల రాజ్యము చూచి సంతసించాలని యన్నారు అనుభవ శాలులైన పెద్దలు. పోనీ పెట్టినా మానినా మాటైనా మంచిగారాలేదు కదా యని విచారించిందామె. "మనసువిరిగెనేని మరియతకదు తరిమాన" అన్నట్లు యదిమొదలా సుభద్ర, బిడ్డలనేమియు యడుగక చేతనైనట్లు వండిపెట్టుచు ముక్తసరిగాభాషించుచు భర్తకు పరిచర్యచేయుచు కాలక్షేపం చేయుచుండెను.

పిల్లపెండ్లి తప్పనిదౌట పాతయిల్లు విక్రయించి యేదో సంసారపక్షమువానికిచ్చి పెండ్లిచేసేసిరి. కాని తరువాతి రజస్వలా శుభకార్యము లెట్లో తప్పని సరియౌట ముగ్గురన్నలుకలిసి తూటాతూటీగా, స్వల్పమూల్యముతో చేసేసి సూర్యాన్ని యత్తవారింటికి

చేసి తమబలువు వదల్చుకొనిరి. ముగ్గురుకోడళ్లు పురానికొచ్చిరి. అత్తగారే వంటలక్కవలె రెండు పూటలు వండుచుండెనే కాని, యొక్కకొడుకూ తమ భార్యలను ప్రోత్సహించికాని, కోపపడికాని యొకసారైనా వండించరైరి. పైపనులకైనా సహాయపడనీయక రాణివాసపుస్త్రీలలా కాఫీలుకాపించుకొని త్రాగుచు మెలగుచుండిరి. పెద్దావిడ యింగ్లీషు విద్యావతి. సాయంకాలము భార్యాభర్తల షికార్లు, మాటింగులు, రాత్రిళ్లు సినీమాలు, వారిప్రవర్తన వేళకు భోజనాలుగాయున్నది. రెండోయామె ధనవంతుల యాడుబిడ్డ. పనిచేయుట నీచలక్షణమన్న యభిమాన గర్వవతి స్వతంత్రురాలు. ఇంట్లో సగటుమీద వండిన వంట నచ్చక నిత్యము స్వంతసొమ్ముతో హోటలు కూరలు వేపుళ్లు వేరుగాచేసుకొని యందరి పంక్తిలో నున్నను భర్తకేసి తానువేసుకొని తింటుంది. ఇట్టి నిల్లుబోతు, యత్తగారికి పంచర్యచేయునా? భార్యకు సలాందారుడు భర్త ధనముండుటచేత. ఇక మూడవ యామెసంగతి: సుగుణవతి అత్తగార్కి తోడికోడళ్లు చూడకుండా చాటుమాటున సహాయపడుచుండును. తన యక్కలుచూస్తే సమానమవక కొంచబరిచి హేళనచేస్తారన్న భయ మొకప్రక్కయు, అంతమంచి యత్తగారి కింతటియగచాట్లా! ఎట్లన్న విచార మొక ప్రక్కను యీమెను వేధించుచుండెను. అందుచే చాటుగా నామె కుపచరించుచుండెను.

"చేసికొన్న కర్మమోయి, శంభులింగమా! అనుభవించక తప్పునా అబ్బులింగమా" యన్నట్లు కొడుకుల నింతగా వృద్ధికిదచ్చి చేతకాసు లేకుండచేసికొనిన తన తెలివితక్కువకు మనసులో దుఃఖించుచు మరొక దారి లేక, వారి చీదరింపులకు తలయొగ్గుచు నట్లనే వృద్ధులు కాలక్షేపం చేయుచుండిరి.

తల్లి చిరుగులబట్టలు కట్టుకున్న కొడుకుల కళ్లు మూసికొనిపోయాయి. కోడళ్లకక్కరలేదు. తమకి నెలనెలకు పట్టుచీరలు కొనుక్కొనుటే కాని అత్తగార్కి రెండుకట్టుడు చీరలు తెచ్చిపెట్టండని చెప్పే కోడలొక్కతీ లేదు. ఏపేరంటమొచ్చినా అత్తగారిని వాళ్లు రమ్మనుటేలేదు. ఎందుచేత? తమహోదా కామె సరిరాదు. పంటిని నగలేదు, కట్టుటకు మంచి చీరైన లేదు. అట్టిపేదరాలు యత్తగారు తమతో నెట్లురా నర్హురాలని వారి యూహ. సత్స్వభావ యగు సుభద్ర, కొడుకుల ప్రవర్తనలకే కుమిలిపోవుచుండెను. మనబంగారము మంచిదైనయెడల, కంసాలి ననవలసిన పనియేమని, తనవాళ్లే కానివాళ్లవగా, పెరవాళ్లగు కోడళ్లు తమవాళ్లెట్లగుదురని యెంచి, తప్పుకు తావీయకుండ, మాటపడకుండ, తలవంచికొని, యెవరినేమియు ననకుండ కాలము వెళ్లబుచ్చుకొనుచుండెను. కాని యొక్కసంగతి కామె ఖేదపడుచుండెను.

తమకెట్లున్నను, నాల్గుయేండ్లయి, నట్టింటికొక్క పండుగకైన కూతుళ్లు రాలేదు. తమకా స్వతంత్ర ధనములేదు. కుమారులకి వారి తలంపేలేదు. ఇక వారిని తీసుకువచ్చి, నట్టింట నాల్గురోజులుంచుకొని, యొక క్రొత్తబట్ట బెట్టి సాగనంపుటెట్లన్న యాలోచనయే యీమెను వేధించుచుండెను. ఎంతయైశ్వర్యములో సౌఖ్యపడుచుండినా స్త్రీలకు పుట్టింటి యభిమానము మెండుకదా! చూచాయల, అన్నల సంగతి నెరిగినవారగుటచే, శేష సత్య సూర్యములు, పుట్టింటికేగు తలంపులే విడచిరికాని, తలిదండ్రుల చూడవలెనని దిగులుపడిపోవుచుండిరి. పిలువకపోతే వెళ్లుటెట్లని, మగలహేళనలకు జడిసి, వారంతట వారు రామనిరి. తలిదండ్రులను పిలిపించుకొనుటకా యస్వతంత్రలు.

ఇట్లుగా వారును, యట్లుగా, తలిదండ్రులును హృదయవ్యథ నొందుచుండిరి. ఇట్లుండ సంక్రాంతి పండుగవచ్చింది. పెద్దకోడలు, చిన్నకోడళ్లు మగలను దీసికొని పుట్టింటికేగిరి. మూడవయామె నంతకు క్రితమే వచ్చినదగుటచే యీ పండుగకు వెళ్లలేదు.

కొంచెము తనకు సహాయకారి యాకోడలే యగుటచే, సుభద్రమ్మ తనయభిలాష యామె కెరింగించెను. ఆకోడలు సుగుణమణియగుట, స్త్రీల యాశ లందరికిని యొకటేయన్న తలంపుతో తనమగనికి, యత్తమామల యభిప్రాయ మెరింగించి, నచ్చచెప్పి, ఆశబడుచులను, దీసికొనిరా మగనిని బంపెను. ముందుగా పెద్దామెయింటికేగి పిలచెను. అన్నవచ్చె నన్న సంతసమున, తమరిని చూచుటయే లేదన్న ద్వేష భావము దూరీకృతమవగా, చెల్లెళ్లు ముగ్గురుకూడ, పరమానందభరితముగా, నాతనిని గౌరవ పురస్సరముగా నాదరించి, క్రొత్తబట్టలు కట్టబెట్టిరి. చెప్పుట కన్న చేసిచూపించుటచే, నితరుల మనస్సుల కెక్కుడుగా నాటును. వీరి యవ్యాజానురాగమున్ను తమ యనాదరణయు, తావేలువేసికొని, అన్నగారంతయు తమ యవినీతికి వగచెను. నాల్గేండ్లయి, తమనుంచి యొక్కరవికల బట్టైన చెల్లెళ్లెరుగరుగదా! అట్టిఅన్నకు విందులు. నూతనాంబర బహుమానములు, ఇట్టి పరిస్థితి, గూలములా వేధించుచుండెను. బావలను బ్రతిమాలి చెల్లెళ్లనుఁ దోడ్కొని నారాయణు డింటికి వచ్చెను. కూతుండ్రు, తలిదండ్రుల నాలింగనమొనర్చుకొని, కండ్లనీళ్లు నించిరి. తల్లివిచార మపారము. సంగతులన్నియు సావకాశముగా తల్లివారల కెరింగించెను. మూడవకోడలి సహాయాదరణముల చేతను, నారాయణుని ఖర్చుచేతను, పండుగ లానందకరముగా గడచెను. ఈసారి చెల్లెళ్లతో పాటు తల్లికి తనయుడు నూతన వస్త్రముల నొసగెను. తండ్రికి కూడ నిచ్చెను. ఆగర్భ శ్రీమంతులై, సుఖసంపదలనుభవించిన తలిదండ్రులు, రాతిహృదయముగల తమ యన్నల మూలమున, కుచేలముల ధరించుట, భరింపరాని దుఃఖహేతువై, మిగతా యన్నలురాగనే, వారుముగ్గురుకలిసి పంతులప్రకారము తలిదండ్రుల తమవద్దనుంచుకొనుట కేర్పరుచుకొనిరి శేషసత్య సూర్యములు.

పండుగల యనంతరము కోడండ్రిరువురతో, కొడుకులువచ్చి చెల్లెళ్ల రాకజూచి, తమరు లేకుండా చూచి వీరలను తీసుకువచ్చు కుళ్లాలోచన లేలయని, చిరుబురులాడిరి. కోడళ్లు యాడబిడ్డలను పల్కరించనేలేదు. తమకి భుక్తికేలేనప్పుడు వదినలభయము కాని, ధనశాలులకు వీరిలెక్కయేమి. ఒకనాడు భోజనసమయమున ప్రస్తావన వశమున తల్లియు, కూతుళ్లును, కలిసి అన్నలను వడచివాట్లువేసిరి. "మీ నిమిత్తమే కదా యీసాధ్వి బొందుధరించెను. మీమీ యున్నతికైయే యీమె స్వసౌఖ్య నాశన మొనరించుకొని. చేత కానులేని నిర్ధనురాలయ్యెను. కృతఘ్నులార! కఠిన శిలకైన, మాతృపితృభక్తి యుండునే అంతకన్న నిర్దయులు మీరు. కన్నవారి ఋణముదీర్చనివాడు, కులనాశకుడు రౌరవాది నరకములు బడునని పురాణములు ఘోషించుచున్నవి. మీకు భారముకాని, యీవృద్ధులు మాకు భారము కాదు. భార్యలనలంకరించి, తల్లిని దాసిగా తయారుచేయు మీవద్ద వారి నిక యుంచజాలము. మాతో గొంపోయెదమని యొక్కొక్కరింట నాల్గేసిమాసము లుంచికొన నేర్పరుచుకొని కూతుండ్రు సుభద్రా జగన్నాధముల తమ వీండ్లకుఁ గొంపోయిరి. సకల సౌఖ్యములవారిని బూజించుచు, మాతృ, పితృఋణములఁ దీర్చికొనుచుండిరి.

తలిదండ్రుల నేడ్పించిన యనుయూరికేఁ బోవునా!! ధన మశాశ్వతము. స్థిరనదపడికలు లేనివారలను లక్ష్మి విడనాడ యీడిప్రెషన్ రోజులలో మొదటి యిద్దరి యుద్యోగములూడెను. రెండవవాని భార్య పుట్టినింటి ధనము జూచికొని, మగనిని పురికొల్పి పుట్టింటికేగెను. కాని యిల్లరికపుటల్లునిపాట్లాతనికి దప్పలేదు. వచ్చేదామంటే వేరాధరువులేక, భార్యాహస్తమందలి బొమ్మయై నౌకరియై మెలగుచుండెను. పెద్దామె, నీకేలేనప్పుడు నాకేలా పెట్టగలవని, ట్రైనింగై స్వతంత్రోపాధిఁ గల్పించుకొనుటకై స్కూలులో ప్రవేశించెను. మూడవవాని కాపురము బాగుండెనుకాని, అన్నలకు పెట్టుటకు వారితమ్ముడు కాడు గనుకనా? లేమిదేవత విశేషముచే చూపు క్రిందికిదిగింది కాని, మరివారురారు, కూతుళ్లు రంపరు. ఇదే పుత్రపుత్రికా హృదయభేదము, పురుషుఁడు శిల. స్త్రీ ద్రవము.!!!

# ఆనందవనము.

అష్టావధాని వడ్డాది సీతారామాంజనేయులు.

ఉ॥ కొందలపాటు లోన నొనగూడఁగ లీల నుపన్యసించు నా
నందవనస్థమాప్రకృతి నాతనువల్లినిఁ, దీర్ఘపీఠికన్
స్పందమొనర్చి దివ్యమగుభావములన్ వికసిల్లఁజేసె; నా!
నందలి భస్మరాశి మహిమాతిశయమ్ము వచింపశక్యమే?

ఉ॥ పేదల జ్ఞప్తిఁదెచ్చెడు పవిత్రపరాగచయమ్మునందు నో
సోదర! రంగరాయ! భవదుద్భటరూప మదే! 'తెలుంగుజెం
డా'దసిలీబుటాల జిగిరాయము హాయిగ నివ్వటిల్లఁగా
మోదముపుట్టెఁ 'గోకిల' విమోహనగాన మనూనమైతగన్.

ఉ॥ పొందుగ భూతపంచక సముజ్జ్వలగేహము, దేహమంది, త
న్మందిరభూమి భూతమయతత్త్వము పేర్మిఁ బ్రవర్ధమానతన్
బొందుచు, నంతమందు నలభూతములందె విలీనమయ్యెడున్
సందడిదీఱి జీవుఁ; డిఁకసర్గము, సంస్థితి, నాశనమ్ము లెం
దెందు ఘటిల్లు నప్రకృతియెల్ల గణింపఁగఁ దత్త్వరీతి నా
నంద వనమ్ము; భూతవిభు నందనసీమను, దీని నెన్నదన్.

చ॥ గణములుగొల్చుచుండఁ దమిఁగాంచి హరుండు సురాసురాళులున్
గణుతి యొనర్పఁగాఁ బితృవనమ్మునఁ జల్పెడు తాండవోద్ధతిన్
బ్రణవనినాదమేదురతఁ బ్రాంతశివాలయమందు నెంతయున్
గణగణ మ్రోఁగుగంట లెసకమ్మునఁ దెల్పెడు సంజపోకడన్.

ఉ. బైళుల లేఁతపచ్చికలు బాగుగమేసి యథేచ్ఛమీఱి 'నం
బా'లపనమ్ము లొప్పఁగ గృహావళికేఁగెడు నాల మందలన్
దోలుక పోవుచున్ గదువినోదముతోడఁ బదాలు వాడు గో
పాలుఁర గానమాధురిమ వైళమసంధ్యను వీడు కొల్పెడున్.

క. మాగాణులఁ బగలెల్లన్ । బాగుగఁ గష్టించియింట భార్యాసుతసం
యోగమ్మున సుఖయింపఁగ । నేఁగుచునున్నారలలసి యెలమిన్ గృషికుల్.

క. లౌకిక సౌఖ్యవిభూతికి । నాకము లనఁదగు నికేతనములకు జీవా
నీకమ్మునరియెఁ జీఁకటి । వ్రేఁకమ్ముగఁ దోఁచి యావరించుచు నుండన్.

ఉ. చూపులు వాలులోనఁ గలచోట మినుక్కు మినుక్కురంచు సం
దీపితమైన దీధితుల తేజము సర్వము మ్లానమూట ఘూ
మోపమసాంద్రసంతమస ముత్కటమై ప్రసరించె దిక్కులన్;
స్వాపముఁ జెందెమారుతము; సర్వము మాటుమణంగె నయ్యెడన్.

శా. ఈ నిశ్శబ్ద గభీరసంస్థితిని నొందే నొక్కచో ఘుల్లికా
స్వానం బొప్పెడు; క్షేత్రగోష్ఠముల విశ్రామార్థ మందందు సం
ధానింపంబడు నుక్షసంచయ గళోద్యద్ఘంటికా వ్రాతలీ
లానిస్వనము, సత్పశుప్రతతి జోలల్ పాడి జోకొట్టెడిన్.

ఉ. "మేదినిపైఁ బురాతనత మించు మదేకతమైన ప్రాభవం
బీడెనఁ బోవునట్టి జనమెల్లఁ గలంచెను" నంచుఁ జంద్రుతో
నాదరి శైవలావృత శివాలయ కుడ్యమునన్ 'హుంటీఘుటీ'
నాదముఁజేసి కౌశిక మొనర్చె మొఱల్ వినవచ్చె సుస్థితిన్.

చ. పరిమళ బంధురమ్మగు ప్రభాతపుఁ దెమ్మెర మేలుకొల్పులున్
గిరబిఁ బూరిగూండ్లనిడు పిచ్చుక పింఛుల తుఱ్ఱుమన్ ధ్వనుల్
'కుఱకుఱ కొక్కురో' యనుచుఁ గుక్కుట సంఘమొనర్చు నాదముల్
పరువడి వేటకున్ జనెడు పోఁజుల బూరల మాఱుమ్రోఁతలున్
గఱగొఱ సెజ్జనుండి యిఁకఁ గ్రమ్మఱలేపఁగ వేవువారలన్.

చ. పోయి వెలుఁగొందుటల్, గృహిణి పొందుగ సంజ సపర్యఁ జేయుటల్
ప్రియమగు ముద్దుపల్కులను బిడ్డలు నాయనరాఁగఁ బల్కుచున్
రయమున జానుయుగ్మ మెగఁబ్రాఁకుచు నీసున హెచ్చి ముద్దుమున్
గయికొనఁగాఁ గడంగుటలుఁ, గ్రమ్మఱఁ బో విఁక వారికోసమై.

ఉ. పైరులు వంగి లొంగినవి వారలమేల్ కొడవండ్లధాటికిన్
వారలచేతి నాగళులపాటున బీళులు మెత్తగిల్లె, వే
సారఁగఁ గాఁడిమేఁడిఁగొని హాయిగ వారెటు దుక్కిదున్నిరో!
వారి భుజాహతి ప్రభకు వంగి మహీజము లెట్లువ్రాలెనో!

క. వారి సహేతుకమగు వ్యా। పారము, సాధారణ ప్రభవసౌఖ్యమ్మున్
ఘోరవిధివ్యత్యయమున్। గేరకుఁ డాశాప్రమత్త కింకరులారా!

క. ఘనసంగ్రహాసాత్వికజీ। వనులగు పేదలకథావిభాగముల, సహే
తనముగ విని నవ్వకుఁడీ। ఘనతర విభవమునఁ ద్రుళ్ళు గర్వితులారా!

చ. మించిన వంశగర్వమును, మేటిప్రభుత్వ వికాసమున్, ప్రదీ
పించు మనోహరత్వమును, విత్తపుఁ బెంపును నొక్కరీతినే
కాంచెడుఁగా యలంఘ్య ఘటికా ప్రతిపత్తినిఁ, దత్ప్రసిద్ధి సం
ధించెడి మార్గముల్ తుదకుఁ దీసుకపోవును వల్లకాటికే!

చ. ఒలుకులమిట్టఁజేరునెడ నుండకపోయెను వేదనాదముల్
కలిమియెలర్పఁ బ్రేతమును గందపుఁజెక్కలఁ గాల్పరైరి, ప్రో
జ్జ్వలగతిఁ గర్మకాండమును జల్పకపోయిరి, దానధర్మముల్
'బళి!'యనఁ జేయరైరి, స్మృతిపద్యము లేవియులేవటంచుఁ బీ
దలను హసింపఁగా వల దుదంచిత గర్వితులార! యెన్నఁడున్,

క. పీనుఁగుస కలంకారము లూనించిన వచ్చునొక్కొ- యూపిరిమఱలన్;
మానించిన శైథిల్యము పోనేర్చునె? స్తోత్రపాఠములు వినఁబడునే?

మ. అనవద్యమ్మగునట్టి దివ్యతర కర్మావేశ పూర్ణాత్ములున్,
ఘనసామ్రాజ్య ధురంధర ప్రవణులున్, గాన ప్రభావాఢ్యులున్,
ప్రణయీభూత నవీన భవ్యకవితా ప్రజ్ఞాస్ఫురత్సారవ
శ్యనిహూషల్ లయమొందిరెందఱో యుపేక్షన్ బొందు నిత్తావునన్.

క. కాని యెపుడైనవారికి। జ్ఞానము, తనచే హృతమగు కాలచరిత్రో
చూ్పనత ఘనమైన స్వేకీ। యా నూతపుఁబుటను విప్పదయ్యెను గనఁగన్॥

క. కవియుచు లేమిడియనుచలి। చివికెను నవ్యాదిదివ్యశీలమడఁచి త
త్ప్రవిమల హృదయౌదార్య। ప్రవాహము ఘనీభవించు భంగినొనర్చెన్॥

చ. విమలతరోజ్జ్వల ద్యుతుల వెల్గెడు రక్నకదంబ మొల్ల సం
ద్రమున నగాధఘోర తిమిరావృత గహ్వరపాళి డిందుఁగా!
సుమనిచయమ్ము విచ్చి కమనాంపెసలారెడు సౌరభమ్ము వ్య
ర్థముగ నరణ్యసీమల యథాయథలాగతి నించెమన్ గదా!

ఉ. వేమయు మేరుధైర్యమున వెల్వడి యోపికతోడఁ గ్రూరభూ .
స్వాములపై నెదుర్కొనిన జానపదాఖిల లోకమాన్యులున్,
గోముగఁ గైతవాఞ్ఛనుటకున్ దగి మూఁగలైన పోతనల్,
ధీమహిమన్ త్రిలోకములఁ దేర్చఁగఁ దత్త్వముఁ గ్రుమ్మరింపఁ జాల్
స్వాములు నాదిశంకరు లలక్షితులై యిట నొందఱుండిరో!

చ. చతురవచో విలాసముల సభ్యుల సన్నుతులంది నాయకాం
చితులగుటల్, స్వధర్మమును నిల్పఁ బ్రభుత్వ నిరంకుశత్వ దు
ర్గతి నొనగూడు నష్టములఁ గష్టములెల్ల నలక్ష్యపెట్టుటల్,
వితతముగా సమస్త శుభవృత్తుల దేశము నొప్పఁజేసి యూ
ర్జితముగఁ దత్ప్రజా నిచయదృప్తి నుదగ్రతమా స్వకీయపున్
గృతులు గ్రహించుటల్, విధి నికృష్టత దుర్ఘట మయ్యె వారికిన్.

సీ. రక్తప్రవాహాళి రహిఁ జల్లులాడుచు నేఁగి సింహాసనోద్వృత్తిఁ గనుట,
మానవజాతి పెంపూనకుండఁగ దయా దృఢకవాటమ్ము బంధించియుంట,
హృదయవేదనను సహించియైనను సత్యమును గప్పిపుచ్చఁగాఁ బూనుకొనుట,
యవమానజన్య లజ్జాధిక్యమును నేర్పు మించ లోలో నణఁగించుకొనుట,

గీ. గర్వమత్తులైన భోగులు గద్దెకడఁ గవిత్వనీరాజనమ్ము లర్పించుచుంట,
మొదలుగాఁగల యవినీతిపుంజమడఁగె దిష్టమున వాశిలంబు నిరోధింపఁబడఁగ.

చ. పొనుపడి వెఱ్ఱిఁగొల్పు నలమూఁకల నీచపు గొట్టులాట లె
చ్చినకడఁ దప్పిజాతియును జేరవు వారి ప్రశాంతభావముల్,
ఘనతరశాంతిజీవన వికాసపు ద్రోణికలందు నెంతొ పా
వన మనుపద్రవమ్మయిన బాటల నేఁగిరి వారలెప్పుడున్.

క. పొందుగఁ దముఁ బ్రేమించెడు డెందములన్ విశ్రమించి డెప్పరపుటకన్
గ్రందుకొను పాపనాశ స్పందన మర్థించుచుండు రసమయువారల్.

[ఆంగ్లకవి 'గ్రే' రచన కనువాదము]

# ఆదర్శప్రాయురాలు

శ్రీమతి సిహెచ్. వ. రమణమ్మగారు

'కమలా! పేపర్లో విశేషాలేమిటే' అంది విమల.

'ఏముందే, పాపము, యమ్.బి.బి.యస్. చదివే విద్యార్థి ఒకడు, జబ్బుతో బాధపడే ఒక పేదవానికోసం, తన శరీరంలోవుండే కొంత వేడిరక్తాన్ని యిచ్చివేస్తే, పేదవాడు బ్రతికి, ఆ త్యాగశీలుడు చనిపోయాడట. అంతా భగవల్లీల.'

'ఏమిటే, యెప్పుడూ పేదవాళ్లు పేదవాళ్లు అంటూ గోలపెడతావే. పేపర్లో విశేషాలేమీ లేవు? లేకపోతే నీకు కనబడవా? లైనర్‌జార్జి అనే స్టీమరుఉందా, వెళ్ళిపోయిందా? లూయిస్, వాళ్ల స్టీమరు ఒకటి తప్పిపోయిందటగా?'

'ఏమోనే యివన్నీ నాకేం తెలుస్తాయ్. నీకంటు మీ తండ్రిగారిచ్చిన ఓడలవ్యాపారం ఉంది కాబట్టి, యేఓడ యెప్పుడువచ్చిందో, యెంత వేరుసెనగ వేసుకొని వెళ్ళిపోయిందో కావాలి. గాని నాకెందుకే యివన్నీ?

'మరేం కావాలి నీకు? ఏ యే దేశనాయకు లెప్పుడు జైలులో ఉంచబడింది, పేదవాడిని ఎవ్వడు ఆదరిస్తున్నాడో, యివా నీకు కావలసినవి? ఎంతసేపూ పేదలు పేదలో అని ఏడుస్తారు. మీకు వాళ్ల మొఖం ఏలాచూడబుద్ధవుతుందే? కావడిబద్దల్లాగు వంగిపోయిన నడుముల్తో, అరఅంగుళం లోపలకుపోయిన కళ్లు, సన్నగా వెదురువాసాల్లాగుండే అవయవాలతో చెమటకారుస్తు నల్లగా మాగిపోయిన దేహాల్తో, దేవుడా అంటూ ఏడుస్తుండేవాళ్ల విషయం ఆలోచించడమైనా ఎలాఆలోచిస్తారే మీరు?'

'పోనీగాని, పరీక్షలై పోగానే ఏంచేస్తావ్?' అంటూ మార్చేసింది సంభాషణ—కమల ఎంతసేపైనా ధోరణి యిలాగే పోతుందని.

'నీవేంచేస్తావ్?'

'చేసేదేముంది...బి.ఎ. పూర్తిచేసి ఎక్కడో ఉద్యోగంచేసి మాతలిదండ్రులను పోషించాలని దేశసేవచేస్తూ బీదలకోసం పాటుబడాలనివున్నది. ఏమో మరి అపరమాత్ముని ఆదేశమెలావుందో! నీవేంచేస్తావ్?'

'నేను చేసేదేమిటి! ఏదో ఉన్న వ్యాపారాన్ని జాగ్రత్తగా నడుపుకోవడం, యింకో రెండుమూడు పడవల కూలీల్ని పెట్టించి 'లాండింగు' (Landing) కూడా మనమే చెయ్యడం అని వుంది'

'మరి పెళ్లి ఎప్పుడు చేసుకుంటావ్?'

'పెళ్లిమాట ఎత్తకు. ఒకరికి లొంగి వుండడం నాకిష్టములేదు. కాని నీమో స్తరుగా

సంసారంలోకి దిగటంతోడనే దేశసేవో, బీద సేవో, స్త్రీసేవో, నాశనంపొతుంది అన్న ఆలోచనతో మటుకు కాదు' అంది విమల.

విమల ఆలోచనలను చూచి ఒక చిరు నవ్వు నవ్వుకుంది కమల.

కమల విమలసహపాఠి; పేదరాలు. విమల ధనముతో తులతూగుచూవుంది.

భాగ్యమునకు తగినట్లుగానే మనుజుల ఆలోచనలు నడుస్తూవుంటాయి. విమల యెప్పుడు తన చదువు పూర్తియగునా, యెప్పుడు మితిలేనిభాగ్యముతో తులతూగుతూ, నిర్భాగ్యులగు పేదవారి మీద 'హుకుమ్' చలాయిండమా అని ఆలోచిస్తూ వుంటుంది. ఆమె దృష్టికి ధనహీనులు యెందుకూ పనికిరారని దేశంలో భాగ్యభోగ్యములన్నీ అనుభవించడానికి తగరని అటువంటివారు చస్తేనే మేలనియు కనుపడు కాని కమలమటుకు అట్లు గాదు. పేదలను ఆదరించుట, విద్యరాని వాళ్లకు విద్యచెప్పించుట, దేశమునకు సేవ చేయుట మొదలుగాగల ఆలోచనలు ఆమె చిన్నమనస్సుకు తట్టుచూవుండేవి. స్త్రీలలో కమల చాలా పేదరాలయినప్పటికీ ఆమె మనస్సులోమాత్రము చాలా గొప్పఆలోచనలు పుట్టుచూవుండేవి.

౨

మనసులో వుద్దేశములమీదనే వారి వారి భావిజీవితం ఆధారపడివుంటుంది. కమల బి.ఏ. పూర్తిఅగుటతోడనే చెన్నపట్నం వెళ్లి యెల్.టి. కూడా పూర్తిచేసి ఒక ఆడపిల్లల బడియందు ఏలూరులో హెడ్‌మిస్ట్రెస్‌గా వుండి నెలకు నూటయేబది రూపాయిలజీతం తెస్తూ తలితండ్రులను సోదరుని పోషింపుచున్నది. తలితండ్రులు మితిలేని ఆనందము పొందుచూవుండేవారు. ఈమాదిరిగా నాలుగేళ్లు గడిచినాయి.

కమల క్రమక్రమముగా తన జ్ఞానమును అభివృద్ధి చేసుకొన్నది. పరిమాణినది. దేశములోవున్న పెద్దలదయవలననూ, తను కష్టపడి సంపాదించుకున్నదానితోనూ, అనాధలకు శరణాలయం ఒకటి కట్టించవలయునని అనుకున్నది. గాని ఆమె మనస్సంతా తను పుట్టిపెరిగి చదువుకున్నప్రాంతగు గుంటూరి యందేయున్నది. వుండదా మరి! 'జననీజన్మభూమిశ్చ, స్వర్గాదపిగరీయసీ' అని పూర్వులే అన్నారా? అందుచేత గుంటూరులో 'శ్రీ భారతఅనాధశరణాలయం' అనే పేరుతో శరణాలయం కట్టించింది. కొద్దిరోజులలోనే ఆమె మొదలుపెట్టబోయేపని దేశాలకన్నిటికిని ప్రాకిపోయినది. చాలామంది తమతమ బిడ్డలను ఆశరణాలయమునకే పంపుటకు మొదలుపెట్టినారు. పైవూళ్లనుండి అనాధలు వితంతువులు నగు బాలికలు దాదాపు యేబది మందివచ్చి ఆమె శరణుచొచ్చినారు. వూరిలో వారంతా దాదాపు అరువదిలేక డెబ్బది మంది, భాగ్యవంతులయితేనేమి పేదవారయితే నేమి, వచ్చి ఆస్కూల్లో ప్రవేశించినారు. అచ్చట అన్నివిధములయిన విద్యలు నేర్పుతారు. హిందీ, సంగీతము, ఆంగ్లము, తెలుగు,

వ్యాయామము, నూలువడుకుట, దేశసేవ మరి యితర శాస్త్రములు మొదలగునవి అన్ని రకముల విద్యలను పిల్లలు నేర్పుతో నేర్చుకుంటూ వుండేవారు. కమలకు గాంధీ మతమన్న యిష్టము. అందుచేత కద్దరు కట్టుట వాలింటీరుపనులుచేయుట, తన కున్నవి సరికదా పిల్లలకుకూడా నేర్పించి ఆ పిల్లలను కన్నతల్లికంటే యెక్కువగా దయతో వారికి యేవిధమయిన లోపము లేకుండా పెంచుచున్నది. ఆబాలికలకుగూడా ఆ మాతృమూర్తి అంటే అటువంటి భయ భక్తులే వుండేవి. ఉండక యేమవుతాయి. చెట్టుఒకటి ఐతే విత్తువేరొకటిఅవుతుందా? అందుచేత కమల తను స్థాపించిన వుద్య మాన్ని తన అన్నగారి సహాయముచే ఒక విధముగా బాగానే నేర్పుతో గడుపుకొని వస్తున్నది.

ఇక ఆమె ఆశ్రమములో కార్యక్రమము చాలా పొగడతగినదిగావున్నది. విద్యార్థి నులు ఉదయం నాలుగుగంటలకే లేవడం కాలకృత్యములు స్నానములు మొదలగునవి పూర్తిచేసుకొని అయిదు గంటలకల్లా, ప్రార్థ నామందిరములోనికి వెళ్లవలయును. కమల కూడా అప్పటికప్పుడే స్నానము మొదలగు నవి పూర్తిచేసుకొని ఖద్దరువస్త్రములు ధరించి మూర్తీభవించిన భారతమాతా యన్నట్లు వచ్చి తన నియమిత స్థానమునందు చేతులు జోడించుకొని నిలుచుని వుంటుంది. పిల్ల లంతా ప్రార్థనకు తయారుగానున్నపుడామె నిశ్చలమైన మనస్సుతో కళ్లుమూసుకొని 'వందేమాతరం'అనే కీర్తన భక్తిభావముతో పాడుతుంది. ఆమెప్రార్థన ముగించుటతోడనే పిల్లలందరూ మహాత్మునికి ప్రియమైన 'వైష్ణవ జనతో' అనేకీర్తన పాడతారు. తరువాత కమల దాదాపు ఒక అరగంటసేపు భగవత్ గీతచదివి పిల్లలకు చెప్పతుంది. అటుతరు వాత క్రమముల ప్రకారం కొంతమంది పిల్లలు వీణెయు మొదలగు వాటితో చక్కని సంగీత మునుపాడి ఆశ్రమములోవుండే పశుపక్ష్యాదు లను, మనుజులను, చివరకు భవనమును గూడా మేలుకొలుపుకొనుచున్నారా యను నట్లు మధురమగు కంఠముతో గలిపి సంగీత మునుపాడి ఆరుగంటలకల్లా వారివారి గదుల లోనికి వెళ్లిపోవుదురు. తరువాత యేడు గంటలకల్లా చల్ది అన్నముభుజించి స్కూలికి వెళ్లి తమతమ పాఠములను గురువులవద్ద భక్తి శ్రద్ధలతో నేర్చుకొని తిరిగి పదిగంట లకు తమ నియమితగదులలోనికి వెళ్లి పోయెడివారు. తిరిగి రెండుగంటలకల్లా వ్రాలుకుట్లు చదువు దుస్తులు మార్చుకొనుట మొదలగునవి పూర్తిచేసుకొని నాలుగు గంటలవరకూ స్కూలులోపాఠములను నేర్చు కొందురు. నాలుగుమొదలు అయిదుగంటల వరకూ కమలే స్వయముగా పిల్లలందరికినీ వ్యాయామపద్ధతులను నేర్పుతుంది. అటు తరువాత సాయంత్రము యేడుగంటలవరకూ ఆటలు, భోజనములు, ముగించుకొని పది గంటలవరకూ తమ పాఠములను నేర్చుకొన వలయును. పదిగంటలు దాటినతరువాత యెవ్వరునూ మేలుకొనియుండకూడదు.

ఇక విమలో—చిన్ననాడు చెప్పినట్లు వ్యాపారాన్ని వృద్ధిచేసింది. ఆమె క్రింద యిప్పుడు వెయ్యిమంది కూలీలువున్నారు. భాగ్యవంతురాలననే గర్వముచే కళ్లు నెత్తి మీదకు వచ్చినవి. రెండుచేతులా డబ్బు గణించుచున్నది. ఆమె అంటే కూలీలందరికినీ అపరిమితమయిన భయము. యేంచేస్తారు. జీవనోపాధికి వేరుమార్గంలేదు. రోజురోజుకూ భారతదేశమందు దరిద్రులు, క్షామపీడితులు లేక 'అన్నమో రామచంద్రా' అని మలమలా మాడి చావవలసి వస్తున్నది. కష్టపడి రాత్రింబగళ్లూ ఓడమీద సముద్రములో పని చేయుట సరికదా యజమానుల చీవాట్లు చెప్పుదెబ్బలు వారు పడలేకుండానున్నారు. యెవరికయినా యెంతకష్టపడి పనిచేసినా సంతోషించి ఆదరించే యజమానులుంటే వారి కష్టములు పటాపంచలగును. గాని విమల సంగతి అట్లు కాదామెను. కూలీలు మటుక్కు యేమిచేస్తారు. డబ్బు మదము చేత విమలకు కళ్లు కనుపించుట లేదు. కమల సంగతియే మరచిపోయినది. తను ఆడునది ఆట పాడునదిపాట.

## 3

తనపాఠశాల చందాలనిమిత్తమై కమల విమలఉన్న ఊరువెళ్లినది. అచ్చటికి వెళ్లిన తోడనే విమల సంగతంతా తెలిసినది. కూలీలు పనిచేసే గంటలుతగ్గించమని, కూలిడబ్బు ఎక్కువచేయమని ప్రార్థిస్తూన్నాగాని ఆమె వినడంలేదు. అందుచే కూలీలంతా సమ్మెకట్టా లనుకుంటున్నారని వింది. ఆనాడు సాయంత్రం సభలో కూలీలంతా ఏకమవవలెనని, తమకష్టాన్ని బాపేవరకూ పనిలోనికి వెళ్లకూడదని చెప్పింది. కూలీలులేని యజమానుడు గాని, యజమానురాలుగాని, ప్రాణాలులేనిదేహాలని, పేదకూలీల క్షేమమే యజమానురాలి బలమని ఉపన్యసించిన తరువాత కూలీలకందరికీ పట్టుదల ధైర్యం పెంపొందినాయి. పట్టినపట్టు వదలకూడదని నిశ్చయించుకున్నారు.

నాలుగురోజులు గడచిపోయినవి. కూలీలు పనిలోకి వెళ్లడంలేదు. విమలకు ఆశ్చర్యం వేస్తోంది. ఉపన్యాసలిచ్చేవ్యక్తి యెవరో, తనవద్దకువస్తే కాల్చివేస్తామన్నంత ఆవేశంతో వుంది. గవర్నమెంటుసహాయంవల్ల కూలీలనందరినీ, నాశనంచేయాలనేటటువంటు ఆలోచనకూడాపుట్టింది. కాని ఏమిచేయుటకును పాలుపోకుండా వున్నదామెకు. అప్పుడు వాళ్లతో రాజీపడితే బాగుంటుందనుకొంది. అందుచేత మధ్యవర్తుల్ని కూలీలవద్దకు పంపినది. కూలీలంతా వాళ్ళవైపు మధ్యవర్తిగా మాట్లాడడానికి కమలను ప్రార్థించినారు. కమల సరేనన్నది.

అదిఒకరోజు సాయింత్రం. ఇంకాకొంచెము సేపటికే సూర్యుడు ఆకాశమంతా నెత్తురు పూసేస్తాడు, అటువంటి సమయమందు కమలను చూడ్డానికని ఆమెబంగాళాకు బయలుదేరింది. మొదట గర్వముతో మిడిసిపడుచున్న విమలకు, కమల జ్ఞాపకానికేరాలేదు. అందుచేత ఆమె తన్నుపుడుచూచుటకు వీలులేదని కబురుపంపినది. గాని చివరకు ఆమెరాకకు

అంగీకరించినది. పేదరాలగు కమలతో మాట్లాడడానికి ఆమెపరువుకు భంగమనుకొంది. కమలవెళ్లి వారి చిన్నప్పటిసంగతంతా జ్ఞాపకంచేసింది. గాని ధనమదాంధురాలగు విమలకు అవియేమియును చెవికి సోకడములేదు. యెల్లాగయితేనేమి, దయార్ద్ర హృదయయగు కమల, విమలతో, తన మిల్లులలో పనిచేసెడి కూలీలవిషయమై యెత్తినది. వారిని దయతో చూడమని ప్రతిమలాడింది. అంతకంతకు కమలమీద కోపము యెక్కువఅయినది. రోగికి పథ్యపుమెతుకులు రుచిస్తాయా? చివరకు విమలకు యేమీ దారితోచక నౌకర్లలను పిలిపించి కమలను యింటినుండి తరిమివేయునట్లు ఆజ్ఞాపించినది. కమల తన్నుకూలీలుపంపారని వాళ్ళకుకావలసినపని గంటలు తగ్గించమనియు, జీతము యెక్కువచేయమనియు అని అడిగింది. అహంకారమదముచేత విమల తనవల్లే యిదిఅంతా వచ్చిందని, తన్ను నాశనంచేయాలంటే కొన్నినిముషాలుపట్టదని కమలపై కోప్పడసాగింది. కాని కమల కరుణారసపూరిత. కోపమేమిటో యెరుగదు. విమలయును కూలీలు తిండిలేక మాడుచున్నారు. వారిమీద కొంచెం జాలిచూపించుఅని ప్రార్థించుచున్నారు. గర్భదరిద్రులగు కూలీలు తమకమలాదేవి యేమివార్తతెస్తుందో యని బయట విమల గుమ్మముముందు బారులుదీర్చి కూర్చున్నారు. కమలను నౌకరు చెయ్యిపట్టుకొని బయటకు గెంటడం చూచేటప్పటికీ అందరికీ ఒకమ్మడి విమలమీద తిరుగబడుదామాఅని అనిపించినది. కాని కమలచెప్పే శాంతవచనాలవల్ల వారిఅగ్ని చల్లారిపోయింది. ద్రౌపదీ వస్త్రాపహరణమే కౌరవనాశనానికి ఆదిమెట్టు అన్నాడు. ఇదికూడా......

కమల కూలీలందరికీ నీతినిబోధించినది. ఓర్పుతో వుండమని వారికి ధైర్యముచెప్పింది. వారి క్షేమముకోసరము తన శక్తికొలదీ పాటుపడతానన్నది. వారిని ఆదరించి సమదాయించినది. కమలయందు విమలకు పాముపగ. గాని విమలకు అపరిమితమైన దయ, జాలి; ఆమెను మంచిదారిలోనికి యెట్లు తీసికొనివత్తునాయని ఆలోచింపసాగింది. కూలీలు ఆశ్చర్యపడిపోతున్నారు.

౮

కూలీలంతా యిప్పుడు కమలసహాయంతో తమంతటతాము కంపెనీయేర్పాటు చేసుకొన్నారు. ప్రతికూలీకి దానిలో భాగముంది. తాము మొదటినెలరోజుల్లో సంపాదించే దానిలో సంగం వాటాక్రింద పోతుందని కావలసినడబ్బంతా కమలేయిచ్చినది. కూలీలు, యీకంపెనీకి అధ్యక్షురాలుగా ఎన్నుకొన్నారు. వచ్చేలాభాల్లో కమలచే స్థాపింపబడిన అనాధశరణాలయానికి నాలుగోవంతు యిచ్చివేస్తారు. మిగిలినది కంపెనీకి పెట్టుబడికి వినియోగిస్తారు.

విమలవ్యాపారం దీనివల్ల పడిపోయింది. మండిపడిపోతున్నది. యీసంగతంతా విన్నది. యెల్లాగయినా కమలను యీలోకనుండి పంపి, ఆకంపెనీని నాశనంచేస్తేనేగాని తనకు శ్రేయస్సులేదనుకొంది. అందుచేత ఓరోజున కమలను చూచుటకువచ్చినా ననుమిషతో

ఆమెవద్దకు వచ్చినది. రహస్యముగా మాట్లాడవలెనని ఆమెకు కబురుపంపినది. విమల వచ్చిందనగానే, కమల ఆమెను దయతో ఆహ్వానముచేసింది. క్షేమసమాచారాన్ని అడిగింది. విమలమటుకు కమలను తుదముట్టింప, ఆలోచనచేస్తూవున్నది. అనుకూల పరిస్థితులకోసం యెదురుచూస్తూన్నది.

కమల పరాకుగానున్నపుడు, విమల తాను దుస్తులలోదాచిన బాకును పైకితీసింది. ఆ సమయమందే కమలకోసం యెవరో వచ్చారనిన్ని, కార్డు యిచ్చినారనిన్నీ చెప్పడానికి ఓకూలీవచ్చాడు. అతడు యీదృశ్యాన్నిచూచాడు. భుజాన్నివున్న గొడ్డలిని విమలపైపు విసరివేసినాడు. దాంతో నిద్రనుండి మేల్కొన్నదానివలె వులిక్కిపడి లేచింది. ఇదంతా ఒక్కనిముసంలోజరిగింది. అందుచేత ఆమె నిర్ఘాంతపడిపోయింది.

కాని కమల విమలకుసంభవించిన స్థితికి చాలా విచారపడినది. కూలీని చివాట్లు పెట్టినది. వెంటనే డాక్టరుకు కబురుపంపినది. అతనొచ్చిచూచి దెబ్బబలమైనది. మాడుకు తగిలినది గనుక లాభములేదనిచెప్పి చక్కా వెళ్లిపోయాడు. విమల చావుబ్రతుకులమీద వున్నది. రక్తం కాల్వగా ప్రవహించుచున్నది. ఆమెకు వెనుకటి తనుచేసిన అకార్యములన్నీ జ్ఞాపకమునకు రాసాగినవి. అపరిమితమయిన బాధపడుచున్నది. కమల వుపచారాలు చేస్తున్నది. ఆమెకు కళ్ళవెంబడినీళ్లు ఏకధారగా ప్రవహించుచున్నవి. తనశక్తికొలది విమలను బ్రతికించడంకోసం ప్రయత్నాలు చేసింది. గాని లాభము లేకపోయినది. విమలప్రాణములు నిముషాలమీద నున్నవి. తనుచేసిన దుర్మార్గములకు పశ్చాత్తాపపడినది. కమలను చేతులుపట్టుకొని క్షమింపమని ప్రార్థించినది. పదివేలరూపాయలకు కమల శరణాలయమునకు చెక్కు వ్రాసియిచ్చినది. చేతులెత్తి పరమాత్మను, తనపాపములను క్షమింపమని వేడుకున్నది. "కమలా నీవు ఆదర్శప్రాయురాలవు" అని ఆఖరుమాటగా అన్నది. చీకటి నలుపైపులా ఆవరించినది. విమలప్రాణాలు ఆమెనుండిలేచి పంచభూతములలోకలసిపోయినవి. భగవంతునిమాయ!

శ్లో॥ శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్ ॥

క్లబ్బు

శ్రీమతి సమయమంత్రి రాజ్యలక్ష్మిగారు

"మీరు మరోసారాలోచన చెయ్యండి. మీ బుద్ధిని బాగా వుపయోగించి జరగబోయే పరిస్థితులను గమనించండి. పాశ్చాత్యదేశ స్త్రీలు, మనదేశ స్త్రీలూ, ఆ దేశపు ఆచారములూ, మనసంఘమూ ఒప్పదు. చెప్పవలసినది మరిచిపోయా, అన్నీ యెలావున్నా మనదేశపు పురుషస్వభావం ఒప్పదు."

"సీతా' ఆ ప్రమాణం విశేష వాదమేనా? ఎప్పుడూ ఒకటే పద్ధతా, మనకుమాత్రం నాగరికత అక్కర్లేదా, మానవు; ఆదేశంలో పురుషులూ, స్త్రీలూ ఏవిధం అయిన ఎగమరికా లేకుండా కలిసి మెలిసి వుంటారు. అచటి స్త్రీలకు కావలసినంత స్వేచ్ఛ: స్త్రీ యిష్టం స్త్రీ మీదనే ఆధారపడివుంటుంది. ఆమె ఏమిచేసినా సరే..." అని రామారావు చెప్పబోతూంటే సీత తటాలున తనప్రసంగం మొదలుపెట్టింది.

"ఆగండి! ఆమెకు స్వేచ్ఛ ఎక్కువఅంటే ఆ పురుషుని విశాలహృదయాన్ని, ఉదారతను కొనియాడవలసివుంది. అయితే మనసంఘం స్త్రీలపాలిటి మహాశృంఖలం. మనదేశపు పురుషులు కుంచిత హృదయులు, అనుమానపూరితులు; సహనంఅనేది వారికి లేనేలేదు." అంది సీత నిశ్శంకగా.

"అయితే నువ్వు క్లబ్బుకు వస్తావా రావా? అబ్బా! నిన్ను ఒప్పించేసరికి నాప్రాణంపోతోంది. మన స్త్రీలను పైకి తీసుకువద్దామన్నా రారే! అందుకనే మేమొకకన్య మనలను నూతనచక్రవర్తులనీ, బానిసలనీ ఎత్తివ్రాసింది."

"మీ రెన్నన్నా సరే; నేనుమాత్రం క్లబ్బుకురాను. మీరంతగా పట్టుదలగావుంటే ఈవూళ్లో ఆడవాళ్ల క్లబ్బు ఒకటి స్థాపించడానికి ప్రయత్నించండి. ఆది కాలంనుంచీ మనహిందూవనితలకి మానమే ప్రాణంగా వుంటోంది. అందుకే మనదేశం పాతివ్రత్యానికి పేరు మోసింది. మనపూర్వులు ఎంతో కష్టపడి ఆర్జించిన ఆ చిరతర కీర్తిని క్షణంలో మనం పాడుచేయడమా! నేను మగవాళ్ల క్లబ్బుకు రాను. ఆవిషయంలో నన్ను బాధించకండి. మీ స్నేహితులకు బోధించి వారిభార్యల నేడిపించకండి." అంది ఖండితంగా.

"సరే, చాలించు నీ వ్యాఖ్యానం నీయిష్టమా, నాయిష్టమా, వారంరోజులలో నీవు నీపిచ్చివూహాల్ని, ఆచారాలనీ నీమనస్సులోనుంచి త్రోసి క్లబ్బుకు రావాలి. లేకపోతే నీకూనాకూ చాలాగ్రంధం జరుగుతుంది." అంటూ కోపంతో చివాలున లేచి వెళ్లిపోయాడు రామారావు.

పాపం సీత ఏంచేస్తుంది!! తనకు మగవాళ్ల క్లబ్బుకు వెళ్లడం యిష్టంలేదు. ఆవూళ్లో ఆడవాళ్ల క్లబ్బులేదు. ఇదివరలో తనకు చదువురాదనీ, ముఖ్యంగా ఇంగ్లీషు రాదనీ చాలాగ్రంథం జరిపితే ఎల్లాగో కష్టపడి మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసయింది. తనతో షికారు రమ్మంటే యిష్టంలేకపోయినా అలవాటు చేసుకువడుతూంది.

అప్పుడింతకన్నా యిష్టంలేనిపని ఎలాగా అని విచారిస్తూనే ఈజీచైరులో పడుకుని నిద్రపోయింది.

* * *

రామారావు లండన్‌లో బారిష్టరు పరీక్ష ప్యాసయి స్వదేశానికివచ్చి బల్లకట్టాడు. అతను అక్కడవున్న మూడుసంవత్సరాల్లో మనస్సుకు నాటినది అక్కడి

స్త్రీల ప్రవర్తన. కాంచనది శ్వేతముఖుల షేక్ హాండ్. నిరంతర సావాసం ఆ దొరసానులతో అవడంవల్ల అతని కిచ్చటి స్త్రీలప్రవర్తన వేషభాషలు ఎక్కువగా చిరాకు కలిగించేవి. ముఖ్యంగా తన భార్యవిషయంలో అతను తనదేశంలో స్త్రీలకుకూడా "సమానహక్కులు" వుండాలనీ, తెప్పించాలనీ నిశ్చయించుకున్నాడు. అచట ప్రతివిషయంలో స్త్రీవుండడం ఇచట పరదాలవెనుక స్త్రీవుండడం అతనికి చాలా అహితవ్యంగా తోచింది. ప్రస్తుతం ఒకసంఘం స్థాపించాడు. దానికి తొమ్మండుగురే సభ్యులయినప్పటికీ వారందరూ రామారావు ప్రాణస్నేహితులే!! వారందరూ రామారావుచెప్పినట్లు వినేవారే!! ఆసంఘంలో స్త్రీలకుకూడా హక్కు లివ్వాలనీ, వారినికూడా క్లబ్బులో సభ్యురాండ్రుగా చేర్పించాలనీ ఓ తీర్మానాన్ని బలపరచి వెల్లడిచేశారు. కాని క్లబ్బుకు రాసాహసించే స్త్రీలెవరూ లేకపోయారు. రామారావు ఓ ఆలోచన చేశాడు.

మొదట మెంబర్లంతా తమభార్యలను క్లబ్బుకు తీసుకురావాలనీ అప్పుడు గాని, ఇతర స్త్రీలలో మార్పూ, ఉత్సాహం పుట్టదనీ హెచ్చరించాడు. అసలు ఎవరికీ మనసులో యిష్టంలేకపోయినప్పటికీ నవీననాగరికతకు లోటువస్తుందనే ఉద్దేశ్యంతో, వారివారి భార్యలను క్లబ్బుకు రమ్మని బోధిస్తున్నారు. కాని వారందరూ ఆవిషయంలో సీతకు సోదరీమణులే అయ్యారు. ఊళ్లో ఎక్కడచూసినా రామారావుని గురించే వింతగా చెప్పుకుంటున్నారు. పాపం, సీతకిదంతా తలకొట్టినట్లుగావుంది. భర్తకోర్కె నీడేర్చి పూర్వసాంప్రదాయాన్ని, గౌరవాన్ని పాడుచేయడమా—లేక స్వాతంత్ర్యం కొరకు భర్తకు వ్యతిరేకించడమా—అనేసాడు తీర్మానాలూ ఆమెమనస్సుని ఆందోళనపూరితం చేసేసాయి. తనస్థితిలోనే మిగతా మెంబర్ల భార్యలంతా వుంటారని తలచి వాళ్లసలహా తీసుకుని ఏదో ఒకటి నిశ్చయంచేసికొంటే నలుగురితోపాటు ఉండవచ్చునని సమాధాన పడింది.

## ౨

రుక్మిణి, డాక్టరు క్రిష్ణారావుభార్య: మంచితెలివి, చురుకూ గలది. కాపరానికివచ్చి రెండేళ్లయింది. తెనుగు బాగా చదివింది; కొద్దిగా ఆంగ్లంలో ప్రవేశం కలుగుతోంది. క్రిష్ణారావు మూడేళ్లనుంచి ప్రాక్టీసు చేస్తున్నాడు. రామారావుకు బాల్యస్నేహితుడు. తల్లీ తండ్రీ దగ్గరే వున్నారు. ఒక్కడే కొడుకవడంవల్ల చిన్నప్పటినుంచీ, గారాబం పట్టుదలా ఎక్కువ.

అతనుకూడా క్లబ్బులో సభ్యుడవడంవల్ల రుక్మిణీని క్లబ్బుకు రమ్మని నయాన్నీ భయాన్నీ బలవంత పెడుతున్నాడు. రుక్మిణి తనస్థితి అత్తమామలతో చెప్పి వారిచే మందలింప చేయాలనుకుంది.

ఒకరోజున క్రిష్ణారావు భోజనంచేస్తున్నాడు. తల్లి వడ్డిస్తూ 'ఏంరా, బాబూ, ఏమిటీగోల—ఊళ్లోఅంతా అల్లరిగావుంది!! ఆ రామారావుకు పిచ్చాయేమిటి? స్త్రీలకు హక్కులివ్వడం ఏమిటి? మగవాళ్లతో సమానంగా తిరగడం ఏమిటి? ఏమిఘోరం వచ్చిందిరా బాబూ; మాకాలంలో యిలాంటివెరుగుదుమా? పరువుమర్యాదా అక్కరలేదుట్రా? ఏమో; మీవేషాలేం బాగుండలేదబ్బాయి.' అంది

"అందులో తప్పేముంది చూడు. పెద్దపెద్ద వూళ్లల్లో అందరూ వెళ్లటంలేదూ? వాళ్లందరూ పాడైపోతున్నారా? ఇంట్లోవున్నవారేనా పతివ్రతలు!!" అన్నాడు క్రిష్ణారావు.

"చూడు! పక్క లెక్చరుగారి అమ్మాయి మొగాళ్లతో చదువుకుంటోందిట. ఆ అమ్మాయి నెలా చెప్పుకుంటున్నారు. మనలని అలాగే చెప్పుకుంటారు. చెడ్డపేరు తెచ్చుకోవడం ఎంతసేపు. ఫలాని అతని భార్య అలా ఇలా అని చెప్పుకుంటారు." అంది తల్లి.

"ఆ అమ్మాయి చదువుకోసం అన్నీ భరిస్తుంది. క్రొత్తలో చెప్పుకుంటారు. తరువాత అందరూ మొదలుపెడితే అదీ ఒక ఆచారమే అయిపోతుంది.

కదువురాకపోతే నీలాగూ నీ కోడలులాగూ ప్రపంచ సంగతులేవీ తెలియకుండా మూర్ఖపు ఆచారాల మచ్చితో, కూపస్థమండూకాల్లా ఇంట్లో పడివుంటారు. మనది పాడుసంఘం—నాకు మజ్జిగపొయ్యి. నాయిష్టం నేను క్లబ్బుకు తీసుకువెడతాను. నాయిష్టంవచ్చినట్లు చేస్తా. నీమర్యాదా దక్కించుకో" అన్నాడు.

పాపం దుర్గమ్మగారు మళ్లా మాట్లాడలేదు. క్రిష్ణారావుకు చాలాకోపం వచ్చింది. చెయ్యికడుక్కొని మేడమీదికి వెళ్లిపోయినాడు. ఇదంతా రుక్మిణే చేసిందని భావించి ఆమెమీద కోపగిల్లాడు. ఆమెకు తగినశిక్ష విధించాలనుకుంటూ పడుకుని నిద్రపోయి వాడు.

రుక్మిణి భోజనంచేసి గదిలోకి వచ్చేసరికి క్రిష్ణారావు నిద్రపోతున్నాడు. పళ్లెంలో తానుపెట్టిన తమలపాకుచిలకలూ, చెక్కసోడా అలాగే వుండి పోయాయి. సంగతంతా గ్రహించింది. ప్రక్కగదిలోకి వెళ్లి పాటలుపాడుతూ రాట్నం త్రిప్పుతూంది. కాని ఆమెమనసు మనసులో లేదు. దారం తీస్తూందన్న మాటేగాని అది పూర్వపు నున్నితాన్ని కోల్పోయింది. పురిఎక్కినదారం వెంటనే కదురుకు చుట్టక పరధ్యానంతో ఎక్కువ త్రిప్పడంవల్ల అనుక్షణం దారం పుటుకూ పుటుకూ తెగిపోతోంది !! ఆమెక్కు ప్రతి దినం దారంతీయడం ఎంతవుత్సాహంగా వుండేదో ఆ దినం అంతకురెట్టింపు విసుగ్గా వుందామెకు. "రుక్మిణీ నీనున్నితపు చేతుల్తో తీసిన దారం నీలాగే మృదువుగా వుంటూందినుమా;" అని అంటూండేవాడు క్రిష్ణారావు తరుచుగా.

రుక్మిణి తండ్రి కాంగ్రెసునాయకుడవడంవల్ల ఆమెకు చిన్నతనాన్నుంచీ కద్దరూ, స్వదేశీవస్తువులూ అంటే ఎక్కువయిష్టం. ఆమె నిరంతర కద్దరువస్త్ర ధారిణి. ఆమె సాధ్యమైనంతవరకూ దేశీయవస్తువులనే వుపయోగించేది. కన్నులు మిరుమిట్లుకొల్పే వింతవింత రంగుల్తో, వింత మెరుగుల్తో, ఎన్నిరకాల విదేశీయ గాజులు వచ్చినా, ఆమె నల్లని కాశహస్తిగాజులనూ తెల్లని దంతపుగాజుల్నే ధరిస్తుందిగాని ఎన్నడూ వ్యామోహపడదు.

ఆమె తన చిన్ననాటి సంగతులనూ, ఈ రెండు సంవత్సరాల్నించీ అనుభవిస్తూన్న తనభర్త అవ్యాజానురాగాన్నీ తలుచుకుంటుండగానే శ్యామలవచ్చి "వదినా! టీనీళ్లుకాగాయుట: అమ్మ రమ్మంటూంది." అంది. వెంటనే రుక్మిణి టీ తయారు చేయడానికి క్రిందకు వెళ్లింది. అల్లా వెళ్లిందో లేదో క్రిష్ణారావు చివాలునలేచి ముఖం కడుక్కొని డ్రస్సువేసుకుని వీధిలోకి వెళ్లిపోయాడు. ఒక అరగంటకు వెండిపళ్లెంతో వేడి పకోడీలూ, గ్లాసుతో మంచినీళ్లూ, టీ పట్టుకు వచ్చింది రుక్మిణి. కాని అక్కడ ఎవరూలేనిదే!! గదిలోకి వెళ్లిచూచింది. అక్కడ బట్టలులేవు. ఆమెకు పిడుగు నెత్తిమీద పడినట్లయింది. అవన్నీ డ్రాయరు మీద పడేసి కళ్లనీళ్లతో మంచంమీద కూలబడి పోయింది.

## 3

సాయంకాలం నాలుగుగంటలయ్యింది. డా॥ క్రిష్ణారావుగారింటి దగ్గర కా రాగింది. సీతాదేవి కారుదిగి చకచక లోపలికివెళ్లి "రుక్మిణీ" అని పిలిచింది. కాని రుక్మిణి మరదలు శ్యామల ఎదురొచ్చింది. "మీవదిన యేదీ? అన్నగారింట్లోవున్నారా? అమ్మగారేదీ?" అని ప్రశ్నపరంపర కురిపించింది. శ్యామల పదేళ్ల పిల్ల. కడసారపుపిల్ల అవడంచేత గారాబం ఎక్కువ. శ్యామల సీతను అక్కా అనీ రామారావుని బావ అనీ పిలుస్తుంది. "అక్కా; మరేం అన్నయ్యకి వదిన క్లబ్బుకు రాలేదని కోపంవచ్చి మరేం మధ్యాహ్నం అన్నం సరిగా తినలేదు. వదినతో దెబ్బలాడాడు. మరి "టీ" కూడా త్రాగకుండా ఎవరితో చెప్పకుండా ఎక్కడకో వెళ్లి పోయాడు. వదిన యేడ్చి మేడమీద పడుక్కుంది. అమ్మ పడమటింట్లో పడుకుంది. రా! మనం మేడమీదికి వెడదాం" అంది. ఈ మాట

వినేసర్కి సీతముఖం కాంతివిహీనమై వెలవెల బోయింది. నోటమాట రాలేదు. ఆమె ఆ యింటికి దొంగలా అయిపోయినట్లయింది. తప్పుపనిచేసిన స్త్రీలాగా మెల్లగా తలవంచుకొని మౌనంగా శ్యామల వెనక మేడ మీదికి వెళ్లింది. కాని ఎప్పటిలా రుక్మిణి ఎదటికి చొరవగా వెళ్లడానికి కాని, ఏమిటినాఅంటూ వేళా కోళాలు చేయడానికి కాని ఆవిడకు సాహసం కలగలేదు.

తాను హాల్లో కుర్చీలో కూర్చుని శ్యామలచేత రుక్మిణికి తనువచ్చినట్లు కబురంపింది. వెంటనే రుక్మిణి ముఖం తుడుచుకుంటూ తనబాధ నామెకు తెలియకుండా చేయడానికి లేని చిరునవ్వు తెచ్చుకుంటూ "సీతా" అంటూ వచ్చింది. కాని రుక్మిణి కళ్లువాచి ఎర్రగా జ్యోతుల్లావున్నాయి. పచ్చనిచాయతో కళకళలాడే ఆమెముఖం ఎర్రబారి వికాసహీనంగా ఆమెను చూడగానే సీత సంగతంతా గ్రహించినది. ఆమెకన్నా తానే ఒకవిధంగా ధైర్యవంతురాలనని తలచి మరికొంతధైర్యంతో "ఏమిటీవరస !! అలా వున్నావేం?" అంటూ ఏమీ ఎరుగనట్టుగా అడిగింది.

"సీతా! తల్లీ పుట్టిల్లు మేనమామ యొరుగదట! అలా వుంది. అన్నగారి యున్న తాళయాల్ని నేననుభవిస్తూ వున్నప్పుడు మా అన్నగారి అంతశరీరానివైన నువ్వు తెలియనిదానిలా నటిస్తావేమిటూ?" అంది. రుక్మిణి చమత్కారంగా.

"సరే! దానికేంలే. ఆవిషయంలో నీవు స్త్రీత్వం ఏమిటి? ఏదో ఒక గట్టిప్రయత్నం చేసి వీరి సంపర్కశూన్యం అయిన ఈపాశ్చాత్య నాగరికతా వ్యామోహ భవనాన్ని పడగొట్టి మనమే మన ఆచారాలకి సరి పోయేట్లుగా ఒక దివ్యమైన నూతనభవనాన్ని నిర్మించుకోవాలి. అధైర్యపడితే ఏమీ లాభంలేదు."

"అయితే సీతా ఏమంటావు. క్లబ్బుకి వెళ్లడమా స్త్రీస్వాతంత్ర్యం!! చూడు మనదేశంలో స్త్రీలంటే ఎంత పూజ్యభావమో! ఎంతగౌరవమో! మనం పురుషుల క్లబ్బులలోకి వెళ్లామంటే మనం వారితో సమంగాచేయి కలిపి తిరిగామంటే యింక స్త్రీ అనేవిలువ యేమైనా వున్నదా? ఉత్సవదినాల్లో మేళంచేసే భోగంవాళ్లకీ మనకీ యిక తారతమ్యం యేముంది? వారెంత గౌరవింపబడుతున్నారో మనంకూడా అంతే పూజింపబడుతాం. ఇక కులాంగన అనే పదానికి చోటేది. అందుకనే వారుకూడా వారి మేళతాళాలు, వారి వృత్తిమాని వివాహాలుచేసుకుని కులాంగన అనే పదానికి అర్హత సంపాదించడానికి పాటుపడుతున్నారు. అదీకాకుండా అన్నగారి ఉన్న తాళయాల్ని చెప్పడానికి, వింతలనుటకు వీలులేదు. ఎందుచేతనంటావా— చూడు—ఇప్పుడు మహాపండితులంతాకలసి "స్త్రీలు, నాట్యరంగం ప్రవేశించాలి. అపుడుగాని నాట్యకళ, నాటకంలోని రసికత ఉద్ధరింపబడ"దని ఒక వెర్రి వూహను పైకివెలిబుచ్చి దానిని ఆచరణలోకి తీసుకురా ప్రయత్నిస్తున్నారు."

సీత "ఓహో! సరే. దానికన్నా యిదేబాగు. ఇది అంటే యింకా మగవారితో సమానంగా వారిక్లబ్బుకి పోవడం, వారితో సమానంగా విషయాలు చర్చించడమూ, సరదాగా ఆటలూ పాటలూగాని—రుక్మిణీ! దీనికే మనం,—నీవు నీముఖం, కన్నీళ్ళు కందిపోయేట్టు విచారించడం, నేను తలక్రిందుగా ఆలోచించడం చేస్తున్నాం. ఇంకా మనలాటివారు ఎంత గాభరా పడుతున్నారో. మరి ఆనాటకాల్లో పాత్రలుధరించి నటించడం ఎలాగో! అతి హేయంకాదా! రుక్మిణీ! అబ్బా! తలచుకుంటే వళ్లు జలదరిస్తోంది!! కులస్త్రీలందరూ నాట్యరంగప్రవేశ మొనర్చుతుంటే, యింక వ్యభిచార నిర్మూలనచట్టం అమలులోకితెచ్చి ఆ వేశ్యా కులాన్ని బాధించడంఎందుకూ. ఇంకా దేవునిదయ వల్ల మీఅన్నగారి తలలో ఈతలపింకా ప్రవేశించలేదు. అయినా మన మగవారికి వివేకజ్ఞానం నశిస్తూంది. నలుగురొకచోట చేరడం. ఆచారసాముల ప్రవర్తనాన్ని జపించడం, ఏదో ఒక పిచ్చివూహని

సిద్ధాంతంచేసుకోవడం, ఇకయింటికివచ్చి—వున్నారుగా లోకువ అయినభార్య, అజ్ఞానులు, అమాయికులూ అయిన బిడ్డలూ వారిని బాధించడం, వారి తీర్మానం ప్రకారం నడచుకోమని.

రుక్మిణి:—సరే! దానికి నిదర్శనం మనమే. కాని యింక మంచి, చెడ్డ, యుక్తాయుక్త విచక్షణ లేక వారు చెప్పారే అనుకో. మనకేనావుంటోద్దూ -భారత స్త్రీ పరపురుషుని కన్నెత్తి చూడదనీ స్పృశింపదనే చిరతరకీర్తిని నేడు మనం వమ్ముచేయడమేనా !!

సీత:—అయితే నాల్గుగోడలమధ్యా, అవీ చాలక పరదాలుకూడా వేసుకుని పడివుండడమేనా! ఇక నేరం చేసి ఖయిదుననుభవించే ఖయిదీకన్నా, పశువుకన్నా మనలో యెక్కువ ఏముంది? అల్లాపడి లోకజ్ఞానం లేకుండా వుండడమేనా!!

రుక్మిణి:—అదిగో, మాఅన్నగారిగాలి నీకు చాలా తగిలిందే!! మరి అర్ధాంగివికాదూ, అలా అంటావో అనవో అనే అనుకుంటున్నా, మరి ఏమిటిసాధనం?

సీత:—అల్లా దారికిరా మనంమాత్రం చేతకాని వారమా, వారు పురుషులక్లబ్బు స్థాపించుకుంటే, మనం స్త్రీలకు క్లబ్బు స్థాపించుకుందాం. ప్రస్తుతం మాయింట్లో ఖాళీగావున్న హాలువుంది. మాకు ఆంధ్ర పత్రిక, భారతి, గృహలక్ష్మి, హిందూసుందరి, **Hindu** పేపరూ వస్తాయి. ముందు విఘ్నేశ్వరపూజ కానిస్తే తరువాత మెల్లిగా నువ్వూనేనూ తంటాలు పడదాం. ఏమంటావు?

రుక్మిణి:—ఓ అల్లాగే కాని వీరి నీ వూహనుంచి మరలించాలి. చెప్పినంతమాత్రాన్ని వినేదిలేదు. మధ్యాహ్నం అత్తగారు చెప్పారనేగా భోజనంచేయక, టీ పుచ్చుకోక, మాటాడక వెళ్లారు !!

సీత:—నేను దానికే తగిన ఎత్తువేశాను. దీని కంతకూ కారకులు మాఅన్నగారు. కనుక వారిమనస్సు త్రిప్పితే అందరూ దారికి వారేవస్తారు. ఆ ప్రయత్నానికి నువ్వే సాయపడాలి. అందుకనే వచ్చాను.

రుక్మిణి:—ఏమిటది?

సీత:—ఇలారా, (చెవిలో చెప్పను) రుక్మిణి పకపకానవ్వడం మొదలుపెట్టింది. సీత—ఉహూ! ఇప్పుడుకాదు నవ్వడం. వారికి పశ్చాత్తాపం కలిగి నప్పుడు, మన ప్రయత్నం సార్థకమయినప్పుడు, మన కుల్లాసం. రేపు తప్పకుండా మరువకుసుమా. పిన్నిగారి దర్శనంకూడా చేశివెడతా. నువ్వూ వస్తావా?

ఇద్దరూకలశి పడమటింట్లోకి వెళ్లారు. దుర్గమ్మ గారు సీతనుచూసి హేళనగా "ఓహో దొరసానులు కాబోలు. ఇలా దయచెయ్యండి. అంతా కుశలమా?" అన్నది.

సీత:—పిన్నిగారూ! ఇంకా అవందే వేళాకోళం యెందుకూ!! నేనయితే మీకోడలుమాత్రం అవకుండా వుంటుందేమిటి? అని జవాబిచ్చింది. దుర్గమ్మగారి హుషారు కొంచం తగ్గింది.

"అయితే అమ్మాయీ, ఏమిటిదంతా? నాకేమీ పాలుపోవడంలేదు."

సీత:—పిన్నిగారూ, తప్పంతామీది. మీది అంటే "మీది" కాదులెండి. మనహిందూజాతి తల్లిదండ్రు లది. ఎందుచేత నంటారా? బాలురకు చదువురావా లనీ, పెద్దవుద్యోగాలు చెయ్యాలనీ, వారిని చిన్న ప్పుడే—అంటే—జ్ఞానం రాకమునుపే, స్వదేశం యందు దృష్టిపారకముందే తనజాతి సంఘం అంటే అర్థం తెలియకముందే ధనాతురులై పూర్తిగా మన దేశాచారాలకి, విరుద్ధమైన పరదేశాలకు పంపుతారు. అదీకాకుండా వారికి చిన్నప్పుడే వారి ఎత్తుధనం కట్నం అనేపేర పుచ్చుకుని ఒక పసికూనను కట్టిపెట్టే స్తారు. అక్కడ ఆపిల్లవాడు తెల్లనికాగితంలా నిష్కల్మషమైన తన హృదయంలో అచటి ఆచారప్రవర్త నలను నాటింపజేసుకొని వానికే కేవలం అలవడి పోయి, చిన్ననాటి తనదేశాన్నీ, తనమతాన్నీ సంఘాన్నీ పూర్తిగా మరిచిపోతాడు. ఇక్కడ ఈపిల్ల పూర్తిగా తనదేశాచారాన్నీ వచ్చీరాని

చదువునీ బాగా అభ్యసిస్తుంది. వీరిద్దరూ కలిసి కాపురం చేస్తున్నప్పుడు కేవలం పురుషులవంటి స్త్రీలలో మెలగిన ఆయువకునికి తన స్త్రీ అంటే అసహ్యం కలుగదా? అప్పుడతను ఆమెతో కాపురం చేయడాని కిష్టపడక అనుదినం దెబ్బలాటలతో గడపడమో, లేక అసలా యమాయికురాల్ని విసర్జించడమో జరుగుతుంది. అలా మనం ఎన్ని వినటంలేదూ? అలా విసర్జించబడిన బాలకు ఏమాత్రం మన సంఘసహాయం, సానుభూతి లేదుగదా!

దుర్గాంబ:— అబ్బా! ఏమిటే! జాణనై పోతున్నావు. మొన్నటిపల్లెటూరి సీతవుకాదూ నువ్వు! గుక్కతిప్పుకోండా లెక్చరిస్తున్నావు!! అయితే ఈగొడవకు నీవేమంటావు?

సీత:— వినండి. పిన్నిగారూ! మీఅల్లుడుగారివల్ల స్వయంగా నే నిన్నికష్టాలూ అనుభవించాను. ఇప్పుడు ఈక్షణంలో అనుభవిస్తున్నాను. కాని యిలాంటివి నాకు పరిపాటే. దీని పర్యవసానం మీరు రేపో, ఎల్లుండో వినగలరు. ఐదుగంటలు దాటింది. ఇక నేను వెళతా, వారింటికివచ్చే వేళయింది. రేపు వదినను సారి మాయింటికి పంపుదురూ! రుక్మిణీ! నేవెళతా, నేచెప్పినమాట మరువకు, సెలవు. అంటూ కారెక్కింది.

## 8

మర్నాడు సాయంకాలం 6 గంటలయింది. రామారావూ క్రిష్టారావూ క్లబ్బులో "స్త్రీక్లబ్బు ప్రవేశాన్నిగురించి తీవ్రంగాచర్చించి ఉపన్యసించి ఆమరునాడు కరపత్రాలు పంచిపెట్టటాన్కి తీర్మానించుకుని మామూలుగా రామారావింటికి వచ్చారు. రోజూ వేశివుండే వీధితలుపు దగ్గరగాతీసివుంది. తలుపుతీసుకు లోపలికివెళ్లారు. హాల్లోదీపం సన్నగా వెలుగుతూవుంది. హాల్లో ఎవరూలేరు. రామారావాశ్చర్యపోతూ క్రిష్టారావుతో మేడఎక్కాడు. గదితలుపుతీశివుంది. దీపం ఎక్కువగా వెలుగుతూవుంది. క్రిష్టారావుని హాల్లోకూర్చోమని డ్రస్సు తీయడాన్కి గదిలోపు వెళ్లాడు. తలుపుసందులోంచి సీత ఎవరో యువకునితో చదరంగ మాటాడుతూ కనబడింది. టేబిల్ మీద టీ, ఫలహారాల సరంజామావుంది. రామారావాసందులోంచి నిశ్శబ్దంగా తొంగిచూచాడు. ఆ క్రొత్తయువకుడు చిరునవ్వుతో సీత మృదులహస్తాన్ని ముద్దుపెట్టుకొంటూంటే సీతకూడా మందహాస వదనారవిందఅయింది. ఈదృశ్యంచూసేసరికి రామారావు హృదయం కోపం, అనుమానం, ఈర్ష్యతో ఒక్కసారిగా మండిపోయింది. వచ్చీరాని అస్పష్టమైనమాటలతో "ఆc సీతా! ఆగు!" అని పెద్దకేక వేశి తలుపు బార్లాతీశాడు. సీత ఉలికిపడిలేచి వెలవెలబోయిన ముఖంతో సిగ్గు అవమానంతో తలవంచుకుని దూరంగా తప్పుకుంది. రామారావు కోపంతో గబగబా వణికిపోతున్నాడు.

ఈగడబిడఅంతా చూస్తున్న క్రిష్టారావు అక్కడకు వచ్చి "సీతా! ఏమిటూపని! తప్పుకాదా? అన్నాడు.

రామారావు కోపంతో "అందుకే మనకవులూ పెద్దలూ స్త్రీలహృదయాన్ని నారికేళపాకంతో వర్ణించారు" అన్నాడు.

"వారు దూరదృష్టి కలవారు" అన్నాడు డాక్టరుగారు.

సీత చిరునవ్వుతో "నేనేమి పాడుపనిచేశాను. సోదరునివంటివానితో చదరంగం ఆడటం పాడుపనా? ఈ మాత్రం సహించలేనివారు పురుషులక్లబ్బులో స్త్రీలను మెంబర్లుగా చేయడాన్కి ఏమనసుతో తీర్మానించారు. మేమక్కడ క్లబ్బులో పరపురుషునితో పేకాడుతుంటే, చేయిచేయి కలపి కబుర్లు చెప్పతూంటే మీ రక్కడ వున్నట్టుండి పోరూ? అందుకే మనపూర్వులు దూరదృష్టితో ముందురాబోయే పురుషులు సహనం, వివేకంలేనివారవుతా రనిగ్రహించి స్త్రీలస్వేచ్ఛను మోతాదుగా వుంచారు."

రామారావుకోపం ఆగటంలేదు. "ఛీ! ఏమొగం పెట్టుకొని మాట్లాడుతున్నావు? క్లబ్బుకు రమ్మంటే ఏవో వేదాంతా లుపదేశించావే!! పతివ్రతలా కబుర్లు చెప్పావే!! దూరదృష్టితో ఆలోచించమన్నావే!! స్త్రీలు తేనెపూసిన విషపుకత్తులని వూరికేఅన్నారూ!!

సీత:—కోపంఎందుకూ!! మీరేమన్నారు — స్త్రీ స్వేచ్ఛ స్త్రీయిష్టంమీదనే వుండాలన్నారు. అందుకు విశ్వప్రయత్నాలు చేస్తున్నారు. ఈమాత్రానికే వున్మాదులై పోయారు. సహనం కోల్పోయారు. నా ప్రవర్తనలో మీరు తప్పేమి కనిపెట్టారు? అతడు నాసోదరుడు. నేనాతనితో సోదరబుద్ధితో చదరంగ మాడుతున్నా!! అతడూ నేనూ చిన్నప్పుడు చదువుకుని ఆటలాడుకునేవాళ్లం. ఆతని నింతఅవమానం చేయడం బాగుందా! రేపు క్లబ్బులోనూ, ఈవిధంగానే గంతులువేస్తారా నలుగురిలో.

రామారావు:—ఛీ! నిన్నింకా ఈయింట్లో వుండనిస్తానా. శీలంలేనిదాన్కి యిల్లెందుకు? అన్నీయిండ్లే. అవతలికిపో!! నీవొకనిభార్యవా? అంటూ ఆమెను గదిలోనుంచి అవతలికి తోయబోతుంటే ఆ నవీనయువకుడు "ఆగు! ఆమెను త్రోయకు అంటూ దగ్గరకు వెళ్లి ఆమెను విడిపించపోయాడు. ఈసారి రామారావుకి మరీకోపంవచ్చింది. ఇక ఆగలేక ఆపురుషుని మీదికి దుమకపోయేసరికి ఆగండి! పరస్త్రీ నంటకండి అని నేర్పుగా ఆయువకుడు తప్పించుకుని దూరంపోయి తన కోటూ, తలపాగా తీసివేసాడు చిరునవ్వుతో. ఆశ్చర్యం!! పురుషుడుకాడు. క్రిష్ణారావు భార్య రుక్మిణి, స్నేహితులిద్దరూ ఆశ్చర్యం, సిగ్గుతో తల వంచుకున్నారు. పదినిమిషాలవరకూ అంతా మౌనవ్రతులే అయ్యారు. చివరకు సీత "శీలంలేనిది యిప్పుడే వెళ్లిపోతే ఉత్తమంకాదా ఆవీధినున్న మీ పినతల్లిగారింటికి పోతాను. సెలవు "అంటూ రుక్మిణితో వెళ్లబోతుంటే రామారావు అడ్డువచ్చి "సీతా! నన్ను క్షమించవూ" అన్నాడు.

నేనా క్షమించేది. శీలంలేనిదాన్ని క్లబ్బుకు రానందుకు మీరే క్షమించాలే!! రేపు వస్తాక్లబ్బుకు క్షమించండి. నాకు సెలవు అంది సీత.

"సీతా! నన్నెందు కింకా వెక్కిరిస్తావు. ఇక క్లబ్బు ప్రస్తావన నాదగ్గర లేదు. నాకు బాగా బుద్ధి చెప్పి, నామర్యాదయే నిలబెట్టావు నిన్నుచాలా బాధపెట్టాను; నీవు నిజంగా సీతవే అన్నాడు పశ్చాత్తాపంతో రామారావు.

వెంటనే రుక్మిణి క్రిష్ణారావుతో "ఏమండీ డాక్టరుగారూ! రేపు నేను క్లబ్బుకురావచ్చునా" అంది.

క్రిష్ణారావు "రుక్మిణీ! అసలు నాకు మొదటినుంచీ యిష్టంలేదు. నలుగురితో నారాయణా అని ఒప్పుకున్నాగాని. రామారావూ! అసలీ రూలేమీబాగా లేదు; ఇది తీసేద్దాం."

రామారావు "సరే" అన్నాడు నిస్పృహతో.

ఆవేళకు రుక్మిణీ కృష్ణులు, సీతా రామారావు యింట్లో విందు కూర్చున్నారు. రామక్రిష్ణు లిద్దరూ పరాభవం విచారంతోనూ, రుక్మిణీ సీత లిద్దరూ విజయసూచకం అయిన వుత్సాహంతో భోజనాలు ముగించారు. తరువార రుక్మిణీకృష్ణులు వారింటికి వెళ్లారు.

✂

మర్నాడు సాయంకాలం క్లబ్బులో రామారావు, క్రిష్ణారావు ఆనందరావు మొదలైనవారంతా కూర్చుని ఎవరికిష్టమయిన కాలక్షేపం వారు చేస్తున్నారు. రామారావు క్రిష్ణారావుమాత్రం ఎందుకో నిరుత్సాహంగా వున్నారు. వారిద్దరూ ఎవరేనా స్త్రీలక్లబ్బు ప్రవేశాన్ని గురించి ప్రస్తావన తీసుకువస్తారేమో నని బిక్కుబిక్కుమంటున్నారు.

ఇంతట్లోకే వీధిలో బాజాచప్పుడయింది. పిల్లలందరూ పేపర్లకోసం పరుగెత్తుతున్నారు. క్లబ్బుప్యూను నరశింహం 2, 3 పేపర్లు పట్టుకువచ్చి సభ్యులకిచ్చాడు. ఆపేపరు చదువుకోగానే అందరూ ఆశ్చర్యచకితులయ్యారు. అది ఈవిధంగావుంది.

## స్త్రీ సమాజము స్థాపింపబడును.

ఆదివారము 11—4—34

బారిష్టరు రామారావు పంతులుగారింట ఆదివారం నాడు స్త్రీలకు ప్రత్యేకంక్లబ్బు స్థాపింపబడును. ఆనాడే ఆర్ సీతాదేవిగారి యాధిపత్యమున ప్రారంభోత్సవమును జరపించి యిష్టమున్నవారు మెంబర్లుగా చేరవచ్చును.

ఇట్లు

ప్రెసిడెంటు — సెక్రెటరీ

ఆర్. సీతాదేవి. — యస్. రుక్మిణీదేవి.

రామక్రిష్ణు లిద్దరూ ఆ కాగితంచూసి ఆనందం పొందారో,పరాభవా న్ననుభవించారో వారికేఎరుక!

# తల్లిదండ్రులు — బిడ్డలు

శ్రీమతి పరసా సీతారామమ్మగారు

జననీజనకుల యాహ్లాదంబులు నిగూఢంబులు. వారి విచారములును భయములు నట్టివ; వారు తమ సంతోషంబుల నన్యులకెఱింగించలేరు. విచారభయంబులను దెలుకపడనీయరు. సంతానం బుంటవారికిం గాయకష్టములవలని కష్టము తెలుకపడవు. కాని దురదృష్టదేవత పైకొన్నచో దానివలని బాధలు బిడ్డలుంటవలననే మఱింతయెక్కువయగును. బిడ్డలు జీవితకాలకష్టములను వృద్ధిపఱతురు కాని మరణచింతను తగ్గింతురు. వంశాభివృద్ధి మృగములయందును సహజము కాని మరణచింత సుగుణము ఘనకార్యాచరణము ననునవి మనుష్యలక్షణములు. సత్రనిర్మాణాది ఘనకార్యములు ప్రాయశః సంతానవిహీనులవల్లనే చేయబడుచున్నవి. ఇట్టి సంతాన విరహితుల మనః ప్రతిబింబములను వారి శరీర ప్రతిబింబములు తెలుపుచుసేయుట యొదవమిచే వారుసేయు ఘనకార్యములు దెలుపుచున్నవి. కనుక దమకు దరువాత వారి విషయమయిన చింత చాల పఱకు తమకు దరువాతివారు లేనివారికుండును. తమ వంశమున మొదట వంశోద్ధారకులయినవారు తమ సంతానమును వంశాభివృద్ధిహేతువగు సంతానమని మాత్రమేగాక వంశోద్ధారణమునకై తాము గావించిన ఘనకార్యముల అభివృద్ధిహేతువనికూడా నెంచుకొని మిక్కిలి గారాబముతో జూచుకొందురు.

తల్లిదండ్రులు తమ బిడ్డలందఱియెడల ననేకవిషయములయందు సమానప్రేమనే జూపుచుందురు. కాని కొన్నిసమయములయందు నట్టి ప్రేమను జూపరు. ఈపక్షపాతము ముఖ్యముగ దల్లియందు కానవచ్చెడిది. సాలమను (Saloman) చెప్పినట్లు సుపుత్రుడు తండ్రిని సంతోషపెట్టును: కుపుత్రుడు తల్లి కవమతి యొనర్చును. పెక్కురు బిడ్డలున్న కుటుంబమున మొదటి యొకటిద్దరు గట్టిశిక్షచే పెరుగుదురు. కడపటివారు గారాబమున బెరుగుదురు. అయిన నెంతమాత్రము లక్ష్యపెట్టబడని నడుమవారే యందఱిలో నుత్తములగుట తటస్థించును. తల్లిదండ్రులు యుక్తాయుక్తంబుల నరయక గారాబముకొలది తమబిడ్డ లడిగినవన్నియు నిచ్చుచుండుట యపాయకరమయిన తప్పు. అట్లిచ్చుచున్నచో వారు నీచవృత్తులయందు ప్రవేశింతురు. జత్తులమారులగుదురు. దుస్సాంగత్య మలవఱచుకొందురు. భోజనప్రియులగుదురు. కనుక బిడ్డలను గట్టి శిక్షయందుంచి వారికి భక్తివిశ్వాసంబుల కలుగజేయవలయునేగాని వారడిగినదంతయు నిచ్చిగాదు. కొందఱు తల్లిదండ్రులు బాల్యమున నన్నదమ్ములకు పరస్పర తరతమభావముల బుట్టింతురు. ఇయ్యది దుశ్చేష్ట. ఈ తరతమత్వమువారు వయోవంతులయినప్పుడు ప్రబల విరోధముగా బరిణమించి కుటుంబములను పాడుచేయును.

ఇటాలియావారికి తమబిడ్డలు, దమయన్న దమ్ముల బిడ్డలు, దాపుచుట్టములను వివక్ష లేదు. స్వసంతతిగాకున్నను (తనకడుపున బుట్టినవారు)నేక కుటుంబమువారైనయెడ బాలును ప్రేమాతిశయంబుల నగపఱతురు. ప్రకృతియందు నిట్టే యగపడుచున్నది. సాధారణముగా నొకనియందు రక్తస్పర్శానుసారముగ నాతలితండ్రిపోలికకంటె నెక్కుడుగ బినతండ్రి మేనమామల పోలికయైనను సన్నిహితబంధువు పోలికయైనను కానబడుచున్నది. తల్లిదండ్రులు తమబిడ్డ లవలంబింపవలసిన వృత్తులను యుక్తసమయముననే నిర్ధారణసేయవలయును. అట్లు అర్హసమయమున నిర్ణయించినచో దన్నిర్ణయము సులభసాధ్యమగును. తమ బిడ్డలకు మిక్కిలి యిష్టమైన విషయమును నిర్ణయించుటలో నా యెక్కువనై పుణ్య మగపఱుపగలమని యెంచికొని తల్లిదండ్రులు తమబిడ్డల చిత్తవృత్తుల యందు అతి విస్తారమైన జోక్యము కలుగజేసికొనగూడదు. బాలురు తమకేదైన నొక మంచి విషయమునందభిరుచి కలిగినయెడల నావిషయమునుగూర్చి శంకించి నిరుత్సాహులు కాగూడదు. ఉత్తమ విషయము నేఱుకొనవలయును. తదాచరణము తొలుదొలుత కష్టముగ గనపడినను నలవాటువలన నయ్యది మనోహరమైనదియు సులభమైనదియు నగును. ముందు వారిజీవనాధారమునకు వారే పాటుపడుదురు గాకయని తల్లిదండ్రులు బాల్యమునుండి గఱపిన గట్టిశిక్షచే బెఱిగిన వారగుటచే చిన్నవారు గుణవంతులును నదృష్టవంతులును నగుదురు.

శా॥ ఉద్యోగాలకుఁగాదు సభ్యతకుఁగా దూళ్లేలఁగాఁ గాదు మీ
విద్యాజ్ఞాన వివేకసంపదలతో వీర్యప్రతాపోన్నతుల్
ఖద్యోత ప్రతిమానులై ప్రజలు సౌఖ్యంబొందు నట్లెల్ల స
ద్వేద్యంబైన పథంబులో నడపుఁడీ బింబాధరల్ వారలన్.

స॥ కృ॥ మూర్తి.

# సందిగ్ధము

పోలుకొండ భద్రయ్యగారు

౧

కొమ్మకొమ్మనుజేరి ;
కొసరికొసరిపాడి ;
కోర్కెలూరించెడి ;
కోకిలమ్మతోగూడి—

మధురగానముజేసి
మరపింపవలె ; గాని—
పాడగలనా ?—కోర్కె
వీడగలనా ?

౨

ఒడలు పులకింపగా ;
వలపు లుబుకింపగా ;
పండువెన్నెలలీను ;
నిండుచందురుగూడి ;

నిర్మలాకాశమున
నివసింపవలె ; గాని
నిలువగలనా ?—మనసు
నిలుపగలనా ?

౩

సాంద్రతర మేఘాల
చాటునన్ మెరసెడి ;
చంచలత దిరిగెడి ;
శంపావధువుగూడి

పరిరంభణముసలుప
పాటుజెందెద ; గాని
తలపసగునా ?—విడిచి
తాళగలనా ?

౪

కమ్మతావులజిమ్ము
కాంతారవీధులలో
కపటమెరుగనినాదు
కలలోనిప్రియుఁగూడి

ముద్దుముచ్చటలాడ
మురిసిపోయెద ; గాని
కలయొగాదా ?—వట్టి
కల్లయగునా ?

# కవితాజగము—నవలామణులు

శే. వెం. రాఘవఅయ్యంగారు. ఎం. ఏ

లోకమున వారివారి చిత్తవృత్తుల నెఱుంగుటయే కష్టసాధ్యము. అట్టిచో పరులహృదయమర్మముల గుర్తించుట కష్టతరము. అందును పురుషుల చిత్తవృత్తుల గ్రహించుటకన్న స్త్రీహృదయమును తెలుసుకొనుట మిగుల కష్టము. కావున నారీ హృదయమును గుర్తించుట కష్టతమమని పెద్దలందురు. అందుచేతనే కాబోలు, ఆంధ్రకవితా పితామహుండు

"ఒక్కొకవేళ పద్మముఖులొల్లమి
సేయుదు రొక్కవేళ పె
న్మక్కువ నాదరింతురు క్షణక్షణముల్
జవరాండ్ర చిత్తముల్
పక్కన వేసరంజన దుపాయములన్
దగునిచ్చకంబులన్
జిక్కగజేసి డాసిసతిచిత్తముబట్టి
సుఖింపఁ గావలెన్."

అని వచించెను. మరియు సంస్కృత పండితులుకూడ "స్త్రీణాంచచిత్తం పురుషస్యభాగ్యం దేవోనజానాతి కుతోమనుష్యః" అని పల్కిరి. పాశ్చాత్య విద్వాంసులుకూడ పై భావముతో నేకీభవించిరి. ఇంక నవీనులన్నచో, వనితా హృదయారవిందమును (Barometer) వాయుమాపకయంత్రముతో బోల్చిరి. ఆ యంత్రమునందు వలెనే స్త్రీలడెందమునందు గూడ నత్యంతసూక్ష్మములైన పరివర్తనములు చూపరులదృష్టికి గోచరములగుచుండును. స్త్రీలచిత్తవృత్తు లత్యంత కోమలములు, సజీవములునై వెలుగొందుచుండును. నారీమణుల హృదయవీణలయందలి తంత్రు లతిసూక్ష్మములు; కావున సూక్ష్మాతిసూక్ష్మవాతాహతాలోలములై సుకుమారగాత్రుల హృదయవిపంచీ సునిశిత తంత్రు లాలాపము జేయుచుండును. స్త్రీల శరీర నిర్మాణమును, హృదయరచనమును పురుషులకన్న భిన్నముగను మిన్నగను నెలంగునని శరీరమనోవిజ్ఞానధనులు వచింతురు. సుకుమారగాత్రులు, సుందరాంగులనుట స్త్రీజాతికన్వర్థాభిధానము 'నవనీతకోమలాంగు'లనియు, 'వెన్నవలెంతరంగు సలివేణుల'నియు పండితరాయలచేతను, కవితాపితామహులచేతను స్త్రీజాతి వర్ణింపబడుటయే వారు 'సత్యం, శివం, సుందర' మను నిక్త్రయమునకు నిధానములై పురుషుల కానందదాయినులై వెలుగొందుచుందురనుటకు ప్రబల ప్రమాణము.

జగమునందలి జంతుజాలమును బరికించినచో, శరీర సౌష్ఠవము, అంగసౌందర్యమునకును పురుషజాతియే ప్రసిద్ధిగాంచినట్లు గానవచ్చును. ఇంక మానవసృష్టియందలి తారుమారై, అవయవరచనమునందును, అంగవిన్యాసమునందును సౌందర్యసంపదనంతయు స్త్రీజాతికే పరమేశ్వరుడు ప్రసాదించినట్లు గాననగును. ఇటుల కేవల బాహ్యసౌందర్యమునందు మాత్రమే గాక, అంతరంగిక సౌందర్యమునందుగూడ స్త్రీజాతియే మిన్నగా వన్నెలొల్కుచున్నది. ఇంతియేగాదు. సాకారమైన శృంగారరసము, మూర్తీభవించినకరుణరసాధిదేవతయై స్త్రీజాతి వెలుగొందును. ఇంక పురుషుడన్నచో రూపొందిన వీరరసము, తనువుదాల్చిన శాంతరసమనవొప్పును. నవరసములలో వీరశాంతములకన్న కరుణశృంగారములే జనుల మనముల నత్యంతము నాకర్షించుట సహృదయసంవేద్యము. ఈనాలుగు రసములును ప్రత్యేకముగ ప్రకాశించినచో రసికుల హృదయముల గరగింపజాలవు; ఇవి తామొండొంటిపై నాధారపడి, అన్యోన్యాశ్రితములై వెలుగొందుచున్న

ప్పుడే ప్రజలకు పరమామోదమును గూర్పజాలును. అటులనే స్త్రీ పురుషులు తామొకరికొకరు 'మాలతీ లతాక్రాంత మనోజ్ఞమైన సహకారముకైవడి' నీడు జోడుగా మెలంగుచున్నప్పుడే చూపరులకు నయనానందమును గూర్పగలరు. స్త్రీలహృదయాలవాలమున నంకురించి, పల్లవించి, పుష్పించి, ఫలించు ప్రేమయు, స్వార్థత్యాగములను కల్పలతావ్యయమే పురుషులను పశుత్వశ్రేణినుండి దేవత్వధామమునకు గొనిపోవజాలును. నాతీమణులలో ప్రకాశించు ప్రేమ బలిదానముల మించిన స్వార్థవేది మానవజాతికి విశాల ప్రపంచమున వేరొకటిగానరాదు. ఈ స్వార్థవేదికై విశేషముగ వెదకనక్కరలేదు; ఇంటింట నిదిగానవచ్చును. ఈ స్వార్థత్యాగ మావేశజన్యముగాదు; ఈ క్షణమున సర్వస్వమును సమర్పించి, ఉత్తరక్షణమున నున్మాలమై పోవునదియుగాదు. ఈ ప్రేమబలిదానములు, ఆద్యంతరహితములు క్షణక్షణము, దివారాత్రములు ప్రకాశించు పరంజ్యోతి స్వరూపములు. ఈ ప్రేమ మర్త్యసహనసౌహార్ద సంపన్నమనియు, ఇది [illegible] గానవచ్చుననియు, పింగళి సూరనార్యుడు సూచించెను. ఇదినే సీతారాముల దాంపత్యమున మనము గాంచగలము. భవభూతిమహాకవి:—

"ఇయం గేహే లక్ష్మీ రియము
మృతవర్తిర్నయనయో
రసావస్యాః స్పర్శోవపుషి
బహుళశ్చందనరసః
అయంబాహుః కంఠే శిశిర
మసృణో మౌక్తికసరః
కిమస్యాన ప్రేయో యదిపరము
సహ్యస్తు విరహః||"

అనియు.

"అద్వైతం సుఖదుఃఖయో
రనుగతం సర్వాస్వవస్థాసు య
ద్విశ్రామో హృదయస్య యత్ర
జరసా యస్మిన్నహార్యోరసః
కాలేనావరణాత్యయాత్పరిణతే
యత్ప్రేమసారే స్థితం
భద్రంతస్య సుమానుషస్య
కథమప్యేకంహితత్ ప్రార్థ్యతే||"

అను శ్లోకద్వయమున దాంపత్యప్రేమమాహాత్మ్యమును ప్రతిబింబింపజేసెను.

ఇటుల ననేకమంది కర్మయోగులు, వీరయోధులు, విపశ్చిద్వతంసులు, మహాకవులును స్త్రీలయొక్క సూక్ష్మస్ఫూర్తిదాయకశక్తిని ముక్తకంఠముగ వర్ణించిరి. పురాణేతిహాసములందు మాత్రమేగాదు—దేశచరిత్రమునందుగూడ ననేక లిఖిత స్త్రీరత్నములుగలరు. విశ్వవిజేతయని విఖ్యాతిగాంచిన నెపోలియను చక్రవర్తి తనతల్లి గుణగణముల సర్వదా సంస్మరణ మొనరించువాడని చరిత్రకారులు వచించిరి. కవిసార్వభౌముడైన 'డాంటే' (Dante) తనప్రేయసీమణియైన బీట్రిసు (Beatrice) ను విశేషముగ వినుతించెను. తనఅర్ధాంగి యొక్క అనునయాలాపములవలననే, తులసీదాసునకు శ్రీరామచంద్రుని యందలి భక్తి హృదయమున గుదురుకొనెను. సీతాదేవికి శ్రీరామచంద్రునియందును, శ్రీరామునకు సీతాసతీమణియందును గల ప్రేమమే శ్రీరాముని లంకావిజయమునకు కారణమయ్యెను. రాధాసతీమణియొక్క నిష్కామప్రేమమే, శ్రీకృష్ణుని గీతాబోధమువలన జనించిన అమృతప్రవాహము. ఇంతియేగాదు. రాధికా నిష్కామప్రేమమే శ్రీకృష్ణుని గీతాబోధమునకు బీజప్రాయమని చెప్పవచ్చును. స్త్రీ స్వాతంత్ర్యమును గ్రోలి, వనితాలక్ష్మీని నవమానించి, వృద్ధినొందని పురుషుడే మనుష్యమానవజాతియందు నుండునని కొక్కడైన గానరాడు. బాల్యకౌమారయౌవన, జరావస్థల నాల్గింటియందును పురుషునకానందదాయిని స్త్రీజాతియే!! వేయేల—మనము నివసించు మృత్యులోకమును స్వర్గసమానముగ నొనరింపజాలు దేవతాంగనలు, స్త్రీలని పలుకవచ్చును.

ఇప్పుడొక ప్రశ్నవచ్చును. ఇట్టి ఉన్నతపదము, ఇంతప్రాముఖ్యము స్త్రీజాతి కున్నప్పుడు, కవితా

జగమునందు నవలామణులు లేల పురుషులవలె రచయితలు గాకున్నారు? కారణము స్పష్టమే. స్త్రీలకు కార్యక్షేత్రము వేరుగనున్నది. గ్రంథరచనము గాదందురు. సంస్కృత సారస్వతము నొకపరి పరిశీలించినచో, విద్యాభ్యాసమునందే జీవితమునంతయు గడపుచు బ్రహ్మచారిణులుగా గార్గి, మైత్రేయి మొదలైన వారు కాలము గడపినట్లు మనకు గానవచ్చును. ఉత్తర రామచరితమున కుశలవులతోపాటు వాల్మీకి వద్ద స్త్రీలు విద్యనభ్యసించినట్లు గోచరించును. మరియు శార్ఙ్గధర పద్ధతియందు నారీమణులు రచించిన శ్లోకము లెన్నియో గలవు. శీలాభట్టారిక రచించిన "యఃకౌమారహరః సఏవహివరః" అను శ్లోకమును ఉత్తమమైన ధ్వనికావ్యమునకు లక్ష్యముగ మమ్మటాచార్యుడు కావ్యప్రకాశికయందు పేర్కొనెను. మరియు 'ధన్యాసియాకథయసి' యను శ్లోకమందే విజ్జికాకృతమని ఉదాహరింపబడెను. ఈమె దండికాలమున నున్నటుల నీ క్రిందిశ్లోకమువలన దెలియును.

"నీలోత్పలదళశ్యామాం విజ్జికాం మా మజానతా
వృథైవ దండినాప్రోక్తం సర్వశుక్లా సరస్వతీ"

అని దండికృతమైన కావ్యాదర్శమునందలి సరస్వతీ స్తుతి పద్యమునకు ప్రతిపద్యమును విజ్జికరచించి దండికవిని పరిహాసమొనరించెనందురు.

ఇటుల శీలాభట్టారికా విజ్జికలేగాక, గౌరీ వికటనితంబాదు లెందరో, విద్యావతులు, విదుషీమణులు భారతవర్షమున విఖ్యాతిగాంచినటుల నిదర్శనములు గలవు. కాళిదాసాది మహాకవుల శ్లోకము లెన్నియో యుండ, వానినిమాని, శీలాభట్టారికా విజ్జికల శ్లోకముల లక్ష్యములుగ స్వీకరించిన వాగ్దేవతాపరావతారుడైన మమ్మటాచార్యుని కావ్యప్రకాశగ్రంథమే, కవితా జగమున నవలామణుల ప్రథమగణ్యస్థానమును ప్రకటించుచున్నది. ఇందువలన స్త్రీలు, భవభూతి వచించినట్లు "గృహలక్ష్ములు"ను మమ్మటుడు రచించినట్లు "హ్లాదైకమయులు, అనన్యపరతంత్రము, నవరసరుచిర నిర్మితము లైన భారతీదేవులు" నై వెలుగొందవలయును. కావున సాహిత్యక్షేత్రమునందు గూడ సాధ్వీమణులు పురుషులకు సహభాగినులై చేదోడువాదోడుగా వెలంగుచు ప్రాచీన భారత సౌభాగ్యము మరల రేకెత్తునటుల చేయవలసిన బాధ్యత వారిపై గలదు. భావిభారత భాగ్యోదయము స్త్రీజాతి భుజస్కంధమున నోలలాడుచున్నది. దేశపారతంత్ర్యమును బాపుటకును, దేశదారిద్ర్యమును దూరమొనరించుటకును భారత నారీమణులు బద్ధకంకణులు గావలయును. సీతాదేవి మూలముననే త్రిలోకకంటకుడైన రావణుడు నశించుట లోకవిదితము. శ్రీకృష్ణునకు రణరంగమున దోడుగానుండుటయేగాక, తరుణ మాసన్నమైనపుడు నారిసారించి నరకాసురుని వధించిన సత్యభామ చరిత్రము మనకందరకును తెలిసినదియే!! 'రాకేందుబింబమై రవిబింబమై యొప్పు నీరజాతేక్షణ నెమ్మొగంబు' అను పోతనామాత్యుని సత్యభామా వీరశృంగార వర్ణన పద్యము జదువని ఆంధ్రబాలబాలిక లుండరు. దశరథునకు కదనరంగమున కైక తోడుపడుటయే గదా రాముని వనవాసమునకు పిదప కారణమయ్యెను. సుభద్రార్జునులయొక్కయు, ప్రమీలార్జునులయొక్కయు కథలు జగత్ప్రసిద్ధములే' ఎన్నటి పురాణములో యనినచో, దేశచరిత్రమున గానవచ్చు దృష్టాంతము లెన్నియో గలవు. రాణాప్రతాపుని రాణియొక్క ప్రోత్సాహము లేనిచో నాతడన్ని సంవత్సరములు అక్బరుచక్రవర్తిని ప్రతిఘటించగలడా? భారతనారీవతంసము జిజియాబాయియొక్క బోధనలు, హితోపదేశములు లేకున్నచో హైందవ స్వరాజ్యమును శివాజీ మహారాజు ప్రతిష్ఠింపలేడనియే చెప్పవచ్చును. శత్రువులపై సమరమునకు బోవునపుడెల్ల తల్లియాజ్ఞనుగొని, ఆమె యాశీర్వాదమును బడసియే శివాజీచ్ఛత్రపతి బోవుచుండెను. అహల్యాబాయి ఝాన్సీ లక్ష్మీబాయి మొదలైన వారల చరిత్ర లత్యంతనవీనములు. వీరిచరిత్రల బరిశీలించినచో, జాతీయజీవనప్రబోధమునకును, దేశ

సేవా పరాయణత్వమునకునుగూడ స్త్రీజాతియే పురుషునకు వెన్నెముకయు, వజ్రాంగియునై విలసిల్లునని తేటపడును. అందుచేతనే 'ఉయ్యాల నూపుచేయియే, ఉర్వీతలమునంతయు నేలును'ని పెద్దలందురు.

ఇటుల వన్నెగాంచిన వనితామణులు భరతఖండమునం దేమూలనో గాక, మన ఆంధ్రదేశమునందు గూడ మున్ను గలరు.

'ముగురాడువాండ్ర మైలతిమి
వగపేటికి జలకమాడ వచ్చినచోటన్.'

అను రణతిక్కనగారి భార్యయొక్క వచనములు,

'నీ వసివైచి విరిగివచ్చిన
బసులున్ విరిగినవి తిక్క పాలున్ విరిగెన్.'

అని వీరరసమును పురికొల్పిన తిక్కనతల్లి యుల్లసపు మాటలును మనకు పూర్వ పరిచితములే. కావుననే;

'ఏమితపంబుచేసె పరమేశ్వరు నేమిట బూజచేసెనో—
శ్రీమహితప్రతాపుడగు సిద్దన తిక్కనగన్న తల్లియున్'

అను పొగడ్తకు ఖడ్గ తిక్కనతల్లి పాత్రురాలయ్యెను. ఇటుల స్వదేశసంరక్షణార్థము పుత్రులను, భర్తలను ప్రోత్సహించి బలిదానమొనర్చిన మాతృదేవతలును, భార్యాదేవులును ఆంధ్రదేశమునందును గలరు. బొబ్బిలి పల్నాడు సీమలందలి వీరాంగనల వీరపత్నుల కథల, పాటల విననివారు యుండరు; కావున జాతీయ జీవితమునందు బాధ్యతాయుతమగు స్త్రీజాతికి స్వత్వసామర్థ్యములున్నవి. సారస్వతమే జాతీయజీవితమునకు దర్పణము. అగుటచే నవలామణులు కవితారంగమున కవతరించి వారి శక్త్యనుసారము భాషాసేవయు, దానిమూలమున దేశసేవయు జేయుటకు సమముగ నుండవలయును. నారీమణులు రానంతవరకును సారస్వత ప్రపంచ మర్ధనిమీలితమై యుండును. స్త్రీ సహయోగము చేకూరనంతదనుక మానవసాహిత్యము సంపూర్ణత నందజాలదు. ఒకానొక పురుషుడు వేరొక మనుజుని హృదయానుభూతిని సఫలముగ ప్రకటించుటకు సమర్థుడగును; జాత్యైక్యత చేకూరుటచే, పరేంగిత ప్రకాశనపారీణత పురుషునకు లభించును. ఇంత నేర్పుతో పురుషుడు స్త్రీ హృదయానుభూతిని చిత్రింపజాలడు. నారీమణుల చిత్తవృత్తుల వికాసనోన్మీలనముల వర్ణింపబూనినచో, ఎంతటి ప్రతిభాశాలియైన కేవలకల్పనములతోడనే తృప్తినొందవలయు.

ఉదాహరణార్థము—ఒకానొక కవీశ్వరుడు మాతృవాత్సల్యము, వధూహృదయోల్లాసము, కామినీ మనోభావనా ప్రకాశనమును వర్ణింపసమకట్టినచో నతనిరచనము కృత్రిమమై గన్పట్టునే గాని సహజముగ రాణింపదు. జాత్యంతరప్రకృతి పరిశీలనప్రకాశనము లత్యంతదుష్కరములు; అత్యంతదుర్జ్ఞేయములై జెలంగును. ఎంత ప్రయత్నించినను, ప్రకృతివిరుద్ధములై యుండునే గాని ప్రకృతిసిద్ధములు గానేరవు. 'పాము కాళ్లు పామునకెరుక' యన్నట్లు స్త్రీజాతియొక్క చిత్తవృత్తులు స్త్రీజాతికి కరతలామలకమైనట్లు పురుషజాతి కవగతము గాదు. వారివారల ఉదాత్తభావ విభావానుభావములును, హృదయావేగావస్థానుభేదములును స్వహృదయ సాక్షికములే గాని, పరహృదయసంవేద్యములు గావనుట ముమ్మాటికిని సత్యము.

కావున స్త్రీ ప్రకృతిని వర్ణించుటకు స్త్రీలకే ప్రథమాధికారము గలదు. కావ్యము 'కాంతాసమ్మిత'మనియు, కావ్యము 'రసాత్మక వచన'మనియు, 'శబ్దసంగీత'మనియు, 'ధ్వనిసంగీతములకు కావ్యమునందు ఘనిష్ఠసంబంధము గల'దనియు ఆలంకారికులందురు. 'బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యక'యనియు ఆర్యులచే వర్ణింపబడుటచే కవిత్వప్రకృతికిని స్త్రీప్రకృతికిని సాదృశ్యము సామంజస్యము సంభవించుచున్నది. ఈదృష్టితో తిలకించినచో పురుషులకన్న స్త్రీలకే సారస్వత ప్రపంచమునందు స్వాభావికము సులభసాధ్యమునైన సాధనసంపద గలదనుట నిర్వివాదము. ఇంతియే గాదు. సంగీతసాహిత్యముల కధిదేవత సరస్వతి. ఆమె స్త్రీజాతియగుటచేతనేమో సంగీతశాస్త్రమునందు పురుషులకన్న స్త్రీలకే

కంఠమాధుర్యము మిక్కుటముగ ప్రసాదింపుమని బ్రహ్మను నిర్బంధించి యుండవోపు. ఏది యెటుల నున్నను; స్త్రీలే గానమునందు జాణలై రాణజెందిరి. చెందుచున్నారు. అభ్యసింపకున్న నేమోగాని, సంగీతమం దలవడిన చాతుర్యము సాహిత్యమునందు స్త్రీజాతికి చిక్కకుండునా? నాట్యశాస్త్రమును రచించినవాడు పురుషుడైనను దానిని ప్రచారములోనికి దెచ్చిన ఊర్వశీ, రంభా మేనకాదులు స్త్రీజాతిలోనివారే. లోకాంతరవార్తలేల యున్నచో, నేడుగూడ సంగీతమునందును, నృత్యమునందును వన్నెకెక్కుచున్నవారు వనితామణులే. ఇన్ని లలితకళలయం దభిరుచినిగన్న నారీరత్నములు, లలితకళావతంసమైన కవిత్వమునందు నిరాదరణమును జూపుచున్నారు. సహజముగ స్త్రీస్వభావము కోమలము; ఈగుణము వారిశబ్దమునందును, వాణియందునుగూడ వ్యాప్తి నొందియున్నది. కర్ణకటుశబ్దములను మధురములు, సరళములుగ నొనరించుట రమణీమణుల కవశ్యకర్తవ్యము. సంస్కృతసాహిత్యమునం దీ సత్యమునకు ప్రచురప్రమాణము గానవచ్చును. ఎట్లన సఖీమణులు 'శకుంతల'ను 'సఉందల' అని పిలుతురు. ఆమె పేరునందున్న కర్కశములైన 'శ,క,త' అనువర్ణముల నుజ్జగించి చెలికత్తెలు 'స,ఉ,ద,'లను గూర్చిరి. ఈమార్పు వలన యామె నామమున కెట్టి కోమలత, యెంత మధురిమయు చేకూరెనో చదువరులు సులభముగ నెరుంగగలరు. ఇటులనే 'కృష్ణుని' గోపబాలురు 'వెన్నుడ'ని వ్యవహరింతురు. పదములలోని మృదుత్వమును, మాధుర్యమును, అచ్చతెనుగునందు మిన్నగ గానవచ్చును. ఈతెనుగునుడికారమునందలి తియ్యదనము, ఇంగ్లాండ్ర మామూలుమాటల... చాల వన్నెలొలుకును. స్త్రీలభాషయందు సరళతా కోమలతలు స్వాభావికములైయుండ పురుషులభాషయందు పాండిత్యప్రకటనము ప్రచురమై ప్రకాశించుచుండును.

పురుషులభాష చాలవరకు సంస్కృతమయమై చెలువొందును. పెద్దనార్యుని 'పూతమెరుంగులుం బసరు పూపబెడంగులు జూపునట్టివా కైత'లనువాలికయందు సంస్కృతాంధ్రరచనలకుగల భేదమే పురుషులయొక్కయు స్త్రీలయొక్కయు రచనలయందు గూడ గానవచ్చునని చెప్పనొప్పును. అందుచే స్త్రీల రచనలు మధురతరములు, కోమలతరములుగా చెలువారును. ఇందుకు నిదర్శనముగ రామాయణమును రచించినవారి గ్రంథములజూచినచో, భాస్కరుడు, అయ్యలరాజు రామభద్రుడు, కంకంటి పాపరాజు, గోపీనాథం వెంకటకవి వీరల రామాయణము, రామాభ్యుదయములకన్న మొల్లరామాయణము సరసజనామోదముబడసి విలసిల్లుచున్నదని చెప్పకతప్పదు. పురుషులైనవారు రచించిన రామాయణమును జదువని వారు గలరని చెప్పవచ్చునుగాని ఆంధ్రబాలికలలో మొల్లరామాయణమును బఠింపనివారలుండరు. 'ఈ రామాయణమును గొంతకాలము క్రిందటివరకును వీధిబడులలో బాలురకు పాఠమునుగా జెప్పుచుండిరి. ఇది పురుషులు చెప్పిన గ్రంథములలో ననేకములకంటె మనోజ్ఞమై ప్రౌఢమైయున్నది' అని వీరేశలింగము పంతులుగారు వచించిన పలుకులే స్త్రీరచనల ప్రాశస్త్యమును నొక్కివక్కాణించును. ఆమెతరువాత ముద్దుపళనిరచితమైన రాధికాసాంత్వనము గలదు. ఈమె సామాన్యయగుటచేగాబోలు గ్రంథమునందు పరకీయాశృంగారమే ప్రాధాన్యము వహించెను. 'ఈమె సంగీతసాహిత్యములందును, సంస్కృతాంధ్రములందును ప్రవీణురాలు. కవిత్వము నాతికఠినమై మృదువుగానున్నది. స్త్రీ కవిత్వమని తెలిపెడులోకోక్తులును, జాతీయములును పద్యములందు గలవు' అని వీరేశలింగము పంతులుగారే వచించిరి. పంతులుగారు, సంస్కర్తలగుటవలననేమో, ముద్దుపళని రచనయందు 'శృంగారరసమును మేర సంభోగాదివర్ణనములు మిక్కిలి పచ్చిగా నున్న'వని నిరసనభావమును వెలిబుచ్చిరి. అది కథావస్తువునందలి లోపముగాని పేరొందు

గాదని గ్రంథనామమే చాటును. ఈకాలముననే మోహనాంగియను స్త్రీ మారీచిపరిణయమును రచించినట్లు కవులచరిత్ర నుడువుచున్నది. పిదప తరిగొండ వెంకమాంబయను వనితావతంసము కవితాలోకమున గణుతిగాంచెను. ఈమె మంచివిద్వాంసురాలు, గొప్ప భక్తురాలని గ్రంథములే చెప్పుచున్నవి. భాగవతమును ద్విపదకావ్యముగ రచించినట్లీమె వేంకటాచల మాహాత్మ్యమున జెప్పుకొన్నది. ఈమె రాజయోగసారము గూడ భక్తిరసప్రధానమే. వెంకమాంబగారి కవనమతి కఠినముగాక మృదుమధురరచనము, గలదని కవుల చరిత్ర నుతించుచున్నది. ఈమె సమకాలికురాలు సుభద్రయ్యమ్మగారు కొన్ని దండకములు, శతకములు రచించినట్లు తెలియవచ్చును. ఈమెతరువాత పేరొందిన కవయిత్రులు ప్రాచీనులలో లేరు. 'నాచిన్ననాడు శ్రీనాథునివీధి నాటకమునందు కడపట బుద్ధరాజు వారికన్యచే రచింపబడినదని 'వనజాతాంబకు డేయు సాయకములన్ వారింపగారాదు' అను చాటువు నొకదానిని నేను చదివితిని. వీనివలన ప్రాచీనులలో, ఆధునికులలోగూడ నవలామణులు కవితాజగమునందు కృషి సల్పిరనుటకు నిదర్శనములు గానవచ్చును.

కవిత్వమునందు భాషకును భావమునకును శరీరమునకును, ఆత్మకును గల అవినాభావసంబంధము గానవచ్చుచున్నను, ప్రాధాన్యము ఆత్మకే యున్నట్లును. కావున భావమే ప్రధానమువహించును. అందువలననే మనుచరిత్రమునందలి 'ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ!' అను పద్యమును 'ఎక్కడియూరు కాల్నిలువ కింటికి బోయెదనంచు బల్కెదీవు' అనుపద్యమును చదువరుల మనముల గరగించినటుల 'అటజనిగాంచె భూమిసురు డంబరచుంబి' అనుపద్యము చదువరుల కానందము గూర్పజాలదు. కావున కవితాజీవము సరళపదములు, సరసపాకముపై నాధారపడియుండును. రచనము కఠినశయ్యాకలితమైనచో సగమానందము శూన్యమగును. ఈకారణముననే సాహిత్యమర్మజ్ఞులు 'విపంచీస్వర సౌభాగ్యయుతమైన వైదర్భీరీతిని' మిపుల వినుతించిరి.

ఇక గుణములలో మాధుర్యప్రసాదగుణములనే చాల గణుతించిరి. ఒకానొక వస్తువర్ణనమునుగాని, భావప్రకాశమునుగాని సరసములైన శబ్దములతో, లలితములైన పదములతో చదువరులకు సులభముగను, సుగమముగ నుండునటుల రచించినచో నచట మాధుర్యప్రసాదగుణములు విలసిల్లుచుండును. కవిత్వము హృదయముయొక్క భాష. ఇటుల భాషరూపము నొందినభావమే కవనమై వెలుంగుచో పాండిత్యప్రకటనమునకంతగా ప్రాకులాడ నక్కరలేదు. ఇంత మాత్రమున సౌకుమార్య లాలిత్యములకొరకై పాటుపడ నక్కరలేదను భావముగాదు. భాష స్వభావసిద్ధము, జనసాధారణబోధకమునై మెలంగవలయుననియే తాత్పర్యము. ఈవిషయములనన్నిటిని గమనించినచో స్వాభావిక వర్ణనలసలుపు సామర్థ్యము గలవారలందరును, స్త్రీపురుషజాతు లిర్వురునుగూడ, చేతనైనంతవరకు శక్తివంచనలేక సారస్వతసేవ సలుపవలయును. పురుషకృతులతోపాటు నవలారచనలు గూడ సాహిత్యసౌధము నలంకరింపవలయును. దేశసేవకు భాషాసేవయే ప్రథమసోపానము. పాకశాస్త్ర పారీణతను ప్రకటించి వనితామణులు ప్రఖ్యాతి వహించినటులనే, సంగీతసాహిత్య శాస్త్రములయందు గూడ సాధ్వీమణులు చాతుర్యములు ప్రకాశింపజేసి, ప్రాచీనవిదుషీమణుల మార్గము నవలంబించి, మాతృదేశోద్ధరణమునకు మార్గదర్శినులు గావలయునని ప్రబోధించుచున్నాము. ఇంతమాత్రమున నేడు స్త్రీజాతి భాషాసేవ జేయుటలేదని మాయాశయముగాదు. భావిభారతజాతికి బాల్యవయసున మాతృదేవతయే విద్యోపదేశికురాలు గాన, తామెంత విద్యావతులైన తనయు లంతకుమించి విద్యావంతులగుదురు. అందువలన చేయుచున్న సాహిత్యసేవతో సంతృప్తినొందక నవలారత్నములు కవితాజగమునందును, సారస్వతప్రపంచమునందును ద్విగుణీకృతోత్సాహము వహింపవలయునని హెచ్చరించుచున్నాము.

# స్త్రీ విద్య

శ్రీమతి చదలవాద వెంకటచలంగారు

ఉ॥ హర్తకు గాదు గోచర మహర్నిశము౯ సుఖపుష్టి జేయు స
త్కీర్తి ఘటించు విద్యయను దివ్యధనం బఖిలార్థికోటికి౯
బూర్తిగ నిచ్చిన౯ బెరుగు బోదు యుగాంతపువేళ నైన భూ
భర్తలు తద్ధనాధికుల పట్టున గర్వము మాను టొప్పుగు౯ ॥

అని భర్తృహరి తననీతిశతకమునందు వ్రాసియున్నాడు. విద్యనేర్చుటవలన వినయాదిసుగుణసంపత్తి లభింపవలెను. మరియు తాను నేర్చిన విద్యవలన, అన్యులకు యేమాత్రమును కీడు కలుగరాదు. అట్లు ఇతరులకు కీడు కలిగెడు విద్య, జల్లికూతలతో సమానమనియు, దానికంటె మౌనమే మంచిదనియు పండితాభిప్రాయము.

"విత్"అను ధాతువుపై, కార్యప్రత్యయానుకరణములు ఊరుటవలన విద్యయను బడెనియు, అనగా విద్యాశబ్దమునకు మూలకారణము తెలివి తేజస్సు అని అర్థమనియు జ్ఞానవంతులు వచించెదరు. అట్టి విద్యవలననే మంచిజ్ఞానము లభించుననియు, అట్టి మంచి జ్ఞానము లభించిననుగాని భయములు వీడవనియు పెద్దలు వచించుటవలన సద్విద్యావంతుడొక్కడే నిర్భయుడు.

అట్టి విద్యలేనివారలు "విద్యావిహీనః పశుః"అనగా పశువులతో సమానమని పరిగణింపబడుదురు. పశువులకు నాల్గుపాదములు గదా యని యోచింప "విద్యలేనివాడు వింత పశువు"అని ఏనుగు లక్ష్మణకవి వచించెను. అనగా "అవి చతుష్పాజ్జంతువులు, ఇవి ద్విపాదపశువులు" కావున సర్వజన సమాదరణీయమైనది విద్య-దానినందరును జదువవలయును.

ఇట్టి సద్విద్యస్త్రీలకు ఆవశ్యకమా కాదా యనుటకు విచారింప.

గీ॥ విద్యవలనను దొలుతను వినయమబ్బు
వినయమున సర్వగుణములు వెలయుచుండు
వానిచేతను పతిభక్తి పాదుకొనును
గావునను సుందరులు విద్య గరపవలయు॥

అను సద్వాక్యప్రకారము స్త్రీలు విద్య నేర్చుట యావశ్యకము. అట్లయిన నిపుడు కొందరు విద్యనేర్చిన స్త్రీలు దుష్ప్రవర్తకురాండ్రై యుండలేదాయనియు, విద్యలేనివారలు, పతిభక్తి కలిగియుండలేదాయనియు కొందరు వాదింపవచ్చును గాని, ఇంత మాత్రము చేతనే తక్కిన వారెవ్వరును చదువవలసినది లేదా?

నీతిశాస్త్రమునందు తెల్లవారి లేచిన వెంటనే దంతధావనముఖప్రక్షాళనాదులు చేయనివారు ఇతర విషయములందు విష్ణు

వృత్తితో సమానులైనను వార్లను నేను పరిత్యజించెదనని, శ్రీదేవి వచించెనని వున్నది. ఇప్పుడు మనము చూచునట్లనేకులు12గంటల వరకును పగలు పండ్లుతోముకనే యుండువారు కలరు. అట్టివారు మహదైశ్వర్యవంతులుగా నున్నారు. ప్రాతస్నానములు చేయుచు బహు పరిశుద్ధులుగా నుండువారు కేవలము దరిద్రులై యున్నారు. ఇంతమాత్రము చేత యెవరును ముఖము కడుగివేసినదే లేదన వచ్చునా? కావున యేవో అపూర్వములుగా నుండు విషయములను అన్నిటికిని చేరగ రాదు.

స్త్రీలు నయ, వినయ, సౌజన్యాది సుగుణవతులు కావలసిన యెడల విద్య నేర్చియే తీరవలెను. మరియును విద్యార్థులు శృంగార జావళీలు,బిల్హణీయము,సారంగధరచరిత్రము, తారాశశాంక విజయము, వైజయంతీ విలాసము, శృంగారక్రీడలు మొదలగు విరాగులను సైతము సరాగులనుగాచేయు గ్రంథములను స్త్రీ, పురుషులెవ్వరును చదువరాదు.

గొప్పనీతులను పాతివ్రత్య ధర్మములను బోధించెడి అనసూయశకుంతలా సంవాదము, పద్మావతీచరిత్రము, సత్యాద్రౌపదీ సంవాదము, దమయంతి సీతా మొదలగు సాధ్వీమణుల చరిత్రములు, నీతికథావల్లరి మొదలగు సద్గ్రంథములను పఠించుట, గొప్పవారిచే వచింపబడు ఉపన్యాసముల వినుట, స్త్రీ పురుషుల కత్యంత శ్రేయస్కరము. విద్యావంతులు అనేకులు దుర్మార్గముననే యున్నారుకదా యనగా నదివారి గర్వము. దీపము ప్రకాశముకలది. అట్టి దీపమువలన ననేకులు అంధకారమువలని బాధలను తొలగించుకొని సుఖముగా నుందురు మరి కొందరు గర్వించి దానిచే, తమ వస్త్రములనే కాల్చుకొందురు. అందుచేత నెవరికిని దీపమే కూడదనవచ్చునా; అట్లనుట యవివేకము దప్ప వేరుకాదు. మఱికొందరు, స్త్రీలకు విద్య యెందులకు—వారలకు పురుషుల సేవ వలననే ముక్తి కలుగునని వచించెదరు. పురుష సేవయనగా పతిసేవ శ్రేష్ఠమనుట నిజమే యైనను, విద్యలేని స్త్రీలు సాధారణముగా మూఢవిశ్వాసములకు లోనై పతిభక్తియందనూయకలవారై యుందురనియు విద్య నేర్చిన స్త్రీలు అట్టి మూఢనమ్మికలను పాటింపక పతియందసమాన ప్రేమకలిగి యుందురనియు నాగరికతగలవారి యభిప్రాయము.

ఒకవేళ స్త్రీలకు విద్య యనావశ్యకమే యైనయెడల పరమవిజ్ఞాన సంపన్నులై శ్రీరామానుజాచార్యాది మహానుభావులు స్త్రీలకుగూడ పంచసంస్కారాదులు కొన్నిటిని నియమించియుండు రేమకో:—

గౌరీ పంచాక్షరీ, లక్ష్మీస్తవము మొదలగు ననేకమంత్రములను చక్రాంకితాదులను యేమునకు నియమించిరో తెలియకున్నది. విద్యలేని స్త్రీలకు యివన్నియు ఎట్లు తెలియబోవును. అనేక వ్రతములును, మంత్రములు స్త్రీలకొఱకు విధించియుండగా, స్త్రీవిద్య కూడదనుట యెట్టిమాట. విద్యలేని వారికి మంత్రమెట్లు రాగలదు.

# శ్యామల

శ్రీమతి ఆచంట కొండమ్మగారు

ఏలూరిలో మోహనరావుగారొక ప్రసిద్ధి జెందిన ప్లీడరు. ఆయనకు 18 సంవత్సరముల కుమార్తెయు, 10 సంవత్సరముల కుమారుడును యుండిరి. ఆయన సహధర్మచారిణి కుమారునిగనిన సంవత్సరములోనే మృతినొందెను. తల్లిలేని లోపమురాకుండా అన్నివిధముల చేతను తల్లియు దండ్రియు తానేయై ఆబిడ్డలను పెంచుకొనుచుండెను. శ్యామల, రామారావు చాలా తెలివిగల్గినపిల్లలు. వారికి చక్కని రూ ప సం ప ద యున్నది. శ్యామల మెట్రిక్యులేషన్ పూర్తిచేసిన వెంటనే యఫ్. ఎ. చదువుకు మద్రాసుపంపు నుద్దేశముతో తండ్రియుండెను. ఏలూరునందు మోహనరావుగారి ప్రక్కవీధిలో మునసబు నాగభూషణరావుగారికి ఒక పెద్దమేడయుండెను. ఆయనకు పిత్రార్జితమైన భూములుగూడ గలవు. ఆయనకు కమలాకరరావను ఒక కుమారుడుండెను. అతడు చాలా చక్కనివాడును, తెలివైనవాడును అయియుండెను. శ్యామల అతనితో ఆటపాటలయందు పాల్గొనుచు మిగుల మైత్రిగా యుండెను. కమలాకరుని తల్లి రాజేశ్వరమ్మగారు తల్లిలేని బిడ్డలగు శ్యామల రామారావులను తన కొమరునితో స మా న ము గా ప్రేమించుచుండెను. సాయంత్రపువేళలందు ముువ్వురునుచేరి షికారుపోవుచూ, ఎవరికి ఎచ్చటెచ్చట కుతూహలముగా ఉన్న అక్కడక్కడ వారువారు నిల్చుచు కాలమును సంతోషముగా గడుపుచుండిరి. అంతకంతకు జ్ఞానము కలిగిన కొలది కమలాకరుడు శ్యామల సౌందర్యముచూచి ముగ్ధుడగుచూ మాటలచేత తనప్రేమను వ్యక్తీకరించుచుండెను. ఒకనాడు సాయంత్రము శ్యామల తనతండ్రిగారి ఉద్యానవనములో పూలుకోసికొనుచు తనలో కమలాకరునకు "నామీదప్రేమ దినదినమునకు వృద్ధిపొందుచున్నది. నాకును ప్రేమ యున్నదిగాని భావములేమియు మొలకలెత్తుటలేదు. అతనినిచూచిన నీప్రేమ గలుగుచుండును గాని ఉద్రేకపూరితమైన పలుకులను విన్నప్పుడుమాత్రము కొంచముకోపమువచ్చుచుండును. జవాబుచెప్పుటకు నాకేమియు నోరాడుటలేదు. ఏమన్నను, అతనికి కోపమువచ్చునేమో యనుభయము నాకన్నిటికిని అడ్డువచ్చుచుండును. యౌవనములో ఉన్న కమలాకరునితో నన్ను మాటలాడవలదనిగాని షికారు పోవలదనిగాని నాతండ్రి ఎన్నడునూ అనలేదు. కమలాకరుని తల్లిదండ్రులును, ఆతనిని మందలించినట్లు తోచదు." ఇట్లు శ్యామల తనలోతా ననుకొనుచుండగా మెట్లవద్ద నెవ్వరోమాటలాడుచున్న సవ్వడివిని అచ్చటికివెళ్ళి చూచుసరికి, కమలాకర, రామారావు లిరువురుకూర్చుని మాటాడుచుండుట గాన్పించెను. అంత శ్యామల "ఏవిషయమై మాట్లాడుచున్నారు? నాకుకూడ కొంచము చెప్పుడు." అనెను.

కమలా:—నాకు శెలవులు 15 దినములున్నవి. మాతండ్రి నన్ను కాశీలో ఇంజనీరింగు చదువుమని ఎల్లుండి మంచిరోజుగాన నన్ను బయలుదేరమని దల్పిరి అని విచారముగా బల్కెను.

శ్యామల:—(కమలాకరుని దగ్గరకువచ్చి) కమలం ఏల ఇంతవిచారము? ఎక్కువవిద్యనేర్చి మంచి ఉన్నతోద్యోగము సంపాదించి ఒకగృహస్థువై తల్లి తండ్రులను సుఖపెట్టుటగదా నీవంటివారి స్వభావము. అదియునుగాక సంతోషముగా నుండుటకు మారుగ ఇంతవిచారముగా ఉండుటకు కారణమేమి? అని

తమ్మునివైపుతిరిగి "రామం! నీకుతెలుసునా మన మిత్రుని విచారకారణము?

రామా:—అక్కా! నాకు తెలియదు. అని కమలాకరుని వంకదిరిగి "మిత్రమా! ఏల నీవిట్లు విచారముగానున్నావో మాకు కొంచము తెల్పరాదా?

కమలా:—(విచారముతో) మిమ్ములనువిడిచి దూరదేశమునకు వెళ్లవలసివచ్చుటయే కారణముగాని వేరే విచారకారణము నాకు మరేమున్నది?

శ్యామల:—కమలాకరా! వెళ్లుము. విచారించకుము. ఎల్లకాలము అందరము ఒకచోట ఉండుట తటస్థించునా? నన్నును మాతండ్రి చెన్నపట్నమునకు పంపదలచినారు. నీవును విద్య చాలించుకొనిరమ్ము నేనును విద్య పూర్తిచేసివచ్చెదను. భగవంతునిదయ వలన మనము తిరిగి కలసికొనగలము.

కమలా:—(తనలో) నేనేవిధముగా నాప్రేమను సూచించినను ఈమె తనమనస్సును కొంచమైనను నాకవగతమగుట కవకాశ మీయకున్నది. ఆమె తన ప్రేమను ఒకవేళ నాయందు సోదరప్రేమగా మాత్రమే నిల్పినదేమో నాకు తెలియదు.

శ్యామల:—ఏమట్లు పరాకుగానున్నావు? తెల్పుము. అని మాటాడుచున్నప్పుడు ఒకసేవకుడరుదెంచి కమలాకరునిచూచి "బాబూ మీతండ్రిగారు మిమ్ములను తొందరగా రమ్మనుచున్నారు" ఆమాటలు వినగానేనాకమలాకరుడు లేచి "మిత్రులారా! నే బోయివచ్చెద"అని పల్కి వెడలిపోయెను.

రామ:—అక్కా! కమలాకరము మనలను విడువలేక విడువలేక వెళ్ళినాడుసుమా పాపము. మనలనుగూడ మన నాన్నగారు కాశీకిబంపిన ఎంత బాగుండును?

శ్యామల:—(తనలో) "ఈ అమాయకపు తమ్మునికేమియును తెలియదు" అని అనుకొని ప్రకాశముగా "తమ్ముడా! రమ్ము ప్రొద్దుపోవుచున్నది." అని లోనికి తీసికొనిపోయెను.

౨

శనివారమునాడు ఉదయము నాగభూషణంగారు కుమారునితీసికొని మోహనరావుగారింటికివచ్చి ఆయనను చూచి నమస్కరించి "మాఅబ్బాయి కాశీకిపోబోవుచు మీ ఆశీర్వాదముకొరకిచ్చటికి వచ్చినాడు."

మోహన:—నాయనా! కమలాకరా! నీవు నీస్వధర్మమునుమీరక జాగ్రత్తగా విద్యాపూర్తిగావించుకొని త్వరలో వచ్చునట్లు భగవానుడాశీర్వదించుగాక నీశరీరమునుమాత్రము అనవసరవ్యసనములకు పాల్పడనీయక ఆరోగ్యముగా నిల్పుకొనుచుండుము.

కమలా:—చిత్తము అనిపల్కి తన మిత్రద్వయముల కరములను తనకరమునబట్టుకొని "నేను వెళ్లి వచ్చెదను జ్ఞాపకముంచుకొనుడు" అని గద్గదస్వరముతో బల్కి తిరిగి శ్యామలను ఒకపరి దీనదృక్కులతో గాంచెను. ఆమె యమితధైర్యవతియైనను తన కనుకొలుకులనుండి రెండు కన్నీటికణములను రాల్చకుండ ఉండలేకపోయెను. అప్పటికే కాలాతిక్రమణమగుచున్నదను భయముచే తండ్రికుమారులిర్వురు సెలవుగైకొని వెడలి కారెక్కిరి. కమలాకరుడు మాత్రము పోవుచున్నప్పుడు తనదృష్టులను శ్యామల నుండి మరల్చజాలక బలవంతముగ మరల్చుకొని తనలో "శ్యామల నన్నుగాక మరెవరిని వివాహమాడును? చిన్ననాటి స్నేహితుడనగు నన్ను తృణీకరించునా" అని యోచించుచూ వెడలిపోయెను. మరి పదిదినములకు మోహనరావుగారు తనకుమార్తెను చదువునిమిత్తమై చెన్నపట్టణమునకు పంపెను. అక్కడ బి. యల్. చదువుచున్న కృష్ణారావు అతనిచెల్లెలు పద్మిని, మనశ్యామలకు మిగుల మిత్రులై ఎడబాయకుండ మసలుకొనుచుండిరి.

శ్యామల కృష్ణుని చూచినదిమొదలు ఒకవిధమైన ప్రేమానురాగములచే పీడింపబడుచుండెను. కృష్ణారావు

కూడా శ్యామలనుచూచినదిమొదలు ఆదేవిధమైన భావములచే ఉద్రేకింపబడుచుండెను. ఇట్లు ఒకసంవత్సరము గడచినపిమ్మట మువ్వురునుకలసి ఒకరోజున బీచికి షికారువెడలి సూర్యోచ్చనుసరికి కొంచముదూరముగా ఏదో సందడగుచుండ పద్మిని దానిని కనుగొనుటకు వెడలెను. అంత కొంతసేపటికి శ్యామల ప్రియా యనబోయి ఆపి, మిత్రమా! నీసోదరిని ఎవరు వివాహమాడుదురో వారు మిగుల నదృష్టవంతులు సుమా!

కృష్ణ:—ప్రియా అనబోయి ఆపివేసితివేల? ప్రియాఅని పిలిపించుకొనుటకు నాకు అర్హతలేదా? నీవు నిజముగా నన్ను ప్రేమించినయెడల మన వివాహమున కేమి అభ్యంతరము?

శ్యామల:—(తలవంచి) నేనడుగునదదిగాదు నీ సోదరి వివాహమునుగూర్చి,

కృష్ణ:—సరి పద్మినిని వివాహమాడువారి అదృష్టముకంటె నిన్ను వివాహమాడువారెక్కువ అదృష్టవంతులని నానమ్మకము. సరేగాని మాకుటుంబమున నాసోదరికి తగినవరుడెవ్వడైననొరికిన మనమందరము ఒకచోటనే ఎడబాయకుండా ఉండవచ్చును.

శ్యామల:—నాస్నేహితుడును మిగుల బుద్ధిమంతుడును అగు కమలాకరరావను మునసబు నాగభూషణంగారి కొమారుడు ప్రస్తుతము కాశీలో చదువుచున్నాడు. నీసోదరికి అతడన్నివిధముల తగియున్నవాడు. కృష్ణరావు ఎద్దియో జవాబు చెప్పబోవుచుండునంతలో పద్మినివచ్చి "అన్నా చీకటి పడుచున్నది ఇండ్లకుపోదమా" అని పల్క అందరులేచి గృహోన్ముఖులైరి. కృష్ణునికి తండ్రిలేడు. తల్లిఉన్నది. పిత్రార్జితమైన కొంతనగదువున్నది. ఇప్పుడాతను నివసించుచున్నగృహము వారి స్వంతముదే. అతనితల్లి చాల ఉత్తమురాలు. శ్యామలను చూచినప్పటినుండి తన కొమరునకు ఆమె తగియుండునను సంకల్పము కలిగెను. క్లాసులు మూసినవెంటడే శ్యామల తండ్రిగారిపిలుపు ననుసరించి ఈ మిత్రులనిరువురను వదలలేక విచారించుచు తనఊరికి వెళ్లెను. ఒకరోజు మధ్యాహ్నము తండ్రి కుమార్తె లిరువురు ఒక్కచోటకూర్చుండి లోకాభిరామాయణము మాటాడుకొనుచూ మాటల సందర్భమున శ్యామల, కృష్ణారావు కుటుంబస్థితిని గూర్చియు ఆతనిగూర్చియు కొంచము తెలియబరచెను. అందులకాతడు తలనూచుచూ "అమ్మా నీకిష్టముగాయుండి నిన్ను చేసుకొనుటకు ఆతనికి ఆతనితల్లికి ఇష్టముగా నున్నయెడల నాఅభ్యంతరముండదు. నాఉద్దేశముమాత్రము నీచిన్ననాటిమిత్రుడగు కమలాకరుని కీయదలచినాను. అదిగాక అప్పటి మీవిహారములు, మీఆటలుచూచి నేను మీఇరువురియందును ప్రేమాంకురములు నాటినవని అనుకొంటినిగాని నీప్రేమ సోదర ప్రేమయే యని ఇప్పటివరకు గ్రహించలేకపోతిని. అయినను మించినదేమి. నీఇష్టానుసారము వారికి జాబు వ్రాసి తెలుసుకొని మీవివాహప్రయత్న మొనర్చెదను. ఆపల్కులువిని శ్యామల తనతండ్రి ఔదార్యబుద్ధికి చాలసంతసించి లోనికి వెడలిపోయెను. మోహనరావుగారును కృష్ణారావువద్దనుండి అంగీకారమైన జవాబునుపొంది తన బంధువర్గమునకు కాశీలో చదువుచున్న కమలాకరునకు శుభలేఖలను వ్రాసెను. అచ్చట కమలాకరుడు ఈజాబును గాంచినతోడనే నిర్ఘాంతపొంది ముచ్చెమటలు గార్చుచుండెను. చేతనున్నపత్రిక జారి క్రిందబడెను. అంత అక్కడనున్న కుర్చీలో జారిపడి శ్యామలనుగూర్చి వాపోవుచూ "అయ్యో! నేనెంత నిర్భాగ్యుడను. నాఆశలన్నియు అడియాసలాయెను. నాశ్యామల ఇట్లుచేయునని లోకలనైన అనుమానించలేదు."అని విచారించుచూ పిచ్చిఎత్తినవానివలె అటునిటు తిరుగుచూ, దీర్ఘాలోచనాతత్పరుడయ్యెను. తిరిగి కొంతసేపటికి "నేనెంత పిచ్చివాడను. నాఅభిప్రాయమును ఒక్కసారియైన స్పష్టముగా దెల్పితినా? నాఅభిప్రాయమును దెల్పక ఆమెప్రేమనుగూడ నాప్రేమవంటిదే అను నమ్మకములో ఆమెను నిష్ఠూరపరచిన లాభమేమి? నేను తప్పక

వివాహమునకు వెళ్లకున్న నాస్నేహమునకు భంగం రాక తప్పదు. తప్పక వెళ్లెదను." అని తన సామానులను సర్దుకొనుచూ తొందరపడుచుండెను.

## 3

పెండ్లిదినము వచ్చెను. మోహనరావుగారు తల్లిలేనిబిడ్డయగు శ్యామల వివాహమునుగూర్చి మిగుల నాతురపడుచూ కన్యాప్రదాతలకొరకై విచారించుచుండెను. ఇంతలో నాగభూషణరావుగారు తనకుమరునితోగూడ అక్కడికిరాగా చాలాసంతోషించినవారై సంతోషవిచారములు పెనగొన అతని రెండుచేతులను తనచేతులతో బట్టుగొని "అయ్యా! తమరు మా శ్యామలను నాకన్న ఎక్కువగా పెంచి పెద్దదానిని చేసినారు. ఈ వివాహముకూడ మీరే లక్షణముగా జరిపించి నాకు సంతోషమునుగూర్ప ప్రార్థించుచున్నాను."ఇట్లు వీరు మాటాడుకొనుటలో లీనులై యుండగా కమలాకరుడు శ్యామలను చూచుటకు లోనికి వెళ్లెను. వెంటనే శ్యామల స్నేహపురస్సరముగా "కమలాకరా! వచ్చితివా? చాలసంతోషము. నీవువత్తువో లేవో అని నేను మిగుల నాందోళన చెందుచున్నాను. నాకు నిజమైన స్నేహతత్వమును నీవు బోధపరచితివి. స్నేహమును నిది శాశ్వత సూత్రములచే బంధింపబడి ఎట్టి అవాంతరములకు లోబడక తననిర్మలమైన పరిశుద్ధస్వభావమును మాత్రమే వ్యక్తపరచుచుండును. నేనొక్కసంగతి నీకు చెప్పెదను: నీవు దానినిఅంగీకరింతువని నమ్ముచున్నాను నీకుతగిన కన్యయు కృష్ణారావుగారి సోదరియు అగు పద్మిని స్కూలుఫైనలు చదువుచున్నది. ఆమెను నీవు తప్పక వివాహమాడిన మనము దూరముగాక దగ్గరనే మునుపటివలె మెసలుకొనుచుండవచ్చును. ఏమిమాటాడకున్నావు. సోదరా! నీ శరీరమునం దేమియు లేదుగదా? కండ్లనుండి నీరు కార్చుచుంటివేమి? కారణము నాకు తెలుపరాదా?

కమలా:—శ్యామలా! నా ప్రేమతత్వమునుగూర్చి నీకు తెలియుననను నమ్మకముతోనే, ఇన్నిదినములుండి అనేక గాలిమేడలను నిర్మించుకొనుచూ ఉంటిని. వాటినన్నింటిని ఒక్కసారిగా నేలమట్టమును గావించి నన్ను నిరాశలోగూల్చినావు అని గద్గదిక కంఠముతో బల్కెను.

శ్యామల:—కమలాకరా! ఎట్టి వెర్రిభ్రమలో మునిగియుంటివి? స్త్రీలహృదయమును పూర్తిగా గ్రహించనిదే పురుషులు ఇట్టి ఆశలను గల్పించుకొని తిరిగి స్త్రీలను నిట్లు నిష్ఠూర్యపరచుట భావ్యమా?

ఇన్నిదినములనుండి నన్ను చూచుచున్నను నామనస్తత్వము నీవు ఏమియు కనిపెట్టలేకపోతివను మాట. నీవు అన్నవనియు రాముడు తమ్ముడనియు నే ప్రేమించుచుంటిని. నాతండ్రిగారుకూడా ఇట్టి భ్రాంతిలోనేయుండి నే నీసంగతిని ప్రస్తావించినప్పుడు ఆశ్చర్యపడినారు. నీ విప్పటికే నిజస్థితిని గ్రహించి ధైర్యమునువహించగల సామర్థ్యవంతుడవని నమ్మియున్నాను.

కమలా:—సోదరీ! నాతప్పును క్షమింపుము. నా మందబుద్ధిని దిద్దుబాటు చేసినందులకు మిగుల కృతజ్ఞుడను. ఇంతలో పద్మినీ కృష్ణారావులు తమ తల్లితోకూడ ఇచ్చటికే వచ్చిరి. అప్పుడు కృష్ణారావు కమలాకరమును చూచి చాలసంతోషించి తన చెల్లెలగు పద్మిని వివాహప్రస్తావన దెచ్చెను. గాని పెద్దల అనుజ్ఞ పుచ్చుకొనుట అవసరమని నాగభూషణంగారి వద్దకు అందరూ వెడలి సంగతి సందర్భములను ఆయనకు వివరించిరి. ఆయనయు మిగుల సంతోషముతో "నా కింతకన్న కావలసినదేది? వారి ఉభయులకు అంగీకారమే గదా?" అని ప్రశ్నించెను. కమలాకర పద్మిను లిర్వురు లోలోపల నవ్వుకొనుచుండగా కృష్ణారావు శ్యామలతో "చూచితివా నీ సోదరుడు కమలాకరుడు ఏమియునెరుగని నంగనాచియని నాతో మొదట చెప్పినావు. ఒక్కచూపుతోనే నాసోదరిని వెఱ్ఱిదానిచేసినాడు. అని పల్కి అందరు పకపకనవ్వసాగిరి. కృష్ణారావు తల్లియు తనఅల్లుని రూపసంపదకు విద్యాభివృద్ధులకు మిగుల సంతోషించి వారందరికి మంగళాశీర్వాదములను ఆశీర్వదించెను. సుముహూర్తమునం పెద్దల సన్నిధానమున శ్యామలా కృష్ణారావులకును, పద్మినీ కమలాకరులకును అత్యంతవైభవముతో వివాహములు జరిగెను.

# కీ॥ శే॥ వెల్లూరి తులశమ్మగారు

కో॥ రామేశ్వరరావుగారు

ఈమె వెల్లూరి పెద్దంబరాజుగారి ధర్మపత్ని. శ్రీరాజునాయుడుగారు బ్రహ్మధర్మానుష్టానపరులు. వీరు బ్రహ్మధర్మమును స్వీకరించిన నాడాదిగా కీ॥ శే॥ తులశమ్మగారు తమ భర్తగారి యడుగు జాడల ననుసరించి, బంధువర్గమువారి వీడి, సంఘబహిష్కారమునకు వెరువక బ్రహ్మధర్మమును దమజీవితాదర్శకముగా గడపిరి. బ్రహ్మధర్మకుటుంబములలో వీరిదొక్కటే యనుష్టానిక కుటుంబమని జెప్పుటకు శ్రీతులశమ్మగారి పాతివ్రత్యమేయని చెప్పక తప్పదు.

శ్రీ పిఠాపురం రాజావారు స్థాపించిన యనాధశరణాలయమునకు శ్రీ రాజునాయుడుగారు 1909-వ సంవత్సరమున సూపరెంటుగా నియమింపబడిరి. ఆనాటి దినములలో శ్రీ మహారాజావారి ధనసహాయముతోబాటు అనాధులగు బాలురకు మాతృప్రేమ యావశ్యకత కొరకై యుండెను. ప్రారంభమున నీదంపతులు యనాధశరణాలయమునకై పడినశ్రమ యెంత కొనియాడినను దనివి తీరదు. ఏలనన శరణాలయమునందప్పటిలో పంచములుదప్ప తదితరవర్గముల వారిని జేర్చుకొనుటకు శ్రీ మహారాజావారి యనుజ్ఞ నొసంగుటచే, యిదియును క్రైస్తవ సంస్థయే యని ప్రజలూహించుటవలన సేవకులు సంఘబహిష్కారమునకు వెరచి ప్రధమములో శరణాలయమునందు పనిచేయరైరి. శ్రీ తులశమ్మగారు యత్యంతాదరముతో, దమ పుత్రులతో సమముగా నీయనాధులకు వంట చేసి స్నానములు జేయించి వేయేల మాతృదేవతయై చేసిన సేవకొనియాడదగినది.

ఇట్లుండ దమ గృహమునందు సైతము దమ సహోదరిని, యామె పుత్రికలిరువురను నొకపుత్రుని, శ్రీ రాజునాయుడుగారి సోదరుని కొమార్తెను యతిగారాబముతో పెంచి పెద్ద చేసిన మహాసాధ్వి తమ సహోదరి కుమార్తెకును, శ్రీనాయుడుగారి సోదరుని పుత్రికకును మంచిదాంపత్యమును జూసి వివాహమును జేయించిరి.

ఈమెకు ముగ్గురు కుమార్తెలును అయిదుగురు పుత్రులునుగలరు. శరణాలయపు బాలికను దమ జ్యేష్టపుత్రునకు వివాహముజేసిరి. తమభర్తతోపాటు యనాధపోషణ యుత్కృష్టమైన భగవంతునిసేవయని, సదా వారి శ్రేయస్సు దమబిడ్డల శ్రేయస్సని, నిరాడంబర జీవియై, యెల్లరమేలు దమమేలని త్రికరణశుద్ధిగా నమ్మిన స్త్రీరత్నము శ్రీతులశమ్మగారు, దమభర్తగారు శరణాలయమునుండి విరమించిన నాటనుండి, బహుకష్టములకు లోనై

మున వెళ్లకుండా చేసెను. నాయనా! నాకోరిక నెరవేర్చెదవా బాబూ అని అడిగెను. అమ్మా నీమాటకు ఎదురు ఆడుదునా! అట్లనె చేసుకొందును. అని పలికెనో లేదో సుందరమ్మ మనస్సు సంతోషముతో యుప్పొంగెను. సుందరమ్మకు పనివుండుటచే క్రిందకు దిగి వెళ్ళిపోయెను. సుందరమ్మ మేడదిగుటతోడనే మణి వెళ్ళిపోవుటకు లేచెను. గాని మాధవుడు మణీ వెళ్లకుమణీ; వుండు అనిచెప్పి స్వయంగా గదిలోనికివెళ్లి ఒక కుర్చీ తెచ్చి పైటవరండాపై వేసి తానొక ఈజీ చైరుపై పండుకొని మణీ నిన్ను ఒకమాట అడిగెదను, చెప్పెదవా? చెప్పెదనన్నట్లు తలయూచినది మణి. నన్ను పెండ్లిచేసుకొనుట ఇష్టమేనా? అని అడిగెను. ఇష్టమైనను కొనసాగుట బహుదుర్లభమను ఆశాసూచకమగు పలుకులుబల్కెను. ఏమి! మణీ ఎట్లు దుర్లభము. ఎట్లు దుర్లభమని అడుగుచున్నారా? మీరు పెద్దజమీందారుని ఏకపుత్రులైజన్మించినారు. బి. యల్. ప్యాసు అయినారు. నేను ఒకానొక చిన్న ఆఫీసర్ కూతురను. మేము ఇద్దరము అక్కచెల్లెండ్రము, ఇద్దరు అన్నదమ్ములు. మాది కొంచెము పెద్దకుటుంబము. వచ్చే ఆదాయముచూస్తె నెలఒక్కంటికి 95 రూప్యములు. నాన్నగారి ఒక్కరి చేతిమీద వచ్చేడబ్బు తోమ్మండుగురు తినుట; అన్నయ్య చెన్నపట్టణములో యం.బి.బి.యస్. చదువుచున్నాడు. నిన్నటిదినము 100 రూపాయలు అర్జంటుగా పంపమని వుత్తరము వచ్చినది. నాన్నగారు కంగారుపడుచుండగా నా మెడలోని మీదపైనుతీసి అమ్మివేసి ఆవచ్చేడిసొమ్ము అన్నకు పంపమనిచెప్పి ఇలాగు వచ్చితిని. మీనాన్నగారు కనీసం నాలుగు వేలుఅయినా కట్నం పుచ్చుకొననిదే మీకు పెండ్లిచేయరు. మానాన్నగారుచూస్తే ఏదో వెయ్యిరూపాయలకు మించి ఇవ్వలేరు. మాఇల్లు మాతల్లిగారివంటిమీదనున్న నగలు అమ్మిన నాలుగువేలు వచ్చుననుకొందము. ఆనాలుగువేలు మీకు కట్నం ఇచ్చెదరు. తక్కిన పెండ్లిఖర్చు ఎక్కడనుండి తెచ్చెదరు? ఇంకనూ నాతరువాత చెల్లెండ్రకు ఎట్లు వివాహము చేయుదురు? నాతమ్ముళ్లకు ఎట్లు విద్యచెప్పించెదరు? నావివాహముచేసి వారు చిప్పలు పట్టుకొనవలెనే గాని అంతకుమించి వేరేమియు లేదుకదా? అందుకని మీకు నాకు వివాహమవుట అసంభవమని తెల్పితిని. మణీ ఇంత చిన్నతనములో కష్టసుఖములగురించి బాగుగా ఆలోచించినావు. మన ఆంధ్రులలోవున్న తెలివితక్కువే ఇది. కట్నం ఎందులకుమణీ! ఆడబ్బు ఇచ్చెడివారు ఎంత కష్టపడి ఎంత దుఃఖపడి ఇచ్చెదరో!! ఆసొమ్ము ఎన్నాళ్లు వుండును కనుక వారిని అంత కష్టపెట్టుట మణీ! చెన్నపట్టణములో వరశుల్కముపేర సభజరిగినది. ఆసభకు నన్ను యుపన్యాస మివ్వమని కోరియుండిరి. ఆసందర్భములో ఇచ్చిన యుపన్యాసమునకు గాను, యీ సువర్ణపతకమును ఇచ్చినారు. అని చెప్పి ఆసువర్ణపతకమును చూపెను. ఆమెయు బహు సంతోషముతో దానినిచూచి మీకీర్తి ఆచంద్రార్కము వ్యాపించుగాక. అని మృదుమధురవాక్యముపల్కి తిరిగి ఇచ్చివేసెను. అయితే మీరు ఇప్పుడు కట్నంపుచ్చుకొనెదరా? లేక మానివేయుదురా? అని అడిగెను మణి. మణి! నేను కట్నంపుచ్చుకొనిన నలుగురిలో ఎంత నగుబాటు. బి యల్ చదివినాడు, యుపన్యాసము లిచ్చినాడు తానే ఆఖరకు కట్నం పుచ్చుకొన్నాడు. మరి యితరులు చదువుకొనని శుంఠలు సభలన్న ఎరుగనిమూర్ఖులు తీసుకొన్నారంటే తప్పేమి. అని అడిగెదరా? లేదా? మణి. కాన నాకు కట్నమందు ఆశలేదు కాన నిన్నే తప్పక పెండ్లి చేసుకొందును. మణి టైము అయినట్లుగా యున్నది. అలాగున షైరు వెళ్లవలయును. అనిచెప్పి లేచెను. నాకుకూడ వంట వేళ అయినది వెళ్లెదనండి అనిచెప్పి కుర్చీపైనుండి లేచెను. ఏమి! మణి నీవు వంటచేయుదువా? మీరు జమీందారులు కాన ఎట్లనైన వంటమనిషిని పెట్టుకొందురు. మేము ఎట్లు పెట్టుకొనగలమండీ అని నవ్వుచూ పల్కినది. పోనిలే మణి నేను పెండ్లి చేసుకొన్నతరువాత వంటమనిషినిపెట్టి నిన్ను ఇట్లనే కుర్చీపై కూర్చుండబెట్టి చక్కనిముద్దులు గైకొందును. లెమ్మ అనెను. ఎట్లు! నాకు చూపెదరా అనెను. అమ్మ! మణి! మా చమత్కారిణివలె నుంటివేయని చెప్పి కుర్చీపై కూర్చుండబెట్టి చక్కనిముద్దు పెట్టుకొని ఇలాగునని తెలియజేసెను. ఇద్దరు నవ్వుకుంటూ మేడ దిగిపోయిరి. మాధవుడు బీచివైపు వెళ్లిపోయెను. మణి రామచంద్రరావుగారి ఇంటికి కొంచము దూరములోని చిన్న ఇంటివద్దకువెళ్లి తలుపుకొట్టెను. ఇందుమతి అను బాలికవచ్చి మణిఅక్కా వచ్చావాఅని తలుపుతీసెను. ఇద్దరు లోనికివెళ్లి తలుపు గడబెట్టిరి.

# బాలవిజ్ఞానశాఖ

## పాటలు

### కోకిల

ఎగురుఎగురు కోకిలా
దిగుముదిగుము కోకిలా
ఇగురుపట్టి చెట్లునీకై
చిగురుతొడిగె కోకిలా ॥ ఎ ॥

తీయమావి చెట్టుమీద
తిన్నవుంది కోకిలా
కావికంఠమెత్తి ఒక్క
కళనువిసురు కోకిలా ॥ ఎ ॥

చలిదిపొద్దువేళ పాఠ
శాల విడచివచ్చుచు
కలరుతంబు విన్నమాకు
కలుగుముదము కోకిలా ॥ ఎ ॥

ఎండవేళలందు ప్రకృతి
యెల్ల నిద్రపోవగా
నిండుకంఠ మెత్తిపాడు
నింగిపగుల కోకిలా ॥ ఎ ॥

కసవుమేసి ఆవులిండ్ల
కడకు వచ్చువేళలన్
పశులఅర్పులందు నీదు
పాట చేర్చుకోకిలా ॥ ఎ ॥

రాతిరెల్ల నిదురపోయి
ప్రాతఃకాలమందులేచి
ప్రీతిమీరునట్లుపాడు
దినదినంబు కోకిలా ॥ ఎ ॥

పాటనాలకించి నీవు
పలుకుప్రక్క చూతునా,
పాటవముగ నెపుడుకండ్ల.
పడవదేమి కోకిలా ॥ ఎ ॥

ఆకుగుత్తి చాటులేక
అరక్షణంబుపాడవు
ప్రాకటముగ ఇంతసిగ్గు
పసుట తగునెకోకిలా ॥ ఎ ॥

## కథలు

### పెకింగునగరములో పెద్దగంట

మన హిందూదేశమునకు ఉత్తరమున హిమాలయపర్వతము లున్నవి. వానికి అవతల టిబేటుదేశ మున్నది. దానికి తరువాత చీనాదేశ మున్నది. చీనాదేశము ప్రపంచములోగల దేశములలోనెల్ల కడుపెద్దది. అచ్చటి జనసంఖ్యకూడ చాలయెక్కువ. ఆ దేశములో ముఖ్యమైనమతము బౌద్ధమతము.

మన కథాకాలమునాటి కా దేశమును యుంగ్లో అనుపేరుగల చక్రవర్తి పరిపాలించుచుండెను. అతను చాలా ప్రఖ్యాతపురుషుడు. నాన్కింగు అనే పట్టణమునుండి అతను పెకింగుఅనే పట్టణమునకు తనరాజధానిని మార్చెను. క్రొత్తరాజధానిలోఅనేక భవనములను కట్టించెను. వానిలోకెల్ల

ముఖ్యమైనది రాజనగరు. అనగా తానును తనకుటుంబమును నివసించుసౌధము.

ఆ సౌధముయొక్క గోపురముకూడ మిక్కిలి పెద్దది. ఆగోపురమునకు తగినంత పెద్దగంటను పోయించి తగిలించవలెనని అతడు సంకల్పించెను. ఆ గంటమ్రోగిన తన పట్టణమంతటను వినబడవలెనని అతని యుద్దేశము. కాని అంతపెద్దగంటను ఏకమ్మరి వాడు పోయఁగలడు ?

చక్రవర్తి మంత్రినిపిలిపించి గంటను తయారుచేయించవలసినదని ఆజ్ఞాపించెను. మంత్రి ఆరాజ్యములోనెల్ల ప్రసిద్ధిపొందిన కమ్మరవానిని పిలిపించి పెద్దగంటను తయారు చేసి యియ్యవలయునని ఉత్తరువొసరించెను. అతనిపేరు కుఆన్యా. చీనావాళ్ళపేరులు మనకు నోరు తిరగవుకాదూ ? అవును, మన పేరులుకూడ వారి కట్లేఉండును. అయినను అభ్యాసము చేసుకొనవలెను. లేకున్న దేశ చరిత్రల నెట్లు నేర్చుకొనగలము ?

కుఆన్యా అచ్చు తయారుచేసి, కంచును కరిగించి దానిమీద పెద్దగంటను పోసెను. కాని ఆ గంట పగిలిపోయెను. దానితో అతనిహృదయము వ్రక్కలయ్యెను. ఏలననగా, ఇంతవఱకు అతను పోసినది బ్రద్దలగుట ఆత డెన్నడును నెఱుగడు.

చక్రవర్తికికూడ దుఃఖముకలిగెను. పోనీ మరియొకసారి ప్రయత్నించి మంచిగంటను తయారుచేయుమనెను. అతడు రెండవసారి కూడ పోసెను. ఈసారి అది బ్రద్దలుకాలేదు, కాని దానినిండ తేనెపట్టులోవలె చిల్లులు కనిపించెను. కుఆన్యాకు తిరిగీ దుఃఖము కలిగెను. చక్రవర్తియు విచారించెను. మూడవమారు కడసారిప్రయత్నము చేయు మనెను. "ఈసారి నీప్రయత్నము విఫల మయ్యెనో, నీతలతీయించివేసెద"నని అతడు కఠోరమగు ప్రతిజ్ఞచేసెను.

కుఆన్యా ఏమిచేయఁగలడు ? అతడు తన మూడవప్రయత్నమునైనను సఫలమొనర్చు మని తనయిష్టదైవమును ప్రార్థించెను. అంద ములకు కుప్పయు, తన కేకైకపుత్రియునగు కోఅయి అను చిన్నారికన్నెను పిలచి ఈ చరిత్ర నంతటిని చెప్పెను.

ఆమె అందాలబరిణె గదా ! ఆమె దంత ములు ఆణిముత్యములవలె తెల్లగ మెఱయును. చెక్కిళ్లు గులాబిమొగ్గలవలె లేలేత యౌవ్వన మును గ్రక్కుచుండును. చూపులు నల్లని చంచరీకములవలె ఇటునటు చరించుచుండును. లేడిపిల్లవలె ఆమె చుఱుకుగపరుగెత్తుచు తన తండ్రి యింటిచుట్టునుండు గుట్టలమధ్య నాడు కొనుచుండును. తండ్రియనిన నామె కపార మైనప్రేమ. అతనితలను చక్రవర్తి తీయించు నన్న భయ మాపెహృదయమును కళవళ పెట్టసాగెను.

ఆమె ఒకగుట్టయొద్దకుపోయి, దానిగుహ వద్దకుచేరి దేవుని ప్రార్థించెను. అందులో నుండి ఒకమాంత్రికుడు వచ్చెను. అతనితో ఆమె తనతండ్రికిని తనకును కలుగనున్న ఆపత్తును నివేదించి, అందునుండి ముక్తికలు

గుటకు తగిన సలహానిమ్మని కోరెను. అతను దీర్ఘాలోచనచేసి యీవిధముగా చెప్పెను.

"అమ్మాయీ, నాకు సర్వమును తెలిసెను. ఆగంట సరిగా తయారుకావలెనన్న ఒక్కటే ఉపాయముకలదు. ఆ గంటను పోయుటకై కఱగించుకంచులో ఒకఅందమైన కన్యకామణిరక్తము మేళనమైనచో, ఆగంట సరిగా తయారగును, లేకున్నచో ఈప్రయత్నమును విఫలమగును" అనిచెప్పి అదృశ్యుడయ్యెను.

అందమైన పిల్లయొక్కరక్తము! ఎట్లు వచ్చును? రక్తము నిమ్మన్నచో, అనగా చావుమన్నచో ఎవరుచత్తురు? చావకున్నచో తనతండ్రి బ్రదుకుటయెట్లు? తనతండ్రి మరణించినచో తానెట్లు బ్రతుకగలదు?

ఇట్లు తలపోసి తలపోసి ఆమె కృతనిశ్చయురాలయ్యెను. మాంత్రికుడు చెప్పిన విషయములన్నిటిని తండ్రికి నివేదించెను. "తండ్రీ నీప్రయత్నములో నీవుండుము. నీ ప్రయత్నము సఫలము కాగలదు." అని చెప్పి ఆమె ఊరకొనెను. అమాయికుడగు తండ్రికీమాట లెవ్వియును అర్థముకాలేదు.

అతను కూతురుమాటలు నమ్మికొని చక్రవర్తియొద్దకు వెళ్లి కొలిమి పెట్టించి కంచును కఱగించుచుండెను. లోహము ఎఱ్ఱగా ప్రవహించుచుండెను. అచ్చుమీద నింక పోయవలసియుండెను. పెక్కుమంది జనులుచుట్టునుమూగి ఈప్రయత్నమేమానో కుఱన్యోబ్రదుకవలెనో చావవలెనో తెలుసు కొనవలెనని కుతూహలముతో కనిపెట్టుకొని యుండిరి. పలువురుకలసి ఆకఱగుచున్న లోహప్రవాహమును ఎత్తి అచ్చుమీద పోయుచుండిరి.

ఆసమయమున "తండ్రీ" యని కంచువలె ఖంగునమ్రోయు కంఠము జనులకెల్లఱకు వినబడెను. జనసమూహమును త్రోసుకొనుచు పరుగు పరుగునవచ్చి కోఅయి కన్య ఆకంచు ప్రవాహములో పడిపోయెను. తండ్రి ఆశ్చర్యపోయెను. ఎల్లఱును దుఃఖించిరి. తండ్రి ఆమెను పట్టి తప్పించి యీవలకు లాగివేయుటకు ప్రయత్నించెను. ఆమె అతని చేతుల నుండి జాఱిపోయి అందులో పడిపోయెను. అతనిచేతిలో ఆమె యొకమకాలిజోడు ఒక్కటి మాత్రము మిగిలిపోయెను.

ఆమెరక్త మాలోహములో కలిసిపోయెను. అచ్చుపై లోహము సరిగాపారెను. గంట తయారయ్యెను. బ్రద్దలుకాలేదు; చిల్లులు పడలేదు. అందఱును ఆపెతండ్రియు చక్రవర్తియుకూడ వలవలనేడ్చిరి. అయిననేమి గంట తయారయ్యెను.

చక్రవర్తి గంటను గొంపోయి గోపురములో తగిలించెను. నేటికిని అది మ్రోగుచున్నది. పట్టణమంతటను 'తండ్రీ' యను శబ్దమింకను ఖంగున మ్రోగుచున్నట్లు వినిపించుచుండును. కాని ఆశబ్దము చల్లాఱునప్పుడు 'హాయిష్‌ష్‌ష్ ..' అనుచు సన్నని కీచుగొంతుకతో ఒకమాట శాంతముగ ఆ ధ్వనిలో అణిగిపోవుచుండును.

'హెయిష్...'అనిన చీనాభాషలో అర్థమేమో మీకు తెలియునా? కాలిజోడు. "తండ్రీ, నా కాలిజోడు మీలోకములో ఉండిపోయినది. దానిని నాకిచ్చివేయుము. తోడు కొనుటకు నాకులేదు" అని ఆమె యేడ్చుచున్నదని నగరవాసు లిప్పటికిని చెప్పుకొనుచుందురు.

ఈకథ నిజమేనా? ఏమో! కథకు కాళ్లేమిటంటారు. నిజమైనను అబద్ధమైనను ఈకథవల్ల మనకు చక్రవర్తికి నగర సౌందర్యమునందుగల ఆసక్తికిని ఆస్యాకు చక్రవర్తియందుగల రాజభక్తి, కోఅయికన్యకు తండ్రియందుగల అనురాగము, ప్రజలకు ఈకుటుంబమువారి త్యాగశక్తియందుగల విశ్వాసము మొదలైన వింత విషయములెన్నియో విశదమగుచున్నవి. మనుష్యులు చచ్చిపోయినను వారి త్యాగము సద్గుణములు మొదలగునవి దేశచరిత్రలో ఇట్లు జీర్ణించి పిల్లపిల్ల పర్యంతము చెప్పుకొనబడుచుండును.

ఆ॥ వె॥ పురముశోభ కొఱకు నరవరుండు తపించె
చక్రవర్తి కొఱకు జనుడు సమసె
జనకు కొఱకు అసులు చాలించె లేకన్న
మఱువ దుర్వి పుణ్యతరుల చరిత॥

# మాటా—మంతీ

## మనిషికికూడ రెక్కలు

చాలమంది నవీన శాస్త్రవేత్తలు మనిషికూడ ఆకాశమున ఎగురుటకు రెక్కలు గనిపెట్ట చాల కాలమునుండి ప్రయత్నించుచునే యున్నారు. ఇపుడు క్లింకో అను శాస్త్రవేత్త స్వంతముగా రెక్కలు తయారుచేసినట్లు తెలియవచ్చుచున్నది. వానిని పట్టుకొని పక్షివలె ఎగురుచు ఆకాశమున సంచారము చేయవచ్చునట. విమానముపైనెక్కి, వానిని గట్టుకొని క్రిందికి దూకి వేయి అడుగులు రాగనే అవి మహావేగము గల్పించునట ! అపుడు మనిషి యిష్టము వచ్చినచోటెల్ల అరుగవచ్చునట !

## నవ్వు గ్రుడ్డితనము కుదుర్చుట !

ప్యారిసు మానసికశాస్త్ర విద్యాలయమున డాక్టర్ 'పియర్ వాచెట్' వద్దకు ప్రతి ఆదివారము వందల కొలది గ్రుడ్డివారు చికిత్సకై వచ్చుచుందురు. వారందరు వచ్చినతరువాత, వారిని డాక్టరొక చీకటింటిలోనికి ప్రవేశపెట్టెదరు. "కన్నులు మూసికొనుడు. విశ్రాంతి తీసికొనుడు. మనస్సును నెమ్మదిగానుంచి నేనుచెప్పునది శ్రద్ధగావినుడు" అని డాక్టరు వారందరికి చెప్పును.

తరువాత వారినందరిని 'నేను బాగుగ నున్నాను, బలముగ నున్నాను, నెమ్మదిగ నున్నాను.' అను మంత్రము నుచ్చరించమనును. దానిని వారందరేకగ్రీవముగా నుచ్చరింతురు. వెంటనే డాక్టరు "ఇపుడందరు నవ్వుడు" అనుచు తమాషాలతోడను నవ్వుతోడను నిండిన గ్రామఫోనును పెట్టును. అదియంతయు వినుసరికి అచటజేరినవారందరు నవ్వుటకు ఆరంభించెదరు. ఆవిధముగ వారందఱును సంతోషించుచున్న సమయమున దీపములు వెల్గింపబడును. ఆశ్చర్యము!! అందరికిని దృష్టివచ్చియుండును. అందఱును అమితానందముతో వెళ్లుదురట ! ఆహా ! నవ్వెంత జేయును?

## 78 సం॥ కాచుకొని యుండెదను

అమెరికాయందొక నీగ్రోబందిపోటుదొంగకు 78 సంవత్సరముల కారాగృహశిక్ష విధించిరి. అతని వయస్సు 21 సంవత్సరములు అతని ప్రేమించియున్నయొక నీగ్రో కన్య అతడు శిక్షముగించువఱకు అతని వివాహమాడుటకు కాచుకొనియుండెదనని చెప్పినదట! ఆమెకు తనప్రియుడు 99 వ సంవత్సరమున విడుదలయగునని కాచుకొనియున్నది కాబోలు. ఆమె ప్రేమమయస్వరూపిణి యన వింతగాదు. దినమునకు రెండుపూటలుకూడ విడాకులకై పెనుగులాడుచున్న అమెరికా యువతులకు మేరియోకన్య, యీ ప్రేమమయినుండి పాఠము నేర్చుకొనమని చెప్పగూడదా !

## స్త్రీలకు కావలసినవిద్య

గృహకృత్యములు అత్యంతశ్రద్ధతోడను చాకచక్యముతోడను నెరవేర్చుటకు గావలసిన ఆరోగ్యశాస్త్రము, అర్థశాస్త్రము, పాకశాస్త్రము చాల ముఖ్యము. చిత్రలేఖనము, సంగీతము గృహపరిశ్రమలు —కుట్టుపని మొదలగునవి— వారికి సులభముగ నుండుటయేగాక త్వరగా నలవడును. వీనివలన ముఖ్యముగ గృహపరిశ్రమలవలన ఆర్థిక పరిస్థితియు బాగుపడి దేశాభ్యుదయమునకు మార్గసూచకము లగును.

మనస్త్రీలీవిషయములను విదేశ నారీమణులనుండి యెక్కువగ నేర్చుకొనవలసియున్నది. ఇపుడు ప్రాగ్దేశములన్నిటియందును దేశాభ్యుదయమునకు పురుషులతో సమానముగ తోడుపడుచుండు నారీమణులుగల దేశము జపాను. మనము వారిని శ్రద్ధగ గమనించుచో వారు మనవలె డిగ్రీలకై చదువుదురో లేక దేశాభ్యుదయమునకై గావలసినవి మాత్రము—డిగ్రీలున్నను లేకున్నను—అది శ్రద్ధగ నేర్చెదరో తెలిసికొననగును.

జపానునందు మిస్ర్స్ కురోడా యను కన్య నిస్తంత్రీ వార్తల మూలమున లక్షలకొలది గృహిణులకు, పాకశాస్త్రమును గురించి వరుసగ పాఠముల నిచ్చుచుండునట ! అంతియేగాక ప్రపంచమున లండను, ప్యారిసు, న్యూయార్కు ఆదిగాగల గొప్పనగరముల నుండి ఎప్పటికప్పటికే వార్తలును, అచ్చటి మార్పులును అందలి మంచి చెడ్డలను గమనించి వానినెల్లను రేడియో మూలమున దెల్పుచుండునట ! శిశురక్షణ, గృహశిక్షణ, విద్యాసూచనలు మొదలుగాగల విషయముల నెన్నింటినో గూర్చి ఆమె వ్రాయుచుండునట! వివిధ దేశపాకశాస్త్రమునుగురించి ఆమె వ్రాయుటచే జపాను దేశమున స్త్రీలయందెంతయో మార్పుగలుగుచున్నదట.

(చ॥ రా॥)

# మే డ మ్ క రీ

చ॥ ధరణి సమస్తసస్య సముదాయఫలప్రదఁగా నొనర్చుచున్ ।
బరఁగు మహానదుల్, నరుఁ డెవండును జూడఁగరానియట్టి భూ ।
ధరకుహరంబులం బొడమి తద్దయుదేశములందుఁ బారునా ।
వెరవుననే మహామతులుఁ బేదలయిందులఁ బల్లటిల్లఁగా ।
నరయజనింతు రాతతదిగంతయశోవిభవాభిరాములై ॥

ప॥ కృ॥ మూర్తి

మహావ్రణబాధితులై హాహాకారములఁ బెట్టు లక్షోపలక్షల రోగార్తుల సముద్ధరించుటకై లోకమున నవతరించిన దొక యబల— మేడమ్‌కరీ యనునామె. "ఆధుని భౌతిక శాస్త్ర ప్రపంచమునం దేమి చేయగలిగిన దయ్యా?" యని యీసడించువారల పెదవి విరపులను జక్కఁజేయుటకుఁగానే యీమె జన్మించి తనజీవితమంతయు ధారవోసి తుదకు "రేడియం" అను నపూర్వపదార్థ మొకదానినిఁ గనిపెట్టినది. ఇఁక నీమెజన్మమునకు దేవత్వము సిద్ధించినది.

ఈ యమ సం॥ 1869 రమున వార్సాలోఁ నొక సామాన్యునియింటఁ బుట్టినది. తండ్రి యొక ప్రైమరీస్కూల్ మాస్టరు. ఆయూరనే ఆపాఠశాలలయందే కొంతవరకుఁ జదువుకొని యచటనే 25 సంవత్సరముల వయసువరకు నీకన్యారత్న ముపాధ్యాయినియై యుండినది. అంతలో రష్యాదేశమునం దేవో రాజకీయాందోళనములు సంభవించుటవలన నామె సమయమెరిఁగి మెల్లిగా పారిస్‌పట్టనముఁ జేరుకొనెను. అచట నొకమారుమూల నెక్కడనో యొక చిన్నగది దీసుకుని, సీసాలు శుభ్రముగాఁ గడుగుచు నావృత్తివలన దినమునకైదు పెన్నులు గడించుకొనుచుఁ గాలక్షేపము చేయుచుండెను; కాని యింతేకాదాజన్మకుఁ బరమావధి! ఆమె కొంతమందికి ప్రైవేటుట్యూషను చెప్పి తన్మూలమున డబ్బు గడించుకొనుచు పారిస్ యూనివర్సిటీలో గణితశాస్త్రమునందును ఫిజిక్సునందును పట్టములఁబడసెను. 'ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యా' యన్నమాట నిరర్థకముకాదు కదా!! కూఁడుగుడ్డలకుఁ జాలక మాడిపోవుచున్నను సరే 'ప్రారబ్ధార్థము నుజ్జగింపదు' కాబట్టియే ప్రజ్ఞానిధియై యీయువతి, తలమానికమైనది!

1894 లో పియరీ కరీయను యువకునితో మనమేరీ— ఇది మొదటిపేరు— కన్యకు బరిచయము కలిగెను. ఈయువకుఁడును ఫిజిక్సులో మంచి చురుకైనవాఁడు! కాఁబట్టి వీరి యిరువురి పరిచయమును గాలక్రమమున గాఢానురాగముగాఁ బరిణమించినది! ఇంకఁ బుస్తె ముడిపడుటయే తడవు! కన్యమేరీ మాత్రము 'సుబ్బీ' యంటే వుబ్బిపోదు! పెండ్లియంటే మాటలా! జననీజనకులను

జన్మ భూమిని విడచిపెట్టవలెను!! ఎన్నటి కైన మరల జన్మభూమియందే దేహయాత్ర సేయవలయునని యామెసంకల్పము; కాని యది సిద్ధించేటట్లు కానరాదయ్యె! తన వలపుకాని నిర్బంధము తీవ్రము కాసాగెను. కాఁబట్టి యామె స్వదేశమునకుఁబోయి యుండి నది, మరల పారిసునగరమునకు వచ్చెను. ఇప్పటి కామెకొక నిశ్చయజ్ఞానము కలిగి నది "యింట నన్నవస్త్రముల విషయము నందేకాదు— బాహ్యప్రపంచమునఁ గూడఁ దన కభిమానధనమగు ఫిజిక్సు శాస్త్రపరిశో ధనలందునుగూడఁ దనకు సహాయుఁడై యుండ సమర్థుఁడగు నొకయువకునిఁ— దాను మనసార వలచియున్న వానినిఁ జేపట్టుటకంటె జీవిత మున కధికతరలక్ష్యమేది!" యని. సరి. 1895 లో వివాహమైనది. అది మొదలయ్యాలుమగలు తమశాస్త్రపరిశోధనల యందు మగ్నులైరి. బెక్విరల్ అను నొక సుప్రసిద్ధపండితుఁ డీదంపతుల ప్రజ్ఞ కచ్చెరు వొంది తానుచేయుచుండిన శాస్త్రపరిశోధనల యందుఁ దనకు సహాయులుగానుండ గోరెను.

ఉండనీ! యిప్పుడు 'రేడియ'మ్మనఁగా నేమిటిదో దాని గుణతత్త్వము లెట్టివో, దానిమహిమ యెంతటిదో చాలామంది యెరుగుదురు. కాని అదినో— యిది, దైవ శక్తిగల యీరేడియ మొక మానవవ్యక్తి, అందును ఆఁడుదియొకతె, కనిపెట్టెనని మాత్ర ము చాలామంది యెరుఁగరుకదా!

పెండ్లియాడి ప్రపంచములోఁబడిన యీ పడుచువాళ్లు, భార్యాభర్తలిరువురూ పడిన యవస్థ లెవరెరుఁగుదురు?! ఒక నౌకరును బెట్టుకొంటకుఁగూడ వారికి గతిలేదు. అంత యెందుకు: దినవెచ్చమునకై వారు ప్రై వేట్ ట్యూషనులు చెప్పుకొనక తప్పలేదు! అయినను వారు దీక్షాపరు లయ్యేయుండిరి. తమ పరిశోధనలఁ జేసికొనుటకు వారికొక మంచిస్థలమే లేకుండెను. ఒక ఫిజిక్సుస్కూల్ కాంపౌండులో నొకమూల నేదో యొక చిన్నగది దొరికినది. అది యొకకొట్టుగదిగా నుండెను; గాలిరాదు; వెలుగులేదు; నేల చెమ్మ; చలికాలములోనైతే అక్కడఁ గాలు పెట్టలేరు—జల్లుమనుచుండెను!! ఐనా ఆమా త్రపుస్థలము చిక్కినందుకే వారెంతో సంతో షపడియుండిరి. ఔను: "లెక్కకు రానీయడు కార్యసాధకుఁడు దుఃఖంబుల్ సుఖంబుల్ మదిన్." ఈశ్వరసృష్టిలో నున్నదే! యైనను మానవుని ధీంద్రియములకతీతమై యున్న యొక మహత్పదార్థము ఆ యాలుమగలు పడిన కష్టములకు ఫలముగాఁ గనఁబడినది. వారి కక్కరయైన తారుమడ్డియైనఁ గొను క్కొనలేనంత యార్థికదుస్థితిలోఁబడి వారు మిత్రులను ఋణమడిగి హతాశులై చివరకు బారన్ రాత్ స్ చైల్డ్ అను నొక కోటీశ్వ రుని అర్థించిరి. ఆతఁడొక టన్ను వెంటనే యిచ్చెను! ఉండరా దయాపరులు లోక ములో!!

సం 1898 రపు క్రిస్మస్ దినమున శ్రీమతి కరీ, రేడియమును గనుఁగొంటినని లోకము నకుఁ బ్రకటించెను. అంతతో వారికని విరగడయైనది! ఇఁక మరియాదకేమిలోటు!! ఒకవంక డేవీపతకము మరియొకవంక

ప్రశ్నలు వేయను. మీ అజ్ఞానము అనవసర కుతూహలము అహంకారముచూస్తే నాకు నవ్వువస్తున్నది. ఇంకా గట్టిగా నవ్వుదును కాని, నన్ను మర్యాదాహీనుడని మీరెక్కడ అనుకుంటారోఅని ఆపుకుంటున్నాను.

"ఇక ప్రస్తుతాంశమునకు వస్తాము. మా దేశపు స్త్రీలు చాలా సుఖముగా వుంటారు. వారెంతమాత్రము బానిసలు కారు. వారికి కావలసినంత స్వాతంత్ర్యమున్నది. ఇక విజ్ఞానాది విషయములలోనా, 'వారి కున్నంతమాత్రం మనకుంటే చాలు'నని మీకు కూడా తోచకమానదు" అన్నాడు.

## చీనాయువతి సామ్రాజ్యము

ఒక ఆంగ్లవనితకు ఈ మాటలు వినేటప్పటికి ఆశ్చర్యం పుట్టుకొనివచ్చింది. "ఆహా! అట్లాగనా? ఏదీ వారిసంగతి కొంచెం శలవివ్వండి" అని అడిగింది.

"ఆమె సామ్రాజ్యము ఇల్లు! అచ్చటనే ఆమె హాయిగా వుండి యింటిని దివ్యముగా దిద్దుచు, పురుషులతో సమానముగా వర్తించుచు, వారిని వారిద్వారా బహిర్వ్యాపారములను దేశపరిస్థితులను ఆమె బాగా నడిపించగలదు. ఆమెకు యిల్లంటేకోపం లేదు, రోతలేదు, అసంతృప్తిలేదు!! గృహరాజ్యమంటే ఆమెకు గౌరవకారణముగానే ఆమె భావించును. దుర్దశగాను దాస్యముగాను ఎన్నడును తలచదు. కనుక మాటికీ చీటికీ స్థానిక పత్రికలలో తన దుస్థితినిగూర్చి, పురుషుల అక్రమములను గూర్చి ఏమీ వ్యాసములు వ్రాసీయదు. ఆమె చాలాబుద్ధిమంతురాలు. అనగా నా ఉద్దేశమేమిటంటే అతి తెలివిమంతురాలులాగ అన్నింటిలోనూ వేలుపెట్టి పురుషులతో సంఘర్షణలు తెచ్చిపెట్టుకోదు."

## చీనాస్త్రీలెందుకంత కలకలలాడుచుందురు.

అయితే వారు పౌడర్లు క్రీములు పస్టాలు మొదలైన సౌందర్యపోషణవిధానము తెలియరేమో; అయినప్పటికీ ముసలివాళ్లైపోయినా పడుచువారిలాగ ఎందుకంత అందంగా వుంటారు? వార్ధక్యంలో కూడా వారి ముఖములమీద ముడుతలు గీరలు ఏర్పడవెందుచేత?"

"ఎందుచేతనా? వారికి చీకూ చింతా అట్టే వుండదు. అనవసర సమస్యలలో వారి బుర్రలనుదూర్చి వారి మెదడును నరములను మనస్సులను వారాయాసపెట్టుకోరు.

అంటే వారివి మట్టిబుర్రలు, కారువెర్రిలు అని మీరు భావిస్తారేమో! అట్టివారు మాత్రమును కాదు. వారత్యంత నిశితబుద్ధిమతులని శతాబ్దములనుండి ప్రతీతి సంపాదించియున్నారు. వారి మెదడుకు వారు మిక్కిలి విశ్రాంతి నిస్తారు. పోరాట పడవలసిన అవసరములూ వారికిలేవు. వారట్లు పడనూ పడరు. వారి జీవనములో బెంగలేదు. గౌరవముగా బ్రతుకలేమను భయము లేదు. అనుకోనికష్టములు వచ్చి మీదనుపడిపోతాయన్న అనుమానము లేదు. అగౌరవము కలుగునున్నదను అల్పప్రవృత్తిస్వభావము లేదు. ఆమెజీవనములో పోరులేదు. ఇట్టి సుస్థిరత్వము తొలగునన్న సూచనలు కూడ ఆమెకు లేవు.

ఇటువంటివారి చిత్తము ఉత్సాహపరవశములై, వదనారవిందములు మందహాసమందిరములై అందము చాలుకుచుండక మానునా? అందుకనే మా దేశపు పడుచులు ముప్ఫయేళ్లుదాటినా, మీదేశములో యిరవైయేళ్లలోపలి పడుచులకంటె కమ్మదనమును చిమ్ముచుందురు. మీపిల్లల దేహములను చింతలు సంశయములు చిందరవందర చేయుచుండ తరుణ వయస్సులో మా దేశపు పడుచులానందసామ్రాజ్యముల నేలుచుందురు." అని చెప్పినాడు.

## వారి సుఖస్వాతంత్ర్యములు

"అయితే వారికి స్వంతసంపాదనము స్వాతంత్ర్యము శూన్యమన్నమాట!"

"ఆహా! ఏమిసందేహము. మీ కాశ్చర్యము కలిగితే కలగనీయండి కాని నేనొక్కసంగతి చెప్పగోరుచున్నాను. ఆడవాళ్లు కూలిపనులు ఉద్యోగములు చేసిన్నీ నాటకాలవేషములు వేసిన్నీ డబ్బు సంపాదించుకోగోరడం, ఇవంతా ఆర్థిక సాంఘిక స్వాతంత్ర్యమనుకోవడం ఈ మొదలైన చర్యలవల్ల మీరు ఇహమునకు పరమునకు కూడ చెడుతున్నారని నా ఉద్దేశము.

మీ మొగాలుచూస్తే మీకు సుఖమన్నది ఏకోశానా లేదనే నాకు తోస్తుంది. కామోద్రేకంలోనో, లేక మరో ఆవేశంలోనో వున్నప్పుడు మీకు కొన్ని ఉద్రేకాలు కలుగవచ్చును. ఆ సమయాల్లో మీరేదో వ్రాయవచ్చును, ప్రేలవచ్చును, చేయవచ్చును, కాని ఇవి సుఖమనిపించుకోదు. సుఖమనగా ఎటువంటిది యోగ్యజీవనమో దానిని సంతృప్తితోను సంతోషముతోను చేయుచు దినములను నిముషములవలె వెళ్లబుచ్చుట.

మీ రా విధమైన ధన్యజీవనము చేయలేమ సరే గదా, అనవసరచింతలు అపనమ్మకములలో కుళ్లుచు తుచ్ఛమైన అదృష్టదేవతను నమ్ముకొని దానిని వెంటాడుచు ఎంతవచ్చినా సంతోషము పడక అనుకున్నట్లు కాకపోతే మరీ తల్లడిల్లుతూ సుఖానఉన్న ప్రాణములను దుఃఖాలపాలు చేసుకుంటున్నారని నా అభిప్రాయము. హీనా యువతి తనయమూల్య జీవనమును అదృష్టదేవతతో పందెము వేసి వ్యర్థముగా వెళ్లబుచ్చదు. గృహనిర్వహణము సంసారసౌందర్య నిర్మాణము తనివిధియనుకొని ఆ హద్దులో తాను ఇమిడివుండి అదే తన ఉద్యోగము, అదే తన స్వాతంత్ర్య సామ్రాజ్యము అని ఆనందపరవశయగుచుండును."

## స్త్రీపురుష ధర్మవిభాగము

"ఛీ! ఛీ! ఇదియా మీ ఆశయము అజ్ఞానమునకు దాస్యమునకు దీనికీ భేదమేమి?" అని ఒక పత్రికా విలేఖరి (స్త్రీ) అతని నాక్షేపించెను.

"మీరు నవ్వవచ్చును. మమ్ములనుగూర్చి వెక్కిరించవచ్చును. కాని నేను చెప్పినది యథార్థము. ఇల్లు ఆమె స్వరాజ్యము. ఆమె సామ్రాజ్యము. అందామె సర్వాధికారిణి. తక్కిన వ్యవహారములు కళలు, ఆటలు, సాహసకృత్యములు మొదలగు లోకముల లోనికి దండయాత్రలుచేసి పురుషుల నోడించి బిరుదు పట్టాలను పొందుదామనే వెఱ్ఱివెఱ్ఱి సంకల్పాలతో ఆమె తన్నుకోదు. ఇంట్లో ఆమెను పురుషు డోడించలేదు, ఓడింపగోరడు. బయట ఆమె పురుషునితో పోటీకిరాదు."

"అయితే పురుషులకంటె స్త్రీలు తాము తక్కువవారమనిన్ని, వారితో సర్వవిషయములలోను పోటీచేసి నెగ్గలేమనిన్నీ అధైర్యపడుచున్నట్లేగదా! స్త్రీలకు పురుషులతో అన్నిటను సమానత్వము లభించని మీ రెట్టి నాగరకులు?"

"సమానత్వమో అసమానత్వమో నాగరకతో అనాగరకతో ముందుకు పోవడమో వెనుకకు రావడమో మాకు తెలియదు. గృహధర్మ నిర్వహణములో ఆమెది సర్వంకష పాండిత్యము. ఇంట్లోకివచ్చి ఏదేనా పనిని ఆలాగకాదు ఈలాగ చేయవాలి అని ఏభర్త పుత్రుడు లేక మరోవిధమైన పురుషుడు చెప్పజాలడు, చెప్పగోరడు. అందులో ఎట్టిపురుషుడును, పురుషుడేకాదు అన్యదేశీయులగు స్త్రీలైనను వారికి తీసికట్టే!! అది ఆమె విశిష్టప్రజ్ఞ!! ఎవ్వరుకాని ఆమెతో సమానులమని చెప్పి ఢీకొనజాలరు. ఇక బహిర్వ్యాపారములు ఆటలు సాహసములలోనా ఆమె యెంతమాత్రమును జోలికొనదు. అందులో అతనితో సమానత్వమున కామె వాంఛించదు."

"మమ్ములనుచూచియైన ఈ సుగుణములను మీవారు నేర్చుకొనరాదా? స్త్రీ స్వాతంత్ర్య, స్త్రీ పురుషసమానత్వ సిద్ధాంత సందేశములను ఎలుగెత్తి ప్రపంచమున గల సకల మానవ కాంతాలోకమునకు చాటి జండాయెత్తి సాగించుచున్నది మేముకదా! ఈ సందేశమును వినక కూపస్థమండూకములవలె వారు ఉండిపోవచ్చునా?"

"మీరు అన్నింటిలోను ముందుకుదుమికి పురుషుల నోడింపగడగుచుండుట నిజమే కాని యే ఒకరిద్దరో తప్ప జాతికి జాతీ మొత్తమువిూద తీసుకున్నప్పుడు మీరు మీపురుషుల నెంతవరకోడించగలుగుతున్నారు, సాధించగలుగుతున్నారు? అటువంటివారు ఆయా యీ సమయములలో అన్ని దేశములలోను ఉదయించుతుంటారు: మీదేశములలోను ఉంటున్నారు? దానికై ప్రత్యేకించి గర్వపడవలసినవసరములేదు. వ్యవహారరంగంలో, ఆటలలో వ్యాపారములలో మీలో దక్షతంమీద పురుషులు సంపాదించుచున్న ప్రాముఖ్యమును కీర్తిని స్త్రీలు సంపాదించుకొనగలుగుతున్నారా? పురుషులు మిమ్ములను చులకనగా ఓడించి వారి మాయలలో పడేసుకుంటున్నారు. మా దేశపుస్త్రీలు ఇట్టి భంగపాటున కొప్పుకొనరు. వారు బుద్ధిమతులు. ఇట్టి అవివేకపు పోటీలోకి వారు దిగరు."

## చీనాస్త్రీల ప్రజ్ఞలు

"అయితే మీదేశపుస్త్రీలు చేయగలిగే పనులేమిటేమిటి?"

"వారు ప్రశస్తముగా వండుతారు. దివ్యంగా పతిభక్తి నెరపుతారు. కులాసాగాను చక్కగాను పిల్లలను పెంచుతారు. వారికి భార్యాత్వము మాతృత్వముకంటె మించిన వ్రతములులేవు. అన్యత్వము లక్కరలేదు. అందునను వారి మాతృత్వము సర్వాంకషమైనది. బిడ్డలని పెంచుటలో, ఆడించుటలో, సమృద్ధులుగ అపడములో, ఉత్తమపురుషులనుగా చేయడములో సర్వాధికారము తామే వహింతురుకాని అన్యులను ప్రవేలుపెట్టనీయరు. మాహక్కును అన్యులేల ఆక్రమించవలెనని వారికి కోపము. పిల్లలు పెద్దవాళ్లైతే చదువుకుంటకు చదువులబళ్లకు పంపుతారు కాని బొమ్మలు పిట్టలు మొక్కలు జంతువులు చూపించి ఆడించే కిండరుగార్టను బళ్లకు పంపమంటే వారికి కోపము. ఈపనిని తాము చేసుకుంటామంటారు. మా పిల్లలకు మేము చెప్పునట్లు పంతులయ్యలు పంతులమ్మలు చెప్పేదేమిటంటారు. కిండరుగార్టను బడిలో చదువవేసే తరుణవయస్సునందు పిల్లలు తల్లులదగ్గర, యింటిపట్టున, కుటుంబపరిసరములలోను వుండడం మంచిదికాని బడిలో పడేయడమేమిటంటారు. తల్లికి ఫేక్టరీలో కూలిపని, పిల్లలను క్రెచీలలో దాదులాడించడం అంటే వారిమనస్సు నొస్తుంది. పిల్లలకు బుద్ధి, మప్పితము, మర్యాద, అనురాగము, కులాసా కలిగించుటకు తల్లులను మించిన సంస్థలను మానవులు నిర్మించలేరని వాళ్లంటారు. ఇంతకూ వాళ్లకు పిల్లలంటే ప్రాణము. ఒక అరగంటసేపైనా వాళ్ల నెడబాసి యెవరికో ఒప్పచెప్పివుండలేరు."

## చీనా కుటుంబములు

"చాలా వింతవ్యక్తులలాగున్నారేమో ఆడవాళ్లు!"

"అవును, వారికి కుటుంబమే స్వర్గము. చీనాదేశములో కుటుంబజీవనమునం దున్నంత గౌరవము పాశ్చాత్యదేశములలో ఉన్నట్లు నాకు కనిపించదు. మాదేశములో సాంఘికజీవనమునందు కుటుంబములకుండే ప్రాముఖ్యము అపారము. కుటుంబప్రేమ, కుటుంబవృద్ధి, కుటుంబపోషణము, కుటుంబగౌరవము వీనినిదిద్దుటయే మాకు ప్రధానోద్యోగము. మాదేశములో కుటుంబమంటే యెవరో ముగ్గురు నలుగురు వ్యక్తులుమాత్రము రెక్కలువచ్చేదాకా కలిసివుండడము కాదు. మా బంధువర్గము అనగా స్త్రీలవంకవారు పురుషులవంకవారుకూడ కుటుంబముక్రిందకే వస్తారు. తల్లీ పిల్లల యందెంత అనురాగమో బంధువర్గమంతటియందుకూడ మా కటువంటిప్రేమయే వుంటుంది. 'ఎవరికి వారే యమునాతీరే' అన్నట్లు సర్వస్వతంత్రతతో వర్తించే మీకు మాపద్ధతి ఆశ్చర్యము కలిగించకమానదు.

## పాశ్చాత్య కుటుంబములు

"మాది సంయుక్తకుటుంబవిధానము. ఒకయింటి కప్పుక్రింద యెంతమంది జీవిస్తూవుంటే మాకంత యెక్కువ సుఖముగావుంటుంది. ఇంతమంది ఒక యింట్లో దూరివుంటే యేమి సౌఖ్యంగా వుంటారని మీ దేశాలనుంచివచ్చి మాదేశంలో ప్రయాణంచేసే వారు ఆశ్చర్యపడతారు. మాకుకూడా మీచర్యలు చూస్తే ఆశ్చర్యంగానే వుంటుంది. కాస్త పెద్దవాళ్లు కాగానే వేఱుపెడదాము వేఱుపడదాము అనే మీరు కోరుతారు. మీదేశములో లక్షలకొద్ది కోట్లకొద్ది జనులు కుటుంబములకు దూరులై ఒంటరిగా ఎక్కడో కాలక్షేపము చేస్తూవుంటారు. కుటుంబవాసన, కుటుంబప్రేమ వీరికింత తక్కువగా ఎట్లావుంటుందా అని నామట్టుకు నాకు ఆశ్చర్యమే!! 'కొడుకులు, కోడండ్రు' మనమలు, మనమరాండ్రు యెంతోమంది ఉన్నవాళ్లు కూడా వారినివిడచి యేకాకిగా ఒంటి పిల్లులలాగ ఎక్కడో యేవో కార్యములు దిద్దుకుంటూ దూర దూరంగా తిరుగుతారు; దగ్గరగావున్న పది సాళ్లు భోజనభాజనములకు మాటామంతికి వచ్చీ పోతూవుండడం అరుదుగా వుంటుంది.

"ఈ ఘోరమైన పరిస్థితులుచూస్తే నాకు ఒళ్లు జలదరిస్తుంది. ఏమి! ఈ దేశములన్నియు పిల్లలతో పోట్లాడిపోయే తల్లిదండ్రులు, తల్లిదండ్రుల నిండ్లలో నుంచి గెంటేసే సంతానములుతో కూడిన మానవ యెడారులాఅని నాకు ఆశ్చర్యమవుతుంది. వీరిని కన్న బిడ్డలు పైకి గెంటుచున్నారా, లేక తల్లిదండ్రులను రాగవిహీనులై విడిచి పారిపోవుచున్నారా అని నాకు సందేహము కలుగుతుంది. ఇదంతా ఇప్పటికికూడా నాకొక అగమ్య గోచరమైన సమస్యగా కనిపించు తుంది.

నేననేకమందితో దీనినిగూర్చి ప్రశంసించాను. ఇట్లా వేఱువేఱుగా ఉండడమే వాళ్లకిష్టమట!! ఇదే స్వతంత్రమట! నాకేమో అర్థముకాకుండావుంది. నా పిల్లలే నావృద్ధాప్యంలో నన్నట్లాగెంటేశారురా అంటే నాకు వారిమీద పట్టరానంతకోపం రాకమా నదు. నాకిదే బాగుంది, ఇదే నాకిష్టము అని దొంగ మాటలు నేనొకనాటికిని ఆడలేను.

నాకిది దుఃఖకరమైన దృశ్యమే. అయితే మీకు మాత్ర మిందులో వైపరీత్యమేమీ అగుపించక చాలా నైజముగానే తోస్తుంది. దీనికి కారణము మీ దేశాచారములు వేఱు మా దేశాచారములు వేఱు, మీ ఆర్థిక విధానములు వేఱు, అసలు మీతత్వములే వేఱు మాతత్వం వేఱు. ఎందునను మీకూ మాకూ సామాన్యమన్నది ఇసుమంతలేదు. మీ విధానము మాకు భయంకరంగా వుండకతప్పదు. మావిధానం మీకు వింతగా వుండక తప్పదు. మీరట్లా విడివిడిగా ఒంటరిగానేవుండండి, మేము మాదేశములో కుటుంబమంతా కలసిమెలసి హాయిగా వుంటూవుంటాము."

## నిజమైన స్వతంత్ర మేది?

"అయితే మీఆడవాళ్లకు స్వతంత్రమక్కరలేదూ?"

"ఓహో! స్వతంత్ర మక్కరలేనివాళ్లుంటారా? అందములోను పడుచురక్తముకలిగి చలాకుగా వ్యవహరించే సుందరులకు స్వతంత్రములేకుంటే అసలు ఒప్పుతారా? అయితే ఆడవాళ్లకు యింట్లోవుంటే స్వాతంత్ర్యంవుండదు, వీధిలో కూలిపనికో జీతపు టుద్యోగమునకో పోతే స్వాతంత్ర్యం ఊడిపడివస్తుంది అంటే మాదేశపు స్త్రీల కర్థముకాదు. మీది యంత్రపరిశ్రమల దేశం, మాది వ్యవసాయకుటీర పరిశ్రమలదేశం. మీరు యిళ్లు పల్లెలువిడచి బారక్సులోకి పట్ణాలలోకి పోయి ద్రవ్యోపార్జనచేసుకోకతప్పదు. మేమింటి పట్టున, గ్రామముపట్టున ఒకరికొకరము హత్తి పరస్పర సహాయ మవుచుండకతప్పదు. మీరు ఇంటినిమిత్తమై, పిల్లలనిమిత్తమై కంటె యంత్రములనిమిత్తమై పొట్టల నిమిత్తమై పనిచేసుకోకతప్పదు. మేము యజమానుల నిమిత్తమును పొట్టలనిమిత్తమును కాక కుటుంబముల నిమిత్తమును సంఘమునిమిత్తమును పనిచేసుకోక

తప్పదు. మీపద్ధతి మీకు స్వతంత్రంగాను విజ్ఞానము గాను నాగరీకతగాను కనిపించుతుందేమో! కాని మాపద్ధతి మాకు ప్రశస్తమైన మానవధర్మములాగ కనిపించుతుంది. ఇంటిని స్వహస్తములతో అలంకరించు కోవడం, పిల్లలను స్వంతపరిశీలనక్రింద పెంచుకోవడం, బంధుసముద్రములో పోయిగఉండడం, వ్యవసాయం చేతిపనులు దిద్దుకోవడంకంటె, ఫ్యాక్టరీలువూడవడం యంత్రాలపాగలలోను రొదలలోను తిరగడం, కచేరీలలో రికార్డులువ్రాయడం, కోర్టులలో కేసులువాదించడం మొదలైనపనులు ఎక్కువ సుఖ ప్రదమైనవా అని నేను మిమ్ములను తిరిగీ ప్రశ్నిస్తున్నాను. కోపంపడకుండా జవాబు చెప్పవలెనని ప్రార్థన.

స్త్రీలంటే నాకు చాలాగౌరవము. వారెట్టిపను లనుచేయుట కత్యుత్తమముగా తగివుందురో, జీవన క్రమములో వారికర్హమైన స్థానమేదో ఆయాపనులలో ఆస్థానములో వారు రాణించడమే నాకు మిక్కిలియిష్టము. మీతెల్లదేశాల స్త్రీలు సాతంత్ర్యం స్వాతంత్ర్యంఅంటూ పొలికేకలు వేసుకుంటూ తిరిగే వుద్యమాలలో ఎక్కడా అస్థానముకాని అవ్యవస్థకాని యెక్కడాలేదని నాఉద్దేశము. మీరు మా జపానుపనులుకూడా బాగా కూలిపనులు చేస్తున్నారు, యంత్రాలు తిప్పుచున్నారు, మోటార్లు తోలుతున్నారు, ఉద్యోగాలు చేస్తున్నారు, విమానాలలో యెగురుతున్నారు నిజమే - ఎంతమాత్రం సణుగుగొణుగుకూడా లేకుండా యీపనులుచేయడం కూడా ప్రశంసనీయమే— ఈపనులు చేస్తున్నాముగదా అని గర్విస్తున్నారు, అదికూడా ఆశ్చర్యమే. కాని యీమాత్రంపనులు పురుషులుకూడా చేయగలరు. వారు చేయగలపనులనే మీరుకూడా చేయడంలో ఎట్టిప్రజ్ఞయు నాకు కనిపించదు. వారు చేయజాలని విశిష్టపనులను, మీరుమాత్రమే ఉత్తమముగను అందముగను నిర్వహించగల ప్రత్యేకకృత్యములను మీరు నెరవేర్చి ప్రతిష్ఠపొందడములోనే మీ గౌరవము కలదని నావుద్దేశ్యము. మాదేశపు స్త్రీలసంకల్పములును ఆశయములును ఇట్టివి. వారినిచూసి మీరునవ్వితే నవ్వండి, విచారించితే విచారించండి" అని వ్రాక్రుచ్చినట్లు 'డెయిలీస్కెచ్చి' అనే పత్రికావిలేఖరి వ్రాయుచున్నాడు.

## చీనా భారత దేశముల పరిస్థితులపోలికలు

మనదేశంలోకూడా క్రొత్తగాలేచుచున్న పాశ్చాత్యదేశ స్త్రీస్వాతంత్ర్యపద్ధతుల నుపాసించు స్త్రీలు ఇందులోనుంచి నేర్చుకోవలసిన విషయములేమైనా ఉన్నవేమో నిర్ణయించుకొనుటకు వారే అర్హులు. ఇది వరకెల్లా శ్వేతదేశస్థులధోరణులు వారువింటూ అనుసరిస్తూ వస్తున్నారు. ప్రాచ్యదేశస్థులదృక్పథమును ఈతడు చక్కగా నిర్వచించినట్లు తోస్తుంది. యంత్రాలు పట్నాలు పెరిగినదేశాలలో శ్వేతదేశాశయములు అంగీకరింపబడినట్లు వ్యవసాయకుటీరపరిశ్రమల దేశములలో అంగీకార్యములు అవుట చాలా కష్టసాధ్యము. మనదేశాన్ని తెల్లదేశాలమాదిరిగా యంత్రాలతోను పట్నాలతోను దిద్దడమాలేక గాంధీమహాత్ముడు సంకల్పించినట్లు పల్లెలవైపు మనదృష్టిత్రిప్పి కుటీరపరిశ్రమలు గ్రామసౌభాగ్యములు, జీవాధారసమృద్ధి, సంతృప్తి మొదలగువానితో తులతూగునట్లు చేయడమా అన్నది పెద్దప్రశ్న.

## యంత్రోత్పత్తివల్ల అనర్థము

పాశ్చాత్యదేశాలీవిషయములో యిప్పటికే యంత్రపరిశ్రమలు, ఉత్పత్తివిస్తారము, వర్తకము, విదేశాక్రమణము సామ్రాజ్యదురాకాంక్ష మొదలగు పథములలో ఒక పెద్దఅడుగు వేసినవి. వానియొక్క దుష్ఫలితము లీనాటికి వారికే తెలుసుకొని వస్తున్నవి. అయినను అవి వెనుకడుగు వేయలేవు. ఈస్థితిలో నిలువలేవు. పరస్పరమాత్సర్యములు విరోధములు అనుమానములు ప్రబలుచున్నవి. యుద్ధమైనా కాకపోయినా యుద్ధప్రయత్నాలు విపులముగా చేసుకోక

తప్పదు, చేసుకొనుచున్నవి. యుద్ధమయిందా, ఇన్నాళ్లాయ పొందుతూవున్న నీటిబుగ్గలాంటి సౌభాగ్యము అరక్షణములో భస్మమౌతుంది. కాకపోయిందా యీ సౌభాగ్యము భాగ్యముఅంతా నిరుద్యోగులకు పనులు కలిపించే ప్రయత్నములలో బదులు అనుమానాలను పశమింపచేయడములో బదులు ద్వేషములను చల్లార్చడములో బదులు సవ్యమయిన విజ్ఞానమును సంతృప్తిని స్నేహమును ప్రపంచఐకమత్యమును బలపరచడములో బదులు యుద్ధసైన్యములు, యుద్ధవిమానములు, యుద్ధనావలు, విషవాయువులు మొదలగు మారణసాధననిర్మాణములో ఖర్చయిపోతుంది. లేదా వారంతా ఒకకూటమై వారికంటె బలహీనులగు ఆసియా ఆఫ్రికా మొదలగు ఖండవాసులను స్వతంత్రముగా అభివృద్ధి పొందనీయకుండా దాసులుగాను, కూలివారుగాను, నిర్వ్యాపారులుగాను, జీవాధారరహితులుగాను దుర్బలులు గాను ఉంచి వారి ఆశయములను హతమార్చి తమప్రస్తుత బలవత్స్థితిని నిలబెట్టుకోవడం కోసం వినియోగించవలసివుంటుంది. ఇవి యెవ్వియును వాంఛనీయములుకావు.

## గృహపరిశ్రమలతో వాటిని అరికట్టగలమా ?

అయినను వారిప్రస్తుత విజృంభణమును మనప్రాచీన సుందరసంప్రదాయములతో అరికట్టగలమా అన్నది కూడ ఆలోచించదగ్గదే. ఈమార్గమున మనము దానినరికట్టగలమని మనకు నమ్మకమున్నను లేకున్నను, వారిమార్గముల నవలంబించి వారి నరికట్టగలమన్నమాట కల్ల. వారిది తప్పుమార్గమయినప్పుడు వారిమార్గమునే మనము త్రొక్కుటవలన ఆకూటమునకు మరియొక్క అంకెను చేర్చడమే శేషించునుకాని ప్రయోజనమింతకన్న నేమియు నెక్కుడయుండదు. ఇంతకును అనేక శతాబ్దములనుండి యీయున్నతస్థితిని వారాక్రమించుకొని మనలను నిస్సహాయులనుచేసిన తరువాత ఆవిధానములతో తిరిగీవారితో మనము తుల్యులము కాగలమను ఆశయు వట్టిది. అయ్యది ధనైకసాధ్యము, మనవెండిబంగారములన్నియు వెళ్లిపోయినవి. అయ్యది తమవ్యవహారములను తామే నిర్వహించుకొనుచుండు జపానువంటి సర్వతంత్ర స్వతంత్రదేశములకు మాత్రము కొంతవరకు ప్రారంభసాధ్యము. హిందూదేశముకాని చీనాదేశముకాని అట్టి భాగ్యమునకు నోచుకోలేదు. మన కిష్టమైనను కాకున్నను, సాధ్యమైనను కాకున్నను ప్రాచీనపద్ధతితప్ప వేఱొండు మన కవలంబనీయము కాదు. ఏపట్టణవాసస్థులకో ఏపాశ్చాత్యవిద్యావిభూషితులకో గ్రామపద్ధతులు పూర్వసంప్రదాయములు అంటే కిట్టక లాభప్రదములు కావను అపనమ్మకమున్నదికాని, నూటికి యెనభైమందికిపైగా గ్రామములలో నివసించు చీనా ఇండియావాస్తవ్యులకు వాటియందు విశ్వాసములుపోలేదు.

ఇప్పటికే లేచి విజృంభించుచు విదేశస్థులతో నేస్తములుకట్టుకొని పల్లెలభాగ్యములను దోచుచున్న యంత్రదూషితనగరములబాధ మనపల్లెలకు నానాటికి హెచ్చుచున్నది. మనము విదేశస్థులనాదరించు యీ ఆర్థికదాడి నెదుర్కొనవలెనన్నను, మననగరములు చేయుచున్నదాడి నెదుర్కొనవలెనన్నను మనగ్రామములను కొన్నికొన్ని కాలోచితమార్పులతో ప్రాచీన పద్ధతులప్రకారము పునర్నిర్మాణము చేసుకొనుటతప్ప వేరు శరణ్యములేదు. కాన మనదేశస్థులు స్త్రీపురుషులెల్లరును చీనాదేశీయులవలె పల్లెలమీదను ప్రాచీన సంప్రదాయములమీద స్త్రీపురుష యథోచితస్థాన గౌరవములమీదను తమదృష్టులను నిగిడ్చి గ్రామ సౌభాగ్యములకు త్రోవతీయుదురుగాక ! మొట్టమొదటిలో మనకిది యేటికెదురీతవలె వెఱ్ఱిమొఱ్ఱితలంపులవలె కనిపించవచ్చును కాని ఒక్కసారి విశ్వాసము కుదిరినచో మొక్కవోని దీక్షతోపనిచేసి మన మీ మహత్కార్యములను సాధించవచ్చును.

## మానవుడు: యంత్రము

మానవుడు పరమేశ్వరరచిత సజీవయంత్రము. యంత్రము స్వార్థోపాసకుడగు క్షుద్రమానవునిచే

వృద్ధికి తేబడిన నిర్జీవయంత్రము. అట్టి నిర్జీవయంత్రముతో స్వార్థోపాసకుడగు మానవుడు ప్రపంచమునకు నేడింత క్షోభకూర్చ గలుగుచున్నప్పుడు, సర్వమానవ సౌభాగ్యోపాసకుడగు మానవుడెట్టి సజీవ అనంతకోటి మానవయంత్రములతో ఎట్టి కళ్యాణము నొసగూర్పలేడు! అయితే విశ్వాసము, దీక్ష, ప్రచారము, ప్రబోధము ఈ సుగుణసంపద అత్యంతావశ్యకము. చీనాదేశమునుండో హిందూదేశమునుండో తప్ప యిట్టి మహాదుద్యమములు విజృంభింపజాలవు. గాంధీమహాత్ముడు దీనికి పునాదివేసినాడు. నిరాడంబర జీవనులగు కొందఱు దేశీయనాయకులు దీనిని ఒకతపస్సుగా భావించి చేయుచున్నారు. భారత ప్రభుత్వమువారుకూడ దీనిపై నొక క్రీగంటి చూపు నిడక తప్పుచున్నదికాదు. నిరాధారులై నిస్సహాయులైయున్న విద్యార్థులైన యువకులను దరిద్రులై మృత్యుముఖులై నవయుచున్న రైతులు కులవృత్తుల వారలకును ఈ సందేశము నమృతబిందువులవలె వీనులవిందగునట్లు ఉపన్యసింపగల కీర్తింపగల వక్తలును కవులును గాయకులును యోగులును కొందరున్న చాలును జనసమూహమునను సమూహమును ఒక్కమాఱు విజగబడి, పేరాసలు, దురహంకారములును, మృగతృష్ణా జలాస్వాదనాయత్త పిపాసలను విసర్జించుకొని భూదేవిని అమాయకమానవప్రకృతిని కొలిచి భూలోకమున కంతటికిని కళ్యాణము గూర్చగలరు!!

## భారతీయులకు సాధ్యము

ఈ పనిని ఆధ్యాత్మిక తత్త్వవిభాసితులగు భారతదేశ పురుషశ్రేష్ఠులును వనితామణులునే చేసి చూపించజాలక నిస్పృహపొంది ఇతర పాశ్చాత్యదేశస్థుల తెగలో కలిసిపోయినయెడల ప్రపంచమునకు మరి తరణోపాయమెక్కడ! భారత నారీమణులెల్లరును గాంధీ మహాత్ముని స్వరాజ్యసంగీతమును విని ముసుగులు చించుకొని వీధులలో వేదికలమీదికి వచ్చి ఉపన్యసించి ప్రజలనుద్బోధించి కష్టనష్టముల కోర్చి మహాత్యాగము నానరించి జైళ్లలో కుటీకి నట్లే నేడు గ్రామములలోని కుటీకి పొలములలోనికి వెళ్లి, కుటీరములలోనికి దూరి వ్యవసాయమును పరిశ్రమలను సులభమార్గముల వారిచేత చేయించి, వారు తృప్తిచేసిన పదార్థములను మాత్రమే పౌరులకు అభిమాన ఆదరపాత్రములు చేసి యంత్రాధినాథుల కుతంత్రముల కెల్లస్వస్తి చెప్పుదురుగాక! పరమేశ్వరుడు వారి కిట్టి ప్రయత్నములలో సర్వ సహాయముల నొనరించునుగాక!

# మ నో ర మ

చ. క్షితిపయి వట్ట్రిమ్రాకులుచిగిర్ప వసంతుఁడు దా రసోపగుం
ఫితపదవాసనల్ నెఱప మెచ్చక చంద్రుఁడు మిన్నునన్ బ్రస
న్నతయును సౌకుమార్యము గనంబడ నాల్గరగంగఁజేసెఁ: నే
గతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరే కదా!

—విజయవిలాసము

"మెచ్చరు—చచ్చిననైన మెచ్చరు—తలఁగొట్టుకొనినసరే—మెదడుఁ జింపుకొనినసరే—వల్లకాటి సమకాలికులలో నీపోఁగాలము సృష్ట్యాదినుండియు నున్నది. గ్రంథము మనసునఁబెట్టకుండ, నోటఁ బలుకకుండఁ, గంటఁ జూడకుండఁ, జెవిని జేర్పకుండఁ, జేతఁబట్టకుండ—"అబ్బే! వట్టితుక్కండి—వట్టి పెంట-నిరర్థకపుఁజెత్త. చదువవలయుననియే యూహింతుము; ఏదీ? ఒక్కపుట బలాత్కారముగఁ జదువుసరికి వమనమగునంతటి వికారమారంభమై పుస్తకమవలఁ బాఱవైచువఱకుఁ దోచనియెడల నింకఁజేయవలసినదేది? పుస్తకము దెఱవనైన బుద్ధిపుట్టనప్పుడింకఁ జేయునదేది? బాణునితరువాత సిగ్గుబిడియములున్నవాఁడు కలము చేతఁబట్టవలసినదా?" యను మహానుభావులు స్వచ్ఛందరసులై ప్రకాశించుచున్నారు.

"—ముద్దు మొదలుకొని కుండలాల విద్వచ్ఛిఖామణివఱకు నొకటేవైఖరి! ఎల్లదేశములలో నెల్లజాతులలో నెల్లకాలములలో జను లుత్తమకవులను గ్రహింపలేక వారిని నిందించుట నిత్యవిధిగ జరుగుచున్నదే కాని క్రొత్తది కాదు. పూచునంతకాలము తీఁగెకు గిల్లులు తప్పవు. ఇచ్చుచున్నంతకాలము దాతకు దెప్పులు తప్పవు. వ్రాయుట మానుకొనిన తరువాతఁగూడఁ గవికిఁ దిట్లు తప్పవు."

—'విమర్శాదర్శ' విమర్శాదర్శము.

అంతట మహోల్లాసశీలయు, పాశ్చాత్యానురూపవర్తనయు నగు లీలావతి తాను భాషాంతరీకరించియున్న కథాభాగమును జెప్పవలసినసమయ మాసన్నమయ్యెను. ఆమె యాలాపవైఖరుల నెఱిఁగి మాసభాభవనమునఁ జేరియున్న మహిళామణులందఱు నింక నామె యేవిధముగఁ గథను వినుపింపఁగలదాయని యుత్కంఠమున నెదురు చూచుచుండిరి. వారి మనములఁ బట్టుకొనియున్న సంశయవల్లరుల ఛేదింప నూహించుచు నేతదుద్యమ నిర్వాహ పరాయణయగు కళావతి యిట్లు పలుక నారంభించెను.

"మాసమాజమునందలి యితర సభ్యురాండ్రవలె లీలావతి కథను భాషాంతరీకరింపఁగలదా యని మీరు భావించుచున్నారు. మీకేకాదు. ఇట్టిసంశయము తొలుత మాయందు సహిత ముదయించినది. కథను జెప్పు మే మయిదుగురమును మామాయభిరుచుల కనుగుణ్యముగఁజెప్ప నేర్పాటుచేసి

కొన్ని నియమములనుబట్టి మేము రచించు కథాభాగములఁ దప్పక భేదముండునని మీరు భావించుట యుక్తమే. మనోరమ మా సంఘనిర్మాణమును గూర్చి పత్రికలకు పంపిన వ్యాసమునం దీమెనుగూర్చి 'వేష భాషాదివ్యవహారముల నెల్లప్పుడును పాశ్చాత్యుల పద్ధతుల ననుసరింప నభిలషించు చుండు"నని చెప్పియున్నది. కాని లీలావతి కాంగ్లభాషయందువలె నాంధ్రమున నంతగ ప్రవేశము లేకపోలేదు. ఈమె పదేండ్లవఱకుఁ దన మాతామహునియొద్ద గీర్వాణభాషా గ్రంథముల నభ్యసించెను. అహోరాత్రములు మరుఁదు వ్రాసియుంచిన నామలింగానుశాసనమును వల్లించుచుఁ బెద్దల కాశ్చర్యజనకముగ నెట్టియెట్టి కఠినశబ్దములనైన నేకసంథిన గ్రహించి ధారాళముగ నొప్పఁజెప్పుచుండెడిది. ఆవిధముగ నుండి పోయినమొదల నిప్పటికీమె యుభయభాషాప్రవీణయై ఉదాత్తరసాన్విత కావ్యరచనా విశారదయైయుండియుండవలసినది. సంస్కృతమభ్యసించుచుండఁగనే తండ్రిగారీమెకొక యింగ్లీషు దొరసానినిఁబెట్టి ఆంగ్లభాష నేర్పింప నారంభించిరి. ఒకవంక రఘువంశమును జదువుచు నొకవంక నాంగ్లభాష నీమె ధారాళముగ మాట్లాడుట కారంభించినది. అప్పుడీమెను తండ్రిగారు బెంగుళూరు సందలి యొకయాంగ్లో ఇండియన్ పాఠశాలకు బంపివేసిరి. అప్పటినుండియు నీమె జీవితమున నొక క్రొత్తశక మారంభమైనది. తనవారినుండి వేఱయి పరదేశమున నితరుల యింటఁ బెరుగుటకుఁబోయి వారియందపరిమితానురాగమునఁ దేజరిల్లుచత్తునివలె నీమె యాక్షణమునుండి స్వస్థానవేషభాషాదులను వదలి ఆంగ్లేయబాలికాయోగ్యమైన వేషభాషాదుల నవలంబించుచు విద్యార్జన మొనర్చినది. అందువలననే గావలయు నామె కాంగ్లేయ నైఖరులన్న నింత యభిమానము.

"నేటికాలమున నాంగ్లభాష మిక్కిలి ముదిరియున్న విద్యాధికులవలెనే ఈమె ప్రసంగముల నాంగ్లవాగ్జాలమునకు స్వేచ్ఛాప్రచారమున్నది. ఆంగ్లమునఁ బట్టపరీక్షల నిచ్చిన భారతీయులకుగూడ గష్టసాధ్యమనియు నరుదనియుఁ జెప్పఁబడు 'థింకింగ్ ఇన్ ఇంగ్లిష్' (ఇంగ్లీషునందే యూహించుకొనుట) అను గుణము ఈమె కలవాటై పోయినది. ఆంగ్లభాషావ్యామోహ మెల్లరికనులను గ్రమ్ముచున్న ఈకాలమున నాలుగైదింగ్లీషుముక్కలను బట్టుకొని సందర్భమంతగ లేకపోయినను వానిని బ్రదర్శించుచు పరమానందమును జెందు నాంధ్రులలో ధారాళముగ నాంగ్లభాషయందు సంభాషణ మొనర్పఁగల మాలీలావతికి ఎల్లప్పుడింగ్లీషుముక్కలే నాలుకకు వచ్చుటలో నాశ్చర్య మేమియున్నది? కాని కలము చేతఁబట్టి యాంగ్లకావ్యమును భాషాంతరీకరణ మొనర్పవలసినప్పుడు లీలావతి ప్రదర్శించిన శబ్దార్థపరిజ్ఞానమునకు, ఆంధ్రీకరణ నైపుణ్యమునకు ఆంగ్లేయ వాక్యార్థ గ్రహణశక్తికి నాకు మహాశ్చర్యము వేసెను. ఆమెకిట్టి యుభయభాషాపరిజ్ఞానమున్నదని తెలిసియుండని ప్రియం

వదయు, మనోరమయుగూడ ఈభాగమును గూడ నేనే యనువాదముచేసి లీలావతి నామమునఁ బ్రచురింప నుద్దేశించుచుంటి నని తొలుత భావించిరి. కాన వారికిఁగూడ విస్మయ మొదవునట్లు లీలావతి రచింపఁ గలిగినదని చెప్పుటకంటె నేను చెప్పవలసిన దేదియు లేదు.

నే ని*ట్లంటిని,—.

ప్రత్యక్ష నిదర్శనమునఁగాని మనమెవ్వరి ప్రజ్ఞయు నంగీకరింపము. ఆంగీకరణమున లీలావతి సమర్థతనుగూర్చి నేనను ప్రియం వదయు మొదట సంశయించితిమి. కాని మా కాశ్చర్యజనకముగ నామె ఈకార్యమును నిర్వహించుట మా కానందకరముగ నున్నది. మేమిట్టి ప్రసంగముల, నిట్టి యుపన్యాసముల నిచ్చుచుంటిమని పత్రికాముఖమునఁ దెలిసికొని విద్యాధికులగు పురుషులును స్త్రీలునుగూడ హర్షింపక పోవుటయే గాక మీనుమిక్కిలి ఇవి మా సోదరుల చేతనో, లేక మా భర్తలచేతనో రచియింపించి మానామములఁ బ్రచురించు చుంటి మనియు, ఇవి స్త్రీల రచనలవలె లేవనియు, ఆడువాండ్ర కిట్టి తెగువయు, సాహసము నుండదనియు ననేకవిధములఁ జెప్పుకొను చున్నారని నాకుఁ దెలియవచ్చినది. ఇట్టి వాక్యములు విద్యాగంధ శూన్యులగువారు చెప్పుకొనఁదగినవికాని విద్యావివేక సంపన్నులాడుకొనఁ దగినవికావు. సంభవమసంభవముగను, సత్య మసత్యముగను జేసి పరుల విశ్వసింపఁజేయుటలో హిందువులను మించినవా రింకొకరు లేరు. వేదములు బ్రహ్మ ముఖమునుండి బుట్టినవని, పదునెన్మిది పురాణములు వేదవ్యాసు డొక్కనిచే రచింపబడినవని, కృష్ణరాయవిరచితముగఁగానవచ్చు విష్ణుచిత్తీయమును పెద్దనార్యుఁడే వ్రాసెనని, కంకంటి పాపరాజ కృతమగు నుత్తరరామాయణమును నిజముగా వ్రాసినవాఁడు పుష్పగిరి తిమ్మనయని యీవిధముగ మనవా రొకరి రచనముల నొకరి కారోపించుచు కథలనల్లి సంతసించుకొనుట సృష్ట్యాదినుండియు జరుగుచునేయున్నది. ఇట్టి కట్టుకథలన్నియు, సరియైన చరిత్రములుకాని తదితర నిదర్శనములు కాని మనకంతగ లేని పూర్వకాలమునఁ గల్పింపఁబడినవి. కాని యట్టికథల కవకాశములేని ప్రస్తుతకాలమున మనవార సూయాపరులయి ఇట్టికథల నేలబుట్టింతురో నాకు తెలియకుండ నున్నది. ఇట్టివారిని జూచి మనమేమి యూహింపనలయు? సమకాలికుల యరసికత్వమునుజూచి మహోద్దండ భావుఁడగు స్విఫ్ట్ అనువాఁడు

**When a true genius appears in the world you know him by this mark—all the dunces are in con federacy against him** (జగమున నెవఁడైన ప్రతిభాశాలి యుదయించినయెడల నీవది ఈయొక్క గురుతును బట్టియే

* నేను—అనగా 'మనోరమ' నని యర్థము.

గ్రహింపవచ్చును - మూర్ఖులందఱును కలసి యట్టివానికి విపక్షశ్రేణిగఁ బ్రోఁగగుటయే) అని సమకాలిక విమర్శకులపై వాతవేసిన శ్లోక వాక్యమును శిలాశాసనముగాఁ జేసి యున్నాఁడని 'మెకాలే' యెక్కడనో వ్రాసి యున్నట్లు నాకు జ్ఞాపక మున్నది.

"కాని యిట్టిసంఘముల నుపన్యాసముల నిచ్చువారును, గ్రంథరచన మొనర్చువారును మన కనులయెదుట సభలలో బ్రోఁగగు వారియొక్కగాని తదితర పాఠక లోకముయొక్కగాని దూషణ భూషణ తిరస్కారములఁగూర్చి తలంపక

'ఉత్పత్స్యతేహి మమ కోపి సమానధర్మా' కాలోహ్యయం నిరవధి ర్విపులాచపృథ్వీ' అని మహాకవియగు భవభూతివాక్యమును దలంచుకొని వాఙ్మయమణుల వెలువరించుచుఁ బ్రపంచమును దేజస్వంతముగ నొనర్ప నూహించుచుండవలెను. మఱియు

క. విరచించు శక్తిపుట్టని (వసుం పురుషుని చదువులు ప్రకాశములుగావు ధరదీప రహిత సదనాం (క్రియన్. తరమున రేయి బడియున్న ద్రవ్యముల

క. ఛందోలంకారాదుల యందలి పాటెల్లఁ దుదిని వ్యర్థముగాదే సుందరమగు వాక్యంబుల (స్నన్. పొందెటఁగి రచించుబుద్ధి పుట్టక యు

అను సప్పకవి వాక్యములదలంచియు మన ముపన్యాసవ్యాసాది కావ్యకరణ దక్షులమై యుండవలెనని యూహించుచున్నాను.

ప్రియంవద యిట్లు పలికెను.-

" సమకాలిక జనులఈరస మస్తికలఁబట్టు నపుడు విశ్వశ్రేయః కాములగు కవులెట్లూహించి కావ్యరచన మొనర్తురో తెలిసికొనుటకుఁ దేజస్వంతముగ భవభూతిచేఁ జెప్పఁబడిన మహావాక్యమును దడవి మనోరమ మనలఁ జక్కగ నుద్బోధించినది. వీరిప్పుడు మెచ్చుకొనుచున్నారని కాని, వారుమెచ్చుకొనుట లేదనికాని, ఇంకొక రవహేళన మొనర్చుచున్నారనికాని, మఱియొక రసూయావిష్టులై తుచ్ఛముగఁ బలుకుచున్నారని కాని మనస్సున నుంచుకొన్న యెడల మనము సాధించున దెద్దియును లేదు. ఒక మన సంఘోపన్యాసములఁజూచియే జనులి ట్లను కొనుచున్నారా? 'గృహలక్ష్మి' యందు స్త్రీలెవ్వ రేమేమివ్రాసినను-"అబ్బే! ఆడువాండ్రేమి? ఇట్లు వ్రాయఁగలుగుటయేమి? తప్పక నిందు పురుషులచేయి స్పష్టముగఁ గానవచ్చుచునే యున్నది" అని తాము స్వయముగ జూచినట్లు, చెప్పగలిగినట్లు పలుకువారు పాఠకోత్తములై మెఱసిపోవు చున్నారు. ఏదో 'కుక్కకూత'యు 'నక్కకూత'యు జెప్పగలుగువారేకాని మఱెట్టి వ్యాసములను స్త్రీలు విరచింపఁజాలరని కొందఱు పూరుషోత్తములయూహ. అట్లధిక్షేపించువారికి తగిన సమాధానము మన 'రాజకుమారి' మహిళావిద్యాలయోద్యమ తత్వమునందును, ముఖ్యముగ నందలి శకుంతల మహోధ్యాపికోపన్యాసము (Professorial Address) నందునుండనే యున్నది.

"ఎవ్వరో యొకరువ్రాసిరి. ఏమైన బాగుగా నున్నదా ?" అని యెవరైన నడిగినయెడల "ఏమివ్రాతలు! ఏమిపత్రికలు! జారిణుల వలె కంటికింపుగ నున్నంతమాత్రమున లోన సారముండవలదా! 'వ్యాసోచ్ఛిష్టమ్ జగత్త్రియమ్' అన్నారు పెద్దలు. పూర్వకావ్యేతిహాసములముందీ కథలెందులకు? కాల్చనా?" అన పూర్వకావ్యేతిహాసములను దాము కరస్థలామలకములుగఁ జేసికొని చెప్పువారివలె భాషింతురు.

ఇట్టివారి యాగడములఁగూర్చి 'విమర్శాదర్శ' విమర్శాదర్శ మను గ్రంథమున నిరుపమాన ప్రజ్ఞాశాలురగు పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు మనోరమ చెప్పియున్న భవభూతి వాక్యమునే ఒకానొక సందర్భమున నుదహరించుచు నిట్లువ్రాసిరి.—

అని ప్రియంవద యాగ్రంథమును దెఱచి యక్కడక్కడ నీవిధముగఁ జదివి వినుపించెను —

"యేనామ కేచిదిహనః ప్రథయంత్యవజ్ఞాం
జానంతి తేకిమపి తాన్ప్రతినైషయత్నః
ఉత్పత్స్యతేహి మమకోపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధిర్విపులాచపృథ్వీ."

ఇది మాలతీమాధవీయములో వ్రాయబడినదని యెల్ల రెఱింగినయంశమే.

"కవులకు గర్వము, నసూయ, యాత్మస్తోత్రము, పరహేళనము సర్వసాధారణములగు నవగుణములు. కవులకున్న గర్వము రణశూరులకు లేదు. కిరీటధారులకు లేదు. వారికున్నయసూయ జ్ఞాతులకులేదు. వారికున్న స్వస్తోత్రపరనిందలు పశుచుసానులకు లేవు; చెడిబ్రతికినవారికి లేవు. తిట్లు తిట్టుటలో నింతవారులేరు. తిట్లుతినుటలో నింతవారులేరు. అనూనదానప్రతిగ్రహణప్రవీణులు. స్వకవితానిందను విని, కడుపుడికియుడికి, యొడలు కాలికాలియుండుటచే నాతఁడీ శ్లోకమును జెప్పినాఁడు. ఆశ్లోకార్థమిది. 'ఎవరైన మా తిరస్కారమును బ్రకటింతురుగాక! వారుగూడ నేదియో కొంచెము తెలిసినవారే యగుదురు. అట్టివారికొఱకు నేనీరూపకమును వ్రాయలేదు. కాల మంతములేనిదియగుటచేతను, ధరామండలము విపులమైనదగుటచేతను నెప్పుడైన నెక్కడనైన నావంటి బుద్ధి ధర్మము గలవాఁ డుదయింపగలడు."

మఱియు నీవాక్యములఁ జర్చించుచు వా రిట్లువ్రాసిరి.—

"జనులకొఱకుఁ గష్టపడుచు జనులఁ చేతఁ గష్టపడువాఁ డొక్కకవియే. పుణ్యమునకుఁబోయి బూతులు దినువాఁ డొక్కకవియే. భవభూతివంటివాని బ్రదుకే తెల్లవాఱినప్పు డిప్పటివారిమాట చెప్పవలయునా? కాళిదాసు మాత్రము జనుల తిట్లనుఱికి దాఁటిపోఁగలిగెనా? అతని కవిత్వములో బింకము తక్కువయనియు, బంటిక్రింది కాఁగునంతటి పటిమకలదికాదనియు, నతఁడు యమకకవిత్వము చెప్పఁజాలఁడనియు, నెంతసేపు నుపమాలంకారము నే

కాని ఇతరాలంకారముల నుపయోగించుట యెఱుఁగడనియు నీకనేమేమోయనియు నాతనిని నోటికివచ్చినట్లెల్లఁ దత్సమకాలికులు తూల నాడినట్లు మనము వినుచు టిమి కదా?

"కాళిదాసుఁడు గడుసుకవి. ఈఁడెన్ని తిట్లు తినినను దన శాకుంతలములోని నాందిలో 'ఆపరితోషాద్విదుషాం నసాధు మన్యేప్రయోగ విజ్ఞానమ్.' అని వ్రాసినాఁడు. ఇది యెంత లౌకికప్రజ్ఞాతియో కనుఁగొనుఁడు. తిట్టుచున్నవారిని విద్వాంసులని శ్లాఘించుచున్నాఁడు వారి పరితోషమే కావలయునను చున్నాఁడు. అవిలేనియెడలఁ దనగ్రంథ మసాధువేయనుచున్నాఁడు. ఆత్మ విశ్వాసము లేనివాఁడననుచున్నాఁడు. పరితోష పూర్వకముగు పండితుల శిరఃకంపనమే తన గ్రంథమునకు జీవనమనుచున్నాఁడు.

"ఉత్తమకవుల ప్రాశస్త్యమును సమకాలికులేకాదు. కొంచెము తరువాతి వారుకూడ గ్రహింపలేరు. ఆంగ్లేయ శారదా కిరీటమధ్యమునఁగోటి కోహినూరుల తేజముతోఁ బ్రకాశించుచున్న షేక్స్పియరు కవిశిఖామణి, తనకాలములో వట్టిమసిబొగ్గు!! బేకన్ వంటివాఁడతని బుద్ధిని గ్రహింపలేకపోయినాఁడు. తరువాతివారలలో నాంగ్లేయ సారస్వత తిమింగిలమని మక్కికి మక్కిగఁ బిలువఁబడు జాన్సన్ అను నాతఁడు షేక్స్పియరును బహుసామాన్యకవిగఁ బరిగణించినాఁడు. అతనికంటె పోప్ అనువాఁడే ఘనుఁడని సూచించినాఁడు. వైక్రాంతము బ్రహ్మజాతి వజ్రమనుకొనుట యెంతకంటె మంచిదికాదా!"

ఉపజ్ఞామహితులైన నరసింహారావు పంతులుగారి కలముక్రిందకు వచ్చిన ఈ యంశమును గూర్చిన యొకటి రెండువాక్యములఁ బేర్కొనుటతో తృప్తివహింపక కొంత దీర్ఘముగ నుదహరించితిని. మత్సరగ్రస్తలగు సమకాలీను లెంతనిరసించినను మన యుద్యమమున చలింపకుండ యోగారూఢులమగుటయే కర్తవ్యము. విరచనోత్సాహమున బద్ధకంకణులమై

**Self-reverance, self-knowledge, self-control
These three alone lead life to sovereign power.**

(ఆత్మగౌరవము, ఆత్మజ్ఞానము, ఆత్మనిగ్రహము—ఈమూడే జీవితమున్నతమైనశక్తి కాస్పదమగునట్లుఁ జేయఁగలవు.) అను తేజస్వంతమగు నెన్నిసన్వాక్యము నొకమారు స్మరించి కథ నిఁక సాగింతము.

## రాజకుమారి

### 3

సౌందర్య లహరిలో
సౌఖ్యంపు దరగలో
మలయాద్రిదోఁచెను మందమారుతము
మధురమైవీచెను మందమారుతము.

సంద్రంపు కెరటాల
చందురు కిరణాల
ఊగుచు నూగుచు
నుదయాద్రి కెక్కుచు
మలయాద్రిదోఁచెను మందమారుతము
మధురమైవీచెను మందమారుతము.

వెన్నెలాలూపగా
వన్నియల్ బొడమగా
సంద్రంబు లెగురగా
చందురుం డుండగా
ఆడుచు బాడరా నాచిట్టితండ్రి
హాయిగా నిద్రింపు నన్‌గన్నతండ్రి.

ఊహలందూగుచు
నుయ్యేలానూగితివి
నిద్రింపు నిద్రింపు
నన్‌గన్నతండ్రి.
నాన్నగా రొస్తారు నాచిట్టితండ్రి
నావద్ద నిద్రపో నన్‌గన్నతండ్రి.
చందమామ తెస్తారు
జాబిల్లి దెస్తారు
బండెక్కివస్తారు
కొండెక్కివస్తారు
నిద్రింపు నిద్రింపు
నన్‌గన్నతండ్రి.

మఱునాటి యుదయమున దివసనాథుని రాక నెదురుచూచుచు సువర్ణ రేఖారమ్య సర్వాంగీణముగ నలంకరించుకొనియున్న పూర్వ దిశాభామినివలెనే వికాసభాసుర ముఖములతో ముప్పురమును మేలుకొంటిమి. సమయాకరణీయములైన వెనుక పర స్పరసహాయమున మా యాడువేషముల దిద్దుకొని క్రిందిచావడికావలినున్న పుష్పో ద్యానమునం బ్రవేశించితిమి. అక్కడ నొక జలయంత్రమున నగుచున్న కృత్రిమవర్షపాత మును, మఱియు దానివలన నిరంతరీకృత ముగ నేర్పడుచున్న బుద్బుదసమూహమును దిలకించుచు—కాదు తిలకించు నట్లభిన యించుచు నిలచియుండగ—మాలతి మిగుల నాతురపాటుతోవచ్చి మమ్ముఁగలసి కొనెను. నిద్రాహానివలనఁ గలిగిన జడభావ మువలననో లేక సంతాపితాంతఃకరణము చేతనో మొగము కెంపువలె నెఱ్ఱబారి యుండగ ఆమెరూపమున బడలికయు, ఖిన్నతయు, నాందోళనమును ద్యోతకమగు చుండెను.

"పాఱిపోవుఁడు! తత్క్షణమే పాఱిపో వుఁడు! విహంగములవలె దొరకకుండ పాఱిపోవుఁడు!! మాయమ్మ కంతయుఁ దెలిసి పోయినది. ఇప్పు డవకాశముండగనే పాఱి పొండు" అని కలవరపాటుతో నామె పలుక నారంభించెను.

నీతల్లి కెట్లుతెలిసినదని నేను ప్రశ్నింప నామె యేడ్చుచు:—

"అదంతయు నాయపరాధము! నా బుద్ధిహీనత! అయినను స్వయంకృతా పరాధమునుగాదు. కాకపోయినను కొంత వఱకు నేనందులకుఁ బాధ్యురాలనే. కావున వినుడు. విని నాయపరాధమును దయతో క్షమింపుఁడు. ప్రతిరాత్రియు శకుంతలా దేవిని గూర్చియు, నామె యనుచరుల గూర్చియుఁ దోచినట్లాడికొనుట మాయమ్మ కలవాటు. ఈ మహెూద్యమనిర్వాహ కత్వమున రాజకుమారి యుత్తమాంగమై తానును శకుంతలయు చెరియొక హస్తమై యుండవలెనని మొదట నిర్ణయించుకొని రట. కాని ఇప్పుడు శకుంతల దక్షిణభుజమై

పోవుటవలన తానెందుకును బనికిమాలిన వానుహస్తమువలె కేవలాలంకారమాత్రముగ నుపయోగమునకుఁ దేఁబడకుండ నుపేక్షింపఁబడుచున్నదఁట. సగముకన్న నెక్కుడు విద్యాశిక్షను లిచ్చిన శకుంతలాదేవి శిష్యురాండ్రు — అందఱికి నామెయన్న ప్రేమ! వారి విద్యాభినివేశమున కామె యు దేమి మహాత్మ్యమున్నది? కొత్తగఁ జేరవచ్చు వారికికూడ విదితమేయున్న. నిన్న రాత్రి శకుంతలాదేవి మిమ్ములను వెనుక వేసికొని యేదో శ్లాఘించినదఁట.—ఏల? మీరు నా దేశమువారట! ఇదంతయు నామెపై తనకుఁగల నిర్హేతుక ద్వేషమునఁ గానఁట. కాని—మిమ్ముల నామె యంతగ నెందులకుఁ బూసికొని రావలెను ?—"ఆమె దేశస్థులా? అడవిజంతువులుగాని వీరుత్త రాది బాలికలా? వీ రాంధ్రురాండ్రా? ఈ పురుషసువాసినీ స్వరూపములు స్త్రీలెట్ల గుదురు?—"అని మిమ్ములనుగూర్చి మాయమ్మ సందిగ్ధముగ బ్రసంగించుచుండగా మిమ్ములనుగూర్చిన రహస్యము ఇంటఁబ్రవేశించి ప్రాకులాడు పామువలె నాహృదయాగారమున తల్లడపాటునుగలుగఁజేసెను. సూక్ష్మాతిసూక్ష్మమగు పలలఖండమునుసహితము చాలదూరమునుండి యుపలక్షింప సమర్థమగు గ్రద్దవలె ఆమె నన్నుతీక్షణముగజూచి నా రహస్యమును భేదించినది కావలయు. అప్పుడు నాయొడల రణకంపమెత్తి నాముఖమున నెట్టివిపరీతలక్షణముల నుదయింపఁజేసినదో ఆ పరమాత్ముఁడే యెఱుఁగవలయు. తప్పక నా కపోలము లెఱ్ఱవడి మాయమ్మ దృష్టిపాతమున మిగుల సంతప్తములై నాకు యుక్తాయుక్తజ్ఞానములేకుండఁ జేసివేసెను. నాకు కలవరమే కలిగినదో, కంపమే వచ్చినదో, భయమే వేసినదో, సిగ్గేపట్టుకొన్నదో కాని మాయమ్మమాత్రము నాయాందోళనమును క్షణమాత్రములో గ్రహించివైచెను. ఆమె నవ్వుచు 'ఆహా! ఎంత యద్భుతముగ సిగ్గభినయించుచున్నావు! ఎంత నెఱజాణతనమున నాకన్నులను భ్రామనూహించుచున్నావు! వీరు తప్పక పురుషులే. యువతులవలెనున్న పురుషులు!! లేనియెడల నీమొగ మిట్లు కెంపుగఁజేసికొనవలసిన యావశ్యకతయే లేదు.'' అని పలుకఁజొచ్చెను. అట్లామె యనుటవలన నా యాందోళనము మఱింత హెచ్చుగఁ బెరిగిపోయినదికావలయు. నేఁటి నిస్సంచాంచల్యమున మీరహస్యమును వెల్లడించుటకుఁ గాఢాభిమానులనైతిని వగచుచున్నాను. అయినను నానోట మీరు పురుషులని నేనొక్కమాటయైన పలుకలేదు. కావున క్షంతవ్యురాలనని మనవి చేయుచున్నాను. మాయమ్మ మాత్రము 'వీరు పురుషులు, పురుషు' లని పలుమారు చెప్పుకొనుచు లోనఁ దలపోయుచు నిట్లు పలికినది. 'స్త్రీవేషములఁదాల్చిన యంతమాత్రమున వీరు స్త్రీలెట్లగుదురు? పురుషులని వారివైఖరులనుబట్టియే చెప్పవచ్చును. ఈయాఁడువేసగాం డ్రంతకాల మా యమ్మాయిదానితో మాట్లాడుట కేమివచ్చినది?' అని మఱియు నుద్దండభావమున నొకమాటకంటె నొకమాట నాకు భయావహమగుచుండ 'ఆహా!

వీరు—తప్పక—పురుషులే. నీకును తెలి
యును. నేనెఱుగ ననుకొంటివి.' అని
వచించెను. నాకొడలు జలదరించెను.

'నన్నేమియు నడుగవలదు. నాకనుట
యేమి? శకుంతలాదేవియు నెఱుంగును.
ఉపాధ్యాయురాలగు నామెయే దీనిని రహస్య
ముగ నుంచుచున్నది.' అని మాయమ్మకుఁ
జెప్పుకొనవలసినదాన నయితిని. ఆయుత్తర
క్షణమునందే మాయమ్మకు సర్వమును
విశదమైపోయెను. కాని మీ రిట్టివారని నే
నొక్క యక్షరమైన పలుకలేను. ఈ ప్రాతః
కాలముననే ఆమె రాజకుమారి యొద్దకుఁ
బోయి సర్వమును జెప్పివేయును. శకుంతలా
దేవి పనినుండి తొలఁగింపఁబడి యవమానింప
బడుట ధృవము. కాని మీరు ప్రాణరక్షణ
మొనర్చుకొనవచ్చును. వేగమే వెడలిపొండు.
పోవుటకుముందీరహస్యాభాసమునకు కారణు
రాలనైన నన్ను క్షమింపవలసినదని ప్రార్థన."

కృష్ణవర్మ యిట్లు పలికెను.

"ఏమి క్షమించుట! మాయుదంతము
మీయమ్మకు దెలిసిపోవునట్లు సిగ్గభినయించితి
వనియా? బాగుబాగు!! ఇప్పటివలె వెల్లదన
మున ముఖముపై దెల్లకలువలను జూపుట
కంటె మీయమ్మయొద్ద జూపినట్లు సిగ్గున
కెందామరయేజూపి మమ్మును మాజీవములను
గూడ సిగ్గుపడునట్లు చేసివేయుము. అయిన
నీభూతల స్వర్గమున మేమింకను కొంతకాల
ముండవలసియున్నది. లేనియెడల గీర్వాణ
ధోరణులఁబోవు కవిగాఁడెవఁడైన శాశ్వత
ముగ మాపై గ్రంథమునల్లి

'త్రిశంకునివలె స్వర్గారోహణ మొనర్చిరి.
కాని తదుత్తరక్షణముననే ఛండాలురై క్రింద
కుఁబడిపోయిరి.'

అని మమ్ముల నాక్షేపింపవచ్చును. ఇప్పుడే
మీయమ్మనుగలసికొని ఆమెయందలి పాషాణ
మును ద్రవీభూతముగ జేసికొని ఇంకను
మాకు కొంత కాలహరణమున కవకాశ
ముండునట్లు చేయగలను" అని పలికి భాను
మతీదేవిని జూచివత్తునని వెడలిపోయెను.

అతఁడెంత మాత్రమును కృతార్థుఁడు
కాఁజాలఁడని మాలతి సంశయించుచు పలికెను.

"ఈకుడియెడమల గూర్చిన తగవులాట
యెప్పుఁడెట్లు సంభవించినది?" అని పార్థసారథి
ప్రశ్నించెను.

"ఈ యిరువురకు ద్వేషాంకురములు
చాలకాలము క్రిందటనే మొలకలెత్తినవి.
అయినను వారి మనస్పర్థలు చాలకాలము
వారి హృదయాంతరాళమున నడగిపోవుచు
వచ్చినవి. వీని కంతకును కారణము మా
యమ్మయేయని నాయూహ. స్వేచ్ఛాగమ
నాభిలాషిణియై క్రింతలలో నడగియుండుట
కొప్పుకొనక ప్రచండవేగమునఁబోవ నుద్య
మించు మహామారుతమువలె మొదటినుండి
యు మాయమ్మ సర్వతంత్ర స్వతంత్రముగ
నుండ వాంఛించునది. మొదటినుండియు ఆమె
యభీష్టము లప్రతిహతముగఁగొనసాగవలసి
నదే. ఎచ్చటనైన సరే; ఎవరియొద్దనైనసరే;
ఆమె ప్రచండశాసనయై పరులఁ బాలింప
నభిలషించును. నేను మాతండ్రి యెట్టివాఁడో

యెఱుఁగను. కాని యామె — భగవంతుఁడామె పాలనుండుఁగాక! — తన్ను బెండ్లాడిన యతఁడు వట్టి బుద్ధిమాలినవాఁడని చెప్పుకొనును. మొదటినుండియు నామె సనాతన సాంప్రదాయముల నసహ్యించుకొనుచువచ్చినది. ఇందిరాదేవికి శైశవమునుండియు విద్యాబుద్ధుల నుపదేశించు నుపాధ్యాయినిగా నీమె నిర్ణయింపబడినది. మఱియు రాజకుమారి తల్లి మరణించినప్పటినుండియు మాయమ్మయే యామెకు జననీస్థానమునుండి పెద్దదానిగఁ జేసినది. కాని యంతలో మిాయక్కయగు శకుంతలవచ్చి యామె హృదయమును తనదెస కాకర్షించుకొనెనఁట. అప్పటినుండియు రాజకుమారియు, శకుంతలయు మేనులు రెండును ప్రాణము లొక్కటియు నగునట్లు సంచరించిరఁట. ఒక్క సంగీతరవమున కనురూపముగా మ్రోయు మృదంగాది రవముల వలె నెల్లప్పుడును మెలంగుచు వచ్చిరఁట. అయినను మిాశకుంతల తన సిద్ధాంతములనే దొంగిలించి వానిద్వారమున తనశిష్యురాలగు రాజకుమారిని హస్తగత మొనర్చుకొన్నదని మాయమ్మయనుచుండును. పరపదార్థాపహరణ ప్రవీణులగు గ్రంథకారులవలె శకుంతలయు తన పదాభిప్రాయ తస్కరణ మొనర్చుచుండునని మాయమ్మవాదము. దయ్యమెఱుఁగవలయుగాని నేనిఁకఁ జెప్పఁజాలను. కాలాతీతమైపోయినది. నేనిఁకబోవలయు"నని చెప్పి త్వరితగమనమునబోవు విహంగమచ్ఛాయవలె మాలతి వెడలిపోయెను.

ఆమె పోయినవైపునకే చూచుచు పార్థసారథి ఈవిధముగఁ బలికెను.

"దాపటిక మెఱుఁగక సత్యము, నిర్మలము నగు నంతఃకరణముగల బాలిక! నేనవతెనైనఁ బ్రేమింపఁగలిగినయెడల నిశ్చయముగనీమెయే కావలయు. మాటవరుసకు సిగ్గభినయించి మనల సిగ్గుపఱుపుమని యడిగిన కృష్ణవర్మ మాటను తీసివేయఁజాలనిదానివలె ఆమె యెంతముగ్ధసుందరముగ సిగ్గుపడినది! ప్రమాదాస్పదమగు నహంకారమున పరిభ్రమించు తమ రాజకుమారీమణియు, ఆమె యడుగులలో నణుగులిడుటయే ప్రతిభగఁదలపోయు మాశకుంతలయు నామె సుకుమార సౌశీల్యములకు సాటిరాఁజాలరు."

నేనంటిని—"అల్పమగుకొంగ కొంగను జూచియే సంతసింపవచ్చును. ఒకపావురమింకొకపావురమును జూచియే మురియవచ్చును. కాని రాజహంసనగు నేను నారాయంచనుగూర్చి కాక తదితర చిత్రవర్ణపుఁ బిట్టలఁగూర్చికాని కీటకములఁగూర్చికాని సంకీర్తన మొనర్చుటెట్లు? రాజకుమారి! ఆహా! నా రాజకుమారి! నిశ్చయముగ నామె ప్రమాదాస్పదమగు వర్తనమునఁ బరిభ్రమింపవచ్చును. కాని ఆపరిభ్రమణమంతయు నప్రమేయమహోన్నత జ్యోతిర్మయభావాంబర పథమునందు! సర్వాధికులగు నటువదిపూరుషోత్తములకంటెను ఆమె తత్త్వము నందత్యధికమగు ఘనతయున్నది. ఎట్లు?— ప్రతిస్త్రీయందును ఆమె తన ప్రతిబింబమునే జూచుచు వారిబ్రదుకే తనబ్రదుకుగా, వారి

కష్టమే తన కష్టముగా, వారి శ్రేయమే తన శ్రేయముగా వారి యౌన్నత్యమే తన యౌన్నత్యముగా మనోవాక్కాయకర్మముల ననుభవమునకు దెచ్చుకొనుచున్నదే! అప్రమేయగుణపూజ్యులైన మహాపురుషులు సహితము ఏదేశముననైన నేకాలమునందైన నీవిధముగ భావింపఁగలిగిరా! ఆమె యుద్యమమునం దెంతవిపరీత తత్త్వమున్నను అది జగత్తంతయు నొక్కమాఱుగఁ దేజస్వంతముగ నొనర్చు తత్ప్రభావతీక్ష్ణత్వమున నన్నును సత్యమునుగూడ సంధీభూతముగఁ జేసివేయుచున్నది. అనితర సాధారణమైన దుస్తరమార్గమునఁ దేజరిల్లుచు విపరీతముగాఁ గానవచ్చు నిట్టివైఖరియే ఆమె కలంకార భూతమై కిరీటమువలె మెఱసిపోవుచున్నది.

"ఏకార్థసముపేతలగు తదితరనాయికలు మొదట మోహినులయి ఆమె కమృతమును పోసి ఆమె నింతటిదానిగఁ జేసిరని యొప్పుకొందును. విజ్ఞానామృతసేవనమునందామె కెంతప్రీతి! ఎంతపట్టుదల! తిమిరోన్మూలన మొనరింప నుదయించు సూర్యభగవానునివలె ఆద్యప్రపంచమున నజ్ఞానతిమిరోన్మూలన మొనర్ప నూహించుచున్నదే! అనుపమానశోభారమ్యాంగియగు నామెయం దొక దివ్యతరమైన తేజమున్నది. ఆమెతత్త్వమునందొక యనిర్వచనీయమగు నతిశయభావమున్నది. ఆమెచేష్టయం దొక సాటిలేని మనోజ్ఞత్వమున్నది. ఆమె సర్వశేఖరులందును జెప్పరానిమాధుర్యమహిమయున్నది"

అట్లనుకొనుచు మేమిర్వురమును నడకఁ దిరిగివచ్చితిమి. ఆమహాభవనమునందలి యుపరిభాగము నధిరోహించి ఉత్తరాభిముఖముగ జూచుచు నిలువఁబడితిమి. ఆమహోన్నత స్థానమునుండి పరిసరప్రదేశమంతయు గనులపండువుగ గానవచ్చుచుండెను. ఆకాశము నొరసికొనుచోట వసుంధర నీలనీరదశుభాకారమున నక్షిగోచరమగుచుండగఁ జేరువ తరులతాదిపత్రములనడుమ లెక్కపెట్టరాని మల్లియల, జాజుల, గులాబుల, గుల్షబులనుండి యేతెంచు పరిమళమిళితమైన ండ మారుతము ప్రాణముల కుజ్జీవనకరముగ నానందవర్ధనముగవచ్చి మాకనుఱెప్పల సంచలిత మొనర్పఁజొచ్చెను. అంతలోఁ గృష్ణవర్మవచ్చి ఇట్లు చెప్పెను.

"ఏమో యనుకొంటినిగాని ఎంతకష్టమైపోయినది. ఇది చాయలతోడి నిరాఘాటమగు పోరాటముగా భావింతురుకాఁబోలు! వృథాభ్రాంతి. ఎక్కడనైన మీరు మోసపు జాయలతో 'గుస్తీ' పట్టవచ్చునేమో కాని ఇక్కడట్లు సాగిరాదు. అయముకంటెను, ఆదికూర్మముయొక్క మూపుకంటెను ఆమె హృదయమునం దెక్కువ కఠినత్వమున్నది. అయిన నొకవిధముగ మనకింతగఁ దలవంపులుండని మార్గమొకటి కనిపెట్టివచ్చితిని. సృష్ట్యాదినుండియు మనుష్యమాత్రుఁ డెఱిఁగియుండని మహారణ్యములనడుమ—భగ్గుమను మండువేసవియందు — మిట్టమధ్యాహ్నమప్పుడు — ఒకటి రెండు క్రోసుల దూర మొకరాజమార్గమైన నిర్మించుటంత

కష్టముగ నుండదు. కాని ఈయూడుగురువుగారికి నచ్చచెప్పుటను దుర్దశయున్న దే— అది మానవమాత్రుఁడొనర్పఁజాలని పని !

"నేనుపోయి తలుపుతట్టితిని. ఆమె లోనికి రమ్మనినది. రాజకుమారియొద్దకుఁ గావలయు — ఆమె బయటికిపోవ నుద్యమించుచుండగ నామెను సందర్శించితిని. ఆమెహృదయమునఁ బొంగి ప్రవహించు మత్సరద్వేషముల విష మామె కనులనుండి ఈవలకు వచ్చుచున్నట్లుండెను. పురుషుఁడెంత వినయ మభినయించుచు మాట్లాడుటకు శక్యమగునో నేనంత వినయమున నామె దెసజూపుచు సంభాషించితిని. కమ్మని యాలనేతితో వేపఁబడు జీడిపలుకులవలె నాపలుకులును ఆమెకు రుచ్యములుగఁ జేసి సంభాషించితిని.

"కన్యాజనయోగ్యమైనముగ్ధత్వ మభినయించుచు మాయహాస్యమును గుప్తముగ నుంచవలసినదని మొదట ప్రార్థించితిని. ఆమె మండిపడుచు మొదట మఱెవరమో యేలవచ్చితిమో చెప్పవలసినదని యాజ్ఞాపించెను. నేనేదో చిత్రకల్పన మొనర్చి దాఁటుకొనిపోవ నూహింపక తాము శకుంతలయొద్దఁ జూపినమార్గమును బట్టి సత్యమంతయుఁ జెప్పివైచితిని. ఆమె హృదయమున క్రోధము, నాశ్చర్యము నొక్కపెట్టున పుట్టియుండవలయు. ఆమె కేదో యావహించినదానివలె చేతులు జోడించి 'హాహా! శివా! భవానీ! రుద్రాణీ! శర్వాణీ! సర్వమంగళా! ఎంతలేసిపనులై పోవుచున్నవి!' అని యేమేమియో గొణుగుకొనెను.

"నేను రాజకుమారినిగూర్చి తమప్రథానాది సందర్భములఁ జెప్పితిని. నేనసందర్భముగ నతనిగుఱించి మాట్లాడుచుంటినని యామె పలికెను. ద్వారదేశమునందలి యాభయంకరశాసనముదలంచియైన మాముప్పురకును ప్రాణదానమొసఁగవలసినదని ప్రార్థించితిని. కనులుండియే యురులయందును, జిగురునందును జిక్కుకొనువిహంగముల వలెనె మేమును కనులుండుకొనియే ప్రమాదమునఁ బడిపోతిమి. సత్యమే!—అందులకేమివచ్చినను సంసిద్ధులమై యుండువారమే! కాని శిరచ్ఛేదనమువంటి కఠినతమమైన శిక్షలకు మమ్ముఁ బాలుపఱచిన యెడల నది ఈయూడువారి యుద్యమ మొక్కదెబ్బతో భగ్నముగఁ జేసివేయును."

"పక్షపాతము నిష్ఫలము పొడగుచున్న దానికంటె నెక్కుడుగ భగ్నముకా"దని యామె ప్రత్యుత్తరమిచ్చెను.

"పోనీయని నేనామెయందలి 'తల్లిగుండియల'నైన కరిగింపవలెనని ప్రయత్నించితిని.—'మాలతికి తెలిసియుండియు నూరకుండుటవలన నామె కందఱియందును దలవంపులయి పోవును. ఆమెను జూచియైన నీవు మాయెడల దయ జూపింపవలయు'నని ప్రార్థించితిని.

"దానినిగూర్చి నేను చక్కబెట్టుకొందును లెమ్ము." అని యామె ప్రత్యుత్తరమిచ్చెను.

"యుద్ధములై పోవును. ఇరుపంకలజనులు నిష్కారణముగఁ జచ్చిపోవుదురు. ప్రాణి నాశనహేతువైన ఇంత కలహమెత్తి పనులఁ బంపవల"దని నేనంటిని.

"ఏమైన సరుగాక! నాధర్మము నేనొనర్తును. ధర్మము, ధర్మము, నాస్వధర్మమును నేను నిర్వహింతును." అని స్త్రీత్వమును సాక్షాత్కరించిన కృష్ణభగవానునివలె-తన జన్మమంతయు స్వధర్మరక్షణ పరాయణత్వమునఁ జెల్లించుకొను వైఖరిని మాట్లాడెను.

"కడకేమి చెప్పను?—నేను నిరుత్సాహపడి ధైర్యమును గోలుపోతిని. అయినను వేయేండ్లు హాహాకారాహాహాకారంబుల మునఁ గొట్టుచు వచ్చినప్పటికిని—అనేకమంత జాతి నేలమైనను కడకొక్క గుప్పెడి ... గ మట్టును ద్రోసివేయవచ్చునను సంగతి నెఱిఁగియున్నవాఁడ నగుటచేత తిరుగ నీవిధముగ బ్రార్థించితిని.—

"తొందరపడి నీవెట్టి నిశ్చయమునకు రాఁగలదని మనవి. మొదట బాగుగ యోచింపుము. అసలీ మహింసామహావిద్యాలయమునకు స్థాపకురాలవు నీవు. కాని యిందు నీకు ప్రతిపత్తిస్థానమే యున్నది. కొందఱు మూఢవాదాం యనుచున్నారు.

కావున నేను సాహసించి చెప్పెద నాకర్ణింపుము. నిన్ను మేము అత్యుచ్చమగు స్థానమున నుంతుము. మారాకనుజూచినను తెలిసియుఁ దెలియనట్లూరకుండుము. మా రాజకుమారుఁడు తన వధూటిని పరిణయమాడుటకు సహాయమొనర్చుము. అట్లు చేసినయెడల మా దేశమున నీకు గొంత రాజ్యమిచ్చి అందు సర్వసుందరీలోకమునకును నిన్నుఁ బ్రభ్వినిగా నియంతనుగాఁ బట్టాభిషేక మొనర్తుము. ఇక్కడనున్న ఈ భవనములకంటె నుత్తమమును విశాలమునైన మా రాజప్రసాదమొకటి నీకుఁ బారితోషికమిచ్చి నీశాసనములకు యాఁడువాండ్ర కుమారితవ్యములగునట్లు చేయింపఁగలము. అట్లయిన శాశ్వతముగ రాజకుమారికంటె నధికమైనకీర్తి ఆచంద్రార్కముగ నీకుండిపోవును.

"ఈవాక్యము లామె శ్రద్ధతో నాకర్ణించి కొంతసేపూరకుండెను. ఆమె ఏమి తలపోసెనో కాని యిందులకు నేటిరాత్రి ప్రత్యుత్తరమిత్తునని సెలవిచ్చినది. ఈలోన మన మెవ్వరితోడను నుత్తి ఎట్టిప్రసంగములును జేయకుండ నుండవలసినదని యాజ్ఞాపించినది.—ఇంతవఱకు మాత్రమే కృతార్థుడనైతినని మనవి చేయుచున్నాను."

# పాకకళ

## — గోధుమరవ హల్వా —

రెండుపళ్లపాలలో అరపడినీళ్లుపోసి పొయిమీద బెట్టి పొంగువచ్చినపుడు ఒకపడి గోధుమరవను వేసి ఆ రవలు ఉడికి గట్టిగా వచ్చినపుడు రెండుపళ్లు శుద్ధిచేసిన తెల్లచక్కెర పాకమునుపోసి దానిమీద కాలుపడి నెయ్యిని, ఒకపడి పన్నీరునుపోసి, చక్కగా కలియబెట్టి మూతపెట్టి అట్లే కొంచెమునే పుంచనిచ్చి, తర్వాత కలియబెట్టి, యీలాగు అయిదారుమార్లు కలియబెట్టి, హల్వాపక్వమునకుంచి, ఉపయోగించుకొనవలెను.

## — అక్బర్ హల్వా —

పెద్ద గోసపప్పు, కర్బూజపప్పు, చిన్నగోసపప్పు, సారపప్పు, ఇవి వినుమునకు అరపడి, పొట్టుతీసిన బాదముపప్పు కాలుపడి, గసగసలు రెండుపలములు, వీనినంతయు ఆవుపాలలో మెత్తగానూరి, ముద్దచేసి, రెండుపళ్ల కలకండను పాకముచేసుకొని, ఈపాకము పొయిమీదనుండగా ముందు నూరియుంచియుండు ముద్దను దానియందువేసి, అరసీసెడు నెయ్యియు, అయిదుతులముల పన్నీరును, రెండువరాలెత్తు కుంకుమపువ్వును, అరవరాయెత్తు కస్తూరిని చేర్చి, హల్వాపక్వమును తయారుచేయునది.

—పప్పు. కమలావతి

## — మామిడి యూరుగాయ —

గింజకట్టినట్టియు పుల్లగా నుండునట్టియు మామిడి కాయలు 100 తెచ్చి 7 పర్యాయములు పడకట్టిన మంచినీళ్లు కాయలు మునుగునట్లుగా బోసి నాటిలో 2½ శేర్ల ఉప్పునూ, అరవీశ పచ్చిమిరపపండ్లునూ, 2 తులముల యింగుపపొడియును, పావుశేరు మిరపకాయలపొడియును, ½ శేరు తూనికెగల పొట్టు గీచిన ప్రశస్తమగు శొంఠిముక్కలును వేసి మూతబెట్ట వలయును. ఇట్లు మూతబెట్టిన 3, 4, రోజులయిన వెనుక కావలసినపుడెల్ల తెడ్డుతో దీసి యుపయోగించుచుండవలయును. తినుటకు మిక్కిలి రుచిగాను, ఆరోగ్యముగాను యుండును.

## — కదంబ పాకము —

20 తులముల దానిమ్మపండ్ల రసమును, 20 తు॥ నిమ్మపండ్లరసము, 10 తు॥ దబ్బపండ్లరసము, 20 తు॥ వెలగపండ్లరసము, 15 తు॥ ద్రాక్షపండ్లరసము, 1 పావుశేరు కొబ్బరిపాలు పావుశేరు ఆవుపాలు, ఇవి అన్నియుచేర్చి బాగుగ కలియగొట్టి దానిలో 4 తు॥ యాలుకలపొడి, జాజికాయ, జాపత్రి వీటి పొడుమొక ½ తులము, ఒకపావుశేరు చక్కెర పలుచని పాకముగా దించుకొని దానిలోనుండు మరల నెత్తివేసి పయిని జెప్పిన కదంబమునుపోసి కలిపి యుపయోగించవలయును. నిల్వయుంచరాదు.

—శీలా. అప్పలకొండ

## బూడిద గుమ్మడికాయ వడియాలకూర

వడియాలనుచేయువిధము అందరకును తెలిసినదే కాని అట్టి వడియాలతో కూరచేయుట మాత్రము నూతనము. కొంచెము అవాలు, బియ్యము రుబ్బి ఆముద్ద వేసేటప్పుడు సిద్ధముగా యుంచవలెను. ఆ పిమ్మట వడియాలను చిదిపి, వాటిని యొక కళాయిలో కొంచెమునీళ్లు, చింతపండు, పసుపువేసి అందు యీ చిదిమిన వడియాలనుపోసి బాగా వుడికించవలెను. వడిలినపిమ్మట వార్చి, మామూలు తాలింపుసామానులతో పోపు తయారుచేసి అందు వార్చిన వడియాలనుపోసి వానిపైని ఆవాలుబియ్యము కలిపరుబ్బిన పిండిముద్దవేసి, కొంచము బెల్లముగాని, పంచదారగాని జల్లికలియ కలుపవలెను. కొంచెముసేపు పొయ్యిమీదపుంచి తరువాత దించి రుచి చూడవచ్చును. చాలా బాగుంటుంది. —కాం॥ చూడామణి.

# గ్రంథపరిచయము

**వ్యాసమంజరి** 'సాహిత్యలతో'వారి తృతీయ కుసుమము, క్రౌనుసైజు 80 పుటలు. వెల చందాదారులకు రు. 0-8-0, ఇతరులకు రు. 0-12-0, గ్రంథాలయములకు 1-0-0, రాధాప్రకృతి, హింమానుందరి, అక్బరునిర్వేదము గిరీశంగారి బహుమానము, కళోపాసకులు, ప్రాయశ్చిత్తము మొదలగు వ్యాసములు, కథలుగలవు. దీనిని పఠించుట వలన కవిగారి గంభీరహృదయము, దేశభక్తి, కావ్యవిమర్శనము, కథారచనానైపుణ్యము, సుందరశైలి మొదలగు లక్షణములెన్నియో పాఠకులకు గోచరించును. ఈకుసుమములన్నియు మానవానందమును దేవతాప్రీతియు ఒకేసారి బడయదగును. -గాాలు, కర్లపాలెం కృష్ణారావుగారు గ్రంథకర్త.

**ఆర్తరక్షామణి** డెమ్మీసైజు 24 పుటలు, వెల రు. 0-4-0. గ్రంథకర్త శ్రీయుత వడ్డాది సుబ్బారాయుడుగారు, రాజమహేంద్రవరం. 'రామా ఆర్తరక్షామణీ' అను మకుటముతో 106 పద్యములు భక్తిచింతామణి లోనివి 18 పద్యములు గలవు. భక్తిచింతామణివలె భావగాంభీర్యము, భక్తిసౌందర్యము, వైరాగ్యాసక్తి మోక్షాసక్తి నొలుకుచున్నవి. దానివలె ఇదియు అనతికాలమున జనప్రీతిదాయకమై వారి రసకలపై తాండవింపగలదని నమ్ముచున్నాము.

**ప్రభ** ఆదర్శగ్రంథమండలి సంపాదకుడు శ్రీయుత గద్దె లింగయ్యచౌదరి గారు సంపాదకుడు. కార్యస్థానం మచిలీపట్టణం. విడిపత్రిక వెల 0-1-6. 5-5-34 తేదిది మాకార్యాలయము చేరినది. సాంఘిక, రాజకీయ, సాహిత్య, ఆర్థిక విమర్శనా వ్యాసములపై పోట్లు విసురులు చాలాఘాటుగావున్నవి. పత్రిక తుదిమొదలు రహస్యాత్మకత్వమునోడుచున్నది. రిమార్కులు కొన్నియెడల బాధ్యతారహితములై యున్నవి. కద్దరుతత్వము, గాంధీతత్వము కిట్టదు కొన్ని చక్కనికథలు, పెక్కు సినీమా నటీమణుల చిత్రములు గలవు. ప్రజలలో విరివిగా చెలామణీ అగుటకు సందేహములేదు.

**రామ బాణము** ఇది ఒక సచిత్రమాస సంచిక. ఈ సంవత్సర చైత్రమాసపత్రిక మా కార్యాలయము నలంకరించినది. మ.రా.రా.శ్రీ జేకుమళ్ల రామచంద్రరావు, పురాణం సూరిశాస్త్రి, యస్. యమ్. యల్. యన్. హానుగార్లు సంపాదకీయవర్గము. మాదవ వారు సంపాదకులు. విడిపత్రిక రు 0 2 0 లు. బందరు కార్యస్థానము సంపాదకులు సంపాదకీయభారమును గుర్తించి, సర్వజ్ఞత్వము వహించక 'నైతిక, సాంఘిక, సంసారిక మతాదర్శముల నాశనమొనర్చుచు తామే దేశోద్ధరణమును మతోద్ధరణమును గావించుచున్నట్లు నటించుచు నిజధర్మమును విస్మరించువారి యడుగుజాడలు త్రొక్కక 'ఒక పెద్దపవిత్రగ, ద్రష్టగ, జాత్యభినేతగ' నుండగల మహదాశయమును పెట్టుకొనినారు. 'సంఘమోర్చని కొన్నివ్రాతలు జ్వాలలై భారతీయజీవితములో విషావర్తములను కల్పించుచున్నవి. కొన్ని హాస్యరస ప్రధానశీర్షికల చిత్రించుకొని... అమాయకులగు ప్రజల జీవితములను తప్పుడు మార్గములకు దారితీయుచున్నవి.' నీత్యవినీతులు, సత్యాసత్యములు మొదలగు ద్వంద్వములన్నియును సంఘనిర్మితములని సంఘోపజీవులమగు మనమే

ప్రచారమొనర్చుట చాల హాస్యాస్పదమను వారి అభిప్రాయ మెంతయు గౌరవార్హమైనది. పత్రికలోని వ్యాసములన్నియును ఈ భావగౌరవమును పురస్కరించుకొనియే యేర్చి కూర్చఁబడినవి. ఇది చిరంజీవియై ఆంధ్రదేశపత్రికా ప్రపంచగౌరవ ప్రతిష్ఠలను చిరకాలము నిలబెట్టునుగాక అని ఆశీర్వదించుచున్నాము.

**తారామండలం మొదలైన నాటకాలు**

తారామండలం, బోను, అభిషేకము, ఆమె మళయాళం మొదలగు నాటికలు 'సరస్వతి' పత్రికనుండి పునర్ముద్రితములు. గ్రంథకర్త శ్రీయుత వజ్ఝల కాళిదాసుగారు ఆంధ్ర సాహిత్య లోకమునకు కృతపరిచయులు. గంభీరభావము, కర్మనిశయ్య, ఒక అపరిచితమగు రహస్యసందేశము తెలియజేయనిదీ కథకాని నాటకముగాని అనరు వ్రాయరు. ప్రతియాంధ్రుడును చదివి 'రచన' యనునది గుర్తించి సాగించవలెనో కొంతనేర్చుకొనతగినది. ఇందు చేరిన ప్రస్తుత పత్రికాలోకమునుండి రచనాబలు అనేకము చెప్పదగినవి కాగలవు. ఇందలి ప్రతిపాదనలు కేవల సాంఘిక రాజకీయ పాక్షిక దృష్టితో కాక కవిదృష్టితో తిలకించబడి ఉద్ధరించబడినవి.

**సాధన**

24 పుటల ఆంధ్రమాసపత్రిక. కాకినాడ ఆంధ్రబ్రహ్మ సాధనాశ్రమము తరఫున శ్రీయుత కె. కళ్యాణస్వామిగారి సంపాదకత్వమున వెలువడుచున్నది. ప్రార్థన, విబుధవాక్యములు, భక్తజీవనములు, సంఘసేవాకరపత్రలు, సద్గ్రంథవిమర్శనములు, బ్రహ్మసమాజశాఖలనివేదికలు మొదలగు వ్యాసములతో హైదర్శనమును ప్రోత్సహించును. సంవత్సరచందా రు. 1-0-0 విద్యార్థులకు రు. 0-8-0 లు. వలయువారు కాకినాడ కలెక్టరేటుపోసు శాంతిసదనమునకు వ్రాసుకొనవలెను.

**ఇనూన్సురెన్సు పత్రిక**

సంపాదకుడు శ్రీయుత యస్. ఆర్. రావుగారు, 231 పైక్రాఫ్టు రోడ్డు రాయపేట. చందా సం1-కి రు 2 లు, విడిపత్రిక రు. 0 3-0 లు భీమాకంపెనీలచరిత్ర వాటిప్రాముఖ్యము, భారతదేశ భీమాకంపెనీలు, ఏజంట్లు తెలుసుకోవలసిన విషయములు, వివిధదేశములగూర్చిన ముఖ్యాంశములు మొదలగు వానితోగూడిన సుందరవ్యాసము లిందు ప్రకటింపబడును. శ్రీయుత రామదాసుపంతులు వెంకటాచలం, పట్టాభి సీతారామయ్యగార్ల వ్యాసములచే ఏప్రిల్ పత్రిక యెంతయు రాణించుచున్నది.

**భీమా ప్రచారిణి**

గుంటూరునుండి ఏప్రిల్ లగాయతు వెలువడు మాసపత్రిక. సంపాదకుడు శ్రీయుత టి.వి. సుబ్బారావుగారు. శ్రీయుత రాజగోపాలచారిగారి ప్రబోధవ్యాసము, జీవితభీమా లాభములు, సమిష్టిభీమావ్యాపారము, ఆంధ్రప్రోవిడెంటు కంపెనీ (బెజవాడ) భీమావ్యాపారసభల తీర్మానములు, శాసనసభలలో ఉపన్యాసప్రత్యుత్తరములు, మొదలగు అనేక విషయములతోకూడిన సుందరవ్యాసములు గలవు. చందా సం॥ 1-కి రు. 3 లు, విడిపత్రిక మూడుఅణాలు.

**ఆంధ్ర వాచస్పత్యము ఆరవభాగము**

ఇందు ఎ. ఏ. ఐ. లతో ప్రారంభమగు పదములు కర్తములు నిర్వచింపబడినవి. నూరుపుటలు వెల రు. 1. ఇందలి పూర్వభాగములవలె యిది కేవల నిఘంటువులనుమించి విపుల విషయబోధకమై యున్నది. అయినను విజ్ఞానసర్వస్వమని పిలువబడక హాస్యలో వర్తించుచు విజ్ఞానసర్వస్వపదనామ కీర్తికి త్రోవ జూపుచున్నది. ఆంగ్లాది అన్య భాషాసంపర్కమువలన, వివిధభౌతిక పాశ్చాత్య శాస్త్ర పరిచయమువలన అనేక నూతనపదములతో మనకు సంబంధమేర్పడు. అట్టిపదముల నిందుఁజేర్చుకొని

కేవల ప్రతిపదార్థములనేగాక మరికొంత అర్థపరిచితిని హెచ్చించి కౌతూహలమును బోధమం జేయువరకు వాచస్పతిగారు తృప్తిపడక చేయూతనిచ్చి సాయము చేయుచున్నారు. ఎడ్వర్డ్ది కన్ఫెసరు, ఎలెక్ట్రో బయాలజీ, ఏంగిల్ ఒరిస్సా మొదలగు పదములిందు కుదాహరణములు. ఏకఖటి స్ఫురితమునుగూర్చి తెలుపుచు ఆలవణవిశేష మెందున్నది, ఎన్ని రకములది, ఏమిపనిచేయునది మొదలగు రసాయనశాస్త్ర విశేషములు తెలుపబడినవి. ఏకద్వివీజ దళవృక్షములను పరిచయపరచుచు చాలవరకు వృక్షశాస్త్ర విజ్ఞానమునం దభిరుచిగలుప గోరుచున్నవి. ఐరోపా నెత్తు కొన్నప్పుడు అందలి వివిధదేశములు విస్తీర్ణము, జనసంఖ్య ముఖ్యపట్టణములు మొదలగు విషయములను తెలుపక తృప్తిబడకయున్నది. ఏకాదశవర్గుగణితమును బోధించుచు ధ్వజాయ, గజాయ, వృషభాయాదులను కూడువిధములను 10 పుటలవరకు తెలుపుచున్నది. శ్రీయుతులు బుర్రా శేషగిరిరావు, మేడేపల్లి వెంకటరమణాచార్యులు, వేమూరి శ్రీరామశాస్త్రి గార్లు దీని అశేషప్రయోజనమునకు ముగ్ధులై విశేషప్రశంసల నొనరించిరన్న నచ్చెరువులేదు. మహారాజపోషకులు మొదలు చందాదారుల వరకుగల విరాళనియమములను ముందటిపత్రికలలో ప్రకటించినాము. ఆంధ్రమహాజనులెల్లరును శ్రీ కొట్రశ్యామల కామశాస్త్రి గారిదీక్షను కొనసాగించుటకై సర్వవిధముల చేయూతనిత్తురు గాక! ప్రతులు వలయువారును, విరాళముల నీయ గోరువారును కాకినాడదగ్గర కరప గ్రామమునందు కార్యాలయము వారికిగాని, దత్తమండల మదరాసు నగరములకు ఏజంట్లుగా పనిచేయుచుండు శ్రీయుత గరిమెళ్ళ వెంకట్రామయ్య (నెం. 2 నాట్యమాపస్ట్రీటు, మైలాపూరు, మద్రాసు) గారికిగాని వ్రాసుకొన వచ్చును.

**సుమహారము** శ్రీ జార్జి సార్వభౌముని రజతోత్సవసందర్భమున గుంటూరుజిల్లా చీరాలపోస్టు, పేరాలకరణంగారును, గుంటూరుజిల్లా గ్రామోద్యోగ సంఘాధ్యక్షులును నగు శ్రీరావుల లోకనాథంపంతులుగారు వ్రాసిన పద్యరత్నములు 43 పుటలు. గుంటూరుజిల్లా కలెక్టరు డి. యస్. స్ట్రాత్రీగారు ఆంగ్లమున మున్నుడి వ్రాసినారు. సార్వభౌమ దంపతుల గ్రంథకర్తగార్ల చిత్రపటములతో, ఆశీర్వాదము, వంశాభివర్ణనము, అభినందనము, ప్రభుత్వోపకారములు, గ్రామోద్యోగ ప్రాశస్త్యము, ఆకాంక్ష, వినతి అను అధ్యాయముల క్రింద విభజింపబడి గ్రంథమెంతయు రసవంతముగ నున్నది.

## గ్రంథస్వీకారము

**'Labour in South India' by Professor N. G. Ranga.**




రజతోత్సవము:—

జార్జిసార్వభౌముని రజతోత్సవము బ్రిటిషుసామ్రాజ్యమంతటా రాత్రింపగళ్లు అనేకము వేడుకలతో జరిగినది. రిపబ్లిక్కుల ప్రెసిడెంట్లు, నాజీఫ్యాసిస్టు సోషలిష్టునియంతలు, సాధారణ మిత్రరాజులు చక్రవర్తులు, మొదలగు వారలెల్లరును ఆసందర్భమున అతని కానందసందేశములనంపి సామ్రాట్దంపతులను సామ్రాజ్యప్రజలను పురస్కారితుల నొనర్చినారు. మదరాసువంటి ప్రసిద్ధనగరములన్నియు రాత్రులయందు రత్ననీలపుష్యరాగ మాణిక్యాదుల కెనయగు ఎలక్ట్రికు దీపములను సౌధములనిండపొదుపుకొని, హారములుగ వేసుకొని, తిలకములుగ దిద్దుకొని, కొప్పుగొలుసులుగ సర్దుకొని జనసంచారముతో క్రిక్కిరిసి ఇంద్రలోకవైభవములను బురుడించెను.

దిగంతవిశ్రాంతమైన యిట్టి ఆనందము మే 6, 7 వ తేదీలలో ప్రపంచనగరములయందెల్ల వ్యాపించెనన్న అందులకు తగిన మహత్కారణములు లేకపోలేదు. సార్వభౌముడు చక్రవర్తులలో చక్రవర్తియయ్యు పౌరులలో పౌరుడు. పౌరధర్మము చక్రవర్తి మొదలు సాధారణప్రజలవరకుగూడ నొక్కటియే. ఎట్టి యుద్యోగికికాని మంత్రికిగాని, జమీందారుకుగాని, రాజుకుగాని, పూంజీదారునికికాని విశేష బాధ్యతలనే ఒసగునుకాని విశేషము విఱవీగుట కవకాశములు గల్పింపదు ఈనీతిని విక్టోరియామొదలు జార్జిసార్వభౌమునివరకు ఆంగ్లరాజులు ధృవపరచినట్లు మరియెవ్వరును ధృవపరచలేదు. సంతతమును ప్రజలసౌభాగ్య స్వాతంత్ర్యశాంతులను నెలకొల్పుటయందే వారు సర్వతంత్రపరతంత్రులైయుండి, వారి నెల్లవిధముల ముందుకురానిచ్చుటకొరకే తాము వెనుకకైనతగ్గి, లోకకళ్యాణముకొరకు పాటుపడుచుండు ఆదర్శసామ్రాట్టు లేదేశమునకుగాని పురాకృతపుణ్యమునగాని అబ్బరు. ఎల్లరును అట్టివారల అడుగుజాడల నడచుటకై ప్రయత్నముచేసిరేని లోకమున నేడిట్టి కార్మికయాంత్రిక పోట్లాటలు, సామ్రాజ్యవలసరాజ్యవైషమ్యములు, అమ్మువారల కొనువారల విరోధములు, బలవంతుల దుర్బలులమధ్యక్రౌర్యములు అన్యాయములు లేకుండ నుండెడివి.

నేడు ప్రపంచమునం దన్ని దేశములును ఇండియా, చీనా, అబిసీనియా, బ్రిటను, జపాను, ఇటలీ, జర్మనీ, ఫ్రాన్సు, రష్యాలెల్లయు ఎడతెగని అసంతృప్తితో క్రుళ్లు

చున్నవి. తమలోతమకు కొట్లాటలు, ఒరులతో కొట్లాటలు తప్పవనుస్థితిలో నున్నవి. యుద్ధమేఘములు నిర్మలాకాశమునెల్ల కాలుక్రమ్ముకొని యున్నవి. బలవంతులెల్లరును యుద్ధసన్నద్ధులగుచున్నారు; బలహీనులు బలవంతులుకాగోరుచున్నారు; అస్వతంత్రులు స్వాతంత్ర్యము నాసించుచున్నారు. ఏక్షణమున నేమిసంగుబడునో చెప్పఁజాలము. దానిఫలితము గత అయిరోపాయుద్ధముకంటెను ఘోరముగ పరిణమించునని చర్చిలు స్మట్సువంటి జ్యోతిష్కులు గుఱించి చెప్పుచున్నారు. సకల దేశములును హేరాళముగ విరజల్లుచున్న ఈ అభినందన సందేశములు తేనెపూసిన పెదవులనుండియేకాని అనురాగ తుందిలములగు సంస్కారచిత్తములనుండి జారుచున్నవో లేదో చెప్పఁజాలము. సార్వభౌముని రజతోత్సవసందర్భమున ప్రకటించబడిన పరస్పరాభినందనసందేశములుసకలదేశములహృదయాంతర్గతములనుండి వచ్చుచున్నవే యైనయెడల మనమిప్పటికైనను 1914 లో జరిగిన విపత్తువంటి విపత్తునుండి తప్పుకొనుట కెక్కువ అవకాశములేవున్నవి. కాని అవి వట్టిబూటకములైనచో ప్రపంచమప్పటినుంచి ఇప్పటికొక అడుగైన ముందుకుపోలేదు అని స్పష్టమవక మానదు. ఇట్టి విపత్తును తప్పించుటకై సార్వభౌమదంపతు లనేకత్యాగములు చేయుచున్నారు. తక్కిన పార్లమెంటువారు, కన్సర్వేటివులు, విదేశాధినాధులు వారిసంకల్పమున కెంతవరకు మనఃపూర్వకముగ తోడ్పడి యెట్టి త్యాగము లొనర్పగలరో చూడవలసియున్నది. సార్వభౌముని చిరజీవనమును, సత్సంకల్పములును, నిండుహృదయమును, ప్రజాహితవర్తనమును ఇట్టి సంయోగమున కెంతయును తోడ్పడునుగాకయని ఆశించుచు వారికి సమస్తమంగళములును సమకూరవలెనని కోరుచున్నాము.

కుబేరసతనము:—

శ్రీయుత హోసూరు నంజుండరావు, బి.ఏ. గారిచే రచింపఁబడిన యీ 'సాంఘిక' నాటకము మాకు హృదయానందదాయకముగ నున్నది. సాంఘికమనగా స్వసంఘదూషణపరాయణత్వమనుదుర్భ్రమ నిది చాలవరకు తొలగించఁగలదు. స్వర్గములో ఇంద్రుని దర్బారు, ద్రాక్షారములో భీమేశ్వరుని దర్శనము అను రెంటినుతప్ప భౌతికప్రకృతి కతీతములగు నద్భుతము లిందెవ్వియునులేవు. ఇవి మార్చి వేరొండువిధముగ వ్రాసినను కథాపరిణామమున కెట్టిభంగమును వాటిల్లదు. కవిగారిచేతిలో యీసందర్భములు కూడా (భారతీయ భావముప్రకారము) ఎంతో సహజమైస్వర్గమర్త్యములకు సోపానములవలె నున్నవి. కాని సాధారణులచేతిలో అసహజమై, విపరీతములవలె మారుట కవకాశమున్నది. నాటకములలో ఇట్టిఅద్భుతములకు తావే లేదన్నవాదముతో మేమేకీభవించము. షేక్స్పియరు కాళిదాసాదులలోగూడ ఇట్టిచర్యలు గానవగును. సాహిత్యదృష్ట్యా దానిని ప్రశంసించినవారే కాని అధిక్షేపించిన విమర్శకులులేరు.

సామాన్య స్త్రీలుతప్ప ఉత్తమయిల్లాండ్రను ధనమునే ఎఱిగాగొని మానము నెగురవేసు కొనరని కుబేరపతనమును సుగుణవతి విజయమును ఎల్లరికిని ధృవపరచుచున్నవి. మఱియు మానగౌరవము సాంసారస్త్రీలకు మాత్రమే సర్వస్వామ్యముకాక కళా ఉపాసనాజీవులై వారకాంతలనబడువారికి గూడ ధ్యేయమైనదనియు, అజ్ఞానులగు వేశ్యమాతల శిక్షణము పోరాటము ఇంట్లోలేకున్నచో యెట్టి సుందరియు ఆజీవనము ఏకపురుష సహవాసముతో ధన్యతగాంచగలదనియు కథయొక్క ఉపదేశము. మనసంఘము కొందరుస్త్రీలకు జారిణీజీవనము, కొందరికి విద్యావిహీనదాస్యజీవనము విధించుచున్నదనియు, దీనిని తొలగించవలెనన్న పాశ్చాత్యవనితల మార్గముల ద్రొక్కి సంఘవిప్లవమార్గముల నవలంబించవలెననియు నెవ్వరును నిస్పృహ పొందనక్కరలేదు. భారతసంఘములో స్త్రీలస్థితి మిగుల హీనాతిహీనమనుభావము నిరాధారమనియు, పూర్వమునకు ఇప్పటికిగూడ వైదికగార్హస్థ్య ధర్మమున కామెయే ఆటపట్టనియు, ఈధర్మ సాధమునుండి కుబేరోపాసనకు (ధనారాధనకు) చిత్తగించి తొలుదొల్త భారతీయపురుషులును పిమ్మట వారితోబాటు భారతీయ స్త్రీలును పడిపోవుటవలననే యిట్టి అజ్ఞానములు అల్పత్వభావములు విప్లవభావములు మననావేశించినవనియు, ఈనిజమైన జ్ఞానము మన కుదయముకాగానే సుగుణవతివంటివారి చర్యలను సంఘవిప్లవ చర్యలుగాగాక, సనాతనధర్మోద్ధరణ చర్యలుగా మనము గ్రహింతుమనియు శ్రీయుత యన్. కె. వెంకటేశం పంతులుగారు వ్రాసిన సుందరమగు వ్యాఖ్యానము మనచిత్తముల కెంతయు ఉత్తేజమును గలిగింపకమానదు. ఇతరసాంఘికనాటకములను వ్రాయబూనువారు ఈసందేశముల గుర్తుంచుకొని జాతీయసంఘగౌరవమునకు భంగముకని రీతిని తమరచనలు సాగించి ప్రజాప్రశంసలను బడగొందురుగాక! కవిగారు ప్రత్యేకముగ ఇట్టి నాటకములువ్రాయు నర్హతను స్థిరపరచుకొన్నారనియు వారు మున్ముందు వ్రాయబోవు నాటకములలో ఈ బీజము వర్ధిల్లగలదనియు ఆసించుచున్నాము. శైలిగ్రామ్యముకాని గ్రాంధికమును కాక గ్రాంధికమైన వ్యావహారికమున్నై అనుకరణయోగ్యమైనది. వెల రు. 0-8-0. కవిగారి చిరునామా 12, ఈస్టురోడ్డు, బసవనగుడిపోస్టు, బెంగుళూరు.

సౌభాగ్య నికేతనము:—

కాకినాడ ప్రేజరుపేటలో 'సౌభాగ్యనికేతనము'నుస్థాపించి సంరక్షకురాలుగా పని చేయుచున్న శ్రీమతి మంచికంటి వేంకరత్నమ్మగారు మా కీ క్రిందివిధమున వ్రాయుచున్నారు.

"ఆంధ్రమండలమున గౌరవకుటుంబములకు చెందిన రజస్వలకాకముందే భర్తలను కోల్పోయిన బాలికలకును, రజస్వలయైనను భర్తృసంయోగమునొందని ఇరువదేండ్లకు లోపువయసుగల యువతులకును, సుఖజీవితముగడుపుకొనుటకు తగిన మంచి సంబంధము

లను ఆయావర్ణములలో శాఖలలో సమకూర్చి పునర్వివాహములు చేయుటకు మేమన్నివిధముల సహాయపడుదుము. అట్టి బిడ్డలుగల తల్లిదండ్రులుగాని సంరక్షకులుగాని యనాథలయెడల జాలివహించి వారి శ్రేయోభివృద్ధిని జీవితసౌఖ్యముకోరి నిరాక్షేపణముగా పునర్వివాహము లొనర్చదగును. బంధువులకును సంఘమునకును భయపడువారు అట్టి పిల్లలను మా నికేతనమునకు పంపించుచో వారికాశ్రమమిచ్చి తగిన సంబంధములు వచ్చునరకు విద్య, పరిశ్రమలు, నేర్పించుచు వివాహములు జరిపింతుము.

మరియు నట్టివారిని వివాహమాడగోరు సుఖజీవనోపాధిగల యువకులు మాతో నుత్తర ప్రత్యుత్తరములవలనగాని స్వయముగాగాని సంప్రదించి తమ స్థితిగతులు, వయసు వర్ణము, శాఖ, గోత్రము, మున్నగు విషయములు వివరముగ తెలుప ప్రార్థితులు. వివాహమాడగోరు వధువులయొక్కయు వరులయొక్కయు, నుత్తరప్రత్యుత్తరములు అతిరహస్యముగ నుంచబడును." ఇట్టి ఉత్తమ సేవకై కంకణము కట్టుకొని పనిచేయుచున్న శ్రీమతిగారికి శ్రీసర్వమంగళాదేవి సర్వమంగళములునొనగూర్చుగాకయనికోరుచున్నాము.

విన్నపము:—

ఆంధ్రదేశమున ప్రతిమాసమునను అనేక స్త్రీ సమావేశములు, బాలికాపాఠశాలల ఉత్సవములు, నాటకములు, సభలు జరుగుచున్నవి. అట్టి వానియొక్కయు, వారి వారి అధ్యక్షకార్యదర్శ్యాదులయొక్కయు పటములు 'గృహలక్ష్మి'లో ప్రకటించినందువలన స్త్రీజనంబుల ఉత్సాహమినుమడించి స్త్రీజనోద్యమమింతకన్న పెక్కురెట్లు శోభస్కరముగ వెలుగొందుననుటకు సందేహములేదు. అయినను మా కార్యాలయమునకు వానిలో కొన్నిటియొక్క చిత్రములు మాత్రమే వచ్చుచున్నవి. ఇతరరాష్ట్రములనుండి వచ్చునన్ని పటములైనను మనరాష్ట్రములనుండి రాకుండుట విచారకరము. ఇట్టి యుద్యమముల కార్యదర్శులు వారి సమావేశములకు సంబంధించిన ఫోటోగ్రాపులను తీయించి మాకార్యాలయమునకు పంపించ కోరుచున్నాము. సర్వవిధములను మాపత్రికనుసర్వాంగసుందరముగ జేసి ఆంధ్రపద్మినుల కరపద్మముల కర్పించుటయొండె మాయాశయము. ఈసందర్భమున మా స్త్రీపురుష విలేఖరులనుకూడ తొంటివలె మాయెడలన నూనరాగమూని ఉత్సాహదాయకములును నీతిమనోహరములునునైన వ్యాసములను పద్యములను గేయములను నర్పించవలెనని కోరుచున్నాము. ఆంధ్రపండితులును చిత్రకారులును మాకెంత సహకారము చూపిన మా పత్రిక అంతప్రశంసనీయముగ రాజిల్లి సుస్థిరమైన దేశసేవ చేయగలదు. మాయుద్యమమునకు పైవారలాదరమును ప్రోత్సహింతురుగాక యని కోరుచున్నాము.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS EGMORE, MADRAS.

సామాన్య స్త్రీలుతప్ప ఉత్తమయిల్లాండ్రను
ధనమునే ఎఱగాగొని మానము నెగురవేసు
కొనరని కుబేరపతనమును సుగుణవతి విజయ
మును ఎల్లరికిని ధృవపరచుచున్నవి. మఱియు
మానగౌరవము సాంసారస్త్రీలకు మాత్రమే
సర్వస్వామ్యముకాక కళా ఉపాసనాజీవులై
వారకాంత లనబడువారికి గూడ ధ్యేయ
మైనదనియు, అజ్ఞానులగు వేశ్యమాతల శిక్ష
ణము పోరాటము ఇంట్లో లేకున్నచో యెట్టి
సుందరియు ఆజీవనము ఏకపురుష సహావాస
ముతో ధన్యతగాంచగలదనియు కథయొక్క
ఉపదేశము. మనసంఘము కొందరుస్త్రీలకు
జారిణీజీవనము, కొందరికి విద్యావిహీనదాస్య
జీవనము విధించుచున్నదనియు, దీనిని తొల
గించవలెనన్న పాశ్చాత్యవనితల మార్గముల
ద్రొక్కి సంఘువిప్లవమార్గముల నవలంబించ
వలెననియు నెవ్వరును నిస్పృహ పొందనక్కర
లేదు. భారతసంఘములో స్త్రీలస్థితి మిగుల
హీనాతిహీనమనుభావము నిరాధారమనియు,
పూర్వమునకు ఇప్పటికీగూడ వైదికగార్హస్థ్య
ధర్మముస కామెయే ఆటపట్టనియు, ఈధర్మ
సౌధమునుండి కుబేరోపాసనకు (ధనారాధ
నకు) చిత్తగించి తొలుదొల్త భారతీయపురు
షులును పిమ్మట వారితోబాటు భారతీయ
స్త్రీలును పడిపోవుటవలననే యిట్టి అజ్ఞాన
ములు అల్పత్వభావములు విప్లవభావములు
మనసావేశించినవనియు, ఈనిజమైన జ్ఞానము
మన కుదయముకాగానే సుగుణవతివంటివారి
చర్యలను సంఘువిప్లవ చర్యలుగాగాక, సనా
తనధర్మోద్ధరణ చర్యలుగా మనము గ్రహిం
తుమనియు శ్రీయుత యన్. కె. వెంకటేశం
పంతులుగారు వ్రాసిన సుందరమగు వ్యాఖ్యా
నము మనచిత్తముల కెంతయు ఉత్తేజమును
గలిగింపకమానదు. ఇతరసాంఘికనాటకము
లను వ్రాయబూనువారు ఈసందేశముల
గుర్తుంచుకొని జాతీయసంఘగౌరవమునకు
భంగముకని రీతిని తమరచనలు సాగించి
ప్రజాప్రశంసలను నందగొందురుగాక! కవి
గారు ప్రత్యేకముగ ఇట్టి నాటకములువ్రాయు
నర్వాతను స్థిరపరచుకొన్నారనియు వారు
మున్ముందు వ్రాయబోవు నాటకములలో ఈ
బీజము వర్థిల్లగలరనియు ఆసించుచున్నాము.
శైలిగ్రామ్యముకాని గ్రాంధికమును కాక
గ్రాంధికమైన వ్యావహారికమునునై అనుకరణ
యోగ్యమైనది. వెల రు. 0-8-0. కవిగారి
చిరునామా 12, ఈస్టురోడ్డు, బసవనగుడిపోస్టు,
బెంగుళూరు.

సౌభాగ్య నికేతనము:—

కాకినాడ ప్రేజరుపేటలో 'సౌభాగ్యనికే
తనము'నుస్థాపించి సంరక్షకురాలుగా పని
చేయుచున్న శ్రీమతి మంచికంటి వేంకరత్న
మ్మగారు మాకీ క్రిందివిధమున వ్రాయు
చున్నారు.

"ఆంధ్రమండలమున గౌరవకుటుంబము
లకు చెందిన రజస్వలకాకముందే భర్తలను
కోల్పోయిన బాలికలకును, రజస్వలయైనను
భర్తృసంయోగమునొందని ఇరువదేండ్లకు
లోపువయసుగల యువతులకును, సుఖజీవిత
ముగడుపుకొనుటకు తగిన మంచి సంబంధము

లను ఆయావర్ణములలో శాఖలలో సమకూర్చి పునర్వివాహములు చేయుటకు మేమన్నివిధముల సహాయపడుదుము. అట్టి బిడ్డలుగల తల్లిదండ్రులుగాని సంరక్షకులుగాని యనాధలయెడల జాలివహించి వారిశ్రేయోభివృద్ధిని జీవితసౌఖ్యమునుకోరి నిరాక్షేపణముగా పునర్వివాహము లొనర్పదగును. బంధువులకును సంఘమునకును భయపడువారు అట్టి పిల్లలను మా నికేతనమునకు పంపించుచో వారికాశ్రమమిచ్చి తగిన సంబంధములు వచ్చువరకు విద్య, పరిశ్రమలు, నేర్పించుచు వివాహములు జరిపింతుము.

మరియు నట్టివారిని వివాహమాడగోరు సుఖజీవనోపాధిగల యువకులు మాతో నుత్తర ప్రత్యుత్తరములవలనగాని స్వయముగాగాని సంప్రదించి తమ స్థితిగతుల, వయసు వర్ణము, శాఖ, గోత్రము, మున్నగు విషయములు వివరముగ తెలుప ప్రార్థితులు.

వివాహమాడగోరు వధువులయొక్కయు వరులయొక్కయు, నుత్తరప్రత్యుత్తరములు అతిరహస్యముగ నుంచబడును." ఇట్టి ఉత్తమసేవకై కంకణము కట్టుకొని పనిచేయుచున్న శ్రీమతిగారికి శ్రీసర్వమంగళాదేవి సర్వమంగళములనొనకూర్చుగాకయనికోరుచున్నాము.

విన్నపము:—

ఆంధ్రదేశమున ప్రతిమాసమునను అనేక స్త్రీ సమావేశములు, బాలికాపాఠశాలల ఉత్సవములు, నాటకములు, సభలు జరుగుచున్నవి. అట్టి వానియొక్కయు, వారి వారి అధ్యక్షకార్యదర్శ్యాదులయొక్కయు పటములు 'గృహలక్ష్మి'లో ప్రకటించినందువలన స్త్రీజనంబుల ఉత్సాహమినుమడించి స్త్రీజనోద్యమమింతకన్న పెక్కురెట్లు శోభస్కరముగ వెలుగొందుననుటకు సందేహములేదు. అయినను మా కార్యాలయమునకు వానిలో కొన్నిటియొక్క చిత్రములు మాత్రమే వచ్చుచున్నవి. ఇతరరాష్ట్రముల నుండి వచ్చునన్ని పటములైనను మనరాష్ట్రములనుండి రాకుండుట విచారకరము. ఇట్టి యుద్యమముల కార్యదర్శులు వారి సమావేశములకు సంబంధించిన ఫోటోగ్రాఫులను తీయించి మాకార్యాలయమునకు పంపించ కోరుచున్నాము. సర్వవిధములను మాపత్రికనుసర్వాంగసుందరముగ జేసి ఆంధ్రపద్మినుల కరపద్మముల కర్పించుటయొండె మాయాశయము. ఈసందర్భమున మా స్త్రీపురుష విలేఖరులను కూడ తొంటివలె మాయెడలననూనరాగమూని ఉత్సాహదాయకములును నీతిమూకరములునునైన వ్యాసములను పద్యములను గేయములను నర్పించవలెనని కోరుచున్నాము. ఆంధ్రపండితులును చిత్రకారులును మాకెంత సహకారము చూపిన మా పత్రిక అంత ప్రశంసనీయముగ రాణిల్లి సుస్థిరమై దేశసేవ చేయగలదు. మాయుద్యమమునకు పైవారలాదరమును తోడ్పడుదురుగాక యని కోరుచున్నాము.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS EGMORE, MADRAS.

# కుఱ్ఱా డల్లర పెడితే

## వాడిమీద కోపించిన లాభం లేద

## వైద్యుల నడిగితే చెప్పతారు





తిన్నది వంటికిపట్టక, బలం చేయకపోవడంవల్ల పిల్ల లల్లరి పెడతారు. ఎ, డి. వైటమినులు, కాల్షియము ఫోస్ఫరనులు వంటికి పట్టకపోతే పిల్లలు నీరసించుతారు.

60 యేళ్ళాయి వైద్యులు స్కాట్సు ఎమల్షనే పిల్లలకు యిస్తున్నారు. అది యెకలకు పళ్లకు కూడ బలమిస్తుంది. మామూలు కాడ్ లివరాయిలు కంటె యెక్కువ గ మిస్తుంది. తినుటకు తియ్యాగాను, అరుగుటకు చులాకనగా నుంటటచే పిల్లలకు మిక్కి యిష్టము.

ఊపిరితిత్తులకు నమ్మకమైన మందు.

దగ్గు, పడిసెములు, గొంతుక జబ్బులు అన్నిటికీ మంచిది.

స్కాట్సు ఎమల్షను ఏమిచేయును?

ఎముక, మాంసం, నరలు, ఊపిరితిత్తులను బలపరచును.

రక్తము వృద్ధి చేయును.

జబ్బులు రాకుండా కాపాడును.

జబ్బుపడ్డతరవాత—నీరసించు తరువాత. పోయినశక్తి నిస్తే యిమ్మను.

మండీవరకులు:

ఇంపీరియల్ కెమికల్
ఇండస్ట్రీసు (ఇండియా)
లిమిటెడ్.

కలకత్తా, బొంబాయి, మద్రాను, లాహోరు, రంగూను, కొలంబో, కాన్పూరు, పాట్నా, అలహాబాదు, కొచ్చిను, కాలికట్టు, విశాఖపట్టం, కరాచి, అమృతసరం

### ఆశ్చర్యమైనా నిజము.

సాదా కాడ్ లివరాయిలుకంటె 3 రెట్లు, వెన్నకంటె 80 రెట్లు, ఎక్కువ యెముకపుష్టి. 2 పయింటు పాలు, 2 కోడిగడ్లు గుజురు 2 పౌనులు బనానాతో సమానమైన బలమిచ్చును.



# COTT'S Emulsion

# చూడ చక్కనైన చర్మము



## మానవులకుండే అందములలోనెల్ల అతి రమ్యమైనది.

నీ చర్మమును నిర్మలముగా మెఱుగుగా ఉంచుకోవలెనంటె ఒక్క సంగతి జ్ఞాపక ముంచుకొనుము. చర్మము మీద మీదను గట్టిగా తోమినంతమాత్రమున చాలదు. రోమకూపముల అట్టు అడుగు నుంచి కూడ శుభ్రముకావలెను. [సువాసన] "501" టాయిలెట్టు సోపు యీవిషయంలో నీకు ప్రాణ మిత్రము వంటిది. అందులో క్రొవ్వు చేరదు. కఠినములగు రసాయన పదార్థము లుండవు. తాకీ తాకుటతో లేచు మీగడవంటి దాని నురుగు నీచర్మపు టందమును చెఱచు మాలిన్యములనెల్ల తొలగించి పరిశుద్ధముగ కడిగివైచును.







టామ్కో సేల్సు డిపార్ట్‌మెంటు,

19 వాణియర్ వీధి, జి. టి. మదరాసు.

**ది తాతా ఆయిలుమిల్సు కంపెనీ లిమిటెడ్, తాతాపురం.**

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు రచియించిన పుస్తకములు



1. **వసుమతి:**—సాంఘిక సాంసారికానర్థములను వివరించు నీతిబోధకమగు చక్కని సాంఘిక నవల. పాఠశాల పఠనీయగ్రంథముగా అప్రూవు చేయబడును. ... వెల 0 12 0

2. **బాలనీతి కథావళి:**—నీతిబోధకములగు ఇరువది కథల సంపుటి. దొరతనమువారిచే పఠనీయ గ్రంథముగా అప్రూవ్ చేయబడినది. ... ... వెల 0 10 0

3. **విశ్వామిత్ర మహర్షి:**—ఈ మహర్షియొక్క అద్భుతచరిత్ర మిందు ప్రౌఢభాషలో వర్ణింపబడినది. ... ... ... ... వెల 0 8 0

4. **ద్రౌపదీ వస్త్రసంరక్షణము:**—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

5. **సత్యాద్రౌపదీ సంవాదము:**—(ద్విపద) పాటవలె పాడనగును. వెల 0 2 0

6. **జ్యోతి:**—ఆరోగ్యనాటకము, హెల్తు డిపార్టుమెంటువారిచే ఆమోదింపబడినది. 0 4 0

7. **పెన్నను పుచ్చుకున్ననాటి రాత్రి:**—అనేకమంది విద్యాధికులచే ప్రశంసింపబడిన చక్కని కథ. గృహలక్ష్మినుండి పునర్ముద్రింపబడినది. ... ... వెల 0 1 0

8. **శారదలేఖలు:**— వెల 1 0 0

ఈ పుస్తకములన్నియు నొకేమారు తెప్పించుకొనువారికి 3 రూపాయలకే యివ్వబడును. పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

ఈగ్రంథములు వలయువారు:

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు,
బాపట్ల, గుంటూరు జిల్లా. అని వ్రాయవలయును.

---

# బ్రాడ్‌కాస్టు రికార్డులు

Broaacast

## సంగీత కచ్చేరి

**2128**

ఏతావునరా—కళ్యాణి

1 & 2 భాగములు.

లలిత గానమునకు పుట్టినిల్లగు శ్రీ సుందర కామాక్షిగారి గాన మాధుర్యమును, ఈ రికార్డులో వినుడు.

శ్రవణశ్రావ్యమైన ఈ రికార్డునకై నేడే ప్రయత్నింపుడు.

యు

ంచి

న్నారు.

చో

గలము.

శ్రీ త్యాగరాయ

స్తవను,

కొనదగినది.




దీ మ్యూజికల్ ప్రొడక్ట్సు

లిమిటెడ్,

మొదలైనవున్నవో, ఎన్ని యుద్ధములు పోట్లాటలు జరిగినవో, మొదలైన విషయములనుగూర్చి బట్టీపెట్టించి, కొంచెము తప్పినవారిని ఫేలుచేసి హింసపెట్టుట కాదనియు, ప్రధానముగ బోధించవలసినది ధర్మవిషయమనియు, తక్కినవిషయములెల్లయు అత్యంతావశ్యకమై, సమీపమైయున్న ఆర్థికాదికములకు చెందవలెననియు వారి ఆదర్శము. విద్య సులభముగ రావలెనన్న విద్యార్థులను తిట్టి కొట్టి కోపించి ఫేలుచేసి మొగ తాళ్ళిచేయుటలు లక్షణములుకావు గనుక, చెప్పఁబడిన ప్రతివిషయమును వారికి సులభముగను, ఉత్సాహప్రదముగను, మఱువరానివిధముగను వచ్చుటకై చిత్రపటములు, వాక్యములు మొదలగువానిని గోడలనిండ అంటించి విద్యార్థులమనసములు విజ్ఞానమునకై ఉవ్విళ్ళూరునట్లు చేయవలెను. అసంఖ్యాకులగు విద్యార్థులు నొక్కే పెద్దమందిరములో మందలు మందలుగా క్రుక్కుట పట్టణములలోని స్లమ్ము లేక కుప్పములకంటె భేదముకాదు కనుక 500 మందియైనను చేరకముందే పాఠశాలను రెండుగా చీల్చవలెను. పాఠశాలలెన్నియుండిన నంతమంచిది కాని ఒక్కొక పాఠశాలలో ఎంతమందిని క్రుక్కిన అంత మంచిదికాదు.

పాఠశాలల గోడలనిండ చిత్రవిచిత్రములగు పటములు తగిలించినచో విద్యార్థుల చిత్తములయం దనేకభావములనురేపి అనేక ప్రశ్నలు వేయించును. మఱికొన్నిపటములు వాటికి జవాబులు చెప్పును. పంతులుగారు నిమిత్తమాత్రులుతప్ప అక్షరములుకూడ ఆటలవలె తమంతట తామే వచ్చును; అక్షరములనుండి పేరులు, పేరులనుండి వాక్యములు, వాక్యములనుండి కథలు మొదలగునవి ఒకటిరెండు సంవత్సరములలో చాలావరకు బొమ్మలసహాయముననే నేర్పనగును. విద్యాశాఖ డిప్యూటీ డైరక్టరగు శ్రీ సదాశివరెడ్డిగారు ఈ విధానమునుమెచ్చి 'ఇందలి గోడలు సజీవపురుషులవలె మాటలాడుచున్న'వని వచించినప్పుడు విధానముయొక్క మహత్త్వము నెల్లరును గ్రహించుట సులభసాధ్యము. ఇంతకంటె కొంచెము పెద్దతరగతులవారును వయోజనులును పఠించుటకు వార్తాపత్రికలు దేశీయగ్రంథములుగల ఒక పఠనాలయ మీపాఠశాలకు చేర్చబడియున్నది.

మనదేశములో పాఠశాలలనగానే అక్షరాలు విషయములు కంఠతాపట్టి ఒప్పచెప్పెడి ఒకానొక వింతరకపు చదువుకొరకని ఒక భావము వ్యాపించియున్నది. ఇందుకొరకు పేలకొలదివిద్యార్థులు చేరుటయు, అదృష్టవంతులు నెగ్గుటయు, లేనివారలు అనగా నూటికి 80 మందివొప్పున ఫేలయి యేడ్చుచుండుటయు అలవాటయినది. పాఠశాలలయొక్క ఉద్దేశ్యము ఉపాధ్యాయులు తాము కంఠతాపెట్టుకొని వచ్చిన విషయములు విద్యార్థుల మూదర యాకరువుపెట్టుట కాక విద్యార్థుల నొక్కొక్క కళయందో వృత్తియందో తరిఫీదుచేయుట యను భావమింకను ఈదేశములో ఏర్పడలేదు. విద్యా

ర్థులకు స్వయం సహాయశక్తి, ఓర్పు, పట్టుదల, క్రియాశక్తి, విద్యాసక్తి మొదలగు గుణములు కార్యరతులగుటవల్లనే సాధ్యములు కాని, చిలకపలుకు లెన్నాళ్లు బట్టీపెట్టించినను ఆసద్గుణములు చెడునేకాని క్రొత్తగారావని యెవ్వరికిని తెలియకున్నది. విద్యార్థి స్కూలువిడచి రాగానే నీవేమి చేయగలవని యడిగిన ఫలానాపనులు చేయగలనని చెప్పవలెనుగాని నీకేమి వచ్చునని అడిగిన నాకు ఫలానాపాఠములు వచ్చునని కంఠతాపెట్టినది ఒప్పజెప్పిన ప్రయోజనము లేదు సరేగదా తరువాత అతని జీవయాత్ర కూడ అనుకూలముగా సాగదు. ఇది మన దేశములో ప్రస్తుతము ప్రత్యక్షనిదర్శనమై యున్నది. కేవల జ్ఞానమన్నది యీకాలములో అనేకగ్రంథములలోకి యెక్కించి చౌకగాకూడా అమ్ముచుండుటచేత మిక్కిలి చౌకయైపోయినది. ఈకాలములో అక్కరలేనిసంగతు లెఱిగినవారెక్కువగాను, కావలసిన పనులుచేయఁగలవారు చాలా తక్కువగాను తయారవుచున్నారు. ఇట్టి అనాగరికము పోవలెనని ప్రతిపాఠశాలయు ఒక సేవాసదనమై, అందు నేర్పబడు సాధారణ అక్షరజ్ఞానము చదువులతోబాటు, తాళ్లు అల్లుట, దారము వడుకుట, బట్టలు నేయుట, చక్కని అంచులునేయుట, పిల్లలాడుకొనువస్తువులు తయారుచేయుట, తివాసులు చాపలు అల్లుట, బట్టలుకుట్టుట, కుర్చీలు పెట్టెలు మొదలగువానిని చేయుట, వస్తువులను చెరుగుట జల్లించుట, విత్తినములు జల్లుట, మొక్కలకు గొప్పుపట్టుట, అషుట, పాడుట మొదలగుపనులు నెన్నిటినో అక్కడ జరుపుచుండవలెను. ఇట్టిపనులను మనదేశములో వివిధభాగములలో నెట్టి పరికరములతో నెట్లుచేయుదురో తెలుపు వస్తువులయొక్కయు పనులయొక్కయు చక్కని ప్రదర్శనమొండు పాఠశాలలో ఒకభాగములో తెరవఁబడి యుండవలెను. ఇట్టి సందర్భములలోనే అనేక శాస్త్రీయవిషయములను (Elementary Science Principles) ను వారికి బోధపరచవలెను. విద్యార్థుల పరిశోధనాశక్తియు, ఉత్తమవిజ్ఞానాభిలాషయు ఈవిధముగానే వారిలో హెచ్చును. ఇట్టి అభిలాష వారిలో హెచ్చినచో జనసామాన్యముయొక్క దైనికవ్యవహారమున కెంతయు సరిపోవును. ఈ పాఠశాల విధానమిదియే.

భూదేవి సమస్తభాగములలోను మానవులకు కావలసిన ముడిపదార్థములను ఫలించుచున్నది. ప్రస్తుతము సమస్తదేశములలోని ప్రజలు వానిని పైదేశములకు తెక యంత్రములతో యెగుమతిచేసి ప్రజలను వ్యర్థులను నిర్వ్యాపారులుగను నొనర్చుచున్నారు. సధనాఢ్యులో కొందరు కూలివాళ్లనుపెట్టుకొని వానిని ఉపయుక్త వస్తువులుగా యంత్రములలో తయారుచేసి అమ్ముకొని కోట్లకొలది రూప్యములు లాభము కొట్టుచు ప్రపంచమును దారిద్ర్యవంతముగా చేయుచున్నాడు. భారతదేశమువంటి విశాల గ్రామపూరితదేశములో అట్టి పంటలను

తయారీసరుకుగా ప్రజాసామాన్యము వారి వారి గ్రామములలో మార్చినయెడలనే ప్రజలకు ముక్తికాని యంత్రములపై ఆధారపడినచో కొనుక్కొంటకుకూడ డబ్బులేక యిప్పటివలె బాధపడకమానరు. భూదేవి పంటలను ప్రయోజనకర అనుభవయోగ్య పదార్థములుగా మార్చగలనేర్పు మన భారతదేశమునకు అనాదినుండియు పుట్టుకతోకూడిన విద్యయైయుండెడిది. యంత్రముల విజృంభణము వచ్చినప్పటినుండియు అట్టి సమస్తకళలును అంతరించి ప్రజలు నిరాధారులైనారు. ఇట్టివారి కిట్టిసద్వృత్తులయందభిరుచి కల్పించని యెన్నిచదువులు మప్పినను అవి అంత దండుగ తప్ప రవ్వంత ప్రయోజనములేదు. ఇట్టి శుష్కచదువులలో ప్రజలను నలగగొట్టుటకు ప్రస్తుతపుమాదిరి స్కూళ్లు లక్షలకొలది రూప్యములు ఖర్చుపెట్టి కట్టించి, విద్యార్థుల తలలకుమించిన జీతములను పిండుచుండు విద్యావిధానము నెట్లు ఖండించవలెనో యెల్లరు నెఱిగినదే. అయినను అందుకుప్రతికూలమగు సులభ విద్యావిధానమును ప్రారంభించుట అంత సులభసాధ్యమైన పనికాదు.

శ్రీమతి కొల్లిపర లక్ష్మీనరసమ్మగారు ఇట్టిప్రయత్నమునకై మొట్టమొదట స్త్రీల విషయమునగడంగి ప్రారంభించినందు కెంతయు ప్రశంసాపాత్రురాలు. ఇట్టి పాఠశాలను మొట్టమొదట స్త్రీల విషయములో ప్రారంభించుటకు కారణము పురుషు లెల్లరు నిందులో పండితులనికాని, వారికిట్టి పనులవసరములేదని కాని కాదు. పురుషులెల్లరు వారివారి జీవయాత్రలలో నెట్లో కాలక్షేపము చేయుచున్నారు. భారతదేశములో స్త్రీలకు పురుషులకంటె ఇట్టి సుందరవిషయముల నేర్చుట కెక్కువ విశ్రామముగలదు. వారికి సంసారతాపత్రయము తక్కువ, కనుక వారిట్టివిద్యలు నేర్చి గృహమునకు కావలసిన అనేకవస్తువులు కూర్చి పురుషులను రంజిల్లచేయగలరు. కాలక్రమమున పురుషులకుకూడ నట్టిపనులు, ఇట్టి సంతుష్టశీలము అలవాటయినచో ఉద్యోగసద్యోగములకై పట్టణములమొగము పట్టక తమ పల్లెలలోనే సుఖముగ కాలక్షేపము చేయఁగలరు. ప్రస్తుతమిట్టి పాఠశాల ఇది యొక్కటియే కావచ్చును, కాని అనతికాలములో ఇట్టి పాఠశాలలు వేనవేలు ప్రతిగ్రామమునను స్థాపింపఁబడుననియు, కాలక్రమమున ప్రతి యిల్లుకూడ పూర్వకాలములోవలె ఒక పాఠశాలగా మారిపోవచ్చుననియు శ్రీమతి లక్ష్మీనరసమ్మగారి ఆశయమైయున్నది. ప్రస్తుతపుయంత్రభూయిష్ఠమైన పాశ్చాత్య నాగరికతయొక్క పతనము భారతదేశమునకు తొలఁగవలెనన్న ఇట్టి గృహపరిశ్రమల నాగరకత చిలువలుపలవలై భారతదేశమునందెల్ల వ్యాపించకతీరదు. భారత దేశాభిమానులెల్లరును గాంధిమహాత్ముని బోధనల నాలకించియు శ్రీమతి లక్ష్మీ నరసమ్మగారి ప్రయత్నము ననుకరించియు గ్రామగ్రామమున నిట్టి చిన్నపాఠశాలలను నెలకొల్పుదురు గాక!

వీనికి పెద్దకట్టడము లక్కఱలేదు. విద్వాంసబోధకు లక్కఱలేదు. ఉపాధ్యాయులకు పెద్దజీతము లీయనక్కఱలేదు. బాలబాలికలు పెద్దజీతములు చెల్లించనక్కఱలేదు. వీనిలో చదువుకొనువారికి చదువురాకపోవడ ముండదు. ఫేలన్నమాట యిందు వినబడదు. ఇక్కడ ప్రారంభమైన జీవనచరిత్రయు చర్యయే ప్రపంచములో జీవనపర్యంతమును ప్రతీవ్యక్తికిని సాగును. అన్నవస్త్రముల కెవ్వరును తడుముకొన నక్కరలేదు. అత్యధిక శ్రీమంతులై అతిపేదవారి అన్నముల నపహరించువారు కలికమునకైన కనిపించకుందురు. ఇది నేర్చుకొంట కెక్కువ కాలముపట్టదు. అభ్యాసము చేయుచున్న కొలదియు నాజూకుతనము పొందును. తగుమాత్రము పరిశ్రమతో జీవయాత్రగడచును. వారమునకు నలువది గంటలు కాదుగదా ముప్పదిగంటలపనియైన నుండదు. విశ్రామసమయమునెల్ల వేదాంత విద్యయందో లేక చారిత్రకశాస్త్రాదిపరిశోధనములకు చెందిన మరి యేవిద్యయందో, కవులు గ్రంథరచనమునందో, విద్వాంసులు పండిత గోష్ఠియందో, చిత్రకారులు చిత్రరచనములయందో ఎవరెవరికి అభిరుచి యెందెందు గలదో అందందు కాలము బుచ్చవచ్చును. ప్రతిగ్రామస్థునకును ప్రస్తుత విద్యావిధానము కంటె యీవిధాన ముత్తమమైనదనుభావ మంకురించిన చాలును. ఈ విద్యావిధానము దానంతటనదే దినదినప్రవర్ధమానమై వర్ధిల్లగలదు. జనులకు సంతుష్టశీలము, భారత సంప్రదాయాభివర్ధనము పొడమనలెను. వారు ప్రస్తుత పట్టణవాసములలోని ఆడంబర జీవనములయందు విరక్తిగొని ధన్యజీవనులగుదురు. మహాలక్ష్మీదేవి నేడు వేనవేలు గృహములను విసర్జించి, అనేకులను నిర్గేహుల నొనర్చి, ఏ ఒకరిద్దరు కోటీశ్వరులు, ఏ కొంతమందియో వారి యనుచరులు మొదలగువారి నాశ్రయించుకొనియున్నది. జనసామాన్య మెల్లరును వారి కత్యావశ్యమయిన యిట్టి కృషులను విద్యను తిరిగి వారి స్వాధీనముచేసుకొని రాణింపఁగడగనిదే ఆమె తిరిగీ అందరికీ యిల్లువాకిళ్ల నొసంగి, అందరినీ శ్రీమంతులనుజేసి, అందరియిళ్లను కలకల నాడదు.

గాంధిమహాత్ముడు ఖద్దరువ్రతముపూని అఖిలభారత చరఖాసంఘమును స్థాపించిన నాటగోలె అతని కిదియే తపస్సయి అతను తనసర్వస్వమును ఇందుకొరకై యే అర్పించుచున్నాడు. అతని గ్రామోద్ధరణ ప్రయత్నమును తదర్థమైన సంఘమునుగూడ ఈ మహాప్రయత్నముకై యే తంటాలు పడుచున్నవి. చిత్తవిశ్రాంతిలేని దేశసేవకులెల్లరును ఇట్టి శుభసందర్భమున రాజకీయగందరగోళములను అల్లకల్లోలములను వ్యర్థసంరంభములను విసర్జించి, సన్యాసులవలె యోగులవలె యిట్టి సత్కార్యరతులై యే జీవించుచున్నారు. ఎవరో కొందరు విపరీతవాదు లిట్టి సత్కార్యపరాయణత్వముయొకకినిసి యంత్రముల లోనే మోక్షమున్నదని బోధనలకు గడంగుట వలన ఏ పట్టణవాసస్థులగు ధనాఢ్యులకో పెద్ద కూలులకోసము తంటాలుపడువారి కొరకో

రుచించును కాని కోటానుకోట్ల గ్రామీణులకు రుచించవు. ఈరహస్యమును గాంధి మహాత్ముఁడు గుర్తించినట్లు వేరెవ్వరును గుర్తించలేదు. ఈ పాఠశాలవంటి సంస్థల వలన యీసందేశ మెల్లరకుహితమై, యంత్రవస్తునిరసనము వ్యాపించి, మానవహస్తరచిత వస్తువుల అభిమానము హెచ్చి మానవకోటి యెల్ల సకల సంపదలతో తులదూగుదురు గాక!

## కాలము

శ్రీమతి ఎ. కమలాంబగారు

మ. గతులందప్పరు సూర్యచంద్రులును వీకన్ పర్వతవ్రాతము
న్నతభావంబు త్యజించనేరదెపుడైనన్ సాగరశ్రేణి స్వ
స్థితి గోల్పోవదు తారక ల్గగనమందే నిల్చుకాలం బదే
గతి మార్పొందగ జేయులోకమున లోకాతీత భావాలచే

ఉ. క్షీరము శ్వేత వర్ణముత్యజించ దొకానొకనాడు వెండిబం
గారములున్ స్వవర్ణముల బాయవు నేటికి తింత్రిణీఫలం
బారయ పూర్వభావపరిహారము సేయదు కాలమింక నే
తీరు స్వశక్తిచేత జగతిన్ బరిణామ మొనర్పగల్గెడిన్

ఉ. కాలము వేశ్మవంటిది జగంబున వెల్గుసమస్తమందునన్
గ్రాలెడి వస్తుజాతమెటులన్ జనియించిన నేమిసేయగా
జాలును యేదియున్ విడదు సద్మముసర్వము దానిబాయునిం
కేలను సంశయంబు పరికింపగ కాలము సాక్షిభూతమా

గీ. ధూమశకటాధి రోహమర్త్యులకు దృశ్య
జగముగదలెడి మాదిరి నగపడుగద
తద్విధంబున కాలమంతయును విడచి
పోవునట్లుగ విభ్రాంతి వొడము సూవె,

ఆ. వె. సుజనులైన వారి చూడ్కులకెప్పుడు
కాల యోగమేమి గానరాదు
ఖేలనా ప్రవీణలోల నేత్రమృదంగ
దూషణంబు రీతిదుష్టమతులు

# గద్వాల రాణులు

శ్రీమతి మారేమండ సీతమ్మగారు.

ఆధునికాంధ్రసంస్థానములలోనెల్ల నేడు నైజాం రాజ్యాంతర్గతమైయున్న గద్వాల సంస్థాన మగ్రగణ్యమై యొప్పుచున్నది. కాకతీయాంధ్రచక్రవర్తులలో గణపతి వాడగు ప్రతాపరుద్రదేవుని కాలమున నుద్భవించినదగుటచే నీ సంస్థానము మిక్కిలి ప్రాచీనమైనదనియు జెప్పవచ్చును. కొంచెమించుమించుగ స్వతంత్రపరిపాలనాధికారమును గలిగియుండి యనేకవందల సంవత్సరములనుండియు విద్వత్పోషణమునకు పేరెన్నిక గాంచిన యీ మహాసంస్థానచరిత్ర మాంధ్రదేశచరిత్రమునకు మిక్కిలి ముఖ్యమైనది. అనేక సమయములలో నీసంస్థానము రాజ్ఞీమణుల పాలనమునందుండి యెన్నియో క్లిష్టపరిస్థితులను దాటెను. ఈ రాణుల పుణ్యచరిత్ర మీవ్యాసమున వర్ణింపబడును.

## బక్కమ్మ రాణి

క్రీ॥ శ॥ 16-వ శతాబ్ది యుత్తరార్థమున కృష్ణా తుంగభద్రానదుల మధ్య నుండు దేశము చిన్నచిన్న స్వామ్యములుగ విభజింపబడి యుండెను. వానిలో నొక్కొక్క సీమ యొక్కొకనాడగౌడు స్వాధీనమునందుండెను. ఇందు పూడూరు సీమయొకటి. దీనికి వీరారెడ్డి యను నతడు నాయకుడై యుండెను. ఇతనికి బక్కమ్మ యను పుత్రిక మాత్ర ముండెను. పుత్రులు లేకుండుటచే దనయనంతరము పూడూరుసీమగతి యేమగునోయని యీనాడగౌడు విచారించుచుండెను. ఈకాలమున ఐజ, దరూరు, కందనవోలు, ఆదవని, నంద్యాల సీమలపై ముష్టిపల్లి వంశజులగు రెడ్లు నాడగౌడులుగ నుండిరి. క్రీ॥ శ॥ 1595 ప్రాంతమున వీరిలో వీరు తగవులాడుకొనుటచే పెద్దారెడ్డి యను నతడు ఐజ దరూరు కందనవోలు సీమలకు నాడగౌడగిరీని సంపాదించి, బిజాపుర సుల్తానుకు సామంతుడయ్యెను. జ్ఞాతులచే విడువబడి నిరాలంబుడై యున్న పెద్దారెడ్డికి పూడూరు నాడగౌడగు వీరారెడ్డి తనకూతురగు బక్కమ్మను పెండ్లిచేసి యల్లుని దనయింట నుంచుకొనెను. ఈ పెద్దారెడ్డియు బక్కమ్మ రాణియు గలసి యైజ దరూరు కందనవోలు పూడూరు సీమలపై యధికారమును నెరపిరి. ఈ దంపతులకు సోమన్న సిరిగరెడ్డి యను నిర్వురు పుత్రులు గల్గిరి. పెద్దారెడ్డి క్రీ॥ శ॥ 1628లో మరణించెను. అప్పటికి కుమారులు బాలురై యుండుటచే బక్కమ్మ రాణియే నాడగౌడుగ నుండెను. ఈ మహాసాధ్వి దైవభక్తియు, పాపభీతియుగలిగి ప్రజలను గన్నబిడ్డలవలె జూచుకొనుచు, ననేక ధర్మకార్యములను జేయుచు ముప్పది నాలుగేండ్లు పరిపాలనముచేసి క్రీ॥శ॥1668లో

తన జ్యేష్ఠపుత్రుడును మహాశూరుడు నగు పెదసోమ భూపాలునికి పట్టముగట్టెను.

## లింగమ్మరాణి

ఈ పెదసోమ భూపాలుడు ప్రఖ్యాతాంధ్రవీరుడు. తన బాహుబలము వలనను, రాజనీతి వైశద్యమువలన నితడు మొగలు రాజప్రతినిధియగు నౌరంగజేబునకు సహాయము జేసి, బిజాపుర సుల్తానుపై దిరుగబడి స్వతంత్రుడై కర్నూలు బళ్ళారిజిల్లాలలోని పెక్కుసీమలను జయించి ప్రకృతిగద్వాల దుర్గమును నిర్మించి స్వతంత్రగద్వాల రాజ్యమును స్థాపించెను. చక్రవర్తియైన పిమ్మట నౌరంగజేబీతని రాజత్వము నామోదించి విశేషముగ గౌరవించెను.

క్రీ॥ శ॥ 1712 లో నీరాజు మరణించిన పిమ్మట పండ్రెండు సంవత్సరములకాల మిర్వురుద్యోగులు రాజ్యమును రక్షించిరి. అటుపై పెదసోమభూపాలుని పెద్దభార్యయగు అమ్మక్కరాణి యొకయేడును, దరువాత రెండవభార్యయగు లింగమ్మరాణి * యధికారమునకు వచ్చెను. ఫరుక్షయారను మొగలు చక్రవర్తి యీమె ననేకవిధముల గౌరవించి, వీరశిఖామణియు నీమె పుత్రుడు నగు తిరుమలరాయని సాహాయ్యము నభ్యర్థించెను. ఆయేట దక్కను సర్దారుగనుండిన నైజాముల్ ముల్కు స్వతంత్రుడై హైదరాబాదునుండి పరిపాలింప నారంభించెను. రాజనీతి విశారదయు, దూరదర్శియునగు లింగమ్మరాణి యీ మొదటినైజాముతో సఖ్యతను పాటించి యతని గౌరవమునంది మార్గమును నిష్కంటకము నొనర్చుకొనెను. ఈమె మిక్కిలి ఖ్యాతిగాంచెను. ప్రజోపయోగార్థమై కూపారామ తటాకాదుల నెన్నిటినో వేయించెను. క్షామపీడితులై జనులెందరో తన రాజ్యమునకు వలసవచ్చినపుడు వారి నెల్లర నాదరించి వారికి చక్కని వసతుల నీమహారాణి కల్పించెను. ఈమె తన భక్తి ప్రభావముచే నొక మూగవానికి మాటలు వచ్చునట్లు చేసెను. విద్యాపక్షపాతినియై యీమె యనేకపండితుల నాదరించెను. ఈ మహాసాధ్వి క్లిష్టపరిస్థితులలో గద్వాల సింహాసనమునుండి యీ రాజ్యమును సంరక్షించి యనేకవిధముల పెంపొందించి క్రీ॥ శ॥ 1738 లో పుత్రుడగు తిరుమలరాయుని గద్వాల రాజ్యమున కభిషిక్తుని జేసెను.

## రాణీ రామక్కమ్మ

క్రీ॥ శ॥ 1761-94 నడుమ పెదసోమ భూపాలుని మనుమడగు చినసోమ భూపాలుడు గద్వాలరాజ్యము నేలెను. అతడు మరణించునాటి కితనిపుత్రుడగు రెండవ రామరాయడు బాలుడగుటచే భార్యయగు రామక్కమ్మ సింహాసనమునకు వచ్చెను. ఒకయేడాది గడచిన పిమ్మట నీరాణి కుమారునకు రాజ్యము నప్పగించెను. మహాతంత్రజ్ఞుడగు నీరామరాయడు నైజామును, మహారాష్ట్రులను పణములుగ నుపయోగించి స్వార్థము ననేకవిధముల నభివృద్ధిచేసికొని

* పదమూడేండ్లును రాజ్యముచేసిరి. క్రీ॥ శ॥ 1723 ప్రాంతమున లింగమ్మరాణి.

రాజారామభూపాల్ బహద్దరనుపేర విఖ్యాతుడై క్రీ॥ శ॥ 1806 లో మరణించెను. అనంతరము గద్వాల రాజవంశమున గిల్లోలములు జరిగినవి. రామరాయునికి శేషమ్మ, లక్ష్మమ్మ యను నిర్వురు రాణులుండిరి. అతడు మరణించునప్పటికి చిన్నరాణియగు లక్ష్మమ్మ గర్భవతిగనుండెను. రాజు మరణశయ్యపై నుండి తల్లియగు రామక్కమ్మను బిలచి "నాచిన్నభార్య పుత్రునిగనినచో నతనికి పట్టముగట్టుము, పుత్రికనుగనినచో నామెను నీమేనల్లుడగు సీతారామునికి పెండ్లిచేసి యతనికి రాజ్యము నప్పగింపుము. అంతవరకును సంస్థానమును రక్షించుచుండుము" అని చెప్పెను. పిమ్మట నిర్వురు రాజబంధువుల సాహాయ్యముతో రాణీరామక్కమ్మ కార్యములను చక్కబెట్టుచుండెను. ఇంతలో రామరాయని పెద్దభార్యయగు శేషమ్మ యసూయాపరురాలై తన సవతికి విషమిప్పింపబోయెను. దైవికముగ రామక్కమ్మ రాణి తన చిన్నకోడలిని యీయాపదనుండి రక్షింపగల్గెను. ఇంతటితో దృష్టినొచక శేషమ్మ తనభర్తచే యనంతరవారసుడుగ పేర్కొనబడిన సీతారామిరెడ్డిని సంహరింప యత్నించెను. రాజభక్తులీవిద్రోహమునుగూడ నణచివేసిరి. అప్పుడు రామక్కమ్మరాణీ తనచిన్నకోడలికి బుట్టిన బిడ్డను సీతారామరెడ్డికి పెండ్లిచేసి యతనిని రాజా సీతారామ భూపాల్ బహద్దరనుపేర సింహాసన మెక్కించెను. ఈరాణి తన చాకచక్యమువలనను ప్రజానురాగమువలనను రాజ్యమును విపత్పరంపరలనుండి కాపాడి యనేక ధర్మకార్యములను జేసి శాశ్వతమగుకీర్తిని గడించెను.

రాణీ వెంకటలక్ష్మమ్మ

సీతారామ భూపాలుడు క్రీ॥ శ॥ 1840లో మరణించెను. అనంతర మతని రెండవభార్యయగు రాణీవెంకటలక్ష్మమ్మను గద్వాలకేలికగ నంగీకరించి నైజాంప్రభుత్వమువారామెకు దమసాహాయ్యమును వాగ్దానము చేసిరి. ఈమె నాలుగుమాసములు సంస్థానకార్యమును నిర్వహించి దత్తపుత్రుడగు మూడవరామభూపాలుని కభిషేకముజేసెను. ఇతడు నాల్గుసంవత్సరములకాలమే రాజ్యమేలెను. విషయలాలసుడై యతడెన్నియో యక్రమములనుజేయుటచే సైనికులు దిరుగుబాటుజేసి దర్బారు దీర్చియుండగ నితనిని గుండుపెట్టి కొట్టివేసిరి. అంత జేయునదిలేక తిరిగి సంస్థానభారమునువహించి తనమేనల్లుని దత్తుచేసికొని నైజాం ప్రభుత్వమువారియనుమతితో రాజారామభూపాల్ బహద్దరను పేరుతో నతని నీరాణి గద్వాలసింహాసన మెక్కించెను. ఇతనికాలమున దేశమున సిపాయిలకలహము జరిగి యల్లకల్లోలమయ్యెను. పరిస్థితు లెంతగందరగోళముగనున్నను రాజెంతయువకుడుగ నున్నను, దూరదర్శియు రాజనీతివిశారదయునగు రాణీ వెంకటలక్ష్మమ్మ మనస్థైర్యమును విడనాడక, బ్రిటిషుప్రభుత్వమునకు బాసటయైయుండి విద్రోహకీటకము దనరాజ్యమున బ్రవేశింపకుండ జాగరూకతతో మెలగెను. ఈ కారణ

మున గద్వాలరాజ్యము నైజాముయొక్కయు బ్రిటిషువారియొక్కయు మన్ననలకులోనై మిక్కిలి యభివృద్ధినందెను.

## మహారాణీ శ్రీ శ్రీ శ్రీ ఆదిలక్ష్మీదేవమ్మ బహద్దరుగారు

రామారామభూపాలుడు సంతతి లేకుండుటచే మహారాజా శ్రీ సీతారామభూపాల్ బహద్దరువారిని దత్తతచేసికొనెను. 1913లో పట్టాభిషిక్తుడై యీ మహారాజు 1924 వరకును గద్వాలరాజ్యము నేలెను. ఈయన కాలమున సంస్థాన మెన్నియోవిధముల నభివృద్ధినందెను. గద్వాల విద్వద్గద్వాల యయ్యెను. సుప్రసిద్ధులగు తిరుపతి వేంకట కవులు, కొప్పరపుకవులు మున్నగు కవితల్లజులును, వేదము వెంకటరాయశాస్త్రిగారు మున్నగు పండితులును విశేషముగ గౌరవింపబడిరి. ఢిల్లీదర్బారులో నా మహారాజు ప్రత్యేకముగ గౌరవింపబడెను. ఈయన యొసగ్గిన ధర్మము లసంఖ్యాకములు. ఈ రాజచంద్రుని మరణానంతరము సంస్థానమునకు కొన్నిచిక్కులు గలిగినవి. అప్పుడు రాజ్యము మహారాణీ శ్రీ ఆదిలక్ష్మీదేవమ్మ బహద్దరువారికి జెందవలసివచ్చెను. కాని దానిని ప్రజాహితార్థమై తామాక్రమించుకొందుమని నైజాం ప్రభుత్వమువారు ప్రకటించిరి. కుడకు మహారాణీవారి విన్నపమును మన్నించియు, దేశమునందంతట నుద్భవించిన యసంతృప్తిని గమనించియు వారు మహారాణీవారి పుత్రికలలో నెవరికైనను పుత్రులు గల్గినపిమ్మట వారిని గద్వాలరాజ్యమునకు వారసులుగ నంగీకరింతుమనియు నంతవరకును శ్రీ మహారాణీవారు రాజకార్యములను జూచుకొనవచ్చుననియు నుత్తరు వొసంగిరి.

ప్రకృత గద్వాలపాలకులగు మహారాణీ శ్రీ ఆదిలక్ష్మీదేవమ్మ బహద్దరువారి వలన నీ సంస్థానమునకు గ్రొత్తకీర్తి చేకూరినది. ఈమె ప్రాచీనాంధ్ర సాధ్వీమణియగు గాక తిరుద్రాంబను పోలియున్నారు. ప్రజల సౌఖ్యమే యీ మహారాణి సౌఖ్యము. వారి కుపయోగించుపనులను జేయుటయే యీమె ముఖ్యకర్తవ్యము. పంటలుచెడిపోయి కరవు గల్గినచో పన్నులను తగ్గించుటలో నీమె ముందంజవేయును. ఈమెకాలమున మాఘ కార్తికమాసములలో గద్వాలకేతెంచు బ్రాహ్మణులసంఖ్య యినుమడించి వేనకువేల రూపాయలు ధర్మముచేయబడుచున్నవి. ఈ మహారాణి యూపితప్రోత్సాహముల నందని పుణ్యకార్యములుగాని ప్రజాసంస్థగాని లేదని చెప్పవచ్చును.

లక్ష్మీ సరస్వతులకు వీరియింట స్థిరవసతి యేర్పడినది. ఒకవంక నుద్యోగులకు గర్తవ్యములను సూచించుచు, మరియొకవంక ప్రజల కష్టసుఖముల నాలించుచు, నొకచేత ప్రియదౌహిత్రుని లాలించుచు మరియొకచేత దానధర్మములను జేయుచు నీ మహారాణీ సాహేబావారు వర్ణనాతీతమగు నానందము ననుభవించుచుందురు. అంతటి మహారాజపదమునందుండి మహదైశ్వర్యము ననుభవించుచుండిన నీ మహాసాధ్వి జీవితము నిరాడంబరమైనది. దేవబ్రాహ్మణ పూజయు,

బురాణ శ్రవణమును, విద్వత్సన్మానమునే యీమె దినచర్యలో విశేషభాగ మాక్రమించును. ఈ మహారాణీవారి దర్శన మతి సులభము. వీరిదర్శనముచేసిన యర్థులు వ్యర్థులై తిరిగిపోవుట యింతవరకును జరుగలేదు.

ఈ మహారాణీవారికి శ్రీ లక్ష్మీదేవమ్మ, వరలక్ష్మీదేవమ్మయను నిరువురు పుత్రికలున్నారు. జ్యేష్ఠపుత్రిక దోమకొండ సంస్థానమునకు యువరాజగు శ్రీ రాజా సోమేశ్వరరావు బహద్దరువారికి బత్నియై శ్రీరాజా రామ కృష్ణభూపాల్ అను తనయుని బడసెను. శ్రీ మహారాణీ సాహెబావా రీదౌహిత్రుని దమకుత్తరాధికారిగ స్వీకరించియున్నారు. ఇటీవల నైజాం ప్రభుత్వమువారును దీని కంగీకరించి, మహారాణీవారికి సంపూర్ణాధికారము నొసంగియున్నారు. కొద్దిరోజుల క్రితమే మహారాణీవారు రెండవపుత్రికను పాపన్నపేట సంస్థాన యువరాజునకిచ్చి యతి వైభవముగ వివాహమును చేసియున్నారు.

ఈ విధమున బూర్వకాలమునుండియు గద్వాలసంస్థాన మనేక క్లిష్టపరిస్థితులలో పరిపాలనాదక్షులును, రాజనీతివిశారదలునగు రాజ్ఞీమణులచే బాలింపబడి యభివృద్ధినందినది. నేడయ్యది గద్వాలరాజ్ఞీ శిఖామణులగు మహారాణీ శ్రీ ఆదిలక్ష్మీదేవమ్మ బహద్దరువారి యాధీనమునందుండి యపూర్వమగు శోభను గాంచుచున్నది. గద్వాలరాజ్య మాంధ్రత్వమునకు దివ్యచిహ్నము. దీని మూలమున నాంధ్రులగౌరవ మనేకవిధముల బెంపొందినది. శ్రీ మహారాణీవారు తమ కటాక్షము నాంధ్రలోక మంతటిపైనను బరపి దాని నుద్ధరింతురుగాక. ఆంధ్రను లీ యాంధ్రరాజ్ఞీమణి నుచితరీతిని గౌరవింతురుగాక.

# ఆంధ్ర రైతాంగ విద్యాలయము

శ్రీమతి సుశీలాదేవిగారు

మొన్న మొన్నటిదాకా ఈ విద్యాలయంలో స్త్రీలు నేర్చుకోవాల్సిందేమన్నా ఉందా అనే సందేహం అనేకమంది స్త్రీజనాన్ని ఆవరించింది. ఈసమస్య స్త్రీలనెదుర్కొన్నదంటే ఆశ్చర్యంలేదు. ఎందుకంటే పురుషుల్లోనే అనేకమందికి ఆశ్చర్యాలు, అనుమానాలు కలిగినయి. ఇప్పటికింకా ఈ పురుష లోకంలో [illegible] అంగీకరించలా. అయినా ఇందులో స్త్రీలకేలా స్థానంలేదా అనిపించింది. స్త్రీకి ఎందులో లేదు కనుక ఇందులో [illegible] చాలామంది స్త్రీలు [illegible] ఈ సందర్భం [illegible].

[illegible] దేశసౌభాగ్యాన్ని కోరుతున్నామని హిందువు స్త్రీలను ఇళ్ళలోకి తోలుతున్నారు. కాని భారతదేశానికి స్వరాజ్యం రావాలంటే స్త్రీలు నాలా కృషిచేయాలన్నారు మానరావు [illegible]. ఆబోధనను బలపర్చారు మాగంటి బాపినీడుగారు నాటి సతీమణి స్మారకోపన్యాసంలో. బాబూ, గృహసీలు చెల్లించేకిస్తే సమయం వచ్చేసరికి భార్య ఎక్కడఉందా అని పరుగెత్తి మూలపాయిదగ్గర దుములుతూంటే, పచ్చివంటినున్న ఏ పుత్ర్పరునారో వీలుతప్పితే పుత్రసహితం గుంజుకెళ్తూంటే మా హక్కుల్ని నిలబెట్టుకునేదానికి బయటకు రావటం తప్పా? అందుకు విజ్ఞానం సంపాదించటం అనవసరమా? "జయిపే[illegible]కి రాయని రండీ, జన్మహక్కులనుకోండీ" అని మా స్త్రీ విద్యార్థుల్లో ఒకరు పాడుతూంటే మేమంతా పలకలా? అంటే మా హక్కుల్నికూడా నిలబెట్టుకుంటాం అని బయల్దేరారు మా సోదరీమణులు.

పోనీండి ఇవన్నీ అనుకునేదినాలు పోయినయి స్త్రీ లిప్పటికే అనేకవిధాల ముందుకొచ్చారు. ఇంకా హక్కులు కోరేదేమిటి? నిజమే కాని ఒకదేశం దాస్యశృంఖలాలలోపడి, భారతమాత రక్షణకోరకు పరితపించుచూ పడరాని బాధలు పడుతూంటే, పురుషులింకా భరతమాత పిలుపే వినకుంటే స్త్రీలు బయల్దేరకూడదా? బయల్దేరొచ్చని మా కాశేశ్వరరావుగారు చెప్పలా? చైనాదేశంలో స్వాతంత్ర్యోద్యమానికి నాయకత్వం వహించిందెవరు? సన్‌యట్ సన్ భార్యగాదటండీ. జపానుదేశంలో స్త్రీలు [illegible] సమయంలో ఎంతపని చేశారో మన "[illegible]" [illegible], గరిమెళ్ళ సత్యనారాయణగారు చెప్పలేదా? ఆదేశంలో [illegible] మోటారు నాలకుంటే, స్త్రీలు [illegible] ముఖ్యులయినారు, స్త్రీ సౌందర్యానికి [illegible] కోరుకున్నారు. [illegible] మేము, మన భారతదేశ స్త్రీలు దేశం[illegible] నా పాటు పడకూడదా?

ఏమంటారండీ మీ స్త్రీలు, [illegible] చేయవలసినది అంటే ఎంతోదూరం పోనక్కర్లా. హనుమాయమ్మగారు "పరిగంధము తెచ్చినారము, నీరు లెవ్వరో తెల్పుడీ" అని చక్కగా పాడుతూంటే నేను అంటే నేనని ఎందరు ముందుకొస్తారో మా స్త్రీలు. ఇంక మా సోదరి అనసూయాదేవి "రా [illegible] తుమ్మెదా" అంటూ "మోటుతుమ్మెదలొచ్చి తుమ్మెదా, సీమతోటలో బడ్డాయి తుమ్మెదా సీతో[illegible] చెడిపోయె తుమ్మెదా ఇంక తొందరగ మేల్కొనవె తుమ్మెదా" అంటే ఇంక నిదురపత్తు లెవరుంటారండీ.

## విద్యా విధానం

మన విద్యాలయంలో చెప్పే చదువు పొట్టకూటి

కొరకు తంటాలుపడు పట్టభద్రులకు చెప్పేచదువు కాదు. వీరలను తయారుచేయుటమే స్థాపకులు రంగ నాయకులుగారి అభీష్టం. అదెంతవరకు సాధ్యమా అంటే సంవత్సరానికొక్కరు తయారైనా చాలన్నారు శనివారపు సుబ్బారావుగారు. కావాల్సింది ప్రజల దృక్పథాన్ని మార్చటమే అన్నారు. వీరందరూ రైతు రక్షకులే అన్నారు. వీరిపైననే రైతుల మోక్షం ఆధార పడి ఉందని చెప్పారు మన కల్లూరి సుబ్బారావు గారు. కాదు ఆంధ్రులంతా వట్టి దద్దమ్మలు, ఎందుకూ పనికిరారన్నారు అవుటపల్లి నారాయణరావుగారు. కాని హనుమాయమ్మగారి హరికథను గురించి ఏలా వ్రాశాగో చదివేలాగాలి. కాని విద్యార్థులు దద్దమ్మలం కాదని పోరాడాల్సివచ్చింది.

ఈ విద్యార్థులకు, మా గ్రామస్థులకు చెప్పుతూన్న శంషాబాదు [illegible] లెక్చర్లుగాని, ఆత్మస్థైర్యంయొక్క గొప్పతనాన్ని గురించిగానీ, ఆర్థికపు సూత్రాన్ని గురించిగానీ [illegible] చేసి. [illegible] ఆర్థిక రాజకీయ పరిస్థితులు, స్వాతంత్ర్యోద్యమ చరిత్ర, ఇటాలీ, ఇంగ్లాండు, చైనా, టర్కీ దేశాల స్వాతంత్ర్య సమరచరిత్ర, తుదకు వారెట్లు సఫలీకృతులు అయ్యారో తెల్పుతున్నారు. దాంతో వీరి [illegible] పాయనా అనే సందేహమే లేకుండా పోయింది. మనకెప్పటికొస్తుందా స్వరాజ్యం అనే పిపాస ప్రారంభించింది.

రంగాగారి పైన్యాస ఉపన్యాసాలు వింటూంటే అక్కడికి పరుగెత్తి పోదామా అనిపిస్తున్నది. మన గాంధిగారు అలాంటిపద్ధతులెందుకు ప్రారంభించరా అని అనుమానం కలిగింది. రంగాగారి సమాధానాలు వెంటనే అలాంటిదేం లేకుండాచేసి, గాంధిగారు మన కిన్నాళ్లదాకి చేసిఇచ్చిన పునాదిపై దౌర్జన్యరాహి త్యంతోకూడుకొన్న సాంఘికవాదంతో పూంజీదారుల పడద్రోసి మనకార్మికకర్షకుల సౌధాన్ని నిర్మించుదాం అన్నారు. ఈపద్ధతి మాస్త్రీలందరికూ కూడా నచ్చింది.

సకల యుద్ధవిధానాలు చెప్పారుకాని, అసలు మనకున్న కష్టసుఖాలేమండీ అంటే, రైతుల ఋణ భారాన్నిగురించి, ప్రస్తుతపుఆర్థిక తారుమారుల గురించి, విపులంగాచెప్పారు. గాంధిగార్ని ఒక్క విసురు విసరకుండా, నేటిసాంఘికవాదుల నెత్తినేసు కొనక చక్కని ఓనూతనఆర్థిక ప్రణాళికను నిర్వచిం చారు. "ప్రపంచకార్మిక కర్షకులారా ఏకంకండి" అనే కేక అందరిచిత్తములలో హత్తుకొని పోయింది.

కాని శనివారపు సుబ్బారావుగారు గ్రామావ సరాలగురించి వాటిఆర్థిక రాచకీయాల గురించి చక్కగా తెల్పారు. మనదేశం బాగుపడాలంటే, మన ఆర్థికస్థితి స్థిరంగా ఉండాలంటే స్త్రీల అధీనం చెయ్యాలన్నారు గృహఆర్థికంతంతా.

ఎవరే ఉపన్యాసంచేసినా స్త్రీలని మరివలా. కేటూరు రామస్వామి చౌదరిగారు గ్రంథాల యోద్య మాన్నిగురించి దీర్ఘంగా ఉపన్యాసంచేసి తుదకు స్వాతంత్ర్యోద్యమంలో [illegible] చేసిన సేవను గురించి చెప్పి స్త్రీలు ఉన్నతవిద్య స్వాతంత్ర్యసంపాదనకు తోడ్పడ కోరినారు.

## ఉపన్యాసాలు చేసారు

నిరుటికన్న ప్రాతినిధ్యం హెచ్చయింది స్త్రీల కీ సంవత్సరం. ఇతెరులవలె గాక మా కనకమ్మతల్లి పిలువంగానే అంగీకరించి ఉపన్యసించటానికి వచ్చారు. ఆంధ్రులందురు అమూలాగ్రముగా ఆమెగార్నిగురించి ఎరిగిఉందురు. నేను ప్రతేకంగా ఏంవ్రాసేది? ఆమె దేశసేవాఫలితంగానే గతసంవత్సరం ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘాని కుపాధ్యక్షత లభించింది. కాని ఈసంవత్సరం స్త్రీలకి సరైన ప్రాతినిధ్యంలేకపోవ టంవల్ల రాష్ట్రసంఘసభ్యత్వానికి రాజీనామా నిచ్చారు. మాకు ముచ్చటగా మూడుపన్యాసా లిచ్చారు. వారు విద్యార్థులకిచ్చిన సలహాలు గమనా ర్హములు. ఆమెగారి ప్రేమాదరాలు చూడండి. మూడు దినా లున్నాకకూడా వెళ్లాలంటే చాలా కష్టంగా ఉందని, వెళ్లలేక వెళ్లారు.

## అయిపోతోంది

ఈ సంవత్సరం విద్యాలయం రెండు నెలలునడిపినా, అప్పుడే అయిపోతోందే అనిపిస్తున్నది. ఏప్రియలు 17 తేదీకి దేశోద్ధారకుల ఆశీర్వాదాలతో ప్రారంభమయింది. నారీలోకంలో నమ్మకంగల బాపినీడుగారు ప్రారంభోత్సవం జరిపారు. జయప్రదంగా సాగింది. 5, 6 తేదీలలో రాధాకృష్ణనుగారు, 9–10 తేదీలలో భూలాభాయిగారు వస్తారని స్వైతాంగంఅంతా ఉవ్విళ్లూరుతూఉంది. ఇవన్నీ విజయచిహ్నాల్లా ఉన్నయి మా విద్యాలయానికి.

## భారతీదేవిగారు

" Last but not least " అనే ఆంగ్ల ప్రయోగం తరచు ఉపయోగిస్తుండేవారు మా గురువుగారు. అదే మాభారతీదేవిగార్కి కూడా వర్తిస్తుంది. గతసంవత్సరం రంగాగారు ఓసారి "నేనేం చేస్తేనేమండీ, మాభారతీదేవి సహకారంచేయకపోతే ఏంసాగిస్తాం" అన్నారు. ఇందులో అణుమాత్రం అతిశయోక్తిగాని అబద్ధంగానీ లేదు, నిజంఅయిన అర్ధనారీశ్వరే! రంగాగారు ఉపన్యాసాలుచేసి విషయాలు బోధించినంతమాత్రానే అయిందా విద్యాలయం. మిగతావిషయా లెన్నో ఉన్నయి. అవంత చక్కగా "పెట్టింది భారతీదేవిగారే."

బాపినీడుగారి ధర్మమా అని వారు ఉపన్యాసం వినేభాగ్యం కలిగింది. నిజంగా వీరు చేసింది "చిన్నదైనా, చక్కని ఉపన్యాసమే." కాసేపట్లో మా తాతలనాటికాలానికి తీసుకెళ్లి తోలుబొమ్మలు, వీధి నాటకాలు చూపారు. వాటిద్వారా మనపెద్దల కెంత జ్ఞానమనిచెప్పచెప్పి తెలిపారు. సమస్యలన్నింటిగురించి సంగ్రహంగా చెప్పారు.

వచ్చేసంవత్సరం ఇంతకన్నా ఎక్కువ జయప్రదంగా సాగుతుందని ఆశిస్తున్నా.

# క్వేటపుర ప్రళయము

వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు, బి.ఏ.,
వేంకటనారాయణ (సోదరకవులు).

మ॥ యువసంవత్సరమా యిదేమిపోగకో యుగ్రంబుగాఁదోఁచెనీ
వపురా! దగ్ధముసేయుచుంటి జనులన్ బ్రారంభమందప్డె, నీ
యవధానంబున కాఁగువారెవరు? భావాబ్దంబు బీహారమున్
దవులన్ బెట్టె నికెంత ముందుగలదో? తబ్బిబ్బులన్ జెందఁగన్. 1

ఉ॥ కోటవలెన్ బ్రకాశమయి కోమలపట్టణమంచు నొప్పునా
క్వేటను మ్రింగివేసితివి కేవల నిర్దయతన్ వహించుచున్
మీటితి వొక్కచూపుసను నీటనుముంచుచుఁ బట్నమంత బా
హాటముగాఁ జరించితివె యాలునుబిడ్డల వేరుసేయుచున్. 2

ఉ॥ నీరమునందు ముంచెఁగద నీటగుపట్టణమంత నష్టు బీ
హారును భావవత్సరము నక్కటికంబొక యింతలేక, యీ
తీరున భూమికంపములఁ దెంపునఁ గల్పనసేయనేల? బల్
వైరముదాల్పనేల? యలపౌరులొనర్చిన పాపమెట్టిదో. 3

ఉ॥ ఝల్లనెగుండె క్వేట్టపుర సౌధములన్నియుఁ గూలిపోవఁగా
ఘొల్లని ఘొల్లుఘొల్లుమని గోలవినంబడినంతఁ దత్పురం
బెల్ల నశింపఁజేసితి వదేలొకొ? యందఱు పాపులైరె? నీ
వల్ల లభించెనింత యువవత్సరమా! యిఁకఁ బొమ్ము చెచ్చరన్. 4

గీ॥ గురుఁడు రాజయ్యె నీ కేమికొదువ గల్గె
ననుచు నో యువవర్షమా! స్వాంతమందు
నుబ్బితిమిగాని ఫలమిట్టు లబ్బురముగ
మారె పాపగ్రహంబులు మసలుచుంట. 5

గీ॥ రాజు బలవంతుఁడైన తత్ప్రజల కెట్లు
సౌఖ్యమేపారు! కర్మానుసారముననె

సిద్ధమగుట నిజము మంచి చెడ్డలెల్ల
చేసికొన్నట్టి కర్మ త్యజింపఁగలమె? 6

ఉ॥ ఎచ్చటఁజూచినన్ మరణ మెచ్చటఁజూచిన నిండ్లుగాలుటల్
హెచ్చుగ వేడిగాడ్పులు మఱెక్కడఁజూచిన రోదనంబె; యీ
పచ్చనిహిందుదేశము శవంబుల కాస్పదమయ్యె నయ్యయో
చచ్చిరి వేనవేలనుచుఁ జల్లఁగఁ జెప్పికొనంగనయ్యెఁగా. 7

గీ॥ ఘోరమరణంబులంచు దుర్వారమైన
ఆత్మహత్యలటంచు నష్టాధికమునఁ
జేసి యాశ్చర్యమున మృతిఁజెందుచుండి
రంచుఁ బత్రికలనుజూడనయ్యె నేఁడు. 8

ఉ॥ కనఁబడుచుండె నీకలియుగంబునఁ బ్రప్రథమంబునం దహా!
కనివినరానివింతలు నకాలపుమృత్యువు లెందుఁజూచినన్
వినఁబడు ఘోరవార్త లటుపీనులు బ్రద్దలుగాఁగ నింకనే
మని బ్రదుకన్గలారము భయావహమయ్యె జగంబు నక్కటా! 9

ఉ॥ ఓజనులార! యీతనువులుండినఁదాక పరోపకారమే
యీజగమందు ముఖ్యమని యెల్లరు నిశ్చయబుద్ధినెంచి, యే
రోజునఁ నేమి మూడునొ పరుల్ వచియింపఁగలేరు గాన, మీ
రోజసహాయమున్ సలుపుచుండుడి దీనులఁగావఁ బూనుడీ. 10

ఉ॥ ఇంతటికంటె వేరుగలదే? సుకృతంబిహమందు, దేహమా
యంతముఁ జెందునెడ్డ ధనమా స్థిరమైనదిగాదు గాన, ని
శ్చింతమనంబుతో మెలఁగి జీవితమిట్టులె నెట్టఁగావలెన్
జింతయొకింతసేసి దరిఁజేర్పుడి యార్తరవంబుమాన్పుడీ. 11

ఉ॥ చచ్చినవారికై వగలసార్థకమేమగు? గ్రాలమిట్టులే
పుచ్చుట పాడిగాదు నషుముల్ దగగట్టి పరిశ్రమంబులన్
బొచ్చి భవత్సహాయమును జొప్పడఁజేయుడి సత్వరంబునన్
చ్చుగ మానవాళి కిదియే సుమి పుణ్యము నిందునందునన్. 12

# స్త్రీ విద్య

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, ఎం. ఏ. బి. ఎల్.

## ( ఆధ్యాత్మిక శక్తి )

సంపూర్ణజీవనము, ఉన్నతాశయగోష్ఠి అధునాతన నాగరకతయందు శుద్ధపూజ్యములు. కారణము? అధునాతన విద్యయందు వీనికి తావు లేకుండుటే! నేఁటి మహామేధావుల దృష్టిలోనున్నవి మానసము, శరీరములు. భౌతికవృద్ధి ఐహికోన్నతి వీరి యారాధ్యదేవతలు. ఆత్మను తలఁచి, ఆత్మశక్తిపై మనసుంచువారు వీరిలో నరుదు.

ఆత్మశక్తి (Soul force) వలనఁగాని నేటి ప్రపంచ పరిస్థితులు తిన్నబడవు. వ్యక్తిగత జీవనమందే కాక, విశాలమానవ జీవనాంగణమందుగూడ సూర్యకిరణమట్లే శక్తి ప్రసరించిననాఁడే, దివికాంతులు చిరుతరగలట్లు వసుంధరపై దృగ్గోచరమగును. దివి మర్త్యములకు చుట్టరికము కుదురుట ఈ శక్తివలననే!! ఈ శక్తినుండియే ఈశ్వర తేజము వివిధరూపముల నవతరించును.

ఆత్మశక్తివృద్ధికై ప్రాచీన భారతీయులు వివిధశిక్షణా విధానములను నిర్ణయించిరి. ఇది యలవడవలెనని కాంక్షించువారు దీని మహత్త్వమెఱిఁగి దీనిపై కన్ను వేయవలెను. వేసినంతన నది 'సీవాని'వని తెలుపదు. పరాక్రమశాలిని వరించు రాచముద్దియవలె యోధప్రవరుని జేరి అదృశ్యశమంతకమై అతని హృదయమందిది విరాజిల్లును. క్రమానుష్ఠానమునగాని మానవుఁడు కాఁజాలఁడు.

ఈశక్తి ద్రౌపది. ద్రుపదుపట్టి, జ్ఞానద్రవసముద్భవయని భారతాంతరార్థమున బుధుంగుమనిన వారెఱుఁగుదురు. శాంతిపూరమును హృదయమున వోయున దీశక్తి; నరునిచేతికి విజయకేతనమందించి అతని జీవనమునకు జయమంగళమనునదీ శక్తియే. మానస మత్స్యయంత్రమును దెగఁగొట్టు నరునకే ఇది లభించును.

మత్స్యమట్లు మానసము నిలుకడలేనిది; అది యగోచరము. క్రియాపృథ్వియందు దానినీరు చూపట్టును. మత్స్యముయొక్క నీడను, జాడను చూచియేగదా దానినిగొట్టి సవ్యసాచి ద్రౌపదిని చేఁబట్టఁజాలినాఁడు. ఈ శక్తినందిన యోధుఁడు పరమార్థమును పడసినాఁడు; కావున ధనంజయుఁడైనాఁడు. ఆధ్యాత్మికోన్నతి నందినవాఁడే మహాయోధుఁడని 'ధమ్మపదము'న బుద్ధుడు పలికినాఁడు. నరుఁడు ఆదర్శయోధుఁడు. శాంతికి ఆత్మశక్తికి వేఱుపేరైన సీతనందినరాముఁడు ఆదర్శయోధుఁడు. సీత శాంతికావుననే ఆత్మారాముని వరించినది; అశోకవనమున రామస్మరణ మొనరించినది.

ఆదర్శవ్యక్తులందు ఆత్మశక్తి భాసమానమైనది. ఇట్టివ్యక్తుల సాయుక్త జీవనవిధానములు ఆదర్శనాగరకతా నిర్మాణమునకు అక్కరైన సామగ్రి.

మానసమిచ్చునది సుఖము ఆత్మయొసంగునది ఆనందము. సుఖము ఐహికమైనది. ఆనంద మాధ్యాత్మికమైనది. క్షణికమైన సుఖమునకు దిగదుడుపని మహాయోధులును, మహాయోగులును ఆనందమును కాంక్షించిరి. ఆనందమును తనివారగ్రోల నువ్విళ్లూరువా రాత్మశక్తి నందితీరవలెను; మానసమును జయించి తీరవలెను; దశదిశలం బర్విడు యింద్రియములను స్వాధీనపఱుచుకొనవలెను. జీవన కురుక్షేత్రమున శరీర స్యందనమును తగురీతి నడుపవలెను.

మానసికవృద్ధికే అంజలెత్తు నేటినాగరకత, భౌతికోన్నతిపై పూలుచల్లు నేటి నాగరకత తన దృక్పథమును మార్చుకొనవలెను. నవజీవనము నందవలెను. ఆనంద శాంతులు వసుంధరయందు గోచరింపవలెననిన, పృథ్వీవాసులు నూతనజీవన విధానముల ననుష్ఠింపవలెను.

వివిధాశ్రమములందు ప్రాచీన భారతీయులు క్రమానుష్ఠాన శిక్షణమునకు వలసిన వ్యవస్థలు కావించిరి. నాటి ఆశయములు, నేడును, రేపునుకూడ అనుకరింపదగినవి. వెనుకటి విధానవిశదములను తూచాతప్పక నేడు లేవనెత్తుట సాధ్యముకాకపోవచ్చును. కాని వానికి పునాదులైన గురుగంభీర నిబంధనలు అర్వాచీన సభ్యతకు మూలబంధములైనగాని, మానవజాతి పునరుద్ధరణము నందజాలదు. వివిధాశ్రమములందుం దొలి యాశ్రమము ప్రధానమైనది బ్రహ్మచర్యము; వ్యక్తిగతజీవన వృద్ధికిని, జాతీయజీవన వృద్ధికిని ప్రధానమైనది. దివ్యభావములకును విజ్ఞానము బ్రహ్మచర్యదీక్ష నెఱపు జిజ్ఞాసువున కందు బాటగును. సంయమజీవనమునకు శిక్షణాంగణము బ్రహ్మచర్యము. దీనికి తన మనుష్యశక్తులు క్రమాభివృద్ధినందును. ఆత్మశక్తి అరచేతిపండగును; సంపూర్ణజీవనమునకు రహదారు లేర్పడును. ఇట్లని ప్రాచీన నాగరకత సహస్రాబ్దులకు మున్ను రూఢి చేసినది. * విద్య (పురుషవిద్య యనుడు, స్త్రీవిద్యయనుడు) పెంపొందజాలుట బ్రహ్మచర్యమంచే.

* "At the basis of the old Aryan system was the all-important discipline of Brahmacharya ... the foundation of the Structure they have to build, can only be the provision of a fund of force and energy sufficient to bear the demands of a continually craving activity of the memory, judgment and creative power...one of the chief processes which they used for the increased storage of energy, was the practice of Brahmacharya" (vide Aurabindo Ghose's "The Brain of India" pages 18, 20, 24).

# నేటి విద్యాపాటవము

శ్రీమతి అవంట సత్యవతమ్మగారు

“కానివాని నూతఁగోని, కానివాఁడు విశిష్ట వస్తువుల్ కానవిధంగి”గా యున్నాయి సర్వవిషయాలను. ఏది తిలకించినా విచారమేస్తున్నది. సాంఘికపరివర్తనాలంటూ సంఘ విమర్శనలంటూ, కళాపోషకత్వమంటూ బయలుదేరినవి. వారపత్రికలవారిగా దేశమంతటా పుట్టగొడుగులవలె వేగముగాపుట్టి, శీఘ్రముగా గిట్టివేయుచున్నవి. ఇట్టివే నాటకాలు. నటించస్న చలామణి, నివురుగప్పిన నిప్పులాంటి పౌరాణిక చారిత్రిక దృశ్యప్రబంధాలకిలేదు. ఆదర్శమాసపత్రికల కసలేలేదు. ఎందుచేత? నవీన యువకులందరూ సారస్వత కవీంద్రులే. పత్రికాస్థాపకులువారే. పాఠకులు వారేయైనప్పుడిట్టి త్రిమూర్త్యాత్మక శక్తి విజృంభణమునకు లోటేమి?

వీరి దృష్టిలో పౌరాణికగాథలు పాతయుసిరిక పచ్చడివలె నగ్గుబడిపోయాయి. తినఁబోవుచు రుచి యడుగనేలయున్నట్లు నలుప్రక్కలగనుచున్న దృశ్యములే సాంఘిక దుర్విషయములను దిద్దవలెనన్నచో నీతియుత విషయములను వ్రాసియు నటించియు చూపించాలి కాని నిత్యమును యెదుటగనుచు వినుచున్న నాటినే నటనారూపకంలో రాత్రిబంగారులాంటి నిద్రపోగొట్టుకొని శేబునందలి చేవకాస్తదులిపికొని చూచి యేమి నేర్చుకొనుచున్నాము. అట్టి దృశ్యము లాబాలగోపాలము హృదయముల హత్తించుకొని చర్చించుకొని సంతరించుకొనుచున్నారు. లేకపోతే వాడుబాగ యాక్టుచేయలేదు. వీడు రౌడీ పాత్ర బాగా పోషించాడుకాని చాంతాడు సంగీతముతీయక త్రుంచేశాడనియో కబుర్ల కాలక్షేపము. ఇంతేనా? ఇది వివేకమా? అజ్ఞానమా? దిస్సుబాటా? విద్యాపాటవమా? ఏదీకాదు. నూటికి సగమిళ్లలో త్రాగుడు డ్రామాలు జరుగుచునేయున్నవి. కులకాంతల గోలలు వినబడుచునే యున్నవి. అదే నాట్యకళాపోషకత్వమంటూ రాత్రి రూపకంలో చూచుటచే సంఘము మార్పుచెందునో కాదు. అట్టివారింట్లకేగి బుద్ధిమంతులు చేతనయితే ప్రబోధించి దిద్దాలికాని ఇసిక తక్కెడ పేడతక్కెడమాదిరి కుండమార్పుల పెండ్లిండ్లమాదిరి పగలు వాళ్లాడేది రాత్రి వీళ్లాడితే రాను వాళ్లకుబుద్ధి. ఇంకా చూచినచిన్నపిల్లలు పాడగుచున్నారంటే చర్వితచర్వణము వినుగునకు హేతువు.

“ప్రహ్లాద రుక్మాంగద రామదాసు” మొదలగు నాటకాలు చూచివచ్చిన కొన్నాళ్లవరకు పదిమంది యాడువాళ్లను పోగేసుకొని పిల్లలు భజనచేసుకొని దైవకార్యనిమగ్నులయేవారు. ఇప్పుడో రాత్రితాజూచిన తాగుడుపాత్రధారియొక్క “చుక్కానీ బొడ్డుపాక్క చురుకు తీయవే” యంటూ ఒకసీసాలో ఇన్నినీళ్లు పోసుకొని త్రాగుచూ తూలుచూ పాడుచూ యాక్షన్ చేయుచున్నారు. అది తప్పని అల్లాత్రాగినవారు చివరకల్లా పాడైయారని కొసవేదాంతము, ప్రాయశ్చిత్తము పిల్లలకేమి తెలుసును? వార్కలేత హృదయాల్లోకి ఆచిను మెక్కిపోయింది. మంచో, చెడ్డో, లేతహృదయమప్పుడే సుక్షేత్రమందు నాటిన బీజములవలె మొలకెత్తి తీరుతుంది. చిన్నమొక్క నేలావంచిన యలావంగుతుంది: చెట్టుముదిరాక వంచితే పెళుక్కునవిరుగుతుంది. అంతే మానవ బాలక సంగతిన్ని గాన పెద్దలుమంచియాదర్శము చూపించిననే ముందు ముందు సంఘము బాగుపడును. కాని ఇట్టి యవినీతి దృశ్యప్రబంధములు సంఘవినాశన మార్గములే కాని సంఘోన్నతికాజాలదు. ఇంతకు నే గూటి చిలుక కా పలుకి కదా?

"అడుసు త్రొక్కనేల కాలు కడుగనేల" యని యొకజారిణిపాత్రను దానికింకి విటునిగూర్చి రంగమును శృంగారరసముగాఁ జూపించి చివరకు ముష్టిచెంబే గతియౌ నట్లంతమందు రవంత వైరాగ్యమునుఁ గన బర్చుటేమి సంఘసవరణలగును? కళ్లకుకట్టించిన రసికత్వనటనాప్రవీణముగ్ధులై చూచే యువకుల కవే పట్టుబడును కాని చివరఫలితములు వీరికిని చివరనే ఫలించును. ఎరుగనివారికి యెరువువెట్టుటన్న నిట్టిదే.

ఇప్పుడు హాస్యపత్రికలు కథలువ్రాసే మహాశయులలో కొందరు బాల్యయౌవ్వన మధ్యగతులు తారుణ్యామందని లేతలేతములు ముగ్ధహృదయములు, బ్రహ్మచారులు, గృహము, స్త్రీ, సంతానము యనగనేమియో యెరుగనిచిన్నలయ్యును, వారువ్రాసే వ్రాతలు చూస్తే సకలానుభవశాలుల ననుకరించుచాతుర్యములును గలిగియున్నవి. చదువవలసిన యువకవిద్యార్థికి విద్యావిషయకచింతలే ముఖ్యం కాని సహాధ్యాయిని యగు స్త్రీ చింతచే యామెను చింతించుచు యన్య మనస్సుతో దీపంచూచుకొనక ముందుకు జరిగితే పరీక్ష రోజులలో మూతికాలి డాక్టరు ట్రీటుమెంటున్న పరీక్షకురానందుకు డాక్టరు సర్టిఫికెట్లును కావలసిన ఫలితములా? ఈలాగైతే మనవూర్వులు ఆధునిక ఘనోద్యోగులు యేలాగుచదివి నిర్వహించుకొన్నారు? ఇట్టివ్రాతలు ముందువారికిదారా? వెనుకవారికిమార్గా? ఏమీ తెలియక అర్థముకాక నీతిలేక చదువలేక సంసార్లు తహతహలాడుచున్నారు. వీరికెంతసేపూ శ్రీమతి వరలక్ష్మమ్మ సోదరి వ్రాసినటుల "స్త్రీ" కథావస్తువు! పోనీ అదైనా మంచిగాసాగిస్తారా? ఆనుండి తుది వరకు స్త్రీయే అపరాధిని, లయలమారి, సర్వనాశన హేతువు, మూర్తస్వరూపిణిగానిరూపిస్తారు. మాయవల, అమాయికపురుషులనందు జిక్కించుకొను నేర్పుకత్తెగా ప్లాటుసాగిస్తారు. ఇంతకన్నవారు తెలిసికొనిన విజ్ఞాన మంటేగా!! రసహీనకవిత్వము. ఒకరినిచూచి యొకరు నొకరు—అనుకరణములు. గ్రంథచౌర్యములు. విద్యా పాటవశక్తి నేర్పులలవడుట నూటికొకరు "పూర్వ జన్మసుకృతముగా వచ్చిన కవిత్వసంపదయుంటే నవరస పోషకత్వమెందైన నిర్వహించవచ్చుననియు అది మంచిగా వినియోగించుట మేలని" మెత్తగా సోదరి విమర్శించనే విమర్శించినది. అయితే మేటరులేని మహాశయులకం దేతదుములాటలు.

ఒకకథలో అత్తగారంటే కిట్టక కైకలా గలిగి దశరథునిచే తకన్నకొడుకును కానలకంపించిన చందాన అత్తగారిని చంపుటకై మగనిని వేధించుకొని తిననట్లు లిఖించారు. చూడండి స్త్రీవ్యక్తులపై నెంతయసహనమో!! దేనికైన నడుముకట్టి వెనుదీయక సిద్ధపడు ధైర్యశాలి పురుషుఁడు కాని స్త్రీకాదు "స్త్రీ" హృదయము దయాపూరితము మార్దవయుతము మాధుర్యయుతము ప్రేమనిలయము." ఇట్లని పూర్వ కవులే మహాగ్రంధములలో లిఖించినారు. దీనికి "ద్రౌపది" తార్కాణము. నిద్రాసక్తులై యధీరులై యవ్యక్తులై అసహాయులైయున్న తనపుత్రులైదుగురు కుమార్లను (ఉపపాండవులు) అధర్మయుతముగా కటికవాఁడు మేకలనుఁగోయు చందాన, అశ్వత్థామ నఱుకగా అర్జునుఁడాతనిబట్టి తెచ్చి నఱుకనుంకించ గర్భవాసశోకగ్రస్తయైన ద్రౌపది యాతని నివారించి "ప్రతిక్రియచే అశ్వత్థామతల్లికికూడ పుత్రశోకముఁ గల్పించుటేల! పుత్రశోకవిహ్వలనై నేనొక్కతెనే యుండెదను కాని తిరిగి మఱియొక స్త్రీకి గల్పించనొల్ల" ననిభర్తను వేడికొని యాశిశుఘాతుకుని క్షమించి విడిచిపుచ్చెనని భారతమే చాటుచున్నది. అంతకంటె యుత్కృష్టనిదర్శనమింకేదిఁగలదు. ఇట్లని హృదయ దుర్బల స్త్రీ కాజాలదు. తన్నవమానించిన సమయమందామె శక్తిస్వరూపిణిగామారి లయకారిణియై తీరును. దీనికిని ద్రౌపదియే యుదాహరణము. ఒకచో ద్రవీభూతప్రేమహృదయము; ఒకచో కురులుపట్టి యీడ్చి సభాభవనమున పెద్దల సన్నధిని వస్త్రాపహరణ మొనర్చిన దుశ్శాసనునిపై తీరనిపగ. ఆ దుష్టుని

చంపిన రక్తహస్తముల నాయమకురుల ముడివేయించుకొనువఱకు నట్లనే ద్వాదశవర్షంబులు కేశబంధ మొనరించుకొనవనని ప్రతినబట్టి నెరవేర్చుకొని తీరినది. అంతేకాని అవకాశములేని నీరసకథలకెల్లా "స్త్రీ" దుష్టురాలేనా? అట్టికథలువ్రాసి మాతృస్థానముల నపవిత్రపఱచుట కథాకర్తకవమానమని చెప్పవచ్చును. ఏక్కడో నూటికొక్కరు కైక చిత్రాంగులవంటి స్త్రీలుండ్రుగాక కలియుగ దుష్టపురుష సంఘములో నొకరిద్దరు స్త్రీలున్న కథానాయకులై కథావస్తువు లవుదురా?? పిసుక్కిబియ్యానికిహూడ నొకలే మంత్రముగా ప్రతీకథలోను హీరోహీరోయినుకేమిచ్చి ముగించుట భావ్యముకాదు. సన్మార్గముకానీ దుర్మార్గముకానీ స్త్రీపురుషవ్యక్తులుకూడనిదే యేపనియు కాజాలదు. అట్టియెడ ఆకాశమందలి విమానసంచారిణిజూచి నౌకావాసియగు ప్రయాణీకుడంతలోనే యామె వికారచూపులకలకు భ్రమసి దృఢమోహబంధితుండై యామెకేసిచూస్తూ కొయ్యముక్కై కర్రలాబిగుసుకుపోయి తాను వెళ్లేగమ్యస్థానము ప్రయాణోద్దేశము కూడ మరచి ప్రపంచకమేమరచి తనెందుండెనో తెలియక విమానంకేసిమాస్తూ పట్టుతప్పి సముద్రంలోపడి యీదిపెడుచుండగా విమానం విధివశమున పాడై తానున్నచోటకేపడి యిందుండుపిల్లములుగ సిద్ధమై యుండ తాదీసి బ్రతికించి కౌసల్యాదశరథులవలె గట్టుచేరి కళ్యాణంచేసుకున్నారా? గాథలివి. మెరుపు దృశ్యంలాంటి విమానవేగంలో యందలి బాలిక చూపులు హాయిలు వీనికి గనుపించాయీ!

ఆరునెలలు సహవాసం యొకరితో నొకరుచేస్తేనేకాని ఆంగ్లులు పెండ్లే యాడరట అట్టియెడ ఆంగ్లవిద్యాపాటవులమనుకొను మనయువక విద్యార్థకవుల కల్పనాకథలలోని కాముకుల కటాక్షణికచూపులకే బందీలై పోవుచున్నవి ఏమివ్రాతలు పిచ్చివ్రాతలు!! ఈ వ్రాతపఠనకొఱకు పత్రికవచ్చిందంటేనే నాకు నాకనిజగడాలు!! భారతీయ విజ్ఞానపాటవ మింతకోసలోకి దిగింది చివరకు జాతీయవిద్యాభ్యాసరహితులై పరవిద్యాపారంగులమన్న గర్వదుర్మోహముచే నింతవచ్చినది. ఇకనైన కనువిచ్చి స్వజాతీయ, విజాతీయ, భేదములు గుర్తించి మూల్యగంధ మహత్వములు గ్రహించిన మన విద్యలదేవి కింతటి పీకనొక్కులు సంభవింపజాలవు. సరస్వతీదేవి కాటుకకంటి నీరు కట్టించినాడా మహనీయుడు పోతన: ఇప్పుడామె కంటిప్రవాహము వక్షస్థల పర్యంతమంటజేయుచున్నారీ మహాశయ కవీంద్రచంద్రులు. ఇట్టి వ్రాత లపవారించు విజ్ఞానవ్యాసావళుల మర్గాలి. వారివ్రాతలు పత్రికానిర్వాహకులామోదించి ప్రకటించాలి; ఆర్యవిజ్ఞానామృతమహాకిగా ఆధునిక ప్రపంచమంతటాజల్లాలి; జాతీయ జ్ఞానబీజములు మొలకలెత్తాలి. తిరిగి విజ్ఞానఫలములు మనమనుభవించాలి. యెన్నటికో!

ప్రకృతి "స్త్రీ" శీలవతి పతినాకర్షించును. తన పవిత్రప్రేమ హృదయమున ధవునకు స్థాన మొసగును. అట్లే ప్రకృతి తనధవుండగు పురుషు నాహ్వానించును. పురుషుండనద్దైవము. దైవారాధనకై ప్రకృతిశోభించును. పవిత్రలతాపుష్పముల నాతని పాదార్చన చేయును. ఇదే వసంతశోభ. ప్రభాకరార్ధాంగియగు పద్మిని పతిరాకకై, ముఖమంత చేసికొన్నట్లు వికసించును. అందలి మాధుర్య మాస్వాదింపనాభాస్కరునికే హక్కుకాని పరపురుషసమానుడగు అళిరాజునకు హక్కుగలదా? అయినను విషయవాంఛారితుండగు పురుషుండు, విమర్శనజ్ఞానశూన్యుండై పరస్త్రీవాంఛామోహమున జిక్కినశించురీతి యాభృంగ మందలి మకరంద మాస్వాదింప నందు వ్రాలగనే సాయంకాలమగుడు నిజనాథుడ స్తమింపవిచారాక్రాంతయైముఖము ముడుచుకొనగనే ముకుళీకృతకమలమందు ఖైదీవలె జిక్కి యా పరభృత మందు నశించును. దీనికి ఇంద్ర నరక రావణు లుదాహరణ లయ్యేయున్నారు. అట్టి యెడ పవిత్రప్రణయీపతి సేవాపరాయణులగు నార్యావర్త స్త్రీలపై నంతటి యపవిత్ర కథలల్లి

# మీ రా బా యి

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తిగారు బి. ఏ.

ఆమె తలిదండ్రు లరయ బాహ్యప్రవృత్తి
భోగలాలస పాశ్చాత్య భూమిజనులు
ఆమె ప్రభవించినది భువనైకవినుత
భవ్య ధర్మాభ్యుదయకారి భరతభూమి.

అరయ పాశ్చాత్యదేహంబు; అనఘతమము
భారతీయాత్మయున్ గూర్చి నేరుపుమెయి
నంటుకట్టగ ప్రభవించినట్టి విమల
పరిమళోల్లసితార్ఘ ప్రసవమామె

టక్కు టిక్కనుచు బల్ టెక్కుమీరగదాల్చు పాదరక్షలనెటో పారవైచె
పలచని మడతబట్టలు కట్టుటనుమాని ముతుకగుడ్డలుకట్టి మురియుచుండె
తమదేశ సాంప్రదాయమును పోనాడి, మెప్పుగ బ్రహ్మచర్యంబు పూనియుండె
తనసుకుమారజీవన పద్ధతినివీడి ఏపనినైన గావించుచుండె.

తనశరీరాత్మలవి భరతావనివె య
టంచు జగతిని విశదీకరించుచుండె
ఆమె మనభారతీయకాంతాళికెల్ల
మార్గదర్శకురాలయి మసలుచుండె.

అధికాడంబర జీవనానుకరణ వ్యామోహవారాశిలో
సుదతుల్ మున్గుచు దారితప్పి చనగా చోద్యంపుచుక్కానియై
ప్రథితంబౌ మనభారతీయతకు మార్గం బొందుచూపించెని
య్యదెయంచున్ తన స్వచ్ఛజీవనముచే; ఆమెన్ స్తుతింపందగున్.

# కవి వాక్సిద్ధి

భ. పట్టాభిరామయ్యగారు, ఎం. ఏ. ఎల్. టి.

(ఫిబ్రవరి నెల తరువాయి)

## ప్రథమరంగము.

(శివరాత్రినాడు దాక్షారామమునఁ బార్వతియింటి యెదుటివీధి. ఇంటిముందొక పాతరగోయి. పార్వతియు భీముఁడును వీధియరుగుపైఁ గూర్చుందురు. యాత్రికు లనేకులు వీధివెంటఁ గోవెలకుం జనుచుందురు. చలి యెక్కువ).

పార్వతి:—‘శివరాత్రి’యను మాట విన్నమాత్రాన పాత చింతలన్నియు జ్ఞప్తికి వచ్చుచున్నవి భీమా!

భీముఁడు:—ఔను కాని పుత్రునిఁగనుటచే నీ కష్టములన్నియు తీరిపోలేదా?

పార్వతి:—ఔను, నాయనా అందులో నీవంటి విఖ్యాతుఁడగు పుత్రునిఁగంటినని నాకు గర్వముగనే యున్నది. నీవుండ నాకేమి తక్కువ? అయినను నేను నీపుట్టుకచేఁ బడ్డ యపవాదము బహిష్కారమునుఁ

భీముఁడు:—అంతయు శుభముగ ముగిసినదిగదా? ఇఁక చింతయేల? [పార్వతి యింటిలోనికి నిష్క్రమించును. కళింగ గంగరాజు భిక్షుకుఁడై జడలఁ దాల్చి చేతఁ గఱ్ఱయుఁ జిప్పయుఁ జోలెయుఁ బూని ప్రవేశించి చీఁకటిలో నింటిముందున్న గోతిలోఁబడును]

కళింగ:—పైకి లేవనెత్తుండయ్యా! ఛీ! కాలి దివిటీ లేనివాని బ్రతుకేల?

భీముఁడు:—[తనలో] ఇతఁడెవఁడో గొప్ప వాఁడై యుండవలయును. [ప్రకాశముగా] ఎవఁడవు నీవు?

కళింగ:—బిచ్చగాఁడను.

భీముఁడు:—ఎల్లపుడు భిక్షుకుఁడవా? అటులఁ దోఁచదు.

కళింగ:—భీమకవి శాపమున నిట్టి భిక్షుకుఁడనైతిని.

భీముఁడు:—ఏల కవిశాపము నొందితివి?

కళింగ:—గర్వితుఁడనై యాతనిఁ జిన్నపుచ్చితిని. ఆ పాడుగర్వమే నన్నీస్థితికిఁ దెచ్చినది.

భీముఁడు:—కళింగగంగరాజా! నీవింకను పోల్పనేరవా? నేనే నీకు శాపమిడిన భీమకవిని.

కళింగ:— వాక్సిద్ధించెడి వరకవీ! వినుము

> గర్వాతిశయముచేఁ గష్టమొందితిని.
> కప్పము మునునాకుఁ గట్టెడిరాజు
> నాతోడఁ బోరాడి నారాజ్యముఁగొనె.
> నను(బట్టి ననుఁజంపి నాతలఁదెచ్చిన
> వారికి బహుమతి వాగ్దానమిచ్చె.
> గూఢచారు లనేకులు వెంటఁ దరుమ
> వేగమె యటనుండి వెడలి వచ్చితిని.
> శివరాత్రి కొఱకు యీ క్షేత్రముంజేరు
> బహుసాధువులతోడ వచ్చితినిటకు,

పడయుదుఁగాతనే భద్రంబు సిరులఁ
బాపములన్నీడి భవదీయకృపను.

భీముఁడు:—కళింగరాజా! మున్ను గర్వముచే రాజ్యభ్రష్టుఁడవైతివి. ఇపుడు పశ్చాత్తాపముతో నమ్రుఁడవైతివి, కావున మరల నీకు రాజ్యము ప్రాప్తించును. కళింగపట్టణమున కేగుము.

కళింగ:—అయ్యో! వైరులపాలఁబడనా?

భీముఁడు:—ఆ భయ మక్కఱలేదు. నీవైరు లెవ్వరు నిన్ను నుక్రించరు. చెచ్చెరఁజనుము.

కళింగ:—వాక్సిద్ధ! పునరపి నేను రాజపదవి నొందితినేని, కృతజ్ఞతాపూర్వకముగ నిన్నుఁ [illegible] నిం గావించెద. ఈరాత్రి నీయరుఁగుపైనను నిదురించ నిమ్ము.

భీముఁడు:—నీవక్కడి తిన్నెపైఁ బరుండుము. పలుపు నియ్యనొల్ల, నేలయన, నట్టియుపచారములు సేసినచో నీవు బయలువడుదువు.

[కళింగరాజు తిన్నెయందె శయనించును. గురులింగము ప్రవేశించును.]

గురులింగము:—అయ్యా! ఇది పార్వతమ్మగారి పూటకూళ్లయిల్లుగ నుండెనుగదా. ఇప్పు డేమియు సందడిలేదేఁ? శివరాత్రిగదా?

భీముఁడు:—మున్నిది పూటకూళ్లయిల్లుగ నుండెను కాని యిప్పుడు కాదు.

గురు:—ఆయమ యున్నదా?

భీముఁడు:—అమ్మా! [అని పిలుచును.]

గురు:—అయ్యా! మీరామె కుమారుఁడుగదా? [పార్వతి ప్రవేశించును] అమ్మా! మరల నన్ను చీపురుతోఁ గొట్టఁ దలఁచుచుంటివా?

పార్వతి:—అయ్యా! క్షమియింపుము. నేను తమ శక్తిఁ దెలియక పొరబడితిని. మీరనినట్లె యయినది.
నాయనా! ఈతఁడు మంచి సాముద్రికుఁడు. నీవు జనియింతువని మున్నే నాకుఁ జెప్పె.

భీముఁడు:—ఏదీ! అట్లైన మీ హస్తం బరీక్షించెద. ఆయరుఁగుమీద బిచ్చగాని చేయిం జూడుఁడు.

గురు:—[కళింగరాజు చేయిం జూచి మోమున సంతోషము దోఁపుచు] అయ్యా! మీరు నిజముగ భిక్షుకులేనా?

కళింగ:—కాకేం. మరేటంటావయ్యా?

గురు:—రాజవు. ఇది రాజహస్తమే. ఏదీ యా దీపముచెంతకు రండు. హా! తెలిసినది. [illegible] పాలై పదభ్రష్టుఁడవైతివిగాని, చిం[illegible]. మరల రాజ్యప్రాప్తిగల్గును. సిద్ధము.

కళింగ:—ఆరే! మా [illegible] చెప్పావయ్యా భికారిముండాకొడుకు రాజట [తిన్నెయందుండి లేచి మూలంజేరును].

భీముఁడు:—కళింగరాజా! అతనికి [illegible] దెల్పనగు, [illegible]. అయ్యా! సాముద్రికము మీ కత్యద్భుతశక్తి గలదే! కళింగరాజునకు [illegible] రాజ్యప్రాప్తి యయినచో మీకు [illegible] పట్టును. [కోడికూయును. [illegible] దొంగరుల యెలుఁగనిరు [illegible] మేలు. (గురులింగము నిష్క్రమించును).

పార్వతి:—[illegible] చూచి వచ్చెదను.

భీముఁడు:—అమ్మా! [illegible] గాఁ [illegible]. ఎవ [illegible] కలుగును. [పార్వతి యింటి లోనికి నిష్క్రమించును.]

కళింగ:—[ఇదేమి తెల్లవారు వేళగదా యని యిటు నటుఁజూచి భీముని పాదములకు సాష్టాంగప్రణామము నాచరించును] నే నెల్లప్పుడుఁ దమకుఁ గృతజ్ఞుఁడనే. [నిష్క్రమింతురు].

## ద్వితీయరంగము.

(కళింగపట్టణములో నొక యడవి. విజయవర్మ ఖడ్గకవచముల ధరియించి క్రిందఁ బరుండి నిదురవోవుచుండ, జుట్టు గడ్డముఁ బెంచుకొని జీర్ణవస్త్రములతో నొక ఖడ్గముం జేఁబూని లక్ష్మీపతిరావు ప్రవేశించును.)

లక్ష్మీపతిరావు:—[జయవర్మపైన వంగిచూచుచు] ఓసీ! ద్రోహీ! నీజీవితమున కాశించి రాజును శత్రువు లని బట్టియిచ్చితివా? ఎట్టి సుఖము నీకుఁదగినది? ఖడ్గముచేతనా? నిప్పుచేతనా? నిదురించువారిం జంపుట యోధులకు పాడి కాదంద్రు. యోధధర్మము నాకేల? రాజ్యతంత్రమే నేను పాటించెద. ఎయ్యది లాభించునో యదియే పాడియగు. అయిన నితని నిదురనుండి లేపెద. [లేపఁబడిన జయవర్మ దిగ్గనలేచి కూర్చుండి [illegible] చెంది యిటునటుఁ జూచును.]

జయ:—ఓహో లక్ష్మీపతిరావు! నెనరులేని విజయుఁడు నన్నుఁ జంపయత్నించెనుసుమీ!

లక్ష్మీ:—అతికుతూహలముతో నాపనిని నే నిపుడు ముగించెద. [జయవర్మను పొడిచి చంపి వేయును]. ఇపుడుగదా రాజునకు న్యాయముజరిగినది. లోకమునుండి యొక రాక్షసుఁడు తొలఁగె.

[పరశురాము సైన్యాధ్యక్షుఁడు, భీష్మపరుఁడు కళింగరాజు యిరుప్రక్కలనుండి ప్రవేశింతురు. రాజునకు తక్కినవా రెల్లరు నమస్కరింతురు].

కళింగ:—బాగు! బికారిముండాకొడుక్కు దణ్ణా లేటుండె? మీకు మతిపోయిందా యేటి?

లక్ష్మీ:—వేషమా లక్ష్మీపతిని మోసపుచ్చఁ జాలదు. ఆ చెంపమీది పుట్టుమచ్చ నే నెఱుఁగ నిదిగా? [జయవర్మం జూపుచు] చిత్తగింపుఁడు. తమ ముఖ్యసర్దారు వచ్చె. రాజద్రోహము సేయుటకై యిఁక యెప్పుడును లంచములకై యీ చేతికి దురద యుండదు.

కళింగ:—నాయందలి ప్రీతియు భక్తియుఁ గల్గి వర్తించిన మిమ్ములను గర్వాతుఁడనై శిక్షించిన పాపమును క్షమియింపుఁడు. ఈకళింగగంగు మరల రాజయ్యేనేని యన్నిటిని సైరణసేయును. నమ్ముఁడీ.

పరశు:—ఎంతో కాలముపట్టదు. శీఘ్రమే మీకు శ్రీదశపట్టునగా తోఁచుచున్నది. రాజద్రోహి జయ వర్మ యానతిచొప్పునఁ బోరాడకుంటిమి యని సైనికు లందరు చింతఁగొనియున్నారు. విజయుఁడుగూడ తనకు దగని యదృష్టము నొందినవాని గుణములం జూపు చున్నాఁడు. కృతఘ్నత, అనుమానము, క్రౌర్యము మున్నగు దుర్గుణముల పుంజమాతఁడు. కావున మేము మరలివచ్చుట కతి యనుకూలమగు కాలమిది. మా యిరువురికి మరల యూరికిఁ జొచ్చుటకు రాజానతి యిప్పుడే విమాపకుఁడు తెచ్చియిచ్చెఁ గావున మేమును వత్తుము. మఱియొకవార్త. తన యరబ్బీ గుఱ్ఱము విజయుని కాని మఱి యితరులను కాని చెంత రానియ్యకఁ దన్నుచున్నదఁట. విజయుఁడు కుపితుఁడై తమరిని దానిపైనెక్కించి తమరిని గుఱ్ఱముఁగూడఁ జంపుదునని పంతగించె. ఇందులకై తమరింగూర్చి యొక నాటకము వేయించునఁట. తమరుతప్ప వేరొక్కఁడా యశ్వము నెక్కఁజాలఁడు కావున, విజయుఁడు సైగచూపఁగా తమపై బాణము వేయుట కొకభటుఁడు నియమింపఁబడియెనఁట. తమరు ముందెత్తువేసి రాజ్యముం బొందుఁడు.

[రాజసేన వచ్చెడిశబ్దము వినును].
త్వరపడుఁడు, సర్వేశ్వరుఁడు తోడ్పడుఁగాక!
[కళింగగంగు నిష్క్రమించును]
ఈశవమును దాచవలయును.

[ఇరువురు జయవర్మకళేబరము నొకపొదలోఁ బారవైచి యిరుదెసల నిష్క్రమింతురు.]

## తృతీయరంగము.

(కళింగపట్టణమున నొక సత్రము. ఆనందుఁడు వీధియరుగుపైఁ గూర్చుండును.)

ఆనం:—రాజు నియమించిన పక్షకాలములో నొక వారమైపోయినది. కళింగగంగు వేషముంబూన నొక్కఁడు దొరకఁడయ్యె. ఆ పోకిరిగుఱ్ఱము నెక్కుట ముఖ్యమని రాజనియె. ఈబాధలేకున్న నెవఁడైన దొరకును. కళింగుని యశ్వము నెక్కి యాతని వేషము వేయువానికి రాజు బహుమతినిచ్చునని ముమ్మారు డప్పులతో నీయూరఁ జాటఁబడినది. [కళింగగంగు ప్రవేశించును] నియమితకాలములోఁ దగిన వేషధారి దొరకనియెడల రాజు కోపగించునేమో. నాగతి యేమగును?

కళింగ:—బాబూ! మాధవకబళమండోయి!

ఆనం:—ఛీ ఛీ! పొమ్ము, సోమరీ, అనేకులు మంచిదేహదార్ఢ్యముగలిగియుఁ, దామే కష్టపడి ద్రవ్యమార్జించక సోమరితనముచే బిచ్చగాండ్రై పరులచేఁ బోషింపఁబడుచున్నారు. వీరే మన దేశారిష్టకారకులు. ఛీ! పొమ్ము ఇంకను నిలచెదవేల?

కళింగ:—అయ్యా! నేను చేయఁదగిన దెద్దైనఁ గలదా?

ఆనం:—కళింగగంగురాజువేషము వేయఁగల వాడు మాకుఁ గావలయునని యూరంతయు డప్పులతోఁ జాటితిని కదా? నీకెఱుఁగదా?

కళింగ:—వినలేదండి. తీర్థయాత్రనుండి నేనిప్పుడే యీ యూరఁ జేరితిని. బిచ్చగాడెటుల ప్రభువువేషము వేయఁగలఁడు? ఈ రెండిటికిని హస్తిమశకాంతరము వాసియున్నది గదా!

ఆనం:—నీకేమితక్కువ? మంచి దేహచ్ఛాయఁ గలిగి యొడ్డుపొడవు గలిగియున్నావు. స్నానమాడి కళింగగంగరాజుమంగలిచే క్షౌరము చేయించుకొని, యాతనిదుస్తులు ధరియించిన కళింగరాజు వె యగుదువు.

కళింగ:—(స్వగతము) ఈతఁడు నన్ను గుఱుతు పట్టెనా యేమి? భగవంతుఁడా! (ప్రకాశముగా)

గీ. విభుఁడు గానేరఁడెవ్వఁడు వేషమునను
పేదవాఁడు కిరీటముం బెట్టుకొనిన,
క్షౌరమొనరించి దుస్తులఁ జక్కఁగాను
వేసికొన్నను దెలియదు వేషమంచు,
మాటనైన ఖరిచేష్టనైన మఱియుఁ జెప్ప
నలవిగానట్టి చిన్నెచేనైనఁ దుదకు.
రాజునొక్కని నెక్కండ్రు రైతుగుంపు
నడుమ గద్దెను వేసి జీర్ణాంబరముల
తోడనిల్పిన రాజని తోఁచునతఁడు
వ్యానాశ్రిత శిక్షచే క్షురులచే.

[చేతికఱ్ఱ క్రిందఁబడ, వంగియెత్తుకొనును.]

ఆనం:—(తనలో) ఈతఁడాడినమాట యితనికి చక్కఁగాఁ జెల్లును. తెలిసికొందగిన భాషావ్యాసలు కని యం దున్నవి.

కళింగ:—మఱియుఁ బెద్దకవీశ్వరులు వ్రాసిన గద్యపద్యాల నేఁ జదువఁజాల.

ఆనం:—పఠించఁదగినది యెంతయో లేదుగాని దానికంటెఁ గష్టతరముగుఁ గార్యము నీవు చేయవల యును. కళింగగంగునియశ్వము ఒరుల నెక్కనీయ కున్నయది. చెంతవచ్చినవారి నెల్లఁ గఱచుచుఁ దన్ను చున్నది. దానిని వంచి యెక్కవలయును. చేయఁ గలవా?

కళింగ:—ఒకవేళ చేయఁగలనేమో. అశ్వవశీకరణ మంత్రమొకటి నేనెఱుంగుదును. ఒక్కవారము పర్యంత మనుదినము నడిరేయి నన్నాగుఱ్ఱమువద్ద వదలినచో దానిని లోఁగఁదీయుటకు యత్నించెద

అది నాచేతనైనచో రాజుయొక్క మంగలి సాయము చేతను, ఆతని ఖడ్గము దుస్తులను ధరియించుటచేతను నేనా వేసము వేసెద.

ఆనం:—నేడు శనివారముగదా? కోటలోని యశ్వశాలలోనికి నీ వేగుట కనుమతిని వెంటనే పొందెద. నీవు శక్తికొలఁది ప్రయత్నించి రాఁబోవు శనివారము నాడు నీవు వేషముఁ గానఁగలవా లేవా నాకుఁ జెప్పుము. ఇది సమర్థించఁగలిగిన సర్వప్రాప్తు గల్గును సుమీ. [లోనికేగలేచును.]

కళింగ:—(తనలో) నిస్సంశయముగ (ప్రకాశముగ) అయ్యా, నేనిది చేయఁగల్గినచో బహుమతి యేముండును?

ఆనంద:—వేయిన్ని నూరుపదహార్లు కట్నముం దానితో హేమకంకణములు, జోడు కాశ్మీరశాలువలున్ను, మఱియు నిన్నాస్థాన నటకునిగఁ జేయును. నేడు సాయంకాలమువచ్చి యశ్వశాలలోనికిం జనుట కనుమతిఁ గొనిపొమ్ము.

కళింగ:—చిత్తము. [నిష్క్రమింతురు.]

## చతుర్థరంగము

(రాజుయొక్క యశ్వశాల— రాత్రి— కోడికూయుటకు జాముముందు— కళింగగంగు ప్రవేశించును. చంద్రయాను గుఱ్ఱము సకిలించును.)

కళింగ:—నాచంద్రయాను గుఱ్ఱంబి, తన ప్రేమను జూపుటకు సకిలించుచున్నది. నీవు శబ్దముచే నౌరులు నను గనుగొనుదురుగదా! నా కుడిభుజము కుడికన్ను నదరుచున్నవి. ఇది శుభసూచకము లందురు. సందియమేల? సరియే. ఇవి పేర్కొనిన పున్నమవాటి నే నైదుదినములు. నావలెనే నేపాత్రధారిని గావలయు, తనవలెఁ దానుండుట కష్టము కాదు కాని, కొంత భేదముండిపోవును. లేకున్న నౌరుల కనుమానము గలుగును. ఇదియే కష్టము.

[అశ్వశాలాధికారియగు శ్రీహరి ప్రవేశించును. కళింగుఁడు కోటలోనికిం జన యత్నించును; శ్రీహరి పట్టుకొని వెలుపలికి లాగును.

శ్రీహరి:—నేను నటకుఁడను, రాజుగారి యనుమతిఁబొంది యిటకు వచ్చితిని. [ఇతరు లెవ్వరు చెంత లేరుగదా యని యిటునటుఁ జూచి,] రేపు తమరు విజయునిఁ జంపుట కంతయు సిద్ధముగనున్నది. తమరు జంపుటకు నియమితుఁడగు విలువకాఁడు దాపనిసేయకుండున ట్లేర్పాటైనది. విజయుఁడే తమరినిఁ జంప యత్నించినచోఁ బరశురాముఁడైవచ్చుఁ డాతని వెనుకకు లాగును. ఇంతలోఁ దమ రాతనిఁ బరిమార్చి వేయుఁడు.

[నేపథ్యమున 'ఎవరు లోనికిఁ జనువారు?'' అను భటుని కేక వినిపించును.]

శ్రీహరి:—ప్రొద్దుపొడిచినది. ఇఁక నేనేగెద. సర్వేశ్వరుఁడు తమకు సాయపడుఁగాక! [నిష్క్రమించును.]

కళింగ:—ఇప్పుడుకదా నాయందు ప్రేమగల భృత్యుల విలువ నాకుఁ దెలిసె! [మరిడి ప్రవేశించును.]

మరిడి:—నటకు లెవరైన నిచ్చటనున్నారా?

కళింగ:—నేనే—ఏమి నాతోఁ బని?

మరిడి:—శ్రీకళింగగంగురాజుగోరి కెలా సౌరం చేశేవోణ్ణో, అలా తొంగూడా రాజుగోరు శెయ్యమంటే వొచ్చాను.

[క్షౌరము సేయ సిద్ధపడును. కళింగుఁ డెదుటఁ గూర్చుని పైవస్త్రముం దీసివేయును. పుట్టుమచ్చం జూచి, కత్తి క్రిందపెట్టి మరిడి నమస్కరించును.]

మాప్పెభూ! యెంతభాగ్యం నేడు!

కళింగ:—ఉశ్! జాగ్రత! ఎవరికినిఁ దెలియఁగూడదు. ఎలుఁగనివానికివలెఁ బనిసేయుము.

మరిడి:—చిత్తం [అని మోమునకు నీరుఁబూయును. తెరప్రాలును.]

# చింత

గోనెల నరసింగరావుగారు, యం. ఏ.

సాంధ్య చిత్రకారుఁడు వర్ణచయమునించి,
చదల తెరలఁ జిత్రించి యంబుదవితాన
పాత్రధారుల నర్తన పరిఢవిల్లఁ
జంచలాంచల ధవళ హాసమ్మొనర్చె.

ఆ విమలద్యుతి నాదగు
నావిల హృదయము హరించి, యంబరమున స్వే
చ్ఛావిధి విహరించె; మెఱుపుఁ
గోవయె చిత్రాశ్వమయ్యెఁ గుందెడి మదికిన్.

ఈ మృదుగాన మాధురిమ యెందుజనించెనో? నేఁడుగాఢని
ద్రామయమైన నాహృదయ తంత్రుల నల్లనమీటి, రమ్యరా
గామృత వీచికానిచయ మాశలనించి కలంచుచుండె, ని
స్సీమవిలాసభాసురము సిద్ధకరంబిది, యేలతాంగిదో.

విపినములోన నేమిటికి వెన్నెలతేఁట? యకారణప్రసూ
నపరిమళోజ్జ్వ లోచ్ఛ్వసన నవ్యతయేల యవేళ? నెవ్వరి
ట్లిపుడు హతాశు నన్ను దనియింపఁగఁ జల్లనిచూపు నాపయిన్
గృపమెయి నించినారొ పులకింపఁగ నామెయిదీఁగసోఁగయై.

దొంతర దొంతరై గదిసి తొట్రిలుపాటొనగూర్చెవిస్మృతో
దంతములెల్ల; నాహృదయ తాపమువాయదు; నేటికిన్ గటా
క్షాంతపురేఖ యేనిఁ గను జాడఁదళుక్కున మించదాయె; నీ
చింతదొలంగి ప్రేమమయజీవన భాగ్యమదెన్న డబ్బునో.

# స్త్రీలు — యోగవిద్య

బం. మల్లయ్యశాస్త్రిగారు

ఇదివరకు స్త్రీలకు ఉపనయనమున్ను సావిత్రీపాఠమున్ను వేదవిద్యాధికారమున్ను ఉన్నట్లు గృహలక్ష్మికి విన్నవించి యుంటిని. దానిపై కొందఱు మాధవాచార్య గ్రంథమును పరాశరవ్యాఖ్య వివాహ ప్రకరణములోనిది చూపి ఉపనయనమైన స్త్రీలు బ్రహ్మవాదినులై ఆజీవము గురుకులమున బ్రహ్మచారిణులుగానే ఉండవలెను. వివాహితలకు బ్రహ్మవిద్యాధికారములేదు; ఉపనయనములేదు; అని ఆక్షేపించుచున్నారు. ఆమాధవగ్రంథము వారికిని అంతపూర్తిగా నుపయోగించలేదు. నాకును పూర్తిగా నుపయోగించదన్నది సిద్ధమే. కానిమాధవుల వారు హారీతవచనము — పురాకల్పేతు నారీణాంమౌంజీబంధనమిష్యతే ఇత్యాదికమును వ్యాఖ్యానించుచు "ద్వివిధాః స్త్రియః బ్రహ్మవాదిన్యస్సద్యోవధ్వశ్చేతి" అని వ్రాసినమాట సత్యమే. అది ఆయనస్వాభిప్రాయముకానేరదు. స్వాభిప్రాయమే అని అంటేకూడ నావాదమునకు నష్టములేదు. అందులోనే "సద్యోవధూనాంతు ఉపస్థితే వివాహే యథాకథంచి దుపనయనంకృత్వా కుర్వన్తి" అనియున్నదే! వారిమాటపాటించి సద్యోవధువులకు మాత్రమిపుడు ఆ యథాకథంచి దుపనయనమైనా యీ ఆక్షేపించిన వారు చేయుచున్నారా? చేయలేదుకదా!

అయితే వారికాలానికున్న ఆచారమును పట్టి వారి వ్యాఖ్యలుండును. అచ్చుపుస్తకములు లేవు. ఆకాలములో వేమయ్య చెప్పింది వేదము. ఈయిరవై శతాబ్దియ బ్రిటిషుపరిపాలనలో మఱి కళ్లుమూసుకొని పాలుత్రాగడానికి వీలులేదు. బెత్తందెబ్బ వీపుమీద పడుతుంది. జగత్తు కన్ను తెఱచియున్నది. పిల్లులలోకూడ గ్రుడ్డిపిల్లులు కన్నుమూసికొని పాలుత్రాగుచున్నవని యెఱుంగుడు.

ప్రకృతమనుసరింతము. కుమారసంభవ కావ్యమున 'సమానసీం' అను శ్లోకమును వ్యాఖ్యానించుచు మల్లినాథు డుదాహరించిన విష్ణుపురాణ బ్రహ్మాండపురాణ వచనములు చిత్తగించండి. సంశయములు ఆక్షేపణములు విచ్ఛిన్నములయి తత్త్వము తెలియంగలదు. విష్ణు — తేభ్యశ్శ్వధాసుతే జజ్ఞే మేనకాహారిణీ తథా తేచోభే బ్రహ్మవాదిన్యౌ యోగిన్యౌ చాప్యుభే ద్విజ. బ్రహ్మాండే: తేషాంతుమానసీ కన్యా మేనానామమహాగిరేః పత్నీ హిమవతో యస్యాః పుత్రో మైనాక ఉచ్యతే॥ వీటి తెలుగు పితృదేవతలకు మానసకన్యలు మేనహారిణీయను వారలిద్దఱు; వారిద్దఱు బ్రహ్మవాదినులు యోగినులుకూడను. ఆ మేనక హిమవంతునిభార్య. ఆమెకొడుకు మైనాకుడు. దీనిబట్టి బ్రహ్మవాదినులైన స్త్రీలకువివాహము ఉండవచ్చును. వారు

ల్లలనుకూడ గనవచ్చును. కావున ఉప యనమయిన బ్రహ్మవాదినులకు పెండ్లి కారాదు. పెండ్లాడదలచినవారికి ఉపనయ ము బ్రహ్మవిద్యా యోగవిద్యాధికార ములులేవు అంటే ఆ అన్నవారికి పురాణాలు ఇతిహాసాలు తెలియవు. చిలుకపలుకులు పలుకుచున్నారు అని అనవలసివస్తుంది.

ఇంతతో ఆవెఱ్ఱివిడచి స్త్రీలకు వేదవిద్య యేకాక వేదాస్తశాస్త్ర యోగశాస్త్రము లుపదేశించి దేశమును సంస్కరించుకొన నవసరము. పురుషులకన్న స్త్రీలకే యోగ విద్య శీఘ్రముగా బట్టుబడునని మహర్షులు చెప్పినారు. గమనించి కృతార్థులుకండు.

# పెంపు ప్రేమ

అత్తిలి సూర్యనారాయణమూర్తిగారు

చెట్టుల్లారా
పుట్టల్లారా
చెల్లాకైగి
పిట్టల్లారా
గుట్టల దాటినో
మొట్టల యెక్కినో
చెప్ప... మీరు

తప్పటడుగులా దాకి
చిన్నబొజ్జా
చిగురూచేతులు
గజ్జెలకాళ్లూ
కాటుక కళ్లూ
నీలపు వళ్లూ

నెమలీపింఛం
పగడపు పెదవీ
పలుకుల తేనే
మురళీ గీతం
మురిపించిందా
చెట్టుల్లారా
పుట్టల్లారా
చెప్పరటే మీరు
కృష్ణుని
తప్పటడుగులా దాకీ!
అదిగో ఆవులు
కదలక వున్నవి
రారా నాన్నా
రారా తండ్రీ

రారా వెన్నలు
ఆరగింతువూ
ఇంతకోపమా
యెల్లాగయ్యా
దిష్టిని తీస్తా
నొష్టనె బొట్టు
పొదరిళ్లల్లో
దాగకు రా
చెట్టుల్లా
పుట్టల్లారా
చెప్పరటే మీరూ?
కృష్ణుని
తప్పటడుగులా దారీ!

అక్కడకు సమీపములో రోడ్డుపై, నున్న కారులో ఎక్కి ఆమె వెడలిపోయినది. మాధవుడు లీలను చూచినదగ్గరనుండి ఆమె సౌందర్యమునకుఁ ఆమె ఫ్యాషన్‌కు ఆమె చదువుకు చాలసంతోషించి అటు వంటి యువతిని పెండ్లిచేసుకొన్నవానిదే జన్మము అని ఆలోచించుకొనుచు ఇంటికి తిరిగివచ్చినాడు. మాధవుని మనస్సు లీల తీసుకొనిజనినది. మాధవుడు, కాఫీ త్రాగుచున్నప్పుడు లీలమూర్తి, చదువుచున్న ప్పుడు లీలయే, భోజనముచేయుచుండ లీలయే, ఎల్ల వేళలందు లీలమూర్తియే కాన్పించుచున్నది. మణి (తాను వివాహముచేసుకొందునని మాటయిచ్చిన కన్య) యొక్క ప్రతిబింబమును హృదయమునుండి తీసి పారవేసినాడు. లీలను చూచినదగ్గరనుండి పిచ్చి వాని చందముగా అయిపోయినాడు.

ఒక దినమున రామచంద్రరావుగారు, ఆయన భార్యయు, మాధవుడును కలిసి మేడమీద వసారాపై కూర్చొనియుండిరి. అందరు సొంతముగాయుండిరి. మాధవా నీకు తగినంతవిద్య చెప్పించితిని. నా చేతు లతో నీకు వివాహమొనర్పవలెనని యున్నది. నీ ఇష్టము తెల్పెదవా? అని అడిగినారు తండ్రి రామ చంద్రరావుగారు. ఇంత వేగిరం ఎందుకండి నాకు పెండ్లి? అని సంకోచిస్తూ బదులిడినాడు. ఏమి! ఇంకనూ పెండ్లివద్దా? మాతాతకు 11 సంవత్సరము లకు పెండ్లిఅయినది. ఇప్పటికాలపువారు కాన ఇంత ముదిరిపోయినదనను పెండ్లిలేక వుంటూయున్నారు. పెండ్లికొడుకుముదిరినా బెండకాయముదిరినా పనికి రాదంట. ఈ సంవత్సరము తప్పక నీకు పెండ్లిచేయు దును అని మహోగ్రముతో పల్కినాడు. సుందరమ్మ ఏమండీ! మనమాధవునికి ఆనందరావుగారి కూతురు మణిని చేయుదుమా అని పలికెనో లేదో వోసి వెధవ ముండ, ఆ దరిద్రగొట్టు సంబంధంటే దొరికినది! నీకు నేను ఎంతమాత్రం చేయను ఆసంబంధము. ఆ ఆనంద రావుగారు తలఎక్కడ నా తలఎక్కడ. వాడు నాలుగువేలుకట్నం ఇవ్వగలడే? ఎంతమాత్రం ఆసంబం ధము పనికిరాదు. అని పలికి నేను వెంటనే సంబం ధము కుదిర్చెదను. తల్లి కొడుకులకు మంచిప్రాయశ్చిత్త మగునని మహాకోపముతో వెళ్ళిపోయినాడు. తల్లి కంటనీరుపెట్టుకొని నాయనా చిన్నతనమునుండి మణిని చేయుదమని యుండెడిది. సుగుణరాసియగు మణి నా కోడలై నేను సేవలు చేయించుకొనుటకు నోచ నైతిని అని విచారముతో కూర్చుండెను. మాధవునికి ఇవిఅన్నియు తలకెక్కుటలేదు. లీలను చేసుకుంటే బాగుండును. నాతండ్రి యేమి సంబంధముచేయునో అయినా నేను వరశుల్కముపేర యుపన్యాసములిచ్చి యుంటిని. ఎవరైనావిన్న ఎంతనగుబాటు, అయ్యో! నేను ఎంత దురదృష్టవంతుడను. లీలనా బడయజాలక పోవుచున్నాను. వరశుల్కమా పుచ్చుకొనుచున్నాను. అని కంటనీరు పెట్టుకొనెను. తల్లి అయ్యో! పాపం మణిని చేసుకుందామని ఎంత ఆశయున్నదో పిల్లడికని ఆమె యనుకొని, నాయనా! విచారించకు. ఎవరి వ్రాతలెట్లున్న అట్లుజరుగును. విచారించకు నాయనా! నీతండ్రి చాలకోపిష్టి, పట్టుదలగలమనిషి, అన్నంతపని చేసితీరును నాయనా ఏడవకుమని వోదార్చి ఆమె మేడదిగి వెళ్ళిపోయెను.

మాధవుడు అట్లు విచారించి సబుజడ్జి ప్రసాదరావు గారి ఇంటికివెళ్లెను. లీల మాధవుని సగౌరవముగా దోడ్కొని హాలులోనికి తీసుకొనివెళ్లినది. ఇరువురును చెరి యొకకుర్చీమీద కూర్చొనిరి. ఆమాట యీమాట ఆడినతరువాత మీకు వివాహమైనదా యని అడిగెను. లేదు ఇంకనూ, యీసంవత్సరము అగును అని అనెను. ఎవరి కుమార్తెయని యడుగ మా నాన్నగారికే గాని నాకు తెలియదు. అయ్యో! మీకేతెలియనా మీరా పెండ్లిచేసుకొనుట? లేక మీ తండ్రిగారా? బాగున్నదని సకిప కానవ్వినది. ఆనవ్వు మాధవుని మనస్సు కలిచివైచినది. లీలా నీవు ఎప్పుడూ ఇక్కడనే చదివెదవా? ఇక్కడనే చదివెదను. లీలా ఇంక శెలవు ఇమ్ము, మరల రేపు కలుసుకొందును, అని ఇంటి మొగముపట్టెను.

ఓసేవ్ ! ఓసేవ్ ! అని కేకవేసి రామచంద్రరావు గారు సుందరమ్మను అతివేగముగా రమ్మని పిలుచు చుండిరి. ఆమె ఎందుకండీ అనుకుంటూ వచ్చినది. ప్లీడర్ జనార్దనరావుగారికి ఇద్దరుకూతుళ్లు. ఇద్దరు కుమారులు. పెద్దపిల్ల 6 వ క్లాసు చదువుకొన్నది. అంత రూపసికాదు. 16 సంవత్సరము లుంటాయి. వసుంధరాదేవి పిల్ల పేరు. కట్నం నాలుగు వేలు. బాలతొడుగు వెయ్యిరూపాయలు. పిల్లడికి వెండి చెంబు, వెండిపళ్లెం, పట్టుపంచెలచాపు, తక్కిన లాంచన ములన్నియు బాగానే జరిపెదరు. మంచి సంప్రదాయమైన కుటుంబము. మంచి పలుకుబడి. నాకు నచ్చినది. పెండ్లి మాఘమాసములో నిశ్చయముచేసెదను. అని అన్నియు ఏకరవుపెట్టెను. సుందరమ్మ అన్నియు విని బెల్లంగొట్టిన దిమ్మవలె యూరకున్నది.

ఆనందరావుగారి కుటుంబవిషయం: ఆయన భార్య పేరు జ్ఞానాంబ, ఆమె చాల తెలివితేటలుగలమనిషి. గృహవిషయములలో మంచినేర్పరి. ఆమె జ్యేష్ఠ పుత్రుడు చెన్నపట్టణములో యం బి బి యస్ చదువు చున్నాడు. వారి జ్యేష్ఠపుత్రికయే, సుగుణయగు మణి దేవి. రెండవపుత్రిక ఇందుమతి. వారి కుటుంబమంతయు మంచి సరళహృదయులు గలవారు. మంచి దయార్ద్రహృదయులు. ఆనందరావుకు మణిని మాధవునికి ఇవ్వవలయునని యుండెడిదిగాని వారితో సంబంధముచేయుట చాలకష్టతరమని ఆ ఆశవీడి మణి మేనమామయగు కమలాకరునికిచ్చి వివాహమొనర్ప వలెనని అతని కున్నది. కమలాకరునికి చిన్ననాటనుండి మణినే చేసుకొనవలెనని యుండెడిది. గాని మణికి మాత్రం కమలాకరునిమీద ప్రేమలేదు. ఆమె మాధవుని ప్రేమించియున్నది. ఆమె ప్రేమనిశ్చలము. అది స్వచ్ఛమైనది. ఒకదినమున జ్ఞానాంబయు, మణియు, వసారాలోకూర్చొనియుండ ఆనందరావుగారువచ్చిరి. జ్ఞానాంబా! రామచంద్రరావుగారి కుమారుడు మాధవునికి పెండ్లి వచ్చేనెలలో, అనెను. ఎవరిపిల్లండీ? అని అధికాతురతో ప్రశ్నించినది జ్ఞానాంబ. ప్లీడర్ జనార్దనరావుగారి కూతురు వసుంధరాదేవిని ఇచ్చుచుండిరి. మనకెందులకు వారి ప్రస్తావన? వారు గొప్పవారు. గొప్పవారి సంగతులు, మనకెందులకని మిన్నకుండిరి. మణికిమాత్రం మనస్సు మనస్సులోలేదు. ఏమి నన్ను చేసుకుంటా నన్నారే. అలాంటిది వసుంధర నెట్లు చేసుకొనుచున్నారు. ఆయనకు నచ్చినది కాబోలు అని పరిపరివిధములుగా ఆలోచించుకొనుచున్నది.

జనార్దనరావు భార్యపేరు రుక్మిణమ్మ. వారికి ఇద్దరు కుమారులు. ఇద్దరు కుమార్తెలు. ఇద్దరు కుమార్తెల లోను పెద్దకుమార్తెనే రామచంద్రరావుగారి కుమారు నకు నిశ్చయమైనది. రెండవకుమార్తె శ్రీలతాదేవి. ఫోర్తు ఫారం చదువుచున్నది. ఆతక్కిన మొగపిల్లలు చిన్నవాళ్లు. జనార్దనరావుగారి ప్రాక్టీస్ మొట్టమొదటిలో బాగుండెడిది. గాని ఇప్పుడు ఎక్కడచూచినా లాయర్లు అవుటచే ఆయన ప్రాక్టీస్ అంతగాలేదు. ఆయన పాపం ఇప్పుడు మహాచిక్కులోపడినాడు. మాధవునికి నిశ్చయమైనదిగాని డబ్బుగురించి బహు తంటాలు పడుచున్నాడు. తోట భూమికలిపి మూడు వేల రూపాయలకు అమ్మివేసెను. భార్యవంటిపై నగలు వెయ్యిరూపాయలకు అమ్మినాడు. కట్నం సంపాదించినాడు. బాలతొడుగు యేమిపెట్టాడు? తక్కిన లాంచనములు ఎట్లు జరుపుతాడు? అందుకు ఇంటిని రెండువేలరూపాయలకు తనఖాపెట్టినాడు. వెయ్యి రూపాయలుపెట్టి వసుంధరాదేవికి నగలు చేయించినాడు. తక్కినసొమ్ముతో పెండ్లిచేయ నిశ్చయించుకొన్నాడు. అటువంటి జమీందారునితో సంబంధము చేయుచుంటినే అని గర్వపడుచున్నాడుగాని ముందు ఎట్లుగడుపుటయో కూడ ఆలోచించినాడు కాదు. మణి తనచెల్లెలగు ఇందుమతికి జడవేయుచున్న సమయములో అమ్మా! మణీ! అని ఆనందరావుగారి పిలుపు వినబడినది. వస్తూయున్నానండీ అనుకుంటూ తండ్రి వద్దకు వచ్చినది. ఇదుగో అమ్మా మాధవుని పెండ్లి పత్రిక. అని ఇచ్చివేసి ఆయన వెడలిపోయినాడు.

శ్రీరస్తు శుభమస్తు

వివాహమహోత్సవాహ్వానపత్రిక.

శ్లో॥ జానక్యాః కమలామలాంజలిపుటేయాః పద్మ
రాగాయితాః। న్యస్తారాఘవమస్తకేచవిల
సత్కుంద ప్రసూనాయితాః। స్రస్తాశ్యామల
కాయకాంతికలితాః। యాఇంద్రనీలాయితాః
ముక్తాస్తాశ్శుభదాభవంతు భవతాం శ్రీరామ
వైవాహికాః॥

అయ్యా!

శుక్రవారం ఉదయం 7-48 నిముషములకు అనగా,
12-6-1931 తారీఖున.

నా కుమార్తె చిరంజీవి సౌభాగ్యవతియగు
వసుంధరా దేవిని
రామచంద్రరావుగారి ఏకపుత్రుడగు
మాధవరావునకు

ఇచ్చి కాకినాడలో నా స్వగృహమందు వివాహము జరుపుటకు పెద్దలచే స్థిరపరుపబడినది గాన తచ్ఛుభ ముహూర్తంబునకు కుటుంబబంధు మిత్ర సహితము దయచేసి వధూవరులను ఆశీర్వదించి నన్ను ఆనందింపచేయ కోరుచున్నాడను.

ఇట్లు విధేయుడు,

సరస్వతీ పవర్ ప్రెస్ రాజమండ్రి జనార్దనరావు.

# నీ నడవడి

రావు వెం॥ కుసంగనాయకులుగారు

సనాతనుడ నంటావు — సత్కర్ముడ నంటావు
మాల లింటికివస్తె — మరి యెగిరిపడతావు
సత్కులీనుడ నంటావు — స్వప్రయోజకుడ నంటావు
నీచ లింటికివస్తె — బెదరించివేస్తావు
సంధ్యావందన మంటావు — సత్యాచార మంటావు
మడి గిట్టకుంటానె — మరి భోంచేస్తావు
గీతా పారాయణ మంటావు — గీత బోధిస్తావు
అధిక వడ్డీలిచ్చి — అప్పుపాల్జేస్తావు
దేశసేవంటావు — దైవభక్తంటావు
దేశసేవకులను — దెప్పిపొడుస్తుంటావు
సనాతనుడ నంటావు — సత్కర్ముడ నంటావు
మాల లింటికివస్తె — మరి యెగిరిపడతావు.

# శారదలేఖలు

సౌభాగ్యవతి కల్పలతకు

నెచ్చెలీ! నీవు వ్రాసిన యుత్తరములన్నియు చేరినవి. ఏదినమున కాదినమున నేను నీకా కల్పలతకు తప్పక జాబు వ్రాయవలయు నను కొనుచునేయున్నాను. నాయూహ లూట కలమున కెక్కక మునుపే ప్రతిదినము గడచి పోవుచునేయున్నది. ఏమిచేయుదును? ఈ వేసవియందు పగటి ప్రొద్దెక్కువన్న మాటయే గాని యెందుకును కొఱగాదు. అందును యీ యువసంవత్సరపు టెండలు యువజనుల భావములవలెనే అత్యంత తీవ్రములై యల యించుచున్నవి. 120, 122, డిగ్రీలయొక్క వేడిమియట—ఏనాడైన నెఱుగుదుమా! మితమైన యెండలకును, మేలైన గాలికిని నలవాటుపడిన సముద్రతీరవాసులమైన మేమే యీయేటి యెండలకును, వేడి గాడ్పులకును నుక్కిరిబిక్కిరై యల్లాడుచుండ నిక మెట్ట ప్రదేశములవారి బాధ చెప్పవలయునా? చదువుకొనుట వ్రాసికొనుట మాట యటుంచుము. ఏ పనిచేయుటకును బుద్ధిపుట్టదు. తలుపు తెఱచిన యెండ, తలుపుమూసిన చెమట, బయటికివచ్చిన వేడిమి, లోపల నున్న నుమ్మదము, విసరుకొనిన వేడిగాలి, యూరుకొనిన నుక్క, ఇట్టి తీవ్రనిదాఘసమయములో ప్రచండమార్తాండుని చండమయూఖముల దాడికోడి దినమెల్ల దివాంధము వలె నే గృహాంతర్భాగమునమో పడియుండి ప్రొద్దుగడుపుటయేగాని యేపనిచేయుటకును నేమితోచును? అదియట్లుండ, ఆమనారము గదా. ఎల్లప్పుడు కలమునకనియే పనికాదు గదా. ఎండలతోబాటు మామిడికాయలును మల్లెపూవులును ప్రత్యక్షమగును గదా. ఊరుగాయలు పెట్టవలయును గదా. మల్లెపూవులు మాలలు గట్టి పెట్టుకొనవలయును గదా. మామిడిపండ్లు తినుచుండవలయును గదా. మంచినీళ్లు త్రాగుచుండవలయును గదా. ఊరిలోని పేరంటములు బీరుపోనీయకుండవల యును గదా. పొరుగూరి పెండ్లిండ్లకుపోయి రావలయును గదా. ఇన్నిపనులలో నీయుత్తరములకు ప్రత్యుత్తరములుగూడ నాలస్యము లేక వ్రాయవలయునని నీవు త్వరపెట్టిన నాకేమి నాల్గుచేతు లున్నవా? మఱియు నీ యుత్తరము సాధారణమైనదైన నెప్పుడో యొకప్పుడు పనిలోపనియని వ్రాసి పాఱవేయుదును, కాని యట్లు కాదే? ప్రత్యుత్తరమను పేరున క్లిష్టప్రశ్నలతో గూడిన నొకపీట ముడినివేసి విడిచిపెట్టుదవు. వానిని విప్ప దీయలేక నే నవస్థపడెదను. నూరుప్రశ్నలు వేయవచ్చును గాని యొకప్రశ్నకు జబా బిచ్చుట దుస్తరము. అందును శ్రీమతి

దివాకర్ల శారదామణిగారు శారదకు ప్రత్యుత్తరమను శీర్షికతో వ్రాసినదానిపై నీవు కోరిన సమాధానములు మఱింత క్లిష్టములైనవి. శ్రీమతి శారదామణి ప్రత్యుత్తరమింతయు సంతయు గాదు. సన్నని యక్కరములతో దాదాపు పదునొకండు పుటలను మించియున్నది. ఇంత దీర్ఘలేఖ చదువుటయే దుస్తరమైయుండ దీనికి జబాబిచ్చుట యెంతకష్టమో నీవే యోచింపుము. పైగా ఆలేఖను సమగ్రముగా జదివినవెనుక నాకొక సందియము గల్గినది. ఏమన? ఆప్రత్యుత్తరములోని ప్రశ్నపరంపరలకు మనయాంధ్రదేశనాయకులేగాక యావద్భారతనాయకులును సమాధానమీయ నాకంటె మిన్నగా బాధ్యులుగా చేయబడియున్నారు. వీరిలో జీవితులేగాక ఆంధ్రరత్నమున్నగు స్వర్గవాసులును నున్నారు. కీర్తిశేషులతోసహా వీరినందఱిని గుమిగూర్చి నేనెట్లు సమాధానమిప్పింపగలను?

శ్రీమతి శారదామణి లేఖని యొక త్రోవను నడువలేదు. ఒక్క యభిప్రాయముపై నిలువబడలేదు. ఒకచో జదువుచున్న నామె నిరుపమానదేశభక్తికి సంతోషమొదవును. వేఱొకచో జదువుచున్న యావద్భారత ఏకైక ప్రజాహిత సంస్థయగు కాంగ్రెసుపై యామెకుగల యాగ్రహమునకు విచారమొదవును. ఇంకొకచో జదువుచున్న నామె యసదృశ రాజభక్తి కాశ్చర్యమొదవును. మఱియొక్కచో జదువుచున్న బ్రిటిషు సామ్రాజ్యప్రాశస్త్యము నుగ్గడించుటకును, భారతీయుల లోపములను గోరంతలు కొండంతలుచేసి యెత్తిచూపుటకును పనిబూని కృషి చేయుచున్న మేయోకన్య పలుకులా యివి యని సందియమొదవును. ఇంకొక యెడ చదువుచున్నచో నీమె యనూన మాతృభాషావ్యామోహమునకు ముచ్చటగాదవును. మఱియొకతావున జదువుచున్నచో నీమె యాంగ్లభాషావ్యామోహమునకు దిగ్భ్రమ గలుగును. ఉర్దూ సంపర్కమున నాంధ్రభాష పాడైపోవుచున్నదని యీమె మొదటిచింత. ఒక్క ఉర్దూసంపర్కముననేగాదు: తమిళము, కన్నడము, ఓఢ్రము మున్నగు ప్రతియితర రాష్ట్రభాషాసంపర్కముగల ప్రదేశమునందును తెలుగుభాషస్థితి యిట్లనేయున్నది. రెండుభాషలు సంధిల్లుచోట ఈభాషాపదము లాభాషయందును, నాభాషాపదము లీభాషయందును ననుకోనకుండనే కలియుచుండును. ఇది సిద్ధము. తప్పదు. అయితే యింతమాత్రముచేతనే తమభాషకు చేటువాటిల్లుచున్నదనియు, నిది కారుచిచ్చువలె తమరాష్ట్రము నంతయు వ్యాపించి తమ భాషనంతయు ధ్వంసము సేయుచున్నదనియు ననుట పొరబాటు. ఏలయన నిది కారుచిచ్చైయే దేశమునంతయు వ్యాపించు గుణముగలదే యగుచో మన యాంధ్రదేశమునంతకు నేనాడో వ్యాపించి సర్వనాశనముచేసి యుండవలసినది. అట్టిది విపరీతమేమియు సంభవింపలేదు సరికదా కొన్నివందల యేండ్లక్రిందట వీని వ్యాప్తి యేసరిహద్దు గ్రామముల నాక్రమించియున్నదో యిప్పటికిని నట్లనే యున్నది. ఇకముందును నట్లనేయుండును.

ప్రాబల్యముగల యొక భాషయొక్క పోటుగువనున్న యేభాషయైనను నీళ్లు వాసి తగ్గియుండుట సహజమే. ఉర్దూప్రాంతమున్న మన తెలుగెటుల వన్నె చెడియున్నదో తెలుగు ప్రాంతముగల యుర్దూగూడ వన్నె చెడియున్న దనుటకు ఉత్తర సర్కారులలో మహమ్మదీయులు భాషించు హిందూస్థానీని చూచినచో తెల్లమగును. వారి పదములలో సరిసగము తెలుగుపదములే. అందును పల్లెటూరి తురకలు మాట్లాడు హిందుస్థానీ భాషయందు ముక్కాలు మువ్వీసము తెలుగు మాటలే మిళితమైయుండును. ఇంత మాత్రమున నుర్దూకేమైన నష్టము గల్గినదా? అటులనే యన్యరాష్ట్రభాషాసంపర్కముగల చోట తెలుగుభాష సంకరమైయున్నను స్వచ్ఛమైన తెలుగున కెట్టి మోసము లేదు. అందును రాష్ట్రేతరాంధ్రులెల్లరు మాతృభాషాభిమానముగలవారై ప్రత్యేకసంఘములను స్థాపించి పాటుబడుచున్న యీ దినములలో మన తెలుగుభాష కెట్టి ముప్పును వాటిల్లజాలదు.

శ్రీమతి శాంతాదామణి, తెలుగును దక్షిణ హిందూదేశమునకంతయు వ్యవహారభాషగా సేయవలయుననుచున్నది. ఈమె మాతృభాషాభిమానము సంస్తవనీయమైనది. మన తెలుంగుతల్లి కంతటి మహోన్నత పదవి లభించుచో నేనుకూడ నపారముదంబు జెందెదను. కాని మన మాతృభాషపై మన కెంత ప్రేమగలదో యితరులకుగూడ తమ తమ భాషలపై నంత ప్రేమయుండుట సహజమేగదా. అట్టిచో నిట్టి యేర్పాటునకు తమిళ కర్ణాట కేరళులు సమ్మతింతురా? ఏనాడో మేము మహమ్మదీయుల దాడినుండి మిమ్ము మీ దేశమును గాపాడితిమి కాన దానికి ప్రత్యుపకృతిగా మా తెలుగును మీరు వ్యవహారభాషగా జేసుకొనుడనిన నిప్పుడు చేసినమేలు నిప్పుడే మఱచిపోయి పైగా నీవేమిచేసితివని, తిరుగుబాటుజేయు వింతజనులుగల యీకలికాలములో మనమాట వినువా రెవరు? అయినను పదుమూడుకోట్ల భారతీయులు మాట్లాడు హిందీభాష రాష్ట్రేతర వ్యవహారభాషగా నుండరాదని వాదించుచు రెండుకోట్ల ఆంధ్రుల వ్యవహారభాషమాత్రమే యైన తెలుగును దక్షిణమునందియావారెల్ల నేర్చుకొనవలయుననుట యేటిసబబు? మన మాతృభాష యైనంతమాత్రమున నెల్లరు నేర్చుకొనుట కర్హతగడించినదా యేమి?

నైజాము రాష్ట్రములోని యాంధ్రప్రజాబాహుళ్యమునుబట్టి యారాష్ట్రమున తెలుగే వ్యవహారభాషగా నుండదగునని యీమె తలంపు. నిజాంరాష్ట్రాంధ్రు లింతటి పలుకుబడి కలుగజేసికొనుచో నెవరు కాదందురు? కాని మహమ్మదీయ ప్రభుపాలితంబగు స్వదేశ సంస్థానములో హిందువులకు ఉద్యోగము లిచ్చుటలోనే యెంతయో పక్షపాతము చూపబడుచున్నదని చెప్పుకొనుచు నాంధ్రమే వ్యవహారభాష గావలయునని కోరుట గొంతెమ్మ కోర్కెయేగాని వేరొకటగునా?

గాంధిగారనిన నీమెకు కొంచెము గౌరవమేగాని యేడాదిలో స్వరాజ్యము తెచ్చెదనని యూరించి తేలేదని యాక్షేపించుచున్నది

కాని అందులకు కారణము తనదేశీయులలో
మనవంటివారు కొందఱు కలిసిరాకుండుటయే
కారణమని యీమెకును తెలిసియేయుండు
ననుకొందును. గాంధీ నొకవిధముగా మాన
వోత్తముడని యీమె యంగీకరించినను కాం
గ్రెసుపైనను తదితర కాంగ్రెసు నాయకుల
పైనను నీమె కేమాత్రము విశ్వాసము లేదు.
సర్వభారతజాత్యైక్యత యెప్పుడును సిద్ధించి
యుండలేదని చరిత్రపరిశోధకురాలగు మన
సోదరి నొక్కి వక్కాణించుచున్నది. నిజమే
యనుకొందము. పూర్వమెప్పుడు లేదని యిప్పు
డైక్యమునకై యత్నించుట దోషమగునా ?

అది యట్లుండ మోయజాలని పన్నుల
భారముతో, కదుల మెదులరాని నిర్బంధ
శాసనములతో స్వదేశస్థుల క్షేమ లాభము
లను మాత్రమే గమనించు స్వార్థదృష్టితో,
దేశమునందలి వ్యాపార పరిశ్రమలనెల్ల నడచి
వేయు వాణిజ్యనీతితో, భరతఖండము
నందలి వెండి బంగారములనెల్ల నూడ్చివేయు
నర్థాపేక్షతో సాగింపబడుచున్న ప్రస్తుత
బ్రిటిషు పరిపాలన మీమెకు చల్లగ నున్నది.
బ్రిటిషు దొరతనమువారికి భారతీయులకు
కలుగజేయవలసిన సౌకర్యములుగాని భారతీ
యులు కోరవలసిన సౌకర్యములుగాని
యీమె కేమియు గాన్పించుటలేదు.

451 క్లాజులనే మేకుబందీతో బ్రిటిష్
పార్లమెంటువారు తయారుచేయుచున్న
యిండియాబిల్లనే యుక్కుచట్టము ఈమెకు
చక్కగా నున్నది. అందులో బిగింపబడి
యున్నట్టియు, కాంగ్రెసువారు బాగుగా
లేదనుచున్నట్టియు, 'ఇందులో తలదూర్చి
నచో బ్రిటిషు యిండియాపై యాధి
పత్యము మాట దేవుడెఱుగును తమసంస్థాన
ముల యాధిపత్యమునకే యేమి చిక్కువా
టిల్లునో', యని సంస్థానాధిపతులు సైతము
శంకించుచున్నట్టియు ఫెడరలు రాజ్యాంగ
పద్ధతి యీమెకు మోదకరముగా నున్నది.
ఈమె దృష్టిలో నిజాము రాష్ట్రమే సమస్త
మన్నటులున్నది. ఉత్తర హిందూదేశస్థులని
నను, హిందీయన్నను నేలనో యీమెకిష్టము
లేకున్నది. కావుననే ఔత్తరాహులతో సంబం
ధముకన్న హిందుస్థానీయుల నెత్తినెక్కించు
కొనుటకన్న నిజామురాష్ట్రమువారితో సం
బంధము క్షేమకరమనుచున్నది. గోవుచుట్టూ
ప్రదక్షిణించిన పదునాల్గుభువనములు ప్రదక్షి
ణము చేసినంతఫలమని యేదో వ్రతకథలో
జెప్పినట్లుగా నిజామురాష్ట్రముతో సంబం
ధము గల్గించుకొనిన యావద్భారతదేశము
తో సంబంధము గల్గించుకొనినంత పుణ్య
మని చెప్పుచున్నదీ సోదరీమణి. ఆ ప్రయో
జన మేమో !

మిత్రమా, హిందీవిషయము నవలం
బనముగా జేసికొని యీమె దేశీయవిషయ
మెల్ల ప్రస్తావించి కాంగ్రెసుపై తనకు గల
యయిష్టతను, బ్రిటిషు పరిపాలనపై గల
విశ్వాసమును, ఇంగ్లీషుపై గల వ్యామోహ
మును వెల్లడించినది. హిందీభాషా ప్రస్తావన
సందర్భమున నీమె జూపిన మాతృభాషా
వాత్సల్య మాంగ్లభాషపై ప్రేమ జూపునపు
డేమైనదో ఆశ్చర్యము!!

దేశీయుల స్వాతంత్ర్య సంపాదనా యత్నములు నిష్ఫలములే యైనను, నా మె యాశీర్వదించినట్లుగా బ్రిటిషు పరిపాలనము స్థిరతరమే యైనను, పారతంత్ర్యమైన జాతి యొక్కయును తద్విముక్తికై కృషిచేయకుండ నుండదు. ఫలించుట ఫలింపకుండుట యది దైవయత్నము. ఫలింపనంతమాత్రముననే తత్ప్రయత్నములు సల్పెడి మహనీయులు పరిహాసభాజనులు కాజాలరు. మహాత్ము డెన్నేండ్లు నాయకత్వము వహించినను ఆయన నాయకత్వమున భారతదేశమునకు స్వాతంత్ర్యము సిద్ధింపకపోవచ్చును. కాంగ్రెసువారు కోరెడి సంపూర్ణ స్వాతంత్ర్యము ఆకాశసౌధమే కావచ్చును. కాంగ్రెసువారి వ్యూహములు బ్రిటిషు రాజనీతికి ఆహుతియే యగుచుండవచ్చును. అంగబలము, అర్థబలము గల ప్రభుత్వము వారిచే దేశనాయకులకు సర్వదా యోటమియే సిద్ధించుచుండవచ్చును. అయిన దేశమోక్షమునకై వారు గావించెడి యనూనకృషియు నసదృశత్యాగమును, సర్వదా ప్రశంసనీయములై భవిష్యదైతిహాసిక పుటలయందు స్వర్ణాక్షరములతో విలిఖింపబడకపోవు!!

హార్ద్య విరహితమైనను కాంగ్రెసు వారు సాగించుచున్నదియు నొకవిధమగు పోరాటమే. కాన వ్యూహములకు ప్రతివ్యూహము లన్నట్లయు నెత్తులకు ప్రతియెత్తులు వేయుచుండుటయు, సమయోచితములగు నడకలు నడుచుచుండుటయు వారికిని నలయును, కాన వారొకప్పు డవసరమునుబట్టి శాసనసభల బహిష్కరించి తమ పలుకుబడిని ప్రదర్శించిరి. నేటి యవసరములనుబట్టి మరల శాసనసభల ప్రవేశ మంగీకరించి ప్రజలకు కాంగ్రెసుపై గల భక్తిని విశదీకరింపజేసిరి. ఎవరెవరి కనుకూలమగు నేర్పాటులను వారు పరిస్థితులనుబట్టి నిర్ణయించుకొందురు. వారి కేవిధముగను తోడ్పడజాలని మనకీ దోషపరిశీలన మెందులకు? హిందీభాషా ప్రస్తావనలో నీ యనవసరపు రాజకీయగోడవ లెందులకు? కల్పలతా! నా లేఖా ప్రత్యుత్తర మంతయు నారయ శ్రీమతి శారదామణి మంచి విద్యావతియని తోచుచున్నది. కావుననే యొక్క లేఖయందే సంఘ మత రాజకీయార్థిక చారిత్రక భాషా విషయములన్నియు గుప్పించి గృహలక్ష్మి సంపాదకుల యభినందనము లందుకొనినది. ఇట్టి విద్యావతితో నాబోటి యల్పజ్ఞురాలు సమాధానమీయ నెంచుట తగరు కొండతో డీకొనుటయే యగును.

కల్పలతా! హిందీ విషయమై యీ శారద వ్రాసిన లేఖను చూచితివి. ఆ శారదామణి వ్రాసిన ప్రతిలేఖయు చూచితివి. దానికి నే నిచ్చిన సమాధానముగూడ నారసితివి. కాని యిందలి సాధక బాధకము లెల్ల నీకు బాగుగా తెలిసియే యుండును. ఇవియు నీకు తృప్తినీయకున్న గడచిన మే నెల భారతి పత్రికలో నఖిలభారత వర్షీయ సాహిత్య సమ్మేళనమునకు సభాధ్యక్షత వహించిన మహాత్మా గాంధీగారి యుపన్యాస

మున్నది. అందు నీ వివాదవిషయముల కెల్ల మహాత్ము డుచితమైన సమాధానముల నిచ్చియున్నారు. వానినెల్ల సమగ్రముగా జదివిన నీ సందియములును శ్రీమతి శారదామణి సందియములును పూర్తిగా తొలగిపోగలవు. మహాత్ముని నిష్కపట హృదయము నెఱిగినవారి కెవరికైనను నాయన హిందీ భాషా ప్రచారోద్యమము నాక్షేపింప నవకాశము గలదా ?

ఇట్లు,
శారద.



# అచ్చమాంబ

ఐహికసుఖంబు లిచ్చట ననుభవించి
యనుభవింపఁగ శాశ్వతంబగుసుఖంబు
నమరపురికేగు నీకు నశ్రమపథంబు
నిర్మలానందమునుగూర్చు నీశుఁ దలఁతు.

ప్రాణమువాయుటన్న దనివార్యము సంభవమైనజీవసం
తానము కిష్టపోయపుడు, దానికినై వగవంగఁజెల్ల దీ
మేనుగలంతకాలమును, మేలగు కర్జము లాచరించి యిం
పైనయశంబుగాంచిన సుమాతను నిన్మది సంస్మరించెదన్.

అక్షరజ్ఞానమన్న దావంతయైన
లేనినీవు క్షరాక్షరజ్ఞానమెట్లు
లరిసితివో, నీదు శ్రీశక్తి యద్భుతంబు
అక్షరశ్రద్ధ కిల ససాధ్యంబుకలదె.

నీమమనంబునవ్యసనసీతిము చేష్టపరోపకార మా
హ్లాదకరింబుపల్కు హృదయంగమమాదరణంబు సంతత
శ్రీదముసత్ప్రవర్తన మశేషములౌనుగుణంబు లేకమై
మేదినిఁగ్గ్లెనిట్టులన మించితివన్నిట నచ్చమాంబికా!

సాధితసర్వసిద్ధుఁ డతిశాంతుఁడు నీజనకుండు సమ్మిగం
గాధరశాస్త్రిగారు, సహగిర్భుఁడు పండితవేరిశాస్త్రి, నై
ద్యాధికవేంకటేశ్వరుఁడు దైవము, పుత్రులు ప్రాజ్ఞులీవు స
త్సాధుతమస్వభావ, పతిధన్యమునీతను వచ్చమాంబికా!

శిరోమణి వారణాశి గంగాధరశాస్త్రి

భర్తవైపు చూచి అంది. "మనసబుపని కనకనా, హైకోర్టు జడ్జీ యివ్వాలా? మచ్చటలు వద్దనడానికి హైకోర్టుజడ్జీకావాలా? యీ ప్రకృతిని మార్చగల కావ్యాలుకూడా వస్తున్నాయా? పిల్లలను కంటే ఆడుదాని యౌవనం జారిపోతుందని మగవాడికి భయమా? ఆహా! యేమి విశాలహృదయం! మగవాని ఆరోగ్యభాగ్యం వానిచేతిలో నున్నదా? అది గాక, యౌవనానుభవాకాంక్ష యెంత కాల ముంటుందో నిర్ణయించాడా? పిల్లలులేని నావంటి నిర్భాగ్యస్త్రీలు త్రిదశులయి దేదీప్యమానంగా వెలిగిపోతున్నారా? శాశ్వతయౌవన సౌఖ్యమనుభవిస్తున్నారా? తాను నిత్యయౌవనుడై నిర్మలంగా విచ్చు పూవులాగు కలకలలాడుతూ ఉంటాడా? నిష్కల్మష ప్రేమకి యౌవనం ముక్కుటే లక్ష్యమా? వానప్రస్థులయిన దంపతులకే యౌవనం ఉందా? వారు ఒకరినొకరు ప్రేమించుకోలేరా? వట్టి కేవలము పశుత్వం క్రింద పరిణమిస్తుందేం? ఇంత స్వార్థపరత మగవానికే గాని యాడుదానికి కల్గదేమా? ఇట్టి నిత్యపశుత్వపరత్వమున బడే మగవాని యౌవనం మరి జారదు గాబోలు. ఇంకొకమాట - మగవానికంటి కామదేహానికేమి బడుతుందని? వాసన చూచి పారేసే పువ్వను కున్నాడా?

"అదిగాక; పిల్లలు పుట్టినంతనే ఆడుదానికి మగవానిమీది ప్రేమ సన్నగిలిపోతుందా? ఈ నవీన ప్రేమతత్త్వసిద్ధాంతం నాకు బోధపడలేదు. అయితే లగ్నములో ఆడుదానికి మగవాడుతప్ప మరి ప్రేమింపదగిన వస్తువే లేదన్నమాట. భగవంతునిమీది ప్రేమ పరిగపోలు త్రొక్కవలసిందే? తలిదండ్రులమీది ప్రేమ తారుమారు కావలసిందే? అన్నదమ్ములమీది ప్రేమ అడుగంటవలసిందే? స్నేహితులమీది ప్రేమ చిందరవందర కావలసిందే? బంధువులపైని ప్రేమ పాడు కావలసిందే? దేశప్రేమ దిబ్బచేయవలసిందే? అదేనా ప్రేమతత్త్వం?

"ఇంక పిల్లలెక్కువయితే ఆస్తి పలుచబడుతుందన్నారు. ఇది మగవాని అర్థశాస్త్ర జ్ఞానసౌభాగ్యం కాబోలు! ఆస్తిని శాశ్వతంగా నిలబెట్టే ఉపాయాలెన్ని కనిపెట్టేరు? శ్రీమంతులెందరిచేతిలో చిప్ప వచ్చింది. అక్కడల్లా బిడ్డలసంఖ్యే కారణమా? మీరన్నట్లు కావలసినట్లొక్క కొడుకును గన్నారనుకోండి? ఆ కొడుకు మొద్దయితేనో? చపలుడయితేనో? చచ్చు పెద్దమ్మయితేనో? ఎందరు పండితుల కడుపున శుంఠలు పుట్టలేదు? పండితపుత్రుడన్నమాట వినలేదూ? ఇక ఆరోగ్యవిషయం మాలోచించండి. పిల్లలను పెంచే విధానమెరిగిన దంపతులెందరున్నారో లెక్కపెట్టండి. అలాగే పెంచుతున్నారనుకోండి; అంటువ్యాధులు రాకుండ నిలబెట్టే ఉపాయాలు స్థిరమైనవేవయినా ఉన్నాయా? రోగాలకు తిడితే సరిగ్గా పనిచేసే మందులున్నాయా? అవేవీ లేనప్పుడు చక్కని మొలకను కనిపెట్టుకున్న తలిదండ్రుల దినం యెలా దిబ్బకేరుతుంది? మగవాడన్నవాడు, జీవుడిని నిత్యం వెన్నంటివుండే మృత్యుదేవతను దూరంగా తరిమే సిద్ధోపాయం కనిపెట్టాలి. పాదరసంలాగు పరుగెత్తే తనమనస్సు వ్యసనసంసక్తం గాకుండా మరలించే ఉపాయాలు కనిపెట్టాలి. మర్యాదాప్రాకారాలలో తలమార్చకుండా ఉండే కట్టుబాట్లు చేసుకోవాలి. అప్పుడు జననతత్త్వంమీద స్వాతంత్ర్యత సంపాదిస్తే రాణిస్తుంది!"

వీరభద్రరావు:—అబ్బ! ఏమిటలా గచ్చపొదలాగ గలగలలాడుతున్నావు? బడాబడాయించేశావే? నేను చెప్పిన మాటలు నీవర్థం చేసుకోలేకపోయావు. ఈమాట స్పష్టంగా చెపతానువిను. పిల్లలను కంటే ఆడదాని బలం క్రమక్రమంగా తగ్గిపోతుంది. అందుకోసం మితిమీరకుండా ఒకడో ఇద్దరో పిల్లలను కని కాన్పు త్రిపేయగలిగితే స్త్రీ ఆరోగ్యం అంతగా చెడదు. దేహసౌఖ్యం యెప్పుడైతే వుందో గేహసౌఖ్యం అప్పుడే ఉంది.

**సీతమ్మ:**—అలాగయితే నేను మాటాడలేనుగాని బుద్ధిమంతులు లోకానికి తమ చేతలచేత, మాటల చేతా కూడ తెలియాలి: కేవలం యితరుల ఊహలమీద పండితుల బుద్ధి వన్నె కెక్కదు. ఒక్క గెలవేసి యరటిచెట్టు తెరిస్తూంది. ఒక పిల్లను కని తుమ్మెద తొలిగిపోతూంది. ఇది ప్రకృతి నిర్మాణతత్వమా? చిత్రకారుని శిల్పచాతుర్యమా? ఇంకా ఎన్నియో జంతువులు ఒక్కొక్కతూరి నాలుగయిదు కూనలను పెట్టి నిత్యారోగ్యముతో నిగనిగలాడుతున్నాయి. ఇది ప్రకృతి తత్వమా? ప్రకృతి శాస్త్రవేత్త జ్ఞానపరిశ్రమమా? ప్రకృతిలో భాగమయిన మనుష్యజాతికి ప్రకృతి సూత్రము లంటవా? ఈ సందర్భములో నాకో చిన్నకథ జ్ఞాపకం వచ్చింది. చెప్తాను వినండి. నేను పదేండ్లదాననై యున్నపుడు మా అన్న రఘురామరావు కోయంబత్తూరునుండి శలవు లేకో వచ్చి యింటికొచ్చాడు. మా నాన్న మా దొడ్లో గులాబి మొక్కొకటి వేశాడు. అప్పటికి సోకొమ్మ వేసి కొమ్మకొమ్మకూ గుత్తులుగుత్తులు మొగ్గలు తొడిగింది. రఘురామరావప్పుడు వ్యవసాయ కళాశాలలో చదువుతున్నాడు. అది చూచి, చెల్లీ! నీవు పురుగులలాగ చెట్టుకిన్ని మొగ్గ లెందుకే! జీవసత్వం చెడుతుంది. పుష్పాందం పోతుంది. మూడు కొమ్మం తటికీ ఒక్కటే పువ్వు పూయిస్తాను. అప్పుడానందంగా వుంటుం దన్నాడు. సరే అలాగే కానీ అన్నాను. అతను కత్తెరొకటి పట్టుకొని చుట్టూ వున్న మొగ్గలన్నీ కత్తిరించేసి మధ్యనున్న మొగ్గమాత్రం కొమ్మను విడిచేశాడు. ఆ మొగ్గ క్రమక్రమంగా పెరిగి పెద్దదయి కొమ్మ నిండా ఒక్కటే పువ్వు పిక్కాది. పువ్వు మరీ సొగసుగా వుంది. పెద్దది! దానికోసి యెప్పటివాడుక ప్రకారం వాసన చూశాను. ఏం చెప్పేది! దాని మునుపటి పరిమళమంతా పోయింది. నేను తెల్లబోయేను. వగటు వాసన వేసింది గాని గులాబివాసన లేనేలేదు! ఎందుకా పువ్వు! ఆ బుల్లిబూడ చిలుకు చెండుపూ వేలాగుందో చూడండి! దానికీ దీనికీ యేమిటి భేదం? ఇంకా యీ చెండుపువ్వే నయం! ఈ మధ్య బెంగుళూరునుండి వచ్చిందని పెద్ద చేమంతిపువ్వు వీరు తెచ్చేరే, అది కాగితపు పువ్వులాగు కలకలలాడడమే గాని కొంచమైనా పరిమళించిందండీ? ఎందుకీ నిర్గంధ కుసుమాలు? ఎక్కడయితే ప్రకృతి విరుద్ధంగా శరీర నిర్మాణ తత్వం మారుతుందో, అక్కడల్లా గుణం కొరవడుతుంది.

**వీరభద్రరావు:**—ఉండవుంటే! నీ వింత చెప్పు తావు? మంచి చెడ్డ లాలోచించకుండా ఎక్కడ మంచిని కనేస్తూంది లోకం! ఈ పిల్లలతో కాలేజీలు కర్మాగారాలు క్రిక్కిరిసి పోతున్నాయి! కళ ప్రవీణులు లెక్కువయిపోతున్నారు. నిరుద్యోగపు సమస్య లెక్కువయిపోతున్నాయి. అభిప్రాయభేదాలకు మేరలేదు. బ్రాహ్మణ బ్రాహ్మణేతర భేదాలు కలిసి పోతున్నాయి. ఇవన్నీ ఈ దేశమంతా ఏకముఖంగా సంచేయాలంటే జనసంఖ్య తగ్గాలి; గాంధీమహాత్ముడు కూడ యీ మాటే అంటాడు. కాని అతని విధానం వేరు. స్త్రీ పురుష సంయోగాని కవకాశమే యివ్వ కూడదంటాడు. ఈ గ్రంథాలలో స్త్రీ పురుషులు భార్యాభర్తలుగా జీవిస్తూ కొన్ని కొన్ని యంత్ర సాధనాలవల్ల సంతానవంతులు కాకుండా ఉండ వచ్చునని నూతన సిద్ధాంతం చెప్పబడ్డది.

**సీతమ్మ:**—అబ్బ! అమానుషమైనదే మేకంగా ఉంది! ఏమిటిది? పిల్లలు లేకపోతే కాలేజీలెందుకు, కర్మాగారాలెందుకు? జగత్తులో అభిప్రాయభేదమే లేకపోతే జగత్తే లేదు. చూడండి, ఆ బుద్ధిమంతుల లోనే రెండుతెగ లేర్పడ్డాయి. గాంధీమహాత్ముని దృక్పథంతోనా, గ్రంథకారుల దృక్పథంతోనా — మనుష్యున కున్న ప్రత్యేకతయే యభిప్రాయభేదము; అభిప్రాయ భేదమువలననే ప్రజలలో విద్యాకాంక్ష; దానివలననే జ్ఞానాభివృద్ధి; అదియే దేశక్షేమాభివృద్ధికి కారణమవు తూంది. సృష్టితత్వం ఒకమాటు నిదానించి చూడండి! జనులముఖా లెన్నో అన్ని భేదాలు, మన స్తత్వాలెన్నో

అన్ని భేదాలు! శరీరనిర్మాణములెన్నో అన్ని భేదాలు! జనసంఖ్యపెరిగితే సామ్యమేర్పడుతుందా?

"ఈ మహాకార్యానికి యంత్రసాధనం కూడా కనిపెట్టేరూ? ఇది మరీ బాగుంది. యంత్రసాధన సంపత్తి యెప్పుడింత గొప్పయింది? గొడ్రాలికి బిడ్డలను ప్రసాదించే యంత్రాలున్నాయా? ఇక్కడ మీ యోగాలు సాగవుగదా! పోయినవాళ్ల మాటలన్నీ నాతోటిదే, ఇప్పుడు పిల్లలుకంటే; ముచ్చటా చక్కగా అనుభవిస్తాం. నాకేదీ? ఇన్నాళ్ళయినా కూడేనా?"

"అదేకాదే" అని వీరభద్రరావు యేమో చెప్ప బోయేడు.

"ఏదికాదూ! ఇంతవరకూ బాధపడ్డాను కట్టెయ్యండి సరే, మీ మంత్రాలేవో యీ పసియోగించండి. నవ్వంటేనా? చూస్తే సమస్యలన్నీ సూత్రా లెరుగరా? దానితో నా కేమి సంబంధం? నే నవతలకు పోయి వంటచూసుకోవాలి" అని సీతమ్మ లోపలికి వెళ్ళి పోయింది. వీరభద్రరావు చిరునవ్వు నవ్వుతూ వెనుక నిలబడి చూస్తున్నాడు.

౨

"సీతా ఏదీ? ఏం చేస్తున్నావు? ఏదో ఒకటి సంపాదించి తెచ్చేను నీకోసం" అని వీరభద్రరావు కేకపెట్టాడు. సీతమ్మ వంటింట్లో అన్నాకప్రయత్నాలు చేస్తూంది "ఏమే? రావేం? నీకు కావాలా అక్కరలేదా?— రా మరి ఆ రావిచెట్టుక్రిందికి పోదాం?" అన్నాడు వీరభద్రరావు.

సీతమ్మ గబగబా వచ్చింది. "ఏమిటా బంగీ" అంది.

వీరభద్రరావు:—బంగీ విప్పుతాను చూడు!

సీతమ్మ:—(దగ్గరగా వెళ్ళి చూచి) "ఏమిటిది? పిల్లలులేని నాలాటి గొడ్రాలికి ఉగ్గుగిన్నెందుకూ? పిల్లలులేని చిన్నతనం నాకొక్కర్తెకేనా యేమిటి? మీకుమాత్రం చిన్నతనంలేదూ?"

వీరభద్రరావు:—ఇదేమిటో సరీగా చూచి చెప్పాలి! ఇది స్త్రీలపాలిటి వరప్రసాదిని! స్త్రీల సౌభాగ్యధనాగారం! మంగళాంగళాగారం! ఆ కంపెనీ వాళ్ళు చెప్పినట్లా మనం చేయగలిగేమంటే ఇక భార్యాభర్తల నడుమ శాశ్వతానురాగం స్థాపించే మన్మథమాటే? ఇక వారిమధ్య పానకంలో పుడకలాగు బిడ్డలుంటారు.

సీతమ్మ:—సరే! గర్భాలోకానికే మీకు పిచ్చి లావవుతుందేం? మీ దేవుళ్ళ క్రిందను పెట్టియయినా ఆమె పిల్లలను కనితీరుతుంది." అని వెళ్ళిపోయినది.

ఆరునెలలయింది, మునుపటికంటె వీరభద్రరావుకు సీతమ్మమీద ప్రేమ హెచ్చయింది. ఆమె చెక్కిళ్ళ తెలుపూ, పెదవిమీది జాలిరేఖలూ, కనురెప్పల బరువూ, అమాయకతనా, అతిమనమాటం, ఇవన్నీ సీతమ్మ సహజసౌందర్యానికి వన్నె తెచ్చేయి. మరి ఆయిదునెలలకి సీతమ్మ కొడుకును కంది. వీరభద్రరావుకు మోడువారిన మనస్సు పుష్పించినట్లయింది. అతనికి పిల్లడిమీద ప్రేమ అధికమయింది. అస్తమానం ఆ పిల్లడిని అలా చేతులలో యెత్తుకొని కచేరీ పనికూడ మరచిపోయేవాడు.

ఒకనాడతనికి ఉగ్గుగిన్నె జ్ఞాపకం వచ్చింది. వెంటనే బజారుకువెళ్ళి ఒక వెండిఉగ్గుగిన్నె పట్టుకొని వచ్చేడు. "సీతానే! ఇదిగో! చూ" అన్నాడు.

సీతమ్మ ముద్దుపడి వెళ్ళి ఆ చేతిలో ఉగ్గుగిన్నె అందుకుంది.

సీతమ్మ:—దీనికుందు గాజులెందుకూ? గడియారం గొలుసెందుకూ?

"అవునే!" యని ఆ బాలెంతరాలి పసుపుబుగ్గలు వీరభద్రరావు ముద్దుపెట్టుకున్నాడు.

# గృహవిద్యా శిక్షణ: నియమిత వేతనములు:

చదువుల రామచంద్రయ్యగారు, బి. ఏ.

[అనువాదము.]

(పేదకుటుంబమునకు జెందిన పార్సీయువతులు సంఘోన్నతికై నెలకొల్పిన "జొరాష్ట్రి స్త్రీ మండలి"కి లోకోపకారధురీణయగు శ్రీమతి రత్న తాతాగారు, బొంబాయి నగరమున హ్యూస్ రోడ్డునందుగల తమ దివ్యభవనము నొసంగిరి. ఇందు పేద యువతులును, వివాహితలును, తమతమ కుటుంబరక్షణలకై నియమిత వేతనములతో శిక్షణ పొందుచున్నారు. క్రింద పొందుపరుపబడిన వ్యాసములో యీస్థలమున, పాకశాస్త్రము, కుట్టుపని, నగిషీపని, నేత, ఇస్త్రి మొదలగు గృహమునకు గావలసిన సమస్తవిషయములందును పొందు శిక్షణ విశదముగ వివరింపబడి యున్నది.)

సర్ రత్న తాతాగారి పరిశ్రమాలయము గాంచినపుడు, తద్వాతావరణమున "పరిపూర్ణమగు సమర్థతయన్న నిదియే" యను భావము పొడకట్టెను. ఇచట, సాధారణ పార్సీకుటుంబములకు జెందిన 225 మంది యువతులున్నారు. వారి ముఖ్యాశయములు మూడు: తమకుగాని తమ కుటుంబములకు గాని కావలసిన ధనము సంపాదించుట; కుటుంబమునకు తోడ్పడుట లేక గృహవిద్యల నభ్యసించుట; తమ విరామకాలమును లాభదాయకముగా నుపయోగించుట; ఈ యాశయముల పొందుటకే వారందు పనిజేయుచున్నారు.

ఈ నికేతనమున గల పరిశ్రమలకు "తేనిపట్టు పరిశ్రమ" యన్న నది చాలదుగాని, అంతకంటె మంచి దింకొకపేరు తెలియక యున్నది. అన్ని శాఖలందును సుశిక్షణ, సున్నితము, చక్కని కార్యక్రమముగలదు. నేనచట తేనెను జేయుట జూడనైతిని గాని, దానికంటె మధురమును రుచికరములును అగు పదార్థములజేయు భాగముల జూచితిని. సుప్రసిద్ధమైన 'పోర్టు సన్‌లైట్' (Port Sunlight) ఫ్యాక్టరీ సంస్థాపనయు, ఇంతకంటె ఎక్కువ సుశిక్షణ, పరిపూర్ణత జూపజాలవని నాతలంపు.

ఈభవనపు క్రింది యంతస్థున పాకశాలలున్నవి. ధనము సంపాదించు విద్యార్థినులకివి చాల యిష్టమైనవి. కూరలు, రొట్టెలు, లడ్డులు, పిండివంటలు, బిస్కత్తులు మొదలగు వేలకొలది తినుబండారములను పెక్కుమంది యువతులు జేయుచుందురు. ఈశాఖయందు ఏబదిమంది యువతులు పని జేయుచుందురు. 'వివాహమాడుట వంటజేయుటకే' యను పరిహాసపు లోకోక్తిని దలచి నేను పార్సీయువతుల పాకశాస్త్రమందలి యాసక్తి కచ్చెరువొందలేదు.

ఇచట తయారగు వస్తువులన్నియు త్వరగా జెడిపోవు స్వభావము గలవగుటచే నిన్నివస్తువు లేమిజేయుదురని వింతగలిగెను. కాని వాని నన్నింటిని పెక్కుగృహముల కును, పాఠశాలలకును, పరిశ్రమాలయముల కును, పంపి యొక గొప్పవ్యాపారమే జేయు చున్నారని తెలిసినది. 300 మందికి తక్కువ గాకుండ భోజనమును తయారుజేసి, ప్రతి దినము ఈసంస్థ సుమారు మాసమునకు తల కరువది రూపాయలవంతున దీసికొని భోజన మందజేయుచున్నది! (ఉదయమందు రెండు పళ్లెరములు, సాయంత్రము మూడుపళ్లెర ములవంతున పంపుదురు.) ఈశాఖకు సంబం ధించిన దింకొకభాగముకూడ గలదు. దానిని వారు Jam Jelly Department అనెదరు. ఇందున్న వారందరు చాకులెట్లను తయారు జేసి పైన కాగితముల జుట్టుచుందురు. ఒకా నొక చాకులెట్ కర్మాగారమున నూతన ముగా పనిలో ప్రవేశించినవారిని మొదటి వారమునందు, తమ కిష్టమైనన్ని చాక్ లెట్లను తినమందురట! తరువాత వారు చాకులెట్లను నోట వేసికొనుటకైన సహింప రట! ఆ సమాచారము జ్ఞాపకము జేసికొని యందలి కార్యనిర్వాహకురాలితో మీరు గూడ ఆపద్ధతి నవలంబింపకూడదా యనగా వారందరు నవ్వదొడంగిరి.

పిదప గుడ్డలు చలువజేయు చోటును జూడబోయితిమి. ఇచట ఆవిధి ఇతరులు చలువజేయు స్థానమువందువలె బయలు దేరు చుండుట లేదు. అది విద్యుచ్ఛక్తిచే నడుప బడుచున్నది. అచట పనిజేయువారికి దాని యందాసక్తి మిక్కుటముగ నున్నట్లు దోచెను. ఇందులకు ముఖ్యకారణ మేమన, దానియందు దినమంతయు పనిజేసినను, ఒక రూపాయకంటె యెక్కువ సంపాదింప సాధ్యముగాదు; కాని యితర శాఖలందు అనగా నగిషీ, నేత, కుట్టుపని మొదలగు వానియందు దినమునకొకరు రెండురూపా యలను సంపాదించుకొనవచ్చును. ఇచట గుడ్డల నారవేయుట, ఇస్త్రిచేయుట త్వరిత ముగ జేయబడుచుండెను.

అచటనుండి వెళ్లి నేతపరిశ్రమను జూచి తిమి. అత్యంతసుందరమగు వారి వివిధ రకముల నేత కచ్చేరువుగల్గెను. ఫ్రేముపై నుంచబడిన చీరలవద్ద యిరువురు లేక ముగ్గు రు యువతులు అంచులపై పనిజేయుచుండిరి. ఇది వారికి చాల నిష్టమగు పరిశ్రమగా గన్పడి యెను. ఇందు నెల కరువదిరూపాయల సంపా దింప సులభసాధ్యమై యుండెను. ఇచ్చట హెచ్చైనజీత మరువదియే! అందుచే నీ శాఖయందు 70 మంది యువతులు పని జేయుచున్నారు.

దీనిప్రక్కనే కుట్టుపని శాఖగలదు. కుట్టు యంత్రములు వరుసలుదీర్చి 'బుజ్' అను శబ్దముతో నాప్రదేశమునంతయు నింపు చుండెను. వానిపై చాలమంది పనిజేయు చుండిరి. ఇంకొకగదిలో నగిషీపని జేయు యంత్రము లుండెను. మాకు వారుజూపిన మాదిరియంచులు, పిల్లలదుస్తులు వాని శ్రేష్ఠత్వమును చెప్పక చెప్పుచుండెను.

ఈపాలునుండి నేయుచుండుచోటికి దారి దీసితిమి. ఇచట యువతులుగూర్చుండి వారి సున్నితమగు వ్రేళ్లతోడను, పాదములతో డను మగ్గముల నేయుచుండిరి. నేను ప్రయ త్నింపబోయి సరిగనుత్రెంచి నాశక్తిపైనున్న భ్రమనువీడి యాశాఖయందు దినమున కారణాలవంతునగూడ సంపాదింపజాలను గదా యని విరమించుకొంటిని.

అందలి కార్యనిర్వాహకురాలు (Lady Superintendent) మాతో "జపానుదేశ మందలి యంత్రములచే తయారుచేయబడు వస్తువుల వెలలతో మేము పోటీచేసి గెలుపొందగలుగుదుము. ఇది మీరు వినుట కచ్చెరువు పొందెదరేమో?" అనెను. ఈ విషయము నింకను విపులముగ విచారింపగా 8 గజముల చేతితో తయారగు శ్రేష్ఠమగు చీర అంచులు 4 మొదలు 15 రూ. లోపల వారమ్మగలరట! యంత్రయుగమనదగు నీ కాలమున నిది చిత్రముగదా?

ఇక పెరుగు, వెన్న, మజ్జిగ తయారు చేయుచోటు (Dairy) చాల తమాషగ నుండును. మంచుగడ్డలవలె నున్న వెన్న ముద్దలు ముద్దలుగ తట్టలలో బల్లలపై నుంచబడి యుండెను. అచట పెక్కుమంది యువతులు పనిజేయుచుండిరి.

ఈ నికేతనపు కార్యాలయమున నొక స్త్రీ సమావేశమునకై కాచుకొని యుండెను. అందున్న యొక యుద్యోగి, "వారములో కొన్ని దినములు సూచనలకొఱకు లేక సాయముకొఱకు చాలమంది వచ్చుచుందు" రని తెలిపెను. అచటనుండి హాస్టలు, విరామశాల వీనితో మాయాత్ర ముగిసినది.

ఇట్టిసంస్థలను నపుడపుడు కష్టమువచ్చు గొప్ప కష్టములగూర్చి తెలిసికొంటిమి గాని యా యాటంకములు దీనికి కార్యభూతులయిన వారి కార్యనిర్వాహకత్వము దృఢనిశ్చయము అను కిరణజాలమునెదుట మంచువలె కఱగి పోయెను. ఇచట పనిచేయువారు తమ శిశువులనుగూడ సురక్షితముగ వీడి తమపనుల నిరపాయముగ నెరవేర్చుకొనుటకు నేర్పాట్లు జరుగుచున్నట్లు వింటిమి. ఇట్టివే గాక వారికింకను పెక్కు ఆశయము లున్నవిగాని. అచట చోటు విశాలముగ లేనందుచే యవి కార్యరూపము దాల్చుటసాధ్యము":—

ఇట్టి దేశోపకారులు, స్వార్థత్యాగులు మనదేశమునకు పెక్కుమంది కావలసి యున్నారు. ప్రస్తుతము శ్రీయుత రత్నతాతాగారిని మహనీయు లనుసరించెదరు గాక! ప్రతివారును డిగ్రీల వ్యామోహమున బడికొట్టుకొనకుండ యువతులగు మా సోదరీమణులందఱు ఇట్టివిద్యలనేర్చి కృతార్థులై తమ్మును తమకుటుంబములను పునరుద్ధరింతురుగాక!

## మాటాడక పనిచెయ్!!

వే॥ కృ॥ మూర్తి

ఉ॥ జ్యాయము కర్మకంటె నలసాంఖ్యమె యెంతయుఁ బార్థ నా యభి
ప్రాయమిదంచుఁ జెప్పితటు – బంధువధోద్యమ తాపమీఁగుచున్
జేయుము యుద్ధమంచు నిటు చెప్పితి వక్కట యేదిదారియో
మాయలమారి కృష్ణయను మానములోనను ముంపఁజొచ్చెదే।

చం॥ మతిసెడె మున్న: యీగడును మాటలతో మరి బొత్తిగాఁ జెడెన్
గతి విషమించె; నిట్టియెడఁ గావుమయా యని వేడుకొంటి; మా
హితమును గోరువాఁడ విదమిద్ధమటంచెరిగింపు మొక్కవ।
దతి యిదె నీకు వందనము దాసజనావన, లోకపావనా॥

-కర్మయోగము.

కొంత కాలము క్రిందటివరకుఁ గర్మయోగ మను మాట మిక్కిలి సకృత్తుగా వినఁబడెడిది. లోకమాన్యుని గీతారహస్యము బహిర్గతమైననాటినుండియు నీ పదమునకు వ్యాప్తి యెక్కువ కాఁజొచ్చినది. ఆవెనుక గాంధీగారు ప్రజానాయకుఁడైన నాటినుండియుఁ 'గర్మయోగము' కారుచవకయైనది: కావేసినదే. దాని కభ్యంతరముండరాదు; కాని యీ పరివ్యాప్తి సవ్యమా లేక యపసవ్యమా యని యాలోచించునపుడు మాత్రము అనేక సందేహము లుదయింపకమానవు. ఎందువలన?-చూడుఁడు. సకల వేదాంతశాస్త్రమునకును బ్రహ్మముడివంటి దీ కర్మయోగమే. శ్రీమన్నారాయణుఁడు వివస్వంతునకుఁ జెప్పిన దిదే కదా! ఈ వివస్వంతుని ముఖమున నిఁక మనువు ఇక్ష్వాకు మొదలగువారలు విన్నారు. అట్టి దానికిఁ గాలదోషము పట్టినది. భారతయుగము నాటికిఁ గేవలము నామమాత్రావశిష్టమైనది. అర్జునునివంటి యుత్కృష్ట చంద్రవంశ సంజాతుఁడే స్వకులోచితకర్మఁ జేయునెడఁ బొందఁగూడని దుఃఖమును బొందినాడు కదా! అనఁగా నేమనెడి మాట? ఈ యుత్తమవిధాన మస్తరించినదనుటయే. ఇట్టి మహావిపద్దశఁ దొలఁగించుటకే శ్రీమన్నారాయణుఁడు కృష్ణావతార మెత్తుట. వర్ణాశ్రమ వ్యవస్థితమైన మానవధర్మము మట్టిపాలై ప్రతివాఁడును జలగవలె రక్తపిపాసువైనాఁడు! వేయేల? దుర్యోధనుని వంటి యుత్తమ రాజకుమారుఁ డొకఁ డన్నపెండ్లామును, అయోనిజను సభలో మానభంగ మొనరింపఁజూచుట సామాన్య విషయమా! స్త్రీ నవమానించుటయా!! శివశివా!! ఇఁక నుపేక్ష యెంతమాత్రముఁ

బనికిరాదు. కాఁబట్టి వర్ణాశ్రమ ధర్మవ్యవస్థల విలసిల్లు ధర్మము—మానవధర్మము—మరల నుద్ధరింపవలెను. కాఁబట్టియే శ్రీ కృష్ణుఁడై యవతరించిన భగవానుఁడు యుద్ధము సేయుమని విజయున కుపదేశించుచున్నాడు. యుద్ధమనఁగా కేవల హింసా కర్మయే కదా!! తథాస్తు! ఏ కర్మయందు గాని తత్త్వజ్ఞానము మొదటిది. ఇది యథాయోగ్యముగాఁ దెలుసుకొనక చిత్తశుద్ధి కలుగదు. అది లేనపు డేపని చేసినను బాడే గాని బాగుపడదు. ఈ తత్త్వజ్ఞాన చిత్తశుద్ధులకు రెండే విషయములు మనుష్యున కమృతత్వ మిచ్చుచున్నవి "ఫలాపేక్ష వదలు; మానావమానములతో బ్రమేయము పెట్టుకోవద్దు; నీ పని నీది — కులక్రమాగతమైనది" అనియే గీత బోధించుచున్నది. సన్యాసియుఁ గర్మయోగమే పూనవలయును. దేనికనఁగా లోకక్షేమమునకు. ఇట్టి యుత్తమకర్మ నాచరించుట కధికారి యెవఁడు?—చిత్తశుద్ధి గలవాఁడు మాత్రమే: తదన్యుఁడు అనఁగా భోగరాగములఁ గోరువాఁ డెంతమాత్రముఁ బనికిరాఁడు.

గాంధీమహాత్ముఁడు స్వయముగా సర్వపరిత్యాగముచేసి వేరొకరిని జేయుమనుచున్నాఁడు. 'నాది' యని చెప్పుకొంట కతని కేదియులేదు గదా! శరీరాభిమానము గూడ నతని కున్నట్లు తోచదు. ఎప్పటి కప్పుడే యాత్మపరీక్ష: దోసమున కుపవాసము శిక్ష: యిట్టి కఠినదీక్షతోనున్న యా మహాపురుషుని — అదృష్టవశమున మన కాలమునఁ బుట్టి మనకు సన్మార్గముఁ జూపుచున్న యీ పరమయోగిని — సాధ్యమైనంతవర కనుసరింపవలెను; గాని కేవల కర్మయోగ పదమును బలుమా రుపయోగించుట భావ్యమా? నిజాన్తఃకరణపరీక్ష యెంతవరకుఁ జేయఁబడుచున్నదో యని విచారించితిమేని గంటసీరు రాకమానదు. ముగ్గురు మనుష్యులున్న యే సంస్థయందైనను రెండు 'పార్టీ'లు! అంతే కాని ముగ్గురు నొకటే యభిప్రాయముతో నుండుటరుదు! కాని యీ మూవురును 'కర్మయోగులే'!! ఈరీతిని వ్యాఖ్యానమె చేయుదుమేని నూరేండ్లు చాలవు. రానురాను భేదము శతసహస్రసంఖ్యాముఖముల నభివృద్ధి చెందుచు వచ్చుచున్నది! ఇదియంతయుఁ 'గర్మయోగమే'నా? ఔను!! ఔననక తప్పదు. బోలెడు చదువులు చదివినను సోలెడు నూకలు లభించుట దుర్ఘటమగుచున్నది. కాఁబట్టి కాని పనియే యైనను జేయక తప్పుటలేదు. కాఁబట్టి యిట్టిదానిని సమర్థించుకొంటకుఁ బ్రజ్ఞావాదమే—"కర్మయోగమే"—గతి! ఈ విషమావస్థ యెందుకుఁ గలిగినది యని విచారింతము. నేల విడచిన సాముఁ జేసినాము:—"మన మెవరము - మన పూర్వు లెట్టివారు మన మత మెట్టిది" అను నీ మొదలగువిషయము లడుగంటించి కేవల 'పరప్రత్యయనేయ బుద్ధు'లమైనాము. కాఁబట్టి మన కీ శాస్తి. ఇట్టి కానిపోని యవస్థల యందుఁబడి కర్మయోగ పదము నపభ్రంశము సేయుటకంటె మార్గ



శ్రీ రామేశ్వరము అంతర్భాగము

దర్శకుఁడే యనుకొనుచున్నాము కాఁబట్టి యా మహాత్మునే మనసార ననుసరించుట లెస్స !

నిజమగు కర్మయోగము గ్రామములలో నారంభము కావలయును. ఎండలకు వానలకు వెన్నిచ్చిన హాలికులు మలమల మాడి పోవుచున్నారు. వారి క్షేమమే మన క్షేమము కాఁబట్టి **(A bold peasantry, their country's pride when once destroyed can never be supplied)** వెంటనే యీ పట్టవాస విజృంభణలకుఁ డిలోదకములిచ్చి పల్లెటూరి ప్రజలతోఁ గలసి మెలసియుండి పాటుపడుటయే కర్మయోగమగును. దీని మూలమున నిరుద్యోగ సమస్య తీరుట యటుండ నాత్మానందము సమకూడుచున్నది. దీనివలనఁ బాపచింతయు దూరమగుచున్నది. కాఁబట్టి యువయువతులు శుద్ధచిత్తులై యిట్టి లోకకళ్యాణ హేతుకమగు కర్మయోగమునకుఁ బూనుకొని భరతభూమిని దొంటి సౌభాగ్యస్థితికిఁ దేవలయునని మనవి. మాటలతోఁ బనులు కావు. ఓమ్ తత్సత్.

# బాలవిజ్ఞానశాఖ

## మల్లెమొగ్గ

మల్లెంటు తెచ్చారు మానాన్నగారు
తల్లియే మోపెరట త్రవ్వి పాతింది
అన్నయ్య పందిరిని అచట వేశాడు
తిన్నగా మీదికే తీగలెక్కాయి

వేసంగిగాలులు వీచాయొ లేదో
పూసిందయాచెట్టు పుష్కలంబుగను
ఒడినిండిపోయింది పళ్లెంబుపట్ట(దు)
ఒకసజ్జసాలదు ఎన్నోనుమిగిలె

రేపకడ మొగ్గలు మాపటికిపూలు
మాపటికిమొగ్గలు రేపటికిపూలు
ఆకుదాచినకొద్ది అవిమఱిపూయు
రేకులనువిడచుకొని రేలెల్లనవ్వ

దండల్లుగా గ్రుచ్చి తలకుచుట్టండి
మొగ్గల్లుగా గ్రుచ్చి ముడవండి సిగల
పోగులుగలక్ష్మికి పూజచేయండి
వేగముగ దేముని మెడనువేయుండి

అంగుగా ఒకమొక్క అతికేమొ లేవో
రంగుగా పెరడంత రమ్యమై ప్రాకె
తొంగిచూచును ఆకుతొడిమలనుండి
శృంగారతరమైన చిన్నిపుష్పములు

తీరికై నవ్వుడు షికారుపోదాము
కమ్మనివలపు లాఘ్రాణించుదాము
మంచినీళ్లను పరిమళింపజేతాము
మల్లిఅత్తరవులు మరివండుదాము.

## కప్ప కెందుకు పొడలు వచ్చినవి ?

చీనాదేశంలో పెకింగు నగరములోగల పెద్ద గంటనుగూర్చి మీరు ముందే చదివి ఉన్నారు. చీనావారిట్లు వారి దేశములో వింతలనే గాక, ఇతర దేశములలోని ప్రాత వింతలనుగూర్చికూడ చిత్రవిచిత్రమైన కథలను చెప్పుకొనుచుందురు. అందులో మన హిందూదేశములో ఒక అరణ్యప్రాంతమున జరిగిన జంతుజాలమునుగూర్చి ఒకటి.

హిందూదేశంలో ఎక్కడో లూషాయి గుట్టలని కొన్ని కొండలున్నవట. ఆ ప్రాంతమందు అరణ్యములో జంతువులన్నియు అల్లకల్లోముగ ఒకనాడు తగవులాడుకొన్నవి. దానికి కారణమేమి ?

ఒక ముసలివాడు చెట్లుకొట్టి కాలక్షేపము చేసుకొనేవాడు. వాని కత్తి మొఱకుపోయినది. దగ్గరగానున్న ఒక యేటిలో ఒక రాయిమీద దానిని వాడు నూఱుకొని పదునుపెట్టెను. ఇంతలోనే ఒక మొ(ఱ్ఱ)సుక అతని కాలును కఱచెను.

అతని కేమీతోచక గబగబ ఒక చెట్టు దగ్గరకు వెళ్లి దానిని కొట్టివేసెను. ఆచెట్టు "అయ్యా, ఇదేమయ్యా నన్ను ఇట్లు నఱి

నావు? నా ఒంటినిండ ఒంటెడుపళ్లు వున్న వే! అవి రాలుసమయమున నిల్లు చేసితివి?'' అని చెప్పి దుఃఖించెను.

అయినను ఆ చెట్టేమి మహామంచిదా? తాటిపండంత పెద్దకాయను అక్కడ ఒక కప్ప ఆడుకుంటూ వుంటే దానిమీద రాల్చింది. దాని కొక పెద్ద దెబ్బతగిలి అది "ఏమయ్యా చెట్టా! నీ కాయలను, ఎక్కడ పట్టిన నక్కడ ఇంత కాళీజాగావుండగా, నా మీదనే రాల్చవలెనా? బాగుంది, బాగుంది!'' అని విచారించింది.

ఆకప్ప మళ్లీ యేమి సామాన్యురాలా? ఆ కుంటికాళ్లతోటి అక్కడ ఒక చీమలపుట్ట వుండగా దానిమీదికి దుమికింది! చీమలు సామాన్యులు కావు! అక్కడ ఉండిన ఒక పామును కఱచినవి! పాము ఒకపంది నొక్క కాటు వేసింది! పంది తీవ్రించి ఇటూ అటూ పరిగెత్తి ఒక అంటిచెట్టును ఊడ లాగింది! ఆ చెట్టుగెలలో కిందనబుఱ మీదనకాళ్లు పెట్టుకొని ఒక ఋషిపక్షి తపస్సు చేయుచున్నది! దానికి తపోభంగమై పరుగెత్తి పరుగెత్తి చేటలలాటి చెవులుగల ఒక ఏనుగ చెవులలో దూరింది! ఆ యేనుగ పిచ్చెత్తినట్లు పరుగెత్తి పరుగెత్తి అక్కడ ఒక ముసిలమ్మ గుడిశవుంటే దానిని బోర్లా తోసింది. అక్కడనుంచి ఆమె కయ్యము నకు కాలు దువ్వడము మొదలుపెట్టింది!

ఇట్లాగ ఒకరిగోల ఒకరికి తెలియకుండా, ఒకరిమీద ఒకరు పడుచు, ఒకరినొకరు దూషించుకొనుచు, తిట్టుచు, తప్పుపట్టుచు అల్లకల్లోలముగావుండిరి. ఆఖరికి ముసిలవ్వ తెగించింది. ఏనుగుమీాద పడ్డది. "నీవల్ల నా కెంతో నష్టము వచ్చినది. నా కిప్పు డుండ యిల్లు, వండ పొయ్యిలేదు. నా నష్ట మునకు పరిహారమిస్తే కాని వూరుకో''నని గట్టిగా చెప్పింది.

అప్పటికీ యిపుటికీకూడా మనిషంటే అందరికీ హడలు. "అమ్మా నన్నేమి చేయ మంటావు? గబ్బిలంలాగ ఆ ఋషిపక్షి వచ్చి నా చెవిలో దూరబట్టి నా కేమీ తోచక యిటూ అటూ పరుగెత్తి నీ యింటి మీద పడ్డాను కాని, అన్యాయంగా మీా వంటివారిని హింసపెట్టడం నా కేమి సరదా వా యేమి?'' అని మెల్లిగా బ్రతిమాలి తప్పించుకున్నది.

ఆపాళముగా ముసిలిది ఋషిపక్షిదగ్గరకు వెళ్లి "నీవల్ల నాకీ నష్టము వచ్చినది, పరి హారమిస్తావా యియ్యవా?'' అని సాధించినది.

"అమ్మా అడవిపందివచ్చి అరటిచెట్టు నూడపెరుకుటచేత నాకుకూడా నిలవ నీడ లేక కొట్టుకొంటూ యేనుగచెవులో వేలాడు దామని వెళ్లినాను. నేనేమి చేయుగల''నని ఋషిపక్షి యేడ్చింది.

పందిదగ్గరకు వెళ్లితే పంది చెట్టుమీాద, చెట్టు పాముమీాద, పాము చీమలమీాద. చీమలు కప్పమీాద, కప్ప కాయలచెట్టుమీాద, చెట్టు చెట్టునటికే వాడిమీాద, వాడు యెండ్రుక మీాద ఏవో నేరములుచెప్పి తప్పించు కున్నారు.

ఈయెండ్రుక యెవర్నిమీద తప్పు పట్ట గలదు? అది అనువుగా దొరికిపోయినది. తీరా కూర్చుని యెవరినో కరిస్తే దానిఫలము వ్వారికే పోతుందా? ఈ జంతుజాలమంతా దానిమీదపడి పగతీర్చుకుందామని నిశ్చ యించుకొన్నవి.

"సరే నిన్ను నీటిలో పెట్టి ముంచివేయు టకు మేమందరము సిద్ధులమయి వున్నాము. వేడినీళ్లలో మునుగుతావా. చన్నీళ్ళలో మునుగుతావా?" అని ప్రశ్నించినవి.

"సరే నేను చన్నీళ్లలో మునిగిపోతా" నని అది చెప్పింది. నీటిలో యెండ్రుకకు నీటిలో, అందులోను చన్నీటిలో భయమే ముంది? అన్నీ కలిసి దానిని ఒకగుంటదగ్గ రకు తీసుకొనిపోయి లోతుగాకుక్కి, అది చచ్చి మీదికి తేలుతే చూదామని కనిపెట్టు కొని కూర్చున్నవి. యెండ్రుక యెప్పుడైనా నీటిలో చచ్చునా? అది హాయిగా అక్కడే వుండిపోయింది.

"అరరే, ఇదేదో మాయచేసి మనను మోసగించినది. దీని కిందువలన హాయియే కాని నష్టము లేదు. దీనినెట్లైనా సాధించవలె" నని అవిఅన్నియు తలచినవి.

గుంటలో నీళ్లన్నీ ఏనుగ తాగేసినది. వేడినీళ్లకుండ ఒకటి తెచ్చిఅక్కడ పెట్టినారు. ఎండ్రుకను ఆకుండలో అవన్నీ కలిపి కుక్కి వేసినవి. మీద మూతపెట్టినవి. ఉడికిపోతే తిందామని కనిపెట్టుకొన్నవి.

దానికి చుట్టుచుట్టుమని వేడితగిలి అది ఉడకడము ప్రారంభించినది. కప్ప గారు వంట బ్రాహ్మడైనాడు. "మూతదిట్టముగా వున్నదా? ఎండ్రుక బాగా ఉడుకుతున్న దా?" అని అడగడము మొదలుపెట్టినవి.

"అయ్యో నీళ్ళింకా చాలా వున్నవి. అవన్నీ యిగిరిపోవలెను. ఇదిగో వీనిని మెల్లిగా త్రాగివేసి, దానిని వేగిర ముడికిం చెద"నని చెప్పుచు నీటిచుక్కలతో పాటు యెండ్రుకనుకూడ కబళించుచు తిరిగి మూత పెట్టుచు కప్ప కాలక్షేపము చేయజొచ్చెను.

'ఏమండీ కప్పగారూ, వంట అయిందా?' అని అందరును తొందర పెట్టజొచ్చిరి.

"అయ్యో, వంటా అయింది, నాతిండీ అయింది. నానోరు పెద్దదేమో, అదినా నోట్లోకి ప్రమాదవశమున దూరిపోయినది. నాకడుపు పట్టదు. ఆయాసమూ యెక్కు వయింది" అని కప్ప ఆయాసము నటించెను. "అన్నా దొంగా, మమ్ముల నేమార్చి నీ వొక్కడవే విందునెల్ల సాపడితివా? నీకు తగిన ప్రతికారము చేయలేకపోతామా? జాగ్రత!" అని అన్నియు ఒక్కసారి కోప ముతో రేగి దానివీపల్లా తెగపొడిచినవి. దానిది మొండిప్రాణము కనుక అదిమాత్రం కృత్యాద్యవస్థమీద బ్రతికిపోయినది. నాటి నుండి నేటివరకు ఆజాతికప్పల కన్నిటికీ ఒడలినిండా పొడలుమాత్రము వున్నవి.

గీ॥ అందరొకలాటి అపరాధులైననేమి?
దొరకిపోయెను యెండ్రుక వెఱపులేక
పరుల మోసంబుచేసి సాపడినకతన
కప్పకప్పుడే మేనిపై కలిగెపొడలు.

# మనోరమ

అని కృష్ణవర్మ తాను చేసికొనివచ్చిన దానినిగూర్చి చెప్పుచుండగా రాజకుమారి యొద్దనుండి సందేశమొకటి వచ్చెను.

ఆనాటి మధ్యాహ్నమున నామె దూరముగఁ గానవచ్చు నొక పర్వతారోహణ మొనర్చి యచ్చటి సృష్టిచిత్రములఁ బరిశీలింప సత్వరారూఢయై వాహ్యాళి బోవనున్న దఁట. అచ్చట యేటొకటి పైనుండి మహా వేగమున క్రిందకు దొరలివచ్చుచుండునఁట. ఆ పరిసరప్రదేశమంతయు మిగుల దర్శనీయముగ నుండును గావున మేముగూడ వత్తు మాయని యామె మాకు వర్తమాన మంపెను.

మే మందులకు సమ్మతించితిమి. ఆనిర్ణీత సమయ మాసన్నమగువఱకు నెట్లో నాటి చదువులఁ గడతేర్చుకొని మాకై ప్రతీక్షించుచున్న నామనోహారిణియొద్దకు వెడలి పోతిమి.

ఆమె తన యుపాధ్యాయినీ సంఘము తోడను తదితర కన్యాజనముతోడను పరివేష్టింపఁబడి ప్రయాణసన్నద్ధయై నిలునఁబడి యుండెను. అందఱిలోను ధగధగ మెఱసి పోవుచు నందఱిలోను శిరఃప్రమాణమాత్రమున నున్నతమైయున్న ఆమెరూపమెంత మనోజ్ఞతరమై యున్నది! సింహకిశోర మొకటి యామె పాదములయొద్ద పిల్లిపిల్లవలె చెలగాట మాడుచుండెను. చేరువకుబోయి నే నామెను చూచితిని. అప్పుడాకస్మికముగ మావంశమునఁ బీడవలె బట్టికొనియున్న ప్రాక్తనశాపము నన్నావహించినదికావల యు. చూచుచుండగ రాచకన్నియ యగు నయ్యిందిరమొగపుఁ బూతల మెఱసిపోవుచు మాయానాటకమున నాటలాడు వేసగత్తె వలె నాకగుపించెను. ఆమెపాదములచెంత నున్న ఆసింగపుఁబిల్ల మృగతృష్ణయందలి జలపూరమువంటిదని భావించితిని. అంతే కాదు. ఆమహిళావిద్యాలయము, ఆసర్వ విద్యార్థినీ సంఘము మఱియు నక్కడ ప్రోగు వడియున్న మేఘసందఱమును స్వప్నమునఁ దోచు కపటపాత్రములవలె కుహనాదృశ్యములవలె—మోసపుఁ జాయలవలెనే నూహించితిని. ఆ మిథ్యా మనోఘాతము నాయందెట్టి ప్రధ్వంసాభావమునకుఁ దావలమైనదో పరాత్పరుఁ డెఱుఁగవలయు! ఉండియులేకుండ, కనియుఁ గాంచకుండ 'అస్తి నాస్తి'యను భావమునకు మూలమైన మనః పరివర్తనమున బ్రుంగుడువడి మిగుల నుద్వేగమున గొట్టుకొను రక్తనాళముల యొత్తిడి వలన గొంత తహతహలాడి, తరువాత

నన్నట్లు పీడించవచ్చిన భ్రాంతిదృశ్యముల నప్రమత్తుఁడనై విదల్చుకొంటిని గావలయు. ఆమె కనులయందలి యసాధారణ తేజ మొక్కమారు మెఱపు మెఱసినట్లు నా సర్వాంగములను ప్రజ్వలిత మొనర్చివైచెను. అప్రయత్నముగ నాహృదయాంతరాళము నుండి దీర్ఘనిశ్వాసమొకటి యీవలకువచ్చెను. ఆమె నా పాణిగ్రహణమొనర్చి యథోచితముగఁ బలుకరించుటయే తడవుగ నాకస్మికముగఁ బీడవలె బట్టికొనియున్న భ్రాంతి పుంజములన్నియుఁ బంచబంగాళముగఁ జెదరి పోయెను. పునరుజ్జీవనకరముగ నా యం దెప్పటిచైతన్య మంకురించినదని తెలిసి కొంటిని.

అటుపిమ్మట మేమందఱ మశ్వారూఢులమై బయలుదేరితిమి. ఆసరిత్తీరమునఁజేరి అది కొట్టుకొనుచు వచ్చియున్న కొండల దెసకు బారులుదీరి మా వెనుక వచ్చువిద్యార్థి సేనలమునకుఁ ద్రోవఁదీయుచు స్వారి చేయుచుంటిమి.

ఆ రాజకుమారి కొకవంక నేనశ్వారూఢుడనై యుంటిని. ఆమె నాతో "మిత్రమా, నిన్నటి సంభాషణమున నేను నీసహాధ్యాయునుగూర్చి మిగుల కఠినముగ సంభాషించితినని నీవు భావింపకుందువని నే ననుకొనుచున్నాను. ఏమనుకొంటివో కాని మిగుల ననిష్టముగనే నట్లు పలుకవలసినదాననైతిని' అని పలికెను.

"ఆమెతో గాదుగాని మేమెవ్వరినిగూర్చి ప్రసంగించితిమో వారిపై మీరనుచున్న విధముగ తప్పక పలికియుంటిరని నాకుఁ దోచినది." అని నేనంటిని.

"తిరుగ నదియే గాథయా? మీరాతనిఁ యొద్దనుండి రాయబారిణులై వచ్చితిర యేమి? క్రొత్తవారు గావున నీకనుజ్ఞ యిత్తును. నీవు యథేచ్ఛముగ మాట్లాడ వచ్చును. ఏమందు వోస్పష్టముగ నొక్కమారు చెప్పివేయుము. ఆకథ నిఁక దడువకుండ నాశ్వాసాంత మొనర్పవచ్చును.' అని యామె నన్నడుగజొచ్చెను.

ఆకస్మికముగ నడుగఁబడుటచేత నేన తడబాటున నేమియు నతుగకుండ మాట్లాడ వలసిన వాఁడనైతిని.—మొదట నేనతఁ నెఱుఁగుదు నంటిని. తరువాత "ఇట్టి విద్వేషములకంటె పొందుపడినయెడల బాగు నుండియుండును కదా!" అని యేమొ చెప్పఁబోయి నడుమ నాపివైచితిని. అట పిమ్మట "మారాజు కోరునదియేమనగా"- అని అర్థోక్తియందే "ఈ వైవాహికోద్యవ మునుగూర్చి మున్పొక రొకండంబడికయైః దఁట గాదా?—మఱియు నారాజకుమ రుఁడు!—అతనికంటె నుత్తమమనస్కడింకొక డుండఁడు. అతఁ డేమిచేసినను తన మూర్తినే యంతరాళమున ననుసంధించ కొనుచుఁ గదలువాఁడు. అచ్చటనుండి ఈ వైపునకుఁబోవు విహంగముల జూచునప్పుడ తనకుఁగూడ నావిధముగ ఱెక్కలు న్న యెడల నిచ్చటకువచ్చి వ్రాలియుండును

గదాయని తలపోయుచుండువాఁడు. నిశ్చయముగఁ దాము తమ యుద్యమమున సుస్థిరులయి యుండిపోవుటయే జరుగునెడల నతఁడు హతాశుఁడై—విచ్ఛిన్నచేతస్కుఁడై—దారుణముగఁ జచ్చిపోవుననుట ధ్రువము. నిరాశాహతులగు నిర్భాగ్యు లాపత్కాలమునఁ దుచ్ఛముగ, ఘోరముగ నెట్లు ప్రాణత్యాగము నర్తురో అతఁడుగూడ నదేవిధమున జేసివేయును.'' అని చెప్పుకొంటిని

“పాప మెంతటిబేల !—అయిన నతఁడు చదువుకొనఁజాలఁడా ? వారిదేశమున పుస్తకములే లేవా ?—జీవితమును దుష్టిప్రదముగ జేసికొనుట కెన్ని సాధనములు లేవు ? ఎన్నియెన్ని కేళీవినోదములు లేవు ? వీరపురుషోచితములగు నాహవ, వ్యాయామ, ఖేలన, విద్యావినోదము లెన్ని లేవు ? వానితో నతఁడేల కాలయాపన మొనర్పఁజాలఁడు ?—అవివేకమూలమగు గ్రుడ్డియాదర్శమొకటి యెదుట నుంచుకొని దానివలన నంధీభూతుఁడై తహతహలాడుటకన్న అధమాధమత్వ మింకొకటి యున్నదా ? బాలికాజనయోగ్యమైన ఇట్టి యపస్మారమున నాతఁడడలిపడుట యెందులకు ? ఇది కేవల పసిబాలికాయోగ్యమగుధోరణి. బాలికలయిన నొకప్పు డట్లుండిరి కాని ఇప్పు డట్లు లేరే! నేనుసహిత మొకప్పు డట్టివైఖరి నుంటిని. అవన్నియు నిప్పుడు కలవలె నైపోయినవి. అట్టివాని యందతఁడు సంతత పరిభ్రమణపరాయణుఁడై, నిర్మగ్నమానమనస్కుఁడై యుండును గావలయు. అట్టివైఖరి నొకప్పుడు నేనుసహిత ముంటినని జెప్పుకొనుటకు నాకెట్టి సంకోచమును లేదు. ఏమందువా? నాప్రాక్తన జీవితమంతయు పూర్వజన్మకర్మమువలె నిశ్శేషముగఁ జచ్చియున్నది. అదంతయు మహిళాలోకమున నాకుగలస్థానమును నాజీవితపరమార్థమును, తదాశయమును, తత్కర్తవ్యమును దెలిసికొని ఇక్కడే కార్యరంగమునకువచ్చి వ్రాలుటాదిగనైనది. నైసర్గికమగు దేవత్వమును బోఁగొట్టుకొని తుచ్ఛముగఁ బరిభ్రమించుచున్న స్త్రీల వివేక వైభవప్రాభవములను పురుషులతో సరిసమానముగఁ బ్రతిష్ఠించుటయే నాజీవితమున కిప్పుడు ముఖ్యలక్ష్యముగఁ దలంచుచున్నాను.”

ఆమె కొంతసేపూరకుండి మఱల నతిశయసూచకమగు నొక మందహాసమును బ్రదర్శించుచు,

“నీవేమో ముందు జరిగిన యొసంబడిక యనుచుంటివి. కాని నేనేమి పసికూన ననుకొంటివా ? ఒకరియాజ్ఞాబద్ధముగ నాజీవిత స్వాతంత్ర్యమును నే నెందులకు బోఁగొట్టుకొందును ? అన్యకన్యాసాధారణమైన బుద్ధితో నన్నుపలక్షించి నాయిష్టానిష్టములఁ బాటింపకుండ అన్యులొనర్చుకొను ఇట్టి ప్రాచీనసమయములకు నేనేల బద్ధురాల నగుదును? ఇట్టి రాక్షసపైశాచిక వైవాహికోదంతములు కృతయుగమునందో, ద్వాపరయుగమునందో జెల్లియుండినవి గాని ఇప్పుడీకాలమునఁ జెల్లగలవా ? ద్వాపరమునఁ బుట్టినను అట్టి రాక్షసపుబద్ధతి కొప్పుకొనని

అంబయే నిక్కముగు నంబ! అవల మగవాఁ డెంత భీష్ముఁడయి రాక్షసముగ నెత్తికొని పోయి తనబ్రదుకు కథోగతి పాలుచేసినను చలింపక ముష్కరుఁడగు నాతనిని వధింప నుద్యోగించి జన్మాంతరమునందైన గృత కృత్యయైన అంబ సాక్షాదంబికా రూపిణియై మహిళాలోకమున నేక వీరయై ప్రకాశించుచున్నది. ఎట్టి మగవానికిఁగూడ గెలువరాని అమర్త్య మహాబలశాలియైన యతఁ డంగనను—అంగనాపూర్వని—అంగనాభిధానునిమార్కొనక యుద్ధపరాఙ్ముఖుఁడగునఁట! ఎంతవింత! అబలలను ముష్కరముగ నీడ్చుకొని పోఁగలఁడు కాని వారు కత్తిగట్టి యుద్ధమొనర్ప వచ్చినవారి తోడి యాహవము తన పౌరుషమునకుఁ గొఱఁతగఁ దలపోయునంట.

ఉ. ఎవ్వతెనేని ధాత సృజి
యించెఁదగన్ మగవానిగాఁగ నా
కావ్వమిఁజేసి యట్టి నిను
నుగ్మలి నేయఁగ నొల్ల నాపయిం
గ్రొవ్వెసలారనీవు శర
కోటివెసం బరగించితేని నే
నవ్వుదుగాని గోపము మ
నంబునఁ బుట్టదునూ శిఖండిని.

ఆడుదానిశస్త్రమును గ్రీఁగంటనైనఁ జూచుట కొప్పుకొనని ఇట్టి యడిబీరపుఁ దులువలను—మగవారిలో నాతఁ డమేయ పౌరుషశాలియే కావచ్చును—నేలకుఁగోల కుఁదెచ్చిన శిఖండినివంటిపరాక్రమశీల నేఁడొకతె యున్నయెడల స్త్రీల యిష్టానిష్టములతో ప్రసక్తిలేకుండ వారియైహిక జీవితములఁగూర్చి తమలోదాము సమయము లొనర్చుకొను నీప్రతాపశాలురపస తెలిసి పోవును." అని పలికెను.

"చేవగల మొక్కనాశ్రయించి బ్రదుక నూహించు లతకూనవలె నారాజకుమారుఁడు తమతోడి సహవాసమే చిరాకాంక్షితసిద్ధిగ—సర్వజీవితమనోరథఫలావాప్తిగ నెంచువాఁడని మనవి చేయుచున్నాను. అట్టి వానిపై తాము పూర్తిగ హేమంతమున మహాకంపమెత్తింప వీచు హోరుగాలివలె నిర్దాక్షిణ్యముగఁ దీవ్రముగ నూఁపివేయ నూహించుచున్నారు కద!—నే రాజకుమారుని ముఖ్యముగ నతని యంతఃకరణము నెఱుంగుదును. అతని సత్యశీలత్వమున నాకు విశ్వాసమున్నది—ఇక సృష్ట్యాదినుండి నిరంతరీకృతముగఁ బ్రబలియున్న పురుషౌన్నత్యమును ప్రతిఘటించి నిలువఁబడుటయను తమ సంకల్పమున్నదే!—అదియెంత మహత్తరము! ఎంతమస్తరము! ఎంతమహాయాసప్రదము!—స్వేచ్ఛగ మాట్లాడవచ్చునని మీరనుచున్నారు. కావున నామనస్సునందున్న దున్నట్లుచెప్పవచ్చునా?—కొంచెమూహింపుడు. ఈదేహములేమి మనకు శాశ్వతములా? 'నలినీ పత్రగతాంబు చంచలము లెన్నఁగ బ్రాణముల్' అనుట తమ కెఱుంగనిది కాదుగద! తమ మనోరథమున నగమైన కొనసాగకుండ తమకేమైన వచ్చిన యెడల సంకటతో తమ యుద్యమమున కాశ్వాశాంతమై పోవును కాదా? తమకున్న

పట్టుదలయు, కార్యోత్సాహమును, కార్యా
శూరత్వమును తమ తరువాతి నాయికల
కుండునా ? వారల కింతమనోబలముండిన
గదా తమవలె కార్యదక్షులు కాఁగలరు!
లేనియెడల తమ నిర్మాణకార్యక్రమము
లన్నియుఁ గూలిపోవుననుట కేమైన సందేహ
ముండునా ? కావునఁ దమ పరిశ్రమమంత
యుఁ దుదకు సైకతస్థలమందలి పదప్రచార
ములవలె పూర్వాచారతరంగముల తాకున
నామరూపములు లేకుండ నశించిపోవుననుట
నిశ్చయము. తమయుద్యమమట్లు తుదకు
సర్వనాశనమగుటయే భావిఘటనా పరిణామ
ముగఁ జెప్పఁ గలిగినయెడల నీలోన తాము
కేవలస్త్రియే కళత్రముగ బ్రదిగి తమ మహ
త్కార్యములే సంతానముగఁదలంచి తుద
కంద కాడువాంఛకును ప్రకృతి సిద్ధముగ
లభించు ప్రణయము, నానందము, పిల్లలును
లేని శుష్కజీవితమును గడుపవలసిన వారగు
దురు కద!" అని సాహసించి పలికితిని.

ఆమె కొంచెము తీవ్రముగ "చాలింపు
ము! మొండిత్రోవఁగఁబోవు గొడ్డువలె
నెంతదూరముగఁ గొట్టుకొని వచ్చితివి! ఉత్త
రాది కొండలలోని యడవిబాలికవు! మంచి
చెడ్డ లెఱుంగకుండ నొకేవిధమున ఘోషిం
చితివి. ఏమో యనుకొంటిని గాని నా
యెదుట నింత చొరవగ మాట్లాడుదు వను
కొనలేదు. వీరరాజకుమారుని ప్రణయము
కేవల దేవలోకమున గోచరించు నుత్తమ
తత్త్వమే యందము. అయిన నేమామె!
నేనుమాత్ర మింతత్యాగము—ఇహలోక
దుర్లభమగు నింత మహాత్యాగమొనర్చు
చుంటుట లేదా!—నీవలె యింత సాహస
ముగ నాయెద్ద నెవ్వరును భాషించినవారు
లేరు. నీవు పిల్లలనుచున్నావు! అడవిపువ్వుల
వలె ఎల్లయెడలను పిల్ల లీ భూమిపై నుద
యించుచుండినయెడల నెంత బాగుండియుం
డును !! స్త్రీలకుఁ బిల్లలతోడి బ్రదుకు నిశ్చ
యముగ మహానందదాయకమే ! అయిన
నేమి ! అంత గారాబముతో పెంచికొను
పిల్లలుసహితము మరణింతురే! ఇఁక
నోబాలిక ! నీవెంతజాణవై భాషింప నేర్పరు
రాలవైనను నేనొక్కసంగతిఁ జెప్పఁగలను.
ఏమి నశించినను గొప్పపనులున్నవే! అవి
మఱెప్పటికిని నశింపవు. 'జాతస్య మరణమ్
ధ్రువమ్' అనునది కేవల కుక్షింభరులై
చరించు మానవులగూర్చి మనము చెప్పు
కొనదగినది. దేవతాసంకాశములగు నుత్తమ
చరిత్రములకు జరామరణ భయముండదని
నిశ్చయముగఁ జెప్పఁగలను. అవి సూర్య
చంద్రాదుల తేజమువలె నిరంతరపరివర్ధ
మానమగు కాంతిపుంజములతో శాశ్వత
ముగఁ బ్రకాశించుచు నీభూమిపై చరి
యించువారి కాదర్శయోగ్యముగ నాశీర్వ
దించుచు నుండిపోవును!—ఇఁక బిల్లలను
గూర్చి నేను చెప్పునది. పిల్లలమూలముననే
గద స్త్రీలైహికమున దుస్సహములగు
నన్నిబాధ లనుభవించుట! పిల్లలమూలమున
గదా పురుషు లబలలహృదయములఁ దఱిగి
వేయ సాహసింతురు ! లేనిప్రేమయు—లేని
కరుణయుఁజూపి యాత్మోన్నతికి మనల

వంచితలఁజేసి బాధింతురు ! ఆహా ! పిల్లలను
గని వారు పాడగుచుండఁగాంచి దుఃఖిం
చుటకంటె యీసుదానిఁబ్రతుకున నధోగతి
యింకొకటియుండదు. ఈమహిళామహో
ద్యమమిది నాకు జన్మవ్రతము. దీనిని పరిత్య
జించి తుచ్ఛములగు సంసారసుఖముల కాసిం
చిన నేను లోకసామాన్యనగుదును గాని
సర్వలోకోత్తరచరిత్రనైమనుట యెట్లు ?

క. జగముల నెల్లను నిండిన
పొగడిత గను వెలితిసేసి పొల్లమొసలికై
తగవే జన్మవ్రతమిటు
దిగవిడువఁగ నేఁడు నాకు త్రిభువనదీపా.

అని సూర్యునకుఁగూడ విస్మయమొదవు
నట్లు పలుకఁగలుగుటయే కర్తవ్యనైష్ఠికత్వ
మనిపించుకొనును.

ఆ. వె. కీర్తివిమలజాలఁ గీర్తితో మెలుఁగఁగ
జావువచ్చెనేని జత్తుఁగాని
జగములోననెల్ల నడికించుఁ జావుమే
లనఁగబరఁగుమాట యనఘ వినవె.

ఉ. కీర్తియె యిచ్చుఁ బుణ్యగతిఁ
గీర్తియె తల్లియుఁబోలెఁ బ్రేమ ప
త్కీర్తియె యాయువున్ సిరియుఁ
గీర్తివిహీనయుచూ శవంబు——

అనువాక్యములు మన కంతరాళములఁ
దేజస్వంతముగ వెలుంగుచుండవలయు. ఐనను
'యేనాకేనాప్యుపాయేన ప్రసిద్ధ పురుషో
భవేత్'——అనునట్లు ఎట్లైన సరే——ఏయుపా
యముననైన సరే ప్రసిద్ధులము గావలయు
నను నుద్దేశమున మన మిట్టియుద్యమముల
నిర్వహించుచుండుటలేదు. అయాచితముగ-
మనము చేయుకార్యముల ఘనత కను
రూపమైన యుత్తమకీర్తి మనకుండవలయుఁ
గాని కీర్తియే పరమావధిగ మనమూహింపఁ
దగదు. అయిన నింక గీర్తి కాసపడుట
యొంతమలకందువేమో —— సత్కీర్తియున్నదే
అది మహానుభావమున మెఱయువారి యభి
నందనమున కాస్పదమైనది. అట్టి యభినందన
మునఁ దుదకు సిద్ధించునదియు సత్యాల్పమే
యైనను——అది కాలక్రమమున మనయుద్య
మమునఁ జేరుచుండువారికిఁ జేయూఁతనొసం
గునని నిశ్చయముగఁ జెప్పవచ్చును. కావున
నేనీనడకు వదించినట్లు——'ఉత్తిష్ఠత ! జాగ్రత !
ప్రాప్యవరాన్నిబోధత'——అను పరమాదర్శ
మును దృష్టిపథమున నుంచుకొని మన
యుద్యమ నిర్వహణమున బహుకంటకాలమై——
కార్యశూరులమై ప్రకాశింపవలయుగాని——
మనయుద్యమ మతి గహనమనియు——బ్రదుక
స్థిరమనియు భావించి——'అయ్యో ! మనకు
సాధ్యము కాదేమో ! మనము జచ్చిపోయిన
నేమగునో ! మనవెనుక వచ్చువారు మన
యంత ధైర్యశాలినులు గారేమో !' అని
వెడగుతనమునఁ దలపోయుటకంటె బరి
హాసాస్పదమగు తత్వమింకొకటి యుండదు.
కాని సీవనినట్లు కల్లోలలోలమై, కతిపయ
దివసస్థాయినియై, సౌదామినీచంచలమై,
మక్షికాసంకాశమగు మనుష్యపుటునికి గల
మర్త్యభామినుల మగుటకంటె ఒక వేయేసి
సంవత్సరములైన సమర్థులమై చిరాయురు
పేతులగు పూర్వదేవతలవలె మృత్యు
ధిక్కారమొనర్చి నిలువఁగలిగినయెడల నిప్పు

డిసుకయందువలెఁ గానవచ్చు మన పదచిహ్నములు కాల దొలచినక్కడి శాశ్వతముగ నిలిచిపోవుట కండ్లాఱఁ జూచియుందుము కద !”

నేను నిరుత్తరుఁడనై యూరకుంటిని. విస్మయావహమగు నట్టి యంతఃకరణమును బ్రదర్శింపుచు మహోన్నతభావాంబర సంచారిణియై లోకోత్తర కవయిత్రీమణియై కవయింపఁగల నామనోహారిణి — నా రాజకుమారి నాకులభింపదు గాఁబోలు ననుసంశయముగూడ నాయం దుత్పన్నమయ్యెను.

ఆమె నామనోగతభావముల దెలిసికొన్నదానివలె మఱల పలుక నారంభించెను.

“నిశ్చయముగ మేమొకనీతి రాక్షసప్రకృతిని బుట్టియుందుమని నీదుభావము కావలయు. ఇంతవఱకు స్త్రీలు మానసికముగ, నైతికముగ, ఆధ్యాత్మికముగ నెట్టి స్వాతంత్ర్యము నభిలషింపకుండ మగవాండ్ర కొదిగియుండిపోవుచువచ్చిరి. ఏమివలన? — స్త్రీలకట్టి స్వాతంత్ర్యార్హతయు లేదని మన వాం[illegible]లతో తెలుపఁబడి, తమకు సహజముగ జెందఁదగినయున్నతి నపేక్షింపకుండ నుండిపోవుటవలన మగవాండ్ర ముష్కరత్వమున ఎండబారిన వజ్రకఠినత్వమును గూడ కోమలాంగులలవరించుకొని తుచ్ఛాతితుచ్ఛులగు ‘భర్తృ’వాండ్ర యేలుబడులకుగూడలోబడి యుండిపోవుచువచ్చిరి కాదా? ఆత్మగౌరవమును నిష్ఫలముగఁ జేసికొని అవమానాస్పదముగ మగవానికడగి యుండుటయే యాదుదాని కానందజనకముగఁ బరిణమించినది. అట్టిసందర్భమున స్త్రీలోకక్షేమంకరాకాంక్షిణులమై మేమొనర్చు ఘనకార్యములనుగాని, ఏతన్మహత్త్వమునుగాని వారు లేశవలేశమును తెలిసికొనఁజాలరు. వారి భావమునబట్టని, తలపున కందని, దుస్తరపథముల వారిశ్రేయస్సే మామనోరథముగ, ఉత్తమాదర్శముగ, పరమాపధిగ, ఇహలోకజీవితవ్రతముగ మేమూహింపఁగలము. ప్రేమైకభాజనులగు మాసఖీమణుల నిశ్చయనిశ్శేష సద్యఃస్వాతంత్ర్యఫలావాప్తికి ప్రహ్లాదకుమారునివలె మేమెట్టి మరణబాధలనైన ననుగ్రహములుగ భావించుచు పంచత్వమొందుటకైన వెనుదీయము. స్త్రీలోకాభ్యుదయమునకై ఆజన్మాంతముగఁ దనువులఁ జెల్లించుకొనుటకంటె ఒక్కసారి స్వార్థరహితమగు నాత్మార్పణముగ సూక్ష్మముగ ఫలసిద్ధియగుట కవకాశమున్నయెడల నట్లు పరమపదించుటయే పరమధర్మముగును కాదా? అశేషకాంతా స్వాతంత్ర్య సంపాదనమొక్క కాంతా ప్రాణసమర్పణమున సిద్ధింపఁగలిగినయెడల నెట్టి మహోగ్రమారణ తంత్రమైన వెనుదీయకుండ సిద్ధపడఁగలను. గజయూథముల ద్రొక్కుడు వడుటకైన — శూలముల బొడువఁబడుటకైన — గొప్పకొండలనుండి గూలఁబడుటకైన — మహోగ్రానలమున దుముకుటకైన — మఱియెట్టి యగ్నిపరీక్షకైనను నిస్సంశయముగ సంసిద్ధురాలను కాఁగలను.”

అట్లనునప్పు డామెకనుల బాష్పోద్గమ

మైనది కాంబోలు. ఆమె తలవంచి యూరకుండెను. అక్కడ నానదీప్రవాహము కొండనుండి క్రిందకు దిరుగుచుపడుచు నాయడవియంతయు మారుమ్రోగునట్లు మహానాదమొనర్చుచుం గానవచ్చెను. నిరంతరీకృతముగ నెగసిపడు నంబుకణములపై సూర్యరస్మి చిత్రవిచిత్రములగు కాంతిపుంజములం బ్రభవింపం జేయుచుండెను. అచ్చట సమీపమున మనుష్యుండీభూమిపై నవతరించుటకు మును దేహోన్నతములై తమకంది వచ్చిన సర్వచరాచరావళులను గలంచి నేడు నామ మాత్రావశేషముగ నశించియుండిన యుగ్రసత్త్వముల యెముకలు కొన్ని మా కక్షిగోచరమయ్యెను. కొంతసేపామె వానిపై దృష్టిం బఱపి "మనకీ యెముకలెట్లున్నవో భావికాలమువారికి మనమట్లే యగుదుము గద!" అని పలికెను.

"అనగ సంతతవర్ధమానముగ సృష్టికర్త తాం జేసినదానికి మెఱుగులపెట్టుకొనుట నేర్చుకొనుచున్నాఁడని యర్థమగును కాదా? జగత్కారణుఁడైన పరమేశ్వరుని సహితము అభ్యాసమునం బ్రోడతన మలవఱచుకొను సామాన్యకార్మికునివలె భావించు సాహసమునకు మనమేల పాలుకావలెను?" అని నేనంటిని.

"అట్లయిన భౌతికశాస్త్రములయందు నీకభిమానమున్నదాయేమి?—ఉన్నయెడల నీవు వానిని లెస్సగ నభ్యసించి వానియందు మనవారి కభిరుచి కలుగవలయునను నుద్దేశ్యమున మేము నిర్ణయించియుంచిన రత్న ఖచితమగు సువర్ణపదకమును పొందఁగలవు. ఆపదకమున విశ్వవిఖ్యాతగణితవేత్తయగు లీలావతి విక్రమాదిత్యునకు స్వకీయశాస్త్రమవగతమగునట్లు బోధించుచున్నది. అది యెంత జక్కగ—జీవకళ లుట్టిపడునట్లు చిత్రింపంబడిన దనుకొంటివి! ఆమె తాను చెప్పుదానియందు నిగాఢవిలీనమనస్కయై బోధించునది వోలెను—అతఁడామె చెప్పుదానిని కౌతుకమున వినుచున్నట్లును నాకు స్ఫురించిన భావమున కనురూపముగఁ జిత్రింపఁబడునట్లు చేసితిని. ఏమనుకొంటివో కాని మా విద్యాలయమున నెట్టివారికెట్టి విద్యాభిరుచియున్న యట్టివానిని సమగ్రముగ బఠింపఁగలుగు వీలుండునట్లు చేసితిని." అనియామె చెప్పఁజొచ్చెను.

"కాని వారిలో శస్త్రచికిత్సా శాస్త్రమునుగాని, శరీరవిఖండనవిజ్ఞానమునుగాని పొందగోరువారొక్కరినిగూడ నేను చూచి యుండలేదు." అని నేనంటిని.

"అందునుగూర్చి నేను తలంపక పోలేదు. నిజము చెప్పవలయునన్న నాకట్టి కళేబర విదళనోత్సాహవ్యవసాయముల నుత్సాహము లేదు.—అయినను మనుజభోజనులవలె బిఱుంగుల నోయుటయందు సిద్ధహస్తులగుచున్న మగవారి వైఖరుల నవలంబించి మనబాలికల కట్టి వైద్యశాఖల నేర్ప నూహింతురను నూహయే నాకొడలకంప ముదయింపం జేయుచున్నది. అట్టి శవఖండన విద్యాపారంగతులగు పురుషులవైఖరిని మన వారుగూడ తగులఁబెట్టుట కర్హమైన కళేబర

ములఁ గొంతగోసి వానిని కుక్కలకు దిని
పించి—అవి వానిని జీర్ణించుకొనుచుండగ
వానిని సహితము సగము సగము ఖండించి—
అంతటితో నూరకుండక ప్రాణోత్క్రమణో
న్ముఖమగుచు నాగిపోవనున్న మనుజహృద
యముల సహితము నిష్కంపకాఠిన్యమున
గోసి హింసించి—మహాపవిత్రమైన పాంచ
భౌతికవికారాకారములగు దైహికాలయ
ముల నాస్తికగాథములై పాడుచేసి ఘాతుక
మృగముల కనురూపమైన కర్కశప్రకృతుల
నలవరించుకొని తమయాత్మల నధఃపతిత
ములుగఁ జేసికొనుట నాకు వెక్కసముగ
దోచుచుండును.—ఇట్లు నీ నంతమాత్రమున
విజ్ఞానమహాత్వమును దెలిసికొనఁజాలని
వాననుగాను. విజ్ఞానోపార్జన మన్నివిధముల
నైహికజీవితమునకుఁ బరమావధియని నాకు
స్పష్టముగఁ దెలియును. అట్లగుటచేత నీగాత్ర
విదళన వ్యవసాయములఁగూర్చి నేనొక నిర్ణ
యమున కింకను రాలేను.—అయినను ఆధి
వ్యాధి జరామరణభయము లైహికప్రాణుల
కెల్లప్పుడును సంభవించుచునే యుండును
గావునను—పురుషుఁడు దెచ్చికొనుట మా
కంగీకారము కాకపోవుటచేతను నేనుగూడ
నీ వైద్యవిద్యను—ఈ ఆయుర్వేదశాస్త్ర
మును సమగ్రముగఁ జిరకాల మభ్యసించితిని:
కావున మీ కేమైన వచ్చినయెడల నేనే
స్వయముగఁ జికిత్స యొనర్పఁగలను.—
ఇఁక 'నీసృష్టికి గారకుఁడుకూడ సామాన్య
కార్మికుని రీతివాఁడా?'—అని నీవడిగిన
ప్రశ్న యున్నది. ఆజగత్కారణుని మహత్వ
మెఱుఁగుటకు భావిపురాతనాద్యతనఘట
నామయమగు కాలచక్రమును—ఈ సృష్టి
నంతయు సమగ్రముగఁ జూడవలయును గాని
దానిని కణుపుకణుపునకును విఱచి పరిశో
ధింపరాదు. అనంతమగు కాలవాహినియందు
భూతవర్తమానము లొకచిన్న యలవంటివి.
ఆచిన్న యలనుగూడ మనము పరమాణువు
లుగ విడదీసి వానిలోని పరస్పరతత్త్వముల
తారతమ్యము లెన్నికొని వానితో మన
భావమున బట్టఁజాలని సమగ్రతత్త్వమును
గూర్చి విచారింపవచ్చునా? అయినను క్షణ
పర్యంతజీవనులమగు మనము ఈ తనువులు
నిలచియున్నంతవఱకు భూతభవిష్యద్వర్త
మానములఁ గల్పించుకొని వాని చాయల
మనబద్ధుల బరిభ్రమణ మొనర్పకుండ బ్రదుక
నేరము. భూచరజీవములకు బ్రాణవాయు
వెట్టిదో మనమనస్సులకుఁ దట్లు కాలవిషయిక
మగు పరిజ్ఞానముగూడ నట్టిదేయని చెప్పఁకొన
వచ్చును. కావున మహా మాయాపరికల్పిత
మగు నీసృష్టిచక్రమును గూర్చి యోచించు
నప్పుడు దాని కాధారముగ కాలమను నొక
మార్గమును సహితము మన మూహించుట
జరుగుచున్నది. తుదకీ కాలవిషయికమగు
చింత మన యల్పతత్త్వములఁబట్టి మన
యం దుత్పన్నమగుచున్నను దాని పథము
నందే మనసోదరీమణు గూడ నడపించి గమ్య
స్థానమును చేరుకొందమని మనము భావింప
వలసియున్నది.—" అని తేజోవంతమగు
నేత్రముల నుపలక్షించుచునామె పలికెను.
ఆవల నొకక్రోసెడుదూర మేమియు భాషింప

కుంద స్వారి యొనర్చితిమి. తుద కచ్చట మహోన్నతముగ నొకకొండ నొఱసికొని నల్లు కట్టబడియున్న యొక వంతెనయొద్దకుఁ జేరుకొంటిమి. ఆకొండ కెల్లనై పుల నత్యంత రమణీయమై, హృదయసౌఖ్యావహమై, క్రొత్త విరిగుత్తులచేత నేత్రపర్వమగుచున్న వనాంతలక్ష్మిఁ గని మహానందమొందితిమి.

నాయనాఁడు వేసము సగము మఱచినవాని వలె 'మహామనోహరమగు నిట్టితావుల ప్రియులతమముగుకాంతనుగూడి యధేచ్ఛముగ సంచరించుటెంత మోదావహము!' అని పలికితిని.

"నిశ్చయముగ ముదావహమే! మనోజ్ఞమగుఁ దాత్త్వికసిద్ధాంతములఁ దర్కించుచు సఖులఁగూడి సంచరించుట కింతకంటె రమణీయమగు ప్రదేశముండదు. ఇది భూమిపై నుదయించిన నందనవనమువలె నున్నది. నందనవనమైన నింత సుందరముగనుండునో లేదో యెవ్వఁడెఱుఁగును? ఆహవమున జచ్చువానికి లభించునని జనులూహించు స్వర్గలోక సౌఖ్యములైన నిచ్చట మన మనుభవించు నానందమునకు సాటిరాఁజాలవు." అని యామె తన పరిజనుల కచ్చట నొక గుడారమును నిర్మింప నాజ్ఞాపించెను.

అంతఁ దుంబురునిజయించు నుద్యోగమున నారదుఁడు జాంబవతియొద్ద సంగీత మభ్యసించుచున్నట్లు వస్త్రములఁ జిత్రింపఁ బడియున్న గుడారమొకటి ధగధగమెఱసి పోవుచు నచ్చట నిర్మింపఁబడెను. సంగీత విద్యాపారంగతుఁడై, బ్రహ్మవిద్యావిదుఁడైన ఆమహామహునకు నాఁడామె జయ మాపాదింపఁ బాటుపడెను. నేఁడిమె—ఈ రాజకుమారి ఆఁడువారినెల్ల జయించి మహామహులగు పురుషుల మార్చివేయు బాటు పడుచున్నది!

తరువాత మే మాపర్వతారోహణ మొనర్ప నారంభించితిమి. కృష్ణవర్మ శకుంతలతోను, పార్థసారథి మాలతితోను, నేను నామనోహారిణితోను సమముగ నడచి తక్కుంగలవారికి దారితీసితిమి. అంత శక్తికాంతము లైన నెమ్మోములతో, అంత మహానీలములైన శిరోరుహములతో, అంత పద్మరాగములయిన హస్తములతో నందఱు కామినీ రత్నము లాకొండపై మఱెప్పుడును బ్రకాశించియుండవని నేనూహించితిని. గైరిక ధాతువులఁగూర్చి, గైరికనిధి నిక్షేపములఁ గూర్చి, గిరిగహ్వర సరిదంతికముల నుపలబ్ధమగు పాషాణాదితత్త్వములఁగూర్చి పాషాణములవంటి శబ్దముల ధారాళముగఁ జెప్పుకొనుచు బాలికామణు లాకొండపై యధేచ్ఛముగ సంచరించిరి. అప్పుడు దినసనాథు డపరశైలమున కవ్వలిదిక్కునకుఁ బోవుచుండఁగ పశ్చిమాశాంగన కెంపున నలంకరించుకొనుచు నానందవగ్నయై కానవచ్చెను.

ఇది మనోరమ యను నచవకావ్యమున లీలావతియను నామెచేఁ జెప్పఁబడిన రాజకుమారియను కథయందుఁ దృతీయభాగము.

# ప్రాచ్యలోకము

[అన్ని జాతులూ ఏక మట్టమవుతాయా?—వీరిలో ఒకరిపద్ధతి గొప్పదీ ఇంకొకరిది కొద్దిదిన్నా?—ప్రధాన మానవధర్మములలో సమానత్వ మున్నయెడల చాలదా?—అట్లుకాక సర్వసామాన్యవిషయములలో 'కన్వర్షనులు' చేయ గడంగిన పుష్టియేమి?—ప్రస్తుత క్రైస్తవులది అయిరోపామతబోధనమా క్రీస్తుధర్మబోధనమా?—ఆత్మగౌరవముగల ప్రాచీనజాతులిందు కొప్పుకొనునా?—టిబేతుసుందరి వ్యాఖ్యానము—టిబేతులో పురుషులమాట, స్త్రీలఅధికారము—స్త్రీలపనులు, పురుషులపనులు—పెద్దఆస్తుల రాజ్యముల వ్యవహారములు—బహుభార్యాత్వభర్తృత్వపద్ధతులు లేవు—అవినీతిజారత్వములచ్చట లేవు—సౌందర్యము ఒకమోస్తరు శాపము—భర్తలను చెరుత్రోవలకు త్రిప్పుభార్యల కగుశిక్షలు—టిబేతుస్త్రీల సుగుణములు—వారి విశిష్టలక్షణములు—భారతీయుల కర్తవ్యము.]

### అన్ని జాతులూ ఏక మట్టమవుతాయా?

విశ్వమానవవిమర్శనమును చేదామంటే అది సామాన్యమైన కార్యము కాదు. అందు కొకమాదిరి విశ్వమానవదృష్టి విశ్వమానవసానుభూతి వుండవాలి. మానవులకు స్వయంగా తమజాతియందు సంప్రదాయములయందు అభిమానం ఎక్కువగావుండడం సహజము. అసాధారణజనులలో అయితే ఇదిఒక అహంకారంక్రింద పరిణమించి, ఇతరులు తమనుండి భేదపడే సంగతులను విపరీతములుగా భావించి, వారిని తమప్రకారము సంస్కరించి ధన్యులుగా చేతామనే కోరిక సహజంగావుంటుంది. సాధారణజనులకు ఒక్కొక్కజాతికి ఒకొక్కసంప్రదాయముంటుందని, ఎవరి సంప్రదాయంప్రకారం వారిని మననిచ్చి ఒకరిలాగ ఒకరు మారకుండుటయే శ్రేష్ఠమని సహజమైన ఒక కోరిక ఉంటుంది. సాధారణులకంటె శ్రేష్ఠులుకూడా ఇంచుమించుగా వీరిలాగనే తలుస్తారుకాని, అవకాశములనుకోరి వేరేరీతిగా మారుదామని అన్యులకు కోరికకలిగేలాగుంటే వారిని నిరోధముగా అట్లు మారకుండా చేయకూడదని తలుచుతారు.

### వీరిలో ఒకరిపద్ధతి గొప్పది, ఒకరిది కొద్దిదిన్నా?

ఎవరికికాని తమపద్ధతిఒక్కటే పరమోత్కృష్టమైనదని కాని అందరికీ అది తగివుంటుందని కాని తలంపు ఉండడం అంత శ్రేయస్కరంకాదని తోచుచున్నది. అట్లాగనవున్నవారుకూడా ఇతరులను తమవలె మారమని నిర్బంధము చేయుటయుకాని, చేరుటకు లంచముల నిచ్చుటకాని యుక్తమైనపనికాదు. శుద్ధమైన అన్యాయములని యెవ్వరైనా యోగీంద్రులు వేనినైనా భావించినప్పుడుకూడా, వానిని సవ్యముగా విమర్శించి క్రొత్తపద్ధతులమీద వారికి నిజమైనఅభిరుచి పుట్టించ

దమే మంచిదికాని బలవంతముచేయడం ప్రారంభించితే తమపద్ధతులలో మొట్టమొదటకలదని తాముభావించిన న్యాయముకూడా అన్యాయముగా పరిణమించడములో ఆశ్చర్యములేదు. లోకంలో శుద్ధసత్యము శుద్ధసంప్రదాయము అని పేరుపెట్టుకొని యేదీవుండదు. ఒకరికి అన్యాయమని అసంప్రదాయమనీ తోచునది మరియొకరికట్లు తోచకపోవచ్చును. ఇందులో ఒకరిభావములు ఇంకొకరిభావములకంటె నిజమైతేకావచ్చును. ఇతరులను మనభావములలోనికి మార్చుటకు మంచిఉపాయము మన భావముల ప్రకారము మనము శుద్ధముగా జీవించడమే సాధనము కాని ఇతరుల సంప్రదాయములను తిట్టడము, వానిని దూషించడము, వారిమీద ప్రభుత్వములు చలాయించి బలవంతముగా చట్టములు ప్యాసుచేసి వారిని మార్చడము, ఆప్రకారము ఇష్టములేనివారిని శిక్షించడము సవ్యమైన నాగరక శాంతి సంప్రదాయము కాదనితోచును.

## ప్రధానధర్మములలో సమత్వముండినో చాలదా?

ముఖ్యమైనధర్మములలో వద్దన్నా కాని జాతికి జాతికి సమత్వము ఉండకమానదు, అముఖ్యమైన వానిలో ఆమాత్రపు మామూలు భేదములున్నను యోగిజనులు లక్ష్యముచేయరు. ప్రతిజాతివారికిని తాము ముఖ్యములని తలచిన ధర్మములగూర్చి ప్రచారము చేయవలసిన ఆవశ్యకత ఉన్నది. ఇందెంత బలవంతము తక్కువఅయితే లోకమునకంత శ్రేయస్సు ఎక్కువ- ఇతరులను మనలాగే మార్చవలెనను సిద్ధాంతము మానవజాతిలో ఎప్పుడు పాడయినదో చెప్పజాలము. ఆర్యజాతిలో అనాదినుండియు ఒకరిని ఇంకొకరిగా అనగా తమలాగ మార్చితీరవలెననే విశ్వాసములేదు. మానవకోటిలో సంప్రదాయభేదములు అధికారభేదములు జన్మభేదములు దేశభేదములు సహజములని వారియుద్దేశ్యము. ఇతరులను చూచీ చూడడములో తమకంటె భిన్నముగనున్నవారి సంప్రదాయములను విమర్శించి దూషించుటకు వారెన్నడును పూనుకొనలేదు. పైగా వారిలోగల సుగుణములను తాము గ్రహించి కొనియాడి ఆప్రకారము వర్తించుమని వారు భోధించుటయేకాక వారిలోవున్న కొన్ని మేలులనుకూడ నిడికిమీద తమలోనికి జీర్ణించుకొని తామును ధన్యులయ్యేడివారు. అన్యులను తను లోనికి 'కన్వర్టు' చేసుకొనేపద్ధతి వారిధర్మమునకు విరోధము. ప్రతివారును తమజాతిలోవుండియే దినదినాభివృద్ధి పొందవలెనని వారిసిద్ధాంతము. వారు తమజాతిని విసర్జించుకొనుటకాని, ఇతరులు తమజాతులను విసర్జించి తమలో చేరుటకాని వారి సంప్రదాయమునకు విరోధము. ప్రతిజాతివారును తమ తమ జాతివారుగానుండియే కావలసిన మార్పులనందవలెనే కాని, ఒకరిలోకి ఒకరుచేరి వర్ణసంకరముకావడము వారి ఆశయముకాదు. ఆసంప్రదాయము వల్లనన్నాళ్లవారిపక్షమునే త్రొక్కిరి నేడును త్రొక్కుచున్నారు. ఇతరులు తమంతటతాము తమయొక్క ఏసాంప్రదాయములయినను ముట్టలో అట్టివానిలో చేరకోరినప్పుడుకూడ వారి జాతికి భంగములేనంత ఈ నూతనసంప్రదాయములను అవలంబించు పద్ధతికి వారు అనుమతించుచుండిరి. ఇట్లొప్పుటవలన పరస్పరమాదరణములు, పరస్పరవిరోధములు, పరస్పరభేదములుకూడ తొలగి, ఎన్ని జాతిభేదము లున్నను, వారి అందరిలోను సమత్వభావము వర్ధిల్లుచు వచ్చినది.

## అట్లుకాక కన్వర్షనుతో ఉండే గొప్పయేమి?

మహమ్మదు క్రీస్తువుకూడ ఈసంప్రదాయమునే త్రొక్కిరి. బుద్ధుడుకూడ ఈసంప్రదాయమునే అవలంబించెను. అయినను అసహనీయులు తపోబలిమికలిమిని అప్పటిజనులు హరిమతములను సిద్ధాంతములను అవలంబించిరి. వారికంటె పామరులు వారిమతముల నవలంబించినంతకాలము అవి దినదినాభివృద్ధిని పొందినవి. కాని వానిలోకూడ మూర్ఖత్వము, అహంకారము

వ్యాపించినప్పటినుండి, తామొక్కరే సర్వోత్కృష్టుల మనియు, తమకంటె వేరుగానున్న వారినందరినీ బలవంతముగా కత్తులతో చంపియో, అర్థికపు ఎరలచూపి ఆకర్షించియో, తమ మతముల పేరులు వారికికలిపించి, తమ మతస్థులసంఖ్య హెచ్చుచున్నదను దుష్ప్రచారమునకు గడంగిరి. ఈమతములలోనికి 'కన్వెర్షను' కొరకు యుద్ధములు రక్తములవరదలు తప్పెడివికావు. బౌద్ధమతము కేవలము హిందూమతముయొక్క చంటిబిడ్డయ్యు, తనచుట్టుపక్కల నిరాడంబర భిక్షుకుల ద్వారా ప్రచారము ప్రారంభించిన కతమునను, యుద్ధమును ద్వేషించుచు అహింసను బోధించుచున్న కతమునను అది చీనా, జపాను, టిబెత్తు, బర్మా, సిలోను దేశములలో అంతేసిముందనాగరికసంప్రదాయస్థులను తనవేమగలవారినిగా మార్చుటయేగాక, భారతీయనాగరికతను వారికి బోధించగలిగినది. ఆయాదేశస్థుల కెల్లయు భారతదేశమనిన గౌరవమువచ్చుటకు కదియే ముఖ్యమైన కారణము. క్రైస్తవులు మహమ్మదీయులకు గల మతపిచ్చి, సామ్రాజ్యకాంక్ష మొదలగు దుర్లక్షణములు కాని, క్రైస్తవులకుగల సంకుచితభావము, వర్తకతృష్ణ, పశుత్వపిపాస, వైషయికమాత్రము నారోగ్యముగా నెరుగుచుచు అగాధవిశ్వాసము లేకుండుట మొదలైన లక్షణములుకాని లేవు. మనఃపూర్వకముగా ఎంతమంది తనలోనికివచ్చిన అంతకే సంతోషించిరి కాని, ఇతరులపైకి తమవిశ్వాసమును రొప్పించే 'కన్వెర్షను' పద్ధతిని చాలకాలముక్రిందటనే వారు విరమించిరి. మహమ్మదీయులు నేటికిని నామమాత్రముగా మతపిచ్చిలోపడి దొర్లుచున్నారు కాని మునపటి చేవగాని పటుబలముగాని లేకపోవుటచే వెనుకబడిపోయినారు.

## ప్రస్తుతపు క్రైస్తవులు అయిరోపా మతమా లేక క్రీస్తుధర్మమా బోధించుచున్నది?

కాని క్రైస్తవులకుమాత్రము ఈ కన్వర్షనుతృష్ణ, అన్యసంప్రదాయదూషణము, హేళన మొదలగు దుర్గుణములు నానాటికి వర్ధిల్లుచున్నవి. క్రైస్తవమతములోనికి నేడుజరుగు కన్వర్షనులుకూడ మతసిద్ధాంతముల ప్రకారముకాక ఆర్థికవర్తకలాభ సిద్ధాంతముల ప్రకారముమాత్రమెక్కువగానున్నవి. ఇప్పుడు క్రైస్తవులు సాగించుచున్న మతప్రచారము కిరస్తానీమత ప్రచారముకాక, అయిరోపామతప్రచారమైయున్నది. దానిసిద్ధాంతము ఇంచుమించుగా ఈవిధముగానున్నట్లు తోచును. "అయిరోపావారు లేక తెల్లజాతివారు ఒక్కరే ఉత్తమజాతివారు. తెల్లచర్మములోను, వారి తత్వములోనే ఒక ఘనతవున్నది. కనుకనే వారు గొప్పసైంటిస్టులు, విద్యుచ్ఛక్తి మొదలగువానిని కనిపెట్టినవారు, వాణిజ్యము నభివృద్ధిచేసినవారు, నల్లజాతుల సిరిసంపదలు దుల్చిదుర్బలమొనర్చినవారును అయినారు. ప్రపంచమునెల్ల నల్లపొగలతోగూడిన ఫ్యాక్టరీలమయముగాచేసినవారు, డిమోక్రసీనిలబెట్టినవారు, రాజులు రెడ్డులను చంపినవారు స్వాతంత్ర్యమును స్థాపించినవారు మొదలైనవారయినారు. నిర్బంధోచిత ప్రారంభవిద్య, నిర్బంధోచిత సైనికశిక్షణము, శ్వేతేతరజాతులతో నిర్బంధపు వర్తకపుటొడంబడికలు మొదలగు ధర్మములను నెలకొల్పినారు. శ్వేతేతరజాతులను తమవలెమార్చడము, జపానువారిలాగ వారితో సమానులయినా మించిపోయినా అన్యాయముమాటలు అపనిందలు వేయడము ఇది అయిరోపా తత్వము. ప్రస్తుతమును వారిజండా బాగా యెగురుచున్నది గనుక, అందరును వారికి సలాములు చెయ్యవలెను. వారిలోవారికి విరోధములున్నను వారే సర్దుకుంటారు కాని వారిఘనతను నిలబెట్టుకొరకు నల్లజాతులవారందరూ వారికిదాసులై, వారికి లాభములుకూర్చుతూ వర్తిల్లవలెను" అని వారి బోధనలు. దీనిని మతశాస్త్రవేత్తలు మతమనీ, అర్థశాస్త్రవేత్తలు లోకశ్రేయస్సనీ, సంఘశాస్త్రవేత్తలు సత్సంప్రదాయములనీ బోధపరుస్తూవుంటారు. పేపర్లలో, చదువులలో, వర్తకములో, తిండిలో రేడియోలో అన్నిటిలో రాత్రింపగళ్ళివ్వే వినబడుచుండుటచేత కొంతవరకు

ఈ "అయినోపాతత్వము"నకు కన్వర్టు నయినవా రందరును హోయిహోయి అని వారి ననుకరిస్తూ పొగడుతున్నారు.

ఆత్మగౌరవముగల ప్రాచీనజాతు లింక [illegible]?

కాని ఆత్మగౌరవముగల నల్లజాతులు యీ తత్వము నారాధనముచేస్తూ తమసంఘములన్నీ సంప్రదాయములన్నీ లోపభూయిష్టములని దూషించుకొంటూ వారిపాటకు వెనుకతాళము వేయుచుంటే వేయుచుందునా? నిజ మేనాటికైనా బయలుపడదా? ఇంతకూ ఈ సైన్యులతోను, ఈ పల్లెలను పాడుచేసిన నగరములతోను, కొంచెము భాగ్యవంతులై కోట్లకొలది మందిని నిరుద్యోగులుగాచేసిన ఆర్థికవ్యవస్థతోను, నిరంతరాయుధసమృద్ధితోను వీ రందరూ బాధపడుకొంటున్నా రేమిటి? ప్రాచీన గ్రామీణనాగరికత, దేశదేశీయ స్వజాతీయసంప్రదాయములు వారి క్రౌర్యముల ముందు కొంతకాల మణగిపోయినంతమాత్రమున అవి మళ్ళీ లేవజాలవా? ఎన్ని పాపపున్నాగములైనను పల్లెలను విధ్వంసమొనర్చి యెన్నాళ్లు భోగము లనుభవింపగలవు? ఇప్పటికైనను ప్రాచ్యదేశములు గ్రామసంప్రదాయములు, జాతీయగౌరవములు, 'కన్వర్షను' మహాకాంక్ష విసర్జనలు మొదలగువానితో తమధర్మములను గుర్తించుచు తెల్లవారి అజ్ఞానవిమర్శనలు చెల్లుపడగోరుచుండుట యెంతయును శ్రేయస్సు.

తిబేతుసుందరి వ్యాఖ్యానము.

గత గృహలక్ష్మిసంచికలో చీనావిశేషకురాలు పాశ్చాత్యసుందరుల ఆక్షేపణలకన్నిటికి సమాధానము చెప్పినదిన్ని చూచినాము. ఈసంచికలో తిబేతు దేశపు సుందరియొకతె 'రిన్-చెన్-లా-మో' అనునామె శ్వేతజాతులకు తిబేతుసుందరులపైగల దురభిప్రాయములను తొలగించుచు ఒకవ్యాసమును వ్రాసినది.

"పాశ్చాత్యులు మా తిబేతుదేశపు స్త్రీలనుగూర్చి కొంచెముగామాత్రమే తెలుసుకొని విరివిగా వ్రాసియున్నారు. వారు వ్రాసినవానిలో కొంచెము నిజములు చాలా అబద్ధములు ద్వేషపూరితములై ఆశ్చర్యమును కలిగిస్తున్నవి, కొన్ని అసహ్యము క్రోధముకూడా కలిగిస్తవి. తెలియని సంగతులను వ్రాయుట మానివేయరాదా? వ్రాస్తే చీనా జపానీయులలాగ మమ్ములను గూర్చి చక్కగా వ్రాయరాదా?

నే నిట్లా వ్రాస్తున్నానుగదా అని నాకు తిబేతు పద్ధతులంటే పక్షపాతమున్నది, పాశ్చాత్యపద్ధతులు వ్యక్తులంటే ద్వేషమున్నది అని ఎవరూ అనుకోరాదు. మాదేశస్థు లెవ్వరూ నే [illegible] వివాహము చేసుకోకున్నా నేను చేసుకొన్నాను. నాకుకూడా తెల్లవాళ్లలాగ [illegible] చేతులు [illegible], [illegible] గానులలాటివే [illegible] దము, [illegible] సుందరైన వస్త్రా లలవాటే.

పురుషులసహాయ—స్త్రీ[illegible]

పాశ్చాత్యపద్ధతులను కొన్నిటికి నేననుకరించినంత మాత్రమున మా ప్రాచ్యసంప్రదాయములయందు నా కగౌరవము లేదు. మాలో స్త్రీ లెక్కువ, పురుషులు తక్కువ కాదు. స్త్రీలు [illegible], పురుషులుమాత్రం వ్యవహారాలు చేయజాలరు. జీవనంలో యిద్దరూ సమానులే గాని గృహధర్మనిర్వహణము వారి పెద్దరికముపైనే జరుగును. మా గౌరవము శ్వేతస్త్రీల గౌరవమునకు తీసిపోదు. ఇంటివ్యవహారం పురుషుని యాజమాన్యమున జరిగినను స్త్రీ చేతులలోనే పెట్టెలతాళం చెవులు, పురుషుల [illegible] వుండును. ఇద్దరూ కలిసి నిర్ణయిస్తే కాని యేదీ జరగదు. ఎదిగిన కొడుకులు కూతుళ్ళ సలహాలుకూడా తీసుకొనబడుటయే కాక తల్లి తాళము చెవులు పెద్దకూతురుచేతులకు కూడా అందించును. స్త్రీకి చిన్నప్పటినుంచి ఇంట్లో మగవారితోను ఆడువారితోను [illegible] బట్టియే ఆమె పెద్దదైనతరువాత నిర్భయముగా సక

స్వంత వ్యవహారములనుగూడ సద్దుకొనగలుగుచున్నవి.

మా స్త్రీలకు సోమరిపోతుతనము లేదు. ఎట్టి శ్రీమంతురాలైనను గుమ్మము లూడ్చుకొనుట దగ్గర నుంచి యెట్టి గొప్పకార్యములైనను సలుపును. పనికత్తెలంటే మాకు దాసీలుకాక గృహపు సభ్యులవలె గౌరవార్హులు.

### స్త్రీలపనులు—పురుషులపనులు

ఇంటిపనులు స్త్రీలు, కూతుళ్లు, స్త్రీసేవకురాండ్రు చేతురు. వంట, నీళ్లుమోయుట, నూలుతీయుట, బట్టలు నేయుట వారిపనులు. బట్టలుకుట్టుట కీలిపని, తోళ్లు కుట్టుట పురుషులపని. పాలను స్త్రీలు పితుకుతారు. కట్టెల నిరువురును కొట్టుతారు. గొర్రెలఉన్నిని పురుషులుమాత్రము కత్తిరింతురు, కాని పత్తను విత్తుట, కోయుట, నూర్చుట యిరువురును చేతురు. దున్నుట, వేట, జంతువులను పట్టుకొనుట, వెండి బంగారము మొదలగు లోహపు పనులు చేయుట మగవారిపనులు. స్త్రీలు జంతుహింసాకరములగు పనులు వేనినిగాని చేయరు. పురుషులుచేయు సామాన్యకృత్యములం దెట్టి సహాయమును చేయుచుండకమానరు. ఇట్లు కష్టములలో పురుషులకు స్త్రీల సహాయము వుంటుంది. వ్యవహారము వర్తకము మొదలగు పనులను స్త్రీలు కూడ పురుషులవలెనే నిర్వహించగలరు. ఎవరు తెలివైనవారైతే వారు [illegible]గా పనిచేస్తారు. పెనిమిటి లేనప్పుడు లేక చనిపోయినప్పుడు కావలసిన స్త్రీపురుషసేవకుల నియమించి కుటుంబవ్యవహారములన్నీ స్త్రీయును, స్త్రీ చనిపోయిన లేక మూర దేశ[illegible]నచో స్త్రీపురుషసేవకుల నియమించుకొని పురుషుడును కుటుంబవ్యవహారములను నిర్వహించుకొనుచుందురు.

### పెద్ద ఆస్తుల వ్యవహారము

రాజ్యములు జమీందారీలు ఇనాముదారీలు మొదలగువానిని స్త్రీపురుషు లిరువురును సరిసమాన బాధ్యతలతో వ్యవహరింతురు. చాలా వ్యవహారములకు పేరుమాత్రము పురుషుల పెద్దరికముకాని నిర్వాహణమంతా స్త్రీలచేతులలోనే వుంటుంది. పురుషులు సాధారణముగా ఎక్కడకైనా పనిమీద పోవలసి వుంటే స్త్రీలే పనిపాటులు దిద్దుకుంటారు. ఒక పురుషునికి కొడుకులు లేక ఒక కూతురుమాత్రమే వుంటే ఆ కూతురుని పెళ్లిఆడిన మగవాడు అతని యింటికే వస్తాడు. ఆమెతండ్రి మరణించగానే ఆమెభర్తకాక ఆమెయే ఆస్తికి వారసురాలై వ్యవహరిస్తూ, కొమారుడు పుట్టగానే అతనికి ఒప్పచెప్పును. విధవరాండ్రే వారి మైనరుసంతానపు ఆస్తిని వ్యవహరింతురు. ఆస్తి నిర్వాహణములో స్త్రీ పురుష భేదమేమియును లేక యిరువురును బాగా పనిపాటులు నెరవేర్చగలరు.

### వివాహ రహస్యము

టిబేటు స్త్రీలు ఇట్టి పేరుపొందిన వ్యవహర్తలు గదా, ఎందునను వారి ఆలోచన తీసుకొనకుండ వీలు లేదు గదా. అయినా అతిముఖ్యమైన ఒకవిషయములో వారి ఆలోచన యేమాత్రమును గైకొనబడదు. తల్లితండ్రుల యిష్టు వికది వెళ్లదమన్నా, పెళ్లి అన్నా పిల్లలకు భరించరాని దుఃఖముగా వుంటుంది కనుక, వారికి తెలియకుండానే తల్లిదండ్రులు వరులను వెతికి వివాహమొనరింతురు. తెలియనట్లుల నటించువారే కాని ఆపిల్లలకు ఈ సంగతి తెలిసి, ఎవరైనా "ఏమమ్మా, నీ కెప్పుడా పెళ్లి?" అని కదలించి అడిగితే నొచ్చుకొని సిగ్గుపడతారు. వీరుకాక పెళ్లికొడుకులను తల్లిదండ్రులకు తెలియకుండానే రహస్యముగా చూచుకొని, వాళ్లొప్పరని భయపడి వేరే లేచిపోయి స్వతంత్రించి వివాహములు చేసుకొనువారు కూడా వుంటారు.

### బహుభార్యాత్వ బహుభర్తృత్వ పద్ధతులు లేవు

తెల్లజాతులవారికి కళ్లలు వాటంతట అవే మనస్సు

నను తట్టుతవో, లేక యెక్కడనైనా పుక్కటి పురాణాలలాగ వింటారో, లేకుంటే పై వారినిగూర్చిన అపభ్రంశాలు నిజమైతే వారిని తామే వుద్ధరించవచ్చునని ఆశయో చెప్పలేముగాని చాలా చక్కటి కల్లలను కలిపించగలరు. అందులో ప్రధానమైనది టిబేటు స్త్రీలు బహుభర్తల ప్రియులట. ఈ పద్ధతి ఖాము జిల్లాలో మరీ యెక్కువట. వ్రాసిన ఆసామీ అక్కడకు జన్మంలో యెప్పుడైనా వెళ్లెనో లేదో నే నెరుగను. మా జిల్లా ఖామే. దీనికి వింతైయిన కారణములుకూడా కల్పించినారు. టిబేటులో స్త్రీలెక్కువ అని ఒకటి, పురుషులు మతాచార్యులై బ్రహ్మచర్యము చేస్తారని వకటి. ఎక్కడెక్కడో వెతికితే బహు భర్తృకలై తిరుగుతారేమో అన్ని దేశాలలోనుకూడా, కాని అన్ని దేశాలలోవలెనే యిక్కడకూడా సిద్ధాంతరూపకమైన యిట్టి వివాహపద్ధతి లేదని సకల జనులను యెరుగవలెను. బహుభార్యా వివాహమును నిక్షేపి నిషిద్ధము.

అవనీతి జాడ్యము లచట లేవు

మా దేశములో అవనీతికాని జాడ్యముకాని విస్తారముగా లేదు. మా దేశపు పొలిమేరలో మాజాతికి దగర పోలిక గలవారు మూరపు పోలికగలవారు అనేకులు గలరు. వారు తిరుగుబోతు జాతులవారు. వారిలో కొందరట్టివారు. వారినిబట్టి మాజాతివారిని వంటివారని నిర్ణయించడము అసత్య ప్రచారము. మా జాతిలోకంటె ఉత్తమనైతికపద్ధతు లితరజాతులలో నెక్కడను లేవు.

మాలో పల్లెటూరివాళ్ళఆటలు అవనీతికరంగా వుంటాయని తెల్లవారు ఆక్షేపిస్తారు కాని మాకందులో నెట్టి అసభ్య వస్తువులను కనిపించవు. ఇక తెల్లజాతులలో ఉన్నతకుటుంబములలో జరిగే నృత్య పద్ధతులను కొన్నిటిని చూస్తే వారిలో సభ్యులకే అసహ్యాకరముగా వుంటుంది. గదులలో బొమ్మలు రోత పుట్టించుతవి.! అయినను, వారినీతిని గూర్చి విమర్శించితే వారికి కోపమువస్తుంది. పైగా వారి దేశములలోవలె పదుపువ్వన్నిగల స్త్రీలే టిబేటు దేశమున గానరారు. మా స్త్రీలు పతిభక్తికి ప్రసిద్ధిగాంచినవారు. స్త్రీ పురుషు లెన్నడును ఒకరినొకరు విడాకులిచ్చి విడిచిపెట్టరు.

మా సౌందర్యము మా శాపము

మా దేశపు స్త్రీలు సహజమైన అందకత్తెలు. వారు పెద్దవారైతే పురుషులు వారికొరకు పోరాడు కొందురనియే మేము వారికి పదియునందోనే పెళ్లి చేస్తాము. పురుషులుకూడా బలిష్ఠులే, అయితే సౌందర్యమునకు వశ్యులు కానివారు లేరుగదా? స్త్రీలు తమ సౌందర్యమువల్లనే బహు పురుషుల కాకర్షణవంతులై ప్రకోపించినచో మా బౌద్ధమత ధర్మము ప్రకారము తప్పనియే మేము భావింతుము. మా పురుషులు బహు స్త్రీల నాశించుట కసాధ్యమగునట్టి సౌందర్యవంతులు కాకపోవుటవల్లను, స్త్రీల కోరికలను లేపలేనివారగుటవల్లను, వారు మా స్త్రీలకంటె యెక్కువ యోగ్యులైనను, మా స్త్రీలుకూడ పురుషు లంత యోగ్యులుగా అనగా అందము లేనివారుగా మారినదే వారికి బౌద్ధమతములో స్వర్గము చిక్కదనియు మాలో సాధారణముగా విశ్వాసము. మాలో ఎవరో కొందరు పురుషులు స్త్రీ కొరకు కొట్లాడు కొని నరుకుకొనుచుండుటవల్ల అపచారమువల్ల చెడుసింహమువచ్చునని మాలో మాకే సిగ్గుకలుగును. అయితే పరమేశ్వర ప్రసాదితమైన అందమునకు మేమేమి చేయగలము? తప్పని సరిగా దుర్భరవలెనే మేము సహించుచుందుము, పురుషుల కట్టి ఉత్సాహము మాలో నెవరివిషయమై గూర్చి కూడ కలుగకుండును గాక యని యీశ్వరప్రార్థన మొనర్చుకొనుచుందుము.

భర్తను చెప్పుతోను గొట్టు దిట్టు భార్యలు.

సాధారణముగా పురుషులయెడల స్త్రీలకుకంటె కూడ స్త్రీలయెడల పురుషులకు భక్తి యెక్కువ.

వారు స్త్రీల నెన్నడును ద్రోహముచేయగోరరు. మాలో చిన్నజాతులలో ఏపురుషునిఅయినా వేరొక స్త్రీ దుష్కృత్యములు ప్రోత్సహించి వశీకరణమొనర్చుకొనెనేని ఆ పురుషునిభార్య తనస్నేహితురాండ్రతో కలిసి, ఆనాతిని కలిసి, కాళ్లమీదవ్రాలి తనపురుషుని అట్లు తప్పుత్రోవలు త్రొక్కించుట న్యాయముకాదనియు అతని బుద్ధిమార్చి తనభర్తను తనను గూర్చుమనియు ప్రార్థించును. ఆ స్త్రీ అందుకు మనఃపూర్వకముగా ఒప్పుకొనకపోయినచో, ఈ క్రొత్త స్త్రీ ఆమెజుట్టును పీకివేసి ఆమె యెటువంటి స్త్రీయో తనపురుషుని యెట్టి వెర్రిత్రోవలకు త్రిప్పుచున్నదో లోకమునకు తెలియజేయును.

### టిబేతుస్త్రీల సుగుణములు.

టిబేతులో దారబంధువుల నెవ్వరును పెండ్లాడరాదు. వితంతు పునర్వివాహములు కూడదు కాని చేసుకొనువారు కొందరుగలరు. మొదటిపెళ్లి అయిననే శ్రద్ధం తను ఆచరింతురు కాని రెండవపెండ్లి స్త్రీలే చేసుకొందురు. అనేకవితంతువులు సన్యాసమునే గ్రహింతురు.

టిబేటు పురుషులు చుట్టలు సారాలు త్రాగరు. స్త్రీలకసలే అట్టి అభ్యాసములేదు. ఈ అభ్యాసమైనను పురుషులు క్రొత్తగా తెల్లవారిదగ్గర నేర్చుకొనుచున్నారు. స్త్రీ పురుషు లత్యల్పముగా నస్యమును సేవింతురు. స్త్రీలు ద్రాక్షరసము త్రాగినను ఎన్నడును తప్పత్రాగరు. వారు రంగులను వేసులను మొగముకు రాసుకొనరు. ఎండ, గాలి తగలకుండా కొందరు పల్లెటూళ్ల పడచులు నల్లటి ముద్దలు మొగములకు రాసుకొందురు. ఈ విధంగా అందవికారం కలిగించుకోకుంటే బౌద్ధసన్యాసులు వారిని వెంటాడుదురను భయముచే వారట్లు చేతురని కొందరు తెల్లవారు వ్రాయుచున్నారు. బౌద్ధసన్యాసు లట్టి నీతిబాహ్యులను కారు. అట్టి నీతిబాహ్యులొకరిద్దరున్నను, ఇట్టి కృత్రిమములవలన వారిని తాము మోసగించలేమనియు స్త్రీలకు తెలుసును. కాక ఇట్టి రంగులు పులుముకొనే వారికి సాధారణముగా అంతగా చెప్పుకోదగిన సౌందర్యము, భ్రమింపజేయు కళలు బుద్ధులుకూడ వుండవు. వారు అది పులుముకుంటకు కారణము ఎండ తగలకుండా కాపాడుకొనుటయే.

అట్లాగని మాదేశపు స్త్రీలకు చక్కని వర్చస్సు లేదని నేనుతలచను. వారికి మంచి వర్చస్సు ఉన్నది, కాని అంతకంటె మంచిదైన హృదయములు ఉన్నవి గనుక వారు పయివారిని చెరుపుదురని యెవ్వరికిని భయములేదు. మాకంటె మీ తెల్లదేశముల అమెరికా అయినాసరే స్త్రీలనుచూస్తే నాకందవికారముగానే కనిపించుతారు. మీ పెద్దముక్కులు, పందిచెవులు, గోలీకాయలలాంటి కళ్లు మావాటికంటె అందములని మీరు భావించడము సహజము. మేము వారి నాక్షేపించము. ఎందుచేతననాగా అందమున కొకేరూపురేఖా నిర్ణయమా? ఒకరిని ఆక్షేపించ పూనుకొన్న వారి కెంత పూర్ణమైన అందముండవాలి! అట్టి అందము మాకు లేనూలేదు, వద్దనూ వద్దు.

### తిబేతుస్త్రీల విశేష లక్షణము.

మా అందమే అనండి చందమే అనండి మాకున్నదల్లా ఒక్కటే. మా స్త్రీ లారోగ్యంగావుంటారు. నల్లటి నిగనిగలాడేకళ్లు, తెల్లటిపళ్లు, చకచక నడకలు, ఎవరు తొడుక్కొంటకైనా బాగుండే అందవికారము కాని దుస్తులు, శ్రమపడి పనిచేసేశీలము, నీవెక్కువా నేనెక్కువా అని పురుషులతో దెబ్బలాడకపోవడం, కష్టసుఖములను వారివలె సహించడం, ఇవి మా లక్షణములు. ఇంతకంటె సలక్షణంగా నేను మాదేశపు స్త్రీల ప్రవర్తనలనుగూర్చి వర్ణించలేకుంటే అది నాలోపము. ఈ వర్ణన అతిడంబముగా లేకుంటే నాయొక్క పాండిత్యము లేమియే దానికి కారణము. నేనట్టి తిబేతుదేశపు స్త్రీనే అయినప్పటికిని, వారందరి

# పాకకళ

## —జబ్బలపూరి—

అర్ధసేరు మయిదాపిండియును వీశె పంచదార యును తేవలయును. వీశె పంచదారలో సేరు నీళ్లు పోసి లేతపాకము పట్టవలయును. పట్టినతరువాత దించి వేయవలయును.

అర్ధసేరు మయిదాలోని నీళ్లుపోసి అట్లే పలచగా కాకుండ ఒకమాదిరిగా చిక్కగా వచ్చినట్లు కలప వలయును. కలిపినపుడు వంట సోడాగుండ తులము న్నర అందులో పోయవలయును. పోసినవెనుక బాగా కలపవలయును. లోతులేని కలాయిలో సేరు నూని పోసి మాగిన తరువాత కలసిన మయిదా చినచిన్న ముద్దలుగాచేసి అందులో పోయవలయును. వేగిన తరువాత నవితీసి పాకములోముంచి తీసి వేయుచుండ వలయును. తీసిన తరువాత వాటిపయిని కాస్త పంచ దార జల్లుచుండవలయును. తరువాత నవితినిన యెంతో రుచిగా నుండును. —శాంతాబాయి

## — తేనె పానకము —

2 శేర్ల ఆవుపాలలో 1 శేరు చెఱుకుపానకము కాచి వడియకట్టిన ¼ శేరు తేనెపోసి బాగుగా కలుచ వలెను. 1 తులము జాజికాయ, 1 తులము జాపత్రి, 5 తులములు ఏలకులు, 2 తులములు దాల్చినచెక్క, ఇవన్నియు కలిపి చూర్ణముగొట్టి తేనె దిని పానకములో వేసి కలిపి, మఱియొక కలాయిపాత్రలోనికి వడియకట్ట వలెను. 20 తులముల పంచదార పాకముబట్టి యందులో వడియకట్టిన పాకమును బోసి 5 తులముల పన్నీరు, ¼ తులము పచ్చకర్పూరము పొడిచేసి కలుపవల యును. గులాబిరంగుగా యుండవలసినయెడల ఒకచిటి కెడు లక్కకమాది నీళ్లు వేసినచో గులాబిరంగువచ్చును. ఇష్టముయినవారు ¼ తులము మిరియాలు ½ తుల ములు శొంఠి, నూరి దానిరసము రెండుతులములగు నటుల తూచి పాకములో కలుపవలెను.

—చదలవాడ రాఘవ పద్మావతులు.

## — సీతాఫలముల పచ్చడి —

బాగా పక్వమైన పెద్ద శీతాఫలములు రెండు మూడు తీసుకొని వానిపై తొక్కలు గింజలు తీసివేసి ఆ గుజ్జంతయు ఒక శుభ్రమైన గిన్నెలో నుంచవలెను. పిమ్మట పండ్లగుజ్జుకు దగినంత యుప్పు పచ్చిమిర్చి అల్లము కొత్తిమిరి సన్నెకంటిపై నలిచి నూరుకొని యందు దగుమాత్రము చింతపండు పుల్లము చేర్చి రుబ్బి తీసుకొని పై గుజ్జులో కలిపి పిమ్మట రసవర్గము లన్నియు చేర్చి పొగిచి ఉపయోగించుకొనవలెను. ఇది రుచిగానుండి ఆకలి పుట్టించును.

## — తేగల పచ్చడి —

పచ్చివి ముదురుగా లావుగానున్న తేగలు 6 తీసుకొని వాని పైతొక్క, పీచులోనచందమామ మొదలైనవితీసివేసి సన్నగా ముక్కలుగకోసి పెట్టుకొన వలెను. తరువాత పొయ్యిమీద బాణలిలో ఒకపెద్ద గరిటెడు నెయ్యిగాని నూనెగాని వేసిపెట్టి కాగుచుం డగా పైన తరిగియుంచిన తేగముక్కలను దోరగా వేయించి తీసుకొనవలెను. అటుపిమ్మట మూడు వ్రేళ్లపై నిల్చునంత శనగపప్పు, మినపప్పు, పెసరపప్పు, కందిపప్పు పై ముక్కలకు ఈ పప్పులకు సరిపోవునన్ని యెండుమిరపకాయలు చేర్చి ఆ బాణలిలో మరికొంత చమురువేసి వేయించవలెను. ఇవి వేగినవెనుక కరివే పాకు, సన్నగాతరిగిన కొత్తిమిరి, కొంచెము ఆవాలు, జీలకర్ర, మెంతులువేసి వేగనిచ్చి క్రిందదించుకొన వలెను. బాణలిలోనివి మెత్తగా రుబ్బినవెనుక పైతేగ ముక్కలకును నూరుచున్నముద్దకును సరిపడ చూచు కొని ఉప్పు చింతపండు జేర్చి బాగుగారుబ్బియెత్తి ఒక గిన్నెలో నుంచవలెను. తరువాత తేగముక్కలను నీళ్లు చల్లుచు మెత్తగా రుబ్బి ఇదివరకు రుబ్బిపెట్టిన ముద్దలో కలిపి ఉపయోగించుకొనవలెను.

—T. చంద్రమతి.

ప్రసరించుచుండుననియు, ప్రాచీననవీనకాలములకును ఆశయములకును కవీంద్రుల సుందరములగు డెందముల కంటె అందమగు వంతెనలు లేవనియు ఋజువు పరచుచు గ్రంథమెల్లయు పాఠకుల నానందపరవశులనుగా నొనరించును. ప్రతులు వలయువారు ప్రకాశకులు శ్రీయుత కాటూరి వెంకటేశ్వరరావుగారికి బందరు నగరమునకు వ్రాసి [illegible]యగలరు.

**శ్రీహరినాథ స్మృతి (1-వ భాగము)** [illegible] శ్రీ కుసుమ హరనాథ [illegible] ప్రచారిణీ సభ వారిచే ప్రకటింపబడినది. డెమ్మీ సైజు 133 పుటలు వెల రు. 0-5-0 లు. [illegible] హరనాథుని [illegible], [illegible] ప్రతిష్ఠ [illegible] పూర్వకముగా [illegible]. శ్రీవారి [illegible] తప్పక [illegible] చేత [illegible] సందేహము లేదు.

**దక్షిణ ఇండియా కార్మికుల స్థితి** శ్రీయుత యన్. జి. రంగా [illegible] (ఆక్సను) గారు ఆంగ్లభాషలో Labour in South India అను గ్రంథమును వ్రాసినారు. 20[illegible] పుటలు, 15 అధ్యాయములు, వెల రు. 1-8-0 లు. [illegible] శ్రీమతి భారతదేవి గారికి కృతి. [illegible] లను భుజించుచును, [illegible] చేసుకొనుచు, [illegible] వారినిగా [illegible] ముల [illegible] తా ననుభవించుచును, [illegible] లోను యున్న [illegible] అవస్థల [illegible] వర్ణించినారు. పనివారల దారిద్ర్యము, కష్టనివారణోపాయములకు ప్రస్తుత ధనాస్వామ్య [illegible] పద్ధతి యొక్కటే కారణమనియు, పనివారికెల్లరకి వోటు లిచ్చి, ప్రతినిధుల నేర్పరచి, కార్మికప్రభుత్వములు నెలకొల్పనిదే ప్రపంచసమస్యలుకాని దక్షిణహిందూ దేశ కార్మికస్థితులు కాని బాగుపడవనియు అతని

అభిప్రాయము. ముఖ్యముగా హరిజనుల అవస్థలను గూర్చి వారు హృదయములు కరుగునట్లు వర్ణించినారు. ధనాఢ్యులు తమలాభముల నొక్కదానిపైనే తమదృష్టి నిడుకొనక సర్వజనశ్రేయస్సుపై తమ చిత్తముల లగ్నము చేసుకొన్నచో అనేకకష్టములు తీరునుకాని, వారి పరిపాలనలో నిది సంభవించుటకల్ల. కార్మికసంఘములు నేర్పరచి [illegible]గిననాయకులు పనిచేసినచో ఈ కష్టములు కొన్నియైనను తీరక మానవు. గ్రంథము కార్మికపక్షములకు మిగుల ప్రబోధకరము.

**రైతు భజనావళి** రైతు గ్రంథమాల రెండవకుసుమము, 45 పుటలు. [illegible]కవీంద్రులు గాయకులు మొదలగువారు రైతులయొక్కయు, పాటకజనులయొక్కయు ప్రబోధముకొరకు వ్రాసిన పద్యములు, కీర్తనలు ఎన్నో గలవు. నిడుబ్రోలు రైతాంగ విద్యాలయ శిక్షణవర్గమునకివే భజనకీర్తనలై అత్యుత్తమమైన ప్రబోధమును కలిగించినవి. దేశీయులెల్లరు నిట్టి పాటల నెంత వేగము కంఠతా పెట్టి అవగాహనము చేసుకొని కార్యోన్ముఖులైనచో దేశముయొక్క తత్వ మంతవేగముగా మారును. రమ్యములనుమట్లు, సుందరములగు భావములు, ఉత్సాహకరములగు శయ్యలు పదములు గలిగి జనులకెల్లరకు పాడుకొనవలెనని యనిపించుచు, ఒకసారి నేర్చినచో రెన్నటికిని మరపురాకుండును. గ్రామీణులెల్లరును కొనుక్కొని పఠింతురుగాక! ఈ రెండు గ్రంథములు వలయువారును నిడుబ్రోలువాసులగు శ్రీ జి. లక్ష్మీనారాయణ ఎమ్. ఎ. గారికి వ్రాసి బడయుదురుగాక!

**ఆంధ్ర దశరూపకము** క్రౌను సైజు 125 పుటలు వెల రు. 0-8-0 లు. గ్రంథకర్త శ్రీయుత మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, ప్రకాశకులు వావిళ్ల రామస్వామిశాస్త్రి అండు సన్సువారు 297 ఎస్ప్లనేడు, చెన్నపురి. సంస్కృతభాషలో ధనంజయు

మహాకవి రచించిన దశరూపకమను గ్రంథమున కాంధ్రానువాదము. ఈ గ్రంథము విల్సను మొదలగు వాంగ్లపండితుల ప్రశంసబడసినది. ప్రస్తుత నాటకకవి శ్వరు లిట్టి గ్రంథముల నొకసారి పఠించి నాటక రచనకు పూనుకొన్నచో నయముగా నుండును. అట్లు చేసినచో, తక్కిన అప్రధాన విషయముల సంగతి యెట్లున్నను, పాత్రౌచితి, రసౌచితి, కథౌచితి గలిగి అవి రాణించగలవు. ఈ ప్రధానోద్దేశ్యముతోనే గ్రంథకర్తగారు దీనిని రచించిరి.

**సీటిబుగ్గ** క్రౌను సైజు 15 పుటలు వెల రు. 0-4-0 గ్రంథకర్త శ్రీయుత కాజ రాధాకృష్ణశాస్త్రి గారు, చమ్మనగిరి పేట, మచిలీపట్టణము. శాఖమూరి దుర్గాప్రసాదు గారి అకాలమరణమువలన కవిగారికి కలిగిన మనోవేదన యిందు పద్యములరూపమున వాపోవబడినది. పెండ్లినాటికే కథానాయకుని ధర్మపత్ని కతని మరణవృత్తాంతము "గుండియ మ్రింగసాగిన" యగ్నిరూపమున విశదమయ్యె ఆమె పెండ్లి మానకుండుట, "ఇలను సావిత్రియాట యీ యిందువదన కందునా" యని తల్లి నిశ్చయించుకొనెనేగాని సంబంధము తప్పించకుండుట, ఇంచుమించు మరణసమీప కాలమునకే పతి వేటకేగ గోరినప్పు డామెయు అతని నొప్పించి వేటకుబోవుట, అతనప్పుడు పాముకాటు వలన మరణించియు, తాను గర్భవతియైయున్న కారణమున జీవించి మగశిశువును గాంచి పట్టముగట్టి తనఋణము భర్తకటు తీర్చుటయు ఇందలి యితివృత్తము. ఈ కథవలన కవిగారికి హిందూ వివాహములు శ్రీ సావిత్రీ వివాహమువలె విధాతృనిర్ణయములు గాని కేవల మానవోద్దేశపూరకములు కావనియు, ప్రాజ్ఞులు రానున్న కష్టసుఖము లెరింగికూడ విధాతృనిర్ణయములని తాము విశ్వసించిన వానికి కట్టుబడి యుండుట మానవకర్తవ్యముకాని దాని నతిక్రమించి సుఖింపగోరుట ఒక వ్యర్థవాంఛయనియు, మానవజన్మముయొక్క ప్రధానకర్తవ్యము సుఖములు గుణించుకొని కూడబెట్టుకొనుటకంటెకూడ దుఃఖముల నూహించి అనుభవింప సంసిద్ధులగుట యనియు, ఇట్టి చర్యలవలన కడుపులుడికిపోయినను, కన్నీరు కాల్వలై పారినను 'తనఋణము' తానుతీర్చిన అఖండ కీర్తియైనను కలుగక మానదనియు ఒక రహస్యవిశ్వాస ముండవలెను. అట్టి విశ్వాస మిట్టికథలకు ఇట్టి ప్రపంచ సంభవములకునుపునాది. మనకట్టి విశ్వాసమున్నను మానినను హిందూమతము ప్రకారము అట్టి విశ్వాసము సమస్తబంధుత్వసంబంధరహస్యమై యున్నదనుట కాటంకములేదు. కవిగా రిట్టిచిన్న కావ్యములో యీ మహాసూత్రమును సూచకముగా చర్చించినందుకు ధన్యులు. ప్రథమప్రయత్నమయ్యు, గ్రంథముయొక్క శైలి సులభము, సుందరము, శిష్టము

**ఆంధ్రవాచస్పత్యము (7-వ భాగము)** 600 మొదలు 664 పుటలవరకు ఒ ఓ ఔ లు అచ్చుల అనుబంధములు కలిగియున్నది. వెల 0-8-0 ఇందుతో అచ్చుల సంబంధమైన వాచస్పత్యభాగము ముగించబడినది. ఎనిమిదవభాగమునుండి క కారము మొదలగు హల్లులు ప్రారంభింపబడును. ఇందు సుమారు 36 పుటలు అనుబంధపదములు. వీనిలో పెక్కు జ్యోతిష, చారిత్రక వైద్యసంబంధమైన పదములకు సుబోధకమైన విపులార్థములు, కొన్నికొన్ని పాతకములకు శాస్త్రోచితప్రాయశ్చిత్తాదికములు, బ్రాహ్మణాది జాతులలోగల అఖండనాడీభేదములు మొదలగు ధర్మశాస్త్రవిషయము లనేకపదముల కర్థమురూపమున తెలుపబడినవి. చందాదారులు పోషకులు మొదలగువారు రాబోవు భాగములకుకూడ వీనికివలె మిక్కిలి ఆదరణమొసంగుదురుగాక! ఇట్టి ఉద్గ్రంథరచయితలకు తద్రచనా సందర్భమున కొన్ని స్ఖలనము లచ్చటచ్చట తగులుచుండుటయు, వానిని అంత్యమునందు సవరించుచుండుటయు, సహజము. అట్టి స్ఖలనములు మొదలగునవి అచ్చటచ్చట కలవను సంగతి పాఠకులు తత్తరపడవలసిన విషయము కాదని

రెల్లరును గుర్తించి ఆదరణము నొసంగుటలో వెనుదీయకుందురుగాక అని వాచస్పతిగారు చేయు విన్నపము నెల్లరును మన్నింతురుగాక! చందాదారులుగా చేర కోరువారు కాకినాడదగ్గర కరపగ్రామములో నుండు వాచస్పతిగారికి వ్రాసుకొనవలెను.

**శ్రీరామ విజయము (కళ్యాణకాండము)** డెమ్మీసైజు 190 పుటలు వెల రు. 1-0-0 గ్రంథకర్త శ్రీయుత కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు, కాకినాడ.

పూర్వము గ్రంథకర్తగారు పూర్వకాండములో ఇక్ష్వాకువంశ చరిత్రమును నవల రూపమున వ్రాసిరి ఇందు శ్రీరామచంద్రుని పుట్టువు మొదలు కళ్యాణానంతరమువరకుగల కథను వ్రాసినారు. రామాయణకథ నెఱిగినవారు భారతదేశమున లక్షలకొలది జనులున్నను, ఇంతపూర్వాపరసందర్భోచితముగ నెఱిగినవారుగాని వ్రాసినవారుగాని లేరని చెప్పవచ్చును. ఒక్కొక్క వ్యక్తియొక్క మూడు నాలుగు పూర్వజన్మముల చరిత్రలు ఆయాసందర్భమున వచింపఁబడుచుండుటచేత, రామాయణములో సామాన్యదృష్టికి దోచు అనేక అసందర్భములు తొలగి సర్వమును ఒక సుసందర్భమహాకావ్యమువలె దోచును. సామాన్యదృష్టికీశ్వరసృష్టి అన్యాయపూరితముగ దోచు ఈ యుగములోగూడ ఇట్టి సద్గ్రంథ పఠనము వలన యీ కాలపు టనేకానర్థములకు ఆయావ్యక్తుల పూర్వజన్మదోషములు కారణములై యుండునను నమ్మకము కలిగి, ప్రస్తుతము చెలరేగుచున్న పరస్పర ద్వేషములు విద్యాధికులలో సమసి, ధర్మబుద్ధిబలిసి, ప్రపంచసమన్వయానుకూలమైన స్నేహము వర్ధిల్లగల అవకాశములు కనిపించక మానవు. గ్రంథమామూలాంతము నిరహంకారచిత్తుల శాశ్వత ప్రవర్తకసూత్రములను, అహంకారపూర్తుల అజ్ఞాన క్రౌర్యములవలన గలుగు సర్వానర్థములను వెలిగ్రక్కుచున్నది. ఇట్టి కావ్యములు రచించుట శ్రీ సుబ్బయ్యశాస్త్రిగారివలె సర్వసమబుద్ధి, సంప్రదాయగౌరవము, ధర్మశాస్త్ర గౌరవము మొదలగు సద్బుద్ధులు గలవారికేగాక, అహంకారపూరితులగు గ్రంథకర్తలకు సాధ్యము కానట్లు తోచెడిని. ప్రస్తుతపాఠశాలఁజదువు లెన్నియైన నేర్పుచున్నవికాని విద్యార్థులకిట్టి దివ్యదృష్టి కుపయోగించుసాధనలు కలిపించఁజాలకున్నవి. కారణము అట్టి సమర్థత కవీంద్రులకు లేమియే కాబోలును. ఇట్టిగ్రంథములను విద్యార్థులెల్లరికి పఠనీయములుగ నియమించినను వారికి విశేషము చిత్తసంస్కారము కలిగి, ప్రస్తుత ప్రపంచ మనుభవించుచున్న అనేక జాతీయార్థిక సాంఘిక అల్లకల్లోలములకు శాంతమగు సంస్కారణములు తోచకపోవు. కాని ప్రస్తుతప్రపంచ మిట్టి దివ్యదృష్టిని ఏవగించుకొనుచు తమ అహంకార సిద్ధాంతముల మూలముననే వర్తించి పరిస్థితులను మఱింత అల్లకల్లోలము చేయుటకే గడగుచున్నది. ఇట్టి గ్రంథములను పఠించుటవలన వేయింటికి పదిమందియైన నిట్టి నిర్మలచిత్తులుపొడమి లోకమునకు నూతనకళ్యాణకాండము లొనగూర్తురనుటకు సందేహము లేదు. లోకమువిన్నను వినకున్నను, జనులిట్టి ధర్మశాస్త్ర పురాణగ్రంథముల భావముల నాదరించినను ఆదరించకున్నను, శాస్త్రిగారు తమ పురాణపరిశోధనఫలితముల నీవిధముగా నుపయోగించి, తపోవిధానమువలె తమ రచనలను తాము సాగించుచుందురుగాక యని హెచ్చరించుచున్నాము.



# సంపాదకీయములు

క్వెట్టానగరనాశనము:—

క్వెట్టానగరమును నిర్మించి నూరేండ్లయినది. దాని నూరవవార్షికోత్సవము యీ సంవత్సరము మే యి 31-వ తేది అదియెట్లు పరిణమించినదో మనము చూచుచున్నాము. 'శతవర్షముందాక మితము చెప్పిరిగాని'యని కవీంద్రుడు చెప్పినట్లు ఈపట్టణము నూరు సంవత్సరములు జీవించి 3 గంటలలో మటుమాయమైనది. సుమారెనుబదికోట్ల రూప్యములు విలువగల ఆస్తి నశించినది. అరువది వేలుజనులు మరణించిరి. గాయపడి పైపట్టణములలోని ఆస్పత్రులకు గొనిపోబడు వారి సంఖ్యకు మితములేదు. శవములను గుట్టలుగా ప్రోగుపెట్టి పాతుచున్నారు. దుర్గంధము కొట్టుచున్నది ప్రాతనగర మెల్లయు.

కొన్ని డేరాలు కట్టుకొని మిలిటరీవారు చచ్చినవారిని ప్రాతుట, గాయపడినవారిని అస్పత్రుల కెగుమతిచేయుట మిగిలినవారికి ముష్టి, గుడ్డ మొదలగు వానిని సరఫరా చేయుట, పైవారి రానీకుండుట మొదలగు పనులొనరించి ప్రశంసలు బడయుచున్నారు. ఇప్పటికిని ప్రతిక్షణమును భూమి గడగడవణకుచు ఏక్షణమున తిరగబడునోయని బెంగ పుట్టించుచున్నది. పట్టణమునుగునబడిన వెండి బంగారములు మొదలగునవి కెలికిపైకితీసి యెవరివి వారికిద్దురా అని కొందరు బెంగలు పెట్టుకొనుచున్నారట. ఈనగరమును పునర్నిర్మించుటయో, లేక వేఱేనగరమును కట్టుటయో ఇంకను నిశ్చయముకాలేదు. నగర నిర్మాణమునకేమి, గాయపడినవారి దేహ చికిత్సలకేమి, చనిపోయినవారిని దహించుట కేమి, నిరాధారులకాదరువు కనిపించుటకేమి హద్దులేనంత ధనమావశ్యకమైయున్నది. భూకంపపు బాధపడని ప్రాంతముల వారీ ధనమును విరాళముగిపంపి వారి సానుభూతి చూపుచున్నారు. అయినను దారిద్ర్యపీడితంబైన యీభారత భూమినుండి మనమను కొన్నంత ధనమెట్లువచ్చునో ఊహింప సాధ్యముకాదు. ఏటేటా భూకంపములు, కఱవులు, వరదలు మొదలైన ఉపద్రవములు వచ్చి అనేకమందియొక్క రక్తమాంస ప్రాణాదులను, తక్కినవారి గింజగిట్టబట్ట పాత ధనాదులను ఈవిధముగా హరించి శల్యములుగామార్చుచున్నందుకు భారతీయులెట్టి పాపమొనర్చియుండిరో మన మెఱుగము. ఈకష్టము లెన్నాళ్లింకాపడవలెనో పరమేశ్వరునికే యెఱుక! దానధర్మ శీలములకు బ్రసిద్ధికెక్కిన భారతపుత్రులెల్లరును తాముమిగిల్చి

పంపించగల యంతవరకు యీసహాయనిధికి సహాయము చేయుదురుగాక ? బ్రిటిషుగవర్న మెంటువారు 50000 పౌండ్లను, ఆస్ట్రేలియా గవర్నమెంటువారు 10000 పౌండ్లను, తిరువాన్కూరుమహారాజావారు 10000 రూపాయిలు హైదరాబాదునైజామువారు 15000 రూపాయిలు కాశ్మీరమహారాజువారు 10000 రూపాయిలు యీవిధముగా భూరి విరాళములను గురిపించుచున్నందుకు వారి కెంతయు కృతజ్ఞులుగానున్నాము.

జ్యేష్ఠమాసగోష్ఠి:—

ఈ పత్రికాసంపాదకుడగు శ్రీ యుత గుమ్మిడిదల సుబ్బారావుగారు శ్రీ గోపాల కృష్ణుని జయంత్యుత్సవ సందర్భోచితముగ సంచికను 44 పుటలకు పెంచి వివిధవిషయ ములం దాము చర్చించియు ఆంధ్రరత్నము యొక్క దివ్యవాక్కులను, భావములను, ఉపదేశములను 'సాధ'నాది పత్రికాచయము నుండి సేకరించియు, విద్వత్శిఖామణు లీయు త్సవమున కాశీర్వచనపూర్వకముగ నొసం గిన శుభసందేశముల పొందుపరచియు పాఠక లోకమున కపూర్వమగు విందొనగూర్చి నారు. జయంత్యుత్సవముయొక్క ప్రధా నార్థము పుణ్యచరితులు భౌతికమాత్రముగా కాని మరణింపరనియు, సత్యముగా వా రమృతమూర్తులనియు, వారిలీలలను, చర్య లను, భావములను మనము వినునప్పుడెల్ల వారు మన కన్నులకు కట్టినట్లువచ్చి నిలచి ధర్మోపదేశబోధకులై ఉత్తమమార్గములకు దారి చూపుచుందురనియు. ప్రపంచము నేటి వరకు పొందుచున్న సత్ఫలితామెల్లయు వారి సంకల్పముల ఫలితమేయనియు నై యు న్నది. ఈ ప్రమాణమునుబట్టి చూచినచో, ఈ యాధునికయుగములో ఆంధ్రరత్నమువలె రత్నతుల్యములైన భావతరంగముల నుచ్చ రించి ప్రజలనుత్సాహపరవశులను దీక్షా సక్తులను నొనరించి కార్యరంగమున కురికిం చిన నిష్కళంక త్యాగమూర్తి యెవ్వరును నుదయింపలేదని చెప్పవచ్చును. అతని సమ కాలికుల కాతనొసంగిన ఆనంద సముద్ర ములో నీదులాడుచు, అప్పుడు కలిగిన క్లిష్ట సమస్యలలో తన్నుకొనుచు, అతనినిగూర్చి సాధారణభావములలోనే తేలుచుండుటకే తప్ప అతని సంపూర్ణమాహాత్మ్యమును గుర్తించుట కనకాశము లేకపోవచ్చును. కాని అతని జీవితానంతరముకూడ అతని భావములు సందేశములు పఠనీయములై ప్రశంసనీయములై అనుసరణ నీయములై యుండుటయే, అతని జయంత్యుత్సవము శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, శంకరాచార్యుడు, రామానుజాచార్యుడు మొదలగువారల జయంతులవలె ప్రపంచమున్నన్నాళ్లు శాశ్వత స్మరణీయమని యెల్లరకును స్పష్టము అగు చున్నది. సకలజాతుల మతస్థుల సమభావ నుస్నేహములు; రామదండువలె ఈశ్వర సేవాపరాయణ కృత్యములు; మానవులకు ఆకలిదీర్చుచరకా, ఆనందమునుగూర్చు లేఖ నులు; రాజకీయాశయములు మొదలగు వానినిగూర్చి అతనికిగల అభిప్రాయములనెల్ల అతని దివ్యవాక్కులనే యేర్చికూర్చి హృద

యములలో పాతుకొనునట్లు అచ్చొత్తించి సంపాదకులీ సంచికను ప్రకటించినకతన గోపాలకృష్ణుని మూర్తిభౌతికశరీరముతోను, భాసురమందహాసములతోను ప్రజ్ఞాచాతుర్యములతోనుగూడ మనలో తిరిగీ తాండవించుచున్నట్లు పాఠకులకు గోచరమగుచున్నది. ఇదివరకిట్టివి ఆరుజయంతులు గోష్ఠివారివల్లను యితరులవల్లను ఆంధ్రదేశముననెల్ల జరిగినవి. ఈజయంతి ఆంధ్రజాతీయతకు లక్షణమైయేటేట అనంతకాలమువరకు జరుపబడి ఆంధ్రుల పరిశుద్ధసేవాదీక్షాపరుల నొనరించును గాక. రాధాకృష్ణునువంటివారు సమయమునకు జ్యేష్ఠశుద్ధ పంచమినాటికి రాగలిగినను రాలేకున్నను చీరాల వాస్తవ్యులు చిన్నతనముపొందక, గోపాలకృష్ణుని జయంతిని దివ్యతమముగ జరిపినందు కెంతయు ధన్యులు.

ఆయుర్వేద పశు చికిత్సాలయము:—

ఆంధ్రదేశములో పల్లెగ్రామములలో జనులకే సరియైన వైద్యసహాయము చిక్కకున్న సంగతి యెల్లరకుఁ దెలిసినవిషయము. అట్టియెడ పెంపుడుజంతువులు మందుమాకులు లేక అంటువ్యాధులపాలై యెన్నెన్ని యేటేటా మరణించుచున్నవో చెప్పఁజాలము. కాలముచూపిన క్రొత్తాప్రాతల భేసందయి యున్నది. పూర్వకాలములో వైద్యపండితులు తక్కువైనను, అన్నిగ్రామములలోను అన్నిజాతులలోను మనుజ పశువైద్యానుభవము లున్నవారు కొందరుండెడివారు, వారివల్లనుభయులకు నెంతో కొంతతేప చేకూరెడిది. వారికి తెలిసినది దేశీయవైద్యము.

ఇప్పుడా ఆంగ్లవైద్య పాఠశాలలు లేచినప్పటినుండి వైద్యములో అప్పటికంటె పాండిత్యము హెచ్చియుండవచ్చును. కాని ఆపండితులు నలుగురు పట్టణములలో పెద్ద ఉద్యోగములలోనో పూర్తిగా నిరుద్యోగములలోనో జీర్ణించుచున్నారు. వారి చదువా, విదేశీచదువు, మందులా విదేశీ మందులు, ప్రభుత్వమువారు ఆస్పత్రులలో ఉచితముగా ఇచ్చి నిమ్మళింపజేసిననేతప్ప, ప్రజలకు కొనుక్కొంటకే శక్తిచాలదు. గవర్నమెంటువారు ఎట్టిదాతలైనను, మహార్బాసీగా కొందఱికి మందులిప్పించుటతప్ప రోగులెల్లరిని పరిశీలింపఁ గలుగుటయే దుస్తరము. కాని ఈమందుల ప్రాబల్యము హెచ్చుచున్నప్పటినుండియు, అవి అందరికిని అందగలుగుచున్నను మానుచున్నను, అందినవారికైనను శాశ్వతముగ నిమ్మళించుచున్నను మానుచున్నను; గ్రామములలో ఇదివరకు వైద్యపండితులుగా కాకున్నను అనుభవజ్ఞులుగానైనను ఉండి, అనేకమందిజనులకు, జంతువులకు మందుమాకు లిచ్చుచుండువారి ప్రతిభ తగ్గిపోయినది, వారిసంఖ్యయు తగ్గినది, వారివద్దకు పోవువారిసంఖ్యయుతగ్గినది.

ఇట్లు గ్రామములను నగరములను వేనిని జూచినను అటు ఆయుర్వేదము నశించి, ఇటు ఆంగ్లమందు లందక లక్షోపలక్షలజనులు, జంతువులుకూడ కమిలిపోయి నశించుచున్నారు. దీనికి సాయము జనుల దురభ్యా

నములు జీవనవైఖరులు తొంటికంటె చెడుగులై అవసీణిప్రసములై నందువలన రోగముల సంఖ్యయు హెచ్చినది. ఏ పల్లెటూరిలో ఏ జబ్బుచేసినను వెంటనే రైలుబండీలెక్కించి బంధుమిత్రులందరు వానిని ఏపెద్దపట్టణపు జనరలుఆస్పత్రికో మోసుకొనివచ్చి బోలెడంతడబ్బు దండుగపెట్టుకొని బ్రతికించుకొనవలసియున్నది, లేకున్న చంపుకొనవలసియున్నది. ఇట్టి దురాగతములు తీరవలెనంటే విదేశీమందులు కారుచౌకయై ప్రభుత్వము కొని ప్రజలకెల్లరకు పంచిపెట్టుచుండవలెను; లేదా, స్వదేశీమందులు స్వతహాగా చౌకయై, యెక్కడపట్టిన నక్కడ దొరకునవై, సులభముగ తయారు చేయబడునవై బహుమందిచే డబ్బు దండుగలేకుండ నేర్చుకొనబడునవై యుండుకతన వానియందు విశ్వాసమును ప్రజలకు కుదర్చవలెను.

విదేశీమందులు చౌకయౌననుట కల్ల. భారతీయుల ఆయుర్వృద్ధికి భారతీయ ఆయుర్వేదమందులు వైద్యులయొక్క ఆవశ్యమెంతయో యున్నది. ఏదేశములో పుట్టే రోగములు తరచుగా ఆదేశపు మందులతోనే నివారణ కావలెనుతప్ప విదేశపుమందులతో నివారణమగుట చాలా అరుదు. అయినను నాగరికత నేను విశేషముగ బలిసి, ఒకదేశమునుండి ఇంకొకదేశమునకు చిత్రవిచిత్రాభ్యాసములు వస్తువులు ఎగుమతులు దిగుమతుల రూపములతో తిరుగుచు, జనులను దరిద్రులుగా మార్చుచున్నట్లే చిత్రవిచిత్రములగు రోగములుకూడ వచ్చి నిష్పక్షపాతముగ అందరిని పీడించుచున్నకతన, అట్టి సంపర్కరోగముల సంహరించుటకై నను విదేశీమందుల సహాయము, విదేశీ వైద్య పాండిత్యము పెద్దలకు ముందుఅవసరమైది గుణవారికి విస్మృటగరపబడ వలసియున్నది.

మన ఆంధ్రదేశములో గ్రామములలో ఏటేటా అనేకము పశువులు పెద్దరోగము, దొమ్మ, గురక, గూబవాలుడు మొదలగు అనేకరోగములకు పాల్పడుచున్నవి. దీనిని నిర్మూలింపజేయుటకు ఆంగ్లేయశాస్త్రచికిత్సలేకాక అనేకము ఆయుర్వేదచికిత్సలు కూడ చేయించవలసియున్నది. ఇందుకొరకు శ్రీయుత డాక్టరు యేజెళ్ల శ్రీరాములుచౌదరి గారు కృష్ణాజిల్లా అంగలూరులో ఒకచికిత్సాలయమును 1929 లో స్థాపించి అనేకజంతువులను కుదర్చుచున్నారు. కొందరికి యిండ్లకు మందు లంపుచున్నారు. ఎల్లరకు అచ్చుకరపత్రములద్వారా విశేషము ప్రచారము చేయుచున్నారు, పుస్తకములనుగూడ ప్రకటించుచున్నారు. ఈ ఒక్కచికిత్సాలయమునకు సంవత్సరమునకు 6000 పశువులకంటె యెక్కువగా చికిత్సకువచ్చుచున్నవనిన ఇట్టి సంస్థలెన్ని మనఆంధ్రసీమలో నెలకొల్పబడవలెనో పాఠకులూహించుకొందురుగాక!

మరియు ఇందుకొరకొక ఆయుర్వేదవైద్యపాఠశాలనుగూడ అచ్చటస్థాపించి శిష్యులను పండితులుగా తయారుచేసి వివిధజిల్లాలకంపి, అక్కడ చికిత్సాలయముల నెలకొల్ప బూను

నట్లు ప్రోత్సాహించుచున్నారు. స్థానికసంస్థలు, జమీందారులు, పెద్దరైతులు మొదలగువారు విరాళములనిచ్చియు, విద్యార్థులకు ఉపకారవేతనములనిచ్చియు ఈపాఠశాలలను పోషింత్రుగాక !

ఆంధ్రదేశరైలు ప్రయాణీకులసంఘము:—

ఈ సంఘమువారు *1928* మొద *1934* అంతమువరకు ఒనరించిన చర్యలనుగూర్చి పన్నెండుపుటల నివేదికనొండు ప్రకటించినారు. అందు సుమారు ఏబదిరకముల చర్యలుదహరింపఁబడినవి. ప్రయాణీకులకు సాధారణముగ కలుగు కష్టములనేకములు దిగువ ఉద్యోగస్థులు, కూలీలు, లైసెన్సుదారులు మొదలగువారివల్లనే కలుగుచుండును. రైలునడుచుముందర తొందరలోనో, బండి యెక్కినవెనుక యిబ్బందులలోనో, మరేసందర్భమునో వారు లొంగిపోయి వారికి చిన్నచిన్న లంచపంచములిచ్చి వానిని తీర్పించుకొనుచుందురు. విమ్మటనైనను పైవారికిట్టివిషయములు రిపోర్టుచేసి మరియెన్నడును కలుగకుండ కాపాడుకొనగల దూరాలోచన మనదేశస్థులకు తక్కువ. ఏదో యెప్పటిబాధ అప్పుడుపడి, తరువాత అది మరచిపోదురు. కాని సూర్యదేవర సంజీవరాయణింగారుమొదలైనవారు పదిమంది వలె అట్టులూరుకోక ఒకసంఘము స్థాపించి, దాని సమావేశములు పెక్కుచోట్ల జరిపి, ఎక్కడెక్కడ జరుగుచున్న అవకతవకలను గూర్చి రిపోర్టులను తెప్పించుకొని, వానిని పై అధికారులకు వ్రాసి నివారణకు బూనుకొనునట్లు నిర్బంధించుచున్నారు. ఈ నివేదికచదివినచో, ఇట్టి సంఘముయొక్క ఆవశ్యకత యొంతయు విశదముకాగలదు. వీరి ప్రయత్నము నాంధ్రులెల్లరు ఆశీర్వదింతురుగాక !

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# మాధవి




ఇది పుష్పసారములతో నిండియుండు ఒక నాజూకైన మంచువంటి పరిమళపదార్థము. ఈ మంచును కొద్దిగ వ్రేలితో తీసుకొని ముఖమునకు లేపనమును చేసికొనిన వెంటనే అది చర్మములో మాయమై ముఖమునకు కళ, కాంతి నిచ్చును. ముఖము స్ఫటికమువలె నిర్మల మగును. ముఖమున లేచు సోబి, మచ్చలు, మొటిమలు మొదలగువానిని మాన్పును. మరియు దీనిని ముఖమునకు పట్టించుకొనిన వెంటనే ముఖము చల్లగ నుండి మంచు రాచుకొనినట్లేయుండును.

వెల బుడ్డి 1-కి 8 అణాలు.

కేసరి కుటీరం, ఎగ్మూరు, మద్రాసు.



# మీ స్వదేశపు తేనీరు



హిందూదేశము ప్రపంచములో పండెడి తేయాకులో సుమారు సగమును తానే పండించిపంపును, కాని ఆదేశస్థులకింకా తేనీరుత్రాగే అభ్యాసమే కుదరలేదు. ప్రపంచములోనెల్ల మిక్కిలి సువాసనగల తేయాకు మనదేశములో మన కష్టపరిశ్రమవల్ల తయారౌవుచున్నదను విషయమును మనము గుర్తించుచున్నట్టే లేదు. ఇట్టి నిర్లక్ష్యభావము నశించవలెను. మనము మన స్వోపయోగముకొరకు భారతదేశపు తేయాకునే వాడుదము. ఇట్టి సువాసనగల ఆరోగ్యప్రదమైన తేపగూర్చు పానీయమును మన జాతీయ పానీయముగా మనము చేసుకొనవలెను. మనలో ప్రతి వ్యక్తియు ప్రతిదినమును కనీసము కొన్ని తేనీటికప్పులైనను త్రాగుటకు ప్రారంభించుదము. యెండదినములలో తేనీరు దేహమునకు చలువచేయును. చలికాలములో చక్కని వేడికూర్చును. ప్రయత్నించిచూడుము! ఇది మన స్వంత తేయాకనియును దీని నుపయోగించు ప్రథమహక్కు మనకే కలదనియు నీవు జ్ఞాపకముంచుకొనుము.

## తేనీటి నెట్లు తయారుచేయుట

1 పొడియైన భారతదేశపు తేయాకును మనిషికి ఒకచమ్చా చొప్పున ఒకపాత్రలో వేయుము. 2 ఉడుకుపట్టిన నీటిని తెచ్చి అందులో పోయుము. 3 అయిదునిమిషములుంచి వడపోయుము 4 వలసినంతచక్కెర పాలు చేర్చుకొనుము.



**కోట్లకొలదిజనులు భారతదేశపు తేనీరుత్రాగి ఆనందించుచున్నారు—నీవో?**

# నీకు అందమును తెచ్చేది యేది!



## మృదువైన నున్నని, చర్మము.

శరీరము నిగనిగలాడడమే అందము. బింబము అందంగా వుండవచ్చును. కాని కాస్త శ్రద్ధ పట్టవలెను. ముఖ్యంగా చేయవలసినదేమిటి అనగా, చర్మమును శుద్ధము చేయవలెను. పైపైన మాత్రమే కాదు. రోమకూపముల అడుగు నుంచీకూడా.

'501' టాయిలెట్టు సోపుయొక్క మీగడవంటి నురుగు ప్రయోగించి తోమితే ఇట్టి శుద్ధత్వము వెంటనే కలుగును. శరీరపుటందములు చెఱచు మాలిన్యముల నన్నింటిని ఇది సన్నసన్నంగా తీసివేయును.

'501' టాయిలెట్టుసోపు క్రొవ్వు చేరక శుద్ధమైన ఉద్భిజ్జపు తైలములతో చేయబడినది. రమణీయమైన మల్లెపూవుల వాసనతో గూడినది.







టామ్కో సేల్సు డిపార్టుమెంటు,

19. A. వాణియర్ వీధి, జి. టి. మదరాసు.

ది టాటా ఆయిల్ మిల్సు కంపెనీ లిమిటెడ్, టాటాపురం.

## ప్రపంచ దుఃఖమునకు

## మూడే కారణములు:

జ్వరము

బలహీనత

వంధ్యత్వము

ఈ మూటికిని ఉన్నవి చక్కని

మూడు నివారణోపాయములు

| | |
|---|---|
| జ్వరమునకు | అర్క |
| బలహీనతకు | అమృత |
| వంధ్యత్వమునకు | లోధ్ర |

వీటికి తిరుగులేదు. సేవించుటతో గుణ మిచ్చ్యవలసినదే. జీవితములను సుఖవంతము చేయుటకు యివి మూడును మూడు వజ్రాయుధములు.

అర్క — అమృత — లోధ్ర

అన్ని షాపులలోనను దొరకును.

కేసరికుటీరం, ఎగ్మూరు, మదరాసు.




# కాయకల్ప రసము
(REGD)

సకల వ్యాధులకును ఈ రసమును చుక్కల పరిమాణమున లోనికిని పైకిని యుపయోగించిన క్షణమాత్రమున అత్యద్భుతమగు గుణమిచ్చును.

1

దీనిని పైన పూయుటచేత నివారణమ వ్యాధులు :—తలనొప్పి, పార్శ్వపు తలనొప్పి, ప్రక్క నరములు లాగుట, కంఠమాల, న్యూరెల్జియా, జలుబు, రొమ్మునొప్పి, కీళ్లవాత వీపునొప్పి, కీళ్లనొప్పులు, శరీరమునం దేభాగమునైన తిమ్మిరి, కీళ్లు పట్టుట, నరమ చుట్టుకొనుట, నరముల వ్యాధులు, పండ్లనొప్పి, నడుమునొప్పి చర్మమున వాపు, తామ

2

లోపలికి సేవించిన నివారణమగు వ్యాధులు:—విషజ్వర ఇన్ఫ్లూయంజా, ప్లేగు, మలేరియా, బోదకాలు, చలిజ్వరము మొదలైన అన్నివిధము జ్వరములు, గొంతునొప్పులు, రొమ్ముపడిసెము, నోటి దుర్వాసన, ఉబ్బసము, అజీర్ణ మంద విరేచనములు, కలరా, మలబద్ధము, పిత్తాశయ ప్లీహ రోగములు, పొడిచి కోరింతదగ్గు, పక్షవాతము, కడుపుబ్బరము, కడుపునొప్పి, మూత్రవ్యాధులు, గు మండుట, పిత్తమైకము, అశాంతి, పసుపుకామెలరోగము, శరీరము బడలిక, నిస్సత్తు నరములు సడలుట, పాండురోగము, ధాతుసంబంధమైన దుర్గుణములు, కక్కువా స్త్రీలకు కలుగు ఋతుసంబంధమైన వాయువు, సూతికకట్టు, సూతికసన్నిపాత గుల్మము, కడుపునొప్పి, శిశువ్యాధులు మొదలైన అన్ని విధములైన దేహవ్యాధి కాయ కల్ప రసమువల్ల నివారణమగును.

ఏ రోగమునకైనను కిటీస పథ్యము లేదు.

ఒక సీసా వెల రూ. 1-6-0. తపాలాచార్జీ ప్రత్యేకము.

## ఇండియన్ మెడికల్ వర్క్స్
ఆలందూర్ P.O. 234 గోవిందప్పనాయక్ వీధి
మద్రాసు

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావు. నూజవీడు: వైద్యుల నారాయణ
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు.
నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కంపెని.
జెమ్షెడ్‌పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్ పైప్ కంపెనీ, [లిమిటెడ్.
బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.
గుంటూరు: వెల్కం అండు కంపెని. మైసూరు: స్టూడెన్ట్సు హాలు.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు
పిఠాపురం: ఎం. నూకరాజు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
మదరాసు: వై. నారాయణగారు, 364 ఎస్ప్లనేడు.
బెంగుళూరు కంటోన్మెంటు: ఆనందా బుక్ డిపో. ఏలూరు: డి. శ్రీహరిరావు.
తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్‌పేట.
ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్ వీధి.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.
విజయనగరం: ఆయపిళ్ల .సూర్యనారాయణరావు
నరసాపురం: వై. సత్యనారాయణగారు.
ఖరగ్‌పూర్: పి. వి. రమణయ్య, స్టోర్స్ క్లర్క్., బి. ఎన్. ఆర్ వై. వర్క్ షాప్స్
కొవ్వూరు: కె. సి. చెన్నకేశవయ్యర్. గూడూరు: సి. సి. సుబ్బయ్య, మర్చంటు.
కాకినాడ: నున్నా బాలకృష్ణరావు, న్యూస్ బాయ్ అండు కో.
అనకాపల్లి: సివాజీ న్యూస్ ఏజన్సీ.
నెల్లూరు: సి. సుబ్బరావు అండు సన్సు.
భీమవరం: వంగల అచ్యుత రామయ్య, మేనేజరు, నెహ్రూ ఖద్దర్ స్టోర్సు.
గుడివాడ: శ్రీ శివరామ అండు కో.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.
అమలాపురము: పి. అన్నాజిశర్మ. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)

హిగిన్‌బాథమ్ స్టాలువద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు వరభాష్య సంపుకొనుడు.

బలము వృద్ధి చేసుకొండి

# కాడ్లివర్ ఆయిల్

## మరియు స్కాట్సు ఎమల్షను

మూడురెట్లెక్కువ గుణము నిచ్చును.



పెద్ద జబ్బుచేసి నిమ్మళించిన తరువాత తొలుతటి శక్తిని తెచ్చుటకు, సదా యుండెడి సహజ శక్తిని నిలబెట్టుటకు, ఎ. బి. వైటమినులతో సమృద్ధమైన కాడ్లివరు ఆయిలుకంటె ప్రశస్తమైన మందు లేదని వైద్యులెల్లరు అంగీకరించినారు.

కాని సాదా కాడ్లివరు ఆయిలు కొంతగుణము నే యిచ్చును. అది జీర్ణమగుట కష్టము. స్కాటు అను నతడు తయారుచేసిన విధానమువలన అందులో హైపోఫాస్ఫైటులు, సున్నము సోడా మొదలైనవి చేర్పబడి, రుచికరముగా చేయబడినది కనుక యీ ఎమల్షను దానికంటె మూడురెట్లెక్కువ గుణవంతము.

**స్కాట్సు ఎమల్షను**

సాదా కాడు లివరాయిలు కంటె 3 రెట్లు గుణమునిచ్చును.

ఎముకలను బలపరచి మాంసమును పెంచును.

నరములకు పటుత్వమిచ్చును.

రక్తమును గట్టిపరచును.

అంటు రోగముల నెదిరించును.

అంటువ్యాధులు రాకుండ కాపాడును.



స్కాట్సు ఎమల్షను చర్మమును శుద్ధపరచును, నరములకు చురుకుతనమునిచ్చును, రక్తమునకు పటిమను కూర్చును. కనుక రోమకూపములనుండి శరీరము లోనికి పోగోరు విషక్రిములతో నీశరీరము పోరాడి వాని నావలకు నెట్టివేయును. ఎప్పుడెప్పుడు నీశరీరము నీరసించినను, ఆయాసపడిపోయినను, ఎక్కువ పని చేసుకొనవలసివచ్చినను, నీవు దీనిని సేవించి నీ బలమును ఆరోగ్యమును దృఢపరచుకొనవలెను. అరువది సంవత్సరములనుండి వైద్యులు దీనినే సిఫార్సు చేయుట పైకారణముల చేతనే యని గ్రహించుము.

# SCOTT'S Emulsion

(శుద్ధమైన కాడ్లివరాయిలునుండి)

మండీ వర్తకులు : ఇంపీరియల్ కెమికలు ఇండస్ట్రీసు (ఇండియా) లిమిటెడ్

కలకత్తా, బొంబాయి, మదరాసు, లాహోరు, రంగూను, కొలంబో, కాన్పూరు, పాట్నా, అహమ్మదాబాదు, కొచిను, క్యాలికట్టు, విశాఖపట్టణము, కరాచి, అమృతసరము.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు

**డాక్టరు. కే. యన్. కేసరి**

సంపుటము ౮.] ఆగస్టు 1935 [సంచిక ౬.

*Printed at Lodhra Press, Egmore, Madras.*

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్ధ సంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలములరేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతోవ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈపఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జవాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలుఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు.



# క్వెట్టా నుండి పాఠము!

భూగర్భమున అశాంతి : భూమి కంపించినది
ఫలితముగ క్వెట్టా ధ్వంసమయిపోయినది.

## అదే విధముగ

స్త్రీ గర్భమున అశాంతి : ఆరోగ్యము అంతమందినది
ఫలితము : కుటుంబసౌఖ్యము ధ్వంస మయిపోయినది.

* * *

అటువంటి విషాద విచ్ఛిత్తి రాకుండ రక్షింపగలది "లోధ్ర". లోధ్ర సేవనము 'ముందుకాపు': అది అశాంతికి, దుఃఖమునకు కారణమగు గర్భాశయరోగములను దూరముచేయును. 35 యేండ్లనుండి "లోధ్ర" స్త్రీల పాలిటి ఆరోగ్యదేవతయై, వరప్రసాదినియై వెలయుచున్నది.

## స్త్రీగల గృహములో "లోధ్ర" ఉండాలి

'లోధ్ర' యెల్లడల దొరకును

కేసరి కుటీరం, ఎగ్మూరు, మద్రాసు.

# విషయసూచిక

# హేమోద్రాక్షోమాల్ట్

**జీవనమును మఱింత అనుభవయోగ్యముగ జేయును.**

జీర్ణశక్తిని, బలపుష్టిని వృద్ధిచేయు ఔషధములలో నెల్ల హేమోద్రాక్షోమాల్టు సర్వోత్కృష్టమైనది. దాని వలన ఆకలివృద్ధియగును. జీర్ణించి నలిగిపోవుచున్న కాళ్లకు, నరములకు, నూతన జీవము నూతనశక్తి కలుగును.

దేహమునకు రక్తమునుచేర్చు హేమోగ్లోబిను, చక్కని ద్రాక్షపళ్లరసము, బలవర్ధకాహారపదార్థముల సారము, అనేక సుగుణములతో కూడినట్టియు, భారతీయుల ఆరోగ్యలక్షణములకు సరిపడునట్టియు ఇతర పదార్థములనిగ్గు చేర్చి యిది తయారుచేయబడినది. ఇది నీకు జబ్బును కుదిర్చి పుష్టినిచ్చి తీరవాలి. విదేశీమందు లనేకమును మించి దేశమంతట నిది మిగుల ప్రీతిపాత్రమై చలామణి యగుచున్నది.

ఒక్కసీసా నేడు కొనుక్కొనుము. హేమోద్రాక్షోమాల్టు నీ జీర్ణశక్తిని, ఆకలిని, బలమును యెట్లు వృద్ధి చేయునో నీవు తెలుసుకొనగలవు.



**ఇది**

**అలెంబిక్**

**సరకు**

## అలెంబిక్ కెమికల్సు

బొంబాయి     బరోడా     మదరాసు.

# ఛాయా చిత్రములు

## చిత్రపటముల వివరములు

### శ్రీమతి వడ్డాది సావిత్రి

మే నెల 4 వ తేదీని భీమునిపట్టణము మ్యునిసిపల్ హైస్కూలు వార్షికోత్సవ బాలికలు బాలురు ప్రదర్శించిన "ప్రహ్లాద" నాటకములో మొదటి బహుమానమును బడసినది.

### శ్రీమతి కమలా నెహ్రూ

కారాగారవాసి జవహరిలాలుగారి సతీమణి, ఆరోగ్యముకొరకు అయిరోపాఖండ మునకేగి ఆరోగ్యమును బడయుచున్నారు.

### శ్రీమతి జోర్బాయి హార్మస్జీ మోడీగారు

క్వెట్టా భూకంప పీడితుల సంరక్షణకు ధనము సంపాదన నిమిత్తము బొంబాయిలో జరిగిన వుమన్సు ఇండియనసోసియేషనువారిసభ కగ్రాసనాధిపత్యము వహించిరి.

### మిస్ రోమాబోసు

కలకత్తా విశ్వవిద్యాలయములో బి. యె. యెమ్మె పరీక్షలలో మొట్ట మొదటి యామెగా ప్యాసయినారు. సర్కారు రూ. 2400 యిచ్చి ఆక్సుఫర్డులో రిసెర్చి విద్యకై పంపించినారు.

### శ్రీమతి రంగనాయకమ్మాళ్ రుక్మిణమ్మాళ్ గార్లు

శ్రీయుత కందాళ సింహాద్రి అప్పలాచార్య అయ్యావార్లంగారి పుత్రికారత్నములు. నివాసము నిడదవోలు. వీరికి సంగీతమం దసమానపాటవముకలదు. ఈ బాలికలు హార్మని ఫిడేలుమున్నగు పరికరములతో గాత్రమును మేళవించి మనోహరముగా పాడగలరు. శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారి (బాలికాపాఠశాలాధికారిణి) అధ్యక్షత క్రిందజరిగిన సభలో భాస్కరమ్మగారు వీరి గానమునువిని వేనోళ్ళ ప్రశంసించి రజితపాత్రములను బహుమతి నొసగి గౌరవించిరి. నమ్మాళ్ళ శ్రీరాములుగారు ఈ బాలికలకు సంగీతవిద్య నేర్పిరి.

# వరులు కావలెను

(1) వెలనాటి వైదికకుటుంబమునకు చెందినట్టియు, రూపవతియు, విద్యావతియు, గుణవతియు నగు 15 సం॥ వయస్సుగల బాలవితంతువును వివాహమాడుటకును—

(2) ఆర్వేలనియోగిశాఖ సత్సాంప్రదాయకుటుంబమునకు చెందిన 17 సం॥ వయస్సుగలిగి, తెలుగు హిందీభాషలందును, కుట్టు, అల్లికపనులందును గృహకృత్యములందును నేర్పరియైన బాలవితంతువును వివాహమాడుటకును—

(3) 16 సంవత్సరముల ప్రాయముగలిగి, తెలుగుచదువుట, వ్రాయుట నెరిగి, నేర్పు, వినయవిధేయతలుగలిగి, సుగుణరాశియగు— సుప్రసిద్ధవైశ్యకుటుంబమునకు చెందిన నొక బాలవితంతువును వివాహమాడుటకును—

వరులు కావలెను వరులెల్లరును నాయావర్ణములవారై 30 ఏండ్లప్రాయమునకు మించనివారై యుండవలెను. సుఖజీవనోపాధికి లోపములేనివారు కావలెను. వధువు లందరు తాము వ్యక్తురాండ్రు కాకముందే భర్తలను గోల్పోయి నిష్కళంకలైయున్నారు. వివాహమాడగోరు యువకులు తమపేరు, ఇంటిపేరు, గోత్రము, వయస్సు, ఉద్యోగము, స్థితిగతులు, కుటుంబచరిత్ర వివరముగా తెలుప ప్రార్థితులు.

# వధువులు కావలెను

(1) ముప్పది సంవత్సరములలోపు వయస్సుగలిగి, సుఖజీవనోపాధికి లోపములేనివారై తగిన భూవసతి, విద్య ఉద్యోగముగల కమ్మయువకులను వివాహమాడుటకు కమ్మవారికులమునకు చెందిన 20 సం॥ వయస్సునకు లోబడిన బాలవితంతువులు కావలెను.

(2) 30 ఏండ్లకు లోబడిన వయస్సుగల సుఖజీవనోపాధికి లోపములేనివారై తగిన యుద్యోగములు, వ్యాపారము, స్థితిగల వైష్ణవ యువకులను వివాహమాడుటకు 20 యేండ్లకు లోబడిన వైష్ణవబాలవితంతువులు కావలెను.

పునర్వివాహములు చేసికొనగోరు వధువులు తమ దరఖాస్తులను (మైనర్లయిన యెడల వారివారి సంరక్షకుల అంగీకారముతో) ఇంటిపేరు, పేరు, వయస్సు, గోత్రము, కుటుంబచరిత్రము వివరముగా తెలుపగోరెదము.

పునర్వివాహమునకు సంసిద్ధులైన అట్టి వధువులు (నిష్కళంకలు) మా నికేతనముకు రాదలచుకొనినచో యావిషయము ముందుగ వ్రాసిన తగిన యేర్పాట్లు చేసి, వివాహమగువరకు ఉచితముగ భోజనవసతి, విద్య యొసగబడును భోజనాదులకు స్వయముగనే ఖర్చులు భరించుకొనువారు ఎప్పుడువచ్చినను మా నికేతమున చేర్చుకొనబడుదురు.

మంచికంటి వెంకటరత్నమ్మ,
సంరక్షకురాలు.
సౌభాగ్యనికేతనము,
త్రేజరుపేట, కాకినాడ.

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావు. నూజవీడు: వైద్యుల నారాయణ

తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.

హైదరాబాదు: ఎస్. లక్ష్మిబాయిగారు, సుల్తాను బజారు.

నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.

తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కంపెని.

జెమ్‌షెడ్‌పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్‌పైప్ కంపెనీ, [లిమిటెడ్.

బరంపురం: ఎస్. కె. మూర్తి అండ్ సన్స్.

గుంటూరు: వెల్‌కం అండు కంపెని. మైసూరు: స్టూడెన్ట్సు హాలు.

సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు

పిఠాపురం: ఎం. నూకరాజు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.

రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.

మదరాసు: వై. నారాయణగారు, 364 ఎస్ప్లనేడు.

బెంగుళూరు కంటోన్మెంటు: ఆనందా బుక్‌డిపో. ఏలూరు: డి. శ్రీహరిరావు.

తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.

బెజవాడ: ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్‌పేట.

ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.

రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్ వీధి.

చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.

విజయనగరం: ఆయపిళ్ల .సూర్యనారాయణరావు

నరసాపురం: వై. సత్యనారాయణగారు.

ఖరగ్‌పూర్: పి. వి. రమణయ్య, స్టోర్సుక్లర్క్., బి. ఎన్. ఆర్ వై. వర్కు షాప్స్

కొవ్వూరు: కె. సి. చెన్న కేశవయ్యర్. గూడూరు: సి. సి. సుబ్బయ్య, మర్చంటు.

కాకినాడ: నున్నా బాలకృష్ణరావు, న్యూస్‌బాయ్ అండు కో.

అనకాపల్లి: సివాజీ న్యూస్ ఏజన్సీ.

భీమవరం: వంగల అచ్యుత రామయ్య, మేనేజరు, నెహ్రూ ఖద్దర్ స్టోర్సు.

గుడివాడ: శ్రీ శివరామ అండు కో.

తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.

అమలాపురము: పి. అన్నాజీశర్మ. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)

హిగిన్‌బాథమ్స్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.




# కాయకల్పరసము (REGD)

సకల వ్యాధులకును ఈ రసమును చుక్కల పరిమాణమున లోనికిని పైకిని యుపయోగించిన క్షణమాత్రమున అత్యద్భుతమగు గుణమిచ్చును.

1

దీనిని పైన పూయుటచేత నివారణమగు వ్యాధులు:—తలనొప్పి, పార్శ్వపు తలనొప్పి, ప్రక్క మెడ నరములు లాగుట, కంఠమాల, న్యూరాల్జియా, జలుబు, రొమ్మునొప్పి, కీళ్లవాతము, వీపునొప్పి, కీళ్లనొప్పులు, శరీరమునందే భాగమునైన తిమ్మిరి, కీళ్లు పట్టుట, నరములు చుట్టుకొనుట, నరముల వ్యాధులు, పంటినొప్పి, నడుమునొప్పి చర్మమున వాపు, తామర.

2

లోపలికి సేవించిన నివారణమగు వ్యాధులు:—విషజ్వరము, ఇన్‌ఫ్లూయంజా, ప్లేగు, మలేరియా, బోదకాలు, చలిజ్వరము మొదలైన అన్నివిధములైన జ్వరములు, గొంతునొప్పులు, రొమ్ముపడిశెము, నోటి దుర్వాసన, ఉబ్బసము, అజీర్ణము, మంద విరేచనములు, కలరా, మలబద్ధము, పిత్తాశయ ప్లీహ రోగములు, పొడిదగ్గు, కోరింతదగ్గు, పక్షవాతము, కడుపుబ్బరము, కడుపునొప్పి, మూత్రవ్యాధులు, గుండె మండుట, పిత్తవైకము, అశాంతి, పసుపుకామెలరోగము, శరీరము బడలిక, నిస్సత్తువ, నరములు సడలుట, పాండురోగము, ధాతుసంబంధమైన దుర్గుణములు, కక్కువాయి, స్త్రీలకు కలుగు ఋతుసంబంధమైన వాయువు, సూతికకట్టు, సూతికసన్నిపాతము, గుల్మము, కడుపునొప్పి, శిశువ్యాధులు మొదలైన అన్ని విధములైన దేహవ్యాధులు కాయ కల్ప రసమువల్ల నివారణమగును.

ఏ రోగమునకైనను కఠిన పథ్యము లేదు.

ఒక సీసా వెల రూ. 1-8-0. తపాలాచార్జీ ప్రత్యేకము.

# ఇండియన్ మెడికల్ వర్క్స్

ఆలందూర్ P.O. మద్రాసు. | 234 గోవిందప్పనాయక్ వీధి మద్రాసు.

కొండకోలకు, వికసితోత్పలశీర్షిక. కవి మ-రా-రా-శ్రీ కవికొండల వెంకటరావుగారి

విరచనములు అచ్చుపడినవి.

తగ్గింపు వెలలు

# అభినవాంధ్ర కార్యస్థాన సుప్రకాశితములు

| పుస్తకము ప్రతి 1-కి | అసలు వెల | | | తగ్గింపువెల | | |
|---|---|---|---|---|---|---|
| 1. మాతృదేశ సంకీర్తనము | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 2. కలరుతము | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 3. జనపదములు | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 4. కుమారకంఠము | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 5. చదువులదుత్త | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 6. ప్రకృతిచందనము | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 7. కోసేరు | 0 | 4 | 0 | 0 | 1 | 0 |
| 8. చిట్టికత | 0 | 6 | 0 | 0 | 1 | 0 |
| 9. ఆత్మవ్యక్తి | 0 | 8 | 0 | 0 | 6 | 0 |
| 10. పొట్టికథ | 0 | 8 | 0 | 0 | 6 | 0 |
| 11. అగడపలు | 0 | 8 | 0 | 0 | 6 | 0 |
| 12. విప్రసందేశము | 1 | 0 | 0 | 0 | 10 | 0 |
| 13. జంటలు | 1 | 0 | 0 | 0 | 10 | 0 |
| 14. త్రయి | 0 | 14 | 0 | 0 | 10 | 0 |
| | 6 | 8 | 0 | 3 | 8 | 0 |

## విశేషగమనిక

రూపాయకు తక్కువ అయిన ఆర్డర్లు అంగీకరింపబడవు. సొమ్ము ముందుగ మనియార్డరు చేసినయెడల కొనుక్కొనువారికి తపాలఖర్చులు తగులవు. మొత్తము సెట్టువంతను నొకేవరి తీసికొనువారికి సెట్టంతయు మూడురూపాయలు మాత్రమే. మొదటి నాలుగుపుస్తకములలో నే వానిలోనైనను వందపుస్తకము లొకేవరి తీసుకొనువారికి ఆ వందపుస్తకముల ఖరీదు అయిదు రూపాయలు మాత్రమే. త్వరపడుడు. కొన్నికొన్ని కొలది ప్రతులుమాత్రమే కలవు.

వలసినచో

కవికొండల వెంకటరావుగారు, బి. ఎ. బి. ఎల్.,

ఇన్నీసుపేట, రాజమండ్రి, అని వ్రాయవలెను.




# పాశ్చాత్యస్త్రీలు–వారి అభివృద్ధి

విక్టోరియా మహారాణి కాలమునాటి కంటె యిప్పటికి పాశ్చాత్య సుందరీమణుల స్వాతంత్ర్యము వేయిరెట్లు హెచ్చినదని చెప్పవలెను. ఆకాలమున విశ్వవిద్యాలయ ద్వారములు, ఉన్నతాధ్యాపకాచార్యకత్వ మార్గములు, ఉత్తమోద్యోగముల తెరవులు, శాస్త్రరహస్య పరిశోధనామందిరముల తలుపులు వారికి తెరవక మూసిపెట్టియే యుంచిరట. ఇప్పుడట్టి వెలుతులన్నియు తీరినవి. ఊడివుడిగి, కినిసిపెనగి మానవుడట్టి మార్గములన్నియు స్త్రీలకై తెరచినాడు; మానవతులందరు నేడు వానిలో విహరించుచు పురుషులకు దిగ్భ్రమ గలిగించుచున్నారు. వారట్టి ఆదర్శప్రాయమైన పోరాటము పురుషులతో సలిపి, ఆదర్శప్రాయమైన హక్కుల బడసి, ఆదర్శప్రాయమైన జీవనముల నడపుచుండుటచేతనే, భారతదేశపు మహిళామణుల భారము లనేకము తగ్గి, అట్టి హక్కులు సౌకర్యములు మొదలగు వానికొరకు వారట్టి ఘోరసమరము లొనర్పకుండనే ప్రభుత్వమువారును ప్రజానాయకులును గూడ వారికి లొంగి విజయవిభూషితుల నొనరించుచున్నారు.

అయితే ఇట్టి రాజకీయ స్వాతంత్ర్యములు, ఆర్థికహక్కులు, విహారస్వేచ్ఛలు, మొదలైనవి లభ్యమైనతోడనే సరేయా, ఆపైని వారికి కావలసిన దింకేమైనయున్నదా యనునదొక చిన్నప్రశ్న. అనగా యీ స్వాతంత్ర్య సౌకర్యములన్నియు ఆమెను సౌఖ్య సౌధాగ్రభాగమున ఆనందడోలికలో నూగులాడ చేయగలుగునా, లేక యింతకష్టపడి, యింత పోరాట సలిపి, యిట్టి సౌకర్యములు బడ

సీనను వారిదుఃఖములు అజ్ఞానములు మౌఢ్య లగునవి యెప్పటియట్లనో అంతకంటె ఘోరముగనో ఉన్నవా ? వారిజీవితాశయములు ఈ రాజకీయాది హక్కులతో పూర్తియగుచున్నవా లేక యింతకంటె నధికముగా వేఱేమైన గలవా ?

సర్. రాధాకృష్ణనుగారు కలకత్తాలో జరిగిన అఖిలభారత మహిళాసభాసమక్షమున నుపన్యసించుచు పై ప్రశ్నల కొకరీతి సమాధానమిచ్చినారు. ఇట్టి హక్కులు తప్పక స్త్రీలోకమునకు పురుషులతో సమానముగా నుండవలసినవేయైనప్పటికిని, ఇట్టి హక్కులను మాత్రము బడసి సంతుష్టులగుచున్న దేశముల స్త్రీలు ఎన్నో సొగసులలోను వియ్యామ్మణలలోను గోటులలోను తూలుచు యిరువది రెండేండ్ల వయస్సుకే ప్రపంచము సర్వమెఱిగి, అనుభవించలేక విసుగుగొని యేడ్చుచున్నారు. వారికి డబ్బు, దర్జా, పాట, ఆట అన్నీ హెచ్చుగానేయున్నవి. వానితో యేమిచేయుటయో వారికి తెలియకుండా వున్నది. ఇట్టి శుష్కషోకులను ఇంకా మఱి యింకా సంపాదించుకొని పోసీసుకొందామని ఒకరితోనొకరు పోటీచేయుచు, గెలుచుచు ఓడుచు, లేచుచు పడుచు, నవ్వుచు యేడ్చుచు, వీటికి కారణములైన వారిని పొగడుచు తిట్టుచు పత్రికలలో నవ్వుచు యేకుచు కాలమల్ల యిట్టిఅల్లతల్లడములో పడి వగచుచున్నారు. ప్రొద్దెల్లయు వారికి శరీరసౌందర్యాదుల పోషణములోనే గడచుచున్నది. సంఘములోకి బహిరంగముగా పోతే అదంతా ఒకకృత్రిమపుటాటయై విసుగు పుట్టించి దుఃఖమును కలిగించుచున్నది. అది కాస్త తప్పుకోగలిగి యేకాంతమంటూ యెక్కడైనావుండి అక్కడకు పోగలిగితే, విచారపూరితమైన భావములు డెందమును కలంచి తమ్మణచివేయుచుండును. పేరులేని విచారమొండు ఆధీరలనెల్ల కలంచి తీరులేని ప్రేలాపనలను ప్రేలించుచుండును. అదియేమిటో యెట్టిదో తెలుసుకొనగోరుచో పాశ్చాత్యసాంఘిక నవలలు, నాటకములు, సినిమాలు, టాకీలు, అందలి నటకులు, పాత్రలు, కవులు మొదలగురంగములను చూచిన కొంత విశదముకాగలదు. అదంతయు దుఃఖపూరితుడగు పిచ్చివాని చరిత్రలు చర్యలువలె అర్థవిహీనమై డెందమునకు రోత గొలుపుచుండును. ఇదంతయు వారి స్వాతంత్ర్యముల ఫలము, దీనిని వారు విసర్జింపలేరు, విసర్జింపనొల్లరు, పైగా సర్వప్రపంచమున నిట్టిభావములు బొమ్మలు వెదజల్లి వారినికూడా పాడుచేయుచున్నారు. ఇవి యెల్లయు పట్టిదురాశయములై వాటిదుష్ఫలితములను తామనుభవించుచున్నను, సదాశయములని ప్రతీ పత్రికయందు, గోడలకంటించు బొమ్మలయందు, యెక్కడ పడితే అక్కడ ప్రకటించుచు ప్రాచ్యదేశపు టమాయికులఁగూడ 'సరస' యను పేరిటి మంత్రకత్తెవలె తమవలలోనికి లాగుచు పాడుచేయుచున్నారు. ఆదేశములలో స్వాతంత్ర్యమను పేర ప్రతీ వ్యక్తియు తన యిచ్చవచ్చినది చదివి, యిచ్చవచ్చినది చూచి, చేసి, విహ

రించి నవ్వు చుండవచ్చును. వద్దనిచెప్పితే విను వారులేరు, చెప్పకోరగల మగవారులేరు. అథవా యే కేథలిక్కు మిషనరీలలాంటివాళ్లో చెప్పబూనుకుంటే వాళ్లవంటినుంచి మతము వాసన, దేముడుకుళ్లు ప్రాచీనకాలపుకంపు ముక్కుకు కొట్టుటచేత కాబోలు వెంటనే కోటినాలుకలుకలములు పేటలనిండా వాటిని ప్రేలి ఖండించి పత్రికలనిండా చెరిగివేయక మానవు. ఇంతకంటె కొన్ని సాంఘికమర్యాదలు మతాచారములు మొదలగువానిచే వ్యక్తులెల్లరును కట్టియుండబడినపూర్వకాలమే నయమని రాధాకృష్ణనుగారు చెప్పినారు—స్వాతంత్ర్యము పేరిట పాశ్చాత్య స్త్రీ మర్యాదలనుండి సూత్రములనుండి తెగతెంపు చేసుకొని వచ్చేసి తమతమ క్షుద్రతరచిత్తవృత్తులకు దాసానుదాసులై అహంకార సౌధాగ్రమున విఱ్ఱవీగుచు జ్ఞానకళయని ప్రపంచమునకు అచ్చులద్వారా పత్రికల ద్వారా బలవంతముగా బోధన చేయుచున్నారు.

ఇట్టి అభివృద్ధిని బడసిన పాశ్చాత్యులు తక్కిన పేదలను ప్రాచ్యులను మొదలైన వారి నుద్ధరించుటకు సంఘాలేర్పరస్తున్నారు, చందా లిస్తున్నారు, వసూలు చేస్తున్నారు, లిస్టులు వ్రాస్తున్నారు. ఇందులోవారికి విసుగు లేదు విరామములేదు. ఇదికూడా యించుమించు పైపిచ్చులలాటి పిచ్చే. అది కొందరికి, ఇది మరికొందరికిగా ఉన్నవి. సంఘసేవ సంఘసేవ అని కేకలువేసి లెచ్చర్లిచ్చి దయాపూర్వకమైన చందాలు కొందరు కురిపించగానే సంఘమునకు నిజమైనసేవకాదు. ప్రస్తుతము ఊరుకు రెండుమూడు, జిల్లాతాలూకా రాష్ట్రాలు కొకొక్కటి, అఖిలప్రపంచమున కొకటి సేవాసంఘాలు స్థాపించి అందులో అందరము సభ్యులుగాచేరి చందాలుచెల్లించి, రిపోర్టులు ప్రచురించి సంఘసేవ కాగ్రగణ్యులముగా మనలను మనము పరిగణించుకొనుచున్నాము. వీధులలో ముష్టియెత్తుకొంటున్న వాళ్లకు యిళ్లలోను కచేరీలలోను కుళ్లేవాళ్లకంటె యెక్కువ సంఘసేవ కావాలని యీ సంఘాలవుద్దేశ్యము. డబ్బుపారేస్తే సంఘసేవ అయిపోతుందని వీరు నిశ్చయించి ఒకొక్కజాతి కష్టాని కొకొక్కయెత్తు డబ్బు క్రుమ్మరించుచుందురు. డబ్బు లేని వాడు ఆఖరుకు సంఘసేవకూడా చేయలేడు. పూంజీదారులువచ్చి ప్రపంచమును నిర్ధనముచేసినారు. ధనములేకుంటే సంఘసేవైనా చేయలేము. వారికష్టములకు రాత్రింపగల్లు పరితపించి వారితో కలిసి వారి దుఃఖవిదారణోపాయముల నాలోచించగల ఓర్పు యీ సేవకులకు లేదు. ప్రపంచముయొక్క స్థితి సంపూర్ణముగ మారనిదే వారిదుఃఖములు తొలగివు. వారిదుఃఖములుతొలగవలెనంటే, ప్రపంచకస్థితి సంపూర్ణముగ మారవలెనంటే, స్త్రీ పురుషులు స్వాతంత్ర్యమనుపేరట చరలాడుచున్న యీ భోగలాలసత్వమునకు, విలాసపరత్వమునకు, శుష్కవిద్యాప్రియత్వమునకు, ధనరాసులను సంపాదించు తలంపులకు స్వస్తిచెప్పి శాంతి, సంతుష్టి, స్వవిమర్శన, సఖ్యము మొదలగు సుగుణముల

వభ్యాసపరచుకొనక తీరదు. పాశ్చాత్యదేశములో వనితామణులు పొందిన స్వాతంత్ర్యమువల్ల, పై చెప్పిన సుగుణముల ప్రచారమునకు వారెంత ప్రయాసపడుచున్నారో చూచినచో తెలియగలదు.

పట్టణములను విడువక, కుటీరపరిశ్రమలకు పూనక, యంత్రాలలో కూలిపనిలో నలుగుతూ, నీతిమార్గములయందు గౌరవములేక, హాలీ వుడ్డు ప్రతిష్ఠయొక్కటే స్త్రీజన్మకు కీర్తిదాయకమనుకొంటున్నవాళ్లు పాశ్చాత్య పురుషులస్థితివలె స్త్రీలస్థితియు పైకెంత దగ్గాగా బలముగా గొప్పగా కనిపించినను లోలోపుల హేయమానము కాకపోదు. పైవారెంతమందిమీదికైనను తిరగబడి పైపై స్వాతంత్ర్యమును తెచ్చుకొని విఱ్ఱవీగడము పాశ్చాత్యులకు మనకంటె సులభము. ఇట్టి స్వాతంత్ర్యము వారిని దుర్లక్షణములకును అహంకారమునకును స్వాధీనము చేసి అట్టి వెల్లయు విజ్ఞానపరంపరలవలె వారి కండ్లముందు తాండవమాడఁజేయును. చిత్తవృత్తియొకటి యుండుననియు దానిని స్వాధీనములోనుంచుకొని ప్రభుత్వము చేయవలసిన బాధ్యత మానవునిపై గలదనియు వారి తత్వములలో లేదు, బడులలో చెప్పరు. వారికి నిజముగా అట్టితత్వముగాని చింతనగాని కలలోనైన బొడమునేని, దానికి విఘ్నము చేయగల ఇట్టిబహిర్నాగరకతా విలాసములను వారు సృష్టించకుండియుందురు, మరియును సృష్టించలేకుందురేమో! మనదేశములోకూడ నాగరకత, స్వాతంత్ర్యము, విద్యా విధానము సమస్తము తెల్లజాతులయడుగు జాడలనడచుచున్నవి. అయితే మనతత్వములోమాత్రము ఇంద్రియ నిగ్రహము, ఆత్మజ్ఞానము మొదలగు వాసనలుపట్టియున్నవి. వానినూతగొని మనము పాశ్చాత్యనాగరకతావిలాసపరాయణత్వమును నిర్జించుదుమో, లేక దానినాధారము చేసి కీర్తించి పాడుకొనుచు ఆత్మవిక్రయ మొనర్చుకొందుమో తేలవలసియున్నది. రాధాకృష్ణుని యుపన్యాసము భారతమహిళామణుల కర్ణగోళముల ప్రతిధ్వనించుచు తమ కర్తవ్యతను వినిపించుచున్నది.

# స్త్రీవిద్య—సాధన

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఎం.ఏ; బి.ఎల్.

నిండుగుండెఁగలవ్యక్తి ప్రపంచముపై పులుగువలె వ్రాలు దుస్థితిని మాచి కటకటంబడును. గట్టిమెదడును మాత్రము కలిగి దీర్ఘయోచనలందే దినములుకడుపు నాతఁడు విచలితచిత్తుడు కాక జోద్యము చూచుచుండును. కలహవాతావరణముతో నిండిన అధునాతననాగరకతను, దురంతదుఃఖప్లావితమైన అర్వాచీన మానవజీవనమును నేఁడెందఱో చోద్యములు మాచినట్లు చూచుచున్నారు.

శాంతినిగురించి కొంతసందడి లేకపోలేదు. కాని కన్ను ఫిరంగులనుండి తొలఁగిపోలేదు. నానాజాతిసమితి (League of Nations) నుండి సుఖశాంతులు వెల్లివిరియునని ఎవ్వరును ఆశపడుటలేదు. సమస్తభూవలయమున శాంతిపాఠమును బోధింపనెంచి కొంతకాలమునకుమున్ను బర్మానుండి కొందఱు బౌద్ధసన్యాసులు పయనమైరి. ఈ భిక్షుల యుద్దేశము మహత్తరమైనదే! కాని వీరు నాటనెంచిన శాంతిబీజమునకు మానసములనొడ్డు పుణ్యాత్ము లెవరు?

శాంతిస్థాపనమునకై పల్వురు తనువులను తుచ్ఛమొనరింప సంసిద్ధులు కారేని, ఆ యుత్కృష్టాశయము గగనకుసుమమగునని రమారమి రెండేండ్లకుమున్ను జినీవాలో రాధాకృష్ణుడనినాఁడు (Unless individuals arise in every State — men who are prepared to suffer and be mauled to the earth for the sake of Peace we shall not get nearer the goal.) సంపూర్ణఆంతరంగికపరివర్తనమువలనఁ గాని శాంతిచేకుఱదు. ఈ మార్పును జనింపజేయు శక్తి యెందుండివచ్చును? "ఉత్తమాశయముల నారాధించువారి కడనుండి,—హృదయముగలవారి కడనుండి" అని యుత్తరమొసఁగఁజాలుదుము.

హృదయసంపద స్త్రీలకు మెండుగ నుండును. రాజకీయములందును, సాంఘికరంగములందును నేఁడు వీరు ముందంజవేయుచున్నారు. అన్ని క్రియారంగములందు పురుషులతో సమముగ తాము హక్కుల నందవలెనని వీరు కంఠమెత్తి పలుకుచున్నారు. హక్కులకును బాధ్యతలకును అవినాభావసంబంధము కలదని న్యాయశాస్త్రము (jurisprudence) తెలుపుచున్నది. బాధ్యతలకు స్వస్తిచెప్పి హక్కులనే చేఁబట్టఁ గాంక్షించు పురుషులసంఖ్య అధికమైయుండుటచే నెన్నో ప్రతికూలపరిస్థితులు విజృంభించుచున్నవి. గురుగుణములకు పుష్పాంజలియిచ్చి వ్రతములు నెఱపుచుందురు గాన, స్త్రీలు వీరికి చక్కనిబాట చూపఁజాలుదురు.

భారతపురాణములందును, చరిత్రములందును స్త్రీ మహత్త్వము వర్ణింపబడిన తీఱును పలువు రెఱుఁగుదురు. "నమాతుఃపరదైవతమ్" "మాతృదేవోభవ" మున్నగు నుడువులు గభీరభావసమన్వితములు. ఒక్కొకపుడు పురుషునందు నేరములు గోచరించినను, స్త్రీ మహత్త్వము ఆకాశప్రదీపమువలెను వెలింగెను. తానొకప్పు డందిన ఉన్నతినే తన పరమాశయముగా నెంచి, దాని నందుటకై స్త్రీశక్తి వంచనలేక ప్రయత్నించవలెను. * పురుషుఁడుచేయు ఘనకార్యములందును, ఆతఁ డెదుర్కొను అపాయములందును తనకు సమానభాగము కలదని స్త్రీవాదించునని నాఁడును, నేఁడునుకూడ (vide: Rabindra

* కవీన్ద్రసతి యేమనెనో పరికింపుఁడు: "The ideal for woman was not to rise to man's height but to her own height."

**Nath Tagore's "Chitra")** మన సాహితి తెలుపుచున్నది. ఈయుపాయముల నెట్టించుట కామె చేయువెరవులు లేయుననుట కన్నిని దృష్టాంతములున్నవి. సేవాధర్మము నెఱపవలయు చోటులందపుడును స్త్రీ నిలిచియున్నది. దేవివలె నీమె కట్టెమటఁ దోఁచినపు డెన్నని బాధలు పటాపంచలైనవి. నైటింగేల్ కన్యసలిపిన సేవాధర్మము జగద్విదితము. కడచిన ఐరోపా మహాసంగ్రామమున పురుషులు శరీరములను తునకతునకలు చేసికొనినపుడు స్త్రీలు వారికి వివిధోపచారములు గొలిపెడివారు. ఉత్తమాశయముల నొక్కొకపుడు గుర్తింపక గులకరాళ్లనట్లు పురుషులు వానిని గిరవాటువేసిన వేళలందు వానికి మానసములనొగ్గి అద్భుతఆధ్యాత్మిక శక్తినంది మానవపురోభివృద్ధికి వారుతోడ్పడిరి. ఇట్టి పవిత్రధర్మనిర్వహణమునకు అధునాతన వసుమతీ పరిస్థితులందు అనివార్యమైన తరుణ మాసన్నమైనది. రోంప తగులబడుచుండ నెవ్వరైన గీతగోవిందములు పాడనెంతురా? దురంతదురితోత్కట బాధలు ఘోరవిభీకర పైశాచిక నృత్యమొనరించుచుండ నెవ్వరైన చెండ్లాటకు దొరఁకొందురా? దురదృష్టము! అట్లు పాడువారును, ఇట్లాడువారును నేఁడు గోచరించుచున్నారు. మనతల్లులును, సోదరీమణులును ఈ వికృతనృత్యమును మాపొనరింప నడుముఁగట్టిరేని, వీరి సేవయందలి మహత్త్వమును గుర్తించి, వీరి గురుగంభీర దృష్టాంతమును మేలు బంతిచేసికొని పురుషులు సముంచితమైన ఆంతరంగికపరివర్తన మందెదరు. అట్లందిన నాఁడు మనుష్యసంఘమున భుగుల్భుగుల్మను పొగలను అంతరించును. ఏయుగమందును, ఏసీమయందును పిశాచమునకు నెగ్గుదలలేదు. కాలక్రమమున జయపతాక మెత్తఁగలుగునది సదాశయముగాని కుత్సితంపుతలంపు కాదు.

ప్రతిసీమయందును స్త్రీలు నేఁడు ఓటుకొఱకును, రాజకీయములందలి '*Franchise*' కొఱకును కృషి సలుపుచున్నారు. యశస్విలకుఁడు రోమెరోలండు తెలిపిన **"Enfranchisement of the soul"** కొఱకై,- మానవసంఘమందలి ఆత్మయొక్క ముక్తికై కూడ వీరు పాటుపడిరేని నేఁటి యరిష్టములన్నియు నంతరించి నైతికపరిణామము నక్షత్రగోళమువలె మహిమోపేతమైనదని షోపెన్‌హేరను పాశ్చాత్యతాత్త్వికుఁడనెను. ఇట్టియద్భుత నైతికపరిణామమును తేజాలువారు స్త్రీలు. వీరి కృషికి తన కారుమబ్బులో నిండియున్న నేఁటివసుంధర నక్షత్రశోభను గనఁజాలునని నాయాశ.

ఈయుత్కృష్టాశయ సిద్ధికి ఎంతేని సాధన మావశ్యకమైయున్నది. ఈసాధన మొక్కసనమున పట్టుబడదు. దీని నలవఱచు విద్యావిధానము నేఁడు నెలకొన కొనవలెను.

# అనసూయ

శ్రీమతి చర్ల నగరాజకుమారిగారు

ఆమె లోకమ్ములందు మహాపతివ్రతాశిరోమణి, భర్తృపాదారవింద
సంతతధ్యానమానస. సర్వదా తపః ప్రభాఢ్యాత్రిముని సుతపః ఫలంబు.

మనమున కల్మషంబనెడు మాటనెరుంగదు నెట్టివేళలన్
వినయము భర్తృసేవనము విప్రసపర్యయు పాంథపూజయున్
తనకొక వర్తనంబుగను ధర్మపుబుద్ధిచరించు నెప్పుడున్
మునిజనకామినీమణులు మోదముతో తనుగొల్చుచుండగన్

ఎట్టియిబ్బందులొదవిన నెట్టిసంకటసమయంబులు దటికొన్న నెనకమొసగ
స్వీయభర్తృపూజన మాలసించెరుగదు. పతియె తనకు దైవంబంచు భావమాదు,
లెక్కసేయదు బ్రహ్మగౌరీశశ్రీశు లనయినను. తనభర్తయే ఘనుడటంచు
నాడినదియాటపాడిన యద్దిపాట యగుచు సాంసార, స్వీయవాక్యమ్మజగతి
రాజిలు నిరంతరమ్ము విభ్రాజియగుచు. మూడులోకమ్ములందు నీ ముదితకీడు
నెవ్వరును లేరనుచు బల్కనెసగు, బిట్టు భర్తృనామమంత్ర జపవిభ్రాజమాన
పాతివ్రత్యతపోవైభవాఢ్యయగుచు. సూర్యచంద్రులామెసువచస్సునకు భయము
పడెదరట. వాయువాతనిపనికిజంకు నట. త్రిలోకములామెకు నడుగుమడుగు
లొత్తునట భయభక్తి ప్రపత్తివలన. వసుధపతివ్రతకొగి భయపడనిదేది?

అవనినీదుమహత్వము నరయగోరి
వచ్చినట్టిత్రిమూర్తుల పాతివ్రత్య
మహిమపసికందులనుజేసి మహిమజూపి
నట్టి పతివ్రతారాజ్ఞి! మదంబ నీమ
హత్వమునకివెనాదు జోహారులమ్మ!

నిరతము స్వీయభర్తృపదనీరజముల్ మది నమ్మి ప్రేమతో
పరిణతమైనభక్తితో శుభావహపుష్పసముచ్చయంబుతో
గరమనురక్తిగొల్చు నలకంజదళాక్షితో సామ్యమొందగా
హరిహరపద్మగర్భులకునైన దరంబెధరాతలంబునన్.

# గృహోద్ధరణమే దేశోద్ధరణము

శ్రీ దువ్వూరి రామచంద్రయ్యగారు బి. యే.,

౧.

"చెప్పకుండా లేకుండా వచ్చారే"

"..............."

"ఏం ? మిమ్మల్నే ?"

"..............."

"కాఫీ చల్లారిపోతుందేమో లేవా ?"

"ఊ.............."

"ఇంత దీర్ఘాలోచనేమిటో. కొంపదీసి కొత్త రిట్రెంచిమెంటు ఏమీ లేదుగదా ! మరి ఆఫీసులో చీవా-

"

"పోనివ్వండి ఇదో కాఫీ చల్లారిపోతుంది"

రమణరావు బల్లపైనుంచమని వ్రేలితో జూపెను.

"పైకు పోతారా ? మూగవేషమేమిటి ?"

"..............."

"ఇంట్లో పని చూచుకోనా"

"ఊ.............."

"ఈజబ్బుకు మందు నావద్ద ఉందిలెండి !"

౨

మందమలయానిలుడు గోదావరీతీరమునకు సాయం సమయమున వాహ్యాళికై జనుదెంచినవారిని సహజ శీతలములగు పిల్లతెమ్మెరలచే నాహ్వానించు చున్నాడు. విచారమునకు చోటులేని యాసమయ మున రమణరావుముఖముపై విచార సూచిక దోచు చునే యున్నది.

"ఓహో ! రమణరావుగారూ ఒంటరిగ కూర్చు న్నారేమి ? ఏదో దీర్ఘాలోచన—కాదు విచారమే యున్నట్లు గన్పట్టుచున్నదే అని ప్రసాదరావు ప్రక్కన ఇసుకలో గూర్చుండెను.

"ప్రసాదరావా ! మంచివేళకే వచ్చితివి. నిన్ను గలసికొనవలయుననియే యుంటిని."

"విశేషములేమైన—"

"లేకుండునా !"

"అదియేనా దీర్ఘముగా నాలోచించుచున్నావు ?"

"అవును. నిన్న నీతో జెప్పితినిగదా ? మహాత్మ గాంధిగారి యుద్యమమంతయు గ్రామోద్ధరణపై కేంద్రీ కరించబడియున్నది. ఆరోగ్యవిషయములను స్వదేశ మునయున్న వస్తువులనే సర్వత్ర నుపయోగించు మార్గ ములను, ఒకటి రెండననేల వేయిసంగతులను జెప్ప వచ్చును. కాని వానియాచరణ సులభమని నీకు దోచుచున్నదా ?"

"కాకేమి ? నీవంటి యువ్వనులు నిరాపేక్షతో కార్యదీక్షతో జేసిచూపిన నది దుస్సాధ్య మెందుల కగును ?"

"ముందంజవేసి చేసిచూపుచున్నను, ఆసమయ మునకు ప్రజలు తమ కర్తవ్యములను గ్రహించి తరువాత కొనసాగించడములో మందతను గన్పింప జేయు చున్నారు. సర్వదా ఇతరులు వారి వంతనుండి వారికి నేర్ప సాధ్యముగాదు. అదియునుగాక వారికర్తవ్య ములు వారెఱుంగనిచో ప్రయోజనముండదు."

"ఐన నీయుద్దేశ్య మెయ్యది ?"

"ప్రతిఇల్లు బాగుపడిన గ్రామోద్ధరణ, దేశోద్ధరణ జరుగును. తమ గృహమును సర్వవిధముల అభివృద్ధికి

తెచ్చుటకు పురుషునికన్న స్త్రీ లెక్కువ సమర్థులు. ఈవిషయమున చీనా జపానుదేశముల జూడు? ఎంత యభివృద్ధికి వచ్చినవో? కాని వారి బుద్ధులకిది సులభముగ నెక్కునదిగాదు."

"ఎక్కించవలయును"

"అదియె నాయాలోచన" మొదట మాయింట నుండియే ప్రయత్నింపవలనని కోరిక!

"మాచెల్లెలు కమల యీవిషయమునందు చాల తెలివైనదే సుమా? నీవొకటిచెప్పిన నూరుగా చేయ గలదుగదా! మరి సంశయమెందుకు? ప్రయత్నించుము."

"సరి. మబ్బుగుచున్నది. వెళ్లుదమా" అని యిరువురులేచి గృహోన్ముఖులైరి.

3

రమణరావు బెజవాడయందు సాధారణ గృహస్థుడు. స్వాతంత్ర్యపిపాసచే శాంతిసమరమున బాల్గొని ఆంధ్రదేశమునందంతయు తిరిగి ప్రచారములొనరించి శ్రీకృష్ణ జన్మస్థానమున రెండేండ్లుజరిపిన యోధుడు. కాని తదనంతరము ఉద్యమమునందు కొంచము కొంచ మప నమ్మకపడుచు వృథాగా కష్టపడితినిగదా స్వరాజ్యము కొంచమైన మాటగట్టుకొనక పోయితిని గదా యని ముక్కువారిలో జేరినవాడు. అదియు గూడ సహనములేని సహవాసదోషమే. ఇట్లుండ మహాత్ములవారి గ్రామోద్ధరణ ప్రణాళిక చెవినిబడిన నాటినుండి హృదయమున నెచటనో యడగియున్న దేశభక్తి మరల మొలకెత్తినది. గ్రామోద్ధరణకొఱ కెన్నియోవిధముల ప్రయత్నించుచున్నాడు. నాయకుల సలహాలను పొందుచున్నాడు. కాని యెక్కువ ఫలము త్వరలో గల్గునను సూచన లాతనికి తోచుట లేదు. పైగా తాను గూఢముగ జేయుచున్నది గిట్టదని తెలియవచ్చినది. ప్రభుత్వమువారినుండి తుదకు అతికష్టముతో సంపాదించిన తన ఉద్యోగముగూడ వదలుకొనవలయునేమో యను శంక గల్గినది. అంటే వీడుటకు ఆతనికి కష్టముగాదు గాని, ఉద్యోగములేక, దేశసేవయులేక ఊరకుండు టాతని కిష్టములేదు. అయితే మాపాఠకలోకమునకు "శాంతిసమరసైనికుడగు నాతడుద్యోగ మెట్లుస్వీకరించె"నని సందేహముగల్గవచ్చును. అట్లు జేసినవారు పెక్కుమంది గలరు. ఉడుకారిన తరువాత ఉద్యమమునే దూషించువారుగూడ గలరు. వారిలో నాతడు జేరడుగాని, జేసిన గౌరవముగ నుద్యోగముజేసి సంసారముజేయవలె, లేకున్న దేశసేవ జేయవలయుననువారిలో నొకడు. ఈత్రోవ విచిత్రమైనదేగాని, యట్టి విచిత్రవ్యక్తులు చాలమందిగలరు.

కమలాదేవి ఆయనభార్య ముల్లోకముల మోహింపజేయు రూపవతిగాకున్నను రూపమునకొఱతయని ఎంత కొంచము భావకవియైనను వచింపజాలడు. రూపమునకుతగిన గుణము గుణమునకుతగిన విద్య. కాపురమునకువచ్చి మూడేండ్లయినది. భర్తయన్న పరమప్రేమయే గాని ఆయన విచిత్రవ్యాపారము లామెకుగిట్టవు. దేశమునకై యొకమారు త్యాగమొనర్చినవారు తమ జీవితమునందంతయు నింద్రపదవినిగూడ లెక్కపెట్టక దేశసేవకై వినియోగింపవలయుననియు, చేతగానిచో చచ్చుపెద్దమ్మలై పడియుండవలయుననియు, యొకదానినుండి వేరొకటికి పరివర్తన పనికిరాదనియు ఆమె యూహ. అందుచేతనే రమణరావునకు మాటపోటులపుడపుడు ప్రేమపదునులోగూడ తాకుచుండును. కొన్నిదినములనుండి రమణరావును పీడించుచున్న సమస్య యామెకు చక్కగ దెలియును. తత్పరిష్కారమునుగూర్చి యాతనికి దెలుపవలయుననియే యున్నది. తుదకీదినము చెప్పవలయునని నిర్ణయించినది.

౪

"ఓహో! దేవిగారేమో ఆలోచించునట్లున్నదే"

"    "

"అబ్బ అంత దీర్ఘాలోచనా"

"..............."

"వినపడదా! లేక కో—"

"..............."

"ఎప్పడినుండి ఈమూగతనము"

"..............."

"యేమిటో మేముకూడ తెలిసికోకూడదా నీఆలోచన, కొంచం చెప్పదూ."

"ఏమి కమలా! మాట్లాడవు. నిద్రా యేమి తొమ్మిదిఘంటలకే."

"ఊఁ..............."

"మూగవేషం వేశావే"

"నీవునేర్పినవిద్యయే నీరజాక్ష."

"ఎత్తుకు పైయెత్తా! ఏమిటో చెబుదూ! విసిగించక"

"మీరుచెప్పారా సాయంత్రము?"

"ఓహో! అదా! ఏమిటో ఆలోచిస్తుంటివి."

"నేగూడా ఆలోచిస్తూనే యున్నాను."

"చెప్పమంటూంటే!!

"మీరు చెప్పండి మొదట."

"ఊఁ, విను. గ్రామోద్ధరణలో ఫలితం త్వరగా గనపడవలయునంటే స్త్రీలు తమయింటిని మొదట ఉద్ధరించుకోవాలి—"

"అవును. పురుషులు చేతగానివారైతే."

"ఆ. ఆ. ఏమన్నావు. చేతగాకకాదు, స్త్రీలు గూడ వారికెక్కువ సాయపడాలి."

"సాయపడకేం జేస్తున్నారు. కాని పురుషులకు పట్టుదలేదే! నాన్ కోఆపరేషనులో కొన్నిదినములు మహావీరులవలె పనిజేసి ధనమానప్రాణములకు లెక్కింపక పాటువడి తరువాత ఆయుద్యమమందు నమ్మకమువీడి, తిరిగి కన్నవారి కాళ్లుపట్టి ఉద్యోగం సంపాదించి మరల గ్రామోద్ధరణయట. రేపుదయమున మరేయుద్ధరణకు బయలుదేరుతారో నమ్మకమేమున్నది."

"చతురురాలి చీవాట్లుచాలు. ఇంతకుమునుపు జేసినదానినిగూర్చి త్రవ్వకుము. ఇకపై యుద్దేశ్యములు మార్చక పాటుబడెదను."

"సరే అట్లేగానివ్వండి. ఇపుడేమి జేయదలచితిరి?"

"నీవు నేటి సర్వవిషయములను చదువుచున్న దానవుగదా! మనస్నేహము ఆదర్శప్రాయముగా జేయుట కెట్టిపద్ధతి యవలంబింపబడవలయునో తెలియక ఆలోచిస్తున్నా."

"మీకు దెలియదని ఒప్పుకొంటిరి. సరి. నేను చెప్పెద వినండి:"

"నీ కామాక్షము దెలిసేనా ఊరకున్నావు."

"తెలిసినంతమాత్రమున గంతులు వేయవలయునా? ఒకగృహ మాదర్శప్రాయముగ నుండవలయునన్న యింటనుండువారి దినచర్యయం దెక్కువ మార్పు గలుగవలయును."

"ఏమిటది. కాఫీకి వేసినయెత్తా."

"అవసర మెందుకండి! ఆరోగ్యప్రదమగుసూర్యోదయమునకుముందే లేచి కాలకృత్యముల నిర్వర్తించి"

"కాఫీ త్రాగి—"

"కాఫీ టీ వగైరా పానీయములను తుదముట్టింపవలయును. ప్రాణమానములను లెక్కింపక దేశసేవకై తెగించువారుకూడ కాఫీ మొదలగువానిని త్యజింపకుండుట హేయము. మిమ్ముజూచియే మేమును నేర్చుకొంటిమి. కాని మేము చక్కబడి మిమ్ము చక్కజేయగలము. అట్టి సదుద్దేశ్యముతోడనే, ఆంధ్ర సోదరీమణు లింకమీదట యీ రీతి తప్పకవర్తింతురని నమ్మకముచేతనే యిటుల నుడువ సాహసించుచున్నాను."

"కాఫీకి స్వస్తి జెప్పితిరి. తరువాత—"

# గృహోద్ధరణమే దేశోద్ధరణము

"చేతగాని సోమరులవలె యెనిమిది గంటలవఱకు నిద్రింపక, లేచినంతనే యితరులు పనిజేయలేదని వారిపై నధికారము వహింపక సర్వము నేనే గావించుకొందును. సర్వేశ్వరుఁడు ఆరోగ్యమగు శరీరము నిచ్చియుండ, యితరులచే బనిజేయించి ఆరోగ్యమును, అర్థమును నష్టపరచుకొననేల?

"కమలా! కోమలమగు శరీరము ఉదయము నుండియు పనిజేసిన నలసిపోదా!"

"అబ్బ! ఎంతదయో? ఇట్లే మగవారు స్త్రీలు దుర్బలులగుటకు మార్గములు జూపుచున్నారు. నాకిష్టమై నేను జేయుచుననుచుండ మీకేమికష్టము. ఉదయమునజేయుపనులచే నారోగ్యమును, తన్మూలమున శరీరవికసనము గలుగునుగదా!"

"ఇక వంటకుగూడ నీవే దిగెదవా?"

"కాకేమి? వంటలక్కచేయు భోజన మెంతలక్షణముగనున్నది మనకుదెలియునదిగాదు. అది యామె ఇతరులకొఱకై చేయుటచే నట్లున్నది. మనకొఱకై నేనేజేసిన నెంత రమ్యము గానుండునో జూతురుగాక! దీనివలన మనకు నెలకు పదిరూపాయలుగూడ మిగులును. ఇంతకు మీ భాగమునకు మీ రుద్యోగముజేసి సంపాదించుచున్నారు. నాభాగమునకు నే నింటిపనుల జేయుదును. ఇది నాయుద్యోగము."

"ఈ ప్రకారముగ పైకము మిగిలించి వంకో, వడ్డాణమో—"

"జేయించుకున్న మీకు నష్టమేమి? పీడించి పీకబిసికి ఉన్నను లేకున్నను సొమ్ములు తెప్పించుకొనునిల్లాండ్ర కంటె ఇది యుత్తమముగాదా! చాకచక్యముచే, చతురతచే పైకము మిగిలించి ఆభరణముల జేయించుకొన్న యెంతో భర్త యడ్డగించును. ఎక్కడికి బోవును? సమయమున కుపయోగపడును గదా?"

"పనిజేసి జేసి మధ్యాహ్నము బాగుగా గుఱ్ఱుపెట్టి"

"నిద్రించుటకంటె పనికిమాలిన పనిలేదు. రాటమున్నది. అది యారంభింతును. వచ్చిన అమ్మలక్కలతో పనికిరానియు, నితరులకు హానిగల్గించునవియు నగు నధికప్రసంగములాడక ప్రపంచవిషయములను, సంస్కరించుకొనవలసినవిషయముల రాటము వద్దనుండియే ప్రసంగింతును. ఉత్తమగృహస్థురాలి కింతకంటె మంచిమార్గములేదు. ఇదెంతయు మేలు గూర్చును."

"విదేశవస్తువుల నుపయోగింపకుండుటకు మార్గమేమి వెదకితివి?"

"మనకు అన్నపానాదులు దేవుడిచ్చిన మనభూమియందే బండుచున్నవి. మీరు శలవుదినములలో క్లబ్బులకు వృథాగా మిత్రులతో దిరుగకపోయినచో మనకు గావలసిన ప్రతిదానిని మనభూమియందు బండించు నేర్పాట్లు జేయవచ్చును వర్తకమే ప్రపంచకము నావరించుకొనియున్న యిక్కాలములో విశేషవస్తువులు ముట్టక కాలముగడుపుట కష్టముగ గన్పట్టవచ్చును. కాని సాధ్యమైనంతవఱకు మనవస్తువులనే వాడుకొన నభ్యాసపడవలయును. ఈవిషయమున జెప్పుటకే న్నెనియుగలవు. జేయుట కంతకంటెను గలవు. ఇది నావంటి సోదరీమణుల కొకసూచన. దీనికి మీవంటివారు దోహదము గల్గించునట్లైన ప్రతి గృహము నాదర్శప్రాయమై కాలక్రమమున సౌఖ్యమున దేలియాడగలదు."

"ఉపన్యాసముల కేమిగాని కార్యములు జేయవలయును గదా!"

"చూతురుగాక! రేపటినుండియే, ఈ పద్ధతి నవలంబించెదను. ఎందులకుగాదో చూడవలయును."

"ఇంతకు అందరికి విద్యవచ్చినయుండినగదా నిది తెరుగును. సంసారములు జేయుచుండువారికి నేర్చుకొనుట కనుకూలము లేవి?"

## గృ హ ల క్ష్మి

"అట్టి సందేహము మీ కక్కఱలేదు. ఇంట్లో ఆడవారికి పనులుండుట పాతికకాలము, పనికిరాని వృథాప్రసంగాలు ముప్పాతికభాగము. నే నిపుడు జెప్పునది మధ్యరకము కుటుంబినులమాట. వీ రాప్రసంగముల కుపయోగించు కాలమును తెలిసిన ఇతరులవద్ద ఆసమయ నందే నేర్చుకొనుట చాల మంచిపనిగదా! తుదకు ప్రపంచపరిస్థితులను చేయవలసిన కార్యపద్ధతులనైన తెలుంగవలయును."

"ఓహో! నీ ఉపన్యాసాలు వింటుంటేనే పదకొండుగంటలైంది- ఇక చాలించడము బాగుంటుంది."

"మీకు నచ్చిందా."

"నిస్సందేహంగా."

"మరి యిపు డేమంటారు."

"నీకు బహుమతిస్తాను."

"ఏదీ........."

"..........."

".........అబ్బ...ఇదే......చాల్లేద్దురూ"

"ఇదో! ఇంకొకమాట..."

"ఉండనివ్వండి....ఇంటగెల్చి రచ్చగెలువాలని తెలిసిందా?"

### స్మ ర ణా నం ద ము

శా. దేవా నీపదపంకజంబులెద ప్రార్థింతుందయారాశివై
రావే కోర్కులదీర్పవే గుణనిధీ, రాజన్మతీ, క్ష్మాపతీ
యీావే నాజనయిత్రి వీవెజనకుం డీవే సుహృద్వర్గమున్
సేవాభాగ్య మొసంగరమ్ము పరమశ్రీలిమ్ము గోపాలకా.

మ. ఎపుడో యొచ్చటనో మరేక్షణమునో యేరీతినో ప్రాణము
ల్వపుపుర్గ బాసెదుగాని యెప్పటికి నిల్వంబోవటంచెంచి మో
క్ష పదానంద? భవత్పదాబ్జముల హృత్కంజాతమందుంచి భ
క్తి పరత్వంబున బూజసేతును దయాబ్ధీ? దేవకీనందనా?

అ. కం. కమలాంబగారు

# ఓదార్పు

[గృహలక్ష్మిలో "ప్రపంచఘోష" "మానవవిప్లవము" "స్త్రీకన్నీరు" మొదలగు వ్యాసములను వ్రాసిన శ్రీమతి తాడి నాగమ్మ గారికి కలిగిన వైధవ్యదుఃఖసందర్భమున వ్రాయబడిన పద్యరత్నములు.]

చేరుకొనెనమ్మ నీపతి శివునికొలువు
తరుణవయసున నీకింత తాల్మిద్రెంచి ;
పరగ నీవెట్టిచింతల పాలఁబడితో !
అరయఁగంపించు దేహంబు నిరయమొంద.

పరులకునేమొ కష్టములు పాటిలివాటిలె నంచునీవు సం
సరణపుఁబాటులెల్లను విచారములోన మునింగి వానిచేన్
మరచితివట్టివన్నియు ; మనంబున నీవిపుడేవిధంబునన్
తెరలితివమ్మరో ! మదినిసెంచగ గుండెలు నీరు గాడడిన్.
భారత భూమిలోఁ గలుగు బాలవితంతుల రోదనధ్వనిన్
ధారుణిభారమొంది బహుదాస్యత దీనత నొందియుండగా
వీరల ఘోషలోఁ దడియువేదిక నెట్టులమెక్కితమ్మరో !
నీరగుదేహమంత కడునీరము శోషిల పొంగియుండగన్.
నవలల,నాటకంబుల జనంబు సుఖంబులదేలుచూహమై
కవుల సునీతులన్నియు సకౌతుకరీతిని నీవుపాడుచో
నువిదలు సంతసిల్లిరి సుబోధులయూధము తృప్తితీర ; నీ
కవనిని ఇంతలోన నిటులౌనని నమ్మితి రమ్మయెవ్వరున్ ?
జీవితయుద్ధరంగమున జీవికపాటుల జీవులన్నియున్
కేవల మీమహిన్ గలుగు కీడుగులీలలు దెచ్చెనాయనన్
పావని ! ఈజగంబు పరిపాలనజేసెడి దెవ్వరోగదా ;
కావను సాధుజీవులను కాలమె సాక్షిగ నమ్ముమమ్మరో !

ఇదితరింపగరాని సంసృతిమహాబ్ధి
సత్యమా ? నిత్యమా ? కవోష్ణాశ్రుధార
నిల్పుకొమ్మికంతర్వాహినిగ ; ప్రపంచ
రంగమో ? నీకో ? కడువిచిత్రమ్మొ ? తల్లి!

జె. మోహనరావు.

# చెల్లాయి చదువు

నాగేశ్వరరావుగారు

"అమ్మాయ్."

"ఏమండీ, నాన్నగారూ."

"చెల్లాయి రాలేదింకా?"

"రాలేదు."

"అయిదుగంటల పైగాఅయినా రాలేదే ఇవాళ. వరేయి, కోటిగా అట్లా బడికల్లేపోయి అమ్మాయి వస్తోందేమో చూచిరారా. బడొదిలి అరగంటైనా ఇవాళెందుకనో ఇంకా రాలేదు."

"అయ్యోర్రూ, మన అనసూయమ్మగారా? అదుగో. వస్తున్నారు, పుస్తకాలసంచీ తగిలించుకొని నిమ్మళంగా వస్తోన్నారు."

"ఏమమ్మాయి. రా, రా, రా. మీబావగారు వచ్చారు చూచావా. పాపం నీకోసరం ఇందాకట్నించీ ఎదురుచూస్తున్నారు."

"వచ్చారెస్తూ. మా అక్కాయికూడా వచ్చిందా? ఏమండి ఎందుకుతీసుకురాలా? మీరు రెండో మైదానే!! సంపాదిస్తున్నా గాని ఖర్చుపెట్టడాని కంతకష్టమో! ఇంకేం తెచ్చారూ?"

"ఏంతేలా. నెనొకడ్నే వచ్చా. ఏంకావలోయ్."

"పట్నంనుంచి మీరల్లా వచ్చారూ. తినేదానికన్నా ఏంతేలా? మంచి పచ్చిద్రాక్ష, చాక్లెట్లు, మంచి పుస్తకాలు తెచ్చారేమో అనుకున్నా. చాల్లెండి. ఇందుకనేనా ఇందాకట్నించీ చూస్తోంది."

"లేదు లేవమ్మా. అన్నీతెచ్చానుగా. అంతా ఇంట్లోఉంది."

"అమ్మాయ్, ఇవాళింత ఆలస్యంగా వచ్చావేం బడినించి?"

"ఇవాళ శుక్రవారం కదండీ. ఆఖరిపీరేడు డిబేటుందికాదూ. అందుచేత ఆలస్యంఅయింది. లేకపోతే ఆపాడుస్కూల్లో ఉండటం నాకేం సరదా అనుకున్నారా? ఎప్పుడు నాలుగున్నర అవుతుందా, సుబ్బుడు గంటెప్పుడు కొడతాడా అనే ఎదురుచూస్తూ ఉంటాను."

ఎందుకోయ్ అంతకష్టం. చక్కగా చదువుకో లేక."

"వద్దునకూర్చొని కబుర్లెన్నన్నా చెప్పవచ్చు. మీరుచూస్తే తెలుస్తుంది. నిజంగా ఆడవాళ్లు మగపిల్లలబళ్లో చదవటం అంటే యమలోకబాధ అనుభవించటమే. నిజంగా ఈమగాళ్లకి మతుల్లేవు. బుద్ధి అంతకన్నా."

"అక్కాయి పిలుస్తోంది. పోయి నీళ్లుపోసుకొని తలదువ్వుకొని, మంచిగుడ్డలు కట్టుకొని రా. తరవాత కబుర్లు చెపుదుగాని బావగార్కి."

"ఏమండీ, అబద్ధాలు ఎప్పట్నించండీ, నేను పోతున్నా," అంటూఒక్కగంతేసిందింట్లోకి చెల్లాయి అనసూయ.

"ఏవక్కయ్యా, బావగారు తెచ్చినపుస్తకాలు?"

"అయిగో. నీషెల్ఫులో పెట్టాను."

"భలేబాగున్నయి. నా ఆష్యన్ హిస్టరీకి భలే బాగుం దీపుస్తకం. నాకో చాక్లేటు పెట్టవు? అదేనా పెట్టే? భలేబాగుందే; చాక్లేట్లు ఏలాఉన్నాయి? ఏం పెట్టుకోనూ ఇందులో?"

"ఏయ్, అనసూయ నీళ్లుపోసుకోరాదూ ముందు, అవన్నీ సమితించాలా ఇప్పుడు? నీళ్లు చల్లారిపోతున్నాయ్."

"వెళుతున్నానమ్మా. ఇంతలోకే ఎందుకమ్మా అలా కోపపడతావు. అబ్బ బస్లో అవస్థపడి ఇంటికొస్తే ఇంటిదగ్గరన్నా హాయిలేదయ్యా."

౨

"ఏమమ్మా? భోజనం అయిందా? అప్పుడే పుస్తకాలు, లాంతరు తీసుకు బయల్దేరా?"

"పాపం, భావగార్తోనే భోజనంచేద్దాం అనుకున్నా గాని, ఇవాళ భలే ఆకలేసింది నాన్నగారు."

"వెనకవాళ్ల కేమన్నా మిగిల్చారా? అందులో ఇవాళ బంగాళాదుంపలకూరా, టోమెటోపులుసు కూడా గాబోలు."

"అబ్బో! అంత తినగలిగితే ఇలా గెందుకుంటాం. మీమాదిరిగానే ఉండేవాళ్లం. ఇంకా చాలాఉంది లెండి. దిగులడకండి."

"అది సరేగాని ఇవాళ దేనిమీద మీస్కూల్లో డిబేటు (చర్చ)?"

"స్త్రీవిద్య మీదండీ.

"మీరుకూడా మాట్లాడినారా?"

"నేనసలు మాట్లాడనుగా మాస్కూల్లో. వట్టి పనికిమాలినపిల్లలు పోగయ్యారండి. ఏదో అంతా కోఎడ్యుకేషనంటారు గాని ఒక్కరు దేశంలోని పరిస్థితులు ఆలోచించరండీ. మరి అది కాకపోయినా చదువులో ఆడపిల్లకి మొగపిల్లకి ఎక్కడ సంబంధం. అంత నాగరికత ప్రబలినదేశం ఇంగ్లాండు. ఆదేశం సంఘసంస్కర్తల్లో ముఖ్యులు, సుప్రసిద్ధులైన రస్కినుగారే వద్దన్నారు కదండీ ఈలాంటి విద్యావిధానం. అసలు స్త్రీలకి అవసరంఅయిన చదువు వేరు. పురుషులకు కావాల్సింది వేరు. అసలట చిన్న ఆవుదూడనైతే ఏలా వదుల్తామో పచ్చిక బయళ్లమీద కావాల్సినమేత తినేదానికి, అలాగే వదిలెయ్యాలట స్త్రీలని లైబ్రేరీల్లో. ఆయన సిద్ధాంతంప్రకారం స్త్రీపురుషుల విద్యావిధానంలో ఏలాంటి సంబంధం లేదు. అలాంటి పరిస్థితుల్లో నన్ను ఈపాడు పాఠశాలకు పంపటం మానాన్నగారి పొరపాటు కదండీ."

"సరే కానీ ఎంతమంది చదవటంలేదు ఈ మాదిరి స్కూళ్లల్లో? అంతేగాక కాలేజీల్లోకూడా చదువుతున్నారే మరెంతమందో. వారెవ్వరికీ తెలియలేదా ఈవిషయం?"

"అవునండీ, విషయంలోని మంచి చెడ్డలు గ్రహించక అనేకమంది ఆలా చేస్తున్నారని కళ్లుమూసుకొని ప్రదక్షిణాలు చేస్తున్నారు కనకనే మనదేశం ఇలా ఉంది. అసలీ విద్యాశాఖాధిమంత్రులకి అధికారులకే లేదు చీకు చింత లీ విషయమై! ఇందుకంతకూ కారణం మా స్త్రీలు ఉద్యోగాల్లో లేకపోవటమే. మాలోని ఏ కనకమ్మగారుకాని భారతీదేవిగారుకాని విద్యాశాఖాధికారిణులైతే మేమీలాఉంటాం? అప్పుడు మాకొరకు ప్రత్యేకంగా విద్యాలయాలు స్థాపించి, గృహవిద్య, అవసరమగు తదితరశాస్త్రములు చెప్పుతూంటే అప్పుడు మీ పురుషులు చదువుతారో మాతోపాటు? మా ప్రైవేటుమాస్టరుగారి కున్నంత జ్ఞానం, తెలివి మీ పురుషుల్లో గొప్పవాళ్లం అనుకునే అనేకమందికి లేదు. ఉంటే మేము ఇలాఎందుకుంటాం. భారతమాత రక్షణకొరకు అలా ఎందుకు కన్నీరు కాలువలయ్యేలా విలపిస్తుంది?"

"మాచెల్లాయికి చదువుపై అసహ్యం కలిగించింది, విసుపుట్టించింది కేవలం విద్యావిధానమే కాదు; అంతకంటే ముఖ్యం అయింది నేటిపాఠశాలల్లోని వాతావరణం. అసలు ఆకాశం నిర్మలంగాఉంటే అమావాస్యనాడైనా తిరగచ్చు కాని ఆకాశంఅంతా కారుమబ్బుల్తో నిండిపోయి, గాఢాంధకారంఅయితే అది పౌర్ణం అయితేమాత్ర ఏం?

ఈ రోజుల్లోని బడిపిల్లలు కేవలం వానరమూకే. పంతుళ్లని ఎదిరించటం ప్రజ్ఞతోటి ఆడపిల్లలను గోలచేయుటం సరదా. పరీక్షల్లో ప్యాసుచేయకపోతే పాకలు పరశురామప్రీతి చేయటంగొప్ప. చదివి

బుద్ధిమంతులనిపించుకుంటే ధైర్యంలేని పిరికిపందలని పిలువబడతారు. లోటి స్త్రీవిద్యార్థుల ఆదరించి గౌరవించితే వారు పనికిమాలిన వెధవట. అందరితో పాటు అల్లరిచెయ్యకపోతే వాడసలు విద్యార్థే కాడు.

ప్రత్యేకంగాచేసే పిల్లదనపు పనులకి అద్దూ ఆపు లేదు. స్త్రీలకి విద్యాలయాలు అంపశయ్యలే!! వీళ్ల గోడు విచారించగలిగినవారే లేరు. పంతుళ్లకి స్థానం లేకుంటే ఇంక స్త్రీలసంగతి కనుక్కున్నదాకా ఎక్కడ?! పొరపాటున ఎవరితోనైనా ఏ పుస్తకం కోరకో మాట్లాడితే మర్నాడు బ్లాకుబోర్డులమీద బొమ్మలేస్తారు—పుస్తకం ఇచ్చేవాడ్ని చేసే గోల కంటుండదు. ఎవ్వరితో మాట్లాడక వారి పనేమో వారు చేసుకొని పోతూంటే పడరానిపాట్లు పడతారు. అనరాని మాట లంటారు. అవి వినాలంటే కఠోరంగా ఉంటాయి. ఇంక వ్రాసేదేమి? అల్లరచిల్లర ముక్కలుపోగయారు స్కూలునిండా. అదరించి మార్కులేయించుకొని ప్యాసవటం, అందర్నీ గోలచేయటం.

మా చెల్లాయి అమాయకురాలు. అనవసరంగా ఒకళ్లతో మాట్లాడదు. అదీగాక మా నాన్నగారు గవర్నమెంటులో పెద్ద ఉద్యోగం చేయటంవల్ల, యీ గ్రామంలోకల్లా మాదే కాస్త మర్యాదగల్గిన పెద్దకుటుంబం అవటంవల్ల ఇలాంటి గోల లేం చేయక పోయినా, మిగతా సౌకర్యాలేం లేవు ఆ స్కూలుకు. అంచేత మొగపిల్లల్తో చదువు మరింత కష్టంఅయింది. బయటకెళ్లేదానికి దొడ్డిలేదు ఆ స్కూలుకు. అన్నీ అలానే ఉన్నాయి. కాస్త విశ్రాంతికి ఇంటర్వెల్లో కూర్చోటానికి తావుండదు.

పంతులుగారుండేవే క్లాసులో కూర్చోటం అంతంతగా ఉంటుంది. ఇక మాస్టరుగారు లేకుంటే కూర్చోటానికే తావులేదు. అన్నీ అలానే ఉన్నాయి!! ఇది అవనేమిటి? స్కూలు వదిలాక ఇంటికెళ్లుతూన్న పని వేళ వెంటొచ్చి మరీ గోలచేస్తారు. అక్క చెల్లెండ్ర గౌరవించ వేరగాని ఈవిద్యార్థి బృందాలతో ఉండటం ఏలా సంభవిస్తుంది? ఎంత అల్లరిచేసినా "అదేం" అనే వాడుకాదు ఆ అరవతల మేష్టరు. అసలు 'అరవ', అందులో పిరికి.

అవతారం నరసింహావతారమే అయినా ధైర్యం మాత్రం లేదు. హిరణ్యకశపుని వధించటానికి బదులు ఉద్ధరించేవానిలా వచ్చి ప్రహ్లాదులపని బడతాడు. అల్లరిచేయని పిల్లల్ని అణగిమణగి ఉండేవాళ్లని, దండిస్తాడు. మా అమ్మాయిల దగ్గరకొచ్చి వాళ్లజోలికి మీరు పోకండని హెచ్చరికచేస్తాడు. కాని సంగతులు గ్రహించడు. రిపోర్టుచేసినా వినిపించుకోడు. మొన్ననొకసారి ఒకపోకిరికుర్రాడు మాచెల్లాయితోపాటు చదువుకుంటూఉన్న శాంతకి ఏదో వెర్రిబొర్రితనంగా ఉత్తరం వ్రాసి ఊరంతా గోల్చేసాడు.

హెడ్మాస్టరుగారికి రిపోర్టుచేస్తే కుర్రాడ్ని పిలిపించిన పాపానపోలా!! మూకలేసిన పుణ్యంకట్టుకోలా.!!

నిజంగా మాచెల్లాయి సంగతేం కానీండి ఈ మెతో పాటు చదువుకూన్నవారి అవస్థలు చూస్తే నిజంగా ఈ "కో ఎడ్యుకేషను" అసలు పనికిరా దనిపిస్తోంది. ఇన్ని ఇక్కట్టులుండబట్టే పాపం మా చెల్లాయి "నాలుగున్నర ఎప్పుడవుతుందా; మప్పుడు గంట ఎప్పుడు కొట్టేస్తాడా" అని చూస్తూ ఉండేది."

# మణి

శ్రీమతి పెద్దిశెట్టి రామమ్మగారు

(అనుబంధకథ)

[రామచంద్రరావుగారి కుమారుడు మాధవరావు చెన్నపట్నములో బి.యె. చదువుచు వరశుల్కమునకు విరోధముగ లెక్చర్లిచ్చి, యింటికి శెలవులలోవచ్చి, తన యిరుగింటి మణియను పిల్లనుచూచి మోహించి పెండ్లాడెదనని చెప్పి ముద్దుపెట్టుకొనెను. ఒకనాడు సాయంకాలము బీచికి షికారుపోయి సబ్ జడ్జీ ప్రసాదరావు కూతురు లీలనుచూచి ప్రేమించి మణిమీద మరులుమరచిపోయెను. తండ్రి వేరొకనాను ప్లీడరు జనార్ధనరావు పెద్దకూతురు వసుంధరాదేవి అంతచక్కనిది కాకున్నను తాను పెండ్లియాడకతీరదనియు వారెక్కువ కట్నమిత్తురనియు చెప్పెను. మాధవరావు తండ్రి నెదిరించలేక సమ్మతించెను. మణితండ్రి ఆనందరావుగారికి రామచంద్రరావుగారిందువిషయమై శుభలేఖ వ్రాసెను. ఆనందరావు ఆ శుభలేఖను మణికి చూపించగా వారి కుటుంబమెల్లయు మిగుల ఆశ్చర్యపడి విచారింతురు.]

ఆ పత్రిక మణి చదివి చాల సంతోషించినది. ఆ ముగ్ధయొక్క అమాయకత్వము! ఆమె పెండ్లికి వెళ్లవలయునని చాలప్రయత్నించినది గాని ఆమె తల్లిదండ్రులు వెళ్లుట మంచిదికాదని చెప్పుటచే వెళ్లలేదు. వసుంధరాదేవికిని, మాధవరావుకును వివాహమైనది గాని మాధవుని హృదయములో వసుంధరకు తావులేదు. లీలయొక్క మూర్తియే నిండియున్నది. మాధవుని వివాహమైన మూడుమాసములలోనే మణిని మేనమామయగు కమలాకరరావు, బి.యె.కు ఇచ్చి వివాహమొనర్చిరి. వివాహమైన వెంటనే పునస్సంధానము చేయవలెనని సంకల్పించుకొనిరి గాని మంచిదినము కాకపోవుటచే 20 దినములు పోయినతరువాత చేయ నిశ్చయించుకొన్నారు. ఇంతలో అకస్మాత్తుగా జ్వరమువచ్చి నాలుగుదినములు జ్వరము కడుపునొప్పితో బాధపడి యీమాయాప్రపంచకముపై మణిని దుఃఖముపాల్ చేసి యీలోకం బాసినాడు. ఆనందరావు జ్ఞానాంబల దుఃఖము ఇంకనివర్ణింప నలవికాదు. మణి పాపం ఒక్కదినమైన భర్తతో కలిసియుండలేదు గాని విధవఅయినది. ఈ దుర్వార్త విని మణిఅన్నయగు కేశవరావు వచ్చినాడు చెన్నపట్టణంనుండి. కేశవరావుకు మణిఅన్న పంచప్రాణములును. ఆయన తండ్రిని సమాధానపరచి మణికి స్వయంగా తాను ఇంగ్లీషు లెక్కలు సైన్సు మొదలగునవి అన్నియు ఇంటివద్దనేర్పి స్కూల్ ఫైనల్ పరీక్షకు కట్టించినాడు. మణియొక్క తెలివితేటలు కనపరచుటో యనునట్లు ఫస్టుగా స్కూల్ ఫైనల్ ప్యాసుఅయినది. అన్నగారు యం.బి.బి.యస్.పరీక్ష ప్యాసుఅయినట్లుగా తెలిసినది. వారికి గ్రుడ్డిలో మెల్లన్నట్లు మణి విచారములో యీ సంతోషవార్తకొంచెము వా. మనస్సుకు సంతోషమైనది. ఏమి సంతోషము, పాపం ఆదంపతులకు, కేశవరావు స్వయంగా డిస్పెన్సరీ పెట్టుకొని ప్రాక్టీస్ మొదలుపెట్టినాడు. ప్రతివారు మందులకొరకు కేశవుని దగ్గరకే వచ్చెడివారు. చాల మంచియువకుడు. అతని రూపురేఖావిలాసములు ఆకర్షణీయముగ నుండెను.

25 సంవత్సరములు. ఇంకనూ వివాహము కాలేదు. మంచి దయార్ద్రహృదయుఁడగుటచేతనే ప్రతివారును ఇతనివద్దకే వచ్చెడివారు ఔషధములకొరకు. తన చెల్లెలు స్కూల్ ఫైనల్ యందు ఫస్టుగా ప్యాసుఅయి నందుకు చాల ఆనందమును పొందినాడు. మణిని యఫ్. యే. చదివించెద నన్నాడు. తల్లిదండ్రులు ముందుకొంచెము శంకించినారుగాని పోనీ ఏదో చదువుకొనవలెనుపడిన భర్తను మరిచి ఏదో కాలక్షేపము అవును పిల్లకు అని తలయూచిరి. చెల్లెలను చదివించుచున్నాడు మణి చాల తెలివితేటలది గాన బహుశ్రద్ధగా చదువుచు తెలియని విషయములు అన్న నడుగుచు యఫ్. యే పూర్తిచేసినది. L. M. P కి చదివించెదనని అన్న తల్లిదండ్రులను సమ్మతింపజేసి చెల్లెలను చదివించుచున్నాడు. మణికి ఒకొక్కసారి భర్త తలంపుకువచ్చిన అయ్యో! నేను విధవనైతిని కదా అనుకొని, ఛా! నేను ఎందులకైతిని, నామాధవుడు బ్రతికియున్నాడుకదా, నాహృదయము దొంగిలించి, నన్ను ప్రేమపాశమున బంధించినాడు నా మాధవుడు గాని కమలాకరుడు నా భర్తకాడు" అని అనుకొనుచుండెడిది.

మాధవుడు బి.యల్. ప్యాసుఅయినందున ప్రాక్టీస్ మొదలుపెట్టినాడు. ఏదో యొక మోస్తరుగానున్నది. వసుంధర సుగుణములకుప్ప. అత్తగారిని తన కన్నతల్లి కన్నామిన్నగా చూచుచు కొద్దిదినములలోనే ఆమె దయకు పాత్రురాలైనది. వసుంధరకు వివాహమొనర్చి తండ్రి చాల అప్పులపాలయినాడు. ఇంటిమీద తెచ్చిన రెండువేలకు అప్పులవాళ్లు పీకుచుండిరి. ఆబాధపడలేక ఇల్లుఅమ్మివేసి ఆఅప్పు తీర్చినాడు. ఇప్పుడు తినుటకు తిండిలేదు. కట్టుటకు బట్టలేదు. ప్రాక్టీస్ చూస్తే యేమిలేదు. నానాఇబ్బందిపాలు అవుచుండిరి; వసుంధరకు యీసంగతితెలిసి అయ్యో! పరాత్పరా! వరశుల్కము పేరి మనుష్యులను పీల్చి పిప్పిచేయుచున్న యీదురాచారమును ఎప్పుడు మట్టు చేయుదువోకదా? అని లోలోపల దుఃఖముతో కుములుచున్నది. సరిగా తిండితినెడిదికాదు. మాధవుని చరిత్రచూస్తే ఎప్పుడు ఏదో ఆలోచిస్తూవుంటాడు ఆమహానుభావుడు, సరిగా వసుంధరను చూడడు. ఏదో వస్తాడు, పైకివెళ్తాడు మళ్లీ. భోజనమువేళకు వస్తాడు, వసుంధరకు ఆయన యుద్దేశమేమో బోధపడలేదు. ఇంతలో ఆమె గర్భిణితోయున్నది.

జనార్ధనరావుగారికి 20 దినములనుండి జ్వరము వచ్చుచున్నది. సాయంకాలము నాలుగుగంటల సమయము పక్షులు తమతమగూడులు చేరుచున్నవి. జనార్ధనరావుగారు రుక్మిణమ్మను పిలిచి వసుంధర పెండ్లి చేసి ఇంత కష్టములపాలయితిమి. ఆవరశుల్కమే నాప్రాణములు తీయుచున్నది. ఇంతకష్టపడి చేస్తిమి. మాధవుడు వసుంధరను సరిగా చూడడట. సబుజడ్జి ప్రసాద్ రావుగారి కుమార్తెలీలను ప్రేమించియున్నాడట. ఈసంగతి మొన్నను వింటిని. ఏదో అయిపోయినది. నేను వెళ్లుచున్నాను. ప్రేయసీ ఇకనైనా నీవు మన శ్రీలతకు బాగాచదువుచెప్పించి వరశుల్కము పుచ్చుకొనని మంచి సహృదయునికి ఇచ్చి వివాహమొనర్పుము. నేను వెళ్ళిపోవుచున్నాను. నన్ను క్షమింపుము. ఇద్దరు కుమారులను ఎట్లుచూచెదవో కదా. ధారాపాతముగా కారుచున్న కన్నీటిని తుడుచుకొని పిల్లలను కాపాడుమని ప్రేయసి గడ్డముపట్టుకొని కన్నీటినితుడిచి, రుక్మిణీ! ఒక్కసారి శ్రీలతను పిల్లలను పిలువుము. శ్రీలతాయని మోహనా, ఆగి భాస్కరాయని పిలవగానే పిల్లలువచ్చిరి. తండ్రి శ్రీలతను ప్రక్కను కూర్చొనబెట్టుకొని, అమ్మా, నీ అక్కపెండ్లిచేసి మనము చాల కష్టములపాలయితిమి. నీవు యీ పరీక్ష ప్యాసుఅవుటతోనే స్కూల్ ఫైనల్ కు తప్పకకట్టుము. అది ప్యాసుఅయి తమ్ముళ్లను తల్లిని పోషించుటకు ఎక్కడనైన పనిచేయుము. తల్లీ నాభారముఅంతయు విడిచి వెళ్లిపోవుచున్నాను. నీవు చక్కనివాడును సరళస్వభావముగలవాడును,

వరశుల్కమన యేవగించుకొనువానిని చేపట్టి చక్కని సుపుత్రులనుగలిగి చిరంజీవివై యుండవుగాక అనిదీవించి ఇద్దరుకుమారులను ముద్దులాడి నాయనా! మోహనా, బాబూ! భాస్కరా! అమ్మని అదిఇమ్మని ఇదిఇమ్మని అడగకుడు. చక్కగా చదువుకొని మంచికీర్తిని సంపాదించుడు. మీరు పెండ్లిండ్లుచేసుకొన్న కట్నం పుచ్చుకొనవలదు. కట్నం ఎంత మాత్రం పుచ్చుకొనవలదు. అదిమాత్రం జ్ఞాపకముంచుకొనుడు" అని పలికి రుక్మిణీ నీవే అట్లు దుఃఖించిన పిల్లలు బెంగటిల్లెదరు. ఏడవకుము అని వోదార్చి తను యీప్రపంచకం వీడినాడు.

చదువరీ! వరశుల్కము ఎంతపనిచేసినదో చూడుము. డబ్బు లేకపోగానే, పిల్లలను ఎట్లుపెంచుట అని బెంగపెట్టుకొని జ్వరము తెచ్చుకొని ఆ బెంగతోనే పాపంజనార్దనరావు యీలోకంవిడిచినాడు. అయ్యో! పండువంటి సంసారము వరశుల్కమువల్లనే కదా ధ్వంసమైనది. రుక్మిణమ్మ పాపం భర్తపోవుటచే చైతన్యము తప్పిపడిపోయినది. శ్రీలతచేసిన ఉపచర్యలకు కొద్దిసేపటికే తెలివితెచ్చుకొని ధైర్యముబూని భర్తకు చేయవలసిన అగ్నిసంస్కారమంతయు చేసినది. శ్రీలత తండ్రి అవసానకాలమందు నుడివిన పలుక్కులు జ్ఞప్తియందువుంచుకొని చాల శ్రద్ధగా చదివి స్కూల్ ఫైనల్ యందు ప్యాసుఅయి అక్కడనుండి ట్రైనింగ్ రెండువత్సరములు చదివి అక్కడనే పని చేయుచున్నది.

లీలాకుమారి యస్.ఎ. ప్యాసుఅయినది. మాధవుడు లీలను తరుచుగా కలుసుకొనుచుండెడివాడు. మాధవునికి లీలను ఎటులైనా పొందవలెనని యున్నదిగాని ఎట్లుపొందగలడు. వసుంధర ధర్మపత్నియై వున్నది కదా. వసుంధరకు ఆడపిల్లజన్మించినది గాని అందుకు సంతోషించుటకు బదులు తండ్రి చనిపోయినవార్త వినబడినది. దానితో పాపం ఆ యువతి చాలవిచారముతో కృంగిపోయినది. అయ్యో! నాతండ్రి నావివాహముచేసి తినుటకు తిండిలేక నానాఇబ్బందిపాలయి ఆఖరకు యీ మాయాప్రపంచమును వీడినాడని బహుసంతాపముపాలయినది. వసుంధర పాపం యీలాగున ఎప్పుడు విచారిస్తూయుండెడిది. ఆకుమార్తె జన్మించిన మరి రెండుసంవత్సరములకు కుమారుడు జన్మించినాడు. కుమార్తెపేరు మనోమోహినిఅనియు, కొడుకుపేరు కీర్తిశేషులైన తండ్రిగారిపేరు జనార్దనరావు అనియు నామధేయము పెట్టుకున్నది. వసుంధర మనస్సుకు సంతోషములేదు. తండ్రియా తన్నుగురించి కష్టములు పడి ప్రాణములు విడిచినాడు. ఆమెకు దుఃఖముగాక వేరేమియున్నది. ఏదిఎట్లైనను భర్త ప్రేమతో చూచిన యీకష్టములన్ని లెఖ్ఖకు రాకపోవునుగాని. భర్తకు ప్రేమలేదు. ఇట్లున్నది ఆమెస్థితి. ఆమె బెంగతో కృశించి అత్తమామలకు భర్తకు తనబిడ్డల నప్పగించి స్వర్గస్థురాలైనది. వసుంధర పాపం సుందరమ్మను రామచంద్రరావుగారిని దుఃఖములో ముంచినది. దావ:చంద్రరావుగారికి వృద్ధాప్యము వచ్చినది. ఆస్తినంతయు కొడుక్కిఅప్పచెప్పి ఆయనకూడ వియ్యంకుని కలుసుకొనుటకు వెళ్లినాడు.

# కవితిలక కాంచనపల్లి కనకమ్మగారు

రామసుబ్బారాయఁడుగారు బి. ఏ.,

వెంకటనారాయణగారు

ఉ. కాంచనపల్లివంశమునఁ గాంతలలోపల మేలుబంతివై
కాంచితి జన్మమీవు కనకమ్మ! ధరాతలమందుఁ బ్రాకె ని
ర్వంచిత కీర్తివైభవము ప్రాక్తనపుణ్యవశమ్ముచేత, నా
కాంచనగర్భుఁడెంతయు సుఖంబొసఁగూర్చుఁ జిరాయురున్నతిన్.

ఉ. కాంచనపల్లివంశమునఁ గల్గిరనేకులు; గాని నీవలెన్
గాంచిరె యొక్కరేనియు నఖండయశంబు కవిత్వమందు! ని
న్నంచితులైనవార లహాహాయని-మెచ్చుట చాలదొక్కొ? శీ
లించిన నీకు నీడుగలరే? యెవరేనియు నెందునేనియున్.

ఉ. కాంచితినీకవిత్వమును గాంచితిఁ దత్త్వ విచారమంతయున్
గాంచితి నీదుగ్రంధములఁ గాంచితినీదగు 'జీవయాత్ర'యున్
గాంచితి వాక్ప్రభావమును గాంచితి సత్కృతులెన్నియేనియున్
గాంచితిసర్వమున్ దనివిఁగాంచితి వేయి వచింపనేటికిన్.

చం॥ సదమలభక్తితో రచన సల్పిన "హంసజయంబు" నంతయున్
జదివితి; దానియందుఁగలసారము గ్రోలితిఁ దత్త్వబోధనల్
బొదలుటఁ జేసి వాక్యములపొందికయున్ రససౌకుమార్యముల్
కుదురుగనిల్చెఁ బాఠకులకున్ బ్రమదమ్ము ఘటింపఁజేయుచున్.

ఉ. సత్యముదాపనేటికి? రసజ్ఞులుమెచ్చెదు తత్త్వబోధనల్
సత్యములైన భావములు నూల్కొనునట్లు రచించినా; వనౌ
చిత్యము గానరాదెచటఁ; జెప్పఁగనేటికి? గల్గుజన్మరా
హిత్యము మోక్షమున్ గలుగు నింతటి సత్కృతివ్రాసినందుకున్.

గీ. హంసతత్త్వార్థమెల్ల నీవరసినావు
నిశ్చలంబైన యోగసన్నియతిచేత
దాన సంసారచక్రంబు దాఁటఁగలవు
ధన్యతనుగాంచినావమ్మ ధాత్రిలోన.



"భారత్ కీ బేటీ"లోని అభినేత్రి కమలా శివదాసిని.

## కవితిలక కాంచనపల్లి కనకమ్మగారు

ఉ. ఇంతకుమించి వేఱె వచియింపఁగ నేటికిఁ బెక్కుసార్లు ; శా
కుంతలయొక్కటే యశముఁగూర్పఁగఁజాలిన గ్రంధరాజ ; మా
వంతయులేదు సందియము ; నాపయినీదగు "జీవయాత్ర" ఖం
డాంతరమందు నిల్పఁగలదంతకు మించిన కీర్తికీర్తులన్.

చ. కనదగుధర్మవాక్యము లఖండముగా నొడఁగూర్చె నీదులే
ఖని; యవి సూక్ష్మబుద్ధినిఁగించి యెఱింగిన జ్ఞానసత్తముం
డెనయఁగరాని సౌఖ్యమును నేర్పడఁగాంచి శుభంబులెప్పుడున్
గను ; బలుమాటలేటికిఁకఁ గన్పడు మోక్షము జీవయాత్రలోన్.

కం॥ ధర్మార్థమోక్షసాధన
కర్మముల కనువగునట్టి కావ్యములిల్లే
నిర్మలదృఢచిత్తమునం
దర్మిలి మైఁజేయుమమ్మ యశమునుగొమ్మా.



# స్త్రీ బుద్ధి

శ్రీమతి వల్లాది రాజ్యలక్ష్మిగారు

'స్త్రీబుద్ధిః ప్రళయంకరీ' అను లోకోక్తి నెవ్వ డేమహనీయుడు సృష్టించెనో కాని నాటినుండి నేటివఱకును పురుషులకొదవు కష్టనష్టములకెల్లను స్త్రీలే కారణమను నపోహ ఇప్పటి జనసామాన్యమున మిక్కుటముగ వ్యాపించిఉన్నది. సత్యదృష్టిచే నాలోచించిన స్త్రీబుద్ధి యేయే సమయముల ప్రళయోత్పత్తికారణమయ్యెనో దెలుసుకొనెదరుకాని న్యాయాన్యాయవిమర్శనా పరిశీలత నెన్నడెఱుగని అహంభావ పూరితులగు ప్రజాసామాన్యము ప్రతి విషయమునందును నీలోకోక్తినివాడి స్త్రీ లోకము నవమానించుచున్నారు. వాస్తవముగ ప్రతి పురుషునకు స్త్రీలు మాతృదేవతలుగను భగినీ గణములుగను ధర్మపత్నులుగను ప్రియపుత్రికలుగ నుండియుందురు. కాన స్త్రీల నివ్విధి నవమానించుట మాతృస్వరూపిణులగు స్త్రీలపట్ల మిక్కిలి యనుచితమును అసంభావ్యమునగును. సహజముగ స్త్రీ హృదయము నవనీతకోమలసదృశమేకాని ప్రపంచ నాశనమునకు కారణము కానేరదు. యెంతటి విద్యావిహీనలగు స్త్రీలైనను వారలస్వభావము శాంతి ప్రియత్వమేకాని అశాంతిభరితము కాజాలదు. సామాన్యముగ 'స్త్రీబుద్ధిః ప్రళయంకరీ' యను వాక్యమునువాడి యందు కుదాహరణముగ భారత రామాయణాదిగ్రంథముల పేర్కొందురు. న్యాయదృష్టిగల మనుజులు భారతరామాయణయుద్ధములకు మూలకారణము స్త్రీలో లేక పురుషులో నిర్ణయించుకొనెదరు. లంకాధిపతియగురావణుడు భార్యయుపదేశముల పెడచెవినిడి అహంకారమున మత్తుడై సీతాపహరణ మొనరించుటవలననేకదా సకల సౌభాగ్యపూరితమగు లంకాపట్టణ మవ్విధి నశింపబడుటయేకాక కుటుంబసహితముగ తానును నాశనమంది యుగములపర్యంతము నతని యవినీతివర్తనమును ప్రజలు గర్హించుట. శ్రీరామునిమైత్రిచే ధైర్యమును బొందిన సుగ్రీవుడు మహాధైర్యమునబోయి వాలినిరణమునకాహ్వానింప వాలిభార్యతార, పతికొనరించిన సదుపదేశముల నిరాకరించినందులకు ప్రతిఫలముగ వానరోత్తముడగు వాలి ప్రాణములగోల్పోయి నశించుట. భారతయుద్ధమునకు మూలకారణము స్త్రీ యని పల్కుదురు. నిజమునకు దుర్యోధనుని మితిలేని రాజ్యతృష్ణయేకాని వేరొండుకాదు. దురాశాపీడితుడై దుర్యోధనుడు ధర్మరాజును జూదమునకుబిలువ నిరాకరించుట క్షాత్రధర్మంబు గాదనుతలంపుతో ధర్మజుడు జూదమాడి రాజ్యసర్వస్వమునోటువడి తుదకు భార్యనుగూడ నోడుట సర్వజన విదితమే! యెవ్వరు పతులును పౌరుషమును

లోనాడి మూఢభావము వహించుటచే నిస్సహాయురాలై మానవతియగు ద్రౌపది శ్రీకృష్ణకృపావిశేషమున మానసంరక్షణ మొనర్చుకొనినదికూడ సువిదితమే కదా! ద్రౌపదీకారణమున యుద్ధము జరిగియుండినచో ముఖ్యముగ నీసమయముననే యుద్ధము జరిగియుండవలె కదా! దాన ద్రౌపదీ కారణమున భారతయుద్ధము జరిగెనను వార్త శుద్ధాబద్ధము. ధర్మమేజయమను నీతి వాక్యమునుస్మరించి గాంధారి పుత్రుడనియైన శంకింపక పుత్రప్రేమ నవ్వలద్రోసి ధర్మమెచ్చటనుండునో జయమచ్చట నుండునని యాశీర్వదించినది. కాని భారతరామాయణముల నిట్టిశాంతిప్రియులును ధర్మబద్ధులునగు కాంతామణులవలననే రణభేరులు ప్రయోగింపబడెనని పలుకుదురే, యిది యేటిమాట! స్త్రీబుద్ధి ప్రళయోత్పత్తి కారణమయ్యెడిచో పూర్వోక్తస్త్రీల గుణములవలన నెంతటి యనర్థకములయ్యెనో సహృదయులగు వారలాలోచించెదరు గాక. ఆడదానిచేతి యర్థం మగవానిచేతి బిడ్డ బ్రతుకదను మరియొక లోకోక్తినికూడ జనసామాన్య ముపయోగింతురు. బుద్ధిమతులగువనితామణులచే మహాసామ్రాజ్యములుగూడ పరిపాలింపబడియుండ ధనమొక్కటియేనా నిలువకపోవుట! స్త్రీజనశ్రేయమభిలషించని పూర్వులెవ్వరో ఇట్టి సామెతల సృష్టించియుండ నట్టివాక్యముల నుదహరించుచు స్త్రీలోకము నిట్టి కఠోరవాక్కులచే నవమానించుట మిక్కిలి యన్యాయము. న్యాయమున బుద్ధిసూక్ష్మత గలస్త్రీబృందములు చేయరానిపనులెవ్వి? వానివలన గలిగిన యనర్థకము లెవ్వి? అహల్యాబాయి నూర్జహాను ఝాన్సీ లక్ష్మీబాయి విక్టోరియా మున్నగువారలు స్త్రీలు కారా! యిటీవలనే తిరువాంకూరు రీజెంటు రాణి సత్పరిపాలనమువలన రాజ్యాభివృద్ధి యెటులయ్యెనో మరచితిరా! స్త్రీబుద్ధి ప్రళయంకరము, ఆడదానిచేతి యర్థము నాశనమందుననను వాక్యములే నిజములయ్యెడిచో స్త్రీలగు వీరు రాచకార్యముల నెట్లు చక్కబెట్టగలిగిరి? ప్రపంచమున ప్రతియుద్ధమునకు కారణము మితిలేని రాజ్యాశయో ధనాశయో ముఖ్యముగాని వీనికన్నిటికి స్త్రీలే కారణమనువార్త అసత్యకల్పనము. సత్యదృష్టిచే పాఠకులు నిజానిజముల గ్రహింపకోరుచున్నాను.

# బంగారుపతకము

శ్రీమతి చమర్తి సీతాదేవిగారు

ఒకవూరిలో ఒకజమీందారువుండేవు. ఆయనపేరు గంగాధరరాజు. ఆజమీందారు ఏంచేశాడంటే, వూళ్ళో వుండే కోమట్లని, బ్రాహ్మణుల్ని, క్షత్రియులని పిలిపించి, సభచేశాడు. సభలోనికి ఒక బంగారుపతకం తెచ్చి శారదాశాసనాన్ని తప్పించుకోవడం ఎల్లాగో ఎవరు మంచియుక్తిచెప్తే వారికి ఈపతకం బహుమతిగా ఇస్తానన్నాడు.

సోమనాథం లేచి "చిన్నపిల్లలకే పెళ్ళిళ్లుచేద్దాం, సర్కారువాళ్లు జుల్మానావేస్తే యిస్తాం, ఖయిదులో పెట్టితే వాళ్ల అతిథులు అవుతాం" అన్నాడు.

జమీందారు:—"బీదాబిక్కీ జుల్మానాలు ఇవ్వలేరు. జయిలుఅంటే ఇంకా చాలామందికి భయంపోలేదు. మాలసంపర్కం తప్పదు, మావసతులకు ఏది భంగంవస్తుందో, ఇది పనికిరాదు."

కొడుకులనుగన్న సుబ్బయ్యాలేచి:—"సర్కారువాళ్లు ఇప్పట్లో శిక్షలువెయ్యరు. తప్పక జుల్మానాలు వేస్తారు. వరకట్నంతోపాటు జుల్మానాకూడా మాట్లాడుకుందాం. పెళ్లిళ్లు యథాప్రకారం చేద్దాం" అన్నాడు.

జమీందారు:—"ఇది కూతుళ్లుకన్న తల్లిదండ్రులకు కష్టం. జాస్తిమంది యిట్లాచేస్తుంటే సర్కారువాళ్లు ఖయిదుచెయ్యడం ఆరంభిస్తారు. ఇదంతా సరిపడదు."

"ఆడపిల్లలు కడుపులోవుండగానే పెళ్ళిచేస్తే బాగావుంటుంది" అని శ్యామశాస్త్రుల్లు చెప్పాడు.

జమీందారు:—"అట్లాచేస్తే శారదాశాసనం ఏమీచేయదుగాని, కడుపులోఉండేది ఆడపిల్లో మగపిల్లవాడో ఎట్లాతెలుస్తుంది?"

శ్యామశాస్త్రుల్లు:—"జ్యోతిషంవల్ల"

జమీందారు:—"జ్యోతిషం మంచిశాస్త్రముగాని దాన్ని సరిగా విమర్శించి చెప్పేవారులేరు. జ్యోతిష్కులుచెప్పేవి పూర్తిగా నమ్మడానికి వీలులేదు. ఆడపిల్ల పుడుతుందని కష్టపడి ఖర్చుపెట్టి పెళ్ళిచేస్తే, మగవాడుపుడితే నవ్వులాటగావుంటుంది. ఇదంతా బాగాలేదు.

వీరభద్రరావు లేచి:—"ఇప్పటి లోకపరిస్థితులు చూచేరా? మంచిచెడ్డ లాలోచించకుండా బాల్యవివాహములు చేస్తున్నారు. ఆడపిల్లలు కడుపులో వుండగానే పెళ్ళిచేస్తే బాగావుంటుందన్నారు. మన దేశీయులు అన్యదేశీయులవలె బలవంతులుగా నుండకుండుటకు బాల్యవివాహములే ముఖ్యకారణము. చెట్టువృద్ధికి భూమి కారణముగనుండునట్లు శిశువుయొక్క శరీరారోగ్యమునకు తల్లియే ముఖ్యము. తల్లి రక్తబలము తక్కువదైనచో తల్లియందుండు పిండమునకు చాలినంతరక్తము లేక పిండముయొక్క యవయవములు చక్కగపెరుగవు. పిండమునకు సామర్థ్యము లేక బిడ్డలు బలహీనులుగ జన్మించెదరు. కాన తల్లికి తగు రక్తవృద్ధి శరీరారోగ్యము ఉండవలెను. బాలికలు 18 సంవత్సరములవరకు పెరుగుచుందురని వైద్యులుచెప్పెదరు. బాలికల ప్రథమరజస్వలానంతరము మూడుసంవత్సరములకే శరీరము సౌష్టవముగ నుండును. పురుషునికి 22 సంవత్సరముల పిమ్మటనే శరీరము పటుత్వముగనుండును. పసిప్రాయముననే బాలికలను సంసారమునకు పంపిన దుర్బలలగుదురు. అట్టివారికి జనించుబిడ్డలు చాలకాలము బ్రదుకుట దుర్లభము. గావున దంపతులు యుక్తవయస్కులుగా నుండవలయును. ఇవన్నీ ఆలోచించే శారదమొదలగు

గొప్పవారు బాల్యవివాహములు నిషేధించు శాసనమును అమలులోనికి తెచ్చేరు."

ముసలియగు రామిశెట్టిలేచి:—"వీరి నవీనతత్వం నాకు బోధపడలేదు. అన్యదేశసంపర్కమువలనను, ఆంగ్లవిద్యాభివృద్ధిచేతను మనదేశమునకు, మతాచారములకుగలిగిన హానివర్ణనాతీతము. వీరభద్రరావు ఆంగ్ల విద్యాధికుడయినందుచే గదా మనమతాచారముల దూషించుచున్నాడు. తోకతెగిన నక్కవలె తానెడుటయే గాక మనలనందరిని చెడుపదలచినాడు. పాశ్చాత్య నాగరికతావాతావరణము మనదేశమం దంతటను వ్యాపించి అనేకవ్యాధులకు అనర్థములకు కారణమయింది. మనపెద్దలు బాల్యముననే వివాహమాడి నిత్యారోగ్యముతో నిగనిగలాడలేదూ?

వీరభద్రరావు:—"మీరట్లే బాల్యవివాహములు చేయండి. నేను సర్కారులో మీపై నిందమోపించి జుల్మానా, శిక్ష వేయించెదను."

వీరభద్రరావు సభనుండిలేచి వెళ్ళిపోయెను.

రామిశెట్టి:—"వాని ప్రసంగముతో మనకు అవసరములేదు. మన మాలోచింపవలసిన విషయములాలోచించుదాం. కత్తికి భావ్యంకట్టి ఆడపిల్లకు పెళ్లి చేస్తే శారదాశాసనం వర్తించదు. పిల్ల పెరిగినతర్వాత వరుణ్ణివెతకి గర్భాధానం చెయ్యవచ్చును."

జమీందారు:—"ఇది శాస్త్రసమ్మతమేనా ? కత్తికిచేసినపెళ్ళి పెళ్ళిఅనిపించుకుంటుందా?"

అందుకు రామిశెట్టికంటె ముందు గోపాలశాస్త్రిలులేచి:—"అదిసరే. అట్లాచెయ్యవచ్చు. పూర్వం చిత్రాంగికి ఇట్లాచేసి సారంగధరునికి బదులు అతని తండ్రికి కట్టబెట్టారు. ఒకరాచకన్యకను కత్తికి పెండ్లి చేసినట్టూ తర్వాత ఒకపామును మగడుఅని చూపినట్టూ పాముపాటలోకూడాఉంది. మగవాళ్లకు రెండు పెళ్ళిళ్ళకంటే జాస్తికూడదంటే అరటిచెట్టును మూడో పెళ్ళాంగా చేసుకొని, నాలుగోపెళ్ళికి పిల్లకు దేవులాడుతారు. అయితే ఒకపనిజరిగిస్తే శాస్త్రయుక్తం అవుతుంది" అన్నాడు.

జమీందారు:—"అదికూడ చెప్పచూదాం."

గోపాలశాస్త్రిలు:—"పసిపిల్లలకు మంత్రాలతో గర్భాధానం చేస్తున్నారాలేదా? అలాగే మొదట భావ్యంకట్టినకత్తే తర్వాత ఏర్పడిన వరుడుకావలె. అందుకుగాను పెళ్ళికాలమందు మంత్రపూర్వకంగా కత్తికి రాముడనో, లక్ష్మణుడనో పేరుపెట్టి తర్వాత ఏర్పడేవరునికి ఆపేరును మంత్రపూర్వంగామార్చి, ఆకత్తిని వాడు సదా వాడుకొనేటట్టు చేస్తే సరిపోతుంది."

రామిశెట్టి:—"పెద్దకత్తిని రాత్రిపగలు మోసేది యెట్లాగు. చిన్నబాకుఅయితే జంధ్యంలోఅయినా వేసుకోవచ్చు లేకపోతే మొలత్రాటికైనా కట్టుకోవచ్చు. నేను చెప్పిందానికి ఈసవరణ చేసుకొంటాను."

ఈయుక్తి గంగాధరరాజుకు నచ్చింది. షెబాస్ అన్నాడు. అంతకంటె పైయుక్తి యెవరయినా చెప్పగలరాఅని సభవారిని ఆయన అడిగాడు. ఎవరు లేవలేదు. నోరు తెరవలేదు. "పతకం ఎవరికి ఇవ్వవలె"నని జమీందారు అడిగినాడు. రామిశెట్టి తనకురావలెనన్నాడు. గోపాలశాస్త్రిలు తనదిఅన్నాడు. గంగాధరరాజు ఒకజోడాచేయించి యుండినందున, రెండో పతకంగూడా తెప్పించి, ఒకటి రామిశెట్టికి రెండవది గోపాలశాస్త్రిలకు సభలో బహుమతిగానిచ్చి వారిని మెచ్చుకొన్నాడు. అప్పటినుంచి కత్తికి భావ్యంకట్టి చిన్నపిల్లకు పెళ్ళిళ్ళుచేస్తున్నారు. పిల్లపెద్దది అయ్యేలోపల తగిన వరుణ్ణితెచ్చి శాస్త్రోక్తంగా సంధానం జరిగిస్తారట. ఈపెళ్ళిళ్ళలో శాస్త్రోల్లంఘనలేదు. శాసనోల్లంఘనలేదు. ఇదేవిధంగా మన హిందూమతమునకు ఎన్ని అవాంతరాలువచ్చినా లొంగక తల యెత్తి తిరుగుచున్నది. రాజ్యపరిపాలన చేయుచుండిన హూణులను సిథియనులను క్షత్రియులుగ గైకొన్నది. పూజలు చేయుచుండిన ద్రావిడులను బ్రాహ్మణులలో చేర్చుకొన్నది. వర్తకముచేయుచుండిన అనేకతెగలు వైశ్యులైరి. బౌద్ధమతసిద్ధాంతములు పురాణమతములో అంతర్భూతములైనవి. భిన్నమతములు భగవద్గీతవలన సమన్వింపబడినవి. అనాదిభారతీయులయు ద్రావిడులయు దేవతలు త్రిమూర్తులలోనో వారి భార్యలలోనో చేరిపోయిరి. యువతీవివాహములుపోయి బాల్యవివాహములు వచ్చినకాలములో ఉపాయములు శాస్త్రాధారములు దొరికెను. ఇదియేనా సనాతన ధర్మము?

# మబ్బు

అష్టావధాని వడ్డాది సీతారామాంజనేయులుగారు

ఆస్రవంతులలోనుండి యబ్ధినుండి
స్వచ్ఛశీతలశీకరవ్రతతిఁ దెచ్చి
దప్పిచే స్రుక్కి శోషించి తల్లడించు
నించు విరిబంతులను దనియింతునేను.

మట్టమధ్యాహ్నమందుఁ గన్పట్టు నుజ్జ్వ
లాతపప్రభాప్తి విశీర్ణమై తపించి
స్వప్నసుఖమునఁ దూఁగు జొంపాలకెల్ల
నంతరించెద లేఁత క్రొంజాయులేను.

నే విహంగమనాటచే నావినీల
పక్షయుగళమ్ము విదిరిచి పక్షితతులఁ
దుహినకణసేచనమున నిద్దురను లేపి
యెర వెదకికొనఁ బంపెద నెచటికేని.

పచ్చలలరారుపేరుసాం పచ్చపడఁగ
వసుమతీభామినీదేహవల్లి నెల్ల
వజ్రసమకరకామహాప్రహరణప్ర
హారనై శైత్యమున వెలరారఁ జేసి
స్ఫాటికద్యుతు లొలయించి చతురలీల
వడిగ వర్షోపలమ్ములన్ వానఁ గలిపి
మెఱసి నే నవ్వుకొందు చిట్టుకుములురల.
కుధరశిఖరోపరిని మంచుకురిసికురిసి
తద్గిరిస్థితఘనదేవదారువృక్ష
భయదనిస్వనపటలమ్ము ప్రబలుచుండ
నచలశృంగమె దిండుగా నానుకొనుచు
సరళవాయుబాహార్గళ శయ్యఁ జేరి
స్వాంతమలరారఁగా నిదురింతునేను.

ఇంద్రనీలమణిప్రభాసాంద్రమగుచుఁ
బరఁగు మత్సౌధగోపురోపరితలమునఁ
బటుమహత్తరగంభీరభావమొనఁగఁ
దనరుచుండు విద్యున్మార్గదర్శికుండ ;
శృంఖలితమైన స్వనితమ్ము రెచ్చిపోయి
మద్గృహాభ్యంతరస్థతమఃప్రపూర్ణ
భాగమందున నున్మాదరోగ మగ్గ
లింప సంక్షోభమంది ఘోషింపఁ దొడఁగె.

వితతవారాశిమీఁద, నీ విపులమీఁదఁ
జంచలామార్గదర్శి యుదంచితగతిఁ
బేర్మిమై నాకు బాటఁజూపించు చుండు ;
అతిగభీరకరాళ మహాబ్ధియందు
వఱలు వనదేవతా మోహావశ్యుఁడగుచు
గుట్టలందున, సెలయేళ్లపట్టులందుఁ
గొండలందున, నందమౌ కొలఁకులందు
బయళులందున, నదనదీచయములందు
నెందుఁ దనబుద్ధిఁ బఱపిన నందు నందు
నంబుతతియందొ లేకయేయుద్రులందొ
యెందుఁజూచిన నందందె విందుగాఁగ
మన్నియంత, తటిన్నామమండితునకుఁ
దనమనోహరి వనదేవతాలలామ
మించు వేడుక సాక్షాత్కరించు చుండు.

ఆ వినీలవియద్దరహాసనిర్మ
లప్రసారప్రసాదాప్తి లలితరీతి
నే నలరుచుండ, సౌదామినీ నియంత

వరుణతరుణవిలాసినీవరహృదంత
రాళమందు విలీనమై గ్రాలుచుండు.

ప్రొద్దుపొడుపుఁగెంజాయలు పొదవుసూర్య
ధూమలద్యుతి తోరమై యామునొసఁగ
బాలపులినాలు తురాయిసొంపులు వెలార్చ
వెలయువిన్నాణికము తన లలితకిరణ
వితతి నాళాంతములను సంభృత మొనర్చ,
నేఁడు జక్క నిస్తేజమై వీగువేళ,
వీప్సహెచ్చి మచ్చరమాంగవిపులతరణి
నధివసించి యుల్లాసమ్ము నధిగమించి
కొండకొమ్మున నొకచోటఁ గ్రొంబసిండి
తెక్కడోయి తేకులనెల్లఁ జక్కదిద్ది
యద్రి భూకంపమున నూఁగి యల్లలాడు
తరుణమునఁబ్రాలి క్షణముమాత్రమె వసించు
విహగపతికై వడిని విజృంభించుచుండు.
క్రింద నర్ణవమునఁ దులకించుచుండు
చిత్రవర్ణవైవిధ్యవైచిత్రినుండి
యస్తమయకాంతివితతి, మోహాతిశయ,మ
మేయశాంతియుఁ బ్రబసరింపఁజేయువేళ,
ఘనగభీరాంబరోర్ధ్వభాగమున నుండి
కటికి చెంగావి తగటుదుప్పటముజాఱి
క్రుంకుసంజనిమ్మగఁ గ్రమ్ముకొనెడువేళ,
నస్మదీయ పావనకులాయమ్ము నందు
ముకుళితపత్త్రయుక్తి నామోద మంది
కుదురుగా గ్రుడ్లుపొదివెడు గువ్వవోలె
శాంతహృదయంబుతో విశ్రమింతు నేను.
'శశి' యనుచు దేని మానవసంఘమెల్లఁ
బిలుచుచుండునొ యనురాగ విలసనమున
నాసుధాంశుబింబానన, యావినూత్న
లలితచక్రాంగకుచభరాలస, సుమాంగి
[illegible]దనూనదాలనమున విరళమైన
మన్మృదూజ్జ్వలతారాలికామంజులోర్వి
విమలకర్పూరదీపికావృతకరాబ్జ
యగుచు నడుగుఁ జెంగల్వల నల్లనల్ల
దళుకుబెళుకులు గులుకంగఁ దారుచుండుఁ
దమ్మరల నడురేయి వీతెంచుచుండ.

అమరులకె వినవచ్చు నాయుమయదృశ్య
రణదమలపాదఘటనభారమున నస్మ
దీయవిరళశిబిరపటోద్దీప్తతంతు
నిచయ మెచట విచ్ఛిన్నమౌ నచట నామె
చరమభాగమ్మునందుండి సరసలీలఁ
దక్కుచును, దారుచును జూచు తెక్కచాలు
హేమభృంగాళికై వడి నెగసిపర్వఁ
గ్రందుగాఁగాంచి యెదనవ్వుకొందునేను.

వాయునిర్మితమౌ నస్మదీయశిబిర
రంధ్రముల విస్తరింప నీరంధ్రమెడసి
పడిన శకలమ్ములోయన వారినిధులు,
సరసతతులు, మందాకినీ సంచయములు
ప్రౌఢతారకాచేటికావళినిఁ గూడి
యలరురేరాణినడలతో నందగించు.

భాస్కరుని రత్నపీఠికాభరణగరిమ
లీల నుజ్జ్వలపరిధిఁ గల్పింతునేను;
అనుఁగుజాబిల్లి కాణిముత్యాలసరుల
లలితమౌ మేఖలనుగూర్తు నెలమితోడ ;
దారుణమ్ముగ సుడిగాలి మేరమీఱి
మత్ప్రతాపోజ్జ్వలవిజృంభమాణగతుల
మసకదేఱు జ్వాలాముఖీమండలములు ;
అభ్రభాగమ్మునందుఁ బరిభ్రమించి
వడిగ నీదులాడుచునుండు నుడుగణములు.

అశరీభూమ్యగ్రమాదిభూమ్యగ్రపరిమి
తావకాశమ్మునందు నేత్వాకృతిఁ గొని
భయదభీషణకల్లోలవార్ధి మీఁదఁ
జండరవ్యాంశుతతి కభేద్యుండ నగుచుఁ
బర్వతప్రచయములె కంబములుగాఁగ
నమరియుండెద నాచ్ఛాదనముగ నేను.

మత్సముజ్జ్వలదివ్యసింహాసనాధి
కారసంబద్ధులై వాయుకలిత శక్తు
లన్నియునునాకు సామంతులగుచుఁ గొలువ
జ్వలనతుహిననిర్ఘాతఝంఝాప్రయుక్తి
విభవమున నేను గమియించు విజయతోర
ణమునుమీఁ మించు నీరతనాల విల్లు.

ఊర్ధ్వగతినున్న బాలమయూఖనిర్మి
తేంద్రచాపద్యుతుల్ గగనేందిరకును
నిరుపమానశోభను గూర్చు తరుణమందు
నార్ద్రజగమెల్లఁ గలకల లాడుచుండు.

వసుమతీసాగరులకూర్మిపట్టినయ్యు
నింగియనుదాదిచేతి నిసుంగునైతి;
నంబుధిజలంబులందు నైక్యంబుఁ జెంది
పృథులభూభాగములయందు నింకిపోయి
మార్పుఁగందునె కాని నే మ్రంద నెపుడు.

వృష్టిపాతమ్ము తుదముట్టి వియదుదీర్ణ
మండపము నిష్కళంకమై యుండువేళ,
భానురోచిర్వి మిశ్రితవాయువీచి
కాళి మధ్యోన్నతప్రభాపాళి నెరపి
నీలమౌ వాయుగోళముఁ నిల్పువేళ,
సస్మదీయశూన్యసమాధి నరసి నగుదు;
గర్భకోశమ్ము వెలువడుకందు పగిదిఁ,
ప్రేతగృహమును వీడెడు భూతమట్లు,
వృష్టితుహారశవాటము వెడలివచ్చి
యుత్థితుఁడ నౌచు గోళమ్మునూడ్చి వైతు.

(షెల్లీరచన కనువాదము)

# ప్రేమ

శ్రీమతి అమృతవల్లిగారు

పంకజం విద్యావతి సుగుణసంపత్తుకలది. అందమైనటువంటి యువతి. ఎం. ఏ. పరీక్షకు తయారగుచున్నది. ఆమె ఒకరోజు గదిలో కూర్చొని పరీక్షనుగురించి ఆలోచిస్తూన్న సమయంలో టెలిగ్రాఫి బంట్రోతు టెలిగ్రామ్, తీసుకొచ్చి ఇచ్చాడు. పంకజం హడావిడిగా విప్పిచూసింది. ఇంకేముంది, ఆమె గుండెలు నీరయిపోయినాయి. టెలిగ్రామ్ బల్లమీదపడేసి కర్తవ్యమేమిటాయని విచారించుచూ కుర్చీలో చతికిలపడింది. ఇంతలోకే కుముదం తలుపుతట్టింది. పంకజం కుముదయని గ్రహించికూడా అలాగే కూర్చొన్నది. ఏంచేస్తుందిపాపం, తలుపు తియ్యక తప్పిందికాదు. తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో, లోపలికి ఆహ్వానించింది.

కుముదం లోపలికి వచ్చీరాకమునుపే "నీకేమైనా మతిపోయిందా ఏమి? ఫోటోకి అంతా సిద్ధమయ్యారు. నీవు రాలేదని తెలుసుకొని, ప్రిన్సిపాల్, నిన్ను తీసుకు రమ్మని నన్ను పంపించాడు, వెంటనే రావాలిసిం"దని చెయ్యిపట్టుకొని లాగడం మొదలెట్టింది.

హీనస్వరంతో "రాలేను క్షమించు" అన్నది పంకజం. "ఏం! అట్లా ఉన్నావ్" అని అడిగింది కుముదం.

"ఆ! ఏమీలేదు." అంటూ తిరిగి నవ్వు ముఖంపెట్టి కులాసాగానే ఉన్నాను"అన్నది.

"ఈ ఖబుర్లన్నీతీసి అవతలపెట్టుదూ నే నమ్మనులే నిజమైనసంగతేమిటో చెప్పు మనమిద్దరం చిన్నప్పటినుంచి స్నేహంగా ఉన్నామ్ ప్రతియేడు తప్పకుండా ఎం. ఏ. వరకు వచ్చాం. నన్ను నమ్మవా? మిత్రద్రోహం చెయ్యకు" అంటూ బ్రతిమాలటం మొదలెట్టింది.

"ఏం, లేదు పరీక్షకు వెళ్లదలచుకోలేదు. అందువల్ల ఫోటోకి రాను" అన్నది పంకజం.

"క్లాసులోకల్లా 1st class లో pass అవుతావని అందరం అనుకుంటూంటే పరీక్షకు వెళ్లనంటావే బాగుంది. పిచ్చిపిచ్చివేషాలు పోవాకు, లేచిరా" అన్నది.

"నీకు తెలీదు, వెళ్లు. ఫోటో మించిపోతుంది. ముమ్మాటికి రా"నని చెప్పింది.

కుముదానికి ఈ గొడవంతాచూస్తే ఏమీ అర్థంకాలేదు. ఏం చేస్తుందిపాపం. పరిపరివిధాలపోయింది మనస్సు. పరిస్థితులన్ని ఆలోచించింది. ఈమె ఈవిధంగా ఉండటానికి, పరీక్షకు పోకుండాఉండటానికి, ఎంత ఆలోచించినా కారణం తోచకుండా ఉంది.

ఎన్నివిధాల ఆమెచేత కారణం చెప్పిద్దా మన్నా చాతకాకపోయింది.

ఇట్లా రెండురోజులు గడిచాక, మూడో రోజున కుముదం కన్నీరుకారుస్తూ, హీన స్వరంతో "మనస్నేహం ఇంతేకాదూ, చెప్పవుకాదూ!" అంటూ పంకజం గదిలోకి వచ్చింది. పంకజంకు ఇహ చెప్పకతప్పింది కాదు. ఎవరితోకూడా చెప్పనని ఒట్టు వేయించుకొని, తనచెల్లెలుదగ్గరనుంచివచ్చిన టెలిగ్రామ్ చేతికిచ్చింది.

టెలిగ్రామ్ చాలా విషాదకరమైంది. దాంట్లో, పంకజం బావగారైన కృష్ణా రావుకు, రాచకురుపు లేచినదనిన్ని, ఆపరేషన్ చేసినగాని బ్రతుకడనిన్ని, ఆపరేషనుకు కావలసినంత డబ్బు తనవద్ద లేదనిన్నీ, తను పంకజానికి చదువుకు సహాయము చేయలేకపోగా, తిరిగి సహాయమడుటకు చింతిల్లు చున్నాననియు, కనీసము నూట ఏబదిరూపాయలైన సహాయముచేసి,భర్తను బ్రతికింప వేడుచున్నాననియు వ్రాసి యుండెను.

పంకజం, ఇన్నిరోజులనుంచి జాగ్రత్తగ పరీక్షకు దాచినసొమ్ము, నూరురూపాయలు. Pass book కూడ కుముదానికి చూపించింది. ఇదా సంగతన్నది. కుముదం పరిస్థితులు అర్థంచేసుకొని తన స్నేహితురాలికి, ఇన్ని కష్టములు వచ్చినందుకు చింతించుచూ, "సరే వస్తానని" వెళ్ళిపోయింది.

తనగదికి వెళ్ళిందగ్గరనుంచి, ఆమెకు ఏం తోచిందికాదు. పంకజాన్ని ఈక్లిష్టపరిస్థితులలోనించి తప్పించటం ఎలాగా యని ఆలోచించటం మొదలెట్టింది. ఏం తోచిందికాదు. చివరకు తనమేనమామకొడుకు శ్యామ సుందరందగ్గరకు వెళ్లటానికి నిశ్చయించింది.

శ్యామసుందరం, సుందరపురుషుడు అపారమైన బుద్ధికుశలత కలవాడు. నవ నాగరికుడు M. A. pass అయి ఉత్తరోత్తర పెద్ద నౌకరీలోకి రావచ్చుననే ఉద్దేశముతో, బ్యాంకులో గుమాస్తాగా పని చేయు చున్నాడు. అతనికివచ్చే పదిరాళ్లూ, కులాసాగా ఖర్చుపెడుతూ కాలంగడుపు చున్నాడు.

ఆరోజు శెలవుదినం అగుటవల్ల కూని రాగాలుతీస్తూ, పడకకుర్చీలో పడుకొని, అతనికి రేపు బ్యాంకుఇచ్చే బోనసును, ఎట్లా ఖర్చుపెడదామా యనికాబోలు, ఆలోచిస్తుండగా ఇంతలోకే కుముదం హాజరైంది.

"ఏమోయి బావా! ఎప్పుడుచూసినా, శతమన్మథుడులా గుంటావ్."

"నీకంటికట్లాగే అవపడతా మరి." కులాసాగానే. రేపటిరోజుగురించి ఆలోచించే వాణ్ణికాను. దిగులు విచారం అనేది నామనస్సుకెక్కదు. ఏదో జరిపేస్తుంటాను రోజులు."

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?"

"ఏముంది. రేపు బ్యాంకువాళ్లు ఇచ్చే బోనసు ఎట్లా ఖర్చుపెడదామని."

"ఏం కొంటావ్?

"ఒక వీణకొని కులాసాగా వెన్నెలరాత్రిళ్లల్లో మేడమీద వాయించుకుంటూ ఆనందిద్దామని"

"అయితే పెళ్లిమాట ఆలోచించటం లేదు?

"పెళ్లెందుకమ్మా? భార్యవచ్చిందగ్గర నుంచి ఇంట్లో ఉప్పులేదు, పప్పులేదు, నగలు లేవు, నాణ్యాలు లేవు అంటూ పోట్లాటేగా. ఇదయితే ఆ గొడవంతా ఏమీఉండదుగా."

"సరే లేద్దూ ఈ ఖబుర్లకేం తప్పక కొనాల్సిందే?"

ఇట్లా మాట్లాడుతుండంగానే కుముదం ముఖంలో మార్పు సుందరం గమనించాడు.

"ఏం! నిమిషంలో మారిపొయ్యావ్"

"ఏంలేదు! ఏంలేదు!" అంటూ కులాసాగా అవపడటానికి ప్రయత్నం చేసింది.

ఏదోకష్టంలో ఉన్నట్టుగ్రహించి, సుందరం చెప్పేదాకా వదలిపెట్టలేదు.

చెప్పక తప్పిందికాదు, కుముదానికి; ఉన్న విషయం అంతా పంకజంను ఇదివరలో కలుసుకొని మాట్లాడిన సంగతులన్నీ అతని జ్ఞాపకంరావటం మొదలెట్టినాయి. మొట్ట మొదట పంకజం బ్యాంకుకు రావటంపోవటం చూచాడు. తర్వాత కుముదంతో వచ్చినప్పుడు పరిచయం అయింది. అప్పటినుంచి ఏదోవిధంగా మాట్లాట్టం మొదలెట్టాడు. పరిచయం జాస్తిఅయినకొద్ది బుద్ధికూడా మారిపోయింది. తనప్రేమను ఆమెకు వెలిబుచ్చాలని చాలా ప్రయత్నాలుచేశాడు. ఒకరోజున ఆమె బ్యాంకుకు వచ్చినప్పుడు, Pass bookతోపాటు ఒక ఉత్తరాన్నికూడా ఇచ్చాడు. పంకజం ఇంటికొచ్చి ఉత్తరం చూసి, నవ్వుకొని చింపి పోస్టులో మళ్లీ పంపించింది. సుందరం చించిన ఉత్తరంచూచి నిర్ఘాంతపొయ్యాడు. అప్పటినుంచీ ఏంచెయ్యటానికీ తోచలేదు. సరే సమయంవచ్చింది కదాయని సహాయం చేయటానికినిశ్చయించి తనపేరటఉన్న బోనసు నామె ఎకౌంటుకు transfer చేశాడు.

మరుసటిరోజునుంచీ పరిస్థితులు ఎట్లా మారుతాయో చూదామని శెలవు తీసుకొన్నాడు.

సుందరానికి ఎట్లాయితే ఉద్దేశంఉందో పంకజానికికూడా, సుందరంమీద మనసుంది. చదువు పూర్తికాలేదనే ఉద్దేశంతో చనువీయలేదు. చింపినఉత్తరం పంపినదగ్గరనుంచి సుందరం ఏమనుకుంటాడోయని భయపడుతూ ఉన్నది. తనచెల్లెలకు బ్యాంకులో ఉన్న డబ్బయినా పంపిద్దామని బ్యాంకుకు వెళ్లింది. అక్కడ మామూలుగా ఇచ్చే సుందరం లేడు. మరీ మంచిదికదా అనుకొని కొత్తగుమాస్తా దగ్గరకెళ్ళి తన ఎకౌంటులో నూరురూపాయలున్నవి. ఆమొత్తంఅంతా ఇవ్వవలసిందని కోరింది.

గుమాస్తా ఎకౌంటుచూచి ఆశ్చర్యంతో ఎగాదిగాచూచి నూరురూపాయలుకాదు.

రెండువందల రూపాయలున్నాయి" అని చెప్పి డబ్బు ఇచ్చేశాడు.

ఆమిగతా నూరురూపాయలు ఎవరు వేశారు ? ఏమిటని ? ఆశ్చర్యంగా అడిగింది.

ఆవిషయం నాకేమీ తెలీదు. బ్యాంకులో డబ్బువేశేవాళ్లువస్తే వారిని ఈవిషయాలు ఏమీ అడగం. ఇచ్చేటప్పుడు మట్టుకు తెలుసుకుంటామ్, అదీసంగతీ తీ సి కె ళ్ళమన్నాడు.

కాశేపు పస్తాయించి, బాగానే ఉందనుకొని ఎవరువేశింది తెలుసుకోలేక ప్రస్తుతం పని గడుస్తుందిగదా అనుకొని, తర్వాత ఎవరు వేశిందీ తెలిస్తే వారికి అప్పు తీర్చొచ్చు గదాయని డబ్బుతీసుకొని చెల్లెలకు కావలసిందిపంపి మిగదాతీసి పరీక్షరుసుము కట్టింది.

జరిగిన వృత్తాంతముంతా పంకజం, కుముదంతోటి పూసగ్రుచ్చినట్లు చెప్పింది. సంగతులన్నీ ఇదివరలోనే తెలిసిందికనక చిరునవ్వు నవ్వింది.

కొన్నాళ్లుపొయ్యాక కుముదం శ్యామసుందరం గదికివెళ్ళి "వీణకొన్నావా ? కొంచం వినిపించు ?" అని ఎగతాళిగా మాట్లాడటం మొదలెట్టింది.

సుందరం సిగ్గుపడి తలవంచుకొన్నాడు.

కు ము ద ం అతని ప్యాస్‌బుక్కు తీసి, "నీబోనస్సు ఏంచేశావో నాకు తెలుసులే" అన్నది.

సుందరం నవ్వాడు.

కుముదం, పంకజం 1st class లో pass అయ్యారని results తెలిశాయి.

కుముదం పంకజంతో అన్ని విషయాలు చెప్పింది.

ప ం క జ ం సుందరాన్ని క్షమించమని కోరింది

క్షమించటానికన్నా మీరు భార్యాభర్తలయితే బాగుంటుందన్నది, కుముదం.

పంకజం, సుందరం ఒకర్నిఒకరు తెలుసుకున్నవారగుటచేత కుముదం కోరికప్రకారం మరునాటినుంచి భార్యాభర్తలై కులాసాగా కాలంగడపటం సాదించారు.

# క్రిమినలు కేసులగురించి

'అనసూయ'

( మగని చెవిలో )

ఏమండోయి! అనుకున్నంతపనీ అయిందటే! ఏమిపనా? అప్పగించేసేరట! ఏమిటప్పగించేరమా? కన్నన్నాయిశిని ఖైదుకి వప్పగించేసేరట మీరు!

'అవును. ముంశ మేజిస్ట్రీటు పోలీసువారికి భయపడి అలాగు చేసేడుగాని అప్పీలులో అరనిమిషంలో తిరిగి పోతుంది.'

ఆమామూలు ఊకదంపుడు ఉత్తరక్రియమాటలు పల్లెటూరి పార్టీలైనా నమ్మరుగదా, పట్నవాసం వకీలుపెళ్లాన్ని నేను నమ్ముతానా? మీ మీసాలు తిరగాలిగాని అప్పీలులో శిక్షలు తిరగవు!

నేను చెపుతూఉన్నానుకానూ వద్దండీ యీ క్రిమినలు కేసులని! వీడికాళ్లూ వాడికాళ్లూ పట్టుకొని ఈమేజిస్ట్రీటునీ ఆమేజిస్ట్రీటునీ ఆశ్రయించి పగలనకా రాత్రనకా తిరిగి ఆవూరూ యీవూరూపోయి తిండికీ తిప్పలకీ నానాయిబ్బందులూపడి, ఆసాలలోనూ యీసాలలోనూ బసచేసి, ఒంటికిరోగాలు తెచ్చిపెట్టుకొని తీసుకువచ్చేది నాలుగురాళ్లు! ఆఖరుకు ఇలాంటిచురకేదోపడిపోయి 'వీడిది అమృతహస్తంరా' అని ఆజన్మాంతం అందరినోళ్లల్లో పడిపోయిఉన్నది కూడా ఊడిపోవడానికి తప్ప ఇటువంటికేసు లెందుకు చెప్పండీ!

మీరు అలాగు కచేరీనుండి క్లబ్బుకు సన్నసన్నంగా చపాయించినారు కాబోలు గాని ఆపార్టీవాడి మనుష్యులువచ్చి ఇక్కడ మీగుమాస్తాతో ఎంత ఘోష పెట్టేరో తెలుసునా? ఇరుగువాళ్లూ పొరుగువాళ్లూ ఊరుడూ రదూ మూగేసేరు! ఆవచ్చినపార్టీలలో ఒకడన్నాడుగదా, "అడికేసెల్లిందిరాక్రిమిలి! ప్రతీవోడికీ పట్టాయేనా?" ఆమాటలు వినేసరికి మీ క్రిమినలు ప్రాక్టీసుకి ఈరోజుతో నీళ్లధారగదా అని నాకు తోచింది! కొత్తనీరువచ్చి పాతనీటిని కొట్టేసి రెండూ సముద్రంలో కలిసిపోయినట్లు అయిపోతుందేమో మీ అసలు ప్రాక్టీసని నాకు దిగులుపుట్టింది!

అక్కడికీ పాపము మీగుమాస్తా సముదాయింపు మాటలు చెపుతునేఉన్నాడు గాని కార్యమేమిటి? కాలంచేసినవాడికి గరళం పోసినట్లయిపోయింది! అప్పుడుజరిగిన సంభాషణ వినాలిగాని చెప్పలేము! ఏమిటిజరిగిందా?

మీగుమాస్తా అన్నాడు. "వెధవతీర్పు పద్ధతికి శుద్ధవిరుద్ధమన్రా! యెర్రపాగా అంటే యెటువంటి మేజిస్ట్రీటుకీ భయంకదూ? అందుచేత యిలాగైంది గాని అప్పీలులో మరి పోలీసువాళ్ల పప్పుడకదులెండి! ధొరకి యిలాంటి భయాలుండవు! వాడుముక్కుకి నూటిగాపోతాడు!"

పార్టీ:—"ముక్కునూటిగాయెల్లి మూడుమూడునెల్లు ఖైదేసేడు! ఆడుముక్కునూటిగాయెల్లి ఆరునెల్లిస్తాడేమో!"

మీగుమాస్తా:—"అలాచేస్తే వాడికి హైకోర్టువారు పిలకసాగతీసేస్తారు! శిక్ష హెచ్చుచెయ్యడానికి వాడికి పవరులేదు!"

పార్టీ:—"అడిపిలకమాటటుణ్ణిగాని మావోడిపిలక నిగిడిపోతుందికద!"

మీగుమస్తా:—"పోవోయ్! ఛార్జీ లేకుండా కొట్టివలసిన చచ్చుకేసుకు చార్జీ డిఫెన్సు కావలిసొచ్చింది!

ఏమికాలం? ఈముష్టికేసుకు ఖైదా? ఇలాంటివి ఈయేడాదిలో మాపంతులుగారు యిరనైవడిపించి కొట్టించేసేరు!"

అప్పుడొక డన్నాడు:—"ఆశ్లోకామోనురా మనకి రాజమహేంద్రంలో కనపడ్డారు!"

మీగుమాస్తా:—"నీమొగం! వాళ్ల దావూరుకాదే!"

పార్టీ:—"అవును. యిటువైపు జాగాలేక ఎగువకు కట్టేసుంటారు!

మీగుమాస్తా:—"ఓయి రామినాయుడూ! ఎందుకా కిట్టని దొంగమాట లాడతావు? నీ బారిష్టరు వకీలు గారికి కేసివ్వలేదనా అలా పేల్తున్నావు! నీబారిష్టరు మొన్నను కట్టించేసేడుకదూ పేనంత కేసు భేతాళం చేసేసి? రామినాయుడుతో ఏమిటి గాని సంగన్నాయుడూ! కష్టపడి శక్తివంచనలేకుండా వకీళ్లు పనిచేస్తారు గాని మేస్త్రీటు కలంపట్టి రాయించగలరూ? తెలివితేటలతో చెప్తారుగాని వినేవాడికి బుద్ధిలేకపోతే వీళ్లేమిచేస్తారు? వకీళ్లు వాళ్ల శక్త్యానుసారంవాళ్లు పనిచెయ్యడం, తర్వాత—"

అంటూఉంటే ఆరామినాయి డందుకున్నాడు:—"తర్వాత పార్టీలు వీళ్లకర్మానుసారం వీళ్లు కొట్లో పడిపోవడం! ఏంయేదాంతపు ముక్కలు సెప్తావయ్యా! యేదాంతానికిటయ్యా యీఫీజులుచ్చుకోడం?"

మీగుమాస్తా:—వేదాంతం కాదోయినాయుడూ! లోకరివాజు చెపుతున్నాను. దానికేంగాని, సంగన్నాయిడూ! అపీలు పెడదాం! వకళ్లకీ ఖర్చులకీ సొమ్ము తే."

సంగంన్నాయుడు:—"ఇక్కడింతైంది! ఇంకా అపీలెడతావు!

మీగుమాస్తా—"అలాగనకు! నిజంగా చెపుతున్నాను విను! అపీలులో గుండెమీదగుద్దినట్లు తిరగకపోతే నాపేరుకాదను!

సంగంన్నాయుడు—"ఇక్కడ గుద్దినారుకాదూ మేస్త్రీటుకు మాకేసి మాగుండెమీద!"

మీగుమాస్తా:—"సంగన్నాయిడూ! ఒకకల కనగానే తెల్లవారిందిటోయి!"

సంగం:—"ఇంకా ఎన్ని కలలుగనిపించి ఎందరికి జైలుచూపిస్తావయ్యా!"

మీగుమాస్తా:—"అది కాదోయ్! కష్టాలుండిపోవు! రాత్రి తెల్లవారకమానదు! అలాగే శిక్షలుకూడా నిలవవు అని నేనన్నది!"

రామినాయిడు—"ఔను! అనుభవమైపోతే మరేటి నిలుసుంటాయి!

మీగుమాస్తా:—"సరి! యీమాటల కేమిగాని అపీలు వెంటనే పెట్టి బెయిలుపుచ్చుకోకతీరదు, కాబట్టి సొమ్ము వేగమియ్యి!"

సంగంన్నాయిడు:—"ఆమాటొదలవుగదా! సొమ్మెక్కడిప్పుడు జతపడుతుంది? ఇక్కడెలా అప్పు పలుకుతుంది? మావూరు దగ్గిరాదాపలా? మీరు పెట్టండయ్యా యెనకనుం డిచ్చేస్తాం పువ్వుల్లో పెట్టి!"

మీగుమాస్తా:—"వెనకవెనకే! పార్టీలసంగతి మాకు తెలియదూ? ఈగుమాస్తాగిరిలో నాతలా, ప్లీడరీలో మా పంతులుగారితలా తెల్లబడిపోతూ ఉన్నాయి!"

రామినాయిడు:—ఇలాంటి శిక్షవేయిస్తే యెంద్రుకలు తెల్లబడక నల్లబడతాయటయ్యా! ఇన్నివాళ్లకే యెంద్రుక తెలిసిపోతూంటే యేయించినవాళ్ళకెలాగవుతాయి! చాలులేవయ్యా, సొమ్మిస్తగుతావిప్పుడు! ఎక్కడుంది సొమ్ము! మదుపెట్టవయ్యా! ఎక్కడికి పారిపోతాము మీసొమ్మెగేసి? పారిపోకుండా ఒకడిసి అప్పుసెప్పవుగద! అడినిడిపించుకొండి! సొమ్ము పుచ్చుకొండి! ఈతరానోడిని సెల్లో తోసేసి సేపలుపట్టమన్నట్లుంది నీమాట!

గుండె నీరిడిసిపోతూంటే డబ్బు తెమ్మంటావు! చాలుచాలు, సిగ్గూరుకోవయ్యా!"

మీగుమాస్తా:—"సిగ్గెందుకు మాకు! ఇదేం రండుతనమా? దొంగతనమా?

రామినాయిడు:—"రెండిట్నీమించిన దోపిడి నా గుంది నీయేపం."

మీ గుమాస్తా:—"మధ్యనున్న మంత్రసాని గండమన్నట్లు నామీద ఎందుకోయి కోపము? ప్లీడరుగారు వస్తారు; వారితో చెప్పు! వారు ఖర్చులు మదుపుపెడితే నేను వద్దంటానా?"

సంగన్నాయిడు:—ఒస్సి! ఎంతట్లోనువ్వూ నీ ప్లీడరూ భేదమయ్యా? పోనీ, ఏరయ్యా ప్లీడరుగారు?

గుమాస్తా:—"క్లబ్బు కేళ్లేరు; చీకటి పడేసరికి వస్తారు."

సంగన్నాయిడు:—"పేక్కి ఊరేసేసి కమ్మగా కూకున్నాడు గావాల కబ్బులో! ఎల్లి పిలవ్వయ్యా! ఇలాంటప్పుడైనా కట్టనుకాలనుకొందికి లేకపోతే మరెందుకయ్యా బుట్టేడు రూపాయలిచ్చుకోడం?"

గుమాస్తా:—"క్లబ్బులోనికి వెళ్లడానికి వల్లకాదు. అక్కడ కలక్టరూ మూపరెంటూ మునసబూ మేస్రీటూ ఇలాంటి పెద్ద పెద్దవాళ్లంతా ఉంటారు. వారిమధ్యను కూర్చుంటే పంతులిని ఎలాగు పిలవడం? పిలవడానికి వెళితే కోపగిస్తారు!"

సంగన్నాయిడు:—"ఎందుకయ్యా యీ వోకీళ్లు అళ్లతో టప్పాలు కొట్టుకొని తిరగడం?"

గుమాస్తా:—"నీకేం తెలుస్తుంది? వాళ్ల పరిచయముంటే పకీళ్ల కెంతపలుకుబడి! కేసులలో ఎంత లాభం!"

రామినాయిడు:—"మేస్రీటుతో పరిచయమై యింత కొయ్య దింపించేడు! ఇక కలెక్టరుతో పరిచయం చేసి కొయ్యనాగుతాడు! పాలు రమ్మనవయ్యా! పస్తూవుంటే సంకెలు గుద్దినట్లుందీ వోకీలుసంగతి!"

గుమస్తా:—"నేను వెళ్లను. మీరేవెళ్లి పిల్చుకురండి! ఈలోపున నేను అపీలుకు పోయంట్లు నోటుచేస్తూ వుంటాను."

రామినాయుడు:—"ఇప్పటికి శేశినావు కావూ మంచి పాయింటీను!—ఖైదు ల్తొసీడం!—ఇంకేటిసేస్తావు!"

గుమాస్తా:—ఎందుకీ ఊకదంపు? వెళ్లండి వెళ్లండి! పంతులిని పిలుచుకురండి!"

అని మెల్లిగా సాగనంపేసరికి వాళ్లిద్దరూ మీ క్లబ్బుకు వెళ్లేరు కాబోలు; మళ్లా వెంటనేతిరిగి వచ్చేసేరు.

సంగన్నాదన్నాయిడు:—"ఏటయ్యా! ఇటుమొగం ఉన్నవాడు అటుతిరిగిపోయి మరి దించినబుర్ర ఎత్తకుండా పేకాటాడేస్తున్నాడు! బంట్రోతుతో చెప్తే అదు తుళ్లగనిరేసినాడు! తిట్లు తినడానికిటయ్యా తెచ్చి ఫీజాలిచ్చుకోడం? డబ్బిచ్చి తాపులు తిన్నట్లుంది మా బతుకు!"

గుమాస్తా:—"పంతులు కెదురుగుండా కలెక్టరు లేడ్రా?"

సంగన్నాయిడు:—"ఉన్నా, డుంతే?"

గుమాస్తా:—"ఉంటే, వాళ్లిద్దరూ ఒకపార్టీ అన్నమాట. ఆటమధ్యను లేచి వెళిపోవస్తే ఆ కలెక్టరుకి మా చెడ్డకోపం! ఎందుకు వెళిపోవస్తున్నారో తెలిసిందంటే కోపంవచ్చి మర్నాడు వాడేమి చేస్తాడో తెలునునా? నిన్నను ఈ వెధవకేసు గురించి వెళిపోయినాడు గనుక యీరోజున వాడికి బెయిలుయివ్వను అంటాడు! తర్వాత ఎంతచెప్పి బుర్రకొట్టుకున్నా లాభంలేదు! అందులోకీ అఘోర టిక్కెటంకరయ్యకూడాను! కాబట్టి మీరు తొందరపడకండి! పంతులుగా రీ గడియకో

గడియకో వెళిపోవస్తారు! ఈలోపున మీరు భోంచేసిరండి! లేకపోతే సినీమాకి వెళ్ళండి! ఫేమైన సినిమా అవుతున్నాది! లవకుశ టాకీ! వెళ్లిచూడండి! ప్లీడర్లందరో వెళ్తున్నారు!"

సంగన్నాయడు:—"మన పంతులు కూడా యెల్లిపోతాడు కావాల! ఓరి రామినాయుడూ! మనం ఓపాలే తిళ్లకిపోతే మరిదొరకదురో! నువ్వెల్లిరా, నే నిక్కడుంటాను; నువ్వెల్లొచ్చిన తర్వాత నే నెల్తాను."

రామినాయుడు తిండికిపోయేడు. వాడు వెళ్లిన తర్వాత సంగన్నాయడిని కొంచెందారిలోకి తీసుకొని రావడానికి మా గుమాస్తా మళ్లా మొదలుపెట్టేడు.

గుమాస్తా:—"ఓయి సంగన్నాయుడూ! ఆ రామినాయుడుమాటల కేమిటిగాని మా వకీలుగారు నిజంగా పట్టుదలగా దీనిలో పనిచేసేరా లేదా చెప్పు! నీ మనస్సుకి నువ్వుచూచుకో! ఎంత కష్టపడి ఎన్నిలాలు చూసి ఎంత క్రాసు చేసి ఎంత గట్టిగా ఆర్గ్యుమెంటు చెప్పేరో మరి నీకు తెలియదా యేమిటి?"

సంగన్నాయుడు:—ఏటో బాబూ! గావుకేక లేస్తే కార్యమేటి, అధికారికి నచ్చచెప్పాలిగాని, అని రామినాయుడంటాడు.

గుమాస్తా:—"వాడిమొగం వాడికేమి తెలుసును! బొటు గాడిదకొడుకు! మేస్త్రీట్లకు నచ్చచెప్పడ మేమిటి? వాళ్లేమి సెమను జడ్జీలా యేమిటి? వాళ్లదగ్గిర మత్తిపెట్టు పెట్టినట్లు డాబుదార్చాలే గాని నంగిరిగా నీళ్లు నమలుతూ పొడిపొడిగా మూడు మాటలాడితే యెక్కుతుందీ? జడివాన బాదినట్లు బాది ఆఖరుకు కాళ్లుపట్టుకొని బురదలో కీడ్చెయ్యాలిగాని వాళ్లకు నచ్చచెప్పే దేమిటి? అంతెందుకు! ఆవేళ తాళ్లపాలెంలో మా పంతులుగారు పోలీసు సబుఇనసపెక్టరును జల్లీలు తెగబొడిచి క్రాసు చేస్తూఉంటే నువ్వూ ఇంకా వినడానికి తీర్థప్రజలాగువచ్చిన ఆ గ్రామస్థులూ ఇలాగు పిండిబొమ్మల్లాగు నిశ్చేష్టులై ఉండి పోలేదూ?

సంగన్నాయుడు:—"కాని రామినాయి డేటన్నా డోయిన్నారా? 'ఇదేటి బాగోతమా, హరికతా, భోగంమేళమా, గెంతడానికీ, అడడానికీ, తిప్పుకోడానికీ! పుంజెడు ముక్కలడిగి బోల్తా కొట్టించాలి గాని, ఊరికే గరికేళ్ల ప్లీడరునా గడిగేస్తూంటే లాభమేమిటి? అడిగినకొద్దీ ఆడు ఉరిబిగించేస్తూంటే ఎందుకీ క్లాసు అని మా రామినాయి డన్నాడు. కత్తిపారేసి ఒకెట్టి పాడిసినట్లుందీ క్లాసన్నాడు."

గుమాస్తా:—ముండ రామినాయి డో లాయరులాగు మాట్లాడతాడు మా తెలిసినట్లు! మీకు వాడు చెప్పిందే వేదవాక్యం!"

సంగన్నాయుడు:—"అలాగనకండి! ఆడుకోర్టుసంగతులు మాచూసినాడు! అంచేతాడిమీ దందరికీ గురి! ఇంకా ఆడన్నాడు గదా. మొన్న నల్లా చోరీకేసులో మా బారిస్టరు పనిచేసినాడు నూడు! మూడుముక్కలడిగి సరికి ముంతెడునీళ్లు తాగి చెట్టంత సబినసపెట్టరూ చితైపోయి, చచ్చుమొగం యేసి కేసు జార్చేసేడట!"

గుమాస్తా:—"ఓ! ఆ సబు ఇనసపెక్టరు సంగతి యెవరికి తెలియదు! జార్చడానికి ఇటు బరువు లావైపోయింది గనుక జార్చేసేడు అంతేగాని బారిస్టరుగారి ప్రతాపముచేకాదు. ఓయి సంగన్నాయుడూ! రామినాయుడు కోతాలునమ్ముతా వేమిటి? వాడొట్టి బొటుగాడు! తొండముదిరి ఊసరివిల్లి అయినట్లు వాడు పార్టీగాఉండి పస పోయిన తర్వాత బొటయి పోయినాడు! వాడికి బారిస్టరుగారు భారీగా పారేస్తారు గనుక వాడిని

ఇంద్రుడు చంద్రుడు అని పొగుడుతూ ఉంటాడు! ఆ బారిస్టరు ఇటువంటివాళ్లని పొగుచేసి తనకు లేని ప్రజ్ఞావిశేషాలు వున్నాయని యీ మోస్తరుగా దండోరా వేయిస్తూ ఉంటాడు! నికటానికి వచ్చేసరికి మా వకీలుతో నిలబడతాడూ ఆ బారిస్టరు! యింతెందుకు? మొన్న సివిలుకోర్టులో ఒక పెద్ద దత్తతదావా! వీలు, పోర్జరీ పార్టిషను, దత్తత, రద్దు, ఇలాగన్నీ పద్ధతీ పేచీలు చిక్కులుగల దావా! ఆ బారిస్టరవతల! మరి అతని తందనాలు సివిలులో పనికొస్తాయీ! ఆ కేసులో మా వకీలుగారు గంగా ప్రవాహంలాగు ఆర్గ్యుమెంటు చెప్పేసరికి—ఆవేళ యేమి జవాబు చెప్పడానికీ తోచక ఈ బేరిస్టరుగాడు వాయిదాకోసం నానా వేషాలూ వేసి మర్నాడు జ్వరమని సాకుపెట్టి కట్ట మరొకప్లీడరు నేస్తుడిమీద పారేసి కాళ్లుజాచేసేడు! మునసబు ఢంకామీద దెబ్బకొట్టినట్లు మా పక్షం తీర్పుచెప్పేసేడు!—ఆ రోజున ఆ పార్టీల ఆనందం ఏమిచెప్పను! వాళ్లు సంతోషంతో అప్పుడు ఏమిటి చేసినారో తెలుసునా మా పంతులుగారికి బహుమతీ?"

ఇంతట్లో ఆఖరు ముక్కకు రామినాయడు తిరిగి వచ్చేడు— అన్నాడు—"ఏటయ్యో! మీ పంతులుగారికి బహుమతీ అంటున్నావు? మంచియేళ కనిపెట్టినావు బహుమతీ అడగడానికి! తిండికెళ్లే ముందు ఓపాలి చూద్దామని జైలుకాడికెళితే మావోడు కెవ్వున కేకపెట్టి ఏడిస్తే నాకు నిలువునా ప్రాణాలు పోయి తిండి వంటపట్టక ఆడిదుఃఖం చూడలేకెల్లిపోవచ్చేను!"

సంగన్నాయడు:—"ఆడేడిసేదట్రా! అయ్యో! నాకడుపు తరుక్కుపోతున్నాదిరా! ఏడయ్యా వొకీలు ఏడయ్యా? ఎప్పటికీరాడేటయ్యా?"

రామినాయుడు:—"ఆడక్క దఘోరిస్తాంటే నువ్వెక్కడ మా సంగన్నాయుడిని బహుమతీకోసం పీక్కుతింటున్నావయ్యా? చస్తాఉంటే సరసంనాగున్నాది నీ యేషంచూస్తే! బహుమతీయేటయ్యా బందెలదొడ్లో గొడ్డును తోసేసి?"

గుమాస్తా:—"ఓయి! రామినాయుడూ! నువ్వు ముందూ వెనకా చూడకుండా మాట్లాడకు! ఇప్పుడెవడు బహుమతీ అడిగేడు? అల్లా ద్వారపూడివీలుకేసు గెలిపించినందుకు మా పంతులుగారికి పార్టీలుయిచ్చిన బహుమతీగురించి సంగంన్నాయుడికి చెపుతూ వున్నాను!"

రామినాయుడు:—"ఆకేసా! మాగొప్ప సెప్తున్నావు! సరి! సరి! పట్నాయిణ్ణి పాతికరూపాయీలకీ దిగలాగేసి, కోమటోడిని కొట్టుదోపించేస్తామని బెదరించి, కంసాలోడిని యిల్లుకాల్చేస్తామని చిల్లంగిపెట్టి, ఆళ్లందరిసేతా సంతకాలు మావికావనిపించేసి మోతుబరి పార్టీలు బెత్తాయిస్తే కేసు గెలిపించినాట్ట వొకీలు! ఎంత గొప్పోడయ్యా! ఆళ్లు బహుమతీ యిచ్చేరుట! నే నెరుగనూ ఆ బహుమతీ!"

గుమాస్తా:—ఏమి! దానికేమిటి తక్కువ? యాభై రూపాయీల రిస్టువాచీ యిచ్చేరు! ఇప్పుడు మాపంతులుగారిచేతి నున్నదదే!"

రామినాయుడు:—యాభయ్యి! కొనితేవాల! సున్న తీసేసి ఆవాచీ కొన్నారు! సవకమచ్చుది! మరి నాదగ్గర కోతలుకొయ్యకయ్యా, నేనూ ఆకేసులో అవతల పార్టీ తరఫున ఉన్నాను! నే నాసంగతులెరగననుకుంటున్నావు గావాల!"

గుమాస్తా:—"ఓయి, రామినాయుడూ! తాచెడ్డకోతి వనమల్లా చెరిచినట్లు, నువ్వు మహాదుర్మార్గంగా పేల్తున్నావు మా పార్టీలను విడతియ్యడానికి! నువ్విటుపైని యిక్కడికి రావద్దు—యీ గుమ్మం తొక్కవద్దు—మా పంతులుగారితోకూడా నిన్ను రానివ్వవద్దని ఖచితంగా చెప్పేస్తాను. నువ్వా బారిస్టరుగారియింటోనే ఉరిపెట్టుకో, పో!

రామినాయుడు:— "రానివ్వొద్దని నువ్వుసెప్పు నక్కర్లేదు! ఇట్నుపైని రమ్మని తాంబూలమిచ్చినా రాము. ఏమి సంగన్నాయుడూ! ఒకమాటు పొరపాటొస్తాదిగాని అవిటవిటికీ వస్తాదా? ఎంత మర్యాదైనా ఎన్నిమార్లు సెయ్యిగాల్చుకుంటాడు!"

ఇలాగు జరుగుతూఉండగా మీరు వచ్చేరు! పాపం! మామూలుకన్నా మరోగంట ఆలస్యంగా వచ్చేరు. ఈపాటికి పార్టీలు తిళ్లకూ తిప్పలకూ పోయి వుంటారు, తలుపు బిడాయించుకొని పడుక్కుందా మనుకున్నారు గని, ఇంటికి వచ్చేసరికి వాళ్లు యమ దూతలలాగు ప్రత్యక్షం! కచేరీసావిట్లోకివచ్చి వాళ్లని చూడగానే మీముఖంయొక్క రూపరేఖా విలాసాలు ఫొటోతియ్యవలసిందే గాని చెప్పతరం కాదు! తరువాత మళ్లీ రెడ్డివచ్చేడు మొదలెట్టండి అన్నట్లు మీ గుమాస్తాతో జరిగిన ఘర్షణ యావత్తూ మరింత విపులంగా మరిన్ని వన్నెచిన్నెలతో మీకూ వాళ్లకూ జరిగింది. అవి మీకు తెలిసినసంగతులే!

'నీకు వంటా పనీలేనట్లుంది! ఈ కబుర్లువిని కంఠతా పెట్టడంతప్ప!'

వంటెంతసేపు! నాలుగుగంటలనుండీ తొమ్మిది గంటలదాకా అవడానికి పేకాటా? బాతాఖానీయా? వంటవండడం చల్లారిపోయి బెడ్డకట్టడం అన్నీ అయిపోయినాయి మీ రింటికి వచ్చేసరికి!

'అంచేతే అన్నం సాయించిందికా దివాళ!

అంచేతకాదు! పార్టీవాడికి బందిఖానా అయినదన్న సంతోషంచేత! దానికేంగాని యిక్కపై నయినా హాయిగా కడుపులో చల్లకదలకుండా కృష్ణారావులాగు కాలక్షేపం చెయ్యకూడదూ? మునసబుకోర్టో జడ్జీకోర్టో కనిపెట్టుకొని ఉండండి! దొరికినంత దొరుకుతుంది, లేకపోతే మానుతుంది! అంతేగాని యిదేమి చిత్తక్షోభమ్మా! వండేవంట లేదుగాని ఇల్లంతా యెంగిలే అన్నట్లు తెచ్చేరాబడిలేదు గాని వచ్చే అపకీర్తి లావైపోతుంది! వాళ్లు మీకిచ్చిన కితాపులు ఇన్నీ అన్నీనా? కితాపులేమిటూ? వాళ్లన్న ముక్కలన్నీ, అందులోకీ ఆ రామినాయుడో రావణానాయుడో ఏకరుపెట్టిన ఎత్తిపొడుపులన్నీ తల్చుకుంటే నా మనస్సు మనస్సులాగుండదు! అవన్నీ నాకు జ్ఞాపకంలేవుగాని, ఓ దగ్ధహస్తముకాదు, ఓ కూర్మాంలోని కునుకు వైష్ణవుడుకాదు, ఓ ఉప్పు కప్పురంబుకాదు, యింటిదగ్గిర వాళ్లు బయలుదేరినప్పటి అపశకునాలుకావు, తిరిగి వాళ్లవూరు వాళ్లు వెళితే అవి బుర్రమీద కొంగులుకావు, అవతలపార్టీ వాళ్లు వేసే కవ్వున కేకలు కావు, ఇంకా యేమేమో వల్లించేడా రామినాయుడు! యివి వినపడినవి, యింకా వినపడనివి ఎన్నో? ఎందుకండీ యిలాంటి అవకతవక ప్రాక్టీసు?

"దోసెళ్లతో మరి రూపాయిలెలా వస్తాయి?"

దోసెళ్లతో రూపాయి లబ్ధంగాని కావిళ్లతో తిట్లు నిజం! ఇవతల పార్టీలచేత, అవతల మేస్ట్రీట్ల చేత! ఎందు కటువంటి కేసులకు వెళ్లడం? ఎందు కిటువంటి పరాభవాలు పొందడం?

"ఎందుకా! ఈ భర్తృహరి శ్లోకం విను—
దీనాదానముఖైస్సదైవ శిశుకైరాకృష్ట జీర్ణాంబరా
క్రోశద్భిః క్షుధితైర్నిరన్న విధురాదృశ్యాన చేద్గేహినీ,
యాచాభంగభయేన గద్గదగళ త్రుట్యద్విలీనాక్షరం।
కో దేహీతి వదేత్స్వదగ్ధ జఠరస్యార్థే మనస్వీపుమాన్॥

ఓహో! బక్కనుబందల దొడ్లో తోసేసి భర్తృహరి పఠనం ప్రారంభించేరా యేమిటి?

# స్త్రీ విద్య

శ్రీమతి అయితం. హైమవతమ్మగారు

ఈవిషయమై యింతకుపూర్వ మీపత్రిక యందు సోదరీమణులు పలువిధముల పలుసారులు చర్చించియున్నారు. విజ్ఞులగువారి కంటె విద్యార్థినినగునేను విశేషముగా నెఱుగను గాని, కేవలము ఉత్సాహపూరితనై వ్రాసితిని. విద్యయను పదము తెలుసుకొనుట అను అర్థముగల 'విత్' అను సంస్కృతధాతువునుండి పుట్టినది. విజ్ఞానదాయకమగువిద్యను నేర్చుటకు స్త్రీపురుషులకు సమానమగు హక్కుగలదు. ఏదేశమున విద్యాబుద్ధులు గల వనితామణు లుందురో, యాదేశమే యన్నివిధముల నభివృద్ధి చెందగలదు. వేదకాలమునుండి నేటివరకు మనదేశమునుండి స్త్రీలు విద్యావతులై యుండుట గమనింపదగిన విషయము.

విద్యాశూన్యమగు స్త్రీ వివేకశూన్యమగును. విద్యాధనమును, నుత్తమోత్తమ ధనముగా, సర్వశాస్త్రములు ఘోషించుచున్నవి. విద్యాధిదేవతయగుసరస్వతి కూడ స్త్రీజాతికే జెందియున్నది. వేదకాలమునందు గూడ, గార్గి, మైత్రేయివంటి, విదుషీమణులుండిరి. విద్యాబుద్ధులు గలవని నైతికముగా, మానసికముగా, ఆధ్యాత్మికముగా, శారీరకముగా నభివృద్ధిపొంది, యట్టి లక్షణములుగలవారిగ తన సంతానము శిక్షించును. సీత, దమయంతి, ద్రౌపది, మొదలగు పురాణకాల స్త్రీలిందులకు ఉదాహరింపదగినవారు. విద్యాశిక్షణమున వినయవతులగుటకు మారు వివేకభ్రష్టలగుదురను కొందరి వాదము విశ్వసింపదగినదికాదు. అట్లైన విద్యావంతులగు పురుషులందును నెందరో యవివేకచిత్తులు గలరు. దీనను తేలెడి సారాంశమేమన, సద్గుణము కాని, దుర్గుణముకాని, పురుషునకు గాని, స్త్రీకిగాని నైసర్గికమనియు, విద్యాబలమున దుర్గుణములు తగ్గుటకును, సద్గుణములు హెచ్చుటకును వీలగుననియు, విద్య యొంతమాత్రము దుర్గుణములను ప్రేరేపించునది కాదనియు, విద్య స్త్రీ పురుషుల కెల్లరకును ఆవశ్యకమనియు, విద్యనేర్చిన స్త్రీలనుగాని, విద్యార్థినులనుగాని అపహసించుట కేవలము భ్రమయనియు తెలియుచున్నది. పవిత్ర చరిత్రలగు జిజియాభాయి, సంయుక్త, అహల్యాభాయి, రుద్రమాంబ, మొదలగు వారి నడవడి, విద్యచే మఱింత వన్నెకెక్కినది. కుమ్మరకులమున పుట్టినమొల్ల పవిత్రమగు రామాయణము వ్రాసి ధన్యతఁబడసెను. కవయిత్రియగు తరిగొండ వెంకమాంబ, వెంకటాచల మహాత్మ్యమును వ్రాసి కీర్తికాయమును బడసినది. నేటి

కాలమందుకూడ నెందరో, చిరకీర్తి నార్జించుకొనినవారుగలరు. శ్రీమతి సరోజిని నాయుఁడు గారి యత్యద్భుత కవనధాటి దేశాంతరములందు గూడ కీర్తింపఁబడుచున్నది. ఆధునికులలో (Moderns) నంతటి కవితా ప్రతిభ కలిగిన వనిత మఱొక్కతె గానరాదు. కీ॥శే॥ మాగంటి అన్నపూర్ణాదేవి తన విద్యావిజ్ఞానముల తోడ్పాటులచే, తనభర్తకు ఖద్దరువస్త్ర దీక్షణము నొసఁగి, యా గర్భశ్రీమంతురాలయ్యు, దన్నివాసములు లెక్కసేయక, శీతవాతాతపములకు జంకక, కాలినడకను ప్రయాణమును సాగించి, ఖద్దరు ప్రచారమునుసలిపి, శ్రీ గాంధీమహాత్ముని యాదరణమునకు పాత్రయై యాంధ్రుల హృదయములయందు నేటికిని నిలిచియున్నది. శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డి అమ్మగారు చెన్నపురి రాజధానియందు శాసనసభోపాధ్యక్ష పదవిని (Vice President Legislative council) ప్రప్రథమమున పొందిన యువతీమణులు. వీరు చేయు స్త్రీసేవ ప్రశంసార్హము. ఈదేశమున ఏప్రాంతమున మహిళాజనసమావేశమైనను ఆప్రదేశమున వీరు అధ్యక్షపదవిని అధివసించుటయే వీరికి స్త్రీలయందుగల యాదర గౌరవములకు ఉదాహరణము. వీరు స్త్రీస్వాతంత్ర్యమునకును, వ్యభిచార నిర్మూలనమునకును శాసనసభయందు పడినపాట్లు మఱువరానివి. స్త్రీజన విద్యాభివృద్ధికై వీరు మైలాపూరునం దొక నిలయము స్థాపించి తత్పోషణ భారమున దీక్షవహించి, యెంతయో పాటుపడుచున్నారు.

నేటికాలమందు పాశ్చాత్య దేశములకు హిందూదేశమునకు గలిగిన సంబంధము వలన చేకూరిన లాభములలో స్త్రీవిద్యాపోషణము, అనునది కూడ నొక్కటియై యున్నది. కావున సోదరీమణులెల్లరు స్త్రీజన విద్యాభివృద్ధికై కృషిసలిపి, దేశమును ధన్యతమమొనర్తురుగాక యని ప్రార్థించుచున్నాను. వీలగునేని రాబోవుసంచికయందు 'స్త్రీ ఎట్టివిద్య నేర్వవలయు'నను విషయమునుగూర్చి వ్రాసి సమర్పించుకొందును.

# ఎఱుకమ్మ

అయ్యలసోమయాజుల సుబ్బారావుగారు

శూద్రజాతి; అందు స్త్రీజాతిఅంటే అతి హీనంగా చూస్తున్నారు. ఎంచేత అలా చూడాలి? వారిలో మాత్రం శక్తిగలవారు లేరా? ప్రజ్ఞాశీలురులేరా? దేశసేవకులు లేరా? నివురుగప్పిన నిప్పులాగ వారి ప్రజ్ఞ ఇతరులకు తోపనీయక యీ సంసారబంధములో చిక్కుపడి తోడివారలవలెనే వారూ వుంటేమాత్రం వారిశక్తి బయలుపడదా? ఎప్పటికేనా చెట్టున కాచినకాయ ఫలితానికొచ్చి క్రింద రాలిపోదా? ఇప్పుడింకా స్త్రీజాతిఅంటే కొంచెం గౌరవాభిమానాలు చూపుతున్నారేమోగాని; పూర్వకాలం మరీ కర్కోటకంగా వుండేది. అయినా వారిశక్తి చెప్పదగినది. పూజలన్నా, భక్తిశ్రద్ధలన్నా అప్పుడే చెప్పాలి. భక్తిజ్ఞానవైరాగ్యాలు వారి సొమ్ములు. ఏజాతియయినను పూర్వస్త్రీలలోనుండే పతి, దేవ, బ్రాహ్మణభక్తి ఇప్పుడేదీ? ఇప్పుడూ వున్నాయి కాని పైవారు వెక్కిరిస్తారనే భయంమాత్రం వెనక్కి తీస్తుంది. పెనిమిటి పాదాలుకడిగి ఉదకం శిరసున జల్లుకుంటే ఇప్పుడొక హేళన. భర్త పాదపూజచేస్తే భక్తి వొలుకుతోందని వెక్కిరింపులు. ఇంతకీ కాల మహిమ. దాన్ని దాటడానికి శక్యమవొద్దూ? ఇంకేం మకు? అసలుసంగతి ఏబదిసంవత్సరములక్రితంమాట.-

సంసారంలోబడి కొట్టుకుంటూ ముగ్గురు మొగపిల్లలు, ఇద్దరు ఆడపిల్లలు, తనూ, భర్తా—ఇదీ ఎఱుకమ్మ సంసారం. ఈసంసారం అనే సాగరంలో తన సుగుణాలే తెప్పగా, తనే సరంగుగా, పొదుపుగా నడుపుకుంటూ తరిస్తోంది ఎఱుకమ్మ. జాతి శూద్రజాతి. ఏరోజు కూలికి వెళ్ళకపోతే ఆరోజు యింట్లో కుండలు డింకీలు కొడ్తాయి. శృంగవరపుకోట తాలూకాగ్రామమయినప్పటికీ అడవి యూరే. అవుట్లో రోజూ కూలెక్కడ దొరుకుతుంది? కూలి దొరకనిరోజు కట్టెలుకొట్టుకొని అవి అమ్మి కాలక్షేపం చేసేవాడు ఎఱుకమ్మభర్త.

ఓరోజు ఎఱుకమ్మకు ఇల్లుజాగ్రత్తఅనిచెప్పి తను గొడ్డలి భుజానవేసుకొని తనతోడివారితో అడవి పాలం వెళ్లిపోతూంటే ఆకలేస్తుందేమోనని వో గిన్నెలో అంబలిపోసి నంజుడుగా నీరుల్లిపాయోటి అందులోపడేసి అతిప్రేమతో భర్తకిచ్చిందిఎఱుకమ్మ. అది పట్టుకువెళ్ళాడు అడవికి. ఆహా! అటువంటి ప్రేమమయస్వరూపిణియగు భార్యను చేపట్టినవాని భాగ్యము వేరే చెప్పాలా? ఇంతకీ అదృష్టంవుండొద్దూ? ఇంక ఎఱుకమ్మభర్త రెండుజాములవఱకూ అడవిలో కట్టెలుకొట్టి అలసిపోయి కొంతసేపు విశ్రాంతి తీసుకొని అంబలిత్రాగి తిరిగి కట్టెలు కొట్టడానికి వెళ్ళిపోయాడు. కొంతవఱకూ కట్టెలుకొట్టి కడకు వోపెద్ద చెట్టుయెక్కి కొమ్మ కొడుతూంటే దైవవశాత్తూ కాలుజారి క్రిందపడిపోయాడు. బుఱ్ఱ బ్రద్దలయిపోయి మరి నోటంటమాటలేకుండా ప్రాణాలు వదిలిపెట్టాడు. కూడావచ్చిన మిత్రవర్గము ఏడుస్తూ, వాని గుణములను పొగడుకుంటూ ఆ ప్రాణవిహీనమైన కట్టెను మోసుకొని రాత్రయేసరికి ఎఱుకమ్మ ఇంటి దగ్గఱ వప్పచెప్పేసి దహనాదిక్రియలు మరునాడు చేయవచ్చునని ఇంటికి వెళ్లిపోయారు.

ఇంక ఎఱుకమ్మ భర్తశవంచూచి ముందు కొంత జాలిగా దుఃఖించి మనస్సు కుదుటపర్చుకొని వచ్చే పోయే స్వజాతిస్త్రీలతో పెనిమిటి శాంతౌదార్య సాహసాలువర్ణించి చెపుతూ దుఃఖించకుండానే రాత్రి భాగమంతా గడిపేసింది. తెల్లవారింది తనభర్త స్నేహితులు వచ్చి భర్తను దహనపర్చడానికి తీసుకు

పోతూంటే ఎఱుకమ్మమాత్రం ఏడవకుండా వారు తీసుకుపోయేవఱకూ వూరుకొని తరువాత పిల్లల్ని తీసుకొని ఆవీధిలోనేవున్న తన పుట్టింటికి దిగబెట్టి తాను శ్మశానవాటికకు ప్రయాణమైంది. ఎఱుకమ్మ అన్నభార్య యీ సంగతంతాగ్రహించి తనకొంపమీద కేంవస్తుందేమో నని పోలీసుస్టేషనుకి వెళ్లి "ఎఱుకమ్మ చచ్చిపోడానికి వెళ్లిపోతోంది—మా పీకలమీదకి వస్తుంది బాబయ్యా! రక్షించాలి" అంది. దాంతో సబ్ ఇన్‌స్పెక్టరు బయలుదేరి శ్మశానానికి వెళ్లాడు. అక్కడ వద్దని చెప్పే బంధువులమాటలు పెడచెవిని పెట్టి భర్త చితిలో నుఱుకదలచుకొన్న ఎఱుకమ్మను గాంచి బలవంతంగా చీరకొంగు పట్టుకొని బయటకు లాగి దూరంగా తోసేశాడు. భర్తచావు విన్నప్పుడు లేనిదుఃఖం ఇప్పుడు అలుముకుంది ఎఱుకమ్మకు; ఏమీ మాట్లాడలేక పోయింది. ఇనస్పెక్టరుమాత్రం తనకొంప మునిగిపోయినట్టు "మాఱుమనుముల ముండలకి చావు మానాలట! తెల్లవారితే ఎంతమందిని చూస్తారో! పిల్లల్ని పెంచలేక యీ వేషమంతా" అంటూ కూక లేశాడు. దాంతో మరీ కృంగిపోయింది ఎఱుకమ్మ. పిచ్చిరయెత్తినదానికి మల్లే ఇంటికివెళ్లిపోయింది. అన్నయు, వదినయు, ఇంకా పైవారూ కూడా చెప్పారు. ససేమిరా మాట్లాడందే! మనస్సులో విచారంచేత కృంగిపోతోంది "మారు మనుముల ముండ" అన్నందుకు. ఎఱుకమ్మ ఎక్కడ సాహసం చేసి పోతుందేమోనని అన్నా వదినా అక్కడే మకాంవేశారు. క్రమేణ రాత్రికాజొచ్చింది. మరీ జాగ్రత్తగా కాపలా కాస్తున్నా రన్నా వదినాను. ఎంత కనికాయగలరు? రాత్రి పండ్రెండయింది. ఎఱుకమ్మ అన్నావదినా కొంచెం నిద్రకాగలేక జోగారు. అదే సమయమని ఎఱుకమ్మ వోచీర శేరు పైగా పసుపుగుండా పట్టుకొని చెఱువుకు వెళ్లిపోయి పసుపులో ఆచీర తడిపేసి స్నానంచేసి కట్టుకొని శ్మశాన వాటికవైపు పరిగెత్తింది.

ఇక్కడ ఇంటిదగ్గఱ ఎఱుకమ్మ అన్నా వదినా లేచి యింట్లో ఎక్కడా ఎఱుకమ్మనుగానక వారు కూడా శ్మశానానికి పరుగెత్తారు. వీరు వెళ్లేసరికి చితిచుట్టూ ప్రదక్షిణంచేస్తూన్న ఎఱుకమ్మనుచూచి "ఆగు! ఎఱుకమ్మా!" అన్నారు. ఆగలేదు. చట్టున వెళ్లి చెయ్యిపట్టుకున్నాడన్న.

"అమ్మా! మాకొంప ముంచేస్తావా?" అన్నాడన్న.

"నీకేం? నిన్నెవరేంచేస్తారు?" అంది ఎఱుకమ్మ.

"పోలీసువాళ్లు మమ్మల్ని బ్రతకనిస్తారా? తల్లీ!" అని వాపోయినాడు.

"నీకేం పరవాలేదు; నాపని నేను మానను, నా పెనిమిటిలేనిజన్మ నాకెందుకు? పోలీసువాళ్లు నిన్నేం చేయకుండా నే చెప్తానులే! నన్ను వొదిలీ!" అంది ఎఱుకమ్మ.

"పోలీసువాళ్ల నమ్మకానికి మేం వేం చూప గలం?" అన్నాడు మెత్తబడి.

"దానికేం పరవాలేదన్నా! నేను కాలిపోయి నప్పటికీ నేను కట్టుకున్న చీరమాత్రం కాలదు రే పుదయమయ్యేసరికి మేం ఇద్దఱం ఇక్కడే నీకు మళ్లా కనుపిస్తాంలే! వెళ్లు!" అని చితిలో వురికింది. భర్తను భస్మముచేసి ఆరిపోయియున్న అగ్నికిరస నాయిలుపోసినట్టు భగ్గుమంది ఎఱుకమ్మ పడగానే. అయిదునిముషాల్లో ఎఱుకమ్మ పాంచభౌతిక శరీరం భస్మమై పోయింది. చూడలేక ఇంటికివెళ్లిపోయా రన్నా వదినాను.

తెల్లవారింది. ఊరంతా మాశ్చర్యమోగిపోయింది ఎఱుకమ్మ సహగమనం సంగతితో రాత్రి ఇన్‌స్పెక్టరు కలలో కొచ్చి "నన్ను మాఱుమనుములముండన్నావు కదూ? నేను రోజుకు ఎంతమందినో చూస్తున్నాను గదూ? నన్ను నీవు చావుమానం చెయ్యనిచ్చేవు కాదు గాని నేనుచేశాను చూడు. నా మరణానికి మావారి నేం బాధపెట్టకుసుమా!" అని ఎఱుకమ్మ చెప్పినదని

ఇన్‌స్పెక్టరు ఎఱుకమ్మ బంధువులందఱితోనూ చెప్పి వారినందఱినీ తీసుకొని శ్మశానానికి వెళ్లాడు. చితిపై కప్పబడివుంది పసుపుచీర. ఆశ్చర్యపోయారందఱూ. ఎఱుకమ్మ అన్న ఆ చీరతీసి జాగ్రత్తపెట్టాడు. నిప్పులు కణకణలాడుచున్నాయి. చీర కాలనందుకు ఎఱుకమ్మ మాహాత్మ్యాన్ని పొగిడా డిన్‌స్పెక్టరు. కొంతసేపు ఎఱుకమ్మబంధువులంతా మొకరించి ప్రార్థన చేశారు. కొంతసేపటికి అటాత్తుగా ఆ నిప్పుల మధ్య పసుపువర్ణంతో చిటికెనవ్రేలులావున బారెడు పొడుగుగల పాములు రెండు పెనవేసుకుని వున్నాయి. ఆ నిప్పులమధ్య కాలకుండావున్న ఆ పాములే "ఎఱుకమ్మా, ఎఱుకమ్మ భర్తా" అని వారి మహత్తును పొగడి అక్కడనే చిన్నదేవళం కట్టించారు ప్రజలు. ఏటేటా ఎఱుకమ్మ పేరుచెప్పి మహాశివరాత్రి రోజున గొప్ప తీర్థం ఆ దేవళంచుట్టూ ఇప్పటికీ జరుపుతున్నారు. ఇప్పటికీ ఆ పాములు అప్పుడెలాగున్నాయో ఇప్పుడూ అలాగేవున్నవి. ఆ యెఱుకమ్మ కాపురం చేసినవీధికి "ఎఱుకమ్మపాలెం" అని పేరు పెట్టి ఇప్పటికీ అలాగే వాడుతున్నారు. శివరాత్రికి జనం మాజోరుగా శృంగవరపుకోటవచ్చి అక్కడకు మూడుమైళ్లదూరంలోనున్న పుణ్యగిరికిపోయి స్నానముచేసి దేవదర్శనం చేసుకొని ఎఱుకమ్మగుడికి వచ్చి పళ్లూ, పసుపూ, కుంకుమా సమర్పిస్తూంటారు. ఇట్టి పతివ్రతామణులైన స్త్రీలు మృతినొందినను మృతజీవులై చిరస్మరణీయులు గదా?

## మానసబోధ

ఔరా మానవజన్మ కర్మగుణ తత్త్వాది ప్రపంచంబుఁ గ
ళ్లారా చూచుచునున్నవాఁడ వనునిత్యం బింతయుం దోచదా?
లేరెవ్వారలునీకు నీవొకనికిన్ లే వెందు కీ దుర్భ్రమల్;
కూరాకుందిని గోచివెట్టుకొని నీకున్ హాయిగాఁదోచు కా
సారప్రాన్తమునన్ మహావటతరుచ్ఛాయోపవిష్టుండవై
ధీరుల్ మెచ్చఁగఁ బాడరా; మరిభవోత్తీర్ణుండవై కూడరా;
పోరా ముక్తివధూటి యల్లదిగొ: నీభోగేచ్ఛలన్ వీడరా.

ప॥ కృ॥ మూర్తి

# చాంద్ సుల్తానా

నేల నరసింగరావుగారు, ఎం. ఏ.

చాంద్ సుల్తానా పవిత్రనామాక్షరములు అహమ్మద్‌నగరరాజ్యసంరక్షణా ధురీణత్వమున నైక్యమాయెను. అబలయగు నా బాలామణి బలపరాక్రమాదులా బాలప్రసిద్ధములు. అహమ్మద్‌నగరరాజవంశమున నుద్భవించిన సర్వులలో నీమె సితద్యుతివలె సముజ్జ్వలము. క్షమాతేజంబులకు, సత్యశౌచములకు, ధర్మాధర్మములకు శేవధి. స్వమత పరమత విభేదములేక యితర మతములయెడ గౌరవము, సహనము కనుపరచుచుండెను. కష్టసహిష్ణుత, నిస్తంద్రత రాజనీతిజ్ఞత మొదలగు సుగుణపుంజములు, నద్వితీయమగు ప్రేమ, యనన్యసామాన్యమగు వివేకము, ననిర్వచనీయమగు సౌజన్యము మొదలగు దైవీప్రవృత్తులు పిన్ననాఁటినుండియు నీధీర నారీమణియందు ద్యోతక మగుచుండెను. నిరతముఁ బ్రహృష్టాంతరంగమున, సామంతులగు తాబేదారులను దీనులగు సేవకులను నాదరించుచుఁ బోషించుచు వారి కనుగుణ్యముగఁ బ్రవర్తించుచుండెను. వేయేల, నీమె యసాధారణ గౌరవోదార; యఖండ శౌర్యాలంకార; యసమానకీర్తిస్వరూప: సర్వజనసమాదరణీయయై, స్వాతంత్ర్య గామియై, లోకైకమాతయై యలరారుచుండెను.

1596-వ సంవత్సరమున మొగలాయి చక్రవర్తియగు నక్బర్ చక్కరముక్కయనందగు దక్కనురాజ్యధానిపై నుక్కుకత్తి నెత్తెను. మురాదురాజపుత్రుండీసమరమునకు సర్వసైన్యాధిపత్యము వహించెను. ఆఘోరసంగ్రామప్రణాళికకు నహమద్‌నగరుముట్టడి తొలిపద్దు. అహమ్మద్‌నగరు మున్ముందు భయానకరణరంగముగ మారిపోవును. ఏలికఁజూడ బాలుఁడు; ఇఁక కర్తవ్యమేది? అహమద్‌నగరునం దెచ్చటఁ జూచినను జనులు గుంపులుగూడి రాజ్యరమకు రానున్న ఘోరవిపత్తును గూర్చి పలుసారులు ముచ్చటించుచుండిరి; ఉపన్యసించుచుండిరి; కర్తవ్య మూహించుచుండిరి.

ఇట్టి విషమపరిస్థితులలో చాంద్ సుల్తానా తదేకదీక్షతో నిరుపమానకౌశలముతో కార్యప్రణాళికను సమకూర్చుకొనుచుండెను. వజీరులు, సామంతులు, సైన్యాధీశులు, రాజప్రతినిధియగు చాంద్‌బీబిచెంత కేతెంచి వినయవినమితగాత్రులై సలాములనొనరించి, మొగల్ వీరులనెదుర్కొని నిర్జించు నుపాయమత్యావశ్యక మనినుడివిరి. చాంద్ సుల్తానా కడు నప్రమత్తతతో సమస్త విషయముల నాకర్ణించి, డెందంబునఁ గ్రందుకొన్న సందేహముల నివారింపనెంచి శత్రువాహినుల సంఖ్య, నాయకుల నామములు, సంగ్రామమునకు వలయు సామగ్రి గూఢచారుల సంచారములు మొదలగువిశేషములఁ గూర్చి ప్రశ్నించి చక్కఁగ విషయము నవగాహన మొనరించు

కొనెను. అనంతర మామె కొంతదనుక మా నముద్ర వహించి యించుక తడవాలోచించి యుద్ధమున కవశ్యము సిద్ధపడుఁడని యాజ్ఞాపించెను.

మురా దహమ్మద్ నగరరాజ్యసింహాసన మునచిరకాలములోఁ దనకు నప్పింపుమనియుఁ దన యాజ్ఞను రాజప్రతినిధి శిరసావహింప వలయుననియు సందేశ మంపెను. 'యుద్ధమునకే సిద్ధ'మని చాంద్‌బీబి ప్రత్యుత్తరమొసంగెను; ఇరుకక్షులవారు హోరాహోరి పోరాడుచుండిరి. ఇంకచాంద్‌సుల్తానా, వీర పురుషవేషమునఁ గృపాణపాణియై మొగలాయి సేనలు కలగుండుపడునట్లు భీకరాకారమునఁ గదన మొనర్చుచు శాత్రవుల శిరములను నిసితకరవాలమున కెరవేయుచు, నహమద్ నగర రక్షాదళములగు ధీరులఁ బురికొల్పుచు, వీరవిహారము సల్పుచు నాఱుమాసములు కోటను బటిమతో సంరక్షించెను. కావుననే యొకానొక సుప్రసిద్ధ పాశ్చాత్య చరిత్రకారుం డీ క్రిందవిధమున చాంద్‌సుల్తానాను బ్రస్తుతించెను.

**Chand Sultana who acted as a regent on behalf of her nephew, gallantly defended the city of Ahmadnagar appearing herself on the ramparts of the city in full armour and with drawn sword.**

అహమ్మద్ నగర దుర్గస్వాధీన మొనర్చుకొనుట దుర్గమ మగుటు మురాద్ సంధి చేయ నిశ్చయించి రాయబారము సల్పి కృతకృత్యుడాయెను. మొగల్‌సేన ఢిల్లీపురాభిముఖమాయెను. అగ్బరు చక్రవర్తి చాంద్ సుల్తానా ధీచాతురికి, ధైర్యస్థైర్యములకు రాజ్య రక్షణమనీషకు నతులితా నందాశ్చర్యముల నొందెను.

బలగర్వల్ మొగలాయి లహ్మదునగర్ పైఁగ త్తిఁగీటంగ నీ
వలఘుప్రాభవ వైభవోద్ధతి నవార్యప్రౌఢి నుద్గాఢని
శ్చలధైర్యాకృతిఁ గోటఁగాచి రిపులన్ జక్కాడవే! చాందుబీ
సులతానా, స్వజనైక రక్షణకళా స్ఫూర్జత్ప్రసన్నాననా.

# బాలికలు - పాకవిద్య

శ్రీమతి శృంగారకవి లక్ష్మీనరసమ్మగారు

స్త్రీవిద్య ఈదినంత అభివృద్ధిగాంచకున్నను, మునుపటికంటె నెక్కువగానే వ్యాపించుచున్నది. పురుషులకు గరుపబడు విద్యవలెనే స్త్రీలకుగరుపబడు విద్యయు, ఏదోయొకవిధముగా పుస్తకమును చదువుట కుపయోగించుచున్నదేగాని జీవయాత్ర కుపయోగించు నంతటిదిగాలేదు.

స్త్రీలును, పురుషులకువలెనే సర్వవిద్యలను నేర్చుకొని విదుషీమణులై, దేశాభ్యున్నతికి తోడ్పడినగాని సంఘముత్తేజమునకు రాదు.

కొంచెము పెద్దదగు ప్రతియూరి నొకపాఠశాల యుంటున్నది. బాలికలాపాఠశాలకుబోయి, బాలురతోపాటు పాఠపుస్తకములను జదువుచున్నారు. ఇట్లు కొంతకాలమువరకు జదివినపిమ్మట, స్త్రీలయందును, పురుషులయందు భేదమేర్పడి, ఇరువురు వేరువేరు విధముగా జీవనము గడుపవలసినవారగుచున్నారు.

స్త్రీ రజస్వలయైన పిమ్మట భర్తతో కాపురము చేసి, పిల్లలగని తల్లియై, శిశుపోషణాదికములలో మెలంగుచున్నది. పురుషుడెదిగి పెద్దవాడై భార్యతో సంసారచక్రమును సుఖముగా నడుపుటకై, ఏదోయొక వృత్తిలో ప్రవేశించి ధనము సముపార్జనము జేసి, పిల్లలను లోకోద్ధారకులను గావించుటకు వలయు సౌకర్యము లొనగూర్చవలసినవా డగుచున్నాడు.

పోనీ! స్త్రీలకే యున్నతవిద్య నేర్పి, వారికే ధనసముపార్జనమునకు వినియోగింతమన్నయడల, పురుషులకే ఉద్యోగములుగాని, సంపాదనార్హమగు వృత్తులుగాని చాలకున్న నీసమయమున స్త్రీలుకూడ ఉద్యోగములకు పోటీపడినయడల నిరుద్యోగసమస్య మరింత కఠినమై, దేశమం దాందోళన కలిగించునేగాని ఫలప్రదాయికాదు.

గర్భిణీస్త్రీకి విశ్రాంతి యావశ్యకము. పిల్లలను పెంచుటలో తల్లికిగల యోర్పు, శాంతి, పురుషుల కుండుటయరుదు. గర్భధారణమునకు పూర్వమును, ప్రసవానంతరమునుగూడ స్త్రీకిసంతోషము, సౌఖ్యము, విశ్రాంతిముఖ్యావశ్యకములు. సహజమగు నీదేశోద్ధరణ కార్యమునకు పైగా, సంసారమునీదు బాధ్యతకూడ మీదపడినయెడల స్త్రీ చాల నలిగిపోవుటయేగాక, ఇటు శిశుసంరక్షణమో, అటు ఉద్యోగమో చెడును.

ప్రకృతి సిద్ధముగా పురుషుడు ఏదోయొక వృత్తిని సాధనముగా గొని ధనసమూపార్జనమునకు దగియున్నాడు. "మగవాని పెంపుబిడ్డ" యని నాదారు పిల్లల ననుట వాడుకయై యున్నది. బుద్ధి చాకచక్యమందుగాని, కార్యనిర్వహణమందుగాని, పరాకాష్ఠయందుగాని, స్త్రీలు పురుషులకు తీసిపోరు. రాజ్యములనేలిన స్త్రీలు, రణరంగమున రక్తసిక్తధారలతో తాండవించిన స్త్రీలు, మంత్రులై రాజకార్యముల నడపిన స్త్రీలు లేకపోలేదు. కాని వారిసంఖ్య చాల తక్కువ.

అట్లే పురుషులలోకూడ, ఇంటిపనులయందు, వంటపనులయందు, శిశుపోషణమందు, ఆరితేరినవారు గలరు. కాని వారిసంఖ్యయు చాలతక్కువ.

చూడగా, ప్రజాభివృద్ధి గావలసినయడల, స్త్రీలను మాతలుగా నుండునట్లును, పురుషులను, భార్యలను, పిల్లలను సుఖముగా పోషించుటకు వలయు ధనము

నార్జించుటకును నియమించిన ప్రాచీన సదాచారమే మంచిదిగానున్నది.

స్త్రీలకు బాల్యమందు తండ్రియు, యౌవనమందు భర్తయు, వార్ధకమున సుతులును, పోషణకర్తలుగా నియమించి స్త్రీ సౌఖ్య విశ్రాంతులను గలిగించిన మనువు ధన్యుడు.

నాగరకత ముదిరి ముదిరి, స్త్రీ మాతృత్వపదవిని స్వీరించకను పురుషుడు పెండ్లియాడి భార్యాపుత్రుల పోషణభారము నంగీకరించకను, దేశవర్ధకులగు ప్రజలను సృష్టించుటకు వెనుదీయగా, జర్మనీ, ఫ్రాంసు దేశము లీనాడు స్త్రీలకు మాతృత్వధర్మమును, పురుషులకు భార్యా సుతుల పోషణమును విధియించి దేశమును ప్రజావర్ధకము గావించుచుండవలసిన శోచనీయ స్థితికి వచ్చినది.

ఇప్పుడిప్పు డక్కడక్కడ స్త్రీలు పరీక్షలు ప్యాసయి ఉద్యోగపదవుల నాక్రమించుచున్నారు. భార్యాభర్తలొక్కచోటనుండి, హాయిగా దాంపత్య సౌఖ్య మనుభవించుచున్న వారిని జూచినవారి కెంతో ముచ్చటగా నుండునని చెప్పగా వినియుంటిని. ఉద్యోగమునకును, సంసారధర్మమునకును పడక పోవుటచేత,అట్టి స్త్రీలు వివాహమునే మాని పరివ్రాజకలుగా నిలిచిపోవుచున్నారు. అట్టివారు కొందఱున్న జాలును.

ఎటుజూచినను, స్త్రీలకు మాతృత్వపదవీవాంఛ యుదయింపజేయు విద్యాప్రణాళిక చాల యావశ్యకము.

ప్రస్తుతము మనపాఠశాలలలోని విద్యనే 13, 14 ఏండ్లలో పూర్తిగావించుకొని యస్. యస్. యల్. సి, ప్యాసైన ఒకబాల, అత్తవారింటికేగినచో చిన్న-చిన్న పనులు చేయుటకు గూడ రాక, తనకును, తనభర్తకును సౌఖ్యమీజాలకున్నది.

స్త్రీలు పాఠశాలలోనే చిన్నతనమునుండియు నుండుటచేత, వారిభావి సంసారసౌఖ్యమునకు వలయు విద్యలను, పాఠశాలలలోనే నేర్పబడవలయును. ఆ విద్యలలో—పాకవిద్య—చాల ముఖ్యమైనది. హిందూగృహము మిక్కిలి మితవ్యయముతోగూడిన గృహము. హిందువుల ఆర్జన మిక్కిలి తక్కువ. ఆకారణమున పెద్దజీతములవారు పెట్టుకొనినట్లు, వంటకొకనిని, బజారువెచ్చముల కొకనిని బట్టలారవేయుటకొకనిని, యిట్లు పలువురు నౌకరులను పెట్టుకొనుటకు వసతిజాలదు. కావున స్త్రీలకు ప్రధానమగు పాకవిద్యను పాఠశాలలలో నేర్పుట అభిలషణీయము.

15 ఏండ్ల స్త్రీ, భర్తతో కాపురముచేయుచుండును. అప్పటి కప్పడే వంటయందు దారితేరి, శిశుపోషణమునకు వలయు విద్యనునేర్చి, కామశాస్త్రమును ఆరోగ్యశాస్త్ర సమ్మతమొనర్చుకొని ధర్మార్థకామ మోక్షములను జారగొను సత్ప్రియత్నమునునుండుట హిందూశాస్త్రసమ్మతము. అది యట్లుండ, నేటి ఆర్థిక పరిస్థితులను బట్టి చూచినను, స్త్రీ సంసారమున పతికి సహాయకారిగా నుండినగాని ఆసంసారము మట్టుగా నడవదు.

అవిభాజ్య హిందూకుటుంబములు నేడు కాన్పించుటయే అరుదుగానున్నది. అట్టి కుటుంబములలోని పెద్దలు, చిన్నవారలకు చెప్పుకయే, సంసార నిర్వహణమునకు వలయు సదుపాయములను చెప్పుచుండెడివారు.

పృథక్ కుటుంబము లేర్పడినతరువాత, చిన్న వయస్సున తల్లియగు యిల్లాలికి సంసార నిర్వహణ దక్షత, పాకశాస్త్రప్రవీణత మరింతయవసరములైనవి.

కావున పాఠశాలలలో ప్రస్తుతపు ఆరోగ్యశాస్త్ర పద్ధతుల ననుసరించి పాకశాస్త్రమును జెప్పుటకు ప్రారంభింపవలయునని కోరుచున్నాను. సోదరీమణులీయభిప్రాయముతో నేకీభవించి పాఠశాలాధికారుల కీవిషయమై యుద్బోధము గలిగింతురని విశ్వసించుచున్నాను.

స్త్రీల యభివృద్ధి కెంతో కృషిసల్పుచు, కష్టనష్టములకోర్చి, ప్రశస్తమైన ! "గృహలక్ష్మి" పత్రికా పతంసమును నడపుచున్న, పత్రికాధిపతులుగూడ నీవిషయమై సత్కృషి సల్పుదురుగాక యని కోరుచున్నాను.

# వింత వివాహము

బంకుపల్లి సూర్యశాస్త్రిగారు

అది మాఘమాసం. రథసప్తమి వెళ్లి రెండురోజులే అవడముచేత మలయమారుతం హాయిగా వీస్తుఉంది. 'పరిమళం' అప్పుడె భోజనంచేసి చావడిలోకొచ్చింది. గోడకు దాపిన సరస్వతీపటము వెనుక మామూలు ప్రకారంపెట్టిన గృహలక్ష్మి పత్రిక తీసి చదువుతూ మంచంమీద చేరబడింది.

ఎదురుగాఉన్న యింట్లో 'సమీరు' కుర్చీలో కూర్చొని కళ్లజోడుసర్దుకుంటూ తన విద్వాన్ పరీక్షాపుస్తకాలు చదువుకుంటూఉన్నాడు. తల పైకెత్తిచూచేసరికి ఎడమవైపున్న పరిమళంయొక్క సుందరవదనం కనిపించింది. సమీరు తనహృదయాన్ని ఇన్నాళ్ళకు ఆమె పరంచేశాడు. దృష్టికూడ పరిమళంమీద లగ్నమయిపోయింది.

పరిమళానికి ఆచూపులు వినుగుకలిగించేయి. అదివరకెప్పుడు సమీరు అల్లా చూడకపోవడంచేత కోపంకూడ ఒచ్చింది. కొంతసేపటికి ఈర్ష్య తెచ్చుకొని తనచేతిలో ఉన్నగృహలక్ష్మి పత్రికను మంచంమీద పడవేసి చావట్లోంచి వెళ్ళిపోయింది.

సమీరు ఖిన్నుడై పోయేను కాని ఒక్కొక్కమారు ఎంచేతనో ఒళ్లుపులకరిస్తుఉండేది. పరిమళం పెంకితనం జ్ఞాపకం తెచ్చుకొని ఒక్కొకమారు కోపం దుఃఖంకూడ తెచ్చుకుండేవాడు. మొత్తంమీద ఇదివరకున్న మనశ్శాంతి ఇప్పుడులేదు చదువుతూవున్న పరీక్షాపుస్తకాలు తలకెక్కడంలేదు.

౨

పరిమళానికి యిరువదియైదు సంవత్సరాలుంటాయి. మందారపువ్వులాంటియౌవ్వనం, యౌవ్వనంతోపాటు వైధవ్యవ్యథకూడ ఆవేశించింది. రోజురోజు జీవితం యెడారై పోతూంది. "జీవితంలో నాకు విశ్రాంతిలేదు. కాబోలు!" అని అనుకుంటూ ఉండేది. కాని ఎప్పుడూ గృహలక్ష్మి భారతి మొదలయిన పత్రికలు చదవడంచేతనూ సమీరు ఇన్లుఖయన్నుచేతనూ హృదయవిశ్రాంతి కల్పించుకుంటూ ఇప్పుడిప్పుడు భావాలు మార్చుకుంటూ ఉన్నట్టు అగుపడుతూఉంది. పాటలంటే చాలయిష్టము. పాటలుపాడిన ఆడపిల్లల్నిచూస్తే చాల ఆదరిస్తుంది. తననోటుపుస్తకంలో ఎన్నోపాటలు రాసుకుంది. ఎప్పుడూ ఆడుతూపాడుతూ సంతోషంతో పవిత్రంగానే కాలంగడుపుతూఉంది.

పరిమళం తండ్రి శ్యామలరావుపంతులు గవర్నమెంటుపెన్షనుదారు. పూర్వాచారపరాయణుడుకాడు గాని స్వతంత్రభావాలు లేనివాడు.

సమీరుపన్ను గడలకే మాత్రం తీసిపోడు. ఎలాగైనా తనకోరిక సఫలం చేసుకుందా మనుకున్నాడు.

3

మర్నాడు పదిగంటలయింది. మామూలు ప్రకారం పరిమళం భోజనంచేసి ముందుచావ డిలో కొచ్చింది. పటంవెనకనున్న పుస్తకం తీస్తు సమీరుమీదికి తనకడకంటి సెర్చిలైటు ఫోకస్ చేసింది.

తమాషాచేద్దామని "ఇదిగో!"అని తన మధురకోకిలస్వరంతో కూసి చాటుకెళ్లి దాగుంది. భావతరంగాల్లో తేల్తూఉన్న సమీరు హృదయనావకు లంగరు అందలేదు. తానేంచెయ్యాలో తనకు తెలియలేదు. కాని అతడేంచేస్తున్నాడో చూద్దామని పరిమళం కిటికీలోంచి కొంచెం తలపైకెత్తింది. సమీరు ఏమీ ఎరుగనట్టు తలవంచుకొని పుస్తకం చదువుతున్నట్టు నటిస్తు పరిమళంయొక్క వదనకమలం పూర్తిగ గోచరమయ్యేక "ఓహో"అని పక్కునవన్వేడు. పరిమళం కోపమువచ్చినట్టు వేడిగసమీరువేపుచూస్తూ గబగబనడచి వంటింటికెళ్లిపోయింది."నాకేనా కోపంరానిది"అని సమీరు వీథితలుపులు గభాలున మూసేశాడు.

४

ఆరాత్రి సమీరు కనలునిద్రపట్టలేదు. "పరిమళానికి నామీద నిజంగా ప్రేముందా లేదా? లేక ఇదంతా కొంటెతనమా? అంతలోకినవ్వు......అంతలోకేకోపం.... కొంటెతనముంటే ఉందిగాని అందులో వ్యక్తిత్వంకూడ ఉంది.

పరిమళాన్ని విడచి క్షణమేనా ఉండగలనా? అయ్యో ఉండడమే! విడచి బ్రతుకడమే! నా జీవితం జీర్ణారణ్యంకాదూ! పరిమళం! నా జీవితం నిష్ఫలంచేస్తావా?"అని ఈవిధమయిన మోహాందోళన తప్ప మరొక ఆలోచనకు సమీరు హృదయంలో తావులేదు.

నిద్రలో కూడ పరిమళంవదనకమలమే ప్రత్యక్షం. హృదయేశ్వరి మందగమనంతో సమీపించి ఆలింగనంచేయబోయినట్టు కలొచ్చింది. ఇంకేమి జరుగునోగాని అంతట్లో గదిలో ఏదో చప్పుడైన చట్టున మెలకు వొచ్చింది. దిగ్గునలేచి చూచేసరికి పరిమళం లేదు. పరిమళం వాయువులో లీనమైపో యింది. తుదకు విషవాయువై పోయింది పరిమళం. మరి ఒక్కకునుకైనా లేదు.

వెంటనే ఫైల్ తీశాడు. స్వప్నమంతా చిత్రించికథగారాద్దామనుకున్నాడు. దిన్నెలు వన్నెలుపెట్టి కథపూర్తిచేసేసరికి రెండుగంటలు రాత్రయింది.

ఉదయాన్నె సమీరుకనబడలేదు నిన్నటి వేడి వేడిచూపులు ప్రియునిమనస్సు విరిచేశా యేమో అని పరిమళానికి బెంగకలిగింది. రోజు సంతోషంగాతిరిగే పరిమళం అనాసు కొన దిరిగి స్తంభానికి చేరబడికూర్చొంది.

५

సమీరుకథను పరిమళానికి చూపించా లని అనుకున్నాడు. ఒకవేళ యీకథశ్యామల

రావుపంతులు కంటపడితే అసలుకే మోస మొస్తుందేమో అని అనుకున్నాడు. ఆ కథ కాగితం ఇంట్లో ఉంచేశి ఉత్త చేతులతో వీధిలో కొచ్చేడు. శ్యామలరావు పంతులుతో మాట్లాడదామని కల్పించుకొని అతనింటికి వెళ్లేడు.

సమీరుని చూడగానే పరిమళానికి వల్ల మాలినసిగ్గు కలిగింది.

పైట సవరించుకుంటూ ముసిముసినవ్వుతో పాటలపుస్తకం తెరుచుకొని కలంతో ఒక్కొక్కపాట రాసుకుంటూ కూర్చుంది. సమీరు నిజంగా మాట్లాడడానికి వెళ్లలేదు. కాని ఏదో కొంతసేపు శ్యామలరావు పంతులుతో మాట్లాడి తిరిగి ఇంటికెళ్లుతు ఉంటె పరిమళం ఎదురైంది.

౬

"పరిమళం! కాస్తమంచినీరిస్తావ్?" అన్నాడు సమీరు. పరిమళం తెచ్చిన నీళ్లు త్రాగేడు. "ఇంతతియ్యగా ఉన్నాయేం నువ్వుదెచ్చిన నీళ్లు?" అన్నాడు. "ఆతీపినీళ్లలో లేదు" అంది నవ్వుతూ

"అవునుగాని మాయింటికోసారిఒస్తావ్?"

"ఎందుకూ"

"ఒకగమ్మత్తు చూపిస్తా!"

"ఏమిటి ?"

"ఒస్తెగాని చెప్పను"

"చూపిస్తెగాని రాను"

"బలేటక్కరివే"

"సరిగాని చెప్పవోయ్"

"కథ"

"కాదు చెపుదూ" అంది.

"అబ్బ !!"

"అయితె నేనురాను"

"అయితె విను. నీమీదకలొచ్చింది రాత్రి"

"అయితె కథ రాశేవేమిటి ఆకల ?"

"ఆ, అట్లాంటిదే జరిగింది"

"ఏమనొచ్చిందికల ?"

"తినబోయిరుచులెందుకూ అడగడం?"

"ముందు తెలుసుకుంటే మనస్ఫూర్తిగా తినొచ్చునని"

వీళ్లకబుర్లు శ్యామలరావుపంతులుకి విని పించేయి. ఏమిటో చూద్దామని తలుపుతీసే సరికి తోడిదొంగ లిద్దరు ప్రత్యక్షమయ్యేరు.

ముఖం ప్రక్కకుత్రిప్పి నవ్వుకుంటూ నిల బడ్డాడు సమీరు.

పరిమళంసిగ్గుతో దాగుంది. పాపం శ్యామలరావుపంతులు ఏంచేస్తాడు?ఏవో గొణుగు కుంటూ గదిలో కెళ్లిపోయ్యేడు.

పరిమళంవచ్చేక "విన్నారు చివరకు మన కథంతా" అన్నాడు సమీరు.

"పరవాలేదు. సాయంత్రం రానా?" అంది.

"ఆ ఆరుగంటలకి"

"ఆ"

సమీరు హృదయభారంతగ్గింది. పరి మళం మాటలు తలుచుకుంటూ నూతన వికాసంతో షికారువెళ్లిపోయేడు.

౭

అనుకున్న వేళకు పరిమళం సమీరింటికి బయల్దేరింది.

సమీరు తనగదిలో సంధ్యచీకట్లో ఆలోచిస్తు కూచున్నాడు. ఆలోచన ఆరోగంట మీద; ఇంతలో ఎవరో వెనకనుంచి కళ్లు మూసేశారు. ఉలికిపడి విడిపించుకోడానికి వెనకకు చేతులుచాచి ఆ చేతులు గట్టిగ పట్టుకున్నాడు సమీరు.

"ఇదంతా పరీక్ష చదువేనా?" అంది నవ్వుతూ పరిమళం.

సమీరు కథతీశాడు. "ఇదిగో! నీకు చూపిస్తానన్నది."

"స్వప్నగాథా?" అంది.

"మనవిలాసగాథ"

పరిమళం ప్రియునిలో పూర్తిగా లీనమయిపోయింది. తన్మయురాలై లోకం మరిచిపోయింది.

౮

రాత్రి భోజనమయ్యేక శ్యామలరావు పరిమళాన్ని పిలిచి "పరిమళం, నీవరస బొత్తిగ బాగులేదుసుమా?" అన్నాడు.

పరిమళం నవ్వుతూ "ఏంనాన్న" అంది.

"ఇదేమిటిల్లా అదురుబెదురూ లేకుండా." అన్నాడు కోపంతో.

పరిమళం తలవంచుకొని కాలి బొటన వ్రేలితో నేలమీదరాస్తూ కన్నీళ్లు కారుస్తూ నిలబడి నీరైపోయింది.

ఆరాత్రి ఏవేవో మాటలు చాలచాల అన్నాడు తండ్రి.........

ఆరాత్రి తొలిఝాము ఎల్లాగో గడిపింది. తెల్లవారుసరికి పరిమళం ఇంట్లోలేదు. సమీరు ఊళ్లోలేడు.

ఆరోజు గడిచిపోయింది. రెండోరోజు కూడ గడిచింది. మూడోరోజు ఒచ్చింది. సమీరు పరిమళాల జాడైనా లేదు. నాలవనాడు ఉదయం శ్యామలరావుపంతులుపేర ఒకకార్డు ఒచ్చింది.

అందులో:—

"నాన్నగారికి,

నమస్కారములు. నేను సమీరుని పెళ్లి చేసుకున్నాను. మా ప్రేమప్రవాహాన్ని మానవమాత్రుడు అడ్డలేడని నేను సాహసించి చెప్పగలను. ఇదఒక పవిత్రమయిన ప్రేమారాధన. అమానుషమయిన అకృత్యము కాదు.

ఇట్లు మీ ప్రియపుత్రిక,
"పరిమళం"

# "సుకృతి యెవ్వండో కదా ధాత్రిలోన్"

శా॥ శ్రీ విశ్వేశ్వర సన్నిధానమునఁ గాశీ క్షేత్రమం దార్య భూ
దేవుల్ కొందరు పూర్వ మొక్కపుడు ప్రీతిన్ గోష్ఠిగాఁజేరి నా
నా వేదాంత రహస్య చర్చలను విన్నాణంబుతోఁ జేయుచున్
శ్రీ వాణీ కరుణాకటాక్ష విలసచ్ఛ్రీయుక్తి నొప్పారుచో.

మ॥ పరమాశ్చర్యకరప్రభాయుతము దివ్యంబున్ స్ఫురన్నాగరా
క్షర సంయుక్తమునై తనర్చు నొక బంగారంపుఁబళ్లేర మా
పరిషణ్మంటపమధ్యభాగమున శోభారాశియై వ్రాలెః నీ
శ్వరమాయాతిశయంబు లొక్కొకట నుద్భాసించుఁబో యట్టులన్.

మ॥ 'బహుమానం సుకృతేర్వరేణ'యని యాపత్రంబుపై నుండె; నా
మహనీయుల్ తిలకించి రిచ్చవడి పల్మారుల్ ఫలింత్రట్టి త
న్మహదర్థంబును బొంద నర్హుఁడెవఁడొ నాయంచు యోచించుచున్
బహు మార్గంబుల. నిక్కమే సుకృతి యెవ్వండో కదా ధాత్రిలోన్.

చ॥ అకట మరొక్క వింతగలదా హరదత్త హిరణ్యవస్తువున్
సుకృతులుగానిమానవులు సోకినఁజా లది సత్తురేకుగా
నొక త్రుటిలోనమారు !! నెవరుందురు సాహసు ? లైనఁగాని యూ
రక నొక రిద్దరయ్యలు పరాభవ మొందిరి యప్పు డప్పుడే.

ఉ॥ అకథ దేశదేశములయందును వెల్లడియై యహర్నిశల్
రాకలు సేయఁజొచ్చి రటు లక్షలకొద్ది మహానుభావు, ల
స్తోకయశుల్, విశుద్ధచరితు ల్దనికు ల్నిరతాన్న దాతలున్
ప్రాకటధర్మశాస్త్రపరిపాలకు లుత్కటపుణ్యశాలులున్.

ఉ॥ ఏటికి వీరు వారనుట లేగతినో సుకృతంబుఁజేసి తీ
పాటి యటంచు నెంచుకొను వాఁడెవడైన సరే కడంగి యా
హాటకపత్రమొందఁదగు నంచు నశేష ధరాతలంబునం
జాటఁగఁ బంచిరంతఁ బరిషజ్జనముల్ముదితాంతరంగులై.

నను మిగులంగ నీక యిడినాఁడనుగా! సుకృతంబు దీని కం
టెను మరియేది? వే యొసఁగుడీ యిక నాకు సువర్ణ పత్రమున్.

మ॥ అన నావండితు లైకకంఠ్యముగ 'నౌనౌ మానవాధీశ! దా
నిని నీవే గ్రహియింప నర్హుఁడ వహో నిక్కంబుగా!' నంచుఁ బ
ల్కిన మోదాతిశయుండు వాఁడు నరుగెక్కెన్ మెల్లఁగా! రోమహ
ర్షణకంపాది విలక్షితాంగమునఁ జేరంబోయె దానింగొనన్;

ఉ॥ వెంటనె యెల్లవారలకు విశ్రుతమై యశరీరి యంతలో
'నంటకు దొంగనాకొడక! యంటకు మంటకు; మీవుకావుము
క్కంటి దయాస్పదంబ'వని గట్టిగ మ్రోసెను గాని భూవిభుం
డంటెను దాని నాసమెయి; నక్కట! తత్ఫలమేల చెప్పుటల్!!

మ॥ పరిహాసాస్పదు లౌటగాక! తమ గొప్పల్తాము వేమారుఁ బ
ల్వురిలో నూరకఁ జెప్పుకొన్న నరు లౌ భూతేశ్వరప్రీతు లౌ
దురె? యాత్మస్తుతి కంటెఁ బాతకము కద్దో? వట్టియాడంబరు
ల్చరితార్థం బెటులం గడింతు రిటు లాశాపాశసంబద్ధులై?

ఉ॥ ఈవిధి 'దొంగనాకొడుకు' లెందరికయ్యెనొ శృంగభంగ మ
య్యా, వివరింపమాకుఁ దరమౌనె? య దట్టుల నుండనీ: మహా
దేవునిఁ జూచువేడ్కఁ జనుదెంచె నొకానొకనాఁడు మేటి స
ద్భావుఁడు కాఁపువాఁ డొకఁడు భద్రముగా నటు వారణాసికిన్.

మ॥ పరమాసహ్యము — చూడలే మకట! యేపాపంబులం జేసెనో!!
కర మామేన్ వ్రణపూర్ణమై యుమిదుతర్గంధంబులం గొట్టుచున్
బురువుల్గారుచునుండ బాధపడుచున్ మొర్రోయటం చార్చుచున్
బొరలం జొచ్చె నొకండు మార్గమున నాపుణ్యాత్మకుం జూచుచున్.

మ॥ 'కడువృద్ధుండను; గండ్లులేవు; నడువంగాల్లాడ; వమ్మయ్య, ప
ట్టెదుకూఁ డింత జలంబు — చాలు నదియే! యీదీనునిన్ వేగఁజూ
డుఁడు!! పానంబులువోయె! నొక్కఁడును లేఁడో ధర్మచిత్తుండు నా
నుడు లాలించెడివాఁ'డటంచుఁ గడుఖిన్నుండైన యవ్వానినిన్

చ॥ తటుకునఁ జూచి కర్షకుఁడు తద్దయుఁ గన్నుల నశ్రుపూరముల్
జొటజొట రాలఁ జెంతఁ జని శుద్ధదయావివశాంతరంగుఁడై

## సుకృతి యెవ్వండో కదా ధాత్రిలోన్

'కటకట! తమ్ముఁడా!' యనుచుఁ గాఁగిటఁ జేర్చి ప్రియంబుతోడ 'నాఁ
కటఁబడి కొట్టుకొం చిటులఁ గష్టము నొందుచు నున్నవాఁడవే!

శా॥ అన్నా, శ్రీగిరిజామనోహరున కే నర్పింతునం చిప్పుడే
కొన్నా నీ కదళీఫలంబు; లివె; యాఁ కొన్నాఁడ వీ వెంతయో!
పున్నెం బట్టుల నుండనిమ్ము కనెదన్; ముం దీవు భక్షింపుమా;
యన్నం బేమియుఁ బెట్టలేనయితి నీ కం చెంతయో నొచ్చెదన్.

ఉ॥ కప్పుర మింద; సీయొడలి గబ్బు నడంచును; మక్షికాతతిన్
జప్పునఁ బారదోలు; నిదిచాలున? నే నికపోయి వత్తునా?
చెప్పు' మటంచుఁ బ్రీతిమెయిఁ జేతనొకించుక డబ్బు వెట్టి పైఁ
గప్పి నిజాంశుకం బొకటి కర్షకుఁ డేగెను శంకరార్థియై.

మ॥ అటమున్నెందరొ తైర్థికుల్ కల రసంఖ్యాకుల్ మహాశక్తితో
నిటలాక్షుం గని భోగరాగముల నెన్నేఁ జేయుచున్ సర్వది
క్తటముల్ గింగురువెట్టగా "హరహరా, కైలాసవాసా, మహా
నట" యం చార్చుచు దానధర్మములకై నాణెంబులం జిమ్ముచున్.

ఉ॥ వానిని జూచి యంద రొకపట్టున నవ్వుచుఁ గేలిచేయుచున్
"జానపదుండు వీఁ డెవఁడొ చక్కఁగ వచ్చెను రిక్తహస్తుఁడై"
"లేనిది లేనెలేదు: కదళీఫలమైనను లేకపోయెనే"
"కాసియునైన దక్షిణకుఁగాఁ గొనితేఁ డిది యెంతలోభమో"

చ॥ అని యిటులాడుకొంట విని హాలికుఁ డచ్చోటు వాసి సంతసం
బునఁ జని యా సభాసదనముం గను వేడుకతోడ నచ్చటన్
ధనికవరుల్ స్వకీయసుకృతంబుల మిక్కిలిఁ జెప్పుకొంచు శం
భునిబహుమానమందుకొనఁ బోవుచు నొందినభంగపాటులం
గని మదిలోన నచ్చెరువు గల్గగఁ దానును దానిచెంతకుం
జనియె మనుష్యసాజమగు చంచలచిత్తముతోడ నంతటన్

చ॥ 'మిడుకఁడు వీరుపెద్దలని; మీదికి వచ్చుచు నున్నవాఁడు; ద
మ్మిడివెలసేయఁ; డేమిటికొ మిట్టిపడుం గద గోచిపాతరా
యఁ డెవఁడొ వీఁడు: గెంటుఁడని యాడుచునుండినవారి వీడి యొం
డెడకు గమించి యాహాలికుఁ డెంతయుఁ జోద్యమునొంది చూచుచో;

ఉ॥ ఆపరిషత్తునుండి యొకయయ్య చివాలున లేచివచ్చి యా
కాపునుజూచి "ఓయి, కరకంఠుఁ డొసంగును హేమపత్రమున్
దాఁపక యీవొనర్చు సుకృతంబులఁ జెప్పిగ్రహింప ర"మ్మనన్
ఏపశు వెట్టిదో తెలియ నెవ్వరికైనఁ దరంబె ధాత్రిలోన్

క॥ కని నిర్వ్యాజస్నేహంబున నాబుధుఁడా సరోత్తమునిఁ గెంగేలం
గొని తత్పరిషన్మధ్యంబున కల్లనఁ దెచ్చెః నుత్తముల తీ రదియే.

ఉ॥ హాలికచక్రవర్తియుఁ గృతాంజలియై యను "నయ్యలార! నా
కేలయిదంతయున్ ? జనన మెత్తిన దాదిగఁ గష్టజీవినై
యాలినిఁబిన్న పాపలఁ బ్రియంబలరారఁగ బెంచికొంటకై
నేలను దున్నుకొంట, తిని నిద్దురవోవుటయే యెరుంగుదున్.

మ॥ ఒకటెంకాయయుఁ గొట్టలేనయితి నయ్యో ! యిన్నినాళ్ళాయెఁ గా
శికి నేవత్తును బోదుఁగాని యెపుడున్ సేవింపనైతీశ్వరున్
సుకృతం బేమిటిచేసినాఁడనని యిచ్చోఁ జెప్ప మంద్రయ్య !! కా
పకులంబందునఁ బుట్టి పున్నెముల నెప్పాటం గడింతుంగదా !!

మ॥ అకటా ! అచ్చరమెట్టిదో యెరుగ నయ్యా, బాబు, నే నెప్పుడే
రికి నేగానియు నీయలేదుకద !! యేరీతిన్ శివుండిచ్చువాఁ
డిక నాకిట్టియినాము లక్కటకటా యీ యాన నాకేల? యీ
రక నన్నేటికి లాగుచుంటి"రని దూరంబేగె వాఁ డెంతయున్.

ఉ॥ వానికిబోధజేసి యలపండితుఁ డెట్టెటులో గిరీశ స
న్మానము వానిఁబట్టుమనినన్ వెరపొందుచు వాఁడు నల్లనన్
దానిని ముట్టెనెట్టెటులో ! తక్షణమే యది దిక్తటంబులన్
భానుసహస్ర తేజమయి భాసిలె !! హాలికుఁ డెంతవాఁడహోఁ !

మ॥ "అదిరా ! హాలికచక్రవర్తి ! కనుఁబుణ్యాత్ముండ వీ; వౌను ! నీ
యెద నిండారెడు పండువెన్నెలయె !! నీ కేయూహాలున్ లేవు. భూ
తదయావాలుఁడ వీవె యీకనకపత్రం బొందనర్హుండ" వం
చు దివంబం దశరీరిపల్కెను గడుం జోద్యంబుగా సంతటన్.

ప॥ కృ॥ మూర్తి




గుమ్మలూరు సత్యనారాయణగారు, బి. ఎస్ సి: ఎగ్.

## ఖండములద్వారా ప్రవర్ధనము:

ఖండములద్వారా ప్రవర్ధనము చేయుటవలన నీదిగువ రెండులాభములు సమకూడగలవు.

1. మొక్క మొక్క కులసాంప్రదాయములు నిలుచును. 'మొక్కకు కులసంప్రదాయము లున్నవా' యని పెక్కురు నవ్వగలరు. వివాహములందు చిక్కుపెట్టు కులసాంప్రదాయములు యీమొక్కలలోకూడ రావలెనాయని విచారించుట కవకాశము లున్నవి: పూవులకుండదగిన సుగుణములు వర్ణము,వాసనయుగదా. ఈరెండుసుగుణములుగల జాతులుండుట చాలయరుదు. కాని యొక్కొక్కగుణమునకు పేరుబడిన జాతుల నొకదానితో మరియొకదానిని సంకరపరచిన, వాని సంకరజాతులలో నుండగలవు. ఐనను, రెండుమూడు కాలములవరకు, విత్తులవలన సంకరజాతులు ప్రవర్ధనము లగుచున్నప్పుడు, వీని సంకరములు పూయుచు, కాయుచు, మరియొకకాలములో భిన్నభిన్నగుణములతో నవతరించి మనలను మోసపుచ్చును. ఇచ్చట నాసంకరజాతి, యనుకొనిన కులసాంప్రదాయము తప్పినదిగదా. ఇట్లు గుణములనుండి దారితప్పకుండుటకు, సంకరపరచినజాతులను విత్తుల (గింజల) వలన గాక, వాని ఖండములద్వారా ప్రవర్ధనముజేయుటయిటీవల కర్షకరహస్యముగా కనుగొనబడినది.

2. కొన్నిమొక్కలలో, నిరుపేదలలోని కీర్తి భాస్కరు లాకొకప్పు డుదయించినటుల, మనము కని, విని, యెరుగని యుత్తమగుణములు గలిగి యొకటి రెండు మొక్కలు, వాటియంతటవి పుట్టుట వాడుక గలదు. (Sports). ఈ వింతమొక్కలు చాల లాభకరముగా నున్నప్పుడు, తిరిగి బొందకుండ చాలకాలము వరకు వాని ఖండములనే యుపయోగించుచువచ్చిన నిలబెట్టగలము. కనుక ఖండములు ప్రవర్ధనావిధానములలో చాల ముఖ్యమైనవి,

## ప్రవర్ధనావిధానము.

బాగుగా ముదిరిపోయినవి గాక బలముగానున్న 10-12 అం|| పొడవుగల మొక్కల నొక కొమ్మలో నుండి వాడిగల తోటచాకుతోగాని, తోటకత్తెరతోగాని, కోసి తీయుము. వాడిగల పనిముట్లు నీ తోట పనులలో నుపయోగించకుండిన ఖండములలోని 'విభాజ్యకణములు' (Cambium layers) అనునవి చిందరవందరగా తెగి, పనికిరాకపోవును. మనపని పాడయిపోవును. కొమ్మను కత్తిరించుటకు ముందుగా నది 3-6 కణుపులు గలిగియున్నదో లేదో చూడవలెను. పిదప క్రింది కణుపునకు దగ్గరగా కొమ్మను గుండ్రముగా, మట్టముగాను చివరకణుపు దగ్గరకొమ్మను యేటవాలుగాను కోయగా వచ్చిన కొమ్మభాగమునే ఖండమనుచున్నాము. ఈఖండమును గోసిన వెంటనే 8-10 గంటలవరకు నీళ్లలోనుంచి, లేక తడిపినగడ్డిలో నుంచి తీసినపిదప బాగుగాతుడిచి మట్టముగా నరికిన క్రిందిభాగమునకు, మైలతుత్తము బహుస్వల్పముకలిపిన శుభ్రమైన పేడముద్దను మెత్తుము. ఏటవాలుగానరికిన మీదిభాగము గోళము లోనికి పోవును. ఇటుల

చేయుటవలన, యెక్కువ యాహారపదార్థములకు దీసు కొని వేగము వేళ్లుతన్నుటకు వీలుగానుండును.

ఖండము లిట్లు తయారయిన తరువాత గోలెములను నింపవలసియున్నది. మంచి మిశ్రమమును తగులబెట్టక, చిన్న పూలగోలెము (6—5—4 అం॥)లో 1 భాగము మెత్తని బొగ్గగుండ, 3 భాగములు సన్నని యేటి యిసుక, 1 భాగము తోటమన్ను కలిపి నింపవలెను. సాధారణముగా ఖండములను పాతునప్పుడు ఖండములనే స్వయముగా మన్నులోనికి క్రుచ్చుట వాడుక. అటులజేసిన ఖండములలోని కణములు కొన్ని తెగి పోవును. కనుక యట్లు చేయుటమాని, యొక కర్ర పుల్లతో మొదట గోతుల నేటవాలుగాజేసి, యందు జాగ్రత్తగా నీఖండముల నుంచవలెను. ఇట్లు గోలెములోచేసిన గోతులు, గోలెముల కేంద్రమునుండి కేంద్రోపరిభాగమువైపు, నేటవాలుగా నుండిన మంచిది.

తోటజాలిలో గోలెము మధ్యను నీరుబోయుచు, జాగ్రత్తగా నుంచిన 3-3½ నెలలలో ఖండములు వేళ్లు తన్నును. సాధారణముగా ఖండములను పాతుటకు మద్రాసు ప్రాంతములలో నవంబరు మంచిది. ఎందు చేతననగా యీనెలలో యిదివరకే యెండిపోయినవి గాని, ముదిరినవిగాని యాకులను కొమ్మలను కత్తిరించి వేయుదురు. అప్పుడే ఖండములనుగూడ దీసిన యవి మార్చి సరికి వేళ్లుతన్ని, జూలైలో నూడ్చి పాతుటకు సరిగా నెదిగియుండును.

అమెరికాపద్ధతిప్రకారము ఖండప్రవర్ధనము

24, 18, 2 అం॥కొలతలుగల, మూతలేని దేవదారు పెట్టెను తెచ్చి, యందులో పశుగత్తము, మంచి మన్నుతో నింపి, ఖండముల క్రిందిభాగమును పేడ ముద్దలోముంచి, దానిని తలక్రిందులజేసి పాతు నలవాటు అమెరికాలో గలదు. అటులజేసిన, సూర్య రశ్మి బాగుగా ఖండముల కంట్లకుతగిలి వేళ్లు త్వరలో పుష్టిగా వచ్చును. ఈవిధమునకు ఖండములు 6—8 ఉన్న చాలును. ఇందులో నొకచిన్న విషయమున్నది—దయ్యమో, భూతమో యనుకొనకుండ దానిని చేసిచూసిన లాభమున్నదీ, లేనిదీ, తెలియ గలదు. "ఎసిటిక్ ఏసిడ్" (Acetic Acid) అను నొక యామ్లపదార్థమును నీళ్లలో గలిపి, గోలెములో గాని తొట్టెలో గాని చల్లిన, వేళ్లతిశీఘ్రముగా బలముగా వచ్చి మొక్క పుష్టిగానుండును. ఈ చిన్న తనములోని దార్ఢ్యత, మొక్క యెదుగుచున్నకొలది, దానిస్థితిలో మంచిదనమును దెలుపుచునే యుండును.

మొగ్గంట్లు — వానిద్వారా ప్రవర్ధనము

అనగా మొగ్గలవలన తయారయిన అంట్లు సాధారణముగా 'మొగ్గలు' అనునపుడు పూ మొగ్గలని యభిప్రాయపడుదుము. కాని 'మొగ్గ' యనగా పక్వమునకు రాని పత్రసంబంధమగు వృక్షాంగవిశేషము. అది పూమొగ్గయినపుడు పువ్వులను, ఆకు మొగ్గయినపుడు కొమ్మలను నొడగును. ఈ మొగ్గలలో మొక్కలలో గల గుణములన్నియు యిమిడియుండును. ఇవి యించుమించు మొక్కల భాగజీవములు, వృక్షశాస్త్రరీతిని జూచిన కణుపులదగ్గరనున్న 'కంట్లు' అను ఆకుమొగ్గలును, పూలమొగ్గలును, యొకటే. ఆకును పూరేకయుగూడ లోని సూక్ష్మాంగ సముచ్చయములో నొకటే. కనుక యీ సందర్భమున మొగ్గంటులోని మొగ్గ కణుపు దగ్గరనున్నకన్నన కీయన్వయము.

మొగ్గంటువలన లాభములు

1. విదేశపురకములు పెంచునపుడు అవలంబింప వలసిన యుక్తమార్గమిది. మనదేశపు దేశవాళీలో బాగుగా పెరుగు రకములకే పైదేశపురకముల కంట్లను మొగ్గంటుగా కట్టిన మంచిది. అట్లుగాక పైదేశపు రకములను చెట్లపాళముగా గాని పాతినను, ఖండములుగా జేసినను, యవి వేళ్లు తన్ని యొకప్పుడీ స్థలములో బ్రతుకవు. కనుక యుత్తమమైన విదేశజాతులను, స్వదేశ

మున జక్కగా బెరుగు మొరటిజాతులపై, మొగ్గంట్లుగా గట్టిన లాభము. ఇట్టి మొగ్గంట్లకు సాధారణపు రోజా గులాబి ('Edward Rose') మంచిదని యిదివరకే నేర్చితిమి.

2, ఒకే చెట్టులోని, రెండుమూడు కొమ్మలలో నుండి 2, 3 రకముల పూవులను పూయించగలము. అట్టి వింతకృషి యుద్యానములో నుండదగినది.

## మొగ్గంటు కట్టువిధము

మొదట మనకు కావలసిన విదేశపుజాతి మొక్క (లేదా యితరజాతిమొక్క, లేదా ఖండములను దెప్పించి కొనినపుడు ఖండములను) దీసి యందులో ఆకు పచ్చగాను, దృఢముగాను, యున్న కన్నును వెదకి దాని చుట్టుగల కొమ్మ బెరడును వాడిగల తోటచాకుతో తిన్నగా గంట్లుబెట్టి, క్రమముగాగోసి, యూడదీయుము. ఇట్లు పైకిదీసిన 'మొగ్గబెరడు' ఉండును. మొగ్గకును; చుట్టుగల యావరణ బెరడునకును, సంకేతకములు.

పిదప బెరడు వెనుకనింకనంటుకొనియున్న తల్లి మొక్కయొక్క నాళములను మెల్లిగా చాకుతో, బెరడు కన్నము పడకుండ, గోకి పారివేయుము. ఇట్లు పలుచనైన బెరడు, మధ్యనొక మొగ్గకలిగియుండు నన్నమాట. దీనినే యంటు గట్టుదుము.

ఇకను అంటుకట్టబడు మనదేశవారి మొక్కదగ్గరకు పోయి బాగుగా పక్వమునకువచ్చి, యింకను ఆకు పచ్చగానున్న కొమ్మభాగమునుబట్టి, యందు దృఢముగాను, ఆకుపచ్చగాను, యున్న మొగ్గను జూడుము. ఈ మొగ్గయు, యిదివరకే విదేశపు రకమునుండి యూడదీసియుంచిన మొగ్గయు, సుమారు వయసులో నొకటిరైయి యుండిన మంచిది. ఇట్టి మొగ్గను వెదకిన పిదప తోటచాకుతో (ఇంగ్లీషులోని 'టి' అక్షరము వలె) గంటుపెట్టుము. ఈ గంటు బెరడుయొక్క లోతు (దళము) దాటి లోనికి పోకూడదు. అటుల గాక లోనికిపోయిన నాళములుదెగి, మొక్కకు హాని గలుగును. కోతలోని అడ్డముగానున్న గంటు తల్లికొమ్మ కణుపుమీది కుండవలెను. నిలువుగానున్న కోత, యా తల్లికణుపుమీది కన్నును నరికివేయుచు రావలెను. ఈ కోతవలన తల్లికన్ను చంపివేయబడినది. దాని స్థానమున నిదివరకే తయారుచేసియుంచిన 'అంటు' మొగ్గవచ్చును.

ఇట్లు అంటుమొగ్గయును, తల్లికొమ్మపై అంటు కోతయు, నయిన పిదప అంటుమొగ్గ నాకోతలో దూరిచి కట్టవలసియున్నది. ఇది చాల జాగ్రత్తగా చేయవలెను. మెల్లగా నిడుపుకోతకునున్న రెండు దవడలను విడదీయుచు, యా కాళీస్థలములో నీ యంటుమొగ్గను మణగిపోకుండ, దూర్చవలెను. అందుకుగాను, అంటుమొగ్గయొక్క వెడల్పుకన్న, గంటులోని అడ్డకోత చాల కొంచెమెక్కువగా నుండినను యుండవచ్చును. కాని అంటుమొగ్గయొక్క పొడవును, అంటుకోతయొక్క నిడుపును సరిపోవలెను. కొలతలను సరిజూచుకొని, జాగ్రత్తగా మొగ్గను లోనికి దూర్చి, 'అంటుమొగ్గ', 'నరుకబడిన తల్లిమొగ్గ'మీదకు సరిగా వచ్చినటుల జూచి, విడదీసియుంచిన బెరడు దవడలను తిరుగ మూసి, తడపిన యరటినారతో, అంటుమొగ్గనుమాత్రము వదలి యనగా తప్పించి, చుట్టును కట్టివేయవలెను. దీనితో విధానము పూర్తియైనది. ఇకనే నీరును పోయనక్కరలేదు. (అనగా అంటుమీదను) ఏమియు చేయనక్కరలేదు. మామూలుగా మొక్కకు నీరుపోయుచు, చీడపట్టిన యాకులను ద్రెంచి వేయుచుండవలెను. 3–3½ నెలలలో నీమొగ్గ చిగుర్చును. చిగిర్చినపిదప యీ మొగ్గంటు మీదనున్న తల్లి కాడభాగమును క్రమముగా కోసివేయవలెను. తుదకిట్లు, ఒకజాతి తల్లిమొక్కపై, వేరొకజాతి మొగ్గను దొడుగుటచేత, 'మొగ్గంటు' అయినది.

పైని చిగిర్చిన మొగ్గంటు క్రమముగా నెదిగి తల్లి నుండే క్రింది యాహారమును గైకొనుచు, తన జాతి

పువ్వులకు పూచును. ఇట్లు ఒకేకొమ్మనుండి రెండు జాతుల పువ్వులను జూచుదుము. ఇదియే మొగ్గంట్ల వలని రెండవవిశేషము. మనకెన్నిరకము లొకమొక్క నుండి రానక్కరలేనప్పుడు అన్ని తల్లికొమ్మలమీద నిట్లు మొగ్గంట్లు కట్టవచ్చును. లేదా చాలరకములు ఒకే మొక్కనుండి పూయించుటకు, అన్ని వేరువేరు రకముల కంట్లను, తల్లికొమ్మలపై మొగ్గంట్లు గట్టినను కట్టవచ్చును. ఇకనీ విధానక్రమము దెలసినపిదప నే విచిత్రప్రదర్శనమైనను జేయుటలో కష్టమేమున్నది?

## గోలెములలోని జయప్రదముగా గులాబిని పెంచగలుగుటకు

1. గోలెముయొక్క క్రిందికన్నములు మూసుకొని పోకుండ చూచుచు, నీటి నిలకడలేక, యెక్కువ చెమ్మదనము లేకుండ చూడవలెను.

2. సాధ్యమైనంత తరచుగా నేలను గలుపుచు మొక్క యెదుగుకొలది (గోలెములోని యాహారమై పోవుచుండును గనుక) గోలెములోని మన్నును మార్చు చుండవలెను. †

3. విలాసాధిక్యతను వింతవింత పాత్రలను గొని రాక మంటిగోలెములే యుంచుట శ్రేయస్కరము.

4. మొక్క బాగుగా మొగ్గలను దొడుగుచున్న ప్పుడు ద్రావకపు ఎరువుల నుపయోగించుట ఉత్తమము.

5. వర్షాకాలమున యెక్కువనీరు గోలెములో నిలచిపోయిన వెంటనే గోలెమును తలక్రిందులజేసి, పారపోయుట మంచిది.

6. గోలెములను మాటిమాటికి యెత్తి, స్థలములను మార్చుచుండవలెను. అటుల జేయుటవలన గోలె ములోనుంచి, మొక్కవేళ్లను భూమిలోనికి తన్న లేదు.

## గోలెములోనిమొక్క చచ్చుటకు కారణములు

1. సరియగు నీటి యింకుదల లేకుండుట.
2. శీతకాలములలో సాయంత్రము నీరుపోయుట.
3. మిగిలినకాలమందప్పుడును, మధ్యాహ్నము, లేక ప్రొద్దున్న యెక్కువ వడితో నీరుపోయుట.
4. తరచుగా మొక్క స్థితిగతులు చూడకుండుట.

† మూడు వారములకొక పర్యాయము గొప్పు త్రవ్వవలెను. పిమ్మట వారమున కొకసారిరైనను మీద పెచ్చుకట్టిన నేలను కలుపుచుండవలెను.

రెండుసెలల కొకసారి గోలెములోని సగమువరకున్నమన్నును దీసివైచి, తిరుగ కొత్త గొత్తమట్టితోను, మంచి మిశ్రమముతోను నింపవలెను. లేకున్న మొక్క నిరసించి చచ్చును.

# బాలవిజ్ఞానశాఖ

## ౧. పాటలు

మల్లెపువ్వుకు చెల్లెలో యేమో
మా పెరట్లో పూసింది
తెల్లని సన్నని జాతియొక్కటి
జాజిపువ్వని అంటారు
పందిరిలేదు ప్రాకుటలేదు
పరిపరివిధముల పొదవులతో
చిందులుత్రొక్కుతు దానికొమ్మలే
చివరంటా ప్రసరించాయి.
గుబురుకొన్నది కుంద్రముగాను
గుప్పెడు పూవులు గుచ్ఛమున
కబురులుకావు కావలసినచో
కడువడిగా రండేరుదము.

పొదవుకాదు నే నిలబడితేనా
కొదదాకా అది వస్తుంది
ఎడతెగక నే నొతయేసినా
యెన్నో పువ్వులు మిగిలేయి
అమ్మ పూవుకు అన్ని పూవులు
అక్కయ్యల్లిన దీ దండ
రెమ్మా రెమ్మకు లెక్కాజమలే
దెక్కువపూవులు మిగిలాయి
మల్లెజాజీ ఒక్కసారి
మా పెరటిని చూడొస్తారు
కొల్లలుగా పూసేవి పిమ్మట
గు నగులాడుతు పోతారు.

## ౨. కథలు

### అల్లుని తెలివి

శ్రీమతి సీతాలక్ష్మిగారు

అత్తగారింటికి అల్లుడువచ్చెను. అల్లుడు వచ్చెనని అత్తగారు చాల సంతోషపడి పప్పుపరమాన్నము పిండివంటలు మొదలగు నవిచేసి మునక్కాయసాంబారుకూడచేసెను. మామగారు వూరిలోలేనందున అల్లుడు ఒంటరిగా కూర్చొని భోజనము చేయవలయునని ప్రక్కయింటి బ్రాహ్మణుని భోజనానికి పిలచి ఇద్దరికి అన్నము మొదలైనవి వడ్డించి, మునక్కాయ సాంబారును నాలుగుముక్కలతో వడ్డించెను. అల్లుడు మునక్కాయలు ఇదివరలో చూచి యుండలేదు కావున, ఎట్లు తినవలయునని తెలియక ప్రక్కయింటి బ్రాహ్మణుని విస్త్రాకును చూచినాడు. ఆయన ముక్కలు నమలి తొక్కు ఉమ్మి యుండెను. మనముకూడ అట్లు నమలి తొక్కును ఉమ్మినయెడల అత్తగారు ఏమైన అనుకొంటారేమోయని అల్లుడు తొక్కుతోనే నమిలి మ్రింగవలయుననుకొని, ముక్కలను నమలి తొక్కుతో మ్రింగజాలక కంటిలో నీళ్లుకారగా, "చచ్చితి బ్రతికితి

బాబూ" అనుకొని, చాలకష్టపడి ఎట్లో నాలుగుముక్కలను ఒకటొకటిగా మ్రింగి వేసెను. అత్తగారు ఇదికనిపెట్టి అల్లునికి; మునక్కాయలంటే చాల ఇష్టంకాబోలు, తొక్కలతోకూడ మ్రింగివేసినాడని మఱి నాలుగుముక్కలు తెచ్చివేసెను. "ఆనాలుగు ముక్కలు తినుటకే యెంతోకష్టపడి మ్రింగితే మఱి నాలుగుముక్కలు యెట్లు మ్రింగేదిరా భగవంతుడా" యని చేతికి ఒకముక్కను తినడానికి తీసుకొనగా, ప్రక్కఇంటి బ్రాహ్మణుడు అల్లుని తెలివిని కనిపెట్టుకొని, ఈలాటి మొద్దు వీడొకడేనా లేక ఇంక ఎంతమంది ఉన్నారో కనుక్కోవలయునని, అల్లుని చూచి "అయ్యా మీరొకరేనా లేక మీతోబుట్టువులు ఎంతమందియున్నారు ?" అని అడిగెను. అందుకు అల్లుడు "ఈనాలుగు ముక్కలూ నీతి నేను బ్రతికితే, నాతోకూడ నలుగురయ్యా" అని చెప్పినాడు. కథ కంచికి మనమింటికి.

## పుంగనూరు రాజు

సత్యవోలు రాజశేఖరరావుగారు

పూర్వకాలమున పుంగనూరురాజ్యములో యొక వైశ్యకులజుడు వాస మొనర్చుచుండెను. కొలది వత్సరములక్రిత మాతడు గొప్పయైశ్వర్యవంతుడే; కాని పాపమాతడిప్పుడు కడుబీదవాడై యుండెను. అతని యాస్తంతయు బోయినది కాని పెద్ద సౌధ మొక్కటిమాత్ర మింకను మిగిలియుండెను. మహదైశ్వర్య సంపన్నుడగు యావైశ్యుడా గృహమును మాత్ర మెంతదరిద్రావస్థ ననుభవించుచున్నను విక్రయింపజాలకుండెను. అతడు నివసించుటకు యిల్లు కడుపెద్దది. అప్పటి పూర్వకాలపు రోజులలో యిటుకలు సున్నము నుపయోగించక యిండ్లన్నియు మట్టితోడనే కట్టబడియుండుటచే యీతని గేహముకూడ మట్టితోడనే నిర్మింపబడి యుండెను. వర్షకాలములో యధికవర్షములచే కోమటివానియింటిగోడ పడిపోయెను. గోడకువలయు మట్టికగుఖర్చుకన్నను కూలివాండ్రకూలి యెక్కువగుటచే యెట్లో శ్రమకోర్చి కూలీలచే గోడపెట్టించెను.

నాడే పరదేశీయుడైన చోరుడొకడా పట్టణమరుదెంచి, వణిజునియొక్క దివ్యభవనముగాంచి దానినిండ యధికధనరాసులుండునని యూహించి యా రాత్రి తప్పక యా గృహమునకు కన్నమువేసి చోరపడవలెనని దృఢముగా తలచెను. అతని యాలోచన ప్రకారమే నాటి నిశీధసమయమున చోరుడు నూతనకుడ్యమునకు రంధ్రము జేసెను. క్రొత్తగోడయొక్కమట్టి తడిగను మెత్తగను యుండుటచే యాచోరుడు తన శిరమును రంధ్రముగుండా దూర్చిదూర్చుటతోడనే యామెత్తని తడిమట్టంతయు మీదబడుటచే యాకన్నగాడు వెంటనే మరణించెను. మరుసటిదినమున చోరుని మిత్రుడొకడు వెదకుచు షాహుకారు యింటి గోడలో స్నేహితుని మృతకళేబరము నొక్క-

కొని యంటుకొని యుండుటనుగాంచి చాల విచారించెను. తక్షణమే యాదొంగ రాజు చెంతకు పర్వెత్తుకొనిపోయి "మహాప్రభో! యీయూరి వర్తకుడొకడు నాస్నేహితుని నిష్కారణముగా చంపియున్నాడు. కావున న్యాయమును దయచేయు"డని కోరెను.

ఈసంగతి జరుగుకాలమున పుంగనూరునకు యొక మూర్ఖుడైన దద్దమ్మ రాజ్యమును పాలించుటకు యేర్పడియుండెను. ఆతని పేరుముల్లాసాహేబు. రాజెంతటి బుద్ధిహీనుడో యాతని మంత్రులంతకంటెను తెలివిహీనులు బుద్ధిహీనులు. అట్టిరాజు న్యాయవిచారణకై తన సేవకులనుబిలచి నేరస్తుడగు వైశ్యుని దోడ్కొనిరమ్మని యాజ్ఞాపించెను. నీచులకు దుష్కార్యములను జేయుటన యుత్సాహము మెండుగదా! రాజాజ్ఞనుబడసినదే తడవుగ నొక్కపరుగ్వునబోయి యాభటులు నిరపరాధి యగు వైశ్యుని యీడ్చుకొని లాగుకొనుచు రాజుచెంతకు వచ్చిరి.

అంతట బుద్ధిహీనుడగు యవివేకియైన రాజు యేమియు నేరము నెరుంగని వణిజుని జూచి కఠినముగా "ఓవర్తకుడా! నీవేల తడిమట్టితో గోడనుకట్టించి యొకమనుష్యుని నిష్కారణముగా జంపితివి?"అని పల్కెను.

వెంటనే వైశ్యుడు "మహాప్రభూ! ఈ తప్పు నాదికాదు. అది గోడపెట్టిన కూలివాని నేరమైయున్నది. అందుచే నిందితుడతడు కాని నేనుకాను. ఆకూలివాడు తడిమట్టిని గోడకట్టుటకై యుపయోగించెను. నేనేమి చేయుదును."అని దీనముగాపల్కెను. అది విని రాజగు ముల్లాసాహేబు "తడిమట్టిని నుపయోగించి గోడకట్టిన కూలివాని నిటకు దోట్కొనిరం"డనిచారులకు త్తరువొసంగెను. వెంటనే కూలివాడురాజు సమ్ముఖంబున కీడ్చుకొని రాబడెను. రా జాతనిగాంచి "కూలిపనివాడా! నీవెందుచే తడిమట్టి నుపయోగించి గోడకట్టి యొకమనిషిని మృత్యువాతబెట్టితి"వని గద్దించిపల్కెను. ఆ కూలివాడు "అయ్యా! ఆనేరము నాదికాదు. అడుసు చేయుచుండిన కూలివానిదానేరము. అందుచే నిందార్హుడాతడై యున్నాడు. ఆతడొసగిన మట్టి నుపయోగించితి"నని భయముతో మనవిజేసెను.

తక్షణమే రెండవకూలివాడు రాజు న్యాయస్థానమునకు దీసికొని రాబడెను. "కూలివాడా! నీవు తడిమట్టినిచ్చి గోడ కట్టించి చోరునేల చంపితి"వనిరాజు కోపముతోబల్కెను. "అయ్యా నేనేమియు నెరుంగను నేనుపయోగించినకుండకు మూతిపెద్దదై యుండుటచే నీరు యెక్కువగాపడి మట్టిని చాలా తడిపివేసినది. ఆకుండనుచేసిన కుమ్మరి నేరస్తుడు. దండనార్హు"డని తన తెలివి నుపయోగించి సవినయముగా చెప్పెను.

"కుమ్మరిని దీసుకొనిరండు"అని రాజైన ముల్లాసాహేబు సేవకుల కాజ్ఞయిచ్చెను. కుమ్మరివాడరుదెంచగనే "ఓయీ నీవీ కూలివాని కడవకు మూతిపెద్దదిగా జేయుటచే యొక మనుష్యుని మరణమునకు కారకుడవై

యున్నావని యెఱింగియుండలేదా?" అని మల్లూసాహేబు గర్వముగా గద్దించిపల్కెను.

"గౌరవనీయులైన మహారాజా! నేను కుండనుజేయు సమయమునందు యొక వేశ్య మాయింటిప్రక్కనే పోవుట తటస్థించినది. నా దృష్టిని సారెచక్రమునుండి మరల్చి, యావిటకత్తెను జూచుచునుంటిని. నామనస్సు దృష్టి కుండలుజేయుటపై లేకుండుటచే నాచేతు లాకుండను మూతిపెద్దదై యుండు లాగున జేసివైచినవి. అందుచే యీనేరము నాదికాదు. ఈ నేరము భోగముదానిదై యున్నది. ఆమె శిక్షార్హురాలు." అని కుమ్మరి చాకచక్యముగా జెప్పెను. వెంటనే యాక్షణమందే వేశ్యకై కబురు వెళ్లెను. ఆవెలయాలు మంచి వెలగల వలువలు బంగారునగలు ధరించి రాజు చెంతకరుదెంచెను.

రాజామెను వీక్షించి "ఓ సుందరాంగీ! నీ వెందుచే కుమ్మరికుండలుజేయుచుండగా, వానిగృహముచెంతనే వెడలితివి? నిన్ను జూచుచు కుండకు మూతివెడల్పుగా జేసెను. కుండకు మూతి వెడల్పుగా నుండుటచే, నీరు యెక్కువగాపడి, అడుసును యెక్కువ బాడి వలె జేసినది. అది యొకగోడకుపయోగింప బడెను. ఆగోడ యొకదొంగపై బడుటచే వాడా నిముషమందే జీవములు విడిచెను. అందుచే వాని మరణమునకు నీవు కారకురాలవై యుంటివి" అని రాజు పూసగ్రుచ్చినట్లు చెప్పెను.

అదివిని వెంటనే యావేశ్య "మహారాజా! ఆ తప్పిదము నాదికాదు. బంగారపు పనివాని దుకాణమునకు, నగకై వెడలుచుంటిని. నా సువర్ణాభరణమును, త్వరగా నాకు పంపకపోవుటచే నేనే స్వయముగా వెడలవలసి వచ్చినది. అందుచే దారిలోనున్న కుమ్మరివానియింటిదరినుండి పోవుట సంభవించినది. దీనివలన నిశ్చయముగా యా కంసాలియే నేరస్థుడై యున్నాడు. శిక్షకు పాత్రుడగును." అని తనవచోనైపుణ్య మగపరచి సవినయముగా నుత్తరువొసంగెను. ఆవెలయాలి ప్రసంగమునకు రాజు చాలసంతసించి, స్వర్ణకారునకై చారుల నంపెను.

అంతట కంసాలి యాన్యాయస్థానమున కరుదెంచి, యానేరమును, మంచియుక్తిగా యొక లోహము లమ్ముకొనువానిపై ద్రోచివైచెను. అటుతరువాత లోహవర్తకు డరుదెంచి, యితరులవలె బుద్ధిచాతుర్యములేనివాడగుటచే, నిందారోపణ యేరిపైనను బెట్టుటకసమర్థుడై, నిరుత్తరుడగుటచే, క్షమించుటకు వీలులేక నేరస్థు డతడేయని నిశ్చయించిరి. రా జాతనితో "ఓయీ! నీవే యాదొరుని మరణమునకు కారకుడవై యున్నావు. కావున నీవు తప్పక మరణింపవలసియున్నది. మంచి పదునై వాడియైన, కొయ్యకు నిన్నుగ్రుచ్చివేసి చిత్రవధగావింతు"రని, తన యవివేకమును ప్రకటించుచుకొనుచు, న్యాయమును తీర్పుచెప్పెను. అచ్చటివారు ఆశ్చర్యపడిరి.

అంతలో యీ లోహవర్తకుని స్నేహితు లిరువురు, యీ చిత్రమును జూచుచు, వెలుపలయుండుట తటస్థించినది. వారిరువురును, యీ విచిత్రగాథనంతను విని, చూచి, మిత్రుని యనవసర మరణమునకు జింతిల్లిరి. ఎటో మాయోపాయముచే వానిని మృతి నుండి తప్పించి, రక్షింపవలెనని తలచి, వారిలో వారు తగవులాడుకొన బూనిరి.

మందబుద్ధిగల ముల్లాసాహేబు, ధ్వనిని విని, "బుద్ధిలేని నిర్భాగ్యు లేల వివాదపడు చున్నారు. ఒకమనుష్యుడు ప్రాణములను గోల్పోవుచుండగా యీ సమయమున మీరు నిర్విచారముగా తగవులాడుట మంచిదికా" దనెను.

ఇదివిని యిరువురిలో నొకడు "ప్రభూ! మేము యేల తగవులాడుచుంటిమనగా, మే మిరువురమునుగూడ, యీ లోహవర్తకునికి బదులుగా కొయ్యకు గ్రుచ్చబడి ప్రాణములను తృణప్రాయముగా గోల్పోవుటకు కోరుచుంటిమి. ఎవరైనను కొయ్యకు గ్రుచ్చబడి నిర్విచారముగా నుసురులను బాసినచో, యాతడు మరుజన్మమున పుంగనూరునకు రాజై జన్మించు"నని పల్కెను. ఇట్లు పలికి మరింత యెక్కువగా తగవులాడజొచ్చెను. మిత్రు లిరువురును, "నన్ను చావనిమ్ము" "నన్ను చావనిమ్ము" "వలదు నేనే ముందర చచ్చెదను" అని ఒకరినొకరుత్రోసికొనుచు, గ్రుద్దుకొనుచుండిరి. ఇదంతయుజూచి తెలివి లేని, దద్దమ్మయైన, యీరాజు యొక్క పెట్టున గొంతెత్తి "మూఢులారా? మీ యిరువురిలో నెవ్వరును చనిపోవవలదు. ఆ లోహవర్తకుడును మరణింపవలదు. మీలో యెవ్వరికిని నారాజ్యము, నా సింహాసనము నిచ్చుటకు యిష్టపడను. నేనే నారాజ్యమును కలిగియుందును. నేనే మరల పుంగనూరునకు రాజుగా జన్మింపవలెనని కోరుచున్నాను. అందుచే నేనేమరణించెద"నని యరచెను.

ఆ యుత్తరక్షణముననే మూఢుడైన ముల్లాసాహేబు, సూదిగానున్న కొయ్యను తన శరీరమునుండా గ్రుచ్చుకొని ప్రాణములను విడిచెను. ఆతనిమంత్రులు దీనినిజూచి, తెలివిలేనివారగుటచే, మరల ముల్లాసాహేబే పుంగనూరునకు రాజై జన్మించునని మిగుల సంతసించిరి.

# ప్రాచ్యలోకము

(ప్రాచ్యులభావములు వేగము మారవు—భారతీయులకు కొంచెమెక్కువగా యెందుకు మారినవి?—వానిలో ప్రధానములు—ప్రాచ్యపాశ్చాత్యులకు నిజమైన భేదమెక్కడ—పాశ్చాత్య వనితామణులు వారివిద్యలు—పూర్వపు జాతిభేదములు ఇప్పటి కర్మభేదములు—ఈకర్మలలోనికి యంత్రాలెంతవరకు రావచ్చును—కుటీర, యంత్రపరిశ్రమల యోగ్యతా, అయోగ్యతలు—ప్రాచ్యులలో సహజముగా కలగావులగము లేదు—అకాలమరణములకు మిల్లువస్తువులు కారణములు—అక్షరములు రాకపోయినను భారతీయ వనితలకు లోకానుభవ మెక్కువ—ప్రస్తుతములో చదువురానివారికి లోకానుభవమే తెలియదు—ఉద్యోగములను భారతీయవనితలుకూడ చేయగలరు. భారతీయాంగనల రాజకీయోత్సాహము—ఆక్షేపకుల అజ్ఞానము.)

## ప్రాచ్యులభావములు వేగముమారవు.

క్రిందటిసంచికలలో యింకా పూర్వాచారాల లోనో 'అజ్ఞానం'లోనో కొట్టుకుంటూ యంత్రాలలో పనిచేయడం తెలియనటువంటి స్త్రీలు గలదేశములు, యంత్రాలు అసలే లేనిదేశములు అయి, ప్రాచీన వ్యవసాయ కుటీరపరిశ్రమలలోవున్న చీనా, టిబేటు దేశములలో స్త్రీలలక్షణములు, ఆశయములు, సంకల్పములు, కోరికలు ఎంత అమాయికముగా, అక్లిష్టముగా, ఆరోగ్యకరముగ ఆనందముగా వుండెడివో చర్చించినాము. వారిసంకల్పాదులంతఅమాయికముగ వుండడానికి కారణము వారికి పాశ్చాత్యవిద్య, పాశ్చాత్యవాసనలు లేకుండుట అయివున్నది. అథవా కొందరికివున్నా, ఆవున్నవారిలో వాటిని మోహించినవారికంటె ఏవగించుకొనేవారే యెక్కువ. జనసామాన్యమునకు వారి అనుశ్రుతాచారములలో ఎట్టిలోపము కనిపించదు సరేగదా, సర్వమును గొప్పగానే కనిపించును క్రొత్తపద్ధతులంటే ఒక గోలలాగవున్నవి.

ఆ రెండుదేశాలలోను కేవలము పాశ్చాత్యమిషనరీలు పాశ్చాత్యవర్తకులు కాక, భారతదేశంలోలాగే ఒక స్థిరమైన పాశ్చాత్యప్రభుత్వమే నెలకొనివున్నట్లయితే, అచ్చట స్థాపించినబడులలో చదువుకొనే స్త్రీపురుషులెల్లరికిని ప్రాచీనపద్ధతులపై రోత, యంత్రవస్తువులయందు ప్రీతి, పాశ్చాత్యాచారములయం దనుకరణబుద్ధి మొదలగునవి స్థిరపడి, వారంతా గ్రామపునర్నిర్మాణము సంఘసంస్కారము ప్రారంభించి తమలాగే దేశం మారడానికి విశ్వప్రయత్నములను చేయుచుండియుందురు. కాని అచ్చట పాశ్చాత్యప్రభుత్వము లేనికారణముచేత, ఆబడులు లేకుండుటచేత ఆదేశపు పెద్దలకు యంత్రాదులయందు, పాశ్చాత్యాచారాదులయందు ప్రీతిలేక పాశ్చాత్యులెవరైనా తమ్మాక్షేపించినప్పుడు, మన దేశస్థులలాగ తమ్ముతాము దిద్దుకొని చక్కగా మారగడంగక, పాపమా యాక్షేపకులను ప్రత్యాక్షేపణము చేయుచున్నారు.

మనదేశము స్పష్టముగా గ్రామములదేశమైయున్న

కారణముచేత, పాశ్చాత్యాచారాభిమానములు పట్టణ వాసములను ముట్టడించినట్లు పల్లెటూళ్లలోకి ప్రాక లేదు. తప్పులో ఒప్పులో వారి పూర్వకాలపుగోలలు అజ్ఞానములు మూఢవిశ్వాసములలోనే వారు కొట్టు కొంటున్నారు. అవి అజ్ఞానమన్నా చెడ్డవిశ్వాస మన్నా వాళ్లు నమ్మరు. అవి విడిచిపెడితే వాళ్లకు లభించేముక్తి పోతుంది అనుకుంటారు. వారిలో చదువుకొన్న విజ్ఞానజాతులు కొన్నివున్నవి. వారి జ్ఞానవిశ్వాసములు ఇంచుమించుగా అట్లుగానేవుండే క్రిందివారి భావములను మార్చగడంగవు సరేగదా కొంతవరకు ప్రోత్సాహించుచుండును. ఇంగ్లీషు పరీక్షలు ప్యాసయి చిత్తములుమారి సంస్కారులైన స్త్రీపురుషులు నూతనభావములతో యీయుభయుల భావములు అజ్ఞానములమీద వాగ్యుద్ధము పత్రికలలో వ్యాసయుద్ధము, శాసనసభలలోనుంచి చట్టయుద్ధము, చట్టములుమీరినవారిపై శిక్షాయుద్ధము మొదలైన యుద్ధములు చేయుచున్నారు. అయితే పూర్వా చారాభిమానులు సంస్కారులవలె వీరులుకారు, యుద్ధము చేయలేరు, నిలవలేరు, కాలమెట్లీడ్చుకొని పోతూవుంటే అట్లీడ్చుకొనబడి పోతూవుంటారు. వారికి క్రొత్తపద్ధతులయందు విశ్వాసములను మనము కుదర్చలేము, ప్రాతపద్ధతులయందు చెడగొట్టలేము.

## భారతీయులకు కొంచెమెక్కువగా యెందుకు మారినవి?

వారికి పాశ్చాత్య మిల్లునూలు, మిల్లుబట్టలు, గ్లాస్గో డబ్బీలు, హేటులు, క్రాపింగులు మొదలగు వానిమీద మోహములేదు. అయినా అవి చౌకగా వారిమీద పడడమునుంచిన్ని, కొంచెం అందంగా పైమెఱుగు లుండడమునుంచిన్ని పల్లెపల్లెల జనులుకూడా వాటివెనకాతల పడిపోయినారు. అయినా యింకా పడనివాళ్లే యెక్కువ. వారికి తెల్లవాళ్ల ఇంగ్లీషు చదువులు, సబ్జెక్టులు అంటే యిష్టంలేక పోవచ్చును, అయితే అవి ప్యాసయినవాళ్లకందరికీ పెద్దఉద్యోగము లిచ్చేస్తున్నారు గదా అని మొదట తెలివైన వారు, తరువాత తెలివితక్కువవారు అందరూ క్రిక్కిరిసి స్కూళ్లలోదూరి యేటా నూటికి డెబ్భై మందిచొప్పున ఫేలవుతూకూడా బాధపడుతున్నారు. అయినా ప్యాసయినవాళ్లు దాని ప్రశంసలు చేస్తూనే వున్నారు. కాన్వొకేషను లెచ్చర్లుచదివితే కడుపు నిండిపోతుంది. ఈచదువులన్నీ యెక్కడెక్కడ వున్న పిసరూపిప్పీ ఊడిపోయేదాకా సాగుతాయి. అది యెప్పటికి అందరిదగ్గరనుంచీ పూర్తిగా ఊడుతుంతో ఊహించలేము. అట్లు వూడితేనేకాని మనకు బుద్ధి రాదు. అంతవరకుకూడా ఆస్కూళ్లు మఠతాలూకు యెక్కడెక్కడ యేమిశేషమున్నా తాకట్టుపెట్టుకొని మనము దివాలాలెత్తుటకే పనికివచ్చుచుండునుగాని, వృద్ధికివచ్చుటకు వినియోగింపవు. అయినా మనము మంచి పట్టుదలలూని వానిని విడువనొల్లకుండా వున్నాము. ఇది జ్ఞానమో అజ్ఞానమో!

## వానిలో ప్రధానములు

పాశ్చాత్యాచారపద్ధతులయందు ఛాందసులకు మొదటినుండీ అసహ్యముండేదికాని పాశ్చాత్యవాసన లబ్బిన పండిత సంస్కారుల సహాయమువలన అట్టి అసహ్యములు తొలగి, మన ఆచారవ్యవహారముల మీదికే మరల్చబడుచున్నవి. పాశ్చాత్యబట్టలు, డ్రెస్సుల మీద, చౌకగదాయన్న కారణముచేత, రాట్నములను విరగగొట్టుకొన్నంతకూడా, పేదలకు శ్రీమంతులకు గూడ ప్రీతివుండేది. చేతిలోవున్న డబ్బంతా చౌకగా వచ్చాయిగదా అని విదేశీబట్టలు కొనుక్కొంటకు పోతే, ఆడబ్బు పోయినతరువాత, ఆగుడ్డలు కొనుక్కోలేక మనగుడ్డలను తయారుచేసుకోలేని అవస్థలు వస్తాయని వారూహించుకోలేదు. అయిరోపాయుద్ధసమయములో ఇంచుమించుగా అంత ముప్పువచ్చినది. ఆదర్శిలానే మనదేశములో మిల్లులులేచాయి. అయితే ధనలక్ష్మి అంతా విదేశములకు ప్రయాణమయి పోయింది గదా వీరిది మనము కొనుక్కోగలగడమెట్లాగ మన

దేశపు మిల్లుయజమానులు అవతల విదేశీమిల్లు యజమానులతో పోటీచేయలేక, పనివాళ్లసమ్మెలతో సాలలేక, ప్రజలు పెద్దఖరీదులు పెట్టి కొనుక్కోలేక యిప్పుడు పడుతున్న అవస్థలు దేముడికెరిక. స్వదేశీ మిల్లుబట్టకు ఒక సల్లక్షణముంది. అది కొత్తగ నేయఁబడుచున్నది. విదేశమునుండి దిగుమతియైనది యెన్ని వేలయేళ్లనుండి చెల్లకపడియుంటే యీదేశానికి తీసుకొనివచ్చి నూరురూపాయిలది పదిరూపాయిలకమ్ముతున్నారో! అహా యెంతచౌకగదా అని మనమనుకొని కొనుక్కోవడము, పదిరోజులనాటి కది చిఱిగి పాట్టుకావడము. ఈగడబిడలో గాంధిమహాత్ముడు రాట్నం వడకండోయి మగ్గంమీద బట్టలు నేయండోయ్, ప్రతిమనిషీ చేతినిండా పనిచేసి యంత్రాలను పడపోయండోయి, దంపుడుబియ్యంతిని బలవంతులు కండోయ్, మిల్లుబియ్యంతిని మాత్రగ్గ కాస్తా ఇంగ్లీషుమందులకింద పోసేసుకోకండోయి అని రాట్నమువడుక్కుంటూ కూర్చుంటే, లక్షోపలక్షల మిల్లువాదులు "నీవు కాలాన్ని వెనక్కి లాగేస్తున్నావు, నాగరికతను నలిపివేయుచున్నావు, పూంజీదారులలో దూరుచున్నావు, కార్మికులను కష్టపెట్టుచున్నావు" అని దూషించుచు ఖద్దరు బట్టలమీద కుటీరపరిశ్రమలమీద వ్యతిరేకప్రచారమును ప్రారంభించుచున్నారు. అసలెట్టిప్రచారంలేకుండానే పూర్వపు, యిప్పటి మిల్లులమాహాత్మ్యమువల్ల ప్రజలంతా సోమరిపోతులై, వ్యవసాయకులు సంవత్సరమున కారునెలలు, తక్కినవారు సంవత్సరమంతాను వ్యర్థపుచ్చుచు కడుపు మాడుతున్నారు కాని రాట్నం ముట్టరు, రోకలిపట్టరు, మరే పరిశ్రమను పూనరు. పూనినా వారిని యితరులు ప్రోత్సాహించి వారిదగ్గర తయారైనవస్తువులు కొనరు. పట్టణవాసాలనుంచి జపాను చీటీలతోనో ఇంగ్లీషుచీటీలతోనో వస్తువులు వస్తే కొనుక్కొంటున్నారు లేకుంటే గుడ్డలులేకుండా, పాలులేకుండా, బియ్యంలేకుండా మాడుతున్నారు. దీనికి సాయం మనమా గ్రామాలకివెళ్లి కుటీరపరిశ్రమలకు వ్యతిరేకప్రచారము, మిల్లు సంస్థాపనాప్రయత్నము మొదలైనవికూడా చేసేలాగుంటే ఇక చెప్పవలసినదిలేదు.

## ప్రాచ్యపాశ్చాత్యుల నిజమైన భేదమెక్కడ?

మొత్తముపైని తూర్పుదేశస్థులకు పడమరదేశస్థులకు గల ముఖ్యమైనభేదములు మొదటివి కుటీరపరిశ్రమల గ్రామదేశములు, రెండవవి యంత్రపరిశ్రమల నగరదేశములు కావడమువలనకలుగుచున్నవి. తూర్పు పడమర లేకముకావాలంటే పడమరవారు కుటీరపరిశ్రమలనుపూని రాట్నమేనా వడకాలి. ఇట్లాగు వడకేరోజులు రాకమానవని యీమధ్యన మిస్ స్లేడు మీరాబాయిగారే అన్నారు. లేదా మనదేశాలలోని గ్రామాలన్నిటినీ పాడుచేసి, పెద్ద వో 40,50 నగరాలుకట్టేసి మిల్లులమయమేనా చేసేవాలి. తెల్లదేశాలు చిన్నవి కనకను, అక్కడ ఉత్పత్తిఅయిన సరుకునే నల్లదేశాలలో అమ్మి దోచుతున్నారు గనకను, వారి మిల్లులవల్ల వారి కిన్నాళ్ళవరకైనా లాభములువచ్చినవి. ఇప్పటికీ అల్లాటిలాభాలు రాకుండా వున్నాయి గదా అని తన్నుకుంటున్నారు. మన దేశాన్నంతటినీ మిల్లుపరిశ్రమలతో నింపేలాగుంటే, యిక్కడ తయారైనవస్తువు నేదేశము కొనగలదు? ఎవరూ కొనలేకపోతే వాటివలన మనకేమైనా లాభముండగలదా? అనేకమంది కూలివాళ్లకు కూలులుకోసేస్తే, అనేకలక్షల మంది కుద్యోగములులేకుండా లాగేసి నిరుద్యోగులనుచేస్తే, ఏకొంచెము మంది పూంజీదారులకో విదేశీ పూంజీదారులంతేసి లాభములుకాకున్నా యేమైనా లాభాలు వస్తున్నాయి. మనదేశాలలో యింకా మిల్లులు పెంచేలాగుంటే యింకా నిరుద్యోగము యెక్కువై, దరిద్రమెక్కువై, పేదలపీడనము వృద్ధి కాక మానదు.

## పాశ్చాత్యవనితామణులు వారివిద్యలు

పాశ్చాత్యదేశములలో స్త్రీలు కూలిపనులకు యంత్రములు నడిపేపనులకు పోతున్నారు. అందుకు



దామోదరథాకర్సే కన్యావిద్యాపీఠముయొక్క పట్టప్రదానోత్సవము గతవారము పూనాలో జరిగినది. అధ్యక్షోపన్యాసమును సర్. సి. పి. రామన్‌గారు యిచ్చారు. చిత్రములో ఆచార్యకార్వే, సర్. సి. వి. రామన్‌గార్లును యితరులును ఉన్నారు.

తగిన చదువులు చదువుతున్నారు, అందులో కీర్తి ప్రఖ్యాతులు పురుషులనుమించి సంపాదించుతున్నా రంటే ఆదేశములో యంత్రపరిశ్రమలు విరివిగా ఉండడం, అందులో పనిచేసే యేకొందరికో మంచి జీతాలియ్యడం, ఆజీతాలు లేకుంటే కాని యింటిదగ్గర దినం గడియక పోవడం, అందుకొరకు స్త్రీలు పురుషులుకూడా ఒకరితో ఒకరు పోటీ చేసుకోవడము అయివున్నది. యంత్రపరిశ్రమ లనగానే వస్తువుల ఖరీదులు హెచ్చుతాయి, వానిని కొనుక్కొంటకిం టిల్లు పదిమంది కూలివాళ్లు కావాలి, కష్టపడవాలి. సరిగా కష్టపడవాలంటే అందుకుతగిన చదువులు రావాలి. ఆచదువులు సాధారణబడులలో కాక టెక్నికలు బడులలో చెప్పుతారు. వానిలో జీతా లెక్కువగా వుంటాయి. ఎటుచూచినా డబ్బుడబ్బు అని ప్రాణాలు తినేస్తారు. ఆడబ్బు యంత్రాలలో కష్టపడి కూలిపనో మేనేజరుపనో చేస్తేనే కాని రాదు. ప్రాచ్యదేశస్థుల కిదంతా అనవసరపు తగులాటము, బాదరబందీలాగ వుంటుంది.

## పూర్వపు జాతిభేదములు, ఇప్పటి కర్మభేదములు

ఈదేశంలో జనులలో పూర్వం సాధారణముగా నాలుగురకాల మనుష్యులుండేవారట. ఒకరు చదువుకొని వ్యవసాయాదులు చేసుకుంటూ ప్రజలకు జ్ఞానమో గానమో మప్పేవారు; రెండవవారు మంచి శరీరశిక్షణముపొంది బలవంతులై దేశమున కెట్టి ముప్పురాకుండా కాచేవారు; మూడవవారు వస్తువాహనముల నొకచోటినుండి యింకొకచోటికి గొనిపోయి లేనివారికి సరఫరా చేసేవారు; నాలుగవవారు వ్యవసాయ కుటీరపరిశ్రమల నొనరించెడివారు. వీరిని బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రవర్ణములనేవారు. ఈకాలములో యీభేద మవసరములేదు. నిర్బంధోచిత ప్రారంభవిద్య, నిర్బంధసైనికశిక్షణము అందరికి బలవంతముగా మప్పుతున్నారు కాబట్టి అందరూ బ్రాహ్మణులే, అందరూ క్షత్రియులే అనుకుందాము. వైశ్యవృత్తికూడా యేకులమువారికి హక్కుగాలేదు. మదుపుపెట్టి వ్యవహారము చేసుకొనేవాడల్లా లాభాలు కొడుతున్నాడు, లేకుంటే దివాలా తెత్తుతున్నాడు. ఇక మిగిలినవారు ఎవరూలేరు. అందరూకూడా శూద్రులే. వారికి రెండువృత్తులున్నవి. అందులో ప్రధానమైనది పెక్కుమందిచే అవలంబింపబడునది వ్యవసాయము, వివిధనైపుణ్యములు కలవారిచే అవలంబింపబడునవి యితరకుటీరపరిశ్రమలు శిల్పములు గుమాస్తాగిరీలు, ఎడిటరు లేక సంపాదకషిప్పులు, మంత్రిత్వములు, శాసనసభ్యతములు మొదలైనవి. ఇది కార్మికయుగము కాబట్టి ప్రతివాడు యేదోకర్మ యీవిధంగా చెయ్యవాలి. మనదేశములో ప్రస్తుతము జాతిమాత్రోపజీవులు తప్ప నిజమైన బ్రాహ్మణక్షత్రియులు లేకపోయినా, వైశ్యులెల్ల కులములలోనున్నా, అందరును శూద్రవృత్తిలేక కార్మికవృత్తిపూని యేదో ఒకపని చేయుచున్నారు. కడుపులో చల్ల కదలకుండ పల్లెప్రాంతములవారికి దినము వెళ్లుచున్నది.

## ఈకర్మలలోకి యంత్రా లెంతవరకురావచ్చును

వీరందరినీ నేడు యంత్రపరిశ్రమలలో తరిఫీదులు అయి పట్టణవాసపువాళ్లలాగ తయారుకమ్మంటే,పట్టణ వాసపుకార్మికులగతి యేమికాను? పట్నాలలోనే యెంతోమందికి మిల్లులలో పనిదొరకక మన కేవీ పనులులేవో అని యేడుస్తూవుంటే, ఆగతి పల్లెటూళ్లకు కూడా పట్టవలెనా? ఇంతమంది కూలివాళ్లయి సరుకు లుత్పత్తిచేస్తే తమకు కావలసినదిమాత్రమే తాము ధరిస్తారుకాని తక్కినది యెవరుకొంటారు? తెల్లవాళ్ల దేశాలలో అంటే యిన్నాళ్లాయను మనము కొంటున్నాము గనుక వారి హెచ్చుఖరీదులు హెచ్చు కూలులు, స్త్రీపురుషుల సమానశ్రమలు, స్వాతంత్ర్యములు, నైపుణ్యములు, వానికి వలయుఖర్చులు అన్నీ

చిక్కినవి. మనము కొనుక్కొను చుండుటవల్లనే దివాలా యెత్తినాము. మరి కొనుక్కోడానికి శక్తి లేదు, కొనుక్కోమని బహిష్కారాయుధముకూడా పూనినాము. వాళ్ళది మనము కొనుక్కోవలసినదుర్గతి లేకుండా, మనది వాళ్లు కొనుక్కోకుంటే లక్ష్యము లేకుండా హాయిగా బ్రతకడానికి ఒక్కటే ఉపాయం. అది యంత్రాలులేని వ్యవసాయం. యంత్రాలులేని గృహపరిశ్రమలు. ఇట్టినాగరకత ఒక్క మనకేకాక సమస్తప్రపంచమునకును శరణ్యమైయున్నది. శీఘ్ర ప్రయాణాలకు, ఆచ్చులకు, మొదలైనవాటికి ప్రభుత్వములు యంత్రములుపెట్టుకొని, నష్టములుపొందో, లాభములుపొందో ప్రజల కుపచారం చేస్తూవుంటాయి. తక్కిన ప్రజాపరిశ్రమలన్నీ కుటీరావస్థలో నుండివలసినవే. విద్యుచ్ఛక్తి మొదలైనవివచ్చి కుటీరవాసికి సాయము చేయవచ్చునుగాని, కుటీరవాసి తన యిల్లు వాకిలివిడచి విద్యుద్యంత్రములలో కూలివాడై దాసుడు కాకూడదు. ఇది గాంధీమహాత్ముని బోధారహస్యము, తూర్పుదేశపు గ్రామాదులలో పూర్వము జరిగేరీతి, ఈమధ్యన పాశ్చాత్యయంత్రాలవల్ల చెడగొట్టబడినరీతి, యిప్పుడు పునరుద్ధరించుటకు సులభసాధ్యమైనరీతి. ఇట్లుకాక ఇంగ్లాండులాగో అమెరికాలాగో మనము తయారుకావాలంటే అవి యిప్పుడు పడుచున్న దురవస్థలు మనము పడకతప్పదు. పోనీ రష్యాలాగ డిక్టేటరు షిప్పు స్థాపించుకుందామన్నా, దానికి బహుళా తటస్థించగల ఆపత్తులు మనకు తప్పవు.

## కుటీర, యంత్ర, పరిశ్రమల యోగ్యతా, అయోగ్యతలు

పాశ్చాత్య ప్రాచ్యదేశములకు భేదము అవి యంత్రపాలితములు మనవి కుటీరనిర్మితములు అని చెప్పితిమి. యంత్రము కుటీరము అను ఈరెండుపదములలోనే అనంతభేదమున్నది. యంత్రమనగా ఆశపోతుతనము, యితరులను హింసించి వారిసొత్తును ఆరోగ్యమును దోచగోరడము, అహంకారము గర్వము మొదలగు గుణములతో పూరితమైనచదువులు చదువుకోవడము. కుటీరమనగా ఆశపోతుతనము లేక కష్టపడి నిరాడంబరముగ జీవించడము, ఇతరులసొత్తు తమయింట్లో పడిపోయి వారు నాశనము కావలెనను భావములు లేకపోవడము, వచ్చినపాటిచదువుతో తలతిరిగి అహంకారపూరితులై తామే గొప్పవారమనుకొని యితరుల నెల్లరిని ఆక్షేపించక పోవడము. పాశ్చాత్య, ప్రాచ్య జాతులకు ప్రధానభేదము లిట్టివని మన మంగీకరించినచో యీరెంటికిని కారణములు యంత్రకుటీరములనుటకు ఎవ్వరికిని సందేహముండకూడదు. వారిలో మనకంటె ఉత్తమోత్తమ నిరాడంబర జీవులెవ్వరో ఉండవచ్చును, మనలో వారికంటె దురాచారపాతకులును వర్తకనీతిపరు లుండవచ్చును. అయినను అసలు జాతులలక్షణములను బట్టిచూచినచో యీభేదములు సరియైనవనియే యెంచవచ్చును.

## ప్రాచ్యులలో సహజముగా కలగాపులగము లేదు

ప్రాచ్యపాశ్చాత్యదేశముల స్త్రీలలోగల లక్షణములకుకూడ యిట్టివియే కారణములై యుండవచ్చును. పాశ్చాత్యస్త్రీలకు ప్రాచ్యదేశములసంగతి విస్తారము తెలియకపోవుటనుంచియో, తమపురుషులు వ్రాసిన వ్రాతలు చదువుచుండుటనుంచియో, ఈదేశము వచ్చినవారికికూడ సత్కుటుంబినుల సందర్శనమబ్బక యేవెట్టిముట్టివారినో చూచిపోవుటనుంచియో, తాము మహానాగరికులనియు ప్రాచ్యదేశస్థులెల్లరును మూఢులనియు ఒక దురభిప్రాయమున్నది. పాశ్చాత్యులలో స్త్రీపురుష లొకరితోనొకరు కలగాపులగముగా తిరుగుతూ అతిచొరవగా ఉండే లక్షణమున్నది. మన దేశములలో అదేమికర్మమోకాని ఒకరికొకరు శాస్త్రయోదముగావుండి పలకరించి ప్రసంగించుకొనవలెనను భావముగలదు. యంత్రపరిశ్రమలు, టాకీపరిశ్రమలు, మొదలయినవి హెచ్చినపిమ్మట యీభావముతొలగి

మనకుకూడ అట్టిచొరవ కుదురుటలో ఆశ్చర్యముండదు. ఇట్లు కుదిరి అరమరఅభ్యంతరములులేకుండదము శ్రేష్ఠులలక్షణమనియు, ఏమాత్రము సిగ్గు మోమోటము వెనుకతగ్గుట యున్నను అనాగరిక మూఢులలక్షణమనియు వారియుద్దేశ్యము. స్త్రీ పురుషులేమాత్రము దగ్గరగా మసలినను దురాచారమనియు, యెంతగోషాలో మునిగివుంటే అంత సద్ధర్మమనియు అనుకొనుట మనదేశీయుల ఆచారము. పాశ్చాత్య విద్యావిభూషితలుకొంద రిట్టిదురాచారములను విసర్జించుకొనినను, పాశ్చాత్యవిద్య యెంతహెచ్చిననుగూడ, స్త్రీపురుషులమధ్య చొరవమాత్రము యేమీ హెచ్చకుండుట మనజాతిలక్షణముయొక్క బలవత్ప్రేరేపణవల్లకాబోలు ననిపించును.

## అకాలమరణమునకు మిల్లువస్తువులు కారణము.

పాశ్చాత్యస్త్రీపురులతో మనమంత చొరవచేసుకొని తిరగకపోవుటనుంచి మనసంగతి వారికి తెలియక వారి యిష్టమువచ్చినట్లు వారు వ్రాయుటలో ఆశ్చర్యములేదు. అయితే వారినిగురించి మనకువ్రాసే ఆచారమేలేదు కనుక యేమియువ్రాయము. అథవా వ్రాసినా యితరులలోని మేలునేకాని కీడును పరిశోధించేదృష్టి మనకుతక్కువ. చెప్పరాగా మనస్త్రీలు వారికివలె యంత్రపరిశ్రమాదులలోను ఆంగ్లేయవిద్యాపాండిత్యములలోను పారంగతులు కాకపోవచ్చును కాని, మన దేశీయసంప్రదాయజ్ఞానము, తెలివితేటలు, వ్యవహారదక్షత, శిశుపోషణ మొదలగువానిలో వారికి తీసిపోరు. మనలో మిల్లుబియ్యాలు దిగబడక పూర్వము అన్నిగ్రామములలోను అన్నిజాతులలోను పుట్టేబిడ్డలలోను మరణములుతక్కువ, బలవంతులెక్కువగా ఉండేవారు. ఇవి దిగుమతి అయినప్పటినుండియే క్రొత్తజబ్బులు దిగుమతి అగుచున్నవి. ఈమిల్లుజబ్బులకు దేశీయవైద్యములుపడవు. విదేశీ మందులసంగతి మనకుతెలియదు కొనుక్కోలేము. దైవకటాక్షమువలన దంపుడు బియ్యమలవాటైతే మన ఆడవాళ్లకి 'అనారోగ్యమెక్కువ పిల్లలనుకనడంతెలియదు, కన్నవాళ్లలో అనేకులు చస్తున్నారు' అన్న అపకీర్తులు తొలగుతవి.

## అక్షరములు రాకపోయినను భారతీయ వనితలకు లోకానుభవ మెక్కువ.

భారతదేశపుస్త్రీలు అజ్ఞానులు చదువురానివారు అని మనమీద వారువేయుచున్న రెండవఅపకీర్తి. మనవాళ్లకు యింగ్లీషురాదు నిజమే, కాని వారికి మాత్రము తమభాషలుకానియితరభాషలు వచ్చునా? మనదేశములో బడులుతక్కువ- ఈతక్కువబడులలోకే బాలికలుపోయి వారి కిష్టమైనవి చదువుకొనేవారు. గ్రాంటుస్కూళ్లురాగానే ఆబడులు, బోర్డుస్కూళ్లురాగానే గ్రాంటుస్కూళ్లు, పోయినవి. ఈ బోర్డుస్కూళ్లలోచదువు పూర్వపు చదువులకంటె మంచిదైనా చెడ్డదైనా యివిప్రతీవూళ్లోను పెడదామంటే గవర్నమెంటుకు డబ్బులేదు. డబ్బులేకుండానే పూర్వంలాగు ధర్మానికి చదువులు చెప్పుదామంటే పంతులకన్నములేదు. కాకపోయినా పిల్లలనందరినీ పాశ్చాత్యదేశాలలోలాగే నగరబడులలోకి కుక్కి లెఖ్ఖడొక్కలునేర్పి, స్టేటస్టిక్సు తీసుకొన్నదానికిన్నీ, మనదేశములోలాగ నూటానాట ఒకబడిపెట్టి ఇష్టము వచ్చినవాళ్లువస్తే చదువుచెప్పి, స్టేటిస్టిక్సు తీసుకున్న దానికిన్నీ భేదములేదా? వాళ్లలో సంతకాలువచ్చిన వాళ్లు, పుస్తకాలు చదవగలవాళ్లు యెక్కువమందివుండవచ్చును, మనలో తక్కువమంది వుండవచ్చును. మనకు స్వరాజ్యంవచ్చి కమాలుపాషాలాగ ఒక్క యేడాది సాగించామంటే అందరికీసంతకాలే, అందరూ చదవగలుగుతారే! ఈలోపులమాత్రం వారు తెలివితక్కువ మొద్దులైపోయినారా? లోకవ్యవహారంలోను, గృహనిర్వహణంలోను, వారికున్న తెలివితేటలు ఈ పట్టణవాసపుపిల్లలకే ఉండకపోవచ్చును. వారి తెలివి

లేట లెవరికీ తెలియవు, నిరాడంబరులు కాబట్టి. చదువు కొన్నవారైతే వారి ప్రజ్ఞలను బాగాచాటుకొని వ్రాసుకొని ప్రకటించగలరు కాబట్టి వారికి యింత వుంటే అంతగా గుప్పన సర్వలోకాలలోను వెలిగి పోతూవుంటుంది.

## ప్రస్తుతంలో చదువురానివారికి లోకానుభవమే తెలియదు.

పాశ్చాత్యదేశాలలో జ్ఞానముఅని పిలవబడేదంతా అక్షరాలలోనేవుంది. అక్షరాలువస్తే చాలు, జ్ఞానమున్నాసరే లేకున్నాసరే, లెఖ్ఖలలో చదువుకున్న పండితులలాగే సమోజాఅవుతారెవరైనా— మనతూర్పు దేశాలలో కుటీరపరిశ్రమలదేశాలలో జ్ఞానానికీ అక్షరాలకీ సంబంధమేలేదు. వినికిడిమీద, పరిచయముమీద, అనుభముమీద అనేక స్త్రీపురుషులు నిజమైన పండితులకంటె గొప్పవారుగావుండేవారు. ఇప్పుడు ఆవు పాలు యిస్తుంది, అవి తెల్లగావుంటాయి అన్న సంగతి కూడా అక్షరాలునేర్చుకొని పుస్తకాలుకొనుక్కొని, మేష్టగారిదగ్గర చెప్పుకొని, కంఠతాపెట్టుకొని వల్లించి అప్పచెప్పితేగాని రానటువంటిస్థితి యేర్పడ్డది. చెప్పరాగా యేమిటంటే యిప్పుడు ఎలిమెంటరీ స్కూళ్లలో చెప్పేసంగతులన్నీ యేస్కూలుకీవెళ్లకుండానే పూర్వమందరికీతెలుసును. వాళ్లకి చదువువస్తే వారికి తెలుసుననీ చదువురానివారంతా అవి తెలియని మూఢులనీ అనుకోవడము, జనాభాలెఖ్ఖలలోను పత్రికలలో వ్యాసాలలోను అట్లువ్రాయడము ఈ కాలపు టలవాటు.

## ఉద్యోగములను భారతీయవనితలుకూడ చేయగలరు.

పాశ్చాత్యదేశపుస్త్రీలను ప్రాచ్యదేశపు స్త్రీలకంటె గొప్పవారనడానికి కారణము వారిలోకొందరు అనేకరకములైన ఉద్యోగములు చేయుచుండడము. అసలు కుటీరపరిశ్రమల పల్లెటూళ్ల దేశములలో చేదామన్నా అన్నివుద్యోగా లుండవు. క్రొత్తగాలేచిన పట్టణాలలో పురుషులకే ఉద్యోగాలులేకుంటే స్త్రీలకుకూడా యెక్కడవస్తవి? అయినా పురుషులను గెంటేసి అనేకస్త్రీల కిస్తున్నారు. కాక పురుషుడి పని పైకిపోయి ఆర్జించడం, స్త్రీపనిదానినిదాచి యిల్లు చక్కపెట్టడడం అనేసూత్రమొకటి యీ దేశంలో యింకాచెడిగిపోలేదు. అంతేకాని స్త్రీలామాత్రముద్యోగములు చేయలేకపోలేరని ప్రస్తుతం బి. ఏ., యమ్. ఏ., పరీక్షలుప్యాసయి ఉద్యోగములుచేయుచున్న వారివలన తెలియుచున్నది. ఇంకా వారిసంఖ్య యెక్కువగాలేదని ఆంగ్లేయులుచేసెడి ఒకఆక్షేపణ ఉంటున్నది. ఏమ్., ఎ., లుప్యాసయిన వాళ్లందరికీ ఉద్యోగాలుయిస్తామని ప్రభుత్వమువారు పూచీకస్తు వ్రాసియిస్తే అయిదేళ్లనాటికి కనేక యమ్; ఏ., లు తయారవుతారు. ఏమీలేనిదాని కెందుకు సొమ్ము దండుగపెట్టుకోవడమని వాళ్ల తెలుగుచదువు లేమో చదువుకుంటూ ఇంగ్లీషువెనకాతలపడలేదు మనఆడవాళ్లు. అదిఒక అపరాధమా?

## భారతీయాంగనల రాజకీయోత్సాహము.

రాజకీయములలో పాల్గొని ప్రభుత్వము నల్లరిపెట్టి తమహక్కులను సంపాదించలేదని వేరొకనాక్షి భారతీయవనితలపైని. ఈ దానిసదేశంలో పురుషులకస లున్న హక్కులేమిటి స్త్రీలకు లేకపోవుటకు? స్వరాజ్యంవస్తేకాని యేదీచక్కబడదు, కనుక సర్వులు అందుకొరకు సహాయనిరాకరణవ్రత మవలంబించండి అని గాంధిమహాత్ముడు శంఖారావము చేసినపైని యెంతమంది స్వరాజ్య సమరరంగమునకు దుమికి అహింసావ్రతముతో యోధులవలె ప్రభుత్వముతో పోరాడిరి! ఈపోరాటము ఇంగ్లాండులో శ్వేతస్త్రీలు తమవోట్లకొరకు పార్లమెంటుపై బెడ్డలనువిసరిననాటి పోరాటముకంటె యెంతకీర్తిప్రదమైనది! ఇప్పుడు

# స్త్రీ హితైషిణీమండలి

ఎక్కడ చూచినను మహిళామండలసభలు, ఉపన్యాసములు, హక్కులు, పోరాటములు, సేవలు మొదలగునవి గ్రామగ్రామమునను నగరనగరమునను చెలరేగుచుండుట లేదా? ఈపాఠములన్నీ తెల్లజాతి స్త్రీల సభలనుచూచి నేర్చుకొన్నవి గాక, గాంధిమహాత్ముని సందర్శనఫలితము గాకలిగిన ఆవేశఫలితసభ లేగదా! కనుక సంఘసంస్కారవిషయమున నేమి, విద్యావిజ్ఞాన విషయములలో నేమి, సేవాసదన కార్యక్రమములలో నేమి భారతీయమహిళామణులు పాశ్చాత్యవనితల ఆక్షేపణలకుగాక ప్రశంసలకు పాత్రులైయున్నారు.

## ఆక్షేపకు లజ్ఞానులు

పాశ్చాత్యు లెన్ని ఆక్షేపణలు చేసినను మన గ్రామములన్నియు యంత్రపరిశ్రమలుగా మారవు. పల్లెటూరి వారందరు నాగరకశ్రేష్ఠులుగా మారరు. వారి ప్రాతయాచారము లన్నియుమాని హాట్లు బూట్లు గౌనులు బాబ్డుహెయిర్లు చేసుకొని అధిక సంఖ్యాకులు తిరగరు. అందరికీ యింగ్లీషుభాష రాదు, ఎవరిభాష వారికిరాకపోదు. ఇతరదేశముల వ్యవహారములనుగూర్చి యెక్కడైనా పదిసార్లు విన్నా చదివినా తెలుస్తుంది, లేకుంటే తెలియదు, కాని తమదేశపు పూర్వాధునాతనవిషయముల చరిత్రలన్నీ క్షణక్షణము స్మరించుకొనుచుందురు కనుక తప్పకుండా తెలుస్తవి. ఇంచుమించుగా ప్రతీదేశపు స్త్రీలసంగతియు ఇట్లేవుండును. ఇట్లే ఇచ్చటకూడ నున్నది. వీరిని తక్కువవారని కాని, అజ్ఞానులని కాని, పురుషబానిసలని కాని మూర్ఖాచారపరాయణలని కాని యెవరైన విదేశీయులు ఆక్షేపించినచో అందు యాదార్థ్యముకంటె అజ్ఞానాహంకారము లెక్కువగా ఉన్నవని మనము ఊహించవలసివుంటుంది.

## స్త్రీ హితైషిణీమండలి చతుర్థ వార్షికోత్సవము

సీ॥ సారసాక్షులమానసక్షేత్రములయందు విజ్ఞానబీజముల్ వెలయజేసి
భామామణులదాస్యభావంబుతోనాడి స్వాతంత్ర్యమున దేలి యాడజేసి
అవికలవేణులకై కమనీయామృత మాప్యాయముగ ద్రావునట్లుజేసి
స్త్రీజన గౌరవాదేశమార్గంబులు పిన్నపెద్దలలోన పెంపుజేసి
ఆత్మకళ్యాణముకేది యవసరంబో చక్కనెఱిగి మహోన్నతి కెక్కజేయు
నీహితైషిణిమండలి నీశ్వరుండు ప్రోచుగావుత శుభములప్రోవుగాను

సీ॥ సారస్వతంబున సాహాయ్యమునుగోరు తరుణీమణులకెల్ల దారిజూపి
ఆస్త్రీలహక్కుకై యారాటమునుజెందు యువిదలకెల్ల చేయూతనొసగి
స్వాతంత్ర్యమునకయి సర్వదాపోరాడు అంగనాజనముల కండయగుచు
దేశాభివృద్ధికై త్రిప్పలంబడుచున్న కొమ్మలకును పట్టుకొమ్మయగుచు
అన్నివిధముల స్త్రీలయభ్యున్నతులకు సాయమొనరించుచుండునీ సంస్థనెపుడు
ప్రోచుచుండునుగాత సంపూర్ణదయను అఖిలరక్షకుడైన మహాత్ముడెపుడు.

వెన్న అనంతరామమ్మ.

# పాకకళ

## —గోధుమ బాదాంహల్వా—

ఒకటిన్నరపడిపాలలో పాతికాపరకపడి నీళ్లుపోసి మరుగనిచ్చి పొంగువచ్చుసమయమున అయిదుపలముల బాదాంపప్పును వేడినీళ్ళలో కొంచెముసేపుంచి పై తోలుతీసి దానిని పాలుపోసి మెత్తగానూరి యుంచుకొని, ముందుగా అరపడి గోధుమరవలు వేసి చక్కగా కలియబెట్టినచో కొంచెముసేపులో వుడికిపోవును. అప్పుడు నూరిన బాదముముద్దను వేసి, మరికలిసిన తెల్ల చక్కర ఒకటింకాలుపడియును, రెండుపలముల పన్నీరును, ఒకపడినెయ్యియును చేర్చి కలియబెట్టుచు లేహ్యపక్వముగా వచ్చునపుడు దించుకొని భక్షించవలెను.

## —మహారాష్ట్రి సాంబార్—

ఎనిమిదిపలముల క్రొత్తచింతపండు నీళ్లలో కలిపి తీసికొని, ముక్కాలుఅరాకు పెసగలను ప్రత్యేకముగా వుడకబెట్టి యెత్తి పులుసులో వేసి, ముప్పదిరెండు పలములవంకాయలను చిన్నముక్కలుగాచేసి పై దానిలో వేసి, కొంచెము మెంతులు బియ్యపుపిండి ఉప్పు వీనినివేసి, అన్నియు బాగా కాగినతర్వాత ఆవాలు జీలకఱ్ఱతుంచిన మిరపకాయలు ఇంగువ వీనిని నేతిలో వేయించి అందులో పోయవలయును.

—పి. కమలావతి

## —కోవా రవ్వలడ్డు—

నీళ్లుకలవని ప్రశస్తమగు పాలుతెచ్చి బాగుగా కాయవలెను. కాగినకొలది పాలుపరిమాణములో చాలాతగ్గును. అనగా 2 శేర్లపాలు అయినచో అవి 1 శేరువరకు యిగురునట్లుమరగించి అవి దించివేయవలెను. పిమ్మట ఆ 2 శేర్లపాలకు తగినట్లు 1 శేరు గోధుమనూకతెచ్చి నెయ్యివేసి వేపవలెను. అలా చేయునపుడు మంచివాసన వేయును. ఒక కొబ్బరికాయ కోరుసహితము నేతితో వేపవలెను. వేగిన నూక, కొబ్బరికోరు, జీడిపప్పు, కిస్‌మిస్, సీమబాదం, కుంకుమపువ్వు, పచ్చకర్పూరం, ఏలకపొడి యివన్నియు తగినపంచదారతో మరిగిన ఆపాలయందుపోసి నిప్పుమీదనే ఒక పావుగంటసేపువుంచి బాగుగా కలియకలిపి దింపినపిమ్మట వుండలు కట్టవలయును. మంచి రుచికరముగను, పరిమళయుతముగను యుండుననుటలో సంశయములేదు. ఒకమారు చేసిచూచిన మీకే తెలియగలదు.

—కాంచనపల్లి వేంకటరంగనాయకమ్మ.

## —గోధుమ కాఫీ—

మంచి జవగోధుమలు, 1 శేరు తెచ్చి వుంచుకునేది. రాత్రిపూట ఒక ఐస్‌టంబ్లర్‌లోకి మేజా గరిటెడు గోధుమలు, నాలుగు బాదంపప్పులు, కొద్దిగా నీళ్లుపోసి వూరపెట్టేది. తెల్లవారగనే లేచి, ఆనాలుగు బాదంపిక్కలు, తొక్కవలిచి వుంచి ఈగోధుమలు రాతిమీదవేసి మెత్తగానూరి టంబ్లర్‌లో ఒకఅరాకునీళ్లులో ఈముద్ద పల్చగా కలిపి ఇంజన్‌పోయిలో కాగనిచ్చి అందులో పాలు చక్కెరవేసి భుజించిన చాలారుచి, ఉష్ణశమనము.

—కంకిపాటి రుక్మిణమ్మ.

# గ్రంథపరిచయము

**భాషామణి**

ఈ మాసపత్రిక యొక్క నాలుగుసంచికలు మా కార్యాలయము నలంకరించినవి. గతయేప్రిల్ నెలలో స్థాపితము. కార్యాలయము రాజమహేంద్రవరము. ప్రస్తుత మెల్లెడలఁ బ్రకటింపఁబడు వార్తాపత్రికలు వ్యాసపత్రికలవలె గాక సమున్నతసంపూర్ణగ్రంథప్రకటానుకూలపత్రికయై రాణించుచున్నది. వడ్డాది సుబ్బారాయకవిగారి లేఖినినుండి యెడనెడ మాసమునకొకతూరి తప్ప గంభీర రసగుంభితంబులగు పద్యరత్నములు ప్రసరింపకుండవచ్చును. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారివంటివారిని 'యిదిగో పత్రిక అచ్చగుచున్న'దని తొందరచేయనిదే ఒక ఉద్గ్రంథ నవలాభాగములు బయలువెడలకుండవచ్చును. ఇట్టి సంపాదకుని పత్రికయొండుండి ప్రోద్బలించనిచో శ్రీపాద కామేశ్వరరావుగారిలేఖిని సాహిత్యదీపిక వంటి విమర్శతత్వగ్రంథములు వ్రాయుటకు బుజ్జగింపఁబడనొల్లకుండవచ్చును. అసలు సంపాదకుడు చెలుకువాడ వెంకటరామయ్యగారు తన కనవరతము గలుగుచుండు సుందరావేశావస్థలలో చిందుచుండు కవితారసమును గ్రుమ్మరించుట కిట్టిపత్త్రిర మత్యావసరమనితోచును. ఇట్టిపూజ్యులు బుజమూనుకొని పత్రికానిర్వాహణ భారమునకు గడింగినప్పుడు కలిగిన సమ్మోదభరమునకు శ్రీమాచిరాజు దుర్గాశంకరామాత్యుడు చెలుకువాడ సుబ్రహ్మణ్యాదులు తమరచనలను విరివిగనర్పించి పత్రిక నుద్ధరింపఁబూనుటలో నబ్బురమేమి? ఇట్టి గ్రంథములు కవులవల్ల పూర్ణముగ మున్నురచింపబడినవేయయ్యు, పాఠకుల కొక్కసారికంటె మాసమాసపు వాయిదాలలో చదువుట కెక్కువముచ్చట లూరుచుండును. దీనికి సాయము వారిలేఖినులుకూడ స్పృహలుగ పాఠకలోకముకొరకు సద్యోభావముల ప్రసరించి పత్రికలబరచి వ్యాపింపఁజేయుచున్నచో వానిరమణీయత మరియు ప్రశస్తతరముగ నుండునని చెప్పక తప్పదు. ఇట్టి సుందరపత్రికకుచందాయా సాలుకు రెండేరూపాయీలు.

**కల్యా్యవతార ఘట్టము**

రాజమహేంద్రవరమునందలి హరిజనగ్రంథమాలవారి యేడవ పుస్తకం. గ్రంథమాల సంపా సంపాదకుడు శ్రీయుత కలగ సత్యనారాయణగారు, గ్రంథకర్త శ్రీయుత కొవ్వలి గోపాలరావుగారు. గాంధీమహాత్ముని మహిమలు, హరిజనుల దౌర్భాగ్యతలు, సవర్ణులఘోరములు, బౌద్ధమతప్రశంసలు, సకలజనదేవాలయ ప్రవేశహక్కులు మొదలైనవిషయము లిందు వర్ణింపబడినవి. క్రౌనుసైజు 43 పుటలు, వెల రు 0-2-0 లు.

**జంతువైద్యము**

గ్రంథకర్త 'అభినవసహదేవ' శ్రీయుత యేజెళ్ల శ్రీరాములు చౌదరిగారు, అంగలూరు, కృష్ణాజిల్లా. ఇందు సహదేవపశువైద్యము, గజవైద్యము, అశ్వవైద్యము, శునకవైద్యము, పక్షులవైద్యము, గొఱ్ఱెలు మేకలు పందులు పిల్లులవైద్యము అను అధ్యాయములు 172 పుటలుగలవు. వీనికి సంభవించు వివిధరోగముల పేర్లు, వానిలక్షణములు, చికిత్సలు మొదలగునవి యనేకధర్మశాస్త్రములు పాశ్చాత్యశాస్త్రీయగ్రంథములు పఠించి గ్రంథకర్త వ్రాసినారు. ప్రతివ్యవసాయదారునకు అత్యవసరము వెల రు 1-0-0.



# సంపాదకీయములు

**హిందూ దేవాలయములు—వాని ప్రతిభ:—**

మతము, దేవాలయము మొదలగువాని వలన భారతజాతీయత చెడి భారతీయులెల్లరు అనంతమతకులజాతిభేదములుగా చీలి పరస్పరాసూయానుమానములతో రేగుచున్నారు గనుక వానిని ధ్వంసముచేయకపోతే భారతదేశమునకు 'శాల్వేషను లేదు' అనే వారొక కొందరు; దేవాలయాలుంటేనేమి వాటిలో 'నమాజో', 'మాసో' చెప్పుకొనివచ్చేస్తూ వుండవాలికాని కాళ్లూ చేతులూగల ఆడమగ విగ్రహాలు, వాటికి పెళ్లిళ్లుభోగాలు, బాజాబజంత్రీలు, మేళాలుతాళాలు, కట్నాలు కానుకలు, పూజాపునస్కారములు, నైవేద్యాలు అభిషేకాలు, సంస్కృతభాషలో మంత్రాలు తంత్రాలు మొదలైన అంగరంగ వైభోగాలేమిటి? జనులమూర్ఖత్వాన్ని రెట్టించి వాళ్లపిసరూపిప్పీ ఊలాడగే అర్చకులు, ధర్మకర్తలు, ఊరిపెద్దలు మొదలగువారి సంపర్కము వుండవాలా? స్కూలు ఫైనలు, యెఫ్ఫే, బియ్యే, యెమ్మే. బి.యల్ మొదలైన పెద్దపెద్ద యింగ్లీషుపరీక్షలు ప్యాసయి నిరుద్యోగులై యేడ్చుచున్న వారందరికీ చిన్నచిన్న జీతాలుచేసి అనేక ఉద్యోగాలుఇచ్చేసి వీటి ఆదాయాలనన్నింటినీ ఖర్చుపెట్టి కూడదా అని ఒకరాజకీయ కక్షవారు; అసలుమతము, మతసంస్థలు, వాటికి ఆస్తులు, వేరేవ్యవహారాలు యీ అన్యాయమేమిటి? సర్వము రాజులది, లేకపోతే రాజకీయకక్షులది, లెజిస్లేటివుసభ్యులది, వాళ్లిష్టమువచ్చినట్లు వాళ్లువ్యవహరిస్తారు. పాశ్చాత్యదేశములలో మొనాస్టరీలు మొదలగువానిని యెనిమిదవహెన్రీ దోచేసుకోలేదా? మనము పాశ్చాత్యులవిద్యలు చరిత్రలునేర్చుకొనికూడా యీ మాత్రము మహత్కార్యము చేయలేకపోతే యేమి సార్థకమనేవారుకొందరు; ఈ విధంగా ఇంగ్లీషువిద్యాధికులలో కొందరు తర్జనభర్జనలు పడుతున్నారు. ప్రజలకీగోల యేమీ తెలియదు. తమయిళ్లలో కష్టము వచ్చినప్పుడో సుఖమువచ్చినప్పుడో దేముళ్లకు మొక్కుకొని యెంతో కొంత యెత్తి కట్టి పట్టుకొనివెళ్లి దేముళ్లకి దాఖలుచేసుకుంటారు. ఇంగ్లీషుచదువుకున్న మహానుభావులలోనే గొప్పకో గోటుకో నిజానికో యిచ్చకానికో 'మతమూర్ఖత, ఆచారము, పిచ్చి' మొదలగు వానిమీద విశ్వాసమో నటనో యింకా చలామణీ అవుతున్నవిగదా, అనంత గ్రామాలలోను అజ్ఞానపు కుప్పముల

లోను వుండే జనసామాన్యమంతా ఒక్క-
ఈకునసంస్కారులై దేవాలయములను బహి
ష్కరించి దోచీవలెనంటే దోచీగలరా?

ఆర్యసామాజికులకు బ్రహ్మసమాజకులకు
బౌద్ధులకు వారి అనుయాయులకెల్లరికీ, ఏమత
చింతా లేకుండా తింటూ జీవిస్తూచస్తూ పుడు
తూవుండే అనంతమానవకోటికీ, ఈదేవాల
యాలమీద ఎట్టి అసహ్యతవున్నా సరే లేక
ఉపేక్షవున్నా సరే, మనదేశంలో ఇంటింటా
యేటేటా జరిగే తద్దినాలలాగ, యేటా యీ
దేముళ్ళకుకూడా అగమశాస్త్రం ప్రకారం
విధించబడ్డ యీపెళ్ళిళ్లు పేరంటాలు,
శుభాలు శోభనాలు, ఊరేగింపులుబ్యాండు
మేళాలు, యాత్రలు తీర్థములు మొదలైన
వన్నీ సాగుతూవుండవలసినదే. ఇది వద్దని
'ఆత్మమర్యాదా' పక్షంవారు, కాంగ్రెసు
'నాస్తిక' పక్షంవారు, 'ఆర్యసమాజమిమసరీ'
వారు యెంతముక్కినా మూలిగినా యేమీ
ప్రయోజనములేదు. ఆఖరుకు వారుకూడా
తమ 'దివ్య'సందేశాలు చాటడానికి మరో
దగ్గరకైతే ప్రజలువస్తారో రారోయని ఈ
ఉత్సవాలలో యీ గుళ్ల కెదురుగుండానే
పోయి ఉపన్యాసాలిస్తూ నేవుంటే జనులు
అవన్నీ యేవో భక్తిప్రసంగాలనుకొని విని
తెలుసుకోలేక లెంపలువాయించుకొని దేము
ళ్లకు ముడుపులుచెల్లించుకొని మరీ వచ్చే
స్తారు. ఈవిధంగా ప్రజలఅజ్ఞానము మన
జ్ఞానమో, ప్రజలజ్ఞానము మన అజ్ఞానమో
రెండూ రెండుదిక్కులంట పరుగెత్తుతూ
పరస్పరం ఒకరినొకరెరుగకుండానే 'షేకు
హ్యాండు' చేసుకొంటున్నవి.

ఇటువంటి సందర్భాలలో దేవాలయాల
పరువుప్రతిష్ఠలు మనము చెడగొట్టలేము, అవి
చెడవు. వాటిమీద గౌరవము లేనివారికి
కుదరదు, కలవారికిపోదు. జ్ఞానులో
మూర్ఖులో మనమేమన్నా వారికి లక్ష్యము
లేదు, వినిపించదు—గౌరవము కలవారు
సర్వదా అధికసంఖ్యాకులు, లేనివారు అల్ప
సంఖ్యాకులు. ఇటువంటి సందర్భములలో
ప్రజలవిశ్వాసాలమీదికేమి, దేవాలయసంస్థ
లమీదికేమి మనము శూరులవలె తిరగ
బడి తిట్టి, వారివిశ్వాసములు చెడగొట్టి మన
విశ్వాసములు వారిలో నెలకొల్పజేయగడంగి
శాసనసభలద్వారా చట్టములను చేయించ
బూనుకొనుటకంటె, మన వీరత్వమును
కొంచెము విరమించుట పరువుతక్కువ అను
కోక, వారివిశ్వాసములద్వారా వారినిసంస్క
రింపగడంగుట హిందూమతము లేక వైదిక
మతముయొక్క సల్లక్షణమైయున్నది. నా
ఒక్కడివిశ్వాసమే సత్యము, ఇతరులనెవరి
నైనా సరే నేను బలవంతాన మారిపిస్తాను
అనే అహంకారమును వైదికమత మొక్క
నాటికిని ఒప్పదు. అందుకనే అది అనేకమత
భేదములకు, నామభేదములకు, జాతిభేదము
లకు, అధికారభేదములకు, సంప్రదాయభేద
ములకు, తత్వభేదములకు చోటిచ్చి అంగీక
రించి జ్ఞానదృష్టితో ప్రశంసించిందికాని, ఒకరి
మతమును విశ్వాసమును ఒకరిమీదవొప్పించు

క్రౌర్యాధికారమునకు అది చోటివ్వలేదు. ఈఔదార్యమువల్లనే సకలజాతులు మతములు కులములు పరస్పరస్నేహములతోను గౌరవములతోనుకలిసి ఆవైదికమతమును భక్తితో నెత్తినిదాల్చినవి కాని దానికిగల క్రౌర్యాధికారములవల్లనగాదు. ఇదివరకున్న భేదములనుగాక క్రొత్తభేదమతమును నవలంబించినను అది ఒప్పకపోదు కాని సాంఘికముగ దానిమీాద నీయాచారముల నెలకొల్ప బూనుకొనునప్పుడు అది అంగీకరింపదు. అయితే శాసనబలముతో దానిమీాద పడునప్పుడు వీరత్వమునుబూని ప్రతిరోధించగల మూర్ఖత్వముకాని ఐకమత్యముకాని దానికిలేదు. కాని దాని ప్రాతవిశ్వాసముపోదు క్రొత్తదానిని మనస్ఫూర్తిగ అంగీకరించదు. ఇట్టి క్రొత్తవిశ్వాసములను వారిపై బలవంతముగ జొప్పించ బూనుకొనుటకంటె సౌమ్యముగ బోధసేయుట వలననే కావలసిన చిత్తశుద్ధి సర్వులకునేర్పడునని నమ్మవచ్చును.

ఆస్తిక్యభావమున్న వారెల్లరికిఇదియొండే అవలంబించతగ్గ భావముకాని దూషించుట ఆస్తిక్యమునకే విరోధముకావచ్చును. మూర్ఖత్వమంటే, మూర్ఖత్వముకానిదేదో యెవరు చెప్పగలరు? దేముడు కలడన్నవారనేకులకు 'కలడు' అను పదముయొక్క అర్థమును లేదు అనువారికి 'లేదు' అను పదముయొక్క అర్థమును స్పష్టముగా తెలియకపోవచ్చును. తెలిసేలాగుంటే యించుమించు రెండుపదములఅర్థము నొక్కటియే కావచ్చును. ఇద్దరి అభిప్రాయములును సత్యములే కావచ్చును లేక మూర్ఖములే కావచ్చును. ఇక కలడన్నవారిలో అసలు 'కలడు' అను విశ్వాసము మూర్ఖమయేలాగుంటే, అతనికి కాళ్ళుచేతులు వూడటము, పెళ్లిళ్లు ఉత్సవాలు జరగడము, వరములుఒసంగడము మొదలయినవన్నీ అటువంటిజాతి మూర్ఖములే కావచ్చును అభావము సత్యమయేలాగుంటే ఆజాతిసత్యములే కావచ్చును. అసలు 'సత్యము'నకు మూర్ఖత్వమునకు నెల్లలు నిర్ణయించగల వారెవ్వరు? వేదాంతులు ప్రపంచమేమాయ, దానిలో లీనమగుటయే మూర్ఖత్వము, దానిని హత్తుకొనుసంతవరకు మానవుడు మూర్ఖుడే, అమూర్ఖత్వమునుండి జ్ఞానమును చేరుకొనేవరకు అతనిని మూర్ఖత్వముపీడను, అమూర్ఖత్వము వీడవలెనన్నను ప్రపంచమున నాతనికి చివరవరకు మార్గము చూపవలసినిది ఆమూర్ఖప్రపంచమేయనియు, 'ఇదిగో దీనినివిడచితి'నని దానినుండివిచ్ఛిన్నమగుటయే అతనికి జ్ఞానములేక ముముక్షత్వమనియు, ఈలోపలిజ్ఞానములోవుండే అంతస్థులన్నీ అజ్ఞానభూమికలేయనియు వాక్రుచ్చుచుందురు. దైవధ్యానమునకు దేవాలయములు కాని, అక్కడి దేముళ్ళపెళ్ళిళ్ళు మొదలగు ఉత్సవములుకాని నరులను పురికొల్పుచు ఆధ్యాత్మికభావములు కలిగించుచున్నన్నాళ్ళు వానిమీాద నెవరైనను తిరగబడుట అవివేకము. అటువంటిభావ మించుకైనకలవారే దేవాలయములకు పోదురు కాని లేనివారు మెడపట్టిగెంటినను పోరు.

వెల్లడివా రెవ్వరికి ఆస్తిక్యభావములు లేవు, వెళ్ళనివారే మహానుభావులందరును అనుకొనుట పొరపాటు. దేవాలయములు కేవలం మూర్ఖులకుగాని జ్ఞానులు వానిజోలికి బోరాదనరాదు; సిద్ధులయినవారుకూడా తత్సాన్నిధ్యమున ముగ్ధులయి ముముక్షులుకూడ వానికి వన్నె గూర్చుచున్నారు. ధర్మకర్తలు, అభిమానులు, అర్చకులు, ప్రభుత్వము, శాసనసభ్యులు మొదలగువారు పరస్పర ప్రతికూలభావములుమాని, స్వార్థపరత్వముకంటె సర్వసమత్వబుద్ధితో యీ యుద్యమమున ప్రవేశించి ఇట్టి సంపూర్ణ సహనమంగళభావమునకు దోహదముచేయగడంగినచో విజయవంతులు కాగలరు. పరస్పరాక్షేపణలతో పనులు ప్రారంభించిరేని వారిలో వారికి విరోధములే పెరుగును కాని దేవునిమహిమకాని, గుళ్లమహిమకాని ప్రతిభకాని తగ్గదు హెచ్చదు. దేవాలయములనుగూర్చి యీ మోస్తరు ప్రచారముచేసిననే యెట్టి ప్రయోజనమైనను కలుగునుగాని తద్వ్యతిరేక ప్రయత్నములు చేసినచో వ్యర్థములై పరిణమించునని గ్రహించుట ఉత్తమనీతి.

బెజవాడలో డాక్టరు వి. యస్. ఆచార్యగారి సంపాదకత్వమున జూలై మాసమునుండి ప్రకటింపఁబడుచున్న 'దేవాలయ ప్రతిభ' యను పత్రికయొక్క ప్రథమసంచిక మా కార్యాలయమునకు చేరినది. అందలి సంపాదకీయ వ్యాసములు, సంపాదితవ్యాసములు, మహాత్ముని ఆంగ్లవ్యాసములకు భాషాంతరీకరణములు, సర్వమును ఇట్టి సామ్యత్వమును సమరసత్వమును చిలుకుచున్నవి. క్రైస్తవ చర్చీలు మహమ్మదీయ మసీదులు బౌద్ధమఠములు బ్రహ్మసమాజమందిరములు మొదలైనవానికంటె హైందవ దేవాలయములు, యెక్కువ 'మూర్ఖత్వము'నుకాని తక్కువభక్తినికాని పుట్టింపవు. ఆయా శాఖలవారికి ఆయా మందిరములయం దెట్టి విశ్వాసముగలదో హైందవులకు వీనియందును వీని కర్మకలాపములయందును అట్టి విశ్వాసమేగలదు. నిజమునకు చూచిన యెడల వాని నాశ్రయించి తత్వజ్ఞానము, సమాధినిష్ఠ, మోక్షబుద్ధి మొదలగు మహిమలను బడసినవారికంటె వీనినాశ్రయించి బడసినవారెక్కువగా కనిపించుచున్నారు. మొత్తమైని హిందూమత లేక వైదికమత తత్వమును భారతీయుల డెందములలో హిందూదేవాలయములు ముద్రించునట్లు ఇతర మతస్థుల మందిరాదులు ముద్రించలేవు. అట్లయినప్పటికి హిందూమతస్థులకు ఆయా మందిరాదులు అన్నిటియందు గౌరవభావము తప్ప అన్యభావములేదు. కాని ఇతరమతస్థు లెవ్వరికిని హిందూదేవాలయ దృశ్యములమీద అట్టి గౌరవభావము లేకుండుట వారు వీరికంటె సర్వసహన దృష్టియం దెంత వెనుకబడియున్నారో తెలియఁజేయు శోచనీయమగు అవస్థ. మనలో ఆంగ్లవిద్యాధికులకుకూడ వారి తత్వమే అబ్బి యీ సంప్రదాయములయందు గౌరవముచేసి వారికంటె యెక్కువగా ఆక్షేపించుచుండుట యెంతయో విచారకరము.

ఈ పత్రికవంటి పత్రికలు అట్టి భావములను చెరిపి హిందూ సంప్రదాయ విజ్ఞానము పాఠకుల హృదయఫలకములలో చిలుకకపోవు. శ్రీ వేదాంతం శ్రీనివాసాచార్యులవారు తమ విన్నపములో

"నేడు అందరికన్నులును దేవాలయములపై పునకు తిరిగినవి. మాల మాదిగజాతుల దేవాలయప్రవేశము కావలెననువారును, వలదనువారలునుకూడ వాని మహత్వప్రయోజనము విశ్వసించినవారలే యగుచున్నారు. కావున నీ సమయము దేవాలయముల మంచి దశకు సాధనమైనది కావచ్చును. ఇపుడు ట్రస్టీలును అర్చకులును తమ బాధ్యతను సంస్మరించి తమ ప్రయత్నములొనరించి కృతార్థులు కావలెను. ఇంకను యెవరికి వారు మనకేలయని యూరకొనినచో దేవాలయ వ్యవస్థను వినాశించినవారు కావలసివచ్చును" అని ఆంధ్రదేశ దేవాలయ మహాసభ అను వ్యాసములో వ్రాసినారు. పండితులందరిట్టి దృష్టితోనే సభకు వెళ్లి విషయము చర్చలతో ముగించక ఆలోచనతో తేల్చి సమస్తజనగౌరవమును బడయుదురు గాక!

దీ తెలుగుటాకీసు లిమిటెడ్:—

ఈ కంపెనీవారు మాకీవిధముగ తెలియజేయుచున్నారు.

"మదరాసు, జూలై 11.

నేటిదినము ది తెలుగుటాకీస్ లిమిటెడ్ వారి కార్యస్థానము తాత్కాలికముగా మద్రాసునందలి 1/4 ఉడ్సురోడ్డులోని ప్రజామిత్ర కార్యాలయమున ప్రారంభోత్సవము కావింపబడినది. శ్రీ శ్రీ శ్రీ చల్లపల్లిరాజావారు ఈ కంపెనీకి ప్రధాన పోషకులుగా (Patron) నుండుటకు దయతో నంగీకరించిరి. కంపెనీ నిర్మాతలును, శాస్త్రవేత్తలును, స్టూడియో నిర్మించుటకు బెజవాడలో సాంకేతికాభ్యంతరము లుండగలవని ఆలోచించుచున్నందున దానిని గురించి నిశ్చితాభిప్రాయమునకు రాలేదు. సంస్థాపకులు కంపెనీ రిజిస్ట్రేషనుకు సంబంధించిన నియమములు, నిబంధనలు తయారుచేయుటలో తీవ్రముగా నిమగ్నులై యున్నారు. ఈ కంపెనీ వివరములు తెలిసికొనగోరువారు ఈ క్రింది చిరునామాకు ఉత్తర ప్రత్యుత్తరములు జరుపవలయును.

ది తెలుగు టాకీస్ లిమిటెడ్
1/4 ఉడ్సురోడ్డు, మౌంటురోడ్డు పోస్టు,
మద్రాసు.

శ్రీ రాజావారి ప్రధానపోషకత్వముక్రింద యీ కంపెనీ చక్కగ వర్ధిల్లి ఆంధ్రులకీర్తిని ప్రకటించుననని యాశించుచున్నాము.

స్త్రీహితైషిణీమండలి:—

బాపట్లలో నెలకొన్న పై మండలియొక్క చతుర్థవార్షికోత్సవము జూలై నెల 13, 14 తేదిలలో శ్రీమతి ఉన్నవలక్ష్మీబాయమ్మగారి అధ్యక్షతను జరిగినది. శ్రీమతులు డి. భారతీదేవి వెన్న అనంతరామమ్మ కనుపర్తి వరలక్ష్మమ్మగార్లు మొదలగు వారలు వ్రాసిన పద్యములు, ఇచ్చిన ఉపన్యాసములు బాలికలు జరిపిన ప్రహసనములు, నాటకములు, ప్రదర్శకులకు బహుమానములు మొదలగు వేడుకలతో సభలు వైభవముగ నెరవేరినవి. జిల్లాబోర్డువారు దాదాపు 1000 గజముల స్థలమును మందిరమునకుగా నొసంగిరి. కనుక సమాజమునకు మందిరములేని కొఱత తీరుచున్నందుకు బాపట్ల కాంతామణులెంతయు గర్వించవలసిన విషయము. వార్షికోత్సవోపన్యాసములు మొదలగునవి వచ్చేసంచికలో ప్రకటింపబడును.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.






# ఇదిగో నా

# ప్రియమైన సబ్బు సకల

# కార్యములను తీర్చుచున్నది



501 బట్టల సబ్బు వస్త్రములు శుభ్రముచేయుటకును ఇంటిపనులకును



50! స్పెషలు సబ్బు సన్న బట్టలకును



501 పట్టుచుడతల సబ్బు నగిషీ నాజూకు పట్టువస్త్రములకును



501 టాయిలట్ సబ్బు శరీర అందమును కాపాడుటకును

●

**501.** వాషింగు సబ్బుకు స్నేహితులు ముగ్గురు. సన్నబట్టలను శుభ్రము చేయుటకు తగిన 501. స్పెషల్. పట్టు బట్టలను శుభ్రము చేయుటకు 501.సిల్ క్ పిలెక్సు. సువాసన యెక్కువై పరిశుద్ధమైనస్నానసబ్బు 501 టాయిలెట్ సబ్బు.

ఈ నాలగురకముల సబ్బులను వాడుటచే మీయొక్క ఉపయోగముకు సరియైన సబ్బులనే ఉపయోగించినట్లగునుగాక 501 సబ్బు పరిశుద్ధమునకు ఉత్తరవాదమైనవి. చిక్కనమునకు తగినవి. అందువలనె ఇండియా మొత్తమును పొగడపడుచువున్నవి.

# **501** సబ్బు

టామ్కొ సేల్సుడిపార్ట్ మెంటు, 

19. A. వానియర్ వీధి, జి.టి. మద్రాసు.

ది తాతా ఆయిల్ మిల్సు కంపెనీ లిమిటెడ్, తాతాపురం.

# ఇంటిపనులు ముగియగానే చేయవలసిన దేమి?

భర్త కచేరీ వెళ్లినపిదప, పిల్లలందరు బడులకు పోయినతరువాత, ఇంటిపనులన్నీ ముగిసినవెంటనే, నీకీళ్లునాళ్లు అన్నీ ఒకక్కప్పుడు చాల అలిసిపోయినట్లుండును కాదూ? ఇల్లునడపడంఅంటే సకలాయాసమున్నూ అని ప్రపంచమందరికీ తెలును. కాని పదకొండుగంటలకు పడ్డశ్రమ ఒక్కకప్పు ఇండియన్ టీ త్రాగీత్రాగడంలో తీరిపోతుందని నీకు తెలుసునా? ప్రపంచంలోవున్న బుద్ధిమంతురాండ్రైన యిల్లాళ్లూ సమస్తమైన త్రాగుళ్లలోను ఇది చాలా నిరపాయకరమైనదనిన్నీ, ఆరోగ్యప్రదమైనదనిన్నీ సేదదీర్చునదనిన్నీ కనిపెట్టినారు. శరీరంలోవున్న యెట్టిఆయాసమునైన అది ఒక్కనిముషములో తొలగించి శరీరమును మనస్సునుకూడ చకచకలాడఁజేయును. దినమునకొక కప్పుచొప్పున ప్రతిఉదయమును వారమురోజులు సేవించి నీ ఆరోగ్యమెట్లు మారి ఉల్లాసమెట్లు హెచ్చునో చూచుకొనుము.

**తేనీరు యెట్లు తయారుచేయుట:**—నీళ్లు మరిగించేపాత్రను వేడినీళ్ళతో కడిగిపెట్టుము. మనిషికి చమ్చాచొప్పునను పాత్రకొకటి అధికముగను ఇండియను తేయాకునందుంచుము. అందులో ఉడికిననీళ్లు పోయుము. అయిదునిమిషములు పిమ్మట వడబోసి కప్పులలోపోసి పాలుచక్కెరచేర్చి త్రాగండి.



**ఇండియను టీ ఒక్కటే కుటుంబ పానీయము.**

# ఆరోగ్యప్రదమగు జాతిని నిర్మించును



నీ సంతాన మెట్లు వృద్ధియగుచున్నది? వారి శరీరప్రకృతి బాగుగనున్నదా? లేక వారి పెంపున కేమైన ఆటంకమున్నదా? భారతీయమాతలీనాడు తమ సంసారసౌఖ్యమునకే గాక తమ జాతీయతాభివృద్ధికిగూడ బాధ్యులైయున్నారు. ఈదేశమునకు బలవంతులగు స్త్రీపురుషుల యావశ్యకత మెండై యున్నది.

కావున గృహమం దాహారనియమమందుండవలసిన శ్రద్ధ చాలముఖ్యమైనది. ప్రతిదినము తయారుజేయు ఆహారములందు తేనీటి ప్రాముఖ్యతను మరువకుము. పిల్లలెపుడును గోరునట్టి నిరపాయకరమైన సేదదీర్చు పానీయమియ్యదే! అంతియగాక యీవాడుక ప్రోత్సాహింపదగినది. ఈ వాడుక బలకరమగు జాతీయ నిర్మాణమునకు కారణమగును.

## తేనీరును తయారుజేయుట

ఉడుకునీటితో గడిగిన

మంటిపాత్రలో మనిషికి ఒక చమ్చావంతున తేయాకునువేసి, మరిగిన ఉడుకునీటి నందులో పోయుము ఐదు నిముషములుండనిచ్చి, వడబోసి, పాలు చక్కెరజేర్చి త్రాగుము.



**భారతీయ తేనీరొక్కటే** కుటుంబ పానీయము

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు

**డాక్టరు. కే. యన్. కేసరి**

సంపుటము ౮.] సెప్టెంబరు 1935 [సంచిక ౭

*Printed at Lodhra Press, Egmore, Madras.*

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4. అర్ధ సంవత్సరపుచందా రు. 2. అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువరైయినప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలముల రేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసు చేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈపఱకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జబాబుతీయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లుతెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలుఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తుఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు,మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రముపంపకూడదు.

# విషయసూచిక

# ప్రపంచ దుఃఖమునకు

# మూడే కారణములు:

జ్వరము

బలహీనత

వంధ్యత్వము

ఈ మూటికిని ఉన్నవి చక్కని

మూడు నివారణోపాయములు

| | |
|---|---|
| జ్వరమునకు | అర్క |
| బలహీనతకు | అమృత |
| వంధ్యత్వమునకు | లోధ్ర |

వీటికి తిరుగులేదు. సేవించుటతో గుణ మియ్య వలసినదే. జీవితములను సుఖవంతము చేయుటకు ఇవి మూడును మూడు వజ్రాయుధములు.

అర్క — అమృత — లోధ్ర

అన్ని షాపులలోనను దొరకును.

కేసరికుటీరం, ఎగ్మూరు, మదరాసు.

## వంధ్యాత్వము

మాతృత్వమునకై ప్రతిస్త్రీయును ఆసగొనును. ముద్దుబిడ్డను కరకమలము లందిడుకొని ఆడించు తలంపు స్త్రీకిఎక్కువ. స్త్రీకి లభించవలసిన యీ మహోన్నత స్థానమునకు ఆటంకములను కల్పించు గర్భాశయ రోగములను దూరముచేయవలయును. ఋతుదోషములు లేనిక్రమ జీవనమును గడుపవలెను. ఇందులకు లోధ్ర సేవనమే రాజమార్గము.

## లోధ్ర

స్త్రీ రోగములకు
వజ్రాయుధము

## రక్తదారిద్ర్యము

దారిద్ర్యము యెట్టిదయినను కష్టాలకు కారణము. అందునను రక్తదారిద్ర్యము మరింతఘోరము. జీవితమే ఒకరోతగా ఉంటుంది.

దేహమందు రక్తమునకు — నిష్కళంకమగు ఉష్ణరక్తమునకు — దారిద్ర్య ముండరాదు. దేహమునకు ఆరోగ్యము ప్రాణికి ఆనందము. జీవితముయెడ ఉత్సాహము రక్తదారిద్ర్యము లేనివారి సొమ్ము.

కాని, అందరును బలిష్టముగను దార్ఢ్యముగను జన్మింపరు. శరీరమందు రక్తదారిద్ర్యముండుటవల్ల కండరములు పెరుగక బలములేక నిరుత్సాహముగ నుండెదరు. కాని సుఖపడుట మానవుని జన్మహక్కు. అందుకు మార్గము వెతుకవలెను.

రక్తవృద్ధికి దారితీయునది — జవసత్వముల నిచ్చునది జీవితము నొకేపాటగా చేయుగలది అమృత. అమృత సేవనమునకు నేడే పూనుకొనుడు.

## అమృత

కండరముల బిగికి
నరముల బలమునకు

## జ్వరము

మానవుని శక్తులను లాగివేసి జీవితమును కేవలము నిరర్థకము చేయునది జ్వరము. జ్వరము వచ్చెనా, మిమ్మది పీల్చిపిప్పి జేయుటకు నే మాత్రపు టవకాశము గాని యీయరాదు. వంట బెట్టెనా దాసిని వదలించుకొనుట బహుకష్టము. విరుగుడుకై వెతకులాడుట కిది అదను కాదు. జ్వరము వచ్చెనా, వెంటనే అర్కను ప్రయోగించుడు. జ్వరములను పారద్రోలుటలో అర్కవజ్రాయుధము.

## అర్క

సర్వ జ్వర
నివారిణి

# ఛాయాచిత్రములు

## చిత్రములవివరములు

### శ్రీమతి మీరావతి

భరతనాట్యకళయం దీమె పెద్దపేరు సంపాదించెను. ఇపుడు తన పాండిత్యప్రదర్శనముల జేయుట కీమె పాశ్చాత్యసీమల కేగుచున్నది.

### డా॥ మిస్ జి. యం. డి. సోజా

సివిల్ సర్జనుగానున్న యీ యువతీమణి కొచ్చిన్ శాసనసభా సభ్యురాలుగ ప్రభుత్వమువారివలన నియమింపబడినది.

### కుమారీ శైరమ్మ

ఈ బాలిక యీతయందు జగత్ప్రసిద్ధినొంది యనేక స్వర్ణపతకాది బిరుదుల బొందుచున్నది.

### పార్శీక కాయస్థయువకమండలి

రాయల్ ఓపెరా హౌసులో యీ మండలి క్వెట్టా సహాయనిధికై ప్రదర్శనము లిచ్చుచున్నారు.

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావు. నూజవీడు: వైద్యుల బ్రదర్సు.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు.
నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కంపెని.
జెమ్‌షెడ్‌పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్‌పైప్ కంపెనీ, [లిమిటెడ్.
బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.
గుంటూరు: వెల్‌కం అండు కంపెని. మైసూరు: స్టూడెన్ట్సు హాలు.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు
పిఠాపురం: ఎం. సూర్యరాజు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
ఏలూరు: డి. శ్రీహరిరావు.
తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్‌పేట.
ఒంగోలు: తాతా జాలయ్య శెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్ వీధి.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.
విజయనగరం: ఆయపిళ్ల .సూర్యనారాయణరావు
నరసాపురం: వై. సత్యనారాయణగారు.
ఖరగ్‌పూర్: పి. వి. రమణయ్య, స్టోర్స్‌క్లర్క్., బి. ఎన్. ఆర్ వై. వర్క్ షాప్స్
కొవ్వూరు: కె. సి. చెన్న కేశవయ్యర్. గూడూరు: సి. సి. సుబ్బయ్య, మర్చంటు.
కాకినాడ: నున్నా బాలకృష్ణరావు, న్యూస్‌బాయ్ అండు కో.
అనకాపల్లి: సివాజీ న్యూస్ ఏజన్సీ.
భీమవరం: వంగల అచ్చుత రామయ్య, మేనేజరు, నెహ్రూ ఖద్దర్ స్టోర్సు.
గుడివాడ: శ్రీ శివరామ అండు కో.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.
అమలాపురము: పి. అన్నాజిశర్మ. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)
పర్లాకిమిడి: రాచూరి రామనారాయణరావుగారు.

హిగిన్‌బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.




# కాయకల్పరసము

(REGD)

సకల వ్యాధులకును ఈ రసమును చుక్కల పరిమాణమున లోనికిని పైకిని యుపయోగించిన క్షణమాత్రమున అత్యద్భుతమగు గుణమిచ్చును.

1

దీనిని పైన పూయుటచేత నివారణమ వ్యాధులు :—తలనొప్పి, పార్శ్వపు తలనొప్పి, ప్రక్క రె నరములు లాగుట, కంఠమాల, న్యూరెల్జియా, జలుబు, ఱొమ్మునొప్పి, కీళ్లవాత వీపునొప్పి. కీళ్లనొప్పులు, శరీరమునందే భాగమునైన తిమ్మిరి, కీళ్లు పట్టుట, నరమ చుట్టుకొనుట, నరముల వ్యాధులు, పండ్లనొప్పి, నడుమునొప్పి చర్మమున వాపు, తామ

2

లోపలికి సేవించిన నివారణమగు వ్యాధులు:—విషజ్వర ఇన్ఫ్లూయంజా, ప్లేగు, మలేరియా, బోదకాలు, చలిజ్వరము మొదలైన అన్నివిధము జ్వరములు, గొంతునొప్పులు, ఱొమ్ముపడిసెము, నోటి దుర్వాసన, ఉబ్బసము, అజీర్ణ మంద విరేచనములు, కలరా, మలబద్ధము, పిత్తాశయ ప్లీహ రోగములు, పొడిద కోరింతదగ్గు, పక్షవాతము, కడుపుబ్బరము, కడుపునొప్పి, మూత్రవ్యాధులు, గు మండుట, పిత్తమైకము, అశాంతి, పసుపుకామెలరోగము, శరీరము బడలిక, నిస్సత్తు నరములు సడలుట, పాండురోగము, ధాతుసంబంధమైన దుర్గుణములు, కక్కువా స్త్రీలకు కలుగు ఋతుసంబంధమైన వాయువు, సూతికకట్టు, సూతికసన్నిపాత గుల్మము, కడుపునొప్పి, శిశువ్యాధులు మొదలైన అన్ని విధములైన దేహవ్యాధ కాయ కల్ప రసమువల్ల నివారణమగును.

ఏ రోగమునకైనను కఠిన పథ్యము లేదు.

ఒక సీసా వెల రూ. 1-6-0. తపాలాచార్జి ప్రత్యేకము.

## ఇండియన్ మెడికల్ వర్క్సు

ఆలందూర్ P.O. మద్రాసు. 234 గోవిందప్పనాయక్ వీధి మద్రాసు.

# జామా తైలము




ఏజంట్లు కావలెను.

తలనొప్పి, యిన్‌ఫ్లుయంజా, చేయి కాలు పట్టుకొనుట, పంటినొప్పి మొదలగువ్యాధులను ఒక క్షణములో పోగొట్టగల ఖ్యాతిచెందిన "జామాతైలము" నకు సమమగు మందు వేరేదియు లేదు. చాలా యోగ్యతా పత్రములనుపొందియున్నది.

బుడ్డి 1-కి అణాలు 6 ఇచ్చి ఉపయోగించి చూడుడు.

## అమర్‌చెందు, శోభాచెందు,

ఇంగ్లీషుమందులు, పలుసరకులు, సల్ఫ్యూరిక్, నైట్రిక్, మొరాటిక్ ఆసిడ్ల వ్యాపారస్థులు.

నెం. 63; నైనప్పనాయని వీథి, మద్రాసు.

---



పి. కోదండరాం పిళ్లే

(లేటు పి. యస్. పొన్నుస్వామిపిళ్లేవారి కుమారులు)

1854-వ సంవత్సరమున స్థాపితము.

ఉత్తమతరగతి కర్రసామగ్రుల నిర్మాతలు

(పి. యస్. పొన్నుస్వామిపిళ్లే భవనములు)

మీ భవనమును అలంకరించుటకును దానిని ఆకర్షణీయముగ చేయుటకును మీకు కర్రసామగ్రులు కావలయును.

త్వరగా చేసియిత్తుము. నమ్మికమైన పనితనము.

కర్రసామగ్రులను కొనుటకుపూర్వము మాతో సంప్రదింపుడు.

పురాతనమైన, ప్రఖ్యాతిగల కంపెనీ.

39 & 44, ఎస్ప్లనేడ్ వెస్టు; మదరాసు.

---

# శ్రీమత్కన్యకావిజయము

ఉత్తమ యక్షగాన ప్రబంధము. పసుమర్తి కృష్ణమూర్తిగారు రచించినది.

వలయువారు నాలుగణాల బిళ్లలు

"గృహలక్ష్మి కార్యాలయం, ఎగ్మూరు, మద్రాసు"కు పంపుపది.

వరవిద్యా పరక్షేమభావలు విమప్రాయంబు; సౌశీల్యము |

స్థిరసంవిద్రతి; కాయకష్టము; నిరుత్సేకంబు; సౌభాగ్యబం |

[illegible]

నరితో దాఁగిలిమూఁతలాడఁగలవీ నేపాళనారీమణుల్ ||—



# గృహలక్ష్మియు స్త్రీజన ప్రబోధనమును

గడచిన ఫిబ్రవరితో గృహలక్ష్మికి ఏడేండ్లు నిండి మార్చితో ఎనిమిదవయేట ప్రవేశమైనది. 'సందెలక్ష్మి, దివ్యలక్ష్మి, దీపలక్ష్మి' యను నిత్యాదిమంగళసూక్తములతో యిల్లాండ్రు తమతమ కాపురపుటిండ్లలో సంధ్యారాగమున దీపారాధనలు జేయుచు తమతమ సంసారములును ఇరుగుపొరుగులును నిత్యవైభములతోడను జ్ఞానప్రభలతోడను చెన్నలరారజేయు సూచనలకాలంబనముగ దీపములవెలిగించున ట్లుద్బోధించు ముఖపత్రములచేతను, స్త్రీజనమునకు పరమప్రీతికరమును దుర్నివార్యవ్రతసమానమునను తులసీపూజారూప పటములతోడను, స్త్రీత్వప్రయోజన పరమార్థమగు సత్సంతానముతో వెలయు తల్లిబిడ్డల యాకృతులతోడను, గృహిణీ ధర్మమగు రాట్నమువడకు పటములచేతను, ఇంకను నిట్టి యనేక మంగళసూచకములును యభివృద్ధిసూచకములును గృహిణీ ధర్మహితబోధకములును నగు చిత్రముఖపటములతో నలంకరింపబడుచు ఏడేండ్లు వర్ధిల్లినది. ఏటికి నేటికి ఈ గృహలక్ష్మివర్తనమును జూడజూడ దీనియందు స్త్రీజనమునకు కానరాని గారాబమును తమ స్వంతవస్తువను నభిమానమును యుప్పతిల్లుచున్నటుల దోచెడిని. పెద్దపెద్ద కథలు చిన్నచిన్న కాకిపిట్టకథలు, నానావిధములగు పాటలు పద్యములు పసిబిడ్డలు తమయాటలలో పాడుకొను బుజ్జిపాటలు, పాకవిజ్ఞానములు, ఇవి యవి యననేల, నానావిషయములగు చర్యలు యుపన్యాసములు వ్యాసములు యథాశక్తి స్త్రీలచే వ్రాయబడుచున్నవి. అణగియుండినట్టెమో

లేక అణగింపబడియున్నట్టియో ప్రతిభా శక్తులు నిర్వక్రముగను నిరభ్యంతరముగను వికాసము జెందుచున్నవి. అంకురించు చుండు సూచనలజూడ, అవకాశములుగలిగినంతట స్త్రీజనమును విద్యాకళా ప్రపంచమున పురుషులతోపాటు సమానముగ స్పర్ధించగలరని తోచగలదు. ఇంటగూర్చుండి చదువుటయు వ్రాయుటయుగాక నీడనుండి సుకుమారములగు పనుల చిత్రించుటయు గాక చెయ్యివిరిగిన మగవారితో పాటు కష్టపుపనులునుగూడ నెరవేర్చుచున్నారు.

ఈ వికాసమునకు కొంతవరకు ఆడువారి పాఠశాలలు కారణములు. క్రైస్తవ మతబోధకురాండ్రు కొంతవరకు గృహలక్ష్మి భారతి ఆంధ్రపత్రికలోనగు పత్రికావ్యూహము కొంతవరకు ఆంధ్రస్త్రీజనము మనోహరమగు శైలియు సొంపగుభావములతో గద్యవ్యాసములను పద్యములను రచింపగలిగియుండుటమాత్రము కాదు. వారు వారు సేకరించియుండు నానావిషయములగు గ్రంథస్థవస్తుసామగ్రి ఆశ్చర్యకరముగ నున్నది. గడచిన ఏప్రెలునెల గృహలక్ష్మిలో శ్రీమతి దివాకర్ల శారదామణిగారు శారదకు ప్రత్యుత్తరమనుపేర హిందీకంటెను తెలుగే దేశభాషగ నుండవలయునని వ్రాసిన వ్యాసము ఇంగ్లీషులోనున్నయెడల మెకాలె శైలిని విషయసంగ్రహమును ప్రౌఢిమనూ జ్ఞాపకపరచియుండును. మరియు గృహలక్ష్మి నలంకరించుచుండు శ్రీమతులు వరలక్ష్మమ్మ గారియొక్కయు, "సరస్వతి" దేవిగారి యొక్కయు దివాకర్ల శారదామణిగారి యొక్కయు వచన వ్యాసములను శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు మొదలగువారి పద్యములును అద్భుతములగు యుపజ్ఞలను (Originality) ప్రకాశించుచున్నవి. గడచిన మే నెలలో "సరస్వతీ"గారు భావకవుల నెపమున తనభర్తగారితో జరిగించినసంభాషణ యెన్నిమార్లు చదివినను తనివితీరునట్లు లేదు. ఇదివరకు తెనాలిరామలింగని కాలమునుండి యొక "తిలకాష్టమహిషబంధనము"తో కాలముగడుపుచుండు తెలుగువారి కీమె 'లొట్టాబట్టియము' 'కత్తిరాయి సంవాదము' 'తిరుమలతాతియము'లను భావకవిత్వములక్రింద జూపినది. ఇందు వినోదము చమత్కారము విజ్ఞానముకూడ కలసి యున్నవి.

స్త్రీలవిద్యాప్రచారమునకు గృహలక్ష్మి నొకతార్కాణగగొనిస్థాలీపులాకమున ఒక్క సంవత్సరచర్యను విమర్శింతము. సాధారణముగ గృహలక్ష్మి సంవత్సరమునకు కొంచెమించుమించుగా వేయి ముద్రితపత్రములు గల కోశమైయున్నది. ఏడవసంవత్సరపు ముద్రితగ్రంథమును ఉదాహరణముగ గోరుదము. 1934 మార్చినుండి 1935 ఫిబ్రవరి కడవరకు గల సంవత్సరము దాదాపు 78 మంది స్త్రీలు 78 వేరువేరువిషయములపై దాదాపు 83 పుటలపై వ్యాపించియుండు పద్యముల రచించియున్నారు. మరియు 157 మంది స్త్రీలు 161 విషయములపై దాదాపు 840 పుటల వచనవ్యాసముల వ్రాసి

యున్నారు. గద్య పద్యములుగలసి దాదాపు 285 మంది యాడువారు దాదాపు 289 విషయములపై దాదాపు 423 పుటలు నింపియున్నారు. వెయ్యిపుటలలో ఈ 423 పుటలు పోగా మిగిలినభాగమంతయు పురుష లేఖన మనుకొనవక్కరలేదు. అట్లు మిగిలిన దాదాపు 587 పుటలలో సగమునకు మించి సంపాదకీయములు, గ్రంథస్వీకారములు, విమర్శనములు గ్రంథపరిచయములు. బాల విజ్ఞానశాఖలు ఇత్యాదివిషయములతో సరిపోవుచున్నది. అవశిష్టార్థమున మగవారి రచన లగపడుచున్నవి. స్త్రీజనమున కింకను ఎక్కువ ప్రోత్సాహముకలిగించినయెడ పురుషులవ్యాసము లక్కరలేకనె కొదవంతయు వారే నిర్వహింపగలరు. అనేకులు, ఈ స్త్రీజనము వ్రాయువ్యాసములజూడక వీరేమి వ్రాయగలరని హేళనయు నిరాదరమును జూపవచ్చును. కొలది యవధానముతో జదివిన నివియు సామాన్యముగ విద్యాధికులగు పురుషుల వ్యాసములతోపాటుగ నుండగలవు. కొన్నిమిన్నగనున్నవి—అభిప్రాయముల తెలియపరచుటలోనను నిగమనముల స్థాపించుటలోనను ఆగ్రహముతో నిర్వహించుకొనుచున్నారు. (ఆగ్రహమనగ తీవ్రమగు కోపమని వాడుకపడియున్నదిగాని యథార్థమున నీశబ్దార్థము అవధారణము (Emphasis) పట్టుదల (assiduity)అనియె—తాటియాకుల పొత్తములలోని స్త్రీల యబలాత్వములను అవైదగ్ధ్యములను అజితేంద్రియత్వములను కనుపరచు కథలును వ్యాసములను వీరేమాత్రమును యోర్చుటలేదు. సృష్టి కంతయు పురుషుడధికారియనియు వారసు అనియు సూచించు వ్రాతల నంగీకరింపరు. పురుషునితోపాటు తామును సమానాధికారులమనియె వారి సిద్ధాంతము—వారివిస్రంభము—స్వాతంత్ర్యము నర్థించుచున్నారు—స్వాతంత్ర్యమన స్వస్వరూపావస్థానమెయని వీరి యాశయము—ఇట్టిభావములయందు దప్పేమియు లేదు. ఉభయులకును సమానోపపత్తుల నమర్చి ఒకకార్యనిర్వహణమునకు ఒకపురుషుని యొకస్త్రీని నియోజించిన పురుషునికంటె స్త్రీయె శ్లాఘ్యతరముగ నాపనిని నిర్వర్తింపగలదని గడచినసంవత్సరమున నెల్లూరిలో వెలసిన మొల్ల జయంత్యుత్సవాధ్యక్షురాలుగారు (శ్రీమతి వసుంధరాదేవి M. A. గారు) సెలవిచ్చిరి. ఏ మాసపత్రికనుగాని ఏ నవలగాని జూచినను "సుందరమ్మ"యో "సుభద్ర"యో "రాజేశ్వరి"యో యను మంచిపేరుగల ముద్దియ మగనిచే త్యజింపబడుటనో లేక చిన్నతనముననే విధవయగుటనో యూహించుకొని అచటనుండి ఆ చిన్నదాని కడగండ్ల దీనాతిదీనముగ ఘోరాతిఘోరముగ వర్ణింపదొడగి తుదకు "తప్పంతా నాదేనా" యని యామెనోట పలికించుట మొదలగు దుస్సహములును దురంతములును యసహజములగు ఫలితార్థములతో ఇట్లు యున్మనస్క కల్పితముల జూచిజూచి విసిగి వెగటొంది గడచిన మాఘమాసపు 'భారతి'లో ఆంధ్రవచన రచనాధురీణ శ్రీమతి కను

షష్ఠి వరలక్ష్మీదేవిగారు స్వర్ణాక్షరోపమితము లగు "మూడు తీర్మానాలు"* ఉదాత్తముగ నుద్ఘోషించినారు. ఆ వ్యాసమును జూచిన పిదప స్త్రీల నధికరించి వ్రాయుకథలయొక్కయు వ్యాసములయొక్కయు దృక్పథము మారవలసియున్నది. అంతియగాదు—వారి మహోకాంత్షలు స్పృహాలు యెట్టివిగ నుండు నదియు ఆ వ్యాసమువలననే తెలియగలదు. అందు సాధ్వీమణి రాజేశ్వరమ్మగారికిని హృదయేశ్వరుడగు భర్తగారికిని జరిగిన సల్లాపములో ఆ పురంధ్రి "నేను మొదట స్త్రీని—తర్వాత మీకు భార్యను" అని యంటజెప్పినది.

ఇదివర కయిదారేండ్లక్రిందట "హిందూ" పత్రికలో సుగుణయను నొకమాన్యురాలు వ్రాయుచుండిన లేఖలలో నొకమారు 'మాపైన మగవారి కధికార మెవరిచ్చిరి' యని ప్రశ్నించియున్నది.

ఉదాహృతసంగతులను ఆ కృతిగణము లుగ భావింపనగును. ఇట్టి యాశయముల జూడ ఇవి యెప్పుడును అజనమునకు కలిగియే యుండినవనియు పలుకుట కవకాశములబ్బమి మూలనొదిగియుండినవనియుతలంపవచ్చును.

గడచిన సంవత్సరపు "గృహలక్ష్మి"లో స్త్రీజన విరచిత పద్యములు వ్యాసాదులు ఇందు పూర్వగ్రంథమున ప్రస్తావింపబడి ప్రసంగవశమున కొన్ని యితరములును పలుకబడినవి ప్రస్తావనవిషయమునకు మరల వచ్చును.

పద్యములు:—ఎప్పుడో యొకపద్యమో పద్యభాగమో వ్రాయుటగాక కొందఱు స్త్రీలు పలుమారు పలువిషయములపై పద్యరచనలు జేసియున్నారు. కవిరాణి శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు[1] వెంబడి వెంబడిగా మార్చి ఏప్రిల్ జూలై అక్టోబరు నెలలలో రమ్యమగు పద్యముల వ్రాసి

---

* (1) ప్రస్తుతకాలంలో కొందఱు పురుషులు వ్రాస్తూవున్న కథలు స్త్రీలకు అవమానకరముగా ఉంటూవున్నవి కావున యిటువంటికథలు వ్రాయుడము అనుచితమని సభవారు వారిని హెచ్చరించుచున్నారు.

(2) ఇటువంటికథలను ప్రచురించే పత్రికలు స్త్రీసంఘానికి ద్రోహంచేస్తున్నవి గనుక యిటువంటి పత్రికలను నిరసిస్తూ ఆంధ్రదేశమునందలి మహిళా సంస్థలన్నియు తీర్మానములుచేసి సదరు పత్రికాధిపతుల కందజేయవలయునని సభవారు ఆంధ్రమహిళామణుల ప్రార్థిస్తూ వున్నారు.

(3) ఏపత్రికలైతె స్త్రీల నవమానించు ఇట్టి కథలను విరివిగా చిత్రపటములతోసహా ప్రచురించుచున్నవో ఆ పత్రికలను స్త్రీలు తమయింటికి రానీయరాదనియు. ఒకవేళ వచ్చినట్లయితే చదువకుండానే వాటిని పట్టుకచింపి వంటపాత్రలు వగైరా దించుకొనేనిమిత్తము, యింకా పసిపిల్లల అశౌచములు వగైరాలు తుడిచేనిమిత్తమున్నూ వినియోగించవలయుననియు ఈ సభవారు స్త్రీలనందరిని హెచ్చరిస్తున్నారు.

(ఈ మూడు తీర్మానములును ఒకానొక స్త్రీలసమాజములో జరిగినవని యూహింపదగియున్నది.)

(1) ఈమె పద్మినీ పరిణయము అను పద్యకావ్యమును సముద్రమథనము అను నాటకమును దిలీప యను ఏకాంకనాటకమును ఇంకను చిల్లరచిల్లరగ ననేకపద్యములను రచించియున్నది. మరియు అరవిందయను నొక మనోహర నవలనువ్రాసియున్నది అదియు ముద్రితమైనది. మరియు నెల్లూరునందలి వార్తాపత్రికలలో ననేక వచనవ్యాసములు వ్రాసియున్నది.

యున్నారు. మార్చిలోని "నెచ్చెలి యెడబాటు" కడుమృదువుగను హృదయస్పర్శముగ నున్నది.

(2) శ్రీమతి ఏ. కోమలమ్మగారు మార్చి ఏప్రిల్, మే, జూన్, జూలై సెప్టంబరు నెలలలో వ్రాసిరి. మార్చి యేప్రిల్ నెలల రచనలు సంస్కృతముగ నున్నవి. ఈమె రచనలు ఉద్బోధకములుగను మానసబోధకములుగ నున్నవి.

(3) విద్వాన్ కవితిలక కాంచనపల్లి కనకమ్మగారు మార్చి సెప్టంబరు నెలలలో వ్రాసిరి. ఈమె మహా విద్వాంసురాలును సంస్కృతాంధ్రముల గొప్ప కవియునై యున్నది. ఈయమ రచించిన గ్రంథములనేకములు. వానిలో జీవయాత్ర, హంస విజయములనుగ్రంథములుఆధ్యాత్మికములు. ఈమాన్యురాలి ప్రశంస ప్రత్యేకముగ జేయవలసియున్నది. ఈయమ వ్రాయునదంతయు నుపదేశముగ నుండును.

(4) శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు ఏప్రిల్ మే నెలలలో వ్రాసిరి. పద్యముల వ్రాయుటయు నీయమకలవడిన సాధనమైనను ఈమె ప్రతిభ వచనరచనలందు జూచి యానందింపవలయు. ఇంగిలీషున 'అడిసన్' డిక్వెన్సిగార్ల పోలికల నిందు వెలుగున జూడగలరు.

(5) శ్రీమతి ఉభయభాషా ప్రవీణ భువనగిరి లక్ష్మీకాంతమ్మగారు ఏప్రిల్ అక్టోబరులలో వ్రాసిరి.

ఇంకను యెందరెందరో గలరు. విస్తర భీతిచే వారిపేళ్లన్నియు వ్రాయబడలేదు. వచనరచనలు—

1. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు మార్చి ఏప్రిల్ జూన్ ఆగస్టు సెప్టంబరు అక్టోబరు నవంబరు డిసంబరు నెలలలో వ్రాసిరి. వీరు చూచినది చూచినట్టు వ్రాయుదురు. కొన్ని యన్యాపదేశములుగ నగపడినను యందలి సంగతులు జరిగినవిగ నున్నవనుట కనుమానపడ నక్కర లేదు. ఈమెగారి శారదలేఖలు ప్రసిద్ధిగాంచి యున్నవి.

(2) శ్రీమతి అనసూయాదేవి మార్చి ఏప్రిల్ జూన్ జూలై డిసంబరు ఫిబ్రవరి నెలలలో వ్రాసియున్నది.

(3) శ్రీమతి శీలా అప్పల కొండమ్మగారు మార్చి ఏప్రిల్ జూన్ జూలై ఆగస్టు—

(4) శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు ఏప్రీల్ అక్టోబరు నవంబరు ఫిబ్రవరి (1935)

(5) శ్రీమతి కవితిలక పులవర్తి కమలావతి దేవిగారు ఏప్రిల్ మే సెప్టెంబరు—

(6) శ్రీమతి కృష్ణకుమారిదేవిగారు మే ఆగస్టు నవంబరు—

(7) శ్రీమతి పరసా సీతారామమ్మగారు

(8) శ్రీమతి నెమలి చంద్రమతమ్మగారు జూన్ సెప్టంబరు 1935 జనవరి—

(9) శ్రీమతిశివావెంకటరాజేశ్వరమ్మగారు జూన్ సెప్టంబరు అక్టోబరు—

(10) శ్రీమతి చదలవాడ రాఘవాంబ గారు జూన్ అక్టోబరు 1935 ఫిబ్రవరి—

(11) శ్రీమతి వెలిదండిచూడికుడుతమ్మ గారు జూలై ఆగస్టు సెప్టెంబరు అక్టోబరు డిసంబరు—

(12) శ్రీమతి సమయమంత్రి వందే మాతరంగారు జూలై అక్టోబరు డిసంబరు (1935) ఫిబ్రవరి—

(13 శ్రీమతి యేర్లగడ్డ చిలకమ్మగారు అక్టోబరు నవంబరు డిసంబరు 1935 జనవరి—

(14) శ్రీమతి దివాకర్ల శారదామణి గారు అక్టోబరు నవంబరు డిసంబరు 1935 జనవరి ఫిబ్రవరి.

రెండేసినెలలలో వ్రాసినవారును ఒక్కొక నెలలోవారును అనేకులున్నారు. కొంత కొంతమంది పేర్లు చెప్పినందున మిగిలిన వారియం దనర్హత నూహింప ననువుకాదు.

గద్యపద్యాత్మికములగు నీస్త్రీజనరచనల జూడ వారును నానావిషయముల విమర్శింప సమర్థురాండ్రుగనే యున్నారు. అయితే యేయే తెగలవారి యీ విద్యాభివృద్ధి వ్యాపించుచున్నదియు కనుగొన కుతూహలముగలవారికి సందర్భము కలుగునట్లు యేదైన సదుపాయము సంపాదకులు చేయగల్గియున్నయెడల యుపకారమగును. ఇంటిపేర్లును రచయితల పేర్లును మాత్ర మాధారపరచుకొని జాతియు తెగయు యూహించుట యసమంజసముగ నుండ గలదు. కొందరు నిజనామధేయముల ప్రచ్ఛన్నముజేసి సరస్వతి — కమల ఇత్యాదికల్పిత నామములబెట్టుకొనిరి. పేరునుబట్టి నిర్ణయింప దగు వరకు శ్రీమతి ఇ. ఆర్. ఈనాక్ *(Enock)అను నొక్కరియొక్క జాతిమతములు తెలియుచున్నవి. ఈమె తననేస్తము క్రీ॥శేషురాలు నెల్లి జోషిగారినిగూర్చి 1934 జూలై గృహలక్ష్మిలో సంక్షేపముగ స్మరించి యున్నది. ఈయమ దేశీయక్రైస్తవురాలు. ఈజోషిగారి పుణ్యచరిత్రమును కొలదిగ మంచితెలుగున వ్రాసినది. ఈనాక్ గారి వలెనే తెలుగు చక్కగనేర్చి వ్రాయగల క్రైస్తవస్త్రీ లనేకులున్నారు. బి. ఏ. లు యం. ఏ. లు అయినవారున్నారు. దేశీయ క్రైస్తవులకు మిషనరీలయొక్కయు ఐరోపీయులయొక్కయు సాంగత్య మెక్కుడగుట మాతృభాషా ప్రచారమున కవకాశములు తక్కువగనుండును కాబోలును. అయినను ఈనాక్ గారివంటి దేశభాషాభిమానినులు విస్తరింపవలయును. పాశ్చాత్యసాంగత్య విషయమున వారికి కొన్ని విశిష్టభావములు ఆశయములు కలుగుచుండ గలవు. ఆంధ్ర క్రైస్తవురాలు కృష్ణమ్మగారు "లేడిస్ మాగజైన్" అనునొక పత్రికను ప్రకటించు

---

* ఈమెవలె క్రైస్తవ పురుషులలో హెచ్చుగ దేశాభిమానమును భాషాభిమానమునుగల జి. జోషువా గారు పలుగురు "భారతి"లో శ్లాఘ్యములగునట్టియు గంభీరభావములు గలవియునగు తెలుగుపద్యముల వ్రాయుచుండుదురు.

చున్నారు. దానియందును కొందరు స్త్రీలు తెలుగున వ్రాయుటగలదు.

ప్రస్తావనలోని సంవత్సరపు గృహలక్ష్మి యందలి వ్రాయసకత్తియల నామధేయముల జూడ నొకమాటజెప్ప సంతసమగుచున్నది. ఇపుడిపుడు ఇంగిలీషు పత్రికలలో హైందవ స్త్రీజనము పేళ్లు ముచ్చటింప నవసరములు గలిగినపుడు పెండ్లిఅయినవారికి భర్తగారి నామముల గూర్చుటయొకటి యగపడు చున్నది. ఒక సౌభాగ్యవతిపేరు సీతమ్మయు భర్తగారిపేరు రామయ్య అగునెడల ఈమె పేరుచ్చరింప నవకాశము గలిగించినచో (Mrs. Sethammal Ramiah) (సీతమ్మ రామయ్య సతి) అని వ్రాయుచుందురు. ఇది అంతవరిష్టమగు విధమనితోపదు. ఈ స్త్రీ ఈ పురుషుని సతియని తెలియుటయె యపరిహార్య ప్రస్తాపమగునెడల "రామయ్య సీతమ్మ" యనదగునని యూహింపనగును. ఇట్టిప్రయోగములు భాషలోనను యున్నవి: కాటయ కుమారుడగు వేమయ యనవలసిన చో "కాటయ వేమ" యను ప్రయోగములు గలవు. కొమ్మన కుమారుడగు తిక్కన యన వలసియుండ కొమ్మన తిక్కడను ప్రయోగ మున్నది. సీతారాముల ప్రస్తావముననె మన యాదువారిపాటలలో "శ్రీరాములసీత" యనియు "రఘురాములసీత" యనియు ప్రయోగములున్నవి.—ఈ పై పంక్తులు ఈ వ్యాసప్రయోజనములకు కేవల సంగత ములు-కానందున నివి సాధ్వసముగ వ్రాయ బడినవని మనవి. గృహలక్ష్మిలోని మహిళా జననామావళియంతయు ఈ మనవి కవిరోధ ముగ నుండుట యొక సంతృప్తిహేతువుగ నున్నది.

బ్రిటిషు స్త్రీలకువలె రాజకీయ వ్యవస్థా దులందు హిందూదేశపు స్త్రీలు పోరాడ నక్కరలేకయే పురుషులకు గల స్వతంత్ర ములు స్త్రీలకును గలవు. పార్లమెంటు వోటుకొరకు బ్రిటిషుస్త్రీలు హోరాహోరిగ ప్రచండ ప్రచారము సలిపిరి. ఇచట నట్టి యుద్దేశములేకనే యిట్టి స్వతంత్రములు స్త్రీల కును లభించినవి. శాసన సభ్యురాండ్రగు చున్నారు. లాయర్లగుచున్నారు. వివాహ ముల విషయమై శారదాశాసనమును పొంది యున్నారు. సర్వముఖములను నీ యభ్యు దయముల జూడ వీరి జ్ఞానవిజ్ఞానపరిధుల విస్తరించి "అంగా దంగాత్సంభవతి పుత్రవ ద్దుహితానృణాం" అని ధర్మతత్త్వము ఘాటింపుచుండ పైతృస్వమునంతయు తమ యన్నదమ్ములు స్వీకరించుటయు తాము మంగళసూత్రములు నల్లపూసలతోటి భర్తృ గృహముల నాశ్రయించుటయు ధర్మాపేతం బను తీవ్రప్రచారమున కుపక్రమించి హిందూ దయు ధర్మసూత్రముల జన్మానుగుణము జేయించుకొనుదురు అది న్యాయవిరుద్ధము కాదుగదా!

# మిత్రుండొక్కండె దైవంబు ధాత్రిలోన

గీ. నమ్మఁగాఁజాల నే నొక్కనాఁడునైనఁ
గలియుగముననొక్కండైనఁ గలఁడు హితఁడ
టంచుఁ జెప్పఁగనేల మిధ్యంపుమాట
కాని మిత్రుండె యేనాఁటకైన హితుఁడు.

ఉ. దేనికినైనఁగాని వెనుదీయక యాపద గల్గువేళలన్
బ్రాణమునైన నొడ్డి పలుభంగులఁ గాచెడువాఁడు మిత్రుఁడే
గాని తదన్యులెవ్వరునుగారు విచారణఁజేసి చూడుమో
మానసరాజహంస వినుమా చెడుదారినిఁ బట్టఁబోకుమా.

గీ. కపట వ్యక్తులనెఱుఁగని ఘనసఖుండు
నొక్కఁడున్నను జాలఁడొక్కో ? జగాన
కష్ట కాలము నందు నక్కరకురాని
బంధుగణ మెంతయున్న నిష్ఫలముగాదె ?

గీ. అరయఁ జుట్టాలు దొంగల టంచు మున్ను
పోతనార్యుండు నంతగా బోధసేసి
నట్టి మాటలు వేదవాక్యములుసుమ్మి
మిత్రు డొక్కండె దైవంబు ధాత్రిలోన.

రామ సుబ్బారాయుడు, బి. ఏ.

# వేంకమాంబ

అయ్యలసోమయాజుల సుబ్బారావుగారు

విశాఖమండల ప్రాంతమున శృంగవరపు కోట తాలూకాకు జెందిన కొంపుపాలెం అనే కుగ్రామం వేంకమాంబ కాపురస్థలం. కోనసీమద్రావిడకుల సంజాత. స్వాధ్యాయ పరుడైన వేంకటావధాని సహధర్మిణి. నిరంతర భర్తృపాద పూజాపరాయణయై పతి అనురాగమును బడసిన సతీస్వరూపిణి. కొద్దో గొప్పో ఆస్తివుంది వేంకటావధానికి; ఏలోపం లేకుండా కాలంగడిచిపోతోంది; కాని పున్నా రకం తరింపజేసి పుణ్యంకట్టుకున్న పుత్రుడు లేకపోడం మూలాన్న 'అపుత్రస్యగతిర్నాస్తి' అని పెద్దలు చెప్పారు గనుక కొడుకులేని జన్మ వృథాయని మాత్రం భార్యాభర్తలు విచారిస్తూండేవారు. తమ చేతిలో పని గనుకనా? దైవకటాక్షం వుండాలి; ఏం చేస్తారు? రోజురోజూ సంతానచింత ఎక్కువై పోయింది. ఈసంతానం విషయమై ఆభార్యాభర్తలిద్దఱు తిరగనితీర్థాలు, మ్రొక్కని దేవుళ్లు లేరు. కాలం మళ్లిపోతోంది. పిల్లలాశ తగ్గింది. కొనకి మనస్సు కుదుటపఱచుకొని "ఔరసుండట్లా దత్తుండునట్లె"యను పెద్దల వాక్యాలునమ్మి దత్తుతీసికోతలచుకొన్నారు.

సోమయాజులు వేంకటావధాని సోదరుడు. అన్నపై నెక్కువ మక్కువకలవాడు. ఆస్తి అన్నగారితో సమంగాపంచుకొన్నప్పటికీ బహుకుటుంబీకుడవుటచే ఖర్చు ఎక్కువ. అందులో ఏటేటా పురుళ్లు, కార్యాలు. ఎంతకనితేగలడు? ఎంతపొదుపుగా వాడుకున్నా ఏఖర్చు తప్పుతుంది? ఆస్తంతా తణఖారాసేశాడు. అదిచాలక అన్నదగ్గిఱకొచ్చి బుడిబుడిరాగాలుతీస్తే జాలిగుండె గల వేంకటావధాని లేదనలేకపోయేవాడు. ఓరోజు అవధాని తమ్ముణ్ణిపిలచి మనస్సుకు కష్టం తగలకుండా అడిగాడు "ఒకణ్ణి తనకు దత్తుఇ"మ్మని.

"అన్నయ్యా! నాకొడుకులు నీకొడుకులు కారా? అంతప్రాధేయపడి అడుగుతావేం? ఆఖోవాణ్ణి నువ్వుతీసికో" అన్నాడు సోమయాజులు. ఉప్పొంగిపోయారు భార్యాభర్త లిద్దఱూ. మంచిరోజుచూచుకొని యథాశాస్త్రీయంగా దత్తతచేసుకొన్నారు. వాణ్ణి కన్నవాణ్ణికంటె ఎక్కువగా చూచుకొంటోంది వేంకమాంబ; కొంతకాలమైంది. ఓరోజు ఆదత్తుణ్ణి వొళ్లో కూచోపెట్టుకొని ముద్దులాడుతోంది వేంకమాంబ. ఆసమయానికే సోమయాజులుభార్య వచ్చిచూచి "నిజంగా నువ్వే కంటే ఇంకెంతముద్దుబాడుదువో?" అంది. గుండెకి శూలమై తాకిందామాట. "అవును, నేకంటే గాదూ? తోడికోడలు దెప్పకుండావుండడానికి." అనుకొంది వేంకమాంబ. ఏమీ పైకిఉబకలేదు. రోజూ కన్న అతిప్రేమతోచూస్తోంది తోడికోడల్ని.

సోమయాజులు భార్యమాత్రం మాట అలా అనేసిందేగాని; తోడికోడలంటే భక్తిశ్రద్ధలు లేవు గనుకనా! సరియైనపుణ్యస్త్రీకి మనఃకించగలిగించే ఒక్కమాటచాలు శాశ్వత మనక్షోభం కలిగించడానికి. తుక్కగనకనా లొటలొట దులిపెయ్యడానికి? అటువంటి వారు సామాన్యంగా మాటపడరు; పైకి ఉబకరు. అర్పుగలకుక్క కఱవదు. వేంకమాంబ దినేదినే క్షీణించిపోతోంది దానికి కారణం ఇంట్లో ఎవ్వరికీతెలియదు. అసలు రోజూచూచేవాళ్లకి క్షీణించిపోతూన్నట్టు కూడా తెలియదు. ఆనందంతోనేయున్నారు. ఇలావుండగా వోరోజు అవధాని కొందఱు-స్నేహితుల్నితీసుకొని మఱ్ఱిఆకులకు వెళ్లాడు. ఎంతభాగ్యమున్నప్పటికీ పూర్వకాలం సోమరిపోతులుకారు. కూరగాయలు కొనుక్కో-నక్కరలేకుండా పెరట్లో పాదులుపెట్టి దోహదంచేసి కాపించుకుంటూండేవారు. ఇప్పటిలాగ అయిదణాలిస్తే వోవిస్తరాకుల కట్టొస్తుంది. వారంరోజులిడ్చెయ్యొచ్చు అనే రకంగాదు. కష్టపడి ఎంతదూరమైనా వెళ్లి ఆకులు తెచ్చుకొని విస్తరాకులు కుట్టుకోవలసిందే. పనికిమాలిన పళ్లుతోము పుడకలు కూడా ఎంతదూరమైనా వెళ్లి తెచ్చుకుంటూండేవారు. ఆప్రకారముగానే మన అవధాని మఱ్ఱిఆకులకు కొండుపాలెందాటి వేపాడ సరిహద్దులకు మూడుక్రోసుల దూరం వచ్చాడు మిత్రులతోకూడ. పురాతనంనుంచి వుంది వోమఱ్ఱిచెట్టక్కడ వరప్రసాదుల మల్లే తలకోకొమ్మెక్కారు. కొంతసేపటికి అందఱూ చెట్టుదిగి ఎవరికోసిన ఆకులు వారు కట్టకట్టుకున్నారు. అవధానిమాత్రం ఇంకాచేరలేదు. ఎంచేతనోయని కొంతసేపు నిరీక్షించారు. రాలేదు. తలోకమారూ పిలిచారు పలకలేదు. ఒక్కొక్కరొక్కొక్కవేపు వెళ్లి వెదికారు. ఓచోట బుఱ్ఱబ్రద్దలయి చనిపోయిన అవధానినిచూచి వారిదుఃఖం పట్టనలవికాకపోయింది. సాయంకాలం అయిపోతోంది. ఒకణ్ణి కొండుపాలెంపంపించారు. వాడు సోమయాజులుకు, వేంకమాంబకు జరిగినసంగతంతా చెప్పాడు. సోమయాజులు మాత్రం దుఃఖమాపుకోలేక దొర్లిదొర్లి ఏడ్చాడు. వేంకమాంబకు కళ్లంటనీళ్లేనా రాందే! రాత్రికి రాత్రీ "పదండి నేనూవస్తా" ననిమాత్ర మంది. సోమయాజులు; వేంకమాంబ, దత్తుడు ఇంకా వూళ్లోవారంతా వెళ్లారు చెట్టుదగ్గఱకు. చనిపోయిన అన్నపైబడి చిన్నపిల్లాడల్లే దుఃఖించాడు సోమయాజులు. వెంకమ్మ చీరకొంగుతడిపి అవధాని ముఖమంతా రక్తంపోయేటట్టు తుడిచింది. తెల్లవారిన తరవాత ఆచెట్టుక్రిందనే చితిపేర్చి అవధాని పాంచభౌతికదేహం దానిమీదపెట్టి అగ్నిసంస్కారంచేశారు. అప్పుడు వేంకమాంబ తొందఱగా సమీపంలోనున్న వో నూతిదగ్గఱకుపోయి స్నానంచేసి ఎవరికీ తెలియకుండా తెచ్చుకొనిన పసుపుచీర కట్టుకుని భర్త చితిచుట్టు ప్రదక్షిణంచేస్తోంది. అదిచూచి ప్రేక్షకులగుండెలు జారిపోయాయి. ముమ్మారు ప్రదక్షిణంచేసి చితిపై నుఱకబోతూన్న వేంకమాంబను పట్టుకు

న్నారు. "ఇదితగ"దని చెప్పారు. "ఇప్పుడు సహగమనంచేస్తే అధికారు లూరుకో"రని బ్రతిమాలారు. "చూడవచ్చినవాళ్లందఱినీ కొట్లో తోసేస్తారు"అని యెన్నో విధాల చెప్పారు. వినలేదు. పడనీయకుండ పట్టుకున్నారు. చితి అంటుకుంది. ఇట్టి పుణ్యాత్ముణ్ణి దహింపజేస్తున్నాననే సంతోషంగాబోలు! అగ్నిహోత్రుడు ప్రజ్వరిల్లాడు. ఆ ఝాళ కాగలేక దూరంగాపోయారు జనమంతా. వేంకమాంబమాత్రం ఆగలేకపోయింది. అందఱూ పరాకుగానున్నతరుణంలో పరుగెత్తి చితిలో పడిపోయింది. ఇంక గత్యంతరంలేక "నీ మాహాత్మ్యము చూపి మాపై కేసురాకుండా కాపాడుకోడానికి ఆనవా లివ్వవలసింది" అని కోరారు.

"ఈ చీరకొంగుతీసుకోండి" అంది.

వెళ్లేవారెవరు? దగ్గఱకువెళితే ఒళ్లు బొబ్బలెక్కుతోంది. ఇంకేమీచెయ్యలేక విచారిస్తూ కూర్చున్నారు పూర్తిగా దహనమయ్యేవఱకు. రెండుజాములకల్లా చితి చల్లారింది. వీరికివ్వబోయిన చీరముక్క ఆచితిలోనే కాలకుండావుంది. అదిచూచి వేంకమాంబ మాహాత్మ్యం పొగడుకొంటూ ఆచీర ముక్క తీసుకొని వెళ్లిపోయారు. అదిలగాయితు ఆమట్టి "గుండంమట్టి" (గుండమనగా సహగమనంచేసినస్థలం) అనుపేరున పిలవబడుతోంది. వేంకమాంబయొక్క స్మారకచిహ్నముగా ఆచీరముక్క వారి వంశీయుడగు పేరి పెదవెంకట నృసింహంఅను నాతనివద్దనున్నది. ఏటేటా పూజచేస్తూ వుంటాడు. ఇట్టివారిని తలుచుకొంటే మనకీ తరింపుంది.

క॥ ధర్మాత్ములు దమసలిపెడు
ధర్మక్రియఁ దప్పరెట్టి దశయందును; మో।
హార్ములుఁదాపముఁ బుట్టవు
ధార్మిక హృదయములఁ బ్రథమధర్మాధ్యక్షా॥

క॥ కావునఁ బతియనుగమనం
బేవిధమున విడువఁదగునె యెట్లయినను మో।
హావేశముఁబొందక ధ
ర్మావస్థితి సలుపవలదె యవహితబుద్ధిన్॥

భారతం.

"అబ్బబ్బా! ప్రాణాలు విసిగిస్తున్నారు పొండిరా. వెధవపిల్లలు. ఊఁ; అల్లా ఏడు."

"ఏమ్. ఎందు కల్లా పెంకులన్నీ ఎగిరిపొయ్యేలా అరుస్తావు. నింపాదిగా సముదాయించలేవూ?"

"కబుర్లుకాదండీ చెప్పేదానికి. మీరు సముదాయించండి తెలుస్తుంది. ఏదో వేళకింత ఉడకేసి పెడుతూంటే తిని దేశాలెంట తిరిగేవాళ్ల కేంతెలుస్తుంది కాపురపుకష్టాలు!"

"ఏమిటా గిజగిజ. ఇప్పు డేంవచ్చిం దింతవినుగుదలకి? ఇంతమాత్రనికే ఇంత గందరగోళంచేస్తే ఇంక ముందు నువ్వేం కాపరంచేస్తావు? వాడు దుంపతెగ, వాడుచెప్పిన జోస్యమే నిజమైతే ఇంకాముగ్గురు పిల్లలు పుడతారట."

"అబ్బా. అల్లాఅయితే నాకు బ్రతికేరోజులే లేవు. నిజంగా యెముకలు కొరుక్కుతింటున్నారీ పాడుమూక, ఒకళ్లా ఇద్దరా. ఈనల్గురు పాపల్ని పెంచేసరికే పుటం అవుతోంది. చచ్చిందాన్ని! ఎటేటా కాన్పేనాయను. తిన్నగా వళ్లుపచ్చి పోకముందట్నించే మళ్లోకళ్లుపోతూన్నాసరే అపాయిముం దేడవాల్సిందే. ఇదేంఖర్మం?"

"ఎందుకంతగా విచారపడతావు? చేసుకున్న వారికి చేసుకున్నంత మహదేవ. కని పారేసినంత మాత్రానే అయిందీ. నాకుమాత్రం దిగులుగాలేదూ? ఎట్లానా ఈపనిమందినీ పోషించేదీ అని నేను గంట గంటకి ఆలోచిస్తూనేఉంటా. ఆఫీసులో కాగితాలు ముందరేసుకుని తీరికలేకుండా వ్రాసుకుంటున్నా ఈ సంగతులే తలనిండా. ఈఆలోచనల మూలానే నిన్న పనంతా దండగైంది. అన్నీ తప్పులుపడ్డయి. అధికారి అనరాని మాటలన్నాడు. ఇవన్నీ ఆలోచించుకుంటూంటే వీళ్లందర్నీ చంపేద్దామా అనేంత విసుకు కోపం కలుగుతుంది."

"మీపుణ్యాం గాని ఆపనిమాత్రం చేయకండి. నే నుంటం మూలానగదా వీరంతాపుట్టింది. నన్నేచంపేస్తే ఇంక ఎవ్వరూపుట్టరు. కనుక నన్నే చంపేయండి. నాకూ ఈ యమలోకబాధ తప్పిపోతుంది. మీ కెంతన్నా పుణ్యంఉంటుంది. ఈఅవస్థలు పడలేక నా అంతట నేనే ఏభావిలో దూకుదామా అనిపిస్తుంది. నిజంగా ఎప్పుడో అంతపనిచేస్తా."

"ఇప్పుడే నాకు వార్నింగిస్తున్నా వేమిటి? నేనే ఆపనిచేస్తేముందు?"

"సరేలెండి అన్నీ బాగానేఉన్నాయికాని పది గంటలు కావస్తోంది. స్నానంచేయండి. కచేరీ వేళయింది."

౨

వెంకట్రావు పాపం ఈబాధలన్నీ అనుభవించలేకనే మొదట్లోనే వద్దన్నాడు పెండ్లి. కాని వాళ్ల వాళ్లందరూ వెంకట్రావుని ఒకఇంటివాడ్ని చెయ్యాలని పట్టుదల. కాకున్నా రామారావు సీతమ్మలకు ఒక్కడే కొడుకవటంవల్ల, సీతమ్మ పెద్దదైపోవటం వల్ల, ఇంట్లో రెండోఆడదిక్కు లేకపోవటంచేత, ఎట్లాగైనాసరే కాస్త పెద్దపిల్లనిగా చూచి వెంకట్రావుకు పెళ్లిచేయాలని ఆలోచన. వెంకట్రావుకూడా ఈనాటి కుర్రాళ్లలా గట్టితేలకపోవటంవల్ల లోపల ఇష్టంలేకపోయినా, వాళ్లనాన్నభయంవల్ల వాళ్లమ్మయందున్న ప్రేమవల్ల తలూపాడు. ఇదే సందుగదా అని ఏదో ముహూర్తంచూచి ఆముడి కాస్తావేయించేశారు.

వెంకట్రావు ప్యాసైంది మెట్రిక్యులేషనే అయినా వాళ్లనాన్న ప్రాపకంవల్ల తొందర్లోనే వాళ్లజిల్లా బోర్డు ఆఫీసులో ఉద్యోగం దొరికింది.

అధ్యక్షులు కమ్మఅయినా, మిగతా మెంబర్లంతా బ్రాహ్మణముండాకొడుకులేంకా ఉద్యోగాలేంటని అడ్డుతగిల్నా, ఏగుణానున్నాడో పాపం ఆడొక్క బుద్ధిలేని అధ్యక్షులు వెంటనే ఉద్యోగం ఇచ్చేశాడు. కాని అంతవరకే. తరవాత ఎన్నిసంవత్సరాలు మాట లేకుండా ఉద్యోగంచేసినా ప్రమోషనేలేదు. అయితే నేం తరవాత ఆఫీసులో ప్రవేశించిన బ్రాహ్మణేతర గుమాస్తాలందరికీ అట్టే ఇంక్రీమెంట్లిచ్చి అరవై, డెభ్భైలుచేసారు. ఏవన్నా మాట్లాడితే అసలుకే మోసంవస్తుందనే భయంచేత, సహజంగాఉన్న పిరికి తనంవల్ల ఆ ప్రెసిడెంటు దగ్గరకెళ్లిన పాపానపోలా.

రామారావుకు అదృష్టం అంతగాలేదు. కొడుకుసం పాదన ప్రాప్తంలేదు. ఉద్యోగంవచ్చిన నాలుగోసంవ త్సరంలోనే స్వర్గస్థుడైనాడు. సీతమ్మకూడా పాపం వైధవ్యబాధ లనుభవించలేక రామారావుచనిపోయిన నెలరోజులకే కాలధర్మంపొందింది. మన వెంకట్రావు మాత్రం అలానే ఉద్యోగంచేసుకుంటూ పెళ్లాం బిడ్డల్ని పోషించుకుంటూ కాలంగడుపుతున్నాడు.

"ఏమండోయ్! కాస్త వీడ్ని తీసుకుందురూ. ఎక్కడికి వెళుతున్నారు. తొమ్మిదిన్నరైంది. ఇంత వరకిసట్లో బియ్యంపోలేదు. పదిగొట్టంగానే గంటైందని గొంతుమీద కూర్చుంటారు. నాయన్నా యనా, ఈ పిల్లలుకాదుకాని వీళ్లతో చచ్చేయోగం వచ్చింది."

"ఏమిటోయివెంట్రావు ఆలాగో లెక్టేసిందిపాపం. కాస్త కాస్తవాళ్లని తీసుకోరాదూ పాపం. ఈలా రండిరా" అన్నాడు కేశవరావు.

చిన్నప్పటి స్నేహితులు కేశవ, వెంకట్రావులు. మిత్రుడేదో ఉద్యోగం చేస్తున్నాడు చూచిపోదాం అని ఆనాడేవచ్చాడు కేశవరావు. వచ్చిరాంగానే వెళ్లిపోదామా అనిపించింది ఆరొడచూస్తే. కాని మర్యాదకు భయపడి ఏంచేయలేక, వెంకట్రా వేదో భోజనంచేసి వెళ్లొచ్చంటే ఆగిపోయ్యాడు, అయితే పాపం ఈలంపట్లోపడని కేశవరావుకు ముళ్లమీద కూర్చున్నట్లుంది. అయితే మిత్రులకొరకు త్యాగం ఒకలెక్కలోది కాదనుకొని గుండె నిబ్బరంచేసుకొని ఉండేశాడు.

చాలా కాలానికొచ్చాడు స్నేహితుడని స్పెష లుగా చేయిద్దాం ఏమైనా అని అప్పుడే బయల్దే రాడు.

"నాన్న! చెల్లాయి బయలికెళ్లింది. అమ్మ మడి గట్టుకుందిట. నీకు చెప్పమంది."

"నానోయి? ముద్దికరగవు" అంటూ చొక్కా ఎగబట్టుకొని వెంకట్రావు కెదురుగా నిలబడింది రెండేండ్లపిల్ల.

"వస్తున్నా నుండవోయి. బుద్ధిలేక చేసుకున్నా నీపెండ్లి. అబ్బ; ఈబాధల కంతులేకుండాఉంది." అంటూ వెంకట్రావు పిల్ల రెక్కట్టుకొని గబగబ లోపలికి తీసుకెళ్లాడు.

"అదేంటండీ. అలా లాగుతే రెక్క కాస్తా ఊడిరాదూ."

ఇవన్నీచూస్తే పాపం కేశవరావు మాటాల్లేనివా డిలా నిలబడిపొయ్యాడు. "హోటలుకూడుతిని రోగాలన్నా సహించుకుంటాంగాని ఈయమబాధ నాకొద్దు" అని నిశ్చయించుకున్నాడు. ఇంతట్లోనే వెంకట్రావు కూరకాయలసంచీ తీసుకొని బయట కొచ్చాడు.

"ఏమండోయి; ఎంతసేపటికొస్తారో? మీరొచ్చి దీన్ని తీసుకుంటేనేగాని వంటకాదు. తొందరగా రండి," అని కేక.

ఏదోవిధంగా తెంచుకు బయటపడ్డారు స్నేహితు లిద్దరూ.

ఆవేళ అమావాశ్య. ఆదివారం కూడా అయింది. వెంకట్రావు దినంఅల్లా ఇంట్లోనేఉండి పిల్లల్ని ఆడిస్తూ భార్యతో సరససల్లాపాలాడుతూ కాలంగడిపాడు. భార్యకూడా పాపం చరచరా పనిచేసుకొని భర్త కన్నంపెట్టి పిల్లలకి రెండోమా టన్నంపెట్టి తను దిని, అంట్లగిన్నెలన్నీ సుబ్రంగా తోముకొని తిరిగి రాత్రి వంట కన్నీ సిద్ధంచేసికొని పండుకొని ఏదో ఆలోచిస్తూనాన్నా వెంకట్రావుప్రక్కనే చేరింది.

మందు వేసంగవటంవల్ల అన్నంతినగానే కాస్త కన్నుమూసాడు వెంకట్రావు. అతనిప్రక్కనే చెంగు పర్చుకొని సేదదీర్చుకోటానికి పడుంది సావిత్రమ్మ. పిల్లలుకూడా తలోమూలా నిద్రాదేవతని ఆరాధిస్తున్నారు.

గడియారం దబదబ అయిదుకొట్టేసింది. ఉలికిపడి లేచింది సావిత్రి. మైమరచి నిద్రపోతూన్న భర్తను చూచి "ఏమండోయ్! ఇంక లేవండి. అయిదయింది. అసర సంధ్యవేళ నిద్రపోకూడదు." అంటూ తను పని చేసుకోటాని కింట్లోకెళ్లింది. పిల్లలుమాత్రం ఇంకా నిద్దర్లు లేవలేదు. వెంకట్రావు నింపాదిగాలేచి నిద్దర మొహంకడుక్కొని షికారుకెళుతూ తొందరగా వంటచెయ్యమని ఇంట్లోచెప్పి వెళ్లిపోయాడు.

తిన్నగా దీపాలుపెట్టలేదు ఊరంతానూ. అప్పుడే తిరిగొచ్చాడు వెంకట్రా వేదో చేతులో ఓపెద్దబుట్ట తీసుకొని.

"ఏమిటండీ, అవన్నీ? ఏలా; ఇట్లు దబ్బు ఖర్చుపెడుతూంటే. ఇంకెన్నాళు చేయాలో మనం ఈకాపరం. ఎందు కివన్నీనీ."

లేదులేవే. ఇవాళేగా, పాపం పిల్లలకి చిరుతిండంటే మంచిఇష్టం. గోచీకంటే గొప్పదరిద్రం లేదు కదా. పుట్టించినదేవుడు పోషించక మానాడూ?"

"వెధవదేవుడు. మనల్నిన్ని కష్టా లెందుకండీ పెట్టాలి. నాకిద్దరు పిల్లలుపుట్టానక ఇంకవద్దని ప్రదక్షిణాలు చేసా. పాపం పొరుగింటి పున్నమ్మ ఇప్పటికింకా ప్రదక్షిణాలు చేస్తూనేఉంది పిల్లలుకావాలని. నాకు పుట్టటం ఆగలేదు. ఆమెకు పుట్టలేదు."

"వంటైందా మరీ? తొందరగా చెయ్యమన్నాను ఇందాక. ఆకలేస్తోందికూడాను."

"అయింది. స్నానంచెయ్యండి. మడి కట్టుకో వచ్చు."

"మడీలేదు, దడీలేదు. వడ్డించు స్నానం చేసి వస్తా." "పిల్లలంతా నిద్దరపోయారూ?"

"ఇప్పుడే చంటిదాన్ని పండుకోబెట్టి వచ్చాను. మళ్లామళ్లా లేపకుండా ఒకేసారి పాలుకూడా ఇచ్చేసొచ్చాను."

"ఇవా ళెందుకనో నిద్దరపట్టటంలేదు. ఇలారా"

"దీపం తీసెయ్యమన్నారా సాంతంగా?"

"వద్దు. దీపాలార్పటం నేర్చుకున్నా వేంటి కొంప తీసి. కొంచెం చిన్నదిచేసి రా."

"గాలే లేదండీ బొత్తుగా ఈదినం,"

"అవును. నా కిక్కడ నిద్దరట్టటంలేదు. కాస్త విశ్రాంతి గాఉంటుంది పోయి వసారాలోని కుక్కిమీద వెన్నువాలుస్తా నింకేం?"

"పదండి. నాకూ నిద్దరొస్తోంది. పాపం మీరూను అలసినట్లున్నారు."...

నేవెళ్లి పండుకోనా మరి?"

"ఊఁ. సరేపో."

అంతే! భార్య నిద్దరపోతోందికదా అని నెమ్మదిగా లేచి ఇంటికి కొంచెందూరంగాఉన్న అఖావిదగ్గరకెళ్లి అటూఇటూ చూచి గుటిక్కుమని దూకేశాడు.

వెంకట్రావు కీ సంసారం ఈదటం చాలా దుర్భరంగా కనిపించింది.

ఉన్నకొద్దీ కష్టాలెక్కువవుతాయనుకున్నాడు. ఇంతకన్న ఉరే మేలనుకున్నాడు.

భర్త గాఢనిద్రలో ఉన్నాడుగదా అనుకుంది. పిల్లలందరిదగ్గరకెళ్లి ఆఖరితడవ ముద్దెట్టుకుంది. తన జీవితంపైన అసహ్యంతోచింది. మళ్లా నెలతప్పింది. గుండెల్లో దిగు లెక్కువైంది. భర్తసంపాదనా, బొత్తిగా కుటుంబసాధారణఖర్చులకే చాలటంలేదు. తనకా, దేహంలో పటుత్వం తగ్గిపోయింది. ఇంట్లో చాకిరీ ఎక్కువైంది. తిరిగి కనేరోజులొస్తే ఖర్చున బడుతుంది కుటుంబం అనుకొని నింపాదిగాలేచి అటూఇటూ చూడకుండా వేరువిచారణలేకుండా మాధవయ్యగారి మంచినీళ్ల భావిదగ్గరకెళ్లి గభామని దూకేసింది. అంతకు ముందేఉన్నాడు తననాథుడక్కడామె కొరకు. ఈ భూలోకబాధల్నుంచి వెళ్లిపొయ్యారు.

తెల్లవారింది. వెంకట్రావింట్లో అమ్మా నాన్నా అనేకేకలు మిన్నుముట్టి పోతున్నయి. చంటిపిల్ల పాలకోసరం కవ్వున ఏడుస్తోంది. అమ్మెక్కడ! నాన్నెక్కడ. ఈ ధ్వనికి పొరుగువాళ్ళంతా ప్రోగయ్యారు. ఎవరేం చేయగలరు. అంతాచూచి ఎవరిదోవను వారు పొయ్యారు.

మంచినీళ్ల భావిదగ్గర ఊరంతా పోగైంది. మునసబుగారు ఎట్టివాళ్లని తీసుకొని తయారయ్యారు. అందరికీ ఆశ్చర్యంకలిగింది. ఎవ్వరేం చేయగలరు. మునసబుగారే వారి శవాల్ని దహనంచేయించేసి అంత్యక్రియలు చేసేసారు.

ఇంక ఇంటికడ్డంగాపడి ఏడుస్తూన్న పిల్లలగతేంటి? మునసబుగారి అబ్బాయి మంచిబుద్ధిమంతుడు. మద్రాసులో యం.ఏ. చదువుతున్నాడు. మంచిదయార్ద్రహృదయుడుకూడానూ. వీరినల్గుర్నీ పట్నంతీసుకెళ్లి పెద్దలచేత ఈలాంటి పిల్లలకొరకు నడుపబడుతూన్న ఆర్ఫనేజీలో చేర్పించేసాడు.

కాని ఇప్పటికీ ఊళ్లోఅంతా వెంకట్రావు సావిత్రుల్ని నిందించేవాళ్లే. "ఏమిటమ్మా ఇంత అఘాయిత్యం. ఎందరికిలేరింతమందిపిల్లలు," అని. కాని బ్రతికుండంగా, "అబ్బే వాళ్ల వెంకట్రావు పిల్లలు చూడు ఎలికలఏనాది పిల్లల్లాఉన్నారు" అని అసహ్యించుకునేవాళ్లు.

ఏమోనబ్బా ఈ వెధవబాధ లనుభవించేకన్న అదే మేలేమో?

క॥ కర్మములు మేలునిచ్చును;
కర్మంబులు కీఁడునిచ్చుఁ; గర్తలుతనకుం।
కర్మములు బ్రహ్మకైననుఁ;
గర్మగుఁడై యొరులఁదడవఁగా నేమిటికిన్ ॥

భాగవతం.

# ప్రేమాన్వేషి

ఊటుకూరు తిరుమలరావుగారు

ప్రేమంటే అంధకారావృత జీవితాన్ని పూర్తిగా నిర్మూలించే దివ్యజ్యోతి. ప్రేమ సృష్టి సర్వస్వంలోను మూర్తీభవించింది. ప్రేమసూత్రాలతోనే ఈ ప్రపంచసంబంధాలన్నీ బంధించుకోనున్నాయి. ఈశ్వరునిలో గూడ ఈ ప్రేమే లీనమైవుంది. ఆనందమయమగు ఈశ్వరతత్వాన్ని గ్రహించేందుకు ప్రేమే మార్గదర్శి అట్టిపవిత్రప్రేమజ్యోతిని అనుభూతంచేసుకోకుండా ఎవరుంటారు? ఆప్రేమ, వివిధరూపాలుగ ప్రకాశిస్తూన్నది. గమ్యస్థానాన్ని చేరేందుకు ఎవరికిష్టమొచ్చినట్టు వారు ప్రేమని సహాయ్యంగా జేసుకుంటారు. ప్రేమమార్గాన్ని అనుసరించే సత్యారుక్మిణులు గమ్యస్థానాన్ని సులభంగా అవరోహించగలిగారు.

శ్రీకృష్ణుని ప్రేమించినవారందరిలోను సత్యఆధిక్యాన్ని వహించిందంటానికే మాత్రం సందేహంలేదని నాఊహ.

సత్య సత్రాజిత్తుకు ముద్దులుగురిపించే అందమైన బిడ్డ. ఎండకన్నెరుగక అంతఃపురాల్లో సంచరించేసుకుమారి. ప్రపంచకజ్ఞానానుభవంలేని ముగ్ధసుందరి. రాజకుమార్తె సహజసౌందర్యవతి.

కృష్ణుడు శమంతకమణికోసం సత్రాజితునొద్దకు వెళ్లినప్పు డామణిమయసౌధప్రాంగణాల్లో ప్రకృతిశోభనుమించి సకలనవ్యపుష్పఫలాలతో పచ్చగా నలరారుచున్నవనంలో, చెలులతో విహరిస్తూన్న సత్యనుజూచి ఆమె సౌందర్యానికి ముగ్ధుడైనాడు. సత్యగూడ కృష్ణుని అవలోకించింది. హఠాత్తుగ ఒకరి హృదయం మరొకరిహృదయంలో లీనమైంది. ఒకరిప్రేమ నింకొకరర్థంచేసుకున్నారు. ప్రేమజ్యోతి ఒక్కటిగ యిద్దరిహృదయాల్లో రేకెత్తి అపూర్వకాంతులతో మెరవసాగింది. ఒకరినొకరు ప్రేమించుకున్న హృదయాలు వివాహానికి ఉద్వేగపరిచినై.

కృష్ణుడా ప్రేయసినిపొందటానికనేక వ్యయప్రయాసలకులోనై, కొన్నిజీవాలను తన ప్రేమకొరకు భగ్నంచేశాడు. సత్యగూడ ప్రియుణ్ణిచేరేటప్పు టడ్డంవచ్చిన వ్యక్తిని నాశనంచేయటానికి సంసిద్ధురాలైంది. ప్రేమాన్వేషకులకు తుదికష్టాలు సంభవించినా ఫలితంమాత్రంలభించకపోదు. వివాహమైంది. సత్యాకృష్ణుల ప్రేమలు నాటుకొని చిగిరించి, తీగలై చక్కని పూలుబూసి, సర్వతోముఖముల, సొంపుగ, అల్లారుగ, గంపెడు వాసనలతో ప్రాకసాగినై.

ప్రేమంటే నిజంగ సత్యదేప్రేమ. సత్యంగ, పవిత్రంగ నిర్మలంగ, నిరాఘాటంగ, ప్రేమ డోలికల్లో కృష్ణున్నుంచి వూపినదొక్కసత్యే.

ప్రేమకోసం సర్వస్వం ధారవోసిందిసత్యే. కృష్ణుణ్ని ప్రేమసూత్రంతో హృదయానబంధించేసుకుంది. శృంగారపూరితమగు ప్రేమచే నాతనిలో ఐక్యమొందటానికి ప్రయత్నించింది. అదియే ఆమె నమ్మినమార్గం. సత్య తనభర్తఎడబాటు నిమిషమైనా భరించలేదు. తనసాన్నిధ్యాన్నే వుండాలని తలంపు. ఇది అసూయని కొందరంటారు. తనభర్తే దైవమని, భర్తతప్ప తనకు యితరులుచేరని నమ్మినసత్య భర్తఎడబాటు సహించగలదా? ఈనిస్సారమైన ప్రపంచంలో సారమైనవ్యక్తి ఒక్కకృష్ణుడనియే ఆమె నమ్మకం. అటువంటప్పుడు భర్తసాన్నిధ్యాన్నే వుండాలంటంలో ద్వేషమేముంది? తానునమ్మిన కృష్ణపరమాత్మతో లీనంకావటానికి తొందరపడుటే ముఖ్యంగదా! భక్తుని ఆశయంగూడాఅంతే? ఈశ్వరునితో లీనంకావటానికి తొందరించిన భక్తునిది ద్వేషమేనా? సత్యప్రేమకు ప్రేరేచిన కృష్ణుని భౌతిక సౌభాగ్యాన్ని సర్వదా ఆమె ఆరాధించింది. ప్రేమపారాన్ని ముట్టిన ప్రత్యేకవ్యక్తులపై నిట్టి ఆంక్షలేదు. రసికశేఖరుడై నకృష్ణుని ప్రేమించటానికి, సంతృప్తిపరచటానికి, అతనిలో అంతర్లీనమవటానికి భౌతికభోగాలు చాలా అవసరమనుకున్నది. వనలక్ష్మికి వసంతచైత్రోదయంలాగు శృంగారపేశలమైన సత్యఆకృతి పవిత్ర ప్రేమతో నింపుకుంది.

సత్య ఎల్లప్పుడు సుగంధపరిమళాల్లో తులతూగుతూండేది. రకరకాలైన మల్లెలను, సంపెగలను, జాజులను తన నల్లని బారులు తీరున్న కేశాల్లో చిత్రించుకునేది. చక్కని చీరెలను, కంచుకాలను ఆమె ప్రత్యేకించుకునేది.

ఆమెలోనున్న పవిత్రప్రేమజ్యోతిని గ్రాహ్యంచేసుకొని ఆ అమాయికపు జీవితం సంతృప్తిపెట్టేందుకు, ఆమెపరిసరంలోనే ఎల్లప్పుడు తిరిగాడు. భౌతికము, మానసికము అయినప్రేమలో పరిలోపించినా సత్యసహించలేదు. కృష్ణుడుదగ్గరనున్నంతకాలము, ఆకాలాన్ని అమూల్యంగాతలచుకునేది. కృష్ణుడు దగ్గరవుండబట్టే నరకాసురవధలో తాను స్వయంగా యుద్ధంచేయగలిగింది. మహాయోధురాలనిపించుకుంది. కృష్ణుడే తనదగ్గర లేకుంటే, తనకు ప్రపంచమంతా అంధకారంగా కనుబడి, వివేచనాశూన్యురాలై, అలంకారవిహీనయై, దుఃఖాబ్ధిలో మునిగియుండి విలపించేది!

ఎల్లప్పుడు, భర్తృసాన్నిధ్యాసక్తిగలదై, బేలయై, నారదమునీంద్రులమాట విశ్వసించి పుణ్యకవ్రత మాచరించింది. నారదుడు కలహాన్ని ప్రధానంగాగొని, రుక్మిణీ సత్యల విరోధానికి ఎదురుచూచి, ఆవిధంగా నడిపాడు కధంతాను.

రుక్మిణివచ్చి తులసీదళమిడగానే త్రాసు సమానమైంది. సత్యకంటె రుక్మిణి ఎక్కువని తలంచుట అభిప్రాయభేదమే? కృష్ణునిభక్తులింకెవరైనా తులసీదళమిడినగూడ అదే భావాన్ని చూసేవాడు. సత్యను నిజంగా బేలనుచేసింది ఆకాలంలో నారదుడు, ఈ

యుగంలో కవి. ఒకరికొకరు మరింత తోడై నారు.

పారిజాత పుష్పసందర్భాన సత్య కృష్ణుని నిరసనభావంతో ప్రవర్తించి తన్నింది; అది లోపమని కొందరిభావం.

సత్య కృష్ణునిమీద ప్రసరింపజేసిన ప్రేమ లద్వితీయాలట. స్నేహితురాలిలాగు, భార్య లాగు, యుద్ధాల్లో యోధురాల్లాగు ప్రవర్తించింది. నారదుడిచ్చిన పారిజాతాన్ని రుక్మిణికిచ్చాడని ఎరిగి, కృష్ణుడు ఏభావంతో రుక్మిణికిచ్చాడో? తనమీదచూపించే ప్రేమంతా కపటమైందా? అని తెలుసుకోటానికి సమయ మదేగదాయని యోజించుకుని, ముఖానలేని కోపాన్ని తెచ్చిపెట్టుకొని కృష్ణుడొచ్చేవరకు అలంకారవిహీనగా విచారాన్నభినయిస్తూ శయ్యపై పవళించింది. ప్రణయకోపమని మనస్సులో తెలిసి, పైకట్లాగేయుండి, కృష్ణుడోదార్చటానికి శయ్యని ప్రవేశించిన సమయాన విడిపించుకోడానికి, యత్నిస్తే కాలేమైనా తగులితే దానికీ రాద్ధాంతమంతఎందుకు? ప్రణయావేశంలో కాంతలు ప్రియులమీద లేనిపోని కోపాన్ని తెచ్చుకొని ఆవిధంగా చేయుటం సహజం. అప్పుడు రసికహృదయులైనవారు వాటిని పాటించక ఆహ్లాదిస్తారు. ప్రేమోపాసకులైన మన సత్యా కృష్ణులిద్దరు వీటికి పలుమారులు అభ్యాసపడేఉన్నారు. కనుకనే సత్య మాట్లాడిన కొంటెమాటలు సరసాలైనాయి. తన్నిన తన్ను విలాసమైంది.

కృష్ణునిప్రేమ కాస్పదమైన వ్యక్తికి ప్రేమ సౌందర్యం తెలీదని చెప్పగలమా! ప్రేమలో లోతు తెలియలేక, యౌవనప్రభావం ఉజృంభితమయ్యేటప్పుడు జీవితసౌఖ పడేతపబాటునకు ఆమె కర్ణధారియైనభర్త పరిష్వంగంలో ఒదిగిపోయి, స్వేచ్ఛాగానంచేసింది. కట్టుబాటులలో పడియున్నలోకం, ఆదర్శరూపిణులై వెలుగొందుచున్నవారి దృష్టితో జపనంచేసి చూడబోతే ఆస్వేచ్ఛ నైజస్వభావాన్ని కోల్పోయినట్లు కనుపించింది. సహజస్వరూపంయొక్క సౌందర్యం, సత్యాన్వేషణచేస్తేగాని తెలియదు.

సత్యయొక్క ప్రేమ నిర్మలమైంది, అనిర్వచనీయమైంది. హైందవ సుందరీమణుల కందరికి పతిప్రేమ తత్వాన్ని తెలియచేసి ప్రేమకు మార్గదర్శకురాలైంది సత్య.

భారతీయులందరికిని, ప్రేమమార్గాన్నవలంభింపజేశాడు కృష్ణుడు. ప్రేమవల్ల సతుల నుంచిరాబడే కష్టనిష్టురాలను, వాటిని నివారించుకునేవిధాన్ని తెలియజేసిన మహానుభావుడు కృష్ణుడు.

అట్టి సత్యాకృష్ణుల ప్రేమతత్వాన్ని, గ్రహించలేక సత్యకు కళంకమున్నది. ద్వేషమున్నది అని చెప్పసాహసించువారలకు ఈ మనవి.

# మణి

శ్రీమతి పెద్దిశెట్టి రామంగారు

(అనుబంధకథ)

[మాధవరావు చెన్నపట్నములో వరశుల్క_విరోధోపన్యాసముల నుత్సాహావశమున నిచ్చి, యింటికివచ్చి మణియను పేదపిల్లను వివాహమాడెదనని మాటయిచ్చి ముద్దు పెట్టుకొని, బీచికివెళ్లి సబ్ జడ్జీప్రసాదరావుగారికూతురు, విద్యావతియగు లీలనుచూచి ప్రేమించి మణినిమఱచి, తనకిష్టములేకున్నను తండ్రికట్నమునకాసించి పెండ్లాడవలెనని ఆజ్ఞాపించిన వసుంధరయను వకీలుపుత్రికను పెండ్లియాడెను. మణిని ఆమె మేనమామ కమలాకరునకిచ్చి ఆమెతలిదండ్రులు పెండ్లిచేసిరి కాని, ఆమెకు అతనిపై మోహము లేదు. పెండ్లిఅయిన యిరువదిదినములలో అతను మరణించెను. ఆమెఅన్న కేశవరావు ఆమెకు యెఫ్ఫేవరకుచదువుచెప్పి యల్.యం.పి చదివించుచుండెను.ఆమె కమలాకరుని భర్తగ తలంచలేదు. మాధవరావుపై మోహమును వీడలేదు. వసుంధరపై మాధవ రావునకు మోహములేదు. ఆమెకదే దుఃఖము. అయినను వారికి కాపురముసాగి ఒక కూతురు ఒకకొడుకుపుట్టి పాపమామె మరణించును. మాధవరావుతండ్రి వసుంధర తండ్రికూడ మరణించిరి.]

వసుంధర చనిపోవుటచే ఆమెతల్లి రుక్మిణమ్మ విచారము మరియు వృద్ధిపొందినది గాని పాపమా ఇల్లాలు ధైర్యము తెచ్చుకొని రెండవ కుమార్తెయగు శ్రీలతను చూచుకుంటూ మొగపిల్లలకు చదువు చెప్పించుచు కాలక్షేపము చేయుచున్నది. మాధవరావు తల్లి సుందరమ్మ ఒకదినమున 'నాయనా! నీ యిష్టము వచ్చిన పిల్లను ఎవరినైనా చేసుకొనుము. నీదురదృష్ట మునకు చింతిస్తూకూర్చున్న రెట్లు? ఎవరిగీతఎట్లున్నదో ఎవరుచెప్పగలరు నాయనా' అని సుందరమ్మ అనుటయే తడవుగా 'అమ్మా! సబ్ జడ్జీవారికుమార్తె లీలను పెండ్లి చేసుకొందునా?' అని అడిగినాడు మాధవుడు. 'వద్దు నాయనా, ఆపిల్లవద్దు; అదేమిటి బోగందానివలె నున్నది.

అమ్మా చదువుకున్నవాళ్లు మరి ఫ్యాషన్ గా వుండరాఅమ్మా

ఏమిటినాయనా ? చదువుకున్నయెడల నవనాగ రికతగా యుండవలెనా? చదువుకున్న అంత అనాగ రకతగాకుండా విశేష వేషడాంబికములకు లోను గాకుండా యుండవలెను. చదువుకున్నవారు మంచి బుద్ధి సంపాదించుకొని నవనాగరికతయను పిశాచము నకు వశంగాకుండా యుండవలెను. అంతేగాని చదువు కున్నాంఅని ద్రవ్యమును వేషడాంబికములకు వెచ్చిం చుట పాడియా నాయనా! నా మాటవిను నాయనా అని దీనవదనఅయి పలికినది.

అమ్మా! ఇన్నిఏలి? నేను సంసారసౌఖ్యమును అనుభ వించవలెననియున్న ఈవివాహమునకు అంగీకరింపుము. లేనియెడల ఇట్లనే నేను వుండిపోయెదను అన్నాడు.

తల్లి మారుమాట వచింపలేక సరే నీ యానందమే నాయానందమని వూరుకొన్నది.

ఆదినము సాయంత్రమే మాధవుడు ప్రసాద్ రావు గారి ఇంటికిజని ఆయననుకలుసుకొని ఆమాటయీమాట ఆడినతరువాత లీలను నేను పెండ్లిచేసుకొనుటకు ఏమైనా అభ్యంతర ముండునా అని అడిగినాడు. ఆయన అభ్యంతరమేమియున్నది. నాకుసమ్మతమే నీవుచేసుకొనుట. లీలను తప్పకుండా ఇచ్చెదనని చెప్పినాడు. మాధవుడు అధిక సంతోషముతో లీలను సమీపించి లీలా నీకొరకు వచ్చితిని. నిన్ను నాహృదయపూర్వకముగా ప్రేమించి యుంటిని. నిన్నుప్రేమభిక్ష వేడుకొనుచున్నాను. నన్ను పెండ్లిచేసుకొనుటకు అంగీకరించమని అడిగినాడు. లీల అట్లనే లెండి, అయితే ఎప్పుడు పెండ్లిఅని నవ్వుతూ పల్కినది. లీల సమ్మతించినందుకు ఆనందముతో ఉప్పొంగిపోయినాడు మాధవుడు. లీలా, ఇంకా 17 దినములున్నవి. అని చెప్పినాడు.

ఆవెంటనే ఇంటికివచ్చి తల్లిని అడిగి 4 వేలు తీసుకొనివెళ్లి రెండువేలకు నెక్ లేను తీసినాడు. ఒక వెయ్యిరూపాయలకు మంచిచీరలు లీలకు తీసినాడు. 300 వందలకు రవ్వల లవ్ లక్కులు కొన్నాడు. కొంత సొమ్ము పెట్టి తను మంచినూట్లు కుట్టించుకొన్నాడు. ఆ వున్నసొమ్ముతో కూతురగు మనోరమానికి బట్టలు కొడుకుజనార్ధనరావుకుబట్టలు కుట్టించినాడు. కట్నం లేకుండానే పెండ్లి అవుచున్నదికదాయని కుమార్తెకు మహావైభవముతో పెండ్లిచేసినాడు ప్రసాద్ రావు.

ఇంక మాధవుని ఆనందమునకు అంతులేదు. లీల భార్యయగుట తన పూర్వజన్మ సుకృతమని భావిస్తూయున్నాడు. లీలదినచర్య ప్రొద్దునఏడుగంటలకు లేచుట; మొహము కడుగుకొనుట; వంటమనిషి సిద్ధము చేసిన కాఫీ ఫలహార మారగించుట; అక్కడనుండి శృంగారించుకొనుటకు మొదలుపెట్టుట; ఆముస్తాబు అయినతరువాత రీడింగ్ రూమ్కు వెళ్లుట; తిరిగి 9½ గం సమీపములో ఇంటికివచ్చుట; యీజీచైరులో కొంత వరకు అనగా 11 గంటలవరకు కాలముగడుపుట; చదువుకుంటూ, వంటవాని పిలుపు అందుకొని భోజనమునకువెళ్లుట; భోజనము చేసినతరువాత కిళ్లీనములు కుంటూ ఏదైనా నావల్ చదువుకొనుట; పడుకొనుట; పడుకొని 3 గంటలకు లేచుట ముస్తాబు అయేసరికి కాఫీఫలహారము సిద్ధముచేసి వుంచినవి ఆరగించుట; టెన్నిస్ కోర్టుకు ఏదో ముంచుకుపోవుచున్నట్లు మురళీధరుడను స్నేహితునితో కలసి వెళ్లుట; తిరిగి ఆరుగంటలకు ఇంటిమొహంపట్టుట; భోజనంచేసి సినీమాగాని నాటకంగాని ఏదైనాప్రదర్శనమును చూచుటకువెళ్లుట; రాత్రి 9 గంటలకువచ్చి పవ్వళించుట; ఆమె ప్రతిదినము చేసెడిపని. వసుంధర పిల్లలను కన్నెత్తి చూడదు. పాప మాపిల్లలు వాళ్ల నాయనమ్మదగ్గరనే యుందురు. మాధవుడు, 'మాధవరావుగారి భార్య మాబాగా టెన్నిస్ ఆడుతుందిరా' అని ఒకళ్లు అనుకొనుట విన్నాడు. శరీరం బూరెవలె పొంగిపోయినది. లీలను గులాబిపుష్పము చూచినట్లు చూస్తాడు. ఒక కారుకొన్నాడు లీల షైరువెళ్లుటకు. లీలలేనప్పుడు నెలకి 200రూప్యములు అవుచుండే ఖర్చు ఇప్పుడు 450 రుపాయి లగుచున్నది. ఎక్కడచూచినా పని వాళ్లే. ఆమెబట్టలు అందించుటకు విప్పినవి మడతలు పెట్టుటకు ఒకమనిషి; ఆమె తలదువ్వుకొనుసరికి దువ్వెనా అద్దము సెంటుబాటిల్ తెచ్చుటకు ఒక మనిషి; ఆమె జోడు మేజోడు అందించుటకు, విప్పిన తరువాత తుడిచి జాగ్రత్తచేయుటకు, మరల ప్రక్కఎత్తివేయుటకు ఒకమనిషి; ఇట్లు ఇంటినిండా పని మనుష్యులే.

మాధవుడు ఒకదినమున 'లీలా! లీలా! యీ దినము మణిదేవి అంట L. M. P. చదువుచున్నదంట ఆమెయు; శ్రీలతయనుఆమెఅంట స్కూల్ మాస్టర్ ఇద్దరు వరకట్నము పై ఉపన్యాస మిచ్చెదరట వచ్చెదవాః' యని అడిగినాడు. 'అలాగునే వచ్చెదను ఆజోడు ఇలాగున తెచ్చిపెట్టుడు' అని అనుటతోనే

తెచ్చిఇచ్చినాడు. ఇద్దరు రతీమన్మథులవలె తయారు అయి కారుపైవెళ్లిరి. మణిదేవి ముందుగా పీఠ మలంకరించినది. మణిని చూడగానే ఇన్నిదినములు మణిని మరిచిపోయినవానికి గబుక్కున మణి జ్ఞాపకము వచ్చినది. ఆదినము తాను మద్రాస్‌నుండి వచ్చిన దినమున మణి తన తల్లిదండ్రుల కుటుంబముయొక్క కష్టసుఖము లన్నింటిని తెలియజేసినది. 'ఆహా! నే నెంతటి విశ్వాసఘాతకుడను. అయ్యో! మణిని పెండ్లి చేసుకుందునని చెప్పితినే. ఆమెను ఆశపెట్టి వేరొక ఆమెను చేసుకొంటినే! అయ్యో! నాయంత పాపి యీ ప్రపంచకముపై వుండబోడు. ఈ మణిదేవిని చూడగానే నామణి ముద్దులమణి జ్ఞాపకము వచ్చిన'దని విచారిస్తూయున్నాడు. ఇంకనూ విచారించుచున్న, లీల చూచిన కారణ మడుగును. అప్పుడు తడబడవలెను. అని శ్రద్ధగా వినుటకు కూర్చొన్నాడు. మణిదేవి రెండవదేవివలె ఉపన్యాసము ఇచ్చినది.

పూజ్యులారా! సోదరీసోదరులారా! యీ సభకు నన్ను ఉపన్యాసమిచ్చుటకు నియమించినందుకు యీసభ నేర్పాటుచేసిన మిత్రబృందమునకు నేను వందనము లర్పింపజాలకున్నాను. ఎందుచేతనన ఏపదవికిని ఎంతమాత్రం తగని నన్నా యీపదవికి యింత గొప్పసభకు ఉపన్యాసమిచ్చుటకు నియమించుట! చాలపొరబాటు. జ్ఞానము గాని ధనసంపత్తిగాని విద్యాకుసుమంబు గానిలేని నాబోటి యయోగ్యురాలు యీసభయందు అగ్రపీఠము నలంకరించుటా? ఎంతమంది యో విద్యాకుసుమంబులతో ఆంధ్రమాతను భక్తిమై పూజించెడి కవయిత్రులుండగా, సంఘదౌర్జన్యము సరకుసేయక అనేకమైన సంస్కరణకార్యములు నెరపిన, నెరపుచున్న యువతీమణు లుండగా నేనా యీపీఠ మలంకరించుట? గొప్పవింత! అర్హులెల్లరు తామనర్హులమని చెప్పుకొనుట పరిపాటి అయినందున నా యీరోదన మరణ్యరోదనమే యగును కావున నాయన ర్హతనుగూర్చి యేకరవుపెట్టుట మాని పెద్దల యొక్కయు మిత్రులయొక్కయు ఆజ్ఞ సిరసావహించి యీశ్వరుడగు ఆపరమాత్మకు వందనమొనర్చి యీ పీఠమును స్వీకరించుచున్నాను.

సోదరులారా, మీయొక్క యున్నతవిద్యలను యేమూలపెట్టి మీరు వరశుల్కమును స్వీకరించుచున్నారు? అయ్యో! ఎంతటి వింత. ఎంతటి ఘోరము. ఎంతటి తెలివితక్కువతనము. సోదరులారా! వరశుల్కమనుపేర మనుష్యులను పీల్చి పిప్పిచేయుచున్న యీ వరశుల్కమును స్వీకరించకుండా ప్రయత్నించవలెను. ఎందరో తమతమ ముద్దుబిడ్డలను బి.య్యే. కు ఇవ్వవలెనని ఆశయము లున్న రెండువేల రూప్యములు పోయుచున్నారు. ఆఖరకు వారు తినుటకు తిండిలేక కట్టుటకు బట్టలేక నానా ఇబ్బందులపాలగుచున్నారు. మనసోదరులు ఇట్టి దశనొందుటకు యీ కట్నములే హేతువు. స్కూల్ ఫైనల్ అయిన 5 వందలు, యఫ్‌యే అయిన వెయ్యి, బి. య్యే. కు రెండువేలు యల్ టికి 3 వేలు యీలాగున చదువు ఎక్కువ అయినకొలది కట్నం వేలుకువేలు పెరుగుచున్నవి. ఆ కట్నమును గ్రహించు మహానుభావులు మంచివిద్యను గ్రహించువారే! పోనీ కుంతలనుకుంటే కారే! మంచి విద్యను అభ్యసించినవారే! మళ్లీ వరశుల్కముపేర యుపన్యాసము లిచ్చినవారే! తామే ఆసమయము వచ్చిన చేయిచాపుదురు కట్నంకొరకు. సోదరసోదరీ మణులారా మీకు చెప్పున దేమన, మీమీబిడ్డలకు కట్నము లింతమాత్రం ఇవ్వవలదు. సహోదరులారా మీరు కట్నములు స్వీకరించ వలదు. వలదు. ఆసర్వేశుడు మన ఆంధ్రులకు బుద్ధిని ప్రసాదించుగాక యని ప్రార్థించుచు యీ యుపన్యాసమును ముగించుచున్నాను.

# కోడండ్రముచ్చటలు

శ్రీమతి చిత్రపు సుబ్బులక్ష్మిగారు

శేషమ్మగారికి ఒక్కడే కుమారుడు అగుటవలన చాల గారాబముగా పెంచినది. కుమారుడు పెద్దవాడై బి. ఏ. ప్యాసుఅయినాడు. తండ్రియొక్క హోదానుపట్టి కేశవునకు అనగా కుమారునికి త్వరలోనే వుద్యోగము అయినది. కేశవరావును ఎంతగారాబముగా పెంచినప్పటికి పెంకితనమనేది ఎరుగక తల్లితండ్రుల ఇష్టప్రకారము నడుచుచుండెడివాడు. చిన్నతనమునందే వివాహమగుటవలన భార్యను చూచినట్లుకూడ జ్ఞాపకము లేదు. ఇప్పుడు తండ్రియొక్క అనుమతివలన భార్యను కాపురానికి తీసుకువచ్చారు.

కేశవునిభార్యపేరు రమాబాయి. ఈమె తండ్రి తహశీలుదారు. పదిహేనువత్సరములకే స్కూల్‌ఫైనల్ పరీక్ష ప్యాసుఅయినది. చాల తెలివిగలది. ఈకాలపుపిల్లే. మంచి రూపసి. సంగీతము చాలాబాగాపాడుతుంది. తండ్రి 15 సంవత్సరములకే కాపురానికి పంపించినాడు.

రమ కాపురానికి వెళ్లిన నెలదినములకు మామగారు గతించినారు. రమ వెళ్లినది మొదలు అత్తగారికి పోరుగనేయున్నది. కుమారుడుకూడ తల్లికివ్యతిరేకముగా భార్యవైపు తిరిగినాడు. ఇప్పుడు అత్త శేషమ్మ ఒక్కత్తి అయినది. కోడలును కోడంటము పెట్టాలని మహాసరదాగా వుండేది. తనమాట ఈకాలపు కోడళ్లదగ్గర సాగిద్దామంటె యెట్లా సాగుతుంది ?

రోజూ ఇంట్లో అత్తగారె వంటవండడము. ప్రొద్దున్నలేచి అత్తగారు కాఫీ కాస్తుంది. కోడలు నెమ్మదిగ 7 గంటలకు లేచి దంతధావనము అయినతరువాత అప్పుడు కాఫీ త్రాగుతుంది. కాఫీ త్రాగకముందే రమ Morning walk కు వెళ్లుట అలవాటు. కాఫీ త్రాగి స్నానమైనతరువాత తలదువ్వుకుని Easy chair (పడకకుర్చీ)లో కూర్చుని గంటన్నరవరకు పేపరు చదువుకుంటుంది. పేపరు పూర్తిఅయ్యేసరికి భర్త స్నానముచేసివచ్చి పేపరులోవుండే important news (ముఖ్యవిషయములు) అడుగుట ఈమె చెప్పుటయు జరుగుచుండును. ఇంతలో అత్తగారు అన్ని తయారుచేసి భోజనమునకు పిలిస్తే "వుండవమ్మా, నీకు యెప్పుడు తిండే" అని రెండు కేకలువేసి మరి అరగంటకి భోజనమునకు వెళ్లును. ఒకవేళ భోజనములో యేమైన లోటువస్తే అన్నము నేలకేసికొట్టి భోజనము నుండి లేచిపోవడము. కొడుకు, కోడలుని యేమి అనడని కోపము మహాజాస్తీగా వుండేది. కాని యేమిచేయగలదు ? కొడుకు కూడ భార్యను వెనుకవేసుకుని పోట్లా

టకు వస్తాడు. ఇహ భోజనములయిన తరువాత ఇద్దరు Dressing Room (డ్రెస్సింగ్ రూమ్) లోనికి వెళ్ళుదురు. భర్త Dress వేసుకుని ఆఫీసుకు వెళ్ళగానే తాను తనగదిలో కూర్చుని రెండుగంటలుచదువుకుని కొంచము సేపు నిద్రపోయి లేచి సాయంకాలమున Evening dress వేసుకుని క్లబ్బుకు వెళ్ళుతుంది. కొడుకు కోడలు వెళ్ళినతరువాత, కొడుకు, కోడలుసంగతులు ప్రక్కింటి అమ్మలక్కలతో చెప్పుట ప్రారంభిస్తుంది. సాధారణంగా కేశవరావు ఎనిమిదిగంటలు కాగానే ladies' club కు వెళ్లి భార్యను కలుసుకుని ఇద్దరు కలిసి ఇంటికివత్తురు. ఈమధ్య ఏవైన మంచి సినిమాలువస్తే సినిమాకు వెళ్లి తొమ్మిదిగంటలకు ఇంటికి వత్తురు. వారు తిరిగి ఇంటికివచ్చేవరకు అత్తగారు కనిపెట్టుకుని కూర్చోవలసినదే. అట్లు చేయనియెడల కొంపమునిగింది అన్నమాటే. ఇహ ఇంటికి రాగానే భోజనముచేసి వారిరూములోనికి వెళ్ళుదురు. అప్పుడు నెమ్మదిగా అత్తగారు భోజనముచేసి ఆయాసపడుతూ తిట్టుకుంటూ నెమ్మదిగా పనిచేసుకుని 10 గంటలుకి పడుకుంటుంది. ఈవిధముగా రోజు జరుగుతూ వుంటుంది. అత్తగారు సాధారణంగా పని చేయలేనప్పుడు కోడలుని ఒకతిట్టు తిట్టి కోడలుచేత పదితిట్లు పడుతుంది.

ఒకరోజు మధ్యాహ్నము రమ Easy chair లో కూర్చొని పేపరు చదువుతుండగా ఆమెయొక్క Dearest friend (ప్రియస్నేహితురాలు) అగు లీలవచ్చి రమ వున్నదా అని అడిగినది.

Leela come here (లీలా ఇచ్చటికిరా)

Good morning, my dear Rama, When have you come. (ఎప్పుడువచ్చితివి.)

Just now (ఇప్పుడే)

What's the news (విశేషములు యేమిటి ?)

Do you know Rama? The next Andra provincial women's conference will be held at Ellore. I will be going there as a delegate (నీకు తెలియునా. ఈతేప ఆంధ్రమహిళాసభ ఏలూరులో పెట్టుదురు. నేను వెళ్లుదును.)

Yes. I simply heard. Who is the president? అవును నేనువింటిని ప్రెసిడెంటు యెవరు ?

Dr. (Mrs) Muthulakshmi Reddi. We must hear her beautiful, melodious, ironical and splendid speeches (మనము తప్పకుండ ఆమెయొక్క మృదువైన లెక్చర్లను వినితీరవలెను.)

Did you ever hear her speeches? (నీవు యెప్పుడైన ఆమె లెక్చర్లను వింటివా?

Many a time n Madras. (చెన్నపట్నములో చాలసార్లు వింటిని.)

When will you go there. I will also accompany you. We must attend there on the fixed date. (నేను కూడా నీతో వత్తును. నీవు యెప్పుడువెళ్లుతావు. మనము ఆరోజుకి వెళ్లుదము)

**I am leaving this place on 12th by the evening mail. Tomorow I will come here and both of us can go to the station. I am going** (నేను 12.వ తారీకున సాయంకాలపు రైలులో వెళ్ళుదును. నేను ఇక్కడకువత్తును. మనమిద్దరము కలిసి స్టేషనుకు వెళ్ళుదుము.)

**Yes. good bye.**

**Good bye** అని వెళ్లిపోవును.

మరునాడు భర్తయొక్క అనుమతి తీసుకుని అయిదురోజులలో వత్తునని చెప్పి రమాబాయి వెళ్లిపోయినది.

ఆరోజున కేశవుడు భోజనముచేసి ఆఫీసుకు వెళ్లినాడు. శేషమ్మగారు భోజనముచేసి పనిఅయ్యేటప్పటికి లీలావతియొక్క అత్తగారగు వెంకమ్మగారు వచ్చిరి. వారి, లోకాభిరామాయణములో వారి కోడండ్ర ముచ్చటలు వచ్చినవి.

వెంకమ్మ.—శేషమ్మగారు, మీకోడలు యెక్కడకు వెళ్లినదండి?

శేషమ్మ:—అదేమిటో మీటింగుట. అక్కడకువెళ్లినదట. నాతో మా అబ్బాయి కూడ చెప్పలేదండి. బయట మా అరుగు మీద కూర్చుని యెవరో అనుకుంటుంటె విన్నాను. నేను వింటాననికాబోలు మీకోడలువచ్చి ఇంగ్లీషులో పాన్ పీస్ అనుకుంటూ మాట్లాడి వెళ్లిపోయినది. ఇప్పటి వాళ్లకు యేమిపొయ్యేకాలము వచ్చిందండీ?

వెంకమ్మ:—నేను కూడా అట్లాగే విన్నాను: ఈకాలపు కోడళ్ళు యేమి కోడళ్ళండి. పోనీ వెళ్లేటప్పుడు వెళుతున్నాననీనా చెప్పవద్దండి. మొగవాడిలాగా ఆడదానికి కబ్బులు మీటింగులు యేమిటండి? ఎవరన్నవింటె చెప్పుతీసుకుని తంతారు. మన కాలంలో ఇవియేమైన ఎరుగుదుమ? లేని పోని మీటుంగులంటె తెలుసా? క్లబ్బు అంటే తెలుసా. ఒక్కచెంబునైన ఇక్కడిదితీసి అక్కడపెట్టరు. పైగా మన మీద అథార్టీ చేస్తారు. అదేమిపాపమండి, మనముమాత్రము మనుష్యజన్మమెత్తినవాళ్ళముకామండి. అందులో ముసలివాళ్ళము కదా. ఇంతపని యెట్లా చెయ్యగలము? ఒకపనిఅయిన చెయ్యక పైగా మనమీద అథార్టీ చెయ్యవస్తారు? మనము ఒకటంటె వాళ్ళు పదిఅంటారు. ఎక్కువ మాట్లాడితే ఇంట్లోంచి పొమ్మంటారు. ఈకాలపు కోడళ్ళకు అత్తగారులేకుండావుండాలని వుంటుంది. మనము చావనన్నా చచ్చాముకాదుగదా? మనము పూర్వకాలముచేసుకున్న పాపము ఇప్పుడు అనుభవిస్తున్నాము. వీళ్లకి యెంత పొగరువున్నదండీ యెప్పుడు తలదిద్దుకోవడమేకదా. భోగంవాళ్లకన్న మించిపోతున్నారు. చదువుతప్ప మరియొకగొడవేలేదు. మగవాండ్రకొరకు వచ్చినట్లు టక్కుటిక్కు అంటూ చేతులో వకతోలుసంచిపెట్టుకుని లీలవున్నదా అని అడిగిపోయేవాళ్లేకదా. మనకాలంలో ఇల్లా ఎప్పుడన్నావున్నదండి శేషమ్మపిన్నిగారు. ఇటువంటికోడండ్రు వస్తారని కలలోనైన అనుకోలేదుగదా? ఏదో, కోడళ్ళువచ్చి సుఖపెడుతారనుకుంటే వ్యతిరేకముగా చేస్తున్నారుకదా? మనకాలములో

ఎప్పుడు వంటచేయడము తదితర పనులు
చేసుకోవడమే కాని ఇవిఅని మనమెరుగు
దుమా? అందులో అత్తగారింటికి వెళ్ళితే
ఎంత జాగ్రత్తగా వుండెవాళ్లమండీ? ఇప్పటి
వాళ్లకి ఈ గోలేలేదు. పైగా నలుగురు
నౌకర్లు చేతిక్రింద పనిచెయ్యాలి. నౌకర్లు
లేకపోతే పోకుకాదట. మనకి వాళ్లకి భేదమే
లేదుకదా. పునిస్త్రీ పడుచుకు వుండవలసిన
లక్షణము లేలేవు. కాలికి మెట్లేలేదు.
మొహాన్న బొట్టూలేదు. మెడని నల్లపూసలు
లేవు. ఇహ భేదమేముంది? మా లీలమ్మ
తల్లి కాపురానికి రాకమునుపు మారాఘవుడు
గడపదాటనుంటె దాటి మా మాటఅంటే
ఎంతవిలువు చేసేవాడండీ? ఈఅమ్మతల్లి
వచ్చినదిమొదలు మందుపెట్టినట్లు మనమంటె
గిట్టదు. పైగా భార్యను వెనకవేసుకుని నా
మీదికి పోట్లాటకి వస్తాడు. ఒక్కసారైన
"అమ్మా" అని మనస్సుపూర్తిగా పిలవడు
కదా? ఇంటికి వచ్చినదిమొదలు పోట్లాటే.
ఈ ఘటము యెట్లావెడుతుందో తెలియ
కున్నది. ఎక్కడికి వెళ్లినా పోటోలుతీసె ఒక
తోలుపెట్టి వీళ్లచేతులో వుండవలసిందే?
వీళ్ళు మగవాడిలాగా అందరికి పోటోలుతీసి
డబ్బు గణిస్తారా? కాలము యెట్లా మారి
పోయిందండి. ఒకనిమిషమైన ఇంట్లో వుండరు
కదా! మీటింగులకొరకు యెవరైన ఇంత
దూరదేశములు వెళుతారా? ఒక మగపీను
గైన వెళ్లకుగదా. వీళ్లమీటుంగులు నేల
బడా. యెంతంత దుర్మార్గపు పనులు చేస్తు
న్నారండీ! వీళ్లకి మనలను అత్తగారని చెప్పు
కుంటే సిగ్గుఅట. వీళ్లవలన మనఅబ్బాయిలు
కూడ చెడిపోయి మనమాటే వినరు. మన
మాటవింటు మరొకకోడలనైనను తెచ్చుకో
వచ్చును. యెప్పుడు భోగందానిలాగా సంగీ
తము పాడడమేకదా? అహా! ప్రపంచిక
ములో పాపము యెట్లో పెరుగుతోంది!
ఇంటిలోకూడ చెప్పులు తొడుగుకుని నడ
వడమే కదా? ఈ వింత విన్నారు! మొన్న
ఒకరోజున మాలముండలను లోపలికితీసుకు
వచ్చారండీ. నేను మనస్సులో యెంతదుఃఖ
పడేది పరమేశునికితెలుసు, నాకుతెలుసు!!
మా అబ్బాయివచ్చేవేళ అవుతోంది నేను
ఇంక ఇంటికివెళుతాను. లేకపోతే యెక్కడికి
పోయావని తిటుతాడు. అని లేచెను

శేషమ్మ:—నాగొడవలాంత మీ గొడవ
లాగునే వున్నది. కొంచముకూడ భేదము
లేదు. నేను యెవరితోను మాట్లాడకూడదట.
వాళ్లభార్యలు మగవాడితోను ఆడదాని
తోను సమానముగా మాట్లాడవచ్చును.
తప్పులేదట. మనము మాట్లాడితే తప్పట.
మనము బతికి యేమిప్రయోజనమండి.
మనము చస్తే కర్మకూడ చేస్తారో చెయ్యరో
కదా? వాళ్ళు ఇంటిలోలేకపోతె నాకు
సుఖముగావుంటుందండి. వచ్చినప్పటినుండి
పోట్లాటేకదా? మా అబ్బాయి వచ్చేవేళ
అయింది. ఇంకమీరు ఇంటికివెళ్లండి. చూస్తె
యేమి చెప్పుకుంటున్నారని తన్నడానికి సిద్ధ
మవుతాడు. నేను ఆలస్యముగా వెళ్ళితె
నాకు సాపనార్థాలేకదా? అని వెంకమ్మగారు
వెళ్లిపోవును. శేషమ్మ నడుమువాల్చి నిద్ర
పోవును.

# ఉపన్యాసము

శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు

స్త్రీ హితైషిణి మండలియొక్క, చతుర్థవార్షికోత్సవమునకు అధ్యక్షురాలినిగ, నన్నాహ్వానించి, మీ కార్యక్రమములో పాల్గొనుటకు, నాకవకాశమిచ్చినందులకు, మీకు నా హృదయపూర్వక నమస్కారము లర్పించుచున్నాను. ఇట్టి ఉన్నతపదవి నధిష్ఠించుటకు, నాకు యోగ్యతలేకున్నను, మీరు నాయందలి ప్రేమచే, నన్నాహ్వానించిరని; తలంచుచున్నాను. నేనిది అంగీకరించుటకు మొదట సంకోచించినను, మీలో బహుమంది నాకు చిరపరిచితులగుటచే సాహసించి అంగీకరించితిని. మీరందరును నాయెడ, సోదరీవాత్సల్యముజూపి, ఈకార్యము నిర్వహించుటకు తోడ్పడ ప్రార్థించుచున్నాను.

మానవజాతిలో తీవ్రమయిన మార్పులు, అతివేగముగ, జరుగుచున్నవి. ఇతరదేశములయందు స్త్రీలలో అభివృద్ధి తీవ్రముగ జరుగుచుండగా, మనదేశములో స్త్రీలింకను పూర్తిగ మేల్కొనలేదు. ప్రస్తుతకాలమునకు తగిన మార్పులను జెందక, కృతయుగమునాటి ఆచారములను అనుసరించి, మూలకూర్చుండుటయు సరికాదు. దారి తెన్ను తెలియక, క్రొత్తవిషయములన్నియు మంచివేననియు, ప్రాతవన్నియు పనికిరావనియు భావించి సంఘమును తలక్రిందులుచేయనూకూడదు. పూర్వాచారములలో, జాతీయతను విడువక అభివృద్ధికి అవసరమయిన క్రొత్తమార్పుల కడ్డపడక, పూర్వపద్ధతులకును, ప్రస్తుతపద్ధతులకును, సమన్వయము కూర్చుకుని, నిదానముగ ముందడుగువేయుచుండవలయును.

## విద్య

అభివృద్ధికి విద్య మూలకారణము. విద్యయనగా కేవల గ్రంథపఠనమే కాదు. చదువను వ్రాయను నేరకున్నను పండితులని పిలుచుటకు అన్నివిధముల తగినవారు, మనలో యెందరో యున్నారు. చదువనేర్చినను లోకజ్ఞానమెరుగనివారు యెందరో కలరు. లోకానుభవమువల్లను, పురాణాది శ్రవణమువల్లను జ్ఞానము పెంపొందగలదు. మీసంఘములో పత్రికలు మొదలగునవి చదువుటయేగాక ఉపన్యాసములవల్లను, చర్చలవల్లను జ్ఞానమభివృద్ధిచేయుచున్నందుకు సంతసింపవలసియున్నది.

## స్త్రీల వారసత్వపు హక్కులు

స్త్రీలకు సంబంధించిన కొన్ని సంస్కరణల విషయమై కొందరికి అభిప్రాయభేదములుండవచ్చును. కాని స్త్రీజాతిని, దుర్భరపారతంత్ర్యమునుండి తొలగించుటకు స్వతంత్ర జీవనాధారమే ముఖ్యసాధనము. ఇప్పటి యేర్పాటుప్రకారము స్త్రీలకు జీవనాధారము వివాహమే తల్లిదండ్రులాస్తిలో, స్త్రీలకేమాత్రమును భాగములేకుండుటచే, వివాహమే జీవనాధారముగ పరిణమించినది. తలిదండ్రులు కొంపలమ్మియైన కొడుకులకు చదువుచెప్పింతురుగాని కూతుండ్ల చదువునకై వెచ్చించ వెనుదీయుచున్నారు.

అందువలన స్వశక్తివల్ల ఆర్జించుకొనుటకు నీళ్లు మోయుట, వంటజేయుట, అటుకులుదంపుటకంటె మరియొకమార్గము కనుపడకున్నది. తల్లిదండ్రులాస్తినుండి కొంతభాగము నిచ్చునెడల తప్పక చదువుకొనుటకును, స్వతంత్రజీవనముల స్థాపించుటకు, కొంత మూలధనము కలిగియుండుటకును, అవకాశముకలుగును. కాబట్టి తల్లిదండ్రులఆస్తిలో భాగరీత్యా హక్కు కలిగియుండుటకు క్రొత్తచట్టము ఏర్పడవలసియున్నది. దానికై అందరును ప్రయత్నించవలయును

## స్వార్జిత హక్కు

కుటుంబవ్యవహారముల నిర్వహించుటలో యావజ్జీవితమును భర్తతోబాటు భార్యయును శ్రమపడుచునే యున్నది. భర్త గృహముయొక్క వెలుపలను, భార్యగృహమందును సమానముగనే పాటుబడుచున్నారు. సంపాదనయంతయు భర్తకు స్వార్జితమే. భార్యకు వంటకత్తెకు వచ్చులాభముకూడ లేక, పొట్టకూటితో సరిపుచ్చబడుచున్నది. భర్త సంపాదననుండి భార్యకు తగినభాగము హక్కుకలిగియుండుటే న్యాయమును అవసరమును అయిఉన్నది.

## గృహిణి

స్త్రీ, గృహిణియనుటే వాస్తవమును సమంజసమును అయిఉన్నది. కాని స్త్రీయొక్కధర్మములు యింటిహద్దులను దాటగూడదనుట మిక్కిలి సంకుచిత భావము. స్త్రీ తనబుద్ధిని విద్యాదులవల్ల వికసింపజేసుకొని సంఘముయెడలను, దేశముయెడలను తనకుగల ధర్మములను తెలుసుకొని త్యాగముతో, తనధర్మములను నిర్వహించి, తనజన్మను సార్థకపరుచుకోవలెను. వంటయిల్లే మనకు మోక్షమని, భావింపరాదు. విశాలధర్మములను స్త్రీ అవలంబించవలసినప్పటికిని, తన గృహధర్మములను మాత్రము, మరువకూడదు. మనలో నిప్పుడు సాధారణముగ నొక పొరబాటు జరుగుచున్నది. చదువువచ్చినంతమాత్రమున చాలమంది తమగృహధర్మములమరచి తాముపనిచేసికొన్నను, లేక అందరితోకలసి మెలసియున్నను తమదర్జాకు భంగమని భావించుచున్నారు. అందువలన స్వర్గతుల్యముగ నుండవలసిన గృహములు కల్లోలముకలిగి పాడగుచున్నవి. స్త్రీ విద్య గ్రహించినందుకు తన గృహధర్మములను, యెక్కువ సమర్థతతో నిర్వహించినప్పుడే, తనవిద్య సార్థకమయినట్లు భావించుకొనవలయును. తనగృహములోనివారికి సేవచేయజాలనివారు సంఘమునకును, దేశమునకును సేవచేయుదురనుట కల్ల. విద్యాధికులయినచో స్త్రీలు తమగృహధర్మములు వదలివేయుదురని చాలమంది, స్త్రీల ఉన్నతవిద్యకు విముఖులైయున్నారు. ఉన్నతవిద్య నభ్యసించిన కొందరు సోదరీమణులు యిట్టి ఆక్షేపణలకు తావిచ్చుచుండుటయును కలదు. అది సత్యమయినను కాకున్నను అట్టి అపవాదులకు మనవారు చోటియ్యకుందురుగాక యని కోరుచున్నాను.

మరియు విద్యాలయములలో ప్రస్తుత మవలంబించబడుచున్న విద్యావిధానముమాత్రము స్త్రీలకు బొత్తిగా పనికిరాదు. చదువురాకపోవడమునకంటె ఏదో చదువు రావడము మేలేగాని ఆచరణలోనికి పనికిరాని వట్టి చదువువల్ల ప్రయోజనముమాత్రములేదు. ఉన్నతభావములు కలిగినంతమాత్రముతో చాలదు.

వాటిని ధైర్యముతో, సాహసముతో ఆచరణలో పెట్టగలశక్తికూడ సంపాదించుకొనవలయును. అట్టిదే నిజమయినవిద్య.

ఇప్పటికే ఎక్కువకాలమును తీసుకొన్నాను. ఇదియును, ఇతరవిషయములును యోచించి తీర్మానములు చేయవలసియున్నవి. మీరందరు కార్యక్రమమునకు ఏగవలయునని ప్రార్థించుచున్నాను.

# స్త్రీలు — వ్యాయామ విహారస్థలములు

శ్రీమతి పి. రాజమ్మగారు

(క్లబ్బులు)

వ్యాయామవిహారస్థలములు (Recreation clubs) ప్రతి నాగరికత పట్టణమందు, స్త్రీలకువేరుగను పురుషులకు ప్రత్యేకముగను ఏర్పరుపబడియున్నవి. సాధారణముగ ప్రతినగరమందును పురుషులకుగాను యిట్టి స్థలములు నిర్మించియున్నారు. నాగరికత గల పెద్దపట్టణములందు స్త్రీలకుగాను ప్రత్యేకించి, వెలయుచున్నవి. ఈక్లబ్బులలో జరుగు దినచర్య శరీరవ్యాయామక్రీడలు, (బంతులు, చదరంగము) వార్తాపత్రికలు చదువుట, అప్పుడప్పుడు ప్రముఖులచే మత సాంఘిక, రాజకీయ యుపన్యాసములను జరుపుట ఇవి సామాన్యముగా స్త్రీ సంఘములును పురుషులును యీ స్థళములలో జరుపుచుండుట యలవాటు. ఉదయము 7 నుండి 10 గంటల వరకు పత్రికలపఠన సాయంకాలము 4 నుండి క్రీడలు, యుపన్యాసములను జరుగును.

స్త్రీకిని పురుషునకును, భగవంతుడు ప్రకృతిలోనే ప్రతివిషయమునందును భేదము కల్పించియుండ స్త్రీలు వారి స్త్రీధర్మమును మఱచి పురుషులతో సమానహక్కుల గోరుచు వారివలె విహరింపవాంఛించుట చూడ పులినిచూచి నక్కవాతవెట్టుకొనిన సామ్యమును చాటుచున్నది. పురుషులతో పాటె స్త్రీలకు క్లబ్బులను నేర్పరచి వారి పద్ధతుల నవలంభింప యాశించుట స్త్రీల స్వాతంత్ర్యవాంఛకు తోడ్పడుచున్నను పురుషులకుగాను ఏర్పరచినకాలము (వ్యాయామ క్రీడలకు) స్త్రీలకుతగునా తగవా అని ఆలోచింపవలెను. అదే కాలము ననుసరించుటవలన స్త్రీలక్లబ్బులు (సంస్థలు) పురుషుల క్లబ్బులవలె అభివృద్ధిపొందుటకు వీలున్నదా? పురుషులవలే స్త్రీలు ప్రతినిత్యమును యీక్రీడలకు పోవుచున్నారా? వీలగునా యోచింపవలెను.

మన దేశమందు పురుషుడు ధనమార్జించుటయు స్త్రీ ఆహారపదార్థములను సమకూర్చి గృహకృత్యముల నిర్వహించుటయు యాచరమైయున్నది. ఐనను యిరువురు పని చేయుకాలము వేరు. పురుషుడు పనిచేయు కాలము సాధారణముగ వుదయము పది గంటలనుండి సాయంత్రము 5 వరకు అనగా స్త్రీ విశ్రాంతి పొందుటకును వ్యాయామ క్రీడలుగాని వుపన్యాసములు వినుటకుగాని చేతిపనులునేర్చుకొనుటకుగానితగినకాలము. స్త్రీలకు గృహకృత్యములు వుదయమునుండి 11 గంటలవరకును సాయంకాలము నాలుగు నుండి రాత్రివరకును నెరవేర్చవలసియున్నది. స్త్రీ పురుషులు తమ నిత్య ధర్మములు నెరవేర్చవలసిన కాలమునకు యింతభేదముండగా క్లబ్బులకు పోవుటకు ఒకేసమయము ఒకే పద్ధతి మీాద నడుపయత్నించుట యెంత

1935 ఆగస్టు ఉద్యానవన పోటీపరీక్షలో గెలుపొంది
బహుమతి బడసిన కేసరికుటీరం, బెంగుళూరు



సింహద్వారము

# స్త్రీలు — వ్యాయామ విహారస్థలములు

శోచనీయము !! నేను ఒకటిరెండు పర్యాయములు స్త్రీల క్లబ్బులకు నామిత్రులతో పోయియుంటిని. అచ్చట గమనింపదగిన దేమనగా నామిత్రురాలును మరియిద్దరును తప్పయెవరునులేరు. అదిఎటువంటిసమయము? భర్తలు వారివారి పనులనుండి గృహమునకు తిరిగివచ్చుట బాలురు పాఠశాలనుండి ఆకలితో యింటికి వచ్చుట శ్రీమంతుల యిండ్లకు నౌకరులు వంటవారువచ్చి పనిచేయువేళ పిల్లలుపాలకు ఏడ్చువేళ పెద్దవారు యింటిలో వంటకారంభము చేయువేళ. ఇన్నిపనులను వదలి యేహిందూవనిత క్లబ్బులకుపోవ సమకట్టును? అన్నిటినితోసి పుచ్చిపోవ యత్నించును. అచ్చట ఆమెనేర్చుకొనునదేమి? బంతియాటలు పత్రికలు చదువుట విశేషించి వచ్చినవారితో వృధా కాలక్షేపముచేయుట పై యంశములు స్త్రీల అభివృద్ధికిగాని గృహకృత్యనిర్వహణమునకు గాని శిశుసంరక్షణమితవ్యయము పరిపక్వమైన వంటలుచేయు విధానమునకుగాని ఎంత మాత్రము సహాయభూతము కాజాలవు. అయితే మనహిందూదేశమందుగూడ పురుషులవలె యుద్యోగముచేయు స్త్రీలున్నను వారు నూటికి యిద్దరుగూడ యుండరు. ఒకవేళ పాఠకు లెవరైనను యీక్లబ్బు విదుషీమణులకును శ్రీమంతులకు యేర్పాటు చేయబడినదిగాని సామాన్య స్త్రీజనమునకుగాదని యభిప్రాయపడిన యీక్లబ్బులు ప్రత్యేకముగ విత్తమువెచ్చించి నిర్వహించుట అనావశ్యకము. ఏలననగా శ్రీమంతులకు వారిప్రాకారములయందును విదుషీమణులకు వారికళాశాలలయందును పాఠశాలలయందును శరీర వ్యాయామక్రీడలకుతగు సదుపాయములు ఏర్పాటుచేయబడియున్నవి. కావున యీ క్లబ్బులు సర్వజనోపయుక్తముగ యుండవలెనను వాంఛపై నాధారపడియున్నదని మనము గ్రహింపవలెను. సామాన్యస్త్రీజనమును నాగరికులగాజేయుట కుద్దేశింపబడినవని తలచుట సమంజసముకాదు. ఏలననగా బంతియాట పత్రికలుచదువుట స్త్రీలను నాగరికులగజేసి యభివృద్ధి తేగలిగినచో మన దేశమందు స్త్రీలు యితరదేశములందువలె యున్నతపదవికివచ్చి యభివృద్ధిగాంచియుందురు. కాని ప్రతిఫలము వేరుగయున్నది. ఇప్పుడు విద్యావతులగు స్త్రీలు క్లబ్బులకుపోవు నుత్సాహముతో యింటివద్ద శిశువులను వదలి సంసారములను గృహకృత్యములను నౌకర్లకప్పగించి సమయ సందర్భములలో తమ పొట్టకైనను రుచియగు ఆహారపదార్థములను చేసుకొను శక్తిలేక పూటకూటి యిండ్లపై (హోటల్లపై) నాధారపడి ధనమును ఆరోగ్యమును పాడుచేసుకొనుచున్నారు గదా?

ఇంతవరకును స్త్రీలు నిర్వహించుచుండు క్లబ్బులలోని లోపములను గురించి వివరించియుంటిని. పై సంచికయందు యీక్లబ్బులను యెట్లునిర్వహించి సర్వజనోపయోగముగ నుండి స్త్రీలను వారినాగరికతను అభివృద్ధికి తేగలుగునో విన్నవించెద.

౧

నన్ను వంచించువా రేరీ లోకాల
నన్ను కుంచించువా రేరీ !—
ఆకాశవీథుల్లో
హార్మ్యాలు గట్టేను ;
గగనకుసుమాలెన్నొ
గంపలలో కోశాను ;—
నన్ను వంచించువా రేరీ లోకాల
నన్ను కుంచించువా రేరీ !—

౨

చందమామనుగూడి
సరసంబు లాడేను ;
తారకాతతిమధ్య
'తళతళల' మెరిసేను ;—
నన్ను వంచించువా రేరీ లోకాల
నన్ను కుంచించువా రేరీ !—

౩

పక్షినై యాకాశ
పథమంత దిరిగాను ;
సుమమునై లోకాలఁ
సురభీకరించాను ;—
నన్ను వంచించువా రేరీ లోకాల
నన్ను కుంచించువా రేరీ !—

౪

భావడోలికలలో
బహువిహారించేను ;
ఊహాప్రపంచాన
నుత్కంఠఁదిరిగేను ;—
నన్ను వంచించువా రేరీ లోకాల
నన్ను కుంచించువా రేరీ !—

౫

ప్రణయలోకమునంత
పరికించి చూచేను ;
కనరానిప్రియురాలి
కౌగిలిలో జిక్కేను ;
నన్ను వంచించువా రేరీ లోకాల
నన్ను కుంచించువా రేరీ !—

# స్త్రీ యెట్టివిద్య నేర్వవలయును

అయుతం. హైమవతమ్మగారు

స్త్రీ తన స్త్రీజాతి స్వభావమును వ్యక్తిత్వమునుగాపాడుకొనువిద్యను నేర్వవలయును. ఏవిద్య స్త్రీజనమునకు సహజాలంకారమగు లజ్జను, గౌరవమును నశింపఁజేయునో, యే విద్య స్త్రీజనసహజమగు వాత్సల్యము, శాంతము మొదలగు సద్గుణముల విధ్వంసముచేయునో, యేవిద్య మానవలోకమునకేగాక, దేవలోకమునకుగూడ దైవత్వము నాపాదింపఁజేయు పాతివ్రత్యశీలమునకు వ్యతిరేకమైయుండునో, యట్టివిద్య నేర్చుటకంటె, యెచ్చటనో విద్యాహీనయై కాలముఁగడపుట యుత్తమము. అయినను నేఁటి స్త్రీ విద్య మిక్కిలి క్లిష్టసమస్యయై యున్నది. ఏమన, పరిపాలకులు పరదేశీయులుగను, పరిపాలితులు స్వదేశీయులుఁగ, నున్నారు. వారిభాషకును వీరిభాషకును, వారి యాచారములకును వీరియాచారములకును, సహస్రవిధముల భేదముగలదు. అట్టియెడ సరళయు, అమాయికయునగు స్త్రీ, తన విద్యాభ్యసన దీక్షయందు సందిగ్ధావస్థయందుబడి, యొక్కొకసమయమునఁ గళంకమునుకూడ దెచ్చికొనుచున్నది. అవలంబింపవలసిన విధానము, నేర్వవలసినవిద్య, నడువవలసిన మార్గము, చేయవలసిన కర్తవ్యమును సామాన్య మేధాశక్తిగల స్త్రీ యెఱుంగక యున్నది. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అను పవిత్రవాక్యముల ననుసరించి, తనదేశగౌరవమును, తనదేశాచార సాంప్రదాయములను, నిలుపుకొనుచు, మాతృభాషయందు అభిమానముగలిగి తనదేశకాల పరిస్థితుల గమనించి, పరిపాలకుల నరసి, వ్యవహారదక్షతకొఱకు, కొన్ని నవీనపద్ధతుల గూడ గుర్తెఱుంగవలయును. అందులకై మాతృభాషతోపాటు రాజభాషను నేర్వవలయును. అందు విజ్ఞానము సంపాదింపవలయును. వివేకదృష్టితో నందలి మంచిచెడ్డలను గమనింపవలయును. ఈ కారణములచే హైందవవిద్యాశిక్షణముతోపాటు పరదేశీయ విద్యనుకూడ నేర్వవలయును. అయినను, మనదేశాచార సాంప్రదాయములను మనజాతిత్వమును వెల్లడిచేయు సుగుణములను, ప్రాణాపాయ సమయమునగూడ విసర్జింపఁదగదు. మనము రాజవిద్యాశిక్షణమునంది, వారి నవీననాగరకత, ఆచారవ్యవహారములు అవలంబించుట మిక్కిలి యవమానకరమైన విషయము. ఇంగ్లండుదేశమున పుట్టిన, యాంగ్లేయుఁడు భారతసాంప్రదాయముల ననుసరించి వస్త్రధారణమును, తిలకధారణమును గావించి మెలఁగువానిని మనము చూచియున్నామా? లేదు, దీనిచే

వారెట్టి బలవద్హృదయులును దేశగౌరవదీక్షా పరులునునైయున్నారో తెలియుచున్నది. ఇఁక మనము మనదేశమునుమఱచి, మన వ్యక్తిత్వమును మఱచి, గొప్పయనుకొని, విజ్ఞులు నవ్వుచున్నను, పరదేశసాంప్రదాయములు గమనించి పరదేశమునకుఁ జెందిన సాంప్రదాయముల ననుసరించి, వస్త్రధారణమును గావించియు, తిలకధారణమును విడచియు, భగవద్గీతాది పవిత్రగ్రంథములఁ జదువుట మానియు, నవీననాగరకతపేర గౌరవమును బూడిదలో గలపియు, విశ్శృంఖలముగ సంచరించుచున్నాము. దీనిచే మన హృదయదౌర్బల్యము సంపూర్ణముగా తెలియుచున్నది. భాషయనునది యేదేశమువారిదైనను నేర్చుకొనవచ్చును. అందుదోషము లేదు. ముఖ్యముగా రాజభాష నేర్వవలసియుండును; కాని పరదేశములభాషనేర్చినను, పరదేశములకేఁగినను, మన దేశగౌరవము గాపాడుకొనుశక్తి లేనిచో, యట్టి విద్య నేర్వకుండుటయే యుత్తమము. పరభాషయు, పరదేశ సంచారమును పరవాఙ్మయమును మనము హృదయబలముకలిగి యభ్యసించి మనదేశస్త్రీల సనాతనగౌరవమును నిలువఁబెట్టుటకుదగిన రీతిని యుపయోగించుకొనుటయే బుద్ధిశాలినులగుస్త్రీలలక్షణమనియు, స్వదేశ కళ్యాణార్థమే పరభాషలను నేర్వవలయుననియు, పరవాఙ్మయ సంచరణమందు మునిఁగి, నవీననాగరకతా మోహమునఁబడి కొట్టుకొనక, తనజాతిత్వము జ్ఞప్తియం దుంచుకొనవలయుననియు యీరీతిగా సంచరించినప్పుడే భారతస్త్రీ సుస్థిర యశః కాయము సంపాదింపఁగలదనియు, అన్యథాయగునేని, తానెట్టి యున్నతపదవి నాక్రమించినను, నీచాతినీచమై పరమేశ్వరునకు దూరమై పతితయగుచున్నదనియు నొక్కి చెప్పవచ్చును.

అవకాశముగలుగునేని రాబోవుసంచికయందు 'పాతివ్రత్యము' అను విషయము చర్చింపఁ బడును.

# శారదకు ప్రత్యుత్తరము

శ్రీమతి దివాకర్ల శారదామణి గారు

ఆ. వె. కావ్యగతుల తెలుఁగు కలరూపు సెప్పిన
నధికమతులు దాని నాదరింత్రు—
అల్పకావ్యబుద్ధు లగు వారలకు నది
విరసకారణంబు విసమువోలె.

—నన్నయ భట్టారకుఁడు.

ఆంధ్రభాషామతల్లి కహితమయ్యును హిందీ భాషాభిమానమునఁ బ్రకాశించుచు తత్ప్రచారపరాయణయై వెలయుచున్న శారదకు దివాకర్ల శారదామణి ప్రణామపూర్వకముగ వ్రాయు రెండవ యుత్తరము.

అమ్మా!

'పుణ్యమునకుఁ బోయిన పాప మెదురువచ్చె—పుణ్యం కర్తుం గతవతి జనేపాపమభ్యాయతీతి'—అని శ్రీమత్తిరుపతి వేంకటకవులు తమ గుంటూరు సీమయందుఁ జెప్పుకొనినట్లు గుంటూరిసీమయందుఁ బ్రకాశించు నీతోడి మైత్రికాసపడి నేను గృహలక్ష్మీ ముఖమున బ్రచురించుకొన్న లేఖ నీ కాగ్రహకారణ మగుట నాకు సంతాపకరముగ నున్నది. ఒకరివ్రాతల జూచిన నొకరికి నిప్పుఁబెట్టవలయు * నన్నంత యోర్వలేని తన మీ యాంధ్రభూమియందు ఆదికవియగు నన్నయ భట్టారకుని కాలమునుండియుఁ బ్రభవించిన పోఁగాలమని మనము భావించునట్లు విద్వత్కవు లొండొరులతో బద్ధమత్సరులయి పరస్పర హృదయ విదారణముగ వాఙ్మయశరములఁ బ్రయోగించుకొనుచు ఆంధ్రసారస్వత మొక యాహవరంగముగఁ జేసి కసిదీరఁ దిట్టుకొనుటయుఁ, గొట్టుకొనుటయుఁ గూడ జరుగుచున్నదని నిరాక్షేపముగఁ జెప్పినను జెప్పవచ్చును. ఉద్భట వివాదములఁ జేసి కవిశిఖామణుల విజయడిండిమములఁ బగుల గొట్టించి కవిసార్వభౌముఁడై వెలసియున్న శ్రీనాథునంత మహాకవికూడ తుదకు రాజమహేంద్రవరపుఁ బండితుల యాగడములకు తాళఁజాలక తానును వారితో గలియఁబడి వారిని నోటికివచ్చినట్లు చెడఁదిట్టి వానిని తేజోవంతమగు నక్షరములఁజేసి గ్రంథముల కెక్కించుకొనినాఁడు.

గీ. బోధమల్పంబు గర్వ మభ్యున్నతంబు
శాంతి నిప్పచ్చరంబు మచ్చరము ఘనము
కూపమండూకముంబోలె కొంచెమెఱిఁగి
పండితమ్మన్యులైన వైతండికులకు.

'హృదయ వచశ్శరీరముల బుణ్యసుధాప్రపూర్ణులై యుండవలయు' ననియు, "నిష్ఠురవాదులను క్షమాధృతి నిరసింపవలయు" ననియు పండితులు చిలుకపలుకులవలె పరులకుఁ జెప్పఁగలరు కాని తామట్లు సంచరింపఁజాలరని నలుబది యేబది యేండ్లనుండి శరపరంపరలవలె నాంధ్రభూమియం దుత్పన్నమగుచున్న

* నన్నపార్యుఁ డితరకవుల గ్రంథముల కగ్గిపెట్టెనని కొందఱి వాదము.

విమర్శన గ్రంథములే శతసహస్రముఖముల ఘోషించుచున్నవి. గ్రంథ విమర్శన మనిన గ్రంథకర్తను వెక్కిరించుటవలన నైపోవునని కొందఱు విమర్శ కాగ్రగణ్యుల యూహ. అట్టివారు వ్యక్తిదూషణమే పరమావధిగ భావించి "పండిత బ్రువలక్షణముల" సహితము పుంఖానుపుంఖములుగ నిర్వచించి సామ్రాజ్యముగొన్నయ ట్లానదించుటవలన నేడిన్ని "గీరతము"లు, ఇన్ని "గుంటూరుసీమ"లును బయలుదేరినవి.

పరగుణ పరమాణువులను కొండలుగఁజేసి మెచ్చుకొనవలయునను భర్తృహరి వాక్యమును దలంచి నిన్ను శ్లాఘించుచు నీ లేఖవలన నాయందుదయించిన సంశయముల వెల్లడించుచు నే నుత్తరమ్ము వ్రాసితిని. నీ వందులకు సుహృద్భావముతోఁ బ్రత్యుత్తర మీయవలసియుండగ నట్లు చేయలేదు సరికదా మీదు మిక్కిలి నా వ్రాతలను జూడ నీకు మేరొాకన్య నేమోయను సందేహముసహిత ముదయించినదని ప్రారంభముచేసి తుదకు నే నొక "చరిత్ర పరిశోధకురాల" వని తేల్చి నన్ను జూడ "మంచి విద్యావతి" నగుదునని తోచుచున్నదని ముగించి యీవిధముగ నపహాస్య మొనర్పవచ్చునా? నీ కింత యుద్భట వివాద మొనర్ప నూహపుట్టినను సౌమ్యముగ లోకమునకు నచ్చఁజెప్పుటకు భాషాప్రపంచమున వ్యక్తిగత మగు నుల్లాసపు బఁకులకంటె మఱి మాటలే దొరకక పోవునా? నా వాదమును జూచ నీ కింత యాగ్రహ ముత్పన్నమైనను నీ వొక ప్రతివిమర్శనమును వ్రాయ నుద్యమించి దానిని శాశ్వతముగ నీ లేఖలలో నెక్కింపఁదలంచినపుడు నీవు మనస్వినివై, వశీకృత చిత్తవై, హేతుకల్పన మొనర్చి, యుక్తాయుక్తములఁ బరిగణించి, సమంజసముగ, సరసముగఁ బ్రత్యుత్తర మీయవలయును గాని, కత్తితో, గొడ్డలితో కొట్టినట్లు ముందు వెనుకల జూచికొనక కలియబడ నూహింప వచ్చునా? తుమ్మెద పుష్పములనుండి తేనియ గ్రోలునట్లు "ఎదురు కందకుండ" జిక్కఁబెట్టుకొనవలసిన వ్యాపారమును బొగ్గులకు వలె మొదలంటఁ బొడువ వచ్చునా?

క. ఎవ్వరికి హితమును బ్రియమును
మదికింపునుగాఁగఁ బలుకుమాటలు పెక్కై
యొదవినను లెస్స, యటుగా
కిదియదియన కూరకునికి యొంతయునొప్పున్.

క. చెలిమియుఁ, బగయును, దెలివియుఁ
గలఁకయు, ధర్మంబుఁ బాప గతియును బెంపుం
దులువతనంబును వచ్చును
బలుకుబడిన; కానఁబొసఁగఁ బలుకఁగవలయున్

(తిక్కన)

స్త్రీల కసూయ పుట్టుకతోడ బుట్టుగుణమని మన పెద్దలు గ్రంథముల నిరాతంకముగ వ్రాసియుండగ వానినెల్ల దెలిసియున్న మనముగూడ నట్టి విపరీతచేతస్కులమై మన యెదుటివారి విద్యాపరిణతికిగని వారి తేజమునకుగాని నసహ్యపడుచు "తెవులులేని వేదన" బడకుండ నుండుట కవకాశమున్నదని భావించుచున్నాను.

మన వివాదమున నొండొరుల కభిప్రాయభేదము లున్న నేమాయె?—నీ స్నేహోపార్జన మొనర్చి యానందింపవలయునని నేను త్రికరణశుద్ధిగ నూహించితిని. ఇప్పుడైన సరే—భాషావిషయికమగు నీవాదమున యిరువురనడుమ పర్వతోపమానముగ విమర్శన గ్రంథము లెంత పెరిగిపోవుట కవకాశమున్నను అది మన చెలిమి కడ్డుగ నుండరాదని నేను తలంచుచున్నాను. ఇందునుగూర్చి నీ మనస్తత్వ మెట్లున్నదో నే నెఱుఁగనుగాని నాకుమాత్ర మట్టి విశ్వాసమున్నది. ఎన్నటికైన నే నీ యుద్యమమున సిద్ధసంకల్పురాల నగుదునని చెప్పఁగలను. "ప్రారబ్ధ ముత్తమగుణా నపరిత్యజంతి."

## కౌరవకు ప్రత్యుత్తరము

కావున నా వాదమునుగూర్చి నీవు పత్రికాముఖమున చేసియున్న యాక్షేపములకన్నిటికిని మహాద్భావముతోడనే క్రింద సమాధానమిచ్చుచుంటినని నీవు భావింపవలసియున్నది.

హిందీభాషయన్న నాకపరిమితమైన ద్వేషమని నీ వూహించినట్లు కానవచ్చుచున్నది. అట్టి యపోహనీయం దెట్లుత్పన్నమైనదో నా కాశ్చర్యముగనున్నది. కావున చెప్పుచున్నాను. హిందీసాహిత్య మొక పఠనీయమగు విద్యగా—అనఁగ భారతవర్షమునఁ బూర్వము ప్రవాహరూపముననుండిన సంస్కృత ప్రాకృతముల మన మిప్పు డెందుల కభ్యసింతుమో అట్లు—దక్షిణ దేశీయులు చదువుకొనుటకు నా కెట్టి యాటంకమును లేదు. నా తగవంతయు దానిని వ్యావహారికమున మనలోమన ముపయోగమునకు దెచ్చుకొనుటతోడనే యున్నది. ఇట్లని నేను నాలేఖయందు స్పష్టముగ వ్రాసికొనియే యుంటిని. నీ వది గమనించినట్లులేదు. కావున నెంత చర్వితచర్వణమైనను నేను చెప్పవలసియే యున్నది. హిందీసాహిత్యపఠనమే పరమోద్దేశముగ నెవ్వరైనసరే దానినభ్యసింపవచ్చును. అనగ 1920 వ సంవత్సరమున హిందీ ప్రచార మారంభించుటకుముందు దాని నాంధ్రదేశమున జనులెట్లు సారస్వత పఠనైకదృష్టితో పఠించిరో అట్లు పఠింపవచ్చును. కాని రాజభాషగగాని వ్యావహారికభాషగగాని దానిని జనసామాన్యమున నుపయోగమునకుఁ దేబడకుండ నుండవలయునని నేను చెప్పునది. అనఁగ * నైజామురాజ్యమునందువలె దానికి రాజకీయ వ్యావహారిక క్షేత్రముల ప్రవేశ ముండుటకు మన మొప్పుకొనరాదు. ఉన్నయెడల వ్యావహారికాంధ్ర మాదేశమున నెట్లు భ్రష్టమైనదో మనదేశమునగూడ నట్లే భ్రష్టమగును. ఇది స్వానుభవముగ మనము చెప్పుకొనవచ్చును. దైవవశమున బ్రిటిష్‌రాజ్యమునఁ జేరిపోవుటచేత ఉత్తరసర్కారులలోనుండు మనము బ్రదికిపోతిమి కాని నైజాము రాజ్యమునందే మన ముండిపోయినయెడల ఉత్తర సర్కారులలోని వ్యావహారికముకూడ నైజామురాష్ట్రమునందలి తెలుఁగువలె "ఖరా"బయి యుండెడిదే. ఇట్లింతస్పష్టముగ వ్రాసిన దానిని నీవు చల్లగ జారవిడిచితివి. రాజభాషగ, వ్యావహారికభాషగ ధారాళముగ నుపయోగమునకు వచ్చునప్పుడు తెనుఁగును బాడుచేయు ప్రకృతసిద్ధగుణమొకటి హిందీయం దుండుటచేతనే అట్టియుద్యమముల నాంధ్రమహాజను లెదుర్కొనవలెనని నే నూహించుచున్నాను.

ఇఁక హిందీయన్న నాకెంతమాత్రమును గిట్టదని నీ వూహించితివి. ఇంగ్లీషునందువలె దానియందు నాకెట్టి "వ్యామోహము"ను లేదని నీవు భ్రాంతి పడుచున్నావు. రెండుమూడేండ్ల క్రిందట నే నుత్తర సర్కారులలో నుంటిని. అప్పుడు దక్షిణ భారత హిందీ ప్రచార సభవారు నాపేర "హమ్‌కో బడీ ఖుశీ హై కి ఆప్ హిన్దీమేం ఉచ్చకోటీ కా అధ్యయన్ కర్‌నా చాహ్‌తీ హైం హమ్ హృదయ్‌సే ఆప్‌కీ సఫల్‌తా చాహ్‌తే హైం" అని వ్రాసియుండిరి. ఆ యుత్తరమింకను నాయొద్ద భద్రముగ నున్నది. నాయన్నగారికి, మఱియు నాకు చిన్నతనమునుండియు తల్లివలె—అయిదేండ్లప్పుడు తల్లియు పదేండ్లప్పుడు తండ్రియు పరలోకగతులగుటవలన—విద్యాబుద్ధుల నొసంగియుండిన మహాలక్ష్మీసమానురాలగు మా పెద్దయక్కకును హిందీయనిన నపరిమితమగు నభిమానము. నా భర్తగారికికూడ హిందీభాషాజ్ఞాన

* నైజాము రాజ్యమునందలి రాజభాషయు వ్యావహారిక భాషయు 'ఉర్దూ లేక హిందుస్థానీ' యని మనవారాడుకొను హిందీయే. **I consider Hindustani a better word in place of the word Hindi Hindustani written in Arabic script is Urdu and when written in the Devanagari script it is called Hindi.**

**Mr. Satyamurty M.L.A.**

మున్నది. నా తోడికోడ లొకయామె ప్రచారసభ వారి పరీక్షలకు సహితము పోయి కృతార్థురాలై యున్నది. ఇట్లు నా బంధువర్గమున నిందఱి కింత హిందీభాషాభిమానమున్నను దానిపై నా కీవిపరీత ద్వేష మెందులకు కలిగినదో నా లేఖ లామూలాగ్రముగ బఠించియున్న నీకు విశదము కాకుండ నుండదని భావించుచున్నాను.

ఇంక నీలేఖయందుఁ గ్రమముగ నీవొనర్చిన యాక్షేపములకు సమాధానమిత్తును.

నావాదమునందలి ప్రశ్నాపరంపరలకు నీవొక్కతవే గాక మన యాంధ్రనాయకులును, యావద్భారత నాయకులును సమాధానమీయ బాధ్యులుగఁ జేయబడిరనియు, అందు గీర్తిశేషులగు 'ఆంధ్రరత్న' మున్నగు స్వర్గవాసులుకూడ నున్నారనియు వీరందరిని గుమిగూర్చి నేనెట్లు సమాధాన మిప్పింపగలననియు ప్రథమమునందే నీకొక గొప్పసందేహ ముదయించినది.

ఇందఱు రాజనీతిపారంగతులును, ఇందఱు నాయకశిఖామణులును మనయం దుదయించిన ఈ యిరువదియవ శతాబ్దమునగూడ సర్వాంధ్రదేశము నేకముఖమునకు వచ్చునట్టి సక్రమాందోళన మింతవఱకు నుదయింపకపోవుట మిగుల శోచనీయమని నేను కొంత తీవ్రముగనే వ్రాసితిని. ఆవాక్యమున 'దేశభక్తు'లని 'దేశోద్ధారకు'లని 'ఆంధ్రరత్నము'లని నేను ప్రయోగించిన శబ్దములన్నియు ఉత్తమవాచకములుగ నుపయోగించి వ్రాసితినికాని ఆబిరుదముల వహించియున్న ఆయావ్యక్తులను ప్రత్యేకముగ వ్రేలఁ జూపించుచు వ్రాసినదానను కాను. అయినను— 'ఇందఱు ఆంధ్రరత్నములు మనలో నుద్భవించి'— అను వాక్యభాగమున కర్థమేమి?— తేజస్వంతముగ రాజకీయరంగమునఁ బ్రవేశించు నిందఱు ఆంధ్రప్రముఖులు మనలో నుదయించియున్నను మన మిట్టి యాందోళన మొనర్పఁజాలక పోతిమని యర్థము కాదా? అట్టిబాధ్యత నాయకులకంటె వారిజీవితము లాదర్శముగ నుంచుకొనవలసిన మన దేశీయులయందే యున్నదని నాభావము. కావునఁ గీర్తిశేషులతోసహా వీరినందఱిని గుమిగూర్చి నేనెట్లు సమాధానమిప్పింపఁగలనని నీవు శంకింప నక్కఱలేదు. సజీవులై కీర్తియందాసక్తిగి దక్షులై యుండు ఆంధ్రమహాజనులకే నేనట్టి విజ్ఞప్తి నొనర్చితిని. దానిని తమతమ శక్తిసామర్థ్యములబట్టి, అవకాశములబట్టి, రుచిభేదములబట్టి, సాధకబాధకములఁ దర్కించి సమావేశములఁజర్పించి మనదేశీయులు కార్యరూపమునకు దెత్తురన్న విశ్వాసముతో నే నట్లొనర్చితిని. కాని ప్రత్యేకవ్యక్తుల నుద్దేశించి నేనేమియుఁ జెప్పను జేయను సంకల్పించియుండలేదు. కావున "పేరంటమునకుఁబలె మమ్ము వేర్వేఱ నీమె యెందులకుఁ బిలువలేదు? బొట్టుపెట్టి పిలువకున్న మాకేమిపని?"—అని యందఱూరకున్నను ఊరకొనవచ్చును. 'దక్షులెవ్వారలు పేక్షచేతురది వారలచేటగుగాని సత్యనిస్తారకమయ్యు సత్యశుభదాయకమయ్యును దైవముండెడున్.'—అను తిక్కన వాక్యమును నేను దడవియే యుంటిని.

తరువాత నావాదమున నేనొక్కత్రోవను నడువక ఒక్కయభిప్రాయముపై నిలువఁబడక, ఒకచో నిరుపమానమైన దేశభక్తిని బ్రదర్శింపుచు, ఒకచో కాంగ్రెసుపై నాగ్రహించుచు, వేఱొకచో రాజభక్తిని వెల్లడిచేయుచు, మఱియొకచో బ్రిటిష్ సామ్రాజ్యప్రాశస్త్యమునుగడించి భారతీయుల లోపములు గోరంతలు కొండంతలుచేసి యొత్తిచూపుటకు పనిబూని కృషిసల్పుచున్న మేయోకన్య పలుకులాయని సందియమొదవునట్లు వ్రాసియుంటినని తెల్పితివి. ఇది మిగుల దయావిహీనమైన మాటయని నేను వినయపూర్వకముగఁ జెప్పుకొనుచున్నాను. ఏమందువా?—మిస్ మేయో మిగుల తుచ్ఛముగ, నీచముగ, నబద్ధములు, నశ్లీలములు, నసభ్యములునగు బూటకముల రసవంతముగఁ జెప్పగలవ్రాఁతగత్తె. 'నీచులకు బలంబు నెట్టన పలుసని కాలు లలచుచున్కి'

అని తిక్కన వ్రాసినట్లామె కొన్ని కాలుకూత లక్షరములఁ జేసియున్నది. అట్టి తుచ్ఛురాలితో నుపమించుటకు నేనేమి కోఁతవ్రాఁతల వ్రాసితిని?

అయినను జాతీయవాదులమని, దేశభక్తులమని విఱ్ఱవీగు పత్రికావిలేఖకులకు నేడిదియొక యాగడమై పోయినది. ఎదుటివారు తమభావముల కేమైన వ్యతిరేకముగ మాట్లాడినంతమాత్రమున వారిని, దేశద్రోహులనుగా నుగ్గడించి 'మిస్ మేయో'తో బోల్చి వేయుచుందురు. అట్లనుట నేడొక చమత్కారోక్తిగా బరిణమించినది. అభిప్రాయభేదములఁ బ్రకటించినంత మాత్రమున నసంగత దురాలాపముల నోటికివచ్చినట్లాడి, అక్కటికములేకుండ నసూయాగ్రస్తులై ఇట్టి నిందోపన్యాసము లొనర్చువారి నేమనవలయునో తెలియకుండనున్నది.

క. పరదోషము సెప్పఁగనే
ర్తురుగా కాత్మీయమైన దోషంబు మదిం
బరికింపగ నధములు నే
ర్తురె?— (తిక్కన)

తరువాత నావ్యాసమునం దొకచోట చదువుచున్న 'నా యనూన మాతృభాషావ్యామోహమునకు ముచ్చటొదవు'ననియు, మఱియొకచోట చదువుచున్న నా 'యాంగ్లభాషావ్యామోహమునకు దిగ్భ్రమకలుగు' ననియు వ్రాసితివి. ఈభావమునే గృహలక్ష్మి 381వ పుటయందలి తుదివాక్యమున—"హిందీభాషా ప్రస్తావనసందర్భమున నీమెఱపిన మాతృభాషా వాత్సల్యమాంగ్లభాషపై ప్రేమఁజూపునపు డేమైనదో ఆశ్చర్యము!!" అని నీకుఁగలిగిన యాశ్చర్యమును రెండాశ్చర్యార్థకములతోఁ బ్రదర్శించితివి.

అనఁగ పరభాషయం దేమైన ప్రీతిఁజూపించిన స్వభాషాభిమాన ముండుట కెంతమాత్ర మవకాశము లేదని నీవు నిరాక్షేపముగ, నిస్సంశయముగఁ జెప్పఁగలవన్నమాట. అట్లయిన నీవు జూపించు నీ హిందీ భాషాభిమానమో లేక నీయాంధ్రభాషాభిమానమో ఏదో యొకటి బూటకమైయుండునని ఎవ్వరయిన సందేహింపవచ్చునా?

ఒకభాషయం దభిమానముండగ నింకొకభాషయం దాదరముచూపుట అసంభవమని నీవేమో భ్రాంతి పడుచుంటివిగాని పరీక్షించిచూచినచో విద్యాధికులలో నేడెల్లరకట్టి బహుభాషాభిమానమే ప్రత్యక్షమగుచు సర్వజీవిత వ్యాపారములలోను బ్రదర్శితమగుచున్నది. నిరుద్యోగులలో నట్టిసందర్భమున కాఁగా దనుట కెంత యవకాశమున్నను అది గవర్నమెంటు నౌఖరీలలో నధమశ్రేణినుండు తాలూకా గుమస్తాలు మొదలు నీలగిరికొండలపై నధివసించు సర్.కూర్మారెడ్డి నాయుడుగారివఱకు వ్రాయువ్రాఁతలలోను, పలుకు పలుకులలోను, చేయుపనులలోను వ్యవహారమునకు వచ్చుచునేయుండును. గవర్నమెంటువారి యుప్పు దినుచు దినము పదునెనిమిదిగంటలు ఆంగ్లభాషా భూయిష్ఠమగు కచేరీకాగితములతో నుక్కిరిబిక్కిరి యగు గవర్నమెంటు నౌఖరు లిండ్లవద్ద బ్రిటిష్వస్తు బహిష్కారసూత్రముల నుద్ఘాటించుచు తామెంత స్వదేశాభిమానమును, స్వభాషాభిమానమును బ్రదర్శించుకొన దలంచినను అది కార్యరూపమునకు దెచ్చుకొనుట కేమైన నభ్యంతరముండునా? — అట్టివారిండ్లయెద్ద నతివాదసిద్ధాంతముల నెంత యుద్ఘాటించినను, ఆంధ్రభాషాభిమాన మెంతచూపించినను అడ్డుపెట్టువా రెవరు?

బహు భాషాభిమానమును, బహు భార్యాభిమానమును ఒక్కరీతి నుండునని చెప్పవచ్చును. దక్షిణ నాయకులు తమసతులపై సమానముగ ప్రేమఁ జూపుట కెంత యవకాశముండునో బహుభాషావిదులకుగూడ ఆయాభాషలపై సమానముగ ప్రీతి యుండుట కవకాశమున్నది. కావున 'నీ మెఱపిన మాతృభాషావాత్సల్యమాంగ్లభాషపై ప్రేమజూపునపు డేమైనదో' నీ వాశ్చర్యపడుట కవకాశములేదని చెప్పఁగలను. ఒక

భాషాభిమాన మింకొక భాషాభిమానమును జెఱచివైచి ఆభాషాభిమానము నూతనాభ్యసితమగు వేఱొకభాష వలన పాడయి తుదకే భాషాభిమానమును లేకుండ నుండుట సంభవింపదు. ఈనీవిమర్శనమును జదువు నపుడు విపరీతవైఖరినిబోయిన ఒకరిభావమును అందును గూర్చి మన సారస్వతమునం దేజస్వంతముగ మెఱయు చున్న నొక విమర్శనమును నాకు జ్ఞప్తికివచ్చెను. ఒక భాషాభిమానముండగ నింకొక భాషాభిమాన మాదేశ మగుట దొలుతటి భాషాభిమానమున కుద్వాసన మిచ్చుట యగునా? అని తలపోసితిని. అప్పుడు 'విమర్శాదర్శ' యను గ్రంథమునందలి "ఇట్లు కావ్యములు మన అనుభవములను అనేకవిధములుగ మార్చుతవి." అనువాక్యము జ్ఞప్తికివచ్చెను. ఆవాక్యమును పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు క్రిందివిధముగ నధిక్షేపించిరి.

"ఈ 'మార్చుతవి.' యను శబ్దముతోడ మాకుం దగవున్నది. వివిధములగు కావ్యములు వేఱువేఱు రసానుభవముల కలిగించును గాని యొక కావ్యమిచ్చిన యనుభవమును వేఱొక కావ్యము వేఱొకయనుభవముగ మార్పదు. మొన్నందిన్న కాకరకాయ చేదు రుచియనుభవమును నిన్ననుదిన్న కమరకాయపుల్ల రుచియనుభవముగ మార్పదు. ఆరుచియనుభవముండును. ఈరుచి యనుభవముండును. కాని యది ఇదిగా మాఱలేదు. బ్రహ్మసూత్ర భాష్యమును చదువుచుండ నొక వింతయైన యనుభవము మనమునకుం గలుగును. తారాశశాంకవిజయముం జదువంగ వేఱొక్క యనుభవము మనమునకుం గలుగును. కాని యిది పూర్వవైరాగ్యానుభవముమార్చి శృంగారములోనికి దింపినదని చెప్పందగదు. అన్నియనుభవములు మనమునందు నిలిచియుండును గాని ఈ యనుభవము దానిని మార్చుటచేతం నా యనుభవము దీనిని మార్చుటచేతం దుట్టతుదకేయనుభవము లేకుండ మనముండదు."

ఈ సందర్భమున వీరీక్రిందికథను జెప్పిరి. 'అయ్యా! సొంటి, దనియాలు, లవంగాలుకూడ ననుపాన ముంచితిరేం? ఒక్కసొంటి చాలదా?" యని యొకయనుమాన పురోగి యొక సంచికట్టు వైద్యునడిగెను. "సొంటి కాక చేస్తుందండి! ఆకాక కొట్టెయ్యడానికి దనియాలు పెట్టానండి!" అని వైద్యుండుత్తరము చెప్పెను. "సరే కాని లవంగాలెందుల"కని తిరుగ రోగి యడిగెను. "దనియాలలో కొంచెము శ్లేష్మవృద్ధి గుణముంది. దాన్ని కొట్టెయ్యడానికి లవంగాలు తగిలించాను" అని వైద్యుండుత్తరము చెప్పెను. "మఱి లవంగాలలో ఉండేపైత్యము మాటయేమి చెప్పారు?" అని రోగి తిరుగం బ్రశ్నించెను. "ఆమాట వేఱే చెప్పనక్కరలేదు ఆపైత్యమేదో దనియాలే కొట్టేస్తుంది." అని వైద్యుండు బదులు చెప్పెను. "దీని దది కొట్టేసి దాని దిది కొట్టేసి ఈరెంటిది మరొహటి కొట్టేసి మరొహదాని దీ రెండుకలిసి కొట్టేసినపుడు ఇక మిగిలిందేది? నాకీమందువద్ద"ని రోగి తనదారినిదాం బోయెనంట.

మన మెన్నిభాషల నేర్చుకొన్నను మనభాషాభిమానము లొండొంటిచేతం గొట్టువడిపోవని తెల్పుటకే నేనింతమారము చూపవలసినదాననైతిని. ఈసంగతి నీ యనుభవమునకు వచ్చియున్నను నీవు గుర్తింపకుంటివని భావించుచున్నాను. ఏమందువా?—"కల్పలతా, హిందీభాష నేర్వదగునని నేనింతగట్టిగా వ్రాయుటచే నాకు మాతృభాషపై నభిమానములేదని గాని నిరసనముగలదని గాని భావింపకుము. కేవలము మాతృదుగ్ధముచే బెరిగిన బిడ్డవలె నేను కేవలము మాతృభాషవలననే విద్య నభ్యసించితిని." అని నీ వాఱుమాసములక్రిందట వ్రాసియే యుంటివి. అట్లని నంతమాత్రమున నీవు పరస్పర విరుద్ధమగు నభిప్రాయము వెల్లడించితివని నేనెప్పుడును తలంపజాలను. కాని నాయందు దోషారోపణము చేయునప్పుడు నామాతృభాషాభిమానమును, నాయందెక్కువగనున్న

దని నీ వేమో భ్రమించుచున్న నా 'యాంగ్లభాషా వ్యామోహము'ను నీకాశ్చర్య జనకములగుటయే నాకు వింతను బుట్టించుచున్నది.

నేనైన ఆంగ్లభాషావ్యామోహ మేమంత వెల్లడించితిని? కాంగ్రెసునాయికలలో నగ్రగణ్యురాలగు శ్రీమతి సరోజినీనాయుడుగారివలె ఆంగ్లమే ఆసేతు శీతాచలమును రాజభాషగ — ముఖ్యవ్యవహారభాషగ నుండిపోవలయునంటినా? ఆంగ్లమే భరతవర్షమునకు 'లింగ్వాఫ్రేంకా' గావలయునని యామె లాహోరునందు ధారాళముగ నుపన్యసించియుండెనని నా మొదటి యుత్తరమున నేను చూపియేయుంటిని కాదా?

బ్రిటిషువారీ దేశమాక్రమించుకొని నూటయేబదేండ్లును రాజధానీనగరములలో నింగ్లీషు యూనివర్సిటీ లుదయించి నూరేండ్లును అయియున్నను పదివేలమంది పురుషులలో నిప్పటి కాంగ్లము వచ్చునని చెప్పుకొనఁగలవారు 212 గురును, పదివేలమంది స్త్రీలలో అట్టి వారి సంఖ్య 28యు మాత్రమే అయియున్నదని సెన్సస్ లెఖ్ఖలఁబట్టి తెలియుచున్నను శ్రీమతి సరోజినీదేవిగారా యాంగ్లమే మనకు 'ఆమ్‌జబాన్' కావలయుననుచున్నది. నేనట్లనుచుండుట లేదు. ఉత్తరమున హిందుస్తానీయే యుండవలయుననియు దక్షిణదేశముల మాత్రము సంఖ్యాబాహుళ్యమునుబట్టి ఏభాషయుండదగునో ఆభాషయే యుండవలెననియు చెప్పియుంటిని. కొంతకాలమునుండి నేనుత్తరదేశముల నివసించుచున్నాను. అట్టి నాకు హిందీయొక్క మహత్వము కాని దాని యుపయోగము కాని తెలియకుండ నుండగలదా? కాని యది హద్దుమీఱి దక్షిణదేశముల విజృంభించి దక్షిణభారతీయభాషలను 'ఖరాబ'గునట్లు చేసివేయరాదని నేను చెప్పుచున్నాను. ఇందెట్టి విపరీతమును లేదని నీవు తెలిసికొనవలెను. దక్షిణభారతీయభాష లొక్కభాషాకుటుంబమునకుఁ జేరినవి. పరస్పరసామ్యమున నున్నవి. పరస్పరసంబంధము గలవి. కావున వాని కంముబాటునఁ జేయవగ సంఖ్యాబాహుళ్యమున మెఱయుచున్న ఆంధ్రభాషయే వ్యావహారికభాషగ — కాలక్రమమున రాజభాషగ దక్కన్ అని చెప్పఁబడు దక్షిణాపథమున నంగీకరింపఁబడునట్లు మనదేశీయు లాందోళన మొనర్పవలసియున్నది.

ప్రస్తుతమున మనదేశీయనాయకులకందఱకు ఆంగ్లభాషామహత్వము తెలిసియేయున్నదనియు, అయినను వారు తమ యంతరంగస్థమగు సత్యముల నోటబలుకుటకు సంశయించుచున్నారనియు నేను వ్రాసియుంటిని. అది నాయాంగ్లభాషా వ్యామోహమునకు నిదర్శనమగునా? కడచిన హిందీసాహిత్య సమ్మేళనసమావేశ సందర్భమున గాంధీమహాత్ముని యుపన్యాసమును జూచిన నాకు సంశయ విచ్ఛిన్నమగునని నీలేఖయందు నీవు చెప్పదగిన తుది వాక్యముగ వ్రాసికొంటివి. అప్రమేయ గుణపూజ్యుఁడగు బాపూజీ ఆంగ్లమును గూర్చియేమనుచున్నాఁడు? —

యది హిన్దీ అంగ్రేజీకా స్థాన్ లేతో కమ్ సే కమ్ ముఝేతో అచ్ఛాహీ లగేగా అనగా హిందీ ఆంగ్లభాషాస్థానము నాక్రమించిన తనకు పసందుగ నుండునని కదా యతఁడనుచున్నాఁడు. హిందీ యుత్తరదేశములందా వినముగ విజృంభించుట నాకును ముదావహమే. దక్షిణాపథమునందే నేను వలదనుచున్నాను.

లేకిన్ అంగ్రేజీ భాషాకే మహత్వకో హమ్ అచ్ఛీతరహ్ జాన్తే హైఁ. ఆధునిక్ జ్ఞాన్ కీ ప్రాప్తి, ఆధునిక్ సాహిత్యకే అధ్యయన్, సారే జగత్ కే పరిచయ్, అర్థప్రాప్తి, రాజ్యాధికారియోంకే సాథ్ సమ్‌పర్క్ రఖ్‌నే ఔర్ ఐసాహీ అన్యకార్యోఁకే లియే అంగ్రేజీ జ్ఞాన్ కీ హమేఁ ఆవశ్యకతా హై.

అనగ నాంగ్లభాషా మహత్వము తనకు చక్కఁగఁ దెలిసియున్నదనియు, వర్తమానయుగమునందలి జ్ఞానప్రాప్తికి, వర్తమానకాలమునందలి సాహిత్యాధ్యయనమునకు సకలజగత్ పరిచయమునకు, అర్థప్రాప్తికి,

రాజ్యాధికారులతో సంబంధముల నుంచుకొనుటకు మఱియు నిట్టి యితరకార్యావసరములకు మన కాంగ్ల భాషాజ్ఞాన మావశ్యకమై యున్నదని మహాత్ముఁడు సింహఘోషమున నుపన్యసించినాఁడు. ఆంగ్లభాషా మహత్త్వము నుగ్గడించుట జాతీయ విద్రోహముగఁ దలంచు నీ వీ వాక్యముల విశ్వసింపఁ గలవా ?

ఇచ్ఛా నరహేతే హుయే భీ హమ్ కో అంగ్రేజీ పఢ్ నీ హోగే. యహీ హో భీ రహా హై అంగ్రేజీ అంతర్రాష్ట్రీయ భాషా హై.

"మన కిష్టములేక పోయినను ఆంగ్లభాష నభ్యసింపవలసి యున్నది. ఇట్లే యగుచు నుండిపోవుచున్నది. ఆంగ్ల మంతర్జాతీయ భాష"—అని మహాత్ముఁ డనుచున్నాఁడు.

నేనుగూడ నాంగ్లమును మిగుల ననిష్టతతో నేర్చుకొంటిని. ప్రారంభమున నే నాంగ్లభాషాపదము లెంత కంటక సదృశములుగ దలంచుచువచ్చితినో మా యక్కగారి కిప్పటికిని స్పష్టముగఁ దెలిసియే యున్నది. నిజము చెప్పవలయునన్నచో నా కిప్పటికికూడ ఆంధ్ర భాషా కావ్యము లానందమిచ్చునట్లు ఆంగ్లగ్రంథము లానంద మొసంగకుండ నున్నవి. చెప్పనారంభించితిని గాన నడుమ మానివేయుట యెందులకు?—నేను కళాశాలకు బోయి విద్య నభ్యసింపలేదు. ఇంటి యొద్దనే నా యభిరుచినిబట్టి చేతికివచ్చిన గ్రంథముల నొక క్రమములేకుండ—ఒక పద్ధతిలేకుండ చదివి స్వయంకృషిచే నాంగ్లభాషోపార్జన మొనర్చితినికాని దినదినమును కళాశాలకుబోయి చదువుకొన్నదానను కాను. కావున నిప్పటి కొందఱు విద్యార్థినులవలె నే నుగ్గుపాలతో ఆంగ్లభాషయందే పెరిగినదానవని నీవు భావింపకుందువుగాక! ఆంగ్లభాషా వ్యామోహము కాని, ఆంగ్లేయాచారాభిమానముకాని నాయందంతగ లేకపోవుటచేతనే నేను రచించుచున్న 'మనోరమ'యందు "మే మాంగ్లపద్ధతులవలననే సర్వాధికులమయ్యెద మనుట దేవతార్చన మింగ్లీషునజేసి పవిత్రులమయ్యెద మనుటవంటిది కాదా?" అని కామేశ్వరమ్మగారిచేతఁ బలికించితిని. ఆంగ్లవైఖరుల నవలంబించుటవలన మనకు పారతంత్ర్యవ్యాప్తియే కాని మోక్ష మెప్పటికిని చేకూరదను విశ్వాసమున్నదానను. ఇట్లని నేను క్రిందటి నవంబరునెలయందు—అనగ నీకు లేఖవ్రాయుట కాఱుమాసములముందే మనోరమయందు వ్రాసికొంటిని.

కావున నాలేఖ నొకచోఁ జదువుచున్న నా మాతృభాషాభిమానమునకు ముచ్చటొదవుననియు, మఱియొకచోఁ జదువుచున్న నా యాంగ్లభాషా వ్యామోహమునకు దిగ్భ్రమయు కలిగితీరునని నీ వేవిధముగ నిర్ణయించితివో నాకాశ్చర్యముగనున్నది. కన్యాకుమారి మొదలు కాశ్మీరమువఱకు ఆంగ్లభాషయే "ఆమ్ జబాన్" కావలయునని చెప్పియున్న సరోజినీ నాయఁడుగారి వాక్యములకు నీకు దిగ్భ్రమ ముదయింపదు కాని, హెచ్చు జనసంఖ్యనుబట్టి దక్షిణ దేశముల భాషలలోఁ బ్రథమస్థానముననున్న తెనుఁగు వ్యావహారిక భాషగ దక్షిణదేశస్థు లంగీకరింపవలయునన్న నీకు దిగ్భ్రమ ముదయించుచున్నది. బాగు బాగు!

మొత్తముమీద నేను పరస్పరాసంబద్ధదోషదూషితముగ వ్రాసితినని గావలయు—నా లేఖయందిన్ని యిన్ని విపరీతముగు ననుభవములకుఁ బాలయితినని నీవు విమర్శన మారంభించితివి. అనగ నేనొక్క విషయమునే దీసికొని దానినే విపులముగ నా లేఖయందామూలాగ్రముగ జర్చింపనైతిననియా నీభావము?—దక్షిణమున హిందుస్థానీ యుండరాదు. దానియందు దక్షిణ భారతీయ భాషలను బాడుచేయు గుణమొకటి ప్రకృతిసిద్ధముగనున్నది. సంఖ్యాబాహుళ్యమును బట్టి దక్షిణదేశమున ఆంధ్రమే రాజభాషగ—ముఖ్య వ్యవహారిక భాషగ నుండవలయును.—అనునదికదా నా వాదము! ఇందుల కెన్ని రాజకీయాంశముల—ఎన్ని చరిత్రాంశముల పూర్వపక్ష విచారణమొనర్చుచు దర్శించవలసియున్నది? "హిందీభాషా ప్రస్తా

వనలో నీయనవసరపు రాజకీయగొడవ లెందులకు?" అని నీవు ప్రశ్నించితివి. రాజకీయములకును రాజభాషా నిర్ణయమునకును సంబంధమే లేదా? "మనకు సంపూర్ణస్వతంత్ర సిద్ధియగును. అప్పుడు భారతవర్షమునకు హిందీ రాజభాషయగును. కావున వెంటనే హిందీ నేర్చుకొనుఁడు" అనికదా హిందీ ప్రచారసభ వారనుచున్నారు? అట్లను వారి వాదమును నేను పరిశీలింపవలసియున్నదా లేదా? 'బోధమల్పము. గర్వమభ్యున్నతము. కూపమండూకమట్లు కొంచెమెఱుఁగును.' అని 'గుడుగుడుకుంచముగ' నే నొక్కవిషయమునే దీసికొని వితండవాదమొనర్చిన బరిహాసాస్పదను కాకుండ నుందునా?

కావుననే ననేకాంశములఁ జర్చించి యనేకముఖముల వ్రాసితినని నీ వాక్షేపించుట కవకాశములేదని చెప్పఁగలను. నేను యుక్తియుక్తముగ హేతుకల్పన మొనర్చుచు సమంజసముగఁ జర్చించితినో లేదో నా లేఖయే వెల్లడింపఁగలదు. నా హేతువాదమునఁ బూర్వపక్షముల కవకాశముండునని నాకేమైన స్ఫురించినంతనే వానిని విపులముగఁ దర్కించి అట్టి యవకాశములకుఁ దావులేకుండ దీర్ఘముగ వ్రాసికొనియే యుంటిని—అవన్నియు నీ "కనవసరపు గొడవలుగ" గానవచ్చినవి.

"ఉర్దూ సంపర్కమున నాంధ్రభాష పాడైపోవుచున్నదని యీమె మొదటిచింత"—అని నీవు వ్రాసితివి. మన హిందీభాషా విషయికమగు వాదమున హిందీ—హిందుస్థానీ భాషలను నీవు ఉర్దూయని వ్యవహరించుటకు నే నొప్పుకొనను. "ఉర్దూ, హిందీ ఔర్ హిందుస్థానీకో ఆప్ ఏక్ హీ సమఝియే" శ్రీ సత్యమూర్తి యమ్. యల్. యే. గారు కూడ హిందీ ఉర్దూ అనుశబ్దముల నుపయోగించుటకన్న అన్నిటికిని "హిందుస్థానీ"యని వ్యవహరించుకొన్న బాగుండుననియు అన్నియు నొక్కభాషా వికారములే యనియు మొన్ననే నిర్వచన మొనర్చియున్నారు.

ఇఁక హిందీ—హిందుస్థానీభాషలను ధారాళముగ వ్యవహారమునకు దెచ్చుకొన్నయెడల మనవ్యావహారికాంధ్రము 'ఖరాబ'గుననికదా నా వాదము? అట్లు నైజామురాష్ట్రమున ఖరాబయియున్నదని నీవుసహిత మొప్పుకొంటివి. 'ప్రతియితర రాష్ట్రభాషాసంపర్కముగల ప్రదేశమునందును తెలుఁగుభాషస్థితి యిటులనే ఉన్నది. రెండుభాషలు సంధిల్లినచోట ఈభాషాపదము లాభాషయందును ఆభాషాపదము లీభాషయందును ననుకొనకుండనే కలియుచుండును. ఇదిసిద్ధము తప్పదు.' అని వ్రాసితివి. కాని నైజాము రాజ్యమంతయు ఆంధ్రభూమియందు గొన్ని 'సరిహద్దుగ్రామముల'ని తేల్చి వైచితివి.

ఎంతవింత! గోదావరియంతయు నిసుకపఱ్ఱయని చెప్పిన నెవ్వరైన నమ్మవచ్చునా? ఎక్కడనో గోదావరినడుమ నిసుకతిన్నెలున్నవని గోదావరియంతయు సైకతస్థలమని చెప్పిన నదియవ్యాహతమగు నతిశయోక్తియనుట కేమైన సందేహముండునా? అట్లే ఆంధ్రదేశమునకు సరిహద్దురేఖయొకటి నైజామురాష్ట్రమును రెండుగజేసి వేయుచున్నదని నైజామురాజ్యమంతయు, నాంధ్రదేశమునకు 'సరిహద్దుగ్రామముల'ని చెప్పుకొనవచ్చునా? నైజాము రాజ్యమునందలి ఆంధ్రదేశ విస్తీర్ణము ఆంధ్రదేశమొత్తమునందు రమారమి మూడవవంతున్నది. నేను నైజామురాజ్యప్రసంగమును దడవుట నీవప్రస్తుతముగభావించి "ఈమెదృష్టిలో నిజామురాష్ట్రమే సమస్తమున్నటులున్నది." అని వ్రాసితివి. ఎందులకుఁ గారాదు? 'స్వయంతీర్ణః పరంస్తారయతి' యనికదా మనము తలంపవలయు? తనజాతిని తాను తరింపజేసికొన్నతరువాతగదా భారతవర్షమునందలి సర్వజాతీయ విముక్తి కుద్యమింపవలయును? "గోవు చుట్టూ ప్రదక్షించిన పదునాల్గు భువనములు ప్రదక్షిణము చేసినంత ఫలమని యేదో వ్రతకథలో జెప్పినట్లుగా నిజామురాష్ట్రముతో సంబంధము గల్గించుగొనిన

యావద్భారతదేశముతో సంబంధము గల్పించుకొనినంత పుణ్యమని చెప్పుచున్న దీ సోదరీమణి. ఆ ప్రయోజన మేమో!" అని నీవు సంశయించితివి.

నీవు తలంచునట్లు నైజామురాజ్య మొక గోవంత గాని, యొక గోష్పాదమంతగాని ప్రదేశముగాక గొప్ప దేశమే యున్నదని నీ వంగీకరింపవలసియున్నది. ఇట్లు రెండురాజ్యాంగవిధానములుగఁజీలి పాడగుచున్న జాతి ఒక్కరాజ్యాంగ విధానమునకువచ్చి ఐకమత్యమునకు వచ్చుటయందు ఒక్క ప్రయోజనమును నీకు తోపకుండనే యున్నదా? మనభాషావాదమున నొక్కదానిని వ్రేలెత్తి చూపింపఁగలను. ఆంధ్రము హిందుస్థానీ క్రిందబడి నలిగి చచ్చిపోవుటయను దురవస్థయున్నదే అది సంపూర్ణముగఁ దొలఁగిపోవచ్చును. కాని యట్లగుటకు పూర్వము భరతదేశమునకు స్వతంత్రస్వతంత్ర మేర్పడవలసియున్నది. అప్పుడు నేడు జర్మనీయందువలె ఆంధ్రదేశమునగూడ హిట్లరువంటి చండశాసనుఁ డొకఁ డుదయించి హిందుస్థానీయను రాకాసిబోసను వింధ్యపర్వతముల కీవలకురాకుండ జేసిపైచి దక్షిణాపథమంతయు సంఖ్యాబాహుళ్యమునకు మాతృభాషయు, దక్షిణభారతీయభాషాకుటుంబములకు చెందినదియు నగు నాంధ్రమే రాజభాషగ— ముఖ్యవ్యవహారికభాషగ నను శాసింపవలసియున్నది. అట్టి యుత్తమాదర్శమును మనవారు దృష్టిపథమున నుంచుకొనవలయునుగాని దక్షిణభారతీయభాషలను బాడుచేయు నవగుణమునఁ బ్రకాశించు హిందుస్థానీనే వ్యావహారికమునకు దెచ్చుకొని పవిత్రమగు తమవాణిని బుద్ధిపూర్వకము జెఱుపుకొన నూహింపరాదు.

"ఒక్క ఉర్దూసంపర్కమునసే గాదు. తమిళము, కన్నడము, ఓఢ్రము మున్నగు ప్రతి యితరరాష్ట్రి భాషా (ప్రాంతీయభాషలని నీయూహ గావలయు) సంపర్కముగల ప్రదేశములందు తెలుఁగుభాషస్థితి యిటులనేయున్నది." అని వ్రాసితివి. అనగ సరిహద్దు ప్రాంతములలో నెల్లదిక్కులను వేఱొకభాషాసంపర్కమెక్కడ వచ్చినను తెనుఁ గాయాప్రాంతములందు హైదరాబాదునందువలె పరిహాసాస్పదముగ 'ఖరా' బగుచున్నదని నీవు పలుకఁగల వన్నమాట. ఆంధ్ర, తమిళ, కన్నడవాఙ్మయములు దక్షిణభారతభాషా కుటుంబమునకుఁ జేరినవి. అవి సరిహద్దురేఖలలో నొఱసికొనునప్పుడు పరస్పర మపహాసభాజనముగఁ బాడుచేసికొనవు. 'డబ్బ' నుటకు 'దుడ్డ' నియు 'పోతా' ననుటకు 'పూడుస్త' నసియు మఱియు విచిత్రమగు 'దా' ప్రయోగములను తమిళభాషాసంపర్కమున మదరాసు:కును బెంగుళూరునకును నడుమ ఆంధ్రమున వ్యావహారికవాణియందు బ్రవేశించినవి. దత్తమండలములందుగూడ కన్నడభాషాసంపర్కమున కొన్నిచిత్రవిచిత్రప్రయోగము లక్కడి వ్యావహారికవాణియందుదయించినవి. అయినను ఆంధ్రకన్నడములకు లిపియందు, శబ్దసామ్యమునందుఁ జాల దగ్గరసంబంధమున్నది. మనకు కవిత్రయమువారి భారతమువలె పూర్వమున గొప్పకన్నడభాషాగ్రంథములు వ్రాసినవారందఱు వేంగీవిషయమునుండి పోయియుండిన తెనుఁగువారే యనికొందఱు పరిశోధకులనుచున్నారు. అర్జునునకు భారతయుద్ధమునందుఁ గృష్ణునివలె తనకుఁ భారతరచనఁ దోడ్పడియుండెనని నన్నయభట్టారకుడు మనకుఁ దెలుపుచున్న నారాయణభట్టనువాఁడు వాఙ్మయధురంధరుఁడయి, సంస్కృత, కర్ణాట, ప్రాకృత, పైశాచి, కాంధ్రభాషా సుకవిరాజశేఖరుఁడని తెలియవచ్చుచున్నది. ఆంధ్రరాజకవులలో నగ్రేసరుఁడగు నన్నెచోళుఁడు 'నాయి' మున్నగు కన్నడ భాషాశబ్దములను ధారాళముగ నాంధ్రగ్రంథములఁ బ్రయోగించి తనకుఁ ల కన్నడభాషాభిమానమును వెల్లడించుకొని యుండినవాఁడు. కీర్తిశేషులగు కందుకూరి వీరేశలింగముపంతులవారు తమకవులచరిత్రమున ఆంధ్రశైవుల మతగ్రంథములన్నియు కన్నడమునందే యుండెనని వ్రాయుచు "ఆకాలమునందలి తెనుఁగు పండితుల కందఱికిని సంస్కృత కర్ణాటకభాషలు సాధారణముగ వచ్చుచుండెను. అందుచేతఁ దెనుఁ

గును సరి తము కర్ణాటక మనుచుండుట యప్పుడప్పుడు కలదు. శ్రీనాథుఁడు తనభీమఖండములో నేమనెనో చూడుఁడు !

గీ. ప్రౌఢిఁబరికింప సంస్కృత ♦ భాష యండ్రు
పలుకునుడికారమున నాంధ్ర ♦ భాషయండ్రు
ఎవ్వ రేమన్న నండ్రు నా ♦ కేమికొఱత
నాకవిత్వంబు నిజము క ♦ ర్ణాటభాష.

అని వ్రాసిరి.

ఇఁక హంపీవిజయనగర శాసకులగు నాంధ్రచక్రవర్తులు కొన్నికొన్ని సందర్భములలో ఆంధ్రదేశముకంటెను, ఆంధ్రభాషకంటెచు కర్ణాటాభిమానమే హెచ్చుగఁజూపించుచు నుండిపోయిరని పలుకవలసి యున్నది. వారికాంధ్రజాతీయాభిమాన మంతగలేక బిజాపురముక్రిందను గోల్కొండక్రిందను నలిగి చచ్చుచున్న ఆంధ్రజాతుల నంతగ నుద్ధరింపఁదలంపక దక్షిణమున సేతునుగూడ నతిక్రమించిపోయి సింహళము దనుక విజయయాత్రల జరిపి విజృంభించుచువచ్చిరి.

అయినను అప్పు డాంధ్రకన్నడజాతుల కట్టి యైకమత్యముండినదో ఇప్పు డీయుభయజాతులకును భాషలకును కూడ అట్టి ఐకమత్యముండిన మనకు దేశాభివృద్ధియు, భాషాభివృద్ధియు గలిగి తమిళ, కేరళ ప్రాంతీయులు మనతో కలియునట్టి యుత్తమాంనోళనముల మనము సల్పుకొనగలమని నే నూహించుచున్నాను.

ఆంధ్రకర్ణాటకుల సంఖ్య 3 కోట్ల 75 లక్షలయి యున్నది. తమిళమును మాట్లాడువారు 2 కోట్ల నాలుగులక్షలు.

ఇఁక ఓఢ్రభాషాసంపర్కమునుగూర్చి—ఛత్రపురమున, బరంపురమున నేను రెండుసంవత్సరము లుండియుంటిని. అచ్చటి వ్యావహారికాంధ్రమున నెట్టి యోఢ్రపద సంయోగమును లేదు. ఉన్నయెడల నది కనుగొనుటకైన వీలులేనంత సూక్ష్మముగనుండి యుండవలయును.

కాని నిజామురాజ్యమున ఉత్తరమున మధ్యరాష్ట్రములలోనున్న సిరోంచమొదలు దక్షిణమున రాయచూరువఱకును, తూర్పున భద్రాచలమున కావలియొడ్డునుండి పశ్చిమమున హైదరాబాదువఱకును గల యాబదివేల చదరపుమైళ్ల విస్తీర్ణదేశమునందును అట్టి సూక్ష్మాతిసూక్ష్మమగు హిందూస్థానీపద సంయోగమున్నదని నీవు చెప్పజాలవుకద ! ఆపదసంయోగము దక్షిణమందలి ద్రవిడభాషాసంపర్కమున నగుచున్న విచిత్రప్రయోగములవంటివి కాక మిక్కిలి విపరీతమగు తురకభాషాప్రయోగములే కదా ! ఆ తురకభాషయే మీరు పూనుకొనివచ్చుచున్న 'హిన్దీ, ఉర్దూ ఔర్ హిన్దుస్థానీ' యగును కాదా ?

ధారాళమగు హిందుస్థానీవలన ఆంధ్రులవ్యావహారికవాణి నిశ్చయముగ భ్రష్టమైపోవును. కాని హిందుస్థానీ ప్రచారపరాయణులగు మీ రది యొప్పుకొనరు. ఒప్పుకొనిన బింకమునకు లోపము కాదా ?

కావున నే నెంత హేతుయుక్తముగ నెంత నచ్చ జెప్పినను మీవంటివారి కవి నచ్చకపోవుట ఆంధ్రభాషామతల్లి మహాపాపమేమోయని తలంపవలసి యున్నది. మన కంతరంగమున నెఱయు సత్యమును మన మొప్పుకొనుటకు శ్రీమతి సరోజినీనాయుఁడుగారియొక్కగాని, గాంధీమహాత్మునియొక్కగాని ధైర్య ముండవలయునుకదా ? మీవంటివారి నూతగఁ దీసికొని హిందీభాషాభ్యాసన మొనర్చువారు ఆంధ్రదేశమున వందలును వేలును కలరు. వారీయనర్థముల మీయుద్భోదముల మూలమునఁ గదా చూడజాలరు ? అయినను మీరంత 'కానని' వారా ? తెలిసియుఁ దెలియనివారు. మీకు బ్రహ్మయు చెప్పఁజాలడు.

గీ. బోద్ధలగువారు మత్సర పూర్ణమతులు
ప్రబలగర్వవిదూషితుల్ ప్రభువులెన్న
నితరమనుజులబోధోపహతులుగాన
భావమున జీర్ణమయ్యె సుభాషితంబు.

అనునట్లు తెలిసి చెప్పఁగలవారు మత్సరగ్రస్థులగుట వలనను—ఆంధ్రనాయకాంగ్రేసరులు తమఘనతకుఁ దగనిదని భావించుటవలనను తుదకీ వాదవిషయమగు సుభాషితమంతయు నాభావమందే యణఁగిపోవునేమొ!

"ఆయితే యింతమాత్రము చేతనే తమభాషకు చేటు వాటిల్లుచున్నదనియు, నిది కారుచిచ్చువలె తమ రాష్ట్రమునంతయు ధ్వంసము సేయుచున్నదనియు ననుట పొరబాటు. ఏలయన నిది కారుచిచ్చేయై దేశమునంతయు వ్యాపించుగుణముకలదే యగుచో మనయాంధ్రదేశము నంతను నేనాడో వ్యాపించి సర్వనాశనము చేసియుండవలసినది."—14 వ శతాబ్దమున నేకశిలానగరము తురుష్కుల యధీనమైపోయినది. 14–15 శతాబ్దములలో హిందుస్థానీ భాషాభాషితులగు మహమ్మదీయు లాదేశమున బీఠము పెట్టికొని గోల్కొండ బిజాపురరాజ్యములఁ బ్రతిష్టించుకొనిరి. అప్పటినుండియు నేబది డెబ్బదివేల చదరపుమైళ్ల వైశాల్యముగల తెలుఁగుదేశము హిందుస్థానీ భాష క్రింద నలిగినలిగి చచ్చుచునుండిపోయినది. ఇప్పటియిదాఁ ఐదువందలయేండ్లకు గదా ఆదేశమున వ్యావహారికాంధ్ర మీవిధముగ 'ఖరాబై'నదని మనము చెప్పుకొనగలుగుచున్నాము? ఇప్పుడు త్తరసర్కారుల లోను, దత్తమండలములందును హిందీప్రచారాందోళన మారంభింపఁబడి పదునైదు సంవత్సరములు మాత్రమే అయినది. ఇంకను ధారాళముగ వ్యావహారికమున నుపయోగమునకు వచ్చినప్పుడు కదా అది యెంతటి "కారుచిచ్చుగ సర్వనాశన" మొనర్చునో చూడవలెను? హిందుస్థానీ ప్రచార మెంతతీవ్రముగ సాగింపఁబడినను అది మనజీవితములలో ననుభవమునకు రాకపోవచ్చును. వచ్చినను శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారననట్లు "తమకంపు తమకింపు"గ మనవారానందించుటయే జరుగవచ్చును కావున మన కది కారుచిచ్చగుటకు కొన్నివందల యేండ్లకుగాని నిశ్చయముగ నెఱుకకు రాజాలదని నేనూహించుచున్నాను.

ఇఁక నైజాము రాజ్యమునందలి యేబదివేల చదరపుమైళ్ల ఆంధ్రభూభాగమందును 'హిందీ ఉర్దూ ఔర్ హిందుస్థానీ' యని త్రిమూర్తులవలె మెఱయుచున్న భాష త్రినేత్రునికంటిమంటలవలె నచ్చటి వ్యావహారికాంధ్రమును దగ్ధపటలముగఁ జేయుచునే యున్నది. ఇది స్థానికముగ నిన్నియేండ్లు నచ్చటనే యుండిపోయినదికాని మన "హిందీ, ఉర్దూ ఔర్ హిందుస్థానీ ప్రచారసభవారు" తదితర ఆంధ్రభూభాగమంతయు భ్రష్టమగునట్లీ యుపద్రవమును క్రొత్తగ దీసికొని వచ్చినారు.

హిందుస్థానీ పొంతనున్న మనతెలుఁగెట్లు వన్నె చెడియున్నదో తెలుఁగు పొంతనుగల హిందుస్థానీ కూడ నదేవిధముగ వన్నెచెడి యున్నదనియు, ప్రాబల్యముగల యొకభాష పొరుగుననున్న యేభాషనైనను నిట్లు వాసితగ్గియుండుట సహజమేయనియు, పల్లెటూరి తురకలు మాట్లాడు హిందుస్థానీయందు చెరిసగము తెలుగుపదములేయుండుననియు నీవు వ్రాసితివి. వ్యావహారికపు తెనుఁగు 'ఖరాబ'గు విషయమటుంచి తెనుఁగువలన హిందుస్థానీ మాత్రము పాడగుచుండలేదాయను నీవాదమును మనకు బ్రతిపక్షులుకూడ మెచ్చుకొనఁదగిన నమేయతత్వమున వ్రాసితివని చెప్పవలసియున్నది. మనతెనుగువలన హిందుస్థానీవన్నె దఱిగియుండుటకుకూడ మనమే యుత్తరవాదులమా? —ఇక వారు మాట్లాడు సగము తెలుఁగు—సగము హిందుస్థానీ వలన వారి హిందుస్థానీకేమైన నష్టము గల్గినదాయని నీవు ప్రశ్నించుచున్నావు.

ఆహా! కలుగకేమి? ఔత్తరాహులై, స్వచ్ఛముగ హిందుస్థానీ మాట్లాడువారి నెవ్వరినైన నడుగుము. మన తెలుఁగుతురకల తుపికబాసను వారెంత యపహాసమొనర్తురో స్పష్టమగును!

"అటులనే యన్యరాష్ట్రభాషా సంపర్కముగల చోట సంకరమైనటలున్నను స్వచ్ఛమైన తెలుఁగున కట్టి మోసమునులేదు." నియమబద్ధమై స్వచ్ఛమైన

కేసరికుటీరం — బెంగుళూరు



బంగాళా దక్షిణభాగ దృశ్యము

ఆంధ్రుల గ్రాంథికవాణి కెట్టిమోసమును కలుగకపో
వచ్చును. నాతఁగవంతయు నియమశూన్యమై, నిరంతర
మును మనతెలివాళిలనుండు వ్యావహారికవాణి పాడగు
ననియే. ఆంధ్రభాష పాడగుననగ—స్వచ్ఛమై వ్యాక
రణయుక్తమగు గ్రాంథికభాష పాడగునని నేననుచు
న్నట్లు నీవపార్థముల గల్పింపవలదు. అభ్యాసవశమున
నలవరించుకొనఁదగిన గ్రాంథికవాణి హిందుస్థానీవలన
చెడియున్నదని కాని ఇకముందు చెడఁబోవునని కాని
నే నాడుచుండుటలేదు. మహాఘనతవహించియున్న
శ్రీ నైజాముగారైనను ఆంధ్రుల గ్రాంథికభాష
నభ్యసించి, అందు స్వచ్ఛముగ, ప్రౌఢముగ, సుదా
త్తరసాన్వితముగ కావ్యకల్పన మొనరవచ్చును.
ఏబదివేల చదరపుమైళ్ల వైశాల్యముగల తెలుఁగుదేశ
మును అవ్యాహతముగ, సర్వతంత్ర స్వతంత్రముగ
పరిపాలించుచున్న ఆ తురుష్కప్రభువునకు ఈడి
మోక్రేటిక్ దినములలో కడకు తెలుఁగచ్చరములైన
వచ్చునో లేదో నే నెఱుఁగను. మనగ్రాంథికభాష
యొక్క ఘనత "తెలంగీవట్టిగడ్డిబాస" యని తలంచు
హిందుస్థానీ భాషీయులగు తురుష్కప్రభువుల చేతు
లలోలేదు. "విమర్శాదర్శ" విమర్శాదర్శమునఁ
జెప్పఁబడినట్లు గ్రాంథికవాణిని తలఁబగుల గొట్టుట
యనునది మనగ్రంథకారుల చేతులలోనే యున్నది.

"అందును రాష్ట్రేతరాంధ్రులెల్లరు మాతృభాషాభి
మానముగలవారై ప్రత్యేకసంఘములను స్థాపించి
పాటుపడుచున్న ఈదినములలో మన తెలుఁగుభాష
కెట్టిముప్పును వాటిల్లజాలదు." అని వ్రాసితివి. ఏబది
వేల చతురపుమైళ్ల మహావిస్తీర్ణదేశమునందు నైజాము
రాష్ట్రాంధ్రులెన్ని ప్రత్యేకసంఘముల నెన్నియెన్ని
తావుల స్థాపించిరి? సంవత్సరముపొడుగునను వారెన్ని
సభలజేయించుచు ఎట్టియెట్టి కార్యోత్సాహమును
జూపింపఁగలుగుచున్నారు? వారిసమావేశములలోఁ
బ్రోగుపడువారి సంఖ్య యెంత? ఏ సమావేశమున
నెచ్చటనైన ఒకలక్షమంది చేరియుండిరా? అటుపైన
వారుచూపించు మాతృభాషాభిమానము గ్రాంథిక
వాణినిగూర్చియా, లేక తమతలవాళిలనుండు వ్యావ
హారిక వాణీ సంస్కారమునుగూర్చియా?—వారు
తమ వ్యావహారికవాణీ సంస్కారమునుగూర్చి ఎట్టి
యుద్యమములను తలపెట్టలేదని నిరాఘాటముగఁ
జెప్పఁగలను. ఒకవేళ నుద్యమించినను హిందుస్థానీ
రాజభాషగ—ముఖ్యవ్యవహారిక భాషగ నుండువంత
వఱకు నట్టి సంస్కారము జనబాహుళ్యమును చేరఁ
జాలదని నిరాక్షేపముగఁ జెప్పకొనవచ్చును.

అమ్మా! శారద! ఇంతవఱకు నావాదమును
గూర్చిన ముఖ్యాంశములను నీవు దర్శించియుండుట
చేత నీవాదమున నొక్కవాక్యమైన విడువకుండ ప్రతి
విమర్శన మొనర్పవలసినదాననైతిని. నీలేఖయందు
మూడుకాలములకైన జవాబీయకుండ నిప్పటికే కడు
దీర్ఘమైపోయినది. నాప్రథమలేఖ సన్నని యక్క
ములతో దాదాపు పదునొకండుపుటలను మించి
యుండెననియు అదిచదువుటయే దుస్తరమైయుండె
ననియు వ్రాసితివి. ఇప్పుడు దీనినిగూర్చి యేమిభా
వింతువో! కావున నీక నీవువ్రాసినవాని కన్నిటికిని
జవాబీయలేదని భావింపక విస్తర భీతిచేత ప్రధా
నాంశములకు మాత్రమే సంక్షేపముగ నుత్తరమిత్తునని
భావింపవలయును. నూఱుప్రశ్నలు వేయవచ్చును
గాని యొకప్రశ్నకు జవాబిచ్చుట దుస్తరమని నీకు
తెలిసియేయున్నది. పైగా నీక విమర్శింపవలసినవి
నీబుద్ధియందు "అనవసరపు రాజకీయగొడవలు!"
పైగా "ఆడువారముగదా? ఎల్లప్పుడు కలముపనియే
పనిగాదుకదా?"

"తెలుఁగు దక్షిణహిందూదేశమునకంతయు వ్యావ
హారికభాష నేయవలయునన్న తమిళ, కర్ణాట, కేరళులు
సమ్మతింతురా?"—అని ప్రశ్నించుచున్నావు. ఈ
డిమోక్రేటిక్ రోజులలో బహుసంఖ్యాకులకు మాతృ
భాష యగుటవలనను, దక్షిణభారతీయభాషాకుటుంబ
మునందు తెనుఁగునాయికమణి యగుటచేతను దక్షిణ
దేశస్థులందఱు దానిని వ్యావహారికభాషగ, వేయువల

యొనను చున్నాను కాని 'సబబు' లేకుండ తెనుఁగును దక్షిణదేశమునందు 'ఆమ్‌జబాన్' కావలయునని నే ననుచుండుటలేదు. "పదుమూడుకోట్ల భారతీయులు మాట్లాడు హిందీభాష రాష్ట్రేతరవ్యవహారభాషగ నుండరాదని వాదించుచు, రెండుకోట్ల ఆంధ్రులవ్యవహారభాష మాత్రమేయైన తెలుఁగును దక్షిణయిండియా వారెల్ల నేర్చుకొనవలెననుట యేటిసబబు? మనమాతృభాష లైనంతమాత్రమున నెల్లరు నేర్చుకొనుట కర్హత గడించినదా యేమి?"—అని నీవు ప్రశ్నించితివి. హిందీభాషపదమూడుకోట్లనియు ఆంధ్రము రెండుకోట్లనియు నీవు చెప్పుటకు నేనొప్పుకొనను. 1931 వ సంవత్సరపు సెన్‌సస్ లెక్కలనుబట్టి స్వచ్ఛమగు హిందీభాషా భాషితులసంఖ్య—దీనినే పశ్చిమహిందీయందురు— 7 కోట్ల 15 లక్షల 47 వేలయియున్నది. వీనితో బీహారీ, రాజస్థానీమున్నగుభాషలెన్ని యొకలిపి అవిహిందుస్థానీ భాషలుగ పరిగణించి అవి మాట్లాడువారు 10 కోట్లను మించియుందురని సెన్‌సస్ రిపోర్టులనుబట్టి తెలియుచున్నది. 1934 సంవత్సరము డిశెంబరు 'మోడర్న్ రివ్యూ' యందు హిందుస్థానీభాషల మాట్లాడువారి సంఖ్య 12 కోట 12 లక్షల 54 వేలని ఈయబడినది. నా ప్రథమలేఖయందు నే నీసంఖ్యనే తీసికొని హిందీభాషను మాట్లాడువారు 12 కోట్ల 12 లక్షలని వ్రాసియుంటిని. అది నీవ్రాఁతయందు 13 కోట్లెట్లు లైనదో నా కాశ్చర్యముగ నున్నది. '12 లక్షల నొకకోటిగ చేసికొనరాదా' యని నీవాక్షేపింతువు కాఁబోలు! అట్లయిన 2 కోట్ల 63 లక్షల 73 వేలున్న ఆంధ్రులను కేవలము 2 కోట్లనుగా చెప్పి 63 లక్షల 73 వేల తెనుఁగువారిని నీవు కోసివేయ వచ్చునా? హిందుస్థానీయులనుగూర్చి చెప్పునప్పుడు 12 లక్షలను ఒకకోటిగ నీవుగ్గడింపఁ గలవుగాని 64 లక్షల తెలుఁగువారి నొక యర్ధకోటిగనైన నీవు చెప్పఁజాలవు!

ఇఁక తెలుఁగువారికంటె తక్కువసంఖ్యయందు మహారాష్ట్రులు 2 కోట్ల 9 లక్షలును, తమిళులు 2 కోట్ల 4 లక్షలును, కన్నడులు 1 కోటి 12 లక్షలును అయియున్నారు. అనఁగ తెనుఁగువారు మహారాష్ట్రులకంటె 55 లక్షలును, తమిళులకంటె 60 లక్షలును, కన్నడులకంటె 1 కోటి 52 లక్షలును హెచ్చుగ నున్నారు. ఇన్నిజాతులకంటె హెచ్చుగ నుండుటచేతనే ఇంత విస్తీర్ణదేశమున బహుసంఖ్యాకులకు మాతృభాషయగు నాంధ్రభాషయే ముఖ్యవ్యవహారోపయోగముగ నుండదగునని చెప్పుట.

ఇఁక నైజాము రాజ్యములోని యాంధ్రప్రజాబాహుళ్యమునుబట్టి తెలుఁగే వ్యవహారికభాషగ నుండుదగును కాదాయని నేను వ్రాసినందులకు నీవు "నిజాంరాష్ట్రాంధ్రు లింతటి పలుకబడి కలుగఁజేసికొనిన నెవరు కాదందురు?— అచ్చట నెంతయో పక్షపాతము చూపబడుచున్నదని చెప్పుకొనుచు నాంధ్రమే వ్యవహారభాష కావలయునని కోరుట గొంతెమ్మ కోర్కెయేకాని వేఱొకటగునా"— అని వ్రాసితివి.

భారతవర్షమునకు సంపూర్ణస్వాతంత్ర్యప్రాప్తి కవకాశము లేదేమోయని నేను సందేహించినపుడు మన మట్టి యాందోళనమే చేయవలసియున్నదనియు, ఫలించుట ఫలింపకుండుట యనునది దైవయత్నమనియు, ఫలింపనంతమాత్రమున నేతృప్రయత్నములు సల్పెడు మహనీయులు పరిహాసభాజనులు కాఁజాలరనియు, అంగబలము అర్థబలముగల ప్రభుత్వమువారిచే దేశనాయకులకు యోటమియే సిద్ధించుచుండవచ్చుననియు, అయినను వారు గావించెడు ననూనకృషియు, నసదృశత్యాగమును సర్వదాప్రశంసనీయములై భవిష్యదైతిహాసిక పుటలయందు స్వర్ణాక్షరములతో విలిఖింపబడకుండ నుండవనియు నీవంటివి. ఇట్టి యుత్తమాదర్శ వాక్యములను నీవు నైజామురాష్ట్రీయులుసలుపవలసిన యాందోళనము పట్లనైన చెప్పఁజాలక మీదు మిక్కిలి అట్టియాస లడియాసలని పరిహసించుచున్నావు.

# శారదకు ప్రత్యుత్తరము

నిజ మేమనఁగ తెనుఁగువారికి తెనుఁగువా రన్న నే గిట్టదు. బంగాళీవారికి బంగాళీజాతియన్న నుండు నభిమానము నుండు ఆంధ్రులకాంధ్రత్వమునందు సహస్రాంశమైన లేకుండనున్నదని పలుకవలసియున్నది. ఆంధ్రు లెందఱో వారి వ్యక్తిత్వముకూడ నన్ని విధముల నుండుననియు, బంగాళీవారు చిత్తరంజన్ దాసుగారిని వియత్పథమున కెత్తునట్లు ఒక్క నాయకునిక్రింద ప్రజలందఱును కలిసియుండు 'వీరపూజా తత్త్వము' మనయందుఁ గొఱవడియున్నదనియు, మనలిపియందుఁ 'దలకట్టు'ట్టివో మనవారి తలలు గూడ నొండొంటితో కలియకుండ నతుగకుండ నుండిపోవుననియుఁ బలుకవలసియున్నది. మనయందు దక్షులగు మహానాయకు లెందఱున్నను ఇప్పటికికూడ మనదేశమున బహునాయకత్వ మేర్పడుచు, భారతవర్షమునఁ గాంగ్రెసుమహాసంస్థ యుదయించి ఇప్పటి కేబదేండ్లయినను ఒక్కఁ యాంధ్రనాయకుఁడైన కాంగ్రెసున కధ్యక్షపదవి నొందుటయే యసంభవమయిపోవుచువచ్చినది. ప్రకాశమ్, పట్టాభి, సాంబమూర్తి మున్నగు మహానాయకు లేయితరప్రాంతీయనాయకులకును దీసిపోవువారు కారు. అయినను ఆంధ్రమహాజనులందఱు నొక్కుఁ యెత్తున వారినాయకత్వ మామోదించి వంగాలయులు చిత్తరంజనుని ప్రతిష్ఠింపగలిగినట్లు భారతవర్షమున కంతకు నేకైక నాయకులగుట పొసఁగకుండఁ జేసి వేయుచున్నారు.

సరి !—నడుమవచ్చిన యీమాటకేమిగాని యేబదివేల చదరపుమైళ్ల విస్తీర్ణముననున్న నిజామురాజ్యవాసులగు నాంధ్రులగొడవ మనకెందులకని మనవారు మిన్నకొనియుండుటయే నాకు విషాదజనకముగనున్నది. నేను వంగదేశవిభాగమునకైన యాందోళనమును గూర్చి అట్టి యాందోళనమే నైజాము రాజ్య విషయమునగూడ జరుపఁదగియున్నదనియు బ్రిటిష్‌రాజ్యమనియు, నైజామురాజ్యమనియు మనలను రాజకీయ శృంఖలముల బంధించి వేలువేలుకోట్లలో శాశ్వతముగనుంచుట కొప్పుకొనమని యాందోళన మొనర్పవలయుననియు, ఇన్ని సత్యాగ్రహములలో—ఇన్ని శాసనోల్లంఘనములలో మనము ప్రోడలమైయున్నను ఆంధ్రజాతియంతయు నేకముఖమునకు వచ్చునట్టి యాందోళన మొక్కటియు జరుపకుండనుండిపోతిమనియు వ్రాసితిని. ఈసందర్భముననే ఇప్పటి యిండియాబిల్లునందలి ఫెడరల్ విధానమునుగూర్చి దడవి యుంటిని. కాంగ్రెసువారు స్వదేశసంస్థానములలో జోక్యము వలదనియు, అచ్చట స్వరాజ్య మేర్పడియే యున్నదనియుఁ బలుకుచున్నారు. సంస్థానాధిపతులు సహితము ఫెడరల్ రాజ్యాంగపద్ధతివలన తమ యాధిపత్యమునకే యేమిచిక్కు వాటిల్లునో యని శంకించుచున్నారని వ్రాసితివి. శంకించుటలేదు. సర్. మనూభాయ్ మెహతాగారు స్వదేశ సంస్థానములపక్షమున లండను నగరమున మాట్లాడుచు ఫెడరల్ విధానము తమ కామోదకరముగనే యున్నదనియు, ఫెడరల్ ప్రభుత్వమునకు తాము తోడ్పడెదమనియుఁ బ్రకటించినట్లు నేటి వార్తయందున్నది.

ఇఁక 'గాంధీ నొకవిధముగ మానవోత్తముఁడని యీమె యంగీకరించినను, కాంగ్రెసుపైనను తదితర నాయకులపైనను నీమె కేమాత్రము విశ్వాసములేదు.'- అని వ్రాసితివి.

"నిశ్చయముగ నరులలో గాంధికంటె మన్నతుఁడు లేఁడు." అనియు మనకు స్వరాజ్య మెప్పటికైన వచ్చిన నది గాంధీగారి పద్ధతులవలననే—కాంగ్రెసువారి యాందోళనములవలననే జరుగవలయునని నాకు విశ్వాసమున్నదనియు స్పష్టముగ నా ప్రథమలేఖయందు వ్రాసియేయుంటిని.

హిందీ రాజభాషయగుటకు భారతవర్షమునకు స్వాతంత్ర్యప్రాప్తి యున్నదా? లేదా యని నేను తర్కింపవలసి వచ్చినది. అది నీవు బ్రిటిష్‌రాజ్యాంగ తంత్రములందు నాకుఁగల వ్యామోహముగ భ్రాంతిపడితివి. బ్రిటిష్ రాజనీతి నెదుర్కొను మహోద్యమ

ములలో కాంగ్రెసువారి ప్రతిహతమనోరథులు కాక లభ్యమునదియే నేనానించుచున్నాను కాని బ్రిటిష్‌వారి ప్రచండశాసనముల క్రింద మన మాచంద్రార్కముగ నుండిపోవలయునని నేనాశించుచుండుట లేదు. అయినను 'ఈ కదులమెదలరాని నిర్బంధశాసనము' లెట్లు వచ్చినవి?—ప్రతిపక్షు లేమనుచున్నారు?—

**Mr. Satyamurty had claimed that the congress had broken the fetters of the nation. What a travesty of the truth! Are not all the fetters that have been put on the press and on the people due directly to congress activities during the last 15 years? They have committed Himalayan blunders and they have been enshrined in the Statute Book in the form of innumerable safeguards. (Mr. A. Ramaswamy Mudaliar)**

"భారతజాతి దాస్యశృంఖలముల తాము త్రెంపుచుంటిమని సత్యమూర్తిగారు ప్రతాపములఁ బలుకుచున్నారు కాని ఇదిసత్యమునకు విరుద్ధముగ లేదా?" యని ప్రశ్నించుచున్నారు. "కడచిన 15 సంవరముల నుండియు పత్రికలపై ప్రజలపైనను శాసింపబడుచున్న నిర్బంధశాసనములన్నియు కాంగ్రెసువారి యాందోళనములఁ బుట్టిన ఫలితములే కదా?" యనుచున్నారు. "కాంగ్రెసువారు హిమాలయమువంటి తప్పులఁజేసిరి. అవన్నియు గవర్నమెంటువారి శాసనావళిలో 'సేఫ్ గార్డ్సు' ల (మేకుల) క్రింద నవతరించుచున్నవి." అవి వాస్తవముచుండుట లేదా? ప్రతిపక్షులమాట యెందులకుఁ దలపెట్టవలయునని నీవందువు కాఁబోలు! నీయందు దేమైన మహత్వమున్న నది నీకుఁ బ్రతిపక్షముగ వాదమొనర్చు నేను చెప్పినదే యోగ్యతరముగఁ బ్రకాశించును కాదా? అట్లే మన మేమైన వాదమున పూర్వపక్ష సిద్ధాంతములఁ జేయునపుడు ప్రతిపక్షుల వాదముల సహితము పరీక్షించి చూడవలసియున్నది.

వెనుక సరోజినీనాయుడుగారి యాంగ్లభాషాభిమానమును గూర్చిన వాక్యముల నేనుదహరించినప్పుడు ఆమెయాడు మాటలన్నియు నేనేచెప్పితి నన్నట్లు నన్నొక యాంగ్లభాషా 'వ్యామోహితురాలిని' గాఁ జేసివైచినావు. కాంగ్రెసువారి ప్రతిపక్షుల వాక్యముల నుదహరించినందులకు నేను నీబుద్ధియందు కాంగ్రెసునకుఁ బ్రతికూలప్రచారిణి ననిపించుకొనుట కెట్టి యాటంకమునుండ దనుకొందును.

క్రిందటి నవంబరునెల గృహలక్ష్మియందుఁ బ్రచురింపఁబడిన నా 'మనోరమ' రెండవప్రసంగమునందు "శతశతాబ్దములనుండి దాస్యశృంఖలానిబద్ధమైయున్న ఆర్యజాతి స్వేచ్ఛాసంపాదనమునకై తహతహలాడుచున్నది. కొన్ని వందలయేండ్లనుండి మనదేశమును బట్టికొని పీల్చి పిప్పిచేయుచున్న పారతంత్ర్యభూతములను వదలించుకొనుటలో మనమన్నివిధముల పురుషులకుఁ దోడ్పడవలెను. బిడ్డలమహావ్యాధులచే, దారిద్ర్యముచే, వైషమ్యములచే ఈకంటినీరు బంగాళాఖాతముగ—ఆకంటినీరు ఆరేబియాసముద్రముగ విలపించుచున్న భారతమాతను మనము ధీరస్వాంతనుజేసి సమాశ్వాసింపజేసినయెడల నదియే మనజన్మములకుఁ గృతార్థత్వమని మనము తలంపవలసియున్నది." అని ప్రియంవదచేతఁ బలికించితిని. అది నారచనమగుట నీవెఱుఁగనందువు కాఁబోలు! అందలి ప్రథమవ్యాసము 'మనోరమాసంపుము' అను తప్పుపేర వ్యాసముఖమున నా నామముతోడనే ప్రచురింపఁబడినది. అందలి యసందర్భమును నేను సంపాదకులకు తెలుపుకొంటిని. తదాదిగవారు ఆమనోరమావ్యాసముఖమునుండియు విషయసూచికలనుండియు గూడ నా నామమును దుడిచివైచిరి. ఒక్క మార్చిసంచికయందు మాత్రము విషయసూచికలో నా పేరుంచి మనోరమను ప్రచురించిరి. కాని మఱల నిటీవల నెందువలననో మానివేసిరి. ఏమైనను 'మనోరమ' నాచేవ్రాయఁబడుచున్నదని గృహలక్ష్మి పాఠకులెఱుఁగకుండ నుండరని భావించుచున్నాను.

కావున నేను దేశహితమునకు విరుద్ధప్రచారిణి నగుదునో కాదో దేశమెఱుఁగకుండ నుండదు.

# శారదకు ప్రత్యుత్తరము

ఇంగ్లీషువారియందుగాని, ఇంగ్లీషుభాషయందు కాని తదితర బ్రిటిష్‌వస్తువులందుకాని అపరిమితమగు నాకెట్టి వ్యామోహమును లేదు. కాని 'స్వయంతీర్ణః పరాంస్తారయతి' అనునట్లు మనము మొదటతరించి తర వాత నీ సమగ్రభారతవర్షమును—ఈ సర్వమానవ ప్రపంచమును తరింపజేయ నుద్యమించుట లెస్సయని నాయూహ.

ఇఁక 'వార రమణికైవడి బహునీతి రాజనీతి'అను తత్త్వమునకుఁ బ్రత్యక్షతార్కాణముగఁ బ్రబలియున్న బ్రిటిష్‌రాజనీతియందలి అప్రతిహత స్వభావమును గూడ పూర్తిగ గమనించియే మనము వారి యెత్తులకు బ్రతియెత్తులును, వ్యూహములకు బ్రతివ్యూహలును సంఘటించుచుండవలయునని నే నాంధ్రమహాజనులను హెచ్చరించుచున్నాను.

ముష్కరులగు తురుష్కప్రభువులకాలమునందు—అందును ముఖ్యముగ ప్రజాహననపరాయణులు, హైందవహింసారతులునగు తైమూర్‌లంగ్, మాలిక్ కాఫూర్, మహమ్మద్ తుఘ్‌లక్, నాదిర్‌షా,'అహమ్మద్‌షా దుగానీ మున్నగు నరరూపరాక్షసుల కాలమునందును మనముపడిన 'సహింపరాని భరింపరాని' కడగండ్లను బ్రిటిష్‌ప్రభుత్వమున మనమనుభవించి యుండలేదని నేను వ్రాసినమాట వాస్తవమే! చరిత్రమున రూఢికెక్కియున్న సత్యముల నేను తడవినంతమాత్రమున నన్నొక జాతీయవిద్రోహురాలినిచేసి 'చరిత్రపరిశోధకురాల'నని నీవాక్షేపింపరాదు. బ్రిటిష్‌వారి వర్తకనీతియు, రాజనీతియుఁ దేనెపూసిన కత్తుల వంటివని, పయోముఖవిషకుంభములని నాకుఁదెలిక పోలేదు. మన కెన్నిస్వరాజ్యములు ఎన్ని 'డొమినియన్ స్టేటస్'లు ఎన్ని సంపూర్ణ స్వతంత్రాందోళనము లనుభవమునకు వచ్చుట తటస్థించినను బ్రిటిష్‌వారితోడి సంబంధ మింతటనంతట వదలిపోవునది కాదని వ్రాసితిని, దానికి నీవు భరతవర్షమున బ్రిటిష్‌వారి పెత్తనము స్థిరముగానుండుగాక యని నే నాశీర్వదించుచుంటినని యపార్థమును గల్పించుచు నుగ్గడించితివి.

"He came and prayed for the continuance of the benign British rule in India"— అని సర్ ఆర్. వెంకటరత్నమునాయుఁడు గారిని గూర్చి యిండియా మంత్రియగు మాంటేగూపలికినట్లు నేనీ బ్రిటిష్‌ప్రభుత్వమే చిరస్థాయిగా నుండునుగాక యని భగవత్ప్రార్థనమేమియు చేసియుండలేదు కదా?

ప్రసన్నయాదవమున

శా. పోరాటంబులు పెట్టి యొండొరులకున్
భూపాలక శ్రేణిలోఁ
జేరం దీయదు రండునొక్కని పరుం
జెండాడి యెల్లెల్లొ, భూ
భారంబంతయ 'బాపినార'మిది 'మా'
ప్రజ్ఞాబలంబంచు నూ
రూరం బల్మరు జాల 'బంచెదరు'గా
నోహోయనన్ భూజనుల్.

అనునట్టి రాజనీతిని బ్రదర్శింపుచు బ్రిటిష్‌వారీ దేశమును స్వాధీన మొనర్చుకొనుటయేగాక ఎప్పటికిని ఆమహా సూత్రముచేతనే మనలో నిన్ని పక్షములు కలుగునట్లు స్పర్థలఁ కలుగఁజేసి ఆసేతు శీతాచలమును అనుశాశింప నూహించుచున్నారని నాకు స్పష్టముగఁ దెలియును. నీబుద్ధి యందివన్నియు మనహింపస్థానీ విషయికమగు వాదమున 'అనవసరమ'గు 'రాజకీయపు గొడవలు' కావున నిఁక వానినిగూర్చి హెచ్చుగ వ్రాయవలసిన యావశ్యకతయేలేదు.

నాకయాచితముగ 'చరిత్ర పరిశోధకురాలు, మంచి విద్యావతి, మిస్ మేయో' మున్నగు బిరుదములఁ గటాక్షించి పాఠకలోకమునకు సంశయవిచ్ఛిత్తియగుట కవకాశములేదని నిరాఘాటముగ వ్రాసియు నచ్చుటనే యసందర్భముగ "నేనట్టి విద్యావతికి సమాధానమీయ నూహించుట తగదుకొండతో డీకొనుటయే యగును." అని వ్రాసికొంటివి. వ్రాసికొన్ననేమి? "తగరే కొండంగనిరోటమి పెట్టినట్లు" — అనుకవివాక్య ముండనేయున్నది.

# గృహలక్ష్మి

హిందీప్రచారసభవారు ప్రచురించుచున్న కరపత్రములను బట్టి చెన్నరాజధానియందింతవఱకు హిందీ చదివినవారి సంఖ్య 5 లక్షలనియు, వ్యావహారిక భాష పొందిన వారి సంఖ్య 4 లక్షలనియు హిందీప్రచారము నిమిత్తమై ఖర్చయిన ధనము 3 లక్షల రూప్యములనియుఁ దెలియవచ్చుచున్నది. ఇది దినదిన ప్రవర్ధమానమగుచు నెంత తీవ్రరూపమును దాల్చుచున్నదో పై చెప్పుచున్నవి.

కావున వెనుకటి లేఖలో వ్రాసినట్లు ఆధ్యాత్మిక విజ్ఞానమునకై సంస్కృతము, రాజభాషయగుటవలన నాంగ్లము, మాతృభాష గావున తెనుఁగు—ఇన్ని భాషల మనవారభ్యసింపవలసి యుండఁగ పైగా 'రాష్ట్రభాష'యని హిందుస్థానీనిగూడ మనవారేల నెత్తినెక్కించుకొనవలయునని నేనడుగుచున్నాను.

క్రిందటి లేఖను శ్రీమతి సరోజినీనాయుఁడుగారు ఆంగ్లభాషామహత్వమును గూర్చి లాహోరునందుపన్యసించిన దినమందు అనగ ఫిబ్రవరి 17-వ తేదీయందు గృహలక్ష్మి కంపుకొంటిని. లేఖాంతమున ఆ తేదీయు, 'నీ మైత్రినభిలషించు దివాకర్ల శారదామణి' అనియు బ్రచురితములు కావలయునని నేను కోరుకొంటిని. ప్రమాదమునఁ గాఁబోలు ముద్రణమునవి తొలఁగింపఁబడినవి. ఈ లేఖయు నీ మైత్రి నభిలషించుచు ముగించుచున్నానని నీవు తెలిసికొందువు గాక! 'వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే' అని పెద్దలు సెలవిత్తురు. వాదవశమున ప్రమాదాస్పదముగ నేనేమైన వ్రాసిన మన్నింతువు గాక!

దివాకర్ల శారదామణి.

# లెమ్మోయి లెమ్మోయి

భారతావని గాఢాంధకారమెల్ల బాపవచ్చిన విజ్ఞాన దీపమదిగో
దాని నవనవ దేదీప్యమానరుచుల కొరవడకమున్నె లెమ్మోయి భరతపుత్ర!
దీనులకుదక్కు కబళంబు దెగువగొట్టి కడగిసంపన్ను నౌదలిరాగరసకలిత
భాస్కరుని గతి సన్నఁపు వలిపెములను చుట్టబెట్టెడు కన్న సంశుద్ధమతులు
తోడిపేదలు వడకిన దొడ్డనూలు తోడిపేదలు నేసిన బొడ్డబట్ట
కట్టి తొడగి ముస్తాబయి, కనిమొకనకొ భారతావనినిక్షిప్త భాగ్యములను
పైకిలాగంగ నొకచేయి పరవుమోయి త్వరగ లెమ్మోయి లెమ్మోయి భరతపుత్ర!
చెప్పులను గుట్టుటకునైన సిద్ధులైన గ్రామ్యులెట్ల దీనంపు మొఱ్ఱ వినవోయి.
మనుచునుండుట భారతిమాత కొరకె మరణమొందుట భారతమాతకొరకె
గాని సౌఖ్యంపు వీచులదేలగాదు త్వరగ లెమ్మోయి లెమ్మోయి భరతపుత్ర.

పోతుల జయలక్ష్మి

# శారదలేఖలు

సౌభాగ్యవతి కల్పలతకు,

నెచ్చెలీ! నేనెప్పుడు రైలుప్రయాణము చేసినను స్త్రీలపెట్టెయందే కూర్చుందును. స్త్రీలకు ప్రత్యేకసౌకర్యము లొనగూర్చి యుండగా మగవారిపెట్టెలో గూర్చుండి యవస్థపడనేలననియు, వివిధరకముల స్త్రీలతో కలిసి కూర్చుండినచో వారి మంచిచెడ్డల గ్రహింపవచ్చును గదాయనియు నేను సామాన్యముగా స్త్రీలపెట్టెయందే కూర్చుండి ప్రయాణము చేయుదును.

కాన కడచిన యేప్రియలునెలలో నేను మా భావపురినుండి మత్స్యపురికిని మత్స్యపురినుండి విశాఖపురికిని చేసినప్రయాణములోగూడ స్త్రీలపెట్టెయందే ప్రయాణము చేసితిని.

వేసవికాలము: రాత్రిసమయము: పైగా పెండ్లిండ్లదినములు: బెజవాడలో బందరు బండి దిగి వాల్తేరుపోవు బండి నెక్కితిమి. అబ్బా! ఆరేయి జనసమ్మర్దనమువలన పడిన శ్రమ వర్ణనాతీతము. ప్రతిస్టేషనులోను బండి ఆగుచునేయున్నది. జనులు తండోపతండములుగా నెక్కుచునేయున్నారు. మనస్త్రీలపెట్టె యెక్కడనో కట్టకడపట గార్డుద్వార వారి ప్రత్యేకసంరక్షణక్రింద నుండును గదా, అయినను మామూలు ఉపేక్షాభావము లేక అక్కడికిని స్త్రీలువచ్చి పెట్టెలో జనులు క్రిక్కిరిసియుండుట నైనగమనింపక, తాము గాని తమ సామానులుగాని యుండుటకైన నవకాశ మున్నదో లేదో యనినైన శంకింపక నెక్కుచునేయున్నారు. ఇందు కేవలము జనులమౌర్ఖ్యమే గాదు రైల్వేవారి ప్రోద్బలమును నున్నది. ఈపెట్టెలో నింతమంది మాత్రమే యెక్కవలయునని ప్రతిపెట్టెయందును వివిధభాషలలో విస్ఫుటమైన యక్షరములతో వ్రాయబడియుండును. కాని ఆయక్షరములకు నోరా? కన్నా? అందువలననే వానిచూచిన రైల్వేయుద్యోగులకుగాని ప్రయాణీకులకుగాని భయము లేదు. లక్ష్యములేదు. ఎవరిపనివారిది. ఇన్ని దినములనుండి పొగబండి ప్రయాణము నలుపుచున్నను జనులకు రైలుపెట్టెలో నెందఱు కూర్చుండవలయునో, ఎట్లు కూర్చుండవలయునో, తమహక్కుబాధ్యతలెట్టివో, పరిశుభ్రత నెట్లు పాటించవలయునో ఏమియు తెలియదు. గ్రుడ్డెద్దు చేనబడినటు లేదియో యొకపెట్టెలో నెక్కుటయు నక్కడ తెలిపిగానున్న నమ్మో బాబో యనుటయు తుదకు "ఏమో యీనాల్గు గడియలేగదా యేబాధపడినను" అని మన స్సమాధానముచేసికొని యచ్చటి కష్టముల

కన్నిటికిని యూర్చి తమస్టేషన్ వచ్చువరకేదియో విధముగా ముక్కుమూసికొని కూర్చుండి యీవలబడుటయు, నిది ప్రయాణికులెల్లరు చేయుచున్న పని.

ఇంతయేందులకు? స్త్రీలపెట్టె ప్రత్యేకమనియు నందు మగవా రెక్కరాదనియు నందఱకు తెలియునుగదా, అయినను ఖాళీగానున్నదనియో తమ ఆడంగులు కూర్చుండిరనియో నేదియోనెపమున స్త్రీల పెట్టెలోని కెక్కుటకేతెంచి యందఱచే 'దిగుదిగు'మనియనిపించుకొను మగవారు ఇప్పటికిని యనేకమంది. అంతియేగాదు వలదనుచుండగానెక్కి దిగవలసినదనగా మీరు మగవాళ్ల పెట్టెలోని కెక్కుటలేదా? మేము మీ పెట్టెలో నెక్కిననేమి యని ధిక్కరించు వివేకవంతులును గలరు. అయితే స్త్రీల పెట్టెపై వ్రాసియున్నట్లుగా తాము కూర్చున్న పెట్టెలపై 'పురుషులకుమాత్రమే' అని వ్రాసియుండలేదనియు వ్రాసియున్నచో నేస్త్రీగాని యందు కూర్చుండుటకు రాదనియు నాపల్లెటూరి మనుష్యులకు తెలియదు.

సరి సరి. ఆమాటయు నీమాటయు చెప్పుచు నాటి రాత్రి ప్రయాణపుమాట వెనుక బడనేసితినే. అసలు నేను చెప్పగలచినవిషయమది. మాబండి యేలూరు స్టేషను దాటెను. మేము కూర్చుండిన కంపార్టుమెంటు జనులతోను సామానులతోను నిండి కాలుపెట్ట నెడములేకుండెను. కూర్చుండుటకు స్థలము చాలనందున జనులరాకపోకలకు వినుపబడిన సందులలోగూడ పెట్టెలు పరుపుచుట్టలువేసికొని కూర్చుంటిమి. కొందఱు నిదుర నాపజాలనివారు బల్లలక్రిందకుజరిగి పడుకొని నిద్రింపసాగిరి. ఆదుర్గంధములో, నా జనత్రొక్కిడిలో, నా గందరగోళములో వారు గుఱుపెట్టి నిద్రించుటజూడ నిద్ర సుఖమెఱుగదన్నసామెత నిక్కమనిపించెను. రాజమండ్రికీవల నేదియో పెద్దస్టేషనులో మా బండి యాగినది. ఒక రైల్వేయుద్యోగి గుంపెడుమందిస్త్రీలను వెంటవేసికొనివచ్చి పెట్టెలో స్థలములేదని మనవిచేసికొనుచున్న స్త్రీలనెల్లర ధిక్కరించి వెనుకకు సర్దుకొనుడని గద్దించి వారినెల్లర మాపెట్టెలో త్రోసి వెళ్లెను. వారితోబాటు వల్లమాలినసామాను గూడ వచ్చిపడెను. ఆయెక్కినవారు యెనిమిదేండ్లబాలకు వివాహముచేయునిమిత్తము యానాముపోవుచున్న సంపన్నగృహస్థులగు కమ్మపెండ్లివారట. వారు రిజర్వుడు కంపార్టుమెంటుకొఱకు యత్నింపగా దొరకలేదట. అందువలన నాయధికారి యీవిధముగా వారికి వీలుచూపెనట. అదివఱకే సమ్మర్దముగానున్న పెట్టెలోనికింతమంది యొక్కమారుగా వచ్చిపడుటచే నాపెట్టెలో నెన్ని జగడములు, నెన్ని యేడుపులు! ఎన్ని దౌర్జన్యములు నెన్నిత్రోపిళ్లు నెన్ని తొక్కుళ్లు జరిగినవో చెప్పజాలను. వేసవికాలములో నీజనత్రొక్కిడికి తాళలేక పసిబిడ్డలేడ్చిన యేడ్పులు సరే సరి. ఆబాధకు పెద్దవారికిగూడ నేడ్పు వచ్చినదనిన నమ్ముము ఆడువారు చేసికొనిన పాపమేమోగాని యన్నిటిలో పక్షపాతము చూపబడినటులనే రైలుపెట్టెలలో గూడ పక్షపాతమే గదా! ఎప్పుడైన చూడుము.

క్రించుమించుగా పురుషప్రయాణికు లున్నంత మంది స్త్రీ ప్రయాణికులును నుండుచునే యుందురు. అయినను నెటువంటి యొత్తిడి సమయమునందైనను సరియే. స్త్రీలపెట్టె యొకటియే. ఆయొక్క పెట్టయైనను నెచ్చటనో బండికి చివరనుండును కాన సాదారణముగా పెద్దస్టేషనులందుతప్ప నీపెట్టె ప్లాటుఫారముమీదకు రానేరాదు. ఇక నక్కడ బండిదిగలేక పిన్నలుపెద్దలుచేయు సర్కసు ప్రాయ శక్యముగాదు. ఇదియేగాదు ఈపెట్టె కట్టకడపట నుండుటవలన మరియొక్కచిక్కు గూడ గల్గుచుండును. ఆటవస్తువులుగాని చిఱుతిండివస్తువులుగాని యీ కొనకురావు. సామాన్యముగా మధ్యపెట్టెలవద్దనే తిరుగుచుందురు. ఇక నివి కావలయునవికావలయునని మారాముపెట్టు చిన్నపిల్లలో స్త్రీలపెట్టెలో తల్లులవద్దనుండెదరు. ఆవస్తువు లాదగ్గరకు రావు.అందువలన నాతల్లు లాపిల్లలతోబడెడి యవస్థ వర్ణనాతీతము.

ఇకలకక్కూసు మాట. భూలోకనరకమనిన నదియే. ఇన్నాళ్లుగా పొగబండి ప్రయాణములుచేయుచున్నను ప్రయాణికులకు లకక్కూసులో మలమూత్రవిసర్జనముచేయుట తెలియదు. ఉపరిభాగమంతయు పాడుచేయుదురు. ఆబండి బయలుదేరినచో మరల నాపివేసినచోటనే దానికిబాగు. ఈలోపల నాబండి రెండుమూడుదినములు ప్రయాణములో నుండవచ్చును. వందలకొలదిమైళ్లు వచ్చియుండవచ్చును. వేలకొలదిజను లెక్కిదిగియుండవచ్చును. ఏమైననుసరియే నడుమ నడుమ పెద్దస్టేషనులోనైనను వానిని పరిశుభ్రపఱచు నేర్పాటులులేవు. కాన లకక్కూసులస్థితి అంతే, ఈప్రయాణికుల కర్మమింతే, ఈలెట్రినులింతయసహ్యాకరముగా నుండుటచే వృద్ధులు, నశక్తులు, ముఖ్యముగా మాటిమాటి కవతలకుబోవలసిన గర్భిణీ స్త్రీలుపొందు కష్ట మింతంతగాదు. అయినను వానిని గమనించువా రెవరు? టికెట్లులేనివారిని కనిపెట్టుట కుద్యోగులున్నారుగాని లకక్కూసులు బాగుగాలేవని పరిశీలించువారులేరుగదా.

మూడవతరగతి ప్రయాణికులవలననే తమ కధికాదాయమని రైల్వే డిపార్టమెంటువారే యొప్పుకొందురు. అయినను సౌకర్యములులేక విశేషశ్రమపడువారును నీమూడవతరగతివారే. పాశ్చాత్యదేశములలో వారిహోదాలనుబట్టి ఛార్జిలలో తారతమ్యముండునేగాని సౌకర్యములలో భేదముండదని చెప్పుదురు. కాని యీదేశములోనట్టి ప్రజాహితసౌకర్యములు గగనకుసుమములుగదా.

ఈమధ్య క్రొత్తరకము మూడవతరగతి బండ్లు తయారుచేయబడుచున్నవని యెసంబ్లీలో చెప్పబడినట్లు పత్రికలలో చదివితిని. ఇక వానిస్థితి యెట్లుండునో! సౌకర్యములెట్లుండినను ప్రయాణికు లెక్కుటకొకత్రోవయు, దిగుటకొకత్రోవయు ప్రతిపెట్టకును నేర్పాటుచేయబడిన బాగుగానుండునని తోచెడిని. ఏలనందువా? ఏస్టేషనులోనైనను నెక్కువారికిని, దిగువారికిని నాతురత

రొకటియే. కాన నెక్కవలసినవారును దిగవలసినవారును తలుపుతలుపు దగ్గరను ఘూర్ణణపడుచుందురు. అంతలొందరేల దిగనీయమని దిగువారును, అంతలొందరేల నెక్కనీయమని యెక్కువారును నొకరినొకరు మందలించుకొనుచుందురు. కాని యెక్కుటయు దిగుటయు నిముసములలో జరుగవలసినవని యగుటవలనను, నాలస్యమై బండి కదలినచో నిరువురకును కష్టమేయగుటవలనను త్వరపడుట యందఱకును నగత్యమే యగును. కాన నిది మందలించవలసిన విషయముగాక గమనించవలసిన సంగతై యున్నది. కల్పలతా, ఆంధ్రదేశమున రైల్వే ప్రయాణికుల సంఘ మొకటి యుండెననియు వారి నివేదిక యీ మధ్య ప్రకటింపబడెననియు, గృహలక్ష్మిలో చూచితిని. వారు అనారోగ్యకరమగు పులుసన్నము, పెరుగన్నములను స్టేషనులవద్ద నమ్మించుటకు శ్రమపడుటకంటె పైన వివరింపబడిన మూడవతరగతి ప్రయాణికుల యిబ్బందులను తొలగించుటకును, ముఖ్యముగా స్త్రీల కంపార్టుమెంటులలో గల్గెడి కష్టములను నివారించుటకును ప్రయత్నించిన బాగుగా నుండును.

భావపురి
1—9—1935

ఇట్లు
మిత్రురాలు
శారద.

# విశ్వాత్వదృష్టి - మహిళాభివృద్ధి

[ఇది సమిష్టి మహాయుగము—ఒక్క శరీరములలోతప్ప భేదమన్నది మిధ్య—భారతదేశముకూడ ఈ విశ్వాత్వదృష్టి ధర్మమును మీరజాలదు—ఈ దృష్టివలన ప్రయోజనములు—మతాధమత విచ్ఛేదము, స్త్రీజన స్వాతంత్ర్యము—పాశ్చాత్యులే ధర్మప్రారంభకులు—రష్యా వారిలో తమానికము—రష్యాలో స్త్రీ సంపూర్ణ విశ్వాత్వము—ప్రాచ్యదేశములో తొలుదొల్తనే ఈ విశ్వాత్వదృష్టి యెందుకుప్రారంభముకాలేదు?—పడమటి దేశములలో ప్రారంభానుకూల పరిస్థితులు—పాశ్చాత్యులే మూఢాచారములమీదికి ముందెట్లు తిరగబడగలిగిరి—నిజమైన తిరుగుబాటు ఎప్పటినుంచి—ప్రాచ్యస్త్రీలు యీ హక్కులు మున్ముందు ఏల సంపాదించలేకపోయిరి—ఇప్పుడెట్లు సంపాదించుచున్నారు—సనాతనులుకూడ లొంగుచున్నారు—ఇస్తాంబులు మహాసభ—హిట్లరు సనాతనాదుల కర్తవ్యము.]

## ఇది సమిష్టి మహాయుగము

ఇది సమిష్టిమహాయుగము. ఎవరిమానమున వారు అని అనుటకు వీలులేనియుగము. ప్రపంచమంతయు నొక్కటేయని ప్రతీ చిన్నవ్యక్తియుకూడ తలంచు యుగము. 'ఏకమే వాద్వితీయంబ్రహ్మ' అని పూర్వమే వేదాంతులో ఏబ్రహ్మతత్వమునో లేక మరియే మూల తత్వమునోగూర్చి ప్రశంసించుచుండిరికాని, నేడు ప్రతి దేశపు కార్మికుడును ప్రపంచపుకార్మికులెల్లరు నొక్కటే యని నమ్మి సాంఘికలేక సర్వసామ్యతత్వ ప్రబోధకుడగుచున్నాడు. ప్రతిదేశపు సహకారియు సహకారమును సర్వప్రపంచసంస్థగాచేసి సకలదేశీయ సహకార ఉద్యమ సంస్థలను దాని శాఖామాత్రములుగా జూచుచున్నాడు. ఇట్లే స్కౌటు లేక బాల భటోద్యమము విశ్వవ్యాప్తమై ఒక్క మోస్తరు చర్యలు, చిహ్నములు, మర్యాదలు మాటలు శిక్షణములు, గీతములతో నిండియున్నది. దివ్యజ్ఞానసమాజమునకు అఖిలప్రపంచమునను శాఖలే. అసలు అఖిల ప్రపంచదేశముల ఆర్థికసంస్థలు, ప్రభుత్వసంస్థలు, యైన్నికవిధానములు, విద్యావిధానములు, వ్యాపార విధానములు, వైద్యవిధానములు సర్వమును ఒకటితో నొకటి సంప్రతించి, ఒకటి నొకటి అనుకరించి, పోలి ఏకత్వ మహాతేజముతో రాణించుచున్నవి. ఎక్కడెక్కడి భేదములును నామమాత్రములై, ప్రధాన భేదములెల్ల ఛేదింపతగినవై యుండవలెనని విశ్వము యొక్క ఆదర్శము.

## ఒక్కశరీరములలో తప్ప భేదమన్నది మిధ్య

మానవకోటిలో ఒక్క శరీరభేదములుతప్ప (వానిని కలిపి ముద్దచేయుటకు వీలులేదు గనుక) జాతి, కుల, కుటుంబ మతాదిభేదములులేక, సర్వసమత్వము అతివేగము వ్యాప్తమగుచున్నది. ఏ వ్యక్తిని చూచినను తనను తనకుటుంబమును తనజాతిని మతమును

మొదలగు పూర్వకాలపు సంకుచిత వలయములను మీరి తానుచెందియున్న విశ్వమానవత్వాదర్శమును తొలినుండి యూహించుకొనువాడే—అసలు మాతృగర్భమునుండియే నేడు విశ్వమానవత్వము, విశ్వశ్రేయము, విశ్వైక్యత మొదలగు విశ్వాదర్శములు ముందు ప్రసవించి ఆ పిమ్మట ఆడపిల్లయో మగబాలుడో పుట్టుచున్నాడా అనిపించును. ఇది వేదాంతుల తత్వముకాదు, జ్ఞానులభావముకాదు, భక్తుల పరవశత్వముకాదు, వ్యక్తుల పిచ్చితనముకాదు; ప్రతీ వ్యవహారస్తుని నిత్యసంభాషణము, ప్రతిబాలుని నిత్యపాఠము, ప్రతీ ఉపన్యాసకుని హెచ్చరిక, ప్రతీ కవియొక్క ప్రమాణము. రష్యావంటి దేశములో తల్లీబిడ్డ, మగడూ పెళ్లము, తన్నూపర, మొదలైన జంతుసహజమైన తుచ్ఛభేదములెల్లపోయి, ప్రభుత్వమొక్కటే విశ్వమై, అదివిశ్వమానవులదై, సర్వమును తద్విశ్వాధీనమై, సమత్వముకాదనువారిని, పరఅని భావించువారిని అందరిని ఛేదించుచున్నది. రష్యా అన్నది కేవల మొక్కదేశముకాదు. హిందూదేశమునకు మూడురెట్లు విశాలమై అనేక భూభాగముల జనభేదముల భాషాభేదముల కూటము. అట్టి మహాఖండములో ఈ యేకత్వము యీ సమానత్వము యెంత చక్కగా వ్యాపించియున్నదో, టర్కీ, జర్మనీ, పోలండు, జపాను మొదలగు దేశములలో కొంతవరకు దేశీయత, చాలావరకు విశ్వత్వము అంతమూరమే అల్లుకొనిపోయి వ్యాపించి సర్వాధికార ప్రభుత్వము లేర్పడి శాసనములద్వారా మార్పులద్వారా తమ సంకల్పముల నెరవేర్చుకొనుచున్నవి.

## భరత దేశముకూడ

## ఈ విశ్వత్వదృష్టిధర్మమును మీరజాలదు

జాతులోయి, కులాలోయి, మతాలోయి, ఆచారాలోయి, శాస్త్రాలోయి అని యేకొంతమంది సనాతన పిచ్చిఛాందసులో దేవులాడి యేడవడమే శేషించుచున్నదికాని ఈ మహోఝుంఝూనిలముయొక్క ధనరును భారతదేశముమాత్రము తప్పుకొనగలుగుట కల్ల. అస్పృశ్యత నివారణయగుచున్నది. సకలసంఘైక్య భోజనములు, వివాహములు సర్వసామాన్యములగుచున్నవి. పూర్వశాస్త్రములు, కర్మలు, మొదలగునవి బుగ్గియగుచున్నవి. విశ్వత్వవేదాంతచర్చలుకాక యీ దిగువవానిని యే చైతన్య గౌరాంగ హరనాథ రామకృష్ణ దివ్యజ్ఞాన బ్రహ్మసమాజాది సంస్థాప్రచారకులును పెదవులతో నుచ్చరింపనైన నొల్లరు. ఈ తత్వశాస్త్రవేత్తలుపుట్టుటకు చాలాకాలము ముందే రైళ్లు, హోటేళ్లు, యిస్కూళ్లు, సభలు, పట్నాలు, సంతలు, బజార్లు, కచ్చేరీలు మొదలగు సంస్థలు ఈ సమానత్వమును సర్వత్ర తత్వరూపముగ కాకున్నను ప్రత్యక్షరూపముగనైన సాధించియే తీరినవి. అవి సాధించినవానిని సమర్థించి ప్రాత మూఢమతవిశ్వాసముల సంహరించుటతప్ప పై ప్రచారకసంస్థలు క్రొత్తగా బోధించునదేమియును లేదని యెల్లరకుం దెలియును.

## ఈ దృష్టివలన ప్రయోజనములు

ఇట్టి విశ్వత్వదృష్టివల్ల నెన్నియో ప్రయోజనములున్నవి. మున్ముందు మానవకోటికి కూపస్థమండూకత్వముపోవును. వారికళ్లువీడి వారియిల్లు, వారివూరు, వారిదేశము, వారిజాతి కులము ఆచారము మొదలగు పురాతన సంస్థలేకాక వీటి తాతసంస్థలు ప్రపంచమునందంతట వ్యాపించియున్నవని తెలియనగును. ఇంత విశ్వదృష్టి ఇంత విశ్వపరిచయము మానవకోటి కేనాడు కలుగునో వారు కేవల స్వంతగ్రామాచారాదులతో తృప్తిపొందక, అన్యుల ఆచారాదులతో పోల్చుకొని, యేది బాగుంటే దాని నవలంబించి, బాగుండని తమవానిని విసర్జింపవచ్చును. పూర్వము అనగా యీ మోస్తరు విశ్వత్వము ప్రపంచములో వ్యాపించనిరోజులలో, బుద్ధిమంతులో, బలవంతులో,

వర్తకులో, మతపీఠాధిపతులై, రాజులు జమీం దారులై, ధనవంతులై జనసామాన్యమునెల్ల అజ్ఞానములోముంచి మూర్ఖులుగను, దుర్బలులుగను, భయస్థులుగను, పేదలుగను చేసి బానిసలుగను మార్చి తమ చెప్పుచేతలలో వర్తించు మృగతుల్యులుగ నొనరించిరి. ఇది ఒక అన్యాయము దీనిమీద మనము తిరగబడి ఛేదించవలెను అను జ్ఞానమే వారికి లేకుండా చేసిరి. పైగా దేముణ్ని బ్రాహ్మణ్ని ఫాదర్ని సేవిస్తే పుణ్యం రాజును కొలిస్తే క్షేమం కళ్యాణం, వర్తకుడు లేకుంటే ప్రపంచమే నాశనమవుతుంది కనుక వానికి సపర్య చేయడం కర్తవ్యం అనే క్షుద్రభావములను జనులకెల్లరికి నూరిపోసిరి. బ్రాహ్మణాది మతాధికారులు, క్షత్రియాది రాజులు, వైశ్యాది వ్యవహారస్థులు లేకుంటే యిప్పుడు సాంఘికవాదులు సంస్కారులు మొదలగు వారు బోధించు విశ్వాత్వమెన్నియుగములకో ముందు నుండి యీ ప్రపంచములో రాణించవలసినది. కాని పై మూడుతరగతులవారును తక్కిన జనులనెల్ల తమ స్వార్థముకోసము బానిసలుగా చేసుకొనబట్టియే ప్రపంచనాగరికత యిట్లు క్షుద్రమై క్షీణించుచున్నది. తిరిగి ప్రపంచము ఈ పై జాతులు పుట్టనియుగములోవలె బాగుపడవలెనన్న యీ మూడుతరగతులను పటాపంచ లొనరించవలెను. అప్పుడుమాత్రమే జ్ఞానముకాని బలముకాని ధనముకాని యే యొక్క చిన్నసంఘములోను నిబిడీకృతమై బూజుపట్టిపోయి పరహింసాపరాయణత్వమూని ఘోరరాక్షస తత్వములు దాల్చక, సర్వులకు సమముగ మాత్రము వ్యాపించగల సుదినములు భూదేవి సంతానమునకు రాగలవు.

## మూఢమత విచ్ఛేదనము

పై మూడుసంస్థలవారే ప్రపంచపు టజ్ఞానమునకు, అపౌరుషమునకు అభాగ్యమునకు కారకులు—వీరు మువ్వురును సమకారకులే యైనను వీరందరిలో మతాధిపతులు లేక మతాధిపతు లెక్కువ పాపులు. వారు లేకుంటే పై సిద్ధాంతములే లేకపోవును, సిద్ధాంతములే లేకుంటే తక్కిన తరగతులు రెండును వారి కాసరాగా ఉండకపోదురు. వారుచెడిపి బానిసలుగా చేసినది ఒక్క జనసామాన్యమునేగాక స్త్రీలోకమునెల్ల నవమానించిరి. పురుషునకు బహు భార్యలు బహు వివాహములు కూడును—స్త్రీల కొక్కటికంటె యెక్కువకూడదు. పురుషుడు తాను పిల్లనుచూచి బాగున్న చేసుకొనును లేకున్న మానును—స్త్రీని అతి బాల్యమున తన తండ్రి యెవనికో యెరుగనివానికి కన్యాదానముచేసివేయును. పురుషుడు స్త్రీని తన యిచ్చవచ్చినట్లు చూడవచ్చును—స్త్రీ నిత్యము పతి భక్తితో యేడ్చుచు దాస్యముచేయవలసినది. పురుషుడు పురములవెంబడిపోయి ఉద్యోగములుచేసి, శ్రీమంతుడు కావచ్చును—స్త్రీ వంటింట్లో కూర్చొని వండడము, పిల్లలను కనడము పెంచడముతప్ప రెండవ పని తలపెట్టకూడదు. పురుషుడు పండితుడుకా వచ్చును — స్త్రీకి చదువువస్తే చెడిపోవును. పురుషుడెక్కడపట్టినక్కడ షోకులుచేయుచు వ్యభిచరించనూ వచ్చును—స్త్రీ మగనియెదుటతప్ప అందముగా అగుపించరాదు. పురుషిడిదే ఆస్తిఅంతా—స్త్రీకి మనోవర్తియైనా ఒకొక్కప్పుడు లేదు. ఇవి పూర్వపు మతాలు, పూర్వపు రాజ్యాలు, పూర్వపు వ్యవహారాలు లేక వ్యవహారస్తుల పంథాలు—అవతల జనసామాన్యము, ఇవతల స్త్రీలుకూడా యీ యాతనలన్ని యిన్నియుగములలోను అనుభవించినవారే.

## పాశ్చాత్యులీ ధర్మప్రారంభకులు

అయితే పాశ్చాత్యదేశస్థులకు ముందుకళ్లువిడ్డవి కనుకను, వారికి అభివృద్ధి నాసించేలక్షణము సరిగా వున్నది కనుకను, సర్వులను సమానంగా చూడవలెననెడి సహోదరభావము మనకంటె వారికెక్కువ సహజమైనది కనుకను, ఆదేశములలో ఈ రెండు శాఖలకు మనదేశములలోకంటె విమోచనము వేగము

కలిగినది. అక్కడ విద్య యెల్లరికి నిర్బంధము ఉచితము కనుక విద్యాధికవర్గమెందు ప్రత్యేకముండ అవసరము లేదు. అక్కడ సైనికశిక్షణ ముచితము నిర్బంధము కనుక బలిష్ఠ ప్రభుజాతి లేక రాజజాతి వేరే వుండ నక్కరలేదు. వ్యవహారి మెవ్వరైనను చేయవచ్చును. అందుకు తగిన విద్య, శిక్షణము ప్రతిపాఠశాలయందును నప్పఁబడును. ఇట్లు ఆదేశము లన్నిటిలోను పూర్వపుతరగతులు చెడిగినను విద్యాధిక బలాధిక ధనాధిక భేదములుమాత్రము పోక యీ భేదములు క్రొత్త తరగతులైనవి.

## రష్యా వారిలో తలమానికము.

రష్యాదేశము ఈలోపమునుగుర్తించి యీక్రొత్త భేదములకూడ చెఱిపి, ఒకరికంటె ఒకరి కెక్కువ ధనము నిలవలేకుండునట్లు అందరిని కార్మికులను లేక కూలివారినిచేసి వారికి పూటభత్యములిచ్చి రాణించుచున్నది. అధవా యెవ్వరైనా యీ కూలిలో దేనాలుగుడబ్బులు మిగుల్చుకొని యెవరి అవసరానికైనా బదులిచ్చి యెంతతక్కువవడ్డీఅయినా తీశాడో వానికి సంఘంలో గౌరవంలేదు, రాజకీయంలో వోటులేదు. ఇకను, చదువుకుంటకు ఆడుకుంటకు పాడుకుంటకు అందరికీ సమానమైన అవకాశములు విశ్రాంతులు ఇచ్చినారు గనుక ఒకరికంటె ఒకరు తక్కువ విద్వాంసులు, యెక్కువ ఆక్రమణశీలురు కాగలమార్గములెల్ల మూయబడి అందరును సమాన పండితులు సమానరాజకీయవేత్తలు, సమాన వ్యవహారస్థులు అయి రాణించుచున్నారు. ఈభాగ్యమెల్లయు వారొక్కరే జుర్రుకొనుచు కూర్చొనక యేదేశములో నైననసరే యెవ్వరైననసరే తమదేశములో వ్యాపించియున్న విధానములకు విరోధులుగను రష్యాలో వ్యాపించియున్న విధానముఃకనుకూలురుగను బోధించి పనిచేసి సాధించ సంసిద్ధులైనచో వారికెల్ల మాటసాయము ధనసాయము చేతునని రష్యా అభయహస్తమిచ్చినది. ఏఅభయము లేకున్నను ఈయుగధర్మమును బట్టియే యిట్టిభావములు సర్వవ్యాప్తము లగుచున్నప్పుడు రష్యా యొనరించు సహాయము శ్రీరామరక్షవంటిది కాదా! ఇప్పుడేదేశమునుచూచినను సోషలిస్టుపార్టీలేని దేశములేదు. ఇటలీ, జర్మనీ, జపాను మొదలగు దేశములలో ఆతత్వము జాతీయతకు విరోధమనుపేపమున హింసింపబడుచున్నది. ఇతరదేశములలో సహింపఁబడుచున్నది. అయితే సామ్యవాదులు హింస అంటే భయపడురకము కాదు. హింసకు ప్రతిహింసచేయుట కెప్పుడును సంసిద్ధులు. ఇట్లు జనసామాన్యమునకు ప్రతిదేశములోను సోషలిస్టులు ఈ విధముగా మోక్షమును తెచ్చుచున్నారు. వారితోపాటే నారీమణుల మహత్తును వారు గుర్తించి వారికి దాస్యవిమోచనము నిచ్చుచు పురుషుని ఘనత యెందునను ఉండకుండ దునుమాడుచున్నారు.

## రష్యాలో సంపూర్ణ విశ్వాత్వము

స్త్రీపురుషసమానత్వము రష్యాలో వ్యాపించినంత మేరకు మరేదేశములోను వ్యాపించలేదు. స్త్రీపురుషులు స్త్రీపురుషులేతప్ప భార్యాత్వభర్తృత్వబంధుత్వమునూ నవసరములేదు. వివాహకర్మ నిషేధము. ఇదుగో మేమిద్దరముకలిసి జీవించుచున్నామని యిరువురు స్త్రీపురుషు లెప్పుడైనను సర్కారు రిజిస్టరులో వ్రాసి సంతకములుపెట్టి, వారి కిష్టములేనిచో ఆమర్నాడే కారణము గట్ర యేమీ చెప్పకుండనే వేరే విడిపోవుచున్నామని మరియొకచోట సంతకముపెట్టి ఇతరులతో పొత్తుకూర్చుకొని మరియొకపుటను సంతకముఁు పెట్టుకొనవచ్చును. ఇది కేవలము చట్టము మాత్రము, రష్యాలో స్త్రీపురుషసంబంధము లంతక్షణికములుకావు, పుంజీదారుదేశాలలోను మతాధిపతుల మన్ననలలో ఉండే దేశాలలోనుకంటె కూడా యెక్కువ శాశ్వతమైనవి అని కొందరు వాదిస్తున్నారు. తెలివితక్కువ కొద్దీ రష్యాలో ఆవేశవశమున ఇట్టియేర్పాటును ఏలనో చేశారేకాని వీరి విడుపు ముడుపు సంతకాలకు రష్యాలో వుండే రిజిస్టరీలన్ని

చాలవు, సంతకాలు తీసుకొంట కెక్కడలేని వుద్యోగస్థులు చాలరు కనుక తగినకారణాలు లేనిదే ఒకసారి కలిసినవారికి సులభముగా వి డా కు లి వ్వ రా దు, కోర్టులు పెట్టి విచారణలు సాగించవాలని ఒక చట్టము కూడ ప్యాసుచేయుటకు ప్రస్తుతము మరికొందరు ఆలోచిస్తున్నారు. ఏదోఒకటి చేస్తారనుకొందాము. అచట నాభార్యా అని భర్త స్త్రీని యెట్టినిర్బంధము చేయలేడు. ఆమె స్వయంగా కూలిపనికిపోయి పని చేసుకుంటుంది. ఆమెనతడు సంతానమును కనుమని బలవంతపెట్టలేడు. గర్భమైనను అతను చూచుచుండగనే ఆమె దించుకోవచ్చును. పిల్లలు పుట్టినతరువాతకూడ ఆమె కిష్టమైన పెంచును లేనియెడల యేసర్కారు క్రెచీకైన అప్పచెప్పును. వ్యభిచారమన్నపదమే ఆదేశమునలేదు. పిల్లలకు తండ్రిపే రుండవలసిన ఆవశ్యకత లేదు. స్త్రీపురుషసంబంధములలో నీతి అవనీతి యను మాటలనరాదు. అయినను పూంజీదారులు మతాధిపతులు పలుకుబడిగలిగియుండు దేశములలోకంటె రష్యాలో స్త్రీపురుషనీతి యెక్కువ చక్కగనుండునట. అవనీతి అనేమాటను సిద్ధాంతమును తొలగించనిదే అసలు నీతిఅనేది వ్యాపించనే వ్యాపించదనీ, అట్లు తొలగించని దేశాలలో నీతియని చెప్పబడునదే నిజమైన అవనీతియనియు సాంఘికతత్వముయొక్క పరమోద్దేశము. నిజమైననాగరకత బుద్ధి పరువు పనిగలజాతి యెద్దియు నీతి అవనీతియను చొప్పదంటు చర్చలతో కాలయాపనముచేయక నిత్యము పని చేయుట, విహరించుట, ఆడుకొనుట, పాడుకొనుట, ఆనందించుట మొదలగు ఎన్నో వినోదములలో తేలియాడుననియే వారి వుద్దేశము. ఇతరదేశస్థు లెవరైన ఆక్షేపించినచో వారిని ప్రత్యాక్షేపించి తమ్ము తాము సమర్థించుకొనుటకు తప్ప వారికి నీతి అవనీతియను తప్పుడుమాటలతో నెట్టిప్రసక్తియు లేదు.

రష్యా ఇంతదూరము పూర్వకాలపు ఛాందసనీతి అవనీతిభావాలను ఛేధించింది కనుకనే ఆదేశములో స్త్రీలు పొందిన అభివృద్ధిని యింకే పాశ్చాత్యదేశములోను పొందలేదు. లేనియెడల నీతియనుపేరుపెట్టి పూంజీదారులు వారిని నొక్కేసివుందురు. ఫ్రాన్సులో స్త్రీలకు వోటులులేవు, జర్మనీలో వుద్యోగములు లేవు, ఇటలీలో సమానత్వములులేవు, ఇంగ్లాండు మొదలగు ఇతర పూంజీదారు దేశములమాట చెప్పనక్కరలేదు. సమస్తశాఖలలోను రష్యాలో వున్నంత మంది స్త్రీ వుద్యోగస్థులు ఇతర ఏదేశములోనులేరు. రష్యాలో స్త్రీలకున్నంత యెక్కువ అధికారము, నిరభ్యంతరము, బహిరంగజీవనము, సంఘదూషణాభావము మరియేపాశ్చాత్యదేశమునందును లేదు. ఎందును వారి నీరసములేను. పురుషుల కెక్కువకూలి స్త్రీలకు తక్కువ కూలిలేదు. పురుషునికి సర్వదాకూలి స్త్రీలకు పురిటిముందర పురిటివెనుక తక్కువకూలి లేదు. తత్సంబంధమైన ప్రసవశెలవులలో కూడ ఆమెకు పూర్తికూలియే. పెనిమిటిలేక పురుషునకు స్త్రీ స్త్రీయనుకారణమున నెట్టి సపర్యయు చేయనక్కరలేదు. బిడ్డలకెట్టి సంరక్షణమును చేయనక్కరలేదు. అందుకు తగినవర్సు ఉద్యోగస్థులాపనిచేయవలసినదే. తల్లిగర్భమునుండి బిడ్డ క్రిందపడేదాకానే తల్లిది. అటుపిమ్మట ఆమె కిష్టమైన సంరక్షణ చేయవచ్చును లేనియెడల ప్రభుత్వము తన భావిపౌరుడు లేక పౌరురాలుగభావించి వేరే క్రెచీకి తీసుకొనిపోయి నర్సులునర్సులచేత సంరక్షణ చేయించును. తల్లిగర్భములో పడినప్పటినుండియే బిడ్డ ప్రభుత్వపు బిడ్డ యగుచున్నది. తల్లియడుగులకు మడుగులొత్తి అపరిమితానందవార్నిధిలో తేలించి ప్రసవింపజేసి బిడ్డసంరక్షణభారమును ప్రభుత్వమేపూనుకొందురు.

## ప్రాచ్యదేశములో తొలుదొల్త ఈవిశ్వాత్వదృష్టి యెందులకు ప్రారంభము కాలేదు ?

ఇతర పాశ్చాత్యదేశములలో స్త్రీలకు పురుషులకు ఇట్టి అభేదత్వము లేకపోయినను ప్రాచ్యదేశములకు

వేనినైనను వానిముందర పెట్టినప్పుడు ఇవి దిష్టిబొమ్మల వలెనైనను రాణింపవు. ప్రాచ్యదేశములలో పెనిమిటి యొద్ద వినయవిధేయతా గౌరవములు లేక వెల్లమిాటి పోయిన మహిళామణులు అత్యంతవిద్యావతులు, సంస్కారులు మహిళా ఉద్యమ నాయకురాండ్రలో కూడ లేరు. భర్త భార్యను సాధారణముగను భార్య భర్తను సగౌరవముగను బిలచుటయే అలవాటయిన యీ దేశములో స్త్రీపురుషుల అభేదత్వ మేనాటికైన సిద్ధించునా అని బెంగపుట్టును. ఈదేశములో స్త్రీ పురుషుల మధ్య గల మహాఖాతమునకెల్ల యీ గౌరవ భావమే కారణమనిపించును. ఒకరినొకరు నీవు అనియో మీరు అనియో సమానముగ బల్కుటకు మనసొప్పని భార్యాభర్తలుగలదేశములో స్త్రీ పురుష సమానత్వము మిధ్య. ఉపన్యాసాలు సభలు తీర్మానాలు మొదలగునవి లక్ష్య చేయవచ్చును కాని యింట్లోకివస్తే యెప్పటివరసే, వీధిలోకి వెళ్లితే యెప్పటి మొగమోటాలే సిగ్గులే, ఉభయులకూకూడా. ఈసిగ్గులు మొగమాటాలు గౌరవాలు మొదలైనవి కూడా విద్యాధికులు పెద్దకులములవారు నాగరికులు అని పిలువబడే పైజాతులవారిలో మరీ యెక్కువగా వున్నవి. వీరికంటె సాధారణకులస్థులే నయము. వారిలో పురుషులు స్త్రీలను పెద్దకులాలవారిలోవలె 'ఓసేయి' యనే పిలచినచో, స్త్రీలు పురుషులనుకూడ 'ఓరేయి'యనే పిలతురు. లేదా యిరువురకుఆంగ్లవిద్యా వాసన అబ్బినచో 'ఏమో' అంటే'ఏమోయి'అందురు. కాని బ్రాహ్మణాద్యులలోవలె 'ఒసేయి'అని పిలచు చున్నను 'ఏమండీ, మీరు' అని గౌరవముచేయరు. గౌరవముమాట దేముడెరుగును వారిలో నెక్కువ సమానభావ మున్నదనుట నిస్సందేహము. గౌరవ మెక్కడుంటే సమానత్వ మక్కడ శూన్యమన్నమాట యెల్లరును గ్రహించవలెను. గౌరవింపబడినవారికి వారి మహోదారదృష్టివల్ల యితరులపై సమభావము న్నను గౌరవించువారికి ఎట్టి సమభావమును తోచక తామల్పులమనుభావము Slave-mentality లోలోన తచ్చాడకతీరదు. ఈగౌరవములను వర్జింపలేనిజాతికి సామ్యవాద ప్రకృతమైన లేక ఆధునిక ప్రపంచసమాజ మైన సమానత్వ మేనాటికైనా సిద్ధించునా? ఇట్టి సమభావసిద్ధికి భారతదేశ మెన్నియుగములు తపస్సు చేయవలెనో ఎన్నితరములు పాశ్చాత్య నాగరకతా శుశ్రూష చేయవలెనో యెవరికెరుక!

## పడమర దేశములలో ప్రారంభానుకూల పరిస్థితులు.

అదృష్టవశమున ఆదేశములలో అనాదినుండియు స్త్రీకి పురుషుడు దేముడను తుచ్ఛభావము మతాధిపతులు మొదలగువారిచే బోధింపబడలేదు గనుక అక్కడివారికి సమానత్వము నిత్యము అనుభవసిద్ధమై యొకరివద్ద నొకరు ఒదిగి ఒకరిమీాది కింకొకరు యెగిరి వర్తించకుండ సమానంగా నువ్వూ అంటే నువ్వు అని వంటలలో ఆటలలో సభలలో సంభాషణలలో షికార్లలో దుకాణములలో తిరుగుటకు వీలగుచున్నది. కాని ఒక్కసారి యీ అసమానభావము నేమూర్ఖ మతాధికారో బోధించితే కలియుగాంతమువరకు ఆభావము పోవునా? అందునను భారతదేశములో ఏయొక్క మూర్ఖుడో మూర్ఖురాలో కాదు, సమస్త పురాణములు కథలు శాస్త్రములు ఇదేగోల! పురుషులంటే స్త్రీలను ఈవిధముగా బానిసలుగా చేసుకొన గోరినారు గనుక వారీఆటలాడినారు కాని, అనసూయ, ద్రౌపది, రుక్మిణి, సావిత్రి మొదలగు స్త్రీలకు కూడ తమ జాతినెల్ల ఈవిధముగా శాశ్వతపురుష బానిసత్వములో ముంచివేసెడి దుర్బుద్ధి యేల పుట్టవలెను? తాము పురుషులతో సమానమగు గౌరవ నీయలమనుగర్వము వారి కేమాత్రమున్నను వారిట్టి తుచ్ఛబోధన లొనరించెడివారా? ఇంతకూ పాపము! వారట్టి బోధన లొనరించియుందురా? ఏపాడు పురుషకవియో ఆగాథలనువ్రాసి వాటికి మహిళామణుల పేరులు తగిలించియుండును. వాటిని నమ్మెడ

మిప్పటిమహిళామణులలోవలెగాని అసలట్టి వ్యక్తులుండినట్లు యేచరిత్రాపరిశోధకుడు పరీక్షించి నిర్ణయించినాడు! ఎట్టి మూఢవిశ్వాసమునైనను దేముడుపేర మోక్షముపేర వ్యాపింపచేయడము ఈ పాడు భరతదేశమున సులభసాధ్యము గనుక పురుషుల ఆటలిచ్చట సాగుచున్నవి కాని యితరపాశ్చాత్య దేశములయందిచ్చటనైన యిట్టిభావములను మూఁ జూడనైన జూతురా ?

## పాశ్చాత్యులే మూఢాచారములమీఁద నెట్లు ముందు తిరగబడగలిగిరి?

చీనా టిబేతు మొదలగు ఇతర ప్రాచ్యదేశములు కూడ మతప్రధాన దేశములు గనుక అక్కడకూడ భరతదేశమంత ఘోరముగా కాకున్నను అంతకంటె నించుక తక్కువగానైనను స్త్రీ యింటిపట్టుననే వుండవలెను. ఇల్లుచక్కపెట్టి పిల్లలను పెంచుచుండుటయే ఆమెకర్తవ్యము, రాజకీయాలు మొదలగుగోలలు పురుషులకుగాని స్త్రీల కేల, అలసిసొలసివచ్చు పురుషు నానందింపఁజేయుటకే స్త్రీలకు సౌందర్యము, సౌందర్యపోషణాభిలాష, మాధుర్యము, మధుర గానము, మొదలగు సల్లక్షణముల పరమేశ్వరుడొసంగినాడు, మొదలగు దాస్యభావములు క్రమ్మకొని యున్నవి. ఇట్టి భావముమీదికి మొట్టమొదట యెత్తు జండాయెత్తి తిరగబడినవారు పాశ్చాత్య వనితామణులు. అసలీతిరుగుబాటు జరగడానికన్నేండ్లో పూర్వమునుంచే ఆదేశములలో స్త్రీ పురుషులలో లింగభేదమంటూ లేక కలగాపులగముగా తిరగడము సహజలక్షణముగా రాణించుచుండెను. ప్రతిస్త్రీయు తనయిచ్చవచ్చినపురుషునితోను, ప్రతి పురుషుడు తనయిచ్చవచ్చినస్త్రీతోను తన స్వంత పురుషుడు స్వంతస్త్రీతో మించి యెక్కువ అనురాగముతో నవ్వుతో చనువుతో కేలింతలుతో కాని, వింతలతో ముద్దులతో యేకాంతములతోకాని రాణింపవచ్చును. వారిద్దరును ఒకరినొకరు మోహించుకొనుచున్నారు, దుర్వ్యాపారములో నున్నారు అని యెవ్వరును అనుమానించక వారిగోలకు వారిని వదలెడివారు. అథవా యెవ్వరైన అట్టి అనుమానము పడినయెడల, అందునను ముఖ్యముగా ఆస్త్రీపురుషుల భర్తలు భార్యలే అట్టి అనుమానములు పడినయెడల లోకము వారిని తుచ్ఛులుగ నెంచెడిది. పురుషుడంటే వేరే లింగమునకు చెందినవాడు కనుక అతనిసరస నేకాంతముగ నున్న అతనికిగాని తనకు గాని యెట్టిబుద్ధిపుట్టునో యను భయము స్త్రీకి కాని,లేదా అట్లే పురుషునకుగాని ఉండెడిదికాదు. వారు కలియునప్పుడు ఇతరులకుకూడ అట్టి భయ ముండెడిదికాదు. ఇట్లు కలసెడివారెల్లరు యోగులే, నిష్కళంకులేయని మనము చెప్పలేకపోయినను కలయువారెల్లరును పోకిరీవారే అని మనము చెప్పలేము. కాస్త ప్రమాదములుజరిగినను వారికొక తప్పులోనిదికాదు. ఆచింతయే యెవ్వరును పెట్టుకొనెడి వారుకారు. అట్టిసంబంధములు బట్టబయళ్లగునప్పుడుమాత్రము విడాకులకొర కాందోళన. బట్టబయళ్లుకాని అనేకసందర్భములలో అసలు అట్టి గుట్టే ఉండకపోవచ్చును. ఇట్టి సరిసమానత్వము, అభేదత్వము, కలుపుగోరుతనము, స్నేహము మొదలగు సుగుణపుంజములు ఒక్క పాశ్చాత్యులలోతప్ప మరియేయితర నాగరికజాతిలోను మొన్నమొన్నటివరకు లేకుండెను. మనదేశములో సవరలు కోయలు భిల్లులు మొదలగు అటవికజాతులలో తప్ప ఇతరజాతులలో నున్నవేమో సందేహము. వారిలోకూడ ఉత్తత్తనే వట్టి అనుమానములు పుట్టి ఒకరినొకరు చంపుకొనుట సామాన్యముగ నున్నది. ఇట్టి మహోన్నతస్థితిని నాగరకులగు పాశ్చాత్యులందగలుగుట ప్రపంచమునకెల్ల ఆదర్శప్రాయము.

## నిజమైన తిరుగుబాటు ఎప్పటినుండి?

అయితే యీమహోన్నతస్థితిఅంతా స్త్రీపురుషులు ఇళ్లూ వాకిళ్లూ,తోటాదొడ్డీ, పెళ్లీ పేరంటమూ, విందూ

వేడుకా మొదలగు సందర్భములలో ఆడుతూపాడుతూ, నవ్వుతూ కేరుతూ తిరిగేటప్పుడేతప్ప, ఆస్తిహక్కులు, వ్యవహారపుహక్కులు, వోటుహక్కులు, ఉద్యోగపుహక్కులు మొదలగు సందర్భములలో అంతా పురుషులదే అన్నట్లు వుండేవారు. అయినా ప్రాచ్యదేశాలకంటె చాలానయము. ఉపాధ్యాయినులుగా, బోధకురాండ్రుగ, ప్రైవేటు ట్యూటర్లుగ అనేక చిన్నచిన్న స్వతంత్రఉద్యోగాలు వారు చేసుకొనేవారు. వారికి యెన్నిహక్కులు లోపమయినా అసలులో పురుషులతో సరిగా తిరగడము, ప్రక్కన కూర్చొనడము, ఆనందములో తేలడము, సంభాషణలు చేయడము, చర్చలు సాగించడము మొదలగు సౌకర్యములకు వారి కెన్నడును లోటులేదు గనుక, దరిమిలాహక్కులను ఒకటితరువాత నొకటి క్రమముగా పిండి తీసుకొనుటకు వారికి సంపూర్ణమైన అవకాశముండేది. మనదేశాలలోలాగ మగవారిదగ్గర ఆడువారు వెళ్లడానికే మొగమాటమైతే చర్చించడమెక్కడ, సాధించడమెక్కడ, వాదించడమెక్కడ, ఓడించడమెక్కడ, ఆడదాని కిల్లేగతోయి వంటిల్లేగతోయి అనే పాడుదేశాలలో అసలు మహిళా సభలైనాజరగడమెట్లా, జరిగినా ఆతీర్మానాలు పురుషుల వద్దకు తీసుకపోయేదెట్లా? రహస్యముగా కుట్రలు చేసి వారిని అడచిపెట్టవలెనేగాని.

### ప్రాచ్యులాహక్కులు ముందే యేల సంపాదించలేక పోయిరి?

అసలు సమరమునకుపూర్వము పాశ్చాత్యదేశములలో అట్టి కలగాపులగ మమలులో వుండెను గనుకనే ఆసమరములో వారికి విజయము కలిగెను కాని లేనియెడల పురుషులంటే సిగ్గుపడి వెనకకు నక్కుతూతే అయితే పాశ్చాత్యస్త్రీలకు ఇట్టిహక్కులే వచ్చివుండేవికావేమో! ప్రాచ్యపురుషులు ఈరహస్యము తెలిసిగియే, వారితో చనువుగాతిరిగితే వారి వీరి నీతి మాటలేలాగున్నా వారు వీరి నెత్తిమీది కెక్కి తమ అధిక్యత నంతటినీ బ్రద్దలుచేసి, బానిసలుగా నుండక తప్పక తిరగబడుదు రేమో అన్న భయముచేత 'స్త్రీపురుషులు దూరముగా వుండవాలి, భార్యాభర్తలు తప్ప అన్యులెన్నడును కలియరాదు, ఒకరినొకరు చూస్తే సిగ్గుపడవాలి, మొగము వంచుకోవాలి, కళ్లెత్తి చూడరాదు, నవ్వులాటకూడదు, ఇట్టిపను లేమాత్రము జరిగినట్లు అనుమానము తగిలినను వారిద్దరికీ రంకుకట్టి జాతిలోనుంచి బహిష్కరణము చేసివేయవాలి' అనే ఘోరశాసనమొకటి ముందే చేసుకొనివుండిరి. ఇట్టి ధీరులయొద్దకు యేమహిళాసభ నాయకురాలు వారి ప్రత్యేక మహిళాసభలో జరిగిన తీర్మానమును తీసుకొనివచ్చి చూపించగలదు? చూపించితే వారిద్దరికీ యేమైనా పరువు నీసంఘము వుంచుతుందా? మహిళావుద్యమము తొలిరోజులలో అట్టి గౌరవమేమైనా వుంచేదా?

### ఇప్పుడు ఎట్లు సంపాదించుచున్నారు?

అయితే ఇప్పుడు స్త్రీలు ఎక్కువవిద్యావతులు కావడముచేతను, పురుషులకుకూడా బాగా పాశ్చాత్యవాసనలు వంటికిపట్టి ఆ ఆశయములు నచ్చుటచేతను, తెల్లజాతిస్త్రీలు యీయుద్యమములో ఇప్పటికే చాలామట్టుగ జయించి తమజండాను ప్రపంచపు నాలుగు చీకటిమూలలలోనికిని గొంపోయి యెచ్చటెచ్చటివారిని తెచ్చిగొట్టి విశ్వమహిళాసంస్థను స్థాపించి విశ్వమహిళాసభలు జరుపుచు విశ్వమహిళా శ్రేయస్సమస్యల నాలోచించుచు విశ్వములో యెక్కడ యేమహిళకు ఎట్టిహక్కు ఎట్టిగౌరవము నిరాకరింపబడినను దానిని సాధించవలెనని కంకణము కట్టుకొనుటచేతను ప్రాచ్యదేశపు పురుషులకు నోళ్లు కట్టబడినవి. పాశ్చాత్యదేశములలో స్త్రీలు గతనూరు సంవత్సరములాయను పురుషులతో ముఖాముఖిని బాహాబాహిని పోరాడి యెట్టి స్వాతంత్ర్యములను హక్కులను ఆస్తులను ఉద్యోగములను విహారములను

బడసిరో అట్టిపెల్లయు పురుషుల మొగ మేశాడును చూచినపాపమునఁగూడపోకుండనే మన దేశపు మహిళామణులు తీర్మానాలుచేసుకొని నేడు బడయుచున్నారు. అఖిలభారత మహిళామణుల సభలలో గాని, విశ్వప్రపంచ మహిళామణుల సభలలో గాని ఆమోదింపఁబడిన సవ్యములగు తీర్మానములకు యెదురు చెప్పవలెనను తుచ్ఛకోరిక భారతీయపురుషులకు లేకపోవుటయేకాక, దానికి తప్పక అంగీకరింపవలెనను మహోదార్యబుద్ధికూడా వారిలో బహుళా రాణించుచున్నదని నమ్మవచ్చును. స్త్రీలతో పోరాడి వారొనన్నది తాము కాదనడము పరువు తక్కువగ కొందరకు తోచవచ్చును. కాదన్నను ఆమాట నెగ్గదు. ప్రభుత్వ మీ యుగధర్మమునుబట్టి వారికోరికల నెరవేర్చియే తీరునని తోచుటచేత తమ వెలితితనము చూపించుకొనుట కిష్టములేనివా రనేకులు.

## సనాతనులుకూడ లొంగుచున్నారు.

ఒక్క సనాతనుల కిట్టిసూత్రములు నచ్చవేమో కాని, నచ్చవనిచెప్పి యింట్లోకూర్చుంటే లాభము లేదు, తాముకూడా రాజకీయములలో పాల్గొని వీధి బడకపోతే తమ ధర్మమింకా నశించుతుందని వారు వారి స్త్రీలుకూడా యిప్పుడిప్పుడు సభలలోదూరి వోటుహక్కులు మొదలైనవి కావాలనీ రాణీగారి వాగ్దానాలను చెల్లించవాలనీ ప్రభుత్వమువారిని ప్రార్థించుకుంటున్నారు. యుగధర్మమో విశ్వధర్మమో ఏదో ఒకటి కానిండు, సనాతనస్త్రీల దగ్గరనుంచి 'మేము మావంటిట్లో వండుకుంటాము, మొగుళ్లను కొల్చుకుంటాము, పిల్లల్ని భోకొట్టుకుంటాము, లక్షవత్తులనోము నోచుకుంటాము, తులిసమ్మకు మ్రొక్కుకుంటాము, మహాలక్ష్మిని పూజించుకుంటాము, ప్రపంచ మెట్లాపోతే మాకేమికావాలి, మామోక్షమే మాకు లక్ష్యము' అని యేడుస్తూ కూర్చోక, ఎందుకో ఒక దానికి వీధిపడ్డారంటే అది అసలు యెక్కడెక్కడనున్న మహిళామణులకు స్వార్థదృష్టిపోయి విశ్వాత్వదృష్టి వచ్చినందుకు నిదర్శనముకాదా? ఇది విశ్వప్రపంచ మహిళాసభల ఫలితముకాదా?

## ఇస్తాంబులు మహాసభ.

గత విశ్వమహిళా ప్రపంచ మహాసభ ఇస్తాంబులు నగరములో అనతికాలముక్రిందట జరిగినసంగతి పాఠకులకు జ్ఞాపకముండవచ్చును. ఈ అధునాతన నాగరతకుమున్ను స్త్రీలెల్లదేశములలోను యెల్లమతములలోను నిప్పటికంటె చాలా వెనుకబడి పీడింపఁబడియుండిరేమో కాని మహమ్మదీయమతములోను వారి దేశములలోను వారెక్కువ పీడింపఁబడినట్లు కనబడును. బహుభార్యాత్వమనగా హిందువులు మొదలగువారిలో నొకేసారి యేయిద్దరు ముగ్గురో యిష్టరాండ్రు కాని ఆమతములో లెక్కలేనంతమందిని చెఱబట్టుట కాబోలు ననిపించును. పదునైదేండ్ల క్రిందట పదభ్రష్టుడైన టర్కీసుల్తానునకు వందల కొలది భార్యలుండిరి. వారికి భవనములలోనే చెఱ చాల, కొజ్జాల మొగముతప్ప అన్యుల మొగము వారెరుగకుండిరి ఆభవనములో తిరిగినను బురకా తప్పదు. అట్టి భార్యాదాసీలలో నొకయామె మొన్నటిసభలో మునుగు పూర్ణముగతీసి ముప్పదిదేశములనుండి వచ్చిన 280 ప్రతినిధులముందర ఉపన్యసించుచు అట్టి దురాచారములమీద తనకానాడు పగ తీరినదని క్రోధముతో ఘూర్ణిల్లగా సభయెల్లయు జలదరించెను. టర్కీలో స్త్రీలకు వోటులిచ్చి, శాసనసభా సభ్యత కర్హతనిచ్చి పందొమ్మండుగురితో కెమాలు పాషా సభ నలంకరింపఁ జేసికొనినాడు. టర్కీవనితలెల్లరు అతనికి నివాళులెత్తి 'ఆటో టర్క్' అను బిరుదమునిచ్చి వానికీర్తిని పాడిరి. అందుకు సూచకముగనే విశ్వప్రపంచ మహిళాసభ అక్కడ జరిగినది. అక్కడి ప్రతినిధిరాండ్రు ఒకరిదేశములో మొట్టలొకరిదగ్గర యాకరువుపెట్టుకొని ప్రతీకారసమస్యలాలోచించిరి. ఈసభకైన ఖర్చునంతటిని మనదేశములో జూబిలీ ముద్రలవలె టర్కీలో సభాముద్ర

ఉత్పత్తించి పోష్టువారిచే అమ్మించి ఖర్చుకు వినియోగించుటకు కమాలుపాషా అనుజ్ఞ యిచ్చినాడు.

ఆ ప్రతినిధురాండ్ర దేశముల భాషలు మాత్రమే వేఱుకాని ఆశయములొక్కటే. భూమిమీద మగనామధేయుల కెన్ని హక్కులుంటే ఆడనామధేయుల కన్ని హక్కులువుండవలసినదే. మతము గితము, శాస్త్రం గీస్త్రం, ఆచారం గీచారం పేరుపెట్టి ఎవ్వరూ ఏవీ ఆపీడానికి వీలులేదు. కోటిహక్కులకు మూలమైనది ఆస్తి హక్కుగనుక స్త్రీలకు ముఖ్యముగ పురుషులకువలె అవతల తండ్రియొక్క తల్లియొక్క ఆస్తిలోను ఇవతల పెనిమిటియొక్క ఆస్తిలోను హక్కు యిచ్చి తీరవాలి. పైగా వారి యిష్టమువచ్చినవృత్తి పూని యిష్టమువచ్చినంత ధన మార్జించుకో నీయవాలి. వారి ఆస్తిని వారి యిష్టమైనయట్లు దానదత్తాధికారములతో వ్యయపరచుకొనవచ్చును. ఈహక్కులేకుండా పైపైని యెన్ని హక్కులనిచ్చినా వారు అసలు నిలబెట్టుకోలేరు గనుక సాధించుకోలేరు గనుక అవి వ్యర్థమగును గనుక ఇదొక్కటీ సాధిస్తే చాలునని వారంతా తమతమ దేశాలువచ్చి ఆందోళనలుచేయ నిశ్చయించుకొన్నారు. స్త్రీలకు విశ్వాత్వాన్పష్టి రాబట్టి వారిట్టి ధీరురాండ్రయిరి కాని కూపస్థమండూకాలలాగుంటే యింకా కుళ్లుతూ వుండవలసినదేనా ?

## హిట్లరు సనాతనాదుల కర్తవ్యము

ఇట్టిసభల వృత్తాంతములు, ఇట్టి స్త్రీల పౌరుషములు పఠించిన యేపురుషుల శరీరములపై గర్వముచే పులకాంకురములు పొడమకుండును? భావిప్రపంచ పౌరులను, వీరులను, శూరులను గనవలసిన మహిళామణుల కిట్టి మహోన్నతపదవి యెంతయు దగియున్నదని యెవ్వరికి తోచకుండును? ఇట్టి వీరనారీమణులుపూనిన యేకార్యము సత్వరవిజయము నందజాల కుండగలదు? వారి ఘోరదీక్షను ప్రతిఘటించగల మగతన మేమగపురుగున కుండగలదు? స్త్రీలను తిరిగీ వంటింటిలోనికి గెంటివేసిన హిట్లరు మొదలగువారి చర్యలపై వారు తింద్రించి, అట్టి దుష్ప్రభుత్వముల నోడించవలెనని ఆయాదేశములలోని స్త్రీలనుద్బోధించుచు తీర్మానించిరి. హిట్లరీతీర్మానమును మన్నించిన సరే, లేకున్న విశ్వప్రపంచమహిళాసభ తన శక్తినంతటి నొకజర్మనీపై కేంద్రీకరించి దండెత్తి అచ్చటి యబలలకు సాయముచేసి హిట్లరునోడింపగలుగుటలో నాశ్చర్యములేదు. ఈదేశపు సనాతనులు, అట్టిదేశముల డిక్టేటరులు మరోదగ్గరా మరోదగ్గరా తమ మహిమలు ఆటలుసాగుతాయి అనుకుంటే అనుకోనీయండి కాని మహిళామణులవద్ద సాగవని నిశ్చయించుకొని వారిఆస్తిహక్కులువారికిచ్చివేసి, యిష్టమైనచదువులు వివాహములు ఉద్యోగములు చేయనీయవలెను. గౌరుగారి విడాకులబిల్లుకి బి. దాసుగారి శారదాచట్టపు యెమెండుమెంటు బిల్లుకి, భగవాందాసుగారి అంతర్జాతీయవివాహబిల్లుకీ మొదలయినవాటికి వోటులిచ్చి వారి ఆశయములను గౌరవించిరా సరే; లేనియెడల శారదాచట్టమును ప్రతిఘటించి క్షౌరము చేయించుకున్నట్లే వీనిని ప్రతిఘటించియు సనాతనులు పరాభూతులు కాక మానరు.

# సభలు — నివేదికలు

## స్త్రీ హితైషిణీ మండలి (బాపట్ల)

ఈమండలి చతుర్థవార్షికోత్సవము జూలై నెల13,14 తేదీల శని, ఆదివారములలో సుప్రసిద్ధ దేశసేవకురాలును, త్యాగశీలయు, శారదానికేతన విద్యాలయ స్థాపకురాలును, నగు శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ గారి అధ్యక్షతక్రింద మిగుల వైభవోపేతముగా జరుపబడినది.

13—7—35, గ2-30ని. లకు మండలివారి సామాన్య దైవప్రార్థనతోను, శారదానికేతన విద్యార్థినియగు తులసీదేవి ప్రత్యేక ప్రార్థనా గీతములతోను సభ ప్రారంభింపబడినది. తరువాత మండలి అధ్యక్షురాలగు శ్రీమతి వెలగపూడి సరస్వతమ్మగారు శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారి నిరంతర దేశసేవాపరాయతణను, త్యాగశీలతను, సంఘసంస్కరణాసక్తిని స్త్రీజనాభ్యుదయ చింతను ప్రశంసించుచు నేటి మహాసభకు వారధ్యక్షత వహింపవలయునని కోరిరి. శ్రీ క. వరలక్ష్మమ్మగారు బలపరచిరి. అంత శ్రీ లక్ష్మీబాయమ్మగారు కరతాళధ్వనులు చెలరేగుచుండ నగ్రాసనము నధిష్టింప, శ్రీ సరస్వతమ్మగారిచే కర్పూర మాలాలంకృతలుగా చేయబడిరి.

అనంతరము మండలికొఱకై ప్రత్యేకముగా రచియింపబడిన పతాకగీతములను, పతాకములను చేదాల్చి బాలికలు పాడిరి. పిమ్మట స్త్రీసమాజముల ఆవశ్యకత, వానివలన స్త్రీలు పడయవలసిన వివిధప్రయోజనములు స్త్రీవిద్య, స్త్రీల వారసత్వహక్కులు, గృహనిర్వాహకత్వము మున్నగు పెక్కువిషయములగూర్చి యెంతయో చక్కగా అధ్యక్షురాలు ప్రారంభోపన్యాసమొసంగెను. తదుపరి మండలికార్యదర్శినిచే వార్షికనివేదిక చదువబడెను. అనంతరము, మండలి నాశీర్వదించుచు కవయిత్రీమణియగు శ్రీమతి డి. భారతీదేవిగారు రచియించి పంపినపద్యములును, శ్రీ వెన్న అనంతరామమ్మగారు వ్రాసిన పద్యములును చదువబడెను. అనంతరము స్త్రీసమాజములనుగూర్చి శ్రీ క. వరలక్ష్మమ్మగారిచే వ్రాయబడినపద్యములు చదువబడెను. పిమ్మట మండలితో 'నాపరిచయము' అను వ్యాసమును శ్రీమతి వెన్న అనంతరామమ్మగారును, 'హిందీభాషవలని లాభ'మనువ్యాసమును దర్శి వజ్రమ్మగారును, 'స్త్రీసమాజములు' అను వ్యాసమును ఘట్టి సత్యవతమ్మగారును చదివిరి. తరువాత బాలికలు సంభాషణను 'పెండ్లిబేర'మను హాస్యప్రహసనమును, 'ఒక్కవర'మను స్వార్థభక్తుడు శివునిప్రార్థించి వరము లడుగుట యనునదియు కడు మనోజ్ఞముగా ప్రదర్శించి సభవారిని కడుపుబ్బ నవ్వించిరి. అంతటితో నాటి కార్యక్రమము ముగింపబడెను.

14—7—35 ఆదివారము 5 గంటలకు మరల సభ ప్రారంభింపబడెను. శారదానికేతన విద్యార్థినియగు తులసీదేవిప్రార్థన చేసినవెనుక 'మేవాడపతన' మను హిందీనాటకమునుండి కొంతభాగమును ప్రదర్శించిరి. తదుపరి సక్కుబాయి అను తెలుగునాటకము పదిమందిబాలికలచే నత్యంతరమణీయముగా ప్రదర్శింపబడెను. రెండు ప్రదర్శనములమధ్య దేవుడు-పూజారి అను హాస్యప్రసంగము గావింపబడెను. ఈప్రదర్శనాంతమున ఈ రెండుదినములు అనేక ఆటలుపాటలు సంభాషణలు, ప్రహసనములు, నాటకములు ప్రదర్శించి సభవారి నత్యంత ప్రమోదభరితులును గా జేసిన

డి. కృష్ణవేణమ్మ, పి. శారదాదేవి, కె. సుందర కామాక్షమ్మ, ఎ. చారుమతీదేవి, డి. చంద్రకాంతము ఎ. లీలావతి, యస్. సావిత్రమ్మ, పి. విజయలక్ష్మమ్మ జి. శేషమ్మ, కె. వెంకటరత్నమ్మ అను బాలికా మణులకును, హార్మోనియం వాయించిన రామాయణము వరలక్ష్మమ్మ అను బాలికామణికిని, పూలగుత్తులుంచువాజాలు, లేడీస్ మనీపర్సులు, పెప్పరమెంటు సీసాలు, వెండి కుంకుమబరిణె మున్నగునవి బహుమాన మీయబడెను. అనంతరము, అధ్యక్షురాలికిని, వార్షికోత్సవము జరుపుకొనుటకై హాలునొసంగిన హైస్కూలు హెడ్ మేస్టరు గారికిని, వార్షికోత్సవమునకై ప్రత్యేక చందాలొసంగిన మహిళామణులకును, తదితరానేక సహాయము లొనర్చిన సోదరసోదరీమణులకును, సభ వారికిని కార్యదర్శిని వందనసమర్పణముతోడను, అధ్యక్షురాలి అంత్యోపన్యాసముతోడను, బాలికల మంగళగీతములతోడను, జయజయ శబ్దములతోడను సభ సమాప్తము చేయబడెను. ఉత్సవము రెండుదినములును, పురస్త్రీ లసంఖ్యాకముగా విచ్చేసిరి. ఉత్సవ రెండుదినములు మోదడుసు ఆదెమ్మగారు వడపప్పు ఖర్జూరము పంచిపెట్టిరి.

ఈవిధముగా చతుర్థవార్షికోత్సవమును జరుపు భాగ్యము గల్గించిన పరాత్పరునకు వందనములు.

ఇట్లు,

కనుపర్తి వరలక్ష్మమ్మ,

కార్యదర్శిని.

## నా పరిచయము

నేను గుంటూరులోనుండగా తఱచు మీటింగులకు, క్లబ్బులకు వెళ్లుచుండేదాన్ని. అక్కడ ప్రతి చిన్న విషయమునుగూర్చి చర్చింపఁదలంచినను పురుషులతోఁ బాటు స్త్రీలకుకూడ ప్రత్యేకస్థలముల నిర్ణయిస్తుండేవారు. అందువలన పురుషులవలె స్త్రీలు యేసభాసమావేశములకైన నిర్భయముగా వెళ్లుచుండేవారు.

అదే అభ్యాసమువల్ల నేను బాపట్ల రాగానే ఇక్కడ స్త్రీలకైన సొసైటీలున్నవా అని విచారింప "ఆఁ ఉన్నయి! లేకేం! 'స్త్రీ హితైషిణీమండలి' అని యొక సమాజమున్నది. దానికి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు కార్యదర్శినిగానుండి పనిచేయుచున్నారు. ఆమెగారు బహుశా మీకు తెలిసియే యుండును. అప్పుడప్పుడు గృహలక్ష్మిలో "శారద లేఖ"లని వ్రాస్తుంటారు" అని యొక సోదరీమణి చెప్పినది. అప్పుడు నేను "ఔనండీ! చూచినట్లే జ్ఞాపకము. అచ్చటి కార్యక్రమమేమిటండీ!" అని యడుగ "ప్రతి సోమ శుక్రవారములు పురస్త్రీలకెల్ల పత్రికా పఠనముచేయుచు, సారస్వతవిషయములు చర్చింపుచు పురాణశ్రవణము గావించుచు యేదో శ్రమపడుచున్నది. కాని మాగ్రామములో నామె కుఁదగిన ప్రోత్సాహము లేదమ్మా! లేకున్న మండలి యిప్పటికి జాల యభివృద్ధి చెందవలసిన"దని చెప్పి వెళ్లినది.

మఱునాఁడు సోమవారమగుటచే వెళ్లి మండలిని చూడవలెనని మిగుల నుత్సాహపడితిని. కాని బాపట్ల పురస్త్రీలెల్లరు నాకు క్రొత్తవారగుటచేతను కార్యదర్శిని గారితోఁగూడ నాకుఁ బరిచయము లేకపోవుటచేతను సాహసించి వెళ్లలేక పోయితిని. ఇంతలో నిరుగు పొరుగు సోదరీమణులు కొందరు వచ్చి 'యేమండీ! నాలుగుగంటలైనది. మండలికివచ్చెదరా?' అని అడిగిరి. అన్నదే తడవు వెంటనే బయలుదేఱి మండలికి వెళ్లితిని.

మేము వెళ్లుసరికి నాఁడు సోమవారమగుటచేఁ బత్రికను బఠించుచు సోదరీమణులకెల్లరకు రాజ్యాంగ విషయములబోధించుచు వాగ్దేవివోలె విజ్ఞానమయము లగు శారదలేఖల లోకమున వెదజల్లి విద్యావిహీనులగు గృహిణుల నెందఱినో సంపూర్ణవిద్యావతులనుగ నొనర్చిన శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు సభామధ్యమున నాసీనరైయుండెను. అప్పుడామె

గారిని నే నెచ్చటనో జూచినట్లు జ్ఞాపకమని విచారించికొనగా గుంటూరు మహిళాసభ సమావేశమున రాయసంవారియింటిలో చూచినట్లు చప్పున జ్ఞప్తికి వచ్చెను. సోదరీమణులారా? నేనట్టె పారచూస్తిని. ఆకుంకుమబొట్టు. ఆచిల్లగోచి, ఆచిల్లచుట్టు అచ్చమగు బ్రాహ్మణ ముత్తైదువున కించుకేనియు లోపంబు గలిగింపలేదు. హైందవాచారమంతయు నామెయం దుట్టిపడుచుండెను. కాని విద్యావతియగు స్త్రీ యిట్లు నిరాడంబరముగ నుండునా? అని నేనుమాత్రము కొంత గాబరాపడక తప్పలేదు. కారణము ప్రస్తుత కాలమున వేషముల విషయమున విద్యావతులకున్న వ్యామోహాతయే. అంతేకాక నేనారోజుననే వారు వ్రాసిన "బట్టు" అనుకథను చూచాను. ఆకథ యెవరో ఒడ్డుపొడవుకల స్త్రీ వ్రాసినదని నాయూహ. ఈవిధమగు నూహలన్నియు నన్నావరించియుంటచే నామెగారిని గాంచగనే యాకథవ్రాసిన దీమెయేనా కాదా అని నామనస్సు ద్వంద్వావస్థలో పడ్డది. తరువాత నీమెగారు పత్రికాపఠనము పూర్తిచేసి నా దగ్గఱకువచ్చి "యేమండీ! మీరు ప్రతి సోమ శుక్ర వారములు తప్పక మండలికి రావలె"నని చెప్పిరి. నాటి నుండి నేటివఱకును మండలికి తప్పక వెళుతూనే యున్నాను.

క్రమేణ కొలదికాలముననే నా సందేహములన్నియు వారి సారస్వత విజ్ఞానమువల్ల కొట్టివేయబడ్డవి. ప్రతి సోమ శుక్రవారములు అచ్చట జరుగవలసిన కార్యక్రమమంతయు నియతముగ జరుగుతూనే యుండును.

సోమవారము పత్రికలలోని రాజకీయవిషయములు సారస్వతవిషయములు చర్చింపబడును. శుక్రవారము భారతముగాని భాగవతముగాని రామాయణముగాని పురాణము చెప్పబడును. రాజకీయ సారస్వతవిషయములవలన నిటు లౌకికజ్ఞానమును పురాణ శ్రవణమువలన నటు ఆధ్యాత్మికజ్ఞానమును నలవఱచుకొనుటకు నీమండలియందు మంచి యవకాశము లున్నవి. నే ననేకచోట్ల ననేకక్లబ్బులను అనేక సమాజములను చూచాను. కాని అన్నివిషయముల సర్వతోముఖముగ స్త్రీలు పైకిరాగల సమాజము ఈ మండలిదక్క నాకెక్కడను గాన్పింపలేదు. ఇతర చోట్ల పాశ్చాత్యవ్యామోహాతములైన హైందవాచారముల సంపూర్తిగ విడనాడిన సమాజములే పెక్కులు గనుచున్నాము. అచ్చట కేవలము శరీర వ్యాయామముకొఱకు బేడ్మింటు మొదలయినవే యేర్పాటు చేయబడును. కాని జ్ఞానాభివృద్ధికేమాత్రము తోడ్పడజాలవు. ఒకవేళ పత్రికలేమైనయున్నను వానినన్నిటిని బాగుగాచదివి యితరులకు బోధింపగలవారు చాలాఅరుదు. ఆసమాజములు కేవలము బి. ఏ. యం. ఏ., ప్యాసైన స్త్రీలకే యుపయోగపడునుగాని తెలియనివారిని పైకి తీసికొని రాజాలవు. ఈసమాజము తెలిసినవారికేకాక తెలియనివారిని పైకి తీసికొనివచ్చు విషయమున మిగుల నుపయోగముగానున్నది. యథా రాజా తథా ప్రజ యన్నట్లు ఈమండలి కార్యదర్శిని గారు మొదలగు కార్యనిర్వాహక వర్గమువారు హైందవాచార సంప్రదాయముల నన్నిటిని సర్వతోముఖముగ పైకి తీసికొనిరావలెనను నుద్దేశ్యములు కలవారగుటచే నీమండలియు నాయుద్దేశ్యములతోనే యభివృద్ధి చెందుచున్నది. ఈమండలి నాలుగుసంవత్సరములలో నింత యభివృద్ధిచెందుటకు ప్రాచ్య పాశ్చాత్య విషయములనన్నిటిని సమ్మేళనమొనర్చి చెప్పగల సమర్థులగు విదుషీమణు లీ మండలిని నిర్వహించుచుంటయే కారణము. ఇతర గ్రామముల యందలి సమాజములు కేవలము ధనవంతులకే వినియోగపడుచుండును. అచ్చటి గౌరవస్థానములన్నియు ధనవంతులవశమె. ఈమండలియం దట్టిభేదభావమే గాన్పింపదు. భాగ్యవంతులుగాని భాగ్యహీనులుగాని యెవరైనను వచ్చి వారికి తగు సహాయము వారు పొందవచ్చును. ఈమండలి కార్యదర్శినిగారు తగుశ్రద్ధతో గ్రామాంతరములనుండి వచ్చిన విద్యావంతులగు పురు

షులచేగాని స్త్రీలచేగాని యుపన్యాసముల నిప్పించుచు సత్కవీశ్వరులచే రచింపబడిన కవితల నెల్ల పఠింపించుచు పురస్త్రీల కెల్లరకు సర్వదా సంతోష విజ్ఞానముల నొనగూర్చుచుందురు. పురస్త్రీలకు మండలి విషయమున కార్యనిర్వాహకవర్గమువారు పడుచున్న శ్రమ చెప్పనలవిగాదు. వారింతటి శ్రమ పడుచున్నను పురస్త్రీలనుండి తగుసాయము లభించినట్లు కన్పట్టుట లేదు. ఇది విచార్యము. కనుక నోసోదరీమణులారా! మీరు మండలికి సర్వదా చేదోడువాదోడుగానుండి స్వహస్త పరహస్తములసాయము చేయవలెను. ఇతర గ్రామములలో నిట్టిసమాజములకొఱ కెంతతపించుచున్నారో మనకెల్లరకుఁ దెలిసినవిషయమే. అట్టి పరితాప మేమియు లేకుండనే మీపురాకృత పుణ్యము వలన మీకీమండలి లభించినది. కనుక మీరెల్లరు కడు జాగ్రత్తతో నీమండలిని నిలబెట్టుకొనవలసిన వారైతిరి. ప్రతి సోమ శుక్రవారములను తప్పక మండలికివెళ్లి నూతన నూతన విషయముల గ్రహించి మీరెల్లరు సంపూర్ణవిద్యావతులు కావలయునని నా కోరిక. జ్ఞానాభివృద్ధి చెందుట కవకాశముకల మీరును నవకాశములేని స్త్రీలవలె సమయము వృధాచేయవలదని యీ మీసోదరి ప్రార్థన. ఈమండలి శాశ్వతముగ నుండునట్లు డిస్ట్రిక్టుబోర్డువారు 20 సెంట్లభూమిని గూడ నిచ్చుట ఈసంస్థయొక్క భావ్యభివృద్ధికి సూచన. ఇంకను మీరు తగుసహాయమొనర్చిన నియ్యది యావదాంధ్రలోకమునగల స్త్రీసమాజముల కన్నిటికన్న మిన్నయనిపించుకొన గలదని నానమ్మకము.

వెన్న అనంతరామమ్మ.

# గ్రంథపరిచయము

**శ్రీ సోమనాథ రేఖాశాస్త్రము**

డెమ్మీసైజు 24 పుటలు వెల రు. 0—8—0 పండిత వడ్లమాని సోమనాధశర్మ వ్యాఖ్యాత. ఇందు పురుషాంగలక్షణాధ్యాయము; కన్యాస్వేషణాధ్యాయము అను రెండు అధ్యాయములు గలవు. సంస్కృతశ్లోకములు తెలుగు అర్థములు వివరములుగా గలవు. సచిత్రము. ప్రతులు వలయువారు వ్యాఖ్యాత గారికి ఆంజనేయాలయము, కాకినాడ అని వ్రాసిన బడయగలరు.

**భక్తముకుంద జీవితము**

క్రౌనుసైజు 24 పుటలు. వెల రు. 0—6—0 గ్రంథకర్త పండిత వడ్లమాని సోమనాథ శర్మగారు. భక్తముకుందుడను నాతనికి భక్త్యానంద పరమహంసగారు భక్తిప్రేమ యోగము మొదలగు మహాద్వైదాంత విషయములను గూర్చి చేసిన ఉపదేశములెల్ల నిందు క్లుప్తముగ వర్ణింపబడినవి.

**ది న్యూయోర్క్**

వాల్యూము II నెంబరు 2 1935 సం॥ జూలై నెలది. కారల్ లిబుకునెక్ట్ జీవితము కాంగ్రెసుయెడల విద్రోహము, మన రాజకీయములలో దప్పాదేముల్లు మొదలగువ్యాసములు గలవు. కాంగ్రెసు, హిందూమతము, మతము, కులము, జాతి, దేముడు, అహింస, స్వదేశి, రాట్నం, భక్తి మొదలగు క్షుద్రసంస్థలు తత్వములు విశ్వాసములనునవి నలిపి వేయునిదే నిజమైన సామ్యవాది లేక సాంఘికవాది యెవ్వరును కాజాలరను పరిశుద్ధతత్వము సాంగ్లభాషలో యీపత్రిక నేర్పుచుండును. సాంఘికవిప్లవము నింతస్పష్టముగను చక్కగను నిరూపించి బోధించు పత్రిక లత్యల్పముగ నున్నవి. సామ్యవాద మహాఫలితముల నెఱుంగఁగోరువా రందరును దీనిని తప్పక తెప్పించుకొనవలెను. సంపాదకుడు హెచ్. డి. రాజా గారు, నెం 3 కొండిచెట్టివీధి, మదరాసు.

**ఆదర్శ సుఖ జీవనము**

డెమ్మీసైజు సుమారు రెండు వందలపుటలు. వెల రు. 1 ఆంగ్లమున ఖుషీరామ్‌గారు రచించిరి. శ్రీ కూచి నరసింహంగారు (పిఠాపురం) ఆంధ్రీకరించిరి. ప్రతులు క. గౌరాంగమూర్తి c/o కూచి నరసింహంగారి వద్దగాని, ముద్దా విశ్వనాధంగారి (వ్యాసకుటీరం, మేలుపాక, యెలమంచిలిపోస్టు, విశాఖపట్టణముజిల్లా) వద్దగాని దొరుకును ఆంగ్లభాషాప్రతులు వలయువారు ఖుషీరాముగారు బి. యె. సిమ్లా వెస్టు అని వ్రాయవలెను. ఆరోగ్యము, విద్య, సంఘజీవనము, పని, ధనము, మనోనిగ్రహము ఇవి సుఖజీవనసాధనములుగా భావించి వీనిమీద ఆరు అధ్యాయములు రచించిరి. అవి చాలా చక్కగానున్నవి. స్వస్వరూపజ్ఞానము బ్రహ్మసాక్షాత్కారము అను మహాలక్షణములు లేని యీ శుష్కసుఖములు ఆదర్శసుఖములు కాకపోవుటచే వానిపైని మరిరెండు అధ్యాయములు వ్రాసి ఆదర్శసుఖజీవనమని గ్రంథమునకు పేరిడినారు. కొందరికి ఆదర్శజ్ఞానముతోనే జీవనము ప్రారంభమై అయాచితముగనే లక్కిన దిగువ భాగ్యములెల్ల అబ్బును. కాని చాలా మట్టుగ సాధారణమానవకోటి

మొట్టమొదటిమెట్టు ప్రారంభించి ఆరుమెట్లు యెక్కి అప్పటికి తృప్తితీరక ఆత్మచింతనలేనిదే ఆత్మసాక్షాత్కారములేనిదే తక్కినమార్గములవల్ల కలిగిన సుఖమెల్ల శూన్యమనిగ్రహించి ఆదర్శసుఖాన్వేషులగుదురు. ఆదర్శ సుఖజీవనచింత కలుగుటయే కష్టము కాని కలిగినతరువాత సులభసాధ్యమని గ్రంథపాఠకులకు తెలియకపోదు. ఈరెండింటిలో ఏసౌఖ్యము కోరెడివారైనను దీనిని పఠించక తీరదనుటయే కాక, దీనిని పఠించునప్పుడే యోగ్యులకు అట్టిసుఖములు తోచుచుండకమానవని చెప్పుటకూడ సాహసముకాదు.

**ఎక్సుకాలేజిగర్లు** — డెమ్మీసైజు సుమారు 130 పుటలు. వెల రు0—12—0 ప్రకటనకర్త కృత్తివెంటి నాగేశ్వరరావుగారు. వీరు రాజమహేంద్రవర హిందూనాటకసమాజ డైరక్టరై కాలేజీగర్లను నాటకమును అఖిలాంధ్రభాగములను ప్రదర్శించి అసమాన కీర్తి నార్జించినట్లు ఆంధ్రులెల్లరికిఁ దెలియును. అయినను కాలేజీవిద్యార్థినులెల్లరి జీవనమును ఖండించుచున్నదని ఆనాటకరచనను అనేకవిమర్శకులు తెగడినారు. ప్రదర్శనములవలన అంత ఖ్యాతివడసిన నాటకము ఆస్వల్పకుష్క కారణముచే దూష్యముగ చేయఁబడుట శ్రీ నాగేశ్వరరావుగారి కిష్టములేక అందుగల కళంకములెల్ల తొలగించి నీతివంతముగఁజేసి సుస్వతంత్రముగ వేరొకనాటకము వ్రాయించినారు. ఇది దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారి కంకితము. ఇందు సుగుణ ప్రవర్తనాలోపములకు ఆమె కాలేజివిద్య కాక, 'ప్రేమసంఘము గొప్పది, వివాహము బానిసత్వసూచకము, స్వాతంత్ర్యమొండే సర్వశ్రేష్ఠము' అను దుర్భ్రమలకు కొందరు యువతీయువకులు వశ్యులగుచుండు దురాచారము కారణము. ఈభ్రమ తీరగానే ఆమె రాముని వివాహమాడును. ముసలి తహసీలుదారి పడచుకన్యా వివాహమునకు కారణము కొంతవరకు లోకాచారమును చాలావరకు తన అజ్ఞానమును. ఈ అజ్ఞానము తనికి విచ్ఛిన్నముకాగానే అతను ఆపెరయెడ భార్యభావమును విడచి పుత్రికాభావమూని ఆమె మోహించిన మోహనునికి కన్యాదానముచేసి, తన ఆస్తియంతయు వారి పేర వ్రాసి ఆఅల్లుని ఆకూతుని ఇంటపెట్టుకొని ఉన్నతమైన వార్ధక్యజీవన మొనరించినాడు. రామప్పంతులను అతని దారిద్ర్య మీతప్పుత్రోవకుద్రోసి పిచ్చెత్తించి వేసినది. హేముదీక్ష, పతిభక్తి హరినాథభక్తి ఆదర్శప్రాయములు. ఇట్టి నాటకములవలన దుస్సంఘనిరసనము సత్సంఘగ్రహణము ఎట్టిమానవులనైనను నీతివంతులుగా చేయక మానవనియు, దుస్సంఘము వర్జనీయమనియు స్పష్టము కాకమానదు. ఈనాటకమునకీ రూపము తెచ్చినందుకు నాగేశ్వరరావుగారభివందనీయులు.

**ఆంధ్రదేశము (మొదటిభాగము)** — క్రౌనుసైజు 124 పుటలు, వెల సాహిత్యలత చందాదారులకు రు. 0—8—0, ఇతరులకు రు. 0—12—0. క్లబ్బులకు గ్రంథాలయములకు రు. 1—0—0. చీరాలయందలి సాహిత్యలత గ్రంథమాలా సంస్థాపకులు, సుప్రసిద్ధకవి, నవలాకర్త, దేశభక్తాగ్రేసర శ్రీయుత, కర్లపాలెం కృష్ణరావుగారిచే సదరు గ్రంథమాల నాల్గవ కుసుమముగా రచితము. ఆంధ్రవిశ్వవిద్యాలయపు పోటీపరీక్ష కంపబడినను, రుచులభేదముననో యితర కారణముచేతనో ఇది విజయపత్రము నందలేక పోయినది. "అధికారులెట్లు బహుమతులొసంగినను గుణాగుణములను మంచిచెడ్డలను నిర్ణయించి, ముచ్చటించుకొనుటకు అందరికిని సమానమగు హక్కుగల" దని నిశ్చయించుకొని "ఆదర్శప్రాయుడగు ఆధునికాంధ్రు డితడని చెప్పదగిన 'విశ్వదాత' 'దేశోద్ధారక' కా॥ నాగేశ్వరరావుగారికిది కృతియొసంగి గ్రంథకర్త ప్రకటించారు. 'ఈగ్రంథమున ఆధునికాంధ్రుని జీవితమును ప్రతిబింబింపఁజేయుటకు ప్రయత్నింపఁబడినది.

రామారావు ఒక పల్లెటూరి స్వల్పచదువు, నిరాశరణ నాయిక, ఉత్తమజీవి. అతనిఅన్న పట్టణవాసి సర్కారు వారి 'తోపాకుమ' రాజారావు ఆంగ్లవిద్య యేమో తన్నుద్ధరించునని తలంచుచు ఆస్తినంతయు వ్యయపరచి మేనమామ ఆస్తినిగూడ యాచించుచు చెన్నపట్నములో బహు కష్టముమీద బి. యల్. చదువుచున్న యువజన అవివాహితవిద్యార్థి. సూర్యనారాయణ మాతృభార్యా వియోగములవలన కొంత స్మశాన వైరాగ్యమంది స్వగ్రామము వీడి చెన్నపురిపట్టి కమీషనుఏజంటై ధనవంతుడగుచున్న అదృష్టశాలి. సుశీల రామారావు కనుకూల కళత్రము. సుందరమ్మ అతనిమాత, పూర్వాచార పరాయణురాలు. సావిత్రి అతని చెల్లి భర్తనెఱుగకుండ ముండమోసిన పదునారేండ్ల పడుచుపిల్ల. సూర్యనారాయణ కామెనిచ్చి పెండ్లిచేయు ప్రయత్నములు కాస్త ప్రారంభమైనవో లేదో మొదటి భాగము సమాప్తము. ఇతర భాగములను ప్రకటించి యీశుభవర్తమానమును ఇతర ప్రధాన విషయములను గ్రంథకర్తగారు సత్వరముగ అఖిలాంధ్రాధునిక పాఠక లోకమునకు బ్రకటించి హర్షాంబుధి నోలలాడింతురు గాక !

**కృషీవల విలాసము**

డెమ్మీ సైజు సుమారు 120 పుటలు. వెల రు.1—0—0 నాలుగధ్యాయములు. గ్రంథకర్త శ్రీయుత చాట్రాతి చిన వెంకటప్పయ్యగారు ఏలూరు. లక్కవ రాస్థాన విద్వాన్ కొత్తపల్లి సుందరరామయ్యగారి ప్రియ శిష్యులు. బాల్యాదారభ్య కృషీవలవిషయమునుగూర్చి మనస్సున తట్టుచుండు సుందరభావములు 465 పద్యములలో వ్రాసిరి. కవిగారి కవితాపరిణామము, భావపుష్టి, శైలి పటిష్ఠత, క్రమక్రమ వేదాంతదృష్టి, ఐహిక దాంభికఖండన మొదలగు నెన్నోవిషయములు అద్దములోవలె యీ మహాగ్రంథమున కానవగును. వీరి గురువుగారి పీఠికతో రాణించుచున్నది.

మెచ్చుపద్యము.

చ. జనపరిశుద్ధపాలనవు
సంఘపువోటుకు దుడ్డుచేతితో
వనముల తేరిచూచి యిలు
వాకిట తిప్పుచు నాకు నాకనాన్
ఘనమగు నాశ్రయింపు గల
నాట్యము కోర్టుకు బ్రాకులాడు దీ
వనలను బుద్ధిమెచ్చు చల
పాదుల కేమిటి తత్వబోధనల్.

**కళ.**

జూలై 15-వ తేదినుండి నెల కొకతూరి వెలువడు మాసపత్రిక. చందా సాలుకు రు. 1—8—0. విడిప్రతి రు. 0—2—6. కార్యస్థానము రాజమహేంద్రవరము. సంపాదకుడు శ్రీయుత వల్లూరి శ్రీనివాసమూర్తిగారు. తొలిపలుకు, స్వాగతం, దీవన, ఆశీర్వాదము, గురువు, కళాపూర్ణోదయం, లౌలెటరు, హరినాథ బాబాగారి వ్యాసానువాదం మలాశయ క్రిమిదోషము, సీతాదేవిసిగరెట్టు, వింతలు, ఫలోక్తులు మొదలగు రకరకాలపాకములతో 'కళ' కడుపు నిండించుచున్నది. దర్శనీయమగు ఆకృతి—చెళ్లపిళ్ల వేంకటకవిగారి యాశీర్వాదము ప్రకారమిది చిరంజీవియై వర్ధిల్ల గోరుచున్నాము.

**జ్యోతి.**

లాంఛనామాత్రమైన చక్కని సంపాదకీయపీఠిక; ఆపద్ధర్మ రూపకమైన మునిమాణిక్యం వారి కాంతం భర్తల చీకట్లో తీయనికౌగిలింతతో శుభాంతమగు కథ; కొడవటివంటివారి 'ప్రవాహ' రూపకమైన విధవావివాహకథ; కుటుంబరావుగారి అత్యాచారఘోరం కథ; గూడూరివారి 'మత'ద్వేష ఘోష; దూరస్థ హిట్లరుపరిపాలన దూరు; సామ్యవాదముయొక్క ఉండకతీరని 'యెందుకంటే'; రంగనాయకులుగారి ఆస్తులయేలం లాభాలుపంపకం సిద్ధాంతం; శ్రీ సత్యనారాయణరావుగారి యంత్రమహిమా

సంకీర్తనవ్యాసం; మొదలైన యెన్నోవిషయము లిందందమును చిందుచున్నవి. ఒకవ్యాసమున కొకటి యీడుతీయకున్నది. 'సరదాగా ఓగంట చదువుకోడానికీ—చదువుకున్నాక, ఆలోచించడానికీ—మెదడుకు ఏమాత్రమైనాపని యివ్వడానికీ' దీనిఆశయము. మెదడుకు 'ఏమాత్రమైనా' మాత్రమేకాక తీక్ష్ణమగు చుఱుకుదనమిచ్చి చకచక పనిచేయించే శక్తి నిచ్చుచున్నది గనుక యీసంచిక వీరి ఆశయాలను ద్యోతంచేయటం మాత్రమేకాక ఫలింపజేయుచున్న దనవాలి. ఇది మాసపత్రిక. జూన్ నుండి ప్రారంభం. వి. కె. విశ్వనాథ గరు సంపాదకులు. బందరు శ్రీ లక్ష్మి ముద్రణాలయములో ప్రచురణము. చందా సాలుకు రు. 1—8—0. విడిపత్రిక రెండణాలు. కార్యస్థానము బందరు.

**వచన రచనా దర్శని**

క్రౌనుసైజు 169 పుటలు. వెల రు. 0–12–0లు. గ్రంథకర్త శ్రీయుత పప్పు సేతు రామ శర్మగారు. మద్రాసు గవర్నమెంటు ట్రెయినింగుస్కూలు రిటైరుడు హెడ్మాస్టరుగారు. పీఠికలో శ్రీయుత జె. జి. సోమయాజులు గరు సూచించినట్లు నన్నయ చిన్నయ సూర్యాదుల వ్యాకరణములు బహుసులక్షణోపేతంబు లయ్యు వారు బాలురకు శిక్షలు నేర్పియెరుంగమిని లేక అన్యజాతీయులు తమ బాలురకు విశాలపాఠశాల తరగతులలో నేర్పు తెరంగు లెఱుంగమిని ఉపాధ్యాయులకును విద్యార్థులకునుగూడ ఆగ్రంథము లెందుకును కొఱగాకున్నవి. వ్యాకరణసూత్రములను కంఠతా పెట్టినవారికికూడ సూత్రములత్రోవ సూత్రములవి తప్పులత్రోవ తప్పులదిగా ఉన్నది. గ్రంథకర్తగారి యం దీ లోపములు లేకుండుటచేతను ఇతర అందు ముఖ్యముగా ఆంగ్లభాషాసంప్రదాయముల ననుసరించుటచేతను బాలురకు వ్యాకరణసూత్రములు రాకున్నను గురువులకు సులభమైన శిక్షాక్రమమువలన వారు చక్కని వచనలేఖకులగుదురనుట కభ్యంతరము లేదు. తరగతి సమూహవిద్యలు, వరయోజనవిద్యలు విరివిగా వ్యాపించుచున్న యీరోజులలో ఇట్టి సులభ శిక్షాక్రమములు గురుశిష్యులపాలిటి కల్పతరువు లనవలెను. ప్రకటనకర్తలు అంబికా బ్రదర్సు మైలాపూరు, మద్రాసు.

**పద్యమాల**

సుమారిరువదియైదు పద్యముల గ్రంథము. కవి శ్రీయుత నందివాడ వెంకటరత్నంగారు, వేగేశ్వరపురం (via) కొవ్వూరు, పశ్చిమగోదావరిజిల్లా. కవిగారు చెళ్లపిళ్ల వేంకటకవిగారి శిష్యులు. వేంకటకవిగారి ప్రజ్ఞలను మాధుర్యములను శిష్యవాత్సల్యాది సుగుణములను ఇంత సుందరముగను ఉత్ప్రేక్షాద్యలంకారయుతముగాని సత్యములగు పద్యములుగను వర్ణించినవారు లేరు. వ. సు. రాయకవియే కవితను ప్రశంశించిరన్న నందలి మాధుర్యము రమణీయ మనవలెను.

**వైద్యయోగ రత్నావళి**

మద్రాసు సెంట్రలుబోర్డు ఆఫ్ ఇండియను మెడిసిన్‌లో సభ్యులగు శ్రీయుత ములుగు రామలింగయ్యగారిచే రచితము ప్రకటితము. ఇండియన్ మెడికలుస్కూలు ప్రిన్సిపాలు జి. శ్రీనివాసమూర్తిగారు దీనికి ప్రశంసాపూర్వక ఉపోద్ఘాతము వ్రాసినారు. ఇందు 20 ఆసవారిష్టములు 24 చూర్ణములు, 14 లేహ్యములు, 11 గుటికలు, 7 లేపములు, ౮తైలములు, 38 భస్మసిందూరములు, 57 రసౌషధములు, 43 అనుబంధములు, ఘృతములు, సర్జికలున్ను స్పెషల్సు మొదలగునవి 43 మొత్తము 265 మందులను తయారుచేయు విధానములు, వానిని సేవించవలసిన విధానములు, వానివలన నివారణములగు రోగములు, ఏయేరోగములకు ముఖ్యముగ దేనిని సేవించవలెనను సకల విషయములను తేటతెనుగువచనములో వ్రాయబడినవి.

## గ్రంథపరిచయము

వీనిలో పెక్కింటిక్రింద యీవిధానము లేయే ప్రాచీనోత్తమ గ్రంథములనుండి సంగ్రహించబడినవో వాని పేరులు, తత్సంబంధశ్లోకములు వ్రాయబడినవి. ఇది కేవలము ప్రాచీన ఆయుర్వేదగ్రంథముల కనువాదము కాని, నవీన పాశ్చాత్యానుభవసారముల సంపుటము గాని కాక, ఒక్కొక్క ఔషధమును తీసి దానిని తయారుచేయు విధానాదులను ప్రాచీన గ్రంథముల ప్రకార ముదహరించి ప్రతి ఔషధరచనము సేవనము సందర్భమునను తమ కఖండానుభవమువలన తెలిసిన విషయముల నుదహరించుచు, ఇంతతో అగక మళయాళ ప్రాంతమునందలి ధారాభ్యంజనాది విధానములకూడ తెలుపుచు 356 పుటలుగల మహాగ్రంథమును వ్రాసినారు. కాస్త శుశ్రూషవలన నెట్టియజ్ఞానియైనను మంచి వైద్యుడు కాగల్గుటకు ఈ గ్రంథమును పఠించి యీమార్గ మవలంబించుటకంటె వేరు సులభమార్గములేదు. కేవల వైద్యులేకాక ఆధివ్యాధిభాజనశరీరధారులకెల్ల తామే మందుల నెప్పుడు సేవించవలసినది దేనివలన నెట్టిగుణము కలుగుచున్నది తెలుసుకొనుచున్నచో ఆరోగ్యము ద్విగుణీకృతమగుననుటకు సందేహములేదు. వెల రు. 2. తెనాలిలోని ఇండియన్ మెడికల్ స్టోర్సునందుండు గ్రంథకర్తగారివద్ద ప్రతులు దొరకును.

# మేనల్లునిపై

శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుగారు

నిశిగర్భమున మేటి శశిబాలు డుట్టె, చెల్లికడుపున చిన్ని చంద్రు దుదయించె!
నింగి చంద్రుని క్రమ్మె నీలంపుమొగిలు, చెల్లిపుత్రుని మోము మల్లిపూలేను!
చందమామ మొగాన చందున్నదోయి! మాపాప కళ చందమామ నేదోయి?

పొడుపుకొండకు గల్గె నుదుకుసూర్యాంశు, చెల్లికడుపున వెల్గె చల్లన్నిసుతుడు!
వేశితపనుడు కాచె మాడించునెండ, చెల్లిపాపడు పూచె చెంగావినవ్వు!
మింటిసూర్యుని చాయ వెంటాడునోయి, మాబాల సూర్యుడే మంచివాడోయి!

అడవిలో పూవుల్ల అందాలుకాని
ఆమన్ని చిగురించు కోమలతకాని
సందె పయ్యెరగాలి చలువల్లుకాని
మాచెల్లిపాపల్లో తోచాయిముందు!
మాపాపలో లేని మహిమలేదెందు!

# బాలవిజ్ఞానశాఖ

## పాటలు

### తెల్లవారుజాము

తూర్పుపాటాయింది - తొలికోడికూసింది.
కర్పూరకణికలాగను - వేగుచుక్కుంది
నేర్పైనయిల్లాళ్లు - నిద్రపడకలనెత్తి
ప్రాచిపనిచేస్తున్న - పాటలనుపాడేరు;
మేలుకొలుపులుకొన్ని - కవ్వాలుతిప్పుతూ
గొల్లకృష్ణునినాటి - చల్లపాటలుకొన్ని.
భక్తుడొకడెవ్వడో - భజనపాటలుపాడి,
పశుక్కాంచెమటి - నిద్రపట్టనీకున్నాడు.
పాలేళ్లు నాగేళ్ళు - పట్టుకొని యెడ్లతో
ఊరవలపొలములకు - పారిపోతున్నారు
దాసీలువాకళ్ళ - దార్లల్లతుడిచితే
కలయంపిజల్లి - పసుచులు ముగ్గుపెట్టేరు.
తెలివొచ్చివూరెల్ల - తేటగావున్నాది,
కలవచ్చినట్టుగా - కలకలలాడింది

## కథలు

### తోళ్ళపనియు కర్మయోగమే

పూర్వకాలములో కీవు అనే నగరములో ఒక చల్లని రాజు పరిపాలించుచుండువాడు. అతని ఔదార్యము ప్రజాభిమానము మొదలగు సుగుణములను చూచి "సూర్యభగవానుని పుత్రు"డని అతనిని ప్రజలు పిలచెడివారు. అతనికి హెలెను అను పేరుగల ఒక కుమార్తె ఉండెడిది. ఆమె సౌందర్య మప్సరసలను మించియుండెడిది. పురాణములలోనైనను మనమట్టి సౌందర్యమునుగూర్చిన వర్ణనలను చదివియుండము.

ఆరాజు ఆనగరమును పాలించుసమయమునసనే ఒకదినమున రాత్రి పెద్దకొండచిలువకంటె పెద్దదైన ఒక త్రాచుపాము ఆనగరములో ఒకయింటిలోదూరి ఒక సుందరమైన కన్యను కఱచుకొనిపోయి మ్రింగివేసెను. ఆ మఱునాడు వేఱొకయింటిలోదూరి వేఱొక కన్యను కఱచుకొనిపోయెను. ఇట్లు దినమున కొకొక్క సుందరమైన కన్యకావిగ్రహమును కఱచుకొనిపోవుచుండెను. ఏనాడెవరిపిల్లనెత్తుకొనిపోవునో యెవ్వరికిని తెలియకుండెను.

పురవాసులెల్లరును ఒక సభచేసి యేనాడెవరిపిల్లనిచ్చివేయుటో నిశ్చయించుకున్న బాగుండునని తీర్మానించుకొనిరి. నెలకు ముప్పదిచీటీలమీద ముప్పదిపేరులు వ్రాసి కళ్లుమూసుకొని ప్రతిదినము ఒక్కొక్క చీటీని తీయుచు, ఏనాడెవరిపేరుగలచీటి దొరకిన ఆనాడాకన్యకనిచ్చివేయ నిశ్చయించుకొనిరి.

ఇట్లు దినమున కొకొక్కకన్యక మరణించుచుండగా ఒకదినమున హెలెనువంతు పడెను. రాజపుత్రికగదా అని ఆమెను విడచిపెట్టుట కామెతండ్రిమాత్ర మొప్పుకొనకుం

డునా? రాజుయొక్క కర్తవ్యము ప్రజలను రక్షించడమో, అది సాధ్యముకాకున్నచో వారితోకూడ సమానముగ తానునూకష్టములనుభవించడమో కాని, వారినెల్లరిని మాత్రము కష్టములపాలుజేసి తాను సుఖించ కోరడము కాదు గదా!

హెలెను మరణించుననన్న రాజునకు దుఃఖము పొంగిపొంగివచ్చెను. ఆమె నెట్లయినను రక్షించుటకును, సాధ్యమైనచో తానా త్రాచుతో పోరాడి చంపుటకును దృఢనిశ్చయుడయ్యెను. అది వ్యర్థప్రయత్నమనియు, త్రాచును చంపుటకంటె తండ్రి చచ్చుటయే నిశ్చయమనియు హెలెనుకు తెలియును. ఆమె తనతండ్రిని వారించి తానే చనిపోవుటకు నిశ్చయించెను. రాత్రి సర్పము వచ్చి యామెను తనచీకటిగుహయొద్దకుం గఱచుకొనిపోయెను. తండ్రి విచారించెను.

అది అచ్చట ఆమెసౌందర్యమునుచూచి పరమానందమును పొందెను. ఆమెసౌందర్యమాచీకటిగుహనంతటిని దేదీప్యమానముగా వెలిగించుచుండెను. ప్రతిదినమును ఆమె దివ్యసౌందర్యము నొకసారి దర్శించి పిమ్మట వనిపాటులు చూచుకొనుటకుపోవ నిశ్చయించెను. ఆహా! సౌందర్యములో నెట్టి మహిమ గలదు! క్రిమికీటకాదులలోంగూడ ఆమోహములో పడనిజీవులు లేవుగదా!

ఆమెకు తీయని ఆహారము, కమ్మని ద్రాక్షసారము, మెత్తని గరికపఱుపు మొదలగునవి యొసగి దినదినమును పరిచర్యలను సలుపుచుండెను. ఒకదినమున వనికిపోవుచు 'నీకేమితేవలెను?' అని ఆచిలువ అడిగెను. 'నీవొసంగుచున్న పదార్థములే నాకు చాలును; వేరేమియు శ్రమపడితేవలదు' అని ఆమెచెప్పెను. 'మొగమాటపడకుము. నీకు మంచినగలు తెచ్చెదనులే' అనిచెప్పి పాము బయటికి పోయెను. దినమును తెచ్చుకొనుచుండు కన్యల నామెయెదుటకాక వేఱేతావున తినుచుండెను.

ప్రతిదినమును ఉదయమున తాను పనికి పోవునప్పుడు పెద్దరాళ్లనుతెచ్చి ఆమెగుహాద్వారమున కడ్డుపెట్టి పోవుచుండెను. ఆరాళ్ల నామె కదలించి పైకిపోజాలదనియు అన్యులెవ్వరును అందులోదూరజాలరనియు పాముయొక్క నమ్మకము. ఇట్లుండగా హెలెనుయొక్క స్వంతకుక్క ఆమెఉండెడి తావును పసిపట్టి, ఆ గుహాద్వారముకడకు ఒకదినముదయమునవచ్చి లోపల మెల్లగాదూరెను.

హెలెను ఆ కుక్కనుచూచి మిగుల సంతోషించి, ఒకభూర్జపత్రమునుతీసి దానిపైని తాను సుఖముగా ఉన్నట్లువ్రాసి కుక్కమెడకుకట్టి, తండ్రియొద్దకు బొమ్మని వీపుతట్టి పంపెను. తండ్రి తనకుమార్తె జీవించియున్నందుకు పరమానందమునొంది 'ధైర్యముగను ఉత్సాహముగను ఉండు'మని ఆశీర్వదించుచు వేఱొకచీటినివ్రాసి కుక్క నామెకడకంపెను.

ఆకుక్కవచ్చిన మూడు నిముషములకు పాము వచ్చుచుండెను. ఆమె కుక్కను చీటిని ఒకమూలనుదాచిపెట్టి యేమియు నెఱుగనట్లు కూర్చొనెను. ఇంతలో పాము లోపలదూరి

యేదో విచారసూచకముగా ఒకమూల పడియుండెను. ఆమె పాముచెంతకుపోయి 'ఏమి అంతదుఃఖముగానున్నావు ? కారణ మెయ్యది' అని అడిగెను. 'నాకు మహా కష్టమువచ్చినది. కొంచెమాహారమును ద్రాక్షసారమును ఇమ్ము. పిమ్మట తెలిపెద' ననెను.

ఆహారానంతరము 'కీవునగరమున కైరిలో అను పేరుగల మాదిగవాడొకడున్నాడు. అతను నాకంటె చాలా బలవంతుడు. నామీద నతనికి చాలాకోపముగా ఉన్నది. అతనంటే నాకు భయమగుచున్నది' అని చెప్పెను. ఆమె పామును భయపడవలదని ఓదార్చి జోలపాటలు పాడి జోకొట్టి, నిద్ర వచ్చినతరువాత భూర్జపత్రముపై 'కైరిలో ఒక్కడే ఈపామును చంపగలధీరుడు. వానిని బ్రతిమాలి పంపు'మని చీటీ వ్రాసి కుక్క మెడకుకట్టి వెంటనే పంపెను.

ఆమెతండ్రి ఆ లేఖనుజదివి ఆనందపరవశుడై తాండవమొనరించి కైరిలోను పిలిపించి, పాముగుహదగ్గరకుపోయి చంపుమనియు, తనకు జయమునిశ్చయమనియు బ్రతిమాలెను.

అయితే కైరిలో మూర్ఖుడు. తనబలము సంగతి నెరుగనివాడు. కాకశ్రమాశీలుడు. నిద్రపోయే నాలుగుగడియలుమాత్రమేమో కాని పిమ్మటనెల్ల తోళ్లు బాగుచేయుట చెప్పులు వగైరాలు కుట్టుటయందే ఆనందము ననుభవించు యోగిలాంటివాడు. 'నా తోళ్లపని యెవరుచేస్తారయ్యా?'' అని విసుగుతో అరచి ఊరకొన్నాడు.

"కీవునగరమునందలి సుందర కన్యాలలామలందరితరఫున నేను నిన్ను ఆగుహ యొద్దకుపోయి సర్వమును సంహరింపవలెనని యాజ్ఞాపించుచున్నా"నని రాజు పల్కెను. కైరిలో యేమీ కదలలేదు. మొద్దురాతి చిప్పవలె కూర్చొనెను. అప్పుడు ఆనగరములో చావగా మిగిలి చనిపోవుటకు సిద్ధముగానున్న సుందరీ విగ్రహములెల్ల యేడ్చుచు మొఱపెట్టుచు అతనియొద్దకువచ్చి పాదములపై బడిరి. అక్కడికి అతనిమనస్సు కఱిగినది.

వెంటనే అతడంగీకరించి యెట్టయెదుట నున్న ఒక మహావృక్షమును మూడువ్రేళ్లతో గూడ బెఱికి బెత్తమువలె చేసుకొని, పాముగుహ వద్దకు పరుగెత్తి "ఎవరోయి, ఇందులో నక్కిపండుకున్నారు? పైకివస్తావాలేదా? రా'' అని పెద్దకేకవేసెను. పాము గజగజవణకి తలను కొంచెము పైకిదూర్చి యెవరోఅని తొంగిచూచెను. ఠకీమని ఒక్కపెట్టుపెట్టినాడు కైరిలో, రాళ్లు అవతలకి త్రోసేసినాడు. "రక్షించుతండ్రీ, నామీద జాలివహించు'' అని పాముదీనముగా యేడ్చినది. "మానగరపు దీనసుందరులమీద నీవే మాత్రము జాలిపూనినావోయి? ఈ కబురులు మాను''మని దాని ప్రాణములు పోవునట్లు మరియొక్క పెట్టుపెట్టినాడు. అది మరణించినది.

పిమ్మట హెలెనును తీసుకొని కైరిలోకీవు నగరమునకుపోయెను. నగరధ్వజ స్తంభములన్నిటియందు గల చిఱుగంటలును గణగణమని ఉత్సాహముతో ఒక్కమాఱు మ్రోగినవి. నగర సుందరులెల్లరును రెండు కమ్మనిపూలదండలను గొనితెచ్చి కైరిలో హెలెనుల యిరువురి కంఠముల నలంకరించిరి.

"నీవు చేసిన యీమహోపకారమునకు బదులుగా నీయిల్లంతయు బంగారముతో నింపెద"నని రాజుగారు పలికెను. "తమ బంగారమున కాసించి నేనుపోలేదు. ఈ కన్యకామణులయందుగల అభిమాన బలమువల్ల నేనాసర్పమును వధించితిని. మీ ఆనందము కంటె నా కెక్కువబహుమానమువద్దు" అని చెప్పి అతను తనతోళ్లు బాగుచేసుకుంటకు పోయెను.

కర్మాసక్తి కర్మయోగము అన్న అట్లుగదా ఉండవలెను. తోళ్లపని కాదుగదా అంతకంటె తక్కువపనిలాంటిదైనను కర్మ కాదా, అందుగల యిట్టి శ్రద్ధ యోగము కాదా? ఆపనియందు అతను లీనుడై ఉన్నన్నాళ్లు అతని బలముయొక్క మహిమమే అతనికి తెలియలేదు. అశేష బాలికా ప్రాణసంరక్షణాధారమొక్కటే అతని నాతని కార్యమునుండి కొంచెము తప్పుకొనునట్లు చేసెను. అమూల్యాకనకవర్షము నతనిపై గురిపింతునని రాజుగారు కోరినను తృణప్రాయముగ నిరాకరించెను. రాజులకు రాజాధిరాజులకుఁగూడ అతని చరిత్ర గుణపాఠమును నేర్పుచున్నది. అట్టి మహనీయులు రాజులు, దర్పములు కొట్టుకొనుచుండు శ్రీమంతులు, పండితులు మొదలగు పెద్దపెద్ద బిరుదులధారులలోకంటె సర్వసామాన్య వృత్తులొనరించు సాధారణ సంసారులలోనే యెక్కువగా నుండవచ్చునని అతని చరిత్ర చెప్పక చెప్పుచున్నది. అయినను ఈకాలములో డాబులులేని వారిని తరుచుగా జనులు లెక్కచేసి గమనించరు. అయినను అట్టివారి యందెక్కువ శ్రద్ధను బఱచుట ఉత్తముల లక్షణమైయున్నది. మన పురవీధులలో రోడ్డులప్రక్కను కూర్చొని చెప్పులు కుట్టువారిలోకూడ ఇట్టివారు అనేకులు ఉండవచ్చుననుట కాటంకమేమి?

నగరవాసులుమాత్ర మానాడమితానందమునొంది పాముగుహకుపోయి, సర్పకళేబరమును సముద్రపుటొడ్డునకు మోసుకొనిపోయి విడచిపెట్టిరి. కీవునగరమునకు వెళ్లిన, సముద్రపుటొడ్డున నేటికిని ఒకపాము శవము కనిపించునట. ఆశవ మీ పాముదేయని ఆ ప్రాంతస్థులు చెప్పుకొనుచుందురట. ఇట్టి నిదర్శనములున్నప్పుడిట్టి కథలను నమ్మకుండు టెట్లు?

# శిశు శిక్షణము

బద్రా వెంకటనాంచారయ్యగారు, ఎం. ఏ.,

## పసిబిడ్డ — భయము

మనలో కొందఱు పసిబిడ్డ పాడికుండ అన్నా రనుచు బిడ్డలను గుడికదిలి వెలుపలికి రానీరు. ఇది పొరపాటు. పిల్లలు స్వేచ్ఛగా తిరిగినచో మంచి వ్యక్తిత్వమునుగలిగి భవిష్యజ్జీవనమునందు ప్రయోజకులగుదురు. అట్లుకానిచో కూపస్థమండూకములై తెలివిలేనివారై బాహ్యప్రపంచవిషయముల నించుకేనియు తెలియక అజ్ఞానాంధకారమున దేవులాడెదరు. ఇదికాక పిట్ట బుఱ్ఱనినచో బెదరెడుస్వభావము గలిగెడువారయ్యెదరు. భయము బిడ్డని కవసరమా కాదాయను విషయమును కొంతవఱకు చర్చించు టుచితము.

బిడ్డనికి భయముండవలసినదే. కనుకనే మనవారు "భయమూ లేదు భక్తీ లేదు. వీడు పనికిమాలినవాడగుచున్నా"డని నుడివెదరు. ఆంగ్లభాషయందుగూడ "Spare the rod and spoil the child." అనెడు లోకోక్తి ననుసరించి "అబ్బాయీ సరిగా చదువకపోతే బెత్తంపప్పులు తగులు"నని యదలించుచున్నారీనాటి యుపాధ్యాయులు కొందఱు. అది మిగుల పొరపాటు. బిడ్డని నలిపి నైవేద్యముపెట్టినచో నాతఁడు దాసానదాసుఁడుగా తయారగును. కొంతవఱకు యుక్తాయుక్తముల గుర్తెఱింగి కంటిభయముతో బిడ్డను పెంచు టుచితము.

మఱికొందఱు బిడ్డలకు భయమనిన యెట్టిదో తెలియగూడదను సిద్ధాంతమును బయలుదేరదీసి పసిగందుల నోట మట్టికొట్టుచున్నారు. కాని నిజముగా భయమనునది శిశువు నభివృద్ధికిఁదెచ్చెడు ముఖ్యసాధనము, అపాయకరములగు కార్యములనుండి మనల పరాఙ్ముఖులనుజేయునది భయమేగదా! అట్టి భయమ నెట్టిదియో తెలియనిది నిరతదుఃఖాపాదియగు మాయలోకమున నెగ్గఁగలమా. క్రవ్యాదులు కొంతవఱకు భయమువీడి స్వేచ్ఛాప్రచారము గావించినచో శీఘ్రముగా మట్టుపెట్టబడును? పిల్లితో నెలుక చెలగాటలాడునా? ఇది స్వభావవిరుద్ధము. భయము వలననే యది యట్లొనరించుచున్నది. బిడ్డలును భయమెట్టిదియో యెఱుంగనిపక్షమున—తామీ ప్రపంచమందు క్లిష్టపరిస్థితుల నెదుర్కొనవలసినపుడు, చేతకాని "దద్దమ్మ"లగుదురు. కాని భయమనునది శిశువును హఠాత్తుగా నావరింపగూడదు. అట్లావరించిన యెడల నా పసిపాప యుక్కిరిబిక్కిరగును. సమయాసమయములఁ దల్లియొద్ద కూర్చుండఁబెట్టి మేపి పంచవత్సరములు రాగనే పిల్లవానిని "అబ్బాయీ బళ్లోకి పో, నాయనా! అక్షరాభ్యాస మయినదిగదా"యని శ్రీరంగనీతులు చెప్పినచో బిడ్డవినునా? బడికిపోవుట అనినచో నది జగత్ప్రళయమనుకొని కుములును. మనవారు చెట్టైవంగనిది మానై వంగునా యనుట కిదియే తార్కాణము. గ్రాహకము తెలిసినప్పటినుండియు బడియన నేమో యచ్చటి పరిస్థితులేమో తెలుపక పొరుగింటిపిల్లలతోడనైన, గిల్లి కజ్జములు తెత్తురను భయముతో, నాడుకొననీక ఆకస్మికముగా బడిలోనికి పొమ్మంటే పోతా డాకుఱ్ఱవాడు - మనులుతాడు గాని.

### భయము—దాని వైధర్మ్యము

భయమనున దెన్నివిధములో కొంచముచూతము. మృగము లెప్పుడును చచ్చిపోదుమను భయముతో

మెలఁగుచుండును. అట్టిభయమే మానవునియందునుఁ గలదు. ఇది సాధారణముగా బాధ ననుభవించుట వలన జనించును. పాలు దొంగతనముగా త్రాగ నల వాటుపడుపిల్లి యొకనాడు సలసల కాచినపాలలో మూతిఁబెట్టినచో నిక నది బ్రతికియున్నంతకాలము పాలజోలికి పోదు. అటులనే యెప్పుడును చాకుతో నాటలాడుకొనుబిడ్డ డొకప్పుడు వ్రేలు కోసికొనినచో నిక దానిని ముట్టుకొనుటకుగూడ జంకును. శారీరక బాధ మానవుఁడెప్పుడో యొకప్పు డనుభవింపవలసి నదే కనుక చిన్నతనముననే యట్టిబాధ ననుభవింపఁ జేయుట సమంజసము. మనదేశములో పిల్లలకు కర్ణ వేధనము మొదలగు బాధ కలుగుచునే యున్నది. కాని "టీకాలు వేయించండయ్యా" అంటే కొందఱు తల్లితండ్రులు "మాబిడ్డ నల్లారుముద్దుగా పెంచినాముః నీచేతి కప్పగింతుమా"యని యెదురు తిరుగుదురు. తుదకెప్పుడో యొకప్పుడు మిత్తి కప్పగించుచునే యున్నారే!

పితరులిటుల ప్రవర్తించుట బుడుతలకు విషముగా పరిణమించుచున్నది. అటుల చాలమంది పిల్లలకొక పర్యాయము టీకాలు వేయునప్పుడు వారిని మీలో నొప్పిని యెవ్వ రోర్చుకొనెదరో చూచెదమని ప్రోత్సాహము చేయుచుండవలెను. వారలదివిని నాకు నొప్పిలేదు నాకు నొప్పిలేదని యొకరినిమించి యిం కొకరు పో నభిలషింతురు. పదిమందితోడి చావు పెండ్లితో సమానమని పెద్దలు వచించియేయున్నారు గదా! ఈతీరున చిన్నతనమునందు నొప్పి ననుభ వించినబిడ్డ తన జీవితములో నట్టిఘట్టమునే తా ననుభ వింపవలసి వచ్చినపుడు నగుమోముతో నిలుచుండునే గాని పిరికితనము చిన్న మెత్తైనఁజూపదు. అందువలన దానికి నాత్మవిశ్వాస మెక్కువగును.

మనకు తెలియనిదానివిషయమై భయముఁజూపుట సహజమే. వన్యమృగము లట్టిభయమునేఁ జూపు చుండును. "ఏమో పులేయున్నదో భూతమేయున్నదో దానిజోలికి పోవలదని" మనము సాధారణముగా జెప్పుచుండుటయే పిల్లలను జెడుచుచున్నది. అందులకే కొందఱు పిల్లలు పట్టణమందు దారితప్పి వారి తల్లి తండ్రులను గానక రోదన మొనర్చుచున్నారు. మరి కొందఱు సాహసికులు తమదారి నెటులనో కనుగొని వారి తల్లిదండ్రులను జేరుచున్నారు. బిడ్డలు సాహస కృత్యము లాచరించునటుల వారిని ప్రోత్సహించుట పితరులమగు మనవిధియై యున్నది.

మూడవది పట్టుపడెదమను భయము. మానవుడు తెలివితేటలలో నారితేరిన కొలదియు నీభయ మెక్కు వగా కలుగును. కనుకనే కొందఱు స్వేచ్ఛగా బహిః ప్రదేశములందు రాత్రికాలమున సంచరింప భయ పడెదరు. ఆకారణముచేతనే కొందఱు రాత్రులయం దింటిలో పడుకొన నిచ్చగింపరు. రాత్రులం దెవ్వరేని తలుపు గొళ్లెము బెట్టి కొంపను నిప్పంటింతురేమో యనెడు భయము వారిని పీడించుచున్నది. బిడ్డలున్న యింటిలో మూలలకువెళ్లి యేవస్తువునైన తీసికొని రమ్మనినచో వారు వెనుదీయుట మనకు సువిదితమే. అట్టిభయము బిడ్డని ఆవేశింపకుండునటుల మనము తగు శ్రద్ధ వహింపవలెను.

నాల్గవది తోటివారలు తమవర్గమున చేరనీ కొనెదరో యనెడు భయము. ఇది మనభారతదేశము వంటి దేశమందే తాండవమాడుచున్నది. మానవుఁ డెల్లపుడును తోటివారల పెట్టుపోతల కాశింపక పోయినను వారితో కలిసిమెలిసి తిరిగెడి స్వభావము కలవాఁడైయున్నాడు. కనుక సంఘమున కాతఁడు సర్వకాలసర్వావస్థలయందును వెలిచుచునేయుండును. ఈ వెలిపేలేనిచో వానిని పట్టపగ్గములేయుండవు. బిడ్డను తనసంగడికాండ్రలో నెవ్వరేని గేలిచేసినచో "చూడవే అమ్మా! వాడు నన్నెక్కిరిస్తున్నాడ"ని తల్లితో మొఱపెట్టుట మనకు తెలిసినవిషయమే. కాని వాని మేధాశక్తి పరిపక్వదశనుపొందగనే యట్టి హేళన కాతఁడు చెడచెవిపెట్టి "ఏనుగుపోవుచున్న

కుక్కలెన్ని మొరుగ"వని నుడువ మొదలిడును. స్త్రీలు శరీరము నలంకరించుకొను విషయమునను, వస్త్రధారణమునందునను తోటివారల యభిరుచి ననుసరించియే సంచరించుట యీభయమువల్లనే.

అయిదవది యొంటరితనమువలని జనించెడిభయము పిల్లల నింటిలో నొంటరిగా వదలిపెట్టినచో నావురు. మని యేడ్చెదరు. పెద్దవారుకూడ నొక్కరేయున్నపుడు బిక్కుబిక్కుమనుచునేయుందురు. ఇది మానవునికి స్వాభావికమే.

ఇదికాక చీఁకటియునినచో బిడ్డలు భయపడుదురు. ఆభయమే పెద్దవారైనను వారిని వీడదు. ఈచీఁకటిభయ మెందువలనఁ గలుగుననగా, బిడ్డని పెద్దవారు "నాన్నా చీఁకటిలోకి పోవద్దు బూచియున్న"దని యొకటేభయపెట్టెదరు. బూచి యున్నదో లేదో శిశువు పిలోకించెనా? ఎఱుఁగునా? లేదు. నిజముగా బూచియేయున్నదికాఁబోలునని వాడుపొద్దుగ్రుంకగనే యింటిలోనికాలు బయటపెట్టడు. ఇదికాక మనము పిల్లలకు దయ్యములు మొదలైనకథలు చెప్పుచున్నాము కనుక చిన్నవాండ్ర చీఁకటిలో, గాలి దయ్యములు పెనుభూతములు భేతాళుఁడు వగయిరాలు చెలరేగి తిరుగునని శంకించి యింటిలో నడగిమడగిపోవుదురు. కొందఱు మానసికతత్త్వవేత్తలు మనపూర్వీకు లెప్పుడో గుహలలో నివసించిరనియు వారు చీకటిలో ఘాతుక మృగములవలన బాధపడిరనియును దానివలన వారలు చీఁకటియనినచో కలఁతఁజెందిరనియు అట్టి శంకయే వారిసంతతివారలమగు మనలఁగూడ బాధించుచున్నదనియుతలంచుచున్నారు.

కొందఱు తల్లిదండ్రులు ప్రతిదానికీ భయపడెదరు. అట్టిభయమే వారినన్నివిధముల ననుకరించుచున్నవారి సంతానమునుగూడ పట్టి పీడించును. ధ్వనియనినచో గూడ కొందఱు భయముపడెదరు. కనుకనే పెళపెళ యురుములు మొదలుపెట్టగనే మనలో కొందఱు "అర్జున, భర్జన" యని యరచుచున్నారు.

ఆరవది మతబోధవలన బిడ్డలకు కలిగెడిభయము. ఇట్టి భయమునకు మనము తావొసంగనేకూడదు. పాపము చేయఁగూడదనియు అట్లు చేసినచో నరకమున భగవంతుఁడు మనల వేపుకతిననియు, యమదూతలు యినుపముక్కులు నీలిగడ్డలు శంకకొప్పులు గలవారనియునను మనము చెప్పుకొనుట బిడ్డలు కని బైరాగులు మొదలగువారినిఁజూచి భయపడుదురు. కొందఱుబిడ్డలు బిచ్చగానిజోలెఁజూచి నిలువుగుండెపడి ఏడ్పు మొదలుపెట్టెదరు. దానికిహేతువు మనతెలివితక్కువతనమే. మనము "నాయనా అల్లరిచెయ్యవద్దు, కదలితే బూచివాడు సంచిలోవేసుకొని పోతా"డని చెప్పుదుము. ఆభయమే వేరుపురుగై పిల్లవానిని బాధించుచున్నది. అటుల భయంపడినపిల్లలకు బిచ్చగాని సంచితీసి యొకమారు చూపినచో నాభయము పోయి "ఓష్, ఇంతేగా" అని బిడ్డ చిందులు వేయ ప్రారంభించును. పిల్లివలని భయముగూడ నిటులనే బిడ్డకుఁ గలుగుచున్నది. అల్లరిచేయుపిల్లలను మనము పిల్లికూతలుకూసి భయపెట్టుటలేదా? దీనివిషయమై కొకపాటు ముచ్చటింతము.




ప్రథమ వ్యాసము:—

గృహలక్ష్మి ప్రథమవ్యాసమును తరచు సంపాదకులే వ్రాయుట ఆచారమైయున్నను, యీసంచికయందు సుప్రసిద్ధాంధ్ర విద్వాంసులును, భాషాభిమానియు, దేశాభిమానియు, 'గృహలక్ష్మి'యం దనవరత వాత్సల్యసిద్ధులునునగు ఒక మహనీయునిచే వ్రాయబడినదానిని అచ్చొత్తించినాము. ఏదో స్వల్పకారణముకతన వారు తమ పేరు ప్రకటింపగోరలేదు. కాని వ్యాసపాఠకులకు వారి సంతతపత్రికాపఠనావ్యాసంగము, వివిధవిలేఖక విలేఖనీ ప్రజ్ఞా పరిచయము, సునిశిత సుందరవిమర్శనా నైపుణ్యము, పత్రికా పోషకలేఖకవర్గముల యందనురాగము మొదలగు సుగుణములు వ్యాసాద్యంతమును ప్రతిబింబించుచుండక మానవు. ఎంతకాలముననైననా హరించగల వకీలువృత్తిలో అప్రమత్తులై యుండియు పత్రికా ప్రపంచముపై నింత దృష్టిబరపి, ఇంత తీక్ష్ణముగ పఠించుచు ఇట్టి చక్కని వ్యాసములు వ్రాయ నౌత్సుక్యముగల వారు మన ఆంధ్రరాష్ట్రపాఠక లోకములో నరుదుగ నున్నారన్న నది కల్లగాదు. గృహలక్ష్మి గత యేడేండ్లలోను పాఠకలోకమునకును మహిళాభివృద్ధికిని విజ్ఞానవ్యాపనమునకునుచేసిన కొన్ని సేవలను వారుగ్గడించు సందర్భములగూడ అతిశయోక్తులు పక్షపాతములు మొదలగు మార్గములలోనికి జొరక యాథార్థ్యశ్రద్ధతో వ్రాసిన యీ వ్యాసమునకై వారికి మే మనేక కృతజ్ఞతా పూర్వక నమస్కారములొనరించుచున్నాము.

సృష్టికరణములు—వడ్డీలు:—

కులద్వేషములు కొందరుమూర్ఖులలో పెరుగుచున్నవను కారణమున కులములను కులాభిమానములను ఖండించు వీరులకు నందివాడ వెంకటరత్నముగారి కులాభిమానమను నొక చిన్నగ్రంథము అంజనము వంటిది. అతను వ్రాసినట్లు 'తన జననీజనకులపై తన పుట్టిన కులముపైనం దన గ్రామముపైం దనదేశముపై భక్తిని గనుబరచని వాడు పశువుగా నెన్నబడున్' అన్నదానికి సందేహములేదు. ఒడ్డీలనగా వివిధప్రాంతములనుండి చెదరి ఒక ప్రాంతమున సెటలు అయినవారని అర్థమని శ్రీగిడుగు రామమూర్తి పంతులుగారు తెలుపుచున్నారు, వీరందరును ఏక జాతివారుకారు. ఇట్టివారు పెక్కు- రొక్కప్పుడిప్పుడుత్కళమనంబడు ప్రాంతమున నివసించిరి గనుక అక్కడి

అట్టి ఆంధ్రులకు ఆంధ్రభాషలో పరుష సరళాక్షర భేదములున్నవనిమాత్రమే తెలియునుగాని వత్తు సాము అక్షరములున్నవని తెలియదు. ఆసంగతిని అరవలిపిలో తెలుపఁ గడంగుటకంటె దుస్సాధ్యము బాదరబందీ వేఱేలేదు. పంతులుగారంతటి కార్యమునకు పూనుకొనినకంటె తనకత్యంత ప్రియమైనట్టియు, ఆంధ్రభాషాభ్యాసమునకత్యంతావశ్యకమైనట్టియు పరిశుద్ధాంధ్రలిపీ ప్రచారమునకై గడంగుటయే కర్తవ్యము. ఆంధ్రలిపీ ప్రచారప్రయత్నములు ఫలించు రోజు లివికానట్టులున్నవి. పాతిక అక్షరములతో తెమిలిపోయే అరవలిపికి చిరకాలమలవాటుపడినవారు యాభైఆరు అక్షరములు గలిగినటువంటిన్ని, పొల్లక్షరము వెనుక ఆంగ్లభాషలోవలె సాదుఅక్షరము చేర్చగానే గుణింతమేర్పడుచున్నభాష కలవాటుపడినవారు క్యావుడి క్రావుడి తావత్తు సావత్తు మొదలగు అసంఖ్యాక భేదములతోగూడిన గుణింతమును కలిగినటువంటిన్ని ఆంధ్రలిపిని నేర్చుకొనుట సులభసాధ్యము కాదు.

వారికి తెలుగు భాషను వారెఱిగిన అరవలిపిలోతప్ప బోధింపక వీలు లేదు. ఆంధ్రలిపి నేర్వుమనిన వారు అసలుభాషాప్రయత్నమే మానివేయుదురు. ప్రభుత్వమా డబ్బుపెట్టి పెక్కురాంధ్రులుగల ప్రాంతములలోనైన అక్షరములైన నేర్పు ఒక ప్రాథమిక పాఠశాల నెలకొల్పు పాపమునఁబోదు. ఉత్తరాది ఆంధ్రోద్యమనాయకులా, తగిన పండితులను పదిపదిహేనుసంవత్సరములపాటా యాప్రాంతములలోనే నెలకొను షరతుపై పంపించి, వారికి తగిన వసతి కల్పించి, మఱపుపట్టుచున్న వారికాంధ్రభాషను లిపిని జ్ఞాపకమును తేబోరు. వీరిరువురుఁగాని లేక యేయొక్కరుగాని అట్టి పుణ్యమునకు కట్టుకొనినను, బహువ్యాపకములు, నిరంతర జీవనాధారసమస్యాసంపీడనములు కలిగిన యీద్రవ్యలేమి ధనయుగములో నెంతమంది అట్టిలిపినినేర్చుకొనుటకై శ్రద్ధబరపగలరో విచారణీయము. ఇట్టివన్నియు సమకూరువఱకు నెదురుచూచుచు మిన్నక ఊరకొనుటకంటె ముందు భాషాభిరుచిని బాగుగా కలిగించినచో లిపియందు తనంతటతానే శ్రద్ధయేల కలుగకుండగలదో చూచెదను గాకయని శ్రీపంతులుగారి ప్రతిజ్ఞ.

వారి సంకల్పము నెరవేరుచున్నది. అరవలిపి క్రొత్తగా నేర్చుకున్న ఉత్తరాదివారికి అది చదువుకొనుట కష్టము కావచ్చును కాని అరవలిపి మాత్రమే నేర్చుకొని తెలుగు భాష మాట్లాడుటవచ్చిన దక్షిణాదివారి కది ఆంధ్రభాషా విజ్ఞానమును బాగాపోషించుచున్నది. గత రెండుసంచికలో రాయసం వెంకటశివుడుగారు, తేకుమళ్ల కామేశ్వరరావుగారు కె. రాధామణిగారు, ద్వివేదుల రామమూర్తిగారు మొదలగు ఉత్తరాది వారియొక్కయు, సాధుశంకరం పంతులుగారు, భాగీరది సోమయాజులుగోపాలయ్యగారు మొదలగు దక్షిణాది విలేఖరుల

యొక్కయు మంచి కథలు వ్యాసములు వార్తలు నవ్వుతాలు వింతలు మొన్నో వ్రాసి పత్రికను సర్వాంగసుందరముగా నొనరించి నారు. అరవలిపి నేర్చుకొనినదైనను, ఆ ప్రాంత యీ ప్రాంతభాషా సంభాషణా భేదములను తెలుసుకొనుటకును, ఇతర విషయములను పఠించుటకును ఉత్తరాది ఆంధ్రులకే ఉత్సాహము పుట్టునట్లు పత్రికను నడిపించుచున్న శ్రీవరదరాజంపంతులు గారిని మేమెంతయుఅభినందించుచున్నాము. ప్రతి సంచికయందును శ్రీమతి వరదరాజం పంతులుగారి సతీమణి జయలక్ష్మమ్మగారు రచించిన భాషా ప్రశంసకీర్తనలు కాననగు చున్నవి. చందా సంవత్సరమునకు 1 రూ. మాత్రము.

పంతులుగారు దక్షిణాంధ్రప్రాంతముల యం దేవిధమునసైన సలక్షణాంధ్రభాషా ప్రచారము చేయవలెనని ఇప్పటికి పదిసంవత్సరములకు పైనుండి తీవ్రప్రచారము చేయుచున్నారు. నేడిట్టి ప్రయత్నమునకు గడంగి విజయమందు చున్నందుకానందించు చున్నారు. ఇది సామాన్యవిజయము కాదు. ఇప్పుడా ప్రాంతముల నాంధ్రులొండొరులకు తమిళభాషలో గాక తమిళలిపిలోనాయను ఆంధ్ర భాషలో ఉత్తరప్రత్యుత్తరములు జరుపుకొనుచుండుట గాననగును. ఆంధ్ర లిపీ ప్రారంభమునకిది ఆసన్నయుగమనుటకు సందేహము లేదు.

ఇట్టిశుభసమయమున ఆదంపతులకు కలిగిన ఆపత్తు ఆంధ్రులెల్లరికిఁగూడ మిగుల దుఃఖకరమైనది. వారి యేకపుత్రుడు శ్రీ సాధు శివసుబ్రహ్మణ్యమను పదునాలుగేండ్ల బాలుడు మార్చి 27 వ తేదిని అకాలమరణమునంది పరమపదము వేంచేసినాడు. పుత్రశోకమున మునిగియున్న ఆదంపతుల కాంధ్రలోకము సానుభూతి చూపుచున్నది. అరవదేశముననే ఆ బాలుడు పెఱిగినను అతని తలిదండ్రుల అపారఆంధ్రభాషాభిమానమువలన అతనికి ఆంధ్రభాషలోనే అక్షరాభ్యాసము, శతకములు పట్టుట, రుక్మిణీకల్యాణాది కావ్యములు చదివించుట, పత్రికలకు వ్రాయించుట, దక్షిణాంధ్ర దేశమున భాషాప్రచారకోపన్యాసము విప్పించుట మొదలగు కళల నెన్నిటినో అతనికి నేర్పి, తమ సంకల్పములను సాధించగల వ్యక్తి ఆబాలుడు కాగల శిక్షణమును అతని కొనగూర్చుచుండిరి. అట్టి యాతని మరణమువలన వారికి కలిగిన లోపమును గర్భశోకము నింతంతకాదు. దాని నతిక్రమించి తమదీక్షలో తాము మునిగి పత్రికా నిర్వాహణాది కార్యములను నెరవేర్చుటకు తగిన ధైర్యోత్సాహములను పరమేశ్వరుడు వారికి ప్రసాదించునుగాకయని యీశ్వరుని ప్రార్థింపుచున్నాము.

ది నేషనల్ ఇండియన్ లైఫ్ఇన్సూర్యెన్సు కంపెనీ లిమిటెడ్:—

కలకత్తాలోనున్న యీకంపెనీకి యిప్పటికి సుమారిరువదియేండ్లు దాటినవి. ఆరంభములో ఎక్కువమంది భీమా పట్టాదారులుగా చేరడము, పెక్కుఱు చావడము, ప్రీమియ

ము ఆదాయములకంటె మరణముల క్లైయిములకెక్కువ చెల్లించుకోవలసి రావడము మొదలైన అవస్థలు దీనికిపట్టక భీమాగా నడిచినది. 1934 లో రు 36, 92, 750 లు మొత్తముగల 2634 దరఖాస్తుల నంగీకరించిరి. ఇవికాక యింకా వెయ్యిదరఖాస్తులుండెను. ఆలోచించి అంగీకరించదగిన వాని నంగీకరించియుందురు. 1933 లో కంటె ప్రస్తాపసంవత్సరము రు 12,83,900ల భీమాలు హెచ్చినవి. అనగా నూటికి 53 చొప్పున హెచ్చు. పట్టాలసెక్యూరిటీమీద యిచ్చిన అప్పులు గతసంవత్సరముకంటె రు 3,491 ఎక్కువఅనగా రు 72, 908లు. సకల విధాయముల మొత్తము రు 11,06, 906-12-5 లు. అంతకు ముందువత్సరము కంటెరు. 96, 462-10-2 హెచ్చు. సంవత్సరాంతముకు రు. 52,50, 244-6-1లు లైఫ్ ఫండు మొత్తము.

ఈ సంవత్సరములో మరణములవలన 111 గురికి సుమారు రు 1,96, 947-6-0 లున్ను మెచ్యూరు కావడమువల్ల 182రుకు రు 3,02, 379-5-0లున్ను చెల్లించిరి. మరణములకంటె మెచ్యూరు పట్టాలు నూటికి 60 చొప్పున హెచ్చు. కంపెనీభాగ స్వాములకు నూటికి 12½ చొప్పునడివిడెండు పంచిపెట్టిరి. టి. వి. రాఘవయ్యగారు దక్షిణజిల్లాలకు ఆర్గనైజరుగాను ఏజంటుగాను ఉన్నారు. భీమాచేయించుకొనువారి కిది చాలా అనుకూలమైన కంపెనీ అనుటకు సందేహము లేదు.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# లోధ్ర

స్త్రీలకు గలుగు ఋతుశూల, బహిష్టు కాకుండుట, అకాలబహిష్టు, మైల ఎక్కువగను తక్కువగను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్త హీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్ళనొప్పులు, అరికాళ్లు అరిచేతులు మంట, మొదలగు స్త్రీలకువచ్చు వ్యాధులను కుదుర్చును. స్త్రీలపాలిట "లోధ్ర" వరప్రసాదము, కల్పవృక్షము, కామధేనువు, కొంగుబంగారము, రత్నఖచిత యాభరణము, సర్వాభీష్టప్రదాయిని యని, వాడినవారు పలువిధములుగ స్తోత్రము చేయుచున్నారు.

# అమృత

రక్తహీనత, మలబద్ధము, అజీర్ణము, కీళ్ళనొప్పులు, సోమరితనము, మేహ వ్రణములు, సుఖసంకటములు, నిస్సత్తువ, కడుపులోమంట మొదలగు వ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని, ముఖమునకు తేజస్సును ఇచ్చును. ఈ మేలైన యౌషధమువలన నెందరో ఆరోగ్యవంతులైనారు.

# అర్క

ఆహార, విహార ఋతుభేద దోషంబులవలన అన్నాశయమునందు క్రిమి కూటముచేరి పలువిధములైన జ్వరములు సంభవించుచున్నవి. వాతజ్వరము, పిత్తజ్వరము, కఫజ్వరము, సన్నిపాతజ్వరము, మరి యితర విషజ్వరములు, కడుపులో ప్లీహమును జ్వరగడ్డను, అర్క కుదుర్చును. ఈ ఔషధమును పసిబిడ్డలకుగూడ యివ్వవచ్చును.

# హేమోద్రాక్సోమాల్ట్

**జీవనమును మఱింత అనుభవయోగ్యముగ జేయును.**

జీర్ణశక్తిని, బలపుష్టిని వృద్ధిచేయు ఔషధములలో నెల్ల హేమోద్రాక్షోమాల్టు సర్వోత్కృష్టమైనది. దాని వలన ఆకలివృద్ధియౌను. జీర్ణించి నలిగిపోవుచున్న కాళ్లకు, నరములకు, నూతన జీవము నూతనశక్తి కలుగును.

దేహమునకు రక్తమునుచేర్చు హేమోగ్లోబిను, చక్కని ద్రాక్షపళ్లరసము, బలవర్ధకాహారపదార్థముల సారము, అనేక సుగుణములతో కూడినట్టియు, భారతీయుల ఆరోగ్యలక్షణములకు సరిపడునట్టియు ఇతర పదార్థములనిగ్గు చేర్చి యిది తయారుచేయబడినది. ఇది నీకు జబ్బును కుదిర్చి పుష్టినిచ్చి తీరవాలి. విదేశీమందులనేకమును మించి దేశమంతట నిది మిగుల ప్రీతిపాత్రమై చలామణి యగుచున్నది.

ఒక్కసీసా నేడు కొనుక్కొనుము. హేమోద్రాక్షోమాల్టు నీ జీర్ణశక్తిని, ఆకలిని, బలమును యెట్లు వృద్ధి చేయునో నీవు తెలుసుకొనగలవు.



**ఇది**
**అలెంబిక్**
**సరకు**

## అలెంబిక్ కెమికల్సు

**బొంబాయి     బరోడా     మదరాసు.**

# హరిశ్చంద్ర

చాలా శ్రేష్టమైన తెలుగుటాకీ

స్టార్ కంబైన్సు లిమిటెడువారు శాలినీ సినిటోన్ కోల్హాపూరువద్ద

కోల్హాపూరు సంస్థానమువారి పూర్ణసహాయముతోను



| | |
|---|---|
| అద్దంకి | చెవులకు ఇంపుగానుండు |
| కన్నాంబ | స్పష్టతరమైన రికార్డింగు |
| బందరు నాయుడు | సుందరమైన ఫోటోగ్రాఫీ |
| పులిపాటి | అనేకప్రజల దొమ్మిసీనులు |
| ఆకుల | ఆశ్చర్యములుగొలుపే నాట్యములు |
| మాస్టరు భీమారావు | నిజమైన అడవిదృశ్యములు |
| నెల్లూరు నగరాజరావు | అడవిమృగములు జలదరింప జేయుటలు |
| కాసి చెంచు | |
| ఇంకా 1000 కి మించిన ఆర్టిష్టులతోను | లోపములేని నటనా చాతుర్యములతోను |

ఒక లక్ష రూ. యొక్క వగానేకర్చుపెట్టి ఆరుమాసములకు అధికముగా శ్రమభరించి తీసిన టాకీచిత్రములు.

స్టార్ కంబైన్సు (లిమిటెడ్)వారు రచించిన చాలా కీర్తిని వహించిన టాకీ ప్రదర్శనము

అన్ని నగరములకును అతిశీఘ్రములో వచ్చుచున్నది.

దర్శించి ఒడలు పులకరింపః జేసికొనుడు

'పారమౌంటు' బెంగుళూరు, — క్రౌనుటాకీస్, మద్రాసు.

# విషయసూచిక

# హేమోద్రాక్షోమాల్ట్

**జీవనమును మఱింత అనుభవయోగ్యముగ జేయును.**

జీర్ణశక్తిని, బలపుష్టిని వృద్ధిచేయు ఔషధములలో నెల్ల హేమోద్రాక్షోమాల్టు సర్వోత్కృష్టమైనది. దాని వలన ఆకలివృద్ధియౌను. జీర్ణించి నలిగిపోవుచున్న కాళ్లకు, వరములకు, నూతన జీవము నూతనశక్తి కలుగును.

దేహమునకు రక్తమునుచేర్చు హేమోగ్లోబిను, చక్కని ద్రాక్షపళ్లరసము, బలవర్థకాహారపదార్థముల సారము, అనేక సుగుణములతో కూడినట్టియు, భారతీయుల ఆరోగ్యలక్షణములకు సరిపడునట్టియు ఇతర పదార్థములనిగ్గు చేర్చి యిది తయారుచేయబడినది. ఇది నీకు జబ్బును కుదిర్చి పుష్టినిచ్చి తీరవాలి. విదేశీమందు లనేకమును మించి దేశమంతట నిది మిగుల ప్రీతిపాత్రమై చలామణి యగుచున్నది.

ఒక్కసీసా నేడు కొనుక్కొనుము. హేమోద్రాక్షోమాల్టు నీ జీర్ణశక్తిని, ఆకలిని, బలమును యెట్లు వృద్ధి చేయునో నీవు తెలుసుకొనగలవు.



**ఇది**
**అలెంబిక్**
**సరకు**

## అలెంబిక్ కెమికల్సు

**బొంబాయి     బరోడా     మదరాసు.**

# ఇదే ప్రప్రథమము

ఒడలు జలదరింపజేయు సత్యోద్భూత
సాంఘిక విషయ విశిష్టమైనది

## పూర్వాచార దుర్గ విభేదకము

పూర్వాచార వ్యవహారములందు గల
క్రౌర్యమును బట్టబయలు సేయునట్టిది

## ఈ యపూర్వ నాటకము

కవి:—శ్రీయుత పి. యస్. వి. అయ్యర్ గారు

## ది సౌత్ ఇండియన్ ఫిలిమ్ కార్పొరేషన్, లిమిటెడ్

వారు

అభిమానపూర్వకముగ ప్రదర్శించు

# 'కౌసల్య'

ఎల్లకాలములలో అమోఘమైనది
విజ్ఞానులగు యువకులచే నటింపబడినది
మామూలు ఫిలిమ్‌వంటిది కానేకాదు
ఇది కేవలమొక క్రొత్తదారి

## గెయిటీ టాకీస్

సెప్టెంబరు తే 27 దీలో మొదలు
దినమునకు మూడాటలు
గం॥ 3, 6, 9½ లకు




## దుర్గాపూజ

హిందూదేశములోని ప్రతి యడుగు నేలయు ఏదో యొక పురాణగాథతో మిళితమై దానిని ప్రకటించుచు అందడుగిడువారి డెందముల పుణ్యభావము లల్లుచుండు పుణ్యక్షేత్రమని ఒకవిలేఖరి తొల్లి వ్రాసియున్నాడు. అట్లే తొంటియుగముల లోని వివిధవర్షములలో ప్రతినిముషము నందును ఏదో యొకపుణ్యవ్యక్తి యేదో యొక మహాత్కార్యము నొనరించి, ఈ యుగమునందలి ప్రతినిమేషమును ఆ యుగములను తలంపునకు వచ్చునట్లుగా నొనరించినారు. భరతవర్షమున యే శూన్యమాసములో వర్జ్యపుగడియలో తప్ప పర్వములు కాని దినములే లేనట్లు తోచును. పురాణములను గాలించి శూన్యమాస మహత్వబోధకగాథలను గూడ నేడు పండితులు కావ్యములుగా ప్రకటించుచు వానినిగూడ పర్వములుగా విశదీకరించుచున్నారు.

ఏటా యేటా వచ్చు సంవత్సరాది పాడ్యమి, భానువిదియ, అక్షరతృతీయ, వినాయకచతుర్థి మొదలగు పదునారుదినములు మాత్రమే కాక, వసంతనవరాత్రములు, శ్రీరామలీలలు, వినాయకోత్సవములు, దేవీనవరాత్రములు, జగన్నాథుని రథోత్సవములు, కార్తికమాసము, మాఘమాసము, శ్రావణ మంగళ శుక్రవారములు, మార్గశిర గురువారములు, మాఘ పాదివారములు, వివిధదేవతల జయంతులు మొదలగున వెన్నియో కూడి సంవత్సరము పొడవునను యేవో పుణ్యవిషయములను ప్రజల మనములకు తెచ్చుచు వారికి ధన్య జీవనమార్గములను చూపుచుండును. ఇట్టి

పండువులు భారతదేశమున నొకభాగమున గలవు ఒకభాగమున లేవనక, హైందవులలో నొకతెగకు గలవు వేఱొకతెగకు లేవనక సకలభాగములలోను తెగలలోను వ్యాపించియున్నవి. స్థలముల దూరములను పట్టి తిథులు కొంచె మెచ్చుతక్కువగా వివిధ భాగములయందు వ్యాపించుటయు కలదు. కొందఱు విపరీతజాతీయవాదులు ఇట్టి తిథిభేదములవలన పండుగలు దేశమునందెల్ల ఒకేదినమునఁ గాక ఒక్కొక్కప్పుడు తొలినాడు మఱునాడుగా జరుగుట ఒక తప్పుగాభావించి భారతీయులందరికి 'ఐక్యత' స్థిరపరచుకొరకు ఎల్లరును ఒకే దినమున నాయాపండువులను తప్పక జరిపించుకొనే యేర్పాటులు చేసుకొనవలెనని ప్రబోధించుచున్నారు. పంచాంగములను గ్రహచారములను మార్చగడంగు ఇట్టి వెఱ్ఱివెఱ్ఱి సంస్కారములవలన అసలు పర్వముల ప్రాముఖ్యత హెచ్చుటకన్న తగ్గుననుటకు సందేహములేదు. తిథుల భేదములు గంటల భేదములుమాత్రమున ఐకమత్యములు తగ్గేవారి జాతీయత శుష్కజాతీయత యనవలెను. ఇట్టి స్వల్పభేదములవలన భారతీయుల ఐకమత్యము చెడుననుకొనుట వెఱ్ఱియూహ.

భరతదేశమునఁగల యిట్టి పర్వదినములకెల్ల మకుటము దసరానవరాత్రములు. ఈ పర్వదినముల కధిష్ఠానదేవత సింహవాహినియగు శ్రీదుర్గాదేవి. ఆ దేవత సౌందర్యమునకునిధి. పరాక్రమమునకు పట్టుకొమ్మ. భీభత్సమును ప్రిధులుచుండును. పరతత్త్వమునకు ప్రాణము. నిరంతర దుష్టశిక్షణ శిష్టరక్షణవ్రతపరాయణ. ఆమె చర్యలను వర్ణించు పురాణములు బండ్లకెక్కించినను పట్టవు. దేవీభాగవత లలితాపురాణములలోని యొకొక్కకథ నెందఱెందఱు కవీశ్వరులు కలములుపట్టి క్రొత్తగావర్ణింపఁగడంగినను అంతములు కావు. ఆమె సహస్రనామధేయములలో నొక్కటొక్కటి ప్రతిభక్తుని కవిని బాలుని బాలికను స్త్రీని పురుషుని తన్మయుల నొనరించిసచ్చిదానంద వారాసి నోలలాడఁజేయును. ఆమె ఉద్యద్భాను సహస్రాభా, చతుర్బాహుసమన్విత, పంచతన్మాత్రసాయక, నిజారుణ ప్రభా పూరమజ్జత్కామేశమానస, అష్టమీ చంద్ర విభ్రాజదలకస్థలశోభిత, తారాకాంతి తిరస్కారి నాసాభరణభాసుర, తాటంక యుగళీభూత తపనోడుపమండల, కర్పూర వీటికామోదసమాకర్షదిగంతర, కామేశబద్ధ మాంగల్యసూత్ర శోభితకంధర, హరనేత్రాగ్ని సందగ్ధకామ సంజీవనౌషధి, మందస్మిత ప్రభాపూర మజ్జత్కామేశమానస. ఆమె సౌందర్యమూహాతీతమన్న వర్ణనా సాధ్యమగుటెట్లు. ఇట్లే భీభత్సమునకును నంతు లేదు. ఆమె భండసైన్యవధోద్యుక్త శక్తి విక్రమహర్షిత, మహాపాశుపతాస్త్రాగ్ని నిర్దగ్ధాసురసైనిక, భండాసురేంద్రనిర్ముక్తశస్త్ర ప్రత్యస్త్రవర్షిణి, రక్తాక్షరక్తజిహ్వాదిశిక్షణి, మహిషాసుర దోర్వీర్య నిగ్రహ, చండముండనిశుంభాదిఖండన, మహేశ యుక్త నటనతత్పర. తత్త్వదృష్టితోఁ జూచినయెడల నాపె ఓంకారపంజరశుకి, ఉపనిషదుద్యాన

కేళికలకంఠి, ఆగమవిపినమయూరి, దేశిక రూపేణదర్శితాభ్యుదయ, జన్మమృత్యుజరా రోగభంజని, కామక్రోధాదిషడ్వర్గనాశని. ఆమె మహిమలు వర్ణింప నాదిశేషున కలవి కాదనిన, సాధారణుల కేమి సాధ్యము! సంవత్సరమెల్ల ఆమెను పూజించినను తనివి తీరదు. దసరాదశరాత్రములైనను ఆమెను నుతించి జనసంఘములు తరించవలెనని ఈ పండుగ ఉద్దేశింపఁబడినది.

ఆశ్వయుజ శుద్ధపాడ్యమి మొదలు దశమి అంతమువరకు గల పదిదినములును ఈమె పూజాదినములు. క్షత్రియులు, సైనికులు, వీరులు మొదలగు క్షాత్రకుటుంబములవారు ఆయుధములనెల్ల నొక్కచో నిలిపి పదిదినములును ఆయుధపూజచేసి ఆమె పరాక్రమమును సంస్మరించుచుందురు. మారువాడీలు వైశ్యులు మొదలగు శ్రీమంతులెల్లరు తమ సంపదలనెల్ల నొక్కచో పేర్చి పూజించి పేదసాదలకు సంతర్పణలొనరించి ఆమె వదాన్యతను జ్ఞప్తికి తెచ్చుచుందురు. పండితులు బ్రాహ్మణులు మొదలగువారెల్లఱును తమ యిళ్లయందలి గ్రంథములనెల్ల దులిపి శుభ్రపరచి ఒక్కచో పెట్టి పూజించుచు ఆమె పురాణములు పఠించుచు ప్రజలకు బోధించుచుందురు. జనసామాన్యమెల్లఱును కొందఱు తమతమ యిండ్లలోను కొందరు దేవాలయములలోను ఇట్టి యుత్సవములు జరిపించుచు దర్శించుచు భజనలు సేయుచు పాటలుపాడుచు అత్యంతోత్సాహముతో నూగులాడుచుందురు. బాలురు క్రొత్త దుస్తులుదాల్చి, పూలుబాణములుచేఁబూని దసరాపద్యములు వల్లించుచు బడిపంతుళ్లతో నింటింటికిఁ దిరిగి, యొవరింటవారు పంతుళ్లకు కట్నములను చదివించి విద్యార్థులకు పప్పుబెల్లములు పంచిపెట్టించుదురు. ప్రతియింటను బాలికలు వివిధరకముల బొమ్మలను కొలువులుగా పేర్చి, పేరటాండ్రను పిలచి కీర్తనలు మంగళహారతులు పాడుచు, ఉపహారములను తాంబూలములను పంచుచు అత్యంతానందమున నోలలాడుదురు.

ఇట్టి ఆయుధపూజ నొనరించువారెవ్వరు వీరాధివీరులు కాగోరరు, సైనిక శిక్షణమున తరిఫీదుకాగోరరు, దుష్టశిక్షణ శిష్టరక్షణ వ్రతపరాయణులు కాగోరరు, ప్రపంచశాంతి నెలకొల్పఁబూనరు? ఇట్టి పుస్తకపూజ నొనరించువారు ఎవరు విద్యాసక్తిని బూనరు, పండితులు కాగోరరు, గ్రంథములు వ్రాయఁబూనరు, ప్రపంచమునకు జ్ఞానప్రబోధము లొనరించనేరరు? ఇట్టి దసరాపద్యములు వల్లించు బాలురెవ్వరికి ప్రాత జాతీయ చరిత్రలు స్మరణకు రాకుండును, భేదములు సమయకుండును, ఐకమత్యము సమకూరకుండును, జాతీయ గర్వము చేకూరకుండును? ఇటి బొమ్మల కొలువులు చేయు యువతీమణుల కెట్లు లలితకళాసక్తి, శిల్పకళాచాతుర్యము, గానకళా నైపుణ్యము, పాకకళా విచక్షణము సౌందర్యకళా పోషణము కుదరకుండును? పురాతన భారతవర్షమున నేఁటట నెందఱో వీరులు, పండితులు, కవులు, శిల్పకళోపాసకులు, పరస్పర స్నేహపిపాసులు

మొదలగువారు నేల యీనినట్లుద్భవించు చుండిరన్న అందుకు కారణము గ్రామ గ్రామముననను జరుగుచుండు ఇట్టి ఉత్సవ ములు కాక వేఱేమియును కాదని మనము గుర్తించవలెను. ఈ యుత్సవములెల్లయు విజయదశమినాటి రాత్రి శమీవృక్షమును పూజించుటతో ముగియును.

అయినను నేటి భారతవర్షమున నిట్టి యుత్సవములు కేవలము అనుమాయితగా తప్ప వాటిఉద్దేశ్యములు గుర్తించి జరుప బడుచున్నట్లు తోచదు. జనులెల్లఱును విదేశ విద్యయు విదేశాచారములను మఱిగి తమ స్వదేశాచారముల ఉద్దేశ్యములను విస్మ రించినారు. నేటి ఆయుధపూజలలో అసలు దేవియొక్క ఉపాసన మృగ్యమగుటచేతఁ గాబోలును ప్రపంచకంటకులగు యేరాక్షస తుల్యులనో నోడించ గడంగుటకు బదులు ప్రజలు తమలోతాము అంతఃకలహములకు అనైకమత్యములకు గడంగుచున్నారు. నేటి పుస్తకపూజలలోఁగూడ ఆ దేవియొక్క ఉపాసనయందు దీక్షను నిసర్జించుటవలనఁ గాబోలును నేటి పండితులును కవులును వ్యర్థప్రసంగములు, బూతుకథలు, సినీమా వేషములు, టాకీ పాటలు మొదలగు శుష్కకాలక్షేపములతో పత్రికలను నింపు చున్నారు. నేటి బాలబాలికలు తమదేశీయ శిల్పకళాపోషకములగువెఱవుల నెమకుట మాని సమస్తమునకు విదేశవస్తువులు, బొమ్మలు, వస్త్రములు, పుస్తకములు గిన్నెలు, జడలు, తిండ్లు, తిప్పలు మొదలగు వానిపై నాధారపడి జీవనోపాధి రహి తులై, దాస్యవారాసిలో మ్రగ్గుచున్నారు. నేటి పెద్దల ప్రబోధములు పిల్లల వ్యామో హములుకూడ ఒక్కతీరున పరుగిడుచున్నవి. ఇట్టి అనాచారములయందు పరాఙ్ముఖత యింకను ప్రారంభమేకాలేదు.

ఒక్క గాంధిమహాత్ముఁడు కుటీరపరి శ్రమా పోషణము, గ్రామపునర్నిర్మాణము, ప్రజాసౌభాగ్య పరివర్తనము, పరస్పరస్నేహ సౌభాగ్యము, దేశీయ కళానిమగ్నత మొదలగు మహామంత్రములను హరిజనాది పత్రికలనుండి ఉపదేశించుచున్నాడు. ఆ యుపదేశము లెందరికి వినఁబడగలవో చెప్ప లేము. విదేశవస్తు వ్యామోహము, విదేశా చారలోలత్వము, విదేశవ్యసన పరాయ ణత్వము, విదేశనాస్తికతా ప్రమత్తత మొదలగు గాఢాంధకారములు భారత వర్షమునెల్ల వ్యాపించి దివారాత్రములకును, జాగ్రన్నిద్రలకును భేదము తెలియని యొక మహాసుషుప్తిని సర్వత్ర వ్యాపింపఁజేసినవి. విద్యాలయములు దీనిని విచ్ఛిన్నముచేయు టకు మారుహెచ్చించుచున్నవి. ఉపన్యాస కులుదీనిని త్రుంచుటకు బదులు మఱింతగాఢ ముగ అల్లుచున్నారు. నఖదీధితి సంఛన్న నమజ్జన తమోగుణయు, చిదగ్నికుండ సంభూతయు, అజ్ఞానధ్వాంతదీపికయు నగు శ్రీమతి త్రిపురసుందరీదేవియొక్క అపార కరుణామృత దృష్టివలన నిట్టి యజ్ఞానములెల్ల మటుమాయములై, అధునాతన భారత వర్షము ప్రాచీనభారతవర్షమును బురుడిం చునుగాక యని ప్రార్థించుచున్నాము.

# పరదేవతాదండకము

శ్రీమతి బంకుపల్లి వేంకటరత్నమ్మగారు

శ్రీమన్మహాదేవతా! లోకమాతా! సుపర్వాణ సంపూజితా! స్మారితా!
దీనసంభావితా! భక్తసంపాలితా! ముక్తిసంస్థాపితా! కాంతిసందీపితా!
దేవదేవార్చితా! సర్వలోకేశ సంపాలితా! గర్వనిర్వాపితా! నిన్ను
గీర్తింప నే నెంత! వేనోళ్లతో శేషుఁడే నిన్ను బ్రార్థించి భూభారము న్మోయు
చున్నాఁడు! దేవేంద్రుఁడే నిన్ను వేకళ్లతోఁ జూచి సంతోషముం బొంది
స్వర్గాధిపత్యంబుఁ గొన్నాఁడు! సూర్యుండు వేచేతులన్మ్రొక్కి వేవేగ మిన్నంది
లోకంబులం బెల్ల దీప్తిం బ్రసాదించుచున్నాఁడు! తల్లీ! మహాకల్పవల్లీ!
దయాక్షీరవల్లీ! పరబ్రహ్మరూపంబునన్ శాసనంబీయఁగా బ్రహ్మ సృష్టించు
చున్నాఁడు విష్ణుండు పోషించుచున్నాఁడు శంభుండు నాశంబులం జేయు
చున్నాఁడు సర్వంబు నీవల్లనే గల్గెనమ్మా! మహాదేవి నీపాదముల్
నిత్యముం బూజ సేయంగనే పాపముల్ నాశమై తాపముల్ దూరమై
భాగ్యభోగ్యంబులున్ సర్వసౌఖ్యంబులున్ దానధర్మంబులున్ బొంది
భూలోకమం దెప్పుడున్ గొప్పగా నొప్పులం గాంచి యాచంద్ర
తారార్కమౌ కీర్తులం బొంది విద్యాధనాధిక్యతం గాంచి యెంతేనియున్
సాటిలేకుండ వంశంబునం దెప్పుడున్ భాగ్యముం బొంది దారిద్ర్య
మావంతయున్ లేక యొప్పారునోయమ్మ! నీమూర్తి నామానసంబందున
న్నిల్పి నీసేవ సేయంగ నీకీర్తనల్ బాడ నీపాదముల్ చూడ నీభక్తులం గూడ
నిన్ బ్రేమతో వేఁడ నీలీలలం దాడ నాకుం బ్రసాదింపుమా! దీనతన్ వేఁడు
చున్నాను! దాసానుదాసత్వముం జేయుచున్నాను! శక్తిస్వరూపంబునం
దున్న నిన్నెవ్వరున్ మించలేరమ్మ! నీలీలలం దెల్ల ముల్లోకముల్ నాటకం
బాడుచుండంగ నీ వొంటిగా నిర్మలాత్మన్ విడంబించుచున్ మించుచున్
గాంచుచున్ బెంచుచున్ నించుచున్ వంచుచున్నావు తల్లీ! జగద్వ్యాపినీ!
నిర్మలంబైన నీరూపముం గాంచి నీభక్తులెల్ల న్మహానందముం బొంది సంసార
మందుండి భోగాదిరాగంబులం బొందుచున్నార లంత్యంబునన్ నీపరా
శక్తిలో లీనమై వెల్గుచున్నారు మాతా! సమస్తార్చితా! కీర్తిపూతా!
నమస్తే నమస్తే నమస్తే నమః!!

# గృహలక్ష్మీ పత్రికా ప్రశంస

సీ. కరతలామలకంబు ♦ గాదె మోక్షాపేక్షఁ
గలవారి కరయ నీ ♦ గాథ లెల్ల
తంగేటి జున్నుగా ♦ తగదె యోగాసక్తిఁ
గలవారి కరయ నీ ♦ గాథ లెల్ల
పాణినీయంబుగాఁ ♦ బరగదే కావ్యేచ్ఛఁ
గలవారి కరయనీ ♦ గాథ లెల్ల
కల్పవృక్షముగాదె ♦ గార్హస్థ్యధర్మంబుఁ
గలవారి కరయ నీ ♦ గాథ లెల్ల

తే. గీ. కాంతలకు శీలసంపత్తి గలుగ జేయు
పిల్లలకు మోదమల్లన వెల్లివిరియు
నిన్నుఁ జదివిన సతతము నిఖిలభువిని
జయము! జయమ్ము! గృహలక్ష్మి!.' జయముగనుము!

మ. కవులుం ఖేమనఁ, బండితుల్ పొగడగా, ♦ కావ్యజ్ఞులుం మెచ్చ, కా
కవులుం భీతిల, మూర్ఖులుంగలగ, చొ ♦ క్కఁ జిత్రకారుల్, ఘనం
బవురా యంచు రసజ్ఞులెల్లఁదలల ♦ ల్లాడింప, సొంపొప్పగా
మివులం కీర్తిగడించితీవు 'గృహలక్ష్మి' నీకు దీర్ఘాయువౌ!

డి. వి. ఆర్. ఆర్. లక్ష్మీబాయమ్మ.

# ప్రభాతము

ఇపుడ తూరుపు మచ్చెకం టెలమిఁ బ్రాణవల్లభుని బిగికౌఁగిటం బరమసుఖముఁ
గాంచఁ బోవుచునున్నదికాన యొక్కపాట బాడుమ యెలుగెత్తి పరభృతంబ!
అవని దట్టంపుటిఱులఁ బోనడప నీవు కరుణ నరుదేర ఛాయ నీ కన్నుఁ బ్రామి
వెలలియోఁగెనే దూరాన వెలుఁగులయ్య! వెదకుచున్నావు కరములు వేయిసాచి

గాఢపరిరంభణక్రియాకాల నిజతనూగత ప్రాగ్వధూ స్త నానూన కుంకు
మమ్మొ యయ్యెది! భువనతలమ్మునెల్ల నెఱుపుగావించుచున్నయ దరుణసూత.
లోకబాంధవునకుఁ బ్రీతి లోనొదవఁ దీవెలను నిజబాహువుల్ తీర్చిసాచి
కుసుమకోటుల నుపదగా నొసఁగుచుండె యాతఁడున్నాఁడు మల్లికా యాకసమున.

కడుపునిండునటుల తృణదఁ గ్రోలిన సుమాసవమువలనఁ దనివిసనక సరగ
భ్రమర వెడలిరమ్ము రాకున్నచో నిన్ను గలువ ముకుళితమయి కప్పివేయు.
బిసములందిను గుతుకాన విస్మరించి యొడలు బిసరుహంబులపాలి కముఁగలిడకు
మంచు మీసామిఁగనినమ్మ యఖిలజనుల నేలి సిరులీయనిలచు మరాళరాజ.

జగములన్నియు సమ్మోద జలధివీచి కలను మునుఁగుచుఁ దేలుచు సలరుచుండఁ
గలయఁదిరుగుచు నల్గడల్ కనులనశ్రు ధారలొలికింతువేల చకోర చెప్పుము.
కలువల పింపుకు మీరామీ! యలమటలిడి మోదమున రథాంగములారా
వెలలుచు నుంటిరె యచ్చట వలదొర మిము లేప మరల వచ్చెనుసుండీ.

అరయ జాబిల్లిమినుకుల కాగలేక తల్లడిల్లెడు పాంథుల కుల్లమలరఁ
దెలియఁబల్కుఁడు భానుఁ డేతెంచెననుచు సురుచిరారావముల్మీఱ శుకములార
వెల్లఁ బాఱెడుకీవియు లల్లనార్చి యిరులుగలవంచు నెంచకు డిండ్లఁ గనలు
జాలమార్గ ప్రవిష్టుఁడై మూలమూల నెమకుచున్నాఁడు స్వీయకరముల నినుఁడు.

జి. అన్నపూర్ణ.

# దసరా — బొమ్మలకొలువు

పః కృః మూర్తి

గృహలక్ష్మికి మరియొక శరన్నవరాత్ర్యుత్సవ సౌభాగ్య మొదవుచున్నందుకు సంపాదకపాఠకు లుభయులు ఈశ్వరునకుఁ గృతజ్ఞతాబద్ధులై నమస్కరించుట పరమ విధికదా! ఇది సామాన్యసమయముకాదు. ఆసేతుహిమాచల పర్యంతము నీ మహా సమయమున నయ్యాదిశక్తి నేదో యొకవిధమున నేదే నొక గొప్పయుద్దేశముతోఁ బూజించుటయే ప్రజానికి ముఖ్యలక్ష్యముగాఁదోఁచును. నిరాహారులై దుర్గామంత్రోపాసనఁజేయు సుజ్ఞానుల మొదలుకొని యేవో పదిమట్టిబొమ్మ నొకచోటఁ బెట్టుకొని "కొలువు — కొలు"వనుకొనుచుఁ జంకలు గ్రుద్దుకొనుచుండు చంటిపాపల వరకునూ ప్రసరించుచుండునది యానంద ప్రవాహమే — దసరా! ఇటువంటి మరొక దేశమున లేదనుట సాహసముకాదు! మనది కర్మభూమి. పసిపాపలు చేయు పనుయందుఁ గూడ నేదో యొకలాభ ముండవలయు. ఆ లాభ మైహికమా ఆముష్మికమ యనునది వేరేవిషయము. ఐహికమే యగునెడఁ గేవల స్వార్థముమాత్రమే గాకుండిఁజాలు. ప్రస్తుతమం దాముష్మికవిషయమునువెనుక కుంచి యైహికలాభము మాటలే కాదు కొందము. ఇది ముందుగ లోకకల్యాణకరమై సిద్ధించినపుడే అదియును దానంట నదే సిద్ధించును. ఇది లేనప్పు డదేకా దింకేదియు లేదు "నాయం లోకోఽస్త్యయజ్ఞస్యకుతోఽన్యః కురునందన" అని. "ఐతే పిల్లల బొమ్మలకొలువులకునూ లోకకల్యాణానికిన్నీ సంబంధం వేంవిఁటయ్యా?" అని యడుగుదురు కాఁబోలు! కావలసినంత సంబంధమున్నది — లేకేమీ?! బొమ్మలంటే అవి యెక్కడినుండి వచ్చినవీ? ఎవఁడో యొకపనివాఁడు తన తెలివితేఁట లుపయోగించి చేసినవో వ్రాసినవో అయియుండవలెను గదా! అది యొక గొప్పలలితకళ కదా! ఇట్టి లలితకళల కన్నిఁటికి నధిదేవతయే యీశారద. కాబట్టి యొకవంకఁ జిత్రకారుఁడును మరియొకవంక బాలబాలికలునూ సేవించుచున్నది యీ శారదనే. ఇట్లే సమస్తవిద్యలకు నధిదేవత యీమెయే. ఐన నీసేవకు ఫలమున్నదా లేదాయని విచారింతము. చిత్రకారుఁడు రామకృష్ణాది మహద్విగ్రహములను మిగులఁ బవిత్రభావముతోనే చేయునుగాని బిడ్డలకది యేమెఱుక? ఇట్టియెడఁ బెద్దలకుఁ గొంతపని కలుగుచున్నది: రామచంద్రుని చరిత్రము సాధ్యమైనంతవరకు పిల్లల తలకెక్కించుట. ఆలాగే తాజ్‌మహలును గూర్చియుఁ దక్కిన యితరవిషయములఁ గూర్చియుఁ జెప్పవచ్చును. పిల్లలకు విద్యగఅవుట కింత

కంటె మంచిదారిలేదని యీనాటి విద్యాధి కారులు తెలుపుచున్న యీవిషయము లిదివరకే మనదేశమున వెలసియున్నవి. మీదుమిక్కిలి యీయుపాయము లుత్సవవ్రతాది సందర్భములతోఁబొందుపరుపఁబడియున్నవి. ఇది యెంతమేలు! సత్యనారాయణవ్రత వ్యాజమున హిందూదేశచరిత్రయందు మహారాష్ట్రయుగమున నెంతో చెప్పవచ్చును. ఇంతేకాక బిడ్డలకు విద్యయందుగలయాసక్తి నభివృద్ధిసేయుటకుఁ గూడ నిదే యదను. పొరుగింటివారి హేమలత మాయింటఁ గొలువులో మనోహరముగఁ బాడినది. మేమే కాక వచ్చియున్న ముత్తైదువలందరు 'హాయ్ హా'యన్నారు. మరునాటినుండి అధికతరకృషి చేసి మరుచటి దసరాకు హేమలతకంటె బాగుగాఁ మాఅమ్మాయి పాడఁగలిగినది. ఎందువల్ల? ఈమె మనసునఁబుట్టిన స్పర్థ! "స్పర్థయావర్థతే విద్యా"యని కదా! నిజమైన లలితకళాభివృద్ధి గోరువారు ఇట్టి కొలువులు మొదలగు సంతోషసమయములందే చిన్నచిన్న బహుమానము లేర్పరచి బాలికల కెంతో యుత్సాహము గలుగఁ జేయవచ్చును గదా! ఇట్లొకవంక దైవభక్తి, మరియొకవంక మహాపురుషుల గుణములఁగూర్చి బోధ, వేరొకవంక విద్యాసక్తిని వృద్ధిసేయుట యీమొదలగు ముఖ్యవిషయములయందు తల్లులు శ్రద్ధయుంచి తమబిడ్డలకు నేర్పిపెట్టుట కింతకంటె మంచి వేళలుండునా? కేవలపశుప్రాయులగుగ్రామీణుల నందర నొకచోటఁగూర్చి మహత్తర రాజకీయపరిజ్ఞానము, దేశభక్తి, మతశక్తి మొదలగునవి సులువుగ వారి తలల కెక్కించుటకు మహారాష్ట్రులీనవరాత్రులే యదనుగాగ్రహించి యెంతవరకో కృతకృత్యులైనారు. సాంఘికవిషయములందు గూడ నీ కొలువులు మొదలైనవి యేర్పరచి స్త్రీలను బాలబాలికలను గూడ నెంతో యభివృద్ధికిఁ దేగలిగిరి. ఇపుడు దేశమందంతటను వ్యాపించియున్న యీకొలువుల వేషమునకు ముందువారే దారిచేసినవారు. సమస్తవృత్తులకునూ మూలశక్తి యీశారదా స్వరూపమున వెలయుచున్నది. గీతలయందుపయుక్తమయిన యజ్ఞమునకుఁగల నానార్థములలో 'వృత్తి' యను నర్థమునే ముందుగా గ్రహింపవలెనని తిలకు గాంధీ మొదలగు యుగపురుషులు శాసించుచున్నారు. దానింబట్టి ప్రతివృత్తియును ఒకవిధమైన యజ్ఞమే: అనఁగా యజ్ఞము సామాన్యార్థమున నెంతటి గొప్పపవిత్రతకలది యని తలఁచుచున్నామో అంతటి గొప్పదనమును బవిత్రతయుఁ బ్రతివృత్తియందును గలవనుటకు గాను యీపదప్రయోగము, వృత్త్యర్థమందుఁ జేయఁబడినది.

ఇఁక వృత్తులు బాగుంటయే లోకకళ్యాణము. అది యభావమైనపు డేదియు లేదు. హిందూదేశ మిపు డీయవస్థలోనే యున్నదని మీ రెరుఁగరు? ఐనను చేయునదేమి? పెద్దల వృత్తివిషయముల మాట లటుండగా బిడ్డలు పెట్టుకొనుచున్న బొమ్మల కొలువులందుఁగూడఁ బాశ్చాత్యనాగరకత

యేనా? ఒక చిన్న కొలువులో పదిబొమ్మలుండునేని వాటిలోఁ గనీస మేడెనిమిది బొమ్మ లే జపానువో యేయింగ్లండువో!! ఇండియాలోనున్న చిత్రకారు. లేమికావలెను? ఈమాట శ్రీమతి క॥ వరలక్ష్మమ్మగారొకతూరి నచ్చఁజెప్పినారు. పిల్లలకు బొమ్మలుకొనిపెట్టేవారు తల్లులే కదా! వారు దీనియందుగల రహస్యము నెరిఁగి తమబిడ్డలకు స్వదేశపుబొమ్మలనే కొనిపెట్టిన యెడల నేమిలోపము?

అదిఒకప్పుడు పిల్లల కిష్టముండ దందురేమో!

అదియంత సరియైన సమాధానమా? వారి కిష్టములేని యెన్నిపనులను బిల్లలచేతఁ దల్లులు చేయించుచుండుట లేదూ! ఇదియు నాలాటిదే! స్వదేశాభిమానమనునది యిట్టి పసితనమునుండియే బిడ్డలయందు గలుగఁ జేయుట యెంతసులభమైన పని! వారి భవిష్యజ్జీవయాత్ర కిది యెంతవన్నె దెచ్చును! మరియొకమాట:—యీ బొమ్మల వెల లేమైనఁ దక్కువయా?! "అమ్మఁబోతే అడివీ – కొనఁబోతే కొరివీ" ప్రొద్దుటఁ గొన్నబొమ్మ సాయంత్రమునకే 'ఫైసలా'! అమితమైన సున్నితము!! ఇది బిడ్డల కేమెఱుక? మనదేశపు కొయ్యబొమ్మలుగాని మట్టిబొమ్మలుగాని యింతసులువుగాఁ జెడిపోవే!

పెద్దలు విల్లునమ్ములు ధరించి వెడలుట మరచియే పోయినాము: అదియట్లుపోయినా పిల్లలైనా ముచ్చటగా విల్లునమ్ములఁబూని వీరపూజా కీర్తనములఁజేయుచు వెడలుట 'అనాగరకత'! ఆపద్ధతియే క్రమేణ అడుగంటి పోవుచున్నది. దీనిఁగూర్చి పెద్దలు విచారించినారా? రాజనీతికిని దీనికిని గల సంబంధ మెంతవరకునున్నదో చెప్పవచ్చును; కాని అదియప్రస్తుతము.

జాతీయతాభావ సంపూర్ణమగు నీదసరా మహోత్సవము నాగరకత హెచ్చుచున్న కొలది నానాటికి నిర్జీవమై కేవలము విదేశపు బొమ్మలను సాధ్యమైనంతవరకుఁగొని వాటిని బ్రదర్శించుటతో సరిపోవుచున్నది కదా!

సోదరీమణు లీ విషయములను గమనింపరా? తమ సంతానములచేత వీరవరుల చరితలఁ బాడింపఁజేయరా? నైసర్గికముగఁ దమయందిమిడియున్న మహాశక్తిని మరల నుద్రేకింపఁజేసుకొనుటకే యీ సమయము నుపయోగించుకొన్నయెడల భరతమాత యచిరకాలముననే ధన్యయగుట కేమి సందియము?! ఈ నవరాత్రులయందుఁగల పవిత్రతలెస్సగాఁ బాటించి విదేశవస్తుసామగ్రి కేమాత్రము నెడమీయకుండుట యెంతమంచిది!! శారద సుప్రీతయగుట కింతకంటె సులువైన మార్గము లేదు. వేరేయజ్ఞములు తపసులు బలులు మొదలగునవి మనకసాధ్యములే కాని యీ నవరాత్రులయందైన సంపూర్ణ స్వదేశదీక్షఁ బూనియుండుట కేమికష్టము?! జీవితకాలమంతయు స్వదేశదీక్షఁబూనుట కష్టమే కావచ్చుఁగాని యేడాదికొకతూరి వచ్చు

నిట్టి మహాత్ముల్పుట్ట పర్వసమయము లందుఁ గొన్ని లెక్కదినము లీయుత్తమ దీక్షఁబూనలేకున్న నింక మనమేమిచేసి యీ మనభరతమాత ఋణము దీర్చుకో గలమో సెలవిత్తురా?

మరొక చిన్నమాటతో నీవిషయమును ముగింతము. 'క్రిస్‌మస్' దినములలో "క్రిస్మస్ ట్రీ"యని యొక వేడుకయున్నది. ఇది కేవలము చిన్నబిడ్డలకే. ఇందు నానా విధములైన బొమ్మలును జేర్చి యొక వృక్షాకృతి యేర్పరతురు. ఇందులోనున్న బొమ్మలన్నియు స్వదేశీయములే. ఎంచిచూత మన్నను విదేశీయ మొక్కటి యుండదు.

దేశాభిమాన మనగా నిదే !!

## శకుంతల భర్తృవియోగము

శ్రీమతి ధవళేశ్వరపు సత్యవతమ్మగారు

పురమునకేగి నిన్నుఁగొనిపోవగ బంపెదనాభటాళినో
గరిత! యటంచు నమ్మకము గల్గగ బల్కియు; రాచకార్యత
త్పరతవహించి యిప్పటికి బంపకయుండె నదెట్టివార్తయుఁ
దరిజరుగంగ చూడరుగదా! పురుషుల్ వనితాజనంబులన్.
చతురంభోధి పరీతమైన ధరణీ చక్రంబుపాలించు భూ
పతియే యిట్టు లసత్యమాడుటకునై పాల్పడ్డ, సామాన్య సం
గతులన్ వేరవచింపనేల, సకలాకారంబునై యొప్పుసూ
నృత మింకెట్లు తిరంబుగా నిలచునోనేమంబుతో ధారుణిన్.
అవసరంబగునప్పుడ యాతురతను
మంచిమాటల నొప్పించి, మానినులను
వంచనముజేసి కోర్కె చెల్లించుకొనియు,
తుదకు జూడరు పురుషులు యదనుదాట
సందియమందనేల నిటు, సర్వజనంబు లదెట్లు బల్కినన్
బందుజనుల్ హసించినను, భావమునందున శర్వుసాక్షిగా
నిందునిభాస్య! నిన్ను వరియించితినంచన మోసపోయితిన్
ముందుగలిం దలంపకయె, ముద్దియనై యవివేకబుద్ధితోఁ
జిన్నతనంబునుండి ననుజేరగదీసియు, నింతకాలమే
బన్నములేక పెంచి, యతిమన్ననతోడ మెలంగుచున్నతా
గన్నకుమారివోలె దయగాంచుచునుండిన తండ్రియాజ్ఞ లే
కున్న వరించి నందులకు, కూడదె యిట్టిఫలంబు యుంటికిన్?




# కాయకల్పరసము (REGD)

సకల వ్యాధులకును -ఈ రసమును చుక్కల పరిమాణమున లోనికిని పైకిని యుపయోగించిన క్షణమాత్రమున అత్యద్భుతమగు గుణమిచ్చును.

1. దీనిని పైన పూయుటచేత నివారణమగు వ్యాధులు :—తలనొప్పి, పార్శ్వపు తలనొప్పి, ప్రక్క మెడ నరములు లాగుట, కంఠమాల, న్యూరాల్జియా, జలుబు, రొమ్మునొప్పి, కీళ్లవాతము, వీపునొప్పి, కీళ్లనొప్పులు, శరీరమునందే భాగమునైన తిమ్మిరి, కీళ్లు పట్టుట, నరములు చుట్టుకొనుట, నరముల వ్యాధులు, పండ్లనొప్పి, నడుమునొప్పి, చర్మమున వాపు, తామర.

2. లోపలికి సేవించిన నివారణమగు వ్యాధులు:—విషజ్వరము, ఇన్‌ఫ్లూయంజా, ప్లేగు, మలేరియా, బోదకాలు, చలిజ్వరము మొదలైన అన్నివిధములైన జ్వరములు, గొంతునొప్పులు, రొమ్ముపడిసెము, నోటి దుర్వాసన, ఉబ్బసము, అజీర్ణము, మంద విరేచనములు, కలరా, మలబద్ధము, పిత్తాశయ ప్లీహ రోగములు, పొడిదగ్గు, కోరింతదగ్గు, పక్షవాతము, కడుపుబ్బరము, కడుపునొప్పి, మూత్రవ్యాధులు, గుండె మండుట, పిత్తమైకము, అశాంతి, పసుపుకామెలరోగము, శరీరము బడలిక, నిస్సత్తువ, నరములు సడలుట, పాండురోగము, ధాతుసంబంధమైన దుర్గుణములు, కక్కువాయి, స్త్రీలకు కలుగు ఋతుసంబంధమైన వాయువు, సూతికకట్టు, సూతికసన్నిపాతము, గుల్మము, కడుపునొప్పి, శిశువ్యాధులు మొదలైన అన్ని విధములైన దేహవ్యాధులు కాయ కల్ప రసమువల్ల నివారణమగును.

ఏ రోగమునకైనను కఠిన పథ్యము లేదు.

ఒక సీసా వెల రూ. 1-8-0. తపాలాచార్జి ప్రత్యేకము.

## ఇండియన్ మెడికల్ వర్క్సు

ఆలందూర్ P.O. 234 గోవిందప్పనాయక్ వీధి, మద్రాసు. మద్రాసు.

# మణి

శ్రీమతి పెద్దిసెట్టి రామంగారు

[మాధవరావు వరశుల్క-విరోధవాది. పేదపిల్లయగు మణిని ప్రేమించి ముద్దాడెను. సముద్రపుటొడ్డున షికారుచేయుచున్న లీలావతియను విద్యావతినిచూచి మోహించెను. ఇంటికివచ్చి తండ్రికెదురుగాడలేక వసుంధరయను వకీలుపుత్రికను కట్నమునకై పెండ్లియాడెను. వసుంధర ఇద్దరు బిడ్డలనుకని, పతియొక్కయప్రేమ భరించలేక చనిపోవును. మాధవరావు తండ్రియు మరణించును. మాధవరావు స్వతంత్రుడై తానుమోహించిన లీలను సబుజడ్జీగారికూతురును పెండ్లియాడెను. మణిని మేనమామకిచ్చి పెండ్లిచేసిరి. అతని నామె ప్రేమించలేదు. పెండ్లియైన యిరువదిదినములలో అతడు మరణించెను. ఆపె యన్న కేశవరావు ఆపెను యఫ్. యె. పరీక్షను వైద్యపరీక్షను ప్యాసుచేయించెను. ఆమె మంచివక్త. వరశుల్కమునకు విరోధముగ ఒకసారి ఆపె యుపన్యసించుచుండగా లీలామాధవులు సభకు వెళ్లుదురు.]

ఆయుపన్యాసధోరణి వినిన ప్రతి యువతీయువకుడును 'ఆహా! యేమి యాయుపన్యాసము! ఎంత చక్కగా ఇచ్చినది. చాల బాగున్నదంటే 'బాగున్న' దనిరి. ఆమెచెల్లెలు స్కూలుమిస్ట్రెసు శ్రీలతాదేవి కూడ బహు చాకచక్యముగా అందరికి బోధపడు నట్లుగా యుపన్యాసమిచ్చి పీఠము దిగినది. మాధవునికి మణిని చూచినతోడనే అదొకవిధముగా అయిపోయినది మనస్సు. పాపం 4 సంవత్సరములక్రిందటి తన మణి జ్ఞాపకము వచ్చుచున్నది ఆ మందభాగ్యునికి. శ్రీలతను చూచుటతోడనే తనభార్యయగు వసుంధర చిహ్నములు కాన్పించినవి. కొంతసేపు వసుంధరను తలంచుకున్నాడు. అక్కడనుండి లీలయు, తాను ఇంటికి వచ్చివేసిరి. 'లీలా! లీలా! సినీమాకువెళ్తామా' అని అడిగినాడు. 'పోనిద్దురూ! ఇప్పుడేమిటి' అన్నది. ఇంతలో ఎవరో తలుపుకొట్టినశబ్దం అయినందున తలుపుతీసినది లీల. తనస్నేహితుడగు మురళీధరుడు వచ్చినాడు.

'వోహో! వచ్చినా రండి' అని అధికానందముతో కూర్చొనుటకు సోఫా చూపినది. దానిపై ఆయన కూర్చొన్నాడు మురళి. బి. యె. ప్యాసు అయినాడు. మంచిషోకిల్లా! ఇంటియజమానియగు మాధవుడు అక్కడనే కూర్చున్నాడు. ఆయనతో పలకరించకుండా లీలతో ఇష్టావిలాసముగా మాట్లాడుచున్నాడు. మాధవునికి చాలకోపము వచ్చినదిగాని వూరుకొన్నాడు. 'లీలా! సినీమాకు వెళ్దామా' అని అడిగినాడు మురళీధరుడు. 'వెళ్దాము' అని ఒక్కగెంతువేసి గదిలోనికివెళ్ళి రెండవపారిసిలేడీవలె తయారుఅయి వచ్చినది. మాధవుని 'తలుపువేసుకోండి' అని చెప్పినది. మాధవుడు లీలా! లీలా! అని పిలిచిన పిలుపు వినిపించుకొనకుండా వెడలినది మురళితో. మాధవుడికి చాల కోపమువచ్చినది. 'అయ్యో! సుగుణరాసియగు మణిని పోగొట్టుకొంటిని. సద్గుణఖనియగు వసుంధరను వసుంధరపాలు చేస్తిని. అయ్యో! వసుంధరా! నీవేలోకములో నుంటివోగాని నన్ను

క్షమింపుము. అనేకవిధముల నిన్ను దుఃఖపెట్టితిని. లీలా ప్రేమోన్మత్తుడనై నావసుంధరను దుఃఖపెట్టితిని' అని కన్నీరుకార్చుచు ఏడ్చుచున్నాడు. కొంతసేపు మణిని తలంచుకొనియు, కొంతసేపు వసుంధరను తలంచుకొనియు అనేకవిధముల విచారించెను. "ఆహా! లీలా నీకొరకు ఎన్నికష్టములను అనుభవించితిని. ఎంతటిఅవస్థలకు లోనైతిని ఆఖరుకు లీల నాయెడ ఎంతకపటముగా ప్రవర్తించుచున్నది. నేను సినిమాకు రమ్మనిన 'పోనిద్దురూ ఇప్పుడేమిటి' అన్నది ఆమురళీ ధరునితో ఎట్లువెళ్లినది. నాకు వారిద్దరిచర్య అనుమానము గాయున్నది. ప్రతిదినము టెన్నిస్‌కోర్టుకువెళ్లి తిరిగి 8 గంటలకువచ్చెదరు. టెన్నిస్‌కోర్టు 6½, 7 గంటలకే ముగియును. వీ రిద్దరిచర్య చాలఅనుమానాస్పదముగాయున్నది." అని పరిపరివిధముల తలంచుకొనుచు నిద్రాదేవికి వశ్యుడైనాడు.

మరునాడు సాయంకాలము టెన్నిస్‌కు వెళ్లుటకు తయారుఅగుచున్నది. ఇంతలో మాధవుడు "లీలా! యీదినము టెన్నిసుకు వెళ్లకుము. మనోమోహినికి చాల జ్వరముగాయున్నది."

"ఏమి! నీ కూతురుకు జ్వరమువచ్చిన నేనెందులకు? నేను యీదినము టెన్నిస్‌కు వెళ్లకతీరదు. మురళీధరరావుగారు మరి మరి రమ్మని చెప్పియుండిరి. వెళ్లక తీరదు."

"ఏమి లీలా! నామాటకన్నా వానిమాట ఎక్కువగాయున్నదా? అదికాక, నీవు,నీవు, అని సంబోధించుచున్నావు. మర్యాద అక్కర్లేదా? ఏమి"

"నీవు అనక పోతే మరేమిటి, నీ గొప్పఏమిటి"

అని గిరుక్కునమరలి టెన్నిసుకు వెళ్ళిపోయినది మురళీధరునితో. తిరిగి ఏడుగంటలకు ఇంటికివచ్చినది. భోజనంచేసినది. గాని మాధవునితో మాట్లాడుటలేదు.

అంతయు మాటుమణిగియున్నది. చీకటులు నలుగడలు వ్యాపించియున్నది. సరిగా 12 గంటలైనది. అర్ధరాత్రి సమయమున లీల లేచి తలుపుతీసినది. మురళీ బండి తీసుకొనివచ్చినాడు. లీల గదిలోనికివెళ్లి శబ్దము చేయకుండా రెండుట్రంకులు తీసుకొనివచ్చినది. మురళి పెట్టెలు అందుకొని బండిలో పెట్టినాడు. లీలను చేయూతనొసంగి బండి ఎక్కించినాడు. బండి తిన్నగా స్టేషనువైపు వెళ్లిపోయినది.

ఉదయం ఆరుగంటలైనది. మాధవుడులేచి లీలా! లీలా! అని పిలిచినాడు. పలకలేదు. అంతయు వెదకినాడు. కాన్పించలేదు. మొదలునరికిన చెట్టువలె గుభీమని కూలినాడు. పూరుఅంతయు ఎక్కడచూచినా యీమాటలే, లీల మురళీధరునితో లేచిపోయినదని. పాపం యీసంగతి ప్రసాదరావుగారికి తెలిసినది. "అయ్యో! నాకు ఎంతటి అప్రతిష్ఠ తెచ్చినది. ఫలానా సబుజడ్జీగారికూతురు ఇటువంటిపని చేసినదంటే ఎంత చిన్నతనము."అని ఆయన దుఃఖముతో కుమిలి 'ఇంక దానిని నాగుమ్మం ఎక్కనివ్వకూడదు అది చచ్చినదని ఊరటిల్లెద' నని లేని ధైర్యముతెచ్చుకొని పూరుకున్నాడు. మాధవుడు వీధిలోనికివచ్చుట మానివేసినాడు; పిచ్చివానిచందముగా అయిపోయినాడు. తల్లి వచ్చి "నాయనా విచారించకు. ఎవరిజీవితంలో ఎట్లు వ్రాసియున్నదో అట్లుజరుగక వేరుజరుగునా? విద్యావంతుడవునీవు. అజ్ఞానముగా విచారించడం ఎందులకు? పూరకొనుము"అని కుమారునికిఅనేకవిధముల ధైర్యము చెప్పినది. యీలాగున అప్రదిష్ట వచ్చినదని బెంగపెట్టుకొని తిండి సరిగా తినుటమాని కృశించి పోయినాడు.

ఉన్నటులవుండి ఆయనకు జ్వరంవచ్చుట మొదలుపెట్టినది. అవూరిలోనికి బాగా పేరుతెచ్చుకొన్న మణి అన్నయగు కేశవునికి కబురుపంపినది మాధవునితల్లి.

కేశవరావు మణిని వెంటబెట్టుకొని వచ్చినాడు. కేశవరావు ఏకేసుఅయినా మణికి చూపుచుండుట అలవాటు. అందుచే మణిని తీసుకువచ్చినాడు. మాధవుడు వారిఇద్దరిని చూచినాడు. మణిని సభలో చూచియుండినందున 'వోహో! మణిదేవిగారా?' అని కేశవునికిని మణికిని రెండుకుర్చీలు వేయించినాడు. వారు కూర్చున్నతరువాత కేశవుడు అతనినిపరీక్షించి ఇది మనోరోగం అని మనస్సునందు అనుకొని మందు ఇస్తానని పైకిఉచ్చరించి మణితో ఇంటికి వెళ్లి పోయినాడు. సశేషము.

# గంగయొడ్డున

శ్రీమతి రాజేశ్వరిగారు

సీ॥ కాబోలునిది జగత్కల్యాణ చరణజా
తభగీరథ ప్రసాదస్రవంతి,
కాబోలునిది సుధాకరమౌళి విలయసం
జ్ఞాతాండవ మహాశ్మశానవాటి,
కాబోలునిది హరోంకార ఘూర్ణితసాగ
రారూఢ విశ్వనాథాలయంబు,
కాబోలునిది ప్రేతకబళనోద్గతధూమ
దర్శనాసక్త కేదారశిఖరి

తే॥ గీ॥ ఇదియొకాబోలు కంఠ సంభృతహాలాహ
లాగ్ని తేజస్క సన్నిధానానుకూల
వరవిశాలాక్షి దివ్యగోపురము ; ఇదియె
పాపవిదళన శాతాసి వారణాసి.

సీ॥ పెనిమిటి ఋణము తీర్పింపగా నొక మహా
సాధ్వియమ్మకమైన సంతబయలు,
సత్యపాలనము కోసము సార్వభౌముడొ
కండు కాచిన వల్లకాటినేల,
ఏడుదీవులరేని ఇల్లాలు సుతశవ
మ్మునకునోచని మూడుముళ్ల మట్టి
స్వామికార్యనిరూఢి స్వకళత్రమారణో
ద్యమదృశ్యమిడిన వధ్యస్థలంబు,

తే॥ గీ॥ జగతి "సత్యమేవజయతి నానృత"మను
నమలవాక్యమును శిలాక్షరముల
నిలిపినట్టి దివ్యనిలయ మియ్యదె కాశి
కాపురంబు సిరులకాపురంబు.

చ॥ ఇముడని పాపపుంజముల నెన్నిటి దా భరియించుచున్నదో
యమలవియత్స్రవంతి యిది, యార్పక కన్నులగాంచుకొద్ది మే
ను మరచి రాతిబొమ్మ కరణిన్ స్మరియింతును భక్తిపూర్వమం
దనమున గాంగనిర్ఝరమునన్ నినదించెను కాలఘోషమున్.

# నమ్మకమైన సరుకు

అనేక సంవత్సరములనుండి మేము వజ్రములు, నగలు, వెండి బంగారు వస్తువులను ఇండియా సిలోను దేశములవారి కెల్లతికి విక్రయించుచున్నాము. మా సరుకు నమ్మకమైనది. ఖరీదులు ఖచితమైనవి. దీనిని సందేహించువారెవ్వరును లేరు. మా వద్దనున్న సరుకు కొనుక్కొన్నవారికి పూర్తిగా నచ్చని యెడల ఖరీదు ధనము వాపసు చేయగలమని దృఢముగ చెప్పుచున్నాము. స్వయముగా కొనుక్కొన్నను సరే, తపాలా ద్వారా తెప్పించుకొన్నను సరే మా సరుకు నమ్మకమైనదనిన్నీ సరసమైన వెలలు గలదనిన్నీ కొనుక్కొనేవారందరికీ పూచీగా చెప్పుచున్నాము.



మాకు వచ్చిన అనేక జాబులలోనుంచి అక్కడక్కడగా తీసిన యీ దిగువజాబులవలన మా సరుకుయొక్క నాణ్యమును గురించి బాగుగా తెలియగలదు

పిఠాపురం మహారాజావారు:—నేను మీవద్ద కొన్న వజ్రములు నాకు సంపూర్ణముగ తృప్తి కలుగ చేసినవని తెలుపుటకు సంతసించుచున్నాను. వజ్రములు చాలా ఉత్తమజాతివనిన్ని ఖరీదులు చాలా సహేతుకమైనవనిన్ని నమ్ముచున్నాను. నేను మీతో చేయుచున్న వ్యవహారములెల్లయును చాలా సరళముగనున్నవి. మీ ప్రవర్తనము మిగుల మర్యాదకరముగా ఉన్నది. మీ వ్యవహారములు చాలా తీరుగను నిష్కలంకముగను నున్నవి. మీ వ్యవహారమునకు సంపూర్ణ విజయమును కోరుచున్నాను.

పైడా వెంకటనారాయణగారు, జమీందారు, కాకినాడ:—మదరాసు మెసర్సు బాప్లాల్ అండు కంపెనీవారు వజ్రవర్తకులు, నగలు తయారుచేయుదురు, వారు నాకొరకై వజ్రములనగలు బంగారుసరుకులు తయారుచేసిరి. వాటిగుణము ప్రశస్తము, మజూరి సరసము, పనితనము తృప్తికరము, రవానా అతిశీఘ్రము. వారి వ్యవహారము సంపూర్ణజయప్రదము కావలెనని కోరుచున్నాను.

మిసెస్ వెంకటసుబ్బారావుగారు (గౌరవనీయులు న్యాయమూర్తి వెంకటసుబ్బారావుగారి భార్య):—మెసర్సు బాప్లాల్ అండు కంపెనీవారు నాకొఱకై కొన్నినగలు వెండివస్తువులు తయారుచేసిరి. అవి చాలా దిట్టమైనవి, వాని పనితనము మిగుల నాణ్యమైనది. వారివజ్రములు చాలా మేలైనవి. మితమైన ఖరీదులుగలవి అని నా అభిప్రాయము.

---

టెలిఫోను నెం. 2696. మదరాసు. టెలిగ్రాము "నెక్లేసు"

## బాప్లాల్'స్

దయమండు మర్చెంట్సు, మేన్యుఫాక్చరింగు జ్యూవలర్సు,

**216, చీనాబజారు రోడ్డు, మద్రాసు. 86, రూ డూ పెలికేను, ఆంట్వెర్పు.**

వలయువారికి క్యాటలాగు ఉచితముగా పంపఁబడును.

# దసరా బహుమతి

శ్రీమతి సహాయమంత్రి వందేమాతరంగారు

దసరా పండుగలకు పదిరోజులు ముందుగనే యల్లుర నాహ్వానించుట కేగినారు ప్రసాదరావుగారు. ఊపిరివిడువనైన తీరిక లేకుండ పనులుచేయుచున్నారు మంగళాంబగారు. ఈ యత్తమామల యడావుడికి అన్యదేశాలనుంచి విద్య పూర్తిచేసి వచ్చిన గోపాలవర్మరాకయే కారణం. వివాహమైన సంవత్సర మేపండుగ కొచ్చినాడో, మరి రానేలేదు వర్మ. మూడవయల్లునితో పాటు తతిమ్మా యిరువురనూకూడా పిలువదల్చా రాయన ప్రసాదరావుగారు—వచ్చేటప్పుడే కుమార్తెలను పిల్చుకొచ్చేశారు. ఆతల్లీ కూతుండ్లేమియవస్తపడుచున్నారో కాని వనసుందరి కీ సంగతులేం పట్టడంలేదు. తన చదువేమో తనేమో అంతే; అదీగాక యీయేటితో చదువు మానివేయాలెగావల్నని గొప్ప వేదన పుట్టి ఆ లేతహృదయాన్ని బాధిస్తున్నదిపాపం. సుందరి జగదేకసుందరి. సుగుణాలవాల; పదునారేడులప్రాయము; చక్కని శరీరకాంతి; నల్లటినొక్కునొక్కుల కేశములు; నిరంతర ఖద్దరువస్త్రధారిణి. యిక నామె చక్కదనమునకు లోటేమి కలదు? గోపాలవర్మ విద్య పూర్తిచేసిరాగానే నిషేకముహూర్తము కానీయమని యాతని మాతాపితరులు ప్రసాదరావుగార్ని కోరినారు. "ఈయేటిపరీక్షలుకాగానే మీయిష్టము నెరవేర్పగలను. అంతదనుక యోపికపట్టు" డని కోరగ వారందులకు సమ్మతించేరు. ముఖ్యంగా వర్మయే తన సమ్మతిని చూపేడు. ఆశ్వయుజ శుద్ధపాడ్యమినాడే సుందరీ చెల్లెలూ బొమ్మలు పెట్టుకున్నారు. మహర్నవమికి రెండురోజులు ముందుగనే గోపాలవర్మ వచ్చేడు. అల్లునకు జరుగవలసిన మర్యాదలన్నీ జరుగుతున్నయి, కాని సుందరి దరిశనభాగ్యమతనికింతవరకు కానేలేదు. 'ఛీ సుద్ధమొద్దులా గీలా దాగుండడ మేమిటిఁ? నాన్ సెన్సు!!' అని విసుగుచెందుతుండేవాడు. 'యేమో ఒకవేళ అవుపడినా గుర్తించ లేకుండా వున్నానేమో' యనుకొనేవాడు. మహర్నవమినాడందరూ తలయంట్లు పోసికొనిరి. హడావుడిగ కొత్తలాగు చొక్కాలకోసరం సుందరితమ్ముడు సోమశేఖరం అల్లరిపెట్టేస్తున్నాడు. 'వుండరా బాబూ, కాఫీ త్రాగి యిస్తా'నంది సుందరి. 'అప్పుడే నాబడి పిల్లలంతా గిలకబద్దలుపట్టుకొని వెళ్లుంటారు: మరినేనో' యని ఏడ్పుముఖమేశాడు. ముందు వాడిపని చూడమని తల్లియనుటచే సుంటిరి ఆలాగేయన్నది; తమ్మున కలంకరించి విల్లుబద్దచేతికిచ్చి దానికొననున్న సంచినిండ బుక్కానింపి యాబాల వసంతమూర్తి నొకపరి ముద్దిడికొని యుక్తాయుక్తపరిజ్ఞానవిహీనుడగు మారునివలెగాక జాగ్రత్తగ మెలంగిరమ్మని సోదరు నెచ్చరించి పంపినది. మధుర పదార్థములగు పిండివంటకములతో

సహభోజనము లారగించి మెచ్చటివా రచ్చట విశ్రమించారు. కపురంపు వీడెముల నములుచు సుమారు మూడుగంటలప్పుడు మండువా సావడిలో వాల్గుర్చీలో పరున్నాడు ఎదపై దసరాగృహలక్ష్మి నిడికొని వర్మ. ప్రక్కగది తలుపు కిర్ మని శబ్దమయ్యే సరికి కండ్లువిప్పి యటుత్రిప్పేను ముఖం. దువ్వుకొనుచున్న తలనట్టే వేలుముడివైచికొని స్త్రీవ్యక్తి యీవలకు రావటం చూచేను. ప్రక్కనుంచాలా వెళ్తుంటే సుందరేయనుకొని తదేకదీక్షగా చూడసాగేడామెని నాసుందరీలా అయిపోయిందేమిచెప్మా అనుకొంటూంటే 'అమ్మా, నా కొత్తతోపీ యియ్యవుతే అని యేడుస్తూ వెళ్తున్న చిట్టి పంతుల్నిచూచి పడిన పొరబాటుకు పశ్చాత్తాపపడి పత్రిక చేతికి తీసుకొని చదువసాగేను వర్మ. ఈలాటి పొరబాటు సాధారణంగా ఆయింట్లో అంతాపడుతూ చేయుంటారు. సుందరిలోనూ ఆమె చిన్నక్క శ్యామలలోనూ యేకొద్ది వ్యత్యాసమో కాని లేదు; మూడుమూర్తులా నొకరినొకరు పోలియేయుందురు. సంతానవతయాక శ్యామల బాగా నూరిపోయింది. తేలిపోతున్నకళ్లు యుస్సురను వేడినిట్టూర్పులు బక్కపలుచటి శరీరము వీనింబట్టి శ్యామలాసుందరుల కనుగొనవచ్చు. అలాంటప్పుడు యేనాడో వివాహమప్పుడు చూచియున్న భార్య నేలా గుర్తింపగలడు వర్మ? ఆమె రూపు రేఖాదులుమాత్ర మతని హృదయంలో హత్తుకుపోయే యున్నయి. ఎన్నిదేశాలు తిరిగినా ఆబింబాన్నిమాత్ర మతను దుడిచివేయలేదు. పాపం విజయదశమినాడు మధ్యాహ్నం ప్రసాదరావుగారు యల్లుంద్రతో మాటలాడుచు కూర్చున్నారు. వీథులన్నీ ప్రతిధ్వనించేట్లు గిలకలపద్యాలు పాడుకొంటూ నూతనవస్త్రాలంకృతులై కలియుగ మన్మథమూర్తులంబోలె బయలుదేరేరు విల్లమ్ములు ధరియించి ముందుబడి పంతులు వెనుక పిల్లలు ప్రసాదరావుగారింట ప్రవేశించారు 'శ్రీరస్తు విజయోస్తు దిగ్విజయమస్తు; స్వస్తివాచకమస్తు మీకు శుభమస్తు' అని మొదలెట్టి యిల్లెగిరిపోయేట్లు పాడేస్తున్నారు పిల్లలు. అయ్యవారికిచాలు నైదు వరహాలు; పిల్లవాండ్లకుచాలు పప్పుబెల్లాలు. అని పాడు నప్పుడు యేదీ మళ్లీ అనండ్రా ఆ మొదటిముక్క అని ఆజ్ఞాపించాడు పంతులు వాళ్లని. ద్వారబంధాన్నానుకొని నిలబడి కుమారునిచూచి మురుసుకొనుచున్న మంగళాంబగారి చెవులకు యేం పంతులుగారి బహుమతి యీలాపంపించు అని ప్రసాదరావుగారనుట వినిపింప తెచ్చుచున్నానండీయని లోనికేగి తాంబూలమూ పంచెలచాపూ తెచ్చి భర్త కందిచ్చిందామె. 'నాయనా, గురువుగార్ని పూజించి యీ బహుమతుల నిమ్మని కుమారుని ప్రబోధించారు ప్రసాదరావుగారు. తండ్రి చెప్పినప్రకారం చేశాడు శేఖరం. రూపాయలు కొంటిని పెట్టుకుంటూ పంతులుగా రీయేడు చాలా చిన్నచూపుచూచేరు అన్నాడుబుడిపంతులు. అలాగే అంటూంటారుకదటు మీకుచేసినలోటేమిటంది మంగళాంబ కొద్ది తీక్ష్ణస్వరంతో మీబోటివార్ని గాక మరెవర్నడుగుతాం

తల్లీ మేం అన్నా డాయన. ఆ అడగటాని కేనా వీలూచాలూ వుండొద్దా అన్నదామె. శాస్త్రులుగారూ? మీరడుగనూవచ్చు మే మీయనూవచ్చు కాని మీరింకా శ్రద్ధగా పట్టుదలగా చదువుచెప్పాలి పిల్లలకు; లేకుంటే యీ వింటిబద్దలరూల్సు యెత్తి వేయిస్తా నేమనుకున్నారో అన్నారు ప్రసాదరావు గారు. చిత్తం — తమశలవుప్రకారం నడుచు కొంటానన్నాడు శాస్త్రులు. శ్యామలొక పళ్లెంనిండా లడ్లు మరొకపళ్లెంనిండా పప్పు బెల్లాలూ తెచ్చి పిల్లలకు పంచిపెట్టేరు. తిని చేతులు కడిగికొని విల్లులు చేతధరించి రెండు చెరణాలుపాడి గిలకలందున్న పూల నంద రొక్కమారుగ నందాసీనులై యున్న మామ యల్లుండ్రపై చల్లి గలగలలాడుచు నావలి కేగిరి. గిలకనిండా బుక్కాయెక్కించి బావముఖానికి సూటిజూచి నారిని విడిచి పెట్టేడు శేఖరం. అదేమిపనిరా శేఖరా? బావకు కోపంరాదా యన్నది మంగళాంబ గారు. యీచిన్నితమాషా కేమికోపమమ్మా యంటూ తోటిబాలుర గలసికొన పరువిడి నాడు. చేరుమాలుచే కండ్లుదుడిచికొనుచు నోటబడినవాని నుమియుచు లోనికొచ్చేడు వర్మ. మరిదిగారిక్కె తగిన బహుమతి యే జరిగినదేయంటూ లేచి నిలబడ్డారు రమణా శ్యామలలు. అచ్చటనేకూర్చొని తఖిలిమీద ధారంతీయుచున్న వనసుందరి చిరునవ్వు మోమున చిందులాడ లేచి వెళ్లిపోయింది. సుందరి చదువుకొనుచు మేడమీద గదిలో సోపాలో పరున్నది. ఏమియూ దోచక నందెపిల్ల తెమ్మెరలనైన ననుభవించి సుఖింప నెంచి గోపాలవర్మకూడ పైకివెడలి డాబా చేపట్టుగోడపై నాసీనుడైనాడు. ప్రకృతి వైచిత్ర్యము నీక్షించుచుండ చెంతగల గది నుండి సన్నటి కంఠధ్వని వీనులచొర నిందె వరుగలరో చూచివచ్చెదగాక యని పద శబ్దమేనిగాకుండ గదిద్వారము చెంతకేగి యందు పాఠములం చదువుకొనుచున్న సుందరింగని ఆ సౌందర్యమధువును మన సారగ్రోలుచు నిలువంబడియెను. తదేక దీక్షగ జదువుకొనుచున్న సుందరి యిదేమి గాంచనేలేదు. సుందరీ? ఓ సుందరీ? కను చీకటి వేళ నెచ్చటికేగితివమ్మా యను మాతృనుడులు వీనులచొర నులికిపడిలేచి వచ్చుచుంటినమ్మా? యని పుస్తకముల జాగ్రతపెట్టి యీవలకు రా మొదలిడెను. ఆమె కగుపడకుండగనే కొలది ప్రక్కకొత్తి గిలినాడు వర్మ ? చరచర నామెయూ ద్వారము సమీపించి దాటనుండ గోపాల వర్మ యెదురేగి యడ్డుగ నిలచినాడు రెండు చేతులూ ద్వారము నాన్చి. ఖంగారుగ రెండడుగు లవతలకేసి, అబ్బా? యెవరూ? అన్నది అస్ఫుటస్వరముతో? యిన్నిరోజులు కనుపింపకుండ దాక్కొన్నావు యిప్పుడేం చేస్తావన్నట్టు తలవంచియున్న ఆమె కళ్లల్లోకి చూచాడువంగి వర్మ. చూచారా? అవతల యమ్మ పిల్చుచుండ మీరే యీలా మార్గ మడ్డగిస్తే యేలాయన్నట్లుదీనంగా చూచింది భర్త ముఖంకేసి. వృధాగా నామెను నవ్వుల పాలెందుకు చేయడమనో, స్వతస్సిద్ధంగా దయార్ద్రహృదయుడగుట చేతనో, చేతులడ్డం తీసేసి ఆమె చెంపపై

నతి నాజూకుగ నొకటికొట్టేసు దసరా బహుమతియని - యిక వెళ్లు పాపం అన్నాడు. చెంప తడుముకొంటూ వెళ్తూవెళ్తూ పై మెట్టుమీద నిలబడి ఒక్కమారు వెనుదిరిగి చూచి నవ్వుకుంటూ చెకచెక మెట్లుదిగి పోయింది సుందరి. మామగారిచ్చిన పండుగ కానుకలందికొని సంతృప్తహృదయులై యత్తమామల యాశీర్వాదములందికొని వారివారి నివాసములజేర నేగిరి యల్లుండ్రందరును. తోటి సహవాసగత్తెలంజేరి వేళ మించకుండగ పాఠశాలకేగి విద్య నభ్యసించుచున్నది వనసుందరి తీరికకలిగినపుడెల్ల భర్తయొసంగిన దసరా బహుమతి తల్చుకుంటూ.

# దైవభక్తి

శ్రీమతి, కొల్లూరి. గౌరీదేవిగారు

౧

ఉ॥ రాలకు మ్రొక్కినంతనె పరాత్పరు డుంపునటంచు నెంచి, దే
వాలయమందు భక్తులయినంత, వనాంతరమందు పుట్టలన్
పాలనుబోసినంత, నదిమధ్యమునందు మునింగినంత పా
పాలను బాసిపోదురె? కృపారహితాత్ములు జారచోరులున్.

౨

ఉ॥ ఇమ్మహినర్థగర్వమున నెందరొ యౌవనమందు చాలనే
రమ్ములుచేసి తామిహపరంబుల ముక్తినిబొందగోరి పా
పమ్ములు వోవగా జపతపమ్ములు చేతురు వృద్ధులైనకా
లమ్మున రామనామము విరామములేక జపింతురూరకన్.

౩

ఉ॥ సోదరులందఱున్ గలసి సొంపుగనుండిన వారితండ్రికా
మోదముగాదె చేతమున; భూప్రజకంతకు తండ్రియంచు దా
మోదరు నెంచి జెప్పరె ప్రబుద్ధులు; కావున తోడివారిక
త్యాదరమిచ్చి జూచునపుడార్త శరణ్యుడు సంతసింపడే?



" రాధామాధవయోర్జయన్తు యమునాకూలే రహఃకేలయః "

# పశ్చాత్తాపము

శ్రీమతి డి. బి. సీతమ్మగారు

మాలతి డిప్యూటీ కలెక్టరు గారి యేకపుత్రికఅవటం వల్ల చిన్నప్పటినుంచీ చాలా ముద్దుగా పెరిగింది. తల్లి ఇంట్లో చిన్నపనైన చేయనీయకుండా 'నే నుంటూం డగా నీ కెందుకమ్మా కష్టం' అని అంటూవుండేది. మాలతి చాలాచురుకైనది అయినప్పటికి తల్లిదండ్రులు ఎక్కువగా గారాబంచేసి పాడుచేయుటవల్ల యే పనీ చేత కాకుండా అయిపోయింది. 15 ఏళ్లు వొచ్చేసరికి 4 వ ఫారం వరకు చదివింది చదువులోమాత్రం చురుకు చూపించేది. ఇంక బంతాట, బ్యాట్‌మింటన్, సైకిల్ త్రొక్కడం, ఇవన్నీ నిత్యకృత్యాలు. సంగీతం బాగా పాడగలదు. వీణవాయించగలదు. చక్కనిదే. పొడుగ్గా సన్నంగా, పెద్దకళ్లూ, పొడుగైన నల్లటిజుట్టు చాలా అందంగావుంటుంది. అయితే గృహకృత్యాలు చేతకాకుండాపోవడం పెద్దలోటు.

మాధవరావు గొప్ప వకీలు గారికొడుకు. చక్కని వాడే. B. A. Pass అయి ఇంగ్లాండుకు బారిష్టరు పరీక్షకు వెళ్లి పరీక్షఇచ్చి సెలవలకి ఇంటికి వచ్చాడు. వాళ్లయిల్లు చాలా పెద్దది. యెప్పుడూ పదిమందికి తక్కువకాకుండా బంధువులతోటి నిండివుంటూ వుంటుంది. మాధవుని తండ్రిగారి రాబడికూడా చాలా యెక్కువ అవడంవల్లనూ, మాధవుడు వారికి ఒక్కడే కుమారుడగుటవల్లనూ అతనికేమీ కొరతలేకుండా యున్నది. మాధవుడు ఇంగ్లాండు వెళ్లినతరువాత తన పేరు మాధవన్‌గా మార్చుకొన్నాడు. అతడు చాలా బుద్ధిమంతుడు; ఎక్కువ షోకులు అవీ అట్టే లేవు. రోజూ సినీమాలు అవీ లేవు. ఇంతలో మాలతి 4 వ ఫారము పూర్తిచేసిన తర్వాత చదువు చాలించాలి సొచ్చింది. ఇంకేమి! రోజూ బీచి షికార్లు, సినీమాలు మొదలుపెట్టింది. తల్లితండ్రులు వద్దనలేదు కూడాను. ఇలా వుంటూవుండగా మాధవునికి ఒకమంచి సంబంధం వచ్చింది. పిల్ల బుద్ధిమంతురాలూ, తెలుగు బాగా చదవడం వ్రాయడం వచ్చును. ఇంగ్లీషుకొంచెంవచ్చు. అందమైనదనే చెప్పవచ్చును. పేరు. శశికళ. గృహకృత్యములు బాగుగా చేతనగును.

సరే వివాహంవైభవముగా జరిగినది. శశీమాధవులు అన్యోన్యంగా ఒకర్ని వొకరు వదలలేక వుంటూ ఎంతో సంతోషంగాయుంటూయుండేవారు. వారికి ఒకబాలుడుకూడా కలిగాడు. వాడికిప్పుడు 4 ఏళ్లు. పేరు రాజశేఖరుడు. అయితే మాధవన్‌కిమాత్రం ఒకటి చాలా కష్టంగావుంటూయుండేది. ఏమిటంటే భార్యకు ఇంగ్లీషు తనతో మాట్లాడడానికిరాదు. అది ఒక పెద్దతప్పక్రింద తోచేది కూడాను. అయితే మాలతిని చూసినప్పటినుంచీ ఆమెను వివాహమాడ వలెనని యున్నది. మాలతికికూడా మాధవుడ్ని వివాహముచేసుకోడం ఇష్టమేనని వేరే చెప్పక్కర్లేదు. ఒకరోజున ఎంచేతనోగాని శశి తనపుట్టింటికి వెళ్లెదనని కోరింది. ఇదే సమయమనుకొని:—

"నువ్వు వెళ్లవచ్చునుకానీ మళ్లీ రానక్కరలేదు" అని అన్నాడు. పాపం శశికళ ఏమీ యెరుగదు గనుక అతన్ని కారణంచెప్పమని బ్రతిమాలుకుంది; కాని యతడు చెప్పలేదు. పోనీ వెళ్లను పంపించవద్దని కాళ్లమీద పడింది, కాని మాధవుడికి జాలిరాలేదు. సరికదా ఆతక్షణం ఇంట్లోంచి వెళ్ళిపొమ్మన్నాడు. పాపం ఆకరుకి గుండెధైర్యం తెచ్చుకుని పిల్లవాడ్ని నిద్రపోగొట్టి నమ్మకమైన దాదిచేతి కప్పగించి ఆ అంధ కారంలో రాత్రి 12 గంటలప్పుడు వీధిలోకివెళ్లి

పోయింది. తర్వాత యేమయిందో తెలియదు. మాధవునికి అప్పటికికూడా కనికరం రాలేదు సరికదా పెద్ద బలువు తగ్గినట్లయింది. మర్నాడే మాలతిని వివాహం చేసుకొన్నాడు. కొన్నాళ్లు బాగా జరిగింది. తర్వాత రోజూ సినీమాలవల్లనూ పౌడరు అవీ యివీ ఒకటేమిటి అన్నిటివల్లను ఖర్చు ఎక్కువకా మొదలుపెట్టింది. ఏ సినీమాలోచూచినా, ఏ బీచిలోచూచినా మాలతీ మాధవులే. పాపం రాజశేఖరంని ఆ దాదితప్ప చూచేవాళ్లేలేరు. ఒకరోజున అయినా మాలతి పనిచేసి యెరుగదు. ఇల్లుఎలాగావుందో ఒక్కమాటైనా పూర్తిగా చూడలేదు.

అప్పు లెక్కువఅయిపోతున్నాయికాని రాబడిలేదు. మాలతి, రాజశేఖరుని ఎప్పుడు చూచినా అసహ్యముగా చూడడమే. నిజంచెప్తే తనకుమాత్రం లలితకన్న శేఖరుడు చాలాఅందమయినవాడు. పాపం బట్టలయినా లేక ఎప్పుడూ మాసినవి చింకివి కట్టుకునేవాడు. ఇప్పుడు 15 ఏళ్లవాడయినాడు. కొంచెము ప్రపంచజ్ఞానం వచ్చింది. తను అధికారిము చెలాయించవలసిన స్థలంలో ఒకచిన్న బాలిక లలితవున్నదని గ్రహించాడు. తనతల్లిని వెదకాలనుకున్నాడు కాని పాపం చేతిలో కానీలేదు. అయినా ఎలాగైనా వెదకాలనుకొని ఒకరోజున రాత్రి ఇంట్లోంచి వెళ్లిపోయాడు. తెల్లారింతరువాత ఇంట్లో పిల్లాడు లేకపోవడంవల్ల మాధవునికి ఎంచేతనో ఏదో లోటుకింద తోచింది. లలితమాత్రం వాడ్ని ఎక్కడవెతుకుతారోనని "తిని కూర్చోలేక ఎక్కడకో పారిపోయాడు ఏం 15 ఏళ్లవాడుకదా! వాడింకా వాడిప్రాణం చూసుకోలేడా" అనేది కాని మాధవుని ఆత్రత ఎక్కువవుచున్నది. పూర్వచరిత్రస్మృతికి వచ్చింది. పాపం చాలా పశ్చాత్తాపపడ్డాడు, అప్పుడు మాలతి యొక్కయు శశియొక్కయు భేదం కంటికి కట్టినట్లు కనిపించింది. ఎక్కడచూచినా, శశికళా లేకపోతే తనయొక్క ఋణములు కనుబడుతున్నాయి. శశిన్నీ రాజశేఖరుడును కనబడితే తప్పకుండా తీసుకురావాలనుకున్నాడు రాజశేఖరుడు. ఒకరోజున ఆవూరికి ఒక సన్యాసిని 30 ఏళ్లదిన్నీ ఒక బాలసన్యాసి 17 ఏళ్లవాడున్నూ వచ్చారు. వారు అందరికి మంచిబోధనలు చేస్తూయుండడంవల్ల వారిసంగతి వూరంతా ప్రాకిపోయింది. మాధవునికికూడా చూడాలని బుద్ధి పుట్టింది; వారున్న చోటికి వెళ్ళాడు. కుర్రాడ్నిమాత్రం గుర్తుపట్టాడు. ఆ స్త్రీ యెవరా అని ఆలోచించాడు. ఒకవేళ తన శశికళేమో ననుకున్నాడు. ఇలా ఆలోచించుతు కూర్చుండేసరికి ఆస్త్రీ ఉపన్యసించుట మొదలుపెట్టింది.

మాధవుని అనుమానం తీరిపోయింది.

ఇంకేముంది ఆ శశికళే! అదేరూపు అదేమాట అదే ధోరణి. ఇంక అతనికాళ్లు నిలవలేదు. గబాగబా వెళ్లి శశి కాళ్లమీద పడెను. పడి తనఇంటికిరమ్మని చాలాసేపు బ్రతిమాలాడు. ఆమె పతివ్రతకాబట్టి మగనిచేత బ్రతిమాలించుకోడం ఇష్టంలేక పశ్చాత్తాపంవచ్చింది కాబా అని ఒప్పుకుంది. ముగ్గురూ ఇంటికివెళ్లారు. అంతకుముందే పశ్చాత్తాపంచేతక్రుగిపోవుచున్న మాలతి వారికాళ్లమీదపడి, శశినిచూచి "అక్కా నాతప్పు క్షమించు. నీకొడుకుని ఇంటినుంచి పోయినట్లుచేసి తర్వాత వెదుకనీయకుండాచేసిన మహాపాపిని నేనే. నా అంత పాపాత్మురాలు ఇంక వుండదు" అని వేడుకుంది. శశికళ తక్షణం క్షమించింది. లలితనుచూచి సంతోషించింది; మరుక్షణంనుంచి ఇల్లు మహాశోభగా తయారైనది. మాలతీ శశికళలు అక్కా చెల్లెళ్ళకన్న ఎక్కువప్రేమతో కాలక్షేపం చేస్తూయున్నారు. రాజశేఖరుం ఇప్పుడు B. A. పరీక్షకు వెళ్లినాడు. లలితకు వివాహము అయినది. రాజశేఖరుడు తనతల్లిని వెదుకుటకు పడిన కష్టసుఖములు తెలుపుటకు ఇక్కడ ఇప్పుడు వ్రాయుటకు అవకాశములేనందున క్షమించండి. ఈ కథంతా క్షమాపణలతోటే పూర్తిఅయింది కనుక మీరుకూడ క్షమాపణతోటే నాకు సెలవు ఇవ్వండి.

# స్త్రీవిద్యాప్రణాళిక

శ్రీమతి శృంగారకవి లక్ష్మీనరసమ్మగారు

విద్యచే వినయమును, వినయగుణము వలన లోకసమ్మానమును దక్షతయు, దక్షత వలన ధనార్జనమును, ధనార్జనమున ధర్మసంరక్షణమును, ధర్మసంవర్ధనమున నైహికాముష్మిక సుఖములునందిన స్త్రీలచే తాండవించిన భారతదేశమున, సకలకళావిదులగు స్త్రీలచే నలంకరింపబడిన భారతదేశమున, కాలవ్యత్యయమునుబట్టి స్త్రీవిద్య దోహదములేక సన్నగిల్లి, నామావశిష్టమై, తుదకు బొత్తుగా నశించెను.

ఈ స్త్రీవిద్యానాశనమును పునరుద్ధరించుటకై పశ్చిమఖండవాసులగు మిషనరీలు మన దేశమునకువచ్చి, విద్యావంతులగు కొలది పురుషుల ఆదరాభిమానములతో పేరుగల పట్టణములలోనెల్ల బాలికాపాఠశాలలు స్థాపించి స్త్రీవిద్యాప్రధానమున కుపకరించిరి.

నూటికి 8 మందికంటె విద్యావంతులగు పురుషులేలేని యీనాడు స్త్రీవిద్యకంటె పురుషవిద్యను గూర్చియే ప్రజాభిప్రాయము కేంద్రీకరింపవలసినమాట సత్యమేయైనను, అర్థాంగియగుస్త్రీవిద్యగూడ విస్మృతిజెందించుటకుగూడ సత్ప్రయత్నములు సలుపబడవలసియే యున్నది.

పురుషులెల్లరు విద్యావంతులైనచో, స్త్రీవిద్యకు పురుషులేగురువులై వ్యాప్తిజెందింతురనుటగూడ యుక్తిసహమే. ఏ విద్యావంతుడు తనభార్య విద్యావతిగా నుండగోరడు?

మొట్టమొదట పట్టణములలో ప్రారంభింపబడిన స్త్రీవిద్య స్థానికపరిపాలనము ప్రజల చేతిలోనికివచ్చిన పిమ్మట పేటిగ్రామములలో వ్యాప్తిజెందుచున్నది.

ఇంటిలో అల్లరి చేయకుండనుందురనియు, పొరుగింటివారి పిల్లలు బడికి పోవుచున్నారనియు, ఇట్టి కారణములవలన తమ బాలికలను బడికిపంపిన తల్లులు, "మాపిల్లలకు తగినంత చదువురాలేదు. వచ్చినవిద్య సార్థకముగాలేదు. ఇవి యేమిచదువులు? ఒక పురాణము చదువలేదు. ఒక లెక్కవ్రాయలేదు. ఇంట పనిపాటలు నేర్పుగా చేయలేదు. వంటకు పనికిరాదు. గాజుబొమ్మవలె తయారగుచున్నది మాపిల్ల" అనుచు విద్యయొక్క వాస్తవోపయోగముకొరకు దృష్టి సారించుచుండు శుభదినములు వచ్చినందున కెంతయో సంతసింపదగియున్నది.

మన దేశపరిస్థితులనుబట్టి స్త్రీ యెట్లుండవలెను అనుసమస్య బుద్ధిమంతుల దృష్టినాకర్షించుచున్నది. ఆంగ్లవిద్యాపరిణతులగు విజ్ఞానఘనులు కొందఱు స్త్రీవిద్యకును పురుషవిద్యకును భేదమక్కరలేదు. ఏకవిధముగానే యుండవచ్చు ననుచున్నారు.

మఱికొందఱు శాస్త్రజ్ఞులు 'సృష్టిలోనే స్త్రీ పురుషులకు భేద మేర్పడియున్నది. స్త్రీ మాతృదేవత. పురుషుడు పిత, కావున స్త్రీత్వము మాతృత్వ గరిమాధిష్ఠితముగా నుండవలెను. పురుషుడు పోషణకర్తగా, స్త్రీయొక్క మాతృత్వపోషకుడుగా నుండవలెను. వివాహము కేవల కామశాంత్యర్థముగాదు, సత్సంతానార్థమే. కావున స్త్రీవిద్య,స్త్రీ భావికాలమున, యౌవనవతియైన పిమ్మట వహింపవలసిన కార్యక్రమమున కనుకూలించునదిగా నుండవలయును. విశేషించి సకల సస్యభరితమును, బీదదియగు మన దేశమునకు తగినదిగా నుండవలయును' అనుచున్నారు.

స్త్రీపురుషుల కభేదాధ్యవసాయము గావలయుననువారికి పశ్చిమఖండ మాదర్శము. ప్రత్యేకవిధానము లపేక్షించువారికి భారతావని లక్ష్యముగా గనుపించుచున్నది.

పశ్చిమఖండము రమారమి ఒకశతాబ్దము నుండి స్త్రీపురుషుల కేకవిద్యావిధానమును బరపి తత్ఫలితములను బడసియున్నది. పశ్చిమఖండవాసులలో ముఖ్యముగా ఫ్రాన్సు, జర్మనీదేశములలోని స్త్రీలు మాతృత్వపదవి భారవహముగా, యౌవనోచ్ఛేదకముగా, స్వసౌఖ్యహానికరముగా భావించి, ఆపదవిని వాంఛించకపోగా, నచటి జనసంఖ్య తగ్గి దేశసంరక్షణమునకే భంగమువాటిల్లెను. ఈ పరిస్థితులనుబట్టి అచ్చట అవివాహితుడగు బ్రహ్మచారి బ్రువునకు శిక్షార్థపు పన్నువిధించుటగూడ సత్సంతానాభివృద్ధికి చాలనందున పిల్లలను గన్న కుటుంబములుగల ఉద్యోగికి పిల్లకింత చొప్పున శిశుపోషణార్థము ధనమిచ్చెదమని ఉత్తర్వులు ప్రకటించిరి. అదియు చాలకపోగా వివాహపుఖర్చులను ఆయాగవర్నమెంటువారే భరించెదమని ప్రకటించినారు. ఇదియు జర్మనీదేశములో చాలకపోగా—మాతృత్వమును స్వీకరించుట కడ్డుగానున్న ఉద్యోగపదవీ వాంఛను నిర్మూలము గావించుటకై స్త్రీలు విద్యావతులై, గృహదక్షలై, శిశువిద్యాపోషణానురక్తలై దేశదేశమునకు సత్సంతానప్రదలై యుండవలెనని శాసించబడెను. ఇట్లే యిటలీయందు కూడ నేడు స్త్రీని మాతగా పూజించుచున్నారు.

మన దేశము సకల సస్యభరితమై, సర్వజనులు సుఖముగా జీవించుటకు వలయు సమిష్టికుటుంబ నిర్మాణముచే నిరుద్యోగ సమస్యకెడ మీక, స్త్రీ మాతృత్వపదవిని నిరీక్షించుచు దేశవర్ధకులగు జనసంఖ్య కెప్పుడును కొఱతలేకయుండెను.

పూర్వకాలమున సమిష్టికుటుంబనిర్మాణము, వర్ణాశ్రమవృత్తిజీవనములవలన నిరుద్యోగసమస్యకే యెడములేకుండెను. కలకాలదిగా కుటుంబములోని వారందఱు పంచుకొని తినుచుండిరి. కుటుంబాదాయమునుబట్టియే, వ్యయమును పరిమితమై యుండెను. ఉద్యోగములేనివారేలేరు. కాని అందఱు యథోచిత క్లుప్తభోగములనే యనుభవించుచుండిరి. ఆనాడు స్త్రీలకు

కుటుంబమే విద్యాగురువు; సాంప్రదాయము సంరక్షింపబడుచుండెను. స్త్రీకి చదువు, యింటిపనిపాటలు, శుభాశుభకార్యక్రమ నిర్వహణదక్షత, అతిథిపూజ, శిశుపోషణము, పురాణకాలక్షేపము, వ్రతాచరణము, తన ఆచారశౌచశీలముల యెదుపున పిల్లలకు సత్సంప్రదాయము నేర్పుట నిత్యవిధులై యుండెను.

ఈ పద్ధతులలో మెలగినవారు, స్త్రీలకు భారతసంప్రదాయ వర్ధకమగు విద్యావిధాన మేర్పరుపబడవలెనని కోరుచున్నారు.

ఏదేశీయులకును దేశసాంప్రదాయ మర్చామనుట నిర్వివాదాంశము. భారతదేశము భారతదేశీయుల బట్టకట్టునుగూర్చి పశ్చిమ ఖండవాసు లెంతో మెచ్చుకొనుచున్నారు. ఒక కుట్టయినను లేక 16 మూరల చీరను శరీరమంతకప్పుకొనుటకు వీలైన విధానము ఒక్క భారతదేశమందే కలదు. ఇట్లు శరీరమంతకప్పుటకు పశ్చిమఖండవాసులమస్తులెన్నో అతుకులతో, కుట్లతో, బిగింపులతో, గాలి ఆడనివిధముగా నుండును.

భోజనవిషయమునగూడ సర్. కె.వి. రెడ్డి నాయుడుగారు మొదటిసారి ఇంగ్లాండునకు పోయివచ్చిన తర్వాత చెప్పినట్లు, పాకకళ - సమపాళముగా, ఉప్పు పులుసు కారముల సమ్మేళనముతో సర్వసిద్ధముగా నొనర్పబడుటకు మనభారతదేశమే అగ్రస్థానమలంకరించుచున్నది.

మన దేశసాంప్రదాయమున నిలుపుకొనదగిన యాచారములు చాలగలవు. అతిథిపూజ. ఆపరాహ్ణకాలమున నింటికి వచ్చువారికి భోజన మమర్చుట. నిత్యము ప్రతియింట దేవపూజ, మాతృత్వపదవీ స్వీకారకాంక్ష.

ఇందులకు వలయు విద్యావిధానము స్త్రీలకు ముఖ్యావశ్యకము. స్త్రీలు బుద్ధియందు పురుషులకంటె నాల్గురెట్లెక్కువ చులుకుతనము గలవారని మనువే చెప్పియున్నాడు. అట్టి స్త్రీలకు 15 వ యేటనే దాంపత్యపదవిని పొందవలసిన స్త్రీలకు, ఆవెంటనే మాతృత్వమును, అటుపైని శిశుపోషణమును, కాపురమునకు పోయిననాటనుండి వంటయింటిపని గృహకార్యనిర్వహణమున నుండవలసిన స్త్రీలకు 8 సంవత్సరములలో భారతదేశ సాంప్రదాయసిద్ధమును, నవీన నాగరకతానుకూల్యమైన మెలుగులు, గల విద్యాప్రణాళిక యేర్పరుపబడవలెను.

అట్టి స్త్రీవిద్యాప్రణాళికను గూర్చి విదుషీమణులు తమయభిప్రాయములను 'గృహలక్ష్మి' పత్రికాముఖముద్వారా తెలిపిన మిగుల సంతోషించెదను. బహుజనాంగీకారమైన అట్టి ప్రణాళికను స్థానికసంస్థలలో ప్రవేశపెట్టుటకు విద్యాశాఖా డైరెక్టరుగారికి నివేదింపవచ్చును.

సోదరీమణులారా! మాతృత్వపదవీ పర్యవసాయులగు స్త్రీ వతంసములారా! మీకు తోచిన ప్రణాళికను ప్రచురించి దేశకళ్యాణమును సమకూర్చుడు.

ఒకే సీసాలో!




స్త్రీల వంధ్యాత్వమును పారద్రోలు వజ్రాయుధము
సుఖజీవనమునకు సాధనమగు సంతానము
ఒకే సీసాలో యిమిడి యున్నది.

# వింత స్నేహితుడు

శ్రీమతి విశాల దుర్గాభాయిగారు

సాయంత్రము 4-15 గంటలకు గ్రంథాలయం యినుకేస్తే రాలకుండావుంది. అప్పుడే కాలేజీ వదలుటచేతనూ, వచ్చేదారిలో వుండడముచేతనూ, కొంతమంది కాలేజీగాల్సుకూడా ఆంధ్రగ్రంథాలయంలో వచ్చి చోటుదొరకక పిన్న పెద్దలమధ్యనే కొంచెం చోటుచేసికొని చేతికందినపేపర్లు చదువుకుంటున్నారు. కాని వారిలో ఒకఆమెమాత్రం చోటుదొరకక ఒకచోటనుంచుని ఆతురతతో ఒక స్థానంకోసం అటూయిటూ చూస్తోంది. ఇదంతా చూస్తోవున్న ఒక పెద్దమనిషి తానుకూర్చున్న కిటికీలోనే కొంచెంప్రక్కగా జరిగాడు ఇక్కడకువచ్చి కూర్చోమన్నట్లుగా. ఆయనకూడా మంచిమనిషిలాగే వున్నాడు. ఈమెను చూడగానే ప్రేమాస్పదమైన చిరునగవును వెలిబుచ్చాడు. ఆమెకూడా ఆయన అయాచితమైన ఆదరణకు సంతోషిస్తూ కూర్చుంది. ఒక Puzzle ను solve చేయటానికై వేళ దాటిపోతుందేమోనని హడావిడిగావచ్చుటచేదీర్ఘనిశ్వాసలు విడుస్తోంది. తాను solve చేయదలచుకొన్న Puzzleకి ఆరోజే ఆఖరు నియమితదినమగుటచే దానిని ఆరోజు సాయంత్రానికి తప్పకుండా పూర్తిచేసి టపాలో పడవెయ్యాలనుకుంది.

*　　*　　*

"రామూ నీదగ్గిర రామన్సుడిక్షనరీవుందా ? ఒక మాటకోసం సరియైన అర్థందొరకక నామెదడు పాడుచేసుకుంటున్నాను. అన్నట్లు నీవు యీనెల Hindu Weekly లో cross word Puzzle చేస్తున్నావా?" అంది రాజ్యం.

"నేను చూశానుకాని రాజ్యం నేను పట్టి అభాగ్యుడను యీ Puzzles కోసం ప్రతినెలా 10 రూపాయలుపైగా ఖర్చుపెడ్తూవుంటాను. కాని 4,5 తప్పులు వుంటూనేవుంటాయి. నీకేమైనా Prize వచ్చిందా ? ఆ వచ్చేవుంటుంది. అందరూ నామాదిరిగానే వుంటారేమిటే! యిప్పుడు జేబులో రామన్స్ డిక్షనరీ లేదుకాని నాధమ్సు డిక్షనరీవుంది కావాలా?" అన్నాడు రాము.

"యిప్పటి కాలపువాళ్లంతా ఏదో కొత్తమాదిరి డిక్షనరీలువ్రాసి డబ్బు సంపాదిస్తున్నారనుకుంటా" అంది నవ్వుతూ. "రామూ నీవు B. A. కదూ చదువుతూవుంటా? మొదటేడా రెండవయేడా ?"

'అవ్వే అప్పుడే ఎక్కడండి ఇంకో ఏడువుంది.'

'తర్వాత ఏంచేస్తావు? B. L. చదువుతావా ?'

'అవును చదవాలనేవుంది మరి.'

యీసంభాషణ జరుగుతూవుంటేనే రాజ్యం డిక్షనరీచూసి Puzzle పూర్తిచేసి కవరుమీద ఎడ్రస్ వ్రాసి బిళ్లఅంటించి అదంతా మళ్లీ ఓమాటు చదువుకొని 'అమ్మయ్య ఏలాగో ఓలాగు పూర్తిచేశాను. తరువాత ఏమవుతుందో! మూడువంతులు Prize రావచ్చును' అంటూ తనచేతిలోని పుస్తకంతో విసురుకుంటూ కూర్చుని చదువుకుంటున్న వాళ్లవైపు చూస్తోంది.

*　　*　　*

యింతలో ఒకపొట్టిమనిషి—వేషాన్నిబట్టి ఒక ఆంగ్లోయిండియన్‌మాదిరిగా వున్నాడు—వచ్చి రామూ భుజాలమీద గట్టిగ చరిచి Well Ramu ! How are you?(రామూ ఏలాగున్నావు?)మనం బొంబాయిలో కలుసుకున్నప్పుడుకంటే బాగా వూరావేమోయ్.



" దసరా కొలువులు కదవే ...

కుసుమాంగీ వచ్చి పసపుఁగుంకుమ గొనవే "



"బ్రహ్మదేశపుఁ బరమసౌభాగ్యచిహ్న"

ఇదిగో ఇలాచూడు. ఇదేమి మాట్లాడడేం ఏమైనా అస్వస్థతగావున్నావా? ఏమమ్మాయి ఏమిమాట్లాడడేం? ఏమైనా విచారంగావున్నాడా? అన్నాడు ఆ ఆంగ్లో ఇండియన్ ఆతురతతో.

రామూ తలను ఆంగ్లోయిండియన్ భుజాలమీద అన్ని వికారంగా అటూయిటూ తిప్పుతున్నాడు. రామూ కిటికీలోంచి క్రిందకితూక్కుండా యీ స్నేహితుడు భుజాలమీద ఆపుచేస్తున్నాడు. యిదంతా ఒక్క నిమిషంలో జరిగినమార్పు. రాజ్యం యిదంతా చూస్తూ యీ మార్పుకు చాలా ఆశ్చర్యపోతోంది. క్రితం పదినిముషాలనుంచి నాతో చాలా సర్దాగా మాట్లాడుతున్నాడు—ఇప్పుడిది ఏమివింత? అంది రాజ్యం ఆశ్చర్యంతో.

నీకేమీ వికారంగా కన్పించలేదా.

అబ్బే నాతో మాట్లాడేటప్పుడేమాత్రం వికారంగా వున్నట్లు కనబడలేదు.

చాలా ఆశ్చర్యంగావుండే. నేను యితన్ని సే కలుసుకోనడం. అయ్యోపాపం ఏమిఆపద సంభవించిందో !...అన్నాడు ఆఆంగ్లోఇండియన్ చాలా జాలిమనస్కుడై.

రాజ్యం ఆతురతతో రాము ముఖం చూసి అయ్యో రాము తెలివితప్పినట్లున్నాడు, సోడా తెస్తానాఅని సోడాకోసం అవతలికి పరుగెత్తింది రాజ్యం.

యిదంతా చూస్తున్నవాళ్లు తక్షణం ఆసుపత్రికి తీసుకెళ్లండి అనిచెప్పగానే ఆ ఆంగ్లోఇండియను ఎవరి సహాయం అక్కర్లేకనే రామూని తనచేతులమీద కారులోనికి ఎక్కించి ఆసుపత్రికి బయలుదేరాడు.

* * *

రాజ్యం సోడా తీసుకొనివచ్చింది కాని ఆమను ష్యులిద్దరూ కనబడలేదు. ప్రక్కవాళ్లనడిగి ఆసుపత్రికి తీసికొనివెళ్ళబడ్డాడని తెలుసుకొని సరే మంచిపనే జరిగిందనుకొంది. తనపుస్తకాలన్నీ తీసుకొని యింటికి వెళదామని బయలుదేరిపోతూవుంటే ఆమె Purse కనబడలేదు. కాని రామూ Purse మాత్రం అక్కడుంది. అయ్యో తన Purse యిక్కడవుంచి పొరపాటున నా Purse పట్టుకొని వెళ్లినాడు కాబోలు అందులో నా Puzzle cover వుంది: పోస్టు టయిమ్ అయిపోవచ్చింది అనుకుంటూ గబగబా రోడ్డుమీదికి పరుగెత్తి ఒక కారు వెడుతూవుంటే ఆపి దానిలో ఎక్కి ముందుపోతూవున్న పచ్చకారుని కలుసుకోవాలి; త్వరగా కలుసుకుంటే ఇవ్వవలసినదానికన్న రెట్టింపె యిస్తానని డ్రైవరును ఆశపెట్టింది. డ్రైవరు కూడా కారుకు వేగంహెచ్చించాడు. రాజ్యానికి ప్రక్కనున్న చెట్లుచేమలు ఏమీ కనుపించడములేదు. ఆమెదృష్టి ముందున్న పచ్చకారుపై అతితీక్ష్ణంగా ప్రసరింపజేస్తోంది. Puzzle Post చేయడానికి ఆలస్యమవుతూన్నందుకు ఆ ఆంగ్లోఇండియనుని నిందిస్తూ వుంది లోపల.

* * *

కొంతదూరంపోగా ఆపచ్చకారు ఒక పురాతనపు బిల్డింగుదగ్గర ఆగివుంది. వీళ్లకారుగూడా ఆకారు ప్రక్కనే ఆపుజేశారు. రాజ్యం నింపాదిగా కారులోంచి దిగింది. టైముచూసేటప్పటికి సరిగా 4–50 గంటలు అయింది. యిక టపాలోవేయడానికి 25 నిమిషాలుమాత్రమే time వుంది. వీరు ఆగినరోడ్డు ఊరికి చాలా చివరగావుంది. ఆరోడ్డుమీద ఎక్కడా జనసంచారములేకుండా నిర్మానుష్యంగావుంది. ఆసుపత్రికదా తీసుకొనివెడతానని ఈపెద్దమనిషి తీసుకొని వెడతా! ఆసుపత్రులన్నీ దాటించి ఇక్కడకు తీసుకొచ్చాడేమాయని ఆలోచిస్తోంది. ఆకారుదగ్గరకువెళ్ళి అందులోకి తొంగిచూచింది. అందులో ఎవరూలేరు కాని ఒకమూల ఒకడబ్బాయును కొన్నికూరలుమాత్రం కలవు. ఆడబ్బామీద poison (విషము) అని వ్రాసి వుంది. దానితో రాజ్యానికి అనుమానం ఎక్కువైంది.

భయంకూడాకల్గింది. ఆడబ్బాను నింపాదిగా బయటకు లాగింది.

డ్రైవర్.

డ్రైవర్ వచ్చాడు.

యిదంతాచూస్తే చాలా చిత్రంగావుంది.

అవును నాకూ ఆలాగేవుంది అన్నాడు డ్రైవరు.

యీ ఆంగ్లోయిండియన్ రాముకి ఇక్కడ ఏం సహాయంచేయగలడు. యిదేమీ ఆసుపత్రికూడా కాదే! యీ యిల్లు యీ ఆంగ్లో యిండియన్‌దని గూడా తోచదు. అందుచేత యిదంతాచూస్తే ఆ ఆంగ్లో ఇండియన్ ఏదో మాయచేస్తున్నట్లుగా తోస్తోంది అంది. ఏమైనాసరే యిదంతా నేను కనుక్కోవాలి—యీ విషయంలో నీవుకూడా నాకు తోడ్పడాలంది. డ్రైవరును ఆలాగే సహాయంచేస్తాను అన్నాడు. సరే నేను లోపలికి వెళతాను నీవుమాత్రం గుమ్మందగ్గిరవుండి ఎవరినీ లోనికి రానీయకు అని చెప్పి అవుసరమైతే సహాయంకోసం ఒక యీలను ఆ డ్రైవరువద్దనుంచి తీసుకొని డబ్బా చేతపుచ్చుకొని నింపాదిగా ఇంట్లోకి వెళ్ళింది. తలుపులు వేసిలేవు. నింపాదిగా మేడమీదికి ఎక్కింది. పైన ఒకగదిలో కొన్నిమాటలు వినిపిస్తున్నాయి. ఆగది తలుపులు సగంవరకు మాత్రమే వేశివున్నాయి. నింపాదిగా వెళ్ళి తలుపుప్రక్కనే నుంచుని వారి సంభాషణ వింటోంది.

“జాన్, యీతనికి తెలివివచ్చినతరువాత కొంచెము నీళ్ళియ్యి” అన్నాడు ఆ ఆంగ్లోయిండియన్ జాన్ అనువానితో—అతనికి తెలివొచ్చేవేళయింది.

జాన్ నేనా తమాషాచేస్తూండగా నీవు చూడవలసినది. ఏమిచేశాననుకున్నావు నేను డాక్టర్‌సార్‌వద్ద దొంగిలించిన విషసూదితో యితని భుజంమీద గుచ్చాను. అతిసునాయాసంగా ఎవరికీ తెలియకుండా చేశానా పని. అసరిని యితను బాబుజాలమీద వాలిపోయాడు యీలోపున నే నతనితో కొన్ని ఛలోక్తులు మాట్లాడుతున్నాను. చాల్లా తమాషాగా జరిగింది. ప్రతివాడు నేనాతని స్నేహితుడననుకున్నారు. అతని ప్రక్కనున్న అమ్మాయి ఏదో కాస్త హడావిడిచేసినది కాని అసలు సంగతి తెలియును—ఏదీ అతనిదగ్గరనున్న Purse యీలాయియ్యి అందులో వజ్రమున్నట్లు ఏలా తెలిసిందనుకున్నావ్.

తామస్ చెప్పాడు...అన్నాడు జాన్ ఓహో అయితే రహస్యవిషయాలు వెల్లడిచేయకుండా అతనికి గూడా ఓమారు బుద్ధిచెప్పాలన్నమాట.

యితని కింకా తెలివిరాలా ?

యీ సంభాషణతో రాజ్యానికి సంగతంతా గ్రాహ్యమయింది. కాళ్లు వణకుతూవున్న ధైర్యంతో అక్కడే నుంచుంది యింకా విందామని—

జాన్ యిలాచూడు ఇందులో వజ్రమేది...... ఆ సంచిని గట్టిగా బల్లమీద విసిరిపారేశాడు.

రామూదగ్గరకు వెళ్లి అతన్నిబాగా గుంజాడు.

లే...లే...నీవు మెలుకువగానున్నట్లు నాకు తెలుసును. నాతో తమాషాచేయకు చెప్పు వజ్రమేంచేశావో.

అది నా Purse లో వుంది. అన్నాడా రాము విధిలేక

ఏదీ చూపించమని దానిని మీదపారేశాడు.

యిది నా Purse కాదు రాజ్యానిది అన్నాడు రామూ.

ఆ...లా...గా అయితే పారపడిచాలా తెలివితక్కువపనిచేశామే అని వ్రేలుకరచుకొన్నాడు.

నేను వెళ్లవచ్చునాఅండీ.

వీలులేదు వజ్రంమాట చెపితేనేగాని నిన్నుగుమ్మం దాటి అడుగుపెట్టనివ్వమన్నాడు కోపంతో. రాజ్యానికక్కడా కోపం ఆగటంలేదు. అది తప్పనిసరిగా రామూకి సహాయంచేసే సమయమనుకొంది. నిశ్శబ్దంగా రెండుశెకండ్లు గడిచాయి. హఠాత్తుగా తలుపుతెరువబడింది. లోపలి ముగ్గురు తెల్లబోయారు. ఆంగ్లో

ఇండియన్‌కి భయమెక్కువైంది. తానుపయోగించే మందు రాజ్యం చేతిలోవుంది. ధైర్యంతో వాళ్లు యీమెదగ్గిర దబ్బాను లాగుకొన నుద్యమించారు. మరుక్షణంలోనే నేల కూలారు.

* * *

రాజ్యం తొందరతో ఆబల్లమీద తన Purse ను తీసుకొని రామూ చేయిపట్టుకొని నింపాదిగా దింపి కారులో కూచోపెట్టింది. డ్రైవరు కారును సాగించాడు. రాజ్యం టైముచూసింది 6 గం|| లు దాటింది కారును తిన్నగా జనరల్ పోస్టాఫీసుకు పోనియ్యమని ఆ కవరును అందులో పడేసింది. తక్షణం కారును పోలీసు స్టేషనుకి పట్టించారు. జరిగినదంతా సబ్‌యిన్స్పెక్టరుతో చెప్పింది. తక్షణమే అంతా బయిలుదేరారు, ఆంగ్లోఇండియన్‌ను ఎరస్టుచేయడానికి రాజ్యాన్నికూడా రమ్మన్నారుకాని నేను చదువుకోవాలి రానన్నది.

రోజూ Puzzle result కోసం ఎదురుచూస్తోంది. ఒకనాడొక కవరువచ్చింది. అదివిప్పిచూడగా prize for great puzzle Solvation అనివుంది. తానురాసిన దానికి ఫలితము చేకూరినదిగదా అని సంతోషించింది. తీరా వుత్తరంఅంతా చదివినతర్వాత "ఓహో ఇది ఆంగ్లో ఇండియన్ puzzle solve చేసినందులకా" అంది. అసలు puzzle జవాబుకోసం ఎదురుచూస్తోంది

# అభాగిని

శ్రీమతి మరువాడ లక్ష్మీదేవిగారు

[కిలకిలధ్వనితో యమునానది ప్రవహిస్తూంది. నదీగర్భంలో పెద్దపెద్దఅలలు విజృంభించి యొడ్డునున్న యిసుకశయ్యలతో నాట్యమాడుతున్నై. సౌదామిని తనయుప్రతిభాసౌందర్యాన్ని లోకానికి చూపిస్తూ తనలోతాను గర్విస్తూంది. చంద్రకాంత శిలామయమైన అక్బరుపాదుషా దివ్యభవనాలు సౌదామినీ ప్రసాదం చేత నవ్యకళలతో విరాజిల్లుతున్నై. ఇదేసమయాన్ని ఒకస్త్రీ యమునానదీతీరాన్ని కూర్చుని సలీముభవనాన్ని రెప్ప వేయకుండా తదేకదృష్టితో వీక్షిస్తూంది.]

'విధికృతం గాకపోతే నాతల్లి మసీదు మెట్లపై నెందుకు మరణిస్తుంది. సలీము అదే సమయాన్ని నమాజుకై వచ్చి నాతల్లి శవ మతిగౌరవముతో పూడ్చవలసినదిగా తన సేవకుల కెందు కాజ్ఞాపించాలి! పోనీ, ప్రజాసుఖము వాంఛించు నాతఁడా తెఱఁగున ప్రవర్తించినా, పోవునపుడాతడు నన్నేల పదేపదే చూచుచుపోవలెను? ఆ చూపులు ప్రేమచూపులని నా కపుడే స్ఫురించి యుండినచో—

(సలీము నుద్దేశించి) ప్రభూ! భావి మొగల్ సామ్రాజ్య సింహాసనాసీనుఁడవు. నేనొక నీచకన్యనుగదా! నీకైనను స్ఫురించలేదా యొకనీచవనిత ప్రేమశృంఖలముల దగుల్కొనుట మొగలాయీ యశక్షీణమునకే నని. సలీమ్! నీవు ప్రకృతికి జోహార్ చేశావు. నీ తప్పేమీలేదు. ఇందొకరు చేసినదేమున్నది విధివ్రాతగాకున్న!

సలీము పాఱవేసుకొన్న రత్నాభరణం నాకెందుకు దొఱకాలి! దొఱకినవస్తువు వారొంటరిగనున్న సమయాన్ని నేనెందుకు సాహసించి అర్పించాలి. సమర్పించుట నా విధి, నావిధిని నేను నెఱవేర్చుకొనుచుండగ, సలీము — ఆసలీం — కృతజ్ఞతావందనము లర్పించుటకు బదులుగ నా హస్తాన్ని —

నదీరా — నేనుపుట్టిన పదియవనాఁడు నా జననీజనకులు నా కల్లారుముద్దుగా నిడిన నదీరానామము, అనార్కలీగ అక్బరుపాదుషా నన్నేందుకు మార్చాలి? ఆ అనార్కలీనామముతోనే నాకంత్యదశ ప్రారంభమైనదని సూచించుటయే పాదుషా ఆశయమా!

విధి ప్రేరణముగాకున్న మెహరున్నీసా నాపై నేల కత్తిగట్టాలి! నేను ఆమెయెడ చేసిన అత్యాపచారము - అపరాధము యేమైనవుందా! అబ్బా తలుచుకుంటే దుఃఖం ఆగదు. ఆ అంబరరాజకుమారి కొజ్జాలచే కొట్టించిన కొరడాదెబ్బలు యీనానుపైన శరీరంమీద యెఱ్ఱగా తట్టు తేరింది!! అ సమయాన్ని స్రవించిన రక్తం — అదే సూచనా రాజ్యక్షయానికి!

అక్బర్, నాడు నీ జన్మదినోత్సవ సమయాన్ని నన్నెందుకు నాట్యకర్త్రిగా నియమించాలి. నియమించావనుకో! సర్వమెఱిఁగిన నీవు నాట్యంచేస్తూ తప్పటడుగు వేశానని — అందుకుకారణం — నాట్యం

చేస్తూ నీసుతుని ప్రేమవీక్షణాలతో పరికించానని తప్పుబట్టి నన్నంతఃపురంనుంచి త్రోసి వేస్తావా? అలసినపు డట్టియవస్థకు లోను కాగూడదా!

నేను దాసిని. నీచాంగనను ప్రేమిస్తే నీవంశ మర్యాదలకు గౌరవం నశిస్తుంది. ప్రజలు మొగలాయీ సామ్రాజ్యసింహాసనాసీనులను గౌరవించరు. అగ్బర్! ఔను. నీవు వచించునది నిజమే. నీచజాతి కావు ననే స్వజాతీయ కన్యలవదలి అన్యకాంతల పరిగ్రహించుట. ఈనాటికి నీకు పాదుషా గౌరవము కల్గినదని యెరుగెల్లరును నీచులేనా! కష్టాలలోనున్న నీతండ్రిని ఉమర్కోటప్రభువైన ఉదయసింహుడు ఆదరింపకయుండినచో — ఇపుడు యీవిశాల విశ్వానికి నీవు పాదుషానని చెప్పుకొనగలిగి యుండెడివాడవా! పారసీకరక్తం నా ప్రతి రక్తనాళంలో ప్రవహిస్తూంది. కాలమానం చేతనే నిట్టి నీచస్థితికి వచ్చానుకాని అక్బర్! నీ తాతయైన బాబర్ యీ దేశాన్ని ఆక్రమించి మొగలాయీసామ్రాజ్యం ప్రతిష్ఠించకపూర్వమే దశయందుండెడి వాడో కొంచెం ఆలోచించుకో!!

సలీమ్! నాడు రంగమహల్ సౌధంలో సితారు వాయించుకుంటూ సుఖంగా కూర్చుండియున్నపుడు అంబరరాజకుమారి నన్ను కొరడాలచే కొట్టిస్తూందని విని యెంతపరితపించావు! స్పృహలేని నన్ను నీ ప్రాసాదానికి స్వయముగా మోసుకొని వచ్చి పరిచర్యచేస్తూ ఆ స్థితిలో నీవు నాతో చెప్పిన విషయాలేమైనా జ్ఞాపకాని కున్నాయా! 'మానవనిర్మితాలైన కుల భేధాలు ప్రేమరాజ్య విస్తృతికి నిరోధకాలు ప్రేమ రసవాహినిలో కులపర్వతాలు మధు ఖండాల్లాగ కరగిపోతాయి' అనలేదూనీవు. నేను నీ ప్రేమనాశించే యిన్ని కష్టాలకు లోనగుచున్నాను. తుచ్ఛమైన నీ మొగలాయీ సామ్రాజ్యసింహాసనాన్ని జూచి కాదు. నామీద నీకుదయలేదూ! నీ కింకా విశ్వాసంలేకపోతే యిదుగో యీ ఖడ్గంచేత నా వక్షస్థలం చీల్చి చూడు నీ ప్రణయైక మూర్తిని నాహృదయంలో ప్రతిష్ఠించానో లేదో నీకే తెలుస్తుంది. నీవు నన్ను నిజంగా ప్రేమించావా? లేకపోతే అది మోహావేశమా! ఎన్నిసార్లు నీవు 'పవిత్రప్రేమ' అని అంగీకరించలేదు! ప్రణయమంటే క్షణికమైన ఇంద్రియోన్మాదమనుకున్నావా! బాహ్య సౌందర్యాన్ని జూచుటచే కలిగిన నిషా అనుకున్నావా! ఏదీ అనుకోకపోతే నీవు నిర్వీర్యునిలాగ బానిసలాగ మౌనం వహించావేమి! చూస్తూ—ఊరుకోవడం భావ్యమని నీ అంతరాత్మ అంగీకరిస్తూందా! నీవే చెప్పావు 'బాహ్యసౌందర్యాన్నిదాటి అంతః సౌందర్యాన్ని గుర్తించినపు డుత్పన్నమైన రసావిర్భావమే ప్రణయ'మని సర్వం తెలిసీ కూడా యీ మహత్తరమైన కార్యంలో నీవు అక్బరుమాటల నొదల దాలుస్తున్నావా? నీ వీ విధంగా అన్యాయంగా ప్రవర్తించినా రేపు ప్రపంచం చెప్పకోదూ! మన ప్రణయాన్ని లోకం చెప్పకోనీ చెప్పుకోకపోనీ, నీకోసం నే నెల్లా

పరితపిస్తూన్నదీ నా అంతరాత్మకి తెలియదా! అల్లాకు తెలియదా!! నీకోసం సర్వస్వమూ—వేయేల ప్రాణాలుకూడా అర్పిస్తా. ఆవిషయం నీకూ తెలుసును నా మెత్తనిదేహ మొపుడైతే కొరడాదెబ్బల స్పర్శచే రక్తం స్రవించిందో!

నీవు దానిమ్మమొగ్గల్నియెన్ని పల్లావీ పుష్పాలచేత కప్పాతేనేం దానిమ్మ వృక్షాల్ని నీ వెన్నిసార్లు ముద్దాడితేనేం. క్రియారూపకంగా—

సలీమ్! నీ కేదిగావాలి!

నిశ్చలము, నిర్మలము, నిష్కళంకము, మోక్షసామ్రాజ్యానికి సోపానము—ప్రణయమా!

కాకున్న రక్తమయ సింహాసనమా!

ప్రణయ ప్రపంచంలో యెుండొయల బుజాలపై చేయివేసుకొని పక్షుల కిలకిల ధ్వనులాలకిస్తూ ప్రణయగీతాలు హాయిగా పాడుకుంటూ స్వేచ్ఛగా సుఖంగా బ్రతుకడానికి నీ వంగీకరించవూ!

దేవాలయాలు మసీదులుగా మార్చడం—బలవంతాన హిందువుల్ని ఇస్లాంమతం శాగలింపజేయడం — రాజ్యాలు కొల్లగొట్టడం—యుద్ధాలుచేయడం—నిరపరాధుల్ని నిష్కారణంగా హింసించడం — త్రాగుడు—వేశ్యాలోలత్వము — అభిలషిస్తావా!

సుఖము, శాంతి, ఆనందము తృప్తి — ప్రణయమా!

దుఃఖము, ఆశ, విచారము, క్రోధము, పాపపంకిలము. పాపభూయిష్టము—మొగల్ సామ్రాజ్య సింహాసనమా!

స్వర్గమా! నరకమా!!

సలీం! నీవేది నిర్ణయించినాసరే! నేను దేనికీ నిన్ను ప్రోత్సహించను. నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమించాను. ఆ ప్రేమకోసమే నే నిపుడు జీవాలు త్యజిస్తున్నాను ముందెన్నడో నీవు నన్ను చేపట్టుతావనీ—బహిరంగంగా ప్రేమిస్తావనీ నే నీ కష్టాలు పడుతూ దుర్భరమరణాని కంగీకరించను. నీమీద నాకు రవ్వంతకూడా ఆగ్రహం లేదు. కాని నీ జీవితమధ్యంలో అనార్కలీని విస్మరించకు. అదే నా తుదికోర్కె. అల్లా నిన్ను రక్షిస్తాడు. ఈ అభాగిని కింక శెలవు.

[అనార్కలీ యమునలో పడుతుంది. ఆకసం మేఘావృతమైపోయింది. ఆమె మరణించినదనికాబోలు మేఘకన్యలు కండ్ల తడిపెట్టినై. ఆమె నిర్మల ప్రణయాన్ని చాటుతున్నై ప్రచండంగా ప్రజ్వలిస్తూన్న మెఱపులు ఆమె నిశ్చలప్రేమను సూచిస్తున్నై మేఘాలు తమభయంకరమైన గర్జనలచేత సౌదామినీదేవి మళ్లీ మందహాస వీచికలతో పాడగట్టింది విశాలవిశ్వానికి అనార్కలీ మరణించలేదన్నట్లుగా]

# బలము కాడ్లివరాయిలులో వుంది

## స్కాట్సు ఎమల్షనులో

## అంతకు 3 రెట్లెక్కువ వుంది



దేహానికి బలము రావలెనంటే, అందులోనూ జబ్బుబడి లేచినతరువాత బలవృద్ధి శీఘ్రముగా కావాలంటే కాడ్లివరాయిలుకంటె మంచి మందు లేదనే డాక్టర్లు చెపుతారు. దానినిండా ఎ. డి. వైటమినులుండి దేహానికి పెంపు పుష్టికూడా యిస్తవి.

కాని శుద్ధ కాడ్లివరాయిలును త్రాగి అరగించుకోవడం చాలా మందికి కష్టం. స్కాటుచేసిన యీ ఎమల్షనువల్ల అది చాలావరకుమారి అందరికీ సులభముగా జీర్ణమవుతున్నది. దీనివల్ల దానిగుణములా చెడవు. జీర్ణశక్తి యూ హెచ్చును. పైగా లైము, సోడాకూడా చేర్పుటవలన దానికంటె మూడురెట్లెక్కువ గుణముకూడా కలుగుతుంది.

### బలిష్ఠమగు రోగనివారిణి.

దౌర్బల్యంపోయి బలంగా ఆరోగ్యంగా ఉన్నప్పుడైనాసరే. జన్మంలో ఏజబ్బూలేకుండా బాగుండాలంటే యీఎమల్షనే తగినది. రక్తము వృద్ధిఅవుతుంది. నరములు బలపడుతవి. ఎంతకష్టపడినా. ఎటువంట శీతాతపములైనా శరీరానికొక్కరవ్వ ఆయాసం కలగనీయదు. డాక్టర్లు అగ్వైద్యశ్లాయను దీనిని సిపార్సు చేస్తున్నారు.

స్కాట్సు ఎమల్షను

సాదా కాడులివరు ఆయిలుకంటె 3 రెట్లధికగుణమిచ్చును. రొమికలనుమాంసమును కండలనుతీర్చి పెంచును. నరములకుపుష్టినిచ్చును. రక్తవృద్ధిని కలుగజేయును. రోగములు రాకుండా కాచుకుంటకు తగిన శక్తి నిచ్చును.



# SCOTT'S
# Emulsion

మాండీవర్తకులు:

ఇంపీరియలు కెమికలు ఇం
డ్రీస్ (ఇండియా) లిమిటెడ
కలకత్తా, బొంబాయి, మదరాస
లాహోరు, రంగూన్, కొలంబ
కాన్పూరు, పాట్నా, అహమ్మ
బాదు, కొచ్చిన్, కాలికట
విశాఖపట్టణం, కరాచి, అమ

# అబిసీనియా చరిత్ర

చదువుల రామచంద్రయ్యగారు

"అబిసీనియా అనాగరికులకును క్రూరులకు నివాసస్థానము. నాగరికులమైన మనము దానిని స్వాధీనము జేసికొని వారిని చక్కజేయవలయును" అని ముసోలిని గంభీరముగ చాటుచున్నాడు. "నాగరికతగల దేశములన్నియుగూడ జేరి ఈపట్టున శాంతిని గలిగింపజాలక పోవునేని, ముసోలినీ భల్లూకపుపట్టును విడిపింపజాలరేని, యుద్ధము తప్పదేని, మేము మమ్ము గాపాడుకొనుటకైన వీలు గలుగజేయవలయు"నని, విదేశములు యుద్ధసామగ్రులను అబిసీనియా కంపుటకు నిరాకరించినపుడు రాస్ టఫారి నాగరికతాప్రపంచమును ప్రార్థించెను. ఈ యిరువురి ప్రముఖులమాటలను గమనించి చూచెదమేని ఇందేదేశము నాగరికత జెందినదో చక్కగ ద్యోతకమగుచున్నది. శతాబ్దముల నుండియు నూరుపేరులులేక మారుమూలల ఆఫ్రీకా ఖండమున ఉత్తరభాగమం దణగియుండిన అబిసీనియా నేడు ప్రాచ్యపాశ్చాత్య ప్రపంచములం దన్నిదేశముల దృష్టి యాకర్షించినది. అబిసీనియాసమస్య నేడు ప్రపంచసమస్యయైనది. కారణమెయ్యది?

బ్రహ్మాండమైన ఆఫ్రికాఖండమును శ్వేతజాతులన్నియు ఇంతింతగ కబళింపగా ధైర్యసాహసోత్సాహములచేతనేమి, ప్రకృతి సాయముననేమి వందలకొలది సంవత్సరములుగా తన స్వాతంత్ర్యము గాపాడుచు వారి యాశకింధనముగాక యుండునది అబిసీనియా యొక్కటే. ఏనాడు అనాగరికులగు నల్లజాతులపై శ్వేతజాతులు విజృంభించి వారిని నాగరికులను జేయవలయునని పైకిజెప్పుచు, రాజ్యకాంక్ష, ధనాశలోపల వేధింపగా, అలెగ్జాండరు నల్లజాతులపై దండెత్తి త్రోవజూపెనో, నాటినుండియు యతనివంటి మహాత్ములు పెక్కుమంది దానిని గు. చ. తప్పక ఆచరించుచునే యున్నారు. తన్మూలముననే నల్లజాతులన్నియు కొంచెమెచ్చుతక్కువగ శ్వేతజాతుల ప్రాబల్యమునకు తాళజాలక లోబడియెను. నల్లవారికి తగిన నాగరికత నేర్పవలయుననియే శ్వేతజాతుల ముఖ్యాభిప్రాయమైనట్లు గనపడుచున్నది. కాని వారట్లాక్రమించిన ప్రాచ్యదేశీయుల కెంతవఱకు నాగరీకత నేర్పిరో, ఎంత ముందునకు దీసికొనివచ్చిరో, ఎంత భాగ్యవంతులను జేసిరో ప్రపంచమెఱుగనిది గాదు; తుదకు వారుగూడ దాని నెఱుంగకపోలేదు.

అబిసీనియా నల్లజాతివారి దేశమగుటయే ఈ యలజడికంతయు కారణము. పైగా స్వాతంత్ర్యమును గాపాడుకొనుచున్నది. అచ్చటచ్చట అనాగరీకులు చుట్టుపట్టున నున్నవారిని బాధించినారు. పెక్కుసాధనసంపత్తి యుండియు, పరిశ్రమలందు, వ్యాపారమునందు ముందునకు రాజాలకున్నది. ఇటలీ యన్ననో శ్వేతజాతి; నాగరీకతకు వేలకొలది సంవత్సరములుగా పేరుగాంచినది. బలవంతమైనదీ; దానికి నల్లజాతులను తమస్వాధీనమునకు దెచ్చుకొని నాగరీకులను జేయుటకు హక్కున్నది. అబిసీనియాకదియిష్టము లేకుండ నుండవచ్చును. ప్రపంచమంతయు నది యకార్యమనవచ్చును. తుదకు కోపించి కొందరు ఇటలీని ప్రతిఘటించి అబిసీనియాకు సాయముగూడ జేయవచ్చును. కాని ఇటలీ బలంతముగనైన అబిసీనియాను లోబడునట్లు జేసుకొని నాగరకత వ్యాపించునట్లు జూచుట తప్పనిసరియైయున్నది. ఇదంతయు గమనించినవారికిట నేదేశము నిజముగ నాగరీకత జెందినదో యెఱుంగనగు. ఇతరులజోలికి పోక, తన

స్వాతంత్ర్యము నితరుల దురాశకు ఒప్పజెప్పక, ఒకవేళ యుద్ధము తటస్థింపనున్నను హృదయపూర్వకశాంతికై సకలప్రయత్నము చేసిన దేశమున నాగరకత గలదా! లేక నాగరకతగలదని విఱ్ఱవీగుచు, దురాశచే లేనికారణములుగల్పించుకొని ఇతరుల నన్యాయముగ లోబరుచుకొనసెంచి, వేల, లక్షణలకొలది ధనమునకును తోడి సోదరుల వినాశమునకు లెక్కింపక ఇతరులమాట చెడ చెవినిపెట్టు దేశము నాగరికత జెందినదా? దీనికి ప్రపంచము ఉత్తర మివ్వగలదు. ఇట్టి సమయములందు బలవంతమగు పాశ్చాత్యదేశమును దిట్టముగ నెదుర్కొన సంసిద్ధముగనుండునట్టి నల్లజాతుల దేశమును గురించి పాఠకులు కొంచమెఱుంగుట మంచిది.

నైసర్గిక పరిస్థితులు :—

అబిసీనియా ఆఫ్రికాఖండమున తూర్పుభాగమున నున్నది. తూర్పున ఇటలీ సోమలిలాండును, పడమట సుడాను ఈజిప్టు దేశములును, ఉత్తరమున బ్రిటిషు తూర్పు ఆఫ్రికా సరిహద్దులుగా నున్నవి. ఈరాజ్యము మూడు ముఖ్యభాగములుగను తొమ్మిది రాజ్యభాగములుగను విభజింపబడియున్నది. దీనివైశాల్యము 3,50,000 చదరపుమైళ్లు. దేశమంతయు కొండలు నిండియుండును. కొంతభాగము ఎడారి ప్రదేశములతో గూడ గలవు. కాని సస్యశ్యామలములగు ప్రదేశములు లేకపోలేదు. బంగారు, రాగి, మొదలగు లోహపు గనులున్నవి. వ్యవసాయమున కుపయోగించు నదులును సరోవరములును గూడ పెక్కుగలవు. ఎండలు విశేషము. ఉష్ణము కొన్నిస్థలములయందు భరింపరాకయుండి 160 డిగ్రీలకుగూడ పైకిపోవుటగలదు.

ఈ దేశమున ముఖ్యమగు పరిశ్రమ వ్యవసాయమైనను, ప్రత్తి కాఫీ విశేషముగ బండుచున్నవి. కొంచెము పరిస్థితుల బాగుజేసినచో పంటలు దివ్యముగ బండు సూచనలుగలవు. చెఱుకు ఖర్జూరము, ద్రాక్ష, జొన్న, గోధుములు, పొగాకు మొదలగు పంటలేగాక, చర్మములు మొదలగునవి తయారు చేయబడుచున్నను ఎగుమతులు చాలతక్కువ.

దేశమంతయు ప్రయాణసౌకర్యములకు మార్గములు లేవు. జిబుటినుండి రాజధానియగు అడిస్ అబాబా వఱకు రైలుమార్గముగలదు. రాజధానిచుట్టు కొంత వఱకు బాటలుగలవు. ఇతరచోట్ల కొండమార్గములే. కాని ముఖ్యపట్టణములగు హరార్ జిబుటి మొదలగు పట్టణములకు టెలిగ్రాఫ్, టెలిఫోన్ సౌకర్యములు గలవు.

ప్రజలు:—

ఇపుడు ప్రపంచమంతయు, అందుముఖ్యముగ ఇటలీ దేశము చాటించుచున్నంతటి యనాగరికులును, క్రూరులును నగు వివిధజాతులు అబిసీనియాయందున్నవారని తలంచుట సత్యేతరము. అచటచట ఇట్టి కొండజాతులు లేకపోలేదు. అబిసీనియాయందు పెక్కుజాతు లుండుటయు నిజమే. కాని వారిలో అధికారము చేతియందుంచుకొని దేశమును పాలించువారు 15,00,000 గలరు. ఈదేశపు జనాభా 80 లక్షలు.

ముఖ్యమగు వృత్తి వ్యవసాయమని ముందే చెప్పియుంటిమి. నేటివఱకు విద్యావిధానముగాని, ప్రభుత్వ సహాయముగాని లేనందున పరిశ్రమలు వృద్ధినందలేదు; గాని యిపుడు చాలమంది విదేశముల కేగి యందు పారిశ్రామికవిద్యల నభ్యసించి తమదేశమున వివిధపరిశ్రమల స్థాపించియున్నారు. వ్యవసాయము గూడ వృద్ధియగుచున్నది. పూర్వమునుండి పశువుల పెంచుట గొఱ్ఱెలనుమేపుట వంశపారంపర్యముగ వచ్చుచున్నది.

నల్లని శరీరమును నీగ్రోరూపములు గలవారు మొదలు పాశ్చాత్యులకు దీటగునట్టి వారుగూడగలరు. వారు ఎంతకష్టములకుగాని వెనుదీయరు. తమదేశమే వారిని దిట్టముగ జేసినది. వారిది క్రీస్తుమతము. కాని ఆదేశమున అరుగురికొకరుచొప్పున మహమ్మదీయులు గూడ గలరు. వారు తమతమ మతములయెడ ఆసక్తి గల్గియుందురు. క్రీస్తుమతములో వారు చేరియున్నప్పటికి మరి యేయితర క్రీస్తుదేశమునందును లేనట్టి విచిత్ర

వాడుకలును, అభిప్రాయములును వారికి గలవు. రాజధానియందున్న 'అబూనా' అని పిలువబడు క్రీస్తు మతాధికారి తానెక్కువ మహాత్మ్యము గలవాడ ననుకొనుటయేగాక ప్రజలపై నమియుటే యతని యాశీర్వాదమని యెంచును.

ఈదేశమున గృహములన్నియు మట్టితో నిర్మించికొందురు. ముఖ్యపట్టణమగు అడిస్ అబాబాయందలి రాచనగరుగూడ మట్టితో నిర్మింపబడినదే. సాధారణ ప్రజలందరు శుభ్రముగనుండరు. స్నానమరుదు. తలలపై నూనెరాచుకొని దానిపై పెరుగు పెట్టియుంతురు. మూడు నాలుగు మాసములకుగాని దానిని శుభ్రపరచరు. విద్య యెచటనో గాని కానరాదు. వారు దాని గమనించుటగూడ అరుదుగనే యున్నది. నాగరికతగల ప్రపంచము నూతనవస్తువులతో నూతననిర్మాణములతో ముందు సాగుచున్నను, భారతదేశమున కుగ్రామ నివాసులవలె వారేమియు గమనింపక తమ పురాతనపద్ధతులను వీడక తమజీవితముల సుఖముగ గడుపుకొనుచున్నారు.

చరిత్ర:—

ప్రపంచచరిత్రయందు అబిసీనియానుగురించిన సమాచారమేమియు లేదు. ఉన్నను ఇపుడు తెలిసికొనుటకాధారము లేమియులేవు. క్రీ. శ. మూడవశతాబ్దియందే అబిసీనియనులు క్రీస్తుమతావలంబకులైరిగాని క్రమక్రమముగ వారు మహమ్మదీయ ప్రపంచముచే నావరింపబడి క్రీస్తుమతావలంబకులైన ఇతరదేశీయులతో నెక్కువసంబంధము లేకుండిరి. ఆదినుండియు ఈదేశము అంతఃకలహములు, యుద్ధములచే నిండియుండినట్లు దెలియుచున్నది. కాని అపుడపుడు ఉత్తమపురుషులు, ధైర్యశాలులు వీరులు అచ్చటచ్చట బయలుదేరి దేశారిష్టములబాపి, ప్రజలకు శాంతిచేకూర్చి విదేశస్థుల నెదుర్కొని పారద్రోలినవారు లేకపోలేదు. వారు మతముకొఱకై యెంతయో పాటుపడినారు. అనాగరికత ఇట్టికార్యముల జేయింపజాలదు.

అట్టి సుప్రసిద్ధపురుషులలో మూడవ థియడోర్ ముఖ్యుడు. అతడు 19-వ శతాబ్దిమధ్యము చిన్నచిన్న రాజులజయించి రాజ్యమును గొప్పజేసెను. కాని బ్రిటీషువారాదేశముపై దండెత్తినపు డాత్మహత్య గావించుకొనియెను. అతనితరువాత నెన్నదగినవాడు నాల్గవజాన్. అతడు రాజ్యమును మంచిస్థితికి దెచ్చెను. అతనికాలమున తనపై నెత్తివచ్చిన పాశ్చాత్యులను జయించుటేగాక, ఓడవ్యాపారవిషయమై జనించిన పగవలన యిటలీదేశము తనపైకి సైన్యముబంపగా 1887-వ సంవత్సరమున దానిని సంపూర్ణముగ రూపుమాపెను. ఆసంపూర్ణవినాశమే ఇటలీదేశీయుల హృదయమున నేడు ప్రజ్వలించునది. జాన్ అనంతరము మెనలెక్ రాజయ్యెను. ఈతనికాలమునగూడ ఇటలీతో పోరాటమొనగూడెను. 1896-వ సంవత్సరము మార్చి మొదటితేదిని మునుపటికంటె భయంకరమగు ఓటమి వినాశము ఇటాలియనులకు గల్గెను. ఈత డితర దేశములయెడ స్నేహితము జూపించుచుండెను. ఈ విజయముగల్గిన తరువాత ప్రపంచము గనులుదెరచెను. నల్లజాతియందు పాశ్చాత్యులను మించువారిపుడుగూడ నున్నారనువిషయము ప్రపంచమునకంతయు దెలియవచ్చెను. ప్రదేశములు తమ రాయబారులను అచటికి పంపుట కారంభించెను.

మెనలెక్ అనంతరము అంతఃకలహములుజరిగి తరువాత అతని మనుమరాలు రాణిగను ప్రస్తుత చక్రవర్తియగు రాస్ టఫారి ఆమెకు సంరక్షకుడుగను నియంపబడి అంత్యమున నాతడే చక్రవర్తియయ్యెను.

రాస్‌టఫారి: దేశాభివృద్ధి.

"పట్టుదలయందును, తన శక్తిసామర్థ్యములను మంచి కుపయోగించుటకును రాస్ టఫారి వంటి చక్రవర్తి యిప్పటి ప్రపంచమున గానరా"దని దీనబంధు ఆండ్రూస్ గారనిన దానిలో నతిశయోక్తి యేమియులేదు. తా నేదినము చక్రవర్తియయ్యెనో

నాటినుండియే దేశమును అభివృద్ధికి దెచ్చుమార్గము లాలోచింప నారంభించెను. విద్యాభివృద్ధికై చాల పాటుపడెను. పరిశ్రమల నభివృద్ధిజేయుటకు మిగుల పాటుపడెను. విదేశములనుండి వివిధవిషయములందు ప్రవీణులగు వారినిబిలిపించి తనదేశమున వారిమూలమున సైన్యమునకు సుశిక్షణ యొసంగెను; పెక్కుయంత్రములను స్థాపించెను; వ్యవసాయము పరిశ్రమలు నూతన యంత్రసాయమున నూతనపద్ధతుల ననుసరించి ముందునకు దెచ్చెను. ఎవరితోడను గాని విరోధభావమును వీడి అంతర్జాతీయసమితియందు సభ్యుడుగ జేరి అందరి యెడ సఖ్యతచాటించెను. అంతఃకల్లోలముల పూర్తిగ నడుగంటజేసి, తనయుదారతచే తనప్రజలను సామంతులను జయించెను. ఇపుడు వారతనికొరకై ప్రాణములనైన విడువ సిద్ధముగనున్నారు.

ప్రకృతపు యుద్ధభీతికి కారణము:—

అపుడపుడు అబిసీనియాను కబళింపజేసిన ప్రయత్నములన్నియు విఫలములయ్యె. సమయమెఱింగి యెపుడో యొకమారు దానిని 'గుటకాయస్వాహా' చేయవలయునని ఇటలీ కాచుకొనియుండినది. కాచుకొనియేయున్న వారలకు కారణములు కరువగునా? రాజ్యలోభకము ధనాశ వీనికిపైపెచ్చుగ అబిసీనియా అనాగరికజాతి దానిని తమస్వాధీనమునకు దెచ్చుకొని యభివృద్ధిజేయుటకు శ్వేతజాతులకు హక్కుగలదు అనునవి ముఖ్యకారణములు. ఇవన్నియు నిట్లుండ దురదృష్టవశాత్తున 'ఉల్ ఉల్' అనుచోట ఇటలీ సైనికులకును అబిసీనియా సైనికులకును యొక చిన్న సంఘర్షణ జరిగెను. అందులో కొందరు ఇటలీ సైనికులు చనిపోయిరి. కారణముకై కాచుకొనియున్న ఇటలీనియంత వెంటనే అబిసీనియాపై కుయుక ప్రయత్నించెను. కాని అబిసీనియామాత్రము శాంతినిగోరి పై సంఘర్షణమూలమున ఇటలీకిగలిగిన నష్టమును గట్టి యిచ్చుటకు సిద్ధపడెను; గాని ముసోలినీ యొప్ప దయ్యెను. అంతట అబిసీనియా ఈ విషయమై అంతర్జాతీయసమితికి దెలిపి శాంతియుతముగ దీనిని పరిష్కరింప ప్రార్థించెను. ఆ సమితి సూచించినదానికిగూడ ముసోలినీ యొప్పక అబిసీనియా తనకు స్వాధీనపడినగాని యుద్ధము తప్పదని పట్టుబట్టి కూర్చొని యున్నాడు. అబిసీనియా శాంతికై ప్రార్థనలు సలుపుచున్నది. అంతర్జాతీయసమితిపై పూర్తిగ నాధారపడి యుద్ధము రాకుండ జూడమని వేడుచున్నది; ముసోలినీ తనపై ఆక్రమముగ దూకుచో, అంతర్జాతీయనిబంధనల ననుసరించి సమితిసభ్యులు తనకు సాయముచేయవలయునని వాంఛించినది గాని ముసోలినీ పట్టు వదలించుటకు సమితికి సాధ్యముగాకున్నది. తుదకాతడు సమితినే యెదిరించుచున్నాడు. సమితియన్ననో తన నిబంధనల నిట్టిసమయములందైనను కార్యరూపము దాల్పజేయుటకు వెనుకాడుచున్నది. ఇక అబిసీనియా గతియేమి?

భవిష్యత్తు:—

అబిసీనియాకు నవీనయుద్ధ మారణోపాయములు దెలియవు; తత్సంబంధమగు యుద్ధసామగ్రి తక్కువ; కొనెదమన్న యితరదేశీయులు వస్తువుల నంపుటలేదు; కాని సమయమువచ్చుచో 10 లక్షల సైనికులు తమ ప్రాణములకుతెగించి పోరాడుటకు సిద్ధముగనున్నారు. వీని యన్నిటికంటెను అత్యద్భుతవిషయ మింకొకటి గలదు. యుద్ధము రాకుండుటకై అబిసీనియాకు స్త్రీలు జేసినప్రయత్నములు శ్లాఘనీయములు. అబిసీనియా రాణి పదునారుదినములు శాంతిగోరి యుపవసించినది. ప్రతివారును శాంతినిగోరినారు. కాని అది నిష్ఫలమని తేలగ వెంటనే వీరాంగనలయి విజృంభించినారు. ఖర్చులకు గావలసిన లక్షల ధనమును చందాలమూలమున వసూలుచేయుచున్నారు. యుద్ధమువచ్చిన తోడ్పడుటకు వేలకొలది స్త్రీమూర్తులు సిద్ధమైయున్నారు; ఇంకను సిద్ధమగుచున్నారు.

ఇక ఇటలీయన్ననో తండోపతండములుగ మారణయంత్రములను సైనికులను ఆఫ్రికాకు పంపుచున్నది. శాంతికై ఇతరులు జెప్పెడుమాటలు ముసోలినీ పెడచెవిని పెట్టుచున్నాడు. ఎవ్విధముననైన అబిసీనియా నాక్రమింప సంసిద్ధుడైయున్నాడు. అబిసీనియాకు నైసర్గికబలము దైవబలమున్నది. ప్రపంచమంతయు తన యెడ సానుభూతి జూపుచున్నది. ఇటలీచేతలను గర్హించుచున్నది. కాని యుద్ధముతప్పనిచో ఎవరు గెలుతురో నిశ్చయింప వీలులేదు. ఐన "యతోధర్మస్తతోజయః" గదా! ఇటలీ యుద్ధమూలమునగలుగు వినాశమును గమనించి, శాంతి నెలకొల్పుటకు ప్రయత్నించుగాక! శాంతి నెలకొల్ప తదితర నాగరికదేశములన్నియు ప్రయత్నించుగాక!

# పండుగ ఉత్సాహములు

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

పార్వతి, సుశీల యిరుగుపొరుగు గృహిణులు; ఆబాల్యస్నేహితులు; పైగా జన్మావధి వదలని దృఢస్నేహబంధము వృద్ధిపొందే లాగున, వివాహమైనదిలగాయితు యొక యూరనే ప్రవేశము. అందునను యొక దిక్కుననే నివాసము. ఇరువురుకూడ ప్రాత చదువులు చదివిన జాతీయవాదినులేకాని, నవనాగరికులు కారు. అందుచే, వారి చేష్టలు, మాటలు యొక్క త్రోవనే పోవుచుండెను.

అయితే, అదృష్ట మందరిహక్కు గనుకనా? అందులో పార్వతిభర్త యుద్యోగి. సుశీలభర్త నిరుద్యోగి. అందుచే భాగ్యములో తేడా కాని మనస్సులలో లేదు. ఉన్న ఆవిడ పదిచేసుకొని తిని పట్టుబట్టలు కట్టుకుంటే లేనియామె, యొక్కదానితోను నూలుబట్టతోను సంతృప్తివహించి బ్రతుకును. అంటే అసూయాపరుల మాటకాదు. ఆశాపరుల తీరుకాదు. తృప్తి, సహనము, వివేకము, హృదయనిర్మలము కల, సుశీల విషయమట్లుగాక, సంతుష్టికలదగుటచే, నేవెలితియు బొందక మగనిని లేదని వీథిబెట్టక, దీనత్వము గనబర్చక, లేకితనము లేకుండా కడుయోర్పున సంసారము గుట్టుగా వెళ్లబుచ్చుకొనుచుండెను.

పార్వతికి సంతానము మెండు. సుశీలకు లేదు. అందుచే పార్వతిగారింట, నిత్యకళ్యాణము పచ్చతోరణము కలిగి, బారసాలో, అన్నప్రాశనో, పుట్టువెంట్రుకల సంబరమో, అక్షరాభ్యాసమో, వడుగో, పెళ్లో, రజస్వల వేడుకో యేదోవొక శుభకార్యము జరుగుచునేయుండును. సుశీలకందుమెండగు పాలేకదా (భాగమేకదా) సుశీల తనకు లేకపోయెనేయని కించిత్తైన తలంపెరుగదు.

తన చెలియింట జరుగు మహోత్సవములన్నియు, తనయింటివానివలెనే, సమస్తమునకుఁదోడ్పడుచు, పార్వతికి కుడిభుజమై మెలగుచుండెను.

ఓర్వలేనివారికి, ఒకరినిచూచి సహింపలేకపోతే యొకకన్నును, తనకులేదనియేడిస్తే యొకకన్నును బోయినదట. ఆలాగాక ఆనందహృదయినియగు సుశీల యొకరి శుభసంపత్తుల కానందించునదే కాన ఆమె యానందమునకు ఫలమనగ, భగవంతుఁడు మెచ్చి యామెకొక కూతురిని, యొక కుమారుని ప్రసాదించెను. దానితో నామె బ్రహ్మానందమందెను. లేకలేక కల్గిన తన చెలిబిడ్డలను, పార్వతి, తన అంతస్తుకుదగినటుల యలంకరించుచు, తనయుదారత్వముకూడ బహిరంగపరచుచుండెను.

తల్లిచాలు బిడ్డలు గనుకనే, వారిబిడ్డలు దుకూలాంబరములతోటిన్ని, సుశీలబిడ్డలు, దేశీయబట్టలతోటిన్ని తృప్తిపడి స్నేహభావమున మెలగుచుండిరి.

ఇట్లుగా కొంతకాలము గడచుసర్కి, సుశీలకుమార్తె పదునాల్గవయేట యను కూలవరునికి వివాహముచేయబడెను. నిర్ధనుడైనా కట్నములియ్యక తప్పని యిక్కాలమున, వారికుటుంబ మీాబరువునకు క్రుంగిపోయెను. ఉన్న భూమియమ్మి కట్నమున్ను, సుశీలవొంటిగుల్లలమ్మి పెళ్లియు చేసి గెలిచిరి; కాని తదుపరి వేడుకలుసాగు టెట్లు? సుశీల భర్త తడిమన్ను పొడిమన్నయేలాగ యుద్యోగాభిలాషచే తిరుగుచున్న కానీ లేని బ్రాహ్మణుడగుటచేతను, గవర్నమెంటువారే తమకుపయోగించులాగున కొన్ని డిపార్టుమెంటుల కధికజీతము లెచ్చుచేసి, కొందరిని తీసివేసి, కొందరికి రెండు పనులుగుణింపనిచ్చి, కొన్ని చిన్నభాగాలు పెద్దభాగలలో కలిపేసిన లెక్కల తారుమార్లచేతను, మధ్యఅధికార్ల నిరాదరణల చేతను, లంచగొండుల దురాశలచేతను, కాళ్లరుగుటయేగాని, కాసు జీతముగల యుద్యోగము లభించలేదు. కాని కడుపు కట్టుకొనలేముకదా? ఇదివరకంటే, ఆలు మగలే కాన, ఆటలు సాగినవి. ఇప్పుడిద్దరు ముద్దుబిడ్డలుకూడ కలిగారు. వారికోర్కెలు తీర్చుటెట్లు. వీరిస్థితి చెప్పకయే తెలిసిన పార్వతి, పండుగ పబ్బములపేరట, చాటుమాటగు సహాయములు చేయుచుండెను.

తనలేమి నెరిగినసుశీల భర్తకు కొంత కూడివచ్చినా వచ్చుటేయని, స్వంతముగా నూలువడికి ఇంటికి సరిపడుబట్టలు నేయించుకొనుచుండెను. చేతిమిషనుపై, తమబట్టలు కుట్టుకొనుచు, గృహిణి కెంతవరకు చేదోడు వాదోడు శక్తియుండునో యంత వరకు సహాయపడుచుండెను. పార్వతి తన పిల్లలకు ప్రయివేటు చదువు చెప్పించునెపమిచ్చి సుశీలభర్తకు, నెలకు పదిరూపాయిలు ముట్టచెప్పుచుండెను.

ఇంతలో దసరాపండుగ సమీాపించెను. పార్వతి యాడపిల్లలలో చిన్నవారు బొమ్మలు పెట్టుకొనవలెనని హడావుడి చేయుచుండిరి. కొంచెము పెద్దలై పెండ్లయినవారు తమభర్తలను పండుగకు తీసుకు వస్తారుకదాయన్న యుత్సాహమున, క్రొత్త క్రొత్త చీరలు కొనుక్కొనియు, పాతవి మార్చి క్రొత్తవస్తువులు చేయించుకొనియు, బాల్యచాపల్య జనితోత్సాహముచే వేషభాషలు నేర్చికొని, సబ్బులు, రిబ్బనులు, మొదలగు షోకువస్తువులు కొనిపించుకొనియు, పెద్దల వేళాకోళములకు చిరులజ్జలు పొందుచు, సంతోషంబున నుండిరి. ఇంకా పెద్దలు, పుట్టినింటికి వెళ్లుదుముకదా— తలిదండ్రుల మధ్యను, అన్న చెల్లెండ్రమధ్యను, స్వతంత్రముగా తిరుగుచు, కష్టసుఖములు చెప్పికొని హృదయభారములు తీర్చుకొని యున్న నాల్గురోజులు గారాబ కాలక్షేపముచేయవచ్చునన్నముదమున, తమవారలు రమ్మన్న యుత్తర

ఎప్పుడువచ్చునా యని యెదురుతెన్నులు చూచుచు, మెల్లిమెల్లిగా పెట్టెలు సర్దుకొనుచు, తమభర్తల నత్తవారింటికేగు ప్రయాణమునకై హెచ్చరించుచు, పండుగోత్సాహములుమనస్సుననేయూహించుకొని తొందరలు పడుచుండిరి. ఇక మగపిల్లలలో పెద్దవారికి స్కూలు సెలవులు. బడిపిల్లలకు గుడికి మేకపోతును తోలుట వంటిదిస్కూలంటే! అందుచే, సెలవంటే వాళ్లకింతింత సరదాకాదు. అన్నిసరదాలు పొందే బాల్యమంటి ప్రాయమున్న, సమస్త సుమ ఫలంబులమరేవసంతఋతువంటి ఋతువును లేదు కదా? ఇచ్ఛా విహారలీలా వినోదానుభవములే బాలురపనికాని, ఇదియుంది లేదు అన్న విచార మావంతయు వారిహృదయములో చోటు బడయదు. నిర్విచార, నిశ్శంక, నిశ్చలపరమాత్మలు బాలురు. అందుచే దసరా సెలవు వచ్చిందంటే, అక్కయ్యలు, బావలు వస్తారు, సంతోషంగా బావలతో కబుర్లు, వాహ్యాళులు, నూతన వస్త్రధారణములు, ఇంట్లో పూజలు, పిండి వంటలు; గానసభలు, ఊరేగింపు ఉత్సవములు, వీటిని తలచుకొనుచు, ఆనంద హృదయులగుచుండిరి. చిన్నపిల్లలు పంతులుగార్లుచెప్పిన, గిలకల పద్యాలతో ఇల్లు పెంకులెగిరిపోవునటులను పెద్దవాళ్లచెవులు గింగురుమనిపించులాగున వల్లె వేయుచు, పనిపాటలుతోచనీయకుండా, గిలకలుపట్టేటప్పుడు కట్టించే బట్టలకొఱకును, మేష్టరుగారికేమిస్తారని, పిల్లలకేమి పెడతారని పెద్దలను విసిగించుచుండిరి.

ఇక మన సుశీలన్నో క్రొత్తఅల్లుని తొలి పండుగే యీ దసరాగాన, తీసుకురాక తప్పదనియు. చిన్నపిల్లవాని గిలకల పండుగకు పంతులను సత్కరించుటెట్లనియు, యాందోళన పడుచుండెను. ఆలాగే తినే తిండి తగ్గించుకొనుచు, అల్లుని నిమిత్తమై కొంతసొమ్ము మిగిల్చుకొనిరి. ఇరుగుపొరుగువారు గొప్పగా బొమ్మలకొలువు పెట్టుకొనుటజూచి, తనబిడ్డ కించవడునేమో యనియెంచి, అప్పుడప్పుడొకరూకచొప్పున కొని బొమ్మలు జాగ్రత్తపెట్టెను. తగినంత జాగ్రత్తతీసికొని, సన్నముగా దారముతీసి అల్లునికొక మంచి జాతీయవస్త్రము నేయించెను. పిల్లలకు నూతనవస్త్రములు తయారు చేయించి దాచెను. తనకొకచీర, భర్తకొక చాపు గిలకలుపట్టించిన పంతులకొక పంచ చొప్పున రాత్రిళ్లుకూడ కష్టపడి నూలువడికి నేయించి దాచియుంచెను.

ఇంతలో ఆశ్వయుజశుద్ధపాడ్యమి వచ్చెను. సుశీలభర్తచే అల్లుని నవరాత్ర్యుత్సవమునకు రమ్మని ప్రార్థనపూర్వకంగా జాబువ్రాయించెను. ఉన్న బొమ్మలన్నియు దీసి, అందముగా నలంకరించి, బిడ్డచే బొమ్మలకొలువు పెట్టించెను. మగబిడ్డకు గిలకలపద్యములు నేర్పెను. ఉన్నంతలో యిల్లలంకరించెను. లడ్డు, కొబ్బరిలస్కొర, మైసూరుపాకము మొదలగు నిలువయుండే పిండివంటల నల్లునికొఱకై ముందేచేసి భద్రపరచెను. వారల్లునికొఱకై యెదురు చూచుచుండిరి. ప్రౌఢబాలికయగుటచే,

భర్తవచ్చువేళల పరికించుచు, ముగ్ధస్వభావముగా, సంతోషహృదయురాలై, సుశీల కుమార్తె యుండెను. ఇంతలో అల్లుడు వచ్చెను. సుశీలయల్లుడతిమంచివాడు విద్యావంతుడు.

ఇక పార్వతి గారి గృహము రాజగృహమువలె ఆనందమందిరమై యుండెను. పరరాష్ట్రింబుల జదువు కొమారులొచ్చిరి. అత్తింటగల కూతులు నల్లురతోగూడ ప్రవేశించిరి. బంధువర్గము కూడిరి. దేవీ నవరాత్రులు చేయుదురుగాన, పాడ్యమినాటి నుండియే వారిల్లు, పూజలతోడను, వేదఘోషలతోడను, వాద్యవిశేషములతోడను, దేవీభాగవత, పురాణ కాలక్షేపములతోడను, కుంకుమాదిక సహస్రనామావళి పూజపునస్కారములతోడను, నిత్యసంతర్పణలతోడను, పలువిధ రుచ్యభోజ్యముల తోడను, మధ్యమధ్య హరికథా గానకాలక్షేపములతోడను. వెండికొండవలెనుండు సౌధమందలి పచ్చని తోరణములందగింప, కలకలలాడుచుండెను. స్త్రీ లూపిరివీడలేనంత పనులలో మున్గియుండిరి. అంతలో వందలాది పిల్లలతో, గిలకలబుక్క కొట్టుచు, పార్వతి చిన్నకుమారు లయ్యవార్లతో నడావుడిచేయుచుండిరి. విలువగల లెక్కింపరాని మేటిబొమ్మల నలంకరించి వాటికారతిచ్చు నెపంబున కుమార్తెలు సాయంకాలమగు సర్కి పేరంట్రాండ్రం బిలచికొని, వడపప్పులు అరటిపళ్లు కొబ్బరి తాంబూలములు పంచుచు, వారిసందడిలో వారుండిరి. పార్వతి అల్లురను సత్కరింపుచు, కూతుండ్రను గారవింపుచు, మామగారి పంక్తిని యిష్టాగోష్టి లోకాభిరామాయణ, పండుగగాథల, మనస్సంకోచములదీర్చికొని యుత్సవకబుర్లతో భుజించు, కూతురల్లుర పతిసంపత్తుల కుప్పొంగుచు, స్వర్గసుఖానంద జీవిత మనుభవింపుచుండెను. ఇంతయైనా తనచెలిని మరువలేదు. వారియల్లుని కూడ యొకనాటివిందుకు బిలిపించి, తమయల్లురతో సమానముగా సత్కరింపజేసి, పట్టువస్త్రముల బహుమానమిచ్చి పంపించెను. ఎరుకపిడికెడు ధనమన్నదబద్ధమా? అందున సత్సంగతి అమితైకయత్నముగల నారీమణుల కొక లోపమునుండదు.

పండుగలకెల్ల పెద్దపండుగలు దసరా, (దశరాత్రి యుత్సవములగుటచే దసరా అనిపేరు). సంకురాత్రి తదుపరివి ఒక్కొక్క రోజుతో సమాప్తమయేవే. పూర్వం క్షత్రియులు శరదృతు ప్రవేశమవగనే, రణదుందుభులు మ్రోగించి, కత్తికతారులు సానబట్టించి, సైన్యమును తరిఫీతుచేయించి, కులదేవతల బూజించి, విజయాకాంక్షులై. సరస్వతి, కాళి, శక్తుల నుపాసించి దశమీ దినంబున, దాడికై పరరాష్ట్రములకు బయలుదేరేవారుట. అర్జునాది పాండవ వీరులు, శమీవృక్షమున యజ్ఞాతవాసమందుంచిన యాయుధముల నాదశమీ దినమున దీసికొని, యంతవరకు తమయాయుధంబుల మరుగుపరచిన శమీవృక్షమును

పూజించుటచేనాదినము శమీపూజాదినము గాను, కుమారస్వామి దానవుల బరిమార్చ సేగు దినములకూడ నీదినములే యగుటచే వీరభద్రసంబరములతోఁటిన్ని మనహిందువు లీ పండుగను సనాతనమునుంచి, కాలక్ర రూపములంతరించినా, క్రియాచిహ్నములచే నిలబెట్టుకొనుచున్నారు. మూలపూజ, సరస్వతీయావాహనము త్రిరాత్రులలో, కాళీశక్తి యావాహనములు ఇట్టుగా నేటేట యీ మూలకారణ వివక్షత లేకపోయినా మనచే నాచరింపబడుచున్నది. పూర్వపు సైన్యము యుద్ధానికి విల్లు అమ్ములు తీసుకొన్నారు. ఇప్పుడు మనబాలురు కర్రగిలకలు తీసికొని, బాణాలకు బదులు బుక్కా పువ్వుశరముల వదలుచున్నారు. వారు రాజ్యకాంక్షులు వీరు ధనకాంక్షులు; వారు జయాభిలాషులు, వీరు శ్రేయోభిలాషులు; వారు శరీరవిముఖులు (యుద్ధసన్నద్ధులుగాన) వీరు శరీరపోషకులు (పిండివంటలు మెక్కి నూతన వస్త్రధారణము, వేడుకలు విలోకించుటయేగాన). ఇట్లుగా మన సనాతన ధర్మములు, చిహ్నమాత్రావశిష్టముగా నిలచియున్నవి. ఇంతకే సంతోషము. (అంటే పరవిద్యావ్యామోహ ప్రభావముచే అసలే నశించకుండుటచే)

ఇంతలో దశమినాటిరాత్రి జరిగే యూరేగింపు యుత్సవము వీక్షించి, ఎవరిండ్లకు వారేగగా, చిన్నబోయినయిండ్లలో, వియోగజనిత భారహృదయులైన, పార్వతి సుశీలలు మిగిలిరి.



## దామోదరుడవే

శ్రీమతి నందివాడ లక్ష్మీ నరసమ్మగారు

సీ॥ ఆలు నిర్వాహకురాలు భూదేవియై,
యఖిలభారకుడను నాఖ్యదెచ్చె।
నిష్టసంపన్నురా, లిందిరభార్యయై, కామి
తార్థుండన్న ఘనతదెచ్చెఁ।
గమలగర్భుఁడు సృష్టికర్త తనూజుడై,
బహుకుటుంబకుడన్న బలిమిదెచ్చెఁ।
గలుషవిధ్వంశిని గంగకుమారియై, పతిత
పావనుడన్న ప్రతిభదెచ్చె
గీ॥ నాంధ్రుబిడ్డలుదెచ్చు ప్రఖ్యాతిగాని, యె
దటినుండియు నీవు దామోదరుడవే......



"గృహలక్ష్మీ పదమునఁ గడు
విహితార్థము తిమిరపటల విధ్వంసమెగా !!"

# మహాత్మా గాంధి

౧౯3౦-వ సంవత్సరము అక్టోబరునెల ఇండియన్ రివ్యూలో ప్రకటితమైన శ్రీమతి జియనెట్టి టాంకిన్సు సతిగారి గీతమునకు అనువాదము.

౧. అవని మానవసార్థకనామదత్తాక్షరసమూహంబులోపల మరుగుపడిన
సత్యహృదయంబు దర్శింప సంతతంబు సలుపుచున్నాడు వ్రతము ప్రశాంతుడతడు.

౨. ఆత్మ దేహంబు తనదైనబంధనంబు సరకుసేయడు వాడొక్క క్షణికమైన
నెత్తురొలికెడిగాయంబు చిత్తమెడలుసోదరావళిజూచియె సోలుగాని.

3. అనదలై క్రుంగుచుండెడి మానవాళిఆర్తనాదంబుగాంచి దయార్ద్రుడగుచు
ప్రాణికోటితరింపంగ ప్రతినబూని తనదుసామర్థ్యమెల్లను ధారపోసె.

౪. మార్గమధ్యాన ప్రబలసామ్రాజ్యమొకటి అడ్డమైనిల్వగా దాని నడచుకొరకు
ఆయుధంబెత్తె—క్రోధమా? కాదు, కాదు, విశ్వమోహనమైత్రి నా ప్రేమమూర్తి.

౫. శత్రువులనైనక్షమియించి సఖులబోలిప్రీతితోడుతలాలించు ప్రియుడతండు
కొట్టు, బంధించు, యసువులగూల్చువాని జాలిజూచును; తాపంబు జాడపోడు.

౬. రక్తసిక్తారుణపథాన రాజ్యమదము సహజనిర్నిరోధవిహార స్వారినెరపు
ధర్మరాజ్యంబుసృజియించెధరణి గాంధి దేశకాలజాతిమతాద్యతీతముగను.

౭. క్షితితలేశులు నిర్మించు శృంఖలములు మైత్రినేవంక నిసుమింత మాన్పలేవు
సృష్టియంతయు కరుణాభిషేచనమున తనదెయౌచుంట గమనించి తనియుచుండు.

౮. విధివిహితమైన చిన్నిపూరింట నిపుడు పశుబలమడంచి రంజిల్లు పరమమైత్రి
అవని పట్టాభిషేకమై యమరునెపుడొ? ఎట్లొ? ఎచ్చోటనో? తడవేల? యంచు
కాచియున్నారు మితిమీరుకాంక్షతోడ మహిని వీడువీడులనుండు మనుజులెల్ల.

గొల్లపూడి సీతారామశాస్త్రి
వినయాశ్రమము.

# పండరినాథుడు — విఠోబా

భారతదేశమున పుణ్యక్షేత్రములు పెక్కుగలవు. ప్రస్తుత బొంబాయి మండలమునగల పండరిక్షేత్రము నెఱుగని భారతీయుడు ముఖ్యముగ దక్షిణ హిందూదేశముననుండడనినచో నది ఆశ్చర్యముగాదు. వేలకొలది యాత్రికులు సంవత్సరము పొడవున నీక్షేత్రమును దర్శించుచుందురు. ఏటేట ఆగస్టు మాసారంభమున లేక జూలై మాసాంతమున జరుగు పండరినాథుని ఉత్సవమునకు లక్షలకొలది జనులు తండోపతండములుగ వత్తురు. ఇచటి దైవము మిగుల ప్రసన్నుడని ప్రతీతి. రుక్మాబాయి ఆయన పత్ని. ఈ విషయములెట్లున్నను ఇచ్చో పండరినాథుడు నెలకొనుటకు కారణముగా జెప్పుకథ చాలా నీతిదాయకమగుటచే నందరు తెలిసికొనదగినది. ప్రతి పుణ్యక్షేత్రమునందును దేవుడు నెలకొనుటకు వేరువేరు కథలు జెప్పుదురు. కాని అవన్నియు, భక్తుల భక్తిని మెచ్చియో, తపస్సునకు మెచ్చియో దేవుడచట నెలకొనెనని చెప్పును గాని యిట్టి ప్రశస్తమగు నీతిని బోధించునవి చాల యరుదు. కథ ఇవ్విధమున గలదు.

పండలియను బ్రాహ్మణుడొకడు ముదుసలులగు తన తలిదండ్రులతోడను, భార్యతోడను కాశికి పయనమయ్యెను. త్రోవయందాతడు భార్యయెడ యెక్కువ శ్రద్ధ జూపుచుండెను గాని తలిదండ్రులయెడ ఇంచుకంతయు ఆదరణ వహింపడయ్యెను. తమ సుతుని చర్య తమకు మిగుల కష్టము గల్గించినను ఆముదుసలులు సుతుని వెంబడించుచునే యుండిరి. ఒకదినము వారందరు పండరిపురమున ఒక బ్రాహ్మణునియింట విడిసిరి. ఆ బ్రాహ్మణుడు మాతాపితలయం దత్యంత శ్రద్ధ జూపుచుండ జూచి, పండలి తాను తన తలిదండ్రులయెడ జేసిన యనాదరణకు చాల నొచ్చుకొనుచు నారాత్రి నిద్రించెను. ఉదయమున మేల్కాంచి తానున్న బ్రాహ్మణునియింట మువ్వురు సుందరులు యింటి పనులు జేయుచుండుట గాంచెను. పండలి వారిని దర్శించి "మీరెవ"రని యడిగెను. వారంతట తాము గంగాయమునాసరస్వతీ దేవతలమనియు, అత్యుత్తముడైన ఆ బ్రాహ్మణ గృహస్థునింట పనులుజేయ వచ్చితిమనియు జెప్పుచు, పండలి పాపాత్ముడనియు, తమ చెంత చేరరాదనియు ముఖము గూడ జూపక వెళ్లిపొమ్మనియు బదులిచ్చిరి. పండలికి విద్యుత్పాతము గల్గినట్లయ్యెను. తన తలిదండ్రులయెడ తానొనరించిన యపరాధమును దలంచుకొని పశ్చాత్తప్తుడయ్యెను. కాశికి వెళ్లి గంగా యమునా సరస్వతీ నదులను దర్శింపమాని అచటనే ఉత్తమ మార్గమున తలిదండ్రుల బూజింప నారంభించెను. ఆతని మాతాపితల నిశ్చలభక్తికి విష్ణువు సంతసించి దర్శనమిచ్చి ధన్యుని జేసెను. ఇట్లు ప్రత్యక్షమైన విష్ణువే ప్రస్తుత పండరినాథుడు.

పుణ్యాసంపాదనార్థమై పెక్కుక్షేత్రముల దిరుగుటకన్నను, మరి పెక్కుకార్యములొనరించుటకుమున్న, తనతోడి మానవుల, అందు ముఖ్యముగ తనను ప్రపంచమున అంతవానిగాజేసిన తలిదండ్రులసేవ ఆదరణ భక్తియే యెక్కుడు ఫలదాయకములనియు దీనినే దైవముగూడ తప్పకసంతసించి ధన్యుల జేయుననియు నీకథ నిదర్శనముగా జూపుచున్నది.

ఈ విఠోబా విగ్రహము శిలానిర్మితమై మూడడుగులయెత్తున్నది. దీనికి రెండు హస్తములున్నవి. విగ్రహము నిలువబడియున్నది. పాదములు భూమిపై బలముగ మోపబడియున్నవి; శరీరమునందెచటను వంపులేక 'సమభంగ' జాతికిజేరిన విగ్రహము లక్షణెందియున్నది. రెండుచేతులు నడుముపై నిలుపబడియున్నవి. శిరస్సు పటమున చూపబడిన రీతి లింగపు గుర్తుగల కిరీటముచే నలంకరింపబడినది.

# విధికృతము

శ్రీమతి అడపా సుగుణమణిగారు

భైరవీనదీప్రాంతమున 'జమరాల్' అను పల్లెఉంది. అందులో సుమారు రెండువందల ఇండ్లున్నవి. ఒకటి రెండు పెంకుటిండ్లుతప్ప, తక్కినవన్నీ పూరిండ్లే. ఆ రెంటిలో ఒకటి ప్రఫుల్లచంద్రుడను పెద్దభూస్వామిది. అతడు బంగాళబ్రాహ్మణుడు. ఐశ్వర్యములోనూ, విద్యలోనూ, అతనికిమించినచేయి మరొకటి ఆపల్లెలో లేదు. ఆగ్రామవాసులంతా అతన్ని గౌరవిస్తుంటారు. ఆఊరిలో, కలహములేవన్నావస్తే తీర్పు కతనిచెంతకు రావలసిందే. అతనిమాటకు వ్యతిరిక్తంగా నడిచేవ్యక్తి నొక్కనినైనను వ్రేలెత్తి చూపించలేము.

అతనిభార్యపేరు నారాయణి. ఆమె పూర్వాచార పరాయణ. అక్షరాభ్యాసమైనను ఎరుంగని అబల. ఆవిడ దైవభక్తీ, పతిభక్తీ, వితరణబుద్ధీ, గల ఒప్పుల కుప్పే కాని ఆమెతల్లి ఆమెకు చిన్ననాటనుండి ఉగ్గుపాలతో నూరిపోసిన మూఢవిశ్వాసాలు, చాదస్తపు ఆచారాలు, నానాటికి ద్విగుణీకృతమైనాయి.

ప్రఫుల్లున కిదంటే తలనొప్పి. అందువల్ల నానాటికి వాళ్ల అన్యోన్యానురాగం క్షీణించింది. తుదకు సంసారంఅంటే అసహ్యంకూడా పుట్టింది. పాపం ఎన్నో విధాల ఆమె మనస్సును మరల్పచూచేడు. కాని నిష్ప్రయోజనమయింది. ఇదంతా విద్యలేకపోవడం వల్ల వచ్చిన వింతపకుత్వం అనుకున్నాడు. ఎన్నోసార్లు "భగవంతుడా, నా కనుకూలదాంపత్యం ఇచ్చేవుకా" వని విధిని దూరేవాడు. అది వట్టి అరణ్యరోదనం అయింది.

సువర్ణ, నారాయణీ ప్రఫుల్లుల ఏకపుత్రి. సార్థక నామధేయ. రూపమునకు రతి. లేకలేకగలుగు సంతతి అవడంచేత తల్లిదండ్రులిద్దరూ అల్లారుముద్దుగా పెంచేరు. ఆమెకూడా తలలో నాలుకవలె మెలగుచుండేది.



నాడు పౌర్ణమి. చంద్రుడు షోడశకళాప్రపూర్ణుడై ఎల్లెడల పిండి ఆరబోసినరీతి వెన్నెలకాయుచున్నాడు. అనంతకోటి నక్షత్రాలు ప్రకాశిస్తున్నాయి. కానీ, వాటికాంతి చంద్రతేజస్సుముందు మరుగుపడ్డది. మందమారుత మల్లనల్లన వీచుచున్నది.

నారాయణి దినమంతయు ఉపవాసమొనర్చి, రాత్రి పూజానంతరమున ఫలహారమొనర్చి, వాకిట వాలు కుర్చీలో కూర్చున్నభర్తకు తాంబూలము తీసుకవచ్చి, ఆ సమీపముననే ఉన్న వేదికపై కూర్చుంది. అప్పుడే 'టంగు టంగు'మని గడియారము తొమ్మిదిగంటలు కొట్టింది. అప్పటికే సువర్ణ గాఢనిద్రాపరవశఅయింది. నారాయణి ప్రసంగవశాత్తు "ఏమండీ, ఎన్నిసార్లు చెప్పినా వినిపించుకోరు. అమ్మాయికి యుక్తవయస్సొచ్చింది. ఇప్పటికింకా పెండ్లిమాటే తలంచరు. మీ కేంపోయింది. మిమల్ని ఎవ్వరూ అడగరు. అడిగే అమ్మలక్కలకందరుకూ సమాధానమిచ్చేసరికి నా బ్రతుకు తెల్లవారిపోతుంది. వచ్చిన సంబంధాలన్నీ తృణీకరించేరాయను. మీరు ప్రయత్నం మొదటికే చెయ్యరు. మరి పెండ్లి ఏలాగవుతుందండి? మీదే భల్లూకపు పట్టుగాని, భట్టుగ్రామసంబంధం కేమి లోటండీ? కుఱ్ఱవాడు రూపసి. ఎఫ్. ఏ. చదువుచున్నాడు. ఇంటికి అతనే అధికారి. సామాన్యస్థితి, తినతిండికి కట్టగుడ్డకు, లోటులేదు గదా. మనఊరికి దగ్గరసాకూడాను. తరచుగా అమ్మాయి వస్తూపోతూ ఉండొచ్చు. లేదా మనం వెళ్లిరావచ్చు. ఏమంటారు? మాటాడరేం?"

అంతసేపూ భార్యా వాగ్ధోరణి వింటూ, ఆమె అమాయికత్వం తలంచుకుంటున్న ప్రఫుల్ ఒక దీర్ఘనిట్టూర్పువిడిచి "ఏమో? ఈ సాంప్రదాయ మట్టే

బాగున్నట్లు నాకు తోచలేదు. వాళ్లు మర్యాదస్థుల వలె కనబడరు. అదిగాక ఇప్పుడేం తొందరవచ్చిందని నీకింత ఆందోళన? మనచిట్టితల్లికింకా పంద్రెండేండ్లు దాటలేదు. అతిబాల్యవివాహాలు చేసినవారిగతి మనం కళ్లార చూస్తున్నాం కదా? అదిగాక నాకింకా అమ్మాయిని కలకత్తాపంపించి పెద్దచదువు చదివించాలనివుంది. ఆమెకు యుక్తవయస్సువచ్చి, ఏయువకునైనను ప్రేమించినట్లు కనబడితే, మనం పెండ్లిచేద్దాం. ఆదే దాంపత్యం. మనకేం పదిమందిపిల్లలు పాకులాడేరు గనుక ఆబరువు దించుకోవాలన్న భయం. కూతురైనా కొడుకైనా ఆమెఒక్కర్తెగా."

"చాల్లెండి. ఎవరైనావింటే నవ్విపోయేరు. పిల్లవరుని వెతుక్కోవడమట, పంద్రెండేండ్లు పెండ్లీడు కాదట. ఆడు దింకాచదువుకోవడమట. మీ ఆలోచనలు మీకేచెల్లేయి. మీవంటి ప్రముఖులంతా బయలుదేరడంవల్లనే విధవపునఃలకు వివాహాలు, విడాకులచట్టాలు, దిగ్విజయంగా సాగుతున్నాయి. మాలఇంగ్లీషుచదువు చదువుకొన్నవాళ్లకు మంచిబుద్ధులెట్లావస్తాయి. అమ్మాయికి, ఈడువచ్చిందికదా. ఆ కాస్తపనీ పెళ్లికాకముందే మనయింట జరిగిందంటే సంఘంమింకా మనను బ్రతుకనిస్తుందీ. ఇరువంశముల వాళ్లం కలకాలంఏడ్చి చావవలసిందే. ఏనా ఇదేమిటండీ; లోకంలో ఎవరూ పిల్లలను కనలేదా? పెళ్లిళ్లు చేయలేదా? ఈ రాద్ధాంతసిద్ధాంతాలు ఎచ్చటనైనా మన్నదా? ఎప్పటికైనా ఆడపిల్ల మరొకఇంటికి వెళ్లవలసిందే. ఇప్పటికే ఊరివారంతా ఈ విషయమై చర్చ ప్రారంభించేరట. ఇంకా ఆలస్యంచేసేవంటే కొంప మునిగిందన్నమాటే."

"సంఘం నన్నేమి పోషించక్కరలే. వెలివేస్తే వేయనీ. ఊరి అమ్మలక్కలంతా చర్చచేసి నాలుకలు తెంపుకోనీ, తలలు పగులకొట్టుకోనీ, నా చిట్టితల్లి నిష్పటమండీ దాస్యాని కప్పచెప్పలేను. నీవింక ఈ ప్రశంస ఎప్పుడూ తలపెట్టకు. పిల్లవివాహంబాధ్యతనాది."

ప్రఫుల్ "దాస్యాని కప్పచెప్పలే"నని అనడంలో అర్థంవుంది. క్రొత్తకోడలింటికివచ్చిందంటే సరి, అత్తగారు వీధిబడిమేస్తరు, తోటికోడండ్రు రాణులు, అవుతారు.

"ఏనాడు నా ముద్దుముక్కలు చేసారుగనుక. నే నెరుగనూ మిమ్మల్ని." అని క్రోధముతో నారాయణి ఇంట్లోనికి వెళ్లిపోయింది. మరి కొంతసేపటివరకు ప్రఫుల్లు దక్షిణ వాలుకుర్చీలో కూర్చొని వినీలాకాశం వంక తదేకధ్యానముతో చూచేడు. పైనేముంది? నక్షత్రాలతనివలె మినుమినుకుమని విచారిస్తున్నాయి. చంద్రుడు తనస్థితినిచూచి నవ్వుచున్నాడు.

౨

శశధరబాబు కలకత్తానివాసి. అతని గృహము రెండంతస్తులది. ఆయనకు హేమాంగిఅను అర్ధాంగి కలదు. ఆ దంపతులకు మువ్వురుపుత్రులు.

ప్రఫుల్, అనివార్యములగు కారణాంతరములచే కలకత్తా వెళ్లవలసివచ్చింది. అచ్చట నెలలతరబడి ఉండవలసిన పనితగిలింది. తనస్నేహితుడగు శశధరుని ఇంటియందే ఉనికి- శశధరుడు తనకు అంతరంగిక మిత్రుడు. ఎన్నిదినము లాతని ఇంటియందున్నను తన కభ్యంతరంలేదు. హేమాంగికూడ అతనియెడ ఘోషాపద్ధతి నవలంబించలేదు. ప్రఫుల్లునకు హేమాంగితోబుట్టువుకాకపోయినను 'అన్నయ్యా' అని సంబోధించడం అలవాటు.

ఒకనాడు సాయంకాలము ప్రఫుల్ ఒంటరిగా వాహ్యాళికై బయలుదేరేడు. మార్గమధ్యమున తనకు చిరపరిచయుడును, జమరాల్ గ్రామనివాసియునగు, మాధవ్ అనువానినిచూచేడు. ఇరువురూ ఒకరికొకరు నమస్కారములు చేసుకొని కుశలప్రశ్నల కారంభించేరు.

# విధికృతము

“ప్రఫుల్లబాబూ, చాలదినములై మనగ్రామంవిడచి వెళ్ళేరు. అప్పటినుండి ఇచ్చటనే యున్నారా?”

“ఆ, చాలా రోజులనుండి ఉంటచే ఇచ్చటనే ఉన్నాను, ఇంకా సుమారు ఒకనెల ఉండవలసి యుంటుంది. మీరేం పనిమీదవచ్చేరా? మనఊరిలో అంతా క్షేమమా”

“నేను కోర్టుపనిమీద వచ్చేను. మనవూరిలో అందరూ క్షేమముగానే యున్నారు. ఇంకా రెండు రోజులుఉండి వెళ్లిపోతాను. ఈమధ్య ఒక్కసారైన మనఊరికి వచ్చేరుకారేం? అన్నట్లు మీఅమ్మాయి వివాహానికికూడా లేదే.”

ఈమాట ప్రఫుల్లునకు పిడుగుపడినట్లైంది. తనువు కంపించింది. తానెక్కడ నున్నది, ఎవరితో మాట్లాడు చున్నదికూడా తెలియలేదు. జమరాల్ గ్రామమంత యు తన కండ్లెదుట కట్టినట్లు కనబడ్డాది. తన కట్టెదుట సువర్ణ మూర్తీభవించింది. భార్య తలంపుకువచ్చింది. ఒడలంతా అగ్నిజ్వాల ప్రజ్వరిల్లింది. ఇంకేమో అడుగ దలచుకున్నాడు గాని నోట మాటరాలేదు.

“ప్రఫుల్లబాబూ, ఏమట్లు తెల్లబోవుచున్నారు? మీకీసంగతి ఇదివరకూ తెలియనట్లున్నదే. పెండ్లిజరిగి అప్పుడే రెండుమాసములు కావచ్చింది.”

ప్రఫుల్ లేనిధైర్యము తెచ్చుకొని, గొంతుసవరించి తొట్రుపాటుతో “మాధవ్, నీవు పొరబడుటలేదు కదా? నాకుమార్తెకు—సువర్ణకు—వివాహమైందా? ఎవరికిచ్చేరు?”

“నే పొరబడుటకు తెలివితప్పియుండలేదు. మీ అమ్మాయి పెండ్లి నేను స్వయముగాచూచేను. భట్టు గ్రామవాసియగు శ్రీ విలాసునకిచ్చేరు. ఏకరాత్రిపెండ్లి మన జగన్నాథాలయములోనే జరిగింది. మీరు రాక పోతే, ఏమో పనిఉండి రాలేదనుకున్నాము.”

ప్రఫుల్లునిమోము వెలవెలబోయింది. ప్రతి రక్తనాళం పొంగింది. ఒడలు గుగుర్పొడిచింది. మారుమాటాడక గృహోన్ముఖుడైనాడు.

అప్పటికి ఇంట శశధరబాబు లేడు. ప్రఫుల్లు తన గదిలోప్రవేశించి మంచముపై పడుకొన్నాడు. మాధవ్ చెప్పిన ప్రతిఅక్షరము జ్ఞప్తికివచ్చింది. యోచనా నిమగ్నుడైనాడు; అప్రయత్నముగా అశ్రువులు రాలుచునే ఉన్నవి.

“నా వరప్రసాది, నా నోములపంట, నాసువర్ణ మరియొకరి సొమ్ము అయింది. నాకింక ఆమెపై ఎట్టిధ మైనహక్కు లేదు. అయ్యో! ఎన్నియోచనలు. కలకత్తా కంపించడం, ఆంగ్లవిద్యనేర్పించడం, అన్నీ మంటగలసేయి. ఆహా! నా చిట్టితల్లి కలకాల మొకరి ఇంట దాస్యము చేయవలసినదేనా? సువర్ణా,సువర్ణా నిన్నెప్పుడైన నాజీవములలో చూడగలుగుదునా? ఈనిర్భాగ్యున కంతపాటి యదృష్టము కూడానా. నారాయణీ, నీవు భార్యవుకావు. నాపాలిటి బ్రహ్మ రాక్షసివి. నిన్నేమిచేసినను పాపములేదు. నాకంత మున జీవములున్నంతవరకు నీముఖముచూచిన ఒట్టు. నీకిదియే తగినశాస్తి” అని ప్రఫుల్లు డింక నేవియో తనలోతాను, పొంగిపొరలి వచ్చుదుఃఖముతో, వితర్కించుకొనుచున్నాడు. కాని అవి అంత స్పష్టముగా పైకి వినబడలేదు.

ఇట్లెంతసేపు గడచినదో ఆయనకు తెలియదు కాని తిరిగిచూచుసరికి ఆగదిలో హేమాంగి నిలుచున్నది.

“అన్నయ్యా, దేహమస్వస్థతగా నున్నదా? డాక్టరును పిలువనంపేదా?” అని హేమాంగి ప్రశ్నించింది.

“అమ్మా, అక్కరలేదు. నాశరీర మస్వస్థతగా లేదు”

“మరేమట్లున్నారు? మనఊరిలో అంతా క్షేమమేనా? మీరు వచ్చినపనికేమీ అంతరాయము లేదు కద?”

ప్రఫుల్ నోట మరి మాటరాలేదు.

ఇంతలో శశధరబా బాగదిలో ప్రవేశించేడు. ప్రఫుల్లునెళురిచూచి దిగ్భ్రమ చెందేడు. కారణం భార్యను అడిగేడు. ఆమెకుమాత్ర మేమి తెలియును?

క్రమము గా జరిగినసంగతంతా ప్రఫుల్లు వారుభయులకు చెప్పేడు. "జరిగినదానికై విచారించిన లాభము లేద"ని శశధరుడు, "ఎవరినుదుట వ్రాసినవ్రాత వారనుభవించి తీరవలసినదే"అని హేమాంగి ఓదార్చేరు. ఏదో ఒకరీతిగా ప్రఫుల్లు, శశధరునిఇంట కాలము గడుపుచున్నాడు. ఈమాయసంసారములో మొదటి రోజుననున్న దుఃఖము మరుచటిదినమున ఉండదుకదా!

3

భట్టుగ్రామం భైరవీనది అవలఒడ్డున నున్నది. 'జమ కాల్'కన్న చిన్నపల్లె. శ్రీవిలాసున దండు సామాన్యగృహము. అతడు తండ్రిని బాల్యముననే గోల్పోయెను. నాటినుండి తల్లిచెప్పు చేతల్లో మెలగు చున్నాడు. అతనికి హైమవతి అను సోదరికలదు. శ్రీ విలాసునకిప్పుడు పందొమ్మిదివత్సరములు. అతని కన్నను హైమవతి ఐదువత్సరములు పెద్ద. హైమవతి రజస్వల కాకపూర్వమే వివాహితయై విధవయై పుట్టింట కూర్చుంది. ఆవిడజవ్వనం అడవికాయు వెన్నెలే.

శ్రీ విలాసుని వివాహమై సంవత్సరం కావచ్చింది. ఇప్పుడు ఇంటరుమీడియట్ రెండవసంవత్సరం చదువు చున్నాడు. శెలవులలో స్వగ్రామమునకు వచ్చేను.

వాళ్ల ఆచారప్రకారము సువర్ణ వివాహమైనది మొదలు అత్తవారింటనేయున్నది. అత్తగారి అదలింపులకు హైమవతి అగచాట్లకులోనై రాత్రింబవళ్లు కష్టపడి పనిచేయుచున్నది. ఎంతకష్టపడినను చీవాట్లు తప్పలేదు. పుట్టింటికి,అత్తింటికి, ఆమెకు సహస్రాంశం భేదం కనబడ్డాది. తలంచినది నెరవేర్చుటకు తండ్రి, అడిగినదిచ్చుటకు అమ్మ, దగ్గరలేరు. ఆమెకు కట్టు బొట్లు మెండు. పుస్తకము ముట్టుకోకూడదు. పగలు పడుకోరాదు. భర్తకు కనబడకూడదట. ఇంటికివచ్చిన అపవాంద్రతో కూడా మాట్లాడరాదు. ప్రతిదానికి అత్తగారి అనుమతికావాలి. హైమవతి చాడీలువిని, ఒకటిరెండుసార్లు సువర్ణకు అత్తగారు చేతితో కూడా బుద్ధి చెప్పేరు. నానాటికి సువర్ణకు అత్తవారిల్లన భయం పుట్టింది.

ఒకనాడు మధ్యాహ్నము భోజనానంతరమున సువర్ణ పత్తితో వత్తులుచేస్తుంది. అత్తగారచ్చటనే చాపమీద పండుకున్నారు కాని నిద్రపోలేదు. హైమవతి తల్లిప్రక్కనే కూర్చొని తీర్థయాత్రలమహాత్యం వర్ణిస్తుంది.

"అమ్మా, జగన్నాధం ఏమిటనుకున్నావు? కలియుగవైకుంఠం. మనిషై పుట్టినందుకు జగన్నాధంవెళ్లి స్వామిని దర్శించాలి. అలాంటివాండ్లకు స్వర్గమేకాని నరక మెన్నటికీ లేదు. పట్టిజగన్నాధంచూచి వెళ్లి పో వస్తే చాలదు. సాక్షిగోపాలునిదర్శించి "స్వామీ, నేను జగన్నాధం వెళ్లి వస్తున్నాను, నీవేసాక్షి"అని చెప్పిరావాలి. ఒకవేళ యముడు పొరపాటున, అలాంటివారిని నరకమునకు తీసుకవెత్తే "ఓయీ; ఈమనిషి జగన్నాధంవెళ్లి స్వామిని దర్శించివచ్చింది, ఇందుకు నేనుసాక్షి; ఈవిడకు స్వర్గానికి హక్కున్నది; విడచిపెట్టు"మని వాదిస్తాడు."

"హైమా, ఇంతవరకెందుకు? కాశీవెళ్లి, గంగానదిలో స్నానంచేసి, విశ్వేశ్వరునిదర్శిస్తే యముడు దగ్గరకురాలేదట."

"అమ్మా, గంగానదివరకు వెళ్తావు. మన భైరవీనది ఏమి తక్కువనుకున్నావా? శ్రీరాములువారు, సీతాలక్ష్మణ సమేతులై దండకారణ్యమునకు వెళ్లేటప్పుడు ఈనదిలో స్నానంచేసి వెళ్లేరట. మనకి దగ్గరగా ఉండడంవల్ల అశ్రద్ధగానీ, రోజూ ఈనదిలో స్నానం చేస్తే చాలు; కాశీరామేశ్వరాలు వెళ్లినట్లే."

ఇంతలో ఒకపల్లకీవచ్చి అగుమ్మంముందు దిగింది. దాని వెంట వచ్చిన మనిషి ద్వారముదగ్గరకువచ్చి "అమ్మా", అని పిలచేడు. సువర్ణ వానినిచూచిన వెంటనే "నందా"అని పిలచింది. నందుడు ప్రఫుల్ల బాబు ఇంట చిన్నతనమునుండీ పనిచేయుచున్న సేవకుడు. సుమారు ఏబదివత్సరముల ప్రాయముంటుంది.

# విధికృతము

“అమ్మా, మీయమ్మగారు నిండా జబ్బుగా ఉన్నారు. కలకత్తాకు టెలిగ్రాముఇస్తే మీతండ్రిగారు ఈరోజుఉదయముననే వచ్చేరు. వైద్యులనుతెప్పించి చూచేరు. గాని బ్రతుకుతుందని ఆశ ఎవ్వరికీలేదు. ఇంట ఆడదక్షతలేదని చోరబిల్లినుండి చిన్నమ్మగారు కూడావచ్చేరు. మీకు అత్తగారువిడువరని ఇంతవరకూ కబురుపంపలేదు. వస్తే మొగముచూస్తారని,బాబుగారు నన్నూ పల్లకీనీ పంపించేరు. అమ్మగారికి తెలివివచ్చినప్పుడెల్లా “నాచిట్టితల్లి వచ్చిందా” అని అడుగుచున్నారు.” అని అంగవస్త్రముతో కండ్లనీళ్లను తుడుచుకున్నాడు.

సువర్ణకీమాటలు మిన్నువిరిగి మీదపడినట్లయింది. నిలువున కూలబడ్డది. “అమ్మా, అమ్మా” అని భోరున ఏడ్చింది.

“ఇదేమిటే, పిల్లలతో వున్నఇంట్లో పీనుగపోయినట్లేడుస్తావు. నోరుముయ్యి, లేదా నోటిమీద వాతలెయ్యగలను. ఎక్కడో దీనమ్మకు జ్వరమట, నిండు ఇంట్లో ఏడుస్తుంది.” అని అత్తగారు నిప్పుత్రొక్కిన కోతివలె గెంతడం మొదలెట్టేరు.

“ఇదెక్కడి చోద్యమమ్మా? రోగాలు మనుష్యులకురాక మ్రానులకు వస్తాయా? జబ్బు వచ్చిన వాళ్లంతా చచ్చిపోతారా? లోకంలో ఈవిడకే తల్లివున్నట్లు ది, మరెవ్వరూ తల్లికడుపున పుట్టలేదు” అని ఆడపడుచు అడిపోసింది.

పాపం సువర్ణ అడకత్తెరలోని పక్క. ఇంతదుఃఖమూ దిగమ్రింగి దీనయై నందునివంక చూచింది.నందుడు నిశ్చేష్టుడై నోట మాటలేక శిలాప్రతిమవలె నిలుచున్నాడు.

“పోరా, నీకెందుకిక్కడ సాతానికవములాగ. ఆపిల్ల రాడానికివీలులేదు. పో,” అని అత్తగారు నందుని తుళ్లగసరేరు. చేయుఃదిలేక, సువర్ణయను మతినిగొని నందుడు పల్లకిని తిరిగితీసుకవెళ్ళిపోయాడు.

శ్రీవిలాసుడు ఇంతసేపూ ప్రక్కగదిలోనే ఉండి ఈవాగ్ఘోరణిఅంతా వింటున్నాడు, కాని ఏమిచేయుగలడు? తల్లిచేతి కీలుబొమ్మ.

రాత్రి భోజనానంతరమున ఎవరిగదులలోనికి వారు వెళ్ళి నిద్రపోయేరు. సువర్ణ అత్తగారిభయము కొలదీ విస్తరిదరికూర్చొని లేచింది. ఒక్కకబళమైనను భక్షించిన పాపాన పోలేదు.

రాత్రి పండ్రెండు గంటలయింది, అంతటా నిశ్శబ్దము. చిమ్మచీకటి. కన్నుమూసినను తెరచినను ఒక్కలాగే ఉంది. శ్రీవిలాసునిఇంట సువర్ణతక్క తక్కిన అందరికీ నిద్రాదేవి ఆవేశమయింది. సువర్ణ తల్లిని తలంచుకొనుచూ ఇంకనూ ఏడ్చుచునేఉన్నది. ఆవిడకు తల్లి కంటికి కట్టినట్లుగా కనుపించుచున్నది. “రా, రమ్మని” పిలుచుచున్నట్లు తోచుచున్నది. సువర్ణ సంధిగ్ధావస్థలో చిక్కుకున్నది; అత్తగారిఆజ్ఞ ఉల్లంఘించి వెళ్ళిపోవడమా? తల్లి మొగము చూడకుండా ఉండడమా?

ఎట్టకేలకు “అమ్మా, అమ్మా, నీముఖముచూడక ఉండలేను” అనిఏడ్చుచు మంచముపైనుండి దిగ్గున లేచింది. ఇంచుకైనను శబ్దముచేయక తలుపుతెఱచుకొని వీధిబడినది. ఆమెకు మనస్సు స్వాధీనముతప్పినది. అప్రయత్నముగా కాళ్లు తీసుకొనిపోవుచున్నవి. తిరిగి వచ్చిన అత్త చీల్చిచంపివేయునని తెలిసి, అర్ధరాత్రమున భైరవీనదినిదాటుట ప్రమాదకరమని ఎఱింగి, ఏమి ఈసువర్ణసాహసము!

(సశేషము)

# విజయదశమీ పర్వదినములు

శ్రీమతి ఆకుండి భూదేవిగారు

## వీర పూజలు

హిందువుల కీవిజయదశమీపర్వదినములు దుర్గ పూజలకును సరస్వతీ పూజలకును పెద్దలచే నిర్ణయింపఁ బడిన పవిత్రదివసములు. వీనినే శరన్నవరాత్రులనియు, శారదరాత్రులనియు వ్యవహరింతురు. శారదయన సరస్వతియనియు పార్వతియనియు నర్థము గలదు. ఋతువా శరత్కాలము. చక్కని వెన్నెలరాత్రులు. "శారదరాత్రు లుజ్జ్వలలసత్తర తారకహారపంక్తుల జ్జారుతరంబులయ్యె."

వర్షములతోఁ గొంతవఱకు విసిగిన జనులు దేవతోత్సవప్రియులై యుందురు. ప్రతిదేశములోను జాతీయ వీరులపూజయు మతమునకు సంబంధించిన దేవతారాధనమును నుత్సవరూపమున పరిణామమందును. ఈ నవరాత్రులలో 'బొమ్మలకొలువుల స్థాపనము' హైందవజాతీయ వీరులప్రతిమలయు, చిత్రకళకు సంబంధించిన మనోహరరచనలయు ప్రదర్శనమే. వీరులయారాధనమే యందలి పరమార్థము. జాతీయ వీరుల ప్రతిమలను, మన హైందవమతమునకు సంబంధించిన దేవతల ప్రతిమలను నొకచోఁ జేర్చి, యవి వ్యర్థప్రతిమలేయను భావనతోగాక మన జాతీయ వీరులును, దేవతలును సంవత్సరమున కొకసారి మన గృహముల కతిథులుగా మనగృహములను పావనము చేయవచ్చి పదిదినములు సాయంకాలములందు కొలువు తీర్చి కూర్చుందురను భావముతో నచట గానకళా వినోదములు వారియెదుట పచరించి చూడవచ్చిన సతులకును బాలబాలికలకును పుష్పములు, ఫలహారములు, చందనతాంబూలాదులు సమర్పించి వారలను పంపుటయు నీశరన్నవరాత్రులలోజరుగు కార్యక్రమమెంత యనుస్యూతమగు నాచారమైనది.

చెన్నపట్టణము, మైసూరు, బెంగుళూరు మొదలైన దక్షిణదేశములలో ననేకపట్టణములందును,పల్లెలందును నీనవరాత్ర్యుత్సవములను గొప్ప యాడంబరముగ జరపింతురు.

విలువిద్యలో గొప్పనేర్పరులగు విలుకాండ్రగు జాతీయవీరులు మనకు గలరని తలపింపఁజేయుటకో యన పల్లెటూళ్లయందు పాఠశాలలందలి బాలబాలికలకు విల్లునమ్ములను వినోదముగ నలంకరింపఁజేసి వానిని వారికిచ్చి యుపాధ్యాయులు శరములతో పూజ్యులపై బుగ్గుండయు పుష్పములను వేయింతురు.

ఈ నవరాత్రులలో యుపాస్యయగు దేవి పార్వతి యగుట యీపర్వదినములను దేవీనవరాత్రములని కూడ చెప్పుదురు.

సంగీతము, సాహిత్యము, విద్యయుఁగలుచు విద్యార్థులు, విద్యార్థినులును సరస్వతిని నెలకొల్పి పూజింతురు. ఎట్లైనను శక్తిస్వరూపిణియైన యుమను, విద్యాదేవతయగు సరస్వతిని కొలుచు దినములుగా నిర్ణయింపఁబడినవే యీనవరాత్రులు. శక్తిస్వరూపిణియైన మృడానిని సేవించిన మనకు దేహమనోశక్తులును సరస్వతిని సేవించిన విద్యయు గల్గుననియే యిట్టిపూజల నెల్లరుఁ జేయుచున్నారు.

వంగదేశీయులు (బంగాళీవారు) కాళికాదేవిని దసరాదివసములలోఁ బూజింతురు.

దుర్గ లోకకంటకుడైన మహిషాసురుడను రాక్షసునితో దొమ్మిదిదినములుపోరి పదియవదినమున నాతని సంహరించెను. అందుచేతనే దుర్గకు మహిషాసురమర్దని యని పేరుగల్గెను. ఇట్టి పూర్వగాథలు కొన్ని గలవు.

ఇట్టి జాతీయమును మతవిషయికమగు నుత్సవమును జరిపి జాతీయవీరులయు వీరనారులయు జయంతుల నీరూపమున జరపియు, దుర్గా సరస్వతుల పూజించి దేహమనోశక్తుల సాధించియు, విద్యనుబడసియు, మన మంతయును ధన్యులమయ్యెదము గాక!




# భారతదేశపు మిక్కిలి చక్కనిసబ్బు
# దీనిని సమస్తకార్యములకు
# నుపయోగించ వచ్చును.



501 బట్టలసబ్బు
దూదివస్త్రములు ఇతరవస్తువులు శుభ్రపరచుటకు



501 స్పెషలు
అద్దకపుబట్టలు సున్నితపు దుస్తులు శుభ్రపరచుటకు



501 సిల్కుఫ్లేకులు
పట్టుమడతలు, తళుకుదుస్తులు మొదలగు మెలుగు దుస్తులను శుభ్రపరచుటకు



501 పరిమళసబ్బు
శరీరసౌందర్యమును నిష్కళంకముగ నుంచుటకు

501 సబ్బులను కొనినచో రకరకములవస్తువులను దుస్తులను, శరీరములను పరిశుభ్రముచేసి సౌందర్యవంతములుగ నొనరింపవచ్చును. ఇది నాలుగురకములుగా తయారుచేయబడినది. మొదటిరకము 501 బట్టలసబ్బు సాధారణముగా ఇంటివస్త్రములను పనిముట్లను శుభ్రము చేసుకొనుటకు, రెండవది 501 స్పెషలు అద్దకపుదుస్తులు మొదలగు వానికొరకు, మూడవది 501 సిల్కుఫ్లేకులు పట్టువస్త్రములకొరకు, నాల్గవది 501 పరిమళసబ్బు అతి సున్నితమైన పదార్థములతో కొంచెము పరిమళముకలిపి వాసించునట్లు తయారుచేయబడినది.

ఈ 501 సబ్బు ఇంత చౌకయైనను ఇంతకంటె పరిశుభ్రతరమైన సబ్బు బజారులో నెక్కడను లేదు.

**501**

**సబ్బు**




టోమ్కో సేల్సు డిపో,
19 ఎ. వాణియన్ వీధి,
మదరాస్.

## ది తాతా ఆయిలుమిల్సు కంపెనీ లిమిటెడ్.

తాతాపురం, బొంబాయి.

# శారదలేఖలు

సౌభాగ్యవతి కల్పలతకు

నెచ్చెలీ! నీవు వ్రాసినలేఖ యందినది. అందు శ్రీమతి దివాకర్ల శారదామణిగారి రెండవలేఖకు నీవు తక్షణమే ప్రత్యుత్తరము వ్రాయవలసినదని నొక్కినొక్కి వ్రాయుట జూడ మిగుల నవ్వువచ్చినది. ఈ విషయమున నీ వెంత పురికొల్పినను నీ ముచ్చట దీర్చుటకు నేను సిద్ధముగాలేను. వివాదవిషయము హిందీ. హిందీ తెలుగుదేశమున వాడుకభాష కాగూడదని యామెవాదన. అది నేనుగూడ యంగీకరించిన విషయమే. రాష్ట్రేతరవ్యవహారోపయోగమునకై హిందీ యావద్భారతీయు లభ్యసింపవలయునని నేను చెప్పితిని; దాని కామెయు నంగీకరించెను. ముఖ్యవివాదవిషయమున నీవిధముగా సమాధాన మేర్పడినవెనుక నిక నామెకు నే నీయవలసిన సమాధాన మేమున్నది? బహుశా నేను గుంటూరుమండలముదాన నైనందుల కామె గావించిన యెత్తిపొడుపులకు, కొన్ని వత్సరములక్రిందట గుంటూరుజిల్లాయందు కొప్పరపు సోదరకవీశ్వరులకును, తిరుపతి వేంకటేశ్వరకవులకును జరిగిన వివాదసందర్భమున నుదయించిన పండిత బ్రువలక్షణము, గీరతము, గుంటూరిసీమ మున్నగు గ్రంథముల ప్రస్తావనకును, అందందు నాకు తగిలి వచ్చునట్లు పొందుపఱుపబడిన పదములు పద్యములు మున్నగువానికిని నేను సమాధానమిచ్చు టగత్యమని నీ యభిప్రాయమేమో, కాని యేవిషయములు నేను సమాధానమీయ తగినవని నీవు భావించుచున్నావో ఆ విషయములే నాకు ప్రత్యుత్తరమీయకుండుటకు మనస్కరింపకుండ జేయుచున్నవి. వ్యక్తిదూషణగా బరిణమించిన నీ యనాగరక వివాదమున నామెతో సమానముగా బోరాడితినన్న పేరుకంటె మిన్నకుంటి ననుమాటయే నాకు ప్రియతమముగ నున్నది. ఆమెకంటె తీవ్రవిమర్శకు గడంగుమని నీవెంత ప్రోత్సహించినను, ఈ వివాదమును పర్వతోపమానముగ బెంచవలయునని శ్రీమతి శారదామణిగారు తమ కలమునకు పదునుబెట్టుకొని యెంత. కుతూహలముగ గూర్చుండినను, మేమెన్నిపుటల దీర్ఘవ్యాసములను వ్రాసినను ప్రచురించుటకు గృహలక్ష్మి యోపిక వహించియుండినను నేనుమాత్రము జబాబు వ్రాయజాలను. పదువత్సరముల నుండి నేను నీకు వ్రాయుచున్న లేఖలను, తదితరానేక వ్యాసములను జూచుచున్న విజ్ఞులగు గృహలక్ష్మిపాఠకులకు నన్నుగూర్చి నేను నచ్చజెప్పుకొనవలయునా కల్పలతా! వలదు. నిర్మలచిత్తవై నెమ్మదిగా నుండుము.

భావపురి
1-10-35

ఇట్లు, మిత్రురాలు
శారద.

# బాలవిజ్ఞానశాఖ

**పాటలు**

## వడ్రంగి — బొమ్మలబీరువా

"బొమ్మల బీరువా చేస్తానంటూ
బొంకి ఆదినము పోయేవే!
రమ్మని యెన్నిసార్లు పిలిచినా
రానానకుండా రావేమి?
"అమ్మా, మనయింట్లోనే పెట్టి
అతివేగముగా చేయించే
బొమ్మలకొలువుల పండుగ లాపై
పోతాయి; యెల్లుండొస్తాయి."
"కమ్మచౌదరికి పందిలిమంచం
కార్తిక మాసాని కివ్వాలి
నెమ్మదిగా మూణ్ణాళ్లైనాను
నిండా పాతిక కాలేదు.
చిలకలు హంసలు పాములు డేగలు
గిలికి కోళ్లపై చెక్కాలి..."
"ఒక్కపూట మా అమ్మాయిపని!
ఒప్పుగ చేసిపోరాదా?"
"నిక్కముగా ఈ సాయంత్రానికి
నే తెస్తాను చూడండి"
"చక్కని బీరువా నిక్కముగా ఈ
సాయంత్రానికి తెస్తావా?
నిక్కమని నీ మాట నమ్ముకొని
నేను ఖులాసా పొందుదునా?"

**కథలు**

## దేవకన్య వలపు

ఆఫ్రికా ఖండమున కుత్తరభాగమున ఈజిప్టుఅనే ఒక దేశమున్నది. ఈ దేశములో అతి పురాతనకాలములో కడు చక్కని నాగరీకత యుండెను. అక్కడ పిరమిడ్లులు అనే పెద్ద స్తంభములను కట్టేవారు. ఆ స్తంభములు స్వర్గము నందుకొనుచున్నవని వారి యూహ. చనిపోవువారిని దహనము చేయుటకాని ప్రాతిపెట్టుటకాని ఆ దేశమున లేకుండెను. ఆ శవములను గుమగుమ వాసనలుకొట్టు పరిమళ రసాయనిక ద్రావకములలో నిలవయుంచువారు.

ఆ దేశస్థు లతిసౌందర్యవంతులు. జరా మరణములుకూడ వారి సౌందర్యములను గాని దేహపుష్టినిగాని గిలుబాడ లేకుండెడివి. రెండు మూడువేల సంవత్సరములు గడచినను ఆ శవములు నేటికిని జీవకళలొడుచు ప్రకాశించుచున్నవి. చనిపోయినవారి జీవములు తిరిగీ యెన్నో తరములు గడచిన తరువాత యెవరిశరీరములలో నవి తిరిగీ దూరగోరుననియు, అంతవరకు ఆ శరీరములు చెక్కుచెదరనీయరాదనియు వారి విశ్వాసము. ఈ విశ్వాసమే వారిచేతన ఇట్టి రసాయనిక ద్రవ్యములను కనిపెట్ట నేర్పినది. అట్టి రసాయనము నెట్టుల కని పెట్టుటయో కూడ అట్టి విశ్వాసము లేని నేటిరసాయన శాస్త్రపండితులకు సాధ్యమ

కాషున్నది. ఆ దేశపురాజులకు ఫేతోఫా అనే బిరుదు గలదు.

ఆ దేశపు బాలురు నేటికిని చెప్పుకొనుచుండు ఒక పుక్కిటి పురాణము కథను మనము చెప్పుకొందాము. అది నిజమా అబద్ధమా అనుచర్చ మనకువద్దు. కథకు కాళ్లేమిటిఅని నలుగురును అననే అనుచున్నారు.

రెండువేల సంవత్సరముల క్రిందట ఆ దేశములో ఒక గ్రామములో ఇద్దరన్నదమ్ములు జీవించుచుండిరి. పెద్దవానిపేరు ఆనపు. రెండవవానిపేరు బీటను. ఆనపునకు మంచి గొడ్లు తెలమంద, ఫలవంతమగు వ్యవసాయభూమి, యెడ్లు, నాగళ్లు ఉండేవి. బీటనుకు ఇట్టివేమియునులేవు. బీటను అతని క్రింద పనిచేయుచుండువాడు. అతనికి భూమి సారమును విత్తుల నాణెమును పోల్చుకొనుశక్తియు, వ్యవసాయముచేయు రక్తియును, పశువులు మొదలగువానితో మాట్లాడను నేర్పును ఉండెడివి. అతనివల్ల తన అన్నగారి వ్యవసాయ మెంతో బాగుగా జరిగి చాలా లాభముకలిగేది. అన్నగారికి అతనంటే ప్రాణము. కాని వదినగారికి అతనంటే అనుమానము. అన్నమనసును విఱచి అతనిని గెంటివేయుట కతనిపై యెన్నో పోటీలు చెప్పేదిఅట.

ఒకదినమున అన్నదమ్ము లిరువురును పొలమునకుపోయిరి. అన్నగారు విత్తనములు తెచ్చుకొనుటనుమఱచిపోయెను. ఇంటికి బోయి వానిని తెమ్మని తమ్మునికిచెప్పెను. తమ్ముడు వెళ్లెను. వదినగారు వానిని యెక్కడనో దాచివేసి పండుకొనెను. తమ్ముడువచ్చి వెతకి వెతకి ఆమెను లేపిలేపి అలసిపోయి అన్నకడకు పోయెను. పాపము అన్నగారే స్వయముగా వచ్చెను. అతని భార్య జ్వరమువచ్చినట్లు నటించి, అతని తమ్ముడువచ్చి తననుతన్ని కొట్టెనని లేనిపోని చాడీలు చెప్పెను.

పొలములో తమ్ముడు సత్యము నాతని కెఱిగించెను. "అన్నా! నేననిన ఆమెకు అసహ్యము. నే నీయింట నామెతో మసలజాలను. అకేసియాఅను సీమకు బోయెదను. నాగుండెకాయ నాకు బరువుగాఉన్నది. అదితీసి ఆసీమలో ఒక చెట్టుకొమ్మను తగిలించి తిరుగుచుందును. ఆ చెట్టు నెవ్వరైన నఱకినచో ఆ గుండెకాయ క్రిందను పడిపోవును. అప్పుడు నేను మరణింతును. నీవువచ్చి నాకు సాయముచేయవలెను. అందువలన నీకును మేలుకలుగఁగలదు."

ఆనపునకు తనతమ్ముని విడచుట కిష్టము లేదు. అయినను తన తమ్ముడు తననువిడచి పోక మానడు. "తమ్ముడూ, నిన్నువిడచి నే నెట్లు మనఁగలను? నీకు నా అవసరము కలుగుచున్నదని నే నెట్లు గ్రహించి అచ్చటికి రాగలను?" అని అడిగెను.

"నా గుండెకాయ క్రిందనుపడువేళకు నీయొద్ద కెవ్వరో నీ వెఱుగనివ్యక్తి యొక్కరు వచ్చి, ఒకకూజాతో సారాయి తెచ్చి యిచ్చును. సారాయికూజా అంచులనిండ

నురగను గ్రక్కుచుండును" అని బీటను చెప్పి వెడలిపోయెను.

బీటను అకాసియా దేశము వెళ్లి భూమి దున్నుకొనుచు జంతువులను వేటాడు కొనుచు అడవులలో కాలక్షేపము చేసుకొనుచుండెను. ఆ అరణ్యములో ఒక దేవ కన్యక తిరుగుచుండెను. అతని సౌందర్యమును చూచి మోహించి ఆమె అతనిని వివాహ మాడెను. కాని ఆమెయెడల నాతని కెంతో అనుమానము: కారణమును మన మెఱుగము. ఆనాటి దేవకన్యలు తనవదినగారివలె నంత గయ్యాళులు కాబోలు! ఆమెకూడ అతని అనుమానమునకు తగినట్లే వర్తించినదని ముందరికథవలన మనకు తెలియఁగలదు.

ఆదేశపు చక్రవర్తులకు ఫెరోవా అనే బిరుదమున్నదని మనకు తెలియునుగదా. అప్పటికి ఆ దేశమును పాలించుచున్న ఫెరోవా ఆమెసౌందర్యమునుగూర్చి యెన్నో ప్రశంసలను వినెను. ఎట్లైనను ఆమెను వల గొని ఆమెతో క్రీడింపవలెనని ఉవ్విళులూరు చుండెను. ఎందఱినో చెలికత్తెలను అతనికి తెలియకుండ ఆమెకడకంపి అనేకమునగలు నాణెములు రాజ్యములు సింహాసనము నర్పింతునని ఆమెకు ఊటలుగొలిపెను. ఆమెకు కావలసినదికూడ నగలు నాణెములే. ఆమె తన భర్తనువిడచి వారివెంటబడి చక్రవర్తికొలువు చేరెను. అతనితో మహేంద్రభోగము లనుభవించుచుండెను.

అయినను అంతతో నామెకు తృప్తితీర లేదు. తన ప్రథమభర్త మరణింపవలెనని ఆమెకొక దుస్సంకల్పము పుట్టెను. వెంటనే ఆమె చక్రవర్తిని పిలిపించి అతనిహృదయము వ్రేలవేయఁబడిన చెట్టును నఱికించుమనెను. అతను మనుష్యులనంపి ఆచెట్టు నఱికించెను. ఆచెట్టు పడెను.

ఎవరో ఒక అసాధారణవ్యక్తి ఒకకూజాతో నురగలుగ్రక్కుచున్న సారాయిని ఆనపునకు ఆ క్షణముననే:అందించి మాయ మయ్యెను. ఆనపు ఆందోళనాయత్త చిత్తముతో అకాసియాకు బయలుదేరెను. పడిపోయిన చెట్టును కనుగొనెను; హృదయమును చూచెను. దానినొక తొట్టిలోగల నీటిలో వేసెను. కొన్నిదినములుపోయిన వెనుక తన తమ్ముని శవమునుకూడగాంచి దుఃఖించెను.

కాని ఆశ్చర్యము! నీటిలోపెట్టిన హృదయము నానాటికి బలిష్ఠమై నవకమును తొడుగుచుండెను. తమ్మునిశరీరము ప్రాణమునుదాల్చి కదలుచుండెను. గుండెకాయ పూర్తిగా పటిష్ఠమాయెను. తమ్ముడు నిండార బలిష్ఠుడాయెను. ఒకరినొకరు పలుకరించు కొని కుశల ప్రశ్నలుచేసుకొని ఆనందములో నోలలాడిరి.

కాని బీటనుకు ఇంతటితో తృప్తితీర లేదు. "అన్నా, నేనొక పవిత్రతరమైన వృష భాకారము దాల్చెదను. నన్ను చక్రవర్తి యొద్దకు గొనిపొమ్ము. అతడు నన్ను కొనుక్కొని నీకు మంచి బహుమానమొసంగును. నేను, నాభార్యనుగాంచి ఆమెపై పగదీర్చు కొందు"ననెను.

అతడట్లే వెంటనే మాటిపోయెను. అన్నయ్య అట్లే చక్రవర్తికమ్మి బహుమానము నంపెను. ఆ వృషభము తోటలో తిరుగుచుండెను. దేవకన్య ఒంటరిగా ఆ ఉద్యానవనమునకు షికారువచ్చెను.

"నేనింకను జీవించియే యున్నాను సుమా" అనెను ఆ వృషభము.

"నీవెవరవు?" అని దేవకన్యప్రశ్న.

"నేను బీటనును. నీ ప్రాతపెనిమిటిని" అని జబాబు.

ఈ యెద్దు నెట్లు చంపించుటయా యని ఆమె తల్లడపడ జొచ్చెను. ఒకఉపాయము తోచెను. ఆమె చక్రవర్తియొద్దకుపోయి "నాకు ఆ పవిత్రవృషభముయొక్క గుండెకాయను భుజించవలెనని వాంఛగానున్నది. దానిని సంహారించి గుండెను తెమ్ము"అనెను. చక్రవర్తికి ఆయెద్దు అనిన మిగులనిష్టము. దానినిచంప కోరికలేదు. అయినను ప్రియురాలికోరిక మీరుట కంతకన్న వీలులేకుండెను.

అత డిరువురుయోధులనంపి యిరువురును రెండుప్రక్కలనుండి ఆయెద్దును పొడువవలెనని ఆజ్ఞాపించెను. వారిరువురు నట్లేపొడిచిరి. రెండురక్తపు బొట్లుమాత్రము క్రిందరాలి చర్మము రెండుప్రక్కలును మూతవడెను. అవి రెండు సొగసగు కాలువలై ఫరోవా కోటచుట్టును ప్రవహించెను. అక్కడతో ఆగిపోయెను. ఆకాలువలయొద్ద రెండు చక్కనిచెట్లు మొలచి క్షణములో పెరిగెను. వానిని ఆజాతివానిని నేటికిని ఈజిప్టులో అకాసియనుచెట్టులందురు.

ఆ చెట్టు లెంతో పవిత్రవృక్షములట. వేనవేలుజను లా కాలువలలో మునిగి ఆ చెట్లను పూజింపవచ్చుచుండెడివారట. ఒక దినమున సంజప్రొద్దువేళ చక్రవర్తియు దేవకన్యకయు రెండు ఆసనములను తెప్పించుకొని చెరియొక చెట్టుక్రిందను కూర్చొని సరససల్లాపము లాడుకొనుచుండిరి. దేవకన్య యేచెట్టుక్రింద కూర్చొనెనో ఆచెట్టు ఆమెనుచూచి "అమ్మా, చూచితివా? నే నింకా బ్రతికియున్నాను. నేను నీ పెనిమిటిని, బీటనును." అనెను.

ఆమె వెంటనే నిలచి "మనోహరా, వెంటనే యీ చెట్టును నరికింపుము"అనెను. చక్రవర్తి కట్టిపని యిష్టములేదు. అయినను ప్రియురాలిమాట జవదాటఁగలడా? సేవకులు చెట్టుపైపొడిచిరి. దేవకన్య నోరు తెరచుకొని క్రిందనిలువఁబడెను. ఒక నిప్పుకణమువచ్చి ఆమెనోటపడెను. ఆమె మాయమయ్యెను. బీటను నరరూపముదాల్చి తన చరిత్రనంతయు చక్రవర్తికిచెప్పెను. చక్రవర్తి ఆశ్చర్యపోయెను. అతను బీటనును మిగులప్రేమించి, ఒకచిన్న రాజ్యమునిచ్చెను. కాని ఆ దేవకన్యక తలంపునకువచ్చినపుడెల్ల అతనిబడలు జలదరించి ఆమె నసహ్యించుచుండెను.

తే॥గీ॥ మొదట సొగసుసుగనియొక్క పురుషువలచి, భోగములకయి అతని పొందువిడచి।
అతని చంపింప నుంకించి నట్టి దేవకన్యపడినట్టిపాటు ల బ్బబ్బ।
యెన్ని! ఆమెతోడనె అంతంబు లయ్యెనన్ని!॥

# శిశుశిక్షణము

## శిశు పాఠశాలలు !

పిల్లలచేతులెప్పుడూ వూరికేవుండవు. ఏదో ఒకపనిని చేస్తునేవుంటాయి. కొందరి చేతు లద్దాలు బ్రద్దలుకొట్టి, పుస్తకాలు చించి, చిన్నపిల్లలను చిక్కి, దాచుకొన్న తిండివస్తువులను దొంగతనాన తినీ,ఇటువంటి కొంటెపనులు చేస్తాయి. కొందరిచేతులు పువ్వులను గ్రుచ్చి, దండలల్లి, బొమ్మలు వ్రాసి, మట్టిబొమ్మలుచేసి, యేవేవో వింతవింతలైనపనులు చేస్తాయి. మొదటి వారిని చూచి వారితల్లులు చికాకుకొద్దీ వీపుమీద రెండు చరుస్తారు, వాళ్లేడుస్తారు. రెండవవారిని చూచి కొందరు తల్లులు ఆనందిస్తారు, వారు అల్లాటిపనులే చేస్తూ వుంటారు. కాని అనేకము తల్లులు మొదటి వారి నట్టిపనులు వద్దని దిద్దుట కాని రెండవ వారినట్టి పనులయందు ప్రోత్సాహించడము కాని అరుదు. వీరిగొడవవీరిది, వారిగొడవ వారిదే.

ఇందుకొరకే అనేకము దేశాలలో శిశు పాఠశాలలు లేస్తున్నాయి. వీటికి నర్సరీ స్కూళ్లు అంటారు. వీనిలో ఎన్నో కిండరుగార్టెను వస్తువులు, బొమ్మలు తీగెలు పూవులు మొక్కలు వుంటవి ;వీటిని చూచి పిల్లలు తమ యిష్టమువచ్చేటట్లు ఆడుకుంటారు. వీరేమీ పగలగొట్టరు.పగల గొట్టినా అట్టే పరవాలేదు. ఈస్కూళ్లలో ఉపాధ్యాయినులు తరచుగా స్త్రీలు; వారు పిల్లలను బుజ్జగించి ముద్దులాడుచుందురు.

అంతా బాగానేవున్నది. కాని పిల్లలకు వచ్చీరాని జ్ఞానావస్థలలోనే యిళ్లనుంచి తప్పించి, స్కూళ్లలోకి లాగేసి, తండ్రుల చేత జీతాలు కట్టించేసో, ప్రభుత్వాదాయంలోనుంచి గ్రాంటులు పీకేసో, లేక అందుకొరకు ప్రజలపైని పన్నులు రుద్దీ సీడమోఅంటే పాశ్చాత్య ప్రభుత్వాలు, వాటిని అనుకరించే ప్రాచ్యప్రభుత్వాలలో సాధ్యంకాని సాధారణ పేదప్రభుత్వాలలో సాధ్యంకాదు. పైప్రభుత్వాలలో అది తప్పదు కూడాను. అవి యంత్రాలలో అధి కోత్పత్తిచేయువాలి. ఆడవాళ్లనందరినీ కూలి పనులలోకి యంత్రాలలోకి లాగీవాలి. పిల్లలనుగూర్చి శ్రద్ధ తీసుకుంటకు తల్లులకు టైమువుండదు. పిల్లలు చెడిపోకుండా చేసే బాధ్యత ప్రభుత్వముది. దీనికోసము బోలెడు డబ్బు అవుతుంది నిజమే. కాని యంత్రా లలో వస్తువులను అతిచౌకగా తయారుచేసి విదేశాలలో అతిప్రియంగాఅమ్మి కోట్లకొద్దీ లాభాలు తీసుకుంటున్నవారీ మాత్రం ఖర్చు పెట్టలేరూ? గానుగలోదే గంటెడు.

కాని తమ దేశములలోని కుటీర పరిశ్ర

మలుచచ్చి, ప్రతివస్తువూ విదేశీయులమ్మేది కోలెడు ఖరీదుపోసికొనుక్కొని బీదవాళ్లగు చున్న పేదలదేశములలో పెద్దవాళ్ల చదువులకే దిక్కులేదుగదా నర్సరీస్కూళ్లుకూడా పెట్టించుమంటే యెవరితరం?

తల్లులు ఫ్యాక్టరీలలోకి కూలిపనులకు పోవాలి, కాలేజీలలో మేస్టరుపనికి పోవాలి, హైకోర్టులో లాయరుపనికి పోవాలి, ఎయిరోప్లేను డ్రైవింగుకుపోవాలి అంటే పిల్లలకేమాత్రం శిక్షణ యిచ్చేందుకు వారికి టైముపుండదుకాని, ఇట్టి వుద్యోగములు పెక్కుఱు తల్లులకు చిక్కని పేద దేశములలో తల్లులు శ్రద్ధపట్టితే పిల్లలకీ మాత్రం శిక్షణమియలేకపోతారూ? ఇప్పుడు ఇయ్యలేకుండావుంటే కాస్త తల్లితండ్రులో భర్తలో అత్తమామలో చెప్పిన తరువాతనేనా యియ్యలేకపోతారూ? పాశ్చాత్యదేశాలలోలాగ మనవి వ్యష్టి కుటుంబాలుకావు. ఇంకొకొంతో సమిష్టి కుటుంబాలు. మొగుడూపెళ్లాం పిల్లలూ మాత్రమేగల కుటుంబములు చాలాతక్కువ. ఏతాతో అవ్వోలేని యిళ్లు వుండవు. వారికింతకంటె వేరేపని వుండదుగదా! ఈ మాత్రం దిద్దుబాటుకోసం పిల్లలను పసివయస్సునుంచీ బడులలోకి త్రోసీడం, గ్రామాల్లో బడులులేకుంటే పట్నాలుగెంటీయండి అనడం అంతసబబుగా కనిపించదు.

పాశ్చాత్యబోధనలు తలకెక్కుచున్న మనకు ఇట్టి సిద్ధాంతము లిప్పుడిప్పుడు నచ్చుచున్నవిగాని ప్రాచ్యదేశములలో పాశ్చాత్యదేశములలోకంటె మాతపుత్ర మాతపుత్రికా సంబంధ మత్యమోఘమైనది. పాశ్చాత్యవనితలవలె ప్రాచ్యవనితలు సంతానమునుండి యెడబాటును చాలాకాల మోర్వలేరు. వారికి ప్రాణములెల్లయు పిల్లల మీదనే. పిల్లలింట అల్లరిచేయుచున్నను సహింతురు కాని ఒక్కపూటకుపూటా యెక్కడికోపోయి అగుపించకుంటే ఓర్చలేరు. భరతదేశపు కూలిపడుచులుకూడా, ఫ్యాక్టరీలలోనికి తీసుకొనిరానీయరు కనుక మానేస్తున్నారుకాని, పొలములలోనికి మోతపనులలోనికి మొదలగు వానిలోనికి పిల్లలను చంకలనుబెట్టియే తీసుకొనిపోయి తమకండ్లముందరే ఆటలకువిడచి తమకూలి పనులు తాముచేయుచుందురు. ఇంతమాత్రముకు యజమానులు వారిని దండించరు.

అసలు వ్యవసాయదేశములలో కూలి పనులకంటె స్వంతపనులేయెక్కువ అనవాలి. పొలము ఇల్లులాంటిదే. తక్కిన కుటీర పరిశ్రమల కిల్లువిడచి పోనక్కఱయేలేదు. పెక్కుఱు పురుషు డార్జించితెచ్చి యింట పోయుచుండ యిల్లుదిద్దుకొనుటతప్ప పయి పెత్తనములకు పోవలసిన ఆవశ్యకతయేలేదు. నలుగు రైదుగు రాడువారుండనియిల్లే యుండదు. ఇంటిపను లిద్దరు సర్దుకొన్నను తక్కినవారు ఈమాత్రం పనిచేయలేక పోలేరు. బాగాఆలోచిస్తే, ఇల్లాళ్లు చక్కగా యిల్లుదిద్దుకొని వుంచితే ఇంటికంటె, ఇంటిలోని శృంగారపు గదులకంటె, ఇంటి పెరటిలోని మొక్కమోడులకంటె, చెట్లపైని

పూలు ఫలములుకంటె చక్కటినర్సరీ స్కూళ్లెక్కడవుంటాయి? కిండరుగార్టెను. సామానులు కావలిస్తే కొన్ని తయారు చేసుకోవచ్చును.

మనదేశమునకు చీనా దేశమునకు చాలావిషయములలో పోలిక లున్నవని తెలిసినవారందురు. రెండు దేశాలలోను భూమి విశాలము, జనసంఖ్య యెక్కువ, ప్రాచీన నాగరకత, వ్యవసాయకుటీర పరిశ్రమలు వృత్తులు, పురుషులకు సద్గ్రామజీవనము, స్త్రీలకు సద్గృహజీవనము, రెండు దేశములలోను సమిష్టికుటుంబము లెక్కువ, తల్లుల కుద్యోగములయందుకంటె పిల్లలయం దెక్కువప్రీతి. ఆదేశములో తల్లులు పిల్లలను చాలాపెద్దవాళ్లయేదాక తమదృష్టి దాటించి దూరముగా గొనిపోవనొల్లరు. ఆటపాటలెల్ల తమయిళ్లలోను తమ యిరుగుపొరుగు యిళ్లలోనే. ఎప్పుడైనా తోటలకు చెఱువులకు గుడులకు కొండలకు నడిపించి తీసుకొనిపోదురు. వారికి కలుగు సందేహములు తీర్తురు. చిన్నచిన్నప్రశ్నలు వేసి కుతూహలము రేపుదురు. పూవులు పక్షులు జంతువులు వృక్షములు మొక్కలు తీగలు మొదలగు వానినిగూర్చి వారికెన్నో సంగతులు చెప్పుదురు. 'కిండరుగార్టెను బడులలో ఇంతకంటె వారెక్కువ చెప్పుదురా? తల్లులుగలిగి కుటుంబములలో మెలగు పిల్లలకు కిండరుగార్టను బడులేమిటి?' అని చీనా వనితలు ఆక్షేపింతురట.

మనదేశములోని తల్లులుకూడ పిల్లలకు పాలుపట్టుట, అన్నము తినిపించుట, నీళ్లు పోయుట, తలలుదువ్వుట మొదలగువానితో తమ బాధ్యతలు తీరినవనుకోక, పిల్లలకు అటువంటి సరదా పుట్టించే ప్రసంగములు చెప్పి పనులు నేర్పడము, అల్లరిపనులు చేస్తే కొట్టకుండా ఉండడము మొదలైన గుణము లెన్నో నేర్చుకోవాలి. తండ్రులుకూడా యెంతసంచార కార్యక్రమములో కొట్టుకొనుచున్నను ఇట్టివిషయములయందు కాస్త శ్రద్ధజూనిపినచో తల్లులకు పిల్లలకుగూడ సరదాగా వుంటుంది. ఈమాత్రమునకు స్కూళ్లు అవసరమా అని చీనావాళ్లలాగనే మనకును అనిపించుతుంది. అందులోనూ పల్లెటూళ్లు బొత్తిగా కిండరుగార్టనులలాగే వుంటాయి. పిల్లలయందు కాస్త శ్రద్ధబూని వారితో యెటువంటి ప్రసంగాలు చేయువాలి, యెట్టి వుత్సాహములు గొల్పవాలి, ఎట్టిపనులు మప్పవాలి, యెట్టియెట్టి అభిరుచులు కలిగించవాలి అనునదే ప్రధానమగుప్రశ్న. ఇందుకు సంబంధించిన వ్యాసములే యేవైనను తరచు ఈసంచికలో ఈభాగమున ప్రకటించుచుందుము. ఆంధ్రదేశమునందలి నారీమ తల్లులు విద్వాంసులు అనుభవజ్ఞులుగూడ ఈ విషయము నాలోచించి చక్కని ముచ్చటలూరు వ్యాసములను వ్రాసి పంపించ గోరుచున్నాము.




## — సొరకాయహల్వా —

లేతసొరకాయ తోలుతీసివేసి, లోపలిగుజ్జును విత్తులను తీసివేసి ముక్కలు ముక్కలుగాచేసుకొని, రెండుపళ్లపాలను అరపడినీళ్లను కలిపి బాగుగా మరుగనిచ్చి అందులో అయినను లేక ఆరుశేర్ల సొరకాయ ముక్కలనువేసి మూతబెట్టి అయిదుగడియలసేపుంచి సొరకాయ ముక్కలన్నియు బాగా నీరైపోయిన మీదట తోలుతీసి నూరిన బాదంపప్పు మూడుపలములను. పదిపలముల నెయ్యియును; రెండుశేర్ల కలకండయును; మూడుపలముల పన్నీరును; ఒకవరాయెత్తు కుంకుమపూవును వేసి బాగా కలియబెట్టి హల్వా పక్వమున దించి భక్షించిన చాలా రుచిగాను కమ్మగాను వుండును.

## — సొంజా —

రెండుపలముల నెయ్యిని కాచి, అరపడి గోధుమ రవలను వేసి మాడిపోనీయక యినుకరంగుగా వేయించి యుంచుకొనవలయును. తర్వాత ఒకపడి నీళ్లనుకాచి చక్కగా పొంగువచ్చునపుడు వేయించి యుంచిన గోధుమరవలను అందువేసి కలియబెట్టి, యిరువదిపలముల తెల్లచక్కెర; కాలుపడి ఏలకుల పొడి; నేతిలో వేయించిన తోలులేని ముంతమామిడి పప్పు; లేక తోలుతీసిన బాదంపప్పు మూడుపలములు, వీనినంతయు వుడుకుచున్న నీళ్లలో వేసి నీళ్లింకి అన్న పక్వముగా కనపడు సమయమున దించి అయిదు నిమిషములు పొగలేని బొగ్గులనిప్పు సెగమీదనుంచి, తరువాత అయిదుపలముల నెయ్యిని పోసి చక్కగా కలియబెట్టి కొంచెముసేపుతాళి యుపయోగించిన చాలా రుచిగాయుండును.

—పప్పు. కమలావతి.

## — పెసరపప్పు బర్ఫీ —

ఒక కళాయిపాత్రలో పావుశేరు పెసరపప్పు నానపోసి రెండుగంటల కాలము నాననిచ్చి అది మెత్తగా రుబ్బవలయును. ఆ రుబ్బినదానిలో ఒక చటాకు బియ్యపుపిండిన్ని, అర్ధపావు పంచదారున్ను, 1 తులం జీడిపప్పు, 1 పావుతులం కుంకమపువ్వు, 1 పావుతులము ఏలకులపొడి వేసి బాగుగా కలుపవలయును. దానిలో 1 కొబ్బరికాయ బాగుగా తురిమి అదికూడ కలపి నలుచదరముగా ముక్కలువలె చేసియుంచవలయును. ఒక పావుశేరు నేతిని బాణలిలోపోసి పొయ్యిమీదపెట్టి కాగనిచ్చి దానిలో యీ ముక్కలువేసి ఎర్రగా వేగనిచ్చి తీయవలయును. అవి వేడివేడిగా భుజించిన చాలా రుచిగానుండును.

## — మునగకాయల పచ్చడి —

ఒక కళాయిపాత్రలో 1 అర్ధశేరు నీళ్లుపోసి అందులో 25 మునగకాడలు చిన్నచిన్నముక్కలు కోసివేసి, కొంచెము పసుపువేసి ప్రొయ్యిమీదపెట్టవలయును. ఒకపావుగంటసేపు యుడుకనిచ్చి నీరంతయు వాడ్చి ఆ ముక్కలను చల్లారపెట్టవలయును. ఆ మునగకాయలలోని గుజ్జుఅంతయుతీసి యుంచవలయును. కొంచెము మిరపకాయలు, 1 చటాకు మినపప్పువేసి కొంచెము ఉప్పువేసి రుబ్బవలయును. దానిలో యీ మునగకాయలగుజ్జు కలపి యుంచవలయును. బాణలిలో నూనెపోసి ఆవాలు కొంచెము యింగువవేసి వేయించి కలుపవలయును. దానిలో ఒక నిమ్మపండురసముతీసి కలిపిన చాలారుచిగానుండును. ఇది పైత్యమునకు చాలామంచిది.

పువ్వల. అలివేలమంగ తాయారమ్మ.

# నూతన పాశ్చాత్యము

ఆడవాళ్లు మగవాళ్ల కెందునా వెనుకతీసిపోరు, మగవాళ్లు ఆడవాళ్లకు సకలస్వాతంత్ర్యాలు ఇచ్చీక పోవడంనుంచే వారు వెనుకపడిపోయి బానిసలైనారన్న పొలికేక తొలుదొల్త పడమటిదేశాలలో ప్రారంభమైనది. అప్పటే ఆడవాళ్లను ముందు చదువులకు తోలడం పండితులనుచేయడం దానితో వాళ్లు హక్కులకుపోరాడకం కొన్నాళ్లు ఇవ్వకపోవడం ఆఖుకు యివ్వడం వారు పురుషులను మించడం మొదలయిన చర్యలన్నీ జరిగాయని అయిరోపాచరిత్రపాఠకులకు స్త్రీస్వాతంత్ర్యోద్యమచరిత్రాపాఠకులకు తేటతెల్లముగా తెలిసినవిషయమే. అట్లాటి ఆదేశస్థులే స్త్రీల బుద్ధినిగూర్చి నేర్పునుగూర్చి ప్రవర్తనమునుగూర్చి అవమానకరములైనమాట లెట్లా వ్రాస్తారాఅని మనకు సందేహము కలుగకమానదు. ఐతేనేమి అయిరోపా పురుషులకలములు స్త్రీల ప్రజ్ఞలనుపొగడి పొగడదముతో విసిగెత్తి పరాఙ్ముఖములై తిట్టనెట్టుకొనినట్లున్నవి. పోనీ పురుషులంటే వేఱుజాతివారుకాని, స్త్రీలు స్వజాతివారు కదా వీరుకూడా యీతప్పుత్రోవలే త్రొక్కవాలాఅని మనకాశ్చర్యమౌతుంది. వీరివ్రాతలు చూస్తే స్త్రీలనభివృద్ధిచేయవాలని డాబులుకొట్టేవారే కాని, తీరా వృద్ధికివచ్చేవేళకు వాళ్లను రానీయకయేవో సొల్లుపెట్టే మహనీయులే పురుషులనిన్నీ పాపము స్త్రీలుకూడా అమాయకురాండ్రగుటచే యెన్నిప్రజ్ఞలుండిన్నీ వారిపొగడికలకో తిట్లకో లొంగిపోతున్నారనిన్ని తెలియకమానదు.

ప్రపంచచరిత్రలు వ్రాసీడంలో అందెవేసినచెయ్యి అని హెచ్. జి. వెల్సుగారు పేరుపొందేరు. వారి గ్రంథాలు చదవని స్త్రీలు పురుషులు ఆంగ్లభాషజ్ఞులలో లేరు. చాలాకాలంవరకు అతను ఆడవాళ్ల నువ్వెత్తు పొగడినవీరుడే. పైగా ఇప్పుడు సినీమాలోకంలోతేలి హాలీవుడ్డు నటీమణుల సౌందర్యనైపుణ్యముల జాలగొని వారి నానందవారాసిలో ముంచి నిశ్చయించుకున్నాడు. స్త్రీపురుష సమానప్రతిపత్తో యని నిన్నదాకా కేకలువేసినధీరుడు నేడు అభిప్రాయము మార్చుకొని "స్త్రీలు సోమరిపోతులు, నూరేళ్లదాకా వారు అసలు ప్రస్తుతమున్న అవస్థలోనుంచి మారనేజాలరు. ఆ తరువాత పురుషులతో సమానులవడానికి యెన్ని యుగాలుపడతాయో, అంతవరకు అందాలబరిణలు కావలసినదే కాని బాధ్యతాయుత అధికారములకు వారు అనర్హలు, రష్యాను స్త్రీయెడల సోవియట్టుప్రభుత్వమువారెంతపక్షపాతము చూపించుచున్నను వారు గొప్పఉద్యోగములు చేయలేకున్నారు; స్త్రీలు, పోనీ, పురుషులకు స్నేహితురాండ్రు సహచారిణులు అయియేనా వుంటారని వ్రాసినాను కాని అది తప్పు. స్త్రీలబుద్ధులు పురుషుల బుద్ధులతో సమానమేఅయినా, వారు వేరుదారులనే పడతారు కాని వీరిదారులకు రారు. శ్రద్ధచూపవలసినదగ్గర అశ్రద్ధచూపడం, కష్టపడవలసినదగ్గర మేను దాచుకోవడం, వారికి సహజము. స్త్రీని పురుషుని కలిపి ఒక ఆఫీసులోనో ఫ్యాక్టరీలోనో స్కూలులోనో ఉద్యోగులుగా నియమించితే, పురుషులు వారి చూపులు కులుకులు మొదలగు వలలనుండి తప్పుకోలేరు గనుక వారూవీరూ నిత్యం యెక్కడపడితే అక్కడ సహచారులులేక స్నేహితులుగావుండటం అసంభవం. ఆడదాని అందపువలలలోపడి పొగడుతూ కాండలించని పురుషుడులేడు. పొగడుతూవుంటే మైమరచి సోమరిపోతులై తీవ్రపతత్కార్యాచరణమును మానివే యని స్త్రీలులేరు. యౌవనమద మంకురించగానే

పతితురాలు కాని స్త్రీయుండదు; ముసలితనంరాగానే శృంగారమంటే అసహ్యించుకొంటుంది" ఇది ఆదొరగారి ధోరణి. ముసలిదికూడ శృంగారం చూపదేమీ అని అతనికి గుబ్బులాగునవున్నది!

మనభారతీయసనాతన ఛాందసు డెవడేనా యెప్పుడేనా ఇట్టి అవకతవకమాటలు అజ్ఞానంవల్ల అంటే మనదేశంపత్రికలన్నీ అతనిని చెక్కిచెక్కి చెటిగేసి యేకేసిపోను. హెచ్. జి. వెల్సుగారిభావాల నామోదించెడివారే కాని ఆక్షేపించెడివ్యక్తి యొక్కరు కనిపించలేదు.

పోనీ, అతడు పురుషజాతి కనుక అట్లాఅన్నాడు, స్త్రీలకు వారియెడ యెంతగౌరవముగదా అని అనుకుందామంటే మిస్. యమ్. బి. స్కాటుఅనే ఆంగ్లదేశస్థురాలు తనకు కొందరు స్త్రీకార్యదర్శులు కావలసి దరఖాస్తులు పెట్టుమని, కొన్నిప్రశ్నలువ్రాసి సమాధానములువ్రాయుమని యెంతమందికో నోటీసులు పంపింది. 231 దరఖాస్తులు వచ్చినవి. వీరిలో కొందరు కళాశాలలలో పట్టభద్రలు; మరికొందరు సాలుకు అరవై పౌనులు మొదలు 600 పౌనులు జీతములులాగుచున్న ప్రతిభావంతురాండ్రు. వారి సమాధానాలుచూచి వాళ్లకు వ్యక్తిత్వమంటూ లేదనిన్నీ ఏదోకాస్త పెళ్లీమగడూ కుదిరీదాకా కాస్త అరువు తంటాలుపడదామని ఉద్యోగాలకొరకు దేవుళ్లాడుతున్నారనీ ఆమె నిశ్చయపరచుచున్నది.

పోనీ, మనభారతీయవిద్యావతిస్త్రీలు ఏమంటారో విందామంటే అది మరీవింతగావుంటుందేమో! నిజము చెపితే చదువుకున్నవాళ్లకు కోపమటకాని తమసొగసులు తమపుస్తకములు తమఆనందములు ఇవే వాళ్ల లోకమట. "ఇంటిపనులు తెలియవు. స్వతంత్రోద్యోగములు చేయలేరు. ఎవరైనా అడుగులకు మడుగులొత్తుతూవుంటే రాణీలలాగ తిరుగుతారు. ఈసోమరిపోతుతనంవల్ల వంటికి రోగాలు. వానికి వైద్యం ఖర్చులు. తమకుతామూ కొఱగారు, దేశాని కసలూ కొఱగారు." అంటూ ప్రసంగించారు. స్త్రీలను ఇంటిపట్టునుండి ప్రాచ్యప్రాచీనదేశములలోవలె గృహధర్మనిర్వహణపరాయణలై సంసారములను కలకలలాడ జేయనీయకుండా, వీధులలోకి ఫ్యాక్టరీలలోకి స్కూళ్లచదువులలోకీ మేస్టరీఉద్యోగాలలోకి సేవాసదనాలలోకి సంఘాలలోకి లాగినవారు పాశ్చాత్యపురుషులే. అందుకు పొంగినవారూ ఆ పాశ్చాత్యస్త్రీలే. ఇప్పుడు వారిని నిరసిస్తున్నవారూ ఆ పురుషులే, ఆమోదిస్తున్నవారు ఆస్త్రీలే. అసలు సంగతి చూస్తే స్త్రీలకు పురుషులు పొంగవేసి యేవ్యక్తిత్వమిస్తే అదేకాని అసలు ప్రత్యేకవ్యక్తిత్వము లేదనిన్నీ స్త్రీలు పురుషులయొక్క ఛాయామాత్రజీవులేమో అనిన్నీ కొందరి తలంపైయున్నది. భారతదేశంలో 'మొగుడు నీకు దేముడు; వాడి కూడిగం చెయ్యి వాడుచస్తే వాడితోచావు' అని పూర్వులంటే అందుకే యిక్కడివారు ఆనందించారు. 'కాదు, బుఱ్ఱ గొరిగించుకొని తీర్థయాత్రలంట తిరుగుతూ బంధుగుల యిండ్ల వండిపెడుతూ ఏడ్వ'మంటే చిత్త మల్లాగే అని కొంతకాలం ఒప్పుకున్నారు. 'పెళ్ళాంకు మగడితోటి దేనా యేమిటి యావజ్జీవనమున్ను, అతనుచస్తే ఇకనంతేనా, ఇది అన్యాయం; ధర్మశాస్త్రాలు ఇట్టి వైధవ్యమును అంగీకరించవు. 'పతిరన్యోవిధీయతే' అని చాటుతున్నా'యని వీరేశలింగంగారు ఘోషిస్తే చిత్తమని వారివెనకాతల నెంతమందోపడ్డారు. "పెనిమిటి పోయిందాకా బాధలు పడవలసినదేనా? ఉంటేమాత్రము మళ్లీ పెళ్లిచేసుకోకూడదా, యావజ్జీవనంవారికే గుత్తకు అమ్ముకోబడ్డారా స్త్రీలు?" అని గొరుగారు బిల్లుతెస్తే దానికే వోటులిస్తారు. 'వోట్ల కోసం ఆందోళన చెయ్యండోయి' అని కొంతకాలం క్రిందట ఏపాశ్చాత్యుడో స్త్రీలను రెచ్చగొడితే ఓ అల్లాగే అన్నారు, తిరగపడ్డారు, చదువులుచదివారు, ఉద్యోగాలకై యెగబ్రాకుతున్నారు. ఇప్పుడు

ఏవెలో, లేక యేమిస్ స్కాట్‌తో 'ఆడవాళ్లకు ఉద్యోగము లేమిటి' అని పెదవులువిరచేస్తే అంతా కాకున్నా కొందరైనా వెనకముఖం పట్టీరా? రష్యాలో 'సంపూర్ణ వివాహవిచ్ఛేదక స్వాతంత్ర్యం ప్రతీస్త్రీకి వుండవాలి' అని సోలియటుప్రభుత్వం చాటించేస్తే, ఇవతల వివాహరిజిస్టర్లు అవతల విచ్ఛేదం రిజిస్టరు రోజురోజుకు నిండిపోతూవచ్చాయి. 'బుట్టిబుట్టి, పొరపాటున అట్లా అనుకొన్నాము. బాగా విచారణచేయందే విచ్ఛేదానుజ్ఞలియ్యడంవల్ల లోకం పాడైపోతుంది కాబట్టి కొత్తచట్టం ప్యాసుచేసి కోటుకాలు పెట్టండోయి'అని యేపురుషుడో కేకవేశాడు, 'సై' అంటున్నారు ఆడవాళ్లు. ఆడవాళ్లను గౌరవిస్తున్నాము అని నెపముపెట్టుకొని, ఇండ్లల్లో వారితో ఆనందించడముకాక, ఇట్లా చదువులబడులు సత్రములు హోటేళ్లు కచేరీలు కోటుకాలు స్టీమర్లు రైళ్లు మొదలైన సమస్తమైన కలగాపులగం తావులకు యీడ్చేసి ఆడించి గెంతించి ఆఖరుకు వాళ్ల పరువులు తీసేవ్రాతలు వ్రాయడానికికూడా నెట్టుకోవడం పురుషులకు శ్రేయము కాదు. వారెట్లా మద్దెలవాయిస్తే యిందులో స్త్రీనాయకురాండ్రుకూడా అట్లే ఆడుతూ స్వజాతినింద నొనరించుకొన పాల్పడడము అంతకంటెను బాగులేదు. ఉన్నారా ప్రాచీనాచారముల ప్రకారము ఘోషా ఫీషాలుమాత్రం లేకుండా, సాధారణచదువులను సాధారణస్త్రీలు, అసాధారణ చదువులను అతి తెలివైనస్త్రీలు శక్తివుంటే చదువుకుంటూ, ఒక్క తమభర్తలు ఆప్తబంధువులు తప్ప అన్యపురుషులతో కలగాపులగమై రానుకొనితిరగకతీరని సభలు చదువులబడులు నాటకశాలలు కచేరీలు మొదలగు వానిని బహిష్కరించుకొని, గృహనిర్వహణధర్మం కుక్కనుతిన్న బొబ్బతుకాదని నిశ్చయించుకొని నెరవేర్చవలెను. లేదా సమస్తసభలకు వోటులకు ఉద్యోగములకు ఉపన్యాసములకు కూలిపనులకు పురుషులతో సమముగా హక్కువున్నదని నిశ్చయించుకొని ఇష్టమైతే పెండ్లాడి, లేకుంటేమాని, కాకుంటే విడదీసుకొని, నచ్చితే పిల్లలనిగని లేకుంటే తద్వ్యతిరేకసాధన ముపక్రమించి పుట్టినబిడ్డలను ఏప్రభుత్వపు క్రెచీకో అప్పచెప్పిని విశ్వమానవసమానత్వము విశ్వప్రపంచసేవాపరాయణత్వము మొదలగు వ్రతములను నిర్వహించుచుండవలెను. అంతేకాని మగవాళ్లు 'కూత్ కూత్' అని పిలచినప్పుడు పాశ్చాత్యస్త్రీలవలె బయటికి పోవుచు, 'ఛీఛీ' యని కసరినప్పు డింట్లోదూరుచు కుక్కపిల్లలవలె సంచరించుట స్త్రీజాతికి చాలా అవమానకరమని తోచెడిని.

రెచ్చగొట్టితే లేచుటకూడ కేవలము స్త్రీలలక్షణమనుకొనుట పొరపాటు. పాశ్చాత్యదేశముల విప్లవములెల్లయును ప్రజలయాలోచనలకంటె ప్రభుత్వాధికారుల క్రౌర్యములు, నాయకుల రెచ్చగొట్టుటలు, ఇరువురకు సమిష్టితనము లేకుండుట మొదలగు వానివలననే వచ్చినవి. హిట్లరుజర్మనీఅంతా నాజీయే, ముసలోనిఇటలీఅంతా ఫ్యాసిస్టే, స్టాలినురష్యా అంతా బోల్షివిక్కే అంటే ఆయాజాతుల తత్వాలలో అంతేసి ప్రభేదాలున్నవనుకో కూడదని పెక్కుటీయూహ. ఇవన్నీకూడా నాయకులరెచ్చగొట్టుటలు ప్రజలవెంటబడుటలుతప్ప మరేమీ విశేషములేను. ఎవరు అధారిటీలోవుంటే వారి తత్వమే మంచిదని బోధించేవి ఆదేశపు విశ్వవిద్యాలయాలు. ఈ విధానాలలో ప్రజలకు స్వంతాలోచన లెక్కడ? అసలు ఆఆలోచనలు పుట్టనిస్తున్నారా? వాళ్ల దినాలన్నీఒకళ్లుచెప్పినవి వల్లించి అప్పచెప్పడంతోటే సరి. ఆలోచనకూడా మరెందుకు? ఇందుకే సర్. రాధాకృష్ణనుగా రీమధ్య ఒకానొక సందర్భములో ఈ యుగములో ఆలోచనదారుల సంఖ్యకంటె చదివేసుకొని వెంటబడే జనులసంఖ్య అనేకరెట్లు మించుచున్న'దని వ్రాసినారు. పురుషులుకూడా 'కూత్ కూత్ కుక్కపిల్ల'వరుసగనే తయారయే ప్రభుత్వవిధానాలు విద్యావిధానాలు పాశ్చాత్యదేశాలలో లేచి మనకుకూడా కమ్మనివాసనలు కొడుతున్నాయి. వాళ్లకర్మంకొద్దీ వాళ్లు వెంటపడితే పడ్డారుకాని భారతస్త్రీలుకూడా

## నూతనపాశ్చాత్యము

అట్టివారే అను అపకీర్తి తమకు తగలకుండా కాచుకొని యేధర్మమున కట్టిగౌరవమివ్వవలెనో నిశ్చయించుకొనవలెను అంతకుమించి తెల్లవారివలె వెల్లమీఱితే కూడా మనము వారిప్రభుత్వములో వున్నాము కనుక మన స్త్రీలుకూడ వారివలె వెనుక గెంటబడుదురేమో. ఇందుకొరకే విద్యకొరకై ఆశ్రముకంటె ప్రణాళికలయందుశ్రద్ధ నెక్కువగా బరచుచున్నారు మన భరతఖండనారీమణులు. అవి అప్పుడప్పుడు గృహలక్ష్మి ప్రకటించుచున్నది. వీరి ప్రణాళికలు కేవలము వీరికేకాక నిఖిలసభ్య ప్రపంచమునకాదర్శప్రాయములుగ నుండునని నమ్ముచున్నాము. వివిధదేశముల ప్రణాళికలకు వివరములలో పెక్కు భేదములుండును.—విశ్వమానవత్వ నెపమున నట్టి వానిని చెఱుపగడంగరాదు. అయినను ప్రధాన సమాన సూత్రములున్నవనుటకు సందేహములేదు. వానిని ప్రకటించ సాహసించువారును, సాహసించి అంగీకరించువారునే కఱవైనట్లు తోచుచున్నది! వివిధ పాశ్చాత్యదేశములు ఎన్నెన్నో ప్రణాళికలను చెఱిగి చెఱగి పోసినవి. కాని యేదియును స్థిరముకాలేదు. గుణమునీయలేదు, పెక్కువికారములను విపరీతములను గూడ కూర్చినవి. భారత నారీమణులు వానిని మించిన ప్రణాళికలను తయారుచేతురుగాక! ధనము వమ్ముకాని, కాలము వ్యర్థముకాని, గుణము వసివాడని, హాయికి లోపముకూడని, సంసారములను రంజింపంజేయు, మోక్షసామ్రాజ్యము నరచేతగూర్చు, గ్రామగ్రామమునను సాధారణజనులుకూడ నెలకొల్పుటకు సులభసాధ్యమగు విద్యావిధానము కావలసియున్నది. ప్రతికులము, కుటుంబము, వ్యక్తి అందు మిలమిల మెఱయుచు హరువు కూర్చుచుండవలెను. బుద్ధిమంతులుకారు దీనిని వ్రాయవలసినవారు, యోగులు యోగినులు. అట్టివారికి నేటిభరతఖండమునగాని ఆంధ్రదేశమునగాని కూడ కొఱతలేదు. అట్టి ప్రణాళికలను గృహలక్ష్మి తప్పక ప్రకటింప గలదు.

# గ్రంథపరిచయము

**భక్తి హృదయము** — క్రౌనుసైజు 60 పుటలు. వెల రూ. 0—4—0 లు గ్రంథకర్త షాన్నూరుబాపయ్యగారు, దొప్పలపూడి, మన్నవపోష్టు గుంటూరు జిల్లా. అంకితము దొప్పలపూడివాసుడగు శ్రీమన్మల్లేశ్వరస్వామికి. 105 సీసపద్యముల శతకము. ప్రతి పద్యమును శుద్ధమై సుందరమై అనుభవకలితమై భక్తిరసమిళితమై అవాఙ్మానసగోచరుడగు నభవుని లోచన గోచరు నొనరించుచున్నది. ప్రతులు కవిగారి యొద్ద మూల్యమునకు లభించును.

**శివకర్ణామృతము** — క్రౌనుసైజు 20 పుటలు. గ్రంథకర్త శ్రీయుత చల్లపిల్లి అప్పారావుగారు బి. ఎ. బి. యల్. బందరు. శంకరుని శివానందలహరికి తెలుగు భాషాంతరీకరణము. అపూర్వకల్పనలు, అలంకారములు, గాథలు, గంభీరశయ్యలతో రాజించు శ్రీశంకరుని శివానందలహరిస్తోత్రములను వానికి వేనికిని లోటురానీకుండ అతి సులభమగు ఆంధ్రపద్యములలోనికి మార్చుట చక్కనిప్రజ్ఞయనవలెను. ఇది యిట్లుండకున్నచో భాషాంతరీకరణముయొక్క ప్రయోజనము వ్యర్థమైయుండెడిదనుట కాటంకము లేదు.

**శ్రీమాన్ పరవస్తు జియ్యరు సూరిగారి జీవితము** — క్రౌనుసైజు 42 పుటలు. వెల రూ. 0—4—0 లు గ్రంథకర్త శ్రీమాన్ ఎంబార్ భాష్యాచార్యులుగారు, జగదానందనిలయము, శివసముద్రము, బెంగుళూరుసిటీ పోష్టు. 1850 మొదలు 1895 వరకు జీవించి మహాభక్తవిజయము వంటి ఉత్తమవచనగ్రంథమును పెక్కుబద్యగ్రంథములను రచించి ఆంధ్రమున బ్రకటించిన విద్వాంసుని జీవితము సంగ్రహముగ బొందుపరచబడినది. దీనివలన గ్రంథకర్తగారి గ్రంథముల కితోధికవ్యాప్తి కలుగకమానదు.

**మోటారు మాన్యూలు** — 430 పుటలు. రూ.2—8—0 లు వెల. శ్రీయుతులు పి. పట్టాభి శీతారామయ్య డి. రామచంద్రమూర్తిగార్లు గ్రంథకర్తలు. ఇట్టి యంత్రసంబంధవిద్యాబోధకగ్రంథ మెన్నడును ఇదివరకు తెలుగున వెలువడలేదు. తెలుగైనను తేటతెలుగు. విషయము బోధకముగ తెలుపబడినది. ఆంధ్రదేశమున పెక్కు మోటారుస్కూలులు లేచివానిలో నెల్లనిది పాఠ్యగ్రంథము కావలెనని కోరుచున్నాము. ఇంచుక గురుసహాయమున్నచో యిట్టిగ్రంథమువలన నెవ్వరైనను మోటారు ఎక్స్పర్టులు కావచ్చును.

**మెకానిక్సు గైడు** — క్రౌనుసైజు 132 పుటలు వెల రూ. 2—0—0 లు ఇది కేవలము మోటారులుమాత్రమేకాక సకలవిధములగు యంత్రములును యెట్లు తయారుచేయబడునో ఎట్లు చలించునో ఎట్లు పనిచేయునో చేయించవలయునో తెలియజేయు గ్రంథము. గాంధిమహాత్ముని గృహపరిశ్రమలయందు మనకు మిగుల గౌరవమున్నను వానికి కొన్ని చిన్న చిన్న యంత్రములు మిగులసహకారులు కాగలవు గనుక వీటిచరిత్ర మనకు కరగతముకావలెను. ఇందుకై ప్రథమప్రయత్న మొనరించిన కవిగారిని ప్రస్తుతించెదము. గురువు పరికరములు రెండు ఉన్నచో

ఈపుస్తకమును గ్రంహించుట సులభము. ఇందుకుతగిన తెలుగుపాఠశాలలు తెలుగుగురువులు శీఘ్రముగ ఆంధ్రగ్రామముల నచిరకాలమున శ్రీ వెలయుగాక యని కోరుచున్నాము. గ్రంథకర్త శ్రీయుత కోట యజ్ఞనారాయణశర్మగారు చింతగుంటపాలెం, మచిలీపట్టణము, కృష్ణాజిల్లా. వీరియొద్దనే యీ పై రెండు పుస్తకములేగాక పెక్కు యంత్రగ్రంథములు దొరకును.

సునిశిత వైద్యము — డాక్టరు ఇ. డి. బ్యాబిట్టుగారు ఆంగ్లమున పెక్కు ప్రకృతిగ్రంథములు వ్రాసిరి. ప్రకృతివైద్యములో అందె వేసిన చేయియైన బెజవాడ వైద్యులు పుచ్చా వెంకట్రామయ్యగారు పెక్కింటిని తెలుగు పరచిరి. ఇది వానిలో తలమానికము. ఏడు వందల పుటల పరిమాణము గలిగి రూ. 4—8—0లు వెల చేయుచున్నది. ఇది ఆంగ్లగ్రంథానువాదమే యయ్యు ఆంగ్ల హైందవ విజ్ఞానముల పరిచయము నెల్ల గ్రుమ్మరించుచున్నది. సూర్యకిరణస్నాన మిందలి విషయము. సూర్యుని వివిధకిరణములు వాని ప్రత్యేకలక్షణములు అవి పడుసమయములు, ఇతర సమయముల వానిని సృష్టించు విధులు మొదలగు మహాద్భుతముల నెన్నిటినో యిది ప్రకటించును. అనేకుల అనుభవము లిందు కథలరూపమున ప్రకటితములు. పారిభాషిక పదపుంజమును గాక, వానినిత్రోసి రాజును చేయక సామాన్యులెల్లరు హాయిగా చదువుకొని అనుభవైక వైద్యులు కాగల వవలవలెనున్నది. గ్రంథకర్తగారు పడినశ్రమకు వారుచేసినసేవకు బదులుగా ఆంధ్రు లెల్లరు దీనిని పఠించి పరిజ్ఞాతలగుదురుగాక !

హంస విజయము — గ్రంథకర్త్రి శ్రీమతి కాంచనపల్లి కనకమ్మగారు, 71 లాయిడ్సు రోడ్డు మైలాపూరు. వెల రూ. 1-0-0. ప్రబోధచంద్రోదయము తరువాత నిట్టి వేదాంతనాటకము జనించలేదు విషయముత్కృష్టము. పాత్రలు ప్రాపంచికములు. వేదాంత తత్వములతోమాత్రము గ్రంథమెల్ల నుండిరెు తత్కృంగారహాస్య రసములకుగూడ నెడమిచ్చుటవలన నాటకము ప్రపంచసహజముగనున్నది. ఈ రెండును అతి లలితములుగనున్నవి. కాని ఇట్టి యుద్గ్రంథముల కనుచితమగు రీతిని కవయిత్రి మితిమీఱించలేదు. ఆధునిక నాటకరచనా శిల్పకళలో నిట్టి నైపుణ్యము గల నాటకము వేరొండు లేదనుటలో అతిశయోక్తి యేమాత్రమును లేదు. కవయిత్రి యోగిని కాకున్నచో ఇట్టి యోగసిద్ధమైన గ్రంథము వ్రాయుట దుర్లభమని తలంతుము. శైలి యామెకు అతిసహజమైనదయ్యు, ఇట్టి నాటకమున కంతకంటెవేయిరెట్లు సహజమైనట్లు కాన్పించును. నాటకపాఠకులకును ప్రదర్శనదర్శకులకును గూడ ఉత్తమప్రపంచ జీవనమును నడపుచు ఉత్తమోత్తమ తత్వమున లీనమగు అసామాన్యప్రజ్ఞ లల వడజేయుననుటకు సందేహములేదు. సర్ రాధాకృష్ణ దేశోద్ధారిక, జయపురాధీశ, కవిసార్వభౌమ, చెళ్లపిళ్లకులచంద్రాదులెల్లరును దీనిని వేనోళ్ల గీర్తించినారు గనుక కవయిత్రి జీవితము ధన్యతమము.

అష్టాంగ వైద్యావధానము — గ్రంథకర్త వైద్యావధాని, కవిరాజ, కందుకూరి వెంకటసుబ్బారావుగారు, అమృతాశ్రమము, ఏలూరు. ఇది యొక అపూర్వమైన అవధానము. ఇందు కాయచికిత్స, గ్రహచికిత్స, బాలచికిత్స మొదలగు విషయములనుగూర్చి ప్రవీణులగు వైద్యులు అవధానిని పృచ్ఛింతురు. అతను సంగ్రహపద్యములలో పూర్ణమగు నుత్తరములనెల్ల నిమిడ్చి చెప్పును. అవి నిస్సందేహములు. కవిత్వము వైద్యము ఈ రెండింటిని పూర్తిగా తెలియగలవారు దీని నాదరింపజాలరు. ఏలూరులో బెజవాడ వెంకటస్వామిగారి అధ్యక్షతను జరిగిన యీ అవధానమునందలి పద్యములే యీగ్రంథము.




## సంపాదకీయములు

**దసరా సంచిక :—**

గత సంవత్సరపు దసరా సంచికవలె నిదియు సర్వాంగసుందరమై పఠితలకరము లను జేరుచున్నది. ఒకరిద్దరి వ్యాసములు, సంపాదకరచితములును తప్ప తక్కిన వ్యాస ములెల్లయు నారీమణులు వ్రాసినవే. పద్య గద్య వ్యాసము లొకటికొకటి యీడు తీయక ముచ్చటలు గొలుపుచు పురుష రచనముల కెందున నీడుతీయక కొన్ని యెడల మిన్నలుగనున్నవనుట కేవలము స్తుతివాక్యము కాదనియే మా తలంపు. రచనావకాశములు ఆదరణములు నొసంగి నచో ఆంధ్రనారీమణు లింకను మిన్నలు కాఁగలరనుటకు సందేహములేదు. గృహ లక్ష్మి యింతవరకు ఆంధ్రరచయితల వ్యాస ములను బ్రకటించు భాగ్యమేగాని గౌర వించు భాగ్యము మిక్కిలి పట్టలేదు. నారీ మణులలో రచనానైపుణ్యమును బెంపొం దింప గృహలక్ష్మి యువ్విళులూరుచున్నది. సంపాదకులు నిర్ణయించిన ఒక అంశమును గూర్చి చందాదారులైన స్త్రీలు ఒక్కొక్క వ్యాసమును వ్రాసి పంపవలెను. వానిలో మేల్తరములు గృహలక్ష్మి ప్రకటించును. సంవత్సరాంతమున శ్రేష్ఠతమమని పెద్దలు నిర్ణయించినదాని కొక పసిడిపతకము నర్పింపగలము. విజయమందిన నారీమణి నామమును యేఁటేట దసరా సంచికలోఁ బ్రకటించి బహుమతి నందచేయగలము. ఈ సంవత్సరమున వ్రాయువారు ఈదిగువ యంశమునుగూర్చి వ్రాయవలెను. "స్త్రీ పురుష సమానత్వ మేయే విషయముల నత్యావశ్యకము, ఎందైన అనర్థదాయ కమా?"

**మహాత్ముని వర్ధంతి:—**

మహాత్ముని వర్ధంతి 15 సంవత్సరముల నుండి భరతఖండముననెల్ల జరుగుచున్నది. మొదటి సంవత్సరములలో ఊరేగింపులా, ఉత్సవములా, దేశీయకీర్తనలా, ఉపన్యాస ములా, కద్దరు వర్తకములా, రాట్నముల యేకుల ప్రదర్శనములా విక్రయములా, ప్రతిపట్టణమును కలకల లాడుచుండెడిది. అతిపరిచయమువలన వీనిలో ననేకము ముచ్చటలు తగ్గుటో, అనుమాయితగా జరుగుటో తటస్థించుచున్నది కాని కద్దరు ఉత్పత్తికి తగినంత ఉద్రేకము ఉత్సాహము నాయకుల ఉపన్యాసములు క్రియలు కలి గించలేదనియే చెప్పవలెను. కాంగ్రెసు అంటే ఓటులు మోసుకొనివచ్చే బండియే కాక కార్యనిర్మాణసాధనమనికూడ నమ్ము నాయకాగ్రేసరులు కావలెను. కాంగ్రెసు

ఆఫీసులలో వోటర్లలిస్టులు తప్ప కద్దరుబట్ట, రాట్నములు, యేకులు కానరావు. వడుకు నూలు సంఘపు కొట్లలోనే కేవలము బట్ట తప్ప ఇట్టివి కరవైనవన్న కాంగ్రెసు సంగతి యడుగనేల? రాట్నములు యేకులు విరివిగా చెల్లవు కనుక అమ్ముటలేదనుట కాంగ్రెసు వర్తకులకు తగిన నీతికాదు. అది శుద్ధపెట్టుబడిదారుల నీతి. ప్రబోధము నిర్మాణము నీడుజోడుగ సంతతము పరుగిడుచుండవలెను. ఈ సంవత్సరారంభము నుండియైనను వీనినిగూర్చి నాయకులు శ్రద్ధబూని కద్దరు నిర్మాణ వ్యాప్తిని హెచ్చింతురుగాక యని హెచ్చరించుచున్నాము.

ఆంధ్రము—హిందీ :—

ఆంధ్రదేశములో హిందీప్రచారానుకూలపక్షము ప్రతికూలపక్షము అని రెండు వాదములున్నవి. హిందీ యెప్పటికైన జాతీయభాష కానుండుట, గాంధీజీ కాంగ్రెస్సులు దానికి చేయూతనిచ్చుచుండుట, ఇప్పటికే బహుళసంఖ్యాక సంభాషితమైయుండుట, కాంగ్రెసు ఉపన్యాసము లాభాషలో జరుగుచుండుట మొదలైనవి హిందీ అనుకూలవాదుల వాదమున కాధారములు. "హిందీ ప్రచారమువలన దేశీయులకు మాతృభాషయం దభిలాష తగ్గుచున్నది; ఆంధ్రభాష అసడ్డ చేయబడుచున్నది; హిందీ ఆంధ్రులెల్లరికి తెలిసి జనసామాన్య మెఱుంగగలయంత ప్రచారమునంది అది అలవాటయినచో, ఆంధ్రభాషయొక్క రూపురేఖలే పూర్తిగా మారిపోవును; హైదరాబాదు తెలుగువలెతాసునాసగును; రాజభాషయగు ఇంగ్లీషు తప్పని సరియై మీదపడి తెలుగుభాషయందలి శ్రద్ధ నీవరకే చాలా తగ్గించుచుండగా దానికి హిందీకూడా సాయము కావలెనా? హిందీభాషవారికి వారిభాష జాతీయభాష కావలెనను నంతటి అభిలాషపుట్టి దాని ప్రచారమునకు లక్షలకొలది ధనము సమకూర్చి వెచ్చించు అభిమాన ముండుచుండగా, ఆంధ్రులకు తమ భాషకు ద్రోహము ధ్వంసము కూర్చియైనను హిందీని పట్టి ప్రాకులాడగలయంతటి పిచ్చి యేల పుట్టవలెను? హిందీకి భరతజాతీయ సామాన్యభాష కాగలయంతటి రోజే వచ్చినచో ప్రజలు అప్పుడే నేర్చుకొనవచ్చును; ఇప్పుడు ఎవరో ఒకరిద్దరు నేర్చుకుంటే స్వయముగా నేర్చుకోనీయండి కాని ప్రచార సంస్థ, పాఠశాలలు, తరగతులు, పరీక్షలు, ప్యాసులు ఈగోల యేల?" అను నీ మొదలగునవి ప్రతికూలవాదుల వాక్యములు.

"ఇతరభాషలు నేర్చినంతమాత్రముననే మన మాతృభాషాభిమానము తగ్గదు; పైగా హెచ్చును; హిందీభాషా ప్రచారమున మనభాషయొక్క రూపురేఖలు మాఱవు, అది సుస్థిరభాష; రాజభాషయని ఇంగ్లీషు కొరకు చెవులుకోసుకుని భూములమ్ముకొని ఒడలు చెడగొట్టుకొని అంతకష్టపడుచున్నామే, భారతజాతీయైక్యతకు సాధనభూతముకానున్న హిందీకొరకు అందులో

వేయోవంతు శ్రద్ధ పెట్టినంతమాత్రమున మాతృభాషా ద్రోహమగుచున్నదా? మన మీనాడును ఏహిందీ ప్రయత్నమును చేయక అది సామాన్యభాషయైన మర్నాడు నేర్చుకొనవచ్చుననిన న్యాయమా? మన ప్రయత్నములవలన అట్టి సుదినము సౌసన్నము చేసుకొనుట మనవిధి కాదా? హిందీ ప్రచారసభ అంటూ ఒకటి ఉండి ప్రచారము చేయఁబట్టి యీమాత్రము శ్రద్ధయైనను దానిపై కుదురుచున్నది కాని అది అసలే లేకుంటే హిందీ నేర్చుకోఁ గోరువారికి కూడ అవకాశమెట్లు చిక్కఁగలదు?" అనునీ మొదలగునవి ప్రచారానుకూలుర సమాధానములు.

వీరిలో నెవరికిఁగాని మాతృభాషాభిమానము కొఱతయని చెప్పఁజాలము. "హిందీభాషా ప్రచారమాత్రమున నిజముగా ఆంధ్రభాషకు గాని మరియే యితరభాషకు గాని చేటువాటిల్లునేమో చెప్పఁజాలము. నాటు తెలుగుదేశములోనున్న తెలుగువారెల్లరును తమ తెలుగుతనమును తెలుగు భాషను శుద్ధముగా విసర్జించి, హిందీ మాట్లాడుకొని ఆనందించుటలోనే తరణోపాయమున్నదని గర్వించునాడు తప్ప అట్టి చేటువాటిల్లకపోవచ్చును. అట్టి సూచన లిప్పుడట్టె గోచరింపకున్నను అయిదారు శతాబ్దములనాటికి బాగుగా విశదముకాక మాన"వని ప్రతికూలవాదుల నిశ్చయము. అట్లు జరుగదని అనుకూలవాదులధీమా. జ్యోతిష్కులు తప్ప యితరులు దీనిని నిర్ణయింపఁజాలరేమో!

ఏదియెట్లున్నను ఒక్కమాట నిజము. ఆంధ్రనాయకుల కాంధ్రరాష్ట్రము, ఆంధ్రవ్యక్తిత్వము, ఆంధ్రభాషాభివృద్ధి మొదలగువానియందలి ఆసక్తికంటె అఖిలభారత భాషాభ్యాసము స్వరాజ్యము మొదలగు అఖిలభారత సమస్యలలో ఉద్రేకములు హెచ్చి తమకు చెందినసమస్యల సవ్యముగ దిద్దుకొను శ్రద్ధనెల్ల పూర్తిగ వారు తుడిచిపెట్టుకొనుచున్నారని యువజనులలో నొక తీవ్రతరాందోళనము ఆవేశము బయలుదేరినవి. ఏ అపాయము పొడకట్టినను ముందరి పిడుగు ఈకాలములో పాపము నాయకులపై పడకతప్పదు. అరవ మదరాసు రాజధాని ప్రభుత్వమువారు, కన్నడపు మైసూరు రాజప్రభుత్వమువారు ఉరుదూ నైజాము ప్రభుత్వమువారు తమ ప్రాంతములగల ముప్పది, పది, డెబ్బదిలక్షల ఆంధ్రుల నిమిత్తమై, అంతకంటె అల్ప సంఖ్యాకులగు ఇతరభాషవారికిచ్చెడి సౌకర్యములనుగూడ కలుగజేయక వారిభాషను రూపుమాపుచున్నారు. ఇది మనకు ప్రత్యక్షము, అనుభవసిద్ధము. వారికి అఖిలభారతజాతీయసమస్యలకంటె తోడిభాషల కీయవలసిన తగిన స్థానముకంటె తమభాషాభివృద్ధికొరకు అధిక సంఖ్యాకులగు ఆంధ్రుల ప్రతిభనడంచు పట్టుదల యెక్కువగానున్నట్లు తోచుచున్నది. ఇకను ఓఢ్రులమాట చెప్పనక్కర లేదు. వారు మనరాష్ట్రమునుండి పెద్ద ముక్కను దిగమ్రింగుటయేగాక నూతన రాష్ట్రములో మైనారిటీసమస్యను మిగల్చిరి. అనగా ఆంధ్రభాష మాట్లాడువారిని శిక్షించ

వలెనని ఒక శాసనము ప్యాసుచేసుకొన్నచో అశ్చెరువులేదు.

ఇట్టి దురవస్థలకు కారణము ఆంధ్ర కాంగ్రెసు నాయకులును మితవాద నాయకులును ఇతర రాష్ట్రనాయకులతోడి చెలిమి యెక్కడనశించునో అను భయము వల్లను, అఖిలభారత సమస్యాప్రాముఖ్యత పైని గల శ్రద్ధాధిక్యమువల్లను, ఆప్రాంత ప్రభుత్వములలో సపౌరుషముగా వాదింప మియు పోరాడమియు నై యున్నది. నూరు సారులు పెద్దలుచెప్పినప్పుడొకసారియైన వినని ప్రభుత్వములుండవు. వీరి లొక్కువ చూచుకొనియే ఓఢ్రనాయకు లవతల పార్లమెంటుసభ్యుల కేమి మందులుపోసియో తమ పందెము నెగ్గించుకొన్నారు. సత్యమూర్తి ప్రభృతులు మదరాసు ఆంధ్రులను త్రోసి రాజుచేయజూచుటయేగాక, అవతల ఓఢ్రు లను ఇవతల పశ్చిమాంధ్రాదులను మనపై పురికొల్పుచున్నారు. ఎన్నిచేయుచున్నను మనకుఅఖిలభారతసమాఖ్యసమస్యలు అఖిల ప్రపంచసోషలిష్టుసమస్యలే ప్రధానములు. ఆంధ్రపత్రిక లాంధ్రత్వసంబంధమైన యిట్టి ఆందోళనలు చేయవు. ఆంధ్రనాయకులు ఆ ప్రభుత్వములవద్దకో గవర్నరులవద్దకో ఇందుకొరకై రాయబారములేగరు. పైగా హిందీప్రచారసమస్య వచ్చుసరికి మూడేసి తావులకు మించిన కార్యప్రణాళికలను కాంగ్రెసు సంబంధములేని నాయకులు గూడ కుటిపించుచుందురు. ఇది కేవలము హిందీభాషాభిమానమో, ఆంధ్రత్వ నిర్లక్ష్యమో, రెండునుకాని శుద్ధకీర్తికామ కత్వమో ఊహింపలేము. ఇతర ప్రాంతముల వారు తమ ప్రత్యేకత్వములో మునిగి విశ్వ భారతముపైని అలికన్ను వేయుచున్నారు గనుక మనమును వేయవలెనని యెవ్వరును అనరు. అయిననుఇట్టిప్రత్యేకపుగగ్గోలులతో నిండుచున్న ఆధునిక భారతప్రపంచములో ఆంధ్రనాయకు లించుకంత తమవ్యక్తిత్వము వైపు దృష్టి త్రిప్పక యెండమావులలో మునుగనుంకించుచుండుటచూచి కొందరికి ఒడలుమండి ఆంధ్రాభిమానప్రబోధము మిక్కిలి ఘాటుగా నొనరించుచున్నారు. నాయకదూషణ దుర్బుద్ధులుగాక స్వనష్టపరి వేదనలు మాత్రమే వారినిట్టి వ్రాతలు వ్రాయించుచున్నవనుటకు సందేహము లేదు. ఉభయకక్షలవారి వాదములను పరిశీలించి, రాష్ట్రీయనాయకులు ఏయేవిధులపట్ల తమ కర్తవ్యతాభార మెంతెంతయున్నదనువిషయ మును నిశ్చయించుకొని తత్తదుత్తమాచరణ మునకు గడంగుటయే ప్రస్తుతకర్తవ్యము.

గృహలక్ష్మిలో గడచిన జనవరి ఏప్రిల్, జూలై సెప్టెంబరు సంచికలలో శ్రీమతులు కనుపర్తివరలక్ష్మమ్మ దివాకర్ల శారదామణిగార్లు వ్రాసిన చర్చలవలన అనేకాంశములు పాఠకులకు విశదమైనవనియే మాతలంపు. శ్రీమతి వరలక్ష్మమ్మగారు హిందీభాషా ప్రచారమువలననే ఆంధ్రము నశించదనియు, కాంగ్రెసువారి ఆజ్ఞప్రకారము అఖిలభారత సామాన్యభాషకానున్న హిందీపై అన్ని రాష్ట్రములవారివలె మనమును తగుశ్రద్ధ పరుపవలెననియు ఒకరినిచూచి ఒకరు

హిందీని తెగతిట్టుటలో అర్థములేదనియు చక్కగా సమర్థించి బోధించినారు.

"హిందీభాషయు ఆంధ్రభాషయు వేర్వేరు కుటుంబములకు చెందినవి.ఆంధ్రభాష బాగా రాకుండా హిందీభాష చిన్నతనమునుండి గరచువారికి వారి భాషాసంప్రదాయము తప్పక చెడును. హిందూదేశమున కంతటికి ఒకసామాన్యభాష సరిపడదు. వింధ్యపర్వతో త్తర భాగములకు హిందీ, దక్షిణభాగము లకు తెలుగు రెండు సామాన్యభాష లుండ వలెను. ఉత్తరమున హిందీ దక్షిణమున తెలుగు అధిక సంఖ్యాకభాషితములు. రాజకీయభాషగ కాక సామాన్యభాషగ కాక హిందీని దక్షిణాత్యులు సరదాగా స్వంత వ్యవహారములకై సాహిత్యశ్రద్ధతో అభ్యసించుటమాత్రమే చేయవలెను". ఇది యించుమించుగా శారదామణిగారివాదము.

వీ రిరువురి వాదములయందును పాఠకులును నాయకులునుగూడ కడుంగడు శ్రద్ధనుబూని హిందీని తమమీదికి మీటిం చుకొనకను, ఆంధ్రమును క్షీణించక విజృం భించునట్లును సర్వప్రయత్నములును చేతురు గాక !

మా 'గృహలక్ష్మి' యొక్క కొన్ని సంచికల నీ సంబంధమగు వాదన వ్యాసము లతో నింపిన శ్రీమతు లిరువురును విద్వాం సులు, భాషాభిమానులు, సుప్రసిద్ధ వచన రచనాధోరణీధురీణలు, అగాధ విజ్ఞాన విభాసితలు, అపూర్వ సుందర ప్రౌఢశైలీ సుభాషితలు. వా రొనరించిన, ఒనరించు చున్న సేవలకు గృహలక్ష్మి యెంతయు కృతజ్ఞురాలు. అయినను 'ప్రమాదోధీమ తామపి' యనుటచేతనో, కేవల విషయ చర్చామాత్రముతో వ్యాసములను వ్రాయు నేర్పు చర్చాపద్ధతియం దసలే అసాధ్య మగుటనో యేమో చెప్పజాలము కాని, ఒకరిరచనలవలన ఇంకొకరికి మనస్తాప ములు కలిగినవి. చర్చలులేకున్న సారములా తేలవు,ఉన్న మనస్తాపములను తప్పవాయేమి చెప్పుమా యనిపించకమానదు. అయినను అట్టివానిని తప్పించుకొనుట కష్టముకాదు. తప్పదనుపట్ల చర్చలకు దిగకుండుట లెస్స యేమో ! కనుక యికముందు చర్చలకు దిగువారు ఈయొక్క సాధకబాధకములను మాత్ర మాలోచించుకొని, అట్టి విషయ ములనుమాత్రము విడిచిపెట్టి అసలు విష యమునుగూర్చి వాదించినచో నెంతయు బాగుండును. పేరు ప్రసిద్ధులుపొందిన నారీ మణుల వ్యాసములను సవరించుటకుగాని త్రిప్పివేయుటకుగాని గృహలక్ష్మివంటి పత్రి కకు తాహత్తుతక్కువ. అసలులో గృహ లక్ష్మి నారీజనసేవ కుదయించి వారిలోని మిన్నలవ్యాసములను ప్రకటింపకున్నచో ఆక్షేపణీయము కాకపోదు. ఈమాత్రమును పత్రికా సంపాదకీయలోపముగగాని పక్ష పాత చిహ్నముగఁగాని యెవ్వరును పరిగ ణించరని నమ్ముచున్నాము.

శ్రీ వరలక్ష్మమ్మగారు వాదనోద్దేశమే మాత్రమునులేక కల్పలత కొకలేఖను జనవరి నెలలో వ్రాసినారు. శ్రీ శారదామణిగారు దానికి ప్రత్యుత్తర మిచ్చుటవలన

వరలక్ష్మమ్మగారిది ఈ వాదనకు మూలమైన ప్రథమవ్యాసమైనది. ఈ వాదమున నామె కంత్యావకాశమిచ్చు భారము గృహలక్ష్మిది. ఈ సంచికలో ఆమె అంత్యావకాశము తీసుకొన్నారు. కనుక దీనిపై నెవ్వరునుగాని మరి లేఖలుగాని వ్యాసములుగాని వ్రాసినచో ప్రకటింపబడవు.

ఇటలీ గడబిడ:—

శరదృతువు వచ్చినది. దసరా నవరాత్రములు వెడలుచున్నవి. వీరులు యుద్ధసన్నద్ధులై ధర్మసంరక్షణార్థము జైత్రయాత్రలు వెడలు సమయ మాసన్నమైనది. భారతీయు లట్టి యాత్రలను చాలా కాల మాయను మఱచినారు. ధర్మరక్షణార్థమో దుష్టశిక్షణార్థమో పాశ్చాత్యులింకను ఇట్టి యాత్రలు సాగించుచున్నారు. వీరిలో ఇటలీ తలమానికమైయున్నది. ఇటలీ జనసంఖ్యను ముసలోని పెంచినాడు, సైనికశిక్షణములు గఱపినాడు, వైమానిక బలము హెచ్చించినాడు, ఇందుకెల్ల పెద్ద మొత్తము వ్యయమైనది, ఈ నష్టము పూర్తి కావలెను, ఇతర బ్రిటను, ఫ్రాన్సు సామ్రాజ్య దేశములతో సమానముగ అతనికి వలస రాజ్యములు చిక్కవలెను, ఆఫ్రికాలో అబిసీనియా తప్ప యితర భాగము లప్పుడే యెవరికో ఒకరికి వలస రాజ్యములే!! నల్లజాతియగు అబిసీనియాకు స్వాతంత్ర్య మెందుకు, దానిని యేదోమిషతో హరించు టే ధర్మమని పోపువంటి మతాధికారులే చెప్పుచున్నారు. ఎట్లైనను యుద్ధము రానీయకండి, జాతిసమితి గౌరవమును కాపాడండి, తగవు పరిష్కారముచేయండి, మీతీర్పు వింటానని శిష్టుడగు అబిసీనియా చక్రవర్తి అంటున్నాడు. జాతిసమితి యెట్టి తగవు చెప్పగలదో నాకు తెలుసును, నేను దానిని విననుండలేదు, నాకు ప్రతికూలముగ వర్తించిన సర్వులకు బుద్ధి చెప్పెదనని ముసలోని ప్రకటించుచున్నాడు. ఇటలీకి ఇట్టివలసరాజ్యమువచ్చిన తనను మించిపోవునేమో అని బ్రిటను భయము. ఇటలీ స్నేహము తనకు తప్పపోయినచో జర్మనీ తనను మ్రింగివేయునేమో అని ఫ్రాన్సు భీతి. యుద్ధమంటూ వచ్చి పదిమందీ అయిరోపానుండి ఆఫ్రికాకు చెదరినయెడల నాచూపు నేను చూచుకుందునని జర్మనీ ధీమా. వీరిలో యెవరు గెల్చిన నాకేమి, యెవ్వరును నా తత్వమువారు కారు, అందరు నామీద పడవలసినవారే, యీ మధ్యనే కష్టముమీద కోలుకొన్న నాకు వీరితో నేమి ప్రయోజనమని రష్యా తూష్ణీభావము. యుద్ధములు లేచినచో నా వర్తకము మరింత బాగుపడును గదా యని జపాను ఆశ, ఊరిమీద ఊరుపడినను కరణముమీద కానుపడదని అమెరికా సమ్మకము, ప్రపంచమంత పిడుగుపడితే మనము క్రిందివారమా మీదివారమా అని ఇండియా, చీనా మొదలగు దుర్బల ప్రాచ్య నాగరక దేశముల నిరాశ. ఈవిధముగా ఆధునిక ప్రపంచము కొట్టుకొనుచున్నది. ప్రతివారికీ తాము పెద్దయంత్రాలు పెట్టి, పెద్ద ఉత్పత్తిచేసి, అన్నిదేశాలకు పంపి

పెద్దలాభాలు తీసుకొని, పెద్దసామ్రాజ్యాలు కట్టుకుందామని ఒకటే దురాశ. పాశ్చాత్యుల ఆటలు సాగుటకు ఆఫ్రికా మొదలగు ప్రాచ్యదేశములుతప్ప గతి లేదు. వాటికి స్వాతంత్ర్యమున్న వీటికి కంటకము కాకమానదు. వీరి కాయుధములు లేకున్న అవి స్వతంత్రములు కాకమానవు. ఆయుధములుగల జాతు లా ఆయుధముల నొకరిపైనొకరు త్రిప్పకొనుట మానజాలరు. ప్రళయము రాకమానదు. రౌండుటేబిలుసభలాగ రాయబారుల సంప్రదింపు ఒక్కటితప్ప ఇట్టి పరిస్థితికి విరుగుడులేదు. రాయబారపద్ధతిలో మొండివానిపద్ధతి గెలుచునట్లగుపించును. ఇటలీ మొండిపట్టు పట్టినది. బ్రిటను ఫ్రాన్సులుకూడ అంతమొండిపట్టులు పట్టిన ప్రళయము తప్పదు. ప్రపంచ ప్రళయమునకు వెఱచి ఇటలీ కోరినదెల్ల అవి రెండును దాఖలు చేసుకొనకతప్పదని ముసలోని యూహాయేమో! అతని కోరిక లన్యాయము. లాంగవద్దు యుద్ధమునకు దిగండి అని ఇతరు లా దేశముల బురికొల్పుచున్నారు. కాని అవిమాత్రము భయపడక పోలేదు. ముసలోని లాంగుతాడేమో అని అవి బెదిరించుచున్నవి. ఇటలీ సర్వనాశనమగుటకైన సమ్మతించునుకాని ఇట్టి చిట్టి చిట్టి సబబుల కొప్పకోదు. ఇట్టి పట్టుదల ముందర ప్రపంచ ప్రళయమైనా కళ్లచూస్తామనే మొండిపట్టుదలకంటె ఇటలీ కోరికలను మూడుపాళ్లైనా ఫ్రాన్సు బ్రిటను, ఒకరి మెడను ఒకరు వంచుకొనియైనను, ఒప్పకొనకతీరదు. అబిసీనియాస్వాతంత్ర్యమును సంరక్షించడముకొరకు కంకణము కట్టుకొన్నది వీనిలో నే జాతియును కాదు. నల్లజాతుల స్వాతంత్ర్యము లెన్నిపోయినను ప్రపంచములో అయుధసమేతమైన శాంతిని నెలకొల్పుటే ప్రస్తుత ప్రపంచనీతి! ఇందులో ఎన్ని నల్లదేశములు మునుగలేదు? అబిసీనియాకు తప్పతుందా? తప్పితే ఆశ్చర్యమే!!

**ఉన్నత బాలికల పాఠశాల:—**

దక్కను హైదరాబాదునందున్న 'ఉన్నత బాలికల పాఠశాల' క్రమక్రమముగ ఒక ఆదర్శపాఠశాల కానున్నదనిపించును. ఇది స్థాపించబడి యేడేండ్లు మాత్రమయినది. ఉన్నతవిద్య మాతృభాషామూలమున నేర్పుదురు గనుక కుటుంబినులు వితంతువులుగూడ యిందు చేరుచున్నారు. ఒకటవ తరగతి మొదలు మెట్రిక్యులేషను వరకు 1934-వ సంవత్సరమున 188 గురు విద్యార్థినులు విద్య నేర్చిరి. మెట్రిక్యులేషను పరీక్షకు తొమ్మండుగురు వెళ్లి ఆరుగురుత్తీర్ణులైరి. తక్కిన తరగతులలో 126 గురు పరీక్షలకు హాజరై 91 గురు ఉత్తీర్ణలయినారు. ఒక గ్రంథాలయము 18 గురు బాలికలతో ఒక వసతిగృహము, విద్యార్థినీ సంఘపు వారవారము సభలు, జయంతులు, విహారపర్యటనములు, దూరపు వీధులనుండి బాలికలను దెచ్చుటకు మోటారువాహనము మొదలగు సౌక

ర్యము లెన్నోయున్నవి. ఇట్టి పాఠశాల చందాలు, దానములు, దసరావసూళ్లు, వివాహకట్నములు, నాటకము వసూళ్లు మొదలగువానివలన మాత్ర మిప్పుడు నడచుచున్నది. విద్యార్థినీవేతనము లత్యల్ప మగుట ఆశ్చర్యము కాదు. సంవత్సరమునకు నాలుగువేల రూప్యముల కెచ్చుఖర్చు కనిపించుచున్నది. ముగ్గు రుపాధ్యాయులు గౌరవార్థమే సేవచేసి పాఠములు గఱపుచున్నారు. అయినను నెలకు రెండు వందలకు మించి ప్రతినెల ఉపాధ్యాయవేతనముల ఖర్చును నగుచున్నది.

ప్రస్తుతము ఉన్నతవిద్య నవీనజ్ఞానము మాత్రమే యిందు గఱపబడుచున్నవి. గృహనిర్వహణము, రోగుల యుపచారము, ప్రథమచికిత్స, చేతిపనులు మొదలగువానిని గఱప నేర్చుచున్నారు. ఇట్టి చందాలనలన వచ్చు మొత్తములతో ఇట్టి సంస్థల నిర్వహించుట కలకాలమును సాధ్యముకాదు. శాశ్వతనిధి హెచ్చినచో వడ్డీని మాత్ర ముపయోగింతురు. ఇదియును పెద్ద మొత్తముగా కూడుట కష్టసాధ్యమైన పనియే. అసలు ప్రధానసహాయము నైజాము ప్రభుత్వమువారినుండి రావలసియున్నది. ఇన్ని సంవత్సరములాయను ఈ పసిసంస్థ తన్ను కొనుచు వర్ధిల్లుచున్నను ప్రభుత్వమువారి దృష్టి యిటు మరలకుండుట విచారకరము. ఇది ఉస్మానియా విశ్వవిద్యాలయమున కనుబంధముగా నుండజాలమి యిందుకు కారణమై యుండునేమో! తమ రాష్ట్రమునందును ఇతర రాష్ట్రములయందును నెన్నియో సంస్థలకు విరాళములు కురిపించుచున్న నైజామువారు అనేక యువతీమణుల కుపచరించుచు సద్విద్య గఱపుచు సజ్జీవనమార్గములు చూపుచున్న యీ పాఠశాలను నిర్వహించు భారమును పూర్తిగ గైకొందురుగాక! ఇది కేవలము మహిళాసంస్థ కనుక పూనానగరమునందలి కార్వే విశ్వవిద్యాలయమునకు అనుబంధముగానుండి అట్టి ప్రయోజనములను బడయ గడంగక తీరదు. ఇంతమాత్రమున నైజాముగారి ఆదరణ భాగ్యమునకు వెలికాదనియే సంస్థ కార్యదర్శులు శ్రీయుతులు బూర్గుల రామకృష్ణారావు మాడపాటి హనుమంతరావుగార్లతోపాటు మేమును కోరుచున్నాము.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# వనితాలోకము



కె. జానకి

కె. శాంత

ఈ పెద్దబిడ్డ బహుమనోహరముగా పాడగలదు; అది యట్లుండగా 'అనుకరణము' అనగా మరొకరు పాడినట్లు పాడుట యందు మంచి శక్తి సంపాదించి యున్నది.

శ్రీ॥ జాధవకన్య

ఉపాధ్యాయినీ వృత్తియందధికతర విజ్ఞానము నొందగోరి యీ కన్యకామణి యింగ్లండునకు బయనమయ్యెను.

కుమారీ చంద్రకళా

కాళ్లకు చక్రములచెప్పులు చూడండి. మూడేళ్లవయసునుండి యీరాచబిడ్డకిదే పని. ఇట్టి బిడ్డ రాజాధిరాజులచేతి మన్ననలందుట అబ్బురమా?

## మిస్ పి. తంబుచెట్టిఅమ్మ

సుప్రసిద్ధయగు ఫిడేల్ వాద్యకర్త్రి. యీమె గతనెలలో తన ప్రజ్ఞాప్రదర్శనమునకై యింగ్లండు వెళ్లియుండెను గదా! శ్రీసార్వభౌముని సందర్శనముగూడ నీవిదుషీమణికి లభించినందు కీమెను మన మభినందింపవలయును. ఈయమ మొన్ననే యిండియాకువచ్చెను.

## డా॥ ఇ. కె. జానకిఅమ్మాళ్

కోయంబత్తూరు చెరకువ్యవసాయపు కేంద్రమున నుద్యోగినియైన యీమె యిప్పుడు, ఆమ్‌స్టర్‌డంనగరమున జరుగు ఇన్‌టర్‌నేషనల్ బొటానికల్ కాంగ్రెస్సునకును లండనులోజరుగు ఇంపీరియల్‌బొటానికల్‌కాన్ఫరెన్సుకును అధికారరీత్యా ప్రతినిధిగా వెళ్లుటకు ఇండియాగవర్నమెంటు వారిచే నియుక్తమయ్యెను.

## మిస్ లీలావతీబేదార్కర్

ఉపాధ్యాయినీ పదవియందు డిప్లొమాబడయుట కీమె యింగ్లాండునకేగెను.

## కన్నెపల్లి కేసరి దేవి

1923-లో ప్రథమమున ఆంధ్రకుటుంబములలో ఇంగ్లాండునందు కాపురమున్న శ్రీయుత కె. వి. యల్. నరసింహం M.A.LL.B. బారిస్టరుగారి ఏకపుత్రిక. మన ఆంధ్రులలో ప్రథమమున B. A. (London) ప్యాసయినవారు వీరేయని చెప్పనచ్చును. వీరికి ఈతయందును, గుఱ్ఱపుస్వారియందును మిక్కిలి ప్రావీణ్యతగలదు.



రాధాఫిల్మ కంపెనీవారి 'భక్తకుచేల'లో
నొకదృశ్యము

## జామా తైలము

ఏజంట్లు కావలెను.




తలనొప్పి, యిన్ఫ్లుయంజా, చేయి కాలు పట్టుకొనుట, పంటినొప్పి మొదలగువ్యాధులను ఒక క్షణములో పోగొట్టగల ఖ్యాతిచెందిన "జామాతైలము" నకు సమమగు మందు వేరేదియు లేదు. చాలా యోగ్యతా పత్రములనుపొందియున్నది.

బుడ్డి 1-కి అణాలు 6 ఇచ్చి ఉపయోగించి చూడుడు.

**అమర్ చెందు, శోభాచెందు,**

ఇంగ్లీషుమందులు, పలుసరకులు, సల్ఫ్యూరిక్, నైట్రిక్, మొరాటిక్ ఆసిడ్ల వ్యాపారస్థులు.

నెం. 63, నైనప్పనాయుని వీథి, మద్రాసు.

---



**పి. కోదండరాం పిళ్లే**

(లేటు పి. యస్. పొన్నుస్వామిపిళ్లేవారి కుమారులు)

1854-వ సంవత్సరమున స్థాపితము.

ఉత్తమతరగతి కర్రసామగ్రుల నిర్మాతలు

(పి. యస్. పొన్నుస్వామిపిళ్లే భవనములు)

మీ భవనమును అలంకరించుటకును దానిని ఆకర్షణీయముగ చేయుటకును మీకు కర్రసామగ్రులు కావలయును.

త్వరగా చేసియిత్తుము. నమ్మకమైన పనితనము.

కర్రసామగ్రులను కొనుటకుపూర్వము మాతో సంప్రదింపుడు.

పురాతనమైన, ప్రఖ్యాతిగల కంపెనీ.

39 & 44, ఎస్ప్లనేడ్ వెస్టు; మదరాసు.

---

## శ్రీమత్కన్యకావిజయము

ఉత్తమ యక్షగాన ప్రబంధము. పనుమర్తి కృష్ణమూర్తిగారు రచించినది.

వలయువారు నాలుగణాల బిళ్లలు

"గృహలక్ష్మి కార్యాలయం, ఎగ్మూరు, మద్రాసు"కు పంపునది.

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావు. నూజవీడు: వైద్యుల బ్రదర్సు.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు.
నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కంపెని.
జెమ్ షెడ్ పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్ పైప్ కంపెనీ, [లిమిటెడ్.
బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.
గుంటూరు: వెల్ కం అండు కంపెని. మైసూరు: స్టూడెంట్సు హాలు.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.
పిఠాపురం: ఎం. నూకరాజు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
ఏలూరు: డి. శ్రీహరిరావు.
తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్ డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్ పేట.
ఒంగోలు: తాతా జాలయ్య శెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్ వీధి.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.
విజయనగరం: ఆయపిళ్ల .సూర్యనారాయణరావు
నరసాపురం: వై. సత్యనారాయణగారు.
కొవ్వూరు: కె. సి. చెన్న కేశవయ్యర్. గూడూరు: సి. సి. సుబ్బయ్య, మర్చెంటు.
కాకినాడ: నున్నా బాలకృష్ణరావు, న్యూస్ బాయ్ అండు కో.
భీమవరం: వంగల అచ్చుత రామయ్య, మేనేజరు, నెహ్రూ ఖద్దర్ స్టోర్సు.
గుడివాడ: శ్రీ శివరామ అండు కో.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.
అమలాపురము: పి. అన్నాజిశర్మ. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)
పర్లాకిమిడి: రాచూరి రామనారాయణరావుగారు.
అమదలవలస సి. వి. నరసింగరావు
మచిలీపట్టం ఆచంట లక్ష్మీనరసింహం, సర్కిల్ పేట.

హిగిన్ బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకోనుడు.

GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౮]   నవంబరు 1935   [సంచిక [illegible]

*Printed at Lodhra Press, Egmore, Madras.*

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 3. అర్ధసంవత్సరపుచందా రు. 1-8-0 అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-4-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వి. పి. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలములరేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు:

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడుగ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవలకు వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జవాబులీయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వి. పి. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యస్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తులపేర ఎంతమాత్రము పంపకూడదు.

# విషయసూచిక

DIAMONDS

All qualities and sizes
Your inquiries are invited

T.B MEHTA & SONS
Phone: No. 3555
P.T. MADRAS



**పి. కోదండరాం పిళ్లే**

(లేటు పి. యస్. పొన్నుస్వామిపిళ్లేవారి కుమారులు)

1854-వ సంవత్సరమున స్థాపితము.

ఉత్తమతరగతి కర్రసామగ్రుల నిర్మాతలు

(పి. యస్. పొన్నుస్వామిపిళ్లే భవనములు)

మీ భవనమును అలంకరించుటకును దానిని ఆకర్షణీయముగ చేయుటకును మీకు కర్రసామగ్రులు కావలయును.

త్వరగా చేసియిత్తుము. నమ్మకమైన పనితనము.

కర్రసామగ్రులను కొనుటకుపూర్వము మాతో సంప్రదింపుడు.

పురాతనమైన ప్రఖ్యాతిగల కంపెనీ.

**39 & 44, ఎస్ప్లనేడ్ వెస్టు; మదరాసు.**

# మీ అచ్చు పనులయందు

మీకు కావలసినది అందమగుకూర్పులా? లేక చిన్నపనిదైనను బాగుగ చేయుటయా? లేక సకాలమునకు ముద్రించియిచ్చుటయా? మీఅవసరము లేవిదైనను, మీఅచ్చుపనులను మేము చక్కగ చేయగలమని మీ అనుభవమే తెలియజేయగలదు. ఒకమారు పరీక్షింపుడు!




## రస్సెలుగారి భయములు — సిఫార్సులు

భారతదేశ ప్రభుత్వపు పబ్లికు హెల్తు కమీషనరు అగు కర్నలు రస్సెలుగారు తెలుపుచున్న ఈ దిగువ విషయములు భయంకరముగను ఆశ్చర్యకరముగనునుండి నను, అతను చెప్పినట్లు అనతికాలములో ప్రతి స్త్రీని పురుషునిగూడ అత్యంతశ్రద్ధా యత్తులనుగా జేయనున్నవి.

భారతదేశపు జననములసంఖ్య 1933లో 97 లక్షలు. అనగా పదివేలకు సుమారు 355 చొప్పున. 1932 లోకంటె పదివేలకు 18గురు ఎక్కువ పుట్టిరి.

1933లో మరణములసంఖ్య 61 లక్షలు. అనగా 10 వేలకు 224 గురు చొప్పున. 1932 లోకంటె పదివేలకు 8 గురు ఎక్కువ చనిపోయిరి.

వీరిలో పసిపిల్లలచావులు 16,60,000 — అనగా అసలు చావులలో నూటికి 27 గురు పసిపిల్లలు. పుట్టిన పసిపిల్లలలో పదివేలకు 1705 గురు చనిపోయిరి. ఈసంఖ్య 1932 లో కంటె పదివేలకు 18 గురుఎక్కువ.

పుట్టినవారి సంఖ్యలో చనిపోయిన యీ పిన్న పెద్దలసంఖ్య తీసివేసినచో 36.00,000 జనసంఖ్య ఫోక్తుగా హెచ్చినట్లు. అనగా పదివేలకు 131 గురు హెచ్చినట్లు —

వేయిజనులకు సంవత్సరములో సుమారు 35 గురు పుట్టుట, 22 చచ్చుట, 13 చొప్పున హెచ్చుట అంత పెద్దవింతగా మనకు తోచకపోవచ్చును. అయినను ఈరెండు సంవత్సరములు మునపటివానికంటె చాల నయముగానున్నను పసిబిడ్డల చావులను

చూచినప్పుడు అతనికి చాలా బెంగపుట్టుచున్నది. అవి తగ్గేసూచనలు కనిపించవు సరేగదా ఆ ప్రమాణము స్థిరమైనదనుట కనేకరుజువులతనికి కనిపించుచున్నవి. సంవత్సరమునకు సుమారు 17,50,000 ఏడాదిలోపలి పసిపిల్లలు చనిపోవు దేశములో ఆరోగ్యపారిశుద్ధసంఘములకృషి చాల నీరసముగనున్నదనక తీరదని అతను చెప్పుచున్నాడు. ప్రస్తుత ప్రభుత్వపు శిశుసంరక్షణ మాతృసంరక్షణ ప్రయత్నము లే కొలదిమందికి మాత్రమో గలుగుచున్నవి. రాష్ట్రీయ, కేంద్రప్రభుత్వములు వీనిని హెచ్చించవలసియున్నది.

హిందూదేశములో ప్రధానమైన అంటురోగములు కలరా, ప్లేగు, మశూచికమేమైనను ఈ మూడింటివలనను వేయికి 9గురే చనిపోయినారు. మలేరియావలనను సుమారు 10 లక్షలు చనిపోయినారు. మలేరియా పీడితులసంఖ్య ఈసంవత్సరము కోటి యిరవైలక్షలు (ఆస్పత్రులకు చేరుకున్నవారి సంఖ్య). ప్రభుత్వమువారిచ్చు క్వినయిను యేమీ చాలకున్నది. ప్రజలు కొనుక్కొనుటకు చాలా ఖరీదు. అంతకంటె చౌకమైన మందులేదు అని అతను నిస్పృహాపడుచున్నాడు.

మరియొక విషయమునుగూర్చి అతని భయము మరీ యెక్కువగానున్నది. ఇప్పుడు 35 కోట్లకు మించియున్న జనసంఖ్య 1941 నాటికి 40 కోట్లు అగును. బ్రిటిషుఇండియాలో భూమి 67 కోట్లు యకరములు ఇందులో సాగుభూమి 23 కోట్లు యకరములు మాత్రమే. తక్కినది వ్యవసాయ సాధ్యముకాదు. అట్లు చేసినను మనిషికి రెండుయకరముల చిల్లరకంటె యెక్కువరాదట. వ్యవసాయపరిస్థితులు బాగుపడి పంట లెక్కువచేయుదమే అనుకొన్నను, దానిని మించికూడ జనసంఖ్య పెరుగును. కాబట్టి అట్టి ప్రళయము రాకముందే ప్రజలు తెలివి గొందురాయని అతను ప్రశ్నించుచున్నాడు.

ఇందుకు జన్మనిరోధ మొక్కటే ఉపాయమని యెల్లరు నెఱుగుదురు. అది ఈదేశములో విరివిగా అవలంబించబడదని అతనికి నిరాశ. పోనీ పిల్లలచావులు తగ్గేటందుకు, తల్లుల ఆరోగ్యములు వర్ధిల్లేటందుకు వలసినంతమట్టుకైనా దాని నవలంబింతురుగాక అనిఅతని ప్రార్థన. స్త్రీల కీసలహా యీయవలసినవారు స్త్రీడాక్టర్లే గనుకను, ప్రస్తుత మీదేశములో ఉన్నతవైద్యశిక్ష పొందిన స్త్రీడాక్టర్లసంఖ్య 700 లే గనుకను ఆసలహా కూడ వారికి చిక్కకున్నదని అతనికి మరీ భయమగుచున్నది.

ఏది యెట్లున్నను పసిబిడ్డల తల్లుల మరణముల రోగముల బాధ దుస్సహము. నిమ్మళించుకొనుట కనేకులకు డబ్బులేదు. గర్భశోకము భరింపరానిది. జన్మనిరోధము కాకున్న ఆరోగ్యవిధానమైన అవలంబించక తప్పదు. ఇంద్రియనిగ్రహబోధన లీ కలికాలమున ఏగానికి చెల్లవు. నాటకములు, టాకీలు, మువ్వీలు, పత్రికలు, బొమ్మలు, మందుల ప్రకటనలు, కాలేజీల చదువులు, దుస్తుల

తీరులు, నవ్వుల విధానములు, స్వైరవిహారములు, సౌందర్యముల పోటీలు సమస్తమును యువకుల వృద్ధుల ఇంద్రియములను ప్రేరేపించుట కుద్దేశించుచుండ మహాత్ముని ఇంద్రియనిగ్రహబోధన లెవ్వరు వినగలరు? ఈ కృత్రిమనాగరకభ్రమలైనను మనము వీడవలెను. లేదా పాశ్చాత్యులవలె వానిలో 'తెప్పానాం తేలనాం' చేయుటయే మన పరమావధియని నమ్మినచో వారివలె ఆరోగ్యపోషణ మార్గములైనను త్రొక్కవలెను. రెండింటికిని కాళ్లు వ్రేలవేసుకొనకూడదు.

అసలు చావులలో నూటికి 45 గురు 5 సంవత్సరముల లోపలివారు. నూటికి 5 గురు 5–10 సంవత్సరముల మధ్యవారు. ఇంగ్లాండు వేల్సు సంఖ్యలతో పోల్చుదము. అక్కడ యేడాదిలోపలి శిశువుల మరణములు నూటికి 7. 4 గురు. 1–5 యేండ్లకు మధ్యన 3.1 గురు. 5-10 యేండ్లకు మధ్యన 1.4 గురు. అందరు కలిసి 11.9 గురు. దీని నాపుటకు శిశుసంరక్షణ మాతృసంరక్షణ ప్రయత్నమాత్రములు చాలవు. అసలు దేశపుటారోగ్యవిధులే మారవలెను. మంచి త్రాగుడునీళ్లు, శుద్ధమైనదొడ్లు, స్వచ్ఛమైన మురికిపోవు కాలువలు ఉన్నయెడల దేశారోగ్యము బాగుపడగలదని అతను వచించునది నిక్కము.

కలరా, ప్లేగు, మలేరియా మశూచి మొదలగు రోగములకు కారణముపై విషయములు స్వచ్ఛముగా నుండమియని మన మెరుగుదుము. 1932-33 లో కలరా చాలా తక్కువగా ఉండినను 1934 లో హెచ్చినది. ఇంకను ఏటేట మరీ హెచ్చుచుండునటులనే ఉన్నదట. వెన్నెముకజ్వరము (సెరెబ్రో స్పైనలు మెన్నింగ్టిసు) క్రొత్తగా వచ్చినదని మన మీమధ్య ననుకొంటిమి. కాని యిది భరతఖండమునకు ఏబదిసంవత్సరములనాటి పురాణజ్వరమట. అహమ్మదాబాదు ఢిల్లీలలో మాత్రము నాలుగైదేళ్లాయ వృద్ధియై అంటుజాడ్యమువలె వ్యాపింపఁజొచ్చినదట. పిల్లలు యువకులు దీనివలన నెక్కువ చత్తురట. స్త్రీలకు దీనిబాధ అట్టే లేదట. దీనికి కారణము వారు ఇళ్లుకదలక వీధులకు పోయి ఆరోగములను తగిలించుకొనకుండుటయే అయియుండ నోపునట. రాచకురుపులవల్లకూడ పెక్కుఱు చనిపోవుచున్నారు. జపానులోను అయిరోపాదేశములలోను ఈ వ్యాధి 50–60 సంవత్సరములమధ్య తరచుగావచ్చి ప్రజలను తీసుకొనిపోవుచుండగా ఇండియాలో 40-50 సంవత్సరములమధ్యనే జన్నులపై వ్రాలుచున్నదట. విమానములు ఎగురుచున్నప్పటినుండి కెన్యా, ఉగండా సూడాను దేశములనుండి పచ్చజ్వరము కరాచీద్వారా ఇండియాకు దిగుచున్నదనియు, దీని నాపుట కొక పెద్దఆరోగ్యోద్యోగిని సిబ్బందితోసహా నియమింపవలెననియు సిపార్సు చేయుచున్నాడు. శాస్త్రీయతు

ప్రభుత్వములు ఖర్చు తక్కువ కావడము కొరకు యేయితర ఖర్చులనైన తగ్గించు కొనవచ్చును కాని ఆరోగ్యశాఖకగు ఖర్చులను తగ్గింపక హెచ్చించుచుండవలెనని ఆఖరు సిపార్సు చేయుచున్నాడు. భారతీయులెల్లరును తమ ఆరోగ్యమును పరస్పరసహాయమువలనను, ప్రభుత్వపు తోడ్పాటువలనను సాధ్యమైనంతవరకైనను రక్షించుకొందురుగాక యని కోరుచున్నాము.

# గృహలక్ష్మి

## అష్టావధాని వడ్డాది సీతారామాంజనేయులుగారు

ఒకతి కేవలోల్లాస విభ్రాంతిరేఖ మున్ను నాకన్నులం దళుక్కు మన్నదపుడు;
క్షణిక భూషణముగ నెసఁగంగ ధరణి కనుపఁబడిన గంధర్వ దివ్యాంశ మామె;
ఆమె తారలు సంజలో నలరు తార, లిరవుకొనియున్న మునిమాపు టిరులె కురులు;
చైత్ర దివససౌభాగ్య, ముషఃప్రసాద మామె విమాలంగములఁ బరిణామ మొందెఁ;
జంచలా లీలఁబూని నర్తించియట్టె లలిత శృంగారగాత్రియై వెలసె నామె;
వేడ్కనిందందు స్ఫురియింప విభ్రమమ్ము నాకు నొసగూర్ప, నానడల్ నట్టువఱుప.
అంత నొకకొంత దరికేఁగి యరసితి, నది దివ్యమూర్తి యయ్యును యువతీలలామ!
గృహమునం దామె శ్రీదేవియే యనంగ మసలుచుండుఁ బాతివ్రత్యమహిమ మెఱయ;
ఆముఖద్యుతి సద్వర్తనానుభోగ వాచకము, భావిసౌశీల్య సూచకమ్ము;
దైనికనిసర్గ మానవధర్మములకు, క్షణిక మాత్రమ్మయైన విషాదములకు,
ముగ్ధభావమ్ము చిందించు మురిపెములకు, గణతులకు, గర్హణలకు, ధిక్కారములకు,
వలపులకు, ముద్దులకు, బాష్పవిలసనముల, కమృతరుచు లొల్కుమృదు మందహాసములకు,
నగ్గమేకానియట్టి దివ్యస్వరూప; కాదు, మానవసౌజన్య గణ్యయామె.
ఆశుభాకృతి చైతన్య మతిశయించి నిలువ నాప్రేమొలఁగంటి నిశ్చలితదృష్టి;
భావ పరిమళోచ్ఛ్వాస సంభరితమూర్తి; జననమరణాల నడుదారిఁజనెడు పథిక;
ఘన వివేకమ్ము, శాంత సంకల్పశక్తి, దాంతి, దూరదృష్టి, సమర్థతయును,
జాతురియును నామెలోఁ దేజరిల్లుచుండె; ఆమె స్త్రీత్వపూర్ణావధి, యత్యుదార
ఫణితి సృజియింపఁబడియె నాబ్రహ్మచేత హెచ్చరింప, సౌఖ్యము నింపఁ, గృతి విధింప;
మర్త్యభామిని యయ్యు నామగువ మిన్న లలిత, గృహలక్ష్మి, దివ్యకళాప్రపూర్ణ.

# ఆశీస్సు

## శ్రీమతి పోతుల జయలక్ష్మిగారు

హిందూవనితల సాహిత్యవిజ్ఞానముల్ పెంపొందజేయుచు వెలసినావు
అజ్ఞాఃతిమిరంబులణగింప గతులకు మహనీయకాంతి నమర్చినావు
ఆబాలగోపాల మైకమత్యమెసంగ చెలికత్తెవై పేర్మి చెలగినావు
అల్లారుముద్దుగా నెల్లవారలజేరి గృహలక్ష్మివగుచు రహించినావు

శ్రీ గృహంబగు వీఃదమ్మిచెలువుపోలె
సహజసౌందర్యయుతపత్రసమితి దనర
సలలితామోదమాధురీకలన వెలసి,
లక్ష్మికావాసమై, గృహలక్ష్మి! యలరు!

# ఆనందమయి

శ్రీమతి కె. కృష్ణకుమారిగారు

ఆనందమయి చాల చక్కని బాలిక. బ్రాహ్మణులలో ప్రసిద్ధికెక్కిన కుటుంబము నందుద్భవించెను. ఆమె జన్మస్థానము అమరావతి గ్రామము. ఆమె తల్లిదండ్రులకు లేక లేక కలిగిన ముద్దులబిడ్డ. ఆమె జన్మించి దినదినము శుక్లపక్షచంద్రునివలె నభివృద్ధి నొందుచుండెను.

ఇట్లుండగా నామెకు 9 సం॥లు వచ్చెను. ఆమె పుష్టిగలపిల్ల యగుటచేత తల్లిదండ్రు లప్పుడే భయపడజొచ్చిరి. వారు సనాతనిష్టులగుటచేత వివాహముచేయ ప్రయత్నములు చేయసాగిరి. ఆమెకు 9 సం॥ల 10 రోజులకే వివాహముచేసిరి. కర్మమేమోగాని తరువాత మూడు నెలలకే ఆమెతల్లి దివికేగెను. పిమ్మట రెండు నెలలకే భర్తయు స్వర్గస్థుడయ్యెను. ఈకష్టముల కామె తండ్రి బెదరక బిడ్డకు దిక్కుకావలెనని వంకబెట్టి తాను ద్వితీయ వివాహమాడెను. ద్వితీయ వివాహము అయిన కొద్దిరోజులకు ఆయన పుత్రికకును భార్యకును సరిపడలేదనియామెను రా...పట్టణములో బాలికాపాఠశాలలో జేర్పించెను. అనంతరము క్రొత్తభార్యతో వేగలేకను నవయౌవనాంగియగు బిడ్డ దౌర్భాగ్యము చూడలేకను సనాతనిష్టు చావుకు సిద్ధమయ్యెను. చచ్చిపోవునప్పుడు ఆయన దగ్గరబంధువునొకని బిడ్డకు సంరక్షకునిగ నేర్పరిచి చనిపోయెను. మరియు నాయన ఆస్తిని భార్యకును పుత్రికకును సమముగ భాగించి ఆజన్మాంతము అనుభవించి చచ్చిపోవునప్పుడు ఇహలోకములో విడచిపెట్టునట్లు విల్లువ్రాసెను: పాపము...ఆనందమయి అనాథయైరా... పట్టణములో బాలికలతో చదువుకొనుచు నానందములో మునిగిపోయెను.

### 2 వ బిందువు

రా..పట్టణ పాఠశాలఅంతయు నిట్టి అనాథబాలికలతో నిండియుండెను. అచ్చట ఆబాలికలతో ఆడుట పాడుట మొదలగు వానితో సంతోషముగనుండెను. ఈమెకు నవయౌవనము ప్రవేశించిన కొలదియు రూపును శోభాయమానముగ నుండదొడంగెను. అచ్చటి పాఠశాలాధికారురాలును ఆమె నెక్కువ ఆదరించుచుండెను.

వారమున కొకమారు బాలికలందరను గోదావరియొడ్డునకుషికారునకును టాకీలకును నాటకములకును తీసుకొని వెళ్లునది. బాలికలచేత నాటకములు వేయుట మొదలగు సంతోషములైన పనులు చేయించుచుండెడిది. ఆనందమయికి పుష్పములనిన బహుప్రీతియగుటచేత ఆమె ఆమెచేత త్రవ్వించి మొక్కలు నాటుట నీరుపోయుట చేయించుచుండెడిది. చదువుకొనుటకు నవలలు నవీనభావములుగల పుస్తకములు నిచ్చుచుండెను. వానిని చదువుటవలన బాలికలందరకును ఆభావము లుదయించు

చుండెను. కొన్ని సమయము లప్పుడు వారు పునర్వివాహములనుగురించి అనేకవిధముల చర్చించుచుండెడివారలు.

ఇట్లుండగ నొక దినమున ఆనందమయి తన మిత్రురాలగు నొక బ్రాహ్మణేతర బాలికతో వారింటికి వెళ్లెను. అచ్చట ఆమె తన మిత్రురాలి సహోదరుని చూచెను. అతను చాల మంచివాడు, చక్కనివాడు, కరుణామయుడు. అతనును అతని తల్లిదండ్రులు సహోదరులు సహోదరిణులునుగూడ బ్రాహ్మణులను బోలియుందురు. వారలును మాంసాహారమును విడిచి బ్రాహ్మణులవలె శాకాహారులైరి. ఆమె అతనిని చూచినవాటినుండియు నతనిని తన ప్రభునిగ చేసుకొను తలంపుతో నుండెను. స్నేహితురాండ్రెన్నియడిగినను చెప్పక చాలకాలము గడిపెను. ఇట్లు కొద్ది కాలము గడచిన తరువాత ఆమె రహస్యముగ నా బ్రాహ్మణేతర బాలికతో చెప్పి వారల అంగీకారము నడిగెను. ఆమెయు తన తల్లిదండ్రులతోను సహోదరులతోను జెప్పెను. దానికి వారందరు నంగీకరించిరి. మరియు తన ప్రాణస్నేహితురాండ్రతో కూడ జెప్పెను. వారును సంతోషముతో నంగీకరించిరి. దానిని జూచి ఆమె యుప్పొంగి పోవుచుండెను. పాపము! రాగల చిక్కులామె కగోచరములై యుండెను. సామాన్యముగ వారలయింటికి పోవుటవచ్చుట మొదలగునవి చేయుచుండెను. ఇట్లొక సంవత్సరము జరిగినది. అప్పుడు బ్రాహ్మణేతరులు వివాహమునకు త్వరపెట్ట నారంభించిరి.

### 3 వ బిందువు

ఒకరోజున ఆమె మెల్లగ పాఠశాలాధికారిణి యొద్ద కూర్చుని సంగతుల నన్నియు జెప్పి వివాహమున కనుజ్ఞ యియ్యవేడెను. దానికి ఆమె:—అమ్మా! మనము బ్రాహ్మణులము అట్టివారలను వివాహము జేసుకొనరాదు.

ఆ:—ఎందువలననో జెప్ప వేడుచున్నాను.

పా. అ:—అమ్మాయి! మనము బ్రాహ్మణులము. వారు బ్రాహ్మణేతరులు. మనము వారికన్న పైకులజులము, వారలు మాంసాహారము తిందురు. కనుక చేసుకొనకూడదు.

ఆ:—నేను ప్రేమించి యుంటినికదా!

పా. అ:—నీప్రేమ త్రిప్పుకొనుము. నేను బ్రాహ్మణబాలుడును చక్కనివాడును నగువాని కిచ్చి వివాహము చేయుదును.

ఆ:—కులమా! శీలమా! స్త్రీలకు కావలసినది. నా ప్రేమ శీలమునాశ్రయించినది! ఇందు తప్పేమి గలదు?

పా. అ:—నేను నీకు చెప్పజాలను. నీ సంరక్షకునకు కబురు పంపుదునని వెంటనే ఉత్తరము వ్రాసి పోస్టులో వేసెను.

మరునాడు మధ్యాహ్నము రెండుగంటలకు ఆనందమయి విచారముతో తన గది లోపల పరుండియుండెను. అట్టిసమయమున

ఉత్తరము చేతదాల్చి పాఠశాలాధికారిణి అచ్చటికివచ్చి కూర్చుంచెను. తరువాత ఉత్తరము చదువ మొదలిడెను.

అమరావతిగ్రామము 6-5-30

అమ్మా!

మీ ఉత్తరము అందినది. మీరు చెప్పి చూచినారంటిరి గదా! దాని ఖర్మము పురాకృతమువలన దాని కాస్థితి పట్టినది. అది మీయొక్కయు నాయొక్కయు మాట విననిచో ఇంటినుండియు జాతినుండియు వెలివేయుదును. మీరు పాఠశాలలో నుండి వెడలగొట్టుడు. అందులకే పూర్వులు స్త్రీకి విద్య కూడదందురు. అనాధయని విద్య చెప్పించుచుండ నిట్లు వంశమున కపకీర్తి తెచ్చుచున్నది. మీరు మరల చెప్పుడు. విననిచో వెడలగొట్టుడు—

చిత్తగించవలెను—

ఇట్లు

ఆనందమయి సంరక్షకుడు.

అని చదివెను. దానిని విని ఆనందమయి వెక్కి వెక్కి యేడువదొడంగినది. అధికారిణియు కోపముతో బడికి వెడలిపోయెను. తోడిబాలికలందరు నాదినమునుండియు నామెను హీనముగ చూడసాగిరి. పాపము! దానిని ఆనందమయి భరింప జాలకుండెను.

4 వ బిందువు

ఒకదినము రాత్రి 12 గంటల సమయమున ఒకవ్యక్తి ముసుగువేసుకొని గోదావరీముఖముగ నేగుచుండెను.

ఆమె కొంతసేపటికి గోదావరినిజేరి ఈ క్రిందివిధముగ ప్రలాపింప దొడంగెను.

"తల్లీ! గోదావరీ! శరణు...శ...ర......ణు. నే నీఅవమానము భరింపజాల...భరింపజాల! నన్ను నీలో లీనము చేసుకొనుము. అనాధను! దిక్కులేనిదానను! దిక్కులేనివారికి దిక్కునీవే! జననీ! గోదావరీ! ఇదిగో నీబిడ్డ వచ్చుచున్నది: కౌగలిమ్ము. నేనేమి తప్పుచేసితినని నన్నిట్లు అనాధను జేసితివి! ఇదిగో నీపుత్రిక వచ్చుచున్నది. నీగర్భములో తావిమ్ము! అని ఆ పిచ్చిది నీటిలో నురికెను.

ఆమరునాడు పాఠశాలలో ఆనందమయి కానరాలేదు. అందరును వెదకుచుండిరి. అడుగుల జాడనుబట్టి పోయిరి — అడుగులాగోదావరిలోని కరిగినవి. జాలనులుపడ వెదకిరి. ఎచ్చటను కనుపడలేదు ఆమె యేఋషిఆశ్రమములో జేరితపము జేయుచుండెనో! లేక ఆ మహాస్రవంతిలోపడి లీనమై నిరంతర మావీచికలచే బాలవితంతు విలాపంబు గానంబుసేయుచుండెనో! లేక ఈ పంచమహాభూతములందు గలసి ప్రతినగర నారీమణుల హృదయములందు జేరి కరుణారసంబుతో జాతీయతత్వం బుద్బోధించుచుండెనో తెలియరాదుగా —

# విధికృతము

శ్రీమతి అడపా సుగుణమణిగారు.

(అనుబంధకథ)

[సువర్ణ నారాయణీప్రఫుల్లుల ఏకపుత్రి. నారాయణి కుమార్తెకు బాల్యవివాహము చేయతలపెట్టెను కాని భర్తయియ్యకొనలేదు. ప్రఫుల్లు కలకత్తాలోనున్నపుడు ఆమె తన కుమార్తెను శ్రీవిలాసునకిచ్చి రహస్యముగా వివాహమొనర్చెను. ఈసంగతి ప్రఫుల్లుడెరింగి భార్యను పరిత్యజించెను. మరికొంతకాలమునకు భార్య మరణశయ్యపై నున్నదని తెలసి స్వగృహమునకువచ్చి కుమార్తెకు నమ్మనికబురంపెను. కాని సువర్ణకు పుట్టింటికిబోవుటకు అత్త అనుమతి యివ్వనందున ఆమె తల్లినిచూచు నపేక్షతో రహస్యముగా నర్ధరాత్రిని బయలుదేరెను.]

మానవజీవితము బుద్బుదమువంటిది. క్షణమున సృష్టి, క్షణమున లయము. ఎప్పటికైననూ ఈ భౌతిక శరీరమును వీడి చనవలయునని ఎఱుంగక పామరత్వ మొందుటయే అజ్ఞానము.

నారాయణి చనిపోయి మూడుదినములైనది. అంత్యక్రియలన్నియు ముగిసినవి. సువర్ణ మాతృనిర్యాణమునకై పొందిన దుఃఖమునకు మేరలేదు. ఆమెను ఇరుగు పొరుగు స్త్రీలు తమ శక్తిసామర్థ్యములు వినియోగించి ఓదార్చేరు కాని పొంగి పొరలివచ్చు దుఃఖము నరికట్టుట కెవ్వరితరము? ప్రఫుల్లునకు లోకమే అంధకారమైనది. భార్య కంత్యకాలమున నొసంగిన కఠినశిక్షకై పశ్చాత్తాపపడ్డాడు; ఏమి లాభము? మనిషి చనిపోయినపిమ్మటగాని విలువ తెలియదు.

సువర్ణను అత్తవారింటి కనుపుటకై ప్రయత్నములు సాగుచున్నవి. నారాయణి చెల్లెలు, సుధ, ప్రయాణమునకు వలయు సామగ్రినంతయు ఇంట సిద్ధపరచింది. ప్రఫుల్లునాజ్ఞానుసారము నందుడు ఒక రెండెడ్లబండిని తెచ్చేడు. ప్రయాణమనుసంగతి ఎఱింగి, సువర్ణ తండ్రి పాదములపై పడి "నాన్నా నేను మఱల అత్తవారింటికి వెళ్లను. వెళ్లినచో నన్ను జీవములతో భూస్థాపితము చేయుట నిశ్చయ"మని భోరున ఏడ్చింది.

"అమ్మా భయపడకుము. ఇందు నీవొనర్చిన తప్పిదమేమున్నది! నేనుగూడ నిన్ననుసరించివచ్చి నీ యత్తవారికి నచ్చచెప్పెదను. లే తల్లీ లే. ముహూర్తము మించిపోవుచున్న"దని ప్రఫుల్లు కుమార్తెను లేవనెత్తి బుజ్జగించేడు కాని సువర్ణకుమాత్రము భయము విడువలేదు. ఆమె అత్తయొక్క కర్కశహృదయమును బాగుగా నెఱుగును.

వలయు సామగ్రి బండిలో జాగ్రతపరుపబడ్డాది. సువర్ణ కట్టుబట్టలతో శకటావరోహణమొనర్చిన వెంటనే బండి కదలింది. ప్రఫుల్లుడు బండివెనుక నడచుచున్నాడు. భైరవీనదిని సమీపించుట తోడనే పడవవాండ్రు సామగ్రిని, సువర్ణాప్రఫుల్లులను నదిని దాటించేరు. సువర్ణ తనకు అర్ధరాత్రమున నదిని దాటించి, మాతృముఖ సందర్శనమున కవకాశమొసం

గిన పడవవాండ్రను శ్లాఘించి, పితృసమ్మతిని వారలకు బహుమతి ఇచ్చింది. నది ఆవల ఒడ్డున మరియొకబండి బాడుగకు మాట్లాడి భట్టుగ్రామం ప్రవేశించేరు. బండి శ్రీవిలాసుని ఇంటిగుమ్మముముందు నిలచిననూ ఇంట నుండి ఎవరూ పైకిరాలేదు. ప్రఫుల్లుడు సువర్ణకు శకటావరోహ మొనర్చి, చావిడిలోనికి గొంపోయి "అమ్మా! భయపడెదవేల? ఇది నీ ఇల్లు. లోనికి వెళ్లు"మని వెనుకంజవేయుచున్న సువర్ణను లోనికి తోసెను. భయకంపిత దేహముతో, తొట్రుపడు పాదములతో, గత్యంతరములేక పాప మాలేమ లోనికి వెళ్లింది.

శ్రీవిలాసు డాచావడిలోనే ఒకమూల కూర్చొని వార్తా పత్రిక చదువుచూ ఈదృశ్యము నవలోకించేడు కాని మాటనున్న మర్యాదహుళక్కి. ఎట్టకేలకు ప్రఫుల్లు డా చెంతనేఉన్న కుర్చీలో కూర్చొని శ్రీవిలాసునితో సంభాషణ కుపక్రమించేడు.

"నాయనా బండిలో ఇంకా సామానుఉంది. ఇంటపెట్టించు."

"నాకేమి తెలియునండి ఎక్కడ సామాను ఉంచడమో. మా అమ్మ ఏర్పాటుచేస్తుందిలెండి." అని ముక్తసరిజబాబుచెప్పి మరల తన వార్తాపత్రికాపఠనమున నిమగ్నుడైనాడు. అల్లుని అమాయకత్వమునకు ప్రఫుల్లు లోలోన నవ్వుకున్నాడు.

ఇంతలో వీధిలో స్త్రీ యార్తనాదము వినబడ్డాది. ప్రఫుల్లుడు ఒక్కదాటున వీధిలోనికివచ్చి చూచేడు. తనగారాబుపట్టి సువర్ణ ఏడ్చుకొని పరుగెత్తుచుండ, అత్త చీపురు చేతబట్టి తరుముచున్నది. ఈ దృశ్యమును చూచుసరికి ప్రఫుల్లునకు దేహమంతటా విద్యుచ్ఛక్తి ప్రవహించినట్లయింది. కొంతవరకు తనకన్నులను తానే నమ్మలేకపోయేడు. త్రుటిలో వారిరువురిమధ్యను నిలచి ఒకచేతితో భీతచిత్తయగు సువర్ణను చేరదీసి రెండవచేతితో అత్తచేతిలోవున్న చీపురును బలవంతముగా లాగుకొని దూరముగాపారవేసేడు.

"ఏమమ్మా, నాకూతు రేమితప్పుచేసిందని ఈశిక్ష? మరణశయ్యపైఉన్న తల్లిని చూచుటకు వెళ్లడమే తప్పా? తల్లిపైవున్న అనురాగముకొలదీ అసమ్మతి చూపిన మీ అనుమతిలేనిదే బాల్యచాపల్యమున ఇల్లు విడచిందనేనా ఈరట్టు?"

"ఓహోహో! తండ్రీ కూతుళ్లట. పెండ్లినాడులేని తండ్రి పెడాకులనాడు వచ్చేడు. దొడ్డింటి బిడ్డట. రాత్రి ఇల్లువిడచి పారిపోయి మళ్లీ ఏమొగం పెట్టుకొని నాగుమ్మం త్రొక్కింది. రానీ రానీ సిగ్గులేని శిఖండికి కత్తిపీటతో ముక్కలు ముక్కలుగా తరిమేస్తాను. ఈ పెద్దమనిషి మళ్లీ ఆ పిల్లను ఏలుకోమని సిఫారసు చేయడానికి వచ్చేడు. ఏవూరయ్యామీది? మీఊరిలో సూర్యచంద్రు లుదయిస్తారా?" అని అత్తగారు అభినయముతో నడివీధిలోఆడడం ఆరంభించేరు.

ప్రఫుల్లున కీమాటలు వేయివృశ్చికములు కుట్టినట్లయింది కాని ఏమిచేయగలడు? మాటకుమాట ప్రత్యుత్తరమిస్తే కుమార్తెకాపురం గంగలోకలసిందన్నమాటే.

"అమ్మా ఈ అనవసరప్రసంగమేల? కాసిన చెట్టుకు కాయ బరువుకాదుకదా. నా కుమార్తెను పరిగ్రహించెదరా? లేదా?"

"ఏమిటీ బెదరింపు? నీకుమార్తె మాకక్కరలేదు. ముమ్మాటికి అక్కరలేదు. హరిమీద గిరిపడ్డానేనేలుకోను." అని చేతులుముఖమునకు అడ్డుగాత్రిప్పింది.

ఇంతలో శ్రీవిలాసుడు గదిలోనుండి బయటకు వచ్చేడు. ప్రఫుల్లుడు అల్లుని వుద్దేసించి "నీ వుద్దేశము కూడాఅంతేనా" అని ప్రశ్నించేడు. ఆతడు తల్లివంక చూచి ఏమోమాట్లాడబోయి మౌనమే శ్రేయస్కరమని ఊరకున్నాడు. ప్రఫుల్లుడు మరలప్రశ్నించుట వలన "చెప్పవలసినదేదో మా అమ్మే చెప్పింది. నేను చెప్పడానికేమీలే"దని హీనస్వరమున ప్రత్యుత్తరమిచ్చేడు.

ప్రఫుల్లునకు భరింపరాని కోపమువచ్చింది; కండ్ల వెంబడి విస్ఫులింగాలు రాలేయి; పిచ్చియెత్తినట్లయింది. కుమార్తెమెడలోవున్న మంగళసూత్రమును త్రెంచి అత్తపై విసరివేసేడు. మాంగళ్యఖండనము స్త్రీవిలాసునిమృత్యువును సూచించుటచే అత్త, హైమావతి, రోదసీకుహరము నిండునట్లు రోదనమారంభించేరు. కుమార్తెను మఱల బండిలోనెక్కించి ప్రఫుల్లుడు గృహోన్ముఖుడైనాడు. తానొకటితలచిన దైవమొకటి తలచును.

౫

కాలచక్రమునకు అడ్డులేదు. విలిప్తాది యుగాంతరముల వరకును వడితగ్గక, వెచ్చక తిరుగుచునే వుండును. సువర్ణ అత్తవారింటనుండి తరుమబడిన తరువాత ఏడువత్సరములు గడిచినవి.

తారన్‌బాబు శిరస్తారుగా పనిచేసి ఉద్యోగము నుండి విరమించి ఉపకారవేతనముతినుచూ ఢిల్లీపట్టణమున నివసించుచున్నాడు. అతడు శశధరబాబునకు దగ్గరచుట్టము, ప్రఫుల్లునకు మిత్రుడు. అతడు వుద్యోగములోనున్నపుడే భార్యను గోల్పోయెను. తన ఏకపుత్రి అగు అమితను ఇంట ఆడదక్షతిలేకపోయినా గారాబముగా పెంచుచున్నాడు.

ప్రఫుల్లుడు సువర్ణను ఉన్నతవిద్యాపఠనమునకై తారన్‌బాబు రక్షకత్వమున ఢిల్లీపట్టణమున విడచేడు. సువర్ణజీవితములో ఒక క్రొత్తమార్పు కలిగింది. 'అమిత' స్నేహమువలన పూర్వకష్టములన్నియు మఱచి తన బుద్ధినంతయూ చదువునందే వినియోగించి ఏటేట పరీక్షలలో దిగ్విజయమునుగాంచి ప్రస్తుతము డాక్టరు పరీక్షచదువుచున్నది. స్త్రీబుద్ధికసాధ్యమైనపని లేదుకదా!

సుదర్శనుడు తారన్‌బాబుజ్ఞాతి. ఆసంవత్సరము రాజధాని కంతకునూ డాక్టరుపరీక్షలో ప్రథముడుగా ఉత్తీర్ణుడై ఉద్యోగమునకై వేచియున్నాడు. మఱి వాడు రూపసి. డాక్టరుపరీక్ష పేసయినాడు. ఇక సంబంధాల కేమికొదువ. కోఅంటే కోటి, కాని "ఉద్యోగము కలసివచ్చినవరకు వివాహము చేసుకో"నని భీష్మించుటవలన ఇంకా పెండ్లికాలేదు. అతడు తఱచుగా తారన్‌బాబు గృహమునకు రావడముకద్దు. సువర్ణకూడా డాక్టరుపరీక్ష చదువుచుండుటచేత ఆమెకు తెలియని విషయములు బోధపఱచేవాడు. క్రమముగా సువర్ణా సుదర్శనుల స్నేహలత చిగిర్చి పుష్పించింది.

సుదర్శనుడు కేవలము పారబడినాడు. సువర్ణ ఇంకనూ అవివాహితయని తనహృదయపీఠమున స్థానమొసంగి ప్రేమించుచున్నాడు. కాని ఇది అందని మ్రానిపండ్లకై అఱ్ఱులు చాపుటయని తెలుసుకొనలేదు.

సువర్ణ వివాహముసంగతి తారన్‌బాబుకు తప్ప ఆ ఇంట మరిఎవ్వరికీ తెలియదు. అది ప్రఫుల్లుని కోర్కెపై తనకుమార్తెయగు అమితకైననూ తెలియనీక రహస్యముగా దాచేడు. సువర్ణాసుదర్శనుల ప్రణయము తారన్‌బాబు గుర్తించకపోలేదు కాని ప్రఫుల్లుకొనర్చిన వాగ్దత్తమునకు కట్టుబడి సుదర్శనునకీ విషయమును తెలుపలేదు.

ప్రస్తుతము ప్రఫుల్లుడు కలకత్తాలో ఒకఇల్లు అద్దెకు తీసుకొని ఉన్నాడు. తఱచుగా సువర్ణాప్రఫుల్లులకు ఉత్తర ప్రత్యుత్తరములు జరుగుచున్నవి. ఈ ఏడు సంవత్సరములలో సువర్ణ మూడుసార్లు కలకత్తావెళ్లి తండ్రినిచూచి వచ్చింది.

సువర్ణకు తండ్రిదగ్గరనుండి ఒకఉత్తరం వచ్చింది. ఉత్తరముచదువుట పూర్తిచేసి ఒక దీర్ఘనిశ్వాసము విడిచి ఆలోచనానిమగ్నఅయింది. అప్రయత్నముగా కండ్లవెంబడి అశ్రువులు రాలుచున్నవి. ఆమెకింత మనోవ్యాకులము కలుగచేసేవిషయ మేమైవుండును? ఆమె మఱల ఉత్తరమును చదువుటకు ఆరంభించింది.

"కుమార్తెకు ఆశీర్వాదములు. నీవు వ్రాసిన వుత్తరము అందినది. ఒక ముఖ్యవిషయమును వ్రాయు

వలసి వచ్చింది. జాగ్రత్తగా అవగాహనముచేసుకొని బాగుగా యోచించుకొనుము. శ్రీవిలాసుడు పట్టభద్రుడై ప్లీడరీచేయుచున్నాడు. వాళ్లమ్మ చనిపోయిందనీ, ఇదివరలో ఆవిడ వున్నప్పుడు లేనిపోని అల్లరులు జరిగినవనీ, అట్టిది మఱలజరుగుటకు అవకాశములేదనీ, నిన్ను పంపించివేయుమనీ బ్రతిమాలుచున్నాడు. కాని ఇప్పటికైనను అతనికి పూర్తిగా బుద్ధివచ్చిందని నే తలంచను. ఎన్నిసారులు బ్రతిమాలిననూ నే నప్రమత్తతగా వుండడంచూచి నిన్నటిదినమున కోపము తెచ్చుకొని "కోర్టులో వాజ్యముతెచ్చెద"నని భయపెట్టేడు. ఇది విషమస్థితిగా మారునట్లు కనబడుచున్నది. ఇప్పుడు పాఠశాలలకు సెలవలుకూడాను కనుక నీవు ఇచ్చటకువస్తే దీనివిషయమై ఆలోచిద్దాము.

"ప్రఫుల్."

సువర్ణకు మఱల తనపూర్వగాథ స్ఫురణకు వచ్చింది. చనిపోయిన తల్లిని తలంచుకొని దుఃఖించినది. కొంతసేపటికి తనంతట తానే ధైర్యమును తెచ్చుకొని లేఖను తనపెట్టెలో పదిలపఱచుకొని కలకత్తా ప్రయాణ సన్నాహములోనున్నది. అమితాతారక్ బాబులకు సువర్ణఆకస్మికప్రయాణము వింతగొలిపింది కాని ఎవరూ దానివిషయమై చర్చచేయలేదు. బహుశా సెలవులలో తండ్రినిచూచుటకు వెళ్లుచున్నదనుకున్నారు.

సుదర్శనుడు సువర్ణప్రయాణమును విని నివ్వెరపోయేడు. సాధ్యమైనంతవరకూ ప్రయత్నించి సువర్ణప్రయాణమును ఆపుచేద్దామనీ, వీలుకానపుడు తన మనోభావమునువెల్లడించి త్వరగ తిరిగిరమ్మని బ్రతిమాలుదమని వచ్చేడు.

సువర్ణ సుదర్శనునిచూచి వివర్ణఅయింది. ఆమె నోట మాటరాలేదు.

"సువర్ణా! ఇంత ఆకస్మికప్రయాణమునకు కారణమి? మఱల ఇచ్చటకు ఎప్పుడువచ్చెదవు?"

"తండ్రిని చూడవలయునను తలంపే నా ప్రయాణమునకు కారణము. మఱల ఇచ్చటకు వచ్చెదనను ఆశ లేదు." అని గద్గదస్వరముతో చెప్పింది.

సుదర్శనున కీ మాటలు హృదయశూలములైనవి. ఒక్కదినమైననూ సువర్ణతో మాట్లాడక వుండలేని వాడు ఆమెనెట్లు విడువగలడు? దుఃఖమును దిగమ్రింగుచూ సువర్ణనుద్దేశించి "సువర్ణా! ఇచ్చటకు మరి రావా? ఇంతటిదేనా నీస్నేహము? ఈమాత్రమునకు నన్నేల కొఱగాయాసలకు పాల్జేసితివి? నాహృదయమును ఇంకనూ పరీక్షింపలేకపోతివా? సువర్ణా! ఇది నీకు న్యాయముకాదు." అని ఆమె రెండుచేతులు తనచేతులతో పట్టుకొన్నాడు.

సువర్ణ ఇప్పటికైననూ తన వివాహవిషయమును తెలుపలేదు. "నన్ను క్షమించండి" అని తిరోహిత వదనయై చెప్పింది.

స్త్రీ హృదయ మభేద్యము. సుదర్శనుడేమి స్థిరపఱచుకొనగలడు? తన్ను సువర్ణ ప్రేమించుచున్నదా? లేదా?

అప్పుడే అరుణోదయమయింది. సువర్ణా ప్రఫుల్లులు తే పానీయమును పుచ్చుకొని సంభాషణ కుపక్రమించేరు.

"అమ్మా, శ్రీవిలాసుడు ఇచ్చటకుచేరవనే వున్నాడు. బహుశా నీరాకవిని ఈసరికి బయలుదేరి వచ్చుచునేవుండును. నేనింక అతనితో సంభాషింపవలసిన విషయములులేవు. నీవు నిశ్చయముగా నీ వుద్దేశమును అతనికి తెలియపఱచుము."

"నాన్నగారూ, నాకోర్కకూడాఅదే. ఎంత కాలము నేనిట్లు జయిలునుండి తప్పించుకొనిపారిపోయినదొంగవలె మఱుగుపడి జీవిచదం? ఈవిషయమున అంత్యమును చూడనిదే విడువకూడదు."

ప్రఫుల్లుడు వార్తాపత్రికా పఠనమున నిమగ్నుడయ్యెను. సువర్ణ తనగదిలోనికిపోయి శ్రీవిలాసున కెట్లు ప్రత్యుత్తరము చెప్పడమా యోచించుకొను

చున్నది. ఇంతలో శ్రీవిలాసుడు సేవకుడుదారిచూప ఆ గదిలోనికివచ్చేడు. "రండి కూర్చోండి" అని సువర్ణ ఒకకుర్చీ చూపింది. శ్రీవిలాసుడు ఈగౌరవము తనకు జరుగునని తలంచలేదు. అతనికి సువర్ణరూపము నందు సహస్రాంశము భేదముకనబడ్డాది.

"సువర్ణా ! క్షేమముగానున్నావా?"

"మీదయవల్ల క్షేమమే"

"నే వచ్చుటకు కారణము నీ విదివరకే తండ్రివలన వినియుంటావు. నా తల్లి చనిపోయింది. అక్క తీర్థయాత్రలకు వెళ్లిపోతానంటున్నది. ఇక ఇంటికి నీవే యజమానురాలివి. నీ చెప్పుచేతల్లో తిరుగుతాను. ఇన్ని వత్సరములూ నిన్ను విడచియుండడం, తల్లీ అక్క బాధలుపెడితే చూడలేక కాని నీమీద ప్రేమలేక కాదు. నాతల్లి మఱల వివాహము చేసుకొమ్మంటే ఇష్టపడకపోవడమే ఇందులకు కారణము." అని అదివరకు కంఠస్థమొనర్చినదంతా వల్లించేడు.

సువర్ణ కీమాటలు వింతగొలిపేయి. శ్రీ విలాసునకు రెండునాల్కలా అన్న సందేహముతోచింది.

"బొమ్మలపెండ్లివలె నా బాల్యమున నామమాత్రపు వివాహము జరిగింది. ప్రాయశ్చిత్తముగా నానా బాధలు అనుభవించేను. ఒకప్పుడు ఇంటనుండి తరిమి వేయబడ్డాను. నా మెడలోని మాంగల్యము త్రెంచి వేయబడ్డాది. నాటినుండి మనకు ఋణముతీరిందన్న మాట. తరువాత లోకములో స్త్రీలకుకూడా సమాన హక్కుందని తెలుసుకొన్నాను. గత్యంతరములేక క్రొత్తమార్గ మవలంబించి నా దారి నే చూచుకొన్నాను. హిందూ వివాహములపద్ధతి నే నెఱుంగుదును. కర్మముచాలక భర్తపామైనా సరే, పురుగైనా సరే, ఆడుది ఆ బాగు పడిచావవలసిందే కాని ముక్తి లేదు. చట్టము స్త్రీలను ఆటవస్తువులుగా చేసింది. నాకు జ్ఞానమురానిదే, నా యభిమతమును కనుక్కొనిదే, రహస్యముగా జరిగినవివాహము నన్నెంతవరకు కట్టుబాట్లలో నుంచగలదో నాకు తెలుసును. సంఘమేమిచేసిననూ నన్ను శిక్షించగలదు గాని మఱల నీభార్యగా నుంచలేదు. దయచేసి ఈ ప్రశంస మఱల తలంచకండి. నాచదువింకా పూర్తికాలేదు. నా ఉద్దేశము మీకు తెలియపఱచుటకై వచ్చేను. రేపే ఢిల్లీ పోవలయును. మీ తల్లిఆజ్ఞానుసారము మఱల వివాహముచేసుకొని క్షేమముగా నుండవలసిం"దనెను.

శ్రీవిలాసు డీ దీర్ఘోపన్యాసమునకు చకితుడైనాడు.

"సువర్ణా, హిందూదేశములో స్త్రీలకు వివాహములు బాల్యముననే జరుగుచున్నాయి. వారలు భర్తలను ఎంచుకొనే ఆచారములేదు. ఒకవేళ భర్త తగినవాడుగా కనబడకపోయినా ఓర్చి కాపురం చేస్తున్నారు గాని నీవలె వాళ్లకు చదవవేస్తే ఉన్నమతిపోలేదు. నీఅయిష్టత బహిర్పరచి నాతో కాపురంచేయకపోతే చేయకపోవచ్చును గాని మఱలవివాహము చేసుకొనలేవుకదా. హిందూచట్టము దీనికి ఒప్పుకోదు. ఇక కలకాలము నీ విట్లేవుండడం అసంభవము. నాకు మఱల వివాహము చేసుకొనుటకు అనుమతిచ్చుటకు పూర్వమే బాగుగా యోచించుకో. నేను మఱల సాయంకాలము వస్తా"నని శ్రీవిలాసుడు వెడలిపోయేడు.

ప్రఫుల్లుడు సువర్ణద్వారా జరిగినదంతావిన్నాడు. "అమ్మా ఢిల్లీనుండి నీపేరను ఒకవుత్తరము వచ్చింది. ఇదిగో, బహుశా అమిత వ్రాసివుండవచ్చును." అని ఒకఉత్తరంఇచ్చేడు. సువర్ణ వుత్తరంపైనుండు విలాసమును చూచి అది సుదర్శనునిలేఖయని పోల్చింది. సుదర్శనునకు ఇంతతొందరగా వుత్తరము వ్రాయవలసిన అవసరం ఏలకలిగింది?

సువర్ణ తనగదిలోకిపోయి తలుపు గడియవైచి ఉత్తరము చదువుట కారంభించింది.

"శ్రీమతి సువర్ణగారికి:—

నీసంగతంతా తారక్ బాబువలన తెలుసుకొన్నాను. నీవు వివాహితవని తెలుసుకొన్నప్పుడు నాఆశ్చర్యము

నకు మేరలేదు. ఇంకా కన్యవలె ఏల వేషము వేసు కొనుచున్నావో తెలియదు, తెలుసుకొను అవసరము కూడాలేదు. నీ కృత్రిమవేషమున ఒక మానవహృదయమును హింసించేవు. దయచేసి ఇకనైనా నావంటి నిష్కపటపు శలభములను నీ సౌందర్యవహ్నిచే దహింపకుము.

సుదర్శన్."

ఈఉత్తరం చదివినవెంటనే సువర్ణకు రక్తనాళముల వెంబడి విషము ప్రవహించినట్లయింది. ప్రతివస్తువూ తన కండ్లయెదుట తిరుగుచున్నట్లు కనబడ్డాది. "అమ్మా, ఈప్రపంచములో నాకు శరణ్యములేదా?" అని ఏడ్చుచూ మంచముపైపడి స్పృహతప్పింది.

ఇట్లెంతసేపుగడచినదో సువర్ణకు తెలియదు. మరల చైతన్యముగలుగుసరికి ప్రఫుల్లుడు తలుపుతట్టి పిలుచుచున్నాడు. సువర్ణ లేఖను గుప్తపరచి కండ్లను తుడుచుకొనుచూ తలుపుతెరచింది. సువర్ణస్థితి దిగ్భ్రమ గలిగించింది.

"ఏమమ్మా ఎందుకేడుస్తున్నావు? తారక్‌బాబు ఇంట అంతా క్షేమమా?"

"ఆ" అని దుఃఖమును దిగమ్రింగుచూ చెప్పింది.

"మరేమమ్మా? శ్రీవిలాసునిమాటలు హృదయమును చలింపచేసినవా? ఇంకవానిని గుమ్మము త్రొక్కనీయను."

"నాన్నా, కఠినపుమాటలాడి ఆయనమనస్సు నొప్పించకండి. సాయంకాలము ఆయన మరల వచ్చును; స్వాగతమివ్వండి. నేనురేపే అత్తవారింటికి వెళ్లిపోతాను."

ప్రఫుల్లునకు సువర్ణమనోభిప్రాయము మారుటకు కారణము తెలియలేదు.

"ఇదేమమ్మా నీ మనస్సిట్లు మారిపోయింది."

సువర్ణ మరిమాట్లాడలేదు. కాలిబొటనవ్రేలుతో నేలవ్రాయుచూ తలవంచి ఊరుకొన్నది.

లోకంలో చెప్పేవారులేక చెడినవారులేరు.





# కృష్ణస్తవము

శ్రీమతి కవితావిశారద కం. కనకాంబగారు

కం॥ మధురాపురీవిహారీ మధుకైటభహారి శౌరి మాధవ నృహరీ
మధుమధురవచశ్శ్రీహరి సుధాకరకలావభూరిశోభాలహరీ !

కం॥ గోపకులమందు నందుని పాపఁడవై పుట్టు టేటిపాపము ? పోనీ
గోపికలఁ గామించుట శ్రీపతి ! తగునెట్లు పిల్లచేష్టలు నీకున్ ?॥

కం॥ వెన్నుఁడవని మునులందఱుఁ బన్నుగ సద్భక్తి నిన్ను భజియింపంగా
వెన్నందొంగిలు టేలొకొ మున్నా క్షీరాబ్ధియున్న మురహరి నీకున్॥

కం॥ ఏవిధియున్నను శ్రీహరి వీవని పరమార్థదృష్టి నెంచుబుధులకున్
కైవల్యమొసఁగి వారలచే విజ్ఞానంబుగలుగఁజేయవె ప్రజకున్॥

గీ॥ మాధవా ! సురేశ ! మధుసూదనా ! హరీ, వేదవేద్య ! వరద ! వేంకటేశ !
పంచవిషయములఁ బ్రపంచంబునన్గాంచి యాత్మనిన్నుఁ గాంతు నభవ కృష్ణ॥

కం॥ లీలామానుషవిగ్రహ కాలాంబుదనీలదేహ కంసారి హరీ
కాళీయఫణి ఫణాగ్ర వి లోలాంఘ్రిద్వయ సుభక్తలోకాధారా॥

గీ॥ కృష్ణనిన్నుఁబోలఁ గృష్ణచేలంబన్న యతనిబోలఁగఁ గనకాంబరంబు
నీవు దాల్చుచుండ జీవులకెవ్వఁడు పొందఁదగినవాఁడొ బోధపడునె॥

కం॥ భవదీయతత్త్వముంగని భవమున్ దరియించి నీదుపాదాబ్జమునన్
శివ మనుభవింపఁజాలిన ప్రవిమలపదమిమ్ము మాకుఁ బరమాత్మ హరీ !

గీ॥ దివ్యమంగళవిగ్రహుం డవ్యయుండు భవ్యకర్తవ్యతామూఢసవ్యసాచి
సేవ్యుఁ డత్యంతభక్తబాంధవ్యఘనుఁడు ద్రవ్యకాంక్షావిరహితమంతవ్యుఁ డజుడు॥

కం॥ అజ్ఞానతిమిరభాస్కర ప్రజ్ఞానాకార విశ్వభాగ్యాధారా !
యజ్ఞేశ్వరశ్రీహరి సర్వజ్ఞా వేదాంతవేద్య భక్తారాధ్యా !

కం॥ భూరికృపాకర శ్రీకర సారసదళనేత్ర సాధుసజ్జనమిత్రా
ధీరార్చిత గురుపుత్రా మారమణీహృత్సరోజ మార్తాండ హరీ !

కం॥ దేవా జీవాకారా భావాతీతాత్మ సకలబంధూ నృహరీ
శ్రీవేదమూర్తి సురసం భావితచరణారవింద పాహిముకుందా !

గీ॥ రామకృష్ణ దేవరాయ దామోదర స్వర్ణచేల నీలవర్ణ బాల
శ్రీనివాస దాసచిత్తాబ్జమకరందపానశీల వేణుగానలోల !

కం॥ చాలదు నిన్నెన్నఁగనా నాలుక చాలదు మనంబు నవ్యప్రీతిన్
శ్రీలోల లోన నిల్పఁగ జాలదుజ్ఞానంబు భక్తిచాలదు కృష్ణా!

ఉ॥ నీకమనీయవిగ్రహము నీకరుణార్ద్రవిలోకనంబు న
స్తోకవిభూతి గోపికలతోడుత నాదిమదంపతీరసో
ద్రేకము జీవులాత్మగనురీతులు నీతులు బోధజేయులో
కైకసుపోషణా! పరమనాస్తికభీషణ! నందతోషణా!

కం॥ శివదం శాంతిద ముత్తమ మవధీరితశత్రులోక మానందద మా
త్మవిదాంశరణం యదుపుంగవ! తవచరణంభజామి కనకాభరణం॥

కం॥ శరణాగతరక్షణతత్పర పురుషోత్తమ రమాధవ కృపాంభోధే
గురురూప విశ్వదీపక శరణంభవహరణమేవ చరణాతవ మే॥

కం॥ సోహంభావోపేతం శ్రీహరిపాదాబ్జభక్తి సిద్ధంధ్యానం
సాహసమాత్రం నభవత్యూహాపోహాదిరహిత ముత్తమ మమలమ్!

శ్లో॥ రామానుజ! రమానాథ! దివ్యమంగళ విగ్రహా!
స్వామిన్ సర్వజగన్నాథ! సంసారార్ణవతారక॥

శ్లో॥ కృష్ణ మాద్యం బుధైర్వేద్యం భక్తిసాధ్యం పరాత్పరం
సత్కల్యాణగుణోపేతం ముక్తిహేతుం హరిం నమ॥

శ్లో॥ గోపాలకృష్ణాయ పరాత్పరాయ వేదాంతవేద్యాయ భవౌషధాయ
శ్రీరామచంద్రాయ శివేశ్వరాయ తస్మైపరోక్షాయ నమశ్శివాయ॥

శ్లో॥ బంధవే సర్వలోకానాం। కరుణారససింధవే
ఇందవే భవతప్తానాం నమశ్శివాయ విష్ణవే!

శ్లో॥ కాంతాయకాలరూపాయ సంతానాయమహాత్మనాం!
శాంతాయ దేశికేంద్రాయ నమశ్శివాయ విష్ణవే!

శ్లో॥ గోపాలబాల మత్యంతమ్ చింతయామి పరాత్పరమ్
కమలాయతనేత్రం తమ్ సంసారార్ణవతారకమ్॥ [భూతమ్

శ్లో॥ పరమకరుణసింధుమ్ బాలగోపాలబంధుమ్ భజతిగురుపదాబ్జద్వం ద్వమద్వంద్వ
తరతిభవమహాబిందా సదాస్యైనయస్సః చరతిశిశువదంతశ్శాంభపీది వ్యశక్త్యా॥

మా॥ విదితసకలసారం వేదవేదాంతవేద్యంమదనజనకమాద్యం మామకందేశికేంద్రమ్
సదయహృదయమిత్రం సాధుసంతానచైత్రంముదితవదనమీశం పుష్పనేత్రమీడే॥

శ్లో॥ జయతుజయతులక్ష్మీ జానిరానందమూర్తిః మనసిజజనకోయం మానినీచిత్తచోరః
యదుకులమణిభూషో, యజ్ఞభోక్తాపరాత్మా కనకకలితచేలః కాంతిమాన్ బాలకృష్ణ.

# పేదరాలు

శ్రీమతి వెలిపండ చూడికుడుత్తమ్మగారు

మధ్యాహ్నము మూడుగంటలైనది. ప్రొప్రైటరు రంగనాథన్ గారింట్లోఉన్న పనివాళ్లందరు ఊపిరి విడుచుటకైన తెరపిలేక ఉక్కిరిబిక్కిరిగ ఇటూ అటూ పరుగెత్తుచుండిరి. అధికారులు అనధికారులు అగు చాలామంది పెద్దలందరు కార్లమీదను, బండ్ల మీదను, కలకలమని దిగుచుండిరి. వారు అలంకరించుకొనిన చిత్రవిచిత్రములగు ఆభరణాంబరములు, పేదవారల హృదయములు దద్దరించునట్లుగా, కండ్లను, మిరిమిట్లు గొలుపుచుండెను. రంగనాథన్ రత్నకుమారిగార్లు వచ్చిన వారందరికి కైలాగులనిచ్చుచూ ఉత్సాహమైన మాటలతో ఎదుర్కొంటూ లోనికి పంపుచుండిరి. లోపలఉన్న హాలంతా విదేశీయ పనిముట్లతోను, విదేశీయ సిల్కువస్త్రములతోను, చక్కగా అలంకరింపబడి చూచేవారలకు బహుఆకర్షణీయముగ కనిపించుచుండెను. పైన ఎలక్ట్రిక్ ఫానులు టకటకమని తిరుగుచుండెను. స్పెన్సరుకంపెనీ బొట్లెర్లు యూనిఫారండ్రెస్సు తొడుక్కొని చకచకతిరుగుతూ పరిశుభ్రమైన టేబిల్సుమీద ప్లేట్లతో ఆహారవస్తువులను అమర్చుచుండిరి. ఈవచ్చినవారందరు అనేకవిధములైన ప్రసంగములు చేసుకొనుచూ తీపిగా ఆహారమును ఆరగించుచుండిరి. చివరకి ఒక గ్లాసులోపోసి అందిచ్చిన రసముతో ఆవిందును ముగించి, అమెరికానుండి ప్రత్యేకంగా ఈవిందుకొరకు పిలిపించిన ఒకస్త్రీ యొక్క ఆటకొరకు ఎదురుచూచుచుండిరి. ఇంకా దీపములు పెట్టలేదు. పేదసాదలు కూలినాలులు ముగించుకొని తమ మొలలలోఉన్న దమ్మిడీలను, కానులను లెక్కపెట్టుకొంటూ మాటాడుకొనుచుండిరి. ఈరోజుకు ఈశ్వరుడు మనకింతే ఇచ్చినాడను పెద్దల అమృతవాక్కు ఆ నిరుపేదలకు తృప్తినిచ్చుచుండగా తమచేతనున్న అణాపబ్బులకు తాము తమపిల్లలును తినడానికి ఏమివచ్చునా అని యోచించుకొనుచూ బజారుకు కాళ్లీడ్చుకొనుచూ పోవుచుండిరి. కొందరు తమకీరోజున కూలి అసలే దొరకలేదని చిన్నబోయినమొగములతో తమగుడిసెలకు వెళ్లుచుండిరి. ఆసమయంలో మహోత్సాహంగాఉన్న రంగనాథన్ గారి గుమ్మము వద్ద 15 సంవత్సరముల నవయౌవనవతియైన ఒకస్త్రీ చిన్నబోయినముఖముతో చేతిలో ఒక భిక్షాపాత్రము పట్టుకొని నిలుచుండెను. ఆమె కట్టుకొనిన బట్ట చాలమాసిపోయి చినిగి ఆమె శరీరానికైనను పూర్తిగా కప్పలేకుండాయుండెను. కాని ఆమె సహజమైన యౌవనలావణ్యమును మాత్రము మరుగుపరచలేక శతశిఖాల చూచువారందరికి ఈమె చాలాగంభీరమైన హృదయముగలదనియు, చాలా పవిత్రమైన చరిత్ర గలదనియు తోపించుచుండెను పక్షపాతరహితయైన ప్రకృతిదేవతఇచ్చిన సౌందర్యము ప్రకాశిస్తుండగా మెల్లని కంఠస్వరముతో "అమ్మా దిక్కుమాలిన బీదదానిని: పిడికెడుబియ్యమును దయచేయండి. నాలుగు రోజులై మంచినీరేతప్ప రెండో ఆహారములేక బాధపడుచున్నాను." అని దీనముగా అడుగుచుండెను. గుమ్మమువద్ద కావలికాస్తూఉన్న దర్వాన్ ఖాన్ అధికారసేవావాసనచేత కండ్లెఱ్ఱచేయుచూ పండ్లు పటపటకొరకుతూ "ఓసే నిర్భాగ్యురాలా! ఇక్కడ మాత్రము నోరుచెయ్యకు! అయ్యగారు, అమ్మగారు విన్నారంటే నీకూ నాకూ కూడా తలలెగిరిపోగలవు. వెళ్లిపో. ఇంకా వెళ్లవేమి? పందికొక్కులాగ ఇంటింటా ఇలాతిరిగి అందర్నీ వేధించకుండాఉంటే ఎక్కడనైనా కష్టపడి కూలిచేసుకోకూడదూ, పో. అవతలికి పో. జల్దీజల్దీ."అని కఱ్ఱనాడిస్తూ బెదరించెను. ఆపేదరాలు కులికూలిపోవుచున్న తనశరీరమును తన ధైర్యావలంబనచే నిల్వబెట్టుకొనుచూ "నాయనా! కూలినాలుల

కొరకు నేనెంత దేవురించితినో నీకు తెలిసిన ఇలాగనియుండవు. నన్ను చూచిన నీకు కనికరము పుట్టకపోవచ్చును. తొంబదిసంవత్సరాల ముసలిబడుగు ఈతిండిలేని కారణముచేత తటతటకొట్టుకొంటూ ప్రాణావసాన స్థితిలోఉన్నది. ఆసంగతిని విన్నయినా కొంచెము కనికరించుము." అనెను.

దర్వాన్:—నా కేమీ అవసరములేదు. నీఅబ్బ ముల్లెదాచినట్లుగా అలాగు గుమ్మంపట్టుకొని వదల కుండా ఉన్నావేమి? నీకు దేహమర్దనము కావలసి నట్లు కనపడుతున్నది."అనెను. ఇంతలో లోపలనుండి "ఫ్యాన్" అనేకేక వినబడెను. వెంటనే అతడు "వస్తూన్నానండీ అమ్మగారూ"అని అంటూ "ఓసే వెళ్ళెదవా లేదా" అని గాండ్రించుచూ అరచుచుండగా లోననుండి "ఇంకనూరావేమి" అని కేకలు వేయుచూ రత్నకుమారి విసవిసవచ్చి "ఓరీ నీకు చెవులులేవా? పిలిచినవెంటనే ఎందుకురావూ" అని కసరి "ఓరి వెధవా ఈగుంటతో సరసాలాడుతూ కదలిరాలేకున్నావా? నీరోగము దానిరోగము కూడా వదలించెదనులే." అని అనుచుండగా "అమ్మగారూ! దీనికి బిచ్చముకావలెనని మొండికేసి కూర్చున్నది. నేను ఇంతకుముందే మీయాజ్ఞను ఎరిగున్నవాడిని కాబట్టి దీనిని వెళ్లగొట్టుతున్నాను" అని దర్వాన్ జవాబిచ్చెను.

రత్న:—ఛీ నోరుమూయి. చేతకాని పందవు. నీ బ్రతుకుకు చేసినతప్పు సమర్థించుకోవటంకూడనా?

పేదరాలు:—(అవమానముచే కలిగిన రోషవిచారములతో) తల్లీ! మీ రనవసరముగ ఉపయోగింపకూడని నిందావాక్యాలను పల్కినారు. మీరుకూడా జన్మముచేత స్త్రీలైనప్పటికి స్త్రీలకు సహజముగా ఉండవలసిన ప్రేమవాత్సల్యాలు ఆత్మగౌరవము, ఎందుచేతనో గాని లోపింప జేసుకుంటున్నారు. నిజమైన ఆత్మగౌరవము మీయందు ఉన్నట్లైతే తోటి స్త్రీని ఇంతనీచమైన అవమానపుమాటచేత నొప్పించరు. మీరు ధనవంతులుగదా అని నాకడుపుకక్కూరితి ఈ విధముగా నన్నిక్కడికి ఈడ్చుకొనివచ్చినది." అని అంటూ వెళ్లబోవుచుండెను. ఆమాటలను వింటూ ఉన్న రత్నకుమారి పట్టలేని అహంకారముతో ధనాధికారములు మంచిచెడ్డల తెలియనీయనందున దర్వాన్ ఖాను చేతిలోఉన్న బెత్తాన్ని తీసుకొని ఆపేదబాలికను దిట్టముగా వాల్లుతగల్చెను. అప్పు డీపేదరాలు ఇక తాను మాటాడుట లాభములేదనుకొనుచూ తన సుకుమారమైన శరీరమంతా రక్తము క్రక్కుతూ ఉంటే ఈఅన్యాయ, అధర్మపరిస్థితులు, దారిద్ర్య ధనవంతులమధ్యనుండే ఈఅగాధమైన భేదాలు ఆలోచించుకుంటూ ఈశ్వరుని దలచుకుంటూ నడచుచుండెను.

౨

"అమ్మాయీ ఎందుకు నీశరీరమట్లు ఎఱ్ఱగాకంది రక్తము చిమ్ముచున్నది? ఏరాతిగుండెగలవాళ్ళు నీ శరీరము అంత కందిపోయినట్లు నిర్దాక్షిణ్యముగా బాదిరి?"

"అవ్వా! నే నేమని నీతో చెప్పను. రోలూచ్చి మద్దెలతో మొత్తుకొన్నట్లుగా ఉండును మన మొఱ్ఱలు ఒకరితో ఒకర మనుకొనుట. ఈరోజు ప్రొద్దుటినుండి మా అవ్వపడేబాధను చూడలేక పోయాను. ఇంట్లో చారెడునూకలైనలేవు గంజికాచటానికి. అప్పుడు ఒకవిధమైన తెగింపుతెచ్చుకొని మా ఇరుగుపొరుగువారి ళ్ళకువెళ్ళి మొట్టమొదట ఏమైన దొరకునేమో అని చూచాను. ఒకఇంట్లోఉన్న ఇల్లాలు ఒక చిన్నకుండెడు సంకటిని కాచినది కాబోలు. చిన్నచిన్నచిప్పల్లో ఇంతంత సంకటి వేసి ఇంట్లోఉన్న నల్గురుపిల్లలకు సర్దుతూఉన్నది. నంచుకొనుటకు ఒక్కొక్కపచ్చి తెలకపిండి ఒడియం చేతికిచ్చింది. ఆపిల్లలు అది చాలదని గిలగిల తన్నుకుంటూ ఏడుస్తున్నారు. నాగుండె ఝల్లుమన్నది. ఇంకోగుడిసె దగ్గరికి వెళ్లాను. ఆఇంట్లో పెద్దవాళ్లు ఎవ్వరూలేరు. ఇంకా కూలినుండి

తాలేదు కాబోలును. నేలకంటిన ఆపొట్టిచూరుకే ఒక కుళ్లుచింకిపంచెలో ఇరవైరోజులబిడ్డ మలమూత్రాలు చేసుకొని కారుకారుమంటూ గుక్కతిప్పకుండా ఏడుస్తూఉన్నది: మ్యునిసిపల్ వారి ధర్మమాఅని ప్రత్యేకముగా వీరిమీదఉండేదయచేత ఎత్తివేయకుండానున్న చెత్తకుప్పలమధ్య దిసమొలలతో ఎడపిల్లలు ఆడుకొంటున్నారు. ఆపిల్లలు ఈచంటిబిడ్డ ఏడ్పును వినగానే దబదబావచ్చి ఆఉయ్యాలను గట్టిగాఊపి ఆబిడ్డకు ఉడ్డుగుడుచుకొన్నట్లుగా చేసిపోవుచుండిరి. ఇలాగే అక్కడఉన్న కూలిజనం గుడిసెల్లోకి వెళ్లిచూచాను. ఒక్కఇంట్లోకూడా ఒకపూట గంజికాచటానికైన చారెడుబియ్యము నిలవలేవు. ఇంక ఇక్కడంతా ఇదే మచ్చువారముగదా అని అధికారపదవుల్లోఉన్న పెద్ద పెద్దవీధుల్లోకి వెళ్లినట్టైతే మా అవ్వప్రాణము కాపాడుకొనగలననే భ్రాంతితో ఆ పెద్దవీధుల్లోకి వెళ్లి నేబొందిన బహుమానమిది.

ముసలిది:—అయ్యో ఎంతపని జరిగింది. నీతల్లి చిన్నతనంనుంచి మిమ్ములను నేనెరుగుదును. ఎంత బుద్ధిమంతురాలు, అంత యోగ్యురాలు ఇక పుట్టబోదు. దరిద్రబాధచేత సరియైన ఆహారములేనందున నీవు కడుపున పడినప్పటినుండి నీతల్లి చాలా నీరసించిపోయింది. నెలలు నిండినతరువాత నిన్ను కనగానే మొగముతిరిగి పడిపోయినది. అదే ఆఖరు. నీతండ్రి ఆశవమును దహనపరిచటానికికూడా శక్తిలేనందున అంతకుముందే విచారంతో క్రుంగిపోతూఉన్న అతని మనస్సు ఈవిచారంతో మరీ చలించి దేశాలపాలైనాడు. ఇప్పుడు నిన్ను పెంచుతూవున్న ఆ అవ్వ నీసౌందర్యానికి ముగ్ధురాలై తన కడుపు కట్టుకొని, నిన్ను పెంచి పెద్దదానినిచేసింది. ఏదో విధంగా నీస్వబుద్ధిమూలమున, ఆఅవ్వ తరిబీదువలనా కొంత జ్ఞానము సంపాదించావు. తల్లీ! నీవు చాలా దురదృష్టవంతురాలివి. దారిద్ర్యబాధకుతోడు దెబ్బలు కూడా తిన్నావు. ఒక పల్లెటూరిఖామందు తనఇంట భారసాలని వచ్చినవాళ్లందరికీ లేదనకుండా ఒకపూట భత్యమని రెండేసి అణాలుచొప్పున ఇచ్చినాడు. ఈ రెండణాలు నీవు తీసుకొనివెళ్లిపో. ఈ పూటకు గడచిపోవును గదా. తెల్లవారి మనబాధలు మనవే. ఆనాడు కుశలాయుగంలో చెప్పినట్లుగా మనకు "దిన దినగండం వేయేళ్లు ఆయువు" పద.

పేదరాలు:—అవ్వా! ఒక్కఅణా చాలు. ఆ ఖామందు గ్రామాల్లో నివసించేవాడు కాబట్టి ఇంకా ఈబారసాలలు ఈపెళ్లిసంతర్పణలు పెట్టుకొన్నాడు. లేకపోతే ఈవిధముగా ఖర్చుపెట్టుట కిష్టపడనే పడడు. ఏపదిమంది పెద్దవాళ్లకో ఒక వెయ్యిరూపాయిలు ఖర్చుపెట్టి ఒక టీపార్టీపెట్టి తన జన్మమంతా సార్థకం అయిపోయినట్లుగా సంతోషించేవాడు. దేవునిచేత సృష్టింపబడిన ఈ ప్రపంచంలో ఇంత అన్యాయం ఇంతఘోరం ఎన్నాళ్లుజరగాలో రోజు రోజుకి బ్రతుకడం ఎల్లాగాఅన్న చింతేతప్ప రెండో దానికి దేనికీ అవకాశమేలేదు మనకి.

ముసలిది:—కాలమంతా పూర్తిగా మారిపోయింది. నా చిన్నతనంలో ప్రతివాళ్లము ఇంతో అంతో వ్యవసాయం చేసుకొంటూ, ఒక గేదె, ఒక ఆవు పాడితో హాయిగా మేము పదిమందిమీ కాలక్షేపం చేసుకుండేవాళ్లము. తెల్లవారి ఒక కానీని కూడా చూడవలసిన ఆవశ్యకం లేకపోయేది. మాకు పండింది ఒకరికిచ్చేవాళ్లము. ఒకరికిపండింది మేము తెచ్చుకొనేవారము. దగ్గిరఉన్నబీళ్లలోకి హాయిగా పశువులను తీసికొనివెళ్లి మేపుకొని వచ్చేవారము. దగ్గిరగాఉన్న ఏఅడవుల్లోకివెళ్లినా మాకు కావలసినంత వంటచెఱకు సంవత్సరానికి కట్టే బహుస్వల్ప రుసుముతోనే తెచ్చుకునేవారము. అటువంటి కాలమంతా ఇంత విషమించింది. మొన్న నీ మధ్య పొరుగునఉండే 10 ఏళ్లపిల్ల దగ్గిరగాఉన్న ఒక అడవిలోకివెళ్లి తెలియక కంపనరకటానికి కొడవ లెత్తిందట. దానికి వెంటనే ఫైనూ. జుర్మానా అధికారులు

వేసేశారు. పాపము వాళ్లు బ్రతుకుటే కష్టముగా ఉంటూఉన్నప్పుడు డబ్బురూపంగాఉండే ఈజార్మానాను ఏవిధంగా చెల్లించుతారు. దీన్ని యోచించి తీర్చేనాథు డెవ్వడూ కనిపించడు. మీదుమిక్కిలి పన్నులుమాత్రము ఏటేటా కొత్తకొత్తవి కొత్తకొత్త రూపాలుగా ప్రత్యక్షమవుతున్నాయి.

పరిపాలనా సౌకర్యకోసరం ఏర్పడ్డ వేర్వేరు స్థానికసంస్థలన్నీకూడా వేరువేరు పన్నులను ఒకే మనిషికి తగిలిస్తున్నారు. వాటిని లెక్కపెట్టడానికి వీల్లేదు, ఆపన్నులను వెయ్యడంలో ఈమనిషి ఇచ్చి తీరవలెననే ఉద్దేశమే గాని ఇవ్వగలశక్తి యున్నదా లేదా అని యోచించి వేయుపద్ధతి సుతరాం ఎక్కడా లేదు. ఒకేమనిషిని నలుగురు నాలుగువైపుల తలోసారి వచ్చి తలో తన్నుతన్ని ఎవరిమట్టుకు వారు ఈ ఒక్క దబ్బే గదా అని తలచినట్లుగా తలావకరు తలో రూంపగా పన్నులు వేస్తున్నారు. మనిషికి వచ్చునికరాదాయాన్ని పుచ్చుకొని వాడి జీవితాధారం పోను ఒక్కసారే ఒక్కరే పన్నును వేసినయెడల న్యాయముగను సబబుగాను యుండియుండేది. ఈ కారణాలవల్ల వ్యవసాయదారుడు కష్టపడి పండించే దానికన్న భూమిని వదలివేస్తేనే బాగున్నట్లు తలపవలసిన అవసరం వస్తున్నది. అందుకోసరం గ్రామస్థులందరు గ్రామాలనీ వ్యవసాయాలనీ వదలివేసి పన్నులబాధలను మధ్యవర్తుల దుండగాలనూ భరించలేక గ్రామాల్లో కడుపుజరక్క పట్నాల్లో కూలి చేసుకుందామని మొత్తముమీద అందరూ దాస్యవృత్తికి తయారుకావలసి వచ్చింది. అందువలన గ్రామాల్లో నిత్యమూ మామూలుగా నడుస్తూఉన్న గృహపరిశ్రమలన్నీ నశించినవి. వ్యవసాయము కడుపు నింపుతూఉంటే ఈచేతిపనులమూలాన తమ ఇతరఖర్చులు సౌఖ్యములూ జరుగుతూఉంటే గ్రామస్థులందరూ ప్రపంచము తల్లక్రిందలైనా తాముమాత్రము తొణకవలసిన అవసరంలేకుండా హాయిగా ఉంటూ ఉండేవారు. అందుమూలాన తాము సౌఖ్యపడుటయే గాక సమస్తప్రజలకు తిండికి కష్టములేకుండా జరిగిపోతూ ఉండేది. ఇక ఇక్కడ చూడబోతేనా (అనగా పట్నాల్లో) మన సౌకర్యంకోసరం చాకిరీ చేస్తున్నామా, లేక చాకిరీకోసరమే మనముపుట్టామా అనే ప్రశ్నలోనికి వచ్చినాము. నిజానికి చూడబోతే చాకిరీకోసరమే మనంపుట్టాము అని రుజువవుచున్నది. ఏమిల్లుకుపోయినా ఏకాలికిపోయినా ప్రొద్దుటే 6 గంటలు కొట్టకుండావెళితే 12 గంటలు కొట్టేవరకూ గొడ్డుచాకిరీచేసి తిరిగి రెండుగంటలకేవెళ్లి సాయంత్రం 6 గంటలవరకు ఆవిధంగానే చేసితీరాలి. అంత చాకిరీ చేస్తేనేగాని ఒక్కపూటైనా గడవదు. అంత చాకిరీకి సరియైన ఆహారము, సరియైన ఉత్సాహపరిస్థితులు లేనందున శక్తియుండదు. అందువల్ల మస్తుగా తాగటం అలవాటు చేసుకుంటారు. దానికి తోడు సహవాసాలు ఎక్కువ ప్రోత్సాహం చేస్తూ ఉండగా, మన అధికారులుకూడా చాలా చవుకగా పేదవాళ్లమీదఉండే దయ చేత చేసేసప్లైవల్లనూ బాగా త్రాగుబోతులై, చేతకానిపందలై, జీవచ్ఛవాలై చెడిపోతున్నారు. ఈత్రాగుడే ఆహారముగా కూడా మారిపోయిన కాలంవచ్చింది. ఈత్రాగుడుమూలాన కలిగేఅనర్థాలు పోట్లాటలు వేరే చెప్పనవసరములేదు. వాళ్లిచ్చిన కూలిడబ్బులు కాస్తా ఇలాగ వ్యయమైపోగా ఇంట్లో పెళ్లాంబిడ్డలు మామూలుపస్తే. ఈవిధంగా మనవాళ్లబ్రతుకులు తారుమారు కావలసినపరిస్థితులు ఏర్పడ్డవి. ఇంతకూ మనఅవస్థలు తీరేవిధము కలలోకూడా కనపడటం లేదు. ఇక వెళ్లు ప్రొద్దుపోయింది. రేపు కలుసుకుందాం.

## 3

ప్రతాప దేవవర్మమహారాజుగారు చాలా ఉదారహృదయం గలవారనిన్నీ, సరసులనిన్నీ, విద్యావంతులనిన్నీ, కించిత్పరమార్థ చింతగలవారనిన్నీ ప్రసిద్ధి. ఐశ్వర్యవంతులలో అంత నిగర్వచూడామణిని

చూడటం అయినకూడా వాకుక. అతను ఒకరోజున ప్రొద్దుటే 8 గంటలకు తనహాల్లోనే ఒంటరిగా ఏదో గ్రంథమును చదువుకొంటూ కూర్చుండెను. అప్పుడు లోపలినుండి ఒకయువతి ఈయన యున్న చోటికివచ్చి కొంచము ప్రక్కగా నిలుచుండెను. ఆయన కొంతసేపటివరకు ఆవిడను చూడలేదు కాని తరువాత చూచి "అమ్మాయీ శకుంతలా! ఎందు కిలాగు వచ్చావు. నీశరీరము ఇంకా నీరసముగా ఉన్నదనిన్నీ ఒకనెలవరకు కదలకూడదనిన్నీ డాక్టరు చెప్పాడుకదా? ఆరోజున నువ్వు నాకారుక్రింద పడి పోయినప్పుడు నీవు తిరిగీ ఈ స్థితిలోకి వస్తావని అనుకోలేదు సుమా. ఇంతకూ భగవంతుడు నాపాలిట ఉన్నాడు. లేకపోతే నీవంటి ఉత్తమజీవిని లోకంలోనుండి తప్పించిన పాపము నాకొడుకుకు చుట్టుకొనియుండేది. అయినా ఆరోజు కార్లకూడా పడి, బంట్లుకూడావడి, గవర్నరుగారి రాకవలన మేమిచ్చే టీపార్టీలవలన ఎక్కడా తెన్ను తెరపి లేకుండా ఉండెను. నిన్ను చూచినవేళా విశేష మేమిటోగాని కణ్వమహామునికి శకుంతల్లాగ నీవు నాకంటికి కనబడగానే శకుంతలాఅని పిలవవాలని బుద్ధిపుట్టింది. మీఅవ్వకూడా ఖులాసాగా ఉన్నది కదా?

పేదరాలు:—తండ్రీ! మీరు చూపించేదయకూ ప్రేమకూ నేను చాలా కృతజ్ఞురాల్ని. మీబోటి వదాన్యుల్ని ఈకాలంలో సాధారణంగా చూడ లేము. తెన్నుబోయే భిక్షురాల్ని తెచ్చి ఇంతవరకూ ఇంతజాగ్రత్తగాచూడటం ఈకాలంలో అరుదు. నా శరీరంలో ఇప్పటికి చాలావరకు దారుఢ్యమొచ్చింది. ఇక మీకు శ్రమను ఇయ్యలేదు. తమరికి నాయందు దయఉంటే మాఅవ్వనిమాత్రం మీనౌకర్లఇళ్లలో దేనిలోనైనా ఉండటానికి అవకాశంఇస్తే చాలా సంతోషం.

వర్మ:—(ఆశ్చర్యంతో) ఏమీ! జీవసాధారం ఏమీలేని నీవిప్పుడు ఎండల్లో వానల్లో ఒంటరిగా కడుపుకోసరం దేవులాడుతూ వెళ్లిపో దలచినావా? వద్దు. వద్దు. నీకిక్కడ ఏమైనా లోపంజరిగిందా? నీఅవ్వకు శుశ్రూషచేయుకుంటూ నా ఇంట్లో నే ఒకచోట ఉండు. నీగౌరవానికి ఏమీ లోటు రానీయను. నేచెప్పినట్లుగా చేయుము. నామాట వినుము.

పేదరాలు:—తండ్రీ! నేను పుట్టినప్పట్నుండి ఇంత ఆదరణ, ఇంత సౌఖ్యము ప్రపంచంలో ఇంకా ఉన్నదనేసంగతే నాకుతెలియదు. గాని మీరు నన్నెంత పుత్రికాభావంతో చూచినా, నేను నాయీ స్థితిలో మీగృహంలో శాశ్వతంగా ఉండటం మంచి దిగా నామనస్సుకు తోచటంలేదు. అదిగాక మావంటివారు నివసించేతావులు వేరే యున్నవి. దయచేసి సెలవీయండి.

వర్మ:—(విచారంతో) నిన్నెవ్వరైనా ఏమైనా అన్నారా ఏమిటి? నీవు నివసించవలసినతావులు వేరే యున్నాయని చెప్పావుగదా! పరమేశ్వరుడు ఒక్కొక్కమనిషికి ఒక్కొక్కతావని నొసటవ్రాసి నిర్ణయించాడా? ఇవిఅన్నీకూడా మానవులు తమ అధర్మయుతమైన వక్రబుద్ధులచేత కల్పించుకొన్న కృత్రిమపద్ధతులు. దురభిమానపూరితమైన పాషాణ ధర్మాలు.

పేదరాలు:—ఏలాగైతేనేమి? ప్రస్తుతంలో అందరూ అవలంబిస్తూఉన్న పద్ధతులే అవికదా. మాలో ఎవరైనా తమరికి కలిగేబాధలు, తమరుపడే ఇబ్బందులు నోరుతెరచి చెప్పటానికి సాహసించినా వినేవాళ్లేలేరు. మీదుమిక్కిలి "రాజాగారని చెప్పవస్తే మరిరెండు తగల్నియ్యి" అన్నసామెత మాయందు సార్థకమవుతుంది. మీరు అనగా ఐశ్వర్య వంతులు నిత్యమూ అనుభవిస్తూయున్న సౌఖ్యాలు, అనుభవాలు వేరువేరుగా నే చెప్పఅవసరంలేదు. మాస్థితిగతులు ఊహామాత్రంచేతకూడా మీకందు

పోటులోనికి రావు. మేము ఉండేతావులు, కట్టుకునే బట్టలు, తినేతిండి, పీల్చేగాలి అన్నికూడా మీవాటికి మావి హస్తిమశకాంతరాలు. మీరు ఏయెండకైతే భయపడి మార్బిల్ రాళ్ల బంగళాల్లో, చల్లనిగాలి వచ్చే ప్రదేశాల్లో, హంసతూలికాతల్పాల్లో హాయిగా చీమ చిటుక్కుమనకుండా నిద్రపోతారో ఆసమయంలో మేము కడుపులోకి ఉప్పులేనిగంజైనా లేక పైని నెత్తి, క్రింద కాలు, లోనక్షుత్తు మలమలమాడ్చివేస్తూ ఉండగా ఇంటింటా పిడికెడు బియ్యముకోసం యాచించుచూ, సామంతుల నిద్రాభంగమైనదను నిందలకు గురియౌతూ మిడిఎండలో తిరుగుతూ ఉంటాము. మమ్మల్ని చదువురానివాళ్లని అనాగరీకులని నిందిస్తూఉంటారు. ఆరోగ్యముగాఉండమని చెపుతారు కాని మాకు తగిన నీటిసదుపాయం కల్పించరు. పిల్లలకు చదువుచెప్పించుమని బోధిస్తారుగాని చదువుకునేటందుకు తగిన సదుపాయాలు చేయరు, సరిగదా కడుపుకొరకే ఏడోఏడు వచ్చినప్పటినుండి దేవులాడవలసిన పరిస్థితుల్లో ఆచదువేమివస్తుంది. అదేమి వంటపడుతుంది. మేమేమికష్టపడో ఒకబేడ్డబ్బులు బజారుకు పట్టుకొనివెళ్లితే ఆబజారువాడంతకంటె మోసముచేస్తాడు. వాడి కందులోనే కక్కూర్తి పాపము. మనిషియొక్క ఆదాయానికి, బజారురేట్లకు ఎట్టిసంబంధములేదు, దాన్నిగురించి మన అధికారులకు నాటనేలేదు. యోచించటానికికూడా అవసరం కనపర్చరు. ఒకఉద్యోగికి సాదాపు సంవత్సరానికి 3 లక్షలు అధికారులు ఖర్చుపెట్టుతూ వారే తిరిగి ఇంకొకఉద్యోగికి సంవత్సరానికి 144 రూ. కన్న ఒక దమ్మిడీ ఎక్కువ ఖర్చుపెట్టరు. పరమేశ్వరుడు సమస్తమానవులకు ఒకేవిధముగా భార్యాబిడ్డలు సంసారము ఇత్యాదిపరిస్థితులన్నీకూడా సమానంగానే ఏర్పాటు చేసాడు. జన్మతోనే క్షుత్పిపాసలను ఏర్పాటుచేసాడు. యిటువంటప్పుడు ప్రజల బాగోగులకు బాధ్యులైనవారు మనిషియొక్క జీవితానికి కనీసము ఎంత ఖర్చవుతుందో అది కొంచమైన గమనించిన న్యాయముజరిగేది. ఇట్టి గమనింపులకోసరమున్నూ, ప్రజలబాగును గమనించటానికిని తగిన అవకాశముకొంటున్నా గదా ఈజనాభాలను ప్రతి పదేసి సంవత్సరాలకు తయారుచేయుట. కాని అది నిజమైన ఉపయోగంకోసంగాక లోకప్రదర్శనానికి ఉపయోగమౌతూఉంది. తమరికి నిశ్చయము- ఎవరియొక్క సహాయములేకపోతే ఒకపనికూడా నడవదో అట్టి తమ తాబేదారులనుగురించియే నిర్లక్ష్యంగాప్రవర్తిస్తూ మనకు మనుష్యులు ఎంత తగ్గింపుజీతమునకైనా సిద్ధమౌతున్నారని నిబ్బరంగా మనపోషకులు ఉన్నారు. తగ్గింపుకు వస్తున్నారంటే దరిద్రమంత ఎక్కువగా విచారించేనాథులు లేరు. ఆమాత్రంకూడా ఆసరాలేని మాబోటివాండ్లసంగతి "ఎవరికి పుట్టినబిడ్డరా వెక్కి వెక్కి యేడుస్తున్నది" అన్నట్లు ఉన్నదనటంలో అసంభవం ఏమీలేదు. ఈదారిద్ర్యంచేత మాబోటివారు చేయరానిపనులను చేయటానికిగాని, వినరాని మాటలచేత ఒకరినొకరు నిందించుకొంటూ కొట్టుకొనుటకుగాని ఎవ్వరూ వెనక్కితియ్యరు.

మా మొరలు, మాలోపాలు, మాచింతలు వినేవారుగాని, చూచేవారుగాని, తీర్చేవారుగాని ఇప్పట్లో ఎవ్వరూలేరు. మశూచి, కలరా, క్షయ, ఇత్యాది వ్యాధులుమాత్రము మాకు చాలా స్నేహితులుగా ఉంటూ ఎడబాయకుండా ఆదరించుతూఉంటవి. ఇంతకూ కర్మను తప్పించలేరనే సిద్ధాంతం మనకి కొత్తది గాదుకదా?

వర్మ:—కాలమానపరిస్థితులు ఆవిధంగా చొచ్చుకొని వస్తూఉన్నవి. ఎవరివీలునుబట్టి వారు నీవిప్పుడు చెప్పిన సమస్యలన్నిటినీ నివారించటానికిప్రయత్నాలు చేస్తునేయున్నారు. ఇంకా ఎవరేమి చేయగలరు? ఎవరదృష్టమువారిది,

పేదరాలు:—నేచెప్పేదికూడా అదే. కానీ కొంచము సహకారమనేగుణము ప్రపంచమునగల సుగుణాల్లోకెల్ల ఎక్కువదిగదా? దేశంలో ఏమైనా

స్థావరంగా కావాలంటే ప్రభుత్వమువారిద్వారా జరిగినట్లుగా ఇంకోవిధంగా జరగజాలదని నాకు ఘంటాపథంగా తెలుసును. అయినను మీవంటిధనవంతులు, మీవంటి వదాన్యులు, చాలామంది ఇంకా ఉన్నారు. ధనమంతా భూమిలో ఇంకిపోలేదు. సముద్రంలో కొట్టుకుపోలేదు. తమతోడి దేశీయులు, తమతోడిమానవులు, తమతోడిసోదరులు వీధుల్లోబడి గుప్పెడు మెతుకులకోసరం, జానెడు గుడ్డకోసం మానాభిమానాలు నశింపచేసుకుని కడుపు కొట్టుకొంటూ గుమ్మముగుమ్మముదగ్గిరా దేవురిస్తూఉంటే డబ్బును నిల్వచేసుకొన్న కోటీశ్వరులంతా హద్దుపద్దు నీతినియమములేని అనవసరభోగాలకు, అనవసర వేడుకలకు, అనవసర మెహర్బానులకు లక్షలలక్షల ధనాన్ని వెచ్చిస్తున్నారు. ఇంకా వెచ్చించటానికి ఒళ్లెరగని ఆవేశంతో ఎదురుచూస్తున్నారు; తమ కాళ్లవద్ద ఈడిగిలపడి తాము ఎడమకాలితోతన్నినా తమ దయాభిక్షాన్నే యాచిస్తూఉన్న తమసోదరులను కొంచమైనా గమనించటానికి ధనవంతుల మనస్సుల్లో చోటులేదు. ఇంతకూ వాళ్లమనస్సుల్లోమాత్రము శాంతిఉందా? నిజంగాచూస్తే శాంతి అన్నది భోగములోకంటే త్యాగంలోనే ఉందని పెద్దల వాక్యంగదా? అట్టిది లేకపోవడంచేతను, మానవ హృదయాల్లో తృష్ణను పెరిగించేపరిస్థితులు ఎక్కువగా నాల్గువైపులా చెలరేగటంచేతనూ ఎక్కడా నిజమైనతృప్తి, శాంతి, కలల్లోకూడాలేదు. ధార్మిక వాసనలు నైతికకట్టుబాట్లు ప్రజలహృదయాల్లో నానాటికి నశిస్తున్నాయి. కాబట్టి మానవులకు సహజముగా కనబడవలసిన జగత్కళ్యాణస్వరూపాన్ని కన్పింపజేసే హృదయపరివర్తన ధనవంతులహృదయాల్లో కలుగవలెను. అది అత్యవసరము. అట్టి హృదయపరివర్తనమే లేకపోతే పైపై ఉపశమనాలు పైపై ఉపన్యాసాలు ఏమియు లాభంలేదు. అట్టి సుకాలము ఎప్పుడువస్తుందోకదా? కేవలము దీనజనావళోకనమాత్రంచేత సమస్తసౌఖ్యాలను వదలివేసి సర్వభూతదయాళుత్వమును సందేశరూపంగా ప్రపంచానికంతా బోధించిన త్యాగశిరోమణులవంటి త్యాగులు తిరిగి జన్మింతురు గాక.

వర్మ:—బిడ్డా! నీవు చెప్పినదంతా సబబుగానే యున్నది. గాని లోకమర్యాదను, లోకరివాజును, నీవంతగా గుర్తించలేదు. ఒక ధనవంతుడు ఎంతమందిని, ఎన్నివిధాలని పోషించి కాపాడగలడు? ఇదంతా జరగనేరనిపని.

పేదరాలు:—తండ్రీ! మీరడిగారు కాబట్టి నాకు తోచింది నేచెప్పటానికి సాహసిస్తున్నాను. లోకమర్యాదల్ని వదలివేయుమని కోరటంఅస్వభావం. గాని అందులో మతామతములు, సమయాసమయాలు ఉన్నవిగదా? ఇంట్లోబిడ్డలు ప్రాణావసానస్థితిలో ఉంటే ఊళ్లో పేరంటాని కెవరైనా వెళ్లటానికి తలుస్తారా? అన్నీ తెలిసిన మీకు నేదెల్పటం అనవసరం. తమ త్యాగగుణాన్ని చూపించటానికి దీనులనుపోషించటానికి అనేకమార్గాలున్నాయి. పూర్వము తమవంటి వారంతా సామాన్యులందరికీ సహజమైనబుద్ధి చాతుర్యం ప్రోత్సహించే అనేకరకములైన కళలనూ, వ్యక్తిత్వాభివృద్ధి సూచకములైన పరిశ్రమలనూ, దోహదపరచుటకు ప్రయత్నించి శాశ్వతకీర్తిని పొందినట్లుగా మీకు బాగాతెలియును. ఇప్పుడో ఒక్కవ్యక్తికే లాభమంతాచేర్పించే కంట్రాక్టుపద్ధతులు, లైసెన్సు పద్ధతులు అంతులేకుండా పెరిగిపోయినాయి. సామాన్యులందరు కష్టజీవులై అల్లాడటం దానితోకూడా సమంగా పెరిగింది. ఇది ప్రతిదేశంలోనూఉంది కాని ఆదేశములవారు తమ్ముతాము రక్షించుకొంటూ లోపాలను వెంటనే తలచుకుంటే దిద్దుబాటు చేసుకుంటారు. మనకిమాత్రము అట్టిది అసంభవం ఏమో అని అనుకోవాలసివస్తున్నది. ఇంకొకసంగతి. కొత్తకొత్తపనిముట్లను కనుక్కొంటూఉన్న ధీమంతులు కొత్తకొత్తమార్గములను చూపించుకూఉన్న మహానీ

యులు చాలామంది ఉన్నారు. ఇంకా బయల్దేరుతున్నారు. పాలితులందరిబాగును దృష్టియందుంచుకొనవలసిన పాలకులు అతనిని ప్రత్యేకంగా గౌరవించి ఆ పనిముట్లను తమస్వాధీనంలోవుంచుకుంటే ఇంత దుర్భిక్షములు సామాన్యులలో ఉండవు. ప్రభుత్వమునకు తగినంత ధనముఉండి తండ్రిదగ్గరఉన్న ధనము పిల్లలందరికీ వినియోగించి పంచిపెట్టునట్లుగా అధికారులు ఆధనమంతా సద్వినియోగపర్చటానికి సాధ్యమౌతుంది. అందువలన పేదలు కొంతవరకైనా పన్నుల బాధలుతగ్గి సుఖపడునట్లుగా అధికారులు చేయగలరు. అదిగాకుండా కోట్లకొద్దిధనము ఒకేవ్యక్తి స్వాధీనమందుండుట సంభవించదు. దీని నమలునందుంచ ప్రయత్నిస్తూ వ్యవసాయాభివృద్ధికి సకలవిధాల దోహద మిచ్చినట్లైతే ప్రజలు కొంతవరకైనా శాంతి సౌఖ్యాలను పొందగలరు. ధర్మస్వరూపుడును ధర్మసంస్థాపకుడును అయిన పరమాత్ముని రక్షణచేత రక్షింపబడేవారినే గాక రక్షకులు లేనివాళ్లనికూడా రక్షించి తన దీనజనబాంధవుడనే బిరుదును సార్థకపరకునే వేళ తప్పకుండా వచ్చును గాక. నేనిక సెలవు పుచ్చుకొనెదను. అని నమస్కరించి తిరిగిచూడకుండ వెడలిపోయెను. వర్మయు ఆమె ప్రసంగమునుగూర్చి యోచించుచూ అటులనే గూర్చుండెను.



శ్రీమతి చిల్కపాటి సీతాంబ గారు

# గృహలక్ష్మి కంకణ మహోత్సవము

## (1935)

నెల్లూరుపురవాస్తవ్యురాలగు శ్రీమతి చిల్కపాటిసీతాంబగారిపేరును వినని యాంధ్రభాషాపరిచితులుగాని గృహలక్ష్మి పాఠకులుగాని ఆంధ్రదేశమున లేరు. ఈమె 'శ్రీ మదనగోపాల వరప్రసాదాసాదిత'మగు మృదుమధురకవిత్వరచనముల వలన ధన్యురాలు. శ్రీ పద్మినీ పరిణయము, దిలీప, కాదాచిత్కపద్యములు, అరవింద మొదలగు కావ్యముల నెన్నింటినో రచించినారు. ఈమెను సత్కరించుట మత్పరమ కర్తవ్యమని యెంచి ఈమె స్వస్థానమగు నెల్లూరు పురమున శ్రీ మొల్ల జయంతి ఉత్సవ సందర్భమున జరుగు సభలో ఈమెకు నూటపదియారు రూపాయిలు విలువగల గృహలక్ష్మికంకణమును అర్పించ దలచుకొనినాను. గనుక యెల్లరును ఆ యుత్సవమునకు విచ్చేయం బ్రార్థితులు. ఈమెకు కేవలము కంకణ నమస్కారపూర్వక సత్కారములేగాక ఆర్థికముగం దోడ్పడు సత్కారమును గూడం జేయందలచుకొని ఆమె వ్రాసిన అరవిందయను 176 పుటల నవల నచ్చొత్తించి ఆ ప్రతులను అమ్మి తన్మూలమునవచ్చు ద్రవ్యమునుగూడ నర్పింప సంకల్పించుకున్నాను. గృహలక్ష్మి చందాదారులెల్లరును ఆ ప్రతులను స్వల్ప మాత్ర మూల్యమగు రూ. 1-0-0 కు తప్పక కొని పఠించి యానందింతురని నమ్ముచున్నాను. ప్రతులు వలయువారు ఎగ్మూరులోని గృహలక్ష్మి కార్యాలయమునకు డిసెంబరు మాసాంతములోగా వ్రాసినచో 8 అణాలకే ఒసంగబడును. ఈ బహుమానము గృహలక్ష్మి చందాదారుల తరపుననే 'సమర్పింపబడును

# స్త్రీ విప్లవము

హిందూవనితల దుస్థితుల నించుక గమనించిననింతకంటె విషాదకరమింకొకటి లేదు. మనలో కొంతమంది పూర్వాచారపరాయణులగువారి కొక వెఱ్ఱినమ్మకము గలదు. యేడవయేటనె కన్యాదానమొనర్చిన ఫలమధికమనియు, మరియు వయసుచెల్లి యెవ్వరు కన్య నీయక వివాహమాడకుందు వాని కిచ్చిన సుకృతమని లోకులు మెత్తురనియు, యెన్నడో చచ్చిన తమపెద్దలు తరింతురనియు తలంచి ప్రపంచమననెట్టిదో యెరుగక బొమ్మలతో నాడుకొను చిన్నపిల్లలకు పెండ్లిండ్లుచేసి కలకాలము వారి జీవితముల కష్టభాజనములు సేయుచున్నారు. కుటుంబనిర్వహణాసమర్థులకైనను సంతానమునకు తక్కువయుండదు గదా! ఇట్టి విషమావస్థలకు చెందినవారిలో పురుషునికి కుటుంబనిర్వహణభారము తనపైగలదన్న యాలోచన లేక, బిడ్డలకు కుడువ కూడు కట్ట గుడ్డ లేక, విద్యాగ్రహణాదికరములగు కార్యములం దలపెట్ట వీలుగాక పలుబాములంబడు హిందూవనితల నెంతమందినో జూచుచున్నాము. "స్త్రీని లౌకికవ్యావహారిక విద్య లభ్యసింపనీయరాదని మృగము రీతిని పెంచి గార్హస్థ్యమునకు దగనివానికి దానిని ముడిబెట్టిన నిక నా వధూవరులది సంసారమనబడునా? భయంకరదావానలమువలె నసహ్యమగును గదా. విద్యలేని కారణమున వినయవివేకము లెరుగక, కర్తవ్యతామూఢులై సోమరులై, దుస్సాంగత్యమున యుక్తాయుక్తవివేచనాశూన్యులై, ఆలిని బిడ్డల నన్నవస్త్రముల కల్లాడించుచు. మానావమానములనక కొరమాలిన ప్రసంగములతో ప్రొద్దులు బుచ్చుకొనుచు, కుటుంబనిర్వహణమోయని మొఱ్ఱ వెట్టు నిల్లాండ్రను బలుబాములంబెట్టుచు అనరాని మాటలనుచున్న పురుషుల కెదురాడ రాదట. ఆడినట్లైన పాపమట.

కన్నబిడ్డ లన్నమునకై వాపోవుచుండ కడుపార నన్నమిడలేని యేతల్లిమనస్సు కరిగి నీరైపోవకుండును? బ్రతుకుదెరు వరయనేరక యేయబల కన్నీరుమున్నీరుగా వాపోవకుండును? ఉన్న కొలదిద్రవ్యమైనను సంసారయాత్ర కుపయోగపరుపనేరక చేతు లారబోగొట్టుకొనునప్పుడైనను వాని నతిక్రమించి ఉన్నసొమ్మితరుల నపహరింపనీక కాపాడుకొనుటకు స్త్రీకిస్వతంత్రము లేదట. అత్తింటి కడుగిడినది మొదలు అగచాట్లపాలై అష్టకష్టములకోర్చి యచ్చట వార నుపచరింపవలయునే గాని ఆర్థికవ్యావహారికములపట్ల నధికారమే స్త్రీకి లేదట. పుట్టినింటికిబోవ, పుచ్చినవక్కగైకొనుటకైన నధికారముండదు. మెట్టినింట వట్టివిస్తరి మంచినీళ్లు. ఇట్టి యన్యాయ మే దేశమునైన గలదా?

అంగాదంగా తత్సంభవతి, శ్లో. పుత్రవద్దు హితాన్నృణాం, అని ధర్మశాస్త్రము లుద్ఘోషించుచున్నవి. మరియు పురుషునికి స్త్రీ సహధర్మిణి, సహచరి యని వ్యవహరించుచున్నారు. అట్లుండియు క్రియయందు మాత్రము పైతృస్వమంతయు అన్నదమ్ములకు సంక్రమించుటయు శ్వశురగృహమున ఆమరణము మహానసమే స్థిరావాసమగుటయునై యున్నది. అదేమన మన పండితులు "నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి" అని యొకధర్మ ముపపాదించుచున్నారు.

స్త్రీజాతిగూడ మానవజాతికి జెందినదే గదా. దేహయాత్రకనువగు కరచరణాద్యవయవములు దేవుడు పురుషులతోబాటు స్త్రీలకుగూడ నొసంగియున్నాడు గదా. మరియు కుటుంబినియై శిశుపోషణాదికములగు మహత్కార్యనిర్వహణములకనువగు రీతిని స్త్రీజన్మనిర్మాణ మొనర్చి ప్రపంచవృద్ధి స్త్రీమూలముననే జరుగవలయునని యా జాతికొక యాధిక్యత గలుగజేసియున్నాడు గదా. ఆవిధముగా ప్రపంచవృద్ధికి మూలకందములై పురోభివృద్ధి నొందునట్లు మంగళప్రదుడగు శ్రీ పరమేశ్వరునిచే నిర్మింపబడిన కుసుమకోమలులగు తమ ముద్దు కూతుండ్రను తమ కెప్పుడో యే లోకముననో పుణ్యమబ్బునని వివాహాసక్తులకు బలిగా నొసంగు టెంతటిఘోరము! ఆడుపిల్లలని ఉన్నతవిద్యల నేర్పనివారును; అనుచితరీతిని బాల్యవివాహము లొనర్చిన వారును అందుచే తమ కూతుండ్రకు గల్గిన కష్టనష్టములకు ఉత్తరవాదులు గావలసియుండునుగదా. అట్టివిచారణయే లేదయ్యె.

పురుషుడు దుస్సాంగత్యముచే సోమరియై సంసారనిర్వహణము మాని దారాపుత్రాదులను దుఃఖములపాల్జేసి పీడించుచున్నతరి అనన్యగతికయగు స్త్రీగతి యేమి గావలయును? కన్నబిడ్డలన్నవస్త్రము కాకుల పక్షుచుండ ముందుగతి గానక దుఃఖించుచుండవలసినదేనా? పూర్వాచారపరాయణులగు పెద్దవారి యవినీతిచే తమకు జీవనోపాధియగు విద్య సున్నయయ్యె. వివాహవిషయమునను పై యవివేకమే సంప్రతించె. ఇక వారు ప్రాణత్యాగ మొనర్చుకొనవలసినదేనా? నిరుపేదలని కరుణించి ధర్మబుద్ధిని యించుకసాయ మొనర్పగల యుదారులతోనైన తమ కష్టముల మొఱ్ఱ వెట్టుకొని వారికుబిచ్చమునైన గైకొని జీవితము గడుపుకొనుటకు స్త్రీకి స్వాతంత్రము లేదా? పెట్టిపోయలేనితల్లి కుట్లు వెళ్లగ్రుద్దినట్లు, బిచ్చమెత్తుకొన దలచినను నిర్బంధించి బెదరించి నిందించుటయా? విడివడి తిరుగుచున్నదని యవివేకముగ పలుపురిలో చెప్పుకొని తలవంపులు సేయుటయా? విన్నవారు కన్నవారు వికటహాసము లొనర్చుచు వ్రేలుసూపుటయా?

ఉద్యోగంపురుషలక్షణం బను న్యాయ్యమున పురుషుడు వర్తించి దారాపుత్రాదుల నుద్ధరింపనినాడు స్త్రీ స్వాతంత్రించి కుటుంబ సంరక్షణకై ప్రవర్తించుట నింద్యమని యే ధర్మశాస్త్రముననున్నది? కలకాలము కష్ట

పడలేక సర్వసముడగు దేవుడు కరుణచే నొసంగిన యించుక జ్ఞానమునైన నభివృద్ధి జేసుకొని మతిమంతుల మన్ననలకు పాత్రలై తమ జీవితముల సుగమము లొనర్చుకొనవలయునన్న, బందుగుల మను వారు బందములై వారి సత్ప్రయత్నము లకు భంగకారులౌచు భయంకరములగు రూక్షాత్ములను బరపెదరేల? ధర్మబుద్ధి గల వారు న్యాయ్యవాదులగువారు యిట్టి విషమపరిస్థితుల నరసి అగతికలై దీనలగు అబలాజనమును రక్షింపబూనవలదా? అనాధకుటుంబములనదగు నిట్టి కుటుంబము లను రక్షించి పురోభివృద్ధికిం దెచ్చుటకు కొన్ని సంఘములైన నేర్పరుపవలదా? కాలవైపరీత్యముచే దుస్థితి నందియున్న వనితాలోకము నుద్ధరింప గృహలక్ష్మి మున్నగు పత్రికావర్గములును మరికొందరు మహాత్ములును కంకణబద్ధులగుట దైవము స్త్రీలోకమున కమృతము ప్రసాదించుటయే. సంఘదౌర్జన్యములచే విపదంధకారగుహన కన్నొరగియున్న స్త్రీ సముదాయమునుండి దేశోద్ధరణసమర్థలు భాషాసేవాపరాయ ణలునగు శ్రీ సరోజని, రుక్మిణమ్మ, వసుం ధరాదేవి, కనకాంబ, వరలక్ష్మీదేవి మున్నగు స్త్రీరత్నము లాయంధకారమును భేదించుకొని దివ్యజ్యోతులవలె ప్రకాశించు చున్నారు. ఇట్టి ధన్యజీవికల సంఖ్య మన దేశమున కొలదిమాత్రమే యున్నది.

తక్కిన స్త్రీలోకము నాగరకతా జ్ఞాన శూన్యులగు మూఢపిశాచముల యవివేక ముల కగ్గమై వారి దుష్ప్రచారములకు భీతలై అష్టకష్టములపాలై యాహారాదులు వర్జించి, కృశించువారును తమ జీవితములు కష్టభూయిష్టములయ్యెనని వాపోవువారును, ప్రాణత్యాగమునకు తెగించువారునునై గోడుగుడుచుచున్నారు. ఇట్టి దీనలగు అబలల దుస్థితుల నించుక పరిశీలించి అవివేక సంఘములను మందలించి రక్షించు నిష్పక్షపాతచేతస్కు లేరీ? కలరు, కాని పెన్న దాటినవెనుక గదా పెరుమాళ్ల సేవ. ఈర్ష్యాళులగు......వారిబారినుండి తప్పి బ్రతికి తలలెత్తిన వెనుకగదా మహా శయుల సహాయ్య సంపదలను వారి యాశీస్సులను నందగల్గుట.

ఇట్టి విప్లవము లడంచుటకు లౌకికజ్ఞాన నిపుణులగుమహాత్ములెవరికర్మములు వారివని యుపేక్షింపక కాంతాలోకమం తటిని తాము గన్న కన్నియలవోలె సమ దృష్టినరసి శ్రద్ధవహించి, విధిగా అనుచిత ములగు ప్రచ్ఛన్న బాల్యవివాహముల వారించి, నిర్బంధముచేనైనను బాలికల కున్నతవిద్య లభ్యసింప జేయదగు శాసన ము లుపపాదించి, పై యవస్థలకు లోనై యున్న కష్టజీవనకుటుంబములను చేరదీసి రక్షించి పురోభివృద్ధికిం దెచ్చుటకు కొన్ని ధర్మసంస్థలనేర్పరచుట ముఖ్యమైనపని. సర్వ సముడగు శ్రీపరమేశ్వరుడు అట్టి మహా శయుల సత్ప్రయత్నముల సఫలము లొన ర్చుచు, ఘోరాతిఘోరాతిములగు నీవిప్లవ ము లడంచి రక్షించుగాక!

—ఒక మహిళాభిలేఖిక.

# స్త్రీవిద్యా—తమోదీపిక

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఎం.ఏ. బి.ఎల్.

మనుష్యహృదయమందలి శక్తులను అవ్వల విజృంభింపఁజేయు శక్తియే విద్య. తన అంతరంగమందలి అద్భుతభావవారాశిని మానవుఁడెఱుఁగఁడు. ఎఱుఁగుట కాతని కాంతరంగికదృష్టి ఆవశ్యకమైనది. ఈ దృష్టి నలవఱుచుకొని, లోనిగభీర రత్నాకరమును గుర్తించు జిజ్ఞాసువు అతుల విజ్ఞానవిభూతి కధిపతి యగును. తన గుండెయందు కాపురముచేయు అద్భుత శక్తికి చేతులు మొగుచును. దాని వెలుగునందు దినమణి తేజమునఁ దేజరిల్లు తామరవలె ప్రఫుల్లజీవియగును. ఈతని నిమిత్తమాత్రునిఁ గావించుకొని, వీనిచే నది అద్భుతక్రియలు చేయించును. అద్భుతక్రియలు అద్భుత భావసముద్భూతములు కదా! ఈ భావములు విద్యయందు పండిన పంటయే కదా! అంకురము కావించు సాధనయే కాలక్రమమున దానిని ముగ్గినపండు చేయును. విజ్ఞానక్షేత్రమున ముగ్గినపండు కాఁదలఁచు నాతఁడు సాధనయందు సిద్ధహస్తుఁడు కావలెనని తెలిపితినికదా!

సాధన మతమునకు సంబంధించినది. కావున విద్య మతమునకు దగ్గఱిచుట్టము. ఈ సత్యమును అధునాతన వసుంధర యింకను గుర్తింపకుండుట దురదృష్టము. దివ్యజ్యోతివలె ఇది మనప్రాచీనులదృష్టి సమక్షమున వెలింగినది. కావున నాధ్యాత్మిక విభూతిని కరస్థలామలకము కావించువిద్యనే వారు తమ యిలువేలుపుఁ జేసికొనిరి.

మనుష్యజీవనము బహుముఖములుకలది; మనుజుఁడు నిర్వహింపవలయు క్రియలు వివిధములు. చెట్టు కొమ్మ లట్లివి వేలు వేలైయున్నను, వీనికి జీవితము పోయు ఏకైకశక్తి ఆత్మశక్తియే! ఈశక్తి నారాధించి, దాని ప్రసన్నత నందుటకు వలయు జిజ్ఞాసానుష్ఠానములు మతమువలనఁగాని సుసాధ్యములు కావని గ్రహించి, మన ప్రాచీనులు దానిని గణాధిపతిఁ గావించి, తొలుత దానిని సేవించి నిర్విఘ్నజీవనములు కడపిరి. కావుననే భారతప్రకృతియందు నేఁడును మతము అధిష్ఠానదేవతయై యున్నది. అన్యనాగరకతలు ఎన్నిమాఱులు భారతసభ్యతపై దాడివెడలినను, అది నేలగూలక ప్రపంచజిజ్ఞాసువులదృష్టిని, బోధకుల దృష్టిని, ప్రవక్తలదృష్టిని ఆకర్షించుచుండుటకు కారణము మతమహత్త్వమును గుండెయందు నిలుపుకొనుటయే!

పాశ్చాత్య నాగరకతయందు ఏదో వెలుఁగు వెలుఁగుచున్నదని, * దానికి "జే! జే!!" అని, తమ నాగరకతకు "డిల్ల!" యనువారు ఆంగ్లవిద్యయందాటితేఱిన భారతీయులలో ననేకులున్నను, ఆంగ్లవిద్య నెఱుఁగని పామరులు సంప్రదాయసిద్ధమైన మతమహత్త్వముపై కన్నిడి దాని యాలోకనమున తమ జీవనములను గడపుకొన గాంక్షించుచున్నారు. ఈ కాంక్షకతననే భారతరాజకీయ, సాంఘిక, ఆర్థికోద్యమములు మహత్తరాశయమండితములై యుండవలెనని వీరాశపడుచున్నారు; ఈ కాంక్షకతననే మతముపై ఆత్మశక్తిపై, ఆధ్యాత్మికశక్తిపై నాధార

* ఈ వెలుఁగునుగుఱించి రవీంద్రుఁ డేమనినాఁడో పరికింపుఁడు: "The glow we see on the western horizon is not the glory of the sun or of a new birth, it is that of a conflagration."

పడు ఉద్యమములనే వీరాధించుటకై ముందంజవేయు చున్నారు.

మతమనినంతన ముఖము చిట్లించుకొను విద్యాధికు లున్నారు. వీరి మనసును పట్టిన చదువు కృషికులను, పల్లెవాసులను అంటుకొననందుల కానందించవలసి యున్నది. 'భారతీయులు పల్వురు మూర్ఖు'లను వాక్కు కర్ణకఠోరమై వినఁబడుచున్నది. కాని, యీ మూర్ఖుల హృదయములం దింకను ఆరిపోని జ్యోతిని మన ఆంగ్లవిద్యాధికులు పల్వురు సాదరదృష్టితో విలోకించి, తమ యంతరంగమందలి అఖండముపై రివ్వు రివ్వునవీచు ప్రతికూల సభ్యతా వాతూలమును ప్రతిఘటించు రక్షణవ్యవస్థను నిలుపుకొందురుగాక!

మతమహత్త్వమునకు విరోధులై, ఆధ్యాత్మిక శక్తిని గనక, ఉత్తమాశయములకు దూరీకృతమై యున్నదికావుననే, నేఁటి విద్యావిధానము పెక్కు చెఱుపులకు కన్నతల్లియైనది! ఈ చెడుగులపై నేఁడు కొందఱు మహనీయులు దృష్టిసారించుట సంతోష కరము. బెంగాలు రాష్ట్రమందలి విద్యావిధానము లోపములతో నిండియున్నదని, నిన్నకాక మొన్న ఆ రాష్ట్రపాలకులే తెలిపిరి. ఈలోపములు అధునా తన భారత విద్యావిధానమందంతటను ప్రబలియున్నవి. నేఁటి విద్యావిధానము చచ్చి, మనుష్యహృదయమున జిజ్ఞాసనుదయింపఁజేసి, మానవుని యాత్రికునిచేయు విద్యావిధానము తలసూపిననాఁడే, సర్వతోముఖ పురోభివృద్ధికి వలయు భావసామగ్రి శమంతకము కతన వృద్ధియగు బంగారుప్రోవువలె మనుష్యహృదయ మున పెంపొందును.

మూర్ఖులనఁబడు పల్లెవాసులందు పల్వురు ముముక్షు వులున్నారు. మానవజీవనమును నేఁడెదుర్కొను వివిధ సమస్యలను గుఱించిన పరిజ్ఞానముమాత్రము నేఁడు వీరికి అక్కఱకై యున్నది. ఇట్లని స్త్రీలనుగుఱించికూడా వా కొందును. మననారీమణులందు మతమహత్త్వము వెలుఁగొందుచునే యున్నది. వీరియందు నేఁడు సంచలన ముదయించుచున్నది. ముందంజవేయు వీరు కౌతుకము చూపుచున్నారు. కాని వీరిలో పల్వురు నేఁటి ఆంగ్లవిద్యాధికుల దృష్టాంతములను మేలు బంతులుచేసికొనఁ జూచుట దుఃఖకరము. ఈ విద్యాధి కుల కనుకొలుకులందు వెలుఁగునది పూతభావ మరీచి కాదని వీరు గుర్తింపవలెను. తమ హక్కులును, తమ బాధ్యతలును, తమ కర్తవ్యములును ప్రత్యేక ప్రాముఖ్యము కలవనియు, తమదృష్టి నాకర్షింపవలయు విద్య నేఁడు విజృంభించుచున్నది కాదనియు, తమ ఆశయములను, తమ గమ్యస్థానమును తాము గమనిం చియే తాము నడుముఁగట్టవలెననియు సోదరీమణులు గ్రహింపవలెను.

మతాలోకమందే విద్య పెంపొందవలయుననుట కన్నేని కారణములు కలవు. మతదృష్టి సచ్చిదానంద ముల కాలవాలమైన జగదీశునిమీఁదనే యుండును. "సత్యం సుందరం, శివం" అను పరమాశయములదెస మతము తన చెంగటఁజేరువారిని కొంపోవును. ఈ యాశయములు తత్త్వశాస్త్ర మతశాస్త్రములందు నెందో అడఁగియుండి, పండితుల చర్చకు పనికివచ్చు సామగ్రిమాత్రమని అపోహపడువారు కొందఱున్నారు. ఇవి మానవజీవనమును తమదెస కాహ్వానించు దివ్య శక్తులని వీరుగ్రహించుట ప్రాడి. వీనిదెస పెడమొగము పెట్టువారు అపరదిశఁగల నరకమందుఁ గూలఁబడెదరు. మనుష్యమానసము ఏదేని ఒకదిశకు పోకమానదు. మానసము నదీపూరమువంటిదని మనశ్శాస్త్ర పరిజ్ఞాత లెఱుఁగుదురు. నిదురయందుకూడ నిది స్రవించుచుం డును. ఆత్మశక్తి ఈ పూరమునకు ఉచితపంథ నేర్పఱుపవలెను. లేనిచో, అది ప్రతికూలదిశఁ బాఱును. ఆత్మశక్తి, మతపరిజ్ఞాన, మతానుష్ఠానముల వలన పెంపొందును. మానసమును సత్పథగామిఁజేయున దీ శక్తియే!

మనుష్యచిత్తముపై గొప్పతలఁపులు పూలవానవలె రాలినపుడు, అది స్వర్గమగును. హానికోయిలలై

మానవుఁడు తన చూడ్కి సీతలఁపులపై నిలుపఁడేని, రాబందులట్లు దుశ్చింతలాతని చిత్తముపై వ్రాలి దానిని పొడుచుకొని తినును. సదాశయము స్వర్గబంధురము; దురాలోచనము తనగుండెయందు నరకము నిముడ్చుకొని యుండును. నాకనిరయములకు నడుమ **Purgatory** అనఁబడు లోకము కలదని క్రైస్తవులు, చిరనరక చిరస్వర్గములందలి విపరీతభావమును నెట్టించుటకై యూహించుకొనినను, ఇట్టి దొండుకలదని తెలుపఁజాలము. సచ్చిదానందములులేని తావున నంధకారమలముకొని యుండును. సత్యములేనితావున అనృతము రాజ్యచక్రము త్రిప్పును! ఆనందమున ముక్కచేయని వాఁడు, దుఃఖబడబానలమున మిడుతయగును. ఈ యంశముల నెఱిఁగియే, "సత్యం, సుందరం, శివమ్" అను పరమాశయముల దెస మానవుని నడుపఁజాలు నెరవులను తమవిద్యాప్రణాళికయందే మన ప్రాచీనులేర్పఱచిరి. * నిముసమోపికపట్టి పరిశీలించితిమేని, మనుష్యజీవనము, విద్య, మతము అవినాభావ సంబంధమున మనదేశమందు వరలెనని గుర్తింతుము.

సుగంధ సౌందర్యములు హృదయమునకు స్వర్గసుఖమిచ్చునవి. కాని గుణములకు ప్రత్యేకమైన అస్తిత్వములేదు. ఇవి ఒకవస్తువుపై నాధారపడవలెను. కావున సుగంధసౌందర్యములు పూవునాశ్రయించినవి. ఈ గొనములులేనియెడల, పువ్వునకు బ్రదుకులేదు. పూవులేకున్నయెడల, వానికి దిక్కులేదు. విద్యా మతములు మనుష్యజీవనము నాధారముచేసికొనును. ఇవి లేని జీవనము అబద్ధపు బ్రదుకగును.

మతదృష్టియందలి మహదాశయములను క్రమానుష్ఠానము కతన మానవుఁడు మనసునకు పట్టించుకొనవలెనని యెంచి యే ప్రత్యేకజీవన ఘట్టములందు మన ప్రాచీనులు ప్రత్యేకజీవన విధానములను నిర్ణయించిరి. వీనినే ఆశ్రమములందుము. తొలుతటిది - విద్యార్థిది. వృక్షాంకురమువలననే వృక్షఫలము తలనూపు లీల, విద్యకతన మనుష్యజీవనము ఫలపుష్ప సమన్వితమై, కల్పకమునకు మేలుబంతి యగును. తొలుతటి ఆశ్రమమందారంభమైన సాధన, నాలుగాశ్రమములు ముగియునప్పటికి పూర్ణమై మనుష్యజీవనమందలి తుది రొబ్బయందు ముక్తిమందారమును కుసుమింపఁజేయును. ఈ సాధనమును నెఱపిన నిష్ఠాపరులే—యీ తపసునందు సిద్ధహస్తులైన మహనీయులే సర్వతోముఖ జ్ఞానాభివృద్ధినంది, తమవిజ్ఞానసౌరభము నాత్మజీవనమున నింకింపఁజేతురు. వీరిచరిత్ర సుగంధబంధురమై యుండును! మనుష్యశక్తులను నిశితమొనరించుటయ కాక మనుష్యచరిత్రను అమరులకు నొరవడి చేయుటకూడ విద్యయొక్క ఆశయమగుడు యీ ఆశయమును అందిపుచ్చుకొనువారే నిక్కంపు విద్వాంసులై బహుసంఖ్యాకులకాచార్యులై, పరార్థజీవులు కాఁజాలుదురు. చరిత్రవిహీనుఁడైన విద్వాంసుఁడు ఆత్మజీవనమున గరళమువోసికొని, అన్యుల కదలు

---

* విద్యార్థి అలవఱచుకొనవలసినది ఆధ్యాత్మికదృష్టియనియు, నైతికపటుత్వమనియు నేను పలుమారులు వాకొనుచునేయుందును. జిజ్ఞాసువులై, యాత్రీకులైన పాశ్చాత్యమనీషులు మన ఆశయములో నేకీభవించుచున్నారు. డాక్టర్ హాగ్ మహాశయునివాక్కులు పరికింపుఁడు : **"For, my experience is far from teaching me that the Indian undergraduate is less responsive than other undergraduates to the emancipating transforming magic of a many sided College life, and to the contagious example of teachers with whom pursuit of truth, beauty and goodness is an abiding passion. If you graduates have had the good fortune to belong to a College that knows its business, to-day is not the first time that you have inwardly pledged yourselves to support and promote the cause of morality and sound learning. Disinterested pursuit of the good and the true has long ago become a demand which you make upon yourselves." Vide: Dr. Hogg's Address at the Madras University Convocation held on 7th August 1935.**

ఘట్టించును. "చారుమాణిక్య భూషితశస్తమస్తకం బయిన పన్నగము భయంకరము" కాదా?

ఆత్మసంయమమునం దారితేరినవారు, వీర్యవంతులై అద్భుతశక్తి సంపన్నులగుదురు. ఈ వీర్యమునే అరవిందయోగి energy అనుచుండును. ("We are each of us a dynamo into which waves of that energy have been generated and stored, and are being perpetually conserved used up and replenished") Vide: "The Brain of India" page 21, by Sree Aurobindo Ghose.) ఈ శక్తిని తమ హృదయములందు పూరించుకొను వ్యక్తులే ఆత్మకురుక్షేత్రమున విజయులు కాఁగలరని గీతాచార్యుఁడు వాకొనెనని భగవద్గీతయందలి శంఖప్రకరణము హృదయంగమముఁ గావించుకొనినవారెఱుఁగుదురు. శంఖమును పూరించుటన నీ శక్తిని అంతరంగమున నింపుకొనుటే! పాంచజన్యమును పూరించిన హృషీకేశుఁడును, దేవదత్తమును బూరించిన ధనంజయుఁడును, పౌండ్రమను మహాశంఖమును పూరించిన వృకోదరుఁడును, అనంతవిజయమును బూరించిన యుధిష్ఠిరుఁడును, సుఘోషమణిపుష్పకములను పూరించిన నకుల సహదేవులును, వేర్వేరుగా ("పృథక్పృథక్") తమతమ శంఖములను పూరించిన ద్రుపదుఁడును, ద్రౌపదేయులును, సౌభద్రుఁడు మున్నగు మహాబాహువులైన "పృథివీపతు"లును ఈ యద్భుతశక్తి కతననే విజయకేతన మెత్తఁగలిగిరి. కౌరవవీరులెవ్వరును శంఖమును పూరింపరైరి. వారికీ శక్తి లేదనుట స్పష్టవిషయము. వారు మనుష్యులకు మేలుబంతులు కారు. అపజయమునకు, వారనుంగుబిడ్డలు!

ప్రాచీన విద్యావిధానమున మేలుచేతులైనవారందఱు తమజీవనములందీ యద్భుతశక్తిని శంఖస్థాపనముఁ గావింపఁగలిగిరి! ఈ విద్యావిధానమందలి పరమార్థమును గ్రహించి దాని నారవడిగావించుకొనఁజాలితిమేని, నేఁటి మనవిద్యాప్రణాళిక నవనవోన్మేషమై, మనకు పునరుద్ధరణము చేకూర్పఁగలుగును. ప్రాచీనమనినంతన,—సనాతనమనినంతన చల్లుమని లేచుట పాడికాదు. *

యుగములు కడచినను, నవయుగమున క్రొక్కారైన పద్ధతులు కొన్ని అవలంబనీయములైనను, ప్రాచీన సంస్థలందు పెరిఁగి పెంపొందిన ఉత్తమాశయములు (యివి రవికిరణములట్లు, పూవుతావివలె, పండువెన్నెల చందమున మాపుమాయుఁగక నిత్యనూతనములగుచు) నేఁడును మనపూజాపీఠమందలి ఆరాధ్యదేవతలై వెలయవలెను. ఏకాగ్రదృష్టియనుఁడు, మననిదిధ్యాసనములనుఁడు, మతానుష్ఠానవిద్యాభ్యాసములవలన మనుజునకు పట్టుపడును. పరమాత్మనుండి కదలివచ్చిన జీవాత్మను తొంటిపదవియందు చేరుచు అద్భుతశక్తి మతమందున్నట్లు, అణువై యున్న మానవుని బ్రహ్మాండమున నిండియున్న భగవానునందుఁ జేరుచుశక్తి విద్యయందు కలదు. ఆదర్శవిద్యనంది, ఆత్మశక్తిని పడసిన మహాసంయమి యే మహావీరుఁడై "సోహమ్" అని గురుగంభీరస్వరమున పలికి "తత్త్వమసి" యను గంభీరవాక్యము నెదుటిహృదయమున ప్రతిధ్వనింపఁజేయును. ఒకప్పుడు అణువై యుండిన వ్యక్తి యీశక్తి నందినంతన పొన్నవాహనముమీఁది శ్రీకృష్ణునట్లు యుగములమాపునఁ దేజోశాలియై వెలయును! మనుష్యజీవనమునకీ ఘనపదవినిచ్చు విద్యయే నేఁడు మనకు కనకదుర్గ కావలెను. వ్రతమనిన పరమపరితోష సంభరిత స్వాంతలగు సోదరీమణులు లీదుర్గను, యీ "ముగురమ్మల మూలపుటమ్మ"ను హృదయమందిరములందు నిలుపుకొందురుగాక!

---

* "It is a human paradox not altogether devoid of humour and tragedy that, in these days when reason and enlightenment are supposed to be the ruling factors, Sanathana Dharma should be looked upon by certain sections as essentially reactionary." His Holiness Sree Sankaracharya of Kamakoti Peeta.

గురుతరోద్దేశమును కనులెదుట నిలుపుకొను యాత్రికుఁడు ఎదుటికొండ కొనను చేరజాలక పోవచ్చును. ఈతని యుద్దేశమందలి మహత్త్వమును, ఈతని దృఢయత్నమును గణనీయములు. ఈతఁడు గెలుపునందుఁగాక, అందకపోవునుగాక—యీ కృషి యును, ఆయుద్దేశమును సహజభుజకీర్తులై ఆతని చరిత్రకు అపూర్వసౌందర్యము నొసఁగును! అనంతశక్తి సమన్వితుఁడగు జగదీశుఁడు తన యొరవడినిబట్టియే మనుజుని సృష్టించినాఁడు. జన్మ పరంపరలు వివిధ ప్రాకారములై యెదుటనిలిచినను, నిజజీవనోద్దేశమును గుర్తించిన మానవుఁడు ప్రాకారములను దాటి దాటి స్థలకాలముల కతీతుఁడై, దివ్యసింహాసనాసీనుఁడై యున్న సర్వేశునిచేరి, ఆతని హృదయమున కౌస్తుభ మణి కాఁగలఁడు. ఒకే ప్రాకారమున కవ్వల, ఒకే జన్మమున కవ్వల ముక్తిని చూడఁగలిగిన మానవు లీవఱలో నే యుగమందును పుట్టలేదు.

"ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేకజన్మ సంసిద్ధస్తతో యాతిపరాంగతిమ్"

(శ్రీ భగవద్గీత; అధ్యాయము 6; శ్లోకము 45).

ఎన్నియో జన్మలనుదాటియే నరుఁడు విజయుఁడయ్యె ననియు—ధనంజయుఁడాయెననియు గీత తెలుచుచున్నది. కృషిమాత్రమును వదలనివాఁడు, మాత్రముతుదఁగల దివ్యమాణిక్యమును కాలక్రమమున చేఁబట్టఁగలఁడు. కృషియే మనుష్యజీవన మహత్త్వము నుగ్గడించువంది! ఇదియే ఈశ్వరసృష్టియందు మనుజున కగ్రస్థానము నిచ్చుచున్నది!! ఇదియే వీరుని ఈశ్వరసాగ్న్యమున దివ్యరుచులు చిప్పిలఁజేయుగద్దియం దాసీను గావిం చును!!! గక్కసిమూకల నెదుర్కొనిన బ్రహ్మచారి మహావీరుఁడను ప్రతీతిపడసి, సంజీవిని చేతఁబట్టిన నిత్య జీవియైనట్లు, మహారిష్టములను ప్రతిఘటించు వ్యక్తి అమరత్వమునందఁగలఁడు. ఈతని ఆశయము చెరిగి పోదు; జగదీశుని నొసలున వెలయు కస్తూరీతిలకమువలె అనంతకాలమున శోభిలును! ఎదుటికొండ నెదు ర్కొనినపు డీతని నొసలునుండి చెమ్మటబొట్టులు రాలును; యీ బిందువులకు, అదృశ్యవనదేవత యట్లే తనచెంగట వర్తించు ఈతని ఆశయము దోసిలొగ్గి, అవి దివ్యమౌక్తికములగుట గుర్తించి వానిని దండగ గ్రుచ్చి, పరీక్ష ముగిసినంతన, ప్రాణపతిఁజేరు హృదీశ్వరియట్లాతనికి హృదయసీమయందు స్వాగతమిడి మౌక్తికహారము నాతని కంధరసీమ నలంకరింపఁజేసి "ఇఁక నేదాననైతి" నని పలుకును!

నేఁడు సమ్మ్రుఖీనమై యున్నది సంతమసమే. నానా జాతులవారు నేఁడు చీఁకటిలో కుమ్ములాడు చున్నారు. "హక్కు"లని "ప్రత్యేకజాతి సముద్ధరణ" మని పెడుబొబ్బలు పెట్టుచున్నారు! ఈ చీఁకటి అంతరించినగాని, ఎవ్వరును తమహక్కులను బాధ్యత లను గుర్తింపలేరు. సాంఘిక రాజకీయోన్నతికి వెలుఁగు అవసరము. ఈ వెలుంగు నిచ్చునది సద్విద్య. సద్విద్య సదాశయము నుపాసించునది. ఈ యాశయ మును దృష్టినిడికొని వ్రతదీక్షకు కడంగితిమేని, సుప్ర సన్నయైన దేవివలె నది సంతమసమును-చీల్చి, చెండాడి మన ప్రోల మహాజ్యోతియై వెలుంగును. ఈతమోదీపిక ప్రోల స్త్రీలును, పురుషులును, సర్వజాతులును జగద్ధాత్రి కట్టెదుటనిలుచు భక్తులట్లు వ్యత్యాసము లెఱుఁగక నిలువఁగలరు. ఈజ్యోతికతన వీ రాత్మ జ్యోతిని, పరంజ్యోతిని గుర్తించి వానికి తమగీతాంజలి సమర్పింతురు. ఈ శుభముహూర్తము ప్రత్యక్షమగుట యెన్నటికో కదా!

# మ నో ర మ

ఉ. పాయకపాకశాసనికి
భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు తానుసుధ
రామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధు
రంధరుడున్ దనకిష్టుడున్ సహా
ధ్యాయుఁడునైనవాఁ డభిమ
తంబుగఁ దోడయి నిర్వహింపఁగన్.

—నన్నపార్యుఁడు.

అంతట నవనవాదర్శ పరాఙ్ముఖియు, ప్రాచీనాచారపరాయణయునగు కామేశ్వరమ్మ మేమయిదుగురమును భాషాంతరీకరించి చెప్పుచుండిన 'రాజకుమారి' యను కథయందలి నాల్గవభాగ మందుకొని చెప్ప వలసిన సమయమాసన్నమయ్యెను. లీలావతి తన కథాభాగమును ముగించిన తరువాతమే మావిషయమునుగూర్చియే చర్చింప నారంభించితిమి.

"ఇఁక కామేశ్వరమ్మగారివంతు వచ్చినది." అని నేనంటిని.

"నే నెట్లు చెప్పఁగలను? ఈతరానివానిని నీటఁద్రోసి యీదుమన్నటులున్నది మీవైఖరి." అని కామేశ్వరమ్మ బదులు చెప్పెను.

రేపు సాయంకాలమునఁగదా ఆమె చెప్పవలసియున్నది? ఆమెచేత నేను చెప్పింతునో లేదో నీవే చూతువుగాని—" అని కళావతి పలికెను.

"అయిన నీవే భాషాంతరీకరించి ఆమెచే చదివింతువా యేమి?" అని లీలావతి తన యాశ్చర్యమును ప్రకటించెను.

"నే నేమిచేసినను నీకుఁ దెలియకయే పోవునా? ఒకవేళ నట్లొర్చినను 'వాణినారాణి'*

---

* రాజు జైమిని భారతమును జేయుటకై పినవీరభద్రున కాజ్ఞ యిచ్చి పంపినప్పు డతఁడు గడువులోపల సావకాశముగాఁ బుస్తకము రచియింపక యుపేక్ష చేసి యహోరాత్రులు భోగభామినులయింట కాలక్షేపము చేయుచు వచ్చెననియు, మితిదినము నాటికి గ్రంథమును చేసి సమర్పింపనియెడల రాజుచేత మాటవచ్చునని యన్నగారెన్నివిధముల హితోపదేశము చేసినను లక్ష్యము చేయక యాతనిమాటలు పెడచెవులఁ బెట్టి యథేష్టముగాఁ దిరుగుచువచ్చెననియు, పుస్తకము ముగింపవలసిన దినము రేపనఁగా నాఁటిరాత్రి తనగది యలికించి లోపల దీపము పెట్టించి పెందలకడ భోజనము చేసి గదిలోఁ బ్రవేశించి తలుపులోపల వేసికొనఁగనే పదిమంది చేరి లోపల పుస్తకము వ్రాయుచున్నట్లు గంటము చప్పుడు వినఁబడెననియు అద్భుతజనకమైన యాచప్పుడు విని మనసు పట్టలేక పెద్దవీరన్న తలుపుసందునుండి తొంగిచూడఁగా సర్వాభరణభూషితురాలై దీపము వెలుఁగున శరవేగమున వ్రాయుచున్న యొకస్త్రీ 'బావగారు చూచుచున్నా'రని చివాలునలేచి తొలఁగిపోయె

అని చెప్పుకొను మహాకవ్రులుకూడ తమ కావ్యముల తమ 'రాణుల'చేతనే రచియింపించుకొని తమ నామములఁ జెప్పికొనుట ఆంధ్రసారస్వతమున నొక సాంప్రదాయముగ నుండనేయున్నది కాదా?" అని కళావతి నవ్వుచు బదులు చెప్పెను.

"అయిన కామేశ్వరమ్మగారికిఁ గూడ వాణియే వ్రాసియిచ్చునా? పినవీరనకు వాణి రాణి కావచ్చునేమొ గాని ఈమె కేమగును?" అని లీలావతి తిరుగననెను.

"ఏమగునా?—ఈమెకును రాణియే యగును. మనమందఱము ఆమె కీర్తి వశంవదులమైయుండగ నామె కటాక్షమున ఒక్కనాటి కార్యక్రమమునే జరుపుకొనలేకపోవుదుమా?" అని ప్రియంవద పలికెను.

లీలా—'ఇట్ ఈజ్ ఏ లీప్ ఇన్ ది డార్క్'—అని మొదట నేను చెప్పియే యుంటిని.

కళా—'సంశయాత్మా వినశ్యతి'—అని ప్రియంవద నాఁడే నీకు సమాధానమీయలేదా? తినఁబోవుచు కూరలచవులడుగుట యెందులకు? రేపటి సాయంకాలమువఱకు వేచియుండజాలవా?

లీలా—ఇట్ విల్ బి సథింగ్ పార్ట్ ఆఫ్ ఏ మిరకిల్—సమ్మోజాలని ఇంద్రజాలమేమైనఁ గావలయు గాని.

ప్రియంవద—'విమలాదేవి' యను గ్రంథమాంధ్రభాషయం దెట్లు రచింపబడినదో నీ వెఱుంగుదువా?

లీలా—నా కంతగఁ దెలియదు. ఎవరో బాలకవి వ్రాసెఁ గావలయు.

ప్రియం—నేను చెప్పెదను వినుము. అది మహారాష్ట్రభాషయందలి యొక గ్రంథమాధారముగ రచింపఁబడినది. ఆ గ్రంథకారున కొక్క ముక్కయైన మరాఠీ తెలియదు. అయినను తా నాగ్రంథమును కీర్తిశేషులును బహుభాషాకోవిదులును అగు కొమర్రాజు లక్ష్మణరావు పంతులవారిచేఁ జెప్పించుకొని తా నాంధ్రభాషయందు 'విమలాదేవి'ని రచించియుంటినని ఆ గ్రంథకర్తయే చెప్పుకొనియున్నాఁడు. మేమ దేవిధముగ ఆంగ్లభాషాజ్ఞానమేమియులేని కామేశ్వరమ్మగారిచే నీ యాంగ్లకావ్యకథను చెప్పింపఁగలమని మాకు విశ్వాసమున్నది. ఆదికవియగు నన్నయభట్టు సహితము తన భాషాంతరీకరణోద్యమమున తన సహాధ్యాయుఁడు నారాయణభట్టనువాఁడు తోడయి

---

నని యు, ఆటుపిమ్మటఁ బుస్తకమునఁ గొంచెము భాగము మిగులఁగాఁచిన వీరన దానిని పూర్తిచేసి మఱునాఁడు రాజసభకుఁ గొనిపోయెననియు, అతఁడు "వాణినారాణి" యని పంతమున పలుకఁగా గొలువులోనివారు సహింపక యాతని నిరాకరించినప్పుడు రాణి నవరత్నఖచితములయిన కంకణములు గదల తనహస్తము తెరలోనుండి పయికిఁ జాపిచూపి యాతనిమాట సత్యమని యశరీరవాక్కునఁ బలికెననియుఁ జెప్పుదురు.

—ఆంధ్రకవుల చరిత్రము.

నిర్వహించెనని చెప్పుకొనుచున్నాఁడు. అదే విధముగ నుత్తరరామాయణకారుఁడగు కంకంటి పాపరాజు పుష్పగిరి తిమ్మన యను స్నేహితుఁ డొకఁడు సహాయమొనరింపగా తానా గ్రంథమును విరచించియుంటినని జెప్పికొనినాఁడు.

గీ. అనిఁ గిరీటికి శౌరితోడై నయుటుల

నన్మహాకవి సాహాయ్య మాచరించె— అని యతఁ డచ్ఛముగ నన్నయభట్టారకుని వైఖరినే మిత్రసహాయమునఁ దానట్టి రచనను చేసియుంటినని చెప్పుకొనెను. పలువురు కవు లిదేవిధమున సుహృత్ సహాయమున తాము కవిత్వదీక్షావిధి నొందుచుంటిమనియు, గ్రంథరచనాధురీణు లగుచుంటిమనియు నిస్సంకోచముగఁ దెల్పుకొనుచు తమకును వారికినీగూడ శాశ్వతమగు యశము నుపార్జించుకొనుచున్నారు.

ఒకరి రచనల కొకరు దోడ్పడుచుండుటయు, అట్లు తోడ్పడుటవలన గ్రంథకారులుత్సాహవంతులగుటయు నెందుల కగుచుండునో కొంత యోచింతము. పండితులకు— పండితమానులకు రచయితల మనిపించుకొన వలయునను నూహ నిఖిలజగమున నన్ని దేశములవారియందు నొక్క విధముననే యుండునని మనము భావింపవచ్చును. 'మందః కవియశః ప్రార్థీ గమిష్యామి అపహాస్యతామ్' అని మహాకవియగు కాళిదాసత్యంతవినయమున నీభావమునే ప్రదర్శించుచున్నాఁడు. నీవు * గూడ నీవు తెలిగించియున్న భాగమున కీర్తికాసపడుట యెందుల కందువేమో!—సత్కీర్తియున్నదే, అది మహానుభావమున మెఱయువారి యభినందనమున కాస్పదమైనది అని చక్కఁగఁ జెప్పియేయుంటివి. కావున గ్రంథకారులు 'ఆపరితోషాద్విదుషామ్ న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్' అని కాళిదాసునిచేఁ జెప్పఁబడిన యున్నతాశయమును తమ హృదయాంతరాళముల నిల్పుకొననే సివచ్చుచున్నది. అట్టి భావముతోడనే వారు రసగ్రహణపారీణులకు తదితర పండితులకును, సహాధ్యాయులకును, సుహృద్భావముతో నుండువారికిని తమ రచనములఁ జూపించుకొని వారివారి యభిప్రాయానురూపముగ సవరింపించుకొని ప్రకాశమునకుఁ దెచ్చుకొనుట తటస్థించుచున్నది.

ఇంతకును గ్రంథకారులు గ్రంథములు వ్రాసికొనుట అవి తమయింటనే భద్రముగఁ దాఁచియుంచుకొనుటకు గాదుకద! 'గిరీశమ్' గా రనునట్లు లోకమును 'మరమ్మత్తు' చేయవలయునను భావ మొకటి గ్రంథకారులకు కొలదిగనో గొప్పగనో కలుగుచునే యుండునని భావింపవలసియున్నది. సమకాలీను లొకవేళ తమ కావ్యముల ఘనతను కొనియాడజాలనియెడల గ్రంథకారు లూరకుండక 'కాలోహ్యాయం నిరవధి ర్విపులాచ పృథ్వీ' అని నిస్సంశయముగఁ జెప్పుకొని

* నీవు—లీలావతికి సంబోధనము.

యున్న భవభూతి మహాకవివాక్యము
తడవుచుండుటయు జరుగుచునేయున్నది.
సమకాలీనుల యరసికతత్వమునుగూర్చి
మన మిట్టి సందర్భమును క్రిందటి ప్రసంగ
మున విపులముగఁ జర్చించియేయుంటిమి.
కావున నిపు డందునుగూర్చి చెప్పుకొనవల
సిన యావశ్యకత యుండదనుకొనుచున్నాను.

విశ్వశ్రేయమే పరమాదర్శముగ నెన్నో
రైన గ్రంథముల వ్రాయవలసియున్నది.
రచింపఁబడు గ్రంథముల కనురూపమైన
ప్రోత్సాహమును పోషకత్వము గ్రంథకారు
లకుఁ జెందవలసియున్నది. వారట్టి యభినం
దనముల నుత్సాహవంతులయి తదుత్తర
కావ్యముల ఘటింప నూహించుచుందురని
మనము నిరాఘాటముగఁ జెప్పుకొనవచ్చును.
కాని గ్రంథకారు లెప్పుడును

గీ. తరువు లతిరసఫలభారగురుతఁగాంచు
నింగివ్రేలుచు నమృతమొసఁగు మేఘుఁ
డుద్ధతులుగారు బుధులు సమృద్ధిచేత
జగతి నుపకర్తలకు నిదిసహజగుణము

అనునట్టి నిష్కామ్యతత్వమునఁ గేవల
లోకోపకారమే పరమోద్దేశ్యముగఁ బ్రతి
ఫలముల నాసింపకుండనుండరనియు, వా
రెంత సారస్వతోపాసకులైనను తదితరమగు
లౌకికచింతలఁ జేయుచుండుదురనియు జ్ఞప్తి
యందుంచుకొనవలెను.

గ్రంథోత్పాదన మొకరీతిగ ప్రసవవేదన
వంటిదనియు, అట్టి భారమును తలకు గట్టి
కొని మనవా రెందులకు బాధపడవలయు
ననియు కొందఱు విమర్శకావతంసులు నిర్దా
క్షిణ్యముగ నధిక్షేపించుటయు జరుగ
వచ్చును. నిజమే. అడుసుద్రొక్క నేల కాలు
గడుగనేల ? కాని యిట్టి 'ప్రసూతివైరాగ్య
ములు' ఎవ్వరియందైననసరే క్షణభంగుర
ములై నశించిపోవుచుండును కాదా? కావున
నిక పర్యవసానమున

"విద్వానేవవిజానాతి విద్వజ్జనపరిశ్రమమ్
నహివంధ్యా విజానాతిగుర్వీమ్ ప్రసవ
వేదనామ్"

అని పెద్దలు మనకు తెల్పుచున్నట్లు విద్వ
జ్జనపరిశ్రమమును—అనగా విద్వత్కవుల
రచనలయందలి మహత్వమును తెలిసికొను
టకు పాఠకులకు సహితము కొంత వైదుష్య
ముండవలసిన యవసరమున్నదని మనము
భావింపవలయు.

ఇఁక నీ యంశము నింతటితోఁ గట్టిపెట్టి
మన కార్యప్రణాళికనుబట్టి తేపటి సాయం
కాలము సఁ గామేశ్వరమ్మగారివంతునకు
వచ్చియున్న కథాభాగమునుగూర్చి మన
మిప్పుడు నిశ్చయించుకొనవలసియున్నది.
మన సంఘసభ్యులలో మన మెట్టి యెట్టి
ప్రత్యేకతత్వములఁ బ్రకాశించుచున్నను మన
మీ సంఘవ్యవహారముల యుక్తముగ నిర్వ
హించుకొనవలసిన బాధ్యత మన యైదుగురి
యందును సమముగనేయున్నదని
భావింపవలెను. అట్టి తత్వముతోడనే మన
మీ 'రాజకుమారి'ని ఆంధ్ర మహిళాలోక
మునకు సమర్పించుకొనుచున్నాము.

కావున నిప్పు డీ నాల్గవభాగమును నను
ంపవలసిన బాధ్యత కామేశ్వరమ్మగారియం
దెంత యున్నదో మన నల్గురియందు సహిత
మట్టి బాధ్యత యున్నదని యూహించు
చున్నాను. విమలాదేవి ఆంధ్రమునఁ బరివ
ర్తింపబడినట్లే నేనును కళావతియు ఆంగ్లమున
నున్న ప్రతివాక్యమును తొలుత కామేశ్వ
రమ్మగారికి బోధయొనర్చి ఆమెచే నీభాగ
మును ఆమెకుఁ దోచిన శైలియందు రచింపఁ
జేసి మన మీ యుద్యమమును నిరాటంక
ముగ సాగింపవలయునని నే నూహించుచు
న్నాను. ఈకథ మన సంఘసభ్యు లందఱి
చేతను రచింపబడుచున్నదే కాని కేవల
మొక్కరివలన నగుచుండలేదని మనము
తొలుతనే చెప్పుకొనియుంటిమి. ఇట్టి
'సమిష్టి' తత్వమున విరచింపఁబడుటచేతనే
నాల్గవభాగ మాంధ్రీకరించినవారు కామే
శ్వరమ్మగా రొక్కరే కాక నేనును కళా
వతియుకూడ చేసియుంటిమని యెవ్వరైన
భావించుట తటస్థించినయెడల నందువలన
మన సంఘమునకుఁ గాని, కామేశ్వరమ్మ
గారి ఘనతకుఁగాని, కథయందలి మహత్వ
మునకుఁగాని యెట్టి కొఱతయుఁ గలుగదని
నే నూహించుచున్నాను.

అందులకు మే మందఱ మేకగ్రీవముగ
నామోదించితిమి. తదనంతరము మేము
సభను చాలించి మా యిండ్లకు వెడలి
పోతిమి. నిర్ణీతసమయమునఁ గామేశ్వరమ్మ
తన కథాభాగము నీ క్రిందివిధముగ జదివెను.

## రాజకుమారి

### ౪

గీ. అనుప మోజ్వల రమణీయమైనశోభ
రమ్య పూర్వేతిహాసాంతరస్థమైన
అతిమహోన్నత తుహినదుర్గాంతరముల
నాక్రమించుచు నందందయుడఁగదొడఁగె

గీ. పుణ్యసౌరభరుచిరవిభూతిదసరి
సద్గుణోత్కరవారిజ సమితినొప్పి
సత్సభాంతర సుచరిత్ర సారమనగ
మెఱయు పరిపూర్ణ సత్సరోవరమునందు

గీ. పూర్వ కర్మలజాడలఁ బోలెనొప్పు
దీర్ఘతరమైనకాంతి సందీప్తమయ్యు
కదలఁ దొడఁగెనువాయు ప్రకంపమగుచు
వ్యర్థతృష్ల మానస సరోవరమువోలె

గీ. దివ్య దేదీప్యరోచులఁ దేజరిలుచు
ఎగిరె గంతిడు పోల్కి నయ్యేఱువోవు
సింహనాదంబొ తూర్యంబొ శృంగరవమొ
మ్రోగఁజేయుఁడు దిక్కులుమ్రోగునట్లు

గీ. పలుముఖంబుల బొంగు నవార్యరవము
తిరుగ దోతెంచుగాక బ్రతిధ్వనులతో
మ్రోగుగావుత బహుముఖముఖరితముగ
లీనమగుగాత దిశలనాశ్లేషమగుచు

గీ. వినుమువిను మొంతస్వచ్ఛమై విమలమై క
డు గను విశుద్ధతరళమై డోళికావి
నోదలీలమై కిన్నరీనాదమధురి
మానురూపమై పండువై కాననగునొ

గీ. ముగ్ధ మోహనమధురత్వ పూర్ణమైన
దివ్యఘోషలకెంగోన దిరుగువడుచు

పలుదెఱంగుల సంగీత పథములందు
మ్రోయు గావుతఁ బ్రతిశబ్దవాయుగతుల

ఉ. ఓనవలామణీ సఖ యుహో కనుగొంటి
వె నాదమియ్యెడన్
కాననశైలనిర్ఝరుల కమ్మయిషంగును [?]
గాని అత్మలో
జ్ఞానముపొందునంతన నజస్ర సహస్ర
విధంబులన్ బ్రతి
ధ్వానముసేయుచున్ బ్రబలు వైఖరి
గంటివె చోద్యమయ్యెడున్.

మ. మనయాత్మధ్వను లొండొకంటి పరి
రంభంబౌచు మారోర్మియుచున్
నినద బ్రహ్మమురోదసిన్ బ్రబలుచున్
నిండారు చందాన బూ
చిన భావంబుల సౌరభంబు త్రిజగత్
క్షేమంకరంబౌచు భా
విని భూతంబున వర్తమానమున పృథ్వీన్
బెంచు నామోదమున్.

"అదిగో! స్వయంజ్యోతియగు నొక నక్షత్రమే యనియు — మన భూమితోడి నవగ్రహములకును నాయకమణి యగుటచేత మనకింత తేజోవంతముగ నింత శక్తిమంతముగ గానవచ్చుననియు జ్యోతిర్వేత్తలు మన కెఱింగించుచున్న లోకలోచనుఁడగు నభోమణి యుస్సంగత మగుచున్నాఁడు. — అయిన వారి సిద్ధాంతము లెంతవఱకు నిజమో యెవఁడెఱుఁగును? వారు సృష్ట్యాదియందు సర్వ చరాచరావళియుఁ గొన్ని సూర్యగ్రహము లనియు అందుండి మనభూమినిబోలు ఖగోళరాసు లెన్నియో వేఱుపడి చల్లనయి ప్రాణికోటులకు వాసయోగ్యముగఁ దయారయిన వనియు నభివర్ణింతురు. — ఇఁకఁ జీకటిపడకుండ మనము క్రిందకుఁబోయి విశ్రమింతము" — అని రాజకుమారి పలికినంతనే మేము పర్వతశిఖరమునుండి క్రిందకు మరలివచ్చితిమి. సంజచీకటి యగుచుండగ అంతర్దీపికచే మెఱయుచు క్రిందిగుడార మొక మెఱుఁగుడు పురుగువలె కాన్పింపఁదొడంగెను. ఆపర్వతావరోహణ మొనరించునపు డొకటిరెండు మాఱు లామె నాకుఁగైదండ యొసంగుచు నా హృదయమునకుఁ దడబాటును, రక్తమున కుద్వేగమును గల్గించి అత్యపూర్వమగు పరవశత్వమును నా కొనగూర్చుచువచ్చెను.

ఏటవాలుగ నొరకముగనున్న ఆ పర్వతమును కొంతప్రయాసముతో పరస్పరసహాయమున నిర్గమించి మే మాకన్యాసంఘములఁ దోడ్కొని గుడారమునకు మరలివచ్చితిమి. అక్కడ దీపములకాంతిలో పట్టువస్త్రములచేఁ దయారుకాఁబడిన ఆగుడారము కన్నుల పండువుగా నుండెను. మే మాగృహాంతరాళమున నుపవిష్టుల మైతిమి. చిత్రవిచిత్రమైన యల్లికపనులతో పట్టువస్త్రములచేఁ దయారయి అచ్చటవేయఁబడియున్న పర్యంకముల నాశ్రయించి మే మప్పటిబడలికను కొంత యుపశమింపఁజేసికొంటిమి.

సుమనస్సౌరభ సంభరితమగు నొకదీపికా ప్రకాశమునఁ బలుదెఱంగుల భక్ష్యంబులును, నానా ఫలంబులును, రసాయనంబులును, గంధోదకంబులును, మదిరారసంబులును,

మధురద్రవ్యంబులును, హిరణ్యంబును మఱిసిపోవుచు మాయెదుట నుంచఁబడెను. అప్పు డాకాంతల కేశదామముల మెఱయు పుష్పమాలిక లానందవర్ధనమగుఁ జల్లనితావుల బ్రసరింపఁజేయుచుండగ నారాజకుమారి "ఎవ్వారైన నొకగీతమునో కొంతసంగీతమునో వీనులవిందుగ బాడవలయు; సంగీతగోష్ఠినున్న నిముసములు తెక్కలెంగట్టికొనిన ట్లెగిఱి పోవును." అనెను.

అప్పుడు వాసంతి యనునామె వీణ చేతఁ బట్టి కొన్నిగీతములఁ బాడెను. —

గీ. అశ్రులశ్రులు — వ్యర్థాశ్రులక్కటకట
ఏల జనియించుచున్నవో యెఱుఁగనైతి
పరమదివ్య విషాదవిహ్వలములగుచు
పూర్వవాసన లూరక పొంగునకట.

గీ. హృదయమునబుట్టి మొగమునవెగసివచ్చు
రిత్తకన్నీటికెరటాల నొత్తికొనుచు
చింతసేతును ప్రాక్తన జీవితంబు
చింతసేయుదు నింక నశించెనంచు

గీ. అంతమైపోయె పూర్వవసంతమకట
భగ్నమైపోయె పూర్వసౌభాగ్యలక్ష్మి
ఓర్వరానివిషణ్ణత నొందుచునికి
లుప్తమైపోయె సింహావలోకనంబు

గీ. తోయధినిజూడ తొలుదొల్త దోఁచునట్టి
అస్మదాప్తుల గొనితెచ్చు యానపాత్రఁ
తెరలచాపల తెల్లనితేజమట్లు
పరమసౌఖ్యావహంబౌచు బరగుచుండి

గీ. ప్రాణసఖులను గొనుచు నపారసంద్ర
మూవలికిబోవు నోడయందంత్యమందు
కొంచెమగపడు తెరచాప కొయ్యలట్లు
పరమచింతావహంబౌచు బరగుచుండి

గీ. పూర్వవాసనలూరక పొడమునకట —
పూర్వముప్పొంగి సంస్మృతింబొంగునపుడు
చింతసేతును పూర్వవసంతలక్ష్మి
చింతసేయుదు నెన్నడేఁగాంతుననుచు.

గీ. వేగుజామున తమసంబు విరియునపుడు
సగముతెల్పొందు పక్షివిస్వనముచేత
మరణపర్యంకమున గ్రుంగుమానిసికిని
కర్ణముల నెట్లుదోఁచు నక్కరణినుండి.

గీ. వెల్తు రొక్కగవాక్షంపు వీథియందుఁ
గ్రమత నొకచతుష్కోణమహాకాంతియట్ల
మరణ మాసన్నమైన యమ్మానిసికిని
కన్నుగవయందుదోఁచు నక్కరణి నుండి.

గీ. సతతనూతనవిభ్రాంతి సల్పుకతన
రిత్తకన్నీటికెరటాల నొత్తికొనుచు
చింతసేతును ప్రాక్తనజీవితంబు
చింతసేయుదు నెన్నడేఁ గాంతుననుచు.

గీ. మరణమొందిన బంధులమానసముల
జ్ఞప్తియందుంచు ముద్దులచందమునను
అన్యవశమైన హృదయంబునరయలేని
మోనమెఱుఁగని స్వచ్ఛందమోహమట్లు.

గీ. పరులసొమ్మగు నధరంపుమధురమట్లు
మధురమధురంబు ప్రేమైకభాజనంబు
అరిదిప్రణయంబురీతి నత్యంతతీవ్ర
మాదిప్రణయంబువోలె నవ్యాహతంబు.

గీ. అప్రమేయంబు సతత మవ్యక్తమగుచు
నుపశమింపకయుండు నాయుల్లమునయ

కొంగునం దగ్ని దాఁచినభంగినాట
పరిధివిహ్వలతాస్పదమయ్యెనకట

గీ. జీవమునమృత్యు వక్కటాచింత సేయు
రిత్తకన్నీటివెల్లువ నొత్తికొనుచు
చింతసేతును ప్రాక్తనజీవితంబు
చింతసేయుదు నింకనశించెనంచు.

దుఃఖదూషితస్వాంతయై నిక్కంపు నడలున బాడుటచేఁ గావలయు నామె యభివర్ణించిన యశ్రుపొకటి ముత్యమువలె మెఱయుచుఁ బ్రత్యక్షమయి ఆమె యపరాధము నొకింత నుగ్గడించుచు నామె వక్షస్థలమునఁబడి యదృశ్యమయ్యెను. అదేమియు మెచ్చక నా రాజకుమారి సామర్షావహానముగ నిట్లు పలికెను.

"నేర్చుకొంటివి! ఇఁకఁ గట్టిపెట్టుము—పునరాగమమున కవకాశములేని ప్రాక్తన వర్తనముల కింత పరిదేవన మెందులకు? వర్తమానమునకన్న గతమే నీవభివర్ణించున ట్లొకవేళ యోగ్యతరముగఁ జెప్పుకొన్నను వర్తమాన మెప్పటికి గతముకాకుండ వర్తమానమై యుండజాలదుకదా! అనఁగ వర్తమానమును అవశ్యం భావియగు. భావియు నెప్పటికైన భూతకాలమునఁ జేరిపోవలసినదే కాదా? కావున నిది ప్రాక్తన మిది వర్తమానమని మనకు దోచు కాలవిభేదము వృథా భ్రాంతి కాలవాలమగుచున్నదని బలుకవలసి యున్నది.—ఒకవేళ నీవు చెప్పు 'పూర్వ వాసనలం'దు నీ వభివర్ణించు మనోజ్ఞత్వమేదైన యున్నయెడల మన కాత్మవినాశ హేతువై కేవల కర్ణరసాయనముగ గోచరించు నిట్టి గానమును వినుపించుకొనక మా కర్ణరంధ్రముల దూదిఁ గ్రుక్కికొని యూరక నడయాడవలసియున్నది. * — కాని నీ గానమునందలి భావతరంగములున్నవే అవి నిర్వ్యాపారత్వమునఁ దిని కూర్చుండి సంస్కారశూన్యవుగ నుండి పోవుటవలన నేర్చుచున్నవి. — అతిక్రమించియున్న ప్రాక్తన వర్తనములం దెట్టి మహత్వమున్నను అవి యిఁక చేతులకందకుండ నున్నవ్వుడు

* 'హోమర్' అను గ్రీకు పౌరాణికుడు వ్రాసియున్న 'ఆడెసీ' యను నితిహాసమునఁ జెప్పఁబడిన యొక కథాసందర్భమును రాజకుమారి యిచ్చటఁ దడవుచున్నదని పాఠకులు గ్రహింపవలసి యున్నది. ఆ పురాణకథయందు 'అడీసియస్' యను మహావీరుఁ డొకఁడు దుర్గమమగు సంద్రములఁదును పెక్కుకష్టము లనుభవించి అనేక సాహసము లొనర్చిన ట్లభివర్ణింపఁ బడినది.

అతఁడు మహామోహ జనకముగఁ బాడుచుండు 'సైరెను'లనఁబడు రాకాసిసుందరుల హస్తములనుండి తప్పించుకొనుటకయి ముందుగనే తన పరిజనులందరికి సైరెనుల గానమహత్వము వినరాకుండ చెవులకు దట్టముగ మైనమును దట్టి తన పరిజనులచేత యోడయందలి యొక తెరచాపకొయ్యకు తన్నుఁ దాఁ గట్టించుకొనెనట. సైరెనుల కతి సమీపముగ తన యోడ పోవలసియుండును గావునను తనకు వారి గానమహత్వమున తప్పక వెఱ్ఱిలెత్తి వారిచేతఁబడి హతమైపోవుట నిశ్చయమని తెలిసియుండుటచేతను ఇంత 'వివేక' మాతఁడు ప్రదర్శించి యుండెనని గ్రీక్ పౌరాణికు లభివర్ణించుటయే గాక పాశ్చాత్యులు సహిత మీకథ యక్కఱకు వచ్చునపుడెల్ల దడవుచుందురని గ్రహింపవలయు.

వానికై దుఃఖించుటకంటె వెంగలితన మింకొకటి యుండదు. అనంతమగు కాలవాహిని సాగుచుండుట సృష్టికి సహజసిద్ధమగు స్వభావమగుటచేత మనమెల్లప్పుడును వర్తమానమున—భావికాలమున నౌన్నత్యమునుపొంద నూహింపవలయును గాని గత జలసేతుబంధనము సేయుచుఁ గూర్చుండ రాదు. ఇంతియును కాలచక్రము సంతతపరివర్తన శీలమగుచు నడచుచుండుట మనుజుఁడీ భూమిపై నుదయించినప్పటినుండియు జరుగుచునేయున్నది. ప్రపంచపరిణామతత్వ మెప్పుడీవిధముగనే యున్నది. క్రొత్తవింతయు ప్రాతరోతయు నగుట ప్రపంచతత్త్వమునందే యున్నది.—ఇట్లనుచుండినంత మాత్రమున స్వతః సిద్ధముగఁ జేవయు ఘనతయునున్న పూర్వవైఖరులకు గాని, పూర్వశాసనములకు గాని నిర్నిమిత్తముగ నధఃకరించుచు నడ్డుదగులు దాననుగాను. ఇప్పుడు మన మయఃపాషాణములుగఁదలంచు కొన్ని పురాతన శాసనములు తుదకు మనకవి సువర్ణవికారములుగనే దోఁచి యానందమొనగూర్ప వచ్చును. అట్టివానితో నాకెట్టి తగవును లేదు. కావున ప్రస్తుత మీస్థితియందు మాత్రము మనము గతమును 'గతమ్‌గతమ్' అనియే భావింపవలసియున్నది. ఈజగముత్పాదింపఁబడుటకుముందు పోయిన కల్పాంతకాలమున పురాణములయం దభివర్ణింపఁబడిన మహాప్రళయమువలెనే స్త్రీజాతికిఁ జెల్లిన పూర్వ సంఘటనములన్నియు నిర్విశేషముగ నశించినవనియే మన మూహించి మఱల నిచ్చట మనవైన పునఃసృష్టియందు మనకలవడియున్న ప్రభయుఁ, బ్రజ్ఞయు, నసాధారణ తేజమును పూర్ణముగ నుపయోగమునకుఁ దెచ్చుకొని మనమిచ్చట జగద్భద్రానుసంధాయినులమై యుంటిమని సర్వదా జ్ఞప్తియం దుంచుకొనవలయు."

ఆమె నావై పునకుఁదిరిగి—"మీ దేశపు గీతమేదైన నీకురాదా? — గడచినవానికై ప్రలాపించునట్టివిగాక రాఁబోవు నానందసర్గనము వర్ణించున వెట్టివైనసరే!—విందులగుడుచుచు పూర్వమైగు ప్తదేశవాసులు తామెంతదినుచున్నను తుదకుఁ జచ్చువారమే యనిజ్ఞప్తియందుంచుకొనుటకు పీనుగుల యాకారముల పెట్టెలలో నుంచుకొని భోజనశాలలో తమకెదుట నుంచుకొను వారఁట. అట్టి తత్వమున బాడుగీతమైన నెడల నేదియుతలదు."

అప్పుడు మా దేశముననుండగ నేను స్వయముగ రచించియుండిన కొన్ని గీతములు నాకు స్ఫురణకువచ్చెను. వానిని సందర్భోచితముగఁ గొంతమార్చి బాలికాయోగ్యమైన స్వరమున నుండవలెనని తిన్ననికంఠమున నాకుఁజేతనైనంతవఱకు ప్రయత్నమొనర్చుచు నిట్లు చదివితిని.

౧

రాజహంసమ! దక్షిణరాజ్యమునకుఁ
బోవుచుంటివో యేమొ నీపోకఁజూడ
వేగమరుగుము నాసఖివేగఁజూచి
నేనుచెప్పెడుదెల్లను నీవచెపుమ.

౨

ఎఱుగుదువుగాదె యుభయుల నిందునందు
కాంతిమంతంబుభూరి విక్రాంతియుతము
చంచలతావు దక్షిణజాతిధ్రువము.

౩

నల్లవడియును నిశ్చలులెల్లవారు
సత్యసంధులు కారుణ్య సాజమతులు
ఔత్తరాహులయందున నాంధ్రజాతి
ప్రాణసఖికిట్లుచెప్పు నామాటగాగ.

౪

రాజహంసమ! దక్షిణరాజ్యమునకు
నీవుబోయెదుకీతి నేఁబోవునెడల
శీఘ్రముగఁబోయి వ్రాలనే చెలినిజూడ—
వ్రాలినంతనె సల్పనే ప్రణయఘోష.

౫

రెండులక్షలుగలవు నాప్రేమఁజూప
పదములవియన్ని వల్లించిచదువుదాన
నేనుచెప్పిన నీవు వర్ణింపగలవె
నీవుపలుకంగ నేర్తువే నావిధాన

౬

నీవనేనయియుండిన నిశ్చయముగ
ఆమె హృదయంపుఁజేరువ హత్తికొనగ
ప్రణయఘోషను సఖని నావసమచేసి
దివ్యగానంబుహృదయాన దీయఁగలను.

౭

ప్రాణధారణహేతువౌ ప్రణయమన్న
ఆమె కీ యుదాసీనత కేమిగలదొ
ఎఱుగకుంటినియిన్నాళ్లు ఎఱుగనేర్తు
వేని వేవేగఁజెప్పు నాకెఱుగఁబడఁగ.

౮

అల్పభోగ్యంబుజీవిత మరసిచూడ
ప్రణయమన్నను బహుదీర్ఘభావమరయ
ఆమె నాయందియానట్లు యాదు మీవు
నీదు వెనువెంటవత్తు నే నిశ్చయముగ

నే నీ గీతములఁ జదువుచుండఁగ నచ్చటి స్త్రీలందఱు వింత వైఖరుల నొండొరుల నవలోకించుకొనుచు వినాశకాలమున సముద్రతీరమున బానవిధి నొనర్చి కేకిస లాడుచు చావునకు సిద్ధముగనున్న యాదవుల వైఖరి పెద్దకన్నులతో దీర్ఘముగ నుపలక్షించుచు పరులమొగములఁ బెట్టుకొని నవ్వునట్లు తమలోఁదాము నవ్వుకొనుచు తామేమి యొనర్చుచుండిరో దెలియని వైఖరి నుండి పోయిరి.* అప్పుడు నాకంఠము తప్పక నన్నును నావేసమునుగూడ వంచించుచుండెనని నాకుఁ దోచెను.

ఆ రాజకుమారి మిగుల సపహాససుందరముగ నన్నుఁజూచి—"ఆహా! నీవెఱుఁగుదువో లేదో! గంపుకోయిల గులాబికన్యను తనదెస కాకర్షింపఁ గోరి యుత్కంఠమున గాన మొనర్చునని పారసీకకవు లొక చమత్కారముఁ జెప్పుకొందురు. నీవట్టి కోయిలవయి ఈ విధముగ గానమొనర్చినను ఏ గులాబియు నీయందు సఖ్యము వాటింపదని

* **I ceased, and all the ladies, each at each**
**Stared with great eyes and laughed with alien lips**
**And knew not what they meant.**

నేను నిశ్చయముగఁ జెప్పఁగలను. ఇది కర్ణకఠోరమగు కాబందులయులివువలె నుండుటచేత నీవు తప్పక నట్టి పిట్టలకు సహోదరి వనిపించుకొందువు.—ఇఁక నీ గీతమున్నదే అది వట్టి ప్రణయోన్మాదమునఁ జెప్పఁబడిన శృంగారాత్మకమైన రచన—దీనికిని మన భాషయందలి కవుల శృంగారరసాపస్మారములకును ఏమైన భేదమున్నదా?—కావున నో మిత్రమ! నా కట్టి పద్యములన్న చెప్పవలదా, పరమానహ్యము. అవి మనము మన బందుగులయిండ్ల * సైరంధ్రీవృత్తుల నవలంబించి యజ్ఞాతవాసముల నున్నకాలమును జ్ఞప్తికిఁ దెచ్చును. పురుషులఁబోలు వంచకులుండరు. ఎక్కడనో ఏదేశములందో సంతతకళ్యాణప్రదముగ రాజ్యమాన్యప్రియాంగనలై యుండు నదృష్టముగల యున్నతజాతిసంభవలకుఁ బొసఁగియుండునేమొకాని తదితర సామాన్య స్త్రీలందఱును ఒకల్లు చెమర్చునట్లు నికృష్టముగ — నీచతరప్రకారముగ నౌరులకన్నులసన్నల నుదరపోషణమొనర్చుకొనుటయే జరిగిపోవుచున్నది. పురుషుల కింత లాఘవముగ — ఇంత మానధనవిహీనముగ నాఁడుజాతి యుంచుటచేతనే మన మీ మహిళామహోద్యమతత్వమున బద్ధకంకణలమై యుండుట సంభవించినది.

"ఎవరో సంపన్నాంధులగు కొందఱు కాంతలకుగాక విద్యాగంధశూన్యలగు నాడువాండ్రందఱకుఁ గడుపు బ్రోచికొనుటకు తాళ్లెత్తుటమొదలు చందనములు కాయువఱకుగల యెల్లబండపనులును చిన్నపనులును వంశపారంపర్యముగ నుండిపోవుచున్నవి. నిరక్షరాస్యలయ్యు సర్వలక్షణ సంపన్నలమని, సంపన్నగుణాభిరామలమని విఱ్ఱవీగు నాఁడువాండ్రు కట్టి, తొడిగి, పూయుటయే జీవితపరమావధిగ దలంచుచు నెల్లకాలము తినుట త్రాగుట నిద్రపోవుటయే పనులుగ నుండిపోవుదురు. లేనివారు అంట్లుదోముకొనుచునో, పిడుక లమ్ముకొనుచునో, రాజమార్గముల తాళ్లుగొట్టుకొనుచునో కాయకష్టముననుండిపోవుదురు. ఇఁక సాధారణగృహములనుండు కాంతలు వంటచేయుటయో, హారములు గ్రుచ్చుటయో పువ్వులు ముడుచుటయో, నలుగునూరుటయో, కలపంబులు గూర్చుటయో పనులుగఁ జేసికొనుచు వంటయు దేహాలంకరణమును జీవితపరమావధిగఁ దలపోయుచునుండుట జరుగుచున్నది.

"వంటయిండ్లకై పడుకటిండ్లకై బ్రదుకుటింత యేహ్యము? మననాలుక లెట్లుత్రిప్పిన మనయొడ ల్లేమిగోరిన అవి చేసికొనుచు నుండిపోవుటయే మనజీవితములకుఁ బరమ

---

* పాండవ మహిషికి విరాటనగరమున నున్నకాలమునందును సుధేష్ణాదులతోడి బాంధవ్యమున్నది.

క. ఏ నమ్మహానుభావుల
కేనల్లుఁడ వార లార్య మిత్రులు శత్రు
క్ష్మా నాయక గర్వతమో
భానులు బంధుహితకార్యపరతంత్రాత్ముల్.

అని యుత్తరుఁడు 'బృహన్నల'తోఁ బాండవులఁగూర్చి పలుకుచున్నాఁడు.

ప్రయోజనమా? చదువులంగాని, ఉన్నతపుం జీతలనికాని, ఉదాత్త తత్త్వములనిగాని మన జీవితముల ననుభవమునకుం దెచ్చుకొనం జాలనియెడల మన మేమితిన్నను, ఏమితొడిగినను, ఏమి యూహించుచున్నను ప్రాణముల తోడి 'పీనుగుల'వలె సంచరింతుమని భావింప వలయునుగాదా?

"అట్టి యుదాత్తచిత్తమునం బ్రకాశించు వారిపు డెందఱున్నారు? — మనకవుల శృంగారకల్పనల నిట్టియాండు దొక్కరైన నున్నదా? గతానుగతికముగ నపాత్రపు లక్షణము లాదర్శముగ నుంచుకొని తుచ్ఛ శృంగారధోరణులనుండు మఱికినంతియు సుగంధమని దట్టముగ పట్టించుటయే జరుగుచున్నది. ఆకస్మికకామోన్మాదములు, విరహతాపములు, శీతలోపచారములు, చంద్రాద్యుపాలంభనములు — ఇట్టివన్నియు మనకవులు శాస్త్రోక్తముగ సంఘటించుటయే జరుగుచున్నది. ఇట్టి పాపప్రబంధములం జూడ నాకు వానిపై నిప్పుబెట్టవలయు నంతి మహామర్ష ముత్పన్నమగుచుండును. మన భాషయం దిట్టి తుచ్ఛకావ్యము లెన్నియున్నవో, ఉన్నతాదర్శబోధకములు, నుదాత్తరసప్లావితములునగు నుత్తమకావ్యములు గూడ నన్నియున్నవి.

క. మానంబెతొడవు సతులకు
మానమెప్రాణాధికంబు మాన మఖిలస
న్మానములకు మూలంబగు
మానరహితమైనబ్రదుకు మానినికేలా.

అను నుత్తమభావములు సహితము ధీరోదాత్తచిత్తలుగ నభివర్ణింపబడిన కొందఱు నాయికలకున్నవి. అయినను పురుషసృష్టములగు నిట్టికావ్యములతో పురుషులు తమ బుద్ధులను బోనిచ్చుకొనకుండ పూర్తిగం బ్రదర్శింపుచునే యున్నారు. అమ్మవారికి బలియిచ్చుట కలంకరింపంబడు గొఱ్ఱెలవలె వారు తమనాయికల శ్లాఘనీయమైన వేసములువేసి నిష్కారుణముగ వారియాత్మలను 'హత్య' యొనర్చునంత పనులం జేయుచునే యుందురు. ఇట్టి యుదాత్తనాయికలం జిత్రించునప్పుడుకూడ పురుషహృదయము లెంత నీచముగం బోవుచుండునో చూడుడు! తనపై నలుకవహించి 'కోపగృహము'న నున్న నాయిక నుద్దేశించి —

చ. మన మరయందలంచి యొక
మార్గము వన్నితొ నవ్వుటాలకో
నను వెఱపించెదో యకట!
నాయెడ నిక్కము తప్పుగల్గెనో
వనజదళాయతాక్షి! పగ
వాడనె నన్నిటు లేలచూడ వా
క్కనిమునమైన నీవు దయం
గన్గొనకుండిన నిల్వనేర్తునే.

అని నాయకుడు ప్రలాపించుచున్నాండు.

చ. మనముల మాటలం గ్రియల
మన్ననలీ నొకనాడు నట్టికా
మినులకు గౌరవంబు మెఱ
మెచ్చులకై పచరింతుంగాని; పా
యనియనురక్తి నీయెడల
యగ్గలమై కనుపట్టునాకు నీ

పనిచిన పంపుసేయుటయ
ప్రాభవమాటది నీవెఱుంగవే.

ఈ కపటవినయము లెందుకు? స్త్రీలఁగైవస మొనర్చుకొనుటకే కద! ఈ బ్రతిమాలు లెందుఁకు? స్త్రీల పాదాక్రాంతల నొనర్చు కొనుటకే కద! ఈకావ్యమునఁ బురుషుఁడు తననాయిక 'కర్మిలిమ్రొక్కుచు' కార్యసాధన మొనర్చుకొనుచున్నాడు.

వ. నను భవదీయదాసుని మ
నంబున నెయ్యంపుఁగిన్కఁబూనితా
చినయది నాకు మన్ననయ,
చెల్వగునీపదపల్లవంబు మ
త్తనుపులకాగ్రకంటకవి
తానము దాకిన నొచ్చునంచు నే
ననియెద నల్కమానవుగ
దా యికనైన నరాళకుంతలా.

పురుషు లిట్లుమ్రొక్కుటయు వారిచేఁదాపులఁ దినుటయు మఱల వారిచే మ్రొక్కించుకొను టకును వారిని మఱింత భంగపెట్టుటకును అగుచున్నది కాదా? 'ఈ నయగారపుంబ్రియ ము లీపస లీమొగమిచ్చమాట'లివి పురుషుల కెల్లదేశములఁ దమ శృంగారనిర్వాహణమున కక్కఱకు వచ్చుచునేయున్నవి.

"అందును మనదేశకవులు ఆడుదాని బ్రదుకెంత నరకమైయున్నను అదంతయు భూమిపై నవతరించిన స్వర్గమాయని మనకుఁ దోచున ట్లభివర్ణింపగలరు.

"పాపము! నాయొద్ద నొక పరిచారిక యుండెడిది. ఆమె శృంగారరచనముల రసిక జనమనోరంజనములఁజేసియున్న యొక కవిని బ్రేమించి వాని నొక లోకోత్తరచరిత్రు నిగా — అప్రమేయగుణపూజ్యునిగా భావిం చుచు, ఆతనికై మనుజులువడని యుమ్మలి కలువడి అడలియడలి దేహమును శుష్కీ భూత మొనర్చుకొని తుద కాదురాత్మునిచేత పరిత్యక్తయై చనిపోయెను. ఇహలోకమున ఉత్తమోత్తమమగు ప్రణయమున ఆమెకు దుర్లభమైయుండిన మనశ్శాంతి నేను పర లోకమునందైన నీశ్వరకటాక్షమున నామెకు లభింపకుండ నుండదని భావించుచున్నాను.

"కాని యీకవిత్వ మనునది మహాశక్తి మంతమగు దివ్యసాధనము. నేనుగూడ నొక ప్పుడు మనస్త్రీజాతియందుఁ గావలసియున్న భావికార్యసంఘటనముల నూహించుచుఁ దేజోవంతముగ నాయంతరాళమున మెఱయు చున్న స్వతంత్రభావములను శాశ్వతముగఁ గవితయం దుండిపోవున ట్లొనర్చితిని.

"కవితమనుజుల స్వాతంత్ర్యప్రియత్వ మును, జ్ఞానోపార్జనమును, ఉన్నతభావవ్యా ప్తియు నుగ్గడించుటకు వినియోగింపఁబడ వలయుగాని తుచ్ఛమగు శృంగార లాలసత్వ మును అట్టిదేయగు భోజన ప్రియత్వమును ప్రదర్శించుకొనుట కుపయోగింపరాదని నాయూహ.

"కాని పూర్వకవుల శృంగారరసమున్న దే అది నిశ్చలమైన పవిత్రమైన ప్రేమతత్వము నుగ్గడింపక కేవల దైహికసంజనితమును జంతు సాధారణమునగు కామోద్రేకము నభి వర్ణించునని మీరు గ్రహింపవలెను. శాశ్వ

తేము మన మిట్లుండవలసిన యావశ్యకత లేదు. మొదట స్త్రీజాతికి 'హక్కు'గ మానము తెలిసికొనుచున్న మనయోగ్యతను పురుషులు పూర్ణముగ నంగీకరించిన యెడల మన కా పురుషజాతితో నెట్టితగవు నుంచుకొనవలసిన యవసరముండదు. దాసీజనములపై జేయునట్లు మనపై లేనిపోని పెత్తనములఁ జేసి బాధింపకయు, పసిపిల్లల నాడించునట్లు మనల బుజ్జగించుచు గారాబములఁ జూపకయు, మనకీయవలసిన గౌరవమును పురుషుఁడు మనయందు జూపించువఱకు మన మీమహిళామహోద్యమ మొక జన్మవ్రతముగ నూహింపవలసియున్నది.

"అట్టి సంకల్ప మొక మిథ్యామనోరథమని మీ మనస్సులం దేమాత్రమున్నను మీరీ యుద్యమమున కృతార్థత్వమును పొందఁజాలరు.

"— మీకుఁ దెలియఁజెప్పుట కీమాత్రము చాలునని నాయూహ. ఇప్పుడిఁక వ్యర్థముగ కాలహరణ మొనర్చుచునుండి పోవు టెందులకు?" అని నావంకఁజూచి

"మీదేశ స్త్రీలవైఖరులను, వారి ప్రకృతులను ఉన్నదున్నట్లు తెలియఁజేయఁగల యొట్టిగీతమును నీకు రాకనేయున్నదా?" అని పలికెను.

ఇట్లని తాను గోరినరీతి నేదైన గీతము నేను వినుపింతునన్న యూహను బ్రకటించుచు తేజస్వంతములగు నేత్రములఁ నన్నడిగెను. నేనును అట్టిరీతి గీతముల నేవైనఁ బాడుదమని నాతలను జించుకొనుచుండగ కృష్ణవర్మ మితిమీరి దాహశాంతి * చేయుటచేతనో— లేక అదేదైన చమత్కారముగ నూహించెనో యేమోగాని—ఆదువాంధ్ర కర్ణములకు వినసొంపుగాని గైరమ్మ * ను గూర్చియు వెంకమ్మను గూర్చియు—

'నే నెరక్కపోయ్యేల్తిని గైరమ్మా!' అని తేనెపెరవలెనుండు గేయముల నుత్సాహముగఁ బాడ నారంభించెను. తెగఁద్రాగి యొడలు తెలియకుండ ప్రలాపించు వాని జిహ్వ నెవ్వరాపఁగలరు!

'వలదు వల'దను నర్థముతో పార్థసారథి యాతని కన్నుకనుసంజ్ఞలఁ జేయుచు, తల నాడించుచు, నదల్ప నూహించుచున్నను ఆత డింకను తన్మయత్వమును బొందియున్న వానివలె నొక్కటే ధోరణిని బాడుచు పోవుచుండెను.

---

* దాహశాంతి — మదిరాపాన మొనర్చియుండెనని రాజకుమారుని భావము.

* ఇవి నేఁ డాంధ్రదేశమునఁ బ్రతియింటను ఒక్కటేరొదగఁ బాడి వేయఁబడుచున్న 'గైరమ్మపాట'యు 'వెంకిపాటలు'ను గావని పాఠకు లూహింపవలెను. ఒకవేళ నెవ్వరైన నట్లు శంకించినను అదియొకవిధమైన 'ఎనక్రానిజమ్' — అనఁగ కాలమునకు విరుద్ధమగు నొకరీతి రచనముగ — కామేశ్వరమ్మగారిచేతఁ జెప్పఁబడి యుండవచ్చునని భావింపవలసినదిగ నేను పాఠకులఁగోరికొనుచున్నాను. ఇట్టిరీతి సంఘటనముల 'షేక్స్పియర్' వంటి మహాకవికూడఁ జాలఁజేసి యుండెనని విజ్ఞులెఱింగియే యుందురు.

—మనోరమ.

అప్పు డారాజకుమారి యతనిని మిగుల [illegible] గుడార[illegible]యు తమసేయుడు. మన రూక్షముగ నవలోకించుచు "ఊరకుండుము! [illegible] ప్రదము." — అని యనుచుండగనే నే నాగ్రహావేశమున — అని తన నెచ్చెలుల కాజ్ఞాపించెను.

"ఊరకుండవయ్యా?" అని కృష్ణవర్మ నదలించుచు ప్రేమతోఁ గోపముతో నా రొండలు పుంచుకొనిపోవుచుండగ నాతని వక్షస్థలమున నొకటి గొట్టితిని.

అతఁడు తనపాటలను గట్టిపెట్టుచు నివ్వెఱపాటుతో నన్నుదిలకించుచు నుండి పోయెను.

అప్పు డాకస్మికముగ నేలమట్టమునకు బాడుచేయఁ బడుచున్న మహానగరమునందు వలె నా మహిళా సంఘమునం దెంత గందర గోళమైన నుదయించెను. పూర్వకాలమున తల్లికోట యుద్ధసమయమున హాయిగనుండి గుండియలపైఁ జేయిడి నిద్ర పోవుచున్న విజయనగరముపై తురుష్క లొక్కసారిగ నాక్రమించినప్పుడైన నంతభీభత్సమగు నార్త నాద ముదయించియుండెనని నేను భావింపఁ జాలను.

అప్పుడు మాలతి మిగుల సంక్షోభమున నడలిపోవు కన్నులతో — "పాఱిపొండు. ఇఁక నున్నయెడల చావు నిశ్చయము. వేగమే పాఱిపొండు." — అని మమ్ములఁ దొందర పెట్టఁజొచ్చెను.

తన మహిళాసంఘమున నంతటికలకల ముదయించినను ఆరాజకుమారి మిగుల స్థిర చిత్తయై నిష్కంపధైర్యమున మెఱయు మహాద్రివలె —

అప్పుడు మధుకోశమున కేమైనఁ దగిలిన యెడల నలుదిక్కులకును పాఱిపోవు మధు మక్షికములవలె నాబాలికాసంఘమంతయు గుడారమునుండి నానాముఖముల చెదరి పోయెను.

ఒక్కక్షణమునం దా గుడారమున నేనొక్కడను పార్థసారథితో నుండిపోయితిని. నన్ను నేను తిట్టుకొనుచు, కృష్ణవర్మను శపించుచు — ఆకస్మికముగ పలాయితమై పోయిన నా మనోరథములవలెనే నారాజకుమారి — నా మనోహారిణియు, తదితర స్త్రీజనమును నన్నువీడి యావలకు వెడలిపోవు సవ్వడులు నాకర్ణరంధ్రములఁ బడుచుండెను. ఆవల నున్న వంతెనపై పలాయితమై పోవుచున్న స్త్రీల గుఱ్ఱపుడెక్కలు మిగుల గందరగోళ ముగ వినుపించుచుండెను.

అప్పు డాకస్మికముగ —

"రాజకుమారి! అయ్యో మనరాజ కుమారి! — ఏటబడిపోయినది. — మన నాయకురాలు. హా! హా!" యను హాహా కారములు నాశ్రవణపుటములఁ బడెను. ఆమె యాగ్రహావేశమున నానిశానసమయ మున స్వారి యొనర్చుచు — తానెక్కియున్న గుఱ్ఱము కాలుజారి పోవుటచేఁ గావలయు నశ్వారోహయై యుండియు ఆయేటి నట్ట నడుమఁ బడిపోయెను.

# నూతన భారతీయ గృహలక్ష్మి

పదువుల రామచంద్రయ్యగారు

(అనువాదకుడు)

## ఇర్విన్ ప్రభ్వీకళాశాల యందలి కార్యజాలములు

ముదితల్ మున్కొనివచ్చి భావిగృహల
    క్ష్మల్ గాగ సన్మార్గమై,
యెద శ్రీ భారతమాత హృత్కమలమ
    ధ్యంబైన ఢిల్లీపురిన్,
విదితంబయ్యె సహోదరీ! కనుము
    ఇర్విన్ ప్రభ్వీ విద్యాలయం
బదనయ్యెన్ చనుదెమ్ము! లెమ్మచటి కా
    మ్యార్థంబులన్ బొందగన్.

[పోయిన జూలయి మాసపు 'గృహలక్ష్మి'యం దనువదించిన "గృహశిక్షణ : నియమితవేతనములు" అను వ్యాసము 'గృహలక్ష్మి' పాఠకుల కెక్కువ అక్కరను గల్గించిన దని తలంచుచున్నాను. కారణమే మన వ్యాసమును జదివినతరువాత చాలమంది, ఆంధ్ర సోదరీమణులకుగూడ తగిన శ్రీయుత రత్నతాతాగారి విద్యాలయములవంటి సంస్థలనుగురించి తెలుప వేడుచు, వ్యాసకర్తకును, గృహలక్ష్మి కార్యాలయమునకునుగూడ వ్రాసియుండిరి. అందుచేత మున్ను వ్రాసిన సంస్థను బోలినదియును, దానికన్న నన్నివిధంబుల మిన్నయనదగినదియును నగు ఇర్విను ప్రభ్వీకళాశాలనుగురించి వ్రాయ నుద్దేశించితిని. ఈ సంస్థయందు యే యువతీమణియైనను ప్రవేశపరీక్షయం దుత్తీర్ణురాలయ్యెనేని చేర్చుకొనబడును. ఆమె ఏ మతస్థురాలైనను, విశాల భారతదేశమునం దెచటనున్ననుగూడ యీ కళాశాలను ప్రవేశింపవచ్చును. ఐనను, యీ క్రిందివ్యాసమున వివరించియున్న కారణములచే యీ విద్యాలయమున ప్రవేశింప ప్రయత్నించిన ప్రతి యువతికిని చోటుదొరకకపోవచ్చును; గాని ముందే తగురీతి ప్రయత్నించుచో విఫలులుగారని నా తలంపు. విద్యాలయమునుగుఱించిన వివరములు, Directress, No. 1, Sikandra Road, New Delhi వారికి వ్రాసిన బడయవచ్చును.]

అల్పకాలముననే ఇర్విను ప్రభ్వీకళాశాల విద్యార్థిని చులుకుదనమునకును నిపుణత్వమునకును ఆదర్శప్రాయమయి యుండును. మూడు సంవత్సరములక్రింద తొమ్మండుగురు విద్యార్థినులచే ప్రారంభింపబడిన యీ సంస్థ భారతీయ మహిళా విద్యాభివృద్ధికై యెక్కువ పాటుపడ నున్నది. ఏలయున, ఈ కళాశాల భారతీయ స్త్రీవిద్యా సమస్యా పరిష్కారమునకు హిందూ సుందరులచేతనే గావింపబడిన ముఖ్యమగు నొక మార్గమైయున్నది. వారు తమ్ము తా ముద్ధరించుకొన జాలరను సవాలున (ఆక్షేపణకు) కియ్యది సరియగు సమాధానమై యున్నది.

బెతూను కళాశాలయందు బహుమానముల బంచుతఱి, వంగదేశ విద్యాధికారి (Director of Public Instruction) భారత నారీమణులు తమ్ము తాముద్ధరించుకొనజాలకున్నారని యాక్షేపించి తమ విద్యావిషయమున తెల్వితో చురుకుతో శ్రద్ధగైకొనుడని ప్రబోధము జేసెను. అంతట ఈ విషయముసెడ అఖిల భారత మహిళాసభ అత్యంతశ్రద్ధ గైకొని 1927 వ సంవత్సరమున పునహానగరమున విద్యాసంస్కార

విషయముల జర్పింపగూడిన సభయందు, ఈ కార్యక్రమమునకు గావలసిన ధనార్జనోపాయమునకు రెండవ సభ ఢిల్లీ నగరమున సమావేశముగావింపవలయునని తీర్మానించిరి.

ఆరంభము :—

ఇర్విను ప్రభ్వి అధ్యక్షతక్రింద శ్రీమతి ఫెరిదూన్జీ గారవ కార్యదర్శిగా అఖిలభారత మహిళా విద్యావిధాననిధిసంఘ మేర్పడెను. వెనువెంటనే హిందూదేశమునం దన్ని భాగములందును గల విద్యాప్రవీణులను ఒకసంఘముగా నేర్పాటు జేయబడియెను. ఈ సంఘము చాలకాలము సమాలోచనలు జరిపి గృహనిర్వహణశాస్త్రము, విద్యాప్రచారపద్ధతులు, మానసికశాస్త్రము వీనిని జదువుటకును, వానియందు నూతన విషయములు గనిపెట్టుటకును ఒక మహిళావిద్యాలయ నిర్మాణ మావశ్యకమను సూచనతో నొక ప్రణాళికను వెలువరించిరి. ఇవ్విధమున ఇర్విను ప్రభ్వికళాశాల 1932 వ సంవత్సరమున నవంబరుమాసమునందు ప్రారంభింప బడియెను.

ఈ విద్యాలయారంభమునుండియు తన యాధిపత్యమున జరుగుచున్న, మిసర్స్ హున్నా సెన్ యను నామె యాహ్వానముపై నీ కళాశాలను జూచుటకై వెళ్లినపుడు దాని క్రమాభివృద్ధిని గమనింప వీలయ్యెను. దురదృష్టవశమున నా యధికారిణి జబ్బుగనుండుటచే యామె సహాయాధికారిణితో నపుడు విద్యాలయమంతయు జుట్టి చూచితిని. విద్యాలయము స్థిరముగ నుండదగిన భవన నిర్మాణ మింకను సాగుచుండుటచే యీ కళాశాలను దీనికిసంబంధించిన భోజనవసతియును (Hostel) నెం. 1 సికంద్రీరోడ్డు, న్యూఢిల్లీ (No. 1, Sikandri Road, New Delhi) యందు ప్రస్తుతము జరుపబడుచున్నది.

వనపాలనావశ్యకత:—

ఈ స్థలము క్రమక్రమముగా వృద్ధియగుచున్న యీ విద్యాలయావశ్యకతలకు చాలుటలేదు. ఏబది మందికంటె యెక్కువ వారికి చోటు చాలనందున యీ సంవత్సరము చాలమంది యభ్యర్థినులను నిరాకరింపవలసివచ్చెను.

ఈ కట్టడమునకు చుట్టును ప్రహరియును, దాని లోపల క్రమముగ తీర్పబడియున్న యుద్యానవాటికలును గలవు. ఈ వనవాటికల యభివృద్ధికి విద్యార్థినులే తగుశ్రద్ధ గైకొనుచున్నారు. ఈ విద్యాలయ కార్యక్రమమునందు వనపాలన ముఖ్యమగు విషయమనియు, మొక్కల మనోహరముగా పెంచుటయందు విద్యార్థినులతిశ్రద్ధగైకొందురనియు నాకు దెలియవచ్చెను.

స్థలము చాలకున్నందున వరండాలయందును, భోజనము జేయుచోటునందుగూడ తరగతులు పెట్టుకొనబడుచున్నను, అచటి గదులన్నియు, పెద్దవై నిర్మలవాయు పూరితములై యున్నవి. ప్రస్తుత మీ విద్యాలయమున ద్వివిధ విద్యావిధానములు గలవు:—

ఉపాధ్యాయుల శిక్షణ (Training course) మూడు సంవత్సరములు; గృహవిద్యాశిక్షణ, రెండు సంవత్సరములు గలవు. ఒకసంవత్సరముననే ముగియు గృహవిద్యాశిక్షణ విధానముగూడ గలదు. కావున ఐదు తరగతుల నియమితస్థలమున జరుపవలసియున్నది.

విపులమగు విద్యావిధానము:—

భారత యువతుల కత్యంతావశ్యకములైన విషయములయెడ ప్రత్యేకమగు శ్రద్ధవహించి, విపులమగు అనుక్రమణిక తయారుచేయబడినది. స్త్రీలను సకల విద్యాప్రవీణలగను, పండితులుగనుగా జేయుట వారి యుద్దేశ్యముగాదు; కాని చక్కని గృహశిక్షణ నొసగుట ఉపాధ్యాయత్వమునందు ప్రవీణలను జేయుట వారి ముఖ్యాశయములు. ఈ విద్యావిధానమునకు జేర్పుకొనబడు యువతులు ప్రవేశ పరీక్షగాని (Matriculation) దానికి సమానమగు మరియే యితర పరీక్షయందుగాని ఉత్తీర్ణలై యుండవలయును.

గృహశిక్షణ తరగతియందు మనోశాస్త్రము (Psychology) పరిపాలనా పద్ధతులు (Civics) జీవ శాస్త్రము (Biology) ఆహారపదార్థ విజ్ఞానము (Dietics) ఆరోగ్యశాస్త్రము (Hygiene) వీనియందు కొద్దిగ ప్రవేశమును, ప్రథమ చికిత్సయందును (First Aid) శిశుపాలనాది గృహసంరక్షణ కుట్టుపని పాక శాస్త్రము వస్త్రముల శుభ్రపఱచుట (Laundry) వనపాలనము మొదలగు వానియం దెక్కువగను నేర్పబడును.

ఉపాధ్యాయ వృత్తికొరకై జదువువారు వీని నన్నిటిని నేర్చుకొనవలసినదే గాక, రసాయన శాస్త్రము (Chemistry) భౌతికశాస్త్రము (Physics) జీవశాస్త్రము వీనినిగుఱించి యెక్కువగ జదువవలసి యుండును. కడపటి సంవత్సరమున(Final year) చరిత్ర విద్యాబోధనా పద్ధతులు, సూత్రములేగాక గృహ సంబంధములగు విషయములు నేర్పుట.యందలి ప్రము ఖత బడయవలయును.

ఈ విద్యా విధానమున సిద్ధాంతములనేగాక, (Theoretical) అభ్యాసమును (Practical) పరిశోధన శాలయందును (Laboratory) పనులను జేయవలసి యుండును. తరువాత నేను పాకశాలలో జూచినపు దందలి యువతులు తట్టలతోడను. తదితర పాత్రలతో డను ఎంతనునాయాసముగా బనిచేయుచుండిరో, యావిధముననే ఆ చిన్న పరిశోధనాలయమున గూడ క్షారములతో (Alkalis) ద్రావకములతో (Acids) వారు పనిచేయుచుండిరి. వారు తాము పాకములజేయ నియమింపబడిన కాలములలో తయారుజేసిన ఊరు గాయలతో, చట్నీలతో పెక్కు ఫలహారములతో నిండిన బీరువాయొకటి పాకశాలయందు జూపిరి.

## అభ్యాస సిద్ధమగు శిక్షణ :—

## (Practical Training)

గృహమునకు సంబంధించిన వివిధ విషయములను గుఱించి యూరక చదివి నేర్చుకున్నంతమాత్రమున ఆ విద్యాలయమున వారి చదువు సాంతమగుటలేదు. ఆ విద్యాలయాధికారిణి ప్రతివారు నిర్ణీతసమయము లందు ప్రతి పనిని స్వంతముగాచేసి యభ్యసించు విధ మున కార్యక్రమమును చాల నిపుణతతో నేర్పాటు జేసినది. వారి భోజనవసతి గృహకార్యములన్నియు వారే జూచుకొనవలసియుండును. ప్రతిదినము ప్రతి విద్యార్థినికిని వేరువేరు కార్యములుండును.

దీనికొక యుదాహరణము:—ఇరువురు యువతులు ప్రతిదినము అతిథుల నాదరించుటకై నియమింపబడి యుందురు. ఇది వారికి మిగుల యిష్టమగు కార్యము. ఎందుకన అతిథులతోగూడ వెళ్లి ఆ విద్యాలయ మంతయు వారికి జూపింపవలయును. నలువురు వంట యింటిని, భోజనశాలను జూచుకొనుటకు నియమింప బడుదురు. ఇరువురు వస్త్రముల శుభ్రపరచుటకును, మరి యిరువురు, అనారోగ్యముగ నుండువారికి సాయ పడుటకును నియమింపబడుదురు. ఇవ్విధమున ప్రతి యువతియు, తాను యిల్లాలై యుండునపుడు జేయ వలసియుండు కార్యములనన్నింటిని క్రమముగ జేయు చుండును.

ఈ విద్యాలయమున సంగీతము భరతశాస్త్రము గూడ నేర్పుటకు పూనికొనియున్నది. ఇటీవల శ్రీ సార్వభౌముల రజతోత్సవ సందర్భమున యీ విద్యా లయ విద్యార్థినులచే నాడబడిన చౌ చౌ నాటక మందలి నృత్యములు, పఠనములు, Recitations ప్రేక్షకులచే మిగుల నామోదింపబడినవి.

## ఆటపాటలు — సాంఘిక జీవనము:—

టెన్నిస్ (Tennis) బాడ్ మిన్‌టన్ (Badminton) వాలి బాల్ (Volley Ball) బాస్‌కెట్ బాల్ (Basket Ball) మొదలగు ఆటలకు గావలసినన్ని సదుపాయములు గలవు. ఈ విద్యాలయమున సూర్య నికేతనము (House of Appolo) గురునికేతనము (House of jupitor) అని రెండుశాఖలుగ భాగింప

బడి, రెంటికిని మధ్య తరచుగ పందెములు జరుగుచుండును. ఈవిద్యాలయమున ఈదుటకొక స్నానఘాటీ గలదు. అందు పెక్కుమంది యువతులు ఎండకాలమున యీది ఆనందింతురు.

ఇందు విద్యార్థినీ సమాజ మపుడపుడు పెక్కు విషయములను గురించి చర్చించుచు విద్యాలయమునందలి సాంఘిక జీవనమును బలపరచుచున్నది. అపుడే యీ కళాశాల విద్యార్థినులు వక్తృత్వమునందు పేరుబొందుచుండుట మిగుల యాశ్చర్యమును గూర్చుచున్నది. వీరిలో శ్రీమతి ముమ్‌టాజ్ ఖా నవాజ్ అను విద్యార్థిని ఢిల్లీనగరమున జరిగిన అఖిలభారత వక్తృత్వపు పోటీపరీక్షలందు కొన్నిసంవత్సరములనుండి, ప్రథమురాలై నెగ్గి బహుమానముల బడసినది.

## నిరుపమాన విద్యాలయము

ఒక్కవిషయముననే గాక, పెక్కువిషయముల నీవిద్యాలయ మద్వితీయమైయున్నది. హిందూపద్ధతుల ననుసరించి, భారతీయజీవితమునకు దగిన కార్యపద్ధతిని నేర్ప నిక్కముగ ప్రయత్నించిన విద్యాలయముల యందిది యగ్రగణ్యము. ఇచటనే భావిభారతపౌరులు, నిపుణులగు నుపాధ్యాయినులు, వివేకులగు మిత్రులు, యోగ్యులగు మాతలుగానున్న యేబదిమంది హిందూసుందరులు శిక్షణ బొందుచున్నారు.

భారతనారీమణులు తమభావి విద్యాసమస్యా పరిష్కారణార్థమై ప్రయత్నించు ప్రథమయత్నమే యీవిద్యాలయము. కాశ్మీరమునుండి కన్యాకుమారి అగ్రమువరకుగల పలుప్రాంతవాసులైన హిందుమహమ్మదీయ, పార్సీ క్రైస్తవమతములకు జెందిన భారతనారీమణుల భేదాభిప్రాయములు లేని యానందవాతావరణమున నొకచో దినుచు నాడుచు, జదువుచున్న దీ యొక్కవిద్యాలయముననే !! కావుననే నందుండి వెడలునపుడు, ఇర్వీను ప్రభ్వీకళాశాలయందు నూతన భారతీయ స్త్రీమూర్తి ప్రబలుచున్నదని భావించితిని.

ఒకమాట:—

ఇంత విశాలభారతదేశమున కిట్టి యుత్తమాదర్శకమగు కళాశాల యొక్కటి యున్నంతమాత్రమున కరవుతీరదు. కావున ప్రతిరాష్ట్రమునం దిట్టి సంస్థ యొక్కటియైన యుండితీరవలయును. ముఖ్యముగ అట్టిసంస్థ లేని లోపము మన యాంధ్రభూమిని గన్పడుచున్నది. దీనిని గనిపెట్టి ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు తగిన శ్రద్ధవహించి యిట్టి సంస్థలను గూడ నూతనముగ స్థాపించియో, లేక ప్రకృతమున్న కళాశాలలం దిట్టి నూతనవిషయములను, ఆంధ్రయువతుల కనుగుణముగా నేర్ప బ్రయత్నించియో తమ విధాయకకృత్య మొనరించుకొనవలయును. ఆంధ్రు లెల్లరు అందు ముఖ్యముగ మహిళాసంఘము లిట్టి సంస్థల సంస్థాపనార్థమై విశ్వవిద్యాలయమువారితో సంప్రతించి వారది నిర్వహించునట్లు జూడవలయును. ఆంధ్రు లెల్ల రిట్టివానియెడ నెంతమాత్రము పేక్షవహింపరాదు. తుద కిన్ని సదుపాయములు లేక యుత్తమాదర్శములు మాత్రము దృక్పథమందిడి, యిట్టి సంస్థల స్థాపించి ప్రస్తుతము జరుపుచుండు వారికి తగినవిధమున చేయూత నొసంగనగును. ఆంధ్రదేశమున శారదానికేతనము, సేవాసదనములు మొదలగు సంస్థ లట్టివి లవు. కాని సరియగు నాదరణ లేమి యవి ఆరంభించిన స్థితియందేయున్నవి. ఆంధ్రసోదరీసోదరు లెల్లరు సంఘసౌభాగ్యము దేశదీప్తియు గోరి యిట్టివానికి దోహద మొనరింపవలయుననియే నా ప్రార్థనగూడ.

వనితల్ విద్దల నేర్వరాదనుట పూ
ర్వాచార; ముద్యోగమే
అనుకూలంబని యెంచి నేర్పుట వృథా
వ్యాపారమా; భావిజీ
వనమం దెల్ల సుఖంబులన్ బడయగా
పాటించు సద్విద్యయే
వనితాలోకము గుర్తెఱింగి మునుముం
దర్థిల్లు నంచెంచెదన్.

# శ్రీలక్ష్మీసేవాసదనము

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

(ప్రథమవార్షికోత్సవాధ్యక్షోపన్యాసము)

సోదరీమణులారా,

శ్రీలక్ష్మీసేవాసదన కార్యనిర్వాహకవర్గమువారు యీప్రథమవార్షికసభ కధ్యక్షతవహించు నవకాశము గల్పించి నా కపూర్వగౌరవమును సమకూర్చిరి. నిజమునకు విద్యాసంస్థలనుగురించి నాకెట్టి యనుభవము లేకున్నను స్త్రీవిద్యాసంస్థలయెడ నాకుగల ప్రగాఢప్రేమవలన నిదియు నొక సేవాధర్మముగనే భావించి యీకృత్యమును నెఱవేర్చుట కంగీకరించితిని.

ఏలూరుపురవరము నాకు క్రొత్తగాదు: ఆదినములలో మాపంతులు గారీయూర యుద్యోగమునను్న కారణమున తొలుదొలుత నత్తవారింటికి నేనిచటికే వచ్చితిని. అప్పుడు దాదాపు ఒకటిన్నరసంవత్సర మీయూరనుంటిని. కాని చిన్నతనమగుటవలన నేనొకరి నెఱుగను నన్నొక రెఱుగరు.

ఈ యిరువదేండ్లలో నీపట్టణము బహువిధముల నభివృద్ధినందినది. జిల్లాకు ముఖ్యపట్టణమైనది. అనేక ప్రజాహితసంస్థలు నెలకొల్పబడినవి. సేవాపరాయణలగు విదుషీమణులు పెక్కుమంది వెలసినారు. స్వర్గీయ అన్నపూర్ణాదేవివంటి త్యాగశీలలకు నిలయమై వన్నెకెక్కినది. ఈ లక్ష్మీసేవాసదనమువంటి విద్యాప్రతిష్ఠాపనలు నెలకొల్పుభాగ్య మొదవినది. ఇదియంతయు హేలాపురి సత్వరాభివృద్ధికి నిదర్శనములని చెప్పవచ్చును.

## అవిద్య

వర్తమానకాలమున భారతస్త్రీల నావరించినంత యవిద్యాతమస్సు ప్రపంచమున మఱేదేశపుస్త్రీలను నావరించియుండలేదు. ఇటీవలి జనాభాలెక్కలప్రకారముగూడ మనదేశమున చదువుకొనిన స్త్రీలసంఖ్య నూటికిద్దఱుకంటె తక్కువనియే తేలినది. కావున స్త్రీలనిమిత్తమై యెన్నిపాఠశాలలు నెలకొల్పినను, నెంతమంది కృషిచేసినను నది నూటికి రెండుపాళ్లైన కృషిచేసినట్లు కాదనియే తలంపవలయును.

దృఢమైన తాళపుపెట్టెయం దెంతధనము నిలువచేయబడినను తాళపుచెవులు లేకున్న నా ధనపేటిక లెంత నిరుపయోగమో అటులనే భారతదేశమున నెంత ప్రాచీనార్యవిజ్ఞానము భద్రముచేయబడియున్నను విద్యయను తాళపుచెవిలేక దానినిబడయ సాధ్యముగాదు. కావున ప్రభుత్వమువారును, ప్రజలునుగూడ భారతదేశ సౌభాగ్యమునకై మునుముందు చేయవలసినపని యవిద్యను రూపుమాపుటయే.

## విద్యాలాభము

విద్య జ్ఞానసముపార్జనకు మొదటిమెట్టు; జీవితోన్నతికి మూలకందము; అర్థోపపత్తికి ముఖ్యసాధనము. కావుననే శ్రీమద్భాగవతము, "చదువనివా డజ్ఞుండగు; చదివిన సదసద్వివేకచతురత గలుగుఁ: చదువగ వలయును జనులకు" అని శాసించినది. భారతదేశమున నేకారణముననో పూర్వమునుండియు స్త్రీవిద్య యుపేక్షింపబడినది. ఉద్యోగములు చేయనా? ఊళ్లేలనా? ఆఁడుదానికి చదువెందుకను సామ్యమును బట్టి, చదువుకొనుట యుద్యోగముకొఱకే ననుభావములోనుండి ఉద్యోగముచేయదు గనుక స్త్రీకి చదువెందుకని మనవా రనుకొనిరి కాబోలు; కాని ఉద్యో

గము చేయకపోయినను నుద్యోగము చేయించునట్టియు, నూళ్లలకపోయినను నూళ్లలించునట్టియు బాధ్యత స్త్రీలదే ననువిషయము నా రూహింపలేదు.

## మాతృపదము

ఎప్పుడు సృష్టికర్త మానవప్రపంచమున కంతకు స్త్రీని మాతృస్థానముగ జేసెనో అప్పుడే స్త్రీలపై నీబాధ్యత బహుధా నిర్భరపడియున్నది. స్త్రీలు తమ్ము దాముద్ధరించుకొనుటయేగాక తమసంతానమగు బాలబాలికలను గూడ నుద్ధరించుబాధ్యత గలిగియున్నారు. బాలబాలికల మానసకేదారములందు తమంత మొలకలెత్తెడు భావాంకురముల బరికించి యనుపయుక్తములగువానిని బెకలించివైచియు నుపయుక్తములగువానిని తమ నిరంతరసుధామయ వాక్పూరములచే పెంపొందించి ఫలవంతము చేయవలసినవారు స్త్రీలే!! ఈమాతృపదము అనునది స్త్రీలకు భగవద్దత్తమైన పవిత్రపదము. ఈపదవిని పడయగల్గినందుకు ప్రతి స్త్రీయు గర్వింపవలసినదే. కాని బిడ్డలను కనివైచినంతమాత్రమున స్త్రీయును నీపదమును బడసినది కాజాలదు. ఏస్త్రీ తనధర్మమును గుర్తెరిగి తనబిడ్డలకు విద్యాబుద్ధులు గఱపుటయందు జాగరూకత వహించినదై వారిభవిష్యజ్జీవితమును శోభావంతము జేయుటకు పాటుబడునో ఆమెయే నిజమైన మాతృపదమును బొందిన స్త్రీయని చెప్పనగును. అకలంకమగు బిడ్డల లేతమనస్సులపై నీతి, భక్తి, జ్ఞానము, సేవ, ప్రేమ, పరోపకారరతియాదిగాగల నేచక్కనిచిత్రములైనను చిత్రించుటకు తల్లికి గలిగినంత యవకాశము మఱెవ్వరికిని లేదు. తండ్రియు, తదుపరి యుపాధ్యాయుడు మున్నగువారును వారి యభివృద్ధికి తోడ్పడినవారుగా గాన్పింపవచ్చును. గాని వారెల్లరు బాల్యావస్థలో మాతృమూర్తి గీచినరేఖలపై రూపకల్పనచేయువారే గాని స్రష్టలుమాత్రము కాజాలరు. కాన జాతినిర్మాతలు స్త్రీలు, పోషకులు పురుషులు, అని చెప్పనగును.

## స్త్రీల ప్రస్తుతస్థితి

ఇంత బాధ్యతాభారములుగల స్త్రీలస్థితి మనదేశమున నెట్లున్నదని విచారించినచో నశ్రుపూరితనేత్రులము కావలయును. విద్యాగంధమా లేదు! వృత్తివిద్యలా చేతగావు! స్వయంపోషక సామర్థ్యమా, లేదు! పైగా మూఢనమ్మకములు, మూఢాచారములు మూఢసాంప్రదాయములు మనచిత్తములయందు బాగుగా పాదుకొనిపోయినవి. ఏక్రొత్తవిషయము వచ్చినను మనహిందూస్త్రీ కన్నులువిప్పి చూడలేదు; విశాలహృదయముతో యోచింపలేదు. అర్హమగువిధమున పరిష్కరింపలేదు. పురుషులుచూపినదే ప్రపంచము; వారు యోచించునదే మార్గము! వారు పరిష్కరించినదే కర్తవ్యము!! ఈవిధముగా చెప్పుచుంటినని పురుషులపై నాకు ద్వేషమని భావింపవలదు. వారియందు నాకు పరమపూజ్యభావముగలదు. వారైనను నేటి మన స్త్రీల దురవస్థనరసి జాలిగొని యుద్ధరణకు పూనుకొనుటవల్లనే మన మీమాత్రమైన విద్యాలేశమును బడయగల్గితిమి. కాన వారికి సర్వదా మనము కృతజ్ఞలమే. కాని అజ్ఞానతమోగ్రస్తమైన భారతమహిళాహృదయమున వ్యక్తిత్వ మెట్లు నశించినదియు మానవసహజమైన స్వతంత్రభావములును, స్వపురోభివృద్ధి యత్నములును నెట్లు సన్నగిలినదియు తెలుపుటకే నేనిట్లు నుడివితిని.

## స్వయంపోషకత్వము

సృష్టిలో నేప్రాణియు పరపోషణపై నాధారపడియుండలేదు. దేనిపొట్ట నదియే పోసికొనును. సృష్టిధర్మ మిదియైయుండగా హిందూస్త్రీమాత్రము ఉత్కృష్టమానవజన్మ మొందియు కరచరణాద్యవయవములుగలిగియు నిర్వ్యాపారిగాను సోమరిగాను పరాన్నభుక్కుగను నున్నది. నిజమున కిది బిడియపడవలసిన విషయమైయుండగా నిదియే గొప్పతనమునకు చిహ్నమను దుర్భావముగూడ స్త్రీలలో బలపడి



శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు
ఆంధ్రవిశ్వవిద్యాలయపు సెనెటుకు
సభ్యురాలుగా నెన్నుకొనబడిరి



మిస్ జె. జీ. బహుదూర్‌జీగారు
బొంబాయి విశ్వవిద్యాలయపు సెనెటు
సభ్యురాలుగా నెన్నుకొనబడిరి



ఏలూరు, శ్రీలక్ష్మీ సేవాసదన వార్షికోత్సవము.
శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు అధ్యక్షురాలు.

యున్నది. స్త్రీలీ అభిప్రాయము కలిగియుండుట వలన ప్రాచీనములగు గృహపరిశ్రమలు నశించుటయు, స్త్రీల సామర్థ్యశక్తి వృథపోవుటయునను రెండనర్థములు కలుగుచున్నవి. కాయకష్టములేక తినుట కెరికిని నధికారములేదనియు, నట్లు తినువారు దొంగలనియు చెప్పిన మహాత్మాగాంధీగారి సూక్తియందు మహార్థము గలదు. కేవలము పురుషుల పెట్టుపోతలపై నాధారపడియుండెడి స్త్రీలీవిషయమును గమనింపవలసియున్నది. ఎప్పుడును నొకరి పెట్టుపోతలపై నాధారపడియుండువారి స్థితికిని స్వకాయకష్టమువలన జీవించువారి స్థితికిని చాల తారతమ్యముగలదు. కావుననే పేదస్త్రీలకున్నంత స్వాతంత్ర్యము భాగ్యవతులకు లేకున్నది.

స్వకాయకష్టము తప్పుగాదు. శ్రేయోదాయకమనిరూపించుటకు భాగ్యవంతులగు స్త్రీలు పాటుబడి యితరులకు మార్గదర్శకులు కావలయును. ఇందువలన శరీరమూ తేలికపడును. ఆరోగ్యమూ వర్ధిల్లును. డాక్టరులకు నెలనెల బిల్లులుచెల్లింప నవస్థ తప్పును. తమపై మేలిమాపు నుంచెడి సామాన్యకుటుంబినులకు ఉపకారకరమగును.

## నీతి — ధర్మము

పొగబండియొక్క నడక పట్టాలపై నాధారపడి యున్నట్లు మానవజీవితము నీతిధర్మములపై నాధారపడి యున్నది. ఆ నీతిప్రేరకములగు పరిస్థితులెన్ని నేడు మనదేశమున పెచ్చరిల్లియున్నను నీతిగౌరవ మింకను మనలో భ్రష్టముకాలేదు. మనుజులను వన్నెగట్టు నిజమైన యొరగపిడిరాయి నీతియే!! ధనము, విద్య, అధికారము, సేవ, యీవి, త్యాగము, శౌర్యము నాదిగాగలవి యెంతగణనీయగుణములైనను, నీతితో సమములు గావు. నీతిరహితమైన యే యాధిక్యతను లోకము గణింపదు. కాన ప్రతివిద్యాసంస్థయు నీతిధర్మమును నిశితముగా ననుష్ఠించు బోధనమును విద్యార్థినుల కొసంగుటావశ్యకము. నీతిధర్మము ననుష్ఠించుటనగా

జీవితమునందలి సర్వపథములందును క్రమమైన నడవడిని గలిగియుండుట — ఇదియే జీవితమునకు పునాది.

## వేషభాషలు

ఇదియే చాలదు. బాహ్యములగు వేషభాషలును విద్యార్థినుల కాదర్శప్రాయములుగనే యుండవలయును. మనుజుల ఆంతరప్రవృత్తికిని, బాహ్యప్రవృత్తికిని అభేద్యమగు సంబంధము గలదు. ఒకరి స్వభావ సౌశీల్యాదులు వెంటనే పట్టిచ్చుటకు అంతరంగికమగు స్వభావముకంటె బాహ్యమగు వేషమే ముఖ్యసాధన. విద్యార్థినుల వేషభాషలు నిరాడంబరముగనుండవేని యినుమునుగూర్చి అగ్గికి సమ్మెట పెట్టినట్లు వారభ్యసించెడి విద్యగూడ నిందాపాత్రమగును. వర్తమానకాలమున మన ఆంధ్రవిద్యార్థినులలో వేషమునుగూర్చిన యాడంబరము మితిమీఱి పోవుచున్నది. ఎల్లప్రాయముననుండెడి విద్యార్థినులలో ప్రబలియున్న నాగరికతాభ్రాంతియు, సౌందర్యపిపాసయు నిందలకు గారణములు. ఒకవిధముగా నలంకారప్రియత్వము స్త్రీజన సహజమగుట వాస్తవమేగాని యది యితరులకు పట్టిచ్చునంత విపరీతముగను ఆర్థికముగా ధననష్టము గలిగించునంత నధికముగను నుండరాదని నా యభిప్రాయము. విద్యార్థినీదశ యొకవిధమగు పవిత్రదీక్షాకాలము. ఈ కాలములో వారలవర్చుకొనవలసినది నీతి, విద్య, విజ్ఞానము, సేవాప్రియత్వము, నాదిగాగల సుగుణములు గాని సొగసులు గావు. నవనాగరికవేషము కొఱకై యేటేటా సబ్బులు, పౌడర్లు, స్నోలు, తలనూనెలు, సెంట్లు, లేసులు, రిబ్బన్లు, పిన్‌లు, వివిధవన్నె వస్త్రములు, ఒకటేమి ఎన్నియో విలాసవస్తువులు స్త్రీలు కొనవలసివచ్చుచున్నది. ఇది మనమే తయారుచేసుకొనినవి గాని, లేక మన దేశమునందే తయారైనవిగాని యైనచో రెండవపక్షముగానైన వీని వినియోగ మంగీకరింపవచ్చును గాని యివి

యున్నియు విదేశవస్తువులై కేవలము సౌందర్య వ్యామోహమును తృప్తిపొందించుటే లక్ష్యముగుచో నది యెంతయు గర్హింపదగిన విషయము గదా! కాన విద్యార్థినులిందు జిక్కువడరాదు.

## భగవద్భక్తి

“దైవాధీనం జగత్సర్వం” భగవంతుని యనుగ్రహములేక మనుజులేమియు చేయజాలరు. “ఆంభోజాసనుడాదిగాగ తృణపర్యంతము” పరమాత్మ విశ్వాత్ముడైయున్నాడు. కాన పరమేశ్వరుడు కేవలమొక విగ్రహరూపుడుగనే యున్నాడనియు, అతని పూజార్చనలు మాత్రమే మోక్షహేతువులనియు భావించి పాండురంగభజనలు, నామసప్తాహములు, రామకోటి యూరేగింపులు నిత్యాది యాడంబరములతో ప్రొద్దులు పుచ్చుట పొరబాటు. “సర్వమయుడు స్వామి సర్వమాతనిరూపు. అణువణువునను నతడమరియుండు, అతడు లేనితావు వరయ నెందునులేదు” కాన స్వార్థవిరహితమైన సమస్త సేవాధర్మములును భగవత్కైంకర్యములుగనే భావింపవలయును. ‘సేవ’ యను పదమునందు మహార్థము గలదు. దానికి అనంతముఖములు, అనంతహస్తములు, అనంతరూపములు గలవు. ఏవిధముగ సేవించినను పరమాత్మని సేవించుటయే యగును. కావున నిరర్థక తారతమ్యములు పెట్టుకొనక సేవాస్వరూపుడగు పరమాత్మను బహువిధముల సేవించి సార్థకజన్ములగుటకు సేవాసదనవిద్యార్థినులుద్యుక్తులు కావలయును. ‘పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్మను నార్యోక్తి యొక్కటియే చాలును. సేవాధర్మమును ప్రబోధించుటకు మఱియు నీ విద్యాసంస్థ యొక్క యభిధేయముగూడ నీ సందేశమునే యొసంగుచున్నది.

## శ్రీలక్ష్మీ సేవాసదనము

మదరాసు రాజమహేంద్రవరము మున్నగు పట్టణములలో స్థాపింపబడినటులనే యీ పట్టణమున గూడ నిట్టి సేవాసదనము స్థాపింపబడుటయేగాక యిందు కేవలము సామాన్యవిద్యయే గాక స్త్రీజనానుకూలములును, స్వతంత్రజీవనోపాధికుపయుక్తములును నగు చేతిపనులుగూడ నేర్పబడుటయు ముదావహమగు విషయము. నేడు సామాన్యవిద్య పురుషులకే నిరుపయుక్తమని నిరసింపబడుచున్నది. అట్టిచో నదియే విద్య స్త్రీలుగూడ నేర్చిన ప్రయోజనములేదు. స్వభావసిద్ధముగనే స్త్రీ పురుషుల కార్యక్షేత్రములు భిన్నములుగా చేయబడియున్నవి. కాన గృహిణీధర్మమును, మాతృధర్మమును నెఱవేర్పవలసిన స్త్రీలు తదనుగుణ్యమగు విద్యనే నేర్చుట యుక్తము. కాన యీ లక్ష్మీసేవాసదన మట్టి విద్యావిధానమునే యేర్పాటుచేసి మార్గదర్శకముగా నుండవలయునని వాంఛించెదను.

## స్థాపకుల ప్రశంస

చెన్నపురి, రాజమండ్రి, ఈ యేలూరు పట్టణములలో స్థాపింపబడిన మూడు స్త్రీవిద్యాసంస్థలును సేవాసదన మను నామమును గలిగియుండుటయే గాక అగ్రసంపన్నులగు వైశ్యప్రముఖులే స్థాపకులై యుండుట సంతోషమును గొల్పుచున్నది. విత్తవంతులగు వారికే సత్సంకల్పములుగూడ నుదయించినచో హాలికునకు సుక్షేత్రము బీజంబు లొకట చేకురినట్లు సార్థకములగును. ఇటులనే ఆంధ్రదేశమునందలి యితర పట్టణ వైశ్యప్రముఖులుగూడ నిట్టి సేవాసదనములు స్థాపించినచో అనతికాలములో ఆంధ్రస్త్రీల విద్యాదారిద్ర్యము తొలగిపోగలదు. ఆంధ్రవైశ్యులు వదాన్యతకు పేరుమోగినవారు. ఆంధ్రదేశమునందలి సత్రములేమి, దేవాలయములేమి, పాఠశాలలేమి, వాపీకూపతటాకాదులేమి, ముక్కాలు మువ్వీసము వారు నిర్మించినవే. ‘వాణిజ్యే వసతే లక్ష్మీః’ లక్ష్మీపుత్రులగు వణిక్ప్రముఖులు దానశౌండులగుట సహ

జము. కాని ధర్మములుగూడ కాలానుగుణ్యములైన మార్పులను బొందినగాని రాణింపవు. పూర్వము బౌద్ధమతము ప్రబలి జనులలో నాస్తికభావము వ్యాపించినప్పు డూరూర దేవాలయములు ప్రతిష్ఠించి ప్రజలను భగవచ్చింతనాపరులనుగా జేయుట, యావశ్యకమైయుండెను. నేడు జనసామాన్యమునం దాస్తిక్యభావమునకు కొఱంతలేదు. ప్రజల కేది కొఱతగా నున్నదో దానిని నిచ్చుట ధార్మికుల విధి. ప్రజల బుభుక్షాపిపాస లెట్లు నివారింపదగినవో ప్రజల యవిద్యయు నట్లు బోకార్పతగినది. కాన ప్రస్తుత పరిస్థితులనుబట్టి దానశీలురెల్ల రీకాలమున విద్యాసంస్థల బోషింప చూరకొనినచో ప్రజాహితమును దేశాభ్యుదయకారకమునై విరాజిల్లగలదు.

## విద్యార్థినులు

సేవావ్రతులైనవారు విద్యాసంస్థల నెలకొల్పినను, ధనాఢ్యులైనవారు దానిని పోషించినను, ప్రజ లందలి పరమార్థమును గ్రహించి వినియోగించుకొనకపోయినచో నా ప్రతిష్ఠాపనము నిష్ప్రయోజనమేయగును. ఒక విద్యాసంస్థను స్థాపించుటకు నిర్వాహకుల యవసర మెంతగలదో, పోషకుల యవసర మెంతగలదో అందు చదువుకొను విద్యార్థినుల యవసరమును నంతగలదు. విద్యాలయమునకు తగుగృహాదివసతులు లేకున్నచో నే పూరిపాకయందైనను నే చెట్టునీడ యందైనను పాఠములు నేర్పవచ్చును గాని విద్యార్థినులే లేకున్న చేయున దేమియు లేదు. కావున నొక స్త్రీ విద్యాసంస్థ స్థాపింపబడగనే యందు విద్యార్థిను లధికముగా జేరి స్థాపకుల కుత్సాహమును ప్రోత్సాహమును గలిగించి దానిని యితోధికముగా వృద్ధినొందించునట్లు చేయవలయును. ఏడుగురు విద్యార్థినులతో స్థాపింపబడిన మద్రాసు సేవాసదనము అనతికాలములో రెండువందల యేబదిమంది విద్యార్థినులతో విరాజిల్లుచున్నట్లు వారి వార్షికనివేదికయందు జదివితిని. అటులనే యీ లక్ష్మీ సేవాసదనముగూడ పెంపొందునట్లు విద్యార్థినులు చేరవలయును.

ఈ సేవాసదన పరిపాలనయందు స్త్రీపురుషులు భాగస్వాములుగానుండి అర్థసంబంధములగు కార్యములను పురుషులును, పాఠశాలా నిర్వహణమును స్త్రీలును వహించుట సమంజసముగానున్నది. ఈ విద్యాలయమునందు కేవలము, విద్యాబోధనమేగాక, లలితకళలు, గృహపరిశ్రమలు నభ్యసించు నవకాశము లుండుటయు, ఈ రెండువిధములనేగాక లోకజ్ఞానము గల్గించు గ్రంథ పత్రికా పఠనావకాశములును పెద్దలచే నుపన్యాసములిప్పించు నేర్పాటులును నుండుటయు ప్రశంసనీయముగానున్నవి. ఇవియేగాక ఖగోళ భూగోళ సంబంధమగు భౌతికశాస్త్రజ్ఞానమును, ప్రాచీన చరిత్రాపరిజ్ఞానమునుగూడ స్త్రీల కావశ్యకమే గావున వానికిగూడ నిందు స్థానమీయబడవలయుననియు, వివిధ విషయకజ్ఞానమును సముపార్జించి యీ విద్యాలయ విద్యార్థినులు సమగ్రవిద్యావతు లగుదురుగాక యని మనఃపూర్వకముగా కోరుచున్నారు. సోదరీమణులారా! త్రవ్వినకొలది యెన్నియో విషయములు గలవు. నా యుపన్యాస మిప్పటికే కడుదీర్ఘమైపోయినది కాన యీ తుది మనవితో విరమించుచున్నాను. ప్రస్తుతము మన దేశస్థితియు, అందు ముఖ్యముగా మన స్త్రీలస్థితియు, మిక్కిలి శోచనీయముగానున్నవి. పూర్వాచారము లెన్నియో మన హిందూసంఘమున పాదుకొనియున్నవి. అందు కొన్ని కేవలము శృంఖలాతుల్యములై మనుజుల నరికట్టుచున్నవి. పాలకులా దూరదేశస్థులు — యిచ్చటి మతాచారములతో వారు జోక్యము కల్గించుకొనరు. కల్గించుకొనినచో నలజడికి కారణమగునని వారికి భయము కావున సాధ్యమైనంతవఱకు వీని నంటకుండ తమ పనిని తాము చక్కబెట్టుకొందురు. కనుక తమ భాగోగులను పరిశీలించుకొను బాధ్యత దేశీయులపైననేయున్నది. కాలము పరిణామశీలమైనది. చేతనావిలసితమైన మానవసమా

జమునందు భావవికాసము సహజలక్షణము. అట్టిచో పూర్వులు నిర్మించిపోయిన అచ్చులయందే మానవుల భావము లెల్లకాలము యిమిడిపోవలయునని కోరుటయు, ప్రయత్నించుటయు సాగనిపని. మానవుల నీవిధముగా పోతబొమ్మలనుగా నుంచవలయునని ప్రయత్నించుటకంటె కాలానుగుణ్యములైన మార్పులను ప్రజాహితకరమగునంతవఱకు చేపట్టుట వివేకలక్షణము. ప్రజలభావము లెప్పుడు నున్నతాశయపూరితములుగా నుండవలయును గాని క్రిందికి దిగదీయు గుదిబండలుగా నుండరాదు. నిన్న మొన్నటివఱకు మౌఢ్యాంధకారనిమగ్నములైయున్న చీనా, తుర్కీ మున్నగు దేశములలోని స్త్రీ లాశ్చర్యకరమగు నభివృద్ధిని బడసిరి. భారతదేశస్త్రీలుగూడ నట్టి యుచ్చస్థితికివచ్చి దేశము నుద్ధరింపవలయును. ఇందుకు పురుషులును తోడ్పడవలయును. స్త్రీవినా పురుషుల యత్నములు నేలనిడిచిన సాములు. స్త్రీయే జాతికి మూలకందము. స్త్రీల యున్నతియే దేశోన్నతి. స్త్రీల యభ్యుదయమే దేశాభ్యుదయము. కావున మన స్త్రీలెల్లరు బాగుగా విద్యాభ్యాసము గావించి రానున్న రాజ్యాంగసంస్కరణములయందు మనకు గల్గెడి అధికారములను హక్కులను స్వతంత్రముగ స్వసంఘక్షేమకరముగ వినియోగించుకొనగల శక్తిసామర్థ్యమును బడయుదురుగాక యని కోరుచు నా యుపన్యాసమును విరమించుచున్నాను.

# మణి

శ్రీమతి పెద్దిశెట్టి రామరంగారు

[మాధవరావను ఆంగ్లవిద్యాధిక శ్రీమంతపుత్రుడు మణిని వివాహమాడుదునని వాగ్దానమిచ్చి, పిమ్మట లీలను మోహించి, తరువాత తండ్రి మొగమాటమున వసుంధర యను ప్లీడరుపుత్రికను కట్నమునకై పెండ్లియాడును. వసుంధర ఒక పుత్రుని పుత్రికను కని పతిచర్యలు సహించలేక రోగము పొంది మరణించును. తండ్రి చనిపోవును. తల్లి యిప్పుడైనను మణిని వివాహమాడు మనును. అతను విద్యావతియగు లీలనే వివాహమాడును. ఆమె దూబరామనిషి, భర్తృసేవయందభిలాషశూన్యము. తన ఆటలు మిత్రులు షోకులే ఆమె పని. ఒకనాడు ఆమె ఒక మిత్రునితో లేచిపోవును. మాధవునికి ఆచింతవలన జబ్బు చేయును. ఉన్నత ఆంగ్లవైద్యపరీక్షలో ఉత్తీర్ణయైన మణి అతని కిప్పుడు వైద్యురాలు. ఆమె అన్న కేశవరావు వసుంధర చెల్లెలు ఉపాధ్యాయినియగు శ్రీలత నిదివరకే మోహించెను.]

"మణీ అతనికి బాగుగా పశ్చాత్తాపము గలుగుట చేత మనోవ్యాకులత గలిగినది" అని కేశవరావు నుడివినాడు.

మణిని మాధవరావు జూచిన దగ్గరనుండి చాల విచారముగాయున్నట్లు ముఖభావమువలన కనిపెట్టి, "చెల్లీ! యేమట్లున్నావు. నాతో చెప్పవా?"

"సోదరా! నాస్థితి కనుక్కొన కోరుచున్నావు నీవు. ఆసభ జరిగిననాటినుండి అదోమాదిరిగా వున్నావు. నీ సంగతి నేను వినతగనా. చెప్పుము సోదరా. ఆతరువాత నేను చెప్పెదను."

"మణీ! నీకు చెప్పుటకు వెనుతీయుదునా! వసుంధర చెల్లెలగు శ్రీలతను జూచిన దగ్గరనుండి నా మనస్సు ఆమెపైకి పోయినది. ఆమెనుతప్ప మరెవ్వరిని చేకొనను. ఆమెకు నామీద ప్రేమ యున్నదో లేదో అని చింతగాయున్నది."

"అన్నా! నేను తప్పక ఆమె స్నేహము కలుగ చేసుకొని ఆమెకు నీయందు ప్రేమ జనింపజేసెదను" అని ధైర్యము కలుగునట్లు నుడివినది.

"మణీ! నీ సంగతి చెప్పుము."

"నేను చిన్ననాటనుండి మాధవుని ప్రేమించితిని. నన్ను కమలాకరునికి ఇచ్చి వివాహము చేసినారు గాని ఆయనయందు నా కిసుమంతయు ప్రేమలేదు. సహోదరా! మాధవునిమూర్తి నా హృదయమున నిండియున్నది. నేను ఆయనకే నా హృదయమును అర్పించితిని" అని ఆమె విచారముతో పల్కినది.

"చెల్లీ! నీ వెందులకు విచారించుట? పూరుకొనుము. ఆయన నిన్ను చేసుకొనునటుల చేయుదును" అని చెప్పినాడు.

"అన్నయ్యా! అది అసాధ్యమైనపని. ఆయన విధవయగు నన్ను చేపట్టునా? వట్టిది."

"లేదు! చెల్లీ! నీ వట్లు నిరాశచేసుకోవలదు. విధవావివాహములు చాలా అవుతున్నవి."

"అన్నా! ఆయన వొప్పుకొనును అనుకొందను. నాన్నగారు, అమ్మ వప్పుకొందురా."

"నేను వొప్పుకొనునట్లు చేయుదును. నా కాపని వదలుము" అని పలికి వెడలిపోయినాడు.

ఆదినము సాయంకాలమే శ్రీలతాదేవిని మణి కలుసుకొన్నది. శ్రీలత మణిని సగౌరవముగా ఇంటి లోనికి దొడ్కొనివెళ్లి కుర్చీచూపి ఆమె కూర్చొన్న తరువాత తాను కూర్చొన్నది. శ్రీలతతో ఆమాట యీమాట ఆడినతరువాత ఇంటివ్యవహారములు అడిగి నది మణి. అక్క పెండ్లి, వాళ్లకష్టములు, తండ్రి చని పోవుట, తండ్రి అంతిమసమయములో చెప్పిన మాటలు, సమస్తమును తెలియజేసినది. మణికూడ తన వివాహము తనకు సంభవించిన కష్టములు గురించి చెప్పినది. ఇద్దరుకూడ తమతమ ప్రేమగాథలు మరుగు పరచిరి. మణి కొంతసేపు ఆలోచించి శ్రీలతా! నా అన్నగారు నిన్ను ప్రేమించినారు అని మెల్లిగా చెప్పినది. ఆమెకూడ "మీతో నేనుకూడ చెప్పు చున్నాను. మీ అన్నగారిని నేను ప్రేమించితిని"అని సిగ్గుతో పల్కినది.

మణి చాలసంతోషించి, శ్రీలత తల్లినిపిలిచి సమ స్తము తెలియజేసి తనతోతెచ్చిన అన్నగారిఫోటోను చూపినది. ఆమెచూచి తనఅల్లుడు సౌందర్యవంతుడు కదాయని మురిసిపోయినది. కేశవుని సరళభావము దయార్ద్రహృదయము వినియున్నది గాన సంతోషించి "అమ్మా! శ్రీలతా! మీ నాయనగారు చనిపోవు నప్పుడు చెప్పిరి వరశుల్కము పుచ్చుకొననివానిని చేసుకొనమని. అమ్మా! మణీ! మీ అన్నగారు కట్నం స్వీకరించనియెడల తప్పకఇచ్చెదను శ్రీలతను" అనెను.

"అమ్మా! మా అన్నగారికి కట్నంఅన్న పరమఅస హ్యము. దానికి మీరేమి చింతపొందవలదు." అని ఆమెను సమాధానపరచి నేను వెళ్లెదనని తల్లి, కుమా ర్తెలవద్ద శెలవుగైకొని ఇంటికివచ్చి, అధికానంద ముతో అన్నకు యీసంగతి తెలియజేసినది. తల్లిదం డ్రులకుకూడ తెలియజేసినది. వారు చాల సంతో షించిరి.

ఒకనాటి సాయంకాలము మణికేశవులు మాధవుని ఇంటికివెళ్లిరి. కేశవరావు ఆమాట, యీమాటఆడి ఇప్పుడేవస్తాను, పక్కఇంట్లో ఒకకేసుఉన్నది, అని చెప్పి దాటివేసినాడు. మణిని మాధవుడు ఏమిప్రశ్నిం చుటకుతోచక, "మణీ! నీతండ్రిగారి పేరేమి?" అని అడిగినాడు.

"నాతండ్రిగారి పేరు ఆనందరావుగారు"

"ఏమి! ఆనందరావుగారి మణివా! నీవు, మణీ! ఎన్నిదినములకు నిన్ను నా యీపాపిష్టికన్నులతో చూస్తిని. నీకు పెండ్లిఅయినదని వింటిని నిజమేనా?"

"అవును"అని పెండ్లిఅయినదగ్గరనుండి నేటివరకు జరిగినగాథ ఓపికతోచెప్పినది.

"మణీ! నీవు వరశుల్కముపేర బాగా యుప న్యాసమును ఇచ్చితివి. నేను చాలా దుర్మార్గముగా ప్రవర్తించితిని. నన్ను క్షమింపుము. ఇకనైనా నాతప్పు లను మన్నించి నీవానిగాచేకొనుము" అని అతిదీన ముగా వేడినాడు.

"ప్రభూ! నేను మిమ్ములను క్షమించుటా! మీరే నన్ను క్షమింపుడు."

మాధవరావు తల్లినిపిలిచి "అమ్మా నీమణి ఇదుగో అమ్మా!" అన్నాడు.

"ఆహా, ఎన్నిదినములకు నే చూస్తినమ్మా" యని అధికానందముతో బల్కినది. సుందరమ్మకు తనపెండ్లి తనచదువు, అన్నియు చెప్పినది మణి!

"అయ్యో! తల్లీ! ఇంతచిన్నతనములోనే నీవు భర్తనుగోల్పోయి విధవరాలవు అయితివా?" అని

# జీర్ణవటవృక్షము

కొంతసేపు విచారించి, "నాయనా! నీవు పెండ్లిచేసుకొన్న మణిని చేసుకొనుము. నాకేమియు అభ్యంతరము లేదు. యీనాటికైనా నా యీకోరిక తీర్చుము." అనెను.

"అట్లనే అమ్మ, మూర్ఖుడనై, పైసౌందర్యమునకు మోహపడి చేసుకొని, ఇంతవిచారమును తెచ్చుకొంటిని. యీనాటికి తెలిసినది. హృదయసౌందర్యముగాని, పైసౌందర్యముకాదు సౌఖ్యపెట్టునది."

సుందరమ్మ. మణిని లోనికితీసుకొనివెళ్లి వసుంధర పిల్లలను చూపినది. మణి వారినిఎత్తుకొని ముద్దాడి దించివేసినది.

ఇంతలో మణీ! అని పిలిచినాడు కేశవుడు. ఇద్దరు, తల్లి, కుమారునివద్ద సెలవుగైకొని వెళ్లిపోయిరి.

మాధవునికి తనకుజరిగిన సంభాషణఅంతయు అన్నకు తెలిపినది. ఇద్దరుకలిసి తల్లీదండ్రులవద్దకు జని జరిగిన సంగతి యావత్తు తెలియజేసిరి. వారుకూడ చాల సంతసించిరి.

ఆదినము సాయంకాలము మణి, శ్రీలతను వెంటనిడుకొని తల్లిదగ్గరకు తీసుకొనివచ్చి చూపినది. జ్ఞానాంబను చూచుటయేతడవుగ సాష్టాంగనమస్కారము చేసినది శ్రీలత. పతిదయకు పాత్రురాలవై పుత్రులనుబడసి చిరంజీవినివై వర్ధిల్లుమని దీవించినది. మణియు శ్రీలతయు చాలసేపు ముచ్చటించుకొనిరి. శ్రీలత మణివద్ద సెలవుగైకొని వెడలిపోయినది.

ఒకదినము సుముహూర్తమున శ్రీలతాదేవికి కేశవరావునకును, మణిదేవికి మాధవరావుకును, అతివైభవముగా వివాహముజరిగినది. మాధవుడు చాలఆనందము బొందినాడు.

ఒకదినమున మాధవుడు మణీ అని పిలిచినాడు. "ఏమి! ఎందులకు," అని అనుకుంటూవచ్చినది.

"కుర్చీమీదకూర్చో. ఒకకబురు చెప్పవలసియున్నది."

మణి కూర్చున్నది. గబుక్కునవచ్చి చక్కని ముద్దుపెట్టుకొని "మణీ! జ్ఞాపకము వున్నదా! 6 సంవత్సరములక్రిందమాట. నిన్ను కుర్చీమీదకూర్చోనబెట్టి చక్కని ముద్దుపెట్టుకొందునని చెప్పితిని" అని పకపకానవ్వినాడు.

"కబురు చెప్పుతానని ఇదాపని. నేనుమాత్రం ఎప్పుడైనా బదులుతీర్చుకోనా! వుండండి మీపని చెప్పుతా"నని చెప్పి క్రిందకు దిగిపోయినది మణి.

## జీర్ణవటవృక్షము

శ్రీమతి వేదుల మీనాక్షీదేవిగారు

సీ॥ ఇనునైనఁ జొరనీనియిపురు జొంపములతో నాకమంటెడి గొప్పశాఖలేవి
నికతంబుగూఁడులనీయందునిర్మించు కడురమ్యమౌ పతగంబులేవి
నెమరువేయంగ నీనీడఁజేరెడు చక్కదనమొల్కు జంతుసంతానమేది
కాననంబులయందు కడుడస్సియుండి నీప్రాపుగోరినయట్టి పాంథులేరి

తే|గీ॥ రంగురంగులతో కడు♦రమ్యమైన।
పూర్వశోభను తలచుచు♦పొగలిపొగలి।
మ్రోడువైపోతె♦తుదకిటు♦ముదివటంబ!
సకలమును జెల్లి అస్థిపం♦జరమువోలె॥

# వింతలు — విశేషములు

## సృష్టి ముందుకా వెనుకకా ?

ఆజాసమీపమం దొక గ్రామమున నొక యిల్లాలికి శరీరమంతయు వెంట్రుకలచే నిండి ముఖము కోతి యాకారముతో నొక వింతశిశువుగల్గి వెంటనే మరణించునట్లు వార్తలు వచ్చుచున్నవి. ఇంతకంటెను విచిత్రమగు నింకొకటిగూడ దెలియవచ్చుచున్నది. కన్నులుగాని ముక్కులుగాని లేక నోరెప్పుడును మూతవడకుండి తల్లిపాలు త్రాగుటకు సాధ్యముగాని యొకశిశువు మరియొక యిల్లాలికి జనించి యిపుడు ఆరోగ్యముగ నున్నదట! వ్రేళ్లు మొత్తమున ఇరువది నాల్గు గలవట! ఏడ్పుగూడ మృగముల శబ్దమువలె నుండునట!

## నాగరికతా ఫలితమా ?

"స్వాభావికోద్దేశ్యమును బయల్పరచునట్టి యనుటకన్న ముద్దును నాగరికతావిజయమువలన గలిగిన ఫలితమనుట మేలు" అను సిద్ధాంతము ప్రష్యాదేశ పదార్థ విజ్ఞానశాస్త్రసమితిచే ప్రకటింపబడినది. అందు ముద్దులచరిత్ర యనాదినుండియు క్రమముగ వివరింపబడినది. పూర్వ మీజిప్టుదేశమున ప్రజలు ఎట్టి కష్టసమయములందును ముద్దు అత్యంతమధురమైన దనువారట! కాని చైనాదేశీయు లద్దాని నెఱుంగరట. నేటికిగూడ వారు దానికి సరియగు పదమును వెదుకజాలకయున్నారట. కాని యీ క్రిందివిషయముల జదివినవారుగూడ యీ ముద్దుల పిచ్చినాగరికతావిజయసూచక మనగలరాయని సందేహము. పెగ్గికింగ్ అను యువతి డార్బు అను గ్రామమున వివాహానంతరము చర్చినుండి బయలుదేరిరాగా వెలుపల ఆమె నాదరించుటకై కాచుకొనియున్నది రి బంధుమిత్రాదుల తల కొకటికివంతున అరగంట కాల మామెను ముద్దుగొనిరట. లెక్కప్రకారము, ఆమెపై నిముషమునకు 8¾ ముద్దులు గురిసినవన్న మాట! ఇంకొకటి. ఒకయువతి యిటీవల యొకకుట్టు పని యంగడివద్దకు వెళ్లి అటనున్న కుక్కను ముద్దు బెట్టుమని కోరినడట. ఆకుక్క ఆప్రకారము గావింపగా సంతసించి తిరిగి ముద్దిడమని యువతి గోరినదట. పాప మా కుక్కకు విసుగెత్తి ది గాబోలు. ఆమెను ముద్దిడుటకు బదులు ముక్కు గరచినది. దానిపై నామెకు కోపమువచ్చి కుక్క యజమానురాలిపై వ్యాజ్యముజేసి పరిహారముగా 75 పౌనులు పొందినదట!

## ధైర్యశాలిని

బర్మింగుహామ్‌లో సింహముల మచ్చికచేయుటకు స్త్రీలు గావలయునని పత్రికలలో ప్రకటింపబడగా నలువది దరఖాస్తుదారు లచట హాజరయినారు. వారిని సింహము లున్నచోటికి దీసుకొనివెళ్లి సర్కసునందు సింహములను మచ్చికచేయ నుద్యోగి పరీక్షించుచుండగా తమ్ము మచ్చికచేయవచ్చిన ధైర్యశాలులను తాముగూడ పరీక్షింప నెంచెనేమో యన్నట్లు అచటనున్న సింహము లొక్కపెట్టున గర్జింప నారంభించెనట అచటనున్న నలువదిమందిలో నొకయామెకు మూర్ఛవచ్చెనట. 38 మంది ఎటకేగిరో జాడ దెలియలేదట. ఒకయువతిమాత్రము ధైర్యముగా చలింపకయుండుట జూచి యామెనే ఆపనియందు నియోగించిరట! నిజముగ ధైర్యము గలవా రెంతమంది కలరు?

## భర్తను పోల్చజాలని భార్య

గ్లాస్కోపట్టణపు వీధులలో నొక డకస్మాత్తుగా మృతుడయ్యెను. అత డెవడని విచారింపగా నొక

యామె అతడు తనభర్త అనెనట. మరియొక యువతి తనసోదరుడనెనట; యొకబాలిక తనమామ అనెనట! వారందరు అతను అతడు 'కార్పరీ' అని సమ్మతిం చిరి. వారిలో భార్యనని చెప్పిన యామె తన దుఃఖము పట్టజాలక యింటను బిడ్డలకా సమాచారమును తెలుపుటకు యింట ప్రవేశించి చూడగా తనభర్త హాయిగా నిద్రించుచుండెనట! అది తనభర్త భూతమనుకొని యామె పెనుగోలజేసినదట. నిజమగు భర్త అతడేయని నమ్ముటకే కొంతకాలము పట్టినదట యామెకు!

## వరుడు ఆకాశమునుండి

రష్యాదేశమునకు ముఖ్యపట్టణమగు మాస్కోనగరమునకు 80 మైళ్లదూరమున యొకగ్రామమున నొక వివాహము జరిగినది. మైకేల్ ఐవానోవిచ్ అను వైమానికుని వివాహమున కన్నియు సిద్ధమై యొక దినము నిర్ణయింపబడినది. కాని ఆదినమే పేరచూట్ (విమానములనుండి నిరపాయముగా క్రిందకు దిగు సాధనము; గుమ్మటమువంటిది) ప్రదర్శనమగుటచే ఆతనికాదినము లీవు దొరకకపోవుటయెగాక ఆ ప్రదర్శనములం దతడుగూడ పాల్గొనవలయునని ఉత్తరవులివ్వబడియెను. అతడు హతాశుడై తన పేరచూటుతో విమానమునుండి క్రింది కురికెను. సురక్షితముగ తాను రాకరానందున విచారగ్రస్థులైయున్న వధువు వారి మధ్యలోనే దిగెనట! తలవని తలంపు లిట్టివిగదా!

## పాశ్చాత్యులుగూడ బానిసవ్యాపారులా?

సుందరమగు 15 సం. యువతిని 10 పౌనులకు కొంతమంది విక్రయించుటచే బానిసవ్యాపారసంఘ మొకటి పాశ్చాత్యదేశములం దుండవచ్చునని యొక పత్రిక వ్రాయుచున్నది. 'జర్మయినీ హాలెండు' అను యువతి పనికత్తెగా యొకరింట యుండి తనజీవితము దుర్భరముగ నున్నదని జెప్పుకొనుచుండగా కొంతమంది సాయముచేయుదుమని యామె వాచోటునుండి తీసుకొనివెళ్లి దూరముగా నొకచో 10 పౌనుల కొకనికి విక్రయించిరట. అచ్చటనుండి తప్పించుకొని అధికారుల కీవార్త దెలిపినదట. బానిసవ్యాపారం వృత్తి యుండుట వీరల అనాగరికులనియు అందునకే ప్రాచ్యులపై కత్తిగట్టుచున్న నాగరకులగు పాశ్చాత్యులు దీని కేమందురో?

## వింతవాడుకలు

కక్కువాయిదగ్గు మంత్రతంత్రములచే సులభముగ కుదురునను నమ్మకము చాలమంది పాశ్చాత్యులకుగూడ గలదు. ఇంగ్లాండునందు పెక్కుస్త్రీలు యీదగ్గు వచ్చిన తమబిడ్డలను గ్యాస్‌వర్కు వద్దకుగాని రైలు సొరంగమువద్దకుగాని తీసికొనిపోయినచో తగ్గిపోవునని నమ్మెదరు. మరికొందరు యీదగ్గువచ్చిన బిడ్డలవెండ్రుకలు కొంచము కత్తిరించి మాంసపుముక్కలో చుట్టి పిల్లికో కుక్కకో వేసిన పోవుననియెదరు. ఇంకను విచిత్రమగు వాడుక పోర్చుగల్ దేశమునందు గలదు. దగ్గువచ్చిన వారిగోళ్లను దీసికొని పొగాకులో చుట్టగా చుట్టి బాటమీద పడవైతురట! దానిని ఎవరు దీసికొని త్రాగుదురో వారి కంటుకొనునట! మరికొందరు ఒక వృక్షముప్రక్కన కొంతఆహారము పడకకు కొంచము గడ్డియుంచి వెనుకకు తిరిగిచూడక వచ్చెదరట. ఆదగు అచటనే నిలిచిపోవునట. పాశ్చాత్యులకున్న పెక్కువాడుకలలో ఇవి కొన్నిమాత్రము. ఇట్టి వాడుకలు పెక్కుగలవని వెక్కిరించుట గురిగింజ సామ్యము గదా!

## విచిత్రమగు శిశువులు

ఈసంవత్సరమున ప్రపంచమున మిగుల బరువైనట్టి మిగుల తేలికయైనట్టియు శిశువు లింగ్లాండు ఆస్ట్రేలియా దేశములందు జనించినట్లు దెలియుచున్నది. మెల్బోరను సమీపమున టి. హిల్ దంపతులకు జనించిన పుత్రుడు పుట్టినపుడు బరువు 15 పౌనులు 4 ఔన్సులు; పొడవు 24¼ అంగుళములు; లావు 16¾ అం. తొడచుట్టుకొలత 9½ అం. మెడ చుట్టుకొలత 9 అం. ఇతర మగశిశువు పుట్టినపుడు 15 ఔన్సులు బరువుండెనట! 10 దినములు నర్సులు కంట వత్తిడుకొని కాపాడగా 10 ఔన్సులు బరువు యెక్కువైనదట ఇది తల్లుల భాగ్యమా తనయుల యదృష్టమా! చ॥ రా॥

# సౌందర్యపోషణము

## కేశముల సౌరు

ఐరోపాఖండములో ఒక శతాబ్దముక్రిందటను, మన భరతఖండములో ఒకటి రెండు దశాబ్దముల క్రిందటను అంగనామణులందఱును వారికేశములకు పరమేశ్వరు డెంత పొడవు రెట్టిరంగునిచ్చిన దానితోనే తృప్తిపొంది, కాస్త తలదుద్దుకొనుట, చమురు రాసి దువ్వుకొనుట మొదలగుపనులతో సరిపెట్టుకొనేవారు. కొందరికి వారికేశముల పొట్టితనమో యెఱుపో తెలుపో అందవికారముగ కనిపించినను లోలోన వగచుటతప్ప, పైపై నెట్టి ప్రయోజనమును లేకుండెడిది. కొందరికేశములు తళతళ మెఱయుచు, ఉంగరములు తిరుగుచు, పొడవుగ పెఱుగుచున్నచో వారు తాము ధన్యులమనుకొనెడివారు; కొందరి కేశములు బిరుసుగా పొట్టిగా తిన్నగా వూరకుంటే వారు లోలోన వగచెడివారు.

నేడట్లూరకొను యువతీమణియొక్కర్తె కానిపించదు. తన జుట్టుతీరు తనకు నచ్చకున్నచో నచ్చినట్లు మార్చుకొను సౌరులెన్నియో యామెకు హస్తగతములై యున్నవి. ఇందుకు కొంతకాలహరణము కావచ్చును. కాని వనితామణికాలమునకు సౌందర్యపరిపోషణమునకు మించిన సద్వినియోగ మిక్కాలమున లేదని పెక్కుఱు నమ్ముచున్నారు. ఈ కాలములో అసలు సహజసుందరమైన కేశములతో జనించువారు అత్యల్ప సంఖ్యాకులనియు, కేశ వైభవములును భోగములును గలవారెల్ల వేయికంటె యెక్కువ ఉపాయములతో రాణింపజేసుకొనుచున్నవారే యనియు నొక వనితామణి వ్రాయుచున్నది.

వీనిలో కొన్నిపద్ధతు లారోగ్యభంగమైనవని కొందఱు తలచుచున్నారు. కాని ఆరోగ్యవిధానములై యెట్టివారికైనను సిఫార్సుచేయగల ప్రకారములుకూడ వేనవేలు ఉన్నవి. వీనివలన స్త్రీలకేశములకు కావలసిన సౌందర్యపు తీరులను ప్రకృతి ప్రసాదించలేకున్నంతమాత్రమున స్త్రీలు నిరాశచెంద నక్కరలేదనియు, ప్రకృతిదేవతవారి కెక్కడెక్కడ మోసము చేసినను వారు ఆలోపమును పూర్తిచేసుకొనగలరనియును స్పష్టమగుచున్నది.

అసలులో మంచి దేహారోగ్యము లేనిదే కేశములుగాని ముఖముగాని కళ్లుగాని బుగ్గలుగాని నిగనిగ రాణించుమనిన రాణించవు. మిత, బలిష్ఠ, సాత్వికాహారమును సుందరకేశాభిలాషులగు స్త్రీలెల్లఱును భుజించవలెనేగాని అక్కఱమాలిన చిఱుతిండ్లు భుజింపరాదు. ఆరోగ్యోత్సాహములతో శరీరమానసంబులు రాజిల్లుచున్నప్పుడు ప్రతిభాగమును సౌందర్యముతో తాండవించుచుండును. ఆహారప్రకరణము వేఱుగాన దానినిగూర్చి యిచ్చట మిక్కిలి ప్రస్తాపించ వీలులేదు.

కేశవర్ధని తైలములు పెక్కు బజారులలో విక్రయించుచుందురు. ఆయుర్వేదవైద్యుల నడిగినచో వానిని సులభముగ దయారుచేయు విధులుకూడ చెప్పుదురు. వానివలన తల యెన్నడును చుండు పుండు పేను మెతక మొదలగు వానిని పట్టదు. తరచుగా స్త్రీలు తలదువ్వుకొనునప్పుడించుకంత నూనెను జుట్టుపైని నిగనిగకొఱకు రాసుకొనుచుందురు. ఇట్టి మెఱుగులవలన పయివారికి వారుబాగుండవచ్చును కాని తలకుగాని కేశములకుగాని యెట్టి ప్రయోజనమును లేదు. చేతినిండ నూనెపోసుకొని, ముందలపై పోసుకొని అయిదువ్రేళ్లను కేశముల మొదళ్లను ఛేదదును తాకునట్టు జొనిపి వ్రేళ్లతోను అరచేతితోను ముందలమొదలు వెనుకతలవఱకు సమస్తముతలను బాగుగ రెండునిముషములు మర్దనము చేసుకొనవలెను.

ఎవరితల వారు మర్దనము చేసుకొనుట చీకాకుగానే మొదట తోచును. పాశ్చాత్య వనితలయినచో యీమాత్రము భాగ్యమునకు సెలూనుకుపోయి యెక్కువ కూలియిచ్చి మర్దనలు చేయించుకొందురు. వారి ఆర్జనలు పెద్దవి కనుక వారి ఖర్చులును పెద్దవి కావచ్చును కాని భారతీయాంగనలు యీ మాత్రపు పని నెవరికి వారు చేసుకుంటేనే సులువు. మొదట కష్టముగానే కనిపించినను క్రమక్రమముగ ఒకరిచేత చేయించుకొనుటకంటె తాము చేసేసుకుంటేనే సుఖమనిపించుతుంది.

జుట్టు పెరుగుటకు మెరుగెక్కుటకు తలకు మర్దన మెందుకని కొందరి కనిపించును. కాని జుట్టునకు పెరుగుదల మధ్యయెక్కడనుంచోకాక మొదళ్లనుంచి ప్రారంభించును. మధ్యరానిన మెరుగు మాయమగును. మొదటినుండివ్యాపించినది నిలచి వెలుగును. మర్దన చేయనిదే తలయొక్క కపాలముననుండు చుండు పుండు మొదలగు దుర్లక్షణములు తొలగవు. అవి తొలగనిదే జుట్టు పెరుగదు. వ్రేళ్లతో, అఱచేతితో తల నెంత గట్టిగా నిమిరినచో చుండు అంతపూర్తిగా నిర్మూలమై తల అంత నిరోగమై కేశములంతబాగా పెరుగును.

ఈ తైలము నుపయోగించుటలోఁ గూడ వివేక ముపయోగించవలెను. శరీరతత్వములనుబట్టి ఒకొక్కరొకొక్క జాతితైలము నుపయోగించవలెను. మెరుగులు పెరుగుదలలు కావలసినవారు తైలములను, వంపులు మెలికలు కావలసినవారు గ్లిసరైనులు లేక ముద్దలను ఉపయోగింతురు. తలమర్దనము దినమున కథమము అయిదునిముషములైనను చేసుకొనవలెను.

పిమ్మట తలదువ్వుకొనవలెను. మొట్టమొదట దువ్వెనతో దువ్వుకొనుట మంచిది. అందువలన జుట్టెల్లయు చిక్కులువీడి విరవిరలాడును. పిమ్మట బ్రష్షుతో దువ్వుకొనవలెను. బ్రష్షువెంట్రుకలు బిరుసుగా వుండవలెను కాని జుట్టులోనికి దూరగానే ముడుచుకొనిపోవురకముగా నుండకూడదు. బ్రష్షువెంట్రుకలు మెదడుకు కపాలమునకు అంతటికి ఘుంచుకంత దురుసుగ తగులునంత బిరుసుగనైన నుండవలెను. దువ్వెనకు కూడ దులిపి పైకితీయరాని చుండు మొదలగు దుష్పదార్థములు దీనితోగాని తొలగవు. ఇందువలన జుట్టు పెరుగును, మెరుగును హెచ్చును.

బిగించి జడలు శిగలు వేసుకొనుటవలనను జుట్టు మెలికలు తిరుగును. ఈజడల నల్లుకొనుటవలని ప్రయోజనము కేవలము కేశములనుకూడదీసుకొని ముడివేసుకొనుటయేగాక ఇట్టి సొగసుతో అవి రాణించుటయేయైయున్నది. "కడుహెచ్చు కొప్పు" అని చేమకూర వెంకటకవి తననాయికను వర్ణించినాడు. భారతీయ వనితలకు పెద్దజుట్టుపెట్టనిసొమ్ము. జుట్టు పెరుగుటకే తైలములను వారు రాసుకొందురు. అట్టి పాదవు చాలనివారు చక్కని సవరములుదాల్తురు. పాశ్చాత్యవనితల కీయుగారంభమునుండియు దీర్ఘకేశములపై విముఖత పొడమినది. పూర్వకాలపు పాశ్చాత్యపురుషుల వలె వారు గిరజాలుగా జుట్టును కత్తిరించుకొనుచున్నారు. ఇట్టి హ్రస్వకేశముల ననేకవిధములుగా పిన్నులతో మడచి ఉంగరములవలె రాణింపఁజేసుకొనుట కెక్కువ అవకాశములున్నవి. దీనినే వారు 'బాబ్బుడు హెయిరు' అందురు. కొందరు నవ్యభారతనారీమణులుకూడ యీయాచారమును ద్రొక్కుచున్నారు కాని పెక్కులు వారి నాక్షేపించుచున్నారు. ఈపద్ధతి యింకను మనవారికి నచ్చుచున్నట్లు తోచదు. ఐనను పెక్కులు లౌక్యులును నాగరకులును తమ బొట్టెలకుమాత్రము ఇట్టి సొగసులుచేసి బడులకు పంపుచున్నారు. బొట్టెలయొద్దనుండి పెద్దలకు ప్రాకుటకు కొంతకాలముపట్టునేమో చెప్పజాలము. కాని యిప్పటి మట్టుకయువతీమణులకు కత్తిరింపులయందుకంటె దీర్ఘతరసవరములమీదనే ముచ్చట హెచ్చుగనుండుట శుభసూచకము.

ఆంధ్రసుందరీమణులు జాతీయసౌందర్యపోషణ విధానములను గూర్చిన చక్కనివ్యాసములు వ్రాసి పంపించగోరుచున్నాము. అట్టివానికి ఈభాగమునందు తావు నొసంగుచున్నాము.



శ్రీమతి తిరువళ్లైచి తన్నీర్ మాలై
కారైక్కూడిలో గౌరవమేజస్ట్రేట్ గా
నియమించబడిరి.



శ్రీమతి మిస్. కరుణాకరగుప్త, యం. యే.
డక్కా విశ్వవిద్యాలయములో హిస్టరీ
లెక్చరరుగా నియమింపబడిన ప్రథమవనితామణి.



బొంబాయి మహిళాసమాజము. మిసెస్ శారదామెహతా గారు అధ్యక్షురాలు.
ఆమె స్వదేశీ ప్రదర్శనమునుకూడా తెరచిరి.

# బాలవిజ్ఞానశాఖ

## ౧. పాటలు

### అగసాలిసోమన్న

అగసాలిసోమన్న కదిసోమి గోటు,
నగిషీలు చెక్కుతానని యెంతసీటు!
బంగారు కరగించి పదునుగాచేసి
రంగారు వంకీలు నానులును అల్లు.

పచ్చలునీలాలు వజ్రాలుపొదిపి
జగిసీలు ఉంగరాలును చేసిపెట్టు
వింతవింతలు నగలు విక్రయిస్తున్న
ఎంతోను గొప్పమాటల నాడుచుండు.

పడతులును పసిపాప లందఱును నతడు
కంటపడితే నగలు కావలయునంద్రు
ఒకనా డయిన తీరుబా టుండునేమొ?
అమవాస్య అనగానె అతడు పనిమాను.

ఏమోయి సోమన్న ఎపు డిస్తువంటే
రామమ్మగారు, రేపే తెస్తుననును.
పదిహేను రేపులు పాటిపోయేయి
ఇదిగోఅను; నాగరం బెపుడు తెస్తాడో!

## భామకళాపణ

శ్రీమతి హవాయి కావేరిబాయిగారు, బి.యె యల్.టి.

"భామకలాపము" అనునది సాధారణ వాడుకలో "భామకళాపణ"యని మారి యున్నది. ఇది పూర్వపద్ధతి ననుసరించిన వీధినాటకము. ఒకానొక "భామకళాపణ" నాటక సంఘమునకు ఒకనాడు సంభవించిన కార్యమొకటి యీదిగువ దెలుపబడిన ప్రకారము నేను వినియుంటిని.

పై జెప్పబడిన నాటకసంఘపు నాయకుడు మంత్రప్రయోగవిద్యలం దసమానప్రవీణత గలవాడు. ప్రియా అగ్రహారమను గ్రామమున కొన్నిదినములు "భామకళాపణ" నాటకరంగమందు ప్రదర్శించిన పిమ్మట చేరువనున్న హరిశ్చంద్రపురమను గ్రామమునకు, నటకులు పయనమగుచుండిరి. ఇతర గ్రామస్థులపై హానికరమగు మంత్రములు ప్రయోగించు దుష్టులు హరిశ్చంద్రపురమున నుండుటవలన జాగ్రతబూనుట కర్తవ్యమని ప్రియాగ్రామస్థులునాయకునికినొక్కి వక్కాణించిరి. "మేము యాచనచేసుకొనే వాళ్లము. మమ్ములనేమిచేస్తా"రని నాయకుడు నిర్భయముగా పలికి హరిశ్చంద్రపురమునకు పయనమయ్యెను.

పై గ్రామముజేరి తొలినాటి రాత్రికి నాటకప్రదర్శనమునకు ఏర్పాట్లుగావించెను. "భామకళాపణ"యందు సర్వదా భామ పాత్రను వహించువాడు నాయకుడే యై

యుండినను నాడు మాత్రము మరియొకనిని తన స్థానమందుంచెను. నాటకము ప్రారంభించి బహువినోదముగా జరుగుచుండెను. చూపరులు క్రిక్కిరిసి మూగియుండిరి. అర్ధరాత్రి దాటిన వెనుక జాము వేళకు భామ ప్రవేశించి తెరపై జటనువేయుట వాడుక. భామ వేషముధరించిన నటకుడు తగు వేళకు నాటకరంగము ప్రవేశించి జటను తెరపై వైచెను. వెంటనే యది కాలసర్పముగా మారి యతనిని కఱచెను.

నటకుడు మూర్ఛిల్లి నేలగూలెను. ఇప్పటి వఱకు నాటకమందు పాల్గొనక వేచియుండిన నాయకుడు రెండు వేపకొమ్మలను చేబూని స్మారకము తప్పియున్న సహకారుని ప్రక్కజేరి వేపకొమ్మలతో నతనిని విసరుచు "దిగుదిగు నాగన్న దిగరా నాగన్న" యని పాడుచుండెను.

పాట ముగియుసరికి కళేబరమువలె పడియుండినవాడు లేచెను. అయినను తన భాగము సాగించుటకు శక్తిలేనివాడై యున్నందున నంతటితో నాటకము చాలింపవలసియున్నదని నాయకుడు సభవారికి తెలియజేసి యిండ్లకు పొమ్మనెను. అందఱు లేచి చెదరిపోయిరి కాని యొకానొక పురుషుడు మాత్రము నేలపైకతకబడిన రీతిని కూర్చుండిపోయెను. ఇతడే భామపై మంత్రము ప్రయోగించిన దుష్టుడు. అతనికి తగిన శాస్తి వానికంటె నిపుణుడైన నాయకునివలన కలిగెను.

ఆగడియనుండి మరునాటి తీవ్రమైన యెండయందు సహా నితడు కదలక మెదలక కూర్చుండెను. మరునాటి రాత్రి మరల నాటకము ప్రారంభించువేళకు నాయకుడు దయగని మరియెన్నడు నిట్టి దుష్క్రియల సలుపవలదని నొక్కివక్కాణించి యతనికి విడుదలనిచ్చెను. నాటిరాత్రి యథాప్రకారముగా భామపాత్రను నాయకుడేవహించి తన చాతుర్యమువలన చూపరుల హృదయములు రంజిల్లజేసెను.

# గ్రంథపరిచయము

**జగత్కథ**

సుప్రసిద్ధ ఆంగ్లచరిత్రకారుడును గ్రంథకర్తయునగు హెచ్. జి. వెల్సుగారు ఆంగ్లమున వ్రాసిన ప్రపంచచరిత్రకు ఇది ఆంధ్రానువాదము. ఆంధ్రానువాదమయ్యు వెల్సుగారి గ్రంథముకంటెగూడ శేడాకులుమిన్నయని ఉభయుల గ్రంథములను పఠించిన వారికి తెలియకపోదు. అనువాద మగుటవలన వెల్సుగారి భావములు, సిద్ధాంతములు, ఊహలు మొదలగునవి యథాతథముగా గ్రహించుటకు సంపూర్ణావకాశ మగుచున్నది. శైలి నిర్దుష్టము, నాతిసులభము, చరిత్ర రచనాసంప్రదాయబద్ధము, ధారాళము, సుందరమునై ఇది అనువాద మేమి టన్నట్లుండును. అసలు గ్రంథము యింగ్లీషు తెలిసినవారు ఇంగ్లీషులోనే చదువుకొనవచ్చునుగాని, అట్టివారికి ఈగ్రంథకర్త శ్రీమాన్ కొమాండూరి శఠకోపాచార్యులు యమ్. ఎ. బి. యల్ (కాకినాడ)గారు వ్రాసిన టిప్పణముల పఠించు భాగ్యము కలుగదు. ఈ టిప్పణములు కేవల భారతీయదృష్టితో వ్రాయబడి కొన్నియెడల వెల్సుగారి భావములను స్పష్టపఱచును, కొన్నియెడల విపులీకరించి పూర్తిచేయును, కొన్నియెడల నిరాడంబరముగ ఛేదించి వేదతత్వమును బోధించుచున్నట్లుండును. భారతీయులకు అసలు గ్రంథముకంటె గూడ ఈ టిప్పణము లెక్కువ విజ్ఞానప్రదములైనవి, బహుళతర పరిశోధనాఫలితములైనవి, సమగ్రచర్చా సమన్వితమైనవి. అట్టి శైలిలో గ్రంథకర్తగారు అనువాదమునకు బదులు స్వతంత్రముగానే ఇట్టి గ్రంథమును వ్రాసిన బాగుండుననిపించును; కాని అజ్ఞానమో, అహంకారమో, సంపూర్ణ నిష్పక్షపాత దివ్యజ్ఞానమో కలవారు తప్ప ప్రస్తుతకాలపు గ్రంథములను వేనినో తిరగవేసినంతమాత్రమున నిర్దుష్టమగుచరిత్రను వ్రాయగలమనుకొనుట శుద్ధసాహసము. అందునను అట్టి జగత్కథ వ్రాయగడంగుట మరియును అవివేకము. ఒక్క వెల్సుకే అట్టి నిర్దుష్టమనబడగల(?) చరిత్రను వ్రాయగల భాగ్యము దక్కినది. ఇంతటి పూచీలతో కూడినసందర్భములో ఆచార్యులుగారు పూచీ నెల్లయు వెల్సుకే విడచి, తనభారమును టిప్పణములుగా సూచించి మిగుల ప్రశంసనీయు లగుచున్నారు. విశ్వవిద్యాలయములలో నిట్టి చరిత్రలను ఆచార్యు లుపన్యసించకున్నచో విద్యార్థులు వల్లించకున్నచో, గ్రంథకర్తలు వ్రాసినప్రయోజనము లేదు. ఆంధ్రవిశ్వవిద్యాలయ వైస్ఛాన్సలరు సర్ రాధాకృష్ణన్ గారు ఒక చక్కనిపీఠిక వ్రాసినారు. వెల రు 3 0 లు. ఈచరిత్ర ప్రస్తుత విద్యాలయలోకమున బహుళాదరమును బడయునుగాక!

**మెఱుపులు**

గ్రంథకర్త శ్రీ కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారు ఇన్నిసుపేట, రాజమహేంద్రవరము. శారదా పబ్లిషింగు హోమువారి ప్రథమప్రచురణము. 96 పుటలు. పది 'మెఱుపు'లాంటి కథలు. అకలంకమై అమాయికమైన శృంగారము, స్వచ్ఛమై సుస్థిరమైన శీలము, ఇందలి పెక్కుకథలనాయికల లక్షణములు. చిన్నమ్మిశీలము అనేకులు పెద్దలకు సిగ్గుకూర్చును. ఛాయప్రేమకు రాజకీయములలో తావుచిక్కదు. ప్రాణములకైన తెగించుకొని మీరాబాయి తనప్రియుని వలగొన్నది. ఒకకథలో పెండ్లికుందర కన్య తావలచిన వరునితో లేచిపోయి అయిష్టసంబంధము తప్పించుకొనవలసినంత సాహసమూనవలసి వచ్చినది. విధవావివాహదీక్షాగురులకు గౌరీపతి ఆదర్శపురుషుడు. ఈ గౌరిమార్గమునే ఓబయ్యభార్య వహించుట అచ్చెరువు

కాదు. శ్యామాలంగాతముల ప్రేమసంయాటలకుకూడ పాఠకులు సైఁ యనకతీరదు. సాధారణసంఘటనములు. శైలి సులభతరము. కథలు బహుజనామోదమును బడయఁగలవు.

**పూలమాల** క్రౌను సైజు 41 పుటలు. వెల రు. 0-4-0 చిన్న ఖండకావ్యసంపుటము. గ్రంథకర్త శ్రీగూడ శంకరశర్మగారు, భాషాసదనము ఆదిపూడి, గుంటూరు జిల్లా. తెలుగువాణి, పూలమాల, కోకిల, నోము, రాధిక, పసివాడు, స్మృతి, ఓమరుఖయ్యామ్, రంభ, రైతుబిడ్డ, మొదలగు ఏయంశమును పట్టిన ఆయంశముమీద వీరికలము చరచర పరుగెత్తుచుండును. కవిగారి లేతప్రయత్నములో 'దొసగుల' లెన్నుట విమర్శకుల పనిగాదు; 'తీయ తీయములుగల తెలుగుందనముతో నలరారు'చున్నదని శ్రీ తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారి యభిప్రాయ మెంతయు ననువైనది.

**హస్తనిర్మాణము చేయి పుట్టుమచ్చలు** తమ భావిజీవితపరిణామమును తెలుసుకొనఁగోరని సవరించుకొనఁగోరని మానవు లుండరు. ఈ రెండువిషయములను తెలిపెడి జ్యోతిషసాముద్రికాది శాస్త్రములను భారతీయప్రాచీన ఋషివర్యులు వ్రాయకపోలేదు. పాశ్చాత్యవాసనలవల్ల నేడు వానిపై పెక్కుఱకు విశ్వాసములు కుదరకున్నవి. అయినను అసలు సమాజములో అట్లు కుదరనివారిసంఖ్య అత్యల్పము. సుబోధకముగ, విశ్వాసజనకముగ, ఋజుపూర్వకముగ మధురముగ తెలుపగల వక్తలు లేఖకులే కఱవైనారు. పైగా వారిస్థానము నీమధ్యన కొందఱు బూటకు లాక్రమించిరి. బూటకు లొనరించిన అపచారముల చెఱిపి ఇట్టిగ్రంథములను శ్రీపూడి పెద్ది వెంకట్రావుగారు (పామిస్టు – ఆకల్టిస్టు, విజయనగరం) వ్రాసి ప్రకటించుచున్నారు. పై మూడుగ్రంథములును తొలికుసుమములు. ఈపుస్తకములు పట్టినవారు చివరంట చదువనిదే విడువజాలరు. చదివినవారి కవి నచ్చక మానవు. నచ్చినవారికి విశ్వాసము కుదరకమానదు. కుదిరినవారికీవిద్యలు అభ్యాసము కాకమానవు. అభ్యాసకుల విజ్ఞానమును అనుభవముగూడ విస్తరించకనవు. ఈ మూడుపాత్తముల వెల రు 3 లు. ఒకేతూరి కొనువారికి పోస్టేజీతో సహా రు 1-8-0 లకే పంపఁబడును.

**మారకపు రేటు** డెమ్మీ సైజు 13 పుటలు. వెల ఆరుపైసలు. గ్రంథకర్త తమ్మిరాజు సూర్యనారాయణరావుగారు(బి. ఎ. ఆనర్సు). ప్రకాశకులు ప్రజాసేవ గ్రంథమాల, అనకాపల్లి, విశాఖపట్టణముజిల్లా. ఇది ప్రజలు 'తెలుసుకొనవలసిన ముఖ్యవిషయము', సులభశైలి. యెల్లరకు విశదమగురీతి సోదాహరణముగ వ్యావహారికశైలిలో ఇది చర్చించబడినది. మాసమున కొక గ్రంథమును ప్రకటించుదురు — ఎల్లరు నభిమానించదగును.

**నాబడిచదువు** డెమ్మీ సైజు 6 పుటలు. 43 గీతములు. శ్రీ ఆంధ్రరాష్ట్రప్రాథమిక విద్యాసంఘమువారి ప్రచురణము. గ్రంథకర్త నందివాడ వెంకటరత్నముగారు. పశ్చిమగోదావరిజిల్లా తాళ్లపూడిపోష్టు; వేగేశ్వరము. ఎవ్వరో ప్రాథమికపాఠశాల బ్రాహ్మణోపాధ్యాయుని అనాదరణవలన ఇతని విద్యాభివృద్ధి అణికట్టబడిన చరిత్ర. అయినను చెళ్లపిళ్ల వెంకటకవి, కామేశ్వరరావుగార్ల దయవలన వీరి పాండిత్యకవిత్వములు వర్ధిల్లినవి కనుక వీరి బ్రాహ్మణద్వేషము చచ్చి బ్రాహ్మణాభిమానము హెచ్చినదని గ్రంథములన తెలియనగును. ఇట్టి కవిగారు సృష్టికరణ కులమునకు మేలుబంతియనుటకు సందేహములేదు.

**మేఘసందేశము** డెమ్మీ సైజు 14 పుటలు. వెల 0-2-0 కాళిదాను పూర్వమేఘమున కనువాదము. గ్రంథకర్త తాడూరు లక్ష్మీనరసింహరాయ పండితుడు,

రాజమహేంద్రవరము. కాళిదాస కావ్యామృతపానులు స్వభాషానువాదనోత్సాహము నాపుకొనజాలరు. అందునను అనర్గళ సహజ కవిత్వధారావిలాసులగు కవిగారి కట్టి యుత్సాహము పొడముట సహజము. సాధారణానువాదములవలెసంస్కృతపదజటిలముకాక తేటతెనుగుతో నీటయి సంస్కృతకావ్యము చదువలేనివారికిఁగూడ అందలి యమృతమును గ్రోల ననువగుచున్నది. ఉత్తరమేఘమునుగూడ కవిగారు కృతి పింతురుగాక!

**బోధనాపద్ధతులు** స్నేహలతా కవితాసంఘము వారి 45 వ పుష్పము. ఆంధ్ర రాష్ట్రప్రాథమిక విద్యాసంఘమువారివల్ల ప్రకటితము. తాళ్లపూడిపోష్టు, వేగేశ్వరము సంఘమువారి కార్యస్థానము. వెల రు 0-2-0 గ్రంథకర్తలు వాజపేయాజుల రామసుబ్బారాయుడు, గోనుకొండ లక్ష్మీనారాయణగార్లు, కొల్లాపురం, జటప్రోలు సంస్థానము. డెమ్మీసైజు 19 పుటలు. ఉపాధ్యాయలక్షణములు, దండనాపద్ధతులు, నల్లబల్లచిత్రముల ఉపయోగములు, దండనానిరసనము, హెచ్చరిక ప్రాశస్త్యము, ఉత్సాహోద్దీపనము, ఆరోగ్యరక్షణము, ఆటలప్రోత్సాహము, స్కౌటుశిక్షణము, గ్రంథాలయప్రయోజనము, పాఠములుసిద్ధముచేసుకొనుట, మధ్యమధ్య ప్రశ్నలు, తిట్టుటలు మానుట మొదలైన ఆధునికవిధానములన్నిటిని,ఇంతనూటిగ సూక్ష్మముగ పుష్కలముగ బోధించుగ్రంథ మాంధ్రభాషలో అరుదు. ప్రతిప్రాథమికపాఠశాలోపాధ్యాయుడును తప్పక గలుపఁదగినది.

**భీమ ప్రతిజ్ఞ** క్రౌనుసైజు 100 పుటలు వెల రు. 0-10-0 గ్రంథకర్త శ్రీయుత బుర్రా వెంకటనాంచారయ్యగారు ఎం. ఎ. ప్రకాశకులు బి. బికారి శింగు ఆంధ్రబుక్కుడిపో గుంటూరు. రౌద్రరసప్రధానమగు భట్టనారాయణుని వేణీసంహార నాటకమునకు నవలరూపమగు ననువాదము. పదగుంభనమునందు, పాత్రపోషణమునందు, కథా కథనమునందు, ఆవేశ వివశత్వమునందు, అనర్గళధారయందు, దేనియందును అసలు మాతృకకు తీసిపోక పాఠకకోటికి పౌరుష పరాక్రమములు బురికొల్పు అసాధారణ రచనము. ఆంధ్రీకరణమువలన, గద్యావలంబనమువలన, కథా కథనమువలన భట్టనారాయణుడు సాధారణాంధ్ర విద్యార్థికోటికి సులభసాధ్యు డగుచున్నాడు. సంస్కృత సమాసములయందు, జటిలధోరణియందు ఉద్రేక విజృంభణమునందు పౌరుష ప్రగల్భముల యందు ఈ గ్రంథము మాతృక కెందును దీసిపోదు. పాఠకులకు పౌరుషరసముతోఁబాటు భాషాప్రౌఢత్వమును గూడ సేవింపనొసగిన గ్రంథకర్త సంకల్పము కల్పము. పాఠ్యగ్రంథ నిర్ణయసంఘముల వారు దీనిని శిరసావహించి విద్యార్థుల ప్రజ్ఞాపౌరుషముల నినుమడింపఁ జేయుదురని విశ్వసించుచున్నాము.

**శ్రీపాగలీ మురళి** రాజమహేంద్రవరము శ్రీకుసుమ హరనాథతత్త్వ ప్రచారిణీ సభవారు (కంభంవారి సత్రంవీధి) ప్రకటించిన పెక్కు కీర్తనలుగల 26 పుటలు. వెల ఆరుపైసలు—హరనాథభక్తులకు పరమోపయుక్తము.

**విపంచి** క్రౌనుసైజు 72 పుటలు. వెల 4 అణాలు. గ్రంథకర్త శ్రీయుత బొడ్డుబాపిరాజుగారు, ఆదివారపుపేట, ఏలూరు. మున్నె విశ్వవిపంచి మనోహరగీతికాస్తోమము నాలపించుకొన్నది, మరల నీగీతమె మధుమారుతమునకులికి కోకిలగళాన మాఱుమ్రోగినవి అని కవిగారు మకుటగీతమున తెలిపినారు. ఇందు కవిత్వప్రథమ ప్రధానలక్షణము గోచరించుచున్నట్లున్నది. కవిత్వములో క్రొత్త భావములు సంస్కరణములు చేర్చి కవిత నుద్ధరించుచున్నామనుకొనువారు పెక్కురు గలరు. కాని కవిత్వభావ వస్తు ప్రపంచమున ప్రాతలు

లేవు క్రొత్తలులేవు. కవితా సామగ్రి నిత్యముండునదే. అట్టి సామగ్రిని సంస్కరించుచున్నా మనుకొనుట సౌందర్యమును శోభను శాశ్వతత్వమును సంస్కరింప బూనుకొనుట వంటిదే. కవిగారట్టి వంచక వేషములను వేనినిగాని వేయక యథార్థమును వచించి కవిత్వ లక్షణమును ప్రస్ఫుటించినందుకు వంద్యులు—విశ్వవిపంచిలోలేని గర్భితములుకాని నూతన గీతములు జగతిలో లేవు. యథాశక్తిగా మాత్రమే ప్రజలు వానిని వినగలుగుచున్నారు. వానిని తిరిగి పాడగల కవికోకిలములే చాలా అరుదుగానున్నవి. వారు పాడగలిగినను తమంతట తాము పలికి వారిగళముల మాటు మ్రోగినవే నిజమైన గీతములు కాని తక్కినవి తెచ్చికోలు మెచ్చికోలులు. ఇందలి చందమామ,ఉష, తటిన్నటి, చక్కనిచుక్క, మధుపిపాసి, తేటిబోటి, కాపు పడుచు, మూగనోము, ఇంద్రధనుస్సు మొదలగునవెల్లయు సనాతన కవీంద్రుల శాశ్వత సామగ్రియే. వారనుభవించి అనుభవించి కీర్తించి విడచుచున్న వే- వానికేకవిగాని క్రొత్తతళుకులనుగాని బెళుకులనుగాని చెక్కలేదు, ఇతనును చెక్కలేదనియే చెప్పవలెను. వారు వారిధోరణిలో పాడిరి. ఇతనిధోరణిలోనివి పాడబడినవి. ఈధోరణిలో క్రొత్తదనమును నున్నది, ఇవి పలికించుచును నున్నవి, ఈ సందర్భమున వీనిని 'క్రొత్త ప్రాతల మేలుకలయిక' యనవచ్చును. కోకిల గానమునకు పులకనివా రుండరు. క్రొత్తకవీశ్వరుల ధోరణులకు పులకరించనివారును నుందరు.

**గ్రామోద్ధారిణి**

అక్టోబరు 1 వ తేదిని యీ పత్రిక ప్రథమ సంపుటపు ప్రథమ సంచిక పెద్దాపురంనుండి బయలువెడలినది. సంపాదకుడు వడ్డి శ్రీరామమూర్తి గారు. డబుల్ క్రౌను 24 పుటల పక్షపత్రిక-సంవత్సర చందా రు 2—0—0 లు విడిప్రతి 1 అణా. గ్రామజీవనము, రైతులకు ప్రవృత్తులు, సాత్వికాహారములేక అహింస, ప్రాచీనగ్రామము, సహకార సంఘములు, గ్రామపారిశుద్ధ్యము, వ్యవసాయము, ప్రభుత్వ ప్రయత్నము మొదలగు విషయములనుగూర్చి బహునిపుణులచే వ్యాసములు వ్రాయబడినవి. శైలి సులభము. ఇట్టిపత్రిక ప్రతిగ్రామీణునకును అత్యంతావశ్యకము. గ్రామములలోని వివిధకులముల ఐకమత్యమున కాదరువుగ ప్రతివ్యాసమును నున్నది. ఇట్టి ఐకమత్యమును చెఱుపగోరి చెడిపోయిన యొకని కథ, మంచిపద్యములునుగూడ గలవు. ఇంత చౌకరైన పక్షపత్రిక లేదు. ముద్దులమూట సంపాదకు లిట్టి మురిపెములమూట నిప్పుడు ప్రకటించుచున్నారు. ఇతని యత్నము సఫలీకృత మగునుగాక !

**స్టీము ఇంజను డ్రైవింగు**

క్రౌనుసైజు 120 పుటలు గ్రంథకర్త కోట యజ్ఞరామశర్మగారు చింతగుంటపాలెం, మచిలీపట్టణము. లోహములు, బాయిలర్లు, పని మరమత్తులు, ఇంజనులు, పంపులు, డ్రైవర్లు గమనించవలసినవిషయములు మొదలగునవి యెన్నియో ప్రశ్నోత్తరరూపమున నున్నవి. సాంకేతిపదములెల్ల ఆయా శాఖలలో పనిచేయువారికి సుపరిచితములగు నాంగ్లములు — శైలిసులభము. ప్రతిపనివానికిని నత్యావశ్యకము. వెల రు 2-0-0 లు.

**ఆయిలు ఇంజను డ్రైవింగు**

క్రౌనుసైజు 92 పుటలు వెల 2-0-0 లు. ఇదియు పై గ్రంథకర్త వ్రాసినది. నూనెల రకములు, నూనెయింజనుల రకములు, అవి పనిచేయురీతులు, చేయించునేర్పు, వానిని బాగుపరచుట, బిగించుట మొదలగువిషయములు సచిత్రముగ నిందు వివరింపఁబడినవి. ప్రతిపనివానియొద్దను నిట్టి పుస్తకముండవలెను. పనిరానివాళ్లుకూడ ఇది చూచి నేర్వవచ్చును.

**ఉన్నతమహిళా పాఠశాల వార్షికసంచిక**

అనంతపురం గవర్నమెంటు సెకెండరీ అండు ట్రయినింగు స్కూలువారి సంచిక. ఇందు సంక్షిప్తముగ ఆంగ్లమున ఆంధ్రమున సాంవత్సరికచరిత్ర, బాలికలవ్యాసములు కలవు. ఆంగ్లవ్యాసములు 16 పుటలు. స్కూలుఫైనలు అయిదవఫారం విద్యార్థినులు వ్రాసినవి. సాధారణవిషయములు చక్కని భావములు. ఆంధ్రవ్యాసములు 40 పుటలు. గద్యపద్యవ్యాసములు నలభైమించియున్నవి. మూడవఫారము మొదలు ఆరవఫారమువరకు విద్యార్థినులు వ్రాసినవి. చారిత్రకసాంఘిక, సాహిత్య, రాజకీయాదు లనేక విషయములు. రెండుమూడు చిన్ననాటికలును నున్నవి. ఇట్టి సంచికలవలన బాలికల రచనానైపుణ్యము వర్ధిల్లుచున్నది. ఇతర బాలికాపాఠశాలాధికారు లిట్టి యుదాహరణము ననుసరింతురుగాక!

**మహామేధావులు**

క్రౌనుసైజు 122 పుటలు. వెల రు 1-0-0. గ్రంథకర్త శ్రీయుత గొబ్బూరు వెంకటానంద రాఘవ రావుగారు, ఎలమంచిలి, విశాఖపట్టణముజిల్లా. ప్రకాశకులు ఆంధ్రభావలీగ్రంథమాలికవారు. ఆర్కిమిడీసునాటినుండి సర్ హంఫ్రీడేవీనాటివరకుగల సుప్రసిద్ధ శాస్త్రపరిశోధకులచరిత్ర లిందు విస్పష్టసులభశైలిని వ్రాయఁబడెను. వీరిలో కొందరు జ్యోతిషశాస్త్రధురీణులు, కొందరు ప్రకృతిశాస్త్రపండితులు, మరికొందరు రసాయనశాస్త్రవేత్తలు. గెలీలియో, న్యూటను, కోపర్నికసు మొదలగువారి చరిత్రలును గలవు. ఈ గ్రంథపాఠకులకు శాస్త్రపరిశోధనాశక్తి యెట్టి తన్మయత్వమునుగూర్చునో తెలియగలదు. పరిశోధకపరిశోధనలయందు భక్తియును హెచ్చును. భౌతికశాస్త్రజ్ఞానమును పెంపొందును. ముఖ్యముగ చిన్నతరగతి బాలుర కిట్టి గ్రంథములు నిర్ణయించి మంచి అభిరుచులను మప్పకతప్పదు.

**ఆంధ్రదేశము**

ఈ గ్రంథము మొదటిభాగమును లోగడ విమర్శించితిమి. తరువాయి శుభాంతము. ప్రసాదరావు ఉద్యోగ నిర్మూలనము తాలూకాబోర్డు ప్రెసిడెంటుషిప్పు అందులో దివాలా పలాయనము యోగితనము; రామారావు సత్యాగ్రహజైలు ప్రవేశము విడుదల; సూర్యనారాయణసావిత్రుల రాజారావుభారతుల వివాహములు రామారావు మద్రాసులో "ఆంధ్రదేశము" పత్రికా సంపాదకత్వము, "దివ్యామృతము" మందులో తెగలాభములు, భారతి కొక మాసపత్రికాసంపాదకత్వము, రామరావు కక్కడపడితే అక్కడ ప్రజాసేవాసభాధ్యక్షపీఠోపన్యాసములు, సుపుత్రజననము మొదలైన ఆధునికాంధ్రయువకుల స్వర్ణస్వప్నములెల్ల యిందు తొలుకాడుచున్నవి, రెండుభాగములును చేరి 250 పుటలు. వెల రూ. 1—0—0 వలయువారు కర్లపాలెం కృష్ణారావుగారికి చీరాల వ్రాసుకొనవలెను.

# 'గృహలక్ష్మి' చందా

గృహలక్ష్మి సంవత్సరపు చందా రు. 4 లనుండి రు 3 లకు తగ్గించబడినట్లు ఆంధ్రదినపత్రికలో ప్రకటించియేయున్నాము. ఈ ఆర్థికమాంద్యపుదుస్థితిలో పేదసాదలగు పాఠకుల కెంతభారము తగ్గినను తగ్గినదేయను భావమొండే దీనికి కారణము. మఱియును పెక్కులు క్రొత్తగా చందాదారులుగా చేరి గృహలక్ష్మి పఠన భాగ్యమునందవలెనను వాంఛ రెండవకారణము. మాద్వితీయవాంఛను పురస్కరించుకొని క్రొత్తగా పెక్కులు చందాదారులుగాచేరి మా కీ పత్రికానిర్వహణకార్యమునందితోధిక ప్రోత్సాహము నొసగుదురుగాక యని పాఠకులను గోరుచున్నాము.

# అతనికేమి గావలయునో
# ఆమెకు దెలియును

ఆమె యాతనికొఱకు గాచుకొని యుండినది; ఆతడు వీధికొనయం దగుపడగనే పాత్రపొయ్యెక్కినది; ఆతడు తలుపు దెరచులోపలనే నీరు మరుగుచున్నది. కొన్ని నిమిషములలోనే ఆతనికొఱకు కొంత స్వదేశీ తేనీటిపానీయము సిద్ధమైనది.

ఈ కొంచమాలోచించి చేసినపని వారి దాంపత్య జీవితమున కెంత భేదము గల్గించినది? ఇపుడు అలసిపోయి ఇంటికివచ్చిన తరువాత నుండెడు విసుగుగాని కోపముగాని లేదు. ఒక గిన్నెడు తేనీరు అతని మానసిక బాధను పోగొట్టి స్వగృహమున సంతోషవంతునిగ జేయును. దీనివలన ఖర్చెంతమాత్రమును లేదు. ప్రపంచమున చాల చౌకయైనది. అతనికి గావలసినదిగూడ నదియే!

నీభర్త కీదినమునుండియే దయారసమనదగిన నీపానీయము నిమ్ము. దానికతడమితానందమొందును.

## తేనీరును తయారు జేయుట

ఉడుకునీటితో గడిగిన మంటిపాత్రలో మనిషికి ఒక చమ్చావంతున తేయాకును వేసి, మరిగిన ఉడుకునీటి నందులో పోయుము. ఐదు నిమిషములుండనిచ్చి, పాలు చక్కెర జేర్చి త్రాగుము.



## భారతీయ తేనీరాక్కులే కుటుంబ పానీయము.

I K-29

# సంపాదకీయములు

## అఖిలభారత కాంగ్రెసు సంఘము

మదరాసులో అక్టోబరు 14 వ తేదినుండి 19-వ తేది వరకు అఖిల భారత కాంగ్రెసు నాయకుల రాకలు, స్వాగతములు, ఊరేగింపులు, సభ సమావేశములు, సంఘ విషయముల చర్చలు, కాంగ్రెసు నాయకుల ఉపన్యాసములు, ప్రజల ఉత్సాహములు మొదలగు ఉత్సవములు చెలరేగినవి. విశ్వదాతగారి శ్రీ బాగు ఇసుక వేసిన నేలరాలనట్టి జనసమ్మర్దములో క్రిక్కిరిసెను. అభ్యాగత సత్కార భారమును వహించుటయన్న శ్రీ నాగేశ్వరరావుపంతులుగారి కత్యంతప్రీతి. వారి యంగణమున నాపుణ్యదినములలో 'పావనస్నానవిధాన్నపానముల సంతసమం'దినవారిసంఖ్య అనల్పము. విషయ సంఘసభ్యులు భుక్తాయాసముచే కదలనో పరనియో పంతులుగారు చర్చలనెల్ల ఆదివ్య భవనముననే సాగింపఁజేసిరి.

## ప్రెసిడెంటు పదవి

ఈ సమావేశ మనేక సందర్భములలో ప్రధానమైనది. దేశ మనేక సమస్యలతో నుట్టూతలూగుచున్నది. ఎవ్వరును నే నిర్ణయమునకును రాలేకున్నారు. ముందుచూచిన నూయి, వెనుకచూచిన గోయి. ఒకపక్ష మింకొకపక్షముతో అతి కష్టము మీద మాత్రమే సమరసపొందగలుగుచున్నది. అభిప్రాయభేదము లతి తీవ్రములైనవి. యోగిపుంగవులుగూడ వీనిని సర్దలేకున్నారు. ఇట్టి కంటకభూయిష్టసమయమున రాజేంద్రప్రసాదుగారు ఒకసంవత్సర మధ్యక్షులుగా నుండి, యెవ్వరికిని విరోధికాక, జగన్మిత్రుడై యెట్లో నెగ్గుకొనివచ్చి, తన నియమిత సంవత్సరాంతమున ప్రవేశించి అనతికాలములో సుఖింపబోవుచున్నాడని మనమతనిని అభినందింపవచ్చును.

## రాబోవు అధ్యక్షుని భారము

ఈకంటకకిరీటము వచ్చేసంవత్సర మెవ్వరిపైఁబడునాయనునది కఠినప్రశ్న. ఆంధ్రులు తమకీగౌరవము దక్కవలెనని శ్రీపట్టాభిసీతారామయ్యగారి పేరును సూచించుచున్నారు. నిజముగ నిట్టి గౌరవము శ్రీ పట్టాభిగారికిని మనకునుగూడ నత్యంతకీర్తిదాయకమైన దనుటకు సందేహములేదు. కాని కాంగ్రెసు అధ్యక్షపదవి కేవలము గౌరవప్రదమై, అలంకార కిరీటమాత్రమై రాణించుదినము లరిగినవి. కిరీటమాంధాతకు నిద్రపట్టదని ఒక కవీంద్రుడు వ్రాసినాడు. మనకాంగ్రెసు అధ్యక్ష అకిరీటమాంధాతలకు కూడ అట్టి విషమావస్థయే వచ్చుచున్నది. దేశశ్రేయస్కరమైన దేమార్గము, ఏపక్షముసూచించు

నది, దేనిని స్వీకరించిన అన్యపక్షవాదముల కేమి సమాధానములు చెప్పుట, వారా సమాధానమును స్వీకరింతురా పైఁ బడబోవుదురా, అప్పుడు నిరంకుశత్వ మూనుటా సమీకరణ మొనర్చుటా మొదలైన సమస్యలెన్నియో నేటి అధ్యక్షుల నెదురుకొనుచున్నవి. బంగారు కిరీటమైనన్నాళ్లు పై రాష్ట్రములవారు పెట్టుకొని విఱ్ఱవీగిరి. కంటకభరితమగుటచేత ఆ రాష్ట్రములలో దానిని పెట్టుకొనగలవారు లేక విదేశములలోనున్న ఏ జవహరులాలు సుభాసు చంద్రబోసుల పేరులనో సూచించుచున్నారు. రాజగోపాలాచారిగారి కింకా శుభశకునము లెదురుకాలేదు. సంయుక్త పరగణాలవారు శ్రీ పట్టాభిగారిపేరును సూచించినారు. ఇతరరాష్ట్రముల వారును సూచించక పోరు. రాబోవుకాంగ్రెసు ప్రెసిడెంటు పెద్ద వక్త, దీర్ఘోపన్యాసలేఖకుడు, పుష్టవిగ్రహుడుగా నున్నంతన చాలదు. అతడు సహస్రాక్షుడై యుండవలెను. సర్వ మతపక్ష తత్వముల నెఱుఁగగల సూక్ష్మగ్రాహియై యుండవలెను. సవ్యవాదములకు సమాధానముచెప్పి యొప్పించఁగల మహా పండితుడై యుండవలెను. వితండవాదములకు వెటకారపు జవాబులు చెప్పఁగల వివేకియై యుండవలెను. నిముషమునకు వేయుమాటలైన నాడగల విషయ విదగ్ధుడై యుండవలెను. చర్చలను నడిపించు చమత్కృతులలో నందెవేసిన చేయియై యుండవలెను. వేయిదినములు మాటాడినను వినువారు విసువునందక వినసుంకించుచుండు వక్తృత్వసుందరుడై యుండవలెను. అన్ని రాష్ట్రములలో నాబాలగోపాల మెఱింగిన పరిచిత నామధేయుడై యుండవలెను. ఏబదియేండ్ల కాంగ్రెసు చరితములను నెడమచేతి గోళ్లలో నిరీకించుకొనిన సూక్ష్మబుద్ధియై యుండవలెను. అకళంకరాజకీయ వర్తనుడై, ఆర్య ఆధ్యాత్మిక లక్షణ లక్షితుడై, అనంతప్రజాసేవాపరాయణుడై, అధికారశిక్షాస్మృతి నిర్లక్ష్యపరిభూషితుడై రాణించఁగల ధీరోదాత్తుడై యుండవలెను. అఖిల భరతఖండమున ప్రస్తుతము అట్టివారెవరనిన, ముందు పట్టాభిగారిపేరు చెప్పి తరువాత పెక్కుటి పేరులు చెప్పవచ్చుననుట అతిశయోక్తి కాదు. అఖిల భరతఖండ రాష్ట్రములును 'అతనిని గౌరవించుటకుగాను' అను నెపము నటులుండనిచ్చి, భరతఖండభాగ్యమను నావను పైనిజూపిన కల్లోలములలో కొట్టుకొనకుండ దక్షతతో తప్పించి యొడ్డుచేర్చగల చుక్కానియగు నతనిని పేర్కొనుటవల్ల భరతఖండమున కత్యంతశీఘ్రావశ్యకమైన యొకసేవ నొనరించుచున్నారనవలెను. వివేకవంతమగు భరతఖండ మీసమయమున నతడొనరింపఁగల సేవలనెల్లఁ జూఱగొనక, చీలికయ్యములలో దొర్లి చేవగోల్పోవదని నమ్మవచ్చును.

### వాయిదా యేల?

ఇది వచ్చేసంవత్సరము మాట. ఈ సంవత్సర మీపురమున జరిగిన సమావేశ

ములో నెన్నో సమస్యలు అంత్య పరిష్కార ముగునని అనేకపక్షములవారు తలచిరి. కాని కాంగ్రెసుసభకు అంత్య పరిష్కారము నకు వచ్చుటకు శక్తిచాలక పోయినది. కాల మానము చూచుకొని పరిష్కరింతుమని చెప్పి సర్వమును లక్నో కాంగ్రెస్సుకు వాయిదావేసినారు. అందు ప్రధానమైనది మంత్రిత్వస్వీకరణ సమస్య. ఇందు వాయిదా వేయవలసినంత కష్టమేమియునున్నట్లు తోచదు. రాష్ట్రములలో కాంగ్రెసువారికి మెజారిటీ వచ్చినప్పుడే ఈవిషయము రా వచ్చును. లేనిచో మనకు మంత్రిత్వముల బాధేలేదు. మదరాసులో కాంగ్రెసువారికి వచ్చుచున్న వోటులంత అధికసంఖ్య, యితర రాష్ట్రములలో అనగా బెంగాలు పంజాబు మధ్యరాష్ట్రములలో వచ్చునో రాదోయని నాయకులు భయపడుచున్నారు. మెజారిటీ వచ్చునప్పుడు గవర్నరు ఆపార్టీనాయకునిపిలచి మంత్రుల నేర్పాటుచేయవలెనని కోరును. అతను నిరాకరించినచో వారి ప్రతిపక్షిపార్టీ నాయకుని కాభారమువిడచిపెట్టును. ఇత యును కష్టపడి మెజారిటీతెచ్చుకొని మంత్రిత్వ బాధ్యతవహించక, పూర్వపు స్వరాజపార్టీవలె ఇప్పటి పార్లమెంటరీపార్టీయు, వేరొక అనా మకవర్గమున కాభారము నొప్పచెప్పి తాము వెనుక తాళమువేయుట సమంజసమా, సవ్య మైన ప్రజాహిత సేవామార్గమాయనునిర్ణయ మునకు వాయిదాయేల? సవ్యమని తోచిన చాటరాదా, అపసవ్యమనితోచిన నిషేధించ రాదా? 'లక్నోకాంగ్రెస్సుకు వాయిదా వేయుట కీ సభాసమావేశమేల, రైలుకంపె నీలకి లాభములకా?' అనిన శ్రీ తెన్నేటి విశ్వనాథముగారిప్రశ్నకు సమాధానములేదు.

బొంబాయికాంగ్రెసులో తెల్లకాగిత తిరస్కరణతీర్మానము ప్యాసయినదిగదా, అది ఉండగా ఈ స్వీకరణమెట్లు అని పెద్ద బ్రహ్మాసందేహము. ఈ సందేహములకు సమాధానము కలుగునట్లు అనేకపు మినహా యింపు టర్థములతోనే గదా అది ప్యాసు కాబడినది. తెల్లకాగితమును తిరస్కరింతుమని నాము. అది అప్పుడే చట్టమయినది. చట్ట మునుగూడ తిరస్కరించవలెనా? ఇదియొక సమాధానము! తిరస్కరణమునకర్థము చట్ట సభలను బ్రక్కలుచేయుట, లేక పనులు కాకుండా అడ్డుపెట్టుచుండుటయా? అట్లు కాదని వెంటనే సర్దారువల్లభాయిపటేలుగారు చెప్పినారు. ఇది రెండవ సమాధానము. అయిన తిరస్కరణ శబ్దమున కర్థమేమి! 'తిరస్కరించుచున్నా' మని ఒకే తీర్మాన ము అసెంబ్లీలో ప్యాసుచేయుటమాత్ర మన్నట్లు రాజగోపాలాచారిగారను లిబర ల్సునుగూడ ఏకీభవించి గ్రహించినారు! ఇది మూడవ సమాధానము. అట్టి తీర్మాన మైన నెగ్గినదా? అదియునులేదు. చట్టము పనిచేయదా? ఎట్లో యొకరీతిని పనిసాగక మానదు. అయినను 'జోహుకుములవలె కాక, మనస్ఫూర్తిగకాక, ఒక కబర్దారు (Protest) క్రింద మాకిష్టములేకున్నను ఈ లోపములు కలవని పనిచేసి చూపించుటకే వచ్చినా'మని ఆతిరస్కరణశబ్దమున కర్థము గా మనము గ్రహింపవలెను. లేకున్న కొన్నిలు

ప్రవేశమునకుగాని, పార్లమెంటరీబోర్డుస్థాప
నకుగాని, తద్విధానానుక్రమణమునకు గాని
తావులేదు.

పునస్సత్యాగ్రహాచరణశక్తి గాంధీజీకి
దేశీయులకు లభించువరకుచేయుచుండు నెట్టి
కౌన్సిలుచర్యలకు గాని సంస్కరణతిరస్క
రణమను నామమిడుట సాహసము.
మనకు కావలసినది 'మన మెక్కడ
నున్నాము ఏమిచేయవలెను' అను విషయ
ములలో సత్యైకదృష్టితోసలుపబడుచర్యలు.
ఇందువలననే మహాత్ముడు కౌన్సిలు కార్య
క్రమము కాంగ్రెసు ధర్మమన్నాడు. దేశము
ప్రబలవిజ్ఞానముపొంది, ప్రచండసాహసము
సలిపి, అలసి విశ్రామమునిమిత్తము పార్ల
మెంటరీ త్రోవనుత్రొక్కినది. బొంబాయిలో
మనమె అట్టి మార్గమున కనుజ్ఞయిచ్చినాము.
ఇప్పుడు ఆ మార్గమునకు విరుద్ధమైన పదవీ
తిరస్కరణమను అపసవ్యమార్గమును
త్రొక్కకూడదని నిశ్చయించుటకు వాయిదా
కూడా యేల? అయినను మునపటికంటె
నయము. కాంగ్రెసుసభ్యులు మంత్రిత్వ
స్వీకరణానుకూల ప్రచారము చేయరాదని
వార్థాసభ నిషేధించెను. సత్యమూర్త్యా
దులచర్యలవలన అట్టి తీర్మానము వలన
ప్రయోజనముండదని యెఱింగియో, ఆ ఆంక్ష
తొలగించినారు. లక్నో కాంగ్రెసులో మఱి
వాయిదావేయుటకు వీలుండదు. ఏదో
తీర్మానమునకు రావలెను.

ఆ తీర్మానమును బట్టి కౌన్సిళ్లకు
కాంగ్రెసువా రెక్కువగా నెన్నుకొన
బడుదురా తక్కువగా నెన్నుకొనబడుదురా
యను ప్రశ్న నిశ్చయముకాగలదు. ఆదర్శ
ములు చూపి వోటులు జూఱగొనుదినములు
వెళ్ళినవి. అనుకూల కార్యక్రమ ప్రణాళికలు
బఱపి అవి సాధించవలసిన దినములు వచ్చి
నవి. న్యాయపక్షమువారు సర్వమును మీకు
సాధింతుమని శుష్కవాగ్దానములు చేయు
చున్నారు. వారు చేయజాలరని యెఱింగిన
వారుకూడ, వారిస్థానమును గుర్తించియైనను
ఓటులు వారిపై కుఱిపించకమానరు.
కాంగ్రెసువారు అట్టి బూటకపు టప్పాలు
కొట్టనక్కరలేదు. 'సంస్కరణములు వ్యర్థము
లని మేము నమ్ముచున్నాము గనుక, మేమధిక
సంఖ్యాకులుగ నెన్నుకొనబడినను, మంత్రుల
నేర్పరచు భారమును దాల్చుమని గవర్నరు
మమ్ములను ఆహ్వానించినప్పుడు మేము స్వీక
రింపక, ఎదటికక్షివా రల్పసంఖ్యాకులైనను
వారికే విడచెదము. సభలవలన మంత్రిత్వ
స్వీకరణమువలన గలిగే తుచ్ఛలాభములు
గోరువారు మీయిష్టము. అట్లుకాక మేము
సభలలో ప్రతిపక్షులమై ప్రసంగించుచుం
దుము. మాప్రసంగములే యెక్కువ ప్రయో
జనమైనవని మీరు నమ్ముచో మాకు మీ
వోటు లివ్వుడు' అని వోటర్లను ప్రార్థించినచో
మనగతి యెట్లున్న అట్లు కాగలదు. లక్నో
కాంగ్రెసు చేతులలో కాంగ్రెసు కాండిడే
టుల విజయావిజయసమస్యలు మూయబడి
యున్నవి. ప్రకాశముగారి ఉపన్యాసము
కాంగ్రెసు సభ్యులగుండెలలో నాటుకొనినచో
నయము. లేకున్న మఱి కొన్నియేండ్లు

కాంగ్రెసుపేర వ్యర్థోపన్యాసములును వ్యర్థ కాలక్షేపమును చేసుకొనుచు గౌరవ వినతి పత్రముల నందుచు సమాధానములిచ్చుచు యాత్రసాగించవచ్చును.

గాంధి మహాత్ముడిచ్చిన సత్యాగ్రహ శిక్షణము మనకు జైళ్ళకు వెళ్లుటకు, కష్టములు పడుటకు, పోట్లుతినుటకు, త్యాగములుచేయుటకు సరిపడినది. అయినను దానిని సాగించలేక విరమించితిమి. ఈ విరామకాలములో కావలసిన శిక్షణవేరు. గ్రామపరిశ్రమోద్ధరణము, రైతుసహాయవ్రతము, హరిజన మహాజనలాలనము, అన్యమతద్వేష విసర్జనము మొదలగు శాంతవంతములగు పనులు కావలసియున్నవి. అధిక సంఖ్యాకులమై అధికారస్థానమున నుండికూడ మనమీ మాత్రపు పైపనులను చట్టముద్వారా చేయజాలనియెడల ఆచట్టము పరువును పూర్తిగ తీసినవారగుదుము. లేక ప్రభుత్వానుకూల పక్షీయులకు విసర్జించిన, వారేదో మసిబూసిన మారేడుకాయచేసి ప్రజల గికురించి వారి ప్రతిపక్షులమగు మనయెడల ద్వేషము పెంచుచుండగలరు. కనుక లక్నో కాంగ్రెసు వారైనను కాస్తముందు జాగ్రతపడి మరీ తీర్మానించవలెనని కోరుచున్నాము.

ఐరోపా సమితి

గత అయిరోపాయుద్ధము ప్రపంచమున ముందెన్నడును యుద్ధములు రాకుండుటకై పోరాడబడినది. జాతిసమితి యుద్ధములు రాకుండ వ్యవహారములను ముందే పరిష్కరించుటకు, లేనియెడల చర్యతీసుకొనుటకు స్థాపించబడినది. మొత్తము పైని రెండిటి యుద్దేశము బలీయులు బలహీనులను మొత్తకుండ సంరక్షణ కలిగించుటకు. ఈ సంకల్పములు మంచివి కావని యెవ్వరనగలరు, అవి నిర్వచింపబడినవుడు నిర్వహింపబడక తప్పవని యెవ్వరూహించిరి?

అయితే, ప్రపంచములో ఒకరికి అట్టు ఒకరికి ముక్క ఉన్నన్నాళ్లు, మేము గొప్పవారము మీరునీచులుఅనుభావ మున్నన్నాళ్లు, నేనుయేలుతాను నీవుపడియుండుమను విదేశప్రభుత్వము లున్నన్నాళ్ళు పైసంకల్పములు దబ్బరలుగును, కాని సత్యములు కావు. అయిరోపారాజ్యముల ఊహలేమి? తమకు పెద్దఅట్టు నల్లవారికి ప్రాచ్యులకు రాలినపట్టు, తాము గొప్పవారు వీరు అనాగరీక మూఢులు, తాము పాలకులు వీరు ప్రజలుఅను క్షుద్రసామ్రాజ్యతత్వభావములు వారినిపట్టి పీడించుచున్నవి.

పూర్వము ఏథెన్సులో స్వరాజ్యముండెను. అయితే అందులోని గ్రీకుజాతివారిదే ఆస్వరాజ్యము; తక్కిన అన్యజాతి 'హెలెట్లులు' వారికంటెవేయిరెట్లు అధికజనులు వారిబానిసలే. ఇప్పుడును ప్రపంచమున డిమోక్రసీ లుండవలెను, స్వాతంత్ర్యముండవలెను. అయితే అది శ్వేతవర్ణులకుంటే చాలును; నల్లవారికవి యీయకుండానే వారు రక్షింతురు. ఈవిధముగా ఆంగ్లేయులు, ఫ్రెంచివారు, పోర్చుగీజులు ఇటలీవారు మొదలైన వారెందరో నల్లదేశములను రక్షించుచు

సామ్రాజ్యాధినాథులై యున్నారు. అబిస్సీనియాను వాతాపివలె దిగమ్రింగి దానినికూడ రక్షింతమని ఇటలీకోరిక. అట్లుచేస్తే తక్కిన తెల్లవారికి నష్టము. అబిసీనియామీద ఇటలీని పడనియ్యమన్నారు జాతిసమితివారు. ఇటలీ పడినది.

అబిస్సీనియాకు సాయముచేయుటయా మానుటయా? చేసినచో ఇటలీతో వైరము అయిరోపాకంతటికిని ప్రళయకారణమగును. చేయకున్నచో జాతిసమితి బండారమంతయు బయలుపడును. అందుకొఱకు ఆర్థిక శాంక్షనులని యేదో యీమధ్యన చాలా చర్చలు చేసి కాలహరణ మొనర్చినారు జాతిసమితివారు. దీనివలన ఇటలీకినష్టి లేదు అబిస్సీనియాకు పుష్టిలేదు. కనుక ఇటలీ అబిస్సీనియాను ఇచ్చవచ్చినటుల నొర్లుకొనుచుండవచ్చును. అబిస్సీనియాకు బలముంటే యెదుర్కొంటుంది, అదృష్టముంటే గెలుస్తుందేమో! కాని అయిరోపాలో అగ్గిలేకుంటే చాలునన్నది ఫ్రాన్సు. స్వతంత్రించి నేనురానన్నది బ్రిటను. ఇట్లు ఒకపెద్ద అపాయము తప్పినదనవచ్చును. ఇది జాతిసమితికి ఒకరీతి విజయచిహ్నమే.

అయిరోపాజాతి సమితివారు తమకెంత నిస్సహాయ మొనరించినను వీరునివలెపోర నిశ్చయించితిననుచున్నాడు అబిసీనియా చక్రవర్తి. బ్రిటను, ఫ్రాన్సు, ఇటలీలు సస్నేహముగ చేతులు కలుపుకొనుచున్నవి. నవంబరు మొదటివారములో అయిరోపా జాతిసమితి రాజ్యముల ప్రతినిధులు ఒక మహారహస్యసభ సలుపుదురట. దీనిఫలితము సమితిసభ్యులెల్లరు నేకీభవించి యెట్లయినను అబిస్సీనియాను ఒప్పించి ఇటలీకి కావలసిన కొన్ని సదుపాయములు చేయుమని బలవంతపెట్టుట అనుకొనిన తప్పా? వలసరాజ్యపిపాసిసామ్రాజ్యముల సమితియొక్క చర్యలన్యథా యెట్లుండగలవు? జాతిసమితి సభ్యురాలైనందుకు అబిస్సీనియాకు ఇట్టి మహోపకారము కలుగుట అబ్బురమా? చైనీయులును ఇట్టిలాభము నెంతో కొంత గ్రోలినవారే! భారతదేశమును సభ్యురాలే!

## ఉరమని పిడుగు

మహాత్ముని తత్వబోధనలు హిందూసంఘస్థుల చెవుల కింతో అంతో యెక్కినవి. అసలుకాలమే మారినది. నేనెక్కువ నీవు తక్కువఅను అహంభావమును ప్రజలోర్వరు. ఎవరి కన్యాయము జరిగినను ప్రభుత్వము లూరకొనవు. వెనుకబడినవారి మేలుకై పాటుపడుట ప్రభుత్వములవిధియని నిర్ణయింపఁబడిన సిద్ధాంతము. హరిజనులు యిబ్బందులు కేవలము సాంఘికములు మాత్రమే కావు. అంతకుమించిన ఆర్థికములున్నవి. రెండింటిని తీర్చుటకును అవతల ప్రభుత్వమువారు ఇవతల హరిజనసేవాసంఘములవారు బహు ప్రయత్నములు చేయుచున్నారు. కొన్ని తీరుచున్నవి. కొన్ని అడ్డుచున్నవి. వానినికూడ నెదుర్కొనుచున్నారు. ఇట్లు హిందూసంఘమెల్లయు ఈసమస్యా పరిష్కార విషయములో తటపటలు పడుచుండ డాక్టరు అంబేద్కరుగారు యివోల

నిమ్నజాతి సభలో 'హరిజను లన్యమత స్వీకరణ మొనరించవలెను హిందూమతమును వీడవలె'నని తీర్మానము ప్యాసు చేయించుట ఆశ్చర్యము. మాలవ్యాగారు చెప్పినట్లు ఉదారతరమగు హిందూమతతత్వములో కూడ హరిజనులయెడల సవర్ణులు కొన్ని అపచారములు చేయుచుండుట విచారనీయము. దానికి ప్రతీకారము అట్టి చర్యలకు ప్రతికూల బోధలొనరించి వారిని తప్పించుట మాత్రమే. కరవీర జగద్గురు శంకరాచార్యుల వారే ఇట్టి సనాతనబోధనలకు దిగుచున్నారు. కనుక హరిజనులు తమ వివేకమును గోల్పోరనుకొనవచ్చును.

**తిరువాన్కూరు మహిళాసభ తీర్మానములు**

అక్టోబరు 19 వ తేదిని త్రివేంద్రము నగరములో తిరువాన్కూరు మహిళాసభా సమావేశము ముగిసినది. మిస్. సాలీ కోయిలాఅను క్రైస్తవయువతి ఆసభ కగ్రాసనాధిపత్యము వహించెను. రాజభక్తి, నిర్బంధోచిత ప్రారంభవిద్య మొదలగు తీర్మానముల తరువాత 'సంతాన నిరోధ శిక్షాసంస్థల నెలకొల్పవలెనా కూడదా' యను విషయము చర్చించబడెను. గడచిన అఖలభారత మహిళాసభవారు అట్టి సంస్థలు నెలకొల్పవలెనని తీర్మానించిరి. అయినను మిస్ ఓవర్కిర్కు అనునామె అట్టి పద్ధతుల వలన గలుగు ప్రయోజనములను గూర్చి మనకు అతి కొంచెము మాత్రమే తెలియును గనుక బర్తుకంట్రోలు క్లినిక్కులు తెరచు సందర్భములను ప్రోత్సాహింపరాదు అని తీర్మానమును ప్రతిపాదించెను.

ఆమె వాదము లీ ప్రకారముగా నున్నవి. స్త్రీల వివాహవయస్సు ప్రస్తుతము ప్రకారము 15-20 యేండ్లనుండి 20-25 సంవత్సరములవరకు మార్చినయెడల కొంతజనసంఖ్య తగ్గును. అట్టి సంస్థలు పెట్టి జనసంఖ్యను బొత్తిగ తగ్గించినచో పరిశ్రామికులు తయారు చేయువస్తువులు కొనుక్కొనువా రుండరు గనుక వారికి నిరుద్యోగము సంభవించును. అట్టి పద్ధతు లెఱుగనిపేదలు వానిని ప్రయోగించి అపాయములపాలగుదురు. అది అవనీతిప్రదము. వానికై వ్యయముచేయు సొమ్మును మద్యపాననిషేధము ఉన్నత ఉత్తమ జీవనబోధనము మొదలగువానిపై వ్యయముచేసిన నెక్కువ ఫలప్రదమగును. శ్రీమతి కమలాబాయి వేలుపిళ్లగారు ఆ తీర్మానము నెదిరించి ప్రభుత్వమువారు మంచి శిశుశాలయములు స్థాపించి నిరోధించకున్నచో జనసంఖ్య పెచ్చుపెరుగక మానదని చెప్పిరి.

అఖలభారతమహిళాసభవారి తీర్మానమునకు ప్రతికూలముగా నిట్టి తీర్మానమును అసలు ప్రతిపాదింపవచ్చునా అని ఒకరు ప్రశ్నింపగా, అట్లు కూడునని ఒకవనితయు, ఆ సభాకార్యదర్శియే చర్చింప ననుజ్ఞయిచ్చెనని వేరొకవనితయు సమాధానములు చెప్పిరి. అసలు తీర్మానము నెగ్గెను.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావు. మదరాసు: ఆకుండి వెంకటశాస్త్రి.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు.
నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కం
జమ్‌షెడ్‌పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్ పైప్ కంపెనీ, [లిమిటెడ్
బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.
గుంటూరు: వెల్‌కం అండు కంపెని.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.
పిఠాపురం: ఎం. సూరరాజు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
ఏలూరు: డి. శ్రీహరిరావు.
తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్‌పేట.
ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్ వీధి.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.
విజయనగరం: ఆయపిళ్ల .సూర్యనారాయణరావు
నరసాపురం: వై. సత్యనారాయణగారు.
కొవ్వూరు: కె. సి. చెన్నకేశవయ్యర్. గూడూరు: సి. సి. సుబ్బయ్య, మర్చంట
కాకినాడ: నున్నా బాలకృష్ణరావు, న్యూస్‌బాయ్ అండు కో.
భీమవరం: వంగల అచ్యుత రామయ్య, మేనేజరు, నెహ్రూ ఖద్దర్ స్టోర్సు.
గుడివాడ: శ్రీ శివరామ అండు కో.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.
అమలాపురము: పి. అన్నాజిశర్మ. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)
పర్లాకిమిడి: రాచూరి రామనారాయణరావుగారు.
ఆముదాలవలస: సి. వి. నరసింగరావు
మచిలీపట్టణం: ఆచంట లక్ష్మీనరసింహం, సర్కిల్‌పేట.

హిగిన్‌బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

## వంధ్యాత్వము

మాతృత్వమునకై ప్రతిస్త్రీయును ఆసగొనును. ముద్దుబిడ్డను కరకమలములందిడుకొని ఆడించు తలంపు స్త్రీకిఎక్కువ. స్త్రీకి లభించవలసిన యీ మహోన్నత స్థానమునకు ఆటంకములను కల్పించు గర్భాశయ రోగములను దూరముచేయవలయును. ఋతుదోషములు లేనిక్రమజీవనమును గడుపవలెను. ఇందులకు లోధ్రసేవనమే రాజమార్గము.

## రక్తదారిద్ర్యము

దారిద్ర్యము యెట్టిదయినను కష్టాలకు కారణము. అందునను రక్తదారిద్ర్యము మరింతఘోరము. జీవితమే ఒకరోతగా ఉంటుంది.

దేహమందు రక్తమునకు — నిష్కళంకమగు ఉష్ణరక్తమునకు — దారిద్ర్యముండరాదు. దేహమునకు ఆరోగ్యము ప్రాణికి ఆనందము. జీవితముయెడ ఉత్సాహము రక్తదారిద్ర్యము లేనివారి సొమ్ము.

కాని, అందరును బలిష్టముగను దార్ఢ్యముగను జన్మింపరు. శరీరమందు రక్తదారిద్ర్యముండుటవల్ల కండరములు పెరుగక బలములేక నిరుత్సాహముగ నుండెదరు. కాని సుఖపడుట మానవుని జన్మహక్కు. అందుకు మార్గము వెతుకవలెను.

రక్తవృద్ధికి దారితీయునది — జవసత్వముల నిచ్చునది జీవితము నొకపాటగా చేయుగలది అమృత. అమృత సేవనమునకు నేడే పూనుకొనుడు.

## జ్వరము

మానవుని శక్తులను లాగివేసి జీవితమును కేవలము నిరర్థకము చేయునది జ్వరము. జ్వరము వచ్చెనా, మిమ్మది పీల్చిపిప్పి జేయుటకు యే మాత్రపు టవకాశము గాని యీయరాదు. వంట బెట్టినా దానిని వదలించుకొనుట బహుకష్టము. విరుగుడుకై వెతకులాడుటకిది అదను కాదు. జ్వరము వచ్చెనా, వెంటనే అర్కను ప్రయోగించుడు. జ్వరములను పారద్రోలుటలో అర్కవజ్రాయుధము.

## లోధ్ర

స్త్రీ రోగములకు

వజ్రాయుధము

## అమృత

కండరముల బిగికి

నరముల బలమునకు

## అర్క

సర్వ జ్వర

నివారిణి

# ఒరిజినల్ రంగూన్ డయమండ్స్

(Registered)
3524







తంతివిలాసం :
"ఒరిజినల్"
తిరుచినాపల్లి.

బ్రాంచి :
ఈపని చేయుస్థలము
రంగూన్.

ఒరిజినల్ రంగూన్ డయమండ్స్ అన్నినగలకును చాలా శ్రేష్ఠమైనవి. వివరములకు వ్రాయించితే కేటలాగు ఇనాం.

S. అరుణాచలం శెట్టి, M. రామస్వామి శెట్టి, షరాపువ్యాపారం.

హెడ్ ఆఫీసు:
పెద్దబజారు, తిరుచనాపల్లి.

బ్రాంచి :
212. మోగల్‌రోడ్, రంగూన్.

---

## 40 సంవత్సరముల అనుభవము.

బిడ్డలకు కలుగు యకృత్ (*Liver*) ప్లీహ (*Spleen*) వ్యాధులకు
అసలు విజయనగర ఔషధము.

# బాలసంజీవిని (రిజిష్టర్డు)

నూటికి నూరు కేసులు గుణము.

వివరములకు:— విజయనగరాస్థాన ఆయుర్వేద వైద్య నిపుణులగు

డాక్టరు:— పిల్లా పాపయ్యపాత్రుడు & బ్రదరు

**98, 99 బ్రాడీసు రోడ్డు, మైలాపూరు, మదరాసు.**




ఆమె సౌందర్యము
ఆమె మిత్రుల నిరం
తరాభివర్ణనము
నకు పాత్రమైనది

తమ శరీరములు ముఖపద్మములు సర్వదా సుందరముగ పరిశుభ్రముగ నుంచవలెనని నానాటికి యెక్కువమంది స్త్రీలు తెలుసుకొనుచున్నారు. అందువల్ల నే అనేకులు మార్గోసోపును వాడుచున్నారు. దాని నురుగు చర్మముపై పడీపడడములో ప్రతి రంధ్రములోనికిని దూరి, మయిల నెల్ల పరిశుభ్రముగ కడిగి స్త్రీలను మరింత జవ్వనులుగాను మృదుశరీరలుగాను చేయును.

# MARGO SOAP

## మార్గోసోపు

అన్ని సొగసులకు ఆదరమైనసబ్బు

పతికై ప్రాణముల నొసంగిన పరమసాధ్వీమణియొక్క

# పతిభక్తి

లేక

# రంగూన్ రౌడి నాటకము

6 రికార్డులలో

హచ్చిన్సు & కో

రికార్డింగుశాఖ







మౌంటురోడ్డు :: మద్రాస్

GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక


సంపాదకుఁడు

డాక్టరు. కే. యన్. కేసరి



సంపుటము ౮]        డిసంబరు 1935        [సంచిక ౧౦

*Printed at Lodhra Press, Egmore, Madras.*

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 3. అర్థ సంవత్సరపుచందా రు. 1-8-0 అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-4-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండిరైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రికయెంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్థసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12¼ తోసివేత. కాలుపుటకు తక్కువరైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలముల రేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసుచేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుటలెస్స. విమర్శనార్థము పంపబడు గ్రంథములను, ప్రచురణార్థము పంపబడువ్యాసములను అందుకొనుచు ఈవంటి వ్రాయుచుండినరీతిని ఇక కార్డులు వ్రాయజాలము. తిప్పియుకార్డు వ్రాసిననే జవాబు తెలియబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు,మదరాసు అను చిరునామాకేవ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రముపంపకూడదు.

# విషయసూచిక



విజయ; ఉదయలక్ష్మి; ధ్రువ; సత్యనారాయణ స్తవరాజము; బ్రహ్మపత్రోపాఖ్యానము; ఉదయిని (దసరాసంచిక); కాలచక్రము; వైజయంతి.



త్రివర్ణచిత్రము

'నాట్యవిలాసము' (చిత్రకారుడు టి. భీమారావు)

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావు. మద్రాసు: ఆకుండి వెంకటశాస్త్రి.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, కోఆపరేటివ్ అఫ్ న్యూస్.
హైదరాబాదు: ఎన్. లక్ష్మిబాయిగారు, సుల్తాన్ బజారు.
నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. సంజయ అండ్ కంపెని
జెమ్‌షెడ్‌పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్ పైప్ కంపెనీ, లిమిటెడ్.
బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.
గుంటూరు: వెల్‌కం అండు కంపెని.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.
పిఠాపురం: ఎం. సూకరాజు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
ఏలూరు: డి. శ్రీహరిరావు.
తణుకు: వడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్‌పేట.
ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్ వీధి.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.
విజయనగరం: ఆయపిళ్ల .సూర్యనారాయణరావు
నరసాపురం: వై. సత్యనారాయణగారు.
కొవ్వూరు: కె. సి. చెన్న కేశవయ్యర్. గూడూరు: సి. సి. సుబ్బయ్య, మర్చంటు.
కాకినాడ: సున్నా బాలకృష్ణరావు, న్యూస్ బాయ్ అండు కో.
భీమవరం: వంగల అచ్చుత రామయ్య, మేనేజరు, నెహ్రూ ఖద్దర్ స్టోర్సు.
గుడివాడ: శ్రీ శివరామ అండు కో.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.
అమలాపురము: పి. అన్నాజిశర్మ. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)
పర్లాకిమిడి: రాచూరి రామనారాయణరావుగారు.
అమదలవలస: సి. వి. నరసింగరావు
మచిలీపట్టణం: ఆచంట లక్ష్మినరసింహం; సర్కూల్ పేట.

హిగిన్‌బాథమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.




# స్త్రీధనము

పురాతనసంఘములలో స్త్రీలకు ఏలాటి హక్కులుగాని, స్వాతంత్ర్యముగాని యున్నట్లు కనుపింపదు. గ్రీస్ రోమ్, అంతకన్నను ప్రాచీనములగు అస్సీరియస్, బాబిలోనియన్, దేశములలో స్త్రీలు పురుషుల సొత్తుగా పరిగణింపబడెడివారు. ఈ పరిస్థితికి కారణము ముఖ్యముగా, స్త్రీలు బలహీనులనియు, ఆర్థికజీవనమునందు నిరుపయోగులన్న భావమే. మానవసమానత్వ ఆదర్శము ప్రబలమై క్రమక్రమముగ అన్ని దేశములయందును స్త్రీలయెడల ఈ హైన్యభావము అంతరించి కొద్దిగనో, గొప్పగనో ఆస్తుల విషయమై స్త్రీలహక్కులు, నానాట గుర్తింపబడుచున్నవి.

హిందూ సంఘములో వేదకాలమున స్త్రీలకు చాలా స్వాతంత్ర్యమున్నట్లును, దైవచింతనయందును, అధ్యాత్మికజీవనమునందును, స్త్రీలు పురుషులతో సమానముగ పాల్గొనుచున్నట్లును, గార్గి, మైత్రేయి, అనసూయ, మొదలుగాగలవారిజీవితములవల్ల వ్యక్తమగుచున్నది. ఈవిషయము నాధారముగాజేసికొని పండితులుకొందరు హిందూసంఘములో స్త్రీలకు పురుషులతోపాటు సమానమైన హక్కులున్నవని అభిప్రాయపడియున్నారు. కాని ఆ అభిప్రాయము సరికాదని మనుస్మృతిలోని ఈ క్రిందిశ్లోకమువల్ల వ్యక్తమగుచున్నది.

"భార్యాపుత్రశ్చ, దాసశ్చ
త్రయఏవాధనాస్స్మృతాః।
యత్తే సమధిగచ్ఛంతి
యస్యతే తస్యతద్ధనమ్॥ 8—416

అనగా భార్య, పుత్ర, దాస, ఈ ముగ్గురకు ఆస్తిలేదు. వారికి ప్రాప్తించిన ఆస్తి వారెవ్వరివారో వారికి జెందును.

ఈసిద్ధాంతము, స్త్రీధనమునకుమాత్రము వర్తింపదని మనుస్మృతివల్లనే తెలియగలదు. కొంతధనము స్త్రీకి చెందవలయునని సంకల్పముతో పద్ధతులను సృష్టిచేసి ఆచరణలో యుంచినవారు ప్రథములు హిందువులేయని తెలియుచున్నది. ఈవిషయమై సర్ హెన్రీ మెయిన్ Sir Henry Maine పురాతన హిందు నాగరికతా సౌజన్యమును మిగుల స్తుతిచేసియున్నాడు.

స్త్రీధనమననేమి? ఇందలి యర్థము కొంత వరకు ఈశబ్దమునుండియే యూహింపనగును. కాని, స్త్రీకి పలువిధముల ఆస్తి ప్రాప్తము కావచ్చును. పుత్రుడులేక గతించిన భర్త తాలూకు సొమ్మంతయు స్త్రీకి రావచ్చును. తనతండ్రితాలూకు ఆస్తి స్త్రీకి రావచ్చును. ఈ రెండుమార్గముల వలన సంక్రమించిన సొత్తు స్త్రీకి వారసత్వమూలమున చెందును. స్త్రీధన మట్టిదికాదు. అయ్యది స్త్రీకి స్వతః సిద్ధమగు హక్కువలన సంప్రాప్తమై, అవిచ్ఛిన్నమగు అనుభవముగల్గిన మూల్యము. మనుస్మృతిలో ఆరురకములుగా స్త్రీధనము స్త్రీలకేర్పడగలదని చెప్పబడియున్నది.

"అధ్యగ్న్యధ్యావాహనికం
దత్తంచ ప్రీత కర్మణి।
భ్రాతృ మాతృ పితృ ప్రాప్తం
షడ్విధం స్త్రీధనం స్మృతం॥ 9—174

వైవాహిక హోమములయెదుట ఇచ్చినది, వైవాహికోత్సవ ప్రదక్షిణ సందర్భమున నిచ్చినది, బంధుమిత్రులు ప్రేమపూర్వకముగ నిచ్చినది, సోదరుడు, తల్లి, తండ్రి, వీరివలన నివ్వబడినది స్త్రీధనమనబడును.

ఇందులో వివాహహోమమువద్ద స్త్రీకివ్వబడిన మూల్యమునకు 'అధ్యగ్ని' యనియు, పతిచే ఇవ్వబడినదానికి 'భర్తృదత్త'మనియు, ఉత్సవసందర్భమున ఇవ్వబడినదానికి 'అధ్యావాహనిక'మనియు అత్తమామలవలన ఇవ్వబడినది 'ప్రీతిదత్త' మనియు నమస్కరించు సందర్భమున ఇవ్వబడినదానికి 'పాదవందనిక'మనియు, స్మృతివ్యాఖ్యాతయగు కాత్యాయనునివలన వర్ణింపబడి ఇప్పటికిని ఈ శబ్దములు ప్రయోగమందున్నవి.

స్మృతివ్యాఖ్యాతలందరును, మనుస్మృతిలోని పై నుదహరింపబడిన ఆరు తెఱగులుగాక మరికొన్ని మార్గముల స్త్రీధనమేర్పడవచ్చునని నిర్ధారణ చేసియున్నారు. అవియేవనిన (1) ప్రథమభార్యను తప్పించి మరియొక భార్యను పరిగ్రహించునపుడు, ప్రథమభార్య కోప ముపశమించుటకు భర్త భార్యకు చేయు బహుమానము. దీనికి 'అధివేదనిక'మని పేరు. (2) వివాహానంతరము భర్త బంధువులవల్లను, తన తలిదండ్రుల బంధువులవల్లను చేయబడిన బహుమానము. దీనికి 'అన్వాధేయక' మని పేరు (3) శుల్కము.

కొందరు స్త్రీధనమును స్థూలముగ "యౌతక" మనియు, "అయౌతక" మనియు రెండువిధములుగ విభజించియున్నారు. "యౌతక" మనగా వివాహసందర్భమున భార్యా భర్తల సమాగమ సమయమున నివ్వబడినది; తద్భిన్నమగున దంతయు "అయౌతక" మనబడును.

మితాక్షరికారుడగు విజ్ఞానేశ్వరుడు ఈ తొమ్మిది మార్గములుగాక మరి ఏవిధముగానైనను అనగా:—(1) తన తెలివితేటలవల్ల స్త్రీ స్వయముగ ఆర్జించు ధనము (2) వారసత్వమువల్ల సంక్రమించిన ఆస్తి (3) Adverse possession (అవిచ్ఛిన్న అనుభవము) యిత్యాది మార్గముల స్త్రీకిచెందెడి ఆస్తి అంతయు స్త్రీధనమగునని నిర్ణీత మొనర్చియున్నాడు. కాని ప్రీవికౌన్సిల్ వారు (Privy Council) మితాక్షరాభిప్రాయము సరికాదనియు, స్మృతులలో లేనియర్థమును విజ్ఞానేశ్వరుడు కల్పించెననియు స్త్రీధనము స్మృతులలో చెప్పిన కొన్ని రకములకు మాత్రమే అన్వయించుననియు, వారసత్వమున స్త్రీకి సంక్రమించు ఆస్తియందు స్త్రీకి పరిపూర్ణమైన హక్కు లేదనియు తీర్పుచేసియున్నారు.

విజ్ఞానేశ్వరుని సిద్ధాంతము స్త్రీకి పురుషునితోబాటు పరిపూర్ణసమానత్వ మొసగుచున్నది. అట్టి సమానత్వము ప్రీవికౌన్సిల్ వారి తీర్పుచేతను, ఆతీర్పుపై ఆధారపడి ప్రస్తుత మమలులోనున్న చట్టములవలనను, చాలావరకు లోపించినది.

ఇకమీద క్లుప్తముగా స్మృతులు వ్యాఖ్యానములు, తీర్పులు, వీటిపై ఆధారపడి వ్యవహరింపబడుచున్న స్త్రీధనము యొక్క తెరగులును ఈదిగువ పేర్కొనబడును.

(1) హిందూ న్యాయశాస్త్రకారులలో అన్నిమతములవారును, 'అధ్యగ్ని' స్త్రీధనమని యొప్పుకొనుచున్నారు.

(2) స్త్రీ స్వంతముగ ఆర్జించు యార్జన విషయమై కొన్ని భేదములున్నవి. కన్యగానున్నప్పుడు, వితంతువైనతరువాత స్త్రీ తన తెలివితేటలచేత సంపాదించినది స్త్రీధనమని అందరు వ్యాఖ్యాతలు నొప్పుకొనుచున్నారు. సంసారము చేయుచున్న స్త్రీ తన తెలివితేటలచే సంపాదించిన మూల్యము స్త్రీధనమగునని మితాక్షర సంప్రదాయము అవలంబించుచున్న మద్రాసు, బెనారస్, బొంబాయి రాష్ట్రములలో ఎంచబడుచున్నది. దాయభాగ సంప్రదాయమవలంబించు వంగరాష్ట్రమున ఇట్లుకాదు.

(3) ఇతరులవలన వీలు (Will) మూలకముగా గాని, దానము మూలకముగగాని, కన్యకుగాని, వితంతువునకుగాని ఇచ్చినపుడు అయ్యది స్త్రీధనమగునని యన్నితెగల హిందూన్యాయశాస్త్రకారులు నొప్పుకొనియున్నారు. కాని సంసారముచేయు స్త్రీ తన తెలివి తేటలవల్ల నేదోవృత్తిచే సంపాదించిన ధనవిషయములోనున్న అట్టి స్త్రీకి వీలు మూలకముగగాని, దాన మూలకముగ

గాని, లభించిన సొమ్ము విషయములోను మితాక్షరి సాంప్రదాయమునకును, దాయభాగ సాంప్రదాయమునకును ఒకగొప్ప భేదము గలదు. మితాక్షరిలో యట్టి మూల్యము స్త్రీ ధనమగును. దాయభాగములో యట్టి మూల్యము స్త్రీ ధనము కానేరదు.

(4) తన తల్లిదండ్రులవలనను, వారి తాలూకు బంధువులవలనను స్త్రీకి సంక్రమించెడిఆస్తి దాయభాగ సాంప్రదాయములో తప్ప తక్కిన యన్ని సాంప్రదాయములలో స్త్రీ ధనమని పరిగణింపబడుచున్నది.

(5) కన్యకు వారసత్వమున సిద్ధించు మూల్యము స్త్రీధనమని బొంబాయిరాష్ట్రమున మాత్రము పరిగణింపబడుచున్నది.

(6) పండ్రెండు సంవత్సరములు అవిచ్ఛిన్న స్వాధీనమువలన (Adverse possession) స్త్రీకి సంక్రమించెడుఆస్తి స్త్రీధనమగునని అన్ని సాంప్రదాయములవారు నొప్పుకొని యున్నారు.

(7) దాయాదులతోటి, ఉత్తరవారసుల తోటి రాజీపడునపుడు స్త్రీకి లభ్యపడినది, భరణముక్రింద భార్యకుగాని వితంతువునకు గాని లభ్యపడిన ధనము, స్త్రీధనముతోటి కొన్న నూతన ఆస్తి, భరణాదాయమునుండి స్త్రీ సంపాదించిన నూతన ఆస్తి స్త్రీ ధనమగునని అన్నిసాంప్రదాయ శాస్త్రకారుల చేత నొప్పుకొనబడియున్నది.

స్త్రీధనము స్త్రీకి స్వతస్సిద్ధమగు హక్కుచే సంక్రమించిన మూల్యమని యిదివరకే సూచింపబడియున్నది. దీని విశేషములను క్లుప్తముగ యించుక పరికింతము. ఇందులో స్త్రీ జీవితమును మూడు ఆశ్రమములుగా విభజించి పరికింతము.

(a) కన్య (b) సుమంగలి (c) వితంతువు.

(a) కన్యకు స్త్రీ ధనమువీాద పరిపూర్ణ స్వాతంత్ర్యములేదు. అనగా మైనరగుటచేత దాన విక్రయాది అన్యాక్రాంతములకు తన గార్డియన్ (Guardian) ద్వారా చేయవలసి యుండును.

(b) సుమంగలి తాలూకు 'యూతక' స్త్రీ ధన విషయమై స్త్రీకి పరిపూర్ణమైన హక్కులున్నవి. ఆధనము నామె ఖర్చు చేయవచ్చును, విక్రయించవచ్చును, దానము చేయవచ్చును. నిరాఘాటానుభవమునకు భర్త ఏమాత్రము నడ్డుగానేరదు.

ఆపద సంభవించినపుడు భర్త ఆధనము నుపయోగపరచుకొనవచ్చును. కాని మరల స్త్రీధనము సొమ్మంతయు భార్యకు చేర్పవలెను. 'అయూతక' స్త్రీధనము విషయములో స్త్రీకి భర్తయనుమతిలేనిది అన్యాక్రాంతముచేయు నధికారములేదు. (c) స్త్రీ ధనము తన స్వేచ్ఛానుసారమనుభవించు హక్కు వితంతువునకు గలదు.

స్త్రీధనవారసులు.

(1) కన్య:—కన్యగానుండినపుడు స్త్రీ తన తలిదండ్రులయొద్దనే యుండును. గోత్రముకూడా తండ్రిగోత్రమే యగుటచేత కన్యతాలూకుఆస్తి మొదట సోదరులకును,

అట్టి సోదరులు లేనిచో తల్లికిని, తప్పిన తండ్రికిని చెందును. వీరెవ్వరు లేకున్న తండ్రి తాలూకు సపిండులకు చెందును.

(2) వివాహిత—సంసారము చేయుచున్న స్త్రీ చనిపోయినయెడల, ఆమె తాలూకు స్త్రీధనమెవరికి జెందును? వారసత్వము ఆ స్త్రీధన తత్వమునుబట్టి నిర్ణయింపనగును. విజ్ఞానేశ్వరుడు ఈ క్రిందివరుసను నిర్ణయించి యున్నారు.

(1) అవివాహితఅయిన కుమార్తె

(2) వివాహితయై పేదరికమునున్న కొమార్తె

(3) అట్లు కాని కొమార్తె

(4) కొమార్తె కొమార్తె

(5) కొమార్తె కొమారుడు

(6) కొమారుడు

(7) కొమారుని కొమారుడు

(8) సపత్నియొక్క అవివాహితయగు కొమార్తె

(9) భర్త

(10) భర్తజ్ఞాతులు.

(2) "శుల్కము"ను గూర్చి ఒకమాట చెప్పవలయును. ఆర్యసాంప్రదాయరీత్యా వివాహములు ఎనిమిది రకములు. అందులో నిప్పుడమలునందున్నవి బ్రాహ్మ ఆసురములు. అసుర వివాహమునకు ముఖ్యవిశేషము కన్య తలిదండ్రులకు శుల్కము నొసంగబడుట. అట్టి శుల్కము పుచ్చుకొనినందువలన వివాహము యొక్క సంస్కారబలిమి చాలభాగము లోపించుచునని మనవారి యభిప్రాయము. కనుక శుల్కము పొందినట్టి తల్లిదండ్రులకు కన్యాదానఫలము సిద్ధించదు. అవివాహము వివాహమే కాదు. కనుక అసురపద్ధతిని వివాహమైన స్త్రీతాలూకు స్త్రీధనము తల్లికి, సోదరులకు, తండ్రికి, వారి జ్ఞాతులకును చెందును.

'అయాతక' స్త్రీధనవారసత్వ విషయములలో హిందూన్యాయశాస్త్రకారులొండొరులకు భేదాభిప్రాయములున్నవి. కాని మితాక్షర సాంప్రదాయప్రకారము 'యాతక' స్త్రీధనమునకు పై నుదహరింపబడిన వారసులెవ్వరో 'అయాతక' స్త్రీధనమునకుకూడా వారేయని తెలియనగును; కాని పై యభిప్రాయము న్యాయశాస్త్రకారులు పలువురచేతను, న్యాయాధికారుల తీర్పులవలనను చాలావరకు ఖండింపబడి మారిపోయినది. ప్రస్తుత మనములునందున్న న్యాయశాస్త్ర ప్రకారము 'అయాతక' స్త్రీధనమునకు ఈ క్రింద నుదహరింపబడినవారు వరుసగ వారసులయ్యెదరు.

(1) (a) అవివాహితయగు కుమార్తె (వరనిర్ణయముకాని కుమార్తె)

(b) వరనిర్ణీతయై వివాహముకాని కుమార్తె

(2) కుమారుడు

అవివాహితయైన కుమార్తెయు కుమారుడును సమభాగములుగ ఈ స్త్రీధనమును తీసికొనియెదరు.

(3) వివాహితయైన కుమార్తెలు

(4) కుమార్తెయొక్క కుమారుడు

(5) కుమారునియొక్క కుమారుడు

(6) సవతి కుమారుడు

(7) సవతికుమారుని కుమారులు

(8) సవతి కుమారుని కుమారుని కుమారుడు

(9) సంతానము లేక వితంతువైన కుమార్తె

హిందూ న్యాయశాస్త్రము బహుళమైనదియు అనేక శతాబ్దముల చరిత్ర కలిగినది కాబట్టి అనేక మార్పులను చెందియున్నది. స్మృతులు, స్మృతులపై వ్యాఖ్యానములు. వాటి కనుగుణ్యమైన న్యాయాధికారుల తీర్పులపై హిందూ న్యాయశాస్త్రమాధారపడియున్నది. ప్రభుత్వమువారు దేశీయులు కాకపోవుటచేత స్మృతిప్రోక్తమగు న్యాయమును పాలించుటయందే తృప్తిచెందియున్నారు. పెద్దలనాటి సాంప్రదాయముల ననుసరించి సంఘమునకు న్యాయమును పాలింపవలయునను సిద్ధాంతమును సమంజసముకాదని చెప్పుటకు వీలులేదు. కాని మానవసంఘము పరివర్తనకులోనైనది. నూతనాదర్శములు, నూతన చైతన్యము ప్రజలలో నిపుడు వ్యక్తమగుచున్నవి. ఈ వికాసమునకు స్మృతులు ఎంత పూజనీయములయ్యు జవాబు చెప్పనేరవు. నూతన సమస్యలకు నూతన సమాధానములు కావలెను. ఈ విధముగా చట్టములను మార్చుట మన హిందూసాంప్రదాయముల కెన్నటికిని విరుద్ధము కాదు. నూతన సమస్యల కనుగుణ్యముగ సంఘమును దిద్దుబాటుచేసికొనుటయందు హిందువులకు ప్రాభవమున్నది. అట్టితరి అవసరమైనచో స్మృతులుకూడా సృష్టిచేయు జీవచ్ఛక్తి మనజాతికుండినది. ప్రస్తుతము కూడా అట్టి నూతన స్మృతిసమయమని మా నమ్మకము. ఇప్పుడు పై చర్చించిన స్త్రీధన విషయములో నూతనముగా స్త్రీలు కోరవలసినదేమియులేదు. చట్టములవల్లగాని, ప్రీవికౌన్సిల్ తీర్పులవల్లగాని, స్మృతివ్యాఖ్యాతలలో అగ్రగణ్యుడు విజ్ఞానేశ్వరుని సూచనలు అమలులోనుంచిన స్త్రీలకు పురుషులతో బాటు ఆర్థికసమానత్వమును చేకూరును; స్త్రీలను గౌరవింపరన్న కళంకము మనజాతికి తొలగును.

"స్వదేశీప్రచారము గావలెనన్న స్త్రీలే మార్గదర్శికులుగ నుండగలరు."

బాబు రాజేంద్రప్రసాద్.

# మల్లెలూ — మొల్లలూ

కం॥ మొల్లమకవయిత్రి యిదే।
మల్లెలు మొల్లలును దెనుఁగు మానినులకు నై
సల్లలిత జానకీపద
పల్లవములఁ జేర్చికూర్చె బహుమానముగా॥

## సీత

కం॥ పతి దైవముగా నెప్పుడు
మతిఁ దలఁచుచు నుండునట్టి మగువలఁజెరుపన్
బ్రతినగలయట్టి నీతోఁ।
బ్రతివచనము లాడుకంటెఁ బాపముకలదే॥

కం॥ పరదారాపేక్షకులగు
పురుషుల కాయువు నశించుఁ బుణ్యముసెడు స
త్పురుషులు దూషింపఁగఁదుది।
నరకంబునఁ బడుదురనెడి న్యాయము వినవే॥

కం॥ తన సాహసంబు తానే
కొనియాడునతండు హీనగుణుఁడని వినుచున్।
నిను నీవ పొగడుకొంటివి
వినఁగూడదు నీదు నీతివిరహితభాషల్॥

## మండోదరి

కం॥ మగటిమిగలిగిన పురుషులు
మగతనములు విడచినతువ మగువలు నగరా।
తగదనక నేఁడు మరుగున
విగతవ్రీడుండవగుచు వ్రేల్వందగునే॥

కం॥ రామునిదూతలు నన్నుం
బాములఁ బెట్టంగఁ జూడఁబండువె నీకున్।
నా మానముఁ గాపాడని
నీ మానుష మేటికిపుడు నిర్జరవైరీ॥

# శ్రీ మొల్లరామాయణ ప్రశంస

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

శ్రీరామచంద్రుని దివ్యగాథల కావ్యరూపమున విరచించి ఐహికాముష్మిక సుఖంబులందిన మహానుభావులగు శ్రీమద్వాల్మీకి మహామునియు తదుపరి నేటతెలుంగున భాస్కర రంగనాథులును గోపీనాథులును పిమ్మట 'ఆంధ్రవాల్మీకి' యను బిరుదంబుగాంచిన శ్రీవావిలికొలని సుబ్బారాయ మహాకవియు మున్నగు కవిశ్రేష్ఠులు పూర్ణావతారుండగు శ్రీరామచంద్రుని చరిత్రము మహాకావ్యరూపమున విరచించి తామే తరించుటగాక లోకమున కంతయు అక్షయలోక సామ్రాజ్యము కరతలామలకంబై సుగమంబగునట్లొనర్చిరి. సంస్కృతమున భట్టమురారి భవభూతి మహాకవి కాళిదాసు భోజభూపతి మున్నగు మహాకవిపుంగవులును శ్రీరామచరితల పెక్కు కావ్యనాటకరూపముల వెలయించి కీర్తికాయులైరి. ఆమహాత్ముల మృదుమధురగానామృతరసాస్వాదనానుభవవిశేషముననే యీయుగమునందును యీ భరతదేశమున యీపుణ్యభూమియందు ఎచ్చోటవినినను శ్రీరామచంద్రుని దివ్యగాథలే వీనులవిందులై వినవచ్చుచున్నవి. ఏచోటజూచినను శ్రీరామచంద్రులను ముద్దుపేరులతో బాలురు పిలువబడుచున్నారు. ఏధన్యుల పుణ్యమందిరముల కేగినను శ్రీమద్రామాయణముపారాయణమై వారిని పావన మొనర్చుచున్నది. యే గ్రామమందును రామమందిరములే! ఎటజూడబోవ రామభజనలే!! సంసారసాగరమీదుచునూపిరాడని సమయమున కర్తవ్యతామూఢయగు నే గృహిణిగాని విసుగుజెంది రామ రామ యని రెండుసారులు స్మరించుటచే తరణోపాయ మగపడును. పేదరాలగు నిల్లాలు పిల్లలు తినుబండములకై యల్లరిబెట్టినపుడు రామరామ యేమియులేదు నాయనా నేనేమి సేయగలనని జాలిజెంది రామస్మరణ మొనర్చును. ఆ రెండు రామనామములతో పిల్లలు తృప్తినొంది మరలి పోవుదురు. ఆపిలుపుతో రాముడేమైనవచ్చి వారికి పంచదారలు బెట్టునా? ఏమో రామనామమున మాత్ర మంతకన్న నెక్కుడగు మాధుర్యమున్నది. సంసారసాగరమును తరింపజేయు నావవంటి రామాయణశ్రవణమున నంతటి మహత్తు గలదు గావుననే కవిశ్రేష్ఠులు కవితారూపమునను కాంతలు గానకళలందును నైష్ఠికులనుష్ఠానవిధులందును శ్రీరామనామస్మరణ మొనర్చి ధన్యులగుచున్నారు. ఇంకను ఆధునికాంధ్రకవు లెందరో తామోపినకొలది రామకథల వ్రాసి వెలయించిరి. కాని స్త్రీలలో మున్నెవ్వరును కవితవ్రాయ నేర్చియుండలేదు. అట్టికాలమున అన్యదుర్లభమగుభక్తిభావార్ద్రిక్తహృదయయై శ్రీరామకథామృత

రసానందసాగరమున దేలియాడుచు మృదు మధురమనోహర పద్యగద్యశైలిని శ్రీరామాయణకథను తెలుంగున కబ్బము వ్రాసి శ్రీరామభద్రుని కరుణాకటాక్షము నకు పాత్రమైన ధన్యచరిత శ్రీమొల్లమాంబ యొక్కరితయే! ఈమె కవితాఝరి యనర్గళమై మనోహర గంభీరభావ విలసితమై ధీరోదాత్తుండగు శ్రీరామచంద్రప్రభుని దివ్యగాధలను వర్ణించుతరి బంగారమునకు వెలిగార మద్దినట్లు గ్రంథాచితిని వ్యక్తీకరించుచున్నది. ఈమె భావము లతిగంభీరములయ్యును సుగమములు; శయ్య లలితమైయుండు శబ్దశ్లేషలు వ్యంగ్యములు ప్రౌఢపదభూయిష్ఠములై పండితులనయితము తల లూపింపజాలియున్నది. నేట తెలుంగున కవిత వ్రాయుటయం దీమెకీమెయే సాటి. ప్రాసంగికముగా గ్రంథాదియం దీకవయిత్రి,

కం॥ మును సంస్కృతముం దేటగ
తెనిగించెడిచోట నేమి తెలియకయుండన్
దనవిద్య మెరయ గ్రమ్మర
ఘనమగు సంస్కృతము జెప్పగా రుచియగునే॥

అని యన్నది. మరియు నీకవయిత్రి తన కావ్యామృతప్రవాహమున గూఢభావములుంచిన రసభంగమగునని వానిని బొత్తుగా నిరసించినది.

గీ॥ తేనెసోక నోరు తియ్యనయగురీతి
తోడ నర్థమెల్ల దోపకుండ
గూఢశబ్దములను గూర్చిన కావ్యమ్ము
మూగ చెవిటివారి ముచ్చటగును॥

అట్లసంబద్ధముగా నుండునని చాటిచెప్పినది.

తనకుంగల శబ్దాలంకారచణత్వమంతయు బాలకాండమున ప్రతిపద్యమునందును గుప్పించి విడచినది. అందొకటి—

సీ॥ ప్రకటానురాగ సంపన్నులౌదురుగాని
రమణీయ రుక్మకారకులుగారు
తిలకించిచూడ సద్విజాళౌదు రేకాని
తలపంగ పక్షిజాతములుగారు
శుభపవిత్రోజ్జ్వల సూత్రధారులుగాని
టక్కరిహాస్య నాటకులుగారు
ఉభయసంధ్యాది విధ్యుక్తకర్ములుగాని
చర్చించగా నిశాచరులుగారు
బాడబులుగాని యగ్నిరూపములుగారు
పండితులుగాని విష్ణులపగిది గారు
ధీవరులుగాని జాతినిందితులుగారు
పరమపావను లాపురి ధరణిసురులు॥

ఈపద్యముల నామె శబ్దగ్రహణ సామర్థ్య సంపద సాక్షాత్కరించుచున్నది. మరియు కవి స్త్రీయగుటచే చూలాండ్రగు కౌసల్యాదుల నతిమనోహరముగ స్వాభావికముగా వర్ణించినది.

సీ॥ ధవళాక్షులనుమాట తథ్యంబుగావింప
దెలుపెక్కికన్నులు తేటలయ్యె.
నీలకుంతలలని నెగడినయామాట
నిలుపంగ నెరులపై నలుపు నూపె
గురుకుచలనుమాట సరవిసంభావింప
దోరమై కుచముల నీరువట్టె
మంజుభాషిణులనుమాట దప్పకయుండ
మెలతలపలుకులు మృదువులయ్యె
కామినులటంట నిక్కమీకాంతలందు
మీరి మేలైనరుచులపై కోరికయ్యె
సవతిపోరన దమలోన సారెసారె
కోకిలింతలు బెట్టి చిట్టుములుబుట్టె॥

తెలుపెక్కు కన్నులు తేటలగుటయు నెఱుల చాలు గురుత గాంచుటయు ఒడలు నీరు వట్టుటయు భాషణ లత్యంతమృదువులగుటయు మున్నగు గర్భిణీలక్షణము లనుభూత పూర్వకములుగా వ్రాసినది. మఱియు అసహ్యములగు చిట్టుములకు అట్టిదని సవతి పోరు నుపమించిచూపినది. ఇట్టి స్వాభావిక వర్ణన లీమె గ్రంథమున నెన్నే నిగలవు. కథా సరళియం దెచ్చట నేయే భాగము లుండదగినవో వానినే సేకరించుకొని తనకవితాఝరిని నిరాటంకముగ ద్రుతగతిని ప్రవహింపజేసిన దీమె. రాముడు వనవాసారంభమున గుహుని పల్లియకేగినప్పుడు గంగాతరణ సమయమున గుహుడు తన మనస్సున నిట్లుదలంచెనట.

చ|| సుడిగొని రాముపాదములు
సోకినధూళివహించి రాయి యే
ర్పడ నొకకాంతయయ్యెనట!
పన్నగ నీతనిపాదరేణు వి
య్యెడ వడినోడసోక నిది
యేమగునోయని సంశయాత్ముడై
కడిగె గుహుండు రామపద
కంజయుగంబు భయంబు పెంపునన్||

ఏమి యీభావవిలసనము!! రామపాద రజస్సంగమున రాయియే రమణియయ్యెనట! ఇపుడీతనిపాదము సోకినంతనే దారునిర్మితమగు నీ నావ మరియేమగునోయను సందియముచే నాసీతేశుని పాదములంగడిగెనని సందేహాలంకారమున నొక్కముద్దుపద్దెమున వర్ణించినది. ఇందు గుహుని నిర్మలభక్తియు ఆటవికముగ్ధత్వమును రామపాదరజోమహత్త్వమును విపులముగా వివరించినది—మఱియొక చోట వాలి సుగ్రీవులు పోరుసల్పు నెడ,

ఉ|| సాలముపొంత నిల్చి రఘు
సత్తము డమ్మరివోసి శబ్దవి
న్మూలముగాగ విల్ దివిచి
దృష్టియు ముష్టియుగూర్చి గోత్రభృ
త్కూలము వజ్రపాతహతి
గూలువిధంబున గూలనేసె న
వ్వాలిప్రతాపశాలి మృడ
వందనశీలి సురాలి మెచ్చగన్||

అమ్మరివోసి, ఆకర్ణాంతముగాధనస్సెక్కుడి దృష్టియు ముష్టియు గూర్చి కోదండైకరుండును వాలివధావిధానోత్సుకుండునునగు శ్రీరామచంద్రప్రభుండు సాలము పొంత పొంచి నిల్చియున్నతరి ప్రత్యక్షముగ తానచ్చటనేయుండి చూచినట్లు చిత్రించినది. పండితమహాశయులకు హృద్యములగు నీమె పద్యములే క్రీడాలోలురగు చిన్నిబాలులకు సైతమవగతములై పఠించుతరి వారి నుత్సాహపూరితచిత్తులం జేయుచున్నవి. ఈ పద్యముం జూడుడు.

చ|| మొగముబిగించి పాదముల
మొత్తముగా నట నూది త్రొక్కి నీ
టుగ మొగమెత్తి భీకరక
ఠోరరవంబుననార్చి బాహు ల
త్యగణితలీల నూచి వల
యంబుగవాలము ద్రిప్పి వేగునన్
నగము నగమ్ము గ్రుంక కపి
నాథుడుఁ నింగికి దాటె రివ్వునన్||

అని చదువునప్పటికి తన్మయులై హనుమంతుడావిధముగా వార్ధిలంఘించెనని తాము

నేదియో యొకవస్తువును సముద్రప్రాయమున ముందుంచుకొని యొక్కయదటున కుప్పళించి దానిందాటి తామే సామీరులై కడలిం గడచితిమని యుబ్బి భుజములం దట్టుచున్నారు. పదలాలిత్యమును అర్థగౌరవమును, భావవ్యక్తీకరణమును, నానార్థసంగ్రహణాదిచణత్వమును, ఈమె కవితాశైలికి పెట్టనిసొమ్ములై యొకవింతసోయగముం గూర్చుచున్నవి. అయోధ్యాకాండమున కౌముదీవర్ణనలయందు,

ఉ॥ వెన్నెలతీగలన్ కొనల
వేడుక ముక్కులద్రుంచి తెచ్చి దా
రొక్కన్న ప్రియాంగనాతతికి
కూరిమి నోరికినిచ్చి కేళికిన్
సన్నపు కంఠనాళముల
సన్నలుజేసి సుఖించె నింపుగన్
దిన్నని చంద్రకాంతముల
తిన్నెలమీద చకోరదంపతుల్ ॥

శృంగారరసానుప్రాణితమగు నీపద్యము, విడచియు విడువని తామరపూవువలె లలితంపువలపులు చిలికోయు చిలుకసట్లతిసుకుమారమై కుసుమకోమలియగు గ్రంథకర్త్రియొక్క మృదులహృదయరాసిక్యతను వెలయించుచున్నది. చకోరకుమారుడు ప్రియానుసరణసంతోషశుభసమయమున తనప్రేమంపుటింతికి మనోనురంజకముగ వెన్నెలతీగలన్ కొనలవేడుక ముక్కులద్రుంచి తెచ్చెనట! ఈపద్యపాదసారస్యము విచారింప వానికిం గల ప్రియానుసరణోత్సుకతయు తదభీష్టవస్తుప్రదానాదిసామర్థ్యమును స్ఫురించుచున్నది. (కూరిమి నోరికియిచ్చి, మిక్కుటంబగు మక్కువచే ఆనందో బ్రహ్మాత్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి)తన్మయైక్యతనొంది యమృతమయ కౌముదీప్రాశ నోటికేయందిచ్చె. సన్నపు కంఠనాళముల సన్నలుజేసె అనుటచే ప్రేమైకజీవనులై సాత్వికాది భావానుగతులగు నాచకోరదంపతు లుత్తమశృంగార నాయికానాయకులుగా నధ్యాసింపబడుచున్నారు. కవితాసరస్వతి నీరీతి మనోమోహనకలాపవిభూషితం జేసి విబుధులగు రసజ్ఞులహృదయదర్పణముం దోగాడజేయంగల చాతురి కవియగు కాంతకుగాక మరియొకరి కలవడునా?! ...ఇంకొకచోట కామోద్రిక్తహృదయుండగు రావణుండు సీతకడ తనప్రతాపంబు లుగ్గడించి చెప్పుచున్నతరి వాని సోత్కర్షకుంగసలి యిట్లనినది:

కం॥ తనసాహసంబు తానే
కొనియాడునతండు హీనగుణుడని వినుచున్
నిను నీవ పొగడుకొంటివి
వినగూడదు నీదు నీతివిరహితభాషల్ ॥

ఆత్మస్తుతియు పరనిందయు సహజగుణములుగాగల పండితమ్మన్యుల కిందలి ప్రత్యక్షరమును చపేటసదృశమై వారి యహమహమికల వారింపజాలియున్నది. గ్రాంథికశైలి గమనించిన దురవగాహమగు పద మీ కవితయందేచూచిననైన గలదా! ముద్దులుమూటగట్టుమాటలలో ముక్కుతిమ్మనార్యుని కెందును దీసిపోవ దీమె యిటుజూడుడు

సీ॥ కూకటిముడికినై కురులుకూడనినాడె
బెదరక తాటక పీచమణచె



బొంబాయి వనితావిశ్రామమునకు చెందిన పాఠశాలాబాలికలు.
మొన్నటి దసరాయుత్సవ వినోదములయందీ కోలాటక మొకటి.

గాధేయు డొనరించు క్రతువును రక్షింప
  బెక్కండ్రు దైతుల నుక్కడంచె
నవనిపై విలసిల్లు నఖిలరాజన్యులు
  త్రేలనూపగలేని విల్లువిరచె
ఘోరాటవులలోన గ్రుమ్మరునప్పుడు
  ఖరదూషణాది రాక్షసుల ద్రుంచె

గీ॥ పాదరజమున నొకరాయి పడతి జేసె
లీలమాయామృగంబును గూలనేసె
రాజమాత్రుండె మేదినీరక్షకుండు
రామభూపాలు డాదినారాయణుండు ॥

ఏమి యీ మనోహరవర్ణనా చమత్కృతి! బాల్యము వీడియు వీడని ప్రాయమున ముని జన్నంబుగావ తాటకాహననదక్షుండగు దాశరథి కురుచలై యతివక్రములై యింద్రనీల ప్రభాభాసమానములై యున్నని పాలబుగ్గలతో సహవాసమునకై మల్లాడు జునపాలచే రాజకుమారోచిత సుకుమారవేషాలంకృతుండై యున్న కౌమారభావము తనహృదయ దర్పణమున నిల్పుకొని పాఠకమహాశయులకు కన్నులగట్టినట్లు తెలియంబలుకుచు నా రామమూర్తి యమానుషపౌరుషాదులును భయ కౌతూహలభావములే సహజగుణములుగా నుండదగిన కిశోరప్రాయముననే యొనర్చిన యద్భుతలీలల సహేతుకములుగా పౌలస్త్యునికిం దెలియజెప్పినది. ప్రశ్నోత్తర సందర్భములకుం గూడ నెడమీయక సర్వము తానయై అమృతగర్భయు, అమృతస్వరూపిణియు, అమృతరసప్రవాహగంభీరశీతల మనోహరనిస్వనయునై యీమె కవితామృతవాహిని అమృతహస్తములెత్తి అక్షరాస్యులగు పాఠకకోటి కమృతమ్మును ప్రసాదించుచున్నది. డొంకతిరుగుళ్లు నిరర్థకవర్ణనలు లేక తనసత్కథారచనము నతినేర్పుమెయి చరితార్థము నొందించిన యది. అట్లని సింహావలోకనమే లేదనలేదు. మహాకావ్యమున నుండదగిన సూర్యాస్తమయ చంద్రోదయాదికములగు వర్ణనలను మితముగా పొందుపరచి తన శ్రీరామాయణ మహార్ణవమున రత్ననిక్షేపములుగా నుంచినది. ఇందు దూరాన్వయముగాని క్లిష్టపదములుగాని లేవు. కేవల మృదుమధుర గంభీరోదారాద్యుత్తమ లక్షణానుప్రాణితమై యెంతేని కొనియాడదగియున్నది. కావుననే శ్రీ విద్యాపరీక్షావిధానములందును మఱియు అచ్చటచ్చట జరుగు విదుషీసన్మానములందును ఆది కవయిత్రియగు శ్రీమొల్లరామాయణమునే ముఖ్యపఠనీయముగా పండితసంఘములచే నెన్నుకొనబడుచున్నది. ఇట్టి యుత్తమ గ్రంథరాజమునే బాలికాపాఠశాలలందును మహిళాసంఘసమావేశములందును పఠనీయముగా నిర్ణయించుకొని వనితాలోకమింకను, విజ్ఞానవంతియై యభివృద్ధినొందుచు శ్రీరామరక్షనొందుగాక!

# పసిబిడ్డ — భాష

బుర్రా వెంకటనాంచారయ్యగారు; ఎం. ఏ.,

(శిశుశిక్షణము)

"ఏకః శబ్దః సమ్యగధీతః సమ్యక్ ప్రయుక్తః స్వర్గేలోకే కామధుగ్భవతి"

నోరుగలవానిదే రాజ్యము. మానవునికిఁగల శక్తులలో భాష ప్రాధాన్యతవహించెననుట నిర్వివాదాంశము. ప్రాచీనకాలమున మానవుఁడు భాషయనున దెఱుంగడట. అంతయు సంజ్ఞలతోడనే చక్కఁబెట్టుకొనుచుండెను. కాలక్రమమున పరిసరము లతనియందొక యద్భుతమగు పరివర్తనము గావించెను. చుట్టుఁబట్టునుండు చెట్టుచేమలు జంతుజాలమున కాతఁడచ్చెరువందియో ఘాతుకమృగములకలని భయముచేతనో భావమును ధ్వనిచేసి వ్యక్తపఱచెనట! అదియే యాతనిభాషను ప్రణవమాయెను. వాల్మీకికవిత్వమునకుఁగూడ నాబుషిసత్తమునిచే "మానిషాద" యని ప్రారబ్ధమైన యాక్రోశమేగదా కారణభూతము. కాని **Max Muller** వంటి మేధాసంపన్నులు, శ్వానాదుల భషణములను మానవుఁడు ప్రప్రథమమున ననుకరించి యుండవచ్చునని యూహించుచున్నారు. అదియే యాభాషాశాస్త్రజ్ఞుని "బౌ, వౌ," Bow, Vow' సిద్ధాంతము.

బిడ్డ చేటలోఁబడునపుడే యేడ్పు మొదలిడుచున్నది. ఆరోదనమే క్రమమున భాషగ పరిణమించును. కొన్ని దినములు గడచిన పిమ్మటగూడ బిడ్డ మాటలాడలేదు. ఆకలియైనను, ఉయ్యాలలో పరుండుటచే ప్రక్కయొత్తుకొనినను, చీమలు మొదలైనవి కుట్టినను, కడుపులో కుట్టుచేసినను తదితరమగు శారీరకబాధ యొదవినను, బిడ్డయేడ్చును. కొందఱుతల్లులు శిశురోదనమునకు కారణమఱయఁజాలక విసువుజెందుచున్నారు. ఈ యేడ్పు కొను పోను, అ, ఉ, ఉంగా, యను వింతయగు శబ్దముగా మాఱుచున్నది. ఈవర్ణములు భాషగా నెటుల పరిణమించునో స్థాలీపులాకన్యాయముగా చర్చించు టుచితము. ఇటుల నుచ్చరించుటకలవడిన శిశు వాఱుమాసములు రాగానే తన పెదవులు, నాలుక, కంఠస్థములగు నాడీతంత్రులు మొదలగు వాగింద్రియముల కొంతవఱ కుపయోగపఱచు శక్తిని బడయును. వెంటనే వచ్చియురానిమాటలు వదరును. వచ్చియురానిమాటలును, ఊరియునూరని యూరుగాయయు రుచికి ప్రశస్తములేగదా! అట్టితఱి శిశువు శబ్దముల కంటెను సయిగ లెక్కువగాఁజేయును. వీనినే మనవారు పిద్దములందురు. ఈరీతిగా శిశువు తనభావముల వ్యక్తపఱచును. పెద్దవారీసైగల నవగతము చేసికొని శిశునిష్టములగు కార్యముల నాచరింతురు. బిడ్డ 'బు, బు, బూ,' యని సయిగచేసిచూప తల్లియు నది యర్థముచేసికొని యాహారమిడినచో శిశువా సమయమునుండియు నన్నము కావలసినపుడు 'బు, బూ' అనును. క్రమముగానిదియే బువ్వయగును. ఈవిధమున వస్తుసముదాయమునకు శిశువు నామకరణమిడుచుండును. శిశువట్టి బుడిబుడినుడు లుచ్చరించునపుడు తల్లితండ్రులు సంతసించి వానిని ప్రోత్సహించినచో నికను అమితముగా కొన్నిశబ్దముల నోటఁబట్టును. ఇటులనే క్రుద్ధివేటుగా మాటల నుచ్చరించి బిడ్డతుదకు భాష నలవఱచుకొనుట మీరు శ్రద్ధతో గమనించితిరా? అయినను బుడుతలు రెండుమూడువత్సరములు పైఁబడు

వటఱకును మాటల నోటబట్టుటయేలేదు. ఈశక్తి ముఖ్యముగా బిడ్డని యారోగ్యముపుట్టువు, పోషణ మొదలగు విషయములపై నాధారపడియుండును. అన్నివిధములను సౌఖ్యము లనుభవించెడి బిడ్డలు త్వరితముగానే "ఊకొట్టుచుందురు."

ఈ ఘట్టముదాటగనే పిల్లలు పై అచ్చులను (ఉ, అ, ఊంగా) కలిపి "తాత, అత్త, అమ్మ," అని మొదలిడుదురు. బిడ్డలు ప్రయత్నపూర్వకముగా నట్టినుడుల పల్కుటలేదనియు నవి యదృచ్ఛాశబ్దములనియును చదువరు లూహింతురుగాక! "మర, మర" యనపదము నవిచ్ఛిన్నముగా నుచ్చరించిన "రామ, రామ" యెట్లగునో యటులనే యీపదములు నేర్పడును. పిమ్మట శిశువు స్పష్టముగ "పాప, పాప, అమ్మ, అమ్మ" యని పల్కును. అనగా బిడ్డని భాషకు మొదటియక్కరము లోష్ఠ్యములే (Labials) యని నిరభ్యంతరముగ చెప్పవచ్చును. ఆవర్ణములే సులభములైనందున మునుకొనివానినే యుచ్చరించును. అదెట్లుపొసగునో యించుక విచారింపుడు. స్తన్యమును గ్రోలునపుడు పసిబిడ్డ పెదవులు, నాలుకయు నుపయోగింప నేర్చుకొనునుగదా! శబ్దోచ్చారణ యందును నవియే వానికి తోడ్పడును. "అభ్యాసం కూసువిద్య" యగును. వానికి కొందఱు, శిశువట్టి యవ్యక్తములగు ధ్వనుల నుచ్చరించుట దాని నాడీ సముదాయ మాకస్మికమగు మార్పునకు లోనగుటవలన నిన యభిప్రాయపడిరి. అట్లయినచో మంచియనుభవము గల బిడ్డకు నాడీతంత్రులు బలిష్ఠములుగుననియు అట్టి వాడుకలే వానికి త్వరితముగా మాటలువచ్చున ట్లొనరించునియు చెప్పుట అతిశయోక్తి కానేరదు. ఇది యును కాక పితరుల మేధాశక్తిపై నట్టికృత్య మాధారఁ పడియుండును. దీనినే అనువాయితయందురు. ఇట్టి యస్పష్టములగు శబ్దముల యర్థమును 11 మొదలు 15 నెలలపిల్లలు కొంతవఱకు గ్రహింపఁగలుగుచుండిరి. అప్పటినుంటియే బిడ్డలు, భాషకు సోపానము నేర్పఱ చుట, 15 మొదలు 20 మాసములబిడ్డ లీమాటలతో వాక్యములుగగూడ నుచ్చరింతురు.

భాషయును భావమును సంపృక్తములని కొందఱి మతము. భాషయే మానవుని భావపరంపర నభివృద్ధి నొందించుననుట నమ్మశక్యము కాదు. కుక్కలును కోతులును భావములుగలిగియును భాషించుచున్నవా? లేదే! వాయసము రెండుకంకులు మూడుకంకులకంటె తక్కువని తెలిసికొనఁగలదట. కాని రెండు అనెడు సంఖ్య మూటికంటె తక్కువయని యెఱుగఁదట. అటులనే బిడ్డలకును భావములు ప్రారంభదశయం దిగుడు దిగుడుగానుండును దీనినిబట్టి సహిగంప మాటలాడుట లేదే! కనుక వానికి భావములుండవని వచించుట పొరపాటు. భాషను బిడ్డఁడు పరిసరములందుఁ దిరుగాడు పెద్దల ననుకరించి దృఢముగా నలవఱుచుకొనును. బధిరులు మాటలాడలేకపోవు టెందులకో మీకు తెలియునా? పుట్టుకతోడనే చెవిటియగువాడు పరిసరములందు చెల్లుబాటగు భాష వినజాలడుగదా! అట్టివాఁ డనుకరించుటయు మిథ్యయే. అయినాను సంవత్సరములైనతర్వాత చెవుడువచ్చినబాలుఁడు తానిదివఱకు నేర్చుకొనిన రెండుముక్కలును ఇందులకే, గుంటపెట్టి గంటవాయించి సర్వకాలమును మూఁగవాఁడైయుండును. కాని పెద్దవాఁడయిన తర్వాత బధిరుఁడగువాని కిట్టిగతి పట్టుటలేదు.

ఇఁక బిడ్డవాక్యరచన మెటుల నొనరించుచున్నదో యించుక విచారింతము. పెద్దవారివలె పసిపాప కర్తృకర్మ క్రియలుగలవాక్యముల గూర్చుటలేదు. పాలు కావలసినచో "అమ్మా, బాయి" యని యనును. బిడ్డ 2½ లేక 3 వత్సరములు వచ్చినతర్వాత వాక్యములను కొంచెము భయము పిరికితనముతోడఁ బ్రారంభించును. వానివాక్యములం దుపసర్గలు మొదలగు కొన్ని భాషాభాగము లుండవు. శ్రోతయే వానివర్థము చేసికొనవలెను. కొందఱు బిడ్డలు "తాత, తాతా; నాన్న లేవు" అని వచింతురు. మూడుసంవత్సరముల

బిడుతలు "నీవు, నే" ననుమాట తెగుడుదిగుడుగా ప్రయోగింతురు. వారు సాధారణముగా "నేనెక్కడికి పోతావ్" నీవుపోతావా?" యని వ్రాక్కుచ్చుట మన యందఱికిని విదితమే.

పసిబిడ్డలు మాటలాడుభాష యనేకవిధములుగా నొప్పారుచున్నది. ప్రారంభదశయందు దాతఁ డుచ్చరించెడినుడులు వానికే తెలియునుగాని తదితరుల కవగతమగుట కష్టము. అతఁడుమాటల పదేపదే యుచ్చరించును. అట్టి పునరుక్తి యాతని కానందజనకమగును. కొంచె మెదిగినబిడ్డ దానిలోనదియే మాటలాడుకొనును. మనవారు చెప్పునటుల తుమ్ముకొనుటయు చిరంజీవ యనుటయుగూడ దానివంటే. ఎవ్వరిని యుద్దేశించి గాని భాషింపడు. ఒకప్పుడు సమవయస్కులగు బిడ్డలందఱునుగూడి గొఱ్ఱెలమందవలె యొకటే, ఎవ్వరికి తోచినటుల వారఱతురు. అట్టివారిని మనమడ్డగించినచో వారు నిరుత్సాహులగుదురు. కొంతకాలము బిడ్డను స్వేచ్ఛగా ప్రవర్తింపనీయవలెను. కొన్నిమాసములు పైఁబడినకొలదియు బిడ్డ చుట్టుఁబట్లవారితో సంభాషణ మొదలిడును. ప్రథమమున నా కదికావలె నిదికావలెనని మారాయించును. పిమ్మట పరిసరములను గూర్చి ప్రశ్నింప మొదలిడును. ప్రత్యుత్తరము వచ్చినను రాకుండినను తానే తనకుతోఁచినటుల సమర్థించుకొనును. కొంచె మెదిగినపిమ్మట దీని తత్వమేమో చెప్పుమని పెద్దవారిని బాధించును.

మనము చెప్పునదంతయు బిడ్డ వినుచుండెనని తలంచి మోసపోవుచుంటిమి. బిడ్డ సాధారణముగా తానంతయు నర్థముచేసికొనినటుల నటించును. బిడ్డకుఁగూడ స్వాతిశయ మెక్కువగానే యున్నది. తన కర్థము కాలేదని చెప్పినచో తోటివారలు నవ్వెదరనిగాని బడిపిల్లవాఁడయినచో, పంతులు కొట్టుననిగాని అంతయు తెలిసినటులనే నటించును. బిడ్డనికి తాము చెప్పిన విషయజాలము తెలిసినదో లేదో కనుగొన నిశ్చయించువా రందఱును వానికి తా మొకకథ చెప్పి వానిచేత నాకథనే యింకొకబాలునికి చెప్పింపవలెను. అప్పుడు వానిగుట్టు బయటపడునుగదా! పదిమొదలు 15 సంవత్సరములపిల్లలకు "చెట్టైవంగనిది మ్రానై వంగునా" యనునట్టి కొన్నిసామెతలను పదివఱకును యిచ్చి ఒక్కొకసామెత వివరణ మింకొక కాగితముపై వ్రాసియిచ్చి దాని సాహాయ్యమున ప్రతిసామెతను కనుగొనుచునవలయును. ఈరీతిగా పిల్లవాఁ డర్థము చేసికొనినదియు లేనిదియును గుర్తింపనగును. విషయావగాహన మొనరించునపుడు బిడ్డల స్వంతాభిప్రాయము లక్షుపడును. అట్టి యభిప్రాయపరంపరప్రోద్బలము వలన బిడ్డలపార్థమునూహించుట కెంతేనియవకాశము గలదు. విస్తరించుట కదను లేక సంక్షిప్తముగాఁ జెప్పఁదలంచితిని. బిడ్డ క్రొత్తవాక్యముల నెంత కర్థము చేసికొనదనగా క్రొత్తమాట లర్థముకాకనైనను కావచ్చును. లేక అట్టివాక్యములందలి నూతనభావములను గుర్తింపలేకనైనను కావచ్చును. ఇదియునుగాక బిడ్డ పరాకుఁ జెందియుండుటవలననైన నగును.

బిడ్డలు మూడుసంవత్సరములు పైఁబడగనే యిదెందుకిదెందుకని యక్షప్రశ్నలతో చంపుకుతిందురు తల్లితండ్రులను. అందుల ముఖ్యముగా కొన్నిప్రశ్నల నిట పేర్కొనుట మంచిదని తలంతును. "అమ్మా ఆచెట్టుకు ఆకులెందుకు" "నివ్వెక్కడికి" "నేనెందుకు చదువుకోడం" "ఏట్లోనీళ్లెందు కట్లాపోవడం" అని పృచ్ఛించును. కాని బిడ్డకు 6, 7 సంవత్సరములు రాగానే "పండుగెప్పుడు" "పెద్దవాళ్లు తప్పులుచేస్తారా?" "అమ్మా నేనుమంచివాణ్ణా? అమ్మాయిమంచిదా? చెప్పు." "మొగవాళ్లు పేరంటాని కెందుకెళ్లరు చెప్పు చెప్పవేం" అని యొకటే కొట్టిపోయును. బిడ్డ వేయు ప్రశ్నలకన్నిటికిని తల్లిదండ్రులుగాని పంతులుగాని వెంటనే ప్రత్యుత్తరమొసంగుట మంచిది. సాధ్యమైనంతవఱకున్నదున్నటుల చెప్పుటే శ్రేయోదాయకము. అట్లయిననే బిడ్డ మనయందు విశ్వాసమునుఁజూపును.

బిడ్డ లుచ్చారణమునం దినుమంత తప్పుజేసినను వెంటనే తల్లిదండ్రులు గాని పంతులుగాని పెద్దవారెవ్వరైనను దిద్దవలెను. దిద్దుటయేగాక వారివారి శక్త్యనుసారముగా పిల్లలకు మాటలు వాక్యములుగూడ చెప్పుచుండుట శ్రేయోదాయకము. అట్లు చెప్పునప్పుడు వారివారి యంతస్తులను గుర్తెఱింగియే భాష నేర్పవలెను: క్షేత్ర మెఱిఁగి బీజము పాత్ర మెఱిఁగి దానము నన్నటుల. కొందఱు తల్లిదండ్రులు బిడ్డలకు భాష నలవఱచుచునేయుండిరి. అత్త తాత మొదలగు పదముల నేర్పి యాయాబంధుగులగూడ నెఱుకపఱచుచునేయుండిరి. ఇదికాక యుచ్చారణయందు దక్షులగా నొనర్పుటకు బిడ్డలచే పితరులు "గంపలోది కందిపప్పు, గంపక్రింద పందికొక్కు" "వేకనూరినడిమి లంకనల్ల రెల్లుకట్ట" "నరిసీ! యిరస పెసలువిసిరి యసరు వసలఁబెట్టవే!" క్రిష్టాడిష్ట్రిక్టు" మొదలయిన వాక్యముల నుచ్చరింపఁజేయుచునే యున్నారట. కాని వా రట్టి వాక్యములు సాంప్రదాయసిద్ధమైనవానిని కొన్నింటిసేర్చి కూర్చి వారివారి వయసునకు తగినరీతిని బిడ్డలకు నేర్పుట మంచిది. ఇదియునుగాక మనలో కొందఱు, బొడ్డూడని పసిగందులకు పద్యములు నేర్పుదరు. మఱికొందఱు తండ్రులు తామే సక్కుబాయి నాటకములోనో విని యానందించిన "స్వామి కరుణించెన్," అను పాటలను తాము కూనిరాగములు దీసి పిల్లలచే దీయింతురు. ఇంకను కొందఱు "వందే శంభు ముమాపతిం" యని బిడ్డలకు నూఱిపోయుదురు. ఇట్టి కార్యము లుచితానుచితముల నెఱిఁగి చేసిననేగాని ఫలింపదు. సాధారణముగా 8 మొదలు 10 సంవత్సరముల పిల్లలు విఃతపద్దములన్న ముచ్చటపడుదురు. ఒకప్పుడు కొందఱు బిడ్డలకు "నరసింహ కృష్ణరాయుని కరమరుదుగ కీర్తికాంత కరిభిత్ గిరిభిత్త"ను పద్యమును వినుపింప వార లమందానంద మానసులైరి. కనుక వారివారి శక్తులను, అభిరుచులను గుర్తెఱింగి, నిరతదీక్షతో నిత్యాభిరతితో, పితరులు బిడ్డలను భాషాదక్షులుగా నొనరింతురని నామనవి.

# కమలం పెళ్ళి

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తిగారు బి. యె.,

"ఏమండీ పిల్లకి పదేళ్లొచ్చినా పెళ్లి ఊసే యెత్తుకోరు" అని అప్పుడే యింటి పనులు చక్కపెట్టుకొని వచ్చిన సుందరం అంది గదిలో మాసపత్రిక చదువుతూఉన్న నారాయణరావుతో. "శారదాశాసనం అమలులోఉంటే యింతచిన్నవయస్సులో పిల్లకి పెళ్లెలాచెయ్యడం. మనకింకా నాలుగేళ్ళు టైముందిలే" అన్నాడు నారాయణరావు. "శారదాబిల్లు ఉంటేమాత్రం ఎంతమంది యానాంవెళ్లి చక్కాముద్దొస్తూన్న చిన్నపిల్లలకి పెళ్లి చేసుకోడంలేదు? మనంమాత్రం అలాచేసుకోకూడదూ" అంది ఆవిడ. "శారదాబిల్లు మాట అటుంచి చూసినా, నామతంలో ఇంత చిన్న వయస్సులో పెళ్లిచెయ్యడం భావ్యంగా కనపడలేదు. మనధర్మశాస్త్రాలలో కూడా పెద్దపిల్లలకు పెళ్లిచెయ్యమనేఉంది. ఆరోగ్య శాస్త్రప్రకారంకూడా పిల్లలు పెద్దవాళ్లయిన తర్వాతనే పెళ్లిచెయ్యడం అవసరమనిన్నీ చిన్నప్పుడు పెళ్లిచేసి కాపురానికి పంపిస్తే హానికరం అనిన్నీ తేలుతుంది. మనలో యీ దురాచారం ఉండడంబట్టే మనదేశస్థుల్ని 'పిల్లలయొక్క పిల్ల'లన్నారు. గవర్నమెంటువారి ధర్మమా అని శారదాఆక్టు పెట్టినందుకేనా మనం ఈదురాచారం వదులుకొని సంఘానికంతటికీ ఉపకారం చెయ్యకపోతే మరెవరుచేస్తారు. అదీకాక కమలం స్కూలులో యింకా చదువుకుంటున్నాది, మరినాలుగేళ్లయేసరికి స్కూలు ఫైనలుక్లాసులో కెళ్లుతుంది. ఆపాటిముక్కలేనా వస్తేగాని ఆడవాళ్లు దేశానికి ఉపయోగపడరు." అని తాపీగాబోధపర్చేడు సుందరమ్మకి. "ఎప్పుడూ పూసెత్తినా మీరిలాగే నండీ పెద్దలెక్చర్లు చెప్తూఉంటారు. ఇంతో అంతో స్థితిగతులున్నవాళ్లం కాబట్టి పిల్లకి పెళ్లిచేసుకొని ముద్దూముచ్చట తీర్చుకుందామని అనుకున్నాను. మీ మొగాళ్లందరు వెర్రిచదువులు చదువుకొని జాతీ, నీతీ పోగొట్టుకొంటారేకాని ఏదో పూర్వకాలం మనిషిని నామాటలు మీకు నచ్చవని తెలిసియుండికూడా మిమ్మల్ని బ్రతిమాలుకోడం, చీవాట్లు తినడం నాకెందుకని ఊరుకోలేను." అంది సుందరమ్మ చిన్నబుచ్చుకొన్నముఖంతో.

నారాయణరావుకి తండ్రి సంపాదించిన ఆస్తి పదిగరిసెల ధాన్యంవచ్చే భూమిన్నీ తనప్లీడరీవల్ల సంవత్సరానికి వెయ్యిరూపాయిలున్నూ ఉన్నాయి. సుందరమ్మ ఒక అగ్రహారంవాళ్లపిల్ల. పూర్వాచారంప్రకారం చదువేమీలేదు. కమలానికి చదువుచెప్పించడానికే మూతి విరుపులు విరిచింది. ఎలాగో

లాగు నెగ్గేడు నారాయణరావు. కాని పెళ్లి విషయంలో నెగ్గేటట్లు కనపడలేదు. పెళ్లాన్ని దుఃఖపెట్టడమంటే నారాయణరావుకి పడదు. చదువురానిదైనా తనఅభిరుచులకు వ్యతిరేకంగాఉన్నా ఆమెమనస్సు నొప్పించడంమాత్రం అతనికిష్టంలేదు ప్రతీదాంట్లోను ఏదో రాజీపద్ధతికి వస్తూఉంటాడు. కమలం పెళ్లివిషయంలోకూడా అలాంటి రాజీపద్ధతికే వచ్చేడు. సుందరమ్మ యిష్టం ప్రకారం యానాంవెళ్లి యేదోపెళ్లిఅంటూ చేసుకొని తర్వాత పధ్నాలుగేళ్లుదాటి నప్పుడే కాపురానికి పంపించొచ్చు. అల్లాగ చేస్తే తనకు కావలసిందికూడా అవుతుంది. అని నిశ్చయించేడు నారాయణరావు.

## ౨

సుందరమ్మ మంచిసంబంధంకోసం చాల కష్టపడి వెతుకుతున్నాది. చదువున్నచోట అందం, అందంఉన్నచోట ధనం ఈరెండు ఉన్నచోట సాంప్రదాయం, అన్నీఉన్నచోట ఎదురుకట్నాలు అలంకారాలు వగైరా వాటినిగురించి బేరం తెగకపోడం — ఇలా గుంది వ్యవహారం. తుట్టతుదకి రాజమహేంద్రవరంలో కాస్త భాగ్యవంతులైన వాసుదేవరావుగారి యిరవైఅయిదేళ్ల కొడుకు మోహనరావు కివ్వడానికి నిశ్చయించుకుంది. చదువుసంధ్యా అట్టే లేకపోయినా వాళ్లు మంచిభాగ్యవంతులు. పిల్లకి 50 తులాల బంగారం పెట్టడానికి ఒప్పుకొన్నారు. ఇలాంటి సంబంధం కుదుర్చుకొని వచ్చినందుకు గర్విస్తూ భర్తతో చెప్పిందీ సంగతి. "ఇంతాచేసి చదువులేనివాడికా మనకమలాన్నిచ్చి పెళ్లిచెయ్యడం. కమలానికి స్కూలుఫైనలుదాకా చదువుచెప్పించి మంచి విద్యావంతుడికిచ్చి పెళ్లిచేసి వాళ్లిద్దరు అన్యోన్యప్రేమతో కాపురంచేస్తూ భర్తకి పత్రికలూ పుస్తకాలూ చదివి విని పిస్తూఉండగా కమలాన్ని చూడాలనివుంది." అన్నాడు నారాయణరావు. "ఈకబుర్లు చాల్లెండి. ఈకాలంలో బియ్యేలు ఎమ్మేలు యిళ్లలోకూర్చొని తండ్రిమీదో మామగారిమీదో ఆధారపడి కాలక్షేపంచేస్తూన్నవాళ్లున్నారు. ఏదో యింతడబ్బున్నాదంటే యింకొకరిపూచీ లేకుండా హాయిగా తింటారు. మనపిల్లకూడా సుఖపడుతుంది. లేకపోతే మనజీవానికి ఉసూరుమని యేడుస్తుంది తరవాత." అని వాదించింది సుందరమ్మ.

కమలంక్లాసే చదువుతూఉన్న సరోజిని అనేపిల్లకూడ కమలంయీడుదే. క్లాసులో కల్లా వీళ్లిద్దరే తెలివైనవాళ్లు. సరోజిని తలిదండ్రులు మంచి విద్యావంతులు. సంఘంలో ఉన్న దురాచారాలు పోగొట్టి సంఘోద్ధరణానికి తమశక్త్యనుసారం సాయంచేదామని పూనుకున్నవారు. సరోజినితల్లికూడ విద్యావతి అవడంచేత భర్త అభిరుచులతో ఏకీభవించి పెద్దపిల్లఅయిన తర్వాతనే సరోజినికి పెళ్లిచేయడానికి నిశ్చయించింది. సరోజిని ముందర యీపెళ్లి ఊసే యెత్తకుండా మామ్మూలుగా చదుకోనిచ్చేవారు.

ప్రభాకరరావు ఇంటర్మీడియేటు చదువుతున్నాడు. ప్రతిపరీక్షలోను ఫస్టుగా

మార్కులు తెచ్చుకుంటున్నాడు. తలిదండ్రులు మిక్కిలి బీదకుటుంబమునకు చెందినవారు. తండ్రి చిన్నఉద్యోగంచేస్తూ ఎలాగోలాగు కుటుంబపోషణం చేసుకుంటున్నాడు. గవర్నమెంటు స్కాలరుషిప్పుల తోను, ధనవంతుల సహాయముతోను ప్రభాకరరావుకి చదువుచెప్పిస్తున్నాడు. నలుగురి మీద ఆధారపడి చదువుకున్నందుకు క్లాసులో బాగా చదువుకుంటున్నాడుగదా అని ప్రిన్సిపాలుగారున్ను తక్కిన లెక్చరర్లున్ను ప్రభాకరరావుమీద మిక్కిలి దయ గలిగియుండేవారు.

నారాయణరావు తన కూతుర్ని పెళ్లి చేద్దామని అనుకుంటూఉన్న సమయంలో సుందరమ్మ యీ కొత్తసంబంధం తెచ్చిపెట్టింది. "మన కమలాన్ని స్కూలుఫైనలుదాకా చదివించిన తర్వాత ప్రభాకరరావు అప్పటికి బి. ఏ. ప్యాసయియుంటాడు. అతనికిద్దామని అభిప్రాయంఉంది." అన్నాడు నారాయణరావు. "చదవేస్తే ఉన్నమతీ పోయినట్లుంది మీసంగతి!! ముష్టెత్తుకొని బ్రతికేవాడికిన్ని ప్రభాకరరావుకిన్ని యేమీ భేదంలేదు. ఏదో నలుగురు సహాయం చేస్తూన్నారు. చదువుకుంటున్నాడు. చదువు పూర్తయినతర్వాత ఏమిటిచేస్తాడు. పెళ్లాన్ని పోషించడానికేనా సామర్థ్యం ఉండాలా. మనపిల్ల ప్రారబ్ధం!! దాని కీసంబంధమేమిటండీ!!" అని ఒక్కవిసురిని గబగబా చెప్పింది. ఆఖరుకి సుందరమ్మపంతమే నెగ్గింది. కమలాన్ని చదువుమానిపించడం మోహనరావుకిచ్చి పెళ్లిచెయ్యడం అయింది. సుందరమ్మ కీసంబంధం నచ్చడానికల్లా కారణం వాళ్లు భాగ్యవంతులనిన్నీ తనపిల్లకి ౯౦ తులాల బంగారం పెడతారనిన్నీ.

## 3

నాలుగేళ్లయినాయి. కమలం పద్నాలుగేళ్ల పిల్లఅయింది రెండేళ్లనుంచీ కాపురం చేస్తూ అత్తవారింట్లోఉంది. పెళ్లిలో ఏదో మర్యాదలు తిన్నగా జరిగేయి కావన్న మిషతో అత్తవారు కమలాన్ని యీ రెండేళ్లలోను పుట్టింటికి పంపించడం మానివేసినారు. ఎన్ని ఉత్తరాలువ్రాసినా, ఎన్ని మాట్లు స్వయంగా నారాయణరావు, సుందరమ్మవచ్చినా అవన్నీ నిష్ఫలం అయేయి. సుందరమ్మ కప్పుడే కొంచెం పశ్చాత్తాపం ప్రారంభమయింది. అయినా ఒకవిధంగా సంతుష్టిపొందేది. పోనీ మనపిల్ల ఎక్కడో దగ్గర సుఖంగాఉంటే అంతే చాలనుకొనేది.

సరోజిని స్కూలుఫైనలు ప్యాసయింది. ప్రభాకరరావు బి. ఏ. ప్యాసయినాడు. ఫస్టు క్లాసులో రావడంచేత నలుగురు సంతోషించినారు. సరోజిని తలిదండ్రులు పిల్ల పెళ్లివిషయమై అప్పుడు ప్రారంభించేరు ఆలోచించడం. పిల్లనడిగి తన కెవరిని పెళ్లి యాడవలెననియుందో కనుక్కొని అలాగ చేదామని అంది తల్లి. తండ్రికూడా చాలా సంతోషించేడు. విద్యావతిఅయిన భార్య యుంటే యెంత సౌఖ్యమో, లాభదా

యుక మో అతనికి బాగా తెలిసింది. తనమనస్సులోఉన్న అభిప్రాయం గ్రహించినట్లు భార్య యిలాచెప్పడంవల్ల అతనికి మిక్కిలి సంతోషం కలిగింది. అప్పుడు సరోజినిని పిలిపించి తమకు ప్రభాకరరావు నచ్చేడనిన్నీ తనయిష్ట మెలాఉందో అనిన్నీ అడిగేరు. సరోజిని చదువుకున్నపిల్ల — జ్ఞానంవచ్చిన పిల్ల కనక ప్రభాకరరావునే వరించింది. ప్రభాకరరావుని అతని తలిదండ్రులను రావించి వారి అభిప్రాయం తెలుసుకున్నపిమ్మట సరోజినీ ప్రభాకరులకు పెళ్లి శాస్త్రోక్తంగా చేసేరు. సరోజిని కాపరానికివెళ్లి ఒకయేడాదయింది. ప్రభాకరరావు బి. ఏ. ప్యాసయిన తర్వాత ప్రస్తుతకాలం బి. ఏ. లలాగ నిరుద్యోగుడై యున్నాడు. తండ్రి సంపాదిస్తూ ఉన్న కొంచెంజీతంతోనే కాలక్షేపంచేస్తున్నాడు. సుందరమ్మ యిదిచూచి తన తెలివితేటలకి తానే సంతోషిస్తూ నారాయణరావుతో చెప్పింది. "చూసేరా మీరుచేద్దామనుకున్న సంబంధం ఎంచక్కా వెలుగుతున్నాదో. చదువుచదువని ఊరికే ఉబలాటపడ్డారు. ఆ ప్రభాకరరావుగతి యెలా వచ్చిందో చూచేరా. దమ్మిడీ కావలసినా తండ్రిమీదే ఆధారపడాలిసొచ్చింది. పాపమా సరోజిని యెలా కాలక్షేపంచేస్తున్నాదో కాని నాలాంటిదయితే యిప్పటికి అత్తవారిల్లు విడిచిపెట్టి పుట్టింటి కొచ్చీదును"అని.

## ౪

మోహనరావు విద్యాగంధం లేకపోవడంచేత ఉన్నడబ్బంతా దుర్వ్యయంచేసి రెండు మూడు సంవత్సరాలకి యిల్లు గుల్లచేసుకొని తిండికిలేక మామగారింటికి పోజరయ్యేడు కమలంతో, అప్పటికి కమలానికిద్దరు పిల్లలుకూడాను. చదువుకున్నపిల్ల కాబట్టి కమలంమాత్రం చాలాచిన్నబోయింది తనమొగుడు తన్ని పోషించలేక పోయేడుగదా అని, నారాయణరావుకి కూడా కమలంముఖం చూడడానికి చిన్నతనంగా ఉంది. పిల్లకి బాగా జ్ఞానంవచ్చిన తర్వాత దానియిష్టంకూడా కనుక్కొని పెళ్లిచేసినట్లయితే తనలోపం యేమీ ఉండదుగదా అనుకున్నాడు. మొట్టమొదట యిన్నికబురులూ చెప్పిన సుందరమ్మ యిప్పుడు మరిమాట్లాడలేక పోయింది.

కాలంఎప్పుడూ ఒక్కలాగే ఉండిపోదు. ప్రభాకరరావు చదువుకున్నకాలేజిలోనే ఒక ఖాళీరాగా నెలకి యాభైరూపాయల జీతంతో వేసేరతనిని. బాగా చదువుకొని మేష్టర్లదయ సంపాదించియున్నాడు కాబట్టి రెండేళ్లు పోయినతర్వాత ఎం. ఏ. పరీక్షకు కట్టి ఫస్టుక్లాసులో ప్యాసయి కాలేజీలో లెక్చరరుపని సంపాదించుకొన్నాడు. సరోజిని యెల్లపుడు విద్యావ్యాసంగం చేస్తూ ఉభయభాషాప్రవీణ పరీక్షకుకట్టి ఉత్తీర్ణురాలయింది. ఇద్దరు అన్యోన్యప్రేమతో ఒకరి నీడలాగు ఒకరుండి కాపురం చేస్తున్నారు. వారిప్రేమలత అన్యోన్య పవిత్రానురాగ రసంచేత అభివృద్ధిపొంది ఒకశుభముహూర్తమున సుపుత్రునికాంచి సంతుష్టి చెందింది.

# వీరకాంత

నీలంరాజు వేంకటేశ్వరరావుగారు

మీసములేనిమోసము—సమిష్టికుటుంబము వ్యష్టిఁజేయు వి
శ్వాసము? మోహపాశము? విశాంపతికన్నుఁ గట్టివైచె, నా
మోసమెఱుంగునాయఁ డొకబోయఁడు ; నాయకురాలిప్రజ్ఞతో
కాసుకుసాటిరాదు ; నలగామునిమూర్ఖత కంతులేమిచే.

కుత్తుకలోనిజీవములఁ గోల్పడ జంకనివారు వెల్మరా
హుత్తులు, హమ్మరావులు సహోదరులొక్కెడ గూడియుండఁగన్
బొత్తుగనోర్వలేక నిజప్రాన్కసిటుల్ విజయుంబుగాఁ జె నీ
యెత్తులఁబన్ని ; ఆమది-ప్రయోజన మేమియొ దాన నీమెకున్.

పన్నినవ్యూహచక్రములు వంకనెఱుంగివు వైరిగుండియల్
భిన్నములౌట నిక్కువము : భీతినెఱుంగనినాయఁ డొక్కఁడే
యిన్నిటిలెక్కఁజేయక సహించినదిట్టరి ; పల్లెనాటినా
గన్నలు నాయకమ్మ నొకగత్తరదేవతగా దలంచిరే ?

ఈ పలనాటిభారతమహీశ్వర మొక్కలతాంగి వ్రేలిపై
మోపి గిరాల్లవేయుట సముద్ధ్రితనీతివిశేషశేముషిం
దోపఁగఁజేయుగాని, మహితోజ్జ్వలధీరుఁడు బ్రహ్మనాయఁడే
నొప్పఁ బడరానియిక్కటులనోర్చె సుహృజ్జన బంధుకోటితో.

రణకేళిన్ మగసింగమై చెనకి యుగ్రాసిప్రహారోద్ద్యుతుల్
తనవారిం బెరవారి గుండియలు బ్రద్దల్ గాగ దృప్యత్ చమూ
వనధింజొచ్చికలంచునాయిక యనల్పాపూర్వదోర్దర్ప మెం
తని వర్ణింపఁగవచ్చు నాంధ్రజననీ! ధన్యాత్మ వీవే గదా ?

# టి. సి. యన్. గోల్డన్ మెటల్ జ్యూయలరి మార్టువారి

## వివిధ రకముల

ఆభరణములు, లోకప్రశస్తమైనవి.

వివిధ రకములలో సౌందర్య పోషణ ప్రయత్నమే మా ఆశయము.

| వస్తువు | | ధర |
|---|---|---|
| ఉంగరము 1-కి. | రూ. | 2-0-0 |
| గాజులు పెద్దసైజు జత 1-కి | | 3-0-0 |
| „ మీడియంసైజు జత 1-కి | | 2-8-0 |
| „ బేబిసైజు జత 1-కి | | 2-0-0 |
| చైను పెద్దసైజు పేట 1-కి | | 7-0-0 |
| „ బేబిసైజు పేట 1-కి | | 5-0-0 |
| వంకీ వడ్డానము పెద్దసైజు 1-కి | రూ. | 20-0-0 |
| „ బేబిసైజు 1-కి | రూ. | 15-0-0 |
| గుండీలు 1-కి | అణాలు | 0-5-0 |
| మట్టు చేతిగుండీలు సెట్టు 1-కి | | 2-0-0 |
| గజ్జలుకట్టిన వంకి 1-కి | రూ. | 15-0-0 |
| సాదావంకీ గజ్జలులేనిది 1-కి | | 7-8-0 |

వి. పి. ఖర్చులు ప్రత్యేకము.




ప్రత్యేకము స్త్రీలకొరకు స్థాపింపబడినది.

మాచేత తయారుచేయబడెడు మెటల్ బంగారు ఆభరణములు మా సోదరీమణులకు సంతృప్తికలుగ జేయునని నిశ్చయముగా చెప్పగలము. ఒకసారి మీ దృష్టిని మా నగలపై ప్రసరింపజేసినచో మీ సౌందర్యాభిలాషులమగు మా ప్రయత్నము మీకు తెలియగలదు.

క్యాటలాగు ఉచితము. నేడే వ్రాయుడు.

## టి. సి. నాగలింగప్ప అండు కంపెని.,

280 వాల్టాక్సురోడ్డు, పోస్టుబాక్సు నెం॥ 516, పార్కుటవున్‌పోస్టు, మదరాసు.

ఏజెంట్లు:—పటేల్ స్టోర్సు, మునిసిపల్ హైస్కూల్ రోడ్, బెజవాడ.

# విధికృతము

శ్రీమతి అడపా సుగుణమణిగారు.

(అనుబంధకథ)

[నారాయణి తన యేకైకపుత్రియగు సువర్ణకు బాల్యవివాహము తలపెట్టి, భర్త సమ్మతించనందున రహస్యముగా శ్రీవిలాసునకిచ్చి పరిణయమొనర్చెను. ప్రఫుల్లుడీ సంగతి నెఱింగి, భార్యను పరిత్యజించి, ఆమె అంత్యకాలమున దర్శింపవచ్చి కుమార్తెను రమ్మని కబురంపెను కాని సువర్ణకు అత్త అనుమతి యివ్వనందున ఆమె రహస్యముగా రాత్రి బయలుదేరెను. భార్యమరణానంతరమున ప్రఫుల్లుడు సువర్ణను తోడ్కొని అత్తవారింటికఱిగి వారలు కుమార్తెను పరిగ్రహించనందున స్వగృహమునకు మఱలి, ఢిల్లీ పట్టణమున డాక్టరు పరీక్ష చదువుకొనుమని కుమార్తెను సాగనంపెను. కొంతకాలమునకు శ్రీవిలాసుడు తన భార్యను పంపుమని, లేదన్న కోర్టులో వ్యాజ్యము వేసెదనని భయపెట్టుటచే ప్రఫుల్లుడు కుమార్తెను రమ్మని ఉత్తరము వ్రాసెను. సువర్ణ తానింకను అవివాహితయని తన్ను ప్రేమించుచున్న సుదర్శనుకడ సెలవుగైకొని బయలుదేరి, శ్రీవిలాసునితో తానింకను యతని భార్యగా నుండుట యసంభవమని వాదించును; కాని సుదర్శనుడు తననిజస్థితి నెఱింగి యవమానపరచుచు వ్రాసిన యుత్తరమును చూచి తన మనోభిప్రాయమును మార్చి యత్తవారింటి కరుగుటకై యాయత్తపడెను.]

బుద్ధిః కర్మానుసారిణీ; కర్మ పూర్వజన్మకృతము; జన్మ జీవితరింప నుపాయముగానక పడు అవస్థా రూపము.

సువర్ణ మనోవైక్లబ్యమున మఱల నత్తవారింటి కరుదెంచెను కాని ఆమెకు మనసొకచోట, తనువొకచోట. హైమవతి మాతృమరణానంతరమున "రామా, కృష్ణా" అని జపమాల త్రిప్పడం ప్రారంభించి సువర్ణ రాకను గని గృహకృత్యములలో పాల్గొనక సంతతం తనగదిలో కూర్చొనేది; తనలోకంఏదో తనది.

ఒకనాడు మధ్యాహ్నము శ్రీవిలాసుడు చీట్లాటలో విశేషముగా ధనమును గోల్పోయి భోజనమునకై యింటికేతెంచెను. అప్పటికి సువర్ణా హైమవతులు వారివారి గదులలో పనులలో నిమగ్నలై యున్నారు. శ్రీవిలాసుడు స్నానమునకై దుస్తులను మార్చి, చేతచెంబుపట్టికొని వాకిటకువెళ్లేసరికి అచ్చట నీరు సిద్ధముగా లేదు. కొంతిసేపటివరకు కనిపెట్టి చూచేడు. ఎవరూవచ్చి సిద్ధముచేసే ఏర్పాటులో నున్నట్లుకూడా కానరాలేదు. అసలు మగవాళ్లకు కచ్చేరిలో చీవాట్లుతిని వచ్చినా, చీట్లాటలో ద్రవ్యము నష్టమైపోయినా ఇంటి ఆడవాళ్లమీదకదా అదమాయింపులు అలవాటు; ఇక కర్మముచాలక ఇంట కాస్త తప్పుకనపడినచో మరిచెప్పనవసరములేదు. ఆవేళ రామరావణయుద్ధమే. శ్రీవిలాసునకు సువర్ణ గదిని సమీపించి ఆమెను పిలుచుటకు ధైర్యము చాలకపోవుటచే హైమవతి గదినిచేరి "ఏమే? ఇంటందరూ చచ్చేరా? నారాకను తెలుసుకొనుటకై కళ్లులేవా? చెవులులేవా? మహా నిర్లక్ష్యంగా ఉంది

వ్యాపారం. స్నానానికైనా నీళ్లుపెట్టుటకు సమయము దొరకని ఉద్యోగాలు దొరికేయి," అని కేకలు వేసేడు.

హైమవతి శ్రీవిలాసునకన్నా రెండాకులెక్కువ చదువుకొన్నదే గనుక యేమాత్రమును తీసిపోలేదు. "ఒరే చేతగాని చవటా, కొఱమాలినకుంకా, ఎవరి మీదరా నీఏడ్పు? పెళ్లా న్నొకమాటనలేవు మూతి పళ్లు రాలతంతుందని భయం. నెత్తినెక్కించుకొన్న తరువాత దిగుమంటే దిగుతుందా? తలమాసినముండను, తీర్థయాత్రలకు పోతానంటే పోనివ్వకుండా మీయిద్దర క్రిందా చాకిరీ చేయించుకొనుటకట్రా అడ్డేవు? పెచ్చు రేగి ప్రేలిపోతున్నావుగాని ఎవరికిరా ఉద్యోగాలు పట్టి ఊగులాడుచున్నాయి? తీరికలేని ఉద్యోగం తగలబట్టే తిండికైనా వేళకురాలేక పోతున్నావు" అని కుక్కకాటుకు చెప్పుదెబ్బవలె జవాబుచెప్పింది.

శ్రీవిలాసునకు రౌద్రము ద్విగుణీకృతమైనది. "దెష్టా! ఏమిటే నోటికివచ్చినట్లల్లా వాగుచున్నావు?" అని చేతిలోనున్న చెంబుతో హైమవతి తలపై విసరికొట్టేడు. "అమ్మో! చచ్చేను" అని చావుకేక వేసి ఆమె నేలకూలింది. ఇల్లంతా రక్తమయమే. శ్రీవిలాసుడు చక్కా కాళ్లకు బుద్ధిచెప్పేడు. మూర్ఖులకు యోగ్యతా యోగ్యత విచక్షణ శూన్యము.

సువర్ణ పరుగునవచ్చి వేడినీళ్లతో గాయమును కడిగి తనపెట్టెలోనున్న యౌషధులతో కట్టుకట్టి శైత్యోపచారములుచేసి హైమవతికి మఱల స్పృహ గలిగించింది.

"అమ్మా, సువర్ణా, నీదయవల్ల నాప్రాణాలు దక్కేయి. నీమేలు మఱచిపోలేనుతల్లీ. నీ ఖర్మమేమి కాలిందమ్మా నిక్షేపంలాటి ఇంటబుట్టి ఈ నిర్భాగ్యునకు భార్యవైనావు? నీగుణములను గుర్తించలేక నిన్ను నానాబాధలు పెట్టేను. నన్ను క్షమించు. ఇకముందు మనం ఒక్కతల్లికడుపున పుట్టినట్లే మెలుగుదాం" అని ఆమె సువర్ణను కౌగిలించుకొన్నది.

శ్రీవిలాసుడు కంటబడితే హైమవతి పురాణం విప్పుతుందన్నభయముచే దొంగవలె దొడ్డిదారినివచ్చి భోజనముచేసి పోతుండేవాడు. ఇంట రంభనురాకొట్టు భార్య, తనకా బ్రహ్మచర్యము. పాపం ఏమిచేయ గలడు? ఆమె అతనితో మనస్ఫూర్తిగా మాటలైనా ఆడదు.

ఒకనాటిరాత్రి సువర్ణ వంటచేయుచున్నది. పెద్ద కాపునకు నిండాజబ్బుగా నుందని కబురువస్తే హైమవతి పరామర్శకై వెళ్లింది. శ్రీవిలాసు డీసమయమును కనిపెట్టి వంటయింటికేగి "సువర్ణా నీవెంతటి కఠిన హృదయవు! నాతో నింకనైనను మనసిచ్చి మాట్లాడవా? నీ పరిరంభణ ప్రాప్తికై పడికాపులుపడి యున్న నన్నాదరించవా?" అని పరమాతురతతో కారులుకూయుచు సువర్ణను కౌగిలించబోయెను. ఆమె తనబలమునంతయు వినియోగించి శ్రీవిలాసుని వెనుకకుత్రోసివేసినది గాని అతడు మఱల దరియుటకై గమకించుచున్నాడు. సువర్ణ గత్యంతరము గానక గభీలున తలుపువేసుకొని గడియవైచి వంట ఇంట దాగున్నది.

కామాతురులకు కండ్లుకానరావు. శ్రీవిలాసుడు తలుపును బలవంతముగా తన్నుచు "సువర్ణా తలుపు తెఱువుము; లేనిచో ఈ ద్వారమును ముక్కలు ముక్కలుగా విఱచియైనను నిన్ను చేపట్టితీరెదన"ని భయపెట్టుచుండెను. సువర్ణ వంటఇంటనున్న కత్తిని సంగ్రహించి తలుపు విఱిగినచో ఆత్మహత్యచేసు కొనుటకై సంసిద్ధయై ఉండెను. స్త్రీలహృదయములు పుష్పాడికన్నా మృదువు — వజ్రముకన్నా కఠినము.

హైమవతి గృహమునకు మఱలి, ఈదృశ్యము నవలోకించి తనసహజ వాగ్ధోరణి లంఘించుకొంది. "ఒరే నీ నెత్తికొట్ట, నీ నెదడు పేల్చ. బంగారులాగున్న రైతుకు బాగులేదనిచెప్పి, నిలబడ్డపాటున నన్నింట నుండి తఱిమి, ఏమిట్రా ఈ దారుణం?" అని సమీ

పించేసరికి "ఇక దీనినోట్లోనోరుపెట్టలే"నని ఆతలుపు తాళం వేసుకొని పోయేడు శ్రీవిలాసుడు.

అర్ధరాత్రయింది. ఊరుమాటుమణిగింది. ఆకాశ మంతా మేఘావృతమై భోరున గాలివీస్తుంది. శ్రీవిలా సుడు నిద్రాపరవశుడైనాడు. హైమవతి వంటఇంటి కిటికీని విఱచి ఆదారిని సువర్ణకు బంధవిముక్తిచేసి "అమ్మా, సువర్ణా ఇంక నీవీఇంట నుండుట శ్రేయ స్కరముకాదు. కాలయాపనమొనర్చినచో కడగండ్ల పాలయ్యెదవు. త్వరితముగ పుట్టిల్లు చేరుకొనుము" అని హెచ్చరించెను.

సువర్ణ హైమవతి పాదములపైబడి "అమ్మా, ఎన్నిజన్మములకైన నీఋణము తీర్చుకొనలేను. సమయ మునకు నీవురాకున్నచో నాగతి యేమైయుండెడిదో ...ఇదియె కడసారిసెలవు" అని ఆ గాఢాంధకార మున అదృశ్యయైనది.

స్త్రీలకు సమయోచితబుద్ధి మెండు.

౮

ప్రకృతి కడువిచిత్రమయినది. పోషించుబాధ్యత సమయించు ఆధిక్యత ఒక్కవస్తువులోనే రూపిస్తుంది. ఓర్పునకు పేరన్నికగన్నభూమి! ఒక్కొక్కప్పుడు ప్రళయకాలరుద్రునివలె కంపించి లక్షలకొలది ప్రజలను తనకుక్షి నిడుకొనుచున్నది. తల్లివలె సస్యము లను పోషించి ప్రజలను కాపాడుజలము పెల్లుకొని ప్రవాహమై పల్లెలను పట్టణములను కొల్లగొనుచున్నది. అబలలచేతి ఆటవస్తువగు అగ్ని పెనుభూతమై గృహ ములను ఆహుతి యొనర్చుచున్నది.

భైరవీనది పొంగి పరిసరగ్రామముల నన్నిటిని ముంచి విశేషనష్ట మొనగూర్చినది. తినతిండి, కట్టగుడ్డ నిలువనీడలేక ప్రజలు అల్లలాడుచున్నారు. విషూచి జాడ్యము, మున్నగు అంటువ్యాధులు విశేషముగా ప్రబలినవి. ఇంకను వర్షము సంతతధారగా కురియు చున్నది. రోగులచికిత్సార్థము ప్రభుత్వమువారు డాక్టరు సుదర్శనుని మరికొందరు అనుచరులను క్రొత్తగా నియమించేరు. సుదర్శనుడు అహోరాత్ర ములు కష్టపడి ప్రజలకువలయు సౌకర్యముల నొన గూర్చుచున్నాడు.

నాడు వర్షము కొంచెమాగినది. సుదర్శనుడు సాయంకాలాను వాహ్యాళికై బయలుదేరి శిబిరమును వీడి సుమారొకమైలు పొలములలోనుండి నడచెను. నల్దిక్కులా అంధకార మావరిస్తుంది. మఱలిపోవుటకై యత్నించుసమయమున నొకశకట మాదెసకే వచ్చు చున్నట్లు కనబడెను. ఒకలేడీడాక్టరునుకూడా ఆ ఉద్యమములో తోడ్పడుటకై ప్రభుత్వమువారు నియోగించేరు కాని ఆమెఇంకనూ రాలేదు. బహుశా ఆబండి ఆమెదై యుండనోపునని సుదర్శనుడు వేచి యున్నాడు. దైవఘటన అవిలంఘనీయము. సువర్ణ ఆ బండినుండి దిగినది. ఒకరినొకరుచూచి చకితులైరి. కొంతవర కెవరినోటనుండీ మాటరాలేదు.

"సువర్ణా స్వాగతము. నీరాక ముందుగా తెలియ బఱచకుండా బయలుదేరేవేమి? ఇక్కడనుండి శిబిర మునకు బండిపోదు. సామానంతయూ కూలివాండ్రచే పట్టించుకొని నడచివెళ్లాలి. చీకటికూడా పడ్డాది. పొలములలోనుండి నడవడం ప్రమాదకరము. దైవ వశాత్తు నే రాబట్టి కాని లేకున్న ఈ నిర్జనప్రదేశమున చాల కష్టపడియుందువు."

"నా ప్రయాణము బయలుదేరువరకూ నిశ్చయము కాలేదు. అదిగాక ఇక్కడింతఅవస్థ పడాలనికూడా తెలియదు."

సుదర్శనుడు కొందరి కూలివాండ్రను, రెండు లాంతరులను తక్షణము పంపుమని శిబిరమునకు ఉత్త రమువ్రాసి బండివానిద్వారా పంపించెను. సువర్ణా సుదర్శనులు ఆ సమీపముననేఉన్న చిన్నవంతెన గట్టుపై కూర్చొని సంభాషణ కుపక్రమించేరు.

సువర్ణఅత్తవారిఇంటనుండి పలాయనమైన తరువాత అధిక ప్రయాసముపై తండ్రిని చేరుకొన్నది. ఎండ కన్నెఱుంగని ఆ ఇల్లాలు అనేకకష్టములకు లోనౌటచే దేహదారుఢ్యము క్షీణించింది. వైద్యుల ఉద్దేశము ననుసరించి ప్రఫుల్లుడు ఆమెను భవానీ పురమునకు గొంపోయి కొంతకాలము చికిత్సలోనుంచెను. ఇంతలో ప్రభుత్వమువారు క్రొత్తగా నియమించిన క్షామనివారణ సంఘములో సువర్ణను లేడీడాక్టరుగా నియమించుచూ తత్క్షణమే ఉద్యోగములో ప్రవేశించమని ఆజ్ఞాపత్రము పంపిరి.

"సువర్ణా, చాల తొందరపడి నిన్నవమానపఱుచుచూ ఉత్తరమువ్రాసేను. నే చేసినది గొప్పపొరపాటు. నన్ను క్షమించాలి."

"ఇందు మీరొనర్చినదేముంది క్షమార్పణకు? కృత్రిమవేషంవేసుకొని మానవహృదయాన్ని హింసించినందుకు నేనే క్షమాపణకోరాలి."

"సువర్ణా ఇంకనూ నీకసి తీరలేదా? కుందికుములు చున్న నా మానసమును నిష్ఠురోక్తులతో నేల కలంచెదవు? మన పూర్వస్నేహమును జ్ఞప్తికి తెచ్చుకొని నన్ను మన్నించాలి."

"సుదర్శన్, ఎండమావులని ఎఱింగి నీటికై యింకనూ ఆశయేల? నే నొకనామమాత్రపు గృహిణిని. నా జీవితము కడువిహ్యమైనది. నావంటి దౌర్భాగ్యురాలీలోకమునయుండబోదు. భగవంతుడు కలకాలము ఇట్లే జీవింపుమని మూడుపంక్తులూ నా నుదుట వ్రాసేడు. ఇట్టి నికృష్టను చేబట్టి మీయశశ్చంద్రికల కేల కలంకము చేకూర్చుకొనెదరు? మన పూర్వస్నేహమును స్వప్నగత వృత్తాంతముగ పరిగణించి స్వస్తిచెప్పవలసిందనే నా ఉద్దేశము."

"సువర్ణా నీవెంతటిబేలవు. మానవులు బుద్ధితక్కువచే చేయుపనుల ప్రతిఫల మనుభవించునపుడు విధికృతముగా తలంచుట వెడగుతనము కాదు? ముక్కుపచ్చలారని పిల్లకు మూన్నాళ్లముచ్చటచేసి ముడుపలికి ముడిపెట్టి భర్తమొగ మెఱుంగనిదే బాలవితంతువనిపించి "పూర్వజన్మమున ఏ పుణ్యాదంపతుల నెడబాటు చేసెనో అనుభవింపక తప్పుతుందా?" అని అనడంలో అర్థంవుందీ? నీవే యోచించుకొనుము, యుక్తాయుక్త వివేచనగలదానవు. నా ఆశయముల నడుగంటనీయకుము. మన స్నేహలతకు దోహదమొసంగుటకు మారు కూకటివేళ్లతో పెకలింపకుము. శాస్త్రసమ్మతములు సానుకూలము కాకపోయినను సంఘము కత్తికట్టినను వెఱచి వెనుకంజవేయువాడను గాను. సువర్ణా నీకింకను సంశయము వీడలేదా?"

"సుదర్శన్, అదిగో కూలివాండ్రరుదెంచుచున్నారు. శిబిరమునుచేరి సావకాశముగా ఈ విషయమైఆలోచిద్దాము. నాకుమాత్ర మింకనూ శ్రీవిలాసుడన్న సింహస్వప్నము సుమా."

"ఇదేమి సువర్ణా స్వర్గమునకుపోయినను సవతిపోరేనా?" అని సుదర్శనుడు మందహాసమొనర్చెను.

సువర్ణ సిగ్గున తలవాల్చినది. స్త్రీలకు సిగ్గు సహజగుణము.

---

లోకమునుమాయ మూకుడులేదు. సువర్ణ పలాయనవిషయమై భట్టుగ్రామమున ఆబాలగోపాలము పరిపరివిధముల చెప్పుకొనుచుండిరి. ఆమె ఎవరో డాక్టరును ప్రేమించుటవలననే అత్తవారింటనుండి అదృశ్యమైనదన్న వదంతి ఊరంతా మారుమ్రోగింది.

శ్రీవిలాసుడు సువర్ణజాడను తెలుసుకొనుటకై విశ్వప్రయత్నమొనర్చి విఫల మనోరథుడయ్యెను. కొంతకాలమునకు వార్తాపత్రికలవలన ఆమె ఉనికిని కనుగొని ఎట్లయినను సుదర్శనున కవమానపఱిచి తన భార్యకు తగినబుద్ధి చెప్పవలయునని బయలుదేరెను.

నాడు చేయవలసినపని పూర్తియగుటచే సువర్ణ తన డేరాలోకూర్చొని విశ్రాంతితీసికొనుచున్నది. ఆమె

తన భావిజీవితసమస్యను పరిష్కారమొనర్చుటకై పరిపరి విధముల నాలోచించుచున్నది. ఒకప్రక్క నగ్ని సాక్షిగా వివాహమాడిన భర్త — వేరొకదెస మనస్ఫూర్తిగా ప్రేమించుచున్న ప్రియుడు.

ఇంతలో శ్రీవిలాసుడు ప్రత్యక్షమై వికృతహాస ముతో సువర్ణనుద్దేశించి "ఆడుదానివై పుట్టి బహు యోగ్యమైన పనిచేసేవు. తులసివనములో గంజాయి మొక్కవలె పేరుప్రతిష్టగల బ్రాహ్మణకులమునపుట్టి యిరువంశములవాళ్లకు మాయనిమచ్చతెచ్చి పెట్టేవు. నిన్ననవలసినపనిలేదు. ఆ ముసలిపీనుక్కి బుద్ధిపెడతల పట్టబట్టి నిన్ను చదివించేడు. లేకపోతే అడుదానికి చదువేమిటి? అందులో డాక్టరుపరీక్ష!! డాక్టరుపరీక్ష చదువుకొని సౌశీల్యమును కాపాడుకొనిన స్త్రీలను వ్రేళ్లపై లెక్కింపవచ్చు. నీవు ఉద్యోగములుచేసి ఊళ్లేలక్కరలేదు. ఇప్పటికి జరిగిందేచాలు. తలెత్తు కొని తిరుగలేకపోతున్నాము. ఇక దయచెయ్యం"దని పల్కెను.

సువర్ణ నిలువునీరయ్యెను. ధైర్యము తెచ్చుకొని "మీ రాడవలసినమాటల కిది సమయము కాదు; స్థల ముకాదు. మనిషన్నవా డాడినమాటలకు సబవు సంద ర్భముండాలి. ఇది ప్రభుత్వపు శిబిరము కాని మీయిల్లు కాదు. మర్యాదగా మీ రే దయచెయ్యం"డని ప్రత్యు త్తరమిచ్చెను.

"నేను కదలకపోతే మీసుదర్శనునితో చెప్పి వెళ్ల గొట్టిస్తావేమో? రోతు మెత్తదనమును చూచి గుఱ్ఱము మూడుకాళ్లతో నడిచిందట. ఆరునూరైనా నూరా రైనా నీవు నాభార్యవు. ఈ బంధము తనువులతో నంతరించవలసినదేగాని తాత్కాలికము కాదు. లోకులు నిన్నపహసించిన నన్నుగూడ నపహసించినట్లే. క్షణ భంగురములగు తుచ్ఛసుఖముల కాసించి శాస్త్రవిరుద్ధ ముగ సుదర్శనుని చేపట్టినచో నీవొనర్చు దుర్నయము నకు ప్రతిఫలముగ నీ కడుపునబుట్టిన బిడ్డలు గతిలేక కలకాలము నీప్రాణమున కేడ్చి చావవలసిందే"యని మఱల నుపన్యసించెను.

"మీ యనవసరప్రసంగమున కంతులేదేమో? నాకు తొందరపనిఉంది; వెళ్ళా"లని సువర్ణ వైద్య శాలకుపోయెను.

గత్యంతరములేక శ్రీవిలాసు డచోటువాసెను.

ఇంకను కుంభవృష్టికురియుటచే సుదర్శనుడు శిబిర మునుమార్చు ప్రయత్నములోనుండెను. ఒకసేవకుడు పరుగున సుదర్శనునికడకేతెంచి "బాబూ, ఎవరో నా లా ఆపదలోనున్న రోగినితెచ్చి తమకు తక్షణమే పిలువుమని బ్రతిమాలుచున్నా"డని చెప్పెను.

"ఏమి? అచ్చట లేడీడాక్టరుగారు లేరా?"

"లేరుబాబూ. ఎవరో ముదుసలివచ్చి తనకూత రికి బాగులేదని కాళ్లమీదపడి బ్రతిమాల ఆయన ఇంటికివెళ్లేరు."

"మీ రెందు కామెవెంట వెళ్లలేదు?

ఇదంతయూ శ్రీవిలాసుని పన్నాగమైయుండనోవు పదండి; కొంపమునిగిం"దని శరవేగమున పరుగెత్తెను

సుదర్శను డనుచరులతో శిబిరమునుచేరి భైరవీన మధ్యమున ఒకనావ మందగమనమునపోవుచుండుట గమనించెను. దూరదర్శి యంత్రమునందు శ్రీవిలా సుడు బలవంతముగా సువర్ణను చెరగొనుచున్నట్లు కనుగొనెను. "రండు: ఆలసించినచో నాశాధం మగు"నని త్వరితముగా దుస్తులనుమార్చి ఆప్రవాహ మున దుమికి పడవనుచేరుటకై ఈదుచుండెను.

శ్రీవిలాసు డీదృశ్యము నవలోకించి నావికుల ద్రవ్యాసచూపి నావను త్వరగ నడిపించుట యేర్పాటుచేసెనుగాని యెంతయత్నించినను ప్రవా వేగమున పడవనడువదయ్యెను.

సుదర్శను డనుచరులతో పడవను సమీపించుట గాంచి పడవలోనున్నవా రాందోళనతో నటూ యిటూ కదలుటవలన పడవ నీటమునిగినది.

సుదర్శనుడు సువర్ణను ప్రవాహమునుండి పైకితీసి శిబిరమునకు గొంపొమ్మని సేవకులకొసంగి శ్రీవిలాసునితో ముష్టియుద్ధమునకు కడంగెను.

ఇరువురును సమవయస్కులు; క్రోధఘూర్ణితమానసులు. మదపుటేనుగలవలె పోరి, యలసి, సొలసి స్పృహాతప్ప ప్రవాహమున మునిగిపోయిరి.

సేవకులు చైతన్యహీనులైన సువర్ణాసుదర్శనులను శిబిరమునుచేర్చి వలయు వైద్యసహాయము నొసంగిరి.

కొంతసేపటికి సువర్ణ సేదదేరి "డాక్టరుగారే" రని చెంతనున్న సేవకుని ప్రశ్నించెను.

"అమ్మా, ఎన్నిమందులు వేసినను తెలివిరాలేదు. అపాయస్థితిలోనున్నారు. జీవించునను యాశలే"దని యేడ్చుచూ ప్రత్యుత్తరమిచ్చెను.

సువర్ణ దీర్ఘనిట్టూర్పువిడచి "శ్రీవిలాసు దేమయ్యె"నని మరల ప్రశ్నించెను.

"ప్రవాహమున కొట్టుకొనిపోయి మరణించె"నని సేవకుడు దెల్పెను.

సువర్ణ కనులు మూతలుపడెను. శాశ్వత సుషుప్తి జెందిన ఆమె నయనములనుండి యశ్రుకణములు రాలెను.

* * * * *

ఓమ్ శాన్తిః !

# మరువదగని – మగువలు

అయ్యల సోమయాజుల సుబ్బారావుగారు.

భారతభూమిలో దత్రాపి ఆంధ్రదేశమునం దిట్టి సహగమనపుం బేరంటాండ్రకథలు లెక్కకు మిగిలి యున్నవి. అవియన్నియు నందరకును దెలియవు. కొన్ని కొన్నిప్రదేశములయందు గొన్నికొన్ని మాత్రమే యెఱుకపడియున్నవి. అట్టివానిని సాధ్యమైనంతవఱకు సేకరించుట యుక్తముకదా. ఇక వానిసత్తాయందు విశ్వాసములేనివారికంటె విశ్వాసమున్నవారలే పదిరెట్లెక్కువగ నున్నారు. ఎట్టిదైనను అచంచలవిశ్వాసమే మానవులకు గుణము. "తానకృత్స్నవిదోమందాన్ కృత్స్నవిన్నవిచాలయే" త్తను గీతాప్రమాణమును దలచి తత్త్వవిదులగు వారిట్టివిషయములయెడ సానుభూతి జూపుదురుగాక.

(సంపాదకులు)

## గౌరీదేవి

సర్వసంపత్తులతోటీ తులతూగుతూ తోటిదేశాల తలదన్ని వీరపురుషులతోటీ సతీమణుల దివ్యచరిత్రలతోటీ కూడుకొని కొంత కాలం తనకుదానే సామ్యమనుకొని విఱ్ఱవీగుతూండే భారతదేశం ఇప్పుడు ఇతరులపాలనకు లోబడి పూర్వాచారాలు కోల్పోయి అనుకరణమే ముఖ్యముగా పెట్టుకొని తన సహజత్వాన్ని పోగొట్టుకొని పరబుద్ధిపై నాధారపడివుంది.

పూర్వకాలం యీదేశాన్ని గొప్పగొప్ప వీరులు శాసించి దీని సిగపువ్వాడకుండా చేశారు. వీరవనితామణులైన దేశాభిమానినులగు సాధ్వీమణులుకూడా తమ చాతుశక్తులా దేశప్రేమ చూపించారు. ఒకవీరుడు తన శక్తివంచనలేకుండా పాటుపడి భారతదేశమును మహమ్మదీయులనుండి కాచి రక్షించాడు. మఱియొకవేత్త అఖిలభారతదేశాన్ని దాస్యవిముక్తిచేసి కీర్తిగడించాడు. ఇట్లే వీరవనితాలోకము గూడ తమశక్తిని ధారపోశారు. ఒకసాధ్వి భర్తనుగోల్పోయి బంధువర్గానికిదూరమై అరివర్గం చుట్టుముట్టినప్పటికీ తన నిశితకృపాణధారలచే శత్రువుల బారద్రోలి తనసేవ తానుచేసింది. మఱియొక వీరవనిత దేశమునకై శత్రువులమధ్య వీరవిహారంసల్పి ప్రాణములు గోల్పోయింది. యితరదేశాలకన్న శౌర్యానికీ బలానికీ, భక్తికీ, మనదేశమే మిన్నయివుండేది. దేవబ్రాహ్మణభక్తి, పరమార్థచింత యిప్పటికీ పోలేదనే నమ్మకం. పూర్వం ఎదిరిబలం ఎక్కువై తమబలం తక్కువైనప్పటికీ తమ స్త్రీల పాతివ్రత్యప్రభావంచే శత్రువుల దునుమాడినవారెందఱోగలరు. మఱియు పతిపాదపూజనముచే కొన్ని యద్భుతకార్యాలు చేసి వన్నెకెక్కినవారెందఱోగలరు. అరుంధతి, అనసూయ, సీత, సుమతి, సావిత్రి, తులసి మొదలైన సాధ్వీమణులంతా తమ శక్తివల్లనే యెంతో కీర్తిగడించారు. ఇది పురాణయుగంమాట. ఇప్పుడుకూడా అట్టివారున్నారంటే మనదేశం గర్వించవలసిందే. గర్విస్తోందికూడాను. ఇదివఱకు ప్రకటించిన ఎఱుకమ్మ, వేంకమాంబల చరిత్రలు నిదర్శనాలై వున్నాయి. వాటి నెఱిగిన

వారు కొంతమందికాక కొంతమందేనా వున్నారు. ఇప్పుడు చెప్పబోయే గౌరీసాధ్వి చరిత్ర అట్టిదికాదు. ఎఱిగినవా రొక్కరూ లేరు. పారంపర్యంగావస్తూన్న తద్దివ్యకథాను వర్ణనమే ముఖ్యాధారం. లేనికథ లోకంలో పుట్టదు. ఇదియొక ఆఖ్యాయిక యను కొన్నను నష్టంలేదు. దీని నిజానిజములు పాఠకులే నిర్ణయించుకోవాలి.

విశాఖమండల ప్రాంతమున శృంగవరపు కోటతాలూకాలో యొక కుగ్రామముండింది. దానికిప్పుడు గౌరమ్మపేటయని వాడుక. పూర్వము దానిపేరేమిటో తెలియదు. అందు ఒకక్షత్రియకులంలోపుట్టింది గౌరీదేవి. ఇప్పుడందు క్షత్రియులు లేనేలేరు. వ్యవహారరీత్యా యితరస్థలాలకు పోయివుండొచ్చు! గౌరీదేవి పుట్టింటివారు సామాన్యసంసారులు. వ్యవసాయమే జీవనాధారం. పద్దెనిమిదేళ్లు పైబడ్డాయి గౌరీదేవికి. రజస్వలానంతరవివాహం క్షత్రియకులాచారంగా తప్పు లేకపోయినప్పటికీ ఒక యింటిదాన్ని చేసి తనభారం తగ్గించుకొందామనుకున్నాడు గౌరీదేవితండ్రి. సరియైన సంబంధందొరక్క కొంతకాలం వ్యయం చేశాడు. కొసకి తనబోటిసంసారుల పిల్లవానిని చూచి వాని రూపసంపదకు సగుణౌదార్యాదులకు మెచ్చుకొని గౌరీదేవి నాతనికిచ్చి పెండ్లిచేశాడు తండ్రి. రతీమన్మథులవలె, పార్వతీ పరమేశ్వరులవలె, లక్ష్మీనారాయణుల వలె రూపములో నేమి; సుగుణసంపదలో నేమి; భక్తిప్రేమలవిషయములోనైతే నేమి ఒకరి కొకరు తీసిపోకుండా భార్యాభర్త లిద్దఱూవుంటూండేవారు; కాని ఎప్పటికేనా ఇట్టిచోటనే విఘాతం తటస్థిస్తూవుంటుంది. సామాన్యంగా వొకరితో కయ్యానికి కాలు దువ్వనివాడైనప్పటికీ గౌరీదేవిభర్తకు నీటి తగాదాలవిషయములో అవ్రాళ్లో కొంతమందితో అంతఃకలహం లుద్భవించాయి. వాటి కన్నిటికీవోర్చి తన పనేదో తానుచూచుకుంటూండేవాడు. ఒక రోజురాత్రి కొందఱు ఎదిరివర్గంవారు ఇతనిపొలమునకు పోవునీటిని అడ్డువేసి తమపొలానికి త్రిప్పుకొన్నారు. ఆ సంగతి ఉదయమే తెలిసి గౌరీదేవిభర్త పొలానికివెళ్లి తిరిగి తనపొలమువైపానీటిని త్రిప్పివేసినాడు. అప్పు డాశత్రువులు కఱ్ఱలుచ్చుకొని తయారయ్యారు. తన ప్రాణరక్షణకొఱకై గౌరీదేవిభర్తకూడా కఱ్ఱదీసుకొని నిలబడ్డాడు. ఎంతయైనా క్షత్రియబిడ్డకాదూ? శత్రువులు పదిమంది, తనువొక్కడే. ప్రాణరక్షకే ప్రయత్నిస్తున్నాడు. అయినా ఆకొట్లాటలో ఎవడికేనా తగలదా? ఒకడికి దెబ్బ తీవ్రంగాతగిలి పడిపోయాడు. దాంతో వాడి ప్రాణాలు అనంతపథాన్ని కలిశాయి. మిగతావారు రెట్టించిన కోపంతో తిరగబడ్డారు. యెలాగో తప్పించుకొని యింటికివచ్చాడు గౌరీదేవిభర్త. ఇంటికొచ్చిన భర్తసంగతంతా తెలిసికొని విచారించి ఉపచారాలు చేసింది గౌరీదేవి. భర్తను ఇల్లుకదలనీకుండా చూచింది. ఇంతలో ఆమఱునా డుదయమయ్యేసరికి పదిమందిపోలీసులు, ఇన్స్పెక్టరు వచ్చేశారు. గౌరీదేవిభర్తను అరెష్టుచేసి కచ్చేరిసావిట్లో ఒక గదిలోనుంచి తాళం

వేశారు. ఆపైని పంచాయితీచేసి శవాన్ని దహనపర్చడానికి ఆజ్ఞయిచ్చి బంధితుని తీసికొనిపోదామని కచ్చేరిగది తలుపుతీసిచూస్తే శవముమాత్రమే దొరికింది. ఎన్నడూలేని అవమానం జరిగిందిగదాయని ఆలోపలనే ప్రాణాలు వదిలేశాడు గౌరీదేవిభర్త. ఎలా ప్రాణంపోయిందో ఎవరికీతెలియదు. ఒకదానికి మఱొకటి. ఆరోజు అక్కడేవుండిపోయి పంచాయితీచేసి నాభోసల్లమందో తిన్నాడని నిర్ధారణచేసి దహనాని కార్డరిచ్చాడిన్స్పెక్టరు. తీసుకుపోయారుశ్మశానానికి గౌరీదేవిభర్తను. చితిప్రజ్వరిల్లింది. ఎక్కడనుండి వచ్చిందో ఘోషావిడిచి గౌరీదేవి. చితిలో నురకడానికి సిద్ధమైంది. దాంతో ఇన్స్పెక్టరుకు వళ్లుమండుకొచ్చి ఆమె జుట్టందుకొని బరబరా లాక్కుపోయాడు వూళ్లోకి. ఆమె నామెయింటోనేపెట్టి పైనితాళంవేసి ఆరాత్రికి అక్కడేవుండిపోయాడు. గౌరీదేవి నింట్లోపెట్టి తాళంవేశాడేగాని పతివ్రత కీ తాళాలు, ఈ బంధనాలు అడ్డగలవా యన్నసంగతి తెలియదిన్స్పెక్టరుకు.

అర్ధరాత్రి అయింది. అందఱూ నిద్రాముద్రితులైనారు. పెరటిగోడదాటి రెండు కట్టెలుమాత్రం భుజానవేసుకొని శ్మశానానికి బయలుదేరింది గౌరీదేవి ఆ చితికే ప్రదక్షిణం చేసి తను తెచ్చిన రెండుకట్టెలు చెరో పక్కపెట్టుకొని చితిలోపడుక్కుంది. ఇంతలో ఎవడైనా చూడడా! ఇన్స్పెక్టరుకు ఊదేశాడు. అప్పు డిన్స్పెక్టరు వగైరాలు శ్మశానానికివస్తే ఏముంది? భగభగమంటలే! ఆరిపోయిన చితి రెండుకట్టెల సహాయంతో ఇంతమంట మండుతూన్నందుకు ఆశ్చర్యపోయారంతా. రూపాయి మొగాలుపెట్టేసి చూస్తూ కూర్చున్నారు. అయిదునిమిషాలకే అంతా పూర్తయిపోయింది. తెల్లపోయారు వచ్చినజనం. నిప్పైనాలేకుండా ఆరిపోయింది చితి. ఈ విపరీతపరిణామం వింతగా చెప్పుకుంటూ తెల్లవార్చేశారు. ఉదయమయ్యాక చితిచూచి అందఱికీ ఆశ్చర్యం కలిగింది. గౌరీదేవిజుట్టుమాత్రం కాలకుండా వుండిపోయింది. ఏంచేతనని తలోఆలోచన్లోకి పోయారు. అప్పు డిన్స్పెక్టరే కళ్లుతెఱచి నమస్కారంచేసి ప్రార్థించాడు. అప్పుడు కిరసనాయిలు పోసినట్టు ఒకమాటు భగ్గున మండి ఆరిపోయింది. మఱి జుట్టులేదు. ఇన్స్పెక్టరు చితిచుట్టు మూడుసార్లుతిరిగి చెంపలు వాయించుకొని చేసినతప్పును క్షమాపణ కోరాడు చితిదగ్గఱ మోకరించిరి.

తరవాత ఊళ్లోకిపోయి యీసంగతంతా మూడురోజులుండి విచారణచేసి నేరం గౌరీదేవిభర్తయందు లేకపోవుటకు చాలవిచారించి తగుచర్య తీసుకొన్నాడు. నిష్కారణముగా ఇద్దఱు పుణ్యమూర్తులను తన అవివేకముచే మట్టిలోకలిపినందుకు చాలా విచారించాడు. ఇంకేముంది? ఈచరిత్ర ఈష్టిండియాకంపెనీవారి కాలమున జరిగినదని పెద్దలవల్ల వినికిడి.

## ఒన్నూరమ్మ

అహల్యాభాయి, ఝాన్సీ లక్ష్మీబాయి, ఛాందసుల్తానా మొదలైన వీరవనితామ తల్లుల జీవితములు మనము వింటున్నాము. జగత్ప్రసిద్ధులైన వారలకథలే మనకు ఆనంద దాయకముగానున్నవి. వారివలె గొప్ప రాజ్యము నేలకపోయినప్పటికీ ఒన్నూరమ్మ కూడా కొన్ని గ్రామముల పరిపాలించిన రాణి. వారివలె అశేషసేనాసమూహాము మధ్య వీరవిహారం సలుపకపోయినప్పటికీ కొద్దిపాటిసేనతో పోరాడిన వీరవనిత- ఈమె కడపజిల్లాలో తిప్పారెడ్డిపల్లెయను గ్రామమునకు పాలకుడగు కుమార నరసింహారాయని ధర్మపత్ని. భర్తకు అన్నివిధాలా సహచారిణియైమెలగి ఆతని పొగడ్తలందినది. ఎల్లప్పుడూ బీదసాదలపట్ల మిక్కిలి ప్రేమగా నుండేది. కొంతకాలానికి నరసింహారాయలు మరణించినాడు. ఒన్నూరమ్మపై భారమంతా పడింది. భర్త మరణించగానే ఆతని పూర్వశత్రువు లామెపై కుట్రలుపన్ని ఆమె కున్న కొద్దిపాటి గ్రామములున్నూ అపహరించ తలచుకొన్నారు. రోజురోజూ ఒన్నూరమ్మకు కష్టాలు మిక్కుటంగా వస్తున్నాయి. శత్రువులబారినుండి తప్పించుకోడానికి తిప్పారెడ్డి పల్లెలో నొకకోట కట్టించింది ఒన్నూరమ్మ. అయినప్పటికీ ఆమె కష్టాలు గట్టెక్కలేదు. కొసకిలాకాదని అక్కడకు పదిహేనుమైళ్ల దూరంలోవున్న చాకర్లపాడు అను గ్రామంలో కోటకట్టించి అందులోనుండి రైతులనందరినీ మంచిచేసుకొని వారివల్ల సేవలు చేయించుకొంటూ కులాసాగా తన జమీకేమీ ఆపాటం రాకుండా కాచుకొస్తోంది. తన రక్షణకై కొంత సేననుకూడా నిలుపుకుంది. వ్యవసాయదారులకు అదివరకు కన్న నీటిసదుపాయం ఎక్కువగా కలగజేసి వారి భక్తికి పాత్రమై రోజురోజూ అభివృద్ధిలోకివస్తోంది. అదిచూచి శత్రువులు సహించలేకపోయారు. వారు ప్రత్యేకంగా ఒన్నూరమ్మపై దాడివెడలి జయించలేరు. ఎవరి సాయమేనా కావాలి అందుకోసం చూస్తున్నారు.

ఇట్లావుండగా హైదరాలీ దండయాత్రకు వెళ్ళి తిప్పారెడ్డిపల్లెమీదుగా తన సైన్యముతోగూడ మైసూరుకు వెళ్లి పోతున్నాడు. ఒకరోజు తిప్పారెడ్డిపల్లెలో మకాంచేశాడు. అప్పుడు ఒన్నూరమ్మ శతృవులు ఆమెపై లేనిపోని కొండెములు హైదరాలీతో చెప్పి ఆమెదగ్గఱ విశేషముగా ధనమున్నదని హైదరాలీకి ఆశను పుట్టించారు. దానిమీద హైదరాలీ అమల్దారును చాకర్లపాడువెళ్లి ఒన్నూరమ్మను ధనమిమ్మని అడగమన్నాడు. ఆప్రకారంగానే ఆ అమల్దారు చాకర్లపాడు పోయి ఒన్నూరమ్మను కలిసికొని హైదరాలీ చెప్పినమాటలు చెప్పాడు. అప్పుడు ఒన్నూరమ్మకు ఎక్కడలేని కోపంవచ్చి "డబ్బియ్య వలసిన అవసరం మాకేమీలేదు పో"మ్మంది దుష్టుడగు అమల్దారు ఆమె క్షాత్రతేజానికి మురిసిపోయి నెమ్మదిగా రెండుమూడు సార్లడిగాడు డబ్బు ఇమ్మని. కసిరివేసింది ఒన్నూరమ్మ. అప్పుడా అమల్దారు తనయిష్ట

మెచ్చినట్లామెను తూలనాడాడు. వినలేక రౌద్రాకారిణియై బల్లెముతో నాతని పొడిచి వేసింది ఒన్నూరమ్మ. ఈసంగతి హైదరాలీకి తెలిసి వెంటనే తన సేనతోగూడ చాకర్ల పాడుపై దండెత్తాడు. ఒన్నూరమ్మకూడ తన సేనల జాగ్రత్తపఱచుకొని కోటతలుపులు మూసివేసింది. మహమ్మదీయ సైన్యములు కోటముట్టడించివేసినవి. కోటతలుపులు తీయుటకు ప్రయత్నిస్తున్నాడు హైదరాలీ. కోటగోడలపైనుండి ఒన్నూరమ్మ సైనికులు రాళ్లువిసరి, బల్లెములువిసరి, కాగిననూనె శిరస్సులపై దిమ్మరించి మహమ్మదీయుల ప్రయత్నాలు పాడుచేస్తున్నారు. కాని యిసుకపాతఱలాగున్న మహమ్మదీయుల ధాటి కోర్వలేకపోతున్నారు చాకర్లపాడు వీరులు. హైదరాలీ పట్టినపట్టు వీడక కోట తలుపులు భేదించుటకు ప్రయత్నిస్తున్నాడు. ఒకరోజు ప్రయత్నంతో కోటతలుపులు విడిపోయాయి. మహమ్మదీయులు అత్యుత్సాహంతో లోపల ప్రవేశించారు. దొరికిన వాణ్ణల్లా నఱికివేసినారు. ఇంక ఒన్నూరమ్మకు గత్యంతరం లేకపోయింది: డాలూ, కత్తీ తీసుకొని మహమ్మదీయులమధ్య నురికింది. వీరవిహారం సలిపింది. ఆమె ధాటికాగలేక పోతున్నారు మహమ్మదీయ సైనికులు! అయినా యింత సేనతో తానొక్కర్తే యెంతకని పోరాడగలదు? దొరికిపోయింది. హైదరాలీ ఆమెను బంధించి వూరంతా యిష్టమెచ్చినట్లు కొల్లగొని ఒన్నూరమ్మను తీసుకొనిపోయి దారిలో కరుణావిహీనుడై చంపి వేసినాడు. నాటిలగాయితు నేటివఱకు వూళ్లు పాడుపడినప్పటికీ చాకర్లపాడు తిప్పారెడ్డిపల్లె కోటలు శిథిలావస్థలోనున్నవట. ఒన్నూరమ్మ చనిపోయినప్పటికీ ఆమెపేరు వుండిపోయింది.

## ప్ర బో ధ ము

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

గీ. పాలలో నేయి గూఢమై పరగుభాతి
భూత భూతాన జ్ఞానమ్ము పొదివియుండె
స్వాంతమన్థానమున సదాసరవిఁదరచ
నది బయల్పడు. నుచ్చనీ చాదులేల ?

# స్త్రీల కెట్టివిద్య కావలెను?

బాలాంత్రపు వీరరాజు పంతులుగారు

స్త్రీవిద్యనుగుఱించి యిక్కాలమున పెక్కురు పెక్కువిధములఁ దలంచుచున్నారు. పాశ్చాత్యనాగరకతాభిమానులకును సనాతనవాదులకును దీనివిషయమున భేదాభిప్రాయములు గలవు. ప్రస్తుతము విద్యాలయములు, వీనియందు పురుషులకుఁ గఱపఁబడువిద్యయే స్త్రీలకుఁగూడ నావశ్యకమనియుఁ బురుషులవలె స్త్రీలును నుద్యోగములు చేయవలయుననియుఁ బురుషునితోసమానముగా స్త్రీయును బహిరంగసంస్థలలో సంచరించుచు ప్రపంచవేదికలపై స్వేచ్ఛావిహారమును జేయవలెననియు నవీనాశయుల యభిప్రాయము. సనాతనులమత మిందులకు వ్యతిరేకము. స్త్రీలకు బానిసవిద్య యెంతమాత్రమును దగదని వీరివాదము. ప్రస్తుతము విద్యయనుపేర విద్యార్థులకుఁ గఱపఁబడుచున్నది నిజమైన విద్యకాదనియు, విద్యకుండవలసిన ముఖ్యలక్షణము లందులేవనియు, విద్యయొసంగవలసిన పరిజ్ఞానముగాని, స్వేచ్ఛావృత్తిగాని యిప్పటివిద్యవలన నలవడకపోవుటయేగాక పైగా దానివలన బానిసవృత్తియే సంప్రాప్తమగుచున్నదనియు, నట్టిదవుట నది పురుషులకే గ్రాహ్యముగాదనియును, స్త్రీలకది యసలేతగదనియును వీరు వక్కాణింతురు. అయితే స్త్రీలకెట్టి విద్యకావలెనను విషయమున మాత్రము వీరికి భేదాభిప్రాయములున్నను స్త్రీలకు విద్యయనున దవసరమనుట సత్యము. నాగరకులెవ్వరును స్త్రీలకు విద్య యవసరములేదనిచెప్పరు. కాని ఆవిద్య యెట్టిదిగా నుండవలయుననునది విచారణీయము. ఈ సందర్భమున మనము పాశ్చాత్యదేశములనుండి యేమైనను విలువగలసంగతుల నేర్చుకొననగునా — లేక స్వదేశచరిత్రవలన ప్రయోజనముకల్గునా — యను విషయము లాలోచింపవలసియున్నది. కావున నన్యదేశములకును మనభారతదేశమునకునుగల ముఖ్యతారతమ్యములు, నాగరకతావిషయము, సంఘజీవనము, వీనిసంగతి కొంచెము జ్ఞాపకముచేసికొని చూడవలసియున్నది.

భారతదేశపు నాగరకత కడుప్రాచీనమైనది. పాశ్చాత్యదేశము లరణ్యాకీర్ణములై యందలిజనులు నాగరకతయనునదియే యెఱుంగక మృగప్రాయులుగా నుండుకాలమున మనదేశము మహోన్నతస్థితియందుండినట్లు చరిత్ర నుడువుచున్నది. అప్పు డన్యదేశస్థులు వస్త్రధారణయుఁగూడ నెఱుంగక దిగంబరులుగనో, పర్ణలతాచ్ఛాదితులుగనో యుండి, యపక్వామిషాదు లాహారముగాఁగలిగి గహనములయందే చెట్లకొమ్మలపైనను కొండగుహాలలోను నివాసమేర్పఱచుకొని జీవించుచుండిరి. గృహనిర్మాణాదులు వారెఱుంగరు. అట్టికాలమునఁగూడ భరతవర్షమునందు జనులు నాగరకులై, వాణిజ్యము, రాజ్యపాలనము, యుద్ధము మొదలగు కళలయందు ప్రవీణతగలవారై ప్రజ్ఞావంతులై గొప్పసంగతుల ననేకములను గనిపెట్టి వేదశాస్త్రపురాణేతిహాసాదులమూలమున లోకమునందు మహత్తరవిజ్ఞానము బ్రకటించిరి. ఇటీవల శాస్త్రజ్ఞులు యంత్రసామగ్రీసహాయముచే గనుగొనఁ బ్రయత్నించు భూగోళఖగోళాదిరహస్యములు భారతఋషులు స్వానుభవముచేతను, దివ్యదృష్టిచేతను నామూలాగ్రముఁ దెలిసికొని వ్రాసియుండిరి. వారికిఁ దపశ్శక్తియు ననుభవజ్ఞానమును నపారముగానుండెను. అంతఃకరణశుద్ధిగలిగి భగవత్ప్రేరితులై, నిష్పాక్షికమనీషాగరిష్ఠులై, ధర్మములనువ్యక్తపఱచి పాలకులకు

బోధించిరి. ప్రభువులు వాటి నవలంబించి ప్రజలచే నాచరింపఁజేసిరి. ఋషిప్రోక్తములైన వైదికరాజకీయాదిధర్మములు తత్తదనుష్ఠాతలవలన పరంపరాగతములై నిరంతరాయముగా నడచుచుండెను. అవి శాశ్వతములు, సర్వకాలోచితములు. ఒక్కొక్కప్పుడవి కాలగర్భమునఁ జొచ్చి నశించిన ట్లాభాసించినను మరల వాటిని కాలమే ప్రసవించి వ్యక్తపరుపఁగలదు. అట్టి యనశ్వరమైన ధర్మము లాధ్యాత్మికైకప్రయోజనములై, యైహికార్థబాధకములుగా నుండునట్లు నిర్వహింపఁబడినవి. దేహికి చతుర్విధపురుషార్థము లావశ్యకమైనవి. అందు నాల్గవదియగు మోక్షము సర్వోత్కృష్టమైనది. తక్కఁగల ధర్మార్థకామములను మూడును నైహికానందదాయకములై, యాముష్మికసాధనములునై యలరారుచున్నవి. ఇవి మూఁడును పరస్పరసంబంధబంధితములైనవి. ధర్మసంపాదితవిత్తమును, విత్తకృద్ధర్మమును, ధర్మార్థపరిలబ్ధకామమును ప్రతివ్యక్తికిని సంపాదనీయములు. ఇవి భూమియందు బొందఁగల సౌఖ్యములన్నిటికి నాకరములై తరువాత బ్రహ్మానందమునకు సాధనభూతములై యొసఁగుచున్నవి. యేవ్యక్తిగాని నిర్మలమైన మనస్సుకలిగి యాత్మీయధర్మములను న్యాయపద్ధతులచే నాచరించుచో నిహపరములసుఖ మనుభవించును. ఈ ముఖ్యసూత్రము నాధారముగాఁ జేసికొనియే మనపూర్వులు లోకు లాచరింపవలసిన ధర్మములు విధులు నిర్మించియుండిరి. మనవారు కరము దూరదృష్టి కలవారై మోక్షమును ప్రధానముగా నెంచి 'యద్దృశ్యంతన్నశ్యం' అను నార్యవచనము చెప్పిన సంసారసుఖములు నిత్యములుగావనియు, బ్రహ్మానందముతో సరిపోల్చుచుచిన నవి క్షణికములనియుఁ బరికించిరి. అయినను భూమిపైజన్మించిన తరువాత కర్మ యనివార్యము, నావశ్యకము. అందుచేనది వర్జింపనలవికాదనియు, నూహించి సత్కర్మల నేర్పరించిరి. లోకవ్యవహారమున కడ్డులేక యనుకూలముగ నుండులాగున వాటి నెవ్వరెవ్వ రేరీతి నాచరింపవలయునో చక్కఁగా నేర్పాటుచేసియుండిరి.

పాశ్చాత్యదేశము లిప్పుడు చాలయభివృద్ధిగలిగి గొప్పనాగరకతచేఁ బ్రకాశించుచున్నసంగతి యందరు నెఱింగినదే. వారిలో గొప్పశాస్త్రజ్ఞులు, పరిశోధకులు గలరు. వారిమతసిద్ధాంతములును ముఖ్యవిషయములలో నార్యమతసూత్రముల ననుకరించియేయుండును. అయితే లౌకికధర్మములలో వారికిని మనకును భేదముకలదు. మనవారివలె వారు తమలోకవ్యవహారధర్మములం దాముష్మికసాధనముల నిమిడింపక కేవలము నైహికప్రయోజనములచేతనే తృప్తిగాంతురు. వారిదేశపరిస్థితులకును, మనదేశ పరిస్థితులకును జాలభేదము కూడ నున్నది. మనదేశ మనాదినుండియుఁ బాడిపంటలుగలిగి గొప్పజీవనదులచేతను విశాలమైన మైదానములచేతను శోభిల్లుచు దేశవాసుల కన్నివిధముల సౌఖ్యము గూర్చునదిగానుండెను. అందుచేతనిందలి జనులు మిగుల స్వేచ్ఛావిహారులై నిర్మలహృదయములతోనుండి యేవిచారములేనివారై భగవంతునిగూర్చి తపస్సుచేసికొనుచు మోక్షచింతనాపరత్వముననుండి మానవాతీతమైన శక్తులను గడించియుండిరి. ఇతరదేశములన్ననో యందుండుజనులకు పనికివచ్చు నాహారసంబంధమైన పంటలుపండు భూములుగాని, పాడినిచ్చు తగినన్ని యావులు గేదెలు మొదలగు పశుసంతతిగాని లేక ఇనుము, బొగ్గు మొదలగు నుద్భిజ్జపదార్థములతో నిండియుండి తన్నివాసులకు సౌఖ్యము లేకయుండెను. అందుచే నక్కడిజనులు తమసంఖ్య వృద్ధియైనకొలది తమకందరకు సరిపడునన్ని వస్త్రములుగాని, తమకందరకు నివాసమునకు సరిపడు ప్రదేశములుగాని స్వదేశమున లేనివారై వాటికొఱకు వెదకికొనుచు నితరదేశములకు వలసబోవలసినవారైరి. పరదేశములకు వెళ్లినప్పుడాయాచోట్ల లౌకికసంబంధమైన చిక్కులనేకములు కలుగుచుండెను. ఆకారణమున సంసారసంబంధమగు జీవయాత్రకు కావలసిన

# స్త్రీల కెట్టివిద్య కావలెను ?

సాధనములు సంపాదించుకొనుటయందును, నా ప్రయత్నమునంపు వారికి గలుగుచుండెడి యాటంకములు నివారించుకొనుటకు తగినపరికరములను నిర్మించుకొనుట మొదలగు భౌతికవిషయములయందును మాత్రమే వారిబుద్ధి పనిసేయవలసివచ్చెను. ఇప్పటికి క్రమక్రమముగా నట్టిదేశములు చాలవరకు స్థిరపడి మంచిస్థితిలో నున్నప్పటికిని యాధ్యాత్మికవిషయమైన పరిశ్రమయందు పాశ్చాత్యదేశములు మనదేశమునకు చాల వెనుకబడియున్నది.

పైన చెప్పిన విషయములనుబట్టి చూడఁగా మనదేశపు సంఘజీవనమునకును, పాశ్చాత్యదేశముల సంఘజీవనమునకునుఁగూడ జాలతారతమ్యముండగలదనుమాట ప్రతివారికిని తోపకమానదు. నిజముగా నట్టితారతమ్యమునుగలదు. అది సహజమువు నగును. సంఘజీవనము స్త్రీపురుషులకుగల పరస్పరసంబంధముపైనను వారి ప్రవర్తనపైనను ముఖ్యముగా నాధారపడియుండును. సంసారమునందు సుఖదుఃఖములకుఁగూడ నవియే కారణములు. కావున వారిప్రవర్తనల నేర్పరించి సరిచేయుపద్ధతులను వారివారిస్వభావములకుతగినట్లుగా నిర్మాణముచేసి నడిపించునెడల సంఘౌన్నత్యము కల్గును. మనపూర్వుల కీసంగతులన్నియుఁ గరతలామలకములు. వారెఱుంగనిది భూతభవిష్యద్వర్తమానములయందు లేదు. కావున స్త్రీపురుషులకు వారివలన విధింపఁబడిన ముఖ్యధర్మములేవియో అవి యెట్లుచితములో యూహింతము. స్త్రీలకు పాతివ్రత్యము, గృహకృత్యము మొదలగునవియును బురుషునకు వేదాధ్యయనము, తపస్సు కృషి మొదలగునవియును ధర్మములుగా విధింపబడినవి. ప్రతివారును సత్ప్రవర్తనముగలిగి యోగ్యతతో నడచుకొనవలయుననునది సర్వసాధారణముగా నందరకు విధింపబడియున్నది. ప్రపంచకమునందు జనసంఖ్య పెరిగినకొలఁదిని, కాలక్రమమున వర్తకవ్యాపారము విజృంభించి యన్యదేశసంపర్క మధికమగుటవలనను, సత్యదూరములు, వ్యసనావిశిష్టములునగు విషయము లనేకములై జనులు సన్మార్గమునుండి తొలఁగి నడచుట కవకాశము లేర్పడినవి. మంచిచెడ్డల తారతమ్యమరసి సనాతనమార్గమున నడుచుకొనుటకు తగిన విజ్ఞానమునిచ్చునది విద్య కావున నిట్టివిద్య ప్రతివారికి నవసరమైయున్నది. ప్రపంచవ్యవహారమున కావశ్యకమగు ధనమును సంపాదించుటకుగూడ విద్య కావలెను. విద్య యనేకవిధములైయున్నది. వేదవిద్య, రాజనీతి, కృషి, వాణిజ్యము, శాస్త్రములు మొదలగున వనేకములు గలవు. ఒక్కడొక్క విద్యను సంపూర్ణముగా నేర్చికొనవలయునన్న జీవితమంతయు ధారపోసినను పరిపూర్ణత్వమును గాంచుట దుస్సాధ్యము. ఇట్టియెడఁ బ్రతివారును నన్నివిద్యలు నేర్చుకొనలేరుగదా! అయితే లోకప్రవృత్తికావిద్య లన్నిటివలనఁ బ్రయోజనముకలదు. కావున వృత్తిభేదమునుబట్టియు, వ్యక్తులస్వభావభేదమునుబట్టియు తత్తదనుగుణములగువిద్యలనభ్యసించిన లాభముగలుగును. మనపూర్వులారీతి నేవర్ణము లేర్పరించి వారివారివిద్యలు నిర్ణయించిరి. స్త్రీలకు పాతివ్రత్యము, శిశుపోషణ, గృహకృత్యము మొదలగునవి ధర్మములని చెప్పియుంటిమిగదా! పురుషధర్మములు వేదాధ్యయనము. కృషి మొదలగునవి యనికూడ నుడివియుంటిమి. స్త్రీలకు ప్రతినిత్యము గృహవర్తనమే ముఖ్యముగను, బురుషునికి కృష్యాదులనిమిత్తము బాహ్యప్రపంచకమున వర్తించుటావశ్యకముగను వారివారిధర్మములవలన విధింపబడుచున్నది. అయితే స్త్రీయెల్లప్పుడు యింటిలోపలనేయుండి యెన్నడును బైకిరాకూడదని యభిప్రాయముగాదు. ఆమె తనధర్మముల నతిక్రమించనంతవర కవసరమునుబట్టి స్వేచ్ఛగా విహరించుచునే యున్నది. వివాహాదిశుభకార్యములయందును, బంధుసందర్శనమునిమిత్తమును, యాత్రోత్సవదర్శనములందును మొదలగుసమయములలో స్త్రీయు బురుషునితోపాటు సమానముగా సంచరించుచున్నది. స్త్రీలకు మనవారలొసంగినగౌరవము, ప్రేమ, సంఘమునం దామె

కొసంగబడిన మాతృభావము, పూజ్యత యే నాగరకత గల్గిన దేశములలోను నొసంగబడియుండలేదు. ఈసంగతి తెలిసియుఁగూడఁ బాశ్చాత్యవ్యామోహములోఁ బడిన మనలో కొందరు స్త్రీ గృహమునందే యుండవలసివచ్చుట యామె స్వాతంత్ర్యమునకు భంగకరమని వాదింతురు. పైగా స్త్రీయుఁ బురుషునివలె నిత్యము నిరాఘాటముగా ప్రపంచవేదికలపై బహిరంగముగా సంచరింపవలయుననియుఁ బురుషుఁడాచరించుపనులన్నియు నిర్వహించి పురుషునితో పాటు సమానత్వము వహింపవలెననియు, గృహములు పాడుపెట్టి స్వేచ్ఛావిహారిణులై యుండవలెననియు, నట్టి సమానత్వము స్త్రీపురుషులకు గలిగినగాని దేశముయొక్క నాగరకతకు బరిపూర్ణత్వము గలుగనేరదనియు మొదలగు నిస్సారమైనవాదము లెన్నియో చేయుచున్నారు. ఈవాదము కేవలము వారిభ్రాంతిని మాత్రము వెల్లడిచేయును. ప్రపంచమునకు స్త్రీపురుషులిరువురును సమానకారణములు. వారలవినాభావ సంబంధముకలవారై సమానభాగస్థులై యున్నారు. కాని వారివారి ప్రత్యేకస్వభావములబట్టి వారల కృత్యములును ధర్మములును మార్పుచెందినవి. స్త్రీపురుషులస్వభావములు పరస్పరవిరుద్ధములని చెప్పవచ్చును. ఈ వైరుధ్యము లుపకారిగాక సృష్టికి కారణభూతమగుచున్నది. పరస్పరవిరుద్ధములగు విద్యుత్ప్రవాహములు రెండుకలసి యెట్లఖండమైన విద్యుత్కాంతిని జనింపజేయునో యట్లే స్త్రీపురుషులును నిర్మలులై తమతమ నియమితవృత్తులు మానక సంచరించుచు నేకీభవించునెడల మహత్తరమైన సృష్టికి సమర్థులగుదురు. అంతియకాని స్త్రీగృహకృత్యములు నిర్వహించుకొనుచు నింటిలో నుండవలయుననునది యామె స్వేచ్ఛకు నిర్బంధమని యెంచరాదు. పాశ్చాత్యులలో స్త్రీలు విచ్చలవిడిగా విహరించు నాచారముండిన యుండవచ్చును. అంతమాత్రమున మనకది యాచరణీయమని యెంచుట పొరబాటు. కొన్ని వ్యాపారవిషయములలో మనము వారివద్దనుండి నేర్చుకొనవలసిన విషయములున్నను మననాగరకతయే ప్రాచీనమగుటచే మననుండి నేర్చుకొనవలసిన గొప్ప విషయములు వారలు గ్రహించి యాచరించుకొన ప్రయత్నించుచుండుట నిజము. అట్టియెడ మనము మనదేశముయొక్క ప్రాచీనౌన్నత్యమును మఱచి యితరుల ననుకరింపఁజూచుట హాస్యాస్పదము. మనము భారతీయులమయ్యును మన పూర్వులగు వీరులు, ఋషులు, మహారాజులు మొదలగువారికిగల శక్తిసామర్థ్యములుగాని, స్వతంత్రశక్తిగాని యిప్పుడు లేనివారమై పరాధీనులముగా నుండుటఁబట్టి యుక్తాయుక్తవిచక్షణలేనివారమై వికారస్వరూపములయిన పరపద్ధతుల నవలంబింప సమకట్టుచున్నామని తెలిసికొని యికనైనను మేల్కాని తమ్ముఁదామెఱింగి కొనచో దాముచేయబూనునది తమ కనర్థదాయకమనియు స్వధర్మములే శ్రేష్ఠములనియు స్పష్టమగును. మనపూర్వులు భారతనారీమణుల కట్టి గౌరవము, పూజ్యతగలస్థానమును సంఘమందొసంగిరో సువ్యక్తమగును. ఇంకను స్త్రీలు సుకుమారులు, వీరమాతలునగుట వారికే హెచ్చుహక్కులుగూడ నీయబడియున్నవి. యే శుభకార్యముగాని ధర్మకార్యముగాని చేయునప్పుడు పురుషుడు ధర్మపత్నీసన్నిధానముననే చేయవలయును. యెట్టిసుఖదుఃఖములయందును స్త్రీపురుషులు సమానబాధ్యతగలవారై యున్నారు. పురుషుడుచేయు పుణ్యములో సగము తన ధర్మపత్నికిచెందును. ధర్మపత్ని యాచరించు ధర్మములో పురుషునకు భాగములేదు. ఏ సత్యనారాయణవ్రతమునందైనను తనపత్ని తనతో సమానముగ పీఠము నలంకరించినగాని యది నెఱవేర్పవీలులేదు. తుదకు బ్రాహ్మణార్థముచేయుటకైనను భార్యలేనివాడు పనికిరాడు. ఇట్లే అనేకవిధముల స్త్రీలకు సంపూర్ణములైన హక్కులు హిందూశాస్త్రములు ప్రసాదించుచున్నవి. ఈ మర్మము గుర్తెఱుంగక నుభయభ్రష్టులగువారు కొందఱార్యధర్మములను దూషింతురు..................సింహము మత్తగజ

# స్త్రీల కెట్టివిద్య కావలెను?

కుంభస్థలస్థమగు మస్తిష్కమునే గ్రసించునట్లు ప్రాజ్ఞులెప్పుడున్నతవిషయములనే గ్రహించి యాచరింతురు. పురుషుడు వీధిలో కష్టపడి సంపాదించును. స్త్రీ గృహమునందుండి కావలసినపనులు నెరవేర్చుకొనును. ఇంతకంటె స్వేచ్ఛయనగా నేమి? స్త్రీలు తమ యిచ్చవచ్చినట్లు గృహమునువీడి సంచరించి వచ్చుటయా? అది స్త్రీప్రకృతికి తగినధర్మమా? ఇప్పుడు పాశ్చాత్యదేశములలోఁ గూడ స్త్రీకి గృహకృత్యము, శిశుపోషణ చాలముఖ్యమనియు, పాతివ్రత్యము ధర్మమనియుఁ దెలిసికొని యార్యధర్మములను అనుసరించువారు కూడగలరు. దేశములో మహావీరులు, దేశనాయకులు, మేధావంతులు చిన్నతనమున స్త్రీవలననే పెరిగి పెంపొందవలసివారనియు, స్త్రీ యపవిత్రయైనచో నామె సంతతియు గొప్పది కానేరదనియుఁ దెలిసికొని జర్మనీదేశములో నిప్పటికి స్త్రీ లార్యధర్మములనే పాటించుచున్నట్లు మనము వినుటలేదా? యేదియెట్లున్నను స్వధర్మప్రాశస్త్యమును గ్రహించుటయే యుత్తమకృత్యము. స్త్రీపురుషులు విరుద్ధప్రకృతులని నుడివియుంటిమి. అది యెట్లో కొంచెము విచారింతము. అనగా నిద్దరికిని శరీరధర్మములయందును, స్వభావములందునుగల తారతమ్యమును సంక్షేపముగా గమనింతము. స్త్రీ సహజకోమలగాత్ర. పురుషుడు దృఢకాయుడు. స్త్రీ సౌందర్యలావణ్యశాలిని. పురుషుడు సహజగంభీరుడు. స్త్రీ స్వభావముచే వ్రీడావతి. పురుషుడు ధీరస్వభావముగలవాఁడు. స్త్రీ ఋతుమతి. పురుషుడు నిత్యపవిత్రుడు. స్త్రీ గర్భధారణాకలిత, పురుషుడు గర్భాధానకరుఁడు. కావున స్త్రీ గుణస్వభావములనుబట్టి యామె పురుషునివలె నిరంతరము బాహ్యప్రపంచమున సంచరించుచు నందుగల కష్టనిష్ఠురముల కోర్చుకొనుటకును, యామెకు స్వాభావికమైన గర్భభరణమునకులోనై శిశుపోషణ మొదలగు కృత్యములను నెరవేర్చుకొనుటకును నవకాశముండునా? లేక వారికృత్యములు పురుషుడే సవరించుకొనుటకు సమర్థుఁడగునా? రెండును నసమంజసములే, నసంభవములేయగును. కావున సత్యముగా నిష్పక్షపాతబుద్ధితోఁ జూడ స్త్రీ గృహలక్ష్మియై, తన పవిత్రశీలముచేత లోకమును పవిత్రముచేయగలదు. పాతివ్రత్యముచేతఁ గీర్తివడసి సత్పుత్రులచే నానందించి మోక్షమును పొందగలదు. పురుషుడును నట్టిపతివ్రతయు, సాధువర్తనయునగు భార్యవలనను, తత్పుత్రాదులవలనను సుఖించి తరింపఁగలడు. కావున స్త్రీకి తనవిధ్యుక్తధర్మములను బోధించి యవి చక్కఁగ నెరవేర్చుకొనగల్గు జ్ఞానమును వృద్ధిచేయఁగల విద్యనుబోధించు టత్యవసరము. వారికందుల కనుకూలములగు విద్యావిధానమును తయారుచేయించి ప్రత్యేకపాఠశాలలు నిర్మించవలెను. ప్రస్తుతపు విద్యావిధానము ననుసరించిన విద్య వారికెంతమాత్రము తగియుండలేదు. సంస్కృతవాఙ్మయములోగల ధర్మశాస్త్రములలోను పురాణములలోనుగల స్త్రీధర్మములను, సదాచారసంపత్తిని, విజ్ఞానవైభవమును బోధించుచు నావిధముగ నాచరింపఁజేయవలయును. ఆచరణహీనమగు కళాశాలలవిద్య యవిద్యయనియె చెప్పవలయును. ఈసంగతులు గమనించి యట్లు స్త్రీలకు తగినవిద్య లభింపఁజేయుచో వారి యౌన్నత్యమునకును తద్వారా దేశకల్యాణమునకును కారణమగునని ప్రాజ్ఞులెల్లరును గ్రహించి తమకర్తవ్యమును నెరవేర్తురుగాక.

# పూలమాల — విపంచి

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

వర్తమానకాలమున నాంధ్ర వాఙ్మయమున వెలువడుచున్న నవీనరచనలలో ఖండకావ్యము లొకటి. ఇవి భాషాసతికి నవీనులు గూర్చుచున్న నూత్నాలంకారములు. ఏదే నొకవిషయమును కావ్యవస్తువుగా, జేకొని పద్యగద్యములతో గ్రంథములను విరచించుట పూర్వకావ్యముల పద్ధతి. కవి తాను చూచినట్టిగాని, వినినట్టిగాని చదివినట్టిగాని విషయమును తలచి తలంచి పులకితుడై యా తన్మయావస్థలో పసిడితునకలవంటి పద్యముల నే వైదాఱో విరచించుటయు నట్టి వివిధవిషయములను గూర్చిన పద్యముల సంపుటములుగా బ్రచురించుటయు నిప్పటి కవికుమారుల పద్ధతి. వీని కే ఖండకావ్యము లని పేరు.

కవిత బంగారము. కవులు స్వర్ణకారులు. కావ్యము లా స్వర్ణకారులచే చేయబడిన యలంకారములు. అద్యతనులౌ భావకవులు విరచించెడి ఖండకావ్యము లా బంగారు కట్టుబడితో జేయబడిన రత్నాభరణములు.

అమూల్యములగు నిట్టి రత్నాభరణములతో రాయప్రోలు సుబ్బారావుగారు, దువ్వూరి రామిరెడ్డిగారు, అబ్బూరి రామకృష్ణారావుగారు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు మున్నగు నాధునికకవి వరేణ్యు లాంధ్ర భారతిని గై సేసియున్నారు. అటులనే పూలమాల గ్రంథకర్త్రియు విపంచి కావ్య నిర్మాతయు మఱిరెండు క్రొత్తసొమ్ములు తెలుగుతల్లికి సమర్పించి ధన్యులైరి.

## పూలమాల

పూలమాలవలెనే సుకుమారముగను, సుందరముగను, సుసౌరభ భరితముగను నున్న యొకమృదుమధుర ఖండకావ్యము. ఈ కావ్యరచయిత శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు. ఇటీవ లాంధ్రవాఙ్మయమున కవిత్వపద్ధతులు పెక్కురీతుల మార్పునొందినవి. కాలభేదమునుబట్టియు రుచిభేదమును బట్టియు తీరుతీరు కవితలు బయలువెడలినవి. కాని యీమార్పులన్నియు కవికుమారులనే గాని కవయిత్రుల నాకర్షింపలేదు. ఆంధ్ర నారీలోకమున గూడ చక్కని కవిత్వము చెప్పగలవా రున్నను వా రింతవఱకు ప్రాత పద్ధతినే తమకావ్యముల నడిపించుచున్నారు గాని క్రొత్తతీరుల చేపట్టుటలేదు. ఇయ్యది స్త్రీలరచనలకు కొఱంతగానే యున్నది. నే డాంధ్రవాఙ్మయరంగమున నూత్నముగా ప్రవేశము గల్పించుకొనిన యువకవయిత్రి యగు శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారీ కొఱతనుదీర్చి యాంధ్రకవయిత్రులకు మార్గదర్శకులైరి.

రుక్మిణమ్మగారు 'పూలమాల'యం దేర్చి కూర్చిన పూవులన్నియు వివిధ పరిమళ భరితములై ఒకపూవుతావికన్న నొకపూవు తావి మనోరంజకమై యింపుగూర్చుచున్నది.

'శ్రీమదోంకార పంజరాసీన శుకము
ప్రాంచదుపనిషదుద్యాన పరిభృతమ్మ
అగమారణ్యవీధీ మహామయూర
మైన కాత్యాయనీదేవి నాత్మదలతు'

అని సర్వమంగళదాయినియగు సర్వమంగళను స్మరించుటనెడి యాద్యసుమముతో రుక్మిణమ్మగారు పూలనుగట్టుట కారంభించిరి. తదుపరి శ్రీమతి రుక్మిణమ్మగారు 'చాటింపు' నందు గావించిన హెచ్చరికలు ఐహికవిషయానురక్తులగు ప్రతివారును సర్వదామననము చేయదగినవిగానున్నవి. ఈ ప్రపంచమునందలి సమస్తమునకును శాశ్వతశోభాయశస్సులను గూర్చెడివారము మేమని యీ కవయిత్రీమణి కవులందరి పక్షమునను సగర్వముగ బలుకుచున్నది. ఇందు సత్యమెంతేని గలదు. ప్రభువుల ప్రాభవమేమి, మహాత్ముల మహాత్మ్యమేమి, శూరుల శౌర్యమేమి, పడతుల పాతివ్రత్యమేమి, ఒకటేమి, యే గొప్పతనమైనను కవిసార్వభౌముల నిర్వ్యాజ కరుణకు పాత్రముగాదేని ప్రపంచములో నది నిలిచియుండుట కవకాశమే లేదుగదా.

ఈ కవయిత్రికి స్వజాత్యభిమానము మెండు. కావుననే పురుషులలో నెందఱో మహాకవులుండ వారినెల్లర విడిచి

'మొల్ల తటిగొండవెంగమ్మ ముద్దుపళని
అచ్చమాంబయు మొదలుగా నాంధ్రమహిళ
లమిత విఖ్యాతిగాంచు టీయవనిలోన
క్రమకవితామృతాస్వాదకలన గాదె'

అని ఆంధ్రకవయిత్రుల ప్రశంసించి యెంత కొంచెమైనను సొంతమనిన నెంతటిప్రియమో విశదీకరించిరి.

మఱియు నీమెకు స్వజాత్యభిమాన మెంత ప్రీతియో శౌర్యరసమన్న నంతప్రీతి. ఈచిన్ని ఖండకావ్యములో ఝాన్సీ లక్ష్మీబాయి, కుంతి, పాంచాలి, అను ముప్వురు వీరవనితల చేర్కొని వారిచే శౌర్య ముట్టిపడుపల్కుల పల్కించినారు. ఇంతియేగాదు. ఆంధ్ర లోకమంతయు శౌర్యనిలయమై పోవలయునని యీయామె కోరిక. కావుననే

'ఎందఱెందఱో రుధిరనిష్యందిరేఖ
నుల తెనుగుసీమ యోధసంకలితమనుచు
వ్రాసిరేకాని నేడది వ్యర్థమయ్యె
వీరు డొకండును గనరాని కారణమున'

అని నేటి ఆంధ్రులభీరుత్వమును నధిక్షేపించుచు వీరులుగండని హెచ్చరించుచున్నది. వైరాగ్యభావనా కలితయయ్యు, శౌర్యరస ప్రియయయ్యు స్వజాత్యభిమాన నిరతయయ్యు రుక్మిణమ్మగారు భారతమహిళల కుత్తమాలంకారమగు విమల పాతివ్రత్య ధర్మమును విస్మరింపలేదు. 'సుమన—శాండిలి' యను సంభాషణయందు పాతివ్రత్యప్రభావముచే స్త్రీలకు పడయరాని ఫలములేదనియు,

'సతమగంధలీ ముఖపుణ్య సాధ్వులెలమి
నిట్టిధర్మంబె పాలించి యింపుగులుక
నమరపథ మాక్రమించి'రనియు స్త్రీల కిదె ధర్మమనియు, నీమె చెప్పుచున్నది. కావ్య వస్తువు నెన్నుకొనుటయందే గాక వానిని విశదపఱచుటయందును రుక్మిణమ్మగారు చక్కని స్త్రీత్వమును ప్రకటించినారు. సహజ సిద్ధమగు నీ లక్షణము గ్రంథమునకు వన్నె దెచ్చినది.

రుక్మిణమ్మగారిది వాఁడిమియు వేఁడిమియుగల చక్కని ప్రౌఢకవిత; అయినను మిక్కిలి ధారాళముగనుండి చదువుటకు గుతూహలము గొల్పును. వీనికి దోడు నీతి, భక్తి, వైరాగ్యము, వాత్సల్యము, శౌర్యము, దేశాభిమానము నాదిగాగల విషయము లిందు పొందింపబడియుండుటచే బంగారమునకు తావియబ్బినట్లు కమనీయమైయున్నది.

రుక్మిణమ్మగారేరుకొనినగాథలు పెక్కులు పౌరాణికములగుటచే క్రొత్తగిన్నెలో ప్రాతమధువునే నింపి యొసగినారని కొందఱు తలంపవచ్చును. కాని మంచివస్తువునకు ప్రాతగిలుట యనునదిలేదు. అయ్యది సర్వదా కాలభేదములేక సేవ్యము, సంభావనీయము స్మరణీయము. కాన విజాతీయ భావవికారములచే కల్లోలముజెందుచున్న యాధునిక నరనారీసముదాయమున కివి పునఃపునః పఠనీయములై యొప్పారుచున్నవని నా యభిప్రాయము.

"విపంచి" మధురాతిమధురమగు ఖండకావ్యము. ఈ కావ్యరచయిత బొడ్డు బాపిరాజుగారు. ఈ మనోహరగీతికాస్తోమమాల, విశ్వవిపంచి మున్నాలపించుకొన్నదే. అయిననేమి? శ్రవణసుఖంబుగల్గించెడి గీతము నెన్నిమాఱు లాలకించినను, నేత్రపర్వ మొనర్చు చిత్రము నెన్నిమాఱులు తిలకించినను, మనోహ్లాదకరమగు కావ్యము నెన్నిమాఱులు పఠించినను వెక్కసమగునా? వెగటుగొల్పునా? మధురము, మనోజ్ఞము, లాలిత్యము, నెద్దానియందుగలదో దానికి పునరుక్తిదోషములేదు. మధుమాసము ప్రతి సంవత్సరము వచ్చునదికాదా? కోయిల గానము ప్రతివత్సరము వినుచున్నదికాదా? అయినను నేయేటికాయేడె నవనవమై నవ్యరాగోదయము గల్గించుటలేదా? చవిగలవస్తువు లేగదా మరలమరల తినవలయునని మక్కువగొల్పెడిది? ఒకమాఱు చవిజూడగనే యిక చాలుననిపించునది యరుచికరములగు వస్తువులయెడగాని రుచ్యపదార్థములందు కాదుగదా. కాన మనోజ్ఞమగు నీ గీతికాస్తోమము మరల చవులుగొల్పుచున్నది.

ఉదయించెడి సూర్యుడు, వికసించెడి తామర, విరబూచిన తరువు, వెన్నెలలు చిందెడి జాబిల్లి, యిత్యాదిమనోహర దృశ్యము లెట్టి జడప్రకృతిగల మానవునకైన మనోల్లాసము గల్పించును. అందును యీ కవి "ప్రకృతి శోభావిలాసలాలసుడు" కావున సూర్యుడు చంద్రుడు, నక్షత్రము, ఉఱుము, మెఱుపు, మేఘము, ఇంద్రధనుస్సు సంజప్రొద్దు, సరిత్తు, సాగరము, చెట్టు, పుట్ట



కీ॥ శే॥ శ్రీ సమయమంతుల మాణిక్యంగారు
శ్రీ నాగేశ్వరరావుపంతులుగారి "సార్థకధర్మపత్ని"



యన్నియు నాతని నాకర్షించినవి. ఈభౌతిక ప్రపంచములో నీ శోభామయప్రకృతిలో నాతని నాకర్షింపని పదార్థ మొక్కటియు లేదు.

కవిదృష్టి వేరు. ఇతరమర్త్య దృష్టి వేరు. సామాన్యమానవదృష్టికి జడమై కనుపించెడి భౌతికప్రపంచమంతయు నాతనికి చేతనా విలసితము. సౌందర్యప్రపూర్ణము. ఆనందమయము. కవిప్రకృతులకుగల సంబంధము అచ్ఛేద్యము,అనూహ్యము,అన్యోన్యాకర్షితము.

'ఐహిక మోహబంధనములందు
దగుల్కొని యున్నవారికే
యూహలుదెచ్చి యాకతమయున్కియె
చూపనిముగ్ధ మోహన
స్నేహమయమ్ములైన జడచేతనము'లు కవితో భాషించును. అతనికి

మెల్లగా సాగిపోయెడి మేఘశకల
మింత కలదని పర్వతశృంగసీమ
నిలుబడివచ్చు నాసెలయేటి నురుఁగు
భువనమోహన సందేశములను దెచ్చు'ను.

మబ్బు లుద్యానవనములు, చుక్కలు పేరటాండ్రు, యింద్రధనుస్సులోని చాళ్లు ఉయ్యాలచేరులు, మెఱపు

చెలువారన్ సురలెల్లరాగడప
కుర్చీలందు గొల్వుండబల్
మెలపుల్ మైజిగి సొంపుఁజూపి
వారిన్ రక్తిగట్టించు నర్తకి

* * *

ఈకవి సహజముగా ప్రకృతి శోభావిలాస లాలసుడై నను మర్త్యప్రపంచమును వీడలేదు మాతృభూమిని మఱువలేదు. 'కాపుపడుచు' లోని తొయ్యలినిగూర్చియు, మూగమోములోని బాలికనుగూర్చియు వీరు వ్రాసిన పద్యము లత్యంత సహజములై రమణీయములై మర్యాదాబద్ధములై యున్నవి. మఱియు నాధునికకవికుమారులలో పెక్కుమందివలె నీకావ్యకర్త ప్రణయినీ మోహపంక నిర్మగ్నుడు కాకుండుట ప్రశంసనీయమగు విషయము. "నమస్తే అస్మదాంధ్రావనీ" యని నిజదేశజనని కంజలి గావించుటతో నీకావ్యము ముగింపబడుటచే గ్రంథగౌరవము కవిగౌరవముగూడ నినుమడించినదని చెప్పవచ్చును.

నిజముగా 'విపంచి' దివ్యవిపంచి. మము బోంట్లు దాని బాగోగులు పరీక్షింప దొరకొనుట తలకుమించిన పని; కాన దీనిని నేను విమర్శించుటలేదు. బాగుగానున్నదని చెప్పుటమాత్రమే నాయుద్దేశము. విలువ యెక్కువైన పైరెండు పొత్తములు (పూలమాల, విపంచి) వెలతక్కువై యుండుట మఱియొక గుణవిశేషము. పూలమాల వెల ఆరణాలు, విపంచివెల నాల్గణాలు, మొదటిది విశాఖపట్నము మెయినురోడ్డునందును, రెండవది ఆదివారపుపేట యేలూరునందును, గ్రంథకర్తలవద్ద లభించును. స్వల్పమగు మూల్యముగలిగి యెల్లర కందుబాటులో నున్న నీయుత్తమఖండకావ్యముల నాంధ్ర సోదర సోదరీమణులెల్లరు కొని చదివి యానందింతురుగాక యని కోరుచున్నాను.

# " దీనస్వర్గవీ భార్గవీ!"

శ్రీమతి సోమరాజు ఇందుమతీదేవిగారు

హారికినసుంగుదేవివయి యర్థుల కామ్యములెల్లదీర్చి చం
దురునకుతోఁడబుట్టుట మధున్ వెదజల్లెడిచూడ్కులొప్పగన్
గిరిసుతయబ్జజాంగనయు కీర్తనసేయ సరోరుహాక్ష మం
దిరమున పెంపుగన్ కొలువు దీర్చెడియమ్మరొ ప్రోవు భార్గవీ!

నిలిపెదనిన్ను నాయెడద నిశ్చలభక్తిని నీదుపూజనల్
సలిపెద కుంకుమ ప్రసవచందనచర్చల యర్పణంబునన్
తలచెద చారునీల జలదప్రతిభాసిత శంపనా మహో
జ్వలహరిబాహుపీఠనివసచ్ఛుభమూర్తిని నిన్ను భార్గవీ!

దారువినిర్మితంబయి నితాంతము భాసిలుమంటపంబు సిం
గారముజేసి పత్రసుమకంబుల శ్రీతులసీదళంబులం
గూర్చి శుక్రవారమున కోరిభజించి సహస్రనామపూ
జారమణీయవైననినుః సంతతమున్ తలపోతు భార్గవీ!

ఆచ్ఛపుబత్తి కుంకుమసమంచితమైన శిరంబువంచి నీ
పచ్చనిపాదపద్మములపైబడి మ్రొక్కెద కుంకుమాంకమం
దచ్చుపడం దయారసగృహంబగు చిత్తముచెమ్మగిల్ల క
న్విచ్చిసువాసినీత్వము వివృద్ధినొనర్చవె తల్లి! భార్గవీ!

చందురువంటిమోము సుమసాయకువిండ్లన భ్రూయుగంబు సొం
పుం దులకింపజేయునగుమోమున కుంకుమబొట్టు పుష్పలిట్
బృందముక్రిందుసేయు ముఖబింబము గ్రమ్ముకురుల్ జెలంగ నీ
సుందరవిగ్రహంబు సొగసుందనమున్ దలపోతు భార్గవీ!

# గృహలక్ష్మి

కట్టినపట్టుసేలనునుకాంతులు నల్దెసలావరింప హారాం
బట్టుజరీననుం రవికబాహువులం జిగిగూర్ప విష్ణుకేల్
వట్టి బగత్రయంబున శుభంబొనగూర్చెదు నిన్నుకన్నులన్
గట్టినయట్టుగా గని శుభంబుల బొందెదనమ్మ భార్గవీ !

నినుపూజించితి ధ్యానపూర్వకముగా నిన్నే మదిన్నిల్పితిన్
నిను నామాతగ నిన్నె ప్రభ్విణిగ నిన్నే దేవిగాబ్రోవుమం
చని ప్రార్థించితి నన్ను బ్రోచుటకునై యాలస్యమున్ జేయగా
చనునే కన్పడకుంటి వేలనె జగత్సంధాత్రివై భార్గవీ !

తగవున్ జేసెద నీమ్మపై గినిసెదన్ తల్లీ సుతన్ సుమ్మునా
వగపెల్లన్ దిగజేయరాదె యిక నావాంఛాళి పూరింపుమా
తగునా పూనగనిర్దయత్వము మదిన్ ధర్మంబు నూహింపవా
నగరే పుత్రిని బ్రోవకున్న ధర దీనస్వర్గవీ ! భార్గవీ !

# హెచ్చరిక

శ్రీమతి కోకాహనుమాయమ్మగారు

సీ॥ ఆరోహణావరోహంబులహస్తంబు వల్లకీ మెట్లలో వరలుచుండ
అంగుళీ పటిమచే నందఱు హాయన సలలితగతింబల్కు సరణిదోప
తాళంబు గతియుసమ్మేళంబు జేసెడి వివిధవర్ణంబులు విల్లసిల్ల
కలకల మ్రోగెడి కలకంఠనాదంబు దివ్యతరంబుగ దిశలబర్వ

అధిక శ్రద్ధను బంధువుల లపనటుల
నేడె విద్యను బడయుచు నేర్పుమీర
సోదరీ, మృదుమధుర నినాదమైన
వీణ జేపట్టి గానప్రవీణ వగుము.

# రోఁతవ్రాఁతలు

## దొరికిన వ్యాసములు

గృహలక్ష్మిపత్రికాధిపతులకు వందనములు.

నేను నవంబరు 2 వ తేదీ మాయూరినుండి బయలుదేరి సామర్లకోట స్టేషనువద్ద కలకత్తామెయిలు నెక్కి ప్రయాణముచేయుట తటస్థించెను. అప్పుడు నేను స్త్రీలపెట్టె నెక్కుచుండగా యిద్దఱుస్త్రీలు సామానుదింపించుకొనుచు కాకినాడబండి నెక్కవలయునను తొందరచేఁగాఁబోలు నాదిక్కుగ వెడలిపోయిరి. తరువాత బండికదలునంతవఱకు వా రెవ్వరైయుందురని నే నాలోచించుటయే జరుగలేదు. అక్కడ ప్లాటుఫారమున నున్నంతవఱకు నేను మాయన్నగారితో నేవోసంగతులు మాట్లాడుచు నుండిపోయితిని. బండికదలుట కారంభింపగనే నేనెక్కియున్నపెట్టె నలువంకలనుచూడగా అక్కడనొక కూర్చుండుబల్లపై నొక కాగితములకట్ట యుండెను. అప్పుడాబండియందు మఱెవ్వరునులేరు. నేను మొదటచూచిన యువతీమణులు ప్రమాదవశమున వానినచ్చట మఱచిపోయియుందురని భావించితిని. పరీక్షించిచూడగా అవేవో పత్రికలకు పంపుకొనవలెనని యుద్దేశింపఁబడి కొందరు విదుషీమణులచేత రచింపఁబడిన వ్యాసరాజములగుట తెలిసికొంటిని. వానిపై వారివిలాసములేవియు లేవు.

వానియందు 'రోఁతవ్రాఁతలు'అను నొకవ్యాసమును 'ఆర్యాదేవి'అను నామె వ్రాసినట్లున్న ప్రసంగములును ఉన్నవి. 'ఆర్యాదేవి' యందలి మొదటిప్రసంగమునుబట్టి ఈ 'రోఁతవ్రాఁతల'ను వ్రాసిన యామె డి. సరస్వతీదేవియనియు, ఆమెయొక మహిళాసంఘమునకు కార్యదర్శినియనియు గ్రహింపఁగల్గితిని. మఱియు నా 'ఆర్యాదేవి'యందే ఈ 'రోఁతవ్రాఁతల'ను పేరుతోనున్న వ్యాసము 'గృహలక్ష్మి'కిఁ బంపుకొనవలసియున్నదనియు, అది ఈ డిసెంబరునెలయందుఁ బ్రకటింపఁబడవచ్చుననియు వ్రాసియున్న వాక్యములనుజూచి యీ వ్యాసము మీపత్రికయందు ప్రకటనార్థమై రచింపబడినదే కావున మీకుపంపిన, ఆవ్యాసకర్త్రి యభీష్టము తీరుటయేగాక వ్యాసము తనగమ్యస్థానమునకు చేరగలదని భావించుచు దీనిని మీకు పంపుకొనుచున్నాను. కాని యీవ్యాసములఁ బోగొట్టుకొన్నయామె డి. సరస్వతియో, కాక అందుచెప్పఁబడిన ఆర్యాదేవియో, కాక ఆయుభయులునో నేను తెలిసికొనలేకుండ నున్నాను. 'ఆర్యాదేవి'—అనుపేరు పెట్టుకొన్నపేరని ఆవ్యాసమందేయున్నది, ఆమెయొక మహిళాసంఘమున కధ్యక్షురాలని అందున్నది. తమకుఁ గృతపరిచితురాలని భావించుచు ఆమె యెవతయో నాకు తెలుపఁదగినయెడల తెలియఁజేయ వేడుకొనుచున్నాను. ఆమె వ్రాసిన దానినిబట్టి ఆమె చాలపేరెన్నికఁగన్న విదుషీమణియైయుండవలెను. ఉత్తరదేశములలో నివసించుచున్న నాకు సుప్రసిద్ధనాములగు నాంధ్రమహిళామణులతో నంతగ పరిచయముండుట కవకాశములేకుండనున్నది. అయినను అట్లప్రయత్నముగ రయిలుబండియందు చూచిన విదుషీమణులెవ్వరో తమ ప్రతికాముఖమున ప్రశ్నించుకొన్న నాకు తెలియకుండనుండదనియు, వారు లేఖాముఖమున నాకువ్రాయుట కవకాశముండుననియు భావించుచు మీకు తెల్పుకొనుచున్నాను. ఇట్లు రైళ్లలోదొరికిన యుపన్యాసములను, వ్యాసములను కొందఱానడుమ భారతిలో ప్రచురింపించిరఁట. మీకును తెలిసియుండుననుకొనుచున్నాను. నాకుదొరకిన 'ఆర్యాదేవి' యను కథావ్యాసమును వినోదినీపత్రికకు ప్రకటనార్థమని పైనవ్రాసియుండుటచేత దానిని దానికి పంపుకొంటినని మనవిచేయుచున్నాను.

దివాకర్ల శారదామణిదేవి—10-11-35

నేడు హాస్యపత్రికలని యివి యొకటి వచ్చినవి. ఎక్కడ జూచినను హాస్యపత్రికలు! వింతపత్రికలు! వినోదపత్రికలు! నవ్వును పేర, హాస్యమనుపేర, శృంగారమనుపేర నివి వారమునకు పక్షమునకు మాసమునకు ననంఖ్యాకముగఁ బయలుదేరుచు సాంఘిక వృక్షమును చీడపురుగులవలె బాధించుచున్నవి. యీ యిరువదవ శతాబ్దమున నజస్రసహస్ర ముఖముల వర్ధిల్లవలసియున్న మనజాతిని — అందును ముఖ్యముగ బాలురను, స్త్రీలను బాడుచేయుచు నివి దుర్నీతిని బోధించుచున్నవి. హాస్యరసమను పేర దేశద్రోహమును జగద్ద్రోహమును, లోకవంచనమును జేయుచున్నవి. వీనినెంత సత్వరముగ హతమొనర్చిన — నెంతశీఘ్రముగ వీధులలో — నట్టనడివీధులలో — బజారులలో — చతుష్పథములలో బ్రోవులు పెట్టి నిప్పులు పెట్టి పరశురామ ప్రీతియగునట్లుచేసిన మనదేశమునకును జాతికినికూడ నంతశ్రేయస్కరమని నేడాంధ్రదేశమున గొప్ప కలకల ముదయించినది.

గొప్ప చదువులఁజదువుకొని ఉత్తమాశయ ప్రచారకులై యుండవలసిన పత్రికా విలేఖకులే నేఁడింత పేలవతా దూషితమైన రోఁతమాటలఁ జెప్పుకొనుచు పరమ పవిత్రమగు సాంఘికసౌధమునకు నాల్గుమూరులంటించి దగ్ధపటల మొనర్పఁబద్ధకంకణులై యుండగ దేశహితకాముకులగు నుత్తమ స్వాంతుల కెంత యమర్షమైన నుదయింపవలసినదే! ఉపేక్షాపరులై యూరకుండక ఎంత తీవ్రతరమైన యాందోళనమొనర్చి హాస్యరసమనువంకతో మనజాతి కెక్కింపఁబడుచున్న విష మెంతశీఘ్రముగ వదల్చుకొన్న మన కంతమేలని తలంపవలసియున్నది

తప్పెవరిది?

అయిననిందు తప్పెవరిది?—నిర్వాహకులదా, లేక విలేఖకులదా?

దేవతలందఱొక్కసారిగ నొకచోట గుమిగూడి—"ఇప్పుడు మానవలోకమున పాపము హెచ్చిపోయినది. మన మెప్పుడును కనియు వినియు నుండని మహాపాపములను మనుష్యు లిప్పుడవలీలగాఁ జేసివేయుచున్నారు. అన్నివిధములఁ జెడిపోవుచు ధర్మద్రోహములు బంధుద్రోహములు, జగద్ద్రోహములు జేసివేయుచున్నారు. మాతృభక్తిలేక పితృభక్తిలేక, గురుభక్తిలేక దుర్నీతిపారంగతులయి లోకవంచనమే జీవిత పరమావధిగ ఇహలోకజన్మ వ్రతముగ భావించుచు మన తలపులకందని చేయరాని చెప్పరాని మహాపాపము లవ్యాహతముగ జేసివేయుచున్నారు. సర్వప్రాణి నాశకరముగఁ దనువులఁ జెల్లించుకొనుచు — సకలలోకసంత్రాసకరముగ సర్వజీవజంతువులను తమ పొట్టలబెట్టికొనుటయే కాక తమ్ముదాము జంపుకొనుటకు గూడ చిత్రవిచిత్రములగు మారణ యంత్రములఁ [బాంబులు, ఏయిర్ క్రాఫ్ట్‌లు, మెషీన్ గన్‌లు, డైనమైట్లు] గల్పించుకొనుచు పరస్పరహననపరాయణులై పూర్వదేవతలు అనగా రాక్షసులు కూడ తలవంచుకొనునట్టి

మనుజభోజనలాలసత్వమున నెంతతుచ్ఛ తత్వములనైన వెల్లడించుకొనుచు యుద్ధము లొనర్చి గ్రామములఁబాడుచేసి పట్టణములఁ గాల్చి దేశములఁ బీనుగుపెంటలుగఁ జేసికొను చున్నారు. పరమేష్ఠి తొలుత మనుజజాతిని సృష్టించుటచేతనేకదా లోకమున కింతచేటు వాటిల్లినది! కావున సర్వభూత భయంకరంబైన యీమనుజజాతి నొక్కమారుగ భస్మ మొనర్చి వేయుదమా?"—అని తీర్మానింపఁ జర్చించిరనుకొందు.

వింటిరా? ఇది దేవతలవైఖరియైనయెడల మీ రెంద ఱట్టితీర్మానమున కామోద మొసంగగలరో సెలవిత్తురా?

పాఠకులారా! మిమ్ము దేవతలయొద్దకు దోడ్కొనిపోయి మనలగూర్చి వారు చేసికొను చర్చల నొకింతఁజవిచూపి తిరుగ యథాస్థానమున నుంచివేసితినని భావించుచుంటిరా? శ్రమ యిచ్చినందులకు మన్నించి ఆస్వర్గమే మన భూమియనుకొనుఁడు. ఆదేవతలే హాస్యపత్రికలలోని రోఁతవ్రాఁతల కేవగించుకొను మనదేశీయు లనుకొనుఁడు. సత్యమదియే కాదా?

హాస్యపత్రిక లుండుటవలననే అవినీతి కాటపట్టగు రచనము లాంధ్రభూమియందుదయించుచున్నవనుట మానవులను హా రీ భూమిపై నుండుటవలననే క్రొవ్వి వారిన్ని చేయగానిపనులఁ జేయుచున్నారని తలంచుట వంటిదగుచున్నది.

ఆ.వె. వార్తయందుజగము వర్ధిల్లుచున్నది
యదియులేనినాఁడ యఖిలజనులు
నంధకారమగ్నులగుదురు కావున
వార్త నిర్వహింపవలయుఁబతికి

అని సర్వసాధారణముగ మనము పత్రికల యొక్క ప్రయోజనమును నిర్వచించుకొన వచ్చును. విజ్ఞానచంద్రికా నిర్వాహకులగు కె.వి. లక్ష్మణరావు, ఎం.ఏ. గారును ఆచంట లక్ష్మీపతి, బి. యే. యమ్. బి. సి. యమ్. గారును

"దేశములోని గ్రంథ సంగ్రహంబును, వార్తాపత్రికలును నేదోయొక దైవికకారణముచే నేడు లేకుండనయ్యెనేని ఆదేశము తన యాదిమయుగములోని యనాగరికతకు దిగునని చెప్పుట అతిశయోక్తి గానేరదు. దేశమునందలి వాఙ్మయము ఆదేశమునకు మేలుగాని కీడుగాని కలుగఁజేయఁగల యొక నిరంకుశాధికారి యని చెప్పవచ్చును."

అని మిగుల యుక్తియుక్తముగఁ దేజస్వంతములగు నక్షరములఁ జెప్పియేయుండిరి.

పత్రికాప్రయోజన మీవిధముగ మన మంగీకరించినయెడల నిఁక హాస్యపత్రికల వలన మనకేమైన వినియోగమున్నదాయని తర్కింపవలసియున్నది.

శృంగారాదినవరసములలో హాస్యమునకు మనవారు శృంగారమునకుఁ దరువాతిస్థాన మిచ్చి దాని మహాత్వమును వశీకరణశక్తియుఁ బూర్తిగ నంగీకరించియేయున్నారు. తదితర రసముల కంతగలేని యాకర్షణశక్తి హాస్య

రసమున కున్నది. పిపీలికాదిబ్రహ్మపర్యంతము ప్రాణికోటులకు శృంగారరస మనుభవమునకు వచ్చుచున్నదని నిరాక్షేపముగ మన మొప్పుకొనవచ్చును కాని ఈ హాస్యరస మనునది మనుజప్రకృతియందే యనుభవింపఁదగిన లోకోత్తరరసమని భావింపవలసి వచ్చుచున్నది. ఒకవేళ కోతులయందీరస మొకింతయైన లేదాయని యెవ్వరైన నడుగవచ్చును. లేకేమి? హాస్యమున అధమాధమ మని లక్షణవేత్తలుగ్గడించు నపహాసిత తత్వమునకు అనగ వెక్కిరింతలకు, గ్రోతులు మనుజలనుండి యేమియు నేర్చుకొన నక్కఱ లేదు. అది వానికి ప్రకృతిసిద్ధమైన స్వభావమని పసిబాలురకుఁగూడ తెలిసియేయున్నది.

కాని సర్వతోముఖమగు హాస్యప్రకృతుల నవలంబించుటయందును, ఆనందించుట యందును మనుజుల కనిర్వచనీయమగు నుత్సాహమును, ఆనందమును, చిత్తవికాసమును ఏర్పడుచున్నవని చెప్పవలసియున్నది. అయినను సకలవిద్యా పారంగతులయి విజ్ఞానాధికులమని విఱ్ఱవీగుమనుజులు కొందఱు హాస్యమనునది కేవల మొక హీనప్రకృతికి చేరినరసముగ భావించి అది చపలాంతఃకరణమునకు ద్రోవదీయునని కాఁబోలు దాని నొంతమాత్రము తమ హృదయముల మొలకెత్తనీయకుండ మాడ్చివేయుచుందురు. తమ యంతరంగమునఁ దామెట్లున్నను పైకి మాత్రము తాము మహాపవిత్రులవలె ప్రవర్తించుచునుల్లాసరసపంకమునదగుల్కొని తదితరులను కేవల పతితులనియు భ్రష్టులనియు నోటికి వచ్చినట్లాడుకొనుటయు జరుగుచున్నది.

ఇట్లు మడిగట్టుకొన్న వారితోఁ బోరాడుట వలన మనకెట్టి ప్రయోజనమునులేదు. అది పూర్వాచారములను దైవదత్తములుగఁ దలపోయు పరమ ఛాందసులకు సర్వమానవ సౌభ్రాతృత్వ ముపన్యసించి వారి నంత్యకులములవాండ్రపంక్తులను గూర్చుండ బెట్టి కుడువఁజేయుటనంటిది.

తమ ఘనతను కష్టపెట్టికొననేరక—హాస్యరస మేమాత్రము తమ దరిఁజేరనిచ్చినను అది కొంపదీసివేయునను భ్రాంతితో నుండు విజ్ఞానాధికులమాట యటుండనిచ్చి తదితరులలో హాస్యరస మేమిచేయఁగలదో కొంచమూహింతము.

హాస్య మేమిచేయగలదు?

ఉత్తమము, ఉన్నతము, పరిశుద్ధమునగు హాస్యరసము మనుజుల నుత్సాహవంతులుగఁ జేయఁగలదు. హృదయసౌఖ్యావహ మొనర్చి విచారముల రూపుమాపఁగలదు. హాస్యరసమువలె చిత్తవికాసమొనర్చురస మింకొకటిలేదని చెప్పినను చెప్పకొననచ్చును.

ఉత్తమ జ్ఞానవృద్ధులగు పెద్దలకంటె బాలురు స్త్రీలును హాస్యరసైకలోలురని చెప్పవలసియున్నది. చేతనైనయెడల యుల్లాసమాడుటకుఁగాని యొక రాడిన దానిని వినుటకుఁగాని పామరులును బాలురును స్త్రీలును గూడ ముచ్చట పడుచుందురని నిశ్చయముగఁ జెప్పవచ్చును.

కావున నవి చమత్కారములు గానిండు, ప్రహసనములు కానిండు వినోదములు కానిండు! మీా రేయేపేరుల నీరచనల నిర్వచించినను అవి నిరంతరమును హాస్యరసైక లోలురగు చిరుతవాండ్రకును, అట్టి ప్రకృతి యందే మెలంగుచుండు స్త్రీలకును ఆకర్షణీయములుగఁ బ్రబలిపోవుచుండునని మనము గుర్తింపవలసియున్నది.

హాస్యరసమున కింతవశీకరణశక్తి యుంట చేతనే దానిని లక్షణవంతముగ సంస్కరించి పరిశుద్ధముగ, తేజోవంతముగ, విజ్ఞానప్రదముగఁ జేసికొనుట కవకాశమున్నదని నే నూహించుచున్నాను. అట్టి బాధ్యత పత్రికానిర్వాహకులయం దెంతయుండునో విలేఖకులందు గూడ నంతేయుండునని చెప్పవలసియున్నది.

అయినను హాస్యపత్రికలనగ రోఁతవ్రాఁతలకాలవాలమగు తుచ్ఛపత్రికలని చెప్పుకొనుటకు విలేఖకు లింతవఱకుఁ జేయుచున్న యవివేకపు కల్పనలే మూలమని యొప్పుకొనవలసియున్నది.

రోఁతవ్రాఁతలను చమత్కారపు కల్పనములుగఁదలంచుదశ లన్నివాఙ్మయములందును ప్రత్యక్షమగుచుండునని మనము జెప్పుకొనవచ్చును.

బహువిధ కావ్యకల్పనాధురీణులయి మనభాషయందు హృదయంగమమగు హాస్యరసమునకు దావలములగు పెక్కు గ్రంథముల రచించియున్న శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు 'విమర్శాదర్శ' విమర్శాదర్శమను గ్రంథమున ప్రభువుల కవితాభిరుచులనుబట్టి భావసంపదలేని యపాత్రపు గ్రంథము లాంధ్రభాషయందుదయించెనను వాదమునుగూర్చి వ్రాయుచు నిట్లనిరి.

“ఆకాలపుసాంప్రదాయమది: ప్రభుసాంప్రదాయమది: కవిసాంప్రదాయమది: ఒక్క మనదేశమునకే యీాసన్నివేశమా? ఆంగ్లేయదేశమున 'రెండవఛార్లెస్' రాజుగానున్నపు డేమయినది? రాజభవనములందు, దైవనిలయములందు, గృహస్థుల గృహములందు ధర్మశాలలయందుఁ, బుణ్యప్రదేశములందుఁ బూర్వమునఁదిరిగిన పరిశుద్ధకవిత సానివీధులలో నొడలు బయలుసేయు ననర్ఘవస్త్రములతోఁ దిరుగలేదా? చేతఁబ్రాందిబుడ్డి పట్టుకొని తెయితెక్కలాడలేదా? సంసారి గృహములలో మంచముక్రింద దాఁగలేదా? గట్టిగ నోరెత్తినపుడు కాలితాఁపులఁ బడలేదా? ఆకాలపు నాటకకవులు భర్తల పరువులు తీసివైవలేదా? సంసారిణుల సానులఁ జేయలేదా? గృహచ్ఛిద్రముల వీథినిబెట్టలేదా? ఉదరాది పరాయణులగు పందలను నాటకప్రధానపురుషులుగఁ జేయలేదా? పాతివ్రత్యము నీతి పనికిరానివని వానిని నాటకరంగమునుండి బహిష్కరింపలేదా? మగను దేవానాంప్రియుఁడు, భార్య పరమదౌర్భాగ్యశిరోమణియగు నెఱజాణ, ఉపపతి సర్వలక్షణ సర్వకళా సర్వసౌభాగ్యసంపన్నుఁడు!! ఇదుగో! వీరు పాత్రములు; వీరి కుపపాత్రములు త్రాగుఁబోతులు, తార్పుడు

కొంప్రము; కల్లుదుకాణమో, కాఫీసత్రమో, దేవాలయమో రంగము; భర్త్రపరాభవమే భరతవాక్యము; నీతిసంహారమే నీతిబోధము!! మూడువందల సంవత్సరముల క్రిందటి యాంగ్లేయకవిత్వపురం గిది!! కవులు తెలివి తక్కువవారా? 'షెరిడన్' వంటివాఁ డిట్టి గ్రంథములు వ్రాసినాఁడు. కారణము సింహాసనస్థుఁడగు కాంతాలోలునిలో నున్నది. ఈ సన్నివేశముఁనుజూచి చెడినకాలములోనైన మనకవిత యింత చెడియుండలేదని సంతోషింపవలసియున్నది. గ్రంథములలో రసపోషణ లేకపోయినఁబోనిండు; వ్యభిచారాదిప్రచారములేదు. శబ్దములతోఁ బోట్లాటయైన బోనిండు; వింతషడ్ఢునితోఁ బోరాడి చెప్పుదెబ్బలు తినుటలేదు! నీతిలేకపోయినఁ బోనిండు; దుర్నీతిలేదు."

1915 వ సంవత్సరమున అనఁగ నిరువదేండ్ల క్రిందట వారీవిధముగ వ్రాసిరి. అప్పటివఱకు మన భాషయం దుదయించియున్న గ్రంథములలో దుర్నీతి ప్రోత్సాహకములగు గ్రంథములేవియుఁ బుట్టియుండలేదని సంతోషింపవలసియున్నదని ధ్వని వచ్చునట్లు వా రిట్లువ్రాసిరి. మఱియు నప్పుడు భాషయం దగుచున్న సర్వతోముఖమగు నభివృద్ధుల నుగ్గడించుచు నప్పటి వాఙ్మయస్థితి నీ క్రింది విధముగ కొనియాడిరి.

"నలుబది యేబది సంవత్సరములనుండి మఱింత నిరోగస్థితిచే విరాజిల్లుచున్నదే! దేహదార్ఢ్యముకలిగి, 'హృదయోల్లాసము కలిగి చకచకలాడుచు నెక్కడఁ జూచినఁ దానయై ప్రకాశించుచున్నది కదా? మునుపటి తట్టరాగిడులతో బుట్టకొప్పులతో వెఱ్ఱిగ సింగారించుకొనుటమాని నూతన నాగరికత కర్హములైన యొకటి రెండు భూషణములు మాత్రమే ధరించి ముసిముసినగవుల మిసమిసలతో బుగ్గగులాబుల బుగబుగలతోఁ గన్నులపండువు సేయుచున్నదే! ప్రస్తుత కాలానుసారముగ, ప్రస్తుత జనచిత్తరంజకముగఁ బ్రాచీన బడబడాయమానశబ్దాడంబరములు, సందిగ్ధ సంభాషణములు, వివిధాభిప్రాయప్రకాశవచోవైఖరులు, నాంతరంగ కాఠిన్యమును వదలుకొని పువ్వులవలె నవ్వులవలె మృదులములైన ముద్దుముద్దు పలుకులతో స్పష్టములైన స్వచ్ఛములైన, దాపరికములేని విడివిడిపలుకులతో—నేకాభిప్రాయ బోధకములగు టక్కుటక్కుమను సూటిపలుకులతో—ననంటిపండొలిచి చేతఁ బెట్టినట్లు కులుకుచుఁ గులుకుచుఁ బలుకుచున్నదికదా! కొందఱను తనచుట్టును బెట్టుకొని వారికిఁ జిత్రచిత్ర గల్పనలుఁగల స్వకపోలకల్పిత కథలను—నేవేని పరభాషా కథలను—సరసముగ, సమంజసముగ, సందర్భముగఁజెప్పి హృదయరంజన మొనర్చుచున్నదే!"

ఇరువదేండ్లక్రింద చిత్ర చిత్రములగు చమత్కారపు కథల కథకులు చెప్పుచుండి నందుల కానందించి శ్రీనరసింహారావుపంతులుగారు 'కులుకుచుఁ గులుకుచు' పై విధముగ నుగ్గడించిరికాని ఇప్పుడా విధముగ మనము

కథకుల నభినందింపఁజాలము. ఏల? — మూఁడు సంవత్సరములక్రిందట నెద్ది 'ఆంగ్లేయ సారస్వతపురం' గని వారు వర్ణించిరో ఆ అంకుపురాణములే కథకుల కితివృత్తము లగుటవలన వారు మనభాషయందు లేవని— లేనికారణమున మనభాషను మనలను అభినందించికొనవలసి యున్నదని చెప్పియున్న ఆ ద్రాక్షారససేవలు—వ్యభిచార ప్రచారములు — గృహచ్ఛిద్రములు బహుముఖములఁ బ్రబలిపోవుటయేకాక 'దేవానాం ప్రియులగు భర్తలతో' 'నెఱజాణలగు భార్యలతో' 'సర్వలక్షణ సర్వకళా సర్వసౌభాగ్య సంపన్నులగు నుపపతులతో' మనవారు అంకుకథలనే సంఘటించి, కల్లుదుకాణములను, 'కాఫీ' సత్రములను, దేవాలయములను రంగములుగఁ జేసి త్రాగుబోతులతో తార్పుడుకాండ్రతో భర్తృపరాభవముల నొడఁగూర్చి నీతిసంహారమే నీతిబోధముగ నుగ్గడించుచున్నారని పలుకవలసి యున్నది.

ప్రజలయభిరుచు లిట్లున్నవా?

ప్రజల యభిరుచు లిప్పుడిట్లున్నవి గావున మేమిట్లు వ్రాయుచుంటిమని కాని, ప్రజల నడవడు లిప్పు డిట్లుండుటవలన నీరీతిని చిత్రింపవలసి వచ్చుచున్నదని కాని కథకులు దాటికొనిపోవుట కవకాశము లేదు.

సర్వకాలములయందు, సర్వదేశములయందు మనుజు డెక్కడనున్నను అక్కడ నేదోవిధమగు అవినీతి — దుండగము — దురాచారము జరుగుచునే యుండును. తప్పు చేయుట మనుజులలో సర్వసాధారణమగు నైసర్గికగుణము (To err is human) అని మన మొప్పుకొనవచ్చును. అంతమాత్రమున మన మవినీతుల, దుండగముల, దుశ్చారిత్రముల, మహాపాపముల నుగ్గడించుకొనుచు ప్రజలను పట్టపగ్గములు లేకుండ స్వేచ్ఛాసక్తచిత్తులయి, భ్రష్టులయిపోవునట్లు రెచ్చగొట్టవలసినదా? అట్లుచేసినయెడల పరమపవిత్రములగు సంసారిక సంబంధములు — మాతాపితృ సంబంధములు — గురుశిష్యసంబంధములు—భార్యాభర్తృ సంబంధములు— సోదర సోదరీ సంబంధములు కేవల మన సంఘసౌధమునకే గాక సర్వ జగజ్జీవనమునకు బునాదులని చెప్పఁదగిన స్నేహానుబంధ బాంధవ్యములు అన్నియు మూలమట్టముగ గ్రుంగిపోయి మనుజజాతి కెంతటి యుపద్రవమైన కలుగుననుట కేమైన నాశ్చర్యముండునా? కావున మన సంఘసీమలలో నుత్పాతములఁ బుట్టించి మనవారు — బీహార్ — క్వెట్టా మున్నగుచోట్ల నుదయించిన భూకంపములను మించిన యుపద్రవములను కలుగఁజేయరాదని స్పష్టముగఁ దెలిసికొనవలసి యున్నది.

కావున ప్రజ లవినీతియందాసక్తి కలుగుట వలన మేమిట్టి కల్పనలఁ జేయుచుంటిమనియు — సంఘ మీ విధముగ పతితమై యున్నది కావుననే మే మీకథల సాంఘిక వృత్తములకుఁ బ్రతిబింబములుగ వ్రాయుచుంటిమనియు — అట్లు వ్రాయుటయే ప్రతిభయు, ప్రజ్ఞయు, పండితలక్షణమునగు ననియు ననుట కెంతమాత్రము పొసఁగదని చెప్పగలను.

జారత్వ మొక పౌరుషలక్షణముగ మహాకవులు సహిత ముగ్గడించియుండిన దుర్గతి ఆంధ్ర సారస్వతము నొకప్పు డావహించెను కాని అది రావుబహదూర్ కందుకూరి వీరేశలింగము పంతులుగారి రాకతోఁ దొలఁగి పోయినదని చెప్పవచ్చును. పంతులవారు సమకాలమునందలి విటపురుష దుర్వర్తనముల ప్రతిఘటించుటకై యట్టివారితో కొన్ని సంవత్సరములు హోరాహోరిగాఁ బోరాడి యట్టివారికి నలుగురియందును సంఘదూషణ (Social odium) కవకాశమేర్పడునట్టి పరిస్థితులఁ గల్పించుటచేత నేడు విద్యాధికుల యందీమాత్రమైన నీతివర్తనముండుట కవకాశమేర్పడినది. సంఘమున దుర్ణయ ప్రోత్సాహకరముగ యవినీతి వర్ధకముగ నుండు పూర్వకవీంద్రుల పద్యములసహ్యించుకొనుచు వీరేశలింగము పంతులుగారు వ్రాసియున్న యీక్రింది వాక్యములు విద్యాధికులు సర్వదాజ్ఞప్తియందుంచుకొనవలసి యున్నది. జారత్వమహత్వము నుగ్గడించుచు శ్రీనాధుఁడు వ్రాసియున్న పద్యముల నుదహరించుచు వారిట్లువ్రాసిరి.

"ఈ మహిమ శ్రీనాధుని కాలమునకే తగినది. ఆకాలమునందు జారత్వము తప్పుగా గణింపఁబడకపోవుటయేగాక యది కలిగి యుండుటయే ప్రతిష్ఠావహముగాను పురుషులకది వర్ణనీయమైన గుణవిశేషముగా తలంపఁబడినట్లు శ్రీనాధుఁడు కథారంభమునకు ముందు భీమఖండమునందు ద్రాక్షారామపుర వర్ణనముచేయుచు నాపురములో సానులు తప్ప బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులెవ్వరును లేనట్లుగా నొక్క-సానులను మాత్రమే యత్యధికముగా బహుపద్యములలో నభివర్ణించెను—ఇందుఁ బేర్కొ-నఁబడిన "గంధర్వాప్సరోవధూటులు" సానివారు. వారి నెప్పుడు వర్ణించినను శ్రీనాధుడు వారి గౌరవమునకు గొఱంత రాకుండునట్లుగా సాధారణముగా నిటువంటిపదములనే వారియెడ బ్రయోగించుచుండును."

అవసానదశయందు శ్రీనాధుఁడు బహువిధములయిన బాధలనుబొంది తుదకు మిక్కి-లి బీదతన మనుభవించెనని వ్రాయుచు వారీక్రిందిగీతమున్న సీసపద్యము నుదహరించుచు నిట్లు చెప్పిరి.

> కలియుగంబున నీకనుండ గష్టమనుచు
> దివిజకవివరుగుండియల్ దిగ్గురనఁగ
> నరుగుచున్నాఁడు శ్రీనాధుఁ డమరపురికి

"అవసానదశయం దిట్టి కష్టములకెల్లను గారణము యౌవనదశయందుఁ గామవశముచేత స్వేచ్ఛగా విహరించి దేహమును ధనమును జెడగొట్టుకొన్న పాపఫలముతక్క-వేఱొక్క-టి గానరాదు."

"శ్రీనాధునిపై మోపఁబడినదోషము (అనగా పంతులవారు మోపియున్న దోషము) స్త్రీవర్ణనములు వెల్లడించినందునకునుగాదు. (అట్టి దుర్వర్తనములను పంతులవారు తమ ప్రహసనములందు విశదీకరించిరి) స్త్రీలోలుడయి వయఃకాలమున విచ్చలవిడిగాఁ దిరిగి కాయమును ధనని కాయమును జెడఁగొట్టు

కొని కష్టపడవలసిన వృద్ధదశను దెచ్చుకొన్నందుకు శ్రీనాధుఁడు వేశ్యాప్రియుండని యాతనిని గూర్చి వ్రాసిన వారందఱును నైకకంఠ్యమునఁ జెప్పుచున్నారు. వేశ్యల పొందు ధనైకలభ్యమని యెల్లవాఱును నెఱుఁగుదురు. శ్రీనాధుఁడు మహారాజుల యొద్ద నాస్థానకవియయి యపరిమితధనము నార్జించుటయేగాక వివిధదేశాధీశుల సభల కరిగి కనకాభిషేకాదులను బొందిన మహానుభావుఁడు! రసికశిఖామణియయిన కవి కియ్యఁబడిన యటువంటి ధనరాశి వేశ్యల వలలలోఁ దగులుకొన్నప్పు డల్పకాలములో నదృశ్యమగుట వింతకాదు. వేశ్యల యింటి బంటులైన లక్షాధికారులు నిమిషములో భిక్షాధికారులగుచుండుట మనము లోకములో నాలోకించుచుండలేదా? పండితుఁడు చేసినను పామరుఁడుచేసినను దోషము దోషమే' పండితుఁడు చేసినది యొప్పిదమును పామరుఁడు చేసినది తప్పిదమును గానేరదు. శ్రీనాధుని కవితా చమత్కారమును ఆంధ్ర సారస్వతమునకుఁ జేసిన మహోపకారమును మెచ్చి యానందించు వారిలో నెవ్వరికిని నేను దీసిపోవువాఁడనుకాను; అయినను సత్యము నపేక్షించియు, యువజనాభివృద్ధిని గాంక్షించియు నిష్టములేకయే పెద్దలను గూర్చిన యప్రియమైన సత్యమును బలుకవలసినవాఁడనైతిని. విద్యావివేక సంపన్నులైనవారు నన్నుమన్నింతురుగాక!"

శ్రీనాధుఁడెంతపచ్చిగ పద్యముల వ్రాసియున్నను మనమతని కవితా చమత్కారమునకును అందు మూలముగ ఆంధ్ర సారస్వతమునకుఁ జేసియున్న మేలును ఉగ్గడించుచు కొంత సంతోషింపవచ్చును కాని ఇప్పు డీ రోఁతవ్రాఁతగాంధ్ర భాషకుగాని, వారి శైలికిఁగాని మనమట్లు సంతోషింపఁ జాలము కద! వారు 'మాభావమున నెట్లు పుట్టిన—మానోట నెట్లుబలికిన—మాచేతి కెట్లువచ్చిన ఆవిధమున వ్రాతు'మని నియమశూన్యముగ, నర్థశూన్యముగ వ్రాసివేయుచున్నారు. మూతివంకరలో నత్తి సౌభాగ్యమన్నట్లు రోఁతబుట్టించు వారిభావములను పాడుభాషయందే ప్రదర్శించుకొనుట జరుగుచున్నది.

అమావాస్యాంధకారమున నాకాశము మేఘచ్ఛన్నముకూడ నైనయెడల నెట్లుండునో వారిశైలియం దనన్వయాదిదోషములతో బాధపడుచుండునప్పుడు పదములు వట్టి యడవిగనుండిపోవుట జరుగుచున్నది.

మనకండ్లయెదుట సమకాలీనులగు విద్యాధికు లవినీతికరముగఁ బ్రవర్తించుచున్నారని యెవరైన నిరాఘాటముగఁ జెప్పుకొనఁగలిగినను మనమిట్టి దుర్నయప్రతిబింబితములైన కథలనే జెప్పికొనుచు సామాన్యజనుల జారత్వకథాలోలుపత్వమభివృద్ధియగునట్లుచేసివేయరాదని ముఖ్యముగ నేటికథకులకుఁ దెలియవలసియున్నది. సంతాపకరమగు నిట్టి సందిగ్ధసమయమున నాంధ్రలోకమున 'జ్వాల'యను కొఱకంచొకటి పుట్టి నీతియన్న నభిమాన మేమాత్రమైననుండు సర్వమానవులకు ముఖ్యముగ

సంసారిణులకు భీతావహముగ విజృంభించి పోవుచున్నది. చంద్రమతి నక్షత్రకునిపై కన్ను వేసినదని, సావిత్రి యముని దైహిక ముగ మోహింపఁజేసి యభీష్టములఁ దీర్చు కొన్నదని, హరిశ్చంద్రుఁడొకరీతి తుచ్ఛ ప్రకృతిని బహుపోకడలఁబోయిన మానవాధ ముఁడని—శాంతమ్ పాపమ్, శాంతమ్ పాపమ్ — ఇట్టి రీతికల్పనల నవ్యాహత ముగఁజేయు విలేఖకుల యాగడముల నెంతేఁ దడవినను వారి యవాచ్యరచనల వైఖరు లొక సహస్రాంశమైనను వానిని చూచి యుండిన వారికి గ్రహించుట కవకాశముండు నని బలుకవలసియున్నది.

విహ్యాకరమగు నిట్టి కల్పనల జేయుట వలన కేవల పుస్తకముల మాత్రము చేతఁ బట్టఁగల సామాన్యజనులెంత యధ పతితు లగుట కవకాశమున్నదో విలేఖరు లూహింపకుండుట శోచనీయముగనున్నది. కావున 'జ్వాల'వలె నాంధ్రలోకమున నీతిని మాడ్చివేయుచున్న యిట్టి పత్రికలను డాక్టర్ అంబేద్కరుగారిని పురస్కరించుకొని నేఁడు బొంబాయినగరమున హరిజనయువకులు భారతభూమియందు వారికి తలవంపులుగ నుదయించియుండిన స్మృతిశాస్త్రముల కగ్గి పెట్టుచున్నట్లు, అఖిలమానవులకుఁదలవంపని చెప్పఁదగిన యిట్టి 'జ్వాల'లను ప్రోవులు వెట్టి పరశురామప్రీతియగునట్లు తుద ముట్టింపవలయుననను నాందోళన మొక టుదయించినను ఆశ్చర్యముండదని భావించు చున్నాను.

ఆంగ్లవిద్యోపార్జనమొనర్చిన మహా మహులే ముఖ్యముగ నిట్టికథల కల్పించి పత్రికలు నింపివేయుచున్నారనుట గమనింపఁ దగిన విషయము. వారాంగ్లభాషయందలి 'రెయినాల్డ్స్' అను వాని నవలలాదర్శ ముగఁ బరిగ్రహించి 'జాణీమయ మిదమ్ జగత్'అను భ్రాంతిని బుట్టించు రోఁతకల్ప నలఁ జేతురో యేమో నేను తెలిసికొనఁజాల కున్నాను. అయినను ఆయాంగ్ల నవలాకారున కాంగ్లభాషయందెట్టి స్థాన మున్నదో మనకథకులు రవంత యోచింప వలదా? 'రెయినాల్డ్స్' ఆంగ్లసంఘము (English Social life) ఎట్లుండునో ఉన్న దున్నట్లు చిత్రించిన నవలాకారుఁడని కొందఱ భినివేశమునఁ జెప్పినను చెప్పవచ్చును. అంతమాత్రమున నాతని కాంగ్లవాఙ్మయ మున నొక తృణమైన ఘనత యేర్పడి యున్నదా? లేకపోవుటయేకాదు: వారతని నొక గ్రంథకారునిగనైన బరిగణింపరుకద! ఏల?—వారి సంఘమునకు తలవంపగు కల్పనలఁజేసియుండుట చేతనేకద!

కావున కీర్తియందాసకలిగి వివేకవంతు లగు విలేఖకు లిఁకనైన కన్నులఁ దెఱచి అపనీతి కాటపట్టగు 'కొఱకంచుల'ను దయారుచేసి ఆంధ్రభాషావధూటిపై వాతల వేయుచు నూర్చున్న యెడల శాశ్వతమగు దుష్కీర్తియుండి పోవుటయేగాక వారిజీవిత కాలమునందే సంఘబహిష్కరణములకు పాత్రులయి నీతియన్న నేమాత్రమైన నభిమానముండు జనులందఱిచేతను తిట్లు దినవలసియుండు నాపదకు గురియగుదురని గ్రహింపవలసియున్నది.

# వనితా ప్రభావము

బులుసు వేంకటేశ్వరకవిగారు

నగరమున నెటఁగాంచినను దుఃఖాగ్ని ప్రజ్వరిల్లుచుండెను. శోకవ్యాకులచిత్తులై మగవారు మగటిమిం గోల్పోయి పిరికిపందలవోలె వంటయింట దాగిరి. శత్రుసైన్యము నగరగృహంబులఁ జొరఁబడి యిచ్చ వచ్చినరీతిఁ జరించుచుండెను. దయాదాక్షిణ్యములులేక ప్రజల ధనరాసులఁ దోచుకొనుచుండ ఆర్తజన విలాపంబు లాకసము నంటుచుండెను. కఠినశిలలనైనఁ గరఁగింపఁజాలు నా విలాపానలము వారి హృదయమునుఁ గరగింపఁ జాలకుండెను.

ఇది యానగర మప్పుడున్నస్థితి

మగటిమిం గోల్పోయిన మగవారిన్నమ్మి గృహమున నెట్లు బాధపడఁగల రా నగరమునఁ గల మగువలు? మగవారి మగతనము నుంటఁగలియ నాడువారి యాలోచనాశక్తి యేడబోవును? స్త్రీలలోఁగల మేధాశక్తి పురుషులకుంజూప, స్వదేశోద్ధరణకై పోర, నాడువారు వంటయింటనే యుండవలె నన్న పురుషులకు బుద్ధిఁజెప్పఁ

గొందఱు యోషారత్నము లా శత్రురాజుం జేరిరి

ఏటికి? ప్రాణంబులఁ గాపాడుమని ప్రార్థించుటకా? పరిచారికలుగఁ జేరదీయుమని బ్రతిమాలుటకా? కాదు. భారతనారీమణు లనన్యసామాన్యశేముషీ మతులనియు, స్వదేశోద్ధరణ కార్య ధురీణలనియు నొక్కింత శత్రురాజన్యునకు బోధించుటకు మాత్రమే యటకేగిరి!! ఏగి వెట్టిప్రతాపముం జూపిరా? లేక దానమిచ్చిరా? లేక దండించిరా? లేదు. సామదానభేద దండోపాయములఁ బ్రయత్నించిరి. తుద కసామాన్యశేముషికతంబున

కృతకృత్యలైరి

"మరుచటిదిన ముదయమగుసరికి ప్రతిస్త్రీవ్యక్తియుఁ దాను మోయఁగల్గినంత బరువుం దీసికొని పో నాజ్ఞనొసంగితిని. లేనిచో మరుసటిదిన మంతమగుసరికి వారిమాన ప్రాణంబులు దక్కవు."

ఇది రాజాజ్ఞ

మరునాఁ డుదయమున నొకయువతీజన సమూహము రాచబాటంజనఁ గాంచినాఁడు శత్రురాజు. ప్రతి స్త్రీయు నామెయినర్గళ పాతివ్రత్య ముట్టిపడ తన నిజభర్తను భుజముపై నెక్కించికొని బయలుదేరుట గాంచి నాడు రాజు. గుండెపగిలి బ్రద్దలైన దాతనికి. తత్క్షణము పాడువడిననగరము యథాప్రకారము చేయబడి తిరిగి పూర్వపురాజున కొసంగఁబడియెను. రాజాజ్ఞపై రాజు స్వయముగా నాపతివ్రతల పాదములఁబడి క్షమార్పణ గోరినాడు. ఇది వారలశక్తి—

ఆహా! కాంచితిరా వనితా ప్రభావము!!

# ఉవిదలా ఉక్కు—తునుకలా?

పదువుల రామచంద్రయ్యగారు

ఎతియోపియాదేశపు వనితలు గృహమందేయుండి తమ సంతానమును భర్తను గురించి శ్రద్ధగైకొనుటతో తృప్తి బొంది యుందురు. ఇపుడు తమ స్వాతంత్ర్యమున కపాయము వాటిల్లనున్నది; దేశముపై శత్రువులు దాడివెడలుచున్నారు. కావుననే వారిపుడు వీరయోధలై విజృంభించిరి. వీరిలో ముఖ్యురాలగు 'ఓట్టీరో ఔరానెక్' యను యిరువదియేడు సంవత్సరముల ప్రాయముగల వీరవనిత అంకోబార్ అను స్థలమునుండి అడిస్అబాబాకు తన పరివారముతో కంచరగాడిదలపై జనుదెంచి రాజాజ్ఞబడసి తనభర్త వాల్‌వాల్ యుద్ధరంగముననుండ నాతని గలసికొనబోయినదట! ఆమె యాతని ప్రక్కనే పాదరక్షలు గూడ లేక తన దేశాచారమగు వస్త్రములనే ధరించి శాత్రవులతో పోరనున్నదట. రాజ్యకాంక్షచే నిరాయుధులపై నన్యాయముగ కత్తిగట్టి నాగరికులమని యనుకొనుచున్న మానవరూపులగు రక్కసులనుగాంచి ఉడుకురక్తము గలయే యువిదయైన యూరకుండగలదా?

ఇదియేగాక "స్వదేశాక్రమణమునకు శత్రువులగు నిటాలియనులు గడంగుచో తమ పురుషులతో బాటు స్త్రీసైన్యమెల్ల వారిని ప్రతియంగుళమును అరికట్టి పోరాడెద"మని అబిసీనియా మహిళా సంఘాధ్యక్షురాలగు 'అబిబెక్' గావించిన గంభీరప్రకటన గతించిన ప్రతియుద్ధము నందును వీరవనిత లుండిరను సంగతిని జ్ఞాపకమునకు దెచ్చునుగదా! ఈ విషయమై 'టైమ్సుఆఫ్ఇండియా' యందు హెచ్: హార్వ్వేడే యనువారిట్లు వ్రాయుచున్నారు.

స్త్రీలు సహజముగ హింసాస్వభావులు గారు; కాని సమయమరుదెంచి యుద్రిక్తలైనచో కాళికామూర్తులై మానవునకందని ప్రజ్ఞను గనబరచుచు ఉత్సాహముచే విజృంభించి నెంతటి యపాయములనైన తృణీకరింతురు. 'వీరమాత' యని పేరు గడించిన 'ప్రారెగులా ఎగ్లీ'యను జర్మని దేశపువనితచరిత్ర,యిందుల కుదాహరణమై విచిత్రమును గల్గించుచున్నది. బెర్లిన్ నగరమున జనియించి యీమె ఫ్రెంచి సైనికోద్యోగిని వివాహమాడి భర్త సామీప్యమున నుండుటకై నెపోలియన్ సైన్యమున జేరెను!

అక్కాలమున జరిగిన యుద్ధములందు వరుసగా ముప్పదియొక సంవత్సరములు పాల్గొని పదునాలుగుమారులు గాయముల బొందుటేగాక, "యుద్ధభూమియందు గన్పరచిన" వీరత్వమునకై సైనికోద్యోగిగా నియమింపబడినది. నమ్ముట కసాధ్యముగా గన్పడుచున్నను, యీ కాలములో నామె యిరువదియొక పుత్రుని గనినది! ఆమె సైన్యములతో గూడి సంచారము గావించు

కాలమున పది వివిధ దేశములందు పుత్రులను ప్రసవించినది. ఆమె భర్తయు పదునెనిమిది ప్రియ పుత్రులును యుద్ధభూమియందే వీరస్వర్గ మలంకరించిరి. కష్టములుగాని గాయములుగాని వజ్రశరీరమును జెనకజాలవని నిదర్శనము జూపుటకువలె యామె యిన్నిటికోర్చి తొంబదిరెండు సంవత్సరములు జీవించినది.

పూర్వకాలమున వనితలెంతమందియో సైన్యమున సాధారణ సైనికులుగా జేరి తమ్మితరులు గుర్తింపకుండ సంవత్సరములు గడపినవారు గలరు. గత యూరపు మహాసంగ్రామరంగమున స్త్రీలే అందరకు దెలిసియే సైనికులతో గలసి పోరిరి. "విక్టోరియాసావ్స్"అను పదునారుసంవత్సరముల యువతి సైన్యమున జేరి యిటలీ సరిహద్దులందు బలమగు గాయములొంది తన వీరత్వమునకై రజితపతకమును బడసినది. ఆస్ట్రియా దేశము ప్రక్కన బోరాడిన స్త్రీ మూర్తి యామె యొక్కతెయే! ఐననేమి..యామె యదృష్టము బాగుండలేదు. గాయములవలన నొక కాలు ఖండింపబడి యుద్ధానంతరము దక్షిణ టైరాలు దేశమునందు నివసింప వెళ్ళినది. తమ విరోధులను గూడి తమతో పోరాడినందున ఇటలీ దేశస్థులామెకు సాయమొనరింప నిరాకరించిరి; ఆమె ఇటలీదేశపు స్త్రీయైనందున ఆస్ట్రియా దేశీయులేమియు జేయజాలక యూరకుండిరి. అంతటామె 'ఇన్సుబ్రక్' నకు వెళ్లగానచట పౌరు లామె త్యాగమును వీరత్వమును గుర్తించి యాదరించిరి.

'డోరతి లారెన్సు' అను ఇంగ్లీషుయువతి 1915 సంవత్సరమున మహాయుద్ధరంగమున ముందున్న సైన్యమును జేరుటకు తనశక్తి కొలది ప్రయత్నించెను గాని పదిదినములు సొరంగములు త్రవ్వుపటాలముతోనున్నంతట కనుగొనబడి వెనుకను పంపబడియెను. ఫ్లోరా శాండిన్ అను మరియొక యింగ్లీషు యువతీమణి తనసాహస కార్యములందుజయశీలయై సర్వియా యందంతటను గొప్ప పేరు గడించెను.

ఆమె 1914 సంవత్సరమున నర్సుగా నింగ్లండు దేశమును వీడి యుద్ధరంగమునకు వెళ్లెను. ఘోరమగు పోరాటముల మధ్య జిక్కి శత్రువుల దెబ్బలకు గురియయ్యెను. వెంటనే ప్రక్కనబడియున్న సైనికుని తుపాకిని గైకొని సాధారణ సైనికుని జీవితము నారంభించెను. కొన్ని మాసములు యితరులతోపాటు ఘోరముగ పోరిన తరువాతనే ఆమెసేవ గుర్తింప బడియెనట!

సైన్యమామెను విజయదేవతగా నెంచి యామెకై ప్రాణముల ధారపోయుటకు సిద్ధమగుచుండెనట. ఆమెవలననే సర్వియాకు విజయము చేకూరుచున్నదని వారు నమ్మిరి. సర్వజనప్రియయై యంత ప్రాముఖ్యతను బడసియు, నామె సాధారణ సైనికులకంటె యెక్కువ గౌరవమును నిరాకరించెను. ఒకమారొక ఘోరమగు సంఘర్షణయందామెకు నిరువదినాల్గుపర్యాయములు గాయములు దగిలెను; కుడిచేయి ఛిన్నాభిన్నములయ్యెను. వీనినుండి తేరుకొన్న

తరువాత నామె కధికారులు సులభమైన యున్నతోద్యోగ మివ్వగా వలదని తన పూర్వపుమిత్రులగు సైనికులతోనే యుండ గోరెనట! క్రమక్రమముగ నీ నారీమణి తన వీరత్వముచేతను సాహసకృత్యములచేతను సైన్యమునందొక సహాయ సైన్యాధికార మును, సర్వియాదేశ సైన్యమునందత్యంత గౌరవనీయమగు 'కరాజార్జి స్టార్' ను బడయ గల్గెను.

ఆమె యిప్పటికిని సైన్యముననున్న ట్లె యెంచబడినదట! 1926 వ సంవత్సరమున రాజామెను మూల బలోద్యోగుల పై యుద్యోగినిగా నియమింప నాజ్ఞ యిడెను. మరికొందరు:—

ఇంగ్లండు దేశచరిత్రయందు పెక్కు మంది స్త్రీయోధులను గాననగును. ప్రతివారి చరిత్రయు వారెపుడును పురుషునికి భయ పడలేదనియు, పురుషులుమాత్రము వారిని మృత్యుదేవతా స్వరూపములుగా నెంచి సమీపింప వెరచుచుండిరనియు దెలుపు చున్నది. వారి కాగ్రహమువచ్చెనా ఈనిన బెబ్బులులవలె పోరాడెదరు. వారి భయంకర కోపమున కెదుట నేదియు నిలువజాలకుం డెను. వారి స్థైర్యము కష్టము లనుభవింప గల యోర్పు అనన్యసామాన్యములు.

హెన్నాస్నెల్ పై జెప్పిన జాతిలో నాలుగాకు లెక్కవజదివినది. ఒకమా రామెకు తన విధుల నిర్లక్ష్యము జేసినందు లకై ఆరువందల కొరడాదెబ్బలశిక్ష విధింప బడినది. ఆమె తా స్త్రీనని తెలుపుకొన కుండ ఐమువందల కొరడాదెబ్బల భరించి నది! తాను స్త్రీనని యధికారులకు దెలుపు కొనియే యుండినచో ఆ శిక్షయే విధింప బడునదికాదు. ఏలయన ఆకాలమునకూడ స్త్రీల కట్టిదండనలు లేకుండెను.

ఆమె భారతదేశమున కంపబడెను. అపు డామె పోర్చుగీచువారితో పుదుచ్చేరి యందు ఇంగ్లీషు సైన్యముతోగలసి యతి ఘోరముగ బోరాడెను. ఆయుద్ధమున నొక కాలి కారుగాయములును మరొకదాని కైదుదెబ్బలును తగిలెను.నడుమునందుగూడ నొక గొప్పగాయమయ్యెను. కాళ్లయందు దగిలిన గాయములకు మాత్రము వైద్య సాహాయ్య మపేక్షించి తన స్త్రీత్వమును మరుగుపరచుటకై నడుమునందున్న గాయ మును బయలుబెట్టదయ్యెను. అచట ఔషధ ములు మొదలగు కావలసినవానిని డాక్టరు పెట్టెనుండి సంగ్రహింప సామర్థ్యముగల యొక స్త్రీకి కొంచెము ధనాశజూపి కావల సిన ఔషధములను కట్టుగట్టుటకు గుడ్డలు మొదలగువానిని దెప్పించుకొనియెను. పిమ్మట నడుమునందున్న గాయమున తుపాకి గుండును చూపుడువ్రేలితోడనే వెదకి వ్రేళ్ల తోడనే అందున్న గుండును బయటికిదీసి వేసెను! తాను స్త్రీయగు సమాచారమును బైటబెట్టగూడదను నిర్ణయమునకై యామె యాసమయమున నెంత ఓర్పుగల్గియుండెనో యది సాధారణ మానవుని యూహకు గూడ నతీతమైనది!

ఆమె తన జీవితాంతమును ధనలోపము లేమిచే శాంతియుతముగ గడపెననుట చాల సంతోషకరమగు విషయమే. కంబర్లాండు ప్రభు వామెకు గొప్ప బహుమతి నిచ్చెను. ప్రభుత్వమువారుగూడ సంవత్సరమునకు ముప్పదిపౌనుల ఉపకార వేతనమిచ్చి గౌరవించిరి.

ఈనాడట్టి యేకాంతముగా సాహస కృత్యము లొనరించు వనితలకన్న స్త్రీసైన్యముల కెక్కువ ప్రాముఖ్యతగల్గినదని చెప్పవలసియున్నది. రష్యా దేశమున గల్గిన విప్లవమున యొక మహిళాసైన్యము ప్రభుత్వపు సైన్యము నెదుర్కొని పోరాడుటయేగాక వారిని కండతుండెములుగ ఖండించివైచి, భయముచే బారిపోవుచున్న సైన్యమును తిరిగి తమ నెలవుల జేరునట్లు గావించెను. చైనా దేశమునందు 'విశోచంగ్'యను వీరవనిత, మూడువేలమంది స్త్రీదళమును జేర్చి మంచూరియానంతయు గడగడలాడించెను. ఇపుడు ఇటలీ దేశపు స్త్రీలుగూడ యుద్ధమున ఇటలీ సైన్యమునకు సాయపడెదమని బాస జేసియున్నారు. వారే అబిసీనియా వీరవనితలను యుద్ధమునందు ఢీకొను చో మనము పురాణములందు వినుచుండునట్టి యుద్ధము జరుగకమానదు. అది యిదివఱకు పురుషులచే నొనరింపబడిన యుద్ధదీప్తిని ప్రచ్ఛన్నముగా జేయకమానదు!

ఇట్టి యుక్కుతునుకలు, సంగరక్షోణిని ఖడ్గమును చేబూని విరోధులను చించి చెండాడి యెంతటికష్టములనైన నోర్చి స్వాతంత్ర్యరక్షణకై ప్రాణముంగూడ నవలీలగా యాహుతిచేసిన వీరనారీమణుల విశాల భారతదేశమందు పెక్కుమంది గలరు; కాని వారిచరిత్ర కాలప్రవాహమున గలసిపోయినది. భారతీయు లట్టివారి జీవితచారిత్ర లామూలాగ్రముగా వ్రాయకుండు టెంతయు శోచనీయము. ఇది యట్లుండ స్వాతంత్ర్య సంపాదనమునకై మహాత్ములపద్ధతియగు నహింసా సూత్రమవలంబించి పశుబలమును ఆత్మబలముచే నిరోధించి, గాయములైన, కండలూడిన ముఖములో బాధయను భావమును జూపెట్టక తమయోర్మికి సర్వప్రపంచము దిగ్భ్రమజెంద ప్రవర్తించిన శాంతిసమరమునందలి వీరవనితల వృత్తాంతముగూడ సక్రమమును సమూలాగ్రమును నగు చరిత్రయను దృఢమగు శిలకు బంధింపనిచో కాలప్రవాహమున గలసిపోవునేమో?

# బాలవిజ్ఞానశాఖ

<u>పాట</u>

పండ్లగంప — పిల్లలకోటికే యిది!

భరతమాతనుబోలు — పనసపం డిదుగోండి।
ధర పూర్వమునకంటె — తగ్గ ననుకోకండి॥
సీతమ్మకతలోన — సీరామునటుదక్కి।
యీతీపితోనలోన — నిమిడియున్నదిపిక్క॥
పాతకాలమునాటి — ప్రభువులంతాదీని।
ప్రీతితోఁగొన్నారు — భేషుభే షన్నారు।

విన్నారు నామాట
తిన్నారు సుఖముగా
నున్నారు స్వర్గాన
నెన్నటికి మరిరారు॥

## తాతా మనవలు

తాత — యేంవే అవ్వా, యేంరా తాతా, యిలారండీ —

యిద్దరు — యెందుకు తాతా?

తాత — ఏఁగే-తాతా, అడిగావ్రా మీ తెనుగుపండితుడుగార్ని...శుక్లాంబరధరం...

వెంకటి — అడిగాన్ తాతా —

తాత — యేంచెప్తున్నాడు?

పార్వతి — జిల్లా కెక్టరుగార్ని ధ్యానించాలట తాతా!

వెంకటి — వుండే! -- అదికాద్ తాతా, శుక్లా...ధరం = యెప్పుడూ తెల్లనిబట్టలు కట్టుకునేవాళ్లూ: విష్ణుం — లోకంఅంతా వ్యాపించినవాళ్లూ: శశివర్ణం = చంద్రబింబంలాంటి మొగాలుగలవాళ్లూ: చతుర్భుజం = లోపల కమేజూ పైన కోటూ తొడుక్కోడంవల్ల నాలుగుచేతులు గలవాళ్లూ: ప్రసన్నవదనం = యెప్పుడూ కూడా కలకలలాడుతూవుండేవాళ్లూ ఐనటువంటి జిల్లాకలక్టరుగార్ని మన కేదైనా పనికావలిస్తే: ధ్యాయేత్ = ధ్యానంచేయాలి అని చెప్పారు తాతా.

తాత — చబాసురానాయనా!!...నువ్వడిగావే పార్వతీ...

పార్వ — అడిగాన్ తాతా - 'ఐదు పదిచేసి'రంటే ఐదులో మరో ఐదుకలపడం 'ఆరు మూడైం'దంటే ఆరులో మూడుతీసేడంవున్నా అనిచెప్పారు మా తెలుగమ్మవారు.

వెంక — 'టుపుక్కున - జరజర - దబుక్కు - మేఁ'అంటే చెప్తానన్నావ్ చెప్పవుతాతా?

తాత — ఆఁ - జ్ఞాపకంవుందిరా బడవా ?! మరిచిపోయావనుకున్నా - విను:—

ఒకడూ యింటిమీాద పుల్లగుమ్మిడిపా దెక్కించాడు. అది బాగా కాచింది. వోనాడూ కాయ 'టుపుక్కున తెగింది - జరజరమని దొర్లింది - దబుక్కున ఆ పంచకింద పరున్న మేకపిల్లమీాద పడ్డాది. ఆమేక మేఁఅన్నాది. విన్నావా? యింతే. ఇది భావకవిత్వం అంటూ రీనాడు.

వెంక — తాతా, కథచెప్పవూ

తాత — వోరే, యిదిచూడూ - నీవంటికుర్రాడే వొకడు వ్రాశాడీకథ.

దురాశ దుఃఖమునకు చేటు

నాకు రాత్రి నిద్రపట్టలేదు. మా ముసలమ్మను ఒక కథచెప్పుమని అడిగినాను. మాముసలమ్మ నిద్రకళ్లమలుపుకొనుచు ఈ కథచెప్పెను. నేను ఈకథ మీకు చెప్పుచున్నాను. వినండి.

అనగాఅనగా ఒకముసలమ్మ ఒక ఊరిలో ఉండేది. దానికి పిల్లలులేరు. అందుచేత రెండుచేపలను ముద్దుగా పెంచెను. పెద్దదానికి పెద్దచేపఅని చిన్నదానిని చిన్నచేప అని పిలుచుచుండెడిది. పిల్లలు లేకపోవుటచే ముసలమ్మకు ఆచేపలంటే చాలాముద్దు.ముద్దు ఎక్కువచేత వాట్లకి ముక్కుచెవులు కుట్టించి అందముగా వాటిరెండిటిని అలంకరించి, చాలా గారాబముతో పెంచుచుండెను.

ఒకనాడు ముసలమ్మ తనబంధువులఇంటికి వెళ్లి చూచుటకై పొరుగూరికివెళ్లెను. తనప్రియమైనచేపలను పొరుగింటి పుల్లమ్మకు, శ్రద్ధగా చూడమనిచెప్పి వెళ్లిపోయెను. పుల్లమ్మ ఇంటికి బంధువులువచ్చిరి. కూరలు ఏమియు లేకపోవుటచే ఆరెండుచేపలను తరిగి కూర వండెను. మరునాడు ముసలమ్మ ఇంటికివచ్చి, పెద్దచేపా, చిన్నచేపా, అని పిలిచెను. కాని అవిపలకలేదు. ముసలమ్మకు ఆకలి ఎక్కువగుటచే, తరువాత వాట్ల గురించి చూచెదనని అనుకొని వంటవండెను. కూరలు ఇంట్లో లేకపోవుటచే పొరుగింటికెళ్లి వండిన కూర అడిగెను. వాళ్లువండిన చేపకూర ఇచ్చిరి. ముసలమ్మ ఆకూరను తీసుకొని తనఇంటికివెళ్లి భోజనము చేయుచుండెను. అందుమధ్యను తనుచేపలకు కుట్టించిపెట్టిన దుద్దులుకనబడెను. కోపముతోలేచి, పొరుగింటి ఆవిడదగ్గరకువెళ్లి, నాచేపలను ఇచ్చెదరా, లేక మీ మేకపోతును ఇచ్చెదరా అని అడిగెను. అంత పుల్లమ్మ భయపడి, తన మేకపోతును ఇచ్చెను. ముసలమ్మ ముద్దుతో మేకను తీసుకొనిపోయి చెవులుముక్కు కుట్టించి, చాలాప్రియముతో పెంచుచుండెను. ఒకనాడు ఆవూరిలో ఒకజాతరఅయినది. చూచుటకు వెళ్ళెదనని మేక ముసలమ్మను అల్లరపెట్టెను. ముసలమ్మ మేకకు ఒకదమ్మిడీఇచ్చి జాగ్రత్తగా రమ్మని చెప్పి మేకనుపంపెను. మేక జాతరకువెళ్ళి, తనకు ముసలమ్మఇచ్చిన దమ్మిడీతో సెనగలుకొనెను. ఇంతట్లో చీకటిపడెను. మేకకు భయమువేసెను. అందుచేత, వజ్రములు, కెంపులు, బంగారము అమ్ముచున్న ఒక వర్తకునిదగ్గరకుపోయి, ఆరాత్రి పడుకొ

నుటకై ఒకగదిని ఇమ్మనిఅడిగెను. ఆవర్తకుడు ఒక గదినిచూపించి దానిలో ఉండమనిచెప్పెను. మధ్య రాత్రి అప్పుడు, మేకకు ఆకలివేసెను. ఏమీ లేక పోవుటచేత, ఆగదిఅంతయు వెదికి పక్కగదికివెళ్ళెను. పక్కగదియందు కెంపులు వజ్రములు చూచి, ఆకలి ఎక్కువగుటచే వాట్లనుతినెను. కడుపునిండిన తరువాత తిరిగి తనగదికివచ్చి .నిద్రపోయెను. తెల్లవారగనే లేచి, వర్తకునితో వెళ్ళెదననిచెప్పి, తనఇంటికి వెళ్లి పోయెను.

మేక రాత్రి రాకపోవుటచే, ముసలమ్మ ఎక్కువ భయముతో ఊరంతయు వెదికెను. నౌకరులచేత రాత్రిఅంతయు వెదికించెను. నౌకర్లు మేకను తెల్లవారి ఇంటికివచ్చుచుండుట చూచి, ముసలమ్మ తనకోసము బెంగపెట్టుకున్నదని చెప్పిరి. మేక, వాళ్లను పసుపు రోకళ్లు సిద్ధముగాఉంచమని ముసలమ్మతో చెప్పమని, వాళ్ళను తొందరగా వెళ్లమనెను. మేక ఇంటికివెళ్లేసరికి పసుపురోకళ్లు సిద్ధముగాఉండెను. తనకు కడుపునొప్పి ఎక్కువగా ఉన్నదనిచెప్పి, ముసలమ్మను రోకళ్లతో తనపక్కను పొడవమనెను. ముసలమ్మ ఒకపక్క పొడవగా కెంపులును, మరియొకపక్క పొడవగా వజ్రములును మేక క్రక్కెను. ముసలమ్మ సంతోషము మేరలేదు. వజ్రములు కెంపులు ఎక్కువగానుండుటచే పుల్లమ్మఇంటికిపోయి వాళ్ల తవ్వఇవ్వమని అడిగెను. ముసలమ్మ బీదదికదా దానికి తవ్వఎందుకు? అని అనుకొని తవ్వలోపల అంబలిరాసిఇచ్చెను. ముసలమ్మ, వరహాలు కెంపులు కొలుచుకొని తిరిగి పుల్లమ్మకు తవ్వ ఇచ్చెను. కాని పాపము తవ్వకు వజ్రము అంటుకొని పోవుట చూడలేదు. పుల్లమ్మ అదిచూచి ముసలమ్మ దగ్గరకుపోయి; "నీకు వజ్రములు ఎట్లువచ్చినవి. చెప్పకపోయిన పోలీసువాళ్లతో చెప్పి నిన్ను జెయిలుకు పంపెదను," అని అనగానె ముసలమ్మ భయపడి జరిగినదంతయు చెప్పెను. అంత పుల్లమ్మ వెళ్ళి పోయెను.

పుల్లమ్మకు వజ్రములుఅన్న ఎక్కువప్రియము. అందుచేత ముసలమ్మమేకలాగ వజ్రములు తెచ్చు ననుకొని, తన రెండుకుక్కలను ఊళ్లోతిరగమని చెప్పి పంపెను. కుక్కలు రెండును ఊరంతయుతిరిగి, ఎమ్ములును, తోలుముక్కలును కడుపునిండా తిని ఇంటికి వచ్చినవి. పుల్లమ్మ అవిరాకముందే పసుపులను. రోకళ్లును, సిద్ధముచేసెను. కుక్కలురాగానే వాట్లని పడుకొనమనిచెప్పి రోకళ్లతో పొడిచెను. ఒకపక్క పొడవగా కుక్కలనోట్లోంచి ఎమ్ములుపడెను. మరి యొకపక్క పొడవగా, చిరిగిపోయిన చెప్పులు, తోలు ముక్కలుపడెను. అంత పుల్లమ్మకు ఎక్కువగా కోపము వచ్చి, తన నౌకర్లకు కుక్కలను కొట్టమనిచెప్పెను. అంత నౌకర్లు కుక్కలను గట్టిగాకొట్టగా రెండూ చచ్చి పోయెను. పుల్లమ్మ తనకు వజ్రములు రాకపోవుటయే గాక, తన రెండుకుక్కలు చచ్చిపోవుటచూచి, తన పేరాసయే కారణమనుకొని, చాలా విచారించెను,

మారెళ్ల వెంకటగంగరాజు.

# తారతమ్యము

'కృష్ణవేణమ్మ'

సీ॥ అతఁడు మహాభోగి యితఁడు మహాత్యాగి యెన్నన తనికంటె నితఁడెఘనుఁడు
అతఁడు చక్రాయుధుఁ డితఁడు ధర్మాయుధుఁ డెన్న నతనికంటె నితఁడెఘనుఁడు
అతఁ డరిభీభత్సుఁ డితఁ డజాతవిరోధి యెన్ననతనికంటె నితఁడె ఘనుఁడు
అతఁడు హైందవపూజ్యుఁ డితఁ డెల్లరికిఁ బూజ్యుఁడెంచ నతనికంటె నితఁడెఘనుఁడు॥
గీ॥ అతఁడు పురాణ పూరుషుఁ డితఁడట్లుగాక ప్రత్యక్షదైవము గాన ఘనుఁడు
అతఁ డితఁడును జనితులు విష్ణ్వంశయందు దీనఁ దారతమ్యంబుల గానవచ్చు.

# గృహలక్ష్మియే భారతయుద్ధమునకు కారణము

రాజసూయమున కరుడెంచిన దుర్యోధన చక్రవర్తికి మయసభలో కలిగిన
అవమానమునకు పాండవ గృహలక్ష్మి నవ్వినది.

ఆ అవమానమును కౌరవసభలో వస్త్రాపహరణరూపమున
కౌరవులు కడిగివైచుకొన్నారు.

ఈ వివరములు

## బెజవాడ
## సరస్వతీ టాకీస్ వారు

తమ మొదటి తెలుగుటాకీ

# ద్రౌపదీ
# వస్త్రాపహరణము

లో దివ్యతరముగా ప్రదర్శింపనున్నారు

## నటులందరు ఆంధ్రుల
## అభిమానము
## నాకట్టుకొన్నవారు

పాత్రధారులు

| | |
|---|---|
| యడవల్లి | సి. యస్. ఆర్ |
| గగ్గయ్య | నాగరాజరావు |
| దొమ్మేటి | చొప్పల్లి |
| కన్నాంబ | రామతిలకం |

నగరాజకుమారి

*For Booking apply to*

**SARASWATI TALKIES, Ltd.,**
***Camp: Palace Theatre***
***Buildings, Kolhapur.***
***'Grams: "SARASWATI," Kolhapur***





# స్త్రీలవ్యవస్థ

## మహిళాసభలు

భారతదేశమున స్త్రీల కాదినుండియు సంఘమున నున్న గౌరవము పవిత్రస్థానము ఎప్పటినుండినిరోధింపబడెనో ఆనాటినుండియే భారతజాతీయాభివృద్ధి కాటంకము గల్గెననుటలో సందియము లేదు. దీనినిపుడు భారతీయులు గుర్తించియుండుట శ్రేయోదాయకమే. కాని, తగినకృషి లేకున్నందువలన నా పూర్వస్థానము గల్గించుట కింకను కొంతకాలము బట్టునేమో? కాని యిప్పటి నారీమణుల కార్యక్రమములు, సభలు పరికించినచో నదియు నత్యంతత్వరలో నగునని నమ్మెదము. ఇంతవర కీవిషయమై యెక్కువగా సామాన్య ప్రజలే శ్రద్ధదీసుకొనుచుండిరి. ఇపు దన్నవో ఆసూర్యంపశ్యలగు కాంతాజనములుగూడ భారతనారీమణుల పరిస్థితులు బాగుచేయుటకై పాటుపడ ప్రయత్నించుట సంతోషదాయకము. వీరి ప్రయత్నములమూలముననే హైదరాబాదు సంస్థానమున స్త్రీలపరిస్థితులు చాల యభివృద్ధి జెందినవి. ఇటీవల హైదరాబాదులో జరిగిన మహిళాసమావేశమున కధ్యక్షురాలై వచించిన శ్రీ వనపర్తి రాణిగారి విషయము లెంతయు గమనింపదగియున్నవి. వారు స్త్రీలయభివృద్ధికై జాతిమతభేదములు లేక యైకమత్యముతో బాటుపడవలయునని వచించుచు కావలసిన సంస్కారములను ప్రతిస్త్రీయు నింటనుండియే ప్రారంభించవచ్చుననియు, పరదా వెనుక నుండియుగూడ పాటుబడవచ్చుననియు వచించిరి. సంస్కారములన్నియు ప్రతియింటినుండి ప్రారంభింపవలసిన విషయము చాల ముఖ్యమైనది. పరదా వెనుక నుండిచేయు పనులకన్న పరదాను వీడిన యెక్కువ సులభముగా కార్యములు చేయుగలరని మాతలంపు.

హైద్రాబాదురాజ్యమున పెక్కు శుద్ధాంత కాంతాజనంబులవలెనే తిరువాంకూరు మైసూరు రాజ్యములందుగూడ రాణులు స్త్రీలయభివృద్ధియందు పాల్గొనుచుండుట శ్రేయోదాయకమే. తిరువాంకూరు రాణిగారు మహిళాభివృద్ధికై చేయుచున్న సేవ కరతలామలకమే. ఇపుడు మైసూరు యువరాణిగారు గూడ నిట్టి విషయముల బాల్గొనుచుండుటకు వారినభినందించుచున్నాము.

మైసూరు దివానుగారి పత్నియు నిందులో చాల శ్రద్ధగైకొనుచున్నది. వీరి యాజమాన్యమున బెంగుళూరునందు జరిగిన సభలో పెక్కుతీర్మానములు గావించిరి. వానిలో ముఖ్యముగ, స్త్రీలవిద్యకై ప్రభుత్వమువారు చాల శ్రద్ధవహింపవలయుననియు, మగనాలులగు స్త్రీలు వేరొకరిని వివాహమాడుచో వారి కట్టి శిక్షవిధింపబడునో, భార్యలుండియు వేరు స్త్రీల వివాహమాడు భర్తలకుగూడ నట్టిశిక్షయే వలయునను తీర్మానములు ముఖ్యములు. కొంచె మెచ్చుతక్కువగా నందిగామలోగూడిన మహిళాసభయు నిట్టి తీర్మానములనే యొనరించెను; అహమ్మదాబాదునందు గూడిన అఖిలభారతమహిళాసంఘశాఖ బరోడా సంస్థానమందున్నట్టి విడాకులచట్ట మవశ్యకమనియు, సంతాననిరోధవైద్యశాలానిర్మాణము, స్త్రీలకు వోటింగుహక్కు యింకను విస్తరింపజేయుటయు, త్వరలో జరుగవలయునని తీర్మానించిరి. ఫరీద్‌పూరునం దిటీవల గూడిన మహిళాసభయందు 45 సం. పైబడ్డ పురుషులు కన్యల వివాహమాడిన శిక్షింపబడునట్లును, 30 సంవత్సరములు పైబడిన వితంతువులనే వివాహమాడునట్లును నొక చట్టమావశ్యకమని తీర్మానించిరి. పైతీర్మానములందు విడాకుల చట్టమొకటి విమర్శింపదగియున్నది. గాని మిగిలిన యితర తీర్మానములన్నియు చట్టమూలమున

ప్రచురణలోనికివచ్చిన అచిరకాలములో స్త్రీలకు సంఘమున మునుపున్న స్థానము గలిగి సంఘ మభివృద్ధి బొందునని మా యాశయము.

## స్త్రీ సంస్థలు

ఏలూరు పట్టణములో జరిగిన విద్యావారములో 16-10-35 ఉదయము 8-30 గంటలకు ఏలూరు రామచంద్రరావుపేటలో తమ గృహమున పశ్చిమ గోదావరిజిల్లా సెషన్సు జడ్జీ మ-రా-రా-శ్రీ వి. రాజ గోపాలాచారిగారి అధ్యక్షతక్రింద శ్రీమతి శృంగార కవి లక్ష్మీనరసమ్మగారిచే "మహిళా విద్యాలయము" స్థాపింపబడెను.

సుమారు 16 గురు అన్నివర్ణముల విద్యరాని ప్రౌఢ స్త్రీ విద్యార్థినులు విచ్చేసిరి. వారికి శ్రీలక్ష్మీ నరసమ్మగారు ఓం నమశ్శివాయ మంత్రపురస్సరముగ అక్షరాభ్యాసము గావించిరి.

శ్రీమతి లక్ష్మీనరసమ్మగారిట్లు చెప్పి సభ్యుల నమందానంద కందళిత హృదయుల గావించెను.

మహాజనులారా!

ఇది ఉపన్యాసముల కాలముగాదు. ఎవరికితోచిన మట్టుకు వారివారి శక్త్యనుసారముగా దేశహితకార్య ములను జేయవలసిన మహాసమయము.

పూర్వకాలమున విద్యలకాలవాలమైన భారత దేశమున నేడు నూటికి 1 కంటె నెక్కువగా విద్య వచ్చిన స్త్రీలు లేరని చెప్పుటకు చాలవిచారముగా నున్నది.

విద్యనేర్చిన తల్లి తనపిల్లలకేగాదు తనయింటికి వచ్చు పిల్లలందరికి మంచి సంగతులను జెప్పును. పిల్ల లను పెంచుట తల్లిపనియే. విద్యయేగాదు—తల్లి జెప్పు బుద్ధులే పిల్లల యభివృద్ధికి కారణము కావున పిల్లల తల్లిని విద్యావతినిజేయు భారము తండ్రియందున్నది. పతికి పత్ని విద్యావతిగా, వివేకవతిగా నుండుట కుటుంబమునకు మేలుగదా!

రాబోవు సంస్కరణములలో స్త్రీ ఓటరుగా పరిగ ణింపబడునని తెలిపియున్నారు. నూటికి షుమారు 40 మంది ఓటర్లగుటకు సావకాశము గలదని నూతన సంస్కరణ ప్రణాళిక తెలుపుచున్నది. ఈ సమయ మున చదువను వ్రాయను నేర్చిన స్త్రీలున్నచో వారందరు ఓటర్లగుదురు. అప్పుడు స్త్రీలకు ప్రాతి నిధ్యము, స్త్రీల హక్కులను సంరక్షించుకొనుటకు శాసనములు, స్త్రీ స్వాతంత్ర్య నిర్వహణమునకు వలయు సాధనములను నిర్మించి స్త్రీ జీవనమున కౌన్నత్యము గలిగించుటకు మంచి అవకాశమేర్పడ వచ్చును. ఎటుచూచినను ప్రౌఢ స్త్రీవిద్య ఆవశ్యక ముగానే గానుపించుచున్నది.

ఇప్పుడు, స్థానికసంస్థలును, మిషనెరీలును, ఇతరు లును బాలికా పాఠశాలలను స్థాపించి చాలభాగము విద్యాప్రదానము గావించుచున్నారు. శ్లాఘనీయమే గాని యిప్పుడు 20 ఏండ్లకుపైగా విద్యావిహీనలగు స్త్రీలు విద్యావతులైనగాని మనదేశము జనాభా లెక్కలలో విద్యగానిదేశమనియే పేరుపొందు చుండును.

ఇప్పటి చదువుగాని ప్రౌఢస్త్రీలు వృద్ధులగుదాక మనదేశము చదువురానిదేశముగా నుంచవలసినదేనా? గవర్నమెంటువారుగాని, స్థానిక సంస్థలుగాని బాల విద్యావ్యాప్తికే కృషిసల్పుచున్నారుగాని ప్రౌఢస్త్రీ పురుషుల విద్యావ్యాప్తికి కృషిసల్పుటలేదు.

కావున నాకుగల యల్పశక్తిని గడింపక దైవము మీద భారముకేసి నేడు ప్రౌఢస్త్రీల విద్యావ్యా ప్తికై యీ మహిళాలయమును, పెద్దల యనుగ్రహ మువలన స్థాపించగలిగినందుకు భగవంతుని కొని యాడుచున్నాను. ప్రపంచము బహుళము. విద్యరాని ప్రౌఢస్త్రీలా కోట్లకొలది!! నే నెందరివిద్యావతుల గావింపగలను!! విద్యావిహీన మహా సముద్రమునకే చేయుకృషి పరమాణుప్రాయమని నాకు తెలియును కాని నే జేసిన యీ చిన్నపనినిజూచి, బహు కొంద్ర

# స్త్రీల వ్యవస్థ

దేశమందలి ధర్మాత్ములు, విద్యావంతులు, ఉదారులు వీధివీధికి యిట్టి విద్యాలయములను స్థాపించి అచిర కాలమున భారతదేశస్త్రీలు విద్యావతులను ప్రతిష్ఠ తెప్పింతురను కొండంత యాశతో నీ యుద్యమమును ప్రారంభించితిని. దీనిని నిర్వహించుభారము భారత దేశ కార్యనిర్వాహకుల అధీనము. అటుపై భగవంతుని యాశీర్వచనము. నన్నుగూర్చి యేమేమో చెప్పిన విద్యాభిమానులకు నే నల్పజ్ఞను అబలను ఆశీఃపాత్రురాలను గాని స్తుతిపాత్రురాలను గానని విన్నవించు చాను.

కె. యస్. రత్నమ్మ,
కార్యదర్శిని.

## నందిగామ తాలూకా
## ప్రథమ మహిళాజనసభ

తొమ్మిదవ ఆంధ్రరాష్ట్రీయ మహిళాజనసభ కనుబంధముగ తాలూకా మహిళాజనసభ ఈ నెల 11 వ తేదీ సాయంత్రము 5 గం॥ శ్రీ బెజవాడ సబ్‌కలెక్టరు వారి సతీమణియగు కళ్యాణీదేవిగారి అధ్యక్షతక్రింద సమావేశమైనది శ్రీ అధ్యక్షురాలుగారు స్త్రీ విద్యను గురించి తమప్రారంభోపన్యాసము గంభీరముగ నొసంగిరి. తరువాత సంఘకష్టములను గురించి శ్రీమతి అయ్యదేవర బాలాత్రిపుర సుందరమ్మ, ద్రోణంరాజు మహాలక్ష్మమ్మ కె. హేమలత, శితా మహాలక్ష్మమ్మ వెంకమాంబ శ్రీ లేడీడాక్టరు వగైరాలు చక్కగ నుపన్యసించిరి. బాలికలచే శ్రీ వారి గౌరవార్థము కుశలవ నాటకము ప్రదర్శింపబడెను. కార్యదర్శి వందనములతో సభ ముగింపబడెను.

## మండలిస్థాపన (పాలకవర్గము)

పేరు శ్రీ మహాలక్ష్మి మహిళామండలి.

ప్రసిడెంటు ద్రోణంరాజు మహాలక్ష్మమ్మగారు (తహస్సీల్‌దారువారి సతి)

వైసు ప్రసిడెంటు కతారి లక్ష్మీకాంతమ్మగారు (సిరస్తాదారువారి సతి)

శక్రటరి ట్రెజరరు అయ్యదేవర బాలా త్రిపుర సుందరమ్మ ఉపాధ్యాయ.

జాయింటు శక్రటరి యమ్. లక్ష్మీబాయిగారు (సాల్టు సబ్‌యిన్‌స్పెక్టరువారి సతి)

## నందిగామ తాలూకా మహిళామండలి
## తీర్మానములు

నిస్సంతులైన హిందూ వితంతువులకు భర్తఆస్తిని, వారసత్వేనహక్కు "తొలగించి" సంక్రమించు ఏర్పాటుగల చట్టమును చేయించగలందులకు ఈ సభవారు శ్రీ ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

పురుషులతోపాటు స్త్రీలకుకూడ పుట్టింటిఆస్తిలో భాగము వచ్చుచట్టము నేర్పాటు చేయించమని ఈ మహిళా మండలివారు శ్రీ గవర్నమెంటువారిని కోరుచున్నారు.

భర్తయున్న స్త్రీని పెండ్లాడిన పురుషుల కెట్టి శిక్షగలదో, స్త్రీయున్న పురుషు డింకొకస్త్రీని పెండ్లాడిన నట్టిశిక్షకే పాత్రుడగునట్టి, చట్టము నేర్పాటు చేయించమనిన్నీ సభవారు శ్రీ ప్రభుత్వము వారిని కోరుచున్నారు.

"శ్రీమతి కమలానెహ్రూగారి యారోగ్యము దినదినాభివృద్ధి నొందుచున్నది"

దినపత్రికలు

# పుష్పచయము

## ఇంగ్లండు దేశపు స్త్రీలు

శ్రీయుత బి. యెస్. టర్ఖడ్, గారు "వీక్లీ బాంబే"యందు "తన యింగ్లండుయాత్రయందలి మరువరానిభావము"లను శీర్షికతో నచటి స్త్రీలనుగురించి యిట్లు వ్రాయుచున్నారు.

ఇంగ్లండు నన్నుద్దేశించి "స్త్రీల కున్నతస్థానమిచ్చుదేశ మౌన్నత్యము జెందును; స్త్రీలను నీచముగాజూచునట్టిజాతి యధోగతిపాలగు"నను సందేశమును మీమాతృదేశమునకు, స్ఫుటముగ నివ్వుమనినది. దీనియందలి మహోద్దేశ్యము నెట్లు వివరింపవలయునో తెలియకున్నది, ఇయ్యది అగాధమై, విశాలమై అత్యంతముఖ్యమై యుండుటచే, భావరూపముననేగాని వాగ్రూపమున వెల్లడింప నసాధ్యము. నా మిత్రుడొకప్పుడు "ఇంగ్లండు స్త్రీలదేశ"మని చెప్పియుండెను. దానిని సత్యేతరమనుటకు సాధ్యముగాదు. ఏలన అది యదార్థముగ స్త్రీల దేశమే. స్త్రీలకు గౌరవస్థానమందలి హక్కు, యదార్థమగు సానుభూతి, రక్షకసంఘమునం దౌన్నత్యము, ఇంగ్లండునం దెక్కువగా గుర్తింపబడినది. ఈ నాడింగ్లీషువనితలు పురుషునితో సమానమగు సర్వానుకూలములు బొందుటయేగాక, తమ కార్యజాలములందు పురుషునకుగూడ లేని రక్షణను గల్గియున్నారు. సంఘమున స్త్రీకిగల అత్యుత్తమస్థానమును గల్పించుటతో నేడు ఇంగ్లండువంటి పాశ్చాత్యదేశ మింకొకటి లేదనవచ్చును. యోగ్యత, శక్తి, పరిజ్ఞానములందు యింగ్లీషుస్త్రీ పురుషునికి నూతనోజ్జీవనముగల్గించి సాంఘికజీవనమును శోభాయమానముగా సంతోషయుతముగా జేయుచున్నది. ఈ వనితలు వారిపురుషులవలెనే స్వాతంత్ర్యమును చాల నిచ్చగింతురు. గతించిన అరశతాబ్దమునుండియు, తమ జ్ఞానశక్తి సామర్థ్యములను స్వాతంత్ర్యమూలమున చాలవఱ కభివృద్ధిగావించుకొనిరి. ఇటీవలవారిలో చాలమంది రాజకీయములందుగూడ పాల్గొన నిచ్చగించుచున్నారు. కాని యీకోర్కె యింకను వ్యాపించుటలేదు. వ్యాపించిన నది రద్దాని సఫలత జేకూర్చుకొని విజయముపొందగలరు. స్త్రీ పురుషుని హృదయపీఠము నాక్రమించియుండుటచే ఇంగ్లీషువారు స్త్రీలకోర్కెలను నిరాకరింపరు. ఈ యౌదార్యగుణమే యొక జాతిజీవితమున కత్యంతౌన్నత్యము గల్గింపగలదు."

## వధువుల సంత

ఈసంత, పశ్చిమరుమేనియాలోని పురుమపర్వతముపై అడవిలో ప్రత్యేకముగ నిందుకొరకు చదునుచేయబడినప్రదేశమందు ప్రతివత్సరముజరుగుట ఆచారము, ఇప్పటి నవయుగమందు సయితమిది అంతర్ధానముకాలేదు.

అందుచేత చాల శతాబ్దములక్రిందట ప్రతిపాలన ఈ వధువులసంతజరుగు నేర్పాటుచేయపడినది. సెయింటు పీటర్ పాల్ దినములువెళ్లిన రెండవ ఆదివారమునాడు ఈసంత ఇప్పటికిని విధిగాజరుగుచుండును.

పురుమపర్వతముమీద నీవిచిత్రాచాతముద్వారా మనుములనుగుదుర్చుకొనుట, పెళ్ళిళ్లుజరుగుట మొదలగు పనులు పెద్దతదంగము లేమియులేకుండ సులువుగజరుగును. సంతలో ప్రతివధువును ఆకర్షణీయములగు మంచి

దుస్తులనుధరించి, తమసొత్తులనన్నిటిని — అనగా బట్టలు, అలంకారములు మొదలగువానిని చుట్టునుపరచుకొని కూర్చుండును. మెడలో కట్నముగా నొసగదలచిన బంగారునాణెములు బంగారుత్రాటిని దండగా గ్రుచ్చబడి యుండును. కన్యలందరు ఈవిధముగ బారులుతీరి కూర్చుందురు. ఆ ప్రాంతమందలి గ్రామములవారెల్లరు అసంఖ్యాకులుగ నచటికి వచ్చివారిని చూచెదరు. వారిలో యౌవనపురుషులు తమకా వధూసంఘమున ఎవరైన నచ్చుదురేమో చూచుకొందురు.

ఏ యువకుడైన తనకునచ్చిన కన్యయున్నచో నతడు తలనూపి సన్న చేయును. ఆకన్యకూడ తలనూపినచో పరస్పరాంగీకారమైనట్లే. అపుడు సదరు కన్య ముసినవ్వులతో తనసొత్తులనన్నిటిని బట్టుకొని తనవధువు ననుకరించును. వధూవరు లిద్దరుకలిసి అడవిమరుగునకుబోవుదురు. అక్కడ సిద్ధముగనేయుండు పౌరోహితుడు ఇద్దరి చేతులనుగలిపి, వివాహవిధిని ముగించును. ఇట్లు అతిసులభముగ వీరిపెండ్లిండ్లు ముగిసిపోవుచుండును. కాని ఇటీవల ఆధునికశాసనములు వ్యాపించుచు కొన్నికొన్ని ఇబ్బందులు ఇచట తటస్థపడుచున్నట్లు తెలియుచున్నది.

ఈ సంవత్సరము జరిగిన సంతలో 6 గురుకన్యలు వరులకై యెదురుచూచుచు కూర్చుండిరి. అసంఖ్యాకులుగ వ్యవసాయయువకులు సంత కరుదెంచిరిగాని, ఒక్కకన్యగూడ నెవడు ఏర్చుకొనలేదు. కనుక పాప మీసారి సంతకువచ్చిన కన్యలందరు ఆశాభంగము పొందవలసివచ్చెను. (సమదర్శిని)

సాంఘిక శత్రువులు

(1) ఇతరులకేమైన వుపయోగకరమైన వార్తల చెప్పదలచుకొన్నవారికి అవకాశమివ్వక వున్నంత కాలము సారాంశమేమియు లేకనే బిగ్గరగా ఎలుగెత్తి మాట్లాడెడి స్త్రీ.

(2) అవివేకుడై సుఖరహిత సంసారమున దూరి తానుపడు కష్టముల నాధారముచేసుకొని, మొదటిసారి జన్మమందు పెండ్లిచేసుకోవలయునను తలంపు అంకురింప అందుపై తీవ్రముగా నాలోచించుచుండు యౌవనులను ఆశాభంగులుగజేయు వ్యక్తి.

(3) సినిమా ప్రదర్శనములలో మాటలాడుటకు దబ్బిచ్చుటకైనను సంసిద్ధుడయియుండు మనిషి.

(4) వీథులలో నడుస్తూ పొగత్రాగెడి స్త్రీ.

(5) క్రొత్తతావులనుండి వచ్చెడి లేఖలచివర విశదపడని చిరునామావేయు మనిషి.

(6) తన రాబడి హెచ్చిన సంగతి తనభార్య కెరిగింపనివాడు నీచమైన విరోధి; సంఘమునకు ప్రబలవైరి.

(7) అమ్మా ! నను పాఠములు ఒప్పచెప్పమందువాయని అర్థసాయంసమయము గాక ముందే ప్రశ్నించెడి బిడ్డ,

(8) సంభాషణయందు ప్రీతి పుట్టించవలయునంటే ఒక ప్రశ్నయందలి మంచిచెడుగుల పరిశీలింప వలయుననెడి దురభిప్రాయముకల్గి ఒక ప్రశ్నయొక్క ఎమటిప్రక్క నవలంబించెడి వ్యక్తి.

(9) తనబిడ్డలే లోకమునందు అద్భుతమైన బిడ్డలనుకొని, దారిని పోవువారికెల్ల ఆపిల్లల ఛాయాపటముల తీయమని వారికాలము వృథాగా వెచ్చబెట్టింపచేయు స్త్రీ.

(10) బాల్యచేష్టల అయిష్టతచే ఇది, అది, ఏదీ తినని మనిషి.

(ప్రజామిత్ర)

# గృహలక్ష్మి

## సులభమైన తేలుమందు, మహాత్ముని సిఫార్సు

కొలది వారములక్రిందట నేనొకగోపాయిని కలిసికొంటిని. అతడొక సులభమైన చిట్కా వైద్యమును నాకుచెప్పి నా మనోవేదనను తీర్చెను. అతడు తేలుబాధకు యిచ్చిన ఔషధమును నాకుచెప్పెను. మామూలు ఉప్పును ఒకసీసాలోవేసి కొలదిగా నీళ్లుపోసి అందులో కరగిపోవునట్లు సీసాను ఆడించవలెను. ఆనీళ్లలో ఎంత ఉప్పు కరిగిపోగలదో అంత ఉప్పును కరగించి చక్కని ద్రావకముగా తయారుచేయవలెను. ఆ సీసాను కదల కుండా ఒకచోట ఒకరోజంతా ఉంచవలెను. తేటనీరు పైకి తేరుకొనును. తేటనీటిని వేరొకసీసాలో పోయవలెను. ఈక్షారోదకమును రెండుకండ్లలో రెండుచుక్కలను తేలుకుట్టినవానికి పోయగానే బాధ నివారణమయ్యెను. ఈ ప్రతిక్రియను 4 మాసములనుండియు వాడుచున్నాను. 276 మంది తేలుకుట్టినవారు నావద్దకు వచ్చిరి. వీరిలో 276 మందికి బాధ నివృత్తియయ్యెను. బాధ వెంటనే నివారణమగుచువచ్చెను. మిగిలిన 6 గురి విషయ ములో మాత్రము బాధ చాలవఱకు తగ్గెను. పూర్తిగా బాధ తగ్గిపోవలెనంటే యీరీతిగా క్షారోదకబింద వులను ముమ్మారు రెండుకండ్లలో వేయవలెను. ఈక్షారోదక ప్రభావమును పరీక్షించి పలువురకు ప్రయోగించిన పిమ్మటనే మీకు (గాంధిగారికి) తెలియజేయవలెనని వేచియుంటిని.

యం. కె. నారాయణన్.

ఈ నారాయణనుగారి సలహా చాలా దివ్యముగా నున్నది. ఆయన తాను సంపాదించి నిల్వచేసిన ద్రవ్యమును తన విరామ కాలమును యావత్తు గ్రామోద్ధరణార్థమై వినియోగించి మహోపకారము చేయు చున్నారు. ఆయన స్వానుభవపరీక్షవల్ల తెలియజేసిన డబ్బుఖర్చులేని యీ సులభౌషధమును లోకమునకు నేను వెల్లడింపకతప్పదు. ఔషధద్రవ్యమును తెలియజేసినందువల్ల దాని మహిమ దాని ప్రభావము తగ్గిపోవునని యెంచి దానిని భైషజమర్మముగా నుంచజాలను. ఈ ప్రక్రియను ప్రయోగించి చూచెడివారు ఇది ఎంతవఱకు గుణము నిచ్చుచున్నదో నాకు తెలియజేయగోరెదను.

యం. కె. గాంధి.

## మంగళహారతి

భారతమాతా పాలన సేయుమ—అనె వరుసలో పాడవలెను.

మంగళహారతిదే। మామనోహరా ! నీకు ॥మంగళ॥
మదనజనక వేగ మము దయజూడవేరా ॥మంగళ॥
కంజనయన ! వేగ, కరుణతో గొనవేరా ।
కాంతుల నిచ్చునట్టి । కర్పూరహారతిదే ॥మంగళ॥
పంకజలోచన యో। పాపవిమోచనా
మేము । పామరులముగాన । పరిపాలనసేయుమా ॥మంగళ॥
బాలకృష్ణా ! చేకోరా। బాలికలము నీదు
భజనసేయుచు చాలా । భక్తితో నిచ్చునట్టి ॥మంగళ॥

శ్రీమతి కందుకూరు అన్నపూర్ణాదేవిగారు

# ఎవరు నమ్ముదురు?

## పూర్వజన్మస్మృతి:—

ఢిల్లీనగర సమీపమున 'బీరఖానా' యందున్న లాలాజంగ్ బహదూరునకు ఎనిమిదిసంవత్సరములు ప్రాయముగల కుమార్తెగలదు. ఆబాలిక మాటలాడ నేర్చి నప్పటినుండియు, తాను పూర్వజన్మమున ముత్రా పట్టణ మందొకనిభార్యనని జెప్పుచుండెను. ఇటీవల యతని పూర్తిచిరునామా గూడ జెప్పెను. ఈ సమాచారమును తలిదండ్రులాతనికి తెలియజేయగ, నతడు తన సోదరుని యీ విషయము గనుగొనుటకై పంపెను. ఆసోదరుని ఆబాలిక గుర్తించెను. నవంబరు 15 వ తేది ఆ 'భర్త'యే రాగా బాలిక యతని గుర్తించుటయేగాక, ఆతనికిని, ఆతని ముందుభార్యకును మాత్రమే దెలిసియున్న కొన్ని విషయములనుగూడ జెప్పెను. అంతియుగాక తా నేబిడ్డనుగని చని పోయెనో, ఆబిడ్డ వృద్ధిబొందిన తాను సజీవురాలై యున్నపుడొక దేవత కర్పింపనెంచి, పూడ్చిపెట్టబడిన నూరురూపాయలను గురించి గూడ జెప్పెను. ఆమె మరణానంతరము ఆబిడ్డ బ్రదికి యిప్పుడు 11 సంవత్సరముల ప్రాయముగలదై యున్నది. ఈబాలిక తాను ఢిల్లీయందు జన్మింపకముందు వేరొకచోట జన్మించి యుండెననియు, 2½ సం॥ మాత్రమే జీవించితిననియు జెప్పెను. ఆ 'భర్త' దాచిపెట్టబడిన ధనమును గనుగొనుటకై తిరిగిపోయెను.

పూర్వకాలములయందు రాజాన్తఃపురములయందు పెంచబడుచుండిన చిలుకలు, మైనగోరలు హరిణములు శునకములు మొదలగు పక్షులును జంతువులును చేసియున్న కార్యములను మనమీకాలమున నుసువుగా నమ్మలేము కదా!

బల్గేరియాప్రభువగు బోరిస్‌గారిని కొందరు రాజద్రోహులు హత్యచేయ నిశ్చయించుకొనిరి. ఈదుర్మార్గులు రాజసౌధమున నొక గదిలో సమావేశులై యీ యాలోచనలు సేయబూనిన పుడచ్చట రాజుగారి పెంపుడు చిలుకయొకటి పంజరములోనుండి యీ దురంతము వినుచుండెను. తదనంతర మాచిలుక "రాజహత్య, రాజహత్య"యని బిగ్గరగా గూయసాగెను. ఈ కూతనుబట్టి ద్రోహులు బయటబడి సంహరింపబడిరి.

## రేడియోమెదడు:—

రిగాయందలి బీదకర్షకుని కుమార్తయగు ఇల్గాకు 10 సం॥ వయస్సు. ఆమెకు రేడియోమెదడు వుందట! ఆమె చదువజాలదుగాని ప్రక్కగదిలో మనస్సులోనే చదువుచున్న దానిని గట్టిగా వల్లించగలదు. ఆమెకు యేభాష తెలియనప్పటికిని, ఫ్రెంచి, జర్మను, ఇంగ్లీషు భాషల పైప్రకారముగ వల్లింపగలదు. ఆరోగ్యము సరిగాలేదని పరీక్షింప నొకవైద్యుని బలిపింపగా నాతడు తనలోనే జదువుకొన్న బైబిలునందలి విషయము లాబాలిక జెప్పగలిగెను. ఇపుడా బాలికను, గొప్పడాక్టరు పరీక్షించుచున్నాడట!

అమెరికాయందు షార్లివోనగరమున బ్రూస్ బేకన్ అను నాతడు చికాగో కన్యనొకర్తెను బెండ్లియాడెను. రెండు దినములకు తరువాత తానామె చిరునామా మరచితినని పోలీసులతో దావాజేసెను. కొంతకాలముతరువాత పోలీసువారికి బేకన్ గుడ్డలున్న యొక పెట్టెవచ్చిచేరెను. ఆగుడ్డల వెంబడి పెండ్లికుమారితెవద్దనుండి యొక ఉత్తరముగూడ వచ్చియుండెను. అందులో "బేకన్ గారును నేను సంతోషముగా నుండుటకు దుస్సాధ్యము. ఈగుడ్డలాతని కిందు నేను విడాకులు పుచ్చుకొందును."అని యుండెను. బ్రూనుగారిదిగని మాయమైరి. పోలీసువారు బ్రూనుగారు తన్ను దానుమరువదని యెంచుచున్నారు.

# గ్రంథపరిచయము

**విజయ**

అక్టోబరు 5 వ తేదినాటికి విజయనగరవాసుడగు 'విజయుని'కి యేడాదివెళ్లి రెండవయేడు వచ్చినది. కాకులపాటి కృష్ణమూర్తిగారి దయవల్ల మల్లాదివారు, మేడూరివారు బుఱ్ఱావారు, యామిజాలవారు మొదలగువారొసంగిన 'తల్లిపాలు'వలన బిడ్డడు బాగా తేరుకొని తొక్కుపలుకులన్నిటిలో పండితుడైనాడు. ఆంధ్రు లిప్పటివలెనే ఆదరించి అన్నప్రాశనంచేసిన యెడల అటుతరువాతి విద్దెములుకూడ ప్రదర్శించక మానడు—జనసామాన్యమున 'యేదో ఒకటిచూడాలి, చదవాలి' అనే ఉబలాటపుట్టించిన పత్రికలలో యొకటిగా విజయ యేడాదిలోనే అయింది. దీనికి సాయం సాలుచందా రు. 1 విడిప్రతి అణానర.

**ఉదయలక్ష్మి**

మాసపత్రిక. కార్యస్థానం కాకినాడ. సంపాదకుడు మోచెర్ల హనుమంతరావుగారు. అక్టోబరులో మూడవసంచిక ప్రకటితమైనది. ఆంధ్రమాసపత్రికలలో సుప్రసిద్ధ విలేఖరులు అందరును ఇంచుమించుగా దీనికి వ్యాసములు వ్రాయుచున్నారు. కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారి "నవ్యకావ్యాకృతి" ప్రస్తుత పత్రికా రచనములలోని అవినీతిదాయకములగు లోపములను బహిరంగముగ యెత్తి చూపి ఖండించుచున్నది. మహంకాళి శ్రీరామమూర్తిగారు రచించిన నాటిక, భావకవి భగవాన్లకును కవితిలక కృష్ణవేణికిని జరిగిన సంభాషణ, కడుపుబ్బ నవ్వించు మితమైన హాస్యముతో కూడినది. విడిప్రతి రెండు అణాలు.

**ధృవ**

ప్రాతదగు ధృవచరిత్ర 3 రంగముల నాటిక. బరంపురం కాంచనపల్లి వేంకటరంగారావుగారి నవ్వుల తీవ అయిదవపువ్వు. క్రొత్తమాటలు నూతన కల్పన. వెల 1 అణా.

**సత్యనారాయణ స్తవరాజము**

వాజిపేయాజుల రామసుబ్బారాయకవివర్యుని శిష్యులు కృష్ణకుమార మిత్రులను చతస్త్రింశతి వత్సర వయస్కులు అను జంటకవులచే రచింపబడిన 25 పద్యములు. ప్రకాశకులు స్నేహలతాకవితా సంఘము వారు, కొల్లాపురము, మొరవకొండపోస్టు, కర్నూలు జిల్లా. గంభీరమగు శైలి, ఉన్నతమగు భావములు, చక్కనిభక్తి. వెల రెండణాలు.

**బ్రహ్మోపత్రోపాఖ్యానము**

స్నేహలతా కవితా సంఘమువారి 36 వ పుష్పము. వాజిపేయాజి రామసుబ్బారాయ, వెంకటనారాయణ సోదరకవికృతము. వెల 4 అణాలు. పొగాకునుగూర్చి ఒక నిందాస్తుతి కావ్యము, హాస్యరసప్రధానము. శివునిపడిశము, విష్ణుని కాసము, దేవేంద్రుని దంతపీడనమును బాపుటకు పొడుము, చుట్ట, మసాలాలను బ్రహ్మ తయారుచేయబోయి యీ పొగాకును సృష్టించెనట. గోదావరీతీర బ్రాహ్మణుని తపోమహిమవలన యిది భూలోకమునకు దిగి ప్రసిద్ధిగాంచినది. ఈ పద్యములు చదువునప్పుడు ఎట్టి రసికులకునుగూడ వీనిని సేవించి తీరుదమాయని నోరూరునంత చక్కనిశైలిలో ఈ పద్యములు వ్రాయబడినవి. అది కవిప్రజ్ఞ, బిల్వాగిల్వాతులనిగిలగి, పారిజాతము గిరిజాతము పై మువ్వురు దేవతలకు పైసాకు కొఱగానిపై వారు దీనికి వశంవదులైనారు. మానవమాత్రుల లోకశిక్షా! అయినను జాగ్రత!

# శ్రీ మొల్లజయన్త్యాహ్వానము – నెల్లూరు

—:o:—

## విజ్ఞప్తి

సోదర సోదరీమణులారా,

నెల్లూరు శ్రీ వర్ధమాన సమాజమువారి యాదరమున శ్రీ మొల్ల జయన్త్యుత్సవ మీయేడు డిసెంబరు తే 8 దీని, శ్రీమతి కవితిలక కంచనపల్లి కనకమ్మగారి యాధిపత్యమున నెల్లూరు పురమందిరమున సాయంకాలము గం 4 లకు జరుగును. తత్సందర్భమున నెల్లూరు నివాసస్థురాలును కవయిత్రీమతల్లియునగు శ్రీమతి చిల్కపాటి సీతాంబగారిని గృహలక్ష్మి సువర్ణకంకణము సమర్పించి గౌరవించుటయు జరుగును; కావున యీ మహోత్సవమునకు తాము స్వకుటుంబ బంధుమిత్రులతో దయచేసి కార్యము జయప్రదముగ కొనసాగింతురుగాక యని కోరుచున్నాను.

ఇట్లు

కే. యన్. కేసరి

# శిథిలదేహము — మధుర జీవనము?

## ఇది సాధ్యమా?

నదీతీరమున, పచ్చికబయలున, కొండచరియల విహరిస్తే ప్రకృతిశోభ కనబడుతుంది. అది మధురజీవనము.

## కాని అది నీకు సాధ్యమా?

నాల్గంఅడుగులు ముందునకు వేసిన నీ దేహమే నీకు భారమవుతుంది. తీరని ఆయాసము. కలకలలాడు ఆనందు శోభను చూడలేక తేజోవిహీనములగు నీ కనులు గూటిపక్షులలాగు నీటితెరల వెనుక క్రుంగిపోతవి. నీవు నిరాశాభావముతో యెముకలగూడువలె నేల కూలిపోయెదవు. కాని మధురజీవనమునకు నీకు సాధ్యంలేదా? ఉన్నది. దీనిని నీ వనుభవించాలి. అందుకు జీవశక్తి, బలము, ఝుయ్యిమంటూ ప్రవహించే ఉడుకునెత్తురు సంపాదించాలి. దానితో నీలో ఒక నూత్న తేజస్సు, శక్తి బయలుదేరుతుంది. అందుకు సాధనము "అమృత." "అమృత" సేవనము నీలో నవయౌవనము ప్రవేశపెట్టగలదు. అది మధురజీవనము నీ యందుబాటులో ఉంచగలదు. "అమృత" సేవనము నేడే ప్రారంభించు.

# మధుర జీవనమునకు అమృత సేవనము

# 2000000

# మలేరియా మరణములు

ప్రతియేటను మలేరియావల్ల మనదేశములో యిరవైలక్షలమంది మరణిస్తున్నారు ఆ మరణములు సాధారణమైనవి కావు. హృదయ కుహరాలనుండి కదల్చివేసే చలి, శరీరాన్ని వ్రేల్చివేసే ఉష్ణము, శిరాన్ని పగులగొట్టే తలనొప్పి, కాలుచేతులను నమలుకొని తినివేసే నొప్పులు, పీకులు వీటితో యమయాతనను అనుభవించినమీద వచ్చిన మరణములు. ఇంతటి దారుణమునకు కారణము మలేరియా. మలేరియాను పూర్తిగా మాన్పుటకు మందు లేదనే పిచ్చినమ్మకము దేశములో వ్యాపించినది. అందుకు గుణమీయలేని యెన్నోమందులే కారణము.

మలేరియాను పూర్తిగా సంహరింపగలశక్తి "అర్క" వద్ద వుంది. "అర్క" ప్రయోగము తిరుగులేని చక్రాయుధప్రయోగమే. ఎంతటి తీవ్రమైన జ్వరాలనన్నను పారద్రోలుటలో "అర్క"తో పోల్చదగినది మరియొకటిలేదు.

# అర్క

జ్వరములపాలిట చక్రాయుధము

తెలుగుజిల్లాలకు ఏజంట్లు: శీతారాం జనరల్ స్టోర్సు, మెయిన్ రోడ్డు, బెజవాడ.

**ఉదయిని (దసరాసంచిక)**

కొంపల్లి జనార్దనరావుగారి ఉదయిని ఉదయించి ఒక వత్సరము కావచ్చుచున్నది. నాలుగు సంచికలు వెలువడినవి. కిరణములు సృష్ట్యాదినివలె దుర్నిరీక్ష్యములును తీక్ష్ణతమములునుగాక శాంతములై చల్లనివై పాఠకులకెల్లరకు నాతపస్నానమువోసి ఆరోగ్యవంతులుగా జేయుచున్నవి. ఖండకావ్యములలో కొన్ని అగాధములై అగమ్యగోచరములై కవిజనమాత్రులకు కొలిక బడునవేమోయై యున్నను పెక్కు వివేర సాధ్యములై అనుభవయోగ్యములై సుందరజ్ఞేయములైకూడ నుండుచుండుట మంచివిశేషము. శైలబాల ఆరని జ్యోతి మొదలగు కొన్ని వచనరచనలు,ఏతన్మాత్రులు ముక్కు మూసుకొని మునిగినను క్రిందు అందక మీదుతోచక తల్లడిల్లవలసినంత గంభీరముగనున్నను, సీత, ఆ క్షణము యినుపకోటలవలె దుర్భేద్యములు కాక శ్రమపడి చదివినకొలదిని సంతోష వర్ధకములై యున్నవి. ఆఖరుకు రావిపాటి వెంకటరామారావుగారిది పెద్ద 'సమస్యే'! సోమశేఖరశర్మగారి 'ప్రాకృతము : నన్నయకు పూర్వపు సాహిత్యము) వ్యాస మఖండపరిశోధనాఫలితము, అత్యావశ్యక విషయనిర్ణయము, అనుపమ విమర్శనోత్సాహక దోహదము. వాఙ్మయవీధిలోని విమర్శనలు గ్రుడ్డిపొగడికలును, దుడ్డుకొట్టులునుగాక, నవీనకవులు పడుచున్న భాషాబాహుళ్యము భావనాదౌర్బల్యము, అర్థాన్వయము మొదలగు ప్రలోభనములకు చల్లని మందలింపులతో కూడియున్నవి. 'మునిమాణిక్యంగారి వంటి కథకులపైనే కొన్ని విసురులు పడుచున్నవి! ఈ శృంగాటకములో నిలచినచో సాహిత్య సంబంధపు మెలవులలోని సమస్త సవ్యాపసవ్యపు పోకడలు స్పష్టముగ కనిపించుతవి. అనగా సంపాదకునిదృష్టి పాక్షికము కాగలదను భయమున కిసుమంతయు తావు గాన్పించదు. గిడుగు రామమూర్తిపంతులుగారు వ్రాసినట్లు నేటి తెలుగులో నేటి భూలోకము ప్రతిఫలించేటట్లు చేయఁగల విశిష్టకవులు లేచుచున్నారు, విశిష్ట రచనలును వెలయుచున్నవి గనుక వారిని ప్రకటించుటకు ఉదయినివంటి యిట్టి విశిష్టపత్రిక కెంతో ఆవశ్యకతయున్నది. ఇట్టి ఆవశ్యకతను తీర్చుట బహువ్యయప్రయాస భరితమైనది. సంపాదకుని సమర్థత విశేచనముక్రింద పత్రిక విశిష్టమై పటిష్ఠమై స్థిరతరమగు సూచనలు నిండుగా తొడుగుచున్నది గనుక చందాదారులు హెచ్చుచు శ్రీమంతులు భూరివిరాళవృష్టి గురిపించుచు ఉదయిని ఇతోధిక దేదీప్యమానమై వెలుగునట్లుచేసి ఆంధ్ర యశశ్చంద్రికల నెల్లెడ విదియింతురుగాక !

**కాలచక్రము**

అక్టోబరులో ఈ మాసపత్రిక యొక్క 3 వ సంచిక ప్రకటింపఁబడినది. కార్యస్థానమున నత్తారామేశ్వరము, అత్తిలిపోస్టు, పశ్చిమ గోదావరిజిల్లా. సంపాదకుడు శ్రీయుత వి. వీరారెడ్డిగారు. 41 పుటలు చక్కని కథలు, హాస్యములు, లోకప్రసంగములు కలవు. కవికొండల వెంకట్రావుగారి 'విమానభూవ' యను జానపదగీతము మిగుల మనోహరము. వచ్చే సంచికలలోగూడ అది ప్రకటింపఁబడును.

**వైజయంతి**

కర్నూలుజిల్లా మొరవకొండపోస్టు కొల్లాపురంగ్రామం స్నేహలతా కవితా సంఘమునుండి శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారి సంపాదకత్వమున వెలువడిన తృతీయవార్షిక పత్రిక. ఇదివరకు రెండిఁటివలెనే మిగుల రమణీయము, పండితాభిప్రాయములు శేషాద్రి రమణకవుల ఆత్మకథ సరిపల్లె విశ్వనాథశాస్త్రిగారి దేవ్యపరాధస్తోత్రమునకు తెలుగుపద్యములు, దంఢ్యాల జానకిరామయ్యగారి ప్రతిధ్వని, జనుమర్తి కృష్ణమూర్తిగారి కాను, మొదలగు సెనో్న పద్యకావ్యములు మిగుల రసవంతమగునవి కలవు.

# సంపాదకీయములు

## వర్ధంతి సంచిక

1936 జనవరి సంచికయందు సమగ్రముగు శ్రీ మొల్లజయన్త్యుత్సవ వివరములే గాక మరికొందరు కవయిత్రుల ప్రశంసయుఁ జేయబడియుండును. అపరాసరస్వతియని ఆర్యావర్తమున నెన్నికగన్న శ్రీమతి సరస్వతీబాయిగారి జీవితసారము మనోహరమైన త్రివర్ణచిత్రముతోఁగూడఁ బ్రకటితమగును. ప్రసిద్ధలగు మరికొంద ఱాంధ్రకవయిత్రులయొక్కయు ఛాయాచిత్రములును జీవితాంశములతోఁ గూడఁ బ్రకటింపఁబడఁగలవు.

## కవి సార్వభౌముని కవితిలక సన్మానము

శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగమహా విద్యాపీఠమునందు ఏతన్మహా విద్యాపీఠ స్థాపనాచార్యులగు శ్రీమా నమృతానంద స్వాములవారి జన్మదినోత్సవ సందర్భమున నవంబరు యిరువదియవ తేది సాయంకాల మైదు గంటలకు శ్రీవిశ్వదాత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారి యాధిపత్యమున నొక సమావేశము జరిగెను. శ్రీమా నమృతానందస్వామివారి జీవితమును గూర్చియు, మహా విద్యాపీఠ సంస్థాపనోద్దేశ్యమును గూర్చియు నుపన్యాసములియ్యఁబడినతదుపరి కవిసార్వభౌము శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికి పండిత సన్మానము జరిగి, మహా విద్యాపీఠము పక్షమున నూటపదునారులు కవితిలక శ్రీ కంచనపల్లి కనకమ్మగారిచేఁ బండితబహుమానముగా సమర్పింపబడియెను.

ఇక్కాలమున శ్రీకవితిలక కంచనపల్లి కనకాంబగారినిగాని, శ్రీ కవి సార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిని గాని యెఱుంగని ఆంధ్రు లుండరు. కవి బ్రహ్మలకును, కవయిత్రులకును నెలవై వెలసిన నెల్లూరుపురవాసియై సంస్కృతాంధ్రాంగ్లేయ సాహిత్యములఁ దెనలేని పాండిత్యముగడించి యాంధ్రదేశమునం దతి గౌరవము బడసి, వేదాంత బోధముల వీనులవిందుగ రచియించి మించినవారు కవితిలకగారు. తేనెసోన లొలుక దివ్యముగ రామాయణమును రచించిన మొల్లగారి కన్నివిధముల మెఱుంగుబెట్టి జన్మించినవారు. ఇక కవిసార్వభౌములన్న నెఱుఁగనివా రెవరు? సంస్కృతాంధ్రసాహిత్య సార్వభౌముడై, యనన్యసామాన్య గ్రంథము లాంధ్రమున రచియించి కనకాభిషేకములొంది సార్వభౌమ సంపదలందిన శ్రీనాథ కవితల్లజునికి తరువాత నంతటివారై యసదృశకవియై యొక్కరే భారతమునంతయు నాంధ్రీకరించి రాజమహేంద్రపురవరంబున బుధుల రంజింపజేయుచుండు నేటికవి సార్వభౌముఁడు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు. కవితిలక కవిసార్వభౌముని గౌరవించినది. ఇయ్యది యపూర్వము, అసామాన్యము; అద్వితీయము; ఆదర్శప్రాయము.

# సంపాదకీయములు

ఆంధ్ర వాఙ్మయచరిత్రయందు మాత్రమే గాక, ప్రపంచమునగల సుప్రసిద్ధములగు మరే వాఙ్మయ చరిత్రయందైనను గనపడెడి కవిశేఖరులెల్లరు పెద్దమ్మకు దగ్గరబంధువులై వెలసినవారే. ధనవిహీనులకు తృణమైన సంఘమున గౌరవము మృగ్యమను విషయ మెల్లరకు కరతలామలకమే. కాని కవులది యెంత మాత్రము గమనింపరు. "సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్" మను నార్యోక్తి దలంచి తమ కవితా సుధారసములో తన్మయులై యుందురేగాని తదితరములకై ప్రాకులాడకుందురు. అట్టి సమయమందు సన్మానముల మాట దలపెట్టనేల? కవితామాధుర్యమును గ్రహించువారు కవులును, రసజ్ఞులునునై యున్నారు. కవు లెపుడు దరిద్రులును కొందఱు మత్సరపూర్ణమతులై యుండుటచే వారికితర ప్రసక్తి యక్కరకురాదు. కవితయన్న నేమియో, రసజ్ఞతయన్న నెట్టిదియో కలనైన నెఱుంగని సాధారణ ప్రజలకు కవుల నాదరింప నెపుడును దలంపునకు వచ్చునది గాదు. ధనవంతులు, రాజులు రసజ్ఞులై వెలసియున్నచో కవులకు సన్మానము ధనలాభము గలుగుచుండెడివి. భాగ్యవశమున నట్టి రసజ్ఞులాంధ్రదేశమున పెక్కుమంది వెలసిన కతంబుననే వారనుశాసనులు, కవిబ్రహ్మలు, కవిసార్వభౌములు, అష్టదిగ్గజము లాంధ్ర వాఙ్మయ ప్రపంచమున దివ్యదీప్తితో వెలుంగగల్గిరి. ఐననేమి! వీరెంతమంది? దీనివలన నేమి ప్రాముఖ్యము గల్గినది? కవిసార్వభౌముడై కనకాభిషేకము లందిన శ్రీనాథుడే "కవితల్ జెప్పినపాడనేర్చిన వృథా కష్టంబె" యని యెందులకు వాపోయెనో, దీనివలన కవి సన్మానము లెంతసామాన్యములో కోవిదు లూహింపగలరు.

సాధారణముగా పూర్వమాంధ్రదేశమున కవులు కవులనుగాని, కవయిత్రులనుగాని గౌరవించుచుండుటగురించి యెక్కడనోగాని వినము. అందులో ముఖ్యముగ ధనవంతులు గాక, స్వసంపాదనపై నాధారపడిన సాధారణమైన కవయిత్రులు కవులను గౌరవించుట సారస్వత చరిత్రలం దెచటను కాగడావెట్టి వెదికినను గనపడదు. ఇట్టి గౌరవము శ్రీ కనకాంబగారు గావించిరన్న యందలి ప్రాముఖ్యమును సులభముగ ప్రాజ్ఞులు గ్రహింపగలరు.

పండితుల నాహ్వానించి వాదోపవాదములజరిపి జయించినచో బిరుదముల రూపమున ధనమూలమున సత్కరించుచుండెడి విషయము అచటచట యెుక్కొక్కప్పుడు గనబడుచున్నది. అదియును ధనవంతులో రాజులో చేసెడువారు గదా! కవులు సన్మానములమాట చాటుననుంచి పైగా మత్సరులై యితరుల గౌరవము నణగద్రొక్క జూచుచుండుటచే గాబోలు పింగళిసూరన "ఏగతిరచియించిరేని సమకాలమువారలు మెచ్చరేగదా" యని యుద్ఘోషించెను. ఇటీవ లాంధ్రలోకము •మేల్కొని కవులను కవయిత్రులను గౌరవించుచున్నారు గదాయని యనచ్చును. నిజమే. ఆధుని

కాంధ్రలోకము తమవిధులను గురుతెఱింగి, కవితను గౌరవించుచు వారిజయంతులను జరుపుచుండవచ్చును. ఐన నెంతమంది కవుల జయంతులు జరుగుచున్నవి? ఎంతమంది కవులు కవయిత్రులు సోదరకవులను కవయిత్రులను గౌరవించుచున్నారు?

అశేష కవితావైభవ మొకయెత్తు; మహావిద్యాపీఠసంస్థాన మొకయెత్తు; కవిసార్వభౌములను గౌరవించుట మరియొక యెత్తు. వారిని గురువులని పండిత ప్రకాండులని కవితిలకగారు సాధారణజనులవలె గౌరవించెననుటకంటె, కవిసార్వభౌముని కవితామాధుర్యమునకు జొక్కి గౌరవించెననుట మంచిది. కవితామాధుర్యమును కవులకంటె, కవయిత్రులకంటె యానందించువారెవరు; ఆదరించు వారెవరు? కావుననే యిది కవితిలకగారి ఉత్తమగుణజాలమునకు నిదర్శనము. ఇది యసామాన్యమనియు యాదర్శనీయమనియు వచించుటకు కారణముగలదు. ఏలయన, నిది మార్గదర్శకముగాగొని యిట్టి సన్మానము లాంధ్రదేశమున కవయిత్రులచే కవులకు, కవులచే కవయిత్రులకు జరుగవలసియున్నవి. ఇవ్విధమున క్రొత్త త్రోవద్రొక్కి మార్గదర్శకురాలైన శ్రీ కవితిలక కంచనపల్లి కనకమ్మగారు చిరకాల మాంధ్రులను తనకవితా సుధారసధారలచే తన్మయులజేయ సర్వేశ్వరుఁ డనుగ్రహించుగాక.

ఛాయాచిత్రములు.

గృహలక్ష్మియందితర రాష్ట్రీ స్త్రీ రూపము లెక్కువగను ఆంధ్రరాష్ట్రీ స్త్రీ రూపములు చాల తక్కువగను బ్రకటింపఁబడుటనుగూర్చి యించుక కించనొందుచున్నాము.

కొందరుకొంద రువిదలు తమఛాయాపటములను బ్రకటింప నిచ్చుటయందు కేవలము విముఖులై యున్నారు. అయిననొక మాట:—"ఇది ప్రసిద్ధాచారమే కనుక దీనిని దా మనుసరించుటయందుదోషమెంతమాత్రమును లే" దని నచ్చఁజెప్పు బాధ్యత మాయందున్నదికదా యని యీ మాటలు వ్రాయుచున్నాము.

విగ్రహారాధన యేకాలమునఁ బుట్టినదో సరిగా నెవరును నిర్ణయింపలేదు; కాని "యిది వేదకాలమున లేదు; ఉపనిషత్తులందు మాత్రము ప్రతిమార్చనాప్రసంగమున్నది; బౌద్ధయుగారంభమునుండియు దీని ప్రాముఖ్యత ప్రబలినది" యని కొందరు ప్రామాణికులు చెప్పిరి." అది యట్లుండనిండు. ఆగమశాస్త్రవేత్త విగ్రహనిర్మాణవిషయమునఁ జేసియున్న నాలుగు విభాగములలో జిత్రాభాసమనునట్టిది యొకటి. చిత్రాభాసమనఁగా దేవతాస్వరూపములను గాని మానవస్వరూపములఁ గాని, గుడ్డలమీదనో గోడలమీదనో కట్టెపలకలయందో రంగులతోఁ జిత్రింపఁబడిన రూపము. ఇట్టిది రచింపఁబడుటకు మూఁడే కారణములు — భక్తి, గౌరవము, ప్రేమ.

శ్రీ రామచంద్రుఁ డత్తస్సత్త్వయగు సీతాదేవియొక్క వినోదమునకై తమ

పూర్వచరిత్రమంతయుఁ బటమునఁ జిత్రిం పించి యామెకుఁ జూపువిషయము నుత్తర రామచరితమునందుంట మీ రెరుఁగరా?! పురాణేతిహాసములయం దిట్టి వెన్నో యుండును. మరియు నీ చిత్రపట విరచనలం దెక్కువ భాగమును స్త్రీలే నిర్వహించు చుండిరనుటకుఁగూడ నెన్నో ప్రమాణము లున్నవని యెఱుకపఱచుట యప్రస్తుత మన కుండ్రుగాక! ఏ కారణము లెట్లున్నను ఈ రూపనిర్మాణ విద్యలవలనఁ జరిత్రలకును దర్శనదర్శనమునఁ గల్గిన స్త్రీ పురుషులకును ఒకవిధమైన శాశ్వతత్త్వమును ఏర్పడు చున్నవి. పాశ్చాత్యదేశములందు మ్యూజి యములలో నేన్నో కోట్లకొలఁది ధనములను సెలవుసేసి వేలకొలఁది సంవత్సరములకుఁ బూర్వమునఁ బుట్టిగిట్టిన యిల్లాండ్ర యొక్కయు మహాపురుషులయొక్కయు స్వరూపములను సేకరించి వానిని భద్ర పఱచి యుంచుచున్నారు. లోకవ్యవహార ములయందు దస్తావేజు లెంతపనికివచ్చునో యీ ఛాయాచిత్రములుగూడ సాంఘిక జీవిత చరిత్రములయం దంతపనికివచ్చును. నిజముగా నిపుడు మొల్లమాంబయొక్క రూపపటమే యొకటి చిక్కినదనుకొనుఁడు. మీ కెంతటి యుత్సాహము కలుగును!

మానవునియం దేమాత్రపు గొప్పఁ దనమున్నను సరే దానికి వాగ్రూపమునను జిత్రరూపమునను సుస్థిరతఁ జేకూర్చుటకే చరిత్రానిర్మాత సర్వథా యత్నించును. అతని యభిప్రాయమేమి?—యనంతర సంతతులకా కావ్యరూపపటములు రెండును మార్గదర్శికములై యుండవలెనని యే కదా! ఇదియొక లోకకళ్యాణవాంఛయే కదా! పెద్దలు తమ జీవితచరిత్రములను వ్రాసి తమరూపపటములను జిత్రింపించి తమ సన్తానములకు వశముజేయుటకంటె అధిక తరమైన సంఘసేవ యేది?

సామాజికస్థితి కిది చేయకుంట యొక పెద్దలోపము! ఈ లోపమువల్ల సామాన్య జనసంఘమునందు మహాయోగ్యతగల స్త్రీలు పురుషులుగూడఁ గేవల మనామకులై పోయినారు. ఆంధ్రసంఘచరిత్ర వ్రాయవలె నంటే ఆ చరిత్ర లేవీ?! వారిరూపము లసలే లేవే!! ఇఁక దేనినిఁబెట్టుకొని చరిత్రవ్రాయు టయో?! మొల్లమాంబ వ్రాసిన గద్యను బట్టి ఆతుకూరి కేసయశెట్టిగారి కూతురును శ్రీకంఠమల్లేశ్వరుని దయవలనఁ గవిత్వశక్తి గలిగినదియునను నిట్టి రెండు మూడు విషయ ములేనా! మరేదియు లేదా?! కవులయొక్క కావ్యములయందుఁగంటె వారి దైనికజీవిత ములఁగూర్చి చదువుటయందు మానవ సమాజమున కెక్కువ ప్రీతియుండుట స్వాభావికమే! దీనికంటెఁ గూడ నధికతర ప్రీతికరము వారిరూపపట సందర్శనమే!! షేక్స్పియరు మహాకవి, అతఁడు పుట్టిన యిల్లు, అతనికుర్చీ, అతఁడు మిత్రులతో మాటలాడుచుండుట యీ మొదలైన పట ముల నెంతో బ్రహ్మానందమొంది చూచు చున్నామే!!

ఇట్టి యభిప్రాయము పెద్దవారికే యున్నపుడిఁకఁ బిల్లలమాట చెప్పవలెనా! మహాత్ముని పటమొకటి యెదుటఁబెట్టి తచ్చరిత్ర మొక పిల్లవానికిఁ జెప్పిచూడుఁడు; అట్లు పెట్టక మరొకపిల్లవానికా కథచెప్పి చూడుఁడు. పిల్లలకుఁ బెద్దలయందు భక్తి, గౌరవము, ప్రేమ, విశ్వాసము మొదలగు గుణముల గలిగించుట కింతకంటె మార్గమే లేదు — రూపపటముతోఁ గథచెప్పుట.

గృహలక్ష్మికి వ్యాసము లెన్నో వచ్చుచున్నవి. వాటిని వ్రాసినవారి పేర్లు వినుచున్నాము; కాని, 'వారెవ్వరూ యేలాగుంటారూ' అనే సంగతి సందర్భములు మాత్రం తెలియవు!

ఇదియొకలోపమో కాదో తామే యోచించుకొందురుగాక!

పరామర్శ

సోదరీమణి శ్రీమతి పొణకా కనకమ్మ గారికి వచ్చినయాపదకు ఆంధ్రదేశమున విచారింపనివారే లేరు! సర్వసంగపరిత్యాగినియై లోకక్షేమమునకుఁగాను కష్టములు పడిపడి చివికియున్న యీసోదరికి పెద్దకాలమున నిట్టి శోక మెంత దుర్భముగానుండునో చెప్ప శక్యమా! దురదృష్టవశమున నీమాసమున నిట్టి ఘోరవార్తలు మరి రెండుమూడును ప్రకటింపవలసివచ్చుటకు మే మెంతో విచారించుచున్నాము. స్వకులములకు కీర్తిసంపాదింపగలిగి యుండెడివారు చిన్నతనముననందే కీర్తిశేషురాండ్రగుట ఆంధ్రభూమి కెంతో నష్టము! ఐనను మన మేమిచేయఁగలము ప్రకృతివిలాసమొకప్పు డగ్నిపర్వతమువలె విజృంభించును. అట్టిదాని తత్త్వమెరిగి సాధ్యమైనంతవర కుపశమిల్లుటయే పరమార్థము. కృతార్థజీవులగు వారియాత్మల కీశ్వరుడు శాంతినిచ్చుఁగాక!!

రోఁత వ్రాఁతలు

శ్రీమతి దివాకర్ల శారదామణిదేవిగారు తమకు 'దొరికిన వ్యాస'మని మాకు బంపిన దాని నందుకొని యా శ్రీమతియెడ నెంతో కృతజ్ఞతను దెలుపుచున్నాము.

సరే, అదిమాకు విధి: అదియటులుండగా నిక వ్యాస విషయమునుగూర్చియు గొంత చెప్పవలెనని ముచ్చటపడినందుకు మన్నింత్రుగాక!

ఈ విషయమునుగూర్చి లోగడ నొక మారు శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు 'మూడుతీర్మానము'లను శీర్షికతో 'భారతి' యందు వ్యాసమును వ్రాసిరి. దానికిని ప్రస్తుతపు వ్యాసమునకును హృదయధర్మ మొకటే కాని స్వరూప లేఖావిలాసములు మాత్రము వేరు. నీచకథకు హాస్యమని పేరుపెట్టుట, యెంగిలియాకులో అతిథికి కన్నముపడ్డించుట వంటిది. దీనికి నిర్వచన మనవసరము. మన బిడ్డలు, మనతోఁబుట్టువులు, మనయిల్లాండ్రు, మనతల్లులు మొదలగు వారు, నేరిచియో నేరకయో దోషములనే చేయుచున్నారందఱము: వీరిట్లుచేయుటకు ప్రస్తుత సాంఘిక

## సంపాదకీయములు

పరిస్థితులే కారణము లనుకొందము: ఇట్టి దుష్టపరిస్థితులను జక్కఁబెట్టు బాధ్యత నీ కవికుమారులే వహించి రనుకొందము: ఐన స్త్రీలను విగతవస్త్రలజేసి వీధికెక్కించుట సంఘసంస్కరణమార్గమా!! 'దేవదాసీవృత్తి' యేహ్యమని యెఱిఁగి. వేశ్యలుగూడ పవిత్రమగు గృహస్థాశ్రమమును స్వీకరించుచున్నారే!! ఇట్టియెడ నిండ్లలోనుండి యే కాలకర్మవశముననో కాలుమీరిపడినవారిపై దయబూని చేతనైన సహాయముజేయుట సరియైనపద్ధతి కాని సంసారములను బయటికీడ్చుట మంచిదికాదు.

పత్రికాసంపాదకు లట్టి వెంతమాత్రము ప్రకటింపరాదు.

ఈ విషయము సర్వానర్థకరమనుట కేమియు సందేహములేదు.

మానినీమణు లీ విషయమున నేవో యొకటి రెండువ్యాసములు వ్రాసి వేయుటతో తృప్తినొందియుండక సమగ్రముగా బనిచేసి పవిత్ర మాతృభారతిని 'పండితమాను'ల చురకలనుండి తప్పించి యిహపరానందము లొందుదురుగాక !

### కీ. శే. శ్రీమతి సన్నిధి మాణిక్యము తాళ్లపాలెము

16 సంవత్సరముల హరిజనవిదుషి. 1-10-1935 తేదీ రాత్రి సుమారు 2-45 గం॥ లకు తన పుట్టినింట; సర్పదష్టయై భౌతికదేహమును చాలించెను.

శ్రీరామాశ్రమ విద్యార్థినియై గత డిసెంబరుమాసమున, నరసాపురం ఆంధ్రస్త్రీల సారస్వతపోటీపరీక్షయందు ద్వితీయశ్రేణిలో జయముగాంచిన ప్రథమ హరిజనయువతి యీమెయే హరిజననాయకులగు డాక్టరు టి. జియ్యరుదాసుగారి కనిష్ఠసోదరి. గత మే మాసముననే రజస్వలానంతర వివాహము జేసికొనినది. అనతికాలముననే తన వినయ సౌశీల్యాది సద్గుణంబులచేత పరిసరగ్రామ సవర్ణుల యాదరాభిమానంబు లార్జించుకొన్నది. ఆమె యాత్మకు శాంతి నొసంగుగాకయని పరమేశ్వరుని ప్రార్థించుచు, ఆమె ప్రియబంధువర్గంబునకెల్ల మా సానుభూతి నిండుమూలముగా దెల్పుచున్నాము.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# సంక్రాంతి

## ఆశీస్సు

మ॥ పసపుం గుంకుమ,
పాడిపంటలును,
భవ్యంబైన సంతానమున్ ।
బొసఁగన్
దివ్యసుఖప్రభావవయి
రేపుల్ మాపులుం బుచ్చుమమ్మ,
సతీరత్నమ!
లోకమాతవయి
పద్మా భారతీ పార్వతుల్।
పసయున్ బాసయు మేటిశక్తులిడి
సంభావింప
నూరేండ్లకున్

# విషయసూచిక

# జ్ఞాపిక

"స్త్రీపురుషసమానత్వ మేయేవిషయముల నత్యావశ్యకము? ఎందైన ననర్థదాయకమా?" యను విషయమున వ్యాసముల వ్రాయవలెననియు వానియం దుత్తమవ్యాసమునకు బహుమాన మొసఁగఁబడుననియుఁ బ్రకటించియుంటిమిక దా!

అది మా సోదరీమణులు చూడలేదో లేక చూచియు మరచిరో తెలియదు గాని తగినన్ని వ్యాసములు మాత్రము రాలేను. అందువలన మరియొకమారు కోరవలసి వచ్చినది.

సం॥ 1936 రం ఫిబ్రవరి మొదటి తేదీలోఁగా వచ్చెడి వ్యాసములే విలువ సేయఁబడును. కాబట్టి త్వరపడి యత్నింపవలెనని కోరుచున్నాము.

ఇట్లు

సంపాదకులు

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావు. మదరాసు: ఆకుండి వెంకటశాస్త్రి.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు.
నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. నూజవీడు: పి. ధనంజయ అండ్ కంపెని
జెమ్‌షెడ్‌పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్‌పైప్ కంపెనీ, [లిమిటెడ్.
బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.
గుంటూరు: వెల్‌కం అండు కంపెని.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.
పిఠాపురం: ఎం. సూకరాజు, ఆంధ్ర న్యూస్‌ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
ఏలూరు: డి. శ్రీహరిరావు.
తణుకు: పడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్‌డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్‌పేట.
ఒంగోలు: తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్ వీధి.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.
విజయనగరం: ఆయపిళ్ల .సూర్యనారాయణరావు
నరసాపురం: వై. సత్యనారాయణగారు.
కొవ్వూరు: కె. సి. చెన్నకేశవయ్యర్. గూడూరు: సి. సి. సుబ్బయ్య, మర్చంట్
కాకినాడ: నున్నా బాలకృష్ణరావు, న్యూస్‌బాయ్ అండు కో.
భీమవరం: వంగల అచ్చుత రామయ్య, మేనేజరు, నెహ్రూ ఖద్దర్ స్టోర్సు.
గుడివాడ: శ్రీ శివరామ అండు కో.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.
అమలాపురము: పి. అన్నాజిశర్మ. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)
పర్లాకిమిడి: రాచూరి రామనారాయణరావుగారు.
ఆమదలవలస: సి. వి. నరసింగరావు
మచిలీపట్ణం: ఆచంట లక్ష్మీనరసింహం, సర్కుల్ పేట.
కర్నూలు: టి. బాలనాగయ్యశెట్టి బాలసరస్వతి బుక్ డిపో.
అనకాపల్లి: సివాజి న్యూస్ ఏజన్సి.

హిగిన్‌బాతమ్ స్టాలులవద్ద దొరకును.

**ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.**

# కష్టపడుచున్న వ్యక్తికి



సుఖానందని యేది ?

బొంబాయి హార్మోనియమ్‌మార్టు
వారివలన తయారుచేయబడిన

## 'హార్మోనియమే'

ఇయ్యది ప్రతి యింటియందును అత్యావశ్యకముగ నుండతగిన వాద్యము. చౌకదనమును, పనితనమును కలిగినది. దీనిని మీరుకొని యానందింపుడు.

క్యాటలాగు ఇనాముగా ఇవ్వబడును.

## ది బాంబే హార్మోనియమ్‌మార్టు

23 బ్రాడ్వే, మద్రాసు

# టాజిహామల్ భవనము యొకటే

ప్రపంచమునందు "టాజ్ మహాలు" అను భవనము నొక్కటియే శ్రేష్ఠమైయున్నదనియు పర్వతములలో హిమాలయా పర్వతము నొక్కటియే గొప్పదైయున్నదనియు సర్వసాధారణముగా జనులకందరికి తెలిసినవిషయము. అయితే టాజ్ మహాలు మాదిరి మఱియొక భవనము సృష్టించుట కష్టము.



అదేప్రకారము ప్రపంచములోనుండు రంగోన్ యెలక్ట్రో డైమండ్సులో సాయాసింట్ Saya Sint యెలక్ట్రో డైమండ్సు మేలైనవియు శ్రేష్టమైనవిగాయున్నవి.

తక్కినవన్నియు వీటిని పోలియుండును గాని నిజమైనవి కావు. సాయాసింటు అనునతడు గొప్పబర్మాదేశపు రత్నవర్తకుడు. అతడు స్వంతముగా రత్నములను సానబెట్టువారు. అతనిని చూచియే యితరులు చేయ నారంభించిరి. కాబట్టి తమరు సాయాసింటు Saya Sint అను పదమును దయచేసి జ్ఞాపకముంచుకొని నిజమైన యెలక్ట్రో డైమండ్సును కొనవలయునని కోరుచున్నాము. యెల్లప్పుడున్ను మావద్ద పైచెప్పిన సాయాసింటు యెలక్ట్రో డైమండ్సు అన్నిరకములలోను దొరుకును.

మా అడ్రసు: **సాయాసింటు**

రంగోన్ యెలక్ట్రో డైమండ్సు వ్యాపారం,
నెం. 237, గోవిందప్పనాయకన్ వీధి, జి. టి. మద్రాసు.

# కుఱ్ఱవాడు అల్లర పెట్టినయెడల—కొంటితన మనుకోకు

## వైద్యునకు చూపించితే

వారు మంచిసాధకం చెప్పుతారు



**ఆశ్చర్యమైనను నిజము**

స్కాట్సు ఎమల్షను కాడు లివరాయిలుకంటె మూడురెట్లెక్కువ గుణము. వెన్నకంటె 80 రెట్లు యెముకపుష్టి 8 రెట్లు శక్తిగ పుష్టినిచ్చును. 1 చమ్చా ఎమల్షను 5 పయింట్లు పాలు లేక 2 కోడిగ్రుడ్లు 2 పౌ. నాబనాలతో తుల్యాం

చికాకు—కింకపట్టు—ఏడుపు వీనికన్నిటికి ఒక్కటే కారణము.

పిల్లలందరికీ వారివారి తత్వాలకు సరిపడినంత ఎ. డి వైటమినులు ఆహరములో వెళ్లవాలి. శరీరమును పెంచటకు, యెముకలను గట్టిపరచుటకు నరములను బలపరిచుటకు కాల్సియము, భాస్వరముకూడా వెళ్లవాలి ఇవి చాలకపోగానే పిల్లలబలము తగ్గిపోయి, కృశించి, మొండికెత్తి అల్లరి యేడుపు ప్రారంభించుదురు.

60 ఏండ్లనుండి వైద్యులంగీకరించిన చక్కనిమందు స్కాట్సుఎమల్షను. దీనిని పరిశుద్ధమైన కాడ్లు లివరాయిలులో నుంచి తయారు చేయుదురు. ఎవైటమినుల కిది పెట్టినపేరు. దీనిలో డి. వైటమినుకూడా వుంటుంది. ఈఎమల్షనులో కాల్సియము భాస్వరముకూడా చేర్చుదురు కనుక ఇది సాదా కాడ్లులివరాయిలుకంటె మూడురెట్లెక్కువ గుణమునిచ్చును. ఇది రుచిగావుండి సులువుగా అరుగును గనుక పిల్లలు దీనిని చాలా అప్యాయనంగా తిందురు. ఇది శరీరపుష్టిని రక్తవృద్ధిని గూర్చును గనుక దగ్గులు, జలుబు, మొదలైన ఊపిరితిత్తుల జబ్బులకు కూడ పరమౌషధము. జబ్బుచేసి నిమ్మళించిన తరువాత ఎప్పటిబలము కూర్చుటకు దీనివంటి మందు లేనేలేదు.

# SCOTT'S Emulsion



**స్కాట్సు ఎమల్షను ఏమి చేయును ?**

మాంసమును యెముకలను పెంచును. నరములను బలపరచును. అంటురోగములు తగలకుండా ఊపిరితిత్తులను కాచును. రక్తవృద్ధి చేయును. జబ్బులను తరుమును.

స్కాట్సు ఎమల్షను మందీవర్తకులు :

ఇంపీరియల్ [illegible] కెమికలు ఇండస్ట్రీసు (ఇండియా) లిమిటెడ్.

కలకత్తా, [illegible] మదరాసు, లాహోరు, రంగూను, కొలంబో, కాన్పూరు, పాట్నా,

# వారు తమ ఆరోగ్యము     ఆధారపడియున్నారు.



వారు తామనుకొన్నదానికంటె ఎక్కువగ నీపై నాధారపడియున్నారు. వారు త్వరగా వృద్ధిబొందుచుండవచ్చునుగాని వారిని సక్రమముగ బెంచుట నీ ధర్మమైయున్నది. వారికి బాల్యకాలమున నీవు సత్ప్రవర్తనరూపమున నెట్టిది పునాది వేయుదువో యది వారిజీవితములం దెక్కువ యుపయోగించును.

తెలివిగల స్త్రీలు, పరిశ్రమ ఆహార, పానీయములగూర్చిన సదుద్దేశముల తమబిడ్డల మనస్సుల కెక్కింతురు. భారతీయ తేనీటిని త్రాగుడని వారిని ప్రోత్సహించుటకంటె మీ కుత్తమమగు కార్యము మరియొకటి గానరాదు. మీదేశమునందే పండి పరిశుద్ధమైన నేదదీర్చు నీ పానీయము వారి శరీరమునకు మనస్సునకు ఉత్సాహమును గల్గించి వారి జీవితములందొక మంచివా.తి కరమై యుండగలదు.

## తేనీరును తయారుజేయుట.



ఉడుకునీటితో గడిగిన మంటిపాత్రలో మనిషికి ఒక చమ్చావంతున తేయాకును వేసి, మరిగిన ఉడుకునీటి నందులో పోయుము. ఐదు నిమిషములుండనిచ్చి, పాలు చక్కెర చేర్చి త్రాగుము.

**భారతీయ తేనీరొక్కటే కుటుంబ[illegible]ము.** I-K-31

తింటే గారెలుతినాలి; వింటే భారతంవినాలి

"బెజవాడ సరస్వతీటాకీస్ వారు తమ మొదటి తెలుగుటాకీ"

# —ద్రౌపదీ వస్త్రాపహరణము—

అనుభారతకథతో కర్ణానందము, నేత్రానందము గూర్చనున్నారు.

సూపర్వైజింగ్ డైరక్టరు: హెచ్. యం. రెడ్డి. * డైరక్టరు హెచ్. వి. బాబు



రాజసూయమున కరుదెంచిన కృష్ణునికి ధర్మజుడు పాదపూజ చేయుట

## విడుదలకై నిరీక్షింపుడు

ముఖ్య పాత్రధారులు:

| | | |
|---|---|---|
| యడవల్లి | సి. యస్. ఆర్. | కన్నాంబ |
| గగ్గయ్య | నాగరాజరావు | రామతిలకం |
| దొమ్మేటి | చొప్పల్లి | నగరాజకుమారి |

*For Booking apply to:*

**SARASWATI TALKIES, Ltd.,**

***Camp: Palace Theatre Buildings, Kolhapur.***

**Grams: "SARASWATI," Kolhapur**




# శ్రీ మొల్లజయంతి

శ్రీ మొల్లజయంత్యుత్సవ మతివైభవమున నెల్లూరు నగరమున జరిగెను. ఈ సందర్భమున నెల్లూరు పురమందిరమున సభజరిగెను. ఈ సభకు అధ్యక్షురాలగు విద్వాన్ కవితిలక, కవితావిశారద బిరుదాంచిత శ్రీమతి, కంచనపల్లి కనకాంబగారిని, శ్రీమతి చిల్కపాటి సీతాంబగారిని, శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిని మోటారుపై నూరేగించిరి. పెక్కుమంది స్త్రీ పురుషులు వారిని వెంబడించిరి. కవయిత్రీమతల్లులను గౌరవింప నుదార చిత్తులగు పౌరప్రముఖులెల్లరు వెంటనడచి కవితయెడ గౌరవాదరములను జూపి తన్మూలమున ఆంధ్రమాతకు వన్నె దెచ్చిరి. తమపరివారముతో పురమందిర మలంకరించిరి. శ్రీ కంచనపల్లి కనకాంబగారు అగ్రాసనాధిపత్యము వహించిరి. అధ్యక్షురాలి మున్నడికి ముందు బాలికలు మనోహర గానముచే సభికుల తన్మయుల నొనరించిరి. వారివెనుక ఆరుసంవత్సరముల బాలిక సుందరముగ నాట్యమాడి యందరి నానందింపజేసెను.

అనంతర మధ్యక్షురాలినిగురించి సభికుల కెరుక గావింపబడియెను. అంతట నధ్యక్షురాలు తొలిప్రసంగము గావించెను. అది యీదిగువ జెప్పబడియున్నది.

## దైవప్రార్థన

జయంతి దైవప్రార్థనతో ప్రారంభమైనది. శ్రీమతి పుష్పవల్లిగారు మనోహర గానమున దైవస్తోత్ర మొనర్చిరి.

## అధ్యక్షురాలిని సభ్యుల కెరుకపరచుట

ఆవల యూనియన్ కార్యదర్శి మన్నెపల్లి రామకృష్ణరావుగారు అధ్యక్షురాలిని సభ్యుల కెరుక చేయుచు నిట్లు ప్రసంగించిరి.

సోదర సోదరీమణులారా!

నెల్లూరు ప్రొగ్రెసివ్ యూనియను వారు తమకు పంపుకున్న ఆహ్వానమును మన్నించి [illegible] మీ కెల్లరకు వందనములు.

మేము మొల్లమాంబయొక్క వర్ధంత్యుత్సవమును జరుపుట కిదియే ప్రథమము. 1915 వ సంవత్సరము అక్టోబరునెల తే 12 దిన ప్రారంభించిన తిక్కన జయంత్యుత్సవమును, 1932 వ సంవత్సరము డిసెంబరు నెల తే 17 దిన ప్రారంభించిన వేంకటరాయశాస్త్రి వర్ధంత్యుత్సవమును చాలమట్టుకు నేటేట జరుపుచు మా సమాజోద్దేశములలో నొకటియగు వాఙ్మయాభివృద్ధికి యథాశక్తి దోడ్పడుచున్నాము. ప్రాచీనాంధ్ర కవులలో నెందరికో నెల్లూరుమండలము నివాసస్థానమై ఆంధ్రదేశమున వినుతిగాంచియుండుట భాషాభిమానులగు మీకెల్లరకు తెలిసియేయున్నది. కవిత్రయములో నిరువురగు తిక్కన యఱ్ఱాప్రెగడలకేగాక, కేతన, జక్కన, నాచనసోమన, పినవీరన, శ్రీనాథుడు, సోమకవి, కంకంటి పాపరాజు, పుష్పగిరి తిమ్మన, మోచర్ల వెంకన, మోచర్ల దత్తప్ప, కంసాల రుద్రకవి, నారాయణకవి, జంగం శరభకవి, ఘటిక కంటి సూరన, కాకునూరు అప్పకవి, గోపినాథం వేంకటకవి మొదలగు మహాపురుషులకు యీ నెల్లూరు మండలమే నివాసస్థానమై ప్రసిద్ధిగాంచినదని మన మందరము జ్ఞప్తియందుంచుకొనవలెను. ఈలాటి ప్రాచీనమహాకవులగు పురుషసింహులనేగాక, ఆంధ్ర స్త్రీజనలోకమున ప్రథమకవయిత్రియై తెలుగుతో శ్రీరామచరిత్రామృతమును మనోహరములగు పద్యములలో రచించి చారిత్రక విఖ్యాతిగాంచిన నారీరత్నమగు శ్రీ మొల్లమాంబను ఆంధ్రదేశమునకు ప్రసాదించినదియు యీ నెల్లూరుమండలమే. అట్టి మొల్లమాంబయొక్క వర్ధంతిని నేడు ప్రప్రథమమున మా నెల్లూరు ప్రొగ్రెసివ్ యూనియనువారు జరుపగలుగుట యెంతయు ఆనందదాయకము.

ఈ మొల్లవర్ధంతిని జరుపుటకు మమ్ము ప్రోత్సహించినట్టియు, ఏతద్ఘనకార్యము నింత విజయవంతముగ నెరవేర్చుటకు నుల్లసిత ధనాదిసదుపాయముల నత్యంత శ్రద్ధాభక్తులతో ఉదారహృదయముతో మాకు చేకూర్చినట్టియు, స్త్రీజనశ్రేయోభిలాషి గృహలక్ష్మి పత్రికాధిపతి డాక్టర్ క. యన్. కేసరిగారికి మే మెంతయు కృతజ్ఞులము. డాక్టరు కేసరిగారును నెల్లూరు మండలమువారేయని మీకెల్లరకును తెలిసియే యుండును. నెల్లూరు ప్రొగ్రెసివ్ యూనియన్ స్థాపింపబడినది మొదలు డాక్టరు కేసరిగారివలన యీ యూనియనువారు పలువిధముల సహాయమును పొంది యున్నారు; యింకను పొందనున్నారు. ఈ మొల్ల జయంత్యుత్సవసమయమున ఆంధ్రవిదుషీసన్మానము జేయవలెనని, ఏటేట నాంధ్రదేశములోని ఒక్కొక్క విదుషీమతల్లికి గృహలక్ష్మి స్వర్ణకంకణమును బహూకరింపవలెనని, యిది శాశ్వతముగ జరుగు నేర్పాట్లు చేయవలెనని, యీకార్యముల ప్రొగ్రెసివ్ యూనియనువారి యాదరమున జరిపింపవలెనని వారు సంకల్పించియున్నారు. డాక్టర్ కేసరిగారు మాకింతవరకు చేసిన యిక ముందు చేయనున్న సహాయమునకు నెల్లూరు ప్రొగ్రెసివ్ యూనియనుపక్షమున వారికి వందనశతము లర్పించుచు యీ జయంత్యుత్సవారంభముననే దీని పోషకులగు కేసరిగారికి పుష్పమాల నర్పించుకొని (పుష్పమాల అర్పింపబడెను) మా కృతజ్ఞతను తెల్పుకొనుచున్నాము.

నేడీ మొల్లమాంబయొక్క వర్ధంత్యుత్సవమున కధ్యక్షతవహింప విద్వాన్ కవితిలక కవితావిశారద శ్రీమతి కంచనపల్లి కనకమ్మగారినాహ్వానించియున్నాము. కనకమ్మగారును నెల్లూరువారేయని మీకందరికి తెలిసియేయుండును గాన వారిని మీకెరుకపరచుట అనవసరమనియే తలంచితిని. కాని తెలియనివా రెవరయిన నున్నచో వారికొరకై యించుక నుడివెదను. కనకమ్మగారి బాల్యదశ నెల్లూరులో వారి సన్నిహితబంధువులగు కీర్తిశేషులు మంగు రామానుజరావుపంతులు పంగనామాల వెంకటరావు పంతులుగార్లయొద్ద గడచినది. వారియమకు సంస్కృతమునను ఆంధ్రమునను తగు శిక్షణము నొసగియుండుటచే, ఆమెగారు చిన్న

వయస్సుననే ద్రైవభక్తిపూరితమగు రంగశతకమను చిన్నపద్యకావ్యమును 108 కందపద్యములలోను, అమృతవల్లియను మనోహరమగునవలను రచియించి, అప్పుడిచట ప్రచురితమగుచున్న సుబోధినీగ్రంథమాలలో 1916, 1917 సంవత్సరములలో నారెండు గ్రంథములను బ్రచురింపజేసి, అప్పటికే ఆమెగారి హృదయాంతరాళమున మొలకలెత్తుచున్న మృదుమధురకవిత్వమును, భాషాసౌష్ఠవమును ఆంధ్రలోకమునకు వెల్లడిపఱచినది. ఆసమయముననే నరసాపురములోని విజ్ఞానచంద్రికామండలివారి విద్వత్పరీక్షలో కనకమ్మగారు ప్రథమురాలుగా నుత్తీర్ణయై యనేకబహుమానముల బడసిరి. ఆవల యిటనుండి మదరాసుకు వెళ్ళి ఆంగ్లమున ఉన్నతవిద్య నభ్యసించి ఇంటర్మీడియేట్ పరీక్షవరకు చదివి, విద్వాన్ పరీక్షలో కృతార్థురాలై, ఇపుడు క్వీన్ మేరీస్ కాలేజిలో ఆంధ్రభాషోపన్యాసకురాలుగా వన్నెకెక్కియున్నారు. మరియు యం. ఏ. మొదలగు పరీక్షలకు ప్రశ్నాపత్రములనొసగు సభ్యసంస్థలో సభ్యురాలుగా నున్నారు. ఇచటనుండగా వారురచియించిన రెండుగ్రంథములును గాక, మదరాసు చేరినపిమ్మట కాశీయాత్రయను సీసమాలను, శ్రీమహాభారతసంగ్రహము, గౌతమబుద్ధచరిత్రము, రాధయను సాంఘికనవల, జీవయాత్రయను వేదాంతప్రతిపాదకమైన పద్యకావ్యము, పద్యముక్తావళి, హంసవిజయమను నాటకము, శ్రీమద్రామాయణసంగ్రహము, ఆనందసారము, అమృతసారము, పొట్టికథలు, అనుగ్రంథములు రచియించి ఆంధ్రనారీలోకమున చిరస్థాయియైన యశముంగాంచి విలసిల్లుచున్నారు. ఆమెగారి కవిత్వమును గూర్చియు ప్రతిభావిశేషములంగూర్చియు యెక్కువగ ప్రశంసించుటకు నాకు వ్యవధిలేదు. గడచిన నవంబరు తే 20 దిన చెన్నపురిలో కవితిలకకుటీరమున జరిగిన అమృతానందస్వామివారి జన్మదినోత్సవసందర్భమున కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు, దేశోద్ధారక విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావుపంతులువారు, వెలిబుచ్చిన అభిప్రాయములేచాలును – కనకమ్మగారి కవితాసామర్థ్యమును, తత్వజ్ఞానసంపన్నతను, సత్కార్యనిర్వాహకౌశలత్వమును ఆంధ్రలోకమునకు వెల్లడిపఱచుటకు మననెల్లూరువారయిన శ్రీమతి కంచనపల్లి కనకమ్మగారిట్టి ప్రఖ్యాతిగాంచినందుకు మనమెల్లరము ఆమెను అభినందించుచున్నాము.

నేడీ విదుషీమణిహస్తములచే డాక్టరు కె. యన్. కేసరిగారి గృహలక్ష్మీస్వర్ణకంకణము నందుకొను కవయిత్రి శ్రీమతి చిల్కపాటి సీతాంబగారును నెల్లూరు మండలమువారే! ఆమెగారిగూర్చి ముందెక్కువగ మీరు వినబోవుచున్నారు గాన నేను దానింగూర్చి ముచ్చటించుట కియ్యకొనను.

నేడు మనము స్మరించు ఆదికవయిత్రీమతల్లియగు మొల్లమాంబయును, అధ్యక్షతవహింపబోవు కనకాంబయును, బహూకరణమునొందబోవు సీతాంబయును అందఱు నెల్లూరుమండలమువారేయగుట కత్యంతసంతోషమును బొందుచు, యీ మహోత్సవమున కధ్యక్షతవహించి కార్యక్రమమును కొనసాగింప విద్వాన్ కవితిలక కవితావిశారద శ్రీమతి కంచనపల్లి కనకమ్మగారిని కోరుచున్నాను.

ఆవల శ్రీమతి కంచనపల్లి కనకమ్మగారు అధ్యక్షపీఠిక నధిష్ఠించి ఇట్లు ఉపన్యసించిరి.

శ్రీలకు నాలవాలమగు సింహపురంబున వర్ధమాన శో
భాలసదార్యగోష్ఠిఁ గవిపండితభక్తసమక్షమందు. భ్రా
పాలలనాసపర్యలఁ బ్రశస్తముగా ఘటియించు సత్క్రియా
జాలము నిర్వహింప ననుఁజాలఁగఁ జేసినబాల నెన్నదగ॥

కేసరి పిల్చెసింహపురికిన్ నను మొల్లజయంతిలో సభా
గ్రాసనమందునుండ: నట్టులెగద! పుట్టినయింట [illegible]

తే పెద్ద రగ్రపూజ యిది. చిన్నదొ పెద్దదొ యాడుబిడ్డ; కీ
ధోత్సవము సైపఁడంచు వినతుల్ పొనరింతు
సదస్యకోటికిన్||

ధీశుఁడు కొమ్మనార్యుని ప్రతిష్ఠను గీరితిఁ బేరుకొన్న గుం
టూరునఁబుట్టియున్ జనకుఁడున్ బినపాడె చనఁగ,
వచ్చి నె
ల్లూరవసించి పేఁజదువులున్ బతికంబులు
సత్కవిత్వమున్
జేసెను బెంపుగాఁ టినిటఁ బెద్దలునన్ను ననుగ్రహింప మా
యూరిదియే యటంచు ముద మొందెద - శాంత
యయోధ్యనుంబలెన్||

మా పెద్దల్ పలునాట వాటముగ మున్ మాచెర్లలో
వెడి దా
చేపల్లిన్ గడుదానభోగముల వాసిన్ గాంచు
వ్యాపారులై
భూపశ్రీ విలసిల్లినారు; కళలన్ భూదేవులన్ దేవులన్
గాపాడంగఁ గడంగినారు భృతులన్ గల్పించి
మేలెంచుచున్||

మా మాతామహు లందినారు మును సన్మానంబు
గోల్కొండలో
హేమంబుల్ మణులున్ సువస్తువులు భూమీశుల్
సమర్పి ప ను
ద్దామప్రేమ హరిన్ భజించిరి మహత్త్వంబంది
వేదాద్రిలో
నామం బిప్పటికిన్ వినఁబడెడు ధన్యత్వంబు
మాకద్దియే||

తానొకధర్మవాదిగఁ బ్రథన్ బురమందునఁగన్న
మంగు రా
మానుజుఁ డాప్తుఁడౌచుఁ బ్రథమంబున నన్
గవయిత్రిఁజేసి, వి
ద్యానిపుణుల్ కవుల్ యతులు తన్నొగి
ధన్యునిఁజేయ వారిస
ఖ్యానముచేసి చూపె నొకమార్గము నాకును
సాధుసేవకున్||

రంగారాయునిఁ బింగళామణిఁ బారావారరాకా
సుధాం
శుం గీర్తిప్రియు భావుకున్ దలఁతునే
శుద్ధాంతరంగంబునం
దుం గావ్యమ్ములు పత్రికల్ చదువఁగా మాల్కాల్పి
న నిన్నింతదా
నింగా నేఁడు దివంబునుండి గనువానిన్
సాధుసమ్మాన్యునిన్||

తెనుఁగున మల్లినాథుఁడన ధీరతవాఖ్యలువ్రాసి
సంస్కృతం
బునకుఁ దెనుంగుఁజేసి బుధముఖ్యుఁడునా జయమంది
క్రొత్తతో
వను గృతులంబొనర్చి త్రిదివంబునకేఁగియు నార
యూపురం
బున వెలుగొందు సత్కవికి మ్రొక్కెద
వేంకటరాయశాస్త్రికిన్||

పెద్దలకోనఁ బెద్దయయి పిన్నలకున్ జనవిచ్చుపిన్నయై
గద్దెల మాటలాడెడు ప్రగల్భుఁడునై బుధకోటి
కండయై
ప్రొద్దులు విద్దెలంగడుపు ప్రోడయునౌ
శివరామయార్యునిన్
వద్దన మానఁగా వశమె పండితఁగోష్ఠిఁ
బ్రశంసచేయఁగన్||

ప్రస్తావోచితు నేటి తిక్కనను సుబ్రహ్మణ్య
బ్రహ్మణ్యు కృ
ష్ణస్తోత్ర ప్రియునిన్ ద్రిలింగ పరిషన్మాన్యున్
గళావేది స
ద్వస్తూపాసనలాలసున్ విమల దుర్భావంశ్యునిన్
సద్యశో
విస్తారున్ వినుతింతు సింహనగరీ విద్వత్కవీంద్రున్
హితున్||

కం|| కణమీయఁ గొంకుమును కం
కణ మీ కలి నిత్తు రవరు కవయిత్రులకున్
గుణమెఱిఁగి యొసఁగి కేసరి
ప్రణుతుల్ గని దేశమందుఁ బ్రాచుర్యమునన్||

కం॥ తిక్కన జయంతికిన్ నుతి
కెక్కిన కవివరునకొసగు నేటటనుఁ బెం
పెక్కఁగ నూటపదారులు
తిక్కవరపు రామిరెడ్డి తెన్నెవరికగున్॥

కం॥ రేబాల వంశమణులన్
శ్రీబలులన్ సకలసుకవి చింతామణులన్
శోభవలు ధర్మచింతల
తోఁ బురివెలయించుఁ రీతితో హరి సతమున్॥

శైవుని కూతురయ్యు నృపచంద్రుని శ్రీరఘురామచంద్రు స
ద్భావమునన్ భజించియుఁ బ్రబంధము నాతనిపై రచించియున్
భూవలయంబునం గలుగు పుణ్యచరిత్రల నగ్రగణ్యయై
మా వనితాళికెల్ల నుపమంబగు మొల్లదలంతు నెంతయున్॥

ఆర్యులారా, సతీమతల్లులారా!

పుట్టినింటి సౌభాగ్యంబె భాగధేయముగ నలరినదాననగుట మజ్జన్మస్థలంబగు నీ నెల్లూరు పురంబున నిరువదియేండ్లకు నే డీ పరిషన్మధ్యంబున మీ యనుగ్రహంబున నిలువబడుట నాకెట్టి యానందము కల్గించుచున్నదో నేను వాక్కుల వర్ణింపజాలను; సర్వసాక్షియే మీకు దెల్పగలడు. మీ మనంబుల నాయందుగల నిర్వ్యాజానుగ్రహమె నన్నీ స్థానంబున నిలువబెట్టినది. సద్గురుకటాక్షమే మీవంటి సదస్యుల సన్మానమునకు నాకు బాత్రత కల్పించినది.

శ్లో॥ సిధ్యంతి కర్మసు మహత్స్వపి
యన్నియోజ్యాః
సంభావనాగుణ మవేహి త
మీశ్వరాణామ్॥

అని కాళిదాసుని సూక్తికలదు కదా.

సింహపురివత్సమున గృహలక్ష్మీపత్రికాధిపతులును, సుప్రసిద్ధాయుర్వేద ప్రచారకులునగు శ్రీ కేసరిగారు నన్నాహ్వానముచేయుట యొంతయు దగియుండుటయు, మాయూరి కనకమ్మయని నన్ను స్మరించుకొను సహృదయులు మిమ్ము సందర్శించు కుతూహలము నాకును బట్టరానిదగుటయు, విదుషీమణి యగు శ్రీమతి చిల్కపాటి సీతాంబగారి కవితాసత్కార సమయమగుటయు, భవతారకముగా శ్రీరామచరిత్ర వ్రాసిన కవయిత్రీమతల్లి మొల్లకు జయంతియగుటయు నన్నీపురంబునకు రప్పించినవి.

మనపురంబున 1917-వ సంవత్సరమున జరిగిన యష్టమాంధ్ర మహిళాసభ కాహ్వాన సంఘాధ్యక్షురాలిగా స్వాగతోపన్యాసమొసంగిన తరువాత నిక్కడగాని యెక్కడగాని నేనొక బహిరంగసభలో మాటలాడియుండలేదు. 1925-వ సంవత్సరం చెన్నపురిలో నాకు కవితిలక బిరుదప్రదానము సేయుటకు, గవి సార్వభౌములు, కింకవీంద్రఘటా పంచాననులు, దేశోద్ధారకులు సభజరిపిన నాడైన నేనచ్చటికి బోనైతిని. దైవదత్తమైన వృత్తి, మేరీరాణీ కళాశాలలోని విద్యార్థినులకు నాంధ్రభాషను బోధించుటయు, ప్రభుత్వము వారి నియోగమున విశ్వవిద్యాలయమందు పుస్తకనిర్ణయ పరిషత్సమావేశముల యందుఁ బ్రసంగించుటతప్ప నితర సభలకుఁ బోనైతిని. ఈయిరువదిసంవత్సరములనుండి

పాశపమయముకంటె భిన్నమగు ప్రతినిమే షమ్ము—వెట్టికి వెయ్యివిధములు : ఎవరి కిచ్చి వారికానంద మన్నట్లు—సద్గురుభ క్తమైన యీశ్వరోపాసనచేయుచు సద్గురు బోధమ్మును బద్యకావ్యములుగా వ్రాయుచు కాలక్షేపము చేయుచున్న దానను, బహి రంగగోష్ఠీ విముఖనైన నా చిత్తవృత్తి నెల్లూరున మొల్లజయంతి యన్నమాత్ర మున్ననే. సుముఖమై యీ సభకై ముగ్గుట నాకే వింతగానున్నది. నాజన్మస్థలమగుటయే గాక పావనపినాకినీ తీరమందున్న యీ రంగవికేతనం భేరికేని దర్శనీయంబు. కవిత్రయములో దిక్కన సోమయాజి ఎఱ్ఱా ప్రగ్గడల కవితాకాంతల కిది విహారస్థానము. సకల కళలను, నాంధ్రగీర్వాణ పండితకవుల నాదినుండి యాదరించి పేరుగన్న వెంకటగిరి సంస్థాన మీ మండలమునకు మండనం బనదగు. "కందువమాటలు సామెత లంద ముగాఁగూర్చి తేనెసోకగ నోరు తీయన యగురీతిఁ దోడ నర్థమెల్ల దోచునట్లు" చెప్పుమని శ్రీరామచంద్రుండు చెప్పించిన పలుకుమీద నిహపరసాధకంబుగా బుణ్య చరిత్రంబు దేటమాటల గ్రొత్తరీతుల రచియించి తనయశస్సౌరభము దశదిశల వెదజల్లజాలిన మొల్లకును మనయూరే జన్మస్థలము ఆంధ్రభాషా పారిశుద్ధ్యమును గాపాడ నాసపడు నీ నెల్లూరు మండలము నాటినుండి నేటివఱకు 'నేనుగు పండుకొని యున్నను గుఱ్ఱమె' త్తన్నట్లు కాలానుసార ముగా నెంతతగ్గియు నాంధ్రగీర్వాణభాష లకు నార్యవిజ్ఞానమున కాలవాలమై విలసిల్లుచున్నది.

సంస్కృతంబున కాంధ్రానువాదంబులు స్వతంత్రాంధ్ర గ్రంథంబులు, వ్రాయజాలు సత్కవు లిప్పటికిని నెల్లూరు కీర్తి దశదిశల వెదజల్లుచున్నారు. సంస్కృత కళాశాలయు, నాయుర్వేద విద్యాలయము, ప్రస్థానత్రయ బోధం బొనరించు గోష్ఠీమందిరంబులును, భక్త సమాజంబులును, వారపత్రికలు, వివిధ విధవిద్యావినోద సుందరంబగు నీ పురమందిరంబు నీ సింహపురి కసారయశంబు గూర్చుచున్నవి.

ద్రవిడులను దనయంకతలంబున నిల్పుకొని వారికిఁ బరిపూర్ణంబుగా నాంధ్రత్వ మొసంగి పుదూరు తుమ్మగుంట ద్రావిడశాఖలనుండి యాంధ్రపండితులం గవుల గల్పించిన ప్రభావ మీ నెల్లూరునకే చెల్లుగదా!

చదువులఁ జక్కదనంబుల నేరికిం దీసిపోవక పాడిపంటల భోగభాగ్యంబుల నద్వితీయులై దానధర్మములకు మార్గదర్శకులై వెలయు రెడ్డికులంబులు నెల్లూరునకే కాక తెలుఁగుదేశమున కలంకారమనుట యతిశయోక్తి కాదు.

వర్తమానకాలమున మద్రాసురాజధాని యం దుద్యోగధర్మము ననుసరించి యుండ వలసివచ్చినను నాజన్మస్థానమగు నెల్లూరు మండలమందలి యభిమానముచే నాజీవ యాత్రా ప్రబంధమునఁ బ్రధానముగా జెప్పం దగు శారదయును యోగినిఁ దత్త్వజిజ్ఞాస

గలిగినచోటు పినాకినీ నదీతీరముననున్న సోమశిలాక్షేత్రముగా వర్ణించియున్నాను. నా బాల్యంబున నన్ను నా విద్యావ్యాసంగంబును జూచి మెచ్చుకొని స్థలాంతరమందు నాకుగలిగిన సన్మానములకు సంతసించుచు నా శ్రేయస్సుగోరి సన్మాశీర్వదించుచు నీ పురంబున, నీ సభాంతరమ్మునఁగల పెద్దలకు నా నమస్కృతులు.

నా చిన్ననాఁడిచట మహిళామండలి విజ్ఞానముకొఱకుఁజేసిన ప్రచారములో నాకుఁ జేదోడు వాదోడై కీర్తిశేషురాండ్రైన నారీరత్నములు, మహారాజ శ్రీ ఒంగోలు వెంకట రంగయ్యగారి పుత్రియగు భువనేశ్వరమ్మ గారును, మ-రా-రా-శ్రీ విన్నా రాజగోపాల రావుగారి తొలి యర్ధాంగియగు కమలాంబ గారును స్మరణీయులగుచున్నారు.

భారత భాగ్యోదయమునకు హేతుభూత మగు నుద్యమంబునకు నన్నిటఁ బాల్గొని తన సర్వస్వమర్పించు ధీరస్వాంతయగు నా చిన్ననాటిచెలి శ్రీ పొణకా కనకమ్మకు చిరాయురారోగ్యైశ్వర్యము లీశ్వరు డనుగ్రహించుగాక!

కీర్తిశేషులగు పూండ్ల రామకృష్ణకవిగారు, పంచాగ్నుల దక్షిణామూర్తిశాస్త్రిగారు, మొదలగు పండిత ప్రకాండులు తొల్లి మన పురంబున చేసియుండిన సాహిత్యపరిశోధనములు, వారి ప్రోత్సాహమున వెలువడిన యముద్రిత గ్రంథచింతామణియు, నాతలంపున దగులుచున్నవి. మండల మహాత్మ్యము, పురప్రాధాన్యము, పండితకవుల సంస్కరణ సంకీర్తనములు గావించి నేటి సభకుఁ బ్రకృత మగు మొల్లజయంతినిగురించి నాకుఁ దోచిన భంగి మీకు వినిపించెద.

మొల్ల, ఆమది. స్థలమేమి? నెల్లూరు మండలము. కులమేమి? కుమ్మరికులమని ప్రతీతి. తండ్రియెవరు? ఆతుకూరి కేసయ శెట్టి. కాలము సరిగా దెలియదు. శ్రీనాథునిపేరు తన గ్రంథమందామె యుచ్చరించియుండుటచే శ్రీనాథుని తరువాతిదియో సమకాలీనయో యనుకొనుచున్నాము. కొందరు తిక్కనకాలమునాటి దనుకొనుచున్నారు. ఆమెకు గురుఁడో దేవుఁడో శ్రీకంఠ మల్లేశ్వరుఁడు. అది స్పష్టముగా లేదు. ఆమెతండ్రిపేరు చెప్పుటచే కులస్త్రీ యనుటకు సందేహములేదు.

ఆమె సులభవలె నవివాహితయో, తరిగొండ వెంకమ్మ ప్రభృతులవలె బాలవితంతువో తెలియదు. ఏ విషయమున నభిప్రాయభేదమున్నను నామెపేర శ్రీరామ చరిత్ర మాచంద్ర తారకముగ వెలయుట నిక్కువంబు. ఆమెగ్రంథముపై మనయభిప్రాయముతో బనిలేదు. కాలమే యద్దాని మేలు నిర్ణయించినది. ఆ మొల్ల రామాయణములోని తేనెపాకమందరాస్వాదించిన వారేయగుట నే నిట నిరూపించుట కాలహరణమని తలంతు. అయ్యది యీ మాసము గృహలక్ష్మిలో వ్రాయబడిన మన సీతాంబగారి వ్యాసమున మనోహరముగ జిత్రింపబడినది.

అయిన నామె యంతరంగమును మన కెఱిఁగింపజాలు సూచనలఁ గొన్నింటి నుదాహరింతు.

కం॥ "గురులింగ జంగమార్చన
పరుఁడును శివభక్తిరతుఁడు బాంధవహి
తుఁడున్
గురుఁ డాతుకూరి కేసయ
వరపుత్త్రిని మొల్లయనఁగ నఱలిన
దానన్.

గురులింగ జంగమార్చన పరుఁడును, శివభక్తిరతుఁడు, బాంధవహితుఁడు నగువానికి పుత్త్రికయగుటయే తనకుగల సర్వస్వముగ వర్ణించుకున్న సాధ్వీమణి పరమార్థము వర్ణింప నలవియగునా?

కం॥ "కవిగురు బుధమిత్రాదులు
వివిధార్చనలను సురపురి వెలయుదు
రెలమిన్
గవిగురు బుధమిత్త్రాదులు
వివిధార్చనలం బురమున వెలయుదు
రెపుడున్॥

కవులు, గురువులు, విద్వాంసులు, మిత్రులు వివిధార్చనముల బూజింపదగు వారని కదా, మొల్లకవయిత్రి యయోధ్యావర్ణన మిషమున రాజులకుఁ బోధించుచున్నది.

ఉ॥ నారదులైరి సన్మునులు నాకమహీజ
ములయ్యె భూజముల్
శారదలైరి భామినులు శంకరశైలము
లయ్యె గోత్రముల్
పారదలయ్యె నీరధులు పన్నగనాయ
కులయ్యె నాగముల్
నారదవర్గమెల్ల సితవర్ణములాయెను
బండువెన్నెలన్॥

మునులందరు నారదులైరనుట, భామినులందఱు శారదలైరనుటలోను మహాకవయిత్రి మానసమందు, మునులకు జడదారితనముకంటె నారదునివంటి భక్తి వెలయుటయందే తాత్పర్యము. భామినులందఱు నుపభోగ హేతువులుగను, సంసారబంధ హేతువులుగనుఁ బరిణమించుటకంటె విజ్ఞాన స్వరూపలై శారదాదేవిని బోలియుండవలెనని మొల్ల బోధించుచున్నది.

కం॥ చనిచని యెదుటను రాముఁడుగను
గొనియె మహీజనోగ్ర
కలుషాద్రి మహాశనిరూపంబనదగు
నాఘనముక్తి వధూవిలాసకబరిన్ శబరిన్॥"

లోకములోని జనముల ఘోరపాపములని యెడు కొండలను భంగించునట్టి వజ్రాయుధంబనదగు తపోమహిమగలదానినిగా, ముక్తి కాంతాశిరోభూషణమనదగు కబరి (కొప్పు) వంటి దానినిగా శబరిని మొల్ల వర్ణించినది. స్త్రీలు బ్రహ్మచర్యంబున మోక్షమును బొంద నర్హలనియు, నొక్క-వ్యక్తి తరించిన దత్ప్రభావంబున జగంబు తరించుననియు మొల్లయాశయము. ఒక డొక్క-కుటుంబమునతరించినచో "తనదువంశ్యులు ముయ్యేడుతరమువారు" తరింతురను మాట కవయిత్రి సూచించుచున్నది. 'విదుష ఆత్మతా" త్తనుసట్లు భగవద్భక్తునకు భగ

వంతున కభేదమనుటయు, భక్తుని కనితర సాధారణ ప్రభావము భగవత్కృపచే ఘటించుననియు, బోధించుచున్నది.

కం॥ పావని కనుగొనె నప్పుడు
పావన విఖ్యాతసుగుణభావో పేతన్
సేవితదనుజవ్రాతన్
భూవనితా జాత నిత్యపూతన్ సీతన్॥

ఇటఁ బావనియనక వాయుసుతు డనఁ జెల్లదా? పావనియనుటచే పవిత్రుడగుట హనుమంతుఁడు నిత్యపూతయగు సీతాదేవిని జూడగల్గెను. అపవిత్రులు పవిత్రులనుజూడ లేరు. "నారుద్రోరుద్రమర్చయేత్." సామానాధికరణ్యములేని వారల కన్యోన్య స్వభావము తెలియఁగరనుట మహాప్రౌఢిమతో సార్థకవిశేషణములు మొల్ల ప్రయోగించినది.

ఇట్టి వెన్నియోగలవు. నవనీతమువంటి యా మహనీయురాలి కైతలో మేలేరుట హాస్యాస్పదము. మానవకోటి పరమార్థమునే వేదశాస్త్ర పురాణేతిహాసకావ్యములలోఁ బ్రాచీనులు పొందుపరచినారు. మొల్లయు నార్యసంప్రదాయానుసారముగా జీవిత పరమార్థమును సాధించిన జ్ఞానవతి యగుట నామెకు చరమ పురుషార్థ ప్రాప్తియే సాధింపదగినది. కావ్యమునకు వేదశాస్త్రములకుంబోలె మోక్షమే పరమ ప్రాప్యము.

కం॥ ఈ రామచరిత మెప్పుడు
వారక వినినట్టివారు వ్రాసినవారున్
గోరి పఠించినవారును
శ్రీరాముని కరుణ మేలు సెందుదు
[రెలమిన్॥

'శ్రీరాముని కరుణ గలుగు మేలు మోక్షమే! సుఖదుఃఖంబులు కాలప్రాప్తంబులు. ఎయ్యది పొందరా దట్టిమేలు సిద్ధించుటకై హరిభజనచేయవలయును' అని భాగవతమున జెప్పబడినది. పొందరానిమేలు మోక్షమే!! అయ్యది శ్రీమద్రామాయణ పఠనాదులవలన గలుగునని మొల్ల ఘోషించుచున్నది. "భక్తవృక్షాళి చైత్రా" ఆకులురాలి మోడువలె చెన్నుదరిగియున్న వృక్షములకు వసంతునివలెను భవభార వహనక్లాంతులైన భక్తులకు శుభసామగ్రి సంపాదించి బ్రహ్మపదప్రాప్తి కలుగజేయు వాఁడా యని మొల్లపరమాత్ముని సంబోధన జేయుచున్నది.

ఉ॥ శ్రీమహిమాభిరాముఁడు వ
సిష్ఠ మహామునిపూజితుండు సు
త్రామవధూకళాభరణ
రక్షకుఁ డాశ్రితపోషకుండు దూ
ర్వామల సన్నిభాంగుఁడు మ
హాగుణశాలి దయాపరుండు శ్రీ
రాముఁడు ప్రోచు భక్తతతి
రంజిలునట్లుగ నెల్లకాలమున్॥

ఎల్లకాలము రంజిల్లునట్లు, అఖండానందము బొందునట్లు రాముడు ప్రోచుగాత యనుచున్నది కవయిత్రి. స్రక్చందన వనితాది భోగసముదాయంబు క్షణభంగు

రము కాని బ్రహ్మానంద మొకటే మొల్ల కాలము రంజిల్లఁజేయునది.

మాలిని. కువలయదళనేత్రా
కోమలస్నిగ్ధగాత్రా
భవముఖనుతిపాత్రా
భక్తవృక్షాళిచైత్రా
రవిశశి సమధామా
రక్షితాఘ్రాంఘ్రిభామా
కవిజననుతనామా
కావుమా మమ్ము రామా ॥

కామక్రోధాది శత్రుభయము బాపి కాపాడుమని మొల్ల మొఱపెట్టుచున్నది. తక్కినమార్గము లన్నిటికంటె 'దంతి యూధపు చందంబున భక్తిసేయవలయున్ దాత్పర్యసంయుక్తులై' యను భాగవతోక్తి ననుసరించి మొల్లయు భవమోచనముగోరి తారకనాముని "కావుమా మమ్ము రామా" యని వేడుకొన్నది.

ఉపనిషత్తుల కాలమునాఁడు గార్గిమైత్రేయియుఁ, దరువాత సులభయు నిటీవల మొల్ల, తరిగొండ వెంగమాంబయు, జీవిత పరమార్థమును, కావ్యకల్పనా బాధనా విశేషంబున కాంచి కృతార్థులైరి. 'పాత్రలు భేదమైనను పాలొక్కటియే' యన్నట్లు పురుషులేమి స్త్రీలేమి భక్తిసంభరితులై వ్రాసినకావ్యంబులలోని రసము కావ్యపరమార్థ మెరిగిన సాధువుల కొక్కటిగనే తోఁచుచుండును.

ఉ॥ తిక్కనఫక్కియంద్రుడు కవి
ధీరుడు నన్నయపండితుండు తా
నొక్కవచించెనంద్రుడు రమ
ణున్ గొనియాడఁగబోతనందు ర
మ్మక్కప్రపూర్ణభావమున
వ్యక్తుల భేదములున్నె? యూరకా
ఫక్కినిబల్కుచంద్రుతల
పన్ బుధకోటికి సద్రసంబులే
చక్కనిఁబాఱుచున్న గవి
చంద్రుల చంద్రికయాటనేకమై
మక్కువగల్గఁజేయు నొగిమాన్యత
గాంచును దత్వదృష్టిచేన్.

అని యిదివరకు "జీవయాత్ర"లో రచించి యుంటిని.

వాఙ్మయాదర్శ మిక్కాలమున విస్పష్టంబుగ లేకపోవుటచే యిటీవల గ్రంథములలో నేకదేశముగఁ గొన్ని విశేషములుండినను జుక్కానిలేని పడవలవలె తేలియాడియాడి కాలప్రవాహమున భగ్నమగుచున్నవి. మానవులకు గలుగు సకల ప్రవృత్తులను సంపూర్ణముగ గ్రహించి మన పెద్ద లవ్వానిం బోషించిరి కాని స్వచ్ఛందవర్తనము నంగీకరింపక నియమము లేర్పరచి తత్ప్రవృత్తులలోని శుభపరంపరను మాత్రము గ్రహించి యసర్థపరంపరను బ్రయత్నమున బరిహరించిరి. ఈ రహస్యమెఱుంగని బుద్ధిమంతులు దేశీయ విజ్ఞానమార్గముల నవలంబించి శాంతముగ నడువలేక నూత్నములగు త్రోవల డొంకల బరుగులిడుచు విభ్రాంతులగుచున్నారు.

ఇట్టివిషమ సమయమున మానవులకుఁ దమ పరమార్థమును నిరూపించుమార్గములు

కానవచ్చుటలేదు. మతమునందు భక్తి శ్రద్ధలు తగ్గిన నేటికాలమున మతగురువుల జయంతులయందు జనుల కంతే యాదరము కలుగుటలేదు. తమకవితా మాధుర్యంబున జనుల హృదయపీఠముల నధిష్ఠించియున్న మహాకవుల కవయిత్రుల జయంతులు సల్పిన రసలుబ్ధులైనవారు కావ్యోపాసనసల్పి క్రమముగా తద్వర్ణితమైన పరమార్థమును బొందగలరని గాబోలు మన నెల్లూరు మండలమునఁ బెద్దలు తిక్కనజయంతి, యెఱ్ఱాప్రగ్గడజయంతి, మొల్లజయంతి ప్రారంభించినారు. "చచ్చినగాని కవులను గౌరవింపరాదా" యనియొక విద్వత్కవియన్నట్లు మృతకవుల సన్మానముతో సరిపెట్టక జీవించియున్నకవులకు గవయిత్రులకుగూడ సన్మానముజరుపు నేర్పాట్లీపురంబున జరుగుట యెల్లరకు సంతోషదాయకమై యితర పురవరంబులకు మార్గదర్శకమగుచున్నది.

ఉ॥ స్వాంతమునందునమ్ముచు జ
యంతులుసేయుటెకాదు ధర్మదృ
ష్టాంతములట్లనిల్చిన మ
హాత్ములమార్గమునన్ జరించి వి
భ్రాంతులుమాని ఘోరభవ
బంధ విమోచనముంబొనర్చు శ్రీ
కాంతునినంతరంగమున
గట్టి భజించుట మేలుమేలగున్॥

ఓమితి శివమ్

శ్రీరామ.

అధ్యక్షురాలి ఉపన్యాసము ముగిసిన పిమ్మట శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు మొల్లమాంబను గూర్చి రచియించిన యీ క్రింది పద్యములను శ్రీయుత వి. యల్. నరసింహంగారు చదివిరి.

శ్రీరఘురామ పాదసరసీరుహముల్ మదినిల్పి భక్తివి
స్తారచణత్వమేరుపడ పద్దియముల్ రచియించి కీర్తిను
ద్రేకపరిగాంచిమించిన విశిష్టజనాదరణీయయున్ మహో
దారచరిత్రి మొల్లమ మృదూక్తుల వాకొననౌనె
యేరికిన్.

క॥ పద్యంబులు కవిబుధజన
హృద్యంబు లుదారభావవిలసనములు సం
వేద్యంబులు జనపాళికి
గద్యంబుల లలితమెన్నగా వశమౌనే.

క॥ మాటల నెన్నగ కప్రపు
మూటలు భావించిచూడ మోక్షముకేగన్
బాటలు చనిగొననమృతపు
దేటలు శ్రీ మొల్లమాంబ తేటతెలుంగుల్.

క॥ ఏకాలమున జనించెనో
ప్రాకటముగ నీమెభక్తి భావయుతముగా
శ్రీకాంతుని మృదుపదముల
వాకొని పూజనముసల్పె వాక్కుసుమములన్.

గీ॥ రతనమట్టుల స్త్రీలలో రహిజనించి
అన్యదుర్లభమైన శ్రీ హరికథలను
కబ్బమునొనర్చి సతులలో ఘనతగాంచె
భవ్యగుణపేటి మొల్లమాంబావధూటి.

ఆవల శ్రీమతి కంచనపల్లి కనకమ్మగారిం గూర్చి కర్నూలుజిల్లా మురవకొండ పోస్టులోచేరిన కొల్లాపురం గ్రామవాస్తవ్యులగు శ్రీయుతులు రామసుబ్బరాయుడు, బి. ఏ., వెంకటనారాయణగారలు వ్రాసి పంపిన యీ క్రింది పద్యములను శ్రీయుత దీక్షాల పిచ్చయ్యశాస్త్రిగారు చదివిరి.

కాంచనపల్లి వంశమునఁ గాంతలలోపల మేలుబంతివై
గాంచితిజన్మ మీవు కనకమ్మ! ధరాతలమందుఁ బ్రాకని
ర్వంచితకీర్తివైభవము ప్రాక్తనపుణ్యవశమ్ము చేత, నా
కాంచన గర్భుఁడెంతయు సుఖంబొనఁగూర్చుఁజిరా
యురున్నతిన్.

కాంచనపల్లివంశమునఁ గల్గిరనేకులు గాని నీవలెన్
గాంచిరె యొక్కరేనియు నఖండయశంబు కవిత్వమందు, ని
న్నంచితులైనవార లహహాయని మెచ్చుటగాల దొక్కొ? శీ
లించిన నీకు నీడుగలరే? యెవరేనియు నెందునేనియున్.

కాంచితి నీకవిత్వమును గాంచితిఁదత్త్వవిచారమంతయున్
గాంచితి నీదుగ్రంథములఁ గాంచితినీదగు 'జీవయాత్ర'యున్
గాంచితి వాక్పరిభావమును గాంచితి సత్కృతులెన్నియేనియున్
గాంచితి సర్వమున్ దనివిఁ గాంచితి వేయివచింపనేటికిన్.

సదమలభక్తితో రచన సల్పిన "హంసజయంబు" నంతయున్
జదివితి దానియందుఁగల సారముఁ గ్రోలితిఁ దత్త్వబోధనల్
బొదలుటఁజేసి వాక్యముల పొంకికయున్ రససౌకుమార్యముల్
కుదురుగనిల్చెఁ బాఠకులకున్ బ్రమదమ్ము ఘటింపఁ జేయుచున్.

సత్యముదాపనేటికి? రసజ్ఞులు మెచ్చెదు తత్త్వబోధనల్
సత్యములైన భావములు నూల్కొనునట్లు రచించినావనౌ
చిత్యముగానరాదచటఁ జెప్పఁగనేటికి? గల్గుజన్మ రా
హిత్యము మోక్షమున్ గలుగు నింతటి సత్కృతి వ్రాసినందుకున్.

గీ॥ హంసతత్త్వార్థ మెల్ల నీవరసినావు
నిశ్చలంబైన యోగసన్నియతిచేత
దాన సంసారచక్రంబు దాటగలవు
ధన్యతనుగాంచినావమ్మ ధాత్రిలోన.

ఇంతకుమించివేఱ వచియింపఁగనేటికిఁ బెక్కుసార్లు శా
కుంతలయొక్కటే యశము గూర్పగఁజాలిన గ్రంథరాజమా
వంతయులేదు సందియము నాపయినీదగు "జీవయాత్ర" ఖం
డాంతరమందునిల్పఁగల దంతకుమించినకీర్తి కీర్తులన్.
కనదగుధర్మవాక్యములఖండముగానొడఁగూర్చినీదు లే
ఖిని యవిసూక్ష్మబుద్ధినిలగించి యెఱింగిన జ్ఞానసత్త్వముం
డెనయఁగరానిసౌఖ్యమును నేర్పడగాంచి శుభంబులెప్పుడున్
గను బలుమాటలేటికిఁకఁ గన్పడు మోక్షము జీవయాత్రలోన్.

క॥ ధర్మార్థ మోక్షసాధన
కర్మముల కనువగునట్టి కావ్యములిట్లే
నిర్మలదృఢచిత్తమునం
దర్మిలిమైఁజేయుమమ్మ యశమును గొమ్మా.

ఆవల శ్రీమతి కాళ్లకూరి మహాలక్ష్మీసుందరమ్మగారు ఉపన్యాసమును ప్రారంభించుటకు ముందుగా, యూనియను కార్యదర్శి మన్నేపల్లి రామకృష్ణరావుగారు ఆమెగారిని సభ్యుల కెఱుకపరచుచు, శ్రీమతి సుందరమ్మగారు మదరాసు ప్రెసిడెన్సీ కాలేజిలో సంస్కృతమున యం. ఏ., పరీక్షకు పఠించుచున్న విద్యార్థినియనియు, పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరు మునిసిపల్ ఆఫీసులో రివిన్యూ ఆఫీసరుగానున్న శ్రీయుత కాళ్లకూరి శేషయ్యపంతులు బి. ఏ., గారి సతీమణియనియు, "హిందూసుందరి" పత్రికాధిపురాలై సుప్రసిద్ధిగాంచిన విదుషీమణియగు శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారి కుమారితయనియు తెలియ

జేసిరి. అంతట సుందరమ్మగారు ఉపన్యాసము నిట్లొసంగిరి:—

శ్లో॥ అమృతానందనాథాయ నాథాయదృఢచేతసామ్।
చేతః ప్రీతి ప్రదానాయ జ్ఞానాయమహసేనమః॥

శ్లో॥ కల్యాణానాం నిధానం కలిమల
మదనం పావనం పావనానామ్।
పాథేయం యన్ముముక్షోస్సపది
పరపదప్రాప్తయే ప్రస్థితస్య
విశ్రామస్థానమేకం కవివరవచసాం
జీవనం జీవనానామ్।
బీజం ధర్మద్రుమస్య ప్రభవతు
భవతాం భూతయే రామనామం॥

ఆర్యులారా! నారీమణులారా!

ప్రత్యక్ష పరాంబికయోయన్నట్లు పేరోలగంబున గూర్చున్న శ్రీమతి విద్వత్కవితిలక కవితావిశారద విద్వాన్ కంచనపల్లి కనకాంబా సన్నిధానంబున నావంటి బాలిక 'సల్లలిత ప్రతాపగుణసాగరుడై విలసిల్లు' శ్రీరామచంద్రుని వర్ణించిన జిహ్వతో చిల్లర రాజలోకమును దృణీకరించిన కవయిత్రీమతల్లియగు మొల్లగురించి నేడీ సభలో మాటలాడుట నా సాహసమా, భాగ్యమా?

ఈ యవకాశము నాకు గలుగుట మత్పూర్వకృత పుణ్యపరిపాకముగానెంచి సన్నిధానబలమే యూతగా నాకు దోచినభంగి మాటలాడెదను. చిన్నబిడ్డల తొక్కుపలుకులు విని సంతసించు తల్లిదండ్రులవలె నాయీ ప్రసంగంబునకు సంతసింతురని నమ్మిన నన్ను మీర లనుగ్రహింతురుగాక!

కవయిత్రులను సన్మానించు సత్కార్యమునకు నెల్లూరు పురమే దేశమంతటికి దారిచూపినది. విద్యావతియై గృహిణియై పద్మినీ పరిణయాది లలిత కవితా లతల నాంధ్రదేశమునఁ బ్రాకించుచున్న శ్రీమతి చిల్కపాటి సీతాంబగారికి సన్మానము జరుగు సభ జూడవలెనను కుతూహలము స్త్రీజనమునకుఁ గలుగుట వింతయా?

శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠమునకు ధర్మాధికారిణియై, బ్రహ్మీభూతులగు అమృతానందనాథస్వామి కంతేవాసినియై, జీవయాత్రాది మహాప్రబంధముల రచించి, మహాకవుల మన్ననబడసి, కవిసార్వభౌములకు సత్కారము చేయజాలిన మహోపాధ్యాయిని యధిష్ఠించిన యీ సభఁ జూచుభాగ్యము కలుగునను నాసతోగదా గృహలక్ష్మీ పత్రికాధిపతులగు కేసరిగారు నన్నీ యుపన్యాసమునకు బ్రోత్సహించినపుడు నే నంగీకరించితిని.

ఆ పేరు పెట్టుకొని వచ్చినదాననుగాన మొల్లను గురించి యొల్లరెఱింగినమాటలే నా నోటఁ బలికెదను. ఈ సాధ్వీమణి మొల్ల నెల్లూరుమండల వాసినియు, నాతుకూరి కేసయ పుత్త్రికయనియు, శ్రీకంఠ మల్లేశునివరమున గవితాధోరణి సంపాదించినదనియు నామె గ్రంథమునుబట్టి తెలియుచున్నది. కుమ్మరి మొల్ల యను లోక ప్రతీతివలన నీమెను కులాలకులసంభూత యనియే మనము భావింతుము.

ఏకులమైన నేమి?

'ఈతకు లోతులేదు జగదీశ్వరునాజ్ఞకు లాతిలేదు విఖ్యాతికి రోతలేదు పరమార్థపు దృష్టికి జాతిలేదు॥'

అని జీవయాత్రయందు కనకాంబగారు వచించినట్లు, కులాల సంభూతయయ్యు గుణప్రాధాన్యముచే సకలలోకారాధ్యత గాంచినది.

క॥ చదివిన బండితులగుదురు
విదితము గాకున్నయెడల వెఱ్ఱులె పురుషుల్
చదివినఁ జదువకయున్నను
ముదితలు విద్వాంసురాండ్రు పుట్టుకన్నృపతీ॥
జీవయాత్ర.

చదువని ముదితలే విద్వాంసురాండ్రనగాఁ జదివిన నింకెంత విశేషము! జదువుకన్న గురుపదసేవ కలిగిన

వారి కింకెంత విశేషము! మొల్ల గౌరీశ్వరవరప్రసాద లబ్ధమైన కవిత్వము కలది. 'చెప్పుమని రామచంద్రుడు సెప్పించిన పల్కుమీద' చెప్పినది కవయిత్రి రామాయణము, 'భక్తియె కారణమగు గాని చదువు కారణమగునే' యని మొల్ల యెల్లలోకములకుఁ జాటినది. ధూర్జటి మహాకవియు 'బోధావిర్భావనముల్ చదువులయ్యా కావు. త్వత్పాదసంసేవాసక్తియె కాక మానవులకున్ శ్రీకాళహస్తీశ్వరా!' అని యుద్బోధించి యున్నాడు.

చదుకొన్నవారిని సన్మానించుటలో నాడుతన మాటంకము కాగూడదు. అదిగాక పురుషశ్రేష్ఠులకు గూడ మాతృదేవోభవయని వేదపూజితలగు తల్లులాడువారే! వాగీశ్వరియగు సరస్వతి యాడుదేగదా! 'గుణాః పూజాస్థానం గుణిషు; నచ లింగం నచ వయః' గుణవంతులయందు గుణములే పూజింపదగినవి. వారి యాడుతనముకాదు మగతనముకాదు, పడుచుదనము కాదు, ముదుసలితనముకాదు సుమీ యని భవభూతి ప్రకటించినాడు. ఆంధ్రభాష నద్భుతరీతి నధ్యాత్మ రామాయణము రచించిన పరమభక్తుడగు సుబ్రహ్మణ్య కవి తన మనంబున నహంకార ముదయించిన నొక నాడు పరమేశ్వరుడు వృద్ధబ్రాహ్మణరూపమునవచ్చి వ్రాతప్రతి పుచ్చుకొని పోవుచున్నాడట. కవి, వెంట బడి నా పుస్తకము నా కిప్పించుమని వేడగా, నిది నీపుస్తకమేయైన నిందొకపంక్తి చెప్పుమనెనట! కవి యొక్కపంక్తియేని చెప్పలేక యది యీశ్వర దత్తమనియు, నీ బ్రాహ్మణుడు స్వస్వరూపము బోధించుటకు వచ్చిన శివుడనియు దెలిసికొనెనట!! త్యాగరాజును, గర్వపరిహారమునకై 'ఎందరో మహానుభావులు వారందరికి నావందనము'లని పాడియున్నాడు కాళిదాసుడును 'మందః కవియశః ప్రార్థీ' యనుకొన్నాడు. పోతరాజు 'పలికించెడువాఁడు రామభద్రుండట' యనిపల్కెను. "It speaks and I am the first audience" అని యమృతానందనాథస్వామి యాంగ్లమున నుచ్చరించెను. అది అనగా శబ్దబ్రహ్మ పలుకుచున్నది, మాటలాడు నేను, మొదటవినువాడనన్నారు. జీవయాత్రయంమను కవయిత్రి శ్రీవేంకటేశు నుద్దేశించుచు "బాలికవలె పలుకుచు నీ లీలలు విబుధాళి మెచ్చు లీలన్ నాలో। నాలింపుము నినునీవే। బాలేందు కలాప్తమిత్ర పరమపవిత్రా॥" స్వామీ, నీవే నాలో విబుధులు మెచ్చులీల బలుకుచు "సర్వం ఖల్విదం బ్రహ్మ" యగుట నీ మాటలు నీవే యాలింపుమనుచున్నది. అంతశ్శరీరమునకు మానవునకు నోరు బలుకు సాధనమైనట్లు, పరమేశ్వరున కింత జగత్తుండగా మహాకవుల ముఖములే తన స్వరూపబోధకు సాధనములు కాన సర్వదా భగవద్ధ్యాన పరవశులగు వారి వాక్కులు శాశ్వతములై నిల్చెను. మొల్లకవయిత్రియు, భగవంతుని నమ్మియే తత్సూక్తులే వ్రాసినది. వెంగమ్మయు తరికొండ నృసింహస్వామి పలికించినట్లు తాను పల్కుచున్నానన్నది. మతియొక్కచో "తచ్ఛృంగారోక్తులు తానె పల్కికొను సా శ్రీ కృష్ణు సేవించెదన్" అని వ్రాసుకొన్నది. ఆమె కవిత్వము సలక్షణమైనది. ధ్వనికేమి అలంకారములందేమి గుణములకేమి ఇతర కావ్యముల కేమాత్రమును తీసిపోవనిది. మచ్చునకు కొన్ని పద్యము లుదహరించెద.

కూరలు నోటికిన్ రుచులు
గూడుటదప్పెను దుంపదూడులం
గారముతోఁచె జిహ్వకును
గమ్మని తేనెలు చేదులయ్యెఁ గం
గారమెఁ జిత్తమంతయును
గంటికి నిద్ర రహింపదయ్యె శ్రం
గారమెలర్ప సీతఁ బొడ
గానమి రామనృపాల మౌళికిన్॥

పై పద్యమున మొల్లకవయిత్రి శ్రీరాముని విరహము నెంత స్వభావసిద్ధముగ వర్ణించినదో చూడుడు!

క॥ ఏ రమణిఁ జూచిన ధరణీ
నాయకు శ్రీపాదయుగము నాచిత్తములో
ఛాయదని విన్నవింపుము
వాయుతనూజుండ పుణ్యవంతుడ తెలియన్.

గంభీరభావగర్భితమగు నీ పద్యము మొల్లకవయిత్రి యొక్క సామర్థ్యమును చాటుచున్నది. ఎంతచెప్పినను తరుగనిభావము నామె యొక చిన్నపద్యమున నిముడ్చజాలినది.

రాజులు కాంతియందు రతిరాజులు రూపమునందు వాహినీ
రాజులు దానమందు మృగరాజులు విక్రమకేళి యందు గో
రాజులు భోగమందు దినరాజులు సంతతతేజమందు రా
రాజులు మానమందు నగరమ్మున రాజకుమారు లందఱున్.

యమకమున కిదియొక యుదాహరణము.

కమనీయ గాంభీర్య ఘనసముద్రులు గాని
యతులితభంగసంగతులు గారు.

విరోధాభాస కిదియొక యుదాహరణము.

కంటిన్ జానకిఁ బూర్ణచంద్రవదనన్ గల్యాణి నా లంకలో
గంటిన్ మీ పదపంకజంబులను నేఁ గౌతూహలం బొప్పగా
గంటిన్ మీ కరుణావలోకనము విఖ్యాతంబుగా గీర్తులం
గంటిన్ మాకపివీరబృందములలో గంభీర్య పాథోనిధీ.

హనుమంతుడు బ్రహ్మచారియయ్యు రాముని చిత్తవృత్తియందు గల యాందోళనము గ్రహించి తాను చూచివచ్చిన సంగతి చెప్పినచో రాముడు నిల్వ గల్గునని ముందు తాను కంటిని జానకినని చెప్పి అట్లు కన్గొనుటకు శ్రీరాముని పాదములే కారణమని నిరూపించి హనుమంతుని భక్తిని మొల్లకవయిత్రి వెల్లడిచేయుచున్నది.

సీ॥ నిడుదపున్నెలికేణి జడలుగా నవరించి
మలిన జీర్ణాంబరం బొలియగట్టి
భూమిరజంబు విభూతి పూతగబూని
తన దివ్యమూర్తి జిత్తమున నిల్పి
నిరశనస్థితితోడ నిలిచి, భూశయ్యను
బవళించి నిదురయేర్పడగ, విడిచి,
తారక బ్రహ్మ మంత్రంబుఁ బఠింపుచు
గఠిన రాక్షస దుర్మృగములలోన

తే॥ నహిత లంకా మహాద్వీపగహనసీమ
తపము సేయుచునున్నాను తన్నుగూర్చి
నాకు బ్రత్యక్షమగుమని నాథునకును
విన్నవింపుము సత్త్వ సంపన్న నీవు॥

భర్తనుగూర్చి యిట్టి తపస్సుచేయుగల శక్తి సీతాదుల కున్నందువలననే యోగులకు సిద్ధించు శాపానుగ్రహసామర్థ్యము వారలయందు గానవచ్చుచున్నదని మొల్లయాశయము.

### కనుపర్తి వరలక్ష్మమ్మగారి ఉపన్యాసము

ఆపల శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు మొల్లకవిత్వము గూర్చి విమర్శించుచు నుపన్యసించిరి.

సోదర సోదరీమణులారా!

నేటి యీ మహాసభ అనేకవిధములుగా ప్రాముఖ్యమైనదిగా ఉన్నది. ఆదికవయిత్రి మొల్లజయంతి కవితిలక కంచనపల్లి కనకమ్మగారు అధ్యక్షురాలు, శ్రీమతి చిల్కపాటి సీతాంబగారికి కంకణసత్కారము నెల్లూరుమండలంవారైన యీ మువ్వురి సన్మానసందర్భం చూచినట్లైతే అపూర్వవిషయముగానూ ముదావహము గానూ ఉన్నది. కాని యీ సభలో నేను ఉపన్యాస మివ్వడము తలుచుకుంటే మాత్రం భయావహంగా ఉన్నది. కనుకనే శ్రీ కేసరీగారు మొల్లవిషయమై నేను ఉపన్యాస మివ్వవలసిఉంటుందని తెలియబఱచి నప్పుడు నాకు యిట్లా అనిపించినది.

ఆదికవయిత్రి యౌ మొల్లమాంబకు
స్మారకజయంతి సలుపుటేడ
విదుషీమణియు మఱి విజ్ఞాననిధియునౌ
కనకాంబ యధ్యక్షకరణమేడ
కవయిత్రితిలకమై క్రాలెడిసీతాంబ
కంకణసత్కార ఘనతయేడ
పండితకవులకు బట్టుగునెల్లూరి
పురమున నీసభ జరుపుటేడ
అల్పమతినగు నేనేడ యట్టిసభను
మొల్లమాంబను గూర్చిన ముచ్చటేడ ?
అరయ నిటువంటిపని సేయు యత్నమెల్ల
తలకు మీఱినపనిగాదె తలపనాకు.

నిజమునకు యీపని కవులు, పండితులు, చారిత్రక పరిశోధకులు అయినవారు చేయవలసినది. కాని యీ అర్హతలలో ఒక్కటికూడ నాకులేదు. అయినను మొల్లయు నేను ఒక్క స్త్రీజాతికి చెందినవారము. ఆమెయందు భక్తియు, ఆమెకవిత్వమునందు ప్రేమయు నాకు అగ్గలము, కనుక నేను ఈవిషయము చెప్పుటకు సాహసించినాను. మొల్ల కాలనిర్ణయము చేయుటకు సరియైన ఆధారములు లేవు. ఆమె తిక్కనకాలపుదని కొందరు, కృష్ణదేవరాయలకాలపుదని కొందరు అభిప్రాయపడుచున్నారు. అయితే యీమె తిక్కన కాలపుదని చెప్పుటకు తిక్కన తరువాత రెండుశతాబ్దముల కీవలివారైన శ్రీనాథులను స్తుతించుచు ఆమె రామాయణములో వ్రాసినపద్యము అడ్డమువచ్చుచున్నది. కనుక యీమె తిక్కనకాలపుదిగాక రాయలకాలపుదని చెప్పుటయే కొంతవరకు సమంజసముగానున్నది.

ఆంధ్రకవయిత్రులలో ఈమొల్లయే మొట్టమొదటిది. ఈమెకు ముందు కవిత్వము చెప్పిన స్త్రీలెవరు యింతవరకు తెలియబడలేదు. ఈమె గ్రామము విషయమైకూడ సందేహములున్నవి పడుగుపాడని, గోపవరమని రెండుపేర్లు చెప్పుచున్నారు. కాని పడుగుపాడనుటకు తగిన ఆధారములు కాన్పించవు. ఈమె తనరామాయణములో “గోపవర శ్రీకంఠమల్లేశు వరముచేత నెఱికవిత్వంబుచెప్పగా నేర్చుకొంటి” నని చెప్పియున్నది. కావున ఈమెది గోపవరమనియే యెక్కువమంది అభిప్రాయపడుచున్నారు. మొత్తముమీద ఈ రెండుగ్రామములలో యేగ్రామమైనప్పటికీ ఈరెండు నెల్లూరుమండలములోనివే గనుక ఆదికవయిత్రిని గనిన అదృష్టము నెల్లూరుసీమకే దక్కినది. నాకుగాక నేనుగూడ ఈసీమ కవయిత్రులకు పాలముగానేయున్నది. అందుకు వేరేదృష్టాంతర మక్కరలేదు. నేటిసభకు అగ్రాసన మప్పగించినట్టియు. కంకణసత్కారమందుచున్నట్టియు కవయిత్రులేసాక్షి.

అయితే నేనొక నుసమాచారము విన్నాను. నేటి కనకాంబ అధ్యక్షోపన్యాసములో తమ జన్మస్థానము గుంటూరైనట్లు తమపెద్దలు పల్నాటి సీమలోని దాచేపల్లి మాచర్ల, గ్రామములలో నివసించినట్లును చెప్పియున్నారు. ఇంతేగాకుండ గుంటూరువారి యూరు. కనుక నేను ఈమెకు సయామ ఆడుబిడ్డను. ఈవిధంగా కనకమ్మగారు మా గుంటూరువారైనందులకు నాకు చాలా సంతోషముగానున్నది.

మొల్ల పేరువిషయమైగూడ చాలా సందేహము లున్నవి. మొల్లా, లేక మల్లియా అని ఈసందేహము. నాకుమాత్రము ఈమెపేరు మల్లిగాని మొల్లగాదని తోచుచున్నది. ఎందుకన్ననంటే మొల్లరామాయణములో తనతండ్రి శివభక్తిరతుడనియు, తాను మల్లేశ్వరుని వరముచేత కవిత్వముచెప్ప నేర్చుకున్నాననియు వ్రాసియున్నది. కనుక శివభక్తిరతుడైన ఆమెతండ్రి తమయిష్టదైవమైన మల్లేశ్వరస్వామి పేర తనకూమార్తకు మల్లిఅని నామకరణము చేసియుండును. గాని మొల్లయని చేసియుండరు. జనవాడుకమీద మల్లి మొల్లగా మారిపోయి ఉండవచ్చును. లేక ముద్దుచేతగూడా పేరుల కిట్టి తారుమారు సంభవించుట వింతవిషయము గాదు. మల్లమ్మ, మల్లయ్య, మల్లి, మల్లాయి, మల్లికార్జునుడు అనేపేర్లు ఆంధ్రదేశంలో అన్నివర్ణముల

వారిలో ముఖ్యముగా శూద్రులలో వాడుకలో ఉంటం అందరం యెరిగియున్నాము. ఈకవయిత్రి పేరు మల్లిగాని మొల్లగాదనే అభిప్రాయం నాకు చాలకాలమునుండి ఉన్నది. పూర్వమొకమారు యీ విషయమై నేను భారతిలో ఒకవ్యాసముగూడా వ్రాసిఉన్నాను. ఇంతేగాకుండా 'భారతవిదుషీయాం' అనే హిందీపుస్తకములో దక్షిణభారత విదుషీమణులనుగూర్చి వ్రాసినచరిత్రలలో మధురవాణి, మోహనాంగి, మల్లీ, అభయా, నాచీ, అనువారినిగూర్చి వ్రాసిఉన్నది. అందు మల్లీ, అనునామె చరిత్రలో ఈమె దక్షిణభారతదేశమున జన్మించి ఉండెవనియూ, ఈమె కుంభకార పుత్రిఅనియూ, ఈమె రామాయణమును విరచించెననియు వ్రాయబడిఉన్నది. ఇది చూడగానే ఈమెపేరు మల్లిగాని మొల్లగాదనే నా అభిప్రాయము ఈ పుస్తకమందైనను దృఢపడెనుగదా యని నాకు చాలా సంతోషముగలిగినది.

ఈ మొల్లవిషయమై కొన్ని అపవాదులున్నవి. ఈమె కృష్ణదేవరాయల ఉంపుడుగత్తె అనేది మొదటి అపవాదు. ఇది యెంతమాత్రము నమ్మదగిన విషయము గాదు. ఈమె తన రామాయణములో

"సల్లలిత ప్రతాపగుణసాగరుడై విలసిల్లి ధాత్రిపై
బల్లిదుఁడైన రామనరపాలకునిన్ స్తుతిచేయుజిహ్వకున్
చిల్లరరాజలోకమును చేకొనిమెచ్చగ నిచ్చవుట్టునే
అల్లముబెల్లముల్ దినుచు నప్పటికప్పటి కాసచేయునే.

అని రాజమాత్రు లందఱినీ తృణీకరించినది. ఈమె రాయల అధీనముననున్న స్త్రీ అయినచో యిట్లు తృణీకరించుటకు వీలులేదు. పైగా రాయలచే మిక్కిలిగా గౌరవింపబడుచున్న పెద్దనాది మహాకవులను ప్రస్తావింపకుండ నుండుటకును వీలుపడదు. కనుక ఈమె రాయలకు సమకాలికురాలైనప్పటికి ఈమెకును రాయలకును యేలాటి సంబంధమునులేదు.

ఈమె వారాంగన అని మఱియొక ప్రవాదముగలదు. నిజ మాలోచించిన యిదిగూడ నమ్మదగినవిషయవగాదనియే తోచును. మొల్ల తనరామాయములో

వారాంగన శ్రీరాముని
పేడి రాచిలుకఁబిలిచి పెంపువహించెన్
నేరుపుగల చందమ్మున
నారాముని వినుతిసేయ హర్షముగాదే.

అని వ్రాసియున్నది. ఒక వారవనితయే 'రామా అనేపేరుతో రామచిలుకను పిలిచి పెంపువహిం యుండ యిక రామాయణమే వ్రాసిన తాను ఎం సద్గతిపొందుననిగదా ఆ పద్యభావం. వారవనిత ఒ విధంగా తక్కువదనీ, ఆమె రామచిలుకను పిలుః కుంటేనే పెంపుపొందినదన్నప్పుడు ఆమె వారవని కాదని తప్పకుండా స్ఫురిస్తున్నది. ఆమె వారవని అయినట్లైతే అటువంటిపద్యము వ్రాసిఉండదు. ఇం గాకుండా యీమె తనతండ్రి

గురులింగ జంగమార్చన
పరుఁడును శివభక్తిరతుఁడు భాంధవహితుఁడున్
గురుఁ డాతుకూరి కేసయ
వరపుత్త్రిని మొల్లయనఁగ వరలినదానన్.

అని యెంతోగొప్పగా వ్రాసినది. వారవనితలకు వివాహపద్ధతి ఆనాడు లేదు గనుక తండ్రినిగూరి వ్రాయుటకు సాహసముండజాలదు. వేశ్యలకు తండ్రి యింటిపేరు తమయింటిపేరుగా చెప్పకొను ఆచారమ లేదు. తల్లియింటిపేరే వారికి యింటిపేరు. శివభ పరుడైన ఆతుకూరి కేసయశెట్టికొమార్తె వారాంగ యెంతమాత్రము కాజాలదు.

ఈమె తన రామాయణములో కొన్ని అసభ్యపదవ లతోగూడిన వర్ణనలకు చోటిచ్చినది కనుక ఆమె కులాంగనై యుండదని గూడా చెప్పబడుతున్నది కాని మొల్లయొక్క కాలమును మనమొకమారు స్మరిం నట్లైతే మొల్ల తనకావ్యములో యెంతఉచితము ప్రవర్తించినదో తెలియగలదు. కృష్ణదేవరాయ

కాలములో మొల్ల ఉన్నదని చెప్పుచున్నారు. ఆరోజు లెట్టివో మనకు తెలిసియేఉన్నది. పెద్దనాదిమహాకవులు శృంగారప్రబంధములు రచియించి పల్యంకికాది సన్మానములుపొందిన రోజులవి. ప్రతికవియు తన కవితా లతను శృంగారవృక్షమునకు ప్రాకించినగాని చక్కగా ఉండదని, రాజానుగ్రహముపొందదని, ప్రజాదరము బడయదని భ్రాంతితో శృంగారరసప్రబంధములు రచించుటకు పూనుకొనిన రోజులవి. అటువంటిరోజులలో ఉన్నమొల్ల తనకవిత్వమునకు శృంగారమును అవలంబనముచేసికొన భక్తిరసభరితమైన రామకథను కథావస్తువుగా తీసుకొన్నదన్నచో ఆమె స్త్రీత్వము నెంతగా పాటించినదో వేరేచెప్పవలసిన పనేమి. ఎక్కడో ఏమారుమూలపద్యములోనో ఒకటిరెండు చిన్నపదాలుతప్ప అశ్లీలవర్ణనలు మొల్లరామాయణములో లేనేలేవు. మొల్ల అత్తవారిప్రశంస తనకావ్యములో చేయకుండుటగూడ ఒకఆక్షేపణగా కొందరు చెప్పుచున్నారు. స్త్రీలు పుట్టినింటిగూర్చి నంతగా అత్తవారినిగూర్చికాని, భర్తనుగూర్చిగాని ప్రశంసింపకుండుట లోకసాధారణమైనసంగతి. అది స్త్రీలకు సహజమైన లజ్జాస్వభావంచేతగాని అత్తవారిని లాఘవపఱచే ఉద్దేశముచేత యెంతమాత్రముకాదు. సువాసినుల విషయములోనే యీవిషయ మిట్లాఉంటుంది. ఇక నామె లోకవాదుకప్రకారము బాలవితంతువే అయిఉన్నచో ఆమె అత్తవారిప్రశంస చేయకుండుటలో అనుచితమేలేదు. అందుకు వేరే దృష్టాంతమక్కరలేదు. ఈనాడు ఈ మహాసభకు అగ్రాసనాధిపత్యమువహించిన కనకమ్మగారి అత్తవారియింటిపేరు ద్రోణంరాజువారు. కాని ఈపేరు మీలో యెందరికి తెలుసు? కనుక మొల్ల అత్తవారిప్రశంస చేయనంతమాత్రమున ఆమె శంకించుట కేమాత్రము అవకాశము లేదు.

మల్లి భక్తురాలు. పోతనకువలె రాము డామెకు యిష్టదైవము. కనుక పోతనవలెనే రాజమాత్రుల తృణీకరించి రామునకు తన కావ్యము నంకితమిచ్చి ధన్యురాలైనది. కృతి యిచ్చుటలోనేగాక మల్లి పద్యరచనలో గూడ పోతననే అనుకరించినది. పరికించిచూచినట్లైతే పోతన భాగవతములోని పద్యములవంటి పద్యము లెన్నో మనము ఈమె రామాయణములో చూడగలము. మల్లి యేవిషయమునైనను కన్నులగట్టినట్లు వర్ణించుటలో కడునేర్పరి. చూడండి — సీతవర్ణనలలో ఆమె లేఖిని తూలికయై ఎట్లు చిత్రించినదో, ఆమె రూపమును.

పతిఁబాసినట్టి యాపదకంటెఁ బలుమారు
వివిధమాయలచేత వేఁగి వేఁగి
వీరదానవకోటి వికృతవేషంబులు
కనుఁగొని చిత్తంబు క్రాఁగిక్రాఁగి
తన దిక్కులేమికై తల్లడిల్లుచు నాత్మ
లోపల మిక్కిలి లోఁగిలోఁగి
కర్ణకఠోరంబుగా నాడు మాటలఁ
దొరగెడు కన్నీటఁ దోఁగిదోఁగి
రాముఁదలఁచుకొంచు రామునిఁ బేర్కొంచు
రామరామ యనుచు రమణిపలుకఁ
గపివరుండు చూచి కామినీరత్నంబు
సీత యనుచుఁ బొంగెఁ జిత్తమందు.
విడువవు నెత్తివేణి జడలుగా నవరించి
మలినజీర్ణాంబరం బొలియగట్టి
భూమీరజంబు విభూతి పూతగబూసి
తనదివ్యమూర్తి చిత్తమున నిలిపి
నిశ్చలస్థితితోడ నిలిచి భూశయ్యను
బవళించి నిదుర యేర్పడగ విడిచి
తారకబ్రహ్మమంత్రంబు బఠింపుచు
కఠిన రాక్షసదుర్మృగములలోన
నహితలంకామహాద్వీపగహనసీమ
తపము సేయుచునున్నాను తన్నుగూర్చి
నాకు ప్రత్యక్షమగుమని నాథునకును
విన్నవింపుము సత్వసంపన్న నీవు.

మల్లి రచించినకావ్యము చాలాచిన్నది. అయినప్పటికి ఒక చిన్నపువ్వులో రంగు, అందము, సౌకుమార్యము, పరిమళము, మకరందము, అన్నీ పొందింపబడియున్నట్లుగా కావ్యలక్షణములన్నీ పొందింపబడిఉన్నవి. ఈమెకావ్యములో లక్షణదోషా లున్నట్లుగా చెప్పుదురు. కాని యీ ఆక్షేపణ ప్రతికావ్యానికి ఉంటూనే ఉన్నది. దానిమాటకేమి? మొత్తముమీద ఈమె రామాయణము చాలా ప్రశస్తమైనది. సందేహములేదు. ఈ కవయిత్రి జన్మించి నన్నూరేండ్లైనది. ఆమె కోరిఉన్నచో యే రాజమార్తాండుడో ఆమెను సన్మానించియుండును. ఆ విరాగినికి, ఆ తపస్వినికి, అట్టికోర్కె లేదు కనుకనే రాముని కంకితమిచ్చినది. ఆమెను సన్మానించుట ఆమెకక్కరలేదు మనకు కావలయును. మానవజీవితో త్తేజమునకు ఇట్టిమహనీయుల సంస్మరణము ఆవశ్యకము. వీరులు, భక్తులు, కవులు మున్నగువారి ఆరాధనము మనదేశములోనే గాక ప్రతిదేశములోను ఆచారముగా నున్నది.

మనదేశములో గూడా పురుషులలో కవిపండితులైనవారు అనాదినుండీ సత్కరింపబడుచునే ఉన్నారు కాని స్త్రీలను సన్మానించుట మాత్రము ఆంధ్రదేశచరిత్రలో నవీనవిషయము. ఇట్టిమహత్తర కార్యమును నిర్వహించుటకు, శ్రీయుత డాక్టరు కె. యస్. కేసరిగారును, వర్ధమానసమాజమువారును పూనుకొనుట యెంతయు సంతోషకరముగా నున్నది. ఈ మహాసత్కారమును బడయబోవుచున్న శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు ఆయురారోగ్యములు గల్గి సౌభాగ్యవతియై చిరకాలము వర్ధిల్లి ఇతోధికగ్రంథములు వ్రాయుగాక యని కోరుచున్నాను.

ఎల్లరు చెప్పుకొనుచున్న వేగాని క్రొత్తవిషయము లేమియూ నేను మొల్లనుగూర్చి చెప్పకపోయినను మీరెల్లరు సావధానముగా వినినందులకు నామనః పూర్వక వందనము లర్పిస్తూ యింతటితో ఈ ఉపన్యాసము ముగిస్తున్నాను.

పై ఉపన్యాసము ముగిసిన తర్వాత శ్రీయుత మోచర్ల రామకృష్ణయ్యగా రుపన్యసించిరి. ఆ ఉపన్యాససారాంశము నిట దెల్పుచున్నాము.

శబ్దశాసనుఁడు నన్నయభట్టారకుఁడు 'విశ్వశ్రేయః కావ్యమ్' అని వచించినాఁడు. కావ్యము లోకకల్యాణమునకుఁ బ్రయోజనకరమగుటచే సత్కవులు సర్వకాలములయందును సకలదేశములయందును బరమపూజ్యులు.

'జననాథాగ్రణి యాత్మరాజ్యమున నిచ్చల్
పూజ్యుఁ; డాసీమఁబా
సినఁ దా గవ్వయుఁజేయఁ; దన్నికడలన్
శ్రేష్ఠుండువిద్వాంసుఁ డా
యనకన్నం గవి మేటియా 'సుకవితా
యద్యస్తిరాజ్యేనకిం'
మ్మనువాక్యంబు నిజంబు; దీనిఁగని
కావ్యంబుల్ రచింపందగున్.

అని అప్పకవి చెప్పియున్నాడు. శ్రమకోర్చి పాండితిని గడింపవచ్చును. సర్వశాస్త్రపారంగతుఁడు కావచ్చును. కవియగుట దుష్కరము. ఒకఁడు పాండితీధురీణుఁడు కాకపోవచ్చును. సరసకవితావిశారదుఁడుగా నుండవచ్చును. ప్రతిభాషయందును పండితులుకాని కవులెందరో కలరు. పండితులై కవులుకావలెనని విశ్వప్రయత్నములుసలిపి భంగపడినవారునుగలరు. బమ్మెర పోతరాజు భక్తిపారవశ్యమునఁ దెనుఁగుభాగవతము రచించి యమృత కవితాలహరిని వెదఁజల్లి తన జననమును చరితార్థముం గావించిన భక్తాగ్రగణ్యుఁడు. మొల్లయు

కం॥ నేరిచిపొగడినవానికి నేరక కొనియాడువారి
నిజకృప మనుపన్
గారణమగుట కుభక్తియె కారణమగుగాని
చదువు కారణమగునే॥

అనినది. పూర్వకవు లనేకులు రఘురామచరిత్రములు

రచించియుండినను 'భూజన కల్పకంబగుచు భుక్తికి ముక్తికి మూలమైన యా రాజును దైవమైన రఘురాము నుతించినఁ దప్పకల్గునే' యని రామాయణమునకు మొల్ల యుపక్రమించినది.

మొల్ల తెల్గుకవనంపుమర్యాదలు చక్కఁగా నెఱింగిన కవయిత్రి. తెలుఁగు తేటమాటలపై నీయమ కభిమానము మెండు. సంస్కృతమునరచియింపఁబడిన కృతులఁ దెనుఁగు సేయుచోఁ గమ్మని తెనుగుంబల్కుల గూర్చుటయే యీయమ యభిమతము

"మును సంస్కృతముల దేటగఁ । దెనిగించెడిచోట
నేమి తెలియకయుండన్
దనవిద్య మెఱయఁ గ్రమ్మఱ । ఘనముగ సంస్కృతము
జెప్పఁగా రుచియగునే ?"

"కందువమాటలు సామెత । లందముగాఁ గూర్చి
చెప్పినది తెలుఁగునకుం
బొందై రుచియై వీనుల । విందై మఱి కానుపించు
విబుధులమదికిన్ ॥"

కనకమృగమును శ్రీరాముడు వెంబడించి చనుచో నది కావించిన చిత్రచర్యను మొల్ల యిట్లు వర్ణించినది.

సీ॥ తనుబట్టనొయ్యన వెనుకొనిచనుదెంచు
నిలఁజేరి తలఁపుఁ దాఁదెలిసి తెలిసి
చేరువ మెలఁగుచుఁ బూరిమేయుచుడాసి
మెల్లన నంతంత మెలఁగి మెలఁగి
తననీడఁగనుఁగొని తానె దిగ్గనదాటి
భయమునఁబరువెత్తి పఱచిపఱచి
యెడదవ్వునఁబోవక యొలయించి కనుఁగొన్న
దరువులనొయ్యన నొరసియొరసి.

గీ॥ చెవులు నిక్కించిచూచుచుఁ జెలఁగిచెలఁగి
పోవ రాముండు దవ్వుగాఁ బోయిపోయి
యొలమి మాయామృగంబని యొఱఁగి మదిని
దీనిఁజంపుదు గాకని తెగువచేసి.

చూడుఁడీ పద్యమెంత స్వభావసిద్ధమై సరళమై మార్దవమంజులమైయున్నదో! ఈ ఘట్టముననే యితరులు రచించిన పద్యములం జూడుఁడు.

డాయంబోయినఁ జిమ్ముఁ గొమ్ములఁ బ్రచండ
స్ఫూర్తిలంఘించు నే
చాయం జూచినఁ దోఁచుఁ గ్రొమ్మెఱుఁగు నోజన్
మచ్చికన్ నిచ్చరా
మేయుం బచ్చిక; మచ్చికం గదిసినన్ మించున్
దనుంబట్టఁబో
వాయుం బిట్టలయించు దొదిగుచు నప్పాటన్
మృగం బీగతిన్.
పఱచున్ దవ్వుగఁ జేయనంతనిలచున్ బట్టీకయాసా
పలం
బిఱువోవుం బొదలందుడిందుఁ బొడముంబిట్టుల్కి
వేదాఁటుఁ గ్ర
మ్మఱిచూచుం, జెవిదార్చినిల్చుమలయున్ మట్టాడుఁ
గోరాడునే
మఱినట్లుండుఁ దృణంబు మేయు వలయున్ మాయా
మృగంబిమ్ములన్.

మొల్ల కవిత్వమున సమతయనుగుణ మెల్లెడలం గానవచ్చును. సరళములగు శబ్దములచే విరాజిల్లుచు నడక తప్పక యీమె కవిత్వము మధురమై రసవంతమై యుండును. ఎంత పరిశీలించిచూచినను సామాన్యముగా నీమె కవిత్వమున నపుష్టార్థకములు అనర్థకములు కానరావు.

ఈ కవయిత్రి కాలమును నిర్ణయించుటకు సరియైన ఆధారములు లేవు. పుక్కిటిపురాణములు కొన్నింటి వలన ఈమె తిక్కన సోమయాజి కాలములో నుండిన దనియు మనముచేయు సిద్ధాంతములు నిష్ప్రయోజనములు నిరాధారములు. 1447 వ సంవత్సరమున బొంబాయిలో నచ్చొత్తింపబడి ప్రకటింపఁబడిన Biographical sketches of the Deccan Poets అను ఆంగ్లగ్రంథములలో పండిత్ సి. వెంకటరామస్వామి అనువారు వ్రాయుటలో మొల్ల శ్రీకృష్ణదేవరాయల



శ్రీమతి వి. ఇజాల్స్. బర్మాదేశీయురాలు
వాయువిమానముల నడపుటయందు ప్రథమురాలు.

కాలమున నుండినదని చెప్పియున్నారు. కాని ఆరచనకు సైత మేమియు నాధారము నుదాహరించియుండ లేదు. మొల్లరామాయణములో శ్రీనాథుని ప్రశంసించియున్నందున ఆకవీశుని కేవల నీకవయిత్రి జీవించియుండవలయునని చేయు ఊహ సైతము ఊహామాత్ర మే కాని వేరుకాదు.

ఈమె నివాస్థానము గోపవరమని గ్రంథమునందలి "గోపవరపు శ్రీకంఠ మల్లేశువరము చేత నెఱి గవిత్వంబు చెప్పగా నేర్చికొంటి" అను వాక్యములచేఁ దెలియవచ్చుచున్నది. ఈ గోపవరము ఆత్మకూరు తాలూకాలో కలువాయికి సమీపమునయున్నది. చిన గోపరమనియు పెదగోపరమనియు రెండుగ్రామము లాత్మకూరి తాలూకాలోనున్నవి.

కవితా కళాప్రశస్తింగాంచిన తెలుగు వెలందులలో మొల్లయే మొదటిదని చెప్పుటలో నతిశయోక్తి యేమియునులేదు. తంజాపురం రాజధానిగాఁ పరిపాలించిన ఆంధ్రనాయకుల చరిత్రముం దిలకించినచో పదునారవ శతాబ్దిలోఁబలువురు స్త్రీలు గ్రంథముల రచించివాసింగాంచినట్లు దెలియవచ్చుచున్నది. వారిలో తిరుమలాంబయను సీమంతిని 'వరదాంబికాపరిణయము'ను రంగాజన్మయను రమణి మన్నారుదాస విలాసము. ఉషాపరిణయము అను రెండుకృతులను, రామభద్రాంబయను విదుషీమణి రఘునాథాభ్యుదయమను ద్విపద నాటకమును, రచించి విఖ్యాతి నార్జించినట్లు స్పష్టమగుచున్నది.

రామాయణమువంటి ప్రశస్త గ్రంథము రచించి యశము గడించిన మొల్ల మన మండలమున వర్ధిల్లియుండుట మనకు గర్వకారణము. అట్టి యీ మండలమున శ్రీమతి చిల్కపాటి సీతాంబ, కవితిలక కంచనపల్లి కనకాంబగార్లు ఈనాఁడు సుప్రసిద్ధకృతులవ్రాసి ఆంధ్రవాగ్దేవి కలంకారములం గూర్చుచున్నారు. ఇట్లే సింహపుర మండలములో స్త్రీ విద్యావిభవము పెంపొందుగాక.

## శ్రీమతి చివుకుల వెంకటసుబ్బమ్మగారి ఉపన్యాసము

ఆవల శ్రీమతి చివుకుల వెంకటసుబ్బమ్మగారించుకసేపు ప్రసంగించి ప్రాచీన కవయిత్రుల ప్రతిభావిశేషముల స్మరించుట అవసరమేయైనను అంతటితో తృప్తిజెందక తలిదండ్రులు తమబాలికలను పాఠశాలలకుబంపి విద్యావంతురాండ్రుగ జేసి యిప్పటివారుకూడ కవయిత్రులగుటకు మనము యత్నింపవలెనని హెచ్చరించిరి.

ఆవల డాక్టర్ కే. యస్. కేసరిగారు గృహలక్ష్మి స్వర్ణకంకణమును శ్రీమతి చిల్కపాటి సీతాంబగారి కొసగుటకై అధ్యక్షురాలియొద్ద స్వర్ణకంకణము నొసగుటకు పూర్వ మిట్లుపన్యసించిరి.

సోదర సోదరీమణులారా!

శ్రీ సింహపురీనగరము పినాకినీ నదీతీరస్థము. ఇది యనాదినుండియు నాంధ్రసాహిత్య సంపదను పెంపొందించుటయందు వాసిగాంచినది. ప్రాచీనపంచమామ్నాయమందు ప్రధాన భాగంబులను తేటతెనుఁగున తెనిగించి ఆంధ్రజనుల డెందంబులకు విందొనరించినాడు తిక్కనార్యుఁడు. ఆధునిక ప్రపంచ సాహిత్యమునందలి పలు పోకడల గుర్తించి వాని నాంధ్రమున జిత్రించి కీర్తిశేషుడైనాడు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి. వీరిరువురకు నడుమ నెందరు పండితులీ మండలము నుండి తెలుగుభాష కట్టి జిలుగులు దిద్దిరో మనము చూచుచున్నాము.

ఇట్టి సింహపురి మండలమున నుద్భవమంది పినాకినీ తీర నివాసినియై క్షీరములబోలు తన్నీరములు గ్రోల్చి, ప్రాచీన నవీన సంస్కృతాంధ్ర పండిత కవివరుల సాహిత్యసారముల నెల్ల తోరముగ నాని "శ్రీ మదనగోపాల వరప్రసాదాసాదిత" మృదు మధుర కవితా పరిపాక విశారదయై శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు నేడును యీ మండలమున కవిరాణియై రాణించుచున్నారు.

# గృహలక్ష్మి

పండిత ప్రకాండులు మొదలు బడులలోని బాల బాలికలవఱకు నుల్లము పల్లవింపజేయు సులభ సుందర రామాయణమును రచించినది శ్రీమతి మొల్ల. జీవయాత్ర హంసవింశతియాద్యనేకాధ్యాత్మిక గ్రంథముల రచించుచు నేటి పండిత పామర ప్రపంచమునెల్ల రంజింపజేయుచున్నవారు శ్రీమతి కంచనపల్లి కనకమ్మ గారు. నిరుపమాన దేశసేవాపరాయణులై యనేక సుందర కథా గీతముల పత్రికలందెల్ల ప్రకటించుచు పాఠక లోకముయొక్క యుల్లములనెల్ల కొల్లగొనుచున్న శ్రీమతి పొణకా కనకమ్మగారు మొదలగు విదుషీమణుల నెందరినో గాంచి యీ మండలము ధన్యత నొందుచున్నది.

తిక్కన వేంకటరాయశాస్త్రి మొదలగువారి జయంతులను ప్రతిసంవత్సరము నాచరించి యీపుర మితరనగరముల కాదర్శప్రాయమగుచున్నది. ఈ సంవత్సరమున మొల్ల జయంతిగూడ ప్రారంభమైనందుల కిట్టిమరిడలమే ధన్యము. ఇట్టి కవివరులను స్మరియించువారును జీవత్కవయిత్రులను సత్కరించువారును నొనరించిన పుణ్యమే పుణ్యము.

ఈ సంవత్సరమున నీమొల్ల జయంత్యుత్సవసందర్భమున శ్రీమతి చిల్కపాటి సీతాంబగారిని సత్కరించు భాగ్యము నాకబ్బినందులకు నేను పరమానందము నొందుచున్నాను. సీతాంబగారి పేరు విననివారు ఆధునికాంధ్రసాహిత్యపరిచిత లోకమునను, పత్రికాపాఠక లోకముననుగూడ నరుదు. ఈమె కల్పన లగాధములు; భావములు మనోజ్ఞములు; కథావస్తువు లానందదాయకములు; అందలి పాత్రములు దివ్యములు. ఈమె పద్యములనుగాని, కావ్యములనుగాని, కథలనుగాని చదువబూనుకొనినవారు వానిసారమును పూర్ణముగ గ్రోలినను వానిని విడువనొల్లరు.

ఈమె కాదాచిత్కపద్యములు, పద్మినీపరిణయము మొదలగు కావ్యములను పఠించినవారి కిట్టి కవయిత్రులు ఆంధ్రమున నరుదుగా నున్నారని విశదము గాకమానదు. ఇట్టి కవిత్వము కేవలాభ్యాసమాత్ర లభ్యము గాదు. పూర్వ పుణ్యపరిపాకమున గాని యది లభింపనేరదు.

మా 'గృహలక్ష్మి' పుట్టిననాటనుండియు యీమె తన యపూర్వ సుందరరచనలతో దాని నలంకరించుచున్నారు. ఈమె చిన్నారిపద్దము లా బాలకు సిందూరతిలకములు! ఇట్టి యిల్లాండ్రు మా గృహలక్ష్మి కొసంగుచున్న కానుకల ఋణములను మాగృహలక్ష్మి యెన్నడును తీర్చుకొననేరదు.

అమ్మా! సీతాంబగారూ, నేను కేవల కృతజ్ఞతా సూచకముగ నర్పించు యీ స్వల్పబహుమానమగు నీ స్వర్ణకంకణమును స్వీకరించి నన్నానందింప జేయగోరుచున్నాను. మరియు మీరు రచించిన అరవిందయను సుందరమగు నవల నచ్చొత్తించి 500 ప్రతులనుగూడ కానుకగ నర్పించుచున్నాను. నమస్కార పూర్వకముగ నొసంగు యీ కానుకల నంగీకరింపవలయునని ప్రార్థించుచున్నాను.

భారత సాంప్రదాయప్రకారము ప్రతినారీమణి కొసంగు నమస్కారమునందును ఆమె భర్త భాగస్వామి యగుచున్నాడు. ఈమె భర్తగారగు శ్రీమాన్ వేంకటనరసింహాచార్యులువారు పండితులై యీమె పాండిత్యమునకు దోహదమొనరించినారు. నాధుడే గాక గురునాధుడుగూడ నైనాడు. వారి పరిపూర్ణ కటాక్షములేనిచో నాంధ్రదేశమునకు శ్రీ సీతాంబగారి యనంతరచనాసౌందర్యము గ్రోలు నవకాశమే యుండెడిదిగాదు కనుక శ్రీమాన్ వారికి నాప్రత్యేక నమస్కారములు జెప్పుచున్నాను. శ్రీరంగనాధుడు మిమ్ముల బ్రోచుగాత !!

## సీతాంబగారికి స్వర్ణకంకణ ప్రదానము

ఆవల గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానమునకు ముందు అధ్యక్షురాలగు శ్రీమతి కంచనపల్లి కనకాంబగారు ఆశువుగా నీ క్రిందిపద్యమును, అనగా

గీ॥ పలుకుఁదొయ్యాలి ముంజేతి చిలుకపాటి
సీతమాంబకు లక్ష్మియిచ్చె వలయుంబు
కరము మాటాడుటరుదు కంకణము నిడునె
యత్త, కోడలిదానిపై నాదరమున.

అనినదివి, ఆవల శ్రీమతి సీతాంబగారి కంఠమున పుష్పమాలనువైచి, ఆమెహస్తమున స్వర్ణకంకణమును దొడగిరి.

## శ్రీమతి చిల్కపాటి సీతాంబగారి ఉపన్యాసము

సోదరీమణులారా, ఆర్యులారా!

ఈ నాడిట్టి మహోత్కృష్టసన్మానము నీ మహాసభయందు అల్పజ్ఞురాలనగు నాకొసంగి మన్నించుట యీనెల్లూరి పురప్రముఖులకును వర్ధమానసమాజమువారికిని శ్రీ కేసరిమహాశయులకును ఆంధ్రసోదరీజనముపైగల ఆదరాతిశయోపలక్షణమేగాని నాయందు గణింపదగిన యతిశయమేమియు లేదని విజ్ఞాపన. గురుజనానుమతిచే యథోచితవిద్యలంబడసి తదాశీర్వాదములచే నేడిట్టి పూజ్యుల మన్ననలందగంటి. అట్టి గురుజనంబులకు నా నమస్కార శతంబులు. మఱియు నిగ్రహానుగ్రహదక్షుండగు శ్రీ పరమేశ్వరుని యనుగ్రహమే నేడీ మహాశయుల మన్ననగా పరిణమించినయది. కానిచో నీ యార్యుల సమ్ముఖమేడ రేమియు యెఱుంగని నేనేడ.

మహానుభావుండగు తిక్కయజ్వ శ్రీమదాంధ్ర మహాభారతమును యీ పురవరంబుననే విరచించి తెల్గుసీమకు వన్నెగూర్చిన తరువాత నెందరెందరో కవిపుంగవు లీ సీమనే యవతరించి యీమండలమునకు మండనాయమానులై యఖండయశం బార్జించి యున్నారు.

ఆదికవయిత్రి మొల్లమాంబ యీమండలంబుననే తేటతెలుంగున శ్రీమద్రామాయణము నాంధ్రీకరించి యాంధ్రసరస్వతి నలరించి యాంధ్రనారీమండలములో తొలుదొల్త సారస్వతపీఠ మలంకరించినయది. తరువాత నాంధ్రసోదరీమణు లెందరో యెన్నెన్నియో గ్రంథముల విరచించి పురుషులతోబాటు భాషాసేవ గావించిరి.

నేటికిని యీమండలమున కా వాసి కొరవోకుండ శ్రీమతి విద్వాన్ కంచనపల్లి కనకాంబగారు అనేక గ్రంథములవిరచించి యెనలేని విఖ్యాతినందియున్నారు. ఇంకను యిట్టి విదుషీరత్నముల కెందరికో యీసీమ పుట్టినిల్లైయున్నది. గుణగ్రహణపారీణులగు నీ పురప్రముఖులు దేశక్షేమాభిలాషులై భాషాసేవకై తమతోబాటు స్త్రీవిద్యాభ్యున్నతికై కంకణబద్ధులై పూర్వకవయిత్రుల జయంతులనొనర్చి నేటి వనితాలోకమునకు గూడ భాషాసేవ దేశసేవల విషయమున నుత్సాహముగల్గించుట కవిపండితస్థానమగు నీనెల్లూరి గొప్పవారికి పెట్టని భూషణమైయున్నది.

అదియటుండ యీపురప్రముఖులును అఖిలభారత నారీసోదరులగు శ్రీ కేసరిమహాశయులును మహోదారులగుటనే వచ్చియరాని యవ్యక్తములగు నా రచనల నొక గొప్పజేసి విశాలమగు నీ యాంధ్రావనియందు వెలయింపబూనిరి. ఇంకను దేశసేవాపరాయణలును విద్యాశోభితలును వ్యాసరచనాధురీణలును అనేక శేముషీవిభూషితలును నగు విదుషీమణులెందరో యీ పురవరంబున నలంకారభూతులైయున్నారు.

వీరిలో నన్నొకరితనుగాజేర్చి యిట్టి సత్కారమొసంగి మన్నించుటచే యీపట్టణ మహిళాసంఘంబునకును యీ నెల్లూరిగొప్పవారికిని నాయందుగల సౌహార్ద్రమునకు గుఱుతని వీరి యానతిచొప్పున నీ సన్మానము ననేకవందనములతోనంద సాహసించితిని. యీ సన్మానమునంగీకొన నేతగినదాననను తలంపున గాదు. ముద్రణాదికవ్యయములకు శక్తిలేమి యొక మూలనైచిననా రచనలంగాంచి విచారించుచుండుతఱి,

అకబోయిన తీర్థమెదురైనవిధమున, కవిత వ్రాయ నేర్చిన కాంతలేయున్న సమాదరభావమున వెలయించి మన్నించు తలంపుగలమహాశయులు కంకణబద్ధులై యుండుట, చిన్నిగృహలక్ష్మి సన్నసన్నల నుద్బోధించినయది.

తదాది నా నేర్చిన కొలదికొలది వ్యాసకుసుమము లచేనపుడపుడు గృహలక్ష్మిం బూజించుచు నత్యుత్సుకత నవనవారవింద సౌరభవిలసదుపమిత భావోల్లసిత యగు నరవిందయను చిన్ననవలను విరచించి గృహలక్ష్మి సదనమున సమర్పించితి. తోడనే కవితాకాంతా కల్పభూజహమగు శ్రీ కేసరిమహాశయు లాపాత్తముం బరికించి సమాదరమున నభ్యర్చించి యొసంగుచు యీ పురవరంబున కవిపండితస్థానమగు నీయలఘుభూమిని యీ విద్వత్సభాముఖంబున ఆంధ్రకవయిత్రి యగు శ్రీ మొల్లజయంత్యుత్సవసందర్భమున అమూల్య సువర్ణప్రదానాది సత్కారములర్పించి మన్నించుటచే యీ కవిత సార్థకమయ్యె.

ఇటులే వీరింకను శ్రీ విద్యాభ్యున్నతికై సేయు సత్ప్రయత్నములు సఫలీకృతములగుచుండ వీరి కీర్తి యను కల్పలత శ్రీ గృహలక్ష్మి వరప్రసాదలబ్ధామృత పరిషిక్తయై ఖండఖండాంతరంబుల నలముకొని స్త్రీ లోకము నుద్ధరించుగాక.

ఆంధ్రభాషాభిమానులును స్త్రీ విద్యావిధానాభిలాషులును సిద్ధసంకల్పులునునగు శ్రీ కేసరిమహాశయులు చిరాయురారోగ్యైశ్వర్యశోభితులై శ్రీ పరమేశ్వరానుగ్రహమున వర్ధిల్లుదురు గాక. ఈయెడ శ్రీ కేసరి గారి ఘనప్రయత్నములకుందోడ్పడి నాయెడ నవ్యాజ సౌహార్దముంబాటించి మన్నించిన నెల్లూరు కవయిత్రి శ్రీమతి కవితిలక కాంచనపల్లి కనకాంబగారికి నా కృతజ్ఞతానేక నమస్కారములు. ఘనకార్యాచరణచణులును మహోదారులునగు శ్రీ వర్ధమాన సమాజమువారికిని, విబుధులగు తక్కుంగల నెల్లూరి పురప్రముఖులకును, ప్రశంసాభినందనము లర్పించి వీడుకొనిరెద.

జయమగు శ్రీవరలక్ష్మికి జయమగు శారదకు నాంధ్ర
సారస్వతముల్
గయి సేయు కనకమాంబకు జయమగు గృహలక్ష్మి కెపుడు
జయమైయలరుల్
శ్రీయును నామయమునుదీర్ఘాయువు చిరకీర్తివాంఛి
తార్థంబులు శ్రీ
కేయల్ కేసరిఘనునకు బాయక సర్వేశుడొసగి
పాలించుగృపన్.
చిన్నిగృహలక్ష్మి కరుణావిశేషగరిమ అఖిలభారత
నారీజనాళి కలిమి
ఘనతరైశ్వర్యములొసంగి మనుపుమనుచు
చేతులనుమోడ్చివినుతింతు సీతమాంబ॥

## గానము, నాట్యము

శ్రీమాన్ వేదాంతాచార్యులవారి కుమారితలు గానము నాట్యము ఇంచుక సేపుచేసి సభ్యుల నానందపఱచిరి.

## సీతాంబగారింగూర్చి పద్యములు

గృహలక్ష్మి పత్రమున శ్రీయుత పసుమర్తి కృష్ణమూర్తిగారు రచియించిన యీ క్రిందిపద్యములను వారే చదివిరి.

శ్రీ సీతారఘురామచంద్రులు, దయాసింధుల్,
జగద్బాంధవుల్ ।
మా సీతాంబకుం జిల్కపాటి కుల పద్మాదేవి
కారోగ్యను ।
శ్రీ సౌభాగ్యము లేంపుమీరంగం జిరంజీవిత్వమున్
సత్యవి ।
ద్యాసౌరభ్యమొసంగి లోకమును నిత్యశ్రీకముం
జేయుతన్॥
సీతానామము సార్థకంబగుచు వాసింగాంచె
నీయంబుం ద ।
ల్లీ, తథ్యంబిది! కన్నవారలును పెండ్లింగొన్నవా
రెంతవా ।

శా॥ తామిట్టి యలౌకికంబయిన సద్యోగంబుచే నిత్యము।
ప్రీతింబొందిలసద్యశోధనికులై పెంపొందగా ధాత్రిలో॥

అక్కా, చక్కటి దప్పచెప్పుదును; విద్యాదేవివే కాని యా
ఫక్కిం దక్కితివీవు; బావయెడ నీభక్తిప్రభావంబు మి
న్నెక్కెన్; దక్కిన యిద్దరమ్మలకు నీవే యుద్దివై యున్న నా
నిక్కల్ నీల్గులు మాత్ర మొల్ల వెపుడేనిన్: జాలదే జన్మకున్.

కవితారాజ్య రమావిభూతులకు భాగస్వామినుల్ కొద్దిమం
ది; విశిష్టాఖ్యలు మొల్లమాదులంట. ధాత్రిన్ వారలంబోలుభా
గవతీరత్నమవీవటం చిచటి రంగస్వామియే సాక్షియై
వివరించెన్ బలుమారు లోకమున సాధ్వీరత్నముల్ మేలనన్.

గృహలక్ష్మిం గనినట్టి యార్యుడు, సుధీగేయుండు పేర్మిగ శుభా
వహమా దివ్య సభాసమక్షమునఁ గ్గాయత్రీ సమారాధనా
మహితుండైయిడు కంకణంబిదియె కొమ్మా సోదరీ చూడు నీ
సహజాతల్ ముదమొందినారు విరిసేసల్ సల్లుచున్నారదో.

## అధ్యక్షురాలి ఉపసంహారోపన్యాసము

అధ్యక్షురాలు కార్యక్రమమును ముగించుచు, వివిధోపన్యాసకులు నిర్దిష్టవిషయములను నిపుణముగా నుపన్యసించిరనియు, నెల్లూరువారు తమయందు జూపిన గౌరవమునకు కృతజ్ఞతాపూర్వకవందనము లాచరించుచున్నాననియు, నాటియుదయమున సింహపురి ప్రముఖులలో నొకరును భాషాభిమానులునగు శ్రీయుత తూములూరు శివరామయ్యపంతులుగారు స్వగృహమున కుటుంబబంధుమిత్రుల సమక్షమున తనకు నూటపదియారు రూప్యములనొసగి గౌరవించిరనియు చెప్పిరి. బ్రహ్మశ్రీ దుర్భాసుబ్రహ్మణ్యశర్మగారు కనకమ్మగారిని బాల్యమునుండియు కవిత్వమును చక్కబఱచి ప్రోత్సహించిన కారణమునకు వారికి కృతజ్ఞతను దెల్పుకొనిరి.

## వందనములు, తాంబూలసమర్పణము

ఆవల బ్రహ్మశ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు అధ్యక్షురాలికిని ఉపన్యాసకులకు, డాక్టర్ కేసరి గారికి, సభ్యులకు యథోచితవాక్యములతో వందనము లర్పించిరి. తాంబూలము, పండ్లు, పుష్పములు సభ్యులకందరికి పంచిపెట్టబడెను. శ్రీయుత దంటు సుబ్బావధానులవారి మంగళస్తవముతో కార్యక్రమము మిక్కిలి జయప్రదముగ పూర్తియైనది.

మీ భవిష్యత్తును

# ది డెక్కన్ అస్యూరెన్సు కంపెనీ,

(లిమిటెడ్) నందు

## భీమా చేసికొనుడు

ప్రీమియములు స్వల్పములు

పద్ధతులు ఆకర్షణీయములు, నవీనములు

పోల్చరాని ఎందునులేని సౌకర్యములు

బోర్డు అధ్యక్షులు

శ్రీరాజా నాయని వేంకటరంగారావు బహద్దూరు, మునగాల జమీందారు

స్త్రీల అడ్వైజరీబోర్డు

శ్రీమతులు డా. ముత్తులక్ష్మిరెడ్డి, ఆచంట రుక్మిణిలక్ష్మీపతి,

అమ్ముస్వామినాధనుగార్లు

అన్నిచోట్ల విద్యావతులగు స్త్రీలు తమ కాలమును వృథాపుచ్చక మా కంపెనీఏజన్సీతీసుకుని పనిచేసిన స్వలాభమును పొందుటేగాక ప్రజలకు అందు ముఖ్యముగా స్త్రీలకు ఎక్కుడులాభమును చేకూర్చినవారగుదురు. సంకోచింపక కృతనిశ్చయులై నేడే యికార్యసాధనోపాయముల నరయుటకు మాకు వ్రాయుడు.

ఆంధ్రుల సౌకర్యమునకై ఉత్తర ప్రత్యుత్తరములు తెలుగుభాషయందుకూడ జరుపబడును.

బ్రాంచిఆఫీసులు:—
మద్రాసు,
బెంగుళూరు, హైదరాబాదు (డక్కన్)

హెడ్డాఫీసు:—
మునగాలభవనము
బెజవాడ

# ఉష

పసుమర్తి కృష్ణమూర్తిగారు

[చూడండీ, వేడుకసమయములందు బాలబాలికలు చేరి యొకగంటకాలము వినోదింపవచ్చుననుకొని వ్రాసిన దీ యేకాంకము. కథ అందఱెఱిగినదియే. బాల్యమునుండియే యీ లలితకళాభిరుచి గలిగించుట యిద్దానికిఁ బరమప్రయోజనము. ఇట్టిదానియెడఁ జనువరులకుఁ గలుగఁగల యాదరణ మెంతయో తెలియవలెను]

శోణపురము — శివసన్నిధి. ప్ర॥ బాణుఁడు సకుటుంబియై.

బాణు:— పాట:—శంభో మహాదేవ - శంకర గిరిజారమణ
శంభో మహాదేవ - శరణాగత జనరక్షక ।
అంభోరుహాలోచన - పాదాంబుజ భక్తిందేహి మే ॥

లోకపితలకు సాష్టాంగములు. అమ్మా ఉషా, అనుకూలదాంపత్య సౌభాగ్యముల నొందఁగోరు నీవంటి కన్యకల కీ పురాణదంపతులు సంతతశరణ్యులు. రమ్మ — జాగిలి మ్రొక్కుము తల్లీ! — మీరందరుగూడ నట్లే చేయుచున్నారా?

పార్వతి:—వత్సా, సంతోషము. మరల నేమిగోరెదవు?

బాణు:—నాయనా త్రినయనా, చూడు మాయమ్మకు నాపై నెంతకోపమో! అమ్మా, యిదివరకుమాత్ర మేమికోరియుంటిని? ఏదో బిడ్డఁ డొకఁడు కష్టపడుచున్నాఁడు గదా యని కనికరమూని వచ్చితిరిగాక!

శివుఁడు:—పార్వతీ, వాఁడు మూఢుఁడే; ఐన నమాయికుఁడు కాన నాకు నచ్చినవాడు, భక్తుఁడు.

సా:—ఎవరు కాదన్నారు? కాబట్టియే, అసలే యత్తింటిసుఖమన్న నేమో యెఱుఁగని నన్నుఁ బుట్టినింటి సుఖమునకుఁగూడ దూరముచేసి యిటు దెచ్చినారు.

బాణు:— కం॥ మనసారఁగఁ జలిపెడి పూ
జనలం దొక లోపముంట సతమే యనుమో ।
జననీ, ఆమాత్రమునకుఁ
దనయునిపై నలుకఁ బూనఁ దగునే నీకున్ ॥

ప్రేయసీ, వినుచున్నావా మా యమ్మమాటలు? ఇది నీలోపమా నాలోపమా?

ఉష:—నాయనా, ఎంతచేసినను — ఎంతచెప్పినను అవ్వలకు రవ్వ — తాతలకు దగ్గు పోవు!! లోకగురులకు లోపముసేయునట్టిదా మాఅమ్మ!

శివు:—అబ్బా గారూ, గమనరివేనే !
పా:—ఇప్పుడే యేమిచూచితిరి! ముందు చిత్తగించవలెను — వత్సా దీని పెండ్లియెప్పుడు?
రాణి:—దేవతామతల్లీ, దాసులు స్వతంత్రులా ?
శివు:—ప్రభుతంత్రము లితరు లెరుఁగఁగలరా ?
పా:—ఎరుఁగకున్న మీ మూఢవకంటి నెరువాసంగుడు.
రాణి:—కావచ్చు — విశ్వాసులను విశ్వేశ్వరులు విడతురా ?
బాణు:—అమ్మా, అది నీకోడలే — సంకల్పవికల్పములు మీవిగాక మావా ?
ఆహ్లాదనుఁడు:—నాయనా నిన్న నీవు నాకిదియేకదా బోధించినావు !
బాణు:—ఔను. అదే — ఆ విశ్వాసమే మకుఁ త్రిలోకాధిపత్య మిప్పించినది.
పా:—బాణా యింకేమికావలయు — ఇంద్రాదులు దాసులైనారే !
బాణు:—అమ్మా, క్షమించు. ఈ యల్పమతికి కోరికె చాలదు.
శివు:—వత్సా, చెప్పరాదా మనసులోని మాట.
బాణు:—మహాదేవా, నీకడనా దాపరికము ?

మ॥ అనిలో నన్ను నెదిర్చి బాహుబలశౌర్య స్ఫూర్తిఁ బోరాడఁజా
లిన వీరుండొకఁడైనఁ బంటముననన్ లేఁడయ్యె భూమండలి
న్ననయంబున్ భవదీయ దత్తకర సాహస్రంబు కండూతివా
యు నుపాయంబును లేద; యీ భరము నెట్లోర్తు న్నమానాయకా ॥

పార్వ:—నే ననలేదూ !
శివు:—నేను నన్నాను వాఁడు మూర్ఖుఁడని !
బాణు:—గురో, నీనేమన్నను సరియే ! కాని యీవుకాక మరెవఁడీద్దానికి సమర్థుఁడు.
శివు:— కం॥ విను మూఢ హృదయ, నీకే
తన మెప్పు దకారణంబ ధారణిఁ బైఁ గూ ।
లునో అపుడ నీ భుజావలి
తునియఁగ నాయంతవానితో ననిగల్గున్ ॥

బాణ:—ప్రసాదము — మహాప్రసాదము. ఇక సెలవా ?
శివు:—మంచిది.
బాణు:— అఠాణా — ఆది.

ఆ, హరి హర హిరణ్యగర్భులలో - నావిర్భవించు వాఁడెవఁడో
హాహాకారముల బెట్టింతు బ్ర - హ్మాండభాండములఁ బిండీకరింతు
ఆ హా హా „ „ „ తన బా - హాబాహీన్ „ „ „ హుడఁడో
హో హో „ యన మోహరంబున - త్యాహాతీతముగా నొనరించెద ॥

ప్రాణేశ్వరీ, మనోరథసిద్ధి యయ్యెగదా పోదము రండు.

## 2వ రంగము

### ఉషా చిత్రలేఖలు

చి:—గొప్పవారితోఁ జెలిమి యిట్టిది !
ఉ:—ఎందుకమ్మా యీ నిష్ఠురోక్తులు ? !
చి:—మీ యన్నతోడంటినే — చెప్పితివా ?
ఉ:—అన్నావా — అదినేను వినలేదు.
చి:—ఔను నా మాటలిపుడు విందువా — పిన్నను మారాడుదువా ?
ఉ:—గోరిచుట్టుపై రోకటిపోట్లా ? ఎందుకంత కాఠిన్యత ?
చి:—గోరిచుట్లా ? ఏదీ యేలాటివో — ఆపాటి మందే వేయలేనా ?
ఉ:—ప్రాణాధికవు పోల్చియుందువనుకొన్నాను.
చి:—పోల్చుకొనుటయా ? చెప్పినఁగూడఁ దెలియదేమోనే !!
ఉ:—చెలీ,

మ॥ భయమా బంన్లకు మించుచుండె; బుజాసంబద్ధోక్తియా కాదు; వ
చ్చియు రానట్టి వయస్సు నా చెలఁగితిన్; సిగ్గా దశాశాంతమా ;
దయయేలాటిదియో యెరుంగఁడట కందర్పుండు, నాబాము ల
య్యయొ యే సెచ్చెలి కేమనం దెలుపనమ్మా, నీవ యోచింపుమా ॥

అదియొక స్వప్నముగానే యుండనోపు !
చి:—స్వప్నమేమిటి — నీ వెవనినైన వలచియున్నావా ?
ఉ:—నా గుణము నీ వెరుగనిదా ? నీ హృదయమే నాహృదయము కదా !
చి:—ఐన నీయవస్థ కర్థమేమి ?
ఉ:—చెలీ,

కం॥ ఏ మానిసి మోమైనను
నే, మును, గనలేదు; దేవుఁడే యని తలఁతున్ ।
మోమున మోమిడి కలలో
నేమేమో చేసెనమ్మ యీ కోతలకే ॥

చి:—ఔనమ్మా, అయ్యయొ యెంతధూర్తుడు ! కంటఁబడనీ — కట్టితెచ్చి యిచ్చుట
గదిలో దాచిపెట్టెదను చూడూ !!
ఉ:—వలదు చెలీ అతివాదములాడకు.
చి:—అప్పుడే యింతయభిమానమా ? ఓహో !
ఉ:—అది కాదమ్మా

క॥ ఆలేలనగపుర స్థల
కాలీలల కా మృదూ_క్తి కాశ స్థలకున్ ।
బాలామణి, నిర్బంధము
లేలాయని యంటి; వింతకే యలిగెదవో ॥

ఆ మహాశయుడు నా పెదవు లెన్నితడవలో కరచెను. చూడుము. ఐనను నే నలగలేదు.

చి:—సుమనోభిరామవమ్మా నీవు; కాకున్న నిట్లు నలిపి నలిపి నవయగొట్టినను ఇంక నలగలేదనుచున్నావు.

ఉ:—చాలు లేవే — యెందుకీశ్లేషలు ?

చి:—ఔనమ్మా ఔను. సంశ్లేషలేగాని వట్టిశ్లేష లిపుడెందుకూ ?

ఉ:—చిత్రలేఖా, నీమాటలూ నీయాటలూ నాకు చీదరగొలుపుచున్నవి.

చి:—ఐతే పాటలుపాడుదునా — సంతోషింతువేమో ?!

ఉ:—అదియును వెగటే యిప్పుడు.

చి:—రూపపటముల వ్రాయుదునా ?

ఉ:—చూచితిని గదూ:—

ఉ॥ పేరులు బారలన్ మిగులఁ బిసుఁగు మోములుఁ బిచ్చిచూపులున్ ।
దీరును దెమ్మలేక తలదిండ్లను మేలనిపించు రూపులున్ ।
బేరుఁ బ్రతిష్ఠలంగొనని వేషములుం గల చచ్చుభూపులన్
దీరిచి దిద్దిచూపెదుకదే!! మనకాల మదంత చౌకయే?!

చి:—చెలీ వలదు వలదు — వెరఁగు వలదు

కం॥ నగసురకింపురుషనభ । శ్చర, కిన్నర నాగయక్ష సాధ్యులఁగాదీ ।
తరుణమున నీకుఁజూపుట । పురుషోత్తమ నిభుల, యాదవులఁ జూపింతున్ ॥

ఉ:—యాదవులనా? సరే.

చి:—నెచ్చెలీ, నిన్నరేయి నీ కలువరింత లాలించుటవలనఁ గలిగిన యూహలఁబట్టి మూడు పటములఁ జిత్రించి యుంచితిని.

ఉ:—ఏవీ ?

చి:—ఇదిగో — చూడు మితఁడు — శ్రీకృష్ణుఁడు.

ఉ:—మునకొంపలు మాపుచున్నదుంప !!

చి:—ఇదె యాతని సుతుఁడు మదనుఁడు.

ఉ:—అనంగుఁడు — అంతేకాదు — శివవిరోధియును.
చి:—పోనీ యితఁడో?
ఉ:—ఆహా పార్వతీ పరమేశ్వరులారా!!
చి:—ఏమమ్మా అట్లు వాలిపోవుచున్నావు? ఏమైనది?
ఉ.—అబ్బా!! అబ్బబ్బా!!
చి:—అయ్యో — నెచ్చెలీ — యేమైనది?
ఉ:—అయ్యో — మాటాడించకు — ఏదీ యాపటము?
చి:—వద్దువద్దు — నాకు భయమగుచున్నది.
ఉ:— పాట మోహన — ఆదితాళం

తేవే — తేవే పటమిటుదేవే। నా విభుఁడతఁడే — నయగుణరతుఁడే॥ తే॥

చి:—

లేవే — రావే – ఇది గ్రైకొనవే। నీవనీవిభుని — నేఁదాళ నతని॥ దేవే, రావే॥

ఉ:—ఛీ వగలాడీ ,, —
చి:— —చీదగబడకె చిగురుబోడీ, తొందరవడి
ఉ.—పోవె మాటాడకికఁ—
చి:— సరిలే — నేఁ — బోయెద నీయదు నాయకునిఁగనఁగ। దేవే॥

## 3 వ రంగము

నారద రుక్మిణీ సహితుఁడు శ్రీ కృష్ణుఁడు

నార:— కృష్ణ వాసుదేవ కేశవ పరమాత్మ
అప్రమేయ వరద హరి ముకుంద।
మిమ్ముఁ జూడఁగంటి మీకృపఁ గనుఁగొంటి
నఖిల సౌఖ్యపదవు లందఁగంటి॥

ధన్యోస్మి ధన్యోస్మి, కృష్ణా, కష్టనివారణా.
కృ:—శతానంద నందనా, వందనములు. నీ సమయాగమనము సంతోషకరమైనదిసుమా!
నా:—సుమానుష సౌభాగ్యసిద్ధిరస్తు.
రు:—మునిరాజా, మీ యాశీస్సు లమోఘములు.
కృ:—స్వామీ, యేమి విశేషములు?
నా:—పాట బలహంస — చతురగతి

దేవా — నీవు దాసజనుల క — ధీనుఁడవై మెలఁగుచుండెదవు॥ దే॥
భావనాతీతుఁడ వాశ్రితజ నా — పద్బాంధవుఁడవు నీవగాక॥ దే॥

పురహూతాదులు పరిపరి విధముల
బరితాపంబులఁబడి పొరలుదురు కృపాబ్ధి
సరగున రావే — సురలకు శుభ మొసఁగవె॥ దేవా॥

రు:—అక్కటా! అనిరుద్ధా, నా తండ్రీ, యెక్కడ జిక్కియున్నావు నాకూనా!!
కృ:—ఇల్లాలా, యింతేనా వీరమాతృతా శక్తి!
నా:—తల్లీ, యేల దల్లడమొందెదవు?
కృ:—నారదా

ఉ॥ వాయువశంబులై యెగసి వారిధరంబులు మింటఁగూడుచున్।
బాయుచునుండు కైవడిఁ బ్రపంచము సర్వముఁ గాలతంత్రమై।
పాయుచుఁ గూడుచుండు; నొకభంగిఁ జరింపదు; కాల మన్నియుం
జేయుచునుండుఁ; గాలము విచిత్రము దుస్తరమెట్టివారికిన్॥

శతమఖున కిదే నా సందేశము.
నా:—మహాప్రసాదము.
కృ:—దేవమునీ, యీమెను సంతోషపెట్టఁగలవా?
నా:—నీ చిత్తము మహానుభావా, — అమ్మా,

కం॥ సురుచిరమృదు తల్పంబునఁ।
బరిరంభణ సరసవచన భావకళా చా।
తురి మెరయుచు నాతఁడుషా।
తరుణీమణితోడనుండుఁ దమి మెయి నెపుడున్॥

వింటివా తల్లీ? జగత్కళ్యాణ కారులకుఁ గూడఁ గష్టములా?! కష్టములందే వారి కెక్కువసుఖము.
రు:—నాయనా, నీమాటలకు నీవే యర్థము చెప్పవలెను.
నా:—అమ్మా, వెయ్యేల!? మునిమనుమలనెత్తుకొను సమయమువచ్చినది.
రు:—అంతయు నీ యాశీర్బలమే కదా!
నా:—ఎంతమాట తల్లీ, అటుచూడు:—

కం॥ నీనాథుఁడు నానాథుఁడు
నానా బ్రహ్మాండములకు నాథుఁ డితండే।
వానిది యీ సౌభాగ్యము
నే నెంతటివాఁడనమ్మ నీ వెఱుఁగవొకో॥

ఇక సెలవా దేవా?
కృ:—మంచిది.

# 4 వ రంగము

## మధువ్రత నరాశనుల ప్రవేశము

మధు:—పాట

గ గ గ గ రి గ  ప గ ప గ రి గ  ప గ ప ప ర ప సా,,,
బ్రతి కి తి మి క  బ్రతి కి తి మి క—ప్రభు వు క రుణ చే
ప ప ప గ ప ప  గ ప ద సా స  స ద ప ద ప గ  పా గ రి స
కు తు క వ ర కు  మ ధు వ్రుగ్రో లి—కు లు కు దు ని క  చా వు లేదు. ॥బ్ర॥

నా కుక్కను చంపినాడే !!

నరా:—యేమిటిరా నీగోలా ?

మధు:—యమునికి వురి !!

నరా:—తప్పిపోయిందిరా నీ తస్సగొయ్యా !

మధు:—అర్రెర్రే ! యేలాగ తమ్ముడూ ?

నరా:—తుంబూరా టింగ్ టింగ్ మంటాడే —

మధు:—తుంబూరా టింగ్ టింగెవడురా ?

నరా:—తెలీదురా — కుక్కబుర్రా — నడిమికి కర్రా — యిటూ అటూ కాయలూ — చూడలేదూ ?

మధు:—చూచాన్ చూచాను.

నరా:—యేంది నువ్వుచూచిందీ ?

మధు:—కాయలు.

నరా:—వోరి తాగుముచ్చు తొత్తుకొడకా !!

మ:—తెలిశింది తెలిశింది యీాణె — వోహూ నారదుడు !

నరా:—అమ్మయ్యో !!

మ:—మరి ముందే నీవు చెప్పలేదే !

నరా:—పేరు మరిచిపోయూరా ! — వాడొద్దన్నాడు.

మ:—పోనీ !!

పాట (యూసపదం)

శికటేళా రమ్మన్నాను — శీటిరాసీ పంపినాను
కోటపెరటీ — గుమ్మము కదకేరా యినురా తమ్ముడూ

నరా:—ఇదేందిరా యీాగోలా ?

మ:—వుషా వుషా

నవ్వులతో నవరత్నాలూ — రువ్వింది సామీదా
కవ్వమంది కేక వేసిందీ — సాకేసి మాసీ || కవ్వ ||

నరా:—వొరేయ్ కడుపుతో వుందిరోయ్

మధు:—చప్ లమ్మిడీకొడకా !!

నరా:—నోరుముయ్‌రా !! గుండెమీదతన్ని బాడిమీద యీడిపిస్తాచూను.

మధు:—నోరుజారిందికానీ — నీ కేలా తెలిసింది తమ్ముడూ ?

నరా:—తెలియకపోతుందిరా !! గొప్పయింటిరంకూ పెద్దచెరువు కంపూ తెలియవను కుంటారు !!

మధు:—యెంత ధైర్యం — యెవడో ? !

నరా:—అబ్బబ్బా ఆ చిత్రలేఖవుందే—

మధు: ఔను తమ్ముడూ.

నగరులో వంట — అది — సానొమైనగుంటా అది
యెగురగలదు మింట — బలే — పొగరుబోతంటా || న||

నరా:—యింకా మెల్లిగా నంటావూ !! పడుకున్న వాడ్ణి మంచంతోనే తెచ్చేసిందంట

మధు.—అది దేవతరా.

నరా:—యీ దేవతలు తొత్తుకొడుకులవేరా యీ తంత్రాలూ — వొరే యెక్కడా యీ మాటలు చెప్పకుమీ.

మదు:—వొరే తమ్ముడూ యిట్టువిను మా టింగ్ రుధిరప్రియకాయంతోమా !!

నరా:—ఫింజారీ లంజకొడకా (అని పట్టునగొట్టి పారిపోవును)

మధు'—అమ్మయ్యో ఛచ్చాను — ఉండు లంజాకొడకా — వూరంతా చెప్తాను.

## 5 వ రంగము

### ఉషానిరుద్ధులు

ఉష:—నాథా, యేమటులున్నారు ?

అని:—ప్రేయసీ, యేమియు లేదు.

ఉష:—ఏమియు లేదన్నంతమాత్రమున నమ్ముదునా ? మీ మోముతీరే చెప్పక చెప్పుచున్నది — మీ మనోవికారమును.

అని:—

కం|| తరుణీ, యొకకలగంటిని ।
బురుహాతుడు వచ్చి, నన్నుఁ "బోవల దనఘా'

మరకార్యపరిసమాప్తికిఁ।
బరిపరివిధములగు శ్రమలఁబడుచుంటి" మనెన్ ॥

అ:—ఏమేమీ — నన్ను విడచిపోవనెంచితిరా ?

ఉ:—నిన్నువిడచియా ?!

ఉ:—అబ్బా యెంత కఠినవుగుండెలూ !

అ:—నీవా నావా ?

ఉ:—చాలులెండు సరసములు !

అ:—ఔను మరెందుకూ !

ఉ:—ఈ పరిహాసముల కేమిగాని మీరు పోవలదు.

అ:—సరియే ; కాని స్వప్నఫలముఁ జెప్పఁగలవా ?

చిత్రలేఖ:—(ప్రవేశించి) మారకుమారా, ఆమె వట్టిగోలకదా !

అ:—పోనీ నీవు చెప్పవచ్చునుగదా !

చి:—ఇదిగో చిత్తగింపుడు:

కం॥ మదనుల మదమడఁచు నతఁడు ।
సదమల యదుకులపయోధి శైవాతృకుఁడీ ।
సుదతి కుదయింపఁగలఁడిదె ।
విదితఫలం; బింతకంటె వేరుకలుగునే ॥

అ:—అమ్మా చిత్రలేఖా స్వప్నగతులనేకాక గర్భగతులగూడ వ్రాసినావే! ఎట్టివింత !

ఉ:—సరిసరి ! సమయముదొరికినఁజాలు !

చి:—చెలీ, సమయజ్ఞానమే సర్వరక్ష, భద్రముగానుండుము; పోయివచ్చెదను.

(పెద్దకలకలముతో బాణుడు, రాణి, అహ్లాదనుడు, మంత్రియుఁ బ్రవేశింతురు.)

కానడ — ఆది

బాణ:— పాట—మారివి కాని కు - మారివటే ॥
మా కిహపరముల - మాపఁగఁబుట్టిన॥ మా॥
జారిణీ... స్వైరసం - చారిణీ చూడు మిము ।
మారణహోమము చేయించెద నను ।
వారణసేయువాఁడెవఁడో చూచెద॥ మా॥

అ:—మామా నమస్కారము.

బా:—ఎవఁడురా వీఁడు

కం॥ జారుఁడు, చోరుఁడు, దురహం ।
కారుఁడొకం డెట్టయెదుటఁగనుపట్టె నను ।

స్కారము మామాయనుచు ని।
కారణునగవొలయ బలుకఁగలిగెఁ బుడమిలో॥

నిన్ను ఖండఖండములుగాఁగొట్టి కాకులకు గ్రద్దలకుఁ బెట్టింతునుంతరా!

ఉ:—అయ్యోనాయనా! ఆహా ప్రాణేశ్వరా

కీరవాణి — త్రిశగతి

యదుకుల హిమకిరణా, భువనేశవందితచరణా।
సదమలగుణసదన మదనసన్నుత సంతానా॥

బాణ:—ఏమివగలే — ఎప్పుడుమప్పినదే మీయమ్మ!

రాణి:—నాథా శాన్తింపుము — రత్నము స్వర్ణకీలితమైనది.

బాణ:—ఓహో హో కైత్యం!! (కవిత్వము)

ఆహ్లా:—నాయనా ఈతడు మహాత్ముఁడు; యదుకుల...

బాణ:—నోరుమూయ్!!

గొల్లబడవకు లేనిగొప్పతనమునుగూర్చి।
తల్లికొడుకులుమీద తగినారు తార్పక్।

పళ్లురాలఁగొట్టింతును జాగ్రత!!

అని:—

మామా, కం॥ చూచితె నీ ప్రేగిది మెడ।
పైచుకొనుటవలనఁగల్గు బాంధవ్యము చే।
నోచిన నిను నాఖడ్గము।
గాచెను; గాకున్న బ్రతుకు గలదే నీకున్॥

ఉ:—నాయనా కోపపడ కిటుచూడు:—

చం॥ వలచితి నీతనిం గుసుమబాణసుతుం డనిరుద్ధుఁడందు రీ।
విలసితవంశరూపగుణ వీర్యనిధానుని

శా:— ..............చాలులేవె! నీ।
వలపులు వల్లకాటికిది పంచెదఁజూడవె

ఉ:— ...............నాయనా, యమం।
గళవచనంబు లేలఁబలుకన్; శివభక్తుల కిట్లుపోలునే॥ —

బా:—ఓహోహో హో — తొండమునదిరె యూసరవెల్లియైనదే! ఓరీ నా బాహు చక్రము...

(ఆకాశమున) భగ్నమైనది, భగ్నమైనది.

ఎవఁడురా వాఁడు ?

భటుఁడు:—(ప్రవేశించి) దేవా నేను కేతనరక్షకుఁడను.

బా:—సరే - వచ్చెదము. పో. మంత్రి, వీరినిద్దరిని జీకటిచెఱల వేరుగాఁబెట్టింపుము.

మం:—మహాప్రసాదము.

## 6 వ రంగము

### శివజ్వరము — విష్ణుజ్వరము

(కామిక్ పాట — డైలాగు)

విష్ణు:— నడువుమురా – నడువుమురా ♦ బడవా నా నాథునికడకిపుడే|| న||

శివ:— విడువుమురా – విడువుమురా ♦ వెడగా నిను నీనాథునిఁగొడపెద|| వి||

విష్ణు:— విడువనురా – విడువనురా ♦

శివ:— ♦ విడువకున్న నినుఁ బడపడ నడచెద|| విడువు||

విశారదుడు:—(జటాపనస చదువుచు ప్రవేశించును.)

నీ సా నీ సా పా నీ సా సా రి నీ సా రి ని స రి నీ సా।

(like) మానీ మానీ సోమానీ మంచిద్రై తే మరొకటి జేసీ। (repeat)

విష్ణు:—నడూరా నడూ !

శివ:—ఎవర్రా మీరూ ? ఇక్కడాయుద్ధమే !

విష్ణు:—బ్రాహ్మణోత్తమా నమస్కారము. నేను విష్ణుజ్వరమను.

శివ:—అయ్యా నమస్కారము — నేను శివజ్వరమను.

విశా:—మీకేమీ పనిలేదూ ?

విష్ణు:—రాక్షసపక్షుడు వీనిని శిక్షింపుమని పక్షివాహానుని యాజ్ఞ స్వామీ !

శి:—ప్రభువునాజ్ఞపాలించుట తప్ప దేవరా ?

వి:—ఒరే యుద్ధము చల్లారినటులున్నది. ఉండండి వుండండి – ఎవర్రా వచ్చుచున్న వారు చూడూ.

విష్ణు:—స్వామీ స్వామీ !! భగవంతులు శ్రీకృష్ణదేవులు – ఇటేవచ్చుచున్నారు.

కృష్ణుఁడు:—(ప్రవేశించి) ఏమి వయస్యా ఏమితినుచున్నావు ?

వి:—తినడమేమయ్యా వినడం.

కృ:—ఓరీ వైష్ణవుడా, ఆశైవునికట్లు విప్పుమిక. ఓరీ శైవుడా, సూర్యోదయాత్పూర్వమే వచ్చి దర్శనము సేయుదుమని మామనవిగా నమ్మహాదేవులకు విన్నవింపుము. పొమ్ము.

శివ:—మహాప్రసాదము.

కృ:—ఏదీ వయస్యా నీవేదపాఠము – మరియొకసారి !!

వి:—కృష్ణా, సర్వాంతర్యామివి.

శా|| నా కీవింతటివాఁడవంచుఁ గలనైనం దోచదే పూర్వ మా
హా, కృష్ణాయని యాదవాయని వయస్యాయంచునేఁ జీరితిన్ ।
స్తోత్రోక్తుల్ భ్రమనో ప్రమాదముననో తుల్యంబుగా మైత్రినో ।
లోకేశా, యెటులైన నేమిమరి; ఆలోపంబు మన్నింపుమా ||

కృ:—బ్రాహ్మణోత్తమా, నిన్ను నేనెరుఁగనా! నీయందు లోపమేమున్నది? రమ్ము పోవుదము.

7 వ రంగము

బాణుఁడు, రాణి, కృష్ణుఁడు, విశారదుఁడు, ఉషానిరుద్ధులు, చిత్రలేఖాహ్లాదనులు.

బాణ:—దేవా, యాదవశిరోమణీ,

కం|| కలగన్నవారి విషయము
సలలిత బుజాగాధ జేసి శాశ్వతనుయశో ।
విలసిత మొనరించిన యో ।
జలజాక్షా నిన్నుఁబొగడ శక్యమె మాకున్ || —

విశా:—వయస్యా, బాణునిబరువు తగ్గించివేసితివే.

కృ:—కార్యాంతరశూన్యములై కండూతిపట్టుటకుఁగాక – శివపూజకు నాలుగుచేతులు చాలవా వయస్యా?

అని:—తాతా, శత్రుత్వశేషమేమైన మిగిలియుండునేమో!

కృ:—వత్సా, ప్రహ్లాదుఁడు నాభక్తుఁడు. తద్వంశసంజాతులఁ జంపనని వరమిచ్చియుంటిఁ గదా!

బాణ:—నాయనా, నేను మిమ్ముఁబెట్టిన బాధల మన్నింతువుగాక!

విశా:—ఆహ్లాదనా, ఆచాటున ఆతుమ్మలలో రామచిలుక యెవరూ?

ఆ:—అది మానహోదరి.

విశా:—అదికాదోయీ !!

కృ:—విశారదా, చీకటిలోఁ జూడఁగలశక్తి యింకను బోలేదే!

విశా:—కృష్ణా:—గీ|| కలలఁగాంచినవారలఁ గడఁగిప్రాయు
వారు నానన్నఁదో ర్దైచ్చువారుగలరు ।
నీటిలో జాడఁబుట్టించు నీరజాక్షు
లేల నా లోనిచూపులగోల నీకు||

కృ:—ఓహో......
విశా:— ఉండుముండుము - ఈ యాహ్లాదనుని మెడ కాచిత్రలేఖను గట్టిన —
కృ:—ఆ మెతలిచంద్రుడు లొప్పుకోవలదా ?
విశా:—ఐన నీమనుమఁడు బాణుసమ్మతినే యీయుషను బెండ్లాడెనా !
కృ:—ఏమో !

బా:— ఉ॥ అల్పమె పెండ్లిమాట ! సుమహత్తరమైనది; చూడు పన్నగా।
తల్ప, వృథాభిమానినయి తాపమునొందితిఁగాక ! నీదుసం।
కల్పమిదెల్ల; సిద్ధ; మిదికాదనువా రెవరయ్య, సత్కళా
కల్పను జిత్రలేఖ స్నుషగా దయచేయుము నీకుఁదోఁచినన్ ॥

కృ:—సరియే అది సిద్ధమగుఁగాక ! అమ్మా బాణసతీ యింకేమికావలయు ?
రాణి:—జగత్కల్యాణమే నీవుచేయునది. నేనేమికావలెనందును ? ఐన:—

కం॥ ఈ దివ్యకథావిభవము। సాదరముగ వినెడివారు జదివెడివారున్ ।
శ్రీదయిత, భవికచయసం। పాదకులై యుంద్రుగాక భాగతికెందున్ ॥

విశా:—జయము, సర్వభద్రసంయోజకా జయము జయము.

మంగళము

# నెపోలియను సూక్తులు

అకిరము రామారావుగారు

వ్యర్థజీవనము దుఃఖభాజనము. నిజమైన మానవుఁడెవ్వరి యెడను అనాదరిణఁ జూపడు. ఆశయే ప్రపంచమును శాలించుచున్నది. ద్రవ్యముగాని యున్నత పదవులుగాని మనుజుని సౌఖ్యవంతునిగఁ జేయఁజాలవు. కుటుంబముయొక్క గాని, రాజ్యముయొక్క గాని రక్షణకుఁ బ్రశాంతి ముఖ్య సాధనములలో నొకటి. శాశ్వతముగ నుండునట్టిది గొప్పతనము కానేరదు. నిష్కళంకమగు ప్రేమయే యాదర్శప్రాయమగు సౌఖ్యము. సౌందర్యవతియగు యువతి నేత్రానందము గావించును; యోగ్యురాలగు నామె చేతఃప్రీతిఁ జేయును. ఒకటి భూషణము; రెండవది పెన్నిధి. 'అసాధ్యము' ఇది ఫ్రెంచి భాషాపదము గాదు. అట్టిమాట నేనెఱుఁగను. అయ్యది బుద్ధిహీనుల శబ్దకోశమునందు మాత్ర ముండునట్టి పదము. ఉన్నత పదస్థులగు శ్రీమంతుల జీవనము నందు కంటె జన సామాన్యముయొక్క జీవనమునందే నిజమగు సౌఖ్యమున్నదని నిశ్చయముగఁ జెప్పవచ్చును. తమతల్లి యేమిచేసినను బిడ్డలుమాత్ర మామెచేతలను గర్హింప నర్హులుగారు; వారికి యధికారములేదు. విధి ప్రచోదితమగు దాని ననుభవించియే తీరవలెను. 'విజయ'నుండి.

# స్త్రీలు-యుద్ధములు

'ఉవిదలా_ఉక్కుతునుకలా?' యను వ్యాసమును జదివిన మాసోదరీమణులీక్రింది విషయములను గూర్చి యించుక యాలోచింత్రుగాక! ఈ యుద్ధవిషయము లనేకులకు మిక్కిలి యాశ్చర్యమును గలిగింపకపోవు! అది నిజమే; కాని మన యార్యావర్తపుఁ బూర్వచరిత్రముల నొకసారి తిరుగవేయుదుమేని ఇవి యన్నియు మనముత్తాతలనాటి ముచ్చటలే కాని క్రొత్తవికావని ఋజువగును.

అసలు పుట్టించుట పెంచుట గిట్టించుటయను మూడుశక్తులును బ్రకృతియందే యున్నవను పరమసత్యమును మొట్టమొదటఁ దెలుసుకొన్నారు మనవారే!— కాబట్టి యిట్టి ప్రకృతిని మహామాయాశక్తియనియు ఇది పరమదురత్యయయనియు నెరింగి దానినుపాసించినారు. దీనికిఁ బరుఁడయ్యు నీశ్వరుఁడుగూడ దీనితో నైక్యమగుచున్నాఁడు. అట్లుగాకున్నఁ దనస్థితియే నిరర్థకమగును.

దేవీభాగవతము నొకసారి యెల్లవారును జదువుదురుగాక! అందును స్త్రీలు ముఖ్యముగఁ జదువవలసిన యుద్ధగ్రంథమదియే! మహామాయా, మహాకాళీ, విశ్వజననీ, సర్వమంగళాదీ నామకోట్లు, ప్రకృతిప్రతిబింబమగు స్త్రీ, తనయందెట్టు లనువర్తించుచున్నదియు లెస్సగాఁ దెలియఁగలదు. సాధుహింసకులగు మహిషస్వరూపరాక్షసులను సంహరించినదెవరు? నరకునిమద మడఁచినదెవరు? రావణాదులను దుర్యోధనాదులను జంపించినదెవరు? చరిత్రనుబట్టి చూడ మహమ్మదీయులకు మాటిమాటికి గుణపాఠములను బోధించినవారెవరు? ఇటీవలి బొబ్బిలియుద్ధమున బేరి స్త్రీలమాటయో? పల్నాటివీరవనితా శిరోమణియగు నాయకురాలిఁ గూర్చి యేమందురో? ఒన్నూరమ్మను లోకము మరువదుకదా!!

అంతదూరము పోనేల? కర్మచంద్రుని మహాత్ముడనిపించిన మొన్నమొన్నటి యసహాయోద్యమవిషయమాలోచింతము. బొడ్డున మాణిక్యముఁ బెట్టుకొని పుట్టిన యిల్లాళ్లు సమరసన్నాహాలగుటయే కదా మంచుదేశములందు గూడ వేడిబుట్టించినది. ఈత్యాగము, ఈసాహసము, ఈ విజృంభణము నన్నికాలములయందు, అన్ని దేశములందు నున్నదే! తథాపి యావిషయముల మొట్టమొదట మనదేశమునకే పెట్టినది పేరు. ఉత్తరోత్తరమందుఁ గాఁగల స్వరాజ్యసంసిద్ధికిఁగూడ నీ స్త్రీరూపమహాశక్తియే పురుషునకుఁ దోడునీడ కావలయుఁగాని ప్రత్యేకుఁడైనయెడఁ బురుషుఁడు నిరర్థకుఁడు గాక తప్పదు.




MAKES
STERILITY
A THING
OF THE PAST

CURES
Dysmenorrhœa
Amenorrhœa
Menorrhagia
Leucorrhœa
Etc. Etc




KESARI KUTEERAM
Indian Chemists
& Druggists
EGMORE. MADRAS

# లోధ్ర

## గర్భాశయరోగ నివారిణి

ఈ యౌషధరాజము హిందూదేశపు వనౌషధులతో తయారుచేయబడినది. స్త్రీలకు గలుగు ఋతుశూలల, బహిష్టి కాకుండుట, అకాల బహిష్టి, మైల జాస్తిగాను, తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతాన రక్తహీనతలు, మలబద్ధకము, సూతికావాతము, కీళ్ల నొప్పులు, అరికాళ్లు అరచేతులుమంట, మొదలగు స్త్రీ మర్మవ్యాధులను కుదుర్చును. స్త్రీలపాలిటికిది 'కల్పవృక్ష'మనిన్ని 'కామధేను'వనిన్ని మఱి యనేకవిధముల, వాడినవారు స్తుతించుచున్నారు.

బాపట్ల తాలూకా, చీరాలపోస్టు, రవ్వాజాండ్రపేట తోండెపు కోటయ్యాకవిగా రిట్లు వ్రాయుచున్నారు.

గీ. అధికరోగ సంఘటిత జనాళికెల్ల, హర్షవార్ధిని దేల్చి యత్యధికశక్తి
భక్తియుక్తి, ప్రపుణ్యతఁ బ్రబలజేయు, 'లోధ్ర' గుణమెన్నగలరె యీ లోకజనులు.

లోధ్ర అన్ని మందులషాపులలో దొరకును.

కేసరికుటీరము — ఎగ్మూరు, మదరాసు.

ఆంధ్రదేశమునకు ఏజంట్లు : శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ.

# రాచబిడ్డ—వీరరక్తం

కొట్టుపాటి వెంకట హయగ్రీవరావు పంతులుగారు

[క్షత్రియవీరుడి ఉడుకురక్తం పొంగిపోతోంది. కుడిచేతిలోని కైజారు తళతళ మెరసిపోతోంది; చంగునసత్రపుగదిలోకి, ఒక్కదూకు దూకినాడు. ఆగదిలో అతనిభార్య, రెండవకుమారుని ముద్దిస్తోంది. భార్యాబిడ్డల నొక్కసారిచూచాడు. కోపంపట్టలేకపోయినాడు. ఎడంచేత్తో కుమారుని ప్రక్కకుతొలగించి, కైజారు గుండెకుసూటిగాపెట్టి "నిజంచెప్పు" అని గర్జించాడు. ఆగర్జనకు, సత్రపుగదిఅంతా గడగడలాడింది.]

"దొంగతనం బయటపడకపోదు."

"ఏమయిందేమిటి !!"

"అబద్ధం ఆడొద్దు. నిజం చెప్పు నీ కొడుక్కు తండ్రెవరు ?"

"అనుకున్నంతపనీ అయిందా ? అనుకుంటూనే యున్నానూ ! యిదినిజం."

"శుద్ధఅబద్ధం. కాచుకో యీకైజారుకు నీ రక్తంతో దాహంతీర్పు."

క్షత్రియవీరుడి భార్య తొణకలేదు బెణకలేదు; పర్యేటను పక్కకుతొలగించి ధైర్యముగా నిల్చుంది. క్షత్రియరక్తం పొంగిపోగా యీవిధంగాఅంది.

"అసలయిన రాచస్త్రీ తనప్రాణమును త్రుణప్రాయముగా చూచుకుంటుంది. మీకైజారుకు క్షత్రియవీరాంగన ఉడుకురక్తంతోడ దాహం తీర్పవచ్చు. ఆఖరి నారెండుమాటలు వింటారా ? రెండునిముషాలాగండి.మనపెద్దబ్బాయి అంతపనీ జేస్తా డనుకుంటూనేయున్నాను. నిజం చెప్పమంటారా ?"

క్షత్రియవీరుడు అగ్నికణాల్ని రాలుస్తున్నాడు. వృద్ధరక్తం వేగంగా పారుతోంది. చెయ్యి ఒణుకుతూ యుండగా కైజారు క్రిందకుదింపి 'ఏమిటి' అన్నట్లు కనుబొమ్మ లెగురవేశాడు.

"నేను అసలయిన రాచవంశాన్ని జన్మించాను. మాతండ్రితాతలు ధైర్యశౌర్యములకోసము వీరస్వర్గం అలంకరించారు. మాతల్లి మానంకోసమయి అగ్నిని ప్రవేశించింది. క్షత్రియకూడుతిన్న చపటయినా, తన ప్రాణాన్ని పూచికపుల్లతోసమానంగా చూచుకుంటాడు. సమయంవస్తే రాచస్త్రీ కోకబిగించి యుద్ధంచేయగలదు. క్షత్రియవీరాంగన ఝాన్సీలక్ష్మీబాయిగురించి తెలుసా ?..."

"యీగొడవంతా ఎందుకు? అసలు సంగతేదో చెప్పక."

"తొందరపడవద్దు. నేను అటువంటి వంశంలో జన్మించాను. వీరిగురించితెలుసా అని దుర్మార్గపు టూహతో ఎవరూ వేలెట్టి మారాచస్త్రీలవంక చూపలేదు. అటువంటి వంశంలోజన్మించిన నాకు వీరికి పంచయిన వాడు నాకొక పుత్రుడా ? మన పెద్దబ్బాయిని కన్నతర్వాత, నావద్దపాలు లేవు. నేను పిల్లవాడికి, దాసీదానిచే పాలు యిప్పించాను. పెద్దబ్బాయి, రసాభాసంచేస్తాడనుకుంటూనే యున్నాను. అనుకున్నంత పనీ, జర్గియుండును."

"ఆఁ 'అన్నాడు క్షత్రియవీరుడు అత్యాశ్చర్యముతో' అందుకనే దాసీదానిపాలు, కత్తిని ఒరలో పెట్టించలేకపోయింది."

"అవును. అందులో, అబ్బురములేదు. అక్కడేలాజరిగిందేమిటి?" అనిఅన్నది క్షత్రియవీరుడి భార్య.

"అబ్బాయి కత్తిని ఒరలో పెట్టలేక, పడిపోయాడు. నేను వెంటనే యీలావిన్నాను. యింకా నయము ఏదుర్మార్గుడి చెడువార్త చెవినిపడేదో?"

"యికనేమి ? అటువంటివాడుపోతేనే నయము. రాచవంశాన్కి కళంకంలేకుండా !! చిన్నబ్బాయిని తీసుకెళ్లండి ?"

"క్షత్రియవీరుడు ఆశ్చర్యపోయాడు. యీలా అంటుందని, కలలోనైనా తలంచలేదు. 'శౌర్యము కోపము, రత్నాల్లాంటి యిద్దరు బిడ్డలకు అగ్ని పరీక్షా ?"

"యిద్దరుబిడ్డలే కాదు, సమయంవస్తే కోక బిగించి నేను యుద్ధంచేయగలను. మానంకోసం రాచస్త్రీ దేశాన్ని దహించగల్దు: భయములేదు. చిన్నబ్బాయిని తీసుకెళ్లండి ?"

యీమాటలకు క్షత్రియవీరుడు పొంగిపోయాడు.

"కాంతా, నీవే నా పత్నివి ! నీ మూలాన్నే, నాకును నావంశాన్కి పేరుప్రతిష్ఠలు రావాలి. నీవంటి వీరాంగనాగర్భమున జన్మించినందులకే, పెద్దబ్బాయి ప్రతిజ్ఞ నెరవేర్చవలసింది. కాని — కాని — పదిమంది గల దర్బారులో తనకు అవమానము కలిగిందే" అని కళ్లంబట రెండుకన్నీటిబిందువులు రాల్చాడు.

క్షత్రియపత్ని చూచింది. "క్షత్రియవీరాంగన ధైర్యశౌర్యములకోసము ఎటువంటిపనైనా జేస్తుందన్న సంగతిమాత్రము మరువవద్దు. చిన్నబ్బాయిని తీసుకెళ్లండి" అని హెచ్చరించింది.

యీ ఒక్కమాటతో క్షత్రియవీరుడు పొంగిపోయి భార్యవద్దకెళ్ళి, రెండుచేతులూ పట్టుకొని, "ప్రియా, రాచబిడ్డ వనిపించుకొంటివి సుమా !! నీవంటి క్షత్రియ వీరాంగనా హృదయముచూచి యిప్పటి పురుషులు గొప్పపాఠము నేర్చుకొనవచ్చును." అని గట్టిగా కౌగలించుకొని ఒక్కముద్దుపెట్టుకున్నాడు. ఒక్కముద్దుతో విద్యుచ్ఛక్తి మెరసినట్లుమెరసింది. శౌర్య రక్తం హృదయాల్లోంచి స్వేచ్ఛగా ప్రవహించింది. వీరరక్తం పొంగిపోయింది. భార్యాభర్తలు పుత్రుని సమదృష్టితో చూచారు.

"నాన్నగారూ! ఎందుకు భయపడతారు. అన్నయ్య మూద్రపాలు తాగినందుక్కాబోలు చురుకుతగ్గింది. రమ్మనండి ఎవడువస్తాడో ఎదుటివాడి హృదయం చీరాలి, చేతిలో కత్తిజారాలి, ఎదుటివాడిప్రాణాలు హరీఅనాలి- నాప్రాణాలు బొందినివిడువవాలి, ఎవడు నా ప్రతికక్షగానిలబడగలడో ?! రాచపీనుగు తోడు లేకుండా వెళ్లదుసుమా!!" అని గుండెవిరచి తొడ చాదాడు ఆ బొడ్డూడని నాలుగేండ్లబాలుడు. యీ మాటలకు క్షత్రియపత్ని ఆనందాన్కి మేరలేదు. క్షత్రియవీరాంగన బిడ్డవద్దకుపరుగెత్తుకువెళ్ళి కుమారుని ఎత్తుకుని "నీవే నా స్తన్యమును శ్వేచ్ఛగా గ్రోలితివి. నీవే నాపేరు నిలుపవలెనురా తండ్రీ !" అని హృదయమునకు గట్టిగాహత్తుకున్నది. క్షత్రియవీరుడి సంతోషాన్కి మేరయేలేదు. చెంగుమని ఒక్కదూకు దూకి, భార్యతోసహా కుమారుని కౌగలించుకొని "నీ మూలమున క్షత్రియవంశమున శౌర్యము నాశనము కాలేదని తెలుపవలెనురా ! తండ్రీ !" యని ఒక్కముద్దుపెట్టుకున్నాడు. ఆసమయముననే ఆబుగ్గనే అతనిభార్య, ముద్దుపెట్టుకున్నది. మరల యొకసారి విద్యుచ్ఛక్తి మెరసినట్లుమెరసింది. భార్యాభర్తల శౌర్యరక్తం పుత్రునిహృదయములోనికి పరుగెత్తింది. ఆనందబాష్పాలతో భార్యాభర్తలు పుత్రుని దీవించారు.

బాలుడు తల్లిచంకనుండి దిగి, "అమ్మా, యిదే నిన్నాఖరిసారి చూచుట. నాన్నగారితో పాదుషా దర్బారునకేగి, క్షత్రియవంశమున శౌర్యము నాశనము కాలేదని తెల్పి పేరు ఆచంద్రార్కము నిలబెట్టుకొని

వీరస్వర్గము అలంకరింతును" అని మాతృదేవికి నమస్కరించి, పాదుషాదర్బారుకు తండ్రితో నేగెను.

కేగి సభలోనికి రావచ్చునను ఆజ్ఞగొని యీ అయిదుగురువీరులను లోనికిపంపినాడు.

## ౨

వారు అయిదుగురు రాజపుత్రవీరులు. స్వస్థానము రాజపుత్రస్థానము. ముఖమున శౌర్యలక్ష్మీనృత్యము చేస్తోంది. ప్రతికక్షు లెవరయినా, నిలబడుదురేమో వారి పీచమడంచి, రాజ్యముగైకొందుమను నాశతో దేశదేశములు గ్రుమరుచుండిరి. ఏరాజ్యమున కెళ్లిననూ ఆయా దేశపురాజులు వీరికి జోహారొనర్చువారే కాని, ఒకరయిననూ ప్రతికక్షులుగా నిలబడలేదు. ఆనాడుదయమున ఒకమహమ్మదీయుని రాజ్యమున ప్రవేశించిరి. అది అతని ముఖ్యపట్టణము. ఆనగరమున వారు అయిదుగురువీరులూ పట్టణముచూచి, రాజదర్బారువద్దకెళ్ళిరి. ఆదర్బారులోనికేగుటకు, ఏడు సింహద్వారములు. ఆసింహద్వారములవద్ద కాపుండువారు ఉక్కుతునకలంటివారు. ఒకొక్కరూ పాతికమందికి జవాబు చెప్పగలధీరులు యీ క్షత్రియవీరులు ప్రథమద్వారము దాటునప్పుడు, అక్కడ కాపుండువారు వీరినిచూచి, "ఎవరు మీరు?" అని అడుగలేకపోయిరి. రెండవద్వారమువద్ద రాజవీరులు, సింహద్వారము దాటినతర్వాత "ఎవరుమీరు?" అని అడుగకపోతిమే" అని విచారించిరి. మూడవద్వారంవద్ద ఊరు పేరులు అడుగుదామని తల్చుచుండగనే వీరు సింహద్వారముదాటిరి. నాల్గవద్వారమువద్ద, "ఎవరు మీ రన్న ఏమి కొంపమునుగునో" యని ఊరుకుండిరి. అయిదవద్వారమువద్ద "ఎవరుమీరు?" అని కొంచెము కొగిసలాడారు కాని, ఆ మాట వీర్కి వినిపించలేదు. ఆరవద్వారమువద్ద "ఎవరుమీరు" అని అనగలిగారు. గాని, ఆమాట గట్టిగా పెగిల్చిరాలేదు. ఏడవద్వారము వద్ద కాపుండు కాపరులుమాత్రము ఉక్కుతునలంటి వారు. వారిలో మొదటివాడు మాత్రము "ఎవరు మీరు?" అని అడిగి, వెంటనే రెండవవానిని లోనికి పంపు ఆజ్ఞకొరకయి పంపినాడు. రెండవవాడు లోని

## ౩

అది రాజదర్బారు. మంత్రి వీరిని చూడగనే ఎదురేగి యీ అయిదుగురు క్షత్రియవీరులను, ఉచితాసనములపై కూర్చుండజేసెను. పాదుషా వీరిని చూడగనే ఆశ్చర్యపడి వారిధైర్యసాహసముల కనుగొని, "ఎవరుమీరు - మీది ఏదేశము?" అని ప్రశ్నించెను. వారిలో ఒకమొనగాడు లేచి "అయ్యా! మాది రాజపుత్రస్థానము. మేము క్షత్రియపుత్రులము. మాకు, ఏదేశపురాజయిననూ ప్రతికక్షగా నిలబడునేమో వార్కి మా ధైర్యశౌర్యముల చూపవచ్చునను నాసతో, దేశదేశములు గ్రుమ్మరుచుంటిమి. ఇంతవర్కు అటువంటివా రెవరూ ప్రతికక్షగా నిలబడలేదు. అసలయిన రాచబిడ్డకూడా తన పీక తెగిననూ, ప్రతికక్షుని చంపనిదే, వీరస్వర్గము అలంకరించదు. అటువంటివా రెవరయిననూ, మీ దర్బారులో కలరా? మాలో ఎవరితోనైననూ యుద్ధముచేయవచ్చును. లేదా మీరు మాలో ఎవరితలనైననూ నరుకుడు. తల క్రిందపడినను, ఒరలోని కత్తితీసి, ఎదుటివానిని చంపి తిరిగి తనకత్తినిఒరలోపెట్ట సాధ్యమంతుడు. యీ రెండువిధములలో, ఏఒక్కదానిచే నయిననూ మీరు మా పౌరుషమును కనుగొనవచ్చును. రాచపీనుగు తోడులేకుండా వెళ్లదునుమా" అని కూర్చుండెను. యీ మాటలకు పాదుషా ఆశ్చర్యపడి అయ్యా! మీతో సరిసమానముగా పోరువాడు, మాకొల్వులో లేరని చెప్పవచ్చును. గనుక మీధైర్యశౌర్యముల రెండవవిధముగా చూపుడని పల్కెను. యీ మాటకు వీరుడు లేచి, రాజా! మాపౌరుషమును రెండవవిధముగా మేము చూపనక్కరలేదు. ఏడేండ్ల బాలుడు క్షత్రియబిడ్డయే చూపగలడు. రేపు మా ధైర్యశౌర్యముల చూపగలమని, అయిదుగురు వీరులు సభనుండి నిష్క్రమించిరి.

మరునాడు, దర్బారంతయూ కిటకిటలాడుచుండెను. యీ అయిదుగురు వీరులునూ వారిలో ఒకనిపుత్రునితోసహా దర్బారుకువచ్చిరి. ఆ సభలో మంత్రులూ, సామంతులూ, వీరులూ, పౌరులూ, నవుకరులూ, కాఫరులు మొదలగువారితో నిండియుండెను. వీరందరూ, క్షత్రియబాలుని ఆశ్చర్యముతో తిలకించుచుండిరి. వీరులలో ఒకడులేచి 'ప్రభూ! మేము నిన్న ప్రతిజ్ఞచేసినప్రకారము మాధైర్యశౌర్యములను యీ బాలుడు చూపగలడు' అని పల్కెను. యీమాటలు క్షత్రియబాలుడు విని, "రడీ" అనునటుల, ఒరలోనికత్తితీసి నిలుచుండెను. ఒకబుగ్గగిల్లిన నీరు, మరొకబుగ్గగిల్లిన పాలునూ కారు యీ బాలకునిచూచి, ఆశ్చర్యపడి, 'అయ్యా! నూనూగు మీసమయిననూ సరిగాలేని యీ బాలుడా తనధైర్యముల చూపునది' అని హేళనపూర్వకముగా పల్కెను. అంత వీరులు "అవును చిన్నతనమున లేని ధైర్యసాహసములు, పెద్దయిన తర్వాత వచ్చునా? క్షత్రియబాలురకు ధైర్యసాహసములు, ఉగ్గుపాలతో పుట్టుననుసంగతి వినరే?" అని అయిదుగురువీరులూ ఏకగ్రీవముగా పల్కిరి.

పాదుషా సరేనని మంత్రివంకచూచెను. మంత్రి పక్కకుతిరుగగా, "నేనున్నానుగా" అన్నట్లు ఒకడు కత్తిపుచ్చుకు సిద్ధమయ్యాడు. క్షత్రియబాలుడు కత్తిని ఒరలోనిమిడ్చి, ప్రధమున తండ్రికిని, తర్వాత మిగిలిన వీరులకు నమస్కరించి, దూరముగా నిల్చుండెను. భటుడు పాదుషాకు, మంత్రికిని, నమస్కరించి బాలుని వద్ద నిల్చుండి రాజాజ్ఞకొరకయి నిరీక్షించుచున్నాడు. పాదుషా "రడీ" అన్నట్లు కన్నుగీటాడు. భటుడు బాలునితలనరికాడు. వీరబాలుని వెచ్చనిరక్తము వరదలై పారుకొంది. తనశిరస్సు క్రిందపడినవెంటనే క్షత్రియబాలుడు కత్తిని ఒరలోనించితీసి భటునితల నరికాడు కాని, కత్తిని ఒరలోనిమిడ్చలేక వెంటనే పడిపోయాడు. యిది అంతయునూ చూచుచున్న క్షత్రియవీరుడు, చెంగుమని బాలకునిమీద కురికి అతనికైజారు గైకొని పరుగెత్తుకునిపోయాడు. యిది అంతయూ చూచుచున్న సభికులు పాదుషాయును, ఆశ్చర్యపడి యిదియేమని మిగిలినవీరుల నడిగారు. వారు సంగతంతయూ వెంటనేగ్రహించి "ఏమియునూ లేదు, అతడు వెంటనే తిరిగివచ్చు"నని చెప్పిరి.

అటుల క్షత్రియవీరుడు పరుగెత్తుకుని, సత్రము వద్దకు వచ్చుటయునూ, అతని భార్యను "నీకొడుకు తండ్రెవరు" అని నిలువతీసి అడుగుటయునూ ఆమె, దాసీదానిపాలు పెద్దబ్బాయికిపోయుటచే, అతనికి చురుకుతగ్గెనుగాబోలు! అని, రెండవఅబ్బాయిని తీసుకెళ్లమని, హెచ్చరించుటయునూ, మొదలగునవి మొదటిప్రకరణమున చదివియే యున్నారుగదా?

## ౪

కొంతసేపయిన తర్వాత క్షత్రియవీరుడు, తన రెండవకుమారుని గైకొని, దర్బారునకు వచ్చి, పాదుషాకు నమస్కరించి, 'ప్రభూ! అతడు అసలయిన క్షత్రియరక్తమున జన్మించిననూ, దాసీదాని పాలచే పెంపబడెను. అందువల్లనే తన ప్రతిజ్ఞ నెరవేర్చుకొనలేకపోయెను. యితడో, క్షత్రియరక్తమున జన్మించి వీరాంగనాస్తన్యమును గ్రోలుటచే ధైర్యశౌర్యములు కలవాడు. గనుక రాచవారి ధైర్యశౌర్యములు యితనివల్ల పరీక్షించవచ్చు' నని పల్కెను. యీమాటలకు పాదుషా ఆశ్చర్యపడి "రాజపుత్రా! యిందాక నీ కుమారుడు, తనధైర్యశౌర్యములు చూపలేదా? రాచవారి పౌరుషముకొరకు, పండువంటి యిద్దరు బాలురకు మరణశిక్షా?" అని అన్నాడు. అంత క్షత్రియవీరుడు "ప్రభూ! క్షత్రియపుత్రుడు తన ధైర్యమును చూపవలసినప్పుడు తల్లిగర్భములోనుండీ కూడా కత్తిపుచ్చుకుని సిద్ధమవగలడు. మున్ను అభిమన్యుడు, తల్లిగర్భములోనుండి పద్మవ్యూహము భేదించుట నేర్వలేదా? క్షత్రియవీరుడు చివరకు తన ప్రాణమునయినా, యివ్వ నిశ్చయించునుగాని, అవ



మిస్. జి. కృపామయిదేవి- మిస్. జి. విమలాదేవి
ఈయుక్కాసెల్లెంద్రదు శ్రీయుత గోటేటి సూర్యప్రకాశ
రావుగారిపుత్రికలు. కటకం గవర్నమెంటు మెడికల్
కాలేజీలో విద్యార్థినులు. తూ॥ గోదావరిజిల్లా
బోర్డువారు మొదటివారికి రూ. 30 లున్ను,జయ
పురం మహారాజావారు రెండవవారికి
రూ. 25 లును మాసికవిద్యార్థివేతన
మిచ్చుచున్నారు.



మిస్. భిక్కూబాట్లివాలా
బార్ - ఆట్ - లా, బరోడా సంస్థానమున
న్యాయాధికారిణిగా నియమింపబడెను.



శ్రీమతి అత్యాం సత్యవతీదేవిగారు
శ్రీయుత ఎ. యస్. మూర్తి, యం. ఎ.
(న్యూయార్కు)గారి సతీమణి.
వైశ్యయువతులలో మేటి. జిల్లాబోర్డు మెంబరు,
ఆనరరీ మేజస్ట్రేటు మొదలగు గౌరవోద్యోగ
ములఁజేసి ప్రఖ్యాతినొందిన యిల్లాలు.
మానవ సేవాపరాయణ.



సంతాననిరోధ ప్రచారకురాలగు
మిస్. మార్గరెట్ సాంగర్
అఖిలభారత మహిళా మహాసభకై
వచ్చుచున్నారు.

మానమును భరించలేదు. యీనాడుకాకపోయిననూ, మరొకనాడయిననూ, ఏ దుర్మార్గుడీ చెడువార్త వినవలసివస్తుందో! గనక యీశుగ్రవానివల్ల మాధైర్య శౌర్యములు చూడక తప్ప"దని క్షత్రియవీరుడు రెట్టించి పల్కెను.

పాదుషా తిర్గి యెన్నియో నీతులు చెప్పెనుగాని, వీరుడు వినలేదు. చివరకు పాదుషా విసిగి, మంత్రివంక చూడగా, మంత్రి పక్కకుతిర్గెను. వెంటనే ఇంకొకడు సిద్ధమయ్యాడు. రాచబిడ్డ ప్రథమమున తండ్రికిని, తర్వాత మిగిలిన వీరులకూ పాదుషాకూ నమస్కరించి, రాచపౌరుషము ఉట్టిపడుచుండ, విజయలక్ష్మి నృత్యముచేయగా ధైర్యముతో ఎడంచేత్తో ఒరను కుడిచేత్తో కత్తిపిడిని పట్టుకుని నిలుచుండెను అంత భటుడు పాదుషా ఆజ్ఞగొని బాలునితల నరికెను. ఉడుకురక్తం వెల్లువలై పారింది. వీరరక్తం వేగంగా ప్రవహించింది. యీదృశ్యము గాంచలేక సభికులు, కండ్లుమూసుకున్నారు. భటునియొక్క "బాబోయి" యను కేకతో సభికులు కళ్లుతెరిచారు! బాలుడు తన తల నరుకబడి కిందపడియున్నాడు. భటునిహృదయము చీలి, లోని పేగులనిచయం బయటకు లాగబడి, బాలునిపక్క పడియున్నాడు. రాచబిడ్డ ఒరలోని కత్తిని బయటకు తీయుటయూ, వానిహృదయము చీల్చి, లోనిపేగులన్నియూ బయటకులాగుటయూ, తిర్గి కత్తిని ఒరలో పెట్టుటయూ, మొదలగునవి ఎవ్వరూ చూడలేదు. యిదిఅంతయూ క్షణకాలములో జరిగిపోయినది. యిదిచూచుచున్న పాదుషా ఆశ్చర్యముతో, సింహాసనమునుండి దిగి, బాలకుని ఎత్తుకొని, ఒక్క రాచవారి పౌరుషముచూపుటకు, రత్నాల్లాంటి యిద్దరు బిడ్డలకు యిటువంటిశిక్ష విధించినందుకు, క్షత్రియవీరులను నిందించెను.

మరునాడు పాదుషా పట్టణమునంతయూ అలంకరింపచేసాడు. రాచబిడ్డల శరీరములనిండా, రకరకాల పుష్పములతోను, పరిమళద్రవ్యములతోను, మంచి ఎత్తిపేసారు. పాదుషా తన మంత్రులతోను సామంతులతోను, వీరులతోను, పౌరులతోను పాదచారియై యీ బాలకుల శవములను వూరేగించి వారిపేర ఆచంద్రార్కము నిలచునట్లు పాలరాతితో గోరీల కట్టించాడు. పాదుషా కన్నీటితో స్వహస్తముతో బాలకుల శరీరములను, గోతులలో పరుండబెట్టాడు.

యీ ముద్దులొలుకు బాలకులను గాంచి, కంట తడిబెట్టని పౌరులు లేరు. యిప్పటికీ ఆవూరిపౌరులు, ఆ గోరీలనుచూచి, వారి ధైర్యసాహసముల పొగడి కంట తడిబెట్టా యుంటారు. ఆగోరీలు, చెక్కు చెదరక, యిప్పటికీకూడా ఆ వీరబాలకుల ధైర్య సాహసముల జ్ఞప్తికితెస్తూయుంటాయి. పాఠకులారా! మనమొకమారు ఆ గోరీలను పరికింతమురండు. అదిగో, గోరీలు పాలరాతితోను గట్టిపనితనముతోను నవరత్నముల కూర్పుతోను బంగరు అక్షరములతో పొందింపబడి ఎట్లు విరాజిల్లుచున్నవో? తమతండ్రి చేసిన ప్రతిజ్ఞకొరకయి తమ ప్రాణముల నర్పించిన ఆబాలకుల గోరీలను, పరికించిరే? ఆహా! ఏమి ఆపితృభక్తి, ఏమి వారి ధైర్యసాహసాది గుణములు!! త్వరలో మనదేశపు బానిసత్వము బాపుకొనుటకయి, యిటువంటి పుత్రుల ప్రసాదించమని, ఆ భగవంతుని ప్రార్థింతుమురండు.

*

పాదుషా యీ క్షత్రియవీరులకు, అనేక జాగీరు లిచ్చి తనవద్దనే యుంచుకొన్నాడు. క్షత్రియవీరులు పాదుషాయిచ్చిన జాగీరులన్నియూ తీసుకొని, పాదుషాకు కుడిభుజమయియుండి, అతని కష్టసుఖములు సరిసమానముగా ననుభవించుచూ, చాలాకాలము పాదుషాకొల్వులో అగ్రస్థానమువహించి యున్నారు. యిది మిగతావారికి, కష్టముగాయున్ననూ వీరి ధైర్యాదిగుణముల తలంచి కిక్కురుమనకుండిరి. యీ క్షత్రియవీరులు వచ్చినతర్వాత పాదుషా తనరాజ్యమును ఎక్కువుగా విస్తరింపచేసాడు. తర్వాత,

కొన్నాళ్లకు యీ ఓడిపోయిన రాజులందరూ ఏకమయి, పాదుషామీదకు దండెత్తిరాగా వారితో యుద్ధముచేసి, శత్రువులనోడించి ఆ యుద్ధములోనే యీ అయిదుగురు వీరులూ తమ ప్రాణమును గోల్పోయి పాదుషాయొక్క ఋణమును తీర్చుకొన్నారు.

యీ రాజపుత్ర బాలురు చనిపోయినతర్వాత వారితల్లితండ్రులకు మరి సంతతికల్గలేదు. మిగత నల్గురు వీరులకు సంతతిగల్గి, వారివల్ల వంశము వృద్ధిపొందింది. కాని వీర్కి సంతతి గలుగకపోవుటచే ఒకవంశము పడిపోయింది. అందుకనే యిప్పటి క్షత్రియులకు నాల్గుగోత్రములే! పూర్వపు క్షత్రియులకు అయిదు గోత్రములుండేవి. ఆహా! క్షత్రియపౌరుషమును తిలకించిరే? తనరక్తమువల్ల జన్మించిన యిద్దరుబిడ్డలు చనిపోయినప్పటికీ విచారించకుండా క్షత్రియకార్యము చూపగలిగితిమికదా యని ఆనందించాడు.

అఖరి యుద్ధములో యీ క్షత్రియవీరుడు చనిపోయిన తర్వాత అతనిభార్యకూడా శోకబిగించి కత్తిపుచ్చుకుని రణరంగమున ప్రవేసించింది. యుద్ధభూమిలో ప్రవేసించి ఆరురోజులు శత్రుమూకనంతయూ, చీల్చి చెండాడించి ఆ యుద్ధములోనే తన ప్రాణమును గోల్పోయింది. శత్రుపక్షమువారు వీరునిభార్యతో ధర్మయుద్ధము చేయులేక, కొన్నివేల మంది ఒక్కుమ్మడి వీరుని భార్యమీద పడ్డారు. అంతమంది వీరునిభార్యమీద పడినప్పటికీ యీమె జంకక శత్రువులనందరినీ చీల్చి, చెండాడి ఆ యుద్ధములోనే తన ప్రియపుత్రులను, భర్తను, కలుసుకొనుటకు వీరస్వర్గము అలంకరించింది.

తర్వాత పాదుషాకు యీ సంగతంతయూ తెలిసి యుద్ధములో విజయలక్ష్మి తన్ను వరించిననూ, చూడక భార్యాభర్తల శవములను నగరమంతయూ నూరేగించి వీరి పుత్రుల గోరీలపక్కనే పాతిపెట్టి పాలరాతితో గోరీలు కట్టించి కన్నీటితో గోరీలమీద పుష్పముల జల్లాడు.

క్షత్రియశౌర్యము చూపుటకొరకయి రత్నాల్లాంటి యిద్దరు బిడ్డల స్వహస్తముతో నప్పగించి, భర్తకు సహాయము నిమిత్తము యుద్ధరంగమున ప్రవేసించి యజమాని ప్రాణము నిలుపుటకు, ఒకస్త్రీ శత్రుమధ్యమున ప్రవేసించి శత్రుమూకను చీల్చి చెండాడిన క్షత్రియవీరాంగన మరుపునకువచ్చునా? పాఠకులారా, మరొకసారి గోరీల తిలకింతమురండు! ఆహా! ఏమి ఆ దివ్యవర్చస్సు! ఆ గోరీలమీద నెట్లు ప్రతిఫలితమగుచున్నదో పరికించితిరా? ఏమి ఆ క్షత్రియవీరాంగన ధైర్యసాహసములు!! యిటువంటిస్త్రీలు నల్గురుండిన చాలదే భారతదేశమున విజయలక్ష్మి నృత్యముచేయుటకు! తన గర్భమున జన్మించిన పుత్రులను స్వహస్తముతో వధకు నప్పగించి శత్రుమూకను ఆరు అహోరాత్రములు చీల్చి చెండాడించి తన యజమానికి విజయలక్ష్మిని నప్పగించిన ఒకస్త్రీ అబలా?

అవునవును దుర్భరపురుషు లంతకన్నమన గలరు! సమయమురాకపూర్వము అబలలే సమయము వచ్చిన తర్వాత ప్రబలలే.

# నీవే యింటింటా

అమ్మా! గృహలక్ష్మి తల్లీ! నీవు మాయింటికి యిలావస్తావో లేదో — నిన్నోమారు మేము కళ్లారా చూస్తామో లేదో — నిన్ను ఎవరో వొహరు — యిరుగువారో, పొరుగువారో — తీసుకువెళ్లిపోతారు. నిన్ను వెతుక్కుని తిరిగి మాయింటికి తీసుకురావడానికే మాకు ఎంతో బ్రహ్మాండం అవుతోంది. ఒకవేళ వచ్చావే అనుకో, యేదోవొకటి, యెక్కడో అక్కడ విడిచిపెట్టి వస్తావ్; యేవమ్మా, యీలాచేశావంటే, ముశిముశినవ్వులు నవ్వుతావ్.

ఆచంట సత్యవతమ్మగారు వ్రాసిన ముత్తుపల్కులు ముచ్చటగా మరోమారు చూచుకుందామా అనుకుంటే, అదెక్కడో వదిలిపెట్టి వచ్చేశావ్; తల్లివొళ్లో కూర్చున్న బొజ్జవినాయకుణ్ణి కళ్లారా చూద్దామా అంటే, వాడ్ణియెక్కడో ఆడుకోడానికి విడిచేశావ్; సింహవాహనమెక్కిన శ్యామలాదేవిని పటం కట్టించుకుందామా అనుకుంటే ఆమెను యెవరికో అర్పణంచేశావ్; మాచెల్లాయ్ పుట్టినప్పుడు మాఅక్క, ఎరిడమ్మపాట పాడమంటే ఆపాటకోసం వెతుక్కోడమే అయింది గాని దాన్ని యెక్కడా కనిపించకుండా చేశేశావ్! యేంవమ్మా; యీలాచేయడం మంచిదేనా అంటే, ఎవరో నాయందువుండే ప్రేమచే తీసుకున్నవాటికి, మీరు ఆశ పడవద్దని సంజ్ఞచేస్తావ్.

ఆహా! తల్లీ, నీప్రేమ యెంత సమానమైనది; యెంత నిర్మలమైనది; యెంత మెచ్చుకోతగినది — యెచ్చుతగ్గులేని నీ ప్రేమవంటి ప్రేమయే మా అందరికీ సమానంగా అలవడేలాగ, నీవే 'యింటింటా ప్రవేశించి' నిన్ను పూర్తిగా చూచుకునేభాగ్యం అందరికీ కలుగచేద్దూ, తల్లీ.

పోడుగంటి శ్యామల.

# మనుమరాలు

రాజ వేంకటపద్మనాభ రావుగారు

ఒకప్పుడు ఆమెముఖం పూర్ణచంద్రుని వలె దివ్యమోహనంగా ఉండేది. చిరునవ్వు లందు చిందులాడేవి. వికసించిన పుష్పముల వలె ఆమె నేత్రములు విద్యుత్కాంతులు వెదజల్లేవి. సరిగా దువ్వబడిన ఆమె ముంగు రులు ముఖముమీద నాట్యం చేస్తోండేవి. శిఖలోసిపూలు నూత్నశోభను కలిగించేవి. చక్కని చీరలు ధరించేది. రంగురంగు రవికెలు తొడిగేది. శ్రవణానందకరమగు గానమునకు ఆమె అనుదినము వింతమెరుగు పెట్టేది. ప్రపంచములో తనే సుఖజీవి అని అనుకునేది. ఆనందడోలికలలో ఊగులాడేది......అవి పూర్వపురోజులు.

కాలచక్రం తిరిగిపోయింది. మెరుపులేని అమావాస్యరాత్రి ఆమెజీవిత మిప్పుడు. గత దినములు నక్షత్రమాత్రంగా మిణుకుమిణుకు మంటున్నవి. యిప్పుడు ఆమె స్మృతిపథమున అవి వెలుగునీయలేవు. అమావాస్యయనుట కవే ప్రత్యక్షము. కళావిహీనమైన ఆమెవదన మందు విషాదము రేఖలుదిద్దింది. దుఃఖమా హృదయములో గడ్డ కట్టుకుంది. ఎప్పుడూ కన్నీటి బిందువులు రాలుస్తుంది. ఎన్నడైనా సవతితల్లి చీవాట్లుపెట్టితే నేత్రాంతికములలో శోకం కుదించుకొని క్రిందకు చూస్తుంది. నోరెత్తి మాట్లాడలేదు; చీకటిగదిలో శిథిల మైన నిద్రతో మంచంమీద పరుండియుం టుంది. పనిచేయలేదని తిడితే కన్నులు చిల్లులుపడేటట్లుగా ఏడుస్తూ పనులుచేస్తుంది. ఆభగ్నహృదయమునకు సంతోషమెక్కడిది? ఆమెయొక ప్రేమపిపాసిని. కాని యొక విపరీత విధి యాహృదయమందలి యానందజ్యోతి నెత్తుకుపోయింది. నేడొకశూన్యహృదయము. అందు జీవవాహినులు యింకిపోయినవి. ఆమె యొక నిర్జీవప్రతిమ...ఆమె నేడు అనాథ.

అయినా ఒకనాడు ఆమెకోర్కెలు రెక్కలుకట్టుకుఎగరటానికి ప్రయత్నించాయి. కాని పంజరం అడ్డువచ్చింది. నల్లటి కురుల చాలును బాగాదువ్వి జడవేసుకుంది. ఎక్కడో పెట్టెఅడుగున దిక్కుమాలిన బ్రతుకుతో దీనంగా చూస్తున్న చీరెనుతీసి కట్టుకుంది. అద్దంలో చూసుకొని సంతోషిద్దామని, ఆ విధముగానైనా కోరికలను ఆనందపరుద్దామని తలచింది. ఈమాత్రానికే, దేవుడు సహించ లేకపోయాడు. తల్లికంట బడింది. గ్రుడ్లు చింతనిప్పులులాగ మెరుస్తున్నాయి:—

'ప్రభా! నీకు జ్ఞానంలేదా? ఎన్నిసార్లు చెప్పాలి? పరువుప్రతిష్టలులేవా నీకు? లోకు లేమనుకుంటున్నారు? చెడిపోయే రోజు లొచ్చాయి నీకు; రోజురోజుకు యిలాటి బుద్ధులు పుడుతున్నాయి ఏమిటి?' అని తల్లి ప్రభజడలోని పూలుతీసి నేలకు కొట్టింది. నోరులేనిపూలు స్పృహతప్పి క్రిందపడి పోయాయి.

నిశ్చేష్టురాలయింది ప్రభ. గడగడవణి కింది. గ్రుడ్లుకరిగి చెక్కిళ్ళమీద ప్రవహిస్తు న్నాయి. నోటమాటలేదు. తల్లివంకదీనంగా

చూచింది. తల్లికళ్ళలో కనపడే కఠినతకు ఎదురుగా నిలబడలేకపోయింది. శోకభారం దుర్భరమయేసరికి ప్రక్కగదిలోని కెళ్ళింది. మంచంమీదకూర్చుని వెక్కి వెక్కి ఏడవటం మొదలుపెట్టింది.

కొంచెంసేపయాక తండ్రి లోపలికివచ్చాడు. తల్లితీక్షణదృక్కులకు ఆమెవదనం కమిలిపోయింది; హృదయం కుమిలిపోయింది. చూచేటప్పటికి చాలవిచారంవేసింది అతనికిది. ఆమె నవయవ్వని. సహజంగా కోర్కెలుంటాయి. కన్నులు మూయగలంగాని మనస్సు మూయగలమా? బిక్కముఖంతో కూర్చుంది పాపం! తండ్రి చాలా ఖిన్నుడయాడు. కాని సంఘాన్ని ధిక్కరించలేడు. కూతురుకోసం తన పరువు ప్రతిష్టలు పోగొట్టుకోలేడు. పైకి కఠినుడుగా వుండకపోతే కూతురు చెడిపోతుందని యతనిభయము.

'ప్రభా! నీవు కొంచెం హద్దుమీరుతున్నట్లు కనబడుతుంది. ఈవేషం ఏమిటి? ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు? ఏమీ లాభం లేనపుడు వెర్రికోర్కెలు పెట్టుకుంటే ఏమి ప్రయోజనం చెప్పు? నీవంటే సంఘానికి చులకనయౌతుంది. కొంచెం జాగ్రత్తగ మెలగాలి.' అన్నాడు.

అశ్రుపూరితనయనాలకు చీరె చెంగు అడ్డుపెట్టుకుంది ఆమె.

రాత్రి తొమ్మిదయింది. ప్రభగదిలో ఒక మూలకూర్చుంది. ఉండివుండి కొంగుమాటున కంట తడిపెట్టుకుంటోంది. ఆడుజన్మంత వెధవ జన్మ ఏదీ లేదనుకుంటుంది; అందులో బాలవితంతువుఅగుట ఎదో ఘోరపాతకాలఫలితం అనుకుంది. ఇలా ఆలోచిస్తూ, ఆలోచిస్తూ నిద్రపోయింది...తల్లివచ్చి నిదుర హృదయం అదిరేటట్లు పిలిచేటప్పటికి తియ్యనికలకంటోంది. నిద్రలేని ఆమెకన్నులు కెంపులులాగ మెరుస్తున్నాయి. తల్లి మాటలు ఆమె హృదయంలోని చిచ్చును విసురుతున్నాయి. అస్వతంత్రురాలు ఆమె.

మేడమీద రమేషు యింకా నిద్రలేవలేదు. క్రిందటిరాత్రి జరిగిన సంగతంతా అతనికి తెలియదు. సవతితల్లి అంటే అతనికీ అసహ్యమే. ప్రభయందు అతనికి ఎక్కువ ప్రేమ. ప్రభ వచ్చి అతనిని నిద్రలేపింది.

'ప్రభా! రాత్రి నాగదిలోనికి రాలేదేం? నిన్ను పిలుద్దామనుకున్నాగాని మాటలతో ప్రొద్దుపోతుందేమో అని పిలవలా.'

'పోనీలే. ఇంకా నిద్రలేవలేదేమి? నిన్న పిన్ని కేకలేసింది అన్నయ్యా!'

'మళ్లీనా? ఎందుకు?'

'నాకు పెళ్లిలోపెట్టిన చీరకట్టుకుని, ఎలా వుంటానో చూద్దామని చెట్టునకోసి రొండు పూలు పెట్టుకున్నా. ఎందుకో పిన్ని ఆగదిలోని కొచ్చింది. నానాచీవాట్లు పెట్టింది.'

ఆమె నేత్రాలలో అమాయికత్వం, జాలి కనుపిస్తుంది.

'నాన్నగారికి తెలిసిందా?'

'రాత్రి నాన్నగారుకూడా కలిశారు'

ప్రభ, పొంగి పొంగివస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది. వెక్కి, వెక్కి ఏడ్వ సాగింది. రమేషుహృదయం తరుక్కొ పోయింది. ఆమె చూపులలోని దుఃఖం, నిస్సహాయత అతన్ని కలిచివేచాయి. కొంచెం సేపు ఏదో ఆలోచించాడు. ప్రభను దగ్గిరకు లాక్కొని ముద్దుపెట్టుకున్నాడు.

'ప్రభా! పోనీలే. అయిపోయిందేమో అయిపోయింది. విచారపడబోక'

'అన్నయ్యా!... —'
'ఏమిటీ చెల్లీ? చెప్పు పరవాలేదు'

'—ఏమీ లేదులే. నీవువెళ్లి ముఖం కడుక్కొరా నేనిక్కడే కూర్చుంటా'

♦ ♦ ♦

నాలుగైదురోజులు గడిచాయి. రమేషు మనసు స్థిమితంలేదు. ప్రభకూడా అలాగే కనపడింది. ఒకరోజున ప్రభకు తీవ్రమైన కడుపునొప్పి వచ్చింది. రమేషు డాక్టరిని తీసుకొచ్చాడు. డాక్టరు ప్రభను పరీక్ష చేశాడు. 'పేగులలో బాధ; వెంటనే చెన్న పట్నం తీసుకుపోయి ఆపరేషన్ చేయించాలి' అని సలహాయిచ్చాడు.

రమేషు, డాక్టరు మిత్రులు.

ప్రభను రమేషు పట్నం తీసుకెళ్లాడు. రమేషు దగ్గరనుండి రోజు వుత్తరా లొస్తు న్నాయి. ఆరోగ్యం చేకూరుతుందని తండ్రి భ్రమించాడు. ఒకరోజున ప్రభకు చాల ఎక్కువగావుందని వుత్తరం వచ్చింది. ఆ సాయంత్రమే 'టెలిగ్రాము' ప్రభ మరణించిందని. పిడుగువంటి వార్తకు తండ్రి కూలీ పోయాడు. సంఘానికివెరచి తన కూతురి యందు చూపించిన క్రూరత్వము తలపు కొచ్చింది...ఆ తలపులే అతనిని పీల్చివేయ టం మొదలు పెట్టాయి. 'పోనీ, చనిపోయింది అదృష్టమంతురాలు'అని అపుడపుడు మనసును శాంతపరుచుకునేవాడు.

♦ ♦ ♦

అలాగే సంవత్సరం నాల్గు అడుగులు వేసింది. ఆనాడు దీపావళి ఎచటనూచినా టపాకీలమ్రోతలే. ఊరంతా కోలాహలంగా వుంది.

రమేషు పండుగకు యింటికొచ్చాడు. ఇల్లంతా వెలావెలాపోతుంది. ప్రక్కగదిలో నుంచి మాత్రం మూల్గులు వినపడు తున్నాయి. తండ్రి మంచముమీద బలహీ నతతో పరుండివున్నాడు. రమేషు వెంటనే డాక్టరుని పిలుచుకొచ్చాడు. డాక్టరు జబ్బేమీ లేదన్నాడు. రమేషుకు అంతా బోధపడింది.

ఆ ఉదయము రమేషు రెండేండ్లపిల్లను ఎత్తుకొని తండ్రిదగ్గరకువచ్చి ఆయనకు అందించాడు. ఆపిల్లనుచూస్తే సంతోషం, దుఃఖం వచ్చాయి తండ్రికి; ఒక అవ్యక్త ప్రేమ అతనిని పెనవేసింది. కన్నులవెంట నీళ్లు బొటబొటకారాయి. ఆబిడ్డను తనివితీర ముద్దు పెట్టుకున్నాడు.

'గోపాలకృష్ణమూర్తిగారి మనుమరాలు'
'ఏమిటీ? రామమోహనరావు కూతురా?'
'అవును'

'అతను పోలీసుసూపరెంటు కాఁదా యిప్పుడు?'

'అవును'

'అతను వితంతువివాహం చేసుకున్నాడు కదూ?'

'ఉఁ'

'గొప్పవాళ్లాయను. వాళ్ళనేమిఅంటానికి వీలులేదు. సంఘం గొప్పవాళ్లనేమీ చేయ లేదు. తక్కువ వాళ్లమీద విరుచుకోపడు తుంది.—ఎప్పుడొచ్చాడు?'

'నేనూ అతనూ కలిసివచ్చాము. పాపం! బాల్యస్నేహం మరిచిపోలా. నేనంటే అతనికి చాలాయిష్టం. ఆనిక్కా మనయింటికొస్తాడు.

♦ ♦ ♦

రామమోహనరావు భార్యతో రమేషు యింటికొచ్చాడు. రమేషుతండ్రి నిర్ఘాంత పోయాడు. నిశ్చేష్టుడయాడు. అలాగే కుర్చిలో కూలపడిపోయాడు. కొంచెంసేపటికి తెప్పరిల్లాడు. అప్రయత్నంగా చేతులు జాచాడు. ప్రభ అతని కౌగిటిలో వాలింది. తండ్రి కూతురులు తన్మయులయారు.

ప్రభ ముఖంలో నూత్నవికాసము కన బడుతూంది. ఒకనాడు తనదుఃఖానికి, తండ్రి దుఃఖానికి కారణమైన సనమల్లికలు నేడు, ఆమె కచవల్లరులలో వొయ్యారముగా నిలిచివున్నాయి. ఆమెవదనమున ప్రజ్వలించు చున్న తేజః పుంజములచే, ఆయనముఖం కాంతియుతమైంది. శరీర మాంద్యము మాయమై పోయింది .....ఆరోజు వారిల్లు ఆనందసాగరం!

ప్రేమ ప్రతిఘటించింది. సంఘం నిరోధిం చింది. ప్రేమ జయించింది. సంఘం ఓడి పోయింది.

"ఓ నఁడు"

మ॥ అసలేకోఁతి; నిషాబిగించినది; దయ్యంబావెట్టం బట్టుటన్ ।
డెసలం బర్విడి నిప్పుద్రొక్కఁగొనియెన్ ! దేలంతటం గుట్టఁగన్ ।
ట!! సరోజాక్షు, యిదేప్రకార మయినాఁడం జూడుమా: నీవు ది
వ్యసహాయం బొనఁగూడకున్న నిఁక నేమైపోదునో యియ్యెడన్ ॥

# టి. సి. యన్. గోల్డన్ మెటల్ జ్యూయలరి మార్టువారి

## వివిధ రకముల

ఆభరణములు, లోకప్రశస్తమైనవి.

వివిధ రకములలో సౌందర్య
పోషణ ప్రయత్నమే
మా ఆశయము.

ఉంగరము 1-కి. రూ. 2-0-0
గాజులు పెద్దసైజు జత 1-కి 3-0-0
,, మీడియంసైజు జత 1-కి 2-8-0
,, బేబిసైజు జత 1-కి 2-0-0
చైను పెద్దసైజు పేట 1-కి 7-0-0
,, బేబిసైజు పేట 1-కి 5-0-0
వంకీ వడ్డానము పెద్దసైజు 1-కి రూ. 20 0-0
,, బేబిసైజు 1-కి రూ. 15-0-0
గుండీలు 1-కి అణాలు 0-5-0
షర్టు చేతిగుండీలు సెట్టు 1-కి 2-0-0
గజ్జలుకట్టిన వంకి 1-కి రూ. 15-0-0
సాదావంకి గజ్జలులేనిది 1-కి 7-8-0

వి. పి. ఖర్చులు ప్రత్యేకము.




ప్రత్యేకము స్త్రీలకొరకు స్థాపింపబడినది.

మాచేత తయారుచేయబడెడు మెటల్ బంగారు ఆభరణములు మా సోదరీమణులకు సంతృప్తికలుగ జేయునని నిశ్చయముగా చెప్పగలము. ఒకసారి మీ దృష్టిని మా నగలపై ప్రసరింపజేసినచో మీ సౌందర్యాభిలాషులమగు మా ప్రయత్నము మీకు తెలియగలదు.

క్యాటలాగు ఉచితము. నేడే వ్రాయుడు.

## టి. సి. నాగలింగప్ప అండు కంపెని.,

280 వాల్టాక్సరోడ్డు, పోస్టుబాక్సు నెం॥ 516, పార్కుటవున్పోస్టు, మదరాసు.

ఏజెంట్లు:—పటేల్ స్టోర్సు, మునిసిపల్ హైస్కూల్ రోడ్, బెజవాడ.

# శిశు శిక్షణము

బుర్రా వేంకట నాంచారయ్యగారు, ఎం. ఏ.

## బిడ్డలు — కథలు

పిల్లలు కథలనినచో చెవులు కోసికొందురు. "మామ్మా! కథచెప్పవ్, ఏమండీ! పంతులుగారు కథచెప్పరూ" అని యొకటే పీడించెదరు. కొందఱు ముసలమ్మలు చెప్పెడికథలువినిన పిల్లలు చెడిపోదురు. వారు చాదస్తంఅంతా నూతీ పోయుదురుగదాయని యథార్థము తెలియక బొందపడుచుంటిరి. దానికి సంబంధించిన నిజానిజములు పరిశీలించినచో బాగుండునని యిది మొదలుపెట్టితిని. తల్లులు, ఉపాధ్యాయులు, ఇంకా పిల్లలవిషయ ముత్సాహము చూపెడివారున్నూ చదివి యీ యుద్దేశ్యము లెంతవఱ కనుష్ఠానయోగ్యములో తెలియుదురని నమ్ముచున్నాడను.

## కథ — దానివిలువ

శైశవారంభమున కథ బిడ్డనికి అపారమగు బోధ గావించుననుట నిర్వివాదాంశము. అది కథలు వినినకొలఁదియు మనోవికాసము నందుచుండును. కాని కథకుఁడు తెలివిగలిగి యితరబిడ్డల యనుభవములు వారు గడిపెడి జీవనము, వారి యభిప్రాయములు ఆదర్శములు చక్కఁగా విశదీకరించినచో బిడ్డ డట్టివాని నేర్పరితనమున కెంతయో వెలుగుఁజెందును. వెంటనే వానితో సఖ్యమేర్పరచుకొనును. ప్రపంచమునందు వివిధములగు వింతలనుఁ గూర్చి ప్రసంగించుటయు మంచిది. కథలు బిడ్డనిపద జాలమును పెంపొందఁజేయును; వానికి భాష నెటుల నుపయోగించవలెనో నేర్పును. భావలోకమును వృద్ధి చేయును. వాని యవధానశక్తికిని ధారణాశక్తికిని మెఱుంగుపెట్టును. ఈ పైవిషయములను మనస్సునం దుంచుకొని వివేకము, మాధ్యము నెంత తారతమ్యము గలిగియున్నదో శిశువునకు స్పష్టపరుపుము. జీవితా దర్శములయర్థము బిడ్డనికి బోధపరచ యత్నింపుము. వానికి ఆవేశము ధైర్యము నమ్మకము కనికరము గలిగెడి కథలు చెప్పుము.

## ఎట్టికథలు చెప్పవలెను

ఈ దినములలో కుక్కగొడుగులవలె ఒకటే జన్మించుచున్నవి గ్రంథములు. "అజాగళస్తనసగోత్రులకు" ఈ పదప్రయోగమునకు క్షమించుడు అట్టివాని యోగ్యతాయోగ్యతలు గుర్తించి శిశువునకమిత యుపయోగకరములగు కథలనే చెప్పుచుండవలెను. ఏదో పైభారము తొలఁగించుకొనుటకే నోటికి వచ్చిన కథచెప్పుట సరికాదు. అట్టి కథలను మనజీవితకాలమంతయును వినియోగపరచినను క్రోడీకరింపఁగలమా యనెడి సందేహము పొడమవచ్చు. అట్టి సంకోచములను వీడి సదా కార్యరంగమునకు దిగుట మేలు. అయితే యే కథలను చెవియొగ్గి వినెదరు బుడుతలని యడిగెదరేమో వానిని చెప్పుచుంటిని వినుఁడు.

కథ కల్పితమైనదని శ్రోతలకు తట్టకూడదు. ఒకప్పు డది నిజముగా జరిగిన కథ కాకుండినను, చరిత్రాత్మకము కాకుండినను ప్రపంచమున సాధారణముగా జరుగుచుండిన విషయజాలమును గ్రుచ్చియెత్తెడిదై యుండుట మంచిది. పాపము, అసత్యము, అధర్మము జయమును గాంచునని ప్రతిపాదించెడిదిగా కథ యుండుట శుభావహము కాదు. యక్షకథలు మొదలైనవి బిడ్డలెక్కువగావినుటకు మక్కువపడెదరు. "సత్యమేవ జయతి" "సత్యంవద ధర్మంచర" యనెడి కథలు బాగుండును. క్షోభకరమైనట్టి కథలకై చదువు నేర్చిన బాలురు ముందంజవేయుదురు. కాని వినుగు

పుట్టించెడివియు భీతికరములైనట్టివియు రోగకరములైనట్టియు వంచకత్వము నుపపాదించునట్టివన్ని కథలను చెప్పఁగూడదు.

బాలురయం దభిరుచియు నిత్యనూతనోత్సాహమునుగలిగించు సామర్థ్యము కథకుండవలెను. అభినయపూరితమై, నట-నాకౌశలముగలదై హాస్యరసభూయిష్టమై అంత్యప్రాసాది నియమముగలదై యుండవలెను.

## కథచెప్పెడి విధానము

కథ చెప్పుతరి మైమరచి యావేశపూరితుఁడవై నట్లుండవలెను. నీకున్నూ బిడ్డలకున్నూ కొట్టినపిండియై యున్నకథనే చెప్పుము. నీ చిఱుతప్రాయమున నీవువిని ముచ్చటపడిన కథలను జ్ఞప్తికి తెచ్చుకొనట శ్రేయస్కరము. బిడ్డలెట్టికథలు కావలెనందురో అట్టివానినే చెప్పుట యుచితము. బిడ్డల యెట్టయెదుట నీ కథలయందలి పాత్రలు "తోలుబొమ్మల"వలె తాండవమాడునటులఁ జేయవలెను. నీ పదజాలము విశేషణములతో నిండిపోవలెను. విద్యనేర్చుకొను బిడ్డలు మూడు విధములని చెప్పవచ్చును. శ్రోత్రేంద్రియ మెక్కువగా పనిచేయువారు(audiles)స్పర్శేంద్రియ మెక్కువ చురుకుగా నున్నవారు (tactiles) చక్షురింద్రియముద్వారా విషయసంగ్రహణము జేయువారున్నూ(The visuals) అందులకై యిట్టి మూడింద్రియములకు గ్రహణయోగ్యములగు చిత్రములతో నొప్పారెడి కథలు చెప్పుచుండవలెను. మీ కథ కొండవీటిచేఁదవంటిది కాగూడదు. ఎంతకు దించిన నంతమంచిది. సాధారణముగ నభినయమును కథకుఁడు చేసినను తప్పులేదు. బిడ్డలు దానిని బాగుగా నానందించినచో "మళ్లా" యందురు గాన మొదటి పర్యాయమే యందలి విషయానుక్రమణిక బాగుగా గుర్తుంచుకొనవలెను.

ఈ కథ నీతి యిదియని నీవు చెప్పనుగూడదు. బిడ్డచేత చెప్పించ యత్నించనుగూడదు. ఈ లక్షణములుగల కథకుఁడు శ్రోతయందు కథకూడ నొక శాస్త్రమునెడి యాశ్చర్యమును జనింపగలుగును.

## కథ చెప్పవలసిన సమయములు

కథ బాగుగా చెప్పవలయుననినచో సమయాసమయముల పర్యాలోచనచేసి చెప్పుచుండవలెను. పరిసరములు నిశ్శబ్దముగ యున్నతరి యీపనికిఁ బూనుకొనిన బాగుండును. పునరుక్తి, అంత్యప్రాసాది నియమములు గల కథలనే చెప్పవలయును. బిడ్డ క్షుత్తుతో బాధపడుచున్నను ఇతర కార్యాసక్తుఁడైనపుడును కథచెప్పనుంకింపఁగూడదు. అట్టియెడ వానియవధానమును మళ్లించుట కష్టతరముగదా! నిద్రపోవుటకుముందు బిడ్డల కెల్లప్పుడును శాంతియుక్తములు అనగా నాకులపాటు గలిగింపని కథలనే చెప్పవలెను. అటులఁగానిచో మనక్షోభముజెంది బిడ్డ నిదురపట్టక చికాకుములో పిట్టవలె కొట్టుకొనును. ఒకవేళ నిద్రగాంచినను దుస్వప్నములఁ గనును.

కథకుఁడు గమనింపవలసిన కొన్ని నియమములు:- కథ యెటుల చెప్పవలయునని ప్రశ్నించుట సులభమేగాని దానికి ప్రత్యుత్తర మొసంగునప్పటి కేరికైనను తలప్రాణము తోకకువచ్చును. ఇదియు నొకకళయే. తద్వారా కథకుఁడు మహత్తరమైన వర్తమానము నొసంగుచున్నాడు. కథకుఁడు తాఁజెప్పు కథయందలి కష్టసుఖములు తా ననుభవించి యుండినచో కథకు బల మెక్కువయగును. అట్టియనుభవములు సమయము వచ్చినపుడు వానిమోమున నువ్యక్తములు గావలెను. అటుల నుద్రిక్తుఁడుగాని యెవ్వఁడు నీపనికిఁ బూనఁగూడదు. అట్టి యనుభవ మనుభవైకవేద్యమేగాని కావలెనని పెనఁగులాడిన నబ్బదు. అందువలన కథకుఁడు గుణగ్రహణ పారీణుఁడై యుండవలెనని స్పష్టమగుచున్నది.

కథకుఁడు స్వకార్యా చరణమునం దప్రమత్తుఁడై సదా ప్రవర్తింపవలెను. నాలుక తడఁబడఁగూడదు.

కథలోవచ్చెడి పాత్రలు పట్టణములు మొదలగువాని నామము లుచ్చరించుతరి పొరపడఁగూడదు. కథాంశములను వదలివైచి వానిని తిరిగి అతుకుపెట్ట చూడరాదు. కథను బాగుగా నవగాహనము చేసికొననందున డొంకతిరుగుడువాక్యములు కొందఱు ప్రయోగింతురు, అట్టి యభ్యాసమును మానవలెను. కథకుఁడు సాధ్యమైనంతవఱకు స్వభాషనే యుపయోగింపవలెను. బిడ్డ లద్దానిని విని స్వర్ధునీనాదములచేతను వలె శ్రోత్రపర్వ మొనరించుకొందురు.

పాఠశాలలయం దుపాధ్యాయులు కథచెప్ప నిచ్చగించినచో నర్ధచంద్రాకారముగా బుడుతలను కూర్చొనపెట్టవలెను. ఒకరివెనుకనొకరిని కూర్చొననీయరాదు. ఉపాధ్యాయు డందఱికి నెదురుగా దగ్గరగా కూర్చొనవలెను. కాని వారు ధ్వనిచేయ మొదలుపెట్టినచో నీవు కథను వారల కాహ్లాదకరముగునట్లు చెప్పలేదని యర్థము. కనుక నీలోపమెద్దియో కనుగొని యద్దానిసవరించుకొనుము. ఆరంభమునందే పిల్లలను వశముచేసికొనునట్లు ప్రవర్తింపుము. మొదటివాక్యము నుడువగనే బుడుతలందరు నిమ్మనీరెత్తినట్లుండవలెను. ఉపరి నీ వమితోత్సాహము గనుపరచవలెను. నీవాగమృతపు సహకారమే వారి యుత్సాహమునకును దోహదమగును. కథ యందు లీనమైనచో సర్వమును సులభమగును. చిచింద్రీమతాపులవంటివియు పిల్లలకు తెలిసినట్టివియగు పదములనే ప్రయోగింపుము. కథ యందలి విషయజాలమెప్పుడును క్రమముతప్పకూడదు. నీవు విసుగు కనుపరచునెడల బిడ్డలుకూడ విసుగుచెంది వారియుత్సాహము గోల్పోయెదరు.

కథకుని వాగ్ధోరణి యెట్లుండవలెనో యించుక విచారణసల్పుదము. గొంతుచించుకొనుట పనికిరాదు. స్వాభావికముగా నీ వెట్లుమాట్లాడెదవో యట్లనే మాట్లాడుము. నీ కంఠధ్వని స్పష్టమై యనర్గళమై సరళమైయుండవలెను. ముక్కుతో మాటలాడకుము. బిగపట్టి మాటలాడకూడదు.

## బిడ్డలవయస్సు — కథలు

బిడ్డలవయస్సు ననుసరించి కథల యంతస్తుకూడ మారుచుండును. ఏ యేవయస్సువార లే యేకథలు విన కుతూహలముచూపుదురో విచారించుటమంచిది. ఇట్టి విచారణసలుపుటకుముందు వివిధవయస్కులగు బిడ్డలను వారల కే యేకథలిష్టములో తెలిసికొనియుంటినని పాఠకులకు విన్నవించుచుంటిని. అట్టివిచారణ నాధారముచేసికొనియే కొంతవఱకు ప్రస్తావించుట కిచ్చగించుచుండుట.

పురాణకథలు సాధారణముగా ప్రాచీనులమతము. వారిమూఢభక్తి భయము మొదలగువిషయముల ప్రతిపాదించును. తన పరిసరములను బాగుగా నవగతము చేసికొననిబిడ్డడు నట్టికథలు వినుట కుఱ్ఱట్లూగును. ఈనాటి నిరక్షరకుక్షులు నట్టికథలన్న పడిచత్తురు. రామాయణమనిన యొకయెద్దుబరువనిన గొల్లనివిషయము మీరెఱిఁగియేయుందురుగదా! కథలయం దావిష్కృతములగు నాదర్శములే వానిని వినుటవలన భ్రమరకీటన్యాయ మొప్ప బిడ్డల యాదర్శములుగూడనగును గనుక కథలనెంతయో యుక్తాయుక్తజ్ఞానముగలిగి యేర్చి కూర్చి చెప్పుటమంచిది. ఈకథలవలననే బిడ్డల నడవడిక గూడ చాలవఱకు చక్కఁబడుననుట యతిశయోక్తి గానేరదు.

బిడ్డడు మూడుసంవత్సరములు మొదలుకొని ఆఱు సంవత్సరములవఱకు తనకు పరిచితములగు విషయములనుగూర్చిన కథలనే విన నాశించును. అతఁ డింకనూ భావనాప్రపంచ మెట్టిదియో యెఱుఁగడుగదా! ఉన్నది యున్నట్లే వానికి కనుపడునుగాని యందలి యంతరార్థమతఁ డరయఁజాలఁడు. తండ్రి, గుఱ్ఱములు, కుక్కలు, పిల్లులు, ఎలుకలు, తోటిబిడ్డలు మొదలగువానిని గూర్చిన కథలన్న వానికెంతయోమక్కువ. అట్టిశిశువు పిల్లికూతలు, కుక్కఅఱపులు, శివారుతములు నన్న చిందులు వేయును. ఆవయస్సువారికి చెప్పుకథలయం దట్టికూతలు కలుపుట మేలు. కథ మిగుల చిన్నదిగా

యుండవలెను. బుడిబుడినుడులతోడనే చెప్పవలెను. ఉపరి అంత్యప్రాసాదినియమములు మిక్కుటముగా నుండవలెను. అనగా "కత్తిపోయి ఢోలువచ్చె ఢాం ఢాం" వంటి వాక్యములతో కథ నిండియుండుట మంచిది.

ఆఱుసంవత్సరములు దాటిన పిల్లవానికి నూతన భావము లుదయించును. అపుడు వాడు నిజమైన కథలనేగాక భావపరంపరలను వృద్ధిపొందించెడి కథలను వినుట కిష్టపడును. మైదానములు,యెడారులు, అటవీప్రదేశములందుజరిగిన సంగతులను వినగోరును. పెద్దపులి సింహము మొదలగువానినిగురించిన కథలు వానివయస్సునకు తగియుండును. అట్టికథ లాంధ్ర భాషలో లేకపోలేదు. "అడవిలో అక్కమ్మ మను షడా, పులిమహారాజు కొడుకా" యను కథలవంటివి చెప్పుట యుత్తమము. ప్రాచీనులు ప్రకృతికిజంకి వనదేవతలను, జలదేవతలను, దయ్యములను బ్రహ్మ రాక్షసులను నిర్మించిరి. అవి తప్పక మానవనిర్మితములే గాని తమంతటతాము జనింపలేదు. ఆలంకారికముగా కవులును వానిని వర్ణించియుండిరి. మనవారు వానితోఁ గూడిన కథలనుగూడ చెప్పుకొనిరి. అట్టికథ లిప్పటి వారును చెప్పుచునేయుండిరి. అట్టికథలు ఆఱుమొదలు యెనిమిదిసంవత్సరముల వయస్సుగల బాలునికి రుచించును. ఇవికాక సాహసికులగు బాలకులనుగురించిన కథలన్నను వారికిష్టమే. అన్నతమ్ములు, అక్కచెల్లెండ్రు మేనత్తలు మేనమామలు కథలలోవచ్చినచో వారికి సంతోషముకలుగును. ఈ యీడుబిడ్డలు పైచుట్టములను గుర్తించుచునేయుండిరిగదా! తల్లి, తాతయ్య కథచెప్పినచో బిడ్డలు "అమ్మా మనతాత యెప్పుడువస్తా" డని యడుగుటయు నందువలననే.

ఎనిమిది మొదలు పండ్రెండుసంవత్సరములవఱకును బాలుడు వీరరసభూయిష్ఠములగు కథలను విన నిచ్ఛ గింతురు. ద్రోణుఁడు అశ్వత్థామ, కర్ణుఁడు, భీముఁడు, చేసినచర్యలను వర్ణింపుడని పంతుళ్ల ప్రాణాలుతీయుదురు. రాజపుత్రుల కథలనినను వారికిష్టమే. యుద్ధమనినచో లొట్టలువేయుదురు. వికర్ణుడర్జునునితో నెటుల సమరకర్మ మొనరించెనో తెలియగోరుదురు. అభిమన్యుని వీరకర్మముల మాటిమాటికి చెవులనొప్పగించి విందురు. అందులకేగదా అట్టివా రనుదినము "గ్రీకుజ్జములు" తెచ్చుట.

కాని పదమూడవసంవత్సరము పైఁబడగనే అబ్బాయికి మోటుతనముపోయి "నాజూకు" అబ్బును. తనశరీరమును మంచియుడుపులతో నలంకరించుకొనవలయుననెడికోర్కెలు జనించును. మంచిమంచిబట్టలు ధరించుకొనిన పాత్రలు, కథలోవచ్చిన వారిని మెచ్చుకొనును. అటులనే, నేనును వస్త్రములు ధరించవలయునని కృతనిశ్చయుఁడగును. అందులకే మనవారు "చిన్నవానికి గుడ్డచూచినను ముసలివానికి పెండ్లాన్ని చూచినను మురిపెమెక్కువ" యనిరి. బాలికలు కథలోవచ్చిన "భేష్, భేష్" యని లోలోననే మెచ్చుకొందురు. బాలికలనుగూర్చిన కథలను విన నిచ్ఛగింతురు. "అమ్మా, సినిమా" అనెదరు.

పైవిషయములనుబట్టి వారివారి యీడునకుతగిన కథలనే చెప్పవలయుననియు, భాషయును వారివారికి తగినదే ప్రయోగింపవలయుననియును, ఏచెత్తనైనను వారిని చదువనీయఁగూడదనియు మనము నేర్చుకొంటిమి. ఇతఃప్రభృతితల్లులుగాని తండ్రులుగాని యుపాధ్యాయులుగాని కథలుచెప్పునపు డీ నియమముల పాటింతురని నమ్ముచు నిఁకొకతూరి శిశుశిక్షణమునుగూర్చి విన్నవింతునని మనవిచేయుచు విరమించుచుంటిని. అనుభవవేత్తలగు ముసలమ్మలుగూడ నీవిద్దెయందు దిట్టలేగదా!

# మాంగళ్యధారణ

చదువుల రామచంద్రయ్యగారు

( మలయాళాచారము )

మలబారున వీరజాతియగు కులీన నాయరు కుటుంబములందు కన్యలు తామొకరి భార్యలగుటకు మున్న వేరువేరు సమయముల ప్రత్యేకములై విచిత్రములగు "వివాహము"లలో ప్రాముఖ్యత వహించుచున్నారు.

మొదటిది "తాళికట్టు కళ్యాణ"మనబడు మాంగళ్యధారణ మహోత్సవము. దేశాచారము ననుసరించి సతీత్వ చిహ్నమగు సుపర్ణ మాంగళ్యము కన్యల కంఠములకు గట్టబడుచున్నది. "సంబంధ"మను నిజమగు వివాహమునకును దీనికి నెట్టి సంబంధము నుండదు. దీని యనంతరము నిజమగు వివాహము జరుగవచ్చును; జరుగక పోవచ్చును. "తాళికట్టు" ఆచారము కళ్యాణమున నొక భాగమైనను అది యే వివాహముగాదు. మలబారునం దిదియొక చిత్రము. ఈ యెలయం దూగుచున్న పసికూన మొదలు ఋతుమతిగాకముం దేవయస్సునగాని కన్యకు, సంఘమునగల కొన్ని మతప్రతిబంధకముల నుండి తప్పించుకొనుటకై మాంగళ్యధారణ మహోత్సవము జరుపబడుచున్నది.

నవీనాచారములు వ్యాపించినకొలది, పురాతనమును, ఆడంబరసహితమై చేగియున్న యీ యాచార మడుగంటుచున్నను సనాతనకుటుంబములం దిది యింకను అవశ్యకరణీయముగా నెంచబడుచున్నది.

సాధారణముగా హిందూకుటుంబము లన్నిటియందును జరుగు వివాహముఖ్యవిధులతో నేకీభవింపక "తాళికట్టు" తంత్రము వింతగొలుపుచుండును అందు పాల్గొనువారు దాని నియమములకు బద్ధులుగారు. అంతమున వివాహవస్త్రముల జించు పద్ధతి ఆశ్చర్యకరమగు విషయము.

కుటుంబమునకు పెద్దయగు "కార్నవాన్" యీ విషయములందు శ్రద్ధవహించి కన్య జాతకమును జ్యోతిశ్శాస్త్రజ్ఞులకు జూపించి యీ కార్యమునకు సుముహూర్తమును నిర్ణయించును. తగిన "వరుడు" ముందే కుదిరి యుండిన మేలు; లేకున్న తమలో నన్నిటియందును తులతూగుచు వధువుజాతకముతో సరిపోవు జాతకముగల యువకుని బ్రాహ్మణ సంకరజాతినుండిగాని నాయరు కుటుంబముల నుండియేగాని మాట్లాడియుంతురు. అతడిందులో పాల్గొని తాత్కాలికవరుడుగా నుండినందులకు కొంతధనము గ్రహింపవచ్చును.

ఈ కార్యము జరుగుటకు ముందుదినము రాత్రి వధువు శ్వేతవస్త్రధారిణియై పెన్కు

ఆభరణముల ధరించి తలపై ముసుగువేసుకొని ముత్తయిదువలు తోడరా నింటియందు పశ్చాద్భాగమున ప్రత్యేకింపబడిన గదికి వెళ్లును. అచ్చోనొక బ్రాహ్మణ పురోహితురాలు వేదమంత్రములు పఠించును.

అందు జేరినవారంద రచటినుండి వివాహ మండపమున కరుగుదురు. అది వెదురు కొయ్యలతోడను తాటాకులతోడను నిర్మింపబడి పుష్కలముగా పుష్పములతో నలంకరింపబడియుండును. అచట జరుగవలసిన విధులు జరుగుచున్నపుడు వధువు ముసుగు ధరించి సిగ్గుతో తలవంచి కూర్చుండి యుండును. వధువు వివాహపందిరిని యేడు మారులు ప్రదక్షిణముచేసిన పిదప పురోహితుడు మల్లెయుంటుగలపాత్ర నొకదానిని చేబూని చక్కగ నలంకరింపబడిన యేనుగు నెక్కి, బాణసంచాలు వాయిద్యములు జెలరేగ మెరవణితో దేవాలయమునకు వెళ్లును. ఇచట మాంగళ్యమునకు పూజచేయబడి నంతట మెరవణి యింటికి మరలును.

మరునాడు వధువు ఉత్తమ వస్త్రాలంకారములను ధరించి ఇత్తడిదీపమును అన్నపు కుండయు నుంచబడిన ప్రత్యేకమగు గదికి వెళ్లును. ఇచటినుండి తిరిగి వివాహపందిరిని చుట్టి సూర్యుని బూజించి బైటగూర్చుండి వరునికొఱ కెదురుచూచుచుండును. వరుడును సమీపగృహమున వసించి విందారగించి, మెరవణితో వచ్చును. వధువుపక్షపు పెద్దలాతని కెదురేగి లోపలికి బిలచుకొని వెళ్లెదరు. అత డచట ముఖము గడగికొనును.

మూడవమారు పందిరిని చుట్టించి పె వధువును లోనికిగొనిచని వరుని ప్రక గూర్చుండబెట్టెదరు. వధువుతండ్రి వ వరులకు నూతన వస్త్రములనిచ్చును. వా వారు ధరించిన పిదప బ్రాహ్మణుల అతిథులకును దక్షిణలు బహుమతు [illegible] చ్చును. సుముహూర్తమున పురోహిత మాంగళ్యమును వరునిచేతి కిచ్చును. డొక కత్తిని తన యొడియందుంచుకొ సౌభాగ్యసూచకముగా నద్దమును బాణము నిరుజేతుల బట్టుకొనియుండు వధువు మెడ గట్టును. భార్యయని సూచించురీతి వధు వరునికి తాంబూలమును ఫలములను,ముఖవ గడుగుటకు నీరము నిచ్చును.

'తాళి' గట్టినవాడీపుడు తనకు రావలసి ధనమును దీసికొని వెళ్లవచ్చును. అతిథు కందరకు తాంబూలము గంధము మల్లె పూలును పంచిపెట్టబడును.

విందులును నాట్యగాన వినోదములును మఱి రెండురోజులవఱకు జరుగును. నాల్గవ నాడు తటాకమునగాని నదియందుగాని వధూవరులిద్దరొకరిచేతులొకరు బట్టుకొని స్నానమాచరించి యూరేగింపుతో దేవాలయమున పూజగావించుటకై వెళ్లెదరు. అచట నుండి యిల్లుజేరినతరువాత వారిరువు రొకచో భోజనము గావింతురు. అంత వారు కడసారి కళ్యాణముపందిరిలోనికివెళ్లి వివాహ వస్త్రమును రెండుగాజించి యొక్కొక్కరొక భాగమును దీసికొందురు. లేక వానిని పురోహితునికి నిత్తురు. వధూవరుల కటుపై

యెట్టి సంబంధముండదని దాని యర్థము. ఇవ్విధమున విశేషవ్యయముతో వైభవము తోడి యుత్సవమంతయు పూర్ణానుస్వారమగు ఫలితముతో ముగియుచున్నది. వధూవరు లిద్దరు తమ యిష్టమునచ్చిన త్రోవద్రొక్కి కోరినవారిని యింకెప్పుడైనను బెండ్లియాడ వచ్చును.

పూర్తిగా వివాహమున కంగీకరించిన యాతడే యీ యుత్సవమునందు వరుడుగా నుండినచో, నాతడు "సంబంధ" మనబడు వివాహక్రియను గావించి వధువున కొక వస్త్రమునిచ్చి తన భార్యనుగా స్వీకరింప వచ్చును. ఇట్లుగాకున్న నామె యేమి లేక యిరువది యెనిమిదిదినములు దాటిన మాంగళ్యమును దీసివేయవచ్చును. "సంబంధము" జేసికొనకున్నను, హిందూమతమునం దితర బ్రహ్మచారిణులవలెనే, ఆమె బ్రహ్మచారిత్వమునకు కళంకములేదని యెన్న బడును.

ఈ ప్రకారమున మాంగళ్యధారణ మహోత్సవము పూర్వాచారముల నెల కొల్పిన ప్రజ్ఞానిధులచే నవివాహితలగు స్త్రీలకు గలుగుచుండిన యపవాదముల పోగొట్టుటకై సృష్టింపబడినది. ఇదియు యుద్ధములవలనగాని తత్వసంబంధమగు కార్య సాధనములందు నిమగ్నులై యుండుటవలన గాని యవ్వనులగు నాయరు యువకులు దొరకకుండుటచేతనే గల్గినది.

## సంబంధము

మృదుహృదయంబున మొలచుభావం బీవు, అతులితంబగు భాషనగుదు నేను
ప్రాణమైభువిలోన బరగుచుందువు నీవు, దేహమై యెలమివర్తింతు నేను
ధృతికరంబులను శబ్దించుతుంబుర వీవు, వ్యాకులవిరహ గాయకుడ నేను
మలయసుగంధకోమల పరాగం బీవు, మృదుగతివీచు సమీర మేను.

అమలహాసుధాకరకళా హాస మీవు
మధురిమంబగురాత్రినై మనలు దేను
యీప్రపంచంబునందున నీవు నేను
లేనిస్థలము ల వెందైన గానబడవు.

వ. గోపాలకృష్ణారాయకవి.

# వీరమాత — హామీడా బేగం

శ్రీమతి వేదుల మీనాక్షీదేవిగా

వీరగాథలు వీనులకువిందు. వారి తల్లుల చరిత్రములు కర్ణములకమృతోపమానములు. అక్బరు చక్రవర్తి మంచివాడనియు, నాతని పరిపాలనమున ప్రజలు సుఖించిరనియు విని యానందించినాము. అట్టి మహానుభావుని తల్లి యేపుణ్యశీలయోయని కుతూహలము జనించినది. భారతభూమికా రాజచంద్రుని బ్రసాదించి యాహ్లాదమును సమకూర్చిన యామెకథ, యమృతోపమానమగుటలో భేదాభిప్రాయము లేదు.

హిందూదేశము వీరులకు బుట్టిల్లు. హామీడాబేగము, అక్బరు మాతృదేవత.

హుమయూన్ చక్రవర్తిని చతురంగములో రాజును వలె తిన్నచో నిలువనీయక నిలిచినచోఁ దిననీయక షేర్ఖాను, త్రిప్పిత్రిప్పి కొట్టెను. తుదకు దన దురదృష్టవశమున నీ చక్రవర్తి యాతనితో సంధిచేసికొనవలసి వచ్చెను. ఉభయసైన్యములును ప్రాత పగలు మఱచి నెమ్మదిగాఁ గాలముబుచ్చుచుండిరి. కాని, ప్రాఁతపగలు అగ్నికణముల వలె మరల రాజికొని వారిరువురకు జిచ్చు వెట్టినవి. షేర్ఖా నున్నట్లేయుండి యొకనాఁడాకస్మికముగా హుమాయూను సైన్యములపై బడి యందఱను హతమార్చెను. హుమయూను ప్రాణము మాత్ర మతికష్టముపై రక్షింపఁబడెను. ఇట్టి కష్టదశలో నాతఁడందందు గ్రుమ్మరుచుండగా నొక మహమ్మదీయయోగి కుమారిత య హామీడాబేగ మాతని ప్రేమించి యుద్వాహ మాడెను. తినుటకన్నము, కట్టగుడ్డయు నిలువనీడయు లేని దశలో నాతని బరిణయమై యామె యాతని కష్టములలో బాల్గొ ప్రారంభించెను.

దేశమందెచ్చటను నిలువ నీడలేక వారు సింధుదేశపు టెడారిని బ్రవేశించిరి. కాలవ వేసఁగి. అందులో నుష్ణవాయువులు వీఁచ కన్నులు, నాలుక ఆరికొనిపోవుచుండెను. క్రొత్తపెండ్లికూతునకీ తిప్పలు తటస్థమయ్యెనట. అనేకులు దాహాతురులై యసువుల గోల్పోయిరి. పచ్చనిమొక్క యొక్కటియు లేని యా యెడారిలో పచ్చి మంచినీళ్లైన దొరకక వారు చాల శ్రమపడిరి. ఇట్టి భయంకరమగు నెడారిలో నల్పపరిజనముతో హుమయూను పోవుచుండెను. పరిజనులు విడువలేక యాతని వెంబడించిరిగాని, ఆతఁడిచ్చు జీతమునకును భత్యమునకును గాదు. దీనికితోడు వెనుక షేర్ఖాను సైనికులు తఱుముచుండిరి.

ఎట్టులయినను తన భార్యను గాపాడ నెంచి, యామెను గొలఁది సైనికులతో నమర్కోట వైపునకు బంపి తాను కొందఱు సైనికులతో శత్రుసైన్యములను డీకొనుటకు నిలిచియుండెను. కాని ఎంతసేపటికిని శత్రు

# గృహలక్ష్మి

సైన్యములు వచ్చుజాడలు కనబడక పోవుటచే దానును నమరకోట వైపునకు బయలుదేరిపోయెను. త్రోవలో వారిడుమలు పడి తుదకు కొనయూపిరులతో నమర్కోటకు జేరుకొనిరి. అచ్చటిరాజు వారి నాదరించి తగు సదుపాయములు చేసెను.

నవమాసస్ఫూర్తియైన వెనుక నొక శుభ లగ్నమున హమీడాబేగం వంశరత్నమగు అక్బరును బ్రసవించెను. అతఁడు జన్మించగానే, హుమయూను తన చెంత మిగిలియున్న కొంచెము కస్తూరిని, దాని పరిమళము భాతియాకుమారుని ఖ్యాతియు వ్యాపింపవలెననునట్లు, తన పరిజనులకు బంచిపెట్టెను. మాతాశిశువుల నమర్కోటయందుంచి యాతఁడు మునుపటికంటె నెక్కువ పట్టుదలతోఁ బోరి శత్రువులను జయించి చక్రవర్తిత్వము వడసెను.

ఈతని వెనుక అక్బరు సింహాసనారూఢుడయ్యెను.

హమీడా తన తనయునకు సత్ప్రవర్తన ఔదార్యము, త్యాగబుద్ధి, శౌర్యము నుగ్గుపాలతో బెట్టి పెంచినది. అక్బరు హైందవ చక్రవర్తులలో నగ్రగణ్యుఁడయ్యె నన్నచో, నది హమీడాకతమువు చలువయన్నమాట యతిశయోక్తి కానేరదు.

## గొల్లవాని యుక్తి

అశోకుని రాజ్యంలో జీవహింసచేయకూడదని శాసనంచేశాడు. కొన్నాళ్ళయిన తర్వాత ఒకగొల్లవానికి మాంసము తినవలెనని బుద్ధిపుట్టింది.

దొంగతనంగా లేతమేకను చంపాడు. ఇంతలో రాజభటులువచ్చి వానిని మేకతో కూడా రాజుముందర పెట్టారు. రాజు గొల్లనిచూచి రాజాజ్ఞవుల్లంఘించి యీ మేకను ఎందుకు చంపావు అని అడిగాడు. గొల్లడు నిరుత్తరుడైనాడు.

రాజు—ఓరీ నాముందే జవాబు చెప్పలేకున్నావే రేపు దేవునిముందేమిచెప్తావు?

గొల్లడు—నేను చచ్చిపోయిన తర్వాత నన్నేమడుగుతాడా దేవుడు?

రాజు—నిన్ను బ్రతికించి అడుగుతాడు

గొల్లడు—అయ్యా ఈమేకవుంటేగదా నాతప్పు ఋజువయ్యేది !!

రాజు—ఓరీ మూర్ఖుడా, దానినిగూడ బ్రదికించి నీయెదుట నిలబెట్తారు.

గొల్లడు—అట్లయితే నామేక బ్రతికుంటే నన్నెందుకు దండిస్తావయ్యా అని ఆదేవుడినే అడగనా?

సభ అంతా నవ్వారు. రాజు గొల్లవాని తెలివికి మెచ్చుకొని వానిని విడచిపెట్టెను.

పోతుల జయలక్ష్మి.

# లీలావతి

పంతుల విశ్వనాథంగారు

భాస్కరాచార్యులు జ్యోతిషవిద్యా పారంగతుడు, 1100 శాలివాహనశక శతాబ్దమునందు సిద్ధాంతశిరోమణియను గ్రంథమును రచియించెను. ఈతనికి లీలావతియను కుమార్తెకలదు. ఈ ఆచార్యులవారు లీలావతి జాతకమును పరిశీలించి యామెకు వైధవ్యము గలుగునని దెలిసికొనిరి. తనూజకెట్టులైన వైధవ్యముఁ దప్పింపవలెనని యెంచి యాయన యొక సుముహూర్తమున పూర్ణాయువుగల వరునిఁదెచ్చి వివాహముచేయ నిశ్చయించెను. సుముహూర్తబలమున తనూజాత వైధవ్యము తప్పగలదని యాతని నమ్మకము. అందుకొరకాతఁడు సుముహూర్తకాలము సరిగ నెఱుగుటకై జలమునందొక ఘటికా యంత్రమును నిర్మించెను లీలావతి ఆఘటికా యంత్రములోనికి నీరెట్లు వచ్చుచున్నదో తలవంచుకొని చూచుచుండెను. అట్లామె చూచుచుండగా నామె తలపైనున్న అక్షితల గింజయొకటి జారిపడి యాయంత్రరంధ్రమును గప్పివైచెను. ఆకారణముచే నాయంత్రము వలన సరియగుకాలము తెలియక యేదో యొకముహూర్తమున వివాహము గావించిరి. వివాహమైన పిమ్మట స్వల్పకాలములోనే యామెభర్త మరణించెను. లీలావతి తనకు సంసారసుఖము లేకున్నను జీవిత మానందప్రదముగ జేసికొనదలచి సహజముగ విద్యాభిరుచిగలదగుటచే తండ్రికడ గణితశాస్త్రమును జ్యోతిషమును నేర్చికొనెను.

లీలావతికి జ్యోతిషమందుగలప్రజ్ఞ యసామాన్యము. ఆమె యైదునిమిషములలోనే వృక్షములపైనగల యాకులసంఖ్య చెప్పుచుండెడిదట.

లీలావతీగణితశాస్త్రమని యామెకు తండ్రికి గలిగిన ప్రశ్నోత్తరములు ఒక గ్రంథముగా నేర్పడి ఇంగ్లీషుపారసీ మొదలగు భాషాంతరీకరణములనుగూడ బొందియున్నది.

"చదువనివాఁ డజ్ఞుఁడగుఁ
జదివిన సదసద్వివేకచతురత బడయున్."

— పోతన

# శ్రీ సరస్వతీబాయిగారు

( హరికథలు )

హరికథచేయుట ఒకవిధమగు యోగ విభూతి. దీని మహిమను సంపూర్ణముగఁ దెలుసుకొనినవారు మహారాష్ట్రులు. వారిలోఁ బ్రప్రథమగణ్యుఁడు రామదాసస్వామి; రెండవ మహాశయుడు తుకారాం. వీరిరువురును శ్రీ శివాజిమహారాజునకు గురువులు.

హిందూమతము తురకలచేతిలోఁబడి ప్రమాదస్థితియున్న క్లిష్టసమయమున నీ గురువులు, శిష్య ప్రశిష్యులతోఁగూడ దేశసంచారముఁజేసి దేశము, మతము, రాజభక్తి నీతి మొదలగువానిఁ గూర్చి సామాన్య జనులకుఁ బ్రబోధముఁజేసి దేశమతములఁ గాపాడిరి. 'శివాజియే ప్రభువు - శంకరుఁడే దైవము'అని పాడుచు నెందరో మాన్యులు తమ ప్రాణములను దుటుకలకిత్తులకెఱ పెట్టిరి; కాని మతాంతరులు గాలేదు.

హృద్యములగు పద్యములు, మధ్యమధ్య చిన్నచిన్న పాటలు, తేటలఁదేరు మాటలు గల్పించి యా కథకులు సమ్మోహనాస్త్రముల వలెఁ బురాణగాథలను బ్రయోగించుచు, శ్రోతలను లక్షోపలక్షలుగ నాకర్షించుచుండిరి. వారు సన్యాసులు; వారికి ధన మక్కరలేదు; వారు కోరునది హిందూదేశ యోగక్షేమము మాత్రమే! దీనికి మతమే యాధారము. మతవిశ్వాసము రూఢియైయున్నపుడు మనుజులు దాని రక్షణకై ప్రాణముల నైన ధారవోయుట యొక యాశ్చర్యమా! మతమునకును రాజకీయమునకును సంబంధము లేదనుమాట నిరర్థకమే! విశేషించి అది మహానర్థకరము కూడనైయున్నది. సర్వవిషయములయందు హిందూదేశమును నక్షత్రప్రాయముగా నొనరించియుండిన దీ మతవిశ్వాసమే. హిందూదేశచరిత్రయందు మహారాష్ట్రయుగము స్వల్పకాలికమే! తథాపి అస్వల్పమే చరిత్రకంతకు వన్నెఁదెచ్చినది. ఎందువలన? ప్రజాసామాన్యమునందు మతవిశ్వాసము ప్రవేల్లుచున్నకొనియుండెను. దాని రక్షణకై వారు తమ ప్రాణములను బలి పెట్టిరి. శివాజీ మహారాజుగారి చరిత్రము నెరుగుదుముకదా! ఆతఁడు పండితుఁడుకాఁడు. మరియేవిధమైన నాగరకతావిశేషములు గాని యాతనియందు మృగ్యములు. కాని యాతని మతవిశ్వాసము మాత్రము హిమవత్పర్వతప్రాయము. భక్తిపారవశ్యతయే యాతనికి ముఖ్యమగు రాజలాంఛనము. దానినిఁబట్టి 'యథారాజాతథాప్రజా' యను న్యాయముగఁ బ్రజలందరుఁగూడ నొప్పిరి. ఇట్టి యుత్తమస్థితుల కన్నిటికిఁగూడ మూలకారకులీ హరిదాసులే. వారి యుద్బోధ, రాజాధిరాజులను వారికిఁ బాదాక్రాన్తులనుగాఁ జేసినది. ఇదే వారు సంపాదించిన యోగవిభూతి. వారు సిద్ధినొందినారు.

కీర్తిశేషులగు మహాదేవ గోవిందరానడే గారు, సంఘసంస్కరణ ప్రచారమునకై యవలంబించిన దీయోగమార్గమే!! హాయిగల పాటయుఁ దీయని మాటయుఁ జేరి చేయలేని పనియున్నదా !

మన యాంధ్రరత్నము నొకసారి స్మరించుకొందము ! ఆంధ్రదేశమునకు వన్నెవాసులఁ దెచ్చిన దొక్క యీ మూర్తియేకదా ! ఆ సంగీతము, ఆ సాహిత్యము, ఆ వాగ్ధాటి, ఆ శాస్త్రప్రతిమ !! ఆహా ! లక్షోపలక్షలాతనికి జోహారు లొనర్చుట మనమెఱుఁగమా !

అదుగో అట్టి వ్యక్తియే యీ మన శ్రీమతి సరస్వతీబాయమ్మగారు. విశేషించి యీ మూర్తి స్త్రీశక్తియగుటవలన దానికంటె నొకవిధమున నుత్కృష్టతరమే యగవలెను. ఆంధ్రదేశమునం దీ యిల్లాలిని జూచినవారు చాల తక్కువమందియే. కాఁబట్టి అట్టి సోదరీమణుల విజ్ఞానయోగక్షేమాభివృద్ధికై యిది వ్రాయఁబడుచున్నది.

ఈ యమ్మగారి జన్మస్థానము గుత్తి. 1893వ సంవత్సరమున నీమెజననము. శ్రీమతి భాగీరథమ్మగారు తల్లి: రామారావుగారు తండ్రి; వీరు కన్నడబ్రాహ్మణులు-మధ్వులు. ఆకాలమునం దీ ప్రాంతములలో నాంధ్రభాషకే యెక్కువ ప్రాముఖ్యత యుండుట వలన బాల్యమున నీమెయు నాంధ్రమే చదువఁ బ్రారంభించెను; కన్నడము మాతృభాష, అరవము దేశభాష; కాఁబట్టి తొమ్మిది పదేడుల యీడు వచ్చునప్పటికి మూడు భాషలతో నీయమకుఁ బరిచయముగలిగినది. అసలే కుశాగ్రబుద్ధిగల బాలిక; దానికిఁ దోడు నీ భాషాత్రయపరిజ్ఞానము !! ఇఁక సంస్కృతభాషాభ్యాసమున కేమి యభ్యంతరము ?! అంతేకాక యీ అరవదేశమున నాడుపిల్ల లంతోయింతో సంగీతము నేర్చియుండవలయుననుట యొక సామాన్యాభిప్రాయము. ఇట్టిపరిస్థితు లంతటను అందరికిని సమకూడవుకదా ! అది యటుండనిండు.

ఇట్టిస్థితియం దీ బాలిక తలిదండ్రులతో చెన్నపట్టణము వచ్చి తిరువల్లిక్కేణిలో నుండవలసివచ్చెను. అప్పటిదినములలో నీ తిరువల్లిక్కేణి యంతయు మహారాష్ట్రుల పుట్ట ! కాఁబట్టి మహారాష్ట్రభాష, వద్దన్నను రాకతప్పదుకదా! అంతలోనే పెండ్లికుదిరినది. సి. రాఘవేంద్రరావుగారను నొకసురూప విద్యావినయసంపన్నుఁడగు యువకున కీ కన్యారత్నము యథావిధిగ నీయఁబడెను.

ఆ తరువాత క్రిశ్చియన్ కళాశాలలో సంస్కృతపండితులుగా నున్న శ్రీయుత తిరువాది కృష్ణాచారిగారు మిక్కిలి వాత్సల్యముతో నీమెకు సంస్కృతము నేర్పఁబూనిరి. జనాబ్ యాకూ బలీవస్తాద్ గా రొకసమయమున నీమె పాటవిని యానందమునొంది 'యీ శారీరమునకు హిందుస్థానీగానము తగియుండు'నని స్వయముగా శిక్షనొసఁగ జొచ్చిరి. ఇదే పూర్వపుణ్యము.

శాస్త్రవిశ్వాసమే యున్నయెడల నీమె యొక కారణజన్మ యనక తీరదు. ఇట్టికారణ జన్ములకు గురువులు నామమాత్రులు. వారి

యుపదేశము కాగానే ఆ యాప్రాక్తనజన్మ విద్య లా యా విద్యార్థులను దమంతటఁ దామే ప్రాపించును. కాబట్టియే, కాళిదాసుఁడు 'ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యా' యనెను. దీనినిఁ గాదనలేము. పదునైదు సంవత్సరముల ప్రాయము వచ్చుసరికి శ్రీ సరస్వతీబాయి సంగీతసాహిత్యములయందు పట్టభద్రురాలై లోకము నాకర్షింపఁ జొచ్చెను.

ఈసమయమునందు శ్రీ శంకర్ నాయరు గారిని మనము స్మరింపవలసియున్నది. ఆ మహాశయుఁడు హైకోర్టుజడ్జీగానుండెననియు, రాజకీయవిషయవేత్త యనియునే తరచుగ వినికి; కాని యాతనికుండిన యితరవ్యాసక్తు లంతగా నెవ్వరికినిఁ దెలియవు. ఆతఁడు పరమ సంగీతప్రియుఁడు. సాహిత్యవేత్త; స్త్రీవిద్యాభిమానులలో నగ్రగణ్యుఁడు. మన ఈసరస్వతీ యువతీలలామముచేఁ దమయింటఁ 1907 వ సంవత్సరమున మొట్టమొదటి హరికథా కాలక్షేపమును జేయింపఁబూనుకొనెను. "ఆమదియా! హరికథయా!! _ అడఁడాడా!! యెంత యవమానకరము !!!" ఊరంతట నెక్కడఁజూచిన నివియేమాటలు. సంగీత విద్వాంసులందరు నొకటేకట్టు. మృదంగాద్యుపకరణములు సమకూడుట కష్టసాధ్యమై తోచినది. ఏమైనను పట్టినవారు శ్రీ నాయరు గారు; కాబట్టి యట్టివారి కేదియు నసాధ్యము కాదు. ఈ మత్సరగ్రస్తుల మూలమునఁ గలిగిన యుత్తేజమువలన నాటి సరస్వతీ బాయమ్మగారి నావేశించియుండిన సరస్వతీ దేవి యీనాటికిఁగూడ నామెను విడువ లేదు.

1916 లో బొంబాయినగరమున గాంధర్వ మహావిద్యాలయ ప్రథమాచార్యులగు శ్రీ విష్ణు దిగంబర్ పులస్కరుగారు ఈ విదుషిని గాయనపటుబిరుదము నిచ్చి మన్నించిరి. 1920 వ యేటఁ బూనానగరమున లోక మాన్యులగు తిలకుగారు ఈమె కథాకాల క్షేపము విని కీర్తనపటుబిరుదము నిచ్చి సత్కరించిరి. ఇంతవరకు దాదాపు 130 కడియములను ఈవిద్యావతి సంపాదింపఁ గలిగెను.

ఈ శ్రీమతికి సంపాదనయే పరమార్థము కాదు. సంసారసుఖమనునది యసలే లేదు. శ్రీ రాఘవేంద్రరావుగా, రీయమను భార్యగా వ్యవహరింపరు: ఈమెయందు వారికొక దైవీయమైన ప్రేమాతిశయము జనించి యది యాతని నామెయెడ నొక శిష్య ప్రాయునిఁగా మార్చినది. ఇది లోక మెరుగకపోవచ్చును - గాని యథార్థము.

ఈ విదుషీమణి కథన కౌశల్య మసామాన్యము. అది యథాతథముగ వచించుట దుస్సాధ్యము. ఆమె యేభాషలోఁ బాడినను మాటాడినను అదే యామెకు మాతృభాషయా యనిపించును. ఆయుచ్చారణసౌష్టవమును నుడికారపుఁ బొంకమును అంతసాజములై యొప్పుచుండును. సర్వ సాధారణముగ నటీనటులయందొక్కొక్క రసమున కొక్కొక్క కొప్పియుందురు;

కాని యీయమె యట్లుగాక నవరసములకు నొక్కొకవిధమున నొప్పియుండును. తత్రాపి పురుషులు స్త్రీలయెడఁ జూపు సౌజన్యముల నుద్ఘాటించునెడ నీమెనాలుక, యొకమెత్తని కత్తి! ఈమె యాశయములు మహోన్నతములై శ్రోతలను జిత్రప్రతిమలఁగాఁ జేయుచుండును. ఈమెకు స్త్రీలయెడఁగాని పురుషులయెడఁగాని ప్రత్యేక పక్షపాత మొంతమాత్రమును లేదనుట యీమెకథనములందుఁ దేటముగ ఋజువగుచుండును. మఱియు నీయమ కేవల పూర్వాచార పరాయణురాలునుగాదు: నవనాగరకతా నికృష్టయుఁగాదు: భారతజాతీయతా ధర్మ సూత్రమున నీమెయొక్క జీవితయాత్ర యొక్క సాంగల్యము వలె మోయుచుండును.

సంతతానవద్యోక్తితో నీసాధ్వి దినములు బుచ్చుచుండును. ఏ విద్వాంసు లీమెను దొలుదొల్త దూషించియుండిరో వారే యిప్పుడీయమను సరస్వతీ యవతారమని మనసారఁ గొనియాడుచున్నారు. ఈమెయు వారలను నిజమైన పితృభక్తితో సేవించుచుండును. నిందకుండలు తొలఁగుకాడవు కదా! మానవజన్మమెత్తినందు కింతకంటెఁ గోరఁదగినదేది?

మన యాంధ్రజాతియందే కాదు. మఱి యే యితరజాతులయందైన నింతటి యింతి యింతవరకు మరియొకతె గానఁబడదనుట వాస్తవము!

ఇట్టి విదుషీమణులే యిప్పట్టున భరతభూమి కెందరైనను గావలసియున్నారు. పాశ్చాత్య విద్యాప్రభావమువలన మతవిశ్వాసము మట్టిపాలైనది. రాజకీయమునకును మతమునకును సంబంధ మొంతమాత్రము లేదను నపోహ యనేకమంది విద్యాధికుల మనసున నాటుకొన్నది. సంస్కరణము పేరఁ జేయఁబడుచున్న యాకార్యములు మేర మీఱిపోవుచున్నవి. వృత్తిగౌరవ మావంతయైనఁ గానకున్నాము. కాని స్వరాజ్యము — స్వరాజ్యమను మాటలు మాత్రమే మెచ్చుటఁజూచినను వినఁబడుచున్నవి. ఇట్టి సంకట సమయమున సామాన్యులకు గూడ మతవిశ్వాసము చెదరుచున్నది. ఇది మహాప్రమాదకరమైన విషయము. ఇట్టి ప్రమాదమునుండి స్వదేశమతముల నుద్ధరించుటకు మానినీమణులే సమర్థులు. మన యీ శ్రీమతీ సరస్వతీబాయి ననుసరింపఁగల శక్తి చాకచక్యములు గల యువతు లాంధ్రదేశమున నున్నారు. వారి కింతవఱకు వచ్చియున్న సంగీత సాహిత్యములే చాలును. వాటితో వారెంతపనినైనఁ జేయఁగలరు. అట్టి వారినిఁ బ్రోత్సహించుటకే యీ చరిత్రము వ్రాయఁబడినది.



సర్దార్ అఖ్తర్ కన్య
ఈస్టరన్ ఆర్ట్స్ ప్రొడక్షన్



ఆరోరాఫిలిం కార్పొరేషన్‌వారి

'సతీఅనసూయ'లో

వొకదృశ్యము

# బహిరంగలేఖ

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారి సముఖమునకు, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి, గౌరవపూర్వకముగా వ్రాయు ఆనందలేఖ:—

అమ్మా,

మొన్న మీరు పవిత్రహృదయముతో, అమృతవాక్కులతో, పావనకరములతో, "మొల్లరామాయణము"ను గూర్చి ఆంధ్రమాతృసౌభాగ్యలక్ష్మి యనఁదగు, "గృహలక్ష్మి"లోఁ బ్రకాశింపఁజేసిన వ్యాసరాజచంద్రికను, కనులారఁగాంచి, అమితానందము నందితిని.

తల్లీ! మీ మానససరసీరుహమున, సహజ కవితాలక్ష్మి నివసించియుండుటనో లేక మీ రాస్వాదించిన మొల్లయల్లిక మల్లియయలరుల మాక్షికామాధురి, నిజరసనా వాటికను నిలచియుండుటనో శ్రీరామచరిత్రౌన్నత్యము నుద్దేశించియు, కవితా ప్రాశస్త్యమును గూర్చియు, మీరు వ్రాసినప్రశంసాగద్యవ్యాసరచన పండితమ్మండలీ హృద్యమై, అబలాజనసుబోధ్యమై, సద్యశోవర్ధకమై, మొల్లరామాయణమునకు వన్నెఁ దెచ్చుచున్నయది. నిజమే, పవనవాహినీసంచారమున్నఁగాని, సుమసౌరభము పరులకుఁ దెలియరాదు. అటులనే మీయట్టి విదుషీమణుల లేఖినీసంచలనమున్నఁగాని, కృతి గౌరవము ప్రకటితముగానేరదు.

మీరు మొల్లరామాయణభాండమునందు ఘనీభవించియున్న కవితాదధిని చల్లగా మథించి, అందలి మధురరసనవనీతముఁదీసి, పాఠకులచే నాస్వాదింపఁజేసితిరి. అట మొల్లపద్యకవిత్వము, కదళీపాకమున వెలయుచున్నది. ఇట మీ పద్యకవిత ద్రాక్షపాకమున వరలుచున్నది. మీ లేఖననైపుణ్యమునుబట్టి చూడ ఆనాటిమొల్లను, ఈనాటి తల్లులు తీసిపోవువారుకారని, వెల్లడియగుచున్నది.

ఆంధ్రభారతీమాత, మీయట్టి ఘనోదారస్వాంతలగు సుతలఁ గనుచుండుటచే ఆయుమ కామధేనువువలె, ఇప్పటికిని సద్విద్యావైభవకలితలగు సతీతిలకములఁ గనుచున్నదేకాని, వట్టిపోలేదని విశదమగుచున్నది.

మీ రా ఘనవ్యాసపీఠమున ఆచార్యస్థానము నలంకరించి, కురిపించిన సుబోధామృతవర్షధారలచే నీరసించుచున్న శ్రీరామభక్తిబీజములు భారతీయమానసక్షేత్రములఁ దిరుగ మొలకలెత్తఁగలవనియు, మీ రా వ్యాసపుటల నింపిన భాషామర్యాదాలలిత

## బహిరంగలేఖ

ములగు తేటతెలుంగు తేనెపలుకుల మాధుర్యము నాస్వాదించిన, సోదరులకు గ్రామ్యభాషాభిలాషపై విముఖతకలుగఁగలదనియు, నా కాస లుదయించుచున్నవి.

చిరుతప్రాయమున ఉగ్గుపాలుపోసి, బిడ్డలసంరక్షించుటలో నోర్పునేర్పుగల మీయట్టి తల్లులే యెప్పటికైన, దేశసౌభాగ్యమును, సమకూర్ప సమర్థులగుదురు కాని, పరనాగరకతా వ్యామోహితులగుపిల్లలు సమర్థులుకాజాలరు.

మీ వ్యాసకరాటములోని దేశానురాగభాసురమగు భావకుంకుమమును, భారత సోదరీమణులు నిజఫాలతలములఁ దిలకములనఁగా దిద్దుకొని, అనవరతముఁ దమ సౌభాగ్యసంపదను బరికింపఁగోరుచున్నాను. కృపానిధియగు భగవానుఁడు ఆంధ్రసాహిత్య రాజ్యసీమను ఉన్నతిసతీపతాకముల విరివిగా నెలకొల్పుఁగావుత.

ఇట్లు
సోదరుఁడు
సాహిత్యవిశారద
కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి

సూర్యారావుపేట,
కాకినాడ.
7-12-35

# మాతృదేవికి

గొల్లప్రాడి జోగారావుగారు

నీ యకుంఠితప్రేమ తేనియలు, నీవ
చోమరందము సోనలుసోనలై కు
రవ తపించిన యెన్ని సుహృదయములు హ
సించి నీ జీవితమును స్మరించి నాడెం.

నీవు కల్యాణిమూర్తివి. నీమనోజ్ఞ
మధురతరకృపావీక్షణామృతముగ్రోలు
చెన్ని హృదయాలు మునినవో! యీ పవిత్ర
జీవి తావన్ని వేనోళ్ల జెప్పి కొనుచు.

లలిత సుకుమారమైనట్టి సంశ్లేష మధుర
కర నితాంతసౌఖ్య పథాలదనరి, యమిత
కంట కావృత నిబిడాంధకారబంధు
రంబయిన సీమ యేన్చు నాహృదయమిప్డు.

ఏకాకిపతితనై యేడ్తు నిపుడహీన
దుఃఖసాగ రోర్మికలందు దూలివడుచు;
వైరినై పాడుదు విశాల విపులరాగ
మాలికల వినిన హృదయాలు కరగ.

అంతమేలేని యీ దుఃఖాబ్ధిలోన
నిల్చి కనుమోడ్చి ధ్యానింతు నీ యపూర్వ
జీవనాగాథ; నివృతి భావమంది
రాల్తు నొక యంబుకణము నేత్రాలనుండి.

అతి గభీరమై మ్రోగు నా యమలతరసు
ధావిలాప మీకొరకె యీ ధాత్రినేడు.

# బాలవిజ్ఞానశాఖ

పాట — బొమ్మలకొలువు - బోగిపండుగ

బొమ్మలకొలువర్రో పిల్లలు - బోగీపండుగురో॥
అమ్మమ్మలునాన్నమ్మలుతాతలు - నమ్మికొలిచియున్నట్టివేలుపుల. ॥బొ॥
సీతాలక్ష్మణపవనసుతాదులు - సేవింపఁగ రతనాలగద్దెపయి।
చేతోమోదముతోఁగొలువుండిన - శ్రీరఘురామునిఁ జూడుఁడిదిగో ॥బొ॥
పంచపాండవులఁ బాంచాలిని బరి - పాలించి యశముబెంచి జగతిలో।
వంచకులను దునుమాడఁగా నవత - రించినవిష్ణుఁడు శ్రీకృష్ణుఁడిదో॥

పండుగదుస్తులు - పప్పుధప్పళాల్।
మెండుగతీయని - మిఠాయిపొట్లాల్।
ఆటలపాటల - యందచందములు।
మాటలతేటలు - మందహాసములు।
యేటికొక్కపరి - యే యిటుపర్వము।
మాటిమాటికిని - మరి రాదు సుఁడీ ॥బొ॥

ఉదయపుగొబ్బి — అత్రిప్రి సూర్యనారాయణమూర్తిగారు

సంక్రాంతిపండగా సాగివచ్చేనమ్మ
మా ముద్దుమరదల్లు ముగ్గులెట్టేనూ
ముగ్గులోపల గొబ్బిముద్దలెట్టేనమ్మ
ముద్దపై బంతిపూ మొగ్గలెట్టేనూ॥ ॥సం॥

పసుపుకుంకుమపెట్టి పూజచేసేనమ్మ
తామరాపూవంటి తమ్ముణ్ణి యీమనేను
చామంతిపూచోలు చెల్లెల్ని యిమ్మనేను
మొగలిపూవూలాంటి వగకొణ్ణికోరింది॥ ॥సం॥

గొబ్బిళ్లు అదిమేసి గోడకంటచేసెనమ్మ
చిన్ని చేతులదండ చేర్చికట్టేనూ
దండలన్నీ బుట్టనింపివేసేనమ్మ
మాఘపొంగలికివ్వ, మామ్మా! నీకనెనూ॥ సం॥

## గొత్తెలమంద

బుర్రా అన్నపూర్ణమ్మ

అనగా అనగా ఓ కుగ్రామం. ఆవూళ్లో బ్రాహ్మణిల్లు ఒక్కటే. ఒంటిబ్రాహ్మడంటే నల్లేరు మీదబండిపారినట్లుగాక యెంతో గౌరవంభక్తిగలిగివుండేవాళ్లు గ్రామస్థులంతా. ఏంచెయ్యమంటారు? వృక్షాల్లేనివూళ్లో ఆముదపుచెట్టేగా మహావృక్షం.

ఇక బ్రాహ్మడివిషయం విచారిద్దాం కొంత మట్టుకు. ఆయన అట్టేచదువుకోలేదు. ఏదో కొచ్చొపచ్చోగా తెలుగుమాత్రం ఏకరువుపెట్టేడు "హాలికులైననే"మని అపరపోతరాజులా అరకతో తయ్యారయ్యేవాడు దుక్కిరోజుల్లో.

ఒకరోజున చతుశ్శాస్త్రపండితుడొకాయన యీవూరిపెద్దల నందరినీ రచ్చలో చూచి, యాచనకొచ్చానాయనా, పెద్దబ్రాహ్మణ్ణి అని అన్నాడు. కానీయండి మా శాస్త్రుర్లు పరీక్షించిన తర్వాత కట్నంయిస్తాం లెండి; వుండండి మధ్యాహ్నందాకా అన్నారు కాపులంతా. సంజబిచ్చగాడుపొద్దెరుగడన్నట్లు ఎప్పుడాఎప్పుడా అని మెరుగుటకలతో పంచప్రాణాలు బిగపట్టుకొని యున్నాడు కొత్త బాపనాయన.

ఇంతలో దుక్కిదున్ని నిక్కినీలిగి మందగుది యెద్దులా యింటిమొగం పట్టాడు రామశాస్త్రి. కాపులాయన్నిచూచి, యీయన యాచకానికొచ్చాడు పరీక్షించడి రామయ్యగారూ అన్నారోలేదో మనకొత్త శాస్త్రుర్లు అదేసందుచేసికొని సంస్కృతంలో కిమ్మనివాదన ఆరంభించాడు. రామయ్య మాత్రం యేమిట్రాయిది అని చికాకు చెంది 'కిం' లేదు 'కం' లేదు బొల్లెద్దుడొక్కలో "ఢాం" అని ముష్టియుద్ధానికి తారసిల్లాడు. కొత్త శాస్త్రి డీలా అయి ఒక క్రమానికి తెప్పరిల్లి ఒక యుక్తిపన్నాడు.

నాయనా రామయ్యగారు నేటికి చూచానయ్యా నన్నుమించిన పండితుణ్ణి; గుడీ గుళ్లోలింగం మింగేవాడివి నాయనా అని రామయ్య పిలకలోనుంచి ఒక శిరోజం లాగి కళ్లనద్దుకున్నాడు. వెంటనే కాపులంతా రామయ్యగారంత దిట్టకి కాబోలని వెఱగుపడి తలావొకశిరోజం రామయ్య లబోదిబో అంటున్నా బలవంతాన పెరికి కళ్లనద్దుకున్నారు. నాటినుండి బట్టతలతో తయారయ్యాడు రామయ్య. అంతటినుండి కొంచెం తెలివినిపడ్డాడు రామయ్య; కనుకనే కామోసు మనవాళ్లు బట్టతలవాళ్లంటే సామాన్యులు కారని అనడం. సరే! మనదేశంలో యింకను యీలాంటి గొత్తెల మందలేనా?— ఎప్పటికి బాగుపడం.

# పుష్పచయము



లోకమునకంతటికిని నివ్వెరపాటు గలిగింపగల యా సౌరభ్యము జర్మనుదేశమున కెట్లు వచ్చినదోయని పరిశీలనజేయుచు స్త్రీ వెన్ గ్రాహంగారు తెలియజేయుచున్న యథార్థవిషయములివి:—

జర్మనువారెల్లప్పుడును పులుగిడిగిన ముత్యములవలె నుందురు. ఈ శౌచవిషయమున ప్రపంచములో ముందుగా వీరిని జెప్పి యావెనుక మరియెవరినైన జెప్పవలెను. రైళ్లలోగూడ ప్రయాణికుల ముఖప్రక్షాళనాది శౌచక్రియలకై సబ్బులును చేతిగుడ్డలును ప్రతివానికి ప్రత్యేకముగా నిచ్చునట్టి యాచారము జర్మనులే యారంభించిరి.

ఇక నేవస్తువెట్లుండవలెనో యెక్కడనుండవలయునో — యేపని యెట్లుచేయవలెనో యెప్పుడు చేయవలెనో యను నిట్టిక్రమపద్ధతు లీ జర్మనుల కుచ్ఛ్వాసనిశ్వాసముల వంటివి. పార్కులయందు దవరిమట్టుకు వారు గొఱ్ఱెలవలె దిరుగరాదు: ఒకరివెనుక మరొకరుగా వరుసలుదీర్చి నడువవలెను. అచటనుండు పచ్చిక బీళ్లపై యువయువతులు చెల్లపుకుండమీద నీగలవలె నెంతమాత్రము మునుగుకొనరాదు. బెర్లిను నగరమధ్యమున యువక యువతులు కలసి కాముకప్రసంగములనుజేయుట మిగుల గర్హ్యవిషయము.

నగరమంత సుందరమైనది కాదు; కాని గోడలమీదను, స్తంభములమీదను యెట్టి వాల్ పోస్టర్లుగాని యంటింపరాదు. పల్లెటూళ్లలోగూడ నిదేపద్ధతి. బహుముఖమైన విదేశవ్యాపారము చేయుచున్నను జర్మనీలో నే ప్రదేశమునగాని గడబిడ యేమాత్రమును గనబడదు.

పంటకాపు మొదలుకొని పండితునివరకును, బంటు మొదలుకొని ప్రభువువరకును గల ప్రతివ్యక్తియు గూడ దమకు సంబంధించిన విషయములయందు సమగ్రమైన జ్ఞానము గలిగియుండురే కాని యెంతమాత్రము కొరదా చేయరు. ప్రతి యుద్యోగియు దనయుద్యోగమున గడియారమువలె మెలగవలసినదే. దీనికి తిరుగు లేదు.

గృహస్థవిధులందు జర్మనులు తమయింటికి తామే పెద్దలు. దారపుత్రాదులు గృహయజమానికి పరమవిధేయులై యుందురు; కాని యదిమాత్రము బలాత్కార ప్రాభవముకాదు. అన్యోన్య ప్రేమచేతనే.

అక్కరకుమాలిన చదువులవల్ల నన్నవస్త్రములు లభింపనివని జర్మనులు చాలాకాలము క్రిందటనే తెలుసుకున్నారు కాబట్టి తమ బిడ్డలను చిన్నతనమునుండియు కష్టపడుటకే యలవడజేయుచున్నారు. లౌకికము, రసికతయును నీ మొదలగు చక్కనిపేర్లతో వ్యవహరింపబడుచున్న కుచ్ఛితము, మాయదారితనము మొదలగునవి జర్మనులకు మిక్కిలి దూరములైయుండును పండ పగులగొట్టినట్లు ఉన్నది యున్నట్లు మాటాడవలసినదే కాని మరియొకదారి లేదు.

జర్మనులు వీరపూజాప్రియులు. తాము పట్టినపట్టు విడువరు. దానిని సాధించుట కెంతటిదారుణకృత్యమునైన చేయుట, వారికి నైజము. యుద్ధసమయమునందు దయాదాక్షిణ్యములనునవి యెంతమాత్రమునుండవు.

* * * *

సింధుదేశపుస్త్రీలను వారి ఘోషాపద్ధతులను గురించి యుపన్యసించుచు శ్రీయుత నరేంద్రనాథగుప్తగారిట్లు నుడివిరి. "పురాతన ఆర్యాచారసంపదలందు పురుషులకెంత హక్కుగలదో స్త్రీలకుగూడ నట్టి హక్కు-

గలదు. భారతీయయువతు లీనాడు విద్యావతులగుచుండుట సత్యమే. అదెట్టి విద్య? ఈప్రాంతమున బాలబాలికలు ఇంగ్లీషునందే విద్యనేర్చుకొనుచు పాఠశాలలలో రెండవభాషగా ఫ్రెంచిభాషను జదువుచున్నారు. కాని వారి మాతృభాష గతేమి కావలయును? ఎందరు హిందువులు సంస్కృతము నేర్చుచున్నారు; ఎందరు మహమ్మదీయులు పరిషియను భాషను బఠించుచున్నారు? ప్రపంచవాఙ్మయములో నత్యంతసుందర విషయము లీరెండు భాషలందును రచియింపబడినవి గదా! పురాతన భారతీయ యుద్గ్రంథముల నిరసించు విద్యావిధానము తగిన ఫలితములను బొందజాలదు. మన విద్యావిధానమును మొదట గ్రహించి తరువాతవానికై దూరమేగవలసినదిగా నుండవలయును. హోమరు మిల్టను మహాకవుల కావ్యములను మాత్రము జదివి యసత్కృశమగు రామాయణ మహాభారతాది యుద్గ్రంథముల జదువని విద్యవలన ప్రయోజనమేమి?.........షేక్స్పియరు మహానాటకకర్తయే. ప్రకృతియందుగల స్వభావసిద్ధమైన మానవావస్థలను నిపుణముగ చిత్రించినవాడే గాని కాళిదాసుని గణింపవలసిన పనియే లేదా? ఈతనివలె యితర యేకవియు నింత సౌందర్యోపాసకుడై దానినంత రమణీయముగ రచింపలేదుగదా.........రామాయణ మహాభారతములనుండు పురుషు లాకల్పాంతము అవలికు సదృశులుగదా!........" విదేశభాషా వ్యామోహమునచిక్కి పొరుగింటి పుల్లగూర రుచియనువారి కిది చక్కనిపాఠము.

(Modern Review)

స్త్రీలభావముల తృప్తిబొందించుట కేదిగావలయునో, విశేషముగ వారి సౌఖ్యమున కంతరాయము గల్గించు నదెద్దియో, దానిని గన్గొనుటకు పురుషుడు శ్రమయనక ప్రయత్నించుచో, స్త్రీలను సంతోషపెట్టుటత సులభమని యెఱుంగకపోడు. స్త్రీల సౌఖ్యము, దుఃఖకారణములుగూడ పురుషులు స్వల్పవిషయము లనబడు వానిపై నాధారపడియున్నవి. ఈ స్వల్పవిషయములే స్త్రీలకు మహోన్నత విషయములు. ఆ స్వల్ప విషయములను సరిగా పురుషుడు అర్థముజేసికొన నందువలననే వివాహితలయం దతృప్తి మెండగుచున్నది. ఏ స్త్రీయైనను తనయెడ గావించిన మహాపరాధమునైన క్షమించునుగాని తన్నవగాహము జేసికొనకుండ, ప్రేమరహితగా చూడబడుట కెంతమాత్రము సహింపదు. ఇది స్వల్పమెగావచ్చునుగాని, వారికది బ్రహ్మాండము. ఇది గుర్తింపబడిన వివాహములు విచ్ఛిన్నములు గాకుండును.

(Tit-Bits)

* * * *

"రూపమునువలెనే మనస్సును ప్రేమింపవలయును. వివాహోద్దేశ్యములు ఫలించుటకు, పరస్పరాకర్షణల కంటె, స్వభావైకమత్యము, పరస్పరాత్మగౌరవము, సురక్షితము, సుఖప్రదము. సతీపతు లిరువురు యభిరుచులందు సమానాభిప్రాయులై యుండవలయును. జీవితపద్ధతులొక్క త్రోవనడువవలయును. ముఖ్యముగ సతి తా నొనరింపవలసిన సేవను గుర్తెఱుంగవలయును. దుస్తులను ధరించు పద్ధతియే నిరాడంబర జీవితమునకు మొదటి మెట్టని భార్య గ్రహించి మెలంగవలయును. వీనితోగూడ యవ్వనము, అనుభవముగూడ నుండిన తన జీవితమును చక్కదిద్దుకొని నడువగలదు. ఇట్టి స్త్రీలనే పురుషు లెపుడు వివాహమాడగోరుదురు." అని "దుస్తులు—సౌందర్యము" అను పత్రికయం దొకరు వ్రాయుచున్నారు. ఇందలి విషయములన్నియు, మనము శ్రద్ధగ గమనింపవలసినవే!

* * * *

ఆస్ట్రియా ప్రభుత్వము తమదేశములోనికి జపానునుండి యెగుమతిచేయబడుచున్న కొన్ని ఆటవస్తువులను బహిష్కరింప శాసనమొకటి గావించినారట. ఈవస్తువులపై పూయబడు రంగులతో ఉపద్రవకరమగు సీసము విషము మిశ్రమైయున్నవట. చొకయని పిల్లల కెల్లపుడీ వస్తువులగొను తలిదండ్రులు వీనివిషయమై శ్రద్ధవహింతురుగాక.

# గ్రంథపరిచయము

**అనుభవానందము** డబుల్ క్రౌను 146 పేజీలు. శ్రీ పొత్తూరి రామరాజయోగీంద్రులచే రచియింపబడి బెజవాడ ప్రకృతి కార్యాలయమునుండి 46 వ కృతిగా వెలువడినది. ఇందలి పలువిషయములు గురుశిష్యులమధ్య జరిగిన సంభాషణమూలమున బోధింపబడినవి. పరమపావనమైన భరతఖండము ఏనాడు ప్రవేశించెనో నాటనుండి భారతీయులను పీల్చి పిప్పిజేసి, దేశసౌభాగ్యమునంతయు ప్రపంచమంతటను విరజల్లజేసి, నేటికి భారతభావి సౌభాగ్యమునకు వేరుపురువులుగా గనబడుచున్న త్రాగుడు పొగాకు, నల్లమందు, కొంచ మెచ్చుతక్కువగా వానియంతటి హానిగల్గించు వీధులందమ్ము మిటాయీలు, వీనివలన గలుగు చెడుగులు తేటతెలుగున మనోహరముగ బోధింపబడినవి. అంతియగాక, నిహపర సౌఖ్యములనొసగు సహజాహార విహారములు, జ్ఞానము, అహింస మొదలగు వానినిగూర్చి విపులముగ జర్చింపబడినది. ఈపుస్తకము దుర్వ్యాధుకల మూలమున జెడుచున్నవారికి, తమతప్పుల నెఱిగించి చక్కజేయుననుటలో సందియములేదు. గ్రంథకర్తగారిట్టిగ్రంథము లింకను ఆంధ్రలోకమున కర్పింతురుగాక. వెల యితరులకు 12 అ. చందాదారులకు 8 అ. మాత్రము. గ్రంథము ప్రకృతి కార్యాలయమున దొరకును.

**రాష్ట్రీయాంధ్ర సంజీవని** ప్రత్యేకముగా రాష్ట్రీయాంధ్రులకొఱకు బ్రకటింపబడు తెలుగు మాసపత్రిక. సంపాదకులు బ్ర॥ గుమ్మలూరి లక్ష్మీనృసింహ శర్మగారు, ఖర్గపురము. (బెంగాల్) సర్వవిధముల రాష్ట్రీయాంధ్రోన్నతికై పాటుపడుటయే ఈపత్రిక ముఖ్యోద్దేశము. రాష్ట్రీయాంధ్రుల యొక్క ఆర్థిక-నైతిక—సాంఘిక—పారిశ్రామిక-చారిత్రక—విద్యావిషయికాది సమస్త విషయములు నిందు జర్చింపబడుచుండును. ఆంధ్రాభ్యుదయమును గోరు రాష్ట్రీయాంధ్రులేమి రాష్ట్రేతరాంధ్రులేమి యెల్లవారును దప్పక చదివి తీరవలసిన పత్రికారాజము.

చందా:—సం॥నకు రెండురూపాయలు ముందుగా చెల్లింపవలయును.

1935 డిసెంబరు మాసాంతములోపుగా చెల్లించువారికి ఒకరూపాయి మాత్రమే!

**యిన్‌డియన్ టీ.** ఇది ఇంగ్లీషున Indian Tea Cess Committee వారిచే ప్రకటింపబడిన పుస్తకము. ఇందు భారతదేశమున ఇప్పటికి నూరు సంవత్సములక్రింద ప్రారంభింపబడిన తేయాకుపంట క్రమక్రమాభివృద్ధిజెంది యిపుడు ప్రపంచమందంతట తేయాకుపండించు వానియందెట్లగ్రగణ్యత సంపాదించిన వివరమును, తేనీటిపానీయమువలన గలుగు మేళ్లును, తేయాకు తయారుజేయువిధమును వరుసగా వర్ణింపబడినవి. భారతదేశ తేయాకును ప్రపంచమంతయు నుపయోగించుచుండ యీదేశము మాత్ర ముపయోగించకుండు విషయమై యెక్కువగా వ్రాయబడినది. ఇట్టి పానీయములకై విదేశవస్తువులకు నపరిమితముగ వెచ్చించువారీ భారతీయతేయాకునే యుపయోగించుట మంచిది.

**భక్తిసారము** అనకాపల్లి నివాసులగు శ్రీ వుప్పల రామమూర్తిగారిచే రచియింపబడినది. డబుల్ క్రౌన్ సైజు. 80 పేజీలు. గ్రంథాలయములకు భక్తసమాజములకు

పోస్టేజి 2 అ. పంపిన ఉచితము. భక్తి తెలుంగ వలసిన సర్వవిషయములను సులభశైలిలో వ్రాయ బడినవి. పెక్కు ఉద్గ్రంథములనుండి పద్యరత్నములు శ్లోకము లుదహరింపబడినవి. సాధారణ మానవసౌభాగ్యము పెంపొందించుటకు వలయు, సత్యము, అహింస, కాలమును వృథాపోనివ్వకుండుట మొదలగు విషయములు హృదయరంజకముగనున్నవి. ప్రతివిషయము క్లుప్తముగ నితరులకు సులభముగ దెలియునట్లు రచింపబడినది. అవసరమగునపుడెల్ల మహాత్ములవాక్యము లుదహరింపబడినవి. పుస్తకము గ్రంథకర్తగారియొద్ద దొరుకును.

**కమలావిలాసము** — ఇయ్యది వఝ్ఝల వేంకటేశ్వరకవి గారిచే రచియింపబడి సరస్వతీ గ్రంథమాల 39వ పుష్పముగా ప్రకటింపబడినది. పండితులకు మాత్రము పంపబడును. వెల 12 అ. ఈ శృంగార ప్రబంధము కవిగారు నాలవఫారము జదువుచు, 16 సంవత్సరముల ప్రాయమున రచించినది. పూర్వ ప్రబంధానుకరణములుగలవు. బాల్యప్రాయమున రచించినదగుటచే గాబోలు పెక్కులోపములు గన బడుచున్నవి.

**ఆంధ్రవాచస్పత్యము** — 8, 9 భాగములను వందనములతో నందుకొంటిమి. ఎనిమిదవ భాగమున 'కటీరకము' మొదలగు 'కాక' వరకును తొమ్మిదవభాగమున 'కాకకంగువు' మొదలు 'కుశీదము' వరకు గలదు. వెల మునుపటివలె ప్రతిభాగము రూపాయిమాత్రమే.

**రుక్మిణిదేవి** — 10 పేజీలు. పుట్టుకతోడనే భక్తురాలై నిరంతరము శ్రీకృష్ణుని స్మరణతో గడపి అష్టవర్షముల కాతని సాన్నిధ్యముజేరిన రుక్మిణిదేవియను బాలిక సంగ్రహచరిత్ర. రచయిత. కొండపల్లి రామచంద్రరావు తిరువూరు, కృష్ణాజిల్లా.




శ్రీమతి కాళ్ళకూరి మహాలక్ష్మీసుందరమ్మగారు మొన్నటి మొల్లజయంతినాడు మాటాడిన యువతీరత్నములలో నీయమ యొకతె. స్థలాంతరమున ముద్రితమైయున్న యీ యుపన్యాసపుఁ జొప్పారసి పాఠకు లానందింతురుగాక !

క్వీన్ మేరీకళాశాలయం దీమె బి. యే. ఆనర్సుక్లాసునఁ జదువుచున్నది. అందరివలె నీయమయు నాఙ్గ్లేయభాషావ్యామోహిత గాక యార్యభాషయగు సంస్కృతము జదువుట మిగులఁ బ్రశంసార్హమగు విషయము కదా! రమారమి యిరువదేండ్ల యీ చిన్న వయసున నుత్తమ సంస్కృతమతియైన యీ బిడ్డ యుత్తరోత్తరమునఁ దనకెంతటి కీర్తి సంపాదించునోయని వేయిమంది వేలుపులకు మ్రొక్కుచున్న యాంధ్రమాత యభీష్టము సిద్ధించుగాక యని మనసారఁ గోరుచున్నాము.

మాతృభాషాపరిజ్ఞాన మావంతయు లేని పరభాషా పట్టభద్రులవలన హిందూదేశ మునకు ముక్తికలుగుట యసాధ్యము.

ఆర్యభాషయందు గల గొప్పదనము జర్మనీ మొదలగు పరదేశములవారు వేయి నోళ్ళఁ బొగడుచున్నారు కాని ఆ యార్యుల సంతతులమని చెప్పుకొనుచున్న మన యీ నాటివారికి మాత్ర మాగీర్వాణభాష 'మృత భాష' యైనది.

ఇట్టి విపరీతాభిప్రాయమునకు లోనుగాక శ్రీ మహాలక్ష్మీసుందరమ్మగారు యువతీ మణుల యున్నత సంస్కృతభాషాసేవకై చూపుచున్న యుత్తమమార్గమును బట్టి యాంధ్రసోదరీమణులు ఆంధ్రమాతకు వాసిఁ గూర్తురుగాక! సర్వభాషలకును మాతృప్రాయమైయున్నది కదా సంస్కృతము. అట్టి స్థితిలో దీనినిఁ జెప్పఁదగినంతవరకు నేర్చుకొన్నచో హిందీ, మరాఠీ, ఓఢ్రము మొదలగు నెన్నోభాషలు సుసాధ్యములగుననుట నిర్వివాదము. మరియొకమాట — తెనుఁగు వారికి సంస్కృతము సుసాధ్యమైనట్లు తక్కిన వారికిఁగాదు. తెనుఁగుమాటలలో స్వచ్ఛము లగు గీర్వాణభాషాపదములే, విభక్తి ప్రత్యయము మాత్రము మారి 'తత్సమ పదము'లను పేరుతో నిత్యవ్యవహారము నందు సిద్ధములైనవి. కాఁబట్టియే మన పూర్వులు 'తెలుఁగెరుఁగక సంస్కృతంబు తేన్నే మెరుఁగున్' అన్నారు. ఇది యథార్థము కావునఁ బ్రప్రథమమందు మాతృభాషయు దాని సహాయమున సంస్కృతమును దీని వలన నితరభాషలును అతిసులభముగా నేర్చుకో వచ్చును. ఈసత్క్రమపద్ధతి వదలితిమి కాబట్టి

మాతృభాషరాలేదు. మరొకభాష పట్టుబడ బోదు.

ఇట్టి విషమస్థితిలోఁబడక సక్రమముగఁ జదివి యీ విదుషీకుమారి మూఁడుభాషల యందు ముద్దుగా, నుద్దిగాఁ, బెద్దలు హర్షించునట్లు ముచ్చటింపఁగల్గెను.

పరమేశ్వరుఁడీమె ననుగ్రహించుగాక!

## కాంగ్రెస్ స్వర్ణోత్సవము

మానవాభ్యుదయముకని, జాతీయోద్ధరణకని బయలుదేరు సంస్థలు సభలు, చాల కాలము సాగుటే దుర్లభము; అట్లు సాగిన గాని వాని ప్రాముఖ్యత బైటబడజాలదు. జాతీయమహాసభ దేశభక్తులగు కొంతమంది మహాపురుషులచే భారతదేశదీప్తిని గోరి యిప్పటి కేబది సంవత్సరముల క్రింద ప్రారంభింపబడినది. క్రమక్రమమున శాఖోపశాఖలై విస్తరించి నేఁడు దేశమున నగ్రస్థాన మాక్రమించినది. అదెట్లు అభివృద్ధి జెందినదియు, మధ్య నెన్నియవస్థల బొందినదియు ప్రకృత మెట్టి స్థితియందున్నదియు ప్రతిభారతీయునికి దెలియకపోలేదు. ఒక్క విషయము మాత్రము గమనింపదగినది. జాతీయమహాసభారంభమున దానియందు పాల్గొన్నవారిలో స్త్రీలు చాల కొలదిమంది మాత్రమే. జాతీయభావము భారతదేశమంతటను క్రమక్రమంబున వ్యాపించున్నను జాతీయసభయందు, తత్కార్యక్రమమందు పాల్గొని పనిజేసిన శ్రీమతి సరోజినిదేవి అనిబిసెంటు మొదలగు వారలను వ్రేళ్లపై లెక్కింపవచ్చును.

1920 సంవత్సరమున నిది మారిపోయినది. జాతీయభావము మారుమూలల నల్లుకొన్నది. జాతీయసభాకార్యక్రమమున బనిచేయుటకై వేలకొలదిస్త్రీలు తమ కత్యంత ప్రియులగు పతులను సంతానమును గూడ విడిచి ప్రాణములపై నాసగొనక యనంతమగు త్యాగమును గావించి స్వాతంత్ర్యసమరమున పాల్గొనిరి. అదియునుగూడ గడచిపోయినది. మరల పదునత్సరములు జరిగినవి. తిరిగి భారతనారీమణులకు పరీక్షాకాల మేతెంచినది. స్వాతంత్ర్యసమరము సాగినది. సకలము త్యజించి చంటిబిడ్డలను చంకనుబెట్టుకొని సమరమునదూకిరి. శాంతముగ కారాగృహముల ప్రవేసించిరి. ప్రపంచమంతయు దిగ్భ్రమ జెంద జాతీయనాయకుల పద్ధతియగు నహింసాతత్వ మవలంభించి ఆత్మబలముచే సామ్రాజ్య బలమునే యెదిరించిరి. జాతీయసభ కార్యక్రమమునకై కొందరు ఆభరణములను, తమ ప్రియ పతులను, సుతులను, తుదకు తమ్ములను అర్పించుకొనిరి. ఇట్టి యపూర్వ నారీమణుల సేవవలననే భారతమాత పవిత్రమయ్యెను. జాతీయమహాసభాశయములు ఫలించెను.

నేఁడు అఖిలభారత జాతీయసభాస్వర్ణోత్సవము జరుగుచున్నది గదా! ఇయ్యది యిందులో పాల్గొన్న భారతనారీమణుల మహాత్వమహోత్సవమని గూడ వచించుట కెంతమాత్రము సందియము లేదు. ఈసమయమున వారి యమూల్యత్యాగమును, సేవను భారతీయులు మరువరాదు. భారతమాత

స్త్రీశక్తిస్వరూపిణియని పూజింపక విడువజాలరు.

## కీ॥ శే॥ కం. వీరేశలింగము పంతులుగారి విగ్రహప్రతిష్ఠ

"ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" అని శ్రీ కృష్ణభగవానులానతిచ్చినట్లు మహామహు లపుడపుడు సాధారణ మానవులమధ్య జనియించి వారిని సన్మార్గమునకు ద్రిప్పుచుండుట సహజమే. పురాతన హిందూధర్మము లన్నియు పెడత్రోవద్రొక్కి, మానవ సౌభాగ్యమునకై నిర్మింపబడిన ఆచార వ్యవహారములన్నియు హానికరములై మేలునకు బదులు కీడుగల్గించుచున్న సమయమున వానిని కాలదేశపాత్రముల ననుసరించి సంస్కరింపక తప్పదు. కాని అనాదినుండి వచ్చుచున్న యాచారముల నెదుర్కొనుటకు ధైర్యము సాహసము, జ్ఞానము పట్టుదల మొదలగు గొప్పగుణములు గావలసియుండును. ఇందునకే మహనీయులు గావసియుందురు. సాధారణ కుటుంబమున జనియించియు, దేశమునందు చెలరేగుచున్న బాల్యవివాహాది పూర్వాచారములను సంస్కరింప కందుకూరు వీరేశలింగము పంతులుగారు బూనుకొనిరన వారికెంతటి సాహసము, ఎంతవిజ్ఞాన సామగ్రియుండవలయునో స్థూలభముగ నూహింపనగు. వారాంధ్రదేశమున కెంత యమూల్యసేవ గావించిరో యదిచెప్ప సాధ్యముగాదు. అందు ముఖ్యముగ స్త్రీలవిషయమై వారు గావించిన సేవ యాచంద్రతారార్కము నిలుచునదియే. రాజారామమోహన రాయి మొదలగు మహాత్ములద్రోవద్రొక్కి సంస్కారములయెడ సానుక్రోధులైయున్న సనాతన వాదుల కించిత్తుగూడ లెక్కింపక ధనమానప్రాణములను తృణమువలె గణించి విధవా వివాహములను, రజస్వలానంతర వివాహములనుగావించి యాంధ్రదేశమునకు మార్గదర్శకుడయ్యెను. వారి సంకల్పమే యిపుడు శారదాచట్టముమూలమున ఫలించినది. ఎంతటి సంస్కరణాభిలాషియో, యంతకంటె నెక్కుడుగ సాహిత్య సార్వభౌముడగుటచే స్త్రీలకు విద్యగూడ దను వాదోపవాదములను ఖండించి, పురుషులతో సమానమగు హక్కువారి కన్నిటియందును గలదనుభావమును లోకమునకు వెల్లడించెను. ఉపన్యాసవేదికలపై నెక్కి నోటికివచ్చినట్లెల్ల వాగి యింటమాత్రము తద్వ్యతిరేకులై యుండునట్టి వారివలెగాక వీరేశలింగము పంతులుగారు ఇంటగెల్చియే రచ్చగెలువజాలెను. వారి సతీమణియెడ వారికెట్టి గౌరవాదరములుండెనో యదియె యిందులకు నిదర్శనము. ఇట్టిమహాపురుషుని జ్ఞాపకార్థమై రాజమహేంద్రపురమున విగ్రహప్రతిష్ఠ గావించి యాంధ్రానని తనకు మహాపురుషులయందుండు కృతజ్ఞతను గౌరవమును ప్రకటించుకొనియెను. ఇంతటితో కార్యము పూర్తిగాదు. సహృదయులగు యాంధ్రు లెల్లరు దేశసౌభాగ్యమునకు మూలమగు స్త్రీజనాదరణ వహించి వారి పురోవృద్ధికై పాటుబడుదురేని కీ॥ శే॥ వీరేశలింగము

## సంపాదకీయములు

పంతులుగారియాత్మ తన విగ్రహప్రతిష్ఠ కంటె వేయిమడుంగులు సంతసించునని మా విశ్వాసము.

**బాలికల ఉన్నత పాఠశాల; హైదరాబాదు**

ఈ పాఠశాల సప్తమవార్షికపు నివేదిక నందుకొనుటకు సంతసించుచున్నాము. ఇది దేశీయపద్ధతులపై మాతృభాషయందు విద్య గఱపుటకు స్థాపింపబడినది. ఇందీ వత్సరము మునుపటికన్న చాల యభివృద్ధి గనబడుచున్నది. ప్రతి తరగతియందును సగము విద్యార్థుల కంటెను యెక్కువగా తమ పరీక్షలయందు నెగ్గుచుండుట పాఠశాలాధికారుల శ్రద్ధ, ఉపాధ్యాయులకృషి, విద్యార్థుల యక్కఱను దెలియజేయుచున్నది. అందుచే విద్యావిధానమిచట సర్వవిధముల తృప్తిగానున్నదని జెప్పవచ్చును. బాలికలకు మాతృభాషయం దధికాసక్తిగలిగించి వారిచే రచనల ప్రోత్సహించు టెంతయు గమనింపదగిన విషయము. వారికి తగుప్రోత్సాహమున్న త్వరలో నభివృద్ధికి రాగలరనుటకు వారిచే ప్రకటితమగుచున్న మాతృభారతియే నిదర్శనము. ఈపత్రిక వ్రాతప్రతిగా వెలువడుచున్నది. ఉదారులు పెక్కుమం దీపాఠశాలకు సాయముజేయుచున్నారు గాని సరియగు సాయమింకను జేకూరలేదు. ప్రభుత్వమువారియొక్కయు తదితర విద్యాభిమానులయొక్కయు, ఆదరణమునుబొంది యీయున్నతపాఠశాల ఉన్నతస్థితికి వచ్చుగాక యని గోరుచున్నాము.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

ఈస్టిండియా కొత్త ఫిల్ములు

సి. పుల్లయ్య గారి

'కుశ లవ'ను మించిన చాతుర్యం!

# సతీ అనసూయ

నటీనటులు ఎవరు పేరుపొందినవారా!

ఆంధ్ర తారామండలాన్ని అలంకరించనున్నవారు

అందరూ పిల్లలు 13 ఏండ్ల లోపువారు

# ధ్రువ విజయము

నటీ నటులను [illegible]
[illegible] శక్తిగల
సి. పుల్లయ్య గారు

ఈసారి
ఎవరిని ప్రదర్శిస్తున్నారో
ఎదురు చూడండి!

---

ఇదికాకను **సతీ సులోచన** అద్భుతచిత్తరువు

---

## హిందీటాకీలు:

**విద్రోహి**

రాజపుత్ర వధ, కొట్లాటలు, కుస్తీలు,
ప్రేమ, విరహం, కుట్రలు
చిత్ర విచిత్రచర్యలు

**స్వప్నస్వయంవరం**

భవాని చిత్తరువు, పాశ్చాత్య వ్యామోహం,
భారత నారీమణుల ఆదర్శం, ప్రతిబింబితాలు.
ఈ చిత్తరువులో హాస్యం ప్రధానరసం.

---

రానున్న చిత్తరువులు:

1. హంతకుడు, 2. ఖైబరులోయ, 1936 భార్య

---

సింప్లెక్సు మెషీనులు, ఆర్. సి. ఏ. సెట్టులు, 6 నెలలు వాడుకైన మెషీనులు చౌకధరలకు అమ్మకానికి వున్నవి.

---

ప్రైవేటు కన్నింటికి: టెలి: చామేరియా.

**చమేరియా టాకీ డిస్ట్రిబ్యూటర్సు,**

20. వేపేరి హైరోడ్, మద్రా[illegible]

GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుటకై ఏర్పడిన సచిత్ర మాస పత్రిక


సంపాదకుడు

డాక్టరు. కే. యన్. కేసరి



సంపుటము ౮]  ఫిబ్రవరి 1936  [సంచిక ౧౨

*Printed at Lodhra Press, Egmore, Madras.*

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 3. అర్ధ సంవత్సరపుచందా రు. 1-8-0 అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-4-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము.

## ప్రకటనరేట్లు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రికఎంతయు అనువైనది. ఉంచబడినరేట్లుఇవి: ఒకేతూరికి పూర్తిపుటకు రు. 15 0 0 అరపుటకు రు. 10 0 0 కాలుపుటకు రు. 7 0 0. ప్రకటనఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. అర్ధసంవత్సరము అంతకుపైబడినకాలములకు కంట్రాక్టుతీసికొనుచో నూటికి 12½ తోసివేత. కాలుపుటకు తక్కువయైనప్రకటనలు చేకొనజాలము. ప్రత్యేకస్థలముల రేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసములు స్త్రీజనములకు సంబంధించియుండవలయును. సంగ్రహముగనుండిన శీఘ్రప్రచురణకు వీలగును. కాగితమునకు ఒకేతట్టు సిరాతో వ్రాయవలయును. ప్రచురింపబడనివ్యాసములు తపాలాబిళ్లలు పంపిన వాపసు చేయబడును. వీనినిగూర్చి ప్రత్యుత్తరములు పెంచకుండుట [illegible] తిరుగు[illegible]మార్గము పంపబడు గ్రంథములను, ప్రచుర[illegible] పంపబడువ్యాసములను అందుకొనుచు ఈ[illegible] వ్రాయుచుండినరీతిని ఇక కార్డులువ్రాయజాలము. రిప్లయికార్డువ్రాసిననే జవాబుఈయబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందుమార్పుఉండుచో 1-వ తేదీకి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈసూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులనుప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగఉండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైనగమనింపు

చందాదారులుగచేర్చుకొనుమని వ్రాయుఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు, గృహలక్ష్మి, పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయునుగాని ఇతరవ్యక్తుల పేర ఎంతమాత్రము పంపకూడదు.

# గృహలక్ష్మి ఏజెంటు

బాపట్ల: ఎల్. వి. మనోహరరావుగారు. మదరాసు: ఆకుండి వెంకటశాస్త్రిగారు.
తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు.
నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు. నూజవీడు: వి. ధనంజయ అండ్ కంపెని.
జెమ్షెడ్పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్పైప్ కంపెనీ, లిమిటెడ్.
బరంపురం: ఎన్. కె. మూర్తి అండ్ సన్స్.
గుంటూరు: వెల్కం అండు కంపెని.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు
పిఠాపురం: ఎం. సూర్యరాజుగారు, ఆంధ్ర న్యూస్ ఏజెన్సీ.
రాజమండ్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
ఏలూరు: డి. శ్రీహరిరావుగారు.
తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్పేట.
ఒంగోలు: తాతా జాలయ్య శెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు, 244 ఫేర్ వీధి.
చిత్తూరు: వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.
విజయనగరం: ఆయపిళ్ల సూర్యనారాయణరావుగారు.
నరసాపురం: వై. సత్యనారాయణగారు.
కొవ్వూరు: కె. సి. చెన్న కేశవయ్యర్ గారు
కాకినాడ: సున్నా బాలకృష్ణరావుగారు, న్యూస్ బాయ్ అండు కో.
భీమవరం: వంగల అచ్చుత రామయ్యగారు, మేనేజరు, నెహ్రూ ఖద్దర్ స్టోర్సు.
గుడివాడ: శ్రీ శివరామ అండు కో.
తిరుపతి: వై. వి. సుబ్బయ్య అండు కో.
అమలాపురము: పి. అన్నాజీశర్మగారు. (శర్మాస్ న్యూస్ ఏజెన్సీ)
పర్లాకిమిడి: రాచూరి రామనారాయణరావుగారు.
అముదలవలస: సి. వి. నరసింగరావుగారు
మచిలీపట్నం: ఆచంట లక్ష్మీనరసింహంగారు, సర్కిల్ పేట.
కర్నూలు: టి. బాలనాగయ్య శెట్టిగారు, బాలసరస్వతి బుక్ డిపో.
అనకాపల్లి: సివాజి న్యూస్ ఏజన్సి.

హిగిన్బాథమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు [illegible] వ్రాయుడు.

తింటే గారెలుతినాలి; వింటే భారతంవినాలి

బెజవాడ సరస్వతీటాకీస్‌వారు తమ మొదటి తెలుగుటాకీ

# —ద్రౌపదీ వస్త్రాపహరణము—

అనుభారతకథతో కర్ణానందము, నేత్రానందము గూర్పనున్నారు.

సూపర్వైజింగ్ డైరెక్టరు: హెచ్. యం. రెడ్డి. * డైరెక్టరు హెచ్. వి. బాబు



రాజసూయమున కరుదెంచిన కృష్ణునికి ధర్మజుడు పాదపూజ చేయుట.

ఫిబ్రవరి తే 17 దిన ఆంధ్రదేశమున ముఖ్యమగుచోట్ల ప్రదర్శింపబడును.

ముఖ్య పాత్రధారులు:

| | | |
|---|---|---|
| యడవల్లి | పి. యస్. ఆర్. | కన్నాంబ |
| గగ్గయ్య | నాగరాజరావు | రామతిలకం |
| దొమ్మేటి | చొప్పల్లి | నగరాజకుమారి |

***For Booking apply to:***

**SARASWATI TALKIES, Ltd.,**

***Camp: Palace Theatre Buildings, Kolhapur.***

**Grams: "SARASWATI," Kolhapur.**

# ఈస్టిండియా కొత్త ఫిల్ములు

సి. పుల్లయ్యగారి

'కుశ లవ'ను మించిన చాతుర్యం!

# సతీ అనసూయ

నటీనటులు ఎవరు పేరుపొందినవారా!

ఆంధ్ర తారామండలాన్ని అలంకరింప నున్నవారు

అందరూ పిల్లలు 13 ఏండ్ల లోపువారు

# ధ్రువ విజయము

నటీ నటులను ఏరడంలో అద్భుతశక్తిగల సి. పుల్లయ్యగారు

ఈసారి ఎవరిని ప్రదర్శిస్తున్నారో ఎదురు చూడండి!

## మినర్వాటాకీస్ డేవిడ్‌సన్ స్ట్రీటు

బ్రాడ్వేయందు ప్రథమప్రదర్శనమునకై ఎదురుచూడుడు

## హిందీటాకీలు:

**విద్రోహి**

రాజపుత్ర వధ, కొట్లాటలు, కుస్తీలు, ప్రేమ, విరహం, కుట్రలు చిత్ర విచిత్రచర్యలు

**స్వప్న స్వయంవరం**

భవాని చిత్తరువు, పాశ్చాత్య వ్యామోహం, భారత నారీమణుల ఆదర్శం, ప్రతిబింబితాలు. ఈ చిత్తరువులో హాస్యం ప్రధానరసం.

రానున్న చిత్తరువులు:

1. హంతకుడు, 2. ఖైబరులోయ, 1936 భార్య

సింప్లెక్సు మెషీనులు, ఆర్. సి. ఏ. సెట్టులు, 6 నెలలు వాడుకైన మెషీనులు చౌకధరలకు అమ్మకానికి వున్నవి.

ప్రైవాటి కన్నెంటికి: టెలి: చామియా.

## చమేరియా టాకీ డిస్ట్రిబ్యూటర్సు,

[illegible] వేపేరిహైరోడ్, మద్రాసు.

# మాధవి




ఇది పుష్పసారములతో నిండియుండు ఒక నాజూకైన మంచువంటి పరిమళపదార్థము. ఈ మంచును కొద్దిగ వ్రేలితో తీసుకొని ముఖమునకు లేపనమును చేసికొనిన వెంటనే అది చర్మములో మాయమై ముఖమునకు కళ, కాంతి నిచ్చును. ముఖము స్ఫటికమువలె నిర్మలమగును. ముఖమున లేచు సోబి, మచ్చలు, మొటిమలు మొదలగువానిని మాన్పును. మరియు దీనిని ముఖమునకు పట్టించుకొనిన వెంటనే ముఖము చల్లగనుండి మంచు రాచుకొనినట్లేయుండును.

**వెల బుడ్డి 1-కి 8 అణాలు.**

**కేసరి కుటీరం, ఎగ్మూరు, మద్రాసు.**

# విషయసూచిక



త్రివర్ణచిత్రము

గౌతమ సందేశము

# శిథిల దేహము–

# మధుర జీవనము?

## ఇది సాధ్యమా?

నదీతీరమున, పచ్చికబయలున, కొండచరియల విహరిస్తే ప్రకృతిశోభ కనబడుతుంది. అది మధురజీవనము.

## కాని అది నీకు సాధ్యమా?

నాలుగడుగులు ముందునకు వేసిన నీ దేహమే నీకు భారమవుతుంది. తీరని ఆయాసము. కలకలలాడు ఆ నింగి శోభను చూడలేక తేజోవిహీనములగు నీ కనులు గూటిపక్షులు లాగు నీటితెరల వెనుక క్రుంగిపోతవి. నీవు నిరాశాభావములో యెముకలగూడువలె నేల కూలిపోయెదవు. కాని మధురజీవనమునకు నీకు హక్కు లేదా? ఉన్నది. దీనిని నీ వనుభవించాలి. అందుకు తగినశక్తి, బలము, ఝుయ్యిమంటూ ప్రవహించే ఉడుకునెత్తురు సంపాదించాలి. దానితో నీలో ఒక నూత్న తేజస్సు, శక్తి బయలుదేరుతుంది. అందుకు సాధనము "అమృత." "అమృత" సేవనము నీలో నవయౌవనమును ప్రవేశపెట్టగలదు. అది మధురజీవనము నీ యందుబాటులో ఉంచగలదు. "అమృత" సేవనము నేడే ప్రారంభించు.

# మధుర జీవనమునకు అమృత సేవనము

# 2000000

# మలేరియా మరణములు

ప్రతియేటను మలేరియావల్ల మనదేశములో యిరవైలక్షలమంది మరణిస్తున్నారు. ఆ మరణములు సాధారణమైనవి కావు. హృదయకుహరాలనుండి కదల్చివేసే చలి, శరీరాన్ని ప్రేల్చివేసే ఉష్ణము, శిరాన్ని పగులగొట్టే తలనొప్పి, కాలుచేతులను నమలుకొని తినివేసే నొప్పులు, పీకులు వీటితో యమయాతనను అనుభవించినమీద వచ్చిన మరణములు. ఇంతటి దారుణమునకు కారణము మలేరియా. మలేరియాను పూర్తిగా మాన్పుటకు మందు లేదనే పిచ్చినమ్మకము దేశములో వ్యాపించినది. అందుకు గుణమీయలేని యెన్నో మందులే కారణము.

మలేరియాను పూర్తిగా సంహరింపగలశక్తి "అర్క" వద్ద వుంది. "అర్క" ప్రయోగము తిరుగులేని చక్రాయుధప్రయోగమె. ఎంతటి తీవ్రమైన జ్వరాలలనన్నను పారద్రోలుటలో "అర్క"తో పోల్చదగినది మరియొకటి లేదు.

# అర్క

జ్వరములపాలిట చక్రాయుధము

తెలుగుజిల్లాలకు ఏజంట్లు: శీతారాం జనరల్ స్టోర్సు, మెయిన్ రోడ్డు, బెజవాడ.




# అఖిలభారత మహిళాసభ

భారతదేశమందంతటను సహజసౌందర్య[illegible]ఘమునందు పురుషునికంటె [illegible]టయుందును, పేరు గణించినవారు కేరళస్త్రీలు. ప్రజానురంజకమగు పరిపాలనముచే సర్వవిధముల స్త్రీల నభివృద్ధికిదెచ్చి శ్రీమతి రాణిసేతు పార్వతి బాయిగారు 'భారతనారీమణులం దసమానమగు విదుషి'యనియు పేరుబొందిరి. అట్టి దేశమునకు ముఖ్యపట్టణమగు తిరువనంతపురమున విదుషీమణియగు రాణిగారి యధ్యక్షతక్రింద అఖిలభారత మహిళాసభ జరుగుటెంతయు శ్లాఘనీయము. కాశ్మీరమునుండి కన్యాకుమారియగ్రము వరకుగల వివిధ మండలముల మహిళాప్రతినిధులేగాక, విదేశీయ స్త్రీలుగూడ సభ నలంకరించియుండిరి. వీరిలో నొకరగు 'మారియల్ లెస్టర్'గారు వ్రాసినట్లు "అచట వైద్యులు, న్యాయవాదులు విదుషీమణులు, చిత్రకారులు, సంఘాభివృద్ధికి పాటుబడువారేగాక సాధారణ యిల్లాండ్రుగూడ జాతీయభావమును మేల్కొలుపుటకును, భౌతికాధ్యాత్మికబల సంపాదనకును గావలసిన యీ సంవత్సరపు కార్యక్రమమునుగురించి యాలోచించుటకు' సమావేశమైరి.

ఆహ్వానసంఘాధ్యక్షురాలైన శ్రీమతి కుంజన్ పిళ్లై సతిగారు, సభికుల నాహ్వానించుచు తిరువాంకూరు సంస్థానమున కొలది కాలములోనే స్త్రీలు బొందిన యభివృద్ధిని సూచించిరి. ఇదెంతయు సత్యమైన విషయము.

బ్రిటిషు పరిపాలనమున నున్న రాష్ట్రములందు స్త్రీలలో నూటికి ముగ్గురుమాత్రమే విద్యావతులై యుండ, తిరువాంకూరు సంస్థానమున నూటికి 16.8 మంది స్త్రీలు విద్యావంతులై యున్నవారనిన ఆ ప్రభుత్వమువారు విద్యా విషయమున దీసికొనుచున్న శ్రద్ధ గమనింపనగును.

తదుపరి అధ్యక్షులీవిషయమై బలపరచుచు యీ సంస్థ భారతదేశమున నొనరించిన సేవనుగురించి గొనియాడిరి. ఈ సంస్థ ప్రారంభించిన నిధినుండియే పలువురి మెప్పు గనుచు భారతనారీమణుల కాదర్శప్రాయమై యున్న ఇర్విన్ ప్రభ్విక శాఖాల ఢిల్లీనగరమున స్థాపింపబడినది. క్రొత్తరాజ్యాంగములందు స్త్రీల కెక్కువ ప్రాధాన్య మిచ్చుటకుగూడ యీసంస్థ జేసిన కృషియేకారణము. స్త్రీ కార్మికకష్టముల నివారణార్థమై సంఘము నియమించుటకును, ఆరోగ్యాభివృద్ధికొరకు ప్రచారము సల్పుటకును, పురుషులందు నానాటికి బెరుగుచున్న మతసాంఘికాంతః కలములు స్త్రీలలో ప్రబలకుండుటకును యీ సంస్థ చాల పనిచేసెను. ఈ విషయము లెల్లరికిని విదితములే.

ఈ సమావేశమున గావింపబడిన తీర్మానము లింతకంటెను ముఖ్యమైనవి. దేశమునందంతటను యైకభావముండిన భారతీయుల యైకమత్యమునకు దోహదము గల్గునను యభిప్రాయముచే పై సమావేశము హిందీభాష దేశభాషగా నొనరించి దేశమునందలి వివిధసంఘములకును ఐకమత్యము చేకూర్పవలయునని తీర్మానించిరి.

వృత్తివిద్యయే ప్రధానముగాగలిగి బుద్ధి వికసనమునకు తోడ్పడురీతి సంస్కరించిన విద్యావిధానమువలన భారతస్త్రీలకు కావలసినంత జ్ఞానము సామర్థ్యము గల్గింపవలయు ననెడి తీర్మానము ప్రకృత విద్యావిధానమందు అవసరముగా గావలసిన సంస్కారములను సూచించుచున్నది.

స్త్రీలకు ఆస్తియందు భాగములేదను చట్టములను, స్త్రీలనణచు నుద్దేశముతో స్థాపింపబడిన సాంఘికాచారములను, మార్చుట; గ్రామాభివృద్ధికి తోడ్పడుట గ్రామపరిశ్రమలలో తయారగు వస్తువులనే కొనునట్లు ప్రచారముగావించి వానియందు నమ్మకము పుట్టించి వానికెక్కువ అమ్మకము గల్గించుట; స్త్రీకార్మికులకు పురుషకార్మికులకు కూలి విషయమునగాని యితర విషయమునగాని భేదము జూపింపరాదను మరికొన్ని తీర్మానములు గమనింపదగినవి.

ఈసంస్థ నూతనరాజ్యాంగమునందు స్త్రీలకుండవలసిన హక్కులనుగురించి చాల పరిశ్రమజేసినదిగాని తగినఫలితమును బొందజాలదయ్యెను. కాని నూతనరాజ్యాంగవిధానమునందు స్త్రీల కివ్వబడిన ఎన్నికహక్కులను, శాసనసభలందు ప్రత్యేకింపు స్థానములను మొదలగువానిని యక్కరలేదని తిరస్కరింపరాదు; ఆహక్కులనే వినియోగించి శాసన

సభాప్రవేశముగావించి దేశాభివృద్ధికై పాటు బడవలయు ననెడి తీర్మానముగూడ గావింప బడినెను.

భారతదేశమున వివిధమండలములనుండి స్త్రీ లీ సభయందు పాల్గొని భారతస్త్రీల యైకమత్యమును చాటుచున్నారనియు, యీ ఐకమత్యమునే ఎపుడును నిలుపుకొని సాంఘికమతభేదములు పాటింపక పురుషులకు మార్గదర్శకులై యుండవలయుననియు, అంతర్జాతీయస్త్రీలతో గలసి మనహక్కులకై పోరాడవలయుననియు గావింపబడిన యీ తీర్మాన మత్యంతముఖ్యమైనదని అధ్యక్షులు వచించిరి. ఇది ఫలించుగాకయని గోరు చున్నాము.

ఇవన్నియుగాక నింకనెన్నియో తీర్మానములు జేయబడియెనుగాని యవి కార్యరూపము దాల్చునపుడే గుణముండును. ఈ విషయమై సభయందే స్పష్టముగ జెప్పబడినది. ప్రతిసభ్యురాలును స్వదేశవస్తువులనే వినియోగింపవలయుననియు, తన పరిసరముల వారికి సాధ్యమైనంతవరకు సాయపడుచు సంఘము నుద్ధరింప బూనవలయుననియు అపుడే యీ సమావేశముయొక్క ఆశయములు, తీర్మానములు ఫలించుననియు, వచింపబడెను. ఇది అన్నితీర్మానములకంటె ముఖ్యమని తలంచెదము. ప్రతిసభ్యురాలేగాక ప్రతి భారతస్త్రీయు తమ యాశయముల కార్యమూలముగ ప్రారంభించినచో అఖిల భారతమహిళాసభయొక్క ఆశయమేగాక, భారతమాత భాగ్యముగూడ ఫలించును.

# నివేదనము

## (వినోది)

కృష్ణ! సరసగానామృత వృష్టిచేత
భువి పులకరింపజేయు నంబుదమ వీవు;
అవ్య యానందవశత బర్హంబు విప్పి
ఒడలుమఱచి నటించు మయూర మేను.
శీతలమనోజ్ఞ కౌముదీ స్మితముచేత
భువనమలరించు కువలయాప్తుడవు నీవు;
పొడగనినమాత్ర ముప్పొంగిపోవ మేను
గానలయల నటించెడు కడలి నేను.

నిజకరంబుల గిలిగింత నిఖలజగము
పరవశమొనర్చు నలగంధవహుడ వీవు;
లజ్జ నవపల్లవాంగుళుల్ చాచిచాచి
తన్మయముజెందు బాలపాదపము నేను.
లలితసంగీత నవసుధాలహరియందు
వసుధ నుజ్జీవతమొనర్చు భ్రమరమీవు;
తత్సుధాసేచనంబున తనువుమఱచి
ముగ్ధభావాన తలనూపు పుష్ప మేను.

# అతఁడు – ఇతఁడు

సీ. సతతంబు భంగసంగత జీవనుఁడతండు
సతత సౌభాగ్యసంగతుఁ డితండు
అతి ఘోరతర మకరాది సేవ్యుఁడతండు
సాధుసజ్జననుత చరితుఁ డితఁడు
తన పూర్ణతకు నుబ్బు దంభశీలుఁడతండు
వినుత నిర్దంభ వర్తనుఁ డితండు
నిరత దుస్సహపంక నిమ్నాశయుఁడతండు
సరసనిర్మల మహాశయుఁ డితండు.

గీ. చపలగతి సంభ్రమించు శ్రీజనకుఁడతఁడు
ధన్య గృహలక్ష్మిఁ గనుపుణ్యాత్ముఁ డితండు,
యిద్దరికి నుద్దిగణియింప నెందుగలదు
జగతి రత్నాకరునకు కేసరి ఘనునకు.

## ఘనత

చ. అడిగిన నిచ్చువారుగల రా బలియున్ శిబి కర్ణుఁడాదిగా
పుడమిపు లెందఱో యడుగబోకనె నూర్లు పదార్లు కైతకుం
దొడవుగ నిచ్చి గారవముతోఁ గను మేటివదాన్యులేడ నీ
యెడ, కవికల్పభూరుహమునై తగు కేసరిగాక ధారుణిన్.

## కీర్తి

మ. సిరులం గల్గినవారు వైభవములం జెన్నొందుచున్ పుట్టువుల్
ధరణిన్ సార్థముగా దలంతురిటు విద్యావ్యాప్తికై మెప్పుచున్
పరమోదారమతిన్ కవివ్రజములన్ భావించి మన్నించు కే
సరి సౌభాగ్యమె భాగ్యమంచు జగతిం జాటెన్ యశోగీతికల్.

## విధేయత — పాత్రత

ఉ. కొంచెమొ గొప్పయో మదిని కోరికలీరికలెత్త వ్యాసముల్
బంచితి; వేయి నూరులును పై పదియారులు మాన్యమిత్తురం
చెంచ—నయాచితంబి దిటులేకదముగా గవికోటి బ్రీతిపూ
జించిన భోజుడాదినృప శేఖరులగా గినమే వసుంధరగా.

## నమస్కృతి

చ. అతికుతుకంబుతో బనుపు
నట్టి మదీయ సువర్ణపాళికిగా
బ్రతిఫల: రూపమిచ్చుటగ
భావమునందు దలంపరేని నే
సతతము తాతపాదులకు
సామ్యులుగా నొనరింతు మ న్నమ
స్కృతులివెగొమ్ము కేసరి వి
శుద్ధ యశోధన నీతివర్తనా.

## దీవన

చ. సతతము దానశీలతయె
సాజపువర్తనగా మెలంగు శ్రీ
యుతులగునట్టి కేసరికి
నొప్పుల కుప్పవుపోలె పట్టివై
యతితర వైభవోన్నతుల
నారవిచంద్రులుగల్గు కాలముగా
క్షితిపయి సేమమొందు మివె
శ్రీ గృహలక్ష్మిరో నీకు దీవనల్.

చిలకపాటి సీతాంబ

# దివ్య ప్రబోధము

వరిగొండ సత్యనారాయణమూర్తిగారు

"పౌరుషజ్ఞానకీర్తులఁ బరగనేని
వాని సంపద యొకపూటయైనఁ జాలు."

**'One crowded hour of glorious life is worth an age without a name.'**

(భారతీయులయ్యును, అక్బరు పాదుషాకు బానిసలై యుండు హైందవ నరేంద్రులు కొందఱవలెగాక, రాణా ప్రతాపసింహు డాతని ధిక్కరించినాడు. అందుకు ఫలితముగ నాత్మగౌరవము నొక్కదానిని దక్క, ఆ మహారాజు సర్వస్వమును బోగొట్టుకొని, ఆలుబిడ్డలతో నడవులపాలు గావలసివచ్చినది. శత్రువులబారినుండి తప్పించుకొనుటకై, ఆతడు నిలిచినచో నిలుచుట లేదు. ఆతనిని స్వాధీనమొనరించుకొనుటకు, అక్బరు చతుర్విధోపాయముల బ్రయత్నించుచున్నాఁడు.

## ౧

### ప్రదేశము

ఆరవల్లి పర్వతప్రాంతము. కాననభూమి. ఆకసమును దాకుచెట్లు, గజిబిజిగ నల్లుకొనియుండు తీగపొదలు, పచ్చికనేల — ఇట్లు ప్రకృతి రమణీయముగానున్నది.

### సమయము

సాయంకాలము. దూరమున బడమటిసముద్రమున బడనుండు ఎఱ్ఱని సూర్యబింబము.

నిప్పుస్తులు మాడుచుండియు గండరములు మెలితిరిగి కాంతులనీను శరీరము, పరిక్రాంతియొత్తిగి పెద్దకాలమైనను తేజఃకిరణముల వెదజల్లుచు చేరలగొలిచెడి వదనము — ఇట్లు వీరరసాధిదేవతవలె రాణా ప్రతాపసింహు డొంటరిగ నొకచెట్టుక్రింద చాపఱాతిపై గూర్చుని, అస్తంగత మగుచినబింబము వంక గన్నార్పక చూచుచున్నాడు.

కణతల కీడ్చుకొనిపోయిన కనులు, వాడియు వన్నె తఱుగని వదనము — నివురుగప్పిన నిప్పువలెనుండు రాణి గుణవతివచ్చి రాణాను సమీపించినది.

గుణవతి: — మహారాజా! సూర్యభగవానుడు లోకబాంధవుడయ్యును, కాలగతినుండి తప్పించుకొలేకున్నాడుసుమా! ఇక మానవమాత్రులము మన మెంతవారము.

(పరధ్యానముననుండు రాణా రాణిని గమనింపలేదు.)

గుణవతి: — (దగ్గఱకు బోయి) మహారాజా! మొన్నటి హాల్దిఘాటుయుద్ధమున నార్షమత విద్రోహులను దునుమాడి నెత్తురు టుడుపులతో వచ్చిన మీరు, వేగురుకాంతులతోనుండు నీ భాస్కరుని బురిడించుచుండినారు. నేడస్తమించు మార్తాండుడు రేపుదయించునట్లు నేటి మీ కష్టానుభవము రేపటి సౌఖ్యప్రాప్తికి బ్రారంభమని నా యభిప్రాయము.

రాణా: — ప్రేయసీ! భారత మాతృదేవికి భయంకర శాత్రవులును, హిందూమతమునకు వినాశకులునగు మహమ్మదీయులను నేను సంహరించుచుండుట నిజమే. నేను వారికి సింహస్వప్నమై యుండుటయు నిజమే. కాని, దానివలన నాకు గలిగిన సంతృప్తి, సంతోషము నాకు దక్కినవికావు. రాజస్థానమునకు బెట్టని భూషణమగు చిత్తూరురాజ్యమున కధిపతినై యుండియు, నిర్వక్ర పరాక్రమవంతుడనని దిగంతకీర్తి విస్తారుడనై యుండియు, అక్బరు సార్వభౌమునంతటి వానిని బ్రతిఘటించిన ఏకైక వీరుడు రాణాప్రతాప

సింహుడని శత్రుస్తవమును బడసియుండియు, ఒకానొక యతిథిని — అందును బ్రాహ్మణుని ఆకలిగొన్నవానిని — సత్కరించుటకు శక్తిలేకపోయితిగదా యను మనస్సంకటము, నా సంతృప్తిని, నా సంతోషమును, శరత్కాలమేఘ శకలములను ప్రళయవాతూలమువోలె, బటాపంచ లొనరించినది. ఆహా! ఎంతపాపిష్ఠకాలము వచ్చినది!

గుణవతి:—మహారాజా! ఆ బ్రాహ్మణున కన్నమును సేకరించు వెరవు నాలోచించుటకే, మీకడకు వచ్చినాను. ఇంతకును దైవమున్నాడులెండు. మన కాహారము బెట్టకున్న మానెగాక; అతిథి సత్కారమునకైన దారిజూపదా!

రాజా:—ప్రేయసీ! మహారాజునై పుట్టియు, మహారాజునై పెరిగియు ఈనాటి కిట్టి కష్టము లనుభవింపవలసివచ్చెగదా యని యించుకేని చింతింపను. నన్నే సర్వస్వమని నమ్మి కలిమిలేముల రెండింట నా జతవీడని నా యర్ధాంగి పలువెతలు బడుచున్నదిగదా యని మదిగుందను. కనక కనక కనిన శిశువులొకటి పెల్లున మాడుచున్నారుగదా యని పరితపింపను. గుణవతీ! చూచితివిగదా! నా చిన్నిబిడ్డ అక్షయకుమారు డాకట జచ్చినపుడుకూడ జూచి భరించితిని. నా ముద్దుకూతురు స్వర్ణకుమారి యన్నమునకువాచి యసువులు వీడినపుడుకూడ జూచి భరించితిని. ఎన్నియో దినములుగా నా యనుగునెచ్చెలివి నీవు తినుట కొక్క కబళమైనను లేక నకనకలాడుచుండుటను జూచుచుండియు నెట్టులో యొకట్టుల భరించుచున్నాను. కాని, ఆకలితో వచ్చిన యతిథిని ఆదరింపజాలకున్నానుగదా యని నా హృదయము వ్రీలి వ్రక్కలగుచున్నది. దీనినిమాత్ర మెట్లుకాని భరింప నాకు శక్యము గాకున్నదిసుమా! ప్రేయసీ! పరమాణువంత విషము బానెడు పాలను పాడుచేయునట్లు, ఈ నాయశక్తత నాయశస్సముత్కరమును గళంకితమొనర్చుననుట నిస్సందేహము.

గుణవతి:—శిశోదియాసింహ మిట్టి పేదపలుకులను నిక్కముగా బల్కుచున్నదా, లేక నేనట్లు భ్రమించుచుంటినాయని నాకు సంశయము కలుగుచున్నది. ఇంత పేలతనము మీకెపుడు పట్టువడినది? రాజేంద్రా! ప్రబల విరోధివర్గమునుండి తప్పించుటయేగాక, వారిని జించిచెండాడుటకు సాటిలేని శక్తిని బ్రసాదించుచుండు మహానుభావుడా పరాత్పరుడొక్క యతిథి కొక్కపూట పట్టెడన్నమును బెట్టుటకు వలయుశక్తిలేశమును మనకొసంగకపోవునా? దైవమును నమ్మినవానికి నేగిరియొక్కడిది?

(మాయమగ్గము లెఱుంగని మోముసౌరు, మందహాసము చిందులాడు మోవిజంట, బక్కచిక్కియు బంగరు శలాకవలెనుండు చంపావతి యొకపరుగున వచ్చినది. ఆ బాలికకు బదేండ్లుండును.)

చంపావతి:—బాబూ! ఆ బ్రాహ్మణుడు చాల గొప్పవాడుగా నున్నాడుసుమా! సెలయేటిలో స్నానముచేసి త్వరగారమ్మని చెప్పినాను.

రాజా:—(ఆశ్చర్యముతో) ఏ బ్రాహ్మణుడు?

చంపావతి:—అన్నము పెట్టుమని వచ్చినాడే ఆయన.

రాజా:—అమ్మాయీ! ఔను. ఆ బ్రాహ్మణు నెట్లు సత్కరింపుదుమాయని నాకు యోచనకలిగినది.

చంపావతి:—ఆపని నాది. నేను సత్కరింపగలను.

గుణవతి:—మఱి, చంపా! ఆయనకు బెట్టుటకు అన్నము నీ కెక్కడిది?

చంపావతి:—మొన్న నీవిచ్చిన రొట్టెలు రెంటిని నేను దినలేదు. వానిని బ్రాహ్మణునకు బెట్టెదను.

రాజా:—అయిన నిన్నిదినములుగా నీవేమి తినుచుండినావు?

చంపావతి:—అమ్మయు నీవును గొన్నిరోజులుగా దినుట కన్నములేక ఆకులలములు దినుచుండుట

జూచి, నాకుమాత్రము రొట్టెలెందుకని వానిని దాచి పెట్టినాను.

**సతీపతులు**

(సంతసమునుబట్టజాలక) దీర్ఘాయుష్యమస్తు దీర్ఘాయుష్యమస్తు.

**గుణవతి:**—పులికడుపున మేక పుట్టునా !

(వారినేత్రములనుండి బాష్పబిందువులు రాలినవి. కూతురిని దగ్గఱకుదీసికొని, శిరము మూర్కొని వారు ముద్దాడినారు. వారికి మేలుబంటిసుఖమున మోకాటి సంతోషము కలిగినది.)

## ౨

(ఒక పటకుటీరమునందు జింకచర్మముపై బ్రాహ్మణుండొకడు కూర్చుని రొట్టెలు దినుచున్నాడు. ఆయనకు నలువదియేండ్లుండును. దృఢకాయుడు; స్ఫురద్రూపి. ఎదుట నొకవైపు బాలిక చంపావతి యాసీనయైయున్నది. ఆమెవదనసరోజమున సంతృప్తి తొలకాడుచున్నది.)

**బ్రాహ్మణుడు:**— కుమారీ! మహారాజాగారు నీకేమి కావలయును?

**చంపావతి:**—ఆయన మా బాబుగారు

**బ్రాహ్మణుడు:**— "అనియే" అనుకొన్నాను కుమారీ! నీకు అన్నదమ్ములుకాని, అక్కచెల్లెండ్రు గాని యున్నారా?

**చంపావతి:**—ఉండిరి. అక్షయకుమారుడను తమ్ముడు, స్వర్ణకుమారియను చెల్లెలు చనిపోయి యెంతయోకాలము గాలేదు. స్వామీ! ఇద్దఱకు దినుట కన్నములేకపోయినది. ఇప్పుడు నాకు దమ్ముడు ఒక్క సుందరసింహుడుమాత్ర మున్నాడు. మా బాబుగారు మీతో జెప్పుమనిరి; 'మేము సమర్పించిన కొద్దిపాటి యన్నమునే గొప్పగాభావించి సంతసింప వలయును' అని. నేను మీదాసిని. నాతప్పులేవియైన నుండిన మన్నింప బ్రార్థించుచున్నాను.

**బ్రాహ్మణుడు:**—తల్లీ! ఇంతగా నీవు విన్నవించుకోవలయునా? భక్తితో బెట్టినది పట్టెడైననేమి? అమ్మాయీ! అన్నరసముకంటె ఆదరణరసము మేలు సుమా! నీ నడవడి ముచ్చటవచ్చుచున్నది. తల్లీ! మీ బాబుగారు కానరాలేదు; ఎచటికిబోయినారు?

**చంపావతి:**—ఢిల్లీ పాదుషాను మీకు దెలియును గదా! ఆయనకును మా బాబుగారికిని బద్ధవైరము. కాబట్టి పాదుషా మా బాబుగారిని బంధింపవలయునని చాలకాలముగా బ్రయత్నించుచున్నాడు. ఇప్పుడాయన నాయడవితలకు వచ్చినాడని తెలిసి, ఆతనిని గని పట్టుటకై మా బాబుగారు పోయియున్నారు.

**బ్రాహ్మణుడు:**—అయ్యో! పాపము. సజ్జనుల కెట్టిసంకటములు వచ్చుచున్నవి! కుమారీ! ఎంతకాలమని యిట్లు కార్చిచ్చునడుమ నుండగలరు? ఆ ఢిల్లీ పాదుషాకు మీ బాబు లొంగినయెడల, మీకు గష్టములన్నియుబోయి, సర్వసౌఖ్యములు గలుగునుగదా!

**చంపావతి:**— (కాలడచిన నాగమువలె జివ్వున లేచి) ఎవరవయ్యా నీవు? హైందవుడవై యుండియు, హీనవచనములాడు నీ వెవ్వడవయ్యా? కూటికి బేదవైన గులమునకుగూడ ననుకొంటివా? మా యన్నమిదిని మాకే యెగ్గులెంచుట నీకు మంచిది కాదు. కాకులై కలకాలము మనుటకంటె, హంసలై యాఱునెలలుండుట మేలనియు, మానముపోయిన బ్రాణము వృథాయనియు మా బాబుగారు మాకుగ్గుపాలతో గలిపినారుసుమా.

**బ్రాహ్మణుడు:**—(ఆశ్చర్యముతో) సెబాస్! సెబాస్! పిట్టకొంచెము; కూతఘనము. కుమారీ! నీమది తెలియంగనెంచి మాటవరుస కంటినిగాక, నా యభిప్రాయము నిజముగా నయ్యదికాదు. మీ బాబుగారివంటి పౌరుషవంతులుండుటచేసియే, హిందూమత మింతవఱకైన నిలిచియున్నది. నీ యట్టిబాలికామణులను గనిన హైందవమాత ధన్యురాలుగదా! కుమారీ! నీ సందర్శనమున నేను బునీతుడనైతిని.

చంపావతి:—స్వామీ! తెలియక పలికినపలుకులకు నన్ను మన్నింపుము.

(బాలిక బ్రాహ్మణునిపదముల కౌఁగినది.)

బ్రాహ్మణుడు:—కల్యాణమస్తు! కుమారీ! కల్యాణమస్తు.

## 3

(ఆకాశమున గాఢమబ్బులు. అంతట నంధకారము. చిటిపొటమని చినుకులు. ఫెడఫెడఫెడ మెఱుపులు. జివ్వుమని పోడుగాలి. బైట బావురుమనుచున్నది.)

(లోపల గుటీరమునందు చింపిచాపపై జంపావతి పరుండియున్నది. ఆ బాలికముఖము పాలిపోయి, శరీరము శల్యగతమైపోయినది. కన్నులరమోడ్పులై యున్నవి. ఆమెప్రక్క మహారాణా, గుణవతి చిన్నవోయి కూర్చుండియున్నారు. వెలుతురుకట్టె సన్నగా మండుచున్నది.)

రాణా:—గుణవతీ! ఆ నారాయణునిపాదములే నాకుగతి. పాలముంచినను, నీటముంచినను ఆయనదే భారము.

గుణవతి:—నా బంగారుతల్లి యిక నాకుదక్కునా! అయ్యో! నాథా! ఒకరికి యిద్దఱు ముద్దుబిడ్డలు పట్టెడన్నమునకు గతిలేక, నాకడుపున జిచ్చువెట్టిపోయినారు. నాతల్లి చంపావతి కింత యన్నమును బెట్టి నా తల్లిని దక్కించుకొనుటకు శక్తిచాలని, నే నుండియేమి మండియేమి? అయ్యో! తల్లీ! చంపా! పదియేండ్లకే నీకు పరమాయువు నిండినదా? అయ్యో! నాతల్లీ!

రాణా:—కాంతా! ఈ కష్టములెన్నింటి ననుభవించినను, ఇనుకపాతరలవలె తరుగుటలేదు. ఈ జన్మకివిచాలును. సిరిరా మోకాలడ్డువెట్టుమూర్ఖుడు నేనుదప్ప వేఱొకడుండ డనుకొందును. అక్బరుపాదుషా మరల మనకు వర్తమానము నంపియున్నాడుగదా! అతని యాధిపత్యమున కీయకొంటినని రేపే యాతనికి బ్రత్యుత్తరము బంపెదను. అంతటితో మనకష్టము లంతమగును.

(బయట ఎండుటాకులయందు గలగలమనుశబ్దము)

రాణా:—(ఉలికిపడిలేచి యావైపుచూచుచు) తరుణీ! ఏమది?......ఢిల్లీపాదుషాకు గర్భశత్రువగు రాణాప్రతాపసింహుని బట్టుకొన బ్రయత్నించుచుండు నో మహమ్మదీయవీరులారా! ఇకమీరు విరమింపవచ్చును. మీ పాదుషాతో సఖ్యమొనరించుటకు సంసిద్ధముగనుంటినని, మీ రాజుతో విన్నవింపుడు.

గుణవతి:—అదియేదియో అడవిమృగములెండు. (సంభ్రమముతో) శోకమువలన మతిపోయినది కాబోలు! మహాప్రభూ! మీ పలుకులవలన నాకు బుండుపై ముల్లుగ్రుచ్చినటులైనది.

రాణా:—కాదు. కాంతా! కాదు. నీవు పొరబడుచున్నావు. జీవితముయొక్క పరమావధి సౌఖ్యానుభవమని యీనాటికి నాకు తెలిసినది. ఇంతకుముందే నాకీ వివేకబుద్ధి కలుగలేదుగదాయని నేను జింతిల్లుచున్నాను. కలిగియేయుండిన, నిన్నికష్టము లుండకుండెడివి. ఆ యిద్దఱుకూనలును దక్కియుండెడివారు.

(చంపావతి కనులువిచ్చినది. ఆ బాలిక వెడదకనులతో పలుకనున్నట్లు, సతీపతులు తలంచినారు.)

చంపావతి:—బాబూ! నాకు ... ఆ ... యా ... స ... ము ...

రాణా:—అయ్యో! పట్టీ! ఏమిచేయగలను! నీ బాధను జూడజాల.

గుణవతి:—ఆహా! నా గుండెకాయ శిలాసారముతో జేయబడినదికాబోలు!

చంపావతి:—బాబూ! ఒక్క...కనవి. కొంచెము...నీళ్లు...

(ఒక యాకుదొప్పతో రాణా నీటిబొట్టులను బాలికనోటిలో పిడిచినాడు.)

గుణవతి:—నీ కడపటికోరిక యేది తల్లీ!

చంపావతి:—బాబూ! మీ మాటలవలన నాకు జాలసంకటము కలిగినది. బాబూ! దాహము. మానహీనుడు నడపీనుగని...

(గుణవతి నీళ్లచుక్కలను కూతురిగొంతులో బోసినది. కూడ నశ్రుకణముగూడ క్రిందబడినది. చెక్కుట జేయితో రాణా వినుచున్నాడు.)

చంపావతి:—బాబూ! మీరు స్వాతంత్ర్యలక్ష్మిని బూజించుపుణ్యాత్ములు. మీ కడుపునబుట్టిన నేను ధన్యురాలను. లెక్కలేని హిందూరాజులలో పౌరుషవంతుడు మహారాణాప్రతాపసింహు డొక్కడే; తుచ్ఛమగు ధనమునకు మహమ్మదీయున కమ్ముడువోక, మాతృదేశమును దాస్యమునుండి తప్పించుకొనుటకై కడలేని యిడుమలనుగుడిచిన మహాపురుషుడు మహారాణాప్రతాపసింహు డొక్కడే; అని హిందూదేశ చారిత్రకారులు మీజీవితమును సువర్ణాక్షరములతో గనులకు మిఱుమిట్లు గులుగునట్లు వ్రాయుచుండగా, మీ పవిత్రచారిత్ర మా చంద్రతారకముగా భూలోకమున నిలువనుండగా, కట్టకడ కిట్లు కర్తవ్యమునుండి విముఖులరై పతితులరగుట మీకు బాడికాదు. నాకు సంతోషమును గాదు. బాబూ! దాహము...

రాణా:—తల్లీ! వీనులకువిందుగ నీవు మాకు వివేకసుధను బోయుచుండ, నీకు మే మింతగంజినైన బోయజాలకున్నాము గదా!

(రాణా కొంచెమునీళ్లను బాలికనోటిలో బోసినాడు. ఆ వీరుని చేతులు వణకుచున్నవి.)

గుణవతి:—దరిద్రులకు మన కిట్టిరత్న మెట్లు దక్కును!

చంపావతి:—బాబూ! అక్బరుపాదుషా జిత్తులమారియనియు తడిగుడ్డలతో గొంతుగోయువాడనియు, తేనెబూసినకత్తియనియు, హిందూవృక్షమునకు వేరుపురుగనియు, మారెడిచ్చిన బారెడు గుంజుకొనువాడనియు — ఎన్నియోమారులు మాకు జెప్పియుండు నీవే యిప్పు డిట్లనుటజూడ, నగ్నికిగూడ శైత్యము గల్గునాయని నాకు సంశయముగలుగుచున్నది. బాబూ! ఒక్కమాట జెప్పుము. ప్రాణములు నిల్చునట్లులేదు.

రాణా:—నా ముద్దులపట్టీ! వయసున జిన్నవయ్యును, బుద్ధికుశలతల బెద్దదానవు. అమ్మా! చింతింపకుము. నీ తండ్రి ద్రోహియని సందియపడకుము. నేను మతిపోయి మాటలాడితిని. చంపా! అటునూర్యు డిటుపొడిచినను నీతండ్రి — చంపావతి కుమారీమణిని గన్నవాడు — యీ రాణాప్రతాపసింహుడు మానవమాత్రునకు దాసోహమ్మనుట కల్లయని యెఱుంగుము... అమ్మా! తృప్తికలిగినదా?

చంపావతి:—ఆహాహా! ఆనందము ... నారాయణ. నారాయణ.

(ఆ బాలిక ప్రాణవాయువు లెగిరిపోయినవి. సతీపతులు పీనుగుపై వ్రాలి కన్నీళ్లువిడుచుచున్నారు.)

(అక్బరుపాదుషా తెల్లనివస్త్రములతో బ్రవేశించినాడు. కవచములేదు; ఖడ్గములేదు; కిరీటములేదు)

అక్బరు:— (రాణానుడాసి) మహారాణా! లెమ్ము. నీ ముద్దుపట్టియొక్క దివ్యవాణి యింకను నాచెవుల గింగురు వెల్గుచున్నది. మహారాణా! ఇట్టి కుమారీమణిని గనిన నీవు ధన్యుడవు కష్టములకుజిక్కి కర్తవ్యమును మఱచిన కులోత్తమునకు నీకు సమయమునకు సదుపదేశ మొనరించి, సన్నుతిపాత్రురాలైన చంపావతీ కుమారిని మరల నొకమారు చూచునూహతో వచ్చితిని. మహారాణా! నీవు సార్వభౌములకు సార్వభౌముడవని నేటికి తెలిసినది సుమా!

రాణా:—(లేచి యాశ్చర్యముతో) మరల నొక మారనుచున్నావు. పాదుషా! ఇంతకుమును నెపుడు చూచినావు?

అక్బరు:—మహారాణా! మన్నింపవలయును. మొన్న మీకుటీరమునకు వేళకానివేళవచ్చి మీ కుమారీమణి సపర్యలనందిన బ్రాహ్మణుడను నేనే.

రాణా:—పాదుషా! మాయలమారివగు నీచర్యలు నాకు క్రొత్తలుగావు. ఎప్పుడెప్పుడు నిన్ను ముఖాముఖిగా గలిసికొందునాయని యువ్విళ్లూరుచుంటిని కాని పాదుషా! నాడు నీవు మాయింటికి బ్రాహ్మణ వేషమున వచ్చుటకు గాని, నేడిట్టి ప్రశాంతవేషమున వైరినగు నాసమక్షమునకు వచ్చుటకుగాని, నీయభిప్రాయమేమి?

అక్బరు:—మహారాణా! ఏకోదరమునబుట్టిన మానవులు కలకాలము కలహించుచుండిన, సుఖించుటెన్నడు? నాడు కాని, నేడుకాని శాంతిదూతనై నేను మీకుటీరమునకు వచ్చితినేకాని; దురభిప్రాయమున రాలేదు. మఱియు మహారాజా! స్వాతంత్ర్యభావ సంభరితయు యశశ్శరీరయునగు చంపావతి కుమారికి ప్రియజనకుని నిన్ను జయించుటకు నాచేగాదు కదా-నాతలదన్నిన వానికి సైతముచేత కాదని గ్రహించితిని. మహారాణా! ఇట్టి పుత్రికామణిని గనిన నీకు సాటియెవరు? చింతింపకుము. ఆమె చచ్చియు బ్రతికియేయున్నది.

రాణా:—పాదుషా! నీవచనము నాకర్థము కాకున్నది. అనంతమగు నీబలగము, అడవియందు దాగియుండుననుటకు సందేహములేదు. నే నిపుడొంటరిగనున్నాడను. నన్ను బంధించుటకు నీకాటంకము లేదనుకొందును.

అక్బరు:—నిజమే. బాలికామణియగు చంపావతి కుమారిని దర్శించుకొనుతలంపుననే నేనిపు డిచటికివచ్చితిని. మఱియు పశుబలమువలని జయము క్షణికమనియు, ప్రేమబలమువలని జయము శాశ్వతమనియు నాయభిప్రాయము; అనుభవముకూడను. మహారాణా! నాకిక సెలవు. అమ్మా? చంపావతీకుమారీ! స్వాతంత్ర్యలక్ష్మీ! ఇవే ప్రణామములు.

(అక్బరు చంపావతికి వందనము నాచరించి, తిరిగిపోయినాడు. సతీపతులు చిత్రప్రతిమలవలె నట్లేనిలువబడి, యుండినారు.)

# శ్రీమతి రావూరి వెంకట సుబ్బమ్మగారు

[సర్వసాధారణముగ సంసారమునందు గలుగుచుండు సంకటములకు లోనై దుఃఖముచే దరిగనక తల్లడిల్లుటకంటె విద్యయే నూతగాగొని భావిజీవితమును సుఖప్రదముగా గౌరవనీయముగా గడుపుటకు ప్రయత్నించి సఫలీకృతులైనదానికి వీరిచరిత్ర ఒకనిదర్శనమని పాఠకులు గుర్తెఱుంగుదురుగాక.]

శ్రీమతి రావూరి వెంకటసుబ్బమ్మగారు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి మేనకోడలు. అనగా లక్ష్మీనరసింహముగారి రెండవచెల్లెలైన అచ్చమాంబగారిని వీరవాసర గ్రామవాసియైన మధునాపంతుల రామస్వామిగారి కిచ్చి వివాహము చేసిరి. ఆదంపతులకు గలిగిన ప్రథమసంతానమే రావూరి వెంకటసుబ్బమ్మగారు.

ఆయన కిద్దఱు కుమార్తెలు కలరు. ప్రథమపుత్రికయైన వెంకటసుబ్బమ్మగారు 1896 సం॥రము ఫిబ్రవరి 9 తేదిని వీరవాసరమున జన్మించిరి. రెండవపుత్రికయైన వెంకటరత్నమ్మ 1898 సం॥రము జూలై నెలలో జన్మించెను. ఆయన పోయినప్పుడీయిరువురు పుత్రికలు, భార్యయు లక్ష్మీనరసింహముగారి సంరక్షణముక్రింద నుండిరి. రామస్వామిగారు జ్యేష్ఠపుత్రికను దన మేనల్లుడైన రావూరి రామకృష్ణయ్య కిచ్చి వివాహము చేయవలెనని మొదటినుండి సంకల్పముతోనుండిరి. ఆసంకల్పము నెఱవేర్పవలెనని లక్ష్మీనరసింహముగారు 1908 సం॥రము ఫిబ్రవరి నెలలో వెంకటసుబ్బమ్మగారిని రామకృష్ణయ్యగారి కిచ్చి రాజమహేంద్రవరమున వివాహము చేసిరి.

రామకృష్ణయ్యగారు ప్రవేశపరీక్షయందు గృతార్థులై రాజమహేంద్రవరమున ప్రథమశాస్త్రపరీక్షకు చదువుచు వందేమాతరపు గొడవలోఁ జదువు మానివేసి రమారమి రెండుసంవత్సరములు గ్రామముల వెంట దిరిగి స్వదేశవస్త్రవిక్రయము జేసిరి. 1910 సం॥రమున రామకృష్ణయ్యగారు భార్యను దీసికొని వైద్యవిద్య నేర్చుకొనుటకై చెన్నపురికి బోయెను. రావూరి రామకృష్ణయ్యగారు చెన్నపురిలో వైద్యశాస్త్రముం జదివి 1915 సం॥రమున బెజవాడలో బ్రవేశించి వైద్యవృత్తిలో మెలఁగ నారంభించిరి.

క్రమముగా మంచిపేరు వచ్చుచుండెను. నెలకు నూఱు మొదలు నూటయేబదివఱకు సొమ్ము వచ్చుచుండెను. 1918 సం॥రమున నకస్మాత్తుగా జ్వరపీడితుఁడై యాయన మార్చి 30 తేదిని మృతినొందెను. లక్ష్మీనరసింహముగా రప్పుడీమెను రాజమహేంద్రవరముఁ దీసికొనిపోయిరి. సుబ్బమ్మగారి కిద్దఱుకుమార్తెలు గలిగిరి. అందు మొదటిబిడ్డ రెండుసంవత్సరములు పెరిగి మృతినొందెను. రెండవకూతురు పేరు మీనాక్షీదేవి. ఈమె 1917 సం॥రము జూను నెలలో జన్మించి యిప్పుడు సుఖముగా నున్నది.



"ఉభయభాషాప్రవీణ"

శ్రీమతి రావూరు వెంకటసుబ్బమ్మగారు



మిసెస్ బక్షీగారు

లక్నో డిస్ట్రిక్టుబోర్డు సభ్యురాలుగా ఎక్కువ వోట్లతో ఎన్నుకొనబడినది.



శ్రీమతి ఎన్. యామినీపూర్ణతిలకమ్మ గారు,
నరసాపురమునందు గూడిన ఆంధ్రదేశ
కళావంతుల సంఘసంస్కరణ పదియవమహాసభ
క ధ్య క్షు రా లు



శ్రీమతి చాదూరు కమలాదేవిగారు
బొంబాయిలో హిందీరాష్ట్రభాషావిశారద
(చువ్వా) పరీక్షయం దుత్తీర్ణురాలైన
ప్రథమ ఆంధ్రమహిళాశిరోమణి. ఆప్రాంత్యము
లందు హిందీప్రచారము గావించుచున్నది.

కాని యీమెతండ్రి పోయిన వైదారుసం॥రములవఱకు నిరంతరరోగపీడితమై తల్లికిఁ జాలమనోవేదన గలిగించెను. భర్త పోయిన మూడుమాసములు తిరుగకముందే 1918 సం॥రము జూనునెలలో సుబ్బమ్మగారి తల్లి అచ్చమాంబగారు స్వర్గస్థులైరి. తల్లి, తండ్రి, భర్త మృతినొందుటయు, నన్నదమ్ములు లేకపోవుటయు, నను నవి యన్నియు నేకమై సుబ్బమ్మగారిని దుఃఖసముద్రమున ముంచివేసెను. ఆస్థితిలో లక్ష్మీనరసింహముగారామెకు ధైర్యముజెప్పి దుఃఖోపశమనార్థము ముందు ముందు జీవనాధారము నిమిత్తము పనికివచ్చునని తెనుగుకావ్యములు, సంస్కృతకావ్యములు చెప్పి శ్రద్ధగా జదివించి, 1925 సం॥రమామెను విద్వాన్‌పరీక్షకుఁ బంపిరి. ఆ సంవత్సరము పరీక్షలో నామె తప్పిపోయెను. కృతార్థురాలు గాకపోయినను రోజోరియో దొరసానిగారాసంవత్సరమే విశాఖపట్టణ మండలి శ్రీమేరీరాణిగారి యున్నతబాలికా పాఠశాలలో నాంధ్రోపాధ్యాయురాలుగా నియమించిరి.

పిమ్మట నీమె విద్వాన్‌పరీక్ష రెండు భాగములలోఁ గృతార్థురాలై 1928 సం॥రమున బెజవాడలో జరిగిన కాన్వొకేషను సభ కరిగి పరీక్షాపట్టము గ్రహించెను. ఆంధ్ర విశ్వ విద్యాలయపీఠమున మొట్టమొదట విద్వాన్‌పరీక్షలో తేరినపడఁతి యీమెయే.

1930 సం॥రమున సుబ్బమ్మగారిని విశాఖపట్టణమునుండి రాజమహేంద్రవరము దొరతనమువారి బాలికాపాఠశాలకు మార్చిరి. అప్పటినుండియు నెల ఒకటికే బదిరూపాయల జీతముమీద రాజమహేంద్రవరములోనే పనిచేయుచున్నారు. గత సంవత్సరమునను, ఈ సంవత్సరమునను శ్రీమతి కంచనపల్లి కనకమ్మగారు సెలవు పుచ్చుకొన్నప్పుడు డైరెక్టరుగారు చెన్నపురిలోని క్వీన్‌మేరీకళాశాలకు నాంధ్రోపాధ్యాయురాలుగా వెంకటసుబ్బమ్మగారిని బదిలీచేసి పంపిరి. ఈ రెండుసారులుగూడ నీమె పెద్దతరగతులకు మేటిగ్రంథములు బాలికలకు నధికారులకుఁ దృప్తికరముగా బాఠములు చెప్పి, ప్రశంసాపాత్రురాలయ్యెను.

ప్రాకృతభాషలో రాజశేఖరమహాకవి రచియించిన "కర్పూరమంజరి" యను సట్టకము నీమె యాంధ్రమున తెనిగించినది. చెన్నపురి విశ్వవిద్యాపీఠమువారాగ్రంథమును పట్టపరీక్షకుఁ బఠనీయగ్రంథముగా నియమించిరి. ఈమె ఉదారపాండవమను నొకవచనకావ్యముగూడ రచియించిరి. అదిగూడ పాఠశాలలోఁ బఠనీయగ్రంథముగా నుండుట కర్హమైనది. ఇదిగాక బాణకృతమైన 'హర్షచరిత్రము'నుగూడ నాంధ్రీకరించిరి.

ఈమె రచనలకు వన్నెదెచ్చుచున్న "కర్పూరమంజరి"ని గురించి పాఠకులోక

మునకు కొంత మెఱుఁగించుట అసమంజస ముగాదు. చేయునది అనువాదమైనను ఈమె ఇదివఱ కెవ్వరును యనువదింపని కావ్యము నే యేరుకొన్నారు. ఈ యనువాదముగూడ స్వతంత్రరచనకంటె కష్టమైనదే. మూలము లోని భావములను బోనీయక అందలిపద ముల శక్తిని గమనించి, తత్తుల్యములైన పదజాలములచే శైలిని కుంటువడనీయక, స్వతంత్రరచనయని చదువరులకు దోపనీక యనువాద మొనరించుట సులభసాధ్యము గాదు. ఇంకను, ఉభయభాషలందు కూలం కషమగు పాండిత్యము కాలానుగుణ్యమగు మార్పులొనరింప లోకానుభవముండి తీర వలయును. వెంకటసుబ్బమ్మగారి యను వాదమును జదువునపుడీ గుణములన్నియు ద్యోతకమగుటయగాక, సరళమై ధారా శుద్ధిగల కవిత్వము, మూలమునకుగూడ మెఱుగు వెట్టదగిన నేర్పుగలదని సులభముగ దెలియనగును.

మూలమందలి శ్లోకముల యనువాద మెంత సుబోధకమో యీ క్రింది ఉదా హరణము చాలును.

శ్లో. యా చక్రవర్తిగృహిణీ జనగేహినీవా
ప్రేమ్ణితయో ర్నతిల మాత్రమపి విశేషలాభః
జానేత్రియా యది క్రియతే కోపిభావః
మాణిక్యభూషణ నివసన కుంకుమైః.

తే. గీ. జగతి సామాన్యునింతికి చక్రవర్తి
గృహిణికిని భేదమేలేదు ప్రేమయందు.
మణివిభూషణ కుంకు మాంబరగణం బె
భేదభావంబు గలిగించు లే దితరము.

ఇట్టి యనువాదము లెన్నియేనిగలవు. శ్లోకము లున్నచోటులందెల్ల పద్యములను రచియింపక పాత్రోచితముగ అనువాద మందు కొన్నిచోట్ల వచనములుగూడ నీ కవయిత్రి రచించి మించినది.

ఉ. వాసర జీవపిండమయి
భాసిలుచుండెడు భానుమండలం
బీ సమయంబు నందెటకొ
యేగెడుఁ బ్రాణవిభుండు వోవ సం
త్రాసముఁజెంది తద్విరహ
తాపమునన్ వెసమూర్ఛవోయి క
మ్మా సెనొ తమ్మితీవయన
బొల్పు దొరంగి మొగిడ్చె పద్మముల్.

పైపద్య మనువాదమయ్యును అనర్ఘళమై సాపుదేరియున్న దన స్వతంత్ర రచన లిం కెట్లుండునో సహృదయు లూహింపగలరు. ఇట్టి యమూల్యరచనయైనందుననే గ్రంథ మును పట్టపరీక్షకు పఠనీయగ్రంథముగా నియమించిరి.

శ్రీమతి సుబ్బమ్మగా రింకను ఇట్టి సరస రచనలను ఆంధ్రలోకమునకర్పించి వెలయు దురుగాక. విశ్వేశ్వరుడు సర్వవిధముల వీరి ననుగ్రహించు గాక.

# తెనుగు లేఖిని

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

సీ॥ ఆదిని నన్నయ హస్తాబ్జముననుండి
తెనుగుకై తను రూపు దీర్చినావు
పిదప తిక్కనచేత వెలయుచు ధర్మము
ల్లేట తెనుంగున దెల్పినావు
పోతనామాత్యుని చేతిలోబడి భక్తి
రసమును చిప్పిల వ్రాసినావు
యాంధ్రభాషాయోష నలరింప శ్రీనాథు
చేత శృంగారంబు జిలికినావు

తక్కుగల యాంధ్రకవివరుల్. దాకినంత
నవనవోద్భూత కావ్యబంధముల నింపి
మించు వేడుకవాణి కర్పించినావు
తెనుగులేఖిని నిం బ్రస్తుతింతు నెపుడు. ॥ ౧ ॥

సీ॥ రసమయంబైన యీప్రకృతి శోభలనన్ని
తెనుగుపద్యాల జిత్రించినావు
గిరినిర్ఝరులపొంత గేదంగిపొదరిండ్ల
సృష్టికి బ్రతిసృష్టి చేసినావు
భయదాహవక్షోణిపై నెత్తుటేఱులఁ
గములఁబారగ జేయగల్గినావు
రంజిల్ల బ్రణయసామ్రాజ్యముల్ నెలకొల్పి
శృంగారజలధి నిర్మించినావు

భయదరణరంగ సందర్భ భయచరిత్ర
వ్రాయునప్పుడు ఖడ్గమై గ్రాలినావు
ప్రణయగీత ప్రబంధముల్ వలుకువేళ
పుష్పబాణంబవై మారిపోయినావు. ॥ ౨ ॥

ఉ॥ సారవచస్సుధా మధురశైలిని పద్యములల్లువేళ, శృం
గారవిచిత్రచిత్రముల ఖండముగా లిఖియించువేళ, నీ
ధారణగాదె పూజ్యకవితల్లజ శిల్పులనల్పకల్పనా
స్వైరవిహారమాణు లనిశంబును జేసె తెనుంగులేఖినీ. ॥ ౩ ॥

సీ॥ నన్నయామాత్యు వాక్పుణ్యమున్ గ్రోలి
తిక్కయజ్వరు తేట తెన్గునాని
శంభుదాసుని నవ్యశైలిని రుచిచూచి
నాచనసోము విన్యాసమరసి
శ్రీనాథుప్రవిమల శృంగారమున దేలి
పోతనభక్తి కుప్పొంగిపోయి
"అల్లసానివాని యల్లిక" చవిచూచి.
సూరనార్యుని జంటదారులెఱిగి

కృష్ణరాయల ప్రౌఢోక్తిం జెలంగి
రామలింగని కైతల రసముద్రావి
మొల్లకవనంపు దీవికి మురిసిమురిసి
తెన్గులేఖిని మెఱయు నుత్తేజమొదవ. ॥ ౪ ॥

ఉ॥ ఉన్నత భావశక్తి మదినూరగ దృశ్యములన్నిటిన్ మహో
భ్యున్నతరీతి చిత్రములనోజ లిఖించెడి చిత్రకారులున్
గన్నది పద్యరూపములుగా నొనరించు కవీంద్రచంద్రముల్
పన్నుగ నీదుసేవ సలుపన్ గద లేఖిని ఖ్యాతినొందుటన్. ॥ ౫ ॥

గీ॥ ఆంధ్రగృహలక్ష్మి లెందఱిహస్తములను
జేరినవనవ కల్పన లూరజేసి
గంతులేయుచునున్నావు కలమనీవు
లలితపద పద్యజాలము ల్జిలకరించి ॥ ॥ ౬ ॥

# సవతితల్లి

శ్రీమతి అరికిరేవుల వెంకటరత్నంగారు

అయ్యయ్యో! ఏమిభాధ! ఏమిబాధ! భరింపలేను! భరింపలేను. దుస్తరము, దుస్తరము. మంట! మంట!! అయ్యయ్యో! ఈ చేతులు కాఠిన్యపు శిలలుగా మారుచున్నవే! ఏమి యీ ఎరుపుదనము... యీవాపు...ఆ! ఆ!! ఎరుపాయిది?...ఎరుపే! హా! చూడలేను...ఈ ప్రవాహము. (మూర్ఛనొంది) (తెలివొంది) వచ్చిందేమో, చూచిందేమో, పొట్లున్నాయి. దైవమా! మాతాజీ!! రక్షింపవా!!! కరుణింపవా! దీనురాలను...లేక లేక అతి జాగరూకతయని చెప్పియిచ్చిన యీ చినిగినపీలిక. అదియే పదివేలనుకొన్నాను. అది నెత్తురుమరకలచే నిండిపోయింది. ఆమె చూచిందా...బాధలు...(ఏడ్చుచు) పెట్టును. (నేలపైబడును.) 'ఇవ్వకున్న యివ్వలేదు. యిస్తే యిలాగుచేస్తావా' అంటుంది. ఆ ధ్వని నాచెవులో ఝుంకారముచేస్తున్నాది. ఆమె క్షమించదు. దైవమా! మంట!! మంట!!! నిరాపగాధపక్షిని. ఎందుకు నన్నిలాగున ఏడ్పిస్తావు. ఏఏదౌర్జన్యములు చేసేనో, ఎన్నిపాపాలుచేసేనో. పూర్వజన్మములో దానికిఫలమాయిది? తండ్రియా...స్త్రీలోలుడు. ఆమె యెటులన్న అటుల నడవక విధిలేదు. అనుకుంటే పాపము. నాతల్లీ......(ఏడ్చుచు) అమ్మా!...నాతల్లీ...... (వెక్కుతూ) నీవుండ నోచలేదు. తల్లిలేని నిర్భాగ్యురాలినిగాచేసి పరలోకానికేగేవే, తల్లీ. ఈమెపెట్టున్న బాధలు చూస్తున్నావో లేదో, చూచి పూరకుంటున్నావా? నీవే సజీవివైయున్న యీ రోతనాకు లేకపోయేదిగా. తల్లీ! ఒకపండుగా పర్వమా! పండుగసుఖమేమిటి. నాడు సర్వజనులు పిండివంటలతో భోజనముచేసి నూతనవస్త్రములు ధరిస్తారు. అట్టిది నోచలేను. పండుగలేకుంటే కొంతసుఖము. నాడు ఊపిరితీసుకుందికూడా వీలుండదు. పసిపిల్లది మొదలు వృద్ధులవరకు తలలంటి నీళ్లుపోత, వారు తినినకంచములు కడుగుట, ఎంగిళ్లుఎత్తుట, 15 గిన్నెలకు తక్కువలేకుండా అంట్లు ఇవిఅన్నీ నావె. పండుగపూటయిని కడుపారతిండా? తలకు స్నానమా? తలకునూనా? ఇంత సౌభాగ్యముగానున్న నాకు నూతనవస్త్రమొకటా. అయ్యో! జననీ! ఆమెపిల్లలందరు తలలుదువ్వుకొని చామంతి సన్నజాజులు ముడుచుకొని హాయిగావుంటే; పసికూన నవుటచే కించిత్తు ఓర్చలేక పోయేదాన్ని. ఎప్పుడు వీధిమొగము చూచు సౌభాగ్యములేదుకదా! నా పెరటిసాల, నా గడ్డిపరుపు. నాగదే తెలిసినవి...మంట! మంట!! నేను...కంట్లో గవంతైనా పుల్ల...పోయిందే, అనువారిని మాస్తే మొత్తబుద్దిన్నట్లు 'కంట్లో పుల్లపోనీసిందేట' (యని యేడ్వు) దైవమా! నామనస్సాక్షిగా, నాహృదయపూర్వకముగా చెప్పకుంటున్నాను. మొరవిను. అది నాతప్పకాదు. నేను కోరిచేయలేదు. పడిందో లేదో కాని ఏడ్పువినేటప్పటికి విచక్షణలేక నాచేతులమీద పడడం నిజమయింది. సలుపు! సలుపు!! తల్లీ! రావా!! కరుణలేదా! రక్షింపవా! దీనదయాళుడని బిరుదుపెట్టుకొన్నావు. కృష్ణా! ఈబాధలన్నిటికన్నా నన్ను నీలో ఐక్యముచేసుకోవా! అయ్యయ్యో! (అని ఏడుస్తూ మాలతి మూర్ఛపోయింది.)

౨

"ఏమేవు! ఓసే! వెధవముండా, రంకుముండా, చచ్చుడిముండా, పలకవేమే? ఏంచేస్తున్నావు? నిన్ను తగలెయ్య. వెధవపీనుగా యిలాగురా. నీకు పోతరం హెచ్చింది. నీపని పట్టిస్తానుండు. నోరుపడిపోతోంది నీతో అరవలేక. రావేమే"

(మాలతి ఉలిక్కిపడి లేచి) "వస్తున్నానమ్మా (తనలో) ఎంతసేపై పిలుస్తున్నారో. మంచినిద్రపట్టే సింది. ఈరోజున నాపనివుంది."

"ఏంచేస్తున్నావు" (గద్గదస్వరముతో)

"........." (వణకు.)

"మొద్దుమొహమా ! చూడూ, వెధవమొహము ఎలాగుందో, మాట్లడవేమే ?"

"..........."

"ఇక నోటితోకాదు. కర్రతోఅయితేనే" యని ఒకటి బెత్తముతో వీపుమీద వేసింది సుబ్బలక్ష్మి.

"బాబోయి ! నానోయి "

"నోరుముయ్యి ! నోరుపెస్తే చూడు. (అని బెత్తము ఆడిచుచూ) ఎవరైనా మందలించుతారనా ? ఎవడొస్తాడో రమ్మను, నాదగ్గరకు. మొగాళ్లకు మొగుణ్ణి. మాట్లాడవేమి."

(బెక్కుతూ, దెబ్బ తడుముకుంటూ, రెండవదెబ్బ ఆచుకుంటూ) ఏ...మి...చేయు...ట...లే...ద... అ...అమ్మా ?

"అబద్ధమాడకు, చీలేస్తాను. వుప్పు మిరపకాయల కారంకూరుతాను వంకాయలో మెంతి మసాలా కూరినట్టు."

"..........."

"ఏమి..."(కళ్లుఎత్తింది.)

"లేదమ్మా ! ఏమిటిచేయడం లేదమ్మా !"

"నీనుంచి నా నోరంతా నొప్పియింది. అగ్గిణా మిరియాలు దండుగి. ఎవరిస్తారు."

"విన...బడ...లేదమ్మా" (బెక్కుతూ)

"చెముడా ! నీకు ? చెముడువదలకొడ్తా? ఎంగిళ్లు ఎత్తి కాళ్లుపట్టడానికిరా ! వేగిరము. (వెళ్తుంది )

[సూర్యారావు ప్రవేశము.]

"ఏమమ్మా ! అలాగున్నావు"

"..............."

"ఏందుకేడ్పు."

"..............."

"నిన్ను...ఎవరేమన్నారు.

"ఆ నెత్తురు మరకలేమిటి."

"ఏడవకమ్మా ! కళ్లుతుడుచుకో."

"..............."

"తుడుచుకోమ్మా ! ఏడ్వకు !! నువ్వు...ఏడుస్తే నాకు ఏడ్పువస్తుంది. (అని కళ్లంట నీరుకార్చుతాడు. పిల్లని బుజ్జగించుతాడు. తండ్రిప్రాణము ఒకనాడు కాకపోతే ఒకనాడైనా దహించదా )

"అవునా ! ఓయి !"

"........."

"ఎక్కడున్నారు."

"ఊఁ ......... (మెల్లగా యివతలకివస్తాడు.)

"వంటింట్లోనా !"

"........"

"అక్కడేడ్చేది యిక్కడేడ్వకూడదూ" అంటూ (ఇతను వెళ్ళి వంటింట్లో కూర్చొన్నారు. దానిపని సహాయము చేస్తున్నారేమో) వంటింట్లోకి వెళ్లింది.

"మీ భోజనమయింది. నా దయింది. పిల్లల దయింది. ఇంక ఎందుకిక్కడ. అపవాళ్లలాగ వంటింట్లోను. నడవరేమి."

"........"

"నడవరూ."

"........" (రెండు అడుగులు వేసేడు.)

"ఏమి కళ్లు అలాగున్నాయి ?"

"........",

"చెప్పరు."

"వట్టిదే."

"వట్టిదే అయితే యీలాగుండవు."

"

"ఈ ముండనుంచె యిదంతాను. ఏమటి చెప్పేవే. ఏమిటిచేసేవు. ఆయనిని ఏమిటన్నావు. నీమొహం తగలెయ్య ఏమిలేక...పోతే ఎందు కలాగుంటారు, చచ్చినదానితో నువ్వాచస్తే మాకు శని విరగడవును. ఆయనా సుఖపడునును. నేనూ హాయిగావుందును."

"అదేమి చెయ్యలేదే! పాపమే! దానిని అనకే."

"పాప మేమిటి."

"దాని కేమి తెలియదే."

"అదా! ... రాతిగుండెది. పిల్లకంటిలో పుల్ల పోసింది. యిప్పటిదాకా నాప్రాణాలు పుచ్చుకుంది, దీనిని తన్నినా పాపములేదు." (అని ఒక్కటిచ్చింది.)

"ఆ! ఆ!! కొట్టకమే! దానిని. చూడలేనే. పాపాత్మురాలా! అది మనలాటిందే. సవితిపిల్లా. నిన్ను పెండ్లాడటం నాదితప్పు. అంతా నాతప్పే!"

"కొట్టక ... ఏమిచేసినా పాపములేదు. కసి తీరదు. నన్ను ... తప్పా. సరి. మీరు పెళ్ళాడకపోతే నాకు పెళ్ళికాదా పిల్లలుపుట్టరా. ఇప్పుడైనా ఆలాస్యము అవలేదు. మీపిల్లలు మీకుండండి. నేపోతా." (అని నడిచింది.)

"ఆ! పోకే! పోకే! ఎక్కడికే! విను!"

"........."

"జానా! ఓసే! నీమాట వింటానే, ఎక్కడవుండమంటే అక్కడనే వుంటానే, పడుకోమంటే పడుకుంటాను, కూర్చోమంటే కూర్చుంటాను. నీ కాళ్లు పట్టూరా. రావే! పోకే! నా కొంపతియ్యకే" (అని పైటచెంగు పట్టుకొన్నాడు.)

"వదలుతారా లేదా! నాఖర్మం నాది నీఖర్మం నీది."

"...వదలను...అలా అనకు...నిన్ను నమ్మేను.. ఏమిచేయమంటావు."

"వదులు...చీరకదా చిరిగిపోతుంది."

"వదలను."

"వదలవా" (అని పళ్లు పటపటకొరికి ఒకటిచ్చింది కాలితో.)

"తన్నుతే తన్ను వదలను. తన్నినా నాకు నొప్పి లేదు. దెబ్బతగలదు. వళ్లు బురదవదు."

"సిగ్గా! లజ్జా! మనిషిపుట్టుక పుట్టితేసరా?"

"చాలు. రా...గదిలోకి."

ఇద్దరు గదిలోకివెళ్లేరు.

## 3

"ఏమేవు...యిటురా."

"........."

"రావా."

"అవుసరమైతే మీరేరండి."

"అంతేనా"

"నా అవుసరముకాదు."

"రావా"

"ఎందుకు పదేపదే పిలుస్తారు. నావంట్లో బాగు లేదు."

"ఏమి...ఏమిటివచ్చింది."

"........."

"చెప్పవు."

"ఎందుకు."

"నాతో చెప్పవా? పోనీ."

"నాబాధ తీర్చేవారా? ఆర్చేవారా?

"ఏమి బాధ"

"ఏమిబాధే"

"తీర్చుతారా?"

"వీలైతే."

"అయితే చెప్పను."

"చెప్పవా."

"తీర్చుతానంటే."

తీర్చుతాను. నీ పోరుపడలేను."

"అదుగో పోను అంటున్నారు. అంత కష్టంగా వుందా?" (ముఖము తిప్పేసింది.)

"లేదే! నావైపు తిరుగు. యిటు. యిటు"

"ఊఁ......"

"చెప్పవు."

"చెప్పెయ్యనా"

"కోపము రాదా."

"........."

"ఇంట్లోని...చాలా చికాకుగావుంది, మీ అమ్మాయివుంది. మీరు, నేను దెబ్బలాడుకోవడాలు. అందు కుపాయము చూచేను. తగిలేద్దాము."

"ఆ! తగిలివేయడమే!" (ఆశ్చర్యముతో)

"అంటే"

"నా కూతురిని...తగిలివేయడమే!"

"...కూతురేమిటి! వీళ్లు కూతుళ్లు అదికాదు."

"ఎక్కడికి పోతుందే. పాపము. పెళ్లయితే పోనీ అత్తవారింటికి వెళ్లడానికి."

"అదిగో! ఇక మొదలు. మీరు అదేవుండండి నే చెప్పినట్టు చేస్తానని యివా?" (తనలో) ఏమిబాధ వచ్చిపడ్డాదిరా బాబు. కూతురిని ఎలావదిలేది. పసికూననుంచి పెంచేను, పెద్దచేసేను. తల్లిలేనిబిడ్డ. ఎక్కడకిపోతుంది. చిన్నది. చదువురాదు. మాటలాచేత కావు. ఎలాబ్రతుకుతుంది. ఏ నిరాధారపక్షి ఆలయములో జేర్పించుదామంటే వీలులేదు. నేనున్నాను. డబ్బు యివ్వాలి. దొంగతనముగా పంపడానికా వీల్లేదు. జీతము ఎంతవస్తుందో తెలుసు. 29 వ తారీకునుంచే జీతమేది అంటుంది. కానీ, తీసుకుందికి వీలులేదు. నెలరోజులు చచ్చినట్లు కష్టపడడం నావంతు. డబ్బుదీసికొనుట దానివంతు. పోనీ డబ్బుమిగులు. కూతురు మిగులు అంటే — అనుకోకూడదు — ఏమన్నా వెళిపోతుంది. అదిపోయిందా చచ్చేను — కీచుకీచుమంటూ 3 నెలలపిల్ల, బామని ఏడుస్తూ యిద్దరు మొగాళ్లు, వెధవల ముక్కుతీసి, తలకాయలు దువ్వి, ముస్తాబుచేసి, బహిర్భూమికి వెళితే కడిగిఎత్తి. అబ్బా! యిది నావల్లకాదు — వీళ్లతో అయిపోతుంది. కాస్త ఆయింత ఆఫీసుకైనా. వుద్యోగము సున్నా... ఇంకొకసంగతి. వీళ్లందరికి వండిపెట్టి, తినిపించి, చేతులు కడుక్కోవాలి. పరమ అసహ్యమయింది. ఎంగిళ్లెత్తాలి. ఇవన్నీ నావి. ముఖ్యమయింది. కోర్టులో ఇదివరకు తెలివిగలవాళ్లు — నావైపే డిక్రీయిచ్చేరు. ఆడ దావాతెస్తే ఏమంటే, దానికి కోపమువచ్చి అది వెళిపోయినాసరే, నాకు కోపమువచ్చి నేను తగిలేసినాసరే, నేను దానికి నెలకి రు 10-0-0 భరణము యిచ్చుకోవాలి. దానికి నావల్లపుట్టిన పిల్లలందరిని నేనే పోషించుకోవాలిట — ... ఇదంతా కష్టముగావుంది. ఒక్కర్తెను వదులుకొంటే బాగుంటుంది వదలటానికి ప్రాణమువప్పదు. దీని బాధపడలేను. ఒక్కర్తైనా తీసుకువెళ్లదట. అస్తమానం కేసులైతే వుద్యోగంసున్నా. దానిని...పొమ్మ..ని...ఎలాగు చెప్పేది. మనుష్యుడవా దున్నపోతువా అంటారు అందరూ. నా బాధ ఎవడికి తెలుసు అసలు వదల్లేను. దీనిని...దానిని వదలలేను...ఏమిబాధ..."

"ఏమిటి! మాటరాదేమిటి! ఆవాళకం ఏమిటి."

"..............."

"ఏది నిశ్చయం?"

"..............."

"తనువా? మనువా?"

"........ ....."

"మీఖర్మం, నా తప్పులేదు. మాట్లాడకపోవడం చూస్తే, మౌనం అర్ధాంగీకారము అన్నట్లు మీకు కూతురే—యిష్టపడ్డాది. నేపోతా పిల్లలిరుగో పోతున్నా" (అని వీధిగుమ్మములోకి వెళ్లింది) (తనలో) బెదిరించే! పోతుందేమిటి. యిన్నాళ్లూ నాతో కాపురముచేసి—అందిగాని పిల్లలను వదలుతుందా. (తొంగిచూచి) నిజంగా పోతువుంది. ఎంత గడ్డువారీ ముండో! (పైకి) అవునా!"

"నేనురాను. మీకు నాకు సంబంధములేదు."

"రారా ! అదే పోతుందిలే"

"పోతుందా"

"మరి ఏంచేస్తుంది. నీగురించి"

"మీ కిష్టములేదా ?"

"ఎం చెయ్యను."

"అయితే రాను. (నడచును)

"రా ! తగిలేస్తున్నా ?

"(యింటిలోకివచ్చి) వెళ్లండి. తగిలేయండి."

సూర్యారావు, మాలతిగదిలోకి వెళ్లుటకు కాళ్లు రావు. ఇంటినుండి తగిలివేయడానికి ఇష్టంలేదు. పొమ్మని చెప్పలేడు. ఆగినప్పడల్లా "పోతున్నా" ననే భూతముకేకలు చెవిలో రింగుమంటన్నాది. మాలతిగదిలోకి వెళ్ళేడు.

"బాబూ ! ఏమి యీలాగువచ్చేరు."

...ఈ గదిలోకి ఎందుకువచ్చేరు. అమ్మగారు చూస్తే మీకు నాకు అవుతాయి."

"..........."(కళ్లంట నీళ్లు కారుతున్నాయి.)

"కళ్లనీళ్లు పెట్టకండి. అరిష్టము."

"అ...మ్మా...(వెక్కి వెక్కి ఏడ్చును.)

"........." (మాలతికి కడుపులో గాధరాగావుంది. దుఃఖము పొర్లిపొర్లి వస్తుంది.)

"    "

"బా...బూ ..ఎమిటో కారణం"

"అ..." (ముఖము చేతులతో మూసుకొని)

"ఎమండోయి ! ఎమిటిచేస్తున్నారు."

"వస్తున్నా !" (నడచును)

"వెళిపోతానండా ? వెళ్ళిందాలేదా "

"........."

"చెప్పేరా ?"

"లే...దు...ఎలాగు...చెప్పేది."

"పోనీండి, బొమ్మలాటదాని ననుకొన్నారా ? ఆడించుతున్నారు. ?" (కళ్లు ఎఱ్ఱచేసింది)

"నువ్వు...చెప్పెయ్యి."

"నేనా..."

"...ఊ"

"సరే నాకే కదా తట్ట. కానీండి"(గదికి వెళ్లింది)

"ఓసే"

"అమ్మా"

"నీపని అవుసరంలేదు. నువ్వు మాయింట్లో వుండ వద్దు వెళ్లిపో."

" .............. అయ్యయ్యో ! దైవమా ! యీపాటి వూతైనాలేకుండా చేసేవా ! నిరాపరాద పక్షిని, యిటులచేయుట బాగే ! పాపిష్టులకు, కష్ట జీవులకు సుఖము లేనేలేదా. ఈపాటి వూతైనా లేకుండా చేసేవు...దైవమా ! త్రోవలేదు, రక్షింపుము "కళ్లు చీకట్లుకమ్మేయి. భూమితిరుగుచుండెను. కళ్లనిండా నీరు గిర్రుమని తిరుగుతున్నాది మాలతికి.

"ఏమిటి చూస్తున్నావు ?" (గద్గదస్వరముతో)

"........." (వణుకుతుంది.)

"పోవే! "

"అమ్మా ! ... ఏమితప్పు...చేసేనమ్మా ! ఇంత శిక్షటమ్మా ! తప్పు కాపాడవా. ఇకముందు తప్పులు చేయనమ్మా ! అమ్మా !"

"నాకు తెలియదు ... మీ బాబుగారు పొమ్మన్నారు. పో ! నీబాధ పడలేరు."

"నేను ... లేదు."

"ఎమిటి"

"........." (సూర్యారావు ముఖముతిప్పేడు)

"అమ్మా ! ఏమిటి చేసేనమ్మా ! కాపాడవా ! ఎక్కడికిపోతాను. ఎవరున్నారు ... తలిదండ్రులు మీరే. అమ్మాశరణు" (అనిఏడుస్తూ సుబ్బలక్ష్మి కాళ్ళమీద పడ్డది.)

"వెధవ బొల్లిఏడ్పు లెందుకు. ఎవరువినరు! పో: (అని తన్నింది.)

"అమ్మా ! తన్నినను సరే ! యీడ్చినను సరే ! నేను వెళ్లను. నాకు ... లేరు."

"అమ్మాయి.." (దెబ్బతలిగి నుదుటనుంచి నెత్తురు కారుచున్న గాయముపైకి దృష్టిపరపేడు సూర్యారావు.)

"ఊఁ..." (గుడ్లుతిప్పింది.)

"లేదే... నెత్తురు"...

"పాపము ... ఏమి — జాలి — మనపిల్ల లేడ్చి నప్పుడు లేదు. యిదిఅంతా ... యింతే."

"........."

"పోతావా లేదే" (గుడ్లురిమి రవ్వలేసింది.)

"........."

"పోవా ? నీ పనిచెపుతా. (గబగబవెళ్లి కర్ర తెచ్చింది.)

"........."

"ఏం ?..." (కఱ్ఱతాడించి)

"అమ్మా..." (ఆపుకొంటుంది.)

"వెళ్ళు...వెళ్లు అవతలకి" (అని యిచ్చింది.)

"........." (తడుముకుంటుంది)

"పోవా !" (బొత్తుపట్టుకు యిడ్చేసింది అవతలకి.)

సూర్యారావు చెయ్యి పట్టుకోపోయేడు. ఏమి చెయ్యలేకపోయేడు. సుబ్బలక్ష్మిని బతిమాలింది. తండ్రికేసి చూచింది. దీనంగావున్నాడు. మాట్లాడ లేడు. తగిలేసి గడియవెట్టింది.

"అయ్యో ! అమ్మా !! మరెప్పుడూ చెయ్యను. రక్షింపవా."

"పోతావా లేదా! దాచిపెట్టినట్లు అరుస్తున్నావు. చూచుకో" (అని పేద కళాపిల్లని తలుపువేసి వెళ్లి పోయింది కసితీరక.) సూర్యారావు నిశ్చేష్టుడయేడు.

" ఆహా ! యిక ఏల యీజీవితము. తల్లీ! చిన్నతన మప్పుడేపోయింది. తండ్రియా బతికున్న లేని వారిలోజమ. ఇటువంటి తండ్రియున్న ఎంతసౌఖ్యమో లేకున్నాఅంతే. వెదుకుదమన్న ఆవగింజంత జాలి లేదు. ఆమె నన వనిలేదు. "సవతి" యను అక్షర ములే చేయును. అవే యింతమట్టుకు చేసినవి. ఎంత దుర్మార్గురాలైనను పాపమంటదట అనుకున్న వారిదట. ఆమెచేయునది కాదు. నే చేయించుకున్న దానను. విధి ఆహా ! దైవమా ! నీయొక్క శౌర్యసాహసములు, బుద్ధి చమత్కారములు, సుఖవంతులు, ధనవంతులు మీదకివెళ్లలేవు కాబోలు. నీకు బలముచాలదా ! నేనా దొరకేను. నేనుఏడిస్తే నీకు సరదానా? అంతా సమమేమో నీకు! ఏడుస్తే నీకు నవ్వు, ఆటపాటనూ. ఒకరికష్టము నీకష్టమేమో ఏదది...ఛీ! దేవుడిని నిందించడమే! నేనెక్కడ దేవుడెక్కడ! మందభాగ్యు రాలను. దైవమా ! ఇక్కడ పనిలేదు "అమ్మా ! సెలవు. ఇదే కడసారిచూపు, పలుకు. బాబుగారికి నా నమస్కారములు." అని కేకపెట్టి ఏదో గొణుగు కుంటూ, తనలో తాను నవ్వుకుంటూ, బట్టలు చింపు కుంటూ, మార్గమనక, ముళ్లనక తిన్నగా పోయింది మాలతి. ప్రపంచమే అగమ్యగోచర మనిపించింది. ప్రపంచములో తనకుతానే లేదనుకుంది. ప్రపంచ ములో తన్ను భరించేవారు లేదనుకుంది. తిన్నగా సముద్రముగట్టుదాటి తీరముచేరింది. కెరటాలువచ్చి తగులుతున్నాయి. నీరు చల్లగా తగులుతున్నాది. తెలివిలేదు. కృంది తిన్నగాపోతున్నాది. "తల్లీ ! రావా ! కాపాడవా ! నేనీబాధలు భరింపలేను. ఈ అవమానం భరించలేను. దిక్కులేనివాళ్లకు దిక్కు నీవే తల్లీ ! గంగాభవానీ ! యిదిగో నీపుత్రిక. కౌగ లించుకో" (అని రెండుచేతులెత్తి నమస్కరించింది.) పెద్దకెరటమువచ్చింది.

మరునాడు దండోరా. ఎవరో బాలిక, సుమారు 12 సం॥ చింపిరిజుత్తు, బంగారుచాయగల శరీరముగు పిల్ల శవము సముద్రతీరమున దొరికింది. సంబంధీకులు వచ్చి ఠాణావద్ద 7 గం॥ లోగా కనబడవలెను."

ఇట్లు,
సబ్ ఇన్‌స్పెక్టరు.

ఎవరు రాలేదు. 9, 10 అయింది. అనాథప్రేతం గవర్నమెంటువారే దహనంజేశారు. ఎవరో ! తెలుసుకో !!

భారత సతీమతల్లులారా ! సవతియని శాపము పెట్టి యిట్టి దుండగము లాచరించి, స్త్రీజాతి కంతకు కళంకము తేకుందురుగాక !

# ఆత్మవిశ్వాసమున్నచో

బి. సుబ్బయ్యగారు. బి.ఎ., ఎల్.టి.

అనన్యసామాన్య బలపరాక్రమములున్నను, బుద్ధి చమత్కారములున్నను, ఆత్మవిశ్వాసములేనియెడ మానవుడీ ప్రపంచంబున సత్త్వానురూపంబైన ఫలంబు నొందుట దుష్కరము. భీరువులు తమయందిమిడియుండు అనంతశక్తిని గుర్తింపగల్గుచో వారెట్టి మహత్కార్యమునైన నవలీలగ సాధింపగలరు. సకల మానవులకును మహదాశయములు గలవు; ఉత్తమాభిలాషలున్నవి. కాని ఆత్మవిశ్వాసరహితులు విజయపతాకము నాడింపలేరు.

స్త్రీల నబలలని వర్ణించుట సంప్రదాయము. కాని కాలక్రమముగ వారీ కళంకము బాపుకొనుచున్నారు. విద్యావ్యాప్తియు, పాశ్చాత్యనాగరకతా సంపర్కమును, జాతీయభావమును వారి స్వాతంత్ర్యాభిలాషను బురిగొల్పి వారిని లేవదీసినవి. హిందూసుందరులు తమ దాస్యశృంఖలములను ద్రెంచుకొని సర్వరీతుల ముందంజ వేయుచున్నారు. ఇట్టితఱి తరుణుల ఆత్మవిశ్వాసమును ప్రబోధించుటే వారికి మన మొనర్పగల మహోపకారము.

పాశ్చాత్య ప్రపంచమున ధ్రువతారవలె దివ్యకాంతులతో వెలుగు నారీలలామములలో నధికులు ఆత్మశక్తిమూలమున ఉన్నతస్థితికి వచ్చినవారే.

ఫ్లారెన్సు నైటింగేల్ (Florence Nightingale) కన్య బీదకుటుంబమున జన్మించిన సాధారణస్త్రీ. కాని బాల్యమునుండి మానవసేవయందే సర్వశక్తులవినియోగించెను. "నేనే కాకిని" యని పరితపించుచు కార్యదీక్ష బూనకుండినచో క్షతగాత్రులైన యోధులకును, రోగపీడితులైన వారికిని సపర్యలొనర్చి వారి నోదార్పగల్గు రెడ్ క్రాస్ సంఘము (Red cross Society) వంటి ప్రజోపయోగకరములగు సంస్థలెట్లు నెలకొల్పబడియుండును? గతవత్సరము కీర్తిశేషురాలైన క్యూరీసతి (Madame Currie) భర్తృవియోగజనిత సంతాపముచే దపించుచు వూరక కూర్చుండియుండినచో రేడియం (Radium) • నెవరు కన్గొనియుందురు?

నిజమే! వీ రసాధారణ ప్రజ్ఞగలమేధావులు, బలసంపన్నులు, సామాన్యుల కిట్టి ధైర్యసాహసము లబ్బుట సాధ్యమాయని పల్వురు ప్రశ్నింతురు. కాని వాస్తవమునకు వారియం దసాధారణమైన దేదియు లేశమైన కానరాదు. "నా కాత్మవిశ్వాసముమాత్రము మెండుగనున్నది. అంతియకాని వేరులేదని" నైటింగేల్ కన్య పలుమరు వచించెడిదట. తాను సంకల్పించుకొన్న కార్యమును ఉత్సాహముతోను, దీక్షతోను సాగించుచుండెడి దా వీరవనిత.

గ్యాసులైట్లను (Gas Lights) గనిపెట్టిన థామస్ ఎడిసన్ (Thomas Edison) ఆఱేండ్ల ప్రాయమున నుండినపు డొకానొకదినము వాని ఉపాధ్యాయుడు "వీడు శుద్ధమొద్దు, చదువు సంధ్యలు వీనికంటవు, కావున వీనిని బడినుండి తొలగించుట శ్రేయంబని" వ్రాసి పంపగా వానితల్లి దానింగాంచి కొండొక తడవుచింతిల్లి పిదప ధైర్యమును వహించి "నాచిన్నికొమరుడెన్నటికిని మొద్దుకాడు; నే స్వయముగ వానికి విద్యగఱపెద"నని కార్యమారంభించెను. దానిఫలమేమి? ఎడిసన్ మహామహుడు.

అహర్నిశములును గృహకృత్యములందే మునిగి తేలుచునుండుటే మితరవిషయముల నెట్లు నేర్వగలమని మధ్యతరగతిలోని హిందూస్త్రీలు వచించుటకలదు. కాని అమెరికాదేశపు ప్రాచీనచరిత్ర పరికించినచో నిట్టివారనేకులు ఉత్తమబుద్ధులఁబెంచి దేశమునకు మహోత్కృష్టమగు సేవనొనర్చిరని తెల్లమగుచున్నది. అబ్రహాములింకను (Abraham Lincoln) యొక్క మాఱుదల్లి యిట్టి సామాన్యవనితయే. ఆ నారీమణి "దేహము, గృహము మిక్కిలి యింపుగను శుభ్రముగను నుంచుకొని గృహమునకు క్రొత్త వన్నె దెచ్చెను; ఆమె అబ్రహాముపై మిక్కిలి దయగల్గి ప్రేమతో బెంచుచుండెను. అతని విద్యాభ్యాసమున కామె మిక్కిలి తోడ్పడెను. అతడును జీవించినంతకాలము ఆమెయందనురాగము గన్పఱచెను." * ఆ కాంతామతల్లి కుమారుని ఉన్నతాశయములను జూపి దనరక్షణమందును దేశసేవయందును జీవితమును గడపుటుచితమని బోధించెను. కావుననే "నీవు చదివిన గ్రంథములలో నుత్తమమైనదేది?" యని లింకను నెవ్వరో ప్రశ్నింప "నే జదివిన సద్గ్రంథమా! నాతల్లియే" యని నుడివెను.

కావున గమనించవలసిన విషయమిది. "మానవకల్యాణకరమగు ప్రతి సంస్థయు ఏదోయొక వ్యక్తియొక్క ఛాయయే" యని అమెరికాదేశపు కవిపుంగవుడు వచించెను. "నేనల్పుడను, నాకంటె సధికులు పల్వురున్నారు. వారి సహకారములేనిదే కార్యమెట్లు సిద్ధించు" నని తలచుట పొరబాటు. నిజమునకు భగవత్సృష్టిలో ఉత్తమాధములను ప్రత్యేకతెగలు లేవు. ఎవరిని వారు స్వయముగ లోకువజేసికొనుటే కాని లేనియెడ మనకు దుర్ఘటమగు కార్యములేదు. భగవంతుడు మనల నేదో గొప్పయుద్దేశ్యముతో సృజించినాడను దృఢవిశ్వాసముంచి మనయందంతర్గర్భితమగు దివ్యజ్యోతిని వెలిగించి దానిం బెంపొందింపజేసినచో మనోనయములకు చక్కని రాజమార్గము గోచరమగును. ఆత్మవిశ్వాసరహితుడై "నేను వ్యర్థుడ"నని భావించి సర్వమును బరిస్థితులపై నాధారపడియున్నదని భావించువాడు పతితుడగును. "పరిస్థితులు పరిస్థితులనేమి? నేనే వానికల్పింతు" నని నుడివెనట శూరాగ్రేసరుడగు నెపోలియను చక్రవర్తి. ఇవి అహంభావజనిత వాక్యములుకావు కాని యదార్థములు. అనుక్షణమును మనపరిస్థితులను మనమే నిర్మించుకొనుచున్నాము.

* అబ్రహాములింకను — గా. హరిసర్వోత్తమరావు.

# కవిపత్ని

విశారద శ్రీ॥ తి॥ పె॥ రంగాచార్యులుగారు

విద్యార్థి అవస్థలో నేనూ మణిభద్రుడూ సహాధ్యాయులం. ఇంతేకాదు. ప్రాణస్నేహితులం. ఒక కంచంతిండి ; ఒకమంచంపడక. ఒకర్ని ఒకరం చూడకుండా ఉన్నంతకాలం క్షణం ఒకయుగంలా వెళ్లించేవాళ్లం. కాని చిత్రం ఏమంటే—

కొన్నాళ్ల కా ప్రేమపాశం పుటుక్కున తెగి, విరోధంఅనే చెల్లెలి కట్ట ఏర్పడింది మాస్నేహప్రవాహానికి. మా యిద్దరిమధ్యనూ గర్భశత్రుత్వం నిలిచిపోయింది. ఎఫ్. ఎ. పరీక్షలో ఉత్తీర్ణులం అయిన తరువాత మే మిద్దరమూ చెరొక దారీ త్రొక్కాము. మణిభద్రుడు మెడికల్ కాలేజీలో చేరేడు. నేను సాహిత్య సంసారంలో అడుగుపెట్టేను. మా పూర్వులేదో కొంచెం వెనకేసి చనిపోయారు కనుక ఈనాడు నేను పొట్టకోసం రెక్కలుకొట్టుకో నక్కరలేకపోయింది. ఈలాంటి నిశ్చింతావస్థలో — ఏం చెప్పనూ? — రాత్రింబగళ్లు కవిత్వం అల్లడంతోటే సరిపోయేది నాకాలం అంతాను.

ఈవెఱ్ఱి నాకు బాగా తలకెక్కింది. ఏలాగో శ్రమపడి గంటకోపదం అల్లడం ప్రారంభించేను. నా రచనా సౌందర్యంచూసి నేనే మురిసిపోయేవాణ్ణి. ఒక్కొక్కప్పుడు నా కవిత్వం తులసీ సూరదాసుల్ని మరపించేది. క్రమక్రమంగా నారచనా భాగాలికి పత్రికలన్నీ తావిచ్చేయి......అంతటితో నాకవిత్వం వెఱ్ఱి కొంచెం మొగంమొత్తింది. కానీ! ఇంత స్వల్పకాలంలోనే నాపేరింత మారుమ్రోగేసరికి నేనెంత కీర్తిగడించేనో? — అనేగర్వం తలకెక్కింది. అదీ సహజమే అనుకున్నా. గొప్పగొప్పవాళ్లందరికీ టీపార్టీలిస్తూ ఉండేవాణ్ణి. పూర్వానికి ఇప్పటికీ నాకవిత్వంలో కొంతతేడా కనిపించింది. అది నాచేతి ఆటబొమ్మైంది. అందుచేత ఆటే వ్రాయడం మానుకున్నాను. ఎప్పుడేనా హుషారుపుట్టి ఏదో అల్లుతూ ఉండేవాణ్ణి. ఏ స్వల్పవిషయం వ్రాసినా అందులో రసభావాలు ఊరిపోతూఉండేవి. నా స్థితి ఈలాఉంటే—

## అక్కడ మణిభద్రుడు

ఎప్పుడూ ఏచికిత్సాసారసంగ్రహమో, వస్తుగుణదీపికో ముందేసుకుని బుఱ్ఱకొట్టుకుంటూ ఉండేవాడు. ఐదేళ్లు చెమటూర్చిపోసి అసిస్టెంటు సర్జను (Assistant Surgeon) పరీక్ష ప్యాసయి, దుకాణం తెరిచేడు.

పరీక్షా ఫలితాలు పత్రికలలో ప్రకటించినప్పుడు మాత్రం అతనిపేరు చూశేను. మళ్లీ ఇంతవరకూ ఎందులోనూ చూడలేదు. నా ప్రశంసమాత్రం ప్రతిరోజూ పత్రికల్లో కొన్నిపేజీలు నిండిపోయేది. అతడా దుకాణంమీద కూర్చుండి రోగులకోసరం ఎదురుచూస్తూ ఉండేవాడు. అతనికేసిచూస్తే గర్వంతో అతణ్ణిచూసి అవహేళనచేస్తున్నానేమో అని భ్రమపడేవాడు. పోనీ అతడేనా నన్ను పలకరించేవాడా అంటే — అది మొదటికేలేదు.

## ౨

## ఒకనాడు

పన్నెండుగంటలవేళ — తపాలావాడు ఒక కవరు ఉత్తరంతెచ్చి చేతికందిచ్చి వెళ్లేడు. తొందరగా విప్పిచూశేను. అదంతా నాకవిత్వ ప్రశంసతో నిండిపోయింది. దేశసన్మానానికి, దేశగౌరవానికి నేనాదర్శకుణ్ణి' అని అందులో నిర్ణయించి వ్రాయబడి

ఉంది. అప్పుడప్పుడిలాంటి ఉత్తరాలు నాకు వినుగుపుట్టిస్తూ ఉండేవి. పురుషులపక్షంలో ఉపేక్షించినా అట్టే బాధుండదుగాని — ఎవరో ఒక యువతీలలామ లేఖిని కురిపించే యీ అమృత వాక్కుల్ని ఉపేక్షించడానికి మనసొప్పిందికాదు. ఈమైనా సామాన్యస్త్రీయేమోఅంటే — దేహలీ నివాసుడు — సుప్రసిద్ధహృదయనారాయణ జమీందారుగారి సుపుత్రి. విద్యాసంపన్న, బి. ఎ. ప్యాసయింది సావిత్రి. ఈ తరుణంలోనే యీమె ప్రశంస అనేక పత్రికల్లో మాస్తూవచ్చేను. మొదట వాటిని అంత శ్రద్ధగా పాటించలేదుగాని యీవుత్తరం వాటి నన్నింటినీ జ్ఞాపకంచేసింది. వెంటనే కలంపట్టి జవాబు వ్రాయడానికి కూర్చున్నాను. కలం నడుస్తూనే ఉంది. మనస్సు ఆలోచిస్తూనేవుంది. నూతనశబ్దాల కోసం నిఘంటువులన్నీ తిరగేశేను. ఇంకా కొన్ని పదాలకోసం క్రొత్తనిఘంటువు వ్రాయవలసిఉంటుందని నిశ్చయించుకున్నాను. ఆ వుత్తరంలో నాప్రతి పత్తిని పూర్తిగా అంగీకరిస్తూ లిఖించడం ప్రారంభించాను........

......తమరు నన్ను స్తోత్రంచేస్తున్నారు. ఇది తమఘనతనే వెల్లడిచేస్తుంది. నా రచనలు స్తవనార్హములు కావు. కల్పనా సౌందర్యంలేదు. కవిత్వప్రధానాంగమైన రససిద్ధి మొదలేకున్న...ఇట్టి పరిస్థితుల్లో తమరు నన్ను ప్రశంసించుట తమయాశీస్సంపదను పొందింపచేసిరని తృప్తిచెందుచున్నాను........."

ఈలా...ఈలా...ఉత్తరం పూర్తిచేశేను. తనగొప్ప తనాన్ని వెల్లడించుకోవడంలో ఇదికూడా ఒక పద్ధతేగా !!

*   *   *

నెలరోజులైంది. నా ఉత్తరానికి తిరిగీ సమాధానం వచ్చింది. కాలాతీతానికి కలవరించేను.

"తమరువ్రాసినలేఖ తమయోగ్యతను ద్విగుణీకృతం చేస్తోంది. మేలిమి బంగారానికి తావులు కల్పిస్తోంది. తమకు వర్డ్సువర్తు (Wordsworth) టెనిసనులు (Tennyson) సాటిరారని నా తలంపు. తమరచన రసహీనమని వ్రాసియున్నారు. అయితే అవవచ్చును. కాని, అది నన్ను మాయామోహజాలాల్లో ముంచేసే మధురమురళీగానరసాస్వాదనచేయించింది. గంటల కొలదీ రససాగరంలో మునకలేస్తూ ప్రొద్దుపుచ్చుచున్నాను. నిద్రాహారములుకూడ మరచుచున్నాను. తమలేఖిని నొకమారు ముద్దాడుదామా అనే కోరిక లీరికలెత్తుతూవుంది."

ఇది నాకు రెండో ఇంజెక్షన్ అయింది. ఆఖరు వాక్యం నా హృదయంలో వెట్టపుట్టించింది. హృదయం విడివడి ఉత్తరంలో చిత్రించబడిపోయింది. కవి తనకిష్టమైన పదార్థాన్ని గగన సంచారం చేయిస్తాడు గదా! నేనూ సావిత్రిని పొగడడంలో ఆలోకపాతాళం ముడిపెట్టేశేను.

"కవిత్వం వ్రాసేవాడే కవికాదనీ, దాన్ని చదివి అందులో రసాన్ని రచనారహస్యాన్ని హృదయతృప్తిగా అనుభవించేవాళ్లుకూడా కవులే అనీ కార్లైలు వ్రాశేడు. ఈ పద్ధతిలో మీరునూ కవులే. చాలా ఉత్తమోత్తముల నందరినీ చూశేను. ఒకరూ కవిత్వంలో ఉండే మహత్వంమాత్రం అనుభవించినవారు నాకు కనబడలేదు. మీరు గచన్నాప్రపంచంలో వీహార వేశాలన్నీ విమర్శిస్తున్నారు. మీ ఘనత నా కాశ్చర్యజనకం అయింది. తమవంటి సుశిక్షిత మహిళామండలిచే సలంకృతమై భారతమాత ధన్యురాలైంది," అని వ్రాసి ముగించేను.

అనేకనవలలు చదివేను. రసవత్తరమైన కవిత్వాలు చదివేను. కాని సావిత్రి వ్రాసే వుత్తరాల్లో వుండే రసం ఎందులోనూ నాకు దొరకలేదు. అవే తిరిగి తిరిగి చదువుదామా అనే ఆశకలుగుతూ ఉండేది.

## 3

### సావిత్రి మాటలు

తప్పక ఆయన నన్ను ప్రేమిస్తున్నాడు. లేకుంటే

వెంటవెంటనే యీలా ప్రత్యుత్తరాలు జరుపువాడా? ఈనాడు ఉత్తరం వ్రాస్తే ఎల్లుండే సమాధానం. ఆలోచించిచూస్తే నా ఉత్తరంకోసమే ఆయన ఎదురుచూస్తూ వుంటాడా, అనిపిస్తూవుంటుంది. ఆయన కవిత్వంకంటే తేటుచు వ్రాసే ఆయన వుత్తరాలే రసవంతంగా ఉంటాయి. చదివిచదివి ముగ్ధురాలనై పోతూఉంటాను. ఒకప్పుడు నేను చిత్రపటం పంపుతున్నానని వ్రాసేను. వెంటనే సమాధానం—ఏమనిః "పటం పంపుతున్నానని వ్రాసినారు. కాని ఇంతవరకూ నాకు చేరలేదు. రిజిష్టరీ రశీదుఉంటే వెంటనే పంపేది. పోష్టుఆఫీసులో దర్యాప్తుచేస్తాను...." ఈ సమాధానం చూడగానే అదివరలో సుస్తీచేసినా తిరుగుటపాలో చిత్రపటం పంపక తప్పింది కాదు. మూడోనాడు ఆయనఫోటో నాకందింది. ముఖం రాజకుమార లక్షణాలతో విరాజిల్లుతోంది. నా హృదయం చాలావరకు మొదలే లాక్కున్నాడు. ఈ క్షణంలో పూర్తిగా నాహృదయరాజ్యాన్ని ఏలేడు ఆయన. రాత్రులందు నిద్రలేదు. పగలు ఆహారంలేదు. వారి ఆఖరువాక్యం వారి హృదయం నావిహారస్థలం అయిందని బుజువుచేసింది. "........ప్రియతమురాలికి..." ఆహా! ముద్దులొలుకుతోంది అనుభావము. ప్రతివర్ణంలోంచి ప్రేమామృతధారలు ఒలుకుతున్నాయి. 'పాతీనిహారకర' అనేరచన నన్నుద్దేశించే వ్రాయబడి ఉంది. మరొకరచనలో ఆయన అవివాహితులని నిర్ణయింపబడిఉంది. కాని నేనుమాత్రం........" ఆయనింత శ్రమఎందుకు పడుతారు? కవిత్వధోరణిలో శరీరారోగ్యం ఏమరవద్దని వ్రాస్తే ఆయన విషయం తేలిపోతుంది. ఆ అవివాహితుని జీవితపథానికి లక్ష్యంగా నేనే ఏర్పాడ్డానని విశదమయింది.

తిరిగి నేనొకజాబు వ్రాసేను. వెనుకటి వుత్తరాలికీ దీనికీ చాలా అంతరువుంది.

"మీ లేఖలలో సంతోషము కలుగుటలేదు. తమ దర్శనమే ప్రాప్తిస్తే సాష్టాంగపడి తమ పదపద్మాల్ని ముద్దుపెట్టుకుందామా అని తటపటిస్తూవున్నాను. నన్నధికంగా జాలినొందించుట ప్రమాదం. అనుక్షణం తమదివ్య లీలామూర్తిమంతమే నా కళ్ళారాకడుతూ ఉంటుంది. నిద్రావస్థలో మిమ్ములనే పలకిస్తూవుందునంటే అతిశయోక్తికాదు. ఆహారవిహారాల్లో తమ కెట్టిసుకరములు జరుగుచున్నవో? అని తొట్రుపడుతూ వుందును. రాత్రులందు చాలవఱకు నిద్రమేలుకొని ఉండుటలేదు గదా? శరీరారోగ్యం చెడిపోతుంది. ఈ విషయంలో తాము చాలా శ్రద్ధవహించాలి. నన్ను మీపాదదాసిగా ఎంచుకోండి." నాలుగోనాటికల్లా జబాబు. ఎగిరి ఉత్తరం అందుకున్నాను ఆయన నన్ను వివాహం చేసుకుందుకు కుతూహలులై ఉన్నమాట నిజమే కాని కొంచెం అధైర్యంగా కనబడ్డారు. తలవనితలంపుగా నాకను రెప్పలు మూతలుపడ్డాయి. భావి కార్యక్రమాన్ని తలుచుకుంటూ ఆనందడోలికల్లో ఊగేను.

ఇంతలో మా ప్రభాశంకరం పటాలదొంతి తెచ్చి నాముందు పెట్టేడు. 'ఈపటాల్లో ఒకదానిని ఏరుకోవలసినది. అందుతో జతపరచిన ఉత్తరముకూడా చదువుకోవలెను! అని బాబుగారి ఆజ్ఞ వినిపించేడు. కట్టువిప్పేను. అందులో నన్ను వరించాలని ఆశించే వ్యక్తుల ఫోటోలున్నాయి. కాని నా హృదయంలో ఒక్కవ్యక్తికే స్థానంఉంది. అన్నీ తిరగేశేను. నా మతానికి సరిపడింది ఒకటీలేదు. వెంటనే నాపెట్టె తీసి వారిఫోటోమీద 'Passed' అనే మాట వ్రాసి తండ్రిగారిదగ్గిరికి పంపేను. వారాశ్చర్యపడ్డారు. నేనే లక్షాధికారినో ఎన్నుతానని నానుకున్నారు. నేను కవిగారిని వరించడంతోటీ వారు నిర్విణ్ణులైపోయారు. కవిగారు ధనాఢ్యులై కుచేలుణ్ణి ధిక్కరించినవారూకారు, భిక్షుకుణ్ణి అనుకరించినవారూకారు. ప్రేమగ్రుడ్డిదని ఎవరు ఎరుగరు? దాని విలువను తెలిసినవారు మాత్రం ఎవరు? నాతండ్రిగార్కి నేనంటే ఎంతో ప్రేమ అందుచేతనే యీ విషయంలో నాకు పూర్ణస్వతంత్రంయిచ్చి నాతో ఏకీభవించారు.

## ౪

చివరకి అనుకున్నంతా జరిగింది. వారికి జ్వరం తగలడం ప్రారంభించింది. డాక్టర్లు హృద్రోగమేమో అని సందేహిస్తున్నట్టు తెలియవచ్చింది. నాన్నగారు అహోరాత్రాలు విచారసముద్రంలో మునిగిపోయేరు. నే నీ వివాహంమానితే బాగుండునని వారికి తోచింది. చూస్తూ చూస్తూ నూతిలో ఎవరు దిగుతారు? కాని నాకాలక్ష్యంలేకపోయింది. ఇద్దరి మనస్సులూ ప్రేమబంధాల్లో కట్టుబడిపోయాయి. వారి రోగమూ బాధా అన్నీ నాకు వాటా రావలసిందే. నేను వారి దాన్ని. సావిత్రి సత్యవంతుణ్ణి యమపాశాల్లోంచి విడిపించితెచ్చింది. నేను వీరిని రోగముఖంలోంచి విడిపించలేనా? నేనూ సావిత్రినేగా? ఈ భారత మాత సంతానాన్నేగా? పేరు సార్థక్యంచేసుకో యత్నిస్తాను.

సాయంకాలం అయింది. బాబుగారు క్లబ్బుకు వెళ్లేవేళ అయినప్పటికి గదిలోనే కూర్చున్నారు. వారు విచారసముద్రంలో మునిగిపోయారు. నేను కూడ ఆయనదగ్గఱపోయి కూర్చున్నాను.

"బాబూ క్లబ్బుకి వెళ్లలేదేం?"

"ఏంకావాలి?"

"మీరు అనారోగ్యంగా ఉన్నారా?"

"ఫరవాలేదు."

"మీరు అర్థాకలిగాకూడా లేవడంలేదు."

"నాకా సంగతి తెలియును."

"డాక్టరికి ఎవరికేనా చూపించండి. రోగం వృద్ధి పొందించడం బాగుండలేదు."

"నా వైద్యుడు యమధర్మరాజే!"

నాకళ్లంట నీరుకారడం బాబుగారుచూశేరు –

"నా దురదృష్టానికి విచారిస్తున్నాగాని, నీకేమే? సావిత్రీ!" అన్నారు.

నా కేదో పెద్దఅపకారం నాకు వారుచేశేరు అనేట్టుగా బాబుగారిని చూశి –

"నా తండ్రిగారైయుండి మీరు నన్ను పూర్తిగా అర్థం చేసుకోలేకపోయారు. మీ ప్రతిమాట విషం పూసినబాణంలా తగులుతోంది. మీ రెప్పుడూ బయటతిరుగుతూ ఉంటారు. నే నింటకూర్చుండి ఎంతగా ఏడుస్తున్నానో మీ కేంతెలుసు? నేను చిన్నదాన్ని. నా నోటివెంట యీలాటికబుర్లు లాయకైనని కావు. కాని, ఏంచెయ్యను? నాజీవితం సర్వస్వం దోపిడీచేయబడింది. ఎల్లా ఊరుకోగలనూ? నా భావిజీవితాన్ని అంధకారమయంగా చేస్తున్నారు" అన్నాను.

"సావిత్రీ! చూస్తూ విషం త్రాగమంటే ఏలా? అతనిరోగం నీచికిత్సలకి లొంగుతుందని నీకింకా ఆశ ఉందా?"

"తప్పకుండా వారికి ఆరోగ్యం కలుగుతుంది. విస్తారంచదువుతూ, వ్రాస్తూఉండటంచేత బహుశః యీ భోజనసమపాయం సరిగా ఉండకపోవచ్చు. అందుచేతనే ఆలా రుగ్మతగలిగిందిగాని స్వతః వారు ఆరోగ్యవంతులే."

ఈ నామాటలు బాబుగార్కి పథ్యం అయాయి. కొంచెం ఆలోచించి – "చెప్పడంలోనూ చెయ్యడంలోనూ సహస్రాంతం వాసంది. నీవు చెప్పినట్లల్లా అక్షరాలా చెయ్యగలవా?" అన్నారు.

కొంచెం గూఢస్వరంతో –

"నామాట చేతలోనే పరిణతిపొందుతుంది." అన్నా ధాటీగా.

ఆలా ఆలోచిస్తూ కూర్చున్నవారు చటాలునలేచి బయటికివెళ్లిపోయారు బాబుగారు.

వివాహంఅయింది.

రోగిష్టి అనేసంగతి అబద్ధం. వారి దేహారోగ్యం చిత్తానందకరంగా ఉంది. ముఖం ఎఱుపు. నేత్రాలు జ్యోతిర్మయాలు. నన్ను చూడడంతోటే కుసుమకళి



మిసెర్స్. దుర్గాబాయి ఖోటే. దేవకీబోసువారి చిత్రమగు "జీవిత మొక నాట్యరంగ"మను చిత్రమున నాయికపాత్రవహించినారు. ప్రకృతము కొల్హాపుర సినిటోన్‌నందు చేరినారు.

*Courtesy of "Silver Screen"*

కల్లావికసించేది వారిముఖము. అనేక కవులచరిత్ర నేను చదివితే వారివారివిషయాల్లో ఏదో దోషం కనబడుతూనే ఉండేది. కాని వీరికి విషయంలో యీ సిద్ధాంతం నిరాధారం అయ్యింది.

వీరు చాలా బిడియస్వభావులు. పరాయిస్త్రీ కనబడితే తలెత్తిచూడరు. నాచెలికత్తె లెవరేనా కనిపించినాసరే లేచి లోపలికివెళ్లిపోయేవారు.— 'మీరు పురుషులు. స్త్రీకే పరదా కూడదంటే మీ కాఘోషా ఏమండీ?' అని అనేకసార్లు అన్నాను. కాని నాప్రశ్నకి జవాబు అమూల్యమైన ఆయన హాస్యచంద్రికే. వారంటే నాకెంతో నమ్మకం. ఆ హృదయం నిష్కళంక గగనసదృశం అని నావిశ్వాసం. ఈలాంటివరుడు దొరకినందుకు నా భాగ్యదేవతకి ధన్యవాదాలిచ్చేదాన్ని. సమస్తమూ నాచేతులోనే వదిలేశేవారు. బట్టలుకూడా నా సలహా లేకుండా మార్చేవారుకారు. వారి ఆహారవిహారాదులన్నీ నేనే చక్కబెట్టవలసివచ్చేది. నా స్థానంలో ఏ యితర నిర్లక్ష్యవ్యక్తినా యీ సరళహృదయాధికారి అయిందాఅంటే యీగృహనిర్వహణ మెట్లా పరిణమించేదా?'అని ఆశ్చర్యంవేసేది. వారికి తమ ఆఫీసుగది పరిశుభ్రతేనా అక్కరలేదు. వేలుమడిచి చూపినదాకా ఎక్కడమున్నదీ అక్కడేనిలవ. కాలిమీదకాలేసుకుని కూర్చోడమే. నెలకినాలుగురోజులు ఇల్లంతా పురుగులుకొట్లాడుతూ ఉండేది.

"ఏమండీ! భారతదేశం అంతా మీ కవిత్వం ప్రశంసే కదా? మీ సోమరితనం, నిర్లక్ష్యతా ఎవరేనా ఎరుగుదురా?" అని అడిగేను.

"నీవో వ్యాసం వ్రాసి పంపకపోయేవా?" అని నవ్వేరు.

"అపకీర్తి కలుగుతుందేమో?!"

"అందులో నీకూ భాగం వుంటుందిగా?"

"నాకేం! ఇంతనిర్లక్ష్యం అయితే ఏలా?"

"నీవు నాయింటికి రాణివిగా?"

"నేను రాణినే. అందుకే చెపుతున్నా. తమరు తమఆఫీసు చక్కచేసుకోండి."

"నీవు నాసూపరింటెండెంటు (Superintendent) అని తెలుస్తున్నాను."

నేను కోపగించి వెళ్లిపోయేను. కాని మనసు మనస్సులో ఆనందతరంగాలు పొంగిపొర్లుతున్నాయి. మర్నాడు వారి ఆఫీసుగదిదగ్గరకి వెళ్లేను. గోడమీద బయట —

సావిత్రి, బి. ఎ.

(Savitri. B. A.)

సూపరింటెండెంటు.

(Superintendent)

అనే బోర్డు వ్రేలాడగట్టి ఉంది. దాన్ని లాగి వారిదగ్గఱకి విసరేసి, 'యీ దుండగాలు మాస్తే లోకు లేంవంటారు?' అన్నాను. వారు మందహాసంతో చేతులుచాపేరు. ఆహా సచంద్రికాకిరణజాలాల్లో తల్లీనతచెంది అప్రయత్నంగా వారి కరకమలపాశాల్లో బంధింపబడ్డాను.

౫

సాయంకాలం అయింది. నా విలువదుస్తులు ధరించి 'కొంచెం షికారువెళుదాం రండి' అని పిలిచేను.

వారు ఏదో రచనానిమగ్నులైఉన్నారు. 'ఉత్తమ భావాలు తోస్తున్నై. వాటిని ప్రకటించడానికి శబ్దాలు వెతుకుతున్నాను. ఇది సమయంకాదు. మాట్లాడించకు.' అన్నారు. నాకు విషం తలకెక్కిన ట్లైంది. ఏటి ఎల్లకాలం వారిపనేదో అదేగాని నా బ్రతుక్కి స్వచ్ఛందతలేదా?' అని తోచింది. మొదటి రోజుల్లోకంటే ఇప్పుడు నేనంటే విముఖులయారా? అనిపించింది. 'హృదయం ప్రేమశూన్యమా' అని

సందేహంకలిగింది. ఆ కవితాధోరణి నా కంత రుచిం
చిందికాదు.

"మీ కవితాధోరణే మీదా? ఏమైనా సంసార
సుఖం కావాలా?" అని నిర్మొగమాటంగా
అడిగేశాను.

"కవిత్వంవల్ల ప్రపంచంలో ఆందోళన బయలు
దేరుతుంది."

"నాదృష్టి ఏమైనా ఉందా? లేదా?"

"అది నీమనస్సునే అడుగు."

"నా హృదయాన్నికాదు, మిమ్మల్నే అడుగు
తున్నా. కొంచెం నావైపుతలెత్తి జవాబుయిత్తురూ."

"ఈ రచనచూస్తే నీవు ఉప్పొంగిపోతావు. ఇది
వరలో యిలాంటి రచన ఎప్పుడూ వ్రాయలేదు."

"నా కీవేళ కొంచెం షికారుచేసి వత్తామని కోరిక
కలిగింది. ఈ కవిత్వం నా ఆశని చెడగొట్టేశింది. కాగితం
లాగేసి, సిరాబోర్లింతామా అని ఊహకలుగుతోంది."
అన్నా దీనంగా.

"కాగితం సిరాలకేంగాని ఈభావాలు మళ్లీరావు.
ఈవేళకి నీ వొక్కర్తెవూ వెళ్లివస్తూ!"

"నా మనస్సు అంగీకరించడంలేదు."

వారు చెయ్యిఊపి తిరిగి వ్రాసుకోడం మొదలు
పెట్టేరు. నా హృదయంలో బల్లేలు పొడిచినట్లైంది.
వారికి కవిత్వధ్యానమేగాని నాధోరణేలేదు. పేరు
కోసం చూస్తారుగాని యింట్లో ప్రేమచూడరు.

గదిలోంచి బయటికొచ్చేను. తిరుగుతూతిరుగుతూ
ఒకవంతెనమీదికి వెళ్లేను. మనస్సు బరువైపోయింది.
జగత్తు శూన్యమై కనిపించింది. నా తండ్రిమాటలు
జ్ఞప్తికివచ్చేయి. నా దురదృష్టాన్ని నిందిస్తూ, విచా
రిస్తూ ఎంతసేపు కూర్చున్నానో నాకేమీ బోధపడ
లేదు. నా వివాహానంతరం నా సుఖదుఃఖములను
నాతో పంచుకొనేవారు కవిఅయేరు, కాని నాదుస్థితి
చూచి జాలిపొందేవ్యక్తి ఇప్పుడు నా కొక్కరూ
లేరు. నా జీవననౌక నదిలో కొట్టుకుపోతోందా అని
పించింది. కన్నీళ్లతోనిండిన ఆ నిర్భరదృష్టిభాలా
ల్లొంచే వారు వస్తున్నారేమోనని పదేపదే చూచే
దాన్ని. ప్రేమ ఆశనుత్యజించగలదా?

నాదృష్టి నదివైపుమళ్లింది. ఏదో మంత్రశక్తి
న న్నానదీతరంగాల్లో లాక్కొని పోతోందా అనిపిం
చింది. హఠాత్తుగా నిద్రాదేవి నన్నాదరించింది. నదీ
మాత తన ఒడిని నా కాశ్రయుంయిచ్చింది. నేను నదీ
ప్రవాహంలో కొట్టుకుపోతున్నాను.

* * *

తెలివొచ్చింది. నేను ఇంటిదగ్గిర ఉన్నాను. వారు
ఎదురుగా నిలబడిఉన్నారు. కుర్చీలో డాక్టరుగా
రున్నారు.

"వీరు నా స్నేహితులు. మణిభద్రుడు. నదిలో
దూకి నిన్ను బయటికి తీయకుంటే యీపాటికి నీ
వక్కడదానవో కదా! వీరికి ధన్యవాదాలియ్యి"
అన్నారు వారు.

నెమ్మదిగా లేచి బట్ట సవరించుకొని డాక్టరుగారి
వైపు చూచాను. కాని వారిముఖం చూడలేక
పోయాను. "భగవానుడు మీకు మంగళముచేకూర్చు
గాక" అని కూర్చున్నాను. నా హృదయావేదన
ఎక్కువైంది. వా రక్కడనుంచివెళ్లిపోతే బాగుండేదే
అనిపించింది. వారు లేచి వెళ్లినతర్వాతమాత్రం నా
మనోవ్యాకులత యినుమడించింది. నీటిషికారువెళ్లి
నిప్పు కొనితెచ్చినట్లైంది. ఏంచేసేది ?—

### మణిభద్రుని మాటలు

రాత్రి పన్నెండైంది. కాని నాకు నిద్రేపట్టడం
లేదు. సావిత్రికళ్లు నా చిత్తాన్ని దొంగిలించేయి.
ఆహా! అకంటిశోభ, ఆ చూపులకంటే అధికార్లు
తెగించే సంకెళ్లు సులువు. తేలికగా ఒదిలించుకోవచ్చు.
ఆమె నేత్రాలు మాటిమాటికి నన్నేచూస్తూవుండాలని

కోలేవి. కాని ఆమె కనురెప్పలను లేవనిచ్చిందికాదు. పరాయి పిల్లవాడిచేతిలోనున్న ఆటవస్తువులా నిలిచి పోయేను. ఆమె చూపుపాశాల్లో ఎదురుగా సత్యవంతుడు నిలబడిపోయాడు' కాని లేకుంటే మనసార ప్రేమావలోకనాలు విజృంభించేవే!

మర్నాడు షాపులోకి వెళుతూ ఆమెనుగుమ్మంలో నిలబడిఉండగా చూచేను. సతృష్ణదృష్టులతో ఆమె నన్నుచూచి ఒకనవ్వు నవ్వింది. ఆ చిరునవ్వులో మెరుపుమెరిసింది. నాహృదయం కరిగిపోయింది. షాపులో నా మనసుండబట్టలేదు. ఎప్పుడు సాయంకాలమగునా అని నిరీక్షించేను. నిముషాలు లెక్కిస్తూ కూర్చుంటే సాయింత్రమయింది. షాపుమూసి మెల్లగా యింటికి మళ్లేను. నాకేదో అద్భుతవస్తువు ప్రాప్తిస్తుందని ఉవ్విళ్లూరేను. సత్యవంతుని, గుమ్మందగ్గిర అప్రయత్నంగా నా నడక ఆగిపోయింది. చూపు గుమ్మంలోకిసాగింది. సరిగా ఆమె ద్వారబంధాన్నాని నిలబడింది. నోటివెంట మాట వెలువడలేదు. కాని చూపులుమాత్రం ఆమెహృదయాన్ని విప్పిచూపేయి. ఆ కళ్లల్లోది ప్రేమో మరొకటో ఎరగంగాని ఒక అలౌకిక ప్రతిభమాత్రం తప్పకుండా వెలిగింది. మతిపోయినవాడిలా యింటికిచేరేను.

చాలారోజులు గడిచేయి

దృష్ట్యాస్త్రాలు మరికాస్త పురిపెట్టబడ్డాయి. ఆమెను చూడకుండా మనసుండబట్టలేదు. మంచునీటితో మనుష్యుని దప్పిక తీరుతుందా? ఆశ ముందుకు సాగిపోతోంది విరామంలేకుండా. ఆపత్కాలంలో ఎఱ్ఱజెండా చూపించినట్లు మనస్సు సావధానత పరుస్తోంది. త్రాగిన సారథిలాగు మన్మథుడు నిర్లక్ష్యం ప్రకటిస్తున్నాడు. ఇతని పానీయం మామూలుమత్తు పదార్థం మాత్రంకాదు. ధర్మకర్మకుసుమాల్ని అగ్నిహోత్రాహుతిచేసే భీతాహంఅనే దేవతనోట్లో పడిలేస్తుందీపానీయం. దీన్నే విషయవాసనామత్తంటారు.

ఒకనాఁడు చాలారాత్రి అయి వారింటికి వెళ్లేను. ఏదో గొప్పకష్టం కలిగినట్లు మనస్సు వ్యాకులత చెందుతోంది. కార్యక్రమంఅంతా పూర్తైంది. గుమ్మంలో సావిత్రి నిలబడిఉంది.

"ఈవేళ చాలా ఆలస్యమైందే?" అందామె. ధ్వని భిన్నించి గద్గదావస్థను పొందింది. నాహృదయం కలిగిపోయింది. శరీరమంతా చెమటలు కమ్మేయి. నా విద్యార్థి అవస్థలో వందలకొలదీ శవాలనికోశేను. అప్పుడేనా నాకేలా ఉండేదికాదు. ప్రతి అవయవం వణకసాగింది. కొంచెం స్థాయిపడి —

"ఔనండీ! ఓ పేషెంటు (Patient) ను చూడ్డానికి వెళ్లేను. మీరిక్కడే నిలబడ్డారేల? ఎవరికోసం?"

"వారింకా యింటికిరాలేదు. అందుకేచూస్తున్నా వస్తున్నారేమో అని."

"ఎక్కడేనా కవిసమ్మేళనం జరుగుతోందా?"

"అబ్బే, కవీలేదు సమ్మేళనంలేదు. ఎక్కడో ఉత్సవంలో వారి నూతనరచనలన్నీ వినిపించాలట"—

"అలాగైతే పన్నెండుగంటలైతేనేగాని రారేమో?"

దీర్ఘనిశ్వాసాన్ని వదలి చిరునవ్వుతో నాకేసి చూస్తూ—

"ఇంట్లో నాకేంతోచడంలేదు." అంది.

"ఇప్పుడు ఎనిమిదేగా! అవుతా!"

"గడియారపుముల్లు తిప్పేదామా అనిపిస్తోంది."

నాకాళ్లాడడంలేదు. ఏదో క్రొత్తనాటకం జరుగుతూన్నట్లైంది. ఎవరైనా చూస్తారేమోఅని సాగవలసి వచ్చింది. ధర్మభీతి ఉన్నా లేకపోయినా లోకభీతి తప్పకుండా ఉంటుందిమాకు. 'ఏం! ఇంకాతెలిసికోలేదా నీవు' అన్నట్టుగా చూసింది సావిత్రి. విధిలేక మెల్లిగా యింటికిజేరేను. సావిత్రి విగ్రహమేనా

కళ్లముందు ప్రతిఫలిస్తోంది. ఆమె మధురవాక్కులు నా చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. నేనామెని మరచిపోవాలని యత్నించే ఈ కార్యంలో నేను నిందాపాత్రుణ్ణి అవుతానని భయం వేసింది. నాకేసి వేలు మడుస్తారనే దుడుకు కలిగింది. లోకులు నన్ను ఉత్తముడని వ్యవహరిస్తున్నారు. ఈ నానడత నా సర్వనాశనకరమని నాకు తట్టింది. లోకులు నిర్విణ్ణులౌతారు. ఇంతదుర్మార్గు డుండబోడంటారు. ఆమె వివాహిత ఆమెకై చేచాచుట అనుచితం. కాని ఏంచేసేది? ఈ ఉక్తులు, ఈ ఆలోచనలూ జలతరంగాలయిపోయాయి. ఎంత వేగంగా ఎంత ఉన్నతంగా తరంగం వేస్తుందో అంతత్వరలో అంతకంటే లోతుగా పతనమౌతుంది. ఒక చిన్న వాయుప్రసారణ వాటిని రూపుమాపుతుంది. మానవు డెంతటిబలహీనుఁడు! ఎంత అస్వతంత్రుఁడు!

మలిరోజున నేను సత్యవంతుని భవనంలో ప్రవేసించేను. కాని నాకాలు ఊని అడుగుపడుటలేదు' దొంగతనానికి ఇంట్లో ప్రవేసించబోయే కన్నగాడిలా తటపటాయించేను. ముందొకంజ వెనుకకు రెండంజలుగా ఊగులాడేను. చొఱవచేసి లోపల ప్రవేసించేను.

అతఁడు నన్ను చూడగానే ఆదరించి సత్కరించేడు. చాలాసేపు సంభాషణ నడిచింది. సావిత్రికూడా సమీపంలోనే కూర్చుంది. నాదృష్టి ఆమెముఖవర్చస్సుతో ముద్దులాడుతోంది. మొదట దొంగతనం, తరువాత కన్నగాడితనం, పిమ్మట దోపిడి. ఈలా మారింది కథ. ఆమెకూడా సిగ్గువదలి మాటిమాటికి నవ్వసాగించింది. ఇప్పుడామెకు నాకేసి చూడడంలో సంకోచంలేదు. చపలత్వం లజ్జాస్థానాన్ని ఆక్రమించింది. ఇంద్రత్వం లభించినట్టుగా సంతోషిస్తూ యింటికివెళ్లిపోయేను. కాని బాహ్యప్రపంచం అంతా శూన్యంగా కనబడింది. అక్కడనుంచి రోజూ రాత్రులు రెండుగంటలు ఆమెతో కూర్చుని మాట్లాడుతూ ఉండేవాణ్ణి.

క్రమంగా మనస్సు లోకటయాయి పాపం! సత్యవంతు డింతేనా ఎరగఁడు. కల్పనా సముద్రంలోంచి ఆలోచనా ముత్యాలని బయటికితీసే ఆకవి, —'కలిగానని చోరవిగాన నేర్చునే, అనే ఆదూరదర్శికుడగు ఆ కవి; — విద్వత్శిరోమణి అనబడే ఆకవి—నేడు ప్రత్యక్షంగా—తనకెదురుగా జరిగే ఘోరసంగ్రామతుములరంగాన్ని — యీ నటనా సూత్రధారుని విదూషక ఘట్టాన్ని — చూడలేకపోతున్నాడు. అతనికవిత్వం జడపదార్థాల్ని సైతం తాడనం ఆడిస్తుంది. కానీ తానింకా నిద్రావస్థలోనే ఉన్నాడు. ఈ అజ్ఞానసంసార పారావారయాత్రీకుడు ప్రకృతిసౌందర్య ముగ్ధుడై కులుకుతున్నాడు, గాని, తన నావ చట్రాతికి ఢీకొంటోందని తెలియజాలకపోయాడు. అతడు తన పతనానికి తానే హేతువైనాఁడు.

## సావిత్రి మాటలు

ఎంతేనా అంతరువుంది. మణిభద్రుడెక్కడ? వీరెక్కడ? ఆ విశాలనేత్రాలు జ్యోతిర్మయ తారకలు. అదేమోగాని మణిభద్రునిచూడకుండా క్షణమేనా నాకు ఉండబట్టడంలేదు. అయస్కాంతాన్ని చేరే యినుములా అయిపోయింది నా మనసు. మాటలు మాణిక్యాలమూటలు. హృదయం విప్పి మాట్లాడే స్వభావం. వారు లేనప్పుడు ఇల్లువిడచి మణిభద్రుని గదిలో వాలు వామా అనిపించేది. మా జీవితపథంలో క్రొత్తవిధానం ఏర్పడిందని ఆడావాడ విస్తరించి పోయింది. నన్నుచూస్తే వింతహాస్యాలతో వాడ స్త్రీలంతా గుసగుసలాడేవారు. కవిగారుమాత్రం మూర్ఖులా? అయితే వారు నిర్లక్ష్యంగా ప్రవర్తించేవారు. తెలియని వారుమాత్రం కారు. చేతులునలుపుతూ పశ్చాత్తాపపడుతూ ఉన్నట్లుగా నాకు తెలును. ఇల్లువాకిలి అక్కరలేకుండా సంసారం నెట్టుతూన్నారని విశదంఅయింది. రాత్రులు నిద్రలేదు. పగలు ఆహారం లేదు. ముఖంకళకాంతులు లేకుండా వన్నెతరిగింది.

ఒక్కొక్కనాడు స్నానంకూడా మరచిఉండేవారు. నాకూ వారంటే ఇప్పుడంత శ్రద్ధలేదు. నిశ్చింతగా ప్రతివిషయం వదిలేసి కూర్చుంటున్నాను. వారి ఉదాసీనభావంచూస్తే 'చెఱపకురా చెడేవు. చేసుకున్న వారికి చేసుకున్నంత' ఈలాంటి లోకోక్తులు తలంపుకు వచ్చేవి. ఒకనాడు ప్రయాగ మాసికపత్రికలో వారిపద్యమాల ప్రకటింపబడింది. దాని మొదటి పదం యిది—

కోరనివారిని గూడజూచెదవు,
కొఱతతీరునే మనసా

ఇందులో వారి అనుభవచిత్రణమే వర్ణింపబడి ఉంది. నాకు అరికాలుమంట నెత్తికెక్కింది. తిన్నగా వారిదగ్గరకి వెళ్లి—'ఇదేంకవిత్వం?' అని యీసడింపుగా ప్రశ్నించేను. వారు నావైపు చూసేరు. ఆ చూపులు ద్రవీభూతమైనాయి. దానినికూడా కరిగించే మార్దవం ఒలుకుతోంది. మెల్లగా 'ఏఁవిటీ?' అన్నారు.

"ఇది చదివి లోకులు ఏఁవంటారు?"

"కవి తానుచూచిందీ, అనుభవించిందీ, వ్రాసి పారేస్తాడు. నాతప్పేముంది?"

"..........మీరేంచూశేరు?—"

"సావిత్రీ నన్ను వాగించకు, నీకొంగుచాటు ముఖముంచుకొని సింహావలోకనంచెయ్యి. వాదగ్గిర ఏదీ దాగలేదు."

"ఎందుకునన్ను నిందించడం?"

"నిందే అయితే ఈపనికంటే నూరురెట్లు మెఱుగు."

"అయితే నన్ననుమానిస్తున్నారన్నమాట"

"అనుమానమైతే ఏడ్చేందుకు? ఇప్పుడు పూర్తిగా విశ్వాసమే కలిగింది. చెవులుమోసపోలే కళ్లు గుడ్డివి కాలేదు. నాఇల్లు—ఈలా రాజసత్రం అవుతుందని కల్లోకూడా అనుకోలేదు."

నేను నిలువునా నీరైపోయాను దురాచారాలకి నిర్లజ్జత పురోగామి అయింది. విసుగుదలతో 'మీరు పద్యాలు వ్రాయండీ ఇతరులగతి ఏమైతే మీకేం?'

"చేజేతా మృత్యువునుకోరి తెచ్చుకోకు. నేను నిజంగా పిచ్చివాణ్ణైపోయాను." అని గర్జించేరు.

"అయితే! చంపుతారా?—కానివ్వండీ! మీ మనోవాంఛ తీరుతుంది."

సింహం వేటాడబోయే హరిణాన్నిచూచేట్టుగా నన్నుచూచి అలమరావైపు పరుగెత్తేరు. నాగుండె కొట్టుకోసాగింది. నేను బయటికి పారిపోయివచ్చేను. వారు నన్ను వెంటాడిస్తారేమో అని భయంవేసింది. మైదానంలోవచ్చి నిలబడ్డాను. నామనస్సు వికసించింది. మృత్యువును నిరీక్షిస్తున్నాను. కాని వారు బయటికి రాలేదు. మరికొంతసేపటికి 'ఢాం' అనే శబ్దం గుండెలు బ్రద్దలుచేసింది. లోపలికి పరుగెత్తి చూసేను. వారు క్రిందపడి కొట్టుకుంటున్నారు. మరణావస్థలో ఉన్నారు. భయపడిపోయేను. కాని నాకింతేనా విచారం కలుగలేదు. అయితే! ఏ పోలీసుల అధీనమేనాఅయి వ్యవహారాల్లో మునిగిపోనుకదా! అనే భయం నన్ను బాధించింది.

రెండుమాసాలు గడిచేయి.

మణిభద్రునికోసం నెక్‌టై (Neck—tie) కుడుతూ కూర్చున్నాను. లోకాచారాల్ని లెక్కపెట్టకుండా అతనితో వివాహంచేసుకుందామనే సంకల్పంతో ఉన్నాను. లోకులు ఈ నా అభిప్రాయానికి చకితులైపోయారు. ఏమైతేనేం. వారు గతించినందుకు చాలా సంతసిస్తూ కూర్చున్నాను. నా జీవితానందం ఇప్పుడు కలుగుతుందికదా అని గాలిమేడలు కడుతున్నాను. నౌకరు టపాతెచ్చి ముందుబెట్టేడు.

అందులో ముందుగా ఒక పేకట్టు నన్నాకర్షించింది. విప్పిచూచేను. అది నా మృతపతిరచనా సంగ్రహం. అందులో ఒకటిరెండు భాగాలు చదివేను. హృదయావేదన ఎక్కువైంది. ఆభావాలు ఉన్నతాలు పవిత్రతమాలు, సంసారమాలిన్య రహితాలు. వీటిలో కపటంలేదు వంచనలేదు. ఇందులో ఆముష్మికసుఖం, శాన్తి కొల్లలు కొల్లలుగా ద్రవిస్తున్నాయి. నాకన్నీరు ధారలుగా ప్రవహిస్తోంది. ఆకస్మికంగా మూడవపేజీ మీదకి నాదృష్టి దొర్లింది. ఇది అంకింతం యివ్వబడ్డ పేజీ, నాగుండె రాయిఅయిపోయింది. రక్తప్రసారణ ఆగిపోయే కూడాఉంటుంది. అది నాకే అంకితం ఇవ్వబడిఉంది. ప్రతిపదమూ ప్రేమామృతం వర్షిస్తూవుంది. ఆ ప్రేమకే మణిభద్రుని ప్రేమకూ పోలికేలేదు. హస్తిమశకాంతరం. అది అమృతకిరణస్పర్శ; ఇది దవానలస్పర్శ; అది పారావార గంభీరం; ఇది పర్వతోపత్యక స్రవితశీఘ్రగామి ఐన ఝరి; అది సత్యసూక్తి కాని శబ్దరహితం; ఇది అనృతవాదం కాని మేఘ గంభీరఘోషణ.

నాకళ్లకి కప్పినపొర అకస్మాత్తుగా విడిపోయింది. సతీత్వమనే ఉన్నతస్థానాన్నుంచిఏపాతాళలోకంలోకి పడిపోతున్నానో నాకు గోచరించింది. పుస్తకం కళ్లని అద్దుకుని విచారించేను.

ఇంతలో మణిభద్రుడు లోపలికివచ్చేరు. భావి కళ్యాణానంద కల్పనలో మొఖం ఎర్రబారింది. ఆయన చేతులో అమూల్యదామం ప్రకాశిస్తోంది. అది నాకోసం బొంబాయినుంచి తెప్పించేరు. నాఏడ్పు, విన్నతనంచూచి నిలువునా నీరైపోయి—

"ఏడుస్తున్నావేఁ?" అని అడిగేరు.

"ఇప్పుడు నాకళ్లు తెలిచేయి."

"ఇదిగోహారం. రేపు వివాహం!"

"ఇప్పుడిక వివాహం కాజాలదు."

"సావిత్రీ! పిచ్చిదానవైపోతూవున్నావా?"

"పరమాత్ముడు నన్ని పిచ్చిలోనే సర్వదా ఉంచుగాక!"

మణిభద్రుఁడు ముందుకుసాగి నన్ను స్పృశించబోయారు. నేనులేచి వెనక్కివెళ్లిపోయాను. దూరంగా ద్వారముకేసి వేలుచూపుతూ—'అటుపో! ముందుకి ఒక అడుగేనా పెట్ట వీలులేదు' అన్నాను.

ఆరాత్రి నాకు సుఖనిద్ర కలిగింది. ఆలాటినిద్ర నాజన్మకాలంలో ఇదివర కెన్నడూ నేను అనుభవించి ఉండలేదు. నేను నాభర్తని తృణీకరించ కలిగెను. కాని వారిప్రేమను కాదనడానికి నాశక్తికి మీరిన కార్యం అయింది. మానవుడు నశ్వరశరీరుడా? మానవుడు మరణించినా ప్రేమమాత్రం అమరత్వసిద్ధినే పొందుతుంది.

(శ్రీమాన్ సుదర్శనకవిగారి కథకు స్వేచ్ఛావాదము)

స్త్రీప్రేమచే సుశిక్షితుడుగాక యామె ధైర్యముచే బలవంతుడుగాక, యామె వివేకముచే నుపదేశికుడుగాక యే పురుషుడును సక్రమజీవితమును గడిపి యుండలేదు.

'రస్కిన్' —

# స్వర్గీయ మరుపూరు వేంకటసుబ్బమ్మ స్మృతి

శ్రీమతి ప్రో. లక్ష్మీబాయిగారు

చేతులార ! కన్నీళ్ల నీ 'స్మృతి' లిఖింప
నిర్ణయించితివా తండ్రి ! నేడు పిడుగు
పాటుగా గుండెలొక్కట ప్రయ్యఁజేసి
'కాలధర్మ'మటని మెల్లగా వచింతె ?

పరమ సౌజన్యగుణ, పతిప్రాణ, ప్రేమ
హృదయ, కనకమాత్రైకపుత్రిక, సుశీల
పతి మనము తల్లిగర్భంబు వగుల బంధు
లాప్తు లడల వేంకటసుబ్బ మవని విడెనె !

అకట ! నిండెనె నూరేడులమ్మ ! ఇర్వ
దారు ఏండ్లకే ! నీపయినంత యింత
లాసలను పెట్టుకొనుచు గన్నారచూసి
మురియునమ్మకు నేమి ప్రబోధ మింక ?

మంగళాశీస్సులియ్య నుప్పొంగు మదుల
శాంతి వాక్యాలు వెడల నీశ్వరుఁడొనర్చె
ప్రేమనిండార నాటిన పిన్నమొలక
పెరిగి పుష్పించి ఫలియించు వేళ ద్రుంచి.

అమలపౌణకాన్వయమున జన్మమయి వాసిఁ
దనరు మరుపూరుయింటఁ, బాదమ్ము వెట్టు
శ్రీవెలయ పిచ్చిరెడ్డి గూరిమివరించి
వన్నెకెక్కితి జీవించి నన్నినాళ్లు.

ఎల్లవారల యాశలు పల్లవించు
తరుణకాలాన విద్యుల్లతగతి మెరసి

## గృహలక్ష్మి

కనులు హృదయాలు కారుచీకటులు చేసి
అట్టె మటుమాయమైతె! దవాగ్నిఁ ద్రోసి.

పరినిఁగన్నఁ బ్రేమ 'వసుధైవకుటుంబక'మన్న సూక్తి కెం
పారఁగఁజూచు మాత పరమార్థము కయ్యదియే ఫలంబుగా,
దీరిచినాఁడవే! హతవిధీ! సుగుణాలయ సుబ్బమాంబ నౌ
రౌర! ఇదే ఘనంబుగను న్యాయముగా మది నీకుఁదోఁచెనే?

కడుపెడు బిడ్డలంగనినఁగాని యొకళ్లెడఁబాయ ఘోరమైఁ
దొడరెడు గర్భశోకమది దుస్తర మొక్కతె గూర్మిబిడ్డ హా!
కడుపున చుమ్మచుట్టలయి గాల్చు నొకంతన చిచ్చుతల్లిరో!
నుడువఁగ రాని; దేమని మనోధృతి నిచ్చెదమమ్మ నీ కికన్!

ఆయువు నిచ్చియున్నఁ బరమాత్ముఁడు అమ్మకుఁ దగ్గ బిడ్డపైఁ
జేయిమె నాఁగనన్నిఁటఁ బ్రసిద్ధివహించెద గాని దైవ మీ
డాయెను సావకాశ మొకయంతన విచ్చెడు లేగులాబి నా
ప్యాయముతోడఁ ద్రుంచెను బ్రమత్తుడు! గ్రూరతయో! పరీక్షయో?

'కనకమగారి బిడ్డ'యను గౌరవమొక్కటి దక్కెనన్ మహా
ఘనమని తల్లిచాయ నతిగౌరవ కీర్తుల నందితమ్మ! నీ
గౌనములు కండ్లఁగట్టినటు, గొల్పువువిస్మృతి మాకె; తల్లి కే
మని యుపచారసూక్తులనుఁ నాడఁగజాలుదు మింక సోదరీ?

అకట! యెట్టి యుదారాశయములు కలవు!
బిడ్డకని మోన్న నమ్మ తపించి వగల
నీ కథల, వ్యాసములఁ దీయుదాక నెరుఁగ
మమ్మరో! నిగూఢమైన నీ యాత్మవృత్తి.
అతులితశ్రీనిఁ దులతూగు నప్పుడెట్టి
సౌమ్యగుణశీల మట్టి సౌజన్యకలన
ఉన్నభూషణముల యూడ్చి మొన్న శ్రీ మ
హాత్ముకైంకర్య మొనరించునపుడు దెలిసె.

## స్వర్గీయ మరుపూరు వేంకటసుబ్బమ్మ స్మృతి

ధన్యవు ! స్వీయసేవ, కృషి, త్యాగముఁ జేర్కొన నొల్లనట్టి స
న్మాన్యవు ! పేర్ప్రతిష్ఠ లిసుమంతయుఁ నెమ్మదిఁగోర నట్టి సౌ
జన్యవు ! తల్లికిందగు యశస్విని వయ్యెదవంచు, బొంగు మా
కన్యములయ్యెనే తలపులన్నియు నీక్రియ సోదరీమణీ !!

చింతిలనేటికమ్మ ! మృతిచెందితివంచు వివేకమేది యు
ద్భ్రాంతము నిత్యమెయ్యది ధరాస్థలి విభ్రమ మొందగాక; ధీ
మంతులు యాత్మసత్యమని బల్కుదురింక శరీరమందు మా
భ్రాంతివిసర్జనీయమగు వస్త్రముకై వడి సోదరీమణీ !

ధాతకునేనియున్ విధినిదాటనశక్యము పూర్వకర్మసం
జాతములంద్రుగా భవవినాశము లార్యులు; దూరనేల నా
చేతము తృప్తిపొంద హరిసేవయొనర్తు త్వదాత్మశాంతికై
నీ తలపుల్ ప్రశాంతమయి నిల్చుత నీశ్వరునందె సోదరీ !

న్యాయమనుచు నిట్లొనర్చిన యీశుండె
నింత మమ్మమదిని నిలిచి చిత్త
శాంతి గూర్చుగాత 'సత్యము, శివము సుం
దరము' నగుత నీ సదాత్మ తల్లి !!

భాషిభాంతభాగ్యసంభావనీయ
ధన్యగుణశీలవతులైన తరుణులందు
నీ నిరస్తసేవాత్యాగ నిర్మలాత్మ
నిరుపమానంతకీర్తుల నెగడుఁగాత !!

ఓం శాంతిః

---

వ్యాసకర్తలకు.

మాకు పంపెడి రచనలప్రతు లితరపత్రికలకు ప్రకటనార్థమై పంపకుందురుగాకయని ప్రార్థన; అట్లుపంపిన మాకుముందే తెలియజేయవలయును. లేకున్న ఆ వ్యాసములు ప్రకటింప బడవు.

సంపాదకులు

# అర్ధాంగి

శ్రీ మునగపాటి చినహనుమయ్యగారు

"ఏమండీ, మీరువెళ్ళే ప్రతిచోటికీ నాకు చెప్పే వెడుతున్నారుటండీ; ఏదో పనితొందర్లో, యీ రోజు మా మీటింగనీ, నేను వెడతాననీ, మీతో చెప్పడం మరచిపోయాను. ఈ భాగ్యానికి మీకింత కోపమెందుకూ?"

"కోపమేమీ లేదుగాని యీరోజుల్లో ఆడవాళ్లు స్వతంత్రురాండ్లు కావాలనీ, మగవాళ్లమాటకు లోబడుండకూడదనీ, మాతోబాటు సమానముగ అన్ని విధాలా మనాలెననీ కోరుతున్నారు - కాదు కాదు - ప్రయత్నంగూడ చేస్తున్నారు."

"అయితే మీకంత అయిష్టమెందుకండీ; మరీ, మీరిన్ని శాస్త్రాలూ, పురాణాలూ — ఇంకా యేమిటమ్మా — శ్రుతులూ, స్మృతులూ, యింకా యేమిటో గ్రంథాలూ చదివారుగదా; వాటిలో, భర్తకు భార్య అర్ధాంగి అని రాసుందా? లేదా? మీరే చెప్పండీ!"

"ఉన్నదనుకో; ఉంటే?"

"మరి అట్లావున్నప్పుడూ, పురుషుని కర్ధశరీరమైన స్త్రీకీ, పురుషుడితో సమానమైన సౌఖ్య, స్వేచ్ఛా, స్వతంత్రం, అధికారం — మరీ, హక్కూ, గౌరవం ఇవన్నీ వుండొద్దండీ? స్త్రీకి సమస్తసుఖదుఃఖాల్లో పాలుపొందే యోగ్యతుందంటారా? లేదంటారా?"

"ఉన్నదిగాని ఆ శాస్త్రాల్లోనే పురుషదేహంలో స్త్రీ ఎడమపార్శ్వమనిగూడ వ్రాశారన్న సంగతి నీకు తెలుసునుగా"

"అవును తెలుసునూ; అయితే ఎడమపార్శ్వం కుడిపార్శ్వంకంటే తక్కువ యోగ్యతకలదనా మీ అభిప్రాయం?"

"అట్లాఅనే లోకం వ్యవహరిస్తున్నది."

"లోకవ్యవహారంలో ఎన్నెన్నో లోపాలున్నాయి; స్త్రీపురుషుడికంటే తక్కువనడం ఎట్లా నిరాధారమో, అట్లాగే కుడిఎడమభాగాలకు హెచ్చుతక్కువలు కల్పించడంలోగూడ తగినకారణాలేమీ లేవు."

"ఏమీలేవూ! మనం ప్రత్యక్షంగానే చూస్తున్నాంగా — కుడిపార్శ్వంవలె ఎడమపార్శ్వం పనిపాటల కుపయోగపడుతుందా? అనుపయోగమయిన దాని కర్హతమాత్రం సమానంగా యెట్లావుంటుందీ?"

"ఈమాట నేనొప్పుకోనండీ, ఎడమభాగాన్నయినా చిన్నప్పటినుండీ కుడిభాగంవలె పనులకు అలవాటుచేస్తే కుడిభాగంవల్లయ్యే పనులన్నీ ఎడమభాగంమాత్రం చేయలేదటండీ మీరిట్లాఅంటారుగాని; ఎంతమందిని మనంచూడటంలేదూ ఎడంచేతి అలవాటుగలవాళ్లనీ; పోనీ, కుడిపార్శ్వమే పనులన్నీ చేస్తుందనుకోండి, చేస్తేమాత్రం ఎడమపార్శ్వంయొక్క సహాయంతో చేస్తున్నదంటారా?

.....................................

ఏదీ చూతాం, కొంచం నడవండీ ఎడమభాగం సహాయంలేకుండా; ఎంతదూరం, ఏంతహాయిగా, ఎంత చక్కగా నడుస్తారో తెలుస్తుంది.

ఏదీ కుడిభాగంతోనే ఒక్కమాట మాట్లాడండీ మీచేతయితేనూ,

అయినా, కుడికంటితో ఒక్కదానితోనే చూడండీ ఎట్లాచూస్తారో,

.......................

# గృహలక్ష్మి

పోనీ ఎడమభాగాన్ని ఆమూలాగ్రంగా మరుగు పరచి, కుడిభాగంమాత్రమే మీ రూపమనుకొని, అద్దంలో చూచుకొండి, ఎంతందంగా వుటారో ప్రత్యక్షంగానే చూచుకోవచ్చునుగా.”

“ఆఁ నీపరిహాసాలకేంగానీ, కుడిఎడమపార్శ్వాలు రెండూ ఎవరికధీనమై, ఎవరిఆజ్ఞకులోబడి ప్రవర్తిస్తున్నయో గమనించావా మరి?”

“ఎవరికధీనమై లోబడి ప్రవర్తిస్తున్నవని అంటారూ?”

“అట్లా అడుగు చెబుతాను. శరీరమంతటికీ కర్తా, అధికారీఅయిన ఆత్మకువశమై, లొంగి, నడుచుకుంటున్నవి. తెలిసిందా?”

“ఓహో మీరుచెప్పేదియిదా, పురుషపార్శ్వం, స్త్రీపార్శ్వం రెండున్నూ పురుషుడైన ఆత్మకు లోబడున్నవి కనుక పురుషుడి అధికారానికి స్త్రీ గూడ లొంగిఉండాలెనని, ఇంతేనా మీవాదం?”

“అంతే”

“పోనీ అట్లేఅయినా స్త్రీ పురుషపార్శ్వాలు రెండూ ఆత్మకు సమానంగానే లోబడున్నాయి గదండీ, మరి పురుషుడి కాధిక్యమెట్లా కలిగిందీ అంటాను. ‘అధికారిఅయిన ఆత్మ పురుషుడుగదా’ అంటారుమీరు; ఆత్మనుగూర్చి ‘స్త్రీపున్నపుంసమూర్తియనుగాక’ అన్నారేమకీ; ఆత్మను పురుషుడని ఎట్లా నిర్ధారణచేస్తారండీ”

“సరే, ఆత్మపురుషుడూకాదు, స్త్రీ కాదు, మరేమీకాదు. అయితే నీవేమంటావూ?”

“ఏమంటానా? పురుషుడితోబాటు స్త్రీగూడ అన్నివిధాలా స్వతంత్రురాలై సర్వసౌకర్యాలు కలిగుంటే—పురుషుడు స్త్రీ అభివృద్ధికి ఏవిధంగానూ అడ్డుతగులకుండాఉంటే—స్త్రీగూడ పురుషుడివలెనే సర్వతోముఖంగా వికసిస్తుందనీ, దానితో ఉభయులకు సంసారంలో సౌఖ్యానందాలు పూర్ణంగా లభిస్తవనీ, వాళ్లిల్లు భూలోకస్వర్గమవుతుందనీ—”

“అయితే నీ స్వాతంత్ర్యానికి నే నడ్డంరానుగాని పూర్ణంగా వికసించి ‘భూలోకస్వర్గం’ ఎట్లావుంటుందో రుజువుచూపించుమరి”

“సరే బాగానేవుంది, సంఘానికీ, మీకూ యింత కాలం బానిసనై మన్న నేను, నీటిబెంగగొని యిగిరిపోయిన చెట్టువలె తయారయిన నేను, ఇప్పుడు పూర్ణవికాస పొందటాని కవకాశమెక్కడుంది? కాని మీరంతధర్మాత్ములై, మీకంతఅనుగ్రహంకలిగితే మన బిడ్డలను పూర్ణవికాసవంతులయ్యేటట్లు పెంచుదామని నా ఆశ.”

“నీ ఆశతీర్చుకోవచ్చునుగాని ముందు నా కాకలౌతుంది, భోజనంపెట్టు, నీకు పుణ్యముటుంది”

“సరే, రండి, వడ్డిస్తాను”

## గులాబి

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

గుబురుమ్రాకుల రేల్గొన్న కొండకోన
సంజకెంజాయ దీప్తి నైసర్గశోభ
నొక్క తెగులాబిపూవు చుక్కవోలె
కనులకింపయి హృదయమ్ముఁ గలచె నపుర!
ప్రకృతిసాజమా సౌందర్యరాగమెవరి
ముగ్ధ మొనరింపనేరదు ముదమునించి

ధ్యంచు పురిగొను యూహల నరయుచుంటి
నంత;—దృష్ట్యనరోధ మనంతతమము
దిగ్దిగంతరాళమ్ముల దిగుచు కెరలి
ఆ మనోహర కుసుమమ్ము నావరించి
కందళించిన యానంద కళిక లడఁచె
దుర్విదగ్ధుల కెటులుండు నుర్విసుఖము.



# మనోరమ

తదుత్తరక్షణమున నంత దేజోవంతముగ నున్న ఆ గుడారమునుండి మిగులకళాహీనమై యున్న ఆరబయటకు ప్రాలి ఏటియందు గొట్టికొని పోవుచున్న నా మనోహారిణిని కనుంగొంటిని. ఆమె నట్లుపలక్షించుటయే తడవుగ నా యాఁదువేసముతోడనే ఆమహాస్రవంతి యందొక్క దుముకుదుమికి ఆమె దెస కీఁదుకొనుచుం బోయితిని. మొగ్గఁదొడిగి యుండుకొమ్మ సుడినీటియందు దిరుగుచు వడునట్లు అట్లు భయంకరముగం బడియున్న ఆతావునందే ఆరాజకుమారి చేలాంచలము నీటి విసురునం దిరిగి పోవుచుండగం జూచి యావైపునకుం బోవ నెంతో ప్రయత్నించితిని. ఆప్రవాహవేగమునం గొంత విఫలప్రయత్నుండనై తుదకు నా సమావచ్ఛక్తియు వినియోగించి నామనోహారిణిని పట్టుకొంటిని. మానవలోకమునందలి ఒకయర్ధభాగమునకు మూర్తీభవించియున్న మహోద్యమభారమగు నా మనోహారిణి నొకచేతం బట్టి, ఒకచేత నాయేటి విసురు నడ్డికొనుచుం దీరమునుచేరం బ్రయత్నించితిని కాని విఫలప్రయత్నుండనై ఆయేటివేగమునం దీరము బట్టుకొనంజాలక ఆయేటి యుపరిభాగమునం గొట్టికొనిపోవం జొచ్చితిని.

అక్కడ నెప్పుడో పెనుగాలిచేత వ్రేళ్లూడియు నేటంబడి సగము యేటిపై ప్రాలి యున్న మహావృక్షమొకటి యుండుటం గనుంగొంటిని. ఆరాజకుమారి నెట్లో దేలించుకొనుచునే నావృక్షమును బట్టికొని దానిశాఖలను బట్టి తుదకు తీరమును చేరుకొంటిని.

అంతలో నా రాజకుమారియొక్క బలగమంతయు నచ్చట గుమిగూడి నాహస్తముల నున్న ఆమనోజ్ఞభారము నందికొనిరి.

“ప్రాణములున్నవి—జీవించును—బ్రదికిపోతిమి” అని వారొండొరుల హెచ్చరించుకొని

ఆమెను చేతులలో ధరించి వారక్కడి గుడారమునకు దీసికొనిపోయిరి కాని నా పురుషత్వమును బట్టించుకొని నేను వారి వెనుకం బోవంజాలక పోతిని. మఱియు నా రాజకుమారి తేరుకొనునప్పుడామె కన్నుల దెఱచినయెడల నామెయెదుటం జఱింపకుండ నిలువంగలధైర్యము నాహృదయమున లేకపోయెను.

నా మిత్రులగు కృష్ణవర్మయుం బార్థసారధియు నేసుయికోకాని యెంత వెదకినను నాకుం గానరాలేదు. ఆక్షొగ్గుల్ల మాయేటం జచ్చుటచేత నేను సోగుల్లమామెకు వదలి వేయుదమని సరిపెట్టుకొని పాదచారినయి యెట్టకేల కాకన్యా విద్యాలయోద్యాన బహిఃద్వారమునుం జేరుకొంటిని.

ఆద్వారమునంగల లోకచిత్రముగను భౌతికశాస్త్రము లోకచిత్రముగను ద్వారపాలుర వలె నిలిచియుండంగ నుపరిభాగమున సాహసించి స్వర్గారోహణ మొనర్పంబోయి దల

క్రిందుగ నధఃపతితుండై వ్రాలి యాక్రోశించుచున్న త్రిశంకునియాకారము వాలఁ దొలువఁబడియుండెను. ఆద్వారము సంవృతమయి యుండుటచేతనే నచ్చటి యినుపకంబముల నెక్కి బాణముల మొనలవలెనున్న యూఁచలను జాగ్రత్తగఁబట్టికొని కొంతకష్టమున లోనఁ బ్రవేశింపఁ గల్గితిని.

అక్కడ మిగుల నయోమయముగ నా హృదయమునఁ గొట్టికొనియున్న యూహలతో ఆ చంద్రికాప్రసారమును, ఆచుక్కలను, దూరమున మిణుక్కురను మిణుగురు బుర్వులనుగూర్చి యూహించుకొనుచు నడయాడఁజొచ్చితిని. సప్తర్షిమండల మాకాశమున నొకవలయాకారమునఁ దిరిగిపోవుచుండగ నట్లాందోళితుఁడనయి ఆయుద్యానమునఁ దిరుగఁజొచ్చితిని.

అంతలో నెవ్వరో మెల్లగా నడచుచు నావంకకు వచ్చుచున్నట్లగుపించెను. మొదట "ఇది యామెయైనయెడల—" అని నాహృదయమున గొంత కలతపుట్టెను. కాని అంతలో నా వచ్చుచున్నది నామిత్రుడు పార్థసారథియేయని తెలిసికొంటిని.

నన్నుఁ గలిసికొనుటయే తడవుగ మిగుల నాందోళనమున

"వినరుగా! వినరుగా! వారు మనల వెదకికొనుచున్నారు! మఱియుఁ "గ్రొత్తవాండ్ర పట్టుకొనుఁడు ఎక్కడనున్నారు?" అని మనలఁబట్టుకొనుట కారాజకుమారి యుత్తరువొసంగెను. ఇంత రాత్రి మనమెక్కడ నడయాడుచున్నను నిముసములో దొరకిపోవుదుము. నడికిరేయి యంద్రిట్లు తిరుగుచుండుట ఈ మహిళామహావిద్యాలయపుఁ జట్టములకు విరుద్ధమంట!—దానికేమిగాని మీరెట్లు వచ్చిరి?" అని పలికెను. నేనచ్చటి కెట్లువచ్చితినో తెలిసికొనిన తరువాత నతఁడిట్లు చెప్పెను.

"క్షుద్వ్యాధిబాధితాంగులయిన దుఃఖజీవులు తమ్మెంత నీతిబాహ్యులుగఁ దలపోసికొనుచు సంతాపింతురో అంతకన్న నన్ను నేనెక్కువగ నేవగించుకొనుచు వారలతో నుండిపోతిని. నన్నొక భ్రష్టాత్మునివలె వా రూహించుచున్నను ఆకన్యాదళమునకుఁ గట్టకడపట నడచి యిచ్చటకు వారలతో మరలివచ్చితిని. అయినను వారెవ్వరు నాతో నేమియుఁ బలుకలేదు. కృష్ణవర్మ యాగడమునన్నట్లు బయలుపడినప్పటినుండియు నా హృదయమున నేదియో పీఁకుచున్నట్లున్నది. అయిన నేమిచేయువాఁడ?— ఆకన్యలిందు బ్రవేశించునప్పుడొక క్రమములేకుండ మిగుల గందరగోళముగఁ బ్రవేశించిరి. ఆ సందడి యందు నేను మేలిముసుగును చక్కగవేసికొని నన్నితరులు గుర్తింపకుండ ఆ రాజకుమారి యా వాసగృహమును బ్రవేశించి యెవ్వరునుచూడకుండ నే నెల్లవిషయములఁ దెలిసికొంటిని. ఆమెకొలువుకూటమున నామె సింహాసనమునకుఁజేరువ నొక దేవీవిగ్రహమున్నది. దానిచేతనున్న మహిషాసురుని మస్తకమునకు క్రిందిదెసనున్న సందునుండి

సర్వ ముపలక్షించుచు నేనితరులకుఁ గన్పడ కుండ దాఁగుకొంటిని.

"న్యాయమూర్తివలె మిగుల గంభీర భావమున నాసీనయైయుండి కన్యల నొక్కొ కతెగ దనయెదుటకుఁ బిల్పించుకొని ఆమె విచారణ మారంభించెను. ఆ బాలికలంద తైక్యకంఠముగ మనలనేమియు నెఱుంగమని వాక్రుచ్చుచువచ్చిరి. వా రందఱివెనుక మాలతి పిలువఁబడెను. అప్పు డామె యవస్థకు నాకు అనుకంపతోడి నిర్వేదనభావ మొకటిపుట్టినదనగ మీరునమ్ముదురా? ఆమె దురవస్థకు మనమే హేతువులమగుట నాకు మనఃకంటకముగనుండెను.

" 'ఆ స్త్రీరూపధారులను నీవెఱుఁగు దువా లేదా?' అని యారాజకుమారి మిగుల నిర్దాక్షిణ్యముగఁ బ్రశ్నించెను.

"మూర్తిభవించిన దైన్యదేవతవలె ఆమె నిలువఁబడి కొంతకాలమేమియుఁ బలుక కూరకుండెను.

"ఆ రాజకుమారి విడువకుండ నామెను నొక్కినొక్కి ప్రశ్నించెను. ఆ మానమర్థాంగీ కారముగఁ బరిగ్రహించి

" 'తెలిసియున్నదని నీవైఖరియే చెప్పు చున్నది. ఇఁక నీవిషయమై మాయస్మ కేమైనఁదెలియునా!' అని యడిగెను.

"ఆ వధూమణి ఆర్తరూపిణియై యేమి యుంబలుక కూరకుండెను. 'శకుంతల కేమైన తెలియునా?' అని కఠినముగ నారాజకుమారి తిరుగఁబ్రశ్నించెను.

"ఆమె 'యౌను'నికాని 'కాద'నికాని యేమియు స్పష్టముగఁ జెప్పకపోయినను ఆ రాజకుమారి శకుంతలయు, భానుమతియుఁ గూడ నిందుసమానముగా దోషులేయని ఆమెవైఖరినిబట్టి నిముసములో గ్రహించి వేసెను.

"అప్పు డామె శకుంతలనుబిలువ నాజ్ఞా పించెను. కాని ఆమె యెచ్చటను కానరాలే దని పరిచారికలువచ్చి తెల్పిరి.

ఆ రాజకుమారి మండిపడి శకుంతల బిడ్డను దోడ్కొనిపోయి ఈ మహిళావిద్యాలయ ద్వారమున కావలపార వేయవలసినదని యుత్తరువునొసంగెను.

"తరువాత భానుమతిని దోడ్కొనిరా నియోగించినది. ఆమె సమ్ముఖమున నామె యపరాధము నుగ్గడించి శిక్షించునుగావల యు. నేనిఁక నచ్చట నిలిచిచూడనేరక పరు లకుఁ దెలియకుండ నీవలకు వచ్చివేసితిని.—— ఇఁక తా మేమిచేయ నిశ్చయించిరి?——ఆ శకుంతల యేమైనదో! ఆ కృష్ణవర్మ యేమై నాఁడో! ఆహా, యిరువురును గూడ పలా యితులై పోయిరికదా! ఒకవేళ నిద్దఱును కలి సియే పాఱిపోయియుండరుకద!——అట్లయిన నెంతపాపు! ఇదంతయుఁజూడఁ దొలుత మన మిచ్చటికి వేషములతో రావలసినదికాదు. ఆ కృష్ణవర్మ వట్టియడవిగొడ్డువంటి ప్రకృతిని పుట్టియున్నవాఁడు. పైగ నిది రాత్రిగూడ

గావున దానినేమిచేసినను చేయవచ్చునని
నాకు భయముగనున్నది."

నే నిట్లంటిని. — "అయిన నేమాయె ?
ఆ గుజారమునఁ గృష్ణవర్మ నట్లుకొట్టిన నా
కంటె నీవే యతని నెక్కుడుగ బాధించిన
వాఁడ వగుచున్నావు. ఇది కేవల హాస్య
గాంధ్ర ప్రకృతి కనురూపమైననింద. ఏమం
దువా ? — పైకతఁడెంత గంధ్రవైఖరిని
గాన్పించినను అతఁడు చాలయోగ్యుఁడని
నీవుమాత్ర మెఱుఁగవాయేమి ? అతఁడు
మనకై గుండియలనిచ్చి యెంతటి మహాపద
యందైనఁజచ్చుటకు సిద్ధమైవచ్చినట్టివాఁడు.
అట్టివానిని నోటమెచ్చుకొనుచు నొసట
వెక్కిఱించు హాస్యగాంధ్రవలె స్నేహము
నందే అపహాసపాత్రునిగఁజేసి అతనియందు
లేని ప్రకృతినొకటికల్పించి కేవల మవినీతి
వర్తనుఁడని తేల్చివేయుచున్నావు ఒకమాటం
యందుఁ బ్రేమజూపుచు మఱియొకమాట
యం దతనియోగ్యత కవమానకరముగ
మాట్లాడుచున్నావు. కృష్ణవర్మ పైకావిధ
ముగఁ గాన్పించుచున్నను అంతరాళమున
మిగులయోగ్యుఁడు. హాస్యరసైకలోలుఁడై
నంతమాత్రమున నాతఁ డవినీతివర్తను
డగునా ? — ఇఁక నతఁ డీ రాత్రిపాడిన ఆ
'గైరమ్మ' పాటయున్నదే అది యంతరంగ
పరిశుద్ధిలేని వేఱొకఁ డెవ్వడైన పాడియున్న
యెడల నిప్పటికిని క్షంతవ్యమైయుండదు.
కావున నతఁ డూరక కన్పించు వైఖరినిబట్టి
అతని యోగ్యతను సంశయించుట కవకాశ
ములేదు. అతని బాహ్యతత్వమునఁ దోచు
పేలవత్వ మతని అంతరంగమునలేదు. ఆ
పైపైదోచు కాంతులన్నియు మృగతృష్ణ
యందలి తరంగములవలె నిక్కువములు
గావు. తుచ్ఛపుఁ బరిస్థితులయందుఁ బడి
పోకుండ మహాద్రివలె నిష్కంపతత్వమున
నుండు స్థైర్యగుణ మతనియందున్నది. —
కావున పైపైనదోచు నతనియుల్లాస వైఖ
రులు కేవలచంచల పరీత భావముల నేర్పడిన
ప్రకృతులని నీ వెప్పు డూహింపకుము. జలో
పరిభాగమున తామరపూవు నందలిరేఖ
లెంతచిన్నగాలి కెంతసంచరించుచు గాన
వచ్చినను అదినీటియందు తన మృణాల
కాండమును బట్టి క్రిందిభూమి యందెంత
స్థిరముగనుండి పోవునో అదేవిధముగ మనకు
కృష్ణవర్మ వైఖరియు నున్నదని యూ
హింపవలెను."

నేను చెప్పుమాటలింకను నానోటి
యందుండగనే ప్రక్కనొక చింత చెంగట
నుండి ఆమహిళా విద్యాలయాధికారిణు లిద్ద
ఱాకస్మికముగ మాపైనుఱికి "ఎవరు?—
ఇంతరాత్రివేళ — పేర్లుజెప్పుడు ! — అని
మమ్ము హెచ్చరించిరి.

పార్థసారథి తానున్న దాపుననే యుండి
వారలకు సూక్ష్మముగదొరకి పోయెను. కాని
నాకు నాసిక్కబలము నందొకింత విశ్వాస
ముండుటచేత నన్నుఁ బట్టుకొనఁ బోయిన
యూరురాలి చేతులఁ బడకుండఁ దప్పించుకొని
లేడివలె పఱుగెత్త నారంభించితిని.



మిస్. ఇందిరాదేవి. వమాక్ ఎ(జా యందు
"ఎ(జా" పాత్రధారిణి.



మిస్. మాధురి

అక్కడి [illegible]త్రముల జుట్టి జుట్టి, పూవుఁ బొదరిండ్ల ప్రదక్షిణము చేసి చేసి నేను కాలికొలఁది పఱుగిడ నారంభించితిని. నేనెక్కడకుఁ బోయినను విడువకుండ ఆవీరాంగన నిశ్వాసములు నా వెనుక వినిపించుచునేయుండును. ఆకస్మికముగ నాకాలు భూమిపై ప్రాకియున్న యొక్క ద్రాక్షతీగలో జిక్కుపడి పోవుటచేత నచ్చట బోరగిలఁబడి పోతిని. తక్షణమే ఆ వీరకాంత నన్నాక్రమించి పట్టుకొనెను. నిముసములో నేనెవ్వడనో ఆమెకుఁ దెలిసిపోయెను.

"ఆహా! పాఱిపోవుదువా?—మామహిళా మహోద్యమమునకుఁ గంటకములుగ నంకురించితిరి.— ఇంతకాల మీా మహిళాలోకమును వంచించి పాఱిపోవుదురా? రండు మీాకు 'శాస్తి'యైపోవును." అని పలుకుచు వారిద్వరును మమ్ముల నా రాజకుమారి సమక్షమునకుఁ దోడ్కొనిపోయిరి.

న్యాయాధీశుల వెఖరి నా మె యొ క యున్నత పీఠమున గంభీరభావమున నాసీనయై యుండెను. గొప్ప తుపాను లుదయించుటకు ముందుఁ దోయధినుండు నోడల తెరచాప కొయ్యలపైఁ గానఁబడు విద్యుత్సంబంధమగువింత తేజమువలె ఆమె లలాటదేశమున వజ్రమొకటిపైన ప్రేలాడుచున్న దీ పి కా ప్రసారమున వింతగఁ బ్రకాశించుచుండెను. ఆరాజకుమారి కిర్వంకల నిరువురు పరిచారికలు నిలువఁబడి ఫటికసీటఁ దడసియున్న ఆమె వినీల కుంతలములఁ దువ్వుచుఁ జక్కఁ జేయుచుండిరి. ఆమె వెనుకఁ గొంచెము చేరువుగ—ఎండయనక వానయనక నాగలిఁ బట్టి వసుంధరను సస్యశ్యామల సంభరితముగ నొనర్చు విద్యయందు సిద్ధహస్తలయి, బల విక్రమసంపన్నలయి, విశాలోరస్కలయి, పంచాననసదృశ భీషణమూర్తులయి, ఆరోగ్యవంతములయి మహోన్నతములయిన మేనులఁ బ్రకాశించుచు బలగర్వితలువోలె నున్న వనిత లెనమండ్రు నిలువఁబడియుండిరి. సంతత శరీరపరిశ్రమవలనఁ గాఁబోలు వారు పురుషులనుమించిన బలశాలినులనివారి రూపములే చెప్పక చెప్పుచుండెను.

మేములోనఁ బ్రవేశించుచుండగ నారాజకుమారిచుట్టును మూగియున్న ఆఁడుహంద్రు రెండుపాయలుగఁ జీలి మా యాగమనమునకుఁ ద్రోవయొసంగిరి. ఆసింహాసనమున కొకవంక నేలపై బఱచియున్న ము తు గ గుడ్డపై స్వచ్ఛమగు పద్మమువలె మెఱయుచున్న శకుంతలాదేవిశిశువగు నహల్యను పరుండఁబెట్టిరి. సుఖోచితశయ్యయందు మేనెఱుంగక నిద్రించు పసికూనను నిర్దయత్వమున నా రాజకుమారి చెంగటనట్లు పరుండబెట్టిరని నేను భావించితిని.

మఱియు నొకవంక కెంపులవలె మెఱసిపోవుచున్న పాణితలములతో తన ముఖపద్మమును గప్పికొని వెక్కి వెక్కి దుఃఖించుచున్న మాలతిని కనుగొంటిని. ఆమె తల్లియగు భానుమతీదేవి నిరర్గళాలాపములు, తనవాచాలత్వమిట్లు వెల్లడించుకొనుచుండెను.

"—కావున, నో రాజకుమారి!—పూర్వదినములలో నిట్లు జరిగియుండలేదు. నీవు

నాహితోపదేశములఁ జెవియొగ్గి వినుచుంటివి. నాజిహ్వయెట్లు తిరుగుచుండినదో తదనురూపముగ జీవించుటయే నీపరమ ధర్మముగఁ దలంచుచుంటివి. అప్పుడు నీవు సకలవిద్యాజాలమహత్వమును నాచేయూఁత నేర్చుకొంటివి. ఇప్పుడిట్లు వెక్కుచున్న ఈబాలికవలెనే నిన్నుఁ బ్రేమించుకొంటిని. నీవుగూడ నన్ను నీరెండవ తల్లియట్లు మన్నించితివి— అవన్నియుఁ బరమ సౌఖ్యావహమైయుండిన ఆనాటిమాటలు.

"అంతలో నెచ్చటినుండియో ఈక్రొత్త నేస్తగత్తె వచ్చినది. ఆమె యే ముహూర్తమున వచ్చినదోగాని నీవు నాదెస పూర్తిగ మార్పుఁజెంద నారంభించితివి. శీతలదేశములందలి నవనీతమువలె నీవు కొఱకువారి పిడుచకట్టి పోతివి. అదంతయు గమనించుచు నేనెంత దుఃఖించితినో ఆపరమాత్మునఁ డెఱుఁగవలెను.

"ఆపైపై స్నేహములన్నియు ఆమె యంతరాళమునుండి యుప్పొంగివచ్చు నుత్తమ ప్రణయమని నీవు భావించితివి. అట్టి మన సత్వమ్మున నీ సహజానురాగమంతయు నామె కొప్పగించివేసి అహర్నిశ మామెయనినఁ బొంగిపోవుచు నేనన్న ఘునీభవించి మంచుగడ్డవలె నుత్కంపించుచు వచ్చితివి. నేను చేసినదానికంతకుఁ బ్రతిఫలమిట్లు ముట్టఁజెప్పితివి.

"నీవైఖరి పూర్ణముగ నిట్లు మారిపోయినను నేను మనపూర్వ స్నేహమును దలంచుకొని యెన్నియవమానములనైనసహించుచు వచ్చితిని. నాయోగ్యత నాకు సంపూర్ణముగఁ దెలిసియున్నది గావునను, ఈమహిళామహోద్యమమునకు నీవు నాయకత్వమును వహించితివి గావున నేనును నీయాజ్ఞానువర్తినై ఈ తనువును జెల్లించుకొనవలసియున్నదని భావించుచు ఎప్పటికైన నీ స్నేహమును తిరిగి పొందగలనని యూహించితిని.

"మఱియు నీవేదో గొప్పపనుల నిర్వహింప నుదయించితివని విశ్వసించి నీయాజ్ఞానువర్తినై ప్రవర్తించితిని. అట్టి లోకోత్తరమగు మహాత్కార్యమున నేను నీ సహచారిణినై, సమభాగినినై నీసత్సహవాసమును గోరికొనుచు సర్వకార్యకలాపములయందును నీకుఁ దోడ్పడితిని మఱియుఁ గాలమనుకూలముగ నున్నది కావున నన్నివిధముల నట్లు చేయఁగల్గితిని.

"నేను నీకిట్లనుకూలవతినై యుండుటచేత స్త్రీహిత మహారంభమగు నీ మహాభారమును నిర్వహింప గల్గితివి. ఇప్పుడింత విస్మయాకరముగఁ బెరిగియున్న ఈమహావృక్షమునకు విత్తనము మన మిర్వురమును కలసియే యుంచితిమి. ఈ యుద్యమపరిణామమును మనమిర్వురము సకల కలావిభూషింతుఁడగు కళాపూర్ణున ట్లుదయించితిమి. కాని ఆమె యందీ పరిణామము ఆకస్మికోదయమునఁ దొడలులేకుండ వెలువడిన యనూరునట్లు వికృతమైపోయినది.

"ఈ భవనముల దీసికొని మనమీ స్వేచ్ఛానీమలఁ బ్రతిష్ఠించుకొంటిమి. ఇందడు

గిడినప్పటినుండియు నన్ను నీవు తూష్ణీం భావమునఁజూచుచు వచ్చితివి. నీప్రకాశమే యెల్లయెడలఁ బ్రసరింపించుకొనుచు నాకు నీ చెంగట క్రీనీడయే యుండిపోవునట్లొనరించితివి. క్రొత్తబాలిక లెవ్వరువచ్చినను వారందఱిని శకుంతలయొద్దకే పంప నూహించుచు విద్యార్థినుల కామె యన్న నపరిమితమగు నభిమానముదయించునట్లు చేయ నారంభించితివి. అయిన నామెయందేమి మహత్వమున్నది?—సర్వవిధముల నల్పతరవయస్క—అల్పతరవైదుష్యవి కాన—విరోధదేశ సంజనిత—అట్టి దానికి నీ వీ మహోద్యమమున సర్వాధిపత్యమొసంగితివి. ఏకదేశ సంజనితనై జననీస్థానమున నిన్ను బెంచి పెద్దదానిగఁజేసిన నన్ను నీ వుపేక్షించితివి పోనీ!—ఆమె కే విద్యయందైన సమగ్రమగు పాండిత్యమున్నదా? ఊఁహూఁ! ఏమియులేదే! వట్టియడవి! అన్నిటను వ్రేలుపెట్టి సర్వకళాపరిపూర్ణురాలనైతినని విఱ్ఱవీగు దుర్గర్విణికాదా?

"అయిననేమాయె?— ఈ మహారంభమునఁ బెత్తనమంతయు నామెకే చెల్లుచు వచ్చినది. ఇందలి బాలికాగణమంతయు నామె యధీనముగావున ఆమె యాడినదాటయుఁ, బాడినది పాటయు నగుచువచ్చినది. అయిన నెప్పటికైన ఆమె కుహనా పాండిత్యమును కుటిల విచేష్టితములును తెలిసిపోకుండ నుండవని నేనన్నిటికి సరిపెట్టుకొనుచు వచ్చితిని.

"అంతలోఁ దోడేళ్ళవలె పీంద్రీ సీమలఁ బ్రవేశించిరి. శకుంతల యిచ్చట నీయుద్యోగముననున్నదని తెలిసియేవచ్చిరి. ఆమెయు వీరిరాకను సంపూర్ణముగ నెఱింగియుండి వీరిచ్చట మనతో నుండిపోవు కుచ్చితతంత్రమున నీ మహారంభమున కింత యుపద్రవము దీసికొనివచ్చినది. వీరిచ్చటికివచ్చి నిన్నటి యుదయమంతయు శకుంతల భవనమునఁ దలుపులు బిగించికొని గుసగుసలాడుచు నుండిపోయిరి. వీ రామెకు తమ్మును గూర్చి సర్వమెఱింగించుకొనిరి. ఆమె యంతయువిని వీరిని ప్రోత్సహించుచు నుండిపోయినది.

"నా కెవ్వ రీ సంగతులఁ జెప్పకపోయినను నేను సర్వమును గ్రహింపఁగల్గితిని. సకల యువతీలోక క్షేమంకరమగు నభినివేశమునఁ గనురెప్పలు మూయకుండ సహస్రసహస్ర నేత్రముల నుపలక్షించుచుండుదును గావుననే నీ కుచ్చితమంతయు నవలీలగ గ్రహించివేసితిని. వీ రీదొంగవేసముల నెంతనేర్పుగవేసికొన్నను క్రిందటి నిశీథమందే పూతపసిండి వంటి వీరిమోసముల గ్రహించి నీవద్దకువచ్చి సర్వమెఱిగింపవలెనని యడుగిటు వేసి యునంతలో మఱల నూహించితిని. ఒకవేళ నాసుహృద్భావమును నీవు గమనింపక శకుంతలపైనున్న మత్సరమునుబట్టి యొకటి దొరకించుకొనివచ్చితినని భావించి నన్ను చూడగనే 'కన్ను'మందువనుకొంటిని. — 'చాల శ్రమదీసికొంటివికాని — ఈవార్త శకుంతల నా కెఱిగింపకపోవునా? — 'నమ్మ నీ కీవృథాయాస మెందులకు?' అని నన్నదల్చివేయుదువని భావించితిని. —

అదియుఁగాక నిన్న నీ వామెనుకలసికొని చాలతడవు సంభాషించియుంటివి. ఒకవేళ నీకామె తెల్పియేయున్నదేమో! మీ రిరువురును యుక్తమగుచర్యదీసికొనుట కూహించుచుంటిరేమో! — అనియు నూరకొనవలసినదానినయితిని. కావున నాయాందోళనమున కనురూపముగ నీ కప్పుడేమైన తెలియజేసినయెడల నదంతయు నాకుఁ బ్రతికక్షిణియగు ఆ శకుంతలను పదభ్రంశమొనర్చి పరాభవించు తహతహతో నేనిట్లు చేయుచుంటినని నీ వూహింతువని నేననుకొంటిని.

"అయినను మహిళాలోకము యొక్క మేలే మనకు ముఖ్యాదర్శమైనయెడల తప్పక ఆమె కుచ్చితము బహిర్గతమొనర్పఁదగినదే! సంఘము నున్నతికి దెచ్చుటకే కద తొలుత మన మిట్టిశపథములఁ జేసికొంటిమి! అయినను మన మహోద్యమభద్రమునకే నేను నాశపథముల నుల్లఘించియు వాని యాదర్శములకు భంగములేకుండ సంచరింపవలసినదాననయితిని.

"కావున నాకుఁ దెలిసియు నీకుఁజెప్పకుంటినని నీవు కినియుట కవకాశములేదు. చెప్పకున్నను వీరిపై నేకొకకన్నుంచియే జాగరూకతతో మెలంగవలసని యూహించితిని. పైగా వీ రితరబాలికలతో నేమియుఁ గలియుచుండలేదు. కావున నింతలో మఱెట్టి యుపద్రవమునకు నవకాశములేదని భావించితిని.

"ఇఁక నీదినమున వీండ్రీవిధముగ నిగూఢముగనుండిపోవుట నాకు వెక్కసముగఁ దోచి యేమైనను, నీవు నన్ను గూర్చి యేమనుకొన్నను చెప్పివేయుదమని నిశ్చయించి నీ భవనమునకువచ్చి చూచితిని. కాని నీవు ఆ శకుంతలయొక్క బలగమునంతయు దీసి కొండలనెక్క వాహ్యాళి బోయియుంటివని తెలిసికొంటిని. ఆ శకుంతలకూడ నీతోడనే వెడలిపోయినదనియు నీపరిచారికలు నాకెఱింగించిరి.

"ఇఁక నప్పుడయిన శకుంతల యీ మనుజాధముల గూర్చి తెలుపకుండనుండదని భావించితిని. కాని యట్లు చెప్పినదా? చెప్పి తనయొక్కయు, నీయొక్కయు, ఈ సర్వ మహిళామండలియొక్కయు యోగ్యతకు లోపమురాకుండ నేమైనఁ జేసినదా?

"ఇఁక నీతుచ్ఛులు తమజాతి కనురూపమైన యాగడముల మఱింత విజృంభించిపోయిరఁటగాదా? తుదకు తమ గండ్రతనము వెల్లడించుకొనుచు తమ్ముఁ దామే యొప్పగించుకొనిరనియు నాకుఁ దెలియవచ్చినది. అప్పుడా శకుంతల యేమిచేసినదో చూడు! తా నావిధముగ మన మహిళాసంఘముపట్ల నొనర్చిన మహాద్రోహమునకు లజ్జితయై చల్లగఁ జాఱిపోయినది! ఈమాత్రమైన సిగ్గు బిడియము లామెకున్నవని నే నొప్పుకొందును. ఇప్పుడు నీ యాగ్రహమహోదగ్రత్వమునకు గుఱిగా నేనిచ్చట నొక్కతె నుండిపోయితిని.

"ఈ మహిళా మహోద్యమమే నా కైహికలోక వ్రతముగఁ దలపోయుచు దీనికై

నాయారోగ్యమును, ధనమును, ప్రాణమును—నా సర్వశక్తులను ధారపోసియున్నాను. ఇప్పుడవియన్నియు బూడిదయందుఁ బోసిన పన్నీటివలె నిష్ఫలములయిపోయినవి. నే నహంకారమున నిట్లనుచుండుటలేదు. నే నెట్టిదాననో, నాకెట్టి సామర్థ్యమున్నదో నీకును నన్నెఱిఁగినవారందఱికును దెలిసియేయున్నది. ఇప్పుడీవిధమైన స్వల్పశపథము నుల్లంఘించితినని నీవు నన్నావలకుఁ బంపివేసినయెడల నాయనుభవమునుండి పరిత్యక్తమగు నీ పరిపాలనమంతయు నపహాసభాజనముగ నంతరించిపోవును. ధాన్యమునందలి పొల్లువలె పురుషులగాలి యేమాత్ర మిట్లు వీచినను ఈ యుద్యమము నిష్ఫలముగఁ గొట్టికొనిపోవును. అప్పుడు పురుషులందఱును మన కెవ్వరికి లోకమును దేజస్వంతముగఁ జేయువిజ్ఞానము కలిగియుండ లేదనియు, వట్టి యవివేకపుఁ జాయల నిట్లు గొట్టుకొనివచ్చితిమనియు నిరాక్షేపముగఁ జెప్పుకొందురు."

ఆ రాజకుమారి నిర్మొగమాటముగ, నిర్దాక్షిణ్యముగ నిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

"మంచిది. అవిని నీవుచేసిన ప్రతిజ్ఞలకు భిన్నముగఁ బ్రవర్తించితివి. బుద్ధిపూర్వకముగ సమయభంగ మొనర్చితివి గావున నిన్ను వెడలనడచుట యే యుక్తము. నీవిఁక విచ్చేయవచ్చును."

అని యచ్చటనున్న శిశువును వ్రేలఁ జూపించుచు "కాపరిలేని గొఱ్ఱెపిల్లవలె నిరాధారిణియై యుండిపోయిన ఈ బిడ్డనుగూర్చి నా మనసు మారిపోయినది. దీనిని నేనుంచుకొందును. నీవు విచ్చేయవచ్చు." అని పలికెను.

ఆ భానుమతి గృధ్రమువలె తనగొంతుకను వికృతముగ నిగుడఁజేయుచుఁ గంపించిపోవుచున్న పెదవుల కేవల మందహాసమువోలెనున్న శుష్కహాస మొకటి యెరవుదెచ్చికొని—"ఈ మహోద్యమము సర్వము నాయదియ. ఈవిధముగ నిది నిర్వహింపవలయునని మొదట కర్తవ్య నిర్ణయమొనర్చినదానను నేను. వాయసము తాను కట్టికొను గూటికి పికమునుదెచ్చి పెంచునట్లయినది నాయవస్థ". అని కోఱచూపుల నొకింతసేపా రాజకుమారినిజూచి తనకుమార్తె నొకచెక్కపట్టుకొని—'పద'! అని యీడువదొడంగెను.

ఈడిగిలబడుచు నొకచేతిని తల్లిపై కెత్తి పట్టుకొనఁగ దీనదృష్టులతో ఆరాజకుమారివంక దిరిగియున్న ఆ మాలతి, మహాపాపకళంకితమైయున్న ధాత్రీతలమును శిక్షించుటకై పిడుగుల పిండొకటి బంపగోరికొను ఒకానొక ఇటాలియన్ దేశవిగ్రహమువై ఖరినున్నదని పార్థసారథి తన భావాకాశమునఁ గల్పించుకొనుట కవకాశమిచ్చెను.

అంతలో ద్వారమువద్ద నేదో సందడి యొకటి వినవచ్చెను. ఆవంకఁజూడఁగ దయ్యములు తరుముకొనివచ్చియున్న దానివలె దిగ్భ్రమనొందుచున్న ఝాకారపికారములఁ

బయిగెత్తి వచ్చుచున్న వార్తాహరురా లొకతె రాజకుమారిచెంతకు తొందరగ రాబోవుటచే నట్టి కలకలమునయిచెనని తెలిసికొంటిని. నరభ సాగమనసంక్షోభిత మగు పయ్యోదకొంగుతో నేత్రముల భయ మావహించియుండగ ఆననము వెల్పెలబాఱి వెగడొందియుండగ ఆమె సర్వాంగములుఁ దటదట నదరిపోవుచు నూపిరి యాడకుండ వచ్చి ఆ రాజకుమారిచేత లక్షాముద్రితమగు లేఖల నందిచ్చి తా నాయానమున నచ్చటఁ జదికిలఁ బడెను.

ఆ రాజకుమారి నగమీఁవలకుఁ దోచు నాశ్చర్యము తన సింగపువైఖరియందే వానినిఁ జించిజూచుకొనెను. అవేమైయుండు నన మేము గ్రుడ్డియాలోచనల నూహించు కొనుచుండగ ఆలేఖలఁ జూచుకొను రాజ కుమారియందుఁ గ్రోధాగ్ని రగుల్కొని ఆమనోజ్ఞ లలాటమును, కపోలములను, వక్షస్థలోపరభాగమును నెఱ్ఱవుగఁ జేసి వైచెను. మహావిప్లవసమయములందు సంఘ సీమలలోఁ దుపానులుదయించునపుడు సామాన్యకర్షకులు తమ యన్యాయములఁ దామ సవరింపగోరి దుస్సహమగు శాసనము ధిక్కరించి తమ జమీనుదారుల ధాన్యపుఁ గుప్పలఁ జిచ్చుబెట్టునప్పుడు వారిక్రోధాగ్ని ఎట్లు యంబరమంటి రవుల్కొని పోవునో ఆ రాజకుమారిమూర్తియు నదేవిధమునఁ జేవురింప దొడంగెను.* ఆమె రోషకషా యితలోచనయై, అధర మల్లాడుచుండగ, పునః పునరుద్వృత్తభ్రుకుటీభుజంగభూత్కార మట్లు ఉచ్ఛ్వాసము లతిశయించుచుండగ మావంకకుఁ జూడసాగెను. హృదయాంత రాళమున నాకస్మిక క్రోధ మొకఁడుదయించిన ట్లామె సర్వాంగములును వణకిపోవు చుండగ మిగుల నిశ్శబ్దముగనున్న ఆరాత్రి వేళ ఆమె చేతులందలి కాగితముల నిటునటు ద్రిప్పు స్వల్పనాదము సహితము నాచెవులఁ బడుచుండెను.

అప్పు డాకస్మికముగ నిర్గతికయై చెంత బరుండియున్న యహల్య తన తల్లికై గావలయుఁ జెవులకు వెక్కసముగ వాపోవఁ దొడంగెను. క్రోధపరీత చేతస్కయగు నా రాజకుమారి కది మిగులకఠోరముగఁ దోఁచి యుండవలయు. ఆమె యేదో మాట్లాడఁదాని వలె మావంక దిగిచూచెనుకాని ఆమెనోటి కెట్టిమాటయు రాకపోవుటచేత తనచేతుల నున్న కాగితముల నొక యుండగఁజుట్టి 'చదువుకొమ్మ'ని యర్థమిచ్చునట్లు నావంక విసరివైచెను. అందొకలేఖ, ఆమె తండ్రి వ్రాసినయది. అందిట్లుండెను.

"ప్రియకుమారి! ఆ రాజకుమారుని నీదెస కంపునప్పుడు నిష్కారుణముగ నీ వాన

* ఇంతవఱకు రాజకుమారికి తమవిద్యాలయమునఁ బట్టుపడినవారు ఎవరోపురుషులని మాత్రమే తెలిసి యున్నది కాని ఇప్పుడట్లు పట్టుబడినవారు రాజకుమారుఁడును, అతనిస్నేహితులును అని సంపూర్ణముగఁదెలిసి పోయెను. ఆరాజకుమారి యందలిక్రోధ వికారమంతయు నీవార్తవలనను, తదితర లేఖాంశములవలనను ద్విగుణీ కృతమయ్యెనని పాఠకులు గ్రహింపవలెను.

రించుకొన్న కఠినశాసనముల నేమియుఁ దెలిసియున్నవాఁడగాను. వానినిగూర్చి నాకు తెలిసినంతటనే నీ స్వభావతత్త్వమును పూర్ణముగ నెఱిగియున్నవాఁడ నగుటచేత నీవు అక్రమమొనరింపకుండ నివారించు తహతహతో తొందరగ నిటకువచ్చితిని. కాని ఇది ఆరాజకుమారుని రాజ్యమునకుఁ జేరువగ నుండుటచేత ఈ యర్ధరాత్రివేళ నన్నుబట్టుకొన నేతెంచియున్న యతనితండ్రి హస్తములలోఁ జిక్కిపోయితిని. అతఁడు మహాసైన్యములతో నీ యావరణమంతయు ముట్టడించి తనపుత్రున కపాయము రాకుండ నన్నుబట్టి తనయొద్దనుంచుకొనినాఁడు.”

రెండవది మా నాయనగారు వ్రాసినట్టిది. అందిట్లుండెను.—

“మా తనయుఁడు నీయొద్దకువచ్చియున్న వాఁడు. వానికి నీవెట్టియవజ్ఞ యొనర్చినను నిన్నును మీవాండ్రను నేలకును గోలకును దెచ్చి మీ యాగడముల నామమాత్రావశేషముగఁ జేసివేయుదునని ముందే తెలిసికొమ్ము. నీవెఱ్ఱివెఱ్ఱివికారముల నింతటితోఁ గట్టిపెట్టి యింతటితోనైన బుద్ధిగలిగి మసలుకొందువుగాక! ఈ యుభయవంశములును జేసికొనియున్న ప్రాక్తన సమయమునకు బద్ధురాలవై నీవు మా తనయునిఁ బరిగ్రహించి తీఱవలెను. అట్టి పాణిగ్రహణ మీ వఱకే జరిగియుండవలసినది.

“ఆఁడుది మగవానికంటె మేలిజాతి మనుజుఁడని నీభావముగ నాకుఁదెలియవచ్చినది.—అట్లనుట సకల సృష్టితత్త్వమునకు గొప్పద్రోహము. దానినిమించిన పాషండతత్త్వ మింకొకటిలేదు. ఇట్టి యవకతవక సిద్ధాంతము లీ మానవలోకమునఁ బ్రబలిపోయినయెడల నింట గూర్చుండవలసిన యాఁడువాండ్రందఱును పట్టఁ బగ్గములు లేకుండ స్వేచ్ఛాసక్తచిత్తలయి తమనాథులను గాలఁద్రొక్కి పరాభవించివేతురనుట నిస్సంశయము. అట్టివేమియు సాగనీయఁదగినవికావు గావున నీవేమైన నాయాజ్ఞలకు భిన్నముగఁ బ్రవర్తించిన ఈనాఁడే నిన్నును నీ మహాసౌధములను నేలమట్టముగఁ జదును చేయించి మా సైన్యమునకుఁ జలిమంటల కర్హమగు పెంటగఁజేసివేయ సిద్ధసంకల్పుఁడనై యున్నవాఁడ. నాతనయుని నావద్దకీ యుత్తరక్షణమునఁ బంపకున్న దైవసాక్షిగ నట్లు చేసివేయుదును. కావున నొకవెఱ్ఱిక వాసియైన నీవతని కవజ్ఞ సేయక మన ప్రాక్తన సమయమున కనురూపమైన పద్ధతిని నడచుకొనుము.—”

అని యీ వైఖరినున్న యుత్తరమును జదివి నిలువఁబడి నిరాఘాటమగు నావేళ మౌన వారాజకుమారితో నిట్లంటిని.

“సైర్వరవిహారమున స్వేచ్ఛావతి వైయున్న నిన్నుఁ బరిశోధించి నీ రహస్యముల నెట్లైనఁ దెలిసికొనవలయునను నపాత్రపు బుద్ధితో నేనిచ్చటకు రాలేదు. మనకిరువురకు పాలితవ్యమగు రాజసమయమున కొకభంగము వాటిల్లకుండవలయునను మహాం

దోశనముతో పురుషులకు దుర్గమముగ నీచేత ననుశాసింపఁబడుచున్న యీ సీమలఁ బ్రవేశించితిని.

"మీా స్త్రీజాతియన్నఁ దుచ్ఛముగఁ దలపోయునట్టి ప్రకృతిని బుట్టినట్టివాఁడఁగాను. స్త్రీజాతియన్న నా కపారమగు గౌరవభావమున్నది. ప్రపంచమున స్త్రీలెంత మహోన్నతస్థితికి వచ్చుట కవకాశముండునో, అంత మహోన్నతస్థితికిని వచ్చుట కొడంబడిన యెడల మానవలోక మింకను దేజస్వంతమయి, సౌఖ్యారంభ సంయుతమయి, సకల కల్యాణగుణావహమయియుండునని భావించువాఁడ.

"కావునఁ గోపింపక నేఁ జెప్పునదంతయు సావధానచిత్తవై వినఁదగుననిఁ బ్రార్థించుచున్నాను. — నే నెంత పురుషుఁడనైనను స్త్రీలవలె మానవుఁడనే కద! పురుషజాతి సేవగించుకొనుటకు నీ కెట్టి కోపకారణములున్నను నన్నుమాత్ర మసహ్యించుకొనఁదగిన ప్రకృతి నాయందిసుమంతయు లేదని నీవే గుర్తింపఁగలవు. ఏమందువా?— కూకటివేణి నున్న కాలమునుండి శిరోజములఁ దెలుపెక్కుబోవు నిక్కాలమువఱకు నే నెక్కువగ స్త్రీజాత్యభిమానముతోడనే సంచరించి యున్నవాఁడ. అతిశయ సౌఖ్యప్రదమగు బాల్యకాలమున నాతోడినీడవలె మెలంగి యుండిన ధాదిసహితము నిన్నొక కథానాయకురాలినిజేసి నాకుఁ గథలఁజెప్పుచుండెడిది. అప్పటినుండియు నిన్ను నాయూహాప్రపంచమునకు రాణినిగఁజేసికొని ప్రవర్తించియుంటిని. దక్షిణదిగంతమునుండివచ్చు మలయమారుతమున కానందించుచు ఆ యానందమంతయు నీవున్నదిక్కునుండి యేతెంచుటచేతనే అంతమనోజ్ఞముగ నున్నదని భావించుచుంటిని. పసిపిల్లలు ఆకాశమున మహామోహనకరుఁడై యుండుఁ బూర్ణచంద్రుని బట్టుటకై చేతులాడించుచు వచ్చియు రానిమాటల తమసంతోషమును వెల్లడించునట్లు నేను నిన్నొక మనోహరమూర్తిగఁ దలపోసి యానందించుచుండినవాఁడ. వేయేల ?—ఉదయాస్తమయముల మా యుద్యానవనములన్నియు 'ఇందిర! ఇందిర! నా ఇందిర!' అని యుత్సాహమున నానాదుమాటలతోఁ . ప్రతిఘోషించుచు వచ్చినవి. చుక్కలాకసమున 'నిందిర' యనుచుండగ, పక్షులు తమ కలరవముల నా శబ్దమునేబట్టికొని భూనభోంతర మిందిరామయముగఁజేసి వేయుచున్నవని నేను తన్మయుఁడనై యానందించుచు వచ్చితిని.

"అట్టి మనః స్తత్వముననుండు నేను, నీవు మేరుపర్వతాంతరమున మేడగట్టించుకొని యుండిపోయినను నిన్నెట్లోనెదకి పట్టుకొని యుండెడువాఁడనే. పురూరవుని గన్నొఱంగి నందనవనమునకుఁ బలాయితమై పోయిన యూర్వశివలె నుండిపోయినను ఎప్పటికైనను నిన్నుగలసికొని యుండెడివాఁడను.

"దుస్సహములగు నిన్ని శరత్కాలముల నిట్లు గడపికొని ఇప్పుడానూఢయావనుఁడనై నిన్ను స్వయముగ సందర్శింప నరుగుదెంచితిని. అందులకుఁ గారణభూతమై నాహృద

యమున నుప్పొంగియుండు ప్రణయము నిప్పు డల్పవచస్కుఁడనై బలికికొననేరక పోవుచుంటినని భావించుచున్నాను. అయినను మహోత్తమ సంకల్పధీరవగునో యిందిర! భూమితోడి నవగ్రహములును సూర్యునిచుట్టును సంతతపరిభ్రమణశీలములై ప్రదక్షిణముచేయునట్లు నాయందుఁ దోచు భావములన్నియు నీవ కేంద్రీభూతవుగఁ బరిభ్రమించుచున్నవని నిశ్చయముగఁ జెప్పగలను.

"లోకోత్తర చరిత్రులని ప్రఖ్యాతినందియుండు మహాత్ములు సహిత మొకప్పుడు కొందఱకు ప్రత్యక్షానుభవమున విఖ్యాతికిఁ గుఱుచలై అల్పతరమైన వ్యక్తులవలె గోచరింపవచ్చును. కాని నీయందట్లుగాక నీ యమేయతత్త్వమునందలి సూక్ష్మతర సూక్ష్మతమ వివరముల స్వయముగ నవలోకించునప్పుడు ద్విగుణీకృతమైన మనోజ్ఞత్వ ముపలక్షితమగుచున్నది.

"బాల్యకాలమున కలవోలెనైన నీ మూర్తివైభవ మిప్పుడనుభవమున హృదయసమ్మోహనమై నన్ను నీకు సంపూర్ణముగ వశంవదునిజేసివైచినది. కావుననో వరవర్ణిని! నీ వనుశాసించుకొనియున్న ఆ ఘోరశాసనమునుబట్టి నీవొకవేళ నాప్రాణములఁ దీసికొనిన చెప్పఁజాలనుకాని ఇఁక నాకంఠమునఁ బ్రాణవాయువులాడువఱకును నీవే నా కైహికలోక పరమార్థముగఁ దలపోసి నిన్ననుసరించి తిరుగకుండ నుండఁజాలను. నాగస్వరమును ఫణులనుసరించునట్లు నిన్ననుసరించుచు నా జీవితమును తుదముట్టించుకొందును. బాలురు సంతతిపరివర్ధనమగు తమ యౌవనవయఃకాలమును గాంక్షించుటకంటె, మరణోన్ముఖుఁడైన వాఁడు ప్రాణముల నెల్లన దక్కించుకొన నాసజేయుటకంటె, రోగగ్రస్థు లారోగ్యమును వాంఛించుటకంటె, దరిద్రులు సంపదలకాశించుటకంటె హెచ్చుగ నిన్ను నేను గోరికొనుచున్నాను. సర్వవిధముల నేను నీవాఁడ, నీకనువ్రతుఁడ. అనుకంపనీయుఁడ. నీవులేకున్న నా జీవితమునఁ బరిపూర్ణతమున కవకాశము లేదని స్పష్టముగఁ దెలిసియున్నవాఁడ. నీవు లేనియెడల నర్థుఁడ—వ్యర్థుఁడనని తలపోయువాఁడ. మానవలోకమున నొక యర్థభాగమగు స్త్రీజాతియందు నీవొక్కతెవే నాకు వాంఛనీయమగు నర్ధాంగముగఁ దలంచుచున్నాను. నీవెంతపట్టుదలతో నీ హృదయమునుండి నన్ను బహిష్కరించుకొన్నను నేనీ జన్మాంతమువఱకును నిన్ననుసరించుచు నుండిపోవుదును. ఎట్టివిషమ పరిణామమునందైనను ప్రపంచమంతయు నెత్తినచ్చినను నిరాశ నవలంబించుట పురుషప్రకృతికి అవమానాస్పదమని భావించువాఁడనగుటచేత నీ వెప్పటికైన నాదానవుకాకుండ నుండవని యూహించుచున్నాను. — కావున నిన్న న్వేషించు తహతహచేతనే నీ విద్యాలయమునఁ బ్రవేశించు సాహసమ్మున కొడిగట్టితినని నీవు గమనింపవలెను. — అయినను నే నంతగ శాసనముల నుల్లంఘించలేదని మీ తండ్రిగారు తమ స్వహస్తముల వ్రాసి

యిచ్చిన ఈ యనుజ్ఞాపత్రమే చెప్పును గావున దీనిని చూచుకొమ్ము."

అని ఆమెతండ్రి వ్రాసియిచ్చిన లేఖ నామెకందిచ్చితిని. ఆమె దానిని చూడకుండ నాచేతులనుండి లాగి తనపాదముల చెంత నేలపై విసరివేసెను. నదీవేగమున కడ్డుగ నుండు ఆనకట్టపైఁ గొట్టికొనుచు వఱదనీ రొక్కపెట్టున దానినిఁ బగులఁగొట్ట సిద్ధముగ నుండునపు డెట్లుండునో ఆమెహృదయమునఁ బొంగిపోవు ఆగ్రహ మహోదగ్రత్వమునఁ బైకివచ్చుభావపరంపర లట్లుండెఁ గావలయు. ఆ యాగ్రహావేశమున నామె పలుకఁబోవు చుండగ ఆ భవనముయొక్క బహిఃద్వార మున విద్యాలయమునందలి బాలికలందఱుసు గుమిగూడి ఏదో మిగుల గందరగోళముగఁ జెప్పికొనుమాట లాకస్మికముగ వినుపించెను. మే మావంకదిరిగి చూతుముగదా, మణులతో, మణులకంటెను శోభాయమానముగఁ బ్రకాశించుచున్న మేనికాంతులతో గుంపులుగఁగూడియున్న బాలిక లచ్చటి దీపపు కాంతులఁ గానవచ్చిరి. గొప్పతుపాను లుదయించునప్పుడు గొట్టికొను పూలచెట్లనుండు పూవులవలె వారు ముందడుగుల వేయుచు వెనుకకుపోవుచు తమ యంతరంగములఁ బుట్టిన తుపానుల కనురూపమైన చేష్టలఁ బరిభ్రమించుచు వివర్ణవదనలయి, సగము నోళ్లఁదెఱచి భయోత్కంపితలవలె గానవచ్చిరి.

వారంద ఱా రాజకుమారివంక జూచుచు విభ్రాంతాత్మలయి యుండగ నపుమ గొందఱు—"ఇఁకనేమున్నది! మహాసైన్యములే వచ్చినవంట? అనియుఁ గొందఱు—'పురుషులు ముట్టడించుచుఁ గూర్చుండలేదు. లోనికివచ్చిచేసిరి?' అనియుఁ గొందఱు—'అయిననేమాయె?' ననియు తహతహతోఁ జెప్పుకొనుచుండిరి!

ఆ తరువాత నెవరికిదోచినట్లు వారాడుకొనుటచే గాఁబోలు నేమియు వినఁబడకుండ గొప్ప కలకలమును అల్లరియు నా బాలికాసంఘమున బుట్టినదని మేము తెలిసికొంటిమి. శాంతి కాస్పదమగురూపముల వారి కన్నివైపుల సరస్వతీ విగ్రహములున్నవి కాని వారి యుదవ్యాహతముగు కలకలముదయించి అయోమయమగు మహానాదమునకు కారణభూతమయ్యెను.

ఎంత భయంకరమగు తుపాను లుదయించినను చలింపని మహాద్రివలె అరాజకుమారి మూర్తి యచ్చటఁ బ్రకాశించెను. ఆమె గంభీరభావమునఁ దనసింహాసనమునుండి లేచి నిలువఁబడెను. మహాసాగరమున జలవాయుభూతము లొండొంటితో ఘోరముగఁ బోరాడునప్పుడు, భయభ్రాంతములై తనపై వ్రాలు పక్షుల నిష్కరుణముగఁ బంచత్వమొందింపఁజేయు దీపస్తంభమువలె ఆమె తీక్ష్ణమగు చూపుల వారలఁజూచి కఠినముగ మందలించుచు నిశ్శబ్దముగ నుండ నాజ్ఞాపించెను.

అంతలో నా మహానాద మంతరింపగ, నామె వారిని రూక్షముగ నవలోకించుచు నట్లు పలికెను.

"బాలికలు! అల్లరిబాలికలు! — ఏల మీకీకావరము? అడవిజంతువులవలె నెందుల కిట్లు తల్లడిల్లెదరు? ఇంత భయోత్కంపమున మీ రదరిపడుట కిప్పు డే మంతమహాపద వచ్చినది? — నేను మీకు నాయకురాలనగు దునుకద! ఏమివచ్చినను — ఎంత ఘోరపుం దుఫానులైనను మొదట నాతలపైనంగద పడిపోవును? పిడుగులపిండువలె వారంద ఱొక్కసారిగ నాపైఁబడిపోవనిండు. అయిన నేను జలించిపోవుదునా? మీకింత భయోద్వేగ మెందులకు కలుగవలెను? — బుద్ధి కలిగి యికనైన మీరూరకొనుఁడు. మన మాపద గడనబెట్టి, మనపగల సాధించి మనకు శుభ మొడగూర్చువారున్నారు. వారువత్తురు మనకై యుద్ధమొనర్తురు — లేనియెడల మనజన్మ స్వాతంత్ర్యములు సంరక్షించుకొని మనయోగ్యతను జగద్విదితముగ నుంచి వేయుటకు నేనే స్వయముగ కవచినై, ఖడ్గ పాణినై సకలమానినీలోకశిరః కంపన యోగ్యముగ రణరంగమున నుఱుకఁగలను. అందొకవేళ జచ్చినను స్త్రీలోకాభ్యుదయ మునకై పంచత్వమొందితిమను కీర్తిశాశ్వత ముగ మనకుండిపోవును

"ఇంతి భయోత్కంపమునకు మిమ్మంతగ నిందింపఁదగదు. ఆఱువేలేండ్లు పురుషజాతికి వడకుచు మనవారు భ్రమించిపోయిరి. మనజాతి నింతబలముగ నావహించియున్న ఈ పిఱికి తనమునుండి తప్పక మిమ్ముల విముక్తులఁ జేయగలను.

"ఇఁక నా సమక్షమున నింతయల్లరిఁ జేయుటకు కారణభూతలైన మహానాయి కలను — అదిగో! నీవును, నీవును! ఈ గుంపున మీమొగములు నాకు గురుతుగనే యున్నవి. — రేపటి యుదయమున సభ జరిపి అందు యుక్తమగుచర్య దీసికొందును.

"అప్పుడు తమ ధర్మమును విస్మరించి నోట నెట్లువచ్చిన అట్లితరులఁ రెచ్చగొట్టు టయే ప్రతిభగ దలపోయు నవివేకపుబాలి కలకు నలుపురిలో దలవంపులయి దుష్ప్రా భవములకు పాలగుటఁ దెలిసికొందురు.

"అట్టివారీ యుద్యమమున కనర్థకారిణు లని ముఖ్యముగఁ దెలిసికొందురుగాక. వారి మాతలవలె, మాతామహులవలె పురుషుల యేలుబడులందు గృహోపయోగ్యమగు వస్తువులవలె తామును జీవముతోడి నిశ్చే తనపు బ్రకృతులగుట తెలిసికొందురుగాక! అట్టివారి చిత్తవృత్తులే స్త్రీజాతి కింత యధ మావస్థకుఁ గారణభూతములైనవి. అట్టివారి నావలకుఁ గెంటివైచిన, వారు తరతరముల నుండియున్న తమ తల్లులవలె పురుషులచేతు లలోని కీలుబొమ్మలయి, బుద్ధిశూన్యలయి, మత్సరగ్రస్తలయి, హాస్యగాంభ్ర పరిహాస ముల కాలవాలములయి, శుష్కదూషణ భూషణ తిరస్కారములకుఁ బాత్రలయి నాట్యకత్తెలవలె దంభముగ వేషముల మాత్రము ధరింపనేర్పరలయి శాశ్వత మవ మానకరముగ, దుఃఖభాజనముగ, నిరర్థక మైన వ్యర్థజీవితములఁ గడుపవలసిన యాప దలకు బాత్రలగుదురని తెలిసికొందురుగాక!"

అట్లు పలికి ఆమె వారల నావలకుఁ బంపివేసెను. వారు వెడలిపోయినతరువాత క్రింది దెసనున్న గిరిగహ్వరములును మహావనములును జలవాయుభూతములఁ జేతులలో పిడుగులవానయందు విహ్వలములయి, పాడఱియుండఁగ బర్వతాగ్రముల నిర్దాక్షిణ్యతత్వమున మెఱయు సూర్యరస్మివలె మందహాసమొకటి మొగమున మెఱయుచుండఁగ నామె మావంకకు నడచివచ్చి యిట్లుపలికెను.

"నీవు మిగుల నుత్తమప్రకృతిని సంచరించితివి. మహారాజకుమార యోగ్యమైన ప్రవర్తనయందుఁ బ్రవర్తించితివి. అందులకు నేను సంతసించుచు నాకృతజ్ఞతను తెలిపికొనుచున్నాను. ఈ యాఁడువేసములందు సహితము మీరింపుగఁ గానవచ్చుచున్నారు. మఱియు మహనీయమగు తత్వమున మిగుల నుత్తమమగు బ్రకృతిని సంచరించితివి. నా ప్రాణములఁ గాపాడితివి. నా మన్నంగీకరింపకున్నను వానికన్నిటికి నీకు ధన్యవాదముల జేసికొనుచున్నాను. — అయిన నే నాప్రవాహమున నట్లుపడి అందే జచ్చియున్న బాగుండియుండునేమో! అప్పుడు పురుషులేమనుకొందురు? — దానికేమిగాని ఇప్పుడు మీ యిర్వరపైనను నాకు చిత్తమువచ్చినవిధముగఁ బగదీర్చుకొనుట కడ్డేమియున్నది?

"అయిన మా తండ్రినిజూచి — ఎంత ఘోరము! మీరు మీ గోదావరీ మన్యప్రాంతములనుండు పెద్దపులులను మించిన క్రూరాత్ములనుట కెట్టి సందేహమును లేదు. — అట్టి యడవిజంతువులగు మీరు మా మహిళాలోకమునఁ బుట్టిన ప్రకాశ మార్పివేయుటకు బద్ధకంకణులైవచ్చితిరి. — ఆహా! నాతండ్రి రాజ్యాధికారమే నా చేతులలో నున్నయెడల నొక్కగంటలో నేను నా హృదయదుఃఖములఁ బాపికొనఁజాలియుందునే!

"అయిన నింతమోసమున మాయావరణమునఁ బ్రవేశించి మాపరిచారికల మూర్ఖాత్ములఁ జేసి, ఇన్ని యసత్యములాడి, ఇన్ని విధముల నన్నును మావాండ్రను పలుదెఱఁగుల భంగములపాలుచేసియున్న నిన్ను నేను వరింతు ననుకొంటివా? నిన్ను పరిణయమాడుదునా? నీ ప్రాచీన సమయములకు, నీయాగడములకు వశీకృతురాలనై, నీతోడిదే లోకముగ నీకు దాసిననయి ఆజన్మాంత ముండుదు ననుకొంటివా? — ప్రపంచమునఁగల బంగారమంతయు నీకు గిరీటముగ నై పోయినను, భూమియందుండు మానవులనాలుకలన్నియు నిన్నే యేలికగ నంగీకరించినను నే నందుల కొడంబడను.

"కావుననోయయ్యా! నీవేసములును, నీబూటకములును, నీయాకృతియు సర్వము నాకసహ్యకరములుగ నున్నవి. ఇఁక నింతకంటె నన్నధికముగఁ బ్రేలింపక యావలకుఁ బొమ్ము! నీ విందాకచేసిన కపటవేసముల కన్నిటిని నేను గాలఁద్రొక్కివేయుచుంటినని దెలిసికొనుము. పొమ్ము. నన్నిఁకఁ గనలింపకుము. — ఇదిగో! వీండ్రనిద్దరను మన ముందటిద్వారము కడకుదోడ్కొనిపోయి ఆవలకుఁ గెంటివేయుఁడు."

అని యాగ్రహమున నామె వచించెను. అంత వ్యాయామ విద్యాప్రవీణులై బలవంత మగు దేహముల మెఱయుచున్న ఆ యెన మండ్రు పోలికలును మమ్ముబట్టుకొని యావలకుఁ ద్రోయుచుఁ బోవఁదొడంగిరి. బలవత్తర మగు గ్రహచార భారమువలె మిగులఁగ్రొవ్వి యున్న వారిహస్తములు నా బుజములఁబట్టి కొని యావలకు లాగుకొనిపోవుచుండుటచేత రెండుమూఁడులు నే నేమియో మాట్లాడ నుంకించియు విఫలయత్నుఁడనై యూరకొన వలసినవాఁడనైతిని. ఆ భవనమునకుఁ జెంది యున్న సోపానముల క్రిందివాకిటకు మమ్ము ద్రోయుకొనిపోయి అక్కడనుండి ఆయుద్యాన వనమునకును దానినుండి ముంగిలిద్వారసీమ కును మమ్ము నడిపించి వారు మమ్మావలకు గొట్టివేసిరి.

అక్కడి రాజమార్గమున కావలనున్న ఒక యున్నతప్రదేశమునకు మేము చేరు చుండగ నావల గొప్పదీపములును, మనుజులు మాట్లాడుకొనుచున్న యాలాపములును మా చెవులఁబడెను. వానిని నేను వినిపించు కొనుచుండగ నాకస్మికముగ మావంశమునఁ బీడవలె పట్టుకొనియున్న ప్రాక్తనశాపము నన్నావహించినది కావలయు. ఆనాటి రాత్రి యందలి సర్వసంఘటనములును మోసపుఁజాడలనియు, నైంద్రజాలిక దృశ్య ములనియు భావించుచు దృశ్యమానమగు నీ మానవలోకమంతయు మృగతృష్ణయందలి జలపూరమువంటిదని తలంప నారంభించితిని. ఆరాజకుమారి—ఆమెయొక్క ఆ రాకాసి బలగము — అవన్నియుఁ దలచుకొన్న సత్య మసత్యముతో, విద్యయవిద్యతోఁ గలసి యున్నవిధముగ నాకుఁ దోపఁజొచ్చెను. ఆ మహాప్రవాహము అందలి పతనము, ఆ మహిళామహావిద్యాలయమునందలి ఆ మహా కలకలము, ఆ మహారాజుల సంఘర్షణము— అవన్నియు సత్యములుగావని భావింపఁ జొచ్చితిని.

కాని అట్టి చిత్తవృత్తి నామనమున నెంత యాకస్మికముగఁ బొడమినదో అంత యాక స్మికముగనే పరిసమాప్తమైపోయెను. సూక్ష్మ మగు విషణ్ణభావమొకటి నామనమును బట్టి కొనెనుకాని దానినెట్లో విదల్చుకొంటిని. ఆ సంకోచములును, ఆ కుహనాదృశ్యము లును నాకెంత విభ్రాంతినొదవించుచున్నను అదంతియు నుత్తరధృవమునఁ గొండలనుండు మానవునకు గ్రీష్మమందలి సూర్యాస్తమయ మును, రాత్రియు, సూర్యోదయమును ఆకాశము నందలి సూర్యభ్రమణమున ఒక్క విధముగనే గోచరించునప్పుడు రాత్రియెట్లుం డునో అదేవిధముగ నాటి దుస్సంఘటన ములును బ్రవర్తిల్లినవని నామిత్రునితోఁ జెప్పుకొనుచు ముందునకు నడచిపోతిని.

ఇది మనోరమయను వచనకావ్యమునఁ గామేశ్వరమ్మయను నామెచేఁజెప్పబడిన రాజ కుమారియను కథయందు చతుర్థభాగము.

# చిత్రకళ — స్త్రీలు

శ్రీమతి కత్తారుకొండ హనుమాబాయిగారు

విద్యనుగూర్చి మనమెల్లప్పుడును ముచ్చటించుచునే యుందుము. విద్యవల్ల వినయాదిసద్గుణములు గలుగును. శిశుపోషణ శిశురక్షణ ఆరోగ్యము మొదలైనవిషయములును దెలిసికొనవచ్చును. విద్యాభూషణమును ధరించిన సుగుణమణులైన పూర్వపు పుణ్యాంగనలు జ్ఞానవంతులై ప్రఖ్యాతిపొందుట విమర్శీమణులెల్లరకుఁ దెలిసినవిషయమె. కనుకనే దానికొఱకై కొందరు మహాపురుషులయొక్క ప్రోద్బలమువల్లను ప్రభుత్వమువారియొక్క ప్రోత్సాహమువల్లను నెల్లెడలను బాఠశాలలను స్థాపింపఁబడి మనదేశమందు స్త్రీవిద్య అంకురమై తలయెత్తుటచూడ మనదేశస్త్రీలు పూర్ణవిద్యావంతులై పూర్వపు ఔన్నత్యము తేఁగలుగుదురని సంతసింపవలసియున్నది. అయినను విద్యారాజమును సహాయకారియును ముఖ్యమైనదియును బూర్వమున్నదశయందుండి యిప్పుడు క్షీణదశకువచ్చినదియునైన చిత్రలేఖన విద్యనుగూర్చి కొంత ముచ్చటింతము.

మన మనోభావములను వ్యక్తీకరించుటకు మార్గములు మూఁడు. మొదటిది వాగ్రూపము, రెండవది లేఖనరూపము, మూఁడవది చిత్రలేఖనరూపము. వాగ్రూపమున వెల్లడించువారు ఉపన్యాసకులు. లేఖనరూపమున తెల్పువారు కవులు. చిత్రలేఖనమూలమున విశదీకరించువారు చిత్రకారులు. వీరు పసిబిడ్డలకును విద్యావిహీనులకును సులభముగా తెలియఁగలందులకు స్పష్టినంతను జిత్తరువులమూలమున విశదీకరించుచున్నారు. దేవాలయములమీదను రథములమీదను గుడ్డలమీదను కాగితములమీదను, భారత, భాగవత రామాయణములలోని కథలను చిత్రించి చూపుచున్నారు; కావున అభిప్రాయములను వ్యక్తీకరించుటకు చిత్రలేఖనముకూడ లిపులకుమూలమని చెప్పెదరు. తొల్లి చీనా[illegible] ఈజిప్టులోను బొమ్మలిపియుండెడిదఁట. అదియేయిప్పటి లిపులకు మూలము అనియెదరు. ఈవిద్య అత్యున్నతస్థితిలో నుండినట్లు చరిత్రలవల్లను పురాణగాథలవల్లను దెలియుచున్నది. పురుషులేగాక స్త్రీలుసయితము ఈవిద్యలో నిపుణులైనట్లు పెక్కు దృష్టాంతములు గలవు. అభిజ్ఞాన శాకుంతలములో దుష్యంతుఁడు శకుంతలయొక్క చిత్రమును లిఖించినట్లును, రత్నావళినాటకములో రత్నావళి వత్సరాజు చిత్రపటమును, ఆమెచెలియగు సుసంగత ఆపటమునందే రత్నావళి చిత్రమును లిఖించినట్లును, ఉషా, దమయంతి, సీతా, మొదలగు సుందరీమణులు చిత్రలేఖనవిద్యయందు నిపుణులైనట్లు లెక్కకుమిక్కుటముగా అనేక నిదర్శనములుగలవు. మఱియు వివాహములయందు వధూవరుల చిత్రపటముల నొకరికొకరు పంపుకొను నాచారమున్నట్లు తెలియుచున్నది. దీనిని బట్టిచూడ స్త్రీలు ఆకాలమునందుఁ జిత్రములు వ్రాయుట ప్రబలియుండెననియు నిప్పటివారికి దాని అర్థమే తెలియకున్నదనియు నికముందైన స్త్రీలు చిత్రములు వ్రాయుటయందుఁ బరిపూర్ణజ్ఞానము గలవారై ఆంధ్రమాతకుఁ బూర్వపు ఔన్నత్యమునిల్పి విద్యయందును జిత్రలేఖన విద్యయందును గ్రైదండ యొసఁగవలెను. చిత్రలేఖనము స్త్రీలకేలయనెదరేమో? దీనివల్ల ప్రయోజన మొకరికిసుండి, ఇంకొకరికిసుండక పోవునా? అమృత మొకరికి హాయి నిచ్చి మరొకరికి హాని కలుగఁజేయునా? అట్లున్న పురుషులకన్నను స్త్రీలు మృదుస్వభావులు గనుక చిత్రములను చూచువారికి పురుషులు వ్రాసినవాటికన్న స్త్రీలు చిత్రించినవే అతి మనోహరముగా నుండును. ఇంతయేల. యీకాలమునందును రవివర్మగారియొక్క పుత్రిక చిత్రపటములు చిత్రించుచున్నట్లు ఎల్లరకు విశదమేగదా? చిత్రలేఖనవిద్య బుద్ధుని కాలములో నత్యున్నతదశలో

నుండినట్లు ఆకాలమున నిర్మింపబడిన దేవాలయములను బట్టియు స్థూపములనుబట్టియు అప్పటి తాతికట్టడములు రాతిప్రతిమలు రాతిస్తంభములు వానిపై చిత్రింపబడిన జంతుపక్షిజాతములతోఁగూడిన లతలు అందమగు నగిషీపనులతో భరతఖండమునందు పెక్కుతావుల నేటికిని చెక్కుచెదరకయున్నది. ఔరంగాబాదుసమీపమున యెల్లోరాగుహ బొంబాయివద్ద యెలిఫెంటా అజంతా అమరావతి మహాబలిపురము మొదలగు క్షేత్రములు చూచినవారి యానందమునకు మేరలేదు. వారికి ఆచిత్రకారుల నైపుణి తెలియఁగలదు. ఒకేకొండను దేవాలయముగాను ఒక్కతాతినే రథములు యేనుగులుగాను చెక్కినట్లు ఇప్పటికిని యెన్నివేల యేండ్లయినను నిన్న నేడు చిత్రించినట్లు నిదర్శనములు గానవచ్చుచున్నవి. ఇది మనపూర్వులయొక్క నిపుణత అన్నివిధముల వేనోళ్లఁ జాటుచున్నది.

ఆకాలమువు చిత్రములుగాని చిత్రించురంగులుగాని మన యిప్పటివారికిఁ దెలియవుగదా? ఒక తాతిమీదనేగాక కొయ్యమీదను దంతముమీదను నగిషీపనులుజేయుట యెల్లరకు విదితమే! తురష్కుల ప్రభుత్వకాలములోఁ జిత్రలేఖనవిద్య అభివృద్ధిలో నున్నట్లు పెక్కుదృష్టాంతములు గలవు. అయిన వీరికాలమున బింబపటములు వ్రాయుటకు మొదలిడిరి. అక్బరుచక్రవర్తి ఆస్థానమునందు దస్వంతు అను చిత్రకారుడు మహాభారత యుద్ధమునాటి చక్రవ్యూహమును చిత్రలేఖనమూలమున చిత్రించెను. ఈ వ్యూహమునందలి చిత్తరవు లన్నిటిని తులశి అను చిత్రకారుఁడు రంగులతోఁ జిత్రించెను. ఈవ్యూహము వట్టి రేఖాకారము గాక ఏనుగులు తురగములు పిరంగిదళము కాల్బలము మున్నగు యుద్ధపరివారముయొక్క వరుసలతో మిగులఁ జమత్కారముగా యేర్పాటు చేయఁబడియున్నది. జహంగీరుకాలమున దర్బారును దద్వత్తుగాఁ జిత్రించినపటము బొంబాయిలో రతన్ తాతగారివద్ద నున్నదఁట. అది హషి అను చిత్రకారుని యొక్క నైపుణి వేనోళ్ల జాటుచున్నది. పదునాఱవ శతాబ్దములో ముకుందు అను చిత్రకారుఁడు ధర్మరాజు యమలోకమును దర్శింపబోవుట అను విషయమును వూహతో వ్రాసెను. ఇది మిగుల భావానుగుణ్యముగ నున్నదఁట. ఆపటము జయపూరులో గలదు. పూర్వపు మన చిత్రలేఖనమునకును ఇప్పటి పాశ్చాత్య చిత్రలేఖనమునకును చాల భేదముగలదు. మన చిత్రకారులు చిత్రించిన పటములందును, ప్రతిమలందును, భావము, హృదయము, సయితము గనబడునట్లు విగ్రహమును జిత్రించెడివారు. పాశ్చాత్య చిత్రలేఖనములో నీభావము గనబడుట అరుదు. వారు పైరూపమునుమాత్రమే తద్వతుగానుండునట్లు వ్రాయుటకు యత్నింతురు. కాని భావమును గనబరచుటకు యత్నింపరు. మనచిత్రలేఖనము భావరూపప్రధానమై యుండును. వారిది రూపప్రధానమై యుండును. పాశ్చాత్య చిత్రపటములతో మన శయ్యాగృహములు దేవాంగణములు మొదలగుచోట్లు అలంకరింపబడెనో అప్పుడే మనజాతీయత నశించినది. పరదేశపటములతో భారతభూమి నిండినిబిడీకృతమై స్వజాతీయత అడుగంటెడికాలమున రాజా రవివర్మగారు తమ చిత్రలేఖనాకౌశలముచే జాతీయపటములను చిత్రించి భరతఖండముయొక్క నలుదిశల వెదజల్లి భారతజాతీయతను గాపాడెను. జాతీయోద్ధరణకు జాతీయపటములుండితీరవలెను. యెవరు జాతీయభావములను, జాతీయాచారములను నడవడులను బాగుగా గ్రహించి చిత్రపటములను జిత్రింతురో వారే నిజమైన చిత్రకారులు. దేశభక్తులు దేశసేవకులు. దేశముయొక్క పూర్వపుటౌన్నత్యము నిలుపువారలు కవులు చిత్రకారులు. దేశముయొక్క భావిస్థితి వీరిపై నిలిచి యుండును. గ్రంథములకన్నఁ బటములే పసిబిడ్డల నాకర్షింపఁగలవు. అక్షరజ్ఞాన ముండినగాని గ్రంథములు చదువుటకు వీలులేదు. నిరక్షరకుక్షులైనను, మాటలురాని పసిబిడ్డలైనను చిత్రములనుజూచి [illegible]

గ్రహింపగలదు. కావున బాగోగులకు గ్రంథములకన్నఁ చిత్రపటములే ముఖ్యసాధనములు. రామాయణము మొదలగు కథలను పిల్లలకు రెండు మూఁడు దినములు చెప్పినను దానిని వారు తిరిగి చెప్పుటకు సామర్థ్య మంతగానుండదు. దానినే బొమ్మలమూలమున వారికి బోధించినచో సులభముగా గ్రహింతురు. తిరిగి యా కథను విశదీకరింప శక్తిమంతులగుదురు. పెద్దవారి కన్నఁ బసివారికి బొమ్మలయందు మిగులప్రీతి. దీనిని బట్టి యోచింపగాఁ జదువువలన మెదడునకు గలుగు నట్టి యపరిమితశ్రమ చిత్రలేఖన విద్యామూలమునఁ గొంత తగ్గుచున్నది. శ్రమ యధికమగుకొలది బాలురు బలహీనులగుచున్నారు. మెదడునకు కలుగుచున్న శ్రమలో నీ చిత్రములవల్ల నేత్రములు హస్తములు కొంత పాల్గొనుచున్నవి. ఇట్టి యద్భుతశక్తి యీ విద్యయం దుండుటబట్టియే ఇంగ్లండు, అమెరికా, జర్మనీ, జపాను దేశములయందు కళాశాలలలో నిది గూడ బోధనాయోగ్యమైన విద్యయని ముఖ్యాంశ ములలో నొకటిగాఁ జేర్పబడినది. ఆదేశములలో బాలురకుఁ బ్రకృతిశాస్త్రము లన్నిటిని సినిమిటో గ్రాఫ్ యంత్రముద్వారా బోధించుచున్నారు. మన దేశమందలి బరోడా మున్నగుచోట్ల నదేవిధముగా బాలురకు విద్యలను గఱపుచున్నట్లు తెలియుచున్నది. మఱియు భూగోళశాస్త్రమును (మ్యాపు) చూచిచదివిన దానికిని, పటముచూడక చదివిన దానికినిగల వ్యత్యాసము మనకందరికి విదితమే. ఒకఁడు తాను మోయలేని బరువును బండిసహాయమున మోయ శక్తిమంతుఁ డైనట్లు బాలుఁ డెంతచదివినను గ్రహింపలేనిదానిని చిత్రలేఖనరూపమున సులువుగా గ్రహింపగలుగు చున్నాఁడు. పరిపూర్ణమైన జ్ఞానవంతు డనిపించుకొను టకీ విద్య సహితము నేర్చియుండవలెనని కొంద ఱాంగ్లేయ ప్రముఖులు నుడివియున్నారు. దీనికి యోచనాశక్తి చాల నుండవలెను. మనస్సునకు అద్భుతశక్తి గలుగును. ఆ యోచనాశక్తివల్లనే గదా జలరాసిపై నోడలసహాయమునఁ బ్రయాణము చేయు చున్నారు. విమానములలో నెక్కి గగనమార్గమున సంచరించుచున్నారు. భూమిపై ధూమశకటములను నడిపించుచున్నారు. అట్లులే హస్తమునకు నద్భుత శక్తిగలుగును. నేత్రము వీక్షింపనిది మనస్సు యోచింప జాలదు. అట్లు యోచనలేనిదానిని హస్తము లిఖింప నేరదు. లోకములో దైవనిర్మితములుగాక మిగిలిన వన్నియు హస్తనైపుణివల్లగదా నిర్మింపబడుచున్నవి? మనోహరమైన చిత్రపటములు, దివ్యసౌధములు చిత్రములైన పింగాణిబొమ్మలు గిన్నెలు నేతపనులు మొదలగునవి హస్తమువల్లనే గదా చేయఁబడుచున్నవి. ఈవిద్య నశించుటకు హేతువు పోషకులు లేనందునను, మనము దీనికిదగిన ప్రాముఖ్యము నివ్వకుండుటయే యని తోఁచుచున్నది. ఈ కాలములో చదువే జీవనోపాధి కనుకూలమగు విద్యయనియు నదియే గౌరవపాత్రమైనదనియుఁ దలచి ప్రతివారును దానినె యభ్యసించుచున్నారు. ఇప్పుడిప్పుడు మనవారు చిత్రలేఖనముగూడఁ జదువునకు సహాయకారియని గ్రహించుచున్నారు. చిత్రలేఖనమునకుకూడా చదువు సహాయకారి యగుచున్నది. ఎట్లనగా చదువరులు బాగుగా యోచించి చిత్రించెదరు; గనుక ఆచిత్రములు ఇంకను గడు రమ్యముగా నుండును. ఇప్పటికి పాశ్చాత్యదేశమునఁ బ్రతిపట్టణమునందుఁ జూపరుల కానందము నొసగు చిత్రపటమందిరములున్నది. బరోడాయందు కూడ నిట్టి చిత్రపటప్రదర్శనమందిరము స్థాపించియున్నారు. ఈ విద్యవల్లఁ బ్రాచీనగాథలనన్నిటినిఁ జిత్రరూపమునఁ జిత్రించి విశదీకరింపవచ్చును. వీరుల యొక్కయు, భక్తులయొక్కయు, దేశోద్ధారకులయొక్కయు, కవీశ్వరులయొక్కయు, చిత్రపటములవ్రాసి ఉంచవచ్చును. తనరూపమును వ్రాసి దవ్వుననున్న తన బంధుమిత్రులకుఁ బంపవచ్చును. పరదేశములోని యందమగు కట్టడములు తోఁటలు కొండలు మొదలగునవి చూడవలెనన్నను చిత్తరువులిఖించి పంపవచ్చును.



శ్రీమతి యస్. సి. పుష్పము బి. ఎ.,

కీ. శే. కందుకూరు వీరేశలింగముపంతులు గారి శరణాలయమున

సుష్టుభద్రతపొందిన మొదటి యువతీమణి.

తౌమ చూచి ఆనందించినది గాక యితరులను ఆనందింపఁ జేయును. మరియు నిది ప్రతిదేశీయులకుఁ దెలియునట్టి సామాన్యభాషవంటిది. అందులకు నిదర్శనము కుక్క యని తెలుగుభాషలో నొక కాగితముపై లిఖించి దానిని ఇతరదేశీయులకుఁజూపిన వారుదానిని గ్రహింప లేరుగదా? దానినే కుక్కపటముగ వ్రాసిచూపిన ప్రతి వారును వారివారిభాషలోఁ గుక్కయని చెప్పుదురు. కుక్కపటమును కుక్కయెదుటనుంచిన అదియును దన జాతిజంతువని దానినిఁజూచి మొఱుగును. గావున బహుపక్షాయ మలకును గ్రహింపగలుగునట్టి విద్య గాన నిట్టి అద్భుతవిద్యకొఱకై యెల్లరు ముందంజవేసి ఈవిద్యకు స్వాగత మొసగుదురు. రంగురంగుపటములనుజూచి యానందించుచు జ్ఞానము బిడ్డలకుఁ బుట్టుకతోనే గల్గుచున్నది. రంగు నేత్రములయొక్క శక్తిని వృద్ధిపరుచును. మనస్సునకు సంతోషమొసగును. గనుకనే భగవంతుఁడు మన చుట్టునుండెడి సృష్టినంతను వివిధము ల్గగు రంగులతో నింపియున్నాఁడు. ఆకాశమువంకఁ జూచిన నేత్రోత్సవము సేయు చిత్రవిచిత్రమైన రంగులుగల మేఘములును, భూమివంకఁజూచిన వివిధ మైన ... వుఋను నిం... కావున నీశ్వరుఁడు ...నిచ్చెను. కొంటికే సృష్టించియున్నాఁడు... పెద్ద జబ్బుచేసి నిర్మించిన భగవత్సృష్టికన్న మిన్నగా వంకమించ్చొలంతటి శక్తిని లెందును లేవు. ఇకముందుండఁబోవు. వా యుండెడి యగు చిత్రకారుఁడైనను సృష్టిలోని చిత్రములను మెప్పించుట గొనియే లిఖించుచున్నాఁడు. ఈవిద్య నభ్యసింప నుద్దేశించువారు ఎట్టిగ్రంథములను జూడనవసరము లేదు. తెలివిగలవానికి సృష్టియే గొప్పగ్రంథము. ఈ గ్రంథమునం దెట్టితప్పు నుండబోదు. దేవుడొక్కడే సంపూర్ణగ్రంథమును సృష్టించినవాఁడు. మొదటి చిత్రకారుఁడు నాతఁడే. యోగి జ్ఞానేంద్రియములతో నీశ్వరునిగనుగొని యానందించినట్లు చిత్రకారుఁడీసృష్టినిగని యానందించును. ఇతరుల నానందింపచేయును. బాలురకు, వృద్ధునకు, పండితునకుఁ బామరునకు నానందదాయకమగునట్టి యీ చిత్రలేఖనవిద్యను మన బాలురకు బాలికలకు నేర్పుట మంచిది.

# బాల విజ్ఞాన శాఖ

## దైవఘటన తప్పదు.

శ్రీమతి బుర్రా అన్నపూర్ణమ్మగారు

పూర్వం ఒకప్పుడు విదర్భదేశం ఒకరాజు పరిపాలిస్తున్నాడు. ఆయనపేరు సుమన్యప్న మహారాజు. సంతానంలేక చాలాకాలం కనుపడ్డ రాతికల్లా మొక్కాడు; రాణీచేత మొక్కించాడు. అప్పుడు లోధ్ర లోకంలో లేదు కాబట్టి, వారు దంపతులిద్దరు తీర్థయాత్రలకేం బ్రాహ్మణసంతర్పణలకేం చలివేంద్రాలు పెట్టించడానికేం లెక్క లేనిడబ్బు ఖర్చుపెట్టారు. ఒకక్రమానికి వారిమొర దేవుడాలకించాడో అన్నట్లు పుత్రసంతానం కలిగింది. కాని బిడ్డమాత్రం పెద్దపులి తోకతో ఆవిర్భవించాడు. నేడు గదా మా జన్మతరించిందని ఉబ్బిపొయ్యారు రాజదంపతులు. అయినప్పటికీ తోకసంగతి తలవగానే గుండె ఝల్లుమనేది వారిద్దరికీ. ఏ జన్మాన చేసినపాపమో అని వాపొయ్యేవాళ్లు "లేకలేక లచ్చన్నపుడితే నెత్తిమీద మొలిచి వట్లాయిండేం" మా కర్మ అంటూ. దానికితోడు అబ్బాయి ఆటే అందగాడు కాడు.

అందుకే రాజకుమార్తె లెవ్వరూ వరించలేదు. "ఎందేశం గొడ్డుపోయిందా? మాకేం కర్మం పులి మారాజును చేసుకోవలసినగతి" అన్నారు. లేకలేక కలిగిన సంతానం గనుక ఓయింటివాణ్ణి చేద్దామని రాజదంపతులపట్టు వారి అనుమతిమీద మంత్రి వధ్వన్వేషణకై దేశదేశాలు తిరగడం మొదలుపెట్టాడు. పోగా పోగా, ఓ వట్టణవనిలో ఓ పేదరాలు పెద్దమ్మ యిల్లుకట్టుకొని కాపరంచేస్తూన్నది. ఆమెకు ఇద్దరు కుమార్తెలు. వాళ్లిద్దరికీ మంగమ్మ వెంకమ్మ అని పేరుపెట్టింది పెద్దమ్మ. మంగమ్మకు చక్కదనం ఆటే లేదు. దానికితోడు అన్యాయపరురాలు గూడను. వెంకమ్మ మాత్రం సద్గుణాలకునిధి అమితచక్కని చిన్న. చేసిన బొమ్మలావుండేది. అదేం పాపమో గాని మొదటినుంచీ తల్లికి తనకు పచ్చిగడ్డి వేస్తే భగ్గుమంటూ వుండేది. పాపం మొన్నాళ్లని ఓర్చుకుంటుంది కొత్త కోడండ్రికం.

ఆ పెద్దమ్మ వెంకమ్మను "నాకడుపున యెందుకు పుట్టావే వేపుకుతింటున్నావు. నిన్ను పెద్దపులికన్నా యిచ్చివేసి నాపీడ విరగడ చేసికొంటాన"నడం మంత్రి విని పెద్దమ్మ తన మనోరథం తీర్చగలదని దగ్గరకుచేరి నచ్చచెప్పి సంబంధం కుదిర్చాడు పులిమహారాజుకు. కొద్దిదినాలకు వివాహంకూడా మహావైభవంగా జరిగింది వధూవరులిద్దరు చిలకా గోరువంకల్లా వున్నారు.

* * *

వెంకుబాయమ్మను తల్లి ఆ చిట్టెడునీళ్లూ నాదగ్గర పోసుకుంటుందని వుతకలాడేందుకు తీసుకెళ్లింది. మంగమ్మ చెల్లెలి ఆభరణాలు హస్తకంకణాలు మాచి ఓర్వలేక పోయింది. ఓనాడు తల్లీ కూతురు ఏకమై వెంకుబాయమ్మ ఆభరణాలన్ని తీయించి గొడ్లో నూతిదగ్గరకు తీసుకుపోయ్యారు తలంటిపోసేందుకు. పిచ్చియిల్లాలు కళ్లుమూసుకు సిద్ధంగా కూర్చొంది. కొంతసేపటికి నూతులో గభాలుమని చప్పుడయింది. పెద్దమ్మ యింట్లో కొంతకాలం అంతా నిశ్శబ్దం. అటుపిమ్మట అంతా ఆనందంగా మారింది.

మూడో నెలను పులిమహారాజు తల్లిని బిడ్డను తీసుకుపొయ్యేటందుకు అత్తవారింటికివచ్చి వాకిట్లో నులకమంచంపైన చతికిలపడ్డాడు. వెంటనే ఏడువారాల పొమ్ముపెట్టుకొని కాయకంటితో, అమ్మవారుపడ్డ

మచ్చలతో మారేమ్మవలె ఓవిగ్రహంతయ్యారై "బిడ్డ పుట్టిపోయె, అమ్మవారు పడితే" నని గొణిగింది. పులి మారాజు నిర్ఘాంతపోయాడు. ఆలోచనాగ్రస్తుడై నాడు. కూతురికి గాజులు వేయించి అత్తవారింటికి పంపాలని పెద్దమ్మ దారినబోయ్యే గాజులబత్తునిపిలిచి గాజులు తొడిగించింది. మంగమ్మకు డబ్బుతెచ్చేందుకు అమ్మా కూతుళ్లు యింట్లోకివెళ్లి గుసగుస మొదలెట్టారు. పులిమహారాజు దృష్టి మలారానికి అంటించిన కాగితం వేపుకుపోయింది యింతలో. దానిమీద "అడివిలో అక్కమ్మ మనుమడా పులిమహారాజు కొడకా, ఏడవకు ఏడవకు నాచిట్టితండ్రి" అని వ్రాసి వుంది. రాచబిడ్డ గనుక అంతా క్షణంలో గ్రహించాడు. మెల్లగా గాజులశెట్టి నడిగి పాతాళలోకంలో నాగకన్యక లోకి తల్లిపిల్లను పెంచడం అంతావిన్నాడు. అతనికి హృదయం తొట్రిలింది. గాజులశెట్టి చెవిలో ఊరి బయట కలుసుకోవలసిందిగా వూదాడు. తల వూపాడు సరేనని శెట్టి. వెంటనే మంగమ్మను—అత్తగారిని నగరుకు ప్రయాణంచేశాడు రాజు. మేనాలు యింటి మెహ... ధభూమి' పై విమర్శన పాతాళలోకానికి పొ... ...చిక (నవంబరు పెట్టుకునుంచుంది. ఏం యీకర్మ... నేం చేసుకున్నకర్మమే యెవ్వరూ ఏం... చనలో వెంకుబాయమ్మ. లేకపోతే తనవేలు పెట్టుకు ...లకు పొడుచుకుంటుందా. పిల్లాడుకూడా ఊకిస...కొట్టుకొంటూ పులిమహారాజుమీదకు వురికాడు. నాగకన్యకల అనుమతితో తల్లిని పిల్లను బయలుదేరదీశాడు వెంటనే రాజు. సలక్షణంగావున్న వెంకమ్మను చూచి మంగమ్మా పేదరాలుపెద్దమ్మా వణికిపోయ్యారు. ప్రాణాలమీద ఆశవదిలారు. కాని పాపం వెంకుబాయమ్మ అంతపాపం తలుసుకోలా. అక్కకు తల్లికి వేరేవూళ్లో యిల్లువేయించింది పులిమహారాజుకు నచ్చచెప్పి. పాపం కొన్నిదినాలకే పక్షవాతంవచ్చి పరమపదించింది మంగమ్మ. ఇప్పుడు అక్కమ్మగతి యెవ్వరు? పాపం ముద్దరాలు తననోట మట్టి తానే కొట్టుకోనేందుకు యత్నించింది. దైవఘటనం యెల్లా మారుతోందో ఎవ్వరికెరుక!

మునుపటివలెనే "గృహలక్ష్మి"కి పెక్కు సోదరీమణులనుండి రచనలు వచ్చుచున్నందులకు మా కృతజ్ఞతా నందనములు. ఇంకను వారిని కథలను, పద్యములను, పాటలను, స్త్రీలకు సంబంధించిన వివిధ విషయములను వ్రాసి పంపుదురుగాక యని గోరుచున్నాము. వ్యాసములు విడివిడి కాగితమున ఒకే ప్రక్కన వ్రాసిపంప వేడికోలు.

సంపాదకులు.

# మీగడతఱక

'గృహలక్ష్మి" దసరా (అక్టోబరు) సంచికలో శ్రీయుత చదువుల రామచంద్రయ్యగారిచే రచింపబడిన "అబిసీనియా చరిత్ర"యను చరిత్రాత్మక వ్యాసమును ప్రచురించుట, నద్దానిపై శ్రీయుత వి. విశ్వనాధముగారిచే రచింపబడిన విమర్శనమును "ఆంధ్రభూమి" నవంబరుసంచికలో 'కారపుకనగల'నే శీర్షికక్రింద వెలువరించుట, పై రెండు సంచికలను గమనించిన వారికి విశదమే. "గృహలక్ష్మి" సంపాదకులుగాని, వ్యాసకర్తలుగాని నేటివరకును పైవిమర్శనమునకు సమాధానము వ్రాయలేదు. బహుశా, 'మఘలోపుట్టి పుబ్బలో మాడు' సంచికలు వేనవేలు వెలువడుయిక్కాలమున పై విమర్శనమును వారి దృక్పథమునపడెనో, లేదో, సంశయాస్పదమే.

"గృహలక్ష్మి"ప్రచురించిన వ్యాసములో "మెనలెక్ అనంతరము అంతఃకలహములు జరిగి తరువాత ఆతని మనుమరాలు రాణిగను ప్రస్తుత చక్రవర్తియగు రాస్టపారి ఆమెకు సంరక్షకుడుగను నియమింపబడి అంత్యమున నాతడే చక్రవర్తియయ్యె"నని గలదు. "ఆంధ్రభూమి" ప్రచురించిన విమర్శనము "మెనెలెక్ తరువాత అబిసీనియాను అతని మనమరాలు పాలించినదని వ్రాయబడ్డది. అన్నిచరిత్రల్లోను మనమడు పాలించాడనిగలదు. మరి గృహలక్ష్మిలో ఇల్లా ఉండడానికి కారణమేమిటి? ఆడవాళ్లపత్రిక కాబట్టి ఔచిత్యభంగం లేకుండా మనమడు మనమరాలుగా మార్పుచేయడమైనదా?" యని ప్రశ్నార్థకముగ ముగించిరి.

ఈ సందర్భమున వ్యాసము, విమర్శనము యొక ప్రక్కనుంచి, అబిసీనియా దేశచరిత్ర కొంత గమనించవలసియున్నది. అబిసీనియా చక్రవర్తి నాల్గవ 'జాన్' చనిపోయిన పిమ్మట 'మెనలిక్' రాజయ్యెను. 'మెనలిక్' గతించినపిమ్మట(1913-వ సంవత్సరములో) నతనికి పురుషసంతతి లేకపోవుటచే తదనంతరము నతని మనమడు (కూతునికుమారుడు) 'లెజీయాసీ' రాజ్యమునకు వచ్చెను. గాని యవినీతికరముగా ప్రవర్తించుటచే ప్రజలు తిరుగబడి యాతనిని కారాగృహమున బంధించి 'మెనలిక్' కుమార్తెయగు 'జాడిటూ'కు (1916 వ సంవత్సరమున) రాజ్యమిప్పించి, మెనలిక్ మేనల్లునిని ప్రస్తుతపు చక్రవర్తియగు 'రాస్టఫారి'ని యామెకు సంరక్షకునిగ నియమించిరి.

వ్యాసమున 'మనుమరాలు'అని యున్నచోట "కుమార్తె" యని యుండవలెను. ఇది అచ్చుతప్పైనను కావచ్చును లేదా. వ్యాసకర్త పొరపాటైనను యుండనోపు* ఈమెకు రాస్టఫారి సంరక్షకుడుగా నియమింపబడెనని వ్యాసమున వ్రాయబడుటచే పై సవరణ నిర్వివాదాంశము." మెనలిక్ అనంతరము అంతఃకలహములు జరిగి తరువాత ఆతని మనుమరాలు రాణి

* [illegible] పొరపాటు.

గను......"అని వ్యాసమున వ్రాయబడుటచే నిచ్చట "అంతఃకలహాములు జరిగిన తరువాత" యనునది లెజియాను రాజ్యమునకు వచ్చుట, ప్రజలవలన బంధింపబడుట, మున్నగు చరిత్రాంశములను సమర్థించుచున్నది.

ఇక విమర్శకులు "మనుమరాలు"యను చోట "మనుమడు"అని యుండవలెనని వాదించుట ఎంత సహేతుకముగనున్నదో చదువరులే యోచింపుడు. స్థూలదృష్టితో గృహలక్ష్మిసంచిక నామూలాగ్రముగ జదివి, శ్రమయనక విమర్శనమును—నిరాధారమైనప్పటికి—ప్రకటించినందులకు వారికి మాయభివందనములనంద జేయుచున్నాము.

ఇట్టి స్వల్పవిషయములపై విమర్శనమును ప్రకటించు 'ఆంధ్రభూమి' పై విమర్శనమును ప్రకటించిన సంచిక (నవంబరు సంచిక) సంపాదకీయ సమాలోచనలో "సరిగా పదమూడుసంవత్సరములకు పూర్వము ఇదేమాసమున (అక్టోబరు) ఇరువదిరెండవ తేదీని ఆతని ఆజ్ఞపై అతని యనుచరులు రోము మహానగరమునకు మహాప్రస్థానము గావించిరి,"యని ప్రచురించినది. దేశచరిత్రలో ముసోలినీ 1922 వ సంవత్సరము అక్టోబరు 28-వ తేదీని రోము నగమునకు మహాప్రస్థానము గావించెనని యున్నది. 'ఆంధ్రభూమి' యిల్లు తెలుపుటకు కారణమేమి?

"తప్పు లెన్నువారు తమ తప్పులెరుగర"ను వెఱ్ఱివేమన నుడువులు చిరస్మరణీయములుగావా?

నవీనశాస్త్రజ్ఞులు ఆలోచనయొక్క శక్తి గుర్తించినారు. కావుననే 'మానవుడెట్లు దలంచునో అట్లయగు'నని జెప్పబడుచున్నది. హత్యలనుగూర్చి ఎపుడు తలంచువాడు హంతకుడగును; వ్యభిచారమును గూర్చి తలంచువాడు తప్పక వ్యభిచారియగును. కాని సత్యమును అహింసనుగూర్చి ఎల్లప్పుడు దలంచునాతడు సత్యవ్రతుడై అహింసాపరుడై యుండును. దైవము నెప్పుడు చింతించువాడు ధార్మికుడగును.

"మహాత్మగాంధి."



# శిశుపోషణ

శిశుపోషణగూర్చి తెలుసుకోడం అవసరం. కాన్పో తల్లి తల్లయితే వృథాగాదు. ఒకవేళ ఆ అదృష్టం పట్టకపోతుందీ తెలీనివాళ్ళకి నచ్చచెప్పొచ్చు. అయితే ఏ బాధలూ లేక నెలలు నిండి సుఖప్రసవమయితే గదా ఇదంతా. తిన్నగా నీళ్ళుపోసుకోవాలంటే ఏ ఆరోగ్యవిధులో అనుసరించాలా. అవేమిటి. ఏం పెద్దపెద్ద నిబంధనలు కావు సత్కాలక్షేపం చేస్తూ నిశ్చింతగా హాయిగా. ఉండమనీ, యోగ్యభోజనం, యిలాస్నానం చేయమనే. భోజనం తేలిగ్గా త్వరగా జీర్ణమయేట్లు, ద్రవపదార్థాలు జాస్తి కలిసిందిగా, వుండటం అవసరం.

స్నానానికి ఒంటి తత్వాన్ననుసరించి, ఏ నీళ్లైనా వాడుకోవచ్చు (రాత్రిళ్లు వేణ్ణీళ్ల ప్రశస్తం) గాని, నూనె రాచుకొని చేయడం శ్రేష్టం. తలంటుకోవడమూ మంచిదే దరువులూ తాళాలు సిసికించికోడాలు లేక పోతే. ఇక పనులూ—ఇంటిపనులు ఆయాసపడకుండా చేసుకోవచ్చు తిని వట్టినే కూర్చోకుండా. మంచిగాల్లో చల్లవేళ కొద్దిగ నడవనూ వచ్చు.

గుడ్డ గుడుసుల్లోకూడా జాగ్రత్త ఆవశ్యం. శుభ్రంగా వేలిగ్గా వుండేవి బిగువులేనివి వాడవలసినవి.

పరిశుభ్రత గుడ్డలకేకాదు సర్వసాధారణమై వుండవలె. పకాలంలో ఓ 9 గంటలు నిద్ర పక్కవిషయంలో శ్రద్ధ ఉండవలె కూడ.

ఇక ప్రసవం హాస్పిటల్‌లో జరగడం మంచిది ఇంట్లోకంటె అన్ని అవకాశాలుంటాయి గనుక. ఏకారణాలవల్లనయినా వీలు పడనూ ఇంటిల్లిపాదికీ శుభ్రమైన గదిలో ప్రసవానికి ఏర్పాట్లు చెయ్యాలి దీంచే మిగిలిన వాళ్లకు ఏం ఇబ్బందివున్నా. మరోవిషయం గమనించవాల్సింది బిడ్డకు ప్రత్యేకంగా ఓ పడక. ఏమైనాసరే బిడ్డా తల్లి ఒకేపడకలో పడుకోకూడదు.

—యస్. శేషగిరిరావు.

# పుష్పచయము

రష్యాదేశములో సోవియటు ప్రభుత్వమున "పిల్లలయోగక్షేమము ముందు ఆ వెనుక పెద్దవారిమాట" అనునది మూలసూత్రముగా నున్నది. ఈదిగువ నుదహరింపబడిన యంశములు నిశ్చయముగ సంతోషము గలిగింపక మానవు. రష్యాలో కాయకష్టముచేత జీవించుస్త్రీలు గర్భవతులగుదురేని పురిటికిముందు రెండు నెలలును పురిటితరువాత రెండునెలలును శాసనరీత్యా సెలవుండి తీరవలెను. ఈ సెలవుదినములకు జీతము నియ్యవలెను. వైద్యవృత్తి నాట్యవృత్తిగల యువతులకు నిదేపద్ధతి. కచేరీలలో పనిచేయువారికి మాత్రము మూడు నెలలు విశ్రాంతి నిండుజీతముమీదనే !

ఒకయువతి గర్భవతి కాగానే ఆమె పలుమారు వైద్యనిలయములకు క్రమముగ పోవుచుండవలెను. చిన్న చిన్న జబ్బులు వచ్చునపుడామె యెట్టివాటినుండి తన్ను తాను రక్షించుకొనవలెనో అదియంతయు నామెకు వైద్యు లుపదేశింతురు. అంతేకాక అవసరమున్నయెడల బలకరములగు మంచియాహారములను కూడ సప్లై చేయుదురు. గర్భవతు లెవరైన క్షయాదిమహారోగములు గలిగియుందురేని వారిని ఆయారోగముల కేర్పడియున్న వైద్యగృహములందుంచి చికిత్స చేయుదురు. ఈ జాగ్రతవలన దేశములో విషవ్యాధు లెంతో తగ్గిపోయినవి.

పురుడైనతరువాత తిర్గివచ్చి మరల కర్మాగారమునచేరి పనిచేయును. అట్టియెడ నామె పనిచేయవలసిన యేడుగంటల కాలములోనుండి ఒకటిన్నరగంటల కాలము మినహాయింపబడును. ఈ యొకటిన్నరగంటలకాల మామె తనబిడ్డకు పాలిచ్చుకొనుటకే. దీనికిగాను ప్రతికర్మాగారమునందును ప్రత్యేకముగా గదు లేర్పరుపబడి యుండును

చాలామందిబిడ్డలు సాధారణముగా శిశురక్షణాశ్రమములలోనే సురక్షితులై పెరుగుచుందురు. ప్రతి యంత్రాలయమునకు సంబంధించి ఇట్టి ఆశ్రమములుందును కచేరీలయందును కళాశాలలయందుగూడ నిట్టి యాశ్రమములు నెలకొల్పబడియుండును. ఆరోగ్యవంతులగు యువయువతీజనములు, విద్యార్థులై యున్నంత మాత్రమున బిడ్డలను కనరాదను సిద్ధాంత మచటలేదు. ఈ యాశ్రమములోనే బిడ్డలనేర్పవలెనను నిర్బంధమును లేదు. కాబట్టి ఈ సంస్థలు సర్వసాధారణముగా ప్రొద్దున ఏడుగంటలుమొదలు సాయంకాల మైదువరకు తీసియుండును. 1932 లో వెళ్లివచ్చిన బ్రిటిషు కో ఆపరేటివ్ రాయబారవర్గమువారి రిపోర్టులో నిట్లు వ్రాసినారు.

"మేము దర్శించిన శిశురక్షణాలయమున మూడుభాగములున్నవి. ఇందు మొదటిదానియందు రెండు నెలలు మొదలు తొమ్మిదినెలలవయసుగల శిశువులున్నారు. ఒక్కొక్కగదిలో నలుగురికి తక్కువయు పదిమందికి యెక్కువయు శిశువులుండరు.

"ఈబిడ్డలతినిర్మలములైన కేన్వాస్ పరపులపైబరుందురు. వీరిపై తెల్లని [illegible] తప్ప మరేమియు కప్పబడియుండవు. గుండెలును భుజములును [illegible]

నిర్మలమగు గాలి తగులుచుండును. అన్ని కిటికీలును తలుపులును బాగుగా తెరువబడియుండును. ఎనుబది డిగ్రీలకు మించిన యుష్ణత లేదు. ఈగలును దోమలును రాకుండుటకుగాను పలుచని తెరలు కిటికీలకును ద్వారములకును కట్టబడియుండును. లెస్సగా పరీక్షింపబడిన పాలే బిడ్డలకాహారము.

రెండవగదియందు తొమ్మిది మొదలు పదునెనిమిది నెలల యీడుబిడ్డలుందురు. ఇచట వీరు తప్పటడుగులు వెట్టుచు దుముకుచు లేచుచు పడుచు శైశవక్రీడల జేయుచుందురు.

మూడవతరగతి గదియందు పదునెనిమిది నెలలు మొదలు మూడేండ్లయీడుగలవా రాడుకొనుచుందురు. వీరికొరకై చిన్ని మేజాబల్లలును వాటిచుట్టు చిన్నికుర్చీలు నమర్పబడియుండును. ఇచట వీరొకరితో నొకరుకలిసి యాడుకొనుట మాటాడుకొనుట మొదలగునవి జరుగుచుండును.

పుట్టుకచేతనే వికలాంగులగు వారికొరకు ప్రత్యేకముగా నిటులనే యాశ్రమములున్నవి. వీనిని సర్వదా వైద్యులు తనిఖీ చేయుచుందురు.

ఈ మూడేండ్లైనతరువాత బిడ్డలు ఏడేండ్లయీడు వచ్చువరకు కిండర్ గార్టెన్ స్కూళ్లకు బోదురు. 1931—32లో మూడు ఏడు నేండ్ల మధ్యవయసుగలపిల్లలు ఆరులక్షలమంది యున్నారు.

ప్రకృతి తత్త్వముదెలిసి యెల్లవారును పరస్పర సహాయభూతులై అక్కరకుమాలిన పిచ్చిపిచ్చి మతవిశ్వాసములను వదలి, ఆనందయుతులై యారోగ్యయుతులై, దేశముకొరకును, సంఘముకొరకును బనిచేయగల స్త్రీపురుషులను తయారు చేయుటయే విద్యకు లక్ష్యము కాబట్టి యిట్టి మహదాశయము ఈయాశ్రమములందుండియే యారంభమగుచుండును. కొంతమంది వంటకు కట్టెలకొట్టుదురు, కొంతమంది బల్లలువేయుదురు, కొంతమంది గుడ్డలుతుకుదురు కొంతమంది యిస్త్రీ చేయుదురు. ఈపనులన్నియు సక్రమముగా నడిపింపబడును మరియు నివియన్నియు నాటలలోనే లెక్క. ఏయాటయందైనగాని ముగ్గురు నలుగురు చేరియే యుందురుకాని 'నన్ను ముట్టుకొనకు, నామాలకాకి' యని ఒక్కడే యొకచోట నెప్పుడు గనబడడు. అంతేకాక ఆడుపిల్లలును మగపిల్లలును కలసిమెలసియే యుందురుగాని 'యెవరికివారే' యను పద్ధతిలేదు. కష్టపడి పనిచేయుటయను జ్ఞానము బొడ్డూడని యిట్టి పసితనముననే కలిగింపబడుచుండును. అప్పుడప్పుడు గొప్పగొప్ప యంత్రాగారములకు దీసికొనిపోయి, యీపసిపాపల కచ్చటికార్యములన్నియు జూపింతురు. పనులలోగూడ ఆడువారిపని మగవారిపనియను భేదములేదు. ట్రాము, మోటార్లను నడపించుట, రొట్టెలుకాల్చుట, వంటలువండుట మొదలగుం పనులన్నియు నేర్పబడును.

ప్రారంభతరగతి మధ్యమతరగతియని పాఠశాలలయందు రెండుతరగతులుండును. కసరత్తును, సంగీతము తప్ప తక్కినవిషయములన్నియు ప్రాథమికపాఠశాలయందు చెప్పబడును. రెండవదానియం దుపాధ్యాయులే వ్యక్తి కేది బాగుగా వచ్చునో అది నిర్ణయింతురు. కొన్నికొన్ని పాఠశాలలు కొన్నికొన్ని యంత్రాగారములకు అనుబంధములైయుండును. అట్టిచోట పిల్లలు ఆ యా పనివాండ్రకు సహాయముచేయుచు తద్ద్వారా వారి రీతులన్నియు గమనించుచుందురు.

ఈచదువులవేడుకల కెన్నియో నాటకశాలలున్నవి. సినిమాలున్నవి. ఇవియన్నియు విద్యాశాఖ [illegible] ధరించుచున్నారు.

## పుష్పచయము

ప్రభుత్వశాసనము, పిల్లల యోగక్షేమాభివృద్ధియెడ పక్షపాతమువహించియున్నది. ధర్మసంతానమనెడి మాట రష్యాలో వినరాదు. వీడు నాకొడుకు కాదన్నంతమాత్రమున మగవాడు తప్పించుకుపోలేడు. పిల్లలను తండ్రి సక్రమముగా నడిపించవలసినదే. లేకున్న శాసనము వానిపిలక పట్టుకీడ్చి విడచును. భార్యాభర్తలు లోకవ్యవహారము విడాకులిచ్చుకొన్నను శిశుసంతానయోగక్షేమబాధ్యత మాత్రము వానికి తప్పదు. ఈపద్ధతి నతిక్రమించినవానికి శిక్షతప్పదు.

ఇట్లు సర్వవిధములచేతను పిల్లలు సంరక్షింపబడుదురు. కావున వారిదేశము గొప్ప సాఫల్యకరమైనదను కొంత వచ్చును.

### అడయారు సమావేశములో నుపన్యసించుచు శ్రీమతి రుక్మిణీఅరండేల్ గారిట్లనిరి.

భారతదేశము పరాధీనస్థితి ననుభవించుటవలన కలిగిన దైన్యభావములో తనగొప్పతనమును మరచిపోవుచున్నది.

వివిధకళలును భగవంతునియొక్క వివిధస్వరూపములని మనకళానైపుణ్యమునకు రెండుదాహరణముల నొసగెదను. సంగీతము, నాట్యము తీసుకొందము. ప్రతిరాగమునకు ఒకవిధమగు ఆపదమేగాక, ఒకవిధమగు భావమును పుట్టింపగలశక్తికూడ కలదని మనప్రాచీనసంగీతశాస్త్రజ్ఞులు కనుగొనిరి.

సంగీతములోవలెనే నాట్యములోగూడ మనవారు చాలకష్టపడి పరిశోధించి అనేక అపూర్వమగు నాట్యములను కనిపెట్టిరి. మనదేవాలయములలో నాట్యమొనరించు భోగమువారిలో ఈ నాట్యవిశేషములు గోచరమగుచున్నవి. పాశ్చాత్యదేశములో ఇట్టిప్రవీణుల కెంతయో ఆదరమొసగి అందల మెక్కించెడివారు. మనము వారిని అతిహీనముగా చూచుచున్నాము. వారు తమ నాట్యములో భగవంతునికి హారతి యిచ్చుట భగవంతుని వేడుకొనుట మొదలగు భావములు అతిసుందరముగా చూపుచున్నారు. మనకళలన్నియు భగవంతుని ఆరాధనకును, ఆత్మసాక్షాత్కారముకొరకును నిర్మింపబడినవే. కళలకు ఇట్టిగణ్యత ఉపయోగము మనదేశములోనే అనుటనిక్కము. ఇట్టి మహాప్రయోజనము సాధించుటకేర్పడిన మనకళలు, ఇతరదేశముల వారు గ్రహింపదగియున్నవి.

మనవారు నిర్ణయించిన పైకళాప్రయోజనముల జ్ఞాపకముంచుకొని మరల మనము కళలనభివృద్ధిచేయుచో ఇతరదేశములు మనవద్దకువచ్చి నేర్చుకొనునంతటి గౌరవము మనకు లభించును.

మనగొప్పవారిని మనము సత్కరించుటలేదు. మనవారిని పాశ్చాత్యులు సత్కరించుచున్నారు.

ఇకమీద ఇట్లుండరాదు. మన కళాపోషకులకు ఇతరవిషయముల ప్రావీణ్యముగడించిన వారిని సత్కరించుట మనము కోల్పోయిన పూర్వపు ఔన్నత్యమును తిరిగి సంపాదించుకొనుటకు మొదటిమెట్టు.

కళయనగా సంగీతము నాట్యములోనే కాక సామాన్యజీవితములో కూడ ఇమిడియుండవచ్చును. సంతోషపూరితమగు జీవితముకూడ ఒక కళయే. కావున కళయనగా ఏకొన్ని సామర్థ్యప్రదర్శనములలో మాత్రము సంబంధించినదికాదు గనుక ప్రతిభారతీయుడును తన జీవితమును పైవిధమున కళామయ మొనరింప యత్నింపవలెను.

# గృహలక్ష్మి

## గృహలక్ష్మి పాఠకురాలగు నొకసోదరి మాకిట్లు వ్రాయుచున్నది.

"మాయింటి సమీపమున నొకబ్రాహ్మణ యువతిగలదు. ఆ యింటియందామె భర్తతప్ప యితరు లెవరునులేరు. ఆమె తా నెల్లప్పుడు చాలకష్టజీవినని వచించుచుండును. కొంతకాలముక్రింద టామె నావద్ద కరుదెంచి తనకష్టమంతయు నాతో జెప్పి "అక్కా! ఇప్పుడు విద్యావంతులగు స్త్రీలు, స్త్రీ విద్యాభిమానులగు పురుషులు చాలమంది గలరని చెప్పుచుందురుగదా! అసంఖ్యాకులైయున్న నావంటి సోదరీమణుల బాధలు బాపుటకు తగిన సమాజములుగాని ప్రభుత్వచట్టములుగాని గలవా?" యని యడిగెను. నేనందులకు చాల పరితాపపడి "నీభర్తకు నీయందిష్టములేకున్న, మీ యిరువురిమధ్య సౌఖ్యములేక ఆయనే వెళ్లుమని బాధించు చున్నపుడు మీ పుట్టినింటికి వెళ్లి కావలసిన విద్యనైన నేర్చుకొనరాదా" అంటిని. అందూ స్త్రీలకు పై పద్ధతి నచ్చకపోవచ్చును. కాని భర్త భార్యవలదని తనసౌఖ్యముకై యితర ప్రయత్నించుచుండ భార్య తనభావి జీవితమును గౌరవముగ గడుపు ప్రయత్నము జేయగూడదా? అంతటామె కన్నీరుగార్చుచు, అయ్యో! సోదరీ! నావంటి దీనురాలికష్టములు మీకెట్లు దెలియును. ఒకసంవత్సరముక్రింద నా భర్తగారు నాయందు దోషములేకున్నను నన్నుబాది పుట్టినింటి వెళ్లగొట్టి మా తలిదండ్రులకు నే నక్కరలేదని జాబుగూడ వ్రాసిరి. దానిపై మాతండ్రి మిత్రులతో నాలోచించి నన్నొక స్కూలునందు జేర్చిరి. రెండుమాసములుమాత్రమే అచట జదువుచుంటిని. ఇంతలో నాభర్తగారీ సమాచారమెట్లో దెలిసికొని "నా యంగీకారములేనిదే నాభార్యనేల పాఠశాలయందు జేర్చుకొన్నారు ఆమెను బైటకు పంపనియెడల నేను తగినచర్య దీసికొనవలసివచ్చు"నని వ్రాయగా మా హెడ్మాస్టరుగారాసంగతి నాకుదెల్పి నన్ను విరమించుకొమ్మనిరి. నేను భయపడి జరిగిన సంగతంతయు వారితో జెప్పి నా భర్తగారు నే నక్కరలేదనివ్రాసిన ఉత్తరమునుగూడ జూపెట్టితిని. కాని వారు నామాటవినక ఏమగునోయని భయపడి స్కూలువీడుమని ఖండితముగ జెప్పివేసిరి.

అనంతరము కొందరు పెద్దలు నాభర్తగారినిబిల్చి, "నీభార్య చదువుట నీకిష్టములేదుగదా! ఆమెను నీ వెంటదీసికొనివెళ్లి సరిగా కాపురముజేసికొను"మని చెప్ప వారట్లేయని యంగీకరించి నన్నచటికి దెచ్చిరి. ఇప్పుడు నా ఆభరణములన్నియు లాగుకొని, ఘనుపటికంటె నికృష్టముగా హింసించుచున్నారు. నావలన యెట్టితప్పుగలదో మీరు పరీక్షింపవచ్చును. ఇంతకు నాభర్తకు నాయెడల ప్రేమలేదు. నేనన్న గిట్టదు." అని తనవిషాదగాథను ముగించెను. ఆమెయొక దోషమున్నట్లు నాకు గన్పడలేదు. స్త్రీ పురుష సమానత్వ మితర విషయములందెట్లున్నను, వివాహమందును విడాకులయందును భేదముండరాదని నాతలంపు. స్త్రీల శ్రేయోభిలాషులగు సోదర సోదరీమణులెల్లరీ భేదమును పోగొట్టుదురని నా హృదయపూర్వకమగు ప్రార్థన. ప్రపంచమందొకరు సుఖించిన అందరు సుఖించుటలేదు. ఒకరు కష్టపడిన అందరు కష్టపడుటలేదు. కష్టసుఖములు ప్రపంచమందు సమముగానే కలవు. విడాకుల చట్టమునకు మన స్త్రీ లంతగా భయపడుటెందులకో? అనురాగముగల భార్యాభర్తలను యే చట్టముగాని విడదీయజాలదు. అనురాగములేని భార్యాభర్తలను యే సంఘపు కట్టుబాట్లుగాని కలుపజాలవు. ఆవిధమున మనస్సులుకలియక దుఃఖించు సోదరీమణుల సౌఖ్యమునకై వివాహములందు స్వాతంత్ర్యము, విడాకులచట్టము ముఖ్యములని తలంతురుగాక.

(దీనికి ఊహా ఆధారము)